# నిర్ణయ సింధువు

## (తృతీయభాగము)

కర్త

**కమలాకరభట్టు**




అనువాదము

**డా॥ కిడాంబి నరసింహాచార్య**

# విషయసూచిక

## తృ-పరి-ఉత్త-శ్రాద్ధ ప్రకరణం-I

---

నమాం త్యజేథా శ్రితకల్పవల్లి। సద్భక్తిచింతామణి కామధేనో
నమాం త్యజేథాః ధన సూనుపుష్టా। గృహే కళత్రే మయి, పుత్రవర్గే ॥

విజ్ఞానవృద్ధిం హృదయే కురు శ్రీః। సౌభాగ్యవృద్ధిం కురు మేగృహే శ్రీః
దయాసువృష్టిం కురుతాం మయి శ్రీః। సువర్ణవృష్టిం కురు మే కరే శ్రీః ॥



ముదా స్తాం మత్ఫాలే పరమపదలక్ష్మీః స్ఫుటకలా
సదా వైకుంఠశ్రీ ర్నివసతు కలా మే నయనయోః
వసే త్సత్యేలోకే మమ వచసి లక్ష్మీశ్వరకలా
శ్రియ శ్వేతద్వీపే నివసతు కలా మే స్వకరయోః.

# నిర్ణయసింధువు-తృతీయపరిచ్ఛేదము

## ప్రకీర్ణక నిర్ణయము

మూ. శ్రీరామకృష్ణతనయఃకమలాకరసంజ్ఞితః,
నిరూప్యతిథికృత్యంతుప్రకీర్ణంవక్తుముద్యతః॥

అను. శ్రీరామకృష్ణుని కుమారుడు కమలాకరుడను పేరుగలవాడు తిథికృత్యమును చెప్పి ప్రకీర్ణమును చెప్పుటకు ఆరంభించినాడు.

మూ. తత్రాదౌ సంస్కారేషు గర్భాధానం. తత్రప్రథమ రజోదర్శనే దుష్టమాస గ్రహణం, సంక్రమాదిఫలం,తత్రశాంత్యాదిచపితృకృతప్రయోగ దీపికాయాం భట్టకృతప్రయోగరత్నే (చ) జ్ఞేయం.కించిత్తూచ్యతే.

అను. అక్కడ సంస్కారములలో తొలుతగర్భాధానము.అక్కడ తొలిరజోదర్శన మందు (పుష్పవతి)దుష్టమాసగ్రహణము,సంక్రాంతి మొదలగు వానిఫలము, అప్పుడు శాంతి మొదలగునవి కూడా మా తండ్రిగారు వ్రాసిన ప్రయోగదీపికయందు చూడండి.భట్టులు వ్రాసిన ప్రయోగరత్నమందును చూచితెలుసుకోండి.ఐనా కొంచెము మేము చెప్తున్నాము. (దేవరాజు–చీపురుకట్ట, కట్టెలు, గడ్డి మొదలగునవి,చాట వగైరా చేత ధరించి ప్రథమ రజస్వల అయితే కులట ఔతుంది.పడకయందు సంతోషంగా (తింటూనో)ఉండగా, ఎండలో ఉండగానో పుష్పవతి ఐతే అప్పుడు భాగ్యవతి అవుతుంది. స్మృతి సంగ్రహంలో–పూర్వాహ్ణ మందైతే శుభము.మధ్యాహ్నమందైతే మధ్యమఫలము.అపరాహ్ణమందైతే వైధవ్యము.పూర్వ రాత్రమందైతే శుభము).

**సూర్యవారాదులలో** - మూ॥మదనరత్నేనారదః-అమా రిక్తాఽష్టమీ షష్ఠీ ద్వాదశీ ప్రతిపత్స్వపి,పరిఘస్యతు పూర్వార్ధే వ్యతీపాతేచవైధృతౌ, సంధ్యా సూపప్లవేవిష్ట్యాము శుభం ప్రథమార్తవం,రోగీపతివ్రతా దుఃఖీపుత్రిణీ భోగభాగినీ (భోగగామినీ),పతివ్రతా క్లేశభాగీ సూర్యవారాదిషుక్రమాత్॥

అను॥ మదనరత్నంలో నారదుని వచనమిట్లా–అమావాస్య,రిక్తతిథి (చాంద్రమాసం లోని చవితి,నవమి,చతుర్దశులు)అష్టమి,షష్ఠి,ద్వాదశి,ప్రతిపత్,పరిఘయోగం యొక్క పూర్వా ర్ధము,వ్యతీపాతము,వైధృతి,సంధ్యాసమయము,గ్రహణము,విష్టి(భద్ర)వీనియందు తొలిరజో దర్శనము అశుభమైంది.రోగి,పతివ్రత,దుఃఖి,పుత్రులు(సంతానము)కలది,భోగములనను భవించేది,పతివ్రత,క ష్టములననుభవించేది ఇవి క్రమంగా ఆదివారము మొదలుగా అని తెలుసుకోండి(ఉదా–ఆదివారమైతే రోగిణి అని అట్లా).

**తిథ్యాదులలో** మూ॥ వైధవ్యంసుతలాభశ్చమైత్ర్యం శత్రువివర్ధనం, మిత్రలాభః శత్రు వృద్ధిః కులర్ధిఃబంధునాశనం,మరణం వంశవృద్ధిశ్చ నిరాహారఃకులక్షయః,తేజశ్చ సుతనాశశ్చ కులహానిః తిథిక్రమాత్॥

అను॥ తిథులననుసరించి వరుసగా ప్రథమరజస్వల ఫలాలను తెలుసుకోవాలి. వైధవ్యము, సుతలాభము, మిత్రత, శత్రువృద్ధి, మిత్రలాభము, శత్రువృద్ధి, కులవృద్ధి, బంధు నాశనము, మరణము, వంశవృద్ధి, ఆహారం లేకుండా ఉండటం, కులక్షయము, తేజస్సు, సుతనాశము, కులహాని అని.

**నక్షత్రములలో - మూ॥ గర్గః-సుభగా, చైవ దుఃశీలా,వంధ్యా పుత్రసమన్వితా, ధర్మ యుక్తా, వ్రతఘ్నీచ, పరసంతానమోదినీ, సుపుత్రాచైవ, దుఃపుత్రా, పితృవేశ్మరతాసదా, దీనా, ప్రజావతీచైవ,పుత్రాఢ్యా, చిత్రకారిణీ, సాధ్వీ, పతిప్రియా నిత్యం సుపుత్రా,కష్టచారిణీ, స్వకర్మ నిరతా, హింస్రా, పుణ్యపుత్రాదిసంయుతా, నిత్యంధన చయాసక్తా, పుత్రధాన్య సమన్వితా, మూర్ఖా,చాఽజ్ఞా, పుణ్యవతీ దస్రర్క్షాదేఃక్రమాత్ ఫలం॥**

అను॥ నక్షత్రక్రమాన్ననుసరించి ఫలమును గర్గుడు ఇట్లా చెప్పాడు- సుభగ (ఐశ్వర్యవంతురాలు),దుఃశీల, వంధ్య,పుత్రులుకలది, ధర్మబుద్ధిగలది,వ్రతఘ్ని, ఇతరుల సంతానంతో ఆనందించేది,మంచిపుత్రులుగలది, చెడుపుత్రులుగలది, ఎప్పుడూ తండ్రి ఇంటి యందు ఉండాలనుకునేది,దీనురాలు (దుఃఖితురాలు),సంతానము గలది, బహు సంతతిగలది, చిత్రములు గీసేది, ఉత్తమురాలు(సాధ్వి),ఎల్లప్పుడు పతికి ప్రియమైనది, మంచి పుత్రులుగలది, కష్టములననుభవించేది, తన పనులందు ఆసక్తికలది, హింస స్వభావంకలది, పుణ్యాత్ములైన పుత్రులతో కూడియుండేది, ఎల్లప్పుడూ ధనసంచయ మందు ఆసక్తి కలది,పుత్రులు ధాన్యము కలది,మూర్ఖురాలు,చా(కూడా, పై మూర్ఖురాలే),జ్ఞాన శూన్యు రాలు,పుణ్యవతీ అని.

**రాశులలో**- మూ॥నారదః- కులీరవృష చాపాంత్య నృయుక్క న్యాతులా ఘటాః రాశయః శుభదాజ్ఞేయా నారీణాం ప్రథమార్తవే. **వస్త్రములలో**-గర్గః-సుభగా శ్వేతవస్త్రా స్యాత్ దృఢవస్త్రా పతివ్రతా,క్షౌమవస్త్రా క్షితీశాస్యాత్ నవవస్త్రా సుఖాన్వితా, దుర్భగా జీర్ణవస్త్రా స్యాత్ రోగిణీ రక్తవాససా, నీలాంబరధరా నారీ పుష్పితా విధవా తతః. **బిందువు**[illegible]**లో**-వస్త్రే స్యుః విషమారక్తబిందవః పుత్ర మాప్నుయాత్, సమాశ్చేత్కన్య కాచేతిఫలంస్యాత్ప్రథమార్తవే.

అను॥నారదుడిట్లన్నాడు- కర్కట, వృషభ, ధనుస్సు, మీన, మిథున, కన్య, తుల, కుంభము ఈ రాశులలో తొలిరజోదర్శనమైతే స్త్రీలకు శుభకరమైనది. గర్గుడిట్లన్నాడు- తొలిరజస్వలయందు తెల్లని వస్త్రాన్ని ధరించిఉంటే ఐశ్వర్యవంతురాలౌతుంది. దృఢ వస్త్ర ములుగలదైతే పతివ్రత ఔతుంది. పట్టు వస్త్రము గలదైతే రాజస్త్రీ ఔతుంది, కొత్త వస్త్రం గలదైతే సుఖవంతురాలౌతుంది. జీర్ణవస్త్రం కలదైతే దుర్భగురాలు, రక్తవస్త్ర ధారిణి అయితే రోగిణి, నల్ల వస్త్రం కలదైతే విధవ అవుతుంది,ఆ ప్రథమ రజోదర్శన స్త్రీ (పుష్పిత)వస్త్రంలో రక్తబిందువులు విషమంగా ఉంటే పుత్రుడు కల్గుతాడు. ప్రథమార్తవమందు వస్త్రంలో సమరక్త బిందువులుంటే పుత్రిక కల్గుతుంది అని ఫలం చెప్పారు.

**స్త్రీసంగవర్జనము - మూ॥**అత్ర స్త్రీ సంగ వర్జనమాహవసిష్ఠః- ప్రభూత దోషం యది దృశ్యతే తత్పుష్పం తదాశాంతిక కర్మకార్యం, వివర్జయేదేవతదేక శయ్యాంయా

వజ్రజోదర్శనముత్తమేల్ల హ్నా. జ్యోతిర్నిబంధే వసిష్ఠః-ఆద్యర్తౌ పౌషశుక్రోర్జ, మధుశుచినభస్యాశ్వ యుక్పాపవారా, రిక్తామార్క్యాష్టషష్ఠ్యః పితృపరసదనే రాత్రి సంధ్యాపరాహ్ణే, మిశ్రోగ్రా మూలతీక్ష్ణం వివరమనరుణాల్పాధికాస్రం గరాష్టోత్పాతః పాపస్య లగ్నం న సదరుణ జరన్నీల రక్తాంబరంచ. **ఆద్యతౌ దుర్భగా నారీ విష్కంభే చేద్రజస్వలా, వంధ్యా చైవాతిగండేచ, శూలేశూలవతీభవేత్, గండేతు పుంశ్చలీనారీ, వ్యాఘాతేచాత్మఘాతినీ, వజ్రేచస్వైరిణీప్రోక్తా, పాతేచపతిఘాతినీ, పరిఘేమృత వంధ్యా చ, వైధృతౌపతిమారిణీ, శేషాఃశుభావహాయోగా యథా నామ ఫలప్రదాః.**

**అను॥** వసిష్ఠుడు స్త్రీ సంగమును వదలమని చెప్పాడు. ప్రథమ రజోదర్శనంలో అనేక దోషాలు ఉన్నట్టైతే శాంతికర్మ ఆచరించాలి,మంచి రోజున రజోదర్శనమయ్యేదాక ఏకశయ్య (మైధునం) పనికిరాదు. జ్యోతిర్ని బంధమందు వసిష్ఠునిమాట –తొలి రజస్వల పుష్య, జేష్ఠ, కార్తిక, చైత్ర, ఆషాఢ, భాద్రపద, ఆశ్వయుక్ **మాసములలో** పాప **వారములలో** (ఆది, మంగళ, శని) రిక్త, అమావాస్య, ద్వాదశి, అష్టమి,షష్ఠి **తిథులలో**, తండ్రి ఇంటిలో కాక వేరేవారిఇంట్లో, రాత్రి, సంధ్య, అపరాహ్ణములందు, మిశ్ర (కృత్తిక, విశాఖ) ఉగ్ర (పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, మఘ) మూల, తీక్ష్ణ (ఆర్ద్ర, ఆశ్లేష, జ్యేష్ఠ) **నక్షత్రములలో**,వివరం(రజోధర్మము ఆగిఆగి రావటం) ఎర్రరంగులో రజోధర్మం లేకపోవటం, తక్కువరజోధర్మం, రజోధర్మం అధికంగా ఉండటం, గర, వణిజ, విష్టి, నాగ, చతుష్పథ, కింస్తుఘ్న, శకుని, **బవకరణములో**, ఉత్పాతములో, **పాపగ్రహాల** లగ్నంలో (మేష, వృశ్చిక, మకర, కుంభ) ఎర్రవస్త్రము, జీర్ణవస్త్రము, నీల, అరుణ వస్త్రములలోను మంచిది కాదు. తొలి రజస్వల విష్కంభయోగంలో ఐతే ఆ స్త్రీ దుర్భగ అవుతుంది. అతి గండంలో ఐతే వంధ్య ఔతుంది. శూలలో ఐతే శూలవతి ఔతుంది. గండమందైతే కులట ఔతుంది. వ్యాఘాతంలో అయితే ఆత్మఘాతిని ఔతుంది. వజ్రమందైతే స్వైరిణి అవుతుంది. పాత మందైతే పతిఘాతిని ఔతుంది. పరిఘయందైతే మృతవంధ్య ఔతుంది. వైధృతియందైతే భర్తను చంపేది ఔతుంది. మిగిలిన యోగములు శుభమైనవి. పేరుకు తగ్గ ఫలితాన్ని ఇచ్చేవి. (గ్రామం బయట, పరగ్రామమందైతే ఆ స్త్రీ వ్యభిచారిణి ఔతుంది. పతిస్థానంలో ఐతే పతివ్రత, గృహమధ్యంలో సుభగ, గ్రామ మధ్యంలో ఐతే వృద్ధి, దిగంబరంగా ఐతే విధవ అవుతుంది. గ్రహణమందైతే దుఃశీల, నీటిసన్నిధియందు ఆయుష్యము, ధనమధ్య మందైతే ధనధాన్య సమృద్ధి కలది. వసిష్ఠుని వచన మిట్లా – సూర్యుడు అష్టమ మందుంటే వైధవ్యము, చంద్రుడుంటే క్షీణకాంతిగలది, కుజుడుంటే భర్తృహీన, బుధుడుంటే సంతాన హీన, గురువు ఉంటే దౌర్భాగ్యము, శుక్రుడుంటే సాపత్యము, శని ఉంటే సన్యాసము (దేశ దిమ్మరి), రాహువుంటే కలహము, కేతువుంటే అశుభము సప్తమ స్థానంలో ఉంటే శుభులు, శుభాన్ని ఇస్తారు. నరసింహమందిట్లా ఉంది– లగ్నానికి ప్రథమ స్థానంలో సూర్యుడుంటే వైధవ్య కారకుడు, కుజుడు పుత్రహానికరుడు, బుధుడు సత్పుత్రులనిస్తాడు. బృహస్పతి ధనము ఆయుష్యము ఇస్తాడు. శుక్రుడు సాఫల్యాన్ని ఇస్తాడు, శనైశ్చరుడుంటే వంధ్య

ఔతుంది. రాహువుంటే మరణము, చంద్రుడు సద్గుణ సంయుక్తుడైతే శుభమౌతుంది, అని ఇది దేవరాతుని మతము)

**శాంతి - మూ॥ శాంతిమాహ ప్రయోగ పారిజాతేశౌనకః-సార్తవానాంతు నారీణాం శాంతిం వక్ష్యామి శౌనక, పంచమేఽహ్ని చతుర్థేవా గ్రహయజ్ఞపురఃసరం. (తస్మిన్నహని కర్తవ్య ఋతుహోమో విధానతః, అచార్యం వరయే త్ప్రాజ్ఞో భువనేశ్వరీ తుష్టయే, హోమార్థం చ జపార్థంచ వరయేదృత్విజో బహూన్, యజమానో ద్విజైః సార్ధం శాంతిహోమం సమాచరేత్, గృహాదీశాన దిగ్భాగే దేవతా పూజనాయచ)**

**అను॥** ప్రయోగ పారిజాతమందు శౌనకుడు శాంతిని చెప్పాడు-ఋతుమతియైన స్త్రీలకు శాంతిని చెప్తున్నాను, ఓ శౌనక! ఐదవరోజో, నాల్గవరోజో గ్రహ యజ్ఞపురః సరముగా శాంతి చేయాలి (అదే రోజు విధి ప్రకారము ఋతుహోమమాచరించాలి. భువనేశ్వరి తుష్టి కొరకు ప్రాజ్ఞుడు ఆచార్యుని వరించాలి. హోమము కొరకు, జపము కొరకు అనేక మంది ఋత్విజులను వరణం చేయాలి. యజమానుడు ద్విజులతో కూడి శాంతి హోమం చేయాలి. ఇంటికి ఈశాన్య దిక్కులో దేవతా పూజన కొరకు ఏర్పరచాలి)

**మూ॥ ద్రోణ ప్రమాణ ధాన్యేన వ్రీహిరాశిత్రయం భవేత్, కుంభత్రయం న్యసేద్రా శౌతంతు వస్త్రాదివేష్టితం, (పూరయేత్తీర్థసలిలైః ప్రతికుంభం పృథక్ పృథక్) సూక్తేనాథ నవర్చేన ప్రసువ అప ఇత్యథ. ఋచాయాః ప్రవతః తద్వత్ గాయత్ర్యాచ తతః క్రమాత్, మధ్యకుంభేక్షిపేద్ధాన్య మౌషధానిచ హేమచ॥ (తతశ్చ పంచరత్నాని గంధపుష్పాక్ష తాదికాన్, ఔషధాని చ వక్ష్యంతే మునిభిః శాంతికారణాత్). ఉదుంబరః కుశో దూర్వా రాజీవ వటబిల్వకాః, విష్ణుక్రాంతాఽథ తులసీ బర్హిషం శంఖపుష్పికా, శతావర్యశ్వగంధా చ నిర్గుండీ సర్షపద్వయం, అపామార్గః పలాశశ్చ పనసో జీవకస్తథా, ప్రియంగవశ్చ గోధూమావ్రీహయోఽశ్వత్థ ఏవ చ. క్షీరందధి చ సర్పిశ్చ పద్మపత్రం తథోత్పలం, కురంటక త్రయం గుంజా వచా భద్రక ముస్తకాః, ద్వాత్రింశ దౌషధానీహయథా సంభవ మాహరేత్.**

**అను॥** ద్రోణ ప్రమాణ ధాన్యంతో మూడు ధాన్యపు కుప్పలు చేయాలి. ఆ రాశులపై మూడు కుంభముల నుంచాలి. వాటిని దారము, వస్త్రాదులతో కప్పాలి (చుట్టాలి). (ప్రతి కుంభమును విడివిడిగా తీర్థసలిలముతో నింపాలి) నవ (తొమ్మిది) ఋచగల సూక్తంతో ప్రసువ ఆప అనేదానితో, అట్లాగే ప్రవతాహి అనే మంత్రము, పిదపగాయత్రి ఇట్లా క్రమంగా వానితో మధ్య కుంభమందు, ధాన్యము, ఔషధములు, బంగారము ఉంచాలి (ఆపిదప ఐదు రత్నములు, గంధపుష్ప అక్షతాదికములను ఉంచాలి. శాంతి కారణంగా మునులు ఔషధముల పేర్లు చెప్పారు). మేడి,కుశలు, దూర్వ, కమలము, వటము, బిల్వము, విష్ణు క్రాంతము, తులసి, బర్హిషము, శంఖపుష్పిక, శతావరి, అశ్వగంధ, నిర్గుండి, రెండు రకాల ఆవాలు, అపామార్గము, పలాశము, పనస, జీవకము, ప్రియంగువు, గోధుమలు, వ్రీహులు, అశ్వత్థము, పాలు, పెరుగు, నేయి, కమలపుఆకు, కలువ, మూడు కురంటకములు, గుంజ, వస, భద్రక, ముస్తకములు ఇవి ముప్పది రెండు ఔషధములు. లభించినంతవరకు తేవాలి.

**మూ॥ మృత్తికాశ్చౌషధాదీని తన్మంత్రేణక్షిపేత్‌క్రమాత్, కుంభోపరిన్యసేత్ పాత్రం కాంస్యంమృద్వేణుతామ్రజం. భువనేశ్వరీం న్యసేత్తత్ర ఇంద్రాణీంచ పురందరం జపేద్ గాయత్రి మాహోమా చ్ఛ్రీసూక్తం చజపేత్తతః. స్పృశన్వై దక్షిణం కుంభం ఋత్విగే కోజపేదథ. చత్వారిరుద్ర సూక్తాని చతుర్మంత్రోత్తరాణిచ. సంస్పృశన్నుత్తరం కుంభం శ్రీ రుద్రం రుద్ర సంఖ్యయా, శన్న ఇంద్రాగ్నీ సూక్తం చ తత్ర వై సంస్పృశం జపేత్. కుంభస్య పశ్చిమే దేశే శాంతిహోమం సమాచరేత్. దూర్వాభిః తిలగోధూమైః పాయసేన ఘృతేనచ. తిసృభిశ్చైవదూర్వాభిరేకైకాచాహుతిర్భవేత్, అష్టోత్తరసహస్రంవాశతమష్టో త్తరం తువా, గాయత్ర్యైవతుహోతవ్యం హవిరత్ర చతుష్టయం. తతస్విష్ట తం హుత్వా సముద్రా దూర్మి సూక్తతః. సంతతా మాజ్యధారాంతాం పూర్ణాహుతి మథా చరేత్.**

**అను॥** మృత్తికలు, ఔషధాదులు వాని వాని మంత్రములతో క్రమంగా వేయాలి. కుంభముపైన కాంస్యము లేదా మట్టి లేదా వెదురు లేదా తామ్ర పాత్రనో ఉంచాలి. అక్కడ భువనేశ్వరిని, ఇంద్రాణిని, పురందరుని స్థాపించాలి. హోమపర్యంతము గాయత్రిని జపించాలి. పిదప శ్రీసూక్తాన్ని జపించాలి. దక్షిణ కుంభాన్ని స్పృశిస్తూ ఒక ఋత్విక్కుడు జపించాలి. నాలుగు రుద్రసూక్తములను, నాలుగు మంత్రోత్తరములను చదువుతూ ఉత్తర కుంభాన్ని స్పృశిస్తూ రుద్రుని పదకొండుసార్లు (మంది)శన్న, ఇంద్రాగ్ని సూక్తమునూ జపించాలి. స్పృశిస్తూ జపించాలి. కుంభమునకు పశ్చిమభాగంలో శాంతి హోమం చేయాలి, దూర్వలతో నువ్వులతో, గోధుమలతో, పాయసంతో, నేయితో - మూడు దూర్వలతో ఒక్కొక్క ఆహుతి జరగాలి. ఇక్కడ నాలుగు హవిస్సులతో వేయి ఎనిమిది సార్లు గాని నూట ఎనిమిది సార్లు గాని గాయత్రితోనే హోమం చేయాలి. పిదప స్విష్టకృత్‌హోమం చేసి పిదప సముద్రా దూర్మి అనే సూక్తంతో ఎడతెగని ఆజ్యధారతో పూర్ణాహుతిని చేయాలి.

**మూ॥ అథాఽభిషేకం కుర్వీత ప్రతికుంభస్థితోదకైః. ఆపోహిష్ఠేతి నవభిః సూక్తేన చతతఃపరం, ఇంద్రో అంగంత్ర్య ృచేనైవ పావమానైః క్రమేణతు, ఉభయం శృణువచ్చనః స్వస్తిదావిశపేకయా, త్రైయంబకేన మంత్రేణ జాతవేదస ఏకయా. సముద్ర జ్యేష్ఠాఇత్యాది త్రాయంతాం చ త్రిభిః క్రమాత్, ఇమా ఆపః త్ర్యృ చేనైవ దేవస్య త్వేతి మంత్రతః మంత్రేణాథతమీశానం త్వమగ్నేరుద్ర ఇత్యథ, తముష్ఠ హీతిమంత్రేణ భువనస్య పితరం తథా,యాతే రుద్రేతి మంత్రేణ శివసంకల్పమంత్రతః, ఇంద్రత్వా వృషభం పంచమంత్రైశ్చైవాభిషేచయేత్, ధేనుం పయస్వినీం దద్యాత్ ఆచార్యాయ చ భూషణైః, సదక్షిణ మనడ్వాహం ప్రదద్యాద్ రుద్రజాపినే, మహాశాంతిం ప్రజాప్యాథ బ్రాహ్మణాన్ భోజయేత్తతః, ఇతి. నారదః - తత్రశాంతిం ప్రకుర్వీత ఘృతదూర్వా తి లాక్షతైః, ప్రత్యేకాష్టశతంచైవ గాయత్ర్యాజుహుయాత్తతః, స్వర్ణగోభూతిలాన్ దద్యాత్ సర్వదోషాపనుత్తయే. ప్రకారాంతరం మదనరత్నే జ్ఞేయం. విస్తరభయాన్నోచ్యతే. గ్రహణే రజోదర్శనేతు జాతకర్మ ప్రస్తావే శాంతిం వక్ష్యామః.**

**అను॥** ఆ పిదప ప్రతికుంభమందున్న నీటితో అభిషేకం చేయాలి. ఆపోహిష్ఠా అనే తొమ్మిది మంత్రములతో ఆ పిదప శ్రీ సూక్తంతో, ఇంద్రో అంగం అనే మూడు ఋచలతో, పవమాన ఋచలతో క్రమంగా ఉభయం శృణువచ్చనః అనేదానితో స్వస్తిదా విశ అనే ఒక దానితో త్రైయంబక మంత్రంతో జాతవేదస అనే ఒకదానితో ఈ మంత్రాలతో

అభిషేకం చేయాలి. సముద్రజ్యేష్ఠా అని మొదలుగా, త్రాయంతాం అనే మూడు ఋచలతో క్రమంగా ఇమా ఆపః అనే మూడు ఋచలతో దేవస్యత్వా అనే మంత్రంతో, తమీశానం అనే మంత్రంతో, పిదప త్వమగ్నే రుద్ర అనే దానితో, తముష్టుహి అనే మంత్రంతో, భువనస్య పితరం అనే మంత్రంతో, యాతేరుద్ర అనే మంత్రంతో, శివసంకల్పమంత్రంతో, ఇంద్రత్వా వృషభం అనే ఐదు మంత్రాలతో అభిషేకం చేయాలి. ఆచార్యునకు భూషణములతో పాటు పాలిచ్చే ఆవును ఇవ్వాలి. రుద్రజపం చేసిన వానికి దక్షిణతోపాటు ఎద్దును కూడా ఇవ్వాలి. ఆ పిదప మహాశాంతిని జపించి ఆ పిదప బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి, అని. నారదుడిట్లా - నేయితో, దూర్వ, తిలలు, అక్షతలతో శాంతి చేయాలి. ఒక్కొక్కదానితో నూట ఎనిమిది మార్లు గాయత్రి మంత్రంతో హోమం చేయాలి. పిదప అన్ని దోషములు తొలగిపోయే కొరకు బంగారము, గోవు, భూమి, నువ్వులు, వీటిని దానం చేయాలి. మరో పద్ధతిని మదరత్నం నుండి తెలుసుకోండి. విస్తారమౌతుందని భయంతో చెప్పటం లేదు. గ్రహణ మందు రజోదర్శనమైతే, జాతకర్మ ప్రస్తావనలో శాంతిని చెప్తాము.

**విశేషము - మూ - అథ ప్రథమర్తౌవిశేషః** స్మృతి చంద్రికాయాం - ప్రథమర్తౌ **తు పుష్పిణ్యాః పతిపుత్రవతీస్త్రియః, అక్షతైరాసనం కృత్వా తస్మింస్తాముపవేశయేత్, హరిద్రాగంధపుష్పాది దద్యుస్తాం బాలకంస్రజం, దీపైర్నీరాజనం కుర్యాత్ సదీపే వాసయేద్గృహే, లవణాపూప ముద్గాది దద్యాత్తాభ్యః స్వశక్తితః, ఇతి.**

**అను॥** ఇక తొలిరజస్వల యందు స్మృతి చంద్రికలో విశేషమిట్లా ఉంది- పతి పుత్రులు గల స్త్రీలు (సంతానులు) ప్రథమ రజస్వల ఐన స్త్రీకి, అక్షతలతో ఆసన మేర్పరచి, అందు ఆమెను కూర్చోబెట్టాలి. పసుపు, గంధము, పూలు, తాంబూలము, మాలలు మొదలగు నవి ఇవ్వాలి. దీపములతో నీరాజనమివ్వాలి. దీపమున్న ఇంటిలో ఆమెను ఉంచాలి. ఆ స్త్రీలకు తన శక్తి కొలది లవణము, అపూపము, పెసలు మొదలగునవి ఇవ్వాలి, అని.

**లద్వితీయమైతే-మూ- ద్వితీయాద్యు తుషు తన్నియమమాహ** ప్రయోగపారిజాతే **దక్షః - అంజనా భ్యంజనేస్నానం ప్రవాసం దంతధావనం, నకుర్యాత్ సార్తవానారీ గ్రహాణామీక్షణం తథా. అత్రిరపి-వర్జయేన్మధుమాంసం చ పాత్రే ఖర్వే చ భోజనం, గంధమాల్యేదివాస్వాపం తాంబూలం చాస్యశోధనం, దర్భేశరావేభుంజీత పేయం చాంజలినా పిబేత్. మదనరత్నే హారీతః - రజః ప్రాప్తావధః శయీత భూమౌ, కార్ష్ణాయసే పాణౌ మృణ్మయే వాఽశ్నీయాత్, ఇతి. విష్ణుధర్మే - ఆహారం గోరసానాం చ పుష్పా లంకారధారణం, అంజనం కంకతం గంధాన్ పీఠశయ్యాధి రోహణం, అగ్ని సంస్పర్శ నంచైవ వర్జయేత్వాదినత్రయం ఇతి.**

**అను॥** రెండవది మొదలగు ఋతుమతులలో ప్రయోగపారిజాత మందు దక్షుడు, ఆ, నియమములిట్లా చెప్పాడు. కాటుక, అభ్యంజనము, స్నానము, ప్రవాసము, దంత ధావనము, అట్లాగే గ్రహములను చూడటం ఋతుమతియైన నారి వీటిని చేయరాదు; అని. అత్రి కూడా ఇట్లా మధువు, మాంసము, చిన్న పాత్రయందు భోజనము, గంధ మాల్యములు, తాంబూలము, పగటినిద్ర, ముఖశుద్ధి వీటిని రజస్వల విడిచిపెట్టాలి. కాలిన

మూకుడులో భుజించాలి, తాగే వాటిని దోసిలితో, తాగాలి, అని. మదనరత్న మందుహారీ తుడిట్లా -రజోదర్శనమైతే క్రిందభూమిపై పడుకోవాలి. లోహపాత్రయందు లేదా చేతియందు లేదా మట్టిపాత్ర యందు కాని భుజించాలి, అని. విష్ణుధర్మ మందిట్లా - మజ్జిగభోజనము, పుష్ప అలంకారముల ధారణము, కాటుక, దువ్వెన, గంధము, పీఠశయ్యలు, అధిరోహించటం, అగ్ని స్పర్శ ఆమె ఆ మూడు రోజులు వదలాలి అని. (దక్షుడు - గోళ్ళు కత్తిరింత, తాడుతో తాళపత్రాలు కట్టటం వద్దన్నాడు)

**మూ॥ తథా ప్రథమర్తోః పూర్వం** స్త్రీ గమనం నకార్యం. ప్రాగ్రజో దర్శనాత్పత్నీం ..యాద్గత్వా పతత్యధః, వ్యర్థీకారేణ శుక్రస్య బ్రహ్మహత్యా మవాప్నుయాత్, ఇతి తత్రైవ ఆశ్వలాయనోక్తేః.(ఏతత్తు దశవర్షాత్ ప్రాక్జ్ఞేయం.ప్రథమర్తౌ గమనే గౌతమేన విశేషో దర్శితః - గౌరీమపిచరత్యర్థం గచ్ఛేత్ పురుష ఆకులః, అన్యథా వీర్యపాతో హి సహస్ర కులపాతకః, అన్యథాపితదిచ్ఛయా భవతీతి విజ్ఞానేశ్వరః).

**అను॥** అట్లాగే తొలిపుష్పవతి కావటం కన్న ముందు స్త్రీ గమనము (స్త్రీరతి) చేయ రాదు. (తొలిరజస్వలకన్నముందు)రజోదర్శనం కన్న ముందు పత్నిని చేరి పొందినట్లైతే (రతి) ఆతడు అధః పతితుడౌతాడు. వీర్యమును వ్యర్థం చేసినందువల్ల బ్రహ్మహత్యా పాపాలను పొందుతాడు. అని అక్కడే ఆశ్వలాయనుడు చెప్పాడు. (దీనిని పదిసంవత్సరాలకు ముందు అని అనుకోవాలి. తొలిరజస్వల యందు భార్యను చేరినట్లైతే గౌతముడు విశేషాన్ని ఇట్లా చెప్పాడు. పురుషుడు ఆకులుడై రతి కొరకు గౌరి దగ్గరకైనా వెళ్తాడు. లేకున్న వీర్య పాతమైతే అది సహస్రకులముల పాతకమౌతుంది. లేకున్నా ఆమె ఇష్ట ప్రకారం ఔతుంది అని విజ్ఞానేశ్వరుని మాట)

**మూ॥ ఋతౌగమన** మాహ యాజ్ఞవల్క్యః - షోడశర్తునిశాఃస్త్రీణాం తాసు యుగ్మాసు, సంవిశేత్, ఇతి. **అనృతావప్యాహ** గౌతమః - ఋతావుపేయాత్సర్వత్ర వాప్రతిషిద్ధవర్జనం, ఇతి. మనుః - ఋతుః స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశస్మృతాః తాసామాద్యా చతస్రస్తు నిందితైకాదశీతథా, త్రయోదశీచ శేషాః స్యుః ప్రశస్తాదశ రాత్రయః.మదనరత్నే దేవలః -తస్మాత్ త్రిరాత్రం చాండాలీం పుష్పితాం పరివర్జయేత్ ఇతి.

**అను ॥** ఋతుమతి ఐనప్పుడు పొందుటను యాజ్ఞవల్క్యుడిట్లా చెప్పాడు - స్త్రీలకు పదహారు రోజులు ఋతురాత్రులు. వానిలో సరిరోజులలో సంగమించాలి అని (హిరణ్య కేశి సూత్రంలో - నాల్గవరోజు ప్రయత్నంగా, వస్త్రాలంకారము గల ప్రశస్త బ్రాహ్మణునితో సంభాషించిన భార్యను, ఆచమించి దగ్గరికి పిలుస్తున్నాడు, అని).ఋతుమతికాకపోయినా గౌతముని వచనమిట్లా - ఋతువుయందే ఎప్పుడూ భార్యను పొందాలి లేదా విడువ తగిన రోజులను వదలి (తిథి) ఎప్పుడూ భార్యను పొందవచ్చు అని. మనువు ఇట్లా - స్త్రీలకు ఋతువు స్వభావ సిద్ధమైంది. పదహారు రాత్రులు అని అన్నారు. వానిలో తొలి నాలుగు రోజులు, ఏకాదశి త్రయోదశులు (11,13) నిందితమైనవి. మిగిలిన పదిరాత్రులు ప్రశస్తమైనవి అని. మదనరత్నంలో దేవలుడిట్లా - అందువల్ల

పుష్పితను, చాండాలిని, మూడు రాత్రులు విడువాలి, అని(మొదటిరాత్రి చాండాలి, రెండోరాజు బ్రహ్మఘాతిని, మూడో రోజు రజకి, నాల్గవరోజు శుద్ధి అవుతుంది).

మూ॥ **తత్ర తిథ్యాదీనాహ శ్రీధరః** - షష్ఠ్యష్టమీం పంచదశీం చతుర్థీం చతుర్దశీ మప్యుభయత్రహిత్వా, శేషాః శుభాః స్యుః తిథయోనిషేకే వారాః శశాంకార్యసితేందు జానాం॥ ఉభయత్ర=పక్షద్వయేఆర్యో=గురుః. సితః=శుక్రః. ఇందుజో=బుధః.విష్ణు ప్రజేశరవి మిత్ర సమీరపౌష్ణ మూలోత్తరా వరుణ భాని నిషేకకార్యే పూజ్యాని పుష్యవసు శీత కరాశ్వి చిత్రాదిత్యాశ్చ మధ్యమఫలా, విఫలాః స్యురన్యే.

అను॥ అక్కడ తిథి మొదలగు వానిని శ్రీధరుడిట్లా చెప్పాడు - షష్ఠి, అష్టమి,పూర్ణిమ, చతుర్థి రెండు పక్షముల చతుర్దశులు వీటిని వదలితే మిగిలిన తిథులు నిషేకమునకు శుభమైనవి. వారములలో - సోమ, గురు, శుక్ర, బుధవారములు మంచివి. నక్షత్రములలో - శ్రవణ, రోహిణి, హస్త, అనూరాధ, స్వాతి, రేవతి, మూల, ఉత్తరఫల్గుణి, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిష నక్షత్రాలు గర్భాధానమందు పూజ్యమైనవి. పుష్యమి, ధనిష్ఠ, మృగశిర, అశ్విని, చిత్ర, పునర్వసు ఇవి మధ్యమఫలాన్ని ఇచ్చేవి. ఇతరమైనవి విఫలమైనవి.

మూ॥ **విష్ణ్వాదిదైవత్యనక్షత్రా** ణ్యుక్తానిరత్నమాలాయాం-మేషాద్రసయమాగ్ని ధాతృశశినః శర్వోది తిర్వాక్పతిః కద్రూజాఃపితరో భగోఽర్య మరవీ త్వష్టాహ్వయో మారుతః శక్రాగ్నీ త్వథమిత్ర ఇంద్ర నిర్ ఋతీ తోయం చవిశ్వేవిధిః, గోవిందో వసవోఽంబుపాజ చరణాహిర్బుధ్న్య పూషాభిధాః ॥ ఉత్తరాశబ్దేన ఉత్తరాత్రయం. అథ మూలస్య పూజ్యత్వముక్తం. యాజ్ఞవల్క్యేనతు - ఏవంగచ్ఛన్ స్త్రియంక్షామాం మఘాం మూలం చ వర్జయేత్, ఇత్యుక్తం. తేన పూర్వత్ర మూలం చింత్యం. అత్ర సమాసుపుత్రాః విషమాసుకన్యా, ఇతిజ్ఞేయం. యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియో ఽయుగ్మాసు రాత్రిషు, ఇతి హేమాద్రౌ శంఖోక్తేః. తత్రాప్యుత్తరోత్తరాః ప్రశస్తాః . తదాహ పస్తంబః - తత్రాప్యుత్తరోత్తరా ప్రశస్తాః ఇతి. తత్రైవ వ్యాసః - రాత్రౌ చతుర్థ్యాం పుత్రః స్యాత్ అల్పాయుర్ధనవర్జితః, పంచమ్యాం పుత్రిణీనారీషష్ఠ్యాం పుత్రస్తు మధ్యమః సప్తమ్యా మప్రజాయోషి దష్ట మ్యామీశ్వరః పుమాన్, నవమ్యాం సుభగానారీదశమ్యాం ప్రవరః సుతః ఏకాదశ్యామధర్మాస్త్రీ ద్వాదశ్యాం పురుషోత్తమః, త్రయోదశ్యాం సుతా పాపా వర్ణసంకర కారిణీ, ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ ఆత్మవేదీ దృఢవ్రతః, ప్రజాయంతే చతుర్దశ్యాం పంచదశ్యాం పతివ్రతా, ఆశ్రయః సర్వభూతానాం షోడశ్యాం జాయతే పుమాన్, ఇతి. అథ చతుర్థదిన నిషేధేఽపి-స్నాతాం చతుర్థే దివసేరాత్రౌ గచ్ఛే ద్విచక్షణః, ఇతి మహాభారతోక్తేః, చతుర్థేఽహని స్నాతాయాం యుగ్మాసు వాగర్భం సందధాతి, ఇతి హారీతోక్తేః వికల్పోజ్ఞేయః. తత్రాపి-స్నానం రజస్వలాయాస్తు చతుర్థేఽహని శస్యతే, గమ్యా నివృత్తే రజసి నానివృత్తే కథంచన, ఇత్యావస్తంబోక్తేః వ్యవస్థాజ్ఞేయా. అత్రసర్వాసుయుగ్మాసుగమన మావశ్యకం. యుగ్మాస్వితి బహువచన నిర్దేశాదితి విజ్ఞా నేశ్వరః. తచ్చైకస్యాం రాత్రౌ సకృదేవకార్యం. సుస్థే ఇందౌ సకృత్పుత్రం లక్షణ్యం జనయేత్పుమాన్ ఇతి యాజ్ఞవల్క్యోక్తేః. ఇదం చర్తౌ గమన మన్య కాలే ప్రతిబంధాదినా గమనా సంభవే శ్రాద్ధై కాదశ్యాదావపి కార్యం. బ్రహ్మచార్యేవ పర్వాణ్యాద్యాః చతస్రశ్చ వర్జయేత్. ఇతి యాజ్ఞవల్క్యోక్తేః.

**వ్యాఖ్యాతం చేదం మితాక్షరాయాం - యత్ర శ్రాద్ధా దౌ బ్రహ్మచర్యం విహితం తత్రా ప్యృతౌ గచ్ఛతో న బ్రహ్మచర్య స్ఖలన దోషః, ఇతి. పర్వాణీతి బహుత్వే నాష్టమీ చతుర్దశ్యోః గ్రహణ మితి చ. మదనరత్నేఽ ప్యేవం.**

**తా॥** రత్నమాల యందు విష్ణు మొదలగు దైవత్య నక్షత్రములు (శ్రవణం) చెప్ప బడ్డాయి. అశ్వినికి అశ్విని కుమారులు, భరణికి యముడు, కృత్తికకు అగ్ని, రోహిణికి బ్రహ్మ, మృగశిరకు చంద్రుడు, ఆర్ద్రకు శివుడు, పునర్వసువుకు అదితి, పుష్యమికి బృహస్పతి, ఆశ్లేషకు నాగులు, మఖకు పితరులు, పూర్వఫల్గునికి భగదేవుడు (సూర్య) ఉత్తర ఫల్గునికి అర్యమ, హస్తకురవి, చిత్తకు విశ్వకర్మ, స్వాతికి మరుత్తులు, విశాఖకు ఇంద్రుడు మరియు అగ్ని, అనూరాధకు మిత్రుడు (సూర్య) జ్యేష్ఠకు ఇంద్రుడు, మూలకు నిర్‌ఋతి, పూర్వాషాఢకు జలము, ఉత్తరాషాఢకు విశ్వేదేవతలు, అభిజిత్తుకు బ్రహ్మ, శ్రవణంనకు హరి, ధనిష్ఠకు అష్టవసువులు, శతభిషంకు వరుణుడు (జలం) పూర్వాభాద్రకు అజచరణము (సూర్య) ఉత్తరాభాద్రకు అహిర్‌బుధ్న్యుడు (సూర్య) రేవతికి పూష(సూర్య) 27 నక్షత్రములకు 27 దేవతలు. ఉత్తర అనే శబ్దంతో ఉత్తర ఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలు గ్రాహ్యములు. ఇక మూల నక్షత్రమునకు పూజ్యత్వం చెప్పబడింది. యాజ్ఞవల్క్యుడైతే ఇట్లా చెప్పాడు - ఈ విధముగా (రజస్వల వ్రతం ఆది నుండి లేదా స్నిగ్ధభోజనం ఆది నుండి స్త్రీ సంగమం చేస్తూ మఘ, మూల నక్షత్రములందు వదలాలి (సంగమం వద్దు) అని. అందువల్ల ముందు చెప్పిన దానికి మూలము ఆలోచించాలి. ఇందు సమరాత్రులందు పుత్రుడు, విషమ రాత్రులందు పుత్రిక, అని తెలుసుకోవాలి. హేమాద్రి యందు శంఖోక్తి ఇట్లా - యుగ్మరాత్రులందు (2,4,6అట్లా) పుత్రులు కల్గుతారు. అయుగ్మములందు స్త్రీలు, అని అందులో కూడా ఉత్తరోత్తరమైనవి ప్రశస్తమైనవి. దానినే ఆపస్తంబుడిట్లా - అక్కడ కూడా ఉత్తరోత్తర తిథులు ప్రశస్తమైనవి అని . అక్కడే వ్యాసుడిట్లా - చవితి (నాల్గవ) రాత్రి యందు గర్భాధానం చేస్తే పుత్రుడు కల్గుతాడు కాని అల్పాయువు ధనహీనుడౌతాడు. పంచమి (ఐదవ)యందైతే ఆడపిల్లలుకలది, ఔతుంది. షష్ఠి (ఆరవ) యందైతే పుత్రుడు మధ్యముడు కల్గుతాడు. సప్తమియందు (ఏడవ)సంతానహీన ఔతుంది. అష్టమి (ఎనిమిదవ) యందైతే, ఈశ్వరుడైన పుత్రుడు కల్గుతాడు. నవమియందైతే (తొమ్మిదవ రాత్రి) ఐశ్వర్యం గల కన్య, దశమి (పదోరాత్రి) యందు శ్రేష్ఠుడైన పుత్రుడు ఏకాదశియందైతే (11రాత్రి) అధర్మమాచరించే కన్య ద్వాదశియందైతే(12వరాత్రి) పురుషులలో ఉత్తముడైన పుత్రుడు త్రయోదశి (13వది)యందైతే పాపాత్మురాలైన కన్య వర్ణసాంకర్యం చేసేది, చతుర్దశి యందైతే (14వది), ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, ఆత్మజ్ఞాని, దృఢవ్రతుడు ఐన సంతానం ఔతుంది. పంచదశియందు (15వరాత్రి) పతివ్రత కన్య కల్గుతుంది. పదహారవ రాత్రియందైతే సర్వ ప్రాణులకు రక్షకుడైన పుత్రుడు కల్గుతాడు అని.(ఋతుమతియైన నాల్గవనాట నుండి ఋతుమతియైన 16వ రోజు వరకు లెక్క ఇది) ఇక్కడ నాల్గవ రోజు నిషేధమైనా,

మహాభారతంలో ఇట్లా ఉంది – విచక్షణుడు నాల్గవరోజు రాత్రియందు స్నానం చేసిన భార్యను పొందాలి, అని. నాల్గవరోజు స్నానం చేశాక లేదా యుగ్మములందు కాని గర్భం ధరిస్తాడు అని హరీతోక్తి ఉన్నందువల్ల ఇది వికల్పమని తెలుసుకోవాలి. (దైవ, పితృకర్మలందు ఐదవరోజు శుద్ధి, ఐదవరోజు రజోనివృత్తి కాలం. నాల్గవరోజు రజోనివృత్తిఐతే, గర్భాధానాది దేవకర్మకు, శాంతికి యోగ్యురాలు. (శ్రౌత కర్మలలో, ఉపనయనాదుల్లో నాల్గవరోజు అధికారి). అక్కడ కూడా –ఆపస్తంబులు చెప్పిన వ్యవస్థ ఇట్లా ఉంది. రజస్వలయైన స్త్రీకి నాల్గవరోజు స్నానం తగును. రజస్సు నివృత్తమైతే పొందుకు తగును. నివృత్తం కాకపోతే పొందుకు ఎట్లైనా తగదు, అని తెలుసు కోవాలి. (రజస్సు వచ్చినా స్నాన స్పర్శలకు తగును, కాని గర్భాధానం, ఉపనయనం మొదలగు శ్రౌత స్మార్త కర్మలకు తగదు). ఇక్కడ అన్ని యుగ్మరాత్రములందు స్త్రీని తప్పక పొందాలి. విజ్ఞానేశ్వరుడు ఇట్లా చెప్పాడు –యుగ్మములందు అని బహువచనం చెప్పాడు కనుక, అని. ఆ పొందు ఒక రాత్రి యందు ఒకేసారి చేయాలి యాజ్ఞవల్క్య ఉక్తి ఇట్లా ఉంది – చంద్రుడు పదకొండవ స్థానమందుండగా ఒక్కసారి మాత్రమే పొందితే నరుడు మంచి లక్షణములు గల పుత్రుని పొందుతాడు. అని ఇది ఋతుకాల మందు చెప్పే పొందు ఇతరకాలములందు ప్రతిబంధాదుల వల్ల పొందు కుదరని పక్షంలో శ్రాద్ధము, ఏకాదశి మొదలగు వాని యందు కూడా పొందాలి. యాజ్ఞవల్క్యోక్తి ఇట్లా – బ్రహ్మచారియే, పర్వదినములు, తొలినాల్గు రోజులు వదలాలి, అని. మితాక్షరియందు అది ఇట్లా వ్యాఖ్యానించ బడింది. ఎక్కడ శ్రాద్ధాదులందు బ్రహ్మచర్యం విధించబడిందో అక్కడ కూడా ఋతుకాల మందు పొందేవాడికి బ్రహ్మచర్య స్ఖలన దోషం రాదు అని. పర్వములు అని బహువచనం చెప్పినందువల్ల అష్టమి, చతుర్దశులను గ్రహించాలి, అని కూడా అన్నారు. మదనరత్న మందు కూడా ఇట్లాగే ఉంది.

మూ॥ యత్తు హేమాద్రౌ శివరహస్యే – **దివాజన్మదినేచైవ న కుర్యాన్మైథునం వ్రతీ, శ్రాద్ధం దత్వా చ భుక్త్వా చ శ్రేయోఽర్థీన చ పర్వసు, ఇతి తదనృతువిషయం. బ్రహ్మచార్యే వ భవతి యత్ర తత్రాశ్రమే వసన్, ఇతి మనూక్తేః దర్శాదౌతు న భవత్యేవ, పర్వణాం పర్యుదస్తత్వాత్. మాధవీయేతు – ఋతుకాలే నియుక్తో వానైవ గచ్ఛేత్ స్త్రియం క్వచిత్, తత్ర గచ్ఛన్ సమాప్నోతి హ్యనిష్టం ఫలమేవతు, ఇతి వృద్ధమనూక్తేః. శ్రాద్ధే బ్రహ్మచర్యం నియత మిత్యుక్తం. పృథ్వీ చంద్రోదయేఽప్యేవం. ఏతత్పతిసంభవే జ్ఞేయం.**

తా॥ హేమాద్రి యందు శివరహస్య వాక్యం ఏదైతే ఉందో – వ్రతమాచరించేవారు పగటిపూట, జన్మదినమందు కూడా మైథునం ఆచరించరాదు. శ్రాద్ధమాచరించి లేదా భుజించి కాని పర్వములందును శ్రేయస్సు కోరుకునే వాడు మైథున మాచరించరాదు. అని ఈ మాటలు ఋతుమతికాని విషయకములు. మనువు ఇట్లన్నాడు. ఏ ఆశ్రమంలో ఉన్నా నరుడు ఋతుకాలంలో భార్యను పొందితే కూడా బ్రహ్మచారియే ఔతాడు అని. అమావాస్యాదులందు స్త్రీగమన ప్రసక్తే లేదు. పర్వకాలమును నిషేధించారు కనుక (శ్రుతి

– ప్రాణంవా ఏతే ప్రస్కందంతి యే దివారత్యా సంయుజ్యంతే, బ్రహ్మచర్యమేవ తద్రాత్రౌ సంయుజ్యంతే) మాధవీయమందైతే – వృద్ధమనువచనమిట్లా – ఋతుకాలమందు నియుక్తుడైనా పురుషుడు, ఎప్పుడూ స్త్రీని చేరరాదు. అక్కడికి వెళ్తే అనిష్ట ఫలమునే పొందుతాడు (ఆమెను పొంది) అని. శ్రాద్ధమందు బ్రహ్మచర్యము తప్పని సరి అని చెప్పారు. పృధ్వీ చంద్రోదయంలో కూడా ఇట్లాగే ఉంది. దీనిని సతి సంభవమందు (వీలైతే) అనిగ్రహించాలి. (రజస్వలవిధం నాల్గు రకాలు. ఋతుకాలంలో ఐందికాలజ, తిన్న ఆహారప్రభావం వల్ల వచ్చేది ద్రవ్యజ, ప్రసూతి కన్న ముందు కలిగేది రాగజ, రోగం వల్ల కలిగే రజం రాగజ. రజో నివృత్తి ఐతేనే, గృహ్యాకర్మలకైనా ఆమె వెళ్ళటానికి తగింది).

మూ॥ **అనేకభార్యస్యర్తు యౌగపద్యే హెమాద్రౌకశ్యపః –యౌగపద్యేతు తీర్థానాం వివాహ క్రమశోవ్రజేత్, రక్షణార్థమ పుత్రాంవా గ్రహణ క్రమశోఽపివా, ఇతి.** గ్రహణం = ఋతుగ్రహణం. ఋగ్విధానే – **విష్ణుర్యోనిం జపే త్సూక్తం యోనిం స్పృష్ట్వా త్రిభిర్వ్రతీ, గర్భాధానంతతః కుర్యాత్ సుపుత్రో జాయతే ధ్రువం. అగమనే దోషమాహ పరాశరః ఋతుస్నాతాంతుయోభార్యాం సన్నిధౌనోపగచ్ఛతి, ఘోరాయాం భ్రూణహత్యాయాం పచ్యతేనాత్ర సంశయః. అస్యాపవాద మాహమదన రత్నే వ్యాసః – వ్యాధితో బంధన స్థోవా ప్రవాసేష్వథ పర్వసు, ఋతుకాలేఽపి నారీణాం భ్రూణ హత్యా ప్రముచ్యతే. వృద్ధాం వంధ్యాం అసద్వృత్తాం మృతాపత్యా మపుష్పిణీం, కన్యాసూం బహుపుత్రాం చ వర్జయే న్ముచ్యతే భయాత్.** వృద్ధాం=గతరజస్కాం.

అను॥ అనేక మంది భార్యలుండి వారు ఒకే కాలమందు ఋతుమతులైతే హేమాద్రి యందు కశ్యపోక్తి ఇట్లా – రజోధర్మం ఒకేసారి ఏర్పడితే వివాహమైన క్రమంగానో లేదా పుత్రులు లేని స్త్రీని రక్షించే కొరకో లేదా ఋతుగ్రహణ క్రమంలోనో వారిని పొందాలి అని ఋగ్విధానమందు ఇట్లా –వ్రతమాచరించేవాడు మూడు మార్లు యోనిని స్పృశించి, విష్ణుర్యోనిం అనే సూక్తాన్ని జపించాలి. పిదప గర్భాదానం చేయాలి. అప్పుడు మంచి పుత్రుడు తప్పకుండా కల్గుతాడు అని ఋతుమతియైన భార్యను పొందకపోతే దోషము అని పరాశరుదన్నాడు – ఋతుస్నాతయైన భార్య సన్నిధికి ఎవడు చేరడో వాడు ఘోరమైన భ్రూణ హత్యను చేసినవాడౌతాడు. ఇందులో అనుమానము లేదు అని (పాపి). దీనికి అపవాదము మదనరత్నమందు వ్యాసోక్తి ఇట్లా – వ్యాధితుడు, బంధనస్థుడు, ప్రవాసి, పర్వకాలం స్త్రీకి ఋతుకాలమైనా పొందనివాడు భ్రూణహత్య పాపం నుండి ముక్తుడౌతాడు. వృద్ధురాలిని (ముట్లు ఉడిగింది) వంధ్యను, సద్వృత్తములేనిదానిని, సంతానము మరణించిన దానిని, రజోధర్మము లేని దానిని, ఆడసంతానం అధికంగా కలదానిని, అధిక పుత్రులు కల దానిని ఇట్టి స్త్రీల పొందును విడిచిపెట్టాలి. వాడూ పాప భయం నుండి ముక్తుడౌతాడు. (ఓం విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు ఆ సించతు ప్రజాపతిర్ధాతా గర్భందధాతుతే. గర్భంధేహిసినీవాలి గర్భం ధేహి సరస్వతి. గర్భంతే అశ్వినౌ దేవావా ధత్తాం పుష్కర ప్రజా, హిరణ్యయీ అరణీయం నిర్మంథతో అశ్వినా తంతే గర్భం హ

వామహే దశమే మాసి సూనవే. ఋతువు యందు భార్యను పొందకపోతే వాడు ప్రాణాయా మశత మాచరించాలి. కృచ్ఛ్రమునకు 200 ప్రాణాయామములు ప్రత్యామ్నాయము.

**మూ॥ గర్భాధానాంగహోమా కరణే ప్రాయశ్చిత్తమాహ-పారిజాతే ఆశ్వలాయనః - గర్భాధానస్యాకరణాత్తస్యాం జాతస్తుదుష్యతి, అకృత్వాగాంద్విజేదత్వా కుర్యాత్పుంసవనం పతిః . గర్భాధానం చ మలమాసశుక్రాస్తా దావపికార్యం. ఉత్సవేషు చ సర్వేషు సీమంతఋతు జన్మసు, సురాసురేజ్య యోశ్చైవ మౌఢ్యదోషోన విద్యతే, ఇతి జ్యోతిర్నిబంధే భృగూక్తేః. ఋతుగమనే పరాశరః - ఋతౌతు గర్భశంకిత్వాత్ స్నానం మైథునినః స్మృతం, అనృతౌతు యదాగచ్ఛేత్ శౌచం మూత్రపురీషవత్. స్త్రీణాం తు న స్నానం ఉభావప్యశుచీస్యాతాం దంపతీశయనం గతౌ, శయనాదుత్థితా నారీ శుచిః స్యాత్ అశుచిః పుమాన్, ఇతి వృద్ధశాతాతపోక్తేః అత్రకశ్చిద్విశేష ఉచ్యతే- తత్ర రాత్రౌ రజసి జననాదౌ చ రాత్రింత్రి భాగాం కృత్వా ఆద్య భాగద్వయే చేత్ పూర్వ దినంగ్రాహ్యం, పరతస్తూత్తర మితి మితాక్షరాయాం. యత్తు - ప్రాగర్ధరాత్రాత్ ప్రాగ్వాసూర్యోదయాత్ పూర్వదినం గ్రాహ్యం, ఇత్యుక్తం, తత్రదేశాచారా ద్వ్యవస్థా. తథా సప్తదశదిన పర్యంతం పునః రజోదర్శనేస్నాన మాత్రం అష్టాదశే ఏకరాత్రం, ఊన వింశే ద్వ్యహః, వింశతి ప్రభృతి, త్రిరాత్రమితి తతఏవజ్ఞేయం. యత్తు చతుర్దశ దినాదర్వాగ శుచిత్వం న విద్యతే, ఇతి, తత్ర స్నాన ప్రభృతి త్వమభిప్రేతం. ఏతచ్చయస్యా వింశతి దినోత్తరం ప్రాయశోరజస్తస్యైవ. యస్యాస్త్వర్వాక్ ప్రాయశోరజః తత్రోక్తం స్మృత్యర్థసారే- త్రయోదశదినాదూర్ధ్వం ప్రాయోరజోవతీనాం ఏకాదశదినాత్ ప్రాగశుచిత్వం నాస్తి. ఏకాదశదిన ఏకరాత్రం, ద్వాదశే ద్విరాత్రం, ఊర్ధ్వం త్రిరాత్రం ఇతి. ప్రయోగపారిజాతేఽ ప్యేవం.**

**అను॥** గర్భాధాన అంగమైన హోమాన్ని చేయని పక్షంలో ప్రాయశ్చిత్తాన్ని పారి జాతంలో ఆశ్వలాయనుడు ఇట్లా చెప్పాడు -గర్భాధాన (హోమ)ము చేయనందువల్ల ఆ స్త్రీ యందు కల్గిన సంతానము దోషవంతుడౌతాడు. హోమం చేయకపోతే ఆమె భర్త ఒక ఆవును బ్రాహ్మణునకు దానం చేసి పుంసవన సంస్కార మాచరించాలి అని. గర్భాధానమును మల మాసమందు గురు శుక్రాస్తాదులందు కూడా ఆచరించవచ్చును. జ్యోతిర్నిబంధమందు భృగూక్తి ఇట్లా ఉంది- ఉత్సవము లన్నింటిలో, సీమంత సంస్కారమందు, ఋతుకాలమందు దేవతల రాక్షసుల గురువుల (గురు,శుక్రుల)మూఢదోషము (అస్త)ఉండదు, అని. ఋతు గమనమందు పరాశరోక్తి ఇట్లా - ఋతుకాల మందు గర్భ మేర్పడుటకు అవకాశముంది, అందువల్ల మైథున మాచరించే వారు స్నానమాచరించాలి. ఋతుకాలం కానప్పుడు భార్యను పొందేవాడు మూత్రపురీష కాలము లందు వలె శౌచం (శుచి) ఆచరిస్తేచాలు. (మూత్రానికి పోతే నాల్గుసార్లు ఆచమనం చేయాలి. దొడ్డికి వెళ్తె ఒకసారి లింగానికి మట్టి అంటించాలి (శుద్ధికై) చేతికి మూడుసార్లు మట్టితో శుద్ధి, రెండు చేతులకు రెండుసార్లు, కాళ్ళపై ఒక సారి చేస్తే శుద్ధి శుక్రమందైతే దీనికి రెట్టింపు ఆచరిస్తే శుద్ధి). స్త్రీలకు స్నానం అవసరం లేదు. శయనంపైకి వెళ్ళిన దంపతులు ఇద్దరు అశుచులైతారు. (మైథునంవల్ల) కాని శయనం

నుండి లేచిన స్త్రీ శుచి ఔతుంది, కాని పురుషుడు అశుచిగానే ఉంటాడు(స్నానం) అని వృద్ధ శాతాతపులమాట. ఇక్కడొక విశేషం చెప్పబడుతోంది. రాత్రిపూట రజస్సు కన్పిస్తే, సంతానోత్పత్తి, లేదా ఎవరైనా మరణిస్తే రాత్రిని మూడుభాగాలు చేసి మొదటి రెండు భాగాలను పూర్వదినంగాను మూడవభాగంలో ఐతే తరువాతి దినంగానూ గ్రహించాలని మితాక్షర యందు కలదు. అర్థరాత్రి కన్న ముందైనా, సూర్యోదయంకన్న ముందైనా పైవి జరిగితే ముందు రోజు కిందే లెక్క అని ఏదన్నారో, అక్కడ దేశాచారాన్ననుసరించి నిర్ణయము. అట్లాగే పదిహేడు రోజుల వరకు తిరిగి రజోదర్శనమైతే స్నానం మాత్రమే, పద్దెనిమిదవ రోజైతే ఒకరోజు వెలి, పందొమ్మిదోరోజైతే రెండు రోజులు బయట, ఇరువదవ నాటినుండి ఐతే మూడు రోజులని అక్కడి నుండే తెలుసుకోవాలి. పదునాలుగు రోజులకన్న ముందైతే అశుచిత్వములేదు అని అన్నారో అక్కడ స్నానం మొదలగునవి అని అభిప్రాయము. ఇది కూడా అక్కడే అన్నారు ఏ స్త్రీకి ఇరువది రోజుల తరువాత తరుచుగా రజస్సు ఉంటుందో ఆమెకు కూడా స్నానమే. ఏ స్త్రీకి ఇరువది రోజులకు ముందు తరచుగా రజస్సు ఉంటుందో అట్టి స్త్రీకి స్మృత్యర్థసారంలో ఇట్లా చెప్పబడింది – పదమూడవ రోజు తరువాత తరచుగా రజస్సు కలవారికి పదకొండు రోజుల కన్న ముందు అశుచిత్వం లేదు. ఏకాదశ దినంలో ఐతే ఒకరాత్రి, పన్నెండవ రోజు రెండు రాత్రులు, ఆ పైన మూడు రా[illegible] వి. ప్రయోగ పారిజాతమందు కూడా ఇదే చెప్పబడింది

**మూ॥ రోగజేతు** తత్రైవ విశేషః సంగ్రహే – రోగేణయద్రజః స్త్రీణాం అన్వహం హి ప్రవర్తతే, నాశుచిస్తు భవేత్తేన యస్మాద్వైకారికం మతం, ఇతి. కర్మాధికారస్తు రజోనివృత్తావేవ. సాధ్వాచారానతావత్స్యాత్ స్నాతాఽపి స్త్రీ రజస్వలా, యావత్ప్రవర్త మానంహి రజోనైవ నివర్తతే, ఇతి శ్రాద్ధహేమాద్రౌ శంఖోక్తేః – తత్రాపి స్వకాలేశుచిరే వేత్యాహ ఋష్యశృంగః – రోగజేవర్తమానేఽపి కాలే నిర్యాతికాలజం, తస్మాత్కాలేఽ ప్రమత్తా స్యాదన్యథా సంకరోభేవత్. తథా రజస్వలాయా రజస్వలాంతరస్పర్శేఽకామతః స్నానం, కామతః ఉపవాసః పంచగవ్యాశనం చ.అసవర్ణానాంతు బ్రాహ్మణ్యాః క్షత్రియా దిస్పర్శే క్రమేణ కృచ్ఛ్రార్ధపాదోన కృచ్ఛ్రాతికృచ్ఛ్రాః క్షత్రియా దీనాంతు కృచ్ఛ్రపాద ఏవ. క్షత్రియాదీనాం హీనవర్ణ స్పర్శేత్రిరాత్రముపవాసః, వైశ్యాశూద్ర్యోః పూర్వయా స్పర్శే అహోరాత్రం, ద్విరాత్రం చ. ఏతచ్చ కామతః . అకామతస్తుప్రాక్శుద్ధేరనశనం. అకామతశ్చాండాలాది స్పర్శేప్య నశనమేవ ప్రాక్శుద్ధేః. కామతస్తు ప్రథమేఽహ్ని త్ర్యహః ద్వితీయేద్వ్యహః తృతీయే ఏకాహః. శ్వస్పర్శేతు ద్వ్యహ ఏకాహో వా. భుంజా నాయాః చాండాలాది స్పర్శేషడ్రాత్రం. ఉచ్ఛిష్టయోః స్పర్శేతు కృచ్ఛ్రఇత్యాది మితాక్షరా యాం జ్ఞేయం. స్మృత్యర్థసారేతు సర్వత్ర బాలా పత్యాయాః స్పర్శేస్నానే కృతేభుక్తిః పశ్చాదన శన ప్రత్యామ్నాయ ఇతి.

**అను॥** రోగంవల్ల రజస్సువస్తే అక్కడే సంగ్రహంలో విశేషం ఇట్లా – ప్రతిరోజు స్త్రీలకు రోగం వల్ల రజస్సు వస్తే దానితో స్త్రీలకు అశుచిత్వం రాదు, ఎందువల్లనంటే అది వికారం వల్ల ఏర్పడ్డది అని. కర్మాధికారం మాత్రం రజోనివృత్తి అయ్యాకనే. శ్రాద్ధ హేమాద్రి

యందు శంఖోక్తి ఇట్లా ఉంది-రజస్వల ఐన స్త్రీ స్నానం చేసినా అంతవరకు సాధు ఆచరణవతి కాలేదు, ఎంతవరకైతే వస్తున్న రజస్సు ఆగిపోదో, అని. అక్కడ కూడా తన రజోధర్మ కాలమందైతే శుచియే అని ఋష్యశృంగులిట్లన్నారు – రోగం వల్ల వచ్చే రజం వస్తున్నా కాలజమైన (ఋతు) రజం కాలంలో వస్తుంది. అందువల్ల ఋతుకాలమందు అప్రమత్తంగా ఉండాలి, లేకున్న (మైథునంవల్ల, సంతానము) సంకరము ఉత్పన్నమౌతుంది, అని. అట్లాగే రజస్వలైన స్త్రీ మరొక రజస్వలైన స్త్రీని తెలియకుండా ముట్టే స్నానం చేయాలి. తెలిసిముట్టే ఉపవాసం చేయాలి. పంచగవ్యాశన చేయాలి. అసవర్ణులైతే ఇట్లా – బ్రాహ్మణ స్త్రీని క్షత్రియాది స్త్రీలు ముట్టే క్రమంగా కృచ్ఛ్ర అర్ధపాద, ఊనకృచ్ఛ్ర అతికృచ్ఛ్రములు ఆచరించాలి. క్షత్రియాదులకైతే కృచ్ఛ్ర(అర్ధ)పాదమే చెప్పబడింది. క్షత్రియాది స్త్రీలను హీనవర్ణ స్త్రీ ముట్టే మూడు రోజులు ఉపవాసము. వైశ్యశూద్ర స్త్రీలను పూర్వజాతిస్త్రీ ముట్టే(బ్రాహ్మణ, క్షత్రియ) అహో,రాత్రము లేదా రెండు రాత్రులు ఉపవాసము. ఇది బుద్ధి పూర్వకముగా ముట్టేనే. తెలియకుండా ముట్టే శుద్ధికన్న ముందు భోజనం లేకుండా ఉండటం తెలియకుండా చాండాలాది స్పర్శలైతే శుద్ధికన్న ముందు అన శనవ్రతమే. కావాలని ముట్టే మొదటి రోజైతే మూడు రోజులు, రెండవరోజైతే రెండురోజులు, మూడవనాడు ముట్టే ఒకరోజు అనశనము. కుక్కతాకితే రెండు రోజులు లేదా ఒక రోజు కాని అనశనము. భోంచేస్తున్నప్పుడు చాండాలాది స్పర్శ కలిగితే ఆరురాత్రులు అనశనం. ఉచ్ఛిష్టులు (రజస్వలలు) ఇద్దరు పరస్పరం తాకితే కృచ్ఛ్రము మొదలగునవి అని మితాక్షర యందు తెలుసుకోవాలి. స్మృత్యర్థసారమందైతే ఇట్లా బాలసంతానవతియైన స్త్రీయొక్క బాల స్పర్శయందు అంతటా స్నానం చేసి భోజనం చేస్తే చాలు భోజనం తర్వాత ముట్టే అనశన మాచరించాలి అని.

మూ॥ **స్నానవిధించాహ** పరాశరః – స్నానే నైమిత్తికే ప్రాప్తే నారీ యది రజస్వలా, **పాత్రాంతరితతోయేన స్నానం కృత్వా వ్రతం చరేత్. సిక్తగాత్రా భవేదద్భిః సాంగోపాంగా కథంచన,** న వస్త్ర పీడనం కుర్యాత్ నాన్యద్వాసశ్చ ధారయేత్. **అత్ర రజస్వలాస్నానం** దైవజ్ఞవల్లభః – బ్రహ్మేమరాధాశ్విన సౌమ్యభేషు హస్తానిలా ఖండల వాసవేషు, విశ్వార్యమర్క్షోత్తర భాద్ర భేషు వరాంగనా స్నానవిధిః ప్రదిష్టః **జ్వరేతూశనాః** – **జ్వరాభిభూతాయానారీ** రజసాచ పరిప్లుతా, కథం తస్యాభవేచ్ఛౌ చం శుద్ధిః స్యాత్ కేనకర్మణా, చతుర్థేఽహని సంప్రాప్తే స్పృశేదన్యాతు తాంస్త్రియం, సాసచైలాఽవగాహ్యాపః స్నాత్వా పునః స్పృశేత్.దశద్వాదశకృత్వోవా ఆచామేచ్చపునః పునః, అంతే చ వాససాంత్యాగః తతః శుద్ధా భవేత్తు సా, ఇతి ఇదం చాతురమాత్రేజ్ఞేయం. ఆతురే స్నాన ఉత్పన్నే దశకృత్వో హ్యనాతురః, ఇతి పకాశరోక్తేః. **రజసోఽజ్ఞానేతు** పరాశర మాధవీయే ప్రజాపతిః అవిజ్ఞాతే మలేసా చ మలవద్వసనాయది, కృతం గృహేషు దుష్టంస్యాత్ శుద్ధి స్తస్యాః త్రిరాత్రతః. దేవజానీయే కారికాయాం – ఉచ్ఛిష్టాతు ద్విజాతీ నాం రజః స్త్రీయది పశ్యతి, ఉపవాస మధోచ్ఛిష్టే ఊర్ధ్వోచ్ఛిష్టేత్త్ర్యహంక్షిపేత్, ఇతి.

అను॥ పరాశరుడు స్నానవిధిని ఇట్లా చెప్పాడు – స్త్రీరజస్వల ఐనప్పుడు నైమిత్తిక స్నానం ప్రాప్తిస్తే మరో పాత్రలోని నీటితో స్నానం చేసి వ్రతమాచరించాలి. (మునగొద్దు,

తోడిన నీరు అని).ఏదో రకంగా సాంగోపాంగముగా నీటితో శరీరాన్ని తడుపుకోవాలి. వస్త్రమును పిండరాదు. ఇంకో వస్త్రాన్ని ధరించొద్దు.(రజస్వలా ధర్మం – గ్రహనక్షత్రముల చూడరాదు, పగటినిద్ర, మధుమాంస తాంబూల భక్షణం వద్దు. గోళ్ళు కత్తిరించటం, పళ్ళుతోమటం, ప్రవాసం పోవటం, స్నాన, అభ్యంజనములు వద్దు). ఇక రజస్వలా స్నానాన్ని గూర్చి దైవజ్ఞ వల్లభుడు ఇట్లా చెప్పాడు – రోహిణి, అనురాధ, అశ్విని, మృగశిర, హస్త, స్వాతి, జ్యేష్ఠ, ధనిష్ఠ, ఉత్తరాషాఢ, ఉత్తరఫల్గుని, ఉత్తరాభాద్ర ఈ నక్షత్రములందు రజస్వలా స్నానము స్త్రీలకు విహితమైంది అని చెప్పారు అని. (నాల్గవరోజు స్నానానికి ఈ నక్షత్రాలు లేవని స్నానం ఆపరాదు). జ్వరమందైతే ఉశనుని మాట – జ్వరంతో బాధపడుతున్న అట్లాగే రజోదోషం కూడా కలిగిన స్త్రీకి శుచిత్వమెట్లా. ఏ కర్మవల్ల ఆమెకు శుద్ధి కలుగు తుంది. నాల్గవరోజు వచ్చాక ఆ స్త్రీని మరో స్త్రీ ముట్టుకోవాలి. ఆ ముట్టుకునే స్త్రీ వస్త్రంతో పాటు నీటిలో మునిగి స్నానం చేసి తిరిగి తిరిగి ముట్టుకోవాలి. పదిసార్లు కాని పన్నెండు సార్లుకాని మాటిమాటికి ఆచమించాలి. చివర వస్త్రముల త్యాగం చేయాలి. ఆ పిదప ఆమె శుద్ధు రాలౌతుంది, అని. ఇది ఆతురులకు (రోగులకు) మాత్రమే అని తెలుసుకోవాలి. ఆతురుడు స్నానం చేయాల్సివస్తే అనాతురుడు పదిసార్లు (స్నానంచేసి) ఆతనిని స్పృశించాలి. అని పరాశరోక్తి. రజోధర్మం తెలియని సందర్భంలో పరాశర మాధవీయంలో ప్రజాపతి వచనమిట్లా – ఆ స్త్రీకి రజోమల జ్ఞానము లేనప్పుడు లేదా ఒకవేళ వస్త్రంలో రజోమలం ఉన్న పక్షంలో ఇంటిలో చేసిన స్నానము దుష్టమౌతుంది. ఆమెకు మూడు రాత్రుల తర్వాతే శుద్ధి, అని. దేవజానీయమందు కారికయందు ఇట్లా – ద్విజాతుల స్త్రీల రజస్సును ఉచ్ఛిష్ట స్త్రీ ఒకవేళ చూస్తే అధోచ్ఛిష్టమందు ఉపవాసం చేయాలి. ఊర్ధ్వోచ్ఛిష్టమందు మూడు రోజులు ఉపవసించాలి అని (మలమూత్రములు విడిచాక, ప్రక్షాళనంకన్న ముందు కాలం అధరోచ్ఛిష్టం. భోజనం తర్వాత ముఖ ప్రక్షాళనం కన్న ముందు కాలాన్ని ఊర్ధ్వోచ్ఛిష్ట మన్నారు).

మూ॥ **అథ పుంసవనం** – ప్రయోగ పారిజాతే **జాతూకర్ణ్యః – ద్వితీయేవా తృతీయేవామాసి పుంసవనం భవేత్, వ్యక్తేగర్భే భవేత్ కార్యం సీమంతేన సహోథవా. బృహస్పతిః – తృతీయే మాసికర్తవ్యం గృష్టైరన్యత్ర శోభనం గృష్టేశ్చతుర్థే మాసేతు షష్ఠే మాస్యథవాష్టమే. సకృత్ప్రసూతా= గృష్టిః. ఏ తేన ప్రతిగర్భమపి భవతీతి జ్ఞాయతే. బహ్వృచకారికాఽపి కర్తాస్యాద్దేవరస్తస్యా యస్యాః పత్యుర సంభవః, ఆ వర్తత ఇదంకర్మ ప్రతిగర్భమితి స్థితిః. బ్రాహ్మోగర్భాధానాది సంస్కర్తా పతిః శ్రేష్ఠతమః స్మృతః, అభావేస్వకులీనః స్యాత్ బాంధవోఽ న్యత్ర గోత్రజః. మదనరత్నే సత్యవ్రతః–మృతో దేశాం తరగతో భర్తా స్త్రీయద్య సంస్కృతా, దేవరోవాగురుర్వాఽపివంశ్యోవాఽపి సమాచరేత్. హే మాద్రౌయమః – ప్రథమేమాసి ద్వితీయేవాయదా పుంనక్షత్రేణ చంద్రమాయుక్తః స్యాత్, ఇతి. వరాహః – హస్తో మూలం శ్రవణః పునర్వసుః మృగశిరస్తథా పుష్యః, పుంసం జ్ఞకేషు కార్యేష్వే తానిశుభానిధిష్ణ్యాని అనురాధాఽపి పుంనక్షత్రం. అనురాధాన్ హ విషా వర్ధయంతః, ఇతి శ్రుతేః. గర్గోఽపి–పున్నామా శ్రవణస్తిష్యో**

హస్తశ్చైవ పునర్వసుః, అభిజిత్ ప్రోష్ఠపాచ్చైవ అనురాధా తథాశ్వయుక్. నృసింహః - రిక్తాం పర్వ చ నవమీం త్యక్త్వా పుంసవనే శుభాః. జ్యోతిర్నిబంధేవసిష్ఠః - మృత్యుశ్చ సౌరేస్త నుహానిరిందోః మృతప్రజా పుంసవనే బుధస్య కాకీచ వంధ్యా భవతీ హ శుక్రే స్త్రీ పుత్ర లాభో రవిభౌమజీవైః.

**అను॥** ఇక పుంసవనము - ప్రయోగ పారిజాతమందు జాతూకర్ణ్యుడిట్లన్నాడు - రెండవ లేదా మూడవ మాసమం దు పుంసవన మౌతుంది. గర్భం వ్యక్తమయ్యాక ఈ కార్యం చేయాలి లేదా సీమంతంతో కలిపైనా చేయాలి, అని. బృహస్పతి ఇట్లా - ప్రసవించాక మూడవనెల యందు ఈ శోభన కార్యము చేయాలి. ఒకసారి ప్రసవించాక నాల్గవ నెలయందు లేదా ఆరవనెలయందు లేదా ఎనిమిదవ నెలయందు కాని చేయటం ఉత్తమము అని. గృష్టి అనగా మొదటిసారి ప్రసవించిన స్త్రీ దీనితో గర్భం ధరించిన ప్రతిసారీ ఇది ఔతుంది అని తెలుస్తోంది. బహ్వృచకారిక కూడా ఇట్లా-సమీపంలో భర్తలేని స్త్రీకి భర్తరావటానికి వీలు లేనట్టి స్త్రీకి ఈ కార్యం చేసే కర్త దేవరుడు. ఈ పుంసవనకర్మ గర్భం ధరించిన ప్రతిసారి ఆ వృత్తి ఔతుంది, అని నియమము అని. బ్రాహ్మమందిట్లా - గర్భాధానాది సంస్కారం చేసే వాడు భర్త ఐతే శ్రేష్ఠతమమన్నారు. లేని పక్షంలో (తండ్రి) లేదా తనకులంవాడైన బంధవు చేయొచ్చు, మరో (చోట) గోత్రజుడు చేయొచ్చు, అని. (దేవరుని నుండి సుతోత్పత్తి కలిలో వద్దన్నారు కనుక ఇదీ వద్దు). మదన రత్నమందు సత్యవ్రతుడిట్లా - భర్త మరణించినా, దేశాంతరగతుడైనా ఆ స్త్రీకి సంస్కారం జరగని పక్షంలో దేవరుడు కాని గురువు కాని వంశీయుడైనా కాని సంస్కార మాచరించాలి, అని. హేమాద్రి యందు యముడిట్లా - మొదటి నెలలో లేదా రెండవ నెలలో కాని చంద్రుడు పురుష నక్షత్రంతో కూడిన వేళ, ఇది అని. వరాహోక్తి ఇట్లా - హస్త, మూల, శ్రవణం, పునర్వసు, మృగశిర, పుష్యమి ఈ నక్షత్రములన్ని పురుష సంజ్ఞక కార్యములందు శుభములు అని. అనురాధ కూడా పుంనక్షత్రము అనురాధ నక్షత్రములను హవిస్సు ద్వారా వృద్ధి పొందిస్తూ, అని. శ్రుతి. గర్గుడు కూడా - శ్రవణం, పుష్యమి, హస్త, పునర్వసు, అభిజిత్తు, అనురాధా, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, అశ్వినీ ఇవన్నీ పురుష సంజ్ఞక నక్షత్రములు అని. నృసింహుడిట్లా - రిక్త, పర్వ, నవమి వీటిని వదలి పుంసవనమందు ఇతరమైనవి శుభములు, అని. జ్యోతిర్నిబంధమందు వసిష్ఠోక్తి ఇట్లా - శనివారం పుంసవనమైతే మృత్యువు, సోమవారమైతే శరీరహాని, బుధవారమైతే మృతసంతానము కల్గుతుంది. శుక్రవారమందైతే కాక వంధ్య ఔతుంది (ఏక సంతానవతి) రవి, మంగళ, గురువారములందైతే పుంసవన సంస్కారము ఆ స్త్రీకి పుత్రలాభమౌతుంది, అని.

**మూ॥ అనవలోభనస్యాప్యయమేవ కాలః. దీపికాయాంతు చతుర్థే అనవలోభనం ఇత్యుక్తం.**

**అను॥** అనవలోభన సంస్కారమునకు కూడా ఇదే కాలము. దీపికయందైతే ఇట్లా - అనవలోభన - సంస్కారమైతే చతుర్థమాసంలో అని చెప్పబడింది.

మూ॥ **అథసీమంతః** – హేమాద్రౌ వైజవాపః – అథసీమంతోన్నయనం చతుర్థే పంచమే, షష్ఠేచ,ఇతి. వసిష్ఠః – చతుర్థే సప్తమే మాసిషష్ఠే వాష్యథ వాష్టమే. హేమాద్రౌ శంఖః – గర్భస్పందనే సీమంతోన్నయనం, యావద్వా న ప్రసవః. కార్ష్ణాజినిః – గర్భలంభనమారభ్య యావన్న ప్రసవస్తదా, సీమంతోన్నయనం కుర్యాత్ శంఖస్య వచనం యథా. మాసశ్చాత్ర సౌరః సావనో, వా. కాలవిధానే – చతుర్థ షష్ఠ్యాష్టమ మాసభాజి సౌరేణ గర్భం ప్రథమే విధేయం, సీమంతకర్మ ద్విజభామినీనాం మాసేఽష్టమే విష్ణుబలించకుర్యాత్. వసిష్ఠః – చతుర్థే సావనే మాసి షష్ఠే వాష్యథ వాష్టమే. జ్యోతిర్నిబంధేనారదః – అరిక్తా పర్వదివసే కుజ జీవార్కవాసరే. కాలవిధానే – సీమంతే తిష్య హస్తాదితి హరిశశభృత్ పౌష్ణ విధ్యుత్తరాఖ్యాః,పక్షచ్ఛిద్రం చ రిక్తాం పితృతిథి మపహాయాపరాః స్యుః ప్రశస్తాః. అదితిః = పునర్వసుః. పక్షచ్ఛిద్రంచాహ వసిష్ఠః – చతుర్దశీ చతుర్థీచ అష్టమీ నవమీ తథా, షష్ఠీ చ ద్వాదశీచైవ పక్షచ్ఛిద్రాహ్వ యాః స్మృతాః. క్రమా దేతాసుతిథిషు వర్జనీయాశ్చనాడికాః, భూతాష్ట, మను, తత్వాంక దశశేషాస్తుశోభనాః.

అను॥ ఇక సీమంతము. హేమాద్రి యందు వైజవాపుడిట్లా – ఇక సీమంతోన్నయనము నాల్గవ లేదా ఐదవ లేదా ఆరవ మాసములందు కూడా అని (నాల్గవ నెల నుండి ప్రసవ మయ్యే వరకు, శుక్ల పక్షం, 4,6,8,9,12,14, మరి అమా తిథులు కాక ఇతర తిథుల్లో, పురుష నక్షత్రాల మధ్యమ పాదాలు రెంటిలో, మంగళ, గురు, రవివారాల్లో చంద్రుడు అనుకూలుడుకాగా, శుభలగ్నాదుల్లో, విష్ట్యాది దోష రహితంలో పుంసవన మాచరించాలి. మలమాసం, శుక్ర గురు అస్తాదులు ఉన్నా ఆచరించవచ్చు. దోషం లేదు. ఇది నియత కాలికము కనుక. వసిష్ఠుడిట్లా – నాల్గవ, ఆరవ, ఏడవ లేదా ఎనిమిదవ మాస మందైనా ఇది ఆచరించాలి అని. హేమాద్రి యందు శంఖోక్తి ఇట్లా – గర్భం కదులుతున్న దశలో సీమంతోన్నయనము లేదా ప్రసవమయ్యే లోపు. కార్ష్ణాజిని ఇట్లా – గర్భం ధరించిన నాటి నుండి ప్రవసం కానంతవరకు సీమంతోన్నయనము చేయాలి, శంఖుని వచనము ప్రకారం, అని. ఇక్కడ సౌరము కాని, సావనము కాని మాసము కావచ్చు. (సౌరం = సంక్రాంతి. సావనం = సూర్యోదయం నుండి తిరిగి సూర్యోదయం వరకు ఒక దినంగా భావించి చేసే మాసం). కాల విధానమందిట్లా – ద్విజ స్త్రీలకు మొదటి గర్భధారణలో సీమంతకర్మను నాల్గవ, ఆరవ, ఎనిమిదవ మాసములు చేరాక సౌరమాసం ప్రకారం చేయాలి. అట్లాగే ఎనిమిదవ మాసమందు విష్ణు బలిని చేయాలి అని. వసిష్ఠుడు ఇట్లా – సావన మాసంలో నాల్గవది లేదా ఆరవది లేదా ఎనిమిదవ దానిలో సంస్కారం అని. జ్యోతిర్నిబంధములో నారదుడిట్లా – రిక్త కాని, పర్వం కాని, రోజున మంగళ, గురు, రవి వారము లందు సీమంత సంస్కారము చేయాలి (రిక్త =చవితి, నవమి, చతుర్దశి తిథులు చాంద్ర మాసం) అని. కాలవిధానమందిట్లా – సీమంత సంస్కారమందు పుష్యమి, హస్త, పునర్వసు, శ్రవణం, మృగశిర, రేవతి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర పక్షచ్ఛిద్రము (అష్టమి, షష్ఠి, ద్వాదశి) రిక్త, అమాపితృ మృతతిథి

వీటిని వదలి ఇతరమైనవి ప్రశస్తమైనవి అని. పక్షచ్ఛిద్ర మనగా – చతుర్థి, అష్టమి, నవమి, చతుర్దశి, షష్ఠి, ద్వాదశి ఇవి పక్షచ్ఛిద్రమను పేర్లు గలవని చెప్పబడ్డాయి. క్రమంగా ఈ తిథులలో ఈ ఘడియలను వదలాలి. చతుర్దశిలో ఐదు గడియలు, చతుర్థిలో ఎనిమిది ఘడియలు, అష్టమిలో పదునాల్గు గడియలు, నవమిలో ఇరువది ఐదు గడియలు, షష్ఠిలో తొమ్మిది గడియలు, ద్వాదశిలో పదిగడియలు వదలి మిగిలిన గడియలు శుభగడియలు అని వసిష్ఠుడు చెప్పాడు.

**మూ॥ కాల నిర్ణయే – శుభసంస్థేనిశానాథే చతుర్థీ చ చతుర్దశీం, పౌర్ణమాసీం ప్రశంసంతి కేచిత్సీమంతకర్మణి. బృహస్పతిః– పూర్వపక్షః శుభః ప్రోక్తః కృష్ణశ్చాంత్యత్రికం వినా, చతుర్దశీ చతుర్థీ చ శుక్లపక్షే శుభప్రదే, నారదః – విప్రక్ష త్రియయోః కుర్యాత్ దివాసీమంతకర్మ తత్, వైశ్య శూద్ర కయోరేతద్దివానిశ్య పికేచన. వారాః పూర్వోక్తా ఏవ. ఏతచ్చసకృదేవకార్యమితి విజ్ఞానేశ్వరః . సకృచ్చ సంస్కృతా నారీ సర్వగర్భేషు సంస్కృతా, ఇతి దేవలోక్తేః. సకృత్ప్రతి గర్భం వాకార్యమి తిహేమాద్రిః సకృచ్చకృత సంస్కారాః సీమంతేన ద్విజస్త్రియః యం యం గర్భం ప్రసూయంతే స సర్వః సంస్కృతో భవేత్, ఇతి హారీతోక్తేః. సీమంతోన్నయనం కర్మ న స్త్రీ సంస్కార ఇష్యతే, కేచిద్గర్భస్య సంస్కారాత్ ప్రతిగర్భం ప్రయుంజతే, ఇతి హేమాద్రౌ విష్ణు వచనాచ్చ. స ఏవ– స్త్రీ యద్యకృతసీమంతా ప్రసూయేత కథంచన, గృహీత పుత్రావి ధివత్ పునః సంస్కారమర్హతి.**

**అను॥** కాల నిర్ణయమందిట్లా ఉంది– కొందరు సీమంతకర్మయందు ఇట్లా అంటారు – చంద్రుడు శుభస్థానమందుండగా చతుర్థి, చతుర్దశి, పూర్ణిమ వీటిని ప్రశంసిస్తారు, అని. బృహస్పతి ఇట్లా – ఈ కర్మకు పూర్వపక్షము శుభమైనది. కృష్ణపక్షం చివరి మూడు తిథులు వదలి, శుభమైనది. శుక్లపక్షమందు చతుర్థి, చతుర్దశి శుభప్రదమైనవి అని నారదుడిట్లా – ఆసీమంత కర్మను విప్ర క్షత్రియులకు పగటిపూట ఆచరించాలి. వైశ్యశూద్రులకు దీనిని పగలు, రాత్రి కూడా అని కొందరు అని. వారములు ముందు చెప్పినవే. దీనిని ఒక్కసారే చేయాలని విజ్ఞానేశ్వరుడు అన్నాడు. దేవలుడిట్లా అన్నాడు – ఒక్కసారి సంస్కారాన్ని పొందిన స్త్రీ అన్ని గర్భములందు సంస్కారం పొందినట్లే అని. హేమాద్రి ఇట్లా – ఒక్కసారికాని, ప్రతి గర్భానికి గాని ఆచరించాలి, అని. హారీతోక్తి ఇట్లా – సీమంతంతో బ్రాహ్మణ స్త్రీలు ఒక్కసారి సంస్కారాన్ని పొందితే ఎన్నిసార్లు గర్భం ధరించి ప్రసవిస్తారో అవంతా సంస్కారం పొందినట్లే అని. హేమాద్రిలో విష్ణువచనమిట్లా – సీమంతోన్నయనకర్మ స్త్రీ సంస్కారము కాదు. కొందరు దీన్ని గర్భమునకు సంస్కారంగా భావించి ప్రతిగర్భమునకు చేస్తారు అని (కాత్యాయన శాఖులు వీరు)ఆతడే (ధర్మసింధుకర్త) – స్త్రీ సీమంత కర్మ లేకుండానే ప్రసవిస్తే ఒకవేళ పుత్రవతియైన స్త్రీ విధి ప్రకారము తిరిగి సంస్కారమునకు యోగ్యురాలౌతుంది.

**మూ॥ సీమంతభోజనే ప్రాయశ్చిత్తముక్తం పరాశరమాధవీయేధౌమ్యేన – బహ్మోదనే చ సోమే చ సీమంతోన్నయనే తథా, జాతకర్మనవశ్రాద్ధే భుక్త్వా చాంద్రాయ ణం చరేత్. ఋగ్విధానేతు**

– అరా ఇవే జపేన్మంత్రం శతవారం న సంశయః, సీమంతే చ యదా భుంక్తే ముచ్యతే కిల్బిషాత్తదా, ఇతి.

అను॥ సీమంత మందు భోజనం చేస్తే పరాశర మాధవీయంలో ధౌమ్యుడు చెప్పిన ప్రాయశ్చిత్తమిట్లా – బ్రహ్మ ఓదనము, సోమముది, సీమంతోన్నయనముది, జాతకర్మది, నవశ్రాద్ధముది భుజిస్తే చాంద్రాయణ మాచరించాలి అని. ఋగ్విధానమైతే ఇట్లా – అరా ఇవే అనే మంత్రాన్ని నూరు సార్లు జపించాలి. అనుమానం లేదు. సీమంతంలో భుజిస్తే ఆ పాపం నుండి అప్పుడే (జపిస్తేనే) విముక్తుడౌతాడు అని(అరా ఇవేదచరమా అహేవ ప్రప్ర జాయంతే అకవా మహోభిః,పృశ్నేః పుత్రా ఉపమాసో,రభిష్ఠాః స్వయామత్యాసంమిమిక్షుః)

మూ॥ **అథగర్భిణీతత్పతిధర్మాః** – వరాహః – సామి షమశనం యత్నాత్ ప్రమదా పరివర్జయేదతః ప్రభృతి. గృహ్యాకారికా – అంగార భస్మాస్థికపాల చుల్హీ శూర్పాదికే షూ పవిశేన్నారీ, సోలూఖలాద్యే దృషదాదికేవా యంత్రేతు పాద్యే, న తథో పవిష్టా, నోమార్జనీ గోమయ పిండకాదౌ కుర్యాన్న వారిణ్య వగాహనం, సా, అంగార భూత్యానన ఖైః లిఖేత్క్ష్మాం కలిం వపుః భంగమథోన కుర్యాత్. నో ముక్త కేశీ వివశాథ వాస్యాత్ భుంక్తే న సంధ్యావసరే నశేతే, నా మంగలం వాక్యముదీరయే త్సాశూన్యాలయం వృక్షతలం న యాయాత్. విష్ణుధర్మోత్తరే – కటుతీక్ష్ణ కషాయాణీ అత్యుష్ణలవణానిచ ఆయాసం చ వ్యవాయం చ గర్భిణీ వర్జయేత్సదా. హేమాద్రౌ కౌండిన్యః – ముండనం పిండ దానం చ ప్రేతకర్మ చ సర్వశః నజీవత్పితృకః కుర్యాత్ గుర్విణీ పతిరేవ చ. మితాక్షరాయాం – ఉదన్వతోంభసిస్నానం నఖకేశాది కర్తనం, అంతర్వత్న్యాః పతిః కుర్వన్ నప్రజా, జాయతే ధ్రువం. పృథ్వీ చంద్రోదయే గారుడే – గయాయాం పిండదానస్య న కదాచిన్నిరాక్రియా. అత్రకాలే దా ప్రత్యయస్మృతేః నిషిద్ధా కాలస్యైవాపవాదో నతుజీవత్పితృగర్భిణీ పత్యా శౌచాదినిమిత్త స్య. నిమిత్త సంయోగస్య కాలసంయోగాత్ భేదే నాపవాదాభావాత్. అగ్నిహోత్రవద్యావజ్జీవ పరత్వా భావాత్. అన్యథా శౌచేఽపి గయా యాత్రా శ్రాద్ధం చ స్యాత్. యత్ర నిమిత్త సంయోగ స్యాపవాదో యథాశౌచేఽగ్ని హోత్రాదేః యథా వాజీవత్పితృకస్యాపవాదో మాతుః గయాన్వష్టకాదౌ తదేవభవతి నాన్యదితి సంక్షేపః.

అను॥ ఇక గర్భిణి, ఆమె పతి ధర్మములివ్వి. వరాహుడిట్లా – ప్రయత్నపూర్వకంగా ఆ స్త్రీ అప్పటి నుండి మాంసంతో కూడా భుజించటం మానాలి అని. గృహ్యాకారిక ఇట్లా – నిప్పు, భస్మము (బూడిద), ఎముకలు, కపాలము, పొయ్యి, చాట మొదలగు వాని యందు ఆ స్త్రీ కూర్చోరాదు. రోలు మొదలగు వాని యందు, సన్నెకల్లు మొదలగు వాని యందు, తిరుగలి, పాద్య (జల) మందు అట్లాగే కూర్చోరాదు. చీపురు, పిడుకలు వానిపై కూర్చోరాదు. ఆమె నీటియందు మునగటం కూడా చేయరాదు. నిప్పుల బూడిదతో గోళ్ళతో భూమిపై వ్రాయరాదు. యుద్ధము (తగాద) ఆవులింతతోటి ఒడలివిరుపు (వపుర్భంగం) చేయరాదు. వెంట్రుకలు జారవిడిచి ఉంచరాదు. వివశకారాదు. సంధ్యా సమయమందు భుజంచరాదు, పడుకోరాదు. ఆ స్త్రీ అమంగళవాక్యములు పలుకరాదు. శూన్య గృహమునకు,

చెట్టు క్రిందికి వెళ్ళరాదు. విష్ణుధర్మోత్తరమందిట్లా – కటు, తీక్షణ, కషాయ పదార్థములను, అతి ఉష్ణ పదార్థాలను, లవణములను వదలాలి. అతికష్టము, మైథునము, గర్భిణీ స్త్రీ ఎప్పుడూ విడిచిపెట్టాలి, అని. హేమాద్రి యందు కౌండిన్యోక్తి ఇట్లా – ముండనము, పిండ దానము, ప్రేతకర్మ, అన్నివిధముల వీటిని తండ్రి బ్రతికి ఉన్నవాడు, గర్భిణీ స్త్రీ భర్త చేయరాదు, అని. మితాక్షరయందిట్లా – గర్భిణీ స్త్రీ భర్త సముద్రమందు స్నానము, నఖ కేశాదుల కత్తిరింపు చేస్తే సంతానము కలుగదు నిశ్చయము అని. పృథ్వీచంద్రోదయమందు గారుడోక్తి ఇట్లా – గయ యందు పిండదానమును ఎప్పుడూ నిరాకరించరాదు అని. ఇక్కడ కాలమందు దా ప్రత్యయము చెప్పటం వల్ల ఇది నిషిద్ధ కాలమునకే అపవాదము, కాని జీవత్పితృ, గర్భిణీపతి, ఆశౌచాది నిమిత్తము కాదు. (ఆశౌచాది తగులుతుంది) నిమిత్త సంయోగమునకు కాలసంయోగం నుండి భేదం ఉన్నందువల్ల అపవాదం కాదు (లేదు) అగ్నిహోత్రం వలె యావజ్జీవపరకము కాదు. లేనిచో ఆశౌచమందు కూడా గయా యాత్ర శ్రాద్ధము కలుగుతుంది. ఎక్కడ నిమిత్త సంయోగమునకు అపవాదమో ఎట్లాంటే ఆశౌచమందు అగ్నిహోత్రాదులకు లేదా ఎట్లాంటే తల్లి యొక్క గయ, అన్వష్టకాదులందు జీవత్పితృకునకు అపవాదమో అట్టిదే ఔతుంది, మరొకటి కాదు అని సంక్షేపము.

మూ॥ ప్రయోగ పారిజాతేకశ్యపః – గర్భిణీ కుంజరాశ్వాది శైలహర్మ్యాది రోహణం, వ్యాయామం శీఘ్రగమనం శకటారోపణం త్యజేత్. శోకం రక్తవిమోక్షం చ సాధ్వసంకుక్కుటాసనం, వ్యవసాయందివా స్వాపం రాత్రౌ జాగరణం త్యజేత్. మదనరత్నే స్కాందే – హరిద్రాం కుంకుమంచైవ సిందూరం కజ్జలం తథా, కూర్పా సకంచ తాంబూలం మాంగల్యాభరణం శుభం, కేశ సంస్కార కబరీ కరకర్ణ విభూషణం, భర్తురాయుష్యమిచ్ఛంతీ దూరయేద్గర్భిణీనహి. బృహస్పతిః – చతుర్థేమాసి షష్ఠేవాప్య ష్టమే గర్భిణీయదా, యాత్రా నిత్యం వివర్జ్యాస్యాత్ ఆషాఢేతు విశేషతః. యాజ్ఞవల్క్యః – దౌహృదస్యాప్రదానేన గర్భోదోషమవాప్నుయాత్, వైరూప్యం మరణం చాపి తస్మాత్కార్యం ప్రియం స్త్రియాః. దౌహృదం = గర్భిణీప్రియం. తత్రైవాశ్వలాయనః– వపనం మైథునం తీర్థం వర్జయేత్ గర్భిణీపతిః శ్రాద్ధం చ సప్తమాన్మా సాదూర్ధ్వం చాన్యత్ర వేదవిత్. శ్రాద్ధం తద్భోజనమితి ప్రయోగ పారిజాతః. కాల విధానే ముహూర్త దీపికాయాం చ – క్షౌరం శవానుగమనం నఖకృం తనం చ యుద్ధాది, వాస్తు కరణం త్వతిదూరయానం, ఉద్వాహమౌపనయనం జలధేశ్చగాహం ఆయుః క్షయార్థమితి గర్భిణికాపతీనాం. రత్న సంగ్రహేగాలవః – దహనం వహనం చైవ చౌలం చ గిరిరోహణం, నావ ఆరోహణం చైవ వర్జయేత్ గర్భిణీపతిః అన్యత్రాపి – ప్రవ్యక్త గర్భాపతి రబ్ధియానం మృతస్య వాహంక్షురకర్మ సంగం, తస్యాంతు యత్నేన గయాది తీర్థం యాగాదికం వాస్తువిధిం న కుర్యాత్. ప్రవ్యక్త గర్భావనితా, భవేన్మా సత్రయాత్పరం, షణ్మాసా త్పరతః సూతిః నవమేఽరిష్టవాసినీ.

అను॥ ప్రయోగ పారిజాత మందు కశ్యపుడిట్లా – గర్భిణి స్త్రీ ఏనుగు, గుఱ్ఱము మొదలగునవి పర్వతము, మేడ మొదలగునవి ఎక్కటం, వ్యాయామము (మైథునం) వేగంగా నడవటం, శకటం ఎక్కటం విడిచిపెట్టాలి, అని శోకము, రక్తవిమోక్షణము, (బ్లీడింగ్, ఆపరేషను) (జలగ, కొమ్ము వీటివల్ల రక్తం రావటం), తొందర, కుక్కుటాసనము,



వ్యవసాయము (ప్రయత్నము) (పరిశ్రమ) పగటినిద్ర, రాత్రి మేల్కొనటం విడిచిపెట్టాలి. మదన రత్నమందు స్కాందోక్తి ఇట్లా – పసుపు, కుంకుమ, సింధూరము, కాటుక, రవిక, తాంబూలము, శుభమైన మాంగల్య రూప ఆ భరణము, కేశ సంస్కారము, కొప్పు (కబరి), చేతుల చెవుల ఆభరణములు వీటన్నిటిని, భర్త ఆయుష్యమును కోరే స్త్రీ గర్భిణి విడువరాదు (ధరించాలి, గర్భిణి) అని. బృహస్పతి ఇట్లా – నాల్గవ నెలలో లేదా ఆరవ నెలలో లేదా ఎనిమిదవ నెలలో, గర్భిణి యాత్రను ఎప్పుడూ వదలాలి. విశేషించి అషాఢ మందు విడువాలి. అని యాజ్ఞవల్క్యుడిట్లా – దౌహృదం (గర్భిణికి ఇష్టమైనది) చేయనందువల్ల గర్భము దోషాన్ని పొందుతుంది. వైరూప్యము, మరణము కూడా అందువల్ల స్త్రీలకు (స్త్రీలు) ప్రియ మాచరించాలి (ద్విహృత్ రెండు హృదయాలు వాటికి చేసేది దౌహృదం) అని. అక్కడే ఆశ్వలాయనుడిట్లా – క్షౌరము, మైథునము, తీర్థయాత్ర వీటిని గర్భిణీపతి విడిచిపెట్టాలి. ఏడవ నెల తరువాత (గర్భం) వేదవిదులు ఇతరత్ర శ్రాద్ధమును విడువాలి. (పితరులు ఒకవేళ అప్పుడే మరణిస్తే, ఆతడు జ్యేష్ఠుడైతే శ్రాద్ధాది చేయాలి)అని. ప్రయోగ పారిజాత మందు ఇట్లా – శ్రాద్ధ – మనగా శ్రాద్ధ భోజనమును గర్భిణీపతి, తినరాదు, అని కాలవిధానమందు ముహూర్తదీపిక యందు కూడా ఇట్లా – క్షౌరము, శవం వెంట వెళ్ళటం, గోళ్ళు కత్తిరించటం, యుద్ధము మొదలగునవి, వాస్తువు వీటిని చేయటం (గృహ ఆరంభం) ఎక్కువ దూరం ప్రయాణించటం, వివాహము, ఉపనయనము, సముద్రస్నానము, ఇవన్ని గర్భిణి పతులకు ఆయుఃక్షీణతకొరకే కనుక ఆచరించరాదు, అని. రత్న సంగ్రహమందు గాలవోక్తి ఇట్లా – దహనము, క్షౌరము, చౌలము (చూడాకరణం) పర్వతారోహణము, నావ ఆరోహణము వీటిని గర్భిణీపతి విడువాలి, అని. ఇతరత్ర కూడా ఇట్లా ఉంది ఆమె గర్భం బాగా వ్యక్తమయ్యాక ఆమె భర్త సముద్రయానము శవాన్ని మోయటం, క్షురకర్మ, మైథునము, గయాది తీర్థము, యాగాదికము, వాస్తువిధి ఆచరించరాదు, యత్నించియైనా విడువాలి, అని మూడు నెలల తరువాత స్త్రీకి గర్భము స్పష్టమౌతుంది. ఆరు నెలల తరువాత ప్రసూతి. తొమ్మిదవ నెలలో సూతికాగృహవాసము.

**మూ॥ అథసూతికాగృహప్రవేశః**–**గర్గః–రోహిణ్యైందవ పౌష్ణేషు స్వాతీవారుణ యోరపి, పునర్వసౌపుణ్యహస్త ధనిష్ఠాత్ర్యుత్తరాసు చ, మైత్రేత్వాష్ట్రే తథాశ్విన్యాం సూతికాగారవేశనం. ఏతచ్చసంభవే.ప్రసూతిసమయేకాలే సద్య ఏవ ప్రవేశయేత్, ఇతి వసిష్ఠోక్తేః. తచ్చనైరృత్యాంకార్యం. వారుణ్యాంభోజన గృహం నైరృత్యాం సూతికా గృహం, ఇతి వసిష్ఠోక్తేః. విష్ణుధర్మోత్తరే దశాహం సూతికాగారం ఆయుధైశ్చ విశేషతః, వహ్నినాతిందు కాలాతైః పూర్ణకుంభైః ప్రదీపకైః, ముసలేన తథావారి వర్ణకైః చిత్రితేన చ ఇతి.**

**అను॥** ఇక సూతికా గృహప్రవేశము. గర్గుడిట్లా – రోహిణి, మృగశిర, రేవతి, స్వాతి, శతభిషం, పునర్వసు, పుష్యమి, హస్త, ధనిష్ఠ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనురాధ, చిత్త, అశ్విని, వీటియందు స్త్రీ సూతికా గృహాన్ని ప్రవేశించాలి, అని. ఇది జరిగే పక్షంలో. వసిష్ఠుడిట్లన్నాడు – ప్రసూతి సమయమందు సకాలంలో వెంటనే ప్రవేశపెట్టాలి.

అని.దానిని నిర్ఋతిదిశ యందు చేయాలి. వసిష్ఠుడిట్లన్నాడు – వరుణదిశయందు భోజన గృహము, నిర్ఋతియందు సూతికా గృహము ఉండాలి, అని. విష్ణుధర్మోత్తరమందిట్లా – సూతికా గృహమును పదిరోజులు విశేషించి ఆయుధములతో, అగ్నితో, తుమ్మికి కర్రలతో, పూర్ణకుంభములతో, దీపములతో, రోకలితో, పలుచని రంగులతో అలంకరించుటతో అందంగా ఉంచాలి అని.

**మూ॥ అథజాతకర్మ – పారిజాతేవసిష్ఠః – శ్రుత్వాజాతం పితాపుత్రం స చైలం స్నానమాచరేత్. మనుః – ప్రాఙ్నాభివర్ధనాత్ పుంసః జాతకర్మ విధీయతే. వర్ధనం = ఛేదనం. హేమాద్రౌవైజవాపః – జన్మనోఽనంతరం కార్యం జాతకర్మ యథావిధి, దైవాదతీతకాలంచేత్ అతీతే సూతకే భవేత్.** పృథ్వీ చంద్రోదయే విష్ణు ధర్మే – అచ్ఛిన్న నాభికర్తవ్యం శ్రాద్ధం వైపుత్ర జన్మని, పుత్రపదేన కన్యాపి గృహ్యతే. తదాహ తత్రైవ కార్ష్ణాజినిః – ప్రాదుర్భావే పుత్ర పుత్ర్యోః గ్రహణే చంద్ర సూర్యయోః స్నాత్వాఽనంతరమాత్మీయాన్ పితౄన్ శ్రాద్ధేన తర్పయేత్, ఏతచ్చరాత్రావపికార్యం. పుత్రజన్మని యాత్రాయాం శర్వర్యాం దత్తమక్షయం, ఇతి తత్రైవ వ్యాసోక్తేః . వైజవాపః – జాతమాత్ర కుమారస్య జాతకర్మ విధీయతే. స్తన ప్రాశనతః పూర్వం నాభి కర్తనతో ఽపివా, ఏతేన నైమిత్తికమపీదం జాతేష్టివదా శౌచాంతే కార్యమితి శంకా పరాస్తా. జాతే కుమారే పితౄణా మామోదాత్ పుణ్యాంతదహః, ఇతి హారీతోక్తేశ్చ.

**అను॥** ఇక జాతకర్మ – పారిజాతమందు వసిష్ఠుడిల్లా – తండ్రి, పుత్రుడు కల్గి నాడని వినగానే సచేల స్నాన మాచరించాలి అని (రాత్రైనా, చన్నీళ్ళతో, నైమిత్తిక స్నానం, కామ్య స్నానం చన్నీళ్ళతో. పుట్టగానే, తండ్రి తన సంతానం ముఖం చూస్తే తండ్రి ఋణ విముక్తుడౌతాడు. స్పృశ్యుడౌతాడు స్నానంతో తండ్రి. గ్రహణ, వివాహ, సంక్రాంతి, యాత్ర, ప్రసవాదులలో నిమిత్త స్నానం రాత్రిపూట ఏ దోషం కాదు). మనువు ఇట్లా – నాభిచ్ఛేదముక న్న ముందే పురుషునకు జాతకర్మ విధించబడింది అని) బొడ్డుకోశాకనే సూతకం మొదలు అంతకన్న ముందే జాతకర్మ, దానాదులు నైమిత్తిక స్నాన దానాదులైతే రాత్రిపూట చేయొచ్చు. పుట్టుకతో సూతకం వచ్చినా, వృద్ధిశ్రాద్ధ, జాతకర్మాదుల్లో అధికారే. సూతకం వచ్చాక, అని కూడా ప్రజాపతి చెప్పాడు. అది తత్కాల శుద్ధి. ఐరండమూల చూర్ణంతో నేయి కలిపి సుఖ ప్రసవం కొరకు కార్యమందు (ఉత్పత్తియందు) పూయాలి. ప్రసవించేప్పుడు ఇంద్రుణ్ణి ధ్యానించాలి. విజి హీష్వనస్పతే యోనిః సూష్యంత్యా ఇవ. శ్రుతం మే అశ్వినా హవం సప్త వధ్రించముంచతం, అనే మంత్రంతో ఉదకం తాగించాలి. బర్రెపాలు కలిపిన ఆముదం నూనెను – హిమవత్యుత్తరపార్శ్వే శబరీనామ పక్షిణీ, తస్యానూ పురశబ్దేన విశల్యా భవతు గర్భిణీ స్వాహా, అనే ఈ మంత్రంతో తాగించాలి). హేమాద్రి యందు వైజవాపుడిట్లా – జన్మ తరువాత జాతకర్మను యథావిధిగా ఆచరించాలి. దైవయోగం వల్ల కాలం గడిచిపోతే సూతకం తరువాత ఆచరించాలి అని. విష్ణుధర్మోక్తి పృథ్వీచంద్రోదయ మందిట్లా – సంతానం కలిగాక బొడ్డుతాడు కోయక ముందే శ్రాద్ధ మాచరించాలి అని. పుత్రుడనగా కూతురు అనికూడా అర్థము. అక్కడే కార్ష్ణాజని ఇట్లన్నాడు – కొడుకు, కూతురు పుట్టినప్పుడు,

సూర్య చంద్రుల గ్రహణ సమయమందు స్నానం చేసి పిదప, ఆత్మీయులైన పితరులను శ్రాద్ధంతో తృప్తి పరచాలి అని. ఈ శ్రాద్ధాన్ని రాత్రి కూడా చేయాలి. అక్కడే వ్యాసోక్తి ఇట్లా - పుత్రజన్మ సమయమందు, యాత్రయందు, రాత్రిపూట దానం చేస్తే అక్షయమౌతుంది. అని వైజవాపుడిట్లా - పిల్లవాడు పుట్టగానే జాతకర్మ ఆచరించాలి. పాలుతాగటంకన్న ముందు లేదా బొడ్డుతాడు కోయటం కన్న ముందు జాతకర్మ ఆచరించాలి. దీనితో, ఇది నైమిత్తిక కార్యమైనా జాతేష్టివలె ఆశౌచాంతమందు చేయాలనే అనుమానం తొలగిపోయింది. హారీతోక్తి ఇట్లా - సంతానం కలిగాక పితరులు ఆనందిస్తారు కనుక ఆ జన్మరోజు పుణ్యప్రదమైనది అని.

**మూ॥ అత్రశ్రాద్ధమామేన హేమ్నా వాకార్యమిత్యుక్తం. పృథ్వీచంద్రోదయే ఆదిత్యపురాణే - జాతశ్రాద్ధేన దద్యాత్తు పక్వాన్నం బ్రాహ్మణేష్వపి, ఇతి. హేమాద్రిస్తు పుత్రజన్మనికుర్వీత శ్రాద్ధం హేమ్నైవ బుద్ధిమాన్, న పక్వేన, న చామేన కల్యాణాన్యభి కామయన్, ఇతి సంవర్తోక్తేః హే మ్నైవేత్యాహ.**

**అను॥** ఇక్కడ శ్రాద్ధాన్ని, బియ్యంతోగాని బంగారంతోగాని చేయాలని అన్నారు. పృథ్వీ చంద్రోదయ మందు ఆదిత్య పురాణోక్తి ఇట్లా - జాతకర్మ శ్రాద్ధమందు (వండిన దాన్ని) అన్నాన్ని ఇవ్వకూడదు. బ్రాహ్మణులకు కూడా ఇవ్వద్దు., అని హేమాద్రిఐతే -బుద్ధిమంతుడు,పుత్రజన్మమందుశ్రాద్ధమును బంగారంతోనే ఆచరించాలి. పక్వమైన దానితోగాని, బియ్యంతోకాని చేయరాదు,కళ్యాణములు కోరేవాడు,అని సంవర్తోక్తి ఉంది.కనుక బంగారంతోనే అని అన్నాడు.

**మూ॥ ఏతచ్చజననాశౌచే మరణా శౌచే చ కార్యమిత్యాహ మితాక్షరాయాం ప్రజాపతిః -ఆశౌచేతుసముత్పన్నే పుత్రజన్మ యదాభవేత్,కర్తుః తాత్కాలికీశుద్ధిః పూర్వ శౌచేన, శుద్ధ్యతి. కేచిత్తు-మృతాశౌచస్య మధ్యేతు పుత్రజన్మ యదాభవేత్, ఆశౌచా పగమే కార్యం జాతకర్మ యథావిధి.ఇతి స్మృతి సంగ్రహోక్తేః ఆశౌచాంతే కార్యమిత్యాహుః. స్మృత్యర్థసారేఽపి వికల్పఉక్తః .మృదుధ్రువచర క్షిప్రభేష్వేషాముదయేషు చ, గురౌ శుక్రేఽథ వాకేంద్రే జాతకర్మ చనామ చ. మృద్వాది లక్షణ మాహశ్రీధరః. రోహిణ్యు త్తరభం స్థిరంగిరిశమూలేంద్రోర గా దారుణం క్షిప్రంచాశ్విదినేశ పుష్యమనలేంద్రాగ్నీతు సాధారణం, ఉగ్రం పూర్వ మఘాంతకం మృదుగతి త్వాష్ట్రాంత్యమైత్రంచరం, విష్ణు స్వాతిశతోడువస్వదితయః కుర్యుః స్వసంజ్ఞాఫలం.అత్రసర్వత్ర జాతకర్మ నామకర్మాదా వుక్త కాలాతిక్రమే నక్షత్రాదికం జ్ఞేయం.దేశకాలోపఘాతాద్యైః కాలాత్రికమణంయది, అనస్తగేఽజ్యేందుసితే తత్కార్యం చోత్తరాయణే, ఇతి మదనరత్నే నారదోక్తేః. బృహస్పతి రపి-ముఖ్యాలాభేవిధిజ్ఞేన విధిశ్చింత్యోఽప్రమాదతః, నక్షత్ర తిథిలగ్నానాం విచార్యైవం పునః పునః, సూతకేసంధ్యాదౌ విశేషం వక్ష్యామః.**

**అను॥** దీనిని జననా శౌచమందు,మరణా శౌచ మందు చేయాలి,అని మితాక్షర మందు ప్రజాపతి చెప్పాడు ఇట్లా - ఆశౌచం ఉండగా ఒకవేళ పుత్రజన్మ కల్గితే అప్పుడు కర్తకు పూర్వాశౌచం నుండి శుద్ధి కలిగి తాత్కాలిక శుద్ధి ఏర్పడుతుంది, అని. కొందరిట్లా

– మృతాశౌచం మధ్యలో పుత్రజన్మ కల్గితే, ఆశౌచం తొలగిపోయాక జాతకర్మను యథావిధి చేయాలి, అని స్మృతి సంగ్రహంలో ఉంది కనుక ఆశౌచాంతమందు చేయాలని, అన్నారు. స్మృత్యర్థ సారంలో కూడా వికల్పం చెప్పబడింది. **మృదు** నక్షత్రాలు – మృగశిర, చిత్త, అనురాధ, రేవతి. **ధ్రువనక్షత్రాలు**– రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర. చర నక్షత్రాలు–పునర్వసు, స్వాతి, శ్రవణ, ధనిష్ఠ, శతభిషం. **క్షిప్ర** నక్షత్రాలు – అశ్విని, పుష్యమి, హస్త, అభిజిత్. ఈ నక్షత్రముల ఉదయ మందు లేదా గురువు లేదా శుక్రుడు కేంద్ర స్థానమందుండగా జాతకర్మ, నామకర్మ ఆచరించాలి. మృద్వాది లక్షణమును శ్రీధరుడు ఇట్లా చెప్పాడు. రోహిణి మూడు ఉత్తరలు **స్థిరమైనవి.** ఆర్ద్ర, మూల,జ్యేష్ఠ, ఆశ్లేష ఇవి **దారుణ** మన బడే నక్షత్రాలు. **క్షిప్రములు** – అశ్విని, హస్త, పుష్యములు. **సాధారణ** నక్షత్రాలు కృతిక, విశాఖలు. **ఉగ్ర నక్షత్రాలు** – మూడు పూర్వలు, మఘ, భరణిలు. **మృదుగతివి** – (మృగశిర) చిత్ర,రేవతి, అనురాధ **చరగతివి** – శ్రవణం, స్వాతి, శతభిషం, ధనిష్ఠ, పునర్వసులు. ఇవి తమ పేరుకు తగ్గ ఫలితాలనిస్తాయి. ఇక్కడ అంతటా జాతకర్మ నామ కర్మాదులందు చెప్పిన కర్మకాలం దాటిపోతే నక్షత్రాదులు తెలుసుకోవాలి. దేశకాలములు ఉపద్రవములు మొదలగు వానితో ముఖ్య కాలం దాటిపోతే ఉత్తరాయణ మందు బృహస్పతి, శుక్ర, చంద్రులు అస్తమించకముందు ఆ జాతకర్మను ఆచరించాలి, అని మదనరత్నమందు నారదోక్తి ఉంది. బృహస్పతి కూడా ఇట్లా – ముఖ్యకాలం లభించకపోతే విధి తెలిసిన వానితో ప్రమాదం లేని తిథి నక్షత్రముల విధి విచారం చేయాలి. ఈ విధముగా నక్షత్ర తిథి, లగ్నములను మరల మరల విచారించి విధిని నిర్ణయించాలి (మంచికాలం), అని. సూతకమందు, సంధ్యాదుల గూర్చి విశేషాన్ని చెబుతాము.

**మూ॥ అథ జన్మ విదుష్టకాలాః** తత్ర గండాంతః జ్యోతిర్నిబంధేనారదః–పూర్ణా నందాఖ్యయోః తిథ్యోః సంధిః నాడీద్వయంతథా, గండాంతం మృత్యుదంజన్మ యాత్రో ద్వాహ వ్రతాదిషు, కులీరసింహయోః కీటచాపయోః మీనమేషయోః గండాంత మంతరాలం స్యాత్ ఘటికార్థం మృతి ప్రదం.సార్పేంద్రపౌష్ణభేష్వన్త్య షోడశాంశోభ సంధయః, తదగ్రభేష్వాద్యపాదా భానాం గండాంత సంజ్ఞకాః. రత్నమాలాయాం – పౌష్ణశ్విన్యోః సార్పపిత్ర్యర్క్షయోశ్చ, యచ్చజ్యేష్ఠా మూలయోరంతరాలం, తద్గండాంతం స్యాచ్చతుర్నాడికంహి, యాత్రాజన్మోద్వాహకాలేష్వనిష్టం, రత్న సంగ్రహేనవనీతారిష్టే – సర్వేషాం గండజాతానాం పరిత్యాగో విధీయతే, వర్జయేద్దర్శనం త్రావం తచ్చషాణ్మా సికంభవేత్.తిథ్యర్క్షగండే పితృమాతృనాశో, లగ్నేతుసంధౌ తనయస్యనాశః, సర్వేషు నోజీవతిహంతి బంధూన్ జీవన్సనః స్యాద్బహు వారణాశ్వః **అథైషాం దానముత్తర** గార్గ్యే–తిథి గండే త్వన ద్వాహం నక్షత్రే ధేను రుచ్యతే, కాంచనంలగ్న గండేతు గండదోషో వినశ్యతి–ఉత్తరేతిల పాత్రం స్యాత్ పుష్యే గోదానముచ్యతే, అజా ప్రదా నంత్వాష్ట్రేస్యాత్ పూర్వాషాఢేతు కాంచనం, ఉత్తరావుష్యచిత్రాను పూర్వాషాఢో ధ్రువస్యచ, కుర్యాచ్ఛాంతిం ప్రయత్నేన నక్షత్రాకారజంబుధః.

అను॥ జన్మకాలమందు దుష్టకాలము గూర్చి అక్కడ గండాంతము గూర్చి జ్యోతిర్నిబంధమందు నారదుడిట్లా- పూర్ణ (పంచమి, దశమి, పూర్ణిమ) నంద (షష్ఠి, ఏకాదశి, ప్రతిపద) తిథుల సంధికాల మందలి రెండు గడియలు గండాంతము. ఇది జన్మ, యాత్ర వివాహ, వ్రతాదులందు మృత్యువును కల్గిస్తుంది. కర్కట, సింహముల, వృశ్చిక, ధనుః, రాసుల మీన మేషముల మధ్యయందలి అరఘడియ కాలము గండాంతము అది మృత్యువు నిచ్చేది. ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి వీటి చివరి పదహారవ భాగము, నక్షత్ర సంధులు పై వాని తర్వాతి నక్షత్ర అద్యపాదములు గండాంత సంజ్ఞకలవి రత్నమాల యందిట్లా - రేవతి, అశ్వినుల, ఆశ్లేష మఘల, జ్యేష్ఠమూలల మధ్యలోని నాలుగు గడియలు గండాంత మౌతాయి. ఇవి యాత్ర, జన్మ వివాహకాలము లందు అనిష్ట ప్రదములు, అని. రత్న సంగ్రహ మందు నవనీతారిష్ట వాక్యమిట్లా - అందరు గండజాతులను (పుట్టిన) విడిచిపెట్టాలన్నారు. ఆరు నెలల వరకు వారిని చూడటం వారిమాట వినటము విడిచిపెట్టాలి, అని. తిథి నక్షత్రముల గండ మందు తల్లిదండ్రుల నాశము, లగ్నసంధియందు పుత్రనాశము జన్మకాలమందు తిథి నక్షత్రలగ్నముల (మూటి) గండమైతే ఆతడు బ్రతుకడు. బంధువులను నశింపచేస్తాడు. ఒకవేళ బ్రతికితే అనేక ఏనుగులు, గుఱ్ఱములు, కలవాడౌతాడు. వీటికి దానాన్ని గూర్చి ఉత్తర గార్గ్యమందిట్లా - తిథిగండ మందు ఎద్దును, నక్షత్రమందు ఆవును, లగ్న గండమందు బంగారమును దానంచేస్తే గండదోషం నశిస్తుంది అని. ఉత్తరయందు తిలపాత్రను, పుష్యమి యందు గోదానమును, చిత్తయందు మేషదానము, పూర్వాషాఢమందు బంగారుదానము చేయాలి. ఉత్తర, పుష్యమి, చిత్త వీటియందు పూర్వాషాఢ యందు ఉద్భవించిన వానిని పండితుడు, నక్షత్రాకారమును కలదిగా చేసి ప్రయత్న పూర్వకముగా శాంతిని చేయాలి (గర్గుడిట్లా అశ్విని మఘమూలాదులందు మూడు, ఆరు, తొమ్మిది నాడులు. రేవతి, ఆశ్లేష, జ్యేష్ఠముల అంతమందు పన్నెండు, ఏడు, ఆరు, నాడులు, అశ్విని, మఘ, మూల వీని ఆది యందు రెండేసి గడియలు. గండాతములు. అశ్విని మఘ మూలల పూర్వార్థ మందు ఐతే తండ్రికి బాధ. ఆశ్లేష, జ్యేష్ఠ, (పూష) రేవతుల పశ్చాదర్ధమందైతే శిశువు యొక్క తల్లి బాధింపబడుతుంది. దివా జాతుడు పితృఘ్నుడు, రాత్రి జాతుడు మాతృహంతకుడు అని).

**మూ॥ అథాశ్లేషాఫలం** - **మూర్ధాస్య నేత్ర గల కాంస యుగం చబాహు, హృజ్జాను గుహ్య పదమి త్యహి దేహభాగః, బాణాద్రినేత్ర హుతభుక్ శ్రుతినాగరుద్ర, షణ్ణంద పంచశిరసః క్రమశస్తు నాద్యః. రాజ్యం పితృక్షయో మాతృనాశః. కామ క్రియా రతిః, పితృభక్తో బలీ స్వఘ్నః - త్యాగీభోగీ ధనీక్రమాత్.**

**అను॥** ఇక ఆశ్లేష నక్షత్రఫలము - తల, ముఖము, కళ్ళు, కంఠము, రెండు భుజములు, చేతులు, హృదయము, జానువులు (మోకాళ్ళు), గుహ్యస్థానము, పాదములు ఇవన్నీ ఆశ్లేష శరీర భాగములు. ఐదు, ఏడు, రెండు, మూడు, నాలుగు, ఎనిమిది, పదకొండు, ఆరు, తొమ్మిది, ఐదు ఇవి శిరస్సు నుండి వరుసగా నాడులు. శిఖాది గడియలలో

ఉత్పన్న బాలకునకు రాజ్యము, అట్లాగే క్రమంగా పితృక్షయము, మాతృనాశము, కామక్రియ యందు రతి, పితృభక్తి, బలవంతుడు, తనను చంపుకోవటం, త్యాగము, భోగి, ధని ఫలితాలౌతాయి.

మూ॥ **జ్యేష్ఠాఫలం** బ్రహ్మయామలే - **జ్యేష్ఠాదౌజననీ మాతా ద్వితీయే జననీ పితా, తృతీయే జననీ భ్రాతా స్వయం మాతా చతుర్థకే, ఆత్మానంపంచమంహంతి షష్ఠే గోత్రక్షయో భవేత్, సప్తమే చోభయ కులంజ్యేష్ఠం భ్రాతరమష్టకమే, నవమేశ్వ శురం హంతి, సర్వంహంతి దశాంశకే, ఇతి.**

**అను॥** జ్యేష్ఠఫలము బ్రహ్మయా మలమందిట్లా - జ్యేష్ఠ మొదటి భాగమందు జన్మిస్తే తల్లితల్లి మరణిస్తుంది. ద్వితీయభాగమందు తల్లితండ్రి తృతీయభాగమందు తల్లియొక్క అన్న, నాల్గవ భాగమందు తల్లి, ఐదవ భాగమందు తాను, ఆరవభాగమందు వంశనాశము, ఏడవ భాగమందు రెండు కులములు, ఎనిమిదవ భాగమందు పెద్దన్న, నవమమందు మామ, పదవభాగమందు సర్వం నాశము ఇట్లా జ్యేష్ఠవల్ల ఫలం చెప్పారు.

మూ॥ **అభుక్తమూల ఫలం - భల్లాటః - అభుక్తమూల సంభవం పరిత్య జేత్తు బాలకం, సమాష్ట కంపితాథవాన తన్ముఖం విలోకయేత్. తదాద్యపాదకే పితాద్వితీయకే జనన్యథ, ధనక్షయస్తృతీయకే చతుర్థకః శుభావహః, ప్రతీపమన్య పాదతః ఫలం తదేవ సార్పభే. అభుక్తమూలం త్వాహ వృద్ధవసిష్ఠః - జ్యేష్ఠాంతే ఘటికాచైకా మూలాదౌ ఘటికా ద్వయం, అభుక్తమూల మిత్యాహుః తత్రజాతం శిశుంత్యజేత్.కేచిత్ జ్యేష్ఠాం త్యం మూలాద్యం చపాదం అభుక్త మూల మాహుః. కశ్యపి సంహితాయాం త్వన్యథోక్తం - మూలాద్య పాదజోహన్తి పితరంతు ద్వితీయజః మాతరం స్వాం తృతీయోఽర్థాన్ సుహృదం తత్తురీయజః, ఫలం తదేవ సార్పర్క్షే ప్రతీపంత్వంత్య పాదతః.**

**అను॥** ఇక మూల ఫలము - భల్లాటుడిట్లా - అభుక్త మూలమందు పుట్టిన పిల్ల వానిని విడిచిపెట్టాలి లేదా వాడికి ఎనిమిదేళ్ళు వచ్చే దాకా తండ్రి వాడి ముఖం చూడరాదు. తొలి పాదమందైతే తండ్రి రెండవ పాదమందైతే తల్లి మరణిస్తారు. తృతీయ పాదమందైతే ధననాశము, నాల్గవపాదము మేలు చేసేది. అదే ఆశ్లేష యందైతే చివరి పాదం వల్ల దీనికి విపరీత ఫలం కల్గుతుంది. (శుభం). అభుక్తమూల మనగా వృద్ధ వసిష్ఠుడు ఇట్లా అన్నాడు- జ్యేష్ఠాంతమందు ఒక గడియ మూల ఆదియందు రెండు గడియలు అభుక్త మూలము అని అందు జన్మించిన శిశువును విడిచిపెట్టాలి. కొందరు జ్యేష్ఠంచి వరమూల ఆదిపాదములు అభుక్తమూలమని అన్నారు. కశ్యపి సంహితయందు మాత్రం మరో రకంగా చెప్పబడింది- మూలతొలిపాదమందు పుట్టిన శిశువు తండ్రిని చంపుతాడు, రెండవపాదం వల్ల తన తల్లిని మూడవపాదంలో తన ధనాన్ని, చతుర్థంలో స్నేహితులను నాశనం చేస్తాడు. అదే అశ్లేషా నక్షత్రంలో ఐతే చివరిపాదంవల్ల విపరీత ఫలం (వ్యతిరేక) కల్గుతుంది అని.

**మూ॥ మూలవృక్షః** - జయార్ణవే - మూలం స్తంభం త్వచాశాఖా పత్రం పుష్పం ఫలం శిఖా, వేదాశ్చ మునయశ్చైవ దిశశ్చవసవస్తథా, నందాబాణా రసా రుద్రా మూలభేదః ప్రకీర్తితః. మూలేమూల వినాశాయ స్తంభేహో నిఃధనక్షయః, త్వచి భ్రాతుర్వినాశాయ శాఖా మాతుర్వినాశకృత్, పత్రే సపరివారః స్యాత్ పుష్పేషు నృప వల్లభః ఫలేషు లభతే రాజ్యం శిఖా యామల్పజీవితం. అన్యత్రతు అన్యథోక్తం- మూలేసప్త ఘటీషు మూలహననం స్తంభేఒష్టసు స్వక్షయం, త్వక్‌దిక్ బంధు వినాశనం చ విటపే రుద్రైర్ హతోమాతులః, పత్రేఒర్కైః సుకృతీ తుబాణకుసుమే మంత్రీ ఫలే సాగరై రాజా వహ్ని శిఖాల్ప మాయురితి తన్మూలాంఘ్రిపేస్యాత్ఫలం. భూపాలవల్లభః - వృషాలి సింహేషు ఘటేచ మూలం, దివిస్థితం యుగ్మతులాంగ నాంత్యే, పాతాలగం మేషధనుః కులీరనక్రేషు మర్త్యేష్వితి సంస్మరంతి. స్వర్గే మూలేభ వేద్రాజ్యం పాతాలే చ, ధనాగమం, మృత్యులోకే యదా మూలం తదా శూన్యం సమాదిశేత్. వసిష్ఠః - నైర్‌ఋత్యభోద్భూత సుతః సుతావా క్షి ప్రాదవశ్యం శ్వశురం నిహంతి, తదం త్యపాదే జనితో నిహంతి తస్యోత్రమేణాహి భవే కలత్రం.సురేశ తారాజనితాథ వాగ్రజం ద్విదైవతారా, జనితా తుదేవరం పురందరర్‌క్షేజనితః సుతస్తథా స్వస్యాగ్ర జంహంతి న పుత్రికాయది. ప్రయోగపారిజాతే- మూలజాశ్వశురంహంతి వ్యాల జా చ తదంగనాం, మహేంద్రజాగ్రజంహంతి దేవరం తుద్విదైవజా.

**అను ॥** మూలవృక్షము - జయార్ణవ మందిట్లా - మూలము, స్కంధము, త్వక్, శాఖ, పత్ర, పుష్ప, ఫలములు, శిఖ ఇదే క్రమంలో నాలుగు, ఏడు, పది, ఎనిమిది, తొమ్మిది, ఐదు, ఆరు, పదకొండు గడియలు మూల భేదమని చెప్పబడ్డాయి. మూల నక్షత్ర మందు మూలమందలి గడియలు (నాలుగు) మూలముతో సహనశింప చేసేవి. స్తంభమందు హాని, ధనక్షయము ఔతాయి. చర్మమందు భ్రాతృనాశము, శాఖ మాతృనాశకము, పత్ర మందైతే సపరివారనాశము, పుష్పములందైతే రాజుకు ప్రియమైన వాని నాశము. ఫల మందు రాజ్యప్రాప్తి, శిఖయందు అనగా శిఖ యందలి పదకొండు గడియలలో జన్మ ఐతే అల్ప జీవనుడౌతాడు. మరో చోటైతే మరో రకంగా చెప్పబడింది - మూల మందలి ఏడు గడియలలో ఐతే మూలనాశము, స్తంభమందలి ఎనిమిది గడియలలో ఐతే స్వనాశము, త్వక్ యందలి పదిగడియలలో నైతే బంధునాశము, శాఖ యందలి పదకొండు గడియలలోనైతే మేనమామ నాశము, ఆకులందలి పన్నెండు గడియలలోనైతే పుణ్యాత్ముని నాశము, పుష్పమందలి ఐదు గడియలలోనైతే మంత్రినాశము, ఫలమందలి ఏడు గడియలలోనైతే రాజు నాశము శిఖయందలి మూడు గడియలలోనైతే అల్పాయువౌతాడు అని అది మూలవృక్ష మందలి ఫలము అని. భూపాల వల్లభమందిట్లా - వృషభం, వృశ్చికం, సింహం, కుంభం వీనిలో మూలం స్వర్లోకమందు, మిథున తుల కన్య మీనములందు మూలం పాతాళమందు, మేషధనుః కర్కట మకరములందు మూల, భూమి యందు అని అంటారు, అని మూల స్వర్గమందుండగా రాజ్యలాభము, పాతాళమందుండగా ధనాగమము, మూల భూమియందుండగానైతే సర్వనాశము అని తెలుసుకోవాలి. వసిష్ఠుడిట్లా - మూల నక్షత్రమందు కల్గిన పుత్రుడు లేదా పుత్రిక కాని త్వరలో తప్పకుండా మామను చంపుతారు

(శ్వశుర). దాని అంత్య పాదమందు జన్మించిన శిశువు కలత్రమును చంపుతుంది. ఆశ్లేష యందు జన్మించిన శిశువు దీనికి వ్యతిరేకము అని. జ్యేష్ఠ నక్షత్రమందు జన్మించిన కన్య తన భర్త పెద్దన్నను చంపుతుంది. విశాఖ యందు జన్మించిన కన్య తన చిన్న మరిదిని చంపుతుంది. జ్యేష్ఠ యందు జన్మించిన సుతుడు అట్లాగే తన అన్నను చంపుతాడు. పుత్రిక ఐతే అట్లా చంపదు. ప్రయోగ పారిజాత మందిట్లా- మూల యందు పుట్టిన శిశువు శ్వశురుణ్ణి చంపుతుంది. ఆశ్లేష యందు పుట్టినది అత్తను చంపుతుంది. జ్యేష్ఠ యందలిది పెద్ద అన్నను చంపుతుంది, విశాఖయందలిది మరిదిని చంపుతుంది అని.

**మూ॥ నృసింహప్రసాదే - ధవాగ్రజంహంతి సురేంద్ర జాతా, తథైవ పత్న్యా భగినీం పుమాంశ్చ, ద్విదైవజాదేవరమాశుహన్యాత్, భార్యాను జామాతు నిహంతి సూనుః, పత్న్యగ్రజామగ్ర జంవా, హంతి జ్యేష్ఠర్క్షజః పుమాన్, తథా భార్యాస్వ సారంవా, శాలకంవా ద్విదైవజః. కన్యకాదేవరం హంతి విశాఖాంత్య సముద్భవా, ఆద్య పాదత్రయేనైవ ఆద్యభేతుపుమాన్ భవేత్. నహన్యాద్దేవరం కన్యాతులా మిశ్రా ద్విదైవజా, తద్భచాంత్యోద్భవా వర్జ్యాదుష్టా వృశ్చిక పుచ్ఛవత్. చిత్రాద్యర్ధే పుష్యమధ్యే ద్విపాదే, పూర్వాషాఢా ధిష్ణ్య పాదేతృతీయే జాతః పుత్రశ్చోత్తరార్ధే విధత్తే మా తాపిత్రోః భ్రాతరం బాలనాశం. ద్విమాసంచోత్తరాదోషః పుష్యేచైవ త్రిమాసికః, పూర్వాషాఢాష్టమే మాసి చిత్రాషాణ్మాసికం ఫలం. నవమాసంతథాఽశ్లేషా మూలేచాష్టాక వర్షకం, జ్యేష్ఠా పంచదశేమాసి పుత్రదర్శన వర్జితా. వసిష్ఠః - వ్యతీపాతేంగహానిః స్యాత్ పరిఘే మృత్యుమాదిశేత్, వైధృతౌ పితృహానిః స్యాత్ నష్టేందా వంధతాం వ్రజేత్. మూలే సమూల నాశః స్యాత్, కులనాశో ధృతౌ భవేత్, వికృతాంగశ్చ హీనశ్చ సంధ్యయో రుభయోరపి, పర్వణ్యపి ప్రసూతౌ చ సర్వారిష్ట భయప్రదః, తద్వత్ సదంతజాతశ్చ పాదజాతస్త థైవ చ, విపరీత ప్రసూతౌ తు నాభి నాలేన వేష్టితః, రాష్ట్రస్య నృపతేశ్చైవ స్వస్యాపి చ వినాశకః, తస్మాచ్ఛాంతిం ప్రకుర్వీత గ్రహాణాం క్రూరచేతసాం గర్గః - కృష్ణాం చతుర్దశీం షోఢాం కుర్యాదాదౌ శుభం స్మృతం, ద్వితీయే పితరం హంతి, తృతీయే హంతి మాతరం, చతుర్థే మాతులం హన్తి పంచమే వంశనాశనం, షష్ఠే చ ధననాశః స్యాత్ ఆత్మనోవంశనాశనం, తస్మాత్సర్వ ప్రయత్నేన శాంతిం కుర్యాద్వి ధానతః.**

**అను॥** నృసింహ ప్రసాదమందిట్లా - జ్యేష్ఠ నక్షత్రమందు పుట్టిన కన్య భర్త పెద్ద అన్నను చంపుతుంది, అట్లాగే భార్య యొక్క చెల్లెలును ఆమె భర్తను చంపుతుంది. విశాఖ యందు పుట్టిన కన్య మరిదిని త్వరగా చంపుతుంది, పుత్రుడు ఐతే భార్య చెల్లెలును త్వరగా చంపుతాడు. జ్యేష్ఠ నక్షత్ర మందు పుట్టిన పుత్రుడు భార్య అక్కను లేదా అన్నను చంపుతాడు. విశాఖయందు పుట్టినవాడు భార్య చెల్లెలును, లేదా భావమరిదిని చంపుతాడు. విశాఖ అంత్యపాద మందు పుట్టిన కన్యక మరిదిని చంపుతుంది. తొలి మూడు పాదములందు దోషము లేదు. ఆద్యనక్షత్రమందైతే పుత్రడు కలగాలి. (విశాఖలో) తులరాశితో కూడిన విశాఖ యందు కన్య పుడితే మరిదిని చంపదు. ఆ నక్షత్ర మందు అంత్యపాదమందు కల్గిన కన్య తేలుకొండి వలె దుష్టమైంది. కనుక విడిచి పెట్టాలి అని. చిత్తతొలిసగం భాగమందు, పుష్యమి రెండు, మూడు పాదములందు పూర్వాషాఢ మూడవపాదం యందు

లేదా ఉత్తరార్ధమందు పుట్టిన బాలుడు తల్లిదండ్రులకు, అన్నకు, బాలకునకు నాశకారకుడౌతాడు. ఉత్తర నక్షత్ర జన్మదోషము, రెండు నెలలు, పుష్యమి దోషము మూడు నెలలు, పూర్వాషాఢ యందు ఎనిమిది నెలలు, దోషము చిత్తయందు ఆరునెలలు దోషము, ఆశ్లేషయందు తొమ్మిది నెలలు, మూల నక్షత్ర మందు ఎనిమిది సంవత్సరముల వరకు, జ్యేష్ఠ యందు పదిహేను నెలల వరకు దోషము అప్పటిదాకా పుత్ర దర్శనం విడువాలి (చూడొద్దు). వసిష్ఠుడిట్లా – వ్యతీపాతయందు జన్మిస్తే అంగహాని కల్గుతుంది. పరిఘయందైతే మృత్యువు కల్గుతుంది. వైధృతియందు ఐతే తండ్రి నశిస్తాడు. నష్టచంద్రుని యందు (చతుర్దశి విద్ధ అమాసినీవాలి, ప్రతిపద్ విద్ధా కుహూ రెండు వేధలు లేనిది అమావాస్య ఔతుంది. దృష్ట చంద్రాసినీవాలీ, నష్టచంద్రాకుహూః) గుడ్డి వాడౌతాడు. అని మూలనక్షత్రమందైతే సమూలనాశము, ధృతియందు కులనాశ మౌతుంది. రెండు సంధ్యలందైతే వికృతాంగుడు, హీనాంగుడు ఔతాడు.ప్రసూతి పర్వమందైతే సర్వ అరిష్టములు, భయము కల్గిస్తాడు. అట్లాగే పళ్ళతో సహ పుట్టినవాడు అట్లాగే పాదములతో పుట్టినవాడు (తలరాకుండా బయటికి) విపరీత ప్రసూతిలోనివాడు నాభి నాలంతో చుట్టబడినవాడు పుత్రుడు రాష్ట్రమునకు, రాజుకు, తనకూ నాశకారకుడౌతాడు అందువల్ల క్రూరత్వం గలిగిన గ్రహములకు శాంతిని చేయాలి గర్గుడిట్లా – కృష్ణ పక్ష చతుర్దశిని ఆరుభాగాలు చేయాలి. తొలిది శుభకరము, రెండవభాగము తండ్రిని చంపు తుంది. తృతీయభాగమందు జననమైతే తల్లికి మారకుడౌతాడు. నాల్గవ భాగంలో జన్మించిన వాడు మేనమామ నాశకుడౌతాడు. పంచమమందు వంశనాశనము, ఆరవ భాగమందు ధననాశము, ఆత్మవంశనాశనము కూడా అందువల్ల అన్ని విధములా ప్రయత్నించి విధి ప్రకారము శాంతిచేయాలి.

మూ॥ **అథపిత్రోర్నక్ష త్రేజన్మదోషః తత్రదేవకీర్తిః-యద్యేకస్మిన్ ధిష్ణ్యే జాయంతే దుహితరో ధవా పుత్రాః, పితురంతకరాహ్యేతే యద్య పరే ప్రీతిరతులాస్యాత్. గర్గః -ఏకస్మిన్నేవ నక్షత్రే భ్రాతోర్వా పితృపుత్రయోః, ప్రసూతిశ్చతయోర్మృత్యుః. భవేదేకస్య నిశ్చితం. శౌనకః - గ్రహణే చంద్ర సూర్యస్య ప్రసూతిర్యది జాయతే, వ్యాధిపీడా తదా స్త్రీణాం ఆదౌతు ఋతుదర్శనాత్. శాంతిస్తు - తదృక్షాధిపతే రూపం సువర్ణేన ప్రకల్పయేత్ సూర్యగ్రహే సూర్యరూపం హైమం, చంద్రంతు రాజతం. రాహురూపం ప్రకుర్వీత నాగేనైవ విచక్షణః.(నాగః=సీసం)త్రయాణాం చైవరూపాణాం స్థాపనం తత్రకారయేత్. ఆకృష్ణేన, ఆప్యాయస్వ, స్వర్భానో, ఇతిపూజామంత్రాః నక్షత్ర దేవతా యాస్తన్మంత్రేణ. సంపూజ్యతు యజేత్సూర్యం సమిద్భిశ్చార్క సంభవైః. చంద్రగ్రహే చ పాలాశైః దూర్వాభీరాహుమేవ చ, సమిద్భిః బ్రహ్మవృక్షస్య భేశాయ జుహు యాద్ బుధః, ఆజ్యేన చరుణాచైవ తిలైశ్చ జుహుయాత్తతః, పంచగవ్యైః పంచరత్నైః పంచత్వక్ పంచపల్లవైః జలైరోషధికల్కైశ్చ అభిషేకం సమాచరేత్. మంత్రైః వారుణ సంభూతైః ఆపోహిష్ఠాదిభిస్త్రిభిః. ఇమంమే గంగే పురతస్తత్త్వాయామితి మంత్రకైః. యజమానస్తతో దద్యాత్ భక్త్యా ప్రతికృతిత్రయం.**

అను॥ ఇక మాతా పితృ నక్షత్రములందు జన్మిస్తే దోషము ఇట్లా – అక్కడ దేవకీర్తి మాట ఇట్లా – ఒకవేళ ఒకే నక్షత్రమందు కూతుళ్ళుకాని కొడుకులు కాని జన్మిస్తే వీరు

తండ్రి అంతకులౌతారు. వేరు నక్షత్రమందు జన్మిస్తే చాలా ఆనందకారకులౌతారు. అని. గర్గుడిట్లా – ఒకే నక్షత్రమందు అన్నదమ్ములు లేదా తండ్రికొడుకుల ప్రసూతి జరిగితే అందులో ఒకరు మరణించటం తథ్యము అని. శౌనకుడిట్లా – చంద్ర సూర్యుల గ్రహణ కాలమందు ఒకవేళ ప్రసూతి జరిగితే స్త్రీలకు ఋతుదర్శనం కన్న ముందు వ్యాధి పీడకలుగుతుంది. ఇట్లా జరిగిన వారికి మృత్యువు కూడా కల్గుతుంది, అనుమానం లేదు అని శాన్తి విధానమిట్లా – ఆ నక్షత్రాధిపతి రూపాన్ని బంగారంతో కల్పించాలి. సూర్యగ్రహణమందు సూర్య రూపాన్ని బంగారంతో, చంద్రగ్రహణమందు అతని రూపాన్ని వెండితో చేయించాలి. విచక్షణుడు రాహు రూపాన్ని నాగంతోనే చేయించాలి. నాగమనగా సీసము. అక్కడ ముగ్గురి రూపము లను స్థాపించాలి. ఆ కృష్ణేన, ఆప్యాయస్వ, స్వర్భానో అనునవి పూజామంత్రాలు. నక్షత్ర దేవతనైతే అతని మంత్రంతోనే (ఆకృష్ణేన రజసావర్తమానో నివేశయన్న మృతం మర్త్యం చ హిరణ్యయేన సవితారథేనా దేవోయాతి భువనాని పశ్యన్ (ఋ–1–36–2). ఆప్యాయస్వ సమేతుతే విశ్వతః సోమవృష్ణ్యం, భవావాజస్య సంగథే. (ఋ–1–91–16, 9–31–4). స్వర్భానో– రథ, యదింద్ర మాయా అవోదివా వర్తమానా అవాహన్, గూహం సూర్యం తమసాప వ్రతేన తురీయేణ బ్రహ్మణా విందదత్రిః (ఋ–5–40–6). సూర్యుని పూజించి సూర్యగ్రహణమందు ఆ పిదప జిల్లేడు సమిధలతో హోమం చేయాలి. చంద్రగ్రహణ మందు పాలాశ సమిధలతో (మోదుగు), రాహువునకు దూర్వతో, రావి సమిధలతో నక్షత్రేశునకు (నక్షత్ర అధిపతి) బుధుడు హోమం చేగాలి. నేయితో, చరువుతో (అన్నము) నువ్వులతో ఆ పిదప హోమం చేయాలి. పిదప పంచగవ్యముతో, పంచరత్నములతో, పంచత్వక్కులతో, పంచ పల్లవములతో, ఓషధుల మట్టి గలజలముతో అభిషేకం చేయాలి. వారుణ మంత్రము లతో, ఆపోహిష్ఠాది మూడు మంత్రములతో ఇమం మేగంగే మంత్రములతో పిదప తత్వాయామి అనే మంత్రముతో అభిషేకం చేసి, ఆ పిదప యజమాని భక్తితో ఆ మూడు రూపములను దానం చేయాలి.

**మూ॥ మాత్స్యే – అకాలప్రసవానార్యః** కాలాతీత ప్రజాస్తథా, వికృతప్రసవాశ్చైవ **యుగ్మ ప్రసవకాస్తథా. అమానుషా అముండాశ్చ అజాతవ్యంజనా స్తథా, హీనాంగా అధికాంగాశ్చ జాయంతే యది వాస్త్రియః, పశవః పక్షిణశ్చైవ తథైవచ సరీసృపాః వినాశం తస్య దేశస్య కులస్య చ వినిర్దిశేత్, నిర్వాసయేత్తాన్నగరాత్తతః శాంతిం సమాచరేత్. పాద్మే – ఉపరిప్రథమం యస్యజాయంతేచ శిశోర్ద్విజాః, దంతైర్వా సహయస్యస్యాత్ జన్మ భార్గవ సత్తమ, ద్వితీయేచ తృతీయేచ, చతుర్థేపంచమే తథా, యదాదంతాశ్చ జాయంతే మాసేచైవ మహద్భయం. మాతరం పితరం వా౽థ ఖాదేదా త్మానమేవచ, గజ పృష్ఠగతం బాలం నౌస్థంవాస్నాపయేత్ద్విజ. తదభావేతు ధర్మజ్ఞ కాంచనేవా వరాసనే, సర్వౌషధైః సర్వగంధైః బీజైః పుష్పైః ఫలైస్తథా, పంచగవ్యేన రత్నైశ్చ పతాకాభిశ్చ భార్గవ, స్థాలీపాకేన ధాతారం పూజయేత్తదనంతరం, సప్తాహం చాత్రకర్తవ్యం తథా బ్రాహ్మణ భోజనం. భద్రాసనే నివేశ్యైనం మృద్భిర్మాలైః ఫలైస్తథా, సర్వౌషధైః సర్వగంధైః సర్వబీజైస్త థైవ చ, స్నాపయేత్పూజయేచ్చాత్ర వహ్నిం సోమం సమీరణం, పర్వతాంశ్చ తథా ఖ్యాతాన్ దేవదేవంచ**

కేశవం, ఏతేషా మేవ జుహుయాత్ ఘృతమగ్నౌ యథావిధి, బ్రాహ్మణానాంతు దాతవ్యాతతః సంపూజ్యదక్షిణా. బ్రహ్మయామలే - ప్రథమం దంత నిర్ముక్తి రూర్ధ్వం బాలస్య చేద్భవేత్, క్లేశాయమాతుల స్యేహ తదా ప్రోక్తామనీషిభిః. సౌవర్ణం రాజతం వాపి తామ్రం కాంస్యమయంతువా, దధ్యోదనేన సంపూర్ణం పాత్రం దద్యాత్ శిశోః కరే, సమంత్రం భాజనం దత్వా సపశ్యేత్ మాతులః శిశుం. తత్రమంత్రః - రక్షమాం భాగినేయ,త్వం రక్షమే సకలం కులం, గృహీత్వా భాజనం సాన్నం ప్రసన్నో భవమే సదా. నిర్విఘ్నం కురుకల్యాణం నిర్విఘ్నాం చ స్వమాతరం, మయ్యాత్మాన మధిష్ఠాప్య చిరంజీవ మయాసహ. ఏవం కృతే విధానేతు విఘ్నఃకోఽపిన జాయతే, ఇతి.

అను॥ మాత్స్యమందిట్లా - అకాలంలో ప్రసవించిన స్త్రీలు, కాలం గడిచాక సంతానం కల స్త్రీలు, వికృత సంతానం కల స్త్రీలు, కవలలు కనే స్త్రీలు, మనుష్య లక్షణాలు లేని శిశువును ప్రసవించిన స్త్రీలు, శిరస్సులేని సంతతి గల స్త్రీలు, అవయవములు సరిగా రాని సంతతి గల స్త్రీలు హీనాంగములు, అధికాంగములు గల సంతతి గల స్త్రీలు, పశువులు, పక్షులు, సరీసృపములు (పాములు) సంతతిగా కలిగిన స్త్రీలు, ఉన్నదేశానికి వినాశమేర్ప దుతుంది. ఆకులమునకు నాశ మేర్పడుతుంది అని తెలుసుకోవాలి. వారిని (స్త్రీలను) నగరం నుండి వెళ్ళగొట్టాలి. ఆ పిదప శాంతిని ఆచరించాలి,అని. పాద్మమందిట్లా - ఏ శిశువునకు తొలుతపై పండ్లు వస్తాయో, ఎవడు దంతములతోనే జన్మిస్తాడో ఓ భార్గవసత్తమ! ఎవనికి రెండవ లేదా మూడవ లేదా నాల్గవ లేదా ఐదవ మాసంలోనే దంతములు వస్తాయో అప్పుడు గొప్ప భయమేర్పడుతుంది. ఆ పిల్లవాడు తల్లినో తండ్రినో తననో నాశపరుస్తాడు. అందువల్ల ఓద్విజ! ఆ పిల్లవానిని గజపృష్ఠమందో (దుంచో) నావయందో (ఉంచో స్నానం చేయించాలి). ఉంచాలి. అది లేకపోతే ఓ ధర్మజ్ఞ! బంగారుదైన శ్రేష్ఠ ఆసన మందో ఉంచి అన్ని ఓషధులతో సర్వగంధములతో, బీజ పుష్పఫలములతో, పంచ గవ్యముతో రత్నములతో పతాకములతో (శుభచిహ్నములతో) స్నానం చేయించాలి, ఓభార్గవ. ఆ పిదప స్థాలీపాకముతో బ్రహ్మను ఏడు రోజులు పూజించాలి. అట్లాగే ఇక్కడ బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. ఈతనిని భద్రాసనమందు కూర్చోబెట్టి మట్టితో వృక్షమూలములతో, పండ్లతో, అన్ని ఓషధులతో, అన్ని గంధములతో, అన్ని బీజములతో స్నానం చేయించాలి. ఇక్కడ అగ్నిని, చంద్రుని, వాయువును, ప్రసిద్ధమైన పర్వతములను, దేవదేవుడైన కేశవుని పూజించాలి. వీరికే అగ్ని యందు నేయితో శాస్త్ర ప్రకారము హోమం చేయాలి. ఆ పిదప బ్రాహ్మణులను పూజించి వారికి దక్షిణ నివ్వాలి. బ్రహ్మ యామల మందిట్లా - బాలకునకు తొలుత పై పండ్లు ఊడిపోతే, అప్పుడే మేనమామకు కష్టమౌతుంది అని మనీషులు అన్నారు. ఇక్కడ బంగారుదో, వెండిదో, రాగిదో, కాంస్యముదో పెరుగన్నముతో నిండిన పాత్రను పిల్లవాని చేతికివ్వాలి. మంత్రపూర్వకముగా పాత్రను ఇచ్చి ఆమేనమామ పిల్లవానిని చూడాలి,అని. అక్కడ మంత్రమది- ఓ భాగినేయ! నన్ను రక్షించు. నీవు నాకులం మొత్తాన్ని రక్షించు. అన్నముతో కూడిన ఈ పాత్రను తీసుకొని నాకు ఎల్లప్పుడూ ప్రసన్నుడవు కమ్ము. కల్యాణాన్ని నిర్విఘ్నము, చేయి. నీతల్లిని, నిర్విఘ్నను చేయుము. నా యందు నీ ఆత్మను అధిష్ఠింపచేసి,

నాతోపాటు చిరకాలము జీవించు. విధానము ప్రకారము ఇట్లా చేస్తే ఎలాంటి విఘ్నము కలుగదు,అని.

మూ॥ **అథత్రిక ప్రసవశాంతిః.** శాంతి సర్వస్వే – సుతత్రయే సుతాచేత్ స్యాత్ తత్ర యేవాసుతో యది, మాతాపిత్రోః కులస్యాపి తదాఽనిష్టం మహద్భవేత్. జ్యేష్ఠనాశోధనే హానిః దుఃఖం వా సుమహద్భవేత్, తత్రశాంతిం ప్రకుర్వీత విత్తశాఠ్య వివర్జితః. జాతస్యై కాదశాహే వా ద్వాదశాహేశుభేదినే, అచార్య మృత్విజో వృత్వా గ్రహ యజ్ఞ పురః సరం, బ్రహ్మ విష్ణు మహేశేంద్ర ప్రతిమాః సర్వతః కృతాః, పూజయే ద్ధాన్య రాశిస్థ కలశో పరిశక్తితః. పంచమే కలశేరుద్రం పూజయే ద్రుద్ర సంఖ్యయా, రుద్ర సూక్తాని చత్వారి శాంతి సూక్తాని సర్వశః, ద్విజ ఏక జపేద్ధోమ కాలే శుచిసమాహితః, అచార్యో జుహుయాత్తత్ర సమిదాజ్యతిలాంశ్చరుం, అష్టోత్తర సహస్రంవా శతంవా త్రిశతంతు వా, దేవతాభ్యశ్చతుర్వక్త్రాదిభ్యోగ్రహ పురఃసరం, బ్రహ్మాదిమంత్రైరింద్రస్యయత ఇంద్రభయామహే. తతః స్విష్ట కృతం హుత్వా బలిం పూర్ణాహుతిం తతః, అభిషేకం కుటుంబస్య కృత్వా చార్యం ప్రపూజయేత్, హిరణ్యం ధేనరేకా చ ఋత్వి జాందక్షిణా తతః, ఆజ్యస్య వీక్షణం కృత్వా శాంతి పాఠంతు కారయేత్, ప్రతిమాగురవేదత్వా ఉపస్కర సమన్వితాః, బ్రాహ్మణాన్ భోజయేచ్ఛక్త్యాదీనాఽనాథాంశ్చ తర్పయేత్, ఏవం శాంతి విధానేన సర్వారిష్టం ప్రలీయతే,ఇతి. అన్యేపు మూలాద్య ఋక్షేషు శాంత్యాది ప్రయోగపారిజాతే మత్కృతే శాంతిరత్నేచ జ్ఞేయం.

అను॥ ఇక త్రిక ప్రసవశాంతిని గూర్చి చెబుతాము. శాంతి సర్వస్వమందిట్లా – ముగ్గురు కొడుకుల తర్వాత కూతురు పుట్టినా ముగ్గురు కూతురుల తరువాత కొడుకు పుట్టినా అది తల్లిదండ్రులకు కులమునకు కూడా చాలా అనిష్టమును కల్గిస్తుంది,అని. జ్యేష్ఠ పుత్రుని నాశము, ధనహాని, గొప్పదుఃఖము కాని కల్గుతుంది. అప్పుడు ధనలోభం లేకుండా శాంతిని ఆచరించాలి. పుట్టాక పదకొండవరోజు లేదా పన్నెండవరోజో మంచిరోజున ఆచార్యుని, ఋత్విక్కులను వరణం చేసి గ్రహయజ్ఞ పూర్వకముగా బ్రహ్మ విష్ణు మహేశ ఇంద్ర ప్రతిమలను బంగారుతో చేసిన వానిని ధాన్యరాశిపై ఉన్న కలశములపై ఉంచి శక్తి కొలది పూజించాలి. ఐదవ కలశమందు రుద్రసంఖ్యతో రుద్రుని పూజించాలి. రుద్ర సూక్తములను నాలుగు శాంతి సూక్తములు (నలుగురివి) పూర్తిగా ఒక బ్రాహ్మణుడు శుచిగా నిశ్చల చిత్తంతో హోమకాలమందు జపము చేయాలి. అక్కడ ఆచార్యుడు సమిధలు, నేయి, నువ్వులు, చరువు వీటితో హోమం చేయాలి.వేయి ఎనిమిది సార్లుగాని నూరు సార్లుగాని మూడు వందలసార్లుగాని హోమము. గ్రహ పురస్సరముగా బ్రహ్మ మొదలగు దేవతలకీ హోమము. బ్రహ్మకు బ్రహ్మాది మంత్రాలతో ఇంద్రునకు యత ఇంద్ర భయామహే అనే మంత్రంతో. పిదప స్విష్ట కృతమును హోమము చేసి పిదప బలిని పూర్ణాహుతిని చేయాలి. కుటుంబమును అభిషేకించాక అచార్యుని పూజించాలి. బంగారము, ఒక ఆవు ఇవ్వాలి. ఆ పిదప ఋత్విజులకు దక్షిణ ఇవ్వాలి. నేతిని చూచి, శాంతి పాఠ మాచరింప చేయాలి. సంభారములతో గూడా ప్రతిమను గురువుకివ్వాలి. బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. శక్తి కొలదిగా దీనులకు అనాథలకు తృప్తి కలిగించాలి. ఈ రకముగా శాంతి

ఆచరిస్తే అన్ని అరిష్టములు తొలగిపోతాయి,అని. ఇతరమైన మూలాది నక్షత్రములందు శాంత్యాదులు ఆచరించుట గూర్చి ప్రయోగపారిజాతమందు, నా, రచనయైన శాంతిరత్న మందును చూచి గ్రహించాలి.

**మూ॥ మితాక్షరాయాం మార్కండేయః - రక్షణీయాతథాషష్ఠీ నిశాతత్ర విశేషతః రాత్రౌజాగరణం కార్యం జన్మదానాం తథాబలిః, పురుషాః శస్త్రహస్తాశ్చ నృత్యగీతైశ్చ యోషితః , రాత్రౌ జాగరణం కుర్యాత్ దశమ్యాం చైవ సూతకే**

అను॥ మితాక్షర యందు మార్కండేయుడిట్లా - శిశువు కలిగాక షష్ఠి యందు విశేషించి రాత్రియందు (ఆరవరాత్రి) బాలుని రక్షించాలి. రాత్రి పూట జాగరణ చేయాలి. అట్లాగే జన్మదేవతలకు బలి ఇవ్వాలి. పురుషులు శస్త్రములు చేత ధరించి, ఆడవారు నృత్య గీతములతో పదవరాత్రియందు సూతకమందే జాగరణ చేయాలి.

**మూ॥ వ్యాసః - సూతికా వాస నిలయా జన్మదా నామదేవతా, తాసాం యాగ నిమిత్తంతు శుద్ధిర్ జన్మని కీర్తితా. ప్రథమే దివసేషష్ఠే దశమే చైవ సర్వదా, త్రిష్వేతేషున కుర్వీత సూతకం పుత్ర జన్మని, అపరార్కే బ్రాహ్మే - కన్యాశ్చతస్రోరాకాద్యా వాతఘ్నీ చైవ పంచమీ, క్రీడనార్థాచ బాలానాం షష్ఠీచ శిశురక్షిణీ, ఖడ్గేతు పూజనీయాహై. వైశ్యైః వ్రాత్యైః ద్విజాతిభిః, రాకా, అనుమతిః సినీవాలీ, కుహూరితి చతస్రః కన్యా ఇత్యర్థః.**

అను॥ వ్యాసుడిట్లా - సూతికా గృహమందుండేది జన్మద అనే దేవత. వారి యాగ (పూజ) నిమిత్తమై జన్మ సమయమందు శుద్ధి చెప్పబడింది;అని. పుత్ర జన్మయందు మొదటి రోజు ఆరవ, పదవరోజులలో ఎల్లప్పుడూ ఈ మూడు రోజులలో సూతకం పాటించరాదు. అపరార్కమందు బ్రాహ్మోక్తి ఇట్లా - వైశ్యులు, ఉపనయనం కాని బ్రాహ్మణులు (వ్రాత్య) బ్రాహ్మణులు వీరు రాక, అనుమతి, సినీవాలి, కుహూ అను నలుగురు కన్యలను వాతఘ్నీ అనే ఐదవ కన్యను షష్ఠీని, వీరిని ఖడ్గమందు పూజించాలి. మొదటి ఐదుగురు బాలులకు క్రీడకొరకు ఆరవది శిశు రక్షణ కొరకు ఉన్నారు. (చ కారంతో ఐదవ ఎనిమిదవ రోజులు అని. తొలి రోజు బంగారం దానం చేయాలి లేదా ఆరు లేదా ఏడురోజులలో దానం చేయాలి. పదవ రోజున బలిదానము, అన్నదానము తగును)

**మూ॥ అథదత్తకపుత్ర పరిగ్రహవిధిః పారిజాతే శౌనకః - (శౌనకోఽహం ప్రవక్ష్యామి పుత్ర సంగ్రహముత్తమం).అపుత్రో మాతృపుత్రో వా పుత్రార్థం సముపోష్య చ, వాససీకుండలే దత్వా ఉష్ణీషం చాంగులీయకం బంధూనన్నేన సంభోజ్య బ్రాహ్మణాం శ్చవిశేషతః, అన్వాధానాది యత్తంత్రం కృత్వాజ్యో త్పవనాంతకం, దాతుః సమక్షం గత్వాతు పుత్రం దేహీతియాచయేత్. దానే సమర్థో దాతాఽస్మైయే యజ్ఞే నేతి పంచభిః దేవస్యత్వేతి మంత్రేణ హస్తాభ్యాం పరిగృహ్యా చ, అంగాదంగే త్యృచం జప్త్వా అఘ్రాయ శిశుమూర్ధని, గృహమధ్యే తమాదాయ చరుంహుత్వా విధానతః. స్విష్ట కృదాది హోమం చ కృత్వా శేషం సమాపయేత్. సచ- బ్రాహ్మణానాం స పిండేషు కర్తవ్యః పుత్ర సంగ్రహః, తదభావేఽస పిండోవా అన్యత్రతునైవ కారయేత్. మితాక్షరాదౌతు వ్యాహృతిభిరాజ్యేన, హోమఉక్తః. స చ హోమోత్తరం జల పూర్వకందేయః. నచ వాజ్ మాత్రేణ,**

వ్యాహృతిభిర్ హుత్వా ప్రతిగృహ్ణీయాత్, ఇతి వసిష్ఠోక్తేః. మాతా, పితా, వా, దద్యాతాం య మద్భిః పుత్రమాపది, సదృశం ప్రీతిసంయుక్తం సజ్ఞేయోదత్రిమః సుతః, ఇతి మనూక్తేః. తత్రైవ వసిష్ఠః-నత్వే నైకం పుత్రందద్యాత్ ప్రతిగృహ్ణీయాద్వా, నస్త్రీ పుత్రం దద్యాత్ ప్రతిగృహ్ణీయాద్వా, అన్యత్రాను జ్ఞానాత్ భర్తుః,ఇతి. ఇదం చ భర్తృ సత్వే. అన్యథా - దద్యాన్మాతా పితావాయం సపుత్రోదత్రిమః స్మృతః, ఇతి వత్సవ్యాసవచో విరోధఃస్యాత్. దానం ప్రతిగ్రహోప లక్షణం

అను॥ ఇక్కడ దత్తపుత్ర స్వీకరణ విధి గురించి పారిజాతమందు శౌనకోక్తి ఇట్లు - (నేను శౌనకుణ్ణి. ఉత్తమమైన పుత్ర సంగ్రహం గూర్చి చెబుతున్నాను). సంతానం లేనివాడు, మరణించిన సంతతి గలవాడు పుత్రునికొరకు చక్కగా ఉపవసించి, వస్త్రములు, కుండలములు ఇచ్చి తలపాగ, ఉంగరము ఇచ్చి, బంధువులకు, విశేషించి బ్రాహ్మణులకు భోజనముపెట్టి (ముగ్గురికి) అన్వాధానము మొదలుకొని ఆజ్య ఉత్పవనాంతము వరకు గల కార్యమును తంత్రము ద్వారా చేసి, దాత సమక్షమునకు వెళ్ళి పుత్రుణ్ణి ఇవ్వు అని యాచించాలి. దాత, దానము యందు, (పత్నిఅనుమతితో) సమర్థుడు ఇతనికి యే యజ్ఞేన అనే ఐదు మంత్రము లతో ఇవ్వాలి. దేవస్యత్వా అనే మంత్రముతో చేతులతో పట్టుకొని 23 (కామస్తుతి పఠించి) అంగాదంగాత్ అనే ఋక్కును జపించి, పిల్లవాని మూర్ధము ఆఘ్రాణము చేసి, ఇంటి మధ్యకు పిల్లవానిని తీసుకొనివచ్చి, (వస్త్ర, కుండల, ఉష్ణీష, అంగుళీయములతో అలంక రించి వాద్యంతోతెచ్చి) విధానముగా (ఆచార్యునిద్వారా) చరుతో హవనము చేసి 25 స్విష్టకృదాది హోమం చేసి శేషకర్మను సమాప్తి నందించాలి. అది కూడా- బ్రాహ్మణులు సపిండుల నుండే పుత్రుణ్ణి స్వీకరించాలి. అదిలేని పక్షంలో, అసపిండులనుండైనా. మరో చోట నుండి పుత్రగ్రహణం చేయరాదు. మితాక్షరాదులందు వ్యాహృతులతో ఆజ్యంతో హోమం చెప్పబడింది. హోమం తార్వత పిల్ల వానిని జలపూర్వకముగా (నీళ్ళువిడిచి) ఇవ్వాలి. నోటిమాటతో మాత్రమే ఇవ్వరాదు. వ్యాహృతులతో హోమంచేసి స్వీకరించాలి,అని వసిష్ఠోక్తి. మనువు ఇట్లన్నాడు - **ఆపత్కాల మందు** పుత్రుని జలదానం ద్వారా తల్లి గాని తండ్రి గాని ఇవ్వాలి. **తగిన వానిని, ప్రీతిగల వానిని** ఇవ్వాలి. అట్టివాడే దత్తపుత్రుడు,అని. అక్కడే వసిష్ఠుడిట్లు - ఉన్న ఒక్కకొడుకును ఇవ్వరాదు, స్వీకరించరాదు. ఆడది పుత్రుణ్ణి ఇవ్వరాదు, స్వీకరించరాదు. భర్త అనుజ్ఞ తీసుకోవాలిగదా. అది లేకుండా తీసుకోరాదు అ౯. ఇది భర్త ఉన్న పక్షంలో లేనిచో - తల్లి కాని తండ్రికాని ఎవరినిస్తారో ఆ పుత్రుడు దత్తకుడౌతాడు,అని ఇది వత్స, వ్యాసుల మాటలకు విరోధమౌతుంది.దానము ప్రతి గ్రహమునకు సూచకము.

మూ ॥ యత్తు సమంత్రక హోమస్య పుత్ర ప్రతి గ్రహాంగత్వాత్వ్యాహృత్యాది మంత్ర పాఠేచస్త్రీ శూద్రయోరనధికారాత్ తయోర్దత్తకాః పుత్రోనభవేత్యేవేతి శుద్ధివివేకే రుద్రధరేణోక్తం. వాచస్పతిశ్చైవమాహ. తన్న, భర్తురనుజ్ఞయాస్త్రియా అపి ప్రతిగ్రహోక్తేః యద్యపి మేధాతిథినా భార్యాత్వవదదృష్టరూపందత్తకత్వం హోమసాధ్యముక్తం. స్త్రీ యాశ్చ హోమా సంభవః తథాపి వ్రతాదివత్ విప్రద్వారా హోమాదికారయేదితి హరినాథాదయః. సంబంధతత్వే౭ప్యేవం. ఏవం

శూద్రస్యాపి, స్త్రీశూద్రాశ్చ సధర్మాణః ఇతి స్మృతేః. అత ఏవ శూద్ర కర్తృకహోమో విప్రద్వారైవ పరాశరేణోక్తః. దక్షిణార్థంతు యోవిప్రః శూద్రస్య జుహుయాద్ధవిః బ్రాహ్మణస్తు భవేచ్ఛూద్రః శూద్రస్తు బ్రాహ్మణో భవేత్. అత్ర మాధవాచార్యః – యోవిప్రః శూద్ర దక్షిణామాదాయ తదీయం హవిః శాంతి పుష్ట్యాది సిద్ధయే వైదికైః మంత్రైః జుహోతి, తస్య విప్రస్యైవదోషః. శూద్రస్తు హోమఫలం లభేతైవ, ఇతి వ్యాచష్టే. దత్తకేవిశేషః కాలికాపురాణే– పితుర్గోత్రేణయః పుత్రః సంస్కృతః పృథివీపతే, ఆ చూడాంతం న పుత్రః స పుత్రతాం యాతి చాన్యతః చూడోపాయన సంస్కారా నిజగోత్రేణ వైకృతాః, దత్తాద్యాః తనయాః తేస్యుః అన్యథాదాస ఉచ్యతే. ఊర్ధ్వంతు పంచమాద్వర్షాత్ నదత్తాద్యాః సుతానృప, గృహీత్వా పంచ వర్షీయం పుత్రేష్టిం ప్రథమం చరేత్. పంచమోర్ధ్వం స్వదానేచ్ఛోః ఏవదానం, తు నాన్యథా, విక్రయం చైవ దానంచ న,నేయాః స్యురనిచ్ఛవః దారాః పుత్రాశ్చ సర్వస్వ మాత్మ నైవతు యోజ యేత్, ఇతి హేమాద్రి మాధవధృతవ్యాస దక్షాది వచనాత్. యచ్చ యాజ్ఞవల్క్యః – స్వ కుటుంబావిరోధేన దేయం దారసుతాదృతే, ఇతి, తదూర్ధ్వం స్వదానానిచ్ఛు పుత్ర పరం. తేన సర్వస్వదానే స్వదానేచ్ఛుదారపుత్ర దానం సిద్ధం.

అను॥ పుత్ర ప్రతి గ్రహమునకు సమంత్రక హోమము అంగము. వ్యాహృత్యాది మంత్ర పాఠంలో స్త్రీ శూద్రులకు అధికారం లేదు కనుక వారికి దత్తక పుత్రుడే ఉండదు, అని శుద్ధి వివేకమందు రుద్రధరుడు అన్నాడు. వాచస్పతి కూడా అట్లాగే అన్నాడు,కాని అట్లా కాదు. భర్త ఆజ్ఞతో స్త్రీ కూడా స్వీకరిస్తుంది,పుత్రుణ్ణి. మేధాతిథి అంటాడు, భార్యత్వము అదృష్ట రూపంగా వస్తుంది, అట్లాగే దత్తకత్వము కూడా హోమసాధ్యము, అదృష్టరూపము, అని. అట్లా అన్నా స్త్రీకి హోమం కుదరదు. ఐనా వ్రతాదులందువలె బ్రాహ్మణుని ద్వారా హోమాదులు చేయించాలి, అని హరినాథాదులు అన్నారు. సంబంధతత్వమందు కూడా ఇట్లాగే ఉంది. శూద్రునకు గూడా ఈ విధముగానే. స్త్రీ శూద్రులు సమాన ధర్మం కలవారు అని స్మృతి చెబుతోంది. అందువల్లనే శూద్రుడు చేయాల్సిన హోమాన్ని విప్రుని ద్వారానే చేయించాలి, అని పరాశరుడన్నాడు. ఏ బ్రాహ్మణుడు దక్షిణ కొరకు శూద్రుని హవిస్సును హోమం చేస్తాడో ఆ బ్రాహ్మణుడు, శూద్రుడౌతాడు. శూద్రుడు, బ్రాహ్మణుడౌతాడు. ఇక్కడ మాధవాచార్యుడిట్లా – ఏ బ్రాహ్మణుడు శూద్రుని దక్షిణను తీసుకొని వాని హవిస్సును శాంతి, పుష్ట్యాదుల సిద్ధి కొరకు వైదిక మంత్రములతో హోమం చేస్తాడో, అది ఆ బ్రాహ్మణుని దోషమే. శూద్రుడు హోమఫలాన్ని తప్పక పొందుతాడు,అని చెప్పాడు. దత్తకమందు విశేషము కాలికా పురణమందిట్లా చెప్పబడింది – ఓ రాజ! తండ్రి గోత్రంతో ఏ పిల్లవాడు సంస్కారం పొందాడో ఆ పిల్లవాడు చూడా కర్మ అయ్యే వరకు ఇతరుల పుత్రుడుగా పుత్రత్వమును పొందదు, అని. చూడ ఉపనయన సంస్కారములు నిజగోత్రంతో చేస్తే వారు దత్తక మొదలగు పుత్రులౌతారు. లేని పక్షంలో దాసులని పిలువబడుతారు. ఓ రాజ! ఐదు సంవత్సరాల వయస్సు తర్వాత దత్తాది సుతులు కారు. ఐదు సంవత్సరాల పిల్లవానిని తీసుకొని తొలుత పుత్రేష్టిని ఆచరించాలి. ఇక్కడ ఐదు సంవత్సరాల తరువాతైతే తనంతతానుగా దానంగా రాదలచుకున్న వానినే (పిల్లవానిని) దానంగా స్వీకరించాలి. మరోరకంగా కాదు. (తండ్రి

మూ॥ అథనామకర్మ. మదనరత్నే బృహస్పతిః - ద్వాదశే దశమేవాఽపి జన్మతోఽపి త్రయోదశే, షోడశే వింశతౌ చైవ ద్వాత్రింశే వర్ణతః క్రమాత్. యాజ్ఞ వల్క్యః - అహన్యేకాదశే నామ. హేమాద్రౌ భవిష్యే - నామధేయం దశమ్యాంతు ద్వాదశ్యాం మాసికేచన, అష్టాదశేఽహని తథా వదంత్యన్యే మనీషిణః. దశమ్యామతీ తాయామి తిజ్ఞేయం. ఆశౌచా పగమే నామధేయం, ఇతి విష్ణూక్తేః. గృహ్యపరిశిష్టేఽపి - జననాద్దశరాత్రేవ్యుష్టేశతరాత్రే సంవత్సరే వా నామకరణం. వ్యుష్టే=అతీతే. జ్యోతిర్నిబంధేగర్గః - అమా సంక్రాంతి విష్ట్యాదౌ ప్రాప్తకాలేఽపినాచరేత్. శ్రీధరః - మిత్రాదిత్యమఘోత్తరాశతభిషక్ స్వాతీ ధనిష్ఠాచ్యుత ప్రాజేశాశ్వి శశాంకపౌష్ణ దినకృత్ పుష్యేషురాశౌస్థిరే, ఛిద్రాం పంచదశీం విహాయ నవమీం శుద్ధేఽష్టమే భార్గవజ్ఞాచార్యా మృత పాదనామ దివసే నామాని కుర్యాచ్ఛిశోః. మనుః-శర్మాంతం బ్రాహ్మణస్యస్యాత్ వర్మాంతం క్షత్రియస్యతు, వైశ్యస్య ధన సంయుక్తం శూద్రస్య ప్రేష్య సంయుతం. మదనరత్నే నారదీయే - సూతకాంతే నామకర్మ విధేయం స్వకులోచితం,నామ పూర్వంతు మాసస్య మంగలం సు సమాక్షరైః తత్రైవ గార్గ్యః - మాసనామ గురోర్నామ దద్యాత్ బాలస్య వైపితా. స్మృతి సంగ్రహే - కృష్ణోఽనంతోఽచ్యుతశ్చక్రీ వైకుంఠోఽథ జనార్దనః ఉపేంద్రో యజ్ఞ పురుషో వాసుదేవస్తథా హరిః, యోగీశః పుండరీకాక్షో మాసనామాన్యను క్రమాత్. అత్ర మార్గశీర్షాదిః చైత్రాదిర్వాక్రమ ఇతి మదనరత్నే - తన్మాస నామ ప్రథమం దద్యాత్ సంబుధ్య చైవహి, దేవాలయ గజాశ్వానాం వృక్షాణాం వాపి కూపయోః, సర్వాపణానాం పణ్యానాం చిహ్నార్థం యోషితాం నృణాం, కావ్యానాం చ కవీనాం చ పశ్వాదీనాం చ సర్వశః, రాజ ప్రాసాద వాస్తూనాం నామ కర్మ విశిష్యతే.

అను॥ ఇక నామకర్మ. మదనరత్నమందు బృహస్పతి ఇట్లా - (1) పన్నెండో రోజు లేదా పదో రోజున (2) జన్మ నుండి పదమూడవ రోజున (3) పదహారవ లేదా ఇరువదవ దినమున (4) ముప్పదిరెండవరోజున వర్ణము ననుసరించి (బ్రాహ్మణాది) క్రమంగా నామకరణము,అని. యాజ్ఞవల్క్యుడిట్లా - పదకొండవరోజు నామకరణము,అని. (బ్రాహ్మణ - పదకొండవరోజు, వైశ్యునకు ఇరువదిఒకటవరోజున) హేమాద్రియందు భవిష్యోక్తి ఇట్లా - నామధేయము పదవరోజున, పన్నెండో రోజున, కొందరు ఒక నెలకు నామకరణమన్నారు కొందరు బుద్ధిమంతులు పద్దెనిమిదవ రోజు నామకర్మ అని అంటారు. దశమి (పదవరాత్రి) గడిచాక అని తెలుసుకోవాలి. విష్ణూక్తి ఇట్లా - ఆశౌచం గడిచాక నామకరణం,అని. గృహ్య పరిశిష్టమందు కూడా ఇట్లా జననం నుండి పదిరాత్రులు గడిచాక, నూరవ రాత్రియందు సంవత్సరమందు కాని నామకరణము,అని. జ్యోతిర్నిబంధమందు గర్గుడిట్లా - అమా సంక్రమణం విష్టి (భద్ర) అదులందు (వ్యతీపాత, గ్రహణ వైధృతులు) సమయం వచ్చినా నామకర్మ ఆచరించరాదు,అని. (గురు శుక అస్త బాల్య వార్ధక్య వక్ర అతిచార మలమాసాది నిషేధం లేదు) శ్రీధరుడిట్లా - అనురాధా, పునర్వసు, మఘ, మూడు ఉత్తరలు, శతభిషం, స్వాతి, ధనిష్ఠ, శ్రవణ, రోహిణీ, అశ్విని, మృగశిర, రేవతి, హస్త, పుష్య నక్షత్రములందు స్థిరరాశియందు ఛిద్రతిథి (చతుర్థి, షష్ఠి, ద్వాదశి, చతుర్దశి) పూర్ణిమ, నవమి వీటిని వదలి (తిథులు) అష్టమశుద్ధియందు, శుక్ర, బుధ, గురువారములందు

అమృతవేలయందు (మధ్యాహ్నం కన్నపూర్వం) శిశువునకు నామకరణం చేయాలి,అని. మనువిట్లా - బ్రాహ్మణునికి పేరు చివర శర్మ క్షత్రియుని పేరు చివర వర్మ, వైశ్యునకు ధనముతో కూడిన, శూద్రునకు దాసుడు మొదలగు వానితో కూడిన నామం కావాలి,అని. మదనరత్నంలో నారదీయోక్తి ఇట్లా - సూతకం చివర తన, కులమునకు తగినట్లుగా నామకర్మ చేయాలి. నామంకన్న ముందు మాసంయొక్కసుసమాక్షరములతో మంగలం చేయాలి,అని. అక్కడే గార్గ్యుడిట్లా - మాసనామం, గురునామము బాలునకు తండ్రి పెట్టాలి,అని. స్మృతి సంగ్రహమందిట్లా - కృష్ణుడు, అనంతుడు, అచ్యుతుడు, చక్రి, వైకుంఠుడు, జనార్ధనుడు ఉపేంద్రుడు, యజ్ఞపురుషుడు, వాసుదేవుడు, హరి, యోగీశుడు, పుండరీ కాక్షుడు వరుసగా ఇవి మాస నామాలు,అని. ఇక్కడ మార్గశీర్షము ఆదిగానో చైత్రాదిగానో క్రమమని. మదనరత్న మందిట్లా- సంబోధించి (నతో) ఆ మాస నామాన్ని తొలుత పెట్టాలి. దేవాలయ, గజ, అశ్వముల, వృక్షముల వాపీ కూపముల అన్ని దుకాణములందలి వస్తువుల స్త్రీల, రాజుల చిహ్నము కొరకు, కావ్యముల, కవుల పశ్వాదుల, రాజప్రాసాద వాస్తుల (గృహ) నామకర్మల విశేషము చెప్పబడింది.

**మూ॥ నాక్షత్ర మపి నామకార్యం. అభివాదనీయం చ సమీక్షేత, తన్మాతా పితరౌ విద్యాతా మోపనయనాత్, ఇత్యాశ్వలాయనోక్తేః.** కులదేవతా నక్షత్ర సంబద్ధం పితాకుర్యాత్, ఇతి **మదనరత్నే శంఖోక్తేః. తచ్చనక్షత్రపాదాక్షరాద్యాక్షరం** కుర్యాదిత్యుక్తం పరిశిష్టే - తదక్షరాదికం, **నామ యస్మిన్ ధిష్ణ్యే యదక్షరం,ఇతి.** సుదర్శన భాష్యేతు - రోరేమ మృజ్యేచిషు వృద్ధి రాదౌ **రాత్పేచ, వాంత్య శ్రవణా శ్వయుక్షు, శేషేషు నామ్నోః** కపరః స్వరోంత్యః స్వాప్యోరదీర్ఘః సవిసర్గ **ఇష్టః, ఇత్యుక్తం.** రాత్పే ఇతి ప్రోష్ఠపదేత్యత్రాదౌరాత్పరే చ వృద్ధిః ప్రోష్ఠ పాద ఇతి. అంత్యమ పభరణీ శ్శబ్దః శృతా వుక్తః. తత్ర శ్రవణాదౌ చ వాదివృద్ధిః. అపభరణ ఆపభరణ ఇత్యాది. మదనరత్నే వసిష్ఠః - జన్మాహేద్వాదశాహేవా దశాహేవా విశేషతః, ఉత్తరారేవతీహస్త మూల పుష్యాః సవారుణాః, శ్రవణాదితిమైత్రం చ స్వాతీ మృగశిరస్తథా, ప్రాజాపత్యం ధనిష్ఠా చ **ప్రశస్తానామకర్మణి.**

అను॥ నక్షత్రంతో కూడా పేరు పెట్టాలి ఆశ్వలాయనులిట్లా - నమస్కరించిన వానిని, అతని తల్లిదండ్రులు చూస్తారు ఉపనయనం ద్వారా జ్ఞానంతో తెలుసుకుంటారు,అని. (ఉపనయనంలో నమస్కరించేప్పుడు చెప్పే పేరు వ్యవహారనామం). మదనరత్నంలో శంఖోక్తి ఇట్లా - కులదేవత, నక్షత్ర సంబంధిత నామకర్మను తండ్రి చేయాలి,అని. అది నక్షత్ర పాదాక్షరముతొలి అక్షరము కావాలి పేరులో అని పరిశిష్టంలో చెప్పబడింది ఇట్లా - ఏ నక్షత్రమందు ఏ అక్షరముందో అదే అక్షరము నామము ఆదిలో ఉండాలి,అని. సుదర్శన భాష్యమందైతే ఇట్లా - రోహిణి, రేవతి, మఖ, మృగశిర, (పుష్య) జ్యేష్ఠ, చిత్త వీనిలో పుట్టిన వాని పేరు ఆది అక్షరం వృద్ధి కావాలి. ర కన్న పరంగా పఉన్న (ఉత్తరాభాద్రయందు) వృద్ధి ఔతుంది. ప్రోష్ఠపద (ప్రో=ప్రౌ,ప=పా) ప్రౌష్ఠ పాద అని' అంత్యమనగ అపభరణీ శబ్దము అని శృతిలో చెప్పబడింది. అపభరణ, ఆపభరణ అని మొదలుగా, శ్రవణ,

ఆశ్వయుజములందు ఆదివృద్ధి వికల్పము. శేష నక్షత్రములలో పేరు చివర క అక్షరము, చివర స్వరము ఉండాలి. స్వాతీ, పునర్వసూమరి రేవతీ వీటిలో దీర్ఘముండదు (హ్రస్వము) విసర్గ ఉంటే చివర ఇష్టము; అని చెప్పారు. మదనరత్నమందు వసిష్ఠుడిట్లా – జన్మాహము నుండి పన్నెండో రోజున లేదా విశేషించి పదో రోజున (పదిరోజుల తర్వాత పదకొండున) ఉత్తర, రేవతి, హస్త, మూల, పుష్యమి, శతభిషం, శ్రవణం, పునర్వసు, అనురాధ, స్వాతి, మృగశిర, రోహిణి, ధనిష్ఠ ఈ నక్షత్రములందు నామకర్మ ప్రశస్తము.

**మూ॥ అథదోలారోహణః – పారిజాతే బృహస్పతిః** – దోలారోహస్తు కర్తవ్యో దశమే ద్వాదశేఽపివా; షోడశేది వసే చాపిద్వా వింశే దివసేఽపివా. **జ్యోతిర్నిబంధే** – కరత్రయే వైష్ణవ **రేవతీ స్వదితిద్వయే వాఽఽశ్విన క్రువేషు, కుర్యాచ్ఛిశూనాం నృపతేశ్చ తద్వత్ ఆందోలనం వై సుఖినోభవంతి. తత్రైవ**– ఆందోళాశయనే పుంసో ద్వాద సో దివసఃశుభః, త్రయోదశస్తు కన్యాయా న నక్షత్ర విచారణా. **అన్యస్మిన్** ది వసే **చేత్స్యాత్ తిర్యగాస్యే** ప్రశస్యతే.

అను॥ ఇక దోలారోహము – **(ఉయ్యాలలో వేయుటం).** పారిజాతమందు బృహస్పతి వచనమిట్లా – పదవ లేదా పన్నెండవ రోజున లేదా పదహారవరోజున లేదా ఇరవై రెండవ రోజున దోలా రోహణ చేయాలి,అని. జ్యోతిర్ని బంధమందిట్లా – హస్త చిత్త స్వాతి, శ్రవణం, రేవతి, పునర్వసు, పుష్యమి, అశ్విని ధ్రువగణ నక్షత్రములు (మూడు ఉత్తరలు, రేవతి) వీనిలో శిశువులకు అట్లాగే రాజునకు ఆందోళన కార్యం చేయాలి. సుఖపడతారు,అని. అక్కడే – ఆందోళిక యందు పడుకోవటానికి పిల్లవానికి పన్నెండవ రోజు శుభప్రదమైనది. (కన్యకకు) ఆడపిల్లకు పదమూడవ రోజు శుభప్రదమైనది. ఈ విషయంలో మంచి నక్షత్రం గూర్చి విచారణ అవసరంలేదు. మరో రోజు ఐనట్లైతే తిర్యగాస్యములందు (అనగా రేవతి, పునర్వసు, హస్త, చిత్ర, స్వాతి, అశ్విని, మృగశీర్ష, అనురాధ, జ్యేష్ఠ నక్షత్రములు) శ్రేష్ఠము, అని.

**మూ॥ దుగ్ధపానం. నృసింహః** – ఏకత్రింశద్దినే చైవ పయః శంఖేన పాయయేత్, అన్న ప్రాశన నక్షత్రే దివసోదయ రాత్రిషు.

అను॥ ఇక పాలు త్రాగటం అనేకర్మ. నృసింహుడిట్లా– ముప్పది ఒకటవ రోజున పాలను శంఖముతో తాగించాలి. అన్న ప్రాశన నక్షత్రమందు, దివసమందో, ఉదయమందో, రాత్రియందో తాగించాలి,అని.

**మూ॥ అథకర్ణవేధః.** మదనరత్నే వసిష్ఠశ్రీధరౌ – మాసేషష్ఠే సప్తమేవాఽష్టమేవా వేధ్యౌకర్ణౌ ద్వాదశేషోడశేఽహ్ని. మధ్యేనాహ్నః పూర్వభాగే న రాత్రౌ నక్షత్రే ద్వేద్వే తిథీవర్జయిత్వా. అత్ర జన్మమాసోవర్జ్యః జ్యోతిర్నిబంధేగర్గః – మాసేషష్ఠే సప్తమే వా హ్యష్టమే మాసి వత్సరే, కర్ణవేధం ప్రశంసంతి పుష్ట్యాయుః శ్రీవివృద్ధయే. మదనరత్నే – ప్రథమే సప్తమే మాసి అష్టమే దశమేఽథవా, ద్వాదశే చ తథా కుర్యాత్ కర్ణవేధం శుభావహం. హేమాద్రౌవ్యాసః – కార్తికేపౌష మాసేవా చైత్రేవా ఫాల్గునేఽపివా, కర్ణవేధం ప్రశంసంతి శుక్లపక్షే శుభేదినే. శ్రీధరః – హరిహయకరచిత్రా

సౌమ్య పౌష్ణోత్తరా ర్యాదితి వసుషు ఘటాలీ సింహవర్జ్యేసులగ్నే, శశిగురుబుధ కావ్యానాం దినే పర్వరిక్త రహిత తిథిషు శుద్ధే నైధనే కర్ణవేధః. మదనరత్నే బృహస్పతిః – ద్వితీయాదశమీ షష్ఠీ సప్తమీ చ త్రయోదశీ, ద్వాదశీ పంచమీ శస్తా తృతీయా కర్ణవేధనే. సౌవర్ణీ రాజపుత్రస్య రాజతీ విప్రవైశ్యయోః, శూద్రస్య చాయసీ సూచీ మధ్యమాఽష్టాం గులాత్మికా. హేమాద్రౌ దేవలః – కర్ణ రంధ్రే రవేశ్ఛాయాన విశేదగ్ర జన్మనః, తందృష్ట్వా విలయం యాంతి పుణ్యౌఘాశ్చ పురాతనాః. శంఖః – అంగుష్ఠమాత్ర సుశిరౌకర్ణౌ న భవతో యది తస్మైశ్రాద్ధంన దాతవ్యం దత్తం చే దాసురంభవేత్.

అను॥ ఇకకర్ణవేధ. మదనరత్నమందు వసిష్ఠ శ్రీధరులు – అరవ, ఏడవ, అష్టమ నెలలందు పన్నెండవ, పదహారవరోజుననో చెవులు కుట్టించాలి. దివసం మధ్య భాగంలో చేయాలి. దివ సంపూర్వ భాగమందు కాని రాత్రి కాని రెండు నక్షత్రాలున్న రోజున, రెండు తిథులున్న రోజునకాని కర్ణవేధ చేయరాదు;అని. ఇక్కడ జన్మమాసాన్ని విడిచి పెట్టాలి. జ్యోతిర్నిబంధమందు గర్గుడిట్లా – అరవ, ఏడవ, ఎనిమిదవ నెలల్లో లేదా సంవత్సరమందు పుష్టి, ఆయుస్సు, శ్రీలని వృద్ధి కొరకు కర్ణవేధను చేయాలని ప్రశంసిస్తారు,అని. మదనరత్న మందిట్లా – మొదటి, ఏడవ, ఎనిమిదవ, పదవ, పన్నెండవ నెలలో శుభప్రదమైనది కర్ణవేధ (నుచేయాలి),అని. హేమాద్రియందు వ్యాసుడిట్లా – కార్తికం, పౌషం, చైత్రం, ఫాల్గునంలలో శుక్లపక్షంలో శుభదినమందు కర్ణవేధ మంచిదని చెప్తారు,అని. శ్రీధరుడిట్లా – శ్రవణం, అశ్విని, హస్త, చిత్ర, మృగశిర, రేవతి, మూడు ఉత్తరలు, పునర్వసు ధనిష్ఠ ఈ నక్షత్రములందు, కుంభము, వృశ్చికం, సింహ లగ్నములను వదలి మంచి లగ్నమందు, సోమ, బుధ, గురు, శుక్రవారములందు, పర్వ రిక్త తిథులు కాని తిథులందు శుద్ధమైన దిగా లగ్నమునకు ఎనిమిదవ స్థానముండగా కర్ణవేధ చేయాలి,అని. మదనరత్నమందు బృహస్పతి ఇట్లా – విదియ, దశమి, షష్ఠి, సప్తమి, త్రయోదశి, ద్వాదశి, పంచమి, తృతియ ఇవి కర్ణవేధమందు ప్రశస్తమైన తిథులు,అని. రాజపుత్రునకు బంగారుది,విప్ర వైశ్యులకు వెండిది, శూద్రునకు లోహపుది సూచి. మధ్యమ అంగుళితో ఎనిమిది అంగుళముల సూదితో కర్ణవేధ చేయాలి. హేమాద్రి యందు దేవలుడిట్లా – బ్రాహ్మణుని కర్ణరంధ్రమందు సూర్యుని ఛాయ ప్రవేశించరాదు. దానిని చూచి పూర్వమందలి పుణ్యౌఘములు నశించిపోతాయి,అని. శంఖుడిట్లా–చెవులందు అంగుష్ఠ మాత్రపు రంధ్రములు కారాదు. ఒకవేళ ఐతే అతనికి శ్రాద్ధం పెట్టరాదు. ఒకవేళ శ్రాద్ధం పెడ్తే అది ఆసుర మౌతుంది,అని.

మూ॥ **అథతాంబూలభక్షణం** – చండేశ్వరః – సార్ధమాస ద్వయే దద్యాత్ తాంబూలం ప్రథమం శిశోః, కర్పూరా దిక సంమిశ్రం విలాసాథహితాయచ. మూలార్క చిత్రకర తిష్యహరీంద్ర భేషు పౌష్ణేతథా మృగశిరోదితి వాసవేషు, అర్కేందు జీవభృగు బోధన వాసరేషు తాంబూల భక్షణ విధిః మునిభిః ప్రదిష్టః.

అను॥ ఇక తాంబూల భక్షణము. చండేశ్వరుడిట్లా – మొదటిసారిగా, శిశువునకు రెండున్నర నెలలకు తాంబూలమివ్వాలి. కర్పూరము మొదలగువానితో కూడినది ఇవ్వాలి.

అది విలాసమునకు, హితమునకు ఉపకరించేది. మూల, హస్త, చిత్త, పుష్యమి, శ్రవణ, జ్యేష్ఠ, రేవతి, మృగశిర, పునర్వసు ఈ నక్షత్రములందు, (అర్క=కర;ఇంద్ర=వాసవ ఆవృత్తి), ఆది, సోమ, గురు, శుక్ర, బుధవారములందు తాంబూల భక్షణ విధిని మునులు చెప్పారు.

మూ॥ **అథనిష్క్రమణం. జ్యోతిర్నిబంధే – తృతీయేవా చతుర్థేవా మాసి నిష్క్రమణం భవేత్. యమః – తతస్తృతీయే కర్తవ్యం మాసి సూర్యస్య దర్శనం, చతుర్థే మాసి కర్తవ్యం శిశోశ్చంద్రస్య దర్శనం. అత్ర – సూర్యేందోర్యే కర్మణీయే చతయోః శ్రాద్ధం న విద్యతే, ఇతి ఛందోగ పరిశిష్టాత్. ఛందోగానాం నిష్క్రమణేవృద్ధి శ్రాద్ధం నాస్తి ఇతి కల్పతరుః. వ్యాసః – మైత్రే పుష్య పునర్వసు ప్రథమ భేపౌష్ణేఽను కూలే విధౌ, హస్తే చైవ సురేశ్వరే చ మృగభేశారాసుశస్తాసు చ, కుర్యాన్నిష్క్రమణం శిశోః బుధగురుశుక్రే విరక్తే తిథౌ, కన్యాకుంభతులా మృగారిభవనే సౌమ్యగ్రహాలోకితే. మదనరత్నే– అన్నప్రాశనకాలేవా కుర్యాన్నిష్క్రమణక్రియాం. విష్ణుధర్మే – దిగీశానాం దినేశత్ర తథా చంద్రార్కయోర్ద్విజః, పూజనం వాసుదేవస్య గగనస్య చ కారయేత్. బహిర్నిష్కాసయేత్ గేహాత్ శంఖ పుణ్యాహనిస్వనైః, చంద్రార్కయోర్ దిగీశానాం, దిశాం చ గగనస్యచ, నిక్షేపార్థం ఇదం దద్మితే, మే, రక్షంతు సర్వదా, అప్రమత్తం ప్రమత్తం వా దివారాత్ర మథాపివా, రక్షంతు సతతం సర్వే దేవాః శక్రపురోగమాః. మాధవీయే మార్కండేయః – అగ్రతోఽథ ప్రవిన్యస్య శిల్ప భాండాని సర్వశః, శస్త్రాణి చైవ, వస్త్రాణి తతః పశ్యేత్తు లక్షణం. ప్రథమం యత్ స్పృశేత్ బాలః తతో భాండం స్వయం తదా, జీవికా తస్య బాలస్య తే నైవతు భవిష్యతి,ఇతి.**

అను॥ ఇక నిష్క్రమణను గూర్చి. జ్యోతిర్నిబంధమందిట్లా – మూడవ నెలలో లేదా నాల్గవ నెలలో నిష్క్రమణం ఆచరించాలి అని. యముడిట్లా– ఆ పిదప తృతీయ మాస మందు సూర్యదర్శనము చేయించాలి. నాల్గవ నెలలో బాలకునకు చంద్రదర్శనం చేయించాలి, అని. ఇక్కడ – సూర్యచంద్రులకు చెందిన ఏ కర్మలున్నాయో (పూజ) వారికి చెందిన ఏ శ్రాద్ధ ముందో వానిని ఆచరించాల్సిన పనిలేదు, అని ఛందోగపరిశిష్ట మందు ఉంది. ఛందోగులకు నిష్క్రమణ కాలమందు వృద్ధి శ్రాద్ధము లేదు,అని కల్పతరువు అంది. వ్యాసు డిట్లా– అనురాధ, పుష్యమి, పునర్వసు, అశ్విని, రేవతి, హస్త, జ్యేష్ఠ, మృగశిర ప్రశస్తమైన ఈ నక్షత్రములందు, చంద్రుడు అనుకూలంగా ఉండగా, బుధ గురు శుక్రవారములందు, రిక్తకాని తిథులందు కన్య, కుంభ, తుల, సింహము ఈ లగ్నము లందు సౌమ్యగ్రహములు చూస్తుండగా శిశువునకు నిష్క్రమణం చేయాలి,అని. మదనరత్నమందిట్లా – అన్న ప్రాశన కాలమందైనా నిష్క్రమణ క్రియను చేయాలి అని. విష్ణు ధర్మమందిట్లా – అట్లాగే అక్కడ ద్విజుడు దిక్కులకు యజమానులైన, వారిని, చంద్రసూర్యుల దినమందు (సోమ,ఆది) వాసుదేవ పూజను ఆకాశపూజను చేయాలి,అని. మంచిరోజున శంఖము ధ్వనితో ఇంటి నుండి బయటికి శిశువును తేలాలి. ఇంకా ఇట్లా అనాలి – సూర్యచంద్రులకు, దిగీశులకు, దిక్కులకు, ఆకాశమునకు తాకట్టుగా ఈ పిల్లవాణ్ణి ఇస్తున్నాను. ఎల్లప్పుడు వారు నన్ను

రక్షించని (నాబాలుని). అప్రమత్తుడైనా, ప్రమత్తుడైనా, పగలు కాని రాత్రి కాని, ఇంద్రుడు మొదలుగా దేవతలంతా ఎల్లప్పుడూ రక్షించని. మాధవీయమందు మార్కండేయోక్తి-ఆ పిదప పిల్లవాని ఎదుట శిల్పములు, భాండములు, శస్త్రములు, వస్త్రములు, అన్ని బాగా ఉంచి ఆ పిదప పిల్లవాని లక్షణాన్ని చూడాలి,అని. అప్పుడు మొదట పిల్లవాడు ఏ భాండాన్ని ముట్టాడో స్వయంగా,అదే ఆ పిల్లవానికి జీవిక ఔతుంది (బ్రతుకుతెరువు, వృత్తి)అని.

మూ॥ **అథోపవేశనం.** ప్రయోగపారిజాతే పాద్మే విష్ణుధర్మే చ - పంచమే చ **తథామాసి భూమౌ, తముపవేశయేత్, తత్రసర్వేగ్రహాః శస్తాభౌమోఽప్యత్ర విశేషతః ఉత్తరా త్రితయం సౌమ్యం పుష్యర్‌క్షం శుక్రదైవతం, ప్రజాపత్యం చ హస్తశ్చ శస్తమాశ్విన, మిత్రభం. వారాహం పూజయేద్దేవం పృథివీం చ తథాద్విజః, రక్షైనం వసుధేదేవి సదా సర్వగతం శుభే. ఆయుః ప్రమాణం సకలం నిక్షిప స్వహరిప్రియే, అచిరాదాయుషస్త్వస్య యేకేచిత్పరి పంథినః, జీవితారోగ్యవిత్తేషు నిర్దహస్వాచిరేణతాన్. వరేణ్యాశేష భూతానాం మాతాత్వమసి కామధుక్, అజరా చాప్రమేయా చ సర్వభూత నమస్కృతా. చరాచరాణాం భూతానాం ప్రతిష్ఠా నావ్యయాహ్యసి, కుమారం పాహి మాతస్త్వం బ్రహ్మేతదనుమన్యతాం.**

అను॥ ఇక ఉపవేశనము. ప్రయోగ పారిజాతమందు పాద్మ మందలి, విష్ణు ధర్మ మందలి వచనమిట్లా - అట్లాగే ఐదవ మాసమందు భూమిపై ఆతనిని కూర్చో పెట్టాలి. అక్కడ అన్ని గ్రహములు ప్రశస్తంగా ఉండాలి, విశేషించి కుజుడు కూడా. ఉత్తర నక్షత్రములు మూడు మృగశిర పుష్యమి, జ్యేష్ఠ, శ్రవణం, హస్త, అశ్విని, అనురాధ ఇవి ప్రశస్తమైనవి ఈ కార్యమందు. అట్లాగే ద్విజుడు వరాహదేవుణ్ణి, భూమిని పూజించాలి. ఓ వసుధ, దేవి, శుభే అంతట ఉండే ఈ బాలుణ్ణి ఎల్లప్పుడూ రక్షించు ఓ హరిప్రియ! ఈతనికి సంపూర్ణ ఆయుః ప్రమాణాన్ని ఇవ్వు. ఈతని ఆయుస్సునకు ఎవరైతే కొందరు శత్రువులున్నారో వారిని త్వరగా శిక్షించు. ఈతని జీవిత, ఆరోగ్య, విత్తములందలి శత్రవులను త్వరగా దగ్ధంచేయి. శ్రేష్ఠమైన దానివి,భూతములన్నింటికి మాతవు నీవు, కోరికలనిచ్చే దానివి. ముసలితనం లేనిదానివి, కొలతలు లేనిదానివి. ప్రాణులన్నింటితో నమస్కరింపబడెదానివి. చరాచరభూతములను నిలిపేదానివి, నాశం లేనిదానివి. ఓ మాత నీవు ఈ కుమారుని రక్షించు. బ్రహ్మ దానిని అనుమతించని.

మూ॥ **అథాన్నప్రాశనం.** పారిజాతే నారదః - జన్మతో మాసిషష్ఠే స్యాత్ సౌరేణాన్నా శనం వరం, సంవత్సరేవా సంపూర్ణే కేచిదిచ్ఛంతి పండితాః. మదనరత్నే లౌగాక్షిః - షష్ఠేఽన్న ప్రాశనం జాతేషు దంతేషువా, ఇతి. శంఖః- సంవత్సరేఽన్న ప్రాశన మర్థసంవత్సరేవా,ఇతి. జ్యోతిర్నిబంధేనారదః - షష్ఠేవాప్యష్టమేమాసి పుంసాం, స్త్రీ ణాంతు పంచమే, సప్తమే మాసివాకార్యం నవాన్నప్రాశనం శుభం. రిక్తాం దిన క్షయంనందాం ద్వాదశీ మష్టమీమమాం, త్యక్త్వాఽన్యతిథయః ప్రోక్తాః సితజీవజ్ఞవాసరాః చంద్రవారం ప్రశంసంతి కృష్ణేచాంత్యత్రికంవినా. శ్రీధరః - ఆదిత్యతిష్య వసుసౌమ్య కరానిలాశ్విచిత్రాజ విష్ణువరుణోత్తర పౌష్ణమిత్రాః బాలాన్నభోజనవిధౌ దశమే విశుద్ధే ఛిద్రాం విహాయ నవమీం తిథయః శుభాః స్యుః. వసిష్ఠః - బాలాన్న భుక్తౌ వ్రత బంధనే చ

రాజాభిషేకే ఖలు జన్మధిష్ణ్యం, శుభం త్వ నిష్టం సతతం వివాహే సీమంత యాత్రాదిషు మంగలేషు. మార్కండేయవిష్ణు ధర్మయో: – బ్రహ్మాణం శంకరం విష్ణుం చంద్రార్కౌ చ దిగీశ్వరాన్, భువందిశశ్చ సంపూజ్య హుత్వావహ్నౌ తథాచరుం, దేవతా పురతస్తస్యధాత్ర్యుత్సంగ గతస్య చ, అలంకృతస్య దాతవ్యమన్నం పాత్రేసకాంచనం, మధ్వాజ్యదధి సంయుక్తం ప్రాశయే త్పాయసంతువా, ఇతి.

అను ॥ ఇక అన్న ప్రాశనము – పారిజాతమందు నారదుడిట్లా – పుట్టుక నుండి ఆరవ మాసమందు సౌరమానం ప్రకారం అన్న ప్రాశనము శ్రేష్ఠము. కొందరు పండితులు సంవత్సరం నిండాక అన్న ప్రాశన ఇష్టపడుతారు,అని. మదనరత్నమందు లౌగాక్షి ఇట్లా – ఆరవనెలలో అన్న ప్రాశన లేదా పండ్లు (దంతములు) వచ్చాకనైనా,అని. శంఖుడిట్లా – అర్థ సంవత్సరానికిగాని లేదా సంవత్సరానికి గాని అన్నప్రాశన,అని. జ్యోతిర్నిబంధమందు నారదుడిట్లా – పురుషులకు ఆరవ నెలలో లేదా ఎనిమిదవ నెలలోగాని, ఆడవారికి ఐదవనెలలో లేదా ఏడవనెలలోకాని శుభమైన, నూతన అన్న ప్రాశన కార్యం చేయాలి,అని. రిక్త (చతుర్థి,నవమి, చతుర్దశి) తిథిక్షయము, నంద (ప్రతిపద, షష్ఠి, ఏకాదశి),ద్వాదశి, అష్టమి, అమా వీనిని వదలి ఇతర తిథులు మంచివని అన్నారు. శుక్ర, గురు, బుధ, సోమ వారములు మంచివని అన్నారు. కృష్ణపక్షమందు చివరి మూడు తిథులు వదలాలన్నారు. (త్రయోదశి, చతుర్దశి, అమాలు). శ్రీధరుడిట్లా–పునర్వసు, పుష్యమి, ధనిష్ఠ, రోహిణి, హస్త, స్వాతి, అశ్విని,చిత్త, మృగశిర, శ్రవణం, శతభిషం, మూడు ఉత్తరలు, రేవతి, అనురాధ ఈ నక్షత్రములలో లగ్నం నుండి దశమ శుద్ధి ఉండగా, ఛిద్రను నవమి తిథిని వదలి (చతుర్థి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి వదలి) మిగిలిన తిథులలో బాలకునకు అన్నప్రాశన శుభము,అని. వసిష్ఠుడిట్లా – పిల్లవానికి అన్నప్రాశనలో, ఉపనయనములో (యజ్ఞోపవీతం), రాజ్యాభిషేకమందు జన్మనక్షత్రము శుభమైంది. వివాహ, సీమంత, యాత్రాది మంగళములలో ఎప్పుడూ అనిష్టకరమైనది అని. మార్కండేయవిష్ణు ధర్మము లందిట్లా – బ్రహ్మ,విష్ణు, శివులను, చంద్రసూర్యులను, దిగీశ్వరులను భూమిని దిక్కులను పూజించి, అట్లాగే అగ్నియందు చరువును హోమం చేసి, దేవతల ఎదుట, అలంకరింపబడిన తల్లి ఒడిలో ఉన్న బాలునకు బంగారు పాత్రలో అన్నం పెట్టాలి. తేనె, నేయి, పెరుగు వీనితో కూడిన దానిని లేదా పాయసాన్ని తినిపించాలి అని.

మూ॥ **అథాబ్దపూర్తి:.** వ్యవహారనిర్ణయే– నవాంబరధరో భూత్వా పూజయేచ్చ చిరాయుషం, మార్కండేయం నరోభక్త్యాపూజయేత్ప్రయతస్తథా. తతో దీర్ఘాయుషం వ్యాసం రామంద్రౌణిం కృపం బలిం, ప్రహ్లాదంచ హనూమంతం విభీషణ మథార్చయేత్. స్వనక్షత్రం జన్మతిథిం ప్రాప్య సంపూజయేన్నరః, షష్ఠీంచదధిభక్తేన, వర్షేవర్షే పునః పునః. తిథి తత్వే ఏతన్నామభిః తిలహోమో-ఽప్యుక్తః. ఆదిత్యపురాణే –సర్వైశ్చ జన్మదివ సేస్నాతైః మంగలవారిభిః, గురుదేవాగ్ని విప్రాశ్చ పూజనీయాః ప్రయత్నతః. స్వ నక్షత్రం చ పితరౌ తథాదేవః ప్రజాపతిః, ప్రతి సంవత్సరం యత్నాత్ కర్తవ్యశ్చ మహోత్సవః, కృత్య చింతామణౌ – గుడదుగ్ధ తిలాన్ దద్యాత్ హస్తే గ్రంథౌ చ బంధయేత్, గుగ్గులం నింబసిద్ధార్థ దూర్వాగోరోచనాదికం, సంపూజ్య భాను విఘ్నేశౌ మహర్షిం

ప్రార్థయేదిదం, చిరంజీవీ యథాత్వంభో భవిష్యామితథామునే. రూపవాన్ విత్తవాంశ్చైవ శ్రియాయుక్తశ్చ సర్వదా, మార్కండేయ నమస్తే స్తు సప్త కల్పాంతజీవన. ఆయురారోగ్య సిద్ధ్యర్థం ప్రసీద భగవన్ మునే, చిరంజీవీ యథాత్వంతు మునీనాం ప్రవరద్విజ, కురుష్వముని శార్దూల తథామాం చిరజీవినం. మార్కండేయ మహాభాగ సప్తకల్పాంతజీవన (ఆయురారోగ్య సిద్ధ్యర్థం అస్మాకం వరదోభవ). సతిలంగుడ సంమిశ్రమంజల్యర్థమితంపయః, మార్కండేయాద్వరం లబ్ధ్వాపిబామ్యాయుర్వివృద్ధయే, ఇతి పయఃపిబేత్.తిథి తత్వే స్కాందే –ఖండనం నఖకేశానాం మైథునాధ్వాగమౌతథా, ఆ మిషం కలహం హింసాం వర్షవృద్ధౌ వివర్జయేత్. తత్రైవ దీపికాయాం – కృతాంత కుజయోర్వారే యస్య జన్మ తిథిర్భవేత్, అన్యక్షయోగ సంప్రాప్తౌ విఘ్నస్తస్య పదేపదే. (కృతాంతః =శనిః). తస్య సర్వౌషధిస్నానం గురుదేవాగ్ని పూజనం. వృద్ధ మనుః – మృతే జన్మని సంక్రాంతౌ శ్రాద్ధే జన్మదినే తథా, అస్పృశ్య స్పర్శనే చైవ నస్నాయాదుష్ణ వారిణా. అత్ర జన్మతిథి రౌదయికీగ్రాహ్యా. యుగాద్యావర్ష వృద్ధిశ్చ సప్తమీ పార్వతీ ప్రియా,రవేరు దయమీక్షంతే, నతత్ర తిథి యుగ్మతా, ఇతికృత్య తత్వార్ణవేవచనాత్. విశేషో మత్కృతశూద్ర ధర్మేజ్ఞేయః.

అను ॥ ఇక సంవత్సర పూర్తి. వ్యవహారనిర్ణయమందిట్లా – కొత్త బట్టలు ధరించి నరుడు భక్తితో చిరాయుస్సుగల వారిని పూజించాలి. అట్లాగే నరుడు శుచియై మార్కండేయుణ్ణి భక్తితో పూజించాలి. పిదప దీర్ఘాయుస్సుగల వ్యాసుణ్ణి, రాముణ్ణి, అశ్వత్థామను, కృపాచార్యుని, బలిని, ప్రహ్లాదుని, హనూమంతుని, విభీషణుని అర్చించాలి. తన నక్షత్రము, జన్మతిథి వస్తే నరుడు పూజించాలి. ప్రతి వర్షము, మరల మరల పెరుగు అన్నముతో షష్ఠిని పూజించాలి. తిథి తత్వమందు ఈ పేర్లతో తిలహోమం కూడా చెప్పబడింది. ఆదిత్యపురాణ మందిట్లా – తమ జన్మది వసమందు అందరూ మంగళ జలంతో స్నానం చేసి ప్రయత్న పూర్వకముగా వారుగురు, దేవ, అగ్ని, బ్రాహ్మణులను పూజించాలి,అని. తన నక్షత్రమందు తల్లిదండ్రులను ప్రజాపతి దేవుని పూజించాలి. ప్రతి సంవత్సరము ప్రయత్న పూర్వకముగా మహోత్సవము చేయాలి. కృత్యచింతామణియందిట్లా – బెల్లము, పాలు నువ్వులు వీనిని దానం చేయాలి. చేతికి కంకణములు (గ్రంథి) ధరించాలి. గుగ్గులు, వేప, ఆవాలు, దూర్వ గోరోచనం మొదలగు వానితో సూర్యునిగణేశుని పూజించి, మహర్షిని ఇట్లా ప్రార్థించాలి. ఓ చిరంజీవి! ముని! నీవెట్లా ఉన్నావో నేనట్లా ఉండాలి, అని. రూపవంతుణ్ణి, ధనవంతుణ్ణి, ఎప్పుడూ సంపద కలవాణ్ణి కావాలి. సప్తకల్పముల అంతము వరకూ జీవించే ఓ మార్కండేయ నీకు నమస్కారము. ఓ ముని! భగవాన్!ఆయురారోగ్యములు నాకు సిద్ధించేకొరకు నన్నను గ్రహించు. నీవెట్లా చిరంజీవివో,ఓద్విజ! మునులలో శ్రేష్ఠుడ. అట్లాగే నన్ను చిరంజీవిని చేయి, ఓ మునిశార్దూల, ఓ మార్కండేయ, మహాభాగ, సప్తకల్పముల అంతమువరకు జీవించేవాడ! (ఆయురారోగ్యముల సిద్ధి కొరకు మాకు వరమిమ్ము)తిలలు, బెల్లముతో కూడిన సగము దోసిలి యందు గల పాలను, మార్కండేయుని నుండి వరమును పొంది, ఆయుస్సు వృద్ధి కొరకు తాగుతున్నాను, అని పాలు తాగాలి. తిథి తత్వమందు స్కాందోక్తి ఇట్లా – నఖ, కేశముల ఖండనము, మైథునము, దారినడవటం, మాంసభోజనము, తగాదా

పడటం, హింస ఆచరించటం, జన్మదినమందు ఆచరించరాదు,అని. అక్కడే దీపికయందిట్లా – శని, మంగళవారములలో, ఎవని జన్మతిథియైనా వస్తే, మంచి నక్షత్రము, మంచి యోగము లేకపోతే వానికి అడుగడుగునా విఘ్నాలే వస్తాయి,అని. ఆతడు సర్వౌషధులతో స్నానాన్ని చేయాలి. గురు, దేవ, అగ్నుల పూజలు చేయాలి. వృద్ధమనువు ఇట్లా– చనిపోతే, పుడ్తే, సంక్రమణ మందు, శ్రాద్ధమందు. జన్మదినమందు, అట్లాగే అస్పృశ్యుని స్పృశించినా వేడినీళ్ళతో స్నానం చేయరాదు,అని. ఇక్కడ జన్మతిథి ఉదయకాలమందలిది కావాలి. కృత్యతత్త్వార్ణవమందిట్లా – యుగాదులు, వర్షవృద్ధి, పార్వతికి ప్రియమైన సప్తమి వీనిని సూర్యోదయ కాలికమైనవి గ్రహించాలి. ఇక్కడ రెండు తిథుల కలయిక అని భావించరాదు, అని వచనము. ఇంకా విశేషాన్ని నేను రచించిన శూద్ర ధర్మము నుండి తెలుసుకోండి.

**మూ॥ అథకటి సూత్రం** – ప్రయోగపారిజాతే బ్రహ్మే – ప్రతిసంవత్సరాంతర్క్షే వక్ష్యే న్నూణాం విధింపరం, దత్వాగోభూహిరణ్యాది తథా స్వర్ణాది నిర్మితం, బధ్నీయాత్ కటి సూత్రం చ వాసః సంగృహ్య నూతనం, దూర్వాంఽకురైరథాజ్యేన, చరుణా చ పినాకినం,ఆయుష్య హోమం కృత్వా చ తర్పయేత్పితృదేవతాః.

అను॥ ఇక కటి సూత్రము. ప్రయోగపారిజాతమందు బ్రాహ్మోక్తి ఇట్లా– ప్రతి సంవత్సరం చివరి నక్షత్రమందు నరులు చేయవలసిన విధిని ఉత్తమమైన దానిని చెబుతాను, గో,భూ, హిరణ్యాదులను ఇచ్చి (దానం),బంగారు మొదలగు వానితో తయారు చేసిన కటి సూత్రమును కట్టుకోవాలి. నూతన వస్త్రములు ధరించి దూర్వాంకురములతో, నేయితో, చరువుతో పినాకిని గూర్చి హోమం చేయాలి. ఆయుష్య హోమము చేయాలి. ఆ పిదప పితృ దేవతలకు తర్పణము చేయాలి. (మొలత్రాడు= కటిసూత్రము = ఒడ్డాణము)

**మూ॥ అథచౌలం** – ప్రయోగపారిజాతే షడ్ గురుశిష్యః – జాతాధికారాజ్జన్మాది తృతీయేఽబ్దేతు చౌలకం, అద్యేఽబ్దే కుర్వతేకేచిత్ పంచమేఽబ్దేద్వితీయకే, ఉపనీత్యా సహైవేతి వికల్పాః కులధర్మతః. బృహస్పతిః– తృతీయేఽబ్దే శిశోఃగర్భాత్ జన్మతో వా విశేషతః, పంచమే సప్తమేవాపి స్త్రియాః పుంసోఽపివా సమం. తత్రైవ నారదః – జన్మతస్తు తృతీయేఽబ్దే శ్రేష్ఠమిచ్ఛంతి పండితాః, పంచమే సప్తమేవాపి జన్మతో మధ్యమం భవేత్. అధమం గర్భతః స్యాత్తు నవమైకాదశేఽపివా, ఇతి. పారిజాతే బృహస్పతిః – ఉత్తరాయణగే సూర్యే విశేషాత్ సౌమ్యగోలకే, శుక్లపక్షే శుభం ప్రోక్తం కృష్ణపక్షే శుభేతరత్. అశుభోంత్య త్రిభాగః స్యాత్ కృష్ణపక్షే త్రిధాకృతే. తత్రైవ వసిష్ఠః–ద్విత్రి పంచమ సప్తమ్యామే కాదశ్యాం తథైవచ, దశమ్యాంచ త్రయోదశ్యాం కార్యం క్షౌరం విజానతా. నృసింహీయే – షష్ఠ్యష్టమీ చతుర్థీ చ నవమీ చ, చతుర్దశీ, ద్వాదశీ దర్శపూర్ణేద్వే ప్రతిపచ్చైవ నిందితాః. వసిష్ఠః – రవేరంగారకస్యైవ సూర్యపుత్రస్య చైవహి, నిందితా దివసా క్షౌరేశేషాః కార్యకరాః శుభాః. జ్యోతిర్నిబంధే బృహస్పతిః – పాప గ్రహాణాం వారాదౌ విప్రాణాం శుభదంరవేః, క్షత్రియాణాం క్షమాసూనోర్విట్ శూద్రాణాం శనౌ శుభం. హస్తాశ్వివిష్ణు పౌష్ణాశ్చ త్రివిష్ఠాదిత్య పుష్యభం, సౌమ్యచిత్రే నవక్షౌరే ఉత్తమా, నవతారకాః. త్రీణ్యుత్తరాణి వాయవ్యం రోహిణీం వారుణం తథా, క్షౌరేషణ్మధ్యమాః ప్రోక్తాః శేషాద్వాదశగర్హితాః. నిధనే జన్మ

**వైనాశే చంద్రమేఽష్టమే. విపత్కరే వధే క్షౌరం ప్రత్యరే చ వివర్జయేత్. అథ లగ్నశుద్ధి రన్యే చ యోగా జ్యోతిర్విద్భ్యోజ్ఞేయాః.అన్యే చ విశేషాః శ్మశ్రు కర్మ నిర్ణయే వక్ష్యంతే.**

అను॥ ఇక చౌలము. ప్రయోగ పారిజాతమందు షడ్ గురు శిష్యోక్తి - ఇట్లా- పుట్టటమనే అధికారంవల్ల పుట్టిన నాటినుండి మూడవ సంవత్సరంలో చౌలము. (ముండనము. పుట్టు వెంట్రుకలు) కొందరు మొదటి సంవత్సరమందే చేస్తారు. కొందరు ఐదవ సంవత్సరమందు, కొందరు రెండవ సంవత్సరమందు, ఉపనయనంతోపాటు అని వికల్పములు. ఇవి కుల ధర్మాన్ననుసరించి ఉన్నాయి. (గురు, శుక్రుల, బాల, వార్ధక్య, అస్తమయములు మలమాసము ఇవి తగనివి). బృహస్పతి ఇట్లా- శిశువు గర్భంలో పడ్డప్పటి నుండి లేదా విశేషించి శిశువు జన్మించినప్పటి నుండి మూడవ సంవత్సరంలో, ఐదవ లేదా ఏడవ సంవత్సరంలో స్త్రీకిగాని పురుషునకు గాని సమానంగానే చూడాకర్మ,అని. అక్కడే నారదుడిట్లా - పండితులు పుట్టుక నుండి మూడవ సంవత్సరంలో చౌలాన్ని శ్రేష్ఠ మన్నారు. జన్మ నుండి ఐదవ లేదా ఏడవ సంవత్సరంలో అనుట మధ్యమమన్నారు. గర్భము నుండి తొమ్మిదవ లేదా పదకొండవ సంవత్సరంలో ననుట అధమము,అని. పారిజాతమందు బృహస్పతిఇట్లా- సూర్యుడు ఉత్తరాయణ మందుండగా విశేషించి సౌమ్య గోళుడు కాగా (తీక్షణుడుకాక) శుక్లపక్షము ఐతే శుభమన్నారు. కృష్ణపక్షమైతే అశుభమన్నారు. కృష్ణపక్షాన్ని మూడు భాగాలు చేస్తే చివరి మూడవ భాగము అశుభమైంది,అని. అక్కడే వసిష్ఠోక్తి ఇట్లా-తెలిసికొని విదియ, తదియ, పంచమి, సప్తమి, ఏకాదశి, దశమి, త్రయోదశి తిథులలో క్షౌరం చేయాలి, అని. నృసింహీయమందిట్లా- షష్ఠి, అష్టమి, చతుర్థి, నవమి, చతుర్దశి, ద్వాదశి, అమా, పూర్ణిమలు, రెండు ప్రతిపదలు, ఇవి నిందితమైన తిథులు,అని. వసిష్ఠుడిట్లా - ఆది, మంగల, శనివారములు క్షౌరమందు నిందితమైనవి. మిగిలినవి శుభమైనవి, కార్యకరమైనవి,అని. జ్యోతిర్నిబంధమందు బృహస్పతి ఇట్లా - పాపగ్రహముల వారముల ఆదియందు ఆదివారము బ్రాహ్మణులకు శుభమైనది. క్షత్రియులకు మంగళవారము, విట్ శూద్రులకు శనివారము శుభమైనది,అని. హస్త,అశ్విని, శ్రవణం, రేవతి, ధనిష్ఠ, పునర్వసు, పుష్యమి, మృగశిర, చిత్త ఈ తొమ్మిది నక్షత్రములు తొలి క్షౌరమందు ఉత్తమమైనవి. మూడు ఉత్తరలు స్వాతి, రోహిణి, శతభిషం ఈ ఆరు నక్షత్రాలు క్షౌరకర్మయందు మధ్యమములు. మిగిలిన పన్నెండు నింద్యమైనవి. జన్మ నక్షత్రమందు క్షౌరము నిధనకారకము. చంద్రుడు అష్టమ మందుండగా క్షౌరమువల్ల వినాశము కల్గుతుంది. విపత్, ప్రత్యక్, నైధన తారలందు క్షౌరమును వదలాలి (తగదు). ఇక లగ్నశుద్ధి, ఇతర యోగములు జ్యౌతిష మెరిగిన వారి ద్వారా తెలుసుకోవాలి. ఇతర విశేషములను శ్మశ్రుకర్మ నిర్ణయమందు చెప్తాము.

**మూ॥ ఏతచ్చ శిశోర్మాతరిగర్భిణ్యాం న కార్యం తదాహ జ్యోతిర్నిబంధే మదన రత్నే చ వృద్ధగార్గ్యః- పుత్రచూడాకృతౌ మాతాయది సా గర్భిణీభవేత్, శస్త్రేణ మృత్యుమా ప్నోతి తస్మాత్ క్షౌరం వివర్జయేత్. అస్యాపవాద మాహ తత్రైవనారదః - సూనోర్మాతరి గర్భిణ్యాం చూడాకర్మ**

నకారయేత్, పంచాబ్దాత్ ప్రాగధోర్ధ్వంతు గర్భిణ్యా మపికారయేత్, యది గర్భవిపత్తి స్స్యాత్ శిశోర్వా మరణం యది, సహోపనీత్యా కుర్యాచ్చేత్, తదా దోషేన విద్యతే. బృహస్పతిః - గర్భిణ్యాం మాతరిశిశోః క్షౌరకర్మన కారయేత్, వ్రతాభిషేకేఋ ష్యే వంస్యాత్ కాలోవేదవ్రతేష్వపి. అభిషేకః = సమావర్తనం. గర్భిణ్యా మపి పంచమాస పర్యంతం న దోషః, ఇత్యుక్తం ముహూర్త దీపికాయాం గార్గేణ - పంచమ మాసా దూర్ధ్వం మాతుర్గర్భస్య జాయతే మృత్యుః,ఇతి. మదనరత్నే బృహస్పతిః - పుత్ర చూడాకృతౌ మాతా గర్భిణీయదిసా భవేత్, విపద్యతే గురుస్తత్ర దంపతీ శిశురక్షితః. గర్భే మాతుః కుమారస్యన కుర్యా చ్చౌలకర్మతు, పంచమాసాదధః కుర్యాత్ అత ఊర్ధ్వంన, కారయేత్. గర్గః - జ్వరరోగోత్పాదనం యస్య లగ్నం తస్య న కారయేత్, దోష నిర్గమనాత్ పశ్చాత్ స్వస్థో ధర్మం సమాచరేత్. లగ్నమితి మంగలోప లక్షణం. జ్యోతిర్గర్గః - వివాహోత్సవయజ్ఞేషు మాతాయది రజస్వలా, తదాసమృత్యుమాప్నోతి పంచమందివ సంవినా. వసిష్ఠః - యస్య మాంగలికం కార్యం తస్యమాతా రజస్వలా. అర్ధంతదేవ. తత్రైవ బృహస్పతిః - ప్రాప్తమభ్యుదశ్రాద్ధం పుత్ర సంస్కార కర్మణి, పత్నీరజస్వలాచేత్ స్యాన్నకుర్యాత్ తత్పితా తదా. పితేతి కర్తృ మాత్రోప లక్షణం. సంకటేతు వాక్యసారే ఉక్తం - అలాభే సుముహూర్తస్య రజోదోషో హ్యుపస్థితే, శ్రియం సంపూజ్య విధివత్ తతో మంగల మాచరేత్. ఏతచ్చమండనోత్తరం న కార్యం. న మండనాచ్చా పిహి ముండనంచ గోత్రే కతాయాం యది నాబ్ద భేదః, ఇతి మదనరత్నే వసిష్ఠోక్తేః. తత్రైవకాత్యాయనః - కులే ఋతు త్రయాదర్వాజ్ మండనా న్నతు ముండనం, ప్రవేశాన్నిర్గమోనేష్టో నకుర్యాన్మంగలత్రయం. తథా వృద్ధమనుః - ఏక మాతృజయోరేకవత్సరే పురుషస్త్రియోః న సమాన క్రియాంకుర్యాత్ మాతృభేదే విధీయతే.

అను॥ ఈ చౌలమును శిశువు తల్లి గర్భవతిగా ఉంటే ఆచరించరాదు. దానినే జ్యోతిర్నిబంధమందు, మదనరత్నమందును వృద్ధగార్గ్యుడు ఇట్లన్నాడు– పిల్లవాని చౌలకర్మ యందు ఆ తల్లి గర్భిణి ఐనట్లైతే శిశువు శస్త్రంతో మృత్యువును పొందుతుంది. కనుక క్షౌరమును విడచి పెట్టాలి, అని. దీనికి అనువాదమును అక్కడే నారదుడు ఇట్లా చెప్పాడు. శిశువు తల్లి గర్భవతి ఐతే చూడాకర్మ చేయరాదు, శిశువు ఐదు సంవత్సరాలలోపుదైతే. ఐదు సంవత్సరాల పై వయస్సుదైతే, గర్భవతిగా తల్లి ఉన్నా శిశువుకు చూడాకర్మ చేయవచ్చు. ఒకవేళ గర్భవిపత్తి ఐనా, శిశువు మరణించినా, ఉపనయనంతోపాటు చూడాకర్మ చేస్తే దోషంలేదు,అని. బృహస్పతి ఇట్లా– తల్లి గర్భవతిగా ఉండగా శిశువుకు క్షౌరకర్మ చేయరాదు. వ్రత అభిషేక మందు కూడా ఇట్లాగే. (స్నాన సమావర్తనమందు).వేద వ్రతములందు కూడా ఇట్లాగే క్షౌరకర్మ తగదు, అని. గర్భిణి ఐనా కూడా ఐదు నెలల వరకు దోషం లేదు, అని ముహూర్త దీపిక యందు గర్గుడిట్లా అన్నాడు. ఐదు మాసములపైన తల్లి గర్భవతి ఐతే మృత్యువు కల్గుతుంది, అని. మదనరత్నమందు బృహస్పతిఇట్లా– పుత్రుని చూడాకర్మ కాలమందు, తల్లి గర్భవతిగా ఉంటే సంవత్సరంలోపల గురువు, దంపతులు, శిశువు మరణిస్తారు. అని. తల్లి గర్భవతిగా ఉంటే కుమారునకు చౌలకర్మ చేయరాదు. ఐదు నెల లోపల ఐతే (గర్భం) చౌలకర్మ చేయొచ్చు. ఐదు నెలల పైబడిన గర్భమైతే చౌలకర్మ

తగదు. గర్గుడిట్లా – జ్వరమొచ్చిన వానికి శుభకార్యము చేయరాదు. దోషం పోయాక పిదప స్వస్థుడైనాక ధర్మ కార్య మాచరించాలి, అని.లగ్నమనగా మంగళకార్యము. జ్యోతిర్గర్గుడు ఇట్లా – వివాహ, ఉత్సవ, యజ్ఞములందు ఒకవేళ తల్లి రజస్వల ఐతే అప్పుడు ఆతడు ఐదవ రోజు లేకుండానే మృత్యువునందుతాడు,అని. వసిష్ఠుడు ఇట్లా– ఎవనికి మంగళ కార్యమున్నదో ఆతని తల్లి రజస్వల ఐతే ఐదవ రోజు లేకుండ ఆతడు మృత్యువునందుతాడు అని. (నాల్గు రోజుల్లో కార్యం ఆరంభించరాదు అని). అక్కడే బృహస్పతి ఇట్లా– పుత్ర సంస్కారకర్మ కాలమందు అభ్యుదయ శ్రాద్ధంవస్తే, తల్లి రజస్వల ఐతే ఆ శిశువు తండ్రి అప్పుడు ఆ శ్రాద్ధ మాచరించరాదు అని. పిత అనగకర్త అని అర్థం. సంకటమందు వాక్య సారంలో ఇట్లా చెప్పబడింది. – మరో మంచి ముహూర్తం లభించని పక్షంలో, అప్పుడే రజోదోషం సంభవిస్తే విధి ప్రకారం శ్రీని పూజించి, ఆ పిదప మంగల మాచరించాలి, అని. (నాంది ఐ చౌలం కాకముందు) (నాల్గవరోజైనా). దీనిని వివాహం తర్వాత చేయరాదు. మదన రత్నంలో వసిష్ఠోక్తి ఇట్లా – ఒకే గోత్రమందు సంవత్సర భేదం లేకపోతే వివాహం తరువాత ముండనము (ఒకే సంవత్సరంలో) చేయరాదు, అని. అక్కడే కాత్యాయనుడు ఇట్లా – కులమందు మూడు ఋతువుల కన్న ముందు మండనం తర్వాత ముండనముండదు. ప్రవేశం తర్వాత నిర్గమము ఇష్టం కాదు. మంగళత్రయము ఆచరించరాదు, అని. అట్లాగే వృద్ధమనువు ఇట్లా – ఒక్క తల్లికి కల్గిన స్త్రీ పురుషులకు ఒకే సంవత్సరమందు సమాన క్రియలు చేయరాదు. తల్లులు వేరైతే చేయొచ్చు అని.

**మూ॥ ఆశౌచేతు సంగ్రహే – సంకటే సమనుప్రాప్తే సూతకే సముపాగతే, కూష్మాండీభిః ఘృతం హుత్వాగాం చదద్యాత్ పయస్వినీం. చూడోపనయనే ద్వాహ ప్రతిష్ఠాదికమాచరేత్, ఇతి. జ్యోతిర్నిబంధే– షష్ఠేఽబ్దే షోడశే వర్షే వివాహాబ్దే తథైవచ, అంతర్వత్న్యాం చ జాయాయాం నేష్యతే ముండనంక్వచిత్. అన్యోఽపివిశేషో వివాహ ప్రకరణే వక్ష్యతే. దీపికాయాం – న చూడాజన్మభాగ్నేయ దారుణేషు శనౌకుజే, ప్రతి పద్ భద్ర రిక్తాసు విద్యాగంభస్తు పంచమే. ప్రయోగరత్నే – మధ్యే శిరసి చూడాస్యాత్ వసిష్ఠానాం, తుదక్షిణే, ఉభయోః పార్శ్వయోరత్రికశ్యపానాం శిఖామతా, మాధవీయే ఽప్యేవం. ఆపస్తంబస్త్వాహ – తూష్ణీం కేశాన్వినీయయథర్షి శిఖానిదధాతి, యథర్షి ప్రవర, సంఖ్యయా. తాసాం మధ్య శిఖా వర్జం ఉపనయనే వపనం కార్యం. ప్రతిదిశం ప్రవపతి, ఇత్యుపనయనే తే నైవోక్తేః. రిక్తోవా ఏషోఽనపిహితో యన్ముండస్తస్మైతదపి ధానం యచ్ఛిఖా, ఇతి శ్రుతేః విశిఖోవ్యుపవీతశ్చయత్కరోతి న సత్కృతం, ఇతి నిషేధాచ్చ. సత్రేతువపనాత్ సశిఖం వపనం ఇతి సుదర్శనభాష్యే ఉక్తం. యత్తు – కుమారా విశిఖా ఇవ, ఇతి లింగం తచ్ఛందోగపరం. అపరార్కే మదనరత్నే చ లౌగాక్షిః – దక్షిణతః కముంజా, వసిష్ఠానాముభయుతోఽత్రికశ్యపానాం ముండా భృగవః పంచ చూడా ఆంగిరసోవాజిమేకే మంగలార్థం శిఖినోఽన్యే యథా కులధర్మంవా, ఇతి. కముంజా= శిఖా. వాజిః = కేశపంక్తిః. స్మృతిదర్పణే – ఏకాశిఖా దక్షిణతో వసిష్ఠ గోత్రస్య పంచాంగిరసో భృగోఽస్తు, నైకాశిఖా కశ్యప గోత్రజానాం శిఖో భయత్రాపి, యథాకులంవా. ఏతచ్ఛూద్రాతిరిక్త విషయం. శూద్రస్యానియతాః కేశవేషాః, ఇతి వసిష్ఠోక్తేః.**

అను॥ ఆశౌచమందైతే సంగ్రహమందిట్లా – సంకటం వస్తే అట్లాగే సూతకం వస్తే (జాత,మృత)కూష్మాండకమంత్రములతో నేయితో హోమం చేసి పాలిచ్చే ఆవును దానం చేయాలి ఆ పిదప చూడాకర్మ, ఉపనయన, వివాహ, దేవతా ప్రతిష్ఠ మొదలగునవి ఆచరించాలి, అని జ్యోతిర్నిబంధమందిట్లా – ఆరవ సంవత్సరమందు, పదహారవ సంవత్సర మందు అట్లాగే వివాహ సంవత్సరమందు, భార్య గర్భవతి ఐనప్పుడు ముండన సంస్కారము తగదు, అని. ఇతర విశేషం కూడా వివాహ ప్రకరణంలో చెప్తాము. దీపిక యందిట్లా – జన్మ నక్షత్రము, కృత్తిక నక్షత్రము వీనియందు దారుణ నక్షత్రములందు (మూల, జ్యేష్ఠ, ఆశ్లేష, ఆర్ద్ర) శని, మంగళవారములందు ప్రతిపద,భద్ర, రిక్త తిథులందు చూడాకర్మ తగదు. విద్యారంభమైతే ఐదవ సంవత్సరంలో చేయాలి, అని. ప్రయోగరత్నమందైతే ఇట్లా – వసిష్ఠ గోత్రులకు చూడ(శిఖ) శిరసు మధ్య యందలి శిఖకు దక్షిణ మందు ఉంటుంది. అత్రి కశ్యపులకు శిఖ రెండు పార్శ్వములందు ఉంటుంది, అని. మాధవీయ మందు కూడా ఇట్లాగే ఉంది. ఆపస్తంబుడు ఇట్లన్నాడు – మౌనంగా వెంట్రుకలను క్షౌరం చేయించుకొని ఋషుల ప్రకారము (ప్రవర ననుసరించి)శిఖను ఉంచుకోవాలి. వాటిలో మధ్య శిఖను వదలి ఉపనయనంలో క్షౌరం చేయాలి ఉపనయనంలో ఆతడే చెప్పాడు – ప్రతిదిక్కున (నాల్గు వైపుల) (మధ్యశిఖను వదిలాక) క్షౌరం చేయించాలి, అని. శ్రుతియందిట్లా– ఎవని శిఖరిక్తమో (శూన్యమో) కప్పబడిలేదో, దేన్ని ముండనమంటారో అట్టివాడు అని. శిఖ యజ్ఞోపవీతములు లేకుండ ఏ కర్మ చేస్తాడో అది సత్ కర్మ కాదు. అని దాన్ని నిషేధించారు. సత్రయాగమందైతే – వచన సామర్థ్యాన్ని బట్టి శిఖతో పాటు క్షౌరము అని సుదర్శన భాష్య మందు చెప్పారు. శిఖాహీనులు కుమారుల వంటివారు అని ఏదిఅన్నారో, అని ఏసాదృశ్యముందో అది సామవేది శాఖీయులను గూర్చినది. అపరార్కమందు, మదనరత్న మందు లౌగాక్షి వచనమిట్లా – దక్షిణ దిక్కు శిఖ వసిష్ఠులకు అత్రి కశ్యపులకు రెండు వైపుల పార్శ్వము లందు, భృగు గోత్రీయులకు ముండనము, ఆంగిరసులు పంచచూడులు, కొందరు మంగలము కొరకు కేశపంక్తిని ఉంచుకొంటారు. ఇతరులు శిఖ గలవారు, లేదా కులధర్మాన్న నుసరించి చేస్తారు, అని. స్మృతిదర్పణమందిట్లా – వసిష్ఠ గోత్రునకు దక్షిణ దిక్కులో ఒక శిఖ, ఆంగిరసులకు ఐదు శిఖలు, భృగువులకు ఒక్కటి కూడా లేదు. కశ్యప గోత్రజులకు రెండు వైపుల శిఖ లేదా కులధర్మాన్ననుసరించి, అని. ఇది శూద్రులకన్న ఇతరులైన వారి విషయము. శూద్రులకు కేశ వేషముల నియమము లేదని వసిష్ఠోక్తి.

మూ ॥ యత్తుపాద్మే – నశిఖీనోపవీతీస్యాత్ నోచ్చరేత్ సంస్కృతాంగిరం, ఇతి శూద్రము పక్రమ్యోక్తం. తదసత్ శూద్రస్యేతి కేచిత్. వికల్ప ఇతి తుయుక్తం. అత ఏవ హారీత: – స్త్రీశూద్రౌతు శిఖాం ఛిత్వాక్రోధాద్వైరాగ్యతోఽపివా, ప్రాజా పత్యం ప్రకుర్యాతాం, నిష్కృతిర్నాన్యథా భవేత్. ఏతత్పరి గ్రహపక్షే. అత్రదేశభేదాత్ వ్యవస్థేతిదిక్. జ్యోతిర్నిబంధే – నర్మదోత్తరదేశే తు సింహస్థే దేవమంత్రిణి శుభకర్మన కుర్వీత నిషేధోనాస్తి దక్షిణే.

అను॥ పాద్మమందు - శిఖకాని యజ్ఞోపవీతం కాని శూద్రునకు లేదు, సంస్కృతి వాణిని ఉచ్చరించరాదు అని చెప్పినమాట శూద్రుని దృష్టిలో పెట్టుకొని చెప్పినది. అది అసత్ శూద్రుని విషయమని కొందరన్నారు. వికల్పమనునది తగిన మాట. అందువల్లనే హారీతుడిట్లా - స్త్రీ శూద్రులు క్రోధంవల్ల గాని వైరాగ్యంవల్ల గాని శిఖను కోసుకున్నట్లైతే ప్రాజాపత్యవ్రత మాచరించాలి. మరో విధంగా నిష్కృతిలేదు. ఇది దానం తీసుకున్న పక్షంలో. ఇక్కడ దేశభేదాన్ననుసరించి నిర్ణయము, అని ఇక చాలు. జ్యోతిర్నిబంధమందిట్లా - బృహస్పతి సింహరాశియందుండగా నర్మదకు ఉత్తరదేశమందైతే శుభకర్మ చేయరాదు. దక్షిణమందైతే ఈ నిషేధము లేదు,అని.

**మూ॥ అత్ర (ముండన సంస్కారాదౌ భోజనే విచారః)** భోజనే ప్రాయశ్చిత్త ముక్తం పరాశర మాధవీయే-నివృత్తే చూడహోమేతు ప్రాక్ నామకరణాత్తథా, చరేత్సాం తపనం భుక్త్వా **జాతకర్మణి చైవహి, అతో౽న్యేషుతు** సంస్కారే షూపవాసేన శుద్ధ్యతి. **ఏతే సంస్కారాః స్త్రీణా మమంత్రకాః కార్యాః. హోమస్తు సమంత్రక ఇతి ప్రయోగ పారిజాతే. ఆశ్వలాయనో౽పి-హోమకృత్యంతు పుంవత్స్యాత్ స్త్రీణాం చూడాకృతావపి, ఇతి. మనురపి - అమంత్రికాతు కార్యేయం స్త్రీణా మావృదశేషతః, ఇతి. హోమో౽ప్య మంత్రక ఇత్యేకే. సంస్కారాః స్త్రీణాం అహోమకాః తూష్ణీంస్యుః, ఇతి స్మృత్యర్థ సారే. హోమోనేతి వృత్తికృత్.**

అను॥ ఇక్కడ (ముండన సంస్కారాదులందు భోజనవిచారము) భోజన విషయంలో పరాశర మాధవీయమందు ప్రాయశ్చిత్తం చెప్పబడింది ఇట్లా - చూడహోమం అయ్యాక, అట్లాగే నామకరణం కన్నముందు జాతకర్మయందు భోజనం చేస్తే సాంతపనప్రాయశ్చిత్త మాచరించాలి,అని. అందువల్ల ఇతరసంస్కారములందైతే ఉపవాసంతో శుద్ధి ఏర్పడుతుంది. ఈ సంస్కారములు స్త్రీలకైతే మంత్రములు లేకుండా చేయాలి. హోమమైతే మంత్రాలతోనే చేయాలని ప్రయోగ పారిజాతమందు ఉంది. ఆశ్వలాయనుడు కూడా - హోమ కృత్యమైతే స్త్రీలకు చూడా కృతియందు కూడా పుం శిశువునకు లాగానే ఉంటుంది, అని. మనువుకూడా - స్త్రీలకు ఈ సంస్కారములన్ని మంత్రములు లేకుండానే చేయాలి,అని. హోమం కూడా మంత్రం లేకుండానే అని కొందరన్నారు. స్త్రీలకు సంస్కారములు హోమములు లేకుండా (అమంత్రం) మౌనంగానే చేయాలని స్మృత్యర్థ సారమందన్నారు. వృత్తికారుడైతే - హోమంలేదు అని అన్నాడు.(సాంతపనమనగా - మూడు రోజులు పగటిపూట, మూడు రోజులు రాత్రిపూట భుజించి మూడు రోజులు అయాచిత పదార్థముల భుజించి పిదప మూడు దినములు ఏమీ తినకుండా ఉపవాసముండెడు వ్రతము.)

**మూ ॥ అథవిద్యారంభః.** మదనరత్నే నృసింహః - **అక్షరస్వీకృతిం కుర్యాత్ ప్రాప్తే పంచమహాయనే, ఉత్తరాయణగే సూర్యే కుంభమాసం వివర్జయేత్. దీపికాయాం వర్షే పర్జన్యతే కాలే షష్ఠీం రిక్తాం శనింకుజం, అనధ్యాయాన్వితానత్వా దేవంగ్రంథ కృతం గురుం. శ్రీధరః - హస్తాదిత్య సమీరమిత్ర పురుజిత్, పౌష్ణాశ్విచిత్రాచ్యుతే, ష్వారాక్యంశూదినోదయాది రహితేరా**

శాస్త్రరేచోభయే, పక్షేపూర్ణ నిశాకరే ప్రతిపదం రిక్తాం విహాయాష్టమీం షష్ఠీమష్టమశుద్ధభాజి భవనే ప్రోక్తాక్షరేస్వీకృతిః. విష్ణుధర్మోత్తరే – పూజయిత్వా హరిం లక్ష్మీం తథాదేవీం సరస్వతీం, స్వవిద్యాం (స్వవేదం) సూత్ర కారాంశ్చ స్వాంవిద్యాం చ విశేషతః, ఏతేషామేవదేవానాం నామ్నాతు జుహుయాత్ ఘృతం, దక్షిణాభిః ద్విజేంద్రాణాం కర్తవ్యం చాత్రపూజనం ఇతి.

అను॥ ఇక విద్యారంభము. మదనరత్నమందు నృసింహుడిట్లా – ఐదవ సంవత్సరం వచ్చాక అక్షరాభ్యాసం చేయాలి. సూర్యుడు ఉత్తరాయణమందుండగా, కుంభమాసం వదలి ఇతర మాసాల్లో అక్షరాభ్యాసం చేయాలి. (గురువు తూర్పుముఖంగా శిష్యుడు పడమటి ముఖంగా ఉండాలి). దీపికయందిట్లా – సంవత్సరంలో వర్ష ఋతువు యందు షష్ఠి, రిక్త, అనధ్యాయతిథులు, శని, మంగళవారాలు వీనిని వదలి దేవుని, గ్రంథకారుని గురువును నమస్కరించి విద్యారంభం చేయాలి,అని. శ్రీధరుడిట్లా – హస్త, పునర్వసు, స్వాతి, అనురాధ, జ్యేష్ఠ, రేవతి, అశ్విని, చిత్ర, శ్రవణ ఈ నక్షత్రములందు మంగల, శని వీరి అంశ (నవాంశ), దిన, ఉదయాది రహితకాలమందు, స్థిర,ద్విస్వభావరాశియందు (లగ్నం), శుక్లపక్షమందు, ప్రతిపద, రిక్త, అష్టమి, షష్ఠి తిథులను వదలి అష్టమ శుద్ధియందు (లగ్నం), అక్షరారంభము చెప్పబడింది, అని. విష్ణుధర్మోత్తరమందిట్లా – హరిని, లక్ష్మిని, సర్వస్వతిదేవిని పూజించి స్వవేదమును, సూత్రకారులను విశేషించి తమ విద్యను పూజించి, ఈ దేవతల నామంతోనే, నేయితో హోమంచేయాలి. బ్రాహ్మణ శ్రేష్ఠుల పూజను చేసి దక్షిణ లివ్వాలి,అని.

**మూ॥ అథధనుర్విద్యా. దీపికాయాం – అదితి** గురుయమార్క స్వాతిచిత్రాగ్ని పిత్ర్య ధ్రువహరి వసుమూలేష్విందు భాగాంత్య భేషు, శని శశి బుధవారే విష్ణు బోధే విపౌషేసు సమయ తిథి యోగే చాపవిద్యా ప్రదానం.

**అను॥** ఇక ధనుర్విద్య. దీపిక యందిట్లా – పునర్వసు, పుష్యమి, భరణి, హస్త, స్వాతి, చిత్ర, కృత్తిక, మఘ, ధ్రువగణ (మూడుత్తరలు, రోహిణి), శ్రవణ, ధనిష్ఠ, మూల ఈ నక్షత్రములందు మృగశిర, పుబ్బ, రేవతులందు శని సోమబుధవారములందు, విష్ణువు మెలకువతో ఉండగా పౌష మాసంవదలి, మంచి సమయం, తిథుల యోగమందు చాప విద్యనివ్వాలి, అని.

**మూ॥ అథానుపవీతస్య విశేష గౌతమః** – ప్రాగుపనయనాత్ కామచారవాద భక్షాః ఇతి. భక్షణం లశునాదేరపీతిహరదత్తః. అపరార్కే వృద్ధశాతాతపః – శిశోర భ్యుక్షణం ప్రోక్తం బాలస్యాచమనం స్మృతం, రజస్వలాదిసంస్పర్శే స్నానమేవ కుమారకే. ప్రాక్ చూడాకరణాద్బాలః ప్రాగన్నప్రాశనాచ్ఛిశుః, కుమారకస్తు విజ్ఞేయో యావన్మౌంజీ నిబంధనం. ఆపస్తంబోఽపి– అన్నప్రాశనాత్ప్రయతో భవత్యా సంవత్సరాదిత్యేకే, ఇతి. గౌతమోఽపి– నతదుపస్పర్శనా దాశౌచం. తస్యానుపవీతస్య చాండాలాది స్పృష్టస్యాపి స్పర్శాన్నస్నానం. ఇదం చ షష్ఠ వర్షా త్ప్రాక్ ఊర్ధ్వంతు స్నానం భవత్యేవ. బాలస్య పంచమాద్వర్షాత్ రక్షార్థం శౌచమాచరేత్, ఇతి స్మృతేః. కామచారా దికేప్యేవం. ఊనైకాదశవర్షస్య పంచవర్షాత్పరస్యచ, చరేద్గురుః సుహృచ్చైవ ప్రాయశ్చిత్తం విశుద్ధయే. అతోబాలతరస్యాస్య నాపరాధో న పాతకం,ఇతి స్మృతేరితి హరదత్తః. స్మృత్యర్థసారేఽప్యేవం.

అను॥ ఇక అనుపనీతునకు విశేషమును గౌతముడిట్లా - ఉపనయనంకన్న ముందు కామచారము, కామవాదము, కామభక్షణము,అని. భక్షణమనగా **లశునాదులు** కూడా (వెల్లుల్లి) అని హరదత్తుడన్నాడు. అపరార్కమందు వృద్ధశాతాతపుని మాట ఇట్లా - శిశువునకు నీరు చల్లటం, బాలునకు ఆచమనము, కుమారునకు రజస్వలాది స్పర్శఐతే స్నానమే అని చెప్పబడింది. చూడాకరణముకన్న ముందు దశ బాల్యము అన్నప్రాశనకన్న ముందు దశ శైశవము. ఉపనయనం కానంతవరకు, కుమారకుడనబడుతాడు. ఆపస్తంబుడు కూడా - అన్న ప్రాశనవల్ల శుచి ఔతాడు, సంవత్సరము నుండి పవిత్రుడౌతాడు అని ఇంకొందరు అన్నారు, అని. గౌతముడు కూడా - ఆమెను స్పృశించినందువల్ల ఆశౌచం రాదు. ఆ అనుపనీతుడు చాండాలాదులను ముట్టుకున్నా స్పర్శతో స్నానం అవసరంలేదు,అని. ఇది ఆరుసంవత్సరాల వయసు కన్నముందైతే. ఆరు సంవత్సరాల వయసు తరువాత ఐతే స్నానం చేయాల్సిందే. స్మృతియందిట్లా - బాలుడు ఐదేండ్ల వయసు తరువాత తన రక్షణ కొరకు పవిత్రతను ఆచరించాలి, బాలుదు, అని. కామాచారాదులందు కూడా ఇట్లాగే. ఐదు సంవత్సరాల తరువాత పదకొండు సంవత్సరాలలోపు వయసు వానికి బాలకుని విశుద్ధి కొరకు గురువు స్నేహితుడు ప్రాయశ్చిత్త మాచరించాలి.అందువల్ల చాలా చిన్నవాడైన (బాలతర) ఈతనికి అపరాధం లేదు. పాతకం లేదు అని స్మృతియందు అని హరదత్తు దన్నాడు. స్మృత్యర్థసారమందు కూడా ఇట్లాగే అని.

**మూ॥ అథ ఉపనయనం.** ఆశ్వలాయనః - గర్భాష్టమేఽష్టమేవాబ్దే పంచమే సప్తమేఽపివా, ద్విజత్వం ప్రాప్నుయాద్విప్రోవర్షేత్వేకాదశే నృపః.మనుః- బ్రహ్మవర్చస కామస్య కార్యం విప్రస్య పంచమే, రాజ్ఞోబలార్థినః షష్ఠే వైశ్యస్యార్థార్థినోఽష్టమే. విష్ణుః - షష్ఠేతు ధనకామస్య విద్యాకామస్య సప్తమే, అష్టమే సర్వకామస్య నవమే కాంతిమిచ్ఛతః. ఆపస్తంబః - గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత, బహువచనం గర్భషష్ఠ గర్భసప్తమయోః ప్రాప్త్యర్థమితి సుదర్శనభాష్యే. కేచిత్తు విప్రస్య షష్ఠం న మన్యంతే. ఆపస్తంబః - అథకామ్యాని, సప్తమే బ్రహ్మవర్చసకామం, అష్టమే ఆయుష్కామం, నవమే తేజస్కామం, దశమే అన్నాద్య కామం, ఏకాదశే ఇంద్రియ కామం, ద్వాదశే పశుకామం ఉపనయేత్. గౌణకాలమాహమనుః - **ఆషోడశాత్** బ్రాహ్మణస్య సావిత్రీనాతి వర్తతే, ఆద్వావింశత్ క్షత్రబంధోః ఆచతుర్వింశతేః విశః. జ్యోతిర్నిబంధే అగ్రజాబాహుజా వైశ్యాః స్వావధే రూర్ధ్వ మబ్దతః, అకృతోపనయాః సర్వే వృషలా ఏవతే స్మృతాః. గర్గః - విప్రంవసంతే క్షితిపం నిదాఘే వైశ్యం ఘనాంతే వ్రతినం విదధ్యాత్, మాఘాది శుక్రాంతిక పంచమాసాః సాధారణా వా సకల ద్విజానాం. హేమాద్రౌ జ్యోతిషే-మాఘాదిషు చ మాసేషు మౌంజీ పంచసుశస్యతే. కాలాదర్శే వృద్ధగార్గ్యః - మాఘాదిమాసషట్కేతు మేఖలా బంధనం మతం, చూడాకరణ మన్నం చ శ్రావణా దౌవివర్జయేత్. మైత్రేయ సూత్రేఽపి - వసంతో గ్రీష్మః శరత్ ఇత్యృతవో వర్ణానుపూర్వేణ మాఘాదిషణ్మాసావా, సర్వవర్ణానా మేతదుదగయన మనయోర్వికల్పః, ఇతి.

అను॥ ఇక ఉపనయనము. ఆశ్వలాయనుడిట్లా - గర్భం నుండి ఎనిమిదవ సంవత్సరంలో, లేదా ఎనిమిదవ సంవత్సరంలో లేదా ఐదవ, ఏడవ సంవత్సరంలోనో

విప్రుడు ద్విజత్వాన్ని పొందాలి (ఉపనయనం చేయాలి). పదకొండవ సంవత్సరంలో క్షత్రియునకు ఉపనయనము,అని. మనువు ఇట్లా- బ్రహ్మవర్చసకాముడైన విప్రునకు ఐదవ ఏట ఉపనయనం చేయాలి. బలము కోరే రాజునకు ఆరవ సంవత్సరంలో, అర్థము కోరే వైశ్యునకు ఎనిమిదవ ఏట ఉపనయనము, అని. విష్ణువు ఇట్లా – ఆరవ ఏట ధన కామునకు సప్తమవర్షమందు విద్యాకామునకు, అన్నింటిని కోరేవానికి అష్టమమందు, నవమ వర్షమందు కాంతిని కోరేవానికి ఉపనయనం చేయాలి,అని. ఆపస్తంబుడిట్లా – గర్భం నుండి ఎనిమిదవ ఏట బ్రాహ్మణునకు ఉపనయనం చేయాలి,అని. అష్టమేషు అని బహువచనంవల్ల గర్భ షష్ఠము, గర్భసప్తమములు కూడా సిద్ధించే కొరకు అని సుదర్శన భాష్యమందు చెప్పారు. కొందరు విప్రునకు షష్ఠ వర్ష ఉపనయనాన్ని అంగీకరించరు. ఆపస్తంబుడిట్లా – ఇక కామ్యములు. సప్తమమందు బ్రహ్మవర్చసకామునకు, అష్టమమందు ఆయుష్కామునకు, నవమ మందు తేజస్కామునకు, దశమ మందు అన్నాదులకామునకు, ఇంద్రియ కామన కొరకు ఏకాదశ మందు, పశుకామన కొరకు పన్నెండవ వర్షంలో ఉపనయనం చేయాలి,అని. మనువు గౌణకాలాన్ని ఇట్లా చెప్పాడు – పదహారు సంవత్సరాల వరకు బ్రాహ్మణునకు, క్షత్రియునకు ఇరువది రెండు సంవత్సరాల వరకు, ఇరువది నాలుగు సంవత్సరాల వరకు వైశ్యునకు సావిత్రీ గ్రహణము చేయతగును (ఉపనయనం)దాటరాదు, అని. (పదిహేను నిండేలోపు అని నియమం. పదహారు విడిచి) జ్యోతిర్నిబంధమందిట్లా- బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు వీరు తమ తమ అవధి సంవత్సరాలకన్న తర్వాత కూడా ఉపనయనం కాకుండా ఉంటే వారంతా వృషలులే (శూద్రులే) అనబడుతారు;అని గర్గుడిట్లా- బ్రాహ్మణునకు వసంతమందు, క్షత్రియునకు గ్రీష్మమందు, వైశ్యునకు శరదృుతువు నందు ఉపనయన సంస్కారం చేయాలి. మాఘం మొదలు జ్యేష్ఠం వరకు ఐదు నెలలు ద్విజులందరికి (బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులు) సాధారణమైనవి, అని. హేమాద్రి యందు జ్యోతిషోక్తి ఇట్లా – మాఘాది పంచమాసములలో మౌంజీ ప్రశస్తమైంది, అని. కాలాదర్శమందు వృద్ధగార్గ్యుడిట్లా – మాఘం మొదలుగా ఆరు మాసాలలో మేఖలా బంధనము ఇష్టమైనది. చూడాకరణము, అన్న ప్రాశనము శ్రావణాదులలో చేయరాదు, అని. మైత్రేయ సూత్రమందు కూడా ఇట్లా – వసంత, గ్రీష్మ, శరత్ అనే ఋతువులు వర్ణక్రమంగా (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య) లేదా మాఘాది ఆరు మాసాలు కాని అన్ని వర్ణముల వారికి, ఇది ఉత్తరాయణంలో అని చెప్పబడ్డ వారికి, ఆచరించాలి. వీనిలో వికల్పముంది, అని.

**మూ॥ అత్రేదం తత్త్వం – నాత్రవసంతేనోత్తరాయణస్యసంకోచః శ్రాద్ధే దర్శస్య అపరాహ్ణ విధినేవాధానే వసంతాదేః కృత్తికాదినేవసాయం ప్రాతర్విధినా యావజ్జీవ విధేరివయుక్తః. అద్యయోః పరస్పర వ్యభిచారాన్నియమః, అంత్యేనిమిత్తే సాంగ కర్మోక్తేః కాలాపేక్షా, ఇహతూత్తరాయణం వినా వసంతస్యాభావాన్న నియమః న వా నిమిత్తత్వం న చ ఏకం వృణీతే, ఇతి వదవయుత్యాను వాదః తద్వత్ వాక్యభేదా పరిహారాత్. ఉత్తరాయణ విధి వైయర్థ్యాత్వను కల్ప్యో౽యమితి. మాఘ ఆదిర్యేషాం పంచానాం, ఏవంషట్, పారిజాతే బృహస్పతిః – ఝష చాపకులీరస్థోజీవో౽**

ప్యశుభగోచరః, అతి శోభనతాం దద్యాత్ వివాహోపనయాదిషు. వృత్తశతే- న జన్మధిష్ణ్యే న చ జన్మ మాసే న జన్మ కాలీన దినే విదధ్యాత్, జ్యేష్ఠే నమాసి ప్రథమస్యసూనోః తథా సుతాయా అపి మంగలాని.

అను॥ ఇక్కడ ఇదితత్వము - వసంతముతో ఉత్తరాయణమునకు ఇక్కడ సంకోచము లేదు. దర్శమునకు శ్రాద్ధమందు అపరాహ్ణవిధివలె, ఆధానమందు వసంతాదులకు కృత్తి కాదులచేతవలె, సాయంప్రాతర్విధితో యావజ్జీవ విధికివలె ఇక్కడ తగును. మొదటి రెంటిలో (పరస్పర వ్యభిచారం వల్ల నియమ (విచారంవల్ల) ముంది. చివరి దానిలో నిమిత్తమందు సాంగకర్మ చెప్పబడింది కనుక కాలాపేక్ష కాని ఇక్కడ ఉత్తరాయణం లేకుండా వసంతం లేదు కనుక నియమం కాదు, నిమిత్తత్వము లేదు. ఒకదానిని వరించాలి, అనేదానివలె అవయుత్యానువాదము దానివలె వాక్యభేదము తొలగించరానిది అని కూడా కాదు. ఉత్తరాయణ విధి వైయర్థ్యం వల్లనైతే ఇది అనుకల్పమని. మాఘము వేటికి ఐదిటికి మొదలో. ఇట్లా ఆరు. పారిజాతమందు బృహస్పతి ఇట్లా - మీన, ధనుష్, కర్కటములందు గురువు ఉండి అశుభగోచరుడైనా వివాహ ఉపనయనాదులందు మిక్కిలి శుభదాయకుడౌతాడు, అని. వృత్తశతమందిట్లా - జన్మ నక్షత్రమందు, జన్మమాసమందు, జన్మ కాలీనదినమందు, పెద్దకొడుక్కు జ్యేష్ఠమాసమందు, అట్లాగే పెద్ద కూతురుకు కూడా మంగళములు చేయరాదు, అని.

**మూ॥ రాజమార్తండః - జాతందినం దూషయతే** వసిష్ఠో హ్యష్టౌ చగర్గో నియతం, దశాత్రిః, జాతస్య పక్షం కిల భాగురిశ్చ శేషాః ప్రశస్తాః ఖలు జన్మమాసి. జన్మమాసేతిథౌభేచ విపరీతదలేసతి, కార్యం మంగలమిత్యాహుః గర్గ భార్గవ శౌనకాః జన్మమాస నిషేధేఽపి దినానిదశ వర్జయేత్, ఆరభ్యజన్మదివసాత్ శుభాఃస్యుఃతిథయోఽపరే. గ్రంథాంతరే-వ్రతే జన్మత్రిభారిస్థోజీవోఽపీష్టోఽర్చనాత్సకృత్, శుభాతికాలే తుర్యాష్ట వ్యయస్థో ద్విగుణార్చనాత్. శుద్ధిర్నైవ గురోర్యస్య వర్షే ప్రాప్తేఽష్టమే యది, చైత్రే మీనగతే భానౌ తస్యోపనయనం శుభం. జన్మభాదష్టమేసింహే నీచే వా శత్రు భేగురౌ, మౌంజీ బంధః శుభః ప్రోక్తః చైత్రేమీనగతేరవౌ. నారదః - బాలస్య బలహీనోఽపి శాంత్యా జీవో బలప్రదః,యథోక్త వత్సరే కార్యం అనూక్తే చోపనాయనం. శాంతిశ్చాగ్రే వక్ష్యతే. **జ్యోతిర్నిబంధేనృసింహః** - తృతీయా పంచమీ షష్ఠీ ద్వితీయా చాపి సప్తమీ, ఉభయోః పక్షయోశ్చైవ విశేషేణ సుపూజితాః. ధర్మకామౌసితే పక్షే కృష్ణే చ ప్రథమా తథా, శుక్లత్రయోదశీం కేచిత్ ఇచ్ఛంతి మునయస్తథా. టోడరానందే వసిష్ఠః - నైమిత్తిక మనధ్యాయం కృష్ణే చ ప్రతిపద్దినం, మేఖలాబంధనే శస్తం చౌలే వేదవ్రతేష్వపి. ప్రశస్తా ప్రతిపత్ కృష్ణే న పూర్వాపరసంయుతా. ఏతదతీత కాల స్యార్తస్య వటోరుపనయన విషయం. ప్రశస్తాప్రతిపత్కృష్ణే కదాచిచ్ఛుభగేవిధౌ, చంద్రంబల యుతేలగ్నే వర్ణానా మతిలంఘనే, ఇతివ్యాసోక్తేరిత్యాహుః. ఏవం సప్తమ్యపి తస్యాగల గ్రహత్వోక్తేః. బృహస్పతిః - శుక్లపక్షః శుభః ప్రోక్తః కృష్ణశ్చాంత్యత్రికంవినా. తథా- మిథునే సంస్థితేభానౌ జ్యేష్ఠమాసో న దోషకృత్.

అను॥ రాజమార్తండుడు ఇట్లా – వసిష్ఠుడు పుట్టిన రోజు మాత్రమే తగదంటాడు. గర్గుడు ఎనిమిదవనాటి వరకు తగని రోజులంటాడు. అత్రిపుట్టిన దినమునుండి పది రోజులు తగవంటాడు. భాగురి పదిహేను రోజులవరకు తగవంటాడు. జన్మ మాసమందు మిగిలిన రోజులు ప్రశస్తమైనవి, అని. జన్మమాసమందు పుట్టిన పక్షముకన్న ఇతరమైన పక్షమందు (జన్మ) తిథియందు, (జన్మ) నక్షత్రమందు మంగల మాచరించాలి అని గర్గభార్గవ శౌనకులన్నారు. జన్మమాస నిషేధమున్నా జన్మదినము నుండి పదిరోజులు విడిచి పెట్టాలి. ఇతరమైన తిథులు శుభమైనవి. గ్రంథాంతరమందిట్లా – ఉపనయనమందు ఒకటి, మూడు, పది, ఆరుస్థానములందున్న గురువు కూడా ఒకసారి పూజిస్తే చాలు ఇష్టుడౌతాడు. కర్మ కాలం దాటినా నాలుగు ఎనిమిది, పన్నెండు స్థానములందున్నప్పుడు రెట్టింపు పూజ వలన శుభకరుడౌతాడు అని. ఎనిమిది సంవత్సరాలు వయసు వచ్చాక గురుశుద్ధిలేని వానికి చైత్ర మాసంలో సూర్యుడు మీనరాశిలో ఉండగా ఉపనయనంచేస్తే మంచిది. జన్మ (నక్షత్రం) రాశి నుండి ఎనిమిదవ సింహరాశియందు లేదా మకరరాశి యందు శత్రు (నక్షత్ర) గాశియందు గురువుండగా కూడా సూర్యుడు మీనరాశి యందుండగా చైత్రమందు మౌంజీ బంధము శుభకరమైనది. నారదుడిట్లా – బాలునకు, బృహస్పతి బలహీనంగా ఉన్న శాంతి వల్ల బలవంతుడౌతాడు. చెప్పిన సంవత్సరమందుకాని, చెప్పనివత్సరమందైనా కాని ఉపనయన మాచరించాలి, అని. శాంతిని గూర్చి ఐతే పైన చెప్తాము. జ్యోతిర్నిబంధమందు నృసింహుడిట్లా –(ఉపనయనమందు)తృతీయ, పంచమి, షష్ఠి, ద్వితీయ, సప్తమి ఈ తిథులు రెండు పక్షములందు విశేషించి పూజించతగినవి, అని. దశమి (ధర్మ) త్రయోదశి (కామ) శుక్లపక్షమందు కృష్ణపక్షమందు పాడ్యమితిథిని కొందరు గ్రహిస్తారు. కొందరు మునులు శుక్లత్రయోదశిని ఇష్టపడుతారు. టోడరానందమందు వసిష్ఠవచనమిట్లా–నైమిత్తికమైన అనధ్యాయదినము కృష్ణపక్షమందు ప్రతిపదదినము మేఖలాబంధనమందు శస్తమైనది. చౌలము వేదవ్రతములందును ఇది ప్రశస్తమైనది (ఉపాకర్మ, వేదారంభము వేదవ్రతములు). పూర్వ అపరసంయుతము కాని కృష్ణ ప్రతిపద ప్రశస్తమైనది (పూర్వం అమా, పరం ద్వితీయ) అని. ఇది కాలము దాటిపోయిన, రోగగ్రస్తుడైన వటువునకు చెందిన ఉపనయన విషయకము. కృష్ణ ప్రతిపద ప్రశస్తమైంది, చంద్రుడు శుభకరుడైనప్పుడు, చంద్రుడు బలవంతుడై లగ్నంలో ఉన్నట్లైతే కాలము దాటిపోతే అది ప్రశస్తమైంది; అని వ్యాసోక్తి అని అన్నారు. ఇట్లాగే సప్తమి కూడా శుభకరము. దానిని గల గ్రహమని చెప్పారు కనుక. బృహస్పతి ఇట్లా – శుక్లపక్షము శుభకరమైనది. కృష్ణపక్షంలో చివరి మూడు రోజులు విడచి మిగిలినవి శుభము, అని.అట్లాగే–సూర్యుడు మిథునరాశి యందుండగా జ్యేష్ఠ మాసము దోషకరముకాదు, అని.

**మూ॥ మదనరత్నేనారదః– వినర్తునా వసంతేన కృష్ణపక్షే గలగ్రహే, అపరాహ్ణే చోపనీతః పునఃసంస్కారమర్హతి. అపరాహ్ణః త్రేధావిభక్త దినతృతీయాంశ ఇత్యుక్తం తత్రైవ. వసన్తే గల గ్రహోన దోషాయేత్యర్థః. నారదః– కృష్ణపక్షే చతుర్థీ చ సప్తమ్యాది, దినత్రయం,**

త్రయోదశీ చతుష్కం చ **అష్టావేతేగలగ్రహాః.** వసిష్ఠః – పాపాంశకగతే చంద్రే అరి నీచ స్థితేఽపిచ, అనధ్యాయే చోపనీతః పునః సంస్కారమర్హతి. అనధ్యా యస్య పూర్వేద్యుః తస్యచైవాపరేఽహని,వ్రతబంధంవిసర్గంచ విద్యారంభం,నకారయేత్. రాజమార్తండః – ఆరంభానంతరం యత్ర ప్రత్యారంభోన సిద్ధ్యతి, గర్గాదిమునయః సర్వేతమేవాహుర్గలగ్రహం. జ్యోతిర్నిబంధే – అష్టకాసు చ సర్వాసు యుగమన్వంత రాదిషు, అనధ్యాయం ప్రకుర్వీత, తథాసోపపదాస్వపి. **సోపపదాస్తు** **స్మృత్యర్థసారే** – సితాజ్యేష్ఠేద్వితీయా చ ఆశ్వినే దశమీ సితా, చతుర్థీ ద్వాదశీ మాఘే ఏతాః సోపపదాః స్మృతాః. ఏవం ప్రదోషదినంవర్జ్యం. **ప్రదోషస్వరూపమాహ** గోభిలః – షష్ఠీ చ ద్వాదశీ చైవ అర్ధరాత్రోననాడికా, ప్రదోష మిహ కుర్వీత తృతీయా యా నయామికా. జ్యోతిర్నిబంధేవ్యాసః – యా చైత్రవైశాఖసితా తృతీయా మాఘస్య సప్తమ్యథ,ఫాల్గునస్య, కృష్ణే ద్వితీయోపనయే ప్రశస్తా ప్రోక్తా భరద్వాజ మునీంద్ర ముఖ్యైః. అత్రాపి కృష్ణ ప్రతిపద్ జ్ఞేయం. **యత్తు వృద్ధగార్గ్యః** – అనధ్యాయే ప్రకుర్వీత యస్తు నైమిత్తికో భవేత్, సప్తమీ మాఘశుక్లేతు తృతీయాచాక్షయా తథా. బుధ త్రయేందు వారాశ్చశస్తాన్వ్రత బంధనే, ఇతి తత్ ప్రాయశ్చిత్తార్థోపనయనవిషయం. స్వాధ్యాయ వియుజోఘస్రాః కృష్ణ ప్రతిపదాదయః, ప్రాయశ్చిత్త నిమిత్తేతు మేఖలాబంధనేమతాః, ఇతి తేనైవోక్తేరితి నిర్ణయామృతకాలాదర్శౌ. యద్యపి, అథోపేత పూర్వస్య, ఇత్యుక్త్వా అనిరుక్తం పరిదానం కాలశ్చ, ఇత్యాశ్వలాయనేన పునరుపనయనే కాలానియమ ఉక్తః తథాపి నిమిత్తానంతరమేవ సః తదానీమకరణేతు పూర్వోక్తకాలోజ్ఞేయః. ప్రతివేద ముపనయనే కాలా నియమ ఇతి తు యుక్తం. గర్గః– గ్రహోరవీందోరవని ప్రకంపే, కేతూద్గ మోల్కా పతనాదిదోషే, వ్రతే దశాహాని వదంతి తజ్జ్ఞాః త్రయోదశా హాని వదంతి కేచిత్. సంకటేతు చండేశ్వరః – దాహో దిశాంచైవ ధరాప్రకంపే వజ్రప్రపాతేఽథ విదారణే చ, కేతౌ తథోల్కాంశు కణ ప్రపాతే త్ర్యహం నకుర్యాత్ వ్రతమంగలాని. తత్రైవ – వేద వ్రతోపనయనే స్వాధ్యాయాధ్యయనే తథా, న దోషో యజుషాం సోపపదా స్వధ్యయనేఽపిచ.

అను॥ మదనరత్నమందు నారదుడిట్లా – వసంతఋతువు లేకుండానే కృష్ణపక్షమందు గల గ్రహమందు, అపరాహ్ణమందు ఉపనీతుడైనవాడు తిరిగి సంస్కారాన్ని పొందాలి అని. అపరాహ్ణమనగా దినభాగమును మూడు భాగములు చేయగా మూడవ భాగము అపరాహ్ణమని అక్కడే చెప్పారు. వసంతమందు గలగ్రహము దోషకారి కాదు అని అర్థము. నారదుడిట్లా – కృష్ణపక్షమందు చతుర్థి, సప్తమి, అష్టమి, నవమి (3రోజులు) త్రయోదశి నుండి నాల్గురోజులు (త్రయోదశి, చతుర్దశి, అమా, తెల్లవారి పాడ్యమి) ఈ ఎనిమిది రోజులు గల గ్రహమను పేరుగలవి, అని. వసిష్ఠుడిట్లా– చంద్రుడు పాపాంశకగతుడైనప్పుడు శత్రు, నీచస్థానములందున్నప్పుడు, అనధ్యాయమందు ఉపనీతుడైనవాడు తిరిగి సంస్కారాన్ని పొందాలి, అని. అనధ్యాయముకన్న ముందు రోజు అనధ్యాయానికి తరువాతిరోజున వ్రత బంధము, విసర్గము (వేదఉత్సర్గము – సమావర్తనము) వేదారంభము (విద్య) చేయించరాదు. (అనధ్యాయంనిత్యం, నైమిత్తికంకూడ అనిత్యమైనది కాదు).రాజమార్తండుడిట్లా– ఆరంభము తరువాత (బహ్వృచేతర శాఖల వారికి ఉపనయన దినమందే వేదారంభమౌతుంది) ఎక్కడ

తిరిగి ఆరంభము వీలుకాదో (తర్వాతి రోజు అనధ్యాయమైనందువల్ల వేదారంభం వీలు కాదు) దానినే గర్గాదిమునులందరు గల గ్రహమన్నారు;అని. జ్యోతిర్నిబంధమందిట్లా - అన్ని అష్టకములందు, యుగమన్వంతరాదులందు, అట్లాగే సోపపదులందు కూడా అనధ్యాయాన్ని పాటించాలి అని. సోపపదులు స్మృత్యర్థసారమందిట్లా - జ్యేష్ఠ శుక్ల ద్వితీయ, ఆశ్వినశుక్ల దశమి, మాఘ చతుర్థి, ద్వాదశి ఇవి సోపపదులనబడ్డాయి అని. ఈ విధంగానే ప్రదోష దినాన్ని వదలిపెట్టాలి. గోభిలుడు ప్రదోష స్వరూపాన్ని చెప్పాడిట్లా - షష్ఠి, ద్వాదశి ఇవి అర్ధరాత్రి కన్నా ఒకనాడి తక్కువగా ఉన్న సమయం తృతీయ అర్ధరాత్రికన్నా ఒక జాము తక్కువగా ఉన్న సమయంలో ప్రదోష మాచరించాలి, అని. జ్యోతిర్నిబంధమందు వ్యాసుడిట్లా - చైత్రశుక్లతృతీయ, వైశాఖ శుక్ల తృతీయ, మాఘశుక్లసప్తమి, ఫాల్గున కృష్ణ ద్వితీయ ఇవన్నీ ఉపనయనమందు ప్రశస్తమైనవని భరద్వాజమునీంద్రముఖ్యులు అన్నారు. అని. ఇక్కడ కూడా కృష్ణ ప్రతిపద (వలె) అని తెలుసుకోవాలి. వృద్ధగార్గ్యుడు ఇట్లా - నైమిత్తిక వశమైన దానిని అనధ్యాయమందు ఆచరించాలి. మాఘశుక్లసప్తమి, అక్ష తృతీయ బుధ గురు శుక్ర సోమవారములు వ్రతబంధనమందు ప్రశస్తమైనవి, అని ఏదన్నాడో అది ప్రాయ శ్చిత్తము కొరకైన ఉపనయన విషయకము. నిర్ణయామృత కాలాదర్శములు ఇట్లా అన్నాయి - స్వాధ్యాయ వర్జితమైన రోజులు కృష్ణ ప్రతిపదాదులు ప్రాయశ్చిత్త నిమిత్తమందలి మేఖలా బంధనమందు తగినవి, అని ఆతడే చెప్పాడని, అన్నాయి. ఇక ఇదివరలో ఉపనయనం చేసుకున్నవానికి అని పలికి అనిరుక్తము పరిదానము కాలము (వస్తువుల మార్పు కాలము చెప్పబడలేదు)అని ఆశ్వలాయనులు తిరిగి జరిగే ఉపనయనమందు కాల అనియమమును చెప్పారు. ఐనా నిమిత్త అనంతరమే అది. అప్పుడు చేయకపోతే ముందు చెప్పిన కాలాన్నే గ్రహించాలి. ప్రతివేదము కొరకయ్యే ఉపనయనంలోనైతే కాలనియమం లేదు అనేది తగును. గర్గుడిట్లా - సూర్యచంద్రుల గ్రహణమందు, భూకంపమందు ధూమ కేతువురాక, తోకచుక్క పడటం మొదలగు దోషమందు యజ్ఞోపవీతమైతే పదిరోజులు వదలాలన్నారు, ఆ విషయ మెరిగిన పెద్దలు. కొందరు పదమూడు రోజులు వదలాలన్నారు అని. (గ్రహణంలో ముందు మూడు రోజులు, తర్వాత ఏడు రోజులు సూతకము అని గర్గుడు. మరో స్మృతిలో- పూర్ణ గ్రహణ మందు ఏడు రోజులు, సగమైతే మూడు రోజులు, మూడు రెండు ఒక్క అంగుళం గ్రహణం ఐతే ఒక్కరోజు వదలాలి,అని. వసిష్ఠుడు ఐదు రోజులని గర్గుడు మూడు రోజులని, కౌశికుడు ఒక్కరోజని, చ్యవనుడు ఐదు ముహూర్తములు రాహువు దూషిస్తాడని ఉంది) సంకటమందైతే చండేశ్వరుడిట్లా చెప్పాడు - దిక్కులు తగులబడ్డప్పుడు, భూకంపమందు, పిడుగుపడితే, యుద్ధకాలమందు, ధూమకేతువు అట్లాగే ఉల్కఅంశువులు కణములు పడితే వ్రతమంగళములు మూడు రోజులు ఆచరించరాదు, అని. అక్కడే - వేదవ్రత, ఉపనయనములు అట్లాగే స్వాధ్యాయ అధ్యయనములు, సోపపదము లందు అధ్యయనమందుకూడా యజుర్వేదీయులకు దోషము లేదు, అని అన్నారు.

మూ॥ హేమాద్రౌ జ్యోతిషే - హస్తత్రయే పుష్యధనిష్ఠయోశ్చ పౌష్ణాశ్విసౌమ్యా దితి విష్ణుభేషు, శస్తే తిథౌ చంద్రబలేనయుక్తే కార్యౌద్విజానాం వ్రత బంధమోక్షౌ॥ జ్యోతిర్నిబంధే నారదః - శ్రేష్ఠా న్యర్కత్రయహం త్యేజ్య చంద్రాదిత్యుత్తరాణిచ, విష్ణుత్రయహా శ్విమిత్రాబ్జయోనిభాన్యుపనాయనే. బృహస్పతిః - త్రిషూత్తరేషు రోహిణ్యాం హస్తేమైత్రే చ వాసవే, త్వాష్ట్రే సౌమ్యపునర్వస్వోరుత్తమం హ్యుపనాయనం. జ్యోతిర్నిబంధే - పూర్వాహస్తత్రయే సార్ప శ్రుతిమూలేషు బహ్వృచాం, యజుషాం పౌష్ణమైత్రార్కాదిత్య పుష్యమృదుధ్రువైః. సామగానాం హరీశార్కవసు పుష్యోత్తరాశ్విభైః, ధనిష్ఠాదితి మైత్రార్కే ష్విందు పౌష్ణేష్వథర్వణాం. రాజమార్తండస్తు-బ్రాహ్మణస్య పునర్వసుం నిషేధయతి - తారా చంద్రానుకూలేషు గ్రహాబ్దేషు శుభేష్వపి పునర్వసౌకృతో విప్రః పునః సంస్కారమర్హతి. జ్యోతిర్ని బంధె నారదః - సర్వేషాం జీవశుక్రజ్ఞవారాః ప్రోక్తా వ్రతేశుభాః, చంద్రార్కౌ మధ్యమౌజ్ఞేయౌ సామబాహుజయోః కుజః శాఖాధిపతి వారశ్చశాఖాధిపబలంతథా, శాఖాధిపతిలగ్నం చ దుర్లభం త్రితయంవ్రతే. **శాఖాధిపాశ్చ** రత్నసంగ్రహే - ఋగథర్వసామయజుషామధి పాగురుసౌమ్య భౌమసితాః. జీవసితౌ విప్రాణాం క్షత్రస్యారోష్ణగూ విశాంచంద్రః, ఇతి. పారిజాతే బృహస్పతిః - **బహ్వృచానాంగురో ర్వారే** యజుర్వేదజుషాంబుధే, సామగానాంధరా సూనోరథర్వవిదుషాం రవేః. అత్రలగ్న శుద్ధ్యాదిదైవజ్ఞేభ్యోజ్ఞేయం. విస్తర భయాన్నోచ్యతే.

అను॥ హేమాద్రియందు జ్యోతిష వాక్యమిట్లు - హస్త, చిత్త, స్వాతి, పుష్యమి, ధనిష్ఠ, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, శ్రవణ నక్షత్రములందు, ప్రశస్తమైన తిథి యందు, చంద్రుడు బలవంతుడై ఉండగా **బ్రాహ్మణులకు వ్రతబంధ, మోక్షములు** (సమావర్తనం) **ఆచరించాలి, అని.** జ్యోతిర్నిబంధమందు నారదోక్తి ఇట్లు - హస్త చిత్త స్వాతి రేవతి పుష్యమి మృగశిర పునర్వసు, ఉత్తర, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, అశ్విని, అనురాధా, రోహిణి ఈ నక్షత్రములు ఉపనయనమందు శుభప్రదమైనవి, అని. బృహస్పతి ఇట్లు - ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి, హస్త, అనురాధ, ధనిష్ఠ, చిత్ర, మృగశిర, పునర్వసు ఇవి ఉపనయనమునకు ఉత్తమమైనవి, అని. జ్యోతిర్నిబంధమందిట్లు- పుబ్బ, పూర్వాషాఢ పూర్వాభాద్ర, హస్త చిత్త స్వాతి, ఆశ్లేష, శ్రవణం, మూల వీనిలో బహ్వృచులకు (ఋగ్వేదులకు)మంచిది. రేవతి, అనురాధ, హస్త, పునర్వసు, పుష్యమి, మృదు (మృగశిర చిత్త, అనురాధ, రేవతి) ధ్రువ (ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి) ఇవి యుజుర్వేదీయులకు మంచివి. సామగులకు శ్రవణం, ఆర్ద్ర, హస్త, ధనిష్ఠ, పుష్యమి, ఉత్తర, ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర, అశ్విని ఇవి శుభనక్షత్రములు. అధర్వణులకు ధనిష్ఠ పునర్వసు, అనురాధ, హస్త, మృగశిర, రేవతి ఈ నక్షత్రములు శుభమైనవి అని. రాజమార్తండుడు బ్రాహ్మణునకు పునర్వసు నక్షత్రాన్ని నిషేధిస్తున్నాడిట్లు - తారాబలము చంద్రుడు ఇవి అనుకూలంగా ఉన్నా, గ్రహ అబ్దములు శుభంగా ఉన్నా పునర్వసు నక్షత్రమందు సంస్కారమును పొందిన విప్రుడు తిరిగి సంస్కారమునకు అర్హుడు అని. జ్యోతిర్నిబంధమందు నారద వచనమిట్లు - అందరికి వ్రతమందు గురు,శుక్ర, బుధవారములు శుభములని చెప్పబడ్డాయి. సోమ,

ఆదివారములు మధ్యమము, ఉపనయన సంస్కారానికి. సామవేదులకు, క్షత్రియులకు మంగళ వారము ఉత్తమము. శాఖాధిపతి వారము, శాఖాధిపునిబలము, శాఖాధిపతి లగ్నము ఈ మూడు ఉపనయనమందు లభించుట దుర్లభము అని. శాఖాధిపులు రత్న సంగ్రహమందిట్లా చెప్పబడ్డారు– ఋక్, అధర్వ, సామ, యజుశ్శాఖలవారికి గురు, బుధ, మంగళ, శుక్రులు అధిపులు. వర్ణాధిపతులు విప్రులకు గురుశుక్రులు, క్షత్రియునకు మంగళ, సూర్యులు, వైశ్యునకు చంద్రుడు అధిపతి, అని. పారిజాతమందు బృహస్పతి ఇట్లా – ఋగ్వేదులకు గురువారము, యజుర్వేదులకు బుధవారము, సామగులకు మంగళవారము, అథర్వ వేదులకు ఆదివారము ఉపనయనము విహితము. ఇక్కడ లగ్నశుద్ధి మొదలగునవి జ్యోతిష్యుల నుండి తెలుసుకోవాలి. విస్తారమౌతుందనే భయంతో చెప్పటం లేదు.

మూ॥ లల్లః – **ప్రతేఒహ్ని పూర్వ సంధ్యాయాం వారిదో** యది గర్జతి, తద్దినేస్యాద నధ్యాయో వ్రతం తత్ర వివర్జయేత్. జ్యోతిర్నిబంధే – **నాందీశ్రాద్ధం కృతంచేత్ స్యాత్** అనధ్యాయ స్త్వాకాలికః, తదోపనయనం కార్యం వేదారంభం నకారయేత్. ఏతత్ బహ్వృ చాతిరిక్తానాం. తేషాం తద్దినే వేదారంభా భావాత్.అతస్తేషా ముపనయనం నభవత్యేవ. ఐతరే యోపనిషది – మృగాది జ్యేష్ఠాంతం వర్షర్తుః. తం వినావర్షాదౌ త్రిరాత్రం అనధ్యాయః. ఇతి వేద భాష్యేఉక్తం. ఏతచ్చ ప్రాతః స్తనితే, సాయం స్తనితేతు దివైవ చరుంశ్రపయిత్వా సాయం సంధ్యోత్తరం హోమం కుర్యాత్. **న సంధ్యాగర్జితేకాలే** న వృష్ట్ యుత్పాతదూషితే, బ్రహ్మౌదనంపచేదగ్నౌ పక్వమన్నం నివర్తతే. బ్రహ్మౌదనం పచేదగ్నౌ పక్వమన్నం నదుష్యతి, ఇతి సంగ్రహోక్తేరితి ప్రయోగ రత్నే భట్టచరణాః. **అత్రశాంతిరప్యుక్తా.** నృసింహ ప్రసాదే– బ్రహ్మౌదనవిధేః పూర్వం ప్రదోషే గర్జితం యది, తదా విఘ్నకరం జ్ఞేయం వటోరధ్యయనస్యతత్. **తస్యశాంతి ప్రకారంతు** వక్ష్యేశాస్త్రానుసారతః ప్రధానం పాయసం సాజ్యం ద్రవ్యం శాంతియజౌ భవేత్. సూక్తం బృహస్పతే ర్విద్వాన్ పఠేత్ ప్రజ్ఞావివృద్ధయే, గాయత్రీ చైవ మంత్రః స్యాత్ ప్రాయశ్చిత్తంతు సర్పిషా. ధేనుం సవత్సకాం దద్యాత్ అచార్యాయపస్వినీం, బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాత్ తతోబ్రహ్మౌదనంచరేత్.

అను॥ లల్లుడు ఇట్లా – ఉపనయనం ముందు రోజు పూర్వ సంధ్యయందు మేఘం గర్జిస్తే ఆ రోజు అనధ్యాయమౌతుంది. అప్పుడు ఉపనయన వ్రతాన్ని విడిచిపెట్టాలి అని. జ్యోతిర్నిబంధమందిట్లా – నాంది శ్రాద్ధం చేశాక అకాల అనధ్యాయమైతే ఉపనయన సంస్కారం చేయాలి. వేదారంభము చేయరాదు, అని. ఇది బహ్వృచశాఖీయులకన్న ఇతరమైన వారికి. ఆరోజు వేదారంభము లేదు కాబట్టి (ఋక్శాఖులకు). అందువల్ల వారికి ఉపనయనము కానేకాదు. ఐతరేయ ఉపనిషత్తు యందిట్లా – మృగశిరకార్తి నుండి జ్యేష్ఠకార్తి వరకు వర్షర్తువు. అదికాక వర్షఋతువు ఆదియందు మూడు రాత్రులు అనధ్యాయము అని వేద భాష్యములో చెప్పారు. ఇది ప్రొద్దుటి పూట మేఘగర్జన ఐతే. ఒకవేళ సాయంకాలము గర్జన ఐతే దినమందే చరువును వండి సాయం సంధ్య తరువాత హోమం చేయాలి. సంధ్యాగర్జన కాలమందు వృష్టి ఉత్పాతములచే దూషితమైన కాలమందు బ్రహ్మ ఓదనమును అగ్నిలో వండరాదు. ఒకవేళ అన్నం పక్వమైఉంటే, (ఆసమయంకన్న ముందే)నివృత్తి కాదు

(ఉపయోగించవచ్చు దానిని). బ్రహ్మ ఓదనాన్ని అగ్నిలో వండితే ఆ వండిన అన్నము దూషితం కాదు, అని సంగ్రహోక్తి అని ప్రయోగరత్న మందు భట్టచరణులన్నారు. ఇక్కడ శాంతి కూడా చెప్పబడింది. నృసింహప్రసాదమందిట్లా – బ్రహ్మ ఓదనవిధికన్న ముందే ప్రదోష మందు మేఘగర్జన ఐతే అది వటువుయొక్క అధ్యయనమునకు విఘ్నం కల్గించేదని గ్రహించాలి; అని. దాని శాంతి ప్రకారాన్ని శాస్త్రాన్ననుసరించి చెప్తాను. శాంతి యజ్ఞమందు పాయసము, నెయ్యితో కూడినది ప్రధాన ద్రవ్యము ఔతుంది. ప్రజ్ఞావృద్ధి కొరకు విద్వాంసుడు బృహస్పతి సూక్తాన్ని చదువాలి. గాయత్రి, మంత్రము. ప్రాయశ్చిత్త హోమాన్ని నేయితో చేయాలి. ఆచార్యునకు పాలిచ్చే, దూడకలిగిన ఆవును దానంచేయాలి. పిదప బ్రాహ్మణులను భుజింపచేయాలి. పిదప బ్రహ్మౌదనవిధి ఆచరించాలి.

**మూ॥ ఉపనయనేచాధికారిణో మాధవీయే వృద్ధమనునోక్తాః – పితా పితామహో భ్రాతా జ్ఞాతయో గోత్రాజాఽగ్రజాః, ఉపానయేఽధికారీస్యాత్ పూర్వాభావే పరః పరః. ప్రయోగరత్నే –పిత్రైవోపనయేత్పుత్రం తదభావే పితుఃపితా, తదభావే పితుర్ భ్రాతా తదభావేతు సోదరః. పితేతి** విప్రపరం **నక్షత్రియాదేః. తేషాంపురోహిత** ఏవ ఉపనయనస్య దృష్టార్థత్వాత్. తేషాం చాధ్యాపనేఽనధికారాత్. **అత్రపితృవ్యస్య జ్యేష్ఠ భ్రాతృభావేఽధికారః.** అసంస్కృతాస్తు సంస్కార్యా భ్రాతృభిః పూర్వసంస్కృతైః ఇతియాజ్ఞ వల్క్యోక్తేః. తేనేదమవిభక్తపరం, పూర్వంతు, విభక్తపరం. **మాతుః రజోదోషే తుప్రాగుక్తం. అథషండమూకాదీనాం విశేషః–** ప్రయోగపారిజాతేబ్రాహ్మే-బ్రాహ్మణ్యాం బ్రాహ్మణాజ్జాతో బ్రాహ్మణః సఇతి శ్రుతిః. తస్మాచ్చషండబధిరకుబ్జవామన పంగుషు, జడ గద్గదరోగార్త శుష్కాంగ వికలాంగిషు, మత్తోన్మత్తేషుమూకేషుశయనస్థే నిరింద్రియే, ధ్వస్తపుంస్త్వేషు చైతేషు సంస్కారాః స్యుః యథోచితం. మత్తోన్మత్తౌ నసంస్కార్యా వితికేచిత్రుచక్షతే, కర్మస్వనధి కారాచ్చ పాతిత్యంనాస్తిచైతయోః తదపత్యంచ సంస్కార్యమపరే త్వాహురన్యథా. సంస్కారమంత్ర హోమాదీన్ కరోత్యాచార్య ఏవతు, ఉపనేయాంశ్చ విధివత్ ఆచార్యస్య (స్వ) సమీపతః. ఏవమేవ ద్విజైర్జాతౌ సంస్కార్యౌ కుండగోలకౌ, ఇతి. స్మృత్యర్థ సారేఽప్యేవం–కుండగోలకయోఃసంస్కార్యత్వం శ్రాద్ధేనిషేధశ్చ క్షేత్రజపుత్రవిషయః. అన్యస్య, విన్నాస్యేష విధిః స్మృతః, ఇతివచనాత్. అబ్రాహ్మణ్యే నోపనయాద్యప్రాప్తేరిత్యపరార్కః.

అను॥ ఉపనయనమందుఅధికారులనుగూర్చిమాధవీయమందువృద్ధమను వచనములిట్లా–తండ్రి, (తండ్రితండ్రి) తాత, అన్న, జ్ఞాతులు (అసగోత్ర, సపిండులు **తల్లి తండ్రి మొదలగువారు)** సగోత్రసపిండులు, అగ్రజులు (చిన్నాన్న, పెదనాన్న పుత్రులు మొదలగువారు) వటువుకన్నఅధికవయస్సువారు (చిన్నాన్న లేకపోతేనే ఆతని కొడుకుకు అధికారము అన్నఐతే) (ఆతడుకాకపోతే సోదరుడు) ఈరకషంగా ఉపనయనమందు అధికారులు తొలిప పలేకపోతే పరులు, అంతకన్న పరమైనవారు అర్హులు, అని. ప్రయోగరత్న మందిట్లా – తండ్రేకొడుకు ఉపనయనంచేయాలి. అతడు లేకపోతే తాత **(తండ్రి తండ్రి)** అతడు లేకపోతే తండ్రి సోదరుడు, అతడు లేకపోతే సోదరుడు. అని. పిత అనే శబ్దము

బ్రాహ్మణపరకమైనది. క్షత్రియాదులకు కాదు. వారికి పురోహితుడే ఉపనయనముకై చూడబడుతున్నాడు. వారికి (క్షత్రియవైశ్యులకు) వేదాధ్యాపనమందు అధికారం లేదు కాబట్టి. ఇక్కడ చిన్నాన్నలకు పిల్లవానికి పెద్దన్నలు లేకపోతేనే అధికారము (ఉపనయనం చేయటంలో). పూర్వము సంస్కృతులైన అన్నలు సంస్కారమునొందని తమ్ములకు సంస్కారము చేయాలి, అని యాజ్ఞవల్క్యఉక్తి. అందువల్ల ఇది అవి భక్త (కుటుంబ) పరమైనది. ముందుచెప్పింది విభక్తపరమైనది. తల్లిరజోదుష్టఐతే ముందే చెప్పాము. ఇక షండమూకాదులకు విశేషము. ప్రయోగపారిజాతమందు బ్రాహ్మోక్తి ఇట్లా – బ్రాహ్మణి యందు బ్రాహ్మణునిద్వారా పుట్టినవాడు బ్రాహ్మణుడు అని శ్రుతి. అందువల్ల నపుంసకుడు (అంధుడు సూచన) చెవిటివాడు, గూనివాడు, పొట్టివాడు, కుంటివాడు, జడుడు (తెలివిలేనివాడు) బొంగురుగొంతువాడు (నత్తివాడు), రోగి, శుష్కాంగుడు, వికలాంగుడు, మత్తుడు ఉన్మత్తుడు (పిచ్చివాడు), మూగవాడు, శయనమందున్నవాడు, ఇంద్రియములేనివాడు, పుంస్త్వములేనివారు, వీరందరికి యథోచితముగా సంస్కారములు చేయాలి. కొందరు మత్తఉన్మత్తులకు సంస్కారమవసరము లేదని అంటారు. కర్మలలో అధికారం లేదు కనుక వీరికి పాతిత్యము లేదు అని అంటారు. ఇతరులు మరోరకంగా అంటారు, వారి సంతానమునకు సంస్కారము చేయాలి, అని. సంస్కార,మంత్ర, హోమాదులను ఆచార్యుడేచేస్తాడు. ఉపనయనంచేయతగిన యోగ్యులను ఆచార్యునిసమీపమునకో లేదా అగ్నిసమీపమునకో విధిప్రకారము తీసుకొనివచ్చి, వారినిస్పృశించి సావిత్రిని జపించాలి (మూకబధిరులు మొ॥ వారు సావిత్రిని చెప్పలేరుకదా (ఉచ్చరించ) కన్యాదానస్వీకారముతప్ప అన్నిటినీ బ్రాహ్మణునితో చేయించాలి) ఈ రకముగానే బ్రాహ్మణులవల్ల కలిగిన కుండగోలకులకు సంస్కారములు చేయాలి. స్మృత్యర్థసారమందు కూడా ఇట్లా :- కుండగోలకుల సంస్కారము, శ్రాద్ధమందు నిషేధము క్షేత్రజపుత్ర విషయము. (సవర్ణునిద్వారా తనభార్యయందు కలిగినవాడు భార్యయందు సంతతికొరకు భర్త నియోగించిన జ్ఞాతిచే కలిగిన సంతానము, క్షేత్రజ). ఇతరుని చర్చలలో ఈవిధియే చెప్పబడింది, అనేవచనము ననుసరించి బ్రాహ్మణుడు కాని వానితో ఉపనయనాదులు ప్రాప్తించవుగదా, అని అపరార్కులన్నారు (భర్తఉండగా పరపురుషునివల్ల సంతానాన్ని పొందితే అపుత్రుడు, కుండుడు. భర్తపోయాక పరపురుషునిద్వారా సంతానాన్ని పొందితే అపుత్రుడు గోలకుడు).

**మూ॥ ఉపనయనంచ కుమారంభోజయిత్వాకార్యం ప్రాగేవైనం తదహర్ భోజయంతి, ఇతి మదన పారిజాతేగోభిలోక్తేః. గాయత్ర్యుపదేశశ్చ ఉత్తరతోఽగ్నేః కార్యః ఉత్తరేణాగ్నిముపవిశతః ప్రాఙ్ముఖఆచార్యః ప్రత్యఙ్ముఖఇతరోఽధీహిభోః, ఇతి శాంఖాయన సూత్రోక్తేః. యద్యపికాత్యాయనేన, అథాస్మైసావిత్రీమన్వాహోత్తరతోగ్నేః ప్రత్యఙ్ముఖాయ, ఇత్యుక్త్వాదక్షిణతస్తిష్ఠత ఆసీనాయవైకే, ఇతి వికల్పఉక్తః. తథాపికాతీయానామేవనః. బహ్వృచానాంతూత్తరవేవవేదైక్యాత్. భిక్షాయాం విశేషమాహకాత్యాయనః – మాతరమేవాగ్రేభిక్షేత్.**

పరాశరమాధవీయే-మాతరం వాస్వసారంవామాతుర్వాభగినీంనిజాం, భిక్షేతభిక్షాం ప్రథమంయా చైనం న విమానయేత్. అథ సంస్కారలోపేశౌనకః ఆరభ్యాధానమాచౌలాత్ కాఌలేతీతే, తుకర్మణాం, వ్యాహృత్యాగ్నింతుసంస్కృత్యహుత్వాకర్మయధాక్రమం. ఏతేష్వేకైక లోపేతు పాదకృచ్ఛ్రంసమాచరేత్, చూడాయామర్ధకృచ్ఛ్రః స్యాదాపదిత్యేవమీరితం. అనాపదితుసర్వత్రద్విగుణం చరేత్. పారిజాతే కాత్యాయనః - లుప్తే కర్మణి సర్వత్ర ప్రాయశ్చిత్తం విధీయతే, ప్రాయశ్చిత్తే కృతే పశ్చాల్లుప్తం కర్మసమాచరేత్, స్మృత్యర్థసారేచైవం. కారికాయాంతు - ప్రాయశ్చిత్తే కృతేఌతీతంలుప్తం కర్మకృతాకృతం, ఇత్యుక్తం. ప్రాయశ్చిత్తేకృతేపశ్చాదతీతమపికర్మవైకార్యమిత్యేక ఆచార్యా నేత్యన్యేతువిపశ్చితః ఇతి. త్రికాండమండనేతు - కాలాతీతేషుకార్యేషు ప్రాప్తవత్ స్వపరేషుచ, కాలాతీతాని కృత్వైవ విధధ్యాదుత్తరాణితు, ఇత్యుక్తం. తత్రసర్వేషాం తంత్రేణ, నాందీశ్రాద్ధంకుర్యాత్, దేశకాలకర్తృఐక్యాత్, గణశః క్రియమాణానాం మాతౄణాం పూజనంసకృత్, సకృదేవ భవేచ్ఛ్రాద్ధం ఆదౌనపృథగాదిషు, ఇతి ఛందోగపరిశిష్టాత్. ఏతద్బహూనామపత్యానాం యుగపత్ సంస్కార కరణ విషయమితి బోపదేవః. అతీతసంస్కారాణాం యుగపత్కరణఇత్యన్యే. తత్రాపిచౌలస్యో పనీత్యాసహేతిపక్షే ఉపనీతిదిన ఏవానుష్ఠానం నపూర్వదినే, సహత్వస్య దివసైక్యే సన్నికృష్టతరత్వాత్. వృద్ధాచారోఌప్యేవం.

అను॥ కుమారునకు భోజనముచేయించి ఉపనయనముచేయాలి. మదనపారిజాత మందు గోభిలుడిట్లన్నాడు-ఆరోజుఉపనయనం కన్నముందే అతనికి తినిపిస్తారు, అని. గాయత్రి ఉపదేశాన్ని అగ్నికి ఉత్తరభాగంలో చేయాలి. శాంఖాయనసూత్రంలో ఇట్లా చెప్పబడింది - అగ్నికి ఉత్తరభాగంలోకూర్చొని, ఆచార్యుడు ప్రాజ్ముఖుడై వటువు ప్రత్యజ్ ముఖుడుకాగా, ఓయి! అధ్యయనము చేయుము, అని. కాత్యాయనుడు - ఇక ఈతనికి, అగ్నికి ఉత్తరభాగంలోప్రత్యజ్ముఖుడైనవానికి, సావిత్రిని ఉపదేశించుఅని పలికి, అగ్నికి దక్షిణంలో ఉన్న కూర్చున్నవానికి గాని ఉపదేశము అనికొందరు, అని వికల్పం చెప్పాడు అట్లా కాత్యాయనుడన్నప్పటికి అదికాతీయులకే. బహ్వృచులకైతే ఉత్తరదిక్కే ఒకేవేదం కనుక. కాత్యాయనుడు భిక్షయందు విశేషాన్ని చెప్పాడిట్లా - తొలుత తల్లినే భిక్షమడగాలి,అని. పరాశరమాధవీయమందిట్లా - తల్లినిగాని, సోదరిని (అక్కనుగాని), తల్లి తోబుట్టు అక్కను గాని తొలిభిక్షను యాచించాలి. ఆమె ఈతనిని అవమానించేదికారాదు,అని. ఇక సంస్కార లోపమందు శౌనకుడిట్లా - గర్భాధానము మొదలుగా చౌల పర్యంతము, కర్మల కాలము గడచిపోయిన పక్షమందు, వ్యాహృతితో అగ్నిని సంస్కరించి హోమము చేసి యథా క్రమముగా కర్మ చేయాలి,అని. వీటిలో ఒక్కొక్కటి లోపిస్తే పాదకృచ్ఛ్ర మాచరించాలి. చూడాకర్మ యందు అర్ధకృచ్ఛ్ర (ప్రాయశ్చిత్త) మాచరిం చాలి. ఆపద యందు ఇట్లా చెప్పబడింది. ఆపత్తి లేని పక్షమందు అంతట (అన్ని కర్మల లోపంలో) రెట్టింపు రెట్టింపు ప్రాయశ్చిత్త మాచరించాలి. పారిజాత మందు కాత్యాయను డిట్లా - కర్మ లోపించిన అన్నిచోట్ల ప్రాయశ్చిత్తము విధించబడుతోంది. ప్రాయశ్చిత్తం చేశాక ఆ పిదప లోపించిన కర్మను ఆచరించాలి,అని. స్మృత్యర్థసార మందు కూడా ఇట్లాగే ఉంది. కారిక యందైతేనో -

కొరకు ఇంధనము, భిక్షా చర్య భూమిపై పరుండుట, గురువునకు హితము వీటిని ఆచరించాలి,అని ముగింపు.

మూ॥ **మేఖలామాహ ఆశ్వలాయనః** – తేషాం మేఖలా మౌంజీ బ్రాహ్మణస్య ధనుర్జ్యా క్షత్రియస్య ఆవీ వైశ్యస్య,ఇతి. ఆచార్యః – త్రివృతామేఖలా కార్యాత్రివారంస్యాత్ సమావృతా,తత్ గ్రంథయః త్రయః కార్యాః పంచవా సప్తవాపునః. మనుః–మౌంజీ త్రివృత్ సమాశ్లక్ష్ణా కార్యా విప్రస్య మేఖలా, త్రివృతా గ్రంథినైకేన త్రిభిః పంచభి రేవవా. మౌంజ్య భావేతు కర్తవ్యాకుశాశ్మంతక బల్వజైః. అత్ర ప్రవర సంఖ్యా నియమ ఇతి వృద్ధాః. **అథ దండాః** – మనుః – బ్రాహ్మణో బైల్వ పాలాశౌ క్షత్రియో వాటఖాదిరౌ, పైలవౌదుంబరౌ వైశ్యో దండా నర్హంతి ధర్మతః. ఏషామభావే గౌతమః – యజ్ఞియో వా సర్వేషాం మూర్ధలలాట నాసాగ్ర ప్రమాణః,ఇతి. **అజినమాహాశ్వలాయ** గృహ్య సూత్రం – అహతేన వాససా సంవీతమైణేయేన వాఽజినేన బ్రాహ్మణం రౌరవేణ క్షత్రియ మాజేన వైశ్యం,ఇతి. యద్యపి ఐణేయ శబ్దేన మృగీచర్మైవోచ్యతే, ఏణ్యాఢఞ్, ఇతి పాణిని స్మృతేః ఐణేయమేణ్యాశ్చర్మాద్యం మేణస్యైణము భేత్రిషు, ఇత్యమరకోశాచ్చ. తథాపి కృష్ణ రురువస్తాన్యజినాని, ఇతిశంఖోక్తేః. సర్వేషాం వారౌరవం, ఇతియమోక్తేశ్చ మృగచర్మణా సహ వికల్పోజ్ఞేయః. వస్త్రాజినయోస్తు వికల్పః, కార్పాసంవా అవికృతం, ఇతి గౌతమోక్తేః.

అను॥ ఆశ్వలాయనులు మేఖల గురించి ఇట్లా చెప్పారు – వారిలో బ్రాహ్మణునకు మౌంజీ మేఖల (ముంజదర్భలది మొలతాడుకు), క్షత్రియునకు ధనుస్సు యొక్క అల్లిత్రాడు మేఖల, వైశ్యునకు గొఱ్ఱె వెంట్రుకలతో చేసినది మేఖల, అని. ఆచార్యులిట్లా– మేఖల దారము మూడు వరుసలు కలది కావాలి (మౌంజిని మూడు వరుసలేసి ఒకటిగా పేనాలి). మూడు రౌండ్లు నడుముకు చుట్టబడాలి. దానికి మూడు ముడులు ఉండాలి. లేదా ఐదు గాని ఏడుగాని ఉండొచ్చు,అని. మనువిట్లా – మౌంజి ముప్పేటలది, సమమైనది, మృదు వైనదిగా బ్రాహ్మణుని మేఖల ఉండాలి. మూడు సార్లు చుట్టి ఒకటిగాని మూడుగాని ఐదుగాని ముడులు వేయాలి,అని. మౌంజి లేని పక్షంలో కుశలతో, అశ్మంతకము (గడ్డి)తో, మొదవ గడ్డితో మేఖల చేయాలి. ఇక్కడ ప్రవర సంఖ్య ననుసరించి ముడుల నియమము అని వృద్ధులన్నారు. (ఋషులు) ఇకదండములు – మనువిట్లా – బ్రాహ్మణుడు బిల్వపలాశ దండములను, క్షత్రియుడు వట, చంద్ర దండములను, వైశ్యుడు గౌలుగు, మేడి దండములను ధర్మం ప్రకారం ధరించుటకు అర్హులు,అని. ఇవి లేని పక్షంలో గౌతముడిట్లా – అందరికి (బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులకు) మేడి కర్రతోనే దండము. వాని పొడవు మూర్ధము, నొసలు, నాసాగ్రము వరకు ప్రమాణము,అని. అజినమును గూర్చి ఆశ్వలాయన గృహ్యసూత్రము ఇట్లా చెప్పింది – అహత వస్త్రంతో(ఈషద్ధౌతనవీనవస్త్రం) కప్పబడిన నల్లలేడి చర్మముతో బ్రాహ్మణుని, నల్లచారల దుప్పి చర్మముతో క్షత్రియుని, మేక చర్మముతో వైశ్యుని, అని. ఇక్కడ ఐణేయ శబ్దంతో మృగీచర్మమే చెప్పబడుతుంది, ఏణ్యాః ఢ ఞ్ అని పాణిని సూత్రము, ఐణేయం అనగా ఏడి యొక్క చర్మము మొదలగునవి, ఏణ సంబంధి ఐణము అని ఈ రెండు, మూడు లింగములలో ఉంటాయి అని అమరకోశంవల్ల తెలుస్తోంది. ఐనా నల్ల

దుప్పులు, వాని చర్మములు, అని శంఖోక్తి. అన్నింటి చర్మమైనా రౌరవము అని యమోక్తి కనుక మృగచర్మముతో కూడా (మృగీచర్మము) వికల్పము,అని తెలుసుకోవాలి. వస్త్ర అజినము లందైతే వికల్పము. పత్తితో చేసిన వస్త్రము వికృతంగా (చినిగివగైరా) ఉండరాదు,అని గౌతమోక్తి.

**మూ॥ అథయజ్ఞోపవీతం - మనుః - కార్పాసముపవీతం స్యాత్ విప్రస్యోర్ధ్వ వృతంత్రివృత్. పారిజాతే దేవలః - కార్పాసాక్షౌమ గోవాలశణ బల్వతృణోద్భకం (తృణాదికం. ఆది=దర్భ) యథా సంభవతో ధార్యముపవీతం ద్విజాతిభిః. శుచౌదేశే శుచిః సూత్రం సంహతాంగులిమూలకే, ఆవర్త్యషణ్ణవత్యాతత్ త్రిగుణీకృత్య యత్నతః అబ్ లింగకైః త్రిభిః సమ్యక్ ప్రక్షాల్యోర్ధ్వ వృతం త్రివృత్, అప్రదక్షిణ మావృత్య సావిత్ర్యా త్రిగుణీకృతం. తతః ప్రదక్షిణావర్తం సమం స్యాన్నవ సూత్రకం, త్రిరావేష్ట్యదృఢం బద్ధ్వా బ్రహ్మ విష్ణీశ్వరాన్నమేత్. తన్నవతంతుకార్యం. సావిత్ర్యా త్రిగుణం కుర్యాత్ నవ సూత్రంతు తద్భవేత్, ఇతితేనైవోక్తేః. ఛందోగపరిశిష్టే - త్రివృదూర్ధ్వవృతం కార్యం తంతు త్రయమధోవృతం. త్రివృతంచోపవీతం స్యాత్ తస్యైకో గ్రంధి రిష్యతే. ఊర్ధ్వవృతం దక్షిణం కరమూర్ధ్వం కృత్వావలితం. భృగుః - వామావర్తవలితం త్రిగుణం కృత్వా దక్షిణావర్త వలితం త్రిగుణం కార్యం. స ఏకస్తంతురేవం త్రి తంతుక మిత్యర్థః**

అను॥ ఇక యజ్ఞోపవీతము గూర్చి - మనువిట్లా - బ్రాహ్మణునకు పత్తితో చేసినది యజ్ఞోపవీతము, పై భాగమున చుట్టబడినది, మూడు వరుసలు గలది. (రాజునకు జనపనారది, గొఱ్ఱెది వైశ్యునకు)అని. పారిజాతమందు దేవలుడిట్లా - పత్తి, పట్టు, ఆవు వెంట్రుకలది, నారది, మొదవగడ్డితో చేసినది (ఆది=దర్భవగైరా) ఏది వీలైతే అది బ్రాహ్మణులు ఉపవీతంగా ధరించాలి,అని. శుచియైన ప్రదేశము, శుచియైన దారము అంగుళి మూలమందు గట్టిగా చుట్టి తొంబది ఆరుసార్లు చుట్టి (చేతికి) తిరిగి దానిని ప్రయత్న పూర్వకముగా మూడింతలు చేసి జల సంజ్ఞక మూడు మంత్రములతో బాగా శుద్ధి చేసి ఊర్ధ్వవృత్తము మూడుచుట్లు అప్రదక్షిణముగా చుట్టి సావిత్రితో త్రిగుణముగా చేయాలి. ఆ పిదప ప్రదక్షిణా వర్తము సమముగా నవసూత్రకమౌతుంది. మూడుసార్లు చుట్టి గట్టిగా బంధించి బ్రహ్మ విష్ణు ఈశ్వరులకు నమస్కరించాలి. అది నవతంతు కార్యము. సావిత్రితో త్రిగుణము చేస్తే అది నవసూత్ర మౌతుంది, అని ఆతడే చెప్పాడు. ఛందోగ పరిశిష్ట మందిట్లా - మూడు గాచుట్టబడ్డ, పైకి చుట్టబడ్డ మూడు దారములను క్రిందికి చుట్టాలి. మూడుసార్లు చుట్టబడి అది ఉపవీతమౌతుంది. దానికి ఒక ముడి ఉంటుంది. పైకి చుట్టబడిన దక్షిణ కరమును పైకి చేసి తిప్పండి (ధరించండి) అని. భృగువిట్లా - వామావర్తవలితమును ముబ్బడి (మూడు పోగులు) చేసి దక్షిణావర్తవలితమును త్రిగుణం చేయాలి.అది ఒకే దారము ఇట్లా మూడు దారములు కలదౌతుంది,అని.

**మూ॥ కాత్యాయనః - పృష్ఠదేశే చ నాభ్యాం చ ధృతం యద్విందతేకటిం, తద్ధార్య ముపవీతం స్యాత్ నాతిలంభం నచోచ్ఛ్రితం. వసిష్ఠః - నాభేరూర్ధ్వ మనాయుష్య మధోనాభేస్తపః క్షయః, తస్మాన్నాభి సమం కుర్యాత్ ఉపవీతం విచక్షణః. పారిజాతే దేవలః - ఉపవీతం వటోరేకం**

ద్వేతథే తరయోః స్మృతే, ఏకమేవయతీనాం స్యాత్ ఇతి శాస్త్రస్య నిశ్చయః. స ఏవ-బహూనివా **ఆయుష్కామస్య,** తత్ర మంత్ర మాహ స ఏవ - యజ్ఞోపవీతమితి వా వ్యాహృత్యా వాపి ధారయేత్. హేమాద్రౌ - యజ్ఞోపవీతే ద్వేధార్యే శ్రౌతే స్మార్తే చ కర్మణి, తృతీయముత్తరీయార్థే వస్త్రాభావేతదిష్యతే. దేవలః - సావిత్ర్యా దశకృత్వోఽద్భిః మంత్రితాభిస్తదుక్షయేత్, విచ్ఛిన్నం వాప్యధోయాతం భుక్త్వా నిర్మితముత్సృజేత్. మనుః - మేఖలామజినం దండం ఉపవీతం కమడలుం, అప్సు ప్రాస్య వినష్టాని గృహ్ణీతాన్యాని మంత్రవత్. **అగ్నైతల్లోపే** ప్రాయశ్చిత్తం - మనుః - అకృత్వా భైక్ష్యచరణ మసమిధ్య చపావకం, **అనాతురః** సప్తరాత్ర మవకీర్ణివ్రతం చరేత్. **అమత్యాఆపది త్యాగేతు యాజ్ఞవల్క్యః - భైక్ష్యాగ్నికార్యేత్యక్త్వాతు సప్తరాత్రమ నాతురః, కామావకీర్ణ ఇత్యాభ్యాం జుహుయా దాహుతిద్వయం, ఉపస్థానం తతః కుర్యాత్ సమాసించన్త్వనేనతు. మంత్రాస్తు మితాక్షరాయాంజ్ఞేయాః.**

అను॥ కాత్యాయనుడిట్లా - పృష్ఠదేశమందు, నాభియందు (వరకు) ధరించబడినది కటి ప్రదేశమునకు చేరినది అట్టి ఉపవీతమును ధరించాలి. చాలా పొడుగుది, దీర్ఘమైనది కారాదు,అని. వసిష్ఠుడిట్లా- నాభికి పై భాగంలో ఐతే ఆయునాశకము, నాభికి క్రింది భాగమైతే తపోనాశకము. అందువల్ల విద్వాంసుడు ఉపవీతమును నాభి సమముగా ధరించాలి, అని. పారిజాతమందు దేవలుడిట్లా - వటువునకు ఒక ఉపవీతము. అట్లాగే ఇతరులకు రెండు అని చెప్పబడ్డాయి (క్షత్రియ,వైశ్య). యతికి ఒకటే ఉపవీతము అని శాస్త్ర నిశ్చయము. ఆతడే - ఆయుష్కామునకు చాలా కాని అని, అక్కడ మంత్రాన్ని చెప్పాడు అతడే - యజ్ఞోపవీతం, అని కాని వ్యాహృతులచేత గాని ధరించాలి,అని. హేమాద్రి యందిట్లా-శ్రౌతస్మార్త కర్మలందు రెండు యజ్ఞోపవీతములు ధరించాలి. మూడవది ఉత్తరీయం కొరకు వస్త్రం లేని పక్షంలో అది తగును (ఉపవీతం),అని. దేవలుడిట్లా - సావిత్రి ద్వారా పదిమార్లు మంత్రించబడిన నీటితో దానిని తడపాలి. విచ్ఛిన్నమైన క్రింద పడిన, భుజించాక చేయబడిన దానిని విడువాలి,అని. మనువు ఇట్లా - మేఖల, అజినము, దండము, ఉపవీతము, కమండలువు నష్టమైన వానిని నీటియందు పారవేశి ఇతరమైన వాటిని మంత్రమువలె (తో) స్వీకరించాలి,అని. ఇక ఇవి లోపిస్తే ప్రాయశ్చిత్తమిట్లా - మనువు-భైక్ష్యం ఆచరించకుండా, అగ్నికి సమిధా ధానం చేయకుండా, రోగం లేనివాడై ఏడు రాత్రులు, అవకీర్ణి వ్రతమాచరించాలి,అని. (అహింస, సత్యము, అస్తేయము, అమైథునము, అక్రోధము, గురు శుశ్రూష అప్రమోద, శౌచ ఆహారశుద్ధి ఇవి ఆచరించాలి). తెలివి తక్కువ తనంవల్ల ఆపదయందు వదిలిపెడ్తే యాజ్ఞవల్క్యుడిట్లా - భైక్ష్య అగ్ని కార్యములను వదిలిపెడ్తే ఏడు రాత్రులు అనాతురుడై కామావకీర్ణ అనే మంత్రములతో రెండు ఆహుతులను చేయాలి. పిదప సమాసించంతు, అనే మంత్రంతో ఉపస్థానము చేయాలి. మంత్రముల గూర్చి, మితాక్షరయందు తెలుసుకోవాలి.

**మూ॥ సకృల్లోపేతు ఋగ్విధానే - మానస్తోకే జపేన్మంత్రం శతసంఖ్యం శివాలయే, అగ్నికార్యం వినాభుక్త్వా నపాపం బ్రహ్మచారిణః. స్మృత్యర్థ సారేతు - సంధ్యాగ్ని కార్యలోపే స్నాత్వా**

ష్ట సహస్రం జపః, భిక్షాలోపే అష్టశతం, అభ్యాసే ద్విగుణం పునః సంస్కారశ్చేత్యుక్తం. అపరార్కే సంవర్తః - యః సంధ్యాం చైవనోపాస్తే అగ్నికార్యం యథావిధి, గాయత్ర్యష్ట సహస్రంతు జపేత్ స్నాత్వా సమాహితః. అగ్ని కార్యం సంధ్యాద్వయేకార్యం. అగ్నికార్యం తతః కుర్యాత్ సంధ్యయోరుభయోరపి, ఇతియాజ్ఞవల్క్యోక్తేః. (ఆచారాధ్యాయశ్లోక 25) సాయమేవవా, సాయమేవ వాగ్ని మింధీతే త్యేకే, ఇతి లౌగాక్షిణోక్తేః. పారిజాతే వృద్ధశాతా తపః - బ్రహ్మచారీతుయోఽ శ్నీయాత్ మధుమాంసం తథైవచ,ప్రాజాపత్యం చరేత్ కృచ్ఛ్రం వ్రతశేషం సమాపయేత్. ఋగ్విధానే- తం వోధియాజపేన్మంత్రం లక్షం చైవశివాలయే, బ్రహ్మచారీ స్వధర్మేషు న్యూనంచేత్ పూర్ణమేవతత్. **స్త్రీ సంగేతు** మనుః - అవకీర్ణీతు కాణేన గర్దభేన చతుష్పథే, పాక (స్థాలీ) యజ్ఞవిధానేన యజేత నిరృుతింనిశి. విస్తరస్తు మితాక్షరాదౌజ్ఞేయః.

అను॥ ఒక్కసారిలోపమైతే ఋగ్విధానమందిట్లా - శివాలయమందు మానస్తోకే అనే మంత్రమును నూరుమార్లు జపించాలి. బ్రహ్మచారి అగ్నికార్యం చేయకుండా భుజిస్తే పాపము రాదు,అని. స్మృత్యర్థ సారమందైతే ఇట్లా - సంధ్య అగ్నికార్యముల లోపమైతే స్నానం చేసి ఎనిమిదివేల జపం చేయాలి. భిక్షా లోపమైతే ఎనిమిది నూర్లమార్లు. మళ్ళీ మళ్ళీ ఈ లోపం జరిగితే రెట్టింపు జపము మరి మళ్ళీ సంస్కారము అని అన్నారు,అని. అపరార్కమందు సంవర్తుడిట్లా - ఎవడు సంధ్యను ఉపాసించడో యథావిధి అగ్నికార్యం చేయడో, ఆతడు స్నానం చేసి స్థిరచిత్తుడై గాయత్రిని ఎనిమిది వేల మార్లు జపం చేయాలి, అని. అగ్నికార్యము, రెండు సంధ్యలందు ఆచరించాలి. రెండు సంధ్యలందును పిదప అగ్నికార్యము చేయాలి,అని, యాజ్ఞవల్క్యఉక్తి (ఆచారాధ్యాయ శ్లోకము 25). సాయంకాల మందు కాని, సాయంకాలమందే కాని అగ్నిని జ్వలింపచేయాలి, అని కొందరు,అని లౌగాక్షి చెప్పారు. పారిజాతమందు వృద్ధశాతాతపోక్తి ఇట్లా - బ్రహ్మచారియైనవాడు ఎవడైనా మధు అట్లాగే మాంసము భుజించినట్లైతే ఆతడు కృచ్ఛ్రప్రాజాపత్యమును ఆచరించాలి.వ్రతశేషమును ముగించాలి,అని. ఋగ్విధానమందిట్లా - తంవోధియా అనే మంత్రమును శివాలయమందు లక్షసార్లు జపంచేయాలి. బ్రహ్మచారి స్వధర్మమందు లోపమాచరిస్తే అది పూర్ణమౌతుంది,అని. స్త్రీ సంగమందైతే మనువిట్లా - అవకీర్ణి (స్త్రీ సంగమం పొందిన బ్రహ్మచారి,అని) ఐతే ఒంటికన్ను గాడిదతో చతుష్పథ మందు (ఉండాలి). పాక (స్థాలి) యజ్ఞవిధానంతో రాత్రిపూట నిరృుతుని గూర్చి హోమం చేయాలిఅని. విస్తారంగా ఐతే మితాక్షరాదులందు తెలుసుకోవాలి.

మూ॥ **ఉపవీతనాశేతు హారీతః** - మనోజ్యోతిరిత్యేకా. త్వమగ్నే వ్రతపా అసి ఇతి తిస్రః, ఆజ్యాహుతీర్హుత్వా పునః ప్రతీయాత్. తత్రైవ మరీచిః - బ్రహ్మ సూత్రం వినాభుంక్తే విణ్ మూత్రం కురుతేఽథవా. గాయత్ర్యష్ట సహస్రేణ ప్రాణాయామేన శుద్ధ్యతి. మనుః - భోః శబ్దం కీర్తయేదంతే స్వస్య నామ్నోఽభివాదనే, ఆయుష్మాన్ భవసౌమ్యేతి వాచ్యో విప్రోఽ భివాదనే. అకారశ్చాస్యనామ్నోంతే వాచ్యః పూర్వాక్షరః ప్లుతః, శర్మన్నితి నకారాత్పూర్వ ఇత్యర్థః

**అభివాదన ప్రత్యభివాదనాదౌ విశేషః స్మృత్యర్థ సారే పారిజాతాదౌ జ్ఞేయః. యమః** - జ్యాయానపి కనీయాంసం సంధ్యాయా మభివాద యేత్, వినాశిష్యం చ పుత్రం చ దౌహిత్రం దుహితుః పతిం. **అథపునరుపనయనం** - పారిజాతే శాతాతపః - లశునం గృంజనం జగ్ధ్వాపలాండుం చతథాశునం, ఉష్ట్ర మానుషకేభాశ్వరాసభీ క్షీర భోజనాత్, ఉపాయనం పునః కుర్యాత్ తప్తకృచ్ఛ్రం చరేన్ముహుః, ఇతి. హేమాద్రౌ వృద్ధమనుః - **జీవన్యదిసమాగచ్ఛేత్** ఘృతకుంభే నిమజ్జ్యచ, ఉద్ధృత్య స్నాపయిత్వాస్య జాతకర్మాదికారయేత్. తత్రైవ పాద్మే - **ప్రేతశయ్యా** ప్రతిగ్రాహీ పునః సంస్కార మర్హతి. చంద్రికాయాం బౌధాయనః - సింధుసౌవీర సౌరాష్ట్రాన్ తథా ప్రత్యంతవాసినః అంగవంగకలింగాంధ్రాన్ గత్వా **సంస్కారమర్హతి.** హేమాద్రౌ ప్రాయశ్చిత్త కాండే వృద్ధగౌతమః-ఖరముష్ట్రం చ మహిష మనడ్వాహ మజం తథా, బస్తమారుహ్యా ముఖజః క్రోశేచాంద్రం వినిర్దిశేత్. మార్కండేయః - ఖరమారుహ్యా విప్రస్తుయోజనం యదిగచ్ఛతి, తప్త కృచ్ఛ్రత్రయం ప్రోక్తం శరీరస్య విశోధనం, పునర్జన్మ ప్రకుర్వీత ఘృతగర్భవిధానతః. మదనరత్నే మితాక్షరాయాం చ స్నానమాత్రముక్తం. మనుః - అజ్ఞానాత్ప్రాశ్య విణ్మూత్రం సురా సంసృష్టమేవ చ పునః సంస్కార మర్హంతి త్రయోవర్ణాద్విజాతయః.

అను॥ ఉపవీతం నాశమైతే మాత్రం హారీతుడిట్లా - మనోజ్యోతిరనే మంత్రంతో ఒక ఆహుతి, త్వమగ్నే వ్రతపా అని అనేదానితో మూడుసార్లు ఆజ్యాహుతులిచ్చి తిరిగి యజ్ఞోపవీతం ధరించాలి,అని. అక్కడే మరీచి ఇట్లా - బ్రహ్మ సూత్రము లేకుండా భుజిస్తే, లేదా మలమూత్రము లాచరిస్తే అతడు ఎనిమిది వేలమార్లు గాయత్రి జపిస్తే, ప్రాణాయామం చేస్తే పరిశుద్ధు డౌతాడు,అని. మనువిట్లా - నమస్కరించేప్పుడు తనపేరు, చివర భోః శబ్దాన్ని పలకాలి. విప్రుడు, నమస్కారం చేయగా ఓసౌమ్య ! ఆయుష్మంతుడవుకా అని ఆశీర్వదించాలి. (అభివాదయే శుభశర్మాహంభో! అనగా ఆయుష్మాన్ భవసౌమ్య అనాలి). ఈతని పేరు చివర అకారం చెప్పాలి. దాని పూర్వాక్షరము ప్లుతమౌతుంది,అని. శర్మన్ అనే నకారానికి పూర్వము అని అర్థము. (శర్మా). అభివాదన ప్రత్యభివాద నాదులందు విశేషాన్ని స్మృత్యర్థసార మందు పారిజాతాదులందు తెలుసుకోవాలి. యముడిట్లా - పెద్ద వాడైనా చిన్నవాణ్ణి సంధ్యయందు (సమయ) నమస్కరించాలి. శిష్యునకు, కొడుకునకు, దౌహిత్రునకు, కూతురు భర్తకు వీరికి నమస్కరించరాదు అని. ఇక పునరుపనయనము - పారిజాత మందు శాతాతపోక్తి ఇట్లా - వెల్లుల్లి, గాజరగడ్డ (ఎర్రగడ్డ లేదా గంజాయి ఆకు), నీరుల్లి (లేదా, వెల్లుల్లి లాంటి స్థూలకంద)తిని, ఆడకుక్క,ఒంటె, స్త్రీ, ఆడేనుగ, ఆడ గుఱ్ఱము, ఆడ గాడిద వీటిపాలను తాగిన యెడల ఉపనయనము తిరిగి చేయాలి. మరల మరల తప్త కృచ్ఛ్ర మాచరించాలి,అని. హేమాద్రి యందు వృద్ధ మనువు ఇట్లా - బ్రతికి ఉండి తిరిగి వస్తే నీటికడవ యందు ముంచి తీసి స్నానం చేయించి అతనికి జాతకర్మాదులు చేయించాలి,అని. అక్కడే పాద్మమందిట్లా - ప్రేతశయ్యను దానం తీసుకున్నవాడు తిరిగి సంస్కారాన్ని పొందాలి,అని. చంద్రికయందు బౌధాయనుడిట్లా - సింధు, సౌవీర,

సౌరాష్ట్ర దేశములకు అట్లాగే దగ్గరలో ఉండే అంగవంగ కళింగ ఆంధ్ర రాష్ట్రములకు వెళ్ళిన యెడల తిరిగి సంస్కారాన్ని పొందాలి,అని. హేమాద్రి యందు ప్రాయశ్చిత్త కాండ మందు వృద్ధ గౌతముడిట్లా - గాడిద, ఒంటె, దున్నపోతు, ఎద్దు, మేకపోతు, పొట్టేలు, వీటిని ఎక్కి కోసుదూరంపోయినచో బ్రాహ్మణుడు చాంద్రాయణ మాచరించాలి, అని. మార్కండేయుడిట్లా-విప్రుడుగాడిదపై ఎక్కి యోజనదూరంప్రయాణిస్తే మూడుతప్తకృచ్ఛ్ర ములతో శరీరశోధనము అని చెప్పబడింది. ఘృతగర్భవిధానముతో పునర్జన్మచేయాలి. మదనరత్న మితాక్షరములందు స్నానం మాత్రం చెప్పబడింది. మనువు ఇట్లా - తెలియక, మలమూత్రములతో సురతో తాకబడిన దానిని తాగితే మూడు వర్ణముల వారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు తిరిగి సంస్కారానికి అర్హులౌతారు,అని.

**మూ॥ మితాక్షరాయాం పరాశరః - యః ప్రత్యవసితో విప్రః ప్రవ్రజ్యాతో వినిర్గతః, అనాశక నివృత్తశ్చ గార్హస్థ్యంచేచ్ఛికీర్షతి. స చరేత్ త్రీణికృచ్ఛ్రాణి త్రీణి చాంద్రాయణానిచ, జాతకర్మాదిభిః సర్వైః సంస్కృతః శుద్ధి మాప్నుయాత్. బౌధాయన సూత్రే-అథోపనీతస్య వ్రతాని భవన్తి నాన్య స్యోచ్ఛిష్టం భుంజీతాన్యత్ర పితృజ్యేష్ఠాభ్యాం, న స్త్రియా సహ భుంజీత, మధుమాంస శ్రాద్ధ సూతకాన్నాని, దశాహ సంధినీ క్షీరం ఛత్రాకనిర్యాసౌ, విలాపనం గణాన్నం, గణికాన్నమితి. ఏతేషు పునః సంస్కారః. ప్రతిషిద్ధ దేశగమన మిత్యేకే. అథా ప్యుదాహరంతి - సురాష్ట్రసింధుసౌ వీరమవంతీం దక్షిణాపథం, ఏతాని బ్రాహ్మణోగత్వా పునః సంస్కారమర్హతి.**

అను॥ మితాక్షరయందు పరాశరుడిట్లా - ఏ విప్రుడు సన్యాసము అనుభవించి, సన్యాసము నుండి తిరిగి రాదలుస్తాడో, అనాశకుడై (యథేచ్ఛభోగశూన్యతవల్ల) మరలి వస్తాడో వచ్చి గార్హస్థ్యం ఆచరించాలనుకుంటాడో, ఆతడు మూడు కృచ్ఛ్రములు, మూడు చాంద్రాయణములు ఆచరించాలి. జాతకర్మాది సకల కర్మలతో సంస్కృతుడైతే శుద్ధిని పొందుతాడు,అని. బౌధాయన సూత్రమందిట్లా - ఇక ఉపనీతునకు వ్రతములు ఉంటాయి. తండ్రి, పెద్దన్న వీరిని వదలి ఇతరుల ఉచ్ఛిష్టాన్ని భుజించరాదు. స్త్రీతో కలిసి భుజించరాదు. మధు మాంస,శ్రాద్ధ, సూతకాన్నములు, పదిరోజుల సంధినీ (ఎద కొచ్చిన ఆవు, అకాలంలో పాలిచ్చేది) పాలు, పుట్టగొడుగు, జిగురు,దుఃఖపూర్ణమైన మాటలను వినుట, సమూహమునకు చెందిన అన్నము (ధనము), వేశ్యాన్నము ఇవన్నీ తినరాదు. తింటే తిరిగి సంస్కారము చేయాలి,అని. ప్రతిషిద్ధ దేశ గమనమని కొందరన్నారు. (అట్లాగైతే సంస్కారము). ఇంకా ఉదహరిస్తారు. సురాష్ట్ర సింధుసౌ వీరములు, అవంతి దక్షిణాపథము ఈ ప్రదేశములకు బ్రాహ్మణుడు వెళ్తే తిరిగి సంస్కారాన్ని పొందాలి,అని.

**మూ॥ అథపునస్సంస్కారం వ్యాఖ్యాస్యామో దేవయజన ప్రభృతి అగ్ని ముఖాత్ కృత్వా పాలాశీం సమిధమాజ్యేనాక్త్వాభ్యాధాయ వాచయతి - పునస్త్వాదిత్యా రుద్రా వసవః - కామాః స్వాహా ఇతి. అథవ్రాత్యప్రాయశ్చిత్తే జుహోతి యన్మ ఆత్మానో మిందా భూయాత్ - పునరగ్నిశ్చక్షురదా దితి ద్వాభ్యాం. అథపక్వాజ్జుహోతి - సప్తతే అగ్నే సమిధః సప్తజిహ్వాః సప్త - ఘృతేన, స్వాహా, ఇతి. అథాజ్యాహుతీ రుపజుహోతి - యేనదేవాః పవిత్రేణేతి తిసృభిరనుచ్ఛందసీం స్విష్టకృత్రభృతి**

సిద్ధమాధేను వర ప్రదానాత్ అథా పరమా పరిదానాత్ కృత్వా పాలాశీం సమిధా మాధాయాథ వ్రాత్యవత్ ప్రాయశ్చిత్తే జుహోత్యథ వ్యాహృతీర్జుహోతి. అథాపరో బ్రాహ్మణ వచనా దేవ సావిత్ర్యా శతకృత్వో ఘృతమభిమంత్ర్య ప్రాశ్యకృత ప్రాయశ్చిత్తో భవతి. గురోర్వా పృచ్ఛిష్టం భుంజీత. అథాప్యుదాహరంతి వపనం దక్షిణాదానం మేఖలాదండమజిన భైక్ష్యచర్యావ్రతాని చ నివర్తంతే పునః సంస్కార కర్మణి,ఇతి. ఆశ్వలాయన గృహ్యేఽపి – అథోపేతపూర్వస్య ఇత్యాదినా పునః సంస్కారః ఉక్తః. తథాపిత్రాది వ్యతిరేకేణ బ్రహ్మచారిణః ప్రేతకర్మకరణే పునరుపనయన మిత్య పరార్కాదయః. త్రిస్థలీసేతౌ – కర్మనాశాజల స్పర్శాత్ కరతోయావిలంఘనాత్, గండకీ బాహు తరణాత్ పునః సంస్కార మర్హతి. గౌడాస్తు – కరతోయా జల స్పర్శాత్ కర్మనాశావిలంఘనాత్, ఇతి పఠంతి. తన్న. దానధర్మేషు కరతోయాస్నానే ప్రాశస్త్యోక్తేః.

అను॥ ఇక పునస్సంస్కారాన్ని గూర్చి వ్యాఖ్యానిస్తాము దేవయజనం మొదలుకొని అగ్ని ముఖపర్యంతము ఆచరించి మోదుగ సమిధను నేయిలో ముంచి, అగ్నిలో ఉంచి ఇట్లా చదవాలి – పునస్త్వాదిత్యారుద్రావసవః – కామాః స్వాహా,అని. ఇక వ్రాత్య ప్రాయశ్చిత్త మందు (ఉపనయనాది సంస్కారములేని బ్రాహ్మణుడు లోనగువాడు) ఇట్లా హోమం చేయాలి – యన్మ ఆత్మానోమిందాభూత్; పునరగ్నిశ్చక్షురదాదితి రెండు మంత్రాలతో. ఇక చరువుతో హోమం చేయాలి ఇట్లా – సప్తతే అగ్నే సమిధః సప్తజిహ్వాః సప్త – ఘృతేనస్వాహా,అని. ఇక ఆజ్య ఆహుతులతో హోమం చేయాలి ఇట్లా – యేనదేవాః పవిత్రేణ అను మూడు మంత్రము లతో, వేదమంత్రములతో స్విష్టకృత్ మొదలగునవి, సిద్ధము(తో) (వండబడినది) ఆధేను వర ప్రదానము వరకు, ఇక ఆ పరమాపరిదానము వరకు చేసి, పలాశసమిధను హోమంచేసి, ఇక వ్రాత్యునకువలె ప్రాయశ్చిత్తమందు హోమం చేయాలి. ఇక వ్యాహృతి హోమం చేయాలి. ఆ పిదవ మరొకటి బ్రాహ్మణ వచనంతోనే సావిత్రి, (గాయత్రి) మంత్రంతో నూరుమార్లు నేయిని అభిమంత్రించి, తాగి, ప్రాయశ్చిత్తం చేయబడిన వాడౌతాడు. గురువుగారి ఉచ్ఛిష్టము కాని భుజించాలి. ఇంకా ఉదహరిస్తారు – క్షౌరము, దక్షిణాదానము, మేఖల, దండము, అజిన, భైక్ష్యచర్య, వ్రతములు కూడా తిరిగి చేసే సంస్కార కర్మలో ఉండవు. ఆశ్వలాయన గృహ్యమందు కూడా – ఇక ఇది వరకే ఉపనయన సంస్కారం పొందిన వానికి అని మొదలుగా తిరిగి సంస్కారము చెప్పబడింది. అట్లాగే పిత్రాదులకు వ్యతిరేకముగా బ్రహ్మచారులు ప్రేత కర్మ చేస్తే తిరిగి ఉపనయనం చేయాలి అని అపరార్కాదులు,అని. త్రిస్థలీ సేతువు యందిట్లా – కర్మనాశానదీ జలస్పర్శచేస్తే, కరతోయా నదిని దాటితే గండకీనదిని బాహువుల ద్వారా (ఈది) దాటితే తిరిగి సంస్కారాన్ని పొందాలి,అని. గౌడులైతే ఇట్లా – కరతోయా నదీ జల స్పర్శచేస్తే, కర్మ నాశ నదిని దాటితే,అని, చదువుతారు. కాని అట్లా కాదు. దాన ధర్మములందు కరతోయానదీస్నానము ప్రశస్తమైందని చెప్పారు.

మూ ॥ కరతోయే సదా నీరే సరిత్ శ్రేష్ఠేతి విశ్రుతే, ఆ ప్లావయసి పౌరాణాం పాపం హరకరోద్భవే, ఇతి స్మృతి దర్పణ చంద్రికా లిఖితస్నానమంత్రాచ్చ. పరాశరః – అజినం మేఖలా దండో భైక్ష్యచర్యా వ్రతానిచ, నివర్తంతే ద్విజాతీనాం పునః సంస్కారకర్మణి. హరదత్తస్తు – య ఏకం వేద మధీత్యాన్యం వేదం అధ్యేతు మిచ్ఛతి తస్య పునరుపనయనం, తేన ప్రతివేద ముపనయనం

కర్తవ్యం ఇత్యాహ. అన్యే న తన్మన్యంతే. సర్వేభ్యో వైవేదేభ్యః సావిత్ర్యనూచ్యతే ఇత్యాపస్తంబోక్తేః. తద్విధిః కారికాయాం - వేదాంతరమధీత్యైవ ఋగ్వేదం యేత్వధీయతే, ఉపనీతి రియం తేషా మలంకరణ వర్జితా. యద్వై తదుపనీతస్య ప్రాయశ్చిత్తం యదాభవేత్, కృతాకృతం చ వపనం మేధా జనన మేవచ. మేధా జనన సద్భావే వ్రతచర్యా భవేదిహ, అనుప్రవచనీయం చ తదభావేద్వయం నహి. పరిదానంన కార్యం స్యాత్ నిమిత్తానంతరం త్విదం, పూర్వస్యా వాచయేత్ స్థానే తత్ సవితుః వృణీమహే,ఇతి. యత్తు హారీతః - ద్వివిధాః స్త్రియః బ్రహ్మావాదిన్యః సద్యోవధ్వశ్చ. తత్ర బ్రహ్మా వాదినీనాం ఉపనయన మగ్నీంధనం వేదాధ్యయనం స్వగృహేచ భైక్ష్యచర్యా,ఇతి, సద్యో వధూనాముపనయనం కృత్వా వివాహః కార్యః ఇతి. తద్యుగాంతర విషయం. పురాకల్పేషు నారీణాం మౌంజీబంధన,మిష్యతే,అధ్యాపనం చ వేదానాం సావిత్రీవాచనం తథా,ఇతియమోక్తేః.

అను॥ స్మృతి దర్పణము, చంద్రికయందు ప్రాయబద్ధ స్నానమంత్రము ఇట్లా - నదులలో శ్రేష్ఠమైన మిక్కిలి విశాలమైన ఎప్పుడూ నీరు గల కరతోయ నదీ తెప్పలా తేలుస్తున్నావు. ఓకరోద్భవ! పౌరుల పాపమును హరించు,అని. పరాశరుడిట్లా - అజినము, మేఖల, దండము, భిక్షాచర్య, వ్రతములు ఇవి ద్విజాతులకు మళ్ళీ చేసే సంస్కార కర్మ యందు ఉండవు,అని. హరదత్తుడైతే - ఎవడైతే ఒక వేదాన్ని చదివి, మరోవేదాన్ని చదువుటకు ఇష్టపడుతాడో, వానికి తిరిగి ఉపనయనము. అందువల్ల ప్రతివేదమునకు ఉపనయనం చేయాలి, అని అన్నాడు. ఇతరులు దానిని అంగీకరించటం లేదు. వేదములన్నింటికి సావిత్రి మంత్రం వెంట చెప్పబడింది,అని ఆపస్తంబోక్తి. దాని విధి కారికయందిట్లా - ఇతర వేదమును చదివి ఋగ్వేదమును ఎవరు చదువుతారో వారికి అలంకరణం లేకుండా ఈ ఉపనయనము, అని. లేదా ఆ ఉపనీతునకు ప్రాయశ్చిత్తం ఒకవేళ జరిగితే అప్పుడు వపనము మేధా జనన సంస్కారము చేస్తే అది చేసీ చేయనట్టే. మేధా జనన సంస్కారము జరిగితే ఇక్కడ అది వ్రతచర్య ఔతుంది. మరి అను ప్రవచనీయం కూడా ఔతుంది. (వటువుతో చెప్పించుట). అది లేకపోతే (మేధా సంస్కారం) రెండు లేవు (వ్రతచర్య ప్రవచనీయ). పరిదానం చేయరాదు. (కస్య బ్రహ్మచార్య సీత్యాది పరిదదామీతి వరకు పరిదానం). ఇది వేరొక నిమిత్తం కలది. ముందు దాని స్థానంలో, తత్స వితుర్ వృణీమహే, అని పలికించాలి,అని. హారీతుడు - స్త్రీలు రెండు రకాలు బ్రహ్మ వాదినులు, సద్యోవధువులు. అక్కడ బ్రహ్మావాదినులకు ఉపనయనము, అగ్నీంధనము, వేదాధ్యయనము, స్వగృహమందు భిక్షాచర్య,అని. సద్యో వధువులకు ఉపనయనం చేసి వివాహం చేయాలి,అని. ఇది మరో యుగమునకు చెందిన విషయము. పురాకల్పములందు స్త్రీలకు మౌంజీబంధనము, వేదములను చదివించుట అట్లాగే సావిత్రిని ఉపదేశించుట ఉండేవి, అని యమోక్తి.

**మూ॥ అథ అనధ్యాయాః - పారిజాతేహారీతః - ప్రతిపత్సు చతుర్దశ్యాం అష్టమ్యాం పర్వణోర్ద్వయోః శ్వోఽనధ్యాయేఽద్య శర్వర్యాం నాధీయీత కదాచన. నారదః- అయనే విషువే చైవ శయనే బోధనే హరేః, అనధ్యాయస్తు కర్తవ్యో మన్వాదిషు యుగాదిషు, నిర్ణయామృతే - చాతుర్మాస్య ద్వితీయాసు మన్వాదిషు యుగాదిషు, అనధ్యాయస్తు కర్తవ్యో యాచ సోపపదాతిథిః**

గర్గః - శుచావూర్జే తపస్యే చ యాద్వితీయా విధుక్షయే, చాతుర్మాస్య ద్వితీయాస్తాః ప్రవదంతి మనీషిణః. స్మృత్యర్థ సారేఽపి - ఆషాఢీ కార్తికీ ఫాల్గునీ సమీపస్థ ద్వితీయాసుచ, ఇతి. మనుః - ఉపా కర్మణి చోత్సర్గే త్రిరాత్రం క్షపణం స్మృతం, అష్టకాసు త్వహోరాత్రం ఋత్వన్తాసు చ రాత్రిషు,ఇతి. ఉత్సర్గేతు-మనూక్త పక్షిణ్యహోరాత్రాభ్యాం త్ర్యహస్య వికల్పః, ఇతి, విజ్ఞానేశ్వరః. అష్టకాశబ్దేన సప్తమ్యాదిత్రయం జ్ఞేయం. తిస్రోష్టకాః త్రిరాత్రం అంత్యా మేకే, (ఇతి గౌతమోక్తేః ఋత్వన్తా స్వితి సౌర ఋత్వంతాసు, చాంద్రాంతస్య పర్వత్వే నైవ నిషేధ సిద్ధేః) ఇతి సర్వజ్ఞ నారాయణః. ఏతే నిత్యాః.

అను॥ ఇక అనధ్యాయములు - పారిజాతమందు హారీతుడిట్లా - ప్రతి పదలందు, చతుర్దశియందు, అష్టమియందు, అమావాస్య, పూర్ణిమలందు, రేపు అనధ్యాయమైతే ఈ రాత్రి యందు ఎప్పుడూ చదువరాదు,అని. నారదుడిట్లా - అయన మందు, విషు వత్తు లందు విష్ణువు యొక్క శయన, ఉత్థాన తిథులందు, మన్వాదులందు, యుగాదులందు అనధ్యాయము పాటించాలి,అని. నిర్ణయామృతమందిట్లా - చాతుర్మాస్య ద్వితీయా తిథులందు, మన్వాదులందు, యుగాదులందు, సోప పద తిథి యందు అనధ్యాయ మాచరించాలి,అని. గర్గుడిట్లా - ఆషాఢ, కార్తిక, ఫాల్గుణ మందలి కృష్ణపక్ష ద్వితీయలు వానిని చాతుర్మాస్య ద్వితీయలు అని మనీషులన్నారు. అవి అనధ్యాయములు,అని. స్మృత్యర్థ సారమందు కూడా - ఆషాఢ కార్తిక, ఫాల్గుణ సమీపస్థ ద్వితీయలందు కూడా అని. మనువిట్లా - ఉపాకర్మయందు ఉత్సర్గమందు మూడు రాత్రులు (అశుచి) అనధ్యాయ మౌతుంది. అష్టకములందు అహోరాత్రము, ఋతు అంతములందు, రాత్రులందు అనధ్యాయము,అని. ఉత్సర్గమందైతే - మనువు చెప్పిన పక్షిణీ అహోరాత్రములతో మూడు దినములు వికల్పమౌతుంది,అని విజ్ఞానేశ్వరుడు. అష్టకాశబ్దంతో సప్తమి ఆది మూడు అష్టకములు గ్రహించాలి. మూడు అష్టకములు, మూడు రాత్రులు కొందరు అంత్యాన్ని కూడా గ్రహిస్తారు. (అని గౌతమోక్తి. ఋత్వంతములని చెప్పినది సౌర ఋతు అంతము లందు. చంద్రాంతమునకు పర్వం అనటంవల్లనే నిషేధం సిద్ధిస్తుంది కదా) అని సర్వజ్ఞ నారాయణుడు. ఇవి నిత్యమైనవి.

మూ ॥ నైమిత్తికాన ప్యాహ యాజ్ఞవల్క్యః - త్ర్యహం ప్రేతేష్వనధ్యాయః శిష్యర్త్విగ్గురు బంధుషు, ఉపాకర్మణి చోత్సర్గే స్వశాఖాశ్రోత్రియే తథా. సంధ్యా గర్జిత నిర్ఘాత భూకంపోల్కానిపాతనే, సమాప్య వేదంద్యునిశ మారణ్య కమధీత్యచ. పంచదశ్యాం చతుర్దశ్యా మష్టమ్యాం రాహుసూతకే, ఋతు సంధిషు భుక్త్వా వాశ్రాద్ధికం ప్రతి గృహ్యాచ. పశుమండూక నకుల శ్వాహి మార్జార మూషకైః, కృతేఽంతరే త్వహో రాత్రం శక్రపాతే తథోచ్ఛ్రయే. గ్రహణేద్యు నిషోక్తా వపిగ్రస్తాస్తే త్ర్యహమిత్యుక్తం ప్రాక్. (యాజ్ఞవల్క్య ఆచారాధ్యాయే శ్లోక 144-151).స్మృత్యర్థ సారేతు - రాత్రౌతు గ్రహోత్రిస్రో రాత్రీః, దివాచ త్ర్యహం ఇత్యుక్తం. ఋతుః = సౌరః. భుక్త్వేత్యుత్సవ విషయం. ఊర్ధ్వం భోజనాదుత్సవే, ఇతి గౌతమోక్తేః శ్రాద్ధికం మప్యైకోద్దిష్టభిన్నం. తత్ర తుత్ర్యహమితి మనుః. స్మృత్యర్థసారే నైవం. యత్తు - పశ్వాద్యంతరాయే త్ర్యహముపవాసో విప్రవాసశ్చ, ఇతి

గౌతమోక్తం, తత్రృథ మాధ్యయనే. యాజ్ఞవల్క్యః - శ్వక్రోష్ట గర్ద భోలూక సామ బాణార్త నిః స్వనే, అమేధ్య శవ శూద్రాంత్య శ్మశాన పతితాంతికే. దేశేఽ శుచావాత్మని చ విద్యుత్ స్తనిత సంప్లవే, భుక్త్వార్ద్రపాణి రంభోంత రర్ధరాత్రేఽ తిమారుతే. పాంశు ప్రవర్షే దిగ్దాహే సంధ్యానీహార భీతిషు, ధావతః పూతి గంధేచ శిష్టేచ గృహమాగతే. ఖరోష్ట్రయాన హస్త్యశ్వనౌ వృక్షేరిణ రోహణే, సప్తత్రింశ దనధ్యాయానేతాంస్తా త్కాలికాన్ విదుః. బాణో= వంశః. శతతంతుర్వీణేతి హరదత్తః అమేధ్యాః= సూతికాదయః. స్తనితః = గర్జః. వర్షాతోఽన్యత్ర గర్జవృష్టివిద్యుతాం యౌగపద్యే ఆకాలికః వర్షాసుతాత్కాలిక ఇతి నారాయణః. (ఐతరేయోపనిషది అపర్త్రౌ వర్షే త్రిరాత్రమితి మృగాదిశ్యేష్మాంతం వర్షర్తుః తం వినావర్షా దౌత్రి రాత్ర మనధ్యాయ ఇతి వేదభాష్యే ఉక్తం).

అను॥ యాజ్ఞవల్క్యుడు నైమిత్తిక అనధ్యాయములనిట్లా చెప్పాడు - శిష్య, ఋత్విక్, గురు, బంధువులు మరణిస్తే మూడు రోజులు అనధ్యాయము. ఉపాకర్మ, ఉత్సర్గము, స్వశాఖాశ్రోత్రియుడు మరణిస్తే, సంధ్యాకాలమందు మేఘగర్జన, పిడుగుపాటు, భూకంపము, తోకచుక్క పడటము జరిగితే వేదపఠనం ఆపివేసి రాత్రింబగళ్ళు ఆరణ్యకము చదవాలి. అనధ్యాయ మౌతుంది. అమావాస్య, పూర్ణిమ, చతుర్దశి, అష్టమి, రాహుగ్రహణము, ఋతుల సంధికాలం, ఉత్సవ భోజనం చేశాక లేదా శ్రాద్ధ ప్రతి గ్రహం చేశాక పశువు కప్ప, ముంగిస, కుక్క, పాము, పిల్లి, ఎలుక వీటితో అంతరాయం కలిగితే (మధ్య నుండి పోవటం భేదం) అహోరాత్రము అనధ్యాయము. ఇంద్ర ధనువు దింపితే అది ఎత్తితే అహోరాత్రము అనధ్యాయము. భాద్రపద పౌర్ణమాసిన శక్రయష్టి నిపాతనము భాద్రపద ద్వాదశి, శుక్లపక్షం, ఉత్తరాషాఢ శ్రవణ, ధనిష్ఠ నక్షత్రములలో శక్ర (ఇంద్రుని) యష్టిస్థాపనము. గ్రహణ మందు పగలు రాత్రి అని చెప్పబడ్డా గ్రస్తాస్త మందు (గ్రహణం) మూడు రోజులని ముందే చెప్పారు. (యాజ్ఞవల్క్యని ఆచారాధ్యాయమందలి శ్లో॥ 144 - 151). స్మృత్యర్థసారమందైతే - రాత్రి గ్రహణమైతే మూడు రాత్రులు పగలైతే మూడు రోజులు అని చెప్పారు. ఋతువు అనగా సౌర ఋతువు. భుక్త్వా అనునది ఉత్సవ విషయము. భోజనం కన్న ముందు ఉత్సవ మందు (వివాహ ఉపనయన) అని గౌతమోక్తి. మహత్ ఏకోద్దిష్టములకన్న, పార్వణ శ్రాద్ధ సంబంధి ఆబ్దికము భిన్నమైనది. అక్కడైతే మూడు రోజులు అని మనువు. స్మృత్యర్థ సారమందు కూడా ఇట్లాగే ఉంది. పశ్వాది అంతరాయమందు మూడు రోజులు ఉపవాసము, విప్రవాసము,అని గౌతముడు చెప్పినదైతే తొలి అధ్యయనమందు అని గ్రహించాలి. యాజ్ఞ వల్క్యుడిట్లా - కుక్క, నక్క, గాడిద, గుడ్లగూబ, సామగానమందు మరోవేద ధ్వని బాణము (వేణువు) ఆర్తుడైనవాడు వారి ధ్వని విన్నప్పుడు అట్లాగే అశుచి, శూద్రుడు, శవము, అంత్యజుడు, శ్మశానము పతితుడు వీరిదగ్గర, అశుచి ప్రదేశమందు, అశుచి ఆత్మ ఐనప్పుడు, మెరుపు, మేఘగర్జన, అధికమైనవేళ, భుజించాక చేయి తడిగా ఉన్నప్పుడు, నీటిమధ్య, అర్ధరాత్రమందు, బాగా గాలి వీస్తున్నప్పుడు, దుమ్ము రేగినవేళ, దిక్కులు దహించినవేళ, సంధ్యాకాలము, మంచు సమయము, భయపడుతున్నవేళ, పరుగెత్తుతున్నప్పుడు, దుర్గంధ మందు, శిష్టులు ఇంటికి వచ్చినవేళ అనధ్యాయము,అని. గాడిద, ఒంటె, (కట్టిన)బండి,

ఏనుగ, గుఱ్ఱము, నావ, వృక్షము, చవిటినేల వీటిపై ఎక్కిన, నడచిన అనధ్యాయము ఇవి ముప్పది ఏడు అనధ్యాయములు. వీటిని తాత్కాలికమైనవిగా తెలుసుకోవాలి. బాణము అనగా వంశము. నూరు తంతులు గల వీణ అని హరదత్తుడు. అమేధ్యమనగా సూతికాదులు. స్తనితము అనగా మేఘ గర్జనము. వర్షాకాలం కానప్పుడు గర్జన, వర్షము, మెరుపు ఇవి ఒకేసారి ఏర్పడితే అకాలికము, వర్షములందైతే తాత్కాలిక అనధ్యాయ మని నారాయణుడు అన్నాడు. (ఐతరేయోపనిషత్తు యందు అపరుతువుయందు వర్షంవస్తే మూడు రాత్రులు, అనధ్యాయము,అని. మృగశిరకార్తి నుండి జ్యేష్ఠ కార్తి చివరి వరకు వర్షర్తువు. అది కాకుండా వర్షాది యందు మూడు రాత్రులు అనధ్యాయమని వేదభాష్యంలో చెప్పబడింది).

మూ ॥ సంధ్యాగర్జితేతుహారీతః - సాయం సంధ్యాస్తనితే రాత్రిః, ప్రాతః సంధ్యాస్త నితే_హోరాత్రం, రాత్రౌ, విద్యుత్యే పరరాత్ర్యవధిః, విద్యుతి నక్తం చా పరరాత్రాత్ ఇతి గౌతమోక్తేః . తృతీయదినాం శోత్తరంతు, విద్యుతి సర్వరాత్రం, ఇత్యాహస ఏవ. త్రిభాగాది ప్రవృత్తౌ సర్వమితి, అర్ధరాత్రే మధ్యయామద్వయే ఇతి విజ్ఞానేశ్వరః. మధ్య దండ చతుష్టయ ఇతి నిర్ణయామృతే. మనుః - పలివాదే నకలహే నసే నాయాం న సంగరే, నభుక్త మాత్రేనాజీర్ణే న వమిత్వాన సూతకే, రుధిరేవస్రుతే గాత్రాత్ శస్త్రేణ చ పరిక్షతే. కౌర్మే-శ్లేష్మాంతకస్య ఛాయాయాం శాల్మలే ర్మధుకస్య చ, కదా చిదపి నాధ్యేయం కోవిదారకపిత్థయోః. మనుః - శయానః ప్రౌఢపాదశ్చ కృత్వా చైవావ సక్థికాం, నాధీయీతామిషం జగ్ధ్వా సూతకాన్నాద్యమేవచ, ప్రౌఢపాదః పాదోపరిపాద దాతా ఆసనారూఢపాదో వేతి హరదత్తః. సోప పదాస్వపి ప్రాగుక్తం. స్మృత్యర్థసారే - శ్రవణ ద్వాదశీ మహా భరణ్యోః ప్రేత ద్వితీయాయాం రథ సప్తమ్యామా కాశే శవదర్శనే చాహోరాత్రమ్. అనుపిండేగురౌమృతే త్రిరాత్రం. ఆచార్యే ఉపాధ్యాయే చ పక్షిణీ. ఆచార్య భార్యాపుత్ర శిష్యేషు అహోరాత్రం. అగ్న్యుత్పాతేన గోవిప్ర మృతౌత్రి రాత్రం. అయనే విషువేచ పక్షిణీ అకాలవృష్టౌ చ. ఆరణ్యమార్జార సర్పనకుల పంచన ఖాదే రంతరాగమనే త్రిరాత్రం. ఆరణ్యశ్వ శృగాలాది వానర రజకాదౌ ద్వాదశరాత్రం. ఖరవరాహోష్ట్ర చాండాల సూతికోదక్యా శవాదౌ మాసం. గోగవయాజావాప్తి కాదౌత్రి మాసం. శశమేషశ్చ పాకాదౌషణ్మాసం. గజగండ సారస సింహ వ్యాఘ్రమహాపాపి కృతఘ్నాదా వబ్దమనధ్యాయః. శోభన దినే చానధ్యాయః.

అను॥ సంధ్యా సమయమందు గర్జనమైతే హారితుడిట్లా - సాయం సంధ్యయందు మేఘ గర్జనైతే రాత్రి అనధ్యాయము. ప్రాతః సంధ్యయందు గర్జిస్తే అహోరాత్రము అనధ్యాయము. గౌతముడిట్లా - రాత్రియందు, మెరుపు మెరిస్తే అపరరాత్రి వరకు అనధ్యాయము,అని. అందువల్ల రాత్రి మెరుపు వస్తే అపరరాత్రి వరకు అనధ్యాయము. దినముయొక్క తృతీయాంగము తర్వాతైతే మెరుపు, ఆ రాత్రి పూర్తి అనధ్యాయము అని ఆతడే చెప్పాడు - త్రిభాగాది ప్రవృత్తి యందు అంతా,అని. అర్ధరాత్రి యందు మధ్యయామద్వయమందు (అనధ్యాయము)అని విజ్ఞానేశ్వరుడు (స్వాధ్యాయంవద్దుఅని). (మధ్యమయామముల మధ్య భాగము మహానిశ. అందు స్నానము, స్వాధ్యాయము,

పితృతర్పణము చేయరాదు,అని స్మృతి). నిర్ణయామృతమందు మధ్యయందలి నాలుగుదండముల (గడియల)కాలము,అని కలదు. మనువిట్లా - వివాదమందు, కలహమందు, సేనయందు, సంగరమందు, భోజనం చేయుగానే, అజీర్ణమందు, వమనమందు, సూతకమందు శరీరం నుండి రక్తంవస్తే, శరీరంపై శస్త్రంవల్ల గాయమైతే అధ్యయనం చేయరాదు,అని. కౌర్మమందిట్లా - తాంద్ర,బూరుగు, ఇప్ప, కోవిదారము, కపిత్థము (వెలగ) ఈ చెట్ల నీడలలో ఎప్పుడు కూడా అధ్యయనం చేయరాదు,అని. మనువిట్లా - పడుకొని, కాలుమీద కాలేసుకొని, అవసక్థికచేసి (వస్త్రంతో మోకళ్ళను నడుంతో బంధించుకొని) మాంసంతిని, సూతకాన్నాదులు తిని అధ్యయనము చేయరాదు,అని. ప్రౌఢ పాదుడనగా కాలుపై కాలేసుకొనేవాడు, లేదా చాచేవాడు లేదా ఆసనముపై పాదమెక్కించినవాడు అని హరదత్తుడన్నాడు. సోప పదములందు కూడా ముందే చెప్పాము. స్మృత్యర్థ సారమందిట్లా - శ్రావణ ద్వాదశి, మహాభరణి ప్రేత ద్వితీయ, రథసప్తమి, ఆకాశమందు శవదర్శనమైతే అహోరాత్రము అనధ్యాయము. (మహాభరణి= భాద్రపద, భరణి, మహానవమి = ఆశ్వీన శుక్ల నవమి, మహాద్వాదశి= కార్తిక శుక్ల ద్వాదశి, అక్షతృతీయ, మాఘమాస సప్తమి (రథసప్తమి) వీటిలో అధ్యాపన చేయరాదు. ప్రేత ద్వితీయ = యమ ద్వితీయ = కార్తిక శుద్ధ విదియ, శవము=నీరు). అసపిండ గురువు మరణిస్తే మూడు రాత్రులు, ఆచార్యుడు ఉపాధ్యాయుడు మరణిస్తే ఒకటిన్నరరోజు, ఆచార్యుని భార్య, పుత్రుడు, శిష్యుడు మరణిస్తే అహోరాత్రము, అగ్ని ఉత్పాతంతో, గో బ్రాహ్మణులు మరణిస్తే మూడు రాత్రులు, అయనమందు, విషువత్తు యందు, అకాలవృష్టియందు రోజున్నర అన ధ్యాయము. (మహా గురువు మరణిస్తే పన్నెండు రాత్రులు అనధ్యాయము) అరణ్యమందలి పిల్లి, పాము, ముంగిస, పంచనఖాదులు మధ్యలోవస్తే మూడు రాత్రులు (శల్యకము, శ్వావిధము (పందులివి) ఉడుము, కుందేలు, తాబేలు పంచనఖాలు). అరణ్యమందలి కుక్క, నక్క మొదలగునవి కోతి, చాకలివాడు మొదలగువారు అంతరాగమనం ఐతే పన్నెండు రాత్రులు అనధ్యాయము. గాడిద, పంది, ఒంటె, చండాలుడు, సూతిక, రజస్వల శవము అంతరాగమనమైతే నెలరోజులు అనధ్యాయము. గోవు, గవయము, మేక, నాస్తికుడు మొదలగు వారు వీరు అంతరాగమనమైతే మూడు మాసములు, కుందేలు, మేక (మగది) ఛండాలుడు మొదలగు వారైతే ఆరు నెలలు, ఏనుగ, ఖడ్గమృగము, సారసము, సింహ, వ్యాఘ్రములు, మహాపాపి, కృతఘ్నాదులు అంతరాగమనమైతే ఒక సంవత్సరము అనధ్యాయము. శోభన దినమందు అనధ్యాయము. (ప్రతిపదలేశమాత్రము, అష్టమి కలా మాత్రము ఉంటే అవి రోజునంతా దూషిస్తాయి సుర, గవ్య ఘటమును దూషించినట్లు. లేశాదులుండటం సూర్యోదయం తర్వాత, అంతకన్నాముందు కాదు. దినమనగా అస్తము కన్న ముందు ఆచారము ననుసరించి, అని స్మృతిలో)

**మూ ॥ వివాహప్రతిష్ఠోద్యాపు నాదిషు అసమాప్తే సగోత్రాణా మనధ్యాయః, ఉదయే అస్తమయేవాపి ముహూర్త త్రయగామియత్, తద్దినం తదహోరాత్రమనధ్యాయ విదోవిదుః.**

కేచిదాహుః క్వచిద్దేశే యావత్తద్దిన నాడికా, తావదేవత్వనధ్యాయః న, తన్మిశ్రేదినాంతరే. ప్రదోషంత్వాహ ప్రజాపతిః – షష్ఠీ చ ద్వాదశీ చైవ అర్ధరాత్రోన నాడికా, ప్రదోషే న త్వధీయీత తృతీయా నవనాడికా. నిర్ణయా మృతే గర్గః – రాత్రౌ యామత్రయా దర్వాక్ సప్తమీ వాత్రయోదశీ, **ప్రదోషః సతు విజ్ఞేయః** సర్వవిద్యా విగర్హితః. రాత్రౌ నవమ నాడీషు చతుర్థీయది దృశ్యతే, ప్రదోషః సతు విజ్ఞేయః సర్వ విద్యా విగర్హితః. కౌర్మే – అనధ్యాయస్తు **నాంగేషునేతిహాస పురాణయోః,**న ధర్మశాస్త్రే ష్వన్యేషు పర్వణ్యేతాని వర్జయేత్. శౌనకః–నిత్యేజపేచ కామ్యే చ కృతౌ **పారాయణేఽపిచ,** నానధ్యాయోఽస్తి వేదానాం గ్రహణే గ్రాహణే స్మృతః, ఇత్యనధ్యాయాః.

**అను॥** వివాహము, ప్రతిష్ఠ, ఉద్యాపన మొదలగు వాని యందు సమాప్తి కానంత వరకు సగోత్రులకు అనధ్యాయము. ఉదయమందు కాని అస్తమయమందు కాని ఏ తిథి మూడు ముహూర్తములుంటుందో ఆ రోజు ఆ అహోరాత్రము అని అనధ్యాయ విదులు అన్నారు. కొందరన్నారు కదా– ఒక ప్రదేశమందు ఎంతవరకు ఆదిన నాడిక ఉంటుందో అంతవరకే అనధ్యాయము. దానితో కూడిన దినాంతరమందు కాదు,అని. ప్రజాపతి ప్రదోషాన్ని ఇట్లా చెప్పాడు – షష్ఠి, ద్వాదశులు అర్ధరాత్రికి ఒకనాడి తక్కువ ఉన్నంతవరకుంటే, తృతీయ తొమ్మిది నాడులుంటే ప్రదోషమందు అధ్యయనం చేయరాదు,అని. (ఘడియలు) నిర్ణయామృతమందు గర్గుడిట్లా – సప్తమిగాని త్రయోదశి గాని రాత్రియందు మూడు (రెండు)యామములకన్న ముందు ఉంటే దాన్ని ప్రదోషమని గ్రహించాలి. అది సర్వ విద్యలకు గర్హితమైనది,అని. రాత్రి తొమ్మిది నాడులందు చతుర్థి ఉంటే దానిని ప్రదోషమన్నారు. అన్ని విద్యలకు గర్హితమైనది. కౌర్మమందిట్లా – అనధ్యాయము అంగములకు ఇతిహాస పురాణములకు, ఇతర ధర్మశాస్త్రములకు అనధ్యాయము కాదు. పర్వమందు వీనిని వదలి వేయాలి,అని. శౌనకుడిట్లా – నిత్యకర్మలు, జపము, కామ్యకర్మ, యజ్ఞము, పారాయణము, వేదములు చదువుట, చదివించుటలో అనధ్యాయము లేదు, అని స్మృతి, అని, అనధ్యాయములు. (దేవతార్చన మంత్రములకు అనధ్యాయము లేదు ఎప్పుడూను)

**మూ॥ అథమహానామ్న్యాది వ్రతం** – శ్రీధరః – తిథి నక్షత్ర వారాంశ వర్గో దయనిరీక్షణమ్. చౌలవత్ సర్వమాఖ్యాతం సగోదానవ్రతేషుచ. ఏ(తే)షాం లోపే శౌనకః – వ్రతాని విధినాకృత్వా స్వశాఖాధ్యయనం చరేత్, అకృత్వాఽభ్యస్యతే యేన సపాపీ విధిఘాతకః. ప్రత్యేకం కృచ్ఛ్రమేకైకం చరిత్వాఽజ్యాహుతీః శతం, హుత్వా చైవతు గాయత్ర్యా స్నాయాదిత్యాహ శౌనకః స్మృత్యర్థసారేతు – త్రీన్ షడ్ వా దశవా కృచ్ఛ్రాన్ కృత్వా పునర్ వ్రతం చరేత్, ఇత్యుక్తం. **అథ సమావర్తనం** – సురేశ్వరః – భౌమ భానుజయోర్వారే నక్షత్రే చ వ్రతోదితే, తారాచంద్ర విశుద్ధౌ చ స్యాత్ సమావర్తన క్రియా. బౌధాయన సూత్రేతు – రోహిణ్యాం తిష్యే ఉత్తరయోః ఫాల్గున్యోః హస్తే చిత్రాయాం ఐంద్రే విశాఖాయాం వా స్నాయాత్, ఇత్యుక్తం. వసిష్ఠః–స్నానం మధ్యాహ్నకాలేతు హోరాయాం కారయేచ్ఛుభం, పూర్వాహ్ణేతదభావేతు కుర్యాత్ స్నానం యథావిధి. సర్వఋతవో వివాహస్య, ఇతి సూత్రాత్ యదా దక్షిణాయనే వివాహః తదా సమావర్తనమపి

తత్రైవ. అన్యథోదగయనే సమావర్తనే, అనాశ్రమీ, నతిష్ఠేత,ఇతి విరోధః స్యాదిత్యుక్తం, సుదర్శనభాష్యే. ఏతచ్చ బ్రహ్మచారి వ్రతలోప ప్రాయశ్చిత్తం కృత్వా కార్యం. తదాహ బౌధాయనః - శౌచ సంధ్యాదర్భ భిక్షాగ్ని కార్య రాహిత్య కౌపీ నోపవీతమేఖలాజిన ధారణ దివాస్వాప ఛత్రపాదుకాస్రగ్ విధారణోద్వర్త నానులేప నాంజన ద్యూతనృత్య గీత వాద్యాదిభిరతౌ బ్రహ్మచారీ కృచ్ఛ్రత్రయం చరేత్, మహావ్యాహృతి హోమం చ కుర్యాత్.

అను॥ ఇక మహానామ్నీ మొదలగు వ్రతము గూర్చి - శ్రీధరుడిట్లా - తిథి, నక్షత్ర, వార, అంశ, (నవాంశ) వర్గ (షడ్వర్గ) ఉదయముల నిరీక్షణము, చౌలమునకువలె, చెప్పిం దంతా గోదానముతో కూడిన వ్రతములందును చూడాలి,అని. వీటిలోపమందు శౌనకుడిట్లా - వ్రతములను విధి ప్రకారముచేసి స్వశాఖాధ్యయనము ఆచరించాలి. చేయకుండా అధ్యయనం చేస్తే ఆతడు పాపి, విధి ఘాతకుడు ఒక్కొక్క దానిని గూర్చి ప్రత్యేకముగా ఒక్కొక్క కృచ్ఛ్రమాచరించి, గాయత్రితో, నూరు ఆజ్య ఆహుతులు హోమం చేసి స్నానం చేయాలని శౌనకుడన్నాడు. స్మృత్యర్థ సారమందైతే - మూడు లేదా ఆరు లేదా పది కృచ్ఛ్రములను ఆచరించి తిరిగి వ్రతమాచరించాలి,అని చెప్పారు. ఇక సమావర్తనము - (వేదాధ్యయనము తరువాత, ఇక గృహస్థుడవు కమ్మని గురువుచే అనుజ్ఞ పొందినవాడు సమావృత్తుడు). సురేశ్వరుడిట్లా - మంగల, శనివారములలో వ్రతమునకు చెప్పిన నక్షత్ర మందు తారాచంద్రులు శుద్ధులై ఉండగా సమావర్తన క్రియ ఔతుంది,అని. బౌధాయన సూత్రమందైతే - రోహిణీ, పుష్యమి, రెండు ఉత్తరలు, రెండు ఫల్గునులు (పూర్వ, ఉత్తర), హస్త, చిత్త, జ్యేష్ఠ, విశాఖ వీనియందు స్నానం చేయాలి,అని చెప్పబడింది. వసిష్ఠుడిట్లా - స్నానము మధ్యాహ్న కాలమందు హోరయందు చేయించాలి అది శుభము. అదిలేని పక్షంలో పూర్వాహ్ణమందు యధావిధిగా స్నానం చేయాలి,అని. వివాహమునకు అన్ని ఋతువులు అనే సూత్రాన్ననుసరించి ఒకవేళ దక్షిణాయనంలో వివాహమైతే అప్పుడు సమావర్తనం కూడా అక్కడే. లేకున్న ఉత్తరాయణంలో సమావర్తనమైతే, ఆశ్రమం లేకుండా ఉండరాదు, అనే దానికి విరుద్ధమౌతుంది,అని సుదర్శన భాష్యమందు చెప్పారు. దీనిని బ్రాహ్మచారి వ్రతలోప ప్రాయశ్చిత్తమును చేసి చేయాలి. దానినే బోధాయనుడిట్లా - శౌచము, సంధ్య, దర్భ, భిక్షము, అగ్నికార్యములు లేకుండుట, కౌపీనము, ఉపవీతము, మేఖల, అజిన ధారణము,లేకుండ పగటినిద్ర, ఛత్రము, పాదుకలు,మాలాధరణము, అంగోద్వర్తనము, అనులేపనము, కాటుక ద్యూత, నృత్యగీత వాద్యాదులందు ఆసక్తి కలిగిన బ్రహ్మచారి మూడు కృచ్ఛ్రము లాచరించాలి. మహా వ్యాహృతి హోమము చేయాలి,అని.

**మూ॥ సమావర్తనోత్తరం పూర్వమృతానాం త్రిరాత్రం అశౌచం కార్యం. ఆదిష్టీనోదకం కుర్యాత్ ఆవ్రతస్య సమాపనాత్, సమాప్తే తూదకం దత్వాత్రిరాత్రమ శుచిర్భవేత్, ఇతి మనూక్తేఃఆదిష్టీ బ్రహ్మచారీతి విజ్ఞానేశ్వరః. బ్రహ్మచర్యే యది కశ్చిత్ నమృతః తదాత్రి రాత్ర మధ్యే వివాహః కార్యోఽన్య థానేతి సిద్ధ్యతి. జననేతు సత్యపి నత్రిరాత్రం, తత్రాతి క్రాంతా**

శౌచాభావాదుదకం దత్వేతి వచనాచ్చేతిదిక్. తత్రాపి వికల్పః పితర్యపిమృతే నైషాం దోషో భవతి కర్హిచిత్. ఆశౌచం కర్మణోఽంతే స్యాత్ర్యహం వా బ్రహ్మచారిణాం, ఇతి ఛందోగపరిశిష్టాత్. స్నాతకవ్రతాన్యాహ వ్యాసః - యజ్ఞోపవీతద్వితయం సోదకం చ కమండలుం, ఛత్రం చోష్ణీషమమలం పాదుకే చాప్యుపానహౌ. రౌక్మే చ కుండలే వేదః కృతం కేశనఖః శుచిః. వేదః = దర్భవటుః. మనుః - ఉపానహౌ చ వాసశ్చధృతమన్యైర్నధారయేత్, ఉపవీత మలంకారం స్రజంకరక మేవచ. అన్యాన్యపి బహ్వృచ గృహ్యస్మృత్యాదిభ్యోజ్ఞేయాని. అథ ఛురికాబంధః. జ్యోతిర్ని బంధే నారదః - ఛురికా బంధనం వక్ష్యే నృపాణాం ప్రాక్కరగ్రహాత్, వివాహోక్తేషు మాసేషు శుక్లపక్షేప్యనస్తగే. జీవే శుక్రేచ భూపుత్రే చంద్ర తారా బలాన్వితే, మౌంజీబంధర్క్షతిథిషు కుజవర్జితవాసరే. సంగ్రహే- శూద్రాణాం రాజ్య పుత్రాణాం మౌంజ్యభావేఽస్త్ర బంధనం, మౌంజీ బంధోక్తతిథ్యాదౌ కార్యం భౌమదినం వినా.

అను॥ సమావర్తనం తరువాత ముందు మరణించినవారికై మూడు రాత్రులు అశౌచ మాచరించాలి. బ్రహ్మచారి, వ్రతము మొదలు సమాప్తి వరకు జలమివ్వరాదు. సమాప్తి అయ్యాక జల మిచ్చి మూడు రాత్రులు అశుచి ఔతాడు, అని మనూక్తి. ఆదిష్టి = బ్రహ్మచారి అని విజ్ఞానేశ్వరుడు. బ్రహ్మచర్యమందు ఎవ్వరు ఇతః పూర్వం మరణించని పక్షంలో అప్పుడు త్రిరాత్ర మధ్యమందే వివాహము చేయాలిలేని పక్షంలో కాదు అని సిద్ధిస్తోంది. జననం ఉన్నా మూడు రాత్రులు అశౌచం కాదు. అక్కడ గడచిన అశౌచం లేదు అశౌచంగడవలేదు. కనుక, ఉదకమిచ్చి అనే వచనాన్ననుసరించి కూడా అని ఇక చాలు. అక్కడ కూడా వికల్పము. తండ్రి కూడా మరణిస్తే వీరికి ఏ కొంచము దోష ముండదు. కర్మ చివర ఆశౌచముంటుంది, బ్రహ్మచారులకు మూడు రోజులు కాని, అని ఛందోగ పరిశిష్టం వల్ల తెలుస్తోంది. వ్యాసుడు స్నాతక వ్రతములను చెప్పాడు - రెండు యజ్ఞోపవీతములు, నీరు గల కమండలము, గొడుగు, స్వచ్ఛమైన రుమాలు తలకు, పాదుకలు, చెప్పులు, బంగారు కుండలాలు, దర్భవటువు, కేశనఖములు తీర్చుకొని, శుచియై,అని. మనువిట్లా - చెప్పులు, వస్త్రము ఇతరులు ధరించిన దానిని ధరించరాదు,ఉపవీతము అలంకారము, మాల, కమండలు ఇవి కూడ ఇతరులు ధరించినవి ధరించరాదు,అని. ఇతరమైనవి కూడా బహ్వృచగృహ్యస్మృతి మొదలగు వాని నుండి తెలుసుకోవాలి. ఇక ఛురికాబంధము. జ్యోతిర్నిబంధమందు నారదుడిట్లా - రాజులకు వివాహం కన్న ముందు ఛురికా బంధనాన్ని గూర్చి చెబుతాను. వివాహోక్తమాసములందు, శుక్లపక్షమందు, గురు శుక్రులు అస్తం కాకముందు, కుజుడు చంద్ర తారలు బలవంతులై ఉండగా మౌంజీ బంధ నక్షత్రములు తిథులు వీనియందు మంగళవారం తప్ప ఇతర వాసరము లందు ఛురికా బంధనం చేయాలి,అని. సంగ్రహమందిట్లా - శూద్రులకు రాజ్య పుత్రులకు మౌంజిలేని పక్షంలో అస్త్రబంధనము, మౌంజీ బంధోక్తతిథ్యాదులందు, మంగళవారం కాకుండా చూసి చేయాలి, అని.

మూ॥ అథ వివాహః. యాజ్ఞవల్క్యః (ఆచారాధ్యాయే) - అవిలుప్త బ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్, అనన్య పూర్వికాం కాంతాం అసపిండాం యవీయసీం, అరోగిణీం భ్రాతృమతీం అసమానార్షగోత్రజాం. లక్షణ్యాం బాహ్యాభ్యంతర లక్షణైర్యుక్తాం. బాహ్యానికాశీఖండాదౌ ప్రసిద్ధాని. అన్తరాణి ఆశ్వలాయనాదీని, అష్టౌ పిండాన్ కృత్వా, ఇత్యాదీని. మనుః - అసపిండాచయా మాతుః అసగోత్రాచయాపితుఃసా ప్రశస్తాద్విజాతీనాం దారకర్మణి మైథునే, దత్త్రిమమాతుర్ గృహీతా అసపిండాసగోత్రా. తత్కులనివృత్త్రయే చకారాన్మాతు రసగోత్రాదత్తస్య పితుర్ జనక కులే పితురస గోత్రాపి సపిండత్వాన్నిషిద్ధేత్యన్యశ్చకారః. అసపింద్యాం = సాపిండ్య రహితాం. తచ్చైక శరీరావయవాన్వయే న భవతి. ఏకస్యహి పితుర్మాతుర్వా శరీరస్యావయవాః పుత్ర పౌత్రాదిషు సాక్షాత్ పరంపరయావా శుక్రశోణితాది రూపేణ అనుస్యూతాః. యద్యపి పత్న్యాః పత్యా సహభ్రాతృపత్నీనాం చ పరస్పరం నైతత్ సంభవతి తథాపి అధారత్వే నైక శరీరావయ వాన్వయోఽస్త్యేవ. అస్థిభిరస్థీని, ఇతిమంత్ర లింగాత్. ఏకస్యహి పితృశరీరస్య అవయవాః పుత్రద్వారాతా స్వాహితా ఇతి మదనరత్న పారిజాత విజ్ఞానేశ్వరాదయః. వాచస్పతి శుద్ధి వివేక శూల పాణ్యాది గౌడమైథి లాదయోఽప్యేవం. శ్రుతావపి - ఏతత్ షాట్ కౌశికం శరీరం త్రీణి పితృత స్త్రీణి మాతృతోఽస్థి స్నాయు మజ్జానః, పితృతస్త్వక్ మాంసరుధిరాణి మాతృతః ఇతి, ప్రజామను ప్రజాయసే ఇతి చ, చంద్రికాపరార్కమేధా తిథి మాధవా దయస్తు ఏక పిండదాన క్రియాన్వయిత్వం సాపిండ్యం.

అను॥ ఇక వివాహము. యాజ్ఞవల్క్యుడిట్లు - (ఆచారాధ్యాయమందు) బ్రహ్మ చర్యము లోపించనివాడై బాహ్యాభ్యంతర లక్షణములతో కూడిన స్త్రీని వివాహమాడాలి. (లోపిస్తే ప్రాయశ్చిత్తం) (స్త్రీత్వం కలది), దాన, భోగములతో ఇది వరకే ఇతరునికైనది కారాదు, సుందరమైనది, (నేత్ర, మనస్సులకు)సపిండురాలు కానిది, తనకన్న (వరునికన్న) చిన్నదైనది, రోగము లేనిది, అన్నతమ్ములు కలది, సమాన ఋషిగోత్రములలో పుట్టనిది కావాలి. బాహ్యలక్షణాలు కాశీఖండాదులలో ప్రసిద్ధమైనవి. అంతరలక్షణాలు ఆశ్వలాయ నాదులు చెప్పినవి అష్టాపిండాన్ కృత్వా, అని మొదలగునవి. మనువిట్లు - తల్లికి అసపిండ ఐనది, తండ్రికి, అసగోత్రయైనది అట్టి స్త్రీ ద్విజాతులకు దారకర్మలోను (భార్య) మైథునమందు ను ప్రశస్తమైనది,అని. తల్లిని, దత్తుగా గ్రహించే కన్య అసపిండ, సగోత్ర కావాలి. ఆ, కుల నివృత్తి కొరకు చ కారంవల్ల తల్లికి అసగోత్ర, దత్తత పితకు జనకకులంపితకు అసగోత్ర కూడా ఐనా సపిండ కనుక నిషేధము అని మరో చ కారము. అసపిండ్యము=సాపిండ్య రహితము. ఆ సపిండము ఒకే శరీరం యొక్క అవయవ అన్వయ సంబంధంతో ఔతుంది. ఒకే తల్లి లేదా తండ్రి వీరల శరీర అవయవాలు పుత్రపౌత్రులందు సాక్షాత్తుగా గాని, పరంపరగా గాని శుక్ర శోణిత రూపంతో ఎడతెగకుండా ఉన్నాయి. భార్యకు భర్తతో కూడా భ్రాతృపత్నులకు కూడా పరస్పరము ఇది జరుగదు ఐనా అధారత్వమైనందువల్ల ఏకశరీర అవయవాన్వయమే ఉంది. అస్థులతో అస్థులు, అనే మంత్ర లింగము (సూచన) ననుసరించి ఒకే తండ్రి యొక్క శరీరావయవాలు పుత్రునిద్వారా వాని యందు

ఉంచబడ్డాయి,అని మదనరత్న పారిజాత విజ్ఞానేశ్వరాదులు అన్నారు. వాచస్పతి శుద్ధి వివేక శూలపాణిమొదలగు గౌడ మైధిలాదులు కూడా ఇట్లాగే అన్నారు. శ్రుతియందు కూడా – ఈ శరీరము ఆరు కోశములు గలది మూడు తండ్రి నుండి మూడు తల్లి నుండి. బొక్కలు, నరము, మజ్జ (ఎముకలయందలినేయి) ఇవి తండ్రి నుండి చర్మము, మాంసము, రక్తము, ఇవి తల్లినుండి, అని. సంతతిని కల్గిస్తున్నావు,అని కూడా ఉంది. చంద్రిక అపరార్కమేధా తిథి మాధవాదులైతే ఒకే పిండదాన క్రియయందు అన్వయిత్వమే (సంబంధమే)సాపిండ్యమన్నారు.

**మూ ॥ లేపభాజశ్చతుర్థాద్యాః** పిత్రాద్యాః పిండభాగినః. పిండదః సప్తమస్తేషాం సాపిండ్యం సాప్త పౌరుషం ఇతి మాత్స్యోక్తేః. న చ పితృవ్యాదిషు ఏతన్నాస్తీతి వాచ్యం తత్కర్తృక శ్రాద్ధే దేవతైక్యేన తత్సత్వాత్. దేవదత్త కర్తృక శ్రాద్ధేహి యే దేవతా భూతాః తేషాం మధ్యేయః కశ్చిత్ అన్యకర్తృకశ్రాద్ధే అనుప్రవిశతి తేషాం సాపిండ్యం. తద్భార్యా ణామపి భర్తృ కర్తృక శ్రాద్ధే సహాధికారిత్వేన తదన్వయాత్. ఏకత్వం సా గతా భర్తుః పిండే గోత్రేచ సూతకే, ఇతి స్మృతేశ్చ. శ్రుతీనాం చ వైరాగ్యార్థత్వాత్ తస్యాః సాపిండ్య నిమిత్తత్వే మానాభావాత్. న చమాతులా దిష్వే తన్నాస్తీతి వాచ్యం, మాతామహరూప దేవతైక్యాత్. ననుగురుశిష్యాదేరపి శ్రాద్ధ దేవతాత్వాత్ సపిండత్వం స్యాత్. కింబహునా సర్వాభావేతు నృపతిః కారయేత్త స్యరిక్థతః, ఇతి మార్కండేయ పురాణాత్ రాజ్ఞోఽపి శ్రాద్ధ కర్తృత్వాత్ సాపిండ్య ప్రసంగః. సత్యం. పంచమాత్. సప్తమా దూర్ధ్వం మాతృతః పితృతస్తథా, ఇతి యాజ్ఞవల్క్య వచనేన మాతాపితృసంబంధ ఏవతత్సత్వాత్. ఊర్ధ్వం, సాపిండ్యం నివర్తతే, ఇతి శేషః. నను పంచమత్వాద్యత్రనియమ్యతే, నమాతృత ఇత్యాది, వాక్యభేదాత్. మైవం. మాతృకులేపంచమత్వస్యపితృకులే సప్తమత్వస్య చ బోధనే తుల్యత్వాత్. పౌరుషేయత్వాద దోష ఇతిచేత్ తుల్యమన్యత్రాపి, అన్యకర్తృకే రాజ్ఞః తత్పితౄణాం వాదేవతా త్వాభావాచ్చ. కించ అవయవాన్వయ పక్షే యథా యోగరూఢ్యా పరిహారః, తథేహాపి. తేన మాతృకులే పితృకులే చైక పిండదాన క్రియాన్వయిత్వం సాపిండ్య మిత్యాహుః. తేనైకస్య పిత్రాదయః షట్పుత్రాదయశ్చ షట్ సపిండా భవంతి.

అను॥ మాత్స్యోక్తి ఇట్లా – నాలుగవ తరం తరువాతివారు (4,5,6) లేపభాజులు (లేపం = భోజనం) పిత్రాదులు పిండభాగులు పిండమిచ్చేవాడు ఏడవవాడు. వారి సాపిండ్యము సప్త పురుష పర్యంతము,అని. పితృవ్యాదులలో ఇది లేదని చెప్పరాదు. ఆతడు చేసే శ్రాద్ధ మందు దేవత ఐక్యం ఉంది కనుక సాపిండ్యముంది. దేవదత్తుడు కర్త ఐన శ్రాద్ధ మందు ఎవరు దేవతలైనారో వారి మధ్యలో వేరే ఎవరో ఒకరు చేసిన శ్రాద్ధ మందు (దలివారు) వెంట ప్రవేశిస్తారు వారికి సాపిండ్యము వారి భార్యలకు కూడా భర్త చేసిన శ్రాద్ధమందు సహాధికారత్వముంది కనుక అది అన్వయిస్తుంది. భర్త యొక్క పిండ, గోత్ర, సూతకము లందు ఆమె ఏకత్వం పొందుతుంది,అని స్మృతి కూడా. శ్రుతులు వైరాగ్యార్థము కలవి కనుక వానికి సాపిండ్య నిమిత్తత్వమందు ప్రమాణం లేదు. మాతులాదు లందు ఇది లేదని అనరాదు, మాతా మహ రూప దేవతల ఐక్యముంది కనుక. గురు శిష్యాదులకు

గూడా శ్రాద్ధ దేవత ఐనందువల్ల సపిండత్వం ఉంటుంది. ఎక్కువెందుకు, ఎవరూ లేనివారికి వారి సంపద నుండి శ్రాద్ధాదులు రాజు చేయించాలి,అని మార్కండేయ పురాణం నుండి తెలుస్తోంది. అందువల్ల రాజుకు గూడా శ్రాద్ధకర్తృత్వం ఉన్నందువల్ల సాంపిద్య ప్రసంగం వస్తుంది. నిజమే. తల్లి నుండి పంచమతరం తరువాత తండ్రి నుండి సప్తమ తరం తరువాత, అట్లాగే అనే యాజ్ఞవల్క్య వచనం వల్ల మాతా పితృసంబంధమందే అది ఉంటుంది. ఆపైన సాపిండ్యము తొలగిపోతుంది,అని శేషము. ఇక్కడ పంచమత్వాదులే, నియామకము, మాత నుండి కాదు అని మొదలగునవి వాక్యభేదమైనందువల్ల అని అంటే అట్లా కాదు మాతృకులంలో పంచమత్వము పితృకులమందు సప్తమత్వము అని బోధించటం తుల్యమే గదా. పౌరుషేయమైనందువల్ల దోషం లేదు అని అంటే ఇతరత్ర కూడా సమానమే. అన్యకర్తృకమైన దానిలో రాజునకు అతని పితరులకు దేవతాత్వం లేదుకూడా. ఇంకనూ అవయవ, అన్వయ పక్షమందు ఎట్లా యోగరూఢివల్ల పరిహారమో అట్లాగే ఇక్కడ కూడా. అందువల్ల మాతృకుల మందు పితృకుల మందును పిండ దాన క్రియలో అన్వయిత్వమే సాంపిండ్యమన్నారు.అందువల్ల ఒకనికి అరుగురు తండ్రులు, అరుగురు పుత్రులు సపిండులౌతారు.

**మూ॥ అత్రకేచి దుభయత: సాపిండ్య నివృత్తా వేవోద్వాహో నాన్యథేత్యాహు:శుద్ధ చింతామణి వాచస్పతి హరదత్తా దయస్తు సగోత్రత్వవత్.సాపిండ్యస్య సప్రతి యోగికత్వేన సంయోగవ దుభయ నిరూప్యత్వాత్ ఏకతో నివృత్తా వన్యతో నివృత్తే రావశ్యకత్వాత్ మూల పురుషమారభ్య అష్టమోవరో మూల పురుషమారభ్య ద్వితీయా తృతీయాదికాం కన్యాముద్వాహయే దిత్యాహు:. శిష్టాస్తున వధూ వరయో: స్వత: సాపిండ్యం కింతు కూటస్థ సంతతి త్వాత్ తత్సాపిండ్యేనైవ. అతోఽష్టమ వరం ప్రతి కన్యాయా అసాపిండ్యేఽపి కన్యాయా: కూటస్థేన సాపిండ్యాత్ తత్సంతతి స్థత్వాత్ వరస్యాం ప్రతి స పిండ ఏవేత్య వివాహ:. సాపిండ్యా సాపిండ్యయో: ప్రతియోగి భేదే నా విరోధాత్ ఇత్యాహు:ఇదమే వచయుక్తం. ఆశౌచే ప్యేవం సాపిండ్యం జ్ఞేయం. యత్రతు మధ్యే విచ్ఛిన్న మపి సాపిండ్యం మందూక ప్లుతి వదను రనువర్తతే. యథా కూటస్థాత్ పంచమ్యో: కన్యయో: పుత్రౌ తత్ర నివృత్తి:తదపత్యయో: త్వనువృత్తి: తత్రాపినసాపిండ్యా సాపిండ్యయో ర్దోష:, సంబంధి భేదాత్. తేన తత్ర న వివాహ:. అత్ర కూటస్థమారభ్యగణనాకార్యా. తదుక్తం - వధ్వావరస్య వాతాత: కూటస్థాద్యది సప్తమ: పంచమీ చేత్తయోర్మాతా తత్సాపిండ్యం నివర్తతే,ఇతి. కూటస్థో మూల పురుష:**

అను॥ ఇక్కడ కొందరు ఇట్లా అన్నారు - రెండు వైపుల నుండి సాపిండ్యం నివృత్తమైతేనే వివాహము లేకపోతే కాదు,అని అన్నారు. శుద్ధ చింతామణి, వాచస్పతి హరదత్తాదులైతే సగోత్రత్వమువలె సాపిండ్యము సప్రతియోగి ఐనందువల్ల (కౌంటర్ పార్ట్) సంయోగమువలె ఉభయ నిరూప్యం ఐనందువల్ల ఒక ప్రక్క నుండి నివృత్తమైనా మరో వైపు నుండి నివృత్తి ఆవశ్యకమైనందువల్ల మూల పురుషుని నుండి అరంభించి ఎనిమిదవ వాడు వరుడు మూలపురుషుని ఆరంభించి రెండవది, మూడవది మొదలుగా కన్యను

వివాహ మాడాలి అని అన్నారు. శిష్టులైతే ఇట్లా - వధూవరులకు స్వతహాగా సాపిండ్యము లేదు,కాని కూటస్థ సంతతి ఐనందువల్ల అసాపిండ్యముతోనే, (సాపిండ్యము).అందువల్ల ఎనిమిదవ వరుని గూర్చి కన్యకకు సాపిండ్యం లేకపోయినా కన్యకు కూటస్థునితో సాపిండ్యమున్నందువల్ల ఆ సంతతి యందు ఉన్నందువల్ల వరుడు ఆమెకు సపిండుడే, కనుక వివాహం తగదు. సాపిండ్య అసాపిండ్యములకు ప్రతియోగి భేదంతో విరోధం లేదు కనుక,అని అన్నారు. ఇదియే తగును. ఆశౌచమందు కూడా ఈ విధముగానే సాపిండ్యాన్ని తెలుసుకోవాలి. ఎక్కడైతే సాపిండ్యం మధ్యలో విచ్ఛిన్నమైనా కప్పగంతులా వెంటనంటి ఉంటుందో. ఎట్లాంటే కూటస్థుని నుండి ఐదవ తరం కన్యల పుత్రునందు అక్కడ నివృత్తి ఔతుంది. వారి సంతానానికి అనువృత్తి మరల. అక్కడకూడా సాపిండ్య అసాపిండ్యములకు దోషముండదు. సంబంధి భేదమైనందువల్ల. అక్కడ వివాహం తగదు. ఇక్కడ కూటస్థుని ఆరంభించి లెక్కించాలి. అది ఇట్లా చెప్పారు - వధువు యొక్క వరుని యొక్క గాని తండ్రి కూటస్థుని నుండి సప్తముడైతే వారి తల్లి ఐదవదైతే ఆ సాపిండ్యము నివృత్త మౌతుంది,అని. కూటస్థుదనగా మూల పురుషుడు.

మూ॥ **విశ్వరూపనిబంధే - ఏవముక్త ప్రకారేణ పితృబంధుషు సప్తమాత్, ఊర్ధ్వమేవ వివాహ్యత్వం పంచమాన్ మాతృబంధుతః, సంతానోభిద్యతే యస్మాత్ పూర్వ జాదుభయత్రచ, తమాదాయ గణేద్ధీమాన్ వరం యావచ్చ కన్యకాం. స్మృతి తత్వే నారదః - అసప్తమాత్ పంచమాచ్చ బంధుభ్యః పితృమాతృతః, అవివాహ్యాస గోత్రాచ సమాన ప్రవరాతథా. అత్ర బంధుభ్య ఇతి పంచమీ నిర్దేశాత్ పితుః పితృష్వ సృ పుత్రాత్ సప్తమీం, మాతుః మాతృష్వసృపుత్రాచ్చ పంచమీమపి త్యజేత్. ఏవమన్య బంధుషుజ్ఞేయం. తత్రాపి, త్రిగోత్రాత్యయేఽర్వాగపి వివాహం కుర్యాత్ వక్ష్యమాణ వచనాత్. త్రిగోత్ర గణనాచ మాతామహగోత్రాపేక్షయా నతు స్వాపేక్షయా. అన్యథా పితుః పితామహ దుహితుః దౌహిత్రీ పుత్రీ పరిణేయాస్యాత్. వధ్వాః మాతామహ గోత్రాపేక్షయాతు త్రిగోత్రాంతర్గతేన వివాహ ప్రసంగ ఇతి సంబంధతత్వాదయో గౌడ గ్రంథాః. సంబంధ వివేకే శూలపాణిరప్యాహ పంచమాత్ సప్తమాచ్చ అర్వాగపి త్రిగోత్రాన్తరితా వివాహ్యా. అసంబంధా భవేన్మాతుః పిండే నైవో దకేనవా, సా వివాహ్యా ద్విజాతీనాం త్రిగోత్రాంతరితా చయా, ఇతి బృహన్మనూక్తేః. సన్నికర్షేఽపి కర్తవ్యం త్రిగోత్రాత్ పరతో యది, ఇతి దేవలోక్తేశ్చ. ఏతచ్చ దాక్షిణాత్యా నమన్యంతే. యత్తు వసిష్ఠః - పంచమీం సప్తమీం చైవ మాతృతః పితృతస్తథా,ఇతి. యచ్చ విష్ణు పురాణం - పంచమీం మాతృపక్షాచ్చ, పితృపక్షాచ్చ సప్తమీం, గృహస్థ ఉద్వహేత్కన్యాం, న్యాయేన విధినా నృప,ఇతి. తత్పంచమీం సప్తమీ మతీత్యేతి వ్యాఖ్యేయం. పంచమే సప్తమే చైవ యేషాం వైవాహికీ క్రియా, క్రియాపరా అపిహితే పతితాః శూద్రతాం గతాః, ఇత్యపరార్కే మరీచి వచనాత్.**

అను॥ విశ్వరూప నిబంధమందిట్లా - ఈ విధముగా, చెప్పిన ప్రకారము తండ్రి బంధువులలో ఏడవ తరం తరువాతనే వివాహ్యత్వము మాతృబంధువుల నుండి ఐతే ఐదవతరం తరువాతనే సంతానం భేదిస్తుంది. రెండు వైపుల ఏ పూర్వుని నుండి భేదమో అక్కడి నుండి తీసుకొనే బుద్ధిమంతుడు వరుని లెక్కించాలి. కన్యకను ఎంతవరకు లెక్కించాలో

మూ॥ అథద్విగోత్రాః - శౌంగశైశిరీణాం ఆంగిరస, బార్హస్పత్య భారద్వాజ కాత్యాక్షీలేతి, పంచ. కాత్యాక్షీలయోః స్థానే శౌంగశైశిరిర్వా, ఆంగిరస కాత్యాక్షీలేతి త్రయోవా. ఏషాం భరద్వాజైః విశ్వామిత్రై శ్చా వివాహః. ఏవం కపిలానాం కతానాం చ. సంకృతి పూతి మాషాదీనాం ఆంగిరస గౌరివీతి సాంకృత్యేతి, శాక్త్య గౌరివీతి సాంకృత్యేతివా, (అంత్యయోః వ్యత్యయోవా) ఏషాం స్వగణస్థైః వసిష్ఠైః శౌంగశైశిరైః లౌగాక్షిభి శ్చావివాహః. కశ్యపైర పీతిప్రయోగపారిజాతే. లౌగాక్షీణాం కాశ్యప, అవత్సార వాసిష్ఠేతి, కాశ్యప అవత్సార అసితేతివా. ఏతేఅహర్వసిష్ఠా నక్తం కశ్యపాః. ఏషాం వసిష్ఠైః కశ్యపైః సంస్కృతిభిశ్చా వివాహః. దేవరాతస్య జామదగ్న్యైః విశ్వామిత్రైశ్చా వివాహ ఇతి ప్రయోగపారిజాతే. తదయుక్తం. బహ్వృచశ్రుతౌ - యద్యైవాంగిరసః సన్మ ఉపేయాం తవ పుత్రతాం. ఆంగిరసో జన్మనాస్యాజీగర్తిః శ్రుతః కవిః. ఇత్యాంగిరోగణస్థత్వేన భార్గవ జామదగ్న్యత్వ స్మృతేః హరివంశాది స్మృతేశ్చ బాధాత్. తేన ద్వౌదేవరాతౌ ఏక అంగిరసః శ్రుత్యుక్తః. అన్యో భార్గవః. తయోః కల్పభేదేపి ఆంగిరసేన, దేవరాతేన, జామదగ్న్యైః భవత్యేవ వివాహః భార్గవేణతు నేతి తత్వం. ధనంజయానాం విశ్వామిత్రైః అత్రిభిశ్చ అవివాహః జాతూకర్ణ్యానాం వసిష్ఠైః అత్రిభిశ్చా వివాహః. ఏవం దత్తక క్రీత కృత్రిమ, స్వయం దత్త పుత్రికా పుత్రాదీనాం ఉత్పాదక పాలకయోః పిత్రోఃగోత్ర ప్రవరా వర్జ్యా ఇతి ప్రవర మంజరీ నారాయణ వృత్తి ప్రయోగ పారిజాతాదయః. అత్ర సర్వత్రోపపత్తయః మూలం చ మత్కృతే ప్రవరదర్పణే జ్ఞేయ మితిదిక్.

అను॥ ఇక రెండు గోత్రములవారు - శౌంగశైశిరులకు ఆంగిరస బార్హస్పత్య భారద్వాజ కాత్యక్షీలులు అని ఐదుగురు. కాత్యక్షీలుల స్థానంలో శౌంగశైశిరులు కాని. ఆంగిరస, కాత్యక్షీలులు అని ముగ్గురేకాని. వీరికి విశ్వామిత్రులతో భరద్వాజులతో వివాహం తగదు. ఈ విధముగా కపిలులకు కతులకు కూడా సంస్కృతి పూతి మాషాదులకు ఆంగిరస, గౌరి వీతి సాంకృత్యులని, శాక్త్యగౌరివీతి సాంకృత్యులనికాని, (చివరి ఇద్దరు క్రింద మీద కాని). వీరికి తమ గణంలోని వసిష్ఠులతో శౌంగ శైశిరులతో లౌగాక్షులతో కూడా వివాహం తగదు. కశ్యపులతో కూడా అని ప్రయోగ పారిజాతమందు. లౌగాక్షులకు కాశ్యప అవత్సార వాసిష్ఠులని, కాశ్యప అవత్సార అసితులని కాని. వీరు పగలు వసిష్ఠగోత్రులు, రాత్రి కశ్యప గోత్రులు. వీరికి వసిష్ఠులతో కశ్యపులతో సంస్కృతులతో వివాహం తగదు. దేవరాతునకు జామగగ్న్యులతో విశ్వామిత్రులతో కూడా వివాహం తగదు అని ప్రయోగ పారిజాతమందు కలదు. అది తగని మాట - బహ్వృచశ్రుతియందు, ఎట్లాగైతే ఆంగిరసుడ్నైనా నీ పుత్రుణ్ణౌతాను. జన్మచే ఆంగిరసుడైన అజీగర్తుని పుత్రుణ్ణి శ్రుతివల్ల కవి అని అంగిరస గణమందు ఉన్నందువల్ల భార్గవ జామదగ్న్యుల స్మృతివల్ల, హరివంశాది స్మృతివల్లనూ బాధ. కనుక ఇద్దరు దేవరాతులు ఒక ఆంగిరసుడు శ్రుతిలో చెప్పబడ్డారు. ఇతరుడు భార్గవుడు. వారిద్దరికి కల్పభేదం ఉన్నా ఆంగిరసుడైన దేవరాతునితో జామదగ్న్యులకు వివాహం తప్పకుండా జరుగుతుంది. భార్గవునితో మాత్రం కాదు అని నిశ్చయము. ధనంజయులకు విశ్వామిత్రులతో అత్రులతో వివాహం తగదు. జాతూకర్ణ్యులకు వసిష్ఠులతో

అత్రులతో వివాహం తగదు. ఈ విధముగా దత్తుడు, కొనబడ్డవాడు కృత్రిముడు, స్వయందత్తుడు, పుత్రికా పుత్రుడు మొదలగువారికి స్వంత తండ్రి పెంపుడుతండ్రుల యొక్క గోత్ర ప్రవర విడువతగినది అని ప్రవర మంజరీ, నారాయణ వృత్తి ప్రయోగ పారిజాతాదులు తెల్పుతున్నాయి. ఇక్కడ అంతటా ఉపపత్తులు, మూలము కూడా నేను రచించిన ప్రవర దర్పణ మందు తెలుసుకోండి అని ఇక చాలు.

మూ॥ **క్షత్రియ వైశ్యయోస్తు పురోహిత గోత్ర ప్రవరావేవేతి సర్వసిద్ధాంతః. యద్యపి బహ్వృచ పరిశిష్టేకపి భరద్వాజయోః వివాహః ఉక్తః తథాపి- భరద్వాజాశ్చ కపయో గర్గా రౌక్షాయణా ఇతి, చత్వారోఽపి భరద్వాజ గోత్రైక్యాత్ నాన్వయుః మిథః కపిగర్గ భరద్వాజా మిథో రౌక్షాయణా ద్విజాః, నోద్వహేయుః సగోత్రత్వాత్ ప్రవరైక్యాచ్చ కుత్రచిత్, ఇతి స్మృత్యర్థ సారాద్యుక్తేః అవివాహ ఏవతయోరితి. స్వగోత్రాద్యజ్ఞానేతు సత్యాషాఢః - అథాజ్ఞాన బంధోః పురోహిత ప్రవరేణ ఆచార్య ప్రవరేణవేతి. ఆచార్యగోత్ర ప్రవరాన భిజ్ఞస్తు ద్విజః స్వయం, దత్వాత్మానంతు కస్మైచిత్ తత్ గోత్ర ప్రవరో భవేత్. యద్వాస్వగోత్ర ప్రవర విధురో జమదగ్నిజః వివాహం చన, తేనైవ గోత్రేణతు సమాచరేత్, ఇతి కశ్చిత్. దివోదాసీయేఽపి - స్వగోత్ర ప్రవరాజ్ఞానే జమదగ్ని ముపాశ్రయేత్.**

అను॥ క్షత్రియ వైశ్యులకైతే పురోహితుల గోత్ర ప్రవరలే అని అందరి సిద్ధాంతము. బహ్వృచ పరిశిష్ట మందు కపి భరద్వాజులకు వివాహం చెప్పబడినప్పటికి - భరద్వాజులు, కపులు, గర్గులు, రౌక్షాయణులు అని ఈ నలుగురు కూడా భరద్వాజ గోత్రంతో ఐక్యం కలవారే ఐనందువల్ల పరస్పరము వివాహానికి తగరు. కపిగర్గ భరద్వాజులు రౌక్షాయణులు బ్రాహ్మణులు. పరస్పరము వివాహ మాడరాదు. సగోత్రులైనందువల్ల ఒక్కోచోట ప్రవర ఒకటే ఐనందువల్ల అని స్మృత్యర్థ సారాదులలో చెప్పబడ్డందువల్ల వారిరువురికి వివాహం తగదు అనియే. తన గోత్రం మొదలైనవి తెలియనప్పుడు, సత్యాషాఢుడు ఇట్లా - బంధుత్వం తెలియని వానికి పురోహితుని ప్రవరకాని ఆచార్యుని ప్రవర కాని ఉంటుంది,అని. ఆచార్య గోత్ర ప్రవర తెలియని బ్రాహ్మణుడు తనను స్వయంగా ఎవరికో ఒకరికి ఇచ్చుకొని, వారి గోత్ర ప్రవరుడు కావాలి.లేదా స్వగోత్ర ప్రవరల వైకల్యం కలవాడు జమ దగ్నిజుడు కనుక. ఆ గోత్రంతోనే వివాహం తగదు,అని ఒకడన్నాడు. దివోదా సీయమందు కూడా - స్వగోత్ర ప్రవర తెలియని పక్షంలో జమదగ్నిని ఆశ్రయించాలి,అని.

మూ॥ **అథమాతృగోత్ర వర్జన నిర్ణయః - శాతాతపః - మాతులస్య సుతా మూఢ్వా మాతృగోత్రాం తథైవచ, సమాన ప్రవరాం చైవ గత్వా చాంద్రాయణం చరేత్. యద్యపి - సగోత్రాం మాతురప్యేకే, నేచ్ఛంత్యుద్వాహకర్మణి జన్మనామ్నోర విజ్ఞానే హ్యుద్వహేద విశంకితః, ఇతి వ్యాసోక్తేః అజ్ఞాతనామత్వే, న సగోత్రత్వ దోషః తథాపి నేదం కలౌ ప్రవర్తతే. గోత్రాన్మాతుః స పిండాచ్చ వివాహో గోవధస్తథా, ఇతి కలివర్జ్యత్వోక్తేః. ఇదం మాతృగోత్ర వర్జనం, మాధ్యందినీయా నామేవ. మాతృగోత్రం మాధ్యం దినీయానాం అపుత్రాయాశ్చ, ఇతి సత్యాషాఢోక్తే రితి కశ్చిత్ (కశ్చిత్ మహారాష్ట్ర కల్పితం తన్నిర్మూలం అన్యథా గుర్జరాదేః కాతీయస్యకుతోన నిషేధః) తన్నిర్మూలం.**

**అత ఏవాహ ప్రవరమంజరీకారః - దోష స్యాతి గురుత్వాత్ సర్వేషాం మాతృగోత్రం వర్జ్యం,ఇతి. యత్తు - (గుర్జరాదీనాం మాధ్యందినీయానాం అప్యాచరణాచ్చ ఏకస్మిన్ ప్రవరే) ఏకస్మిన్ ప్రవరేతుల్యే మాతృగోత్రే వరస్యచ, తముద్వాహం న కుర్వీత సాకన్యా భగినీ స్మృతా, ఇతి మాతృకులే ప్రవర చింతన ముక్తం, తదాసురాది వివాహోఢా పరమితిదిక్. విస్తరస్తు గ్రంథాంతరేభ్యోజ్ఞేయః.**

అను॥ ఇక మాతృగోత్ర వర్జన నిర్ణయము. శాతాతపుడిట్లా - మాతుల సుతను వివాహమాడిన మాతృగోత్రురాలైన కన్యను వివాహమాడిన, సమాన ప్రవరకల దానిని వివాహమాడినా, చాంద్రాయణ మాచరించాలి. (చాంద్రాయణం అనగా ఏకైక పిండాన్ని శుక్లంలో వృద్ధి పరచాలి, కృష్ణంలో ఒక్కొక్క పిండాన్ని తగ్గించాలి. చంద్రుడు క్షీణిస్తే భుజించ రాదుఅని)అని. వివాహ కర్మ యందు కొందరు తల్లి సగోత్రురాలిని ఇష్టపడరు. జన్మ నామములు తెలియని పక్షంలోనూ, అనుమానం లేకుండా వివాహ మాడొచ్చు, అని వ్యాసోక్తి ఉన్నందువల్ల నామం తెలియని పక్షంలో సగోత్రత్వ దోషంలేదు అని చెప్పినా, అట్లైనా ఇది కలిలో వర్తించదు. తల్లి గోత్రం నుండి, సపిండుల నుండి వివాహం తగదు గోవధ కూడా తగదు, అని కలిలో విడువ తగినవిగా చెప్పారు. ఈ మాతృగోత్ర వర్జనము మాధ్యంది నీయులకే. మాతృగోత్రము మాధ్యందినీయులకు, పుత్రులు లేని దానికి అని సత్యాషాఢోక్తి అని ఒకడన్నాడు. (ఒక మహారాష్ట్రుడు కల్పించింది, అది నిర్మూలము, లేని పక్షంలో గుర్జరాది కాతీయునకు ఎందుకు నిషేధం రాదు.) అది నిర్మూలము. అందుకే ప్రవర మంజరీ కారుడు ఇట్లా అన్నాడు - దోషం చాలా పెద్దది. కనుక (చండాలత్వం) అందరు మాతృగోత్రాన్ని వదలాలి,అని. (ఒకే ప్రవరలో గుర్జరాదుల, మాధ్యందినీయుల ఆచరణ చెప్పినందువల్ల) ప్రవరలుతుల్యంగా ఉన్నప్పుడు, వరుని మాతృగోత్ర మందును తుల్యత ఉంటే అతనిని వివాహమాడరాదు, ఆకన్య చెల్లెలౌతుంది;అని మాతృకుల మందు ప్రవర చింతన చెప్పబడింది. అది అసుర మొదలగు వివాహ పద్ధతిలో వివాహ మాడే వారి విషయ పరము అని ఇక చాలు. విస్తారంగా ఐతే ఇతర గ్రంథాల నుండి తెలుసుకోవాలి.

మూ॥ **సగోత్రాది వివాహే ప్రాయశ్చిత్తం స్మృత్యర్థసారే - ఇత్థం సగోత్ర సంబంధ వివాహ విషయే స్థితే. యదికశ్చిత్ జ్ఞానతః తాంకన్యాం ఊఢ్వా ఉపగచ్ఛతి, గురుతల్ప వ్రతాత్ శుద్ధేత్ గర్భస్తజ్జోం త్యజాం వ్రజేత్, భోగతస్తాం పరిత్యజ్య పాలయేజ్జన నీమివ, అజ్ఞానా దైందవైః శుద్ధ్యేత్ త్రిభిః గర్భస్తు కాశ్యపః. ఏవం సాపింద్యేఽపి - సపిండాపత్య దారేషు ప్రాణత్యాగో విధీయతే, ఇతి బృహద్యమోక్తేః. తిథి తత్వే బౌధాయనః - సపిండాం సగోత్రాం చేదపత్యోపయచ్ఛేత్ మాతృవదేనాం బిభృయాత్.**

అను॥ సగోత్రాది వివాహమందు ప్రాయశ్చిత్తము స్మృత్యర్థ సారమందిట్లా - ఈ విధముగా సగోత్ర సంబంధ వివాహ విషయం ఉండగా, ఒకవేళ, ఎవడైనా ఒకడు తెలిసి కూడా ఆ కన్యను వివాహమాడి సంభోగిస్తే, గురుతల్ప వ్రతం వల్ల శుద్ధుడౌతాడు. వానివల్ల కల్గిన గర్భమందలి వాడు అంత్యజుడౌతాడు. ఆమెను భోగం నుండి వదలి, తల్లినివలె రక్షించాలి. అజ్ఞానంవల్లనైతే, మూడు చాంద్రాయణములతో ఆగర్భము శుద్ధి నందుతుంది,

అని కాశ్యపుడన్నాడు. ఈ విధముగా సాపిండ్యమందు కూడా – సపిండ అపత్యము యందు, స్త్రీలయందు ఐతే ప్రాణత్యాగము విధించబడింది, అని బృహద్యమోక్తి. తిథితత్వమందు బౌధాయనుడిట్లా – సపిండురాలు, సగోత్రురాలు ఐన కన్యను భోగిస్తే (వివాహం) అజ్ఞానం వల్ల, ఆమెను తల్లిలాగ భరించాలి,అని.

**మూ॥ కన్యా వివాహకాలఉక్తో జ్యోతిర్నిబంధే** – షడబ్దమధ్యేనో ద్వాహ్యాకన్యా వర్ష ద్వయం యతః, సోమో భుంక్తే తతః తద్వత్ గంధర్వశ్చత థాఽనలః. రాజ మార్తండః – **అయుగ్మే దుర్భగా నారీ యుగ్మేతు విధవా భవేత్, తస్మాత్ గర్భాన్వితే యుగ్మే వివాహేసా పతివ్రతా మాసత్రయా దూర్ధ్వ మయుగ్మవర్షే యుగ్మేఽపి మాసత్రయమే వయావత్, వివాహ శుద్ధిం ప్రవదంతి సంతోవాత్స్యాదయః స్త్రీ జని జన్మ మాసాత్.** పరాశర మాధవీయేతు – జన్మతో గర్భాధానాద్వా పంచమాబ్దాత్ పరంశుభం, కుమారీ వరణం దానం మేఖలా బంధనం తథా, ఇత్యుక్తం. సంబంధ తత్వేయమః – కన్యా ద్వాదశ వర్షాణి యాఽప్రదత్తా వసేద్ గృహే, బ్రహ్మహత్యా పితుస్తస్యాః సాకన్యా వరయేత్స్వయం. భారతే– త్రింశద్వర్షః షోడశాబ్దాం భార్యాంవిందేత నగ్నికాం, ద్వ్యష్టవర్షో ఽష్టవర్షాం వా ధర్మే సీదతిసత్వరః, అతోఽప్రవృత్తే రజసి కన్యాందద్యాత్ పితాసకృత్. తత్రైవ – సప్త సంవత్సరా దూర్ధ్వం వివాహః సార్వవర్ణికః కన్యాయాః శస్యతే రాజన్న న్యథా ధర్మగర్హితః. రాజమార్తండః – రాహుగ్రస్తే తథా యుద్ధే పితౄణాం ప్రాణ సంశయే, అతిప్రౌఢా చ యా కన్యా చంద్రలగ్న బలేనతు. మనుః – త్రింశవర్షో వహేత్ కన్యాం హృద్యాం ద్వాదశ వార్షికీం, త్ర్యష్టవర్షోఽష్ట వర్షానా ధర్మే సీదతి సత్వరః. యద్యపి – వివాహస్త్వష్ట వర్షాయాః కన్యాయాః శస్యతే బుధైః ఇతి సంవర్తోక్తేః అతః ఊర్ధ్వం రజస్వలా, ఇత్యాదేశ్చ దశవర్షాదూర్ధ్వం వివాహో నిషిద్ధః, తథాపి దాతురభావే ద్వాదశ షోడశాబ్దేజ్ఞేయే. త్రీణి వర్షాణి ఋతుమతీ కాంక్షేతపితృశాసనం, ఇతి పరాశర మాధవీయే బౌధాయనోక్తేశ్చ. మనుః – స్త్రీ సంబంధేదశైతాని కులాని పరివర్జయేత్. హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసం, క్షయ్యా మయావ్యయ స్మారిశ్విత్రికుష్ఠికులానిచ, నర్క్షవృక్షన దీనామ్నీం నాంత్యపర్వతనామికాం, న పక్ష్యహి ప్రేష్య నామ్నీం న చ భీషణ నామికాం. యమః – **తస్మాదుద్వాహయేత్కన్యాం యావన్న ర్తుమయీభవేత్. తథా మూలజాదీనాం ఫలం ప్రాగుక్తం. తథా వర్ణ వశ్య గ్రహ మైత్ర్యాది ఘటిత విచారో జ్యోతిర్ విద్భ్యోజ్ఞేయః. విస్తరాత్తు నోచ్యతే.**

అను॥ జ్యోతిర్నిబంధ మందు కన్యా వివాహకాలము ఇట్లా చెప్పబడింది – ఆరు సంవత్సరముల మధ్య కాలమందు (పుట్టుక నుండి) కన్యకు వివాహం చేయరాదు. ఎందు వల్లనంటే రెండు సంవత్సరాలు చంద్రుడు, ఆపిదప రెండు సంవత్సరాలు అలాగే గంధర్వుడు అట్లాగే రెండు సంవత్సరాలు అగ్ని అనుభవిస్తారు,అని. రాజమార్తండుడు ఇట్లా – బేసి వయస్సు యందు వివాహమైతే స్త్రీ దురదృష్టవంతురాలౌతుంది. యుగ్మకాల మందైతే విధవ ఔతుంది. అందువల్ల గర్భంలో పడ్డప్పటి నుండి యుగ్మకాలంలో వివాహమైతే ఆమె పతివ్రత ఔతుంది,అని. అమ్మాయి పుట్టిన జన్మ మాసం నుండి మూడు నెలల తరువాత బేసి సంవత్సరాలలో ఆరంభమై, యుగ్మ వర్షంలో మూడు నెలల వరకు, సజ్జనులు వాత్స్యాదులు వివాహమునకు మంచి కాలమని అంటారు. పరాశర మాధవీయ మందైతే – కుమారీ వరణము, దానము, మేఖలాబంధనము ఇవి జన్మము నుండి లేదా గర్భధారణ ఐనప్పటి

నుండి ఐదు సంవత్సరాల తరువాత శుభకరము, అని ఇట్లా చెప్పబడింది. సంబంధ తత్వమందు యముడిట్లా - అమ్మాయి పన్నెండు సంవత్సరాల వరకు ఇవ్వబడకుండా ఇంట్లోనే ఉంటె ఆమె తండ్రికి బ్రహ్మహత్య కల్గుతుంది. ఆకన్య, స్వయంగానే వరణం చేయాలి,అని. భారతమందిట్లా - ముప్పది సంవత్సరాలవాడు పదహారు సంవత్సరాల కన్యను ఋతుమతికాని దానిని భార్యగా పొందాలి. పదహారు సంవత్సరాలవాడు, ఎనిమిది సంవత్సరాల కన్యను కాని వివాహమాడితే త్వరగా ధర్మమందుంటాడు,అని. అందువల్ల పుష్పవతి కాకముందు తండ్రి కన్యను ఒకేసారి ఇవ్వాలి. అక్కడే - అన్ని వర్ణముల వారికి, ఏడు సంవత్సరాల తరువాత కన్యకు వివాహం చేయటము (తగును) ప్రశస్తము. లేనిచో, ఓరాజా, అది ధర్మగర్హితము,అని. రాజమార్తండుడు ఇట్లా - గ్రహణమందు, యుద్ధ మందు, పితరుల ప్రాణసంశయమందు, అతి ప్రౌఢయైన లేదా (అతిచిన్నదైన) కన్యకు చంద్ర లగ్న బలంతో వివాహం చేయాలి,అని. మనువిట్లా - ముప్పది సంవత్సరాలవాడు, హృద్యమైన పన్నెండు సంవత్సరాల కన్యను వివాహమాడాలి. ఇరువది నాలుగు సంవత్సరాల వాడు ఎనిమిది సంవత్సరాల కన్యనుగాని వివాహమాడితే త్వరలో ధర్మము నధిష్ఠిస్తాడు,అని. ఎనిమిది సంవత్సరాల కన్యకు వివాహము ప్రశస్తము అని బుధులు అన్నారు అని సంవర్తోక్తి ఉన్నందువల్ల ఆ పిదప రజస్వల, అని మొదలుగా ఉన్నందువల్ల పది సంవత్సరాల తరువాత వివాహము నిషిద్ధము. అని ఉన్నప్పటికి, అట్లాగైనప్పటికి కన్యాదాత లేనప్పుడు పన్నెండు, పదహారు సంవత్సరాలు కూడా గ్రహించాలి. పరాశర మాధవీయమందు బౌధాయనోక్తి ఇట్లా - ఋతుమతి ఐన కన్య మూడు సంవత్సరాల కాలం వరకు తండ్రి ఆజ్ఞకై ఎదిరి చూడాలి,అని. మనువిట్లా - స్త్రీ సంబంధమందు (వివాహం) ఈ పది కులాలను విడిచి పెట్టాలి. జాతకర్మాది క్రియాహీనుల, పురుష సంతతి లేని, వేదాధ్యయన రహిత, శరీరమందు చాలా వెంట్రుకలు కల, మూలవ్యాధికల, క్షయ, అజీర్ణవ్యాధి, తగ్గనియోనివ్యాధి (లేదా మూర్ఛ), తెల్లకుష్ఠ(బొల్లి), కుష్ఠ వీటినికల, కులములను వదలాలి. నక్షత్రవృక్ష, నదీ నామములు కలదానిని, అంత్య (మ్లేచ్ఛ) పర్వతముల పేరు కల దానిని, పక్షి, అహిదాసి ఈ పేర్లు కల దానిని , భీషణ నామము కలదానిని వీరిని వివాహమాడరాదు,అని. యముడిట్లా - అందువల్ల ఎంతవరకైతే కన్య ఋతుమతి కాదో అంతలోనే ఆమెకు వివాహం చేయాలి,అని. అట్లాగే మూలమొదలగు నక్షత్రము లందు పుట్టినందువల్ల కల్గే ఫలితాన్ని ముందే చెప్పాము.అట్లాగే వర్ణ వశ్యగ్రహమై త్రి మొదలగు వాటితో కూడిన వాని చర్చను జ్యోతిర్విదుల నుండి తెలుసుకోవాలి. విస్తృతమైనందువల్ల చెప్పటంలేదు.

**మూ॥ అథగుర్వర్కబలం జ్యోతిర్నిబంధేగర్గః - స్త్రీణాం గురుబలం శ్రేష్ఠం పురుషాణాం రవేర్బలం, తయోశ్చంద్రబలం శ్రేష్ఠమితి గర్గేణ భాషితం. జన్మ త్రిదశ మారిస్థః పూజయా శుభదోగురుః, వివాహేఽథ చతుర్థాష్ట ద్వాదశస్థో మృతి ప్రదః దేవలః - నష్టాత్మజా ధనవతీ విధవా కుశీలా పుత్రాన్వితా హత ధవా సుభగా విపుత్రా, స్వామి ప్రియా విగతపుత్ర ధవా ధనాఢ్యా వంధ్యా భవేత్సు రగురౌ క్రమశోఽభిజన్మా. బృహస్పతిః - ఝషచాపకులీరస్థోజీవోఽ**

వృశుభ గోచరః, అతి శోభనతాం దద్యాత్ వివాహోపనయాదిషు. లల్లః - ద్వాదశ దశమ చతుర్థే జన్మ నిషష్ఠాష్టమే తృతీయే చ, ప్రాప్తే పాణిగ్రహణే జీవే వైధవ్యమా ప్నోతి. గర్గః - సర్వత్రాపి శుభం దద్యాత్ ద్వాదశాబ్దాత్ పరం గురుః, పంచషష్ఠాబ్దయోరేవ శుభ గోచరతా మతా. సప్తమాత్పంచ వర్షేషు స్వోచ్చస్వర్క్షగతోయది, అశుభోఽపి శుభం దద్యాత్ శుభ ఋక్షేషు కింపునః. రజస్వలాయాః కన్యాయాః గురుశుద్ధిం న చింతయేత్. అష్టమేఽపి ప్రకర్తవ్యో వివాహః త్రిగుణార్చనాత్. అర్కగుర్వోర్బలం గౌర్యారోహిణ్యర్క బలాస్మృతా, కన్యా చంద్రబలాప్రోక్తా వృషలీ లగ్నతోబలా. అష్టవర్షా భవేద్గౌరీ నవ వర్షా చ రోహిణీ. దశవర్షా భవేత్కన్యా అత ఊర్ధ్వం రజస్వలా.

అను॥ ఇక గురువు, సూర్యుడు వీరి బలాన్ని గూర్చి జ్యోతిర్నిబంధమందు గర్గుడిట్లా - స్త్రీలకు గురు బలము పురుషులకు సూర్యబలము శ్రేష్ఠము. వీరిద్దరికి చంద్రబలము శ్రేష్ఠము అని గర్గుడన్నాడు,అని. జన్మము, మూడు, పది, ఆరుస్థానములందున్న గురువు పూజవల్ల శుభప్రదుడౌతాడు. ఇక వివాహమందు నాలుగు, ఎనిమిది, పన్నెండింటనున్న గురువు చావునిస్తాడు. దేవులుడిట్లా - గురువు జన్మరాశి నుండి క్రమంగా పన్నెండు వరకు ఈ ఫలితాన్నిస్తాడు. ఒకటిలో సంతాన నాశము, రెండులో ధనము, మూడులో వైధవ్యము, నాలుగులో కుశీలత్వము, ఐదులో పుత్రులు ఆరులో భర్తమరణము, ఏడులో సౌభాగ్యము, ఎనిమిదిలో పుత్రహీనత తొమ్మిదిలో స్వామికి ప్రేమపాత్రురాలు, పదిలో పుత్ర, భర్తృహీనత, పదకొండులో ఐశ్వర్యము పన్నెండులో వంధ్యాత్వమునిస్తాడు,అని. బృహస్పతి ఇట్లా - మీన, ధనుస్, కర్కటరాశిలోని బృహస్పతి అశుభుడైనా వివాహ ఉపనయనాదులందు అత్యంతమంగళ ప్రదుడౌతాడు,అని. లల్లుడిట్లా - పన్నెండు, పది,నాలుగు, జన్మరాశి, ఆరు, ఎనిమిది, మూడు ఈ స్థానములకు బృహస్పతి పాణి గ్రహణ కాలంలో వస్తే ఆమె వైధవ్యాన్ని పొందుతుంది,అని. గర్గుడిట్లా - పన్నెండు సంవత్సరాల వయస్సు తరువాత గురువు అన్ని స్థానాల్లో (అంతటా) శుభాన్ని ఇస్తాడు. ఐదు, ఆరు సంవత్సరాలకే శుభ గోచరుడౌతాడు,అని. ఏడు నుండి ఐదు సంవత్సరములలో తనకు ఉచ్చస్థానమైన తన నక్షత్రాన్ని పొందితే అశుభుడైనా శుభఫలితాన్నివ్వాలి. శుభ నక్షత్రాల్లో ఉంటే చెప్పేదేముంది. రజస్వలయైన కన్యకు గురుశుద్ధిని విచారించవలసిన పనిలేదు. అష్టమబృహస్పతి యందును, బృహస్పతిని మూడుసార్లు పూజించి వివాహం చేయాలి. గౌరికి సూర్యగురువుల బలము, రోహిణికి సూర్యబలము కన్యకు చంద్రబలము రజస్వలకు లగ్నబలముతో వివాహము శుభము. ఎనిమిది సంవత్సరాలకు గౌరి, తొమ్మిదేళ్ళ వయస్సు గలది రోహిణి, పది సంవత్సరాలది కన్య ఆ పిదప రజస్వల (వృషలి)అని.

**మూ॥ అథ బృహస్పతిశాంతిః.** శౌనకః - కన్యకో ద్వాహ కాలేతు అనుకూల్యం న విద్యతే, బ్రాహ్మణ స్యోపనయనే గురోః విధి రుదాహృతః. సువర్ణేన గురుం కృత్వా పీతవస్త్రేణ వేష్టయేత్, ఈశాన్యాంధవలం కుంభం ధాన్యోపరి నిధాయ చ. దమనం మధుపుష్పంచ పలాశం చైవ సర్షపాన్, మాంసీగుడూచ్య పామార్గో విడంగీ శంఖినీవచా, సహదేవీ హరిక్రాంతా సర్వౌషధిశతావరీ, బలాచ సహదేవీచ నిశాద్వితయమేవచ, కృత్వాజ్య భాగపర్యంతం స్వశాఖోక్త

విధానతః, గ్రహోక్త మండలే భ్యర్చ్య పీతపుష్పాక్ష తాదిభిః, దేవపూజోత్తరేకాలేతతః కుంభాను మంత్రణం. అశ్వత్థ సమిధశ్చాజ్యం పాయసంసర్పిషాయుతం, యవవ్రీహితిలాః సాజ్యా మంత్రేణైవ బృహస్పతేః, అష్టోత్తర శతం సర్వం హోమశేషం సమాపయేత్. పుత్ర దారసమేతస్య అభిషేకం సమాచరేత్, కుంభాభిమంత్రణోక్తైశ్చ సముద్రజ్యేష్ఠ మంత్రతః. ప్రతిమాం కుంభ వస్త్రంచ ఆచార్యాయ నివేదయేత్,బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాత్ శుభదః స్యాన్న సంశయః,ఇతి బృహస్పతిశాంతిః.

అను॥ ఇక బృహస్పతి శాంతి. శౌనకుడిట్లా - కన్యక వివాహ కాలమందు, బ్రాహ్మణుని ఉపనయనమందు గురువు అనుకూలంగా లేని పక్షంలో ఈ విధి చెప్పబడింది. బంగారముతో గురువు ప్రతిమను చేసి దానికి పచ్చని వస్త్రాన్ని చుట్టాలి. ఈశాన్య దిక్కు యందు ధాన్యముపైన తెల్లని కుంభమును ఉంచాలి. దమనము, ఇప్పపువ్వు, మోదుగ, ఆవాలు, జటమాంసి, తిప్పతీగ, ఉత్తరేణి, వాయువిడంగము, శంఖపుష్పి, వజ, పిల్లిపిసర, విష్ణుక్రాంత, సర్వౌషధి, పిల్లిపిసర (శతావరి), బల (ముత్తవపులగము) సహదేవి పచ్చి, ఎండు పసుపు ఇవన్నీ కలిపి ఆజ్యభాగ పర్యంతము హోమంచేసి, తమశాఖ యందు చెప్పిన విధి ప్రకారము గ్రహమును చెప్పిన మండలమందు పచ్చని పూలు అక్షతాదులతో పూజించి, దేవపూజ అయ్యాక ఆ పిదప కుంభ అనుమంత్రణ చేయాలి. అశ్వత్థపు సమిధలు, నేయి, నేయితో కూడిన పాయసము, నేయితో కూడిన యవలు, వ్రీహి (వడ్లు) నువ్వులు వీనితో బృహస్పతి మంత్రంతోనే నూట ఎనిమిది మారులు హోమం చేసి మిగిలిన హోమ శేషాన్నంతా సమాప్తి చేయాలి. పుత్రదారసమేతునకు అభిషేకం చేయాలి. కుంభాభి మంత్రణమునకు చెప్పిన మంత్రములతో, సముద్ర జ్యేష్ఠ మంత్రముతో అభిషేకము. ప్రతిమను, కుంభవస్త్రమును ఆచార్యునకు సమర్పించాలి. పిదప బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. శుభం కలుగుతుంది. అనుమానంలేదు, అని బృహస్పతి శాంతి.

**మూ॥ శౌనకః - గుర్వాదిత్యే వ్యతీపాతే వక్రాతీ చారగే, గురౌ, నష్టే శశిని శుక్రేవా బాలే వృద్ధేఽథవాగురౌ, పౌషే చైత్రేఽథ వర్షాసు శరద్యధిక మాసకే, కేతూద్గమే నిరంశేఽర్కే సింహస్థేఽమరమంత్రిణి, వివాహ వ్రతయాత్రాది పురహర్మ్య గృహాదికం, క్షౌరం విద్యోప విద్యాంచ యత్నతః పరివర్జయేత్. మదన పారిజాతే జ్యోతిఃసాగరే - బాలే శుక్రే వృద్ధే శుక్రే వృద్ధే జీవేనష్టే జీవే, బాలే జీవే జీవేసింహే సింహాదిత్యే జీవాదిత్యే, తథామలిమ్లు చేమాసి సురాచార్యేఽతి చారగే, వాపీ కూపవివాహాదిక్రియాః ప్రాగుదితాః త్యజేత్, సింహస్థం మకరస్థం చ గురుంయత్నేన వర్జయేత్. లల్లః - అతి చారగతో జీవః తంరాశిం నైతి చేత్పునః, లుప్తః సంవత్సరోజ్ఞేయః సర్వకర్మ బహిష్కృతః.**

అను॥ శౌనకుడిట్లా - గుర్వాదిత్యమందు, వ్యతీపాతమందు గురువు వక్రుడు అతిచారగుడు ఐనప్పుడు, నష్ట చంద్రునియందు (నష్టశుక్రునియందు (అస్త) శుక్రుడు, గురువు బాలుడు, వృద్ధుడు ఐనప్పుడు, పౌషమాసమందు చైత్రమందు, వర్షాకాలమందు, శరదృతువుయందు, అధికమాసమందు, కేతువు ఉదయమందు, సూర్యుడు లేకపోగా గురువు సింహమందుండగా వివాహ వ్రతయాత్రాదులు పురహర్మ్య గృహాదికము క్షౌరము, విద్య ఉపవిద్య వీటిని ప్రయత్న పూర్వకముగా వదలాలి. (చేయరాదు),అని. మదన పారిజాతమందు

జ్యోతిః సాగరోక్తి ఇట్లా – శుక్రుడు బాలుడు కాగా వృద్ధుడు కాగా, గురువు వృద్ధుడు కాగా అస్తగతుడు కాగా గురువు బాలుడు కాగా గురువు సింహగతుడు కాగా ఆదిత్యుడు సింహమందుండగా, జీవాదిత్యమందు అట్లాగే మలమాసమందు గురువు అతిచారగు డైనప్పుడు వాపి కూప వివాహాదిక్రియలు చేయరాదు ముందు చెప్పిన వానిని వదలాలి. సింహస్థుడైన, మకరస్థుడైన గురువును ప్రయత్నపూర్వకముగా వదలాలి,అని. లల్లుడిట్లా – గురువు అతిచారగతుడై తిరిగి ఆ రాశికి రాని పక్షంలో ఆ సంవత్సరాన్ని లుప్త సంవత్సరంగా తెలుసుకోవాలి. అన్ని కర్మల నుండి బహిష్కరించతగినది,అని.

**మూ॥ సింహస్థగురోరపవాదమాహపరాశరః** – గోదా భాగీరథీ మధ్యేనో ద్వాహః సింహగే గురౌ, మఘాస్థే సర్వదేశేషు తథా మీనగతేరవౌ. వసిష్ఠోఽపి – వివాహోదక్షిణే కూలే గౌతమ్యా నేతరత్రతు. భాగీరథ్యుత్తరే కూలే గౌతమ్యా దక్షిణే తథా, వివాహో వ్రత బంధశ్చ సింహస్థే జ్యే వదుష్యతి. **కన్యాదాతృక్రమమాహ** యాజ్ఞవల్క్యః – పితా పితామహో భ్రాతా సకుల్యో జననీ తథా, కన్యాప్రదః పూర్వనాశే ప్రకృతిస్థః పరః పరః. అప్రయచ్ఛన్ సమాప్నోతి భ్రూణహత్యా మృతావృతౌ, గమ్యం త్వభావేదాతౄణాం కన్యాకుర్యా త్స్వయంవరం. భ్రాతౄణాం సంస్కృతానాం వివాహాధికారమాహ ఏవ. యాజ్ఞవల్క్యః – అసంస్కృతాస్తు సంస్కార్యా భ్రాతృభిః పూర్వ సంస్కృతైః, భగిన్యశ్చ నిజాదంశాత్ దత్వాంశం తు తురీయకం. అత్రచకారేణ పూర్వ సంస్కృతైరిత్యస్య అనువృత్తేః వివాహ పర్యాప్తద్రవ్యదానే స్వాంశ చతుర్థభాగదానేవా సంస్కృత గ్రహణం వ్యర్థం స్యాత్, అతః కర్మ నియమోఽయం. తేన అనుపనీత భ్రాతృమాత్రాది సత్వే మాత్రాదేరేవాధి కారో నభ్రాతురిత్యుక్తం సంబంధతత్వాదౌ. కన్యాస్వయంవరే మాతుః దాతృత్వే చతాభ్యా మేవనాందీ శ్రాద్ధం కార్యం. తత్రచ స్వయం ప్రధాన సంకల్పమాత్రం కృత్వా అన్య బ్రాహ్మణ ద్వారా కారయేదితి ప్రయోగ పారిజాతే.

అను॥ సింహస్థ గురువునకు అపవాదమును పరాశరుడిట్లా చెప్పాడు – గోదావరి భాగీరథి మధ్య దేశమందు గురువు సింహమందుండగా వివాహం చేయరాదు. గురువు మఘ యందుండగా, రవి మీనమందుండగాను అన్ని దేశములందును వివాహం చేయరాదు, అని. వసిష్ఠుడు కూడా – సింహమందు బృహస్పతి ఉండగా, వివాహము గౌతమికి దక్షిణ తటమందు చేయటం తగును. వేరేచోట కాదు. భాగీరథికి ఉత్తరకూలమందు గౌతమికి దక్షిణ కూలమందు వివాహము, వ్రతబంధము గురువు సింహమందుండగా దోషం కాదు, అని. కన్యాదాతల క్రమమును యాజ్ఞవల్క్యుడు ఇట్లా చెప్పాడు – తండ్రి, తండ్రి తండ్రి (తాత), భ్రాత, సకుల్యుడు (సకులుడు), తల్లి వీరిలో ముందరి వారులేని పక్షంలో ప్రకృతిలో ఉన్న పరమైన వారు కన్యాదానము నకర్హులు,అని. కన్య ఇవ్వబడనిచో ప్రతి ఋతుకాలమందు భ్రూణహత్య పాపాన్ని పొందుతుంది. ఇచ్చే దాతలు లేని పక్షంలో గమ్యం ఏమంటే కన్య స్వయం వరణము చేయాలి.భ్రాతలకు సంస్కారము పొందిన వారికి మాత్రమే అధికారమును చెప్పాడుగదా. యాజ్ఞవల్క్యుడు ఇట్లా – మొదట సంస్కారాన్ని పొందిన భ్రాతలు, సంస్కారమును పొందని వారికి సంస్కారము చేయాలి.అట్లాగే తన ధనం నుండి నాల్గవ అంశాన్ని ఇచ్చి భగినుల వివాహం చేయాలి,అని. ఇక్కడ చ కారంతో పూర్వ సంస్కృతులు

అనేది అనువర్తిస్తుంది. కనుక వివాహమునకు సరిపోయే ద్రవ్యం ఇవ్వటమో, తన అంశంలోని నాల్గవ భాగం ఇవ్వటం కొరకో కాని సంస్కృత శబ్ద గ్రహణమైతే వ్యర్థమౌతుంది. అందువల్ల ఇది కర్తను నియమించేది. అందువల్ల ఉపనయనం కాని, భ్రాత మాతాదులు ఉంటే తల్లికే అధికారము, భ్రాతకు కాదు అని సంబంధ తత్వాదులందు చెప్పబడింది. కన్యా స్వయం వరమందు, మాతకన్యాదానం చేసే సందర్భంలోను వారే నాందీ శ్రాద్ధం చేయాలి. అక్కడ స్వయంగా ప్రధాన సంకల్పాన్ని మాత్రం చేసి, ఇతరం బ్రాహ్మణునితో చేయించాలి,అని ప్రయోగ పారిజాతమందు చెప్పారు.

**మూ॥ వరస్తు సంస్కృత భ్రాత్రాద్య భావే స్వయమే వనాందీ శ్రాద్ధం కుర్యాత్, న, మాతా. పుత్రేషు విద్యమానేషు నాన్యం నైకారయేత్ స్వధాం ఇతినిషేధాత్ ఉపనయనేన కర్మాధికారస్య జాతత్వాచ్చేతి పృథ్వీ చంద్రోదయః. మాధవీయే అపరార్కే చ నారదః - పితాదద్యాత్ స్వయం కన్యాం భ్రాతావాఽను మతే పితుః మాతామహో మాతులశ్చ సకుల్యో బాంధవస్తథా, మాతాత్వ భావేసర్వేషాం ప్రకృతౌ యదివర్తతే తస్యామ ప్రకృతిస్థాయాం కన్యాందద్యుః స్వజాయతః. సకుల్యాః పితృపక్షీయః బాంధవో మాతృవంశజః. మదనపారిజాతే కాత్యాయనః - స్వయమే వౌరసీందద్యాత్ పిత్రభావే స్వబాంధవాః, మాతామహస్తతోఽన్యాంహి మాతావా ధర్మజాం సుతాం. తతోఽన్యామౌరసీభిన్నాం ధర్మజాం నియోగాత్ క్షేత్రజాం మాతామహోమాతులోవాదద్యాత్. తేనౌరసీదానే పితృబంధుషు సత్సుమాతామహాదీనాం నాధికారః అనుమతింవినా. అస్యాపవాదః తత్రైవ - దీర్ఘ ప్రవాసయుక్తేషు పౌగండ్యేషు చ బంధుషు, మాతాతు సమయే దద్యాత్ ఔరసీమపి కన్యకాం. మనుః - యదాతు నైవకశ్చిత్ స్యాత్కన్యా రాజాన మావ్రజేత్. పరకీయ కన్యాదానే విశేషో మదనరత్నే స్కాందే-ఆత్మీకృత్య సువర్ణేన, పరకీయాంతు కన్యకాం, ధర్మేణ విధినాదానం సగోత్రేఽపియుజ్యతే. అత్ర ప్రకృతి స్థగ్రహణాత్ అప్రకృతిస్థేన, కృతమకృతమేవ. స్వతంత్రో యదితం కార్యం కుర్యాద ప్రకృతిం గతః, తదప్య కృతమేవస్యాత్ అస్వాతంత్ర్యస్య హేతుతః, ఇత్యపరార్కే నారదోక్తేః. యదితు సప్తపదీ వివాహ హోమాది ప్రధానం జాతం తదాంగవైకల్యేఽపి నా వృత్తిర్వి వాహస్య. గౌడా అప్యేవమాహుః. తత్రైవమరీచిః - గౌరీందదన్నా కపృష్ఠం వైకుంఠం రోహిణీందదత్, కన్యాందదత్ బ్రహ్మలోకం రౌరవంతు రజస్వలాం.**

అను॥ వరుడైతే సంస్కారమందిన భ్రాత్రాదులు లేని పక్షంలో స్వయంగానే నాందీ శ్రాద్ధం చేయాలి, తల్లి కాదు. కొడుకులుండగా ఇతరునితో స్వధను (పితృకర్మ) చేయించ రాదు, అని, నిషేధం ఉన్నందువల్ల ఉపనయనంతో కర్మాధికారం సిద్ధిస్తుంది, (కల్గుతుంది) కనుక అని పృథ్వీ చంద్రోదయము. మాధవీయ మందు అపరార్క మందును నారదుడిట్లా - తండ్రి స్వయంగా కన్యాదానం చేయాలి లేదా తండ్రి అనుమతితో భ్రాత కాని చేయాలి. మాతామహుడు, మాతులుడు, సకులులు, బాంధవులు అట్లాగే ఇవ్వొచ్చు. ఎవ్వరూ లేకపోతే తల్లి ప్రకృతిలో ఉంటే దానం చేయొచ్చు. ఆమె అ ప్రకృతిలో ఉంటే (పిచ్చివగైరా) స్వజాతులు కన్యను ఇవ్వాలి అని. పితృపక్షీయులంతా సకుల్యులు, తల్లి వంశమువారు బాంధవులు. మదన పారిజాతమందు కాత్యాయనుడిట్లా - ఔరసకన్యను తండ్రి స్వయంగా ఇవ్వాలి. తండ్రి లేకపోతే తమ బంధువులివ్వాలి. (తండ్రి అన్నలు వగైరా). లేకపోతే ఇతరమైనదానిని పిదప మాతామహుడివ్వాలి. ధర్మ ప్రకారం కల్గిన కన్యను తల్లిగాని ఇవ్వాలి,అని. ఆ పిదప

ఔరసికన్న భిన్నమైన ఇతరమైన ధర్మంవల్ల కల్గిన, నియోగంవల్ల క్షేత్రమందు పుట్టిన కన్యను మాతామహుడుకాని, మాతులుడుకాని ఇవ్వాలి. అందువల్ల ఔరస కన్య దానమందు తండ్రి తరపు బంధువులుండగా మాతామహాదులకు అనుమతి లేకుండా అధికారం లేదు. దీనికి అపవాదము అక్కడే- బంధువులు దీర్ఘప్రవాసంలో ఉంటే, పౌగండవయసువారైతే (5నుండి16సం॥లలోపువారు),తల్లి ఔరసకన్యనైనా సకాలంలో దానం చేయాలి,అని. మనువిట్లా – ఒకవేళ దాతలు ఎవ్వరూ లేనిపక్షంలో కన్యరాజు దగ్గరకు పోవాలి,అని. పరకీయ కన్యా దానమందు విశేషాన్ని మదరత్న మందు స్కాందోక్తి ఇట్లా – పరకీయ కన్యను సువర్ణంతో తన దాన్నిగా చేసుకొని ధర్మవిధిగా దానం చేయటం అసగోత్ర మందును తగును,అని. ఇక్కడ ప్రకృతియందున్న అనే మాట వలన అప్రకృతిలో ఉన్నవాడు, (అసావధాని) చేసినది చేయనట్టే. స్వతంత్రుడైతే ఆపనిని చేయాలి. అప్రకృతిని పొంది చేసినచో అది కూడా చేయనట్టే ఔతుంది, అస్వాతంత్ర్య కారణముగా, అని అపరార్క మందు నారదోక్తి. సప్తపది, వివాహ హోమాదులు ప్రధానమైనవి అయ్యాక అప్పుడు అంగ వైకల్యం ఐనా వివాహం తిరిగి కాదు. గౌడులు కూడా ఇట్లాగే అన్నారు. అక్కడే మరీచి ఇట్లా – గౌరిని ఇస్తే స్వర్గమునకు (8), (9) రోహిణిని ఇస్తే వైకుంఠమునకు,(10) కన్య (వయసు)ను ఇస్తే బ్రహ్మలోకమునకు రజస్వల (యైన కన్య)ను కన్యాదానం చేస్తే రౌరవ నరకమునకు వెళ్తాడు,అని.

మూ॥ **అథమాస నిర్ణయః** – తత్ర జన్మమాసే విశేషః ప్రాగుక్తః జ్యోతిః ప్రకాశే వ్యాసః – మాఘ ఫాల్గున వైశాఖే యద్వ్యాధా మార్గశీర్షకే, జ్యేష్ఠేవాఽషాఢమాసే, చ సుభగా విత్త సంయుతా. శ్రావణే వాపి పౌషేవా కన్యా భాద్రపదే తథా, చైత్రాశ్వయుక్ కార్తికేషు యాతి వైధవ్యతాం లఘు. నారదః – మాఘ ఫాల్గున వైశాఖ జ్యేష్ఠ మాసాః శుభప్రదాః, కార్తికో మార్గశీర్షశ్చ మధ్యమౌ, నిందితాః పరే. వసిష్ఠః – పౌషేఽపి కుర్యాన్మ కరస్థితేఽర్కే చైత్రే భవేన్మేషగతో యదాస్యాత్, ప్రశస్త మాషాఢ కృతం వివాహం వదంతి గర్గో మిథున స్థితేఽర్కే. ఆచార్య చూడామణౌ జ్యోతిర్గర్గ రాజమార్తాండౌ – మాంగల్యేషు వివాహేషు కన్యా సంవరణేషు చ, దశమాసాః ప్రశస్యంతే చైత్ర పౌష వివర్జితాః. అపస్తంబః – సర్వఋతవో వివాహస్య శైశిరౌమాసౌ పరిహాప్యోత్త మంచనైదాఘం. అత్ర మాఘఫాల్గునాషాఢ వర్జం నవమాసా ముఖ్య కాలః, ఇతి సుదర్శనభాష్యే ఇద విలాయాం బ్రహ్మ విద్యాతీర్థైశ్చోక్తం. బౌధాయన సూత్రేఽపి – సర్వేమాసా వివాహ స్య శుచితపస్తపస్య వర్జ్య మిత్యేకే. తేన పూర్వోత్తరౌ శిశిర సంబంధినౌ మాసౌ పౌష చైత్రౌ విహాయ, ఇతి నిర్ణయామృత వ్యాఖ్యానం మౌర్ఖ్య కృతం ఇత్యుపేక్ష్యం. నిశిచేత్ సర్వేషు ద్వాదశేష్వపిమాసేషు ఉద్వహేత్, ఇతి కాలాదర్శః. యేతుజ్యోతిషే మాఘాది విధయః తే, గృహ్యసూత్రాణాం ద్విజ పరత్వేన, ప్రాబల్యాత్ శూద్రాది పరాః.

అను॥ ఇక మాస నిర్ణయము – అక్కడ జన్మ మాసమందు విశేషాన్ని జ్యోతిః ప్రకాశ మందు వ్యాసుడు ముందే ఇట్లా చెప్పాడు – మాఘ ఫాల్గుణ వైశాఖ, మార్గశీర్ష కములలో, జ్యేష్ఠ, ఆషాఢ మాసములలోకాని వివాహ మాడితే సౌభాగ్యవతి, ధనవంతురాలు ఔతుంది,అని. శ్రావణమందుకాని పౌషమందు కాని కన్యాభాద్రపదమందు కాని, చైత్ర ఆశ్వయుజ కార్తికములందుకాని వివాహమైతే అల్పమైన (లేదా త్వరగా) వైధవ్యాన్ని పొందు తుంది. నారదుడిట్లా – మాఘఫాల్గున వైశాఖ జ్యేష్ఠ మాసములు శుభప్రదములు, కార్తిక

మార్గ శీర్షములు మధ్యమములు, ఇతరములు నిందితమైనవి,అని. వసిష్ఠుడిట్లా - పౌష మాసమైనా సూర్యుడు మకర రాశిలో ఉండగా, చైత్రంలో సూర్యుడు మేషరాశిలో ఉండగా, ఆషాఢంలో సూర్యుడు మిథునరాశిలో ఉండగా చేసిన వివాహము ప్రశస్తము అని గర్గులన్నారు,అని. అచార్య చూడామణి యందు జ్యోతిర్గర్గ రాజమార్తాండులిట్లా - మంగళ కార్యములందు, వివాహములందు, కన్యా సంవరణమందు, చైత్రపౌష మాసములు వదలి మిగిలిన పదిమాసములు ప్రశస్తమని అన్నారు. ఆపస్తంబుడిట్లా - శిశిర ఋతుమాసములు రెండు వదలి, వివాహమునకు అన్ని ఋతువులు తగును. గ్రీష్మ ఋతువు ఉత్తమము,అని. ఇక్కడ మాఘఫాల్గున ఆషాఢములు వదలి తొమ్మిది మాసములు ముఖ్యకాలము,అని, సుదర్శన భాష్యమందు ఇడబిల యందు బ్రహ్మవిద్యాతీర్థులు కూడా అన్నారు. బౌధాయన సూత్రమందు కూడా- అన్ని మాసములు వివాహమునకు పవిత్రమైనవి. మాఘమాసము (తప) శుచి (ఆషాఢము) ఫాల్గున మాసము (తపస్య) విడువాలి అని కొందరు. అందువల్ల పూర్వ ఉత్తరములైన శిశిర సంబంధమైన మాసములు పౌష చైత్రములు విడిచి,అని, చేసిన నిర్ణయా మృత వ్యాఖ్యానము మూర్ఖత వల్ల చేసినది అని ఉపేక్షించతగినది. రాత్రిపూట, వివాహమైతే అన్ని పన్నెండు మాసములలో కూడా చేయవచ్చును,అని కాలాదర్శపు మాట. జ్యోతిష మందు మాఘాదివిధులేవైతే ఉన్నాయో అవి, గృహ్యసూత్రములకు ద్విజపరత్వమైనందువల్ల, ప్రాబల్యంవల్ల శూద్రాది పరములు.

**మూ॥ జ్యోతిషే - వాత్స్యోవర్షమనూన మిచ్ఛతి తథారైభ్యోఽయనం చోత్తరం, శ్రీవాసంత మృతుం విహాయమునయో మాండవ్య శిష్యాజగుః, చైత్రం ప్రోజ్ఝ్య పరాశరః పరిణయే పౌషం** చ దౌర్భాగ్యదం, హ్యాషాఢాది చతుష్టయంన, హితదంకైశ్చిత్ ప్రదిష్టం బుధైః. చండేశ్వరః - మార్గేమాసి తథాజ్యేష్ఠేక్షౌరం పరిణయం వ్రతం, జ్యేష్ఠ పుత్రదుహిత్రోస్తు యత్నేన, పరివర్జయేత్. కృత్తికాస్థంరవింత్యక్త్వా జ్యేష్ఠ పుత్రస్య కారయేత్, ఉత్సవాదిషు కార్యేషు దినానిదశ వర్జయేత్. రత్నకోశే-జన్మర్క్షేజన్మదివసే జన్మమాసే శుభం త్యజేత్, జ్యేష్ఠ మాస్యాద్యగర్భస్య, శుభం వర్జం స్త్రియా అపి. పరాశరః - అజ్యేష్ఠా కన్యకాయత్ర జ్యేష్ఠ పుత్రోవరోయది, వ్యత్యయో వా తయోస్తత్ర **జ్యేష్ఠోమాసః శుభప్రదః. మిహిరః - జ్యేష్ఠస్య జ్యేష్ఠ కన్యాయాః వివాహోన ప్రశస్యతే, తయోరన్యతరే జ్యేష్ఠే జ్యేష్ఠోమాసః ప్రశస్యతే.** ద్వౌజ్యేష్ఠౌ మధ్యమౌ ప్రోక్తావేకం జ్యేష్ఠం సుఖావహం, జ్యేష్ఠ త్రయం న కుర్వీత వివాహే సర్వసమ్మతం. యత్తు, సార్వకాలమేకే వివాహం,ఇతి తదాసురాది వివాహ విషయం. ధర్మ్యేషు వివాహేషు కాలపరీక్షణం నా ధర్మ్యేషు, ఇతి గృహ్యపరిశిష్టాత్. రత్న మాలాయామప్యేవం. తేనాసురాదయో మాఘచైత్రాది నిషిద్ధకాలేష్వపి భవంతి. మాసాః సౌరాః సౌరో మాసో వివాహాదౌ, ఇత్యుక్తేః. ఝషే, న నింద్యో యది ఫాల్గునే స్యాత్ అజస్తు వైశాఖగతోన నింద్యః, ఇతి త్వపవాదః.

అను॥ జ్యోతిషమందిట్లా - వాత్స్యుడు సంవత్సరం మొత్తం కాలాన్ని ఇష్టపడతాడు. రైభ్యుడు ఉత్తరాయణాన్ని ఇష్టపడతాడు. మాండవ్యశిష్యు లైన మునులు వసంతఋతువును వదలి. పరాశరుడు చైత్రమాసాన్ని వదలి మిగిలినవి శ్రేష్ఠమని చెప్పారు. వివాహమందు పౌషము దౌర్భాగ్యాన్ని ఇస్తుంది. ఆషాఢము మొదలుగా నాలుగు మాసాలు హితకారులు

కావని కొందరు బుధులన్నారు,అని. చండేశ్వరుడిట్లా - మార్గశీర్ష, జ్యేష్ఠమాసములలో క్షౌరము, వివాహము, వ్రతమును జ్యేష్ఠపుత్రుని, జ్యేష్ఠపుత్రిక యొక్క వివాహాన్ని ప్రయత్న పూర్వకముగా వదలాలి,అని. కృత్తిక యందున్న రవిని వదలి జ్యేష్ఠపుత్రుని వివాహం చేయాలి. ఉత్సవాది కార్యములందు పదిరోజులను విడిచి పెట్టాలి (జ్యేష్ఠంలో),అని. రత్నకోశమందిట్లా - జన్మనక్షత్రమందు, జన్మమాసమందు, జన్మ దివసమందు శుభకార్యమును విడిచిపెట్టాలి (చేయరాదు) జ్యేష్ఠమాసమందు పెద్ద కుమారుని, లేదా పెద్దకుమార్తె వివాహం చేయరాదు,అని. పరాశరుడిట్లా - వరుడు జ్యేష్ఠపుత్రుడై కన్యక (వధువు) జ్యేష్ఠము కానిచో, దీనికి వ్యతిరేకంగానైనా ఉన్నా ఆసందర్భంలో జ్యేష్ఠమాసము శుభప్రదము,అని. మిహిరుడు ఇట్లా - జ్యేష్ఠునకు జ్యేష్ఠకన్యకకు వివాహము ప్రశస్తం కాదు. వాళ్ళిద్దరిలో ఒకరు జ్యేష్ఠులైతే జ్యేష్ఠ మాసము ప్రశస్తమైంది,అని. ఇద్దరు జ్యేష్ఠమైతే మధ్యమము. ఒకరు జ్యేష్ఠమైతే సుఖ మిస్తుంది. వివాహమందు మూడు జ్యేష్ఠలు పనికిరావు. ఇది అందరికి సమ్మతమైంది. కొందరు అన్ని కాలములలో వివాహం చేయొచ్చు అని అన్నారు అది ఆసురాది వివాహ విషయము. ధర్మ వివాహములందు కాల పరీక్ష, అధర్మ వివాహములందు కాదు అని గృహ్యా పరిశిష్టం వల్ల తెలుస్తోంది. రత్నమాల యందు కూడా ఇట్లాగే ఉంది. అందువల్ల ఆసురాది వివాహాలు మాఘ చైత్రాది నిషిద్ధ కాలములందు కూడా ఔతాయి. సౌరమాసములు, వివాహాదులందు సౌరమాసము, అని చెప్పారు గదా. మీనము ఫాల్గున మాసంలో ఉంటే నిందించతగినదికాదు. మేషము వైశాఖ మాసంలో ఉంటే నిందార్హము కాదు, అనేదైతే అపవాదము (పరిహారము).

**మూ॥ అథదశదోషాః** - వ్యవహారోచ్చయే - వేధశ్చలత్తా చ తథైవ పాతః ఖర్జూర వేధో దశయోగ చక్రం, యుతిశ్చ జామిత్ర ముపగ్రహశ్చ బాణాఖ్య వజ్రే చ దశైవ దోషాః ఏషాం లక్షణం జ్యోతిషే జ్ఞేయమ్. **అతి చారగే గురౌతు** వసిష్ఠః - **అతిచారగతో** జీవే వర్జయేత్త దనంతరం, వివాహాదిషు కార్యేషు అష్టావింశతి వాసరాన్. రత్నమాలాయాం - ఏకపంచ నవయుగ్మ షట్దశ త్రీణి సప్త చతురష్టలాభదః, ద్వాదశాజ వృషభాది, రాశితో ఘాతచంద్ర ఇతి కీర్తితో బుధైః. నారదః - భూబాణ నందహస్తాశ్చ రసదిక్ వహ్నిశైలజాః, వేదావసు శివాదిత్యా **ఘాతచంద్రోయథా** క్రమం. యాత్రాయాం యుద్ధకార్యేషు ఘాతచంద్రం వివర్జయేత్. వివాహే సర్వమాంగల్యే చౌలాదౌ వ్రతబంధనే, ఘాత చంద్రోనైవ చింత్య ఇతి పారాశరోఽబ్రవీత్. జ్యోతిర్నిబంధే - వివాహ చౌలవ్రత బంధయజ్ఞే పట్టాభిషేకే చ తథైవ రాజ్ఞాం, సీమంత యాత్రాసు తథైవ జాతే నోచింతనీయః ఖలుఘాత చంద్రః. నారదః - అకాల జాభవేయుశ్చేత్ విద్యుత్ నీహారవృష్టయః, ప్రత్యర్క పరివేషేంద్ర చాపాభ్రధ్వనయోయది, దోషాయ, మంగలేనూనం న దోషాయైవ కాలజాః,ఇతి.

అను॥ ఇక పదిదోషములు. వ్యవహారోచ్చయమందిట్లా - గ్రహవేధ, లత్త (అపద), పాతము (రాహు),ఖర్జూరవేధ, దశయోగచక్రము, యుతి, జామిత్రము, ఉపగ్రహము, బాణము, వజ్రము ఇవి పది దోషములు. వీటి లక్షణాన్ని జ్యోతిషమందు తెలుసుకోవాలి.

గురుడు అతిచారుడైతే వసిష్ఠుడిట్లా- గురుదు అతిచారగుడైతే (బృహస్పతి మధ్యమ భోగకాలం కన్న ముందే ఒక రాశిని వదలి మరో రాశిలో ప్రవేశించిన), వివాహాది కార్యములందు ఆ పిదప పద్దెనిమిది రోజులను విడిచి పెట్టాలి,అని. రత్నమాలయందిట్లా - మేషం వృషభం మొదలుగా పన్నెండు రాశులకు వరుసగా ఒకటి, ఐదు, తొమ్మిది, రెండు, ఆరు, పది, మూడు, ఏడు, నాలుగు, ఎనిమిది, పదకొండు, పన్నెండు, రాశుల చంద్రుడు ఘాతచంద్రుడు అని పెద్దలన్నారు. (మేషానికి ఒకటవ చంద్రుడు ఘాత ఇట్లా),అని. నారదుడిట్లా - ఒకటి, ఐదు, తొమ్మిది, రెండు, ఆరు, పది, మూడు, ఏడు, నాలుగు, ఎనిమిది, పదకొండు పన్నెండు ఇవి క్రమముగా ఘాతచంద్రులు,అని. యాత్రయందు, యుద్ధకార్యములందు ఘాతచంద్రుని వదలాలి. వివాహమందు, అన్ని మంగలకార్యములందు, చౌలాదులందు, వ్రతబంధనమందు ఘాతచంద్రునిగూర్చి ఆలోచించరాదని పారాశరుడన్నాడు. జ్యోతిర్నిబంధమందిట్లా - వివాహ, చౌల, వ్రతబంధములందు, రాజుల పట్టాభిషేకమందు, సీమంత మందు, యాత్రయందు, జాతమందు ఘాతచంద్రునిగూర్చి ఆలోచించరాదు,అని. నారదుడిట్లా- (మెరుపు)అగ్ని, మంచు, వర్షము **అకాలంలో** వచ్చినట్లైతే సూర్యునకు నాల్గువైపుల పరివేషము, ఇంద్రధనుస్సు, మేఘధ్వని కల్గినట్లైతే మంగళకార్యమందు ఇవి తప్పకుండా దోషం కల్గించేవే. **కాలంలో** వచ్చినవైతే దోషకారులు కావు, అని.

మూ॥ **అకాలవృష్టి స్వరూపమాహల్లః - పౌషాది చతురో మాసాః** ప్రోక్తా వృష్టి **రకాల జా,ఇతి. శార్ఙ్గధరః** - నిర్ఘాతే క్షితి చలనే గ్రహయుద్ధే రాహుదర్శనే చైవ, **అ**పంచ దినాత్కన్యా పరిణీతా నాశముపయాతి. ఉల్కాపాతేంద్ర చాప ప్రబల ఘన రజో ధూమ నిర్ఘాత విద్యుద్ వృష్టి ప్రత్యర్కదోషాదిషు సకల బుధైః త్యాజ్యమేవైకరాత్రం, దుఃస్వప్నే దుర్నిమిత్తే హ్యశుభఫలదృశో దుర్మనో భ్రాంత బుద్ధౌ చౌలే మౌంజీ నిబంధే పరిణయన విధౌ సర్వదా త్యాజ్యమేవ. **జ్యోతిఃప్రకాశే** - అర్వాక్ షోడశనాడ్యః సంక్రాంతేః పుణ్యదాః పరతః, ఉపనయన వ్రతయాత్రా పరిణయ నాదౌ వివర్జ్యాః తాః. గర్గః - దిగ్దాహేదిన,మేకం, చ గ్రహేసప్తదినాదితు, భూకంపే చ సముత్పన్నే త్ర్యహ మేవతు వర్జయేత్, ఉల్కాపాతే త్రిదివసంధూమే పంచదినాని చ వజ్రపాతే చైకదినం వర్జయేత్ సర్వకర్మసు. దర్శనాదర్శనా ద్రాహుకేత్వోః సప్తదినం త్యజేత్. యావత్కే **తూద్గమస్తావద శుభః సమయో భవేత్. అస్యాపవాదో అద్భుతసాగరే - అథ దివస త్రయ మధ్యే మృదుపానీయం యదా భవతి, ఉత్పాత దోషశమనం తదైవ సంప్రాహురాచార్యాః. సంబంధతత్వే - భూకంపాదేర్న దోషోఽస్తి వృద్ధి శ్రాద్ధేకృతేసతి.**

అను॥ అకాలవృష్టి స్వరూపాన్ని లల్లుడు ఇట్లా చెప్పాడు- పుష్య, మాఘ, ఫాల్గుణ చైత్రము ఈ నాల్గుమాసములలో కలిగే వర్షము అ కాలజ మనబడింది,అని. శార్ఙ్గధరుడిట్లా - పిడుగుపాటు, భూకంపం, గ్రహయుద్ధం, రాహుదర్శనం వీటియందు ఐదు రోజుల లోపల అమ్మాయికి వివాహం చేస్తే ఆమె నశిస్తుంది,అని. తోకచుక్కపడటం, ఇంద్రధనుస్సు కన్పించటం, అధికమైన మేఘాలు, దుమ్ము, పొగ, పిడుగుపాటు, మెరుపులు, వర్షము సూర్యుని కప్పటం వల్ల కలిగే దోషాదులందు, పండితులంతా కూడా శుభకార్యములందు

ఒక రాత్రిని విడిచిపెట్టాలి. దుఃస్వప్నమందు, చెడ్డశకునములందు, అశుభఫలాన్ని చూచిన యెడల, మనస్సులో చెడుకలత, బుద్ధి భ్రాంతి నందినప్పుడు ఈ సందర్భములందు చౌలము మౌంజీబంధనము, వివాహము వీటిని ఎల్లప్పుడూ విడిచిపెట్టాలి. జ్యోతిః ప్రకాశమందిట్లా – సంక్రాంతికన్న ముందున్న పదహారు గడియలు తరువాతి పదహారు గడియలు పుణ్య ప్రదములు కనుక ఉపనయన వ్రత యాత్రా పరిణయనములందు ఆ గడియలను విడిచి పెట్టాలి,అని. గర్గుడిట్లా – దిక్కులు దహిస్తే ఒకరోజు, గ్రహణమందు ఏడురోజులు, భూకంప మందు మూడు రోజులు విడిచిపెట్టాలి,అని. తోకచుక్కపడితే మూడురోజులు, పొగ కన్పిస్తే ఐదు రోజులు పిడుగుపడితే ఒకరోజు అన్ని కర్మలందును విడిచిపెట్టాలి. రాహుకేతువుల దర్శనం, అదర్శనం వల్ల ఏడురోజులు విడిచిపెట్టాలి. ఎంతవరకైతే కేతూదయం ఔతుందో అంతవరకు అశుభ సమయం ఔతుంది. దీనికి అపవాదము అద్భుతసాగరమందిట్లా – ఆ పిదప, మూడు రోజుల మధ్యలో నీరు ఎప్పుడు స్వచ్ఛమౌతుందో అప్పుడే ఉత్పాతదోషం శమిస్తుంది,అని ఆచార్యులు చెప్పారు,అని. సంబంధతత్వమందు ఇట్లా – వృద్ధి శ్రాద్ధం చేస్తే భూకంపాదుల దోషంలేదు,అని.

**మూ॥ అథాపరిహార్యే కన్యా వైధవ్యయోగే విశేష ఉచ్యతే. మార్కండేయపురాణే – బాల వైధవ్య యోగేతు కుంభ ద్రుప్రతిమాదిభిః కృత్వాలగ్నంరహః పశ్చాత్ కన్యోద్వాహ్యేతి చాపరే. అత్రపునర్భూదోషాభావఉక్తో విధానఖండే – స్వర్ణాంబు పిప్పలానాం చ ప్రతిమా విష్ణురూపిణీ, తయా సహ వివాహేతు పునర్భూత్వం నజాయతే. సూర్యారుణసంవాదే – వివాహాత్పూర్వకాలేచ, చంద్రతారా బలాన్వితే, వివాహోక్తే చతాం కన్యాం కుంభేన సహచోద్వహేత్. సూత్రేణ వేష్టయేత్పశ్చాత్ దశతంతు విధానతః, కుంకుమాలంకృతం దేహం తయోరేకాంతమందిరే. తతఃకుంభం చనిస్సార్య ప్రభజ్య సలిలాశయే, తతోఽభిషేచనం కుర్యాత్ పంచపల్లవ వారిభిః. కుంభ ప్రార్థనాతత్రైవ– వరుణాంగ స్వరూపాయ జీవనానాం సమాశ్రయ, పతిం జీవయ కన్యాయాః చిరం పుత్ర సుఖం కురు. దేహి విష్ణో వరం దేవ కన్యాం పాలయ దుఃఖతః, తతోఽలంకార వస్త్రాధ్యాః వరాయ ప్రతిపాదయేత్ ఇతి కుంభవివాహః.**

అను॥కన్యా వైధవ్యయోగం తప్పని పరిస్థితి ఐతే విశేషాన్ని చెప్తున్నాడు. మార్కండేయ పురాణమందిట్లా – బాల్య, వైధవ్యం కలిగేట్లైతే కుంభము, వృక్షము, ప్రతిమా మొదలగువానితో వివాహాన్ని రహస్యంగా చేసి పిదప కన్య వివాహ మాడాలి అని ఇతరులన్నారు,అని. ఇక్కడ పునర్భూదోషం (మారు మనువు) ఉండదని విధానఖండమందు చెప్పబడింది ఇట్లా – బంగారం, నీరు, రావి వీటితో విష్ణురూపంగల ప్రతిమ చేసి, దానితో వివాహం చేస్తే పునర్భూత్వ దోషము కలుగదు,అని. సూర్యారుణ సంవాదమందిట్లా – వివాహం కన్న ముందే, చంద్రతారా బలం ఉండగా, వివాహంనకు చెప్పిన లగ్నంలో ఆ కన్యకు కుంభంతో వివాహం చేయాలి. పిదప దశతంతు విధానంతో దారంతో కుంభము కన్య వీరిద్దరికి చుట్టాలి. వారికి, ఏకాంతమందిరమందు దేహాన్ని కుంకుమతో

అలంకరించాలి. పిదప కుంభమును ఇంటి నుండి బయటికి తెచ్చి జలాశయమందు విడిచి పిదప కన్యకు పంచ పల్లవముల నీటితో స్నానం చేయించాలి. అక్కడే కుంభ ప్రార్థన ఇట్లా - వరుణునకు అంగ స్వరూపుడ, జీవులకు ఆశ్రయ భూతుడ, కన్యయొక్క పతిని జీవింపచేయి. చిరకాలము పుత్రసుఖాన్ని ప్రసాదించు,అని. ఓ దేవ విష్ణు వరమివ్వు, కన్యను దుఃఖం నుండి రక్షించు. పిదప అలంకార వస్త్రములతో కూడిన కన్యను వరునకు ఇవ్వాలి,అని కుంభవివాహము.

**మూ॥ మూర్తిదానమపి తత్రైవోక్తం - బ్రాహ్మణం సాధుమామంత్ర్య సంపూజ్య వివిధార్హణైః తస్మైదద్యాత్ విధానేన విష్ణోర్మూర్తిం చతుర్భుజం. శుద్ధవర్ణ సువర్ణేన విత్తశక్త్యాథవా పునః, నిర్మితాం రుచిరాం శంఖగదా చక్రాబ్జసంయుతాం,దధానాం వాసవీ పీతే కమలోత్పల మాలినీం, సదక్షిణాం చ తాం దద్యాత్ మంత్రమేత దుదీరయేత్. యన్మయా ప్రాచి జనుషిఘ్నంత్యా పతి సమాగమం, విషోప విషశస్త్రాద్యైః హతో వాతి విరక్తయా. ప్రాప్యమానం మహాఘోరం యశః సౌఖ్యధనాపహం, వైధవ్యాద్యతి దుఃఖౌఘ నాశాయ శుభలబ్ధయే, బహుసౌభాగ్య లబ్ధ్యైచ మహావిష్ణో రిమాంతనుం, సౌవర్ణీం నిర్మితాం శక్త్యా తుభ్యం సంప్రదదేద్విజ. అనఘాద్యాహ మస్మి ఇతి త్రివారం ప్రజపేదితి. ఏవమస్త్వితి తస్యాశీః గృహీత్వా స్వగృహం విశేత్. తతో వైవాహికం కుర్యాత్ విధిందాతా మృగీదృశః. అన్యేఽప్యశ్వత్థ వివాహ వృక్షసేచనాదయః తత్రైవజ్ఞేయాః. విస్తర భయాన్నోచ్యంతే. అథప్రతికూలాది. జ్యోతిర్నిబంధేగర్గః - కృతేతు నిశ్చయే పశ్చాత్ మృత్యుర్భవతి కస్యచిత్ తదా, నమంగలం కుర్యాత్ కృతే వైధవ్య మాప్నుయాత్.**

అను॥ మూర్తిదానము కూడా అక్కడే చెప్పబడింది. బ్రాహ్మణుని చక్కగా ఆ మంత్రణ చేసి, రకరకాలైన పూజా ప్రకారములతో పూజించి, ఆతనికి విధి పూర్వకముగా నాలుగు చేతులు గల విష్ణుమూర్తి విగ్రహాన్ని దానం చేయాలి. స్వచ్ఛమైన వర్ణము గల బంగారముతో లేదా తనకు గల ద్రవ్యమునకు అనుగుణంగా నిర్మించబడిన, అందమైన, శంఖగద చక్ర అబ్జములు గలిగి, పచ్చని వస్త్రమును, కమల ఉత్పలమాలను ధరించిన ఆ మూర్తిని దక్షిణతో పాటు దానం చేయాలి. ఈ మంత్రాన్ని పఠించాలి. నేను పూర్వజన్మలో పతి సమాగమాన్ని నశింపచేస్తూ, విష, ఉపవిష, శస్త్రము మొదలగువానితో చంపబడి, లేదా అతి విరక్తితో గాని చంపబడిన పతిగలుగుటచే వచ్చిన మహా ఘోరమైన, సౌఖ్య ధనములను నశింపచేసే యశస్సు నాశం కొరకు, వైధవ్యాది అతి దుఃఖ సమూహముల నాశముకొరకు, శుభం చేకూరే కొరకు బహు సౌభాగ్య లబ్ధికొరకును ఈ మహావిష్ణువు విగ్రహాన్ని నా శక్తి కొలది బంగారుతో చేసిన దానిని ఓ బ్రాహ్మణుడా నీకు దానం చేస్తున్నాను. ఈవేళ నేను పాప రహితురాలినైనాను, అని మూడు మార్లు జపించాలి,అని. అట్లాగే కానిమ్ము, అని ఆతని ఆశీస్సులు గ్రహించి తన ఇంటికి రావాలి. పిదప కన్యాదాత కన్యయొక్క వివాహ విధిని ఆచరించాలి. ఇతరమైనవి కూడా అశ్వత్థ వివాహము, వృక్షసేచనాదులు మొదలగునవి అక్కడే తెలుసుకోవాలి. విస్తారమౌతుందనే భయంతో చెప్పటం లేదు. ఇక ప్రతి కూలాదులు. జ్యోతిర్నిబంధమందు గర్గుడిట్లా - నిశ్చయం చేశాక ఎవడైనా మరణిస్తే అప్పుడు వివాహం

ఒక రాత్రిని విడిచిపెట్టాలి దుఃస్వప్నమందు, చెడ్డశకునములందు, అశుభఫలాన్ని చూచిన మొదల, మనస్సులో చెడుకలత, బుద్ధి భ్రాంతి సందినప్పుడు ఈ సందర్భములందు చౌలము మౌంజీబంధనము, వివాహము వీటిని ఎల్లప్పుడూ విడిచిపెట్టాలి. జ్యోతిః ప్రకాశమందిట్లా – సంక్రాంతికన్న ముందున్న పదహారు గడియలు తరువాతి పదహారు గడియలు పుణ్య ప్రదములు కనుక ఉపనయన వ్రత యాత్రా పరిణయనములందు ఆ గడియలను విడిచి పెట్టాలి,అని. గర్గుడిట్లా – దిక్కులు దహిస్తే ఒకరోజు, గ్రహణమందు ఏడురోజులు, భూకంప మందు మూడు రోజులు విడిచిపెట్టాలి,అని. తోకచుక్కపడితే మూడురోజులు, పొగ కన్పిస్తే ఐదు రోజులు పిడుగుపడితే ఒకరోజు అన్ని కర్మలందును విడిచిపెట్టాలి. రాహుకేతువుల దర్శనం, అదర్శనం వల్ల ఏడురోజులు విడిచిపెట్టాలి. ఎంతవరకైతే కేతూదయం ఔతుందో అంతవరకు అశుభ సమయం ఔతుంది. దీనికి అపవాదము అద్భుతసాగరమందిట్లా – ఆ పిదప, మూడు రోజుల మధ్యలో నీరు ఎప్పుడు స్వచ్ఛమౌతుందో అప్పుడే ఉత్పాతదోషం శమిస్తుంది,అని ఆచార్యులు చెప్పారు,అని. సంబంధతత్వమందు ఇట్లా – వృద్ధి శ్రాద్ధం చేస్తే భూకంపాదుల దోషంలేదు,అని.

**మూ॥ అథాపరిహార్యే కన్యా వైధవ్యయోగే విశేష ఉచ్యతే. మార్కండేయపురాణే – బాల వైధవ్య యోగేతు కుంభ ద్రుప్రతిమాదిభిః కృత్వాలగ్నంరహః పశ్చాత్ కన్యోద్వాహ్యేతి చాపరే. అత్రపునర్భూదోషాభావఉక్తో విధానఖండే – స్వర్ణాంబు పిప్పలానాం చ ప్రతిమా విష్ణురూపిణీ, తయా సహ వివాహేతు పునర్భూత్వం నజాయతే. సూర్యారుణసంవాదే – వివాహాత్పూర్వకాలేచ, చంద్రతారా బలాన్వితే, వివాహోక్తే చతాం కన్యాం కుంభేన సహచోద్వహేత్. సూత్రేణ వేష్టయేత్పశ్చాత్ దశతంతు విధానతః, కుంకుమాలంకృతం దేహం తయోరేకాంతమందిరే. తతఃకుంభం చనిస్సార్య ప్రభజ్య సలిలాశయే, తతోఽభిషేచనం కుర్యాత్ పంచపల్లవ వారిభిః. కుంభ ప్రార్థనాతత్రైవ- వరుణాంగ స్వరూపాయ జీవనానాం సమాశ్రయ, పతిం జీవయ కన్యాయాః చిరం పుత్ర సుఖం కురు. దేహి విష్ణో వరం దేవ కన్యాం పాలయ దుఃఖతః, తతోఽలంకార వస్త్రాద్యైః వరాయ ప్రతిపాదయేత్ ఇతి కుంభవివాహః.**

అను॥కన్యా వైధవ్యయోగం తప్పని పరిస్థితి ఐతే విశేషాన్ని చెప్తున్నాడు. మార్కండేయ పురాణమందిట్లా – బాల్య, వైధవ్యం కలిగేట్లైతే కుంభము, వృక్షము, ప్రతిమా మొదలగువానితో వివాహాన్ని రహస్యంగా చేసి పిదప కన్య వివాహ మాడాలి అని ఇతరులన్నారు,అని. ఇక్కడ పునర్భూదోషం (మారు మనువు) ఉండదని విధానఖండమందు చెప్పబడింది ఇట్లా – బంగారం, నీరు, రావి వీటితో విష్ణురూపంగల ప్రతిమ చేసి, దానితో వివాహం చేస్తే పునర్భూత్వ దోషము కలుగదు,అని. సూర్యారుణ సంవాదమందిట్లా – వివాహం కన్న ముందే, చంద్రతారా బలం ఉండగా, వివాహంనకు చెప్పిన లగ్నంలో ఆ కన్యకు కుంభంతో వివాహం చేయాలి. పిదప దశతంతు విధానంతో దారంతో కుంభము కన్య వీరిద్దరికి చుట్టాలి. వారికి, ఏకాంతమందిరమందు దేహాన్ని కుంకుమతో

అలంకరించాలి. పిదప కుంభమును ఇంటి నుండి బయటికి తెచ్చి జలాశయమందు విడిచి పిదప కన్యకు పంచ పల్లవముల నీటితో స్నానం చేయించాలి. అక్కడే కుంభ ప్రార్థన ఇట్లా - వరుణునకు అంగ స్వరూపుడ, జీవులకు ఆశ్రయ భూతుడ, కన్యయొక్క పతిని జీవింపచేయి. చిరకాలము పుత్రసుఖాన్ని ప్రసాదించు,అని. ఓ దేవ విష్ణు వరమివ్వు, కన్యను దుఃఖం నుండి రక్షించు. పిదప అలంకార వస్త్రములతో కూడిన కన్యను వరునకు ఇవ్వాలి,అని కుంభవివాహము.

**మూ॥ మూర్తిదానమపి తత్రైవోక్తం** - బ్రాహ్మణం సాధుమామంత్ర్య సంపూజ్య **వివిధార్హణైః తస్మైదద్యాత్ విధానేన విష్ణోర్మూర్తిం చతుర్భుజం. శుద్ధవర్ణ సువర్ణేన విత్తశక్త్యాథవా పునః, నిర్మితాం రుచిరాం శంఖగదా చక్రాబ్జసంయుతాం,దధానాం వాసవీ పీతే కమలోత్పల మాలినీం, సదక్షిణాం చ తాం దద్యాత్ మంత్రమేత దుదీరయేత్. యన్మయా ప్రాచి జనుషిఘ్నంత్యా పతి సమాగమం, విషోప విషశస్త్రాద్యైః హతో వాతి విరక్తయా. ప్రాప్యమానం మహాఘోరం యశః సౌఖ్యధనాపహం, వైధవ్యాద్యతి దుఃఖౌఘ నాశాయ శుభలబ్ధయే, బహుసౌభాగ్య లబ్ధ్యైచ మహావిష్ణో రిమాంతనుం, సౌవర్ణీం నిర్మితాం శక్త్యా తుభ్యం సంప్రదదేద్విజ. అనఘాద్యాహ మస్మి ఇతి త్రివారం ప్రజపేదితి. ఏవమస్త్వితి తస్యాశీః గృహీత్వా స్వగృహం విశేత్. తతో వైవాహికం కుర్యాత్ విధిందాతా మృగీదృశః. అన్యేఽప్యశ్వత్థ వివాహ వృక్షసేచనాదయః తత్రైవజ్ఞేయాః. విస్తర భయాన్నోచ్యంతే. అథప్రతికూలాది. జ్యోతిర్నిబంధేగర్గః - కృతేతు నిశ్చయే పశ్చాత్ మృత్యుర్భవతి కస్యచిత్ తదా, నమంగలం కుర్యాత్ కృతే వైధవ్య మాప్నుయాత్.**

అను॥ మూర్తిదానము కూడా అక్కడే చెప్పబడింది. బ్రాహ్మణుని చక్కగా ఆ మంత్రణ చేసి, రకరకాలైన పూజా ప్రకారములతో పూజించి, ఆతనికి విధి పూర్వకముగా నాలుగు చేతులు గల విష్ణుమూర్తి విగ్రహాన్ని దానం చేయాలి. స్వచ్ఛమైన వర్ణము గల బంగారముతో లేదా తనకు గల ద్రవ్యమునకు అనుగుణంగా నిర్మించబడిన, అందమైన, శంఖగద చక్ర అబ్జములు గలిగి, పచ్చని వస్త్రమును, కమల ఉత్పలమాలను ధరించిన ఆ మూర్తిని దక్షిణతో పాటు దానం చేయాలి. ఈ మంత్రాన్ని పఠించాలి. నేను పూర్వజన్మలో పతి సమాగమాన్ని నశింపచేస్తూ, విష, ఉపవిష, శస్త్రము మొదలగువానితో చంపబడి, లేదా అతి విరక్తితో గాని చంపబడిన పతిగలుగుటచే వచ్చిన మహా ఘోరమైన, సౌఖ్య ధనములను నశింపచేసే యశస్సు నాశం కొరకు, వైధవ్యాది అతి దుఃఖ సమూహముల నాశముకొరకు, శుభం చేకూరే కొరకు బహు సౌభాగ్య లబ్ధికొరకును ఈ మహావిష్ణువు విగ్రహాన్ని నా శక్తి కొలది బంగారుతో చేసిన దానిని ఓ బ్రాహ్మణుడా నీకు దానం చేస్తున్నాను. ఈవేళ నేను పాప రహితురాలినైనాను, అని మూడు మార్లు జపించాలి,అని. అట్లాగే కానిమ్ము, అని ఆతని ఆశీస్సులు గ్రహించి తన ఇంటికి రావాలి. పిదప కన్యాదాత కన్యయొక్క వివాహ విధిని ఆచరించాలి. ఇతరమైనవి కూడా అశ్వత్థ వివాహము, వృక్షసేచనాదులు మొదలగునవి అక్కడే తెలుసుకోవాలి. విస్తారమౌతుందనే భయంతో చెప్పటం లేదు. ఇక ప్రతి కూలాదులు. జ్యోతిర్నిబంధమందు గర్గుడిట్లా - నిశ్చయం చేశాక ఎవడైనా మరణిస్తే అప్పుడు వివాహం

చేయురాదు చేస్తే వైధవ్యాన్ని పొందుతుంది,అని.

మూ॥ **జ్యోతిర్మేధాతిథిః** - వధూవరార్థే ఘటితే సునిశ్చితే వరస్యగేహేఽప్యథ కన్యకాయాః మృత్యుర్యదిస్యాన్మనుజస్య కస్య చిత్తదా, నకార్యం ఖలు మంగలం బుధైః. మంగలం = వివాహః స్మృతి చంద్రికాయాం - కృతేవాక్ నిశ్చయే పశ్చాత్ మృత్యుర్భవతి గోత్రిణః, తదా న మంగలం కార్యం నారీవైధవ్యదం ధ్రువం,భృగుః-వాగ్దానానంతరం యత్ర కులయోః కస్యచిన్మృతిః తదోద్వాహోనైవకార్యః స్వవంశక్షయదోషతః. శౌనకః - వరవధ్వోః పితామాతా పితృవ్యశ్చ సహోదరః ఏతేషాం ప్రతికూలం చ మహావిఘ్నప్రదం భవేత్. పితా పితా మహశ్చైవ మాతాచైవ పితామహీ, పితృవ్యః స్త్రీ సుతోభ్రాతా భగినీ, చా వివాహితా, ఏభిరత్ర విపన్నైశ్చ ప్రతికూలం బుధైః స్మృతం, అన్యైరపి, విపన్నైస్తు కేచి దూచుర్నతద్భవేత్. మాండవ్యః - వాగ్దానా నంతరం మాతా పితా భ్రాతా విపద్యతే, వివాహో నైవకర్తవ్యః స్వవంశ స్థితిమిచ్ఛతా. **సంకటేతు మేధాతిథిః** - వాగ్దానానంతరం యత్రకులయోః కస్య చిన్మృతిః, తదా సంవత్సరాదూర్ధ్వం వివాహః శుభదోభవేత్. **స్మృతిరత్నావల్యాం** - పితురబ్దంశౌచం స్యాత్తదర్ధం మాతురేవ, చ, మాసత్రయంతు భార్యాయాః తదర్ధం భ్రాతృపుత్రయోః అన్యేషాంతు సపిండా నామా శౌచం మాసమీరితం.

అను॥ జ్యోతిర్మేధా తిథి ఇట్లా - వధూవరుల వివాహ లగ్నం నిశ్చయమయ్యాక వరుని ఇంట్లో కాని లేదా కన్యక ఇంట్లో కాని ఎవరైనా ఒకవేళ చనిపోతే అప్పుడు బుధులు వివాహ కార్యాన్ని ఆచరించరాదు,అని. మంగలమనగా వివాహము. స్మృతి చంద్రికయందిట్లా - వాగ్దానం అయ్యాక వధువు కాని లేదా వరుని కులంలో (మూడు తరముల లోపల సగోత్ర సపిండ మరణమైతే) మరణం సంభవిస్తే అప్పుడు మంగళ కార్యం చేయరాదు. ఆ వివాహము నారికి వైధవ్యాన్నిచ్చేది, నిశ్చయము,అని. భృగువిట్లా - వాగ్దానం తరువాత వరుడు లేదా కన్యల కులములలో ఎవరైనా మరణిస్తే అప్పుడు వివాహం చేయరాదు. తమ వంశం నాశనమై పోయే దోషం వస్తుంది కనుక,అని. శౌనకుడిట్లా- వరుడు వధువుల తండ్రి తల్లి చిన్నాయన, సహోదరుడు వీరి ప్రతికూలము గొప్ప విఘ్నకారి ఔతుంది,అని. తండ్రి, తండ్రి తండ్రి(తాత),తల్లి, తల్లితల్లి, చిన్నాయన, స్త్రీసుతుడు (వరునకు రెండో వివాహం కన్న ముందు తొలి భార్యకు కలిగిన పుత్రుడు) సోదరుడు పెళ్ళికాని చెల్లెలు, వీరిలో ఎవరైనా మరణిస్తే కూడా దాన్ని ప్రతికూలముగా బుధులు గ్రహించాలి. ఇతరులెవరైనా మరణిస్తే కూడా అని కొందరన్నారు కాని అది అట్లాకాదు. మాండవ్యుడిట్లా - వాగ్దానం తరువాత తల్లి తండ్రి, అన్న, మరణిస్తే వివాహం చేయరాదు, తన వంశపు ఉనికిని కోరేవారు,అని. సంకట మందైతే మేధాతిథి ఇట్లా - వాగ్దానం తరువాత కన్య వర కులములలో ఎవరైనా మరణిస్తే అప్పుడు సంవత్సరం తరువాత వివాహము శుభాన్ని కల్గిస్తుంది,అని. స్మృతి రత్నావలి యందిట్లా- తండ్రి మరణిస్తే సంవత్సరం అశౌచం, తల్లి మరణిస్తే ఆరు నెలల తరువాత శౌచం, భార్య మరణిస్తే మూడు నెలలతరువాత, భ్రాతలు పుత్రులు మరణిస్తే నెల పదిహేను రోజుల తరువాత శుచిత్వం ఇతరులు సపిండులు (పితామహీ మొ॥) మరణిస్తే నెలరోజులు అశౌచ ముంటుంది,అని.

మూ॥ **తదంతే శాంతికం కృత్వా తతో లగ్నం విధీయతే. జ్యోతిః** ప్రకాశే - ప్రతికూలేఽపి కర్తవ్యో వివాహః మాసతః పరః, శాంతిం విధాయ గాందత్వా వాగ్దానాది చరేత్పునః . శాన్తిం = **వినాయక శాంతిం తథా చ మేధా తిథిః** - సంకటే సమనుప్రాప్తే యాజ్ఞవల్క్యేన యోగినా, **శాంతి రుక్తా గణేశస్య కృత్వాతాం శుభమాచరేత్,ఇతి. ప్రతికూలే నకర్తవ్యో గచ్ఛే ద్యావదృతు త్రయం,ప్రతికూలేఽపి కర్తవ్యమిత్యాహుః బహు విప్లవే ప్రతికూలే సపిండస్య మాసమేకం వివర్జయేత్. జ్యోతిః సాగరే - దుర్భిక్షే రాష్ట్ర భంగే చ పిత్రోర్వా ప్రాణ సంశయే, ప్రౌఢాయా మపిక న్యాయాం నానుకూల్యం ప్రతీక్ష్యతే. మేధాతిథిః - పురుష త్రయ పర్యంతం ప్రతికూలం స్వగోత్రిణాం ప్రవేశా నిర్గమస్తద్వత్తథా మండనముండనే. ప్రేతకర్మణ్య నిర్వర్త్యచరేన్నాభ్యుదయ క్రియాం, ఆచతుర్థం తతః పుంసి పంచమే శుభదం భవేత్.**

అను॥ దాని చివర (వర్షాంతమందు) శాంతి ఆచరించి పిదప లగ్నం చేయాలి. జ్యోతిః ప్రకాశమందిట్లా - ప్రతికూల మందు కూడా ఒక మాసం తరువాత వివాహం చేయాలి. వినాయక శాంతిచేసి గోదానంచేసి వాగ్దానాదులు తిరిగి చేయాలి,అని. అట్లాగే మేధాతిథి ఇట్లా - సంకటంవస్తే యోగి యాజ్ఞవల్క్యుడిట్లా గణేశ శాంతిని చేసి అశుభ మాచరించాలని చెప్పాడు,అని. ప్రతికూలమందు మూడు ఋతువుల వరకు వివాహం చేయరాదు. ప్రతికూల మందైనా, బహు ఉపద్రవమందు, వివాహం చేయవచ్చును అని అన్నారు. ప్రతికూలమందు సపిండునకైతే ఒక మాసాన్ని విడిచిపెట్టాలి. జ్యోతిః సాగర మందిట్లా - దుర్భిక్ష మందు రాష్ట్ర భంగమందు తల్లి తండ్రి స్థితి ప్రాణ సంశయముగా ఉన్నప్పుడు, కన్య ప్రౌఢయైనప్పుడు, అనుకూలంకై ఎదిరి చూడరాదు,అని. మేధాతిథి ఇట్లా - స్వగోత్రులకు మూడు తరముల వరకు ప్రతికూలము. వధూ ప్రవేశం, కన్యా నిర్గమనం (వివాహమై) అట్లాగే వివాహం, చూడా కరణమందు అని గ్రహించాలి,అని. ప్రేతకర్మ లాచరించకుండా అభ్యుదయ క్రియనాచరించరాదు. స్వగోత్రులకు నాల్గుతరముల వరకు ప్రేతకర్మ చేయాలి. పిదప ఐదవతరం వాడికి శుభం కలుగుతుంది.

మూ॥ **అథ రజోదోషే** నిర్ణయః - మాధవీయే - ప్రారంభాత్ ప్రాగ్వివాహస్య మాతాయది **రజస్వలా, నివృత్తిస్తస్య కర్త వ్యా సహత్వశ్రుతి చోదనాత్,** ప్రారంభాత్ నాందీ శ్రాద్ధాత్, నాందీ **ముఖం వివాహాదౌ, ఇత్యాదినా తస్యైవ** ప్రారంభోక్తేః. మేధాతిథిః - చౌలేచ వ్రతబంధేచ వివాహే యజ్ఞకర్మణి, భార్యా రజస్వలాయస్య ప్రాయస్తస్యన శోభనం. వధూవరాన్యతమయోః జననీ చేద్రజస్వలా, తస్యాః శుద్ధేః పరంకార్యం మాంగల్యం మనురబ్రవీత్. వృద్ధమనుః - వివాహ వ్రతచూడాసు మాతా యది రజస్వలా, తదా న మంగలంకార్యం శుద్ధౌ కార్యం శుభేప్సుభిః. గర్గః - యస్యో ద్వాహాది మాంగల్యే మాతాయదిరజస్వలా, తదా నతత్ ప్రకర్తవ్యం ఆయుఃక్షయకరాయతః . **నాందీ శ్రాద్ధోత్తరం రజోదోషేతు** కపర్దికారికాసు - సూతికోదక్యయోః శుద్ధ్యై గాందద్యాత్ హోమపూర్వకం, ప్రాప్తే కర్మణి శుద్ధిః స్యాత్ ఇతరస్మిన్న శుద్ధ్యతి. అలాభేసుముహూర్తస్య రజోదోషే చ సంగతే, శ్రియం సంపూజ్య తత్కుర్యాత్ పాణిగ్రహణ మంగలం. హైమీం మాషమితాం పద్మాం శ్రీసూక్త విధినార్చయేత్, ప్రత్యృచం పాయసంహుత్వా అభిషేకం సమాచరేత్,ఇతి. **సూతకాది**

సంకటేతు - కూష్మాండీభిః ఘృతం హుత్వా పయస్వినీం గాం చదత్వా వివాహాది కుర్యాత్, ఇతి చ వక్ష్యతే (ప్రాగుక్తం).

అను॥ ఇక రజోదోష నిర్ణయము. మాధవీయమందిట్లా - వివాహం ఆరంభం కావటంకన్న ముందు తల్లి రజస్వల ఐతే దాని, నివృత్తి చేసుకోవాలి, శ్రుతి సహత్వ (కూడా) అని చెబుతోంది కనుక. ప్రారంభమనగా నాందీ శ్రాద్ధము. వివాహాదులందు నాంది ముఖము, అని మొదలుగా దానినే ప్రారంభంగా చెప్పారు,అని. మేధాతిథి ఇట్లా - చౌలమందు, వ్రత బంధమందు, వివాహమందు, యజ్ఞకర్మయందు, భార్య రజస్వల ఐతే తరచుగా అది ఆతనికి మంచిదికాదు అని. వధువు వరుడు వీరిలో ఒకరి తల్లి రజస్వల ఐతే, ఆమె శుద్ధి అయ్యాకే మంగళకార్యం చేయాలని మనువు చెప్పాడు. వృద్ధ మనువు ఇట్లా - వివాహము వ్రతము చూడాకరణము వీటిలో తల్లి రజస్వల ఐతే అప్పుడు మంగళకార్యం చేయరాదు. శుభం కోరేవారు శుద్ధి అయ్యాక చెయ్యాలి,అని అన్నాడు. గర్గుడిట్లా - ఎవని వివాహం మొదలగు మంగళకార్యము లందు తల్లి రజస్వల ఔతుందో, అప్పుడు ఆ కార్యం చేయరాదు, ఎందువల్లనంటే అది ఆయుస్సును క్షీణింపచేస్తుంది,అని. నాందీశ్రాద్ధం జరిగాక రజో దోషం సంభవిస్తే కపర్దికారికలందిట్లా - సూతకం, రజోధర్మం వీటిశుద్ధి కొరకు హోమ పూర్వకముగా గోవును దానం చేయాలి. నాందీ శ్రాద్ధం ప్రారంభమైతే శుద్ధి ఔతుంది. ఆరంభం కాకపోతే శుద్ధికాదు, సుముహూర్తం లభించకపోతే, రజోదోషం సంభవిస్తే, లక్ష్మీదేవిని పూజించి, ఆపాణిగ్రహణ మంగల కార్యాన్ని ఆచరించాలి. బంగారుదైన, మాష పరిమిత (బరువు)మైన పద్మావతిమూర్తిని శ్రీసూక్త విధితో అర్చించాలి, ప్రతి ఋక్కునకు పాయసంతో హోమం చేసి అభిషేకం చేయాలి,అని. సూతకాది సంకటమందైతే - కూష్మాండ ఋక్కులతో నేయితో హెూమంచేసి, పాలిచ్చే ఆవును దానం చేసి వివాహాది కార్యాలు చేయాలి,అని కూడా చెప్పబడుతోంది. (ముందే చెప్పాము).

మూ॥ అథ ఏకక్రియా నిర్ణయః. జ్యోతిర్నిబంధే వృద్ధమనుః - ఏకమాతృజయో రేకవాసరే (వత్సరే) పురుషస్త్రియోః,న సమాన క్రియాం కుర్యాత్ మాతృభేదే విధీయతే. ఏతేన ఏకస్య పుంసో వివాహద్వయమేకదినే నిషిద్ధం. మాతృభేదాభావాత్. నారదః - పుత్రోద్వాహాత్పరం పుత్రీవివాహోన ఋతుత్రయే, న, తయోః వ్రతముద్వాహాత్ మండనాదపి ముండనం. వరాహః - వివాహస్త్వేకజాతానాం షణ్మాసాభ్యంతరేయది, అసంశయం త్రిభిర్వర్షైః తత్రైకా విధవా భవేత్. మదనరత్నే వసిష్ఠః - సపుంవివాహోర్ధ్వమృతుత్రయేఽపి వివాహ కార్యం దుహితుః ప్రకుర్యాత్, నమండనాచ్చాపి హిముండనంచ గోత్రైకతాయాం యదినాబ్దభేదః. ఏకోదర భ్రాతృ వివాహ కృత్యం స్వసుర్నపాణి గ్రహణం విధేయం, షణ్మాసమధ్యే మునయః సమూచుః నముండనం మండనతోఽపి కార్యం. ఏతదపవాదస్తత్రైవ - ఋతు త్రయస్య మధ్యేచేత్ అన్యాబ్దస్య ప్రవేశనం, తదాహ్యేకో దరస్యాపి వివాహస్తు ప్రశస్యతే. సారావల్యాం - ఫాల్గునే చైత్రమాసేతు పుత్రోద్వాహోపనాయనే, భేదాదబ్దస్య కుర్వీత నర్తు త్రయవిలంఘనం. సంహితాప్రదీపే - ఊర్ధ్వం వివాహాత్తనయస్య నైవకార్యో వివాహో దుహితుః సమార్ధం, అప్రాప్యకన్యాంశ్వసురాలయం చ వధూః ప్రవేశ్యా స్వగృహంచ

నారా. మదనరత్నే వసిష్ఠః – ద్విశోభనం త్వేక గృహేఽపి నేష్టం శుభంతు పశ్చాత్ నవభిర్దినైస్తు, అవశ్యకం శోభనముత్సవేవా ద్వారేథ వాచార్య విభేదతోవా.

అను॥ ఇక ఒకే క్రియా నిర్ణయము. జ్యోతిర్నిబంధమందు వృద్ధ మనువు ఇట్లా – ఒకే తల్లికి జన్మించిన వారికి మగస్త్రీ సంతానానికి ఒకేసారి (ఒకేరోజు, ఒకే సంవత్సరంలో) సమానక్రియను చేయరాదు. తల్లివేరైతే చేయవచ్చును,అని. దీనివల్ల ఒక పురుషునకు రెండు పెళ్ళిళ్ళు ఒకేరోజు చేయరాదని తెలిసింది, తల్లి, వేరుకాదు కాబట్టి. నారదుడిట్లా – పుత్రుని వివాహం తరువాత మూడు ఋతువుల వరకు పుత్రిక వివాహం చేయరాదు. ఒకరికి (కన్య) వివాహం తరువాత మరొకరికి ఉపనయనం చేయరాదు (పుత్రునకు). వివాహం తరువాత ఉపనయనం తగదు,అని. వరాహుండిట్లా – ఒకతల్లి గర్భంలో జన్మించిన వారికి అరు నెలల లోపల వివాహం చేయాల్సివస్తే, చేస్తే మూడు సంవత్సరాలలోపు ఆ ఇద్దరు స్త్రీలలో ఒక స్త్రీ విధవ ఔతుంది,అనుమానం లేదు,అని. మదనరత్నమందు వసిష్ఠుడిట్లా – కొడుకు వివాహం చేశాక మూడు ఋతువుల లోపల అమ్మాయి వివాహాన్ని చేయరాదు. వివాహం తరువాత కూడా ఒకే గోత్రమైతే ఒక సంవత్సర భేదం లేకపోతే ఉపనయనం కూడా తగదు,అని. ఏకోదరులైన అన్నదమ్ముల వివాహ కార్యమందు చెల్లెలి వివాహం చేయరాదు. అరునెలల వ్యవధిలో వివాహం తరువాత ఉపనయనం చేయరాదు అని మునులన్నారు. దీనికి అపవాదం అక్కడే – మూడు ఋతువుల మధ్య సంవత్సరం మారితే అప్పుడు ఏకోదరులకైనా వివాహం ప్రశస్తమైంది,అని. సారావలియందిట్లా – ఫాల్గున చైత్ర మాసములందు పుత్రుల వివాహ ఉపనయనములైతే సంవత్సరపు భేదంవల్ల చేయవచ్చును. అక్కడ మూడు ఋతువులు దాటాలని లేదు,అని. సంహితా ప్రదీప మందిట్లా – కొడుకు వివాహం అయ్యాక అరునెలలలో కూతురు వివాహం చేయరాదు. కన్యను అత్తవారింటికి పంపకుండా తొలుతనే కోడలిని ఇంటికి తీసుకురారాదు,అని. మదనరత్న మందు వసిష్ఠుడిట్లా– ఒకే ఇంట్లో కూడా రెండు శోభనములు ఒకేసారి అభిమతం కాదు. ఒకటయ్యాక తొమ్మిది రోజుల తరువాత మరో శుభం జరగాలి. ఒకవేళ శుభకార్యం కాని ఉత్సవంకాని చేయాల్సివస్తే ద్వారభేదంతో కాని ఆచార్యుని భేదంతోకాని ఆచరించవచ్చు.

మూ॥ ఏకోదర ప్రసూతానాం నాగ్నికార్యత్రయం భవేత్, భిన్నోదర ప్రసూతానాం నేతిశాతా తపోఽబ్రవీత్. జ్యోతిర్నిబంధే కాత్యాయనః – కులే ఋతు త్రయాదర్వాక్ మండనాన్నతు ముండనం, ప్రవేశాన్నిర్గమో నేష్టోనకుర్యాన్మంగల త్రయం. కుర్వంతి మునయః కేచిత్ అన్యస్మిన్వత్సరే లఘు, లఘువాగురువాకార్యం ప్రాప్తం నైమిత్తికంతుయత్. పుత్రోద్వాహః ప్రవేశాఖ్యః కన్యోద్వాహస్తు నిర్గమః ముండనం చౌలమిత్యుక్తం, వ్రతోద్వాహౌతు మంగలం. చౌలం ముండనమేవోక్తం వర్జయేత్ మండనాత్పరం మౌంజీచోభయతః కార్యాయతో మౌంజీ, నముండనం. అభిన్నవత్సరేపిస్యాత్, తదహస్తత్ర భేదయేత్, అభేదేతు వినాశః స్యాత్ న కుర్యాదే కమండపే. సంకటేతు కపర్ది కారికాసు వరాహమిహిరశ్చ – ఉద్వాహ్యపుత్రీం నపితా విదధ్యాత్ పుత్ర్యంతర స్యోద్వహనం కదాచిత్ యావచ్చతుర్థం దినమత్ర పూర్వం సమాప్య చాన్యోద్వహనం విదధ్యాత్. కశ్యపః – మౌంజీబంధః తథోద్వాహః షణ్మాసాభ్యంతరేఽపివా, పుత్ర్యుద్వాహంన కుర్వీత విభక్తానాం న దోషకృత్.

అను॥ ఒకే గర్భం నుండి జన్మించిన ముగ్గురికి ఒకేసారి అగ్నికార్యం చేయరాదు. భిన్నభిన్న గర్భ సంజాతులకు శుభకార్యం ఒకేసారి కాదు అని శాతాతపుడన్నాడు (ఏక్‌సాథ్) జ్యోతిర్నిబంధమందు కాత్యాయనుడిట్లా - ఒక కులమందు మూడు ఋతువులకన్న ముందు వివాహం తరువాత ముండనం జరగరాదు. ప్రవేశం (వధూ)తరువాత నిర్గమం ( కన్యా వివాహం) ఇష్టం కాదు. మూడు మంగళ కార్యములు ఒకేసారి చేయరాదు,అని. కొందరు మునులు మరో సంవత్సరం వచ్చాక చిన్న కార్యములను (శుభ) చేస్తున్నారు. నైమిత్తికమైనది కార్యమువస్తే చిన్నదైనా పెద్దదైనా చేయాల్సిందే. కొడుకు వివాహము ప్రవేశము అంటారు,పుత్రిక వివాహము నిర్గమమంటారు. చౌలమును ముండనమంటారు. వ్రత, వివాహములు మంగల కార్యములన్నారు.చౌలము ముండనమనే చెప్పబడింది. వివాహం తరువాత దీనిని చేయరాదు. మౌంజీని చౌలంకన్న ముందు, తరువాత చేయవచ్చును కనుక మౌంజి తర్వాత ముండనం చేయరాదు. ఒకే సంవత్సరంలో నైనా అక్కడ ఆ రోజును మార్చాలి (దినభేదం కావాలి) అభేదమైతేనో వినాశ మేర్పడుతుంది. కనుక ఒకే మంటపంలో చేయరాదు. సంకటమందైతే కపర్దికారికలలో వరాహమిహిరు డిట్లా - తండ్రి ఒక కూతురు (లేదా కొడుకు) వివాహం చేశాక అప్పుడే మరో కూతురు వివాహం చేయరాదు ఎప్పుడూనూ. నాలుగు రోజులవరకు (చతుర్థికర్మ) మొదటి వివాహాన్ని సమాప్తి చేసి తరువాత మరో వివాహాన్ని చేయాలి,అని. కశ్యపుడిట్లా - మౌంజీబంధము, అట్లాగే వివాహము తరువాత అరునెలల లోపల పుత్రికా వివాహం చేయరాదు. విభక్తులైతే దోషం లేదు.

మూ॥ జ్యోతిర్నిబంధే- వివాహమారభ్య చతుర్థి మధ్యే శ్రాద్ధం దినం దర్శదినం యదిస్యాత్, వైధవ్య మాప్నోతి తదాతు కన్యా జీవేత్పతిశ్చేదవ పత్యతాస్యాత్.తథా-వివాహమధ్యే యదిచేత్ క్షయాహస్తత్ర స్వముఖ్యాః పితరోన,యాంతి, వృత్తే వివాహే పరతస్తు కుర్యాత్ శ్రాద్ధం స్వధాభిః నతుదూషయేత్తం. యేవాభద్రం దూషయంతి స్వధాభిః ఇతిశ్రుతేశ్చ. మాసిక విషయే కాలహేమాద్రౌ కాత్యాయనిః - ప్రేతశ్రాద్ధాని సర్వాణి స పిండీకరణం తథా, అపకృష్యాపి కుర్వీత కర్తుం నాందీ ముఖం ద్విజః. వృద్ధింవినాపకర్షే దోషమాహ, తత్రైవోశనాః - వృద్ధి శ్రాద్ధ విహీనస్తు ప్రేత శ్రాద్ధానియశ్చరేత్, స శ్రాద్ధీనరకే ఘోరే పితృభిః సహమజ్జతి,ఇతి. మేధాతిథిః - ప్రేతకర్మాణ్య నిర్వర్త్యచరేన్నాభ్యుదయక్రియాం, ఆ చతుర్థం తతః పుం సి పంచమే శుభదం భవేత్. స్మృత్యంతరే - సపిండీకరణా దర్వాగపకృష్య కృతాన్యపి, పునరప్యప కృష్యంతే వృద్ధ్యుత్తర నిషేధనాత్. స్మృతి సారావల్యాం - భ్రాతృయుగే స్వసృయుగే భ్రాతృ స్వసృయుగేతథా, ఏకస్మిన్ మండపే నైవ నకుర్యాన్మందన ద్వయం సహోదర విషయమేతత్. యమః - ఏకోదర ప్రసూతానాం ఏకస్మిన్ వాసరే పుంసః, వివాహం నైవ కుర్వీత మండనోపరి ముండనం. గార్గ్యః - భ్రాతృయుగే స్వసృయుగే భ్రాతృస్వసృయుగేతథా, న కుర్యాన్మంగలం కించిత్ ఏకస్మిన్మండపేఽహని. ఏకస్మిన్ వాసరే ప్రాప్తే కుర్యాద్యమల జాతయోః, క్షౌరం నైవ వివాహం చ మౌంజీ బంధనమేవచ. జ్యోతి వివరణే - ఏకోదరయో రేకదినోద్వాహే భవేన్నాశః, నద్యంతర ఏకదినే కే ప్యాహుః సంకటేచ శుభం. ఊర్ధ్వం వివాహాత్పుత్రస్య నరస్య నారీ వివాహోన ఋతు త్రయంస్యాత్, నారీ వివాహోత్తరహేపి శస్తం నరస్య పాణిగ్రహ మాహురార్యాః.

అను॥ జ్యోతిర్నిబంధమందిట్లా - వివాహమారంభించాక చతుర్థీ కర్మ మధ్యలో శ్రాద్ధ దినము లేదా దర్శదినము వస్తే అప్పుడు కన్య త్వరగా వైధవ్యాన్ని పొందుతుంది. ఒకవేళ భర్త బ్రతికి ఉంటే సంతాన హీనురాలౌతుంది,అని. అట్లాగే- వివాహం మధ్యలో ఒకవేళ క్షయాహ శ్రాద్ధము వస్తే అక్కడ తమ ప్రధానమైన పితరులు రారు. వివాహం గడిచాక ఆ పిదప స్వధాకారాలతో శ్రాద్ధం చేయాలి,చేస్తే వివాహమును దూషితం చేయదు. ఎవరైతే స్వధాకారాలతో వివాహమును దూషితం చేస్తారో అని శ్రుతి కూడా ఉంది. మాసిక విషయమందు కాలహేమాద్రియందు శాట్యాయని ఇట్లా - అన్ని ప్రేత శ్రాద్ధములు, అట్లాగే సపిండీకరణము, అపకర్ష చేసిఐనా (తగ్గించి) ఆచరించాలి, ఒకవేళ బ్రాహ్మణుడు నాందీ ముఖ శ్రాద్ధమును చేయటానికి సన్నద్ధుడైతే,అని. వృద్ధి శ్రాద్ధం లేకుండా అపకర్షమైతే దోషమును అక్కడే ఉశనుడిట్లా చెప్పాడు -వృద్ధి శ్రాద్ధము లేకుండా ప్రేత శ్రాద్ధములను ఎవరాచరిస్తారో ఆశ్రాద్ధకర్త పితరులతో కూడా ఘోరమైన, నరకమందు మునిగిపోతాడు,అని. మేధాతిథి ఇట్లా - ప్రేతకర్మములు నిర్వర్తించకుండా (సమాప్తి) అభ్యుదయ క్రియను ఆచరించరాదు. నాల్గవ తరం వరకు అని తెలుసుకోవాలి, పిదప ఐదవతరం పురుషునకు మేలు చేస్తుంది,అని. స్మృత్యంతరమందిట్లా-సపిండీకరణం కన్న ముందు అపకర్షచేసి శ్రాద్ధములాచరించినా తిరిగి వానిని అపకర్ష (ఆకర్షణ) చేయాలి. వృద్ధి శ్రాద్ధం తరువాత వానిని ప్రేతకర్మల నిషేధించారు కనుక,అని.స్మృతి సారా వలియందిట్లా - ఇద్దరు అన్నతమ్ములు, ఇద్దరు అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ముల అక్కచెల్లెళ్ళ జంటలు వీరికి ఒకే మంటపమందు రెండు వివాహాలు చేయరాదు,అని. ఇది సహోదరుల విషయకం. యముడిట్లా - ఏక ఉదర ప్రసూతులకు ఒకే రోజున వివాహం చేయరాదు. మండనం తరువాత ముండనం చేయరాదు,అని. గార్గ్యుడిట్లా - ఇద్దరు భ్రాతలు, ఇద్దరు అక్కచెల్లెళ్ళు, భ్రాతృ స్వసృల జంటలు, వీరికి ఒకే మంటపమందు ఒకే రోజున మంగళ కార్యము ఆచరించరాదు, అని. ఒకేరోజు, ఒకేసారి జన్మించిన కవలలకు క్షౌరము, వివాహము, మౌంజీ బంధనము ఆచరించాలి. జ్యోతివివరణమందిట్లా - ఏకోదరులకు ఒకేరోజున వివాహం చేస్తే నాశం కలుగుతుంది. నది, వ్యవధానం ఉంటే సంకటమందును (వినాయకశాంతిచేసి) ఒకేరోజు చేసినా, శుభమే అని కొందరన్నారు,అని. అబ్బాయి వివాహం తరువాత మూడు ఋతువుల లోపల అమ్మాయి వివాహం చేస్తే శుభకరంగాదు. అమ్మాయి వివాహం తరువాత, అదే రోజున అబ్బాయి వివాహం చేస్తే శుభప్రదమౌతుంది అని ఆర్యులన్నారు.

మూ॥ **భిన్నమాతృజయోస్తు** ఏకవాసరే వివాహ మాహమేధాతిథిః - పృథజ్ మాతృజయోః కార్యో వివాహస్త్వే కవాసరే, ఏకస్మిన్ మండపేకార్యః పృథక్ వేదిక యోస్తథా. పుష్పపట్టికయోః కార్యం దర్శనం న, శిరః స్థయోః, భగినీభ్యాము భాభ్యాం చ యా వత్సప్త పదీ భవేత్. **యమయోస్తు విశేషః** భట్టకారికాయాం - ఏకస్మిన్ వత్సరే చైకవాసరే మండ పేతథా, కర్తవ్యం మంగలం స్వస్రోః భ్రాత్రోః యమల జాతయోః. జ్యోతిర్నిబంధే నారదః- ప్రత్యుద్వాహో

నైవకార్యః నైకస్మిన్ దుహితృద్వయం, నచైక జన్యయోః పుంసోః ఏకజన్యే తు కన్యకే. నైవం కదా చిదుద్వాహో నైకదా ముండన ద్వయం, నైక జన్యేతుకన్యేద్వే పుత్రయో రేకజన్యయోః న పుత్రీద్వయమే కస్మై ప్రద ద్యాత్తు కదాచన, ఇతి. కన్యాయాః రజోదర్శనేతు అపరార్కే సంవర్తః- మాతా చైవపితా చైవ జ్యేష్ఠ భ్రాతా తథైవ చ, త్రయస్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలాం. హారీతః - పితుర్గేహేతు యా కన్యారజః పశ్యత్య సంస్కృతా, సాకన్యా వృషలీజ్ఞేయా తత్పతిః వృషలీ పతిః. దేవలాత్రి కశ్యపాః పూర్వార్ధం తదేవ. భ్రూణహత్యా పితుస్తస్యాః సాకన్యా వృషలీస్మృతా, యస్తాం సముద్వహేత్కన్యాం బ్రాహ్మణోజ్ఞాన దుర్బలః, అశ్రాద్ధేయమపాంక్తే యంతం విద్యాత్ వృషలీపతిం. మాధవీయే బౌధాయనః - త్రీణి వర్షాణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనం. విష్ణుః - ఋతుత్రయముపాస్యైవ కన్యాకుర్యాత్ స్వయం వరం. అత్ర వరస్య దోషాభావ మాహయమః - కన్యా ద్వాదశవర్షాణి యాఽప్రదత్తావసేత్ గృహే, భ్రూణహత్యా పితుస్తస్యాః సాకన్యావరయేత్ స్వయం. ఏవంచోపనతాం పత్నీం నావమన్యే త్కదాచన, నతుతాం బంధకీం విద్యాత్ మనుః స్వాయం భువోఽబ్రవీత్. మనుః - అలంకారం నాదదీత పితృదత్తం స్వయం వరా, భ్రాతృకం మాతృదత్తం వా స్తేనా స్యాద్యది, తంహరేత్. వరం ప్రత్యాహ - పిత్రే నదద్యాత్ శుల్కంతు కన్యామృతు మతీం హరన్, నహి స్వామ్యాదతిక్రామే దృతూనాం ప్రతిబోధనాత్.

అను॥ వేరువేరు తల్లులకు జన్మించిన వారికైతే ఒకేరోజున వివాహాన్ని మేధాతిథి చెప్పారు ఇట్లా - వేరువేరు తల్లులకు జన్మించిన వారికి వివాహము ఒకేరోజున చేయొచ్చును. ఒకే మండపమందు, వేరువేరు వేదికల నేర్పరచి చేయాలి,అని. సప్తపది అయ్యేంతవరకు ఇద్దరు సోదరీమణులు ముఖంపై బాసిక మున్నంతవరకు ఒకరి నొకరు చూసుకోరాదు. భట్టకారిక యందు కవలల గూర్చి విశేషమిట్లా - ఒకే సంవత్సరమందు ఒకేదినమందు, ఒకే మంటపమందు కవలలుగా జన్మించిన అన్నదమ్ములకు, అక్కచెల్లెళ్ళకు మంగళ కార్య మాచరించాలి,అని. జ్యోతిర్నిబంధమందు నారదుడిట్లా - ఒకనికి ఇద్దరు కూతుళ్ళనిచ్చి వివాహం చేయరాదు (ఒకరి తర్వాత మరొకర్ని ఇవ్వరాదు). అల్లుడి చెల్లెల్ని తనకొడుక్కు చేసుకోరాదు. ఒకనికి జన్మించిన ఇద్దరు పురుషులకు ఒకనికే కల్గిన ఇద్దరు కన్యలను ఇవ్వరాదు,అని. ఎప్పుడూ ఒకేసారి ఇద్దరికి ముండనము ఇద్దరికి వివాహము, ఒకేసారి జన్మించిన వారికి చేయరాదు. ఒకినికి కల్గిన, ఇద్దరు ఆడ పిల్లలను ఒకనికే జన్మించిన ఇద్దరు కుమారులకు ఇవ్వరాదు. ఎప్పుడూ, ఒకనికి ఇద్దరు కూతుళ్ళ నివ్వరాదు,అని. కన్యకు రజోదర్శనమైతే అపరార్కమందు సంవర్తుడిట్లా - తల్లి, తండ్రి, పెద్దన్న వీరు రజస్వల ఐన కన్యను చూస్తే ఈ ముగ్గురు నరకానికి పోతారు,అని. హారీతుడిట్లా - తండ్రి గృహమందు ఏ కన్య అసంస్కృతయై రజస్సును చూస్తుందో ఆ కన్య వృషలి అని తెలుసు కోవాలి. ఆమె భర్త వృషలీపతి,అని. దేవల అత్రి కశ్యపులు కూడా పూర్వార్ధమును అదే చదువుతారు. ఆమె తండ్రికి భ్రూణ హత్య పాతకం వస్తుంది. ఆ కన్య వృషలి అని గ్రహించాలి. ఆ కన్యను వివాహమాడిన బ్రాహ్మణుడు జ్ఞానదుర్బలుడు. ఆ వృషలీపతిని శ్రాద్ధమునకు అనర్హునిగా, పంక్తి బాహ్యునిగా గ్రహించాలి. మాధవీయమందు బౌధాయను

డిట్లా - ఋతుమతియైన కన్య మూడు సంవత్సరాల వరకు తండ్రి ఆజ్ఞకై ఎదిరి చూడాలి, అని. విష్ణువిట్లా - మూడుసార్లు ఋతుమతి అయ్యాక కన్య స్వయంవరణం ఆచరించాలి,అని. ఇక్కడ వరుని దోషం లేదని యముడిట్లా అన్నాడు- పన్నెండేళ్ల వరకు ఏ కన్య తండ్రితో ఇవ్వబడక ఇంట్లోనే తండ్రి దగ్గర ఉంటుందో ఆ కన్యవల్ల (ఆ పిదప స్వయంగా వరణం చేయాలి) ఆ తండ్రికి భ్రూణ హత్య పాపం వస్తుంది,అని. ఈ విధముగా స్వయంవరంవల్ల వచ్చిన భార్యను ఎప్పుడూ అవమానపరచరాదు. ఆమెను బంధకి అని అనుకోరాదు, అని స్వాయంభువ, మనువు చెప్పాడు. మనువిట్లా - స్వయంవర కన్య తండ్రి ఇచ్చిన, అన్నదమ్ము లిచ్చిన, తల్లి ఇచ్చిన అలంకారములను తీసుకోరాదు. తీసుకుంటే ఆమె దొంగఔతుంది,అని. వరుని గూర్చి ఇట్లా- ఋతుమతియైన కన్యను వివాహమాడితే, ఆమె తండ్రికి ఎలాంటి శుల్కము నివ్వరాదు. ఋతుమతిత్వం తెలిసినందువల్ల, (వివాహం చేయనందువల్ల) (సంతా నోత్పత్తి నిరోధంవల్ల) ఆమె పితృస్వామ్యము నుండి (తండ్రి సొత్తు అనే దశ నుండి) దాటి పోతుంది,అని.

మూ॥ **అత్రప్రాయశ్చిత్తముక్త** మాశ్వలాయనేన - కన్యాంఋతు మతీం శుద్ధాం కృత్వా నిష్కృతి మాత్మనః శుచిం చ కారయిత్వాతా ముద్వహేత్ ఆ నృశం స్యధీః. పితాఋతూన్ స్వపుత్ర్యాస్తు గణయేదాదితః సుధీః దానావధి గృహేయత్నాత్పాల యేచ్చ రజోవతీం. దద్యాత్ తదృతు సంఖ్యాగాః శక్తః కన్యాపితాయది, దాతవ్యైకాపి నిఃస్వేనదానేతస్యా యథావిధి. దద్యాద్వా బ్రాహ్మణేష్వన్నమతి నిః స్వః సదక్షిణం, తస్యాతీ తర్తు సంఖ్యేషు వరాయ ప్రతిపాదయేత్. ఉపోష్య త్రిదినం కన్యారాత్రౌ పీత్వాగవాం పయః, అదృష్ట రజసేదద్యాత్ కన్యాయై రత్న భూషణం. తాముద్వహన్వరశ్చాపి కూష్మాండైః జుహుయాత్ ద్విజః,ఇతి. మదన పారిజాతే యజ్ఞ పార్శ్వః- వివాహే వితతే యజ్ఞే హోమకాలే ఉపస్థితే, కన్యాం ఋతుమతీం దృష్ట్వా కథం కుర్వంతి యాజ్ఞికాః . స్నాపయిత్వాతుతాం కన్యాం అర్చయిత్వా యథావిధి, యుంజానా మాహుతింహుత్వాత తస్తంత్రం ప్రవర్తయేత్. బౌధాయన సూత్రం - చతుర్థప్రశ్నే ప్రథమాధ్యాయే అథయది కన్యోపసాద్య మానా వోహ్యమానా వా,రజస్వలా స్యాత్తామను మంత్రయేత్ - పుమాంసౌమిత్రా వరుణౌ పుమాంసా వశ్వినావుభౌ, పుమా నింద్రశ్చ సూయశ్చ పుమాంసంచ వర్ధయామి,ఇతి. అథ ద్వాదశరాత్ర మలంకృత్య ప్రాశయేత్వం చ గవ్యమథ శుద్ధాం కృత్వావివహేత్. అత్ర గాంధర్వాద్యష్టౌ వివాహాః తద్వ్యవస్థాచాకరేజ్ఞేయా.

అను॥ ఇక్కడ ఆశ్వలాయనులు ప్రాయశ్చిత్తాన్ని చెప్పారు ఇట్లా - ఋతుమతియైన కన్యను శుద్ధురాలిని చేసి, తన పాప నివృత్తిని చేసుకొని (శుద్ధిద్వారా) శుద్ధిని చేయించి, సాధు స్వభావం గలవాడై ఆమెను వివాహమాడాలి, బుద్ధిమంతుడైన తండ్రి తొలి నుండి తన కూతురు ఋతుమతియైన సంఖ్యను లెక్కించాలి. కన్యాదాన పర్యంతము ఆ రజస్వలను తన ఇంటిలో ప్రయత్నపూర్వకముగా రక్షించాలి. కన్య తండ్రి శక్తిమంతుడైతే ఆమె ఋతుమతియైన సంఖ్యకు సమానమైన గోవులను దానం చేయాలి. దరిద్రుడైతే ఆమెను దానం చేసేప్పుడు శాస్త్ర ప్రకారము ఒక్క గోవునైనా దానం చేయాలి. మిక్కిలి దరిద్రుడైతే

బ్రాహ్మణులకు అన్నదానం, దక్షిణతోపాటు చేయాలి. ఆమె ఎన్నిమార్లు ఋతుమతి ఐందో అందరు బ్రాహ్మణులకు భోజనం పెట్టాక వరునకు ఇవ్వాలి. కన్య మూడు రోజులు ఉపవాసం ఉండి రాత్రిపూట ఆవుపాలు తాగాలి. ఋతుమతి కాని కన్యకు, రత్నభూషణములను దానం చేయాలి. ఆమెను వివాహ మాడుతూ బ్రాహ్మణ వరుడు కూడా కూష్మాండ మంత్రములతో హోమం చేయాలి,అని. మదన పారిజాతమందు యజ్ఞపార్శ్వుడిట్లా– వివాహమందలి సుదీర్ఘమైన యజ్ఞమందు హోమ సమయం రాగా ఋతుమతియైన కన్యను చూసి యాజ్ఞికులు ఎట్లా చేస్తారు. ఆ కన్యకు స్నానం చేయించి శాస్త్ర విధిగా పూజించి (ఆకన్యను) యుంజానా అను మంత్రములతో ఆహుతినిచ్చి ఆ పిదప హోమ తంత్ర మాచరించాలి,అని. బౌధాయన సూత్రమిట్లా– (నాల్గవ ప్రశ్న తొలి అధ్యాయమందు)ఇక, ఒకవేళ కన్య భర్త ఇంటికి వెళ్తూనో, వివాహ సమయంలోనో రజస్వల ఐతే ఆమెను అనుమంత్రించాలి. మిత్రా వరుణ అను పురుషులు, ఇద్దరు అశ్వినీ దేవతలు ఈ పురుషులు, పురుషులైన ఇంద్రసూర్యులు. (ఈ కన్య) నేను ఇట్టి పురుషుని వృద్ధి చేస్తాను (స్తుంది)అని. పిదప పన్నెండు రాత్రులు అలంకరించి ఇక పంచగవ్యమును త్రాగించాలి. శుద్ధురాలిని చేసి వివాహం చేయాలి. ఇక్కడ గాంధర్వము మొదలుగా ఎనిమిది వివాహాలు, వాని వ్యవస్థను కూడా ఆకర గ్రంధముల నుండి తెలుసుకోవాలి.

మూ॥ మనుః – షడానుపూర్వ్యా విప్రస్య చతురోஉవరాన్ విట్శూద్రయోస్తుతానేవ, విద్యాద్ధర్మ్యాన రాక్షసాన్. చతుర ఆసుర గాంధర్వ రాక్షస పైశాచాన్. తాన్ రాక్షస వర్జ్యాన్ వైశ్య శూద్రయోః. స ఏవ, ఆసురం వైశ్య శూద్రయోః. హేమాద్రౌ పై ఠీనసిః – రాక్షసో వైశ్యస్య, పైశాచః శూద్రస్య. ప్రచేతాః – పైశాచో అసంస్కృత ప్రసూతానాం ప్రతిలో మజానాంచ. మనుః – రాజ్ఞః తథా సురోవైశ్యే శూద్రే చాంత్యస్తు గర్హితః. క్షత్రియాదేః సంకటే పైశాచ మాహ మాధవీయే వత్సః – సర్వోపాయైర సాధ్యాస్యాత్సు కన్యా పురుషస్యయా, చౌర్యేణాపి వివాహేన, సావివాహ్యా రహః స్థితా. గాంధర్వాది వివాహేషు అపి ఉదక పూర్వకం దాన మాహ తత్రైవ యమః – నోదకేన న,వాచావా కన్యాయాః పతిరుచ్యతే, పాణి గ్రహణ సంస్కారాత్ పతిత్వం సప్తమే పదే. పరాశర మాధవీయే దేవలోஉపి – గాంధర్వాది వివాహేషు పునర్వైవాహికో విధిః కర్తవ్యశ్చత్రిభిర్వర్ణైః సమర్థేనాగ్ని సాక్షికః. త్రైవర్ణోక్తేః గాంధర్వాదౌ విప్రవర్జమధికార ఉక్తః తత్రైవ పరిశిష్టే – గాంధర్వాసుర పైశాచా వివాహో రాక్షసశ్చయః, పూర్వం పరిగ్రహస్తేషు పశ్చాద్ధోమో విధీయతే.

అను॥ మనువిట్లా – బ్రాహ్మణునకు బ్రాహ్మ,దైవ, ఆర్ష, ప్రాజాపత్య, ఆసుర, గాంధర్వములు తగును. క్షత్రియునకు ఆసుర, గాంధర్వ, రాక్షస, పైశాచములు తగును. వైశ్య శూద్రులకు రాక్షసం తప్ప మిగిలినవి ఆసుర గాంధర్వ పైశాచములు శ్రేష్ఠము అని. నాలుగు (చతుర) అనగా ఆసుర గాంధర్వ రాక్షస పైశాచములు. వైశ్య శూద్రులకు రాక్షసం వదలి మిగిలిన వానిని. అతడే ఇట్లన్నాడు వైశ్య శూద్రులకు ఆసురం అని. హేమాద్రి యందు పైఠీనసి ఇట్లా – వైశ్యునకు రాక్షసము, శూద్రునకు పైశాచము,అని. ప్రచేతుడిట్లా – అసంస్కృతులై జన్మించిన వారికి ప్రతిలోమజులకు పైశాచము,అని. మనువిట్లా– రాజునకు

ఆసురము అట్లాగే వైశ్య శూద్రులకు. చివరిదైతే పైశాచము గర్హితమైంది,అని. క్షత్రియులకు సంకటమందు పైశాచం తగును అని మాధవీయ మందు వత్సోక్తి - పురుషునకు, ఏ సుకన్య ఎన్ని ఉపాయముల వల్లనైనా సాధ్యం కాదో అట్టి కన్యను చౌర్య వివాహంతోనైనా (పైశాచం) ఏకాంతమందున్న ఆకన్యను వివాహమాడాలి,అని. గాంధర్వాది వివాహములందు కూడా ఉదక పూర్వక దానమును అక్కడే యముడు చెప్పాడు ఇట్లా - ఉదక దాన మాత్రం చేతనో, మాట ఇవ్వడం మాత్రం చేతనో కన్యకు పతి అని అనబడడు. పాణి గ్రహణ సంస్కారం వల్ల సప్త (మ) పదియందు పతిత్వం లభిస్తుంది,అని. పరాశర మాధవీయమందు దేవలుడు కూడా ఇట్లా - గాంధర్వాది వివాహము లందు పునః వైవాహిక విధిని, మూడు వర్ణముల వారు, సమర్థులైతే అగ్ని సాక్షికముగా తిరిగి ఆచరించాలి,అని. త్రైవర్ణులు అని చెప్పటం వల్ల గాంధర్వాదులందు విప్రునకు తప్ప ఇతరుల కధికారము అని అక్కడే పరిశిష్ట మందు చెప్పారు - గాంధర్వ ఆసుర పైశాచములు, రాక్షస వివాహము వీటిలో తొలుత స్వీకారము, పిదప హోమం విధించబడుతుంది,అని.

మూ॥ అతోహోమాదావకృతే భార్యాత్వా భావాద్వరాం తరాయదేయా. తథాచతత్రైవ వసిష్ఠ బౌధాయనౌ - బలాదపహృతా కన్యామంత్రైః యది న సంస్కృతా. అన్యస్మై విధివత్ దేయాయథా కన్యాత థైవసా,ఇతి. అత్రమంత్ర సంస్కారాభావే అన్యస్మై దానస్య సర్వవివాహేషు సామ్యాత్ బలాదపహారే రాక్షస పైశాచయోః విశేష వచనం వ్యర్థం. తేనతయోర్యది, నసంస్కృతా సంస్కృతా వా ఇత్యావృత్య కన్యామత్య భావే అన్యస్మై దేయేతి వ్యాఖ్యేయం. మదన పారిజాతే నారదః - పాణి గ్రహణికా మంత్రా నియతం దారలక్షణం, తేషాం చ నిష్ఠా విజ్ఞేయా విద్వద్భిః సప్తమేపదే. స్మృతి చంద్రికాయాం అపరార్కే చైవం. ఆశౌచేతు యాజ్ఞవల్క్యః - దానే వివాహే యజ్ఞే చ సంగ్రామే దేశ విప్లవే, ఆపద్య పిచ కష్టాయాం సద్యః శౌచం విధీయతే. కేషామిత్య పేక్షితే బ్రహ్మ పురాణే ఉక్తం - దాతుః ప్రతిగ్రహీతుశ్చ కన్యాదానే చ నోభవేత్, వివాహ విఘ్నః కన్యాయాః లాజహోమాది కర్మణి,ఇతి. వ్రతయజ్ఞ వివాహేషు శ్రాద్ధే హోమేఽర్చనేజపే, ఆరబ్ధే సూతకం నస్యాదనారబ్ధేతు సూతకం, ఇతి విష్ణువచనాచ్చ. ప్రారంభస్తే నైవోక్తః - ప్రారంభో వరణం యజ్ఞే సంకల్పో వ్రతసత్రయోః, నాందీముఖం వివాహాదౌ శ్రాద్ధే పాక పరిక్రియా,ఇతి. వరణమితి మధుపర్కపరం.గృహీత మధుపర్కస్య యజమానాచ్చ ఋత్విజః, పశ్చాదశౌచేపతితే న భవేదితి నిశ్చయః, ఇతి బ్రాహ్మోక్తేః. మధుపర్కాత్పూర్వంతు భవత్యే వా శౌచమితి శుద్ధి వివేకః. రామాండార భాష్యేఽ ప్యేవం.

అను॥ అందువల్ల హోమాదులు చేయకపోతే భార్యాత్వముండదు, కనుక మరో వరునకు ఇవ్వతగినది. అట్లాగే అక్కడే వసిష్ఠ బౌధాయనులు ఇట్లా - బలాత్కారముగా అపహరింపబడిన కన్య మంత్రములతో ఒకవేళ సంస్కరింపబడకపోతే ఇతరునకు శాస్త్ర ప్రకారము ఇవ్వతగినదే, కన్య ఎట్లాంటిదో ఆమె కూడా అట్లాంటిదే,అని. ఇక్కడ మంత్ర సంస్కారం లేకపోతే ఇతరునికి ఇవ్వటం అనేది అన్ని వివాహాల్లో సమమే ఔతుంది కనుక బలాత్కారంగా అపహరింపబడిన రాక్షస, పైశాచములందు విశేష వచనము వ్యర్థమౌతుంది.

అందువల్ల ఆ రెంటిలో సంస్కరింపబడకపోయినా, సంస్కరింపబడినా, ఆవృత్తిచేసి కన్యానుమతి (ఇష్టం) లేని పక్షంలో ఇతరునకు ఇవ్వాలి అని వ్యాఖ్యానించుకోవాలి. మదన పారిజాతమందు నారదుడిట్లా - పాణిగ్రహణమునకు చెందిన మంత్రములు నిశ్చయముగా భార్యా లక్షణములు. వాటియందు నిష్ఠను సప్తమ పదమందు విద్వాంసులు గ్రహించాలి, (ఉంచాలి)అని. స్మృతి చంద్రికయందు అపరార్కమందును ఇట్లాగే ఉంది. ఆశౌచమందైతే యాజ్ఞవల్క్యుడిట్లా - దానము (పూర్వసంకల్పితం) వివాహము, యజ్ఞము, యుద్ధము దేశ విప్లవము, ఆపద, కష్టదశ వీనియందు వెంటనే శౌచము విధించబడుతుంది,అని. ఎవరికి (శుద్ధి) అని అడిగితే బ్రహ్మ పురాణంలో ఇట్లా చెప్పబడింది - కన్యాదాన మందు దాతకు, ప్రతిగ్రహీతకు, కన్యకు, వరునకు లాజా హోమాది కర్మయందు సద్యః శౌచం కలుగుతుంది. (అశుచిలేదు),అని. వ్రతయజ్ఞ వివాహాదులందు, హోమము, శ్రాద్ధము, అర్చన, జపము వీని యందును ఆరంభించాక సూతకం లేదు, ఆరంభించకపోతే మాత్రం సూతకము, అని విష్ణువచనం వల్ల కూడా. ప్రారంభాన్ని ఆతడే ఇట్లా చెప్పాడు- యజ్ఞమందు వరణం ప్రారంభము, వ్రత,సత్ర యాగములందు సంకల్పమారంభము, వివాహాదులందు నాందీముఖ మారంభము, శ్రాద్ధమందు పాక పరిక్రియ (పూర్తి) అని. వరణమనగా మధుపర్కము అని. బ్రాహ్మోక్తి ఇట్లా -యజమానుని నుండి ఋత్విక్కులు మధుపర్కం గ్రహించాక తరువాత అశౌచంవస్తే అశౌచం తగలదు అని, నిశ్చయము,అని. మధుపర్కం కన్న ముందు అశౌచం తప్పకుండా కల్గుతుంది అని శుద్ధివివేకం చెప్తోంది. రామాండారభాష్యమందు కూడా ఇట్లాగే ఉంది.

**మూ॥ నాందీముఖావధిశ్చ స్మృత్యంతరే** - ఏకవింశత్యహర్యజ్ఞే వివాహేదశవాసరాఃత్రిషట్చౌలోపనయనే నాందీశ్రాద్ధం విధీయతే. **ఆరంభాభావే లగ్నాంతరాభావే** గద్యవిష్ణుః - నదేవ ప్రతిష్ఠా వివాహయోః పూర్వ సంభృతయోరపి,ఇతి. **అత్ర ప్రాయశ్చిత్తమాహ మదన పారిజాతే - విష్ణుః - అనారబ్ధ విశుద్ధ్యర్థం కూష్మాండైః జుహుయాత్ ఘృతం, గాందద్యాత్ పంచగవ్యాశీ తతః శుద్ధ్యతి సూతకీ. సంగ్రహేఽపి** - సంకటే సమనుప్రాప్తే సూతకే సముపాగతే, **కూష్మాండీభిఃఘృతం హుత్వాగాం చదద్యాత్ పయస్వినీం.** చూడోపనయనో ద్వాహ ప్రతిష్ఠాదిక **మాచరేత్,** యద్యైవ సూతకప్రాప్తిః తదైవాభ్యుదయక్రియా. **అన్నాదిషు విశేషః** షట్త్రింశన్మతే-**వివాహోత్సవ యజ్ఞేషు త్వంతరా మృతసూతకే,** పరైరన్నం ప్రదాతవ్యం భోక్తవ్యం చ ద్విజోత్తమైః. పరైః = అసగోత్రైః. భుంజానేషు తు విప్రేషు త్వంతరామృత సూతకే, **అన్యగేహోదకాచాంతాః సర్వేతే శుచయః స్మృతాః ఏతదా శౌచాత్ పూర్వం అపృథక్కృతాన్న** విషయం. తత్రశేష మన్నం త్యాజ్యమి త్యర్థః. పృథక్కృతేషు తు బృహస్పతిరాహ - వివాహోత్సవ **యజ్ఞేషు త్వంతరామృత సూతకే, పూర్వసంకల్పితాన్నేషునదోషః పరికీర్తితః,ఇతి.**

అను॥ స్మృత్యంతరమందు నాందీముఖమే అవధిగా చెప్పబడింది. ఇట్లా - యజ్ఞమందు ఇరువది ఒక్కరోజులు, వివాహమందు పదిరోజులు, చౌలమందు మూడు రోజులు,

ఉపనయనమందు ఆరు రోజులు నాందీశ్రాద్ధము (ముందుగా చేయాలని) విధించబడింది, అని. ఆరంభం చేయకపోతే మరో లగ్నం లేని పక్షంలో గర్గ్యవిష్ణువు ఇట్లా చెప్పాడు - దేవతా ప్రతిష్ఠా, వివాహములకు మొదలే సామగ్రి తయ్యారైతే కూడా ఆశౌచం ఉండదు,అని. ఇక్కడ ప్రాయశ్చిత్తాన్ని మదన పారిజాతమందు విష్ణువు ఇట్లా చెప్పాడు - ఆరంభించనిదాని శుద్ధికొరకు కూష్మాండ మంత్రములతో నేయితో హోమం చేయాలి. పంచ గవ్యమును ప్రాశన చేయాలి. గోదానం చేయాలి. ఆ పిదప సూతకం కలవాడు శుద్ధి నందుతాడు,అని. సంగ్రహమందు కూడా ఇట్లా - సంకటం వచ్చినప్పుడు, సూతకం వచ్చినప్పుడు, కూష్మాండ మంత్రములతో నేయితో హోమంచేసి, పాలిచ్చే ఆవును కూడా దానమివ్వాలి. చూడ ఉపనయన వివాహ, ప్రతిష్ఠాదికములను చేసేప్పుడు ఎప్పుడైతే సూతక మొస్తుందో అప్పుడే అభ్యుదయ క్రియను ఆచరించాలి. అన్నాదులందు విశేషాన్ని షట్త్రింశన్మతమందు ఇట్లా - వివాహ ఉత్సవ యజ్ఞములందు మధ్యలో జననా శౌచమో మరణాశౌచమో వస్తే అసగోత్రులు ఇచ్చిన అన్నాన్ని బ్రాహ్మణోత్తముడు భుజించాలి,అని. పరులు=అసగోత్రులు. బ్రాహ్మణులు భుజిస్తూ ఉంటే మధ్యలో మృతసూతకమో జాత సూతకమో వస్తే ఇతరుల గృహంలోని నీటితో ఆచమనం చేయిస్తే వారంతా శుచులౌతారు. ఇది ఆశౌచంకన్న ముందు వేరు చేయబడని అన్నమునకు చెందిన విషయము. అక్కడ మిగిలిన అన్నాన్ని పారేయాలి అని అర్థము. వేరుగా చేస్తే మాత్రం బృహస్పతి ఇట్లా అన్నాడు - వివాహ ఉత్సవ యజ్ఞము లందు మధ్యలో మృత, జాత సూతకములు వస్తే పూర్వ సంకల్పిత అన్నములందు దోషం లేదు అని అన్నారు,అని.

మూ॥ **ధర్మార్థం వివాహకరణేఫలముక్తం** మహాభారతే - జ్ఞాత్వా స్వవిత్త సామర్థ్యాత్ ఏకం చోద్వాహయేత్ ద్విజం, తేనా ప్యాప్నోతి తత్స్థానం శివభక్తో నరోధ్రువం. అపరార్కేదక్షః - మాతాపితృ విహీనంతు సంస్కారో ద్వాహనాదిభిః, యః స్థాపయతి తస్యేహ పుణ్యసంఖ్యా, నవిద్యతే. మదనరత్నే భవిష్యే - వివాహాది క్రియాకాలే తత్క్రియా సిద్ధికారణం యః ప్రయచ్ఛతి ధర్మజ్ఞః, సోఽశ్వమేధ ఫలం లభేత్. **కన్యాగృహే భోజన** నిషేధోఽపితత్రైవ- **అప్రజాయాంతు** కన్యాయాం న భుంజీత కదాచన, దౌహిత్రస్య ముఖం దృష్ట్వా కిమర్థమనుశోచతి. **అపరార్కే, ఆదిత్య పురాణే** - విష్ణుం జామాతరం మన్యే తస్య కోపం న కారయేత్, **అప్రజాయాంతు** కన్యాయాం నాశ్నీయాత్త స్వవైగృహే. బ్రహ్మ దేయాం న వైకన్యాం దత్వాశ్నీ యాత్ కదాచన. అథ భుంజీత మోహాచ్చేత్ పూయాఖ్యే నరకేవసేత్. **తత్రైవ కశ్యపః** - అహతం యంత్ర నిర్ముక్తం వాసః ప్రోక్తం స్వయంభువా, శస్తం తన్మాంగలిక్యేషు తావత్కాలం నసర్వదా. యంత్ర నిర్ముక్తం = నూతనం. **వివాహమధ్యేస్త్రియాసహ భోజనే**ఽపి న దోష ఇత్యాహ హేమాద్రౌ ప్రాయశ్చిత్త కాండే గాలవః - వివాహ కాలే యాత్రాయాం పథిచౌర ాకులే, అసహాయో భవేద్విప్రః తదాకార్యం ద్విజన్మభిః. **ఏకయాన సమారోహ** ఏకపాత్రే చ భోజనం, వివాహోపథి

యాత్రాయాం కృత్వా విప్రోనదోషభాక్. అన్యథా దోషమాప్నోతి పశ్చాచ్చాంద్రాయణం చరేత్. మితాక్షరాయామప్యేవం.

అను॥ ధర్మం కొరకు వివాహం చేయటమందు ఫలాన్ని మహాభారతంలో ఇట్లా చెప్పారు - తనధన సామర్థ్యాన్ని తెలుసుకొని ఒక బ్రాహ్మణునకు వివాహం చేయాలి. దాని వల్ల కూడా నరుడు శివభక్తులు పొందే ఆ స్థానాన్ని పొందుతాడు, నిశ్చయము,అని. అపరార్కమందు దక్షుడిట్లా - తల్లిదండ్రులు లేని పిల్లవానికి ఉపనయన సంస్కారము, వివాహము మొదలగునవి ఎవరు చేస్తారో వానికి ఇక్కడ లెక్కింప రాని పుణ్యం లభిస్తుంది,అని. మదనరత్నమందు భవిష్యోక్తి ఇట్లా - వివాహాది క్రియల కాలమందు ఆ పనుల సిద్ధికి కారణంగా ఎవడు ధర్మజ్ఞుడై దానం చేస్తాడో అతడు అశ్వమేధ ఫలాన్ని పొందుతాడు,అని. కన్యాగృహ మందు భోజన నిషేధం కూడా అక్కడే చెప్పారు ఇట్లా - సంతానం కలగని అమ్మాయి ఇంట్లో ఎప్పుడూ భోజనం చేయరాదు దౌహిత్రుని ముఖాన్ని చూసి (శాక) ఎందుకు విచారిస్తావు,అని. అపరార్కమందు ఆదిత్యపురాణోక్తి ఇట్లా - అల్లుని విష్ణుమూర్తి అంతవానిగా భావించాలి. అతనికి కోపం కల్గించరాదు. (అతనిపై కోపగించరాదు) అమ్మాయికి సంతానం కలగకపోతే ఆతని ఇంట్లో భోజనం చేయరాదు బ్రాహ్మ వివాహ పద్ధతిలో కన్యాదానం చేసిన తరువాత ఆ ఇంట్లో ఎప్పుడూ భోజనం చేయరాదు. ఒకవేళ మోహంతో భుజిస్తే పూయమనే నరకంలోకి వెళ్తాడు,అని. అక్కడే కశ్యపుడిట్లా - కొత్తబట్ట, (బండకు కొట్టబడని = అహతం) యంత్రము నుండి వచ్చిన వస్త్రమును, బ్రహ్మదానిని మంగల కార్యములందు ఆ కాలం వరకే ప్రశస్తమైనదిగా (పవిత్ర) చెప్పాడు. ఎల్లప్పుడూ పవిత్రమైనదిగా చెప్పలేదు. యంత్ర నిర్ముక్తం = నూతనము వివాహం మధ్యలో స్త్రీతో కూడా భోజనం చేసినా తప్పులేదు అని హేమాద్రి యందు ప్రాయశ్చిత్త కాండమందు గాలవోక్తి ఇట్లా ఉంది - వివాహ కాలమందు, యాత్రయందు మార్గమధ్యంలో దొంగలు నిండినచోట విప్రుడు అసహాయుడైతే (ఒంటరి) అప్పుడు, బ్రాహ్మణులతో కూడి భుజించాలి, (స్త్రీలతో కూడి), ఒకే వాహనమందు ఒకేసారి (స్త్రీతో సహ) ఎక్కటం, ఒకే పాత్రలో భోజనం చేయటం ఇవి వివాహ కాలమందు, దారిలో, యాత్రయందు చేసినట్లైతే విప్రున కెలాంటి దోషం లేదు. లేనట్లైతే దోషం వస్తుంది. ఆ నివారణకై చాంద్రాయణ వ్రత మాచరించాలి. మితాక్షర యందు కూడా ఇట్లాగే ఉంది.

అను॥ **రత్నమాలాయాం** - మూలమైత్ర మృగరోహిణీకరైః పౌష్ణమారుతమ ఘోత్తరాన్వితైః భౌమసౌరిరవివార వర్జితే పాణి పీడన విధిర్విధీయతే. **అత్రానిష్టనక్షత్రాదౌ** దానముక్తం జ్యోతిషే - విపత్తారే గుడం దద్యాత్ నిధనే తిలకాంచనం, ప్రత్యగేలవణం దద్యాత్ ఛాగం దద్యాత్త్రి జన్మసు. చంద్రేచ శంఖం లవణం చ తారే తిథౌ విరుద్ధేత్వథ తండు లాంశ్చ ధాన్యం చ దద్యాత్ కరణేచ వారే యోగే విరుద్ధే కనకం ప్రదేయం. **వివాహేమండపమాహ** వసిష్ఠః - షోడశా రత్నికం కుర్యాత్ చతుర్ద్వా రోపశోభితం, మండపం తో రణైర్యుక్తం తత్ర వేదిం

ప్రకల్పయేత్, అష్ట హస్తంతు రచయేత్ మండపం వాత్రిషట్కరం. దైవజ్ఞ మనోహరః - చిత్రా విశాఖా శత తార కాశ్వినీ జ్యేష్ఠా భరణ్యౌ శివభాచ్చతుష్టయం, హిత్వా ప్రశస్తం ఫలతైల వేదికా ప్రదానకం కండన మండ పాదికం. హేమద్రౌ వ్యాసః - కండన దలనయవారక మండప మృద్వేది వర్ణకాద్యఖిలం తత్సంబంధి గతాగతమృక్షే వైవాహికే కుర్యాత్. యవారకం చికసా ఇతి ప్రసిద్ధం. వైవాహికేతు దివసే శుభేవాథ తిథౌశుభే, చతుర్థికం ప్రకుర్వీత విధి దృష్టేన కర్మణా వేదిమాహా నారదః - హస్తోచ్ఛ్రితాం చతుర్హస్తైః చతురస్రాం సమంతతః స్తంభైః చతుర్భిః సుశ్లక్ష్ణాం వామభాగేతు సద్మని. సమాం తథా చతుర్దిక్షు సోపా నైరతి శోభితాం, ప్రాగుదక్ ప్రవణారంభాం స్తంభైః హంస శుకాదిభిః. ఏవం విధా మారురుక్షేత్ మిథునం సాగ్నివేదికాం, ఇతి. సప్తర్షిమతే - మంగలేషు చ సర్వేషు మండపో గృహ మానతః, కార్యః షోడశహస్తో వా ద్విషట్ హస్తో దశావధి. స్తంభైః చతుర్భిరే వాత్ర వేదీ మధ్యే ప్రతిష్ఠితా. హస్తోవధ్యాః. సోపానం పశ్చిమతః ఉపరిభాగే ఉక్త పరిమాణాత్ భిన్నం.

అను॥ నక్షత్ర మాలయందిట్లా - మూల, అనురాధ, మృగశిర, రోహిణి, హస్త, రేవతి, స్వాతి, మఘ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈ నక్షత్రములందు మంగల, శని, ఆదివారములు వదలి ఇతర రోజులలో వివాహ విధి చెప్పబడింది,అని. (మధ్యాహ్న వివాహం ఉత్తమోత్తమము. పూర్వాహ్ణం ముఖ్యం, నిశివివాహం మధ్యమం, అపరాహ్ణ వివాహం గర్హితమైంది) ఇక్కడ అనిష్ట నక్షత్రము మొదలగు వానియందు దానము జ్యోతిషంలో ఇట్లా చెప్పబడింది - విపత్తారయందు బెల్లమును, నిధన తారయందు నువ్వులు, బంగారమును ప్రత్యక్ తారయందు ఉప్పును, మూడు జన్మతారలందు మేకను దానం చేయాలి,అని. చంద్రుడు విరుద్ధంగా ఉంటే శంఖమును, నక్షత్రం విరుద్ధంగా ఉంటే ఉప్పును తిథి విరుద్ధంగా ఉంటే బియ్యమును, కరణ వారములు విర్దుంగా ఉంటే ధాన్యమును, యోగం విరుద్ధంగా ఉంటే బంగారమును దానం చేయాలి. వివాహంలో మండపాన్ని గూర్చి వసిష్ఠుడిట్లా చెప్పాడు - పదహారు అరత్నికలు (మోచేయి నుండి చిటికన వేలు వరకు గల పొడవు) కలదిగా, నాలుగు ద్వారములు కలదిగా తోరణములు కలదిగా మండపముండాలి. అక్కడ వేదిని ఏర్పరచాలి,అని. ఎనిమిది చేతుల పొడవు కలది గాని పద్దెనిమిది చేతుల పొడవుది గాని మండపంను ఏర్పరచాలి. దైవజ్ఞ మనోహరుడిట్లా - చిత్ర, విశాఖ, శతభిషం, అశ్విని, జ్యేష్ఠ, భరణి, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష ఈ నక్షత్రములను వదలి ఇతర నక్షత్రము లందు పండ్లదానము, నూనెరాయటం (పసుపు రాయటం), వేదినిర్మాణం, బహుమతు లివ్వటం దంచటం, మండపాదులు చేయటం ప్రశస్తము,అని. హేమాద్రియందు వ్యాసుడిట్లా- దంచటం, విసరటం, (రాయటం నూరటం, నలగ్గొట్టటం) మండపము, మట్టితో చేసెడి వేదిక, ముగ్గులేయడం మొదలగునదంతా, వివాహమునకు చెందిన రాకపోకలు ఇవన్నీ వివాహ యోగ్య నక్షత్రమందు చేయాలి,అని. యవా రకం అనగా చికసా అని ప్రసిద్ధమైంది. వైవాహిక శుభ దివస మందు, శుభతిథి యందు చతుర్థి కర్మను శాస్త్రంలో చెప్పిన విధంగా ఆచరించాలి. నారదుడు వేదిని గురించి ఇట్లా చెప్పాడు - ఒక చేయి ఎత్తు, నాల్గు చేతుల వెడల్పు అన్ని వైపుల చతురస్రంగా ఉండాలి. నాలుగు అందమైన స్తంభాలు కలది కావాలి.

ఇది ఇంటికి ఎడమ భాగంలో నిర్మించాలి ఈ వేదికను,అని. సమంగా ఉండాలి అట్లాగే నాలుగు వైపుల మెట్లతో అందంగా ఉండాలి. తూర్పు దిక్కుకాని ఉత్తరదిక్కువైపుకాని పల్లము కలది కావాలి (వంగి), స్తంభములపై హంసలు చిలుకలు మొదలగునవి చిత్రింపబడాలి. ఇట్లా ఉన్న అగ్నితో కూడిన వేదికను వధూవరులు అధిరోహించాలి,అని (నారదవచనం). సప్తర్షి మతమందిట్లా – అన్ని మంగళ కార్యములలోను మండపము ఇంటికొలత, ననుసరించి పదహారు చేతులు కాని పన్నెండు చేతులు కాని పదిచేతులది కాని చేయించాలి. వేది మధ్యంలో నాలుగు స్తంభములనే ఉంచాలి. ఇక్కడ హస్త ప్రమాణము (కొలత) కన్యది. మెట్లు పడమటి వైపు నుండి, పై భాగమందు చెప్పిన పరిమాణము కంటే భిన్నంగా ఉండాలి, అని.

మూ॥ **అథమృదాహరణం- జ్యోతిర్నిబంధే** నారదః – కర్తవ్యం మంగలేష్వాదౌ మంగలాయాం కురార్పణం. నవమే సప్తమేవాపి పంచమే దివసేఽపివా, తృతీయే బీజనక్షత్రే శుభవారే శుభోదయే, సమ్య గ్గృహాణ్య లంకృత్య వితానధ్వజతోరణైః, సహవాదిత్రనృత్యాద్యైః గత్వా ప్రాగుత్తరాందిశం, తత్ర మృత్సికతాంశ్లక్ష్ణాం గృహీత్వా పునరాగతః, మృణ్మయేష్వ థవావైణవేషు పాత్రేషు యోజయేత్. అనేక బీజ సంయుక్తాం తోయపుష్పోప శోభితాం. **శౌనకః** – ఆధానం గర్భ సంస్కారం జాతకర్మ చ నామ చ, హిత్వాన్యత్ర విధాతవ్యం మగలేఽం కురవాపనం. బృహస్పతిః – అత్యంతికేషు కార్యేషు కార్యం సద్యోం కురార్పణం. అత్రైవ వాగ్దానం హరిద్రా వందనం చ కార్యం. **జ్యోతిః ప్రకాశే**– చతుర్థో మండపః శ్రేష్ఠః సప్తమః పంచమస్తథా, నవమైకా దశౌ శ్రేష్ఠౌ నేష్టౌషష్ఠతృతీయకౌ. వివాహాభేస్వోదయే వా కన్యావరణమాచరేత్. **వరస్యాపివరణ మాహ** చండేశ్వరః– ఉపవీతం ఫలం పుష్పం వాసాంసి వివిధానిచ, దేయంవరాయ వరణే కన్యా భ్రాత్రా ద్విజేనవా,ఇతి. **వాగ్దానోత్తరం వరమరణేఽ** పరార్క స్మృతిచంద్రికాయాం వసిష్ఠః –అద్భిర్వాచాచదత్తాయాం మ్రియేతోర్ధ్వం వరోయది, న చ మంత్రోపనీతాస్యాత్ కుమారీపితురేవసా. **యత్తునారదః** – **ఉద్వాహితాపి** సాకన్యానచేత్ సంప్రాప్త మైథునా, పునః సంస్కారమర్హేత యథాకన్యాత థైవసా,ఇతి. **యచ్చకాత్యాయనః** – **వరోయద్యన్య** జాతీయః పతితః క్లీబ ఏవచ, వికర్మ స్థః సగోత్రో వా దాసోదీర్ఘామయోఽపివా, ఊఢాపిదేయాసాన్యస్మై సహావరణ భూషణా,ఇతి. ఇదం కలౌ నిషిద్ధం.దేవరేణ సుతోత్పత్తిః దత్తాకన్యాన,దీయతే, ఇత్యాదిత్య పురాణేకలౌ నిషేధాత్. దత్తాశబ్ద ఊఢాపరః, ఊఢాయాః పునరుద్వాహం, ఇతి హేమాద్రా వుక్తేః. అత ఏవ సగోత్రా సపిండాది వివాహేఽపి – భోగతస్తాం పరిత్యజ్య పాలయే జ్జననీమివ, ఇత్యుక్తం.

అను॥ ఇక మట్టిని తీసుకు రావటం జ్యోతిర్నిబంధమందు నారదుడిట్లా– మంగళ కార్యములందు తొలుత మంగళము కొరకు అంకురార్పణము చేయాలి. తొమ్మిదవ, ఏడవ లేదా ఐదవ లేదా మూడవ రోజునందు కాని బీజయోగ్య నక్షత్రమందు శుభవారము, శుభ ఉదయమందు, చాందినీ, ధ్వజము తోరణములతో చక్కగా గృహములు అలంకరించి, వాదిత్రములతో (వాద్యములు) నృత్యాదులతో కూడా ఈశాన్యభాగమునకు వెళ్ళి, అక్కడ

మట్టిని ఇసుకలాంటి సన్నని దానిని, మృదువైన దానిని తీసుకుని తిరిగి ఇంటికి వచ్చి, మట్టితో చేసిన లేదా (వేణు) ఎలిబెబద్దలతో చేసిన పాత్రములందు ఉంచాలి. అందులో అనేక రకాల విత్తులనుంచాలి, నీరు, పూలతో వాని నలంకరించాలి,అని. శౌనకుడిట్లా - అధానము, గర్భసంస్కారము, జాతకర్మ, నామకరణం వీటిని వదలి ఇతరమైన మంగళ కార్యములందు అంకురార్పణ కార్యాన్ని చేయాలి,అని. బృహస్పతి ఇట్లా - తప్పక చేయాల్సిన మిక్కిలి ముఖ్యమైన కార్యములందు అప్పుడే అంకురార్పణ కార్యం చేయాలి. ఇక్కడే వాగ్దానము, హరిద్రావందనము (పసుపుపూజ) చేయాలి,అని. జ్యోతిః ప్రకాశమందిట్లా - (మండపములు ఎనిమిది హస్తములు, పది పన్నెండు, పదునాలుగు, పదహారు, పదు నెనిమిది, ఇరవై, ఇరవైఐదు, ఏభై,నూరు, వేయి హస్తముల కొలమానము గలవిగా పదకొండు రకాలుంటాయి. వీనిలో నాల్గవది, ఏడవది, ఐదవది, తొమ్మిదవది, పదకొండవది శ్రేష్ఠ మైనవి ఆరవది మూడవది ఇష్టమైనవి కావు (అనగా పదునాల్గు, పదహారు, ఇరవై,ఏభై వేయి హస్తముల మండపములు శ్రేష్ఠములు, పన్నెండు, పెద్దెనిమిది హస్తముల మండపములు మంచివికావు. వివాహ నక్షత్రమందు లేదా దాని ఉదయమందు కాని కన్యావరణము ఆచరించాలి,అని. చండేశ్వరుడు వరుని వరణమును గూర్చి కూడా చెప్పాడు - ఉపవీతము, ఫలములు పుష్పములు, వస్త్రములు రకరకాలవి వరుని వరణ మందు కన్య యొక్క అన్నగాని బ్రాహ్మణుడు కాని వరునకివ్వాలి,అని. వాగ్దానం అయ్యాక వరుడు మరణిస్తే అపరార్క స్మృతి చంద్రిక యందు వసిష్ఠోక్తి ఇట్లా ఉంది- నీటితోగాని మాట మాత్రంచే గాని ఇవ్వబడ్డాక ఆపైన ఒకవేళ వరుడు మరణిస్తే మంత్రములతో ఉపనీత కాలేదు కనుక (కాకపోతే) ఆమె కుమారియే, తండ్రికే చెందుతుంది,అని. (మళ్ళీ వివాహం చేయొచ్చు. పాణి గ్రహణ సంస్కారంవల్ల సప్తపది యందు పతిత్వం వస్తుంది. సప్తపది ప్రదక్షిణం కన్న ముందు వరుడు మరణిస్తే విధవాత్వము లేదు) **నారదుడేదైతే అన్నాడో** - ఆకన్య వివాహం చేసుకున్నా మైథునం (శోభనం) భర్తతో పొందకపోతే తిరిగి సంస్కారాన్ని పొందటానికి అర్హురాలు. మొదట ఎట్లా కన్యగా ఉండేదో ఆమె ఇప్పుడు అట్లాగే ఉంది,అని. అన్నాడో, కాత్యాయనుడు ఏదైతే అన్నాడో - వరుడు ఒకవేళ అన్యజాతీయుడైతే, పతితుడైతే, క్లీబుడైతే, చెడుపనులు చేసేవాడైతే, సగోత్రుడైతే, దాసుడైనా, దీర్ఘరోగి ఐనా ఆమెకు ఇట్టివారితో వివాహమైనా ఆమెను మరొకరికిచ్చి వివాహము చేయవచ్చును, ఆవరణ భూషణాదులతో కూడా అని, అన్నాడో ఇవి కలియుగమందు నిషిద్ధములు. మరిదితో సంతానాన్ని పొందటం, వివాహమైన దాన్ని తిరిగి కన్యాదానం చేయటంలేదు,అని ఆదిత్యపురాణంలో వీటిని కలియుగ మందు నిషేధించారు. దత్త అనగా వివాహమైనట్టిది. వివాహితయైన దానికి తిరిగి వివాహము అని హేమాద్రి యందు చెప్పబడింది. అందువల్లనే సగోత్ర అసపిండ మొదలగు వివాహ మందు కూడా - భోగము నుండి (మైథునం) ఆమెను విడిచిపెట్టి తల్లి వలె ఆమెను రక్షించాలి,అని చెప్పబడింది.

మూ॥ దేశాంతరగమనేతు కాత్యాయనః - వరయిత్వాతు యః కశ్చిత్ ప్రణశ్యేత్ పురుషో యదా, ఋత్వాగమాం స్త్రీన తీర్త్య కన్యాన్యం వరయేద్వరం. అపరార్కే నారదోఽపి - ప్రతిగృహ్యా తుయః కన్యాం వరోదేశాంతరం వ్రజేత్, త్రీనృతూన్ సమతిక్రమ్య కన్యాన్యం వరయేద్వరం. శుల్కదానేతు మను వసిష్ఠౌ - కన్యాయాం దత్త శుల్కాయాం మ్రియతే యది శుల్కదః, దేవరాయ ప్రదాతవ్యాయది కన్యాను మన్యతే. చంద్రికాయాం కాత్యాయనః - ప్రదాయ శుల్కం గచ్ఛేద్యః కన్యాయాః స్త్రీ ధనంతథా, ధార్యాసా వర్షమేకంతు దేయాఽన్యస్మై విధానతః అనేకేభ్యో హి దత్తాయా మనూఢాయాంతు తత్రవై, పూర్వాగతశ్చ సర్వేషాం లభేతాద్య వరస్తుతాం. పశ్చాద్వరేణ యద్దత్తం తస్యాః ప్రతిలభేతసః, అథాగచ్ఛేన్న వోఢాయాం దత్తం పూర్వవరోహరేత్. యాజ్ఞవల్క్యః - సకృత్ప్రదీయతే కన్యాహరంస్తాం చౌరదండభాక్,దత్తామపిహరేత్ పూర్వాత్ శ్రేయాం శ్చేద్వర ఆవ్రజేత్. పూర్వస్య దోషసత్వే ఇదమితి విజ్ఞానేశ్వరః. సంబంధతత్వే వసిష్ఠః - కులశీల విహీనస్య పశ్చాద్ధి పతితస్యచ, అపస్మారి విధర్మ స్యరోగిణాం వేషధారిణాం. దత్తామపి హరేత్కన్యాం సగోత్రోఢాం తథైవచ. మనుః - షంఢాంధ బధిరాదీనాం వివాహోఽస్తి యథోచితం, వివాహ సంభవేతేషాం కనిష్ఠో వివహేత్తదా. పితృవ్యపుత్రే సాపత్నే పరదారసుతేషుచ, వివాహే ధానయజ్ఞాదౌ పరివేదో న దూషణం అన్యదూహ్యత్తవ్యం విస్తరభీతేర్నోచ్యత ఇతిదిక్.

అను॥ వరుడు దేశాంతరం వెళితే కాత్యాయనుడిట్లా-వరణం జరిగాక ఎవడైనా వరుడు మరణిస్తే (దేశాంతరగతుడైతే రాబోయే మూడు ఋతుకాలములను చూచి అది దాటాక (రజోదర్శనం లేదా మూడు ఋతువుల కాలం ఆరునెలలు అయ్యాక) కన్య మరో వరుని వరించాలి,అని. అపరార్కమందు నారదుడు కూడా - వరుడు కన్యను స్వీకరించాక (వాగ్దానంతో) దేశాంతరానికి వెళితే, మూడు ఋతువులు దాటాక కన్య మరో వరుని వరించాలి,అని. శుల్కదానం జరిగితే మనువసిష్ఠులిట్లా - కన్యకు శుల్కం ఇచ్చాక శుల్కం ఇచ్చిన వాడు మరణిస్తే, ఒకవేళ ఆకన్య ఇష్టపడితే ఆ వరుని తమ్మునికి ఇవ్వాలి,అని. చంద్రికయందు కాత్యాయనుడిట్లా - ఎవడైనా కన్యకు శుల్కముకాని స్త్రీ ధనము కాని ఇచ్చాక వెళ్ళిపోతే, ఆమెను సంవత్సరకాలం అట్లాగే ఉంచాలి, ఆ పిదప శాస్త్ర ప్రకారము ఇతరునకివ్వాలి,అని. వివాహం కాని కన్యను అనేకులకు వాగ్దత్తం చేసినా, వారందరిలో ముందొచ్చిన వారిలో తొలి వరుడు ఆమెను పొందుతాడు. (వివాహం కాక ముందు, (పూర్వం) వచ్చినవాడు), తరువాతి వరులు ఇచ్చిన శుల్కాన్ని ఆమె వారికి వాపసివ్వాలి. తొలివరుడు ఇచ్చిన దానిని స్వీకరించి, నవోఢ అతనినే పొందాలి. యాజ్ఞవల్క్యుడిట్లా - కన్య ఒకేసారి ఇవ్వబడుతుంది. ఆకన్యను హరించినవాడు చోరదండనను పొందతగిన వాడౌతాడు. పూర్వపు వాడికన్నా ఉత్తమ వరుడు సంప్రాప్తిస్తే, వాడికిచ్చినా కూడా వాని నుండి ఈమెను హరించి ఉత్తమ వరునికివ్వాలి,అని. మొదటి వానిలో దోషం ఉంటే ఇట్లా చేయాలి,అని, విజ్ఞానేశ్వరుడన్నాడు. సంబంధతత్వమందు వసిష్ఠుడిట్లా - కులశీలములు లేని వానికి (హీనునకు) ఆ పిదప పతితుడైన వానికి, అపస్మారం కలవానికి, విధర్మానుసారికి, రోగికి, వేషధారులకు కన్యను ఇచ్చినా తిరిగి తీసుకోవాలి. అట్లాగే సగోత్రుని వివాహమాడిన

దానిని కూడా తిరిగి తీసుకోవాలి,అని. మనువు ఇట్లా - షండుడు, అంధుడు, బధిరుడు మొదలగు వారికి వారికి తగ్గట్టుగా వివాహం ఉంది. వారికి వివాహం కాలేని పక్షంలో అప్పుడు కనిష్ఠునితో(డు) వివాహం చేసుకోవాలి,అని. చిన్నాయన పుత్రుడు సపత్నీపుత్రుడు, పరదార సుతుడు, వీరియొక్క వివాహ, ఆధాన, యజ్ఞాదులందు పరివేదం తప్పుకాదు (అనగా పెద్దవాడు ఉండగా చిన్నవాడి పెళ్ళికావటం) ఇంకా చెప్పాల్సింది, విస్తారమౌతుందనే భయంతో చెప్పటంలేదు అని ఇక చాలు.

**మూ॥ అత్రనాందీశ్రాద్ధేవిశేషం** తదధికారి విశేషం చాగ్రేవక్ష్యామః. ఇదం చాద్య వివాహే **పితాకుర్యాత్ ద్వితీయాదౌ** వర ఏవ కుర్యాత్. నాందీ శ్రాద్ధం పితాకుర్యాదాద్యే పాణిగ్రహే పునః, అత ఊర్ధ్వం ప్రకుర్వీత స్వయమేవతు నాందికం, ఇతి స్మృతేః. త్రికాండమండనోఽపి - పిత్రోస్తు జీవతోః కుర్యాత్ పునఃపాణిగ్రహం యదా పితుర్నాందీ ముఖం శ్రాద్ధం నోక్తం తస్యమనీషిభిః రేణు కారికా - ఉక్తేకాలే వివాహాంగం కుర్యాన్నాందీ ముఖంపితా, దేశాంతరే వివాహశ్చేత్తత్ర గత్వాభవేదిదం. **లగ్నఘటీస్థాపనమాహ** నారదః - షడంగుల మితోత్సేధం ద్వాదశాంగుల మాయతం, కుర్యాత్పాతాల వత్తామ్రపాత్రం తద్దశభిఃపలైః. తామ్ర పాత్రేజలైః పూర్ణే మృత్పాత్రే వాథ వాశుభే, మండలార్ధోదయం వీక్ష్యరవే స్తత్ర వినిక్షిపేత్. తత్రమంత్రః - ముఖ్యం త్వమసి యంత్రాణాం బ్రహ్మణా నిర్మితం పురా, భవభావాయ దంపత్యోః కాలసాధనకారణం,ఇతి. **వరస్య మధుపర్కమాహ** యాజ్ఞవల్క్యః - ప్రతిసంవత్సరం త్వర్ఘ్యాః స్నాతకాచార్య పార్థివాః, ప్రియో వివాహ్యశ్చ తథా యజ్ఞం ప్రత్యృత్విజః పునః. **అత్రవిశేషో గృహ్యపరిశిష్టే** - వరస్యయాభవేచ్ఛాఖా తచ్ఛాఖాగృహ్య చోదితః, మధుపర్కః ప్రదాతవ్యో హ్యన్యశాఖేఽపి దాతరి, అత్రవరదాతృశబ్దౌ ఋత్విగాద్యుపలక్షణం. తదాహుః- అర్చ్యశాఖయా మధుపర్క,ఇతి. అర్చ్యస్య యచ్ఛాఖీయం కర్మ తచ్ఛాఖయా మధుపర్క,ఇతి యాజ్ఞికాః. జయంతస్తు - వరుణవత్సర్వత్ర యజమాన శాఖయైవ మధుపర్క ఇత్యాహ. తత్తున్నాద్రియంతే వృద్ధాః. **అత్ర పంచాశతాభవేత్** బ్రహ్మోతదర్ధేనతు విష్టరః , ఇత్యాది గృహ్యపరిశిష్టాదేఃవిష్టరాది లక్షణం మధుపర్కాది విధిశ్చ స్వగృహ్యాదేః జ్ఞేయః. కన్యాదానే **ప్రపితా మహపూర్వకమిత్యుక్తం** స్మృత్యర్థసారే - నాందీ ముఖే వివాహే చ ప్రపితా మహపూర్వకం, నామ సంకీర్తయే ద్విద్వాన్ అన్యత్ర పితృ పూర్వకం. నాందీ ముఖే ఇతి బహ్వృచాద్యతిరిక్త విషయం. గృహ్య పరిశిష్టే పిత్రాద్యాను లోమ్యా మ్నానాత్.

అను॥ ఇక్కడ నాంద్రీశ్రాద్ధమందు విశేషమును, దానికి, విశేష అధికారిని కూడా ముందు చెప్తాము. దీనిని తొలి వివాహమందు తండ్రి చేయాలి. రెండవ మొదలగు వాటిలో వరుడే చేయాలి. తొలిపాణి గ్రహణమందైతే నాందీ శ్రాద్ధాన్ని తండ్రిచేయాలి. ఆ పిదప వివాహాల్లో వరుడు స్వయంగానే నాందికమును చేయాలి, అనిస్మృతి. త్రికాండ మండనుడు కూడా - తల్లి,తండ్రి బ్రతికుండగా వరుడు తిరిగి వివాహం చేసుకోవాల్సి వస్తే, అతని తండ్రికి నాందీముఖ శ్రాద్ధమును ఆచరించమని పెద్దలు చెప్పలేదు,అని. రేణుకారిక యందిట్లా - వివాహంలో అంగముగా చెప్పిన సమయంలో తండ్రి నాందీ ముఖమును ఆచరించాలి.

వివాహం దేశాంతరంలో ఐతే అక్కడికి వెళ్ళి ఇది (నాంది) చేయాలి,అని. లగ్న ఘటీస్థాపనను నారదుడిట్లా చెప్పాడు – ఆరు అంగుళముల పరిమితి గల లోతు (పొడవు), పన్నెండంగుళ ముల వెడల్పు గలిగిన తామ్ర పాత్రను పదిపలముల పరిమాణంతో కూడిన దానిని సమతలం కలదిగా చేయాలి. నీటితో నిండిన తామ్ర పాత్ర యందుగాని లేదా శుభమైన నీటితో నిండిన మట్టి పాత్రయందు గాని సగం ఉదయించిన సూర్యమండలాన్ని అక్కడ చూడాలి అక్కడ సూర్యుని ఉంచాలి,అని. అక్కడ మంత్రము –నీవు యంత్రములన్నిటిలో ముఖ్యుడవు. బ్రహ్మ పూర్వం నిన్ను నిర్మించాడు. దంపతులకు మంచి చెడులు జరిగేది తెలుసుకొనే కొరకు కాలమును సాధించుటకు కారణము, నువ్వు,అని. యాజ్ఞవల్క్యుడు వరునకు మధుపర్కమును చెప్పాడు ఇట్లా – స్నాతకుడు, ఆచార్యుడు, రాజు, ఇష్టమైనవాడు, వివాహం కాదగినవాడు, అట్లాగే యజ్ఞంలో (ప్రతిసారి) ఋత్విజుడయ్యేవాడు వీరు ప్రతిసంవత్సరము పూజించతగినవారు,అని. ఇక్కడ విశేషము గృహ్య పరిశిష్టమందిట్లా – వరునిది ఏ శాఖయో ఆశాఖా గృహ్య సూత్రానుసారం మధుపర్కాన్ని ఇవ్వాలి, దాత అన్యశాఖవాడైనా,అని. ఇక్కడ వరదాతృశబ్దాలు ఋత్విక్కులు మొదలగు వారికి సూచకము. దానినే ఇట్లా చెప్పారు – పూజించ తగినవాని శాఖ ననుసరించి మధుపర్కము,అని. పూజించ తగిన వాని శాఖీయ మైన కర్మ ఏదుందో దాని ప్రకారం మధుపర్కము,అని యాజ్ఞికులన్నారు. జయంతుడైతేనో ఇట్లా – వరుణమువలె అంతటా యజమానుని శాఖతోనే మధుపర్కము అని అన్నాడు. దానిని పెద్దలు గౌరవించటంలేదు. ఇక్కడ ఏబది కుశలతో (దర్భ) బ్రహ్మను చేయాలి. అందలి సగభాగం అనగా ఇరువది ఐదు దర్భలతో విష్టరము (దర్భపిడికిలి లేదా ఆసనం) అని మొదలుగా గృహ్య పరిశిష్టాదుల యొక్క విష్టరాది లక్షణము మధుపర్కాది విధి కూడా తమతమ గృహ్యసూత్రముల నుండి తెలుసుకోవాలి. కన్యాదాన సమయ మందు ప్రపితా మహులు మొదలుకొని చెప్పాలి అని స్మృత్యర్థసార మందు చెప్పారు ఇట్లా – నాందీ ముఖమందు వివాహమందును ప్రపితామహులు మొదలుగా పేర్లను విద్వాంసులు చెప్పాలి. ఇతరత్ర ఐతే తండ్రి మొదలుగా చెప్పాలి,అని. నాందీముఖ మందు అనేది బహ్వృచశాఖ వారికన్న ఇతరమైన వారి విషయకము. గృహ్యపరిశిష్టమందు తండ్రి మొదలుగా ఆరోహణ క్రమముగా చెప్పారు.

**మూ॥ వ్యాసః – భుక్త్వాసముద్వహేత్ కన్యాం** సావిత్రీ గ్రహణం తథా, **ఉపోషితః సుతాం దద్యాత్ అర్చితాయద్విజాయతు.** భుక్త్వేతి మధుపర్కే వైధభోజనపరం. గృహ్యపరిశిష్టే – **కన్యాం వరయమాణానాం ఏషధర్మో విధీయతే, ప్రత్యఙ్ముఖా వరయంతి ప్రతిగృహ్ణంతి ప్రాఙ్ముఖాః** . మదనరత్నే హేమాద్రౌ చ ఋష్యశృంగః – వరగోత్రం సముచ్చార్య ప్రపితామహ పూర్వకం **నామసంకీర్తయేద్విద్వాన్ కన్యాయా శ్చైవమేవహి. ఉదాపాత్రంతతో గృహ్యమంత్రేణా నేవదాపయేత్.** గౌరీంకన్యామిమాం విప్ర యథాశక్తి విభూషితాం, గోత్రాయ శర్మణే తుభ్యం దత్తాం విప్ర సమాశ్రయ, భూమింగాంచైవ దాసీంచ వాసాం సిచ స్వశక్తితః, మహిషీం వాజినశ్చైవ దద్యాత్ స్వర్ణమణీనపి,

**తతః స్వగృహ్యవిధినా హోమాద్యం కర్మకారయేత్. యథాచారం విధేయాని మాంగల్య కుతుకానిచ, ఏతత్కన్యాదానం త్రిఃకార్యమితి శౌనకః. గృహప్రవేశనీయ హోమే విశేష మాహాశ్వలాయనః - అర్థరాత్రే వ్యతీతేతు పరేద్యుః ప్రాతరేవహి, గృహ ప్రవేశనీయః స్యాదితి యజ్ఞవిదో విదుః,ఇతి. ఔపాసన హోమే విశేష మాహశౌనకః - యది రాత్రౌ వివాహాగ్ని రుత్పన్నః స్యాత్తథాపతి, ఉపక్రమ్యోత్తర స్యాహ్నః సాయం పరిచరేదముం. యదిరాత్రౌ నవనాడీ మధ్యేఽగ్న్యుత్పత్తిస్తదాత దైవ హోమారంభః, తదుత్తరం చేత్పర దినే సాయమారంభ ఇతి సుదర్శన భాష్యే ఉక్తం.**

**అను॥** వ్యాసుడిట్లా - కన్యను, అట్లాగే సావిత్రిని గ్రహించటం వీటిని, భుజించాక చేయాలి. ఉపవసించి, పూజింపబడిన బ్రాహ్మణునకు కన్యను ఇవ్వాలి,అని. తిని అనే మాట మధుపర్క విషయకము శాస్త్రీయ భోజనపరమైనది. గృహ్యపరిశిష్టమందిట్లా - కన్యను వరించేవారికి ఇది ధర్మము అని విధిస్తున్నాము. పశ్చిమాభిముఖులై వరణం చేయాలి. తూర్పు ముఖం గలవారై స్వీకరించాలి,అని. మదనరత్నమందు హేమాద్రి యందును ఋష్య శృంగుడిట్లా - ప్రపితామహుడు మొదలుగా వరగోత్రమును ఉచ్చరించి ఆ పిదప విద్వాంసుడు కన్యకు గూడా ఇట్లాగే పేర్ల నుచ్చరించాలి,అని. కన్యనిచ్చేవాడు తూర్పుముఖంగా కూర్చోవాలి. వరుడు పశ్చిమాభిముఖుడై ఉండాలి. దక్షిణతో కూడా ఈ కన్యను మధుపర్కంతో పూజింప బడిన అతనికై ఇవ్వాలి. ఆ పిదప నీటి పాత్ర తీసుకొని ఈ మంత్రంతో ఇవ్వాలి. ఓ విప్ర! యథాశక్తి అలంకరింపబడిన, గౌరీ స్వరూపురాలైన ఈ కన్యను ఈ గోత్రం గల ఈ పేరు గల నీకు ఇస్తున్న ఈ కన్యను ఓ విప్రుడ ! ఆశ్రయించు (ఈమెకు స్థానం ఇవ్వు),అని. ఆ పిదప తన శక్తి కొలది భూమిని, ఆవును, దాసిని, వస్త్రములను, బట్టను, గుఱ్ఱములను, ఇవ్వాలి. బంగారు(ము) మణులను కూడా ఇవ్వాలి. ఆ పిదప తమ గృహ్య సూత్ర విధితో హోమము మొదలగు కర్మను చేయించాలి. మంగళకరమైన వినోదక్రీడలను తమ తమ ఆచార ప్రకారము చేయించాలి. ఈ కన్యాదానమును మూడుమార్లు ఉచ్చరించాలని శౌనకుడన్నాడు. గృహ ప్రవేశనీయ హోమమందు విశేషమును ఆశ్వలాయనుడు ఇట్లా చెప్పాడు- అర్థరాత్రి గడిచినట్లైతే, తెల్లవారి ప్రాతఃకాలమందే, గృహప్రవేశనీయ హోమము ఉంటుంది. అని యజ్ఞవిదులు అన్నారు,అని. ఔపాసన హోమమందు విశేషమును శౌనకుడిట్లా చెప్పాడు - ఒకవేళ రాత్రి వివాహాగ్ని ఉత్పన్నమైతే అట్లాగే ఉంటే ఆరంభించి తరువాతి రోజు సాయంకాలమందు అదే అగ్నిలో చేయాలి,అని. సుదర్శన భాష్యమందిట్లా - ఒకవేళ రాత్రి తొమ్మిది నాడుల మధ్యలో అగ్ని ఉత్పత్తి ఐతే అప్పుడే హోమారంభము. ఆ తరువాత ఐతే తరువాతి రోజు సాయంకాలము ఆరంభము,అని. (ప్రాతర్ హోమము సంగవాంతము, సాయం హోమము నవనాడికాంతము).

**మూ॥ అథాదేవతోత్థాపనం - సమేచదివసే కుర్యాత్ దేవకోత్థాపనం బుధః, షష్ఠం చ విషమం నేష్టం ముక్త్వా పంచమసప్తమౌ. నిర్ణయదీపేగార్గ్యః - నాందీ శ్రాద్ధే కృతే పశ్చాత్ యావన్మాతృ విసర్జనం, దర్శశ్రాద్ధం క్షయశ్రాద్ధం స్నానం శీతోదకేనచ. అపసవ్యం స్వధాకారం**

నిత్యశ్రాద్ధం తథైవచ. బ్రహ్మయజ్ఞం చాధ్యయనం నదీసీమాతి లంఘనం, ఉపవాస వ్రతం చైవ శ్రాద్ధ భోజన మేవచ, నైవకుర్యుః సపిండాశ్చ మండపోద్వాసనా వధి. బృహస్పతిః - తీర్థే వివాహేయాత్రాయాం సంగ్రామే దేశవిప్లవే నగర గ్రామ దాహేచ స్పృష్టా స్పృష్టం న దుష్యతి. యోగియాజ్ఞవల్క్యః - నస్నాయాదుత్సవేఽతీతే మంగలం వినివర్త్యచ, అనువృజ్య సుహృత్ బంధూన్ అర్చయిత్వేష్ట దేవతాం. జ్యోతిషే - స్నానం సచైలం తిలమిశ్రకర్మ ప్రేతానుయానం కలశప్రదానం, అపూర్వ తీర్థామర దర్శనం చవివర్జయేన్మం గలతోఽబ్దమేకం. మాసషట్కం వివాహాదౌ వ్రత ప్రారంభణేఽపిచ, జీర్ణభాండాది నత్యాజ్యం గృహసమ్మార్జనం తథా. ఊర్ధ్వం వివాహాత్పుత్రస్య తథా చ వ్రతబంధనాత్, ఆత్మనో ముండనం నైవ వర్షం వర్షార్ధమేవ చ. అభ్యంగే సూతకే చైవ వివాహే పుత్ర జన్మని, మాంగల్యేషు చ సర్వేషు న ధార్యంగోపి చందనం. జ్యోతిర్నిబంధే - ఉద్వాహాత్ప్రథమే శుచౌయదివసేత్ భర్తుర్గృహే కన్యకా, హన్యాత్తజ్జననీం క్షయేన్నిజతనుం జ్యేష్ఠేపతి జ్యేష్ఠకం, పౌషే చశ్వశురం పతిం చ మలినే చైత్రే స్వపిత్రాలయే, తిష్ఠంతీ పితరం నిహంతి నభయం తేషా మభావే భవేత్. నిబంధే - వివాహాత్ ప్రథమే పౌషే ఆషాఢే చాధిమాసకే, న సా భర్తుర్ గృహే తిష్ఠేత్ చైత్రే పితృగృహేతథా.

అను|| ఇక దేవత ఉత్థాపనము - బుధుడు దేవతోత్థాపనను సమదివసములో చేయాలి. అందులో ఆరవది విషమపురోజు ఇష్టం కాదు. ఐదవ ఏడవ దివసములను విడిచి పెట్టాలి (తగవు). నిర్ణయదీపమందు గార్గ్యుడిట్లా - నాందీ శ్రాద్ధం చేశాక ఆ పిదప మాతృ విసర్జన వరకు దర్శశ్రాద్ధము, క్షయ శ్రాద్ధము, చన్నీటిస్నానము, అపసవ్యము, స్వధాకారము, నిత్యశ్రాద్ధము, బ్రహ్మయజ్ఞము, అధ్యయనము, నదీలంఘనము, సీమాలంఘనము, ఉపవాసము వ్రతము, శ్రాద్ధ భోజనము చేయరాదు. సపిండములు కూడా (సపిండులు) మండప ఉద్వాసన వరకు ఇవన్నీ చేయరాదు,అని. బృహస్పతి ఇట్లా - తీర్థమందు, వివాహమందు, యాత్ర యందు, సంగ్రామమందు, దేశ విప్లవమందు, నగరము గ్రామము వీని దహనమందు స్పర్శా స్పర్శ దోషం కాదు,అని. యోగియాజ్ఞవల్క్యుడిట్లా - ఉత్సవం అయిపోయాక, మంగళ కార్యం ముగించివచ్చాక స్నేహితులను బంధువులను సాగనంపాక, ఇష్ట దేవతను పూజించాక స్నానం చేయరాదు,అని. జ్యోతిషమందిట్లా - మంగళకార్యం చేశాక ఒక సంవత్సరం వరకు సచేల స్నానము నువ్వులతో కూడిన కర్మ, శవంను అనుసరించి వెళ్ళటం, శ్రాద్ధ కలశ దానము, కొత్త తీర్థముల, దేవతల దర్శనము వీనిని వదలాలి,అని. వివాహాదు లందు వ్రత ప్రారంభమందును ఆరు నెలల వరకు పురాతన (పాత) పాత్రలను మొదలగు వానిని అట్లాగే గృహ సమ్మార్జనమును విడువరాదు. పుత్రుని వివాహం అయ్యాక ఒక సంవత్సరం వరకు తను తల కొరిగించుకోరాదు (గుండు). అట్లాగే ఉపనయనం అయ్యాక ఆరు నెలల వరకు తను గుండు చేయించుకోరాదు. అభ్యంగ స్నానమందు సూతక మందు, వివాహమందు, పుత్రుడు జన్మిస్తే, అన్ని మంగళ కార్యములందు గోపీచందనాన్ని ధరించరాదు. జ్యోతిర్నిబంధమందిట్లా - వివాహమయ్యాక తొలి ఆషాఢమందు (శుచి)కన్యక ఒకవేళ భర్త గృహంలో ఉంటే

వరుని తల్లిని చంపుతుంది, తన శరీరాన్ని నష్టపరచుకుంటుంది, జ్యేష్ఠ మాసంలో (శుచి) భర్తయొక్క పెద్ద అన్నను, పౌషమాసమందు మామను, మలిన మాసమందు (మల) పతిని నశింపచేస్తుంది. చైత్రమాసమందు తన తండ్రి ఇంటిలో ఉంటే తండ్రిని చంపుతుంది. అవి లేకపోతే భయంలేదు,అని. నిబంధమందిట్లా – వివాహం తరువాత తొలి పుష్యమాసమందు, ఆషాఢమందు, అధికమాసమందు కన్యక భర్త గృహంలో ఉండరాదు చైత్రమాసంలో పితృగృహంలో అట్లాగే ఉండరాదు,అని.

**మూ॥ హేమాద్రౌ స్మృత్యంతరే** – వివాహ వ్రత చూడాసు వర్షమర్ధం తదర్ధకం, పిండదానం మృదాస్నానం నకుర్యాత్తిల తర్పణం. (తథా అర్ధం పూర్వవత్, సపిండానైవ కుర్వీరన్ అద్భిః స్నానం ఋతుత్రయే. తీర్థే సంవత్సరే ప్రేతే పితృయజ్ఞే మహాలయే, కృతోద్వాహోఽపి కుర్వీత పిండ నిర్వపణం సదా) **అథ వధూప్రవేశః** – జయతుంగే – మార్గశీర్షే తథా మాఘే మాధవే జ్యేష్ఠసంజ్ఞకే, సుప్రశస్తే భవేద్వేశ్మ ప్రవేశోనవయోషితాం. నాదరః – ఆరభ్యోద్వాహ దివసాత్ షష్ఠే వాఽ ప్యష్టమేదినే, వధూ ప్రవేశః సంపత్త్యైదశమేఽ థసమేదినే. సంగ్రహే – వివాహ మారభ్య వధూప్రవేశోయుగ్మే తిథౌ షోడశవాసరాంతాత్, ఊర్ధ్వంతతోఽబ్దేయుజి పంచమాంతాత్ అతః పరస్తాన్నియమో న చాస్తి. నారదః – సమేవర్షే సమేమాసే యదినారీ గృహం వ్రజేత్. అయుష్యం హరతే భర్తుః సానారీ మరణం వ్రజేత్. ప్రయోగరత్నేతు – వధూప్రవేశః ప్రథమే తృతీయే శుభప్రదః పంచమకేఽథవాప్ని, ద్వితీయకే వాథ చతుర్థకే వాషష్ఠే వియోగా యమ దుఃఖదఃస్యాత్, ఇత్యుక్తం. తత్రమూలం చింత్యం. వృద్ధవసిష్ఠోఽపి – షష్ఠాష్టమే వా దశమే దినే వా వివాహ మారభ్య వధూ ప్రవేశః, పంచాంగ సంశుద్ధ దినం వినాపి విధావ సర్గో చరగేఽపి కార్యః. లల్లః – స్వభవన పురప్రవేశే దేశానాం విప్లవే తథోద్వాహే, నవ వధ్వాగృహగమనే ప్రతి శుక్రవిచారణానాస్తి. మాండవ్యః – నిత్యయానే గృహే జీర్ణే ప్రాశనాంతేషు సప్తసు, వధూ ప్రవేశే మాంగల్యే న మౌఢ్యం గురుశుక్రయోః. జ్యోతిః ప్రకాశే – వామే శుక్రే నవోఢాయాః సుఖం హానిశ్చ దక్షిణే, ధనం ధాన్యం చ పృష్ఠస్థే సర్వనాశః పురః స్థితే, నవోఢాయాస్తు వైధవ్యం యదుక్తం సమ్ముఖే భృగౌ, తదేవవిబుధైర్జ్ఞేయం కేవలం తు ద్విరాగమే. పూర్వతోఽభ్యుదితే శుక్రే ప్రయాయాద్దక్షిణాపరే, పశ్చాదభ్యుదితే చైవ యాయాత్పూర్వోత్తరేదిశౌ. వ్యవహార తత్వే – పౌష్ణాత్కరాచ్ఛ శ్రవణాచ్ఛయుగ్మే హస్తత్రయే మూల మఘోత్తరాసు, పుష్యే చ మైత్రే చ వధూ ప్రవేశో రిక్తే తరే వ్యర్క కుజే చ శస్తః. గర్గః – వ్యతీ పాతేచ సంక్రాంతౌ గ్రహణే వైధృతావపి, శ్రాద్ధం వినాశుభం నైవ ప్రాప్తకాలేఽపి మానవః. తథా – అమా సంక్రాంతి విష్ట్యాదౌ ప్రాప్తకాలేఽపి నాచరేత్, ఇతి.

అను॥ హేమాద్రి యందు స్మృత్యంతరమందిట్లా – వివాహము, వ్రతము, చూడాకర్మ ఇవి అయ్యాక సంవత్సరము, ఆరునెలలు, మూడు నెలలు పిండదానము, మట్టి స్నానము, తిలతర్పణము చేయరాదు,అని. (అట్లాగే మొదటి సగం శ్లోకము. తరువాతి సగమిట్లా – స పిండులు మూడు ఋతువుల కాలం వరకు నీటితో స్నానం చేయరాదు. తీర్థమందు,

సంవత్సర ప్రేత మందు, పితృయజ్ఞమందు, మహాలయమందు వివాహం చేసుకున్నా పిండ నిర్వాపమును ఎప్పుడూ చేయాలి). ఇక వధూ ప్రవేశము - జయతుంగమందిట్లా - మార్గశీర్షం, మాఘము, వైశాఖము, జ్యేష్ఠము, ఈ నెలలలో మంచి ప్రశస్తమైన రోజున కొత్త కోడలికి గృహప్రవేశం జరగాలి,అని. నారదుడిట్లా - వివాహదివసం ఆరంభమునుండి ఆరు, ఎనిమిది, పదవరోజున లేదా సమదినమందు వధూ ప్రవేశము సంపదకారి, అని. సంగ్రహమందిట్లా - వధూ ప్రవేశము వివాహ మారంభించి పదహారు రోజుల వరకు యుగ్మ తిథియందు తగును. ఆ పిదప ఐదు సంవత్సరాల వరకు (అ) సమ సంవత్సరమందు వధూ ప్రవేశము. ఆ పిదప నియమం లేదు,అని. నారదుడిట్లా - సమవర్షమందు సమ మాసమందు ఒకవేళ స్త్రీ ఇంటికి వస్తే భర్త ఆయుష్యాన్ని హరిస్తుంది. ఆ స్త్రీ మరణం పొందుతుంది,అని. ప్రయోగరత్నమందైతే - వధూ ప్రవేశము మొదటి, మూడవ, ఐదవ రోజున ఐతే శుభప్రదము. రెండవరోజున లేదా నాల్గవ, ఆరవ రోజున ఐతే వియోగము, రోగము దుఃఖము కల్గచేస్తుంది, అని చెప్పారు. దీనికి మూల వాక్యాలను విచారించాలి. వృద్ధ వసిష్ఠుడు కూడా - వివాహ ఆరంభము నుండి వధూ ప్రవేశము ఆరవ, ఎనిమిదవ, పదవరోజున, పంచాంగశుద్ధ దినము లేకపోయినా, చంద్రుడు అసద్ గోచారగుడైనా కూడా చేయాలి,అని. లల్లుడిట్లా - తన భవనము, పురము వీని ప్రవేశమందు దేశ విప్లవ మందు అట్లాగే వివాహమందు, నవ వధువు గృహప్రవేశమందు సంముఖ శుక్ర (గ్రహ) విచారణ లేదు,అని. మాండవ్యుడిట్లా - ప్రతిరోజు యానంలో వెళ్ళేట్టైతే, జీర్ణ గృహం విషయంలో, (గర్భాధాన, పుంసవన, సీమంతోన్నయన, జాతకర్మ, నిష్క్రమణ, నామకరణ, అన్నప్రాశన) అన్నప్రాశనాంతమైన ఏడుకర్మల విషయంలో, వధూప్రవేశమందు, మాంగల్యమందు గురు శుక్రుల మౌఢ్యంలేదు (అస్తం),అని. జ్యోతిః ప్రకాశమందిట్లా - శుక్రుడు వామభాగమందుంటే నవవధువుకు (వధూ ప్రవేశమందు) సుఖము. దక్షిణ భాగమందు శుక్రుడుంటే హాని జరుగుతుంది. శుక్రుడు వెనుక భాగమందుంటే ధనధాన్యములు కల్గుతాయి. ఎదురుగా ఉంటే సర్వనాశకారకుడౌతాడు,అని. సమ్ముఖ శుక్రుడైతే నవోఢకు వైధవ్యం కలుగుతుంది. అని ఏదన్నారో అదే కేవలము ద్విరాగమన మందు విద్వాంసులు తెలుసుకోవాలి. శుక్రుడు పూర్వదిశయందు ఉదయిస్తే దక్షిణ పడమర దిశలకు వెళ్ళాలి. పడమర దిక్కు ఉదయిస్తే పూర్వ ఉత్తర దిక్కులు వెళ్ళాలి. వ్యవహార తత్వమందిట్లా - రేవతి, హస్త, శ్రవణముల నుండి రెండేసి, హస్త త్రయము, మూల మఘ, మూడు ఉత్తరలు, పుష్యమి, అనూరాధ ఈ నక్షత్రములందు రిక్త కన్న ఇతరమైన తిథియందు ఆది, మంగల వారముల కన్న ఇతరమైన దినములందు వధూ ప్రవేశము ప్రశస్తమైనది,అని. గర్గుడిట్లా - వ్యతీపాతమందు, సంక్రాంతియందు, గ్రహణ మందు, వైధృతి యందు శ్రాద్ధం లేకుండా శుభ కాలం ప్రాప్తించినా కూడా నరుడు శుభం చేయరాదు,అని. అట్లాగే - అమా, సంక్రాంతి విష్ట్యాదులందు శుభదినం ప్రాప్తించినా కూడా శుభం ఆచరించరాదు,అని.

మూ॥ **అథద్విరాగమనం** ఋక్షోచ్చయే – మాఘ ఫాల్గునవైశాఖే శుక్లపక్షే శుభేదినే, గుర్వాదిత్య విశుద్ధౌస్యాత్ నిత్యంపత్నీ ద్విరాగమః. బాదరాయణః – సీహోరాంశు దినోత్తరాదితి గురు బ్రహ్మేను రాధాశ్వినీ, శుక్రే భాస్కర వాయు విష్ణు వరుణత్వాష్ట్రే ప్రశస్తే తిథౌ, కుంభా జాలి గతేరవౌ శుభకరే ప్రాప్తోదయే భార్గవే, జీవజ్ఞా స్ఫుటితాం దినే నవ వధూ వేశ్మప్రవేశః శుభః. **అథపునర్వివాహః** – శ్రీధరీయే – పునర్వివాహం వక్ష్యామిదంపత్యోః శుభ వృద్ధిదం, లగ్నేందు లగ్నయోర్దోషే గ్రహతారాది సంభవే, అన్యేష్వ శుభకాలేషు దుష్టయోగాది సంభవే, వివాహేచాపి దంపత్యో రాశౌచాది సముద్భవే, తస్యదోషస్య శాంత్యర్థం పునర్వైవాహ్యమిష్యతే. యాజ్ఞవల్క్యః – సురాపీ వ్యాధితాధూర్తా వంధ్యార్థఘ్న్య ప్రియంవదా, స్త్రీ ప్రసూశ్చాధివేత్తవ్యా పురుష ద్వేషిణీతథా. మనుః – వంధ్యాష్టమేఽధివేద్యాబ్దే దశమేతు మృతప్రజా, ఏకాదశే స్త్రీ జననీ సద్యస్త్వ ప్రియవాదినీ. సంగ్రహేతు – అప్రజాం దశమేవర్షే స్త్రీ ప్రజాంద్వాదశేత్యజేత్, మృతప్రజాం పంచదశే సద్యస్త్వ ప్రియవాదినీం. ఏకాముత్క్రమ్య కామార్థమన్యాం లబ్ధుం య ఇచ్ఛతి, సమర్థః తోషయిత్వార్థైః పూర్వోఢా మపరాం వహేత్. యాజ్ఞవల్క్యః – ఆజ్ఞా సంపాదినీం దక్షాం వీరసూంప్రియ వాదినీం, త్యజన్‌దాప్యః తృతీయాంశ మద్రవ్యో భరణం స్త్రియాః. మనుః–అధివిన్నాతుయా నారీ నిర్గచ్ఛే ద్రుషితా గృహాత్, సాసద్యః సన్నిరోధవ్యాత్యాజ్యావాకుల సన్నిధౌ,ఇతి. హేమాద్రౌ కాత్యాయనః – అగ్నిశిష్టాది శుశ్రూషాం బహూభార్యః సవర్ణయా, కారయేత్తద్బహుత్వంచేత్ జ్యేష్ఠయా గర్హితా, నచేత్,ఇతి. యాజ్ఞవల్క్యః – సత్యామన్యాం సవర్ణాయాం ధర్మకార్యం న కారయేత్, సవర్ణాసు విధౌధర్మ్యేజ్యేష్ఠయా న వినేతరా.

అను॥ ఇక ద్విరాగమనము. ఋక్షోచ్చయ మందిట్లా చెప్పబడింది – మాఘం, ఫాల్గునం, వైశాఖం ఈ మాసముల శుక్లపక్షమందలి శుభదినమందు గురువు ఆదిత్యుడు వీరు శుద్ధియందుండగా పత్నియొక్క రెండవ రాక నిత్యమైనది (ఉత్తమము),అని. బాదరాయణుడిట్లా – సోమవారం, ఉత్తర, పునర్వసు, పుష్యమి, రోహిణి, అనురాధ, అశ్విని, జ్యేష్ఠ, హస్త, స్వాతి, శ్రవణం, శతభిషం, చిత్త ఈ నక్షత్రములందు ఉత్తమమైన తిథియందు, సూర్యుడు కుంభ, మేష, వృశ్చిక రాశులందుండగా శుక్రుడు శుభలగ్నమందు ఉదయించగా గురు, బుధ, సోమవారములందు నవ వధువు గృహప్రవేశము శుభప్రదము ఔతుంది,అని. ఇక పునర్వివాహము –శ్రీధరీయమందిట్లా – దంపతులకు శుభమును వృద్ధిని కల్గించే పునర్వివాహమును గూర్చి చెబుతాను (లగ్నశుద్ధి లేనప్పుడు వివాహమాడిన జంట, తిరిగి వివాహం – చేసుకొనేందుకు శుభలగ్నం గూర్చి). లగ్నమందు, ఇందు (చంద్ర) లగ్నమందు దోషమున్నట్లైతే గ్రహతారాదులు సంభవిస్తే, ఇతరమైన అశుభ కాలములందు, దుష్ట యోగాదులు సంభవిస్తే, వివాహమందు కూడా దంపతులకు ఆశౌచాదులు సంభవిస్తే, ఆ దోష శాంతి కొరకు తిరిగి వివాహమాడటం చెప్పబడింది,అని. యాజ్ఞవల్క్యుడిట్లా – (ఆచారాధ్యాయము 73) కల్లుతాగేది, దీర్ఘరోగిణి, మోసగించేది, వంధ్య, ధననాశం చేసేది, అప్రియములు పలికేది, ఆడపిల్లలను కనేది, అట్లాగే పురుషులను ద్వేషించేది కనుక మొదటి భార్య ఐతే ఆమెను కాదని రెండవ వివాహం చేసుకోవచ్చు,అని. మనువిట్లా – భార్య

వంధ్య ఐతే ఎనిమిదవ సంవత్సరంలో (తిరిగి) వివాహమాడాలి. చనిపోయిన సంతానాన్ని కంటూ ఉంటే పదవ సంవత్సరంలో, ఆడపిల్లల్ని మాత్రమే కనేది ఐతే పదకొండవ సంవత్సరంలో, అప్రియములు పలికేది ఐతే, భర్త వెంటనే రెండవ వివాహం చేసుకోవాలి, అని. సంగ్రహమందైతే - సంతానం లేనిదాన్ని పదవ సంవత్సరంలో, ఆడపిల్లల్నే కనేదాన్ని పన్నెండవ సంవత్సరంలో, చనిపోయిన సంతానాన్ని కనేదాన్ని పదిహేనవ సంవత్సరంలో, అప్రియములు (కటువచనాలు) పలికే దాన్ని వెంటనే విడిచిపెట్టాలి. తిరిగి వివాహం చేసుకోవాలి,అని. ఒక స్త్రీని విడిచి విషయ సుఖం కొరకు మరో స్త్రీని ఎవడైనా వివాహ మాడదలిస్తే, వాడు సమర్థుడైతే ముందు వివాహ మాడిన స్త్రీని సంపదలతో సంతృప్తి పరచి, మరో స్త్రీని వివాహ మాడాలి. యాజ్ఞవల్క్యుడిట్లా - (ఆచారాధ్యాయము శ్లో.76) ఆజ్ఞలను పాలించేది, సమర్థురాలు, వీరపుత్రులను కనేది, మధురంగా మాట్లాడేది ఐన భార్యను విడిచిపెడితే (మరోవివాహమాడితే) తన ధనంలో మూడవ భాగాన్ని ఇవ్వాలి. ఒకవేళ వాడు ద్రవ్యహీనుడైతే ఆమెకు భరణం ఇప్పించాలి, (అన్నవస్త్రాలకు లోపం రాకుండా) అని. మనువిట్లా - (అధ్యా9 శ్లో 83) భర్త రెండవ వివాహం చేసుకున్నాక, ఉన్న తొలి భార్య కోపంతో ఇంటి నుండి వెళ్లిపోతే ఆమెను వెంటనే అడ్డగించాలి, గృహ మందుంచాలి లేదా తల్లిగారి ఇంటిలో వదలాలి,అని. హేమాద్రి యందు కాత్యాయనుడిట్లా - అనేకమంది భార్యలు కలవాడైతే సవర్ణురాలైన భార్యతో అగ్నిశిష్టాది శుశ్రూషను చేయించాలి. సవర్ణులు కూడా ఎక్కువమంది ఉంటే పెద్ద భార్యతో చేయించాలి. ఆమె పతితాది దోషం లేనిదైతే,అని. యాజ్ఞవల్క్యుడిట్లా - (ఆచారాధ్యాయ శ్లో 88) సవర్ణురాలైన మరో భార్య ఉండగా అసవర్ణ స్త్రీతో ధర్మకార్యం చేయించరాదు. సవర్ణ భార్యలు ఎక్కువగా ఉంటే ధర్మకార్యమందు జ్యేష్ఠ భార్య తప్ప ఇతర స్త్రీ తగదు,అని.

**మూ॥ ద్వితీయ వివాహ హోమే** అగ్నిమాహ కాత్యాయనః - సదారోఽన్యాన్పునర్ దారాను ద్వోఢుం కారణాంతరాత్, యదిచ్ఛేదగ్నిమాన్కర్తుం క్వహోమోఽస్య విధీయతే, స్వేగ్నావేవ భవేద్ధోమో లౌకికే, నకదాచన. త్రికాండమండనోఽపి- ఆద్యాయాం విద్యమానాయాం ద్వితీయా ముద్వహేద్యది, తదా వైవాహికం కర్మ కుర్యాదా వసథేఽగ్నిమాన్. సుదర్శన భాష్యేతు - ద్వితీయ వివాహ హోమో లౌకికే ఏవ, న పూర్వోపాసనే, ఇత్యుక్తం. ఇదం చా సంభవే. తత్ర చాగ్నిద్వయ సంసర్గః కార్యః. తదాహ శౌనకః-అథాగ్న్యోః గృహ్యయోః యోగం సపత్నీ భేద జాతయోః, సహాధికార సిద్ధ్యర్థమహం వక్ష్యామి శౌనకః. అరోగా ముద్వహేత్కన్యాం ధర్మలోప భయాత్స్వయం, కృతేతత్ర వివాహే చ వ్రతాం తేతు పరేఽహని. పృథక్ స్థండిలయో రగ్నిం సమాధాయ యథావిధి. తంత్రం కృత్వాజ్య భాగాంత మ న్వాధానాదికం తతః, జుహుయాత్పూర్వ పత్న్యగ్నౌ తయాన్వారబ్ధ ఆహుతీః, అగ్నిమీలే పురోహితం సూక్తేన, నవర్చేనతు, సమిధ్యేనం సమారోప్య అయంతే యోని రిత్యృచా, ప్రత్యవరో హేత్యనయా కనిష్ఠాగ్నౌ నిధాయతం, ఆజ్యభాగాంతతంత్రాది కృత్వారభ్య తదాదితః, సమన్వారబ్ధ ఏతాభ్యాం పత్నీభ్యాం జుహుయాత్ ఘృతం. చతుర్ గృహీతమేతాభిః ఋగ్భిః షడ్భిః యథాక్రమం. అగ్నావగ్నిశ్చరతీత్యగ్ని నాగ్నిః సమిధ్యతే, అస్తేదమితి తిసృభిః పాహినో

అగ్ని ఏకయా, తతః స్విష్ట కృదారభ్యహోమ శేషం సమాపయేత్. గోయుగం దక్షిణా దేయాశ్రోత్రియా యాహితాగ్నయే, పత్న్యైరేకా యదిమృతాదగ్న్యాత్ నైవతాం పునః, ఆదధీతాన్యయా సార్థం ఆధాన విధినా గృహీ, ఇతి. బౌధాయన గృహ్య సూత్రేతు -(3-38) అథయది గృహస్థస్త్రద్వే భార్యే విందేత కథం తత్ర కుర్యాదితి, యస్మిన్ కాలే విందేత్ భావాగ్ని పరిచరేత్, అపరాగ్ని ముపసమాధాయ సంపరిస్తీ ర్యాజ్యం విలాప్యోత్పూయ స్రుక్ స్రువం నిష్టప్య సంమృజ్య స్రుచి చతుర్ గృహీతం గృహీత్వాऽన్వారబ్ధా యాం యజమానో జుహోతి-నమస్త ఋషే గద అవ్యధాయై త్వా స్వధాయైత్వా మా,న ఇంద్రాభి తస్త్వ దృష్ట్వా రిష్యాసుః, ఏవా బ్రహ్మన్ తవేదస్తు స్వాహా,ఇతి. అథ సమారోపయతి - అయంతే యోనిర్ ఋత్విజ ఇతి. అథ పూర్వాగ్ని ముపసమాధాయ అజుహ్వానః, ఉద్బుధ్యస్వాగ్నే, ఇతి సమిధ మాధాయ సంపరిస్తీర్య అజ్యం విలాప్యోత్పూయ స్రుక్స్రువం నిష్టప్య సంమృజ్యస్రుచి చతుర్ గృహీతం గృహీత్వా ద్వయోః భార్యయోః అన్వారబ్ధయోః యజమానోऽజుహోతి యో బ్రహ్మబ్రహ్మణా ఇత్యేతేన సూక్తే నైకైకం చతుర్ గృహీతం జుహోతి ప్రసిద్ధాగ్ని ముఖాత్ కృత్వా పక్వాం జుహోతి, సమితం సంకల్పేథామితి పురోను వాక్యామనూచ్యా అగ్నే పురీష్య, ఇతి యాజ్యయా జుహోతి- అథాజ్యాహుతీ రుపజుహోతి పురీష్యస్త్వమగ్నే, ఇత్యంతా దనువాకస్య, స్విష్టకృత్ప్రభృతి సిద్ధ మాధేను వరప్రదానాత్. యాజ్యయాజుహోతి అథాగ్రేణాగ్నిం దర్భ స్తంభేషు హుతశేషం నిదధాతి బ్రహ్మయజ్ఞానం, పితావిరాజమితి ద్వాభ్యామితి. (ద్వాభ్యాం సంసర్గ విధికార్యః)

అను॥ ద్వితీయ వివాహ హోమమందు అగ్నిని గూర్చి కాత్యాయనుడు ఇట్లా చెప్పాడు - భార్య గలిగినవాడు ఇతర కారణాలవల్ల మరో స్త్రీని తిరిగి భార్యగా పొందాలనుకుంటే వివాహ మాడాలనుకుంటే అగ్ని కలిగిన ఈతనికి హోమము ఏ అగ్ని యందు విధించబడుతుంది. ఆతనికి హోమము తన అగ్నియందే కలుగుతుంది. లౌకికాగ్ని యందు కాదు,అని. త్రికాండమండనుడు కూడా - తొలి భార్య ఉండగా రెండవ స్త్రీని వివాహమాడితే అప్పుడు అగ్నికలవాడు ఆవసథాగ్ని యందు వివాహ సంబంధి కర్మను ఆచరించాలి,అని. సుదర్శనభాష్యమందైతే - ద్వితీయ వివాహ సంబంధి హోమము లౌకికాగ్నియందే, పూర్వ ఔపాసన యందు కాదు అని చెప్పారు. ఇదైతే ఔపాసనాగ్ని లేని (దగ్గర) పక్షంలోనే. అక్కడ రెండు అగ్నుల సంసర్గం చేయాలి (తరువాత). దానినే శౌనకుడిట్లా - ఇక గృహ్యాగ్నుల సంయోగాన్ని సపత్నుల భేదం వల్ల కల్గిన దాన్ని సహ అధికారం సిద్ధించే కొరకు నేను శౌనకుణ్ణి చెబుతున్నాను,అని. ధర్మానికి లోపం కల్గుతుందనే భయంవల్ల స్వయంగా రోగ రహితురాలైన కన్యను వివాహ మాడాలి. (కన్యా లక్షణం కాశీఖండం అధ్యా-37). అక్కడ వివాహం అయ్యాక వ్రతాంత మందు తరువాతి రోజున విడివిడిగా **స్థండిలముల** యందు అగ్నిని శాస్త్ర ప్రకారముగా ఉంచాలి. (హోమం కొరకు తయారు చేసిన వేదిక చతురశ్రం, సమంగా ఉన్నది) ఆజ్య భాగాంతముగా తంత్రముచేసి, ఆ పిదప అన్వాధానాదికము చేయాలి. (తంత్రం అనగా కర్మణాం యుగపద్భావః. అన్వాధానము = అగ్నిపై సమిధల నుంచటం) పూర్వపత్ని అగ్నియందు ఆమె స్పర్శతో భర్త అన్వారబ్ధ ఆహుతులను హోమం చేయాలి. అగ్ని మీలే పురోహితం అనే సూక్తంలోని తొమ్మిది

ఋక్కులతో హోమం చేయాలి. అయంతే యోనిః అనే ఋక్కుతో సమిధతో దీనిని ఆవాహన చేసి ప్రత్యవరోహ అనే మంత్రంతో కనిష్ఠాగ్ని యందు దానిని ఉంచాలి. ఆజ్యభాగాంతముగా తంత్రాదులు చేసి అప్పుడు మొదటి నుండి ఆరంభించి అన్వారబ్ధమును ఈ ఇద్దరు భార్యలతో కూడి నేయిని నాల్గుసార్లు తీసుకొని క్రమంగా ఈ ఆరు ఋక్కులతో హోమం చేయాలి. అగ్నావగ్నిశ్చరి, అని, అగ్నినా అగ్నిః సమిధ్యతే అని, అస్తీదం అనే మూడు ఋక్కులతో, పాహినో అగ్న ఏకయా అనే దానితోను (ఇవి ఆరు). ఆ పిదప స్విష్టకృత్ నుండి ఆరంభించి హోమ శేషమును ముగించాలి. శ్రోత్రియుడైన ఆహితాగ్నికి రెండు ఆవులను దక్షిణను(గా) ఇవ్వాలి. ఇద్దరు భార్యలలో ఒక భార్య చనిపోతే ఆమెను అదే అగ్నితో దగ్ధం చేయాలి. ఆ పిదప గృహస్థు ఇంకో ఆమెతో కూడి ఆధానవిధితో ఆధానం చేయాలి, అని. (హోమాగ్నిని ఉంచటం). బౌధాయన గృహ్య సూత్రమందైతే ఇట్లా – ఇక ఒకవేళ గృహస్థుకు ఇద్దరు భార్యలుంటే అక్కడ ఎట్లా చేయాలి,అని. రెండవ భార్య వచ్చాక రెండు అగ్నులను పూజించాలి. రెండవ అగ్నిని సమీప మందుంచి (స్థాపన) దర్భలను పరిస్తరణం చేసి గిన్నెలో నేయిపోసి కదల్చి స్రుక్ స్రువాలను అగ్నిలో కాపి, దర్భలతో వాటిని తుడిచి స్రుక్కు యందు నాలుగు మార్లు తీసుకొని అన్వారబ్ధ– (భార్య స్పర్శం) మయ్యాక యజమానుడు హోమం చేస్తాడు. సమస్త ఋషే అనే ఋక్కుతో పిదప సమారోపణ చేస్తాడు, (అప్పగించు) అయంతే యోనిః ఋత్విజ,అని. ఆ పిదప తొలి అగ్నిని ఏర్పరచి (ఉంచి) ఆజుహ్వానః, ఉద్బుధ్యస్వాగ్నే అనే ఋక్కులతో సమిధ తీసుకొని (సమిధా దానం చేసి) పరిస్తరణం చేసి నేయిపోసి కదల్చి స్రుక్‌స్రువాలు అగ్నితప్తం చేసి తుడిచి స్రుక్కు యందు నాల్గుమార్లు తీసుకొని ఇద్దరు భార్యల స్పర్శ జరిగాక యజమానుడు హోమం చేస్తాడు. యో బ్రహ్మోబ్రహ్మణ, ఈ సూక్తంతో ఒక్కోసారి నాల్గు మార్లు తీసుకొని హోమం చేస్తాడు. ప్రసిద్ధమైన అగ్నికి అభిముఖంగా నిలబడి చరు హోమం చేస్తాడు. సమితం సంకల్పేథాం అని పురోనువాకాన్ని పలుకుతూ అగ్నే పురీష్య, అనే మంత్రంతో యజింపతగిన దానితో హోమం చేస్తాడు. పిదప ఆజ్య ఆహుతులను హోమం చేస్తాడు, పురీష్య స్త్వమగ్నే అని ఆరంభించి అనువాకం చివరి దాకా హోమం చేస్తాడు, స్విష్టకృత్ మొదలుకొని (సంస్రవప్రాశనము బ్రహ్మకు పూర్ణపాత్ర మొదలగునవి ఇచ్చి) ఆచార్యునకు పాలిచ్చే ఆవునిచ్చే వరకు చేస్తాడు. పిదప అగ్నిని హోమం చేయతగిన వానితో హోమం చేస్తాడు. దర్భస్తంభములందు హుతశేషమును ఉంచుతాడు బ్రహ్మయజ్ఞానం, పితావి రాజం అనే రెండు మంత్రాలతో సంసర్గవిధిని చేయాలి,అని.

మూ॥ **ద్వితీయాది వివాహకాలే** కాల ఉక్తః సంగ్రహే – ప్రమదామృతి వాసరాదితః పునరుద్వాహ విధిః వరస్యచ. విషమే పరివత్సరే శుభః యుగలేచాపి మృతి ప్రదోభవేత్. **తృతీయ వివాహో** నిషేధోమాత్స్యే – ఉద్వహేత్‌రతి సిద్ధ్యర్థం తృతీయాం న కదాచన. మోహాదజ్ఞానతో వాపియది గచ్ఛేత్తుమానుషీం, నశ్యత్యేవ, న సందేహోగర్గస్య వచనం యథా,ఇతి. సంగ్రహే–తృతీయాం యదిచో ద్వాహేత్తర్హి సావిధవాభవేత్, చతుర్థాది వివాహార్థం తృతీయేఽ

ర్కం సముద్వహేత్. తద్విధిస్తు - రవిశన్యోః హస్తేవా వరః సంకల్ప స్వస్తి వాచనం నాందీశ్రాద్ధం కృత్వా ఆచార్యం వృత్వా అకృష్ణే నేతి ఛాయాయుతం సూర్యమర్కే సంపూజ్య గుడౌదనం దత్వా వస్త్రేణ తంతు భిరావేష్ట్య - త్రిలోకవాసిన్ సప్తాశ్వ ఛాయయా సహితోరవే, తృతీయోద్వాహజం దోషం నివారయ సుఖం కురు. ఇతి సంప్రార్థ్య జలేనత్రిః సించేత్. మమ ప్రీతికరాయేయం మయా సృష్టాపురాతనీ, అర్కజా బ్రహ్మణా సృష్టా అస్మాకం ప్రతిరక్షతు. నమస్తే మంగళే దేవి నమః సవితు రాత్మజే, త్రాహిమాం కృపయాదేవి పత్నీత్వం, మే ఇహాగతా. అర్కత్వం బ్రహ్మణా సృష్టః సర్వప్రాణి హితాయచ, వృక్షాణా మాది భూతస్త్వం దేవానాం ప్రీతివర్ధనః, తృతీయోద్వాహజం పాపం మృత్యుంచాశు వినాశయ,ఇతి. తతః ఆచార్యః కశ్యపగోత్రాం ఆదిత్యస్య ప్రపౌత్రీం సవితుః పౌత్రీం అర్కస్య పుత్రీం అర్కకన్యాం అముక గోత్రాయ వరాయదాస్యే, ఇతి వాగ్దానంకృత్వా వరస్య మధుపర్కం కృత్వా అన్తః పటం ధృత్వా స్వస్తిన ఇతి సూక్తం జప్త్వా పూర్వవత్ కన్యాందత్వా అర్కకన్యాం ఇమాం ఇత్యూహేన, కన్యాదాన మంత్రముక్త్వా దక్షిణాందద్యాత్. తతోగాయత్ర్యావేష్టిత సూత్రేణ బృహత్సామేతి మంత్రేణ కంకణం బద్ధ్వార్కస్య చతుర్దిక్షు కుంభేషు విష్ణుం సంపూజ్యాగ్నిం ప్రతిష్ఠాప్య అఘారాంతే సంగోభిరితి, ఇదం బృహస్పతయే, నమమ. యస్మైత్వా కామకామాయే తృచాఽగ్నయే, నమమ. తతః వ్యస్త సమస్త వ్యాహృతిభిః ఆజ్యం హుత్వాచార్యాయ గోయుగందత్వా మయాకృత మిదం కర్మ స్థావరేషు జరాయుణా, అర్కాపత్యాని నోదేహి తత్సర్వం క్షంతుమర్హసి. ఇతినమేత్. ఇతిదిక్. ఇతి నిర్ణయసింధౌ వివాహః.

అను॥ ద్వితీయ మొదలగు వివాహముల యందు కాలము సంగ్రహంతో ఇట్లా చెప్పబడింది - ఆమె చనిపోయిన రోజు మొదలుకొని వరుడు రెండవ వివాహం చేసుకో వచ్చు. విషమ సంవత్సరాల్లో శుభము. సమవర్షమందైతే మరణాన్నిస్తుంది,అని. (పత్ని వియోగంలో మొదటి లేదా రెండవ సంవత్సరంలో వివాహం చేసుకోవచ్చు. కాని మాసం బేసిఐతే మంచిది అని గర్గాదులు. సంతానం లేక, భార్య మరణిస్తే ఆమె భర్త సమమాసంలో కాని సమ సంవత్సరంలోకాని వివాహమాడితే శుభము. సంతానం కలిగిన భార్య మరణిస్తే బ్రాహ్మణుడు తొలి సంవత్సరంలో వివాహ మాడరాదు, అశుభకారి అని). మూడవసారి పెళ్ళిని మాత్స్యమందు నిషేధించారు - రతి సిద్ధి కొరకు మూడవదాన్ని వివాహ మాడరాదు. మోహంవల్ల కాని అజ్ఞానం వల్ల కాని మనుష్య స్త్రీని పొందినట్లైతే అతడు నశిస్తాడు అనుమానం లేదు అని గర్గుని వచనము,అని. సంగ్రహమందిట్లా - మూడవదానిని వివాహమాడినట్లైతే ఆమె విధవ ఔతుంది. నాలుగవ మొదలుగా వివాహముల కొరకైతే మూడవ వివాహాన్ని జిల్లేడుతో వివాహమాడాలి,అని. దాని విధి ఇట్లా - ఆది, శనివారములలో హస్త నక్షత్ర మందు వరుడు సంకల్పము స్వస్తివాచనము నాందీ శ్రాద్ధము చేసి ఆచార్యుని ఏర్పరచి, అకృష్ణేన అనుమంత్రంతో ఛాయతో కూడిన సూర్యుని అర్కమందు (జిల్లేడు) పూజించి బెల్లపు అన్నము నివేదన ఇచ్చి వస్త్రంతో దారములతో దానిని చుట్టి, ముల్లోకము లందుండేవాడ ! ఏడు గుఱ్ఱములు కలవాడ (సప్తాశ్వ), ఛాయాదేవితో కూడినవాడ ! ఓరవి! మూడవ వివాహం వల్ల కల్గిన దోషాన్ని తొలగించు. సుఖాన్ని ప్రసాదించు, అని

ప్రార్థించి మూడుసార్లు నీటితో తడుపాలి. ఇది నాకు ప్రీతిని కల్గించేది పురాతనమైన దానినిగా దీనిని నేను నిశ్చయించాను. బ్రహ్మ అర్కజను సృష్టించాడు మమ్ములను రక్షించునీ ఓ మంగళప్రద ! దేవి. నమస్కారము ఓ సూర్యుని పుత్రీ నీకు నమస్కారము. ఓదేవి!ద యతో నన్ను రక్షించు నీవు నాకు భార్యగా ఇక్కడ వచ్చావు. ఓఅర్క ! నిన్ను బ్రహ్మ సృజించాడు. అన్ని ప్రాణుల క్షేమం కోసము. వృక్షములన్నింటిలో నీవు తొలిదానివి. దేవతలకు ఆనందాన్నిచ్చే దానివి (పెంచేది). మూడవ వివాహం వల్ల కలిగే పాపాన్ని. మృత్యువును కూడా త్వరగా తొలగించు,అని. పిదప ఆచార్యుడు, కశ్యప గోత్రురాలు ఆదిత్యుని ప్రపౌత్రి, సవితునిపౌత్రి, అర్కుని పుత్రి, అర్క అనుకన్యను ఈ గోత్రం కలిగిన వరునకు ఇస్తున్నాను,అని వాగ్దానము చేసి, వరునకు మధుపర్కము ఇచ్చి ఇద్దరి మధ్య (వధు,వరుల) తెరపట్టి, స్వస్తినో, అను సూక్తమును జపించి ముందు మాదిరిగా కన్యను ఇచ్చి అర్కకన్య ఐన ఈమెను అని ఊహతో కన్యాదాన మంత్రాన్ని చెప్పి దక్షిణను ఇవ్వాలి. పిదప, గాయత్రీ మంత్రంతో చుట్టబడిన దారంతో, బృహత్సామ అను మంత్రంతో కంకణం కట్టి అర్కమునకు నాల్గు దిక్కుల కుంభములలో విష్ణువును పూజించి అగ్నిని స్థాపించి ఆఘార అంతమందు (అగ్నిపై నెయ్యిని చిలకటం) సంగోభిః అనే మంత్రంతో, ఇది బృహస్పతికి నాకు కాదు అని అనాలి.యస్మైత్వా కామకామాయ అనే ఋక్కును చదివి ఇది అగ్నికి నాకు కాదు అని అనాలి. పిదప వ్యస్త సమస్త వ్యాహృతులతో (భూర్,భువ, స్వస్ వ్యస్తం. భూర్భువః స్వః స్వాహా సమస్తం) ఆజ్యమును హోమం చేసి, ఆచార్యునకు రెండు ఆవులను ఇవ్వాలి. ఇచ్చి స్థావరములలో (స్థావరజంగమ) జరాయువునైన నేను (యోనిజ) ఈపనిని చేశాను. అర్క నాకు సంతానాన్ని ఇవ్వు. అదంతా క్షమించు అని పలికి నమస్కరించాలి. అని ఇక చాలు ఇది నిర్ణయ సింధువు యందు వివాహ ప్రకరణం సమాప్తము.

**మూ॥ అథ ఆధానం.** రత్నమాలాయాం - ప్రాజాపత్యే పూషభే సద్విదైవే పుష్యే జ్యేష్ఠా స్వైందవే కృత్తికాసు, అగ్న్యాధానం హ్యుత్తరాణాం త్రయేఽపి చిత్రాదిత్యే కీర్తితం గర్గముఖ్యైః . **ఆశ్వలాయనః** - అగ్న్యాధేయం కృత్తికాసు రోహిణ్యాం మృగశిరసి ఫాల్గునీషు విశాఖయో రుత్తరయోః ప్రోష్ఠపదయోరే తేషాం కస్మింశ్చి ద్వసంతే పర్వణి బ్రాహ్మణ ఆదధీత. గ్రీష్మ వర్షా శరత్సు క్షత్రియ వైశ్యోప క్రుష్టాః యస్మిన్ కస్మింశ్చిదృతా వాదధీత. సోమేన యక్ష్యమాణో నర్తుం పృచ్ఛేన్న నక్షత్రం. సోమాధానే ఋత్వాద్యనాలోచనమార్తవరం. అథో ఖల్వాహుర్యదైవేనం శ్రద్ధోపనమేదథాదధీత సైవాస్యర్ధి రితి. (సోమేన యక్ష్యమాణోనర్తుం పృచ్ఛేన్న నక్షత్రం) తదేతదార్తస్యాతివేలం వా శ్రద్ధాయుక్తస్య భవతీతి బౌధాయనోక్తేరితి. మదనరత్నే వృద్ధగార్గ్యః - పుష్యాగ్నేయ త్ర్యుత్తరాదిత్య పౌష్ణ జ్యేష్ఠా చిత్రార్క ద్విదై వేందు భేషు, కుర్యుర్వహ్న్యాధాన మాద్యం వసంత గ్రీష్మ ఊష్మాన్తే ష్వేవవిప్రాది వర్ణాః. కాలాదర్శే - అగ్నిహోత్రం దర్శపూర్ణ మాసావప్యాగ్ర రాయణే, ఉపక్రమ్య యథాకాలం ఉపాసీరన్ ద్విజాతయః, సోమం చ పశు బంధం చ సర్వాశ్చ వికృతీరపి, సౌమ్యాయనే యథాకాలం విదధ్యుః గృహమేధినః. అత్ర విశేషః పూర్వముక్తః. **అగ్నిహోత్రకాల ఉక్తః** ఛందోగ పరిశిష్టే - ఉదితేఽనుదితే చైవ సమయాధ్యుషితే తథా,

సర్వథాపర్తతే యజ్ఞ ఇతీయం వైదికీ శ్రుతిః. ఏషాం స్వరూపం తత్రైవ - రాత్రేస్తు షోడశేభాగే గ్రహ నక్షత్ర భూషితే (కాలం త్వనుదితం జ్ఞాత్వా హోమం కుర్యాత్ విచక్షణః, తథా ప్రభాత సమయే నష్టే నక్షత్రమండలే) రవిర్ యావన్నదృశ్యేత సమయా ధ్యుషితం చతత్, రేఖామాత్రం ప్రదృశ్యేత రశ్మిభిశ్చ సమన్వితః ఉదితం తద్విజానీయాత్ తత్ర హోమం ప్రకల్పయేత్. ఆశ్వలాయనః - ఉపోదయే వ్యుషితే ఉదితేవా సాయం తు స ఏవ, అస్తమితే హోమ ఇతి. గౌణకాల మాహ స ఏవ - ప్రదోషాంతో హోమకాలః, సంగవాంతః ప్రాప్తః ఇతి. ఛందోగపరిశిష్టే - యావత్ సమ్యఙ్ న భాష్యంతే, నభ స్యృక్షాణి సర్వతః, న చ లోహితతామైతి తావత్సాయంతు హూయతే. ఔపాసనే౽ ప్యేవం, తస్యాగ్ని హోత్రేణ. ప్రాదుష్కరణ హోమకాలౌ వ్యాఖ్యాతౌ, ఇత్యాశ్వలాయనోక్తేః.

అను॥ ఇక ఆధానము. రత్నమాలయందిట్లా - రోహిణి, రేవతి, విశాఖ, పుష్యమి, జ్యేష్ఠ, మృగశిర కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, చిత్ర, హస్త ఈ నక్షత్రములందు, గర్గాది మునిముఖ్యులు అగ్న్యాధానము ప్రశస్తమన్నారు,అని. ఆశ్వలాయనుడిట్లా - కృత్తిక, రోహిణి, మృగశిర, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని, విశాఖ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పూర్వాభాద్ర (ప్రోష్ఠపద) ఈ నక్షత్రములలో ఏదైనా ఒక దానిలో, వసంత ఋతువులోని ఏదేని పర్వదిన మందు బ్రాహ్మణుడు అగ్న్యాధానము చేయాలి (పర్వం = పూర్ణిమ, శుద్ధ పాడ్యమి) గ్రీష్మ మందు, వర్ష ఋతువున, శరదృతువున క్షత్రియ వైశ్యులు, శూద్రుడు ఏదేని ఒకానొక ఋతువుయందు ఆధానం చేయాలి. సోమంతో యాగం చేసేవారు ఋతు, నక్షత్రములను చూడరాదు. (అడుగరాదు) సోమాధానమందు ఋతువు మొదలగునవి అడుగ (ఆలోచించ) రాదనటం రోగ్యగ్రస్తుని విషయకము. ఎప్పుడు ఈతనికి శ్రద్ధ కలుగుతుందో అప్పుడే ఆధానం చేయాలి. అతనికి అదే బుద్ధి అని (సోమంతో యజ్ఞం చేసేవాడు ఋతువును కాని, నక్షత్రమును కాని అడుగరాదు) ఇది ఆర్తునకు గాని అధిక శ్రద్ధ కలవానికి గాని చెందినది అని బౌధాయనోక్తి,అని. మదనరత్నమందు వృద్ధ గార్గ్యుడిట్లా - పుష్యమి, కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ధనిష్ఠ, రేవతి, జ్యేష్ఠ, చిత్ర, హస్త, విశాఖ, మృగశిర ఈ నక్షత్రములందు వసంత గ్రీష్మ వర్ష ఋతువులలో విప్రులు మొదలగు వర్ణముల వారు తొలి వహ్న్యాధానమును చేయాలి,అని. కాలాదర్శమందిట్లా - అగ్నిహోత్రము, దర్శ పూర్ణ మాసములు కూడా ఉత్తరాయణంలోనే చేయాలి. ఉత్తరాయణంలో ఆరంభించి బ్రాహ్మణులు కాలానుగుణముగా ఉపాసించాలి. సోమము, పశుబంధము, అన్ని యజ్ఞముల వికృతులను (మార్పు) కూడా గృహమేధులు. సౌమ్యాయనమందు (దక్షిణ) సమయాను గుణంగా ఆచరించాలి,అని. ఇక్కడ విశేషాన్ని ముందే చెప్పాము. ఛందోగ పరిశిష్టమందు అగ్నిహోత్ర కాలము చెప్పబడింది ఇట్లా - ఉదయమందు, ఉదయం కాకపోయినా, నక్షత్రాలు సూర్యుడు కన్పించని సమయమందైనా ఎల్లప్పుడూ యజ్ఞము ఉంటుంది. (చేయొచ్చు) అని ఇది వైదిక శ్రుతి;అని. వీటి స్వరూపాన్ని అక్కడే ఇట్లా - రాత్రి యొక్క పదహారవ భాగంలో గ్రహ నక్షత్రములు అలంకరించి ఉండగా, విచక్షణుడు కాలం అనుదితం అని గ్రహించి హోమం చేయాలి. అట్లాగే ప్రభాత సమయమందు నక్షత్ర మండలం నష్టమయ్యాక సూర్యుడు

కన్పించనంతవరకు దానిని **సమయాధ్యుషితమని** అన్నారు. కిరణములతో కూడి సూర్యుడు రేఖా మాత్రంగా కన్పించే కాలాన్ని **ఉదితం** అని అంటారు. అక్కడ హోమం చేయాలి,అని ఆశ్వలాయనుడిట్లా - ఉదయ సమీప మందు, ఉషః కాలమందు, సూర్యుడు ఉదయించాక, సాయంకాల మందైతే అదే సూర్యుడు అస్తమించాక హోమం చేయాలి,అని. (చేతికన్న పైకి, కొలత) సూర్యుడు ఉదయ పర్వతాన్ని విడిచిపోక ముందే హోమం చేయాలి అదే పుణ్య ఫలాన్నిచ్చేది. ఇతరమైంది కాదు ఇది ఉదయ హోమం. రక్తిమ తొలగనంతలో సాయం హోమం చేయాలి, అని కాత్యాయనుడు). గౌణ కాలాన్ని అతడే ఇట్లా చెప్పాడు - రాత్రి హోమము ప్రదోషాంతమందు చేయాలి. (రాత్రిపూర్వార్ధపు చతుర్థ భాగం ప్రదోషాంతం. సూర్యుడు అస్తమించాక, మూడు ముహూర్తముల కాలము ప్రదోషము). సంగవాంతమందు ప్రాతఃకాల హోమము,అని. (సూర్యోదయమయ్యాక ఆరునాడుల కాలము సంగవాంతము (నాడి=24 నిమిషాల కాలం) (సంగవం = ఆవులు దూడలతో కలిసి వచ్చే కాలం) అస్తమించాక హోమకాలం నవనాడులకాలం). ఛందోగ పరిశిష్ట మందిట్లా - ఆకాశంలో నక్షత్రాలు అంతటా చక్కగా కన్పించనంతవరకు ఎరుపుదనం పోనంతవరకు సాయంకాల హోమం చేయొచ్చు. ఔపాసన మందు కూడా ఇట్లాగే. అతనికి అగ్నిహోత్రంతోపాటు ప్రాదుష్కరణ హోమకాలములు వ్యాఖ్యానించబడ్డాయి, అని ఆశ్వలాయనోక్తి,అని. (ప్రాదుష్కరణమంటే అపరాహ్ణమందు గార్హపత్యము ప్రజ్వలింపచేసి, ఈ విధముగా ప్రాతఃకాలమున ఉషఃకాలమందు అని కూడా. సాయం హోమకాలము ప్రదోషాంతము, ఉదయం సంగవాంతము ఇవ్వే ఔతాయి. వేరుకావు ప్రాదుష్కరణ కాలం దాటితే వ్యాహృతులతో ఒక ఆజ్యాహుతి చేయాలి. గృహ్యాగ్నిని తాను, భార్య, కొడుకు, కూతురు, శిష్యుడు వీరిలో ఎవరైనా కాని రక్షణ చేయాలి)

**మూ॥ అథ ఆవసథ్యా ధానమ్.** పారస్కరః. ఆవసథ్యాధానమ్ దారకాలే దాయాద్యకాల ఏకేషాం,ఇతి. దాయాద్య కాలో విభాగకాలః. మదనరత్నే వ్యాసః - అగ్నిర్వైవాహికో, యేన నగృహీతః ప్రమాదినా, పితర్యుపరతే తేన గృహీతవ్యః ప్రయత్నతః. యోఽగృహీత్వా వివాహాగ్నిం గృహస్థ ఇతి మన్యతే. అన్నం తస్య న, భోక్తవ్యం వృథా పాకోహి సన్మృతః. జ్యేష్ఠ భ్రాతరి పితరివాసాగ్నౌ కనిష్ఠస్య పుత్రస్య వాగ్న్యభావేఽపి నదోషః. తదాహ తత్రైవ గార్గ్యః - పితృపాకోపజీవీవా భ్రాతృపాకోపజీవకః, జ్ఞానాధ్యయన నిష్ఠో వా న దుష్యేతాగ్నినా వినా. **గృహస్థస్యాపి అధ్యయన మాహా** సత్యవ్రతః - అనధీత్య ద్విజోవేదం స్నాత్వో ద్వాహ్య యథాతథా, అధీతే బ్రహ్మచర్యేణ సాంగవేదం గురోర్గృహే. ఇదంచా ధానం జ్యేష్ఠే అకృతాధానే న కార్యం.దారాగ్ని హోత్ర సంయోగం కురుతే యోఽగ్రజేస్థితే, పరివేత్తా స విజ్ఞేయః పరివిత్తిస్తు పూర్వజః, ఇతిమను, శాతాతపోక్తేః. స్మార్తేఽప్యేవం. సోదర్యే తిష్ఠతి జ్యేష్ఠే, నకుర్యాద్దార సంగ్రహం, ఆవసథ్యం తథా ధానం పతితస్తు తథా భవేత్, ఇతి తత్రైవ గార్గ్యోక్తేః. ఆజ్ఞాయాం త్వదోషమాహ సుమంతుః - జ్యేష్ఠో భ్రాతా యదా తిష్ఠేదా ధానం నైవ చాశ్రయేత్, అనుజ్ఞాతస్తు కుర్వీత శంఖస్య వచనం యథా. వృద్ధ వసిష్ఠః -

**అగ్రజస్తు యదా౽ నగ్నిః ఆదధ్యాదనుజః కథం, అగ్రజానుమతః కుర్యాత్ అగ్నిహోత్రం యథావిధి. హారీతః - సోదరాణాంతు సర్వేషాం పరివేత్తా కథం భవేత్, దారైస్తు పరి విద్యంతే నాగ్నిహోత్రేణ నేజ్యయా, అధికారిణో౽పి భ్రాతురనుజ్ఞయా కుర్యాదితి మదన పారిజాతః. వివాహస్తు అనుజ్ఞయాపి నేత్యర్థః. సోదరోక్తేర సోదరాణాం సాపత్న దత్తకాదీనాం నదోషః. తదాహ హేమాద్రౌ వసిష్ఠః - పితృవ్య పుత్రాన్ సాపత్నాన్ పరనారీ సుతాం స్తథా, దారాగ్ని హోత్ర సంయోగే న దోషః పరివేదనే. పరనారీసుతా = దత్తకాదయః. దేశాంతరేవిశేష మాహ సఏవ - అష్టాదశ ద్వాదశ వర్షాణి వా జ్యేష్ఠే భ్రాతరమని విష్టను ప్రతీక్షమాణః ప్రాయశ్చిత్తీ భవతి,ఇతి.**

అను॥ ఇక అవసథ్యా ధానము. (పంచాగ్నులు - దక్షిణ, గార్హపత్య, ఆహవనీయ, సభ్య, అవసథ్య అని). పారస్కరుడిట్లా - అవసథ్యా ధానము వివాహకాల మందు చేయాలి. కొందరి మతంలో దాయాద్య కాలమందు అని. దాయాద్యకాల మనగా విభాగ కాలము (ఆస్తి పంపకం). మదనరత్నమందు వ్యాసుడిట్లా - ప్రమాదం (పొరపాటు) మొదలగు కారణాల వల్ల వైవాహికాగ్నిని స్వీకరించనివారు తండ్రి మరణించాక ప్రయత్న పూర్వకముగా స్వీకరించాలి,అని. వివాహాగ్నిని గ్రహించకుండా తనను తాను గృహస్థునిగా భావించేవాని అన్నాన్ని తినరాదు. అతడు వృథా పాకి అని పిలవబడుతాడు. పెద్ద అన్నకు, తండ్రికి కాని అగ్ని ఉన్న పక్షంలో కనిష్ఠ పుత్రునకు అగ్నిలేకపోయినా దోషం లేదు. దానినే గార్గ్యుడు ఇట్లా అక్కడే చెప్పాడు - పితృపాకంతో జీవించేవాడు లేదా భ్రాతృపాకంతో జీవించేవాడు లేదా జ్ఞాన అధ్యయన నిష్ఠుడే కాని అగ్ని లేకపోతే దూషితుడు కాడు,అని. సత్యవ్రతుడు, గృహస్థునకు కూడా అధ్యయనాన్ని చెప్పాడు - ద్విజుడు వేదాన్ని చదవకుండానే స్నాతకుడై వివాహమాడి ఏదో రకంగా, బ్రహ్మచర్యంతో సాంగవేదమును గురువు గారి గృహమందు చదువుతాడు,అని. ఈ శ్రౌత ఆధానమును పెద్దవాడు ఆధానము చేయకపోతే, చేయరాదు. అగ్రజుడు ఉండగా దార, అగ్నిహోత్ర సంయోగమును చేసినవాడు పరివేత్తఅని పిలువబడు తాడు. పెద్దవానిని పరివిత్తి అని అంటారు, అని మనువు అని శాతా తపోక్తి. స్మార్త మందు కూడా (ఔపాసనాగ్ని) ఇట్లాగే. పెద్దన్న వివాహం కాకుండా ఉండగా వివాహం చిన్నవాడు చేసుకోరాదు అవసథ్యము (స్మార్త)ఆధానము కూడా తగదు. అట్లాగైతే పతితు డౌతాడు;అని అక్కడే గార్గ్యుని వచనం. ఆజ్ఞ ఇస్తే మాత్రం దోషం లేదని సుమంతుడన్నాడు ఇట్లా - పెద్దన్న ఉండగా చిన్నవాడు ఆధానం చేసుకోరాదు. అనుజ్ఞను తీసుకొంటే మాత్రం ఆధానం చేసుకోవచ్చు అని శంఖుడు అన్నాడు,అని. వృద్ధ వసిష్ఠుడిట్లా - అగ్రజుడు అగ్ని లేనివాడైతే అనుజుడు ఎట్లా అగ్న్యాధానం చేస్తాడు. అగ్రజుని అనుమతితో అగ్నిహోత్రమును శాస్త్ర ప్రకారము చేయవచ్చును,అని. హారీతుడిట్లా - సోదరులందరికి పరివేత్త ఎట్లా ఔతాడు. వివాహం వల్ల పరివేత్త ఔతాడు. అగ్నిహోత్రంతోకాని యజ్ఞంతోకాని పరివేత్తకాడు,అని. అధికారులు కూడా భ్రాతఅనుమతితో ఆధానం చేయాలి,అని మదన పారిజాతం చెప్తోంది. వివాహమైతే అనుజ్ఞతో కూడా కూడదు అని అర్థము. సోదర అని శబ్దం వాడటంవల్ల

సోదరులు (సహ, ఉదరులు)కానివారికి సాపత్న, దత్తకాదులకు దోషం లేదు దానినే హేమాద్రి యందు వసిష్ఠుడిట్లా - చిన్నాయన పుత్రులు, సాపత్న పుత్రులు, పరనారీ సుతులు వీరికి స్త్రీ అగ్నిహోత్ర సంయోగమందు పరివేత్త దోషం లేదు,అని. పరనారీ సుతులనగా దత్తకాదులు. దేశాంతరమందు విశేషాన్ని అతడే ఇట్లా చెప్పాడు - ఎనిమిది, పది, పన్నెండు సంవత్సరాలు కాని రానటువంటి పెద్దన్నను గూర్చి ఎదిరి చూడనివాడు ప్రాయశ్చిత్తానికి అర్హుడౌతాడు,అని.

**మూ॥ క్లీబాదావపి అదోషమాహ కాత్యాయనః - దేశాంతరస్థ క్లీ బైక వృషణాన సహోదరాన్, వేశ్యానిష్ఠాంశ్చ పతిత శూద్ర తుల్యాతి రోగిణః జడమూకాంధ బధిరకుబ్జా వామన ఖంజకాన్, అతి వృద్ధాన భార్యాంశ్చ కృషిసక్తా న్నృపస్య చ, ధనవృద్ధి ప్రసక్తాంశ్చ కామతోఽ కారిణస్తథా, కుటిలోన్మత్త చౌరాంశ్చ పరివిందం న దుష్యతి. ఆశార్కేఽపి - ఉన్మత్తః కిల్బిషీకుష్ఠీ పతితః క్లీబ ఏవ వా, రాజయక్ష్మామ యావీచ, నన్యాయః స్యాత్ ప్రతీక్షితుం. ఏవం జ్యేష్ఠే ఛిన్న హస్తా దావపి న పరివేతృత్వం. తదాహ త్రికాండ మండనః - దర్శేష్టిం పౌర్ణమాసేష్టిం సోమేజ్యామగ్ని సంగ్రహం, అగ్నిహోత్రం వివాహం చ ప్రయోగే ప్రథమే స్థితం, న కుర్యాజ్జనకే జ్యేష్ఠే సోదరే చాప్య కుర్వతి, క్షేత్ర జాదావనీ జానే విద్యమానేఽపి సోదరే, నాధికార విఘాతోఽస్తి భిన్నోదర్యేఽపి చౌరసే, పంగ్వంధమూక బధిర పతితోన్మాద దూషణే, సంన్యస్తే ఛిన్నహస్తాదౌ యద్వాషండాది దూషణే, జనకే సోదరే జ్యేష్ఠే కుర్యా దేవేతరః క్రియాం, ఇతి, ఆరోహతం దశజం శక్వరీర్మమ, ఇత్యా ధానే మంత్ర వర్ణాచ్చ. శక్వరీః = అంగులీః. తంత్ర రత్నేఽప్యుక్తం - అంగవైకల్యా త్పూర్వ మాహితాగ్ని త్వేఽధిక్రియేతైవ నిత్యేషు, ఆధానంతు న కుర్యాత్తస్య నైమిత్తికత్వాత్, ఇతి. ఏవం చతురంగులేఽపి. జ్యేష్ఠేఽనధికారాత్ కనిష్ఠస్య నదోషః షడంగుల కాణవికార్యాదేస్తు అస్త్యే వాధికార ఇతి కనిష్ఠస్య దోష ఏవ, ఏకాదశసు దశాంతర్గతేః. శరీర కార్శ్యం వా విప్రతిషిద్ధం,ఇతి. హిరణ్య కేశి సూత్రే కర్మాశక్తి హేతో రేవాంగ వైకల్యస్య నిషేధాత్. అత ఏవద్రాహ్యాయణ సూత్రే - యాజ్యశ్చ ప్రథమైః త్రిభిర్గుణైః, ఇతి. న్యూనాంగస్యాపి అధికార ఉక్తః. అపరార్కే ఉశనాః - పితా, పితా మహోయస్య అగ్రజోవాథ కస్యచిత్, తపోఽగ్ని హోత్ర మంత్రేషు న దోషః పరివేదనే. పితు రాజ్ఞాయామపి అదోష మాహ మదనరత్నే సుమంతుః - పిత్రాయస్యతునా ధానం కథం పుత్రస్తు కారయేత్. అగ్నిహోత్రేఽధికారోస్తి శంఖస్య వచనం యథా,ఇతి. నాధానం కృతమిత్యర్థః. ఏత దాజ్ఞాయా మేవేతి హేమాద్రిః. యత్తు - పితుః సత్యత్యనుజ్ఞానే నాథాతం నాదధీత కదాచన,ఇతి. తత్పత్యధికారేజ్ఞేయం.**

అను॥ క్లీబాదులందు కూడా దోషం లేదని కాత్యాయనుడిట్లా - దేశాంతరమందున్న నపుంసకులు, ఒకే వృషణం కలవారు, సహోదరులు కానివారు, వేశ్యానిష్ఠులు, పతితులు, శూద్రతుల్యులు, అత్యంత, రుగ్ణులు అత్యంత మూర్ఖులు, మూగ, గుడ్డి, చెవిటివారలు, గూని, పొట్టి, కుంటివారలు, అతివృద్ధులు, భార్యలేనివారలు (నైష్ఠిక బ్రహ్మచారి), రాజుగారి కృషి (వ్యవసాయం) యందాసక్తి గలవారు ధన వృద్ధి యందాసక్తి గలవారు, తన ఇష్టంతో వివాహ మాడనివారు, కుటిల ఉన్మత్త, చోరులు వీరిని పరివిత్తి దూషించదు,అని. ఆశార్క మందు కూడా - ఉన్మత్తుడు, పాపి, కుష్ఠరోగి, పతితుడు, క్లీబుడు, క్షయ, అజీర్ణరోగి

(అమ యావీ) వీరిని గూర్చి ఎదిరి చూడవలసిన పనిలేదు,అని. ఇట్లాగే జ్యేష్ఠుడు ఛిన్న హస్తుడు మొదలగునవి కలవాడైతే కూడా పరివేతృత్వ దోషంలేదు. దానినే త్రికాండమండను డిట్లా - దర్శేష్టి, పౌర్ణమాసేష్టి, సోమయాగం, అగ్నిసంగ్రహము, అగ్నిహోత్రము, వివాహము, వీని ప్రథమ ప్రయోగము జనకుడు ఉండగా, పెద్దన్న చేయకముందు చేయరాదు. తన స్వంతం (నిజ) కాని క్షేత్రజాది సోదరులు ఉన్నా భిన్నోదరులైన ఔరసులున్నా అధికార విఘాతం లేదు (క్షేత్రజ = భర్త, సంతానం కొరకు తన భార్య దగ్గరకు, తన బంధువును పంపి సంతతిని పొందుట. వాడు క్షేత్రజుడు. ఔరసుడు = తన స్వంత సంతానం). కుంటి, గుడ్డి, మూగ, చెవిటి, పతితుడు, ఉన్మాదుడు, సన్యస్తుడు, ఛిన్నహస్తాదులు, షండాదులు ఈ దోషములతో జనకుడు కాని జ్యేష్ఠ సోదరుడు కాని ఉంటే ఇతరుడు (అగ్న్యాధాన) క్రియను చేయాలి,అని. ఆరోహతం, దశజం శక్వరీః మమ, అని ఆధానమందు మంత్ర వర్ణముల వల్ల తెలుస్తోంది. శక్వరీః = వేళ్ళు (ఆరోహతం దశతం, శక్వరీర్మమ, ఋతేనాగ్న ఆయుషా వర్చసా సహ, జ్యోగ్జీవంత ఉత్తరాముత్తరాం సమాం, దర్శమహం పూర్ణమాసం యజ్ఞం యథాయజై. ఋత్వియవతీ స్థో అగ్నిరేతసౌ. గర్భం దధా థాం తేవా మహం దదే. తత్సత్యం యద్వీరం బిభృథః. వీరంజన యిష్యథః. తేమత్ప్రాతః ప్రజనిష్యేథే. తేమా ప్రజాతే ప్రజన యిష్యథః). (సోదరులు మూడు రకాలు - తల్లిఒకతే, తండ్రులు ఇద్దరు; ఒకేతల్లి సంతానం; ఒకతండ్రి తల్లులు వేరు వేరు ఔరసుడు; **క్షేత్రజుడు**, భిన్నోదరులు). తంత్ర రత్నంలో కూడా చెప్పబడింది - ఇతరుల అంగవైకల్యంవల్ల ఎవడు తొలుత ఆహితాగ్నిగా ఐయ్యాడో అతడే నిత్యకర్మల్లోనూ అధికారి. ఆతడు ఆధానం చేయరాదు. అది నైమిత్తికం కనుక,అని. ఈవిధంగా నాలుగు వేళ్ళు కలవాని యందును. పెద్దవాడికి అధికారం లేదు కనుక చిన్నవాడికి దోషం లేదు. ఆరువేళ్ళు కలవానికి, ఒంటికన్ను వానికి, చెవులు లేని వానికి అధికారం ఉండనే ఉంది కనుక కనిష్ఠునకు దోషము. ఏకాదశములో దశ అంతర్గతమైందికదా. శరీర కార్శ్యంవల్ల నిషేధించారు అని హిరణ్యకేశి సూత్రంలో చెప్పబడింది కర్మ చేయటానికి అశక్తుడౌతాడని ఎంచియే అంగవైకల్యాన్ని నిషేధించారు. అందువల్లనే ద్రాహ్యాయణ సూత్రమందిట్లా - మొదటి మూడు గుణములు కలవాడే యాజ్యుడు అని వ్యాఖ్యానించారు. న్యూనాంగునకు కూడా అధికారం చెప్పారు.(ఋషిః=బహుశ్రుతః. ఏషవై బ్రాహ్మణ ఋషిరార్షే యోత్రః శుశ్రువాన్ తై.బ్రా. ఋషేఅపత్యం ఆర్షేయః. అనూచానః (కల్పసూత్రజ్ఞాత) సాధువృత్తః వాగ్మీ అన్యూనాంగ=చతురంగుళాది;అనతిరిక్తాంగ = షడంగుళాది). అపరార్కమందు ఉశనుడిట్లా - తండ్రి, తండ్రి తండ్రి, పెద్దన్న ఉన్నట్లైతే వానికి తప, అగ్నిహోత్ర, మంత్రము లందు పరివేదనమందు దోషంలేదు,అని. తండ్రి ఆజ్ఞయందును, దోషం లేదని మదన రత్నంలో సుమంతు చెప్పాడు ఇట్లా - తండ్రికి ఆధానం లేకపోతే కొడుక్కు ఆధానం ఎట్లా ఉంటుంది. అగ్ని హోత్రమందు అధికారం ఉంటుంది. అని శంఖుని వచనము,అని. ఆధానము చేయలేదు అని అర్థము. ఇది ఆజ్ఞయందే

అని హేమాద్రి. తండ్రి అనుజ్ఞ ఉంటే ఒక్కొక్కప్పుడు ఆధానం చేయొద్దు, చదవొద్దు, అని ఏదన్నారో, అది అధికారం ఉంటే అని తెలుసుకోవాలి.

మూ॥ **అథశూద్ర సంస్కారాః** - యమః - శూద్రోఽప్యేవం విధః కార్యో వినా మంత్రేణ సంస్కృతః, నకేనచిత్ సమసృజచ్ఛందసాతం ప్రజాపతిః, ఛందసా=మంత్రేణ. వ్యాసోఽపి - గర్భాధానం, పుంసవనం సీమంతో జాతకర్మచ, నామక్రియా నిష్క్రమోఽన్నప్రాశనం వపనక్రియా, కర్ణవేధో వ్రతాదేశో వేదారంభక్రియావిధిః, కేశాంతః స్నానముద్వాహో వివాహాగ్ని పరిగ్రహః, త్రేతాగ్ని సంగ్రహశ్చైవ సంస్కారాః షోడశ స్మృతాః, ఇత్యుక్త్వాహ- నవైతాః కర్ణవేధాంతా మంత్ర వర్జం స్త్రియాః క్రియాః, వివాహోమంత్రతస్తస్యాః శూద్రస్యామంత్రతో దశ,ఇతి. మదనరత్నే హిరణ్య గర్భదానేతు - గర్భాధానం పుంసవనం సీమంతోన్నయనం తథా, కుర్యుః హిరణ్య గర్భస్య తతస్తేద్విజ పుంగవాః, ఇత్యుక్త్వా - జాతకర్మాదికాః కుర్యాత్క్రియా షోడశచాపరా, ఇత్యత్ర, స్త్రియా జాతకర్మ నామకరణ నిష్క్రమాన్న ప్రాశన చూడా వివాహాః షట్, శూద్రాణాం తుషడేతే పంచ మహాయజ్ఞాశ్చైత్యే కాదశ, ఇత్యుక్తం. రూప నారాయణ హరిహర భాష్య యోరప్యేవం. శార్ఙ్గ ధరస్తు - ద్విజానాం షోడశైవస్యుః శూద్రాణాం ద్వాదశైవతు, పంచైవ మిశ్రజాతీనాం సంస్కారాః కులధర్మతః. వేదవ్రతోపనయన మహానామ్నీ మహావ్రతం వినాద్వాదశ శూద్రాణాం సంస్కారాః నామ మాత్రతఃఇత్యాహ. అపరార్కస్తు - గర్భాధాన మృతౌ పుంసః, ఇత్యత్రాహ, ఏతచ్చాతుర్వర్ణ్యపరం, న ద్విజాతి మాత్రపరం. తథా సత్యుపనయనం విధాయ వాచ్యంస్యాత్,ఇతి. తేనతన్మతేఽష్టౌ భవంతి. బ్రాహ్మేతు - వివాహమాత్ర సంస్కారం శూద్రోఽపి లభతాం సదా ఇత్యుక్తం. అత్ర సద సచ్ఛూద్ర గోచరత్వేన, దేశభేదాత్ వ్యవస్థా. యత్తుమనుః - న శూద్రే పాతకం కించి న్న చ సంస్కార మర్హతి,ఇతి. తదర్థ మాహ మేధాతిథిః - యత్సామాన్యతో నిషిద్ధంస్తేయానృతాది న తదతిక్రమేఽస్య పాపం యథా ద్విజానాం. ఉపనయన రూపం సంస్కారం చ నార్హతి, ఇతి. తేచ తూష్ణీం కార్యాః. శూద్రో వర్ణశ్చతుర్థోఽపి వర్ణత్వాద్ధర్మ మర్హతి, వేదమంత్ర స్వధాస్వాహా వషట్కారాది భిర్వినా, ఇతి వ్యాసోక్తేః. అమంత్రస్యతు శూద్రస్య విప్రోమంత్రేణ గృహ్యతే, ఇతి మరీచ్యుక్తేశ్చ. ఇయం పరిభాషా సర్వార్థా. తేన శూద్ర ధర్మేషు విప్రేణ మంత్రః పఠనీయః, సోఽపి పౌరాణ ఏవేతి శూలపాణిః. ఏవంస్త్రీణా మపీతిదిక్.

అను॥ ఇక శూద్ర సంస్కారాలు. యముడిట్లా - శూద్రుడు కూడా ఈ రకముగా మంత్రం లేకుండా సంస్కారాన్ని పొంది కార్యములు చేయాలి. ప్రజాపతి ఆతనిని ఏ ఛందస్సుతోను సృష్టించలేదు,అని. ఛందస్సు అనగా మంత్రము. వ్యాసుడు కూడా - గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మ, నామక్రియ, నిష్క్రమణం (శిశువును నాల్గవ నెలలో ఇంటి బయటికి తీసుకుపోయే సంస్కారం) అన్నప్రాశనం, పుట్టు వెంట్రుకలు తీయటం, చెవులు కుట్టటం, ఉపనయనం, వేదారంభ క్రియావిధానం, చౌలము, (క్షౌరం) సమావర్తనము (స్నాతకుడు), వివాహము, వివాహాగ్ని స్వీకారము, త్రేతాగ్ని సంగ్రహము అని సంస్కారములు పదహారు. అని చెప్పిఇట్లన్నాడు - కర్ణవేధం వరకు గల తొమ్మిది క్రియలు స్త్రీకి మంత్రం లేకుండా చేయాలి. కేవల వివాహము ఆమెకు మంత్రంతో జరగాలి. శూద్రునకు మంత్రం లేకుండ పది సంస్కారాలు,అని. మదనరత్నమందు హిరణ్య

గర్భధానమందైతే ఇట్లా - గర్భాధానం, పుంసవనం, సీమంతోన్నయనం బ్రాహ్మణునకు ఆ బ్రాహ్మణులు ఆచరించాలి,అని పలికి జాతకర్మాదికమైన ఇతరమైన ఇతరక్రియలను చేయాలి, అనేచోట స్త్రీకి జాతకర్మ, నామకరణ, నిష్క్రమ, అన్నప్రాశన, చూడ, వివాహములు ఈ ఆరు, శూద్రునకైతే ఈ ఆరు పంచ మహా యజ్ఞాలు కూడా అని మొత్తం పదకొండు అని చెప్పారు. రూప నారాయణ, హరిహర భాష్యము లందు కూడా ఇట్లాగే చెప్పారు. శార్ఙ్గ ధరుడైతే - ద్విజులకు పదహారు, శూద్రునకు పన్నెండు సంస్కారాలు, మిశ్రజాతులకైతే కులధర్మాన్ననుసరించి ఐదే సంస్కారాలు, వేదవ్రత, ఉపనయన, మహానామ్నీ, మహావ్రతం వీటిని వదలి, పన్నెండు సంస్కారాలు శూద్రునకు నామ మాత్రంగా చేయాలి, అని చెప్పాడు. అపరార్కుడైతే - పురుషునకు ఋతుకాలమందు గర్భాధానము, అనే చోట చెప్పాడు, ఇది చతుర్వర్ణముల వారికి చెందింది, ద్విజాతికి మాత్రమే చెందింది కాదు. అట్లాగైతే ఉపనయనం చేసి అని వాచ్యంగా ఉండేది,అని. అందువల్ల ఆతని మతమందు ఎనిమిదే సంస్కారాలు. బ్రాహ్మమందైతే - వివాహ మాత్ర సంస్కారమైతే శూద్రుడు కూడా ఎల్లప్పుడు పొందని అని చెప్పారు. ఇక్కడ సత్ శూద్ర, అసత్ శూద్రులనీ, దేశ భేదముననుసరించి వ్యవస్థా. మనువేదైతే అన్నాడో - శూద్రునిలో పాతకం ఏమీ లేదు, సంస్కారానికి అర్హుడు కాదు,అని. దాని అర్థాన్ని మేధాతిథి ఇట్లా చెప్పాడు - సామాన్యంగా దేన్నైతే నిషేధించారో దొంగతనము, అబద్ధము మొదలగునవి వాటిని అతిక్రమిస్తే ఈతనికి దోషం లేదు, బ్రాహ్మణులకు అట్లా కాదు, ఉపనయన రూప సంస్కారానికి గూడా అర్హుడు కాదు,అని. వాటిని మౌనంగా చేయాలి. శూద్రుని వర్ణము చతుర్థమైనా వర్ణము వాడైనందువల్ల ధర్మమునకు అర్హుడౌతాడు. వేదమంత్ర, స్వధా, స్వాహా, వషట్ కారాదులు లేకుండా, అని వ్యాసోక్తి. శూద్రునకు మంత్రం లేకుండా విప్రునకు మంత్రంతో సంస్కారము, అని మరీచోక్తి గూడా. ఈ పరిభాష సర్వార్థకమైనది. అందువల్ల శూద్రధర్మములందు విప్రుడు మంత్రం చదవాలి, అది కూడా పురాణ సంబంధమైందే అని శూలపాణి. ఈ విధంగా స్త్రీలకు కూడా,అని. ఇది ఇక చాలు.

మూ॥ **అథక్షుద్రకాలాః.** తత్ర జలాశయస్య వరాహః-హస్తే చాంబుపపౌష్ణ కేశవ **మఘామిత్రోత్తరా రోహిణీ** దేవేజ్యేషు చ శుక్ర సౌమ్యశశభృత్ వాగీశవారాంశకే, రిక్తాం ఛిద్ర **తిథింవిహాయ వృషభే** నక్రేకులీరే ఘటే మీనే కూపతదాగ కర్మమునయః శంసంతిశుద్ధేஉష్టమే. **హస్తో మృగానురాధా** పుష్య ధనిష్ఠోత్తరాణి రోహిణ్యాః, శతభిషగిత్యారంభే కూపానాం శస్యతే భగణః **హేమాద్రౌభవిష్యే** - తస్మిన్ సలిలసంపూర్ణే కార్తికేతు విశేషతః, మునయః కేచిదిచ్ఛంతి వ్యతీతేచోత్త రాయణే, నకాల నియమస్తత్ర సలిలంతత్ర కారణం. దీపికాపి - మార్తండేందూదు శుద్ధౌమురజి దశయనే మాఘ శట్కస్య శుక్లే, మూలాషాఢోత్తరాశ్వి శ్రవణ గురుకరే పౌష్ణ శాక్రాజ చాంద్రే, మైత్రే బ్రాహ్మే చ పూర్ణా మదనరవి తిథౌ సద్వితీయా తృతీయే కార్యాతోయ ప్రతిష్ఠాజ్ఞ గురుసితదినే కాలశుద్ధౌ సులగ్నే. **వారాహః** - ఆగ్నేయే యది కోణే గ్రామస్య గృహస్య (పురస్య) వా భవతి కూపః, నిత్యం స కరోతి భయం దాహం చ స మానసంప్రాయః. నైర్ ఋత్యేబాలభయం వనితా

క్షయం చ వాయవ్యే, దిక్ త్రయమే తత్ త్యక్త్వా శేషాస్తు శుభావహాః కూపాః. **వాస్తుశాస్త్రే** - **భూతిం** పుష్టిం పుత్రహానిం పురంధ్రీనాశం మృత్యుం సంపదం శత్రుబాధాం, కించిత్ సౌఖ్యం శంభు కోణాది కుర్యాత్ కూపోమధ్యేగేహ మర్థక్షయం చ. **ఉత్సర్గ విధిశ్చోక్తో** బహ్వృచ పరిశిష్టే - **అథాతో** వాపీకూపతడాగ యజ్ఞం వ్యాఖ్యాస్యామః. పుణ్యే హన్యుదక సమీపేఽగ్నిం సమాధాయ వారుణం చరుంశ్రపయిత్వాజ్య భాగాంతే **ఆజ్యాహుతీః జుహుయాత్** - సముద్ర జ్యేష్ఠా, ఇతి ప్రత్యృచం, తతో హవిషాఽష్టౌ తత్వాయామితి పంచ, త్వంనో అగ్నే, ఇతిద్వే, ఇమం మే వరుణ ఇతి చ స్విష్టకృతం నవమం మార్జనాంతే ధేమంతారయేత్. అవతీర్యమాణామను మంత్రయేత్ - ఇదం సలిలం పవిత్రం కురుష్వశుద్ధాః **పూతా అమృతాః** సంతు నిత్యం మాం తారయంతీం కురు **తీర్థాభిషేకం తరతే తీర్యతే చ, ఇతి. పుచ్ఛాగ్రాన్వారబ్ధ ఉత్తీర్య ఆపో అస్మాన్మాతరః శుంధయంతు,ఇతి. అపరాజితాయాం దిశ్యుత్థాపయేత్, సూయవసాద్భగవతీ,ఇతి. హింకృతంచేత్ - హింకృణ్వతీ, ఇతి. అలంకృతాం విప్రాయ దద్యాదితరాం వాశక్త్యాదక్షిణాం. తత ఉత్సృజేద్దేవ పితృమనుష్యాః ప్రీయంతామితి. తతఃబ్రాహ్మణాన్ భోజయిత్వా స్వస్త్యయనం వాచయీత ఇతి. విస్తరస్తు మాత్స్యోక్తోఽ స్మత్కృతే జలాశయో త్సర్గ విధౌజ్ఞేయః. కూపాదేరుత్సర్గాకరణేదోష ఉక్తో భవిష్యే** - సదాజలం పవిత్రం స్యాద పవిత్రమసంస్కృతం, కుశాగ్రేణాపి రాజేంద్ర న స్ప్రష్టవ్యమ సంస్కృతం, తథా - **వాపీకూప తడాగాదౌయజ్జలం స్యాదసంస్కృతం, అపేయం తద్భవేత్సర్వం పీత్వాచాంద్రా యణం చరేత్.**

అను॥ ఇక క్షుద్రకాలములు (అల్ప, చెడు). అందు జలాశయమునకు చెందిన విషయం వరాహుడిట్లా - హస్త, శతభిషం, రేవతి, శ్రవణం, మఘ అనురాధ, మూడు ఉత్తరలు, రోహిణి, పుష్యమి నక్షత్రాలలో శుక్ర, బుధ, సోమ, గురువారములు ఈ దినములలో రిక్త తిథిని (చవితి, నవమి, చతుర్దశి) దోష భూయిష్ఠ మైనతిథిని వదలి (తప్పు=ఛిద్రం), వృషభ, మకర,కర్క, కుంభ, మీన లగ్నములందు, అష్టమ స్థాన శుద్ధియందు కూపతటాకముల కర్మ చేయటం ప్రశస్తమని మునులన్నారు. హస్త, మృగశిర, అనురాధ, పుష్యమి, ధనిష్ఠ, మూడు ఉత్తరానక్షత్రాలు, రోహిణి, శతభిషం ఈ నక్షత్రములు కూప ఆరంభమునకు ప్రశస్తమైనవి,అని. హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా - జలంతో నిండిన కూప ప్రతిష్ఠను విశేషించి కార్తిక మాసంలో చేయాలి. కొందరు మునులు ఉత్తరాయణం గడిచాక ఇష్టపడుతారు, అని. అక్కడ నీళ్ళు ప్రధానము, కాలనియమం కాదు (లేదు). దీపిక కూడా - సూర్యచంద్రులు నక్షత్రములు శుభంగా ఉండగా విష్ణువు మేల్కొని ఉండగా (ఉత్తరాయణ) మాఘం నుండి ఆరు మాసాలలో శుక్లపక్షమందు, మూల, పూర్వాషాఢ, మూడు ఉత్తరలు, అశ్విని, శ్రవణం, పుష్యమి, హస్త, రేవతి, జ్యేష్ఠ, పూర్వాభాద్ర, మృగశిర, అనురాధ, రోహిణి, పూర్ణిమ, త్రయోదశితో కూడిన (శుక్లం) ద్వాదశియందు, ద్వితీయతో కూడిన తృతీయ యందు బుధ గురు సోమవారములందు కాలశుద్ధియందు, సులగ్నమందు తోయ ప్రతిష్ఠ చేయాలి,అని. వరాహుడిట్లా - (గ్రామమునకు, గృహమునకు, (పురమునకు) ఆగ్నేయ కోణమందు బావి ఒకవేళ ఉంటే, అది ప్రతిరోజు భయాన్ని కల్గిస్తుంది. మనస్సులో తరుచుగా

దాహం కల్గిస్తుంది (అగ్నిని). నైఋతి దిక్కు యందైతే పిల్లలకు భయము, వాయవ్య మందైతే స్త్రీల నాశము, ఈ మూడు దిక్కులను వదలి మిగిలిన దిక్కులలోని బావులు శుభకరములు,అని. వాస్తుశాస్త్రమందిట్లా – ఈశాన్య మందలి బావి ఐశ్వర్యకారి, తూర్పు దిక్కులోది పుష్టికారి, ఆగ్నేయమందలిది పుత్రనాశమును కల్గించేది, దక్షిణదిగ్కులోది స్త్రీనాశకారి, నిర్ఋతిలోది మృత్యుదాయి, పశ్చిమ మందలిది సంపత్తినిచ్చేది, వాయవ్య మందలిది శత్రుబాధ కల్గించేది, ఉత్తరదిక్కులోది కొద్ది సౌఖ్యాన్నిచ్చేది, ఇంటి మధ్యలో బావి ఉంటే అది ఇంటిని ధనాన్ని నశింపచేసేది,అని. బహ్వ్ చ పరిశిష్టమందు ఉత్సర్గ విధి ఇట్లా చెప్పబడింది – ఇక ఇక్కడి నుండి వాపికూప తటాగ యజ్ఞమును వ్యాఖ్యా నిస్తున్నాము. పుణ్యదిన మందు నీటిదరిలో అగ్నిని సమకూర్చి వరుణుని గూర్చి చరువును వండి ఆజ్య భాగాంతమందు ఆజ్యాహుతులను హోమం చేయాలి, సముద్ర జ్యేష్ఠా అనే ఋక్కుతో. ఆ పిదప హవిస్సుతో ఎనిమిది సార్లు తత్వాయామి అను ఋక్కుతో ఐదుసార్లు, త్వం నోఅగ్నే అనుమంత్రంతో రెండు సార్లు, ఇమంమే వరుణ అను దానితో కూడా ఒకసారి ఆహుతి ఇవ్వాలి. స్విష్టకృతమైనది తొమ్మిదవది. మార్జనము పిదప ధేనువును దింపాలి. దిగుతున్న ధేనువును ఇట్లా ప్రార్థించాలి – ఈ నీటిని పవిత్రం చేయి. ఇవి ప్రతిరోజు శుద్ధమై పవిత్రమై అమృతంగా ఉండని. నన్ను దాటింపచేసేవిగా చేయి. తీర్థాభిషేకము తాను తరిస్తూ ఇతరులను తరింపచేస్తుంది,అని. పుచ్ఛాగ్రమును స్పృశించి, ఆపః అస్మాన్ మాతరః శుంధయంతు అని పఠిస్తూ నీటిలో దిగిపైకి రావాలి. ఈశాన్య దిక్కు నుండి గోవును పైకి తీయాలి, సూయవసాత్ భగవతీ, అనుమంత్రంతో. అప్పుడది హింకారం చేస్తే, హింకృణ్వతీ అనే మంత్రం పఠించాలి అలంకరించిన ధానిని లేదా ఇతరమైన దానినైనా బ్రాహ్మణునకు దానమివ్వాలి. శక్తికొలది దక్షిణ ఇవ్వాలి. ఆ పిదప, దేవతలు, పితరులు, మనుష్యులు ఆనందించనీ అని ఆ గోవును విడువాలి. ఆ పిదప బ్రాహ్మణులకు భోజనం పెట్టి స్వస్త్యయ నము పలికించాలి,అని. ఇంకా వివరాంగా ఐతే మత్స్యపురాణంలో చెప్పిన దానిని, నారచన ఐన జలాశయోత్సర్గ విధి యందు తెలుసు కోవచ్చును. కూపాదులకు ఉత్సర్గము చేయని పక్షంలో దోషము అని భవిష్యపురాణంలో చెప్పబడింది ఇట్లా – జలమెప్పుడూ పవిత్రమైంది. సంస్కరింపబడని నీరు అపవిత్రమైనది. అసంస్కృతమైన నీరును దర్భఅగ్ర భాగంతో కూడ తాకరాదు, ఓ రాజేంద్ర అని. అట్లాగే – వాపికూప తటాకము మొదలగు వానియందు అసంస్కృతమైన జలముంటే అది అంతా తాగకూడనిది. ఒకవేళ అట్టి నీటిని తాగితే చాంద్రాయణమాచరించాలి,అని.

**మూ॥ అథవృక్షారోపణం.** చండేశ్వరః – ఆదిత్య చాంద్ర పితృతిష్య విశాఖ పౌష్ణ మూలోత్తరా త్రయ తురంగమ వారుణాశ్చ, ఏతేషుతారక గణేషు హితం నరాణాం వృక్షాది రోపణ మిహోప దిశంతి ధీరాః. **అథమూర్తి ప్రతిష్ఠా** – వసిష్ఠః – హస్తత్రయేమిత్ర హరిత్రయే చ పౌష్ణద్వయాదిత్యసురేజ్యభేషు, త్రిస్రోత్తరా ధాతృశశాంక భేషు సర్వామరస్థాపన ముత్తమంస్యాత్.

**మాత్స్యే - చైత్రే వా ఫాల్గునే వాపి జ్యేష్ఠేవా మాధవే తథా, మాఘేవా సర్వదేవానాం ప్రతిష్ఠా శుభదాభవేత్. నారదస్తు చైత్రం నిషేధయతి - వినైత్రేష్వేవ మాసేషు మాఘాదిషు చ పంచసు ఇతి. తేనాత్ర వికల్పః. అత్రమాఘమాసో విష్ణు ప్రతిష్ఠా వ్యతిరిక్త విషయః, మాఘేకర్తు ర్వినాశాయ ఫాల్గునే శుభదా భవేత్,ఇతి. విష్ణుధర్మోక్తేరితి హేమాద్రిః. మత్స్యపురాణే - దృఢాధనకరీస్వీతా తథా ప్రతిపది స్మృతా, ద్వితీయాయాం ధనోపేతా తృతీయాయాం ధనప్రదా; చతుర్థ్యాం నాశమాప్నోతి యమస్యస్యాత్సు ఖావహా, వినాయకస్య దేవస్య తథా తత్ర హితప్రదా, పంచమ్యాం శ్రీయుతా కర్తుర్వరదా చ తథా భవేత్, షష్ట్యాం లక్ష్మీయుతానిత్యం సప్తమ్యాం రోగనాశినీ, అష్టమ్యాం ధ్యాన బహులా నవమ్యాం చ వినశ్యతి, భద్రకాళ్యాఃకృతా తత్రకర్తుర్భవతి తుష్టయే. ధర్మవృద్ధికరీజ్ఞేయా దశమ్యాంతు తథా తిథౌ, ఏకాదశ్యాం తథా యుక్తా ద్వాదశ్యాం సర్వకామదా, త్రయోదశ్యాం తథాజ్ఞేయా చతుర్దశ్యాం వినశ్యతి, కృష్ణపక్షే పంచదశ్యాం కర్తుః క్షయకరీ భవేత్, పంచదశ్యాం తథా శుక్లే సర్వకామకరీ భవేత్.**

అను॥ ఇక వృక్షారోపణము. చండేశ్వరుడిట్లా - పునర్వసు, మృగశిర, మఖపుష్యమి, విశాఖ,రేవతి, మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అశ్విని, శతభిషం ఈ నక్షత్రములందు నరులు వృక్షములు మొదలగు వానిని నాటటం మంచిదని విద్వాంసులు ఇక్కడ ఉపదేశిస్తారు, అని. ఇక మూర్తి ప్రతిష్ఠా - వసిష్ఠుడిట్లా - హస్త చిత్త స్వాతి అనురాధ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి, అశ్విని, పునర్వసు, మూల, పుష్యమి, ఉత్తరాత్రయం, రోహిణి, మృగశిర నక్షత్రములందు అందరు, దేవతల స్థాపనము ఉత్తమమైనది,అని. మాత్స్యమందిట్లా - చైత్రమందుకాని ఫాల్గునమందుకాని జ్యేష్ఠమందు కాని వైశాఖమందు కాని మాఘమందు కాని అందరు దేవతల ప్రతిష్ఠ శుభమునిస్తుంది,అని. నారదుడు మాత్రం చైత్రమును నిషేధి స్తున్నాడు. చైత్రమాసం కాకుండా, మాఘాది పంచమాసములలో,అని. అందువల్ల ఇక్కడ వికల్పము ఇక్కడ మాఘమాసము విష్ణువు కన్న ఇతరమైన దేవతల ప్రతిష్ఠ విషయకము. మాఘమందు ప్రతిష్ఠకర్తకు నాశాన్ని కల్గించేది, ఫాల్గునమందు ప్రతిష్ఠ శుభంనిచ్చేది,అని విష్ణుధర్మోక్తి అని హేమాద్రి అన్నాడు. మాత్స్యపురాణమందిట్లా - ప్రతిపదయందు ప్రతిష్ఠ చేసిన దృఢమై, ధనము కూర్చునదై, వృద్ధి నందుతుంది. ద్వితీయయందైన ధనము కూర్చునది, తృతీయ యందైన ధనమునిచ్చేది ఔతుంది. చతుర్థియందైతే నశిస్తుంది, యమునకు సుఖమును కల్గిస్తుంది. అదే రోజు వినాయక ప్రతిష్ఠ ఐతే అది హితమును కల్గిస్తుంది. పంచమి యందు ప్రతిష్ఠ కర్తకు శ్రీని సమకూరుస్తుంది, కోరిన వరముల నిస్తుంది కూడా. షష్ఠి యందైతే ప్రతిష్ఠ ఎప్పుడూ లక్ష్మిని కలిగి ఉంటుంది. సప్తమి యందు రోగముల నశింప చేసేది. అష్టమియందు అధిక ధాన్యమునిస్తుంది, నవమి యందైతే నశిస్తుంది. నవమి యందు భద్రకాళి ప్రతిష్ఠ చేస్తే అది కర్తకు ఆనందాన్ని కల్గిస్తుంది. దశమి తిథి యందు దేవత ప్రతిష్ఠ చేస్తే అది ధర్మమును వృద్ధి పరుస్తుంది. ఏకాదశిన అన్ని కోరికల నిస్తుంది. ఏకాదశితో కూడిన ద్వాదశి యందైతే కూడా అన్ని కోరికలనిస్తుంది. త్రయోదశి

యందును అట్లాగే, చతుర్దశి యందు నాశమౌతుంది. అమా యందైతే కర్తకు నాశనాన్ని కల్గిస్తుంది. పూర్ణిమ యందైతే అన్ని కోరికలనిచ్చేది ఔతుంది,అని.

మూ॥ ఆషాఢేద్వే తథా మూల ముత్తరాత్రయమేవ చ జ్యేష్ఠా శ్రవణ రోహిణ్యః పూర్వాభాద్రపదః తథా, హస్తోఽశ్వినీ రేవతీ చ పుష్యో మృగశిర స్తథా, అనురాధా, తథాస్వాతీ ప్రతిష్ఠాసు ప్రశస్యతే. శ్రీపతిః – రోహిణ్యుత్తర పౌష్ణ వైష్ణవకరాదిత్యాశ్వినీ వాసవా, సూరాధైన్దవ జీవభేషు గదితం విష్ణోః ప్రతిష్ఠాపనం. పుష్యశ్రుత్యభిజిత్సురేశ్వరకయోర్విత్తాధి పస్కందయోర్మైత్రే తిగ్మరుచేః కరే నిర్ ఋతిభే దుర్గాదికానాం శుభం. గణ పరివృఢరక్షో యక్ష భూతాసురాణాం ప్రమథఫణి సరస్వత్యాదికానాం చపౌష్ణే, శ్రవసి సుగత నామ్నో వాసవే లోకపానాం నిగది తమఖిలానాం స్థాపనంచ స్థిరేషు. తేజస్వినీ క్షేమ కృదాగ్ని దాహ విధాయినో స్యాత్ ధనదా దృఢా చ, ఆనంద కృత్కల్ప వినాశినీ చ సూర్యాది వారేషు భవేత్ప్రతిష్ఠా. మాధవీయే వైఖానసః – మాతృభైరవ వారాహ నరసింహత్రి విక్రమాః, మహిషాసుర హంత్ర్యశ్చ స్థాప్యా వైదక్షిణాయనే, వైశబ్దోఽప్యర్థే. లింగప్రతిష్ఠాయాం విశేషో హేమాద్రౌ లక్షణ సముచ్చయే – ఉత్తరాశాగతే భానౌ లింగ స్థాపనముత్తమం, దక్షిణేత్వయనే పూజ్యం త్రివర్గార్థే భయావహం, స్వగృహే స్థాపనం నేష్టం తస్మాద్వై దక్షిణాయనే, స్థాపనంతు ప్రకర్తవ్యం శిశిరాదా వృతుత్రయే. ప్రావృషి స్థాపితం లింగం భవేద్వరద యోగదం, హేమంతే జ్ఞానదం చైవ శిశిరే సర్వభూతిదం, లక్ష్మీప్రదం వసంతే చ గ్రీష్మే చ జయ శాంతిదం, యతీనాం సర్వకాలే చ లింగస్యారోపణం మతం. రత్నావల్యాం – మాఘ ఫాల్గున వైశాఖ జ్యేష్ఠాషాఢేషు పంచసు, మాసేషు శుక్లపక్షేషు లింగస్థాపన ముత్తమం. విష్ణోరప్యాహ తత్రైవ వైఖానసః – మార్గశీర్షాది మాసౌ ద్వౌ నిందితౌ బ్రహ్మణాపురా, మాసేషు ఫాల్గునః శ్రేష్ఠ శ్చైత్రో వైశాఖ ఏవ – చ. వృషే వాప్యాశ్వయుజ్మాసే శ్రావణే మాసివా భవేత్. బౌధాయన సూత్రే విష్ణు ప్రతిష్ఠాముపక్రమ్య – ద్వాదశ్యాం శ్రోణాయాం వా యానిచాన్యాని పుణ్య నక్షత్రాణి,ఇతి. కృత్తికాది విశాఖాంతేష్విత్యర్థః.

అను॥ రెండు ఆషాఢములు (పూర్వ, ఉత్తర), మూల, మూడు ఉత్తరలు, జ్యేష్ఠ, శ్రవణం, రోహిణి, పూర్వాభాద్ర, హస్త, అశ్విని, రేవతి, పుష్యమి, మృగశిర, అనురాధ, స్వాతి ఈ నక్షత్రములన్నీ ప్రతిష్ఠలందు ఉత్తమమైనవి. (అనిమాత్యం). శ్రీపతి ఇట్లా – రోహిణి, ఉత్తర, రేవతి, శ్రవణం, హస్త, పునర్వసు, అశ్విని, ధనిష్ఠ, అనురాధ, మృగశిర, పుష్యమి ఈ నక్షత్రములందు విష్ణు ప్రతిష్ఠ చేయాలి అని చెప్పబడింది. పుష్యమి, శ్రవణం, అభిజిత్, ఈ నక్షత్రములందు ఇంద్రునకు, బ్రహ్మకు, కుబేరునకు, కుమార స్వామికి అనురాధ నక్షత్ర మందు సూర్యునకు హస్త నక్షత్రమందు మూల నక్షత్రమందు దుర్గ మొదలగు వారి ప్రతిష్ఠ శుభ ప్రదమైనది. రేవతి నక్షత్రమందు, ప్రమథగణములతో కూడిన గణేశాది దేవతలు, యక్ష, భూత, అసురులు, ప్రమథులు, నాగులు, సరస్వతి మొదలగు వారి స్థాపన శుభకర మైంది. సుగతుని (బుద్ధుని) స్థాపన శ్రవణా నక్షత్రమందు, లోకపాలుల స్థాపన ధనిష్ఠ నక్షత్ర మందు స్థిరలగ్నంలో సమస్త దేవతల స్థాపన ఉత్తమమైనది. ఆదివారం ప్రతిష్ఠ జరిగితే అది తేజస్సు నిస్తుంది, సోమవారమైతే క్షేమం కలుగజేస్తుంది, మంగళవారమైతే

అగ్ని దాహం కలుగజేస్తుంది, బుధవారమైతే ధనాన్ని కూరుస్తుంది, గురువారమైతే దృఢంగా ఉంటుంది, శుక్రవారమైతే ఆనందాన్ని కల్గిస్తుంది, శనివారమైతే సామర్థ్యాన్ని నశింప చేస్తుంది. మాధవీయమందు వైఖానసుడిట్లా – మాత, భైరవుడు, వారాహ, నరసింహ, త్రివిక్రములు, మహిషాసుర హంత్రి వీరి ప్రతిష్ఠను దక్షిణాయనంలో చేయాలి. ఇక్కడ వై అనే శబ్దానికి కూడా అని అర్థము. లింగ ప్రతిష్ఠ యందు విశేషాన్ని హేమాద్రి యందు లక్షణ సముచ్చయ వాక్యమిట్లా ఉంది – సూర్యుడు ఉత్తరాయణ గతుడైనాక లింగస్థాపన ఉత్తమము. దక్షిణాయనంలో స్థాపించబడ్డ లింగము మూడున్నర సంవత్సరాలలో భయాన్ని కల్గిస్తుంది (సంవత్సరంనర దాకా). అందువల్ల దక్షిణాయనంలో స్వగృహంలో లింగస్థాపన ఇష్టమైనది కాదు. శిశిరాది మూడు ఋతువులలో లింగస్థాపన చేయాలి. వర్షాకాలమందు స్థాపింప బడ్డ లింగము వరములనిచ్చేది సంపదనిచ్చేది ఔతుంది. హేమంత మందలిది జ్ఞానము నిచ్చేది, శిశిరమందు స్థాపితమైంది అన్ని ఐశ్వర్యముల నిచ్చేది ఔతుంది. వసంత మందలిది లక్ష్మినిస్తుంది, గ్రీష్మ మందలిది జయము శాంతిని ఇస్తుంది. యతులైతే సర్వకాలములందు, లింగస్థాపన చేయవచ్చును. రత్నావలి యందిట్లా – మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢములందు ఈ ఐదు మాసముల శుక్లపక్షములందు లింగస్థాపన ఉత్తమమైనది,అని. అక్కడే వైఖానసుడు విష్ణువునకు గూడా ఇట్లా చెప్పాడు – మార్గశీర్షం మొదలుగా రెండు మాసములు పూర్వం బ్రహ్మతో నిందింపబడ్డాయి. మాసములందు ఫాల్గుణ చైత్ర వైశాఖ ములు శ్రేష్ఠమైనవి. జ్యేష్ఠమందు కాని ఆశ్వయుజ మాసమందు కాని శ్రావణ మాసమందు కాని చేయవచ్చును,అని. బౌధాయన సూత్రమందు విష్ణు ప్రతిష్ఠను ఆరంభించి ఇట్లా చెప్పారు – ద్వాదశి యందు శ్రవణ నక్షత్రమందు కాని ఇతరమైన పుణ్య నక్షత్రములందుకాని, అని కృత్తిక మొదలు విశాఖ వరకు గల నక్షత్రములలో అని అర్థము.

**మూ॥ సర్వదేవేషు మాసవిశేషో** హేమాద్రౌ విష్ణుధర్మే – మాఘే కర్తుర్వినాశాయ **ఫాల్గునే శుభదా భవేత్. లోకానంద కరీచైత్రే వైశాఖే వరసంయుతా, ఆజ్ఞాయుతా సదాజ్యేష్ఠే ఆషాఢే ధర్మ వృద్ధిదా, శ్రావణేధన హీనాస్యాత్ ప్రోష్ఠపాదే వినశ్యతి. ఆశ్వినే నాశమాప్నోతి వహ్నినాకార్తికేతథా, సౌమ్యే సౌభాగ్యమతులం పౌషేపుష్టి రనుత్తమా, దోషాన్వితాధి మాసేస్యాత్ కర్తురాత్మన ఏవ చ, ఇతి. అత్ర శ్రావణా శ్వినయోర్నిషేధో మార్గశీర్ష విధిశ్చ విష్ణు వ్యతిరిక్త విషయః, పూర్వోక్త వచనాదితి హేమాద్రిః. మాఘ శ్రావణ భాద్రపద నిషేధః శివ వ్యతిరిక్త విషయః, తత్ర తస్యోక్తేః. దేవీస్థాపనే తత్రైవ విశేషో దేవీపురాణే – దేవ్యా మాఘేఽశ్వినే మాసే ఉత్తమా, సర్వకామదా. తథా – న తిథిర్నచ నక్షత్రం నోపవాసోఽత్రకారణం, సర్వకాలం ప్రకర్తవ్యం కృష్ణపక్షే విశేషతః. అన్యశ్చాత్ర విచారో హేమాద్రౌ జ్ఞేయః. నారదః – హంత్యర్థహీనా కర్తారం మంత్రహీనాతు ఋత్విజం, స్త్రియం లక్షణ హీనాతు న ప్రతిష్ఠా సమోరిపుః. అత్ర అధికారిణ ఉక్తాః కృత్యకల్పతరౌ దేవీపురాణే – వర్ణాశ్రమ విభేదేన దేవాః స్థాప్యాస్తు నాన్యథా. బ్రహ్మాతు బ్రాహ్మణైః స్థాప్యో గాయత్రీ సహితః ప్రభుః. చతుర్వర్ణైః తథావిష్ణుః ప్రతిష్ఠాప్యః సుఖార్థిభిః. భైరవోఽ పి చతుర్వర్ణైరం త్యజానాం తథా మతః. మాతరః సర్వలోకైస్తు స్థాప్యాః పూజ్యాః సురోత్తమాః.**

లింగం గృహీయతిర్వాపి సంస్థాప్యతు యజేత్సదా. శివసర్వస్వే భవిష్యే – యస్తు పూజయతేలింగం దేవాదిం మాం జగత్పతిం, బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రో వా మత్పరాయణః. తస్యప్రీతః ప్రదాస్యామి శుభాల్లోకానను త్తమాన్.

అను॥ దేవతలందరి విషయంలోనూ మాస విశేషము గూర్చి హేమాద్రియందు విష్ణు ధర్మోక్తి ఇట్లా – మాఘ మాసమైతే కర్తృనాశకము, ఫాల్గునము శుభము నిచ్చేది. చైత్రమాసంలో ప్రతిష్ఠ లోకానందకారకము. వైశాఖము వరప్రసాదిని. జ్యేష్ఠము ఎల్లప్పుడు జ్ఞానాన్ని కల్గించేది. ఆషాఢము ధర్మమును వృద్ధి పొందించేది. శ్రావణము ధనము లేకుండా చేస్తుంది. భాద్రపదము నాశకము. ఆశ్వీయుజము నాశకారి, కార్తికమందు వహ్నివల్ల నాశము. మార్గశీర్షమందు లెక్కలేనంత సౌభాగ్యం కలుగుతుంది. పుష్యమందు గొప్పనైన పుష్టి లభిస్తుంది. అధికమాసమైతే అదికర్తకు తనకు దోషాన్ని కలిగిస్తుంది,అని. ఇక్కడ శ్రావణ, ఆశ్వీయుజములకు నిషేధము, మార్గశీర్షమాసమునకు విధి ఇదంతా విష్ణుదేవతకన్న ఇతరమైన దేవత ప్రతిష్ఠకు చెందినది, ముందు చెప్పిన వచనాన్ననుసరించి,అని హేమాద్రి. మాఘ, శ్రావణ, భాద్రపదల నిషేధము శివునకన్న ఇతరమైన దేవతల ప్రతిష్ఠ విషయకము. అక్కడ ఆ విషయాన్ని చెప్పారు కనుక. దేవీ స్థాపన యందు అక్కడే విశేషాన్ని దేవీపురాణ మందిట్లా చెప్పారు – దేవీ ప్రతిష్ఠ మాఘమాసం, ఆశ్విన మాసములలో ఉత్తమము, అన్ని కోరికల తీరుస్తుంది,అని. అట్లాగే తిథిగాని, నక్షత్రంకాని, ఉపవాసంకాని ఇక్కడ కారణం కాదు అన్ని కాలములలో చేయవచ్చును, విశేషించి కృష్ణపక్షంలో.ఇక్కడ ఇంకేదైనా తెలుసు కోవాల్సి ఉంటే హేమాద్రి యందు చూచి తెలుసుకోవాలి. నారదుడిట్లా – ధనహీనమైతే కర్త నశిస్తాడు, మంత్రహీనమైతే ఋత్విజుడు నశిస్తాడు. లక్షణ హీనమైతే స్త్రీ నాశకమౌతుంది. కనుక ప్రతిష్ఠతో సమానమైన శత్రువు లేదు. ఇక్కడ, అధికారులను గూర్చి కృత్యకల్పతరువు యందు దేవీపురాణోక్తి ఇట్లా ఉంది – వర్ణాశ్రమ విభేదాన్ననుసరించి దేవతలను స్థాపించాలి, మరో రకంగా కాదు. బ్రాహ్మలు బ్రహ్మను స్థాపించాలి. ఆతనితోపాటు గాయత్రి కూడా ఉండాలి. నాలుగు వర్ణములవారు, సుఖము పొందే కొరకు విష్ణువును స్థాపించాలి. నాలుగు వర్ణముల వారు అట్లాగే అంత్యజులు భైరవుని స్థాపించాలి. మాతలను, సురోత్తములైనవారిని, అన్నిలోకములవారు (అందరు) స్థాపించాలి, పూజించాలి గృహస్థుకాని, సన్యాసికాని లింగమును స్థాపించి ఎల్లప్పుడు పూజించాలి, అని. శివసర్వస్వ మందు భవిష్యోక్తి ఇట్లా – జగత్పతియైన దేవతల కాదియైన లింగరూపియైన నన్ను పూజించిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులకు, నాయందే ఆసక్తి గలవారికి, సంతసించి ఉత్తమమైన శుభకరమైన లోకములను వారికి కల్గిస్తాను,అని.

మూ॥ తిథితత్వేస్కాందే – శూద్రః కర్మాణి యోనిత్యం స్వీయాని కురుతేప్రియే, తస్యాహ మర్చాం గృహ్ణామి చంద్రఖండ విభూషితే. బ్రహ్మచారీ గృహస్థోవా, వానప్రస్థశ్చ సువ్రతే, ఏవందినే దినే దేవం పూజయే దంబికాపతిం. సన్యాసీ దేవదేవేశం ప్రణవేనైవ పూజయేత్ నమోంతేన శివేనైవ స్త్రీణాం పూజావిధీయతే. ఏతచ్చపురాణ ప్రసిద్ధ జీర్ణలింగపూజా విషయం. యాణితు

**త్రిస్థలీ సేతౌ** నారదీయే –యఃశూద్రేణార్చితం లింగం విష్ణుంవా ప్రణమేన్నరః, నతస్య నిష్కృతిర్ దృష్టా ప్రాయశ్చిత్తాయు తైరపి. నమేద్యః శూద్ర సంస్పృష్టం లింగం వా హరిమేవవా, ససర్వయాతనా భోగీ యా వదాచంద్రతారకం. పాఖండ పూజితంలింగం నత్వాపాఖండతాం వ్రజేత్, ఆభీర పూజితం లింగం నత్వా నరకమశ్నుతే, యోషిద్భిః పూజితం లింగం విష్ణుం వాపినమేత్తుయః, సకోటికుల సంయుక్త మాకల్పం రౌరవం వసేత్, ఇత్యాదీని, తాని, నూతన స్థాపిత లింగాది విషయాణి. యదా ప్రతిష్ఠితం లింగం మంత్ర విద్భిః యథావిధి, తదా ప్రభృతి శూద్రశ్చ యోషిద్వాపి న సంస్పృశేత్, ఇతి తత్రైవోక్తేః. **ప్రతిష్ఠాయాంతు** శూద్రాదీనాం నాధికారః. స్త్రీణాం అనుపనీతానాం శూద్రాణాం చ నరేశ్వర, స్థాపనే నాధికారోఽస్తి విష్ణోర్వాశంకరస్యవా. యఃశూద్ర సంస్కృతం లింగం విష్ణుం వాపినమేన్నరః, ఇహైవాత్యంత దుఃఖాని పశ్యత్యా ముష్మికేకిము. శూద్రో వాను పనీతో వాస్త్రియోవా పతితోఽపివా, కేశవం వాశివం వాపిస్పృష్ట్వా నరకమశ్నుతే, ఇతి బృహన్నారదీయ స్కాందోక్తేరితి త్రిస్థలీసేతౌ పితామహచరణాః. చతుర్ణ్ణేరితి పూర్వోక్త వచనాత్ విష్ణ్వాది ప్రతిష్ఠాయాం శూద్రస్య వికల్పఇతి తు యుక్తం పశ్యామః.

అను॥ తిథితత్త్వమందు స్కాందోక్తి ఇట్లా – ఓప్రియ! ఏ శూద్రుడు తన నిత్యకర్మను ఆచరిస్తాడో, ఓ చంద్రఖండ భూషితురాల! అతని అర్చనను నేను గ్రహిస్తాను,అని. బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు ఎవరైనా కాని వారు ఈ విధముగా ప్రతిరోజు దేవుని, అంబికాపతిని పూజించాలి. సన్యాసి దేవదేవేశుని ప్రణవముతోనే పూజించాలి. స్త్రీలు నమః చివర గల శివ శబ్దంతో పూజించాలి (శివాయనమః). ఇది పురాణములలో ప్రసిద్ధమైన జీర్ణ లింగ పూజా విషయము. త్రిస్థలీ సేతువు యందు నారదీయ వచనాలు ఏవున్నాయో ఇట్లా – శూద్రుడు అర్చించిన లింగాన్ని, విష్ణురూపాన్ని కాని, నమస్కరించిన నరుడు పదివేల ప్రాయశ్చిత్తములను చేసుకున్నా వానికి నిష్కృతి లేదు. శూద్రుడు స్పృశించిన లింగమును కాని హరిని కాని నమస్కరించినవాడు, సూర్యచంద్రులున్నంతకాలము సర్వయాతనలను అనుభవిస్తాడు. పాఖండుడు పూజించిన లింగానికి నమస్కరిస్తే పాఖండుడౌతాడు. ఆభీరులు పూజించిన లింగమునకు నమస్కరించిన, నరకమునకు పోతాడు. ఆడవారు పూజించిన లింగమును కాని విష్ణువును కాని నమస్కరించిన నరుడు కోట్ల సమూహములతో కూడిన నరకము నందు ఆకల్పాంతము ఉంటాడు అని, ఇవి మొదలుగా ఉన్న మాటలన్నీ నూతనముగా స్థాపించిన లింగము మొదలగు వాని విషయకములు. మంత్రము లెరిగిన వారు శాస్త్ర ప్రకారము లింగాన్ని ప్రతిష్ఠించాక, నాటి నుండి శూద్రుడు కాని స్త్రీ కాని లింగాన్ని తాకరాదు, అని అక్కడే చెప్పారు. ప్రతిష్ఠ యందు మాత్రము శూద్రాదులకు అధికారము లేదు. స్త్రీలకు, ఉపనయనం కాని వారికి, శూద్రులకు, ఓనరేశ్వర! విష్ణువును కాని శంకరునికాని స్థాపించుటలో అధికారము లేదు. శూద్రుడు సంస్కరించిన లింగాన్ని కాని విష్ణువును కాని నమస్కరించిన నరుడు ఇక్కడే మిక్కిలి దుఃఖములను చవిచూస్తాడు. ఆముష్మికంలో చెప్పేదేముందు. శూద్రుడు కాని అనుపనీతుడుకాని స్త్రీకాని పతితుడు కాని వీరెవరైనా కేశవునిగాని శివునిగాని స్పృశిస్తే నరకాన్ని పొందుతారు,అని బృహన్నారదీయంలో

స్కాందోక్తి అని త్రిస్థలీసేతువు యందు మాతాతగారు చెప్పారు. నాలుగు వర్ణముల వారు అని ముందు చెప్పిన దానిని బట్టి విష్ణువు మొదలగు దేవతల ప్రతిష్ఠ యందు శూద్రునకు అధికారము వికల్పము (ఉండవచ్చు, ఉండకపోవచ్చు) అనే దానినైతే తగినదని మేము భావిస్తాము.

మూ॥ **తత్రైవ గౌతమః** - **శివార్చనం సదాప్యేవం శుచిః కుర్యాత్ ఉదఙ్ముఖః** వాచస్పతి ధృతం (మతం) - ప్రాక్పశ్చిమోదగాస్యస్తు ప్రాతః సాయంనిశాసుచ, ఇతి ప్రయోగ **పారిజాతే. గృహ్యాపరిశిష్టే** - ప్రతిమాః ప్రాఙ్ముఖీః ఉదఙ్ముఖోయజేత అన్యత్ర ప్రాఙ్ముఖః ఏతచ్చ స్థిర ప్రతిమా విషయం. అన్యత్ర చలార్చాసు. అథప్రతిమాః భార్గవార్చన దీపికాయాం భవిష్యే - సౌవర్ణీ రాజతీతామ్రీ మృన్మయీ చతథా భవేత్, పాషాణ ధాతు యుక్తా చ రీతికాంస్య మయా తథా (రీతిః = పిత్తలం) శుద్ధదారుమయీవాపి దేవతార్చా ప్రశస్యతే. **అంగుష్ఠపర్వా** దారభ్య వితస్తిం యావ దేవతు, గృహేషు ప్రతిమా కార్యానాధికా శస్యతేబుధైః. పంచరాత్రేతు - మృద్దారులాక్షా గోమేద మధూచ్ఛిష్టమయీనతు, ఇతి నిషేధ ఉక్తః. **భాగవతే** - శైలీ, దారుమయీ, లౌహీ, లేప్యా, లేఖ్యా చ సైకతీ, మనోమయీ, మణిమయీ ప్రతిమాష్ట విధాస్మృతా. కాష్ఠం మధూకస్యైవ. తత్ర కాష్ఠేషు మధుకమానీయ చ వసుంధరే, కృత్వాతత్ప్రతిమాం చైవ ప్రతిష్ఠా విధినార్చయేత్, ఇతివారాహోక్తేః. **దేవీపురాణే**-సప్తాంగులం సమారభ్య యావచ్చ ద్వాదశాంగులం, గృహేష్వర్చా సమాఖ్యాతా ప్రాసాదేచాధికా శుభా. **తిథితత్వేకాలికాపురాణే** - ప్రతిమాయాః కపోలౌద్వౌ స్పృష్ట్వా దక్షిణ పాణినా, ప్రాణ ప్రతిష్ఠాం కుర్వీత, తస్య దేవస్య వాహరేః. **అన్యేషా** మపి దేవానాం ప్రతిమాసు చ పార్థివ, ప్రాణ ప్రతిష్ఠా కర్తవ్యా తస్యాందేవత్వసిద్ధయే. వాసుదేవస్య బీజేన తద్విష్ణో రిత్యనేనవా, తదైవ హృదయేంగుష్ఠం దత్వాశశ్వచ్చ మంత్రవిత్. ఏభిర్మంత్రైః ప్రతిష్ఠాంతు హృదయేఽపి సమాచరేత్. అస్యై ప్రాణాః ప్రతిష్ఠంతు అస్యై ప్రాణాః క్షరంతు చ, అస్యై దేవత్వమర్చాయై మా మహేతి చ కశ్చన. **హయశీర్షపంచరాత్రే** - **అర్చకస్య తపోయోగాత్ అర్చనస్యాతి శాయనాత్, అభిరూప్యాచ్చ బింబానాం దేవః సాన్నిధ్యమృచ్ఛతి.**

అను॥ అక్కడే గౌతముడిట్లా - శివార్చనను ఎల్లప్పుడు శుచియై ఉత్తరముఖుడై ఆచరించాలి,అని. వాచస్పతి మతమిట్లా - ఉదయం పూట తూర్పుముఖం కలవాడై సాయం కాలము పశ్చిమముఖం కలవాడై, రాత్రి ఉత్తరముఖం కలవాడై పూజించాలి, అని ప్రయోగ పారిజాతమందు కలదు. గృహ్యాపరిశిష్ట మందిట్లా - విగ్రహాలు తూర్పుముఖముగా ఉంటే ఉత్తరంవైపు ముఖం కలవాడై అర్చించాలి. లేకపోతే (ఇతరత్ర) తూర్పుముఖము కలవాడై అర్చించాలి,అని. ఇది స్థిరమైన విగ్రహ విషయకము; చలప్రతిమలకన్న ఇతరమైనచోట. ఇక ప్రతిమల గూర్చి భార్గవార్చన దీపిక యందు భవిష్యోక్తి ఇట్లా - బంగారముది, వెండిది, రాగిది, మట్టిది, రాయిది, గైరికాదిధాతువులది, ఇత్తడిది, కంచుది. స్వచ్ఛమైన కర్రతో చేసినది వీనిలో ఏదైనా దేవవిగ్రహము (పూజకు) ప్రశస్తమైనది. బొటనవేలు కణువు అంత పరిమాణము మొదలు పన్నెండు అంగుళముల వరకు ఇంటి యందలి విగ్రహములు

ఉండవచ్చును ఇంతకన్న పెద్దవి ఉత్తమము కాదని పెద్దలన్నారు. పాంచ రాత్రమందైతేనో ఇట్లా - మట్టిది, చెక్కది, లత్తుకది, గోమేదమను రత్నముతో చేసినది, తుమ్మెదల జిగురు వీనితో విగ్రహము చేయరాదని నిషేధము చెప్పబడింది. భాగవతమందిట్లా - రాయిది, చెక్కది, లోహముది, పూతది, చిత్రితమైనది, ఇసుకది, మానసికమైనది, మణులతో చేసినది అని విగ్రహము ఎనిమిది విధములు అని చెప్పారు. కట్టెది అనగా ఇప్ప కట్టెది. అక్కడ కట్టెలలో ఇప్పకట్టెను తెచ్చి, ఓభూదేవి! దానితో ప్రతిమచేసి, ప్రతిష్ఠావిధితో పూజించాలి,అని వారాహపురాణోక్తి. దేవీపురాణమందిట్లా - ఏడు అంగుళములు మొదలు పన్నెండంగుళ ముల వరకు గృహములందు పూజా విగ్రహము ఉండాలని చెప్పారు. ప్రాసాదములందు ఇంకా పెద్ద విగ్రహము శుభమైనది,అని. తిథి తత్వమందు కాలికాపురాణోక్తి ఇట్లా - ప్రతిమ యొక్క చెంపలు రెంటిని కుడిచేతితో స్పృశించి ఆ దేవుని లేదా హరి యొక్క ప్రాణ ప్రతిష్ఠను చేయాలి, అని. ఓపార్థివ ! ఇతర దేవతల ప్రతిమలందును, వానిలో దేవత్వ సిద్ధి కొరకు ప్రాణ ప్రతిష్ఠను ఆచరించాలి వాసుదేవుని యొక్క బీజాక్షరములతోకాని "తద్విష్ణోః" అనే ఋక్కులతో కాని. అట్లాగే హృదయమందు నిరంతరము అంగుష్ఠము నుంచి మంత్రవేత్త, ఈ మంత్రములతో హృదయమందు కూడా ప్రతిష్ఠను ఆచరించాలి. ఈ మూర్తియందు ప్రాణములు ప్రతిష్ఠితము కాని, ఈ మూర్తియందు ప్రాణములు సంచరించనీ, దీనిలో పూజకొరకు దేవత్వం ఏర్పడని. దీనితో, ఎవరైనా దీనిని పూజించని అని. హయశీర్ష పంచరాత్రమందిట్లా - అర్చకుని తపశ్శక్తివల్ల, పూజల యొక్క ఆధిక్యం వల్ల, బింబముల సౌందర్యమువల్ల,దేవుడు (దేవత) సాన్నిధ్యాన్ని పొందుతారు (అనుభవిస్తారు), అని.

మూ॥ **ప్రయోగ పారిజాతే** వ్యాసః - ప్రతిమా పట్టయంత్రాణాం నిత్యం స్నానం న **కారయేత్,** కారయేత్పర్వ దివసే యదావా మలధారణం. **లింగే విశేష స్థితి తత్వే భవిష్యే** - **మృత్స్న గోశకృత్ పిష్టతామ్ర కాంస్యమయం తథా, కృత్వాలింగం సకృత్ పూజ్య వసేత్ కల్పాయుతం దివి.వార్క్షం విత్తప్రదం లింగం స్ఫాటికం సర్వకామదం, కృత్వాపూజయవిప్రేంద్ర లప్స్యసే వాంఛితం ఫలం. తత్రైవ కాలకౌముద్యాం స్కాందే - అక్షాదల్ప పరీమాణం నలింగం కుత్రచిన్నరః, కుర్వీతాం గుష్ఠతో హ్రస్వం న కదాచిత్సమారభేత్. అక్షో అశీతిర్గుంజాః.** గుంజాః పంచాద్యమోషకః. **తేషోడ శాక్షః కర్షో అస్త్రీ; ఇత్య** మరకో**శాత్. ప్రయోగ పారిజాతే** క్రియాసారే - నవాష్ట సప్తాంగులికం **లింగం** శ్రేష్ఠ **మిహోచ్యతే, షట్** పంచక చతుర్మానం మధ్యమంత్రివిధం స్మృతం త్రిద్వ్యేకాంగుల **మానంయత్** త్రివిధం **తత్**కనీయసం,ఏవం నవ విధం ప్రోక్తం చరలింగం యథాక్రమం. **అథపంచ సూత్రీ** నిర్ణయః - గౌతమీతంత్రే - లింగమస్తక విస్తారో లింగోచ్ఛ్రాయ సమోమతః, పరిధిస్తత్ త్రిగుణితః తద్వత్ పీఠం వ్యవస్థితం. ప్రణాళికా తథైవ స్యాత్ పంచసూత్ర వినిర్ణయః. అత్రేదం తత్వం. లింగమస్తకవిస్తారం లింగోచ్ఛతా సమంకృత్వాతత్ త్రిగుణసూత్ర వేష్టనార్హలింగ స్థౌల్యం కృత్వా తత్సమం వృత్తం చతురస్రం వా పీఠ విస్తార మథశ్చోర్ధ్వం చ కుర్యాత్. పీఠోచ్ఛతాతు

లింగోచ్ఛ్రితాతో ద్విగుణా. పీఠమధ్యే లింగాత్ ద్విగుణ స్థూలం పీఠోచ్ఛ్రితా తృతీయాంశేన కంఠం కృత్వాతస్యోర్ధ్వ మధశ్చ సమంవ ప్రద్వయం త్రయం వా కృత్వా లింగ విస్తార షష్ఠాంశేన పీఠోపరి బాహ్యమేఖలాం కృత్వా తదంతః సంలగ్నం తత్సమంఖాతం చ కృత్వా పీఠాద్బహిః లింగ సమదీర్ఘాం, పీఠార్ధదీర్ఘాం వా మూలే ధైర్ఘ్య సమవిస్తారాం తృతీయాంశేన మధ్యే ఖాతాం పీఠవత్సమేఖలాం ప్రణాలికాం కుర్యాదితి. అత్రమూలం సిద్ధాంతశేఖరే శైవాగమే చ జ్ఞేయం.

అను॥ ప్రయోగ పారిజాతమందు వ్యాసుడిట్లా - ప్రతిమలు, పట్టు వస్త్రంపై రాసిన యంత్రములకు రోజు స్నానం చేయించరాదు. పర్వదివస మందుకాని లేదా ఎప్పుడైనా మాలిన్యము మొదలగునవి ఉంటే చేయించాలి,అని. లింగమందు విశేషము గ్రూర్చి తిథి తత్త్వమందు భవిష్యోక్తి ఇట్లా - మట్టి, భస్మము, ఆవుపేడ, పిండి, రాగి, కంచు వీనిలో దేనితోనైనా లింగం చేయించి ఒకసారి పూజించిన, దేవలోకమందు పదివేల కల్పములు నివసింపవచ్చును,అని. కట్టెతో చేసిన లింగము డబ్బును సమకూర్చేది. స్ఫటికలింగము అన్ని కోర్కెల నిచ్చేది. ఓ విప్రశ్రేష్ఠ ! అట్లా చేసి పూజించు. నీఇష్టమైన కోరికను పొందుతావు. అక్కడే కాలకౌముది యందు స్కాందోక్తి ఇట్లా - నరుడు ఎక్కడైనా అక్షముకన్నా అల్ప పరిమాణముకల లింగాన్ని చేయరాదు. అంగుష్ఠము కన్నా చిన్నదైన లింగమును ఎప్పుడూ మొదలు పెట్టరాదు. అక్షమనగా ఎనుబది గుంజల ఎత్తు ఐదు గుంజలు ఒక మాసం. పదహారు మాషములు ఒక అక్షము అదే కర్షము. అని అమర కోశము. ప్రయోగ పారిజాత మందు క్రియాసారోక్తి ఇట్లా - తొమ్మిది, ఎనిమిది, ఏడు, అంగుళముల లింగము శ్రేష్ఠమని ఇక్కడ చెప్పారు. ఆరు, ఐదు, నాలుగు అంగుళములది మధ్య రకము మూడు రకాలు. మూడు, రెండు, ఒక అంగుళముల పొడవు గలవి. ఈ మూడు రకాలు అవి కనిష్ఠమైనవి. ఈ విధముగా చరలింగము క్రమానుసారము తొమ్మిది విధాలని అన్నారు. ఇక పంచ సూత్రీ నిర్ణయము. గౌతమీ తంత్ర మందిట్లా - లింగము యొక్క తల భాగము విస్తీర్ణము లింగము ఎత్తుతో సమంగా ఉండాలి. పరిధి దానికి మూడింతలుండాలి (గుండ్రని తనము). అట్లాగే పీఠము కూడా ఉండాలి. ప్రణాళిక (మోరి) కూడా అట్లాగే ఉండాలని పంచ సూత్రీ నిర్ణయము. ఇక్కడ అసలు విషయమిది. లింగముయొక్క తల విస్తీర్ణాన్ని లింగము ఎత్తుతో సమానంగా చేసి దానికి మూడింతలు సూత్రము చుట్టటానికి తగిన విధముగా లింగ స్థౌల్యమును చేసి దానికి సమానంగా గుండ్రముగా గాని, నాలుగుమూలలుగా గాని పీఠ విస్తారాన్ని క్రింద, మీద చేయాలి. పీఠము యొక్క ఎత్తైతే లింగము ఎత్తు కన్న రెట్టింపు ఉండాలి పీఠమధ్యమందు లింగముకన్న రెట్టింపులావు, పీఠముయొక్క ఎత్తులోని మూడవ భాగమంత కంఠము చేసి, దానికి పైన క్రింద సమంగా రెండుగాని మూడుగాని తీరములు చేసి, లింగవిస్తారముయొక్క ఆరవభాగమంత పీఠముపై బాహ్యమేఖలను చేసి దానిలోపల, సంలగ్నమైన, దానితో సమానమైన ఖాతమునుచేసి (పుష్కరిణి), పీఠమునకు బయట లింగమునకు సమానమైన పొడవు లేదా పీఠములో సగభాగమంత పొడుమైన, మూలమందు

ద్వైర్ఘ్యమునకు సమానమైన విస్తారముకల, మూడవ భాగముతో సమంగా మధ్య లోఖాతమును చేసి, పీఠమువలె మేఖలతో కూడిన ప్రణాళిక (నాలను)ను చేయాలి,అని. దీనికి మూలమును సిద్ధాంత శేఖర మందు, శైవాగమమందు చూచి తెలుసుకోవాలి.

మూ॥ **తిథితత్త్వే బ్రాహ్మే** – సర్వత్రైవప్రశస్తోఽబ్జః శివ సూర్యార్చనంవినా. **తత్రైవ వారాహ పాద్మయోః** – గృహేలింగద్వయం నార్చ్యం శాలగ్రామద్వయంతథా, ద్వేచక్రే ద్వారకాయాస్తు నార్చ్యం సూర్యద్వయంతథా. శక్తిత్రయంతథా నార్చ్యం గణేశత్రయమేవవా, ద్వౌశంఖౌ నార్చయేచ్చైవ భగ్నాం చ ప్రతిమాం తథా నార్చయేచ్చ తథా మత్స్యకూర్మాది దశకం తథా, గృహేఽగ్ని దగ్ధా భగ్నాశ్చ నార్చ్యాః పూజ్యా వసుంధరే. ఏతాసాం పూజనాన్నిత్య ముద్వేగం ప్రాప్నుయా ద్గృహీ, శాలగ్రామాః సమాః పూజ్యాః సమేషు ద్వితయం నహి. విషమానైవ పూజ్యాస్తు విషమేష్వేక ఏవహి, శాలగ్రామ శిలాభగ్నా పూజనీయాస చక్రకా, ఖండితా స్ఫుటితావాపి శాలగ్రామ శిలాశుభా. **వారాహే** – దద్యాత్ భక్తాయయోదేవి శాలగ్రామ శిలాంనరః, సువర్ణసహితాం దివ్యాం పృథ్వీదాన ఫలం లభేత్. **తత్రైవ** – యః పునః పూజయేద్భక్త్యా శాలగ్రామ శిలాశతం, తత్ఫలంనైవ శక్తోఽహం వక్తుం వర్షశతైరపి, విష్ణుపురాణే – బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చ పృథివీపతే, స్వధర్మ తత్పరోవిష్ణుమారాధయతి నాన్యథా. **అవిభక్తానామపి** పృథగ్దేవపూజా మాహ ప్రయోగ పారిజాతే **అశ్వలాయనః** – పృథగప్యేకపాకానాం బ్రహ్మయజ్ఞో ద్విజాతినాం, అగ్నిహోత్రం సూరార్చా చ సంధ్యా నిత్యం భవేత్ పృథక్. **తత్రైవ** విష్ణుధర్మే – శాలగ్రామ శిలాంవాపి చక్రాంకిత శిలాంతథా, బ్రాహ్మణః పూజయేన్నిత్యం క్షత్రియాదిర్న పూజయేత్, ఇదం స్పర్శ సహిత పూజా విషయం. శూద్రోఽవానుపనీతో, వా స్త్రియోవాపతితోఽపివా, కేశవం వా శివం వాపి స్పృష్ట్వా నరకమశ్నుతే, బ్రాహ్మణ్యపి హరం విష్ణుం న స్పృశేత్ శ్రేయ ఇచ్ఛతీ, సనాథామృతనాథా వాతస్యానాస్తి హనిష్కృతిః స్త్రీణా మనుపనీతానాం శూద్రాణాం చ జనేశ్వర, స్పర్శనేనాధికారోఽస్తి విష్ణోర్వాశంకరస్యవా, ఇతి స్కాందాత్. స్పర్శరహితా తుతయోర్భవత్యేవ. శాలగ్రామం న స్పృశేత హీనవర్ణో వసుంధరే. స్త్రీ శూద్రకర సంస్పర్శో వజ్రస్పర్శాధికోమతః. మోహాద్యః సంస్పృశేచ్ఛూద్రో యోషిద్వాపి కదాచన, స్వపతే నరకే ఘోరే యావదాభూత సంప్లవం. యదిశక్తిర్భవేత్త స్యస్త్రీణాం వాపి వసుంధరే, దూరాదేవా స్పృశన్, పూజాం కారయేత్సు సమాహితః, ఇతి వారాహోక్తేః. శాలగ్రామ శిలామాత్ర నిషేధో,న ప్రతిమాదౌ, సర్వవర్ణైస్తు సంపూజ్యాః ప్రతిమాః సర్వదేవతాః. లింగాన్య పితు పూజ్యాని మణిభిః కల్పితానిచ, ఇతి తత్రైవోక్తేః.

అను॥ తిథితత్త్వమందు బ్రాహ్మమందు ఇట్లు – శివ, సూర్యుల అర్చన యందు తప్ప అంతట శంఖము ప్రశస్తమైనది (వాడవచ్చు)అని. అక్కడే వారాహ పాద్మము లందిట్లు – ఇంటిలో, రెండు లింగములను, రెండు శాల గ్రామములను, ద్వారకయందలి రెండు చక్రములను, ఇద్దరు సూర్యులను పూజించరాదు. మూడు శక్తి మూర్తులను ముగ్గురు గణేశులను పూజించరాదు. రెండు శంఖములను, భగ్నమైన ప్రతిమను పూజించరాదు,అని. అట్లాగే మత్స్యకూర్మాది దశావతారములను పూజించరాదు. ఓ వసుంధర ! గృహమందు అగ్ని దగ్ధమైన, భగ్నమైన ప్రతిమలను పూజించరాదు. వీటిని పూజించటం వలన యజమాని

ప్రతిరోజు ఉద్వేగాన్ని పొందుతాడు. శాలగ్రామములను సమ సంఖ్యను పూజించాలి. సమమందును రెంటిని మాత్రమే పూజించరాదు (నాలుగు, ఆరు, అట్లా). విషమసంఖ్యను పూజించరాదు. విషమ మందు ఒకదానిని పూజించవచ్చును. శాలగ్రామ శిల ఒకవేళ భగ్నమైనా చక్రం కలదైతే దానిని పూజించాలి. ఖండితమైనా, విరిగినా కాని శాలగ్రామ శిల శుభమైనది. వారాహమందిట్లా - ఓ దేవి! నరుడు, శాలగ్రామ శిలను భక్తునకు దానం చేసినవాడు, సువర్ణ సహితమైన, దివ్యమైన దానిని ఇచ్చినవాడు పృధ్వీ దానఫలాన్ని పొందుతాడు,అని. అక్కడే - భక్తితో శాలగ్రామ శిలలను నూటిని పూజించినవాని ఫలితమును (పుణ్యమును) నూరు సంవత్సరాలకైనా చెప్పటానికి నేను అసమర్ధుణ్ణి,అని. విష్ణుపురాణమందిట్లా - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, ఓమహారాజ! వీరు స్వధర్మ తత్పరులైతే విష్ణువు నారాధిస్తారు, లేనిచో ఆరాధించరు,అని. విభక్తులు కాని వారికి కూడా (విడిపోని) విడిగా దేవపూజను ప్రయోగ పారిజాతమందు ఆశ్వలాయనులిట్లా చెప్పారు - విడిగా ఉన్నా, ఒకే పాకం (వంట) కలవారికి బ్రాహ్మణులకు బ్రహ్మయజ్ఞము, అగ్నిహోత్రము, దేవతార్చన, సంధ్య ప్రతిరోజు విడిగానే ఉంటాయి,అని. అక్కడే విష్ణుధర్మ మందిట్లా - శాలగ్రామ శిలను కాని, చక్ర చిహ్నితమైన శిలనుగాని బ్రాహ్మణుడు ప్రతిరోజు పూజించాలి, క్షత్రియాదులు పూజించరాదు,అని. ఇది ముట్టుకొని చేసే పూజకు చెందిన విషయము. శూద్రుడు కాని అనుపనీతుడు కాని స్త్రీలు కాని పతితుడు కాని వీరు కేశవునిగాని శివుని గాని ముట్టుకుంటే నరకమును పొందుతారు. శ్రేయస్సును కోరే బ్రాహ్మణస్త్రీ గూడా శివుని విష్ణువును స్పృశించరాదు. భర్త ఉన్నా, గతించినా ఆమెకు ఇక్కడ నిష్కృతి లేదు. స్త్రీలకు అనుపనీతులకు, శూద్రులకు, ఓరాజ! శివునిగాని విష్ణువునుగాని ముట్టుకోవటంలో అధికారం లేదు, అని స్కాందోక్తి. ముట్టుకోకుండా ఐతే వారికి పూజకు అధికారం ఉందికదా. ఓ వసుంధర! హీన వర్ణము వారు సాలగ్రామమును ముట్టరాదు. స్త్రీ శూద్రులచేతి స్పర్శ వజ్ర స్పర్శకన్న అధికమైనదిగా భావిస్తాము. శూద్రుడు మోహం వల్ల సాలగ్రామాన్ని తాకితే, ఎప్పుడైనా స్త్రీగాని తాకితే వారు ప్రళయకాల పర్యంతము ఘోరమైన నరకమందు పడిపోతారు. అతనికి గాని స్త్రీకిగాని భక్తి ఉంటే, ఓ వసుంధర! దూరము నుండే తాకకుండా సావధాన మనస్సుతో పూజచేయించాలి,అని వారాహోక్తి. శాలగ్రామ శిలామాత్ర స్పర్శ నిషేధము ప్రతిమాదుల విషయంలో కాదు. అన్ని వర్ణముల వారు అన్ని దేవతల ప్రతిమలను బాగా పూజించవచ్చును,మణులతో చేసిన లింగములను కూడా పూజింపవచ్చును,అని అక్కడే చెప్పారు.

మూ॥ **చత్వారోబ్రాహ్మణైః పూజ్యాః** త్రయోరాజన్యజాతిభిః, వైశ్యైః ద్వావేవ సంపూజ్యౌ **తథైకః శూద్రజాతిభిః, ఇతి స్కాందాచ్చ. అన్యేతుదీక్షితా దీక్షిత విషయత్వేన వ్యవస్థామాహుః. విష్ణుధర్మే** - తయోరసంభవేఽర్చా వైసాచేహ నవధాస్మృతా. రత్నజా, హేమజా చైవ రాజతీ **తామ్రజా తథా**, రైతిక్యర్చా తథాలౌహీ శైలజాద్రుమ జాతథా, అధమాధమాచ విజ్ఞేయా మృన్మయీ

ప్రతిమాచయా, ఏషాం ఫలాని తత్రైవ జ్ఞేయాని. నార్చ్యాగృహేఽ శ్మజామూర్తిః చతురంగులతోఽ ధికా, నవితస్త్యధికా ధాతు సంభవాశ్రేయ ఇచ్ఛతా. ఏవం లక్షణ సంపన్నా పారంపర్యక్రమాగతా, ఉత్తమాసాతు విజ్ఞేయా గురుదత్తాపితత్సమా. తత్రైవపాద్మే శాలిగ్రామం ప్రక్రమ్య - తత్రాప్యామల కీతుల్యా పూజ్యా సూక్ష్మైవయా భవేత్, యథా యథా శిలాసూక్ష్మాతథాస్యాత్తు మహత్ఫలం. తథా - యవమాత్రం తు గర్తః స్యాత్ యవార్ధం లింగముచ్యతే, శివనాభిరితిఖ్యాతః త్రిషు లోకేషు దుర్లభః తత్రైవ-శాలగ్రామమయీముద్రా సంస్థితా యత్ర కుత్రచిత్,వారణస్యాయ వాధిక్యం సమంతా ద్యోజన త్రయం. యోమృతః తత్సమీపేతు మృతోవానీయతేఽంతికం, సవైమోక్షమవాప్నోతి సత్యం సత్యం చ నాన్యథా. తత్రైవ - చక్రాంక మిథునం పూజ్యం నైకం చక్రాంక మర్చయేత్, చక్రాంకమిథునాత్సా ర్ధం శాలగ్రామం ప్రపూజయేత్. తత్రైవ వారాహే - మ్లేచ్ఛదే శేతుచేవాపి చక్రాంకో యత్ర తిష్ఠతి, యోజనానాం తథా త్రీణి మమక్షేత్రం వసుంధరే. తత్రైవ శాలగ్రామం - ప్రక్రమ్య-క్రయక్రీతాపరిజ్ఞేయా మధ్యమా యాచితాఽధమా ప్రయోగపారిజాతే వారాహే - ఏవం లక్షణ సంపన్నా పారంపర్య క్రమాగతా, ఉత్తమాసాతు విజ్ఞేయా గురుదత్తాపి తత్సమా.

అను॥ బ్రాహ్మణులు నాలుగు లింగములను, పూజించాలి. క్షత్రియులు మూడు లింగములను, వైశ్యులు రెంటిని, శూద్రుడు ఒక లింగమును పూజించాలి,అని స్కాందోక్తి. ఇతరులైతే దీక్షితము, దీక్షితముకాని అనే భేదంతో నిర్ణయము అని అన్నారు. విష్ణు ధర్మ మందిట్లా - అవి (రెండు) సంభవించని పక్షంలో అర్చావిగ్రహము ఇక్కడ తొమ్మిది రకాలుగా చెప్పబడింది. రత్నముది, బంగారుది, వెండిది, రాగిది, ఇత్తడిది, ఇనుముది, రాతిది, కర్రది మట్టిది. అధమాధమమైనది, మట్టితో చేసిన ప్రతిమ అని గ్రహించాలిఅని. వీటి ఫలితములను అక్కడే తెలుసుకోవాలి. ఇళ్ళలో రాతితో చేసిన మూర్తిని, నాలుగు అంగుళముల కంటె పెద్దదైన దానిని పూజించరాదు. శ్రేయస్సు కోరే నరుడు, పన్నెండు అంగుళముల కంటె అధికమైన, ధాతువుతో చేసిన మూర్తిని పూజించరాదు. ఇట్లా లక్షణములు కలిగిన పరంపరగా వచ్చిన దానిని ఉత్తమమైన దానినిగా గుర్తించాలి. గురువు ఇచ్చిన దానిని గూడా దానితో సమానమైనదని గ్రహించాలి. అక్కడే పాద్మమందు శాలిగ్రామమును గూర్చి ఆరంభించి - అక్కడ కూడా ఉసిరికాయతో సమానమైన, సూక్ష్మమైనదైనా దానినే పూజించాలి. శిల ఎంతెంత చిన్నగా ఉంటే అంత ఎక్కువ ఫలం లభిస్తుంది,అని. అట్లాగే - గర్తము యవ గింజంత మాత్రము, లింగము యవగింజలో సగభాగము. అది శివనాభి అని ప్రసిద్ధమైంది. ముల్లోకములలో దుర్లభమైంది. అక్కడే - ఎక్కడైనా శాలగ్రామమయమైన చిహ్నాలు కన్పిస్తే అది చుట్టుముట్టు మూడు యోజనముల వరకు వారణాసికన్న ఒక యవగింజ ప్రమాణము అధికమైనది,అని. దాని సమీపంలో మరణించినవారు, మరణించాక దాని సమీపమునకు తీసుకుపోబడ్డవారు మోక్షాన్ని పొందుతారు,ఇది నిజము, నిజము, మరో విధముగా కాదు. అక్కడే - చక్రచిహ్నాము కలిగిన వాటిని రెంటిని (జంటగా) పూజించాలి. ఒక, చక్రాంకము గల దానిని పూజించరాదు. చక్రాంకముల జంటతోపాటు శాలగ్రామమును పూజించాలి.

అక్కడే వారాహమందిట్లు – ఓ వసుంధ! మ్లేచ్ఛదేశమందు కాని శుచిప్రదేశమందు కాని చక్రాంకుడున్నచోట మూడు యోజనముల వరకు నా క్షేత్రము,అని. అక్కడే శాలగ్రామము అని ఆరంభించి– దబ్బిచ్చికొన్నట్టిది మధ్యమమని, యాచింపబడ్డది అధమమని గ్రహించాలి, అని అన్నారు. ప్రయోగ పారిజాతమందు వారాహోక్తి ఇట్లు – ఈ విధముగా లక్షణములతో కూడిన, పరంపరాక్రమముగా వచ్చిన దానిని ఉత్తమమైన దాన్నిగా భావించాలి. గురువు ఇచ్చిన దానిని కూడా దానితో సమానమైన దానినిగా భావించాలి,అని.

**మూ॥ అథపార్థివపూజా – నందిపురాణే – ఆయుష్మాన్ బలవాన్ శ్రీమాన్ పుత్రవాన్ ధనవాన్ సుఖీ, వరమిష్టం లభేల్లింగం పార్థివం యః సమర్చయేత్. తస్మాత్తు పార్థివం లింగం జ్ఞేయం సర్వార్థసాధకం. తత్రైవ – గోభూహిరణ్య వస్త్రాది బలిపుష్పనివేదనే, జ్ఞేయో నమః శివాయేతి మంత్రః సర్వార్థసాధకః. సర్వమంత్రాధికశ్చాయం ఓంకారాద్యః షడక్షరః. భవిష్యే – మూర్తయోఽష్టౌ శివస్యైతాః పూర్వాదిక్రమ యోగతః. ఆగ్నేయ్యంతాః ప్రపూజ్యాస్తు వేద్యాం లింగే శివంయజేత్.** అత్ర, నప్రాచీ మగ్రతః శంభోః, ఇతి రుద్రయామలే నిషేధాత్ నాంతరాలం శివం ప్రాచీ, కింతు ప్రసిద్ధైవ. తిథి తత్త్వే దేవీపురాణే – మృదాహరణ సంఘట్టే ప్రతిష్ఠాహ్వానమేవ చ, స్నపనం పూజనం చైవ విసర్జనమతః పరం. హరోమహేశ్వరశ్చైవ శూలపాణిః పినాకధృక్, శివః పశుపతిశ్చైవ మహాదేవ ఇతి క్రమాత్. **స్కాందే**–శుష్కాణ్యపి చ పత్రాణి శ్రీవృక్షస్య నివేదయేత్, తత్రైవ భవిష్యే – ధత్తూర కైశ్చయోలింగం సకృత్ పూజయతేనరః, సగోలక్షఫలం ప్రాప్యశివలోకే మహీయతే. **యోగినీతంత్రే – శివాగారే ఝల్లకంచ సూర్యాగారే చ శంఖకం, దుర్గాగారే వంశవాద్యం మధురీం చ నవాదయేత్.** శ్రాద్ధహేమాద్రౌ స్కాందే – స్పృష్ట్వారుద్రస్య నిర్మాల్యం సవాసా ఆప్లుతః శుచిః. ప్రయోగపారిజాతే క్రియాసారే – మధ్యమానామికా మధ్యే పుష్పం సంగృహ్య పూజయేత్, అంగుష్ఠ తర్జన్యగ్రాభ్యాం నిర్మాల్య మపనోదయేత్. **అపనీతం** చ నిర్మాల్యం చండేశాయ నివేదయేత్, అశూన్య మస్తకం లింగం సదా కుర్వీత పూజకః. **శూలపాణౌ లైంగే** – వరం ప్రాణ పరిత్యాగః శిరసోవాపి కర్తనం, న చైవా పూజ్యభుంజీత శివలింగే మహేశ్వరం. సూతకే మృతకే చైవ నత్యాజ్యం శివపూజనం. **తిథితత్త్వే లైంగే** – వినాభస్మ త్రిపుండ్రేణ వినారుద్రాక్ష మాలయా, పూజితోపి మహాదేవోనస్యాత్తస్య ఫలప్రదః. తస్మాన్మృదాపి కర్తవ్యం లలాటే వైత్రిపుండ్రకం.

అను॥ ఇక పార్థివపూజ. నంది పురాణమందిట్లు – పార్థివ లింగాన్ని పూజించిన వాడు ఆయుష్మంతుడు, బలవంతుడు, శ్రీమంతుడు, పుత్రవంతుడు ధనవంతుడు, సుఖి ఔతాడు. ఇష్టమైన వరమును పొందుతాడు. అందువల్ల, పార్థివ లింగము అన్ని పనులను సాధించేది అని తెలుసుకోవాలి,అని. అక్కడే – గోవు, భూమి, బంగారము, వస్త్రము మొదలగునవి, బలి అట్లాగే పుష్ప నివేదనమందు నమఃశివాయ అనుమంత్రము అన్ని కోరికలను సాధించేది అని తెలుసుకోవాలి. ఇది సర్వమంత్రములకన్న అధికమైనది, ఓంకారము తొలుత కలిగిన ఈ షడక్షరము. భవిష్యమందిట్లు – శివుని మూర్తులు ఎనిమిది. వీటిని పూర్వదిక్కు మొదలుగా క్రమముగా ఆగ్నేయ దిశ వరకు (చివర) పూజించాలి.

వేదిక యందు లింగమందు శివుని పూజించాలి (మధ్యలో). ఇక్కడ శివుని ముందు పూర్వదిక్కు (మొగం) కాదు అని రుద్రయామల మందు నిషేధించి నందువల్ల పూర్వదిక్కు అంతరాలము (మూల)శివునకు చెందింది కాదు, కాని ప్రసిద్ధమైనదే గ్రహించాలి. తిథితత్వమందు, దేవీ పురాణమందలి వాక్యమిట్లా – మట్టిని తీసుకు వచ్చేప్పుడు హరాయనమః అని పఠించాలి. మహేశ్వరాయనమః అని ఆ మట్టిని కలిపి లింగం చేయాలి, శూలపాణయే నమః అని ప్రతిష్ఠ చేయాలి, పినాకధృతయే నమః అని ఆహ్వానము చేయాలి. శివాయనమః అని స్నానం చేయించాలి, పశుపతయే నమః అని పూజించి, మహాదేవాయ నమః అని విసర్జన చేయాలి,అని. స్కాంద మందిట్లా – శ్రీవృక్షము యొక్క ఎండుటాకులనైనా నివేదన చేయాలి, (మారేడు) అని. అక్కడే భవిష్యోక్తి ఇట్లా – ధత్తూరకములతో లింగమును ఒక్కసారి పూజించిన (ఉమ్మెత్త) నరుడు లక్ష గోవుల దాన ఫలాన్ని పొంది శివలోకమందు వెలుగొందుతాడు,అని. యోగినీ తంత్రమందిట్లా – శివాలయమందు పెద్ద కంచు తాళములు, సూర్యమందిరమందు శంఖమును, దుర్గమందిరమందు వేణువును, మధూరిని (నోటితో ఊదేదిచిల్లులది) వాయించరాదు,అని. శ్రాద్ధ హేమాద్రి యందు స్కాందోక్తి ఇట్లా – రుద్రుని నిర్మాల్యాన్ని ముట్టుకుంటే, వస్త్రములతో కూడా అట్లాగే స్నానం చేస్తే శుచి ఔతాడు,అని. ప్రయోగ పారి జాతమందు క్రియాసారోక్తి ఇట్లా – మధ్యవేలు ఉంగరపు వేలు వీని మధ్య యందు పూవును తీసుకొని (ఉంచి) పూజించాలి. బొటనవేలు చూపుడు వేలు వీనితో నిర్మాల్యమును తీసి వేయాలి,అని. తీసివేసిన నిర్మాల్యాన్ని చండేశునకు నివేదించాలి. పూజకుడు ఎల్లప్పుడూ లింగం మస్తకముపై (తల) తిలకముంచాలి (శూన్యము లేకుండా). శూలపాణియందు లైంగోక్తి ఇట్లా – ప్రాణములు వదలుట ఉత్తమము,తల తెగకోసుకొనుట ఉత్తమము, కాని శివలింగమందు మహేశ్వరుని పూజించకుండా తినరాదు. సూతకమందు కాని మృతకమందు కాని (జాత,మృత)శివ పూజను వదలరాదు,అని. తిథితత్వమందు లైంగోక్తి ఇట్లా – భస్మ త్రిపుండ్రములు లేకుండా, రుద్రాక్షమాల లేకుండా మహాదేవుని పూజించినా అతడు, అతనికి ఫలితమివ్వడు,అని. అందువల్ల లలాటమందు మట్టితోనైనా త్రిపుండ్రమును ధరించాలి.

**మూ॥ రుద్రాక్ష ధారణే విశేషః శివరహస్యే – ఏక వక్త్రః శివః సాక్షాత్ బ్రహ్మ హత్యాం వ్యపోహతి, అవధ్యత్వం ప్రతిస్రోతో వహ్నిస్తంభం కరోతి చ. ద్వివక్త్రో హరగౌరీస్యాత్ గోవధాద్యఘ నాశకృత్,త్రివక్త్రోహ్యగ్ని జన్మాథ పాపరాశిం ప్రణాశయేత్. చతుర్వక్త్రః స్వయం బ్రహ్మ నరహత్యాం వ్యపోహతి, పంచవక్త్రస్తు కాలాగ్ని రగమ్యా భక్ష్య పాపనుత్. షడ్ వక్త్రస్తు గుహోజ్ఞేయో భ్రూణ హత్యాది నాశయేత్. సప్తవక్త్రస్త్వ నంతస్స్యాత్ స్వర్ణస్తే యాదిపాపహృత్. వినాయకోఽష్టవక్త్రః స్యాత్ సర్వానృత వినాశకృత్. భైరవో నవ వక్త్రస్తు శివసాయుజ్య కారకః. దశవక్త్రః స్మృతో విష్ణుః భూతప్రేతభయాపహః. ఏకాదశముఖో రుద్రో నానాయజ్ఞ ఫలప్రదః. ద్వాదశాస్యః తథాదిత్యః సర్వరోగనిబర్హణః. త్రయోదశముఖః కామః సర్వకామ ఫలప్రదః. చతుర్దశాస్యః శ్రీకంఠోవంశోద్ధార కరః పరః.ఇతి. తథా-వినామంత్రేణ యోధత్తే రుద్రాక్షంభువిమానవః సయాతి నరకాన్ ఘోరాన్ యావదింద్రాశ్చతుర్దశ. పంచామృతం పంచగవ్యం స్నానకాలే ప్రయోజయేత్, రుద్రాక్షస్య**

ప్రతిష్ఠాయాం మంత్రం పంచాక్షరంతథా.యద్వా-ఓంఅఘోర ఓం హ్రైం అఘోరతర ఓం హ్రాం హ్రాం నమస్తే రుద్రరూపాయహ్రైంస్వాహా అనేనాభిమంత్ర్య ధారయేత్. తథా-అష్టోత్తరశతం కార్యా చతుష్పంచాశదేవవా, సప్తవింశతి మానావా తతో హీనాధమా స్మృతా. ప్రజాపతిః – మోక్షార్థీ పంచవింశత్యా ధనార్థీత్రింశతా జపేత్, పుష్ట్యర్థీ పంచవింశత్యా పంచదశ్యాభిచారకే. సప్తవింశతి రుద్రాక్షమాలయా దేహసంస్థయా, యత్కరోతి నరః పుణ్యం సర్వం కోటిగుణం భవేత్. యోదదాతి ద్విజేభ్యశ్చ రుద్రాక్షం భువి సమ్ముఖం, తస్య ప్రీతో భవేద్రుద్రః స్వపదం చ ప్రయచ్ఛతి,ఇతి. **పదార్థాదర్శేఽప్యుపదేశః – రుద్రాక్షాన్ కంఠదేశే దశన పరిమితాన్ మస్తకే వింశతీ ద్వేషట్షట్ కర్ణ ప్రదేశే కరయుగల కృతే ద్వాదశద్వాదశైవ, బాహ్వోరిందోః కలాభిః నయనయుగకృతే ఏకమేకం శిఖాయాం వక్షస్యష్టాధికం యః కలయతి శతకం సస్వయం నీలకంఠః.**

అను॥ రుద్రాక్ష ధారణ యందు విశేషము శివ రహస్య మందిట్లా చెప్పబడింది– ఒక ముఖము గలది సాక్షాత్తు శివుడే. బ్రహ్మహత్య పాపమును తొలగిస్తుంది. ప్రవాహానికి ఎదురీదినపుడు చావు రాకుండా కాపాడుతుంది. అగ్ని స్తంభన కూడా చేస్తుంది. రెండు ముఖములది హరగౌరీ అనబడుతుంది. గోవధ మొదలగు పాపముల నశింప చేసేది. మూడు ముఖములది అగ్ని జన్మ అను పేరు గలది. మన పాప రాశిని నశింప చేస్తుంది. నాల్గు ముఖములది స్వయముగా బ్రహ్మయే. నరహత్య పాపమును తొలగిస్తుంది. ఐదు ముఖములది కాలాగ్ని అగమ్యగమనము, అభక్ష్యభక్షణము వల్ల కలిగే పాపాలను నశింప చేస్తుంది. ఆరు ముఖములది కుమార స్వామియే. భ్రూణహత్యాది పాపముల నశింపచేసేది. ఏడు ముఖములది అనంతుడు. బంగారము దొంగిలించుట మొదలగు వానివల్ల కలిగే పాపముల హరించేది. ఎనిమిది ముఖములది వినాయకుడు. అసత్యదోషములనన్నిటిని నశింపచేస్తుంది. తొమ్మిది ముఖములు గలది భైరవము. శివసాయుజ్యమును కలిగించేది. పదిముఖలది విష్ణువు. భూతప్రేతముల భయనాశకము. పదకొండు ముఖములు గలది రుద్రుడు. అనేక యజ్ఞముల ఫలమునిచ్చేది. పన్నెండు ముఖములది ఆదిత్యుడు. అన్ని రోగములను మింగేది. పదమూడు ముఖములది కామము. అన్ని కోరికల ఫలము నిచ్చేది. పదునాల్గు ముఖములది శ్రీకంఠము, వంశమును ఉద్ధరింపచేసేది. ఉత్తమమైనది,అని. **అట్లాగే** – ఏనరుడైనా ఈ లోకంలో మంత్రం (పూతం) లేకుండా రుద్రాక్షను ధరిస్తాడో, అతడు పదునాలుగురు ఇంద్రులున్నంతకాలము ఘోరమైన నరకములకు వెళ్తాడు. పంచామృతము, పంచగవ్యము వీటిని స్నానకాల మందు ఉపయోగించాలి. రుద్రాక్ష ప్రతిష్ఠ యందు మంత్రము పంచాక్షరి లేదా ఓం అఘోర, ఓం హ్రైం అఘోరతర, ఓం హ్రాం హ్రాం నమస్తే రుద్ర రూపాయ హ్రైం స్వాహా, అను మంత్రముతో అభిమంత్రించి ధరించాలి,. అట్లాగే – నూట ఎనిమిది రుద్రాక్షలది మాల లేదా ఏభది నాలుగు రుద్రాక్షలది లేదా ఇరువది ఏడు రుద్రాక్షలది కాని కావాలి అంతకన్న తక్కువైనది అధమమైనదన్నారు. ప్రజా పతి ఇట్లా–మోక్షమును కోరేవాడు ఇరువది ఐదు పూసలుగల ధనమును కోరేవాడు ముప్పది

పూసలు గల, పుష్టినికోరేవాడు ఇరువది ఐదు పూసలుగల, అభిచారకర్మకైతే పరిహేను రుద్రాక్షలు కలదానితో జపించాలి,అని. ఇరువది ఏడు రుద్రాక్షలు గల మాలను దేహముపై ధరించిన నరుడు చేసే పుణ్యము అంతా కోటి గుణితము ఔతుంది. ఏ నరుడు రుద్రాక్షను ఈ భువియందు (శివుని) ఎదురుగా బ్రాహ్మణుల కిస్తాడో,ఆతనికి రుద్రుడు సంతుష్టుడౌతాడు, తన పదవిని గూడా ఇస్తాడు,అని. పదార్థా దర్శమందు బోపదేవుడిట్లా – కంఠమందు రుద్రాక్షలను ముప్పది రెండు ధరించాలి,తల యందు నలుబది, చెవులందు ఆరేసి, చేతులకు పన్నెండేసి భుజములకు పదహారేసి, కళ్ళకు ఒకటొకటి శిఖయందు వక్షస్థలమందు నూటెనిమిది రుద్రాక్షలను ధరించినవాడు స్వయంగా నీలకంఠుడే,అని.

**మూ॥ హేమాద్రౌశివధర్మే – స్నానం పలశతంజ్ఞేయం అభ్యంగం పంచవింశతిః, పలానాంద్వే సహస్రేతు మహాస్నానం ప్రకీర్తితం. పంచవిశత్పలంలింగే త్వభ్యంగంకారయేదథ, శివస్య సర్పిషాస్నానం ప్రోక్తం పలశతేన చ. తావతా మధునాచైవ దధ్నా చైవతతః పునః, తావ తైవచక్షీరేణ గవ్యేనైవ భవేత్తతః. భూయః సార్ధ సహస్రేణ పలానామైక్షవేణచ, రసేన కారయే త్స్నానం భక్త్యా చోష్ణాంబునాతతః. విష్ణ్వాదౌతు స్కాందే – క్షీరాద్ద శగుణందధ్నాఘృతే నైవదశోత్తరం, ఘృతాద్దశగుణం క్షౌద్రం క్షౌద్రాచ్చైక్షవజం తథా. బ్రాహ్మే – దేవానాం ప్రతిమాయత్ర ఘృతా భ్యంగక్షమా భవేత్, పలాని తత్ర దేయాని శ్రద్ధయా పంచవింశతిః. ఇదంక్రోడీకృతాభిప్రాయేణ. తత్రైవ సంగ్రహే-విష్వక్సేనాయ దాతవ్యం నైవేద్యస్య శతాంశకం, పాదోదకం ప్రసాదం చలింగే చండేశ్వరాయతు. పంచాయతన సన్నివేశ మాహబోపదేవః – పదార్థాదర్శశ్చ – శంభౌ మధ్యగతే హరీ నహరభూ దేవ్యోహరౌ శంకరే, భాస్యే నాగసుతారవౌహర గణేశాజాంబికాః స్థాపితాః, దేవ్యా విష్ణుహరైక దంతర వయో లంబోదరై జేశ్వరే నాంబాః శంకరభాగతోఽతి సుఖదా వ్యస్తాస్తుహాని ప్రదాః, శంకర భాగతః ఈశాన కోణాదారభ్య ప్రదక్షిణ మిత్యర్థః. అత్రదిక్ స్వరూపముక్తం ప్రయోగ పారిజాతే మంత్రశాస్త్రే- దేవస్య ముఖమారభ్య దిశం ప్రాచీం ప్రకల్పయేత్, తదాది పరివారాణాం అంగాద్యావరణ స్థితిః. అత్రక్రమః పాద్మే – రవిర్వినాయకశ్చండీ ఈశోవిష్ణుస్తు పంచమః, అనుక్రమేణ పూజ్యంతే వ్యుత్క్రమేతు మహద్భయం. తథా- పూజ్యపూజకయోర్మధ్యే ప్రాచీప్రోక్తా విచక్షణైః.**

అను॥ హేమాద్రి యందు శివధర్మోక్తి ఇట్లా – నూరు పలముల (ప్రమాణం)తో స్నానము, ఇరువది ఐదు పలముతో అభ్యంగము, రెండు వేల పలములతో మహా స్నానము అని చెప్పబడింది.లింగమునకు ఇరువది ఐదు పలముతో అభ్యంగం చేయించాలి. శివునకు నూరు పలముల నేతితో స్నానము చేయించాలని చెప్పారు. అంతే ప్రమాణం గల తేనెతో, పెరుగుతో, అంతే ప్రమాణం గల ఆవు పాలతో (నూరు) స్నానం చేయించాలి. వేయి ఐదు వందల పలముల చెరుకు రసముతో స్నానం చేయించాలి. పిదప భక్తితో వేడినీటితో స్నానం చేయించాలి. విష్ణువు మొదలగు వారి విషయంలో ఐతే స్కాందోక్తి ఇట్లా – పాల కన్న పదింతలెక్కువ పెరుగు, దానికన్న పదింతలెక్కువ నేయి, దానికన్న పదింత లెక్కువ తెనె, దానికన్న పదింతలెక్కువ చెరుకురసము,అని. బ్రాహ్మమందిట్లా – దేవతల ప్రతిమ నేయితో అభ్యంగం చేయించటానికి అనువుగా ఉంటే, అక్కడ ఇరువది ఐదు పలములతో

శ్రద్ధగా చేయించాలి,అని. ఇది క్రోడీకరించిన అభిప్రాయము.అక్కడే సంగ్రహమందిట్లా - నైవేద్యంలోని నూరవభాగాన్ని విష్వక్సేనునకివ్వాలి. లింగమందు చండేశ్వరునకు పాదోదకము, ప్రసాదము ఇవ్వాలి,అని. పంచాయతన సన్నివేశాన్ని బోపదేవుడిట్లా చెప్పాడు. పదార్థా దర్శనుడు కూడా ఇట్లా - శివుడు మధ్యలో ఉంటే విష్ణువు, సూర్యుడు, గణపతి, దేవి వీరిని స్థాపించాలి. విష్ణువు మధ్యలో ఉంటే శివుడు, గణపతి, సూర్యుడు, పార్వతి ఉండాలి. సూర్యుడు మధ్యలో ఉంటే శివుడు, గణపతి, విష్ణువు, దుర్గ స్థాపించబడాలి. దుర్గ మధ్యలో ఉంటే విష్ణువు, శివుడు, గణపతి, సూర్యుడుండాలి. గణపతి మధ్యలో ఉంటే విష్ణువు శివుడు, సూర్యుడు దుర్గప్రక్కన ఉండాలి. శంకరుని భాగం నుండి, ఈశానకోణం నుండి ఆరంభించి ప్రదక్షిణ క్రమంలో ఉండాలి,అని అర్థము. ఇక్కడ దిక్ స్వరూపమును గూర్చి ప్రయోప పారిజాతమందు మంత్రశాస్త్రోక్తి ఇట్లా ఉంది– దేవత ముఖము ఏ వైపు ఉందో అదే ప్రాచీ అని భావించాలి. అక్కడి నుండి పరివారగణమునకు అంగాది ఆవరణ స్థితి ఉంచాలి,అని. ఇక్కడ పాద్మ మందు క్రమం ఇట్లా - సూర్యుడు, వినాయకుడు, దుర్గ, శివుడు, విష్ణువు అని క్రమము. ఈ క్రమంలో పూజించాలి. విపరీతక్రమంలో పూజిస్తే గొప్ప భయం కలుగుతుంది,అని. అట్లాగే- పూజించతగిన వాని యొక్క పూజయొక్క మధ్యలో తూర్పుదిక్కు ఉంటుంది అని విద్వాంసులన్నారు,అని.

**మూ॥ అథకేశవాదిమూర్తయః** - బోపదేవః-కేవిగోవాదాపు హ్నాయ ప్రజాచ్యుత్కృమ మాత్రివా, వాఽథో నృహశాన శ్రీపాశాచ్చ గేవిగపే చపే. అత్రకేవిగవిత్యాద్యైః కేశవ విష్ణ్వాది చతుర్వింశతి మూర్తయోఽభి ధీయంతే శాత్ శంఖాత్ చగే చక్రగదే జ్ఞేయే ఇత్యర్థః . శిష్టేభుజే పద్మం త్వర్థతః సిద్ధం. అత్ర దక్షిణోర్ధ్వకర క్రమేణ జ్ఞేయం. దక్షిణోర్ధ్వకరక్రమాత్, ఇతి హేమాద్రౌ వచనాత్ తేన హేమాద్రిణా సంవాదః. విశబ్దేన విపరీతం గచే ఇత్యర్థః. అత్రాపి శాదిత్యను వృత్తిః శంఖాద్గదా చక్రే ఇత్యర్థః. గపే ఇత్యత్రాపి శాదను వర్తతే. శంఖాత్ గదా పద్మే ఇత్యర్థః. విపరీతే పద్మగదే ఇత్యత్రాపి శంఖాత్జ్ఞేయే. చపే చక్రపద్మే శంఖాత్ చక్రపద్మే ఇత్యర్థః. వి ఇతి అత్రాపి పద్మచక్రే ఇత్యర్థః. తేనచగే ఇత్యష్టౌ మూర్తయః. గపే ఇత్యష్టౌమూర్తయః. చపే ఇత్యత్ర చ అత్ర మూలం హేమాద్రౌ జ్ఞేయం.

అను॥ ఇక కేశవాది మూర్తులు. బోపదేవుడిట్లా - కే (కేశవ)వి (విష్ణు) గో (గోవింద) వా (వామన) దా (దామోదర) పు (పురుషోత్తమ) హృ (హృషీకేశ) య (యజ్ఞపురుష ప్రద్యుమ్న) ప్ర (ప్రజాపతి) జ (జగన్నాథ) అచ్యుత, కృష్ణ,మధుసూదన, మాధవ, త్రివిక్రమ, నారాయణ, వాసుదేవ, అధోక్షజ, నృసింహ, హరి, శాలిగ్రామ, నరపతి, శ్రీశ, పద్మనాభ ఈ ఇరువది నాలుగుమూర్తు లుంటాయి,అని. ఇక్కడ కేవిగ అని మొదలగు వానితో కేశవ విష్ణు మొదలగు ఇరువది నాలుగు మూర్తులు చెప్పబడుతాయి. శాత్ అనగా శంఖము నుండి చగే అనగా చక్ర గదలు అని తెలుసుకోవాలని అర్థము. మిగిలిన భుజమందు పద్మము అని అర్థాత్ సిద్ధమైంది. ఇక్కడ కుడిపై చేయినుండి అనే క్రమము అని తెలుసు కోవాలి. దక్షిణోర్ధ్వకర క్రమము ననుసరించి, అని హేమాద్రి యందు వచనము. దానితో

హేమాద్రితో సరిపోయింది (ఆమాట) విశబ్దంవల్ల విపరీతము గద, చక్రము అని అర్థము. ఇక్కడ కూడా శాత్ అని అనువృత్తి. శంఖము నుండి గద చక్రములు అని అర్థము. గపే అను చోట కూడా శాత్ అనువర్తిస్తుంది. శంఖము నుండి గద పద్మములు అని అర్థము. విపరీతమందు పద్మగదలు అని ఇక్కడ కూడా శంఖము నుండి అని తెలుసుకోవాలి. చపే అనగా చక్రపద్మములు. శంఖము నుండి చక్ర పద్మములు అని అర్థము. విపరీతము అని ఇక్కడ కూడా గ్రహించాలి. పద్మ చక్రములు అని అర్థము. అందువల్ల చగే అని ఎనిమిది మూర్తులు. గపే అని ఎనిమిది మూర్తులు. చపే అనే చోట కూడా (ఎనిమిది మూర్తులు). ఇక్కడ మూలాన్ని హేమాద్రి యందు తెలుసుకోవాలి.

**మూ॥ అథబౌధాయన సూత్రం - త్రైవిక్రమీం చానుసృత్య లింగార్చా ప్రతిష్ఠోచ్యతే. యజమానః పూర్వోక్త కాలే పూర్వేద్యుః దశద్వాదశషోడశాన్యతర హస్తం మండపం కృత్వా ఆగ్నేయే హస్తమాత్రం చతురస్రం కుండం స్థండిలంవా పూర్వతో హస్తమాత్రాం వేదీం నైరృతే వాస్తుమండలం మధ్యే వేదీం తదుపరి సర్వతో భద్రం చ కృత్వా ప్రాణా నాయమ్యాస్యాం మూర్తౌ లింగే వా దేవస్య సాన్నిధ్య సిద్ధ్యర్థం దీర్ఘాయుర్లక్ష్మీ సర్వకామ సమృద్ధ్యక్షయ్య సుఖకామోఽ ముకమూర్తి ప్రతిష్ఠాం కరిష్యే ఇతి సంకల్ప్య గణేశ పూజన పుణ్యాహ వాచన మాతృకా పూజన నాందీ శ్రాద్ధాని కృత్వాచార్యం చతురః ఋత్విజశ్చ వృత్వావస్త్రాద్యైః పూజయేత్. అథాచార్యో, యదత్ర సంస్థితం, ఇతి సర్షపాన్ వికీర్య ఆపోహిష్ఠేతి కుశోదకేన భూమిం ప్రోక్ష్య, దేవా ఆయాన్తు యాతుధానా అపయాంతు, విష్ణోదేవయజనం రక్షస్వేతి భూమౌ ప్రాదేశం కృత్వా అస్మత్కృత తులాపద్ధతి మార్గేణ మండప ప్రతిష్ఠాం కృత్వా అకృత్వా వా పూర్వరాత్రౌ హిరణ్యో పధానం దేవం పంచగవ్య హిరణ్య యవ దూర్వాశ్వత్థ పలాశపర్ణాన్యుద కుంభే ప్రక్షిప్య తాభిరద్భి రాపోహిష్ఠేతి తిసృభిః హిరణ్యవర్ణేతి చతసృభిః పవమానః సువర్జన ఇత్యనువాకేన అభిషిచ్య వ్యాహృతిభిశ్చ ఇదం విష్ణురితి పుష్పఫల యవదూర్వాః సమర్ప్య నమస్తే రుద్రమన్యవ ఇతి రుద్రే తతో రక్షోహణ మితి హస్తే కంకణం బద్ధ్వావాససాచ్ఛాద్య అవతేహేడ, ఉదుత్తమ మితి చ జలే అధివాసయేత్. ఇదం బౌధాయనోక్తం.**

అను॥ ఇక బౌధాయన సూత్రము. త్రైవిక్రమిని కూడా అనుసరించి లింగము యొక్క పూజ, ప్రతిష్ఠలను చెబుతున్నాను. యజమానుడు ముందు చెప్పిన కాలమందు ముందు రోజు, పది, పన్నెండు, పదహారు (వీనిలో ఏదేని ఒక కొలత గల) హస్తముల మండపాన్ని చేసి, ఆగ్నేయ కోణమందు హస్తమాత్ర ప్రమాణముతో చతురస్రముగా కుండముగాని స్థండిలముగాని ఏర్పరచి, తూర్పునుండి హస్తమాత్ర ప్రమాణముగల వేదిని, నైఋత భాగమందు వాస్తుమండలమును మధ్యయందు వేదిని, దానిపైన సర్వతోభద్రను ఏర్పరచి, ప్రాణాయామంచేసి ఈ మూర్తియందు కాని లింగమందు కాని దేవతాసాన్నిధ్య సిద్ధి కొరకు, దీర్ఘాయు, లక్ష్మి, సర్వకామసమృద్ధి, అక్షయ్య సుఖము వీటినికోరి ఈ మూర్తి ప్రతిష్ఠను చేస్తున్నాను, అని సంకల్పంచేసి గణేశపూజ, పుణ్యాహవాచనం, మాతృకాపూజన, నాందీ శ్రాద్ధములు చేసి, ఆచార్యుని, నలుగురు ఋత్విక్కులను వరణంచేసి వస్త్రాదులతో

పూజించాలి. ఇక ఆచార్యుడు, యదత్రసంస్థితం, అని పరిస్తూ ఆవాలు చల్లాలి. ఆపోహిష్ఠ, అను మంత్రంతో కుశ ఉదకంతో భూమిని ప్రోక్షించాలి, దేవతలు రండి, యాతుధానులు తొలగిపోండి, ఓ విష్ణు ఈ దేవయజనాన్ని రక్షించు, అని భూమి యందు ఒక ప్రదేశాన్ని నిర్ణయించి,నేను చెప్పిన తులా పద్ధతి మార్గంతో (కొలతలు) మండప ప్రతిష్ఠను చేసి, లేదా చేయకకాని పూర్వరాత్రియందు ధనము (బంగారముపై) పై ఉంచబడినదేవుని, పంచగవ్యము బంగారము, యవలు, దూర్వారావి ఆకులు మోదుగ ఆకులు వీటన్నిటిని నీళ్ళు గల కుంభమందు వేసి, ఆనీటితో, ఆపోహిష్ఠ, అనే మూడు మంత్రాలతో హిరణ్యవర్ణ అనే నాలుగు మంత్రాలతో, పవమానః సువర్ణః అనే అనువాకంతో (ఆదేవుని) అభిషేకించి, వ్యాహృతులతోను అభిషేకించి ఇదం విష్ణుః అనే మంత్రంతో పుష్ప,ఫల,యవ దూర్వా ఇవన్నీ సమర్పించి, నమస్తే రుద్ర మన్యవ అనే మంత్రంతో రుద్రునియందు (సమర్పించి) ఆ పిదప రక్షోహణమనే మంత్రంతో హస్తమందు కంకణం కట్టి, గుడ్డతోకప్పి, అవతేహేడ, ఉదుత్తమ అనే మంత్రాలతో మూర్తిని జలాధివాసం చేయాలి. ఇది బోధాయనోక్త ప్రకారము.

**మూ॥ తతశ్చల లింగే అర్చాయాంవా అత్రాగ్నిం ప్రతిష్ఠాప్య గోక్షీరే నీవార చరుం కృత్వా విష్ణుశ్చేత్ కృసరమపి శ్రపయిత్వా ఆజ్యభాగాంతే పలాశ ఉదుంబర అశ్వత్థ శమ్య పామార్గ సమిద్భిః ఆజ్యేన చరుణా తిలైర్వా ప్రత్యేక మష్టా వింశతి మష్టౌవా ఆహుతీః లోకపాల మూర్తి పతిభ్యో హుత్వాస్థాప్య దేవ మంత్రేణ పూర్వోక్త సమిత్తిలనైవార చర్వాజ్యైః అష్ట సహస్రం, అష్టశతం, అష్టవింశతి వాహుత్వా, అగ్నిర్యజుర్భిః, ఇత్యను వాకేన దశాహుతీర్జుహుయాత్. ప్రతిద్రవ్యం హోమాంతే దేవం పాదనాభిశిరః స్పృశేత్. ఆజ్యహోమే చోత్తరతః సజలకుంభే సంపాతాన్ నయేత్. తేషాం మంత్రాః ఇంద్రాయేంద్రో ఇతీంద్రస్య, స్యోనే తిపృధివీమూర్తేః, అఘోరేభ్యః ఇతి తత్పతేః శర్వస్య అగ్న ఆయాహీత్యగ్నేః, అగ్నిందూతం పురోదధేత్యగ్ని మూర్తేః, నమః శర్వాయ చ పశుపతయే చేతి పశుపతేః యమాయ సోమమితి యమస్య, అసిహి వీరితి యజమానమూర్తేః స్తుహి శ్రుతం తత్పతే ఉగ్రస్య, అసున్వంతం నైర్ ఋతేః, ఆ కృష్ణేన సూర్య మూర్తేః, యోరుద్రో అగ్నౌ ఇతి తత్పతే రుద్రస్య, ఇమం మే వరుణస్య, శన్నోదేవీ జలమూర్తేః, నమో భవాయేతి భవస్య, ఆనోని యుద్భిరితి వాయోః, వాత ఆవాతు వాయుమూర్తేః, తమీశానం తత్పతేరీశానస్య, ఆప్యాయస్వేతి కుబేరస్య, వయం సోమ ఇతి సోమమూర్తేః, తత్పురుషాయ మహాదేవస్య, అభిత్వా ఈశానస్య, అదిత్ ప్రత్నస్యే త్యాకాశస్య, నమ ఉగ్రాయ చేతి తత్పతేః భీమస్య, తతో దేవస్య పాదౌ స్పృశేత్. ఏవం ద్వితీయే హుత్వా నాభిం, తృతీయే మధ్యం, చతుర్థే ఉరః, పంచమేశిరః స్పృష్ట్వా ప్రతి పర్యాయం సంపాత జలేన దేవమభిషించేత్. తతః స్విష్టకృదాది హోమశేషం సమాప్య అర్చాం శోధయేత్. స్థిరలింగార్చాదౌతు నేదానీమగ్నిస్థాపన హోమాది కార్యం.**

అను॥ ఆ పిదప, చలించే లింగమందు కాని అర్చా విగ్రహమందు కాని అగ్నిని ప్రతిష్ఠించి, ఆవుపాలయందు నీవార ధాన్యపు చరువుచేసి, విష్ణువు ఐనట్లైతే పులగమును వండి, ఆజ్యభాగం అంతమందు, మోదుగ, మేడి,రావి,శమి, ఉత్తరేణి సమిధలతో ఆజ్యంతో చరువుతో లేదా నువ్వులతోకాని ప్రత్యేకముగా ఇరువది ఎనిమిదికాని ఆహుతులను లోకపాల

మూర్తి పతులకు ఇచ్చి, స్థాపించబోయే దేవత మంత్రముతో ముందు చెప్పినట్లు సమిధలు, తిలలు, నీవారచరువు, ఆజ్యము వీనితో ఎనిమిదివేలు లేదా ఎనిమిది నూర్లు లేదా ఇరువది ఎనిమిది కాని హెూమం చేసి,అగ్నిర్యజుర్భిః అనే అను వాకంతో పది ఆహుతులను హోమం చేయాలి. ప్రతి ద్రవ్యముతో చేసిన హోమం చివర దేవుని పాదనాభి శిరస్సులను స్పృశించాలి. ఆజ్యహోమమందైతే ఉత్తరమందున్న నీళ్ళు గల కుంభమందు సంపాతములు ఉంచాలి (చుక్కలు వదలాలి) వాని మంత్రములివి. ఇంద్రాయేంద్రో అని ఇంద్రునకు, స్యోనా అని పృథివిమూర్తికి, అఘోరేభ్యః అని తత్పతిశర్వునకు, అగ్న ఆయాహి అని అగ్నికి, అగ్నిం దూతం పురోధథే అని అగ్నిమూర్తికి, నమః శర్వాయచ పశుపతయే చ అని పశుపతికి, యమాయ సోమం అనే మంత్రంతో యమునకు, అసిహివీరని యజమానమూర్తికి, స్తుహి శ్రుతం అని తత్పతి ఉగ్రునకు అసున్వంతం అని నిర్‌ఋతికి, ఆకృష్ణేన అని సూర్యమూర్తికి, యోరుద్రో అగ్నౌ అని తత్పతిరుద్రునకు, ఇమంమే అని వరుణునకు, శన్నోదేవీ అని జలమూర్తికి, నమోభవాయ అని భవునకు,ఆనోనియుద్భిః అని వాయువునకు వాత ఆవాతు అని వాయుమూర్తికి,తమీశానం అని తత్పతి ఈశానునకు ఆప్యాయస్వ అని కుబేరునకు, వయంసోమ అని సోమమూర్తికి, తత్పురుషాయ అని మహాదేవునకు, అభిత్వా అని ఈశానునకు,అదిత్‌ప్రత్నస్య అని ఆకాశమునకు, నమఉగ్రాయచ అని తత్పతి భీమునకు. ఆ పిదప దేవుని పాదములు స్పృశించాలి. ఈ విధముగా రెండవమారు హోమంచేసి నాభిని, మూడవసారి హోమం చేసి మధ్య భాగమును, నాలుగవసారి ఉరమును, ఐదవసారి శిరమును స్పృశించి, ప్రతిసారి, సంపాత జలముతో దేవుని అభిషేకించాలి. ఆ పిదప స్విష్టకృత్ మొదలగు హెూమ శేషమును సమాప్తి చేసి అర్చామూర్తిని శుద్ధిపరచాలి. స్థిరలింగ అర్చన విషయమందైతే, ఇప్పుడు అగ్నిస్థాపన హోమాదులు చేయరాదు.

మూ॥ తతో దేవం నత్వా ఓం స్వాగతం దేవదేవేశ విశ్వరూప నమోఽస్తుతే, శుద్ధేఽపి త్వదధిష్ఠానే శుద్ధింకుర్మః సహస్వతాం. ఇతి సంప్రార్థ్య ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే,ఇతి సఋత్విగుత్థాప్య పూర్వమకృతేగ్న్యుత్తారణే అధునావాకార్యం. అగ్నిః సప్తిం,ఇతి సూక్తమగ్ని పదహీనం పఠిత్వాతత్స హితం పునః పఠేత్. ఏవ మష్ట సహస్ర మష్ట శత మష్టావింశతి వాపఠన్ జలం పాతయేత్. తతోఽర్చాం ద్వాదశవారం మృదాజలేన చ ప్రక్షాల్య మంత్రవత్ పంచగవ్యం కృత్వా, పయః పృథివ్యాం, అహోరాత్రానాం, ఇతిచ సంస్నాప్య, ఆప్యాయస్వ, దధిక్రావ్ణః,తేజోఽసి, మధువాతా, ఆయంగౌః, ఇతి పంచామృతైః సంస్నాప్యలింగంచేత్, నమస్తే రుద్రమన్యవే, ఇత్యష్టాభిఃసంస్నాప్యఘృతే నాభ్యజ్య ఉద్వర్తనేన ఉద్వర్త్య ఉష్ణోదకేన ప్రక్షాల్యగంధం దత్వా సంపాతోదకేన అభిషిచ్య సపల్లవైః చతుర్భిః కుంభైః ఆపోహిష్ఠేతి, త్రిభిః ఆకలశేషు ఇతి ప్రత్యేకం, సముద్రజ్యేష్ఠా, ఇతి చతుర్భిః, ఆకలశేషు ఇతి చమిలితైః సంస్నాప్య ఔదుంబరాదిపీఠే అర్చాముపవేశ్య పరితోఽష్టదిక్షు సజలకుంభాన్ సంస్థాప్య, తేషు గంధపుష్ప దూర్వాఃక్షిప్త్వా ఆద్యే సప్తమృదః, ద్వితీయే – పుష్కర పర్ణశమీ వికంకతాశ్మంతక త్వచః పల్లవాశ్చ, తృతీయాదిషు సప్తధాన్యం, పంచరత్న ఫల పుష్పాణి, కుశదూర్వాగోరోచన సంపాతోదక సర్వౌషధీః క్షిప్త్వాక్రమేణ ఆపోహిష్ఠేతి తిసృభిః, హిరణ్యవర్ణాః

ఇతి చతుర్భి:, పవమానానువాకేన చాభిషిచ్య, ఏకకుంభే శమీపలాశ వటఖదిర బిల్వాశ్వత్థ వికంకత పనసామ్ర శిరీష ఉదుంబరాణాం పల్లవాన్ కషాయాంశ్చ క్షిప్త్వా అశ్వత్థేవః, ఇత్యభిషించ్య, పంచరత్నోదకేన హిరణ్యవర్ణాః, ఇతి సంస్నాప్య వాససీ దత్వా ఉపవీతాది దీపాంతం కృత్వా హిరణ్యగర్భః, యఆత్మదా, యఃప్రాణతః, యస్యేమే, యేనద్యౌః, యం క్రందసీ,ఆపోహయత్, యశ్చిదాపో, ఇత్యష్టాపిష్టదీపాన్ దత్వా సువర్ణశలాకయా తైజసపాత్రస్థం మధుఘృతం చ గృహీత్వా చిత్రం దేవానాం తేజోఽసి, ఇతి మంత్రాభ్యాం, ఓం నమో భగవతే తుభ్యం శివాయహరయే నమః, హిరణ్యరేతసే విష్ణో విశ్వరూపాయతేనమః, ఇతి చ దక్షిణసవ్యే దేవనేత్రౌ మంత్రావృత్యాలిఖేత్, అంజంతిత్వా ఇత్యంజనేన, మధువాతాఽజ్క్త్వా దేవస్యత్వా సవితుః ప్రసవే ఇంద్రస్యేంద్రియేణానజ్మి, ఇతిమధ్వాజ్య శర్కరాభిరజ్క్త్వా తేనైవాంజనేన పునరంజయేత్. అత్రానక్మతిశేషః. స్థిరలింగేతు - స్వర్ణసూచ్యా గంధేన. ఓం నమో భగవతే రుద్రాయ హిరణ్య రేతసే పరాయ పరమాత్మనే విశ్వరూపాయ ఉమాప్రియాయ నమః ఇత్యంజనాదినా అంజయేత్. తతః అదర్శ భక్ష్యాది దర్శయేత్. తతః కర్తా అచార్యాయ గాంబుత్విక్భ్యశ్చ దక్షిణాందద్యాత్. అధాచార్యః పత్యృచమాదౌ ప్రణవం వదన్ పురుష సూక్తే నస్తుత్వా వంశపాత్రే పంచవర్ణోదనేన దేవస్య నీరాజనం కారయిత్వా రుద్రాయ చతుష్ప థాదౌ దద్యాత్. మంత్రస్తు - ఓం నమో రుద్రాయ సర్వభూతాధిపతయే, దీప్త శూలధరాయ, ఉమాద యితాయ విశ్వాధిపతయే రుద్రాయవై నమో నమః శివమ గర్భితం కర్మాస్తు స్వాహా,ఇతి. అశ్వత్థపర్ణే భూతేభ్యో నమ ఇతి. కేచిదేత ద్రాత్రౌ స్థిరప్రతిష్ఠాయాం ఇచ్ఛంతి.

అను॥ ఆ పిదప దేవునకు నమస్కారముచేసి, ఓం దేవదేవేశ నీకు స్వాగతము, విశ్వరూప నీకు నమస్కారము. నీ సింహాసనము శుద్ధమైనదైనా మేము శుద్ధిని చేస్తాము. దానిని సహించు, అని ప్రార్థించి, ఉత్తిష్ఠ బ్రహ్మణ స్పతే అను మంత్రంతో ఋత్విక్కులతో కూడా లేచి, ఇది వరకు అగ్ని ఉత్తారణ చేయని పక్షంలో ఇప్పుడైనా చేయాలి. అగ్నిః సప్తిం అనే సూక్తమును అగ్ని పదం లేకుండా పఠించి, పిదప, తిరిగి అగ్నిపదంతో కూడా పఠించాలి. ఈ విధముగా వేయిపై ఎనిమిది మార్లు, నూట ఎనిమిది మార్లు లేదా ఇరువది ఎనిమిది మార్లు కాని చదువుతూ నీరు చల్లాలి. పిదప అర్చా విగ్రహాన్ని పన్నెండు మార్లు మట్టితో - నీటితో ప్రక్షాళన చేయాలి. మంత్రం చదువుతూ పంచగవ్యం చేసి, పయః పృథివ్యాం, ఆపోరాజానం, అను మంత్రము లతోను స్నానం చేయించి, అప్యాయస్వదధిక్రావ్ణః, తేజోఽసి, మధువాతా, ఆయంగౌః, అనుమంత్రములతో పంచామృతముతో స్నానం చేయించి, లింగం ఐన యెడల, నమస్తే రుద్రమన్యవే, అను ఎనిమిది మంత్రములతో స్నానం చేయించి, నేతితో అభ్యంజనము, ఉద్వర్తనముతో ఉద్వర్తనముచేసి, వేడినీటితో కడిగి గంధము పెట్టి, సంపాతపు నీటితో అభిషేకం చేసి, చిగురుటాకులు గలిగిన, నాలుగు కుంభములతో ఆపోహిష్ఠ అనే మూడు మంత్రాలు పఠిస్తూ, ఆకలశేషు అనేమంత్రం సముద్ర జ్యేష్ఠా అనే నాలుగు మంత్రాలతో ఆకలశేషు అనుదానితోను కలిపి స్నానం చేయించి, ఔదుంబర మొదలగునవి కలపీఠ మందు అర్చా విగ్రహమును కూర్చోబెట్టి చుట్టు ఎనిమిది దిక్కులందు నీరు కలిగిన కుంభములను ఉంచి, వానిలో గంధపుష్ప దూర్వలు వేసి, తొలి కలశమందు

సప్తమృత్తికలు వేసి, రెండవదానియందు పుష్కరం (మెట్టతామర లేదా కుష్ఠ) మోదుగశమీ, పుల్లవెలగ, అశ్మంతక (ముంజకు చెందింది నడుముకు కట్టునది)ము, వీని చర్మమును చిగుళ్ళను వేసి, మూడు మొ॥ ఆ తరువాతి కలశములందు సప్తధాన్యములు, పంచరత్నములు ఫల పుష్పాలు, కుశ, దూర్వ, గోరోచన, సంపాతోదక, సర్వ ఓషధులు వేసి క్రమంగా, ఆపోహిష్ఠ అను మూడు మంత్రాలతో, హిరణ్యవర్ణాః అను నాలుగు మంత్రాలతో పవమాన అనువాకంతో కూడా అభిషేకంచేసి, ఒక కుంభమందు శమి,పలాశ, వట, ఖదిర (చంద్ర) బిల్వ, అశ్వత్థ, వికంకత, పనస, అమ్ర, శిరీష, ఉదుంబర (మేడి) ములపల్లవములను, కషాయములను వేసి, అశ్వత్థేవః, అను మంత్రంతో అభిషేకంచేసి, పంచరత్నములు గల ఉదకంతో, హిరణ్య వర్ణాః అనుమంత్రంతో స్నానం చేయించి వస్త్రములు సమర్పించి, ఉపవీతం మొదలు దీపాంతము వరకు పూజ నిర్వర్తించి, హిరణ్యగర్భః, య ఆత్మదా, యః ప్రాణతః, యస్యేమే, యేనద్యౌః, యంక్రందసీ, ఆపోహయత్, యశ్చిదాపో అను మంత్రములతో ఎనిమిది పిండి దీపముల నుంచి బంగారు కడ్డీతో తైజసపాత్రయందున్న తేనె, నేయి తీసుకొని, చిత్రం దేవానాం, తేజోஉసి, అను మంత్రములతో, ఓం భగవంతుడవైన నీకు, శివునకు, హరునకు నమస్కారము, నమస్కారము. హిరణ్య రేతస్సు, విష్ణో, విశ్వరూప నీకు నమస్కారము,అని కూడా పఠించి కుడి, ఎడమలైన దేవనేత్రములందు మంత్రమును ఆవృత్తి చేస్తూ లిఖించాలి. అంజంతిత్వా అని కాటుకతో లేదా తేనెతో గుర్తుపెట్టి (వ్రాసి), దేవస్యత్వా సవితుః ప్రసవే - ఇంద్రస్యేంద్రియేణ లిఖిస్తున్నాను అని తేనె, నేయి, శర్కరలతో లిఖించి అదే కాటుకతో తిరిగి లిఖించాలి. ఇక్కడ గుర్తిస్తున్నాను అనేదిశేషము. స్థిరలింగమందైతే - బంగారు సూదితో గంధంతో, ఓం భగవంతునకు, రుద్రునకు, హిరణ్య రేతసునకు, పరునకు, పరమాత్మకు, విశ్వరూపునకు, ఉమాప్రియునకు నమస్కారము,నమస్కారము అని కాటుక మొదలగు వానితో గుర్తించాలి. పిదప అద్దము, భక్ష్యాదులు చూపించాలి. పిదప కర్త ఆచార్యునకు అవును ఋత్విక్కులకు దక్షిణను ఇవ్వాలి. పిదప ఆచార్యుడు ప్రతి ఋక్కుకు మొదట ప్రణవాన్ని పఠిస్తూ పురుష సూక్తంతో స్తుతిస్తూ వెదురు పాత్ర యందు ఐదురంగులు గల అన్నముతో దేవునకు నీరాజనం చేసి రుద్రునికొరకై చతుష్పథాదులందు ఉంచాలి. మంత్రమైతే- ఓం రుద్రునకు సర్వభూతాధిపతికి, దీప్తశూలమును ధరించినవానికి, ఉమా పతికి, విశ్వాధిపతికి, రుద్రునకు నమస్సులు, నమస్సులు, నమస్సులు. మంగళకరము, గర్హితముకాని, కర్మ ఈ స్వాహాకారము కానిమ్ము. (అందువల్ల ఇది సుహుతం కాని)అని. అశ్వత్థపర్ణమందు భూతములకు నమస్కారము,అని ఇవ్వాలి. దీనిని కొందరు రాత్రియందు స్థిరప్రతిష్ఠకాలమందే ఇష్టపడతారు.

మూ॥ అథ ఆచార్యః సర్వతోభద్రే దేవానా వాహయేత్. మధ్యే బ్రహ్మాణం, పూర్వాదిదిక్షు ఇంద్రాదిలోకపాలాన్, ఇశాన ఇంద్రాద్యంతరాలేషు వసూన్, రుద్రాన్, ఆదిత్యాన్, అశ్వినౌ, విశ్వాన్ దేవాన్, పితౄన్, నాగాన్, స్కందవృషౌ బ్రహ్మ ఈశానాద్యంతరాలేషు - దక్షం విఘ్నం, దుర్గాం,

స్వధాకారం, మృత్యురోగాన్, సముద్రాన్, సరితః, మరుతః, గణపతిం, చేతి. మధ్యే ఏవ పృథివీం మేరుంసంస్థాప్య దేవంచావాహ్య ప్రాగాదిక్రమేణ - వజ్రం, శక్తిం, దండం, ఖడ్గం, పాశం, అంకుశం, గదాం, శూలం, తద్బాహ్యే - గౌతమం, భరద్వాజం, విశ్వా మిత్రం, కశ్యపం, జమదగ్నిం వసిష్ఠ మత్రి, మరుంధతీం చ, తద్బాహ్యే - నవగ్రహాన్, తద్బాహ్యే - ఐంద్రీం, కౌమారీం బ్రాహ్మీం, వారాహీం, చాముండాం, వైష్ణవీం, మాహేశ్వరీం, వైనాయకీమితి ఏతాః నామభిరావాహ్య సంపూజ్య అర్చాయాం దేవం తన్మంత్రేణావాహ్య మండలమధ్యే అర్చాం, సుప్రతిష్ఠో భవ, ఇతి నివేశ్య సంపూజ్య వహ్నౌ మండల దేవతానాం నామభిః తిలాజ్యేన దశదశాహు తీర్హుత్వా పుష్పాంజలిం సమర్ప్య నమో మహాత్ ఇతి దేవం నత్వా మండలాదుత్తరతః స్వస్తికే మంచకం తదుపరిశయ్యాం కృత్వా ఉత్తిష్ఠ ఇతి దేవముత్థాప్య మంగళఘోషైః శయ్యాయాం దేవమారోప్య పురుష సూక్త ఉత్తర నారాయణాభ్యాం స్తుత్వా దేవేన్యా సంకుర్యాత్. పురుషాత్మనే నమః. ప్రాణాత్మనే నమః, ప్రకృతితత్వాయనమః, బుద్ధితత్వాయ నమః అహంకారతత్వాయనమః, మనస్తత్వాయ నమః ఇతి సర్వాంగే. తద్యథా- ప్రకృతితత్వాయ నమః. బుద్ధితత్వాయనమః - హృది శబ్దతత్వాయనమః - శిరసి స్పర్శతత్వాయనమః - త్వచి రూపతత్వాయనమః హృది ఏవం హృద్యేవరసగంధ శ్రోత్ర త్వక్ చక్షుర్ జిహ్వా ప్రాణవాక్ పాణిపాద పాయూపస్థ పృథివ్యప్తేజో వాయ్వాకాశ సత్వరజస్తమో దేహతత్వా ని విన్యసేత్. తతః పురుష సూక్తాద్యం ఋగ్ద్వయం కరయోః తదుత్తరం జానునోః తదుత్తరం కట్యోః,తం యజ్ఞం ఇతి తిస్రః నాభిహృత్కంఠేషు, తస్మాదశ్వా ఇతి ద్వయం బాహ్వోః, బ్రాహ్మణోఽస్య ఇతి ద్వయం నాసయోః, నాభ్యా ఇతి ద్వయమక్ష్ణోః అంత్యాం శిరసి. కేచిత్త త్వన్యాస మన్యథా ఆహుః పురుష ప్రకృతి మహంకారతత్వాని, శబ్దస్పర్శ రూపరస గంధ తన్మాత్రాణి, ఆకాశవాయు తేజో పృథివీ శ్రోత్రత్వక్ చక్షు రసనాఘ్రాణవాక్పాణి పాద పాయూపస్థ మనస్తత్వా నీతి. కేచిదేతాని స్థిరలింగాదా వేవేచ్ఛంతి. తతః సుఖశాయీభవ ఇతి శయ్యాయాం దేవం స్వాప యిత్వా మండల శయ్య యోరం తరాలే నగంతవ్యమితి ప్రైషం దత్వా స్విష్ట కృదాది హోమశేషం సమాప్య మండల దేవతాభ్యో నామభిః పాయసేన చరుణావా బలిం దద్యాత్. నీవార చరుశేషేణ దిగ్బలిం. నేదం స్థిర ప్రతిష్ఠా యాం. స్థిరలింగా దౌత్వయం విశేషః. అగ్నిస్థాపన హోమ వర్జ్యం సర్వం పూర్వవత్ కృత్వా ఇదా నీమగ్ని స్థాపనం కృత్వా పూర్వోక్త హోమం కుర్యాత్ నాత్ర నైవారశ్చరుః

అను॥ ఇక ఆచార్యుడు సర్వతో భద్రమందు దేవతలను ఆవాహన చేయాలి. మధ్యయందు బ్రహ్మను, తూర్పు మొదలగు, దిక్కులందు ఇంద్రుడు మొదలగు లోకపాలురను, ఈశాన ఇంద్రాదుల మధ్యలో, వసువులను, రుద్రులను, ఆదిత్యులను, అశ్వినులను, విశ్వేదేవతలను, పితరులను, నాగులను, స్కందవృషలను, బ్రహ్మఈశానాదుల మధ్యలో దక్షుని, విష్ణువును, దుర్గను, స్వధాకారుని, మృత్యురోగములను, సముద్రములను, నదులను, మరుత్తులను, గణపతిని, కూడా,అని. మధ్యలోనే పృథివిని, మేరువును, ఉంచి దేవుని కూడా ఆవాహనచేసి తూర్పు మొదలగు క్రమంలోనే వజ్రము, శక్తి, దండము, ఖడ్గము, పాశము, అంకుశము గద, శూలము వీనిని ఆవాహన చేసి దానికవతల గౌతముని, భరద్వాజుని, విశ్వామిత్రుని, కశ్యపుని, జమదగ్నిని, వసిష్ఠుని, అత్రిని, అరుంధతిని కూడా ఆవాహనచేసి, దానికివతల నవగ్రహాలను, దానికివతల ఐంద్రికౌమారి, బ్రాహ్మి, వారాహి,

చాముండ, వైష్ణవి, మాహేశ్వరి, వైనాయకి అని వీరిని నామమంత్రముల (పేర్ల)తో ఆవాహన చేసి, పూజించి, అర్చావిగ్రహమందు దేవుని ఆతని మంత్రముతో అవాహనచేసి మండల మధ్యమందు అర్చావిగ్రహమును, సుప్రతిష్ఠి తుడిగాఉండు, అని ఉంచి, పూజించి,అగ్నియందు మండలదేవతల నామమంత్రములతో తిలలతో నేయితో పదేసి ఆహుతులు హోమంచేసి, పుష్పాంజలిని సమర్పించి, నమో మహత్ అను మంత్రంతో దేవుని నమస్కరించి మండలమునకు ఉత్తర భాగంలో స్వస్తికముపై మంచమును, దానిపై శయ్యను ఏర్పరచి, ఉత్తిష్ఠ అను మంత్రంతో దేవుని లేపి మంగళ వాద్యములతో శయ్యయందు దేవుని ఉంచి పురుష సూక్త, ఉత్తర నారాయణ సూక్తములతో స్తుతించి దేవుని యందు న్యాసముంచాలి. పురుషాత్మకు నమస్కారము. ప్రాణాత్మకు నమస్కారము. ప్రకృతి తత్వమునకు నమస్కారము. బుద్ధితత్వమునకు నమస్కారము. అహంకారతత్వమునకు నమస్కారము. మనస్తత్వమునకు నమస్కారము అని సర్వాంగములందు న్యాసము. అదెట్లా అంటే- ప్రకృతితత్వమునకు నమస్కారము, బుద్ధితత్వమునకు నమస్కారము అని హృదయమందు న్యాసము. శబ్దతత్వమునకు నమస్కారము అని శిరస్సు యందు, స్పర్శతత్వమునకు నమస్కారము అని చర్మమందు, రూపతత్వమునకు నమస్కారము అని హృదయమందు ఈ విధముగా హృదయమందే రసగంధ శ్రోత్రత్వక్ చక్షుర్ జిహ్వా ప్రాణవాక్ పాణి పాదపాయూపస్థ పృథివ్యప్తేజో వాయ్వాకాశ సత్త్వరజస్తమో దేహతత్వములను న్యాసం చేయాలి. పిదప పురుష సూక్తము తొలి రెండు ఋక్కులు కరములకు, ఆ తరువాతివి జానువులకు, ఆ తరువాతవి కటి భాగములకు తం యజ్ఞం అని మూడు మంత్రాలు నాభిహృత్కంఠములందు, తస్మాదశ్వా అని రెండు మంత్రాలు బాహువులకు, బ్రాహ్మణోస్య అనే రెండు నాసికలకు నాభ్యా అని రెండు కళ్ళకు, చివరిది శిరస్సు యందు న్యాసముంచాలి. కొందరు తత్వన్యాసమును మరో రకంగా చెప్పారు. పురుష ప్రకృతిని, అహంకారతత్వములు, శబ్దస్పర్శ రూపరసగంధ తన్మాత్రలు, ఆకాశ వాయుతేజో అప్ పృథివి, శ్రోత్రత్వక్ చక్షురసన ఘ్రాణ, వాక్పాణిపాద పాయూపస్థ మనస్తత్వములు అని. కొందరు వీనిని స్థిరలింగము మొదలగు వానియందే ఇష్టపడుతారు. ఆ పిదప, హాయిగా నిద్రించు, అని శయ్యయందు దేవుని నిద్రపుచ్చి, మండల శయ్యల మధ్యలో వెళ్ళరాదు అని ఆజ్ఞ ఇచ్చి స్విష్టకృద్ మొదలగు హోమ శేషమును సమాప్తి చేసి మండల దేవతలకు పేర్లతో పాయసంతోకాని చరువుతోకాని బలిని ఇవ్వాలి. నీవార చరుశేషముతో దిక్కుల బలి నాచరించాలి. స్థిర ప్రతిష్ఠ యందు ఇది కాదు స్థిరలింగము మొ॥వాటి యందైతే విశేషమిట్లా – అగ్నిస్థాపన, హోమం ఇవి తప్ప మిగిలినదంతా పూర్వం వలెనే చేసి, ఇప్పుడు అగ్నిస్థాపన చేసి ముందు చెప్పిన హోమాన్ని చేయాలి. ఇక్కడ నీవార (ధాన్యపు) చరువు లేదు.

మూ॥ విష్ణుశ్చేత్ పూర్వోక్త హోమం కృత్వా పురుష సూక్తేన ప్రత్యృచ మాజ్యం హుత్వా, ఇదం విష్ణుః, ఇతిపాదౌ స్పృష్ట్వా పునస్తా ఏవహుత్వా,విష్ణోర్నుకం ఇతినాభిం స్పృశేత్. పునస్తా

ఏవ హుత్వా అతో దేవా ఇతి శిరః స్పృష్ట్వా పునస్తా ఏవహుత్వా పురుష సూక్తేన సర్వాంగం స్పృశేత్. స్థిరలింగంచేత్ అగ్నిస్థాపనాది పూర్వోక్త సమిధాజ్య తిలాహుతీర్ హుత్వా, యాత ఇషు ఇత్యనువాకాంతం, ద్రాపే, సహస్రాణి, ఇత్యనువాకాభ్యాం ప్రత్యృచ మాజ్యం హుత్వా, సర్వో వైరుద్రః, ఇతి మూలం స్పృశేత్. పునస్తా ఏవ హుత్వా కద్రుద్రాయ ఇతి మధ్యమం, పునస్తా ఏవ హుత్వా నమో హిరణ్యబాహవే – ఇత్యగ్రం, పునస్తా ఏవహుత్వా, సర్వరుద్రేణ సర్వాంగం స్పృశేత్. తతో, ధామంత ఇతి పూర్ణాహుతిం జుహుయాన్నవా. ఏవ మధి వాసనం కృత్వా పరేద్యుః సద్యోవా పీఠికాం స్నాపయిత్వా, మహీమూషు, ఇత్యావాహ్య, అదితిర్ద్యౌః ఇతిస్తుత్వా హ్రీంనమః ఇతి సంపూజ్య తేనైవ పూర్ణాహుతిం హుత్వా, ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే, ఇతిదేవముత్థాప్య పుష్పాంజలిం దత్వా పురుష సూక్తేనస్తుత్వా ఉదుత్యమిత్యుత్థాప్య, కనిక్రదత్ ఇతిసూక్తేన విష్ణుం, సద్యోజాతం, ఇతి పంచానువాకైః లింగం గృహం ప్రవేశ్య పీఠికాయాం ఇంద్రాది నామభిరష్టరత్నాని క్షిప్త్వా సప్తధాన్యరూప్య వృషమనః శిలాః క్షిప్త్వా పాయసేన సంలిప్య ప్రణవేనాంగన్యా సంకృత్వా సువర్ణ శలాకామంతరితాం కృత్వా సులగ్నే ప్రతిష్ఠ పరమేశ్వర ఇత్యుక్త్వా అతోదేవా ఇతి విష్ణుం రుద్రేణ చ లింగం స్థాపయేత్.

అను॥ విష్ణు విగ్రహమైనచో ముందు చెప్పిన హోమాన్ని చేసి పురుష సూక్తంతో ప్రతి ఋక్కును ఆజ్యంతో హోమం చేసి, ఇదం విష్ణుః అనే మంత్రంతో పాదములు స్పృశించి తిరిగి వాటితోనే హోమంచేసి విష్ణోర్నుకం అను మంత్రంతో నాభిని స్పృశించాలి. తిరిగి వానినే హోమంచేసి అతోదేవాః అనే దానితో తలను స్పృశించి, తిరిగి వానినే హోమంచేసి, పురుషసూక్తముతో సర్వాంగమును స్పృశించాలి. స్థిరలింగమైనట్టైతే అగ్ని స్థాపన మొదలగు ముందు చెప్పిన సమిధ ఆజ్యతిల ఆహుతులను హోమంచేసి, యాతఇషు, అనే అనువాకం చివరదాకా, ద్రాపే,, సహస్రాణి అను అనువాకములతో ప్రతి ఋక్కుతో ఆజ్య హోమంచేసి, సర్వో వైరుద్రః అనుమంత్రంతో మూలమును స్పృశించాలి. తిరిగి వానినే హోమంచేసి కద్రుద్రాయ అని మధ్యమమును (స్పృశించి) తిరిగి వానినే హోమంచేసి, నమో హిరణ్య బాహవే అని అగ్రభాగమును స్పృశించి, తిరిగి వానినే హోమంచేసి,సర్వరుద్రేణ, అనుదానితో సర్వాంగమును స్పృశించవలెను. ఆ పిదప, ధామంతమను దానితో పూర్ణాహుతిని హోమం చేసినాసరే, లేకున్నాసరే. ఈ విధంగా అధివాసనం చేసి తరువాతి రోజు లేదా అప్పుడే పీఠికను స్నానం చేయించి, మహీమూషు అనుదానితో ఆవాహనచేసి, అదితిర్ద్యౌః,అని స్తోత్రంచేసి, హ్రీం నమః అని పూజించి, దానితోనే పూర్ణాహుతిని హోమంచేసి, ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే అనుదానితో దేవునిలేపి, పుష్పాంజలిని ఇచ్చి పురుష సూక్తంతో స్తుతించి, ఉదుత్యం అనుదానితో లేపి,కనిక్రదత్ అనుసూక్తంతో విష్ణువును, సద్యోజాతం, అను ఐదు అనువాకములతో లింగమును ఇంట్లో ప్రవేశింపచేసి పీఠమందు ఇంద్రాదుల పేర్లతో ఎనిమిది రత్నములను ఉంచి, సప్తధాన్యములను, రూప్యము (వెండి), వృష, మనఃశిలలను ఉంచి పాయసం, పూసి ప్రణవంతో అంగన్యాసముచేసి బంగారు కడ్డీని మధ్యలో ఉంచి, మంచి లగ్నమందు పరమేశ్వర ప్రతితిష్ఠ, అని పలికి అతోదేవా అను మంత్రంతో విష్ణువును, రుద్రముతో లింగమును స్థాపించాలి.

మూ॥ **తతః ప్రాణప్రతిష్ఠా.** చలార్చా దౌత్వధివాసనాంతే పరేద్యుః ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే, ఇతి దేవముత్థాప్య పురుషసూక్త ఉత్తర నారాయణాభ్యాం స్తుత్వా ఘృతే వ్రీహి చరుంకృత్వాత ద్దేవతా మంత్రేణ దశాహుతీర్హుత్వా నామభిః జుహుయాత్. అగ్నయేస్వాహా. సోమాయస్వాహా. ధన్వంతరయే స్వాహా. కుహ్వైస్వాహా. అనుమత్యైస్వాహా. ప్రజాపతయే స్వాహా, బ్రహ్మణే స్వాహా, అగ్నయే స్వాహా, సోమాయస్వాహా, అగ్నయే అన్నాదాయ స్వాహా, అగ్నయే అన్నపతయేస్వాహా, ప్రజాపతయే స్వాహా, విశ్వేభ్యోదేవేభ్యఃస్వాహా, సర్వేభ్యో దేవేభ్యః స్వాహా, భూర్భువః స్వః స్వాహా. అగ్నయే స్విష్టకృతే స్వాహా,ఇతి. తతఃసప్తతే అగ్నే, పునస్త్వా ఇత్యాభ్యాం పూర్ణాహుతిః. తత ఆచార్యో యా ఓషధీః, ఇతి పుష్పఫల సర్వౌషధీః సమర్ప్య సంపాతోదకం తామ్రపాత్రం ఆదాయదేవమంత్రేణ శతవారమభిమంత్ర్య తేనైవాభిషించేత్. తతః ఉత్తిష్ఠే ఇతి దేవముత్థాప్య, విశ్వతశ్చక్షుః ఇత్యుపస్థాయ దేవంధ్యాత్వాజపేత్. బ్రహ్మణేనమః. ఏవం విష్ణవే నమః, రుద్రాయ నమః , తతః ఇంద్రాదీన్ అష్టావసుభ్యో రుద్రేభ్య ఆదిత్యేభ్యోశ్విభ్యాం మరుద్భ్యః కుబేరాయ గంగాది మహానదీభ్యో అగ్నీషో మాభ్యాం ఇంద్రాగ్నిభ్యాం ద్యావాపృథివీభ్యాం ధన్వంతరయే సర్వేశాయ విశ్వేభ్యోదేవేభ్యో బ్రహ్మణే నమ ఇతి. తతః సంపాతోదకేనయజమానమభిషిచ్య దేవంధ్యాత్వా ఓం ప్రతితిష్ఠ పరమేశ్వర, ఇతి పుష్పాంజలిం నివేద్య సచ్చిదానందం బ్రహ్మైవ భక్తానుగ్రహాయ గృహీతవిగ్రహం కరచరణాద్యవయ వినం శంఖచక్రాద్యాయుధ వంతం నిజవాహనాద్యుపేతం నిజహృత్కమలే అవస్థితం సర్వలోక సాక్షిణం అణీయాంసం, పరమేష్వసి పరమాంత్రియం గమయ, ఇతి మంత్రేణ పుష్పాంజలా వాగతం విభావ్యాఒర్చాయాం విన్యస్య ప్రాణ ప్రతిష్ఠాం కుర్యాత్.

అను॥ పిదప ప్రాణప్రతిష్ఠ. కదిలే విగ్రహములు మొదలగు వానియందు ఐతే అధివాసనం చివర తరువాతి రోజున, ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే, అని దేవునిలేపి పురుష సూక్త ఉత్తరనారాయణ సూక్తములతో స్తుతించి నేయియందు (తో) వ్రీహి చరువును చేసి, ఆ దేవతా మంత్రంతో, పది ఆహుతులు హోమంచేసి పేర్లతో హోమంచేయాలి. అగ్నికి స్వాహ సోమునకు స్వాహ. ధన్వంతరికి స్వాహ కుహుకుస్వాహ అనుమతికి స్వాహ. ప్రజాపతి కొరకు స్వాహ. బ్రహ్మకొరకు స్వాహ అగ్నికి స్వాహ. సోమునకు స్వాహ అగ్నికి అన్నాదునకు స్వాహ. అగ్నికి అన్నపతికి స్వాహ ప్రజాపతికి స్వాహ. విశ్వేదేవతలకు స్వాహ. దేవత లందరికి స్వాహ భూఃభువః స్వః స్వాహా. అగ్నికి స్విష్టకృత్తునకు స్వాహ అని పిదప సప్తతే అగ్నే, పునస్త్వా అను మంత్రాలతో పూర్ణాహుతి. పిదప ఆచార్యుడు యాఓషధీః అనేమంత్రంతో పుష్ప ఫల సర్వ ఓషధులను సమర్పించి సంపాతోదకము (గల) తామ్ర పాత్ర తీసుకొని దేవమంత్రముతో నూరుమార్లు అభిమంత్రించి దానితోనే అభిషేకం చేయాలి.పిదప, ఉత్తిష్ఠ,అనుమంత్రంతో దేవునిలేపి,విశ్వతః చక్షుః అను దానితో దగ్గర ఉంచి,దేవుని ధ్యానించి జపించాలి.బ్రహ్మకు నమస్కారము.ఇట్లాగే విష్ణువునకు నమస్కారము, రుద్రునకు నమస్కారము. పిదప ఇంద్రాదులకు, ఎనిమిది మంది వసువులకు రుద్రులకు ఆదిత్యులకు అశ్వినీ దేవతలకు మరుత్తులకు, కుబేరునకు గంగాది మహానదులకు అగ్నీషోములకు (ఇద్దరు) ఇంద్రాగ్నులకు ద్యావాపృథివులకు ధన్వంతరికి సర్వేశునకు విశ్వేదేవతలకు బ్రహ్మకు

నమ్మస్సు అని.పిదప సంపాతోదకముతో యజమానిని అభిషేకించి, దేవుని ధ్యానించి, ఓం|ప్రతితిష్ఠ పరమేశ్వర అని పుష్పాంజలిని అర్పించి సచ్చిదానందబ్రహ్మయే భక్తులపై అనుగ్రహించేకొరకు రూపం ధరించిన కాళ్ళు చేతులు మొదలగు అవయవములు గల,శంఖచక్రాదిఆయుధములు గల,తన వాహనాదులతో కూడిన, తన హృదయ కమలంలో ఉన్న, సర్వలోకసాక్షియైన,అణీయుడైన,పరమేష్ఠివి ఉన్నావు.పరమశ్రీని పొందింపచేయి అని మంత్రంతో పుష్పాంజలి యందు వచ్చిన వానినిగా భావించి అర్చాయందు ఉంచి (పూజలో) ప్రాణప్రతిష్ఠ చేయాలి.

**మూ॥ యథా – అస్యశ్రీప్రాణప్రతిష్ఠామంత్రస్య బ్రహ్మావిష్ణురుద్రా ఋషయః ఋగ్యజుః సామాని ఛందాంసి క్రియామయవపుః ప్రాణాఖ్యా దేవతా ఆంబీజం. క్రోంశక్తిః ప్రాణ ప్రతిష్ఠాయాం వినియోగః. తతో ఋష్యాదీన్ క్రమేణ శిరోముఖ హృదయగుహ్యాపాదేషు విన్యస్య ఓం కం ఖం గం ఘం ఙం అం పృథివ్యప్తేజో వాయ్వాకాశాత్మనే ఆం హృదయాయ నమః. ఓం చం ఛం జం ఝం ఞం ఇం శబ్దస్పర్శ రూపరస గంధాత్మనే ఈం శిరసే స్వాహా. ఓం టం ఠం డం ఢం ణం ఉం శ్రోత్రత్వక్ చక్షుర్ జిహ్వాఘ్రాణాత్మనే ఊం శిఖాయైవషట్ ఓం తం థం దం ధం నం ఏం వాక్పాణిపాద పాయూపస్థాత్మనే ఐం కవచాయ హుం. ఓం పం ఫం బంభం మం ఓం వచనా దానవిహారణోత్సర్గా నందాత్మనే ఔం నేత్రత్రయాయ వౌషట్. ఓం యం రం లం వం శం షం సం హం లం క్షం అం మనో బుద్ధ్యహం కారచిత్తాత్మనేఅః అస్త్రాయఫట్. ఏవం ఆత్మని దేవేచ కృత్వా దేవం స్పృష్ట్వా జపేత్ ఓం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం సః దేవస్య ప్రాణా ఇహా ప్రాణాః ఓం ఆం హ్రీం క్రోం అం యం రం లం వం శం షం సంహం సఃహంసః దేవస్య జీవ ఇహ స్థితః. ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం సః దేవస్య సర్వేంద్రియాణి. ఓం ఆం హ్రీం క్రోం అం యం రం లం వం శం షం సం హం సః దేవస్య వాఙ్ మనశ్చక్షుః శ్రోత్రఘ్రాణప్రాణాఇహాగత్య స్వస్తయే సుఖేన సుచిరం తిష్ఠంతు స్వాహేతి. తతో అర్చాహృద్యంగుష్ఠం దత్వా జపేత్ – అస్యై ప్రాణాః ప్రతిష్ఠంతు అస్యై ప్రాణాః క్షరంతు చ అస్యై దేవత్వ మర్చాయైమామహేతి చ కశ్చన,ఇతి. తతః ప్రణవేన సంరుధ్య సజీవంధ్యాత్వా, ధ్రువాద్యౌః,ఇతి ఋచం జప్త్వాకర్ణే గాయత్రీం దేవమంత్రం చ జప్త్వా పురుష సూక్తే నోపస్థాయ పాదనాభి శిరః సు స్పృష్ట్వా ఇహైవైధి, ఇతి త్రిర్జపేత్.**

అను॥ ఎట్లనగా – ఈ ప్రాణ ప్రతిష్ఠ మంత్రమునకు బ్రహ్మ విష్ణురుద్రులు ఋషులు, ఋగ్యజుస్ సామములు ఛందములు, క్రియామయ శరీరము, ప్రాణమనునది దేవత, ఆం బీజము, క్రోంశక్తి. ప్రాణప్రతిష్ఠయందు వినియోగము. పిదప ఋష్యాదులను క్రమంగా శిరస్సు ముఖము హృదయ గుహ్య పాదములు వీనియందుంచి ఓం కం ఖం గం ఘం ఙం అం పృధివ్యప్‌తేజో వాయు ఆకాశాత్మగా గల ఆం హృదయమునకు నమస్సులు. ఓం చం ఛం జం ఝం ఞం ఇం శబ్ద స్పర్శ రూప రస గంధాత్మగా గల ఈం శిరస్సునకు స్వాహా. ఓం టం ఠం డం ఢంణం ఉం శ్రోత్ర త్వక్ చక్షుర్ జిహ్వాఘ్రాణాత్మయైన ఓం శిఖా

కొరకు వషట్. ఓం తం ధం దం ధం నం ఏం వాక్ పాణి పాద పాయు ఉపస్థ ఆత్మగా గల ఐం కవచాయ (మునకు) హుం. ఓం పం ఫం బం భం మం ఓం వచన, ఆదాన విహరణ, ఉత్సర్గ ఆనందముల ఆత్మగా గల ఔం నేత్రత్రయమునకు వౌషట్. ఓం యం రం లం వం శం షం సం హం లం క్షం అం మనోబుద్ధి అహంకార చిత్తముల ఆత్మగా గల అః అస్త్రాయ (ముకొరకు) ఫట్. ఈ విధముగా తనయందు దేవుని యందును చేసి దేవుని స్పృశించి జపించాలి. ఓం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం సః దేవుని ప్రాణములే ఇక్కడ ప్రాణములు. ఓం ఆం హ్రీం క్రోం అం యం రం లం వం శం షం సం హం సః దేవుని జీవమే ఇక్కడ ఉంది. ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం సః దేవుని సర్వేంద్రియములు. ఓం ఆం హ్రీం క్రోం అం యం రం లం వం శం షం సం హం సః దేవుని వాక్ మనస్ చక్షుస్ శ్రోత్ర ఘ్రాణ ప్రాణములు ఇక్కడికి వచ్చి స్వస్తి కొరకు సుఖంగా సుచిరకాలము ఉండని స్వాహా అని. పిదప అర్చావిగ్రహం హృదయ మందు అంగుష్ఠమును ఉంచి జపించాలి. దీనికి ప్రాణములు ఉండని దీనికి ప్రాణములు సంచరించని, ఈ అర్చా విగ్రహమునకు దేవత్వము కలగని దీని అర్చకొరకు నన్నెవరు కూడా అడ్డగించకుందురుగాక, అని. పిదప ప్రణవంతో అడ్డగించి సజీవమైన దానినిగా ధ్యానించి ధ్రువాద్యౌః అను మంత్రమును (ఋక్కును)జపించి కర్ణమందు గాయత్రిని దేవ మంత్రమును జపించి పురుష సూక్తంతో ఉపస్థానము చేసి పాదనాభి శిరస్సులు స్పృశించి ఇహైవ వైధి, అను మంత్రాన్ని మూడు మారులు జపించాలి.

మూ॥ తతఃకర్తా – స్వాగతం దేవదేవేశ మద్భాగ్యాత్త్వ మిహాగతః. ప్రాకృతం త్వమ దృష్ట్వా మాం బాల వత్పరిపాలయ. ధర్మార్థ కామసిద్ధ్యర్థం స్థిరోభవ శుభాయనః, సాన్నిధ్యంతు సదా దేవస్వార్చాయాం పరికల్పయ. యావ చ్చంద్రావనీ సూర్యాః తిష్ఠం త్య ప్రతిఘాతినః, తావత్త్వ యాత్ర దేవేశ స్థేయంభక్తాను కంపయా భగవన్ దేవదేవేశత్వం పితా సర్వదేహినాం, యేన రూపేణ భగవన్ త్వయా వ్యాప్తం చరాచరం. తేన రూపేణ దేవేశ స్వార్చాయాం సన్నిధోభవ, ఇతినమేత్. ఏతదంతం సర్వదేవానాం సమానం. దేవమంత్రశ్చ మూలమంత్రో వైదికోవాగ్రాహ్యః అథాచార్యః కర్తావా లింగమర్చాంవా ఓం భూః పురుష మావాహయామి, ఓం భువః పురుష మావాహయామి, ఓం సువః పురుష మావాహయామి. ఓం భూర్భువఃసువః పురుష మావాహయా మీత్యావాహ్య ప్రణవేన ఆసనందత్వాతే నైవ దూర్వాశ్యామాకవిష్ణుక్రాంతా పద్మమిశ్రంపాద్యం. ఇమా ఆపః శాంతా శ్శివాశివతమాః పూతా పూత తమామేధ్యామేధ్య తమా అమృతా అమృతరసాః పాద్యా ఆచమనీయా అర్ఘ్యాస్తాజుషన్తాం ప్రతిగృహ్యంతాం ప్రతిగృహ్ణాతు భగవాన్ మహా విష్ణుః, విష్ణవే నమః, ఇతి పాద్యం, భగవాన్ మహాదేవో రుద్రాయనమః ఇతి లింగే, ఏవందేవతాం తరేషూహ్యం. ఇమా ఆపః ఆచమనీయాస్తా జుషతాం, ఇతి ఏలాలవంగకం కోల కర్పూరమిశ్రమా చమనీయం, ఆపః క్షీరకుశాగ్రైశ్చాక్షతైః యవతండులైః, యవైః సిద్ధార్థకైశ్చైవ అర్ఘ్యా ఇత్యర్ఘ్యం. తతో వేదమంత్రైః సంస్థాప్య ప్రణవేన చ రత్నాం బుకలశేన సంస్నాప్య ఇదం విష్ణుః, ఇతి విష్ణౌ, నమో అస్తు నీలగ్రీవాయ, ఇతి లింగే ప్రతిసరం విస్రంస్య వస్త్రం యజ్ఞోపవీతం చ దత్వా –

అను॥ ఆ పిదప కర్త – ఓ దేవదేవేశ స్వాగతము. నా భాగ్యం వల్ల నీవు ఇక్కడికి వచ్చావు. నన్ను ప్రాకృతునిగా భావించకుండా నీవు బాలునివలె పరిపాలించు. ధర్మార్థ కామ సిద్ధి కొరకు మాకు శుభం జరిగే కొరకు స్థిరంగా ఉండు.ఓ దేవ నా అర్చా విగ్రహమందు ఎల్లప్పుడు సన్నిధిని పరికల్పించు (ఉండు). చంద్రుడు, భూమి, సూర్యుడు వీరు ఎదురు లేకుండా ఎంత వరకుంటారో అంతకాలం నీవు ఇక్కడ ఉండాలి, ఓ దేవేశ, భక్తులపై అనుగ్రహం చూపే కొరకు, ఓ భగవన్, దేవదేవేశ, నీవు ప్రాణులందరికి తండ్రివి ఓ భగవన్, నీవు ఏ రూపంతోనైతే చరాచరమందు వ్యాపించి ఉన్నావో అదే రూపంతో, ఓ దేవేశ,నా అర్చా విగ్రహమందు సన్నిధిలో ఉండు, అని నమస్కరించాలి. ఇంతవరకు అన్ని దేవతలకు సమానము. దేవమంత్రమునైతే మూల మంత్రమో వైదికమో గ్రహించాలి. పిదప ఆచార్యుడు కాని కర్తగాని లింగమును కాని అర్చా విగ్రహమునుకాని ఓం భూః పురుషుని ఆవాహిస్తున్నాను, ఓం భువః పురుషుని ఆవాహిస్తున్నాను. ఓం సువః పురుషుని ఆవాహిస్తున్నాను. ఓం భూర్భువః సువః పురుషుని ఆవాహిస్తున్నాను అని ఆవాహన చేసి ప్రణవముతో ఆసనం సమర్పించి దానితోనే దూర్వాశ్యామాక(తృణధాన్యం) విష్ణుక్రాంత పద్మ మిశ్రితమైన పాద్యము, ఈనీరు, శాంతమైనది, శివమైనది, శివతమమైనది, పూతమైనది, పూతతమమైనది, పవిత్రమైనది, మేధ్యతమమైనది అమృతమైనది,అమృతరసముకల పాద్య, ఆచమనీయ అర్ఘ్యములను వానిని సేవించండి స్వీకరించండి, భగవాన్ మహా విష్ణువు స్వీకరించని మహావిష్ణువునకు నమస్కారము,అని పాద్యము. భగవాన్ మహాదేవుడు ఐన రుద్రునకు నమస్సులు, అని లింగమందు, అట్లాగే ఇతర దేవతలందు ఊహించుకోవాలి. ఈ నీరు ఆచమనీయము వానిని సేవించండి, అని ఏలాలవంగకంకోల కర్పూర మిశ్రిత మైన ఆచమనీయము, నీరు, పాలు, కుశాగ్రములు అక్షతలు యవ, బియ్యము యవలు తెల్ల ఆవాలు వీనితో అర్ఘ్యము అని అర్ఘ్యము. ఆ పిదప వేదమంత్రములతో స్థాపించి ప్రణవంతో రత్నములు నీరు గల కలశంతో స్నానం చేయించి ఇదం విష్ణుః అని విష్ణువు యందు, నమో అస్తు నీల గ్రీవాయ, అని లింగమందు ప్రతిసరమును వదలి వస్త్రము, యజ్ఞోపవీతమును కూడా ఇచ్చి –

మూ॥ ఇమే గంధాః శుభాః దివ్యాః సర్వగంధై రలంకృతాః పూతాః బ్రహ్మ పవిత్రేణ పూతాః సూర్యస్యరశ్మిభిః, ఇతి గంధం. ఇమేమాల్యాః శుభాః దివ్యాః సర్వమాల్యైరలం కృతాః పూతాః బ్రహ్మపవిత్రేణ పూతాః సూర్యస్య రశ్మిభిః ఇతిమాల్యం ఇమే పుష్పాః శుభాః దివ్యాః సర్వగంధై రలంకృతాః, పూతా బ్రహ్మ పవిత్రేణ పూతా సూర్యస్య రశ్మిభిః,ఇతి పుష్పం. వనస్పతి రసోద్భూతో గంధాఢ్యో గంధ ఉత్తమః, ఆఘ్రేయః సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతాం ఇతి ధూపం, జ్యోతిః శుక్రశ్చతేజశ్చ దేవానాం సతతంప్రియః, భాస్వరః సర్వభూతానాం దీపోఽయం ప్రతిగృహ్యతాం, ఇతి దీపం దత్వా విష్ణో సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నా నిరుద్ధ పురుషోత్తమాధోక్షజ నృసింహాచ్యుత జనార్దనోపేంద్ర హరికృష్ణేతి ద్వాదశనామభిః కేశవాది ద్వాదశనామభిర్వా పుష్పాణి సమర్ప్యతై రేవతర్పణం కృత్వా పాయసఘృతాప్లుతపూర్ణశరావగుడౌదన హరిద్రౌదనాది, పవిత్రంతే

వితతం,ఇతినివేద్య సంకర్షణాది పూర్వోక్త నామభిః ద్వాదశ కృసరాహుతీః హుత్వాతే నైవ శార్జ్గిణేస్వాహా, శ్రియైస్వాహా, సరస్వత్యైస్వాహా, విష్ణవేస్వాహా ఇతి హుత్వా, విష్ణోర్నుకం వీర్యాణి, తదస్యప్రియమభిపాథో, ప్రతద్విష్ణుస్తవతే, పరోమాత్రయా తన్వా వృధానః, విచక్రమే పృథివీమేష ఏతాం, త్రిర్దేవ పృథివీ మేష ఏతాం ఇతి జుహుయాత్. పునః ద్వాదశనామభిః జుహుయాత్.

అను॥ ఈ గంధము శుభమైనది, దివ్యమైనది, అన్ని గంధములతో అలంకరింప బడినది. బ్రహ్మ పవిత్రతో పవిత్రమైనది, సూర్యకిరణములతో పవిత్రమైనది, అని గంధము ఇవ్వాలి. ఈ మాలలు శుభమైనవి, దివ్యమైనవి,అన్ని మాలలతో అలంకరింపబడినవి, బ్రహ్మ పవిత్రతో పవిత్రమైనవి. సూర్యరశ్మితో పవిత్రమైనవి, అని మాలలు ఇవ్వాలి. ఈ పుష్పములు శుభమైనవి దివ్యమైనవి సర్వగంధములతో అలంకరింపబడినవి. బ్రహ్మ పవిత్రతో పవిత్రమైనవి. సూర్యకిరణములతో పవిత్రమైనవి, అని పుష్పములు ఇవ్వాలి. వనస్పతి రసంతో పుట్టింది. గంధము కలది. ఉత్తమ గంధము. దేవతలందరికి ఆఘ్రాణించతగినది. ఈ ధూపమును స్వీకరించు అని ధూపమివ్వాలి. ఈ జ్యోతి శుక్రము తేజస్సు దేవతలకెల్లప్పుడు ప్రియమైనది ప్రాణులందరికి వెలుగైనది ఈ దీపమును స్వీకరించు,అని. దీపిమిచ్చి విష్ణువు యందు సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్న అని రుద్ధ పురుషోత్తమ అధోక్షజ నృసింహ అచ్యుత జనార్ధన ఉపేంద్రహరి, కృష్ణ అని పన్నెండు పేర్లతో కేశవ మొదలగు పన్నెండు పేర్లతో గాని పుష్పములు సమర్పించి వానితోనే తర్పణం చేసి పాయసము,నేయి కలిపిన మూకుడు నిండుగా ఉన్న బెల్లపు అన్నము చిత్రాన్నము మొదలగునవి, పవిత్రంతే వితతం, అను మంత్రంతో నివేదన చేసి, సంకర్షణాది ముందు చెప్పిన పేర్లతో పన్నెండు మార్లు కృసర ఆహుతులు ఇచ్చి (చిత్రాన్నము) దానితోనే శార్జ్గికి, శ్రీకి, సరస్వతికి, విష్ణువునకు స్వాహా అని హోమంచేసి, విష్ణోర్నుకం వీర్యాణి, తదస్యప్రియమభి పాథో,ప్రతద్విష్ణుస్తవతే, పరో మాత్రయా తన్వావృధానః, విచక్రమే పృథివీమేషఏతాం, త్రిర్దేవపృథివీమేష ఏతాం అను మంత్రములతో హోమం చేయాలి. తిరిగి పన్నెండు నామములతో హోమం చేయాలి.

**మూ॥ లింగేతు దీపాంతం కృత్వా భవాయ దేవాయనమః, శర్వాయ నమః, ఈశాయ నమః, పశుపతయేనమః, రుద్రాయనమః, ఉగ్రాయనమః, భీమాయనమః, మహతే దేవాయనమ ఇతి పుష్పాణి దత్వాతైరేవతర్పణం కృత్వా, పవిత్రంతే, ఇతి పాయసంగుడౌదనం చ నివేద్య పూర్వోక్త నామభిః కృసరం హృత్వా భవస్య దేవస్య పత్న్యై స్వాహా, ఇత్యాద్యష్టభిః గుడౌదనం చ నివేద్య పూర్వోక్త నామభిః భవాయ దేవాయ సుతాయ స్వాహా, ఇత్యాద్యైః హరిద్రౌదనం హుత్వా, త్ర్యంబకం యజామహే, మానోమహాన్త ముతమానో, మానస్తోకే, ఆరాత్తే గోఘ్నముత పూరుషఘ్నే, వికిరిద్రవిలోహిత, సహస్రాణి సహస్రశః, ఇతి ఏతైః హుత్వా శివాయ స్వాహా, శంకరాయస్వాహా, సహమానాయస్వాహా, శితి కంఠాయస్వాహా, కపర్దినే స్వాహా, తామ్రాయస్వాహా, అరుణాయస్వాహా, అవగురుమాణాయస్వాహా, హిరణ్యబాహవేస్వాహా, సస్పింజరాయస్వాహా, బభ్లుశాయ స్వాహా ఇతి చ జుహుయాత్. తతః స్విష్ట కృదాదిశేషం సమాప్య పూర్వోక్త సర్వహవిర్భిః విష్ణవే లింగాయ వా బలిం దద్యాత్.**

అను॥ లింగమందు దీపాంతము వరకు చేసి భవునకు దేవునకు, శర్వునకు ఈశునకు, పశుపతికి, రుద్రునకు, ఉగ్రునకు, భీమునకు, మహాదేవునకు నమః అని (విడివిడిగా) చెప్పి పుష్పములు అర్పించి ఆ పేర్లతోనే తర్పణముచేసి, పవిత్రంతే అను మంత్రంతో పాయసము, బెల్లపు అన్నమును నివేదించి ముందు చెప్పిన నామములతోనే కృసరములతో (ఉప్పు తప్ప ఇతర పదార్థములతో) హోమంచేసి, దేవుడైన భవుని పత్నికి స్వాహ అని మొదలుగా ఎనిమిది నామములతో స్వాహా కారము చేసి, గుడ ఓదనమును నివేదించి ముందు చెప్పిన నామములతో దేవుడైన భవుని సుతునకు స్వాహా,అని మొదలగు వానితో హరిద్ర ఓదనమును (పసుపన్నం) హోమం చేసి, త్ర్యంబకం యజామహే, మానో మహాంత, మానస్తోకే, ఆరాత్తేగోఘ్న, వికిరిద్ర, సహస్రాణి, అను ఈ మంత్రములతో హోమం చేసి శివునకు, శంకరునకు, సహమానునకు, శితికంఠునకు, కపర్దికి, తామ్రునకు, అరుణునకు, అవగురమాణునకు (వీరందరికి విడివిడిగా) స్వాహా హిరణ్యబాహువునకు, సస్పింజరునకు, బభ్లుశునకు స్వాహా అని విడివిడిగా హోమం చేయాలి. ఆ పిదప స్విష్టకృత్ మొదలగు వాని శేషమును సమాప్తి చేసి ముందు చెప్పిన అన్ని హవిస్సులతో విష్ణువునకు గాని, లింగమునకు గాని బలి ఇవ్వాలి.

మూ॥ మంత్రస్తు – త్వాం ఏకమాద్యం పురుషం పురాతనం నారాయణం విశ్వ సృజం యజామహే త్వమేవ యజ్ఞో విహితో విధేయః త్వమాత్మనాత్మన్ ప్రతిగృహ్ణీష్వహవ్యం,ఇతి. లింగేతు నారాయణ పదే రుద్రం శివమితివదేత్. తతోఽశ్వత్థపర్ణే, భూర్భువః స్వరోం,ఇతి హుతశేషం నిధాయ అగ్ని నా సహప్రదక్షిణీ కృత్య విశ్వభుజే ఆత్మనే పరమాత్మనే నమః ఇతి నత్వా (అంగులీయం కుండల ద్వయవస్త్రయుగ్మేన ఆచార్యం పూజయిత్వా) ఆచార్యాయ శతం తదర్థం తదర్థం ద్వాదశతిస్ర ఏకాంవా గాందత్వా ఋత్విగ్భ్యోఽపి దక్షిణాం దత్వా శతం ద్వాదశవా విప్రాన్ భోజయే దితి సంక్షేపః. ప్రాసాదమాత్రేనూతనేతు మాత్స్యోక్త జలాశయ ప్రతిష్ఠా విధిమేవ కుర్యాత్. గోరుత్తారణ పాత్రీప్రక్షేపాదితు నభవతి ద్వారలోపాత్. వారుణ హోమ స్థానే వాస్తు హోమః. అన్యత్తద్వదేవ.ఇతి లింగార్చా ప్రతిష్ఠావిధిః.

అను॥ మంత్రమైతే – నిన్ను ఒక్కణ్ణే, మొదటి వాణ్ణి,పురాతన పురుషుణ్ణి విశ్వస్రష్టను నారాయణుని హోమం చేస్తున్నాము. నీవే యజ్ఞముగా విహితమైనావు. నీవే చేయించేవాడివి. నీవు నీనుండి నీ హవ్యాన్ని స్వీకరించు,అని. లింగమందైతే నారాయణపదం స్థానంలో రుద్ర,శివ అని చెప్పాలి. ఆ పిదప రావి ఆకు యందు, భూర్భువః స్వరోం,అని హోమ శేషమును ఉంచి, అగ్నితోపాటు ప్రదక్షిణం చేసి, విశ్వభుక్, ఆత్మస్వరూపుడైన పరమాత్మకు నమస్సు అని నమస్కరించి (ఉంగరము, రెండు కుండలాలు, వస్త్రయుగ్మము ఆచార్యునకిచ్చి పూజించి)ఆచార్యునకు నూరు, అందులో సగం, అందులో సగం, పన్నెండు, మూడు, ఒక్కటైనా ఆవును దానంచేసి, ఋత్విక్కులకు గూడా దక్షిణనిచ్చి నూరు లేదా పన్నెండుగురు బ్రాహ్మణులకైనా భోజనం పెట్టాలి అని సంక్షేపము. ప్రాసాదం యందైతే మాత్రం కొత్త దానిలో మత్స్యపురాణంలో చెప్పిన జలాశయ ప్రతిష్ఠా విధినే చేయాలి. గోవు ఉత్తారణము,

పాత్రీప్రక్షేపాదులైతే కుదరవు ద్వారం లేదు కాబట్టి. వారుణహోమం స్థానంలో వాస్తు హోమం చేయాలి మిగిలినదంతా అలాగే అని లింగార్చా ప్రతిష్ఠా విధి

మూ॥ **అథపునః ప్రతిష్ఠా.** తామధి కృత్య హయశీర్ష పంచరాత్రే – చాండాల మద్య సంస్పర్శ దూషితా వహ్నినాఽథవా, అపుణ్య జన సంస్పృష్టా విప్రక్షతజ దూషితా. సంస్కార్యేతి శేషః. పదార్థాదర్శే బ్రాహ్మే – ఖండితే స్ఫుటితే దగ్ధే భ్రష్టే మాన వివర్జితే, యాగహీనే పశు స్పృష్టే పతితే దుష్టభూమిషు, అన్యమంత్రార్చితే చైవ పతిత స్పర్శదూషితే, దశస్వేతేషు నోచక్రుః సన్నిధానం దివౌకసః. యాగః=పూజా. పశుఃగర్దభాది. పంచరాత్రే– ఖండిత స్ఫుటితా దగ్ధాయస్మాదర్చా భయావహా,తస్మాత్సముద్ధరేత్తాంతు పూర్వోక్త విధినా నరః. అర్చాభంగాదావుపవాసః కార్యః. నరాజ్ఞో విప్లవేఽశ్నీయాత్ సురార్చా విప్లవేతథా. ఇతి విష్ణుధర్మోక్తేః సిద్ధాంతశేఖరే – చౌరచండాల పతిత శ్వోదక్యాస్పర్శనే సతి, శివాద్యుపహతౌ చైవ ప్రతిష్ఠాం పునరాచరేత్. పంచరాత్రే – అంగాదంగాది సంధానే ప్రతిష్ఠాం పునరాచరేత్, జలాధి వాసవిహిత నేత్రోన్మీలనవర్జితాం. శుద్ధి వివేకే విష్ణుః – ద్రవ్యవత్ కృతశౌచానాం దేవతార్చానాం భూయః ప్రతిష్ఠాపనేశుద్ధిః, ఇతి. అర్చాః=ప్రతిమాః. తద్ద్రవ్యస్య తామ్రాదేరుక్తశౌచం కృత్వా పునః ప్రతిష్ఠాం కుర్యాదిత్యర్థః. స్మృత్యర్థసారేఽప్యేవం తద్విధిః బౌధాయనసూత్రే – పూర్వ ప్రతిష్ఠితస్య అబుద్ధిపూర్వమేకరాత్రం ద్విరాత్రమేక మాసం ద్విమాసం వా అర్చనాది విచ్ఛేదే శూద్ర రజస్వలాది ఉపస్పర్శనే పూర్వోక్తే కాలే పుణ్యాహం వాచయిత్వా యుగ్మాన్ బ్రాహ్మణాన్ భోజయిత్వా నిశాయాంజలాధివాసంకృత్వా శ్వోభూతే కలశపూర్ణేన పంచగవ్యేన తత్తన్మంత్రైః స్నాపయిత్వాఽన్యం కలశం శుద్ధోదకేనాపూర్యతస్మిన్న వరత్నాని ప్రక్షిప్యతం కలశం తత్తద్ గాయత్ర్యా అష్ట సహస్ర మష్టశతం అష్టావింశతి వారం వా అభిమంత్ర్య తేనోదకేనదే వంస్నాపయేత్తతః శుద్ధో దకేన స్నాపయే దష్ట సహస్రమష్ట శతమష్టా వింశతివా పురుష సూక్తేన మూలమంత్రేణ చ. తతః పుష్పాదీ యథా సంభవ మర్చయిత్వా గుడౌదనం నివేదయేత్,ఇతి. బుద్ధిపూర్వం తు విచ్ఛేదే పూర్వోక్తాం ప్రతిష్ఠాం పునః కుర్యాత్ పూర్వోక్త విష్ణు వచనాత్. ఇదం మలమాస శుక్రాస్తాదావపి కార్యమితి మదనరత్నే హేమాద్రౌ చ.

అను॥ ఇక పునః ప్రతిష్ఠ గూర్చి. దానిని గూర్చి హయశీర్ష పాంచరాత్ర మందిట్లా ఉంది – చండాలుడు, మద్యము వీరి స్పర్శతో దూషితమైనా, అగ్నితో దూషితమైనా, పుణ్య హీనులైన జనులతో తాకబడినా, విప్రుని గాయపు రక్తంతో దూషితమైనా తిరిగి సంస్కరించాలి అని శేషము,అని. పదార్థ ఆదర్శమందు బ్రాహ్మోక్తి ఇట్లా – ఖండితమైనా, పగిలినా, కాల్చబడినా, భ్రష్టమైనా, ప్రమాణమునకు తక్కువైనా, పూజాహీనమైనా, గాడిద మొదలగు వానితో ముట్టబడినా, దుష్టభూములందు పడినా ఇతర మంత్రములతో పూజింపబడినా, పతిత స్పర్శ దూషితమైనా, ఈ పది సందర్భములందు దేవతలు ఆయా ప్రతిమలకు సన్నిధానంలో ఉండరు,అని. పంచరాత్రమందిట్లా – ఖండితమైనా, విరిగినా, కాల్చబడినా, ఈ సందర్భాలలో ఆ విగ్రహ పూజ భయమును కల్గిస్తుంది. అందువల్ల ప్రతిమలను నరుడు ముందు చెప్పిన విధి ప్రకారము సముద్ధరణ చేయాలి,అని. అర్చావిగ్రహము భగ్నమైన పక్షం లో ఉపవాసం చేయాలి. రాజ్యవిప్లవమందు భుజించరాదు. అట్లాగే దేవతా విగ్రహ

నాశమందు భుజించరాదు,అని విష్ణుధర్మోక్తి. సిద్ధాంత శేఖరమందిట్లా – దొంగ, చండాలుడు, పతితుడు, కుక్క రజస్వల వీరు తాకిన యెడల అట్లాగే నక్క మొదలగు వాని స్పర్శ జరిగిన యెడల (శివాదులు భిన్నమైన యెడల (విగ్రహం) ) తిరిగి ప్రతిష్ఠ చేయాలి,అని. పంచరాత్ర మందిట్లా శరీరానికి మరో శరీరం మొదలైనవి తగిలితే (విగ్రహాలు పరస్పరం) తిరిగి ప్రతిష్ఠ నాచరించాలి,కాని తిరిగి జలాధివాసము, చేసిననేత్రోన్మీలనాన్ని తిరిగి చేయరాదు, అని. శుద్ధివివేకమందు విష్ణువు ఇట్లా – ద్రవ్యమునకెట్లా శుద్ధియో అట్లాగే శౌచము చేయబడిన దేవతార్చా విగ్రహాలకు తిరిగి ప్రతిష్ఠ చేస్తే శుద్ధి,అని. అర్చ అనగా ప్రతిమలు. ఆ ద్రవ్యమును, రాగి మొదలగు వానిని చెప్పిన విధంగా శుద్ధిచేసి తిరిగి ప్రతిష్ఠ చేయాలి,అని అర్థము. స్మృత్యర్థ సారమందు కూడా ఇట్లాగే ఉంది. బౌధాయన సూత్రమందు దాని విధి ఇట్లా ఉంది – ముందు ప్రతిష్ఠించిన విగ్రహానికి అనుకోకుండానే ఒకరాత్రి కాని రెండు రాత్రులు కాని, ఒకనెల, రెండు నెలలు కాని అర్చనాదుల లోపం జరిగితే (భంగం), శూద్రుడు, రజస్వల మొదలగువారు తాకితే, ముందు చెప్పిన, సమయమందు పుణ్యాహ వాచనము చేసి, ఇద్దరు బ్రాహ్మణులకు భోజనం పెట్టి, రాత్రి జలాధివాసం (విగ్రహాలకు)చేసి, తెల్లవారాక, కలశం నిండా ఉన్న పంచగవ్యంతో ఆయా మంత్రములతో స్నానం చేయించి, మరో కలశాన్ని మంచి నీటితో నింపి అందులో నవరత్నాలు ఉంచి, ఆ కలశమును ఆయా గాయత్ర్యులతో వేయి ఎనిమిదిమార్లు లేదా నూట ఎనిమదిమార్లు లేదా ఇరవై ఎనిమిదిమార్లు కాని అభిమంత్రించి, ఆ నీటితో విగ్రహానికి స్నానం చేయించాలి. ఆ పిదప శుద్ధ ఉదకముతో స్నానం చేయించాలి, వేయి ఎనిమది సార్లు కాని, నూట ఎనిమిది మార్లు కాని లేదా ఇరువది ఎనిమిది సార్లు కాని పురుష సూక్తంతో, మూల మంత్రంతోనూ (స్నానం చేయించాలి). ఆ పిదప పుష్పములతో వీలైనంత పూజచేసి బెల్లపు అన్నాన్ని (పాయసాన్ని) నివేదన చేయాలి,అని. బుద్ధిపూర్వకముగా విచ్ఛేదము జరిగితే (పూజ), ముందు చెప్పిన ప్రతిష్ఠను తిరిగి ఆచరించాలి, ముందు చెప్పిన విష్ణువు మాటనను సరించి. దీనిని మలమాస శుక్రఅస్తాదులందు కూడా చేయాలి,అని మదనరత్నమందు, హేమాద్రి యందు కూడా చెప్పారు.

**మూ॥ దేవార్చాప్రసాదభేదనేతు శూలపాణౌ కాశ్యపః – వాపీకూపారామసేతు సభా తడాగవప్రదేవతాయతన భేదనే ప్రాయశ్చిత్తం చతస్ర ఆజ్యాహుతీః జుహుయాత్ – ఇదం విష్ణుఃమానస్తోకే, విష్ణోః కర్మాణి, పాదోఽస్య, ఇతి యాందేవతాముత్పాదయతి తస్యై దేవతాయై బ్రాహ్మణాన్ భోజయేత్,ఇతి. శంఖలిఖితౌ– ప్రతిమారామ కూప సంక్రమధ్వజసేతు, నిపాత భంగేషు తత్సముత్థానం ప్రతి సంస్కారోఽష్ట శతం చ నిపాతితానాం ఇతి. సముత్థానం = ప్రతిక్రియా. అష్టశతంపణా (తాంబేకా టుకడా) దండశ్చేత్యర్థః. అథ జీర్ణోద్ధారః – స చ లింగాదౌ దగ్ధేభగ్నే చలితే వాకార్యః. అయం చ అనాది సిద్ధ ప్రతిష్ఠిత లింగాదౌ భంగాదిదుష్టేఽపి న కార్యః. తత్ర తు మహాభిషేకం కుర్యాదితి త్రివిక్రమః. కర్తా అముకదేవస్య జీర్ణోద్ధారం కరిష్యే ఇత్యుక్త్వా పుణ్యాహం**

**వాచయిత్వా నాందీ శ్రాద్ధం కృత్వా అచార్యం ఋత్విజశ్చవృత్వా పీఠే మండల దేవతా ఆవాహ్య లింగే – ఓం వ్యాపకేశ్వర హృదయాయనమః ఓం వ్యాపకేశ్వర శిరసే స్వాహా,ఇతి. ఏవం షడంగం కృత్వా దేవతాంతరే మూలమంత్రేణ షడంగం కృత్వా అర్చయేత్. అఘోర మంత్రం అష్టోత్తర శతం జప్త్వాఽగ్నిం ప్రతిష్ఠాప్య అఘోరేణ ఘృతసర్షపైః సహస్రం హుత్వా ఇంద్రాదిభ్యో నామ్నా బలిందత్వా జీర్ణదేవం ప్రణవేన సంపూజ్య బ్రహ్మాది మండల దేవానాం హోమం పూర్వోక్తం కృత్వా దేవం ప్రార్థయేత్ – జీర్ణ భగ్నమిదం చైవ సర్వదోషావహం నృణాం, అస్యోద్ధారేకృతే శాంతిః శాస్త్రేఽస్మిన్ కథితాత్వయా, జీర్ణోద్ధార విధానం చ నృపరాష్ట్ర హితావహం. తదధిష్ఠితాం దేవ ప్రహరామి తవాజ్ఞయా,ఇతి. తతః క్షీరాజ్య మధుదూర్వాభిః సమిద్భిశ్చ అష్టోత్తర సహస్రం శతం వాదేవ మంత్రేణ హుత్వా, అంగానాం, దశాంశేన అంగచాలనార్థం సహస్రం శతం వాపాయసేన హుత్వా లింగం ప్రార్థయేత్. లింగరూపం సమాగత్యయేనేదం సమధిష్ఠితం, యాయాస్త్వం సమ్మితం స్థానం సన్త్యక్త్వైవ శివాజ్ఞయా అత్ర స్థానేచ యా విద్యా సర్వవిద్యేశ్వరైర్యుతా, శివేన సహసంతిష్ఠ ఇతి మంత్రితజలేన అభిషిచ్య విసర్జయేత్. తతోఽస్త్ర మంత్రితేనఖనిత్రేణ ఖాత్వా లింగమాదాయ నద్యాదౌ వామదేవేన లింగం ప్రణవేన మూర్తిం క్షిపేత్. దారుజంతు మధునాఽభ్యజ్య అఘోరేణదహేత్. హేమరత్నాది మయంతు దగ్ధం చలితంవా పునస్త త్రైవ స్థాపయేత్. తతః శాంత్యై అఘోరేణ తిలైః సహస్రం హుత్వా ప్రార్థయేత్. భగవన్ భూత భవ్యేశలోకనాథ జగత్పతే. జీర్ణలింగ సముద్ధారః కృతస్తవాజ్ఞయా మయా. అగ్నినా దారుజం దగ్ధం క్షిప్తం శైలాదికం జలే ప్రాయశ్చిత్తాయ దేవేశ అఘోరాస్త్రేణ తర్పితం. జ్ఞానతోఽజ్ఞానతోవాపి యథోక్తం న కృతం యది, తత్సర్వం పూర్ణమేవాస్తు త్వత్ప్రసాదాన్మహేశ్వర. తతోయజమానః ప్రార్థయేత్ – గోవిప్రశిల్పి భూతానాం ఆచార్యస్య చ యజ్వనః శాంతిర్భవతు దేవేశ, అచ్ఛిద్రం జాయతామిదం.**

అను॥ దేవత,అర్చన మరియు ప్రసాదము భిన్నమైతేనో శూలపాణియందు కాశ్యపుడిట్లా అన్నాడు–దిగుడుబావి,బావి, తోట, ఆనకట్ట, సభ, చెరువు, కోట, దేవాలయము ఇవి భిన్నమైతే ప్రాయశ్చిత్తము, నాలుగు ఆజ్య ఆహుతులను హోమం చేయాలి; ఇదం విష్ణుః, మానస్తోకే, విష్ణోః కర్మాణి, పాదోఽస్య అను మంత్రములతో. ఏ దేవతను తీసివేస్తున్నామో ఆ దేవత కొరకై బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి,అని. శంఖలిఖితులిట్లా – ప్రతిమ, తోట బావి నీటికట్ట, ధ్వజము ఆనకట్ట ఇవి పడిపోతే చెడిపోతే దానికి ప్రతిక్రియ పునః ప్రతిష్ఠ. పడిపోయిన వానికి నూట ఎనిమిది అని. నూట ఎనిమిది పణములు దండనము కూడా అని అర్థము. ఇక జీర్ణోద్ధారము. అది లింగాదులు దగ్ధమైతే భగ్నమైతే, కదిలితే కాని చేయాలి. ఇది అనాది సిద్ధముగా ప్రతిష్ఠితమైన లింగాదులు భంగాదులవల్ల దుష్టమైనా చేయరాదు. అక్కడైతే మహాభిషేకము చేయాలి అని త్రివిక్రముడు. కర్త ఈ దేవునకు జీర్ణోద్ధారము చేస్తున్నాను అని చెప్పి పుణ్యాహవాచనము చేయించి, నాందీ శ్రాద్ధము చేసి ఆచార్యుని ఋత్విజులను వరించి పీఠమందు మండల దేవతలను ఆవాహన చేసి లింగమందు, ఓం వ్యాపకేశ్వర! హృదయమునకు నమస్కారము, ఓం వ్యాపకేశ్వర శిరస్సునకు స్వాహా అని. ఇట్లా షడంగన్యాసము చేసి, ఇతర దేవతలందు మూల మంత్రంతో షడంగము

చేసి అర్చించాలి. అఘోర మంత్రమును నూట ఎనిమిది మార్లు జపించి, అగ్నిని ప్రతిష్ఠ చేసి అఘోర మంత్రంతో, నేయి, ఆవాలతో వేయిసార్లు హోమం చేసి ఇంద్రాది దేవతలకు పేరు పేరున బలి ఇచ్చి జీర్ణమైన దేవుని ప్రణవముతో పూజించి బ్రహ్మాది మండల దేవతలకు హోమమును ముందు చెప్పినట్లు చేసి దేవుని ప్రార్థించాలి ఇట్లా - జీర్ణమైనది భగ్నమైనది ఈ శరీరము, నరులకు అన్ని రకముల దోషముల కల్గించేది, దీనిని ఉద్ధరిస్తే శాంతి అని ఈ శాస్త్రంలో మీరు చెప్పారు. జీర్ణోద్ధార విధానము రాజునకు రాష్ట్రమునకు మేలు చేసేది. అందువల్ల ఓ దేవ మీరు క్రింద ఉండండి మీ ఆజ్ఞతో దీనిని తీసి వేస్తాను, అని. ఆ పిదప పాలు నేయి తేనె గరిక వీనితో సమిధలతో కూడా నూట ఎనిమిది, వేయి నూట ఎనిమిది కాని దేవత మంత్రంతో హోమంచేసి అంగములకు అందులో దశాంశముగా (హోమంచేసి) లింగచాలనము కొరకు వేయిసార్లు కాని నూరుసార్లు కాని పాయసంతో హోమం చేసి లింగమును ప్రార్థించాలి. లింగరూపమును పొంది ఎవరైతే దీనిని అధిష్ఠించారో అట్టి నీవు శివుని ఆజ్ఞతో దీనిని వదలి నీకిష్టమైన స్థానానికి వెళ్ళు. ఈ స్థానమందు ఏవిద్య, సర్వవిద్యే శ్వరులతో కూడి ఉండిందో అది శివునితో కూడి ఉండని, అని మంత్రిత జలంతో అభిషేకించి వదలాలి. ఆ పిదప అస్త్ర మంత్రితమైన గడ్డపారతో తవ్వి లింగాన్ని తీసుకొని నది మొదలగు వానియందు వామదేవ మంత్రంతో లింగమును ప్రణవంతో మూర్తిని పారవేయాలి. కట్టె లింగాన్నైతే నేయితో అంభ్యజన చేసి అఘోరమంత్రంతో కాల్చాలి. బంగారుది, రత్నాదులది ఐతే కాలినా, కదిలినా దానిని తిరిగి అక్కడే ఉంచాలి. ఆ పిదప శాంతి కొరకు అఘోర మంత్రంతో, నువ్వులతో వేయిసార్లు హోమంచేసి ప్రార్థించాలి. భగవన్, భూత భవ్యములకు ఈశ, లోకనాథ, జగత్పతి, నీ ఆజ్ఞతోనే నేను జీర్ణ లింగ సముద్ధారాన్ని చేశాను. దారు దానిని అగ్నితో కాల్చాను. శిలాదులను నీటిలో పారవేశాను. ఓదేవేశ ప్రాయశ్చిత్తం కొరకు అఘోరాస్త్ర మంత్రంతో తర్పణ చేశాను. తెలిసి కాని తెలియక కాని శాస్త్ర ప్రకారం చేయని పక్షంలో అదంతా ఓ మహేశ్వర ! నీ అనుగ్రహంతో పరిపూర్ణం కాని,అని. ఆ పిదప యజమానుడు ప్రార్థించాలి - ఓ దేవేశ, గోవులు, విప్రులు, శిల్పులు, ప్రాణులు వీరికి ఆచార్యునకు యజ్వకు శాంతి కలుగని. ఇది (కర్మ) దోష రహితం కానిమ్ము,అని.

**మూ॥ మూర్త్యౌతు విశేషః** - త్వత్ప్రసాదేన నిర్విఘ్నం దేహం నిర్మాయయత్యసౌ, వాసం కురుసురశ్రేష్ఠ తావత్త్వం చాల్పకేగృహే. వసన్ క్లేశం సహిత్వేహ మూర్తిం వై తవ పూర్వవత్, యావత్కారయతే భక్తః కురుతస్య చ వాంఛితం,ఇతి. తతోనవాం మూర్తిం లింగం వాకృత్వా ఉక్త విధినా స్థాపయేత్. మూలం త్వగ్ని పురాణే స్పష్టం. ఇతి జీర్ణోద్ధారః. **అథ తులసీ గ్రహణం** - దేవయాజ్ఞిక కృతే స్మృతిసారే - వైధృతౌ చ వ్యతీపాతే భౌమభార్గవభానుషు, పర్వద్వయే చ సంక్రాంతౌ ద్వాదశ్యాం సూతకద్వయే, తులసీం యే విచిన్వంతి తేఛిందంతి హరేః శిరః. విష్ణుధర్మోత్తరే - ర వివారం వినాదూర్వాం తులసీం ద్వాదశీం వినా, జీవితస్యా వినాశాయ ప్రవిచిన్వీత ధర్మవిత్. తథా - సంక్రాంత్యావర్క పక్షాంతే ద్వాదశ్యాం నిశి సంధ్యయోః, యైశ్ఛిన్నం తులసీపత్రం తైశ్ఛిన్నం

హరిమస్తకం. పాద్మే - ద్వాదశ్యాం తులసీ పత్రం ధాత్రీ పత్రం చ కార్తికే, లునాతి సనరోగచ్ఛేత్ నిరయానతి గర్హితాన్. రుద్రయామలే - ద్వాదశ్యాం చ దివాస్వాపః తులస్య వచయస్తథా, విష్ణోశ్చైవ దివాస్నానం వర్జనీయం సదాబుధైః. విష్ణుధర్మే - నచ్ఛింద్యాత్ తులసీం విప్రో ద్వాదశ్యాం వైష్ణవః క్వచిత్, దేవార్థే తులసీచ్ఛేదోహోమార్థే సమిధాం తథా. ఇందు క్షయే న దుష్యేత గవార్థేతు తృణస్య చ. గ్రహణ మంత్రస్తు పాద్మే - తులస్యమృతనామాసి సదాత్వం కేశవ ప్రియే, కేశవార్థం విచిన్వామి వరదా భవశోభనే,ఇతి.

అను॥ మూర్తియందైతే విశేషము - నీ అనుగ్రహంతో ఏ అడ్డంకి లేకుండా ఈతడు దేహాన్ని నిర్మిస్తున్నాడు (శిల్పి). అందువల్ల ఓసురశ్రేష్ఠ ! అంతవరకు నీవు ఈ చిన్న గృహంలో నివసించు వసిస్తూ ఇక్కడ క్లేశాన్ని సహిస్తూ, మునుపటిలా నీమూర్తిని భక్తుడు చేసేంతవరకు, ఆతని అభీష్టాన్ని నెరవేర్చు,అని. ఆ పిదప కొత్త మూర్తిని కాని లింగాన్ని కాని చేసి శాస్త్రంలో చెప్పినట్లు స్థాపించాలి. దీనికి మూలము (ఆధారము) అగ్ని పురాణంలో స్పష్టంగా ఉంది. అని జీర్ణోద్ధారము. ఇక తులసిని తెంపుట. దేవయాజ్ఞికులు చేసిన స్మృతి సారమందిట్లా - వైధృతి, వ్యతీపాతము, భౌమ (మంగళ) శుక్ర, ఆదివారములు పూర్ణిమ, అమావాస్యలు, సంక్రమణం, ద్వాదశి తిథి, జననాశౌచ, మృతా శౌచములు వీనియందు తులసిని తెంపిన వారు విష్ణువు శిరస్సును తెంపినట్లే,అని. విష్ణుధర్మోత్తర మందిట్లా - ఆదివారం తప్ప ఇతర రోజులలో దూర్వను, ద్వాదశి తప్ప ఇతర తిథులలో తులసిని ధర్మమెరిగినవాడు తన జీవితం వినాశం కాకుండా ఉండేందుకై తెంపాలి,అని. అట్లాగే - సంక్రమణమందు, ఆదివారమందు పూర్ణిమ అమావాస్యలందు, ద్వాదశి యందు, రాత్రిపూట, సంధ్యాకాలము లందు తులసి పత్రమును తెంపినవారు విష్ణువు తలను తెంపినట్లే. పాద్మ మందిట్లా - ద్వాదశియందు తులసి ఆకును, కార్తిక మాసమందు ఉసిరి ఆకును తెంపిన నరుడు అతి గర్హితమైన నరకములకు పోతాడు,అని. రుద్రయామల మందిట్లా - ద్వాదశి తిథి యందు పగటి నిద్ర, అట్లాగే తులసిని తెంపుట విష్ణువునకు పగలు స్నానము చేయించుట వీనిని బుధుడైనవాడు ఎప్పుడూ విడిచిపెట్టాలి (చేయరాదు)అని. విష్ణుధర్మ మందిట్లా - ద్వాదశి తిథియందు విప్రుడు అందునా వైష్ణవుడు తులసిని తెంపరాదు. దేవునకై తులసిని తెంపటం హోమమునకై సమిధలను తేవటం ఆవునకై గడ్డి కోయటం అమావాస్య రోజు తప్పిదం కాదు. పాద్మమందు గ్రహణ మంత్రమిట్లా - ఓ తులసి నీనామము అమృ(తం)త మైంది ఎల్లప్పుడు నీవు కేశవునకు ప్రియమైన దానివి. ఓ శోభన ! కేశవుని కొరకై తెంపుతున్నాను. వరదవుకమ్ము,అని.

మూ॥ పారిజాతే దక్షః - సమిత్పుష్పకు శాదీనాం ద్వితీయః ప్రహరోమతః. అథపుష్పాదేః పర్యుషితత్వం. భార్గవార్చనే భవిష్యే - ప్రహరంతిష్ఠతేజాతీకర వీర మహర్నిశం, తులస్యాం బిల్వపత్రేషు సర్వేషు జలజేషు చ. న పర్యుషిత దోషోఽస్తి మాలాకార గృహేఽపిచ. బృహన్నారదీయే - వర్జ్యం పర్యుషితం పుష్పం వర్జ్యం పర్యుషితంజలం, న వర్జ్యం తులసీపత్రం న వర్జ్యం జాహ్నవీ జలం. తత్రైవపాద్మే - తులసీపర్యుషితం నైవ బిల్వంతు త్రిదినావధి, పద్మం

పంచదినా త్ర్యాజ్యం శేషం పర్యుషితం విదుః. స్కాందే - పాలాశందిన మేకంతు పంకజంచ దినత్రయం, పంచాహం బిల్వపత్రం చ దశాహం తులసీదళం. పదార్థాదర్శే బోపదేవస్త్వన్యథాహ - బిల్వ, అపామార్గ జాతీ, తులసి, శమి, శతా కేతకీ భృంగదూర్వామందాం భోజాహి దర్భాముని తిలతసర బ్రహ్మీ కల్హారమల్లయః, చంపాశ్వారాతి కుంభీదమన మరు ఖకా బిల్వాతోహాని శస్త్రింశత్ 30 త్ర్యై3కా1 ర్యే6 రీ6శో 11 దధి 4 నిధి 9 వసు 8భూ 1 భూ 1 యమా 2 భూయ ఏవం. అస్యార్థః శతా= శతావరీ. మందః=మందారః, అహిః=నాగకేసరః, మునిః = అగస్త్యః, అశ్వారాతిః = కరవీరః, కుంభీః = పాటలేతి కైదేవ నిఘంటుః. అరయః=షట్, ఈశాః = ఏకాదశ, ఉదధయః చత్వారః, నిధయోనవ, వసవోఽష్టౌ, భూః ఏకః, యమౌద్వౌ, బిల్వమారభ్య అహి పర్యంతం గణయిత్వా దర్భమారభ్య పునస్త్రింశదాది గణయేదిత్యర్థః. ఏతద్దినోత్తరం పర్యుషితానీత్యర్థః. టోదరా నందే స్కాందేదమన ముపక్రమ్య - తస్యమాలా భగవతః పరమ ప్రీతికారిణీ, శుష్కా పర్యుషితా వాపి న దుష్టా భవతి క్వచిత్. తిథి తత్వే మాత్స్యే - బిల్వ పత్రం చ మాఘ్యం చ తమాలా మల కీదలే, కల్హారం తులసీ చైవ పద్మం చ మునిపుష్పకం, ఏతత్పర్యుషితం నస్యాత్ కుశాశ్చకలికాస్తథా. స్మృతిసారావల్యాం - జలజానాం చ సర్వేషాం పత్రాణా మహితస్యచ, కుశపుష్పస్య రజత సువర్ణ కృతయోరపి, నపర్యుషిత దోషోఽస్తి తీర్థతోయస్య చైవహి, ముకులైర్నార్చయేద్దేవం చంపకైః జల జైర్వినా.

అను॥ పారిజాతమందు దక్షుడిట్లా - సమిధలు, పుష్పములు, కుశలు వీనిని తెంపుటకు ద్వితీయ ప్రహర మంచిది,అని. ఇక పుష్పాదులకు పర్యుషితత్వం ఇట్లా - (చద్ది) భార్గవార్చన యందు భవిష్యోక్తి ఇట్లా - జాతి పుష్పము (మల్లె) జాముసేపు, కరవీరము (గన్నేరు) రాత్రింబగళ్ళు ఉంటుంది. (ఆపై చద్ది) తులసి, బిల్వపత్రము, అన్ని జలపుష్పాలు, మాలాకార గృహంలోనివి వీనికి పర్యుషిత దోషంలేదు,అని. బృహన్నారదీయ మందిట్లా - పర్యుషితమైన (చద్ది) పుష్పాన్ని, పర్యుషితమైన జలాన్ని వదలాలి. తులసీపత్రాన్ని, జాహ్నవీ జలాన్ని వదలరాదు,అని. అక్కడే పాద్మోక్తి ఇట్లా - తులసి పర్యుషితం కాదు. బిల్వము మూడు రోజుల వరకు (పర్యుషితం) కాదు. పద్మాన్ని ఐదు రోజుల తరువాత వదలాలి. మిగిలినవన్నీ పర్యుషితములని గ్రహించాలి,అని. స్కాందమందిట్లా - మోదుగ ఒకరోజు, తామరపువ్వు మూడు రోజులు, బిల్వపత్రము ఐదు రోజులు, తులసి పదిరోజులు చద్దివికావు (ఆపైన పూజకు తగవు)అని. పదార్థ అదర్శమందు బోపదేవుడు మరో రకంగా చెప్పాడు - బిల్వము, ఉత్తరేణి, మల్లె, తులసి, శమి, శతావరి (పిల్లపిసర), మొగిలి,, గుంటగలిజేరు, గరిక, మందారం, తామర, నాగకేసరం, దర్భ, అగస్త్యము (అవిశ), నువ్వులు, తగర (నందివర్ధనం). గంగరావి, కలువ, మల్లె, చంపకం, గన్నేరు, పాటలము, దమనం, మరువం ఇవి క్రమంగా 30,3,1,6,6,11,4,9,8,1,1,2 ఈ ఈ రోజుల వరకు పాచివికావు. (బిల్వము 30 రోజుల వరకు ఇట్లా చదవాలి) బిల్వం నుండి నాగ కేసరం వరకు మళ్ళీ దర్భ 30 రోజుల ఇట్లా మరువం వరకు అన్వయించాలి. ఆ పైన ఆయా రోజుల తరువాత పాచి వౌతాయని అర్థము,అని. తోడరానంద మందు స్కాందోక్తి దమనం అని ఆరంభించి దాని

మాలలు భగవంతునకు ప్రీతిపాత్రమైనవి మిక్కిలిగా, ఎండినా పర్యుషితమైనా అవి దుష్టమైనవి ఎప్పుడూ కావు,అని. తిథి తత్వమందు మాత్స్యోక్తి ఇట్లా - బిల్వపత్రము, కుందపుష్పము (మాఘ్యము), తమాల, ఆమలక దళములు, కలువ, తులసి,, పద్మము, అగస్త్య పుష్పము, కుశలు, మొగ్గలు ఇవి పాచివికావు,అని. స్మృతి సారావళి యందిట్లా - నీటియందు కలిగే అన్ని పూలకు ఆకులకు, తెంపని వానికి కుశపుష్పమునకు, వెండి, బంగారములతో చేసిన వానికి, తీర్థతోయమునకు పర్యుషిత దోషం లేదు. చంపకము, జలజము ఈ రెండు తప్ప మిగిలిన పూల మొగ్గలతో దేవుని పూజించరాదు,అని.

**మూ॥ అథశివనిర్మాల్య నిర్ణయః. సిద్ధాంతశేఖరే - ధరాహిరణ్య గోరత్న తామ్రరౌప్యాం శుకాదికాన్, విహాయ శేషం నిర్మాల్యం చండేశాయ నివేదయేత్. అన్యదన్నాది పానీయం తాంబూలం గంధపుష్పకం, దద్యాచ్చండాయ నిర్మాల్యం శివభుక్తంతు సర్వశః. ఆచార్య శివచండానాం ఆజ్ఞాభంగేతు లక్షకం, ధనస్య భక్షణే శేషాం పాదోనం లక్షమీరితం. నిర్మాల్యే భక్షితే లక్ష పాదతః శుద్ధిరీరితా, దానం చ భక్షణ సమంత దర్ధం తదుపేక్షణే. అకామాద్భక్షణే యద్వా నిర్మాల్యస్య జపేత్సుధీః. బ్రహ్మ పంచక సాహస్ర మర్ధేన సహితం తతః, కామతో భక్షణే దీక్షా ప్రాయశ్చిత్తం న చాన్యతః, నిర్మాల్య లంఘనేఽ ఘోరం ప్రజపేదయుతం తతః. స్పర్శశ్చ లంఘనసమో విక్రయో భక్షణేన చ. స్మృత్యర్థసారేఽపి - శైవ సౌర నిర్మాల్యే నైవేద్య భక్షణే చాంద్రం, అభ్యాసే ద్విగుణం, అత్యాభ్యాసే ప్రతపనం, అన్యనిర్మాల్యేఽప్యనాపద్యేవం ఇతి. ఇదం చ జ్యోతిర్లింగా ద్యతిరిక్త విషయం. తథా చ పురుషార్థ ప్రబోధే భవిష్యే - జ్యోతిర్లింగం వినాలింగం యః పూజయతి సత్తమః, తస్య నైవేద్య నిర్మాల్య భక్షణా త్తప్త కృచ్ఛ్రకం. శాలగ్రామోద్భవేలింగే బాణలింగే స్వయంభువి, రసలింగే తథార్షే చ సురసిద్ధ ప్రతిష్ఠితే, హృదయే చంద్రకాంతే చ స్వర్ణరూప్యాది నిర్మితే, శివదీక్షా వతా భక్తేనేదం భక్ష్యమితీర్యతే. తథా - బాణలింగే స్వయంభూతే చంద్రకాంతే హృదిస్థితే, చాంద్రాయణ సమంజ్ఞేయం శంభోర్నైవేద్య భక్షణం. లింగే స్వయంభువే బాణే రత్నజే రస నిర్మితే, సిద్ధప్రతిష్ఠితే చైవ న చండాధి కృతిర్భవేత్. యత్ర చండాధికారోఽస్తి తద్భోక్తవ్యం నమానవైః. చండాధికారోనో యత్ర భోక్తవ్యంతత్ర భక్తితః. త్రైవిక్రమ్యాం - బాణలింగే చ లౌహేచ సిద్ధలింగే స్వయంభువి, ప్రతిమాసుచ సర్వాసు న చండోఽధికృతోభవేత్.**

అను॥ ఇక శివనిర్మాల్య నిర్ణయము. సిద్ధాంతశేఖరమందిట్లా - భూమి, బంగారము, ఆవు, రత్నము, రాగి, వెండి, వస్త్రము మొదలగు వానిని వదలి మిగిలిన నిర్మాల్యాన్ని చండేశునకు నివేదించాలి,అని. ఇతరమైన అన్నము మొదలగునవి, పానీయము. తాంబూలము గంధపుష్పములు శివభుక్తమైన నిర్మాల్యాన్ని అంతా చండునకివ్వాలి. ఆచార్య, శివ, చండుల ఆజ్ఞాభంగమందు ఒక లక్ష (జపంచేయాలి). వారి ధనాన్ని భక్షిస్తే పాదం తక్కువ లక్ష (డెబ్బైఐదువేలు) చేయాలి. నిర్మాల్యం భక్షిస్తే లక్షపాతిక (వేలు) జపంచేస్తే శుద్ధి ఔతుందని చెప్పారు. దానము భక్షణతో సామనమైందే, దానిని ఉపేక్ష చేయటం అందులో సగం తప్పిదం వంటిది. (సగం జపం చేయాలి). నిర్మాల్యాన్ని అనుకోకుండా తిన్న పక్షంలోనూ బుద్ధిమంతుడు ఓంకారమును (అథవా గాయత్రిని) ఐదువేల ఐదు

వందల సార్లు జపం చేయాలి. కావాలని బుద్ధిపూర్వకంగా నిర్మాల్యం భక్షిస్తే, దీక్ష, ప్రాయశ్చి త్తముగా ఆచరించాలి. మరో విధంగా శుద్ధి లేదు. నిర్మాల్యమును దాటితే ఆపిద అఘోర మంత్రాన్ని పదివేలమార్లు జపించాలి. ముట్టుకోవటము దాటటంతో సమానం. అమ్మటము తినటంతో సమానము. స్మృత్యర్థ సారమందు కూడా ఇట్లా - శివ, సూర్యుల నిర్మాల్యము నైవేద్యము భక్షిస్తే చాంద్రాయణ మాచరించాలి. మాటి మాటికి భక్షిస్తే రెట్టింపు, అతిగా తింటే "ప్రతపన" ప్రాయశ్చిత్తము, ఇతర దేవతల నిర్మాల్య భక్షణమైనా ఆపద లేని పక్షంలో ఇట్లే ప్రాయశ్చిత్తము, అని. ఇది జ్యోతిర్లింగాదులకన్న వేరైన వాని విషయము. అట్లాగే పురుషార్థ ప్రబోధమందు భవిష్యోక్తి ఇట్లా - జ్యోతిర్లింగం కాకుండా ఇతర లింగమును పూజించు ఉత్తముడు, ఆ లింగమునైవేద్య నిర్మాల్య భక్షణము చేస్తే తప్త కృచ్ఛ్ర ప్రాయశ్చిత్త మాచరించాలి,అని. శాలగ్రామము నుండి పుట్టిన లింగము, బాణ లింగము స్వయంభువము, రసలింగము, ఆర్షలింగము, సురులు సిద్ధులు ప్రతిష్ఠించినది హృదయలింగము, చంద్ర కాంతమణిలింగము, బంగారు వెండి వీనితో చేసినది ఈ లింగముల నిర్మాల్యమును శివదీక్ష కలిగిన భక్తుడు తినవచ్చును అని చెప్పారు. అట్లాగే - బాణలింగము, స్వయంభువు, చంద్రకాంతము, హృదయలింగము, ఈ శివలింగముల నైవేద్య భక్షణము చాంద్రాయణ సమంగా భావించాలి, అని అన్నారు. స్వయంభులింగము, బాణలింగము, రత్నజము, రస నిర్మితము, సిద్ధప్రతిష్ఠితము వీనిపై చండుని అధికారము లేదు. చండుని అధికారము ఉన్నచోట ఆ లింగము నిర్మాల్యమును మనుజులు భుజించరాదు. చండుని అధికారములేని లింగము నిర్మాల్యమును భక్తితో భుజించాలి. త్రివిక్రమమందు ఇట్లా - బాణలింగము, లోహ లింగము, సిద్ధలింగము, స్వయంభువు, అన్ని ప్రతిమలు, వీనిపై చండుడు అధికారి కాదు,అని.

**మూ॥ అత్ర - బ్రహ్మ హాపి శుచిర్భూత్వా నిర్మాల్యం యస్తు ధారయేత్, తస్య పాపం మహచ్ఛీఘ్రం నాశయిష్యే మహావ్రతే, ఇతి స్కాందాత్ అశుచినా న గ్రాహ్యం శివ నిర్మాల్యం, కింతు స్నాత్వేతి స్మార్తాః, అనుపనీతేన నగ్రాహ్యమితి శ్రీదత్తః. శివదీక్షాహీనైర్న గ్రాహ్యమితి శైవాః తిథి తత్వే హేమాద్రౌ చ పరిశిష్టే - అగ్రాహ్యం శివనైవేద్యం పత్రం పుష్పం జలం ఫలం, శాలగ్రామ శిలాసంగాత్ సర్వంయాతి పవిత్రతాం. పంచాయతన పూజాయాం తంత్రేణ నివేదిత మిత్యర్థః. శివపురాణే - యే వీరభద్రశపితాః శివభక్తి పరాఙ్ముఖాః, శంభోరన్య త్రదేవేషు యే భక్తాయే, నదీక్షితాః, తేషా మనర్హ మీశస్య తత్ప్రసాద చతుష్టయం. కాశీఖండే-జలస్యధారణం మూర్ధ్ని విశ్వేశ స్నాన జన్మనః ఏషజాలం ధరోబంధః సమస్త సుర వల్లభః. తథా - స్నాపయిత్వా విధానేన యోలింగ స్నపనోదకం, త్రిఃపిబేత్ త్రివిధం పాపం తస్యే హాశు వినశ్యతి. లింగ స్నపన వార్భిర్యః కుర్యాన్మూర్ధ్న్య భిషేచనం, గంగాస్నాన ఫలం తస్య జాయతేఽత్ర విపాప్మనః. ఇదం పూర్వ వాక్యవశాత్ విశ్వేశ్వర విషయమితికేచిత్. కాశీస్థ పురాణ ప్రసిద్ధ సర్వలింగ విషయం కాశీఖండే రత్నేశ్వరాఖ్యానే తథైవ దర్శనాదిత్యన్యే.**

అను॥ ఇక్కడ - నిర్మాల్యమును ధరించినవాడు బ్రాహ్మణ హంతకుడైనా శుచి యౌతాడు. ఓ మహావ్రతె ! అతని పెద్ద పాపాన్ని కూడా త్వరగా నశింపచేస్తాను,అనే స్కాంద వచనం వల్ల అశుచిగా శివ నిర్మాల్యాన్ని తీసుకోరాదు, కాని స్నానం చేసి తీసు కోవాలని స్మార్తులన్నారు. శ్రీదత్తుడు, ఉపయనం కానివాడు తీసుకోరాదని అన్నాడు. శైవులు, శివదీక్షలేనివారు తీసుకోరాదని అన్నారు. తిథి తత్వమందు హేమాద్రి పరిశిష్టమందు ఇట్లా - శివ నైవేద్యమైన పత్రము, పుష్పము, జలము, ఫలము తీసుకోరాదు. శాలగ్రామ శిలాసంగము వల్ల అంతా పవిత్రమౌతుంది,అని. పంచాయతన పూజయందు (విష్ణు, శివ, సూర్య గణేశ, దుర్గ పంచదేవతలు) ఒకేసారి అందరికి నివేదించాలి అని అర్థము. శివ పురాణమందిట్లా - వీరభద్రునితో శపించబడ్డవాళ్ళు, శివభక్తి పరాఙ్ముఖులు, శివుని కన్న ఇతరమైన దేవతలందు భక్తి కలవారు, దీక్షితులు కానివారు వారికి ఈశుని అప్రసాద చతుష్టయము అర్హము కాదు,అని. కాశీఖండమందిట్లా - విశ్వేశుని స్నానంవల్ల వచ్చిన జలాన్ని తలపై ధరించాలి. ఇది జాలంధర బంధము దేవతలందరికి ప్రియమైనది,అని. అట్లాగే - లింగమునకు శాస్త్ర ప్రకారము స్నానం చేయించి, ఆ నీటిని మూడుమార్లు తాగిన వారి త్రివిధ పాపములు ఇక్కడ త్వరగా నశిస్తాయి,అని. లింగస్నానపు నీటితో తన తలను తడుపుకున్న వానికి, ఆ పుణ్యాత్మునకు (పాపరహితునకు) ఇక్కడ గంగాస్నాన ఫలము కలుగుతుంది. ఇది ముందరి వాక్యాన్ననుసరించి, విశ్వేశ్వర విషయమని కొందరు అన్నారు. ఇది కాశీలో ఉన్న పురాణ ప్రసిద్ధమైన అన్ని లింగముల విషయము, కాశీఖండమందు రత్నేశ్వర ఆఖ్యానమందు అట్లాగే ఉంది. అని ఇతరులన్నారు.

మూ॥ **అథకృషిః** రాజమార్తండః - ఋక్షేషూత్తర పౌష్ణ వైష్ణవ మఘామూలాను రాధాశ్వినీ ప్రాజాపత్య కరద్విదైవత గురుప్రాలేయ పాదేషుచ, నిర్దోషైర్వృష భైర్వలైశ్చ సు మనోమాలాభిరభ్యర్చ్య తైర్దత్వా క్షేత్రప తేర్బలిం హలధరః క్షేత్రం తతః కర్షయేత్. ప్రాజేశ శ్రవణోత్తరాదితి మఘా మార్తాండ తిష్యాశ్వినీ పౌష్ణానుష్ణ మరీచయః. శతభిషక్ స్వాతీ విశాఖా తథా, జీవార్కేందు సితేందు నందనదినే లగ్నే చ సౌమ్యోదయే, సస్యానాంవపనే తథైవ లవనే శస్తాస్తథా రోపణే. చండేశ్వరః - హస్త చిత్రాదితి స్వాతీ రేవత్యాం శ్రవణ త్రయే, స్థిరలగ్నే గురోర్వారే బీజం ధార్యంజ్ఞ శుక్రయోః ఓం ధనదాయ సర్వలోక హితాయ దేహిమే ధాన్యం స్వాహా. **లేఖయిత్వా ఇమం మంత్రం ధాన్యా గారే నిధాపయేత్.** సస్యవృద్ధిం పరాంకుర్యాత్ **పూజితం ప్రతిపూజయేత్.** దక్షిణ దిఙ్ముఖ గమనం గమన మభిన వాసునారీషు, వ్యయమపి సస్యధనానాం న బుధాబుధవా సరే కుర్యుః. శనివారే చ నోకార్యో ధనధాన్య వ్యయోబుధైః. **అథవస్త్రం శ్రీపతిః** - రోహిణీషు కరపంచకేఽశ్వభే త్ర్యుత్త రాసు చ పునర్వ సుద్వయే, రేవతీషు వ సుదేవతే చ భే నవ్యవస్త్ర పరిధాన మిష్యతే. జీర్ణం రవౌ సతతమం బుభిరార్ద్ర మిందౌ భౌమేశుచే బుధ దినేతు భవేద్ధనాయ, జ్ఞానాయ మంత్రిణి భృగౌప్రియ సంగమాయ మందే మలాయ చ నవాంబర ధారణం స్యాత్. రోహిణీ గురు పునర్వసూత్తరేయా బిభర్తి నవవస్త్ర భూషణే, సానయోషిదవలంబతే పతిం స్నానమాచరతివారుణేఽపియా.

అను॥ ఇక కృషి, రాజమార్తండుడు ఇట్లా – ఉత్తరత్రయము, రేవతి, శ్రవణం, మఘ, మూల, అనురాధ, అశ్విని, రోహిణి, హస్త, విశాఖ, పుష్యమి, మృగశిర (శతభిషం) ఈ నక్షత్రములందు దోషరహితమైన వృషభములు, నాగలి వానిని పూలమాలలతో అలంకరించి క్షేత్రపతికి బలి ఇచ్చాక, ఆ పిదప వానితో కర్షకుడు క్షేత్రమును దున్నాలి,అని. రోహిణి, శ్రవణం, ఉత్తరత్రయం, పునర్వసు, మఘ, హస్త, పుష్యమి, అశ్విని, రేవతి, మృగశిర, శతభిషం, స్వాతి, విశాఖ ఈ నక్షత్రములందు, గురు, ఆది, సోమ, శుక్ర, బుధవారములందు వీని లగ్నమందు, లగ్నంలో శుభగ్రహాలు ఉండగా (బుధుని ఉదయంలో) బీజవపనము (విత్తనంచల్లుట) లవనము (కోయుట) రోపుట (నాటటము) ఇవి చేయటం ప్రశస్తము. చండేశ్వరుడిట్లా – హస్త, చిత్త, పునర్వసు,స్వాతి, రేవతి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం ఈ నక్షత్రములందు, స్థిరలగ్నమందు, గురువారమందు అట్లాగే బుధశుక్రవారము లందును విత్తనములు చల్లుట చేయాలి,అని. ఓం ధనము నిచ్చేవాడ, సర్వలోకహితుడ, నాకు ధాన్యము నివ్వు నీకిదే స్వాహా (నమస్కారము) అని వ్రాయించి ఆ కాగితాన్ని (ఈ మంత్రం గల దాన్ని) ధాన్యాగారంలో ఉంచాలి. సస్యవృద్ధిని అధికంగా చేస్తాడు పూజించిన వానిని గౌరవిస్తాడు కూడా. బుధవారం రోజున, దక్షిణ దిక్కువైపు పోవటం, కొత్త స్త్రీలతో కలవటం, సస్యధాన్యములను ఖర్చు చేయటం పండితులైనవారు చేయరాదు. బుధుడు, శనివారమందు ధనధాన్య వ్యయము చేయరాదు. ఇక వస్త్రము – శ్రీపతిఇట్లా – రోహిణి, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనురాధ, అశ్విని, మూడు ఉత్తరలు, పునర్వసు, పుష్యమి, రేవతి, ధనిష్ఠ ఈ నక్షత్రములందు నూతన వస్త్రాన్ని ధరించటం మంచిది. ఆదివారం నాడు నూతన వస్త్రధారణ జరిగితే అది త్వరలో చినిగిపోతుంది. సోమవారం ధరిస్తే అది ఎప్పుడూ నీటితో తడిసి ఉంటుంది. మంగళవారం ధరిస్తే శోకం కల్గుతుంది. బుధవారం ధరిస్తే ధనం సమకూరుతుంది. గురువారం నూతన వస్త్రం ధరిస్తే జ్ఞానం లభిస్తుంది. శుక్రవారం ధరిస్తే ప్రియజన సమాగమం కల్గుతుంది. శనివారం ధరిస్తే మలినమౌతుంది. రోహిణి, పుష్యమి, పునర్వసు, మూడు ఉత్తరలు, వీనిలో నవ వస్త్రములను భూషణములను ధరించిన స్త్రీ, శతభిషా నక్షత్రమందు స్నానం చేసిన స్త్రీ (ప్రసూతి స్నానం) భర్త అవలంబనమును పొందదు.

**మూ॥ అథాలంకారవలయాది దైవజ్ఞ వల్లభః – నా సత్య పూషవ సుభిః కరపంచకేన మార్తాండ భౌమ గురుదాన వమంత్రివారే, ముక్తా సువర్ణ మణి విద్రుమ శంఖదంత రక్తాంబరాణి విధృతాని భవంతిసిద్ధ్యై. జ్యోతిర్నిబంధే – హస్తాను రాధ మృగపూష ధనిష్ఠ యుక్త చిత్రోత్తరాసు చ పునర్వసు రోహిణీషు, లగ్నే స్థిరేరవిసుతేందుజ జీవవారే హేమాది ధారణ విధిః కథితో నరాణాం. తత్రైవ శ్రీపతిః–పౌష్ణాశ్వినీ వసుకరాదిషు పంచభేషు కౌసుంభ హేమమణి విద్రుమ కాచ శంఖాః , నార్యాధృతాః సుత సుఖార్థకరా భవంతి బ్రాహ్మోత్తరాదితి గురుష్వసుఖాయభర్తుః. తత్రైవ – శంఖాది వరరత్నాని పుష్యాదిత్యోత్త రాసుచ, రోహిణ్యాం చైవ గృహ్ణీత భర్తు ర్జీవిత కాంక్షిణీ.**

**అథసూచీకర్మ** - వాసవాదితి భత్వాష్టమైత్ర చందాశ్విన్నీషు చ, సూచీకర్మ తనుత్రాణమే భిర్బుక్తైః ప్రశస్యతే. **అథశయ్యా** - హస్తాదితి బ్రహ్మా గురూత్తరాణి పౌష్ణాశ్వి మూలేందు భచిత్రభాని, వారేషు జీవేందు సితేందుజానాంశయ్యాసనారంభణ ముత్తమం స్యాత్. **అథశస్త్రధారణం** - పుష్యే చాదితి చిత్రపద్మ తనయే శక్రోత్తరా రేవతి స్వాతీ వాజి విశాఖ మిత్ర సహితే భానౌ గురౌ భార్గవే, కుంభే కీట గృహే వృషే మృగపతౌ చేందౌ శుభైర్వీక్షితే సన్నాహః శరఖడ్గ కుంత ఛురికా ధార్యా నృపాణాంహితాః. **అథస్వామిసేవా** - చండేశ్వరః - రోహిణ్యుత్తర పౌష్ణేషు వసు వారుణ యోరపి. సేవేతస్వామినం భృత్యః శుభవారోదయే తథా. **జ్యోతిర్నిబంధే** - దాసీదాసాది భృత్యా నాం కుర్యాత్సం గ్రహణం బుధే. స్థిరలగ్నే శుభైర్ దృష్టే మంద వారే విశేషతః.

అను॥ ఇక అలంకార వలయాదుల ధారణ గూర్చి - దైవజ్ఞ వల్లభుడిట్లా - అశ్విని, రేవతి, ధనిష్ఠ, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనురాధ, నక్షత్రములందు ఆది, మంగళ, గురు, శుక్రవారములందు ముత్యములు, బంగారము, మణులు, పగడములు, శంఖములు, దంతపు వస్తువులు, ఎర్ర వస్త్రములు వీనిని ధరించిన ఇవి సిద్ధిని కల్గిస్తాయి, అని. జ్యోతిర్నిబంధమందిట్లా - హస్త అనురాధ, మృగశిర, రేవతి, ధనిష్ఠ, చిత్త, మూడు ఉత్తరలు, పునర్వసు, రోహిణీ ఈ నక్షత్రములందు స్థిరలగ్నమందు, శని, బుధ, గురువారము లందు బంగారము మొదలగు వాని ధారణ విధి నరులకు ప్రశస్తమని చెప్పబడింది. అక్కడే శ్రీపతి ఇట్లా - రేవతి, అశ్విని, ధనిష్ఠ, హస్తాది ఐదు నక్షత్రాలు వీనియందు ఎర్రని వస్త్రములు బంగారము మణులు, పగడములు, గాజు, శంఖము వీనితో చేసిన ఆభరణములు ధరించిన స్త్రీలు, సుతులు, సుఖము, ధనము వీనికి చేకూర్చు వారౌతారు. రోహిణి, ఉత్తర, పునర్వసు, పుష్యమి ఈ నక్షత్రములందు ధరించిన స్త్రీలు భర్తకు అ సుఖం కూర్చువారౌతారు. (భర్త వల్ల అసుఖం పొందుతారు),అని. అక్కడే - శంఖము మొదలగు శ్రేష్ఠ రత్నములను పుష్యమి, పునర్వసు, మూడు ఉత్తరలు, రోహిణి ఈ నక్షత్రములందు ధరించిన స్త్రీ భర్త దీర్ఘాయుస్సును కోరినదౌతుంది. ఇక సూచీకర్మ - (బట్టలు కుట్టటం) ధనిష్ఠ పునర్వసు, చిత్ర, అనూరాధ, మృగశిర, అశ్విని ఈ నక్షత్రములందు చేసిన అంగి (తనుత్రాణం) ప్రశస్తమైంది,అని. ఇక శయ్య - హస్త, పునర్వసు, రోహిణి, పుష్యమి, మూడు ఉత్తరలు రేవతి, అశ్విని, మూల, మృగశిర, చిత్ర ఈ నక్షత్రములందు, గురు, సోమ, శుక్ర, బుధవారములందు, శయ్య ఆసనము మొదలగువాని ఆరంభము ఉత్తమమైనది. ఇక శస్త్రధారణము - పుష్యమి, పునర్వసు, చిత్ర, రోహిణి, జ్యేష్ఠ, మూడు ఉత్తరలు, రేవతి, స్వాతి, అశ్విని, విశాఖ, అనురాధ ఈ నక్షత్రములతో కూడిన, ఆది, గురు, శుక్రవారము లందు కుంభ, వృశ్చిక, వృషభ, సింహ ఈ లగ్నములందు చంద్రుని శుభ వీక్షణ మందు సన్నాహము, శరము, ఖడ్గము, కుంతము, చిన్నకత్తి (ఛురిక) వీని ధారణము రాజులకు క్షేమకరము. ఇక స్వామి సేవ - చండేశ్వరుడిట్లా - రోహిణి, మూడుత్తరలు, రేవతి, ధనిష్ఠ, శతభిషం ఈ నక్షత్రములందు శుభమైన వారములో ఉదయ కాలమందు భృత్యుడు,

యజమాని సేవను ఆరంభించాలి,అని. జ్యోతిర్నిబంధమందిట్లా – దాసి, దాసుడు మొదలగు భృత్యుల సంగ్రహణము బుధవారమందు చేయాలి. విశేషించి, శనివారమున స్థిరలగ్నమందు శుభగ్రహముల వీక్షణ ఉండగా సంగ్రహణ చేయాలి,అని.

మూ॥ **అథగజాశ్వదోలాః** – స ఏవ – పౌష్ణప్రజే శాదితి భద్వయాని హస్తాదిషట్క శ్రవణోత్తరాణి, దోలాది మాతంగ తురం గమణా మారోహణేఽభీష్ట ఫలప్రదాని. **అథ నృత్యం** -హస్తః పుష్యోవాసవం రోహిణీ చ జ్యేష్ఠా పౌష్ణం వారుణం చోత్తరాశ్చ. పూర్వాచార్యైః కీర్తితశ్చ శ్రవర్త్రీ నృత్యారంభే శోభనోఽయం భవర్గః. **అథరాజదర్శనం** – శ్రీపతిః – మృగాశ్వి పుష్య శ్రవణ శ్రవిష్ఠా హస్త ధ్రువత్వాష్ట్ర భ పూషభాని, మైత్రేయ యుక్తాని నరేశ్వరాణాం విలోకనే భానిశుభప్రదాని. **అథక్రయ విక్రయౌ** – భాద్రద్వయ త్రిదశ మంత్రి దివాకరేషు మూలా నిలోత్తరతురంగమరేవతీషు, సారంగపాణి రజనీకర మైత్రభేషులాభః సదైవ భవతి క్రయ విక్రయాభ్యాం. **వస్త్రేతు**–చిత్రాశతభిషా స్వాతీ రేవతీ చాశ్వినీ శుభా శ్రవణశ్చ తథా ప్రోక్తో వస్త్రాణాం క్రయణే శుభః. **అథ సేతుః** – స్వాతీయుక్తే మందవారే వృషలగ్నే శుభేదినే సేతూనాం బంధనం కార్యం ధ్రువభే చార్క జీవయోః **అథపశుకృత్యం** – శ్రీపతిః – చిత్రోత్తరా వైష్ణవ రోహిణీషు చతుర్దశీ దర్శదినాష్టమీషు, స్థాన ప్రవేశం గమనం విదధ్యాత్ పుమాన్ పశూనాం న కదాచిదేవ. చండేశ్వరః – హస్తమూల విశాఖాసు రేవత్యాం శ్రవణే తథా, మైత్రేచ వారుణే శ్రేష్ఠం పశుక్రయణ ముచ్యతే, పూర్వాత్రయామృత మయూఖ హుతాశనేషు, ఇంద్రాగ్ని వాజివసువారుణ శంకరేషు, ఏతేషు గోమహిషదంతి తురంగమాది నానా ప్రకార పశుజాతి గతిః ప్రశస్తా. **అథగజదంతచ్ఛేదః** – జ్యోతిర్నిబంధే – త్వాష్ట్రే వైష్ణవ అశ్విన్యామాదిత్యే వసుదైవతే, దంతినాం శుభదం కర్మ పుష్యే హస్తే చ కీర్తితం. **అథనిక్షేపః** – భరణీ త్రీణి పూర్వాణి ఆర్ద్రా శ్లేషా మఘాతథా. చిత్రా జ్యేష్ఠా విశాఖా చ మూలం మృగ పునర్వసూ, ఏభిర్దత్తం ప్రయుక్తం చ యద్యన్నిక్షిప్యతే ధనం, పృష్ఠతో ధావమానస్య ధనినోనోపపద్యతే. **అథ ఋణమోక్షః** – శ్రీధరః–వాగీశ మంద దివసాంశక లగ్న యుక్తే రిక్తాసు మందదివసే కులకోదయే చ మైత్రద్వితీయ పదమైత్ర ముహూర్త యుక్తే రాశ్యుద్గమే చ ఋణమోక్షముశంతి సంతః. **అథరాజముద్రా** – మృదు ధ్రువ క్షిప్రచరేషు భేషు యోగే ప్రశస్తే శనిచంద్ర వర్జం, వారే తిథౌ పూర్ణ జయాహ్వయేచ ముద్రా ప్రతిష్ఠా శుభదాహిరాజ్ఞాం. **అథనౌ** – చండేశ్వరః – పౌష్ణాశ్వినీ తురగ వారుణ మిత్ర చిత్రా శీతోష్ణ రశ్మి వసవోనల వంత్యమూని, వారేచ జీవభృగునందనకే ప్రశస్తే నౌకాది సంఘటన వాహనమేషు కుర్యాత్. **అథభోగః** – గురుభ రవిభా నురాధా విధాతృపౌష్ణాశ్వి రోహిణీషుస్యాత్, స్వాత్యుత్త రాసుకుర్యాత్ శయనాశ (స)న భోగభోగాది.

అను॥ ఇక గజ అశ్వదోలా రోహణముల గూర్చి – ఆతడే – రేవతి, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త మొదలు ఆరు, శ్రవణ, మూడు ఉత్తరలు ఈ నక్షత్రములలో పల్లకి మొదలగునవి, ఏనుగు, గుర్రము, వీనిని అధిరోహించటమువల్ల ఇవి అభీష్ట ఫలముల నిస్తాయి,అని. ఇక నృత్యము – హస్త, పుష్యమి, ధనిష్ఠ, రోహిణి, జ్యేష్ఠ, రేవతి, శతభిషం

మూడు ఉత్తరలు, ఈ నక్షత్రములలో నృత్యారంభము చేస్తే మంచిది అట్లా చేసిన వ్యక్తి నృత్యకులంలో చక్రవర్తి ఔతాడు అని పూర్వాచార్యులు కీర్తించినారు. ఇక రాజదర్శనము-శ్రీపతి ఇట్లా - మృగశిర, అశ్విని, పుష్యమి, శ్రవణం, ధనిష్ఠ, హస్త, మూడు ఉత్తరలు, రోహిణి, చిత్ర, రేవతి అనురాధ ఈ నక్షత్రములలో రాజదర్శనం చేసుకుంటే మేలు,అని. ఇక క్రయ విక్రయములు - పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, పుష్యమి, హస్త, మూల, స్వాతి, మూడు ఉత్తరలు, అశ్విని, రేవతి, శ్రవణం, మృగశిర, అనురాధ, ఈ నక్షత్రములలో క్రయ, విక్రయములు చేస్తే ఎప్పుడూ లాభం కలుగుతుంది. వస్త్ర విషయంలో ఐతే - చిత్ర, శతభిషం, స్వాతి, రేవతి, అశ్విని, శ్రవణం ఈ నక్షత్రములలో వస్త్రములను కొంటే శుభ మౌతుంది. ఇక సేతువిషయం (ఆనకట్టకట్టటం) స్వాతి నక్షత్రంతో కూడిన శనివారం, వృషభ లగ్నం, శుభదినమందు సేతు బంధనం చేయాలి రవి గురువుల వారములలో ధ్రువ నక్షత్రములందు సేతు బంధనం చేయాలి. ఇక పశువుల గూర్చి శ్రీపతి ఇట్లా - చిత్ర, ఉత్తరలు, శ్రవణం, రోహిణి, ఈ నక్షత్రములందు, చతుర్దశి, అమావాస్య అష్టములందు ఎవరైనా సరే పశువులుండే స్థాన ప్రవేశము, పోవటము ఎప్పుడూ చేయరాదు అని చండేశ్వరుడిట్లా - హస్త, మూల, విశాఖ, రేవతి, శ్రవణం, అనురాధ, శతభిషం ఈ నక్షత్రములలో పశువులను కొనుట శ్రేష్ఠము అని అంటారు. మూడు పూర్వలు, మృగశిర, కృత్తిక, విశాఖ, అశ్విని, ధనిష్ఠ, శతభిషం, ఆర్ద్ర ఈ నక్షత్రములలో గోవు, దున్నపోతు, ఏనుగ, గుర్రం మొదలగు నానా ప్రకారములైన పశుజాతుల సేకరణ ఉత్తమము,అని. ఇక ఏనుగుదంతచ్ఛేదనము - జ్యోతిర్నిబంధమందిట్లా - చిత్ర, శ్రవణం, అశ్విని, పునర్వసు, ధనిష్ఠ, పుష్యమి హస్త ఈ నక్షత్రములలో ఏనుగుల దంతచ్ఛేదన కర్మ శుభకరమని చెప్పారు, అని. ఇక నిక్షేపము - భరణి, మూడు పూర్వలు, ఆర్ద్ర, ఆశ్లేష, మఘ, చిత్ర, జ్యేష్ఠ, విశాఖ, మూల, మృగశిర, పునర్వసు ఈ నక్షత్రములలో ఇచ్చిన, పనిలో వినియోగించిన, ఉంచబడిన ధనముకై ఆ ధనవంతుడు వెనుక పరుగెత్తినా అది ఆతనికి తిరిగి అందదు. ఇక ఋణ మోక్షం - శ్రీధరుడిట్లా - గురు, శనివారములలోని అంశక లగ్నముతో కూడినప్పుడు రిక్త తిథులలో, శనివారమందు, కులికోదయమందు (ఆదివారం నాల్గవభాగం, సోమవారం ఆరవభాగం, మంగళవారం ఎనిమిదవభాగము, బుధవారము పదవభాగము, గురువారము పన్నెండవభాగము, శుక్రవారం పదునాల్గవభాగము, శనివారము రెండవముహూర్తము ఇవి కులికలు) అనురాధ రెండవ పాదం మైత్ర ముహూర్తంతో కూడి ఉండగా, రాశి ఉద్గమ (ఉదయం) మందు ఋణమోక్షణము మంచిదని పెద్ద లంటారు, (ఉశ్=కోరుట) అని. ఇక రాజముద్ర - మృదు (మృగశిర, చిత్ర, అనురాధ, రేవతి) ధ్రువ (రోహిణి, మూడు ఉత్తరలు) క్షిప్ర (పుష్యమి, అశ్విని, అభిజిత్, హస్త) ఈ నక్షత్రములలో ప్రశస్త యోగమందు, శని సోమవారములు కాకుండా వేరే వారములలో పూర్ణ (పంచమి, దశమి, పూర్ణిమ) జయ (తృతీయ, అష్టమి, త్రయోదశి) తిథులలో రాజులకు, రాజముద్రను

ప్రతిష్ఠించుట క్షేమకరము. ఇక నావ విషయము – చండేశ్వరుడిట్లా – రేవతి, అశ్విని, స్వాతి, శతభిషం, అనురాధ, చిత్ర, మృగశిర, హస్త, ధనిష్ఠ, కృత్తిక, ఈ నక్షత్రములు, గురు, శుక్ర వారములు వీనిలో నౌకాదులను కూర్చుట, వీనిని ఎక్కుట చేయాలి. ఇవి ప్రశస్తము అని అన్నారు. ఇక భోగము – పుష్యమి, హస్త, అనురాధ, రోహిణి, రేవతి, అశ్విని (విధాతృ, రోహిణి నక్షత్రాలు రెండు ఒకటే రిపీట్ ఐందా?) స్వాతి మూడుత్తరలు ఈ నక్షత్రములలో శయనము, భోజనము (ఆసనభోగము) ఇతర భోగాదులు ఆచరించుట శుభకరము.

**మూ॥ అథశ్మశ్రుకర్మ శ్రీపతిః – పుష్యేపౌష్ణే చా శ్వినీ ష్వైందవే చ శాక్రేహ స్త్రాద్యేత్రికే ఖేష్వదిత్యాం, క్షౌరం కార్యం వైష్ణవాదిత్రయే చ ముక్త్వా భౌమాదిత్య పాతంగివారాన్. నస్నాత భుక్తోత్కట భూషితానా మభ్యంగ యాత్రా సమరోత్సుకానాం, క్షౌరం విదధ్యాన్నిశి సంధ్యయో ర్వాజిజీ విషూణాం నవమే న చాహ్ని. త్రిస్థలీ సేతౌ వృద్ధగార్గ్యః – రవ్యారసౌరవారేషు రాత్రౌ పాతే వ్రతాహని, శ్రాద్ధాహః ప్రతిపద్రిక్తా భద్రాః క్షౌరేషు వర్జయేత్. గార్గ్యః – షష్ఠ్యమా పూర్ణిమా పాతో చతుర్దశ్యష్టమీ తథా, అసు సన్నిహితం పాపం త్రిషు తైలేభగేక్షురే. రాజమార్తండః – దేవకార్యే పితుః శ్రాద్ధే రవే రంశ పరిక్షయే, క్షౌరకర్మ నకుర్వీత జన్మమాసే చ జన్మభే. బృహస్పతిః – రాజకార్యే నియుక్తానాం నరాణాం భూపజీవినాం, శ్మశ్రులోమనఖచ్ఛేదే నాస్తి కాలవిశోధనం. తథా – క్షౌరం నైమిత్తి కంకార్యం నిషేధే సత్యపిధ్రువం, పిత్రాది మృతి దీక్షా సుప్రాయశ్చిత్తే చతీర్థకే. కేచిత్తూత్తరార్థ మన్యథా పఠంతి – ముండనస్య నిషేధేఽపి కర్తనంతు విధీయతే, ఇతి. నారదః – నృపవిప్రాజ్ఞయా యజ్ఞే మరణేబంధమోక్షణే, ఉద్వాహేఽఖిల వారర్ క్షేతిథి షుక్షౌర మిష్టదం. భారతే – ప్రాజ్ముఖః శ్మశ్రుకర్మాణి కారయీత సమాహితః ఉదజ్ ముఖోఽథవా భూత్వా తథాయుర్విందతే మహత్. అపరార్కే – ఉదజ్ ముఖోప్రాజ్ ముఖో వావపనం కారయేత్సుధీః కేశశ్మశ్రులోమనఖాన్యుదక్ సంస్థాని వాపయేత్. దక్షిణం కర్ణమారభ్య ధర్మార్థం పాపసంక్షయే, శిఖాద్యే నవ సంస్కారే శిఖాద్యంతం శిరోవపేత్. యతీనాంతు విశేషోనిగమే – కక్షోపస్థ శిఖావర్జం ఋతు సంధిషు వాపయేత్,ఇతి. అన్యేపి విధి ప్రతిషేధాః ప్రాగుక్తాః. అథ ఇందన సంగ్రహః – బ్రహ్మానిలార్క మఘ మూల త్రిపూర్వ రౌద్ర పౌష్ణానురాధ గురు విష్ణు విశాఖ యుక్తే, వారే కుజార్క భృగు నందన సోమజానాం శ్రేష్ఠం ధనవ్యకరణం భవతి ప్రశస్తం. అథనవాన్నం – శ్రీపతిః – రేవతీ శ్రుతి పునర్వసు హస్త బ్రాహ్మతః పృథగ పిద్వితయే చ త్ర్యుత్తరేషు గదితం పృథుకానాం ప్రాశనం చన, నవాన్న విధానం. అథ నవ భోజనపాత్రం – జ్యోతిర్నిబంధే – భోజ్యపాత్రం సుధాసింధౌ ఘటయే ద్వా సమాహరేత్, తత్రాన్నప్రాశన ప్రోక్తే కాలే భోజన మాచరేత్. అథ నవ పర్ణ ఫలాది భక్షణం చండేశ్వరః – మూలాశ్వి మైత్ర కరతిష్య హరీంద్ర భేషు పౌష్ణోత్తరైందవ పునర్వసు వాసవేషు , వారేషు భూమి తన యార్కజ వారవర్జం తాంబూల నూతన ఫలాద్యశనం హితాయ.**

అను॥ ఇక క్షౌరమును గూర్చి – శ్రీపతి ఇట్లా – పుష్యమి, రేవతి, అశ్విని, మృగశిర, జ్యేష్ఠ, హస్త, చిత్త, స్వాతి, పునర్వసు ఈ నక్షత్రాలలో, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఈ నక్షత్రాలలోను క్షౌరం చేసుకోవచ్చును. మంగళ, ఆది, శనివారములలో క్షౌరం తగదు

(గడ్డం గూర్చి),అని. స్నానంచేసి, భుజించాక, బాగా అలంకరించుకున్నాక, అభ్యంజనం తర్వాత, యాత్ర, యుద్ధోత్సాహముక లిగాక, రెండు సంధ్యలు, రాత్రి తొమ్మిదవ (నవమి) కొత్త (పాడ్యమి) రోజున వీటిలో, దీర్ఘకాలం జీవించాలని కోరుకునేవారు క్షౌరం చేసుకోరాదు. త్రిస్థలీ సేతువు యందు వృద్ధగార్గ్యుడిట్లా – ఆది, మంగళ, శనివారములందు, రాత్రియందు, వ్యతీపాతమందు (రాహు కాలమా), వ్రతపురోజున, శ్రాద్ధం రోజున, ప్రతిపద, రిక్త, భద్ర తిథులు వీనిలో క్షౌరం చేసుకోరాదు,అని. గార్గ్యుడిట్లా – షష్ఠి, అమా, పూర్ణిమ, వ్యతీపాతము, చతుర్దశి అష్టమి ఈ తిథులలో పాపము, నూనె, స్త్రీ, క్షౌరము ఈ మూడిలో సన్నిహితముగా ఉంటుంది,అని. (వీనిలో క్షౌరం తగదు,అని). రాజమార్తండుడిట్లా – దేవకార్యమందు, తండ్రి శ్రాద్ధమందు, సూర్య అంశ తగ్గాక (సూర్యగ్రహణమా అసంపూర్ణంగా), జన్మమాస మందు, జన్మనక్షత్రమందు క్షౌరం చేసుకోరాదు,అని. బృహస్పతి ఇట్లా – రాజకార్యమందు నియుక్తులైన, రాజు నాశ్రయించి బ్రతికే, వారు గడ్డం, శరీరంపైని వెంట్రుకలు, గోళ్ళు వీటిని ఛేదించుకొనటానికి మంచి సమయం కోసం చూడాల్సిన పనిలేదు,అని. అట్లాగే – పిత్రాదులు మరణించినప్పుడు, దీక్షయందు ప్రాయశ్చిత్తమందు, తీర్థమందు, నైమిత్తిక క్షౌరం చేసుకోవాల్సిందే, నిషేధం తప్పకుండా ఉన్నా కూడా. కొందరు ఉత్తరార్థమును మరో రకంగా చదువుతారు (పాఠాంతరం) ముండనం నిషేధమైనా, కర్తనము చేయించు కోవచ్చు,అని. నారదుడిట్లా – రాజు, బ్రాహ్మణుడు వీరి ఆజ్ఞతో యజ్ఞమందు, మరణమందు, బంధ విముక్తియందు, వివాహమందు అన్ని తిథివార నక్షత్రములలోను, క్షౌరము ఇష్టాన్ని కూరుస్తుంది,అని. భారతమందిట్లా – ఏకాగ్రంతో తూర్పు ముఖంగా కూర్చొని గడ్డం చేయించుకోవాలి లేదా ఉత్తర దిక్కుగా ముఖం పెట్టైనా. అట్లాఐతే గొప్ప ఆయుస్సును పొందుతాడు,అని. అపరార్కమందిట్లా – బుద్ధిమంతుడు ఉత్తర దిక్కు ముఖం పెట్టైనా క్షౌరం చేయించుకోవచ్చు. కేశములు, గడ్డం శరీరంపైని వెంట్రుకలు గోళ్ళు నీటితో తడిపి గొరిగించుకోవాలి,అని. పాపనాశం కొరకు ధర్మం కొరకు కుడిచెవిని ఆరంభించి శిఖ మొదలు వరకు, నవ సంస్కారమందు (కొత్తగా) శిఖ యొక్క ఆది అంతముల వరకు శిరస్సును కొరిగించుకోవాలి. (ప్రాయశ్చిత్త తీర్థములందు రాత్రి క్షౌరం తగును మృతి నిమిత్తమైన శ్మశ్రునీ వపన క్రియ పగలే నిషిద్ధ కాలంలో క్షౌరం చేయాల్సి వస్తే చేసి ఆ దోష శాంతి కొరకు మంచి రోజు తిరిగి క్షౌరం చేయాలి,అని, గర్గుడు.క్షౌరమందు వీరిని స్మరిస్తే దోషములన్నీ పోతాయి. వారి పేర్లు ఆనర్తదేశం వాడు అహిచ్ఛత్రుడు, పాటలిపుత్రుడు దితి, దినుడు, శ్రీశుడు,అని). యతులకు విశేషంగా నిగమమందు ఇట్లా ఉంది –చంక, ఉపస్థ, శిఖ వీటిని వదలి ఋతు సంధులలో క్షౌరం చేయించుకోవాలి,అని. ఇతరమైన విధి, ప్రతిషేధములను ముందే చెప్పాము. ఇక ఇంధన సంగ్రహము – రోహిణి స్వాతి, హస్త, మఘ, మూల, మూడు పూర్వలు, ఆర్ద్ర, రేవతి, అనురాధ, పుష్యమి, శ్రవణం, విశాఖ ఈ నక్షత్రములతో కూడిన మంగళ, ఆది, శుక్ర, బుధవారములలో శ్రేష్ఠమైన కట్టెలను

సేకరించుట ఉత్తమము. ఇక కొత్త భోజనము – శ్రీపతి ఇట్లా – రేవతి, శ్రవణం, పునర్వసు, హస్త, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, మూడు ఉత్తరలు ఈ నక్షత్రములలో పృథుకముల (అటుకులు) ప్రాశనము చెప్పబడింది. అది నవ అన్న విధానము,అని. ఇక కొత్త భోజన పాత్రము – జ్యోతిర్నిబంధమందిట్లా – భోజన పాత్రమును అమృత వేళ యందు కూర్చాలి లేదా తీసుకురావాలి. అందు అన్న ప్రాశనకై చెప్పిన సమయమందు భోజన మాచరించాలి,అని. ఇక కొత్త ఆకులను పండ్లను మొ॥వానిని భుజించుట – చండేశ్వరుడిట్లా – మూల, అశ్విని, అనురాధ, హస్త, పుష్యమి, శ్రవణం, జ్యేష్ఠ, రేవతి, మూడుత్తరలు, మృగశిర, పునర్వసు, ధనిష్ఠ, ఈ నత్రములందు మంగళ, శనివారములు కాక ఇతర వారములందు తాంబూలము, కొత్త పండ్లు మొదలగు వానిని తినుట క్షేమకరము,అని.

**మూ॥ అథహోమే ఆహుతి పాతః –జ్యోతిషే – తరణి విద్ భృగు భాస్కరి చంద్రమాః** కుజసురేజ్య విధుంతుదకేతవః, రవిభతోదినభం గణయేత్క్రమాత్ ప్రతిఖగం త్రితయంత్రితయం న్యసేత్. దినకరార్కితమః కుజకేతవో హుతభుజే, న శుభాస్త్వితరే శుభాః దహన చక్రమిదం ప్రవిలోక్యతాం దహన కర్మణి సర్వసమృద్ధయే. **అథశాంతిరుక్తా** విష్ణుధర్మే – క్రూరగ్రహ ముఖే చైవ సంజాతే హవనే శుభే, శాంతిం విధాయ గాందద్యాత్ బ్రాహ్మణాయ కుటుంబినే, **ఆయసీం** ప్రతిమాం కృత్వా నిక్షిపేత్తా మధోముఖీం, గోమూత్ర మధు గంధాద్యైః **అర్చితాం ప్రతిమాంతతః. స్వస్థాం విధాయ సంపూజ్య తత్ర హోమో విధీయతే. అత్రాపవాదః** క్రియాసారే **– నిత్యే నైమిత్తికే దుర్గా హోమాదౌ న విచారయేత్. అథజ్వరాదౌ ఫలం – శ్రీపతిః – స్వాత్యాశ్లేషా** రౌద్ర పూర్వాసు శాక్రే రోగోత్పత్తిః బాధతేయస్య పుంసః, తద్భైషజ్య వ్యాపృతో నిష్ప్రయత్నః స్యాత్ దుగ్ధాబ్ధేః లబ్ధజన్మాపి వైద్యః వ్యాధ్యుత్పత్తిర్యస్య పౌష్ణే సమిత్రే ప్రాణ త్రాణం జాయతే తస్య కృచ్ఛ్రాత్ వైశ్వే సౌమ్యే రోగముక్తిస్తు మాసా ద్వింశత్యాస్యాద్వాసరాణాం మఘాసు. పక్షార్ధస్తే వాసవే సద్విదైవే మూలాశ్విన్యోరగ్ని ధిష్ణ్యే నవాహాత్, యామ్యేత్వాష్ట్రే వైష్ణవే, వారుణేచ నైరుజ్యం స్యాత్ నూనమే కాదశాహాత్. అహిర్బుధ్న్యేతిష్య సంజ్ఞేఉర్యమాఖ్యే ప్రాజాపత్యాదిత్యయో సప్తరాత్రాత్, రోగాన్ముక్తి ర్జాయతే మానవానాం నిః సందిగ్ధం జల్పితంగర్గ ముఖ్యైః. జ్యోతిషే – ఏకాహోనిధనం దశాహమన (ని) లాద్బాణావియత్ పర్వతాః, సప్తాంకా(గా) విలయశ్చ మాసయుగలం మాసోమృతిః పక్షకః ద్వౌమాసావధ వింశతిర్దశనిశాః పక్షాంతపక్షానఖామాసౌ పక్షదశాంతపక్ష, కకుభః పీడాదినాన్య శ్విభాత్. దైవజ్ఞః – ఉరగవరుణ రౌద్రౌ వాసవేంద్ర త్రిపూర్వాయమదహన విశాఖాః పాపవారేణ యుక్తాః, తిథిషు నవమి షష్ఠీ ద్వాదశీవా చతుర్థీ భవతి మరణ యోగో రోగిణాం కాలహేతుః **అథశాంతిః** – కుంభే హైమీం నక్షత్ర దేవతా ప్రతిమాం సంపూజ్య ద్వాదశ దళేషు సంకర్షణాది ద్వాదశమూర్తీః ద్వాదశాదిత్యాన్వా సంపూజ్య దూర్వా సమిత్తిలక్షీరాజ్యైర్గాయ త్ర్యాతద్దేవతాయై అష్టోత్తర శతం హుత్వా దధ్యోదనం బలిం దత్వా ఆచార్యాయ గాం ప్రతిమాం చ దత్వా విప్రాన్ భోజయే దితి సంక్షేపః. విశేషస్తు వ్రత హేమాద్రౌ పదార్థా దర్శేచ జ్ఞేయః. **అథభేషజం** – చండేశ్వరః–మూలానురాధ మృగతిష్య పునర్వ సౌచ పౌష్ణాశ్వినీ శ్రవణ శక్ర కరత్రయే చ, వారేషు వాక్పతి దినేషు సి తేందు శస్తే భైషజ్య భక్షణ మమీషు హితం నరాణాం. **అథ ఆరోగ్యస్నానం**

- శ్రీపతిః - ఇందోర్వారే భార్గవే చ ధ్రువేషు సార్పాదిత్య స్వాతి యుక్తేషు భేషు, పిత్ర్యే చాంత్యే వాపి కుర్యాత్క దాచిన్నైవ స్నానం రోగ నిర్ముక్త జంతుః. చరేవిలగ్నే రవి భౌమవాసరే రిక్తే తిథౌ స్యాద్ బహులే చ పక్షే, దిష్ట్యే చరే రోగని పీడితానాం స్నానం నరాణాం నిరుజత్వకారి.

అను॥ ఇక హోమమందు ఆహుతిపాతమిట్లా - జ్యోతిష మందు - సూర్యుని నక్షత్రం నుండి దిన నక్షత్రం వరకు లెక్కించాలి. క్రమంగా మూడేసి నక్షత్రములుగా (తరువాత) ఈ గ్రహముల ముఖంలో ఆహుతి చేయాలి. సూర్యుడు నక్షత్రం నుంచి మూడు నక్షత్రాలు సూర్యునకు, తర్వాతి మూడు నక్షత్రాలు బుధునకు, తరువాతి మూడు శుక్రునకు, ఆ తర్వాతి మూడు శనికి, తర్వాతి మూడు చంద్రునకు తర్వాతి మూడు కుజునకు, తరువాతి మూడు గురునకు తరువాతి మూడు రాహునకు, తర్వాతి మూడు కేతు ముఖమందు ఆహుతి పాతం చేయాలి,అని. సూర్యుడు, శని, రాహు, కుజ, కేతువులు వీరి ముఖంలో ఆహుతి పడితే అశుభులు ఇతరులు శుభమైనవారు. ఇది దహన చక్రము. దహన కర్మలో సర్వ సమృద్ధికొరకు దీనిని జాగ్రత్తగా గమనించండి. ఇక విష్ణుధర్మమందు శాంతి ఇట్లా చెప్పబడింది - శుభమైన హవనము క్రూరగ్రహము ముఖమందు పడితే శాంతిని చేసి కుటుంబియైన బ్రాహ్మణునకు గోదానం చేయాలి. లోహ ప్రతిమను చేసి దానిని తల క్రిందులుగా ఉంచాలి. ఆ పిదప ప్రతిమను గోమూత్రము, తేనె, గంధముమొదలగు వానితో పూజించి, చక్కగా ఉంచి పూజించి అక్కడ హోమం చేయాలి,అని. దీనికి అపవాదము క్రియాసారమందిట్లా - నిత్యమైన, నైమిత్తికమైన వానియందు దుర్గా హోమాదులందు దహన చక్రం చూడవలసిన పనిలేదు,అని. (ముహూర్తం). ఇక జ్వరాదులందు ఫలమిట్లా - శ్రీపతిఇట్లా - స్వాతి, ఆశ్లేష, ఆర్ద్ర, మూడు పూర్వలు, జ్యేష్ఠ ఈ నక్షత్రములలో రోగోత్పత్తి బాధించిన నరుని పాలసంద్రంలో నుంచి జన్మించిన వైద్యుడైనా ఆతని మందుతో శరీరమంతా వ్యాపించినా (బతికించలేడు) ఆతని ప్రయత్నం వ్యర్థం. రేవతి, అనురాధలలో వ్యాధి ఉత్పత్తి జరిగిన వానికి ప్రాణ రక్షణ అతి కష్టం మీద. ఉత్తరాషాఢ, మృగశిరలలో వ్యాధివస్తే రోగముక్తి నెల తరువాత, మఘల యందైతే ఇరవై రోజుల తరువాత రోగముక్తి హస్త, ధనిష్ఠ విశాఖ ఈ నక్షత్రములలో రోగమొస్తే పదిహేనురోజులలో, మూల, అశ్విని, కృత్తికలలో నైతే తొమ్మిదిరోజుల తరువాత, భరణి, చిత్ర, శ్రవణం, శతభిషం వీనిలోనైతే పదకొండు రోజుల తరువాత రోగవిముక్తి ఔతుంది. ఉత్తరాభాద్ర, పుష్యమి, భరణి, ఉత్తర, రోహిణి, పునర్వసు వీనిలోనైతే ఏడు రాత్రుల తర్వాత రోగవిముక్తి జరుగుతుంది, నరులకు అని గర్గుడు మొదలగు పెద్దలు నిస్సంకోచంగా పలికారు. జ్యోతిషమందిట్లా - ఇరువది ఏడు నక్షత్రాలకు వరుసగా రోగముక్తి దినాలు చెప్పబడ్డాయి. అశ్వినిలో రోగం వస్తే ఒక రోజులో రోగముక్తి. భరణికి చావు. కృత్తికపది, రోహిణి మూడు, మృగశిరలో ఐదు, ఆర్ద్రలో సున్న, పునర్వసులో ఏడు రోజులు, పుష్యమిలో ఏడురోజులు, ఆశ్లేషలో తొమ్మిది రోజులు, మఖలో మృత్యువు, పుబ్బలో రెండు నెలలు, ఉత్తరలో ఒకనెల, హస్తలో మృతి, చిత్తలో

పదిహేనురోజులు, స్వాతిలో రెండు నెలలు, విశాఖలో రెండు నెలలు (ఇరవైరో) అనురాధలో ఇరవై రోజులు (పదిరో) జ్యేష్ఠలో పదిరోజులు. (పక్షము) మూలలో ఒక రాత్రి (అంతము) పూర్వాషాఢ పదునైదు రోజులు, ఉత్తరాషాఢలో పక్షం రోజులు (ఇరవై) శ్రవణంలో ఇరవై రోజులు (రెండు నెలలు) ధనిష్ఠలో రెండు నెలలు (పక్షం) శతభిషంలో పక్షం (పదిరో) పూర్వాభాద్రలో పదిరోజులు, (అంతం) ఉత్తరాభాద్రలో పక్షము, రేవతిలో పదిరోజులు అశ్విన్యాది నక్షత్రములలో రోగంవస్తే ఇవి పీడదినములు, అని. దైవజ్ఞుడిట్లా - ఆశ్లేష, శతభిషం, ఆర్ద్ర, జ్యేష్ఠ, పుబ్బ, మూడుపూర్వలు, భరణి, కృత్తిక, విశాఖ ఈ నక్షత్రములు పాపవారముతో కూడిన యెడల, నవమి, షష్ఠి, ద్వాదశి, చతుర్థి తిథులైతే రోగులకు మరణ యోగము. కాలమునకు కారణము ఔతుంది,అని. ఇక శాంతి - కుంభమందు బంగారుదైన నక్షత్ర దేవతా ప్రతిమను పూజించి పన్నెండు దళములలో సంకర్షణుడు మొదలగు పన్నెండు మూర్తులను లేదా పన్నెండుగురు సూర్యులను కాని పూజించి, గరిక, సమిధలు, నువ్వులు, పాలు, నేయి వీనితో గాయత్రీ మంత్రంతో ఆ దేవత కొరకు నూట ఎనిమిది మార్లు హోమం చేసి, పెరుగు అన్నమును బలిఇచ్చి (నివేదన), ఆచార్యునకు ఆవును ప్రతిమను దానంచేసి, బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి అని సంక్షేపంగా చెప్పాము. విశేషమైతే వ్రతహేమాద్రియందు పదార్థా దర్శమందును చూచి తెలుసుకోవాలి. ఇక మందు విషయం - చండేశ్వరుడిట్లా - మూల, అనురాధ, మృగశిర, పుష్యమి, పునర్వసు, రేవతి, అశ్విని, శ్రవణం, జ్యేష్ఠ, హస్త, చిత్ర, స్వాతి ఈ నక్షత్రములలో గురు, శుక్ర, సోమవారములలో మందు తినుట నరులకు మేలు చేకూరుస్తుంది ప్రశస్తమైంది,అని. ఇక ఆరోగ్యస్నానము. శ్రీపతి ఇట్లా - సోమవారము, శుక్రవారము, మూడు ఉత్తరలు, రోహిణి, ఆశ్లేష, పునర్వసు, స్వాతి, మఘ, రేవతి నక్షత్రములలో రోగవిముక్తుడైన ప్రాణి స్నానం చేయాలి. ఎప్పుడుపడితే అప్పుడు చేయరాదు,అని. చరలగ్నం (మేష, కర్క, తుల, మకర) ఆది, మంగళ,వారాలు, రిక్తతిథి, కృష్ణపక్షంలో కూడ శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, స్వాతి, పునర్వసు ఈ నక్షత్రాలలో రోగపీడితుడైన నరుడు స్నానం చేస్తే రోగముక్తుడౌతాడు.

మూ॥ **అథదంత ధావనం** - పృథ్వీచంద్రోదయే విష్ణుః - ప్రతిపద్దర్శషష్ఠీషు చతుర్దశ్యష్ట మీషు చ, నవమ్యాం భానువారే చ దంతకాష్ఠం వివర్జయేత్. నారదః - చతుర్దశ్యష్టమీ పౌర్ణమాసీ సంక్రమణేషు చ, నందాసు చ నవమ్యాం చ దంతకాష్ఠం వివర్జయేత్. శ్రాద్ధేయజ్ఞే చ నియమే తథా ప్రోషిత భర్తృకా, వ్యతీపాతేచ సంక్రాంత్యాం నందా భూతాష్టపర్వసు, తైలంక్షౌరంరతిం మాంసం దంతకాష్ఠం చ వర్జయేత్. వసిష్ఠః - శన్యర్క శుక్రవారేషు కుజాహే వ్రతవాసరే, జన్మాహే శ్రాద్ధ దివసే దంతకాష్ఠం వివర్జయేత్. హేమాద్రౌ స్కాందే - అభ్యంగే జలధిస్నానే దంతధావన మైథునే, జాతే చ నిధనే చైవ తత్కాల వ్యాపినీతిథిః. సంవర్తః - రవౌ వివాహ ఆశౌచే వర్జయేత్ దంతధావనం. వ్యాసః - అలాభేదంత కాష్ఠానాం. నిషిద్ధాయాం తథా తిథౌ, అపాం ద్వాదశగండూషైః విదధ్యాద్దంతధావనం. **అథామలకస్నానం** - వ్యాసః - శ్రీకామః సర్వదా స్నానం కుర్వీతామలకై ర్నరః, సప్తమీం నవమీం చైవ పర్వకాలం వివర్జయేత్. చంద్ర సూర్యే పరాగే చ స్నానమామల

క్తైస్న్యజేత్. – క్రతుః – షష్ఠీ చ సప్తమీ చైవ నవమీ చ త్రయోదశీ, సంక్రాంతౌ రవివారే చ స్నాన మామలకైస్త్యజేత్. యత్తు – నవమీ దశమీ చైవ తృతీయా చత్రయోదశీ, ప్రతిపద్ ద్వాదశీ కృష్ణా స్నానం తాసు వివర్జయేత్. యచ్చ –దర్శే స్నానం న కుర్వీత మాతా పిత్రోస్తు జీవతోః, పుత్రః కుర్వన్ నిరాచష్టే పిత్రోరున్నతి జీవితే, ఇతి కణ్వయమాద్యైః స్నానమాత్రం నిషిద్ధం. తద్భోగార్థ స్నానపరం న నిత్యనైమిత్తిక పరమితి హేమాద్రిః. అథ తైల స్నాన నిషేధః – కాత్యాయనః – పక్షా దౌ చ రవౌషష్ఠ్యాం రిక్తాయాం చ తథా తిథౌ, తైలేనాభ్యజ్య మానస్తు చతుర్భిః పరిహీయతే. గర్గః – పంచదశ్యాం చతుర్దశ్యాం అష్టమ్యాం రవిసంక్రమే, ద్వాదశ్యాం సప్తమీషష్ఠ్యోః తైలస్పర్శం వివర్జయేత్. న చ కుర్యాత్తృతీయాయాం త్రయోదశ్యాం తిథౌతథా, శాశ్వతీం గతిమ న్విచ్ఛన్ దశమ్యా మపి పండితః. తత్రైవాయుర్వేదే – షష్ఠ్యాం దినక్షయేఽష్టమ్యామేకా దశ్యాం చ పర్వసు, ద్వాదశ్యాం చ, చతుర్దశ్యాం పంచమ్యాం ప్రతిపత్తిథౌ, వ్రతే శ్రాద్ధదినే జన్మ త్రితయే శ్రవణార్ద్రయోః జ్యేష్ఠోత్తరా ఫల్గునీషు వ్యతీపాతే చ వైధృతౌ, విష్టియోగే చ సంక్రాంతౌ మన్వాదిషు యుగాదిషు, నాభ్యంగం తత్ర బాలానాం వృద్ధానాంతు న దోషకృత్, ఇతి. వ్యవహారతత్త్వే – సంక్రాంతి భద్రా వ్యతిపాత వైధృతీ షష్ఠ్యష్టమీ పర్వసు నాఽర్కభూసుతే, స్నానే ద్వితీయా దశమీ చ గర్హితా షష్ఠ్యాద్యి మాద్యా రద ధావనేఽధమాః.

అను॥ ఇక దంత ధావనమును గూర్చి – పృథ్వీచంద్రోదయమందు విష్ణువు ఇట్లా – ప్రతిపద, అమా, షష్ఠి, చతుర్దశి, అష్టమి, నవమి, ఆదివారం వీటిలో దంత కాష్ఠమును విడువాలి, అని. నారదుడిట్లా – చతుర్దశి, అష్టమి, పౌర్ణమాసి, సంక్రమణం, నంద (ప్రతిపద, షష్ఠి, ఏకాదశి) నవమి వీనిలో దంతకాష్ఠాన్ని వదలాలి,అని. శ్రాద్ధము, యజ్ఞము, నియమము, దేశాంతరగతుడైన భర్త గల స్త్రీ, వ్యతీపాతం, సంక్రాంతి, నంద, చతుర్దశి, అష్టమి, పర్వ దినములు (అమా, పూర్ణిమలు) ఈ రోజులలో తైల స్నానము, క్షౌరం, రతి, మాంసము, దంతకాష్ఠము విడువాలి. వసిష్ఠుడిట్లా – శని, ఆది, శుక్రవారములందు మంగళవారమందు వ్రతము రోజున పుట్టినరోజున, శ్రాద్ధంరోజున దంతకాష్ఠమును విడువాలి,అని. హేమాద్రి యందు స్కాందోక్తి ఇట్లా – అభ్యంగము, సముద్రస్నానము, పుట్టిన, చచ్చినరోజులు, దంత ధావన మైథునములు వీటిలో అప్పుడున్న తిథినే గ్రహించాలి,అని. సంవర్తమందిట్లా – ఆదివారం, వివాహం, ఆశౌచం వీనిలో దంతధావనాన్ని విడువాలి,అని. వ్యాసుడిట్లా – దంత కాష్ఠములు లభించకపోతే అట్లాగే నిషిద్ధ తిథియందు నీటిని పన్నెండు సార్లు పుక్కిలించి దంతధావనమాచరించాలి,అని. (అమా, ఏకాదశి తప్ప ఇతర రోజులలో గడ్డి ఆకులతో దంతధావనం చేయాలి). ఇక పుసిరికాయ స్నానము – వ్యాసుడిట్లా – శ్రీకాముడైన నరుడు ఎల్లప్పుడు ఆమలకములతో స్నానం చేయాలి. సప్తమి, నవమి, పర్వకాలములు వీనిని వదలాలి. సూర్యచంద్రుల గ్రహణమందును ఆమలక స్నానం చేయరాదు,అని. క్రతువిట్లా – షష్ఠి, సప్తమి, నవమి, త్రయోదశి, సంక్రాంతులు, ఆదివారము వీనిలో ఆమలకములతో స్నానాన్ని చేయరాదు,అని. నవమి, దశమి,తదియ, త్రయోదశి, ప్రతిపద, ద్వాదశి (బహుళంలో) వీనిలో స్నానం చేయరాదు,అని.

అట్లాగే దర్శమందు స్నానం చేయరాదు,తలిదండ్రులు జీవించిఉంటే. ఒకవేళ పుత్రుడు చేస్తే తలిదండ్రుల ఉన్నతి, జీవనములను ఆతడు నశింపచేస్తాడు, అని కణ్వాయమాదులు చేసిన స్నానమాత్ర నిషేధము అది భోగము కొరకైన స్నాన విషయకము, నిత్య, నైమిత్తికమైన స్నానవిషయకము కాదు అని హేమాద్రి. ఇక తైలస్నాన నిషేధము – కాత్యాయనుడిట్లా – పక్షము ఆదియందు (ప్రతిపద) రవివారం షష్ఠియందు రిక్తతిథియందు, తలంటి స్నానం (నూనెతో) చేస్తే నాల్గింటిని పోగొట్టుకుంటాడు (పురుషార్థములు ధర్మ, అర్థ, కామ, మోక్షములు),అని. గర్గుడిట్లా – పూర్ణిమా, చతుర్దశీ, అష్టమి, సూర్య సంక్రమణం, ద్వాదశీ, సప్తమి, షష్ఠి వీనిలో తైల స్పర్శను విడిచిపెట్టాలి,అని. తృతీయ, త్రయోదశీ, దశమి తిథులందు శాశ్వత గతిని కోరుకొనువారు, పండితులు తైలస్పర్శ చేయరాదు. అక్కడే ఆయుర్వేదమందిట్లా – షష్ఠియందు దినక్షయ మందు, అష్టమి, ఏకాదశీ, పర్వము, ద్వాదశీ, చతుర్దశీ, పంచమి, ప్రతిపద ఈ తిథులలో వ్రతము శ్రాద్ధము, జన్మదినం నుండి మూడు రోజుల వరకు శ్రవణం, ఆర్ద్ర, జ్యేష్ఠ, ఉత్తర, వ్యతీపాతము, వైధృతి, విష్టియోగం, సంక్రాంతి, మన్వాది, యుగాది వీనిలో చిన్నపిల్లలకు అంభ్యంగ స్నానం చేయించరాదు. వృద్ధులకు దోషంలేదు,అని. వ్యవహారతత్వమందిట్లా – సంక్రాంతి, భద్ర, వ్యతీపాతం, వైధృతి,షష్ఠి,అష్టమి,పర్వము,ఆది మంగళవారములు, ద్వితీయ దశమి ఇవి తైలస్నానమునకు తగవు. షష్ఠి, శుద్ధ ప్రతిపద, దంతధావనమందు అధమమైనవి,అని.

**మూ॥ అస్యాపవాదమాహ** తత్రైవ ప్రచేతాః – సార్షపం గంధ తైలంచ యత్తైలం **పుష్ప వాసితం, అన్యద్రవ్యయుతం** తైలం నదుష్యతి కదాచన. ఆయుర్వేదే – నిషిద్ధ తిథి వారర్క్ష గ్రహణే ష్వపి రాత్రిషు, కించిత్ గోఘృతయుక్తంవా విప్రపాద రజోన్వితం. భానౌదూర్వాన్వితం భౌమే భూయుక్తం పుష్పయుగ్గురౌ, సర్వేషాం సర్వదా తైల మభ్యంగేషు నదుష్యతి. **మంగళేష్వప్య దోషః** – మాంగల్యం విద్యతే స్నానం వృద్ధి పూర్వోత్సవేషు చ, స్నేహ పాత్ర సమాయుక్తం మధ్యాహ్నేత్ ప్రాక్తదిష్యతే. ఇతి మదన పారిజాతే కాత్యాయనోక్తేః. హేమాద్రౌ బృహన్మనుః – తైలాభ్యంగో నార్కవారే నభౌమే నోసంక్రాంతౌ వైధృతౌవిష్టి షష్ఠ్యోః పర్వష్టమ్యాం చ నేష్టః స ఇష్టః ప్రోక్తాన్ ముక్త్వా వాసరే సూర్యసూనోః. **తిలస్నాన నిషేధస్తు** షట్ త్రింశన్మతే – తథా సప్తమ్య మావాస్యా సంక్రాంతి గ్రహజన్మసు, ధనపుత్ర కళత్రార్థీ తిలపిష్టం న సంస్పృశేత్. **అథగృహారంభః** – జ్యోతిర్నిబంధే బాదరాయణః – వైశాఖే ఫాల్గునేపౌషే శ్రావణే మార్గశీర్షకే, సూత్రారంభః శిలాన్యాసః స్తంభారంభః ప్రశస్యతే. నారదః – సౌమ్య ఫాల్గున వైశాఖ మాఘ శ్రావణ కార్తికాః. మాసాః స్యుః గృహ నిర్మాణే పుత్రారోగ్య ధనప్రదాః. అత్రవృష సింహ వృశ్చికాః వైశాఖ శ్రావణ కార్తికాః సౌరాజ్ఞేయాః ఇతి కాలాదర్శః. తత్రైవ కారణతంత్రే – స్థిరమాసే స్థిరేరాశౌ స్థిరేఽంశే నవవేశ్మనాం, కుర్వీత స్థాపనం శంకోః శంభుస్థాపనమేవవా. కార్తిక నిషేధస్తులాపరః. కుంభే మాసేఽపి సర్వేషాం మందిరాణాముపక్రమమ్, మహర్షయః ప్రశంసంతి ధాన్యాగారం విహాయ చ. నిషేధో ధాన్యగృహ పరః. పాక భోజన శాలాదౌ మార్గశీర్షశ్చ ఫాల్గునః, రథ్యాగేహే మఠాదౌచ సహస్యః శుచిరేవతు పౌషాషాఢ నిషేధస్తు ప్రధాన గృహపరః, న ప్రధాన గృహారంభం కుర్యాత్ పౌషేశు చాపపి, ఇతి

**తత్రైవోక్తేః. జ్యోతిషస్తత్వే – పూర్వాపరాస్యస్తు నభోఽన్య పౌషే యామ్యోత్తరాస్యం సహసి ద్వితీయే, కార్యం గృహం జీవబుధర్క్షగార్కే నీచాస్తగౌ జీవాసితౌ చహిత్వా – రత్నమాలాయాం – కర్కనక్రహరి కుంభగతేర్కే పూర్వపశ్చిమ, ముఖానిగృహాణి, తౌలిమేష వృష వృశ్చికపాతే దక్షిణోత్తర ముఖాని వదంతి. దైవజ్ఞ వల్లభః – శోకం ధాన్యం పంచతాం నిః పశుత్వం స్వాపం నైః స్వం సంగరం భృత్యనాశం, స్వం శ్రీ ప్రాప్తిం వహ్ని భీతిం చ లక్ష్మీం కుర్యుః చైత్రాద్యా గృహారంభకాలే (రత్నం ధాన్యం కాలాదర్శే పాఠః). గర్గః – త్ర్యుత్తరా మృగరోహిణ్యాం పుష్యేమైత్రే కరత్రయే, ధనిష్ఠా ద్వితయే పౌష్ణే గృహారంభః ప్రశస్యతే. రోహిణ్యాం శ్రవణత్రయే దితియుగే హస్తత్రయే మూలకే రేవత్యుత్తర ఫాల్గునీ పురగభే మైత్రోత్తరాషాఢయోః, శస్తంవాస్తు కుజార్కవర్జితదినే గోకుంభ సింహో ముఖే కన్యాయాం మిథునే నభః శుచి సహోరాథోర్జకే ఫాల్గునే. కాలాదర్శే సనత్కుమారః – ఆదిత్య భౌమ వర్జంతు సర్వే వారాః శుభప్రదాః.**

అను॥ దీనికి అపవాదాన్ని (విరుద్ధం) అక్కడే ప్రచేతసుడిట్లా చెప్పాడు – ఆవాల తైలము, గంధ తైలము, పూలవాసన గల తైలము, ఇతర ద్రవ్యములతో కూడిన తైలము ఎప్పుడూ దోషం కాదు,అని. ఆయుర్వేదమందిట్లా – నిషిద్ధమైన తిథి వార నక్షత్రములు గ్రహణములందు కూడా రాత్రులందు, కొద్దిగా ఆవు నేయితో కలిసిన లేదా బ్రాహ్మణుని పాద ధూళితో కూడిన తైలము దూషితము కాదు,అని. ఆదివారం నాడు గరికతో కూడిన, మంగళవారం మట్టితోకూడిన, గురువారం పూలతో కూడిన తైలము అందరికి ఎల్లప్పుడూ అభ్యంగమందు దూషితం కాదు (నిషిద్ధంకాదు). మంగళ కార్యములందు కూడా దోషం లేదు. వృద్ధిపూర్వక ఉత్సవములందు (ముందు) మాంగళ్యస్నానము ఉంది. మధ్యాహ్నముకన్న ముందే, స్నేహ పాత్రతో కూడిన స్నానం, ఇష్టమైంది,అని మదనపారిజాతమందు కాత్యా యనుడు చెప్పాడు. హేమాద్రి యందు బృహన్మనువు ఇట్లా – ఆదివారం, మంగళవారం, సంక్రాంతి, వైధృతి, విష్టి, షష్ఠి, పర్వము, అష్టమి వీనిలో తైలముతో అభ్యంగస్నానము మంచిదికాదు. పై వాటిని వదలి, శనివారమందు తైలాంభ్యగము అభిమతమైనది,అని. తిలస్నాన నిషేధమైతే షట్త్రింశన్మతమందిట్లా– అట్లాగే సప్తమి, అమా, సంక్రాంతి, గ్రహణం, జన్మదినం వీనిలో ధనపుత్ర కళత్రములను కోరువాడు పిండి తీయబడ్డ నువ్వుల నూనె (తిలపిష్టను ముట్టరాదు,అని. ఇక గృహారంభము – జ్యోతిర్నిబంధమందు బాద రాయణుడిట్లా – వైశాఖం, ఫాల్గుణం, పుష్యము, శ్రావణం, మార్గశీర్షం ఈ నెలలో ముగ్గు పోయటం, శిలాన్యాసము, స్తంభములు పాతటం శ్రేష్ఠము,అని. నారదుడిట్లా – ఓ సౌమ్యుడ, ఫాల్గుణ వైశాఖ, మాఘ,శ్రావణ కార్తిక మాసములు గృహ నిర్మాణమునకు మంచివి. పుత్ర ఆరోగ్య, ధనములను ఇచ్చేవి,అని. ఇక్కడ వృష, సింహ వృశ్చికములు వైశాఖ శ్రావణ కార్తికములు. (వైశాఖం వృషభ సంక్రమణంఅట్లా) అని సౌరమాసములుగా గ్రహించాలి అని కాలాదర్శోక్తి. అక్కడే కారణ తంత్రమందిట్లా – స్థిరమాసము, స్థిరరాశి, స్థిరఅంశము వీనిలో కొత్త ఇంటికి శంకుస్థాపన (మొల) చేయాలి లేదా శంభుస్థాపన చేయాలి,అని. కార్తిక నిషేధము అనగా తుల సంక్రమణ కార్తికం తగదు,అని.కుంభమాసమందు కూడా (మాఘం) అందరు

గృహనిర్మాణము ఆరంభించవచ్చు. దీనిని మహర్షులు మెచ్చుకున్నారు ధాన్యాగారమును మాత్రం ఆరంభించరాదు. ఇక్కడ నిషేధము ధాన్య గృహం వరకే. పాక భోజన శాలాదుల విషయంలో మార్గశీర్ష, ఫాల్గుణములు, రథశాల, మరము వీని విషయంలో పుష్య ఆషాఢములు పవిత్రమైనవి. ప్రధాన గృహ నిర్మాణం మాత్రం పుష్య, ఆషాఢ మాసములలో చేయరాదు. ప్రధాన గృహారంభమును పుష్య, ఆషాఢములలో చేయరాదు,అని అక్కడే చెప్పారు. జ్యోతిషతత్త్వమందిట్లు – తూర్పు, పడమర ముఖంగల ఇళ్ళను శ్రావణ, ఫాల్గుణ, పౌష మాసములలో దక్షిణం ఉత్తరం ముఖం గల ఇళ్ళను మార్గశీర్ష, వైశాఖ మాసములలోను నిర్మించాలి. గురువు, బుధుడు వీరి (నక్షత్రములుగల) రాశిలో సూర్యు డుండగా,గురువు, శుక్రుడు నీచుడు అస్తగుడు ఐనప్పుడు విడిచిపెట్టి గృహ కార్యం చేయాలి, అని. రత్నమాల యందిట్లు – కర్కటకం, మకరం, సింహం, కుంభం వీనిలో సూర్యుడుండగా తూర్పు పడమర ముఖం గల ఇళ్ళను, తుల, మేషం, వృషభం, వృశ్చికంలలో సూర్యుడుండగా దక్షిణం, ఉత్తరం ముఖంగల ఇళ్ళను నిర్మించాలి,అని. దైవజ్ఞ వల్లభుడిట్లు – చైత్ర మాసంలో గృహారంభం శోకం, వైశాఖం ధాన్యకారి (ఇవి రత్న, ధాన్యములని కాలాదర్శకారుడు) జ్యేష్ఠం మరణం, ఆషాఢం పశుహాని, శ్రావణం ధనకారి (నిద్రా), భాద్రపదం దరిద్రం, ఆశ్వయుజం యుద్ధం, కార్తికం  భృత్యనాశము, మార్గశిరం ధనప్రాప్తి, పుష్యం లక్ష్మీప్రాప్తి, మాఘం అగ్నిభయం, ఫాల్గునం లక్ష్మీప్రాప్తి. అని అన్నారు. గర్గుడిట్లు – మూడు ఉత్తరలు, మృగశిర, రోహిణి, పుష్యమి, అనురాధ, హస్త చిత్త స్వాతి. ధనిష్ఠ శతభిషం, రేవతి ఈ నక్షత్రములలో గృహారంభము మంచిది,అని. రోహిణి శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, మూల, రేవతి ఉత్తర ఫల్గుని, ఆశ్లేష, అనురాధ, ఉత్తరాషాఢ ఈ నక్షత్రములలో మంగళ ఆదివారములు తప్ప వేరు వారములలో, వృషభం, కుంభం, సింహం, వృశ్చికం (ముఖం) కన్య, మిధున రాశులలో, శ్రావణ, ఆషాఢ, పుష్య, వైశాఖ, కార్తిక, ఫాల్గుణ మాసములలో గృహారంభము (వాస్తు) శ్రేష్ఠము. కాలాదర్శమందు సనత్కుమారుడిట్లు – ఆది, మంగళ వారాలు విడిచి అన్ని వారములు శుభప్రదమైనవి,అని.

**మూ॥ వాస్తు శాస్త్రే – మార్గశీర్షే తథా పౌషే వైశాఖే శ్రావణే తథా, ఫాల్గునే చ కృతం వేశ్మ సర్వ సంపత్ప్రదం భవేత్. కార్తికే మాఘ మాసే చ చైత్రే జ్యేష్ఠే తథాశ్వినే, మాస్యాషాఢే భాద్రపదే న కుర్యాత్సర్వథా గృహం, ద్వితీయా చ తృతీయా చ పంచమీ సప్తమీ తథా, త్రయోదశీ చ దశమీ పూర్ణా చైకాదశీ తథా, వేశ్మారంభేషుభాయస్యుః విశేషాః శుక్లపక్షగాః. వ్యవహారసారే – శిలాన్యాసః ప్రకర్తవ్యో గృహాణాం శ్రవణే మృగే, పౌష్యే హస్తే చ రోహిణ్యాం పుష్యశ్విన్యుత్తరాత్రయే. వాస్తు ప్రదీపే – అధోముఖైః భైర్విదధీత ఖాతం శిలాస్త దైవోర్ధ్వ ముఖైశ్చ పట్టం, తిర్యఙ్ముఖైః ద్వార కవాటయానం గృహ ప్రవేశో మృదుభిర్ ధ్రువైశ్చ. లల్లః – స్నానం చ పాకం శయనం చ భోజ్యం గజాలయం వాజి గృహం ధనస్య, దేవస్య పూర్వాది దివి క్రమేణ మధ్యే సభా భూప నివేశనాయ. శిల్పశాస్త్రే – కన్యా సింహేతులాయాం భుజగపతి ముఖం శంభు కోణేగ్నిఖాతం వాయవ్యే స్యాత్త దాస్యం త్వలిధన మకరే ఈశఖాతం వదంతి, కుంభే మీనే చ మేషే నిర్ఋతి**

దిశిముఖం ఖాత వాయవ్య కోణే, చాగ్నేః కోణే ముఖంవై వృష మిథునగతే కర్కటే రక్షఖాతం. తత్ప్రచింతామణౌ - యత్ర దైర్ఘ్యం గృహాదీనాం ద్వాత్రింశత్ హస్తతోఽధికం న తత్రచింతయేద్ధీమాన్ గుణానాయ వ్యయాదికాన్. రాజమార్తాండః - ఆయవ్యయౌ మాస శుద్ధిం తృణాగారేన చింతయేత్, శిలాన్యాసాది నో కుర్యాత్ తథాగారే పురాతనే. వ్యవహారతత్వే - నిషిద్ధేష్వపి కాలేషు స్వానుకూలే శుభేదినే, తృణకాష్ఠ గృహారంభే మాసదోషోన విద్యతే. చండేశ్వరః - పూర్ణాది త్వష్టమీం యావత్ పూర్వాస్యం వర్జయేత్ గృహం, ఉత్తరాస్యం నకుర్వీత నవమ్యాది చతుర్దశీం, అమావాస్యాష్ట మీం యావత్, పశ్చిమాస్యం వివర్జయేత్. నవమ్యాదౌ తథాయామ్యం యావత్కృష్ణా చతుర్దశీం. ధ్రువం దృష్ట్వాఽథవా స్మృత్వా కర్తవ్యం వాస్తురోపణం, సాయాహ్నా వర్జ్య దివసే రాత్రౌ త్యక్త్వా మహానిశం. వరాహః - దక్షిణ పూర్వే కోణే కృత్వా పూజాం శిలాంన్యసే త్ప్రథమాం, శేషాః ప్రదక్షిణేన స్తంభాశ్చైవం సముత్థాప్యాః. కాలాదర్శే వాస్తుశాస్త్రే - ఖాతే చైవ శిలాన్యాసే వృష చక్రం ప్రశస్యతే. తచ్చోక్తం శాంతిరత్నే - చతుర్హస్త ప్రమాణంతు ఖాత్వాగర్తం సమంతతః, కుంభోదకైః సేచయేయుః శాంతి పాఠ పురస్సరం, తత ఈశాన దిగ్భాగే సాక్షతం రత్న పంచకం, సాజ్యం కుంభం స్థిరం ముక్త్వా వాస్తు పూజన పూర్వకం కుంభో పరిశిలాన్యాసః కర్తవ్యస్త దనంతరం.

అను॥ వాస్తు శాస్త్రమందు - మార్గశీర్షం, పుష్యం, వైశాఖం శ్రావణం, ఫాల్గుణం ఈ నెలలలో వేసిన ఇల్లు అన్ని సంపదలను ఇచ్చేదిగా ఔతుంది,అని. కార్తికం, మాఘం, చైత్రం, జ్యేష్ఠం, ఆశ్వయుజం, ఆషాఢం, భాద్రపదం, ఈ నెలలలో ఎప్పుడూ గృహనిర్మాణం చేయరాదు. ద్వితీయ, తృతీయ, పంచమి, సప్తమి, త్రయోదశి, దశమి, పూర్ణిమ, ఏకాదశి ఈ తిథులు గృహారంభమునకు, అందున శుక్లపక్ష తిథులు విశేషించి శుభకరములు. వ్యవహారసారమందిట్లా-గృహములకు శిలాన్యాసమునకు శ్రవణం, మృగశిర, రేవతి, హస్త, రోహిణి పుష్యమి, అశ్వినీ, ఉత్తరాత్రయం ఈ నక్షత్రములు తగినవి,అని. వాస్తు ప్రదీప మందిట్లా - అధోముఖ నక్షత్రములలో (మూల, ఆశ్లేష, మఘ, పుబ్బ, పూర్వాభాద్ర, పూర్వాషాఢ, విశాఖ, భరణి, కృత్తిక) భూమిని తవ్వాలి. ఊర్ధ్వముఖ నక్షత్రములలో (ఆర్ద్ర, మూడు ఉత్తరలు, రోహిణి, పుష్యమి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం) శిలాన్యాసము చేయాలి. పట్టము (పైకప్పు ద్వారాలపై కప్పు) ప్రక్క ముఖము గల నక్షత్రాలలో చేయాలి (హస్త, అనురాధ, స్వాతి, పునర్వసు, జ్యేష్ఠ, అశ్విని, చిత్ర, మృగశిర, రేవతి). ద్వారపు దర్వాజాలు (తలుపులు), ప్రయాణపు బండి మృదు నక్షత్రములలో (మృగశిర, చిత్త, అనురాధ, రేవతి) చేయాలి. గృహప్రవేశము ధ్రువ నక్షత్రములలో చేయాలి (మూడు ఉత్తరలు, రోహిణి) అని. లల్లుడిట్లా - స్నానగృహము, పాకగృహము, శయనగృహము, భోజనగృహము, గజాలయము, గుఱ్ఱపు శాల, ధనాగారము, దేవగృహము తూర్పుదిక్కు మొదలుకొని క్రమంగా ఏర్పరచాలి. మధ్యలో రాజు కూర్చునే రాజసభను నిర్మించాలి,అని. శిల్పశాస్త్రమందిట్లా -కన్య, సింహం,తుల, వీనిలో ఆదిశేషుని ముఖము ఈశాన కోణంలో ఉంటుంది కనుక అగ్ని కోణంలో పునాది వేయాలి. వృశ్చికం, ధనుస్సు మకరములలో వాయవ్యంలో ఉంటుంది కనుక ఈశాన్య కోణంలో తవ్వాలి. కుంభం, మీనం, మేషంలలో నిర్ఋతి దిక్కులో ముఖం

ఉంటుంది కనుక వాయవ్య కోణంలో తవ్వాలి. ఆగ్నేయ కోణంలో వృషభం, మిధునం, కర్కటములలో ఉంటుంది కనుక నిర్ఋతికోణంలో పునాది త్రవ్వాలి,అని. తత్వచింతామణి యందిట్లా-ఇంటి (మొదలగువాని) పొడవు ముప్పది రెండు హస్తములకన్న ఎక్కువగా ఉంటే అట్టి సందర్భములందు ఆయవ్యయాదికగుణములను బుద్ధిమంతుడు ఆలోచించరాదు, అని. రాజమార్తండుడిట్లా - గడ్డిపెట్టేశాల విషయంలో ఆయవ్యయములు మాసశుద్ధి విచారించరాదు శిలాన్యాసం చేయరాదు. పురాతనమైన ఇంటి విషయంలోనూ, శిలాన్యాసం చేయరాదు,అని. వ్యవహారతత్వమందిట్లా - నిషిద్ధమైన కాలములందు కూడా, తనకు అనుకూలమైన శుభదినమందు తృణ, కాష్ఠ, గృహముల ఆరంభము చేసిన మాసదోషము లేదు,అని. చండేశ్వరుడిట్లా - పూర్ణిమ నుండి అష్టమి వరకు తూర్పు ముఖం గల ఇల్లును కట్టరాదు. నవమి నుండి చతుర్దశి వరకు ఉత్తర ముఖం గల ఇల్లును నిర్మించరాదు. అమావాస్య నుండి అష్టమి వరకు పశ్చిమ ముఖంగల ఇల్లును చేయరాదు. నవమి మొదలు కృష్ణ చతుర్దశి వరకు దక్షిణ దిక్కు ముఖం గల ఇల్లును నిర్మించరాదు, అని. ఆకాశం, వాతావరణం చూచి, ధ్రువనక్షత్రాన్ని స్మరించి (ధ్రువనక్షత్రం రోజున) చూచి వాస్తు ఆరోపణ చేయాలి. రాత్రి యందు మహానిశను (12గం॥ నుండి 2వరకు) వదలి, దివసమందు సాయాహ్నమును వదలి, వర్జ్య (విడువతగిన) దివసములను వదలి వాస్తురోపణ చేయాలి. వరాహ పురాణమందిట్లా - దక్షిణం తూర్పు వీటి మధ్యమూల (ఆగ్నేయం)లో పూజచేసి తొలుత శిలాన్యాసం చేయాలి. మిగిలినవి ప్రదక్షిణం రీతిలో ఉంచాలి. స్తంభములను కూడా ఇట్లాగే లేపాలి,అని. కాలాదర్శమందు వాస్తు శాస్త్ర ప్రకరణమందిట్లా - (పునాది) తవ్వటమందు, శిలాన్యాసమందును వృషచక్రము చూడతగినది,అని. (సూర్యనక్షత్రం నుండి ఏడు నక్షత్రములు తగవు. ఆ తరువాతి పదకొండు నక్షత్రములు ఇష్టమైనవి. ఆ తరువాతి పది నక్షత్రములు ఇష్టంకావు). అది శాంతిరత్నమందిట్లా చెప్పబడింది - నాల్గు హస్తముల ప్రమాణం గల గోతిని నాల్గువైపుల తవ్వి శాంతి పాఠ పూర్వకముగా బిందెతో నీళ్ళు చల్లాలి. ఆ పిదప ఈశాన దిగ్భాగంలో అక్షతలు, ఐదు రత్నములు ఘృతము గల కుండను స్థిరంగా ఉంచి (పాతి) వాస్తుపూజ చేసి, ఆ కుంభంపైన ఆ పిదప శిలాన్యాసము చేయాలి,అని.

**మూ॥ అథగృహప్రవేశః - బృహస్పతిః - నందాయాం దక్షిణద్వారం భ ద్రాయాం పశ్చిమేన తు జయాయా ముత్తరం ద్వారం పూర్ణాయాం పూర్వతోవిశేత్. వసిష్ఠః - కృత్వా శుక్రం పృష్ఠతో వామతోఽర్కం విప్రాన్ పూజ్యానగ్రతః పూర్ణకుంభం. హర్మ్యం రమ్యం తోరణ ప్రగ్విఁతానైః స్త్రీభిః ప్రగ్వీ గీతవాద్యై ర్విశేచ్చ. వ్యవహారతత్వే - సౌమ్యాయనే శ్రావణమార్గ పౌషే జన్మర్క్ష లగ్నోప చయోదయేఽంశే, వామంగతేఽర్కే గృహవాస్తు పూజాం కృత్వా విశే ద్వేశ్మభ కూటశుద్ధం. వాస్తు శాస్త్రే-లగ్నాత్ ప్రాగాదితో దిక్షు ద్వౌద్వౌరాశీ నియోజయేత్, ఏకమేకం న్యసేత్ కోణే సూర్యం వామం విచింతయేత్. వసిష్ఠః - చంద్ర జార్యసిత వాసరేషు చ శ్రీకరం సుత మహార్థ లాభదం, సూర్య సూను దివసే స్థిరప్రదం కింతు చౌర భయ మత్ర నిర్దిశేత్, రత్నకోశే - పుష్యే ధనిష్ఠా**

మృగవారుణేషు స్వాయం భువర్ క్షేత్రిషు చోత్తరాసుచ, అక్షీణ చంద్రే శుభదో నృపస్యతిధా వరిక్తే చ గృహ ప్రవేశః. నారదః - ప్రవేశో మధ్యమోజ్ఞేయః సౌమ్య కార్తిక మాసయోః, మాఘ ఫాల్గున వైశాఖ జ్యేష్ఠ మాసేషు శోభనః. అకపాటమనాచ్ఛన్న మదత్త బలిభోజనం, గృహం న ప్రవిశేత్ ధీమాన్ ఆపదా మాకరోహితత్. జ్యేష్ఠః క్షుద్రగృహపరః. వృద్ధగార్గ్యః - భానోశ్చ భౌమస్య విహాయవారౌ, శూలాదియోగా నశుభాన్నవాపి, రిక్తాతిధిశ్చాపి మృదు ధ్రువర్ క్షే సౌమ్యాయనేచ ప్రవిశేత్ గృహాణి. రత్నమాలాయాం - త్వాష్ట్రమిత్ర శశి పూజదేవతా న్యామనంతి మునయో మృదూన్యథ, మైత్రగేహ, రతి భూషణాం బరోద్గీత మంగళ విధానమేషు చ, రోహిణ్యు త్తరాత్రయం చ ధృవాని. ప్రవేశశ్చ వాస్తు పూజాం కృత్వా కార్యః - జీర్ణోద్ధారే తథో ధ్యానే తథా గృహ నివేశనే నవప్రాసాదభవనే ప్రాసాద పరివర్తనే, ద్వారాభివర్తనే తద్వత్ ప్రాసాదేషు గృహేషు చ వాస్తు ప్రశమనం కుర్యాత్ పూర్వమేవ విచక్షణః, ఇతి మాత్స్యోక్తేః. తత్రైవ - కృత్వాగ్రతో ద్విజవరానథ పూర్ణకుంభం దధ్యక్షతామ్రదళ పుష్ప ఫలోప శోభనం, దత్వాహిరణ్య వసనాని తథా ద్విజేభ్యో మాంగల్య శాంతి నిలయం స్వగృహం విశేచ్చ. గృహ్యోక్త హోమవిధినా బలికర్మ కుర్యాత్ ప్రాసాదవాస్తు శమనేచ విధిర్యఉక్తః, సంతర్పయేత్ ద్విజవరానథ భక్ష్యభోజ్యైః. శుక్లాంబరః స్వభవనం ప్రవిశేత్సురూపం. **అథకలివర్జ్యాని** - బృహన్నారదీయే - సముద్రయాతుః స్వీకారః కమండలు విధారణం, ద్విజానామ సవర్ణాసు కన్యాసూపయ మస్తథా. దేవరాచ్చ సుతోత్పత్తిః మధుపర్కే పశోర్వధః, మాంసదానం తథా శ్రాద్ధే వాన ప్రస్థాశ్రమస్తథా, దత్తాక్షతాయాః కన్యాయాః పునర్దానం పరస్య చ, దీర్ఘకాలం బ్రహ్మచర్యం నరమేధాశ్వమేధకౌ, మహా ప్రస్థాన గమనం గోమేధశ్చ తథా మఖః, ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యానాహుర్మనీషిణః. కమండలుః = సోదకం చ కమండలుం ఇత్యుక్తః, మృన్మయోవా. దత్తా= ఊఢాః ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధస్తథా కలౌపంచ, న కుర్వీత భ్రాతుజాయాం కమండలుం, ఇతి హేమాద్రౌ వచనాత్. ఊఢాయాః - పురాపురుషసంయోగాన్మృతే దేయేతి కేచన. ఇత్యాదిభిః వివాహ్యేతోక్తా.

అను॥ ఇక గృహ ప్రవేశము. బృహస్పతి ఇట్లా - నంద యందు దక్షిణ ద్వారం గుండా భద్రయందు పశ్చి ద్వారం గుండా, జయయందు ఉత్తర ద్వారం గుండా పూర్ణ యందు పూర్వ ద్వారం గుండా గృహప్రవేశం చేయాలి,అని. వసిష్ఠుడిట్లా - వెనుక అగ్ని హోత్రము ఎడమ ప్రక్కన మంగళ హారతి దీపాలు, పూజించ తగిన విప్రులు పూర్ణ కుంభము ముందర (శుక్రుడు వెనుక అస్తమించాక, సూర్యుడు ఎడమగా (ఎదురుగా) ఉదయించ బోతుండగా) ఉండగా, తోరణములు, పూలమాలలు, చాందినీలతో కూడిన అందమైన మేడను ఆడవారితో కూడి, పూలమాలలు ధరించి, గీత వాద్యములతో కూడి ప్రవేశించాలి, అని. వ్యవహారతత్వమందిట్లా - ఉత్తరాయణంలో (మంచికాలంలో) శ్రావణ మార్గశీర్ష పుష్యమాసములలో జన్మనక్షత్రంలో లగ్నం వృద్ధి దశలో ఉదయాంశ యందు, సూర్యుడు వామగతుడు (శుభుడు) కాగా, నక్షత్ర కూటశుద్ధిని చూచి గృహ వాస్తు పూజను చేసి గృహ ప్రవేశం చేయాలి,అని. వాస్తుశాస్త్రమందిట్లా - లగ్నము నుండి తూర్పు దిక్కు మొదలుగా దిక్కులలో రెండు రెండు రాసులను ఏర్పరచాలి. కోణములందు ఒక్కొక్క రాసిని వదలాలి.

సూర్యుడు శుభప్రదుడైనదిగా చూడాలి,అని. వసిష్ఠుడిట్లా – బుధ, గురు, శుక్రవారములు శ్రీకరములు, సుతులను మహా అర్ధలాభములను ఇచ్చేవి. శనివారం గృహప్రవేశము స్థిరమైనదే కాని ఇక్కడ చోరభయం ఉంటుంది,అని. రత్నకోశమందిట్లా – పుష్యమి, ధనిష్ఠ, మృగశిర, శతభిషం, రోహిణి, మూడు ఉత్తరలు, ఈ నక్షత్రములలో క్షీణచంద్రుడు కానప్పుడు,అరిక్త తిథి యందు రాజునకు గృహప్రవేశము శుభకరము,అని. నారదుడిట్లా – మార్గశిర, కార్తిక మాసములలో గృహ ప్రవేశము మధ్యమమని గ్రహించండి. మాఘ ఫాల్గున వైశాఖ జ్యేష్ఠ మాసములలో శోభన ప్రదము. ద్వారములు లేని కప్పులేని, బలి ఇవ్వబడని, భోజనం పెట్టబడని ఇంటిలోనికి బుద్ధిమంతుడు ప్రవేశించరాదు. అది ఆపదలకు స్థానము,అని. జ్యేష్ఠమాసంలో చిన్న ఇంట్లోకి ప్రవేశం తగును. వృద్ధ గార్గ్యుడిట్లా – ఆది మంగళ వారములు విడిచి, శూలాది అశుభయోగములను (వైధృతి వ్యతీపాతాది) తొమ్మిదిటిని వదలి, రిక్త తిథులను వదలి మృదు ధ్రువనక్షత్రములందు, ఉత్తరాయణమందు గృహ ప్రవేశం చేయాలి, అని. రత్నమాలయందిట్లా – చిత్ర, అనురాధ, మృగశిర, పుష్యమి, ఈ దేవతలను మునులు మృదు నక్షత్రములని అంగీకరించారు. మిత్రుడు, ఇల్లు, భోగము, భూషణములు, వస్త్రములు, ఉత్తమగానము, మంగళకార్యము ఈ నక్షత్రములలో ఆచరించాలి,అని. రోహిణి మూడుత్తరలు ధ్రువ నక్షత్రాలు. ప్రవేశమనగా వాస్తు పూజచేసి చేయాలి. జీర్ణ ఉద్ధారమందు, ఉద్యానమందు, గృహప్రవేశమందు, నవప్రాసాద భవనములందు, ప్రాసాదమును మార్చినప్పుడు, ద్వారములు మార్చినప్పుడు అట్లాగే ప్రాసాద, గృహములందును బుద్ధిమంతుడు తొలుతనే వాస్తు శాంతి చేయాలి,అని మత్స్యపురాణోక్తి. అక్కడే – ముందట బ్రాహ్మణ శ్రేష్ఠులను, పూర్ణకుంభమును ఉంచుకొని, పెరుగు అక్షతలు, మామిడాకులు, పుష్పములు, ఫలములు వీనితో శోభితుడై, హిరణ్యము, వస్త్రములు బ్రాహ్మణులకు ఇచ్చి మంగళములకు శాంతికి నిలయమైన తన ఇంటిలో ప్రవేశించాలి. గృహ్యసూత్రమందు చెప్పబడిన విధముగా హోమము, బలికర్మ చేయాలి. ప్రాసాద వాస్తు శాంతి విషయంలో ఏది చెప్పారో అది చేయాలి. భక్ష్య భోజ్యములతో బ్రాహ్మణ శ్రేష్ఠులను సంతృప్తి పరచాలి. తెల్లని వస్త్రములు ధరించి, చక్కని రూపంతో తన ఇంటిలోకి ప్రవేశించాలి,అని. ఇక కలిలో విడువతగినవి – బృహన్నారదీయమందిట్లా – సముద్రయాత్ర, సన్యాస స్వీకారము ఉదకంతో కూడిన కమండలు ధారణము, బ్రాహ్మణులు అసవర్ణ కన్యలను వివాహమాడుట, నియో గపద్ధతిలో మరిది ద్వారా సంతానాన్ని పొందుట, మధుపర్కమందు పశువధ, శ్రాద్ధమందు మాంసమిచ్చుట అట్లాగే వానప్రస్థాశ్రమము (అక్షతయైన (కన్యాత్వము చెడనిది) పెళ్ళైన కన్యను మరొకనికిచ్చి మళ్ళీ పెళ్ళిచేయుట, దీర్ఘకాలము బ్రహ్మచారిగా ఉండుట, నరమేధ, అశ్వమేధములు, (గొప్ప వ్యాధి పీడిత వ్యక్తి చావుకై) మహాప్రస్థానమునకు వెళ్ళటం (హిమాలయములకు) గోమేధ యజ్ఞము ఈ ధర్మము లను కలియుగమందు విడిచిపెట్టాలి, అని బుద్ధిమంతులన్నారు. కమండలువు మట్టిది కూడా కావచ్చు (48 ఏళ్ళ వరకు వేద బ్రహ్మ చర్యము). వివాహమైన స్త్రీకి తిరిగి వివాహము

చేయుట జ్యేష్ఠాంశము, గోవధ (మధుపర్కంలో) భ్రాతృపత్నిని స్వీకరించుట, సన్యాసము ఈ ఐదింటిని కలిలో ఆచరించరాదు,అని హేమాద్రి యందు వచనము. (కన్యకు వివాహం చేశాక, భర్తతో సంయోగం పొందాక, ఆతడు మరణిస్తే ఆ కన్యను మరొకనికి వివాహం చేసి ఇవ్వవచ్చునని కొందరన్నారు. ఈ మొదలగు మాటలవల్ల ఊఢ అనగా వివాహమైంది అని అర్థమౌతోంది.

మూ॥ **హేమాద్రౌబ్రాహ్మే**- గోత్రాన్మాతుః సపిండాచ్చ వివాహో గోవధస్తథా, నరాశ్వ మేధౌ మద్యంచ కలౌవర్జ్యం ద్విజాతిభిః, గోత్రాత్ గోత్రజాయాః పితృష్వసుః మాతృసపిండాన్ మాతులాత్ తత్కన్యాయాః వివాహః కలౌనకార్యః. తేనయాని తద్విధాయకాని తాని యుగాంతర విషయాణి. **తథాచ వ్యాసః** - తృతీయాం మాతృతః కన్యాం తృతీయాం పితృతస్తథా. శుల్కేన చోద్వహిష్యంతి విప్రాః పాప విమోహితాః, ఇతి కలౌ తన్నిందామాహ. మాతృతః తృతీయాం మాతుల కన్యాంఇత్యర్థః. ఉక్తం చైతత్ ప్రాక్. మద్యం స్త్రీభ్యశ్చ సురామా చామం ఇత్యాదినా విహి తమపి వర్జ్యం. **హేమాద్రౌ ఆదిత్యపురాణే** - విధవాయాః ప్రజోత్పత్తౌ దేవరస్య నియోజనం, బాలాయాః క్షతయోన్యాస్తు వరేణాన్యేన సంస్కృతిః,కన్యానామసవర్ణానాం వివాహశ్చ ద్విజన్మభిః. **ఆతతాయిద్విజాగ్ర్యాణాం** ధర్మయుద్ధేన హింసనం, ద్విజ స్యాబ్ధౌతు నౌయాతుః శోధితస్యాపి సంగ్రహః, **సత్ర దీక్షాచ సర్వేషాం** కమండలు విధారణం, మహాప్రస్థాన గమనం గోసంజ్ఞప్తిశ్చ గోసవే. **సౌత్రామణ్యా** మపి సురాగ్రహణస్యచ సంగ్రహః. **అగ్నిహోత్రహవన్యాశ్చ** లేహోలీఢా పరిగ్రహః, వృత్త స్వాధ్యాయ సాపేక్ష మఘ సంకోచనం తథా. **ప్రాయశ్చిత్తవిధానం** చ విప్రాణాం మరణాంతికం, సంసర్గదోషస్తే యాన్య మహాపాతక నిష్కృతిః, సంసర్గ దోషః తత్సంసర్గీ చ పంచమః ఇత్యుక్తః. స్తేయం చ తదన్యాని మహా పాతకాని బ్రహ్మహత్యా సురాపాన గురుతల్పాని త్రీణి, తేషాం కామకృతానాం మరణాంతికం ప్రాయశ్చితం విప్రాణాం కలౌనేత్యర్థః. మరణాంతికేహి జాతివధ నిమిత్తం ద్వాదశాబ్దం ద్విగుణం బ్రహ్మవధ నిమిత్తం చ ద్విగుణం భవతితత్ చతుర్థే నాస్తి నిష్కృతిః, ఇతి నిషిద్ధం. న చాత్మహత్యా విధినా తద్బాధః, తేన హ్యాత్మ హత్యా నిమిత్త స్యైవ బాధో నజాతి వధ నిమిత్తస్య. భిన్న విషయత్వాత్. సంసర్గిణస్తు కామతోఽపి వ్రతస్యైవోక్తేః నమరణాంతికం. నాపిస్తేయే తత్ర రాజ్ఞో వధకర్తృకత్వాత్. తేన తయోర్మరణాం తికాభావాత్తయో రేవ నిష్కృతి ర్నాన్యేషాం త్రయాణాం. యుగాంతరే తుకలౌ నిషేధ బలాదేవ ప్రవృత్తిః. ఏతద్వి ప్రవరం. నక్షత్రియాదేః. తదుక్తం విప్రాణాం మరణాంతికం ఇతి. విశేషస్స్మృత్కృతే ప్రాయశ్చిత్త రత్నేజ్ఞేయః.వరాతిథి పితృభ్యశ్చ పశూపాకరణక్రియా. దత్తౌరసేతరేషాంతు పుత్రత్వేన పరిగ్రహః. సవర్ణాన్యాం గనాదుష్టైః సంసర్గః శోధితైరపి. అయోనౌ సంగ్రహేవృత్తే పరిత్యాగో గురుస్త్రియః పరోద్దేశాత్మ సంత్యాగః ఉద్దిష్టస్యాపి వర్జనం. ప్రతిమాభ్యర్చనార్థాయ సంకల్పశ్చ సధర్మకః **అస్థిసంచయనాదూర్ధ్వ** మంగస్పర్శన మేవచ.

అను॥ హేమాద్రి యందు బ్రహ్మ పురాణోక్తి ఇట్లా – తల్లిగోత్రం నుండి, సపిండుల నుండి వివాహము, గోవధ, నరమేధ, అశ్వమేధములు, మద్యము వీటిని బ్రాహ్మణులు

కలిలో వదలాలి,అని. గోత్రాత్ అనగా గోత్రం వల్ల కలిగిన తండ్రిగారి చెల్లెలు అట్లాగే మాతృ సపిండం నుండి అనగా మేనమామ వీరి కూతురుతో వివాహం కలిలో చేయరాదు. దీనివల్ల వీనిని విధించే సూత్రాలన్ని (వచనాలు) యుగాంతరములకు చెందిన విషయాలని గ్రహించాలి. అట్లాగే వ్యాసుడిట్లా – తల్లినుండి మూడవతరం కన్యను, అట్లాగే తండ్రి నుండి మూడవతరం కన్యను విప్రులు పాపవిమోహితులై దబ్బిచ్చి(తో) వివాహమాడుతున్నారు, అని. కలిలో దానిని నిందించారు. తల్లి నుండి మూడవది అంటే మేనమామ కూతురును అని అర్థము. దీనిని ముందే చెప్పాము. మద్యము, స్త్రీలు మదిరతో ఆచమనం చేయాలి అని మొదలుగా విధించబడినది కూడా విడిచిపెట్టాలి,అని. హేమాద్రి యందు ఆదిత్య పురాణోక్తి ఇట్లా – విధవకు సంతానోత్పత్తి కొరకు మరిదిని నియోగించటం, క్షతయోనియైన బాలికను (కన్య) మరో వరునికిచ్చుట (వివాహం), అసవర్ణ కన్యలకు బ్రాహ్మణునితో వివాహము తగదు,అని. చంపటానికి సిద్ధమైన బ్రాహ్మణ శ్రేష్ఠులను ధర్మ యుద్ధంతో హింసించటం (చంపుట), సముద్రంలో నౌక ద్వారా వెళ్ళే, బ్రాహ్మణునితో వ్యవహారము, ప్రాయశ్చిత్తమైనప్పటికిని తగ్గించాలి. అందరికి సత్ర యజ్ఞంలో దీక్ష, సన్యాసము స్వీకరించుట మహా ప్రస్థానమునకు వెళ్ళుట, గోయజ్ఞంలో గోవధ, సౌత్రామణి యజ్ఞమందు సురను గ్రహించుట తగ్గించాలి (వలదు), అగ్నిహోత్రమందు హోమము చేయబడిన దానిని, నాకుట, భోజనముగా స్వీకరించుట చేసిన , వేదాధ్యయనము వీనిని ఆధారం చేసుకొనే ఉంటుంది, పాప సంకోచనము కూడా. బ్రాహ్మణులకు ప్రాయశ్చిత్త విధానము మరణాంతము. సంసర్గదోషము, దొంగతనము, ఇతరమైన మహాపాతకముల నుండి నిష్కృతి మరణాంతము. సంసర్గదోషము, అతనితో సంసర్గము చేయువాడు కూడా ఐదవవాడు అని చెప్పారు. దొంగతనము దానికన్న ఇతరమైన మహాపాతకములు బ్రహ్మహత్య సురాపానము, గురుతల్ప గమనము ఇవి మూడు. వాటిని ఇష్టపూర్తిగా చేస్తే మరణాంతము ప్రాయశ్చిత్తము అది విప్రులకు కలిలో లేదు అని అర్థము. మరణాంతమందైతే జాతివధ నిమిత్తముగా పన్నెండు సంవత్సరములకు రెట్టింపుగా, బ్రహ్మవధ నిమిత్తమైతే రెట్టింపుగా ప్రాయశ్చిత్త మౌతుంది. అక్కడ నాల్గవ దానికి నిష్కృతి లేదు,అని నిషేధించారు. ఆత్మహత్య విధితో దానికి బాధలేదు. దానితో ఆత్మహత్యా నిమిత్తమునకే బాధ, జాతి వధ నిమిత్తమునకు కాదు. భిన్నవిషయం కనుక. సంసర్గికైతే వ్రతమే చెప్పారు, ఇష్టపూర్తిగానైనా. మరణాంతికము కాదు. దొంగ తనమందును లేదు. అక్కడే రాజే వధ చేసేవాడు. అందువల్ల వారికి మరణాంతికం లేనందువల్ల వారికే నిష్కృతి మిగిలిన ముగ్గురికి లేదు. యుగాంతరమందైతే కలిలో నిషేధ బలం వల్లనే ప్రవృత్తి. ఇది విప్రుల విషయకము. క్షత్రియాదులకు కాదు. దానినే ఇట్లా చెప్పారు, విప్రులకు మరణాంతికము,అని. విశేషమైతే మేము వ్రాసిన ప్రాయశ్చిత్త రత్నము నుండి తెలుసుకోవాలి. వరుడు, అతిథి, పితరులు వీరి కొరకు పశు ఉపకరణం చేయటం, దత్త ఔరసుల కన్న ఇతరులైన వారిని పుత్రులుగా స్వీకరించుట, సవర్ణులకన్న ఇతరులైన

స్త్రీల సహవాసంతో దుష్టులైన వారితో, ప్రాయశ్చిత్తం చెయబడినప్పటికి, సహవాసం చేయటం, ఆధారం లేనప్పుడు, భరణం ఇవ్వాల్సి వచ్చినప్పుడు గురు స్త్రీ పరిత్యాగము, పరుల నుద్దేశించి తన ఆత్మత్యాగము, ఉద్దేశించిన దానిని వదులుట, ప్రతిమాభ్యర్చన కొరకు సధర్మక సంకల్పము (తగదు) అస్థిసంచయనం తరువాత అంగ స్పర్శనమే (తగదు)

**మూ॥ శామిత్రంచైవ విప్రాణాం సోమ విక్రయణం తథా, షడ్భక్తా నశనే చాన్నహరణం హీనకర్మణః. మాధవీయే పృథ్వీచంద్రోదయేచ - శూద్రేషు దాసగోపాల కులమిత్రార్ధ సీరిణాం, భోజ్యాన్నతా గృహస్థ స్యతీర్థ సేవాతి దూరతః, శిష్యస్య గురుదారేషు గురువత్ వృత్తి శీలతా, ఆపద్ వృత్తిః ద్విజాగ్ర్యాణాం అశ్వస్త నికతా తథా, ప్రజార్థం తుద్విజాగ్ర్యాణాం ప్రజారణి పరిగ్రహః బ్రాహ్మణానాం ప్రవాసిత్వం ముఖాగ్ని ధమనక్రియా. బలాత్కారాదిదుష్టా స్త్రీ సంగ్రహో విధి చోదితః. యతేశ్చ సర్వవర్ణేషు భిక్షా చర్యా విధానతః. నవోదకే దశాహం చ దక్షిణా గురుచోదితా, బ్రాహ్మణాదిషు శూద్రస్య పచనాది క్రియాపి చ, భృగ్వగ్ని పతనశ్చైవ వృద్ధాది మరణం తథా, గోతృప్తిశిష్టేపయసి, శిష్టైరాచమన క్రియా, పితా పుత్రవిరోధేషు సాక్షిణాం దండకల్పనం, యతేః సాయం గృహత్వం చ సూరిభిః తత్వ దర్శిభిః. ఏతానిలోకగుప్త్యర్థం కలేరాదౌ మహాత్మభిః.నివర్తితాని విద్వద్భిః వ్యవస్థా పూర్వకం బుధైః. సురాగ్రహణస్య తత్కర్తుః సంగ్రహోవ్యవహారకః. న చ మద్యం చేతి సామాన్యేన నిషిద్ధస్యానే నోపసంహార ఇతి వాచ్యం. నిషేధ స్య నివృత్తి మాత్ర ఫలత్వేన విశేషాన పేక్షత్వాత్. 'న హింస్యాత్'ఇత్యస్య'నబ్రాహ్మణం హన్యాత్ ఇత్యనేన ఉపసంహారే హింసాంతరస్య అదోషత్వాపత్తేశ్చ. నిరూపితం చైతత్ హేమాద్రిణాన్యత్ర ఇత్యుపరమ్యతే. సురాగ్రహస్యోద్దేశ్యస్య సౌత్రామణీ విశేషణా వివక్షయా వాజపేయేఽపి నిషేధః. సౌత్రామణ్యాంతు పయోగ్రహోవాస్యు' ఇత్యాపస్తంబోక్తేః వైకల్పిక పయోగ్రహై రప్యధికారః.వాజపేయేతు తత్ప్రాప్త్రా మానాభావాత్ సోమసురయోః సహత్యాగే నాంశే సురాద్రవ్యత్వాత్ తత్ప్రఖ్యతయా,యాగనామత్వేన తాం వినా సంజ్ఞాయోగాత్ కలౌనాధికార ఇతి యుక్తం ప్రతీమః. త్రికాండమండనాది లిఖనం తు నిర్మూల మనాకరం చ. వృత్తేతి - ఏకాహాద్ బ్రాహ్మణః శుద్ధ్యేద్యోఽగ్ని వేదసమన్వితః, ఇత్యుక్తేః. అఘస్యాశౌచస్య సంకోచః. నతస్య నిష్కృతిర్ దృష్టా భృగ్వగ్ని పతనాదృతే. ఇత్యుక్తస్య ప్రాయశ్చిత్త స్య విధానము పదేశః. కలౌకర్తైవ లిప్యతే, ఇతి వ్యాసోక్తేః. పతిత సంసర్గే దోషసత్వేఽపి పాతిత్యం నేత్యర్థః. అన్యథా 'సంసర్గః శోధి తైరపి ఇతి విరోధాపత్తేః స్తేయభిన్నే మహాపాపే రహస్యకృతే ప్రాయశ్చిత్తం నేత్యర్థః. సవర్ణాన్యా అపవర్ణా క్షత్రియాదిః తయాదుష్టే అయోనౌ శిష్యాదౌ, చతస్రస్తు పరిత్యాజ్యాః శిష్యగా గురు గాచయాః, ఇత్యుక్తః త్యాగః. పరోద్దేశేన బ్రాహ్మణాద్యర్థం ఆత్మత్యాగః యద్వా పరోద్దేశాత్మ త్యాగోదానం 'మనసా పాత్ర ముద్దిశ్య' ఇత్యుక్తం. ఉద్దిష్టస్యత్యక్త స్యవర్జనం 'ప్రతిగ్రహ సమర్థోఽపి' ఇత్యుక్తం. వేతనగ్రహణేన ప్రతిమపూజా. స్వాశౌచ కాలాత్ విజ్ఞేయం స్పర్శనంతు త్రిభాగతః ఇత్యుక్తః స్పర్శః**

అను॥ విప్రులకు శామిత్రము (పశువిశసనము (వధ) సోమలత విక్రయణము, ఆరుకాలములందు (మూడు రోజులు) భోజనం లేకపోవటం (వల్ల) హీనకర్మణి అన్నమును గ్రహించటం తగవు. మాధవీయమందు, పృధ్వీచంద్రోదయ మందిట్లా - శూద్రులలో

దాస, గోపాల, కులమిత్రులు, వ్యవసాయంలో సగము పంట పంచుకునే వారు వీరి అన్నమును గృహస్థుడు భుజింపవచ్చును,అతిదూరమందున్న తీర్థసేవనము, శిష్యుడు గురు భార్యలయందు గురువు యందువలె వ్యవహరించుట తగును బ్రాహ్మణ శ్రేష్ఠులకు ఆపదలో సేవచేయుట, రేపటికై అన్నాదులను ఏర్పరచుకొనకుండుట. ప్రజల కొరకు బ్రాహ్మణుల ప్రజా అరణిని స్వీకరించుట తగును. బ్రాహ్మణులకు ప్రవాసము,ముఖంతో అగ్నిని ఊదుట తగదు. బలాత్కారాదుల వల్ల దూషితలైన స్త్రీలను శాస్త్రోక్తముగా స్వీకరించుట తగును,అని. యతి అన్ని వర్ణముల వారి నుండి శాస్త్రోక్తముగా భిక్షను గ్రహించాలి. కొత్త నీటియందు పదిరోజులు (సూతకం,అశుద్ధి అని), గురువు అనుజ్ఞతో దక్షిణ స్వీకరించుట, బ్రాహ్మణాదులకు శూద్రుడు పాకం మొదలగునవి చేయుట, భృగుపాతము (పర్వతంపై నుండి దుంకుట) అగ్ని పాతము వృద్ధాదుల మరణము, గోవులు తృప్తి చెందగా మిగిలిన నీటితో శిష్టులు ఆచమనము చేయుట, పితపుత్రుల విరోధమందు సాక్షులకు దండనము విధించుట, యతి సాయంకాలమందు గృహస్థుని ఇంటనుండుట వీటిని తత్త్వదర్శులైన పండితులు విద్వాంసులు, బుధులు, మహాత్ములు వీనిని లోకరక్షణ కొరకు కలి ఆదిలో నిషేధించారు, వ్యవస్థా పూర్వకముగా (శాస్త్ర నియమంగా). సుర అనటం వల్ల ఆ యజ్ఞకర్త, కారయిత ఇద్దరికి చెందినదనుట న్యాయము మద్యం అనుదానితో చేసిన సామాన్య నిషేధమునకు దీనితో ముగింపు అని అనరాదు నిషేధమునకు నివృత్తి మాత్రమే ఫలము అది విశేషాన్ని అపేక్షించదు. హింసించరాదు అనే మాటకు బ్రాహ్మణుని హింసించరాదు (చంపరాదు) అనేమాటతో ముగింపు ఏర్పడితే, మరొకరిని చంపితే దోషం లేకుండా పోతుంది. దీనినే హేమాద్రి మరో చోట చెప్పారు. అని ముగిస్తున్నాము. సురాగ్రహణమను దానికి ఉద్దేశ్యము సౌత్రామణి యజ్ఞ విశేషం వివక్ష కాదు వాజపేయమందును సురనిషేధము. సౌత్రామణి యందైతే, పాలనైనా గ్రహించవచ్చు అని ఆపస్తంబోక్తి ఉన్నందువల్ల వికల్పంగా పయస్సు గ్రహించే వారికి అధికారముంది (పాలు లేదా సుర అని). వాజపేయమందైతే పాలప్రాప్తికి ప్రమాణం లేదు కనుక సోమము, సుర ఈ రెంటిని ఒకేసారి వదలవలసిరావటం వల్ల సుర అందులో అంశ ఐనందువల్ల, ఆ పేరుతోనే ప్రసిద్ధమైనందువల్ల అది లేకుండా పేరు కుదరనందువల్ల కలిలో అధికారం లేదని సమంజసంగా భావిస్తున్నాము. త్రికాండమండ నాదులు రాసినవైతే నిర్మూలము ఆకరములు లేనిది. (వృత్త అనగా అగ్నిహోత్రాది అనుష్ఠానం, వేదాధ్యయనం) అగ్నివేద సమన్వితుడైన బ్రాహ్మణుడు ఒకరోజులో శుద్ధి నందుతాడు అని చెప్పినందువల్ల పాపమునకు ఆశౌచమునకు సంకోచము (తగ్గింపు). దానికి నిష్కృతి భృగు, అగ్నిపాతములు లేకుండా లేదు,అని చెప్పిన దానికి ప్రాయశ్చిత్తమును విధించుట ఉపదేశము. కలిలో కర్తనే పాపదూషితుడౌతాడు అని వ్యాసోక్తి. పతిత సంసర్గంవల్ల దోషం కలిగినా పాతిత్యం కాదు (రాదు) అని అర్థము. లేనిచో శోధితులతో సంసర్గము అనే దానికి విరోధం వస్తుంది. స్తేయ (దొంగతనం) భిన్నమైన మహాపాపమందు, రహస్యంగా చేసిన దానికి

ప్రాయశ్చిత్తం లేదని అర్థము. సవర్ణ ఇతరమైనది అసవర్ణ క్షత్రియాదులు వారి వల్ల దుష్టమైతే, అయోనులైన శిష్యాదుల విషయంలో (అక్రమంగా పుట్టినవారు), శిష్యగులు, గురువును పొందిన వారు అట్టి వారిని ఈ నలుగురిని వదలాలి అని త్యాగం చెప్పారు. పరోద్దేశ్యం అనగా బ్రాహ్మణాదుల కొరకు ఆత్మత్యాగము లేదా పరుల నుద్దేశించి ఆత్మత్యాగముతో దానము, మనస్సులో యోగ్యుడైన పాత్రనుద్దేశించి అని చెప్పారు. ఉద్దేశించిన అనగా విడిచిపెట్టిన దానిని విడచుట ప్రతిగ్రహ సమర్థుడైనా (హక్కు ఉన్నా) అని చెప్పారు. డబ్బు తీసుకొని (జీతం) ప్రతిమ పూజ చేయుటం. తన అశౌచకాలం నుండి మూడవ భాగంలో స్పర్శనము అని తెలుసుకోవాలి అని స్పర్శను గూర్చి చెప్పారు.

**మూ॥ షడితి–ఉపోషితః త్ర్యహం స్థిత్వా ధాన్యం అబ్రాహ్మణాత్ హరేత్. ఇత్యుక్తం అన్న చౌర్యం. ఆపది – క్షాత్రాదివృత్తిః., ముఖే నైవధమే దగ్నిం ఇత్యుక్తంధమనం. దశాహేనైవ శుద్ధ్యేత భూమిష్ఠం చ నవోదకం ఇత్యుక్తో దశాహః. గురవేతు వరందత్వా, ఇత్యుక్త్వా దక్షిణా. శూద్రేషు దాసగోపాలేతి. కందుపక్వం స్నేహ పక్వం యచ్చ దుగ్ధేన పాచితం, ఏతాన్య శూద్రాన్న భుజో భోజ్యాని మనురబ్రవీత్. ఇత్యపరార్కే సుమం తూక్తా శూద్రస్య పాకక్రియా. పితాపుత్ర వివాదేతు సాక్షిణాం త్రిపదోదమః, ఇత్యుక్తః. సాయంగృహత్వం 'విధూమే సన్న ముసలే ఇత్యుక్తం. పృథ్వీచం ద్రేణతు – అటంతి వసుధాం విప్రాః పృథివీ దర్శనాయతు, అనికేతాహ్యనాహారాయత్ర సాయం గృహాస్తుతే, ఇతి విష్ణుపురాణోక్తో నిషిద్ధః. తేన అజ్ఞాత శీల పంథాదేః శ్రాద్ధాదౌ వినియోగోన కార్యః కలా విత్యర్థ ఉక్తః. ఏతానివర్జ్యానీత్యర్థః. నిగమః – అగ్నిహోత్రం గవాలంబం సంన్యాసం పలపైతృకం. దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌపంచ వివర్జయేత్, అగ్నిహోత్రం తదర్థమాధానం, ఏతచ్చ సర్వాధాన పరం. అర్ధాధానం స్మృతం శ్రౌతస్మార్తా గ్న్యోస్తు పృథక్కృతిః. సర్వాధానం తయోరైక్య కృతిః పూర్వయుగాశ్రితా ఇతి లౌగాక్షి వచనాదితి స్మృతి చంద్రికాయాం. ఏతేన చత్వార్యబ్ద సహస్రాణి చత్వార్యబ్ద శతానిచ, కలేర్యదాగమిష్యంతి. తదాత్రేతా పరిగ్రహః. సంన్యాసశ్చ నకర్తవ్యో బ్రాహ్మణేన విజానతా, ఇతి వ్యాసవచనం వ్యాఖ్యాతం. సర్వాధానేఽపి విశేష మాహదేవలః – యావద్వర్ణ విభాగోఽస్తి యావద్వేదః ప్రవర్తతే, సంన్యాసం చాగ్నిహోత్రం చ తావత్కుర్యాత్ కలౌయుగే,ఇతి. అత్ర పూర్వయుగాశ్రితేతి లౌగాక్షివాక్యే పూర్వయుగాని కృతాదీనీత్యేకోఽర్థః. అన్యేతు యుగస్య పూర్వం కలేః పూర్వభాగః. స "చత్వార్యబ్ద సహస్రాణి" ఇతి పూర్వోక్త వాక్యాత్ చతుశ్చత్వారింశత్ శతవర్షావచ్ఛిన్నః. తస్మిన్ భాగే సర్వాధానం కార్యం. తదుత్తరంతు యావద్వర్ణ విభాగోఽస్తీతి వాక్యాత్ వర్ణ విభాగ పర్యంతం అర్ధాధానమిత్యాహుః. సంన్యాసః త్రిదండః.**

**ఇతి తృతీయ పరిచ్ఛేదస్య పూర్వభాగః సమాప్తః**

అను॥ ఆరు,అని. ఉపవసించి మూడు రోజులు ఉండి బ్రాహ్మణేతరుని నుండి ధాన్యమును (అన్నమును) హరించాలి (ఆపత్కాలంలో), అని అన్నచౌర్యమును గురించి చెప్పారు. ఆపదయందు క్షత్రియుడు మొదలగువారి వృత్తిని చేయాలి. ముఖముతోనే అగ్నిని ఊదాలి,అని ధమనము చెప్పబడింది. భూమియందున్న నీరు పదిరోజులైతేనే శుద్ధి నందుతుంది,అని దశాహము చెప్పబడింది. గురువునకు వరము ఇచ్చి అని చెప్పారు

అనగా దక్షిణ ఇచ్చి,అని. శూద్రుల యందు అనగా దాస, గోపాలురు అని. కడాయి (బాండ్లీ) యందు వండినది, నేయితో వండినది, పాలతో వండినది. వీటిని శూద్రాన్నమును తినని వారు తినాలి అని మనువు చెప్పాడు,అని అపరార్కమందు శూద్రపాక క్రియను గూర్చి సుమంతుడు చెప్పాడు. పితాపుత్ర వివాదమందైతే సాక్షులకు మూడు పణములు శిక్ష, (పలంలో నాల్గవ భాగం పణము లేదా తులం) అని చెప్పారు. సాయంకాలం గృహంలో ఉండటం సన్యాసికి, పొగ, రోకలిపోటు తగ్గాక జరగాలి,అని చెప్పారు. పృథ్వీ చంద్రుడైతే బ్రాహ్మణులు భూమిని దర్శించే కొరకు భూమిపై తిరుగుతున్నారు. స్థానంలేదు, ఆహారం లేదు. ఎక్కడ, ఆసన్యాసులు సాయంకాలం ఉంటారో అది సాయం గృహము అని, విష్ణు పురాణోక్త నిషేధమును చెప్పాడు. అందువల్ల శీలము, వారి దారి, తెలియని వారిని శ్రాద్ధాదుల యందు వినియోగము చేయరాదు,కలిలో అని అర్థము చెప్పబడింది. వీటిని విడిచి పెట్టాలి అని అర్థము. నిగమమందిట్లా – అగ్నిహోత్రము, గవాలంభము, సన్యాసము, శ్రాద్ధమందు మాంసము, మరిదివల్ల సంతానోత్పత్తి ఈ ఐదింటిని కలిలో విడిచిపెట్టాలి. అగ్నిహోత్రం అనగా దానికొరకు ఆధానము (ఉంచుట) ఇది అన్ని ఆధానములకు అర్థము : శ్రౌతస్మార్త అగ్నులను విడివిడిగా ఉంచుటను అర్ధ ఆధానమని అంటారు. వాటిని ఒకటిగా చేయుట సర్వాధానమని, ఇది పూర్వ యుగములకు చెందినది, అని లౌగాక్షి వచనము అని స్మృతి చంద్రికయందు కలదు. దీనివలన నాలుగువేల, నాలుగువందల సంవత్సరాలు కలిలో గడిస్తే అప్పుడు త్రేత అని గ్రహించాలి. బ్రాహ్మణుడు తెలిసి తెలిసి సంన్యాసము స్వీకరించరాదు, అనే వ్యాసవచనాన్ని వ్యాఖ్యానించారు. సర్వాధానమందు కూడా విశేషమును దేవలుడిట్లా చెప్పాడు – వర్ణ విభాగం ఉన్నంతవరకు, వేదపఠనమున్నంతవరకు, సంన్యాసము, అగ్నిహోత్రము కలియుగంలో ఆచరించాలి,అని. ఇది పూర్వయుగా శ్రితమని అన్న లౌగాక్షి వాక్యమందు పూర్వయుగములు కృతాదులు అని ఒక అర్థము. ఇతరులు యుగమునకు పూర్వము అనగా కలిలో పూర్వ భాగము అది నాలుగువేల సంవత్సరాలు, అని ముందు చెప్పిన మాటవల్ల నలుబది నాలుగు వందల సంవత్సరాల వరకు అని అర్థము. ఆ కాల మందు అన్ని ఆధానములను చేయాలి. ఆ తరువాతైతే, ఎంత వర్ణ విభాగం ఉంటుందో అనే వాక్యమునను సరించి వర్ణ విభాగపర్యంతము అర్ధాధానము అని అన్నారు. సన్యాస మనగా త్రిదండము. (వాక్, మనో, కాయ, దండము (దమనం) చేయగలవాడు. యౌవన వతి భార్య, తలిదండ్రులు ఉండగా దండధారణ చేయరాదు) అని తృతీయ పరిచ్ఛేద పూర్వభాగము సమాప్తము.

# నిర్ణయసింధువు

# తృతీయపరిచ్ఛేదము - ఉత్తరార్ధం

# శ్రాద్ధప్రకరణం

మూ ॥ నానానిబంధవైమత్య భ్రాంతచిత్తోద్ధిధీర్షయా, కమలాకరసంజ్ఞేనక్రియతే శ్రాద్ధ నిర్ణయః. **తత్స్వరూపమాహ** పృథ్వీచంద్రోదయేమరీచిః - ప్రేతం పితౄంశ్చ నిర్దిశ్య భోజ్యం యత్ప్రియ మాత్మనః, శ్రద్ధయా దీయతేయత్ర తచ్ఛ్రాద్ధం పరికీర్తితం బ్రాహ్మణ స్వీకారాం తశ్చతుర్థ్యంత పదో పనీత పిత్రాద్యుద్దేశ్యకస్త్యాగః శ్రాద్ధమిత్యర్థః. తత్ర యద్యపి హోమ పింద భోజనాని ప్రధానమితి హేమాద్రిః - హోమశ్చ పిండదానం చ తథా బ్రాహ్మణ భోజనం, శ్రాద్ధ శబ్దాభిధేయం స్యాదేకస్మిన్నౌ పచారికం, ఇతిశ్రీధరశ్చ. తథాపి క్వచిద్విశేషం వక్ష్యామః. నిమిత్త భేదేభోజనస్య పిండానాంవా నిషేధో న ప్రాధాన్యం విరుణద్ధి అసోమయాజినోదధిపయో యాగవత్.

అను॥ నానా నిబంధములలోని వివిధ మతభేదములచే భ్రాంతి నొందిన చిత్తము కలవారిని ఉద్ధరించే కొరకు, కమలాకరుడను పేరు గల నేను శ్రాద్ధ నిర్ణయమును చేస్తున్నాను. దాని స్వరూపమును పృథ్వీ చంద్రోదయమందు మరీచి ఇట్లా చెప్పాడు-ప్రేతను, పితరులను ఉద్దేశించి తనకిష్టమైన దానిని, భుజించతగిన పదార్థమును, శ్రద్ధతో ఇచ్చుటయే శ్రాద్ధము అని చెప్పాడు. బ్రాహ్మణుడు స్వీకరించుట చివరగా గల చతుర్థ్యంత పదముతో తీసుకు రాబడిన, పితరులు మొదలగువారి నుద్దేశించి చేసే త్యాగము శ్రాద్ధము అని అర్థము. అక్కడ హోమ, పిండ, భోజనములు ప్రధానము అని ఉన్నప్పటికి, హేమాద్రి ఇట్లా - హోమము పిండదానము, అట్లాగే బ్రాహ్మణభోజనము ఇవి శ్రాద్ధ శబ్దముతో చెప్పబడేవే ఐనా ఒక దానినే చెప్పుట ఔపచారికము,అని. శ్రీధరుడు కూడా ఇట్లాగే చెప్పాడు. ఐనా ఒకచో విశేషాన్ని చెబుతాము. నిమిత్త భేదం వల్ల భోజనము లేదా పిండములు కానీ నిషేధింపబడ్డా వానికి ప్రాధాన్యము తగ్గదు. సోమయాజి కాని వానికి దధిపయో యాగమువలె.

మూ॥ **యచ్చశూల పాణిః** - నిత్య శ్రాద్ధ మదైవం స్యాత్ అర్ఘ్యపిండవివర్జితం, ఇతి హారీతీయే నిత్య శ్రాద్ధ మఘాదౌ పిండనిషేధోఽస్తి. న చ ప్రాప్తిం వినాసః. నచ అతిదేశం వినా ప్రాప్తిః. నచ అంగత్వేన వినా అతిదేశః. ప్రధానస్య అనతి దేశాత్. సప్తమే ఉపకారకత్వేన అతిదేశోక్తేః తేన భోజనం ప్రధానం, పిండోఽంగం. పిండదానమాత్ర విధిస్తు అంగభూతాత్ కర్మాంతరమేవ, ప్రకరణాంతర న్యాయాదితి, తన్న,జాతశ్రాద్ధే, నదద్యాత్తు పక్వాన్నం బ్రాహ్మణేష్వపి. నపక్వం భోజయే ద్విప్రాన్ సచ్ఛూద్రోఽపి కదాచన. ఇత్యాద్యైః జాతశ్రాద్ధే శూద్రశ్రాద్ధాదౌ భోజనస్య నిషేధేన అంగత్వాపత్తేః. నతౌ పశౌకరోతి, ఇతివత్ ఉపజీవ్య విరోధేన వికల్పాపత్తేశ్చ. తేన శ్రాద్ధ శబ్దా భిధేయత్వేన ఉభయప్రాప్తౌ నిషేధః పర్యుదాసో, వా దీక్షితో న దదాతి న జుహోతి, నాసోమయాజీ

సన్నయేత్, ఇతి వదితితత్వం. ధర్మప్రదీపేపి - యజుషాం పిండదానంతు బహ్వృ చానాం ద్విజార్చ నం, శ్రాద్ధశబ్దాభిధేయం స్యాదు భయం సామవేదినాం. తచ్చ పితౄన్ యజేత్, పితృభ్యోదద్యాత్, ఇత్యుభయప్రయోగ దర్శనా ద్యాగదానోభయాత్మకం పితరో దేవతా,ఇతి పిత్ర్యుద్దేశ్యక త్వాద్యాగత్వం, విప్రాపేక్షయాచ దాన త్వమిత్యవిరుద్ధం. ఏతేన నాయం యాగః. (దేవతోద్దేశేన త్యాగో యాగః). యాగోద్దేశ్యాచ దేవతే త్యాత్మాశ్రయాదితి గౌదమత మపాస్తం. వైధశబ్ద విశేషోద్దేశ్యకత్వస్య తస్య ఇదమితి స్వత్వారోప ప్రతియోగిత్వస్య వా దేవతా త్వాత్.

అను॥ శూలపాణి - నిత్యశ్రాద్ధమందు విశ్వేదేవతలుండరు, అర్ఘ్యపిండము లుండవు. అని హారీతీయమందు నిత్యశ్రాద్ధ, మఘాదులందు పిండనిషేధముంది. ప్రాప్తి లేకుండా నిషేధం ఉండదు. అతిదేశం లేకుండా ప్రాప్తి ఉండదు. అంగం కాకుండా అతిదేశ ముండదు. ప్రధానమైన దాన్ని అతిదేశం చేయరు కనుక. ఏడవ ప్రకరణమందు - ఉపకార కత్వంగా అతిదేశం చెప్పారు. అందువల్ల భోజనం ప్రధానము, పిండము అంగము. పిండ దానం మాత్రం విధిస్తే అంగభూతమైన దానికంటే భిన్నమైనదే, కర్మాంతరమే, ప్రకరణాంతర న్యాయాన్ననుసరించి, అని అంటే అట్లా కాదు - జాతశ్రాద్ధమందు బ్రాహ్మణులకు వండిన అన్నాన్ని పెట్టరాదు, సచ్ఛూద్రుడైనాకూడా, ఎప్పుడూ బ్రాహ్మణులకు వండిన అన్నాన్ని పెట్టరాదు. అని మొదలగు వాని చేత జాతశ్రాద్ధ మందు శూద్ర శ్రాద్ధాదులందు భోజనం నిషేధించినందున అది అంగం కావలసి వస్తుంది. నతౌపశౌకరోతి, అనే దానివలె ఉపజీవ్య విరోధమైనందువల్ల వికల్పం కావలసివస్తుంది. అందువల్ల శ్రాద్ధ శబ్దం అన్నందు వల్ల రెండు వస్తే నిషేధమో, పర్యుదాసమో కావలసి వస్తుంది. దీక్షితుదు ఇవ్వటంలేదు. హోమం చేయటంలేదు, అసోమ యాజి సన్నయనం చేయరాదు అనే దానివలె అని తెలుసు కోవాలి. ధర్మప్రదీపమందు కూడా - యజుర్వేదీయులకు పిండదానము, ఋగ్వేదీయులకు (బహ్వృచులు) బ్రాహ్మణ అర్చనము, సామవేదీయులకు ఈ రెండును శ్రాద్ధమనే శబ్దంతో చెప్పబడుతాయి. అది ఎట్లా అంటే పితరుల గూర్చి పూజించాలి, పితరులకొరకు ఇవ్వాలి, అని రెండు ప్రయోగములు కన్పిస్తున్నాయి కనుక యాగము, దానము అను ఉభయాత్మక మైనది శ్రాద్ధము. పితరులు దేవతలు అని పితరులను ఉద్దేశించినందువల్ల యాగము. విప్రులనుద్దేశించి దానము అని రెంటికి విరోధం లేదు.అందువల్ల ఇది యాగం కాదు దేవతల నుద్దేశించి చేసే త్యాగము యాగము. యాగమునకు ఉద్దేశ్యమైంది దేవత అని ఆత్మాశ్రయమైనందువల్ల అనే గౌదమతము అపాస్తమైంది. విధి బోధిత శబ్ద విశేషమునకు ఉద్దేశ్యమైన దానికో, ఇది అని (చెప్పబడ్డ) స్వత్వ ఆరోప ప్రతియోగిత్వమునకో (సంబంధించిన) దేవతాత్వం ఐనందువల్ల.

మూ॥ **తత్రైవసుమంతుః** - శ్రాద్ధాత్పరతరం నాన్యత్ శ్రేయస్కర ముదాహృతం. **ఆదిత్య పురాణే** - నసంతి పితరశ్చేతి కృత్వామనసి యోనరః, శ్రాద్ధం నకురుతే తత్ర తస్యరక్తంపి బంతితే. **తద్భేదానాహ విశ్వామిత్రః** - నిత్యం నైమిత్తికం కామ్యం వృద్ధిశ్రాద్ధం స పిండనం,

పార్వణం చేతి విజ్ఞేయాగోష్ఠ్యాం శుద్ధ్యర్థమష్టమమ్; కర్మాంగం నవమం ప్రోక్తం దైవికం దశమం కృతం, యాత్రాస్వేకాదశం ప్రోక్తం పుష్ట్యర్థం ద్వాదశం స్మృతం,ఇతి. ఏషాంలక్షణానిభవిష్యే - అహన్య హని యచ్ఛ్రాద్ధం తన్నిత్యమితి కీర్తితం, వైశ్వదేవ విహీనం తదశక్తావుదకేనతు. ఏకోద్దిష్టంతు యచ్ఛ్రాద్ధం తన్నైమిత్తి కముచ్యతే, తదప్య దైవం కర్తవ్యం అయుగ్మాన్ భోజయేత్ ద్విజాన్. కామాయ విహితం కామ్యం అభిప్రేతార్థ సిద్ధయే. వృద్ధౌయత్క్రియతే శ్రాద్ధం వృద్ధి శ్రాద్ధం తదుచ్యతే. గంధోదక తిలైర్మిశ్రం కుర్యాత్పాత్ర చతుష్టయం, అర్ఘ్యార్థం పితృపాత్రేషు ప్రేతపాత్రం ప్రసేచయేత్, యేసమానా, ఇతి ద్వాభ్యాం ఏతద్జ్ఞేయం స పిండనం నిత్యే న తుల్యం శేషంస్యాత్ ఏకోద్దిష్టం స్త్రియా అపి.ఏత దుభయమేవస్త్రియాః. తేన స్త్రీ కర్తృకం, స్త్రీ సంప్రదానకం చేత్యు భయ నియమ ఇతి కల్పతరుః. అమావాయాం యత్క్రియతే తత్పార్వణమితి స్మృతం. క్రియతే పర్వణి యద్వా తత్పార్వణ మితిస్థితిః అత్రపర్వ - చతుర్దశ్యష్టమీ చైవ అమావాస్యా చ పూర్ణిమా, పర్వాణ్యేతాని రాజేంద్ర రవి సంక్రమణం తథా. ఇతి తు విష్ణుపురాణోక్తం సంక్రాంత్యాది. గోష్ఠ్యాం యత్క్రియతే శ్రాద్ధం గోష్ఠీశ్రాద్ధం తదుచ్యతే, బహూనాం విదుషాం సమ్యక్ సుఖార్థం పితృతృప్తయే. క్రియతే శుద్ధయే యత్తు బ్రాహ్మణానాం తు భోజనం, శుద్ధ్యర్థమితి తత్ప్రోక్తం వైనతేయమనీషిభిః. నిషేక కాలే సోమే చ సీమంతోన్నయనేతథా,జ్ఞేయం పుంసవనే చైవ శ్రాద్ధం కర్మాంగ మేవచ. దేవానుద్దిశ్య యచ్ఛ్రాద్ధం తత్తుదైవిక ముచ్యతే. గచ్ఛన్ దేశాంతరం యస్తు శ్రాద్ధం కుర్యాత్తు సర్పిషా. యాత్రార్థమితి తత్ప్రోక్తం ప్రవేశేచ, న సంశయః శరీరోపచయే శ్రాద్ధం అర్థోపచయ ఏవచ, పుష్ట్యర్థమేత ద్విజ్ఞేయం ఔపచాయిక ముచ్యతే. గోష్ఠ్యాం శ్రాద్ధకర్తృ సముదాయే సంభూయ సామగ్రీ సంపాదనేన (శ్రాద్ధమిత్యర్థః) యుగపత్తీర్థాదిప్రాప్తౌ విదుషాం శ్రాద్ధం సంపదాం సుఖార్థం భిన్న పాకాశక్తౌ బహుపితృక శ్రాద్ధమేకః కుర్యాదితి కల్ప తరుః శంఖధరశ్చ. శుద్ధిశ్రాద్ధం ప్రాయశ్చిత్తాంగ మితి మైథిలాః. అత్ర పార్వణై కోద్దిష్ట వృద్ధి సపిండీకరణాత్మకం చతుర్విధమేవ ముఖ్యం. తస్యైవాయం ప్రపంచః.

అను॥ అక్కడే సుమంతుడిట్లా - శ్రాద్ధమును మించినది శ్రేయస్కరమైనది మరొకటి లేదు అని చెప్పారు. ఆదిత్య పురాణ మందిట్లా - మనస్సులో పితరులు లేరు అని భావిస్తూ అక్కడ శ్రాద్ధం చేయని నరుని రక్తమును పితరులు తాగుతారు,అని. వాని భేదమును విశ్వామిత్రుడిట్లా చెప్పాడు - నిత్యము, నైమిత్తికము, కామ్యము, వృద్ధిశ్రాద్ధము, సపిండనము, పార్వణము, గోష్ఠిశ్రాద్ధము, శుద్ధిశ్రాద్ధము, కర్మాంగ శ్రాద్ధము, దైవికము, యాత్రా శ్రాద్ధము, పుష్టి శ్రాద్ధము అని పన్నెండురకాలు,అని. వీని లక్షణములు భవిష్యపురాణమందిట్లా - రోజు, రోజు, చేసే శ్రాద్ధము **నిత్యశ్రాద్ధము**. ఇందు విశ్వేదేవులు లేరు. అశక్తుడైతే దీనిని జలంతో చేయాలి (నిత్యతర్పణం). ఏకోద్దిష్ట శ్రాద్ధమును **నైమిత్తిక శ్రాద్ధ**మంటారు. దానికి కూడా విశ్వే దేవులు లేరు. (ఒకటి,మూడు,అట్లా) అయుగ్మ బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. ఇష్టమైన కోరిక నెరవేరటంకొరకు, కోరిక కొరకు చేసే శ్రాద్ధం **కామ్యశ్రాద్ధము**. వృద్ధి యందు చేసే శ్రాద్ధము **వృద్ధిశ్రాద్ధము**. గంధము, ఉదకము, నువ్వులు వీటితో మిశ్రితంగా నాలుగు పాత్రలను చేయాలి. అర్ఘ్యము కొరకు పితృపాత్రలలో ప్రేత పాత్రను, యే సమానాః అను రెండు మంత్రములతో తడుపాలి (కలపాలి). ఇది **సపిండనము**. నిత్య శ్రాద్ధముతో

సమానమైనది మిగిలినదంతా. ఏ కోద్దిష్టముస్త్రీకి కూడా (సంపిండీకరణం) ఉంటుంది. ఈ రెండే స్త్రీకి. అందువల్ల స్త్రీ చేసే, స్త్రీ కొరకు చేసేదీను అని ఈ రెండు విధముల నియమము అని కల్పతరువు. అమావాస్యమందు చేసే శ్రాద్ధము పార్వణమని అన్నారు. పర్వమందు చేయబడేది కాని **పార్వణమని** నిర్ణయము. ఇక్కడ పర్వమనగా - చతుర్దశి అష్టమి, అమావాస్య, పూర్ణిమ, రవి సంక్రమణము ఇవి పర్వములు, ఓరాజా! గోష్ఠి యందు చేయబడే శ్రాద్ధము **గోష్ఠీశ్రాద్ధము**. ఇది మంచి సుఖం కొరకు, పితృతృప్తి కొరకు అనేక మంది బ్రాహ్మణులకు పెట్టే శ్రాద్ధము. ఓ వైనతేయుడ ! విద్వాంసులిట్లా అన్నారు, శుద్ధి కొరకు బ్రాహ్మణులకు భోజనం పెట్టిన అది**శుద్ధిశ్రాద్ధమని** అన్నారు. నిషేకకాలమందు, (శ్రౌతస్మార్త కర్మలకు సూచకము) సోమమందు, సీమంతోన్నయనమందు, పుంసవనమందు చేయబడే శ్రాద్ధము **కర్మాంగశ్రాద్ధము**. దేవతల నుద్దేశించి చేసే శ్రాద్ధము **దైవిక శ్రాద్ధము** (ద్వాదశి మొదలగు తిథులలో నిత్యశ్రాద్ధం వలె చేయాలి) (ఉత్పాతాదులు కలిగే సూచన లుంటే, విశ్వాది దేవతలనుద్దేశించి విప్ర భోజనం పెట్టాలని శ్రాద్ధ సాగరంలో) దేశాంతరం వెళ్తూ నేయితో చేసే శ్రాద్ధమును **యాత్రార్థ శ్రాద్ధమని** అంటారు. దానిని తిరిగి వచ్చాక కూడా చేయవచ్చును, అనుమానం లేదు. శరీర అభివృద్ధి కొరకు ధనం పెరిగే కొరకు చేసే శ్రాద్ధము, **పుష్టి శ్రాద్ధము**. దీనిని ఔపచాయికమని అంటారు. (విద్వాంసుల) గోష్ఠియందు, శ్రాద్ధకర్తల సమూహం కలిసి, సామగ్రీ సంపాదనతో శ్రాద్ధం చేయాలని అర్థము. ఒకేసారి తీర్థాదులు వస్తే విద్వాంసులు శ్రాద్ధము సంపదల సుఖం కొరకు, భిన్నపాకమందు అశక్తుడైనప్పుడు బహుపితృక శ్రాద్ధము ఒకటే చేయాలి అని కల్పతరువు, శంఖధరుడు చెప్పారు. శుద్ధి శ్రాద్ధము ప్రాయశ్చిత్తమునకు అంగమని మైథిలు లన్నారు. ఇక్కడ పార్వణము, ఏకోద్దిష్టము, వృద్ధిశ్రాద్ధము, సపిండీకరణము ఈ నాలుగు రకములవే ముఖ్యము. దాని విస్తారమే ఇదంతా.

మూ॥ **అథశ్రాద్ధదేశాః** మనుః - శుచిందేశం వివిక్తంతు గోమయేనోప లేపయేత్, దక్షిణా ప్రవణం చైవ ప్రయత్నే నోపపాదయేత్. పృథ్వీచంద్రోదయే విష్ణుధర్మే - దక్షిణా ప్రవణే దేశే తీర్థాదౌ చ గృహేఽపివా, భూసంస్కారాది సంయుక్తే శ్రాద్ధం కుర్యాత్ప్రయత్నతః. తత్రైవ ప్రభాస ఖండే - తీర్థాదష్ట గుణం పుణ్యం స్వగృహేదదతః శుభే. భారతే - తస్య దేశాకురుక్షేత్రం గయా గంగా సరస్వతీ, ప్రభాసం పుష్కరం చేతి తేషు శ్రాద్ధం మహాఫలం. స్కాందే- తులసీకాననచ్ఛాయా, యత్రయత్ర భవేద్విజ, తత్రశ్రాద్ధం ప్రదాతవ్యం పితౄణాం తృప్తిహేతవే. మాధవీయే శ్రాద్ధోపక్రమే వ్యాసః - మహోదధౌ ప్రయాగేచ కాశ్యాంచ కురు జాంగలే. శంఖః - గంగాయమునయోస్తీరే పయోష్ణ్యమరకంటకే, నర్మదా బాహు దాతీరే భృగు లింగే హిమాలయే, గంగాద్వారే ప్రయోగే చ నైమిషే పుష్కరే తథా, సన్నిహత్యాం గయాయాం చ దత్తమక్షయ్యతాం వ్రజేత్. **ఏష్టవ్యా బహవః పుత్రా** యద్యేకోపి గయాం వ్రజేత్, యజేత వాశ్వమేధేన నీలం వా వృషముత్సృజేత్. **ఆదిత్యపురాణే** - పంచకోశం గయా క్షేత్రం క్రోశమే కంగయాశిరః, మహానద్యాః

పశ్చిమేన యావత్ గృధ్రేశ్వరోగిరిః ఉత్తరే బ్రహ్మయూపస్యయావద్దక్షిణమానసం, ఏతద్గయా శిరోనామ త్రిషులోకేషు విశ్రుతం, ఇతి. శూలపాణౌ బృహస్పతిః - గయాయాం ధర్మపృష్ఠే చ సరసి బ్రహ్మణస్తథా, గయా శీర్షే అక్షయవటే పితౄణాం దత్తమక్షయం, ధర్మారణ్యం ధర్మపృష్ఠం ధేను కారణ్య మేవచ, దృష్ట్వైతాని పితౄంశ్చార్చ్య వంశాన్ వింశతి ముద్ధరేత్. **త్రిస్థలీసేతౌవాయవీయే** - శమీపత్ర ప్రమాణేన పిండం దద్యాత్ గయాశిరే, ఉద్ధరేత్సప్త గోత్రాణి కులమే కోత్తరం శతం.

అను॥ ఇక శ్రాద్ధ దేశములు, మనువిట్లా - నిర్జనమైన, శుచియైన (అస్థి, అంగారములులేని) ప్రదేశమును పేడతో అలకాలి. దక్షిణం వైపు వంపు ఉండేట్టుగా ప్రయత్న పూర్వకముగా చేయాలి,అని. పృథ్వీ చంద్రోదయ మందు విష్ణుధర్మోక్తి ఇట్లా - దక్షిణం వైపు వంపు గలిగిన ప్రదేశమందు, తీర్థాదులందు, గృహమందుకాని, భూసంస్కారము మొదలగునవి (దుమ్ముగడ్డి లేకుండా) కల్గిన చోట ప్రయత్న పూర్వకముగా శ్రాద్ధము చేయాలి, అని. అక్కడే ప్రభాసఖండమందిట్లా - ఓ శుభ! తీర్థముకన్న తన ఇంటిలో శ్రాద్ధము చేయుట, ఎనిమిదిరెట్లు ఎక్కువ పుణ్యము నిస్తుంది,అని. భారతమందిట్లా - దానికి కురు క్షేత్రము, గయ, గంగ, సరస్వతి, ప్రభాసము పుష్కరము, ఈ ప్రదేశములు శ్రేష్ఠము. ఇక్కడ శ్రాద్ధము చేసిన మహాఫలము లభిస్తుంది,అని. స్కాందమందిట్లా - ఓద్విజ! ఎక్కడెక్కడైతే తులసీకాననము ఛాయ ఉంటుందో అక్కడ పితరుల తృప్తి కొరకు శ్రాద్ధము ఇవ్వాలి,అని. మాధవీయమందు శ్రాద్ధమును గూర్చి చెప్పేప్పుడు వ్యాసోక్తి ఇట్లా - సముద్రము యందు, ప్రయాగయందు కాశియందు, కురు, జాంగలమందు శ్రాద్ధము చేయాలి,అని. శంఖుడు ఇట్లా - గంగయమునల తీరమందు పయోష్ణి, అమరకంటకము, నర్మద, బాహుద ఈ నదుల తీరమందు, భృగులింగమందు, హిమాలయమందు, గంగాద్వారము, ప్రయాగము నైమిషము, పుష్కరము, గయ వీని సమీపమందు చేసిన శ్రాద్ధము అక్షయ్య ఫలమును ఇస్తుంది,అని. మా కులంలో ఒక నరోత్తముడు జన్మించాలి. ఆతడు గయాశీర్ష మందు, వటవృక్ష సమీపమందు సావధానంగా మాకు శ్రాద్ధ మాచరించాలి అనేకమంది పుత్రులను కోరాలి (కనాలి). అందులో ఒక్కడైనా గయకు వెళ్ళొచ్చు. శ్రాద్ధం చేయొచ్చు. అశ్వమేధ యాగమో లేదా నీలవృషమును దానము చేయుటో చేయాలి. ఆదిత్య పురాణ మందిట్లా - గయా క్షేత్రము ఐదు కోసులు విస్తీర్ణము. గయ శిరస్సు ఒక కోసు పరిమితము. పడమర మహానది (యొక్క పశ్చిమం) నుండి గృధ్రేశ్వర గిరి వరకు, ఉత్తరంలో బ్రహ్మయూపం (యొక్క ఉత్తర భాగం) నుండి దక్షిణం మానసము వరకు దీనిని గయాశిరమని అంటారు. ఇది ముల్లోకములలో ప్రసిద్ధమైంది,అని. శూలపాణి యందు, బృహస్పతి వచనమిట్లా - గయ యందు, బ్రహ్మకూపమందు, ధర్మపృష్ఠ యందు గయాశీర్షయందు, అక్షయ వటమందు పితరులనుద్దేశించి చేసిన శ్రాద్ధము అక్షయ్యమైనది,అని. ధర్మారణ్యము, ధర్మపృష్ఠము, ధేను కారణ్యము, వీనిని చూచి, పితరుల నర్చిస్తే ఇరువది వంశములను తరింపచేస్తాడు (తరములు). త్రిస్థలీ సేతువు యందు వాయుపురాణోక్తి ఇట్లా - గయాశిరమందు శమీపత్ర

ప్రమాణంతో పిండము పెట్టాలి. అట్లా చేస్తే ఏడు గోత్రములను,నూటొక్క కులములను ఉద్ధరిస్తాడు,అని.

**మూ॥ సప్తగోత్రాణితు** - పితామాతా చభార్యా చ భగినీ దుహితాతథా, పితృమాతృష్వసా చైవ సప్తగోత్రాణి వైవిదుః,ఇతి. ఏషాం గోత్రాణాం ఏకోత్తర శతంకులం పురుషా ఇత్యర్థః. తేచ ఉక్తాస్తత్రైవ - తత్వాని వింశతి నృపాద్వాదశైకా దశాదశ అష్టావితి చ గోత్రాణాం కులమేకోత్తరం శతం తత్వాని= చతుర్వింశతిః. తేచ ద్వాదశ పూర్వాద్వాదశ పరాః. ఏవమగ్రేపి. ప్రయోగపారిజాతే పాద్మే - శాలగ్రామమయీముద్రా సంస్థితా యత్రకుత్రచిత్, వారాణస్యాయవాధిక్యం సమంతాద్యోజనత్రయం. తథా-యత్కించిత్, పైతృకం కుర్యాత్ సపిండం వాతదంతికే, విష్ణులోకం సగచ్ఛేత్తు లభతే శాశ్వతం పదం. తత్రైవ వారాహే - మ్లేచ్ఛదేశే శుచౌవాపి చక్రాంకో యత్ర తిష్ఠతి, యోజనానాం తథా త్రీణి మమక్షేత్రం వసుంధరే. చక్రాంకస్యతు సాన్నిధ్యే యత్కర్మక్రియతే నరైః స్నానందానంతపః శ్రాద్ధం సర్వమక్షయతాం వ్రజేత్. **అథనిషిద్ధదేశాః** - పృధ్వీచంద్రోదయే స్కాందే - త్రిశంకోర్వర్జయేద్దేశం సర్వంద్వాదశయోజనం, ఉత్తరేణ మహానద్యా దక్షిణేన తు కీకటాత్. దేశ స్త్రై శంకవో నామ శ్రాద్ధ కర్మణి వర్జితః. వాయవీయే - ప్రణష్టా శ్రమ ధర్మాశ్చదేశా వర్జ్యాః ప్రయత్నతః యమః - రూక్షం కృమిహతం క్లిన్నం సంకీర్ణానిష్టగంధికం, దేశంత్వనిష్ట శబ్దం చ వర్జయేచ్ఛ్రాద్ధకర్మణి తత్రైవ శంఖః - గోగజాశ్వాది జుష్టేషు కృత్రిమాయాం తథాభువి, న కుర్యాచ్ఛ్రాద్ధమేతేషు పారక్యాసు చ భూమిషు యమః - పరకీయ ప్రదేశేషు పితౄణాం నిర్వపేత్తుయః తద్భూమిస్వామి పితృభిః శ్రాద్ధకర్మ విహన్యతే. బ్రాహ్మే భారతయోరపి - పరకీయ గృహేయస్తు స్వాన్ పితౄం స్తర్పయేద్యది, తద్భూమిస్వామి నస్తస్యహరంతి పితరోబలాత్. అగ్రభాగం తతస్తేభ్యో దద్యాన్మూల్యం చ జీవితం. శ్రాద్ధార్హాణాం అగ్రభాగం శ్రాద్ధం తదనర్హాణాం శూద్రాణాంతు మూల్యమితి కేచిత్. షోడశీపిండే అబాంధవానా మపి పిండోక్తేః. యే అబాంధవా బాంధవా, ఇత్యాది. తర్పణ బాధా పత్తేశ్చ. నామగోత్ర పూర్వం శ్రాద్ధ నిషేధో నాన్యత్రేతి గౌడాః. విప్రాసు తస్య శూద్రా పుత్ర శ్రాద్ధ నిషేధో నాన్యత్ర. అగ్రదానం చ అన్నత్యాగాత్పూర్వం కార్యమితి మైథిలాః తన్న, అగ్ర భాగస్య శ్రాద్ధ పరత్వే మానా భావాత్ అన్నదానే చ నిషేధా భావాత్. త్యాగా త్పూర్వం కరణే అనంగేనవ్యవధానా పత్తేః. అంగత్వే చ మానా భావాత్. ఇదం చ స్వామ్యనుజ్ఞాఅభావే. తదుక్తం తత్రైవ బ్రాహ్మే- స్వనులిప్తేషు గేహేషు స్వేష్వను జ్ఞాపి తేషుచ శ్రాద్ధమే తేషు దాతవ్యం వర్జ్యమేతేషు నోచ్యతే.

అను॥ సప్తగోత్రములైతే - తండ్రి, తల్లి, భార్య, చెల్లెలు, కూతురు, తండ్రి తోబుట్టువు, తల్లితోబుట్టువు ఇవి సప్తగోత్రములు అని తెలుసుకోవాలి,అని. ఈ గోత్రముల వారి నూటొక్క మంది పురుషులను, కులమని అంటారు అని అర్థము. వారిని అక్కడే చెప్పారు - ఇరువది నాలుగు, ఇరువది, పదహారు, పన్నెండు, పదకొండు,. పది, ఎనిమిది అని గోత్రముల కులము ఏ కోత్తర శతము,అని. తత్వములు ఇరువది నాలుగు.అవి పన్నెండు పూర్వము పన్నెండు పరమువి. ఇట్లాగే ముందు కూడ గ్రహించాలి. ప్రయోగ పారిజాతమందు పాద్మోక్తి ఇట్లా - వారాణసి యొక్క చట్టుముట్టు మూడు యోజనముల విస్తీర్ణములో శాలగ్రామ

మయమైన ముద్ర ఎక్కడో ఒకచోట 1/8 అంగుళముకన్న (యవ) అధికంగా ఉంది,అని. అట్లాగే - దాని సమీపంలో ఏదో ఒక పితృకార్యమును లేదా సపిండమును చేయాలి. ఆతడు విష్ణులోకమునకు వెళ్తాడు. శాశ్వతమైన పదమును పొందుతాడు,అని. అక్కడే వారాహోక్తి ఇట్లా - ఓ వసుంధర! మ్లేచ్ఛదేశమందు లేదా శుచి ప్రదేశమందు కాని చక్రాంక నుదున్నచోట, మూడు యోజనముల విస్తీర్ణము నా క్షేత్రము,అని. చక్రాంకుని సన్నిధానంలో స్నానము, దానము, తపము, శ్రాద్ధము ఇందులో ఏ కర్మచేసినా నరుని ఆకర్మ అంతా అక్షయ మౌతుంది. ఇక నిషిద్ధ దేశములు - పృథ్వీ చంద్రోదయ మందు స్కాందోక్తి ఇట్లా - పన్నెండు యోజనముల విస్తీర్ణమైన త్రిశంకుదేశమును పూర్తిగా విడిచి పెట్టాలి. ఉత్తరంలో మహానది నుండి దక్షిణంలో కీకటం వరకు త్రిశంకు దేశం అని పేరు. అక్కడ శ్రాద్ధకర్మ చేయరాదు,అని. వాయుపురాణమందిట్లా - ఆశ్రమధర్మములు నశించిన దేశములను ప్రయత్న పూర్వకముగా విడిచిపెట్టాలి,అని. యముడిట్లా - రూక్షము, పురుగులతో నష్టమైనది, బురదతో కూడినది, అనేక జాతులతో కూడినది, ఇష్టం కాని వాసన గలది, అనిష్ట శబ్దము గలది, ఇట్టి ప్రదేశములను శ్రాద్ధకర్మయందు విడిచిపెట్టాలి,అని. అక్కడే శంఖుడిట్లా - గోవులు, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు వానితో సేవింపబడిన, అట్లాగే కృత్రిమమైన ప్రదేశమందు (వేదిక), ఇతరుల భూములందు, వీటిలో శ్రాద్ధము చేయరాదు,అని. యముడిట్లా - ఇతరుల ప్రదేశములందు పితరులకు తర్పణ మిచ్చినచో, ఆ భూమి యజమాని పితరులు ఆ శ్రాద్ధకర్మను నశింపచేస్తారు,అని. బ్రహ్మపురాణము భారతము వీనియందిట్లా - ఇతరుల గృహమందు తన పితరులకు తర్పణమిచ్చినచో, ఆ భూమి యజమానుల పితరులు దానిని బలవంతంగా హరిస్తారు. అందువల్ల వారికి అగ్రభాగమును ఇవ్వాలి జీవనానికి మూల్యమన్నా ఇవ్వాలి,అని. శ్రాద్ధార్హులైన వారికి శ్రాద్ధపు అగ్ర భాగాన్ని ఇవ్వాలి. అనర్హులైన వారికి శూద్రులకు మూల్యము అని కొందరు లేనిచో షోడశీ పిండమందు బంధువులు కాని వారికి కూడా పిండం చెప్పబడింది. బంధువులు కానివారు, బంధువులైన వారు ఎవరున్నారో, అని మొదలుగా, తర్పణమునకు బాధ కలగవచ్చు కూడా. కాన నామగోత్ర పూర్వక శ్రాద్ధమునకు నిషేధము, ఇతరమైనది కాదు అని గౌడులు. బ్రాహ్మణీ పుత్రునకు శూద్ర స్త్రీ పుత్రుని శ్రాద్ధము నిషేధము, ఇతరత్ర కాదు. అగ్రదానమైతే అన్నత్యాగముకన్న ముందే చేయాలి,అని మైథిలులు అన్నారు.అదికాదు అగ్రభాగమనేది శ్రాద్ధ విషయకమే అనటంలో ప్రమాణంలేదు. అన్నదానంలో నిషేధం లేదు కాబట్టి. త్యాగం కన్నాముందే చేస్తే, అంగం కానందువల్ల వ్యవధానం ఏర్పడుతుంది. అంగం అనటానికి ప్రమాణంలేదు. ఇదంతా స్వామి అనుజ్ఞ లేనిపక్షంలో. అదే విషయాన్ని అక్కడే బ్రాహ్మమందిట్లా - బాగా అలకబడిన (పవిత్ర) గృహములందు, యజమానులు అనుజ్ఞ ఇచ్చాక శ్రాద్ధము వీనిలో ఇవ్వాలి. వీనియందు వర్జ్యము చెప్పబడలేదు (విడుచుట)అని.

మూ॥ కిరాతేషు కలింగేషు కొంకణేషు ఖశేష్వపి, సింధోరుత్తరకూలేషు నర్మదా యాశ్చ దక్షిణే. పూర్వేణకరతోయాయా న దేయం శ్రాద్ధముచ్యతే. ఇదం కామ్యవిషయం అన్యథా తత్రత్యా నాం సర్వశ్రాద్ధా కరణాపత్తేః. నర్మదా దక్షిణేఽపవాదః స్కాందే - సహ్యస్య చోద్భవో యత్ర యత్ర గోదావరీ నదీ, పృథివ్యామపి కృత్స్నాయాం సప్రదేశోఽతి పావనః. **పరకీయత్వాపవాద** ఆదిత్యపురాణే - అటవీ పర్వతాః పుణ్యానదీ తీరాణి యానిచ, సర్వాణ్య స్వామి కాన్యాహుః నహి తేషు పరిగ్రహః. వనాని గిరయో నద్యః తీర్థాన్యాయతనానిచ, దేవఖాతాశ్చ గర్తాశ్చన స్వామ్యం తేషు విద్యతే. **స్మృతిసారే** - నైకవాసాన చద్వీపే నాంతరిక్షేకదాచన, శ్రుతి స్మృత్యుదితం కర్మన కుర్యాద శుచిః క్వచిత్. **దివోదాసీయే** - మ్లేచ్ఛదేశే తథారాత్రౌ సంధ్యాయాం విప్రవర్జితే, నశ్రాద్ధమాచరే ద్విద్వాన్ న చాకాశే కథంచన **అథశ్రాద్ధకాలాః** - తేచ సంక్రాంతి యుగాది మహాలయాదయః ప్రాయేణ పూర్వ పరిచ్ఛేదద్వయే ఉక్తా ఏవ కేచిత్తూచ్యంతే. పృథ్వీ చంద్రోదయే వృద్ధపరాశరః - శ్రాద్ధం వృద్ధావ చంద్రే భచ్ఛాయాగ్రహణ సంక్రమే, నవోదకే, నవాన్నేచ నవచ్ఛన్నే తథాగృహే. న వైక్షవేషు చే హస్తే పితరోహి మఘాస్వపి, పితరః స్పృహయంత్యన్నమష్టకాసు మఘాసు చ ఇతి శాతాతపపారః. నవోదకే నవకూపాదావితికేచిత్. వర్షోపక్రమే అర్ద్రా ప్రవేశే ఇతి గౌడాః. **నవాన్న శ్రాద్ధే** విశేషో జ్యోతిషే - జ్యేష్ఠా శేషార్ధగే సూర్యే మృగనేత్రానిశాత్మకే, నవాన్నైః భోజన శ్రాద్ధం జన్మ చంద్ర తిథౌన చ. అశ్లేషా కృత్తికా జ్యేష్ఠా మూలాజ పదగేషుచ, భృగు భౌమదినే రిక్తే తిథౌ నాద్యాన్న వౌదనం. తత్రైవ - వృశ్చికే శుక్ల పక్షేతు నవాన్నం శస్యతే బుధైః, అతః కృష్ణ పక్షే నేతి గౌడాః. మైథిలాస్తు - అకృతాగ్రయణం చైవ ధాన్యజాతం నరోత్తమ, ఇతి వారాహోక్తేః ప్రతిధాన్యం శ్రాద్ధమాహుః, తన్న జాతపదస్య శ్రాద్ధయోగ్యసమూహ పరత్వాత్.

అను॥ కిరాతములందు, కలింగములందు, కొంకణదేశములందు ఖశమందు, సింధునది ఉత్తరపు ఒడ్డులందు, నర్మదకు దక్షిణమందు, కరతోయనదికి పూర్వభాగమందు శ్రాద్ధము పెట్టరాదని అన్నారు. ఇది కామ్య విషయపరము. లేనిచో అక్కడ ఉన్నవారు ఏ శ్రాద్ధము చేయలేని పరిస్థితి వస్తుంది. నర్మదనదికి దక్షిణమందు అన్నదానికి అపవాదం స్కాందమందిట్లా - సహ్య పర్వతం పుట్టినచోటు, గోదావరి ప్రవహించేచోటు, ఈ భూమి మొత్తం మీద ఆ రెండు ప్రదేశాలు అతి పావనమైనవి,అని. పరకీయత్వమునకు అపవాదము ఆదిత్యపురాణ మందిట్లా - అడవులు, పర్వతములు, నదీతీరములన్ని పుణ్యప్రదమైనవి. ఇవన్ని అస్వామికములు అని అన్నారు. వానియందు పుచ్చుకొనుట (పరిగ్రహము)లేదు, (పన్ను) అని. వనములు, పర్వతములు, నదులు, తీర్థములు, దేవాలయములు, దేవఖాతములు (యజ్ఞస్థానములు,కొలనులు) గర్తములు (బిలములు) వీటిపై ఎవరికి స్వామ్యము లేదు (స్వామిత్వం) స్మృతిసారమందిట్లా - ఒంటి వస్త్రంతో, ద్వీపమందు, అంతరిక్షమందు, శ్రుతి స్మృతులలో చెప్పబడిన కర్మను అశుచియై ఎప్పుడూ చేయరాదు, అని. దివోదాసీయ మందిట్లా - మ్లేచ్ఛదేశమందు, రాత్రియందు, సంధ్యాకాలమందు బ్రాహ్మణుడు లేనిచోట, ఆకాశమందు (మేడమీద) (కప్పులేనిది) విద్వాంసుడు శ్రాద్ధం చేయరాదు,అని. ఇక శ్రాద్ధ కాలములు - సంక్రాంతి, యుగాది, మహాలయాదులు, తరచుగా

పూర్వ ప్రకరణములు రెంటిలో అవి చెప్పబడ్డాయి. కొందరిట్లా అంటారు – పృథ్వీ చంద్రోదయమందు వృద్ధ పరాశరుని మాట – వృద్ధి యందు, అమావాస్యయందు, గజచ్ఛాయ, గ్రహణ, సంక్రమణములందు, వర్ష ఆరంభకాలమందు (తీర్థోదకమందు), నవఅన్నకాలమందు, గృహమునకు కొత్తగా కప్పువేశాక, కొత్త చెరకు గడల కాలమందు, మఘానక్షత్ర ములందు పితరులు శ్రాద్ధమును కోరుతారు. పితరులు అష్టకములందు మఘలందు అన్నమును ఆశిస్తారు. అని శాతాతపునిపాఠము. కొత్త ఉదకం అనగా కొత్తగా బావి తవ్వినప్పుడు అని కొందరంటారు. వర్షాకాల ఆరంభమందు ఆర్ద్రనక్షత్ర (కార్తి) ప్రవేశమందు అని గౌడులు అంటారు. నవాన్న శ్రాద్ధమందు జ్యోతిషమందు విశేషమిట్లా – జ్యేష్ఠ నక్షత్రం ఉత్తర భాగంలో సూర్యుడుండగా చంద్రుడు మృగశీర్ష నక్షత్రమందుండగా, చంద్రుడు జన్మనక్షత్రంలో తిథిలోను ఉండగా క్రొత్త అన్నముతో శ్రాద్ధ భోజనము పెట్టరాదు. ఆశ్లేష, కృత్తిక, జ్యేష్ఠ, మూల, పూర్వాభాద్ర ఈ నక్షత్రములందు, శుక్ర మంగళవారములందు, రిక్త తిథి యందు కొత్త అన్నము తినరాదు. (శ్రాద్ధం చేయరాదు,అని). అక్కడే – వృశ్చిక మాసం శుక్లపక్షంలో కొత్త అన్నము తినాలి అని పండితులన్నారు. అందువల్ల కృష్ణపక్షంలో పనికి రాదని గౌడు లన్నారు. మైథిలులైతే – ఆగ్రయణం చేయకుండా (బలిఇవ్వకుండా, నివేదన లేకుండా) ధాన్య జాతమును తినరాదు ఓ నరోత్తమ ! అని వరాహ పురాణపు మాటననుసరించి, ప్రతి ధాన్యమునకు శ్రాద్ధ మాచరించాలి అని అన్నారు. కాని అది కాదు 'జాతము' అన్న పదము శ్రాద్ధయోగ్య సమూహపరకము (వాచకము).

**మూ॥ హేమాద్రౌ జాతూకర్ణ్యః** – గ్రహోపరాగే చ సుతేచ జాతే పిత్ర్యేగయాయా మయనద్వయేచ, నిత్యం చ శంఖే చ తథైవ పద్మే దత్తం భవేన్నిష్క సహస్ర తుల్యం. శంఖం ప్రాహు రమా వాస్యాం క్షీణ చంద్రాం ద్విజోత్తమాః అష్టకాసుభవేత్పద్మం తత్రదత్తం తథాఽక్షయం. తత్రైవ శంఖః – యదావిష్టిః వ్యతీపాతో భానువారస్త థైవచ, పద్మకం నామ తత్ప్రోక్తం అయనాచ్చ చతుర్గుణం, యాజ్ఞవల్క్యః – అమావాస్యాష్టకా వృద్ధిః కృష్ణపక్షోఽయనద్వయం, ద్రవ్యం బ్రాహ్మణ సంపత్తిః, విషువత్ సూర్యసంక్రమః. వ్యతీపాతో గజచ్ఛాయా, గ్రహణం చంద్ర సూర్యయోః, శ్రాద్ధం ప్రతిరుచిశ్చైతే శ్రాద్ధకాలాః ప్రకీర్తితాః. కృష్ణపక్షః సర్వోఽపి శాకేనాప్యపర పక్షం నాతిక్రమేత్ మాసి మాసినాఽశనం ఇతి స్మృతేః. ఊర్ధ్వం వా చతుర్థ్యా యదహః సంపద్యతే ఋతే చతుర్దశీం, ఇతి కాత్యాయనోక్తేః, మాసి మాసి కార్యమ పరపక్షస్యా పరాహ్ణః, శ్రేయాన్, ఇత్యాపస్తంబోక్తేశ్చ వీప్సయాసర్వం కృష్ణపక్షేషు నిత్యం. తేనోప సంహారాన్మహాలయ పరత్వం పరాస్తం. అత్ర ప్రత్యహం. పంచమ్యాది, యదహః సంపత్తిర్వా ఇతిత్రయః పక్షాః. యదైకదినే శ్రాద్ధం తదా దార్శం పృథగేవ. యాజ్ఞవల్క్యే నామావాస్యాయాః పృథక్ నిర్దేశాత్. ఏతేన కృష్ణపక్షేయదహః సంపద్యతే అమావాస్యాయాంతు విశేషేణ, ఇతి నిగమోక్తేః గుణోఽపరపక్ష శ్రాద్ధస్యామా వాస్యేతి శూలపాణి మతమపాస్తం. అశక్తౌ దర్శేనాపి మాసి శ్రాద్ధసిద్ధిః, ఇతి నారాయణవృత్తిః. నిరగ్ని కానాం కప్మిం శ్చిద్దినే, ఆహితాగ్నేస్తు దర్శేఏవ, నదర్శేన వినా శ్రాద్ధ మాహితాగ్నేః ద్విజన్మనః, ఇతి మనూక్తేః. సర్వకృష్ణపక్షాశక్తౌమాత్స్యే – అనేన విధినా శ్రాద్ధం త్రిరబ్దస్యేహ నిర్వపేత్. కన్యా

కుంభ వృషస్థేఽర్కే కృష్ణపక్షే చ సర్వదా. కర్కోపి - **అహితాగ్నేః** సంవత్సరే త్రిఃశ్రాద్ధనియమః, ఇతి. దేవలః - అనేన విధినా శ్రాద్ధం కుర్యాత్సంవత్సరం సకృత్, ద్విశ్చతుర్వాయథా శ్రాద్ధం మాసే మాసే దినే దినే, కృష్ణపక్షేష్వపి మహాలయస్య శ్రేష్ఠత్వం, తచ్చోక్తం ప్రాక్. **వ్యతీపాతేవిశేష** మాహ హేమాద్రౌ శంఖః - ఫలం లక్షం సముత్పత్తౌ భ్రమణే కోటిరుచ్యతే, పతనే శతకోట్యస్తు పాతేవై దత్తమక్షయం. జ్యోతిఃశాస్త్రే - ద్వావింశతి స్తథోత్పత్తౌ భ్రమణేచైక వింశతిః, పతనేదశ నాడ్యస్తు పతితే సప్తనాడికాః. అంత్యౌ చ ద్వౌ వ్యతీపాతౌ ప్రాగుక్తౌ. హేమాద్రౌ మార్కండేయః - యదాచ శ్రోత్రియేఽభ్యేతి గృహం వేద విదగ్నిచిత్, తేనైకే నాపి కర్తవ్యం శ్రాద్ధం చ విధి వచ్ఛుభం. ఇదం చాపిండం కార్యమితి హేమాద్రిః. ఏతజ్జీవత్పితృకోఽపి కుర్యాత్, ఉద్వాహే పుత్రజననే పుత్ర్యేష్ట్యాం సౌమికే మఖే తీర్థే బ్రాహ్మణ ఆయాతే షడేతే జీవతః పితుః, ఇతి మైత్రాయణీయ పరిశిష్టోక్తేః.

అను॥ హేమాద్రి యందు జాతూకర్ణ్యుడిట్లు - గ్రహణకాలమందు సుతుడు కల్గినప్పుడు, రెండు (ఉత్తర,దక్షిణ) అయన కాలములందు, గయలోను, శంఖమందు, పద్మమందును పితరుల కొరకివ్వబడ్డ శ్రాద్ధము వేయి నిష్కములతో సమానము,అని. ఓ ద్విజోత్తములార! చంద్రుడు క్షీణించిన అమావాస్యను శంఖమంటారు. అష్టకములు పద్మము అక్కడ ఇచ్చినది అక్షయమౌతుంది. అక్కడే శంఖుడిట్లు - విష్టి, వ్యతీపాతము, ఆదివారము ఉన్న రోజును పద్మకమంటారు. అయనములకన్న నాలుగు రెట్లు శ్రేష్ఠమైనది,అని. యాజ్ఞ వల్క్యుడిట్లు - అమావాస్య, అష్టకములు (హేమంత శిశిరముల కృష్ణాష్టములు నాలుగు) వృద్ధి (పుత్రజన్మ కాలం జననాశౌచం), కృష్ణపక్షము, రెండు అయనములు, ద్రవ్యము, బ్రాహ్మణసంపత్తి, మేష తులారాశులలో సూర్య సంక్రమణం, సూర్యసంక్రమణం, వ్యతీపాతము, గజచ్ఛాయ, సూర్యచంద్రుల గ్రహణం, శ్రాద్ధమును గూర్చి శ్రద్ధ ఇవన్నీ శ్రాద్ధ కాలములు అని చెప్పారు. కృష్ణపక్షములన్నియు, శక్తిమంతుడైనా సరే కృష్ణ పక్షాన్ని దాటరాదు ప్రతిమాసంలోను భోజనము పెట్టాలి,అని స్మృతి కృష్ణపక్ష ప్రతిపద నుండి లేదా చతుర్థి తర్వాత ఏ రోజు వస్తుందో అనగా పంచమి నుండి చేయాలి, చతుర్దశిని విడిచి పెట్టి, అని కాత్యాయనోక్తి. ప్రతిమాసం చేయాలి, కృష్ణపక్షం అపరాహ్ణకాలం శ్రేయస్కర మైనది, అని ఆపస్తంబోక్తి కూడా. నెలనెల అని ఆవృత్తిచేసి చెప్పటం వలన అన్ని కృష్ణ పక్షములలోనిత్యము. అందువల్ల ఉపసంహారం వల్ల మహాలయ పరకము అనునది తొలగి పోయింది. ఇక్కడ ప్రతిరోజు, పంచమి మొదలుగా, సంపత్తి కల్గిన రోజు అని మూడు పక్షములు. ఒకవేళ ఒకరోజు శ్రాద్ధమయ్యే పక్షంలో అప్పుడు అమావాస్య శ్రాద్ధము ప్రత్యేకమే. యాజ్ఞవల్క్యుడు అమావాస్యను ప్రత్యేకించి నిర్దేశించాడు, కనుక. దీనితో, కృష్ణపక్షంలో ఏ రోజు ప్రాప్తమౌతుందో (దానిలో) విశేషించి అమావాస్యయందు,అని నిగమోక్తి కనుక గౌణమైన అపరపక్ష శ్రాద్ధమనగా అమా శ్రాద్ధము అని చెప్పిన శూలపాణి మతము తొలగి పోయింది. శక్తి లేనప్పుడు అమా శ్రాద్ధం వల్లనైనా మాస శ్రాద్ధసిద్ధి, అని నారాయణవృత్తి. నిరగ్ని కులైతేఏదో ఒకరోజు చేయొచ్చు. ఆ హితాగ్నికైతే అమావాస్యయందే, ఆహితాగ్నియైన

బ్రాహ్మణునకు దర్భం లేకుండా శ్రాద్ధం లేదు, అని మనూక్తి. అన్ని కృష్ణపక్షములలో అశక్తుడైతే మాత్స్యమందిట్లా - ఈ విధానంతో శ్రాద్ధము సంవత్సరమునకు మూడు మారులు (తర్పణ) చేయాలి. కన్య,కుంభ, వృషభములలో సూర్యుడుండగా కృష్ణపక్షమందు ఎల్లప్పుడు ఆచరించాలి, అని. కర్కుడు కూడా ఇట్లా - ఆహితాగ్నికి సంవత్సరంలో మూడుమారులు శ్రాద్ధ నియమము, అని. దేవలుడిట్లా - ఈ విధితో సంవత్సరంలో ఒకమారు శ్రాద్ధమాచరించాలి. రెండు మార్లు, నాలుగు మారులు, వీలు ననుసరించి ప్రతిమాసమందు కాని, ప్రతి దినమందు కాని శ్రాద్ధ మాచరించాలి. కృష్ణపక్షములందు కూడా మహాలయము శ్రేష్ఠము. దీనిని ముందే చెప్పాము. వ్యతీపాతమందు విశేషమును హేమాద్రి యందు శంఖుడిట్లా చెప్పాడు - (అరవై గడియల విభాగంలో) సముత్పత్తి యందు లక్ష ఫలము, భ్రమణమందు కోటిగుణిత ఫలము. పతనమందు నూరుకోట్ల ఫలము. పద్దాక ఇచ్చిన శ్రాద్ధము, దానము అక్షయ ఫలాన్నిస్తుంది,అని. జ్యోతిః శాస్త్రమందు ఇట్లా - ఉత్పత్తి యందు ఇరువది రెండు గడియలు, భ్రమణమందు ఇరువది ఒక్క గడియలు, పతనమందు పదిగడియలు పద్దాక ఏడుగడియలు అని. చివరి రెండు (గడియలు) వ్యతీపాతములు, ముందే చెప్పాము. హేమాద్రి యందు మార్కండేయుడిట్లా - శ్రోత్రియుడు, వేదవిదుడు, అగ్నిహోత్రి ఇంటికి వచ్చినప్పుడు, ఆ ఒక్కనితోనైనా శ్రాద్ధమును శాస్త్రప్రకారము చేయాలి, శుభకరము,అని. దీనిని పిండం లేకుండా చేయాలని హేమాద్రి. దీనిని తండ్రి బ్రతికున్నవారైనా చేయాలి, వివాహము, పుత్ర జననము, తండ్రిగారి ఇష్టి, సోమయాగము, తీర్థము, బ్రాహ్మణుడు ఇంటికి రావటం, ఈ ఆరు వీటిలో ఏది సంభవించినా తండ్రి బ్రతికున్నవారు శ్రాద్ధం చేయాలి,అని మైత్రాయణీయ పరిశిష్టోక్తి.

**మూ॥ తిథి విశేషే ఫలవిశేషో** యాజ్ఞవల్క్యేనోక్తః - కన్యాం కన్యావేదినశ్చ పశూన్ వై సత్సుతానపి, ద్యూతం కృషించ వాణిజ్యం ద్విశఫైకశఫాం స్తథా. బ్రహ్మవర్చస్వినః పుత్రాన్ స్వర్ణరూప్యే సకుప్యకే, జ్ఞాతి శ్రేష్ఠ్యం సర్వకామా నాప్నోతి శ్రాద్ధదః సదా. ప్రతిపత్ప్రభృతిష్వేకాం వర్జయిత్వా చతుర్దశీం,ఏతాః కృష్ణపక్షస్థా ఏవ. మహాలయేషు ఫలభూమేతి పృథ్వీచంద్రోదయః. **పౌర్ణమాస్యాం హేమాద్రౌ** పితామహః. అమావాస్యా వ్యతీపాత పౌర్ణ మాస్యష్టకాసు చ, విద్వాన్ శ్రాద్ధ మకుర్వాణో నరకం ప్రతిపద్యతే. ఏతన్మాఘ్యాదిపరం. వ్రీహి పాకేచ కర్తవ్యం యవపాకే చ పార్థివ, పౌర్ణమాసీ తథా మాఘీ శ్రావణీ చ నృపోత్తమ, ప్రోష్ఠపద్యామతీతాయాం తథా కృష్ణాత్రయోదశీ, ఏతాంస్తు శ్రాద్ధకాలాన్వై నిత్యానాహ ప్రజాపతిః, ఇతి విష్ణుధర్మోక్తేః. విష్ణుః - మాఘీ ప్రోష్ఠపద్యూర్ధ్వం కృష్ణా త్రయోదశీ, ఇతి. అత్ర మాఘీపౌర్ణమాసీతి కల్పతరుః, శ్రావణ్యూర్ధ్వ మపి మఘాయోగ సంభవాత్ త్రయోదశీ విశేషణం ఇతి గౌడాః. **యాజ్ఞవల్క్యః** - స్వర్గం హ్యపత్య మోజశ్చ శౌర్యం క్షేత్రం బలం తథా, పుత్రం శ్రేష్ఠ్యం చ సౌభాగ్యం సమృద్ధిం ముఖ్యతాం శుభం. ప్రవృత్త చక్రతాం చైవ వాణిజ్య ప్రభృతీనపి. అరోగిత్వం యశోవీతశోకతాం పరమాంగతిం, ధనం వేదాన్ భిషక్ సిద్ధిం కుప్యం గామప్య జావికం, అశ్వా నాయుశ్చ విధివత్ యః శ్రాద్ధం సంప్రయచ్ఛతి, కృత్తికాది భరణ్యంతం సకామాన్ ప్రాప్నుయాదిమాన్, ఫలాంతరాణ్యపి భారతే

కార్మాదౌ జ్ఞేయాని. **మాధవీయే మరీచిః** - కృత్తికాదిషు ఋక్షేషు శ్రాద్ధే యత్ఫల మీరితం, విష్కంభాదిషు యోగేషు తదేవ ఫలమిష్యతే. **బృహస్పతిః** - ఆరోగ్యం చైవ సౌభాగ్యం, శత్రూణాం చ పరాజయం, సర్వాన్కామాన్ ప్రియాం విద్యాం ధనమాయుర్యథా క్రమమ్ సూర్యాదిదివసేష్వే తత్ శ్రాద్ధకృల్లభ్యతే ఫలం, బవాది కరణే ష్వేతత్ శ్రాద్ధ కృల్లభతేనరః. అన్యాని చషణ్ణవతి శ్రాద్ధాదీని ప్రాగుక్తాని. **మార్కండేయపురాణే** - శ్రాద్ధార్హ ద్రవ్యసంపత్తౌ తథా దుః స్వప్న దర్శనే, జన్మర్క్షగ్రహపీ డాసు శ్రాద్ధం కుర్వీత చేచ్ఛయా. **అథశ్రాద్ధాధికారిణః** - చంద్రికాయాం సుమంతుః - మాతుః పితుః ప్రకుర్వీత సంస్థితస్యౌరసః సుతః పైతృమేధిక సంస్కారం మంత్ర పూర్వక మాదృతః. తత్రైవ హేమాద్రౌ శంఖః - పితుః పుత్రేణ కర్తవ్యా పిండదానోదక క్రియా పుత్రాభావేతు పత్నీ స్యాత్త దభావేతు సోదరః. అత్ర యద్యపి పుత్రపదం క్షేత్రజాది ద్వాదశవిధ పుత్రపరం. **తేచద్వాదశపుత్రా యాజ్ఞవల్క్యేనోక్తాః** - ఔరసో ధర్మపత్నీజః తత్సమః పుత్రికాసుతః. క్షేత్రజః క్షేత్రజాతస్తు సగోత్రేణేతరేణవా, గృహే ప్రచ్ఛన్న ఉత్పన్నో గూఢజస్తుసుతః స్మృతః. కానీనః కన్యకాజాతో మాతామహసుతో మతః అక్షతాయాం క్షతాయాం వాజాతః పౌనర్భవః సుతః, దద్యాన్మాతా పితావా, యంస పుత్రోదత్తకో భవేత్. క్రీతశ్చతాభ్యాం విక్రీతః కృత్రిమః స్యాత్ స్వయం కృతః, దత్తాత్మాతు స్వయందత్తో గర్భేవిన్నః సహోఢజః, ఉత్సృష్టో గృహ్యతే యస్తు సోపవిద్ధోభవేత్సుతః, పిండదోంఽశహరశ్చైషాం పూర్వాభావే పరః పరః,ఇతి.

అను॥ - తిథివిశేషమందు ఫలవిశేషాన్ని యాజ్ఞవల్క్యుడిట్లా చెప్పాడు - కన్యను, అల్లుడిని, పశువులను, మంచిపుత్రులను, ద్యూతమందు విజయాన్ని, మంచి పంటను, వాణిజ్యంలో లాభాన్ని, గోవు మొదలగు వానిని (రెండు గిట్టలవి) గుఱ్ఱము మొదలగు వానిని (ఒక గిట్టవి), బ్రహ్మవర్చస్సు గల పుత్రులను, బంగారము వెండి, ఇతర లోహ పదార్థములను, జ్ఞాతులలో గొప్పతనాన్ని, అన్ని కోరికలను శ్రాద్ధమునిచ్చువాడు ఎల్లప్పుడు పొందుతాడు,అని. ప్రతిపద మొదలుకొన్న వానిలో ఒక చతుర్దశిని వదిలితే (వదలాలి). ఇవన్నీ కృష్ణపక్షములోనివే. మహాలయమందైతే ఫలాధిక్యము అని పృథ్వీచంద్రోదయము. పౌర్ణమాసియందు, హేమాద్రియందు పితామహుడిట్లా - అమావాస్య, వ్యతీపాతము, పౌర్ణమాసి, అష్టకములు వీనిలో శ్రాద్ధమాచరించని విద్వాంసుడు నరకాన్ని పొందుతాడు,అని. ఇది మాఘాది మాసపరకము. ఓరాజ! వ్రీహులు పండాక, యవలు పండాక మాఘపూర్ణిమ, శ్రావణ పూర్ణిమ, భాద్రపద పూర్ణిమ గడిచాక కృష్ణపక్ష త్రయోదశి వీనియందు శ్రాద్ధ మాచరించాలి. ఇవి శ్రాద్ధమునకు నిత్యమైన కాలములు అని ప్రజాపతి చెప్పాడు,అని విష్ణు ధర్మోక్తి. విష్ణువిట్లా - మాఘము, భాద్రపదము వీనిలోని పూర్ణిమ తరువాతి కృష్ణపక్ష త్రయోదశి,అని. ఇక్కడ మాఘ మాస పౌర్ణిమ అని కల్పతరువు. శ్రావణ పూర్ణిమ తరువాత కూడా మఘయోగము సంభవము కనుక త్రయోదశి విశేషణము, అని గౌడులు. యాజ్ఞవల్క్యుడిట్లా - స్వర్గము, సంతానము, శక్తి, శౌర్యము, భూమి, బలము, పుత్రుడు, శ్రేష్ఠత్వము, సౌభాగ్యము, ధనాది సమృద్ధి, నాయకత్వము, శుభము, ఆరంభించిన దానిలో

అపేయత, వాణిజ్యము మొదలగునవి, అరోగిత, కీర్తి,దుఃఖం లేకుండుట, ఉత్తమగతి, ధనము, వేదములు, వైద్యవృత్తిలో విజయం, లోహాదులు, గోవులు, పశువులు, అశ్వములు, ఆయుష్షు, శాస్త్ర ప్రకారము శ్రాద్ధమాచరించినవారు, కృత్తికాది భరణి నక్షత్రాంతములలో ఈ ఫలములను వరుసగా పొందుతారు. ఇతర ఫలితములను కూడా భారతమందు కూర్మ పురాణం మొదలగు వానియందు తెలుసుకోవాలి. మాధవీయమందు మరీచి ఇట్లా - కృత్తికాది నక్షత్రములలో శ్రాద్ధం చేస్తే ఏ ఫలితాన్ని చెప్పారో, అదే ఫలితము విష్కంభాది యోగములలో లభిస్తుంది,అని. బృహస్పతి ఇట్లా - ఆరోగ్యము, సౌభాగ్యము శత్రు పరాజయము, అన్ని కోరికలు ప్రియమైనవి, విద్య, ధనము, ఆయుస్సు ఈ ఫలములను వరుసగా ఆదివారం మొదలుగా ఏడు రోజులలో, శ్రాద్ధమాచరించిన వారు పొందుతారు. భవాదికరణములలో శ్రాద్ధ మాచరించినవారు ఈ ఫలితముల పొందుతారు,అని. ఇతరములైన తొంబది ఆరు శ్రాద్ధములు మొదలగు వానిని ముందే చెప్పాము. మార్కండేయ పురాణమందిట్లా - శ్రాద్ధా ర్హమైన ద్రవ్యము చేకూరినాక, అట్లాగే చెడుకలను చూచాక, జన్మనక్షత్రమందు గ్రహముల పీడ ఉన్న సందర్భములలో, తన ఇచ్ఛతో శ్రాద్ధ మాచరించాలి, అని. ఇక శ్రాద్ధాధికారులు - చంద్రికయందు సుమంతుడిట్లా - చనిపోయిన వ్యక్తి యొక్క ఔరస పుత్రుడు తన తల్లి దండ్రులకు ఆదరంతో మంత్ర పూర్వకముగా పితృమేధ సంస్కారము నాచరించాలి,అని. అక్కడే హేమాద్రి యందు శంఖోక్తి ఇట్లా - కొడుకు, తండ్రికి పిండదాన ఉదక క్రియలను ఆచరించాలి. కొడుకు లేని పక్షంలో భార్య ఆచరించాలి, ఆమె లేకపోతే సోదరుడాచ రించాలి,అని. ఇక్కడ పుత్ర శబ్దము క్షేత్రజుడు మొదలుగా పన్నెండు రకముల పుత్రుల నుద్దేశించినది. ఆ పన్నెండు విధముల పుత్రుల గూర్చి యాజ్ఞవల్క్యుడిట్లా చెప్పాడు - ఔరసుడువగా ధర్మపత్ని యందు తనకు జన్మించినవాడు, అతనితో సమానమైన వాడు కూతురు కొడుకు (మనవడు) క్షేత్రజుడు (క్షేత్రమందు పుట్టినవాడు) అనగా సగోత్రుని వలన లేదా సపిండుని వలన స్వక్షేత్రమందు పుట్టినవాడు, గృహమందు ప్రచ్ఛన్నముగా పుట్టినవాడు గూఢజుడు, తన భార్య కన్యగా ఉండగా ఆ కన్యకు కల్గినవాడు కానీనుడు వాడు మాతా మహసుతుడౌతాడు. తొలిభర్త (అక్షత) వంచించాక, లేదా తొలుత యోని సంబంధాన్ని అనుభవించింది (క్షత) ఐనాక (మారు మనువు)నో పుట్టినవాడు **పౌనర్భవుడు**. తల్లికాని తండ్రికాని ఇస్తే వచ్చినవాడు దత్తకుడు. వాళ్ళ దగ్గర అమ్మగా కొనబడ్డవాడు క్రీతుడు. గుణజ్ఞుడని పెంచుకొనబడినవాడు **కృత్రిముడు**. స్వయంగా ఇవ్వబడిన ఆత్మకల వాడు **స్వయందత్తుడు**, వివాహ సమయమందు గర్భమందుండి ఆ తర్వాత పుట్టినవాడు సహోఢుడు. విడువబడగా, స్వీకరింపబడ్డవాడు **అపవిద్ధుడు** ఈ పన్నెండు రకముల పుత్రులలో మొదటివారు లేకపోతే తరువాతి, తరువాతివారు పిండమునిచ్చేవారు, భాగము తీసుకొనేవారు ఔతారు.

మూ॥ తథాపి - దత్తౌరసేతరేషాంతు పుత్రత్వేన పరిగ్రహః ఇతి హేమాద్రౌ వాదిత్య పురాణే కలౌ వితరేషాం పుత్రత్వ నిషేధా దౌరసదత్తక పరమేవ. యద్యపి - పిండదోఽంశ హారశ్చైషాం పూర్వాభావే పరః పరః, ఇతి యాజ్ఞవల్క్యోక్తేః. ఔరసాభావేదత్తక ప్రాప్తిః, తథా హ్యౌరసా భావే పౌత్రః తదభావే ప్రపౌత్రః తదభావే దత్తకాదయ ఇతి జ్ఞేయం, పుత్రేణ లోకాన్ జయతి పౌత్రేణా నంత్యమశ్నుతే. అథ పుత్రస్య పౌత్రేణ బ్రధ్నస్యాప్నోతి విష్టపం, ఇతి జీమూత వాహన ధృత వసిష్ఠ హారీత శంఖలిఖితోక్తేః, లోకానంత్యం దివః ప్రాప్తిః పుత్రపౌత్ర ప్రపౌత్ర కైరితి యాజ్ఞవల్క్యోక్తేశ్చ. పుత్రః పౌత్రశ్చతత్పుత్రః పుత్రికా పుత్ర ఏవచ, పత్నీ భ్రాతా చ తజ్జశ్చ పితా మాతాస్నుషా తథా. భగినీ భాగినేయశ్చ సపిండః సోదకస్తథా, అసన్నిధానే పూర్వేషాం ఉత్తరే పిండదాః స్మృతాః, ఇతిస్మృతి సంగ్రహే ప్రపౌత్రానంతరం పుత్రికా పుత్రోక్తేః తత్సమత్వాచ దత్తకస్య. యద్యపి బృహస్పతినా - పౌత్రశ్చ పుత్రికా పుత్రః స్వర్గప్రాప్తికరావు భౌరిక్థే చ పిండదానే చ సమౌతౌ పరికీర్తితౌ. ఇతి పౌత్ర సామ్యముక్తం. యాజ్ఞవల్క్యేనచ ఔరసోధర్మ పత్నీజః తత్సమః పుత్రికా సుతః, ఇతి ఔరస సామ్యముక్తం, తథాపి లోకే రాజసమో మంత్రీ, ఇత్యాదౌ కించి న్న్యూనేన సమ శబ్ద ప్రయోగాత్ గౌణముఖ్యయోః సామ్యాయోగాచ్చ స్తుత్యర్థం తత్ నతు సమ వికల్ప ఇతి భ్రమితవ్యం. పుత్రఃపౌత్రః ప్రపౌత్రోవా భ్రాతావా భ్రాతృసంతతిః (సపిండ సంతతి ర్వాపి క్రియార్హా నృపజాయతే, తేషా మ భావే సర్వేషాం సమానోదక సంతతిః). మాతృపక్ష సపిండేన సంబంధోయో, జలేనవా, కులద్వయేఽపి చోచ్ఛిన్నే స్త్రీభిః కార్యా క్రియా నృప తత్సంఘాత గణైర్వాపి తద్రిక్థాత్ కారయేన్నృపః, ఇతి విష్ణు పురాణాచ్చ. ప్రపౌత్రానంతరం దత్త కాదయ ఇతి పృథ్వీ చంద్ర మదనరత్న కాలాదర్శాదయః, మదన పారిజాతేఽప్యేవం బోపదేవ రుద్ర ధరాదయస్తు - పుత్రేషు విద్యమానేషు నాన్యోవైకారయేత్స్వధాం, ఇతి సుమంతూక్తౌ - పితామహః పితుః పశ్చాత్ పంచత్వం యది గచ్ఛతి, పౌత్రేణై కాదశాహాది కర్తవ్యం శ్రాద్ధ షోడశం. నైతత్పౌత్రేణ కర్తవ్యం పుత్రవాంశ్చేత్పితామహః, ఇతి ఛందోగపరిశిష్టేచ పుత్ర శబ్దస్య ద్వాదశ విధ సుత పరత్వాత్. పూర్వా భావేపరః పరః, ఇత్యస్య అనన్య పరత్వాచ్చ, దత్త కాద్యభావే పౌత్రాదీనా మప్యధికార ఇత్యాహుః, తద్గౌణ ముఖ్యయోః సామ్యాయోగాత్ దత్తకేసతి పౌత్రస్య అంశహరత్వస్యాప్య భావాపత్తేః పుత్రపదస్య ఔరసమాత్ర పరత్వాత్ చింత్యం. అత ఏవ నిషేధాదుపనీత పౌత్ర సత్వేపి అనుపనీత పుత్రస్యై వాధికారః, ఔరసశ్చానుపనీతోఽపి కుర్యాత్, ఇత్యాహ.

అను॥ ఐనప్పటికి - దత్తుడు, ఔరసుడు వీరికన్న ఇతరులైన వారిని పుత్రులుగా స్వీకరించుట, అని హేమాద్రియందు ఆదిత్య పురాణమందు కలికాలమందు ఇతరులను పుత్రులుగా స్వీకరించుటను నిషేధించి నందువలన ఇది ఔరస దత్తకపరమే. పిండదుడు, అంశహరుడు కూడా. వీరిలో పూర్వులు లేని పక్షంలో పరుడు, పరుడు అని యాజ్ఞవల్క్యుని ఉక్తి వలన ఔరసుడు లేని పక్షంలో దత్తకుని ప్రాప్తి అని ఉన్నా ఔరసుడు లేకపోతే పౌత్రుడు అతడు లేకపోతే ప్రపౌత్రుడు అతడు లేకపోతే దత్తకాదులు అని తెలుసుకోవాలి. పుత్రుని వలన లోకములను జయిస్తాడు, పౌత్రుని వలన అనంత లోకములను పొందుతాడు. ఇక పుత్రుని పౌత్రునితో బ్రహ్మలోకమును చేరుతాడు,అని జీమూత వాహన మందు చెప్పబడిన వసిష్ఠ, హారీత, శంఖలిఖితుల వచనముల వల్ల తెలుస్తోంది. అనంతలోక ప్రాప్తి, స్వర్గ

ప్రాప్తి ఇవి పుత్ర, పౌత్ర, ప్రపౌత్రకులవల్ల లభిస్తాయిఅని యాజ్ఞవల్క్యుని వచనము. పుత్రుడు, పౌత్రుడు, వానిపుత్రుడు, పుత్రికాపుత్రుడు, భార్య, భ్రాత, భ్రాతృపుత్రుడు, తల్లి, తండ్రి, కోడలు, చెల్లెలు, చెల్లెలు కొడుకు సపిండుడు, సోదకుడు ముందు ముందు వారు సమీపంలో లేకపోతే ఉత్తరోత్తరులు పిండదులౌతారు,అని స్మృతి సంగ్రహమందు ప్రపౌత్రుని తరువాత, పుత్రికాపుత్రుని చెప్పినందువల్ల, దత్తకుడు అతనితో సమానమైనవాడు. బృహస్పతితో - పౌత్రుడు, పుత్రికాపుత్రుడు ఇద్దరు స్వర్గమును పొందించేవారు. అందువల్ల వీరిద్దరు ధన గ్రహణమందు, పిండదానమందును సములు అని చెప్పబడ్డారు అని పౌత్ర సామ్యం చెప్పబడింది. ఐనా - అట్లాగే యాజ్ఞవల్క్యుడు ఔరసుడు ధర్మపత్నియందు జన్మించినవాడు వానితో సమానమైనవాడు పుత్రికా పుత్రుడు అని ఔరస సామ్యం చెప్పాడు. ఐనా లోకంలో, రాజుతో సమానమైనవాడు మంత్రి,అనుచోట్లలో కొద్ది తక్కువ అనే అర్థంలో సమశబ్దాన్ని ఉపయోగిస్తున్నారు. కనుక గౌణముఖ్యములకు సామ్యం కుదరదు కాబట్టి అదిస్తుతి కొరకు మాత్రమే. కాని సమ వికల్పమని భ్రమించరాదు. పుత్రుడు, పౌత్రుడు, ప్రపౌత్రుడు, భ్రాత, భ్రాతృ సంతతి (సపిండ సంతతి వారైనా క్రియార్హురాలౌతుంది, వారు లేకపోతే అందరికి సమానోదక సంతతి అర్హులు) మాతృపక్షమైన సపిండులతో సంబంధము లేదా జలముతో కాని. రెండు కులములు నశిస్తే (మాతృ,పితృ) క్రియ అంతా స్త్రీలు చేయాలి, ఓ రాజా! వారి సమూహంలోని వారితోకాని, వారి ద్రవ్యంతో రాజు చేయించాలి,అని విష్ణు పురాణోక్తి. ప్రపౌత్రుని తరువాత దత్తకాదులు అని పృథ్వీచంద్ర మదనరత్న, కాలాదర్శాదులు అన్నారు. మదనపారిజాతమందు కూడా ఇట్లాగే ఉంది. బోపదేవరుద్రధరాదులైతే - పుత్రులుండగా ఇతరులు స్వధాకారాన్ని చేయరాదు (చేయించరాదు)అనే, సుమంతూక్తి యందు తండ్రి తరువాత పితామహుడు మరణిస్తే పౌత్రుడు పదకొండవరోజు మొదలుకొని పదహారు శ్రాద్ధములు చేయాలి. పితామహునకు పుత్రులుంటే పౌత్రునితో దీనిని చేయించ రాదు. అని ఛందోగ పరిశిష్ట మందును పన్నెండు రకముల పుత్రుల పరముగా పుత్ర శబ్దము చెప్పబడ్డందువల్ల, పూర్వమువారు లేకపోతే తరువాతి తరువాతివారు అని అనుదానికి ఇతర పరకముగా అర్థం కానందువల్ల, దత్తకాదులు లేకపోతే పౌత్రాదులకు గూడా అధికారము అని అన్నారో అది గౌణముఖ్యములకు సామ్యం కుదరనందువల్ల దత్తకుడుండగా పౌత్రునకు అంశహరత్వ అభావము వచ్చే అవకాశముంది పుత్రపదమునకు ఔర సమాత్రపరము అందువల్ల ఆలోచించాలి. అందువల్లనే నిషేధంవల్ల ఉపనీత పౌత్రుడున్నా అనుపనీత పుత్రునకే అధికారము. ఔరసుడు అనుపనీతుడైనా ఆచరించాలి అని చెప్పారు.

**మూ॥ పృథ్వీచంద్రోదయే సుమంతుః - శ్రాద్ధం కుర్యాదవశ్యంతు ప్రమీత పితృకోద్విజః వ్రతస్థోవాఽవ్రతస్థోవా ఏకఏవభవేద్యది. వృద్ధమనుః - కుర్యాదను పనీతోఽపి శ్రాద్ధమే కోపియః సుతః, పితృయజ్ఞాహుతిం పాణౌ జుహుయాత్ బ్రాహ్మణస్యసః. ఏకో ముఖ్య ఔరస ఇత్యర్థః. మనుః - నహ్యస్మిన్ యుజ్యతే కర్మ కించి దామౌంజి బంధనాత్ నాభివ్యాహారయేత్**

బ్రహ్మ స్వధా నినయనాదృతే. బ్రహ్మ= వేదః సమంతురపి - నాభివ్యాహారయేత్ బ్రహ్మయావన్మౌంజీ నిబధ్యతే, మంత్రానను పనీతోఽపి పఠేదేవైక ఔరసః. అయం మంత్ర పాఠః త్రివర్ష కృత చూడస్యైవ. అనుపేతోఽపి కుర్వీత మంత్రవత్ పైతృమేధికం. యద్య సౌ కృతచూడః స్యాత్ యదిస్యాచ్చ త్రివత్సరః, ఇతి సుమంతూక్తేః. యత్తు వ్యాఘ్రః - కృతచూడస్తు కుర్వీత ఉదకం పిండమేవచ, స్వధాకారం ప్రయుంజీత వేదోచ్చారం న కారయేత్,ఇతి. యచ్చస్మృతి సంగ్రహే- కృతచూడోఽనుపేతశ్చ పిత్రోః శ్రాద్ధం సమాచరేత్, ఉదాహరేత్ స్వధాకారం, నతువేదాక్షరాణ్యసౌ, ఇతి. తత్ ప్రథమ వర్ష చూడా విషయమితి మాధవ మదనరత్న పృథ్వీచంద్రాః, త్రివర్షోర్ధ్వం మంత్ర వత్త్వస్య వికల్ప ఇతి చంద్రికా బోపదేవశ్చ. దత్తకా దిపరో నిషేధ ఇతి వయం. మదనరత్నే స్కాందే - యజ్ఞేషు మంత్రవత్కర్మపత్నీ కుర్యాద్యథానృప, తథౌర్ధ్వదైహికం కర్మకుర్యాత్స్వాధర్మ సంస్కృతా. అశక్తౌతు కాత్యాయనః - అసంస్కృతేన పత్న్యా చహ్యగ్ని దానం సమంత్రకం, కర్తవ్యమిత రత్సర్వం కారయే దన్యమేవహి. పుత్రశ్చ నజన్మతోఽకారీకింతు వర్షోత్తర మిత్యాహ కాలాదర్శః - చౌలాదార్వాక్తి కాదర్వాక్ న కుర్యాత్ పైతృమేధికం. మదనరత్నే సుమంతురపి - పుత్రశ్చోత్పత్తి మాత్రేణ సంస్కుర్యాదృణ మోచనాత్, పితరం నార్ధి కాచ్చౌలాత్ పై తృమేధేన కర్మణా. ఏతచ్చఔరస స్యైవ. దత్తకాదీనాం తూప నీతా నామేవాధికార ఇతి కాలాదర్శః.

అను॥ పృథ్వీ చంద్రోదయమందు సుమంతువాక్యమిట్లా - తండ్రి మరణించి నప్పుడు బ్రాహ్మణుడు వ్రతమందున్నా, వ్రతమందు లేకున్నా, ఒక్కడే కొడుకు ఐనట్లైతే తప్పక శ్రాద్ధ మాచరించాలి,అని. వృద్ధమనువు ఇట్లా - ఒక్కడే కొడుకు ఐనట్లైతే, ఉపనీతుడు కాకపోయినా, శ్రాద్ధమాచరించాలి. ఆతడు పితృయజ్ఞపు ఆహుతిని బ్రాహ్మణుని చేతిలో ఆహుతి చేయాలి,అని. ఏక అనగా ముఖ్యమైన ఔరసపుత్రుడు అని అర్థము. మనువిట్లా - మౌంజీ బంధనం జరిగే వరకు, ఈతడు ఏపనీ చేయరాదు. వేదమును ఉచ్చరించరాదు, స్వధాకారము తప్ప, అని. బ్రహ్మ అనగా వేదము. సుమంతు కూడా - మౌంజీ బంధము జరిగే వరకు వేదముచ్చరించరాదు. ఉపనీతుడు కాకపోయినా, ఔరసుడు ఒక్కడే, మంత్రములను చదవాలి,అని. ఈ మంత్ర పాఠము, మూడు సంవత్సరాలకు పుట్టు వెంట్రుకలు తీయబడ్డవాడే చేయాలి. ఉపనీతుడు కాకపోయినా, మంత్రములతో పితృమేధ కర్మను ఆచరించాలి, ఆతడు పుట్టు వెంట్రుకలు తీయబడ్డవాడైతే, మూడు సంవత్సరాల వయసువాడైతే, అని సుమంతు వచనము. వ్యాఘ్రుడు - చూడాకర్మ జరిగినవాడు తర్పణము, పిండదానము, స్వధాకారోచ్చారణము చేయాలి, వేదోచ్చారణ చేయరాదు,అని అన్నాడో, స్మృతిసంగ్రహ మందు - పుట్టువెంట్రుకలు తీయబడ్డవాడు, ఉపనీతుడు కానివాడు పితృశ్రాద్ధాన్ని ఆచరించాలి. స్వధాకారమును చెప్పాలి, వేదాక్షరములను ఉచ్చరించరాదు,అని అన్నాడో అది మొదటి సంవత్సరంలో చేసే పుట్టు వెంట్రుకలకు చెందినది అని మాధవ మదనరత్న పృథ్వీ చంద్రాదులమతము. మూడ సంవత్సరాల తర్వాత, మంత్రోచ్చారణము వీనికి వికల్పము, (చేయొచ్చు, చేయకపోవచ్చు) అని. చంద్రికాకారుడు, బోపదేవుడు అన్నారు. ఇది దత్తపుత్రులు మొదలగు వారి విషయక నిషేధము అని మేము (నిర్ణయకారుడు)

భావిస్తున్నాము. మదనరత్న మందు స్కాందోక్తి ఇట్లా – భార్యయజ్ఞములలో మంత్రములతో కర్మ ఎట్లా చేస్తుందో (చేయాలో) ఓరాజు! అట్లాగే ఆమె ఔర్ధ్వదైహిక కర్మను ధర్మసంస్కృతయై ఆచరించాలి (పుత్రుని పుట్టు వెంట్రుకలు ఐనా కూడా అని. శక్తిలేనప్పుడు కాత్యాయనుడిట్లా – పుత్రునకు సంస్కారం కానప్పుడు కూడా అతడు మంత్రములతో అగ్నిదానం చేయాలి. అట్లాగే భార్య కూడా చేయాలి. మిగిలిన దంతా ఇతరుల ద్వారా చేయించాలి. పుత్రుడు పుట్టుకతోనే అధికారి కాడు కాని సంవత్సర్దం తరువాత అధికారి ఔతాడు, అని కాలాదర్శకారుడన్నాడు ఇట్లా – మొదటి సంవత్సరం కన్న ముందు చౌలాదులు, పితృమేధము చేయరాదు,అని. మదనరత్నమందు సుమంతుడు కూడా – పుత్రుడు పుట్టినంత మాత్రంతోనే ఋణమోచనం కొరకు సంవత్సరం కన్న ముందు చౌలంకన్న ముందు పితృమేధ సంస్కారమును తండ్రికి చేయరాదు,అని. ఇది ఔరసపుత్రుని విషయము. దత్తకాదులకైతే ఉపనయనం ఐనవారికే అధికారము అని కాలా దర్శము.

మూ॥ పృథ్వీ చంద్రోదయేఽపి స్కాందే – పిత్రోరను పనీతోఽపి విదధ్యా దౌరసః సుతః ఔర్ధ్వదేహికమన్యేతు సంస్కృతాః శ్రాద్ధకారిణః,ఇతి. అన్యత్రాపి దర్శమహాలయా దావనుపనీత స్యాధికారోఽస్మాభిః పూర్వముక్తః. ప్రపౌత్రా భావేదత్త కాదయ ఏకాదశపుత్రాః తద భావేభర్తుః పత్నీ, తస్యాశ్చన, అపుత్రాశయనం భర్తుః పాలయంతీవ్రతేస్థితా, పత్న్యేవద ద్యాత్తత్పిండం కృత్స్న మంశం లభేతచ, ఇతి వృద్ధమనూక్తేః. భార్యా పిండం పతిర్దద్యాత్ భర్తుర్భార్యాత థైవచ, శ్వశ్వా దేశ్చ స్నుషాచైవ తదభావేసపిండకాః,ఇతి. పుత్రాభావేతు పత్నీస్యాత్ పత్న్యభావేతు సోదరః,ఇతి చ హేమాద్రౌ శంఖోక్తేః. పృథ్వీ చంద్రోదదయస్తు – కానీనగూఢ సహజ పునర్భూ తనయాశ్చయే, పత్న్యభావేఽధి కుర్యుస్తే అప్రశస్తా స్మృతాహితే. ఇతి స్మృతి సంగ్రహాత్ పత్న్యభావే కానీనాదయ ఇత్యాహ. పత్న్యురపి సపత్నీపుత్రే సతి నాధికారః, పితృపత్న్యః సర్వామాతరః, ఇతి సుమంతూక్తేః. విద ధ్యాదౌరసః పుత్రోఽజనన్యాఔర్ధ్వ దేహికం, తదభావే సపత్నీజః క్షేత్రజాద్యాః తథాస్మృతాః, తేషామభావేతు పతిః తదభావే సపిండకాః, ఇతి మదనరత్నే కాత్యాయనోక్తేశ్చ. బహ్వీనామేక పత్నీనా మేష ఏవ విధిః స్మృతః, ఏకాచేత్పుత్రిణీతాసాం సర్వాసాం పిండదస్తు సః, ఇతి బృహస్పతి వచనాచ్చ అపరార్కే ఽప్యేవం. శేవయచ్ఛుద్ధి వివేకే ఉక్తం – సత్యపి సపత్నీ పుత్రే పత్యురేవాధికారః ,ఇతి తన్నిరస్తం యచ్చ తత్రైవ కాత్యాయనః – న భార్యాయాః పతిః దద్యాత్ అపుత్రాయా అపీశ్వరిత్. యచ్చ విష్ణుపురాణం – కులద్వయేఽపి చోత్సన్నే స్త్రీభిః కార్యాక్రియానృప,ఇతి. యచ్చ మార్కండేయ పురాణం – సర్వాభావేస్త్రియః కుర్యుః స్వభర్తౄణామ మంత్రకం. ఇతి తదాసురాది వివాహోఢా విషయం, ధర్మ్యైర్వివాహైః రూఢాయా సాపత్నీ పరికీర్తితా, క్రయక్రీతాతు యానారీ నసా పత్న్యభి ధీయతే. నసాదైవే నసాపిత్ర్యే దాసీంతాంమునయో విదుః ఇతి మాధవీయే శాతాతపోక్తేః.

అను॥ పృథ్వీ చంద్రోదయమందు కూడా స్కాందోక్తి ఇట్లా – ఉపనయనంకాక పోయినా, ఔరస సుతుడు తండ్రికి తల్లికి ఔర్ధ్వ దైహిక క్రియలు చేయాలి. ఇతరులు మాత్రం సంస్కారమయ్యాకే శ్రాద్ధాధికారులౌతారు,అని. ఇతరత్ర కూడా దర్శము,

మహాలయము వీనియందు, అనుపనీతునకు అధికారాన్ని మేము ముందే చెప్పాము. ప్రపౌత్రుడు లేని పక్షంలో దత్తకాదులు పదకొండుమంది పుత్రులు, వారు లేకపోతే భర్తకు, భార్య, భార్యకు భర్త, సంతానం లేనిదైతే భర్త శయ్యను వ్రతమందుండి పాలిస్తూ ఉండి, పత్నియే ఆ పిండమునివ్వాలి. సంపూర్ణమైన ధనమును పొందుతుంది కూడా (భాగాన్ని). అని వృద్ధ మనూక్తి. భార్యకు పిండదానమివ్వాలి భర్త, భర్తకు భార్య అట్లాగే ఇవ్వాలి. అత్త మొదలగు వారికి కోడలు పిండదానమివ్వాలి. వారు లేకపోతే సపిండకులివ్వాలి,అని. పుత్రుడు లేకపోతే భార్య, భార్య లేకపోతే సోదరుడు ఇవ్వాలి అని హేమాద్రియందు శంఖోక్తి. పృథ్వీ చంద్రోదయ మందైతే - కానీన గూఢ సహోఢజ, పునర్భూతనయులు వీరంతా పత్ని లేని పక్షంలో అధికారులు. ఎందుకంటే వారంతా ప్రశస్తులు కారని చెప్పబడ్డారు, అని స్మృతి సంగ్రహమందు ఉన్నందువల్ల పత్ని లేకపోతే కానీనాదులు అని చెప్పాడు. భార్య కూడా, సపత్ని పుత్రుడు ఉంటే అధికారికాదు. తండ్రిగారి భార్యలందరు తల్లులే అని సుమంతూక్తి. తల్లికి ఔరసపుత్రుడు ఔర్ధ్వదేహిక క్రియలు ఆచరించాలి. అట్లా లేనప్పుడు సపత్నీకుమారుడు, ఆ పిదప క్షేత్రజాదులు అట్లాగే అని చెప్పారు వారు లేకపోతే భర్త, ఆతడు లేకపోతే సపిండకులు, అని మదనరత్నమందు కాత్యాయనోక్తి కూడా. బృహస్పతి వచనమిట్లా-ఒకే భర్తకు అనేక మంది భార్యలైతే ఇదే విధానము చెప్పబడింది. వారిలో ఒక స్త్రీకి మాత్రమే సంతానముంటే ఆతడు ఆ స్త్రీలందరికి పిండదానమిచ్చువాడు,అని. అపరార్కమందు కూడా ఇట్లాగే ఉంది. అందువల్ల శుద్ధివివేకంలో - సపత్ని పుత్రుడు న్నా భర్తకే అధికారము అని అన్నమాట కొట్టివేయబడింది. అక్కడే కాత్యాయనుడు - భార్యకు భర్త ఎప్పుడూ పిండదానం చేయరాదు, ఆమెకు సంతానం లేకపోయినా, అని అన్నాడో, విష్ణుపురాణమందు - రెండు కులములు నాశమైనప్పుడు, క్రియలను స్త్రీలు ఆచరించాలి,అని ఉందో మార్కండేయ పురాణ మందు - ఎవ్వరూ లేని పక్షంలో, తమ భర్తలకు స్త్రీలు మంత్రం లేకుండా క్రియలు ఆచరించాలి, అని చెప్పబడిందో అవన్ని అసుర మొదలగు వివాహముల ద్వారా పెండ్లాడ బడినవారి విషయకము. ధర్మమైన వివాహ పద్ధతిలో పెండ్లాడబడిన స్త్రీ పత్ని అని పిలువబడుతుంది. కొనితేబడిన స్త్రీ పత్ని అని పిలువబడదు. ఆమె దైవకార్యములందు పిత్ర కార్యములందు పనికి రాదు. ఆమెను దాసి అని మునులు అన్నారు, అని మాధవీయ మందు శాతాతపోక్తి.

**మూ॥ యత్తుశుద్ధిరత్నాకరః శూలపాణిశ్చ - అపుత్రస్యచయా పుత్రీ సాపి పిండ ప్రదా భవేత్, తస్య పిండాన్ దశైకం వా ఏకాహేనైవ నిక్షిపేత్, ఇతి జాబాలోక్తేః, భర్తుః ధనహరాపత్నీ తాంవినా దుహితాస్మృతా. అంగాదంగాత్సంభవతి పుత్రవత్ దుహితా నృణాం ఇతి బృహస్పతినా, దుహితుః ధనహారిత్వోక్తేశ్చ పుత్రాభావే కన్యా, తదభావే సపత్నీ పుత్ర ఇత్యాహతుః, తత్ పూర్వ విరోధాత్. మాతుః దుహితరః శేషం ఋణాత్తాభ్య ఋతేఽన్వయః, ఇతి దుహితుః మాతృ ధనగ్రాహిత్వేన పుత్రస్య తచ్ఛ్రాద్ధా నధికారాపత్తే శ్చ ఉపేక్ష్యం. వచనంతు భ్రాతృపుత్రాద్య భావ**

విషయం పత్న్యభావే అవిభక్త స్య సోదరః పూర్వోక్త శంఖవచనాత్. విభక్త స్యతు దుహితా, ధనహారి త్వాత్, పూర్వోక్త జాబాల వచనాచ్చ. తత్రాపి ఊఢానూఢ సమవాయే ఊఢైవ. దుహితా పుత్రవత్ కుర్యాత్ మాతా పిత్రోస్తు సంస్కృతా, ఆశౌచ ముదకం పిండం ఏకోద్దిష్టం సదాతయోః, ఇతి భరద్వాజోక్తేః తదభావే దౌహిత్రః, ధనహారిత్వాత్, మాతాపిత్రోరుపాధ్యాయాచార్యయోః ఔర్ధ్వదేహికం, కుర్వన్ మాతామహస్యాపి వ్రతీ, నభ్రశ్యతేవ్రతాత్, ఇతి చంద్రికాయాం వృద్ధమనూక్తేఃయథా వ్రతస్థోఽపి సుతఃపితుః కుర్యాత్క్రియాం నృప, ఉదకాద్యాం మహాబాహోదౌ హిత్రోఽపితథార్హతి, ఇతి అపరార్కే భవిష్యోక్తేశ్చ. ఏతద్ధనహారిణ, అవశ్యకం నాన్యస్య ఇత్యాహతత్రైవస్కందః - శ్రాద్ధం మాతా మహానాంతు అవశ్యం ధనహారిణా, దౌహిత్రేణార్థ నిష్కృత్యై కర్తవ్యం పూర్వముత్తరం,ఇతి. తేన దౌహిత్రోఽత్ర పుత్రీకృతః, ఇతి దేవయాజ్ఞికోక్తిః పరాస్తా. అత్రపత్నీ దౌహిత్ర సమవాయేఽంశ హరత్వాత్ పత్న్యేవకుర్యాత్. దౌహిత్ర భ్రాతృపుత్ర సత్వే విభక్తస్యదౌహిత్రఃఅవి భాగే భ్రాతృపుత్రః భ్రాతృతత్పుత్ర సత్వే కనిష్ఠశ్చేత్ భ్రాతైవ. జ్యేష్ఠశ్చేత్తత్పుత్రః కుర్యాదితి దాక్షిణాత్యగ్రంథాః.

అను॥ శుద్ధిరత్నాకరమందు శూలపాణి కూడా ఇట్లా - పుత్రులు లేనివానికి పుత్రిక కూడా పిండదానం చేయొచ్చు. వానికి పిండములను పదికాని, ఒకటికాని ఒకరోజే పెట్టాలి, అనే జాబాలోక్తి ననుసరిం[1]చి, భర్త ధనమును హరించే భార్య ఆమె కాకుండా, కూతురు కూడా చెప్పబడింది. నరులకు భార్యాభర్తల శరీరము నుండి కొడుకువలె ఉద్భవించేది దుహిత అని బృహస్పతి దుహిత ధనాన్ని హరించేది అని చెప్పినందువల్ల[2], పుత్రుడు లేకపోతే కన్య, ఆమె లేకపోతే సపత్నికొడుకు అని ఏది చెప్పారో, అది పూర్వము చెప్పిన దానికి విరుద్ధమైనది. తల్లి ఋణములకు పోగా మిగిలిన దానిని కూతుళ్ళు తీసుకోవాలి. కూతుర్లు లేని పక్షంలో వంశమువారు పొందాలి, అనే దానివల్ల కూతురు తల్లి ధనాన్ని స్వీకరించేది ఐనందువల్ల పుత్రునకు ఆమె శ్రాద్ధం చేయటానికి అధికారం లేకుండా పోతుంది అందువల్ల ఈ మాటను ఉపేక్షించాలి. మాట ఐతే (భార్యపిండం, పతిఇవ్వాలి) భ్రాతృ, పుత్రాదులు లేనిపక్షంలో చెప్పబడింది. పత్నిలేని పక్షంలో అవి భక్తునకు సోదరుడు చేయాలి, ముందు చెప్పిన శంఖ వచనాన్ని అనుసరించి, విభక్తునకైతే కూతురు చేయాలి, ధనమును తీసుకుంటుంది కాబట్టి, ముందు చెప్పిన జాబాలి వచనాన్ననుసరించి ఇక్కడ కూడా ఊఢ, అనూఢ ఈ ఇద్దరు కూడితే వివాహితకే అధికారము. వివాహితయైన దుహిత, కొడుకు చేసినట్లు తల్లిదండ్రులకు పిండదానాదులు చేయాలి. ఎల్లప్పుడు వారికి అశౌచము ఉదకము, పిండము, ఏకోద్దిష్టము చేయాలి, అని భరద్వాజోక్తి. (పుత్ర పౌత్ర సంతానం లేనప్పుడు దౌహిత్రులు ధనానికర్హులు. పూర్వులకు స్వధాకారం చేయటానికి దౌహిత్రికులు పౌత్రుల సమం అని). కుమార్తెలు లేకపోతే దౌహిత్రుడు, ధనాన్ని స్వీకరిస్తాడు కనుక. తలిదండ్రులకు, ఉపాధ్యాయ, ఆచార్యులకు ఔర్ధ్వ దైహికమును మాతామహునకును చేయటంవల్ల, వ్రతి వ్రతము నుండి భ్రష్టుడుకాదు, అని చంద్రికయందు వృద్ధమనూక్తి. ఓరాజ! వ్రతస్థుడైనా పుత్రుడు తండ్రికి ఎట్లా ఉదకము మొదలగు క్రియలు నిర్వర్తిస్తాడో, అట్లాగే ఓ మహాబాహు దౌహిత్రుడు కూడా అర్హుడౌతాడు,అని అపరార్కమందు భవిష్యోక్తి కూడా. ఇది ధనం తీసుకునే

వానికే ఆవశ్యకమైనది, ఇతరులకు కాదు అని అక్కడే స్కాందోక్తి ఇట్లా - ధనం తీసుకునే వాడు మాతామహ శ్రాద్ధమును తప్పక ఆచరించాలి, దౌహిత్రుడు ధనం నుండి నిష్కృతి కొరకు పూర్వ, ఉత్తరక్రియలు ఆచరించాలి,అని. అందువల్ల దౌహిత్రుడు పుత్రుడుగా చేయబడ్డాడు, అనే దేవయాజ్ఞికోక్తి తొలగిపోయింది. ఇక్కడ భార్య, దౌహిత్రుడు ఇద్దరు కూడినప్పుడు, భాగాన్ని తీసుకునేది కనుక భార్యయే చేయాలి. దౌహిత్రుడు భ్రాతృపుత్రుడు ఇద్దరున్న పక్షంలో విభక్తునకు దౌహిత్రుడు, అవి భక్తునకు భ్రాతృపుత్రుడు. భ్రాత తత్పుత్రుడు ఇద్దరున్న పక్షంలో చేసేవాడు చిన్నవాడైతే (మృతుడు పెద్దఐతే) భ్రాతనే చేయాలి. చేసేవాడు పెద్ద వయస్సు వాడయ్యే పక్షంలో అతని పుత్రుడు చేయాలి అని దాక్షిణాత్య గ్రంథములు చెబుతున్నాయి.

**మూ॥ హారలతాదౌతు – భ్రాతుర్భ్రాతా స్వయం చక్రే తద్భార్యా చేన్నవిద్యతే, తస్యభ్రాతృ సుతశ్చక్రేయస్యనాస్తి సహోదరః,ఇతి బ్రాహ్మోక్తేః. పత్నీకుర్యాత్సుతా భావే తదభావేసహోదరః, ఇతి కౌర్మాచ్చ జ్యేష్ఠభ్రాతైవ కుర్యాన్న తత్పుత్రః, యత్తునానుజస్య తథాగ్రజః, ఇతితత్ కనిష్ఠ భ్రాతృ సత్వవిషయం. యచ్చమనుః – సర్వేషామేకపత్నీనాం ఏకశ్చేత్ పుత్రవాన్ భవేత్, సర్వాంస్తాం స్తేన పుత్రేణపుత్రిణో మనురబ్రవీత్,ఇతి. తత్సోదరాభావ విషయమిత్యుక్తం. ఏతేన పుత్రత్వాతి దేశోఽయం. అతఃతస్మిన్ సతి ఏకాదశ పుత్రాః ప్రతినిధయోనకార్యాః. స ఏవ పిండదోఽంశ హారశ్చ ఇతి వాచస్పతి మనుటీకా కల్పతరు రత్నాకరాదయః పరాస్తాః, ద్వాదశ విధపుత్రాభావే, పత్నీ దుహితరః, ఇతి యాజ్ఞవల్క్యోక్తేశ్చ. తస్మాద్దత్త పుత్ర ప్రశంసేయమితి విజ్ఞానేశ్వరః, అవి భక్త విషయంవా. మదనరత్నే స్మృతి సంగ్రహే – పుత్రః కుర్యాత్పితుః శ్రాద్ధం పత్నీ చతదనన్వితా, ధన హార్యథ దౌహిత్రః తతో భ్రాతా చతత్సుతః, భ్రాతుః సహోదరో భ్రాతా కుర్యాద్దాహాది తత్సుతః తతస్త్వసోదరో భ్రాతా తదభావేచ తత్సుతః, ఇతి. భ్రాతృపుత్రాభావే క్రమేణ పితృమాతృస్నుషా స్వసృతత్పుత్రాదయః ధనహారిత్వాత్. భగినీ తత్సుతయోః విశేష మాహ మదనరత్నే కాత్యాయనః – అనుజా వాగ్రజా, వాపి భ్రాతుః కుర్వీత సంస్క్రియాం, తతః స్వసోదరాః తద్వత్ క్రమేణ తన యస్తయోః. అపరార్కే కార్ష్ణాజినిః – పుత్రః శిష్యోఽథవాపత్నీ పితాభ్రాతాస్నుషా గురుః, స్త్రీ హారీ ధనహారీ చ కుర్యాత్ పిండోదక క్రియాం. మార్కండేయపురాణే – పుత్రోభ్రాతా చ తత్పుత్రః పత్నీమాతా తథాపితా, విత్తా భావేఽపి శిష్యశ్చ కుర్వీరన్నౌర్ధ్వ దైహికం. తేనధనహారీ ఏతద్భిన్న ఇతి కాలాదర్శః. అత్రపాఠక్రమోన వివక్షితః పూర్వవాక్యేష్వథ తతః శబ్దాదిభిః శ్రౌతక్రమోక్తేః. అథ జిహ్వయా అథవక్షసః, ఇతివత్. పృథ్వీచంద్రోదయే వృద్ధమనుః– స్నుషాస్వస్రీయ తత్పుత్ర జ్ఞాతి సంబంధి బాంధవాః పుత్రాభావేతు కుర్వీరన్ సపిండాంతం యథావిధి. మార్కండేయ పురాణే :– పుత్రాద్యుత్పన్న బంధోశ్చ సఖాపి శ్వశురస్య చ జామాతా స్నేహవత్ కుర్యాదఖిలం పైతృమేధికం. చంద్రికాయాం వృద్ధశాతాతపః :– మాతులో భాగినేయస్య స్వస్రీయోమాతులస్యచ శ్వశురస్య గురోశ్చైవ సఖ్యుః మాతామహస్యచ. ఏతేషాం చైవభార్యాణాం స్వసుః మాతుః పితుస్తథా శ్రాద్ధ మేషాంతు కర్తవ్యమితి వేదవిదో విదుః.**

అను॥ హారలతాదులందైతే – అతని భార్య లేకపోతే భ్రాతకు భ్రాత స్వయంగా కర్మ చేయాలి. సహోదరుడు లేని వానికి అతని భ్రాతృపుత్రుడు చేయాలి,అని బ్రాహ్మోక్తి.

సుతుడు లేని పక్షంలో భార్య చేయాలి ఆమె లేకపోతే సహోదరుడు చేయాలి, అనే కూర్మ పురాణవాక్యాన్ననుసరించి జ్యేష్ఠ భ్రాతనే చేయాలి,తత్పుత్రుడు చేయరాదు. అనుజునకు అగ్రజుడు అట్లా కాదు అన్న మాట కనిష్ఠ భ్రాత ఉన్న సందర్భంలోది (అధికార నిషేధ విషయక మైనది). మనువు - భర్త ఒక్కడై ఉండి భార్యలు అనేకమంది ఉన్న వారిలో ఒక్కరికి సంతానమున్నా వానితో వారంతా స్త్రీలు పుత్ర వంతులైనట్లే అని మనువు చెప్పాడు. అని అనేది సోదరులు లేని పక్షంలో అని చెప్పారు. దీనితో ఇది పుత్రత్వ అతిదేశము (ఒకదాని ధర్మమును మరొక దానిలో ప్రయోగించుటకు ఆదేశము) అందువల్ల ఔరసుడుండగా పరకొందుగుడు పుత్రులను ప్రతినిధులుగా చేయరాదు. అతడే శి -దదుడు, భాగహారి కూడా, అని వాచస్పతి, మనుటీక, కల్పతరు, రత్నాకరాదులు నివారింపబడ్డారు. పన్నెండు రకాల పుత్రులు లేని సందర్భంలో భార్య, కన్యలు అధికారులు అని యాజ్ఞవల్క్య ఉక్తి కూడా. అందువల్ల ఇది దత్త పుత్ర ప్రశంస అని విజ్ఞానేశ్వరుడు, లేదా ఇది అవిభక్త విషయకము. మదనరత్నమందు స్మృతి సంగ్రహమందు - తండ్రి శ్రాద్ధాన్ని పుత్రుడు చేయాలి. అతడు దగ్గరలో లేకపోతే భార్య చేయాలి. ధనమును స్వీకరించే దౌహిత్రుడు చేయాలి. ఆ పిదప భ్రాత ఆ తరువాత అతని పుత్రుడు. భ్రాతృసంస్కారాన్ని సహోదరుడైన భ్రాత చేయాలి లేదా అతని (భ్రాతృ) సుతుడు చేయాలి ఆ పిదప అసహోదరుడైన భ్రాత అతడు లేని పక్షంలో అతని సుతుడు చేయాలి,అని. భ్రాతృ పుత్రుడు లేని పక్షంలో క్రమంగా తండ్రి, తల్లి, కోడలు, చెల్లెలు, ఆమె పుత్రాదులు ధనాన్ని తీసుకునే వాళ్ళు కాబట్టి కర్మ చేయాలి. చెల్లెలు, ఆమె పుత్రులకు విశేషాన్ని మదనరత్నంలో కాత్యాయనుడిట్లా చెప్పాడు- చెల్లెలు కాని, అక్కకాని అన్నగారి సంస్కారాన్ని చేయాలి, ఆ పిదప తమ సహోదరి నుండి అలాగే క్రమంగా వారి పుత్రులు చేయాలి,అని. అపరార్కమందు కార్ష్ణాజిని ఇట్లా - పుత్రుడు, శిష్యుడు, భార్య, తండ్రి, భ్రాత, కోడలు, గురువు ఎవరైనా స్త్రీని కాని ధనమును కాని హరించేవారు పిండోదక క్రియను చేయాలి,అని. మార్కండేయ పురాణమందిట్లా - పుత్రుడు(లు) భ్రాత (సహోదర, అసహోదర) అతని పుత్రుడు, భార్య, తల్లి,తండ్రి, ధనం లేకపోయినా శిష్యుడు వీరు ఔర్ధ్వ దైహిక క్రియలను చేయాలి (చవల్లదౌహిత్రాదులు, కోడలు) అని. అందువల్ల ధనహారి ఇందుకు భిన్నమైనవాడు అని కాలాదర్శము అంటోంది. ఇక్కడ పాఠక్రమాన్ని వివక్షించలేదు. పూర్వవాక్యములందు అథ,తతః అనుశబ్దములు మొదలగు వానితో శ్రౌతక్రమం చెప్పబడింది. అధజిహ్వాయా అథవక్షసః, అనేదానివలె. పృథ్వీ చంద్రోదయ మందు వృద్ధ మనువిట్లా - కోడలు, మేనల్లుడు, అతనికొడుకు, జ్ఞాతి సంబంధు లు, బాంధవులు వీరంతా పుత్రులు లేని పక్షంలో సపిండాంతమైన కర్మను యథావిధిగా చేయాలి,అని. మార్కండేయపురాణమందిట్లా - పుత్రాదులు బంధువులు నశించినవానికి మిత్రుడు మామగారికి అల్లుడు స్నేహం కలవానివలె సంపూర్ణ పైతృ మేధికమును చేయాలి, అని. చంద్రికయందు వృద్ధ శాతాతపుడిట్లా - మేనమామ, చెల్లెలు కొడుకు యొక్క శ్రాద్ధాన్ని,

మేనమామ యొక్క శ్రాద్ధాన్ని మేనల్లుడు చేయాలి. మామ యొక్క గురువు యొక్క స్నేహితుని యొక్క, మాతామహుని యొక్క వీరి భార్యల యొక్క తల్లిదండ్రుల యొక్క చెల్లెలి యొక్క (వీరందరి) శ్రాద్ధాన్ని ఆచరించాలి అని వేదవిదులు చెప్పారు,అని.

**మూ॥ శుద్ధి వివేకే పృథ్వీ చంద్రోదయే చ బ్రాహ్మే - దత్తానాం వాప్యదత్తానాం కన్యానాం కురుతే పితా, చతుర్థే హని తాస్తేషాం కుర్వీరన్ సుసమాహితాః దత్తాః = వాగ్దత్తాః. మాతామహానాం దౌహిత్రాః కుర్వన్త్య హని చాపరే. తేఽపి తేషాం ప్రకుర్వంతి ద్వితీయేఽహని సర్వదా. జామాతుః శ్వశురాః చక్రుః తేషాం తేఽపి చ సంయుతాః, మిత్రాణాం తదపత్యానాం శ్రోత్రియాణాం గురోస్తథా. భాగినేయసుతానాం చ సర్వేషాం త్వపరేఽహని. రాజ్ఞోఽసతి సపిండేతు విరపత్యే పురోహితః మంత్రీవా తదశౌచంతు పురాచీర్త్వా కరోతి సః అత్ర ద్వితీయా హాదౌ శ్రాద్ధ విధాన మస్థిసంచయ పరం. కాలాదర్శే - దాహాది మంత్రవత్ పిత్రోః విదధ్యా దౌరసః సుతః, తదభావేతు పౌత్రశ్చ ప్రపౌత్రః పుత్రికాసుతః. దౌహిత్రో ధనహారీచ భ్రాతా తత్పుత్ర ఏవచ, పితామాతా స్నుషాచైవ స్వసా తత్పుత్ర ఏవచ, సపిండః సోదకో మాతుః సపిండశ్చ సహోదకః, స్త్రీ చ శిష్యర్త్వి గాచార్యా జామాతా చ సఖాపిచ. ఉత్పన్న బంధో రిక్థేన కారయే దవనీపతిః. గౌతమః - పుత్రాభావే సపిండా మాతృ సపిండాః శిష్యాశ్చ దద్యుః తదభావే ఋత్విగాచార్యౌ. యత్తు చంద్రికాయాం వృద్ధశాతాతపః - ప్రీత్యా శ్రాద్ధం ప్రకర్తవ్యం సర్వేషాం వర్ణలింగినాం, ఇతి తత్ సవర్ణవిషయం. బ్రాహ్మణా స్త్వన్య వర్ణానాం న కుర్యాత్కర్మ కించన, కామాల్లో భాద్భయాన్మోహాత్ కృత్వాత జ్ఞాతితాం వ్రజేత్, ఇతి బ్రాహ్మోక్తేః న బ్రాహ్మణేన కర్తవ్యం శూద్రస్యౌ ర్ధ్వ దైహికం, శూద్రేణ వా బ్రాహ్మణస్య వివాహారశవాత్ క్వచిత్, ఇతి పారస్కరోక్తేశ్చ. పారశవః=ఊఢశూద్రాపుత్రః.**

అను॥ శుద్ధి వివేకమందు, పృథ్వీచంద్రోదయమందును గల బ్రాహ్మోక్తి ఇట్లా - వాగ్దత్తములైన ,వాగ్దత్తములు కాని వారైనా ఆ కన్యల శ్రాద్ధమును తండ్రి చేయాలి. నాల్గవ రోజు ఆ కన్యలు, వారి (పితృ) కర్మను సావధానంగా చేయాలి,అని. మాతామహుల శ్రాద్ధాన్ని దౌహిత్రులు తరువాతి రోజున చేయాలి. వారు కూడా, వారి కర్మను ఎప్పుడు రెండవరోజున చేయాలి. అల్లుడి శ్రాద్ధాన్ని మామ చేయాలి. వారి కర్మను, వారు చేయాలి సావధానంగా. మిత్రుల, వారి సంతతియొక్క శ్రోత్రియుల యొక్క గురువు యొక్క చెల్లెలి సంతతి యొక్క అందరి కర్మను తర్వాతి రోజున చేయాలి. రాజుగారికి సపిండులు లేని పక్షంలో , సంతానంలేని పక్షంలో పురోహితుడు కర్మ ఆచరించాలి లేదా మంత్రి ఆచరించాలి, తొలుత ఆ అశౌచాన్ని గడిపాక (గడిచాక) కర్మ చేయాలి.ఇక్కడ రెండవ రోజు మొదట శ్రాద్ధవిధానమనగా అస్థి సంచయన విషయకము. కాలాదర్శమందిట్లా - ఔరస సుతుడు తలిదండ్రులకు దాహం మొదలుకొని కర్మను మంత్రములతో ఆచరించాలి. అతడు లేకపోతే పౌత్రుడు లేదా ప్రపౌత్రుడు లేదా పుత్రికా సుతుడు ఆచరించాలి. దౌహిత్రుడు, ధనంను గ్రహించేవాడు, భ్రాత, అతనిపుత్రుడు, తల్లిదండ్రులు, కోడలు, చెల్లెలు, ఆమెకొడుకు, సపిండుడు, సోదకుడు, తల్లిసపిండుడు, తల్లిసహోదకుడు, స్త్రీ, శిష్య, ఆచార్యులు, ఋత్విక్కు అల్లుడు, స్నేహితుడు వీరు కర్మ చేయాలి. ఏ బంధములేనట్టి వారికి కర్మను రాజుధనమిచ్చి

ఇతరులతో చేయించాలి, అని. గౌతముడిట్లా – కొడుకు లేకపోతే సపిండులు, తల్లి సపిండులు, శిష్యులు కర్మచేయాలి. వారు లేకపోతే ఋత్విక్, ఆచార్యులు ఆచరించాలి,అని. చంద్రికయందు వృద్ధ శాతాతపుడిట్లా – వర్ణ చిహ్నము కలవాళ్ళందరికి ప్రీతితో శ్రాద్ధం చేయాలి.అని అన్నమాట సవర్ణ విషయక మైనది. బ్రాహ్మణుడు అన్యవర్ణముల వారి కర్మ ఏదీ చేయరాదు. కామంవల్ల కాని, లోభం వల్ల కాని, భయం వల్ల కాని మోహం వల్ల కాని ఒకవేళ ఆచరిస్తే ఆ జాతిత్వాన్ని పొందుతాడు,అని. బ్రహ్మపురాణోక్తి. శూద్రుని ఊర్ధ్వ దేహక్రియలను బ్రాహ్మణుడు చేయరాదు. బ్రాహ్మణుని కర్మను దేనిని శూద్రుడు చేయరాదు, పారశవమునకు తప్ప, అని పారస్కరోక్తి. పారశవ అనగా బ్రాహ్మణునకు శూద్రస్త్రీ యందు కల్గినవాడు (వివాహమాడగా).

**మూ॥ అత్రేదంతత్త్వం. సర్వత్ర పుత్రాదేః పూర్వస్యా భావే పత్న్యాదే రధికార ఉక్తః. తత్రా భావో అసన్నిధి ర్నాశశ్చ ఉచ్యతే. అత ఏవ పూర్వత్ర అసన్నిధానే పూర్వేషాం, ఇత్యుక్తం. తత్రా సన్నిధౌ పత్న్యాదేః సర్వత్రాధికారే ప్రాప్తే – ప్రోషితా వసితే పుత్రః కాలాదతి చిరాదపి. ఏకాదశాద్యాః క్రమశోజ్యేష్ఠస్య విధివత్క్రియాః జ్యేష్ఠే నైవతు యత్కృతం ఇత్యాద్యైః దేశాంతరే అపవాదాత్ పుత్రనాశ ఏవ పత్న్యాదేః సపిండ నాదావధికారః. అసన్నిధౌ తు తత్పూర్వమేవనోర్ధ్వం. అతో అనధికారిణా భ్రాత్రా దినా కృతమపి అకృతమేవేతి పునరావర్తనీయం. మాసికాపకర్షోఽ ప్యావర్తనీయః. ఏకాదశాహమాసికాని నావర్తతే. తత్త్యాయసాపి కర్తవ్యం సపిండీకరణంపునః. ఇతి పదావృత్తి విధానా భావాత్ ఇతికేచిత్ తన్న – అస్య నిర్మూలత్వాత్. అతస్తదపి కనిష్ఠ కృతమావర్తతే. వృద్ధిశ్రౌత పిండ పితృ యజ్ఞాద్యం తుకృతం నావర్తతే. నాసపింద్యాగ్నిమాన్ పుత్రః పితృయజ్ఞం సమాచరేత్, నపార్వణం నాభ్యుదయం కుర్వన్న లభతే ఫలం. ఇతి వృద్ధ్యుత్తర నిషేధవాత్, ఇతి భ్రాతావా భ్రాతృపుత్రోవా ఇత్యాది హారీతాది వచోభ్యః కనిష్ఠాదేర ప్యధికారాత్.యథాత్ర జ్యేష్ఠ కర్తృత్వబాధః తథా పుత్రకర్తృ త్వస్యాఽపి బాధః. సపిండనేతు బహువక్తవ్యం తన్నిర్ణయే వక్ష్యామః. అధికార విశేషేణక్రియావ్య- వస్థోక్తా విష్ణుపురాణే – పూర్వాః క్రియామధ్యమాశ్చ తథాచైవోత్తరాః క్రియాః త్రిప్రకారాఃక్రియాః స్వాతాస్త్రాసాంభేదాన్ శృణుష్వమే. అదాహాదాదశాహాచ్చమధ్యేయాః స్యుః క్రియా నృప, తాః పూర్వా మధ్యమామాసి మాస్యేకోద్దిష్టసంజ్ఞితాః. ప్రేతేపితృత్వమాపన్నేసపిండీకరణా దను, క్రియంతేయాః క్రియాః పుత్రైః ప్రోచ్యంతేతాన్యుత్తరాః పితృమాతృసపిండైశ్చ సమానసలిలైస్తథా, తత్సంఘాతగతై శ్చైవరాజ్ఞాధనహారిణా పూర్వామధ్యాశ్చకర్తవ్యాః పుత్రాద్యైరేవచోత్తరా. దౌహిత్రైర్వా, వర శ్రేష్ఠకార్యాస్తత్తనయైస్తథా, మృతాహనితుకర్తవ్యాః స్త్రీణామప్యుత్తరాః క్రియాః దౌహిత్రతత్పుత్రయోర్ధ నహారిణోరిదం. ఏవమున్యస్యధనహర్తుః, యశ్చార్థహరః సపిండదాయీ, ఇత్యాపస్తంబోక్తేః.**

అను ॥ ఇక్కడ అసలు విషయమిది. అంతట పుత్రాదులు ముందుముందువారు లేనిపక్షంలో పత్న్యాదులకు అధికారము చెప్పబడింది. అక్కడ అభావమనగా దగ్గరలో లేకపోవటం, నాశమవటము చెప్పారు. అందువల్లనే పూర్వత్రఅన్నచోట (ఇదివరలో) పూర్వులైన వారుదగ్గరలో లేనప్పుడు, అని చెప్పారు. అక్కడవారు సన్నిధిలో లేనప్పుడు పత్న్యాదులకు సర్వాధికారము లభిస్తే, పుత్రుడు పరదేశంలో మరణిస్తే, చాలాకాలం గడిస్తేనో.

ష్ఠునకు క్రమంగా ఏకాదశ మొదలగు క్రియలు విధిప్రకారం (చేయటానికి అర్హత). జ్యేష్ఠుని చేతనే ఏదిచేయబడిందో అనుమొదలగు మాటలచే దేశాంతరమందు (దానికి) అపవాదమైనందు వల్ల పుత్రనాశమైనప్పుడే పత్న్యాదులకు సపిండనాదులందు అధికారము. సన్నిధిలో లేనప్పుడైతే దానికన్న ముందుక్రియలే ఆపైవికావు. అందువల్ల అనధికారులైన భ్రాత్రాదుల వల్ల ఏ క్రియ చేయబడ్డాచేయబడనట్టే అని, తిరిగి చేయాలి. మాసిక శ్రాద్ధం కూడా అపకర్షచేసి తిరిగి చేయాలి. పదకొండవ రోజు మాసికాలు ఆవృత్తి కావు. దానిని పెద్దవాడైనా తిరిగి సపిండీకరణం చేయాలి. అనే దానివలె ఆవృత్తి విధానం లేదు కాబట్టి అని కొందరన్నారు. అదికాదు దీనికి ఆధారం లేదు కనుక. అందువల్ల అది కూడా చిన్నవాడు చేస్తే ఆవృత్తిని పొందుతుంది. వృద్ధి, శ్రౌతము, పిండపితృయజ్ఞము వీటికొరకు చేసినదైతే తిరిగిఆవృత్తిపొందదు. అసపిండ్యుడు, అగ్నిమంతుడైన పుత్రుడు పితృయజ్ఞము చేయరాదు. పార్వణమును, అభ్యుదయశ్రాద్ధమును చేయరాదు. ఒకవేళ చేసినా ఫలితాన్ని పొందదు (లభించదు) అని, వృద్ధ్యుత్తరకార్యములనిషేధించటం వల్ల అని, భ్రాతకాని భ్రాతృపుత్రుడు కాని అని మొదలుగా హారీతాదులవచనములతో కనిష్ఠాదులకుగూడ అధికారముంది. ఎట్లాగైతే ఇక్కడ జ్యేష్ఠకర్తృత్వబాధ ఉందో అట్లాగే పుత్రకర్తృత్వమునకు బాధ ఉంది. సపిండనమందైతే చాలా చెప్పాలి వాటిని దాని నిర్ణయమందు చెప్తాము. విష్ణుపురాణమందు అధికారులవిశేషాన్ననుసరించి క్రియావ్యవస్థ చెప్పబడింది ఇట్లా - పూర్వక్రియలు, మధ్యమక్రియలు, ఉత్తరక్రియలు అని క్రియలు మూడు రకాలు. ఆక్రియల భేదములను వినునేను చెప్తాను. ఓ రాజ! దహనం నుండి పదవరోజు వరకు మధ్యలో చేసే క్రియలు పూర్వమువి. నెలనెలకు ఏకోదిష్టసంజ్ఞకములైన క్రియలు మధ్యమమువి. సపిండీకరణం తరువాత ప్రేత పితృత్వంపొందటానికి చేయబడే క్రియలు, పుత్రులు చేసేవి ఉత్తరక్రియలు, ఓరాజ తండ్రి, తల్లి, సపిండులు, సమానోదకులు, ఆసమూహంలో చేరినవారు, రాజు, ధన హారి వీరంతా పూర్వ మధ్యక్రియలను చేయాలి. ఉత్తర క్రియలను పుత్రాదులే చేయాలి ఓనరశ్రేష్ఠ! దౌహిత్రులు కాని వారి పుత్రులు కాని చేయాలి. చనిపోయిన రోజైతే ఉత్తర క్రియలను స్త్రీలకు కూడా చేయాలి. దౌహిత్ర, తత్పుత్రులు ధనహారులైతే ఇది (కర్మ) చేయాలి. ఇట్లాగే ఇతరులకైనా ధనహర్తలకే. ఎవడు డబ్బుతీసుకుంటాడో వాడే పిండం పెట్టేవాడు,అని ఆపస్తంబోక్తి.

మూ॥ **ప్రేతస్య ప్రేత కార్యాణి అకృత్వా ధనహారకః,** వర్ణానాం యద్వధేప్రోక్తం తద్వ్రతం ప్రయతశ్చరేత్, ఇతి పృథ్వీచంద్రోదయే వ్యాఘ్ర పాదోక్తేః. మదనరత్నే స్కాందేఽపి - మలమేతన్మ నుష్యాణాం ద్రవిణం యత్ప్రకీర్తితం, ఇత్యుక్త్వా ఋషిభిస్తస్య నిర్దిష్టా నిష్కృతిః (పావనీ)పరా, ఆదేహ పతనాత్తస్య కుర్యాత్పిండోదకక్రియాం, ఇత్యుక్తం **క్రియానిబంధే కాత్యాయనః** - నచ మాతాన చపితాకుర్యాత్, పుత్రస్య పైతృకం, నాగ్రజశ్చ తథా భ్రాతా భ్రాతౄణాంతు కనీయసాం. పృథ్వీ చంద్రోదయే బౌధాయనః - పిత్రాశ్రాద్ధం నకర్తవ్యం పుత్రాణాం తుకథంచన భ్రాతా

నైవసకర్తవ్యం భ్రాతౄణాం చ కనీయసాం. యదిస్నేహేన కుర్యాత్తాం సంపిండీకరణం వినా, గయాయాంతు విశేషేణ జ్యాయాన పిసమాచరేత్. అన్యాభావేపి పిత్రాదిరపి కుర్యాత్ - ఉత్పన్న భాంధవం ప్రేతం పితాభ్రాతాఽథవాఽగ్రజః, జననీ చాపి సంస్కుర్యాత్ మహాదేనోఽన్యథా భవేత్, ఇతి సుమం తూక్తేః.

అను॥ ధనమును హరించినవాడు ప్రేతమునకు ప్రేత కార్యాలు చేయకపోతే, వర్ణముల వధయందు దేన్ని చెప్పారో ఆ వ్రతాన్ని ప్రయత్న పూర్వకంగా ఆచరించాలి, అని పృథ్వీ చంద్రోదయమందు వ్యాఘ్ర పాదుల ఉక్తి. మదనరత్నమందు స్కాందమందు కూడా - దబ్బు అని చెప్పబడేది ఇది మనుష్యుల మలము,అని. చెప్పి - ఋషులు దీనికి నిష్కృతిని పావనమైన దానిని, పరమైన దానిని ఇట్లా, వారి శరీరం పోయిన దగ్గర నుండి వారికి పిండోదక క్రియలను చేయాలి,అని చెప్పారు. క్రియా నిబంధమందు కాత్యాయనోక్తి ఇట్లా - తల్లికాని తండ్రికాని పుత్రునకు పైతృక క్రియలు చేయరాదు. అగ్రజుడు, తనకన్న చిన్నవారైన భ్రాతల పైతృకములు చేయరాదు,అని. వృథ్వీచంద్రోదయ మందు బౌధాయనుడిట్లా - ఎట్టి స్థితిలోనూ పుత్రుల శ్రాద్ధాన్ని తండ్రి చేయరాదు. భ్రాత అగ్రజుడు, తనకన్న చిన్నవారైన భ్రాతల శ్రాద్ధం చేయరాదు,అని. ఒకవేళ స్నేహపూర్వకంగా చేయదలిస్తే దాన్ని సపిండీకరణం లేకుండా చేయాలి. విశేషించి గయయందైతే పెద్దవాడైనా, చిన్నవాళ్ళ శ్రాద్ధమాచరించాలి. ఇతరులు లేకపోతే పిత్రాదులు కూడా ఆచరించాలి (ధనం తీసుకొనని భ్రాతృసుతులు లేకపోతే). బంధువులు లేని ప్రేతకు తండ్రి, భ్రాత, లేదా అగ్రజుడు, తల్లి వీరెవరైనా సంస్కారం చేయాలి. లేనిచో చాలా పాపం సంభవిస్తుంది, అని సుమంతూక్తి.

మూ॥ బ్రహ్మచారిణాంతు శుద్ధి వివేకే పృథ్వీ చంద్రోదయే చ బ్రాహ్మే - అసమాప్త వ్రతస్యాపి కర్తవ్యం బ్రహ్మచారిణః, శ్రాద్ధంతు మాతా పితృభిః నతు తేషాం కరోతి సః శ్రాద్ధం మాసికాబ్దికాది సర్వం కార్యమిత్యర్థః. నత్వితి నిషేధోఽన్యసత్వే. యత్తు ఛందోగపరిశిష్టే - నత్యజేత్ సూతకే కర్మ బ్రహ్మచారి స్వయం క్వచిత్ న దీక్షణాత్పరం యజ్ఞే నకృచ్ఛ్రాదిత పశ్చరన్. పితర్యపి మృతేనైషాం దోషో భవతి కర్హిచిత్, ఆశౌచం కర్మణోంతేస్యాత్ త్ర్యహం వా బ్రహ్మచారిణాం. యచ్చ యాజ్ఞవల్క్యః - న బ్రహ్మచారిణః కుర్యుః ఉదకం పతితాస్తథా, ఇతి. తదప్యన్య సత్వే, అన్యాభావేతు బ్రహ్మచారిణాఽపి కార్యం, పూర్వోక్త వృద్ధమను వచనాత్, ఆచార్య పిత్ర్యుపాధ్యాయాన్నిర్ హృత్యాపి వ్రతీవ్రతీ. సంకటాన్నంచ నాశ్నీయాత్ న చ తైః సహ సంవసేత్, ఇతి తేనైవోక్తేః బ్రహ్మచారిణః శవకర్మణో వ్రతాన్నివృత్తి రన్యత్ర మాతాపిత్రోః, ఇతి వసిష్ఠోక్తేః. అత్రా శౌచమేకాహం వక్ష్యామః. ప్రాగుపనయ నాన్మృతస్యతు పంచవర్షోత్తరం సపిండీకరణ వర్జ్యం షోడశ శ్రాద్ధాది సర్వం కార్యమిత్యుక్తం దేవజానీయే. అసంస్కృతానాం భూమౌ పిండం దద్యాత్ సంస్కృతానాంకుశేషు. ఇతి ప్రచేతో వచనాచ్చ ఏతచ్చాగ్రే వక్ష్యామః.

అను॥ బ్రహ్మచారులకైతే శుద్ధి వివేకమందు పృథ్వీ చంద్రోదయ మందు బ్రహ్మపురాణోక్తి ఇట్లా - వ్రతసమాప్తి కానివాడైనా అలాంటి బ్రహ్మచారి శ్రాద్ధమును మాతా పితరులు చేయాలి. వారి శ్రాద్ధమును అతడు చేయరాదు. శ్రాద్ధమనగా మాసిక, అబ్దికములు

మొదలగునవి అన్ని చేయాలి అని అర్థము. చేయరాదు అనే నిషేధము ఇతరులున్న పక్షంలో ఛందోగ పరిశిష్ట మందు - సూతకమందైనను ఎక్కడా బ్రహ్మచారి తన కర్మను వదలరాదు. యజ్ఞమందు దీక్షితుడయ్యాక కర్మవదల రాదు. కృచ్ఛ్రాది తపమాచరిస్తూను తనకర్మ వదల రాదు. తండ్రి చనిపోయినాకనైనా వీరికి దోషమెక్కడా లేదు. బ్రహ్మచారులకు కర్మాంతమందు మూడు రోజులు ఆశౌచం ఉంటుంది,అని ఉందో, యాజ్ఞవల్క్యుడు - బ్రహ్మచారులు, పతితులు ఉదకదానం (నివాపము) విడువరాదు అని అన్నాడో అది కూడా ఇతరులున్న పక్షంలో. ఇతరులు లేకపోతే బ్రహ్మచారి కూడా చేయాలి, ముందు చెప్పిన వృద్ధ మనువు మాట ననుసరించి. ఆచార్యులను, పితరులను, ఉపాధ్యాయులను దహనం చేసి కూడా వ్రతి, వ్రతియే (పతితుడు కాదు). సంకటాన్నమును (సూతకం) తినరాదు, వారితో కలిసి వసించరాదు, అని ఆతడే చెప్పాడు. మాతా పితరులకన్న ఇతరులైన వారి శవకర్మ చేసే బ్రహ్మచారి వ్రతము భగ్నమౌతుంది,అని వసిష్ఠోక్తి ఇక్కడ అశౌచం ఒక్కరోజు అని చెప్తున్నాము. ఉపనయనం కన్న ముందు చనిపోయిన వానికైతే ఐదు సంవత్సరములకన్న ఎక్కువ వయస్సు కల వానికి సపిండీకరణాన్ని వదలి షోడశ శ్రాద్ధములు మొదలుగా అన్ని చేయాలి అని దేవజానీయమందు చెప్పబడింది అ సంస్కృతులైన వారికి భూమి యందు, సంస్కృతులైన వారికి కుశలపైన పిండం ఇవ్వాలి. అని ప్రాచేతో వచనాన్ననుసరించి కూడా. దీనిని ముందు చెప్తాము.

మూ॥ **అవిభక్తానాం విశేషమాహ** పృథ్వీచంద్రోదయే మరీచిః - బహవః స్యుః **యదాపుత్రాః** పితురే కత్రవాసినః, సర్వేషాంతు మతం కృత్వా జ్యేష్ఠేనైవతు యత్కృతం ద్రవ్యేణ చావిభక్తేన సర్వైరేవ కృతం భవేత్. జ్యేష్ఠస్య కర్తృత్వేపి సర్వేఫలభాగిన ఇత్యర్థః. తేనయే బ్రహ్మచర్య పరాన్న వర్జనాదయః ఫల సంస్కారాః తేసర్వేషాం భవన్తీతి సిద్ధమ్. సంసృష్టి నామష్యేవం, తుల్యత్వాత్. **విభక్తానాం విశేష** మాహ ఉశనాః - నవశ్రాద్ధం సపిండత్వం శ్రాద్ధాన్య పిచషోడశ, ఏకేనైవతు కార్యాణి సంవిభక్త ధనేష్వపి. లఘుహారీతః - సపిండీకరణాంతానియాని శ్రాద్ధాని షోడశ, పృథజ్నైవ సుతాః కుర్యుః పృథగ్ ద్రవ్యాఅపి క్వచిత్. ఊర్ధ్వం సపిండీకరణాత్ సర్వేకుర్యుః పృథక్ పృథక్. మదనరత్నే - విభక్తాస్తు పృథక్కుర్యుః ప్రతి సంవత్సరాదికం, ఏకేనైవా విభక్తేషు కృతే సర్వేస్తు తత్కృతం. ఏతేన ఆబ్దికాదిషు అవిభక్తానామనియమ ఇతివదన్ శూలపాణిః పరాస్తః.

అను॥ అవి భక్తుల విషయంలో (విడిపోని) విశేషాన్ని మరీచి పృథ్వీ చంద్రోదయంలో ఇట్లా చెప్పాడు - తండ్రికి కొడుకులు ఒకేచోట ఉండేవారు అనేకమంది ఉంటే, అందరి అభిప్రాయంతో, పెద్దవాడే చేసినట్లైతే, వారు ద్రవ్యం పంచుకోలేదు కాబట్టి అందరూ ఆ కర్మను చేసినట్లౌతుంది,అని. పెద్దవాడు చేసినా అందరు ఫలాన్ని పొందుతారు అని అర్థము. (అంగీకరించినందువల్ల). దీనితో బ్రహ్మచర్య పరాన్నవర్జన మొదలగు ఫల సంస్కారములు అందరికి వర్తిస్తాయి అని సిద్ధమైంది. కలిసి ఉండే వారికి కూడా ఇట్లాగే తుల్యమైనందువల్ల, విభక్తుల విషయంలో విశేషాన్ని ఉశనుడిట్లా చెప్పాడు - నవశ్రాద్ధము,

సాపిండ్యము. పదహారు శ్రాద్ధములు కూడా ఒక్కడే ఆచరించాలి, ధనాన్ని పంచుకున్నవాళ్ళైనా,అని. లఘు హారీతుడిట్లా - సపిండీకరణాంతములైన, పదహారు శ్రాద్ధములేవైతే ఉన్నాయో వానిని సుతులు విడివిడిగా చేయరాదు ఒకవేళ ధనం పంచుకున్న వారైనా. సపిండీకరణం తర్వాత అందరూ విడివిడిగా చేయాలి,అని. మదనరత్నమందిట్లా - విభక్తులైనవాళ్ళు ప్రతి సంవత్సరాదికమును విడివిడిగా చేయాలి. అవిభక్తులందైతే ఒక్కరు చేస్తే అది అందరు చేసినట్లే అని. దీనితో ఆబ్దికాదులందు అవి భక్తులకు నియమం లేదు అని అనిన శూలపాణి మాట పరాస్తమైంది.

**మూ॥ దత్తకస్తు జనకస్య పుత్రాద్యభావే దద్యాన్న తత్సత్వే. గోత్రరిక్థే జనఇతుః న భజేద్ద త్రిమః సుతః, గోత్ర రిక్థానుగః పిండోవ్యపైతి దదతః స్వధా, ఇతి మనూక్తేః. ఇదం జనకస్య పుత్ర సత్వ విషయం తచ్చ ప్రవర మంజర్యాం కాత్యాయన లౌగాక్షిభ్యాం స్పష్టముక్తం. అథయేదత్త క్రీత కృత్రిమ పుత్రికా పుత్రాః పర పరిగ్రహేణా నార్షేయాజాతాస్తే ద్వాముష్యాయణా భవంతి. యథా - శౌంగ శైశిరీణాం యానిచాన్యాన్యేవం సముత్పత్రీని కులాని భవంతి, ఇత్యాదినా ద్వయోః పిత్రోః ప్రవరానుక్త్వేక్తం. అథయద్యేషాం స్వాసు భార్యాస్వ పత్యంనస్యాత్ రిక్థం హరేయుః పిండం చైభ్యః త్రిపురుషం దద్యుః యద్యుభయోర్నస్యాత్ ఉభాభ్యామేవ దద్యుః ఏకస్మింఛ్ఛ్రాద్ధే పృథగుద్దిశ్యైక పిండే ద్వావనుకీర్తయేత్ పరిగృహీతారం చోత్పాదయితారం చా తృతీయాత్ పురుషాత్, ఇతి. హేమాద్రౌ కార్ష్ణాజినిః - యావంతః పితృవర్గాః స్యుః తావద్భిః దత్తకాదయః, ప్రేతానాం యోజనం కుర్యుః స్వకీయైః పితృభిః సహ ద్వాభ్యాం సహోధతత్పుత్రాః పౌత్రాస్త్వేకేన తత్సమం చతుర్థపురుషే ఛందః తస్మాదేషా త్రిపూరుషీ. సాధారణేషు కాలేషు విశేషోనాస్తి వర్గిణాం (మృతాహేత్వేక ముద్దిశ్య కుర్యుః శ్రాద్ధం యథావిధి) ఇతి. అస్యార్థమాహ హేమాద్రిః-దత్తకాదయః జనకపాలకయోః కులే ప్రేతానాం స్వస్వ వర్గీయైః సపిండనం కుర్యుః దత్తకానాం పుత్రాస్తు పితుర్దత్తకస్య పితృభ్యాం జనక పాలకాభ్యాం స్వపితామహాభ్యాం సపిండనం కుర్యుః. తేషాం పౌత్రాః స్వపితరం దత్తకేన పితామహేన తజ్జనకేన చ సపిండయేయుఃచతుర్థోఽపి తత్కులస్థఏవ. తేషాం ప్రపౌత్రస్తు దత్తకస్య ప్రపితామహస్య పాలకకులస్థం చతుర్థం యోజయేన్నవా. ఛంద=ఇచ్ఛా. దర్శమహాలయాదౌతు ద్వయోః పిత్రోః పితామహయోః ప్రపితామహయోర్వా శ్రాద్ధం దేయం. తత్రద్వయోః పిత్రాద్యోః పృథక్ పిండదానం ద్వయోరుద్దేశేన ఏకోవేతి.**

అను॥ దత్తపుత్రుడైతే జనకునకు పుత్రాదులు లేకపోతే ఇవ్వాలి,వారుంటే ఇవ్వరాదు. దత్తపుత్రుడు తనకు జన్మనిచ్చిన తండ్రి గోత్రధనములను పొందడు. ఆతనిచ్చే పిండము, స్వధ అతనిని స్వీకరించిన గోత్ర ధనముల వారికే చెందుతాయి, అని మనూక్తి. ఇది జనకునకు పుత్రులు ఉన్న సందర్భంలోనైతే. దానిని ప్రవర మంజరి యందు కాత్యాయన లౌగాక్షులు స్పష్టంగా చెప్పారు. ఇక దత్తకుడు, క్రీతుడు, కృత్రిముడు. పుత్రికాపుత్రుడు వీరంతా ఇతరులచే గ్రహించబడటంవల్ల (తండ్రి ఋషి ప్రవరలు లేక) అనార్షేయులైనారు. వారు ద్వ్యాముష్యాయణులైనారు. ఎట్లాంటే - శౌంగశైశిరులకు, ఇంకా ఇతరమైనవి ఏవి ఇట్లా ఉన్నాయో (అవి) ఉద్భవించిన కులాలు ఔతాయి, అనేమొదలగు దానితో ఇద్దరు

తండ్రుల ప్రవరను చెప్పి, చెప్తారు ఇట్లా - ఇక ఒకవేళ వీరికి తమ భార్యల యందు సంతానం లేని పక్షంలో ధనాన్ని స్వీకరిస్తారు వీరికి మూడు పురుషాంతరముల వరకు పిండదానం చేస్తారు. ఒకవేళ ఇద్దరికి లేకపోతే ఒకే శ్రాద్ధమందు ఇద్దరికి ఇస్తారు. ఒకే శ్రాద్ధమందు ఇద్దరి నుద్దేశించి ఒకే పిండమందు ఇద్దరిని స్వీకరించిన వానిని, పుట్టించిన వానిని స్మరించాలి మూడు పురుషాంతరముల వరకు,అని హేమాద్రియందు కార్ష్ణాజిని ఇట్లా - పితృవర్గీయులు ఎంతమంది ఉన్నారో అంతమందితో ప్రేతల యోజనను, దత్తకాదులు, చేయాలి, తమ తండ్రులతో సహా. వారి పుత్రులు ఇద్దరితో, పౌత్రులు ఒకరితో సమం చేయాలి. నాలుగవ పురుషాంతరమందు తన ఇష్టము అందువల్ల ఇది త్రిపూరుషి (మూడు తరాల వరకే) సాధారణకాలము లందు వర్గీయులకు విశేషం లేదు [చనిపోయిన రోజున మాత్రం శాస్త్ర ప్రకారము ఒకనిని ఉద్దేశించే శ్రాద్ధం చేయాలి (కర్మ)] అని. దీని అర్థాన్ని హేమాద్రి ఇట్లా చెప్పాడు – దత్తకాదులు జనక, పాలకుల కులములందు ప్రేతలకు తమతమ వర్గీయులతో సపిండనంచేయాలి. దత్తకులపుత్రులైతే, తండ్రికి దత్తకతండ్రికి స్వంతతండ్రి, పాలకతండ్రి వీరితో తమ పితామహులతో సపిండనమాచరిస్తారు. వారి పౌత్రులైతే తమతండ్రిని దత్తకుడైన పితామహునితో ఆతనిస్వంతతండ్రితో సపిండన మాచరిస్తారు. నాల్గవవాడు కూడా (జనక) వారికులస్థుడే. వారి ప్రపౌత్రులైతే దత్తకుడు తమప్రపితామహుడైన వానిని, పాలకకులస్థుడైన నాల్గవ వానితో కలపాలాలేదా. అది ఆతని ఇష్టము. దర్శమహాలయాదులందైతే ఇద్దరు తండ్రులకు ఇద్దరు పితామహులకు, ఇద్దరు ప్రపితామహులకో శ్రాద్ధమాచరించాలి. అక్కడ ఇద్దరిద్దరు పితరులు మొదలగువారికో విడివిడిగా పిండదానము, లేదా ఇద్దరినుద్దేశించి ఒకటో ఇవ్వాలి.

**మూ॥ అత్రకేచిత్ ఆవయోరయమితి పరిభాష్యయోదత్తస్తస్యైదంద్వయోః పిత్రోః శ్రాద్ధం, యస్త్వపరిభాష్యదత్తం సగ్రహీతురేవ సపాలకాయైవ దద్యాదిత్యాహుః. అత్రమూలం సఏవ ప్రష్టవ్యాః వస్తుతస్తు జనకస్య పుత్రపత్న్యాద్యభావేదత్తకోద్వయోః దద్యాత్ అన్యథాపాల కాయైవ ప్రాగుక్తకాత్యాయ న వచనాత్. మానవీయమప్యేతద్విషయమేవ. గోత్రంతు శ్రాద్ధే పాలకస్త్యైవ వివాహాదౌతూ భయోరి త్యాదిమత్కృత ప్రవరదర్పణే జ్ఞేయం. యస్తు మూల్యక్రీతాయాం పరభార్యాయాం దాస్యాంచోత్పన్నః సబీజినఏవదద్యాత్. మూల్యంవినా స్వయముపనతాయాం తుక్షేత్రిణఏవ. తదుక్తం వృద్ధీ చంద్రోదయేకౌర్మే – అనియోగాత్సుతో యస్తుశుక్లతోజాయతేత్విహ, ప్రదద్యాత్ బీజినే పిండం క్షేత్రిణేతు తతోఽన్యథా, ఇతి క్షేత్రజాదేః విశేషస్తు కలౌతద భావాన్నో చ్యతఇతిదిక్.**

అను॥ ఇక్కడ కొందరు మీ ఇద్దరికి ఇది అని పలికి దేన్ని ఇచ్చామో దానికి చెందిన ఇది ఇద్దరు పితరుల శ్రాద్ధము. అట్లా చెప్పకుండా ఇచ్చిన శ్రాద్ధము అది గ్రహీతదే అది పాలకుని కొరకే ఇవ్వాలి అని అన్నారు. దీనికి ఆధారవచనాన్ని వారినే అడగాలి. నిజానికైతే జనకునకు పుత్రపత్న్యాదులు లేని పక్షంలో దత్తకుడు ఇద్దరికి ఇవ్వాలి లేనిచో పాలకుని కొరకే ముందుచెప్పిన కాత్యాయనుని మాటననుసరించి. మనువుచెప్పినది కూడా ఈ విషయమే. శ్రాద్ధమందు గోత్రము పాలకునిదే. వివాహాదులందైతే ఇద్దరిది అని

మొదలగునవి, నేను వ్రాసిన ప్రవరదర్పణము నుండి తెలుసుకోండి. ఎవడైతే మూల్యక్రీత యందు, పరభార్య యందు, దాసియందు పుట్టాడో అతడు బీజమిచ్చినవానికే శ్రాద్ధ మివ్వాలి. ధనంలేకుండా స్వయంగా వచ్చిన స్త్రీయందలి పుత్రుడైతే క్షేత్రికి ఇవ్వాలి. అదే విషయం స్మృతిచంద్రోదయ మందు కౌర్మోక్తి ఇట్లా ఉంది -నియోగంలేకుండా శుల్కంవల్ల పుత్రుడు కలిగినట్లైతే అతడు బీజికి పిండమివ్వాలి. దీనికి ఇతరవిధంగా (నియోగం) కల్గినవాడైతే క్షేత్రికి ఇవ్వాలి, అని. క్షేత్రజాదుల విశేషమైతే కలిలో అది లేదు కాబట్టి చెప్పటం లేదు, అని ఇక చాలు.

**మూ॥ జారజానాంవిశేష మాహ అపరార్కేనారదః - జాయంతేత్వనియుక్తాయా మేకేన బహుభిస్తథా, అరిక్థభాజస్తే సర్వేబీజినామేవతేసుతాః దద్యుస్తే బీజినేపిండంమాతాచేచ్ఛుల్కతో హృతా అశుల్కోపహృతాయాంతు పిండదావోఢురేవతే. ధర్మార్థంశ్రాద్ధకరణేఫల మాహచంద్రికా యాం శాతాతపః- ప్రీత్యాశ్రాద్ధంతు కర్తవ్యం సర్వేషాం వర్ణలింగినాం, ఏవంకుర్వన్నరః సమ్యక్ మహతీం శ్రియమాప్నుయాత్. గయాయామపితత్రైవ బ్రహ్మవైవర్తే - ఆత్మజోవాఽథవాన్యోఽపి గయాశీర్షే యదాతదా, యన్నామ్నాపాతయేత్పిండం తన్నయేద్ బ్రహ్మ శాశ్వతం. ఏతచ్చ యదా ఫల భూమార్థి వాద్విస్త్రిర్వాక్రియతేతదా ప్రేతశిలాశ్రాద్ధవర్జ్యం కుర్యాత్, తస్యప్రేతత్వవిమోక్షార్థ త్వాత్తస్య చ జాతత్వా దితికేచిత్. వస్తుతస్తుసన్యాసిశ్రాద్ధవదత్రాపిసర్వంకార్యంసాంగేఽధికారాదితియుక్తం ప్రతీమః. సన్యస్తపిత్రాదిస్తుపితుః పిత్రాదిభ్యః సర్వశ్రాద్ధేషు దద్యాదిత్యుక్తంప్రాక్, వక్ష్యతేచ జీవత్పితృకశ్రాద్ధే. అథస్త్రీశూద్రాణాం శ్రాద్ధం మంత్ర వర్జ్యం తూష్ణీం భవతి. స్త్రీణామ మంత్రకం శ్రాద్ధం, తథాశూద్రా సతస్యచ, ప్రాగ్విణాశ్చవ్రతాదేశాత్తే చకుర్యుస్తథైవతత్, ఇతిహేమాద్రి మరీచి వచనాత్. అయమేవ విధిః ప్రోక్తః శూద్రాణాంమంత్ర వర్జితః, అమంత్రస్యతుశూద్రస్య విప్రో మంత్రేణగృహ్యతే, ఇతి బ్రాహ్మోక్తేశ్చ. గృహ్యతే = సంబధ్యతే. అస్యశ్రాద్ధప్రకరణేపాఠేఽపి పరిభాషాత్వాన్నప్రకరణేన సంకోచోయుక్తః తేనశూద్రస్యస్నానదానా దావపివిప్రేణ మంత్రపాఠః కార్యః. అమంత్రస్య ఇతి విశేషణాత్ స్త్రియా అపీతిశూలపాణిః.**

అను॥ జారజులనుగూర్చి విశేషాన్ని అపరార్కమందునారదవచనమిట్లా - నియుక్తము కాని స్త్రీయందు ఒకనివల్లకాని, లేదా అనేకులవల్లకాని పుత్రులు కలిగితే వారు ధనంలోభాగస్వాములుకాలేరు. వారంతా బీజుల సుతులే. తల్లి శుల్కంతో స్వీకరింప బడితే వారు బీజునికే పిండాన్ని ఇవ్వాలి. తల్లిధనం ద్వారా స్వీకరించబడనిదైతే ఆ సుతులు వివాహం చేసుకున్న వానికి పిండాన్నివ్వాలి,అని. ధర్మము కొరకు శ్రాద్ధం చేస్తే ఫలాన్ని చంద్రిక యందు శాతాతపుడిట్లా చెప్పాడు- అన్ని వర్ణముల వారికి ఆశ్రమముల వారికి ప్రీతితో శ్రాద్ధమాచరించాలి. ఈ విధంగా చక్కగా చేసిన నరుడు గొప్ప శ్రీని పొందుతాడు,అని. అట్లాగే గయ యందు కూడా అని బ్రహ్మవైవర్తమందిట్లా–ఆత్మజుడు కాని లేదా ఇతరుడు కాని గయాశీర్షమందు ఎప్పుడైనా కాని ఏ పేరుతో పిండదానం చేస్తాడో,అది ఆతనికి శాశ్వత బ్రహ్మపదాన్ని కల్పిస్తుంది,అని. ఇది, అధికఫలాన్ని కోరేవాడు రెండు, మూడు సార్లు చేసినట్లైతే అప్పుడు ప్రేతశిలాశ్రాద్ధాన్ని వదలి మిగిలినదంతా చేయాలి. అది ప్రేతత్వ

విమోక్ష నార్థము కొరకు అది ఐపోయింది కాబట్టి, అని కొందరన్నారు నిజానికైతే సన్యాసి శ్రాద్ధమువలె ఇక్కడ కూడా అన్నీ చేయాలి. అంగములతో కూడిన దానియందు (సంపూర్ణముగా) అధికారం ఉన్నందువల్ల,అని యుక్తంగా భావిస్తాము. తండ్రి సంన్యసించినపుడు, తండ్రి యొక్క తండ్రి మొదలగు వారి కొరకు, అన్ని శ్రాద్ధములలో ఇవ్వాలి అని ముందు చెప్పాము. జీవత్పితృక శ్రాద్ధమందు ముందు చెప్తాము కూడా. ఇక్కడ స్త్రీ శూద్రులకు శ్రాద్ధాన్ని మంత్రాలు లేకుండా మౌనంగా ఇవ్వాలి. స్త్రీలకు మంత్రములు లేకుండా శ్రాద్ధము అట్లాగే శూద్రస్త్రీ పుత్రునకు కూడా. ఉపనయనం కన్న ముందు ద్విజులకు కూడా అట్లాగే అమంత్రకంగా శ్రాద్ధం చేయాలి,అని హేమాద్రి యందు మరీచి వచనము. ఇదే విధి, శూద్రులకు మంత్ర వర్జితంగా· అని చెప్పబడింది. శూద్రునకు అమంత్రకంగా ఐనా విప్రుడు మంత్రంతో గ్రహింపబడుతాడు. గ్రహణం అనగా సంబంధింపబడుతాడు. ఇది శ్రాద్ధ ప్రకరణమందు పాఠమైనా పరిభాష ఐనందువల్ల ప్రకరణం నుండి సంకోచం చేయటం తగదు. అందువల్ల శూద్రునకు స్నానదానాదులందు కూడా విప్రునితో మంత్రం పఠింపచేయాలి. అమంత్రునకు అనేది విశేషణ మైనందువల్ల స్త్రీకి గూడా అని శూలపాణి. (బ్రాహ్మణుడు స్త్రీకి గూడా మంత్రం పఠించాలి,అని).

**మూ॥ యత్తు తేనోక్తం మంత్ర జన్య నియమా దృష్ట సిద్ధిస్తు నమస్కారేణ అను మతోఽస్య నమస్కారో మంత్రః, ఇతి గౌతమోక్తే రితి. తన్న, దృష్ట ద్వారైవహి తత్రాప్తేన స్వాతంత్ర్యేణ. అన్యథా నఖవిపూతే ప్యవఘాత జన్యాదృష్టార్థం సోఽపి క్రియేతేతి యత్కించిదేతత్. తేన పితౄణాం నామగోత్రతః, ఇత్యాదౌ యత్ర ద్విజానామపి నామమంత్ర ఉక్తః తత్ర ప్రతిప్రసవమాత్రార్థం యుక్తం న తిలావపనాదావపి. అత్రకేచిత్ - వైదికమంత్రోవిప్రస్య, పౌరాణస్తు శూద్రైః పఠనీయః, నహివేదేష్వధి కారః క్వచిచ్ఛూద్రస్య విద్యతే, పురాణేష్వధికా రోమే దర్శితో బ్రాహ్మణైరిహ. ఇతి తత్రైవ పాద్మోక్తే రిత్యాహుః. గౌదాఅప్యేవం. తన్న నాధ్యేతవ్య మిదం శాస్త్రం వృషలస్యతు సన్నిధౌ,ఇతి కౌర్మపురాణ నిషేధేన వేదస్య దురాపాస్తత్వాత్. అధ్యేతవ్యం బ్రాహ్మణేన వైశ్యేన క్షత్రియేణచ, శ్రోతవ్యమేవ శూద్రేణ నాధ్యేతవ్యం కదాచన. శ్రౌతం స్మార్తం చవైధర్మం ప్రోక్తమస్మి న్నృపోత్తమ. తస్మాచ్ఛూద్రైర్వినా, విప్రన శ్రోతవ్యం కదాచన, ఇతి తత్రైవ పురాణాధికారే భవిష్యోక్తేశ్చ ఏతేన, నాధ్యేతవ్యం, ఇతి నిషేధో మంత్రే తర పురాణ పర ఇతి శ్రీదత్తాది మతమపాస్తం. తేన పౌరాణ మంత్రాణామేవ విప్రేణ పాఠోన వైదికానామితి. ద్విజస్త్రియస్తు సంకల్ప మాత్రం స్వయం కృత్వా వైదిక మంత్రయుక్తం సర్వం బ్రాహ్మణ ద్వారా కారయేయురితి ప్రయోగపారిజాతః. అత ఏవ స్త్రీణాం ఇత్యకృత వివాహ స్త్రీ పరిమితి హేమాద్రి రాహ. అనుపనీతస్తు వైదికమంత్రయుక్తం సర్వం స్వయమేవ కుర్యాత్, ఇత్యుక్తం ప్రాక్. యత్తు, ప్రాగ్ద్విజాశ్చ వ్రతాదేశాత్,ఇతి తదశక్త విషయమ చూద విషయం వేతిదిక్.**

అను॥ మంత్రజన్య నియమ అదృష్ట సిద్ధి మాత్రం నమస్కారంతోనే, ఈతనికి (శూద్రునకు) నమస్కారము మంత్రము అని అనుమతించాము అని గౌతమోక్తి ఉంది అని ఏదన్నారో అది తప్పు. దృష్టము ద్వారానే అది లభిస్తుంది. స్వతంత్రంగా కాదు. లేనిచో

గోళ్ళతో పొట్టుతీసినా అవఘాతం వల్ల కలిగిన అదృష్టం కొరకు అది కూడా చేయాల్సి వస్తుంది అని ఇదేదో ఒకటి. అందువల్ల, పితరులకు నామ గోత్రములతో,అను మొదలగు వాని యందు ఎక్కడ బ్రాహ్మణులకు కూడా నామమంత్రము చెప్పబడిందో అక్కడ ప్రతిప్రసవ మాత్రం కొరకు తగును (మినహాయింపునకు మినహాయింపు తిరిగి విధానం). తిలావపనా దులందు కూడా కాదు. ఇక్కడ కొందరు- బ్రాహ్మణునకు వైదికమంత్రము, శూద్రుడు పురాణ వాక్యములు చదువాలి. శూద్రునకు ఎక్కడా వేదములందు అధికారము లేదు. బ్రాహ్మణుల ద్వారా ఇక్కడ పురాణములందు అధికారాన్ని నేను చూపాను, అని అక్కడే పర్వ పురాణోక్తి అని కొందరన్నారు. గౌడులు కూడా ఇదేమాట అన్నారు. కాని అట్లా కాదు. వృషలుని ఎదుట ఈ శాస్త్రాన్ని చదువరాదు,అని, కౌర్మపురాణం నిషేధిస్తున్నందు వల్ల వేదం దూరం నుండే తొలగిపోయింది. బ్రాహ్మణవైశ్య క్షత్రియులు వేదాధ్యయనం చేయాలి. శూద్రుడు మాత్రం వినాలి. ఎప్పుడూ చదువరాదు. ఓ రాజా దీనిలో శ్రౌత స్మార్త ధర్మాలను చెప్పాను. అందువల్ల ఎప్పుడూ బ్రాహ్మణుడు లేకుండా శూద్రులు వినరాదు. (బ్రాహ్మణుని ద్వారానే వినాలి) అని అక్కడే పురాణాధికారమందు భవిష్యోక్తి కూడా. దీనివలన చదువరాదు,అనే నిషేధము మంత్రములకన్న ఇతరమైన పురాణపరము అనే శ్రీదత్తాదుల మతము తొలగిపోయింది. అందువల్ల పురాణమంత్రములనే బ్రాహ్మణుడు చదవాలి, వైదిక మంత్రములను కాదు అని. బ్రాహ్మణ స్త్రీలైతే తాము సంకల్పం మాత్రం చేసి వైదిక మంత్రములతో కూడిన దాన్నంతా బ్రాహ్మణునితో చేయించాలి,అని ప్రయోగపారిజాతము. అందువల్లనే స్త్రీలకు అనే శబ్దము వివాహం కాని స్త్రీ పరమని హేమాద్రి చెప్పాడు. ఉపనయనం కాని వాడైతే వైదిక మంత్రములతో కూడా అంతా తానే చేయాలి అని ముందే చెప్పాము. ఉపనయనం కాకముందు బ్రాహ్మణులు కూడా అని చెప్పామో అది అశక్తుని విషయమో చూడాకరణం కాని వాని విషయమో,అని ఇక చాలు.

మూ॥శూద్రస్యతుసదా ఆమశ్రాద్ధమేవ,సదా చైవతు శూద్రాణా మామ శ్రాద్ధం విధీయతే. ఇతి సుమంతూక్తేః. పృథ్వీచంద్రోదయే మాత్స్యేఽపి- ఏవం శూద్రోఽపి సామాన్యం వృద్ధి శ్రాద్ధం చ సర్వదా, నమస్కారేణ మంత్రేణ కుర్యాదా మాన్నవత్సదా. తత్రైవ వృద్ధపరాశరః - ఆమాన్నేనతు శూద్రస్య తూష్ణీంతు ద్విజపూజనం, కృత్వా శ్రాద్ధంతు నిర్వాప్యసజాతీనాశయేదథ.స ఏవ- ఆమం శూద్రస్య పక్వాన్నం పక్వముచ్ఛిష్టముచ్యతే. హేమాద్రౌ భవిష్యే - ధర్మేప్సవస్తుధర్మజ్ఞాయది శూద్రాః ప్రకుర్వతే. అగ్నౌకరణ మంత్రశ్చ నమస్కారో విధీయతే. ఆవాహనాది కర్తవ్యం తథాశూద్రేణ తచ్ఛృణు దేవానాం దేవనామ్నాతు పితౄణాం నామగోత్రతః , పిండాదీన్నిర్వపే ద్వీర నామతో గోత్ర తస్తథా. శూద్రాణాంగోత్రాభావేఽపి కాశ్యపం గోత్రం జ్ఞేయం తస్మాదాహుః సర్వాః ప్రజాః కాశ్యప్యః ఇతిశ్రుతేః. గోత్రనాశేతు కాశ్యపః, ఇతి వ్యాఘ్ర పాదోక్తేశ్చేతి హేమాద్రిః. ఏవమన్యత్ర గోత్రాజ్ఞానే. ఏవం తర్పణాదిషు చ జ్ఞేయం. తత్రైవభవిష్యే - శూద్రస్తు గృహపాకేన సపిండాన్నిర్వ పేత్తథా, సక్తు మూలం ఫలం తస్య పాయసంవా భవేత్

స్మృతం.గౌతమః - అనుమతోఽస్యనమస్కారో మంత్రః,ఇతి. దేవతాభ్యః పితృభ్యశ్చ,ఇత్యయం నమస్కారమంత్ర ఇతికేచిత్. విజ్ఞానేశ్వరోఽప్యేవమాహ. హేమాద్రిస్తు శూద్రోఽప్యమంత్రవత్ కుర్యాత్ అనేన విధినా బుధః,ఇతి,మాత్స్యే మంత్ర నిషేధాన్నామ మంత్రేణే త్యాహ.

అను॥ శూద్రునకు ఎప్పుడూ ఆమశ్రాద్ధమే. ఎల్లప్పుడూ శూద్రులకు ఆమశ్రాద్ధము విధించబడుతోంది, అని సుమంతూక్తి పృధ్వీచంద్రోదయమందు మత్స్యపురాణమందుకూడా ఇట్లా - ఈ విధముగా శూద్రుడుకూడా సామాన్యవృద్ధిశ్రాద్ధములను ఎల్లప్పుడూ ఆమాన్నమువలె నమస్కారమంత్రముతో ఆచరించాలి, అని. అక్కడే వృద్ధపరాశరుడిట్లా - శూద్రుడుఆమాన్నంతో (బియ్యంతో) శ్రాద్ధమాచరించి, నిర్వాపంచేసి (దానం) మౌనంగా ద్విజుని పూజించి, తన వారిని భుజింపచేయాలి, అని ఆతడే - శూద్రునకు బియ్యమే వండిన అన్నము. పక్వాన్నము ఉచ్ఛిష్టమనబడుతుంది (వండిన అన్నము) అని. హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా - ధర్మంకావాలనుకునే, ధర్మమెరిగిన శూద్రులు శ్రాద్ధ మాచరిస్తే, అగ్నికరణమంత్రమైతే,సమస్కారము అని విధించారు(అగ్నయేకవ్య వాహనాయనమః) శూద్రుడు ఆవాహనాదులు ఎట్లా చేయాలోచెప్తాను దాన్ని విను. దేవతలకు దేవతలపేర్లతో పితరులకు నామగోత్రములతో పిండాదులను వదలాలి, ఓ వీరుడ! పేరుతోను, గోత్రంతోను కూడా. శూద్రులకు గోత్రం లేకపోయినా కూడ కాశ్యపగోత్రమని తెలుసుకోవాలి అందువల్లనే, ప్రజలందరు కాశ్యప్యులు అని, అన్నారు అని. శ్రుతి గోత్రం నాశమైతే కాశ్యపుడు, అని వ్యాఘ్రపాదోక్తి వల్ల కూడా అని హేమాద్రి. ఈ రకంగానే గోత్రం తెలియనిచోట, ఇతరత్రకూడా. ఈ విధంగా తర్పణాదులందుకూడా తెలుసుకోవాలి. అక్కడే భవిష్యమందిట్లా శూద్రుడు గృహపాకంతో పిండములను వదులరాదు, అట్లాగే సత్తుపిండి, మూలములు (గడ్డలు) పండ్లు, పాయసంవీనిలో ఏదైనా వీనితో పిండములు వదలాలి అని చెప్పారు, అని. గౌతముడిట్లా - శూద్రునకు నమస్కారము మంత్రముగా అనుమతించాము, అని. దేవతలకొరకు, పితరులకొరకుకూడా, అనేఇది నమస్కార మంత్రమని కొందరన్నారు. విజ్ఞానేశ్వరుడు కూడా ఇట్లాగే అన్నాడు. (దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ, నమః స్వధాయైస్వాహాయైనిత్యమేవనమోనమః అని) హేమాద్రిఐతే-బుద్ధిగల శూద్రుడుకూడా మంత్రంలేని దానివలె ఈవిధి ప్రకారం చేయాలి, అని మాత్స్యమందు మంత్రాన్ని నిషేధించినందువలన నామమంత్రంతో అని చెప్పాడు.

మూ॥ **పృథ్వీచంద్రోదయే** స్కాందే - రాజకార్యే నియుక్తస్యబంధనిగ్రహవర్తినః, వ్యసనేషుచ సర్వేషు శ్రాద్ధం విప్రేణ కారయేత్. **యత్తుభారతేరాజధర్మేషు** - యవనాః కిరాతాగాంధారాశ్చీనాః శబరబర్బరాః శకాస్తుషారాః కంకాశ్చపల్లవాశ్చాంధ్రమద్రకాః, ఇత్యుక్త్వా బ్రహ్మక్షత్ర ప్రసూతాశ్చ వైశ్యాఃశూద్రాశ్చమానవాః, కథంధర్మాశ్చరిష్యంతి సర్వేవిషయవాసినః, ఇతిచోక్త్వా-వేదధర్మక్రియాశ్చైవ తేషాం ధర్మోవిధీయతే, పితృయజ్ఞాస్తథాకూపాః ప్రపాశ్చశయనానిచ, దానానిచయథాకాలంద్విజేభ్యో విసృజేత్సదా. తథా - దక్షిణాసవయజ్ఞానాందాతవ్యాభూతిమిచ్ఛతా, పాకయజ్ఞామహార్హాశ్చకర్తవ్యాః సర్వదస్యుభిః ఇతిమ్లేచ్ఛాదీనాంశ్రాద్ధవిధానం తదపి సజాతీయ భోజన

ద్రవ్య దానాదిపరం నతుశ్రాద్ధ పరమితి. అథశ్రాద్ధపితరః హేమాద్రౌమాత్స్య దేవలౌ - నామ గోత్రం పితౄణాంతు ప్రాపకం హవ్యకవ్యయోః, అగ్నిష్వాత్తాదయస్తేషాం ఆధిపత్యే వ్యవస్థితాః. నామ మంత్రాస్తదాదేశాభవాంతర గతానపి, ప్రాణినః ప్రీణయంత్యేవతదాహారత్వమాగతాన్. దేవోయదిపితాజాతః శుభకర్మానుయోగతః, తస్యాన్నమమృతంభూత్వాదేవత్వేప్యనుగచ్ఛతి. గాంధర్వేభోగరూపేణ పశుత్వేచతృణం భవేత్, శ్రాద్ధాన్నం వాయురూపేణ నాగత్వేఽప్యుపతిష్ఠతి. పానంభవతియక్షత్వేరాక్షసత్వే తథాఽఽమిషం, దనుజత్వే. తథామద్యంప్రేతత్వేరుధిరోదకం. మనుష్యత్వేఽన్న పానాదినానాభోగకరం భవేత్. అత్రపిత్రా దిశబ్దైః జనకాదీనామేవ దేవతాత్వముచ్యతే న వస్వాదీనాం, అసావేతత్తే ఇతియజమానస్య పిత్రే, ఇతి శతపథశ్రుతేః. యస్యపితాప్రేతఃస్యాత్ సపిత్రేపిండంనిధాయ ఇతి విష్ణ్వాదిస్మృతేశ్చ.

అను ॥ పృథ్వీచంద్రోదయమందు స్కాందోక్తి ఇట్లా - రాజకార్యమందు నియుక్తుడైనవానికి, బంధనము, ఖైది వీనియందున్నవానికి వ్యసనములందున్నవానికి వీరందరికి శ్రాద్ధము బ్రాహ్మణునితో చేయించాలి. భారతమందురాజధర్మములందు - యవనులు, కిరాతులు, గాంధర్వులు చీనులు, శబరులు, బర్బరులు, శకులు, తుషారులు, కంకులు, పహ్లవులు, ఆంధ్రులు, మద్రకులు, అని చెప్పి, బ్రహ్మ క్షత్రియులవల్ల కలిగినవారు వైశ్యులు, శూద్రులు ఐన మానవులు ఈ విషయవాసులందరు ధర్మాన్ని ఎట్లా ఆచరిస్తారు. అని కూడా పలికి వేదధర్మక్రియలు వారికి ధర్మము అని విధించబడుతోంది. పితృయజ్ఞములు, బావులు తవ్వించడం, చలివేంద్రాలు పెట్టించడం, పడకలు ఏర్పరచటం (సత్రాలు) కాలానుసారంగా బ్రాహ్మణులకు ఎప్పుడూ దానాలు చేయటం ఆచరించాలి, అట్లాగే ఐశ్వర్యం కోరేవారు సవనయజ్ఞములందు దక్షిణలు ఇవ్వాలి. దస్యుగణమంతా గొప్పనైన, యోగ్యమైన పాకయజ్ఞములు ఆచరించాలి అనిమ్లేచ్ఛులు మొదలగు వారికి శ్రాద్ధవిధానము అని చెప్పబడిన దంతా కూడా సజాతులైనవారికి భోజన, ద్రవ్యదానములు మొదలైన వాని పరకము (అవి చేయాలి) శ్రాద్ధపరముకాదు అని. ఇక శ్రాద్ధపితరులు హేమాద్రియందుమాత్స్యదేవలుల వచనమిట్లా - పితరులకు హవ్యకవ్యములను చేర్చేవి నామగోత్రములే. అగ్నిష్వాత్తాదులు వాని అధిపత్యమందు వ్యవస్థితమై ఉన్నాయి, అని. నామమంత్రములు, వాని ఆదేశములు భవాంతర (జన్మాంతర) గతులైనవారిని కూడా, వారి (ఆ) యోగం ఆహారం కొరకు వచ్చిన ప్రాణులను సంతృప్తి పరుస్తాయి కూడా. తండ్రి శుభకర్మవల్ల దేవత్వాన్ని పొందితే అతన్ని అన్నము అమృతంగా మారిదేవత్వమందు కూడా అనుసరిస్తుంది. గాంధర్వమందు భోగరూపంగా, పశువుగా మారితేనో తృణమౌతుంది. నాగుడుగా మారితే శ్రాద్ధాన్నము వాయురూపంగా కూడా చేరుతుంది. యక్షుడైతే పానంగా, రాక్షసుడైతే మాంసంగా, దనుజుడైతే మద్యరూపంలో, ప్రేతమైతే రక్తపునీరుగా, మనుష్యుడైతే అన్నపానాది రకరకాల భోగముల కూర్చేదిగా ఔతుంది. ఇక్కడ పిత్రాది శబ్దములతో తండ్రులు మొదలగువారికే దేవతాత్వం చెప్పబడింది, వస్వాదులకు కాదు అసౌ, ఏతత్, తేఅనే మంత్రంతో యజమానుని తండ్రికొరకు, అని శతపథశ్రుతి వాక్యం. ఎవని తండ్రి ప్రేత ఐనాడో ఆతండ్రి కొరకు

పిండాన్ని ఉంచి, అని విష్ణ్వాదిస్మృతివల్లనూ తెలుస్తోంది.

మూ॥ యత్తుమనుదేవలౌ - వసవఃపి తరోజ్ఞేయాః రుద్రాజ్ఞేయాః పితామహాః ప్రపితా మహాస్తథా దిత్యాఃశ్రుతిరేషాసనాతనీ యచ్చయాజ్ఞవల్క్యః - వసురుద్రా దితిసుతాః పితరః శ్రాద్ధదేవతాః ఇతితదభేద ధ్యానార్థం. యానితుహేమాద్రౌనందిపురాణే - విష్ణుః పితాఽస్యజగతోదివ్యో యజ్ఞః సఏవచ, బ్రహ్మాపితామహోజ్ఞేయోహ్యహం చ ప్రపితామహః ఇతి, యచ్చభవిష్యే - అనిరుద్ధః స్వయంజ్ఞేయః ప్రద్యుమ్నశ్చపితాస్మృతః, సంకర్షణ స్తజ్జనకో వాసుదేవస్తతత్పితా, స్వయం = కర్తా. యత్తుతత్రైవ - ప్రథమోవరుణోజ్ఞేయః ప్రాజాపత్యః తథాపరః తృతీయోఽగ్నిః స్మృతఃపిండోహ్యేషపిండ విధిః స్మృతః, యచ్చమనుః - సోమపానామవిప్రాణాం క్షత్రియాణాం హవిర్భుజః, వైశ్యానామాజ్యపానామశూద్రాణాంతు సుకాలినః, యచ్చఆదిత్యపురాణే మాసాశ్చపిత రోజ్ఞేయాః ఋతవశ్చపితామహాః, సంవత్సరః ప్రజానాంచసుష్మాక్తః ప్రపితామహః, యచ్చనందిపురాణే అగ్నిష్వాత్తాబ్రాహ్మణానాం పితరః పరికీర్తితాః, రాజ్ఞాంబర్హిషదోనామవిశాంకావ్యాః ప్రకీర్తితాః, సుకాలినస్తు శూద్రాణాం వ్యామాహ్లే చ్ఛాన్త్యజాదిషు. అత్రావాహనాదిషుపిత్రాదయః సముచ్చయేన వికల్పేనవా యథాచారంతత్తద్దేవతారూపేణ వాచ్యా ఇతి హేమాద్ర్యాదయః. హేమాద్రౌబ్రాహ్మే - పార్వణం కురుతేయస్తు కేవలం పితృహేతుకం, మాతామహ్యంనకురుతే పితృహాసప్రజాయతే. ధౌమ్యః - పితరోయత్రపూజ్యంతేతత్రమాతామహాధ్రువం, అవిశేషేణకర్తవ్యం విశేషాన్న రకంవ్రజేత్. అస్యాపవాదమాహకాత్యాయనః - కర్షూసమన్వితంముక్త్వాతథాఽద్యం శ్రాద్ధషోడశం, ప్రత్యాబ్దికంచ శేషేషుపిండాః స్యుః షడితిస్థితిః. కర్షూసమన్వితం = సపిండీకరణం. దర్శాదౌ సపత్నీకానామేవ దేవతాత్వం, స్వేనభర్త్రాసమంశ్రాద్ధం మాతాభుంక్తేసుధానమం. పితామహీచస్వేనైవ తథైవప్రపితామహీ, ఇతితత్రైవోక్తేః చంద్రికాయాం చతుర్వింశతిమతే - క్షయాహేవర్జయిత్వైకం స్త్రీణాంనాస్తిపృథక్ క్రియా, కేచిదిచ్ఛంతి నారీణాం పృథక్శ్రాద్ధం మహర్షయః అన్వష్టకాసు వృద్ధౌచగయాయాంచక్షయేఽహని. అత్రమాతుః పృథక్శ్రాద్ధం అన్యత్రపతినాసహ, ఇతికాత్యాయనోక్తేశ్చ అన్యనిర్మూలతాం వదంతో గౌడాస్త్వజ్ఞాఏవ. అత్రభాగః, ఇత్యధ్యాహారః అన్యథాసపతి కాయైమాత్రే, ఇతిప్రయోగాపత్తేః అత్రమాతృ శబ్దోజనన్యామేవముఖ్యః, తేనసపత్న మాతృభ్యోనదద్యాత్ ఏవంపితామహ్యాదిశబ్దైః పితృజనన్యాదయఏవోచ్యంతేఇతితత్సపత్నీభ్యోనదేయం, ఇతిహేమాద్రిః. కారుణ్యేనతుమహాలయాదౌ దేయం, ఇతిసఏవ.

అను॥ మనుదేవలులు ఇట్లా - వసువులు పితరులు, రుద్రులు పితామహులు, ఆదిత్యులు ప్రపితామహులుగా తెలుసుకోవాలి ఇది సనాతనమైన శ్రుతి. అని అన్నారో, యాజ్ఞవల్క్యులిట్లా - వసురుద్రఅదితిసుతులు పితరులు శ్రాద్ధదేవతలు, అని అన్నాడో ఇది అభేదధ్యానము కొరకే. హేమాద్రియందునంది పురాణమందు ఇట్లా - ఈజగత్తుకు విష్ణువుతండ్రి దివ్యుడు అతడే యజ్ఞము. బ్రహ్మపితామహుడు, నేను (శివుడు) ప్రపితామహుణ్ణి, అని ఏ వాక్యాలున్నాయో, భవిష్యమందిట్లా - కర్త అనిరుద్ధుడు ప్రద్యుమ్నుడు పిత, సంకర్షణుడు పితామహుడు వాసుదేవుడు ప్రపితామహుడు, అని ఏదుందో, అక్కడే ఇట్లా - తొలుతవాడు వరుణుడు, తరువాతివాడు ప్రాజాపత్యుడు, మూడవవాడు అగ్ని ఇట్లా పిండము, ఇట్లా పిండవిధిఅని ఏదుందో మనువు ఇల్లా - విప్రులకు సోమపుడు, క్షత్రియులకు

హవిర్భుజుడు, వైశ్యులకు ఆజ్యపుడు శూద్రులకు సుకాలినులు, అని ఏది చెప్పాడో, ఆదిత్యపురాణమందిట్లా – పితరులు మాసములు, పితామహులు ఋతువులు, ప్రజలకు సంవత్సరము ప్రపితామహులు అని చక్కగా ఏది చెప్పబడిందో నందిపురాణమందిట్లా – బ్రాహ్మణులకు అగ్నిష్వాత్తాపితరులుగా చెప్పబడ్డారు, రాజులకు బర్హిషదులు, వైశ్యులకు కావ్యులు, శూద్రులకు సుకాలినులు, మ్లేచ్ఛ అంత్య జాదులందు వ్యాములు. అని ఏది చెప్పబడిందో ఇవన్నీ ఇక్కడ ఆవాహనాదులందు పిత్రాదులు సమూహంగాకానీ, విడిగాకాని ఆచారాన్ననుసరించి ఆయాదేవతలరూపంతో చెప్పతగిన వారు, అని హేమాద్ర్యాదులు. హేమాద్రియందుబ్రాహ్మోక్తిఇట్లా – తండ్రికొరకు మాత్రమే ఎవడు పార్వణమాచరిస్తాడో మాతా మహునికొరకు చేయడో అతడు పితృహంతకుడుగా జన్మిస్తాడు, అని. ధౌమ్యుడిట్లా – తండ్రులు పూజింపబడినచోట మతామహులు తప్పకుండా ఉంటారు. ఇద్దరికి సమానంగా పూజచేయాలి భేదంగా పూజచేస్తే (హెచ్చు, తగ్గుగా) నరకాన్ని పొందుతాడు, అని. దీనికి అపవాదాన్ని కాత్యాయనుడిట్లా చెప్పాడు – సపిండీకరణాన్ని వదలి అట్లాగే తొలిషోడశశ్రాద్ధములను వదిలి ప్రత్యాబ్దికమును వదలి మిగిలిన వాటిలో పిండములు ఆరుంటాయి, అని నియమము. దర్శాదులలో సపత్నీకులకే దేవతాత్వము. తన భర్త తో సమానంగా తల్లి (భార్య) శ్రాద్ధమును అమృతసమానంగా భుజిస్తుంది. పితామహికూడాతన భర్తతోనే, అట్లాగే ప్రపితామహికూడా, అని అక్కడే చెప్పారు. చంద్రికయందు చతుర్వింశతి మతమిట్లా – క్షయాహశ్రాద్ధమును ఒకదాన్ని వదిలితే వేరేచోట్ల స్త్రీలకు విడిగా క్రియలేదు. కొందరు మహర్షులు స్త్రీలకు విడిగా శ్రాద్ధాన్ని, అని. అన్వష్టకములందు వృద్ధియందు గయయందు క్షయాహమందు ఇక్కడ మాతకు విడిగా శ్రాద్ధము ఇతరమైనచోట్ల భర్తతో సహానేశ్రాద్ధము, అని కాత్యాయనోక్తి కూడా. దీనికి ఆధారంలేదనే గౌడులమాట అజ్ఞతాపూర్వకమైనదే. ఇక్కడ భాగః అనేది అధ్యాహారము లేనిచో పతితో కూడిన తల్లి గారికి అని చెప్పాల్సివచ్చేది ఇక్కడ మాత అనే మాట కన్న తల్లియందే ముఖ్యము. అందువల్ల సవతితల్లులకు ఇవ్వరాదు. అట్లాగే పితామహిమొదలగు శబ్దములతో తండ్రితల్లిమొదలగు వారు మాత్రమే చెప్పబడుతారు అని. ఆమె సవతులకు ఇవ్వరాదు, అని హేమాద్రి, కారుణ్యంతో ఐతే మాత్రం మహాల యాదులందు ఇవ్వాలి (సపత్నులకు) అని అతడే చెప్పాడు.

మూ॥ **అథవిశ్వేదేవాః**–హేమాద్రౌ శంఖబృహస్పతీ–ఇష్టిశ్రాద్ధేక్రతూదక్షౌ సత్యానాందీ ముఖే వసూ, నైమిత్తి కేకామకాలౌ కామ్యేచధురిలోచనౌ, పురూరవార్ద్రవౌచైవ పార్వణేసముదాహృతౌ. తత్రైవ– ఉత్పత్తింనామచైతేషాం నవిదుర్యేద్విజాతయః, అయముచ్చారణీయస్తై : శ్లోకః శ్రద్ధా సమన్వితైః. ఆగచ్ఛంతు మహాభాగా విశ్వేదేవా మహాబలాః, యేయత్ర విహితాః శ్రాద్ధే సావధానా భవంతుతే, ఇతి. ఇష్టి శ్రాద్ధం శ్రాద్ధం (ఇచ్ఛాశ్రాద్ధం) ప్రతిరుచిరిత్యుక్తం, ఇతి చ కల్పతరుః. ఆధానాది కర్మాం గమిత్యన్యే. నైమిత్తిక మేకోద్దిష్టం, ఏకోద్దిష్టంతు యచ్ఛ్రాద్ధం తన్నై మిత్తిక ముచ్యతే, ఇతి భవిష్యోక్తేః. ఏతద్ యద్యపి ఏకోద్దిష్టం దేవహీనం, ఇతి తత్ర విశ్వేదేవ నిషేధః, తథాపి నవ

శ్రాద్ధే ద్వాదశమాసికేచ కామకాలౌజ్ఞేయౌ. నవ శ్రాద్ధం దశాహాని, నవ మిశ్రంతు షడ్ ఋతూన్, అతఃపరం పురాణంవై త్రివిధం శ్రాద్ధముచ్యతే యస్మిన్నేవ పురాణేవా విశ్వేదేవానలేభిరే, ఆసురం తద్భవేచ్ఛ్రాద్ధం వృషలం మంత్రవర్జితం, ఇతి బహ్వృచ పరిశిష్టాత్. ఏతచ్చ బహ్వృచా నామేవ, తేషామేవోక్తేః. అన్యేషాంతు నాత్ర విశ్వేదేవాః ఇతి కాత్యాయనోక్తేః తన్నిషేధ ఏవేతి పృథ్వీచంద్రోదయః అన్యేతు నైమిత్తికం సపిండీకరణ మాహుః. భవిష్యే యద్యప్యే కోద్దిష్టం తచ్ఛబ్దేనోక్తం, తథాపి - తదప్యదైవం కర్తవ్యమయుగ్మాన్ భోజయేత్ ద్విజాన్, ఇతి తత్రైవ విశ్వేదేవ నిషేధాత్. యద్యపి సపిండీకరణేఽంశత ఏకోద్దిష్టత్వం తథాపి - సపిండీకరణం శ్రాద్ధం దైవ పూర్వం నియోజయేత్, ఇతి వచనాత్తత్పరత్వం. హేమాద్రౌ వాదిత్యపురాణే - విశ్వేదేవౌ క్రతుర్దక్షః సర్వాస్విష్టిషు కీర్తితౌ, నిత్యం నాందీముఖే శ్రాద్ధే వసూసత్యౌ చపైతృకే. నవాన్నలంభనే దేవౌకాలకామౌ సదైవహి, అపిక న్యాగతే సూర్యే కామ్యేచ ధురిలోచనౌ, పురూర వార్ద్రవౌ చైవ విశ్వే దేవౌతు పార్వణే క్వచిద్విశ్వేదేవా పవాద మాహ హేమాద్రౌ శాతా తపః - నిత్యం శ్రాద్ధం అదైవం స్యాత్ ఏకోద్దిష్టం తథైవచ, మాతుః శ్రాద్ధంచ యుగ్మైః స్యాత్ అదైవం ప్రాఙ్ముఖైః పృథక్. యోజయేద్దేవపూర్వాణి శ్రాద్ధాన్యన్యాని యత్నతః నాందీ శ్రాద్ధే భిన్న ప్రయోగపక్షే మాతృశ్రాద్ధం అదైవమితి హేమాద్రిః.

అను॥ ఇక విశ్వే దేవతలు. హేమాద్రి యందు శంఖ బృహస్పతులిట్లా - ఇష్టి శ్రాద్ధమందు క్రతువు, దక్షుడు. నాందీ ముఖమందు వసు, సత్యులు, నైమిత్తికమందు కామకాలులు, కామ్యమందు ధురిలోచనులు, పురూరవ ఆర్ద్రులు పార్వణమందు విశ్వేదేవతలుగా చెప్పబడ్డారు,అని. అక్కడే - వీరి ఉత్పత్తిని, పేర్లను తెలియని బ్రాహ్మణులు శ్రద్ధ కలవారై ఈ శ్లోకమును ఉచ్చరించాలి. మహా భాగులు, మహాబలులైన విశ్వేదేవులారా, రండి. ఏ శ్రాద్ధమందు ఎవరు నియమింపబడ్డారో వారు అక్కడ సావధానులుకండి,అని (ఈ శ్రాద్ధయోగ్యులు రండి). ఇష్టి శ్రాద్ధం. అనగా (ఇచ్ఛాశ్రాద్ధము) శ్రాద్ధమును గూర్చిన కోరిక అని చెప్పారు,అని కూడా కల్పతరువు చెప్పింది. ఆధానాది కర్మాంగమని కొందరన్నారు. నైమిత్తికము అనగా ఏకోద్దిష్టము. ఏకోద్దిష్ట శ్రాద్ధమేదైతే ఉందో అది నైమిత్తికమని చెప్పబడుతోంది,అని భవిష్యోక్తి. ఇది ఏకోద్దిష్టము దేవహీనము అని చెప్పినప్పటికి అక్కడ విశ్వేదేవ నిషేధము అయినప్పటికి నవశ్రాద్ధమందు ద్వాదశ మాస మాసిక మందు కూడా కామకాలులు విశ్వేదేవులు అని తెలుసుకోవాలి. (ఆధానం మొదలగునవి అనగా సోమయాగం, నిషేకాది సంస్కారం. కర్మాంగం అనగా నిషేక కాలమందు, సోమయాగమందు, సీమంతోన్నయనమందు, పుంసవనమందు శ్రాద్ధమును కర్మాంగముగా వృద్ధివలె ఆచరించాలి (చేయబడింది) పారస్కరాచార్యులే 'వృద్ధి', ఈ చేయాల్సిన దాన్ని అతి దేశంతోకర్మాంగశబ్దంతో చెప్పారు). పదిరోజుల వరకు నవ శ్రాద్ధము (మరణం నుండి పదవరోజు వరకు నవ శ్రాద్ధమంటారు. ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిది, పదకొండు ఈ ఆరు నవశ్రాద్ధ శ్రాద్ధములు) నవ, మిశ్రమైతే ఆరు ఋతువుల వరకు ఆ పిదప పురాణము (అనగా కనిష్ఠ, భ్రాతృ వార్షిక శస్త్ర హత చతుర్దశీ శ్రాద్ధా దీని పురాణ సంజ్ఞాని, సపిండి తర్వాత చేయబడే పార్వణములు కూడా పురాణములు అని కొందరన్నారు).

ఈ శ్రాద్ధము మూడు రకాలు. ఏ పురాణమందైనా విశ్వేదేవులు లభించని పక్షంలో ఆ శ్రాద్ధము అసుర శ్రాద్ధము. మంత్రము లేనిచో అది వృషలమౌతుంది (శూద్రం) అని బహ్వృచ పరిశిష్టం నుండి తెలుస్తోంది. ఇది బహ్వృచులకే. వారికే చెప్పబడింది కనుక. ఇతరులకైతే, ఇక్కడ విశ్వేదేవులు లేరు, అని కాత్యాయనోక్తి వల్ల వారి నిషేధమే అని పృథ్వీ చంద్రోదయము చెప్తోంది. ఇతరులైతే నైమిత్తికం అనగా సపిండీకరణమన్నారు. భవిష్య మందు. తచ్ఛబ్దంతో ఏకోద్దిష్టం చెప్పబడింది ఐనా అది కూడా దైవం లేకుండా చేయాలి అయుగ్మ (ఒకటి, మూడు, ఐదు) బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి,అని అక్కడే విశ్వేదేవులను నిషేధించారు. సపిండీకరణమందు ఒక భాగంగా ఏకోద్దిష్టత్వము ఐనా సపిండీకరణ శ్రాద్ధమును దైవ పూర్వకముగా నియమించాలి,అని ఉన్నందువల్ల అది దాని పరకమే. హేమాద్రి యందు ఆదిత్యపురాణోక్తి ఇట్లా - క్రతు, దక్ష అను విశ్వేదేవులు అన్ని ఇష్టులందు కీర్తింపబడ్డారు. నాందీముఖ శ్రాద్ధమందు వసుసత్యులు నిత్యంగా విశ్వేదేవులు. పైతృకమైన నవాన్నలంభనమందు (కొత్త అన్నం తినేముందు పితృకార్యం) కాలకాములు ఎల్లప్పుడూ విశ్వేదేవులు. సూర్యుడు కన్యారాశిలో ప్రవేశించినపుడు, కామ్యమందును ధురిలోచనులు విశ్వే దేవులు. పార్వణమందు పురూరవ ఆర్ద్రవులు విశ్వేదేవులు. ఒకచోట విశ్వేదేవ అపవాదమును హేమాద్రి యందు శాతాతపుడిట్లా చెప్పాడు - నిత్య శ్రాద్ధము అదైవము. ఏకోద్దిష్టము అట్లాగే. తల్లి శ్రాద్ధము యుగ్మములతో అదైవంగానే ఔతుంది. ప్రాఙ్ముఖ (తూర్పు) బ్రాహ్మణులకన్న భిన్నంగా ఔతుంది. ఇతర శ్రాద్ధములన్నింటిలోను ప్రయత్నపూర్వకముగా దేవ పూర్వకముగా కూర్చాలి. నాందీశ్రాద్ధమందు భిన్న ప్రయోగ పక్షమందు మాతృశ్రాద్ధము అదైవము అని హేమాద్రి మతము.

**మూ॥ అథవిప్రాః - తేచ ఉత్తమ మధ్యమ అధమ భేదేన త్రివిధాః. తత్రాద్యాః. అత్ర మదీయాః శ్లోకాః - త్రిణాచికేతః త్రిమధుశ్చ బహ్వృచోఽప్యాథర్వణో యాజుష సామగౌచ, షడంగ విచ్చ త్రిసుపర్ణ వేత్తాఽప్యధర్వ శీర్ష్ణోఽధ్యయనేరతశ్చ. శతాయుర్వేదార్థ విదౌ ప్రవక్తాస్యాత్ బ్రహ్మచారీ చ తథాగ్ని చిచ్చ. పీదద్వృత్తిః. సత్యవాక్ పూరుషైః స్త్రైర్మాతా పిత్రోః పంచభిః ఖ్యాత వంశః. పత్నీయుక్తో జ్యేష్ఠ సామా పురాణవేత్తా పుత్రీ చేతిహాసేష్వభిజ్ఞః. యోగీభిక్షుః సామగో బ్రహ్మవేత్తా పంచాగ్నిశ్చ శ్రోత్రియస్తత్పుతోవా శంభుధ్యాయీ శ్రీశపాదాబ్జ సేవీ పాంథశ్చైతే తూత్తమాః సంప్రదిష్టాః. భిక్షుర్యోగీ పాంథ ఏతేత్వల భ్యాభాగ్యాల్లబ్ధాశ్చేత్తదా భోజనీయాః. శ్రాద్ధే విప్రేషూపవిష్టేషు పశ్చాత్ సంప్రాప్తాశ్చేత్ విప్రపంక్తౌతు భోజ్యాః. అత్రమూలం హేమాద్రౌ జ్ఞేయం. తత్రైవ నారదః - యోవైయతీననాదృత్య భోజయేదితరాన్ ద్విజాన్, విజానన్ వసతో గ్రామే కవ్యం తద్యాతి రాక్షసాన్. దీపకలికాయాం దక్షః - వినామాంసేన మధునా వినా దక్షిణాయాఽశిషా, పరిపూర్ణం భవేచ్ఛ్రాద్ధం యతిషు శ్రాద్ధభోజను. ఏతచ్ఛబ్దాని (వ) విషయం. త్రిణాచికేతః త్రిసుపర్ణో యజుర్వేదైకదేశౌతద్ వ్రతేన తదధ్యాయినౌ, యస్య సప్త పూర్వే సోమపాః సత్రిసుపర్ణాః ఇతి బోపదేవః సత్రి మధుర్ ఋగ్వేదైకదేశః తదధ్యాయీ. కేచిన్నాచికేతం చయనంత్రిః కృతవానిత్యర్థమాహుః తద్ హేమాద్రి విరుద్ధం. హేమాద్రౌ గౌతమః - యువభ్యో దానం ప్రథమం పితృవయసః, ఇత్యేకే.**

మాత్స్యే మనుః - యశ్చవ్యాకురుతే వాచం యశ్చ మీమాంసతేఽధ్వరం, సామస్వర విధిజ్ఞశ్చ పంక్తి పావన పావనాః. కౌర్మే - అసమాన ప్రవరకోహ్యాస గోత్రస్తథైవచ, అసంబంధీచ విజ్ఞేయో బ్రాహ్మణః శ్రాద్ధ సిద్ధయే. గారుడే - శ్రాద్ధేషు వినియోజ్యాస్తే బ్రాహ్మణా బ్రహ్మ విత్తమాః, యేయోని గోత్ర మంత్రాంతేవాసి సంబంధ వర్జితాః. మనుః- నమిత్రం భోజయే చ్ఛ్రాద్ధే ధనైః కార్యోఽస్య సంగ్రహః, నారిం న మిత్రం యంవిద్యాత్తం శ్రాద్ధే భోజయే ద్విజం. ద్వయోః భ్రాత్రోః శ్రాద్ధే భోజనం నిషిద్ధం. పితృపుత్రౌ భ్రాతరౌ ద్వౌ నిరగ్నిం గుర్విణీ పతిం, సగోత్ర ప్రవరం చైవ శ్రాద్ధేషు పరివర్జయేత్, ఇతి శ్రాద్ధ దీపకలికాయాం జాతూకర్ణ్యోక్తేః.

అను॥ ఇక శ్రాద్ధ భోక్తలైన బ్రాహ్మణుల గూర్చి. వారు ఉత్తమ మధ్యమ అధమ భేదంతో మూడు రకాలు. అందులో మొదటివారు. ఇక్కడ నా శ్లోకములు - త్రినాచికేతులు (పీతోదకాజగ్ధతృణా, అను మొదలగు త్రి (తృ)ణాచికేత మనుపేరుగల వేదభాగం చదివిన వారు, జ్ఞాని, రాగద్వేష వర్జితుడు, నిస్పృహుడు. ఉశనహవై వాజః శ్రవస అను మొదలగు మూడు అను వాకములతో చెప్పబడ్డ నాచికేతాగ్నులను ఎరిగినవాడు) త్రిమధువు (మధు వాతా ఋతాయతే అను మొదలగు మూడు ఋక్కులను అధ్యయనం చేసినవాడు త్రిమధు అను వ్రతం ఆచరించినవాడు,ఆ పేరుగల ఋగ్వేదంలోని ఒక భాగాన్ని చదివినవాడు) బహ్వృచుడు (ఋగ్వేదం తెలిసినవాడు) అధర్వవేది, యజుర్వేది, సామవేదాధ్యాయి, షడంగము లెరిగినవాడు (శిక్షావ్యాకరణాదులు). త్రిసుపర్ణవేత్త (మధుమేతుమాం ఆదిగా గల తైత్తిరీయ, యజుస్ త్రితయ అధ్యేత. చతుష్కపదీయువతిః సుపేశా, అని ఋగ్వేదాంతర్గత సుపర్ణ పదంగల ఋక్త్రయమని కొందరు) అధర్వశీర్ష అధ్యయన మందు ఆసక్తి గలవాడు, శతవర్ష ఆయుస్సు కలవాడు (జ్యోతిష, జాతకరీత్యా కలవాడు లేదా వృద్ధతముడు అని) వేదార్థ మెరిగినవాడు, మంచివక్త బ్రహ్మచారి అగ్నిచిత్ (నిత్యాగ్ని), జీవికలేనివాడు, సత్యవాది, తన తలిదండ్రుల నుండి ఐదుపురుషాంతరముల పూర్వము వరకు ప్రసిద్ధి చెందిన వంశీకుడు, భార్య సహితుడు, జ్యేష్ఠ అను సామవేద భాగాన్ని చదివేవాడు, పురాణవేత్త, పుత్రవంతుడు, ఇతిహాసముల నెరిగినవాడు, యోగి, భిక్షువు (భగవద్ధ్యానమగ్నుడు), సామస్వరమెరిగినవాడు, బ్రహ్మవేత్త ఐదు అగ్నులు కలవాడు (గార్హపత్య, దక్షిణ, ఆహవనీయ, సభ్య, ఆవసథ్య లేదా ఛాందోగ్యంలోని పంచాగ్ని విద్యను పఠించేవాడు) వేదపాఠి లేదా ఆతని కుమారుడు, శివుని ధ్యానించేవాడు, విష్ణుపాదసేవకుడు, అతిథి (పాంథుడు) వీరు ఉత్తములుగా చెప్పబడ్డారు. భిక్షువు, యోగి, పాంథులు వీరు లభించరు. ఒకవేళ అదృష్టవశాత్తు లభిస్తే వారిని భుజింప చేయాలి. శ్రాద్ధమందు బ్రాహ్మణులు కూర్చున్నాక పై వారు తరువాత వస్తే వారిని విప్ర పంక్తి యందే భుజింప చేయాలి. దీనికి మూల వచనాలను హేమాద్రి యందు గ్రహించాలి. అక్కడే నారదుడిట్లా - గ్రామ మందున్న యతుల గురించి తెలిసివారిని అనాదరించి ఇతర గ్రామ బ్రాహ్మణులను భుజింప చేసిన వాని, కవ్యము రాక్షసులకు చెందుతుంది,అని. (శిఖీ = బ్రహ్మచారి; ధాతురక్త వస్త్రధారులు, ధ్యానులు వానప్రస్థులు; త్రిదండీ = కాయ, వాక్, మనోదండులు, యతులు త్రిదండులు) దీపకలికమందు దక్షుడిట్లా

- మాంసము, మధువు, దక్షిణ, ఆశీస్సులు ఇవి ఏవి లేకపోయినా యతులు శ్రాద్ధ భోజనం చేస్తే ఆ శ్రాద్ధం పరిపూర్ణమౌతుంది,అని. ఇది జ్ఞానియైన వాని విషయము. త్రినాచికేత, త్రిసుపర్ణ ఇవి యజుర్వేదంలో ఒక భాగాలు, దానిని, నియమంగా, పఠించేవారు ఎవని వంశీకులు పూర్వులైనవారు ఏడుతరాల వరకు సోమపులో వారు త్రిసుపర్ణులు, అని కోపదేవుడు సత్రిమధుః, ఋగ్వేదంలో ఒక భాగం దానిని చదివే వారు. కొందరు, నాచికేత చయనమును మూడుమార్లు ఆచరించిన వారు అని అర్థం చెప్పారు,అది హేమాద్రికి విరుద్ధమైనది. హేమాద్రి యందు గౌతముడిట్లా - యువకులకు దానము తొలుత. తండ్రి అంత వయస్సు కలవారికి, అని కొందరు,అని. మాత్స్యమందు మనువిట్లా - వాక్కును వివరించగలవారు (వక్త), యజ్ఞమును గూర్చి చర్చించగలవారు, సామస్వర విధిని యెరిగినవారు, వీరంతా పంక్తిని పవిత్రం చేసేవారిని పావనం చేయగలవారు, అని. కౌర్మమందిట్లా -సమాన ప్రవరలు లేని సగోత్రులు కాని సంబంధము లేని బ్రాహ్మణుడు శ్రాద్ధ ఫలసిద్ధికి తగును అని తెలుసుకోవాలి,అని. గారుడమందిట్లా - యోని, గోత్ర, మంత్ర, శిష్య, సంబంధములు లేని బ్రాహ్మణులను బ్రహ్మవిత్తములను శ్రాద్ధమందు నియోగించాలి,అని. మనువిట్లా - శ్రాద్ధమందు మిత్రునకు భోజనం పెట్టరాదు. ధనముతో మిత్ర సంగ్రహం చేయాలి. శత్రువు, మిత్రుడుకాని వానిగా తెలిసిన (గుర్తించిన) బ్రాహ్మణుని శ్రాద్ధమందు భుజింప చేయాలి,అని. ఇద్దరు స్వంత అన్నదమ్ములు ఒకే శ్రాద్ధమందు భోజనం చేయరాదు తండ్రి కొడుకులు, ఇద్దరన్నదమ్ములు, నిరగ్ని, గర్భిణి భర్త, సగోత్రుడు, సమాన ప్రవరలు కలవాడు వీరిని శ్రాద్ధమందు విడిచిపెట్టాలి,అని శ్రాద్ధదీప కలికయందు జాతూకర్ణ్యోక్తి.

**మూ॥ అథమధ్యమాః** - హేమాద్రౌ కౌర్మ గార్గ్యౌ - నైకగోత్రే హవిర్దద్యాత్ యథాకన్యా తథా హవిః,అభావే హ్యన్యగోత్రాణాం ఏకగోత్రాంస్తు భోజయేత్. అత్రకేచిత్ స్వశాఖీయాన్ ముఖ్యా నాహుః పఠంతిచ - నిమంత్రయీత పూర్వేద్యుః స్వశాఖీయాన్ ద్విజోత్తమాన్, స్వశాఖీయ ద్విజాభావే ద్విజానన్యా న్నిమంత్రయేత్,ఇతి. ఇదంతు నిర్మూలత్వాత్ హేమాద్రిణా దూషితత్వాచ్చోపేక్ష్యం. మనురపి - యత్నేన భోజయేచ్ఛ్రాద్ధే బ్రాహ్మణం వేదపారగం, శాఖాంతగ మథాధ్వర్యుం ఛందోగంతు సమాప్తిగం. ఏషామన్యతమో యస్య భుంజీత శ్రాద్ధ మర్చితః, పితౄణాంతస్య తృప్తిః స్యాచ్ఛాశ్వతీ సాప్త పౌరుషీ. అత్రమామకః శ్లోకః - మాతా మహోమాతుల భాగినేయ దౌహిత్ర జామాతృగురు స్వశిష్యాః, ఋత్విక్ చయాజ్యశ్వశురౌ స్వబంధు శ్యాలా గుణాఢ్యా స్త్వను కల్పభూతాః. బాంధవో మాతృష్వ సృపితృష్వస్రు మాతుల పుత్రాః, ఇతి కోపదేవః. అత్రమూలం హేమాద్రౌ జ్ఞేయం. నగుణ స్వస్రీయా ద్యతిక్రమేదోషఏవ. సప్త పూర్వాన్ సప్త పరాన్ పురుషా నాత్మనా సహ. అతిక్రమ్య ద్విజానేతాన్ నరకే పాతయేత్ ఖగ. సంబంధినస్తథా సర్వాన్ దౌహిత్రం విట్పతిం తథా, భాగినేయం విశేషేణ తథా బంధుంఖగాధిప, ఇతి మదనరత్నే భవిష్యోక్తేః. అతఏవ యాజ్ఞవల్క్యః - బ్రాహ్మణ ప్రాతివేశ్యానాం ఏతదేవా నిమంత్రణే, ఇతి గుణ్యతి క్రమే దశపణం దండమాహ. ఆసన్న మాత్ర పరమిదం. మూర్ఖేతున దోషః. బ్రాహ్మణాతిక్రమోనాస్తి మూర్ఖేచైవ (వేద) వివర్జితే. జ్వలంత

మగ్ని ముత్సృజ్యనహి భస్మనిహాయతే, ఇతి కాత్యాయనోక్తేః. విప్రస్యాపి దోషః, అవిద్వాన్ ప్రతిగృహ్ణానో భస్మీ భవతి దారువత్, ఇతి మనూక్తేః. అపరార్కే అత్రిః - షడ్భ్యస్తు పురుషేభ్యోఽర్వాగ శ్రాద్ధేయాస్తు గోత్రిణః, షడ్భ్యస్తు పరతోభోజ్యాః శ్రాద్ధే స్యుఃగోత్రజా అపి. ఏతచ్చ బ్రాహ్మణాలాభే, అపి శబ్దాత్ అసంభవే హేమాద్రౌ గౌతమః - శిష్యాంశ్చైకేసగోత్రాంశ్చ భోజయేదూర్ధ్వం త్రిభ్యోగుణవతః. ఆపస్తంబః - బ్రాహ్మణాన్ భోజయేద్యోని గోత్ర మంత్రాంతేవాస్యసంబంధినః, గుణహాన్యాంతు పరేషాం సముదితః సోదర్యోఽపి భోజయితవ్యః. ఏతేన అంతేవాసినో వ్యాఖ్యాతాః,ఇతి. అత్ర విశేష మాహహారీతః - పితాపితా మహోభ్రాతా పుత్రోవాఽథ సపిండకః, వ పరస్పర మర్హాః స్యుః న శ్రాద్ధే ఋత్విజస్తథా, ఋత్విక్ పుత్రాదయోఽప్యేతే సకుల్యాబ్రాహ్మణాః స్మృతాః వైశ్వదేవే నియోక్తవ్యాయద్యేతే గుణవత్తరాః సగోత్రాన నియోక్తవ్యాః స్త్రియశ్చైవ విశేషతః.

అను॥ ఇక మధ్యముల గూర్చి - హేమాద్రి యందు కూర్మపురాణ గర్గ పురాణ వచనోక్తులిట్లా - ఒకే గోత్రమందు హవిస్సు ఇవ్వరాదు. కన్య ఎట్లాగో హవిస్సు అట్లాగే. అన్యగోత్రముల వారు లేని పక్షంలో ఒకే గోత్రము వారిని భుజింప చేయాలి. ఇక్కడ కొందరు తమ శాఖవారే ముఖ్యులని అన్నారు. శ్లోకం పఠిస్తారు కూడా - తమ శాఖీయులైన బ్రాహ్మణోత్తములను ముందు రోజే నిమంత్రణ చేయాలి. తమ శాఖీ యద్విజులు లేని పక్షంలో ఇతర బ్రాహ్మణులను నిమంత్రణ చేయాలి,అని. ఇదైతే మూలవచనాలు లేనందువల్ల, హేమాద్రి దూషించాడు కనుకనూ ఉపేక్ష వహించాల్సిన అంశము. మనువు కూడా - వేద పారగుడైన బ్రాహ్మణుని, శ్రాద్ధమందు ప్రయత్నపూర్వకముగా భుజింపచేయాలి, వేద శాఖాంతము వరకును (పఠన) సమాప్తి చేసిన, అధ్వర్యుని, వేదములను పఠించి సమాప్తము చేసిన బ్రాహ్మణుని భుజింపచేయాలి. వీరిలో ఒకరిని శ్రాద్ధమందు పూజించి భుజింపచేసిన వాని పితరులకు ఏడుతరములవరకు శాశ్వతమైన తృప్తి లభిస్తుంది,అని. ఇక్కడ నా శ్లోకాలు - మాతామహుడు (తల్లి తండ్రి), మేనమామ, చెల్లెలు కొడుకు, బిడ్డకొడుకు, అల్లుడు, గురువు, తన శిష్యుడు, ఋత్విక్కు, యజ్ఞము చేయువాని మామ,తనబంధువు, భావమరిది, వీరంతా గుణవంతులైతే అనుకల్పులు (మధ్యములు, ప్రధానులు లేని పక్షంలో స్వీకరించతగినవారు). బాంధవులనగా తల్లి చెల్లెలు, తండ్రి చెల్లెలు, మామ వీరి పుత్రులు, అని బోపదేవుడన్నాడు. ఇక్కడ మూల వచనాన్ని హేమాద్రి యందు చూడాలి. సగుణులైన చెల్లెలి కొడుకు మొదలగు వారిని వదలటం చేస్తే దోషమే. తనతో కూడా ఏడుగురు పూర్వులను ఏడుగురు తర్వాతి వారిని నరకంలో పడేస్తుంది ఓఖగ ! ఈ బ్రాహ్మణులను అతిక్రమిస్తే. సంబంధులు అందరిని, దౌహిత్రుని, కూతురుభర్త అల్లుడు, విశేషించి చెల్లెలు కొడుకు అట్లాగే బంధువులు వీరందరిని విడువరాదు, ఓ ఖగాధిప ! అని మదనరత్నమందు భవిష్యోక్తి. అందుకే యాజ్ఞవల్క్యులిట్లా - బ్రాహ్మణులను ఇంటి ప్రక్కవాళ్ళను అందువల్లనే నిమంత్రణ చేయరాదన్నాడు,అన్ని గుణములు కలవానిని అతిక్రమిస్తే పదిపణములు దండన అని చెప్పాడు. ఇది దగ్గరలో ఉన్న వాని విషయము. మూర్ఖునియందు దోషం లేదు.

మూర్ఖుని యందు వేదమును విడిచిన వానియందు బ్రాహ్మణాతిక్రమ దోషం లేదు. మండుతున్న అగ్నిని వదలి బూడిదలో హోమం చేయం కదా,అని కాత్యాయనోక్తి. విప్రునకు కూడా దోషమే. అవిద్వాంసుడై ఉండి ప్రతిగ్రహం చేసేవాడు కట్టెవలె బూడిదైపోతాడు, అని మనూక్తి. అపరార్కమందు అత్రి ఇట్లా – తన గోత్రంలో ఆరుగురు పురుషాంతరములకన్న పూర్వము వారిని శ్రాద్ధమందు గ్రహించరాదు. ఆరుగురు పురుషాంతరముల తరువాతి వారిని శ్రాద్ధమందు భుజింపచేయాలి, గోత్రజులైనా సరే,అని. ఇది బ్రాహ్మణులు లభించని పక్షంలో, అని అపి శబ్దం వల్ల తెలుస్తోంది. అసంభవమందు హేమాద్రియందు గౌతమోక్తి ఇట్లా – మూడు తరముల తరువాత ఐతే గుణవంతులైన శిష్యులనైనా, సగోత్రులనైనా భుజింప చేయాలి,అని. ఆపస్తంబుడిట్లా – యోని, గోత్ర, మంత్ర, అంతే వాసి సంబంధాలు లేని బ్రాహ్మణులను భుజింపచేయాలి గుణహీని ఉన్న పక్షంలో, ఇతర బ్రాహ్మణుల సముదాయం లోంచి సహోదరుని కూడా భుజింపజేయాలి. దీనితో అంతేవాసులు వ్యాఖ్యానింప బడ్డారు,అని. ఇక్కడ విశేషాన్ని అత్రి ఇట్లా చెప్పాడు – తండ్రి, తండ్రితండ్రి, భ్రాత, పుత్రుడు సపిండకుడు వీరు పరస్పరం పూజించతగిన వారు కారు, శ్రాద్ధమందు వీరు ఋత్విజులు కూడా కారు. ఋత్విక్ పుత్రాదులు వీరు కూడా సకుల్య బ్రాహ్మణులుగా చెప్పబడ్డారు. (ఒక కుటుంబీకులుగా). వీరు గుణవత్తరులైతే వైశ్వదేవమందు వీరిని నియోగించాలి. (విశ్వేదేవులుగా) సగోత్రులను, విశేషించి స్త్రీలను గుణవత్తరులైనా నియోగించరాదు,అని.

**మూ॥ అథవర్జ్యాః అత్రమామకాః శ్లోకాః – వర్జ్యాన్ ప్రవక్ష్యే త్వథ రోగివైరి హీనాధికాంగాన్ కితవాన్ కృతఘ్నాన్, నక్షత్ర శాస్త్రేణ చ జీవమానాన్ భైషజ్య వృత్త్యాపి చ రాజభృత్యాన్. సంగీత కాయస్థకుసీద వృత్త్యావేదక్రయేణాపి కవిత్వవృత్త్యా దేవార్చనేనా పిచ జీవమానాన్, స్వాధ్యాయదారాగ్ని సుతోజ్ఝకాణాన్. దుర్బాలఖల్వాటకునఖ్యధర్మిన టాంశ్చ పౌనర్భవ కృష్ణదంతాన్, అగారదాహీ గరదః సముద్ర యాయీచ కుండాశ్యథ కూటకారీ. బాలాంశ్చయోఽధ్యాపయతే స్వపుత్రా దవాప్త విద్యస్త్వథ కుండగోళౌ, అగ్రే దిధిష్వాః పతిరత్ర కర్తాసోమక్రయీ తైలిక కేకరాక్షౌ. యుద్ధా చార్యః పక్షిణాం పోషకశ్చ స్రోతోభేత్తా వృక్షసంరోపకశ్చ. మేషాణాం వా మాహిషాణాం చ పుష్ట్యై స్వీయ స్త్రీషు ప్రాహితైర్యశ్చ జారైః. జీవత్యధ్యేతుశ్చ దత్తానుయోగాద్ ద్రవ్య ప్రాప్త్యై వేదముద్ఘాటయంతః గ్రామయాజిపశుకేశ విక్రయీస్తేనశిల్పి పిత్రువాదకారకాన్, అర్థకామ రత శూద్ర యాజకశ్మశ్రు హీన జటిముండవిర్ ఘృణాన్. యస్య చైవ గృహిణీ రజస్వలా స్వార్థ పాకరత శాపదాయకాన్, క్లీబ కృష్ణ తివిలోహితే క్షణాన్ కుబ్జవామన మృషాభి శాపినః. పుత్రహీన మఠకూటసాక్షిణం ప్రాతి హావికమ యాజ్యయాజకం స్వాత్మ దాతృపరివేత్తృయాజకస్తేన హింస్రకముఖాన్ వివర్జయేత్. అత్రమూలం హేమాద్రౌ పృథ్వీచంద్రోదయే చ జ్ఞేయం.**

అను॥ ఇక విడువ తగినవారు. ఇక్కడ నా శ్లోకములు – ఇక విడువతగిన వారిని గూర్చి చెబుతాను. రోగి (ఉన్మాదాది), శత్రువు, తక్కువ లేదా ఎక్కువ అంగములు కలవాడు (సంఖ్యతో పరిమాణంతోకాని) జూదరి, కృతఘ్నుడు, జ్యోతిష్కుడు (నక్షత్రశాస్త్రం

చెప్పి బ్రతికేవాడు) వైద్యంతో జీవించేవాడు, రాజభృత్యుడు, సంగీతంచే బ్రతికేవాడు, కాయస్థవృత్తి (క్షత్రియ తండ్రి శూద్రతల్లికి జన్మించినవాడు వ్రాయసకాడు, ముద్రా రాక్షసంలో) కుసీద వృత్తి (వడ్డీవ్యాపారం) వీనితో జీవించేవాడు, వేదం అమ్మి, కవిత్వం వ్రాసి జీవించేవారు, దేవార్చన చేసి జీవించేవారు, వేదము, భార్య, అగ్ని, సుతుడు వీరిని వదలిన వారిని, ఒక కన్ను లేనివానిని (బధిర, మూగలు వగైరా) కుత్సిత కేశములవాడు, బట్టతలవాడు, కుత్సితనఖములవాడు, అధార్మికుడు, నటుడు, పౌనర్భవుడు (రెండుసార్లు వివాహమాడిన స్త్రీకి భర్త, వానికి పుట్టినవాడు) సహజంగా నల్లనిదంతములవాడు, ద్వేషంతో ఇంటిని, (ధనం కొరకు ప్రేతమును) తగులబెట్టేవాడు (అగారదాహీ) కృత్రిమమైన లేదా అకృత్రిమమైన విషం నిచ్చేవాడు, సముద్రంపై ప్రయాణించేవాడు, కుండుని భోజనం తినేవాడు (భర్త బ్రతికుండగా మరొక పురుషునితో ఆ స్త్రీకి కల్గినపుత్రుడు కుండుడు. వాని ఇంటిలో భుజించేవాడు) కూట (కార్యంచేసే) సాక్ష్యం చెప్పేవాడు, పిల్లలను చదివించేవాడు, తన కొడుకు ద్వారా విద్య పొందినవాడు, కుండ, గోళులు (గ్రామ మందు అక్షరాలు చదివించేవాడు లేదా పుత్రుని నుండి విద్య పొందినవాడు పుత్రాచార్యుడు) (ఇతరుల భార్యలకు పుట్టినవారు కుండగోళకులు, అమృతే జారజః కుండః మృతే భర్తరిగోళకః) అక్కకు పెళ్ళి కాకుండా చెల్లెలు పెళ్ళి జరిగితే ఆమె అగ్రేది ధిష్వ ఆమె భర్త, అస్త్రములు చేసేవాడు, సోమంకొనే(అమ్మే)వాడు (ఓషధి విశేషం) (సోమ యాగసాధ్య అపూర్వ విక్రేత అని కొందరు) గాండ్ల వృత్తి వాడు లేదా నూనె అమ్మేవాడు (నువ్వులు), కేకరుడు (అధ్యర్ధదృష్టి, సగదృష్టి లేదా పిల్లి చూపులు గలవాడు) యుద్ధవిద్య నేర్పేవాడు, పక్షి పోషకుడు, జలమును భేదించేవాడు, చెట్లుపెట్టేవాడు. మేషములను లేదా మహిషములను పెంచేవాడు. తన భార్య దగ్గరకు వచ్చే జారుల ధనం వల్ల జీవించేవాడు, చదివేవారు, విచారణ చేసి అనుమతించాక ద్రవ్య ప్రాప్తి కొరకు వేద ముచ్చరించేవాడు, గ్రామమందు యజ్ఞం చేసేవాడు, పశువుల వెంట్రుకలను (గొంగళ్ళను లేదా) అమ్మేవాడు బ్రాహ్మణుల బంగారము దొంగతనము చేసేవాడు శిల్పము చేసేవాడు, తండ్రితో వాదించేవాడు, అర్ధకామరతుడు, శూద్రులతో యాగం చేయించేవాడు, గడ్డాలు లేనివాడు, జటలు గలవాడు, ముండనము గలవాడు (సంన్యాసి) దయలేనివారు, భార్య రజస్వల ఐనవాడు, (పంచమహాయజ్ఞములు లేకుండా) తనకొరకు వండుకునేవాడు, శాపమిచ్చేవాడు, నపుంసకుడు, కుష్ఠువ్యాధివాడు ఎక్కువ ఎరుపు గల కన్నులవాడు, గూని, పొట్టివారలు, అబద్ధపు శాపాలు ఇచ్చేవాడు, పుత్రులు లేనివాడు, కూటసాక్ష్యములు చెప్పేవాడు (అబద్ధపు), గారడి చేసేవాడు, యజ్ఞానర్హునితో యజ్ఞం చేయించేవాడు, తన ఆత్మను అమ్ముకున్న వాడు, అన్నకన్న ముందు పెళ్ళి చేసుకున్న (తమ్ముడు పరివేత్తవాడు, అట్టి) యాజకుడు, (వెండి బంగారం కన్న ఇతర) లోహముల చేసి దొంగిలించేవాడు, హింసకుడు మొదలగు వారిని శ్రాద్ధమందు విడిచిపెట్టాలి (భుజింప చేయరాదు). దీనికి ఆధారము హేమాద్రి యందు, పృథ్వీ చంద్రోదయమందును గ్రహించాలి (అధ్యాపన బ్రహ్మయజ్ఞము, తర్పణం, పితృయజ్ఞం, హోమం, దేవయజ్ఞం, బలి, భూతయజ్ఞం,

అతిధిపూజ, నరయజ్ఞం ఇవి పంచమహాయజ్ఞాలు.

**మూ॥ భారతేదానధర్మేషు శ్రాద్ధవర్జ్య విప్రాధికారే - కితవో భ్రూణహా యక్ష్మీ పశుపాలో నిరాకృతిః, గ్రామప్రేష్యో వార్ధుషికో గాయకః సర్వవిక్రయీ, సాముద్రికో రాజభృత్యః తేలికః కూట కారకః, పిత్రా వివద మానశ్చ యస్య చోపపతిర్ గృహే, అభిశస్తస్త థాస్తేనః శిల్పం యశ్చోప జీవతి, పర్వకారశ్చ సూచీచ మిత్రధ్రుక్ పారదారికః, అవ్రతానా ముపాధ్యాయః కాండపృష్ఠస్తథైవచ, శ్వభిశ్చయః పరిక్రామేత్ యః శునాదష్ట ఏవచ, పరివిత్తిస్తథా స్తేనో దుశ్చర్మా గురుతల్పగః, కుశీలవో దేవలకో నక్షత్రేయశ్చ జీవతి, ఈదృశా బ్రాహ్మణా జ్ఞేయా అపాఙ్క్తేయా యుధిష్ఠిర. తథా - ఋణ కర్తాచయో రాజన్ యశ్చ వార్ధుషికోనరః, కాండ పృష్ఠః స్వశాఖాంత్యక్త్వా పరశాఖయోపనీతః తద ధ్యాయీచ, క్షత్రియ వైశ్య వృత్త్యా నారదస్తు - తస్యా మేవతు యో వృత్త్యా బ్రాహ్మణో వసతేరసాత్, కాండ పృష్ఠచ్యుతో మార్గాత్ సోఽపాఙ్క్తేయః ప్రకీర్తితః, ఇత్యాహ. హారీతః - శూద్రాపుత్రాః స్వయం దత్తాయేచైతే క్రీతకాః సుతాః, తే సర్వే మనునా ప్రోక్తాః కాండపృష్ఠా న సంశయః.**

అను॥ భారతమందు దానధర్మములందు శ్రాద్ధమందు విడువతగిన బ్రాహ్మణుల అధికరణమందు ఇట్లా ఉంది - జూదరి, భ్రూణహత్య చేసేవాడు, రాజయక్ష్మరోగం కలవాడు, పశుపాలకుడు, నిరాకృతి (వేదంచదివి దాన్ని మరచిన బ్రాహ్మణుడు నిరాకృతి అనబడుతాడు. అధికారం ఉండి పంచ మహాయజ్ఞాలు అనుష్ఠించనివాడు దురాకృతి) దూత (వార్తలు చేరవేసే పోస్టుమాన్) వడ్డీవ్యాపారి, గాయకుడు, అన్ని రకాల వస్తువులు అమ్మేవాడు, హస్తరేఖల చూచేవాడు (వృత్తి), రాజభృత్యుడు, నూనె అమ్మేవాడు కూటసాక్షి, తండ్రితో వాదించేవాడు, జార పురుషుడు ప్రవేశించే గృహస్థుని ఇల్లు, (పరస్త్రీ గమనాదులచే) కళంకితుడు, దొంగ, శిల్పి, అమావాస్య మొదలగు రోజుల్లో చేయాల్సిన విధులను సాధారణ రోజుల్లో ధన సంపాదన కొరకు చేసే బ్రాహ్మణుడు (పర్వకారి) దర్జీ, మిత్రద్రోహి, పరస్త్రీ లంపటుడు, వ్రతరహితులకు ఉపాధ్యాయుడైనవాడు ఆయుధోపజీవి, కుక్కలతో తిరిగేవాడు, కుక్కతో కరువబడ్డవాడు, పరివిత్తి, చోరుడు, చర్మరోగి, గురుతల్పగుడు, నాటకాలు వేసేవాడు, పూజారి, జ్యోతిష్యుడు, ఇటువంటి బ్రాహ్మణులు పంక్తి బాహ్యులు అని గ్రహించాలి, ఓ యుధిష్ఠిర, అని. అట్లాగే - అప్పుచేసేవాడు, వడ్డీవ్యాపారి, కాండపృష్ఠుడు (తన శాఖ వదలి ఇతర శాఖల ద్వారా ఉపనయనం చేసుకొని దాన్ని అధ్యయనం చేసేవాడు) అని వీరు ఓ రాజ శ్రాద్ధానర్హులు. క్షత్రియ వైశ్యవృత్తి యందు నారదుడిట్లా - తత్పరుడై వారి (ఇతరుల) వృత్తి యందు బ్రాహ్మణుడు ఉన్న యెడల అతడు కాండ పృష్ఠచ్యుతుడు, మార్గచ్యుతుడు అతడు పంక్తి బాహ్యుడు అనబడ్డాడు అని అన్నాడు. హారీతుడిట్లా - శూద్రస్త్రీ పుత్రులు, స్వయంగా దత్తులు (వచ్చిన పుత్రుడు) క్రీతకుడు (కొనబడ్డవాడు) ఈ పుత్రులంతా కాండపృష్ఠులు అని మనువు చెప్పాడు, అనుమానంలేదు,అని.

**మూ॥ అన్యేఽపి హేమాద్రౌ మాత్స్యే - త్రిశంకూన్ బర్బరా నాంధ్రాన్ చీన ద్రావిడ కౌంకణాన్, కర్ణాటకాం స్తథాఽభీరాన్ కలింగాంశ్చ వివర్జయేత్. తత్రైవ సౌర పురాణే - అంగ**

వంక కళింగాంశ్చ సౌరాష్ట్రాన్ గూర్జరాంస్తథా, ఆ భీరాన్ కౌంకణాంశ్చైవ ద్రావిదాన్ దాక్షిణాయనాన్, ఆవన్యాన్ మాగధాంశ్చైవ బ్రాహ్మణాంస్తు వివర్జయేత్. చంద్రికాయాం యమః - కాణాః కుబ్జాశ్చ షండాశ్చ కృతఘ్నా గురుతల్పగాః, మానకూటస్తులా కూటాః శిల్పినో గ్రామ యాజకాః, రాజభృత్యాంధ బధిర మూక ఖల్వాట పంగవః, వణిజో మధుహర్తారో గరదావనదాహకాః సమయానాం చ భేత్తారః ప్రదానే యేనివారకాః ప్రవ్రజ్యోపనివృత్తాశ్చ వృధా ప్రవ్రజితాశ్చయే యశ్చ ప్రవ్రజితాజ్జాతః ప్రవ్రజ్యా వసితశ్చయః, అవకీర్ణీ చ వీరఘ్నో గురుఘ్నః పితృదూషకః. శ్రాద్ధకాశికాయాం కాత్యాయనః - ద్విర్నగ్నః కీలదుశ్చర్మా శుక్లో౽తి కపిలస్తథా, ఛిన్నోష్ఠ ఛిన్న లింగశ్చ నైవకేతన మర్హతి. ద్విర్నగ్నః పిత్రోఃవంశే త్రిపురుషం విచ్ఛిన్న వేదాగ్నిః హేమాద్రౌ మరీచిః - అవిద్ధకర్ణః కృష్ణశ్చలంబ కర్ణస్త దైవచ, వర్జనీయాః ప్రయత్నేన బ్రాహ్మణాః శ్రాద్ధకర్మణి. బ్రాహ్మే - మూకశ్చపూతి నాసశ్చ ఛిన్నాం గశ్చాధికాంగులి, గల రోగీచ గడుమాన్ స్ఫుటితాంగశ్చ సజ్వరః, షండతూవర మందాంశ్చ శ్రాద్ధేష్వేతాన్ వివర్జయేత్. లంబ కర్ణం చాహ తత్రైవ గోభిలః - హనుమూలాదధః కర్ణౌలంబౌతు పరికీర్తితౌ, ద్వ్యంగులౌ త్ర్యం గులౌ శస్తావితి శాతా తపో౽బ్రవీత్. చంద్రికాయాంయమః - ద్వ్యంగులా తీతకర్ణస్య భుంజతే పి తరోనతు. షండశ్చాత్ర చంద్రికోక్తః సప్తవిధోగ్రాహ్యః - యథా - షంఢకోవాతజః షంఢః పండః క్లీబో నపుంసకః కీలకశ్చేతి సప్తైవం క్లీబభేదాః ప్రకీర్తితాః. పరాశరమాధవీయేతు చతుర్దశ విధా ఉక్తాః తేషాం స్వరూపాణి తత్రైవ జ్ఞేయాని.

అను॥ ఇతరులు కూడా హేమాద్రి యందు మాత్స్యోక్తి ఇట్లా - త్రిశంకులను (పర్వత ప్రాంతం) బర్బరులను (వర్ణాశ్రమహీనులు), అంధ్రులను, చీనద్రావిడ, కొంకణులను, కర్ణాటకులను, ఆభీరులను, కలింగులను, ఈదేశాల బ్రాహ్మణులను శ్రాద్ధ భోజనమందు విసర్జించాలి,అని. అక్కడే సౌరపురాణమందిట్లా - అంగవంగ కళింగులను, సౌరాష్ట్రులను, గూర్జరులను, ఆభీరులను, కోంకణులను, ద్రావిడులను, దాక్షిణాయనులను ఆవన్య, మాగధులను ఈ దేశాల బ్రాహ్మణులను భోజనమున విసర్జించాలి,అని. చంద్రిక యందు యమోక్తి ఇట్లా - ఒంటికన్నువాడు, గూనివాడు, షండుడు, గురుతల్పగుడు, కృతఘ్నుడు, కొలవటంలో మోసగించేవాడు (ధాన్యం), త్రాసుద్వారా జోకటంలో మోసగించేవాడు, శిల్పులు గ్రామమందలి అనేక వర్ణముల వారితో యజ్ఞం చేయించేవాడు, రాజభృత్యులు, అంధ, బధిర, మూక, బట్టతల, ఈచబోయినకాలువాడు (కుంటి), వ్యాపారి (వైశ్యవృత్తికలవాడు), తేనే దొంగిలించేవాడు, విషమిచ్చేవాడు, అడవిని కాల్చేవాడు, ఆచారాన్ని ఎదిరించేవాళ్ళు, దానం ఇచ్చేవాణ్ణి నివారించేవాడు, సన్యసించి తిరిగి వచ్చినవారు వైరాగ్యం లేకుండా వ్యర్ధంగా సన్యసించినవాడు సన్యాసికి పుట్టినవాడు, సన్యసించి భ్రష్టుడైనవాడు, స్ఖలిత బ్రహ్మచారి, అగ్నిహోత్రం వదలినవాడు గురువును వధించినవాడు పితృదూషకుడు వీరిని శ్రాద్ధమందు నియోగించరాదు,అని. శ్రాద్ధకాశిక యందు కాత్యాయనుడిట్లా - ద్విర్నగ్నుడు (సున్నతి కలవాడు, లింగమూలమందు చిల్లిచేసి దానికి బంగారు ఉంగరం, ముత్యాలు వగైరా కట్టుకునేవాడు నపుంసకజాతి (ఒకరకం) మందుతున్న చెడు చర్మం కలవాడు, అతి తెలుపువాడు, అతి నలుపువాడు, తెగిన పెదవివాడు, తెగిన లింగము కలవాడు, వీరు

ఆహ్వానమునకు (పూజకు) అనర్హులు,అని. ద్విర్నగ్నః అనగా పితృవంశమందు మూడు పురుషాంతరముల వరకు వేదము, అగ్ని వీని విచ్ఛిత్తి గలవారు. హేమాద్రి యందు మరీచి ఇట్లా – చెవులు కుట్టబడనివాడు, నల్లనివాడు, పొడుగు చెవులవాడు, వీరు శ్రాద్ధకర్మ యందు ప్రయత్నపూర్వకముగా విడువతగిన బ్రాహ్మణులు,అని. బ్రాహ్మమందిట్లా – మూగవాడు, దుర్గంధము గల ముక్కు గలవాడు, తెగిన అంగము కలవాడు, అధికమైన వేళ్ళు కలవాడు, కంఠరోగి, కణితి గలవాడు, స్ఫుటిత అంగుడు, జ్వరం కలవాడు, నపుంసకుడు, సకాలంలో గడ్డాలు మీసాలు రానివాడు, మందుడు వీరిని శ్రాద్ధములందు పిలువరాదు,అని. లంబకర్ణమనగా అక్కడే గోభిలుడిట్లా చెప్పాడు – చెక్కిలి మూలం నుండి ఇంకా కిందికి చెవులుంటే వాడు లంబకర్ణుడని చెప్పబడ్డాడు. రెండు అంగుళములు లేదా మూడు అంగుళములు ఉంటే ప్రశస్తము అని శాతాతపుడు చెప్పాడు,అని. చంద్రికయందు యముడిట్లా – రెండంగుళములకన్న పెద్ద చెవులుంటే వాని శ్రాద్ధమును పితరులు భుజింపరు, అని. చంద్రికయందు షండులు ఏడు రకాలుగా చెప్పబడ్డారు వాటిని ఇక్కడ గ్రహించాలి. ఎట్లాంటే – షండక, వాతజ, షండ, పండ, క్లీబ, నపుంసక, కీలకులని ఈ విధముగా ఏడు రకాల క్లీబ భేదాలు చెప్పారు,అని. పరాశర మాధవీయమందైతే పదునాలుగు విధాలుగా చెప్పబడ్డారు వారి స్వరూపాలను అక్కడే తెలుసుకోవాలి. (నీళ్ళపై వీర్యం తేలుతూ మెరుపులా మెరుస్తుంటే, మూత్రం నురుగు వస్తే వాడు పురుషుడు. ఇట్లా కాకపోతే షండుడు అని ఒక శ్లోకం)

**మూ॥ చంద్రికాయాంశాతాతపః** – అగ్నిష్టోమాదిభిర్యజ్ఞైః యేయజంత్యల్ప దక్షిణైః , శేషా మన్నంన భోక్తవ్యం అపాంక్తాస్తే ప్రకీర్తితాః. ఏతచ్చ శక్తౌ సత్యాం. అపరార్కే భారతే – **అప్రతీకితవస్తేనః** ప్రాణివిక్రయకోఽపివా, పశ్చాచ్చేత్ప్రీత వాన్సోయం సోఽపి కేతన మర్హతి. శ్రాద్ధ దీపికలికాయాం యమః – అపత్నీ కశ్చవర్జ్యః స్యాత్ సపత్నీకోఽప్య నగ్నికః. **తత్రైవాశ్వలాయనః** – ప్రతిమా విక్రయం యోవై కరోతి పతితతస్తుసః, జీవనార్థం పరార్థేని ధృత్వా తీర్థం ప్రయాతియః. మాతా పిత్రోర్వినా సోఽపి పతితః పరికీర్తితః. తత్రైవ జాతూకర్ణ్యః – యత్ర మాతుల జోద్వాహీ యత్రవా వృషలీపతిః, శ్రాద్ధం నగచ్ఛేత్త ద్విప్రాః కృతం యచ్చ నిరామిషం. పితృపుత్రౌ భ్రాతరౌ ద్వౌనిరగ్నిం గుర్విణీపతిం, సగోత్ర ప్రవరం చైవ శ్రాద్ధేషు పరివర్జయేత్. **బృహన్నారదీయే** – శంఖచక్రం మృదాయస్తు కుర్యాత్త ప్తాయసేనవా, సశూద్రవత్ బహిష్కార్యః సర్వస్మాద్ద్విజ కర్మణః. శంఖచక్రాద్యంకనంచ గీతనృత్యాదికం తథా, ఏకజాతేరయం ధర్మోన జాతుస్యా ద్ద్విజన్మనః. తేనయే తప్తముద్రాది విధయః తే శూద్ర విషయా ఇతి. పృథ్వీ చంద్రోదయే – శివకేశవయోరంకాన్ శూలచక్రాదికాన్ ద్విజః నధారయేత మతిమాన్ వైదికే వర్త్మని స్థితః, ఇత్యాశ్వలాయనోక్తేశ్చ. నృత్యం చోదరాద్యర్థం నిషిద్ధమితి శ్రీధరస్వామీ. అన్యేఽపి నిషిద్ధా నిబంధేషు జ్ఞేయా ఇతిదిక్. అథవిప్రాణాం గ్రాహ్యత్వోక్త్యైవ తద్వర్జ్యానాం నిషేధే సిద్ధే పునర్వర్జ్య పరిగణనం నిషిద్ధవర్జ్య నిర్గుణ ప్రాప్త్యర్థమితి విజ్ఞానేశ్వరః.

అను॥ చంద్రికయందు శాతాతపుడిట్లు - అల్ప దక్షిణలతో అగ్నిష్టోమాది యజ్ఞములు చేసేవారి అన్నము తినరాదు. వారు పంక్తి బాహ్యులు అనబడ్డారు,అని. ఇది శక్తి ఉన్న పక్షంలో. అపరార్క మందు భారతోక్తి ఇట్లు - అవ్రతి (విద్యా, వ్రత, విద్యావ్రత స్నాతకుడు), జూదరి, దొంగ, ప్రాణి విక్రయకారి వీరంతా తరువాత సోమ (యాగ) రసం సేవించిన యెడల వీరు నిమంత్రణకు అర్హులు,అని. శ్రాద్ధదీప కలిక యందు యముడిట్లు - భార్య లేనివానిని, భార్య ఉన్నా అగ్నిలేని వానిని శ్రాద్ధంలో విడిచి పెట్టాలి,అని. అక్కడే ఆశ్వలాయనుడిట్లు - ప్రతిమలను అమ్మేవాడు పతితుడు, తలిదండ్రుల అస్థికలు లేకుండా బ్రతుకుదెరువు కొరకు ఇతరుల అస్థికలు ధరించి తీర్థానికి పోయేవాడు కూడా పతితుడు అనబడ్డాడు,అని. అక్కడే జాతుకర్ణి ఇట్లు - మేనమామ కూతురును వివాహ మాడినవాడు శూద్ర స్త్రీని వివాహమాడినవాడు వీరి శ్రాద్ధమునకు విప్రులార వెళ్ళరాదు మాంసం లేకుండా చేయబడ్డ శ్రాద్ధమునకు వెళ్ళరాదు,అని. తండ్రికొడుకు, అన్నదమ్ములు, అగ్ని లేనివాడు, గర్భిణి భర్త, సగోత్రుడు, సమాన ప్రవరుడు వీరిని శ్రాద్ధమందు విడిచిపెట్టాలి. బృహన్నారదీయమందిట్లు - శంఖచక్రములను మట్టితో కాని కాల్చిన ఇనుముతో కాని ధరించిన వానిని శూద్రునివలె అన్ని ద్విజకర్మల నుండి బహిష్కరించాలి,అని. శంఖచక్రాది చిహ్నధారణ, గీత నృత్యాదులు ఇవి శూద్ర ధర్మములు. బ్రాహ్మణ ధర్మములు ఎప్పుడూ కావు. అందువల్ల తప్త ముద్రాది విధులన్ని శూద్ర విషయములు అని. పృధ్వీ చంద్రోదయ మందిట్లు - శివకేశవుల చిహ్నాలను శూల చక్రాదులను ద్విజుడు, బుద్ధిమంతుడు ధరించరాదు, వైదిక మార్గమందున్నవాడు,అని. అని ఆశ్వలాయనోక్తి కూడ.నృత్యమును ఉదరపోషణాదుల కొరకు నిషిద్ధము అని శ్రీధరస్వామి. ఇతరమైన నిషిద్ధములు కూడా నిబంధములందు చూచి తెలుసుకోవాలి, అని. ఇక చాలు ఇక్కడ విప్రులలో స్వీకరించతగినవారు అని చెప్పటం ద్వారానే, విడువతగిన వారి నిషేధం సిద్ధించగా, తిరిగి విడువతగిన వానిని గూర్చి చెప్పటం, నిషిద్ధములు, విడువతగినవి పోగా నిర్గుణములైన వాని ప్రాప్తి కొరకే అని విజ్ఞానేశ్వరుడు అన్నాడు.

మూ॥ **కుష్ఠికాణౌ దేరపవాదో** హేమాద్రౌ వసిష్ఠః - అపి చేన్మంత్ర విద్యుక్తః శారీరైః పంక్తి దూషణైః, అదూష్యంతం యమః ప్రాహ పంక్తి పావన ఏవసః క్వచిద్విప్రాణాం **జాతిమాత్రేణ గ్రాహ్యత్వముక్తం. చంద్రికాయామాగ్నేయే** - యదిపుత్రోగయాంగచ్ఛేత్ కదాచిత్ కాలపర్యయాత్, తానేవ భోజయేద్విప్రాన్ బ్రహ్మణాయే ప్రకల్పితాః. బ్రాహ్మణాకృత సంస్థానా విప్రా బ్రహ్మ సమాః స్మృతాః. అమానుషాగయా విప్రా బ్రహ్మణాయే ప్రకల్పితాః. తేషు తుష్టేషు సంతుష్టాః పితృభిః సహదేవతాః. **తత్రైవ - నవిచార్యం** కులం శీలం విద్యాచ తప ఏవచ. పూజితైః తైస్తు సంతుష్టా దేవాః స పితృగుహ్యకాః. గయాయాం నిర్గుణాఅపితే ఏవభోజ్యా ఇతి హేమాద్రిః. అక్షయవటశ్రాద్ధే ఏవ తన్నియమో నాన్యత్రేతి త్రిస్థలీసేతౌ పితామహచరణాః. **పృథ్వీ చంద్రోదయేఽపి పాద్మే-తీర్థేషు** బ్రాహ్మణం నైవ పరీక్షేత కదాచన, అన్నార్థిన మను ప్రాప్తం భోజ్యంతం మనుర బ్రవీత్. **సాంబ్దేఽపి** - బ్రాహ్మణాన్న పరీక్షేత తీర్థే క్షేత్ర నివాసినః. **మనుః**

– న బ్రాహ్మణం పరీక్షేత దైవేకర్మణి ధర్మవిత్, పిత్ర్యేకర్మణితు ప్రాప్తే పరీక్షేత ప్రయత్నతః. అసంభవ పరమే తదితిమేధా తిథిః. **హేమాద్రౌవ్యాసః** – గాయత్రీ సారమాత్రోఽపి వరం విప్రః సుమంత్రితః నాయంత్రితశ్చతు ర్వేదీ సర్వాశీ సర్వవిక్రయీ. కాణాః కూటాశ్చ కుబ్జాశ్చ దరిద్రా వ్యాధితాస్తథా. సర్వే శ్రాద్ధేనియోక్త వ్యామిశ్రితా వేదపారగైః.

అను॥ కుష్ఠురోగి, ఒంటికన్నువాడు మొదలగు వారికి అపవాదాన్ని హేమాద్రి యందు వశిష్ఠుడిట్లా – శరీర కారణాలవల్ల పంక్తి దూషణులైనా వేద మంత్ర విదులై యోగ్యులైతే వారు అదూష్యులే అని యముడన్నాడు. అ తడు పంక్తి పావనుడే, అని ఒకచోట విప్రులకు జాతిమాత్రం వల్లనే స్వీకార్యత అని చెప్పారు. చంద్రికయందు ఆగ్నేయపురాణోక్తి ఇట్లా – ఎప్పుడైనా కాల ప్రభావంవల్ల కుమారుడు గయకు వెళ్ళినట్లైతే, అక్కడ ఏ బ్రాహ్మణులు కల్పింపబడ్డారో (ఏర్పాటు) ఆబ్రాహ్మణులనే భుజింపచేయాలి. ఆ బ్రాహ్మణులు బ్రహ్మచే ఏర్పరచబడ్డారు. వారు బ్రహ్మతో సమానమైన వారు అనబడ్డారు. బ్రహ్మతో ఏర్పరుచబడ్డ ఆ గయ బ్రాహ్మణులు మనుష్యమాత్రులు కారు (దేవతా స్వరూపులు అని). వారు సంతోషపడితే పితరులతో సహ దేవతలంతా సంతృప్తి నందుతారు,అని. అక్కడే – వారికుల, శీలములను విద్య, తపశ్శక్తులను విచారించరాదు. వారిని పూజిస్తే దేవతలు, పితరులు, గుహ్యకులు (నిధిరక్షకులు) ఆనందిస్తారు,అని. గయలో నిర్గుణులైనా వారినే భుజింపచేయాలి. అని హేమాద్రి. అక్షయవట శ్రాద్ధమందే ఆనియమము ఇతరచోట్లకాదు అని త్రిస్థలీ సేతువు యందు పితామహచరణులన్నారు. పృథ్వీచంద్రోదయ మందు కూడా పాద్మోక్తి ఇట్లా – తీర్థములందు బ్రాహ్మణుని ఎప్పుడూ పరీక్షించరాదు. అన్నార్థియై వచ్చిన వానిని భుజింపచేయాలి,అని మనువు చెప్పాడు,అని. స్కాందమందు కూడా – తీర్థమందు, క్షేత్రమందున్న బ్రాహ్మణులను పరీక్షించరాదు,అని. మనువిట్లా – ధర్మమెరిగినవాడు, దైవకర్మయందు బ్రాహ్మణుని పరీక్షించరాదు. పితృకర్మ ప్రాప్తించినట్లైతే ప్రయత్న పూర్వకముగా పరీక్షించాలి,అని. ఇది అసంభవపరము అని మేధాతిథి. హేమాద్రి యందు వ్యాసుడిట్లా– సంయమంగల, గాయత్రీసారాన్ని మాత్రమైన ఎరిగిన బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు సంయమం లేనివాడు, అన్నితినేవాడు, అన్ని అమ్మేవాడు చతుర్వేద పారగుడైనా శ్రేష్ఠముకాదు,అని. ఒంటికన్నువారు, కుటిలులు, గూనివారు, దరిద్రులు, వ్యాధితులు, వీరందరిని వేదపారగులతో కలిపి దైవిక శ్రాద్ధమందునియోగించాలి,అని.

**మూ॥ అథవిప్రనిమంత్రణం – చంద్రికాయాంవారాహే–** వస్త్ర శౌచాదికర్తవ్యం శ్వః కర్తా స్మీతి జానతా, స్థానోపలేపనం కృత్వా తతోవిప్రాన్నిమంత్రయేత్. దంతకాష్ఠంచ విసృజేత్ బ్రహ్మచారీ శుచిర్భవేత్. **తత్రైవ ప్రచేతాః** – దక్షిణం చరణం విప్రః సవ్యంవై క్షత్రియస్తథా పాదా వాదాయ వైశ్యో ద్వౌశూద్రః ప్రణతి పూర్వకం. **బృహస్పతిః** – ఉపవీతీ తతో భూత్వా దేవార్థంతు ద్విజోత్తమాన్, అపసవ్యేన పిత్రేఽథ స్వయం శిష్యోఽథవా సుతః. **ప్రచేతాః** – సవర్ణం ప్రేషయే ద్దాప్తం ద్విజానాంతు నిమంత్రణే. **పృథ్వీచంద్రోదయే స్కాందే** – రాజకార్యే నియుక్తస్య

బంధ నిగ్రహ వర్తినః, వ్యసనేషు చ సర్వేషు శ్రాద్ధం విప్రేణ కారయేత్. చంద్రికాయాం యమః - అభోజ్యం బ్రాహ్మణ స్యాన్నం వృషలేన నిమంత్రితం, తథైవ వృషలస్యాన్నం బ్రాహ్మణేన నిమంత్రితం. **తత్రైవ పైఠీనసిః** - సప్త పంచద్వావాశ్రోత్రియాన్నిమంత్రయేత్. ఆశ్వలాయన గృహ్యసూత్రే-ఏకైకం ఏకైక స్యద్వౌద్వౌత్రీన్ స్త్రీ న్వావృద్ధౌ ఫల భూయస్త్వం, ద్వావితి వృద్ధిశ్రాద్ధే. గౌతమః - నవావరాన్ భోజేయేద యుజోవా యథోత్సాహమ్. యాజ్ఞవల్క్యః. ద్వౌ దైవేప్రాక్ త్రయః పిత్ర్యే ఉదగేకైక మేవ వామాతా మహానామప్యేవంతంత్రం వా వైశ్వదేవికం. దీపకలికాయాం పరాశరః - సంపత్తా వథ పాత్రాణాం ఏకైకస్య త్రయస్త్రయః, పిత్రాదేః బ్రాహ్మణాః ప్రోక్తాశ్చత్వారో వైశ్వదేవికే. వృద్ధయాజ్ఞవల్క్యః - దశైకం పంచ వా విప్రాన్ పార్వణే వినియోజయేత్. అత్ర వైశ్వదేవేద్వౌ చతురోవోప వేశ్య పిత్ర్యాదీనామేకైకస్యస్థానే ఏకంత్రీన్ పంచ సప్తనవ వోపవేశయే దితి నిక్షణ్ణోఽర్థః. మనుః - ద్వౌదైవే పితృకృత్యేత్రీన్ ఏకైక ముభయత్రవా, భోజయేత్సు సమృద్ధోఽపి న ప్రసజ్యేత విస్తరే. సత్క్రియాం దేశకాలౌచ శౌచం బ్రాహ్మణ సంపదం, పంచైతాన్ విస్తరో హంతి తస్మాన్నేహేత విస్తరం. పృథ్వీచంద్రోదయే శాతా తపః - ద్వౌ దైవేఽథర్వణౌ విప్రౌ ప్రాఙ్ముఖావుపవేశయేత్, పిత్ర్యేతూదఙ్ ముఖాం స్త్రీంశ్చ బహ్వృచాధ్వర్యు సామగాన్. అత్యశక్తౌ హేమాద్రౌ దేవలః - ఏకేనాపి హి విప్రేణ షట్ పిండం శ్రాద్ధమాచరేత్, షడర్ ఘ్యాన్ దాపయేత్తత్ర షడ్భ్యో దద్యాత్తథా హవిః. గోభిలః - యద్యేకం భోజయే చ్ఛ్రాద్ధే ఛందోగం తత్ర భోజయేత్, ఋచోయజూం షి సామాని త్రితయంతత్ర విద్యతే.

అను॥ ఇక బ్రాహ్మణ నిమంత్రణము. చంద్రికయందు వారాహోక్తి ఇట్లా - వస్త్రములు ఉతుకుట మొదలగునవి ముందు రోజు చేయాలి. నేనే కర్తను అని జ్ఞప్తి యందుంచుకొని చేయాలి. శ్రాద్ధ స్థలాన్ని అలకాలి. ఆ పిదప బ్రాహ్మణులను నిమంత్రణ చేయాలి. దంత కాష్ఠమును వాడరాదు. బ్రహ్మచారిగా ఉండాలి, శుచిగా ఉండాలి. (ఇదంతా ముందురోజే) అని. అక్కడే ప్రచేతుడిట్లా - విప్రుడు కుడిపాదమును (మోకాలువద్ద) స్పృశించి, క్షత్రియుడు ఎడమ పాదమును స్పృశించి, వైశ్యుడు రెండు పాదముల గ్రహించి, శూద్రుడు నమస్కార పూర్వకముగా బ్రాహ్మణుని నిమంత్రణ చేయాలి,అని. బృహస్పతి ఇట్లా - పిదప సవ్యంగా (ఉపవీతుడై) దేవార్థము బ్రాహ్మణోత్తములను నిమంత్రణ చేయాలి. ఇక పితరులకొరకైతే అపసవ్యంగా (తో) స్వయంగా కాని శిష్యుని ద్వారాగాని, లేదా సుతుని ద్వారా కాని నిమంత్రణ చేయాలి,అని. ప్రచేతుడిట్లా - ద్విజ నిమంత్రణ యందు సవర్ణుడైన, ఆప్త (బ్రాహ్మణు)ని పంపాలి,అని. పృథ్వీ చంద్రోదయమందు స్కాందోక్తి ఇట్లా - రాజకీయ కార్యంలో నియోగింప బడేవాని బంధన, నిగ్రహము లందున్నవాని (కట్లు, అరెస్టు), అన్ని వ్యసనములందున్నవాని శ్రాద్ధమును బ్రాహ్మణునితో చేయించాలి,అని. చంద్రికయందు యముడిట్లా - వృషలుడు నిమంత్రణచేస్తే ఆ అన్నమును బ్రాహ్మణుడు తినరాదు. అట్లాగే బ్రాహ్మణుడు నిమంత్రణ చేస్తే ఆ అన్నమును వృషలుడు తినరాదు,అని. అక్కడే పైఠీనసి ఇట్లా - (పార్వణమందు) ఏడుగురు లేదా ఐదుగురు లేదా ఇద్దరు బ్రాహ్మణులను నిమంత్రణ చేయాలి,అని. ఆశ్వలాయన గృహ్యసూత్రమందిట్లా - ఒక్కొక్కనికి ఒక్కొక్కణ్ణి లేదా ఇద్దరిద్దరిని

లేదా ముగ్గురు ముగ్గురిని (పితరులకొరకు) నిమంత్రణ చేయాలి. ఎక్కువైతే ఫలితమెక్కువ. వృద్ధి శ్రాద్ధమందు ఇద్దరు అనేది,అని. గౌతముడిట్లా – తొమ్మిదిలోపు లేదా బేసి సంఖ్యగానో బ్రాహ్మణులను భుజింప చేయాలి, ఉత్సాహానుగుణంగా,అని. యాజ్ఞవల్క్యుడిట్లా – (విశ్వే) దేవులకైతే ఇద్దరు ప్రాజ్ ముఖంగాను, పితరులకైతే ముగ్గురు ఉత్తర ముఖంగానూ లేదా దైవ పితరులకై ఒక్కొక్కడే కాని, బ్రాహ్మణుడు ఉండాలి. మాతా మహులకు కూడా ఇట్లాగే. వైశ్వదేవికమును శాస్త్ర ప్రకారము ఆచరించాలి,అని. దీప కలికయందు పరాశరుడిట్లా – సంపత్తి ఉంటే, యోగ్యులైన బ్రాహ్మణులు దొరికితే, ఒక్కొక్క స్థానానికి ముగ్గురు, ముగ్గురు బ్రాహ్మణులను పిత్రాదులకై ఏర్పరచాలి. వైశ్వ దేవికమందు నలుగురు బ్రాహ్మణులు అని చెప్పారు,అని. వృద్ధ యాజ్ఞ వల్క్యులిట్లా – పార్వణమందు పదకొండు లేదా ఐదుగురు బ్రాహ్మణులను ఏర్పరచాలి. ఇక్కడ వైశ్వ దేవమందు ఇద్దరు లేదా నలుగురో కూర్చోపెట్టాలి. పిత్రాదులకు ఒక్కొక్కరి స్థానంలో ఒక్కణ్ణో, ముగ్గురినో, ఐదుగురినో, ఏడుగురినో తొమ్మిది మందినో కూర్చోబెట్టాలి, అని తేలిన సారాంశము,అని. మనువు ఇట్లా – దైవులకై ఇద్దరు, పితరులకై ముగ్గురు లేదా రెండు చోట్ల ఒక్కరొక్కరే కాని ఉండాలి. ఎంత సమృద్ధికలవాడైనా ఇట్లాగే భుజింప చేయాలి. విస్తారం చేయరాదు. సత్క్రియను దేశకాలములను, శుచిని, బ్రాహ్మణ (రాక) సమృద్ధిని ఈ ఐదింటిని విస్తారము చంపుతుంది. కనుక విస్తారముగా చేయాలని కోరుకోరాదు,అని. పృథ్వీచంద్రోదయమందు శాతాతపుడిట్లా – దైవులకై అధర్వణ వేద బ్రాహ్మణులను ఇద్దరిని ప్రాజ్ ముఖంగా కూర్చోపెట్టాలి. పితరులకై ఉదజ్ ముఖులుగా ముగ్గురిని బహ్వృచ (ఋక్) అధ్వర్యు (యజుర్) సామవేదులను బ్రాహ్మణులను కూర్చోపెట్టాలి,అని. అత్యంత అశక్తుడైతే హేమాద్రి యందు దేవలుడిట్లా – ఒక్క బ్రాహ్మణునితోనే షట్ పింద శ్రాద్ధ మాచరించాలి. అక్కడ ఆరు అర్ఘ్యములను ఇప్పించాలి. అట్లాగే ఆరుగురికి హవిస్సు ఇవ్వాలి,అని. (అశక్తి అంటే అన్నాభావం, బ్రాహ్మణాభావం) (తీర్థమందు మహాలయ మందు ఒక్కనికే అన్నము. అర్ఘ్యము పిండము, విడివిడిగా ఇవ్వాలి). గోభిలుడిట్లా – ఒకవేళ ఒక్కనికే భోజనం పెడ్తే శ్రాద్ధంలో, అక్కడ సామవేదిని భుజింప చేయాలి (ఛందోగం) అక్కడ ఋక్, యజుస్, సామములు ఈమూడు ఉన్నాయి,అని.

**మూ॥ అత్రవైశ్వదేవే విశేషమాహ** తత్రైవ వసిష్ఠః – యద్యేకం భోజయేచ్ఛ్రాద్ధే దైవం **తత్ర కథం భవేత్, అన్నం పాత్రే** సముద్ధృత్య సర్వస్య ప్రకృతస్యచ, దేవతా యతనే కృత్వాతతః శ్రాద్ధం సమాచరేత్. ప్రాస్యేదగ్నౌ తదన్నంతు దద్యాద్వా బ్రహ్మచారిణే. ఏతచ్చ సపిండీకరణ వర్జంజ్ఞేయం, "నత్వే వైకం సర్వేషాం, కామమనా(న్నా)ద్యే". ఇత్యాశ్వలాయనోక్తేః. అస్యార్థ ఉక్తో నారాయణ వృత్తౌ – అద్యం సపిండకరణం తద్వర్జ్యేషు (సర్వ) శ్రాద్ధేషు కామంత్రయాణా మేకం భోజయేత్, సపిండీకరణేతు నియతం త్రిభిర్భావ్యమితి. అనాద్యేఽభోజనే పార్వణ వర్జితేవా ఆ మహామశ్రాద్ధా దౌవా. అన్నాభావేచేతి వ్యాఖ్యాన్తరం తత్రైవ జ్ఞేయం. కారికాఽపి– దైవే పిత్ర్యేఽథ వైకైకం సపిండీకరణం వినా,ఇతి. అత్రైక విప్రే సాగ్నేర్వి శేషమాహ పృథ్వీ చంద్రోదయే ప్రచేతాః– ఏకస్మిన్ బ్రాహ్మణేదైవే సాగ్నేరగ్నిర్భవేత్సదా. అనగ్నేః కుశముష్టిః స్యాత్ శ్రాద్ధకర్మణి

సర్వతః. **సర్వథా విప్రాలాభే** తత్రైవ హేమాద్రౌ సత్యవ్రతః - నిధాయ దర్భనిచయ మాసనేషు సమాహితః, ప్రైషాను ప్రైష సంయుక్తం సర్వం శ్రాద్ధం ప్రకల్పయేత్. అత్రాన్యా భావాత్ సత్రే ఋత్విక్కార్యే యజమాన విధౌన దక్షిణా, ఇతికేచిత్ తన్న, అదృష్టార్థాయాః దక్షిణాయాః ప్రాప్తేః - సర్వం సత్ త్రిజటేతుభ్యం యచ్చ శ్రాద్ధ మదక్షిణం, ఇతి పాద్మాత్, విదధ్యాద్యోత్రమన్య శ్చే ద్దక్షిణార్థ హరోభవేత్, స్వయం చేదుభయం కుర్యాదన్యస్మై ప్రతిపాదయేత్, ఇతి ఛందోగ పరిశిష్టాచ్చ. ఏవం యతిశ్రాద్ధేఽపి. **కాత్యాయనః** - యజ్ఞవస్తుని ముష్టౌచ స్తం బేదర్భవటౌ తథా, దర్భసంఖ్యా న విహితా విష్టరాస్తరణేషుచ. **మాతృశ్రాద్ధేతు** - విప్రాలాభే సువాసిన్యోఽపి భోజనీయా ఇత్యాహ పరార్కే వృద్ధ వసిష్ఠః - మాతృశ్రాద్ధేతు విప్రాణా మలాభే పూజయేదపి, పతిపుత్రాన్వితా భవ్యా యోషితోఽష్టౌ కులోద్భవాః,ఇతి. అష్టావితి వృద్ధిశ్రాద్ధ విషయం. **పాద్మే ఉత్తరఖండే** - సకృద భ్యర్చితం లింగం శాలగ్రామ శిలాంచయః, పీఠే సంస్థాపయిత్వాతు శ్రాద్ధం చ కురుతేనరః, పితరః తస్య తిష్ఠంతి కల్పకోటిశతందివి.

అను॥ ఇక్కడ వైశ్వదేవమందు విశేషాన్ని అక్కడే వసిష్ఠుడు ఇట్లా చెప్పాడు - శ్రాద్ధమందు ఒకవేళ ఒకనికే భోజనం పెడితే అక్కడ దైవమెట్లా ఉంటాడు. ప్రకృతమైన అన్నం మొత్తాన్ని (విశ్వేదేవ బ్రాహ్మణ భోజనానికి సరిపోయే అన్నాన్ని) పాత్రయందు తీసి, దానిని దేవతా మందిరమందుంచి, పిదప శ్రాద్ధ మాచరించాలి. ఆ అనాన్ని అగ్ని యందు వేయాలి. (భోజన అభ్యనుజ్ఞపిదప) లేదా బ్రహ్మచారికి గాని వ్వాలి. దీనిని (ఏక బ్రాహ్మణ నిమంత్రణ)సపిండీకరణమందు చేయరాదని తెలుసుకోవాలి. ఆశ్వలాయనోక్తి ననుసరించి దాని అర్థాన్ని నారాయణవృత్తి యందిట్లా చెప్పారు - తొలుతది సపిండీకరణము, దానిని వదలి అన్ని శ్రాద్ధములందు కామం అనగా ముగ్గురికై ఒకనినే భుజింపచేయాలి. సపిండీకరణమందైతే తప్పకుండా ముగ్గురుండాలి,అని. అనాద్యమనగా భోజనం లేనిదాని యందు, పార్వణ వర్జితమైన దానియందుకాని ఆమ హేమ శ్రాద్ధాదులందు కాని. అన్నాభావ మందు కూడా (సంపద అభావం, దుర్భిక్షం) అని మరో వ్యాఖ్య అక్కడే, తెలుసుకోవాలి. కారిక కూడా - దైవమందు కాని పిత్ర్యమందు కాని ఒక్కొక్కడే సపిండీకరణంలో తప్ప,అని. ఇక్కడ ఒకే విప్రుడైతే సాగ్నికునకు పృథ్వీ చంద్రోదయమందు ప్రచేతుడు విశేషాన్ని చెప్పాడిట్లా - ఒకే బ్రాహ్మణుడున్నట్లైతే దైవకార్యమందు అగ్నికలవానికి అగ్ని ఎల్లప్పుడు ఉంటాడు. అగ్ని లేనివానికి కుశ ముష్టి అంతటా శ్రాద్ధకర్మ యందు ఉంటుంది,అని. అన్ని విధముల బ్రాహ్మణుడు లభించకపోతే అక్కడే హేమాద్రి యందు సత్యవ్రతుడిట్లా - ఆసన పీఠములందు దర్భల సమూహమును ఉంచి సావధానుడై ప్రైష అనుప్రైషలతో కూడా సంపూర్ణ శ్రాద్ధాన్ని ఆచరించాలి,అని. (ప్రైష = తృప్తాస్థః - తృప్తాస్మః అడగటం, చెప్పటం వీడు వాడికి ఆజ్ఞ. వాడు మరొకడికి ఆజ్ఞ ఇవ్వటం అను ప్రైష) ఇక్కడ మరొక్కరు లేరు కనుక సత్రయాగమందు వలె ఋత్విక్కార్యమందు యజమాన విధియందు దక్షిణ లేదు, అని కొందరంటారు. అట్లాకాదు, అదృష్టార్థము కొరకు దక్షిణా ప్రాప్తి. ఓ త్రిజట ! అదంతా, దక్షిణలేని శ్రాద్ధమంతా

నీకొరకు, అని పద్మపురాణోక్తి. హోత్రం మరొకరు చేసినట్లైతే ఆతడు దక్షిణలో సగభాగం తీసుకుంటాడు. తానే స్వయంగా రెండు చేస్తే ఇతరులకు దక్షిణ నివ్వాలి,అని. ఛందోగ పరిశిష్టంలోంచి తెలుస్తోంది. ఇట్లా యతి శ్రాద్ధమందు కూడా. కాత్యాయనుడిట్లా - యజ్ఞవస్తువుయందు, ముష్టియందు (అందలి కుశలు) స్తంబ మందు (వరిగంట), దర్భవటువు యందు, ఆసనంపై పరచబడే దర్భల విషయంలోను వీటన్నింటిలో దర్భసంఖ్య చెప్పబడలేదు,అని. మాతృశ్రాద్ధమందైతే బ్రాహ్మణుడు లభించని పక్షంలో సువాసినులను కూడా భుజింప చేయాలి,అని అపరార్కమందు వృద్ధవసిష్ఠుడిట్లా చెప్పాడు - మాతృశ్రాద్ధమందు బ్రాహ్మణులు లభించని పక్షంలో, పతిపుత్రులు గల, శరీర ఆచారములతో సుందరులైన, మంచి కులమందు జన్మించిన ఎనిమిది మంది స్త్రీలను పూజించాలి,అని. ఎనిమిది మంది అనటం వృద్ధి శ్రాద్ధ విషయకము. పాద్మ ఉత్తర ఖండమందిట్లా - ఒకసారి పూజించిన లింగాన్ని లేదా సాలగ్రామ శిలనుకాని పీఠమందుంచి శ్రాద్ధమాచరించినచో, అతని పితరులు నూరుకోట్లకల్పముల కాలము స్వర్గమందుంటారు, అని.

మూ॥ **చంద్రికాయాంమాత్స్యే** - పతన్నిమంత్ర్య నియమాన్ శ్రావయేత్ పైతృకాన్ బుధః, అక్రోధనైః శౌచపరైః సతతం బ్రహ్మచారిభిః, భవితవ్యం భవద్భిశ్చ మయాచ శ్రాద్ధకారిణా. యత్తు మనుః- సర్వాయా సవి నిర్ముక్తైః కామక్రోధ వివర్జితైః, భవితవ్యం భవద్భిర్నః శ్వోభూతే శ్రాద్ధకర్మణి, ఇతి తత్పూర్వేద్యుః నిమంత్రణ పరం న తదహః. తత్రైవ దేవలః - అసంభవే పరేద్యుర్వా బ్రాహ్మణాం స్తాన్నిమంత్రయేత్, అజ్ఞాతీన సమానార్షానయుగ్మా నాత్మశక్తితః. కాత్యాయనః - **అనింద్యేన ఆ మంత్రితో నాపక్రమేత్.** కేతనం గృహ్యశక్తః. **అథశ్రాద్ధకర్తృభోక్తృనియమః - తత్ర నిమంత్రిత విప్రత్యాగేఽపరార్కే** యమః - కేతనం కారయిత్వాతు యోఽతి పాతయతి ద్విజం, బ్రహ్మహత్యామవాప్నోతి శూద్రయోనౌచ జాయతే. ఆమంత్ర్య బ్రాహ్మణం యస్తు యథా న్యాయం న పూజయేత్, అతి కృచ్ఛ్రాసు ఘోరాసు తిర్యగ్యోనిషు జాయతే. ప్రమాదా త్త్యాగేతు హారీతః - ప్రమాదా ద్విస్మృతం జ్ఞాత్వా ప్రసాద్యైనం ప్రయత్నతః, తర్పయిత్వా యథాన్యాయం సర్వంత తృల మశ్నుతే. ప్రమాదా భావేతు నారాయణః - ఏతస్మిన్నే నసిప్రాప్తే బ్రాహ్మణో నియతః శుచిః, యతిచాం ద్రాయణం కృత్వా తస్మాత్పాపాత్ప్రముచ్యతే. యమః - అమంత్రితస్తు యోవిప్రో భోక్తు మన్యత్ర గచ్ఛతి, నరకాణాంశతం గత్వా చాండాలేష్వభిజాయతే. తత్రైవదేవలః - పూర్వం నిమంత్రితోఽన్యేన కుర్యాత్ అన్యప్రతిగ్రహం, భుక్తాహారోఽథవా భుంక్తే సుకృతం తస్యనశ్యతి. యదివిప్రో విలంబతే, తదోక్త మాదిత్యపురాణే - ఆమంత్రితశ్చిరం నైవ కుర్యాద్విప్రః కదాచన దేవతానాం పితౄణాం చ దాతురన్నస్య చైవహి. చిరకారీ భవేద్ద్రోహీ పచ్యతే నరకాగ్నినా. పృథ్వీ చంద్రోదయే యమః - నిమంత్రితస్తుయో విప్రోహ్యధ్వానం యాతి దుర్మతిః, భవంతి పితరస్త స్యతం మాసం పాంశు భోజనాః. అమంత్రితస్తుయః శ్రాద్ధే హింసాం వై కురుతే ద్విజః, తంమాసం పితరస్తస్య భవంతి రుధిరాశనాః. నిమంత్రితః ప్రకుర్యాత్తు కలహం చేత్ ద్విజః క్వచిత్, భవంతి పితరస్త స్యతం మాసం మలభోజనాః, ఆ మంత్రితస్తు యః శ్రాద్ధే భారము ద్వహతే ద్విజః,

**పితరస్త స్యతం మాసం భవంతి స్వేద భోజనాః.**

అను॥ చంద్రికయందు మాత్స్యోక్తి ఇట్లా. - నిమంత్రణ చేసి, నియమములను పఠిస్తూ పండితుడు (పితృ) శ్రాద్ధ బ్రాహ్మణులను గూర్చి వినిపించాలి ఇట్లా - అక్రోధనులు, శుచిపరులు, ఎల్లప్పుడు బ్రహ్మచారులుగా మీరుండాలి, శ్రాద్ధంచేసే నేను కూడా ఉండాలి, అని. మనువిట్లా - అన్ని ఆయాసముల నుండి వినిర్ముక్తులు, కామక్రోధ వివర్జితులుగా మీరుండాలి, రేపు జరుగబోయే మా శ్రాద్ధకర్మయందు, అని పలికినది ముందు రోజు నిమంత్రణ చేసిన విషయము, కాని ఆరోజు నిమంత్రణ చేస్తే కాదు. అక్కడే దేవలుడిట్లా - ముందురోజు సాధ్యం కానిచో తరువాతి రోజుకాని, జ్ఞాతులుకాని, సమాన ఋషులు లేని (ప్రవరలో), యుగ్మం కాని అట్టి బ్రాహ్మణులను తన శక్తి కొలది నిమంత్రించాలి, అని. కాత్యాయనుడిట్లా - నింద్యుడు కాని వానితో ఆమంత్రింపబడి తొలగిపోరాదు (స్వీకరించాలి). ఆహ్వానాన్ని స్వీకరించాలి శక్తుడు (నింద్యుడు పిలిస్తే, భోక్త అసామర్థ్యమందు అస్వీకారం తగును). ఇక శ్రాద్ధకర్త భోక్తల నియమాలు అక్కడ నిమంత్రితులైన బ్రాహ్మణులను విడిచిపెడితే అపరార్కమందిట్లా యముడు - ఆహ్వానాన్ని ఇచ్చి, ఆ బ్రాహ్మణుని విడిచిపెడితే కర్త బ్రహ్మహత్యా పాపాన్ని పొందుతాడు. శూద్రయోని యందు జన్మిస్తాడు,అని. బ్రాహ్మణుని ఆమంత్రణ చేసి శాస్త్ర ప్రకారము పూజించనిచో, మిక్కిలి కఠినములైన, ఘోరములైన తిర్యక్ యోనులయందు జన్మిస్తాడు. ఒకవేళ ప్రమాదంవల్ల విడిచి పెడితేనో హారీతుడిట్లా - ప్రమాదం వల్ల మరిచిపోయిన విషయాన్ని గ్రహించి, ఆ బ్రాహ్మణుని ప్రయత్న పూర్వకముగా ప్రసన్నం చేసుకొని, శాస్త్ర ప్రకారముగా తృప్తిపరుస్తే అదంతా ఫలితాన్ని పొందుతుంది,అని. ప్రమాదం వల్ల కాక (మరోరకంగా మరిస్తే) పోతేనో నారాయణుడిట్లా - ఈ రకమైన పాపం సంభవిస్తే బ్రాహ్మణుడు నిగ్రహంతో, శుచియై యతి చాంద్రాయణంచేస్తే ఆపాపం నుండి ముక్తుడౌతాడు, అని. యముడిట్లా - ఆమంత్రణ తీసుకున్నాక ఆ విప్రుడు తిండికై మరోచోటికి పోతే ఆతడు నూరు నరకములు అనుభవించి, చాండాలురయందు జన్మిస్తాడు,అని. అక్కడే దేవలుడిట్లా - ముందు ఇతరునితో నిమంత్రింపబడి, తిరిగి మరోచోట ప్రతిగ్రహం చేస్తే లేదా భుజించి తిరిగి భుజిస్తే వాని సుకృతము నశిస్తుంది,అని. ఒకవేళ బ్రాహ్మణుడు ఆలస్యం చేస్తే అప్పుడు ఆదిత్య పురాణంలో ఇట్లా చెప్పారు - నిమంత్రణ చేయబడి బ్రాహ్మణుడు ఎప్పుడూ ఆలస్యము చేయరాదు. దేవతలకు, పితరులకు, దాతయొక్క అన్నమునకు ఆ ఆలసించేవాడు ద్రోహి ఔతాడు. నరకాగ్నిలో వండబడుతాడు,అని. పృథ్వీ చంద్రోదయమందు యముడిట్లా - నిమంత్రింపబడిన బ్రాహ్మణుడు దుర్బుద్ధి కలవాడై ప్రయాణం చేస్తే (సీమదాటితే) ఆనెల అంతా ఆతని పితరులు దుమ్మునే భోజనంగా గ్రహిస్తారు, అని. బ్రాహ్మణుడు శ్రాద్ధమందు ఆమంత్రింపబడి, హింస చేస్తే వాని పితరులు ఆనెలలో రుధిరాశనులౌతారు. బ్రాహ్మణుడు నిమంత్రణ చేయబడినాక, ఎక్కడైనా కలహం పెట్టుకుంటే, వాని పితరులు ఆ నెలలో మల భోజనులౌతారు. బ్రాహ్మణుడు శ్రాద్ధమందు

ఆమంత్రణ చేయబడ్డాక బరువును మోస్తే వాని పితరులు ఆ నెలలో స్వేద భోజనులౌతారు.

మూ॥ శంఖః - నిమంత్రితస్తుయః శ్రాద్ధే మైధునం సేవతే ద్విజః, శ్రాద్ధం దత్వా చ భుక్త్వా చ యుజ్యతే మహతైనసా. మైధునం ఋతావపి నిషిద్ధం - ఋతుకాలే నియుక్తోవా నైవ గచ్ఛేత్ స్త్రియంక్వచిత్, తత్ర గచ్ఛన్న వాప్నోతి హ్యనిష్టాని ఫలానితు, ఇతి తత్రైవ మాధవీయే వృద్ధమనూక్తేః. శ్రాద్ధం కరిష్యన్ కృత్వావా భుక్త్వావాపిని మంత్రితః, ఉపోష్య చ తథా భుక్త్వా నోపేయాచ్చ ఋతావపి. భోక్ష్యన్ కరిష్యన్శ్వః శ్రాద్ధం పూర్వరాత్రౌ ప్రయత్నతః, వ్యవాయం భోజనం చాపి ఋతావపి వివర్జయేత్, ఇతి తత్రైవాశ్వలాయనోక్తేశ్చ. విజ్ఞానేశ్వరేణతు శ్రాద్ధే ఋతౌ గచ్ఛతోఽపి నదోష ఇత్యుక్తం తత్తు అగతికగతిత్వే జ్ఞేయం. బృహస్పతిః - ద్వినిశంబ్రహ్మచారీస్యాత్ శ్రాద్ధకృద్బ్రాహ్మణైః సహ, అన్యథా వర్తమానౌతు స్యాతాం నిరయ గామినౌ. పునర్భోజన మధ్వానం భారమాయాస మైధునం, శ్రాద్ధకృత్ శ్రాద్ధభుక్చైవ సర్వమేతత్ వివర్జయేత్. స్వాధ్యాయం కలహం చైవ దివాస్వా పంత ధైవచ. **యత్తు శ్రాద్ధకాశికాయాం** పురాణ సముచ్చయే - కృత్వాతు రుధిర స్రావం నవిద్వాన్ శ్రాద్ధమాచరేత్, ఏకం ద్వేత్రీణివా విద్వాన్ దినాని పరివర్జయేత్, ఇతి. తన్నిర్మూలం. **పృథ్వీచంద్రోదయే యమః** - పునర్భోజన మధ్వానం భారాధ్యయన మైధునం, సంధ్యాం ప్రతిగ్రహం హోమం శ్రాద్ధభోక్తాఽష్ట వర్జయేత్. తత్ర సంధ్యానిషేధః ప్రాయశ్చిత్తాత్ పూర్వం జ్ఞేయః. యథాఽఽహోశనాః - దశకృత్వపి బేదాపోగాయత్ర్యా శ్రాద్ధభుక్ ద్విజః, తతః సంధ్యా ముపాసీత జపేచ్చ జుహుయాదపి. గౌదాస్తు - సాయం సంధ్యా పరాన్నం చ ఛేదనం చవన స్పతేః, అమావాస్యాం నకుర్వీత రాత్రి భోజనమేవచ. ద్యూతం చ కలహం చైవ సాయం సధ్యాందివాశయం, శ్రాద్ధ కర్తా చ భోక్తా చ పునర్భుక్తిం చ వర్జయేత్, ఇతి కామధేనౌ వారాహోద్యుక్తేః శ్రాద్ధ కర్తురపి సాయం సంధ్యా నిషేధమాహుః. శిష్టాస్త్వస్య నిర్మూలత్వమాహుః. హోమ నిషేధస్తు స్వవిషయః. సూతకేచ ప్రవాసేచ అశక్తౌ శ్రాద్ధ భోజనే, ఏవమాది నిమిత్తేషు హోవయేన్నతు హోపయేత్, ఇతి ఛందోగ పరిశిష్టాత్. తత్రైవాదిత్యపురాణే - నిమంత్రితస్తు న శ్రాద్ధే కుర్యాద్భార్యాది తాండనం. చంద్రికాయాం ప్రచేతాః - శ్రాద్ధభుక్ ప్రాతరుత్థాయ ప్రకుర్యాద్దంత ధావనం, శ్రాద్ధకర్తాన కుర్వీత దంతానాం ధావనం బుధః.

అను॥ శంఖుడిట్లా - ద్విజుడు శ్రాద్ధమందు నిమంత్రితుడై మైధున మాచరిస్తే, శ్రాద్ధం చేసి లేదా శ్రాద్ధ భోక్తఐ అట్లాచేస్తే గొప్ప పాపాన్ని పొందుతాడు,అని. మైధునము ఋతుకాలమందు కూడా నిషిద్ధము - భార్య ఋతుకాలమందు, నియుక్తుడైనా తన భార్యను ఎప్పుడూ పొందరాదు. అక్కడికి వెళ్తే అనిష్ట ఫలములను పొందుతాడు,అని అక్కడే మాధవీయ మందు వృద్ధమనూక్తి. శ్రాద్ధం చేయబోతూ లేదా చేసి, భుజించికాని, నిమంత్రితుడై కాని, ఉపవసించికాని, తినికాని ఋతుకాలమందు కూడా స్త్రీని పొందరాదు. రేపు తినబోతూ కాని శ్రాద్ధం చేయబోతూ కాని ఉన్నట్లైతే పూర్వరాత్రమందు ప్రయత్న పూర్వకముగా భోజనము, ఋతుకాలమైనా మైధునము వదిలిపెట్టాలి,అని అక్కడే ఆశ్వలాయనోక్తి కూడా. విజ్ఞానేశ్వరుడైతే శ్రాద్ధమందు, ఋతుకాలమందు స్త్రీని చేరితే కూడా దోషం లేదు అని అన్నాడు, అది అగతికగతి ఐతే అని తెలుసుకోవాలి (మరోదారిలేక అని) బృహస్పతి ఇట్లా

- శ్రాద్ధకర్త బ్రాహ్మణులతో సహ రెండు రాత్రులు బ్రహ్మచారిగా ఉండాలి. మరో రకంగా ఉంటే, వారు నరకానికి వెళ్తారు,అని. మళ్ళీ భోజనం చేయటం, ప్రయాణం, భారం మోయటం, శ్రమ చేయటం, మైథునము వీటిని శ్రాద్ధకర్త, భోక్త విడిచిపెట్టాలి. స్వాధ్యాయము, తగాదా, పగటినిద్ర వీటిని కూడా విడువాలి,అని. శ్రాద్ధకాశిక యందు పురాణ సముచ్చయోక్తి ఇట్లా - రుధిర స్రావం చేసి బుద్ధిమంతుడు శ్రాద్ధం చేయరాదు. ఒకటి లేదా రెండు లేదా మూడు రోజులను విద్వాంసుడు విడువాలి,అని అన్నది. అది ఆధార రహితమైన మాట. పృథ్వీ చంద్రోదయమందు యముడిట్లా - తిరిగి భుజించుట, ప్రయాణము, బరువెత్తుట, అధ్యయనము, మైథునము, సంధ్య, ప్రతిగ్రహము హోమము ఈ ఎనిమిదింటిని శ్రాద్ధ భోక్త విడిచిపెట్టాలి. అక్కడ సంధ్యా నిషేధము ప్రాయశ్చిత్తముకన్న ముందు అని గ్రహించాలి. ఉశనుడిట్లా చెప్పాడు - శ్రాద్ధభోక్త ఐన బ్రాహ్మణుడు పదిమార్లు గాయత్రి పఠించి నీరు తాగాలి. ఆ పిదప సంధ్యోపాసన చేయాలి, జపం చేయాలి, హోమం చేయాలి కూడా,అని. గౌడులైతే - సాయంసంధ్య, పరాన్నము, వనస్పతి ఛేదనము, రాత్రిభోజనము వీనిని అమావాస్య యందు చేయరాదు. ద్యూతము, కలహము, సాయంసంధ్య, పగటినిద్ర, తిరిగి భోజనము, వీటిని శ్రాద్ధకర్త భోక్త ఇద్దరు విడువాలి, అని కామధేనువు యందు వారాహాదుల వచనముంది కనుక శ్రాద్ధకర్త కూడా సాయంసంధ్య చేయరాదు అని ఏదన్నారో దానికి శిష్టులు ఆధారం లేదని అన్నారు. హోమ నిషేధమనునది స్వంత విషయము. సూతకమందు ప్రవాసమందు అశక్తి యందు, శ్రాద్ధభోజనమందు ఇవి, మొదలగు కారణములందు స్వయంగా హోమం చేయరాదు ఇతరులతో చేయించాలి, అని ఛందోగ పరిశిష్టం నుండి తెలుస్తోంది. అక్కడే ఆదిత్యపురాణమందిట్లా - శ్రాద్ధమందు నిమంత్రించబడ్డాక భార్యాదులను కొట్టరాదు,అని. చంద్రికయందు ప్రచేతుడిట్లా - శ్రాద్ధ భోక్త ప్రొద్దున్నే లేచి దంతధావనము చేయాలి. శ్రాద్ధకర్త, బుధుడైనవాడు దంతధావనము చేయరాదు,అని.

మూ॥ **హేమాద్రౌ జాబాలిః** - దంతధావన తాంబూలే తైలాభ్యంగం అభోజనం, రత్యౌషధం పరాన్నం చ శ్రాద్ధ కృత్సప్త వర్జయేత్, ఇతి. **విష్ణురహస్యే** - శ్రాద్ధోపవాసదివసే ఖాదిత్వా దంతధావనం, గాయత్ర్యా శతసంపూత మంబు ప్రాశ్య విశుద్ధ్యతి. **పునర్భోజన మధ్వానం** యాన మాయాసమైథునం, దానం ప్రతి గ్రహో హోమః శ్రాద్ధ భుక్ త్వష్ట వర్జయేత్. **సోమోత్పత్తౌ** - వనస్పతిగతే సోమే యత్తు హింస్యాద్వన స్పతిం, ఘోరాయాం భ్రూణహత్యాయాం యుజ్యతేనాత్ర సంశయః. ఏతత్ విహిత ఇధ్మాది వ్యతిరేకేణ. వనస్పతి గతే సోమేఽ నడుహోయస్తు వాహయేత్, నాశ్నంతి పితరస్తస్య దశవర్షాణి పంచచ, వనస్పతి గతే సోమే మంథనం యస్తు కారయేత్, గావస్తస్య వినశ్యంతి చిరకాల ముపస్థితాః. **వనస్పతి గతస్వరూపమాహ పృథ్వీచంద్రోదయే** వ్యాసః - త్రిముహూర్తం వసేదర్కే త్రిముహూర్తం జలేవసేత్, త్రిముహూర్తం వసేత్ గోషు త్రిముహూర్తం వనస్పతౌ. కాలికాయాం వృద్ధమనుః - నిమంత్ర్య విప్రాంస్తదహః వర్జయేన్మైథునం

క్షురం, ప్రమత్తతాం చ స్వాధ్యాయం క్రోధాశౌ చేతథాఽనృతం. కేచిన్ని మంత్రణాత్ పూర్వం శుద్ధ్యర్థం పూర్వేఽహ్ని క్షౌరం కుర్వంతి తత్రమూలం మృగ్యం. **మరీచిః - షష్ఠ్యాం** పర్వసు పక్షాదౌ, రిక్తా భద్రా తిథిష్వపి, పాతే శ్రాద్ధే వ్రతాహే చ క్షౌరం వర్జ్యం నిశాసు చ. యదా కర్తుర శక్త్యా తత్పుత్ర శిష్యాదిః శ్రాద్ధం కరోతి తదా కర్త్రా ప్రతినిధినా చ ప్రాగుక్త నియమాః కార్యాః. న శక్నోతి స్వయం కర్తుం యదాహ్య నవకాశతః, శ్రాద్ధం శిష్యేణ పుత్రేణ తదాఽన్యేనాపి కారయేత్. నియమానాచరేత్సోఽపి నియతాంశ్చ వసుంధరే, యజమానోఽపి తాన్సర్వానాచరేత్సు సమాహితః ఇతి హేమాద్రౌ వారాహోక్తేః.

అను॥ హేమాద్రియందు జాబాలి ఇట్లా - దంతధావనము, తాంబూలము, తైలాభ్యంగము, ఉపవాసము, రతి, ఔషధము, పరాన్నము శ్రాద్ధకర్త ఈ ఏడింటిని విడిచి పెట్టాలి,అని. విష్ణు రహస్యమందిట్లా - శ్రాద్ధ ఉపవాస దివసమందు, తిని, దంతధావనము చేసిన, గాయత్రితో నూరుసార్లు పవిత్రమైన జలాన్ని తాగి శుద్ధినందుతాడు,అని. మళ్ళీ భోజనము, ప్రయాణము, పల్లకిలో ప్రయాణము, శ్రమ, మైథునము, దానము, ప్రతి గ్రహణము, హోమము, శ్రాద్ధభోక్త ఈ ఎనిమిదింటిని విడిచిపెట్టాలి. సోమోత్పత్తి యందు ఇట్లా - సోముడు వనస్పతిని చేరాక, వనస్పతిని హింసించినవాడు, ఘోరమైన భ్రూణహత్య యందు (ఆపాపముతో) యుక్తుడౌతాడు. ఇందులో అనుమానంలేదు,అని. ఇది విధించబడిన ఇధ్మాదులకు వ్యతిరేకంగా (దానిని వదలి). సోముడు వనస్పతిగతుడు కాగా ఎవడైతే ఎడ్లను బండికి కడ్తాడో, వాని పితరులు పదిహేను సంవత్సరముల వరకు భుజించరు. సోముడు వనస్పతిగతుడు కాగా ఎవడు మంథనం (పెరుగు చిలకటం) చేయిస్తాడో ఆతని ఆవులు, చాలా కాలము నుండి ఉన్నవి కూడా నశిస్తాయి. వనస్పతి గతుడనగా దాని స్వరూపాన్ని పృథ్వీచంద్రోదయమందు వ్యాసుడిట్లా చెప్పాడు - మూడు ముహూర్తముల కాలం సూర్యుని యందు, మూడు ముహూర్తముల కాలం జలము యందు, మూడు ముహూర్తముల కాలము గోవులందు మూడు ముహూర్తముల కాలము వనస్పతియందు సోముడుంటాడు,అని. కాలికయందు వృద్ధమనువిట్లా - బ్రాహ్మణులను నిమంత్రణచేసి ఆ రోజు మైథునము, క్షౌరము, (నఖకృంతనం) సోమరితనం, స్వాధ్యాయం, క్రోధ, అశౌచములు, అనృతము వీటిని వదలాలి,అని. కొందరు నిమంత్రణకన్న ముందు శుద్ధికొరకు పూర్వాహ్ణమందు క్షౌరం చేసుకుంటున్నారు. అక్కడ మూల వాక్యములు కన్పించటంలేదు. మరీచి ఇట్లా - షష్ఠిపర్వములు, పక్షాదులు రిక్తభద్ర తిథులు, వ్యతీపాతము శ్రాద్ధము, వ్రతాహము, రాత్రులు వీని యందు క్షౌరకర్మ చేసుకోరాదు, అని. కర్త అశక్తుడైనప్పుడు ఆతని పుత్ర శిష్యాదులు శ్రాద్ధ మాచరిస్తే, అప్పుడు కర్త, ప్రతినిధి వీరిద్దరు ముందు చెప్పిన నియమాలను ఆచరించాలి. అవకాశం లేనందువల్ల స్వయంగా చేయటానికి అశక్తుడైతే అప్పుడు శ్రాద్ధమును శిష్యునితోనో, పుత్రునితోనో, ఇతరునితోకాని చేయించాలి. ఆతడు కూడా నియమములను ఆచరించాలి, తప్పకుండా ఉన్నవానిని, ఓ వసుంధర ! యజమానుడు కూడా సావధానుడై వాటన్నింటిని

ఆచరించాలి,అని. హేమాద్రి యందు వారాహోక్తి.

మూ॥ **స్త్రియాస్తుపాద్మే** - ముక్త కచ్ఛా తుయానారీ ముక్తకేశీ తథైవచ, హసతే వదతే చైవ నిరాశాః పితరోగతాః. **ఆశ్వలాయనః**- శ్రాద్ధేఽహ్ని భోజయేద్వాస్తౌ నబాలానపియత్నతః, ప్రాక్ పిండదానాద్ గంధాద్యైః నాలంకుర్యాత్ స్వవిగ్రహం. వాస్తౌ = గృహే. అథశ్రాద్ధ వస్తూని - తత్రాదౌకుశాః పృధ్వీచంద్రోదయే దక్షః - సమిత్పుష్పకుశాదీనాం ద్వితీయః పరికీర్తితః. అష్టధా భక్తేదినే ద్వితీయోభాగ ఇత్యర్థః. తత్రైవ యమః - సమూలస్తు భవేద్దర్భః పితౄణాం శ్రాద్ధకర్మణి, మూలేన లోకాన్ జయతి శక్రస్యసు మహాత్మనః. వ్యాసః - తర్పణా దీని కార్యాణి పితౄణాం యానికాని చిత్, తానిస్యుః ద్విగుణైర్దర్భైః సప్త పత్రైర్విశేషతః. శాలంకాయనః - సపండీకరణం యావత్ ఋజుదర్భైః పితృక్రియాః, సపిండీకరణాదూర్ధ్వం ద్విగుణైః విధివద్భవేత్. **శంఖః - అనంతగర్భిణం** సాగ్రం కౌశం ద్విదలమేవచ, ప్రాదేశ మాత్రం విజ్ఞేయం పవిత్రం యత్రకుత్రచిత్. హారీతః - పవిత్రం బ్రాహ్మణస్యైవ చతుర్భిః దర్భ పింజులైః, ఏకైకం న్యూనముద్దిష్టం వర్ణే వర్ణే యథాక్రమం. స్మృత్యర్థసారే - సర్వేషాం వా భవేద్ద్వాభ్యాం పవిత్రం గ్రంథితం నవం. రత్నావల్యాం - ద్వయోస్తు పర్వణోర్మధ్యే పవిత్రం ధారయేత్ బుధః. హేమాద్రౌ స్కాందే - అనామికాధృతా దర్భాహ్యేకా నామిక యాపివా, ద్వాభ్యామ నామికాభ్యాంతు ధార్యే దర్భ పవిత్రకే. పవిత్రా భావేతు తత్రైవ సుమంతుః - సమూలాగ్రౌ విగర్భౌతు కుశౌద్వౌ దక్షిణేకరే, సవ్యే చైవతథా త్రీన్వైబి భృయాత్ సర్వకర్మసు. బౌధాయనః - హస్తయో రుభయోర్ ద్వౌద్వావాసనేఽపి తథైవచ.

అను॥ స్త్రీలకైతే పాద్మమందిట్లా - కచ్ఛలేక (వెనుకవైపుగోచి) వెంట్రుకలను విరబోసుకుని, నవ్వుతూ, మాట్లాడే స్త్రీ యొక్క పితరులు నిరాశులై వెళ్ళిపోతారు,అని. ఆశ్వలాయనుడిట్లా - తన గృహమందు శ్రాద్ధమురోజున పిల్లలనైనా ప్రయత్నపూర్వకముగా భోక్తలకన్నముందు భుజింపచేయరాదు. తన శరీరాన్ని పిండదానం కన్నముందు గంధాదులతో అలంకరించుకోరాదు,అని. ఇక శ్రాద్ధ వస్తువులు - అక్కడ తొలుత కుశలు, పృధ్వీచంద్రోదయమందు దక్షుడిట్లా - సమిధలు, పుష్పములు, కుశలు మొదలగు వానిని రెండవదిగా అన్నారు,అని. దివసాన్ని ఎనిమిది భాగాలు చేస్తే రెండవ భాగము అని అర్థము. అక్కడే యముడిట్లా - పితరుల శ్రాద్ధకర్మ యందు దర్భ, మూలంతో సహ ఉండాలి. మూలంతో మహాత్ముడైన శక్రుని, లోకములను కూడా జయించవచ్చు,అని. వ్యాసుడిట్లా - పితరులకు చెందిన తర్పణాది కార్యములేవైనా వానిని రెట్టింపు దర్భలతో చేయాలి, విశేషించి ఏడు ఆకులతో ఉండాలి,అని. శాలంకాయనుడిట్లా - పితృక్రియలు సపిండీకరణము వరకు ఋజుదర్భలతో చేయాలి. సపిండీకరణం తరువాత రెట్టింపు దర్భలతో శాస్త్ర ప్రకారము చేయాలి,అని. శంఖుడిట్లా - అంతర్గర్భములేని (మధ్యలోని కుశలు తీసేసి), అగ్రముగల, కుశలు రెండు దళములు (కుశలు) గలది ప్రాదేశమాత్ర పవిత్రమైనదిగా గ్రహించాలి, అది ఎక్కడున్నా,అని. (ఏడాకులు గల దర్భలు శుభమైనవి. ప్రసవించనివి దర్భలు. ప్రసవించినవి కుశలు, మూలంగలవి, కుతపములు, అగ్రములు ఛిన్నమైతే తృణములు)

బ్రహ్మయజ్ఞమందు జపమందు బ్రహ్మగ్రంధి. భోజనమందు వర్తుల (గ్రంధి). హారీతుడిట్లా – బ్రాహ్మణునకు నాలుగు కుశపత్రములతో చేసిన పవిత్రము ఉండాలి. ఒక్కో వర్ణము వారికి క్రమముగా ఒక్కొక్కటి తక్కువగా చెప్పబడింది,అని. స్మృత్యర్థసారమందిట్లా – అందరికి, రెండు దర్భలతో, కొత్తగా ముడివేయబడ్డ పవిత్ర చెప్పబడింది,అని. రత్నావలియందిట్లా – బుధుడు రెండు పర్వముల మధ్య పవిత్రను ధరించాలి,అని. (జప, హోమ, దాన,స్వాధ్యాయ, పితృకర్మలందు పవిత్ర ఉండాలి, రెండు చేతులకు). హేమాద్రి యందు స్కాందోక్తి ఇట్లా – అనామికయందు దర్భలను ధరించాలి. అనామిక యందు ఒకదర్భైనా ధరించాలి. రెండు అనామికలకు రెండేసి దర్భలు గల పవిత్రలు ధరించాలి, అని. పవిత్ర లేకపోతే – అక్కడే సుమంతువుఇట్లా – మూల, అగ్రములు గలిగిన, గర్భములేని రెండు కుశలను దక్షిణకరమందు, సవ్యకరమందు మూడు దర్భలను అన్ని కర్మలయందు, ధరించాలి,అని. భౌధాయనుడిట్లా – రెండు చేతులలో రెండేసి, ఆసనమందు కూడా అట్లాగే ధరించాలి,అని.

మూ॥ **దర్భగ్రహణే మంత్రమాహ శంఖః** – విరించినా సహోత్పన్న పరమేష్ఠి నిసర్గజ, నుద సర్వాణి పాపాని దర్భస్వస్తి కరోభవ. స్మృత్యర్థసారే – హుంఫట్ కారేణ మంత్రేణ సకృచ్ఛిత్వా సముద్ధరేత్. భారద్వాజః – ప్రేతక్రియార్థం పిత్రర్థం అభిచారార్థమేవచ, దక్షిణాభిముఖం శ్ఛిద్యాత్ ప్రాచీనావీతికో ద్విజః. **కుశాభావేఽ పరార్కే** సుమంతుః – కుశాః కాశాః శరో గుంద్రోయవా దూర్వాఽథ బిల్వజాః, గోకేశ ముంజకుందాశ్చ పూర్వాభావే పరః పరః. కాశాదౌ **విశేషమాహ శంఖః** – కాశహస్తస్తు నాచామేత్ కదాచిద్విధి శంకయా, ప్రాయశ్చిత్తేన యుజ్యేత దూర్వాహస్తస్త థైవచ. **పృథ్వీచంద్రోదయే యమః** – మాసిమాస్యుద్ధృతా దర్భామాసిమాస్యేవ చోదితాః. షట్ త్రింశన్మతే – మాసేన స్యాదమావాస్యాదర్భో గ్రాహ్యోనవః స్మృతః. **గృహ్యపరిశిష్టే** – యే చ పిండా శ్రితా దర్భాయైః కృతం పితృతర్పణం, అమేధ్యాఽశుచి లిప్తాయే తేషాం త్యాగో విధీయతే. **లఘు హారీతః** – పథిదర్భాశ్చితౌ దర్భాయే దర్భాయజ్ఞభూమిషు, స్తరణాసన పిండేషు షట్ కుశాన్ పరివర్జయేత్. హేమాద్రౌ – అన్యానిచ పవిత్రాణి కుశదూర్వాత్మ కానిచ, హేమాత్మక పవిత్రస్య హ్యేకాం నార్హంతి వైకలాం.

అను॥ దర్భగ్రహణమందు (తెంపుట) శంఖుడు మంత్రాన్ని ఇట్లా చెప్పాడు – విరించితో కూడ పుట్టినదాన, పరమేష్ఠి స్వభావంతో పుట్టినదాన, ఓదర్భ! మాకు మంగళం చేయి. మా పాపములన్ని తొలగించు,అని. స్మృత్యర్థసారమందిట్లా – "హుంఫట్", ఈ మంత్రంతో ఒక్కసారి తెంపి పైకి పీకాలి,అని. భారద్వాజుడిట్లా – ప్రేతక్రియకొరకు, పితరుల కొరకు, అభిచారం కొరకు వీటికై దక్షిణాభిముఖుడై, ప్రాచీనావీతితో, బ్రాహ్మణుడు దర్భను ఛేదించాలి,అని. కుశలు లేకపోతే అపరార్కమందు సుమంతువు ఇట్లా – కుశలు, కాశము, శరము, గుంద్రము (నాగముస్తె, సర్కండ) యవము, దూర్వ, మారేదుది, ఆవు వెంట్రుకలు, ముంజ (దర్భ), కుందములు తొలుతవి లేకపోతే తరువాతి తరువాతివి స్వీకరించతగినవి,అని.

కాశాదులందు విశేషాన్ని శంఖుడిట్లా చెప్పాడు - శాస్త్రము అనే శంకతో ఎప్పుడూ కాశ (గడ్డి)మును హస్తమందు ధరించి ఆచమనం చేయరాదు. దూర్వను చేతధరించినా అట్లా చేయరాదు ప్రాయశ్చిత్తం కలవాడౌతాడు,అని. (పవిత్ర గలచేతితో ఆచమనం చేయొచ్చు). పృథ్వీ చంద్రోదయమందు యముడిట్లా - దర్భలు ప్రతిమాసం తేవాలి, ఆ మాసంలోనే అవి పెరిగినవై ఉండాలి,అని. షట్త్రింశన్మతమందిట్లా - మాసమనగా అమావాస్యనాడు తీసింది నెలవరకు కొత్తదని గ్రహించాలి,అని. గృహ్యాపరిశిష్టమందిట్లా - పిండము నాశ్రయించిన దర్భలు, పితృతర్పణం చేసిన దర్భలు, అమేధ్యము అశుచి కలిగిన దర్భలు, అట్టి దర్భలను విడిచిపెట్టాలి,అని. లఘు హారీత మందిట్లా - దారిలోని దర్భలు, చితిలోని దర్భలు, యజ్ఞభూమి దర్భలు, పరచిన, ఆసన మందు పిండమందు వినియోగించిన ఈ ఆరు రకాల దర్భలను (కుశలను) విడిచి వేయాలి, అని. బ్రహ్మయజ్ఞ మందలి దర్భలు పితృతర్పణమందలి దర్భలు మూత్రపురీషములంటిన దర్భలు వీటన్నిటిని విడిచి వేయాలి. హేమాద్రి యందిట్లా - కుశ, దూర్వాత్మకములైన ఇతర పవిత్రలు, బంగారుతో చేసిన పవిత్రయొక్క ఒక కళను గూడా పొందలేవు,అని.

**మూ॥ అథహవిః. హేమాద్రౌ ప్రచేతాః - కృష్ణమాశాస్తిలాశ్చైవ శ్రేష్ఠాః స్యుః యవశాలయః మహాయవాః వ్రీహియవాః తథైవచ మధూలికాః, కృష్ణాః శ్వేతాశ్చ లోహాశ్చ గ్రాహ్యాః స్యుః శ్రాద్ధ కర్మణి. మహాయవా = వేణుబీజం. మధూలికా = యావనాలా ఇతి హేమాద్రిః కల్పతరుశ్చ. భారతే - వర్ధమానతిలం శ్రాద్ధమక్షయ్యం మనురబ్రవీత్, సర్వకామైః సయజతే యస్తిలైర్యజతే పితౄన్. చంద్రికాయాందేవలః - ఇష్టాపూర్తే మృతాహేచ దర్శవృద్ధ్యష్టకాసుచ, పాత్రేభ్యస్తేషు కాలేషు దేయం నైవకుభోజనం. సాయణీయే - అగోధూమం చ యచ్ఛ్రాద్ధం మాషముద్గ వివర్జితం, తైలపక్వేన రహితం కృతమప్యకృతం భవేత్. హేమాద్రావత్రిః - అగోధూమం చ యచ్ఛ్రాద్ధం కృతమప్యకృతం భవేత్, తత్రైవ బ్రాహ్మే - యవైః వ్రీహితిలైర్మాషైః గోధూమైశ్చణ కైస్తథా, సంతర్పయే త్పితౄన్ ముద్గైః శ్యామాకైః సర్షపద్రవైః నీవారైః హరిశ్యామాకైః ప్రియంగుభిరథార్చయేత్. హేమాద్రౌ కార్ష్ణాజినిః - యదిష్టం జీవితశ్చాసీత్తద్దద్యాత్ తస్యయత్నతః. సతృప్తోదుస్తరం మార్గం తతో యాతిన సంశయః. కాలికాయా మాశ్వలాయనః - కదల్యాది ఫలైః శస్తైః మూలై రార్ద్రాదికైరపి, గోరసైర్మధునాదధ్నా శ్రాద్ధే సంతర్పయే త్పితౄన్. కదల్యామ్ర ఫలాదీని శ్రాద్ధే సంపాదయేత్సుధీః హేమాద్రౌ పృథ్వీచంద్రోదయే చ మార్కండేయః - గోధూమైరిక్షుభిర్ముద్గైః సతీ నైశ్చణకైరపి, శ్రాద్ధేషు దత్తైః ప్రీయంతే మాసమే కంపితా మహాః. విదార్యా చ భరుండైశ్చతిలైః శృంగాటకై స్తథా. కంచుకైశ్చతథా కందైః కర్కంధూ బదరైరపి. పాలేవతైరా రుకైశ్చా ప్యక్షోటైః పనసైస్తథా. కాకోల్యా క్షీరకాకోల్యా తథా పిండాలకైశ్శుభైః. లాజాభిశ్చ సధానాభిః త్రపుసోర్వారు చిర్భటైః. సర్షపారాజ శాకాభ్యా మింగుదై రాజ జంబుభిః. ప్రియాలామలకైర్ముఖ్యైః ఫల్గుభిశ్చ తిలంటకైః. వేత్రాంకు రైస్తాలకందైః చక్రికాక్షీరికావచైః, లోచైః సమోచైః లకుచైః తథా వైబీజపూరకైః ముంజాతకైః పద్మఫలైః భక్ష్యభోజ్యైశ్చ సంస్కృతైః. రాగ ఖాండవచోష్యైశ్చ త్రిజాతక సమన్వితైః దత్తైస్తు మాసం ప్రీయంతే శ్రాద్ధేషు పితరోన్నృణాం.**

అను॥ ఇక హవిస్సు. హేమాద్రి యందు ప్రచేతుడిట్లా – నల్ల మినుములు, నువ్వులు, యవలు, శాలి ధాన్యము శ్రేష్ఠములు. మహాయవలు, వ్రీహియవలు, మధూలికలు ఇవి నల్లనివి తెల్లనివి ఎర్రనివి శ్రాద్ధకర్మయందు గ్రహించాలి, అని. మహాయవ అనగా వెదురు ధాన్యం. మధూలిక అనగా యావనాలములు (జొన్న) అని హేమాద్రి కల్పతరువు కూడా. భారతమందిట్లా – శ్రాద్ధమందు తిలలు అధికంగా ఉంటే దానిని అక్షయ్యమని మనువు అన్నాడు. తిలలతో పితరులకు హోమం చేస్తే ఆతడు అన్ని కోరికలతో హోమ చేసినట్టే,అని. చంద్రికయందు దేవలుడిట్లా – ఇష్టాపూర్తమందు, మృతాహమందు, దర్శమందు వృద్ధి శ్రాద్ధమందు అష్టకములందు ఆ కాలములందు పాత్రులైన వారికి కుభోజనము ఇవ్వరాదు, అని. సాయణీయమందిట్లా – గోధుమలులేని, మినుమలు, పెసలు లేని తైలపక్వములేని శ్రాద్ధము చేసినా చేయకపోయినట్టే, అని. హేమాద్రి యందు అత్రి ఇట్లా – గోధుమలు లేని శ్రాద్ధము చేసినా చేయనట్లే, అని. అక్కడే బ్రాహ్మమందిట్లా – యవలు, వ్రీహులు, తిలలు, మినుములు, గోధుమలు శనగలు, పెసలు, శ్యామాకములు, ఆవాలు, నీవారములు, హరిశ్యామాకములు, ప్రియంగు (కొర్రలు) వీనితో అర్చించాలి,అని. హేమాద్రియందు కార్ష్ణాజిని ఇట్లా – ఆతడు బ్రతికుండగా ఆతనికేది ఇష్టమో వానికి దాని ప్రయత్న పూర్వకముగా ఇవ్వాలి. ఆతడు తృప్తుడై ఆ పిదప దుస్తరమైన మార్గంగుండా ఆతడు వెళ్తాడు, అనుమానంలేదు,అని. కాలిక యందు ఆశ్వలాయనుడిట్లా – మంచి అరటి మొదలగు ఫలములు, గడ్డలు, పచ్చిగా ఉన్న ఇతరములతో కూడా, పాలు, తేనె, పెరుగు వీనితో శ్రాద్ధమందు పితరులను తృప్తి పరచాలి. అరటి మామిడి మొదలగు పండ్లను శ్రాద్ధమందు బుద్ధిమంతుడు సంపాదించాలి, అని. హేమాద్రి యందు పృథ్వీచంద్రోదయమందును మార్కండేయోక్తి ఇట్లా – గోధుమలు, చెరకుగడలు, పెసలు, బఠాణీ శనగలు వీటిని శ్రాద్ధంలో ఇస్తే ఒక నెలవరకు పితామహులు ఆనందిస్తారు,అని. విదారి (ఒకకంద). భరుండి, తిలలు, శృంగాటకములు, కంచుకములు, కందలు, కర్కంధు, బదరి, పాలేవత, ఆరుకములు, అక్షోటములు, పనసలు, కాకోలి, క్షీరకాకోలి, పిండాలకము లాజలు (పేలాలు) ధనియాలు, త్రపుస, ఉర్వారు, చిర్భటులు, ఆవాలు, రాజశాకము, ఇంగుది రాజజంబు, ప్రియాలు, వుసిరి, ఫల్గు, తిలంటకము, వెదురు ధాన్యం (ముందు భాగం),తాలకందము, చక్రిక క్షీరిక, వచము, లోచము, మోచ,లకుచములు, బీజపూరకము ముంజాతకం, పద్మఫలము వీనితో చేయబడ్డ, భక్ష్యభోజ్యములు, రాగ ఖాండవచోష్యములు, త్రిజాతకములతో కూడినవి, వీటిని శ్రాద్ధంలో ఇస్తే పితరులు నెలవరకు తృప్తి చెందుతారు. (రాజశాకము = ఓషధి, ఇంగుది = గారఫలము, రాజజంబు = పెద్ద అల్లనేరేడు, లోచం = అరటి, మోచం = అరటి, లకుచం = పనసవంటి పండు, బీజపూరక = ఒక రకమైన నిమ్మ;

మూ॥ ఏషాం కోశహేమాద్ర్యాది వ్యాఖ్యా వైద్యకాద్యను సారేణ మధ్య దేశభాషయా నామాన్యుచ్యంతే - సతీనైః = కలాయైః, కలాయస్తు సతీనక ఇత్యమరః వటూరీతి ప్రసిద్ధైః విదార్యా తత్కందేన, భరుండం జలజం మఖానా ఇతి ప్రసిద్ధం శ్రాద్ధ మంజర్యాం, భూకూష్మాండ మిత్యన్యే, శృంగాటకం = సింఘాడా, కంచుకః = కంచనారః, కందః = సూరణః, అర్శోఘ్నః సూరణః కందః, ఇత్యమరః. కర్కంధూః వన్యం సూక్ష్మం బదరం, పాలేవతం కోశాతకీ, ఆరుకం = అరు ఈ; అక్షోటం = అఖరోటః, కాకోలీ క్షీర కాకోల్యౌ గౌడేషు ప్రసిద్ధే, పిండాలకం = సుధనీ, (మహారాష్ట్రాణాం మోహాల కంద ఇతి ప్రసిద్ధం), త్రపుసాదయః త్రయః కర్కటీభేదాః చిర్భటం = ఖర్బూజం, సర్షపా ఇతి దీర్ఘః ఛాందసః, ప్రియాలం = చిరంజీ; ఫల్గు = ఉదుంబరం, తిలంటకం = పటోలం, తాలకందః = కందవిశేషః, చుక్రికా తింత్రిణీబింబా (బింబీ), క్షీరికా = ఖిరణీ, మోచం = కదలీఫలం, లకుచం = బడహారం, ముంజాతకం = గౌడదేశే ప్రసిద్ధం, పద్మాఫలం = గట్టా, రాగఖాండవః = పానాదివిశేషః, పిప్పలీశుంఠియుక్తస్తు ముద్గయూషస్తు ఖాండవః, రాగఖాండవతాం యాతి శర్కరా సంయుతంతుతత్, ఇత్యుక్తః పానవిశేషః, త్రిజాతం = లవంగ ఏలా పత్రకాణి మదనరత్నే కౌర్మే - కాలశాకం చ వాస్తూకం మూలకం కృష్ణనాలికా, ప్రశస్తా నీతిశేషః. హేమాద్రౌ పృథ్వీచంద్రోదయేచ వాయుపురాణే - కాలశాకం మహాశాకం, ద్రోణశాకం తథార్ద్రకం, బిల్వామలక మృద్వీకాపన సామ్రాత దాడిమం, చవ్యం పాలివతాక్షోటం ఖర్జూరం చ కసేరుకం, కోవిదారశ్చ కందశ్చ పటోలం బృహతీఫలం, పిప్పలీ మరిచం చైవ ఏలాశుంఠీ చ సైంధవం, శర్కరా గుడకర్పూర బదరీ ద్రోణ పత్రకం తథా - మధుకం రామఠం చైవ కర్పూరం గుడమేవచ, శ్రాద్ధకర్మణి శస్తాని సైంధవం త్రపుసం తథా.

అను ॥ నిఘంటువులు, హేమాద్ర్యాదులవ్యాఖ్య, వైద్యశాస్త్రము మొదలగు వానిని అనుసరించి మధ్యదేశభాషలో వీని పేర్లను వివరిస్తున్నాను. సతీనము = బఠాని అనిప్రసిద్ధము. సతీనకము అనగా కలాయముఅని అమరకోశము. విదార్య = ఒకరకమైన కంద భరుండము = నీటియందు పుట్టినమఖానాఅనుపేరుగల వస్తువు ప్రసిద్ధమైనది అని శ్రాద్ధమంజరియందు కలదు. భూకూష్మాండమని కొందరన్నారు. శృంగాటకం అనగా సింఘాడా (పరికేగడ్డ), కంచుకము = కంచనార కందః = సూరణము (కందగడ్డ) అర్శోఘ్నము సూరణము, కంద అని అమరము కర్కంధు అనగా అడవిలోని చిన్న బదరి (రేగు) పాలేవతమనగా కోశాతకి (పొట్లకాయ) ఆరుకమనగా అరు ఈ (చామదుంప), అక్షోటము అనగా అఖరోటు. కాకోలీ క్షీరకాకోలులుగౌడదేశంలో ప్రసిద్ధమైనవి. పిండాలకం = సుధనీ (మహారాష్ట్రలో మోహాల కంద అని ప్రసిద్ధము) త్రిపుస, ఉర్వారు, చిర్భటీ ఈ మూడు దోసకాయభేదములు. చిర్భటము = ఖర్బూజము, సర్షపాఅని దీర్ఘాంతము వైదికమైన శబ్దప్రయోగము. ప్రియాలము = చిరంజి; ఫల్గు = ఉదుంబరము (మేడి) తిలంటకము = పొట్ల, తాలకందము = కందవిశేషము, చుక్రిక = చింతపండు, క్షీరిక = దోసపండు, మోచం = అరటిపండు, లకుచము = గజనిమ్మ, ముంజాతకము = గౌడదేశంలో ప్రసిద్ధము, పద్మఫలము =

అను॥ ఇక హవిస్సు. హేమాద్రి యందు ప్రచేతుడిట్లు - నల్ల మినుములు, నువ్వులు, యవలు, శాలి ధాన్యము శ్రేష్ఠములు. మహాయవలు, వ్రీహియవలు, మధూలికలు ఇవి నల్లనివి తెల్లనివి ఎర్రనివి శ్రాద్ధకర్మయందు గ్రహించాలి, అని. మహాయవ అనగా వెదురు ధాన్యం. మధూలిక అనగా యావనాలములు (జొన్న) అని హేమాద్రి కల్పతరువు కూడా. భారతమందిట్లు - శ్రాద్ధమందు తిలలు అధికంగా ఉంటే దానిని అక్షయ్యమని మనువు అన్నాడు. తిలలతో పితరులకు హోమం చేస్తే ఆతడు అన్ని కోరికలతో హోమ చేసినట్టే,అని. చంద్రికయందు దేవలుడిట్లు - ఇష్టాపూర్తమందు, మృతాహమందు, దర్శమందు వృద్ధి శ్రాద్ధమందు అష్టకములందు ఆ కాలములందు పాత్రులైన వారికి కుభోజనము ఇవ్వరాదు, అని. సాయణీయమందిట్లు - గోధుమలులేని, మినుమలు, పెసలు లేని తైలపక్వములేని శ్రాద్ధము చేసినా చేయకపోయినట్టే, అని. హేమాద్రి యందు అత్రి ఇట్లు - గోధుమలు లేని శ్రాద్ధము చేసినా చేయనట్లే, అని. అక్కడే బ్రాహ్మమందిట్లు - యవలు, వ్రీహులు, తిలలు, మినుములు, గోధుమలు శనగలు, పెసలు, శ్యామాకములు, ఆవాలు, నీవారములు, హరిశ్యామాకములు, ప్రియంగు (కొర్రలు) వీనితో అర్చించాలి,అని. హేమాద్రియందు కార్ష్ణాజిని ఇట్లు - ఆతడు బ్రతికుండగా ఆతనికేది ఇష్టమో వానికి దాని ప్రయత్న పూర్వకముగా ఇవ్వాలి. ఆతడు తృప్తుడై ఆ పిదప దుస్తరమైన మార్గంగుండా ఆతడు వెళ్తాడు, అనుమానంలేదు,అని. కాలిక యందు ఆశ్వలాయనుడిట్లు - మంచి అరటి మొదలగు ఫలములు, గడ్డలు, పచ్చిగా ఉన్న ఇతరములతో కూడా, పాలు, తేనె, పెరుగు వీనితో శ్రాద్ధమందు పితరులను తృప్తి పరచాలి. అరటి మామిడి మొదలగు పండ్లను శ్రాద్ధమందు బుద్ధిమంతుడు సంపాదించాలి, అని. హేమాద్రి యందు పృథ్వీచంద్రోదయమందును మార్కండేయోక్తి ఇట్లు - గోధుమలు, చెరకుగడలు, పెసలు, బఠాణి శనగలు వీటిని శ్రాద్ధంలో ఇస్తే ఒక నెలవరకు పితామహులు ఆనందిస్తారు,అని. విదారి (ఒకకంద). భరుండి, తిలలు, శృంగాటకములు, కంచుకములు, కందలు, కర్కంధు, బదరి, పాలేవత, ఆరుకములు, అక్షోటములు, పనసలు, కాకోలి, క్షీరకాకోలి, పిండాలకము లాజలు (పేలాలు) ధనియాలు, త్రపుస, ఉర్వారు, చిర్భటులు, ఆవాలు, రాజశాకము, ఇంగుది రాజజంబు, ప్రియాలు, వుసిరి, ఫల్గు, తిలంటకము, వెదురు ధాన్యం (ముందు భాగం),తాలకందము, చుక్రిక క్షీరిక, వచము, లోచము, మోచ,లకుచములు, బీజపూరకము ముంజాతకం, పద్మఫలము వీనితో చేయబడ్డ, భక్ష్యభోజ్యములు, రాగ ఖాండవచోష్యములు, త్రిజాతకములతో కూడినవి, వీటిని శ్రాద్ధంలో ఇస్తే పితరులు నెలవరకు తృప్తి చెందుతారు. (రాజశాకము = ఓషధి, ఇంగుది = గారఫలము, రాజజంబు = పెద్ద అల్లనే రెడు, లోచం = అరటి, మోచం = అరటి, లకుచం = పనసవంటి పండు, బీజపూరక = ఒక రకమైన నిమ్మ)

మూ॥ ఏషాం కోశహేమాద్ర్యాది వ్యాఖ్యా వైద్యకాద్యను సారేణ మధ్య దేశభాషయా నామాన్యుచ్యంతే - సతీనైః = కలాయైః, కలాయస్తు సతీనక ఇత్యమరః వటూరీతి ప్రసిద్ధైః విదార్యా తత్కందేన, భరుండం జలజం మఖాణా ఇతి ప్రసిద్ధం శ్రాద్ధ మంజర్యాం, భూకూష్మాండ మిత్యన్యే, శృంగాటకం = సింఘాడా, కంచుకః = కంచనారః, కందః = సూరణః, అర్శోఘ్నః సూరణః కందః, ఇత్యమరః. కర్కంధూః వన్యం సూక్ష్మం బదరం, పాలేవతం కోశాతకీ, ఆరుకం = అరు ఈ; అక్షోటం = అఖరోటః, కాకోలీ క్షీర కాకోల్యౌ గౌడేషు ప్రసిద్ధే, పిండాలకం = సుథనీ, (మహారాష్ట్రాణాం మోహల కంద ఇతి ప్రసిద్ధం), త్రపుసాదయః త్రయః కర్కటీభేదాః చిర్భటం = ఖర్బూజం, సర్షపా ఇతి దీర్ఘః ఛాందసః, ప్రియాలం = చిరంజీ; ఫల్గు = ఉదుంబరం, తిలంటకం = పటోలం, తాలకందః = కందవిశేషః, చుక్రికా తింత్రిణీబింబా (బింబీ), క్షీరికా = ఖిరణీ, మోచం = కదలీఫలం, లకుచం = బడహరం, ముంజాతకం = గౌడదేశే ప్రసిద్ధం, పద్మాఫలం = గట్టా, రాగఖాండవః = పానాదివిశేషః, పిప్పలీశుంఠియుక్తస్తు ముద్గయూషస్తు ఖాండవః, రాగఖాండవతాం యాతి శర్కరా సంయుతంతుతత్, ఇత్యుక్తః పానవిశేషః, త్రిజాతం = లవంగ ఏలా పత్రకాణి మదనరత్నే కౌర్మే - కాలశాకం చ వాస్తూకం మూలకం కృష్ణనాలికా, ప్రశస్తా నీతిశేషః. హేమాద్రౌ పృధ్వీచంద్రోదయేచ వాయుపురాణే - కాలశాకం మహాశాకం, ద్రోణశాకం తథార్ద్రకం, బిల్వామలక మృద్వీకాపన సామ్రాత దాడిమం, చవ్యం పాలివతాక్షోటం ఖర్జూరం చ కసేరుకం, కోవిదారశ్చ కందశ్చ పటోలం బృహతీఫలం, పిప్పలీ మరిచం చైవ ఏలాశుంఠీ చ సైంధవం, శర్కరా గుడకర్పూర బదరీ ద్రోణ పత్రకం తథా - మధుకం రామరం చైవ కర్పూరం గుడమేవచ, శ్రాద్ధకర్మణి శస్తాని సైంధవం త్రపుసం తథా.

అను ॥ నిఘంటువులు, హేమాద్ర్యాదులవ్యాఖ్య, వైద్యశాస్త్రము మొదలగు వానిని అనుసరించి మధ్యదేశభాషలో వీని పేర్లను వివరిస్తున్నాను. సతీనము = బఠాని అనిప్రసిద్ధము. సతీనకము అనగా కలాయముఅని అమరకోశము. విదార్య = ఒకరకమైన కంద భరుండము = నీటియందు పుట్టినమఖాణాఅనుపేరుగల వస్తువు ప్రసిద్ధమైనది అని శ్రాద్ధమంజరియందు కలదు. భూకూష్మాండమని కొందరన్నారు. శృంగాటకం అనగా సింఘాడా (పరికేగడ్డ), కంచుకము = కంచనార కందః = సూరణము (కందగడ్డ) అర్శోఘ్నము సూరణము, కంద అని అమరము కర్కంధు అనగా అడవిలోని చిన్న బదరి (రేగు) పాలేవతమనగా కోశాతకి (పొట్లకాయ) ఆరుకమనగా అరు ఈ (చామదుంప), అక్షోటము అనగా అఖరోటు. కాకోలీ క్షీరకాకోలులుగౌడదేశంలో ప్రసిద్ధమైనవి. పిండాలకం = సుథనీ (మహారాష్ట్రలో మోహల కంద అని ప్రసిద్ధము) త్రిపుస, ఉర్వారు, చిర్భటీ ఈ మూడు దోసకాయభేదములు. చిర్భటము = ఖర్బూజము, సర్షపాఅని దీర్ఘాంతము వైదికమైన శబ్దప్రయోగము. ప్రియాలము = చిరంజి; ఫల్గు = ఉదుంబరము (మేడి) తిలంటకము = పొట్ల, తాలకందము = కందవిశేషము, చుక్రిక = చింతపండు, క్షీరిక = దోసపండు, మోచం = అరటిపండు, లకుచము = గజనిమ్మ, ముంజాతకము = గౌడదేశంలో ప్రసిద్ధము, పద్మఫలము =

తామరవిత్తు. రాగఖాండవము = పానవిశేషము పిప్పలి, శొంఠి వీటితో కూడిన పెసరపప్పు రసము ఖాండము అని. అందులో చక్కెర కలిపితే అది రాగఖాండవ మౌతుంది,అ ని చెప్పబడిన పానవిశేషము. త్రిజాతములు = లవంగము, ఇలాచి, లవంగపుచెక్క (ఇలాచిచెక్క) మదనరత్న మందుకౌర్మోక్తిఇట్లా – కరివేము, ఒకకూరదినుసు, మూలకము, కృష్ణనాలిక, ఇవి ప్రశస్తమైనవి అని ముగింపు. హేమాద్రియందుపృథ్వీచంద్రోయమందును వాయుపురాణోక్తి ఇట్లా – కాలశాకము, మహాశాకము, ద్రోణశాకము అల్లము, బిల్వఫలము, ఉసిరికాయ, మృద్వీక, పనస, ఆమ్రాతకము, దాడిమము, చవ్యము, పాలీవతము, అక్షోటము, ఖర్జూరము, కసేరుకము, కోవిదారము, కంద, పొట్ల, బృహతీఫలము, పిప్పలి, మరీచము, ఇలాచి, శుంఠి, సైంధవలవణము, శర్కర, గుడము, కర్పూరము, బదరీ, ద్రోణపత్రము, ఇవిశ్రేష్ఠములని ఉంది. అట్లాగే – ఇప్పపువ్వు, ఇంగువ, కర్పూరము, బెల్లము, సైంధవలవణము, దోసకాయ ఇవి శ్రాద్ధకర్మయందు ప్రశస్తములు.

మూ॥ రామఠం = హింగుః, కసేరుః కోవిదారశ్చతాలకందః తథాబిసం, తమాలంశత కందశ్చమధ్వాలుః శీతకందకం. కాలేయం కాలశాకంచసునిషణ్ణం సువర్చలం. మాంసంశాకందధి క్షీరంచాంబువేత్రాంకురస్తథా. కట్ఫలం కౌంకణీద్రాక్షాలకుచంమోచమేవచ. తిందుకంగ్రీవకంచారం. కర్కంధుర్మధు సాహ్వయం, వైకంకతంనారికేలం శృంగాటకపరూషకం, పిప్పలీమరిచే చైవ పటోలం బృహతీపలం ఏవమాదీని చాన్యాని స్వాదూని మధురాణిచ. నాగరం చార్ద్రకందేయం దీర్ఘమూలక మేవచ, ఇతి. తథా–శర్కరాక్షీర సంయుక్తాః పృథుకా నిత్యమక్షయాః ద్రోణశాకం = గూమ ఇతి ప్రసిద్ధం. మృద్వీకా=ద్రాక్షా ఆమ్రాతకం= అంబాడా ఇతి ప్రసిద్ధో వృక్షః తత్ఫలం. పాలివతం=జంబీరం, పాలి ఆలమితిగౌడ ప్రసిద్ధంవా. ఖర్జూరం =ఖజూర ఇతి ప్రసిద్ధం. కసేరుః = జలజః కందః, కోవిదారః = కంచనారః (కచనార) తాలకందః = తాలమూలీబిసం = భసేదం. శతకందః = శతావరీ, శీతకందః = శాలూకం, సేరుకీతి ప్రసిద్ధం. కాలేయం = కరాల సంజ్ఞః శాకః, దారుహరిద్రావేతి పృథ్వీచంద్రోదయః. సునిషణ్ణం కర్కటీ సదృశం సులటియా ఇతి గౌడ ప్రసిద్ధం. సువర్చలం శాక విశేషః, కట్ఫలం శ్రీపర్ణీ వృక్షఫలం. కౌంకణీ=అమ్లర సాద్రాక్షా. తిందుకం = డిండి సమితికైదేవః తిందు ఫలంవా. గ్రీవకం = ఫలవిశేషః. చారం = క్షుద్రతాలం. మధుసాహ్వయం= మధూకపుష్పం. ఫలంవా. వైకంకతం చైం చీతి గౌడాఖ్యాతం. పరూషకం పరూసమితి ప్రసిద్ధం. నాగరం = శుంఠీ పృథ్వీ చంద్రోదయే బ్రాహ్మే– (అమ్రమామ్రాతకం బిల్వం దాడిమం బీజపూరకం ప్రాచీనామలకం క్షీరం నారికేలం పరూషకం) నారంగకం చ ఖర్జూరం ద్రాక్షా నీలకపిత్థకం. ఏతాని ఫలజాతాని శ్రాద్ధేదేయాని యత్నతః. మాత్స్యే – అన్నంతు సదధిక్షీరం గోఘృతం శర్కరాన్వితం మాసం ప్రీణంతి సర్వాన్వై పితౄనిత్యాహ కేశవః. యాజ్ఞవల్క్యః – (ఆచారాధ్యాయ 258 – 260) హవిష్యాన్నేనవై మాసం పాయసేనతు వత్సరం, మాత్స్య హారిణకౌ రభ్రచ్ఛాకునచ్ఛాగపార్షతః, ఐణరౌరవ వారాహ శాశైర్మాంసైర్యథా క్రమ. మాస వృద్ధ్యాభి భితృప్యంతి దత్తైరిహ పితామహాః. ఖడ్గామిషం మహాశల్కం మధు మున్యన్నమేవ చ లోహామిషం కాలశాకం మాంసం వార్ధ్రీణసస్యచ.

అను॥ రామరము = ఇంగువ, కసేరు, కోవిదార, తాలకంద, బిసము, తమాలము (కరివేపాకు) శతకందము, తీయఆలుగడ్డ, శీతకందకం, కాలేయము, కాలశాకము, సునిషణ్ణము, సువర్చలము, మాంసము, శాకము, పెరుగు, పాలు, నీటి వేత్రాంకురము, కట్ఫలం, కౌంకణీ, ద్రాక్షగజనిమ్మ, అరటి, తిందుకము, గ్రీవకము, చారము, గంగరేగు, మధుసాహ్వాయము, వైకంకతం, నారికేళము, పరికెదబ్బ, పరూషకము, పిప్పలి, మిరప, పొట్ల, ములకపండు, ఇవి మొదలుగా గలవి, ఇతరములైన రుచికరమైన మధురములను, శొంఠి, అల్లము, పెద్ద ముల్లంగి వీటిని ఇవ్వాలి,అని. అట్లాగే - చక్కెర పాలతో కూడిన అటుకులు ఎల్లప్పుడూ అక్షయకరమైనవి, ద్రోణశాకము. తుమ్మికూర అని ప్రసిద్ధము. మృద్వీక = ద్రాక్ష. ఆమ్రాతకము అనగా అంబాడపండు, పాలివతముఅనగా నిమ్మ, పాలి ఆలమని గౌడ దేశంలో ప్రసిద్ధమైనదో. ఖర్జూరము ఖజూరమని ప్రసిద్ధమైనది. కసేరు = నీటికంద, కోవిదార = కంచనారము, తాలకందము = తాలమూలము (తాటిగడ్డ) బిసము = కమలం మూలము, శతకందము =.పిల్లపీచర, శీతకందము = తామరదుంప, (సేరుకి అని ప్రసిద్ధము). కాలేయము అనగా నల్లగగ్గెర శాకము. మ్రాని పసుపు కాని, అని పృథ్వీ చంద్రోదయము అంది. సునిషణ్ణము దోసలాంటిది సులటియ అని ప్రసిద్ధమైంది గౌడ దేశంలో. సువర్చలం = శాకవిశేషము. కట్ఫలం = శ్రీపర్ణి (పెదగుమ్ముడు) వృక్షఫలము. కౌకంణి=పుల్లద్రాక్ష. తిందుకం = డిండిస మనికైదేవుడు (తుమికి)తిందుఫలముకాని గ్రీవకం=ఫలవిశేషము. చారము=క్షుద్రతాలము. మధుసాహ్వాయము= మధూక పుష్పం లేదా పండు. వైకంకతం = చైంచి అని గౌడులంటారు. పరూషకం = పరూసమని ప్రసిద్ధము. నాగరము = శుంఠి. పృథ్వీచంద్రోదయమందు బ్రాహ్మోక్తి ఇట్లా - (మామిడి, అంబాడ, బిల్వము, దానిమ్మ, మాదిఫలము, పాతవుసిరి, పాలు, నారికేళము, ఖర్జూరము) నారింజ, ఖర్జూరము, ద్రాక్ష, నల్లవెలగపండు, ఈపండ్లను శ్రాద్ధమందు ప్రయత్నపూర్వకముగా ఇవ్వాలి. మాత్స్యమందిట్లా - పెరుగు, పాలు, వీనితో కూడిన అన్నము శర్కరతో కూడిన ఆవునేయి వీటిని ఇస్తే పితరులంతా నెలరోజులు ఆనందిస్తారు అని కేశవుడు చెప్పాడు,అని. యాజ్ఞవల్క్యుడిట్లా - (ఆచారాధ్యాయమందు 258-260) హవిష్యఅన్నముతో నెలరోజులు, పాయసంతో సంవత్సరము తృప్తినందుతారు. చేపలు, జింక, పొటేలు, నల్లపిచ్చుక, మేక, చుక్కలజింక, నల్లజింక, నల్లచారల దుప్పి అడవి పంది, కుందేలు వీటి మాంసంతో యథాక్రమంగా మాసవృద్ధిగా ఇస్తే ఇక్కడ, పితామహులు బాగా తృప్తి చెందుతారు. ఖడ్గమృగము మాంసము మహాశల్కము (చేప) తేనె మున్యన్నము (నీవారధాన్యము), ఎర్ర గొఱ్ఱెమాంసము, కరివేము, వార్ధీణస, మాంసము వీనితో తృప్తులౌతారు,అని.

**మూ॥ నిగమః - త్రిః పిబంత్వింద్రియక్షీణం శ్వేతం వృద్ధమజాపతిం, వార్ధీణ సంతుతం ప్రాహుః యాజ్ఞికాః శ్రాద్ధకర్మణి. వార్ధీణసోఽజరచ్ఛాగ ఇతిమేధాతిథిః. కాత్యాయనః - ఛాగోస్రమేషా నాలభ్యశేషాణి క్రీత్వా లబ్ధ్వా వాస్వయం మృతాన్ వా హృత్యపచేత్. కౌర్మే - క్రీత్వా**

లబ్ధ్వా స్వయం వా౽ థ మృతానాహృత్యవా ద్విజః, దద్యాచ్ఛ్రాద్ధే ప్రయత్నేన తదస్యాక్షయ మశ్నుతే. **శ్రాద్ధేదత్త స్యమాంస స్యాభక్షణే** దోషమాహమనుః - నియుక్తస్తు యథాన్యాయం యోమాంసం నాత్తి మానవః సప్రేత్య పశుతాంయాతి సంభవానేక వింశతిం. అత్రబహుషువచనేషు శ్రాద్ధేమాంసమధునోః ప్రాశస్త్యోక్తేః. వినామాంసేన యచ్ఛ్రాద్ధం కృతమప్యకృతం భవేత్, ఇతి హేమాద్రౌ దేవలోక్తేః. **యచ్ఛ్రాద్ధం మధునాహీనం** తద్రసైః సకలైరపి, మిష్టాన్నైరపి సంయుక్తం పితౄణాం నైవతృప్తయే. అణుమాత్రమపి శ్రాద్ధేయది నస్యా చ్చ మాక్షికం, నామాపి కీర్తనీయం **స్యాత్ పితౄణాం** ప్రీతయేతతః ఇతి హేమాద్రౌ బ్రాహ్మోక్తేశ్చ మాంసమధునోః శ్రాద్ధే నియతత్వం గమ్యతే. గౌడ నిబంధే మాత్స్య సూక్తే - మధ్వభావే గుడోదేయః క్షీరస్య చ తథాదధి, నలభ్యతే ఘృతం యత్రకుర్యాత్ ఘృతవతీ జపం. శ్రాద్ధకలికాయాం నాగరఖండే - కథంచి ద్యదివిప్రేభ్యోన దత్తం భోజనే మధు, పిండాస్తు నైవదా తవ్యాః కదాచిన్మధునావినా. బృహత్పరాశరస్తు మాంసం నిషేధయతి - యస్తు ప్రాణి వధం కృత్వా మాంసై స్తర్పయతే పితౄన్, సవిద్వాన్ చందనందగ్ధ్వా కుర్యాదంగార విక్రయం. క్షిప్త్వా కూపేయథా కించిద్బాల ఆదాతు మిచ్ఛతి, పతత్యజ్ఞానతః సో౽ పి మాంసేన శ్రాద్ధకృత్తథా. **సఏవ - సర్వథాన్నం** యదానస్యాత్ తదైవామిషమాశ్రయేత్, బ్రాహ్మణశ్చ స్వయం నాద్యాత్ తచ్చశ్వాదిహతం యది. **భాగవతే౽ పి** - (స్కం7అ.15శ్లో7) నదద్యాదామిషం శ్రాద్ధే న చాద్యాద్ధర్మతత్త్వవిత్, మున్యన్నైః స్యాత్పరాప్రీతిః యథా న పశుహింసయా తథేతిశేషః. **అత్రకేచిత్ - మున్యన్నం** బ్రాహ్మణస్యోక్తం మాంసం క్షత్రియవైశ్యయోః, మధుప్రధానం శూద్రస్య సర్వేషాం చా విరోధియత్. ఇతి హేమాద్రౌ పులస్త్యోక్త్యా వ్యవస్థామాహుః.

అను॥ నిగమమిట్లా - మూడు ఇంద్రియములతో తాగుతూ, క్షీణించిన ఇంద్రియములుగలది, తెల్లనిది, ముసలిది, అగు అజాపతిని (ఆడమేక) శ్రాద్ధకర్మలందు యాజ్ఞికులు దానిని వార్ధ్రీణసమని అన్నారు,అని. వార్ధ్రీణసము ముసలిమేక అని మేధాతిథి. కాత్యాయనుడిట్లా - మేకపోతు, ఉస్ర (వృషభ) ము,పొట్టేలు వీటిని ఆధారం చేసుకొని (పొంది) మిగిలిన వాటిని కొనిలేదా పొంది లేదా స్వయంగా చచ్చిన వానిని తెచ్చి వండాలి, అని. కౌర్మమందిట్లా - కొని, పొందిలేదా స్వయంగా చచ్చిన వానినైనా తెచ్చి ద్విజుడు శ్రాద్ధమందు ప్రయత్న పూర్వకముగా ఇవ్వాలి. అది ఇతనికి అక్షయ్యమును కల్గిస్తుంది,అని. శ్రాద్ధమందిచ్చిన మాంసమును తిననిచో దోషమును మనువిట్లా చెప్పాడు - విధి ప్రకారముగా నియోగింపబడి మాంసమును (ఇచ్చి) తినని మానవుడు మరణించాక పశుత్వమునందుతాడు. ఇరువది ఒక్క జన్మలను పొందుతాడు,అని. ఇక్కడ అనేక వచనాలలో శ్రాద్ధమందు మాంసము మధువు వీటి ప్రాశస్త్యం చెప్పబడింది. మాంసము లేకుండా చేయబడ్డ శ్రాద్ధము చేసినా చేయనట్టే ఔతుంది,అని. హేమాద్రి యందు దేవలుని ఉక్తి. మధువు లేనటువంటి శ్రాద్ధము అది సకలరసములతో (తీయని) రుచికరమైన అన్నములతో కూడి ఉన్నా అది పితరులకు తృప్తికరము కాదు. తేనె అణుమాత్రమైనా శ్రాద్ధంలో లేకపోతే అప్పుడు పితరుల ప్రీతికొరకు దాని పేరైనా కీర్తించాలి,అని హేమాద్రి యందు బ్రాహ్మోక్తి కూడా కనుక

శ్రాద్ధమందు మాంస మధువులు తప్పక ఉండాలని తెలిందీ. గౌడనిబంధమందు మాత్స్య సూక్తమందిట్లా - మధువు లేని పక్షంలో గుడము ఇవ్వాలి పాలు లేకపోతే పెరుగు ఇవ్వాలి. నెయ్యి లేకపోతే (లభించనిచోట) ఘృతవతీ జపం చేయాలి,అని. శ్రాద్ధకలిక మందు నాగరఖండమందిట్లా - ఏదో రకంగా బ్రాహ్మణులకు భోజనంలో మధువు ఈయని పక్షంలో, ఎప్పుడూ మధువు లేకుండా పిండములను ఇవ్వరాదు,అని. బృహత్పరాశరుడు మాంసాన్ని నిషేధిస్తున్నాడు - ప్రాణి వధ చేసి పితరులను మాంసంతో తృప్తి పరిచేవాడు, అవిద్వాంసుడు చందనాన్ని కాల్చి ఆ బొగ్గులను (నిప్పులను) అమ్మినట్లు. పిల్లవాడు బావిలో ఏదో ఒకటి పారవేసి తీసుకోవటానికి ప్రయత్నిస్తాడు, అజ్ఞానంవల్ల వాడుకూడా పడిపోతాడు. అట్లాగే మాంసంతో శ్రాద్ధంచేసేవాడు కూడా పతితుడౌతాడు,అని. అతడే - అన్నివిధముల అన్నం లేని పక్షంలో అప్పుడే మాంసాన్ని ఆశ్రయించాలి. అది కుక్క మొదలగు వానిని చంపినట్లైతే ఆ మాంసాన్ని బ్రాహ్మణుడు తాను తినరాదు,అని. భాగవత మందుకూడా - శ్రాద్ధమందు మాంసమును ఇవ్వరాదు. ధర్మతత్వ మెరిగినవాడు మాంసం తినరాదు, పశుహింస వల్ల అంత ప్రీతి రాదు. కాని నీవార ధాన్యము ఇవ్వటంవల్ల ఎంతో గొప్ప ప్రీతి లభిస్తుంది అట్లా అని ముగింపు. ఇక్కడ కొందరు - బ్రాహ్మణునకు మున్యన్నము చెప్పబడింది (నీవారధాన్యపు అన్నము). క్షత్రియ వైశ్యులకు మాంసము. శూద్రునకు మధువు ప్రధానము. ఈ మధువు అందరికి విరోధము కానిది, అని హేమాద్రి యందు పులస్త్యుని వచనం ఉన్నందువల్ల శాస్త్ర నియమంను చెప్పారు.

మూ॥ **పృథ్వీ చంద్రోదయస్తు** - అక్షతా గోపశుశ్చైవ శ్రాద్ధేమాంసం తథా మధు. దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ పంచ వివర్జయేత్, ఇతి నిగమోక్తేః. వరాఽతిథి పితృభ్యశ్చ పశూపాకరణ క్రియా, ఇతి కలి వర్జ్యేషు హేమాద్రా వాదిత్య పురాణాత్. మాంసదానం తథా శ్రాద్ధే వాన ప్రస్థాశ్రమ స్తథా, ఇత్యుక్త్వా ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యానాహుర్మనీషిణః, ఇతి బృహన్నారదీయేఽభి ధానాచ్చ మాంసవిధిః కలివ్యతిరిక్త విషయః. కలౌ మాంస నిషేధానాం చ దేశాచారా ద్వ్యవస్థా. తథా చ బృహన్నారదీయే శ్రాద్ధం ప్రకృత్య - యథాచారం ప్రదేయంతు మధుమాంసాదికం తథా, దేశాచారాః పరిగ్రాహ్యాః తత్తద్దేశీయ జైర్నరైః. అన్యథా పతితో జ్ఞేయః సర్వధర్మ బహిష్కృతః ఇతి.యస్మిన్ దేశే పురేగ్రామే త్రైవిద్యైః నగరేఽపివా, యోయత్ర విహితో ధర్మస్తంధర్మం నవిచారయేత్. ఇతి భృగూక్తేశ్చే త్యాహ. తన్న, హోలాకాధికరణ న్యాయేన దేశవిశేష వ్యవస్థాపక పదకల్పనాయోగాత్, నిరూపితం చైతత్ పితామహచరణైః మాంసమిమాం సాయామితిదిక్. **మనుః - సంవత్సరంతు** గవ్యేన పయసాపాయసేనచ, వార్ ధ్రీణ సస్యమాంసేన తృప్తిర్ద్వాదశ వార్షికీ. త్రిపిబంత్విం్ద్రి యక్షీణం శ్వేతం వృద్ధమజాపతిం, వార్ధ్రీణ సంతుతం ప్రాహుః యాజ్ఞికాః శ్రాద్ధ కర్మణి. **క్షీరాదౌ విశేష** మాహ హేమాద్రౌ సుమంతుః - పయోదధి ఘృతం చైవ గవాంశ్రాద్ధేషు పావనం మహిషీణాం ఘృతం ప్రాహుః శ్రేష్ఠం నతుపయః క్వచిత్. యాజ్ఞవల్క్యః - (ఆచారాధ్యాయ - శ్లోక 170) సంధిన్యనిర్దశాఽవత్సా గోపయః పరివర్జయేత్, ఔష్ట్రమైక శఫంస్త్రైణ మారణ్య కమథావికం.

**హేమాద్రౌ హారీతః - నవసూతాయాః సప్తరాత్రాదిత్యేకే, మాసేనోపే యుషం భవతీతి ధర్మవిదః ఏతద్రజోభావపరం దేవలః - అజాఉ ఉ వి మహిషీణాంతు పయః శ్రాద్ధేషు వర్జయేత్, వికారాన్ పయసశ్చైవ మాహిషంతు ఘృతం హితం. తత్రైవ బ్రాహ్మే - మాహిషం చామరం మార్గమా వికైక శఫోద్భవం, స్త్రైణ మౌష్ట్రం పాచితం చ దధిక్షీరం ఘృతం త్యజేత్. సగుడం మరిచాక్తంతు తథా పర్యుషితం దధి, దీర్ఘం తక్రమపేతం చ నష్టాస్వాదం చఫేనవత్.**

అను॥ పృథ్వీచంద్రోదయమైతే - అక్షత (యోని) కన్య, గోపశువుతో యజ్ఞము, శ్రాద్ధమందు మాంసము, భోజనమందు తెనె, భర్తతో బుట్టినవానితో (బావ,మరిది) సంతానాన్ని పొందుట ఈ ఐదింటిని కలిలో విడిచిపెట్టాలి,అని నిగమోక్తి, అని ఉంది. వరుని కొరకు, అతిథి కొరకు, పితరులకొరకు, పశు ఉపకరణ క్రియ (వధ) చేయరాదు అని కలిలో విడువ వలసినవానిని హేమాద్రియందు ఆదిత్యపురాణం నుండి ఉట్టంకించారు. శ్రాద్ధమందు మాంసదానము అట్లాగే వానప్రస్థాశ్రమము అని చెప్పి ఈ ధర్మములను కలియుగమందు విడిచిపెట్టాలని బుద్ధిమంతులు చెప్పారు, అని బృహన్నారదీయమందు చెప్పినందువల్ల మాంసవిధి కలియుగం కన్న వ్యతిరిక్తమైన విషయము. కలిలో మాంస నిషేధములకు దేశాచారాన్ననుసరించి నిర్ణయము. అట్లాగే బృహన్నారదీయమందు శ్రాద్ధం గూర్చి ఆరంభించి - మధుమాంసాదికమును ఆచారాన్ననుసరించి ఇవ్వాలి. దేశాచారములను స్వీకరించాలి, ఆయా దేశములందు పుట్టిన నరులు. లేకున్న అన్ని ధర్మములనుండి బహిష్కృతుడై పతితుడౌతాడని తెలుసుకోవాలి,అని. త్రైవిద్యులు (మూడు వేదాల నెరిగినవారు) ఏదేశమందుగాని, పురమందుగాని, గ్రామమందుగాని, నగరమందుగాని ఏధర్మాన్ని ఎక్కడ ఏర్పరుస్తారో, ఆధర్మాన్ని గూర్చి ప్రశ్నించరాదు,అని భృగూక్తి కూడా అని చెప్పాడు,అది కాదు హోలాకాధికరణ న్యాయాన్ననుసరించి దేశ విశేష వ్యవస్థాపక పదకల్పన తగదు (దేశాచారం అనరాదు). మాపితా మహచరణులు మాంస మీమాంస యందు (చర్చ) దీనిని నిరూపించారు అని ఇక చాలు. మనువిట్లా - సంవత్సరము (గోమాంసముతో) గోవుపాలతో (చేసిన) పాయసంతో వార్ధ్రీణ సమాంసంతో శ్రాద్ధం చేస్తే పన్నెండు సంవత్సరముల తృప్తి కలుగుతుంది,అని. మూటితో తాగేది (రెండు చెవులు నాలుకతో), ఇంద్రియములు క్షీణించినది, తెల్లనిది, ముసలిది, మేకలలోపతి దీనిని యాజ్ఞికులు శ్రాద్ధకర్మయందు వార్ధ్రీణసమని అన్నారు. పాలు మొదలగు వానిలో విశేషమును హేమాద్రియందు సుమంతుడిట్లా చెప్పాడు - ఆవులపాలు, పెరుగు, నేయి శ్రాద్ధములందు పావనము, బఱ్ఱెల నేయి శ్రేష్ఠము, పాలు మాత్రం ఎక్కడా కాదు అని అన్నారు,అని. యాజ్ఞవల్క్యుడిట్లా - (అచార అధ్యాయమందు శ్లోకం 170) గర్భిణి ఆవు, ఈని పదిరోజులు కాని, దూడలేని ఇట్టి గోవుపాలను తాగరాదు ఒంటె, ఒంటి గిట్ట కలది (గాడిద, గుఱ్ఱం) స్త్రీ, అడవి పశువు, గొఱ్ఱె వీని పాలను శ్రాద్ధమందు వాడరాదు,అని. హేమాద్రి యందు హారీతుడిట్లా - కొత్తగా ఈనిన దానిపాలు ఏడు రాత్రుల తర్వాత అని కొందరు, పదిరాత్రుల

తరువాత తాగాలి అని ఇతరులు అన్నారు. మాసం తరువాతనే దానిని చేరాలి అని ధర్మవిదులన్నారు. ఇది రజో భావపరమైనది (దర్శన) రజోనివృత్తి కాకపోతే ఆ గోవుపాలు తాగరాదు,అని. దేవలుడిట్లా - మేక, గొఱ్ఱె, బఱ్ఱె వీని పాలను విడిచిపెట్టాలి. పాల వికారములను గూడా (పెరుగు వగైరా) విడువాలి. బఱ్ఱె నేయి హితమైనది, అని. అక్కడే బ్రాహ్మమందిట్లా - బఱ్ఱె, చమరి మృగం, లేడి, గొఱ్ఱె, ఒంటి గిట్ట గలవి, వీని పాలను స్త్రీ, ఒంటె, కాగిన, ఈ పాలను వీని పెరుగును నేయిని విడిచిపెట్టాలి,అని. బెల్లము, మిరియాలు ఇవి కలిసిన అట్లాగే పాచిన పెరుగును, పగిలిన, రుచిపోయిన మజ్జిగను నురుగువలె తీసివేయాలి.

మూ॥ **మాహిషాపదవాదోఽ పరార్కే బ్రాహ్మే** - దేయం తక్రంతు సద్యస్కం నవనీతా దనుద్ధృతం, ఆరణ్య మహిషీ క్షీరం శర్కరాస్రుతిసం యుతం, మధ్వక్తంతు హితం చైవ దద్యాత్తదమృతం యతః. స్రుతిః = క్షీరశరః. శ్రాద్ధ కౌముద్యాం చైవం. **యద్యపి యాజ్ఞ్య వల్క్యేన** - (ఆచారాధ్యాయ 169) అన్నం పర్యుషితం భోజ్యం స్నేహాక్తం చిర సంస్థితం, అస్నేహా అపి గోధూమ యవగోరస విక్రియాః, ఇతి. పర్యుషితం దధ్యాది భోజ్యముక్తం. **తథాపి** - గుడమరీచాక్తస్య పర్యుషిత దోషోఽత్రోచ్యత ఇతి హేమాద్రిః **తత్రైవ బ్రాహ్మే** - కాలశాకం తండులీయం వాస్తుకం మూలకం తథా. శాకమారణ్యకం చైవ దద్యాచ్ఛ్రాద్ధేషు నిత్యశః. తండులీయం=సూక్ష్మపత్రమితి హేమాద్రిః. మహారాష్ట్రాణాం మాఠ ఇతి ప్రసిద్ధం. ఆరణ్యకం ఫాంజీ చూకాది తత్రైవ - దాడిమం మాగధీ చైవ నాగరార్ద్ర కతింత్రిణీ, ఆ మ్రాతకం జీరకం చ కుంబరం చైవ యోజయేత్. మాగధీ = పిప్పలీ. (నాగరం=శుంఠీ) కుంబరం కుస్తుంభరంధనియా ఇతి ప్రసిద్ధం. వాయవీయే - అగస్త్యస్య శిఖాస్తామ్రాః కాషాయాః సర్వఏవచ. శిఖా = నవపల్లవాః. ప్రభాసఖండే - ఆరామస్యతు సీమంతాః కలాయాః సర్వ ఏవచ సీమంతాః = నవపల్లవాః. కౌర్మే- తమాలంశతకందం చ మధ్వాలుః శీత కందలీ. మధ్వాలుః = మోహాలకందః. శీతకందలీ = రతాలు ఇతి ప్రసిద్ధం

అను ॥ మాహిషమునకు అపవాదము అపరార్కమందు బ్రాహ్మోక్తి ఇట్లా - వెన్ననుండి తీయబడని తాజా మజ్జిగను ఇవ్వాలి. శర్కర శ్రుతి వీనితో కూడిన అడవిమహిషి క్షీరమును ఇవ్వాలి. అది అమృతము. మధ్వక్తము (నేయి) ఐతే హితకారికూడా అని. శ్రుతి అనగా పాలమీగడ. శ్రాద్ధకౌముది యందు కూడా ఇట్లాగే ఉంది. యాజ్ఞవల్క్యులు ఇట్లా (ఆచార అధ్యాయమందు) నూనెమొదలగు వానితో కలుపబడిన, చాలాసమయమందు నుంచిఉన్న పర్యుషితాన్నమును భుజించవచ్చును. నూనెతో కలపబడక పోయినా, గోధుమ, యవ, పాలు వీనితో చేయబడ్డవి పర్యుషితమైనా తినవచ్చును అని. పర్యుషితమనగా పెరుగుమొదలగు తినుపదార్థము చెప్పబడింది అని చెప్పినా బెల్లము మిర్యాలు వీనితో కూడిన దానికి పర్యుషితదోషము ఇక్కడ చెప్పబడుతోంది అని హేమాద్రి. అక్కడే బ్రాహ్మమందిట్లా - కరివేము , తండులీయము, వాస్తుకము, మూలకము ఆరణ్యకశాకము వీనిని శ్రాద్ధమందు నిత్యము తప్పక ఇవ్వాలి, అని. తండులీయమనగా సూక్ష్మపత్రమని

హేమాద్రి మహారాష్ట్రులకు మారమని ప్రసిద్ధము. ఆరణ్యకము=పాంజీచూ కాదులు. అక్కడే దాడిమము, మాగధి, నాగర, ఆర్ద్రక, తింత్రిణి, ఆమ్రాతకము, జీరకము, కుంబరము వీనిని కలపాలి, అని. మాగధి = పిప్పలి, నాగరం = శుంఠి (ఆమ్రాతకం = అంబాడ) కుంబరం కుస్తుంబరం ధనియాలు అని ప్రసిద్ధము. వాయవీయమందిట్లా – అగస్త్యవృక్షము యొక్క శిఖలు (నవపల్లవములు) ఎట్టినైనవి అన్నీ కాషాయములని పేరుగలవి అని. ప్రభాసఖండమందిట్లా – ఆరామమందలి సీమంతములు (నవపల్లవములు) అన్నీ కలాయములను పేరుగలవి, అని. కౌర్మమందిట్లా – తమాలము, శతకందము, మధ్వాలు శీతకందలి ఇవి ఇవ్వాలి అని. మధ్వాలు = మోహలకందము శీతకందలి=రతాలు అని ప్రసిద్ధము.

మూ ॥ **అథవర్జ్యం** మార్కండేయపురాణే – యచ్ఛ్రోత్కోచాదినా ప్రాప్తం పతితాద్యదు పార్జితం, అన్యాయకన్యాశుల్కార్థం ద్రవ్యంచాత్ర విగర్హితం. పిత్రర్థంమే ప్రయచ్ఛస్వేత్యుక్త్వా యచ్చాప్యపా హృతం చంద్రోదయేశంఖః – భూస్తృణం సురసాశిగ్రు పాలంకీమృచకంతథా, కూష్మాండాలాబువార్తాకకోవిదారాంశ్చ వర్జయేత్, పిప్పలీమరిచం చైవతథావై పిండమూలకం. కృతంచలవణం సర్వం వంశాగ్రంచవివర్జయేత్. రాజామాషాన్ మసూరాంశ్చకోద్రవాన్ కోరదూషకాన్, లోహితాన్వృక్ష నిర్యాసాన్ శ్రాద్ధకర్మణి వర్జయేత్. భూస్తృణం కాశ్మీరదేశేప్రసిద్ధం. సురసానిర్గుండీతి మాధవః తులసీతి పృథ్వీచంద్రః సాచభక్ష్యత్వేన నిషిద్ధా పుష్పత్వేనేతిగౌడాః పాలంకీ = పాలక ఇతి ప్రసిద్ధా. మృచుకం = జలజః శాకః ససుకం, ఇతి పారేఖదిరశాక ఇతి హేమాద్రిః మరీచాన్యార్ద్రాణీతి హేమాద్రిః. కృతలవణం సాంభరభిన్నం సైంధవం లవణంచైవ తథామానస సంభవం, యచ్చసాముద్రికంభవేత్, ఇతి శూలపాణౌపారః పవిత్రే పరమేహ్యేతే ప్రత్యక్షేఅపి నిత్యశః ఇతి వాయవీయోక్తేః మానసః = సాంభరం. యత్తుభవిష్యం – తర్జన్యాదంతకాష్ఠం చప్రత్యక్ష లవణంతథా, ఇతితత్రప్రత్యక్షలవణం క్షారలవణంఖారీతిప్రసిద్ధం నిషిద్ధం, భుక్త్వాతుక్షారలవణం త్రిరాత్రంతువనేవసేత్. ఇతి బ్రాహ్మోక్తేరితి శూలపాణిః. క్షీరలవణమితి పారాత్ క్షీరమిశ్రంలవణం నిషిద్ధమితి వాచస్పతిః రాజమాషారతరా ఇతి ప్రసిద్ధాః. కోరదూషకాః = వన కోద్రవాః చంద్రికాయాంశంఖః – పిండాలకంచతుండీరం కరమర్దంచనాలికాం, కూష్మాండంబహు బీజాని శ్రాద్ధందత్వావ్రజత్యధః. పిండాలకం మహారాష్ట్రేషు పెండరమితిప్రసిద్ధం. తుండీరంబింబీ ఫలమితికైదేవః కరమర్దం కరవందమితి ప్రసిద్ధం. తత్రైవ – బిడాలోచ్ఛిష్ట మాఘ్రాతం శ్రాద్ధేయత్నేన వర్జయేత్ కూష్మాండం మహిషీక్షీరమాథక్యో రాజసర్షపాః చణకారాజమాషాశ్చఘ్నంతిశ్రాద్ధం నసంశయః బృహత్పరాశరః – కరీరఫలపుష్పాణి విడంగమరిచానిచ, జంభారికా సజంబీరా సుపక్వం బీజపూరకం, జంబ్వలాబూనిపిప్పల్యః పటోలంపిండమూలకం. మసూరాంజన పుష్పంచ శ్రాద్ధే దత్వాపతత్యధః. జంబూ = సూక్ష్మం మాధవీయే చతుర్వింశతి మతే – యావనాలాన్ కులత్థాంశ్చ వర్జయంతి విపశ్చితః. యావనాలాః = జోంధలాఇతి. అత్రయానిచణకాదీని విహితనిషిద్ధాని తేషాం వికల్పః. అన్యథాశ్యామాకైశ్చణకైః శాకైః నివారైశ్చప్రియంగుభిః. గోధూమైశ్చతిలైర్ముద్గైః మాసంప్రీణయతేపితౄన్, ఇతి. గోధూమైరిక్షుభిర్ముద్గైః సతీనైశ్చణకైరపి, ఇతిహేమాద్రౌకౌర్మవిష్ణు

ధర్మాదివిరోధః స్యాత్. పిప్పలీమరీచాదేస్తు ప్రత్యక్షస్యనిషేధోనత్వన్యద్రవ్యమిశ్రస్య. సౌవీరతిక్తైః లవణాదిభిస్తు పాకస్యసిద్ధిర్మహతీహయైస్తు, తద్బీజపూరాన్మరిచాది యోగాత్ సిద్ధిప్రదేయం నతుదుష్యతీహ, ఇతి పృథ్వీచంద్రోదయేబృహత్పరాశరోక్తేః. తత్రైవ - దాతుశ్చయస్మిన్మనసోఽభిలాషః శ్రద్ధాభవేద్యత్రచదీయమానే. శ్రాద్ధేషుదేయం విధివత్తదేవతద్దత్తమక్షయ్య మితిబ్రువంతి. ఏతన్నిషిద్ధేతర విషయం.

అను॥ ఇకవిడువతగినవి - మార్కండేయపురాణమందిట్లా - ఉత్కోచాదులవల్ల వచ్చింది (లంచం), పతితునివల్ల సంపాదించింది అన్యాయంగాకన్యను అమ్మటం వల్ల వచ్చిన ధనము, ఇవన్నీ ఇక్కడ నిందించతగినవి. నాపితరుల కొరకు ఇవ్వండి అని అడిగి తెచ్చిన ధనము తగదు, అని. చంద్రోదయమందుశంఖుడిట్లా - భూస్తృణము (ఒకకూర), తులసి, మునగ, పాలంకీ, మృచుకము, కూష్మాండము, సొరకాయ, వంకాయ, కాంచనము, వీనిని విడిచి పెట్టాలి. (తులసితినరాదు). పిప్పళ్ళు మిరియము, ఎర్రముల్లంగి, తయారుచేయబడ్డ ఉప్పు వెదురు అగ్రభాగము వీనిని వదలాలి. అలిచెంతలు, చిరుసెనగలు, ఆళ్ళు (కొర్రలు), కోరదూషకములు, ఎర్రనివాటిని, వృక్షములనుండి వచ్చిన జిగురును శ్రాద్ధకర్మలందు విసర్జించాలి. భూస్తృణము కాశ్మీర దేశమందు ప్రసిద్ధము. సురసఅనగ నిర్గుండి అని మాధవుడు. తులసి అని పృథ్వీచంద్రోదయము. అది తినటానికి తగదుకాని పుష్పంగా పనికివస్తుందని గౌడులన్నారు. పాలంకి అనగా పాలక్అని ప్రసిద్ధమైంది. మృచుకము అనగా నీటినుండి వచ్చే ఒక కూర. ససుకం అని చెప్పినచోట ఖదిరశాకమని హేమాద్రి. మరీచములు పచ్చివి అని హేమాద్రి. కృతలవణమనగా సాంభరము కన్న వేరైనది సైంధవలవణము అట్లాగే మానససంభవ మైనది, సముద్రమునుండి వచ్చింది అని శూలపాణి యందుపాఠము ఇవి ప్రత్యక్షమందైనా, ఎప్పుడూ పరమపవిత్రమైనవి, అని వాయవీయోక్తి. మానసమనగా సాంభరము (నప్రత్యక్షంలవణం దద్యాత్ వైష్ణవఅపవాదం ఇది) భవిష్యమందు - తర్జనితో (చూపుడు వ్రేలు) పలుతోముకర్రను, అట్లాగే ప్రత్యక్షలవణమును నిషేధించారు అని ఉన్నా అక్కడ ప్రత్యక్షలవణమనగా క్షారలవణమును ఖారా అని ప్రసిద్ధమైన దానిని నిషేధించారు. క్షారలవణమును తిన్నచో మూడు రాత్రులు అడవియందు వసించాలి, అని బ్రాహ్మోక్తి అని శూలపాణి. క్షీరలవణమని చెప్పే పక్షంలో పాలతో మిశ్రితమైన లవణము నిషిద్ధమని వాచస్పతి. రాజమాషఅనగా రతర అని ప్రసిద్ధమైనవి. కోరదూషకములనగా అడవి కోద్రవములు. చంద్రికయందు శంఖుడిట్లా - ఆలుగడ్డ, తుండీరము (దొండతీగ), వాక్కాయ, కమలదండము, కూష్మాండము, బహుబీజములుకలవి (సీతాఫలము) వీటిని శ్రాద్ధమందు ఇచ్చినచో అధః పతితుడౌతాడు, అని. పిండాలకమనేది మహారాష్ట్రయందు పెండారమని ప్రసిద్ధము. తుండీరమనగా బింబీఫలమని కైదేవుడన్నాడు. కరమర్దముకరవందమని ప్రసిద్ధమైంది. అక్కడే - పిల్లి తినగా

హేమాద్రి మహారాష్ట్రులకు మాతమని ప్రసిద్ధము. ఆరణ్యకము=పాంజీచూ కాదులు. అక్కడే దాడిమము, మాగధి, నాగర, ఆర్ద్రక, తింత్రిణి, ఆమ్రాతకము, జీరకము, కుంబరము వీనిని కలపాలి, అని. మాగధి = పిప్పలి, నాగరం = శుంఠి (ఆమ్రాతకం = అంబాడ) కుంబరం కుస్తుంబరం ధనియాలు అని ప్రసిద్ధము.వాయవీయమందిట్లా – అగస్త్యవృక్షము యొక్క శిఖలు (నవపల్లవములు) ఎట్టివైనవి అన్నీ కాషాయములని పేరుగలవి అని. ప్రభాసఖండమందిట్లా – ఆరామమందలి సీమంతములు (నవపల్లవములు) అన్నీ కలాయములను పేరుగలవి, అని. కౌర్మమందిట్లా – తమాలము, శతకందము, మధ్వాలు శీతకందలి ఇవి ఇవ్వాలి అని. మధ్వాలు = మోహాలకందము శీతకందలి=రతాలు అని ప్రసిద్ధము.

మూ ॥ **అథవర్జ్యం** మార్కండేయపురాణే – యచ్ఛ్రోత్కోచాదినా ప్రాప్తం పతితాద్యదు పార్జితం, అన్యాయకన్యాశుల్కార్థం ద్రవ్యంచాత్ర విగర్హితం. పిత్రర్థంమే ప్రయచ్ఛస్వేత్యుక్త్వా యచ్చాప్యుపా హృతం చంద్రోదయేశంఖః – భూస్తృణం సురసాశిగ్రు పాలంకీమృచకంతథా, కూష్మాండాలాబువార్తాకకోవిదారాంశ్చ వర్జయేత్, పిప్పలీమరిచం చైవతథావై పిండమూలకం. కృతంచలవణం సర్వం వంశాగ్రంచవివర్జయేత్. రాజామాషాన్ మసూరాంశ్చకోద్రవాన్ కోరదూషకాన్, లోహితాన్వృక్ష నిర్యాసాన్ శ్రాద్ధకర్మణి వర్జయేత్. భూస్తృణం కాశ్మీరదేశేప్రసిద్ధం. సురసానిర్గుండీతి మాధవః తులసీతి పృథ్వీచంద్రః సాచభక్ష్యత్వేన నిషిద్ధా పుష్పత్వేనేతిగౌడాః పాలంకీ = పాలక ఇతి ప్రసిద్ధా. మృచుకం = జలజః శాకః ససుకం, ఇతి పారేఖదిరశాక ఇతి హేమాద్రిః మరీచాన్యార్ద్రాణీతి హేమాద్రిః. కృతలవణం సాంభరభిన్నం సైంధవం లవణంచైవ తథామానస సంభవం, యచ్ఛసాముద్రికంభవేత్, ఇతి శూలపాణౌపారః పవిత్రే పరమేహ్యేతే ప్రత్యక్షేఅపి నిత్యశః ఇతి వాయవీయోక్తేః మానసః = సాంభరం. యత్తుభవిష్యం – తర్జన్యాదంతకాష్ఠం చప్రత్యక్ష లవణంతథా, ఇతితత్రప్రత్యక్షలవణం క్షారలవణంఖారీతిప్రసిద్ధం నిషిద్ధం, భుక్త్వాతుక్షారలవణం త్రిరాత్రంతుపనేవసేత్. ఇతి బ్రాహ్మోక్తేరితి శూలపాణిః. క్షీరలవణమితి పాఠాత్ క్షీరమిశ్రంలవణం నిషిద్ధమితి వాచస్పతిః రాజమాషారతరా ఇతి ప్రసిద్ధాః. కోరదూషకాః = వన కోద్రవాః చంద్రికాయాంశంఖః – పిండాలకంచతుండీరం కరమర్దంచనాలికాం, కూష్మాండంబహు బీజాని శ్రాద్ధందత్వావ్రజత్యధః. పిండాలకం మహారాష్ట్రేషు పెండరమితిప్రసిద్ధం. తుండీరంబింబీ ఫలమితికైదేవః కరమర్దం కరవందమితి ప్రసిద్ధం. తత్రైవ – బిడాలోచ్ఛిష్ట మాఘ్రాతం శ్రాద్ధేయత్నేన వర్జయేత్ కూష్మాండం మహిషీక్షీరమాఢక్యో రాజసర్షపాః చణకారాజమాషాశ్చఘ్నంతిశ్రాద్ధం నసంశయః బృహత్పరాశరః – కరీరఫలపుష్పాణి విడంగమరిచానిచ, జంభారికా సజంబీరా సుపక్వం బీజపూరకం, జంబ్వలాబూనిపిప్పల్యః పటోలంపిండమూలకం. మసూరాంజన పుష్పంచ శ్రాద్ధే దత్వాపతత్యధః. జంబూ = సూక్ష్మం మాధవీయే చతుర్వింశతి మతే – యావనాలాన్ కులత్థాంశ్చ వర్జయంతి విపశ్చితః. యావనాలాః = జోంధలాఇతి. అత్రయానిచణకాదీని విహితనిషిద్ధాని తేషాం వికల్పః. అన్యథాశ్యామాకైశ్చణకైః శాకైః నివారైశ్చప్రియంగుభిః. గోధూమైశ్చతిలైర్ముద్గైః మాసంప్రీణయతేపితౄన్, ఇతి. గోధూమైరిక్షుభిర్ముద్గైః సతీనైశ్చణకైరపి, ఇతిహేమాద్రౌకౌర్మవిష్ణు

ధర్మాదివిరోధః స్యాత్. పిప్పలీమరీచాదేస్తు ప్రత్యక్షస్యనిషేధోనత్వన్యద్రవ్యమిశ్రస్య. సౌవీరతిక్తైః లవణాదిభిస్తు పాకస్యసిద్ధిర్మహతీహ్యైస్తు, తద్బీజపూరాన్మరిచాది యోగాత్ సిద్ధిప్రదేయం నతుదుష్యతీహ, ఇతి పృథ్వీచంద్రోదయేబృహత్పరాశరోక్తేః. తత్రైవ - దాతుశ్చయస్మిన్మనసోఖిలాషః శ్రద్ధాభవేద్యత్రచదీయమానే. శ్రాద్దేషుదేయం విధివత్తదేవతద్దత్తమక్షయ్య మితిబ్రువంతి. ఏతన్నిషిద్ధేతర విషయం.

అను॥ ఇకవిడువతగినవి - మార్కండేయపురాణమందిట్లా - ఉత్కోచాదులవల్ల వచ్చింది (లంచం), పతితునివల్ల సంపాదించింది అన్యాయంగాకన్యను అమ్మటం వల్ల వచ్చిన ధనము, ఇవన్నీ ఇక్కడ నిందించతగినవి. నాపితరుల కొరకు ఇవ్వండి అని అడిగి తెచ్చిన ధనము తగదు, అని. చంద్రోదయమందుశంఖుడిట్లా - భూస్తృణము (ఒకకూర), తులసి, మునగ, పాలంకీ, మృచుకము, కూష్మాండము, సొరకాయ, వంకాయ, కాంచనము, వీనిని విడిచి పెట్టాలి. (తులసితినరాదు). పిప్పళ్ళు మిరియము, ఎర్రముల్లంగి, తయారుచేయబడ్డ ఉప్పు వెదురు అగ్రభాగము వీనిని వదలాలి. అలిచెంతలు, చిరుసెనగలు, ఆళ్ళు (కొర్రలు), కోరదూషకములు, ఎర్రనివాటిని, వృక్షములనుండి వచ్చిన జిగురును శ్రాద్ధకర్మలందు విసర్జించాలి. భూస్తృణము కాశ్మీర దేశమందు ప్రసిద్ధము. సురసఅనగ నిర్గుండి అని మాధవుడు. తులసి అని పృధ్వీచంద్రోదయము. అది తినటానికి తగదుకాని పుష్పంగా పనికివస్తుందని గౌడులన్నారు. పాలంకి అనగా పాలక్అని ప్రసిద్ధమైంది. మృచుకము అనగా నీటినుండి వచ్చే ఒక కూర. ససుకం అని చెప్పినచోట ఖదిరశాకమని హేమాద్రి. మరీచములు పచ్చివి అని హేమాద్రి. కృతలవణమనగా సాంభరము కన్న వేరైనది సైంధవలవణము అట్లాగే మానససంభవ మైనది, సముద్రమునుండి వచ్చింది అని శూలపాణి యందుపాఠము ఇవి ప్రత్యక్షమందైనా, ఎప్పుడూ పరమపవిత్రమైనవి, అని వాయవీయోక్తి. మానసమనగా సాంభరము (నప్రత్యక్షంలవణం దద్యాత్ వైష్ణవఅపవాదం ఇది) భవిష్యమందు - తర్జనితో (చూపుడు వ్రేలు) పలుతోముకర్రను, అట్లాగే ప్రత్యక్షలవణమును నిషేధించారు అని ఉన్నా అక్కడ ప్రత్యక్షలవణమనగా క్షారలవణమును ఖారా అని ప్రసిద్ధమైన దానిని నిషేధించారు. క్షారలవణమును తిన్నచో మూడు రాత్రులు అడవియందు వసించాలి, అని బ్రాహ్మోక్తి అని శూలపాణి. క్షీరలవణమని చెప్పే పక్షంలో పాలతో మిశ్రితమైన లవణము నిషిద్ధమని వాచస్పతి. రాజమాషఅనగా రతర అని ప్రసిద్ధమైనవి. కోరదూషకములనగా అడవి కోద్రవములు. చంద్రికయందు శంఖుడిట్లా - ఆలుగడ్డ, తుండీరము (దొండతీగ), వాక్కాయ, కమలదండము, కూష్మాండము, బహుబీజములుకలవి (సీతాఫలము) వీటిని శ్రాద్ధమందు ఇచ్చినచో అధః పతితుడౌతాడు, అని. పిండాలకమనేది మహారాష్ట్రయందు పెండారమని ప్రసిద్ధము. తుండీరమనగా బింబీఫలమని కైదేవుడన్నాడు. కరమర్దముకరవందమని ప్రసిద్ధమైంది. అక్కడే - పిల్లి తినగా

మిగిలింది వాసనచూసింది వీనిని శ్రాద్ధమందు ప్రయత్నపూర్వకముగా విడిచిపెట్టాలి. కూష్మాండము (బూడిదగుమ్మడి) బత్తైపాలు, కందులు, చిన్న ఆవాలు, శనగలు, అలిచెంతలు ఇవి శ్రాద్ధమును నశింపచేస్తాయి. అనుమానంలేదు, అని. బృహత్పరాశరుడిట్లా - కరీరఫలపుష్పములు విడంగము, మరిచములు, నిమ్మ, దబ్బ, పండిన మాదిఫలము, అల్లనేరెడు, సోరకాయ, పిప్పలి, పొట్లకాయ, పిండమూలకం (లావుపాటిముల్లంగి) మసూరము (ఒకపప్పు) అగరుపుష్పము వీనిని శ్రాద్ధమందు ఇచ్చిన అధః పతితుడౌతాడు అని జంబుఅనగా సూక్ష్మమైనది. మాధవీయమందు చతుర్వింశతిమత మందిట్లా - జొన్నలు ఉలవలు పండితులు వీనిని వీడిచిపెడతారు. యావనాళములనగా జొంధలా అని పేరు. ఇక్కడ శనగలు మొదలగునవి విహితమైనవి నిషిద్ధంగా చెప్పబడ్డాయో అవి, వికల్పమని అర్థము. లేనిచో చామలు, శనగలు, వీనిశాకము, నీవారధాన్యము, కొఱ్ఱలు, గోధుమలు, నువ్వులు, పెసలు వీనితో పితరులను నెలరోజులు తృప్తి పరుస్తున్నాడు, అని చెప్పటం కుదరదు. అట్లాగే గోధుమలు, చెరకు, పెసలు, బఠాణి, శనగలు వీనితో కూడా అని హెమాద్రియందు చూపిన కూర్మ, విష్ణుధర్మాది గ్రంధ ప్రమాణములకు విరోధము కల్గుతుంది. పిప్పలి, మరీచముమొదలగు వానికి ప్రత్యక్షంగా వాడటం నిషేధము. వేరే ద్రవ్యంలో కలిపివాడితే నిషేధం లేదు. పులపు, చేదు, ఉప్పు మొదలగు వానితో పాకసిద్ధి ఇక్కడ గొప్పది ఆ బీజపూరములను (నిమ్మ) మరీచి మొదలగువాని యోగముతో చేసిన వారికి ఇది సిద్ధిప్రదమైంది. ఇక్కడ ఇది దోషప్రదమైంది కాదు అని పృధ్వీచంద్రోదయమందు బృహత్పరాశరోక్తి. అక్కడే - ఇచ్చేవాడికిదేనిమీదమనోఽభిలాష ఉందో, దేనిని ఎక్కడ ఇస్తున్నప్పుడు శ్రద్ధ ఉందో, దానినే శ్రాద్ధములందు విధిగా ఇవ్వాలి. అట్లా ఇవ్వబడింది అక్షయ్యమని అంటారు. ఇది నిషేధించబడినవానికన్న ఇతరమైన వాని విషయకము.

**మూ॥ చంద్రికాయాం - కృష్ణధాన్యానిసర్వాణి వర్జయేచ్ఛ్రాద్ధకర్మణినవర్జయేత్తిలాంశ్చైవ ముద్గమాషాంస్తథైవచ. మాత్స్యే-మసూరశణనిష్పావరాజమాషకుసుంభికాః, పద్మబిల్వార్కధత్తూర పారిభద్రాటరూషకాః. నదేయా పితృకార్యేషు పయశ్చాజావికం తథా, కోద్రావోద్దారవరక కపిత్థమధు కాతసీ, ఏతాన్యపి నదేయాని పితృభ్యః శ్రాద్ధమిచ్ఛతా. నిష్పావాః = వల్లాః. యత్తుమార్కండేయః - ప్రియంగవః కోవిదారానిష్పావాశ్చాత్ర శోభనాః ఇతి తత్రనిష్పావః = శ్వేతశింబీతి దానసాగరే శ్రాద్ధప్రకాశేచోక్తం. బిల్వంచరక్తంనిషిద్ధం. జంబీరంరక్తబిల్వంచశాలస్యాపిఫలంత్యజేత్, ఇతి బ్రాహ్మోక్తేః. పారిభద్రే నింబతరుః, ఇత్యమరః రక్తమందారఇతిహెమాద్రిః. ఆటరూషోవాసాతత్పుష్పం. ఉద్దారః = కాంచనారః మధుకం = జ్యేష్ఠీమధ్వితిచంద్రికా. వరకా = వనముద్గాః. హెమాద్రౌ బ్రహ్మాండే - అసనారూఢమన్నాద్యంపాదో పహతమేవచ, అమేధ్యైః జంగమైః స్పృష్టం శుష్కం పర్యుషితంచయత్, ద్విః స్విన్నం పరిదగ్ధంచ తథైవాగ్రావలేహితం, శర్కరా కీటపాషాణైః కేశైర్యచ్చా ప్యుపద్రుతం. పిణ్యాకం మథితం చైవతథా తిలవణంచయత్, సిద్ధాః కృతాశ్చయేభక్ష్యాః ప్రత్యక్షలవణీకృతాః వానసాచావధూతానివర్జ్యాని శ్రాద్ధకర్మణి. ద్విః స్విన్నంయత్సకృత్**

పాకేనభక్ష్యమపి హింగు జీరకాది సంస్కారార్థం పునః పచ్యతే తత్ వర్జ్యం. యత్తుతిక్త శాకాన్న వికారాది ద్విః పాకేనైవభక్షణార్హం నతన్నిషిద్ధం. అగ్రావలేహిత మాస్వాదిత పూర్వం. పర్యుషితస్య సదానిషేధేఽపిపునర్వచనం. అపూపాశ్చకరంభాశ్చధానావటక సక్తవః, శాకంమాంస మపూపంచ సూపం కృసర మేవచ, యవాగూః పాయసంచైవయచ్చాన్యత్ స్నేహ సంయుతం, సర్వం పర్యుషితం భోజ్యం శుక్తంచేత్ పరివర్జయేత్, ఇతిమాధవీయే. యమోక్త వటకాదేరపి పర్యుషితస్యనిషేధార్థమితి చంద్రికాదయః.

అను ॥ చంద్రికయందిట్లు - అన్నికృష్ణధాన్యములను శ్రాద్ధకర్మయందు విసర్జించాలి. కానినువ్వులను, పెసలు, మినుములను విడువరాదు, అని. మాత్స్యమందిట్లు - మసూరము (పప్పు), షణము, (జనుము), అనుములు, అలిచంతలు, కుసుమలు, పద్మము, బిల్వము, జిల్లేడు, ఉమ్మెత్త, వేప, అడ్డసరము, మేకపాలు గొఱ్ఱె (అవి) పాలు వీనిని పితృకార్యములందు ఇవ్వరాదు. ఆళ్ళు, కోవిదారము, అడవిపెసలు, వెలగ, ఇప్ప, అవిశె, వీనిని పితరులకై శ్రాద్ధమును కోరువారు ఇవ్వరాదు, అని నిష్పావమనగా వల్లలు. మార్కండేయుడు - ప్రియంగు, కోవిదారములు, నిష్పావములు ఇక్కడ మంచివి, అని అన్నాడో అక్కడ నిష్పావమనగా తెల్లపెసలు అని దానసాగరమందు, శ్రాద్ధప్రకాశమందు చెప్పారు. ఎర్రనిబిల్వమునిషిద్ధము. జంబీరము, రక్త బిల్వము, సాలవృక్షఫలము వీటిని విడిచిపెట్టాలి, అని బ్రాహ్మోక్తి. పారిభద్రమనగా వేపచెట్టు అని అమరము. రక్తమందారమని హేమాద్రి. ఆటరూషము అనగా వాస. దాని పుష్పము. ఉద్దారమనగా కాంచనారము. మధుకమనగా యష్టిమధుకము అని చంద్రిక. వరకా అనగా అడవి పెసలు. హేమాద్రియందు బ్రహ్మాండోక్తి ఇట్లు - ఆసనమందుంచబడిన అన్నము మొదలగునవి కాలితో తాకబడినవి, అమేధ్య (అపవిత్రము) మైనవానితో జంగమ (తిరిగే) జీవులతో తాకబడినది, ఎండినది, చద్దిది, రెండుసార్లు వండబడినది, అంతా మాడినది, అట్లాగే ముందుభాగము నాకబడినది ఇలాంటి అన్నము, శర్కర, కీటములు రాళ్ళు, వెంట్రుకలు వీనితో హాని నొందించబడినది తెలక పిండి, చిలుకబడినది(పెరుగు), ఉప్పుచాలాకలది, తయారుచేయబడిన భక్ష్యములలో ఉప్పుపడినవి, వస్త్రముచే వీవబడినవి వీనినన్నిటిని శ్రాద్ధకర్మలందు విడిచిపెట్టాలి అని. ద్విః స్విన్నమనగా ఒకసారి వండగా తినతగినది ఐనా ఇంగువ జిలకర్ర మొదలగు వాని సంస్కారముకొరకు తిరిగి వండబడినది అట్టిదానిని విడువాలి. చేదుశాకములు అన్నముతో తయారైనవి మొదలగునవి రెండు సార్లు వండడం వల్లనే తినతగిన వౌతాయి కాబట్టి అట్టివానికి నిషేధములేదు. అగ్రావలేహితమనగా ముందే ఆ స్వాదింపబడినది. చలిదిదానిని ఎప్పుడూ నిషేధించారు ఐనా తిరిగి చెప్పారు. అపూపములు, పెరుగుతో కలిపిన పేలపిండి, పేలాలు, మినుములు మొదలగు వాని పిండితో చేసిన వడలువగైరా, పేలపిండి, శాకము, మాంసము, అపూపము (బియ్యపుపిండితో చేసినవి) పప్పు, నువ్వులపిండి (నువ్వులు బియ్యంకలిపిందికృసరం), యవలతో చేసింది (జావ), పాయసము, నూనెతో చేసిన ఇతర

పదార్థము (నెయితో పెరుగుతోను) ఇవన్ని పర్యుషితమైనా తినవచ్చును. మిక్కిలిపులుపు ఐనదైతే వదిలిపెట్టాలి, అని మాధవీయమందు యమునిచే చెప్పబడ్డ వటకాదులకు గూడా పర్యుషితమైనదానికి నిషేధము కొరకు అని చంద్రిక మొదలగునవి అన్నాయి.

మూ॥ వర్జ్యేషువిశ్వామిత్రః - కపిత్థంకురుకంచైవనారికేలంచపైనికం, జంబూఫలాది పక్వంచపిణ్యాకంతండులీయకం. హేమాద్రౌషట్త్రింశన్మతే - వర్జ్యామర్కటకాః శ్రాద్ధేరాజమాషాస్త థైవచ, మర్కటకాః లాకాఇతి ప్రసిద్ధాః. పైఠీనసిః - వృంతాకంనలికాపోతకుసుంభాశ్మంతకానిచ, శాకానామభక్ష్యాః, ఇతి. పోతంపోఈఇతిప్రసిద్ధం (కుసుంభంకురదుఇతి మహారాష్ట్రేప్రసిద్ధం). మార్కండేయః - వర్జ్యాశ్చాభిషవానిత్యం శతపుష్పాగవేధుకాః జంబీరకఫలం వర్జ్యం కోవిదారాశ్చ నిత్యశః. అభిషవః శుక్లమితి చంద్రికా. సంధానకమితి పృథ్వీచంద్రః శతపుష్పా ఓంవాఇతి ప్రసిద్ధం. శాత్యాయనః - మారిషంనాలికా చైవరక్తాయా చకలంబికా, అసురాన్న మిదం సర్వం పితౄణాం నోపతిష్ఠతే. మారిషంమధ్యదేశేమరసాఇతి మహారాష్ట్రేరాజగిరాఇతిచ ప్రసిద్ధం. కలంబికావేణ్యాకృతి పత్రం. తత్రైవ - గాంధారికా పటోలాని శ్రాద్ధకర్మణి వర్జయేత్. గాంధారికా తండులీయమితి చంద్రికా. జవాసాఖ్యాదురాలభా, ఇతికైదేవః. భారతే - హింగుద్రవ్యేషుశాకేషు అలాబుంలశునం తథా, కుకుండకాన్యలాబూనికృష్ణంలవణమేవచ, పునరలాబుగ్రహణం ఉభయాలాబునిషేధార్థమితి పృథ్వీచంద్రః.కుకుండకం - వర్తులంఛత్రాకం. తత్రైవ-కుస్తుబురుం కలింగోత్థం వర్జయేదమ్లవేతసం. హేమాద్రౌబ్రాహ్మే - వార్తాకంపంచశింబంచలోమశాని ఫలానిచ, కలింగంరక్తచారం చవీణాకం ధృతచారకం, కపాలం కాచమారీచ కరంజం పిండమూలకం. గృంజనం చుక్రికాం చైవ గాజరం జీవకం తథా. వృంతాకం=శ్వేతం. కందూరాం శ్వేతవృంతాకం కుంభాండంచవివర్జయేత్. ఇతిదేవలోక్తేః తేనకృష్ణస్యానిషేధ ఇతి చంద్రికామాధవౌ. వస్తు తస్తు సదాశ్వేతనిషేధాత్ పునః శ్రాద్ధే నిషేధోవ్యర్థః తేనభక్ష్యస్య కృష్ణవృంతాకస్యాపి నిషేధార్థ మితివయం. కందూరా = కపికచ్ఛూః (కందూరం ప్రావృషేణీఫలం) కుంభాదం = వృత్తాలాబూః. పంచశింబంవల్ల మసూరరాజ మాష మతకులిత్థాః. లోమశాని = కపిత్థాని. రక్తచారం లోహితచారఫలం వీణాకం = దీర్ఘకృష్ణకర్కటీ. ధృతచారకం = చిరస్థిత చారఫలంచారోలీతిప్రసిద్ధం. కపాలం = నారికేలం, కాచం = కచువృక్ష ఫలం. మారీచం = ఆర్ద్రమరీచాని. గృంజనం పలాండుభేదః. పశ్చిమదిశిప్రసిద్ధః నతుగాజరం. తస్యపృథగుక్తేః. హేమాద్రిణాతు గృంజనంగాజరమేవోక్తం. గౌడశ్రాద్ధకౌముద్యా మప్యేవంతచ్చింత్యం. చుక్రికాచిరకాలశుక్తంపానకం. చంద్రికాయాం హారీతః - న వటప్లక్షోదుంబర శేలు దధిత్థనీపమాతులింగానిభక్షయేత్. శేలుఃశ్లేష్మాంతకః భోంకరసంజ్ఞః దధిత్థం = కపిత్థం.

అను ॥ విడువతగినవానిలో విశ్వామిత్రుడిట్లా - వెలగ, కురుకము కొబ్బరికాయ పండినజామ, పండిన అల్ల నేరెడువగైరా, గానుగపిండి, వాయువిడంగము వీనినన్నింటిని విడువాలి, అని. హేమాద్రియందుషట్త్రింశన్మతమందిట్లా - మర్కటకము (ధ్యానం), అలిచెంతలు వీనిని శ్రాద్ధమందు విడిచిపెట్టాలి. మర్కటకమనగా లాకఅని ప్రసిద్ధమైనవి. పైఠీనసి ఇట్లా - వంకాయ, నాలికకూర, పోతకూర, కుసుమకూర,అశ్మంతకకూర వీని కూరలను తినరాదు,అని. మార్కండేయు డిట్లా - కల్లుతేట, సదాప, అడవి గోధుమలు వీటిని ఎల్లప్పుడు వదలాలి. పెద్దనిమ్మ ఫలము, కోవిదారము వీనిని ఎల్లప్పుడు విడువాలి,అని.

అభిషవమనగా తెల్లనిదని చంద్రిక. కారునది అని పృథ్వీ చంద్రుడు. శతపుష్ప అనగా ఓంవ అని ప్రసిద్ధమైనది. శార్యాయనుడిట్లా - తోటకూర, నారకూర, ఎఱ్ఱతీగ బచ్చలి, ఇదంతా అసురుల అన్నము పితరులకు చెందదు, అని. మారిషమనగా మధ్య దేశమందు మరస,అని మహారాష్ట్ర మందు రాజగిర అని కూడా ప్రసిద్ధము, కలంబిక అనగా వేణువు ఆకారంగల ఆకు. అక్కడే - గంజాయి, పొట్లకాయ, వీనిని శ్రాద్ధకర్మ యందు విడిచి పెట్టాలి. గాంధారిక అనగా తందులీయమని చంద్రిక. జవాస అనుపేరు గల, దురాలభ అని కైదేవుడు. భారతమందిట్లా - ద్రవ్యములందు ఇంగువ, శాకములందు సొరకాయ, వెల్లుల్లి కుక్క గొడుగు, సొరకాయ, నల్ల ఉప్పు వీనిని విడిచి పెట్టాలి. తిరిగి సొరకాయ పేరును చ్ఫోట వలన రెండు రకములైన (గుండ్రని, పొడవు) సొరకాయల నిషేధము కొరకు అని పృథ్వీచంద్రుడు. కుకుండకము = గుండ్రని పుట్టగొడుగు. అక్కడే - ధనియాలు, కళింగమందు జన్మించిన అమ్లవేతసమును (ఒకరకమైనపులుపుతీగ) విడిచిపెట్టాలి, అని. హేమాద్రియందు బ్రాహ్మోక్తిఇట్లా - వార్తాకము, ఐదుశింబములు, లోమశఫలములు, కలింగము, రక్తచారము, పీణాకము, ధృతచారకము కపాలము, కాచము, మారీచము, కానుగు, పచ్చముల్లంగి, గృంజనము, చుక్రిక గాజరము, వేగిసవీనిని విడిచిపెట్టాలి. వృంతాకము అనగా తెల్లవంకాయ దూలగొండి తెల్లవంకాయలు, గుండ్రని సొరకాయలు వీనిని వదలాలి, అని దేవలోక్తి. కనుక నల్లవంకాయల నిషేధములేదని చంద్రికా, మాధవులు. నిజానికైతే ఎప్పుడూ తెల్లదాన్ని నిషేధిస్తున్నాం కనుక తిరిగి శ్రాద్ధంలో నిషేధము వ్యర్థము. అందువల్లతినతగిన నల్లవంకాయలకు కూడా నిషేధం రావాలని ఇది అని మేము భావిస్తున్నాము. కందూరమనగా దూలగొండి (కందూరము వర్షాకాలంలో వచ్చే ఫలము). కుంభాండము అనగా గుండ్రని ఆనపకాయ. పంచశింబములనగా వల్లము, చిరుసెనగలు, అలిచెంతలు, మఠము, ఉలవలు లోమశములుఅనగా వెలగపండ్లు, రక్తచారము = ఎఱ్ఱచార ఫలము (పప్పు), పీణాకము = పొడుగాటినల్లనిదోసకాయ. ధృతచారకం = చాలాకాలమున్న చారఫలము చారోలీ అని ప్రసిద్ధము. కపాలము = నారికేళము కాచము = కచువృక్షఫలము. మారీచం = పచ్చిమిరపకాయలు. గృంజనము = ఉల్లిగడ్డలో ఒక భేదము. ఇది పడమటి దిక్కులో ప్రసిద్ధమైంది. గాజరముకాదు దానిని వేరుగా చెప్పారుకనుక. హేమాద్రిమాత్రం గృంజనమనగా గాజరమనే అన్నాడు. గౌడశ్రాద్ధకౌముదియందుకూడా ఇట్లాగే ఉంది. దానిని ఆలోచించాలి. చుక్రిక = చాలాకాలముండి పుల్లనైనపానకము. చంద్రికయందుహారీతుడిట్లా - మఱ్ఱి, రావి, మేడి, విరిగి, దధిత్థము. కడిమి, మాదిఫలము వీటినితినరాదు, అని. శేలువు అనగా శ్లేష్మాంతకము భోంకరమని ప్రసిద్ధము. దధిత్థము = కపిత్థము.

**మూ ॥ స్మృతిసారే - క్షీరే తులవణందత్వా ఉచ్ఛిష్టేఽపిచయత్ ఘృతం స్నానం రజకతీర్థేషు తామ్రేగవ్యంసురాసమం. గౌడనిబంధసాగరే స్మృతిః -నారికేలోదకంకాంస్యేతామ్రపాత్రే స్థితంమధు, గవ్యంచతామ్రపాత్రస్థంమద్యతుల్యం ఘృతంవినా. తామ్రపాత్రేధృతం మాంసం యచ్చ**

గవ్యం ఘృతేతరత్, ఆమిషంతుగవాం మాంసం దధిమద్యం పయోరజః. ద్రవ్యాంతరయుతం మాంసం పయసాసంయుతం దధి పయోఽనుద్ధృతసారంచ తామ్రపాత్రేనదుష్యతి. **అథజలం** - **యాజ్ఞవల్క్యః** (ఆచారాధ్యాయ - 192) శుచిగోతృప్తికృత్తోయం ప్రకృతిస్థంమహీగతం. **వర్జ్యం జలముక్తం** హేమాద్రౌబ్రహ్మాండే - దుర్గంధిఫేనిలంక్షారం పంకిలం పల్వలోదకం, నభవేద్యత్రగోతృప్తిర్నక్తం యచ్చాప్యుపాహృతం. యన్న సర్వార్థముత్సృష్టంయచ్చాభోజ్య నిపానజం తద్వర్జ్యం సలిలంతాతసదైవ శ్రాద్ధకర్మణి, నిపానో = జలాశయః. శుద్ధితత్త్వేశంఖః - స్నానమాచమనందానందేవతాపితృతర్పణం, శూద్రోదకైర్నకుర్వీత తథామేఘాద్వినిః సృతైః **హేమాద్రావాదిత్య పురాణే** - చిరంపర్యుషితంవాఽపి శూద్రస్పృష్టమథాపివా, జాహ్నవ్యాః స్నాన దానాదౌ పునాత్యేవసదాపయః **కాత్యాయనః** - అపోనిశినగృహ్ణీయాన్నపిబేచ్చకదాచన ఉద్ధృత్యాగ్ని ముపర్యగ్నేర్ధామ్నో ధామ్నుఇతీరయేత్. రజోదోషేతుప్రాగుక్తం. **నారదీయే** - త్యజేత్ప ర్యుషితం పుష్పం త్యజేత్పర్యుషితంజలం, నత్యజేజ్జాహ్నవీతోయం తులసీం పద్మబిల్వకం. **అన్యాన్యపి పృథ్వీచంద్రోదయే** మాత్స్యే-మధ్యాహ్నః ఖడ్గపాత్రంచతథానేపాలకంబలః, రౌప్యందర్భాః తిలా గావోదౌహిత్రశ్చా ష్టమః స్మృతఃపాపం కుత్సితమిత్యాహుః తస్య సంతాపకారిణః అష్టావేతేయతస్తస్మాత్ కుతపాఇతివిశ్రుతాః. బ్రాహ్మే - యతిస్త్రిదండః కరుణారాజతంపాత్రమేవచ, దౌహిత్రంకుతపః కాలః ఛాగం కృష్ణాజినం తథా. శస్త్రేనీతి శేషః దౌహిత్రం ఖడ్గపాత్రమితికల్పతరుః.

అను ॥ స్మృతిసారమందిట్లా - పాలలో ఉప్పు ఉచ్ఛిష్టమైన నేయి చాకలితీర్థమందు స్నానము, రాగిపాత్రలో పాలు ఇవిసురతో సమానమైనవి, అని. గౌడనిబంధసాగరమందు స్మృతి ఇట్లా - కాంస్యపాత్రయందు నారికేళపునీరు, తామపాత్రయందున్న తేనె, తామ్రపాత్రమందున్న పాలు, (నేయితప్ప) మద్యముతో సమానము. తామ్రపాత్రయందలి మాంసము, నేయితప్ప ఇతరమైన గవ్యము పాలువగైరా పనికిరావు. మాంసము గోమాంస తుల్యము పెరుగుమద్యముతో సమానము. పాలు రక్తముతో సమానము. మాంసం వేరే ద్రవ్యంతో కలిసి ఉంటే పాలతో కూడిన పెరుగు, సారముతీయబడని పాలు ఇవి తామ్రపాత్ర యందున్నచో దూషింపబడవు, అని ఇక జలము గూర్చి - యాజ్ఞవల్క్యుడు ఆచారఖండ మందిట్లా - ఆవులను తృప్తిపరచిన నీరు పవిత్రమైంది. సహజసిద్ధంగా ఉన్న, భూమి యందున్న నీరు పవిత్రమైంది, అని. హేమాద్రియందు బ్రహ్మ ఖండమందు విడువ తగిన నీటిని గురించి చెప్పారు ఇట్లా - దుర్వాసనగల, నురుగుగల కారపునీరు, బురదనీరు, గుంటయందలినీరు, గోతృప్తినివ్వని నీరు, రాత్రిపూటతెచ్చిన నీరు అందరికొరకు విడువబడని నీరు, ఏనీరు తాగటానికి యోగ్యంకాదో, ఏనీరు పశువులు మొదలగు అంతా త్రాగుటకు అనువైనది కాదో అట్టి జలాన్ని ఎల్లప్పుడు శ్రాద్ధకర్మలందు విడిచి పెట్టాలి,అని. నిపానము = జలాశయము. శుద్ధితత్త్వమందు శంఖుడిట్లా - స్నానము, ఆచమనము, దానము, దేవతలకు పితరులకు తర్పణము శూద్రుని ఉదకముతో చేయరాదు. అట్లాగే మేఘము నుండి వచ్చిన నీటితో చేయరాదు,అని. హేమాద్రి యందు ఆదిత్య పురాణోక్తి ఇట్లా -

చాలా కాలపు నీరు, పాచినీరు శూద్ర స్పర్శ కల్గిన నీరు ఐనా గంగనీరు ఎల్లప్పుడు స్నానదానములు మొదలగు వాని యందు పవిత్ర మొనర్చునదే,అని. కాత్యాయనుడిట్లా - నీటిని రాత్రి పూట తీసుకురారాదు. ఎప్పుడూ తాగరాదు. అగ్నిని స్థాపించి, అగ్నిపైన ఉంచి ధామ్నో ధామ్న అను మంత్రమును పఠించాలి,అని. రజో దోషం జలానికి ఉంటే ఇంతకు ముందే చెప్పాము. నారదీయమందిట్లా - పాచి పుష్పాన్ని విడిచిపెట్టాలి. పాచి జలాన్ని విడిచిపెట్టాలి. కాని గంగా జలమును, తులసిని, పద్మము, బిల్వము వీటిని విడువరాదు,అని. ఇంకా ఇతరమైనవి కూడా పృథ్వీ చంద్రోదయమందు మత్స్యపురాణోక్తి ఇట్లా - మధ్యాహ్నకాలము, ఖడ్గపాత్ర (దున్నపోతు కొమ్ములతో చేయబడ్డపాత్ర) నేపాలదేశపు కంబళము, వెండి, దర్భలు, తిలలు, గోవులు, దౌహిత్రుడు (త్రము) వీరు ఎనిమిది. వీటిని పాపము, కుత్సితము (నింద) అని అన్నారు. సంతాపాన్ని కల్గించేవి. ఈ ఎనిమిది తాపం కల్గించేవి కనుక కుతపములని పిలువబడ్డాయి,అని. బ్రాహ్మమందిట్లా - యతి,త్రిదండి, దయ, వెండిపాత్ర, దౌహిత్రము, కుతపకాలము, మేక, నల్లజింకచర్మము ఇవి ప్రశస్తమైనవి అని ముగింపు. దౌహిత్రమనగా ఖడ్గపాత్ర యని కల్పతరువు.

**మూ॥ అపరార్కేస్మృత్యంతరే - అపత్యం దుహితుశ్చైవ ఖడ్గపాత్రం తథైవచ, ఘృతంచ కపిలాయా గోః దౌహిత్రమితి కీర్తితం. బ్రహ్మాండే- అమావాస్యాగతే సోమే యాతుఖాదతి గౌస్తృణం, తస్యాగోర్యద్భవేత్ క్షీరం తద్దౌహిత్రముదాహృతం. స్మృతిసంగ్రహే- ఉచ్ఛిష్టం శివనిర్మాల్యం వాంతం చ మృతకర్పటం, శ్రాద్ధే సప్త పవిత్రాణి దౌహిత్రః కుతపఃతిలాః. ఉచ్ఛిష్టం వత్సస్య దుగ్ధమిత్యర్థః శివనిర్మాల్యం = గంగోదకం. వాంతం = మధు మృతకర్పటం = తసరీపట్టం. తిలేష్వాపస్తంబః** - అటవ్యాంయే సముత్పన్నా అకృష్ట ఫలితాస్తథా, తేవైశ్రాద్ధే పవిత్రాః స్యుః తిలాస్తే న తిలాః స్మృతాః. అభావే గ్రామ్యాః. గౌరాః కృష్ణాః తథారణ్యాః తథైవ త్రివిధాస్తిలాః. ఇతి బ్రాహ్మోక్తేః **అథవర్జ్యాని చంద్రికాయాం** యమః - కుక్కుటోవిట్ వరాహశ్చ కాకశ్చాథ బిడాలకః, వృషలీపతిశ్చ వృషలః షంఢోఽవీరా రజస్వలా. ఏతేతు శ్రాద్ధకాలేవై వర్జనీయాః ప్రయత్నతః. **ఖంజః కాణః కుణిః శ్విత్రీదాతుః ప్రేష్యకరస్తథా, న్యూనాంగోప్యతి రిక్తాంగః తమప్యపన యేత్తతః . వాయవీయే - అన్నంపశ్యే యురేతేతు యదివై హవ్యకవ్యయోః, ఉత్సృష్టవ్యం ప్రధానార్థం** సంస్కారస్స్వా పదిస్మృతః. **సుమంతుః - చాండాలాది వీక్షితమన్నమ భోజ్య మన్యత్ర మృద్భస్మ హిరణ్యోదక స్పర్శాత్. తత్రైవజమదగ్నిః - శుద్ధవత్యోఽథ కూష్మాండ్యః పావమాన్యస్తరత్సమాః పూతేన వారిణా దర్భైః అన్నదోషమపోనుదేత్. చంద్రోదయే - పాదుకోపనహౌ ఛత్రం చిత్రరక్తాం బరం తథా, రక్తపుష్పంచ మార్జారం శ్రాద్ధభూమౌ వివర్జయేత్. నిర్ణయదీపే - ఘంటా నినాదో హయసన్నిధానం శంబూక శంఖౌ కదలీదలంచ, ఉన్మత్త జాత్యర్కమహ యారిజాని శ్రాద్ధస్య వైగుణ్య కరాణ్యమూని. హయారిజం = మహిషీ క్షీరాది.**

అను॥ అపరార్కమందు స్మృత్యంతరవచనమిట్లా - అమ్మాయికొడుకు, ఖడ్గపాత్ర, కపిలగోవు నేయి ఇవి దౌహిత్రమని చెప్పబడ్డాయి,అని. బ్రహ్మాండమందిట్లా - చంద్రుడు

అమావాస్య యందు రాగా ఏ ఆవు గడ్డిని మేస్తుందో ఆ గోవు యొక్క పాలు అది దౌహిత్రమని చెప్పబడింది,అని. స్మృతి సంగ్రహమందిట్లా – దూడతాగగా మిగిలిన పాలు (ఉచ్ఛిష్టము) శివ నిర్మాల్యము, తేనె, మృతకర్పటము, దౌహిత్రుడు, కుతపకాలము, తిలలు ఈ ఏడు శ్రాద్ధమందు పవిత్రమైనవి,అని. ఉచ్ఛిష్టమనగా దూడతాగిన పాలు అని అర్థము. శివ నిర్మాల్యమనగా గంగాజలము. వాంతము = తేనె. మృతకర్పటము =తసరీపట్టము (వస్త్రము) ఒకరకమైన పురుగు నుండి వచ్చేదారము బెస్తవారి వలల దారం. నువ్వుల గూర్చి ఆపస్తంబు డిట్లా – అడవి యందు పుట్టిన, దున్నకుండానే పండిన నువ్వులు శ్రాద్ధమందు పవిత్రమైనవి. అవి మామూలు తిలలు కావు, ఉత్తమమైనవి. లేని పక్షంలో గ్రామంనకు చెందినవి. తెలుపు, నలుపు, అడవివి అని నువ్వులు మూడు రకాలు, అని బ్రాహ్మోక్తి. ఇక విడువ తగిన వాటిని గూర్చి చంద్రిక యందు యమోక్తి ఇట్లా – కోడి, విద్వరాహము, కాకి, బిడాలము, వృషలీపతి, వృషలుడు, నపుంసకుడు, భర్త, సంతానము లేనిది, రజస్వల వీరిని శ్రాద్ధ కాలమందు ప్రయత్న పూర్వకముగా విడిచిపెట్టాలి, అని. కుంటివాడు, ఒంటికంటివాడు, ఈచబోయిన చేయిగలవాడు, తెల్లమచ్చలు గలవాడు యజమాని యొక్క సేవకుడు, తక్కువ అవయవములవాడు, ఎక్కువ అవయవములవాడు వారిని కూడా అక్కడి నుండి తొలగించాలి. వాయవీయమందిట్లా – ఒకవేళ వీరు హవ్యకవ్యముల అన్నాన్ని చూచిన యెడల ప్రధానార్థమును విడిచిపెట్టాలి. లేదా ఆపత్తికాలమందు సంస్కారం చేయాలి అని చెప్పారు. సుమంతువిట్లా – చాండాలాదులు చూచిన అన్నమును తినరాదు, మట్టి,భస్మము, బంగారము వీని జలస్పర్శ కలదాని కన్న ఇతరమైనది (తినరాదు),అని. అక్కడే జమదగ్ని – శుద్ధవతీ కూష్మాండ సంజ్ఞ కల ఋక్కులు, పావమాన్య, తరత్సమ ఈ ఋక్కులతో పవిత్రమైన నీటితో, దర్భలతో అన్న దోషమును తొలగించాలి,అని. చంద్రోదయమందిట్లా – పాదుకలు, చెప్పులు, గొడుగు, చిత్ర వర్ణముగల ఎర్రని వస్త్రము, ఎఱ్ఱని పుష్పము, పిల్లి శ్రాద్ధ భూమి యందు ఇవి ఉండరాదు,అని. నిర్ణయదీపమందిట్లా – ఘంటానాదము, గుఱ్ఱము, ఆలిచిప్ప, శంఖము, అరటిఆకు, ఉమ్మెత్త, మల్లె, జిల్లేడు పూలు బఱ్ఱెపాలు మొదలగునవి, ఇవి శ్రాద్ధమునకు విరోధమును చేసేవి (నీచత్వం),అని. హయారిజము = బఱ్ఱెపాలు మొదలగునవి.

**మూ॥ అథశ్రాద్ధదినకృత్యం** – చంద్రోదయే ఉశనాః – గోమయోదకైర్భూమి భాజన **శౌచం కుర్యాత్. పరాశరః** – కాంజికం దధితక్రం చ శ్రుతం చాశ్రుతమేవచ, పూర్వమేవనదాతవ్యం ఏకోద్దిష్టేఽథపార్వణే. **హేమాద్రౌ పరాశరః** – గృహాగ్ని శిశుదేవానాం బ్రహ్మచారి తపస్వినాం, **తావన్నదీయతే కించిత్ యావత్పిండాన్న నిర్వపేత్. కార్ష్ణే**– తిలానవకిరేత్తత్ర సర్వతో **బంధయేదజాన్. తత్రైవదేవలః** – తథైవ యంత్రితో దాతా ప్రాతః స్నాత్వా సహాంబరః, ఆరభేతనవైః **పాత్రైః అన్నారంభం చ బాంధవైః. అత్ర ఆత్మనేపదాత్ స్వయమేవ పాకః కార్యః. అశక్తౌ పత్న్యా తదభావే బాంధవైః, తతస్తాని పపాచాశు సీతాజనక నందినీ, ఇతి పాద్మలింగాదితి హేమాద్రిః.**

శ్రాద్ధ దీపకలికాయా మాశ్వలాయనః - సమాన ప్రవరైర్మిత్రైః సపిండైశ్చ గుణాన్వితైః. కృతోపకారిభిశ్చైవ పాకకార్యం ప్రశస్యతే. **వ్యాసః** - గృహిణీ చైవసుస్నాతా పాకం కుర్యాత్ప్రయత్నతః నిష్పన్నేషు చ పాకేషు పునః స్నానం సమాచరేత్. **పృథ్వీ చంద్రోదయే బ్రాహ్మే** - రజస్వలాం చ పాషండాం పుంశ్చలీం పతితాం తథా, త్యజేచ్ఛూద్రాం తథా వంధ్యాం విధవాంచాన్య గోత్రజాం. వ్యంగకర్ణీం చతుర్థాహః స్నాతామపి రజస్వలాం, వర్జయేత్ శ్రాద్ధ పాకార్థం అమాతృపితృవంశజాం. మాతృపితృ వంశజభిన్నాం త్యజేదిత్యర్థః. స్మృతిసారే - న పాకంకారయేత్స్త్రీం అన్యాంవాప్యన్య గోత్రజాం, మృతవంధ్యాంచ గర్భఘ్నీం గర్భిణీం చైవ దుర్ముఖీం. **పాకభాండానితు హేమాద్రౌ** నాగరఖండే - సౌవర్ణాన్యథరౌప్యాణి కాంస్య తామ్రోద్భవానిచ, మార్తికాన్యపి భవ్యాని నూతనాని దృఢానిచ. తత్రైవాదిత్య పురాణే - పచేదన్నానిసు స్నాతః పాత్రేషు శుచిషు స్వయం, స్వర్ణా దిధాతు జాతేషు మృన్మయేష్వపి వా ద్విజః. అచ్ఛిద్రేష్వ విలిప్తేషు తథాఽనుపహతేషుచ, నాయసేషు న భిన్నేషు దూషితేష్వపి కర్హిచిత్. పూర్వం కృతోపయోగేషు మృన్మయేషు నతుక్వచిత్. వాయుపురాణే - నకదాచిత్పచేదన్నం అయః స్థాలీషు పైతృకం, అయసోదర్శనా దేవపితరోఽపి ద్రవంతిహి. కాలాయసం విశేషేణ నిందంతి పితృకర్మణి, ఫలానాం చైవ శాకానాం ఛేద నార్థానియానితు, మహానసేఽపి శస్త్రాణి తేషామేవహి సన్నిధిః. ఇష్యతే నేతరస్యాత్ర శస్త్రమాత్రస్య దర్శనం. (శ్రాద్ధ దేశేతు విదుషా పితౄణాం తృప్తి మిచ్ఛతా) మహానసేని యుక్తానామపి కార్యం నదర్శనం. తత్రైవ - పచ్యమానస్తు భాండేషు భక్ష్యాతామ్ర మయేషుచ, సముద్ధరతివైఘోరాత్ పితౄన్ దుఃఖ మహార్ణవాత్. తైజసానామ భావేతు పిఠరే మృన్మయేపిచ, నవేశుచౌ ప్రకుర్వీత పాకం పిత్రర్థమాదరాత్. తత్రైవ ణే - పక్వాన్న స్థాపనార్థేతు శస్యంతే దారుజాన్యపి, దర్వ్యాదీన్యపి కార్యాణి యజ్ఞియైరపి ద యమః - వివాహేప్రేతకార్యేచ మాతా పిత్రోః క్షయేఽహని, నవభాండాని కుర్వీత యజ్ఞకాలే విశేషతః.

అను॥ ఇక శ్రాద్ధ దినమందు చేయాల్సినది. చంద్రోదయమందు ఉశనునివాక్కు ఇట్లా - గోమయ ఉదకములతో భూమిని పాత్రలను శుద్ధి చేయాలి,అని. పరాశరుడిట్లా - ఆరనాళము (కలి), పెరుగు, మజ్జిగ, వండినది లేదా వండనిదైనా ఏకోద్దిష్టమందు కాని పార్వణమందు కాని మొదలే ఇవ్వరాదు,అని. హేమాద్రి యందు పరాశరుడిట్లా - గృహాగ్నికి (ప్రాతర్ హవనము లేక) పిల్లలకు దేవతలకు, బ్రహ్మచారులకు, తపస్వులకు వీరందరికి పిండని ర్వాపం జరిగేదాకా ఏమీ ఇవ్వరాదు,అని. కౌర్మమందిట్లా - వంటశాల మొదలగు చోట్ల అంతట నువ్వులను చల్లాలి. అన్ని విధముల మేకలను కట్టివేయాలి,అని. అక్కడే దేవలుడిట్లా - అట్లాగే దాత నియమపూర్వకంగా (సంయమంతో) ప్రొద్దున్నే సచేల స్నానము చేసి, కొత్త పాత్రలతో, బంధువులతో కూడి అన్నారంభమును (పాకమును) ఆరంభించాలి,అని. ఇక్కడ ఆత్మనేపదం వాడినందువల్ల స్వయంగానే పాకం చేయాలి,అని. శక్తి లేనప్పుడు భార్యతో చేయించాలి. వీలు కాకపోతే బంధువులతో చేయించాలి. ఆ పిదప వాటిని జనక నందిని సీత త్వరగా వండింది,అని పాద్మమందలి మాటలవల్ల తెలుస్తోంది అని హేమాద్రి. శ్రాద్ధ దీప కలికయందు ఆశ్వలాయనోక్తిఇట్లా - సమాన ప్రవర కలవారితో మిత్రులతో,

సపిండులతో, గుణవంతులతో, ఉపకారం చేసినవారితో వీరిలో ఎవరితోనైనా పాక కార్యము చేయించుట మంచిది,అని. వ్యాసుడిట్లా – గృహిణి చక్కగా స్నానం చేసి ప్రయత్నపూర్వకముగా వంటచేయాలి. వంట అయ్యాక తిరిగి స్నానం చేయాలి,అని. పృథ్వీచంద్రోదయమందు బ్రాహ్మోక్తి ఇట్లా – రజస్వల, పాషండి (వేదబాహ్యురాలు) కులట, పతిత, శూద్ర, గౌడ్రాలు, విధవ, అన్యగోత్ర మందు పుట్టినది, చెవులు సరిగా లేనిది నాలుగవ రోజటి స్నానం చేసిన రజస్వల, మాతృ పితృవంశజురాలు కానిది ఇట్టి వారిని శ్రాద్ధపాకమందు త్యాగం చేయాలి (ఉంచరాదు),అని. మాతృపితృవంశజ భిన్నను విడిచి పెట్టాలి అని అర్థము. స్మృతి సారమందిట్లా – పుత్రికతో (కన్యతో) అన్య పుత్రికతో, అన్య గోత్రజతో, పిల్లలు పుట్టి చనిపోవటంతో వంధ్యఐన ఆమెతో, గర్భం తీయించుకున్న స్త్రీతో, గర్భిణితో, చెడు మాటలు మాట్లాడే స్త్రీతో (దుర్ముఖి)వీరితో పాకం చేయించరాదు,అని. పాకభాండములైతే హేమాద్రి యందు నాగరఖండమందిట్లా – బంగారువి, వెండివి, కాంస్యము, రాగి, మట్టివి ఏవైనా సుందరమైనవి, కొత్తవి, దృఢమైనవి కావాలి,అని. అక్కడే ఆదిత్యపురాణమందిట్లా– చక్కగా స్నానం చేసి శుచియైన పాత్రలందు స్వయంగా అన్నం మొదలగునవి వండాలి. ద్విజుడు సువర్ణము మొదలగు ధాతువుల వల్ల కల్గిన పాత్రలందు కాని మట్టిపాత్రలందు కాని వంట చేయాలి. చిల్లులు లేనివి, పూయబడనివి, అపవిత్ర వస్తు సంబంధంలేనివి, లోహమువికానివి (ఇనుము), పగులనివి, ఏవిధంగానూ దూషితం కానివి ఇట్టివి కావాలి. ఆ పాత్రలు. ఇదివరలో ఉపయోగించిన మట్టి పాత్రలందు ఎక్కడా వంట కూడదు,అని. వాయుపురాణమందిట్లా – పైతృకమైన అన్నమును ఇనుప పాత్రలందు ఎప్పుడూ వండరాదు. ఇనుము కన్పిస్తేనే చాలు పితరులు కూడా పరుగెత్తుతారు,అని. పితృకర్మలందు ప్రత్యేకించి నల్ల ఇనుప పాత్రలను నిందిస్తారు. పండ్లు శాకములు కోయటానికి ఏవి ఉన్నాయో వంటశాల యందు శస్త్రములు, అవే ఉండాలి. ఇతరమైన శస్త్ర మాత్రముల దర్శనము ఇక్కడ తగదు. (ఇష్టంకాదు). విద్వాంసుడు పితరులకు తృప్తిని కోరుతూ శ్రాద్ధ ప్రదేశమందు వంటశాల యందుంచిన వాని దర్శనమైనా చేయరాదు. అక్కడే – భక్తితో తామ్రమయ ఇతర పాత్రలందు వండుతూన్నందువల్ల పితరులను ఘోరమైన దుఃఖ మహార్ణవము నుండి ఉద్ధరిస్తున్నాడు. తైజసమైనవి (ధాతువి) లేని పక్షంలో మృన్మయమైన వంట కుండయందు కూడా చేయవచ్చు. కొత్తది, శుచియైనది ఐన మట్టి పాత్రయందు ఆదరంతో పితరుల కొరకు పాకం చేయాలి. శుచియైన ప్రదేశమందు,అని. అక్కడే ఆదిత్య పురాణమందిట్లా – వండిన వంటకాన్ని ఉంచే కొరకైతే కట్టెతో చేసిన పాత్రలు కూడా ప్రశస్తమైనవి. యజ్ఞియమైన కర్రలతో దర్వి మొదలగునవి కూడా చేయాలి,అని. యముడిట్లా – వివాహమందు, ప్రేతకార్యమందు, మాతపితరుల మరణదినమందు, విశేషించి యజ్ఞకాలమందు కొత్త పాత్రలు ఉండాలి,అని.

**మూ॥ అథపాకాగ్నిః** – అథపాకాగ్నిః – హేమాద్రౌ ప్రజాపతిః – ఔపాసనే నాన్న సిద్ధిః అగ్నౌకరణమేవచ. పృథ్వీచంద్రోదయే అంగిరాః – శాలాగ్నౌతుపచేదన్నం లౌకికే వాపినిత్యశః

, యస్మిన్న గ్నౌ పచేదన్నం తస్మిన్ హోమోవిధీయతే. మనుః (63-67) వైవాహికేఽగ్నౌ కుర్వీత గృహ్యం కార్యం యధావిధి, పంచయజ్ఞ విధానంచ పంక్తిం చాన్వాహి కీం ద్విజః. శ్రాద్ధస్య గృహ్యత్వం చోక్తమ పరార్కేణ. **అత్రవిశేషఃకర్మప్రదీపే** - ప్రాతర్ హోమంతు నిర్వర్త్య సముద్ధృత్య హుతాశనాత్ శేషం మహానసే కృత్వా తత్రపాకం సమాచరేత్ పాకాంతేఽగ్నిం తమాహృత్య గృహ్యాగ్నౌతు పునః క్షిపేత్. తతోఽస్మిన్ వైశ్వదేవాది కర్మకుర్యాత్ అతంద్రితః. తదభావే లౌకికే తతః పచేయురన్నాని నిర్వాపానంతరం శనైః, వైవాహికేఽగ్నా వన్యత్ర లౌకికే వాపి సంయతః, ఇతి కలికాయాం సంగ్రహోక్తేః. పిత్రర్థం నిర్వాపం కృత్వేత్యర్థః. అత ఏవహేమాద్రౌ వాయుపురాణే పిత్రర్థం నిర్వపే ద్భూమౌ కూర్చేవా దర్భ సంస్కృతే, ఇతి. తత్రైవ పాద్మ మాత్స్యయోః - అగ్నిమాన్నిర్వపేత్పిత్రం చరుంవా సమముష్టిభిః, పితృభ్యో నిర్వపామీతి సర్వం దక్షిణతో న్యసేత్. చరుగ్రహణా(ద)న్న శాకాదావితి హేమాద్రిః. పిండపితృయజ్ఞార్థ పాకవిషయోఽయం నిర్వాప ఇతి తు యుక్తం. అయం చ ఇతరేషా మగ్నిః. ఆశ్వలాయనానాం (అ4.ఖ5.సూ.9) తు గురుణాఽభిమృతా అన్యతోవా అపక్షీయమాణా అమావాస్యాయాం శాంతి కర్మ కుర్వీరన్, ఇత్యాది సూత్రేణ పచనాగ్నేః త్యాగముక్త్వా, ఇహై వాయమితరో జాతవేదా, ఇత్యర్థర్చేన, శమీమయీభ్యా మరణీభ్యా మగ్నిం మంథేత్ సపచనాగ్నిర్భవతి, ఇతి సూత్రే వృత్తౌ చోక్తేః పచనాగ్నావేవపాకః. బౌధాయనేనా ప్యుక్తం - అహృత్యపచనాగ్ని మౌపాసనం వా అభిప్రవ్రజంతి, ఇతి. స్మార్తాగ్నౌ పాకస్త్వన్య శాఖా విషయ ఇతికేచిత్. వస్తు తస్తు పూర్వోక్తస్య సర్వాధాన విషయత్వం యుక్తం. శిష్టాచారేఽపి నప చనోదృశ్యతే. అండవిలాయామపి సర్వాధానపక్షే వైశ్వదేవం శ్రాద్ధం చ పచనేఽగ్నౌ కుర్యాత్. అన్యథా ఔపాసనే ఇత్యుక్తం. అగ్నౌకరణంతు ప్రయోగ పారిజాతాదిభిః ఆబ్దికాది సర్వశ్రాద్ధేషు పిండ పితృయజ్ఞవ్యతిషం గోక్తేః లౌకికే పచనేవా పాకే కృతేఽపి గృహ్యాగ్నౌ పక్వచరుణైవ కార్యమితి ప్రతిభాతి. మదనరత్నేఽప్యేవం. విధురోత్సిన్నాగ్న్యాదేస్తు పృష్ఠోదివి విధానేన అగ్నిసంపాదన మిత్యుక్తం హరిహరభాష్యే, ఇతిపాకాగ్నిః.

అను॥ ఇక పాకాగ్ని, హేమాద్రి యందు ప్రజాపతి ఇట్లా - ఔపాసనంవల్ల అన్నసిద్ధి అగ్నికరణము కూడా,అని. పృధ్వీచంద్రోదయమందు అంగిరుడిట్లా - శాలాగ్ని యందు అన్నమును వండాలి (గృహ్యాగ్ని) (అర్థాధాని, సర్వాధాని ఇద్దరు. శ్రౌత స్మార్తాగ్నులు రెండు ఇవి చేస్తే సర్వాధాని. ఒకటి చేస్తే అర్థాధాని) లేదా ఎప్పుడూ లౌకికాగ్ని యందు కాని అన్నం వండాలి. ఏఅగ్ని యందు అన్నం వండుతారో ఆ అగ్ని యందే హోమం చేయాలి,అని. మనువిట్లా - గృహ్యాకార్యమును శాస్త్ర ప్రకారము వైవాహికాగ్ని యందు చేయాలి. పంచయజ్ఞ విధానము, ప్రతిదిన, పాకము, వీని నన్నిటిని వైవాహికాగ్ని యందు చేయాలి, బ్రాహ్మణుడు, అని. అపరార్కుడు శ్రాద్ధమును గృహ్యాకర్మగా చెప్పాడు. ఇక్కడ విశేషము కర్మ ప్రదీప మందిట్లా - ప్రొద్దుటి హోమాన్ని పూర్తి చేసి అగ్ని నుండి (కొంత అగ్ని) తీసి మిగిలిన దానిని వంటశాల యందుంచి అక్కడ వంట చేయాలి,అని. వంట అయ్యాక చివర అగ్నిని తెచ్చి గృహ్యాగ్ని యందు తిరిగి ఉంచాలి. ఆ పిదప దీనియందు వైశ్వదేవాది కర్మ సోమరితనం లేకుండా చేయాలి. అదిలేని పక్షంలో లౌకికాగ్ని యందు. ఆ పిదప నిర్వాపము తరువాత

మెల్లగా వంట చేయాలి, వైవాహికాగ్ని యందు కాని లేదా లౌకికాగ్ని యందుకాని నిగ్రహంతో, అని కాలిక యందు సంగ్రహోక్తి. పితరుల కొరకు నివాపాంజలి ఇచ్చాక అని అర్థము అందువల్లనే హేమాద్రి యందు వాయుపురాణోక్తి ఇట్లా - పితరుల కొరకు భూమి యందు కాని దర్భలతో సంస్కృతమైన కూర్చపై కాని (పిడికెడు కుశలు)నిర్వాపం చేయాలి,అని అక్కడే పాద్మమాత్స్యముల వచనమిట్లా - అగ్నికలవాడు పితృసంబంధమైన అన్నాన్నిలేదా చరువును కాని సమానమైన పిడికిళ్ళతో, పితరులకై నిర్వాపం చేస్తున్నాను,అని నిర్వాపం చేయాలి. దానినంతా దక్షిణ దిక్కువైపు ఉంచాలి. చరుగ్రహణము అన్నశాకాదులందు సూచన అని హేమాద్రి. పిండ పితృయజ్ఞం కొరకైన పాక విషయమీ నిర్వాపము అనేది తగినమాట. ఇది ఇతరుల అగ్ని. ఆశ్వలాయనులకైతే, గురుణా అభిమృతా, అనే సూత్రంవల్ల పచనాగ్ని త్యాగాన్ని చెప్పి, ఇహైవాయం, అనే సగం ఋక్కుతో, శమీ మయీభ్యాం, అనిసూత్రమందు వృత్తియందు చెప్పినందు వల్ల పచనాగ్ని యందే పాకము. బౌధాయనుడు కూడా చెప్పాడిట్లా - పచనాగ్నిని కాని ఔపాసనాగ్నిని కాని తెచ్చి,అని. స్మార్తాగ్ని యందు పాకము అనేది ఇతర శాఖల విషయము అని కొందరు నిజానికైతే ముందు చెప్పినది సర్వాధాన విషయకమనుట తగును. శిష్టాచారమందు కూడా పాకం కన్పించటం లేదు. 'అందవిలా' యందు కూడా సర్వాధాన పక్షమందు వైశ్వదేవమును, శ్రాద్ధమును పచనాగ్ని యందు చేయాలి లేని పక్షంలో ఔపాసన యందు అని చెప్పారు. అగ్ని కరణమైతే, ప్రయోగ పారిజాతాదులవల్ల, ఆబ్దికాది సర్వశ్రాద్ధములందు పిండ పితృ యజ్ఞముల కలయిక చెప్పబడింది కనుక లౌకికాగ్ని యందైనా పచనాగ్ని యందైనా పాకం చేయబడ్డా గృహ్యాగ్ని యందు పక్వమైన చరువుతోనే చేయాలని తోస్తోంది. మదనరత్నంలో కూడా ఇట్లాగే ఉంది విధురునికి అగ్ని ఉత్పన్నమైన వారికైతే పృష్ఠోదివి, విధానంతో అగ్ని సంపాదనము అని హరిహర భాష్యంలో చెప్పబడింది. అని పాకాగ్ని గూర్చి.

**మూ॥ చంద్రికాయాం మార్కండేయః** - అహ్నః షట్సు ముహూర్తే షుగతేషు ప్రయతాన్ ద్విజాన్, ప్రత్యేకం ప్రేషయేత్తేషాం ప్రదాయామలకోదకం. దేవలః - తతో నివృత్తే మధ్యాహ్నే కృత్తరోమన ఖాన్ ద్విజాన్, అభిగమ్య యథాన్యాయం ప్రయచ్ఛేద్దంత ధావనం. తైలమభ్యంజనం స్నానం స్నానీయం చ పృథగ్విధం, పాత్రైరౌదుంబరైర్దద్యాత్ వైశ్వదేవిక పూర్వకం, ఔదుంబరైః తామ్రమయైః. అత్రక్షౌరామలక స్నానాది నిషిద్ధతి థ్యాదివ్యతిరిక్త విషయం, ఇతి హేమాద్రిః మాధవశ్చ. యత్తు చంద్రికాయాం ప్రచేతాః - తైలముద్వర్తనం స్నానం దద్యాత్ పూర్వాహ్ణ ఏవతు, శ్రాద్ధ భాగ్భ్యోనఖశ్మశుచ్ఛేదనం తునకారయేత్, ఇతి. తన్నిషిద్ధతిథ్యాది విషయం నిషిద్ధ తిథ్యా దితుప్రాగుక్తం. **అభ్యంగేతు కలికాయాం** కాత్యాయనః - తైలముద్వర్తనం దేయం బ్రాహ్మణేభ్యః ప్రయత్నతః, తైరభ్యంగశ్చ కర్తవ్యో వర్జ్యకాలం నచింతయేత్. **అపరార్కే ప్రచేతాః** - స్నాతోఽధికారీభవతి దైవే పిత్ర్యే చ కర్మణి, శ్రాద్ధకృచ్ఛు క్లవాసాః స్యాన్మౌనీ చ విజితేంద్రియః **హేమాద్రౌ జాబాలిః** - తాంబూలం దంతకాష్ఠంచ స్నేహ స్నాన మభోజనం, రత్యౌషధం

పరాన్నాని శ్రాద్ధ కర్తా వివర్జయేత్. **వస్త్రే విశేషమాహ తద్వైవ భృగుః** - నగ్నస్స్యాన్మలవ ద్వాసా నగ్నః కౌపీన కేవలఃద్వికచ్ఛోఽనుత్తరీయశ్చ అకచ్ఛోఽవస్త్ర ఏవచ. నగ్నః కాషాయవాసాః స్యాన్నగ్నశ్చార్ద్రపటః స్మృతః నగ్నోద్విగుణ వస్త్రః స్యాన్నగ్నో రక్తపటః స్మృతః. నగ్నస్తు స్నిగ్ధవస్త్రః స్యాన్నగ్నః స్యూత పటస్తథా. **తతః కర్తా ఊర్ధ్వ పుండ్రం** కుర్యాత్. జపేహోమే తథాదానే స్వాధ్యాయే పితృకర్మణి, తత్సర్వం నశ్యతి క్షిప్రం ఊర్ధ్వ పుండ్రం వినాకృతం, ఇతి హేమాద్రావుక్తేః యజ్ఞోదానం జపోహోమః స్వాధ్యాయః పితృకర్మచ వృథా భవతి విప్రేంద్రా ఊర్ధ్వపుండ్రం వినాకృతం, ఇతి బృహన్నారదీయాత్. ఊర్ధ్వం చ తిలకం కుర్యాత్ దైవే పిత్ర్యేచ కర్మణి, ఇతి వృద్ధ పరాశరోక్తేశ్చ. **అన్యేతు** - ఊర్ధ్వ పుండ్రం ద్విజాతీనాం అగ్నిహోత్ర సమోవిధిః, శ్రాద్ధకాలేతు సంప్రాప్తే కర్తా భోక్తా చ తత్త్యజేత్. **వామహస్తే చదర్భాంస్తు** గృహేరంగావలింతథా, లలాటే తిలకం దృష్ట్వా నిరాశాః పితరోగతాః, ఇతి సంగ్రహోక్తేః.

అను॥ చంద్రిక యందు మార్కండేయుడిట్లా - దివసంలో ఆరు ముహూర్తాలు గడిచాక పరిశుద్ధులైన ద్విజులను, వారికి ఆమలక ఉదకాన్ని ఇచ్చి ప్రత్యేకంగా పంపాలి (భోక్తలందరికి),అని. దేవలుడిట్లా - మధ్యాహ్నం గడిచాక కొరిగించుకున్న రోమములు నఖములు గల బ్రాహ్మణులను చేరి విధి ప్రకారము వారికి దంత ధావనమునకై ఇవ్వాలి. తైలము అభ్యంజనము కొరకు, స్నానమునకు జలము, విడివిడిగా జలాదులు ఉండాలి. విశ్వేదేవుల పూర్వకముగా ఔదుంబర పాత్రములతో జల మివ్వాలి. ఔదుంబరమనగా తామ్ర మయమైనవి. ఇక్కడ క్షౌర ఆమలక స్నానాదులు నిషిద్ధ తిథులు మొదలగునవి కానివాని విషయము, అని హేమాద్రి, మాధవుడు కూడా. చంద్రిక యందు ప్రచేతుడు ఇట్లా - పూర్వాహ్ణమందే తైలము, ఉద్వర్తనము స్నానము ఇవ్వాలి, శ్రాద్ధ భోక్తలకు నఖశ్మ శ్రుఛేదనము చేయించరాదు అని ఏదన్నాడో అది నిషిద్ధ తిథ్యాది విషము. నిషిద్ధ తిథ్యాదులనైతే ముందే చెప్పాము. అభ్యంగ విషయంలో కలికయందు కాత్యాయనుడిట్లా - బ్రాహ్మణులకు ప్రయత్న పూర్వకముగా తైలము ఉద్వర్తనము ఇవ్వాలి. వారు అభ్యంగ స్నానం చేయాలి. వర్జ్య కాలం గూర్చి ఆలోచించరాదు,అని. అపరార్కమందు ప్రచేతుడిట్లా - స్నానం చేస్తే దైవ, పితృ కర్మలందు అధికారి ఔతాడు. శ్రాద్ధకర్త తెల్లని వస్త్రములు ధరించాలి, మౌనంగా ఉండాలి. విజితేంద్రియుడు కావాలి,అని. హేమాద్రి యందు జాబాలి ఇట్లా - తాంబూలము, దంతకాష్ఠము. స్నేహ స్నానము, అభోజనము, రతి, ఔషధము, పరాన్నము వీనిని శ్రాద్ధకర్త విడిచిపెట్టాలి,అని. అట్లాగే వస్త్రమందు విశేషాన్ని భృగువిట్లా చెప్పాడు - మలినమైన వస్త్రములు ధరిస్తే నగ్నమన్నట్టే కేవలం కౌపీనం ధరించినా, రెండు కచ్చెలు ధరించినా, ఉత్తరీయం లేకపోయినా, కచ్చలేకపోయినా, వస్త్రం లేకపోయినా, కాషాయ వస్త్రాలు ధరించిన, తడి బట్టలు ధరించినా వీరంతా నగ్నమైన వారిగా చెప్పబడ్డారు. రెట్టింపు వస్త్రాలు ధరించినా, ఎర్రబట్టలు ధరించినా, నునుపు గల వస్త్రాలు ధరించినా, కుట్టబడిన వస్త్రాలు ధరించిన వీరంతా నగ్నులే,అని. ఆ పిదప కర్త ఊర్ధ్వ పుండ్రం ధరించాలి. జపము, హోమము,

దానము, స్వాధ్యాయము, పితృకర్మ ఇవన్నీ ఊర్ధ్వపుండ్రం లేకుండా చేస్తే అదంతా వెంటనే నశిస్తుంది,అని హేమాద్రి యందు చెప్పారు. యజ్ఞము దానము, జపము, హోమము, స్వాధ్యాయము, పితృకర్మ ఇవి ఊర్ధ్వపుండ్రం లేకుండా చేస్తే వ్యర్థమౌతాయి. ఓ విప్రేంద్రులార! అని బృహన్నారదీయమందు ఉంది. ఆ పైన, దైవ పితృ కర్మలందు తిలకం కూడా ధరించాలి,అని వృద్ధపరాశరోక్తి కూడా. ఇతరులైతే - బ్రాహ్మణులకు ఊర్ధ్వపుండ్రము అగ్నిహోత్రముతో సమానమైన విధి. శ్రాద్ధకాలం వస్తే కర్త, భోక్త వీరిద్దరు దానిని విడిచిపెట్టాలి, అని అన్నారు. ఎడమచేతి యందు దర్భలు ఇంటిముందు ముగ్గులు, నొసట బొట్టు వీనిని చూచి పితరులు నిరాశతో వెళ్తారు,అని సంగ్రహోక్తి.

మూ॥ **ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రం** వా చంద్రాకారమథాపివా, శ్రాద్ధకర్తా న కుర్వీత యా వత్పిండాన్న నిర్వపేత్, ఇతి విశ్వప్రకాశే వచనాచ్చ న కార్యమిత్యాహుః. అత్ర ఆచారాద్వ్యవస్థా. అత ఏవ బృహన్నారదీయే - ఊర్ధ్వపుండ్రం చ తులసీం శ్రాద్ధేనేచ్ఛంతికేచన, ఇతి. ఊర్ధ్వపుండ్ర విధిః విప్రవిషయః. నిషేధాః కర్తృపర ఇతి పృథ్వీచంద్రః. యత్తుహేమాద్రౌ దేవలః - లలాటే పుండ్రకం దృష్ట్వా స్కంధే మాల్యంత థైవచ, నిరాశాః పితరో యాంతి దృష్ట్వా చ వృషలీ పతిం, ఇతి. తత్ గంధేన త్రిపుండ్ర విషయం. ప్రాక్ పిండదానాత్ గంధాద్యైః నాలం కుర్యాత్ స్వవిగ్రహం, ఇత్యాశ్వలాయనోక్తేః. పుండ్రం వర్తుల మిత్య పరార్కే మదనరత్నే చ. పృథ్వీ చంద్రస్తు పుండ్రం = త్రిపుండ్రం. ఊర్ధ్వం చ తిలం కుర్యాత్ న కుర్యాద్వై త్రిపుండ్రకం, నిరాశాః పితరోయాంతి దృష్ట్వా చైవ త్రిపుండ్రకం, ఇతి వృద్ధపరాశరోక్తేః. భోక్తుః తిర్యగ్లేపో భవత్యేవ. వర్జయేత్తిలకం ఫాలే శ్రాద్ధకాలేచ సర్వదా, తిర్యగ పూర్ధ్వ పుండ్రం వాధారయేత్తు ప్రయత్నతః, ఇతి వ్యాసోక్తే రిత్యాహ. పృథ్వీ చంద్రోదయే బ్రాహ్మే-సదర్భేణతు హస్తేన యః కుర్యాత్తిలకం బుధః, ఆచమ్యస విశుద్ధ్యేత పర్యుత్యాగేన చైవహి. శ్రాద్ధారంభే కాలమాహాపరార్కే గౌతమః - అరభ్యకుతపే శ్రాద్ధం పర్యాదా రౌహిణం బుధః, విధిజ్ఞో విధిమా స్థాయ రౌహిణంతు నలంఘయేత్, ఏతదేకోద్దిష్టే. పార్వణేతూక్తం మాత్స్యే - ఊర్ధ్వం ముహూర్తాత్ కుతపాత్ యన్ముహూర్త చతుష్టయం, ముహూర్త పంచకం హ్యేతత్ స్వధా భవన మిష్యతే, మధ్యాహ్నే సర్వదా యస్మాన్మందీ భవతి భాస్కరః, తస్మాదనంత ఫలదః తత్రా రంభో విశిష్యతే. అథ శ్రాద్ధ పరిభాషా - చంద్రికాయాం కాత్యాయనః - దక్షిణం పాతయే జ్జానుం దేవాన్ పరిచరన్ సదా, పాతయే దితరం జానుం పితౄన్ పరిచరన్ సదా. బౌధాయనః - ప్రదక్షిణం తుదేవానాం పితౄణామ ప్రదక్షిణం, దేవానాం ఋజవో దర్భాః పితౄణాం ద్విగుణా స్తథా. పృథ్వీచంద్రోదయే శంఖః - ఆవాహనార్ఘ్య సంకల్పే పిండదానాన్నదానయోః, పిండాభ్యం జనకాలేతు తథైవాంజన కర్మణి, అక్షయ్యాసనయోః పాద్యే గోత్రం నామప్రకాశయేత్. తత్రైవ పరిశిష్టే - క్షణేచ పిండదానేచ గంధధూపాక్షయే తథా, సంకల్పేచాసనే దీపే అంజనాభ్యంజనే తథా. అన్నార్ఘ్య దానాద్యంతేషు గోత్రం నామ చ కీర్తయేత్. కాలికాయాం సంగ్రహే - ఆసనావాహనే పాద్యే అన్నదానే తథైవచ, అక్షయ్యే పిండదానేచ షట్ సునామాని కీర్తయేత్. మాత్స్యే - సంబంధం ప్రథమం బ్రూయాత్ గోత్రం నామ తథైవచ, పశ్చాద్రూపం విజానీయాత్ క్రమ ఏష సనాతనః.

అను॥ ఊర్ధ్వపుండ్రము లేదా త్రిపుండ్రము లేదా చంద్రాకారము కాని శ్రాద్ధకర్త పిండ నిర్వాపం అయ్యేదాకా వానిని ధరించరాదు,అని. విశ్వప్రకాశంలో చెప్పినందువల్ల ధరించరాదు అని అన్నారు. ఇక్కడ ఆచారాన్ననుసరించి నిర్ణయము. అందువల్లనే బృహన్నార దీయమందు, కొందరు శ్రాద్ధమందు ఊర్ధ్వ పుండ్రమును తులసిని ఇష్టపడరు,అని అన్నారు. ఊర్ధ్వపుండ్ర విధి బ్రాహ్మణ విషయము. నిషేధము కర్తృ పరము అని పృథ్వీచంద్రోదయ మందు చెప్పాడు. హేమాద్రి యందు దేవలుడు ఇట్లా - నొసటి యందు పుండ్రమును చూచి భుజమందు మాలను చూచి, వృషలీపతిని చూచి పితరులు నిరాశులై పోతారు అని, అన్నమాట అదిగంధముతో కూడిన త్రిపుండ్ర విషయము. పిండదానము కన్న ముందు గంధాదులతో తన శరీరాన్ని అలంకరించుకోరాదు,అని ఆశ్వలాయనోక్తి. పుండ్రము వర్తులముగా అని, అపరార్కమందు మదనరత్నమందును. పృథ్వీచంద్రుడైతే పుండ్రము అనగా త్రిపుండ్రము అని అన్నాడు. పైన తిలకము నుంచాలి, త్రిపుండ్రకము నుంచరాదు. త్రిపుండ్రకమును చూచి పితరులు నిరాశులైపోతారు, అని వృద్ధపరాశరోక్తి. భోక్తకు అడ్డముగా లేపనము జరుగుతుంది కదా. శ్రాద్ధకాలమందు ఎల్లప్పుడు నొసట తిలకము నుంచరాదు. అడ్డముగా లేదా ఊర్ధ్వపుండ్రమును కాని ప్రయత్న పూర్వకముగా ధరించాలి, అని వ్యాసోక్తి అని అన్నాడు. పృథ్వీచంద్రోదయమందు బ్రాహ్మోక్తి ఇట్లా - బుధుడు దర్భతో కూడిన హస్తంతో తిలకాన్ని ధరిస్తే ఆతడు ఆచమనంతో పరిశుద్ధుడౌతాడు, దర్భనుత్యాగం చేశాకనే,అని. శ్రాద్ధారంభమందు కాలమును అపరార్కమందు గౌతముడిట్లా చెప్పాడు - బుధుడు కుతపకాలమందు శ్రాద్ధము నారంభించి రౌహిణము వరకు చేయాలి. విధిని ఎరిగినవాడు విధిని అనుసరించి రౌహిణమును దాటరాదు,అని. ఇది ఏకోద్దిష్టమందు. పార్వణం విషయంలో మాత్స్యోక్తి ఇట్లా - కుతప ముహూర్తం తరువాత ఉన్న నాలుగు ముహూర్తములు, అనగా ఈ ఐదు ముహూర్తములు స్వధా భవనమని అన్నారు. మధ్యాహ్న మందు ఎప్పుడూ సూర్యుడు మందగిస్తాడు కనుక అక్కడ అనంత ఫలాన్ని ఇస్తాడు. అక్కడ ఆరంభించటం విశేషము,అని. ఇక శ్రాద్ధ పరిభాష-చంద్రికయందు కాత్యాయనుడిట్లా - ఎల్లప్పుడు దేవతల పూజ చేస్తున్నప్పుడు కుడిమోకాలును వంచాలి. పితరుల పూజ చేస్తున్నప్పుడు ఎప్పుడైనా ఎడమ మోకాలును వంచాలి,అని. బౌధాయనుడిట్లా - దేవతలకు ప్రదక్షిణముగా, పితరులకు అప్రదక్షిణముగా ఆచరణ. దేవతలకు ఋజువైన దర్భలను ఇవ్వాలి. పితరులకు అట్లాగే రెట్టింపు దర్భలనివ్వాలి,అని. పృథ్వీ చంద్రోదయమందు శంఖుడిట్లా - ఆవాహన, అర్ఘ్యము, సంకల్పము, పిండదానము, అన్నదానము, పిండ అభ్యంజన కాలము, అంజనకర్మ, అక్షయ్యము, ఆసనము, పాద్యము ఈ సందర్భములందు గోత్ర నామములను చెప్పాలి,అని. అక్కడే పరిశిష్టమందిట్లా - క్షణమందు, పిండదానమందు, గంధము, ధూపము, అక్షయము వీనియందు, సంకల్పము, ఆసనము, దీపము, అంజనము, అభ్యంజనము, అన్నము, అర్ఘ్యము, దానము మొదలగువాని అంతములందు గోత్రము,

నామము చెప్పాలి,అని. కాలికయందు సంగ్రహోక్తి ఇట్లా – ఆసనము, అవాహన, పాద్యము, అన్నదానము, అక్షయ్యము, పిండదానము ఈ ఆరింటియందు నామోచ్చారణ చేయాలి,అని. మాత్స్యమందిట్లా – తొలుత సంబంధాన్ని చెప్పాలి అట్లాగే గోత్రము, పేరు చెప్పాలి. పిదప రూపమును తెలుసుకోవాలి. ఇది సనాతనమైన క్రమము,అని.

మూ॥ **తత్రైవ - సకారేణతు** వక్తవ్యం గోత్రం సర్వత్ర ధీమతా, సకారః కుతపోజ్ఞేయః తస్మాద్యత్నేన తంవదేత్. యథా కాశ్యపస గోత్రేతి. పరాశరస గోత్రస్య వృద్ధస్యతు మహాత్మనః, భిక్షోః పంచశిఖస్యాహం శిష్యః పరమధార్మికః, ఇతి మోక్షధర్మే ప్రయోగాచ్చ. తేన గోత్ర సగోత్రయోః పర్యాయత్వాత్ శాఖా భేదాత్ వ్యవస్థేతి శూలపాణిః (ఏతద్వ్యైషా మామ్నాతం తేషామేవ). హేమాద్రౌ బృహత్ప్రచేతాః – గోత్రం స్వరాంతం సర్వత్ర గోత్రస్యాక్షయకర్మణి, గోత్రస్తు తర్పణే ప్రోక్త ఏవం దాతా నముహ్యతి. సర్వత్రైవ పితః ప్రోక్తః పితా తర్పణకర్మణి, పితు రక్షయ్యకాలేతు పిత్ర్యే సంకల్పనే తథా. శర్మన్నర్ఘ్యాదికే కార్యం శర్మాతర్పణ కర్మణి శర్మణోఽక్షయ్య కాలేతు పితౄణాం దత్త మక్షయం. స్వరాంతం సం బుధ్యంతమితి హేమాద్రిః. **తత్రైవ చంద్రికాయాం స్మృత్యంతరే** – గోత్రస్య త్వపరిజ్ఞానే కాశ్యపం గోత్రముచ్యతే, తస్మాదాహ శ్రుతిః సర్వాః ప్రజాః కశ్యప సంభవాః **యత్తు సత్యాషాఢః** – అథా జ్ఞాతబంధో పురోహిత గోత్రేణ ఆచార్య గోత్రేణవా, ఇతి తద్వివాహ పరం. **నామోచ్చారణే విశేషమాహ** హేమాద్రౌ బౌధాయనః – శర్మాంతం బ్రాహ్మణస్యోక్తం వర్మాంతం క్షత్రియస్యతు, గుప్తాంతం చైవ వైశ్యస్య దాసాన్తం శూద్రజన్మనః. **పిత్రాది నామాజ్ఞానే** తత్రైవ – పృథివీషత్ పితావాచ్యః తత్పితా చాంతరిక్షసత్, అభిధానా పరిజ్ఞానే దివిషత్ ప్రపితామహః. పిత్రాదీనాం నామ యదాపుత్రైర్నజ్ఞాయతే తదా. ఆపస్తంబ సూత్రేఽప్యేవం. ఏతదన్యశాఖా పరం. **ఆశ్వలాయనానాం** తూక్తం తత్సూత్రే – యదినామాన్య విద్వాంసః తత్ పితృపితామహ ప్రపితామహేతి బ్రూయాత్. **తత్కారికాపి** – నామాని చేన్నజానీయాత్ తత్తేత్యాది వదేత్ క్రమాత్. తత్తేతి సంబంధ మాత్రపరం. తేన పితృవ్యాదావపి తథేతి గౌడాః. స్త్రీణాం దాంతం నామజ్ఞేయం. దాంతం నామ స్త్రీణామితి పృథ్వీచంద్రోదయే గోభిలోక్తేః. కేచిద్దేవీ శబ్దాంతమాహుః. అన్యేతు దేవీ, దా ఇతిద్వయోః సముచ్చయ మాహుః. **హేమాద్రౌ నారాయణః** – విభక్తి భిస్తు యత్కించి ద్దీయతే పితృదైవతే. తత్సర్వం సఫలం జ్ఞేయం విపరీతం నిరర్థకం. **చంద్రికా స్మృత్యర్థసారయోః నారదీయేచ** – అక్షయ్యాసనయోః షష్ఠీ ద్వితీయా వాహనేతథా, అన్నదానే చతుర్థీ చ శేషాః సంబుద్ధయః స్మృతాః యత్తు వ్యాసః – చతుర్థీ చాసనే నిత్యం సంకల్పే చ విధీయతే, ప్రథమాతర్పణే ప్రోక్తా సంబుద్ధి మపరేజగుః, ఇతి. అత్ర శాఖా భేదాత్ వ్యవస్థేతి హేమాద్రిః. హేమాద్రౌ భృగుః – అర్ఘ్యావనే జనం పిండమన్నం ప్రత్యవనే జనం, సంబుద్ధిం తత్ర కుర్వీత శేషే షష్ఠీ విధీయతే. తత్రైవ మాతుర్విశేషో నాగరఖండే – మాతర్మాత్రే తథా మాతురాసనే కల్పనేఽక్షయే, గోత్రే గోత్రాయై గోత్రాయాః ప్రథమాద్యా విభక్తయః (దేవి దేవ్యై తథా దేవ్యా ఏవం మాతుశ్చ కీర్తయేత్).

అను॥ అక్కడే – బుద్ధిమంతుడు అంతటా గోత్రాన్ని సకారం చేర్చి చెప్పాలి. సకారము కుతపమని తెలుసుకోవాలి. అందువల్ల ప్రయత్న పూర్వకముగా దాన్ని చెప్పాలి. ఎట్లాంటే కాశ్యపస గోత్ర, అని. పరాశరస గోత్రునియొక్క వృద్ధుడైన మహాత్మునియొక్క

భిక్షుకునియొక్క పంచశిఖలు గలవాని యొక్క శిష్యుణ్ణి నేను, పరమ ధార్మికుణ్ణి, అని మోక్ష ధర్మమందు ప్రయోగించినందువల్లను. అందువల్ల గోత్ర సగోత్రములు పర్యాయమై నందువల్ల శాఖా భేదము ననుసరించి నిర్ణయము అని శూలపాణి. దీనిని ఎవరికైతే, చెప్పారో వారికే వర్తిస్తుంది. హేమాద్రి యందు బృహత్ప్రచేతులిట్లా - గోత్రము అంతట స్వరాంతము (అచ్). అక్షయ కర్మయందు గోత్రస్య అనాలి. తర్పణమందు గోత్రః అనాలి. ఇట్లా చేస్తే దాతమోహమందదు. అంతట పితః అనాలి. తర్పణ కర్మయందు పితా అనాలి. అక్షయ్య కాలమందు పితుః అనాలి. సంకల్పమందు పిత్రే అనాలి. అర్ఘ్యాదిక మందు శర్మన్ అనాలి. తర్పణ కర్మయందు శర్మా అనాలి. అక్షయ్య కాల మందు శర్మణః అనాలి. ఇట్లా పితరులకిచ్చింది అక్షయ్య మౌతుంది. స్వరాంతమనగా సంబుద్ధ్యంతమని హేమాద్రి. అక్కడే చంద్రికయందు స్మృత్యంతరోక్తి ఇట్లా - గోత్రం తెలియనప్పుడు కాశ్యప గోత్రం చెప్పాలి. అందుకే శ్రుతులన్ని ప్రజలు కాశ్యప సంభవులు అని అన్నాయి, అని. సత్యాషాఢుడు ఇట్లా - ఇక అజ్ఞాత బంధువునకైతే పురోహిత గోత్రమో ఆచార్య గోత్రమో చెప్పాలి అని అన్నది అది వివాహ పరము. నామోచ్చారణమందు విశేషాన్ని హేమాద్రి యందు బోధాయనుడిట్లా చెప్పాడు - బ్రాహ్మణునకు శర్మ చివర ఉండాలి, క్షత్రియునకు వర్మాంతము, వైశ్యునకు గుప్తాంతము, శూద్రునకు దాసాంతము,అని. తండ్రి మొదలగు వారి పేరు తెలియకపోతే అక్కడే - తండ్రిపేరు దగ్గర పృథివీషత్ అని, పితామహునిచోట అంతరిక్షసత్ అని, ప్రపితామహుని పేరు చోట దివిషత్ అని పేరు తెలియకపోతే చెప్పాలి, అని. పిత్రాదుల పేరు పుత్రులకు తెలియనప్పుడు. ఆపస్తంబ సూత్రమందు కూడా ఇట్లాగే ఉంది. ఇది ఇతర శాఖల పరమైనది. ఆశ్వలాయనులకైతే ఆ సూత్రమందు ఇట్లా చెప్పబడింది - ఒకవేళ అన్యవిద్వాంసులైతే దానిని పితృపితామహ ప్రపితామహ అని చెప్పాలి, అని. దాని కారిక కూడా - పేర్లు తెలియనట్లైతే తత్, తే అని మొదలుగా క్రమంగా చెప్పాలి. తత్, తే అనేది సంబంధ మాత్రాన్ని తెల్పుతుంది. అందువల్ల పితృవ్యాదులందు కూడా అట్లాగే అని గౌడులన్నారు. స్త్రీలకు దా అంతము పేరు చివర అని తెలుసుకోవాలి. స్త్రీలకు దాంతం నామము అని పృథ్వీచంద్రోదయమందు గోభిలోక్తి. కొందరు దేవి శబ్దము అంతముగా అని చెప్పారు. ఇతరులైతే దేవీ, దా అని రెంటిని చేర్చి చెప్పారు. హేమాద్రి యందు నారాయణుడిట్లా - పితృదేవ కార్యములందు విభక్తులతో ఇవ్వబడేది అంతా సఫలమైంది. విపరీతమైనది నిరర్థకమైనది,అని. చంద్రికా స్మృత్యర్థసారములలో నారదీయ మందును ఇట్లా - అక్షయ్య ఆసనములందు షష్ఠి, ఆవాహన యందు ద్వితీయ, అన్నదాన మందు చతుర్థి, మిగిలినవన్ని సంబోధనలు అని తెలియాలి,అని. వ్యాసుడిట్లా - అసన, సంకల్పములందు ఎప్పుడూ చతుర్థి విభక్తి వస్తుంది. తర్పణ మందు ప్రథమ, ఇతరులు సంబుద్ధిని చెప్పారు,అని. ఇక్కడ శాఖాభేదము ననుసరించి నిర్ణయము అని హేమాద్రి. హేమాద్రి యందు భృగువిట్లా - అర్ఘ్యము, అవనేజనము (దర్భలు పరిచి పిండదానం

ఇవ్వడానికన్న ముందిచ్చే జలం) పిండము, అన్నము, ప్రత్యవనేజనము (తరువాతి జలం) వీనియందు సంబుద్ధి ఉండాలి (సంబోధనవిభక్తి). మిగిలిన చోట్ల షష్ఠి విధించబడింది,అని. అక్కడే తల్లి విషయంలో విశేషము నాగరఖండమందిట్లా - ఆసనం అనుచోట మాతః (సంబోధన), కల్పనమందు (వస్త్రాదిదానం) మాత్రే, అక్షయమందు మాతుః అట్లాగే వరుసగా గోత్రే, గోత్రాయై, గోత్రాయాః అని ప్రథమాది విభక్తులు చెప్పాలి. (అట్లాగే దేవి, దేవ్యై, దేవ్యాః అని ఇట్లా తల్లికి చెప్పాలి, అని).

**మూ॥** హేమాద్రౌ ప్రభాసఖండే - యజ్ఞోపవీతి నాకార్యం దైవం కర్మ ప్రదక్షిణం, ప్రాచీనావీతి నా కార్యం పితృకర్మాఽప్రదక్షిణం. **అనుపనీత స్త్రీ శూద్రాదే సూత్తరీయేణైవ సవ్యాప సవ్యేజ్ఞేయే, తస్యోపవీత స్థానీయత్వాత్, అపసవ్యం క్రమాద్వస్త్రం కృత్వాకశ్చిత్ సగోత్రజః ఇతి బ్రాహ్మేత్యేతి వాచస్పతిః.** యత్తుకేచిత్ - సదోపవీతినా భావ్యం, ఇత్యస్య పురుషార్థత్వాత్ **ప్రాచీనా వీతకాలేఽప్యుపవీతాంతరేణ తత్కార్య మేవేతి.** తన్న విశేషణ (విశేష) బాధాత్. **జమదగ్నిః** - సూక్త స్తోత్ర జపం త్యక్త్వా పిండాఘ్రాణం చ దక్షిణాం, ఆహ్వానం స్వాగతం చార్ఘ్యం వినాచ పరివేషణం. విసర్జనం సౌమనస్య మాశిషాం ప్రార్థనం తథా, విప్ర ప్రదక్షిణాం చైవ స్వస్తివా చనకం వినా. పితౄనుద్దిశ్య కర్తవ్యం ప్రాచీనావీతి నా సదా. **హేమాద్రౌ సంగ్రహే** - ఆదౌ విప్రాంఘ్రి శౌచాంతేఽభ్యర్చనే వికిరేకృతే, పిండానభ్యర్చయిత్వా చ విసృజ్య బ్రాహ్మణాంస్తథా. **ఆచామేచ్ఛ్రాద్ధ** కర్తాచ స్థానేష్వేతేషు సప్తషు. ఆద్యంతయోః ద్విరాచామేత్ శేషేషు తు సకృత్ సకృత్. తత్రైవ - శ్రాద్ధారంభేఽవసానేచ పాదశౌచార్చనాంతయోః, వికిరే పిండదానే చ షట్ స్వాచమన మిష్యతే. **ఆశ్వలాయనః** - దానాధ్యయన దేవార్చా జపహోమ వ్రతాదికాన్, నకుర్యాచ్ఛ్రాద్ధ దివసే ప్రాగ్విప్రాణాం విసర్జనాత్. ఏతన్నిత్యవర్జ్యమితి బోపదేవః. ఇదం విష్ణుభిన్న దేవపరం. విష్ణోర్ని వేదితాన్నేన యష్టవ్యం దేవతాంతరం. పితృభ్యశ్చాపి తద్దేయం తదానంత్యాయ కల్పతే. పితృశేషంతు యో దద్యాత్ హరయే పరమాత్మనే, రేతోధాః పితరస్త స్యభవంతి క్లేశభాగినః ఇతి స్కాందాత్. పితరః సర్వే మనుష్యా విష్ణు నాశిత మశ్నంతి ఇతి శ్రుతేః. యః శ్రాద్ధకాలే హరిభుక్త శేషం దదాతి భక్త్యా పితృదేవతానాం. తే నైవ పిండాస్తులసీ విమిశ్రానా కల్పకోటిం పితరస్తు తృప్తాః, ఇతి బ్రాహ్మోక్తేశ్చేతి శ్రీధర స్వామి నృసింహ పరిచర్యాదయః. ఏతత్సర్వం నిబంధ విరోధాన్నిర్మూలం. **అత్రవిశేషో** హేమాద్రౌ విష్ణుధర్మే - శ్రాద్ధాహ్నితు సమభ్యర్చ్య నృవరాహం జనార్దనం, శివపురాణే - పూజయిత్వా శివం భక్త్యా పితృశ్రాద్ధం ప్రకల్పయేత్. పూర్వ నిషేధస్తు విహితభిన్నపరః. **తథా హేమాద్రౌ** - దేవార్చా దక్షిణాంగాదిః పాదజాన్వం సమూర్ధసు, శిరోఽంసజాను పాదేషు వామాంగాది చ పైతృకే.

అను॥ హేమాద్రి యందు ప్రభాస ఖండమందిట్లా - యజ్ఞోపవీతం కలవాడు ఉపవీతంగా దైవకర్మను ప్రదక్షిణ పూర్వకముగా చేయాలి. ఆతడు పితృకర్మను అప్రదక్షిణంగా ప్రాచీనా వీతితో చేయాలి, అని. అనుపనీత స్త్రీ శూద్రాదులకైతే ఉత్తరీయంతోనే సవ్యాప సవ్యములు అని తెలుసుకోవాలి. అది యజ్ఞోపవీత స్థానంది కనుక. ఒక సగోత్రజుడు క్రమంగా వస్త్రమును అపసవ్యం చేసి, అని బ్రాహ్మము నుండి వాక్యము అని వాచస్పతి.

కొందరు ఇట్లా - ఎప్పుడూ ఉపవీతిగా ఉండాలి, అనేది పురుషార్థమైనందువల్ల ప్రాచీనావీత కాలమందు కూడా మరొక ఉపవీతముతో దాన్ని చేయవలసిందే, అని అన్నమాట తప్పు. విశేషణమునకు బాధ ఔతుంది కనుక. జమదగ్ని ఇట్లా - సూక్తస్తోత్ర జపములను వదలి, పిండాఘ్రాణము, దక్షిణ వీనిని, ఆహ్వానము, స్వాగతము, అర్ఘ్యము వీనిని పరివేషణము తప్ప (అన్నం వడ్డించుట తప్ప), విసర్జనము, సౌమనస్యము (పిండదానం తర్వాత బ్రాహ్మణునికిచ్చే పుష్పదాన మంత్రం), ఆశీస్సుల ప్రార్థన వీనిని, స్వస్తి వాచన లేకుండా విప్రదక్షిణ వీనిని ఎప్పుడూ పితరులనుద్దేశించి ప్రాచీనా వీతితో చేయాలి,అని. హేమాద్రి యందు సంగ్రహోక్తి ఇట్లా - తొలుత, బ్రాహ్మణ పాదశౌచము చివర, పూజ తరువాత వికిరం అయ్యాక (నిమంత్రితులు భుజించాక విస్తరి ముందరవేసే అన్నం), పిండముల కూడా పూజించాక వదలి బ్రాహ్మణుల కూడా అట్లాగే వదిలాక, ఈ ఏడు స్థానములందు శ్రాద్ధకర్త ఆచమనం చేయాలి. మొదట చివర రెండు సార్లు ఆచమనం చేయాలి. మిగిలిన చోట్ల ఒక్కొక్కసారే, అని. అక్కడే శ్రాద్ధ ఆరంభమందు అవసానమందు పాదశౌచ, అర్చనల చివర, వికిరం అయ్యాక, పిండదానమందు ఈ ఆరుచోట్ల ఆచమనము ఇష్టమైనది, అని. ఆశ్వలాయనుడిట్లా - దానము, అధ్యయనము, దేవతార్చన, జపము, హోమము, వ్రతము మొదలగు వాటిని శ్రాద్ధ దివసమందు బ్రాహ్మణులను విసర్జించటంకన్న ముందు చేయరాదు, అని. ఇది నిత్యం చేసే వానికి వర్తించదు అని బోపదేవుడు. ఇది విష్ణువు కన్న భిన్నమైన దేవతల విషయకము. విష్ణువునకు నివేదించిన అన్నంతోనే ఇతర దేవతలను పూజించాలి, పితరులకు గూడా అదే ఇవ్వాలి అది అనంత ఫలాన్నిస్తుంది. పరమాత్మయైన హరికి పితృశేషాన్ని ఇస్తే వాని పితరులు వీర్యపానం చేస్తారు. దుఃఖమునకు పాత్రులౌతారు. అని స్కాందోక్తి. పితరులంతా మనుష్యులు విష్ణువు తిన్న దానిని తింటారు అని శ్రుతి. శ్రాద్ధకాలమందు హరిభుక్త శేషమును పితృదేవతలకు భక్తితో ఇచ్చిన వాటితోనే, తులసితో కూడిన పిండములతోనే కల్పకోటి కాలము వరకు పితరులు తృప్తులౌతారు, అని బ్రాహ్మోక్తి కూడా అని శ్రీధరస్వామి, నృసింహ పరిచర్య మొదలగునవి అన్నాయి. ఇదంతా నిబంధములకు విరుద్ధము కనుక మూలాధారము లేనివి. ఇక్కడ విశేషాన్ని హేమాద్రి యందు విష్ణుధర్మోక్తి ఇట్లా - శ్రాద్ధము రోజున నృసింహ, వరాహ స్వాములను, జనార్దనుని చక్కగా పూజించాలి,అని. శివపురాణమందిట్లా - శివుని భక్తితో పూజించి పితృశ్రాద్ధాన్ని ఏర్పరచాలి,అని. ముందు విధించిన నిషేధము శాస్త్రము విధించిన దానికన్న ఇతరమైన వాని విషయము,అని. అట్లాగే హేమాద్రి యందు - దేవతార్చన దక్షిణ అంగము నుండి మొదలు పెట్టాలి. సహజంగా కుడిపాదం, మోకాలు, భుజము, శిరస్సు, కాని ఎడమవైపు నుండి శిరస్సు భుజము, మోకాలు, పాదములు ఈ వరుసలో పితృకర్మ లందు పూజ చేయాలి, అని.

ఇవ్వడానికన్న ముందిచ్చే జలం) పిండము, అన్నము, ప్రత్యవనేజనము (తరువాతి జలం) వీనియందు సంబుద్ధి ఉండాలి (సంబోధనవిభక్తి). మిగిలిన చోట్ల షష్ఠి విధించబడింది,అని. అక్కడే తల్లి విషయంలో విశేషము నాగరఖండమందిట్లా - ఆసనం అనుచోట మాతః (సంబోధన), కల్పనమందు (వస్త్రాదిదానం) మాత్రే, అక్షయమందు మాతుః అట్లాగే వరుసగా గోత్రే, గోత్రాయై, గోత్రాయాః అని ప్రథమాది విభక్తులు చెప్పాలి. (అట్లాగే దేవి, దేవ్యై, దేవ్యాః అని ఇట్లా తల్లికి చెప్పాలి, అని).

**మూ॥** హేమాద్రౌ ప్రభాసఖండే - యజ్ఞోపవీతి నాకార్యం దైవం కర్మ ప్రదక్షిణం, ప్రాచీనావీతి నా కార్యం పితృకర్మాఽప్రదక్షిణం. **అనుపనీత స్త్రీ శూద్రాదే స్తూత్తరీయేణైవ సవ్యాప సవ్యేజ్ఞేయే, తస్యోపవీత స్థానీయత్వాత్, అపసవ్యం క్రమాద్వస్త్రం కృత్వాకశ్చిత్ సగోత్రజః ఇతి బ్రాహ్మేచ్ఛేతి** వాచస్పతిః. యత్తుకేచిత్ - సదోపవీతినా భావ్యం, ఇత్యస్య పురుషార్థత్వాత్ **ప్రాచీనా వీతకాలేఽప్యుపవీతాంతరేణ తత్కార్య మేవేతి.** తన్న విశేషణ (విశేష) బాధాత్. **జమదగ్నిః** - సూక్త స్తోత్ర జపం త్యక్త్వా పిండాఘ్రాణం చ దక్షిణాం, ఆహ్వానం స్వాగతం చార్ఘ్యం వినాచ పరివేషణం. విసర్జనం సౌమనస్య మాశిషాం ప్రార్థనం తథా, విప్ర ప్రదక్షిణాం చైవ స్వస్తివా చనకం వినా. పితౄనుద్దిశ్య కర్తవ్యం ప్రాచీనావీతి నా సదా. **హేమాద్రౌ సంగ్రహే** - ఆదౌ విప్రాంఘ్రి శౌచాంతేఽభ్యర్చనే వికిరేకృతే, పిండానభ్యర్చయిత్వా చ విసృజ్య బ్రాహ్మణాంస్తథా. **ఆచామేచ్ఛ్రాద్ధ** కర్తాచ స్థానేష్వేతేషు సప్తషు. ఆద్యంతయోః ద్విరాచామేత్ శేషేషు తు సకృత్ **సకృత్. తత్రైవ** - శ్రాద్ధారంభేఽవసానేచ పాదశౌచార్చనాంతయోః, వికిరే పిండదానే చ షట్ **స్వాచమన మిష్యతే. ఆశ్వలాయనః** - దానాధ్యయన దేవార్చా జపహోమ వ్రతాదికాన్, నకుర్యాచ్ఛ్రాద్ధ దివసే ప్రాగ్విప్రాణాం విసర్జనాత్. ఏతన్నిత్యవర్జ్యమితి బోపదేవః. ఇదం విష్ణుభిన్న దేవపరం. విష్ణోర్ని వేదితాన్నేన యష్టవ్యం దేవతాంతరం. పితృభ్యశ్చాపి తద్దేయం తదానంత్యాయ **కల్పతే. పితృశేషంతు** యో దద్యాత్ హరయే పరమాత్మనే, రేతోధాః పితరస్త స్యభవంతి క్లేశభాగినః **ఇతి స్కాందాత్.** పితరః సర్వే మనుష్యా విష్ణు నాశిత మశ్నంతి ఇతి శ్రుతేః. యః శ్రాద్ధకాలే **హరిభుక్త శేషం** దదాతి భక్త్యా పితృదేవతానాం. తే నైవ పిండాస్తులసీ విమిశ్రానా కల్పకోటిం **పితరస్తు తృప్తాః,** ఇతి బ్రాహ్మోక్తేశ్చేతి శ్రీధర స్వామి నృసింహ పరిచర్యాదయః. ఏతత్సర్వం నిబంధ విరోధాన్నిర్మూలం. **అత్రవిశేషో** హేమాద్రౌ విష్ణుధర్మే - శ్రాద్ధాహ్నితు సమభ్యర్చ్య నృవరాహం జనార్దనం, శివపురాణే - పూజయిత్వా శివం భక్త్యా పితృశ్రాద్ధం ప్రకల్పయేత్. పూర్వ నిషేధస్తు విహితభిన్నపరః. **తథా హేమాద్రౌ** - దేవార్చా దక్షిణాంగాదిః పాదజాన్వం సమూర్ధసు, శిరోఽ ంసజాను పాదేషు వామాంగాది చ పైతృకే.

అను॥ హేమాద్రి యందు ప్రభాస ఖండమందిట్లా - యజ్ఞోపవీతం కలవాడు ఉపవీతంగా దైవకర్మను ప్రదక్షిణ పూర్వకముగా చేయాలి. ఆతడు పితృకర్మను అప్రదక్షిణంగా ప్రాచీనా వీతితో చేయాలి, అని. అనుపనీత స్త్రీ శూద్రాదులకైతే ఉత్తరీయంతోనే సవ్యాప సవ్యములు అని తెలుసుకోవాలి. అది యజ్ఞోపవీత స్థానంది కనుక. ఒక సగోత్రజుడు క్రమంగా వస్త్రమును అపసవ్యం చేసి, అని బ్రాహ్మము నుండి వాక్యము అని వాచస్పతి.

కొందరు ఇట్లా - ఎప్పుడూ ఉపవీతిగా ఉండాలి, అనేది పురుషార్థమైనందువల్ల ప్రాచీనావీత కాలమందు కూడా మరొక ఉపవీతముతో దాన్ని చేయవలసిందే, అని అన్నమాట తప్పు. విశేషణమునకు బాధ ఔతుంది కనుక. జమదగ్ని ఇట్లా - సూక్తస్తోత్ర జపములను వదలి, పిండాఘ్రాణము, దక్షిణ వీనిని, ఆహ్వానము, స్వాగతము, అర్ఘ్యము వీనిని పరివేషణము తప్ప (అన్నం వడ్డించుట తప్ప), విసర్జనము, సౌమనస్యము (పిండదానం తర్వాత బ్రాహ్మణునికిచ్చే పుష్పదాన మంత్రం), ఆశీస్సుల ప్రార్థన వీనిని, స్వస్తి వాచన లేకుండా విప్రదక్షిణ వీనిని ఎప్పుడూ పితరులనుద్దేశించి ప్రాచీనా వీతితో చేయాలి,అని. హేమాద్రి యందు సంగ్రహోక్తి ఇట్లా - తొలుత, బ్రాహ్మణ పాదశౌచము చివర, పూజ తరువాత వికిరం అయ్యాక (నిమంత్రితులు భుజించాక విస్తరి ముందరవేసే అన్నం), పిండముల కూడా పూజించాక వదలి బ్రాహ్మణుల కూడా అట్లాగే వదిలాక, ఈ ఏడు స్థానములందు శ్రాద్ధకర్త ఆచమనం చేయాలి. మొదట చివర రెండు సార్లు ఆచమనం చేయాలి. మిగిలిన చోట్ల ఒక్కొక్కసారే, అని. అక్కడే శ్రాద్ధ ఆరంభమందు అవసానమందు పాదశౌచ, అర్చనల చివర, వికిరం అయ్యాక, పిండదానమందు ఈ ఆరుచోట్ల ఆచమనము ఇష్టమైనది, అని. ఆశ్వలాయనుడిట్లా - దానము, అధ్యయనము, దేవతార్చన, జపము, హోమము, వ్రతము మొదలగు వాటిని శ్రాద్ధ దివసమందు బ్రాహ్మణులను విసర్జించటంకన్న ముందు చేయరాదు, అని. ఇది నిత్యం చేసే వానికి వర్తించదు అని బోపదేవుడు. ఇది విష్ణువు కన్న భిన్నమైన దేవతల విషయకము. విష్ణువునకు నివేదించిన అన్నంతోనే ఇతర దేవతలను పూజించాలి, పితరులకు గూడా అదే ఇవ్వాలి అది అనంత ఫలాన్నిస్తుంది. పరమాత్మయైన హరికి పితృశేషాన్ని ఇస్తే వాని పితరులు వీర్యపానం చేస్తారు. దుఃఖమునకు పాత్రులౌతారు. అని స్కాందోక్తి. పితరులంతా మనుష్యులు విష్ణువు తిన్న దానిని తింటారు అని శ్రుతి. శ్రాద్ధకాలమందు హరిభుక్త శేషమును పితృదేవతలకు భక్తితో ఇచ్చిన వాటితోనే, తులసితో కూడిన పిండములతోనే కల్పకోటి కాలము వరకు పితరులు తృప్తులౌతారు, అని బ్రాహ్మోక్తి కూడా అని శ్రీధరస్వామి, నృసింహ పరిచర్య మొదలగునవి అన్నాయి. ఇదంతా నిబంధములకు విరుద్ధము కనుక మూలాధారము లేనివి. ఇక్కడ విశేషాన్ని హేమాద్రి యందు విష్ణుధర్మోక్తి ఇట్లా - శ్రాద్ధము రోజున నృసింహ, వరాహ స్వాములను, జనార్దనుని చక్కగా పూజించాలి,అని. శివపురాణమందిట్లా - శివుని భక్తితో పూజించి పితృశ్రాద్ధాన్ని ఏర్పరచాలి,అని. ముందు విధించిన నిషేధము శాస్త్రము విధించిన దానికన్న ఇతరమైన వాని విషయము,అని. అట్లాగే హేమాద్రి యందు - దేవతార్చన దక్షిణ అంగము నుండి మొదలు పెట్టాలి. సహజంగా కుడిపాదం, మోకాలు, భుజము, శిరస్సు, కాని ఎడమవైపు నుండి శిరస్సు భుజము, మోకాలు, పాదములు ఈ వరుసలో పితృకర్మ లందు పూజ చేయాలి, అని.

మూ॥ కలికాయాం స్మృత్యంతరే - శ్రాద్ధారంభే తుయే దర్భాః పాదశౌచే విసర్జయేత్, అర్చనాదౌతుయే దర్భాః ఉచ్ఛిష్టాంతే విసర్జయేత్. మార్జనాదౌ తుయే దర్భా పిండోత్థానే విసర్జయేత్. ఉత్థానా దౌతుయే దర్భాః దక్షిణాంతే విసర్జయేత్, ప్రార్థనాదౌతు యే దర్భాః నమస్కారే విసర్జయేత్. ఊహామాహ విష్ణుః - మాతామహో నామప్యేవం శ్రాద్ధం కుర్యాద్విచక్షణః, మంత్రోహేన యథా న్యాయం శేషాణాం మంత్ర వర్జితం. యథా న్యాయమితి యత్ర బహువచనాంతః పితృశబ్దః తత్ర సర్వ పితృవాచిత్వాన్నోహః. తత్రాపి, శుంధంతాం పితరః, ఇత్యత్రోహ ఏవ. సర్వ పితృవాచిత్వే ఉత్తర మంత్ర ద్వయ వైయర్థ్యాత్. బహువచనంతు నోహ్యతే, ప్రకృతావ సమర్థత్వాత్ పాశానితివత్. ఋగంతేచనోహః. తస్మాదృచం నోహేత్, ఇతి నిషేధాత్. ఏకోద్దిష్టేఽప్యేవం. ప్రేతైకోద్దిష్టేతు ఏకవన్మాత్రానూ హేత్తైకోద్దిష్టే, ఇతి విష్ణూక్తే రూహః. అత్ర బహువచన స్యాఽప్యూహో వచనాత్. వృద్ధ్యాదౌతు విశేషం వక్ష్యామః. శేషాణామితి పితృవ్యాద్యేకోద్దిష్టే ఆవాహనాది మంత్ర వర్జ్యం కార్యమితి కల్పతరుః. ఊహ యోగ్యపితృపదవాన్ మంత్ర ఏవ తత్ర ప్రయోజ్యః, నతూహః. నాపి పితృపద రహితః ప్రయోజ్య ఇతి శూలపాణిః. అర్థాంతరం చోక్తం ప్రాక్. బహ్వృచకారికాఽపి - అర్ఘ్య ప్రదాన మంత్రేతు మాత్రాది పదమావపేత్, శుంధం తామితి పిత్రాదౌ మాత్రాది పదమావపేత్. మాతృశ్రాద్ధే పిండదానే - యేచత్వా మత్రాను, ఇత్యత్ర నోహ ఇతివృత్తికృత్. తథా - మాతుః శ్రాద్ధేఽప్యనూహేన కుర్యాత్పిండాను మంత్రణం. దశాదానముపస్థానం తద్వత్ కార్యమితి స్థితిః . ప్రవాహణ మనూహేన తద్వత్ ప్రాశనమిష్యతే. తథా - అయంతున స్త్రిలోఽసీతి ఉశన్తస్త్వేతి యానితు, అనూహ్యాః పితృశబ్దోఽత్ర పితృసామాన్య వాచకః. ఆపస్తంబానాం తు వక్ష్యతే.

అను॥ కలిక యందు స్మృత్యంతర వచనమిట్లా - శ్రాద్ధారంభమందలి దర్భలను పాదశౌచమందు విడిచేయాలి. అర్చనాదులందలి దర్భలను ఉచ్ఛిష్టాంతమందు విడువాలి. మార్జనాదులయందలి (శుద్ధి) దర్భలను పిండోత్థానమందు విడువాలి. ఉత్థానాదులందలి దర్భలను దక్షిణ తరువాత విసర్జించాలి. ప్రార్థన యందలి దర్భలను నమస్కార మందు విసర్జించాలి, అని. ఊహను గూర్చి విష్ణువిట్లా చెప్పాడు - విచక్షణ కలవాడు మాతామహులకు కూడా ఇట్లాగే శ్రాద్ధం చేయాలి. మంత్రోహతో యథా న్యాయంగా ఇతరులకు మంత్రము లేకుండా యథా న్యాయముగా అని. పితృశబ్దము బహువచనాంతముగా ఉన్నచోట అందరు పితరులను సూచిస్తుంది. కనుక ఊహ అవసరం లేదు. అక్కడ కూడా శుంధంతాం పితరః అనే చోట ఊహనే. పితరులందరిని సూచిస్తే తరువాతి రెండు మంత్రాలు వ్యర్థమౌతాయి. బహువచనమైతే ఉంటె, ఊహింపబడదు. ఇక్కడ అసమర్థమైనందువల్ల (ప్రకృతి శ్రాద్ధమందు (ఏకోద్దిష్టం) ఇద్దరు లేరు కాబట్టి బహువచనం ఊహరాదు) పాశాన్ అనే దానివలె. ఋగంతమందును ఊహలేదు. అందువల్ల ఋక్కును ఊహించరాదు,అని నిషేధం ఉన్నందువల్ల. ఏకోద్దిష మందు కూడా అట్లాగే. ప్రేత ఏకోద్దిష్టమందైతే ఏకవత్ మంత్రములను ఊహించాలి, ఏకోద్దిష్టమందు, అని విష్ణూక్తి ఉన్నందువల్ల ఊహ. ఇక్కడ, వచనాన్నను సరించి బహువచనమునకు గూడా ఊహ. వృద్ధ్యాదులందైతే విశేషమును చెప్తాము. మిగిలిన వారికి అనేది చిన్నాయన మొదలగు వారి ఏకోద్దిష్టమందు ఆవాహన మొదలగునవి మంత్రాలు

లేకుండా చేయాలి అని కల్పతరువు. ఊహ యోగ్యమైన పితృపదంగల మంత్రాన్నే అక్కడ ప్రయోగించాలి, అందువల్ల ఊహలేదు. పితృపద రహితమైంది కూడా ప్రయోగించరాదు అని శూలపాణి. అర్థాంతరాన్ని ముందే చెప్పాము. బహ్వృచ కారిక కూడా - అర్ఘ్య ప్రదాన మంత్రమందైతే మాత్రాది పదములను చెప్పాలి. శుంధం తామితి మంత్రంలో పిత్రాది శబ్దములందు మాత్రాది పదమును చేర్చాలి,అని. మాతృశ్రాద్ధమందు పిండదాన మందు ఇట్లా - యే చత్వామత్రాను అనే చోట ఊహలేదు అని వృత్తికారుడు (యే పుంలింగం యాః స్త్రీలింగం కదా). అట్లాగే - మాతృశ్రాద్ధమందు కూడా పిండ అనుమంత్రణమును ఊహ లేకుండా చేయాలి, దశదానము, ఉపస్థానము అట్లాగే చేయాలి, అని నిర్ణయము. ముందర రాబోయే వాటిని, అట్లాగే ప్రాశనమును కూడా ఊహ లేకుండా చేయాలి. అదే ఇష్టము, అని. అట్లాగే - ఆయంతునః, తిలోఽసి, ఉషంతస్త్వా అను మంత్రములందు పితృ శబ్దము అనూహ్యము. ఇక్కడ పితృశబ్దము పితృ సామాన్య వాచకము,అని. ఆపస్తంబులకైతే చెప్తాము.

మూ॥ **హేమాద్రౌ మార్కండేయః** - స్నాతః స్నానాత్ సమాహూతాన్ స్వాగతే నార్చయేత్ పృథక్. **కలికాయాం నారదీయే** - ప్రాయశ్చిత్త విశుద్ధాత్మాతేభ్యోఽనుజ్ఞాం ప్రగృహ్యచ, దద్యాద్వై బ్రహ్మ దండార్థం హిరణ్య కుశమేవచ. **తత్రైవ సంగ్రహే** - తిథి వారాదికం జ్ఞాత్వా సంకల్ప్య చ యథావిధి, ప్రాచీనా వీతి నా కార్యం సర్వం సంకల్పనాదికం. సంబంధం ప్రథమం బ్రూయాత్ నామగోత్రే తథైవచ, వస్వాది రూపతాం చాపిస్వ పితౄణా మనుక్రమాత్. **చంద్రోదయే నారదీయే** - శ్రాద్ధార్థం సమను ప్రాప్తాన్ విప్రాన్ భూయో నిమంత్రయేత్. **ఆపస్తంబస్తు** - పూర్వేద్యుర్ని మంత్రణం, పరేద్యుర్ ద్వితీయం, తృతీయ మామంత్రణం, ఇత్యాహ. యూయం మయాని మంత్రణీయా ఇతి నివేదకరూపమాద్యం. తద్విధి మాహశౌనకః - గృహీత్వా ముకసంజ్ఞ న్యాముక గోత్రస్య చాముకే, శ్రాద్ధేతు వైశ్వదేవార్థం కరణీయః క్షణస్త్వయా. ఇత్యేవం శ్రాద్ధకృత్ బ్రూయాదోం తథేతి వదేత్తుసః, శ్రాద్ధస్యకర్తా సబ్రూయాత్తం ప్రాప్నోతు భవానితి. సవదేత్ప్రాప్నవానీతి ఇతరస్తం ప్రతిద్విజః. దేవౌ పార్వణే పురూర వార్ద్రవౌ వాచ్యౌ పిత్రా దేరప్యనే నైవ వృణీత విధినా ద్విజాన్. **తతః కర్తా బహ్వృచోఽనాహితాగ్నిః** పిండపితృ యజ్ఞం పరిస్తరణాదీధ్మా ధానాంతం కుర్యాత్. అర్ఘాధానినోఽప్యేవం, ఇతి ప్రయోగ పారిజాతే పరిశిష్టే చ. భాష్యకారమతే ఆబ్దికేప్యేవం. వృత్తికారమతే నేదం. **హేమాద్రౌ శంభుః** - సంమార్జితో పలిప్తేతు ద్వారి కుర్వీత మండలే, ఉదక్ ప్లవముదీచ్యం స్యాద్దక్షిణం దక్షిణాప్లవం. వ్యాఘ్రః - ఉత్తరేఽక్షత సంయుక్తాన్ పూర్వాగ్రాన్ విన్యసేత్ కుశాన్, దక్షిణే దక్షిణాగ్రంస్తు సతిలాన్ విన్యసేత్ కుశాన్. తత్రైవ బౌధాయనః - చతురస్రం త్రికోణంచ వర్తులం చార్ధచంద్రకం, కర్తవ్య మాను పూర్వేణ బ్రాహ్మణాదిషు మండలం. తత్రైవ లౌగాక్షిః - హస్తద్వయ మితం కార్యం వైశ్వదేవిక మండలం, దక్షిణేచ చతుర్ హస్తం పితౄణా మంత్రిశోధనే. కలికాయాం సంగ్రహేతు - ప్రాదేశ మాత్రం దేవానాం చతురస్రంతు మండలం, త్ర్యశ్రా షడంగులం తస్మాత్ దక్షిణే వర్తులంతథా, ఇత్యుక్తం. స్మృత్యంతరే - గర్తః పంచాంగులో విప్రే, జానుమాత్రో మహీ భుజి, ప్రాదేశమాత్రో

వైశ్యేచ సాధికః సతు శూద్రకే. తిర్యగూర్ధ్వ ప్రమాణేన వ్యాఖ్యాతో దైవ పిత్ర్యయోః, చతురస్రం వర్తులంచ కథితం గర్తలక్షణం. పాద ప్రక్షాళనం ప్రోక్తముపవేశ్యాసనే ద్విజాన్, తిష్ఠం శ్చేత్ క్షాలనం కుర్యాత్. నిరాశాః పితరోగతాః, ఇతి. తత్సమూలత్వే మండలాగ్రే పృథక్ జ్ఞేయం.

అను॥ హేమాద్రి యందు మార్కండేయుడిట్లా – తాను స్నానంచేసి, స్నానంచేసిన, పిలువ బడిన, వారిని స్వాగతించి విడివిడిగా పూజించాలి,అని. కలికయందు నారదీయోక్తి ఇట్లా – ప్రాయశ్చిత్తంతో పరిశుద్ధమైన ఆత్మకలవాడై వారి నుండి అజ్ఞను తీసుకొని, బ్రహ్మదండము కొరకు హిరణ్యమును, కుశమును ఇవ్వాలి,అని. అక్కడే సంగ్రహమందిట్లా – తిథి వారాదులను తెలుసుకొని యథావిధిగా సంకల్పం చేయాలి. సంకల్పనాదికమంతా ప్రాచీనావీతితో చేయాలి. తొలుత సంబంధం చెప్పాలి. అట్లాగే నామ గోత్రములు చెప్పాలి. తన పితరుల అనుక్రమంగా వస్వాది రూపతను కూడా చెప్పాలి,అని. చంద్రోదయమందు నారదీయ వాక్యమిట్లా– శ్రాద్ధము కొరకై వచ్చిన బ్రాహ్మణులను తిరిగి నిమంత్రణ చేయాలి,అని. ఆపస్తంబుడైతే – తొలిరోజు నిమంత్రణ, తరువాతి (ఆ) రోజు నిమంత్రణ రెండవది, మూడవది ఆమంత్రణము (అనుజ్ఞ) అని అన్నాడు. మీరు నాచే నిమంత్రించ తగినవారు అనే నివేదన రూపమైనది తొలిది. ఆ విధిని శౌనకుడిట్లా చెప్పాడు – గ్రహించి (చేతిని) ఈ పేరుగల, ఈ గోత్రంగల, ఈతని శ్రాద్ధమందు విశ్వేదేవుల కొరకు మీరు క్షణం స్వీకరించాలి అని ఈ విధముగా శ్రాద్ధకర్త పలుకాలి. ఆతడు (భోక్త) ఓం తథా అని చెప్పాలి. శ్రాద్ధకర్త అతనితో దానిని మీరు పొందండి అని అనాలి. ఆతడు పొందుతాను అని అనాలి. ఇతరుడు ద్విజుడు వానితో అనాలి. పార్వణమందు దేవులు పురూరవ ఆర్ద్రవులు అని చెప్పాలి. పిత్రాదులకు గూడా ఈ ప్రకారమైన పద్ధతిలో ద్విజులను వరణం చేయాలి, అని. పిదప కర్త ఋగ్వేది, అనాహితాగ్ని, పిండ పితృయజ్ఞమును, పరిస్తరణం మొదలు ఇధ్మా ధానాంతము వరకు చేయాలి. అర్ధాధాని కూడా ఇట్లాగే చేయాలి,అని. ప్రయోగ పారిజాతమందు పరిశిష్టమందును కలదు. భాష్యకారమత మందైతే ఆబ్దికమందు కూడా ఇట్లాగే చేయాలి. వృత్తికారమత మందు ఇట్లాకాదు. హేమాద్రి యందు శంభువిట్లా – ఊడువబడి (గోమూత్రయుక్త గోమయంతో) అలుకబడ్డ ద్వార ప్రదేశమందు మండలములు చేయాలి. ఉత్తరం వైపుది (దేవము) ఉత్తరం వంతగా (పల్లము) దక్షిణం (పితృ) వైపుది దక్షిణం పల్లంగా ఉండాలి, అని. వ్యాఘ్రుడిట్లా – ఉత్తరమందు అక్షతలతో కూడిన, పూర్వాగ్రములుగా దర్భలను వేయాలి. దక్షిణమందు, నువ్వులతో కూడిన, దక్షిణాగ్రములుగా కుశలను వేయాలి,అని. అక్కడే బౌధాయనుడిట్లా – చతురస్రము, త్రికోణము, వర్తులము, అర్ధచంద్రాకారము, క్రమముగా బ్రాహ్మణాది జాతులందు మండలం చేయాలి, అని. అక్కడే లౌగాక్షి ఇట్లా – విశ్వేదేవుల మండలమును రెండు చేతుల పరిమితంగా చేయాలి. దక్షిణ మందు పితరులకు పాద ప్రక్షాళనకైతే నాలుగు చేతుల పరిమాణంగా మండలం చేయాలి, అని. కలికయందు సంగ్రహోక్తి ఇట్లా – దేవతలకు చతురస్రంగా మండలమును ప్రాదేశ

మాత్రంగా చేయాలి. (చూపుడు వ్రేలు బొటనవేలు చాచిన వచ్చే కొలత). ఆరు అంగుళాలు వదిలి దానికి దక్షిణంలో అట్లాగే వర్తులం చేయాలి, అని చెప్పారు. స్మృత్యంతరమందు ఇట్లా - బ్రాహ్మణునకైతే ఐదంగుళముల గుంత, క్షత్రియునకైతే మోకాలి లోతు, వైశ్యునకు ప్రాదేశమాత్రము, శూద్రునకైతే దానికన్న ఎక్కువది. అర్ధము, పాదవు ఈ ప్రమాణంతో దేవతలకు పితరులకు చెప్పబడింది. గర్తము చతురస్రము, వర్తులము అని చెప్పబడింది,అని. బ్రాహ్మణులను ఆసనమందు కూర్చోబెట్టి పాదప్రక్షాళన చేయాలి. నిలబడగా పాద ప్రక్షాళన చేస్తే పితరులు నిరాశులై వెళ్ళిపోతారు,అని. అది సమూలమైతే మండలాగ్రమందు విడిగా అని తెలియాలి.

మూ॥ **తత్రగోమయే హేమాద్రౌ** భృగుః - అత్యంత జీర్ణదేహాయాః వంధ్యాయాశ్చ విశేషతః, ఆర్తాయా నవసూతాయాన గోర్గో మయమాహరేత్. **మాత్స్యే** - అక్షతాభిః సపుష్పాభిః తదభ్యర్చ్యో ఉపసవ్యవత్, విప్రాణాం క్షాలయేత్పాదావభి వంద్య పునః పునః. ప్రత్యజ్ ముఖస్థితః కుర్యాత్ విప్ర పాదాభిషేచనం. **తత్రైవ భవిష్యే** - ప్రక్షాలయే ద్విప్రపాదాన్ శన్నో దేవీరితి త్యృచా. **పృథ్వీ చంద్రోదయే** వృద్ధ వసిష్ఠః - న కుశ గ్రంథి హస్తస్తు పాద్యం దద్యా ద్విచక్షణః. **కలికాయాం సంగ్రహే** - తతః ప్రక్షాలయేత్పాదౌ భార్యా ప్రావిత వారిణా. **తథా - శ్రాద్ధకాలే** యదాపత్నీ వామే నీర ప్రదా భవేత్, ఆసురం తద్భవేచ్ఛ్రాద్ధం పితౄణాం నోపతిష్ఠతే. **తత్రైవ** - నాథః ప్రక్షాలయేత్పాదౌ కర్తా పిత్రాది కర్మసు పాద్యానంతర మర్ఘ్యమపి దద్యాదితి హేమాద్రిః. **తత్రైవలౌగాక్షిః**- మండలాదుత్తరే దేశే దద్యా దాచమనీయకం. **తత్రైవ - విధాయ** క్షాలనం తేషాం ద్విరాచమన మిష్యతే, స్వయం చాపిద్విరా చామేత్ విధిజ్ఞః శ్రద్ధయాన్వితః. **హేమాద్రౌనారదీయే** - యత్రా చమన వారీణి పాద ప్రక్షాళనోదకైః, సంగచ్ఛంతే బుధాః శ్రాద్ధమాసురం తత్ప్రచక్షతే. **హేమాద్రౌ వ్యాసః** - సవ్యేనైవాసనం ధృత్వా దక్షిణే దక్షిణంకరం, వ్యాహృతీభిః సమస్తాభిః ఆసనేషూ పవేశయేత్. సమాధ్వమితి చైవోక్త్వా దక్షిణం జానుసంస్పృశన్, ఆస్యతామితితాన్ బ్రూయాత్ ఆసనం సంస్పృశన్నపి (**హేమాద్రౌ శాతా తపః** ద్వౌదేవౌ అథర్వణౌ విప్రౌ ప్రాజ్ముఖా వుపవేశయేత్, పిత్ర్యేతూదజ్ ముఖాం స్త్రీం శ్చ బహ్వృచాధ్వర్యు సామగాన్). యాజ్ఞవల్క్యః - (ఆచారాధ్యాయ28శ్లో) ద్వౌదేవే ప్రాక్ త్రయః పిత్ర్యే ఉదక్ ఏకైక మేవవా. యత్తు హేమాద్రౌ హారీతః - దక్షిణాగ్రదర్భేషు ప్రాజ్ ముఖాన్ బ్రాహ్మణాన్ భోజయేత్ ఉదజ్ముఖానిత్యేకే, ఇతి తన్మైత్రాయణీయ విషయం. ప్రాజ్ ముఖాన్ భోజయే దుదజ్ ముఖానిత్యేకే, ఇతి తత్పరిశిష్టాత్ వికల్ప ఇతి హేమాద్రిః.

అను॥ అక్కడ గోమయం విషయంలో హేమాద్రి యందు భృగువచనమిట్లా - మిక్కిలి క్షీణించిన దేహం కల దాని విశేషించి గొడ్డుబోయిన దాని, రోగగ్రస్తయైన, కొత్తగా ప్రసవించిన ఈ గోవుల, పేడను తీసుకరారాదు,అని. మాత్స్యమందిట్లా - అక్షతలు, పుష్పములు వీనితో అపసవ్యంగా దానిని పూజించాలి. మళ్ళీ మళ్ళీ నమస్కరించి బ్రాహ్మణుల పాదములను కడగాలి. పశ్చిమ ముఖుడై విప్ర పాదాభిషేచన చేయాలి,అని. అక్కడే భవిష్య

మిందిట్లా - విప్రుల, పాదములను శన్నో దేవీ రితి మంత్రము చదువుతూ కడగాలి,అని. పృథ్వీచంద్రోదయమందు వృద్ధ వసిష్ఠుడిట్లా - విచక్షణ కలవాడు చేతిలో కుశ గ్రంధిని ధరించి పాద్యము ఇవ్వరాదు,అని. కలిక యందు సంగ్రహోక్తి ఇట్లా - భార్య నీరు పోస్తుండగా బ్రాహ్మణుల పాదములను కడగాలి,అని. అట్లాగే - శ్రాద్ధకాలమందు భార్య ఎడమ భాగంలో ఉండి నీరు పోసినట్లైతే ఆ శ్రాద్ధము ఆసుర మౌతుంది. పితరులకు చెందదు,అని. అక్కడే - పిత్రాది కర్మలలో కర్త పాదముల కింద కడుగరాదు. పాద్యం తరువాత అర్ఘ్యం కూడా ఇవ్వాలని హేమాద్రి,అని. అక్కడే లౌగాక్షి ఇట్లా - మండలమునకు ఉత్తర భాగంలో ఆచమనీయ మివ్వాలి,అని. అక్కడే - వారికి క్షాలనం అయ్యాక రెండు సార్లు వారు ఆచమనం చేయాలి. విధిజ్ఞుడు శ్రద్ధ కలవాడై తాను కూడా రెండుసార్లు ఆచమనం చేయాలి,అని. హేమాద్రి యందు నారదీయోక్తి ఇట్లా - ఆచమనం నీరు పాద ప్రక్షాలన జలంతో కలిస్తే బుధులు దానిని ఆసుర శ్రాద్ధమన్నారు,అని. హేమాద్రి యందు వ్యాసుడిట్లా - కుడిచేతితో ఆసనం ఉంచి, కుడిచేతితో వారి కుడిచేతిని పట్టుకొని అన్ని వ్యాహృతులతో ఆసనము లందు కూర్చోపెట్టాలి. కుడిమోకాలును తాకుతూ సమాధ్వం అని పలుకాలి,ఆసనమును ముట్టుకుంటూ వారితో కూర్చోండి అని అనాలి,అని.(హేమాద్రి యందు శాతాతపుడిట్లా - దైవములకై అధర్వవేద మెరిగిన ఇద్దరు బ్రాహ్మణులను తూర్పు ముఖముగా కూర్చోపెట్టాలి. పితరులకై ఉత్తరముఖంగా ఋక్, యజుస్, సామవేదులైన ముగ్గురు బ్రాహ్మణులను కూర్చో పెట్టాలి,అని). యాజ్ఞవల్క్యుడిట్లా - (ఆచారాధ్యాయం 28శ్లో) విశ్వేదేవులకై ఇద్దరు తూర్పు ముఖంగా, ముగ్గురు పితరుల స్థానంలో ఉత్తరముఖంగా లేదా ఒక్కొక్కరైనా ఉండాలి,అని హేమాద్రి యందు హారీతుడిట్లా - దక్షిణాగ్రం గల దర్భములందు ప్రాజ్ ముఖంగా ఉన్న బ్రాహ్మణులను భుజింప చేయాలి. ఉత్తర ముఖం వారిని అని కొందరు అని అన్నది అది మైత్రాయణీయ విషయము. తూర్పుముఖంగల వారిని భుజింప చేయాలి, ఉత్తర ముఖం గల వారిని అని కొందరు,అని ఇది పరిశిష్టంలోది. వికల్పమని హేమాద్రి.

మూ॥ **మాధవీయే యమః** - భిక్షుకో బ్రహ్మచారీ వా భోజనార్థ ముపస్థితః, ఉపవిష్టే ష్వను ప్రాప్తః కామం తమపి భోజయేత్. **కౌర్మే - అతిథి** ర్యస్య నాశ్నాతి నతత్ శ్రాద్ధం ప్రచక్షతే. **విప్రనియమా మాధవీయే** - పవిత్రపాణయః సర్వేతేచ మౌన వ్రతాన్వితాః, ఉచ్ఛిష్టోచ్ఛిష్ట సంస్పర్శం వర్జయంతః పరస్పరం. **తత్రాసనాని పృథ్వీ చంద్రోదయేయమః** - ఆసనం కుశ పందద్యాత్ ఇతరద్వా పవిత్రకం హేమాద్రౌ చమత్కార ఖండే - పితౄణాం ఘటితం హైమం రాజతం వాపి చాసనం, యేన తామ్ర మయం దత్తమాసనం పితృకర్మణి. సవై దివ్యాసనా రూఢో నహి ప్రచ్యవ తేదివః. **హేమాద్రౌ నాగరఖండే** - అయః శంకుమయం పీఠం ప్రదేయం నోపవేశనే. కలికాయాం సంగ్రహే - క్షౌమం దుకూలంనే పాలమావికం దారుజం తథా, పార్ణం తార్ణం బృసీం చైవ విష్టరాది చ విన్యసేత్. అగ్నిదగ్ధాన్యాయ సానిభగ్నాని చ వివర్జయేత్. హేమాద్రౌ ఛాగలేయః - పశ్చాద్భాగా దుపక్రమ్య ప్రాచ్యాం పంక్తిర్యథా భవేత్, దక్షిణా సంస్థితాహ్యేషా

పితౄణాం శ్రాద్ధ కర్మణి. పులస్త్యః - శ్రీపర్ణీ వారుణీ, క్షీరీ, జంబు, కామ్రకదంబకం, సప్తమం భాకులం పీఠం పితౄణాం దత్తమక్షయం. సంగ్రహే - 'శమీ' చ కాశ్మరీశేలుః కదంబో వారుణస్తథా, పంచాసనా నిశస్తాని శ్రాద్ధే దేవార్చనే తథా. (కారికా - ద్వౌదైవే ప్రాజ్ ముఖౌ పిత్ర్యే త్రీన్ విప్రాను దగాననాన్, పైఠీనసిః - కుతపః శ్రాద్ధ వేలాయాం శ్రోత్రియోయది దృశ్యతే). **ఆశ్వలాయనః - నీవీవాసో దశాంతేన** స్వరక్షార్థం ప్రబంధయేత్. వృద్ధయాజ్ఞవల్క్యస్తు - దక్షిణే కటిదేశేతు తిలైః సహకుశత్రయం యత్తు కాతీయం - నీవీకార్యా దశాగుప్తిః వామకుక్షౌ కుశైః సహ, ఇతి. తత్ వృద్ధి శ్రాద్ధే. పితౄణాం దక్షిణే పార్శ్వే విపరీతాతు దైవికే, ఇతి స్మృత్యం తరాత్. వామే దక్షిణే వేత్యాచారాత్ వ్యవస్థేతి మదన పారిజాతే. **ఆచార్యః - ప్రాణాయామ** త్రయం కృత్వా గాయత్రీ స్మరణం తథా, శ్రాద్ధం కర్తా స్మీతి వదేత్ విప్రైర్వాచ్యం కురుష్వచ. **బ్రాహ్మే - తతస్తిలాన్** గృహేతస్మిన్ వికిరేచ్చా ప్రదక్షిణం, శ్రద్ధయా పరయా యుక్తో జపే దపహతా ఇతి. స్మృత్యర్థసారే - అపహతా ఇతి తిలాన్ వికీర్య, ఉదీరతా మిత్యృచా ప్రోక్షేత్.

అను॥ మాధవీయమందు యముడిట్లా - భిక్షుకుడు లేదా బ్రహ్మచారి, కాని భోజనం కొరకు ఉపస్థితులైతే, బ్రాహ్మణులు కూర్చున్నాక వస్తే వారికిష్టమైతే వారికి కూడా భోజనం పెట్టాలి, అని. కౌర్మమందిట్లా - ఎవని అతిథి భుజించడో అది శ్రాద్ధమని అని పించుకోదు, అని. విప్ర నియమములు మాధవీయమందిట్లా - వారంతా పవిత్ర పాణులై, మౌన వ్రతం కలవారై, పరస్పరము ఉచ్ఛిష్ట ఉచ్ఛిష్ట సంస్పర్శను వదలాలి. అక్కడ ఆసనముల గూర్చి పృథ్వీ చంద్రోదయమందు యముడిట్లా - కుతప (నేపాలకంబళి) ఆసనం ఇవ్వాలి లేదా పవిత్రమైనది వేరే ఏదైనా ఇవ్వాలి,అని. హేమాద్రి యందు చమత్కార ఖండమందిట్లా - బంగారుతో, వెండితో రాగితో దేనితోనైనా, చేసిన ఆసనాన్ని పితృకర్మయందు ఇస్తే, ఆతడు దివ్యాసనా రూఢుడై దివము నుండి కిందికి రాడు,అని. హేమాద్రి యందు నాగర ఖండమందిట్లా - కూర్చోవటానికి, లోహంతో చేసిన శంకుమయమైన పీఠమును ఇవ్వరాదు (మేకులది). కలిక యందు సంగ్రహోక్తి ఇట్లా - నారచీర, సన్న వస్త్రము, నేపాల వస్త్రము, గొఱ్ఱె (వెంట్రుకల)ది, కర్రది, ఆకులతో చేసింది, దూడచర్మంతో చేసింది, ఋషులు వేసుకునేది, విష్టరము (కుశలతో చేసింది) మొదలగు ఆసనములను వేయాలి. అగ్ని దగ్ధమైనవి, లోహపువి, భగ్నమైనవి వేయరాదు,అని. హేమాద్రి యందు ఛాగలేయోక్తి ఇట్లా - పడమర నుండి మొదలుపెట్టి తూర్పు ముఖంగా పంక్తి ఎట్లా ఉంటుందో అట్లాచేసి, పితరులకు దక్షిణ మందు ఉండేట్లు వేయాలి, ఇది శ్రాద్ధకర్మలో చేయాల్సింది, అని. పులస్త్యుడిట్లా - టేకు, గరికది, దేవదారు, నేరేడు, మామిడి, కడిమి, పొగడ ఈ ఏడు పీఠములలో ఏది పితరులకు వేసినా అది అక్షయ ఫలితాన్నిస్తుంది,అని. సంగ్రహ మందిట్లా - జమ్మి, గుమ్మడు, విరిగి, కడిమి, గరిక ఈ ఐదు ఆసనములు శ్రాద్ధమందు దేవార్చన యందు ప్రశస్తమైనవి,అని. కారిక - దైవతలకై ఇద్దరిని తూర్పు ముఖంగా, పితరులకై ముగ్గురిని బ్రాహ్మణులను ఉత్తర ముఖంగా కూర్చో బెట్టాలి,అని. పైఠీనసి ఇట్లా - శ్రాద్ధవేళ యందు ఒకవేళ బ్రాహ్మణుడు

(వేదపాఠి) కన్పిస్తె అది కుతపవేళ అనాలి,అని. ఆశ్వలాయనుడిట్లా - వస్త్రము చివరతో నీవి వస్త్రమును తన రక్షణ కొరకు కట్టుకోవాలి,అని. దక్షిణకటి దేశమందైతే నువ్వులతో సహ మూడుకుశలను ధరించాలి,అని. కాతీయమందు - నీవి, దశాగుప్తి (వస్త్రపు అదిని దాచటం) కుశలతో పాటు ఎడమ కడుపుయందే చేయాలి,అని అన్నమాట వృద్ధిశ్రాద్ధమందు. పితరులకైతే దక్షిణ భాగమందు, దైవికమందైతే దానికి విరుద్ధంగా (ఎడమయందు)అని, స్మృత్యంతరం నుండి. ఎడమనా కుడా అనేది ఆచారముననుసరించి నిర్ణయము, అని మదన పారిజాత మందు. ఆచార్యుడిట్లా - ప్రాణాయామ త్రయము చేసి, గాయత్రిని స్మరించి, శ్రాద్ధం చేస్తాను అని అనాలి, విప్రులతో, వారు చేయి అని అనాలి, అని. బ్రాహ్మ మందిట్లా - పిదప ఆ ఇంటి యందు అప్రదక్షిణంగా నువ్వులను చల్లాలి మిక్కిలి శ్రద్ధతో కూడి అపహతా అనే మంత్రం చదవాలి,అని. స్మృత్యర్థసారమందిట్లా - అపహతా అనే మంత్రంతో నువ్వులను చల్లి ఉదీరతాం అనే ఋక్కుతో ప్రోక్షించాలి,అని.

**మూ॥ పరాశరః - తద్విష్ణోరితి** మంత్రేణ గాయత్ర్యాచ ప్రయత్నతః, ప్రోక్షయేదన్న **జాతంతు శూద్ర దృష్ట్యాది శుద్ధయే. హేమాద్రౌబ్రహ్మాండే** - శ్రాద్ధభూమౌగయాంధ్యాత్వా ధ్యాత్వా దేవం గదా ధరం, వస్వాదీం శ్చ పితౄన్ ధ్యాత్వా తతః శ్రాద్ధం ప్రవర్తతే. దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ, నమః స్వధాయై స్వాహాయై నిత్యమే వనమో నమః. ఆదిమధ్యావసానేషు త్రిరావృత్తం జపేత్ బుధః పితరః క్షిప్రమాయాంతి రాక్షసాః ప్రద్రవంతి చ. తత్రైవ స్కాందే - **తిలారక్షం** త్వసురాన్ దర్భారక్షంతు రాక్షసాన్, పంక్తిం వై శ్రోత్రియో రక్షేత్ అతిథిః సర్వరక్షకః. **వసిష్ఠః** - శుద్ధవతీభిః కూష్మాండీభిః పావమానీభిశ్చ పాకాది ప్రోక్షయేత్, ఇతి. **అథదేవార్చా** - తత్ర ప్రత్యుపచార మాద్యంతయో రాపోదద్యాదిత్యుక్తం వృత్తౌ స్మృత్యర్థసారేచ. హేమాద్రౌ బ్రాహ్మే - ఆసనేష్వా సనందద్యాత్ వామేవా దక్షిణేఽపివా, పితృకర్మణి వామే చ దైవే దద్యాత్తు దక్షిణే. ప్రచేతాః - ఆసనేష్వాసనం దద్యాత్ నతు పాణౌ కదాచన, ధర్మోసీత్యథ మంత్రేణ గృహ్ణీయుస్తేతుతాన్ కుశాన్, ధర్మోఽసి విశిరాజా ప్రతిష్ఠితః, ఇతి మంత్రః. గాలవః - దర్భానాదాయ హస్తాభ్యాం గృహీత్వా దక్షిణేకరే, దేవే క్షణః క్రియతాంతు నిరంగుష్ఠంకరం తతః. ఓంతథేతి ద్విజాబ్రూయుస్తే ప్రాప్నోతు భవానితి. కర్తా బ్రూయాత్తతో విప్రః ప్రాప్నువానీతి వైవదేత్. పృథ్వీచంద్రోదయే బృహన్నారదీయే-యవైః దర్భైశ్చ విశ్వేషాం దేవానా మిదమాసనం, దత్వేతి భూయో దద్యాద్వైదే వేక్షణ ఇతిక్షణం. తచ్చ షష్ఠ్యా చతుర్థ్యావా కార్యం ఇతి స ఏవ. తతోర్ఘ్యం కల్పయేదితి మన్వాదయః శౌనక జయంతాభ్యాం అర్ఘ్యరహితస్య దేవార్చన స్యోక్తేః - ఆశ్వలాయనానాం దైవేర్ఘ్యదానంన, ఇతి బోపదేవః. తన్న, పరిశిష్ట ప్రయోగ పారిజాత విరోధాత్. వృద్ధిశ్రాద్ధేతు దైవేష్వర్ఘ్యం దద్యాత్. దేవేభ్యోఽపి పృథక్ దద్యాది హార్ఘ్యం శ్రుతిచోదనాత్,ఇతి శౌనకోక్తేః.

అను॥ పరాశరుడిట్లా - తద్విష్ణోః అనే మంత్రంతో గాయత్రి మంత్రంతోనూ ప్రయత్న పూర్వకముగా అన్నము మొదలగు వానిని ప్రోక్షించాలి, శూద్రదృష్టి మొదలగు వాని నుండి శుద్ధి కొరకుఅని. హేమాద్రి యందు బ్రహ్మాండోక్తి ఇట్లా - శ్రాద్ధ భూమి యందు గయను

ధ్యానించి, గదాధర దేవుని ధ్యానించి, వస్వాదులైన పితరులను ధ్యానించి ఆ పిదప శ్రాద్ధం ఆరంభించాలి. దేవతలకు, పితరులకు, మహాయోగులకు స్వాహా, స్వధలకు నమస్కారము. ఎల్లప్పుడు వీటన్నిటికి నమోనమః. ఆది మధ్య అవసానములందు బుధుడు మూడు మారులు వల్లె వేస్తూ జపం చేయాలి. దీనివల్ల పితరులు తొందరగా వస్తారు, రాక్షసులు పరుగెత్తుతారు, అని. అక్కడే స్కాందోక్తి - తిలలు అసురుల నుండి రక్షిస్తాయి. రాక్షసుల నుండి దర్భలు రక్షిస్తాయి. పంక్తిని శ్రోత్రియుడు రక్షిస్తాడు. అతిథి అన్ని విధాల రక్షించేవాడు,అని. వసిష్ఠుడిట్లా - శుద్ధవతీ, కూష్మాండీ, పావమానీ ఈ ఋక్కులతో పాకము మొదలగు వానిని ప్రోక్షించాలి, అని. ఇక దేవతార్చన - అక్కడ ప్రతి ఉపచారము (పూజ) ఆది అంతములందు నీరు ఇవ్వాలి,అని వృత్తియందు, స్మృత్యర్థ సారమందును చెప్పబడింది. హేమాద్రి యందు బ్రాహ్మోక్తి ఇట్లా - ఆసనములందు ఆసనమును (దర్భతో) అది ఎడమవైపు కాని కుడివైపు కాని, పితృకర్మయందు ఎడమభాగంలో దైవకర్మలందు దక్షిణ (కుడి) భాగంలో ఇవ్వాలి, అని. ప్రచేతుడిట్లా - ఆసనములందే ఆసన (దర్భ)ము ఇవ్వాలి చేతికి ఎప్పుడూ ఇవ్వరాదు. ధర్మోసి, అనే మంత్రంతో వారు ఆ కుశలను స్వీకరించాలి. ధర్మోసి విశిరాజా ప్రతిష్ఠితః, అని మంత్రం. గాలవుడిట్లా - చేతులతో దర్భలను తీసుకొని కుడిచేతిలోకి తీసుకొని దైవులకై క్షణం స్వీకరించండి,అని అంగుష్ఠాన్ని వదలి ఇతర వేళ్ళను తాకాలి. ఆ పిదప ఓం తథా అని ఆ ద్విజులు అనాలి. ప్రాప్నోతు భవాన్ అని కర్త అనాలి. ఆ పిదప విప్రుడు ప్రాప్నువాని, అని అనాలి,అని. పృథ్వీ చంద్రోదయమందు బృహన్నారదీయమందలి వాక్యమిట్లా- యవలతో దర్భలతో విశ్వేదేవులకు ఈ ఆసనము అని ఇచ్చి తిరిగి దైవమునకు క్షణము అని క్షణము ఇవ్వాలి. దానిని షష్ఠి విభక్తితో కాని చతుర్థి విభక్తితో కాని చేయాలి అని అతడే చెప్పాడు ఆ పిదప అర్ఘ్యము కల్పించాలని మన్వాదులు. శౌనక జయంతులు అర్ఘ్యం లేకుండా దేవార్చన అని చెప్పారు. ఆశ్వలాయనులకు, విశ్వేదేవులకు అర్ఘ్యదానము లేదు అని బోపదేవుడు. కాని అట్లాకాదు ఇది పరిశిష్ట ప్రయోగ పారిజాతాదులకు విరోధము. వృద్ధిశ్రాద్ధమందైతే దైవమందు కూడా అర్ఘ్యమివ్వాలి. దేవతలకు కూడా విడిగా ఇక్కడ అర్ఘ్యం ఇవ్వాలి,అని శ్రుతిచోదన, అని శౌనకోక్తి.

**మూ॥ అథార్ఘ్యమ్. పృథ్వీచంద్రోదయే మాత్స్యపాద్మయోః - పాత్రం వనస్పతి మయం తథా పర్ణమయం పునః, జలజం వాపికుర్వీత తథా సాగర సంభవం. బ్రాహ్మే - సౌవర్ణ తామ్ర రౌప్యాశ్మ స్ఫాటికం శంఖ శుక్తయః, భిన్నానపి హియోజ్యాని పాత్రాణి పితృకర్మణి. హేమాద్రౌ ప్రజాపతిః - సౌవర్ణం రాజతం తామ్రం ఖాడ్గం మణిమయం తథా, యజ్ఞియం చమసం వాపి అర్ఘ్యార్థం పూరయేత్ బుధః. అత్ర విప్రైక త్వద్విత్వ చతుష్ట్వ దావపి అర్ఘ్యపాత్రే ద్వే ఏవ. మానవసూత్రేతు - ద్వేవైశ్వదేవికే, త్రీణి పిత్ర్యే ఏకైక ముభయత్రవా, ఇత్యుక్తం తదేక విప్రపరం, పాత్రా లాభపరం వేతి హేమాద్రిః. మదనరత్నేతు దైవే ఏకం పాత్రముక్తం. పృథ్వీ చంద్రోదయేఽపి - త్రీణిపైతృక పాత్రాణి ద్వేద్వేవై వైశ్వదేవికే, ఇతి బృహత్పరాశరోక్తేః ద్వేఏవేత్యాహ. బహ్వృచానాంతు దైవేవిప్రద్విత్వేప్యేక మర్ఘ్యపాత్ర మర్ధశోదద్యాదిత్యుక్తం పరిశిష్టే ప్రయోగపారిజాతే చ. కలికాయాం**

**హారీతః - దత్తమక్షయతాం యాతి ఖడ్గేనార్ఘ్యంతు యత్కృతం. వృద్ధమనుః - మృన్మయం దారుజంపాత్రం అయః పాత్రం చ యద్భవేత్, రాజతం దైవికే కార్యే శిలా పాత్రం వివర్జయేత్. పురాణ సముచ్చయే - మృత్స్నాభవం త ధాకాంస్య మారక్తం జతు సంభవం, త్రపుసీసలోహ భవం సదాపాత్రం వివర్జయేత్. తత్రైవ - అష్టాంగులం భవేత్ పాత్రం పితౄణాం రాజతం శుభం, దశాంగులంతు దేవానాం సౌవర్ణం శక్తితః కృతం. స్థాపయేదర్ఘ్యపాత్రేద్వే న్యుబ్జే తత్రకుశోపరి, ద్వేద్వే పవిత్రే విధివత్ పాత్రయో శ్చోపరిక్షిపేత్. యజ్ఞ పార్శ్వః - పవిత్రే స్థేతి మంత్రేణ పవిత్రే ఛేదయేత్తుతే, ఓషధీమంతరే, కృత్వా అంగుష్ఠాంగులి పర్వణోః స్త్యేన కాష్ఠేన లోహేన, నమృన్మయనఖాదిభిః. వసిష్ఠః - తూష్ణీం ప్రోక్ష్యాం భసాపాత్రే కుర్యా దూర్ధ్వ బిలేతతః, పూరయేత్పాత్రయుగ్మంతు కృత్వో పరిపవిత్రకే.**

అను॥ ఇక అర్ఘ్యపాత్రము - పృథ్వీచంద్రోదయమందు మాత్స్య పాద్మముల వచన మిట్లా - పాత్ర వనస్పతిది (పూలు లేని పండ్లచెట్టు) లేదా ఆకులది, జలజముది, సముద్ర మందు పుట్టిన ఆకులదో చేయాలి,అని. బ్రాహ్మమందిట్లా - సువర్ణం తామ్రము. వెండి, రాయి, స్ఫటికం, శంఖము, శుక్తి (ముత్యపు చిప్ప) వీనిలో ఏదైనా పాత్ర భిన్నమైనా సరే పితృకర్మ యందు వినియోగించాలి, అని. హేమాద్రి యందు ప్రజాపతి ఇట్లా - సువర్ణము, రజతము, తామ్రము, ఖడ్గపుది, మణిమయము, ముంజదర్భది, చమసము (యజ్ఞపాత్ర) వీనిలో దేనిదైనా అర్ఘ్యము కొరకు బుధుడు పూరించాలి,అని. ఇక్కద విప్రులు ఒకడైనా, ఇద్దరైనా నలుగురైనా అర్ఘ్యపాత్రలు రెండే. మానవ సూత్ర మందైతే - వైశ్వదేవిక మందు రెండు పితరులకై మూడు రెండు చోట్ల ఒక్కొక్కటో అని చెప్పారు. అది ఒక బ్రాహ్మణుని విషయము. పాత్రలు లభించని పక్షంలోనో అని హేమాద్రి. మదనరత్నమందైతే దైవమందు ఒకే పాత్రను చెప్పారు. పృథ్వీ చంద్రోదయమందు కూడా - పితరులకైన పాత్రలు మూడు వైశ్వ దేవులకై రెండు రేండే అని బృహత్పరాశరోక్తి ఉన్నందువల్ల రెండే అని అన్నాడు. బహ్వృచులకైతే దైవమందు ఇద్దరు బ్రాహ్మణులున్నా ఒకే అర్ఘ్యపాత్ర సగం సగమివ్వాలి అని పరిశిష్టమందు, ప్రయోగ పారిజాతమందును చెప్పారు. కలికయందు హారీతుడిట్లా - ఖడ్గ పాత్రతో చేసిన అర్ఘ్యము, అట్లా ఇచ్చింది అక్షయ్య మౌతుంది,అని. వృద్ధమనువిట్లా - మట్టిది (అపక్వమృత్తిక) కట్టెది, లోహపుది, వెండిది (శివనేత్రోద్భవము అమంగలము, పితృవల్లభము) శిలాపాత్ర వీనిని దైవకార్యమందు విసర్జించాలి,అని. పురాణ సముచ్చయ మందిట్లా - మట్టిది, కాంస్యము, ఎర్రరంగుది, లక్కది, తగరము, సత్తు లోహము వీటిని ఇట్టి పాత్రలను ఎల్లప్పుడు విసర్జించాలి,అని. అక్కడే - పితరులకు ఎనిమిది అంగుళముల రజత పాత్ర శుభకరమైనది. దేవతలకు శక్తి కొలది చేయబడ్డ పది అంగుళముల బంగారు పాత్ర శుభకరమైనది,అని. అక్కడ కుశములపై రెండు అర్ఘ్య పాత్రలను తలకిందులుగా ఉంచాలి. పాత్రములపైన రెండేసి పవిత్రలను శాస్త్రప్రకారము ఉంచాలి. యజ్ఞ పార్శ్వుడిట్లా

- పవిత్రేస్థ అనే మంత్రముతో వారు పవిత్రలను ఛేదించాలి. ఓషధిని మధ్యలో ఉంచి అంగుష్ఠ, అంగుళి పర్వములంత తునకలుగా స్ఫ్యేనమను కత్రతో, లోహంతో కాని చేయాలి, మట్టితో, గోళ్ళతో చేయరాదు,అని. వసిష్ఠుడిట్లా - పాత్రలను, మౌనంగా నీటితో ప్రోక్షించి ఆ పిదప పై ముఖంగా చేయాలి. పైన పవిత్రల నుంచి రెండు పాత్రలను నీటితో నింపాలి,అని.

మూ॥ **వృద్ధపరాశరః** - పాత్ర ద్వయమర్ఘార్థం తైజసం చైకవస్తునః, ప్రాఙ్ముఖో మరతీర్థేన శన్నోదేవ్యోదకం క్షిపేత్. యవోఽసీతి యవాంస్తత్ర తూష్ణీం పుష్పాణి చందనం. మానవసూత్రే - సుమనసః ప్రక్షిప్యోత్పూయయవాన్ ప్రక్షిప్య,ఇతి. యవోఽసీతి మంత్రః. పాద్మే- యవోఽసి ధాన్యరాజోవా (ధాన్యరాజోఽసి) వారుణో మధుమిశ్రితః, నిర్ణోదః సర్వపాపానాం పవిత్రం ఋషిభిః స్మృతం. రాజోవా వారుణో మధు సంయుతః, ఇతి పరిశిష్టే పాఠః. గోభిలేనతు - యవోఽసి సోమదైవత్యః,ఇతి. తిలమంత్రోఽత్ర స్వాహాయుక్త ఉక్తః. హేమాద్రౌయమః- యవహస్తస్తతో దేవాన్ విజ్ఞాప్యావాహనం ప్రతి, ఆవాహయేదనుజ్ఞాతో విశ్వేదేవాస ఇత్యృచా. వృద్ధపరాశరః - తతః సవ్యకరంన్యస్య విప్రదక్షిణ జానుని, దేవానా వాహయిష్యేహ మితి వాచ ముదీరయేత్. ఆవాహయే త్యనుజ్ఞాతో విశ్వేదేవాస ఆగతః, విశ్వేదేవాః శృణుతేయమితి మంత్రద్వయం పఠేత్. **శ్రాద్ధ విశేషే విశ్వేదేవానా** మజ్ఞానే హేమాద్రౌ బృహస్పతిః - ఉత్పత్తి ర్నామచైతేషాం న విదుర్యేద్విజాతయః, అయముచ్చా రణీయస్తైః మంత్రః శ్రద్ధా సమన్వితైః. ఆగచ్ఛంతు మహాభాగా విశ్వేదేవా మహాబలాః, యే అత్ర విహితాః శ్రాద్ధే సావధానా భవంతుతే. ఇదం చా వాహన మర్ఘ్యపాత్రా సాదనాత్ ప్రాక్ హేమాద్రిణోక్తం. తత్ర కాతీయైః ప్రాక్కార్యం. తథైవ తత్సూత్రాత్. అన్యైస్తదుత్తరం.

అను॥ వృద్ధపరాశరుడిట్లా - అర్ఘ్యము కొరకు రెండు పాత్రలు ఒకే వస్తువుతో చేసినవి ధాతువువి కావాలి (బంగారు, వెండి, రాగివగైరా) తూర్పుముఖంగా నిలబడి దేవ తీర్థంతో శంనో దేవీ అను మంత్రంతో నీరు పోయాలి. యవోఽసి అనుమంత్రంతో యవలను, మౌనంగా పూలు చందనము వేయాలి,అని. మానవ సూత్రమందిట్లా - పూలు ఉంచి, నీరు కదిలించి యవలు ఉంచి,అని. యవోసి అనేది మంత్రము. పాద్మమందిట్లా - యవోసి.... స్మృతం.అని. పరిశిష్టమందు రాజోవా వారుణో మధుసంయుతః అని పాఠము. గోభిలుడైతే - యవోసి సోమ దైవత్యః,అని తిలమంత్రాన్ని ఇక్కడ స్వాహాయుక్తంగా చెప్పాడు, అని. హేమాద్రి యందు యముడిట్లా - యవలు చేత ధరించి పిదప దేవతలకు ఆవాహనను గూర్చి విజ్ఞాపన చేసి వారి అనుజ్ఞ పొంది, విశ్వేదేవాస, అను ఋక్కుతో వారిని ఆ వాహన చేయాలి,అని. వృద్ధపరాశరుడిట్లా - విప్రుని కుడి మోకాలుపై తన కుడి చేతి నుంచి నేను దేవతను ఆవాహిస్తున్నాను, అనే మాట చెప్పాలి. ఆవాహించు అని వారి అనుజ్ఞ పొంది, విశ్వేదేవాస ఆగత, విశ్వేదేవాః శృణుతేయం అను రెండు మంత్రాలు పఠించాలి,అని. శ్రాద్ధ విశేషమందు విశ్వే దేవతలు తెలియని పక్షంలో హేమాద్రి యందు బృహస్పతి ఇట్లా

– వీరి ఉత్పత్తిని నామములను తెలియని బ్రాహ్మణులు శ్రద్ధకలవారై వారు ఈ మంత్రమును ఉచ్చరించాలి. ఆ గచ్ఛంతు..... భవంతుతే,అని. ఈ ఆవాహన అర్ఘ్యపాత్ర ఆసాదనకన్న ముందు అని హేమాద్రి అన్నాడు. అక్కడ కాతీయులు ముందు చేయాలి. ఆ సూత్రం వల్ల అట్లాగే తెలుస్తోంది. ఇతరులు దాని తరువాత చేయాలి,అని.

**మూ॥ పృథ్వీచంద్రోదయేశంఖః** – సయవం పుష్పమాదాయ చరణాది శిరోంతకం, అర్చయే త్యర్చనం కుర్యాత్ అంతరేచోదకం తథా. పిత్ర్యేతు – మూర్ధాదిపాదాంతం, పాదప్రభృతి మూర్ధాంతం దైవికే పూజనం భవేత్. శిరః ప్రభృతి పాదాంతం నమోవ ఇతి పైతృకే. ఇతి మదన రత్నే ప్రచేతోక్తేః. కలికాయాం సంగ్రహే – తిష్ఠన్ కృతాంజలిర్భూత్వాపరేన్ మంత్రౌ సమాహితః. విశ్వేదేవాః శృణుతే ఇత్యా గచ్ఛన్త్వపరం తతః. హేమాద్రౌ జాతూకర్ణ్యః – తతోఽర్ఘ్యపాత్ర సంపత్తిం వాచయిత్వా ద్విజోత్తమాన్, తదగ్రే చార్ఘ్యపాత్రాణీ స్వధార్థ్యా ఇతి విన్యసేత్. గార్గ్యః – దత్వాహస్తే పవిత్రం చ కృత్వా పూజాం చ పాదతః, యాదివ్యా ఇతి మంత్రేణ హస్తేష్వర్ఘ్యం వినిక్షిపేత్. సంగ్రహే – విశ్వేదేవా ఇదంవోఽర్ఘ్యమితి దానం సమాదిశేత్, తదంతే, స్వాహా నమః , ఇతి వాచ్యం. యాదివ్యా ఇతి మంత్రేణ స్వాహాకారం నమోంతకం, ఇతి హేమాద్రౌ నాగరఖండాత్. అథర్వణ సూత్రేతు, పాద్యమర్ఘ్యమాచమనీయ మితి ద్విజకరే నినయేత్, ఇత్యస్యైవ త్రయముక్తం. గభస్తిః – అర్ఘ్యం పిండ ప్రదానం చ స్వస్త్యక్షయ్యే తథైవచ, గంధపుష్పాదికం సర్వం హస్తే నైవతు దాపయేత్. ప్రతివిప్రం యాదివ్యేత్యావృత్తిః. బహ్వృచానాం త్వనేన దత్తార్ఘ్యానుమంత్రణం. తతః పాత్రం, దేవేభ్యః స్థానమసి, ఇతి న్యుబ్జముత్తానం వాకార్యమితి గారుడే ఉక్తం. ఏతదాపస్తంబానాం నియతమన్యేషాంన. హేమాద్రౌ విష్ణుధర్మే – గంధైః పుష్పైశ్చ ధూపైశ్చ వస్త్రైశ్చా పృథభూషణైఃఅర్చయేత్ బ్రాహ్మణాన్ శక్త్యా శ్రద్ధధానః సమాహితః. పృథ్వీచంద్రోదయే మార్కండేయః – చంద నాగరు కర్పూర కుంకుమాని ప్రదాపయేత్. విష్ణుః – చందన కుంకుమ కర్పూరాగరు పద్మ కాన్యను లేపనాయ, ఇతి. వ్యాసః – అపవిత్ర కరోగంధైః గంధద్వారేతి పూజయేత్. కలికాయాం స్మృతిః – గంధద్వారేతివై గంధమాయనేతే చ పుష్పకం. ధూరసీత్యమునా ధూపం ఉద్దీప్య స్వేతి దీపకం, యువం వస్త్రాణి మంత్రేణ వస్త్రం దద్యాత్ప్రయత్నతః, ఆసనే స్వాస నంబ్రూయాత్ అర్ఘ్యేఽస్త్వర్ఘ్యం ద్విజోత్తమః. సుగంధిశ్చ సుష్పాణి సుమాల్యాని సుధూపకః, సుజ్యోతిశ్చైవదీపేతు స్వాచ్ఛా దనమితిక్రమః.

అను॥ పృథ్వీచంద్రోదయ మందు శంఖుడిట్లా – యవలు, పూలు తీసుకొని పాదముల నుండి శిరస్సు వరకు పూజిస్తాను అని పూజ చేయాలి. మధ్యలో నీరు ఇవ్వాలి, అని. పితరులకైతే – తల నుండి పాదాల వరకు, దైవికమైతే – పాదాల నుండి తల వరకు పూజ చేయాలి,అని. శిరస్సు నుండి పాదాల వరకు పితరులకు, నమోవ, అనే మంత్రంతో చేయాలి, అని మదనరత్న మందు ప్రచేతోక్తి. కలిక యందు సంగ్రహోక్తి ఇట్లా – నిలబడి చేతులు జోడించి ఈ రెండు మంత్రములను ఏకాగ్ర చిత్తంతో చదవాలి. విశ్వేదేవాః శృణుతె, అని పిదప ఆగచ్ఛంతు అని మరొకటి,అని. హేమాద్రి యందు జాతూకర్ణి ఇట్లా – పిదప అర్ఘ్యపాత్ర సంపత్తిని బ్రాహ్మణులచే చెప్పించి (అర్ఘ్యపాత్రం సుసంపన్నం) వారి ముందు

అర్ఘ్యపాత్రములను, స్వధార్ఘ్యా అను మంత్రం చదువుతూ ఉంచాలి,అని. గార్గ్యుడిట్లా - హస్త మందు పవిత్రముంచి, పాదాది పూజ చేసి, యాదివ్యా అనుమంత్రంతో హస్తము లందు అర్ఘ్యముంచాలి,అని. సంగ్రహమందిట్లా - విశ్వేదేవులార ఇది మీకు అర్ఘ్యము అని దానమును చెప్పి, చివర స్వాహానమః అని చెప్పాలి. యాదివ్యా అను మంత్రంతో స్వాహా కారము, చివర నమః అని చెప్పాలి, అని హేమాద్రి యందు నాగర ఖండమందు కలదు. అథర్వణ సూత్ర మందైతే - పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము అని ద్విజుని చేతియందు ఇవ్వాలి అని ఈ మూడింటినే చెప్పారు. గభస్తి ఇట్లా - అర్ఘ్యము పిండప్రదానము, స్వస్తి, అక్షయ్యము, గంధపుష్పాదికము అన్నీ చేతితోనే ఇవ్వాలి. ప్రతి బ్రాహ్మణునకు యాదివ్యా, అను మంత్రాన్ని చదవాలి. బహ్వృచులకైతే దీనితో ఇచ్చిన అర్ఘ్యమునకు సంస్కారము ఆ పిదప పాత్రను, దేవేభ్యః స్థానం అసి,అని బోర్లించుటో లేదా ఎత్తుటో చేయాలని (చక్క చేయుటో) గారుడంలో చెప్పారు. ఇది ఆపస్తంబులకు తప్పదు. ఇతరులకు కాదు. హేమాద్రి యందు విష్ణుధర్మమందిట్లా - గంధ ధూప పుష్ప వస్త్రభూషణములతో బ్రాహ్మణులను శ్రద్ధతో, ఏకాగ్రంతో శక్తి కొలది పూజించాలి,అని. పృథ్వీచంద్రోదయమందు మార్కండేయోక్తి ఇట్లా - చందన, అగరు, కర్పూర, కుంకుమములను ఇవ్వాలి,అని. విష్ణువిట్లా - చందన కుంకుమ, కర్పూర, అగరు, పద్మకములను (ఏనుగు ముఖమందలి బిందువులు) వీనిని అనులేపనం కొరకు,అని. వ్యాసుడిట్లా - పవిత్ర లేని చేతులతో గంధద్వారాం అని గంధముతో పూజించాలి,అని. కలికయందు స్మృతి ఇట్లా - గంధద్వారాం అని గంధము, ఆయనేతే అని పుష్పములు, ధూరసీ అను దానితో ధూపము, ఉద్దీప్యస్వ అని దీపము, యువం వస్త్రాణి అనే మంత్రంతో వస్త్రము ప్రయత్న పూర్వకముగా ఇవ్వాలి. ఆసన మందు ఆసనం అని చెప్పాలి. అర్ఘ్యమందు అస్త్వర్ఘ్యమని, సుగంధం, సుపుష్పాణి, సుమాల్యాని, సుధూపకం, సుజ్యోతిః అని దీపమందు, సుఆచ్ఛాదనమని క్రమంగా చెప్పాలి బ్రాహ్మణులు.

మూ॥ **విప్రాణాం గంధేన వర్తులం** త్రిపుండ్రం వానకార్యం. హేమాద్రౌ దేవలః - లలాటే పుండ్రకం దృష్ట్వా స్కంధేమాలాంత థైవచ, నిరాశాః పితరో యాంతి దృష్ట్వా చ వృషలీపతిం పుండ్రకం = వర్తులం ఇత్యపరార్కే, మదనరత్నే చ - పుండ్రం త్రిపుండ్రం వర్తులం అర్థ చంద్రం చ. ఊర్ధ్వం చ తిలకం కుర్యాత్ న కుర్యాద్వై త్రిపుండ్రకం, ఊర్ధ్వం చ తిలకం కుర్యాత్ దైవే పిత్ర్యే చ కర్మణి. నిరాశాఃపితరోయాంతి దృష్ట్వా చైవ త్రిపుండ్రకం, ఇతి వృద్ధ పరాశరోక్తేః. తిర్యగ్లేపో భవత్యేవ - వర్జయేత్తిలకం ఫాలే శ్రాద్ధకాలేచ సర్వదా, తిర్యగూర్ధ్వం త్రిపుండ్రం వాధారయేత్తు ప్రయత్నతః,ఇతి వ్యాసోక్తే రితి పృథ్వీచంద్రః. **యత్తు బృహన్నారదీయే** - ఊర్ధ్వ పుండ్రం చ తులసీం శ్రాద్ధే నేచ్ఛంతికేచన, ఇతి తత్ కర్తృపరం. **హేమాద్రౌబ్రాహ్మే** - పూతికం మృగనాభించ రోచనాం రక్తచందనం, కాలేయకం తూగ్ర గంధం తురుష్కం చాపి వర్జయేత్. కస్తూర్యాం వికల్ప ఇతి హేమాద్రిః. **వృద్ధశాతాతపః** - పవిత్రంతు కరేకృత్వాయః సమాలభతే ద్విజాన్, రాక్షసానాం భవేచ్ఛ్రాద్ధం నిరాశైః పితృభిర్గతైః. **పుష్పంతు బ్రాహ్మే** - జాతి చంపకలోధ్రాశ్చ మల్లికా బాణబర్బరీ,

చేసిన వారితో వారి పితరులు చంద్రుడు, సూర్యుడు, భూమి ఉన్నంత కాలం సంతోషింప చేయబడ్తారు,అని మార్కండేయోక్తి.

మూ॥ **ధూపస్తత్రైవ విష్ణుధర్మే** - ధూపస్తు గుగ్గులు ర్దేయః తథా చందన సారజః , అగరుశ్చ స కర్పూరః తురుష్కం త్వక్ తథైవచ. విష్ణుః - ఘృతమధుయుక్తం గుగ్గులం శ్రీ ఖండ దేవదారుసరలాది దద్యాత్ ఇతి. **తత్రైవ దేవలః** - యేహి ప్రాణ్యం గ జాధూపా హస్త వాతాహ తాశ్చయే, నతే శ్రాద్ధేనియోక్తవ్యాయేచ కేచో గ్రగంధయః. ఘృతం న కేవలం దద్యాత్ దుష్టం వా తృణ గుగ్గులం. **దీపమాహ విష్ణుః** ఘృతేన దీపోదా తవ్యః తిలతైలేన వాపునః, వసామేదోద్భవం దీపం ప్రయత్నేన వివర్జయేత్. **వస్త్రం బ్రాహ్మే** - కౌశేయం క్షౌమకార్పాసం దు కూల మహతం తథా, శ్రాద్ధేష్వేతాని యోదద్యాత్ కామానాప్నోతి చోత్తమాన్. **హేమాద్రౌ బ్రహ్మవైవర్తే** యజ్ఞోపవీతం దాతవ్యం వస్త్రాభావే విజానతా, పితృభ్యో వస్త్ర దానస్య ఫలంతే నాశ్నుఽతే ఖిలం. **తత్రైవపాద్మే** - నిష్క్రయోవా యధాశక్తి వస్త్రాభావే ప్రదీయతె. **అన్యాన్యపి చ దేయాని తత్రైవ కాలికాపురాణే** - ధాత్వాది నిర్మితా రమ్యా దీపికాః శ్రాద్ధకర్మణి పితౄనుద్దిశ్యయో దద్యాత్ సభవేద్భాజనం శ్రియఃయోధూపదాన పాత్రంతు పాత్ర మారార్తికస్యచ, దద్యాత్ పితృభ్యః ప్రయతః తస్య స్వర్గేఽక్షయా గతిః.

అను॥ ధూపమక్కడే విష్ణు ధర్మమందిట్లా - గుగ్గులుధూపము, అట్లాగే చందన సారము నుండి వచ్చింది లేదా కర్పూరంతో అగరు ధూపము, చిల్లమడ్డి, లవంగపు పట్ట వీని ధూపము వేయాలి,అని. విష్ణువిట్లా - నేయి, తేనె వీనితో కూడిన గుగ్గులు, ధూపము, చందనము, దేవదారువు, సరల వృక్షధూపము ఇవ్వాలి,అని. అక్కడే దేవలుడిట్లా - ప్రాణ్యంగము నుండి పుట్టిన ధూపము (కస్తూరి) చేతిగాలిచే మండించబడ్డవి, ఉగ్రమైన వాసన కలవి, ఇట్టి ధూపములను శ్రాద్ధమందు వేయరాదు కేవలము నేయిని ధూపంగా ఇవ్వరాదు. దుష్టమైన తృణం కల గుగ్గులును ఇవ్వరాదు,అని. దీపమును గూర్చి విష్ణువిట్లా - నేతితో దీపంను కాని నువ్వుల నూనె దీపంను కాని ఇవ్వాలి. వస, మేధ, వీని నుండి వచ్చిన నూనె దీపమును ప్రయత్న పూర్వకముగా త్యజించాలి,అని. వస్త్రము బ్రాహ్మమందు ఇట్లా - పట్టుది, నారచీర, దూదిది, సన్న వస్త్రము, కొత్తది వీనిని శ్రాద్ధములందు ఇవ్వాలి. ఇట్లా ఇచ్చిన వారు ఉత్తమమైన కోరికలను పొందుతారు,అని. హేమాద్రి యందు బ్రహ్మవై వర్తోక్తి ఇట్లా - తెలిసినవారు వస్త్రములేని పక్షంలో యజ్ఞోపవీత మివ్వాలి. పితరులకు, వస్త్ర దానంవల్ల వచ్చే ఫలాన్ని అంతా దానితో పొందుతాడు,అని. అక్కడే పాద్మమందిట్లా - వస్త్రంలేని పక్షంలో, శక్తి కొలది వస్త్రమూల్యం ఇవ్వాలి,అని. అక్కడే ఇవ్వవలసినవి ఇతరమైనవి కాలికా పురాణమందు చెప్పబడ్డాయి ఇట్లా - శ్రాద్ధకర్మ యందు ధాతువులు మొదలగు వానితో నిర్మితమైనవి రమ్యమైనవి ఐన దీపములివ్వాలి. పితరులను ఉద్దేశించి ఇచ్చినవారు సంపదను పొందుతారు,అని. ధూపమునిచ్చే పాత్రను హారతి పాత్రను ప్రయత్న పూర్వకముగా పితరులకై ఇచ్చేవారు స్వర్గమందు అక్షయమైన స్థానమును పొందుతారు.

**మూ॥ విష్ణుధర్మే** - యః కంచుకం తథో ష్ణీషం పితృభ్యః ప్రాతిపాదయేత్, జ్వరోద్భవాని దుఃఖాని సకదాచిన్న పశ్యతి. **స్త్రీణాం శ్రాద్ధేతు** సింధూరం దద్యుశ్చండా తకానిచ, నిమంత్రి తాభ్యః స్త్రీభ్యోయేతేస్యుః సౌభాగ్య సంయుతాః. **హేమాద్రావాదిత్య పురాణే** - నకృష్ణవర్ణం దాతవ్యం నాపికార్పాస సంభవం, పితృభ్యో నాపిమలినం నోపభుక్తం కదాచన నచ్ఛిద్రితం నాపద శంన ధౌతం కారుణాపిచ. కార్పాస నిషేధో అన్యసంభవే. **తత్రైవ** - పితౄన్ సత్కృత్య వాసోభిః దద్యాత్ యజ్ఞోపవీతకం, యజ్ఞోపవీతదానేన వినాశ్రాద్ధంతు నిష్ఫలం. ఏతద్యతి స్త్రీ శూద్ర శ్రాద్ధేష్వపి దేయమితి హేమాద్రిః **తత్రైవ నృసింహపురాణే** - కమండలుం తామ్రమయం శ్రాద్ధేషు ప్రదదా తియః కాష్ఠేన నిర్మితం చాపి నారికేల మథాపివా దద్యాత్ కమండలుం శ్రాద్ధే సశ్రీమాం నభిజాయతే. తత్రైవ- **ఉపాన ఛత్ర వస్త్రాణి** భుక్తిపాత్రం కమండలుం, శయనాసనయానాని దర్పణ వ్యజనాని చ అన్నం సుసంస్కృతం గంధాన్ తాంబూలం దీప చామరం, పితృభ్యోయః ప్రయచ్ఛేత్తు విష్ణులోకం సగచ్ఛతి. సౌరపురాణే - చామరంతాలవృంతం చ శ్వేత ఛత్రం చదర్పణం, దత్వా పితౄణామేతాని భూమిపాలోభవేదిహ.

అను॥ విష్ణుధర్మమందిట్లా - కవచము, తలపాగ వీనిని పితరులకై ఇచ్చినవారు జ్వరం వల్ల కలిగే దుఃఖమును ఎప్పుడూ పొందరు,అని. స్త్రీల శ్రాద్ధమందు సింధూరము, సగం లంగా (చండాతకం)ను నిమంత్రితులైన స్త్రీలకై ఇచ్చేవారు సౌభాగ్యం కలవారై ఉంటారు,అని. హేమాద్రి యందు ఆదిత్యపురాణోక్తి ఇట్లా - నల్లని రంగు దానిని ఇవ్వరాదు, పత్తితో తయారైన దానిని ఇవ్వరాదు, పితరులకై మలినమైన దానిని, వాడిన దానిని ఇవ్వరాదు చిల్లిబోయినది, అంచులేనిది, ఉతికినది, దయతోకాని ఇవ్వరాదు అని. పత్తిని నిషేధించుట వేరేది ఉన్న పక్షంలోనే. అక్కడే - పితరులను సత్కరించి వస్త్రములతో యజ్ఞోపవీతమివ్వాలి. యజ్ఞోపవీతదానం లేకుండా శ్రాద్ధం నిష్ఫలము, అని. ఇదియతి, స్త్రీ శూద్ర శ్రాద్ధములందు కూడా ఇవ్వాలి అని హేమాద్రి. అక్కడే నృసింహ పురాణమందిట్లా - రాగి కమండలును శ్రాద్ధమందిచ్చిన, కట్టె దానినిగాని, నారికేల కమండలముగాని శ్రాద్ధమందు ఇచ్చిన వారు శ్రీమంతులౌతారు. శ్రాద్ధమందు మట్టితో చేసిన శుభమైన ఘటములను లేదా గిండి (సన్నపు మెడ గలచెంబు)ని గాని ఇచ్చినవారు అక్షయ సుఖాన్ని పొందుతారు,అని. అక్కడే - పాదుకలు, ఛత్రము, వస్త్రములు, కంచము, కమండలువు, శయనము, ఆసనము, యానము, అద్దము, విసనకర్ర, మంచిఅన్నము, గంధము, తాంబూలము, దీపము, చామరము, వీనిని పితరులకై ఇచ్చినవారు విష్ణులోకమునకు వెళ్తారు,అని. సౌరపురాణమందిట్లా - చామరము, తాటాకు విసనకర్ర తెల్లని గొడుగు, అద్దం, వీనిని పితరులకిచ్చినవారు ఇక్కడ భూపాలురౌతారు, అని.

**మూ॥ తత్రైవనందిపురాణే** - అలంకారాః ప్రదాతవ్యాః యథాశక్తి హిరణ్మయాః, కేయూరహార, కటక, ముద్రికా, కుండలాదయః. తథా- స్త్రీ శ్రాద్ధేషు ప్రదేయాః స్యుః అలంకారాస్తు యోషితాం, మంజీర మేఖలాదామ కర్ణికా కంకణాదయః. తథా - ఆదర్శవ్యజన ఛత్ర శయనాసన

పాదుకాః. మనోజ్ఞాః పట్ట వాసాశ్చ సుగంధాః చూర్ణముష్టయః. అంగారధానికాః శీతేయోగ పట్టాశ్చ యష్టయః, కటిసూత్రాణీ రౌప్యాణి మేఖలాశ్చైవ కంబలాః. కర్పూరాదిశ్చ భాండాని తాంబూలా యతనం తథా. భోజనాధార యంత్రాణి పతత్ గ్రాహాంస్తథైవచ. తథాంజన శలాకాశ్చ కేశానాం చ ప్రసాధనం, ఏతాన్ దద్యాత్తుయః సమ్యక్ సోశ్వమేధ ఫలం లభేత్. **స్కాందే - సౌవర్ణం** రాజతం వాపి కాంస్యేనా పృథ నిర్మితం, దత్వా భోజన పాత్రంతు సమ్రాట్ భవతి భూతలే. **వామనపురాణే** - వందీ కృతాస్తుయే కేచిత్ స్వయం వా యదివాపరైః, యేనకేనా ప్యుపాయేన యస్తాన్మోచయతే నరః. పితరస్తస్య గచ్ఛంతి శాశ్వతం పదమవ్యయం. **పరాశరః**- వాచయేత్ పరిపూర్ణత్వం వాసోదత్వా విధానతః. **నారదీయే** - దేవైశ్చ సమనుజ్ఞాతో యజేత్పితృగణం త్వథ, తత్రపిత్ర్యే ఆసనాద్యశేష మర్చన కాండం వైశ్వదేవికం జ్ఞేయం. విశేష స్తూచ్యతే. తత్రాసనే ద్విగుణభుగ్నాఃకుశాః. అత్రావాహన మాసనాత్పూర్వంవా అర్ఘ్యపూరణోత్తరంవా, అగ్నౌకరణోత్తరం వేతి స్మృతిషు పక్షా ఉక్తాః. ఏషాం శాఖాభేదేన వ్యవస్థా. ద్వితీయ పక్ష ఏవ బహు సంమతః.

అను॥ అక్కడే నందిపురాణమందిట్లా - శక్తి కొలది బంగారు అలంకారములను ఇవ్వాలి. భుజములవి, హారములు, అందెలు, ఉంగరములు, కుండలాదులు ఇవ్వాలి,అని. అట్లాగే - స్త్రీ శ్రాద్ధములందు స్త్రీలకు అలంకారము లివ్వాలి, అందెలు, ఒడ్డాణము, హారము, చెవి అలంకారము (కమ్మ) కంకణాదులు ఇవ్వాలి,అని. అట్లాగే - అద్దము, విసనకర్ర ఛత్రము, శయనము, ఆసనము, పాదుకలు, సుందరమైన పట్టుబట్టలు, వాసన పొడులు పిడికిలితో ఇవ్వాలి. శీతకాలమందు కుంపట్లు, యోగపట్టము, చేతికర్ర, వెండివికటి సూత్రములు ఒడ్డాణము, కంబళము, కర్పూరము భాండములు, తాంబూలము, పాన్‌దాన్, భోజనము ఉంచే పాత్రలు (తిరుగలి) తమలపాకు ఉమిసేది, కాటుకపుల్ల, కేశాలంకరణ సాధనాలు (దువ్వెన) వీటిని చక్కగా ఇచ్చినవారు అశ్వమేధ ఫలాన్ని పొందుతారు,అని. స్కాందమందిట్లా - బంగారుదో, వెండిదో, కంచుదో ఏదో ఒక భోజన పాత్రను ఇవ్వటం వల్ల భూతలమందు సమ్రాట్టు ఔతాడు,అని. వామన పురాణమందిట్లా - ఎవరైనా తమంత తాముగా బందీలైనా, ఇతరుల కారణంగా బందీఐనా, ఏ ఉపాయంతోనైనా వారిని విడిపించిన వారి పితరులు శాశ్వతమైన అవ్యయమైన స్థానాన్ని పొందుతారు,అని. పరాశరుడిట్లా - విధి ప్రకారము వస్త్రములనిచ్చి శాస్త్రం పరిపూర్ణమైంది అని చెప్పించాలి,అని. నారదీయ మందిట్లా - దేవతలతో అనుమతి పొంది పిదప పితరులను పూజించాలి, అక్కడ పితరులకు ఆసనం మొదలగు మొత్తం అర్చనకాండను విశ్వేదేవులకువలె చేయాలి. విశేషాన్ని చెప్తున్నాము. అక్కడ ఆసనమందు రెట్టింపు భుగ్నములు (తుంచిన) కుశలు ఉంచాలి. ఇక్కడ ఆవాహన, ఆసనముకన్న ముందా, అర్ఘ్యపూరణ తరువాతనా, అగ్నికరణం తరువాతనా,అని స్మృతు లందు భేదములు చెప్పబడ్డాయి. వీటిని శాఖాభేదము ననుసరించి నిర్ణయము రెండవ పక్షమే అనేక మందికి నచ్చింది.

మూ॥ **తత్రార్ఘ్యమాహాశ్వలాయనః** - తైజసాశ్మమయ మృన్మయేషు త్రిషుపాత్రేష్వేక ద్రవ్యేషు వా దర్భాంతర్హితేష్వప ఆసిచ్య, శన్నోదేవీ రభిష్టయ, ఇత్యను మంత్రాసుతిలానావపతి తిలోఽసి సోమదేవత్యో గోసవో దేవనిర్మితః, ప్రత్నవద్భిః ప్రత్తః స్వధయా పిత్ౄనిమాన్ లోకాన్ ప్రీణయాహినః స్వధానమః, ఇతి. అశ్మమయం = స్ఫాటికాది. మృన్మయం=హస్తకృతమేవ. **కులాల చక్రనిష్పన్న** మాసురం దైవికం నతత్, తదేవహస్త ఘటితం దైవికిం లౌకికంతథా, ఇతి ఛందోగ **పరిశిష్టాత్.** అన్యాన్యపి పాత్రాణి పూర్వముక్తాని. **మనుః - అన్నాభావే ద్విజాభావే** యద్యేకో **బ్రాహ్మణో భవేత్,** పాత్రాణ్యాసాదయేత్రీణి నతు బ్రాహ్మణ సంఖ్యయా. దత్తకాదేః కర్తుః ద్విపితృత్వా దావపి వచనాత్ త్రీణ్యేవ పాత్రాణీతి హరిహరః మాధవీయే బైజవాపః - అర్ఘ్యే పిత్ౄణాం త్రీణ్యేవ కుర్యాత్ పాత్రాణి ధర్మవిత్ ఏకస్మిన్ వా బహుషువా బ్రాహ్మణేషు యధావిధి, హేమాద్రావప్యేవం. అత్రాను మంత్రణం సకృత్. తిలోఽసి, ఇత్యస్య ప్రతిపాత్రమావృత్తిః. పితృశబ్దస్య అనూహశ్చేతి వృత్తికృత్. దర్భశ్చత్రిగుణం పవిత్రం.

అను॥ అక్కడ అర్ఘ్యాన్ని గూర్చి అశ్వలాయనుడిట్లా - తైజసపాత్ర, స్ఫటికాదిపాత్ర, మట్టిపాత్ర ఈ మూడు పాత్రలలో లేదా ఒకే ద్రవ్యంతో నిర్మించిన మూడు పాత్రలలోకాని వానిలో దర్భలుంచి అందులో నీరు ఉంచి, శన్నోదేవీరభిష్టయ, అను మంత్రములతో నువ్వుల నుంచాలి, వానిలో. తిలోఽసి సోమదేవత్యో..... నమః, అను మంత్రంతో వేయాలి, అని. అశ్మమయం = స్ఫటికం మొదలైనది. మృన్మయం = చేతితో చేసినట్టిదే. కుమ్మరి చక్రం వల్ల నిర్మితమైంది ఆసురమైనది, దైవికము కాదు. అదే మట్టితో చేతితో చేస్తే అది పాత్ర కేవలం దైవిక మౌతుంది, అని ఛందోగ పరిశిష్టమందు కలదు. ఇతర పాత్రలను గూర్చి ముందే చెప్పాము. మనువిట్లా - అన్నం లేకపోయినా, బ్రాహ్మణులు లేకపోయినా, ఒకవేళ ఒక్కడే బ్రాహ్మణుడున్నా, మూడు పాత్రలను ఆసాదన చేయాలి. బ్రాహ్మణ సంఖ్యతో నిమిత్తం లేదు. దత్తకాదులు కర్తలైనప్పుడు వారికి ఇద్దరు తండ్రులైనప్పటికి ఈ మొదలగు వాటిలో కూడా మూడే పాత్రలు, వచనము ననుసరించి అని హరిహరుడన్నాడు. మాధవీయ మందు బైజవాపుడిట్లా - ధర్మమెరిగినవాడు పితరులకు అర్ఘ్యమందు మూడు పాత్రలనే చేయాలి, బ్రాహ్మణుడు ఒక్కడున్నా చాలా మంది ఉన్నా శాస్త్ర విధిగా,అని. హేమాద్రి యందు కూడా ఇట్లాగే. ఇక్కడ అనుమంత్రణ ఒకేసారి. తిలోఽసి, అను మంత్రాన్ని ప్రతిపాత్ర యందును ఆ వృత్తిచేయాలి. పితృశబ్దము యొక్క ఊహ అవసరం లేదు అని వృత్తి కారుడన్నాడు దర్భలు మూడింత లెక్కువ పవిత్రము.

మూ॥ **తిస్రఃతిస్రః శలాకాస్తు పితృపాత్రేషు పార్వణే, ఏకోద్దిష్టే శలాకైకాం నిధాయోదక మాహరేత్, ఇతి హేమాద్రౌ చతుర్వింశతి మతాత్.** తత్రైవ విష్ణుః - దక్షిణాగ్రేషు దర్భేషు దక్షిణాప వర్గే చమసేషు పవిత్రాం తర్హితే ష్వప ఆసించేత్. శన్నోదేవీః, ఇతి మంత్రేణ జలాసేచనం బహ్వృచ భిన్న విషయం. అత్రాస్మి న్పక్షే ప్రతిపాత్రం మంత్రావృత్తిః. కారికాయాం - గంధ పుష్పాణి చైతేషు పాత్రేషు ప్రక్షిపే దధ. బ్రాహ్మే - జలం క్షీరం దధిఘృతం తిలతండుల సర్షపాన్, కుశాగ్ర మధు పుష్పాణి దత్వాఽఽచామేత్తతః స్వయం. జాతూకర్ణ్యః - తతోర్ఘ్యపాత్ర

**సంపత్తిం వాచయిత్వా ద్విజోత్తమాన్, తదగ్రే చార్ఘ్య పాత్రాణి స్వధార్ఘ్యా ఇతి విన్యసేత్. తతః తిలహస్తో విప్ర సవ్యజానౌ దక్షిణ కరం న్యస్య ఆవాహనం పృచ్ఛేత్. అత్రగోత్ర సంబంధ నామాని ద్వితీయాంతత్వం చ ప్రాగుక్తం. బైజవాపగృహ్యే - తిష్ఠన్ పితౄ నావాహయిష్యామి, ఇత్యామంత్ర్య. కౌర్మే - అపసవ్యంతతః కృత్వా పితౄణాం దక్షిణాముఖః, ఆవాహనంతతః కుర్యాత్ ఉశన్తస్త్వేత్యృచా బుధఃఆవాహ్య తదనుజ్ఞాతో జపేదాయంతు నస్తతః. అత్రసవ్యస్యాపి ప్రాగుక్తేః వికల్పః. అత్రాద్య మంత్రా వృత్యా అస్మత్పితర మముక శర్మాణం అముకగోత్రం వసురూపమా వాహయామీత్యా ద్యుక్త్వా మూర్ధాది పాదాన్తం తిలాన్ వికీర్య, ఆయంతునః, ఇతి సర్వాంతే సకృజ్జపేదితి నిబంధాః . అత్రోపవేశన సంవేశన పాద్యార్ఘ్యా చమనీయాన్యపి హేమాద్రిణోక్తాని తాన్యథర్వ వేదినాం నియతాని నాన్యేషాం. తేషాం చ ప్రపితా మహాది పిత్రంతం ప్రాతిలోమ్యేన సర్వః ప్రయోగః.**

అను॥ పార్వణమందు పితృపాత్రలలో మూడేసి శలాకలు దర్భలవి ఉండాలి. ఏకోద్దిష్ట మందు ఒక్కొక్క శలాక నుంచి ఆపైన నీరు పోయాలి (వదలాలి) అని హేమాద్రి యందు చతుర్వింశతి మతాన్ననుసరించి తెలుస్తోంది. అక్కడే విష్ణువిట్లా - దర్భలు దక్షిణాగ్రంగా ఉంచి దక్షిణ భాగం చివర చమస పాత్ర ఉంచి వానిలో పవిత్రం మధ్యలో ఉంచి నీరుతో తడపాలి. శన్నోదేవీః, అను మంత్రంతో నీటితో తడపటం అనేది బహ్వృచులకన్న ఇతర వేదస్థుల విషయము. ఇక్కడ ఈ పక్ష మందు ప్రతి పాత్ర యందును మంత్ర ఆవృత్తి జరగాలి. కారికయందిట్లా - ఇక ఈ పాత్రలలో గంధపుష్పములను వేయాలి, అని. బ్రాహ్మ మందిట్లా - నీరు, పాలు, పెరుగు, నేయి, నువ్వులు, బియ్యం, ఆవాలు, కుశాగ్రములు, తేనె, పుష్పములు ఈ పాత్రలలో వేసి ఆ పిదప స్వయం ఆచమనము చేయాలి,అని. జాతూకర్ణి ఇట్లా - ఆ పిదప బ్రాహ్మణులతో అర్ఘ్యపాత్ర సంపత్తిని చెప్పించి (అర్ఘ్యపాత్రం సుసంపన్నం అని) వారి ముందు అర్ఘ్యపాత్రలను స్వధార్ఘ్యాః అని ఉంచాలి,అని. ఆ పిదప తిలలు చేత ధరించి బ్రాహ్మణుల కుడిమోకాలిపై తన కుడిచేయి నుంచి ఆవాహనమును అడగాలి. ఇక్కడ గోత్ర సంబంధ నామములను ద్వితీయా విభక్త్యంతముగా చెప్పాలని ముందే చెప్పాము. బైజవాప గృహ్య మందిట్లా - నిలబడి, పితరులను ఆవాహన చేస్తున్నాను, అని ఆ మంత్రణ చేయాలి,అని. కౌర్మమందిట్లా - బుధుడు ఆ పిదప అపసవ్యంతో దక్షిణ దిక్కు నిలబడి పితరులను ఆవాహన చేయాలి, ఉశన్త స్త్వా అను ఋక్కుతో. ఇట్లా ఆవాహన చేసి వారి అనుజ్ఞ పొంది ఆ పిదప, ఆయంతునః పితరః, అను మంత్రాన్ని జపించాలి. ఇక్కడ సవ్యంగా కూడా అని ముందు చెప్పాం కనుక ఇది వికల్పము. ఇక్కడ తొలి మంత్రాన్ని ఆవృత్తి చేస్తూ అస్మత్ పితరం, అముక శర్మాణం, అముక గోత్రం, వసురూపం కలవానిని ఆవాహన చేస్తున్నాను అని మొదలుగా చెప్పి తల నుండి పాదముల వరకు నువ్వులను చల్లి ఆయంతునః, అను మంత్రాన్ని అన్నిటి చివర ఒకసారి జపించాలి,అని, నిబంధములందు ఉంది. ఇక్కడ ఉపవేశనం (కూర్చొనుట) సంవేశనం (కుశాది ఆసనము) పాద్యం అర్ఘ్యం, ఆచమనీయం ఇవి కూడా హేమాద్రి చెప్పాడు. అవి అధర్వవేదులకు తప్పనిసరి. ఇతరులకు

కాదు. వారికి కూడా ప్రపితామహుడు మొదలుకొని తండ్రి వరకు ప్రాతిలో మంగా (పైనుంచి కిందికి) అంతా ప్రయోగించాలి.

మూ॥ వారాహే - గంధపుష్పార్చనం కృత్వా దద్యాత్ హస్తే తిలోదకం గార్గ్యః - శిరస్తః పాదతో వాఽపి సమ్యగభ్యర్చయేతత్తః. తతః - స్వధార్ఘ్యాః ఇతి పితృపితామహాది విప్రాగ్రే ప్రత్యేకం నివేదయేత్, ఇతి కారికాయాం వృత్తౌ చ. ఆశ్వలాయనః - (అ4 ఖ-7.సూ9-13) ప్రసవ్యేన ఇతర పాణ్యం గుష్ఠాంతరేణోపవీతి త్వాద్దక్షిణేన వాసవ్యేప గృహీతేన - పితరిదంతే అర్ఘ్యం, పితా మహేదంతే అర్ఘ్యం ప్రపితామహేదంతే అర్ఘ్యమితి అప్పూర్వం, తాః ప్రతి గ్రాహయిష్యన్ సకృత్ సకృత్ స్వధా అర్ఘ్యా ఇతి, ప్రసృష్టా అనుమంత్రయేత. యాదివ్యా ఆపః పృథివి సంబభూవుః యా అంతరిక్ష్యా ఉతపార్థివీర్యాః, హిరణ్య వర్ణాయజ్ఞియాస్తా న ఆపః శంస్యోనా భవంతు ఇతి. అర్ఘ్యాది ప్రాగ్గంధాదేః యజ్ఞోపవీతమేవ. అర్ఘ్యదానాత్ప్రాగన్యా అపోదద్యాత్. యద్యప్యత్ర సవ్యేన దక్షిణేన వాఽర్ఘ్యం దద్యాదిత్యుక్తం, తథాపి దక్షిణేనేత్య భిమతోర్థః. కారికాయాం వృత్తౌ చైవం. పిత్రాదేః త్రిభిః పాత్రైః దద్యాత్. పితుః స్థానే విప్రత్రయం చేదే కార్ఘ్యం విభజ్యదద్యాత్. త్రయాణాం, స్వధా అర్ఘ్యాః, ఇతి సకృత్ ప్రశ్నః. ఏవం పైతా మహాదావాపి. అన్య జలదాన మర్ఘ్య మంత్రాశ్చ ప్రతి విప్రమా వర్తంతే. శేషు గంధా దౌ చ ప్రతి విప్రం పదార్థాను సమయః కాందాను సమయోవా. పిత్రాదిత్రయాణామేక విప్రపక్షే త్రిభిః పాత్రైః ఏకస్మై వార్ఘ్యం దద్యాత్ ఇతి వృత్తిః. కారికాపి- స్వధార్ఘ్యా ఇత్యపోర్ఘ్యాస్తా ఉపవీతీ నివేదయేత్. నివేదనాత్ప్రాక్ ప్రాచీనావీతయే వేత్యర్థః. అర్ఘ్యం సశేషమాదాయ దక్షిణేన, తుపాణినా, సవ్యహస్త గృహీతేన నినయేత్పితృతీర్థతః. దత్వాదత్వా నినీతాస్తా, యాదివ్యార్ఘ్యాను మంత్రయేత్. యత్తుయాదివ్యా ఇతి మంత్రేణ హస్తే ష్వర్ఘ్యం వినిక్షిపేత్, ఇతి, యచ్చ వారాహే- తిలాంబునా చాపసవ్యం దద్యాదర్ఘ్యాదికం ద్విజః, ఇతి, యచ్చవ్యాసః - గోత్ర సంబంధనామాని పితౄణా మనుకీర్తయన్, ఏకైకస్యతు విప్రస్య అర్ఘ్యపాత్రం వినిక్షిపేత్, ఇతి తత్ బహ్వృచాతి రిక్త విషయం. తత ఆ చామేత్. ఏవం మాతా మహేష్వపి.

అను॥ వారాహమందిట్లా - గంధపుష్ప, అర్చనంచేసి చేతిలో తిలోదకం ఇవ్వాలి, అని. గార్గ్యుడిట్లా - ఆ పిదప శిరస్సు నుండి కాని లేదా పాదముల నుండి ఆరంభించి ఐనా చక్కగా పూజించాలి,అని. ఆ పిదప- స్వధా అర్ఘ్యాః,అని పితృపితామహులు మొదలగు బ్రాహ్మణుల ఎదుట ప్రత్యేకంగా (విడివిడిగా) నివేదించాలి, అని కారికయందు వృత్తి యందు కూడా. ఆశ్వలాయనుడిట్లా- అపసవ్యంతో కుడిచేయి అంగుష్ఠం మధ్య నుంచి (అర్ఘ్యమివ్వాలి). ఉపవీతి ఐనందువల్ల, ఎడమ చేతితో తాకబడిన కుడిచేతితో కాని, పితరులకు మీకు ఈ అర్ఘ్యము, పితామహులకు మీకు ఈ అర్ఘ్యము, ప్రపితామహ మీకు ఈ అర్ఘ్యము అని నీటిధార పూర్వకముగా అర్ఘ్యం ఇవ్వాలి. వారు స్వధా అర్ఘ్యాః, అని ఒక్కొక్కసారి స్వీకరించాలి (పితరుల కొకసారి, పితామహుల కొకసారి అట్లా) చేతితో విడిచిన అర్ఘ్యాన్ని (వేళ్ళ ద్వారా విడువబడ్డది (ప్రసృష్టము) స్వీకరించాలి (బ్రాహ్మణులు యాదివ్యా ఆపః... భవంతు, అని మంత్రం. అర్ఘ్యం మొదలగునవి గంధాదులు మొదలగునవి వీనికన్న ముందు యజ్ఞోపవీతమే ఇవ్వాలి. అర్ఘ్యదానం కన్న ముందు వేరే నీళ్ళు ఇవ్వాలి. ఇక్కడ ఎడమ లేదా కుడితోగాని

(సవ్య, అపసవ్య) అర్ఘ్యమివ్వాలి. అని చెప్పారు ఐనా దక్షిణంతో అన్నదే అభిమతార్థము. కారికయందు వృత్తి యందును ఇట్లాగే ఉంది. పిత్రాదులకు మూడు పాత్రలతో ఇవ్వాలి. పితృస్థానమందు ముగ్గురు బ్రాహ్మణులుంటే ఒక అర్ఘ్యమును విభజించి ఇవ్వాలి. ముగ్గురికి, స్వధా అర్ఘ్యాః అని ఒకేసారి ప్రశ్నించాలి. ఈ విధంగా పితామహాదులందు కూడా. ఇతర జలము నిచ్చుట అర్ఘ్య మంత్రములు ప్రతి బ్రాహ్మణుని దగ్గర ఆ వృత్తి చేయాలి. వారికి గంధాదులు ఇచ్చేప్పుడు ప్రతి బ్రాహ్మణుని దగ్గర పదార్థాను సమయమో కాండాను సమయమో ఆచరించాలి. ముగ్గురు పిత్రాదులకై ఒకే బ్రాహ్మణుడుంటే మూడు పాత్రలతో ఒకనికే అర్ఘ్యమివ్వాలి, అని వృత్తికారుడు. (గణేశ పూజలో ఆవాహనాది పుష్పాంజలి చివరిదాకా ఆచరించి ముగించి గౌరీపూజ చేయటం ఇది కాండాను సమయం ఒకరికి అన్ని పూజలు. గణపతి ఆవాహన, గౌరి అవాహన గణపతికి ఆసనం గౌరికి ఆసనం ఇది ఒక్కొక్క పూజ అందరికి పదార్థాను సమయం). కారిక కూడా - స్వధా అర్ఘ్యాః అని జలముతో అర్ఘ్యము వానిని ఉపవీతిగా నివేదించాలి. నివేదించటంకన్న ముందు ప్రాచీనావీతమే అని అర్థము. కుడిచేతితో మిగిలిన అర్ఘ్యాన్ని తీసుకొని, పితృతీర్థంలో సవ్యహస్తంతో తీసుకున్న దానిని కలపాలి. ఇచ్చి ఇచ్చి పోయబడినవి అవి, యాదివ్యా అను మంత్రంతో పూజించి అనుమంత్రణ చేయాలి. ఏదైతే - యాదివ్యా అను మంత్రంతో హస్తములందు, అర్ఘ్యముంచాలి ఉంచాలి,అని అన్నారో, ఏదైతే వారాహమందు - ద్విజుడు నువ్వుల నీళ్ళతో అపసవ్యుడై అర్ఘ్యాదికమివ్వాలి. అని ఉందో, వ్యాసుడు ఏదైతే - పితరుల గోత్ర సంబంధ నామములను కీర్తించాలి, ఒక్కొక్క బ్రాహ్మణునకు అర్ఘ్యపాత్ర మివ్వాలి, అని అన్నాడో ఇదంతా బహ్వృచులకన్న వేరైన వారల విషయము. ఆ పిదప ఆచమనం చేయాలి. ఈ విధంగా మాతామహులందు కూడా.

**మూ॥ ఆశ్వలాయనః** - (64ఖ7. సూ13.) సంస్రవాన్ సమవనీయ తాభిరద్భిః పుత్ర కామో ముఖమనక్తి. సంస్రవః = శేషః సంస్రవోహి పరిశిష్టో భవతి, ఇతి శతపథశ్రుతేః. కేచిత్తు హస్తగలితాంబు వదంతి. సమవనీయాంత్యే ద్వేపాత్రే పితృపాత్రే ఆసించేదితివృత్తిః ప్రథమే పాత్రే సంస్రవాన్ సమవనీయ ఇతి కాతీయ సూత్రాచ్చ. బ్రాహ్మేతు - ప్రతిబింబానులోక నముక్తం. స్కాందే త్వాయుః కామస్య నేత్రాసేచన ముక్తం. పిత్ర్యవిప్రైః ప్రాఙ్ముఖస్య కర్తుః అభిషేకః కార్య ఇతి కేచిత్. ఆశ్వలాయనః - (అ4.ఖ.7.సూ.7) నోద్ధరేత్ ప్రథమం పాత్రం పితౄణామర్ఘ్యపాతితం, ఆవృతాస్తత్ర తిష్ఠంతి పితరః శౌనకోఽబ్రవీత్. యావద్వి ప్రవిసర్జనం, ఇతి తుర్యపాదే యమీయః పాఠః. అత్రవృత్తిః - పితృపాత్రం సమవనయన దేశాన్నచాలయేత్ ఆశ్రాద్ధ సమాప్తేః, యస్మాత్తత్ర తృతీయ పాత్రేణావృతాః,ఇతి. యద్వా ప్రథమ పాత్రమేవన్యగ్బిలం కుర్యాత్,ఇతి. కామాభావేఽ పీదమేవశేష ప్రతిపాదనం.హేమాద్రౌ కౌర్మే-సంస్రవాంశ్చతతః సర్వాన్పాత్రే కుర్యాత్సమాహితః. పితృభ్యః స్థానమసీతి న్యుబ్జం పాత్రం నిధాపయేత్. శూలపాణౌయమస్తు - పైతృకం ప్రథమం పాత్రం తస్మిన్ పైతామహం న్యసేత్. ప్రపితామహం తతోన్యస్య నోద్ధరేత్ న చ చాలయేత్, ఇత్యాహ.

అను॥ ఆశ్వలాయనులిట్లా - శేషమును తీసుకొని ఆ నీటితో పుత్రకాముని ముఖమును తడపాలి. (యజమానియొక్క) సంస్రవమనగా శేషము. సంస్రవమనగా పరిశిష్టము అని శతపథ శ్రుతి. కొందరు చేతి నుండి జారిన నీరు అని అంటారు. సమవ నీయం చివర, రెండు పాత్రలను పితృపాత్ర యందు ఉంచాలి అని వృత్తి. ప్రథమ పాత్ర యందు సంస్రవములను చేర్చి అని కాతీయ సూత్రం నుండి తెలుస్తోంది. బ్రాహ్మమందైతే - ప్రతి బింబమును చూడాలి,అని చెప్పారు. స్కాందమందైతే ఆయుఃకామునకు నేత్ర సేచన చేయాలి,అని. పితరులైన విప్రులు ప్రాఙ్ముఖుడైన కర్తకు అభిషేకం చేయాలని కొందరన్నారు. ఆశ్వలాయనుడిట్లా - పితరుల అర్ఘ్యము నుంచిన ప్రథమ పాత్రను అక్కడి నుండి లేపరాదు,అక్కడ పితరులు చుట్టుకొని ఉంటారు,అని శౌనకుడు చెప్పాడు. విప్రుల విసర్జన వరకు, అని నాల్గవ పాదమందు యముడు చెప్పిన వాక్యముంది అని. ఇక్కడ వృత్తి ఇట్లా - పితృపాత్రను సమవనయన ప్రదేశం నుండి (ఒకటిచేసిన) శ్రాద్ధ సమాప్తి వరకు కదల్చరాదు, ఎందువల్ల నంటే అక్కడ మూడవపాత్రతో దాన్ని కప్పారు,అని. లేదా ప్రథమపాత్రనే బోర్లించాలి,అని. కోరిక లేకపోయినా శేషమును గూర్చి ఇదే ప్రతిపాదన. హేమాద్రి యందు కౌర్మోక్తి ఇట్లా - శ్రద్ధతో అన్ని సంస్రవములను పాత్ర యందుంచాలి. నీవు పితరులకు స్థానము అని బోర్లించి పాత్రను ఉంచాలి,అని. శూలపాణి యందు యమోక్తి ఇట్లా - తొలిపాత్ర పితరులది దానిలో పైతామహంను ఉంచాలి. ఆ పిదప ప్రపితా మహ పాత్ర నుంచాలి. లేపరాదు కదిలించరాదు,అని అన్నారు.

**మూ॥ అత్రిః - గంధాదిభిః తదభ్యర్చ్య తృతీయేనా పిధాపయేత్, పితృభ్యః స్థాన మసీతి శుచౌదేశేఽర్చితేఽర్చయేత్, అర్చనం న్యుబ్జీకృతేఽపి తుల్యం. న్యుబ్జముత్తరతోన్యసేత్, ఇతిప్రచేత సోక్తేః. సర్వవిప్రోత్తరతో న్యసేత్, ఇతి హేమాద్రి కల్పతరూ. విప్రవామే, ఇతి హలాయుధః. కర్తుర్వామే ఇతి శూలపాణిః. ఉత్తానం వివృతం వాఽపి పితృపాత్రే, నతద్భవేత్, ఇత్యుశనసోక్తేః న్యుబ్జతైవ సాధుః. మాతామహాది సంస్రవానపి పితృపాత్ర ఏవగృహీత్వా ప్రయాజవత్తం త్రేణ న్యుబ్జీ కుర్యాది తిశూలపాణిః. ఏకోద్దిష్టే తూహేన న్యుబ్జతేతి పితృభక్తౌ శ్రీదత్తః. యమోఽపి - స్పృష్ట ముత్తాన మన్యత్ర నీతముద్ఘాటితం తథా, పాత్రందృష్ట్వా వ్రజంత్యాశు పితరస్తం శపంతి చ. వైశ్వదేవే ఉత్తానమితి మదన పారిజాతః. బైజవాపః - తస్యో పరికుశాన్ దత్వా ప్రదద్యాద్దేవ పూర్వకం, గంధపుష్పాణి ధూపం చ దీపం వస్త్రోపవీతకే. అత్రగంధాదేః దైవే పిత్ర్యే చ పదార్థాను సమయస్య యాజ్ఞవల్క్యోక్త కాండాను సమయేన వికల్పోజ్ఞేయః. బహ్వృచానాంతు సూత్రే దైవానుక్తేః కాండాను సమయ ఏవ. అత్ర ప్రాచీనావీతి. నామగోత్ర సంబుధ్యాద్యుక్తం ప్రాక్. అన్యద్దైవ వత్తదంతే ఆచమనంచ. హేమాద్రౌ కాలికాపురాణే - నిర్వర్త్య బ్రాహ్మణా దేశాత్ క్రియామేవం యథావిధి, భాజనాని తతోదద్యాత్ హస్త శౌచం పునఃక్రమాత్. ఆదేశాత్పాత్రాణి దద్యాదిత్యన్వయః . తేన తత్రాపి ప్రశ్నానుజ్ఞే జ్ఞేయే.**

అను॥ అత్రిఇట్లా - గంధాదులతో దానిని పూజించి మూడవ పాత్రతో కప్పేయాలి. పితరులకు స్థానముపు ఉన్నావు అని శుచి ప్రదేశమందు, అర్చించినచోట, అర్చించాలి,

అని. అర్చన, బోర్లించిన పాత్ర యందునూ సమానమే. బోర్లించిన దానిని ఉత్తరదిక్కున ఉంచాలని ప్రచేతసోక్తి. బ్రాహ్మణులందరికి ఉత్తరదిక్కులో ఉంచాలని హేమాద్రి కల్పతరువులు. విప్రులకు ఎడమ భాగంలో, అని హలాయుధుడు. కర్తకు ఎడమ భాగంలో అని శూలపాణి. సరిగ్గా ఉంచినా (వెల్లికిలగా) తెరవబడినా పితృపాత్రయందు అదికాదు అని ఉశనసుని మాట ఉన్నందువల్ల బోర్లించి ఉంచుటే మంచిది. మాతామహాది శేషములను కూడా పితృపాత్రయందే తీసుకొని ప్రయాజం వలె (ఒకేసారి ఏక కాలంలో) తంత్రంతో బోర్లించాలి, అని శూలపాణి. ఏకోద్దిష్టమందైతే ఊహతోనే న్యుబ్జత అని పితృభక్త మందు శ్రీదత్తుడన్నారు. యముడు కూడా – ముట్టుకోబడి, వెల్లికిలగా, మరోచోటికి తీసుకుపోబడి, ఛేదింపబడి, ఏది జరిగినా అట్టి పాత్రను చూచి పితరులు త్వరగా వెళ్ళిపోతారు, అతనిని శపిస్తారు కూడా, అని. వైశ్వదేవ మందైతే ఉత్తానమని మదనపారిజాత మందు ఉంది. బైజవాపుడిట్లా – దానిపై కుశలనుంచి దేవపూర్వకముగా ఇవ్వాలి. గంధము, పుష్పములు, ధూపము, దీపము, వస్త్రము, ఉపవీతము ఇవ్వాలి, అని. ఇక్కడా గంధాదులు దైవులకు పితరులకును పదార్థాను సమయము యాజ్ఞవల్క్యులు చెప్పిన కాండాను సమయము రెండు ఉన్నందువల్ల వికల్పమని గ్రహించాలి. బహ్వృచులకు సూత్రంలో దైవం చెప్పనందువల్ల కాండాను సమయమే. ఇక్కడ ప్రాచీనావీతి ఉండాలి. నామగోత్ర సంబంధాదులు ముందే చెప్పాము. ఇతరమైనదంతా దైవంనకు లాగానే ఆ చివర ఆచమనం చేయాలి కూడా. హేమాద్రియందు కాలికాపురాణోక్తి ఇట్లా – బ్రాహ్మణుల ఆజ్ఞతో ఈ విధముగా శాస్త్ర ప్రకారము క్రియ నిర్వర్తించి ఆ పిదప అన్న పాత్రలను (ఇస్తళ్ళు) ఇవ్వాలి. తిరిగి హస్త శౌచము క్రమంగా చేయాలి, అని. ఆదేశంతో పాత్రల నివ్వాలి అని అన్వయము. అందువల్ల అక్కడ కూడా ప్రశ్న, అనుమతి (ఈ రెండు) ఉండాలని గ్రహించాలి.

మూ॥ **తత్రైవబ్రాహ్మే** – మండలాని చ కార్యాణి నైవారై శ్చూర్ణకైః శుభైః గౌరమృత్తికయా వాపి భస్మనా గోమయేనవా. భృగుః – భస్మనా వారిణావాపి కారయేన్మండలం తతః, చతుష్కోణం ద్విజాగ్ర్యస్య త్రికోణం క్షత్రియస్యతు, మండలాకృతి వైశ్యస్య శూద్రస్యా భ్యుక్షణం స్మృతం. బహ్వృచ పరిశిష్టేతు దైవే చతురస్రం పిత్ర్యే వర్తులం మండలంకృత్వా క్రమేణ సయవాన్ సతిలాం శ్చదర్భాన్ దద్యాత్ ఇత్యుక్తం. **మార్కండేయః** – యాతుధానా పిశాచాశ్చ క్రూరాయే చైవ రాక్షసాః, హరంతి రసమన్నస్య మండలేన వివర్జితం. **హేమాద్రౌహారీతః** – భూమావేవ నిదధ్యాన్నే పరిపాత్రాణి, ఇతి. తాని చ హేమాద్రావత్రి రాహ – భోజనే హైమ రౌప్యాణి దైవే పిత్ర్యే యథాక్రమం. హారీతః – రాజత పార్ణతామ్ర కాంస్య పాత్రాణి భోజనే, ఇతి. తత్రైవ వారాహే – సౌవర్ణానీహ రౌప్యాణి కాంస్యాని తదసంభవే, అన్యాన్యపి హికార్యాణి దారుజాన్యపి జానతా. నాయసాన్యపి కార్యాణి పైత్తలాని నతుక్వచిత్. న చ సీసమయానీ హాశస్యంతే త్రపుజాన్యపి. అత్రిః – పంచాశత్ పలికం కాంస్యం ద్వ్యధికం భోజనాయవై, గృహస్థైస్తు సదాకార్యమభావే హైమరౌప్యయోః పాలాశేభ్యో వినానస్యుః పర్ణపాత్రాణి భోజనే.

అను॥ అక్కడే బ్రాహ్మమందిట్లా - మంచివైన నీవార ధాన్యపు పిండితో లేదా తెల్లమట్టితో లేదా భస్మంతో లేదా ఆవుపేడతోనైనా మండలములు చేయాలి, అని. భృగువిట్లా - భస్మంతో లేదా నీటితో ఆ పిదప మండలము చేయాలి, అని. బ్రాహ్మణ శ్రేష్ఠునకు నాలుగు మూలలుగా, క్షత్రియునకు త్రికోణంగా, వైశ్యునకు మండలాకారముగా, శూద్రునకు నీరు చల్లటం. ఈ విధంగా మండలం చేయాలి, అని. బహ్వృచ పరిశిష్టమందైతే దైవమునకు చతురస్రంగా పితరులకు గుండ్రంగా మండలాలు చేసి క్రమంగా యవలతో కూడిన దర్భలను తిలలతో కూడిన దర్భలను ఇవ్వాలి, అని చెప్పబడింది. మార్కండేయుడిట్లా - యాతుధానులు, పిశాచులు, క్రూరులైన ఇతర రాక్షసులు, మండలం లేకపోతే, అన్నము యొక్క రసమును హరిస్తారు, అని. హేమాద్రి యందు హారీతుడిట్లా - పాత్రలను భూమిపైనే ఉంచాలి పైన కాదు, అని. ఆ పాత్రల గూర్చి హేమాద్రియందు అత్రి ఇట్లా పలికాడు - భోజన పాత్రలు దైవములకు బంగారమువి, పితరులకు వెండివి (హేమరౌప్య, దైవ పిత్ర్య వరుసగా) అని. హారీతుడిట్లా - వెండివి, ఆకులతో కుట్టినవి, రాగివి, కాంస్యపువి భోజన పాత్రలు, అని. అక్కడే వారాహమందిట్లా - బంగారపువి, వెండివి, కంచువి, అవిలేకపోతే ఇతరమైనవైనా కర్రతో చేసినవైనా చేయించాలి, తెలిసిన వారు. ఇనుమువి పనికిరాదు. ఇత్తడివి పనికి రావు. సీసమయమైనవి కూడా ఇక్కడ ప్రశస్తం కాదు. లక్క పాత్రలు కూడా తగవు అని. అత్రి ఇట్లా - ఏబది రెండు పలముల బరువుగల కాంస్య పాత్రను భోజనమునకై గృహస్థు ఎల్లప్పుడూ చేయించాలి, బంగారువి, వెండివి లేని పక్షంలో. భోజనమునకు మోదుగ ఆకులు తప్ప ఇతరమైన ఆకుల పాత్రలు (ఇస్తళ్ళు) తగవు అని.

మూ॥ **పృథ్వీచంద్రస్తు** - కాంస్య పాత్రే హవిర్దృష్ట్వా నిరాశాః పితరోగతాః, ఇతి బ్రాహ్మోక్తేః కాంస్యపాత్ర నిషేధమాహ. **బోపదేవస్తు స్మృతి సంగ్రహముదాజహార** - శ్రాద్ధే పలాశపాత్రాణి మధూకోదుంబరాణిచ, పారికాకుట జప్లక్షక్రకచాని క్రమాజ్జగుః, కదలీ చూతపనస జంబు పున్నాగ (పత్రార్క) చంపకాః, అలాభేముఖ్య పాత్రాణాం గ్రాహ్యాఃస్యుః పితృకర్మణి, ఇతి **హేమాద్రౌతు కదలీపాత్ర** నిషేధమాహాంగిరాః - నజాతీ కుసుమాని దద్యాత్ నకదలీ పత్రం, ఇతి. క్రతుః - అసురాణాంకులే జాతా రంభా పూర్వపరిగ్రహే, తస్యాదర్శన మాత్రేణ నిరాశాః పితరోగతాః ఏవంపాత్రాణ్యాసాద్య భస్మమర్యాదాంకృత్వా విప్రహస్తశోధనం కుర్యాత్ అత్ర పిశంగ, రక్షాంసో, ఇతిమంత్రద్వయంకేచిత్పఠంతి. మాత్స్యే - అకృత్వాభస్మమర్యాదాం యః కుర్యాత్ పాణిశోధనం, ఆసురం తద్భవేచ్ఛ్రాద్ధంపితౄణాంనోపతిష్ఠతే. తత్రైవబ్రహ్మాండే -ప్రక్షాల్య హస్తపాత్రాది పశ్చాదద్భిర్విధానవత్, ప్రక్షాలన జలం దర్భైః తిలైర్మిశ్రం క్షి పేచ్చు చౌ. మండలే పరీతి హేమాద్రిః

అను॥ పృధ్వీచంద్రుడైతే ఇట్లా - కాంస్యపాత్రయందు హవిస్సును చూచి పితరులు నిరాశులై వెళ్లారు, అని బ్రాహ్మోక్తి ఉన్నందువల్ల కాంస్యపాత్ర నిషేధము, అని అన్నాడు. బోపదేవుడైతే స్మృతి సంగ్రహాన్ని ఉదహరించాడు ఇట్లా - శ్రాద్ధమందు మోదుగ పాత్రలు, ఇప్పఆకులు, మేడిఆకులు, నీరు ప్రబ్బలి ఆకులు, కొండమల్లె, జువ్వి, వెణుతురు ఇవి

క్రమంగా చెప్పారు. అరటి, మామిడి, పనస, అల్లనేరేడు, పున్నాగ, చంపకములు ఇవి, ముఖ్యపత్రములు లభించని పక్షంలో పితృకర్మయందు గ్రహించతగినవి, అని. హేమాద్రి యందైతే పాత్రముల నిషేధమును అంగిరుడు చెప్పాడిట్లా – జాతిపుష్పములను, కదలీ పత్రములను ఇవ్వరాదు, అని. క్రతువిట్లా – అరటి, రాక్షసకులమందు తొలి పరివారంలో పుట్టినట్టిది. దాని దర్శన మాత్రంతో పితరులు నిరాశులై, పోతారు అని. ఈ విధంగా పాత్రాసాదన చేసి భస్మమర్యాదను చేసి బ్రాహ్మణహస్త శోధనమును చేయాలి. అక్కడ పిశంగ, అని రక్షాణో, అని రెండు మంత్రములను కొందరు చదువుతారు. మాత్స్యమందిట్లా – భస్మమర్యాదను చేయకుండా పాణి శోధన చేసుకున్న యెడల ఆ శ్రాద్ధము ఆసుర శ్రాద్ధ మౌతుంది. పితరులకు చెందదు, అని. అక్కడే బ్రహ్మాండమందిట్లా – ఆ పిదప నీటితో శాస్త్రప్రకారముగా హస్త పాత్రాదులను ప్రక్షాళన చేసి, తిలదర్భలతో మిశ్రితమైన ప్రక్షాళన జలాన్ని శుచి ప్రదేశంలో చల్లాలి, అని. మండలములపైన అని హేమాద్రి.

**మూ॥ అథాగ్నౌకరణం** – హేమాద్రౌ మార్కండేయః – ఆహితాగ్నిస్తు జుహుయాత్ దక్షిణాగ్నౌ సమాహితః, అనాహితాగ్ని శ్చౌపాసనేఽగ్న్యభావేద్విజేఽప్సువా. వాయవీయే – ఆహృత్య దక్షిణాగ్నింతు హోమార్థం వైప్రయత్నతః, అగ్న్యర్థం లౌకికంవాపి జుహుయాత్కర్మ సిద్ధయే. ఆహితాగ్నిః = సర్వాధానీ. అర్ధాధానీతు గృహ్యఏవేతి చంద్రికా పరార్క మితాక్షరా మాధవాదయఃతస్యాపి దక్షిణాగ్నౌ లౌకికో గృహ్య ఇతి హేమాద్రిః కల్పతరుశ్చ. ఆద్యపక్ష ఏవతు యుక్తో బహు సమ్మతశ్చ. యద్యపి స్మార్తమగ్నౌ కరణం శ్రౌతే దక్షిణాగ్నౌ నయుక్తం, తథాపి వచనాద్భవతీతి హేమాద్రి చంద్రికాదయః. ఇదం దర్శ శ్రాద్ధఏవ ఆబ్దికాదిషుతు సర్వాధానీపాణౌ, అర్ధాధానీ గృహ్యే కుర్యాదితి హేమాద్రి ర్మాధవశ్చ. పక్షాంతంకర్మ నిర్వర్త్య వైశ్వదేవం చ సాగ్నికః, పిండయజ్ఞం తతఃకుర్యాత్ తతోఽన్వాహార్యకం బుధః. ఇతిలౌగాక్ష్యాదిభిః, క్రమోక్తేః విహృత దక్షిణాగ్ని సత్వాత్. అత ఏవాత్ర వచనే సాగ్నికః ఆహితాగ్ని రుక్తో హేమాద్రిణా. ఏతదాపస్తం బాదీనామేవ. ఆశ్వలాయన స్యాహితాగ్నేః పాణావేవేతి వృత్తిః. అర్ధాధానినో గృహ్యే ఏవ వ్యతిషంగేణేతి ప్రయోగపారిజాతే పరిశిష్టేచ. బోపదేవస్త్వాహ హోమశబ్దః పిండ పితృయజ్ఞపరః. పితృయజ్ఞేతు జుహుయాత్ దక్షిణాగ్నౌ సమాహితః శ్రాద్ధే త్వౌపాసనాగ్నౌతు నిరగ్నిర్లౌకికేఽనలే. అనగ్నిర్దూర భార్యశ్చ పార్వణే సముపస్థితే, సంధాయాగ్నిం తతఃకుర్యాత్ హోమమగ్నిం సముత్సృజేత్, ఇతి త్రికాండ మండనోక్తేః శ్రాద్ధే గృహ్యాగ్నా వేవేతి. లౌకికాగ్న్యాది విధానంచ తైత్తిరీయాది విషయం. బహ్వృచస్యత్వనగ్నే రపి పాణిహోమఏవ. అగ్నిపాణీ వినాసూత్రే విధానాంతరానుక్తేః. అగ్న్యభావేతు విప్రస్య పాణావేవోపపాదయేత్, ఇతి (63 శ్లో 212) మనూక్తేశ్చ. వృత్తావప్యేవం. క్వచిత్సాగ్నేరపి పాణిహోమ ఉక్తో గృహ్యపరిశిష్టే – అన్వష్టక్యం చ పూర్వేద్యుః మాసిమాస్యథ పార్వణం, కామ్యమభ్యుదయేఽష్టమ్యా మేకోద్దిష్టం తథాష్టమం. చతుర్ష్వాద్యేషు సాగ్నీనాం వహ్నౌ హోమోవిధీయతే. పిత్ర్యబ్రాహ్మణహస్తే స్యాదుత్తరేషు చతుర్ష్వపి, ఇతి. ఏకోద్దిష్టం సపిండీకరణం, శుద్ధేతన్నిషేధాత్. బహ్వృచ భాష్యకారాస్తు సర్వై కోద్దిష్టేషు పాణిహోమ మాహుః ఇదం బహ్వృచానామేవ.

అను॥ ఇక అగ్నియందు చేయటం. హేమాద్రియందు మార్కండేయుడిట్లా - ఆహితాగ్ని ఐతే మాత్రం దక్షిణాగ్నియందు స్వస్థ చిత్తంతో హోమం చేయాలి. ఆహితాగ్ని కానివారు ఔపోసనాగ్నిలో (గృహాగ్ని) చేయాలి. అగ్ని లేని పక్షంలో బ్రాహ్మణుని చేతిలో కాని, నీటి యందు కాని చేయాలి, అని. వాయవీయమందిట్లా - హోమము కొరకు, అగ్నికొరకు ప్రయత్నపూర్వకముగా దక్షిణాగ్నిని కాని లౌకికాగ్నిని కాని తెచ్చి కర్మసిద్ధి కొరకు హోమం చేయాలి, అని. ఆహితాగ్ని అనగా సర్వాధాని. అర్ధాధాని మాత్రం గృహ్యాగ్నియందే అని చంద్రిక, అపరార్కమితాక్షరమాధవాదులన్నారు. అతనికి కూడా దక్షిణాగ్నియందే. లౌకికమనగా గృహ్యాగ్ని అని హేమాద్రి కల్పతరువులు. తొలిపక్షమే తగినది, చాలామందికి సమ్మతమైంది. స్మార్తము అగ్నియందు చేయటం, శ్రౌతమందు దక్షిణాగ్నియందు చేయటం తగదు, ఐనా వచనం వల్ల ఔతుంది. అని హేమాద్రి, చంద్రికాదులన్నారు. ఇది దర్శశ్రాద్ధమందే. ఆబ్దికాదులందైతే సర్వాధాని చేతియందు, అర్ధాధాని గృహ్యాగ్నియందు చేయాలి. అని హేమాద్రి, మాధవుడు అన్నారు. సాగ్నికుడు పక్షాంతమైన (దర్శపౌర్ణమాసఇష్టి) కర్మచేసి వైశ్వదేవమును ముగించి ఆ పిదప పిండయజ్ఞం చేయాలి. ఆ పిదప బుధుడు అన్వాహార్యకము చేయాలి, అని లౌగాక్ష్యాదులు క్రమం చెప్పారు. విస్తరించిన దక్షిణాగ్ని ఉన్నందువల్ల. అందువల్లనే ఇక్కడ వచనంలో సాగ్నికుడు ఆహితాగ్ని చెప్పబడ్డాడు హేమాద్రితో. ఇది ఆపస్తంబాదులకే. ఆశ్వలాయనునకు ఆహితాగ్నికి పాణియందే అని వృత్తి. అర్ధాధానికైతే గృహ్యాగ్నియందే (వ్యతిషంగంతో) అని ప్రయోగ పారిజాతమందు పరిశిష్టమందు కలదు. బోపదేవుడిట్లా - హోమశబ్దము పిండ పితృయజ్ఞపరము. పితృయజ్ఞమందైతే స్థిరమైన మనస్సుతో దక్షిణాగ్ని యందు హోమం చేయాలి. శ్రాద్ధమందైతే ఔపాసనాగ్నియందు, అగ్నిలేనివాడు లౌకికాగ్నియందు చేయాలి. అగ్నిలేని వాడు (స్వీకారం లేనివాడు, విచ్ఛిన్నాగ్నికుడు) భార్యదూరంలో కలవాడు వీరు పార్వణం వస్తే (శ్రాద్ధం) అగ్నిసంధానం చేసి ఆ పిదప హోమం చేయాలి. ఆ అగ్నిని పారవేయాలి, అని త్రికాండమండనుడు చెప్పినందువల్ల, శ్రాద్ధమందు గృహ్యాగ్నియందే అని. లౌకిక అగ్ని మొదలగు వాని విధానము తైత్తిరీయాదుల విషయము. బహ్వృచునకైతే అగ్నిలేని వానికి కూడా పాణిహోమమే. అగ్ని, పాణి ఇవితప్ప సూత్రమందు మరొక విధానం చెప్పనందువల్ల. అగ్నిలేకపోతే విప్రునకు చేతియందే నిర్వహించాలి, అని మను ఉక్తి కూడా. వృత్తి యందు కూడా ఇట్లాగే ఉంది. ఒక చోట అగ్ని కలవానికి కూడా పాణిహోమం చెప్పబడింది. గృహ్యపరిశిష్టంలో - అన్వష్టకం కన్న ముందు రోజు (హేమంత, శిశిర కృష్ణ పక్ష నవమి) (అష్టమిన) ప్రతినెలలో పార్వణ ముంటుంది. పుత్రాది కామనయందు, పుత్రజన్మమందు అష్టమియందు ఏకోద్దిష్టము. అట్లా ఎనిమిది సార్లు, తొలినాల్గింటిలో సాగ్నులకు వహ్నియందు హోమం విధించబడింది. తరువాత నాల్గింటిలో పితృబ్రాహ్మణ హస్తమందు హోమము, అని. ఏకోద్దిష్టమనగా సపిండీకరణము. శుద్ధమందు దాన్ని నిషేధించారు. బహ్వృచ భాష్యకారులైతే అన్ని ఏకోద్దిష్టములందు పాణిహోమాన్ని చెప్పారు. ఇది బహ్వృచులకే.

మూ॥ అత్రేదంతత్త్వం. స్థాలీపాకేన సహ పిండార్థముద్ధృత్య, ఇతి సూత్రే, నాత్రాపూర్వః స్థాలీపాకశ్చోచ్యతే. సర్వశ్రాద్ధేషుప్రసంగాత్తేనానువాదోఽయం, ఇతివృత్తికారోక్తేః. పార్వణే ఆర్థిక స్యానంగస్య వ్యతిషంగస్య వార్షికాదిష్వనతి దేశాదర్ఘ్యధానినోఽపి పాణిహోమ ఏవేతివృత్తి స్వరసః . ఏవం మాసికాదావపి, షోడశేమాసికే శ్రాద్ధే సపిండీ కరణే తథా, పాణావేవతు హోతవ్య మన్యత్రాగ్నౌ తుహూయతే, ఇతిబోపదేవో దాహృత వచనాచ్చ. భాష్యకారమతేతు సూత్రే స్థాలీపాకే నేతికరణత్వాన్నిత్య వచ్ఛ్రవణాచ్చ పార్వణేసోంగం. తతః కామ్యాదిషు తదభావే కార్యస్య పిండదానస్యా ప్యభావః ఏతదేవాను సృత్య వికృతా వపివార్షికాదౌ వ్యతిషంగ ఉక్తః ప్రయోగ పారిజాతే పరిశిష్టేచ. తేనైతన్మతే అర్ఘ్యధానినోఽగ్నావేవ. వస్తు తస్తు స్థాలీపాకేన, సహశాఖయా ప్రస్తరం ప్రహరతి, ఇతివత్ సహభావమాత్ర శ్రుతేః. పత్నీవతే త్వష్టు రుపలక్షణమివ నాంగత్వం. తత్వేవా నాంగాను రోధేన ప్రధాన భూత పిండదానత్యా గోయుక్తః తేన వ్యతిషంగా భావేఽప్యగ్నౌ హోమోభవతీతి బోపదేవః. అనాహితాగ్నేః గృహ్యాగ్ని మతస్తు సర్వమతే అగ్నావేవ. వార్షికాదౌ వృత్తిమతే వ్యతిషంగోన, అన్యమతేత్వస్తి. అత్రయథాచార మనుష్ఠేయం. ఆశ్వలాయనః – (అ4.ఖ8 సూ 24) ఉద్ధృత్య ఘృతాక్తమన్నం అను జ్ఞాపయత్యగ్నౌ కరిష్యే కరవై కరవాణీతివా. ప్రత్యభ్యనుజ్ఞా క్రియతాం కురుష్వకుర్వితి. అథాగ్నౌ జుహోతి యథోక్తం పురస్తాత్, ఇతి. వ్యతిషంగ పక్షే ఇదమితివృత్తిః. కరవై కరవాణీ త్యత్రఅగ్నా విత్యనుషంగః. పురస్తాత్ పిండపితృయజ్ఞే.

అను ॥ ఇక్కడ ఇది సిద్ధాంతము. స్థాలీపాకంతో సహ పిండము కొరకు తీసి, అను సూత్రమందు ముందు చెప్పని స్థాలీపాకము ఇక్కడ చెప్పబడటం లేదు. అన్ని శ్రాద్ధములందు ప్రస్తావించినందువల్ల ఇది అనువాదము అని వృత్తికారులు చెప్పారు. పార్వణమందు, అర్థాత్ సిద్ధమైనది అంగము కానిది పరస్పర సంబంధము కలది దానిని వార్షికాదులలో అతిదేశం చేయ వీలులేదు కనుక (అతి దేశం ఒకచోట చెప్పినదానిని సామ్యమును బట్టి మరోచోట ఉపయోగపరచుట) అర్ఘ్యధానికి కూడా పాణిహోమమే అని వృత్తికారుని అభిప్రాయము. ఇట్లా మాసికాదులలో కూడా షోడశ మాసికశ్రాద్ధమందు అట్లాగే సపిండీ కరణమందు పాణియందే హోమం చేయాలి. ఇతరత్ర అగ్నియందు హోమం చేయాలి అని బోపదేవుడు ఉదహరించిన వచనం వల్ల తెలుస్తోంది. భాష్యకారమతమందైతే సూత్రమందు స్థాలీపాకంతో అని కరణముగా నిత్యముగా విన్పించినందువల్ల పార్వణమందు అది అంగము. ఆ పిదప కామ్యాదులందు అది లేకపోతే కార్యమైన పిండదానము కూడా లేకుండా పోతుంది. దీనిని అనుసరించే వికృతియందు కూడా వార్షికాదులందు వ్యతిషంగము చెప్పబడింది. ప్రయోగ పారిజాతమందు, పరిశిష్టమందును అందువల్ల వీరి మతమందు అర్ఘ్యధానికి అగ్నియందే. నిజానికైతే స్థాలీపాకంతో, శాఖతో పాటు ప్రస్తరమును (దర్భముష్టి) అగ్నిలో వేస్తున్నాడు అను దానివలె సహభావమాత్రశ్రుతి. పత్నీవతునకు త్వష్టఉపలక్షణంవలె అంగత్వం కాదు. (శాఖసాధనం కాదు, త్వష్టదేవత కాదు) నిజానికట్లా ఐనా అంగానురోధం లేనందువల్ల ప్రధానమైన పిండదానత్యాగము తగును. అందువల్ల వ్యతిషంగం లేకపోయినా అగ్నియందు హోమం ఔతుంది. అని బోపదేవుడు అన్నారు. అనాహితాగ్నికి గృహ్యాగ్నిమతమైతే

అన్ని మతములందు (అందరి ఇష్టంలో) అగ్నియందే. వార్త్తికాదులందు వృత్తి కారమతమందు వ్యతిషంగం లేదు. ఇతర మతములందు ఉంది. ఇక్కడ ఆచారాన్ననుసరించి అనుష్ఠించాలి. ఆశ్వలాయనులిట్లా - స్థాలీపాకంనుండి అన్నం తీసి నేతితో తడిపి, ఆ అన్నాన్ని పితరులకై బ్రాహ్మణులనుండి అనుజ్ఞ తీసుకుంటాడు, అగ్నిలో వేస్తాను అని, బ్రాహ్మణానుమతి ఇట్లా, చేయండి, అని. ఇక అగ్నిలో హోమం చేస్తాడు, ముందు చెప్పిన విధంగా, అని ఇది వ్యతిషంగ పక్షమందు అని వృత్తి కారుడు. కరవై అనుచోట అగ్నియందు అనేది అనుషంగము (చేర్పు) ముందు చెప్పిన పిండపితృయజ్ఞమందు చెప్పినట్లు.

**మూ॥తచ్చైవం- మేక్షణేనావదాయ అవదాన సంపదాజుహుయాత్సోమాయ పితృమతే స్వధా నమోஉగ్నయే కవ్యవాహనాయ స్వధానమ ఇతి స్వాహాకారేణ వాஉగ్నౌ పూర్వం యజ్ఞోపవీతీ మేక్షణ మను ప్రహృత్య ఇతి. అవదాన సంపదా ఉపస్తరణా ద్యపేక్షయేత్యర్థః. వ్యతిషంగపక్షే అతిప్రణీతేஉయం హోమోஉన్యథాముఖ్యే. అతిప్రణీతేஉగ్నావిధ్మముప సమాధాయ ఇతి బహ్వృచ పరిశిష్టాత్. కేచిత్త స్వరక్షోని బర్హణార్థత్వాత్ ముఖ్యేవదంతి. తదేత ద్విరోధాచ్చింత్యం. ప్రయోగ పారిజాతేஉప్యేవం. శౌనకః - స్వాహాకారేణ హోమేతుభవేత్ యజ్ఞోపవీత వాన్, తత్రప్రాగగ్నయే హుత్వా పశ్చాత్సోమాయ హూయతే. అగ్నౌ యజ్ఞోపవీత్యేవ ప్రక్షిపేన్మేక్షణంతతః. ఛందోగ పరిశిష్టే - అగ్నౌకరణ హోమశ్చ కర్తవ్య ఉపవీతినా, అపసవ్యేనవాకార్యో దక్షిణాభిముఖేనచ. కాతీయానాం త్వపసవ్యే నైవ. పిండపితృ యజ్ఞవద్ధుత్వేతి సర్వాతి దేశాత్. సవ్యంతు ఛందోగపరం. గోభిలేనైత దుత్తర మేవాపసవ్యోక్తేః. ఛందోగా జుహుయుః సవ్యేనాపసవ్యేనయాజుషాః, ఇతి వృద్ధ యాజ్ఞవల్క్యోక్తేశ్చ.**

అను ॥ అది ఇట్లా - మేక్షణముతో అవదానం చేసి, (ఖండించి) అవదానసంపదతో హోమం చేయాలి. సోమాయపితృమతే స్వధానమః అగ్నయేకవ్యవాహనాయ స్వధానమః అని స్వాహాకారంతో కాని అగ్నియందు చేయాలి. ముందు యజ్ఞోపవీతియైమేక్షణమును (అగ్నిలో) వేసి, అని. అవదాన సంపద ఉపస్తరణాది అపేక్షతో అని అర్థము. (మోదుగ ఆకుపైనేయి పూసి, పురోడాశముంచి తిరిగినేయి వేసి ఇది అవదాన సంపద) వ్యతిషంగ పక్షమందు అతి ప్రణీతమందు ఈ హోమము, లేనిచో ముఖ్యాగ్ని యందీ హోమము. అతి ప్రణీత అగ్నియందు ఇధ్మమును చక్కగా ఉంచాలి. అని బహ్వృచ పరిశిష్టం నుండి తెలుస్తోంది. (దక్షిణాగ్నికుండము నుండి అగ్నిని వేరు చేయటం అతి ప్రణీతం). కొందరు దానిని, రాక్షసనిబర్హణం కొరకు ఐంది కనుక ముఖ్యమందు చేయాలని అన్నారు. ఇది విరుద్ధమైనందు వల్ల (సప్తమి) ఆలోచించాలి. ప్రయోగపారిజాతమందు కూడా ఇట్లాగే ఉంది. శౌనకుడిట్లా - స్వాహాకారముతో హోమమైతే యజ్ఞోపవీతి కావాలి. అక్కడ మొదట అగ్నికి హోమం చేసి పిదప సోమునకు హోమం చేయాలి. అగ్నియందు, యజ్ఞోపవీతి అయ్యుండే పిదప మేక్షణమును వేయాలి. (మేక్షణము చరును కదలించటానికి, తీయటానికి, హవనం చేయటానికి పాత్ర విశేషము. ఇది గరిటె ఆకారంలో నాల్గు అంగుళముల వెడల్పుతో ముందుకు సాగి ఉందేది). ఛందోగపరిశిష్టమందిట్లా - అగ్నియందు చేయాల్సిన హోమాన్ని

(అగ్నౌకరణహోమం) ఉపవీతిగాచేయాలి, అపసవ్యంగానైనా, దక్షిణాభిముఖుడై చేయాలి. కాతీయులకైతే అపసవ్యంగానే పిండపితృయజ్ఞంవలె హోమం చేసి అని (సంపూర్ణ పదార్థముల విధానం) సర్వాతిదేశం ఉన్నందువల్ల. సవ్యంగా అనేది ఛందోగుల విషయకము. గోభిలుడు దీని వెంటనే (తరువాతనే) అపసవ్యం అని చెప్పాడు. ఛందోగులు సవ్యంగా, అపసవ్యంగా యజుర్వేదీయులు హోమం చేయాలి, అని వృద్ధయాజ్ఞవల్క్య ఉక్తి కూడా.

**మూ॥ అథపాణిహోమః** - ఆశ్వలాయనః (అ4 ఖ8 సూ5) అభ్యనుజ్ఞాయాం పాణిష్వేవవా ఇతి. పిండపితృయజ్ఞ కల్పాభావే నాగ్ని భావేకామ్యాదిష్వితృర్థః. తేనబహ్వృచానా మేకోద్దిష్టే పాణిహోమో భవత్యేవ నిషేధోఽన్యపరః పాణిష్వితి బహువచనా త్సర్వవిప్రపాణిషు హోమ ఇతివృత్తిః ఏవం మాతామహేఽపి. శౌనకోఽపి - సర్వేషా ముపవిష్టానాం విప్రాణా మథపాణిషు, విభజ్య జుహుయాత్సర్వం సోమాయేత్యాది మంత్రతః యత్తు హేమాద్రౌ కాత్యాయనః - పిత్ర్యేయఃపంక్తి మూర్ధన్యః తస్య పాణావనగ్నికః, హుత్వా మంత్రవదన్యేషాం తూష్ణీం పాత్రేషు నిక్షిపేత్, ఇతి తద్బహ్వృచాతి రిక్తానాం. యత్తు తత్రైవ మాత్స్యే - అగ్న్య భావేతు విప్రస్య పాణౌ వాపిజలేఽపివా, అజకర్ణేఽశ్వకర్ణేవా గోష్ఠేవాఽథ శిలాంతికే, ఇతి తత్తీర్థ శ్రాద్ధ విషయం. తద్యదాపాం సమీపే స్యాచ్ఛ్రాద్ధం జ్ఞేయో విధిస్తదా, ఇతి తత్రైవ కాత్యాయనోక్తేః. నిర్జలే త్వజకర్ణాదౌ. యత్తు చంద్రోదయే యమః - దైవ విప్రకరేఽనగ్నిః కృత్వాగ్నౌ కరణం ద్విజః, ఇతి తదభార్య పరం. అపత్నీ కోయ దావిప్రః శ్రాద్ధం కుర్వీత పార్వణం, పిత్ర్య విప్రైరనుజ్ఞాతో విశ్వేదేవేషు హూయతే, ఇతి తత్రైవ కాత్యాయనోక్తేః. హూయతే ఇతి ఛాందసోవ్యత్యయః. హేమాద్రౌ వాయవీయే - విధురోదైవికే కుర్యాత్ శేషం పిత్ర్యే నివేదయేత్.

అను ॥ ఇక పాణిహోమము. ఆశ్వలాయనుడిట్లా - అభ్యనుజ్ఞయందు పాణులయందైౖ(ఐ)నా,అని. పిండపితృయజ్ఞ కల్పం లేనందువల్ల అగ్ని లేకపోతే, కామ్యాదు లందు అని అర్థము. అందువల్ల బహ్వృచులకు ఏకోద్దిష్టమందు పాణిహోమం తప్పక ఉంటుంది. నిషేధము ఇతరుల విషయకము. పాణులందు అని బహువచనం చెప్పినందువల్ల అందరు బ్రాహ్మణుల చేతులందు హోమము అని వృత్తికారులు. ఈ రకంగా మాతామహుల విషయంలో కూడా. శౌనకుడు కూడా - ఇక కూర్చున్న అందరు బ్రాహ్మణుల చేతులందు విభజించి, సోమాయ అను మొదలుగాగల మంత్రంతో (సోమాయపితృమతేస్వాహా) అంతా హోమం చేయాలి, అని. హేమాద్రి యందు కాత్యాయనుడిట్లా - పితృకార్యమందు పంక్తిలో మూర్ధన్యుడైన బ్రాహ్మణుని చేతిలో, అనగ్నికుడు మంత్ర పూర్వకముగా హోమంచేసి, ఇతర బ్రాహ్మణుల పాత్రలలో మౌనంగా ఉంచాలి అని అన్న మాట బహ్వృచులకన్న ఇతరమైన వారి విషయము. అక్కడే మాత్స్యమందిట్లా - అగ్నిలేకపోతే బ్రాహ్మణుని చేతి యందు కాని జలమందు కాని, మేకచెవియందు కాని, గుఱ్ఱం చెవియందు కాని, గోశాలయందు కాని, శిలాసమీపమందు కాని, అని అన్న మాటతీర్థ శ్రాద్ధ విషయకము. ఆ చెప్పిన విషయం నీటి సమీపంలో శ్రాద్ధం ఉంటే అప్పటి విధిగా గ్రహించాలి. అని అక్కడే కాత్యాయనుడు

చెప్పాడు. జలం లేకపోతే మేక చెవి మొదలగు వానిలో. చంద్రోదయమందు యముడు ఇట్లా–బ్రాహ్మణుడు అనగ్నికుడు, అగ్నౌకరణమును దైవ బ్రాహ్మణుని చేతియందు చేసి, అని చెప్పినమాట అది భార్యలేని వాని విషయకము. బ్రాహ్మణుడు, భార్యలేనివాడైతే పార్వణ శ్రాద్ధం చేయాల్సి వస్తే పితృబ్రాహ్మణుల అనుమతి పొంది విశ్వేదేవుల హస్తమందు హోమం చేయాలి, అని అక్కడే కాత్యాయనుడు చెప్పాడు. హూయతే అనేది వైదిక సంబంధమైన తడబాటు. హేమాద్రియందు వాయవీయోక్తి ఇట్లా - విధురుడు దేవబ్రాహ్మణులచేతులందు చేయాలి. మిగిలినదానిని పితృ బ్రాహ్మణులకు నివేదన చేయాలి, అని.

**మూ॥ దైవవిప్రానేకత్వేతత్రైవ - వైశ్వదేవే యద్యేకస్మిన్భవేయుః ద్వ్యాదయోద్విజాః తద్దైవ పాణౌ హోతవ్యం స్యాద్విధిః విహితస్తదా. సోఽప్యాద్యః, ప్రథమంవానియమ్యేత, ఇతిన్యాయాత్, తేనమృత భార్యస్యదైవే హోమః. అనుపనీత బ్రహ్మచర్యాదేస్తుపిత్ర్యే, అగ్న్యభావః స్మృతస్తావద్యావ ద్భార్యాం నవిందతి, ఇతిహేమాద్రౌ జాతూకర్ణ్యోక్తేః సభార్యస్యనష్టాగ్నేరపి పిత్ర్యవిప్రకరే ఇతిపృథ్వీ చంద్రః ఉపవీతేనదైవే హోమః ప్రాచీనావీతేన పిత్ర్యే యద్వాసర్వత్రదైవ పిత్ర్యకరయోర్వికల్ప ఇతి హేమాద్రౌ మదనరత్నే పారిజాతేచ. యదాతుపితృ మాతామహయోః దైవ పిత్ర్యవిప్రభేదస్తదాభేదేన పాణిహోమ ఇత్యపరార్క చంద్రికాదయః యదాతుదైవంతంత్రం తదాతంత్రేణ సకృదేవపాణి హోమ ఇతికేచిత్ హేమాద్రిస్తు - మాతామహస్యభేదే పి కుర్యాత్తంత్రేణ సాగ్నికః ఇతికాతీయస్మృతేర్భేద మాహ ఏవం పిత్ర్యేపి మాధవీయేప్యేవం. ఏవం సాగ్నే రపి విదేశాదౌపాణి హోమోజ్ఞేయః యత్తు కర్మణాగ్నిం వినా శ్రాద్ధమేవనాస్తీత్యుక్తం తత్సపిండీకరణ వార్షికాద్యకరణా పత్తేర్యత్కించిదేవ. యత్తు బృహన్నారదీయే–అనగ్నిఃదూరభార్యశ్చ పార్వణేసముపస్థితే, భ్రాతృభిః కారయేచ్ఛ్రాద్ధం సాగ్నికైః విధివద్ద్విజః. క్షయాహదివసే ప్రాప్తే స్వస్యాగ్ని ర్దూరగోయది, తద్దైవభ్రాతరః స్యుశ్చేత్ లౌకికాగ్నావి తిస్థితిః ఔపాసనాగ్నౌ దూరస్థే సమీపే భ్రాతరిస్థితే, యద్యగ్నౌజుహుయా ద్వాపిపాణౌవాసహిపాతకీ ఔపాసనాగ్నౌ దూరస్థేకేచిదిచ్ఛంతిసత్తమాః, పాణావేవతు హోతవ్యమితినైతత్స మంజసం, ఇతితత్ వృద్ధానాదరాదుపేక్ష్యం. హేమాద్రౌయమః - అగ్నౌకరణవత్తత్రహోమో విప్రకరేభవేత్, పర్యుక్ష్య దర్భానాస్తీర్యయతో హ్యగ్నిసమోద్విజః. మేక్షణేన, కరేణ వాహోమః మేక్షణ ప్రహరణం నేతి వృత్తిః స్మృతిరత్నావల్యాం - నానుజ్ఞాపాణిహోమే స్యాన్నస్తః పర్యూహనోక్షణే, నాగ్నే తమద్యాదితి చనస్యాతా మిధ్మమేక్షణే. కర్కాచార్యోప్యేవమాహ. మాధవీయే చంద్రికాయాంచ అనుజ్ఞాది సర్వం భవతీత్యుక్తం.**

అను ॥ దైవ విప్రులు చాలామంది ఉంటే అక్కడే ఇట్లా - ఒక వైశ్వదేవ శ్రాద్ధమందు ఇద్దరు మొదలుగా బ్రాహ్మణులు ఉంటే అప్పుడే పాణి యందు హోమం చేయాలి, అప్పుడే విధివిహితమైంది అని. అది కూడా తొలుత వానికే. తొలి వానికైనా ఏర్పాటు చేయాలి, అనే న్యాయాన్ననుసరించి, అందువల్ల మృతభార్యునకు దైవ బ్రాహ్మణుని యందు హోమము. అనుపవీతునకు బ్రహ్మచారికి మొదలగు వారికైతే పితృబ్రాహ్మణ హస్తమందు, భార్యను పొందనంతవరకు (పెండ్లికాక) అంతదాక అగ్నిలేకపోవటం ఉంటుందని అన్నారు అని హేమాద్రియందు జాతుకర్ణ్యోక్తి. భార్య ఉండి, అగ్నినశించిన వానికి కూడా పితృబ్రాహ్మణుని చేతియందే అని పృథ్వీ చంద్రుడన్నాడు. దైవమందు ఉపవీతంగా హోమము. పితరులందు

ప్రాచీనావీతిగా హోమము. లేదా అంతటదైవ, పిత్రుకరములందు చేయుట వికల్పము అని హేమాద్రియందు, మదనరత్నమందు, పారిజాతమందును కలదు. పితరులకు, మాతామహులకు దైవ పితర బ్రాహ్మణ భేదము ఉన్నప్పుడు విడివిడిగా (భేదంగా) పాణి హోమము అని అపరార్కచంద్రికాదులు అన్నారు. దైవం, తంత్రమైనట్టైతే అప్పుడు తంత్రంతో ఒక్కసారే పాణిహోమమని కొందరన్నారు. హేమాద్రి ఐతే - మాతామహ భేదమున్నా సాగ్నికుడు తంత్రంతో చేయాలి అని కాతీయస్మృతి ఉన్నందువల్ల భేదమును (ఆవృత్తి) చెప్పాడు. ఈ రకంగా పితృవిషయంలోనూ చేయాలి. మాధవీయమందు కూడా ఇట్లాగే వుంది. ఇట్లా సాగ్నికుడైన వానికి కూడా విదేశాదులందు పాణి హోమమని గ్రహించాలి. కర్కుడు అగ్నిలేకపోతే శ్రాద్ధమే లేదని అన్నమాట అదిసపిండీకరణం, వార్షికం మొదలగునవి చేయకూడని పరిస్థితి వస్తుంది. కనుక ఇది ఏదో అల్పవిషయమే ఉపేక్షించ తగినదే. బృహన్నారదీయమందిట్లా - అగ్నిలేనివాడు, భార్యదూరమందున్నవాడు పార్వణం సమీపించినపుడు ఆ బ్రాహ్మణుడు సాగ్నికులైన సోదరులతో శాస్త్రప్రకారము శ్రాద్ధం చేయించాలి, అని అన్నమాట; క్షయాహదివసం వచ్చినపుడు తన అగ్ని దూరంలో ఉన్న యెడల, అట్లాగే భ్రాతలు దూరంగా ఉన్న పక్షంలో లౌకికాగ్నియందు చేయాలి అని నిర్ణయము ఔపాసనాగ్ని దూరంగా ఉన్నప్పుడు, భ్రాత సమీపంలో ఉండగా ఒకవేళ అగ్ని (లౌకికాగ్ని) యందు లేదా పాణి యందు హోమం చేస్తే ఆతడు పాతకి అని. ఔపాసనాగ్ని దూరంగా ఉండగా కొందరు ఉత్తములు పాణి యందే హోమం చేయాలని ఇష్టపడతారు, ఇది సమంజసం కాదు, అని. ఇది వృద్ధులకు అనాదరమైనందువల్ల ఉపేక్షించతగినది. హేమాద్రి యందు యముడిట్లా - అగ్నౌకరణము వలె అక్కడ హోమము బ్రాహ్మణుని చేతిలో జరగాలి. నీళ్ళు ప్రోక్షించి దర్భలు పరిచి హోమం చేయాలి. బ్రాహ్మణుడు అగ్నిసముడు కనుక ఆతని పాణిలో హోమము. మేక్షణంతో కాని చేతితో కాని హోమము. మేక్షణ ప్రహరణము (పారవేయటం) కూడదు అని వృత్తికారుడు. స్మృతిరత్నావలియందిట్లా - పాణిహోమమందు అనుజ్ఞ లేదు. పర్యూహన, ఉక్షణములు లేవు. అగ్నిదానిని భక్షించాలని లేదు. ఇధ్మమేక్షణ ములు లేవు, అని. కర్కాచార్యుడు గూడా ఇట్లాగే చెప్పాడు. మాధవీయమందు, చంద్రికయందును, అనుజ్ఞ మొదలగునదంతా ఉంటుంది అని చెప్పారు.

**మూ॥ పాణిహోమే ప్రశ్నాద్యాహ పరార్కేశౌనకః - అనగ్నిక శ్చేదా జ్యంగృహీత్వా భవత్స్వేవాగ్నౌ కరణమితి పూర్వవత్తథాస్తు ఇతి. ఆశ్వలాయనః (అ4 ఖ8 సూ 7-9) యది పాణిష్వా చాంతేషుఅన్యదన్నమనుదిశతిఅన్నమన్నే. అస్పృష్టందత్తమృద్ధ్నుకం (స్పృష్టందత్త మద్రువమితి) ఇతిపాణౌహుతం (అన్నం) పాత్రేనిధాయవి ప్రైరాచమ్యభోజనార్థమన్నేపరిశిష్టే హుతశేషం పాత్రేషు దద్యాదిత్యర్థః. స్పృష్టం ప్రభూతం. నైమిత్తికం చేదమాచమనం నహుతభక్షణ నిమిత్తం. అన్నంపాణితలే దత్తం పూర్వమశ్నంత్యబుద్ధయః పితరస్తేన, తృప్యంతి శేషాన్నం న లభంతితే. యచ్చపాణితలేదత్తం యచ్చాన్యదుపకల్పితం, ఏకీభావేన భోక్తవ్యం పృథగ్భావోనవిద్యతే, ఇతిబహ్వృచపరిశిష్టాత్. హేమాద్రా వప్యాచమనే హేత్వర్థవాద ఉక్తః పాణ్యాస్యోహిద్విజః స్మృతః, ఇతిభాష్యేత్వాచాంతేషు భక్షితేషు.**

చముభక్షణే భక్షణోత్తరంచనాచమనం అగ్నిసామ్యాత్. పూర్వనిషేధస్తు సపిండీకరణేజ్ఞేయః దదాతిచోదితత్వాత్ నత్వత్రజుహోతి చోదితత్వాదిత్యుక్తం. నత్వేతత్‌బహుసమ్మతం. యత్తుబౌధాయనేన - తస్మింస్తుప్రాశితే దద్యాత్ యదన్నం ప్రకృతంభవేత్, ఇతిభక్షణముక్తం తత్తచ్ఛాఖీయానామేవేతి హేమాద్రిః. తత్రైవయమః - పిత్ర్య పాణిహుతాచ్ఛేషం పితృపాత్రేషు నిక్షిపేత్, అగ్నౌకరణశేషంతు నదద్యాద్వైశ్వదేవికే. ఏతదగ్నిహోమేపిసమం. కర్కస్తు సూత్రే హుతశేషం దత్వాఇత్యవిశేషాత్ సర్వవిప్రేషుదద్యాదిత్యాహ. తత్రైవ వృద్ధవసిష్ఠః - పిత్ర్యవిప్రకరే హుత్వాశేషంపాత్రేషునిక్షిపేత్, పిండేభ్యః శేషయేత్కించిన్నదద్యాద్వైశ్వదేవికే. అథాపస్తంబధర్మసూత్రే - (సూ 18, 19) ఉద్ధ్రియతామగ్నౌచక్రియతాం, ఇత్యామంత్రయతే. కామముద్ధ్రియతాంకామమగ్నౌచక్రియతాం, ఇత్యతిసృష్ట ఉద్ధరేజ్జు హుయాచ్చ.

అను॥ పాణి హోమమందు, అపరార్కమందు శౌనకుడు ప్రశ్నాదులు చెప్పాడిట్లా - అనగ్నికుడైతే నేయిని తీసుకొని, మీయందే అగ్నౌకరణము అని అంటే బ్రాహ్మణులు - ముందులాగే తథాస్తు, అని చెప్పాలి, అని. ఆశ్వలాయనుడిట్లా - ఒకవేళ పాణిహోమం ఐతే ఆచమనం అయ్యాక ఇతర అన్నమును ఇస్తాడు. అన్నముయందు అన్నమును. అల్పంగా ఇవ్వబడింది. సమృద్ధిని చేసేది, అని. పాణి యందు హోమం చేయబడిన అన్నమును పాత్రయందుంచి, విప్రులు ఆచమనం చేశాక భోజనం కొరకు అన్నమును పరివేషించాక, హుతశేషమును పాత్రలందు ఇవ్వాలి అని అర్థము. సృష్టమనగా అధికము ఈ ఆచమనము నైమిత్తికము హుతభక్షణ నిమిత్తకమైనది కాదు. పాణి తలమందుంచిన అన్నాన్ని బుద్ధిహీనులు తొలుత తింటారు. దానితో పితరులు తృప్తిపడరు. వారికి మిగిలిన అన్నము లభించదు. పాణి తలమందు ఇవ్వబడినది, ఇతర విధముగా ఏర్పరచబడినది ఈ రెంటిని ఒకేసారి (కలిపి) భుజించాలి. పృథగ్భావము లేదు వానిలో, అని బహ్వృచ పరిశిష్టము నుండి తెలుస్తోంది. హేమాద్రియందు కూడా ఆచమన విషయంలో ప్రశంస మాత్రం చెప్పబడింది. బ్రాహ్మణుడు పాణియే ముఖంగా కలవాడు అని చెప్పబడ్డాడు అని. భాష్యమందైతే ఆచాంతము అనగా భుజించాక అని చెప్పారు. చముధాతువునకు భక్షణ అర్థము భుజించాక ఆచమనం లేదు, అగ్ని సామ్యమైనందు వల్ల (సమము). ముందు చెప్పిన నిషేధమైతే సపిండీకరణమందని తెలుసుకోవాలి. దదాతి అని చెప్పబడ్డందువల్ల, ఇక్కడ జుహోతి అని చెప్పబడనందువల్ల అని చెప్పారు. ఇది చాలా మందికి సమ్మతమైంది కాదు. బౌధాయనుడైతే - (అగ్నౌకరణ శేషాన్నమును) దాన్ని తిన్నాక ప్రకృత (వాస్తవిక) అన్నమును ఇవ్వాలి, అని భక్షణమును చెప్పాడు. అది ఆశాఖవారికే అని హేమాద్రి. అక్కడే యముడిట్లా-పితరుల పాణియందు హోమం చేశాక, దానినుండి శేషమును పితృపాత్ర లందుంచాలి. అగ్నౌకరణశేషమునైతే వైశ్వదేవికపాత్ర మందుంచరాదు. (దేవతలకు ఇవ్వరాదు అని) ఇది అగ్నిహోమమందు కూడా సమానము. కర్కుడైతే సూత్రమందు హుత శేషమును ఇచ్చి అని విశేషం లేకుండా అందరు బ్రాహ్మణులకు ఇవ్వాలి అని చెప్పాడు. అక్కడే వృద్ధవసిష్ఠుడిట్లా - పితరుల

(బ్రాహ్మణుల) కరమందు హోమం చేసి మిగిలినదానిని పాత్రలందుంచాలి. పిండములకై కొంచం మిగల్చాలి. విశ్వేదేవతా బ్రాహ్మణులకు ఇవ్వరాదు అని. ఇక ఆపస్తంబ ధర్మసూత్ర మందు (సూత్ర 18,19) ఉద్ధ్రియతాం, అగ్నౌ చక్రియతాం, అని ఆజ్ఞనుకోరుతాడు. వారు కామం ఉద్ధ్రియతాం, కామమగ్నౌ చక్రియతాం, అని ఆజ్ఞాపించగా అధిక అన్నాన్ని ఉద్ధరించాలి, హోమం చేయాలి కూడా (బ్రాహ్మణులకైన అన్నం లోంచి చాలా అన్నాన్ని ఇతర పాత్రలో విడిగా ఉంచాలి.)

**మూ॥ నష్టాగ్ని విధురాదేర్విశేషోబృహన్నారదీమే – నష్టాగ్నిః దూరభార్యశ్చ పార్వణే సముపస్థితే, సంధాయాగ్నింతతో హోమంకృత్వాతం విసృజేత్పునః. అయాశ్చేతితత్కాలేగ్నిం సంధాయహుత్వాత్యజేదిత్యర్థః ఏతదాపస్తంబానామేవ. పాణిహోమస్తు ఛందోగాదీనాం, విశ్వప్రకాశేపి – సాగ్నిరౌపాసనేఽనగ్నిరగ్నౌకుర్వీతలౌకికే, పాణౌహోమం ప్రశంసతినత్వాపస్తంబశాఖినాం. స్నాతకా విధురాద్యాస్తు యది వా బ్రహ్మచారిణః అగ్నౌకరణహోమంతు కుర్యుస్తే లౌకికేఽనలే. అయాశ్చాగ్నే మనోజ్యోతిరుద్బుధ్యవ్యాహృతీర్హునేత్. తతోఽనుజ్ఞాతో అగ్నీంధనాద్యాజ్యభాగాంతేయన్మేమాతే త్యాద్యైః జుహుయాత్. తత్ర సప్తాన్నాహుతయః, షడాజ్యస్యేతిత్రయోదశ. వ్యత్యయోవా. యథా – యన్మే మాతాప్రలులోభతన్మేరేతః పితావృంక్తాం యాస్తి ష్ఠంతి, ఇతి ద్వాభ్యామముష్మై స్వాహేతిపితుర్నా మ్నాద్వౌహోమౌయన్మేపితామహీప్రలులో భతన్మేరేతః పితామహోవృంక్తామంతర్దధే పర్వతైభిరితి తన్నామ్నాపితామహాయ, ద్వౌ యన్మేప్రపితామహీప్రలులోభతన్మేరేతః ప్రపితామహో వృంక్తామం తర్దధేఋతుభిరితితన్నామ్నా ప్రపితామహాయ ద్వౌ. మాతామహేషుతూహః యన్మే మాతామహీ ప్రలులోభ తన్మేరేతోమాతామహోవృంక్తాం, అన్యం మాతామహోద్దధే, ఇత్యాదౌయన్మే మాతుః పితా మహీప్రలులోభ తన్మేరేతో మాతుఃపితామహోవృంక్తాం. అన్యం మాతుఃపితామహోద్దధే. యన్మే మాతుః ప్రపితామహీప్రలులోభతన్మేరేతో మాతుః ప్రపితా మహోవృంక్తాం. అన్యం మాతుః ప్రపితామహోద్దధే. సర్వత్ర అముష్యాఇత్యత్ర జేంతం తత్తన్నామయోజ్యం.**

అను॥ అగ్నినష్టమైన వారికి, విధురునకు మొదలగు వారికి విశేషము బృహన్నారదీయమందిట్లా – అగ్నినష్టమైనవాడు, భార్యదూరమందున్నవాడు, పార్వణం వచ్చాక, అగ్నిసంధానం చేసి పిదప హోమం చేసి తిరిగి దానిని విడువాలి అని అయాశ్చ అనే మంత్రంతో అప్పుడే అగ్ని సంధానం చేసి హోమం చేసి వదలాలి అని అర్థము. ఇది ఆ పస్తంబులకే పాణి హోమమైతే ఛందోగాదులకు. విశ్వప్రకాశమందు కూడా – అగ్ని కలవాడు ఔపాసనాగ్ని యందు అనగ్నికుడు లౌకికాగ్ని యందు హోమం చేయాలి. పాణి హోమమును ప్రశంసిస్తున్నారు కాని ఆపస్తంబ శాఖులకు మాత్రం కాదు, అని. స్నాతకులు, విధురులు, బ్రహ్మచారులు వారు అగ్నౌకరణ హోమమును లౌకికాగ్నియందు చేయాలి. అయాశ్చాగ్నే, మనోజ్యోతిః, ఉద్బుధ్య ఈమంత్రములతో మరివ్యాహృతులతో (ఓంభూర్భువః స్వః) హోమం చేయాలి. పిదప ఆజ్ఞను పొంది, అగ్నిని జ్వలింపచేయుటం వగైరా చేసి, ఆజ్యభాగాంతమందు యన్మేమాతా మొదలగు మంత్రములతో హోమం చేయాలి. అక్కడ ఏడు అన్న పుఆహుతులు, ఆరు నేతితో ఆహుతులు, అని మొత్తం పదమూడు. విపరీతంగా

నైనా చేయొచ్చు. (ఏడు నేతివి, ఆరు అన్నమువి) ఎట్లాంటే - యన్మేమాతా, యాస్తిష్ఠంతి, అను రెండు మంత్రములతో ఈ పేరుగల వానికి స్వాహా అని తండ్రిపేరుతో రెండు హోమములు, యన్మేపితామహీ, అంతర్ధధే పర్వతేభిః అను మంత్రములతో ఆతని పేరుతో పితామహునకు రెండు ఆహుతులు, యన్మేప్రపితామహీ, అందర్ధధేఋతుభిః అను మంత్రములతో ఆతని పేరుతో ప్రపితా మహునకు రెండు ఆహుతులు, మాతామహుల విషయంలో ఊహించుకోండి. యన్మేమాతా మహీయాస్తిష్ఠంతి ఈ మంత్రాలతో మాతామహునకు హవనము రెండుసార్లు. యన్మే మాతుః పితామహీ, అంతర్ధధే పర్వతేభిః ఈ మంత్రాలతో మాతుః పితామహునకు రెండుసార్లు హవనము, యన్మేమాతుః ప్రపితామహీ, అంతర్ధధేఋతుభిః ఈ మంత్రాలతో మాతుః ప్రపితా మహునకు రెండుసార్లు హవనము. అంతట ఈతనికి (అముష్మై) అను చోట వారి వారి పేర్లను చెప్పాలి.

**మూ॥ తద్గృహ్యసంగ్రహే - యోజ్యఃపిత్రాదిశబ్దానాంస్థానే మాతామహాదికః, అన్న హోమేతథాస్పర్శే జలపిండాదిదానకే, యన్మే మాతామహీత్యాది తత్రో దాహరణంభవేత్ తతో యే చేత్యేకాన్నాహుతిః తతఃస్వాహాపిత్రే ఇత్యాద్యైః ఆజ్యంహుత్వాస్విష్టకృతం హుత్వాసర్వభక్ష్యం కించిదా దాయ ఉదగుష్ణం భస్మాపోహ్యతత్రతూష్ణీం స్వాహాకారేణజుహోతి పరిషేచనాంతం స్థాలీపాకవత్. అయమగ్నౌకరణహోమోమాసికశ్రాద్ధేఏవ. తచ్చస్మార్తాగ్న్య భావే న కార్యం, ఇతికేచిత్ కార్యమేవేతి బహవః అత ఏవ సర్వాధానినో హోమవర్జ్యం మాసిక శ్రాద్ధ ముక్తం సుదర్శన భాష్యే. మహాలయేతద్వ దిత్యేకే. ప్రకరణాంతరత్వాత్. కర్మాంతరత్వేన స్మార్తపార్వణవత్ కార్యమితితు అస్మద్గురవః. ఆబ్ది కాదిషుతు స్మార్తపార్వణవిధిరేవ. ఏవం మాతృవార్షికాదిషు. మాసిశ్రాద్ధ వికృతావష్టకాయాం మాతృశ్రాద్ధేవైకృత హోమేన ప్రాకృత హోమ బాధః. అన్వష్టకాసు మాతృశ్రాద్ధంన, ఇతిభాష్యే. తత్రాపి శ్రాద్ధాంతరవత్ క్రియమాణేతు, యన్మే మాతేత్యాదౌ గుణత్వేఽపి మాతృ ప్రాధాన్యం వివక్షితం. మాసి శ్రాద్ధేన కల్పోవ్యాఖ్యాతః ఇతి సూత్రాత్ ఆగ్నేయ్యేవమనోతాకార్యా, వచనాదగ్నిశబ్ద స్యైవ వైకృత దేవతాభిధాయిత్వం ఇతితేనా ముష్మైఇత్యత్ర, అముక శర్మాభ్యాం పితృభ్యాం, ఇత్యాద్యూహః కార్యః. తచ్చమాసిశ్రాద్ధం జీవత్పిత్రాదీనాం వ్యుత్క్రమ మృతపిత్రాదీనాంచ కార్యం, ఇత్యుక్తం సుదర్శన భాష్యే. తత్ప్రకారస్తు వక్ష్యతే. మాతాపిత్రోః ద్విత్వాదౌతునోహః తస్మాద్ధృచం నోహేత్, ఇతినిషేధాత్. ప్రకృతా వూహాభావాచ్చ పత్నీం సన్నహ్యేతివత్. ఉపదేశిమతేతూహః యథా-యన్మే మాతరౌప్రలులోభతుః చరత్యావనను వ్రతే, ఇత్యాద్యస్మత్పి తృకృత మాసిక శ్రాద్ధనిర్ణయే జ్ఞేయ మితిదిక్. అన్యత్ప్రాగ్వత్.**

అను॥ అదిగృహ్యసంగ్రహమందిట్లా - పిత్రాదిశబ్దముల స్థానంలో మాతా మహాదిశబ్దములను చేర్చాలి, అన్నహోమముందు, అన్న స్పర్శయందు, జల దాన, పిండ దానాదులందు చేర్చాలి. యన్మే మాతా మహీ అని మొదలుగా అక్కడ ఉదాహరణంగా గ్రహించాలి. ఆ పిదప యేచేహపితరో అను మంత్రంతో ఒక అన్నపు ఆహుతి ఇవ్వాలి. ఆ పిదప స్వాహా పిత్రే అను మొదలగు వానితో ఆజ్యహోమం చేసి స్విష్టకృత్తు హోమం చేసి సర్వవిధ అన్నమును (తినతగిన పదార్థమును) కొంచం తీసుకుని అగ్నికి ఉత్తర దిక్కులోని వేడి భస్మమును తొలగించి అక్కడ మౌనంగా స్వాహాకారంతో హోమం చేయాలి, పరిసేచ

నాంతము వరకు స్థాలీపాకము వలె చేయాలి. ఈ అగ్నౌకరణహోమము మాసిక శ్రాద్ధమందే దానిని స్మార్తాగ్ని లేని పక్షంలో చేయరాదు అని కొందరు. చేయాలని చాలామంది అన్నారు. అందువల్లనే సర్వాధానులకు హోమము వదలి మాసిక శ్రాద్ధము అని సుదర్శన భాష్యమందు చెప్పబడింది. అట్లాగే మహాలయమందును అని కొందరన్నారు. ఇది ప్రకరణాంతరము ఐనందువల్ల. కర్మాంతరమువలె (మరో) స్మార్తపార్వణమువలె ఆచరించాలని మా గురువులు చెప్పారు. ఆబ్దికాదులందైతే స్మార్తపార్వణ విధియే. ఈ రకంగానే మాతృవార్షికాదులందు చేయాలి. మాసిక శ్రాద్ధ వికృతమైన అష్టకయందు మాతృశ్రాద్ధమందు వైకృతహోమంతో ప్రాకృత హోమమునకు బాధ అన్వష్టకములందు మాతృశ్రాద్ధము లేదు, అని భాష్యమందు కలదు. అక్కడ కూడా మరో శ్రాద్ధం వలె చేయబడుతుండగా నైతే యన్మే మాతా ఇత్యాదులందు గుణమున్నా మాతృ ప్రాధాన్యము వివక్షితమైనది. మాసిక శ్రాద్ధంతో కల్పమని వ్యాఖ్యానించ బడింది, అనే సూత్రంవల్ల. అగ్నేయ్యేవమనోతాకార్యాఅనే మంత్రంతో అగ్ని శబ్దంతోనే వైకృత దేవతను చెప్తున్నారు, అని. అందువల్ల అముష్మై అనే చోట ఈ పేర్లు గల పితరులకు అని మొదలుగా ఊహ చేయాలి. ఆ మాసిక శ్రాద్ధం తండ్రి బ్రతికున్నవారికి, వ్యుత్క్రమంగా మృత పిత్రాదులకు చేయాలి అని సుదర్శన భాష్యమందు చెప్పారు. ఆ ప్రకారాన్ని చెప్తాను. మాతా పితరులు ఇద్దరిద్దరుంటే ఊహ అవసరం లేదు. అందువల్ల ఋక్కును ఊహించరాదు, అని నిషేధించినందువల్ల. ప్రకృతిలో ఊహ లేనందువల్ల, పత్నీంసన్నహ్య అనేదానివలె. (పత్నిని) ఉపదేశిమతమందైతే ఊహ ఎట్లాంటే – యన్మే మాతరౌ, అని మొదలుగా మా తండ్రి గారు రచించిన మాసిక శ్రాద్ధ నిర్ణయమందున్న దానిని తెలుసుకోవాలి, అని ఇక చాలు మిగిలినదంతా పూర్వం లాగానే.

**మూ॥ అథపరివేషణం** – తచ్చోపవీత్యే వాజ్యేనదేవపూర్వం, ఆయాసుపక్వం, ఇతిపాత్రాణ్యుపస్తీర్యకుర్యాత్ ఇతి హేమాద్రిః **భారతేదానధర్మేఽపి** – ఆజ్యాహుతింవినానైవ యత్కించిత్పరివిష్యతే, దురాచారైశ్చయద్భుక్తంతం భాగం రక్షసాంవిదుః తత్రైవ శౌనకః – విధినాదేవ పూర్వంతు పరివేషణమాచరేత్. **తత్రైవ ధర్మః** – ఫలస్యానంతతాప్రోక్తాస్వయం చపరివేషణే. **తత్రైవ వాయుభవిష్యయోః** – భార్యయా శ్రాద్ధకాలేతు ప్రశస్తం పరివేషణం బ్రహ్మాండే – నా పవిత్రేణనైకేనహస్తేన నవినాకుశం, నాయసేనాయసేనైవ శ్రాద్ధేతుపరివేషయేత్. **వసిష్ఠః** – ఆయసే నతుపాత్రేణయదన్నం సంప్రదీయతే, భోక్తావిష్టాసమంభుంక్తే దాతాచనరకం వ్రజేత్ పైఠీనసిః – సీసకాయసరీతి పాత్రాణ్యయజ్ఞియాని **తత్రైవ హారీతః** – సౌవర్ణ రాజతాభ్యాంచఖడ్గేణౌ దుంబరేణవా, దత్తమక్షయ్యతాంయాతిఫల్గుపాత్రేణవాపునః **కార్ష్ణాజినిః** – దర్వ్యాదేయం ఘృతం చాన్నం సమస్త వ్యంజనానిచ, ఉదకం చైవ పక్వాన్నం నోదర్వ్యాతుకదాచన **యమః** – పంక్త్యాం విషమదాతుశ్చ నిష్కృతి ర్నచవిద్యతే. **పృథ్వీచంద్రోదయేపరాశరః** – సర్వదాచతిలాగ్రాహ్యాః పితృకృత్యే విశేషతః భోజ్యపాత్రేతిలాన్ దృష్ట్వా నిరాశాః పితరోగతాః

అను ॥ ఇక పరివేషణము దానిని ఉపవీతిగానే, నేతితో, దేవ పూర్వకముగా, ఆయాసుపక్వం, అనే మంత్రంతో పాత్ర (లయందు) వడ్డించి పరివేషణ చేయాలి అని హేమాద్రి. భారతమందు దానధర్మమందు కూడా - ఆజ్యాహుతి లేకుండా ఏ కొంచము వడ్డించరాదు. దురాచారులు ఒకవేళ భుజించిన యెడల ఆ భాగము రాక్షసులకు చెందుతుంది, అని. అక్కడే శౌనకుడిట్లా- శాస్త్ర ప్రకారము దేవపూర్వకముగా పరివేషణ చేయాలి, అని. అక్కడే ధర్ముడిట్లా - స్వయంగా వడ్డిస్తే అనంతఫలమని చెప్పారు. అక్కడే వాయు భవిష్యములందిట్లా - శ్రాద్ధకాలమందు భార్యతో పరివేషణ చేయిస్తే ప్రశస్తమన్నారు, అని. బ్రహ్మాండమందిట్లా - అపవిత్రంగా, ఒక చేతితో, కుశలు లేకుండా వడ్డించరాదు. శ్రాద్ధమందులోహపాత్రయందు, లోహ పాత్రతో వడ్డించరాదు అని. వసిష్ఠుడిట్లా - లోహపాత్రతో వడ్డించబడిన అన్నము తినువాడు మలమును తిన్నట్టే ఇచ్చువాడు నరకానికి వెళ్తాడు, అని. పైఠీనసి ఇట్లా - గాజు, లోహము, ఇత్తడి పాత్రలు యజ్ఞమందు యోగ్యమైనవి కావు (శ్రాద్ధంలో వాడరాదు) అని. అక్కడే హారీతుడిట్లా - సువర్ణపుది, వెండిది, ఖడ్గమృగపు కొమ్ముతో చేసినది, రాగిది, కుక్కమేడిది వీనితో చేసిన పాత్రతో ఇచ్చినది అక్షయ్యమౌతుంది. అని. కార్ష్ణాజిని ఇట్లా - ఘృతము, అన్నము, సమస్తవ్యంజనములు వీనిని దర్వితో ఇవ్వాలి (గంటె). నీరు పక్వాన్నము వీనిని గరిటెతో ఎప్పుడూ ఇవ్వరాదు, అని. యముడిట్లా- పంక్తిలో విషమంగా వడ్డించినవానికి నిష్కృతి లేదు, అని. పృథ్వీచంద్రోదయమందు పరాశరుడిట్లా - ఎప్పుడు తిలలను గ్రహించాలి. విశేషించి పితృకృత్యమందు. కాని భోజన పాత్ర యందు తిలలను చూచి పితరులు నిరాశులై పోతారు, అని.

**మూ॥ చంద్రికాయాం** వృద్ధశాతాతపః - **హస్త దత్తాస్తు యేస్నేహాలవణవ్యం జనాదయః పితౄణాంనోపతిష్ఠంతి భోక్తా భుంజీత కిల్బిషం.** ఘృతపాత్రే విశేషో గ్రంథాంతరే - ఓదనే పరమాన్నేచపాత్రమాసాద్యముగ్ధధీః, ఘృతేన పూరయేత్పాత్రం తద్ఘృతం రుధిరంభవేత్. **ఘృతాదిపాత్రంభూమౌ స్థాపయేన్న భోజనపాత్రే** ఇతి మదనరత్నే. సంగ్రహే - హస్త దత్తం **తునాశ్నీయాత్** లవణం వ్యంజనాదికం, అపక్వం తైలపక్వంచ హస్తే నైవ ప్రదీయతే **పాత్రాలంభనముక్తం** చతుర్వింశతిమతే - **ఉత్తానందక్షిణం సవ్యం నీచం పాత్రా ణ్యుపస్పృశేత్. యాజ్ఞవల్క్యః (ఆచారాధ్యాయశ్లో 238). - దత్వాన్నంపృథ్వీపాత్రమితి పాత్రాభిమంత్రణం, కృత్వేదం** విష్ణురిత్యన్నే ద్విజాంగుష్ఠం నివేశయేత్. బౌధాయనః - **(ద్వితీయప్రశ్నేదశమాధ్యాయే) బ్రాహ్మణానాం=విప్రాంగుష్ఠేనానఖేనానుదిశతి, పృథివీతేపాత్రం ద్యౌరపిదానం బ్రహ్మణస్త్వా ముఖేఽ మృతేఽమృతం జుహోమి. బ్రాహ్మణానాంత్వాప్రాణాపానయోర్జుహోమ్యక్షిత మసిమే పితౄణాం పితామహానాం ప్రపితామహానాం క్షేష్మా అముత్రాముష్మిన్‌లోకే ఇతి. ఆద్యజుహోమ్యగ్రే స్వాహాశబ్దః కాఠీయసూత్రే ఉక్తః పైత్రేస్వధాశబ్దః.**

అను ॥ చంద్రిక యందు వృద్ధ శాతాతపుడిట్లా- చేతితో ఇచ్చిన నెయ్యి, ఉప్పు, వ్యంజనాదులు పితరులకు చెందవు. భుజించు వాడు పాపాన్ని భుజించినట్టే, అని. ఘృతపాత్ర

విషయంలో విశేషము మరో గ్రంథమందిట్లా- మూఢుడు అన్నమును పరమాన్నమును పాత్రయందుంచి, పాత్రను ఘృతముతో నింపిన యెడల, ఆ ఘృతము రుధిరమౌతుంది, అని ఘృతాది పాత్రమును భూమియందుంచాలి, భోజన పాత్రయందుంచరాదు, అని మదనరత్నమందు కలదు. సంగ్రహమందిట్లా- చేతితో ఇచ్చిన ఉప్పును వ్యంజనాదులను తినరాదు, అపక్వమైనా (పండ్లు) తైలపక్వమైనా చేతితో ఇవ్వరాదు, అని. చతుర్వింశతి మతమందు పాత్రాలంభనము ఇట్లా చెప్పబడింది- కుడిపాత్రను ఎత్తి స్పృశించాలి, ఎడమ పాత్రను క్రింద ఉంచి స్పృశించాలి, అని. యాజ్ఞవల్క్యుడిట్లా- (ఆచారాధ్యాయమందు శ్లో 238) అన్నం వడ్డించాక పృథ్వీపాత్రం అను మంత్రంతో పాత్రాభిమంత్రణము చేసి, ఇదం విష్ణుః అనే మంత్రంతో అన్నమందు బ్రాహ్మణుని అంగుష్ఠమును ఉంచాలి, అని. బౌధాయనుడిట్లా- (ద్వితీయ ప్రశ్నయందు దశమాధ్యాయమందు) బ్రాహ్మణుల యొక్క = బ్రాహ్మణుని అంగుష్ఠంతో, గోళ్ళు లేని దానితో, స్పృశింపచేయాలి. పృథివీతే పాత్రం అను మంత్రంతో అని. అమృతం జుహోమి అనే దాని తరువాత కాతీయ సూత్రమందు స్వాహా శబ్దము చెప్పబడింది. పితృల(కార్య)మందు స్వధాశబ్దము అని.

మూ॥ **అంగుష్ఠే విశేషమాహ** హేమాద్రౌధౌమ్యః- పరివృత్యనచాంగుష్ఠంద్విజః **స్థానేనివేశయేత్. తథా-ఉత్తానేనతు** హస్తేన ద్విజాంగుష్ఠ నివేశనం, యఃకరోతి ద్విజోమోహాత్తద్వై రక్షాంసిభుంజతే. **తత్రైవయమః**-విష్ణోర్హవ్యం చ కవ్యం చ బ్రూయాద్రక్ష స్వచక్రమాత్, దైవేపిత్ర్యే చేత్యర్థః. **తత్రైవాత్రిః**-సంబంధనామగోత్రాణి ఇదమన్నంతతః స్వధాపితృక్రమాదుదీర్యేతి స్వసత్తాం వినివర్తయేత్. హస్తేనా భుక్త మన్నాద్యమిదమన్న ముదీరయేత్. **అత్ర**-అన్నదానేచతుర్థీస్యాత్, ఇత్యాది విశేషాః పూర్వముక్తాః **అత్రపూర్వోక్త** మంత్రాంతే పురూరవార్ద్రవసంజ్ఞకావిశ్వేదేవాదేవతా ఇదమన్నం సపరికరం హవ్యం. అయం బ్రాహ్మణస్త్వాహవ నీయార్థేదత్తం దాస్యమానం చాతృప్తేః గయేయం భూఃగదాధరోభోక్తా ఇదమన్నం బ్రహ్మా సౌవర్ణ పాత్రస్థమన్నమక్షయ్య వటచ్ఛాయాస్థ మముకేభ్యో విశ్వేభ్యో దేవేభ్య ఇదమన్న మమృత రూపం పరివేక్ష్యమాణం చాతృప్తేః స్వాహానమోన, మమ, ఇతి బహ్వృచ పరిశిష్ట హేమాద్ర్యాద్యనుమతః ప్రయోగః ఏవంపిత్ర్యే అముకగోత్రవసురూపాది తత్తన్నామక్షేయం. **తతోయేదేవాసః**, ఇతిదైవే, **యేచేహపితరః, ఇతి పిత్ర్యే కేచిజ్జపంతి.**

అను॥ అంగుష్ఠమందు విశేషమును హేమాద్రియందు ధౌమ్యుడిట్లా-అంగుష్ఠమును పరివర్తనము చేయకుండా, చక్కగా, బ్రాహ్మణుడు, అన్నములో స్థానమందు ఉంచాలి అని. అట్లాగే-వెలికిలిగా ఉన్న హస్తంతో బ్రాహ్మణుని అంగుష్ఠ నివేశనము మోహంతో చేసిన బ్రాహ్మణుని శ్రాద్ధాన్ని రాక్షసులు భుజిస్తారు, అని. అక్కడే యముడిట్లా – ఓ విష్ణు! హవ్యమును, కవ్యమును రక్షించు, అని క్రమంగాదైవ, పితృకార్య మందును చెప్పాలి, అని. క్రమము=దైవ, పితృ కార్యమని అర్థము. అక్కడే అత్రి ఇట్లా – సంబంధనామ గోత్రములు. ఇదం అన్నం, ఆ పిదప స్వధా అని పితృక్రమంగా చెప్పి అని తన సత్తను నివర్తింపచేయాలి. (తాను

తొలగాలి). హస్తంతో భుజించని అన్నం మొదలగు వానిలో ఇదం అన్నం అని చెప్పాలి. ఇక్కడ అన్నదానమందు చతుర్థీవి భక్తి ఉండాలి, అని మొదలగునవి విశేషములను ముందే చెప్పాము. ఇక్కడ ముందు చెప్పిన మంత్రం చివర, పురూరవార్ద్రక సంజ్ఞకా అని ఆరంభించి న, మమ అనేదాక చెప్పాలి అని బహ్వృచపరిశిష్టం, హేమాద్ర్యాదులు అనుమతించిన ప్రయోగము. ఈ విధంగా పితరులకు కూడా. ఈ గోత్రం వసురూపాది ఆయానామములు అని తెలుసుకోవాలి. ఆ పిదప, యేదేవాసః, అని దైవతం దగ్గర, యే చేహ పితరః, అని పితరుల దగ్గర పఠించటం కొందరు చేస్తారు(జపం).

**మూ॥ తతోఽచ్ఛిద్రం** వాచయేత్ తత్రైవప్రచేతాః-ఆపోశనకరే విప్రే సంకల్ప్యాచ్ఛిద్ర భాషణాత్, నిరాశాఃపితరో యాంతిదేవైఃసహ నసంశయః పారస్కరః-సంకల్ప్య పితృదేవేభ్యః సావిత్రీమధుమజ్జపః, శ్రాద్ధం నివేద్యాపోశనం జుషప్రైషోఽథ భోజనం. నివేద్యేతి బ్రహ్మార్పణం కృత్వేత్యర్థః అత ఏవ బృహన్నారదీయే అన్న త్యాగ ముక్త్వోక్తం - దత్తంహవిశ్చతత్కర్మవిష్ణవేవై సమర్పయేత్, ఇతి. యత్తు కృత్యరత్నేకార్ష్ణాజినిః అపసవ్యేన కర్తవ్యం పితృకృత్యమశేషతః, అన్నదానాదృతే సర్వమేవంమాతామహేష్వపి, ఇతి. తదప్యేతత్పరం. తత్రబహ్మార్పణం బ్రహ్మాహవిః హరిర్దాతా హరిర్భోక్తా, చతుర్భిశ్చచతుర్భిశ్చ, ఇతికేచిత్పఠంతి. ధర్మప్రదీపే - తతోఽన్నం పితృదేవేభ్యః సంకల్ప్యచ యథావిధి, దత్తం యద్దాస్యమానంచ ఆతృప్తేర్నమమేతిచ. **తథా - శ్రాద్ధీయాన్నస్య** సంకల్పోభూమావేవ ప్రదీయతే, హస్తే షుదీయమానంతు పితౄణాం నోపతిష్ఠతే. వైశ్వదేవస్యవామేతు పితృపాత్రస్య దక్షిణే, సంకల్పోదకదానం స్యాత్ నిత్యశ్రాద్ధేయథారుచి. **ప్రచేతాః-ఆపోశనం** ప్రదాయాథసావిత్రీంత్రిర్జపేదథ, మధువాతా ఇతిఋచం మధ్విత్యేతత్త్రికం తథా. మితాక్షరాయాం (ఆశ్లో 239) పారస్కరః- సంకల్ప్య పితృదేవేభ్యః సావిత్రీ మధుమజ్జపః, శ్రాద్ధం నివేద్యాపోశనం జుషప్రైషోఽథభోజనం గాయత్రీంత్రిఃసకృద్వాపి జపేద్వ్యాహృతి పూర్వికాం. మధువాతా ఇత్యృచంమధ్విత్యేతత్త్రికంతథా, యాజ్ఞవల్క్యః-(ఆ.శ్లో 239) సావ్యాహృతించగాయత్రీం మధువాతా ఇతిత్ర్యృచం, జప్త్వాయథానుఖంవాచ్యం భుంజీరన్ తేఽపివాగ్యతాః. యథానుఖం జుషధ్వమితివాచ్యం. **అత్రిః-అసంకల్పిత** మన్నాద్యం పాణిభ్యాం యద్యుపస్పృశేత్, అభోజ్యం తద్భవేదన్నం పితౄణాంనోపతిష్ఠతే. అన్నందత్తం నగృహ్ణీయా ద్యావత్తోయంన సంపిబేత్.

అను॥ ఆ పిదప బ్రాహ్మణునితో అచ్ఛిద్రం చెప్పించాలి (అచ్ఛిద్రం జాయతాం అని, మంత్రహీనం క్రియాహీనం..... మమ, చదివాక). అక్కడే ప్రచేతుడిట్లా-బ్రాహ్మణునకు చేతియందు ఆపోశనమిచ్చి, సంకల్పం చేసి, అచ్ఛిద్ర భాషణం వలన, పితరులు దేవతలతో సహా నిరాశులై వెళ్ళిపోతారు, అనుమానం లేదు, అని. పారస్కరుడిట్లా- పితరులు, దేవతలకై సంకల్పం చేసి (అన్నం) గాయత్రి, మధుమతి ఋక్కులను జపించి శ్రాద్ధమును నివేదించి ఆపోశనం చేసి, ఆ పిదప తన ఇష్టం వచ్చిన రీతిలో భుజించాలి. నివేదించి అనగా బ్రహ్మార్పణము చేసి అని అర్థము. అందువల్లనే బృహన్నారదీయమందు అన్నత్యాగాన్ని చెప్పి ఇట్లా చెప్పారు-ఇవ్వబడిన హవిస్సు, అందుకు చెందిన కర్మను విష్ణువునకై సమర్పించాలి,

అని. కృత్యరత్నమందు కార్ష్ణాజిని ఇట్లా - పితృ కర్మ అంతా అపసవ్యంగా చేయాలి, అన్నదానంతప్ప అంతా. ఇట్లా మాతామహులందు కూడా, అని. అది కూడా దీని విషయకమే. అక్కడ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః, హరిర్దాతా హరిర్భోక్తా, చతుర్భిశ్చచతుర్భిశ్చ, అనేవాటిని కొందరు చదువుతారు. ధర్మప్రదీపమందిట్లా- ఆ పిదప, శాస్త్ర ప్రకారము అన్నమును పితృదేవతలకు సంకల్పం చేసి, ఇవ్వబడినది. మీకు తృప్తి కలిగేవరకు ఇవ్వబడేది, నాది కాదు, అనికూడా చెప్పాలి, అని. అట్లాగే-శ్రాద్ధీయ అన్న సంకల్పము భూమిపైనే వేయాలి. చేతులందు ఇచ్చినదైతే పితరులకు చేరదు, అని. విశ్వేదేవులకు ఎడమభాగంలో పితృపాత్రకు దక్షిణభాగంలో (కుడి) సంకల్పఉదకదానం చేయాలి. నిత్య శ్రాద్ధమందైతే మీ ఇచ్ఛవచ్చిన రీతిలో సంకల్ప జలదానం చేయొచ్చు. ప్రచేతుడిట్లా - ఆపోశనం ఇచ్చాక గాయత్రి మంత్రాన్ని మూడుమార్లు జపించాలి. ఆ పిదప మధువాతా అనే మూడు ఋక్కులను, మధు అనే దానిని మూడుమార్లు (మధు, మధు, మధు) జపించాలి, అని. మితాక్షరమందు పారస్కరుడిట్లా - పితరులకు దేవతలకై సంకల్పం చేసి గాయత్రిని, మధువాత అనే మంత్ర జపం చేసి, శ్రాద్ధ నివేదన చేసి, ఆపోశన స్వీకరించి భోజనాన్ని మీకు నచ్చిన రీతిలో చేయండి. గాయత్రిని మూడుమార్లు లేదా ఒకసారైనా వ్యాహృతిపూర్వకముగా జపించాలి. మధువాత అనే ఋక్కును మధు అనే ఈ మూటిని అట్లాగే జపించాలి, అని. యాజ్ఞవల్క్యుడిట్లా - వ్యాహృతులతో కూడిన గాయత్రిని మధువాత అనే ఋక్కును జపించి, మీకు సుఖం కలిగే రీతిలో భుజించండి అని చెప్పాలి. వారుకూడా మౌనంగా భుజించాలి అని యథాసుఖంజుషధ్వమని చెప్పాలి. అత్రి ఇట్లా - సంకల్పం చెప్పని అన్నం మొదలగు వానిని ఒకవేళ చేతులతో స్పృశిస్తే ఆ అన్నం తినతగింది కాదు. పితరులకు చెందదు, అని. పెట్టిన అన్నాన్ని తినరాదు, ఆపోశన జలపానం కానంత వరకు.

మూ॥ **ఆపోశనే విశేషమాహ** స్మృతి సముచ్చయే-ఆపోశనం వామభాగే సురాపాన **సమంభవేత్**, దక్షభాగేతుయః కుర్యాత్ సోమపానసమంభవేత్. తథా-పునరాపూర్యాపోశనం సురాపాన సమంభవేత్. **హేమాద్రావత్రిః**-దత్తేవాప్యథవా౽దత్తే భూమౌయోనిక్షిపేద్బలిం, తదన్నం నిష్ఫలం యాతినిరాశైః పితృభిర్గతైః. **కేచిదాజ్యేనకుర్వంతి**, తన్న, పాయసేన తథాజ్యేన మాషాన్నేన తథైవచ, నకుర్యాత్ బలిదానంతు, ఓదనేన ప్రకల్పయేత్, ఇతిస్మృతి సారే నిషేధాత్. **శంఖః** -శ్రాద్ధేనియుక్తాన్ భుంజానాన్ నపృచ్ఛేల్లవణాదిషు ఉచ్ఛిష్టాః పితరోయాంతి పృచ్ఛతోనాత్ర సంశయః **కాత్యాయనః**-అశ్నత్సుజపేత్సవ్యాహృతికాం గాయత్రీం సకృత్త్రిర్వారక్షోఘ్నీః పురుషసూక్త మప్రతిరథం, ఇతి. హేమాద్రౌ సౌర పురాణే- ఐంద్రంచ పౌరుషం సూక్తం శ్రావయేద్బ్రాహ్మణాంస్తతః మాత్స్యపాద్మయోః-బ్రహ్మవిష్ణ్వర్కరుద్రాణాంస్తోత్రాణివివిధానిచ, ఇంద్రేశసోమసూక్తాని పావమానీశ్చ శక్తితః. మండలం బ్రాహ్మణంతద్వత్ ప్రీతికారిచయత్పునః అభావే సర్వవిద్యానాం గాయత్రీ జపమాచరేత్. పృథ్వీచంద్రోదయే బ్రాహ్మే-వీణాంవంశధ్వనించాథ విప్రేభ్యఃసన్నివేదయేత్. జపేచ్చపౌరుషం సూక్తం నాచికేత త్రయంతథా. త్రిమధు త్రిసుపర్ణంచ పావమానీర్యజూంషిచ.

అను॥ ఆపోశనమందు విశేషము స్మృతి సముచ్చయమందిట్లా చెప్పబడింది. ఆపోశనము ఎడమ భాగమందు చేస్తే అది సురాపానంతో సమానము. అది కుడిభాగంలో చేస్తే సోమాపానంతో సమానమౌతుంది, అని. అట్లాగే – తిరిగి నింపుకొని ఆపోశన చేస్తే సురాపానసమమౌతుంది, అని. హేమాద్రియందు అత్రి ఇట్లా– అన్నం ఇచ్చాక లేదా ఇవ్వకముందైనా భూమియందు బలి నిక్షేపం చేస్తే (ఇస్తే), ఆ అన్నము నిష్ఫలమౌతుంది. పితరులు నిరాశతో వెళ్తారు కనుక, అని. (బలికూడదు). కొందరు నేతితో బలి చేస్తారు. అది తగదు. పాయసంతో నేతితో, మినుముల అన్నంతో బలిదానం చేయరాదు. అన్నంతోనే చేయాలి అని స్మృతిసారమందు నిషేధించినందువల్ల. శంఖుడిట్లా–శ్రాద్ధమందు నియుక్తులైన భుజిస్తున్న బ్రాహ్మణులను లవణాదులగూర్చి అడుగరాదు. అడిగితే పితరులు అశుద్ధులై వెళ్ళిపోతారు. ఇందులో అనుమానం లేదు, అని. కాత్యాయనుడిట్లా– బ్రాహ్మణులు భోంచేస్తుండగా వ్యాహృతులతో కూడా (ఓంభూర్భువఃస్వః) గాయత్రిని మూడుసార్లు కాని ఒకసారి కాని జపించాలి. రక్షోఘ్న మంత్రములను పురుష సూక్తమును, అప్రతిరథసూక్తమును జపించాలి, అని. హేమాద్రియందు సౌర పురాణమందిట్లా– ఆ పిదప బ్రాహ్మణులకు ఇంద్రసూక్తమును పురుష సూక్తమును వినిపించాలి, అని. మాత్స్య పాద్మములందిట్లా – బ్రహ్మ విష్ణు అర్కరుద్రుల స్తోత్రములను వివిధమైన వానిని, ఇంద్ర, ఈశ, సోమసూక్తములను పవమాన సూక్తములను శక్తికొలది వినిపించాలి. అట్లాగే ఆనందాన్ని కల్గించే మండల బ్రాహ్మణాన్ని చదువాలి. ఇవి ఏవి రాని పక్షంలో (సర్వవిద్యల అభావంలో) గాయత్రీ జపాన్ని చేయాలి, అని. పృథ్వీ చంద్రోదయమందు బ్రాహ్మోక్తి ఇట్లా–బ్రాహ్మణులకు వీణను, వేణుధ్వనిని వినిపించాలి. పురుష సూక్తాన్ని నాచికేతుని మూడు మంత్రములను, త్రిమధు, త్రిసుపర్ణ, పవమాన సూక్తములను (యజుర్వేద) వినిపించాలి, అని.

**మూ॥ హేమాద్రావత్రిః–హుంకారేణాపియోబ్రూయాద్ధస్తాద్వాపివదేత్ గుణాన్. భూతలాచ్చోద్ధరేత్పాత్రం ముంచేద్ధస్తేన వాపిబేత్ ప్రౌఢ పాదోబహిఃకచ్ఛోబహిర్జానుకరోపివా, అంగుష్ఠేన వినాశ్నాతిముఖశబ్దేనవాపునః. పీతావశిష్టతోయానిపునరుద్ధృత్యవాపిబేత్. ఖాదితార్ధాత్ పునఃఖాదన్మోదకాని ఫలానిచ. ముఖేనవాధమేదన్నం నిష్ఠీవేద్భాజనేపివా, ఇత్థమశ్నన్ ద్విజః శ్రాద్ధం హత్వా గచ్ఛత్యధోగతిం. జాబాలిః – ఇష్టముష్ణం హవిష్యం చ దద్యాదన్నం శనైః శనైః . వృద్ధ శాతాతపః–అపేక్షితవ్యం యాచితవ్యం శ్రాద్ధార్థముపకల్పితం, నయాచతేద్విజోమూఢః సభవేత్పితృ ఘాతకః. యత్తు యమః–శ్రాద్ధే ద్విజోనైవదద్యాత్నయాచేన్నై వదాపయేత్, ఇతితద సంపాదిత వస్తు విషయమితి హేమాద్రిః హారీతః–ఊర్ధ్వపాణిశ్చ విహసన్సక్రోధోవిస్మయాన్వితః, భగ్నపృష్ఠశ్చ యద్భుంక్తే నతత్ప్రీణాతివై పితౄన్. ప్రచేతాః–నస్పృశేద్వామ హస్తేన భుంజానోఽన్నంకదాచన. నపాదౌనశిరోబస్తింనపదాభాజనం స్పృశేత్.**

అను॥ హేమాద్రి యందు అత్రి ఇట్లా–హుంకారంతో కాని చేతితో కాని అన్నము యొక్క గుణాన్ని చెప్పిన, అన్న పాత్రను భూమినుండి పైకెత్తినా, విడిచినా, చేతితో తాగినా,

ప్రౌఢపాదుడైనా (పాదాలను ఆసనంకింద ఉంచిన, మోకాలు, పిక్కలందుంచిన, కాలుమీద కాలు ఉంచిన) బహిఃకచ్ఛుడు (కక్షుడు=చంకలు), మోకాలికి బయట చేతులుంచిన, అంగుష్ఠం తగల్చకుండా తిన్నా ముఖంతో శబ్దం చేస్తూ తిన్నా, తాగగా మిగిలిన నీటిని తిరిగి ఎత్తితాగినా, తినగా మిగిలిన సగం నుండి తిరిగి తిన్నా లడ్డూలు లేదా పండ్లు కాని, ముఖంతో అన్నాన్ని ఊదినా, పాత్రలో ఉమ్మేసినా, ఈ రకంగా తిన్న బ్రాహ్మణుడు శ్రాద్ధాన్ని నాశనం చేసి అధోగతిని పొందుతాడు, అని. జాబాలి ఇట్లా - ఇష్టమైనది, వేడిగా ఉన్న హవిష్యము, అన్నమును మెల్లమెల్లగా ఇవ్వాలి అని. వృద్ధశాతాతపుడిట్లా-శ్రాద్ధము కొరకు ఏర్పరచిన దానిలో కావలసిన దానిని అడిగి పెట్టించుకోవాలి. మూఢుడై అడగని బ్రాహ్మణుడు పితృఘాతకుడౌతాడు, అని. యముడిట్లా-శ్రాద్ధమందు ద్విజుడు ఇవ్వరాదు, యాచించరాదు, ఇప్పించరాదు అని అన్నమాట అది సంపాదించని వస్తువుల విషయకము అని హేమాద్రి (దత్త, సంపాదిత =ఇవ్వబడిన, సంపాదింపబడిన అని కూడా) హారీతుడిట్లా – పైకి చేతులెత్తి నవ్వటం, కోపగించటం, ఆశ్చర్యపడటం, సరిగా కూర్చోకపోవటం చేస్తూ ఇట్లా ఏం తింటారో, ఆ భోజనము పితరులను, తృప్తిపరచదు, అని. ప్రచేతుడిట్లా – అన్నం తింటూ ఎడమ చేతితో ఎప్పుడూ అన్నాన్ని తాకరాదు. పాదములు, తల, బొడ్డు క్రింది భాగం వీనిని పాదములతో పాత్రను తాకరాదు, అని.

మూ॥ శంఖః-శ్రాద్ధపంక్తౌతుభుంజానో బ్రాహ్మణోబ్రాహ్మణం స్పృశేత్, తదన్నమత్యజన్ భుక్త్వా గాయత్ర్యష్టశతం జపేత్. ఉశనాః-భోజనం తు న నిఃశేషఃకుర్యాత్ప్రాజ్ఞఃకథంచన, అన్యత్రదధ్నః క్షీరాద్యాక్షౌద్రాత్సక్తుభ్యఏవచ. బ్రాహ్మే-నాచాశ్రుపాతయేజ్జాతు నశుష్కాం గిరమీరయేత్, నచోద్వీక్షేత భుంజానాన్ నచకుర్వీతమత్సరం. యమః- స్వాధ్యా యంశ్రావయేత్ సమ్యక్ ధర్మశాస్త్రాణిచైవహి, ప్రచేతాః-భుంజానేషుతు విప్రేషు ఋగ్యజుఃసామలక్షణం, జపేదభిముఖోభూత్వా పిత్ర్యం చైవ విశేషతః. యజూంషి చైవ రుద్రంచ రక్షోఘ్నీః ఋచఏవచ, రక్షోఘ్నీః=కృణుష్వపాజః రక్షోహణ మిత్యాద్యాః. తత్రైవనిగమః-భుంజత్సుజపేత్ పావమానీరుదీరతా మధ్వన్నవతీశ్చ. అన్నవత్యః పితుం నుస్తోషమితి. పృథ్వీచంద్రోదయేభరద్వాజః- భుంజానేషుతువిప్రేషు ప్రమాదాత్ ప్రవతే గుదం, పాదకృచ్ఛ్రం తతఃకృత్వా అన్యం విప్రం నియోజయేత్. క్షణ, పాద్యాది దత్వాఇత్యర్థః విప్రవమనే తత్రైవ దక్షః-నిమంత్రితస్తుయః శ్రాద్ధేభోజనే ముఖనిఃసృతే, తద్దైవ హోమంకుర్వీత స్వాగ్నౌవిప్రః సమాహితః. ప్రాణాదిపంచభిఃమంత్రైః యావత్ద్వాత్రింశ సంఖ్యయా (ద్వాత్రింశ దాహుతీర్హుత్వా హోమశేషం సమాపయేత్) బ్రాహ్మణస్తు తతః కృత్వా (స్నాత్వా) ఘృతప్రాశనమాచరేత్.

అను॥ శంఖుడిట్లా - శ్రాద్ధ పంక్తి యందు భుజిస్తూ బ్రాహ్మణుడు మరో బ్రాహ్మణుని తాకితే, ఆ అన్నాన్ని వదలకుండా తిని గాయత్రి మంత్రాన్ని నూట ఎనిమిది మారులు జపించాలి, అని. ఉశనుడిట్లా-ప్రాజ్ఞుడు ఏమి మిగలకుండా(ఇస్తట్లో)ఎప్పుడూ భోజనం చేయరాదు. పెరుగు, పాలు, తేనె, సత్తు పిండి వీటిని పారవేయరాదు (ఇవితప్ప). బ్రాహ్మమందిట్లా - కన్నీరు కార్చరాదు. వట్టిమాటలు పలుకరాదు. భుజిస్తున్న వారిని

చూడరాదు. ఈర్ష్య పనికిరాదు అని. యముడిట్లా- వేదములను వినిపించాలి, చక్కగా ధర్మశాస్త్రములను కూడా వినిపించాలి, అని. ప్రచేతుడిట్లా-బ్రాహ్మణులు భుజిస్తుండగా ఋక్, యజుష్, సామవేదమంత్రాలను, విశేషించి పితృదేవతల మంత్రాలను, వారికి అభిముఖుడై పఠించాలి. యజుర్వేదమురుద్రమును రక్షోఘ్నీ (ఋగ్వేద) ఋక్కులను జపించాలి అని. రక్షోఘ్నీః కృణుష్వపాజః అట్లాగే రక్షోహణం అను మొదలుగా మంత్రాలు జపించాలి. అక్కడే నిగమమిట్లా-భుజిస్తుండగా పావమానీ, ఉదీరతా, మధువాతా, అన్నవతీ ఋక్కులను పఠించాలి, అని. అన్నవత్యః అనగా పితుంనస్తోషం అను మంత్రాలు. పృథ్వీచంద్రోదయమందు భరద్వాజోక్తి ఇట్లా-బ్రాహ్మణులు భుజిస్తుండగా ప్రమాదం వల్ల గుద స్రావమైతే (మూత్రం వగైరా) ఆ పిదప పాదకృచ్ఛ్రమను ప్రాయశ్చిత్తమును చేసి (ఇదికర్తకు) మరో బ్రాహ్మణుని నియోగించాలి. క్షణము, పాద్యాదులు ఇచ్చి, నిమంత్రణ చేయాలి అని అర్థము. విప్రుడు కక్కుకున్న పక్షంలో అక్కడే దక్షుడిట్లా- శ్రాద్ధంలో, నిమంత్రణ జరిగాక శ్రాద్ధభోజనమందు వమనమైతే, అప్పుడే తన లౌకికాగ్నియందు సమాహితమనస్సుతో విప్రుడు హోమం చేయాలి. ప్రాణాది ఐదుమంత్రములతో ముప్పది రెండు ఆహుతులివ్వాలి (ముప్పది రెండు ఆహుతులిచ్చి హోమ శేషమును ముగించాలి) బ్రాహ్మణుడైతే ఆ పిదప స్నానం చేసి ఘృత ప్రాశన చేయాలి. (తొలి రోజు ఒక పూట భోజనం, రెండవ రోజు రాత్రి మాత్రమే భోజనం, మూడవ రోజు అడగకుండా వచ్చినదితిని ఉండాలి, నాల్గవ రోజు ఉపవాసం ఇది పాదకృచ్ఛ్రము).

మూ॥ **ఋగ్విధానేతు** - ఇంద్రాయ సామసూక్తేన శ్రాద్ధవిఘ్నే యదాభవేత్, అగ్న్యాదిభిఃభోజనేన శ్రాద్ధంసంపూర్ణమేవహి, ఇత్యుక్తం. అగ్న్యాదిభిరితి లౌకికాగ్ని స్థాపన చరునిర్వాపాద్యాజ్య భాగాంతే నామ గోత్రపూర్వమగ్నౌ పితౄనావాహ్య సంపూజ్యాన్నత్యా గంకృత్వా ప్రాణాదిభిః ద్వాత్రింశదాహుతీః హునే దిత్యర్థః. భోజనేన= పునఃశ్రాద్ధేన. తేన హోమః పునః శ్రాద్ధం వేతి పక్షద్వయముక్తం. సూక్త జపస్తు ఉభయానుగతః. సంగ్రహే - ప్రాధాన్యం పిండదానస్య భోజన స్యతదంగతా, అతోభుక్తి క్రియాహానౌశ్రాద్ధావృత్తింనమన్వతే. పిండదానోత్తరంవాంతౌ హోమ ఏవనా వృత్తిః పిండదానాత్ప్రాగ్వాంతౌ తద్దినే ఉపవాసంకృత్వాపరేద్యుః పునఃశ్రాద్ధం కార్యమిత్యర్థః . తత్రైవ - శ్రాద్ధ పంక్తౌ తుభుంజానో బ్రాహ్మణోవమతేయది, లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య అర్చయేచ్ఛహుతా శనం. తథా-ఏక ఏవయదావిప్రో భోజనే ఛర్దితోయది, తదైవాగ్నిం సమాధాయహోమం కుర్యాద్యథా విధి. ద్వితీయపక్షే ఋగ్విధానే - భోజనోపక్రమాదూర్ధ్వం ప్రక్రమాత్పూర్వతో యది, శ్రాద్ధ విఘ్నే పునఃకార్యం జపహోమౌనతృప్తిదౌ. స్మృతి సంగ్రహే- అకృతేపిండదానేతుభుంజానో బ్రాహ్మణోవమేత్, పునఃపాకాత్తు కర్తవ్యం పిండదానం యథావిధి. పిండదానం=శ్రాద్ధం. అకృతే పిండదానేతు పితా యదివమేత్తదా, పునః పాకం ప్రకుర్వీత శ్రాద్ధం కుర్యాద్యథావిధి, ఇతి తత్రైవోక్తేః. తథా - పిత్రర్థానాం త్రయాణాం హిపితా చవమతేయది, తద్దినే చోపవాసః స్యాత్ పునఃశ్రాద్ధం పరేహని. వమనేవా విరేకేవా తద్దినం వర్జయేత్. ఏషువచనేషు మూలంచింత్యం ఇదంమాసికాబ్దిక విషయం. దర్శాదౌతు వాన్తా వామేన తదైవ కార్యం.

అను॥ ఋగ్విధానమందైతే-శ్రాద్ధం విఘ్నం జరిగిన పక్షంలో ఇంద్రాయసామ, అనే సూక్తంతో, అగ్న్యాదులతో, భోజనంతో శ్రాద్ధం సంపూర్ణమౌతుంది అని చెప్పారు. అగ్న్యాదులతో అనగా లౌకికాగ్ని స్థాపన, చరు నిర్వాపం (ఇవ్వటం) మొదలుగా ఆజ్య భాగాంతమందు నామ గోత్ర పూర్వకముగా అగ్ని యందు పితరుల నావాహన చేసి చక్కగా పూజించి, అన్నత్యాగం చేసి, ప్రాణాపానాదులతో ముప్పది రెండు ఆహుతులు హోమం చేయాలి అని అర్థము. భోజనంతో అనగా తిరిగి శ్రాద్ధం చేసి అని. అందువల్ల హోమము, పునః శ్రాద్ధము అని రెండు పక్షాలను చెప్పారు. సూక్త జపము అనేది రెంటికి వర్తించేది సంగ్రహమందిట్లా - పిండదానము ప్రధానము. భోజనము దానికి అంగము. అందువల్ల భుక్తి క్రియకు హాని జరిగితే శ్రాద్ధపు ఆవృత్తిని అంగీకరించరు అని. పిండదానం తరువాత వమనమైతే హోమమే శ్రాద్ధ ఆవృత్తి లేదు. పిండదానం కన్నముందు వమనమైతే ఆ రోజు ఉపవాసం చేసి తరువాతి రోజు తిరిగి శ్రాద్ధం చేయాలి అని అర్థము. అక్కడే - శ్రాద్ధ పంక్తి యందు భుజిస్తున్న బ్రాహ్మణుడు ఒకవేళ వమనం చేసుకుంటే లౌకికాగ్నిని స్థాపించి, అగ్నిని పూజించాలి, అని. అట్లాగే - బోజనమున ఒకే బ్రాహ్మణుడు వమనం చేసుకున్న పక్షంలో అప్పుడే అగ్నిని స్థాపించి శాస్త్రప్రకారము హోమం చేయాలి, అని. రెండవ పక్షమందు ఋగ్విధానమందిట్లా - భోజనం ఉపక్రమించిన తరువాత పిండదానం ఆరంభం కన్న ముందు శ్రాద్ధ విఘ్నం జరిగితే తిరిగి శ్రాద్ధం చేయాలి. జపహోమములు తృప్తినివ్వవు అని. స్మృతి సంగ్రహమందిట్లా - పిండ దానం చేయకముందే భుజించే బ్రాహ్మణుడు వమనం చేసుకుంటే, తిరిగి వంట చేసి పిండదానాన్ని శాస్త్ర ప్రకారం చేయాలి, అని. పిండదానం శ్రాద్ధము. పిండదానం చేయటం కన్న ముందు పితృస్థానం బ్రాహ్మణుడు ఒకవేళ వమనం చేసుకుంటే అప్పుడు తిరిగి వంటచేయాలి. శ్రాద్ధమును శాస్త్రప్రకారము ఆచరించాలి, అని అక్కడే చెప్పారు. అట్లాగే-పితరులైన ముగ్గురు బ్రాహ్మణులలో పితృస్థానీయుడు వమనం చేసుకుంటే ఆరోజు ఉపవాసం ఉండాలి. తరువాతి రోజు తిరిగి శ్రాద్ధం చేయాలి. వమనమైనా విరేచనమైనా ఆరోజును విడిచిపెట్టాలి, అని. ఈ మాటలకు మూలవచనాలను గూర్చి ఆలోచించాలి. ఇది మాసిక అబ్దిక విషయకము. అమావాస్యాదులందైతే వమనమైతే అప్పుడే ఆమశ్రాద్ధం చేయాలి (అన్నముతో).

మూ॥ **శ్రాద్ధ విఘ్నేద్విజాతీనాం ఆమశ్రాద్ధం ప్రకీర్తితం, అమావాస్యాదినియతం మాస సంవత్సరాదృతే, ఇతిమరీచి స్మృతేః శ్రాద్ధేపిండదానమేవ ప్రధానమితి కర్కాచార్యాః. తన్మతే దక్షోక్తో హోమ ఏవనా వృత్తిః విప్ర భోజనమితిమేధాతిథిః భోజన పిండదాన అగ్నౌకరణానీతి కపర్ది ధూర్తస్వామి హేమాద్ర్యాదయః తన్మతే పూర్వోక్తో నిర్ణయః. అన్నత్యాగమాత్రం ప్రధానం. భోజనంతు ప్రతిపత్తి రూపమంగం. అతోవాన్తౌ తద్ధానేపి నావృత్తి రితిగౌడ మైథిలాదయః. తన్న, శ్రాద్ధస్య యాగదానోభయరూపత్వాత్సంపూర్ణదానాభావాత్ భోజనస్యాంగత్వేఽపి సోమవమనే ఇవనైమిత్తి కవిధానమితియుక్తం ప్రతీమః. అత్రేదంతత్వం వైశ్వదేవి కస్యవమనే హోమ ఏవనావృత్తిః**

**అంగత్వాత్ తస్యర క్షార్థత్వాత్ ఇష్టిశ్రాద్ధేక్రతూదక్షా విత్యాది స్మృతేశ్చ. తత్రజయాన్‌జుహూ యాది తివత్. పితామహాదేరపితథా, పితేత్యుక్తేరితికేచిత్. తస్యాపి ప్రధానత్వాత్ పితృవదితి తుయుక్తం. సపిండీకరణాదౌ, వార్షికవత్. సపిండీకరణాదీనియానిశ్రాద్ధాని షోడశ, తత్రపిండ ప్రధానత్వం ప్రేతత్వ వినివర్తకం, ఇతిస్మృతేః. మహైకోద్దిష్టాదౌతు ఉభయప్రాధాన్యాదావృత్తిరేవ. ఏక ఏవ ద్విజోభోజ్యఃపిండోప్యేకో విధీయతే, ఇతి స్మృతేః వృద్ధి సంకల్ప నిత్యశ్రాద్ధా దౌతు భోజన ప్రాధాన్యాత్ వాన్తాదావావృతిరేవ. వృద్ధి శ్రాద్ధే వికల్పేన పిండదానం బుధైః స్మృతం. నిత్యశ్రాద్ధమదైవంస్యాత్ పిండదాన వివర్జితం, ఇతిస్మృతేః. భుక్తి క్రియాయాః ప్రాధాన్యం శ్రాద్ధే సంకల్ప సంజ్ఞికే, తత్రైవ పితృ విప్రస్య తూపఘాతే పునః క్రియా ఇతి సంగ్రహోక్తేశ్చ. మఘాదావప్యేవం. తీర్థమహాలయాదౌ దర్శవత్ ఇతి ఆశార్మాద్యాలోచనేన ప్రతీమః.**

అను ॥ శ్రాద్ధం విఘ్నమైతే బ్రాహ్మణజాతికి ఆమ శ్రాద్ధము అమావాస్యాదులందు నియతము అని చెప్పారు. మాసిక, సంవత్సర శ్రాద్ధములలో తప్ప, అని మరీచిస్మృతి. శ్రాద్ధమందు పిండదానమే ప్రధానమని కర్కాచార్యులు అన్నారు. ఆతని మతమందు దక్షుడు చెప్పిన హోమమేచాలు. ఆవృత్తి లేదు. విప్రభోజనమనిమేధాతిథి. భోజన పిండదాన, అగ్నౌకరణములని కపర్ది ధూర్త స్వామిహేమాద్ర్యాదులన్నారు. వారి మతమందు ముందు చెప్పినదే నిర్ణయం. అన్నత్యాగము మాత్రమే ప్రధానము. భోజనమైతే ప్రతిపత్తి రూపమైన అంగము, (ఆచరణ) అందువల్ల వమన మందు గాని దాని హానియందుగాని ఆవృత్తి లేదు అని గౌడమైథిలాదులన్నారు. అది కాదు. శ్రాద్ధం, యాగము దానము అను రెంటి రూపమైనట్టిది. కనుక సంపూర్ణదానం లేనందువల్ల భోజనం అంగమైనా సోమవమనమందు వలె నైమిత్తిక విధానము, అని దీనిని యుక్తంగా భావిస్తాము. ఇక్కడ యదార్థమిది. విశ్వేదేవ బ్రాహ్మణుడు వమనం చేసుకుంటే హోమమే, ఆవృత్తి లేదు. అంగమైనందువల్ల. అది రక్షకొరకైనట్టిది కనుక. ఇష్టిశ్రాద్ధమందు క్రతుదక్షులు విశ్వేదేవులు, అని మొదలుగా స్మృతి కూడా అక్కడ జయ అను మంత్రములతో హోమం చేయాలి అనేదానివలె. పితా మహాదులకు గూడా అట్లాగే. పితా అని మాత్రమే చెప్పారని కొందరంటారు. అతడు కూడా ప్రధానమైనందువల్ల పితరునివలె అని చెప్పటం యుక్తము. (పితామహాది) (ఆ రోజు ఉపవాసం తర్వాతి రోజు శ్రాద్ధము). సపిండీకరణాదులందైతే వార్షిక శ్రాద్ధంవలె (ఉభయ ప్రాధాన్యం). సపిండీకరణం మొదలైనవి పదహారు శ్రాద్ధములే వున్నాయో, అక్కడ పిండము ప్రధానము. అది ప్రేతత్వంను నివర్తింపచేసేది, అని స్మృతి. మహైకోద్దిష్టాదులందైతే రెండు ప్రధానమైనవే, కనుక ఆవృత్తియే ఒక బ్రాహ్మణునికే భోజనం పెట్టాలి, పిండము కూడా ఒకటే విధించబడుతుంది, అని స్మృతి. వృద్ధి సంకల్పనిత్య శ్రాద్ధాదులందైతే భోజనం ప్రధానం కనుక వమనాదియైతే ఆవృత్తియే. వృద్ధి శ్రాద్ధమందు పిండదానము వికల్పము (ఇవ్వచ్చు ఇవ్వకపోవచ్చు అని)బుధులు అంటారు. నిత్యశ్రాద్ధము, దైవం లేకుండా పిండదానము లేకుండా ఉంటుంది, అని స్మృతి. సంకల్ప శ్రాద్ధమందు భోజనమునకు ప్రాధాన్యము అక్కడే పితృబ్రాహ్మణునకు ఉపఘాతం (బాధ) కలిగితే తిరిగి ఆచరించాలి,

అని సంగ్రహోక్తి కూడా. మఘాదులందు కూడా ఇట్లాగే. తీర్థ, మహాలయాదులందు అమావాస్యయందువలె అని ఆశార్కాదుల ఆలోచన వల్ల తెలుస్తోంది.

**మూ॥ ఆశ్వలాయనః** - (అ4 ఖ.8 సూ 10-12) **తృప్తాన్ జ్ఞాత్వా** మధుమతీః శ్రావయేదక్షన్న మీమదన్తేతిచ. సంపన్నంపృష్ట్వా యద్యదన్నము పభుక్తం తత్తత్ స్థాలీపాకేనసహ పిండార్థముద్ధృత్యశేషంనివేదయేత్ అభిమతే అనుమతేవా, ఇతి. అత్రగాయత్రీ మధ్వితి త్రికజపోఽపి జ్ఞేయః, తృప్తాన్ బుద్ధ్వాన్నమాదాయ సతిలం పూర్వవజ్జపేత్, ఇతిప్రచేత సోక్తేః. **వ్యాసః** - తృప్తాః స్థేతితుపృష్టాస్తే బ్రూయుఃతృప్తాఃస్మఇత్యథ, అభిమతే విప్రైఃస్వీకర్తు మిష్టే. **శౌనకోఽపి** - అన్న శేషైశ్చకింకార్యమితిపృచ్ఛేచ్చతాంస్తతఃతే ఇష్టైః సహభోక్త వ్యమితి ప్రత్యుక్తిపూర్వకం. ప్రదద్యుః సకలంతస్మై స్వీకుర్యుర్వాయథారుచి. **శ్రాద్ధవిశేషేప్రశ్న భేదమాహ హేమాద్రౌ విష్ణుః** - పిత్ర్యేస్వదిత మితి, గోష్ఠ్యాంసుశ్రుతం సంపన్నమితి, అభ్యుదయేదైవే రోచతే ఇతి, ఆయుష్యమితిస్వైరేషు, స్వైర మిచ్ఛాశ్రాద్ధం. **యాజ్ఞవల్క్యః**-(ఆచాశ్లో 241) అన్నమాదాయ తృప్తాః స్థశేషంచైవాను మాన్యచ, తదన్నం ప్రకిరేద్భూమౌదద్యాచ్చాపఃసకృత్సకృత్. ఇదంచాత్ర వికిరదానమన్యశాఖినాం. ఆశ్వలాయనానాంతు పిండదానాంత ఏవ సూత్రకృతోక్తం. కాత్యాయనస్తు వికిరోత్తరం గాయత్ర్యాది జపం తృప్తి ప్రశ్నంచాహ. హేమాద్రౌ దేవలః- తతః సర్వాశనం పాత్రే గృహీత్వా వివిధం బుధః, తేషాముచ్ఛేషణస్థానే వికిరం భువిని క్షిపేత్ మాధవీయే ప్రచేతాః- సార్వవర్ణికమాదాయ యేఅగ్నీతి భువిక్షిపేత్, సచకుశేకార్యః, దర్భేషువికిరశ్చయః ఇత్యుక్తేః మంత్రఃకాతీయః-అగ్నిదగ్ధాశ్చయే జీవాః యేప్యదగ్ధాః కులేమమ, భూమౌదత్తేనతృప్యంతు తృప్తాయాంతు పరాంగతిం.

అను॥ ఆశ్వలాయనుడిట్లా - బ్రాహ్మణులు తృప్తులైనది ఎరిగి మధుమతీః అనే మంత్రాన్ని విన్పించాలి(మధువాతా, మూడు), అక్షన్నమీమదంత అనేదీ విన్పించాలి. సంపన్నం అని అడిగి, ఏ ఏ అన్నాన్ని భుజించారో అది అది స్థాలీపాకంతో సహ పిండము కొరకు తీసుకొని, మిగిలిన దానిని నివేదించాలి. స్వీకరించుటకు విప్రులు ఇష్టపడితే, నిమంత్రిత బ్రాహ్మణులు అనుమతించాక, అని. ఇక్కడ గాయత్రి, మధువాతా అను మంత్రత్రిక జపము కూడా చేయాలి, అని గ్రహించాలి. వారు తృప్తి పద్దారని తెలుసుకొని, అన్నము తీసుకొని నువ్వులతో పాటు, ముందులాగ, జపించాలి అని ప్రచేత సోక్తి. వ్యాసుడిట్లా - తృప్తాఃస్థ అని వారిని అడిగితే వారు తృప్తాఃస్మ, అని చెప్పాలి అని. అభిమతమనగా బ్రాహ్మణులు స్వీకరించటానికి (తినటానికి) ఇష్టపడితే, శౌనకుడు కూడ ఆ పిదప అన్న శేషంతో ఏమి చేయాలి అని వారిని అడగాలి. వారు ఇష్టులతో కలిసి భుజించాలి అని సమాధానం చెప్పాలి. ఈ విధంగా ఆ అన్నాన్ని అంతా అతనికి ఇవ్వటమో లేదా తామే స్వీకరించటమో ఇష్టప్రకారం చేయాలి, అని. శ్రాద్ధ విశేషమందు ప్రశ్న భేదాన్ని హేమాద్రి యందు విష్ణువిట్లా చెప్పాడు.- పితృ శ్రాద్ధమందు స్వదితం అని, గోష్ఠి శ్రాద్ధమందు సుశ్రుతమని, వృద్ధి శ్రాద్ధమందు సంపన్నమని, దైవ శ్రాద్ధమందు రోచతే అని, ఇచ్ఛా శ్రాద్ధమందు ఆయుష్యమని ప్రశ్న భేదం చెప్పారు. స్వైరమనగా ఇచ్ఛా శ్రాద్ధము యాజ్ఞ వల్క్యుడిట్లా - అన్నం తీసుకొని తృప్తి నందారా అని అడిగి, మిగిలిన అన్నానికై అనుమతి

నొంది, ఆ అన్నాన్ని భూమిపై ఉంచాలి, అప్పుడప్పుడు (ఒక్కొక్క సారి) నీరుపోయాలి అని. ఇక్కడ ఇది వికిరదానము ఇతర శాఖల వారికి. ఆశ్వలాయనులకైతే పిండదానాంతము వరకే సూత్రకారుడు చెప్పాడు. కాత్యాయనుడైతే వికిరదానం తరువాత గాయత్రి మొదలగు జపాన్ని తృప్తి ప్రశ్నను చెప్పాడు. హేమాద్రి యందు దేవలుడిట్లా - ఆ పిదప బుధుడు వివిధమైన అన్నము నంతా పాత్రయందు తీసుకొని, వారి ఉచ్ఛేషణ(అవశేష) స్థానమందు వికిరమును భూమియందు ఉంచాలి, అని. మాధవీయమందు ప్రచేతుడిట్లా - అన్ని రకములైన అన్నమును తీసుకొని యే అగ్ని దగ్ధాః అనే మంత్రం చదువుతూ భూమియందు ఉంచాలి, అని. దానిని కుశలపై ఉంచాలి. వికిరం ఏదైతే ఉందో దాన్ని దర్భలందు అని చెప్పినందువల్ల. కాతీయమంత్రమిట్లా - అగ్నిదగ్ధులైన జీవులు, నా కులంలో దగ్ధం కానివారు భూమియందుంచిన దానితో తృప్తినందని. తృప్తినందినవారు పరమగతికి వెళ్ళనీ, అని.

**మూ॥ అన్యేతు-అసోమ పాశ్చయేదేవాయజ్ఞ భాగవివర్జితాః, తేషామన్నం ప్రదాస్యామి వికిరం వైశ్వదేవికం, ఇతిహేమాద్రౌగోభిలోక్తేన దైవే, అసంస్కృతప్రమీతాయే త్యాగిన్యోయాః కులస్త్రియః, దాస్యామి, తేభ్యోవికిరమన్నంతాభ్యశ్చపైతృకం, ఇత్యగ్నిపురాణోక్తేనపిత్ర్యే అన్నం వికీర్య యే అగ్నిదగ్ధాః, ఇత్యుచ్ఛిష్టపిండంకుశోపరిపృథక్దద్యాదిత్యాహుః. పృథ్వీచంద్రోదయేప్యేవం. బ్రాహ్మే-తతఃప్రక్షాల్యహస్తౌచద్విరాచమ్య హరింస్మరేత్. మాధవీయేగౌతమః-వికిరముచ్ఛిష్టైః ప్రతిపాదయేత్. హేమాద్రౌవ్యాసః-ఉచ్ఛిష్టైరేవ వికిరం సదైవప్రతిపాదయేత్. భృగుః-పిండవత్ ప్రతిపత్తి స్స్యాత్ వికర స్యేతి తౌల్వలిః శ్రాద్ధ కారికాయాం-యజమానస్యదాసాదీనుద్దిశ్య ద్విజసత్తమ, తస్మాదన్నం త్యజేద్భూమౌవామభాగేషుపైతృకే. మనుః-(అ1శ్లో 246) ఉచ్ఛేషణం భూమి గతం అజిహ్మస్యా శరస్యచ, దాసవర్గస్య తత్పిత్ర్యే భాగధేయం ప్రచక్షతే. విష్ణుః-ఉదఙ్ముఖేష్వా చ మనమాదౌ దద్యాత్తతః ప్రాఙ్ముఖేషు. పిత్ర్యేదైవేచేత్యర్థః. శాతాతపః-విశ్వేదేవనివిష్టానాంచరమం హస్తధావనం, హేమాద్రౌవారాహే-హస్తంప్రక్షాల్యయశ్చాపః పిబేద్ భక్త్వాద్విజఃసదా, తదన్న మసురైర్భుక్తం నిరాశాః పితరోగతాః, మరీచిః-హస్తం ప్రక్షాల్యగండూషం యఃపిబేదవిచక్షణః, అసురంతద్భవేచ్ఛ్రాద్ధం పిత్ర్యాణాంనోపతిష్ఠతే. తత్రైవసంగ్రహే- పవిత్ర గ్రంథిము త్సృజ్యమండలేభువి నిక్షిపేత్, హస్తాదీన్క్షాలయేద్విద్వాన్ శరావాదౌతుకుత్రచిత్ వ్యాసః- తాంబూలోద్గిరణంచైవ గండూషోద్గిరణంతథా, కాంస్యపాత్రే తథా తామ్రేన కుర్వీత కదాచన. ఉష్ణో దకైః ధాన్య చూర్ణైః కరౌశ్మశ్రూణిశోధయేత్.**

అను॥ ఇతరులైతే - అసోమపులైన యేదేవతలున్నారో, యజ్ఞభాగం రాని వారెవరున్నారో (లో విడువబడిన) వారికి వైశ్వదేవిక అన్న రూపమైన వికిరమును ఇస్తున్నాను, అని హేమాద్రియందు గోభిలుడు చెప్పిన రీతిలో దైవమందు, సంస్కారం నొందకుండానే మరణించిన వారు, త్యాగం చేసిన కులస్త్రీలు ఎవరున్నారో వారికై (పురుషులు స్త్రీలు వారికై) పితరులకు చెందిన, వికిరాన్నమును ఇస్తున్నాను అని అగ్ని పురాణంలో చెప్పిన రీతిగా పితరులకై అన్నం పెట్టి (అగ్ని దగ్ధులైన వారెవరున్నారో) యే అగ్ని దగ్ధాః, అను మంత్రంతో, ఉచ్ఛిష్ట పిండమును కుశలపై విడిగా (ఉంచాలి) ఇవ్వాలి, అని అన్నారు.

పృథ్వీచంద్రోదయమందు కూడా ఇట్లాగే ఉంది. బ్రాహ్మమందిట్లా – ఆ పిదప చేతులు కడుగుకొని, రెండుసార్లు ఆచమనం చేసి హరిని స్మరించాలి, అని. మాధవీయమందు గౌతముడిట్లా – వికిరమును ఉచ్ఛిష్టాన్నముతో చేయాలి, అని. హేమాద్రియందు వ్యాసుడిట్లా – ఎల్లప్పుడూ వికిరమును ఉచ్ఛిష్టములతోనే ఇవ్వాలి, అని. భృగువిట్లా– వికిరమునకు పిండముతో సమానమైన ప్రతిపత్తి (గౌరవము) అని తెల్పాలి అన్నాడు, అని. శ్రాద్ధ కారికయందిట్లా – ఓ ద్విజసత్తమ! అందువల్ల యజమానికి చెందిన దాసాదులనుద్దేశించి, పితరుల వామ భాగమందు భూమిపై అన్నమును విడువాలి, అని. మనువిట్లా – భూమి యందున్న ఉచ్ఛేషణమైన అన్నము, అజిహ్మడు(అకుటిలుడు) శఠుడు కాని దాసవర్గమునకు పిత్ర్యమైన దాని యందు భాగము అని అంటారు, అని. విష్ణువిట్లా – ఉదఙ్ముఖులైన వారికి తొలుత ఆచమనమివ్వాలి, ఆ పిదప తూర్పుముఖమైన వారికి అని. పితరులకు దేవులకు అని అర్థము. శాతాతపుడిట్లా – విశ్వేదేవులైన బ్రాహ్మణులకు (కూర్చున్న) చివరగా హస్తధావనమునకై ఇవ్వాలి, అని. హేమాద్రియందు వారాహోక్తి ఇట్లా – చేతులు కడుగుకొని ఎల్లప్పుడు తిన్నాక నీళ్ళు తాగేసితే బ్రాహ్మణుడు, ఆ అన్నము రాక్షసులు తిన్నట్లు ఔతుంది. పితరులు నిరాశులై వెళతారు, అని. మరీచి ఇట్లా–చేతులు కడుగుకున్నాగ, అవి చక్షణుడై పుక్కిలింతను తాగినచో ఆ శ్రాద్ధము ఆసురశ్రాద్ధమౌతుంది. పితరులకు చెందదు అని. అక్కడే సంగ్రహమందిట్లా – పవిత్రగ్రంథిని విడిచి భూమిపై మండలమందు వేయాలి. విద్వాంసుడు చేతులు మొదలగు వానిని మూకుడు మొదలగు వానిలో, ఎక్కడో కడుగుకోవాలి, అని. వ్యాసుడిట్లా– తమలపాకును ఉమ్మేయుట పుక్కిలింతను ఉమ్మివేయుట వీనిని ఎప్పుడూ కంచు, రాగి పాత్రలందు చేయరాదు. వేడినీటితో ధాన్యపు పొడితో చేతులు గడ్డం మీసాలు శుద్ధిపరచుకోవాలి, అని (బియ్యం పిండి).

**మూ॥ అథ పిండదానం–తచ్చార్చనోత్తరమగ్నౌకరణోత్తరం భోజనోత్తరం వికిరోత్తరం స్వధావాచనోత్తరం విప్రవిసర్జనోత్తరం వేతి హేమాద్రౌ స్మృతిషుపక్షాఉక్తాః తేషాంశాఖాభేదేన వ్యవస్థా. ప్రేత శ్రాద్ధేషు పూర్వం అన్యేషు భోజనోత్తరం, ఇతి చంద్రికా మాధవౌ. సర్వత్ర భోజనోత్తర మితి బహవః. ఆశ్వలాయనః–(అ4 ఖ 8 సూ 12,13) భుక్త వత్సు అనాచాంతేషు పిండా న్నిదధ్యాత్ అచాంతేష్వేకే. భుక్త వత్స్వితి పూర్వనిషేధార్థం. సాగ్ని రితి ప్రణీత సమీపే. అనగ్నిర్ ద్విజ సమీపే. హేమాద్రౌజాతూకర్ణ్యః– వ్యామమాత్రం సముత్సృజ్య పిండాస్తత్ర ప్రదాపయేత్. ప్రసారితభుజాంతరం వ్యామః. సంకటేతువ్యాసః–అరత్నిమాత్రముత్సృజ్యేతి. యత్తు తత్రైవ–సికతాభిః మృదావాపి వేదీదక్షిణనిమ్నగా, ఇతితదన్యశాఖీపరం. దేవలః– తతస్తైరభ్యనుజ్ఞాతో దక్షిణాందిశమేత్యచ. చంద్రికాయాం– పిండనిర్వపణంకార్యంకుశాభావేవిచక్షణైః, కాశేషురాజ దూర్వాసుపవిత్రే పరమేహితే. అశ్వలాయనః–స్ఫ్యేనరేఖాముల్లిఖేత్, అపహతా అసురారక్షాంసివేదిషదఃఇతితామభ్యుక్ష్యసకృదాచ్ఛిన్నైః దర్భైః అవస్తీర్య ప్రాచీనావీతీ రేఖాంత్రిరుదకేనోపనయేత్ శుంధంతాంపితరః శుంధంతాంపితామహాః శుంధంతాంప్రపితామహాః ఇతితస్యాం పిండాన్ నిపృణీ యాత్ పరాచీన పాణిః పిత్రే పితామహాయ**

ప్రపితామహాయైతత్తేసాయే చత్వామత్రాను ఇతి. హేమాద్రౌ పారస్కరః - కరాభ్యాముల్లి ఖేత్స్యేనకు శైర్వాపిమహీంద్విజః, బహ్వృచానాంకరేణైవ లేఖా చాగ్నేయ్యభిముఖేతివృత్తిః. దక్షిణాంప్రాచీంవేది ముద్ధృత్య ఇత్యాపస్తం బోక్తేశ్చ. దేవలః-అవాహాయిత్వాదర్భాగ్రైః తేషాంస్థానానికల్పయేత్, తేష్వాసీనేషుపాత్రేణ ప్రయచ్ఛేత్సతిలోదకం పరాచీనేన నిమ్న పితృతీర్థేన. **వాయవీయే** - మధుసర్పిస్తి లయుతాన్ త్రీన్ పిండాన్ నిర్వపేత్ బుధః. **త్రిస్థలీసేతౌ** - తిలమన్నంచ పానీయం ధూపం దీపం పయస్త థా, మధు సర్పిఃఖండ యుక్తం పిండ మష్టాంగముచ్యతే.

అను॥ ఇక పిండదానము. అది అర్చన తరువాత, అగ్నౌకరణం తరువాత, భోజనం తరువాత, వికిరం తరువాత, స్వధావాచనం తరువాత, విప్ర విసర్జన తరువాత అని హేమాద్రియందు స్మృతులందు చాలా పక్షములు చెప్పబడ్డాయి. (విధాలుగా) వానికి శాఖాభేదంతో నిర్ణయము. ప్రేత శ్రాద్ధములందు భోజనం కన్నముందు, ఇతరచోట్ల భోజనం తరువాత, అని చంద్రికా మాధవులన్నారు. అంతటా భోజనం తరువాతనే అని చాలా మంది భావించారు. ఆశ్వలాయనుడిట్లా - భుజించాక ఆచమనం చేయకముందు పిండములను ఉంచాలి, అని కొందరు, ఆచమనం తరువాత అని కొందరు అన్నారు. తిన్నాక అనేమాట అంతకన్న ముందు నిషేధం కొరకు. అగ్ని కలవాడు అన్నది సంస్కరింపబడిన అగ్ని సమీపమందు చేయాలి. అగ్నిలేనివాడు ద్విజ సమీపమందు చేయాలి. హేమాద్రియందు జాతూకర్ణి ఇట్లా - వ్యామమాత్ర దూరమును వదలి, పిండములను అక్కడ పెట్టాలి అని. వ్యామమనగా చాపిన భుజముల మధ్య భాగము. సంకటము యందు వ్యాసుడిట్లా - (చిటికెన చాచిన మూర) అరత్ని మాత్రం వదలి, అని. అక్కడే - ఇసుకతో కాని, మట్టితో కాని వేదికను దక్షిణంవైపు పల్లంగా చేయాలి, అని చెప్పింది ఇతర శాఖలకు చెందినది. దేవలుడిట్లా - పిదప వారి అనుమతి పొంది దక్షిణం వైపు వచ్చి, అని అన్నాడు. చంద్రిక యందిట్లా - విచక్షణులు పిండ నిర్వాపణము కుశలపై చేయాలి. కుశలు లేకపోతే కాశగడ్డిపైన, రాజదూర్వలయందు, పరమహితమైన పవిత్రయందు చేయటం తగును, అని. (ఉత్కృష్టమైన హితకరమైన తామ్రమందుచేయాలి, అని). ఆశ్వలాయనులిట్లా - ఖడ్గపాత్రతో రేఖను వ్రాయాలి. అపహతాఅసురారక్షాంసి వేదిషదః, అను మంత్రంతో ఆ రేఖపై నీరు చల్లి, ఒక్కసారికే తెంపిన దర్భలతో దానిని కప్పి (పరచి) ప్రాచీనావీతుడై రేఖపై మూడుసార్లు జలము (తిల సహిత) చిలకరించాలి. శుంధంతాం పితరః శుంధంతాం పితామహాః శుంధంతాం ప్రపితామహా అని (శుద్ధులు కాని). ఆ రేఖపై పరాచీన పాణియై (వ్యతిరేక దిక్కులో ముడిచిన చేయి) పిండములనుంచాలి, పితరునకు, పితామహునకు, ప్రపితామహునకు ఇది ఈ పేరుగల నీకు, ఎవరైతే నిన్ను ఇక్కడ అనుసరిస్తున్నారో వారికి కూడ, అని. హేమాద్రి యందు పారస్కరుడిట్లా - కరములతో, ఖడ్గాకారంగల పాత్రతో, లేదా కుశలతో కాని ద్విజుడు భూమిపై వ్రాయాలి. బహ్వృచులకైతే చేతితోనే (చేతితో) (ఋగ్వేదం) రేఖ, అగ్నేయదిశ అభిముఖంగా అని వృత్తి. తూర్పువైపు ఎత్తు దక్షిణం వైపు

పల్లంగల వేదిపై రేఖలుంచాలి, అనే ఇది ఆపస్తం బోక్తి. దేవలుడిట్లా - ఆవాహన చేసి దర్భల అగ్రభాగముతో వారికి స్థానములు కల్పించాలి. వారు కూర్చున్నాక పాత్రతో తిలోదకమివ్వాలి. పరాచీనంగా - క్రింది పితృతీర్థంతో. వాయవీయమందిట్లా - తేనె నేయి నువ్వులు కలిపిన మూడు పిండములను బుధుడు ఇవ్వాలి, అని. త్రిస్థలీ సేతువుయందిట్లా - నువ్వులు, అన్నము, నీరు ధూపం, దీపం, పాలు, తేనె, నేయి వీని భాగములతో కలిసిన పిండము అష్టాంగమనబడుతుంది, అని.

**మూ॥ యాజ్ఞవల్క్యః** - (ఆచా 242) సర్వమన్నము పాదాయ సతిలం దక్షిణాముఖః ఉచ్ఛిష్టసన్నిధౌపిండాన్ దద్యాద్వై పితృయజ్ఞవత్ కేచిత్పిండేషుమాషాన్ వర్జయంతి. మాషాః శ్రాద్ధేషువైగ్రాహ్యాః వర్జ్యాస్తైవాగ్ని పిండయోః బ్రాహ్మణేషు యథామద్యంతథామాషాగ్ని పిండయోః ఇతిస్మృతి సాగరాత్. మాషాన్ సర్వత్రవైదద్యాత్ పిండే ఉగ్నౌ చవివర్జయేత్, ఇతి స్మృతేశ్చ. అత్రమూలంచింత్యం. హేమాద్రావపిసర్వశబ్దస్య ప్రకృతార్థత్వాత్ సర్వాన్న గ్రహణ ముక్తం. అత్రశేషమన్నమనుజ్ఞాప్యసర్వమేకత్రోద్ధృత్యఉచ్ఛిష్ట సమీపే దర్భేషుత్రీన్ త్రీన్ పిండాన్ దద్యాత్ ఇతిగోభిలసూత్రే. సర్వాస్మాత్ ప్రకృతా దన్నాత్ పిండాన్ మధు తిలాన్వితాన్. ఇతిచ శేషనియమాత్తద భావే పిండ నివృత్తి రితి ప్రాప్నోతీతి మైథిలవాచస్పతీ. తన్న, తుషోప వాపవత్ పరప్రయుక్త ద్రవ్య వత్వే ప్యర్థకర్మత్వాత్గుణానురోధేన ప్రధానాత్యాగాచ్ఛేషలోపేఽపిద్రవ్యాంతరేణకార్యం. అతోనేయం ప్రతిపత్తిః కింతు ప్రధానమిత్యుక్తం ప్రాక్. అన్యథా సపిండీకరణాదౌ సంయోజనాదేః ప్రధానస్య లోపాపత్తే రితిదిక్. అథపిండ ప్రమాణం హేమాద్రావంగిరాః- కపిత్థబిల్వ మాత్రాన్వా పిండాన్ దద్యాద్విధానతః, కుక్కుటాండ ప్రమాణాన్వామలకైర్బ దరైః సమాన్, ఇతి. తత్రైవ ధూమ్రః - కపిత్థస్య ప్రమాణేన పిండాన్ దద్యాత్సమాహితః, తత్సమం వికిరం దద్యాత్ పిండాంతే తు షడంగులే. అంత్యేష్టి పద్ధతౌ భట్టాస్తు - ఏకోద్దిష్టే సపిండే చ కపిత్థంతు విధీయతే, నారికేల ప్రమాణంతు ప్రత్యబ్దే మాసికే తథా. తీర్థే దర్శేచ సంప్రాప్తే కుక్కుటాండ ప్రమాణతః. మహాలయే గయాశ్రాద్ధే కుర్యాదామలకోపమం, ఇత్యాహుః. కలికాయాం ఆచార్యః - యత్రస్యుః బహవఃపిండాః తత్రబిల్వ ఫలో పమాః, యత్రచైకో భవేత్పిండఃతత్ర ఖర్జూరసన్నిభః. ప్రేత పిండస్తుదైర్ఘ్యేణ ద్వాదశాంగుల ఉచ్యతే ఇతి. వాయవీయే, పత్నీపిండాంస్తు మృద్నీయాత్ త్రివర్గస్య సహాయినీ. హేమాద్రౌ లౌగాక్షిః - మహాలయేగయాయాంచ ప్రేత శ్రాద్ధేదశాహికే, పిండశబ్ద ప్రయోగఃస్యాత్ అన్నమన్యత్ర కర్తయేత్ శాట్యాయనిః-అసావేతత్త ఇత్యుక్త్వాతదంతేచ స్వధానమః, అసావిత్యత్ర సంబంధరూపగోత్రాది విశిష్టం పిత్రాది నామసం బుద్ధ్యంత ముక్త్వా పునశ్చతుర్థ్యంతం.తదంతేఽయం పిండ ఇదమన్నంవా స్వధానమోనమమేతి వదేదితి హేమాద్రిః

అను॥ యాజ్ఞవల్క్యుడిట్లా - అన్నిరకరముల అన్నము తీసుకొని, అందులో నువ్వులు కూడా వేసి, దక్షిణముఖుడై, ఉచ్ఛిష్టం సమీపమందు పిండములను పెట్టాలి. పితృయజ్ఞం వలె, అని. కొందరు పిండములపై మినుములను విడిచి పెడ్తారు. శ్రాద్ధము లందు మినుములు గ్రహించతగినవి, అగ్ని పిండములందు విడువతగినవి (వద్దు). బ్రాహ్మణులకు

మద్యంవలె(వద్దు) అగ్నిపిండములందు మినుములు వద్దు, అని స్మృతి సాగరం నుండి. అంతటా మాషములనివ్వాలి, పిండము, అగ్నివీనియందు కూడదు, అని స్మృతి కూడా ఇక్కడ మూల వాక్యాలను గూర్చి ఆలోచించాలి. హేమాద్రి యందు కూడా సర్వశబ్దమునకు ప్రకృత అర్థమైనందువల్ల (ప్రకరణార్థం) అన్ని రకముల అన్న గ్రహణము చెప్పబడింది. ఇక్కడ మిగిలిన అన్నమును, బ్రాహ్మణ అనుజ్ఞ పొంది, అంతా ఒకచోట చేర్చి ఉచ్ఛిష్ట సమీపమందు దర్భలపై మూడేసి పిండములను ఉంచాలి, అని, గోభిల సూత్రమందు కలదు. అన్నిరకములైన ప్రకృత అన్నము నుండి, తేనె, నువ్వులు కలిపి పిండములను ఇవ్వాలి. అని కూడా శేష నియమము ఐనందువల్ల అది లేకపోతే పిండ (ప్రవృత్తి లేదు అని) నివృత్తి వస్తుందని మైథిల వాచస్పతులన్నారు. అట్లాకాదు. తుషోపవాపము వలె పరప్రయుక్త ద్రవ్యముకలదైనా, అర్థకర్మ ఐనందువల్ల గుణానురోధం వల్ల ప్రధానమైన దాన్ని విడువ వీలు లేదు కనుక శేషం లోపించినా మరో ద్రవ్యంతో చేయాలి. అందువల్ల ఇది ప్రవేశం కాదు ఇంకా ప్రధానమని చెప్పబడింది ముందే. లేని పక్షంలో సపిండీకరణాదు లందు సంయోజనాదులు ప్రధానమైనవి. వానికిలోపం రావలసి వస్తుంది, అని ఇక చాలు. ఇక పిండ ప్రమాణము - హేమాద్రి యందు అంగిరుడిట్లా - వెలగపండు, లేదా మారేడు పండు పరిమాణం కాని పిండములను శాస్త్రప్రకారం ఇవ్వాలి. కోడిగుడ్డు పరిమాణం, ఉసిరి, లేదా రేగు పండు పరిమాణంలోనైనా, అని. అక్కడే ధూమ్రుడిట్లా - చక్కని మనస్సుగలవాడై వెలగపండు ప్రమాణంతో పిండములనివ్వాలి. దానితో సమానంగా వికిరమివ్వాలి. పిండముల అంతమందు ఆరు అంగుళముల దూరంలో వికిరము, అని. అంత్యేష్టి పద్ధతియందు భట్టులిట్లా - ఏకోద్దిష్టమందు, సాపిండ్యమందును కపిత్థ పరిమాణం గల పిండముండాలి ఆబ్దికము (వార్షికము) మాసికమందైతే నారికేళ ప్రమాణంగా పిండముండాలి. తీర్థము అమావాస్య వస్తే కోడిగుడ్డు ప్రమాణమంత పిండం, మహాలయ మందు గయాశ్రాద్ధమందు ఉసిరికాయంత పిండం చేయాలని చెప్పారు. కలికయందు ఆచార్యులిట్లా - అనేక పిండములున్న చోట మారేడు పండ్లంత పిండములివ్వాలి. ఒకే పిండం ఉన్నచోట ఖర్జూరఫలమంత పిండమివ్వాలి. ప్రేత పిండమైతే పొడవులో పన్నెండు అంగుళములని చెప్పారు, అని. వాయవీయమందిట్లా - పత్ని పిండములనైతే చిదుమూలి త్రివర్గమునకు (ధర్మఅర్థ కామములకు) సహాయం చేసేది ఆమె, అని. హేమాద్రియందు లౌగాక్షి ఇట్లా - మహాలయమందు, గయయందు, ప్రేతశ్రాద్ధమందు పదవ రోజు శ్రాద్ధమందు పిండ శబ్ద ప్రయోగముంటుంది. ఇతర సందర్భము లందు అన్నము అని చెప్పాలి, అని. శాఠ్యాయని ఇట్లా - ఈ పేరుగల నీకు ఇది అని చెప్పి దాని చివర స్వధానమః, అని చెప్పాలి, అని. అసౌ అన్నప్పుడు అక్కడ సంబంధరూప గోత్రాదులతో కూడిన పిత్రాదుల పేరును సంబోధనాంతముగా చెప్పి తిరిగి చతుర్థ్యంతమును దాని చివర ఈ పిండము, లేదా ఈ అన్నము స్వధానమః న,మమ అని చెప్పాలి అని హేమాద్రి.

మూ॥ **పిత్రాదినామ** అజ్ఞానేత్వాపస్తంబః-యదినామాని నవిన్ద్యాత్స్వధాపితృభ్యః పృథివీషద్భ్య ఇతి ప్రథమంపిండందద్యాత్, స్వధా పితృభ్యో అంతరిక్ష సద్భ్య ఇతిద్వితీయం, స్వధాపితృభ్యోదివిషద్భ్య ఇతి తృతీయం ఏవం మాతామహేషు మాతృషుచ బహ్వృచానాం తూక్తంప్రాక్. **కలికాయాం** స్మృతిః- యావదేవోచ్చరేన్మంత్రంతా వత్ప్రాణం నిరోధయేత్, యేషాంతుగృహ్యేదర్శే మాతృశ్రాద్ధం పృథగుక్తం తేషాం పితృభ్యః పశ్చిమే మాతృభ్యః తత్పశ్చిమే మాతామహేభ్యః పిండాదిదేయమితి సాంఖ్యాయనః. అస్మిన్ పక్షేతత్పశ్చిమేమాతా మహీభ్యో ఽపిదద్యాదితి హేమాద్రిః. పూర్వాసు పితృభ్యోదద్యాదపరాసు స్త్రీభ్యః ఇతి సూత్రాచ్చ. ఏవం యత్ర తీర్థమహాలయాదౌ - కేచిదిచ్ఛంతినా రీణాం పృథక్ శ్రాద్ధం మహర్షయః ఇతి చతుర్వింశతి మతాత్. పిత్రాదినవదైవత్యం తథాద్వాదశదైవతం, ఇత్యగ్ని పురాణాచ్చ మాతౄణాం పృథగుక్తం. యత్రవా- ఆచార్యగురుశిష్యే భ్యః సఖిజ్ఞాతిభ్య ఏవచ, తత్పత్నీభ్యశ్చ సర్వాభ్యః తథైవ చ జలాంజలీన్, పిండాంస్తేభ్యః సదాదద్యాత్ పృథక్ భాద్రపదే నరః తీర్థేషు చైవ సర్వేషు మాఘమాసే మఘాసుచ, ఇతి చతుర్వింశతిమతే. దౌహిత్రపుత్ర దారాశ్చయే కనిష్ఠాః సహోదరాః, నిస్సంతానామృతాయేచ తేభ్యోప్యత్ర ప్రదీయతే ఇతి భవిష్యే. ఏకోద్దిష్టాన్యుక్తాని తత్రాపి తత్పశ్చిమే పిండదానం జ్ఞేయం. యేషాంన పృథక్ త్రైస్సపత్నీకాః పిత్రాదయోవాచ్యాః **అన్వష్టకాగయా** మాతృశ్రాద్ధం చైవ మృతేఽహని, ఏకోద్దిష్టం తథాముక్త్వా స్త్రీషునాన్యత్ పృథగ్భవేత్, ఇతి శంఖోక్తేశ్చ. **మనుః** - (అ3 శ్లో 216) తేషుదర్భేషుతం హస్తం నిమృజేల్లేప భాగినాం. హస్తే లేపాభావేఽపిహస్తం నిమృజ్యాదేవేతి **మేధాతిథిః విష్ణుః** - అత్ర పితరోమాదయధ్వమితి దర్భమూలే కరావ ఘర్షణం. **కలికాయాం సుమంతుః** - ఏకోద్దిష్టేషు వర్షాసు దర్భలేపోన విద్యతే, సపిండీకరణాదౌతు లేపః సర్వత్ర శస్యతే.

అను॥ పిత్రాదుల నామం తెలియనిచో ఆపస్తంబుడిట్లా - ఒకవేళ పేర్లు తెలియని పక్షంలో స్వధాపితృభ్యః పృథివీషద్భ్య అని తొలి పిండాన్ని ఇవ్వాలి. స్వధాపితృభ్యః అంతరిక్షసద్భ్యః అని రెండవది, స్వధాపితృభ్యః దివిషద్భ్య అని మూడవది ఇవ్వాలి. ఈ రకంగా మాతామహులందు, మాతలందు కూడా చేయాలి. బహ్వృచులకైతే ముందే చెప్పాము. కలికయందు స్మృతి ఇట్లా - మంత్రాన్ని ఉచ్చరించినంతసేపు ప్రాణాన్ని నిరోధించాలి (ఒకే శ్వాసతో మంత్రోచ్చారణ). ఎవరికి గృహ్య సూత్రమందు, అమావాస్య యందు మాతృశ్రాద్ధం విడిగా చెప్పబడిందో వారికి, పితరులకు పశ్చిమంలో మాతలకు, వారికి పశ్చిమంలో మాతామహులకు పిండాదులు ఇవ్వాలని సాంఖ్యాయనులన్నారు. ఈ పక్షమందు వారికి పశ్చిమంలో మాతా మహీలకు (స్త్రీలకు) కూడా ఇవ్వాలని హేమాద్రి. పూర్వమందు పితరులకు ఇవ్వాలి. అపరమందు స్త్రీలకు అని సూత్రాన్ననుసరించి. ఇట్లా ఎక్కడ తీర్థమహాలయాదులందు - కొందరు మహర్షులు స్త్రీలకు విడిగా శ్రాద్ధమును ఇష్టపడుతారు, అని చతుర్వింశతి మతాన్ననుసరించి, పిత్రాదినవదైవత్యము, అట్లాగే ద్వాదశ దైవతము, అని అగ్ని పురాణాన్ననుసరించి మాతలకు విడిగా చెప్పారో, ఎక్కడైతే- ఆచార్యగురు శిష్యులకు సఖులకు జ్ఞాతులకు, వారి భార్యలకు అందరికి (స్త్రీలకు) అట్లాగే జలాంజలులను వారికి

పిండములను ఎప్పుడూ, విడిగా, భాద్రపదమందు నరుడు ఇవ్వాలి. అన్ని తీర్థములందు మాఘ మాసమందు మఘా నక్షత్రములందు ఇవ్వాలి అని చతుర్వింశతి మతమందు కలదో, దౌహిత్రులు, పుత్రులు, భార్యలు, కనిష్ఠ సహోదరులు, సంతానం లేకుండా మరణించిన వారు ఎవరు ఉన్నారో వారికి కూడా ఇక్కడ పిండం ఇవ్వబడుతుంది, అని భవిష్యమందు ఏకోద్దిష్టములు చెప్పబడ్డాయో, అక్కడ కూడా దానికి పశ్చిమ మందు పిండదానమని తెలుసుకోవాలి. ఎవరికి విడిగా చెప్పబడలేదో వారికి భార్యలతో కూడిన పిత్రాదులను చెప్పాలి. అన్వష్టక, గయ, మాతృశ్రాద్ధములు, మరణించిన రోజున ఏకోద్దిష్టం వీనిని వదలి స్త్రీలకు ఇతరమైన శ్రాద్ధము విడిగా లేదు, అని శంఖోక్తి కూడా. మనువిట్లా - ఆదర్భలందు లేప భాగులకై ఆహస్తముతో తుడువాలి. హస్తమందు లేపం లేకపోయినా హస్తముతో తుడవాల్సిందే అని మేధాతిథి అన్నాడు (తొలి ముగ్గురు పిండార్హులు, తరువాతి ప్రపితామహుల తర్వాతి ముగ్గురు 4,5,6 వీరు లేపభాజులు). విష్ణువిట్లా - ఇక్కడ పితరో మాధయధ్వం,అని దర్భమూలమందు చేతితో ఘర్షణ చేయాలి,అని. కలికయందు సుమంతు విట్లా - ఏకోద్దిష్టములందు, వార్షికములందు దర్భలేపము లేదు. సపిండీకరణాదులందైతే లేపము అంతటా ఉంటుంది,అని.

**మూ॥ మనుః - (అ3 శ్లో 217) ఆచమ్యోదక్ పరావృత్య త్రిరాయమ్య శనైరసూన్, షడ్ ఋతూంశ్చ నమస్కుర్యాత్ పితౄనే వచ మంత్రవత్. ఉదకం నినయేచ్ఛేషం శనైః పిండాంతికే పునః, త్రిః ప్రాణాయామం కృత్వేతి మేధాతిథిః. అమంత్రం ప్రాణాన్నిరుధ్యేతి కర్కాద్యాః. మంత్రవత్ - వసంతాయనమః. నమోవః పితర ఇత్యాద్యైః. శేషం పూర్వావనయన శేషం. ఆశ్వలాయనః - నిపృతా ననుమంత్రయే తాత్ర పితరోమాద యధ్వం యథా భాగమా వృషాయధ్వమితి సవ్యా వృదుదగా వృత్య యథాశక్తి ప్రాణాన్నాసిత్వా అభిపర్యా వృత్యా అమీ మదన్త పితరో యథా భాగమా వృషాయి షతేతి చరోః ప్రాణ భక్ష్యం భక్షయేన్నిత్యం నినయనం, ఇతి. నిత్య గ్రహణం శేషా భావేఒపి కుర్యాదిత్యర్థః. శౌనకః - అత్రైషామత్ర పితర ఇత్యాద్యే నానుమంత్రణం. అమీమదంతే త్యాద్యేన మంత్రేణా ప్యను మంత్ర్యతాన్. పిండశిష్టచరోరన్నం కించిదాఘ్రాయతత్త్యజేత్. ప్రక్షాల్యా చమ్య శుంధంతా మిత్యాద్యై రేవపూర్వవత్. మంత్రైః పిండేషు పానీయం నిషించేత్పితృతీర్థతః. వ్యాఘ్రః - అద్భిఃప్రక్షాల్య తత్పాత్రం ప్రతి పిండంతు పూర్వవత్, కృత్వావనే జనం కుర్యాత్ పిండ పాత్ర మధోముఖం. ఏతత్కాతీయాదీనాం**

అను॥ మనువిట్లా - ఆచమనం చేసి ఉత్తరం వైపు తిరిగి మూడు సార్లు మెలమెల్లగా ప్రాణములను నిరోధించి, ఆరు ఋతువులను నమస్కరించాలి. పితరులను మంత్రం వలె నమస్కరించాలి. మిగిలిన జలాన్ని మెల్లగా పిండముల సమీపమునకే తీసుకెళ్ళాలి,అని. మూడుమార్లు ప్రాణాయామం చేయాలి అని మేధాతిథి. మంత్రం లేకుండా ప్రాణములను నిరోధించి అని కర్కాదులు అన్నారు. మంత్రం వలె అనగా వసంతాయ నమః, నమోవః పితరః, అను మొదలగు విధంగా. శేషమనగా ముందు తీసుకున్న

జలశేషము. ఆశ్వలాయను లిట్లా – కూర్చున్న పితరులను ప్రార్థించాలి, అత్ర పితరోమాధయధ్వం, యథా భాగమా వృషాయధ్వం, అని సవ్యంగా ఉత్తరం వైపు తిరిగి (సవ్యపద్ధతిలో) శక్తి కొలది ప్రాణముల నిరోధించి (నాసిక నుండి లాగి) యథా విధిగా తిరిగి,అ మీ మదంత పితరో యథా భాగమావృషాయిషత అని చరు ప్రాణభక్షణం చేసి (గాలిలోనే ఆస్వాదించి) నిత్య కార్యాన్ని ఆచరించాలి, అని. నిత్యం అని చెప్పటం వలన శేషం మిగలకపోయినా ఆచరించాలని అర్థము. శౌనకుడిట్లా – పిదప వీరికి అత్రపితరః అను మొదలగు ఋక్కుతో ఆవాహన చేయాలి. అమీ మదంత అను మొదలగు మంత్రంతో కూడా వారిని అనుమంత్రించాలి. పిండమునకు కాగా మిగిలిన చరు అన్నమును కొంచెంగా వాసన చూసి దానిని విడిచేయాలి. చేయికడుగుకొని ఆచమనంచేసి శుంధంతాం అని మొదలుగా గల మంత్రములతోనే పూర్వంలాగా పితృతీర్థం నుండి పిండములపై నీటిని చల్లాలి, అని. వ్యాఘ్రుడిట్లా – ఆ పాత్రలోని నీటితో పూర్వంలాగా ప్రతిపిండమును ప్రక్షాళన చేసి, ఆ పాత్రను కడిగి పిండపాత్రను అధోముఖంగా చేయాలి,అని. ఇది కాతీయాదులకు చెందినది.

**మూ॥ ఆచార్యః** – తతః సమ్యక్ ద్విరాచమ్య నీవీం విస్రస్య వాగ్యతః. **ఆశ్వలాయనః** – అసావభ్యంక్ష్వ సావభ్యంక్ష్వేతి పిండేష్వభ్యంజనాంజనే వాసోదద్యాద్దశా మూర్ణాస్తు కాంవా పంచాషద్వర్షతాయా, ఊర్ధ్వం స్వలోమైతద్వః పితరో వాసోమానోతోఽన్య త్పితరో యుంగ్ ధ్వమితి. శ్రాద్ధ చింతామణౌ బ్రాహ్మే – ఏతద్వః పితరోవాస ఇతి జల్పన్ పృథక్ పృథక్, అముకాముక గోత్రే తత్తుభ్యం వాసః పరేద్బుధః. ఇదం కాతీయానాం. ఏతద్వ ఇత్యుపాస్య సూత్రాణి ప్రతిపిండం, ఇతి తత్సూత్రాత్. **హేమాద్రౌ బ్రాహ్మే** – శ్రేష్ఠమాహు స్త్రైకకుదమంజనం నిత్యమేవహి, తైలం కృష్ణతిలేభ్యశ్చ దద్యాదభ్యంజనంహితత్. త్రైకకుదం సురమా ఇతి ప్రసిద్ధం. అంజన ప్రాథమ్యం ఆపస్తంబాది విషయం. **తత్రైవ వ్యాఘ్రః** – గంధపుష్పాణి ధూపం చ దీపం చ వినివేదయేత్. **దేవలః** – దక్షిణాం సర్వభోగాంశ్చ ప్రతిపిండం ప్రదాపయేత్, భక్ష్యాణ్య పూపానిక్షూంశ్చవ్యం జనాన్యశనానిచ. తత్రైవ శంఖః – యత్కించిత్పచ్యతేగేహే భక్ష్యం భోజ్య మగర్హితం, అనివేద్య నభోక్తవ్యం పిండమూలే కథంచన. ఏతత్సర్వే నేతికేచిత్. యుక్తంతు అపసవ్యేన.

అను॥ ఆచార్యుడిట్లా – ఆ పిదప చక్కగా రెండుసార్లు ఆచమనం చేసి, నీవినివదలు చేసి, మౌనంగా ఉండాలి అని. ఆశ్వలాయనుడిట్లా–అసౌ అభ్యంక్ష్వ, అని పిండములందు అభ్యంజన, అంజన, వాసములను ఇవ్వాలి. దశను కాని (నేసినబట్ట తునక చివర ముడులు వేసి), మేషలోమనిర్మితమైన రజ్జువు కాని, ఏభై ఏళ్ళు దాటిన వయస్సైతే తన రొమ్ము వెంట్రుకలతో కాని, ఏతద్వః పితరోవాసః మానోతోఽన్యత్ పితరోయుఙ్ధ్వం, అని ఉంచాలి, అని. శ్రాద్ధ చింతామణి యందు బ్రాహ్మోక్తి ఇట్లా – ఏతద్వఃపితరోవాసః, అని పల్కుతూ విడివిడిగా, ఈ ఈ గోత్రముల వారికి ఇది మీకు వస్త్రము అని బుధుడు పఠించాలి, అని. ఇది కాతీయులకు చెందినది. ఏతద్వః అని పూజించి ప్రతి పిండమునకు సూత్రములు,

అని వారి సూత్రాన్ననుసరించి, హేమాద్రి యందు బ్రాహ్మోక్తి ఇట్లా - త్రికకుత్ అను పేరుగల పర్వతం నుండి లభించిన కాటుక ఎల్లప్పుడూ శ్రేష్ఠమని చెప్పారు. నల్లని నువ్వుల నుండి లభించిన తైలమును ఇవ్వాలి. ఆ అభ్యంజనము హితమైనది, అని. త్రైకకుదమనగా సురమా అని ప్రసిద్ధమైనది. అంజనమునకు ప్రథమస్థానమిచ్చుట ఆపస్తంబాదుల విషయకము. అక్కడే వ్యాఘ్రుడిట్లా- గంధపుష్పములు ధూపము దీపము నివేదించాలి, అని. దేవలుడిట్లా దక్షిణను, అన్ని భోగములను ప్రతి పిండమునకు ఇవ్వాలి. భక్ష్యములు, అపూపములు, చెరుకుగడలు, వ్యంజనములు అశనములు ప్రతిపిండమునకివ్వాలి, అని. అక్కడే శంఖుడిట్లా - ఇంటియందు వండబడినది ఏదైనా అగర్హితమైన ఏ భక్ష్యభోజ్య పదార్థమైనా ఏ విధంగాను పిండ మూలమందు నివేదించకుండా భుజించరాదు, అని. దీనిని సవ్యంగా చేయాలని కొందరంటారు. దీనిని అపసవ్యంతో చేయటమే యుక్తము.

**మూ॥ మనుః-అవజిఘ్రేచ్చతాన్పిండాన్ యథాన్యుప్తాన్ సమాహితః, తతో, నమోవః పితరఇషే, ఇత్యాదినా ఉపస్థానం. మాత్స్యే-** అథా చాంతేషుచా చమ్య వారిదద్యాత్ సకృత్ సకృత్. తిల పుష్పాక్షతాన్పశ్చాత్ అక్షయ్యోదకమేవచ. అత్రదైవేసవ్యం పిత్ర్యేత్వపసవ్యమితికర్కః పరిభాషోక్త వచనాత్ సవ్యమితియుక్తం. అత్రశివా ఆపః సంతు సౌమనస్యమస్త్విత్యాది ప్రయోగోజ్ఞేయః **మాత్స్యే-**దత్వాశీః ప్రతిగృహ్ణీయాత్ ద్విజేభ్యః ప్రాఙ్ముఖోబుధః, అఘోరాః పితరఃసంతు సన్త్విత్యుక్తే పునర్ద్విజైః, గోత్రం తథా వర్ధతాం నమస్తథేత్యుక్తః సతైః పునః, దాతారోనోఽభివర్ధంతా మన్నంచైవేత్యుదీరయేత్. స్వస్తివాచనకం కుర్యాత్, పిండానుద్ధృత్య భక్తితః. **స్వస్తివాచనాత్ప్రాక్** పాత్రచాలనంకార్యం. **హేమాద్రౌబృహస్పతిః-** భాజనేషుచతిష్ఠత్సు స్వస్తి కుర్వంతియేద్విజాః తదన్నమసురైర్భుక్తం నిరాశైఃపితృభిర్గతైః. **జాతూకర్ణ్యః-** పాత్రాణి చాలయేచ్ఛ్రాద్ధే స్వయం శిష్యోఽథవాసుతః నస్త్రీభిఃనచబాలేన, నా సజాత్యాకథంచన. **యాజ్ఞవల్క్యః-**(ఆచార శ్లో 242) స్వస్తివాచ్యంతతః కుర్యాత్ అక్షయ్యోదకమేవచ. తత్రైవ వృద్ధశాతాతపః- పిత్ర్యాణాం నామగోత్రేణ కరే దేయం తిలోదకం, ప్రత్యేకంపితృ తీర్థేన అక్షయ్యమిదమస్త్వితి అత్రషష్ఠీప్రాగుక్తా. **తత్రైవనాగరఖండే-**ఉత్తానమర్ఘ్య పాత్రంతుకృత్వా దద్యాచ్చ దక్షిణాం, హిరణ్యం దేవతానాంచ పిత్ర్యాణాం రజతం తథా. బృహస్పతిః - తస్మాత్పణం కాకిణీంవా ఫలం పుష్ప మథాపివా, ప్రదద్యాద్దక్షిణాం యజ్ఞే తయాసఫలోభవేత్. అత్ర పిత్ర్యుద్దేశేన దక్షిణాదానే అపసవ్యం విప్రోద్దేశేన సవ్యమితి మాధవః. కలికాయామాచార్యః-దద్యాద్యజ్ఞోపవీత్యేవ తాంబూలం దక్షిణాంతథా. అత్రిః -వదేచ్ఛతాంస్తతో విప్రాన్ పిత్రాదిభ్యః స్వధోచ్యతాం. గోభిలః-అఘోరాః పితరః సన్త్విత్యుక్త స్వధాం వాచయిష్య ఇతి పృచ్ఛతి పితృభ్యః స్వధోచ్యతామితుక్తేఽస్తు స్వధేత్యుచ్య మానే ధారాందద్యాదూర్జం వహన్తీ, ఇతి.

అను॥ మనువిట్లా- ఉంచిన క్రమంగా ఆ పిండములను స్థిరచిత్తంతో వాసన చూడాలి. ఆ పిదప, నమోవః పితర ఇషే, అను మొదలుగాగల మంత్రంతో ఉపస్థానము, అని. మాత్స్యమందిట్లా - ఆచాంతమయ్యాక (తిని చేయి కడుగుకున్నాక) ఆచమనంకై

వారికి ఒక్కొక్కసారి నీరు ఇవ్వాలి. పిదప తిల పుష్ప అక్షతలను అక్షయ్యోదకమును ఇవ్వాలి, అని. ఇక్కడ దైవమందు సవ్యంగా పితరులకైతే అపసవ్యంగా అని కర్కుడు. పరిభాషయందు చెప్పిన విధముగానైతే సవ్యముగా అనుట తగును. ఇక్కడ, శివా ఆపఃసంతు సౌమనస్యమస్తు, అని మొదలుగాగల ప్రయోగము అని తెలుసుకోవాలి. మాత్స్యమందిట్లా – బుధుడు ప్రాఙ్ముఖుడై బ్రాహ్మణులకు వానిని ఇచ్చి ఆశీర్వాదమును స్వీకరించాలి. అఘోరాః పితరః సంతు అని బ్రాహ్మణుల నడిగి తిరిగివారు, సన్తు అని అన్నాక, అట్లాగే గోత్రం అభివృద్ధి చెందని, అని నమస్కరించగా తిరిగి వారు ఈతనితో అట్లాగే కాని అని చెప్పగా, దాతారోనోఽభివర్ధంతాం అన్నంచైవ అని పలకాలి. పిండములనెత్తివేసి భక్తితో స్వస్తివాచనకము చేయాలి. స్వస్తి వాచనకన్న ముందు పాత్రములను చాలన చేయాలి (కదిలించాలి). హేమాద్రియందు బృహస్పతి ఇట్లా – తిన్న విస్తళ్ళు అలా ఉండగా స్వస్తి వాచనముద్విజులు చేసినచో, ఆ అన్నమును అసురులు తింటారు, పితరులు నిరాశులై వెళ్తారు. (వెళ్ళాక అసురులు తింటారు) అని. జాతూకర్ణి ఇట్లా – శ్రాద్ధమందు పాత్రలను తానే తీయాలి, లేదా శిష్యుడు తీయాలి లేదా కొడుకు తీయాలి. స్త్రీలు కాని పిల్లలు కాని అసజాతీయులు కాని ఎప్పుడూ తీయరాదు, అని. యాజ్ఞవల్క్యుడిట్లా – స్వస్తివాచనం ఆ పిదప అక్షయ్యోదకము చేయాలి, అని. అక్కడే వృద్ధ శాతాతపుడిట్లా – పితరుల నామ గోత్రములతో (చెప్పి) తిలోదకమును వారి చేతిలోకివ్వాలి. విడివిడిగా, పితృతీర్థంతో, అక్షయ్యం ఇదమస్తు అని, ఇవ్వాలి అని. ఇక్కడ షష్ఠి అని ముందే చెప్పాము. అక్కడే నాగరఖండమందిట్లా – అర్ఘ్యపాత్రను ఉత్తానం చేశాక (బోర్లించింది సరిచేశాక) దక్షిణను ఇవ్వాలి. దేవతలకు హిరణ్యమును, పితరులకు రజతమును ఇవ్వాలి, అని. బృహస్పతి ఇట్లా – అందువల్ల పణమును కాని కాకిణిని కాని ఫలము కాని పుష్పము కాని యజ్ఞమందు దక్షిణను ఇవ్వాలి. దానితో ఆతడు సఫలుడౌతాడు, అని. ఇక్కడ పితరులనుద్దేశించి దక్షిణ ఇస్తే అపసవ్యంగా బ్రాహ్మణులనుద్దేశించి దక్షిణ ఇస్తే సవ్యంగా అని మాధవుడన్నాడు. కాలికయందు ఆచార్యుడిట్లా – తాంబూలము, దక్షిణ వీటిని యజ్ఞోపవీతిగానే ఇవ్వాలి, అని. (సవ్య, అపసవ్య). అత్రి ఇట్లా – ఆ పిదప ఆ బ్రాహ్మణులతో పిత్రాదిభ్యఃస్వధా, అని పలకండి అని చెప్పాలి, అని. గోభిలుడిట్లా – అఘోరాః పితరఃసంతు అని పలికి సంతు అన్నాక స్వధాంవాచయిష్యే అని పలికి అడుగుతాడు పితృభ్యః స్వధా అని చెప్పండి అని అడుగగా అస్తు స్వధా అని వారన్నాక, ఊర్జంవహంతీ అను మంత్రంతో జలధారను (తిలోదకంను కాని) ఇవ్వాలి, అని.

**మూ॥ ఆపస్తంబేనతు** – (అపస్తంబమంత్ర బ్రాహ్మణే) పుత్రాన్ పౌత్రానభితర్పయంతీ ఇత్యపి పరిషేచనే మంత్ర ఉక్తః. ఆశ్వలాయనః – అద్భైతాన్ ప్రవాహయేత్ – పరేతన పితరస్సోమ్యాసోగంభీరేభిః పథిభిః పూర్విణేభిః. దత్వాయాస్మభ్యంద్రవిణేహభద్రం రయించ నస్సర్వవీరం నియచ్ఛతేతి. **మాత్స్యే**–వాజే వాజే ఇతిజపన్ కుశాగ్రేణ విసర్జయేత్. ప్రచేతాః – స్వస్తి వాచ్యం తతఃకృత్వా పితృపూర్వం విసర్జయేత్. ఆశ్వలాయనః– అన్నం ప్రకీర్యోపవీత్యా

ఓంస్వధోచ్యతామితి విసృజేదస్తు స్వధేతివా. బ్రహ్మవైవర్తే - ఆమావాజేతిమంత్రంతు పరిత్వాచప్రదక్షిణం, ద్వారోపాంతేతతఃకృత్వాసంయతః ప్రవిశేద్గృహం. ప్రాంజలిశ్చ తతః ప్రాహతాన్ విప్రాన్ సత్యవాదినః, దాతారోనోఽభివర్ధంతాం అన్నం చన ఇతీవహి. ఏవ మస్త్వితితేతంచ కథయంతి సమాహితాః ఏతన్మండల దేశే కార్యమితి హేమాద్రిః. మనుః-దాతారోనోఽభివర్ధంతాం వేదాస్సంతతిరేవచ, శ్రద్ధాచనోమావ్యగమత్ బహుదేయంచనోఽస్తు, ఇతి. బౌధాయనః- అన్నం చనో బహుభవేత్ అతిథీంశ్చ లభేమహి, యాచితారశ్చనస్సంతు మాచయాచిష్మకంచన, ఇతి. అత్రదాతారోనోఽభివర్ధంతాం-లభధ్వంమా, యాచిధ్వం ఇత్యాద్యూహేపఠిత్వా విప్రైః ప్రతివచనం కార్యమితి సుదర్శన భాష్యే. స్వాదుషం సదః, ఇతి బ్రాహ్మణా సఃపితరః, ఇతి మంత్రద్వయంచ పఠంతి, శౌనకః- బ్రాహ్మణానథనిర్యాతాన్ పరీత్యత్రిః ప్రదక్షిణం, సస్త్రీకః స్వజనైస్సార్ధం ప్రణమేద్ర చితాంజలిః, కనిష్ఠ ప్రథమాజ్యేష్ఠ చరమాఃస్యుః ప్రదక్షిణే. హేమాద్రౌ బృహస్పతిః- అద్యమే సఫలం జన్మభవత్పాదాబ్జవందనాత్, అద్యమే వంశజాః సర్వేయాతావోఽనుగ్రహాద్దివం. పత్రశాకాదిదానే నక్లేశితాయూయమీదృశాః తత్క్లేశజాతం చిత్తాత్తు విస్మృత్యక్షంతు మర్హథ. ప్రచేతాః- విసృజేద్భక్తి సంయుక్తః సీమాంతే చాప్యనువ్రజేత్, ఇతి.

అను॥ ఆపస్తంబుడైతే (ఆపస్తంబ మంత్ర బ్రాహ్మణమందు) పుత్రాన్ పౌత్రానభితర్పయంతీ, అని కూడా పరిషేచనమందు మంత్రం చెప్పబడింది. ఆశ్వలాయనుడిట్లా - ఇక ఈ పిండములను పరేతన పితరః, అను మంత్రంతో ప్రవాహణం చేయాలి (ముందుకు నడిపించాలి పితృలోకానికి) అని. మాత్స్యమందిట్లా - వాజే వాజే అని జపిస్తూ కుశాగ్రంతో విసర్జన చేయాలి, అని. ప్రచేతుడిట్లా - ఆ పిదప స్వస్తి వాచన చేసి పితరులు ముందుండునట్లుగా వారిని విడిచి పెట్టాలి, అని. ఆశ్వలాయనుడిట్లా - అన్నాన్ని వెదజల్లి ఉపవీతియై ఓంస్వధా, అని చెప్పండి అని లేదా అస్తుస్వధా అని కాని పలికి విడిచి పెట్టాలి, అని. బ్రహ్మవైవర్తమందిట్లా, ఆమావాజ అను మంత్రమును పఠించి, ప్రదక్షిణంను ద్వారసమీపమందు చేసి, పిదప సావధానుడై ఇంటిలోకి ప్రవేశించాలి. చేతులు జోడించి ఆ బ్రాహ్మణులతో ఇట్లనాలి. సత్యవాదులు మీరు దాతారఃనో అభివర్ధంతాం అన్నంచనః అని ఇట్లాగా చెప్పాలి. వారు సమాహిత చిత్తులై ఆతనితో అట్లాగే కాని అని అంటారు. దీనిని మండల దేశంలో చేయాలని హేమాద్రి. మనువిట్లా - దాతారోనోభివర్ధంతా.... అస్తు అని, బౌధాయనుడిట్లా - అన్నంచనో బహు.... కంచన, అని. ఇక్కడ, దాతారోనోఽభివర్ధంతా..... అని ఆతడనగా వారు లభధ్వం అని యాచితారశ్చ.... అని అనగామా, యాచిధ్వం అని మొదలుగా వారు అనటాన్ని (ఊహలో), చదివి బ్రాహ్మణులు ప్రతివచనం చేయాలి అని సుదర్శన భాష్యమందు. స్వాదుషం సదః అని బ్రాహ్మణాసః పితరః అని మంత్రములు రెంటిని చదువుతారు. శౌనకుడిట్లా - బయలుదేరిన బ్రాహ్మణులను సమీపించి, స్త్రీలతో కూడి, తన వారితో కూడి మూడు ప్రదక్షిణాలు చేసి చేతులు జోడించి నమస్కరించాలి. చిన్నవారు మొదటగా (ఆవరుసలో) పెద్దవారు చివరగా ఉండాలి ప్రదక్షిణం చేసేప్పుడు, అని. హేమాద్రియందు బృహస్పతి

ఇట్లా – అద్యమే సఫలం జన్మ.... క్షంతుమర్హథ, అని చెప్పాలి అని. ప్రచేతుడిట్లా – భక్తితో వారిని విడిచిపెట్టాలి, వెళ్ళేవారిని సీమాంతము వరకు అనుసరించాలి, అని. (ఎనిమిదడుగులని కారికాభాష్యం).

మూ॥ **అథపిండ ప్రతిపత్తిః** – హేమాద్రౌబ్రహ్మాండే – పిండమగ్నౌ సదాదద్యాత్ భోగార్థీ పరమంనరః, పత్న్యైప్రజార్థీదద్యాద్వైమధ్యమం మంత్రపూర్వకం. ఉత్తమాం గతిమన్విచ్ఛన్ గోషు నిత్యం ప్రయచ్ఛతి. ఆజ్ఞాం ప్రజ్ఞాం యశఃకీర్తిం అప్సుపిండం ప్రవేశయేత్ ప్రార్థయన్ దీర్ఘమాయుష్యం వాయసేభ్యఃప్రయచ్ఛతి. ఆకాశంగమయేదప్సు స్థితో వాదక్షిణాముఖః ఆశ్వలాయనః –వీరంమేదత్త పితర, ఇతి పిండానాం మధ్యమంపత్నీం ప్రాశయేత్ ఆ ధత్త పితరోగర్భం కుమారం పుష్కరస్రజం. యథాయ మరపా అసదితి, భర్త్రాదత్తస్య ఆద్యే నాదాయద్వితీయేన ప్రాశనం. ఆపస్తంబస్తు దానే మంత్రమాహ – అపాంత్వోషధీనాంరసంప్రాశయామి, భూతకృతం గర్భంధత్స్వేతి మధ్యమం పత్న్యై ప్రయచ్ఛతీతి. ప్రాశనేపి, యథేహ పురుషోఅసది, తితదీయః పాఠః. అన్యేషాం తత్తచ్ఛా ఖాయాంజ్ఞేయః తత్రైవ శంఖః – పత్నీవామధ్యమం పిండమశ్నీయాత్ ఆర్తవాన్వితా కలికాయాంఛా గలేయః – ప్రాచీనావీతినా మంత్ర్యపత్నీం పిండో విభజ్యతే, ప్రతిపత్త్యస్య మంత్రస్య కర్త వ్యావృత్తిరత్రతు. మాధవీయేవిష్ణు ధర్మే – తీర్థశ్రాద్ధేసదాపిండాన్‌క్షిపేత్తీర్థేసమాహితః. యాజ్ఞ వల్క్యః – పిండాస్తు గోఽజావిప్రేభ్యోదద్యాదగ్నౌ జలేఽపివా. బృహస్పతిః– అన్యదేశగతాపత్నీరోగిణీ గర్భిణీ తథా, తదాతం జీర్ణవృషభః ఛాగోవాభోక్తుమర్హతి. **అథపిండోపఘాతే** – హేమాద్రౌ ప్రాయశ్చిత్తకాండే దేవలః –శ్వసృగాలఖరైః పిండోస్పృష్టోభిన్నః ప్రమాదతః, కర్తురాయుష్యనాశస్స్యాత్ ప్రేతస్తంనోపసర్పతి. జాతూ కర్ణ్యః– పూర్వశ్లోకాంతే– తద్దోషపరిహారార్థం ప్రాజాపత్యం ప్రకల్పయేత్, పునస్స్నాత్వాతదాకర్తాపిండం కుర్యాద్యథావిధి. **కాకస్పర్శేతుస దోషః** – పిండోపఘాతం ప్రక్రమ్య–ధనస్య చవినాశస్స్యాత్ కాక స్పర్శాదికం వినేతి. తత్రైవ శ్లోకేగౌతమోక్తేః. **స్మృతిదర్పణేఽత్రిః** – మార్జారమూషక స్పర్శే పిండేచద్విదళీకృతే పునఃపిండాః ప్రదాతవ్యాఃతేనపాకేనతత్‌క్షణాత్. బౌధాయనః – శ్వచాండాలాదిభిః స్పృష్టః పిండోయద్యుపహన్యతే, ప్రాజాపత్యం చరిత్వాఽథ పునఃపిండం సమాచరేత్.

అను॥ ఇక పిండ ప్రతిపత్తి (వినియోగము) హేమాద్రియందు బ్రహ్మాండోక్తి ఇట్లా – భోగమును కోరే నరుడు మొదట ఎప్పుడూ పిండమును అగ్నియందు ఇవ్వాలి, సంతానము కోరువాడు మంత్రపూర్వకముగా మధ్యమ పిండమును భార్యకివ్వాలి, అని. ఉత్తమ గతిని కోరువాడు ఎప్పుడూ గోవులకు ఇవ్వాలి. ఆజ్ఞ, ప్రజ్ఞ, యశస్సు, కీర్తి వీటిని కోరువాడు పిండమును నీటియందు విడువాలి దీర్ఘాయుస్సును కోరువాడు కాకులకు ఇవ్వాలి. దక్షిణాభిముఖుడై నీటియందు నిలబడి ఆకాశమందు విడువాలి. ఆశ్వలాయనుడిట్లా – వీరంమేదత్త పితర, అను మంత్రంతో పిండములలోని మధ్యమ పిండమును భార్యకు ప్రాశనకై ఇవ్వాలి (తినుటకు). ఆధత్తపితరో.... అసత్, అను ఈ మంత్రంతో భర్త ఇచ్చిన దానిని, తొలి మంత్రంతో స్వీకరించటం, రెండవ మంత్రంతో ప్రాశనము, అని. ఆపస్తంబుడు దానమందు మంత్రాన్ని ఇట్లా చెప్పాడు – అపాంత్వోషధీనాం...... ధత్స్వ, అనే మంత్రంతో

మధ్యమ పిండాన్ని భార్యకివ్వాలి, అని. ప్రాశనమందు కూడా, యథేహ పురుషో అసత్, అనే మంత్రం ఆతని పాఠమందు కలదు. ఇతరులకు ఆయాశాఖలయందు తెలుసుకోవాలి. అక్కడే శంఖుడిట్లా - ఋతుమతి అయ్యాక భార్య మధ్యమ పిండమును భుజించాలి, అని. కలిక యందు ఛాగలేయుడిట్లా - ప్రాచీనావీతుడై ఆమంత్రణ చేసి భార్యల, పిండమును విభజించి ఇవ్వాలి. ఇక్కడ ప్రతి భార్య దగ్గర ఈ మంత్రమును ఆవృత్తి చేయాలి, అని. మాధవీయమందు విష్ణు ధర్మోక్తి ఇట్లా - తీర్థ శ్రాద్ధమందు ఎప్పుడూ పిండములను సావధానమనస్కుడై తీర్థమందు వేయాలి, అని. యాజ్ఞవల్క్యుడిట్లా - పిండములను గోవునకు మేకకు, బ్రాహ్మణునకు, అగ్నియందు, నీటియందు వీటిలో ఎక్కడైనా ఇవ్వాలి, అని. బృహస్పతి ఇట్లా - భార్యవేరే దేశమునకు పోయిన ఎడల, రోగిణియైన, గర్భిణి యైనా, అప్పుడు దానిని ముసలి ఎద్దు కాని మేకపోతు కాని తినుటకర్హమైనది, అని. ఇక పిండోపఘాతమందు-హేమాద్రియందు ప్రాయశ్చిత్త కాండమందు దేవలుడిట్లా - కుక్క నక్క, గాడిద ఇవి పిండమును ముట్టినా, వీటి స్పర్శతో ప్రమాదం వల్ల భిన్నమైనా దీనివల్ల కర్తకు ఆయుష్య నాశమౌతుంది. ప్రేత దానిని చేరదు, అని. జాతూ కర్ణ్యుడు - పూర్వశ్లోకం చివర - ఆ దోష పరిహారం కొరకు ప్రాజా పత్యవ్రతమాచరించాలి, తిరిగి స్నానం చేసి అప్పుడు కర్త శాస్త్ర ప్రకారం పిండం చేయాలి, అని. (మూడు రోజులు ప్రొద్దున, మూడు రోజులు రాత్రి పూట, మూడు రోజులు ఆయాచితంగా వచ్చిన దానిని తినాలి. తరువాత మూడు రోజులు ప్రాజాపత్యమాచరిస్తూన్న ద్విజుడు తినరాదు. ఇది ప్రాజాపత్యవ్రతం). కాక స్పర్శయందు దోషం లేదు. పిండోపఘాతాన్ని గూర్చి ఆరంభించి - కాకస్పర్శాదికము లేకపోతే ధన నాశమౌతుంది, అని. అక్కడే శ్లోకమందు గౌతమోక్తి కలదు. స్మృతి దర్పణమందు అత్రి ఇట్లా - పిల్లి, ఎలుక వీటి స్పర్శవల్ల పిండం రెండు భాగాలైతే అదే పాకంతో ఆ క్షణంలోనే తిరిగి పిండముల నివ్వాలి, అని. బౌధాయనుడిట్లా - కుక్క ఛండాలుడు మొదలగు వారితో ముట్టబడి పిండము నాశమైతే, ప్రాజాపత్యవ్రతాన్ని ఆచరించి, ఇక తిరిగి పిండమునుంచాలి, అని.

**మూ॥ బోపదేవోఽప్యేవమాహ - అథదినాంతరేతు ప్రాజాపత్యమాత్రం. శేషప్రతిపత్తిత్వేన పిండావృత్తౌ మానాభావాదితి మైథిలాః. తన్న, సపిండీకరణాదౌ శేషనాశే సంయోజనాది లోపాపత్తేః . తేన, వచనాద్వమనే ఇవాత్రాపితన్మాత్ర పిండదానావృత్తిః. అతఏవ, నచనక్తం శ్రాద్ధంకుర్వీత, ఆరబ్ధేచాఽభోజన మాసమాపనాత్, ఇత్యాపస్తంబధర్మసూత్రం. రాత్రౌ భోజన మాత్రం పూర్వేద్యుః కార్యం. శ్రాద్ధ సమాప్తిస్తు పరదినే ఏవ. సమాప్తి పర్యంతం కర్తు రుపవాసశ్చేతి హరిదత్తేన వ్యాఖ్యాతం. తస్మాత్పాకాంతరేణ పిండదాన మాత్రం కార్యం. అథ పిండ నిషిద్ధ కాలః - సచ ప్రాయేణ మహాల యాది నిర్ణయే పూర్వముక్తః. హేమాద్రౌ బృహత్పరాశరః - యుగా దిషుమ ఘాయాంచ విషువత్యయనేతథా, భరణీషు చకుర్వీత పిండ నిర్వపణంనహి. స్మృతిరత్నావళ్యాం - పుత్రేజాతేవ్యతీపాతే గ్రహణే చంద్రసూర్యయోః, శ్రాద్ధం కుర్యాత్ప్రయత్నేన పిండ నిర్వపణాదృతే. తత్రైవకాత్యాయనః - వృద్ధేరనంతరంచైవ యావన్మాసస్సమాప్యతే, తావత్పిండాన్నైవదద్యాత్స**

కుర్యాత్తిల తర్పణం. బౌధాయనః - సంస్కారేషు తథాన్యేషు మాసం మాసార్థమేవచ, తథా - భానౌభౌమేత్రయో దశ్యాం నందా భృగు మఘాసుచ, పిండదానం మృదాస్నానం, నకుర్యాత్తిల తర్పణం. త్రిస్థలీసేతౌకార్ష్ణాజినిః - వివాహవ్రతచూడాసువర్షమర్థం తదర్థకం, ఉత్తరార్థంప్రాగ్వత్. వృద్ధిమాత్రేతథాన్యత్ర పిండదాన నిరాక్రియా, కృతాగర్గాదిభిర్ముఖ్యైః మాసమేకంతుకర్మణాం, హేమాద్రౌజ్యోతిః పరాశరః - వివాహేవిహితే మాసాంస్త్య జేయుః ద్వాదశైవహి, సపిండాః పిండ నిర్వాపం మౌంజీబంధేషడేవహి. తత్రైవ - మహాలయే గయాశ్రాద్ధే మాతా పిత్రోఃక్షయేఽహని, యస్య కస్యాపిమర్త్యస్య సపిండీకరణే తథా, కృతో ద్వాహోఽపికుర్వీత పిండ నిర్వాపణం సదా, ఇతి. మాతాపిత్రోరితిక్షయా హవిశేషణం. హవిరుభయత్వవదవివక్షితం. తేన భ్రాతృపితృవ్యాది వార్షికేఽపి పిండ దానం కార్యమితికేచిత్. సపిండీకరణం నవ శ్రాద్ధ షోడశశ్రాద్ధోపలక్షణార్థమితి నిర్ణయామృతే ఉక్తం. **క్షయాహేవిశేషః** సంగ్రహే - మాతాపిత్రోరాబ్దికేతు వివాహదిషు సర్వదా, తిలైఃపిండాః ప్రదాతవ్యాః అన్యశ్రాద్ధే వివర్జయేత్. అత్రమూలం చింత్యం. రామకౌతుకే - నందాశ్వకామర వ్యారభృగ్వగ్ని పితృకాలభే, గండేవైధృతి పాతేచ పిండాఃత్యాజ్యాః సుతే ష్వభిః. విశ్వరూపనిబంధే - తిథివార ప్రయుక్తోయో దోషోవై సముదాహృతః, సశ్రాద్ధే తన్నిమిత్తే స్యాత్ నాన్య శ్రాద్ధే కదాచన. అన్యత్తూక్తం ప్రాక్.

అను॥ బోపదేవుడు కూడా ఇట్లాగే చెప్పాడు. ఇక దినాంతరమందైతే ప్రాజాపత్యమాత్రము. శేష (కర్మ) ప్రతిపత్తితో (ప్రాప్తి) పిండ ఆవృత్తి యందు ప్రమాణం లేదు కనుక అని మైథిలులన్నారు. అది కాదు. సపిండీకరణాదులందు శేషనాశమైతే సంయోజనాదుల లోపం జరగాల్సి వస్తుంది. అందువల్ల వచనం వల్ల వమనం యందు వలె ఇక్కడ కూడా అంత మాత్రం పిండదాన ఆవృత్తి. అందువల్లనే, నక్తమందు శ్రాద్ధం చేయరాదు, ఆరంభిస్తే సమాప్తి వరకు భోజనం చేయరాదు, అని. ఆపస్తంబ ధర్మ సూత్రమందు కలదు. రాత్రి భోజన మాత్రము, ముందు రోజు చేయాలి శ్రాద్ధ సమాప్తి మాత్రము పరదినమందే సమాప్తి వరకు కర్త ఉపవాసం చేయాలి అని హరదత్తుడు వ్యాఖ్యానించాడు. అందువల్ల మరో పాకంతో పిండదాన మాత్రం చేయాలి. ఇక పిండ నిషిద్ధ కాలము - దానిని తరచుగా మహాలయాది నిర్ణయమందే ముందే చెప్పాము. హేమాద్రియందు బృహత్పరాశరుడిట్లా -యుగాదులందు, మఘయందు, విషువదయన మందు (మేషతులలు) భరణులందు పిండ నిర్వపణము చేయరాదు, అని (దానం). స్మృతిరత్నావళియందిట్లా - పుత్రుడు జన్మిస్తే వ్యతీపాతమందు, చంద్ర సూర్యుల గ్రహణమందు, ప్రయత్నపూర్వకముగా శ్రాద్ధం చేయాలి, పిండదానం లేకుండానే అని. అక్కడే కాత్యాయనుడిట్లా - వృద్ధి తరువాత (జన్మదినం) ఒక మాససమాప్తి వరకు పిండములివ్వరాదు, తిలతర్పణం విడువరాదు, అని. బౌధాయనుడిట్లా - సంస్కారములందు అట్లాగే ఇతరమైన వాటియందు మాసం కాని మాసార్థం కాని తర్పణం చేయరాదు, అని (పదిహేను రోజులా? ఆరు నెలలా). అట్లాగే - ఆదివారం, మంగళవారం, త్రయోదశి, నంద, (ప్రతిపద, షష్ఠి, ఏకాదశి), శుక్రవారం, మఘనక్షత్రం వీనియందు పిండదానము, మట్టిస్నానము, తిలతర్పణము

చేయరాదు, అని. త్రిస్థలీసేతువుయందు కార్ష్ణాజిని ఇట్లా - వివాహ, వ్రత (ఉపవీతం), చూడాకరణం వీనియందు సంవత్సరము, ఆరునెలలు, మూడు నెలలు (వరుసగా) పిండదానం, మృత్తికాస్నానము తిలతర్పణము చేయరాదు, అని. వృద్ధి మాత్రమందు, అట్లాగే ఇతరమైన చోట్ల పిండదాననిరాకరణమును గర్గాది ముఖ్యులు చేశారు, కర్మలకు ఒక నెలవరకు నిరాకరణము. హేమాద్రియందు జ్యోతిః పరాశరుడిట్లా - వివాహం జరిగితే పన్నెండు మాసములను వదలాలి. మౌంజీ బంధమందు ఆరుమాసములను సపిండులు పిండ నిర్వాపమును, వదలాలి అని (పెట్టరాదు) అక్కడే-మహాలయమందు గయాశ్రాద్ధ మందు, తలిదండ్రులు మరణించిన రోజున, ఏదో ఒక మనిషి యొక్క సపిండీకరణమందును, వివాహమైనప్పటికి, పిండ నిర్వపణాన్ని ఎప్పుడూ చేయాలి, అని. మాతాపితరుల అనేది క్షయాహమునకు విశేషణము, హవిరుభయత్వము వలె, వివక్షితము కాదు. అందువల్ల భ్రాత, పితృవ్యాదుల వార్షిక మందు పిండదానం చేయాలని కొందరంటారు. సపిండీకరణము నవశ్రాద్ధ, షోడశ శ్రాద్ధములకు ఉపలక్షణార్థమని, నిర్ణయామృతమందు చెప్పారు. క్షయాహమందు విశేషాన్ని సంగ్రహమందిట్లా - మాతపితరుల ఆబ్దికమందు, వివాహాదులందు ఎప్పుడూ నువ్వులతో పిండములనివ్వాలి, ఇతర శ్రాద్ధములందు ఇవ్వరాదు, అని. దీనికి మూలాన్ని విచారించాలి. రామ కౌతుకమందిట్లా - నంద (ప్రతిపత్, షష్ఠి, ఏకాదశి) అశ్వ (ద్వితీయ) కామ (త్రయోదశి) తిథులందు ఆదివారం, మంగళవారం, శుక్రవారం లందు కృత్తిక, పితృ (మఘ) కాల(భరణి) ఈ నక్షత్రములందు గండము, వైధృతి, వ్యతీపాతము వీనియందు పుత్రులను కోరేవాడు పిండములను వదలరాదు, అని. విశ్వరూప నిబంధమందిట్లా - తిథివార ప్రయుక్తమైన దోషం ఏది చెప్పబడిందో, అది ఆ నిమిత్తక శ్రాద్ధమందు మాత్రమే ఉంటుంది. ఎప్పుడూ ఇతర శ్రాద్ధములందు ఉండదు అని. ఇతరమైన వాటిని ముందే చెప్పాము.

**మూ॥ ఉచ్ఛిష్టోద్వాసన మాహ హేమాద్రావసిష్ఠః - శ్రాద్ధే నోద్వాసనీయాని ఉచ్ఛిష్టాన్యాదితః క్షయాత్,శ్చ్యోతంతేవై సుధాధారాస్తాఃపి బంత్యకృతోదకాః. వ్యాసః-ఉచ్ఛిష్టం నప్రమృజ్యాత్తు యావన్నాస్తమితో రవిః, ఇదం గృహాంతర సత్వే. ఏకగృహేతు మనుః - ఉచ్ఛేషణంతు తత్తిష్ఠే ద్యావద్విప్రావిసర్జితాః, తతోగృహబలింకుర్యాత్ ఇతిధర్మోవ్యవస్థితః. బలి వైశ్వదేవాదినిత్యకర్మేతి మేధాతిథిః. బ్రహ్మాండే - శూద్రాయచానుపేతాయ శ్రాద్ధో చ్ఛిష్టం నదాపయేత్. తథా - కామంవద్యాచ్ఛ సర్వంతు శిష్యాయ చసుతాయచ, భోక్తవ్యమితి శేషః జాతూ కర్ణ్యః - ద్విజభుక్తావశిష్టంతు శుచిభూమౌ నిఖానయేత్. అథవైశ్వదేవాది - అత్రమామకఃశ్లోకః - శ్రాద్ధే అనగ్నిక కర్తృకే అగ్నికరణాత్ పశ్చాజ్జుహోతిర్బలిస్త్వంతే స్యాదథవాథవేద్వికిరతః పశ్చాత్పృథక్త్వే పచేః, శ్రాద్ధాన్తే త్వథవా మహాలయ విధా పూర్వంభుజేః స్యాత్క్షయే, త్వన్తేఽ మాసుచ మధ్యతః శుభవిధా వాదౌ తథా సాగ్నికే. అస్యార్థః. సాగ్నేః పృథక్ పాకేన సర్వత్రాదౌ వైశ్వదేవః పక్షాంతం కర్మనిర్వర్త్య వైశ్వదేవంచ సాగ్నికః, పిండయజ్ఞంతతః కుర్యాత్తతోఽన్వాహార్యకంబుధః పిత్రర్థం నిర్వపేత్పాకం వైశ్వదేవార్థమేవచ, వైశ్వదేవం నపిత్రర్థంనదార్శం వైశ్వదేవికమితి లౌగాక్షిస్మృతేః.**

అత్ర సాగ్నిక ఆహితాగ్ని రితి హేమాద్రిః. శ్రాద్ధా త్ప్రాగేవకుర్వీత వైశ్వదేవంతు సాగ్నికః, ఏకాదశాహికం ముక్త్వాతత్రహ్యంతే విధీయతే, ఇతి హేమాద్రౌశాలం కాయనోక్తేశ్చ. తత్రైవపరిశిష్టే-సంప్రాప్తే పార్వణ శ్రాద్ధే ఏకోద్దిష్టేత దైవచ, అగ్ర తోవైశ్వదేవస్స్యాత్ పశ్చాదేకాదశేఽహని. స్మార్తాగ్నిమతాం తద్రహితానాం వాగ్నౌ కరణోత్తరం వికిరోత్తరం వా హోమమాత్రం పృథక్పాకేన. భూతయజ్ఞాదితుశ్రాద్ధాంతే ఏవ. అత్రమూలం హేమాద్రి చంద్రికాదౌ స్పష్టం. సర్వేషాం శ్రాద్ధాంతేవా తత్పాకేన వైశ్వదేవనిత్య శ్రాద్ధాదీతితృతీయః. శ్రాద్ధం నిర్వర్త్య విధివత్ వైశ్వదేవాదికంతతః, కుర్యాద్భిక్షాంతతోదద్యాత్ హంతకారాదికం తథా, ఇతి పైఠీనసి స్మృతేః. తతః = శ్రాద్ధశేషాత్. శ్రాద్ధాహ్ని శ్రాద్ధశేషేణ వైశ్వదేవం సమాచరేదితి చతుర్వింశతి మతాచ్చ. ఏవం వైశ్వదేవకాలత్రయస్య ఆశార్కే సాంఖ్యాయన పరిశిష్టముదా హృత్యైవం వ్యవస్థోక్తా. ఆదౌవృద్ధౌక్షయే చాన్తేదర్శేమధ్యే మహాలయే, ఏకోద్దిష్టేనివృత్తేతు వైశ్వదేవోవిధీయతే, ఇతి బహుస్మృత్యుక్తత్వాత్ సర్వేషాంశ్రాద్ధాన్త ఏవేతి మేధాతిథి స్మృతిరత్నా వల్యాదయో బహవః.

అను॥ ఉచ్ఛిష్టమును పారేయటం గూర్చి హేమాద్రియందు వసిష్ఠుడు ఇట్లా అన్నాడు – శ్రాద్ధమందు ఉచ్ఛిష్టమును (దినసమాప్తి వరకు) తొలి నుండి చివరదాకా పారవేయరాదు. తర్పణము పొందనివారు (చేయబడని) ఆ అమృత రూపధారలను, కారుతున్న వానిని పానం చేస్తారు అని. వ్యాసుడిట్లా – సూర్యుడు అస్తమించేదాక ఉచ్ఛిష్టమును శుద్ధి చేయరాదు, అని. ఇది మరో ఇల్లు ఉన్న పక్షంలో ఒకే ఇంట్లో ఐతే మనువిట్లా – బ్రాహ్మణ విసర్జన జరిగే వరకుఆ ఉచ్ఛిష్టము ఉండాల్సిందే. ఆ పిదప గృహబలి చేయాలి, అని ధర్మవ్యవస్థ (బ్రాహ్మణ విసర్జన, ఉచ్ఛిష్ట విసర్జన అని) అని. బలి వైశ్వదేవాదులు నిత్యకర్మ అని మేధా తిథి అభిప్రాయం. బ్రహ్మాండ పురాణమందిట్లా – శూద్రునకు ఉపనయనం కానివారికి శ్రాద్ధోచ్ఛిష్టమును ఇవ్వరాదు (పెట్టరాదు) అని. అట్లాగే – శిష్యునకు సుతునకు స్వేచ్ఛగా అంతా ఇవ్వచ్చు అని. వారు తినవచ్చు అని అర్థము.(ఇష్టపడితే). జాతూకర్ణి ఇట్లా – బ్రాహ్మణులు తినగా మిగిలిన దానిని శుద్ధమైన ప్రదేశమందు పాతిపెట్టాలి, అని. ఇక వైశ్వదేవాదులు ఇక్కడ నా శ్లోకము – శ్రాద్ధమందు అనగ్నికుడు (అగ్నిహోత్రికాని వాడు) కర్త ఐతే ఆతడు అగ్ని కరణం తరువాత హోమము, బలి (వైశ్వదేవం) చివర ఉంటుంది. లేదా పాకం విడిగా ఉంటే వికిరం తరువాత, ఉంటుంది. లేదా మహాలయ విధిలో శ్రాద్ధం చివర, క్షయాహమందు భోజనం తరువాత, అమావాస్యయందు చివర, శుభకార్యములందు మధ్యలో. సాగ్నికునకు ఆదిలో అని. దీని అర్థమిట్లా – సాగ్నికుడు విడి వంటతో అన్ని చోట్ల తొలుతనే వైశ్వదేవమాచరించాలి అని. పక్షాంత కర్మనాచరించి, వైశ్వదేవమాచరించి, సాగ్నికుడై ఆ పిదప పిండ పితృయజ్ఞమాచరించాలి. ఆ పిదప బుధుడు అన్వాహార్యక కర్మ ఆచరించాలి. (పితరుల మాసికాన్ని అన్వాహార్యమన్నారు. అదే అమావాస్య నాటి నెల శ్రాద్ధం). పితరుల కొరకు పాకం చేయాలి. వైశ్వదేవం కొరకు చేయాలి. వైశ్వదేవపాకం పితరుల కొరకు కాదు. అమావాస్య పాకము వైశ్వదేవికము కాదు, అని లౌగాక్షిస్మృతి. ఇక్కడ సాగ్నిక పదము అహితాగ్ని పరకమని హేమాద్రి. సాగ్నికుడు శ్రాద్ధము

కన్నముందే వైశ్వదేవమాచరించాలి. ఏకాదశా (పదకొండవ రోజు) హ(శ్రాద్ధమందైతే, అక్కడ చివర వైశ్వదేవము చెప్పబడుతోంది, అని హేమాద్రి యందు శాలంకాయనోక్తి కూడా. అక్కడే పరిశిష్టమందిట్లా - పార్వణ శ్రాద్ధం వచ్చినా, ఏకోద్దిష్టమందైనా క్రమంగా తొలుత వైశ్వదేవముంటుంది, పదకొండవ రోజు శ్రాద్ధమందైతే తరువాత వైశ్వదేవం అని. (ఏకోద్దిష్టం= 11 రోజు శ్రాద్ధం). స్మార్తాగ్నికలవారికి, అదిలేనివారికి అగ్నికరణం తరువాతనో వికిరం తరువాతనో, విడిపాకంతో హోమం మాత్రమే. భూత యజ్ఞాదులైతే శ్రాద్ధాంతమందే. వీటికి మూలాన్ని హేమాద్రిచంద్రికాదుల్లో స్పష్టంగా చూడవచ్చు. అందరికి (స్మార్తాగ్నికల, లేని) శ్రాద్ధాంతమందు కాని, అదే పాకంతో వైశ్వదేవనిత్యశ్రాద్ధాదులు, అని మూడోమార్గం. శ్రాద్ధ మాచరించి విధిప్రకారము ఆ పిదప వైశ్వదేవాదికము, చేయాలి. ఆ పిదప భిక్ష ఇవ్వాలి. అట్లాగే హంతకారాదులు ఇవ్వాలి, అని పైఠీనసి స్మృతి. ఆ పిదప అనగా శ్రాద్ధ శేషంతో. శ్రాద్ధం రోజున శ్రాద్ధ శేషంతో వైశ్వదేవమాచరించాలి, అని చతుర్వింశతి మతం వల్ల కూడా తెలుస్తోంది. ఈ రకంగా వైశ్వదేవం యొక్క మూడుకాలాలను, ఆశార్కమందు సాంఖ్యాయన పరిశిష్టాన్ని ఉదహరిస్తూ ఈ రకంగా నియమ వ్యవస్థ చెప్పబడింది. - వృద్ధి శ్రాద్ధమందు అగ్నికరణం తరువాత ఆదిలోను, క్షయశ్రాద్ధమందు చివరలోను, అమావాస్య మహాలయములందు మధ్యలోను, ఏకోద్దిష్టమందు, అయ్యాక వైశ్వదేవం విధించబడింది, అని. అనేక స్మృతుల్లో చెప్పబడింది కనుక అందరికి, శ్రాద్ధాంతమందే అని మేధాతిథి స్మృతి రత్నావల్యాదులు అనేకనిబంధకారులు భావించారు.

**మూ॥ బోపదేవస్తు, వృత్తికారేణ విసర్జనాంతం శ్రాద్ధముక్త్వా ఉచ్ఛేషణంతు, ఇతి పూర్వోక్త మనువాక్యోదాహరణాత్ బహ్వృచానాం శ్రాద్ధాంతఏవ. మధ్య పక్షస్త్వన్య శాఖా పరఇత్యాహ. హేమాద్రిస్తు వృద్ధావప్యంతే ఏవ వైశ్వదేవమాహ. కాతీయానాంతు శ్రౌతస్మార్తాగ్నిమతాం ఆదావేకేనైవ పాకేనే తికర్కః అన్యేషాం మతే తైత్తి రీయాణాంతు సాగ్నికానాం సర్వత్రాదౌవైశ్వదేవః, పంచయజ్ఞాశ్చ అంతే చేతి సుదర్శన భాష్యే ఉక్తం. అస్యపక్షద్వయస్య పూర్వవద్వ్యవస్థా. హేమాద్రౌమార్కండేయః - తతోనిత్యక్రియాంకుర్యాత్ భోజయేచ్చ తతోఽతిథీన్, తతస్తదన్నం భుంజీతసహభృత్యాదిభిర్నరః తతః = శ్రాద్ధశేషాత్ నిత్యక్రియాం=నిత్యశ్రాద్ధం. తత్ర - పృథక్ పాకేననైత్యకం, ఇతితే నైవోక్తేః. పాకైక్యేవికల్పః అథనిత్యశ్రాద్ధం - హేమాద్రౌ వ్యాసః - ఏకమప్యాశయేద్విప్రంషణ్ణామప్యన్వహం గృహీ, అపీత్యనుకల్పః. ప్రచేతాః - నా మంత్రణంనహోమంచ నాహ్వానం నవిసర్జనం, నపిండదానం వికిరం నదద్యాదత్రదక్షిణాం. అత్ర - నిర్దిశ్యభోజయిత్వాతుకించి ద్దత్వా విసర్జయేత్, ఇతితేనైవోక్తేః దక్షిణావికల్పః. యత్తు - నిత్య శ్రాద్ధం దైవ హీనం నియమాది వివర్జితం, దక్షిణారహితం చైవ దాతృ భోక్తృ వ్రతోజ్ఝితం, ఇతి కాశీఖండే. తద్విప్రాభావ పరమితి. పృథ్వీచంద్రః. భవిష్యే - ఆవాహనం స్వధాకారం పిండాగ్నౌ కరణాదికం, బ్రహ్మచర్యాదినియమా విశ్వేదేవానచైవహి. దాతౄణామథభోక్తౄణాం నియమోనచవిద్యతే. ఏ తద్ధి వాఽసంభవే రాత్రావపికార్యం. దివోదితాని కర్మాణి ప్రమాదాదకృతానివై యామిన్యాః ప్రహరం యావత్ తావత్కర్మాణికారయే ది తి బృహన్నారదీయోక్తే ః. రాత్రౌప్రహరపర్యంతం దివాకృత్యానికారయేత్ బ్రహయజ్ఞంచ సౌరంచ**

వర్జయిత్వా విశేషత ఇతి పృథ్వీచంద్ర ధృత సంగ్రహోక్తేశ్చ. నచ దార్శికాబ్ది కాద్యపి రాత్రౌ స్యాదితి వాచ్యం – ఇష్టాపత్తేః. తస్య తిథి సంబంధిత్వాత్. సంధ్యారాత్రౌ నకర్తవ్యం శ్రాద్ధంఖలు విచక్షణైః ఇతి విష్ణ్వాద్యైః రాత్రౌ నిషేధాత్. అత ఏవ అల్పద్వాదశ్యా ముషః కాలేద్వయం కుర్యాత్ ప్రాతర్మాధ్యాహ్నికం తదా ఇత్యాద్యైః వాక్యైః త్రయోదశీ శ్రాద్ధం నా పకృష్యతే. భిన్న విషయత్వాదిత్యుక్తం మదనరత్నే. నిత్యం త్వపకృష్యతే. అన్వహ మిత్యుక్తే స్థితి సర్వాధికాభావాత్. యథాచసుదర్శనభాష్యే – పరపక్షేపిత్ర్యాణీతి నియమేఽపి నిత్యశ్రాద్ధత్వే సంవత్సరమిత్యత్యంత సంయోగే ద్వితీయా బలాచ్ఛుక్లపక్షేఽపిఇత్యుక్తం. తథారాత్రా వపి. తథాచమాధవేన ప్రతిపత్ ప్రకరణే స్పష్టముక్తం. వయంచాగ్రే వక్ష్యామః అస్యదినే అకరణే లోప ఏవ. రాత్రౌ శ్రాద్ధం నకుర్వీత, ఇతి నిషేధాదితి పృథ్వీచంద్రః.

అను॥ బోపదేవుడిట్లా – వృత్తికారుడు, విసర్జనాంతము వరకు శ్రాద్ధాన్ని చెప్పి ఉచ్ఛేషణం ఐతే, అని ముందు చెప్పిన మనువు వాక్యాన్ని ఉదాహరించినందువల్ల బహ్వృచులకైతే (ఋక్) శ్రాద్ధాంతమందే, మధ్యపక్షమైతే ఇతర శాఖల పరమైనది, అని అన్నాడు. హేమాద్రి ఐతే వృద్ధి యందుకూడా అంతమందే వైశ్వదేవాన్ని చెప్పాడు. కాతీయులకైతే శ్రౌతస్మార్తాగ్ని కలవారికి తొలుత ఒకే పాకంతోనే అని కర్కుడన్నాడు. ఇతరుల మతమందు తైత్తిరీయులకు, సాగ్నికులకు అంతటా తొలుత వైశ్వదేవము, పంచయజ్ఞములైతే అంతమందు అని సుదర్శన భాష్యంలో చెప్పారు. ఈ రెండు పక్షముల వారికి ముందు చెప్పినట్లు నిర్ణయము. హేమాద్రియందు మార్కండేయుడిట్లా – ఆ పిదప నిత్యక్రియను (శ్రాద్ధం) ఆచరించాలి, ఆ పిదప శ్రాద్ధశేషంతో అతిథులను భుజింపచేయాలి. ఆ పిదప ఆ అన్నమునే భృత్యులు మొదలగు వారితో కలిసి కర్త భుజించాలి. తతఃఅనగా శ్రాద్ధ శేషంతో అని. నిత్య క్రియ అనగా నిత్య శ్రాద్ధము. అక్కడ – విడి పాకంతో నిత్యశ్రాద్ధము, అని అతడే చెప్పాడు. ఒకే పాకము అనే విషయంలో వికల్పం చెప్పాడు. ఇక నిత్య శ్రాద్ధము – హేమాద్రియందు వ్యాసుడిట్లా – గృహస్థుడు షట్దైవత్యపితరులకై ప్రతిరోజు ఒక బ్రాహ్మణునకైనా భుజింపచేయాలి, అని. అపి అనే శబ్దము అను కల్పము (గౌణము), (అరుగురు లేదా ఇద్దరు ముఖ్యము). ప్రచేతుడిట్లా – నిత్య శ్రాద్ధమందు, ఆ మంత్రణ, హోమము, ఆవాహన, విసర్జనము, పిండదానము, వికిరము ఇవన్ని ఉండవు. ఇక్కడ దక్షిణ కూడా ఇవ్వవద్దు, అని అన్నాడు. ఇక్కడ, నిమంత్రణ చేసి, భుజింపజేసి, కొంచం ఇచ్చి విడువాలి, అని అతడే చెప్పాడు కనుక దక్షిణ వికల్పము. కాశీ ఖండమందు – నిత్య శ్రాద్ధము వైశ్వ దైవం లేకుండా, నియమాదులు లేకుండా, అట్లాగే దక్షిణారహితమై దాత, భోక్తలకు వ్రత నియమం లేకుండా ఉంటుంది, అని అన్నమాట అది విప్రుడు లేని పక్షంలో అని పృథ్వీచంద్రుడన్నాడు. (నిత్య శ్రాద్ధం – అస్మత్ పితృపితామహ ప్రపితామహానాం, గోత్రాదీనాం, సపత్నీకానాం, అస్మత్ మాతామహ, మాతుః పితామహ, మాతుః ప్రపితామహానాం, గోత్రాదీనాం, సపత్నీకానాంచ నిత్య శ్రాద్ధం కరిష్యే, ఇతి సంకల్ప్య, విప్రముదజ్ ముఖ ముపవేశ్య క్షణాది సంపూజ్య పాత్రమభిఘార్య అన్నం పరివిష్య, పృథ్వీతే

పాత్రం ఇత్యాది బ్రహ్మార్పణం కృత్వా భోజయిత్వా విసర్జయేత్). భవిష్యమందిట్లా – ఆవాహన, స్వధాకారము, పిండము, అగ్నికరణము మొదలగునవి, బ్రహ్మచర్యాదినియమములు, విశ్వేదేవులు ఇవన్నీ ఉండవు అని. దాతలకు, మరి భోక్తలకు నియమము ఉండదు. ఇది పగలు, కుదరని పక్షంలో రాత్రి యందు కూడా చేయాలి. బృహన్నారదీయమందిట్లా - పగటిపూటకై చెప్పిన కర్మలను ప్రమాదం వల్ల చేయని పక్షంలో రాత్రి అయ్యాక ప్రహర కాలం (ఝాము)లోపల కర్మలు చేయాలి (3 గంటలు) అని అన్నాడు. రాత్రి యందు ప్రహర వరకు పగటి పనులను చేయాలి, (బ్రహ్మయజ్ఞము, సౌరము (సూర్యసంబంధికర్మ) విశేషించి వీనిని వదలిపెట్టి, అని పృథ్వీచంద్ర మందు సంగ్రహోక్తులు కూడా. అమావాస్య, సాంవత్సరిక మొ॥ శ్రాద్ధములు కూడా రాత్రిపూట చేయాల్సి వస్తుంది, అని అనరాదు. ఇష్టం నెరవేరినట్టే. అంటే అది తిథి సంబంధమైంది. సంధ్య, శ్రాద్ధము బుద్ధిమంతుడు రాత్రిపూట చేయరాదు, అని వైష్ణవాదులు రాత్రి నిషేధించారు. అందువల్లనే ద్వాదశి స్వల్పంగా ఉన్నప్పుడు – ఉషఃకాలమందే, ప్రాతర్ మాధ్యాహ్నికములు రెండు చేయాలి, అని మొదలుగాగల వాక్యములతో త్రయోదశీ శ్రాద్ధము అపకర్షింపబడదు. భిన్న విషయమైనందువల్ల అని మదనరత్నంలో చెప్పారు. నిత్య శ్రాద్ధమైతే అపకర్ష ఔతుంది. ప్రతి రోజు అనటం వల్ల, తిథి అన్నటికన్న గొప్పది కాలేదు. సుదర్శన భాష్యమందిట్లా - పితృకర్మలన్నీ పరపక్షమందే (కృష్ణ) అని నియమమున్నప్పటికిని నిత్య శ్రాద్ధమందు, సంవత్సరము అని అత్యంత సంయోగమందు ద్వితీయా విభక్తి బలము వల్ల శుక్లపక్షమందు కూడా అని చెప్పబడింది. అట్లాగే రాత్రి విషయములో కూడా అట్లాగే మాధవుడు, ప్రతి పత్రకరణమందు స్పష్టంగా చెప్పాడు. మేము కూడా ముందు చెప్తాము. దీనిని (నిత్యశ్రాద్ధం) పగలు చేయకపోతే లోపమే రాత్రియందు శ్రాద్ధం చేయరాదు, అని నిషేధమున్నందువల్ల అని పృథ్వీచంద్రుడన్నాడు.

**మూ॥ పాత్రాభావేకౌర్మే** – ఉద్ధృత్యావాయథాశక్తికించిదన్నం ప్రకల్పయేత్ **తత్ప్రతిపత్తి** మాహవిష్ణుః - భిక్షుకాభావేఽన్నం గోభ్యోదద్యాదగ్నౌవాప్రక్షిపేదితి. హేమాద్రౌనాగరఖండే - నిత్యశ్రాద్ధంనకుర్వీత ప్రసంగాద్యత్ర సిద్ధ్యతి, శ్రాద్ధాంతరేకృతేఽన్యత్ర నిత్యత్వాత్తన్నహాపయేత్. షట్దైవతేపృథఙ్నేత్యర్థః, మాత్స్యే - తతస్తువైశ్వదేవాంతే సభృత్యసుతబాంధవః, భుంజీతాతిథి సంయుక్తః సర్వంపిత్ర నిషేవితం. సర్వం పర్వనిషిద్ధం మాంస మాషాద్యపీత్యర్థః ఏవంకృష్ణైకా దశ్యాదౌగృహిణోఽపిభోజనం. అస్యవైధత్వేన, నిషేధాప్రవృత్తేః. ఏవం గ్రహణవేధేఽపి. యత్త్వనా హితాగ్నే రమాషమమాంసంవ్రత యేది త్యుక్తం, తద్ధేయమేవ. శ్రౌతత్వేనతస్యబల వత్త్వాత్. దేవలః - శ్రాద్ధం కృత్వాయో మర్త్యోనతుభుంక్తేకదాచన, దేవాహవ్యం నగృహ్ణంతి కవ్యాని పితరస్తథా. శివరాత్ర్యే కాదశ్యాదౌ త్వవఘ్రాణమేవేత్యుక్తం ప్రాక్. యత్రతూపవాసోనావశ్యకః తత్రైక భక్త మయాచితం వాకార్య మితి హేమాద్రిః. జాతూకర్ణ్యః - అహన్యేవతుభోక్తవ్యం కృతే శ్రాద్ధే ద్విజన్మభిః అన్యథా హ్యాసురం శ్రాద్ధం, పరపాకేచసేవితే. **శ్రాద్ధ శేషభోజనస్య** క్వచిన్నిషేధ మాహ హేమాద్రౌ ప్రాయశ్చిత్త కాండే మార్కండేయః - పిత్రాదీనామథాఽన్యేషాం శ్రాద్ధ శేషాన్న భోజనం, వృతినాం

**విధవానాంచయతీనాంచ విగర్హితం, అన్యే = భిన్న గోత్రాః వ్రతినో=బ్రహ్మచారిణః. శ్రాద్ధా వశిష్ట భోక్తారస్తేవై నిరయగామినః, సగోత్రాణాం సకుల్యానాం జ్ఞాతీనాం చ నదోషకృదితి తత్రైవోక్తేః. తత్రైవ జాబాలిః – విప్రస్త్వన్యగృహేశ్రాద్ధేశిష్టాన్నం భోజనం చరేత్, ప్రాజాపత్య విశుద్ధిస్స్యాత్ జ్ఞాతిగోత్రేన, దోషకృత్ యతీనాంవపనం లక్షప్రణవజపశ్చేతి తత్రైవోక్తం. అస్యాపవాదమాహ స ఏవ. శ్వశురస్య గురోర్వాపి మాతులస్య మహాత్మనః, జ్యేష్ఠభ్రాతుశ్చ పుత్రస్య బ్రహ్మనిష్ఠస్యయోగినః ఏతేషాం శ్రాద్ధశిష్టాన్నం, భుక్త్వాదోషోన విద్యతే, ఇతికేచిత్ప్రశంసతి మునయస్తదసాంప్రతం. విశేషాంతరం తత్రైవజ్ఞేయం. హేమాద్రౌజాబాలిః – తాంబూలందంత కాష్ఠం చస్నే హస్నానమ భోజనం, రత్యౌషధ పరాన్నాని శ్రాద్ధ కర్తా వివర్జయేత్. పృథ్వీచంద్రోదయే ఆచార్యః – నశూద్రం భోజయేత్తస్మిక్ గృహేయత్నేన, తద్దినే, శ్రాద్ధశేషంన శూద్రేభ్యః ప్రదద్యాదఖిలేష్వపి. ఇతి పార్వణశ్రాద్ధం.**

అను॥ పాత్ర(బ్రాహ్మణుడు) అభావమందు కూర్మ పురాణమందిట్లా – యథాశక్తి కొంచం అన్నాన్ని తీసి వేయాలి (ఏర్పరచాలి) అని. దాన్ని ఆచరించేవిధానాన్ని విష్ణువిట్లా చెప్పాడు – భిక్షుకుడు, భిక్షుకుడు లేని పక్షంలో అన్నాన్ని ఆవులకు పెట్టాలి. లేదా అగ్నిలోనైనా వేయాలి, అని. హేమాద్రి యందు నాగరఖండమందిట్లా – ఎక్కడ ప్రసంగం వల్ల నిత్య శ్రాద్ధం వస్తుందో అక్కడ (దర్శ ఆబ్దికాదుల్లో), వేరే శ్రాద్ధం చేసే పక్షంలో (చేసిన), నిత్య శ్రాద్ధము చేయవద్దు. (అక్కడ మొదట లేదా చివర వైశ్వదేవం చేయాలి). ఇతరమైన చోట్ల నిత్యమైనందు వల్ల దానిని విడిచి పెట్టరాదు, అని. షట్ దైవతమందు విడిగా కాదు అని అర్థము. మత్స్య పురాణమందిట్లా – ఆ పిదప వైశ్వదేవాంతమందు భృత్యులు బాంధవులు, సుతులు వీరితో కూడి, అతిధులతో కూడి, పితరులు సేవించిన దాన్నంతా భుజించాలి అని. అంతా అనగా పర్వమందు నిషిద్ధమైన మాంసము, మినుములు మొదలగునవి కూడా అని అర్థము. ఈ విధముగా కృష్ణపక్ష ఏకాదశి మొదలగు వాని యందు గృహస్థునకు కూడా భోజనము సిద్ధమైంది. ఇది శాస్త్ర విధి ఐనందువల్ల, నిషేధం ప్రవర్తించదు. ఈ విధంగా గ్రహణ వేధయందు కూడా అని గ్రహించాలి. అనాహితాగ్ని (ఆహితాగ్ని కాదు) మినుములు, మాంసం లేకుండా వ్రతం ఆచరించాలి అని అన్నారో అది విడువతగినదే. శృతి సిద్ధమైనందువల్లపైది బలవత్తమైంది. (మాంసం భుజించాలి అని). దేవలుడిట్లా – శ్రాద్ధం చేసి ఏ నరుడు ఎప్పుడూ తినడో ఆతని హవ్యమును దేవతలు గ్రహించరు, అట్లాగే పితరులు కవ్యమును గ్రహించరు. శివరాత్రి ఏకాదశులు మొదలగు వానియందైతే వాసన చూడటమే భోజనాన్ని అని ముందే చెప్పాము. ఉపవాసం అవసరం లేని చోట అక్కడ ఏక భక్తము, లేదా అయాచితము చేయాలని హేమాద్రి. జాతూకర్ణి ఇట్లా – బ్రాహ్మణుడు శ్రాద్ధం చేశాక పగటి పూటే భోంచేయాలి. లేని పక్షంలో అది అసుర శ్రాద్ధము ఔతుంది. పరుల పాకం సేవించినా (తిన్నా). హేమాద్రి యందు ప్రాయశ్చిత్త కాండమందు మార్కండేయుడు – శ్రాద్ధ శేషభోజనమునకు ఒక చోట నిషేధాన్ని చెప్పాడు. ఆ వాక్యమిట్లా

- పుత్రాదులది, ఇక ఇతరులది శ్రాద్ధ శేషాన్న భోజనము, వ్రతులకు, విధవలకు, యతులకు తగనిది అని. ఇతరులు అనగా భిన్నగోత్రములవారు. వ్రతి అనగా బ్రహ్మచారి. శ్రాద్ధావశిష్టాన్ని భుజించినవారు, నరకానికి వెళ్తారు. సగోత్రులకు, దూరపు బంధువులకు, జ్ఞాతులకు దోషకారి కాదు అని అక్కడే చెప్పారు. అక్కడే జాబాలి ఇట్లా - విప్రుడైతే ఇతరుల గృహమందలి శ్రాద్ధమందు మిగిలిన అన్నాన్ని భోజనం చేయాలి. ప్రాజాపత్యం వల్ల శుద్ధుడౌతాడు. జ్ఞాతి, గోత్రములు దోషకారులు కావు అని. యతులకు వపనము, లక్ష ప్రణవమంత్ర జపము అని అక్కడే చెప్పారు. దీనికి అపవాదాన్ని ఆతడే చెప్పాడు. ఇట్లా - మామ, గురువు మహాత్ముడు, (ఐన) మేనమామ, జ్యేష్ఠభ్రాత(యొక్క) పుత్రుడు, బ్రహ్మనిష్ఠుడైన యోగి వీరి యొక్క శ్రాద్ధశేషాన్నాన్ని భుజిస్తే దోషం లేదు, అని కొందరు మునులు ప్రశంసిస్తారు. అదితగదు. విశేషాంతరాన్ని అక్కడే తెలుసుకోవాలి. హేమాద్రి యందు జాబాలి ఇట్లా - తాంబూలము, పళ్ళ పుల్ల ఉపయోగించటం, నూనెతో స్నానము, భోజనం చేయకపోవటం, రతి, ఔషధము, ఇతరుల అన్నం తినటం వీనిని శ్రాద్ధకర్త విడిచి పెట్టాలి, అని. పృథ్వీ చంద్రోదయమందు ఆచార్యుడిట్లా - ఆ దినమందు ఆ ఇంటియందు ప్రయత్నించి ఐనా శూద్రుని భుజింప చేయరాదు. శ్రాద్ధ శేషాన్నమును శూద్రులకు ఇవ్వరాదు. అన్ని జాతుల వారికి కూడా ఇవ్వవద్దు. అని ఇంతటితో పార్వణ శ్రాద్ధం ముగిసింది.

**మూ॥ అథానుకల్పః** - తత్రవిప్రాలాభే - భోజయేదథవాప్యేకం బ్రాహ్మణం పంక్తి పావనం, దైవేకృత్వాతునైవేద్యం పశ్చాత్తస్యతునిర్వపే దితి శంఖోక్తే రేకో విప్రఃపూర్వముక్తః విప్రాభావే దర్భవటుః నిధాయవాదర్భవటూనాసనేషు సమాహితః, ప్రేషానుప్రేషసంయుక్తం విధానం ప్రతిపాదయేదితి దేవలోక్తేః. **అశక్తానామశ్రాద్ధం** ఆపద్యనగ్నౌతీర్థే చప్రవాసే పుత్రజన్మని, ఆమశ్రాద్ధంప్రకుర్వీత భార్యారజసిసంక్రమే. ఇతికాత్యాయనోక్తేః. **పృథ్వీచంద్రోదయేజమదగ్నిః** - యావత్స్యాత్‌నాగ్ని సంయుక్త ఉత్పన్నాగ్నిరథాపివా, ఆమశ్రాద్ధంతదాకుర్యాత్‌హస్తేగ్నౌకరణంభవేత్, కౌర్మే-అనగ్ని రథనో వాపితథైవ వ్యసనాన్వితః, ఆమశ్రాద్ధం ద్విజఃకుర్యాత్ వృషలస్తుసదైవహి. ఆహితాగ్నౌ ప్రవాసస్థే తత్పత్నీగృహేదర్శంబు త్విగాదినా కారయేత్. ఆమావాస్యాదినియతం ప్రోషితే ధర్మచారిణీ, పత్న్యాతు కారయేన్నిత్యం అన్యేనా ప్యృత్విగాదినా, ఇతిలఘుహారీతోక్తేరితి పృథ్వీచంద్రోదయః. ఆదిపదమాబ్దికాది సర్వపార్వణపరమితి శూలపాణిః. సుమంతుః - పాకాభావే ఉధికారస్స్యాత్‌విప్రాదీనాం నరాధిప, అపత్నీనాం మహాబాహో విదేశగమనాదిభిః. సదాచైవతు శూద్రాణామామశ్రాద్ధం విదుర్బుధాః ప్రచేతాః - స్త్రీ శూద్రశ్శ్వపచశ్చైవ జాతకర్మణి చాప్యథ, ఆమశ్రాద్ధం సదాకుర్యాత్ విధినాపార్వణేనతు. స్వయం పచతీతిశ్వపచః. అపత్నీకః. విష్ణుశనసౌ - ఆత్మనోదేశకాలాభ్యాం విప్లవే సముపస్థితే, ఆపద్యనగ్నౌతీర్థేచ ప్రవాసే పత్న్యసంభవే. చంద్రసూర్య గ్రహేచైవదద్యాదామం విశేషతః, నపక్వం భోజయేద్విద్వాన్ సచ్ఛూద్రోఽపికదాచన, భోజయన్ ప్రత్యవాయీస్యాత్‌నచతస్యఫలంలభేత్. అత్రప్రవాస తీర్థగ్రహణాదావామహేమశ్రాద్ధమేవ.

పాకశ్రాద్ధంతు నభవత్యేవేతి హేమాద్రి రత్నావళ్యా దయః. అపరార్క విజ్ఞానేశ్వరాదయస్తు - పాకాభావే ద్విజాతీనాం ఆమశ్రాద్ధం విధీయతే, ఇతి సుమంతూక్తేః సాగ్నికైర్నిరగ్నికైశ్చ ప్రవాసాదౌసర్వత్ర పాకాభావే ఆమాదికార్యం. పాకసంభవే త్వన్నే నైవేత్యాహుః. అత ఏవ పాక శ్రాద్ధముక్త్వా - ఏతచ్చానుపనీతోఒపికుర్యాత్సర్వేషు పర్వసు. భార్యావిరహితో ఒప్యేతత్ప్రవాసస్థోఒపినిత్యశః, ఇతిమాత్స్యే నిరగ్నేరపి పాకేనోక్తమితి శూలపాణి, కల్పతరూ. ఏతచ్ఛబ్దః శ్రాద్ధమాత్ర పర ఇత్యన్యే. ఏకోద్దిష్టంతు కర్తవ్యం పాకేనైవ సదాస్వయం, ఇతి లఘు హారీతీయమపి సాగ్నే రేవ. నిరగ్నేః మహైకోద్దిష్టమపి ఆమేన. శూద్రస్య తుదశాహ పిండాద్యామేనేతి హలాయుధః. ఉత్పన్నాగ్నీనాంత్వామ శ్రాద్ధమేవ, పూర్వోక్త జమదగ్ని వాక్యాత్. మరీచిః - శ్రాద్ధ విఘ్నేద్విజాతీనా మామశ్రాద్ధం ప్రకీర్తితం, అమావాస్యాదినియతం మాస సంవత్సరాదృతే.

అను॥ ఇక అనుకల్పము (ముఖ్యమైనది చేయలేనప్పుడు చేయవలసిన రెండో (గౌణ) మార్గం అనుకల్పము). అక్కడ బ్రాహ్మణుడు దొరకని పక్షంలో - లేనిచో పంక్తి పావనుడైన ఒక బ్రాహ్మణున్నైనా భుజింపచేయాలి, దైవమునకు నైవేద్యం చేసి ఆ పిదప అతనికి నిర్వపణం చేయాలి, అని శంఖోక్తి ఉన్నందువల్ల ఒక విప్రుడు అని ముందు చెప్పాము, విప్రుడు లేని పక్షంలో దర్భతో చేసిన వటువు. ఆసనములందు దర్భవటువులను చక్కగా ఉంచి, పంపటము అనుసరించి వెళ్ళటం వీటితో కూడిన విధానమంతా చేయాలి అని దేవలోక్తి. (ప్రేష=ఉత్తర, కరిష్యే, సంపన్నం అను ప్రైష=ప్రత్యుత్తర, కురుష్వ, సుసంపన్నం). అశక్తి యందు ఆమశ్రాద్ధము - ఆపదయందు, అగ్నిలేని పక్షంలో, తీర్థమందు, ప్రవాసమందు, పుత్రుడు జన్మించినపుడు, భార్యకు రజోధర్మం ఐనప్పుడు ఆమశ్రాద్ధము ఆచరించాలి, అని కాత్యాయనోక్తి. పృథ్వీచంద్రోదయయందు జమదగ్ని ఇట్లా - అగ్ని సంయుక్తుడు కానంతవరకు, అగ్ని నశించినవాడైనా అప్పుడు ఆమశ్రాద్ధం చేయాలి అగ్నౌకరణ హోమము చేతియందు చేయాలి, అని. కూర్మపురాణమందిట్లా - అగ్నిలేనివాడు, ధనం లేనివాడు (పాకసాధన సామగ్రి లేకపోతే) అట్లాగే వ్యసనములందు లగ్నమైన బ్రాహ్మణుడు, ఆమశ్రాద్ధము చేయాలి. వృషలుడైతే ఎల్లప్పుడు ఆమశ్రాద్ధం చేయాలి, అని. ఆహితాగ్ని ప్రవాసంలో ఉంటే, అతని భార్య గృహమందు, ఋత్విక్కులు మొదలగు వారితో అమావాస్య శ్రాద్ధం చేయించాలి. అమావాస్య మొదలగు నియత శ్రాద్ధములను, ధర్మచారిణి ఐన భార్య, భర్త పరదేశంలో ఉంటే ఇతరులైన ఋత్విగాదులతోనైనా తప్పకుండా చేయించాలి, అని లఘుహారీతోక్తి అని పృథ్వీ చంద్రోదయుని వచనం. ఆదిపదము ఆబ్దికము మొదలుగా అన్ని పార్వణముల పరకమైనది అని శూలపాణి. సుమంతువిట్లా - పాకం (చేసేవాళ్ళు) లేని పక్షంలో విప్రాదులకు అధికారముంటుంది, ఓ రాజ! ఓ మహాబాహూ! అపత్నీకులకు, విదేశగమనాదులవల్లనూ. ఎల్లప్పుడూ శూద్రులకు, ఆమశ్రాద్ధము అని బుధులు చెప్పారు. ప్రచేతుడిట్లా - స్త్రీలు, శూద్రులు, శ్వపచుడు, జాతకర్మయందును, ఎల్లప్పుడు పార్వణవిధితో

ఆమశ్రాద్ధం చేయాలి, అని స్వయంగా వండుకునేవాడు శ్వపచుడు అనగా భార్యలేనివాడు. విష్ణు ఉశనసులిట్లా - దేశకాలాదుల వల్ల, తనకును విప్లవం సంభవిస్తే, ఆపదయందు, అగ్ని లేనప్పుడు, తీర్థమందు, ప్రవాసమందు, భార్యలేని పక్షంలో, చంద్రసూర్య గ్రహణము లందు విశేషించి ఆమ శ్రాద్ధము చేయాలి. విద్వాంసుడు పక్వమైన అన్నమును భుజింప చేయరాదు. సచ్ఛూద్రుడైనా కూడా వండిన అన్నాన్ని ఎప్పుడూ పెట్టరాదు. ఒకవేళ పక్వమైన అన్నాన్ని భుజింపచేస్తే ప్రత్యవాయం (పాపం) ఔతుంది. అతనికి ఫలితం లభించదు. ఇక్కడ ప్రవాసము, తీర్థము, గ్రహణము వీనియందు ఆమము మరియు హేమశ్రాద్ధములే. పాకశ్రాద్ధము మాత్రం కానే కాదు. అని హేమాద్రి రత్నావళ్యాదులన్నారు. అపరార్కవిజ్ఞానేశ్వ రాదులైతే - పాకం లేని పక్షంలో ద్విజాతులకు ఆమశ్రాద్ధము విధించబడుతోంది, అని సుమంతుని వాక్యమున్నందువల్ల సాగ్నికులైనా, నిరగ్నికులైనా ప్రవాసాదులందు అంతట పాకం లేకపోతే ఆమాది శ్రాద్ధం చేయాలి. పాకం సంభవించే పక్షంలోనైతే అన్నంతోనే అని అన్నారు. అందువల్లనే పాకశ్రాద్ధాన్ని చెప్పి, దీనిని ఉపనయనం కానివాడు కూడా అన్ని పర్వములలో ఆచరించాలి. భార్యావిరహితుడు (లేని) కూడా దీనిని ఆచరించాలి. ప్రవాసమందున్నవాడైనా ఎప్పుడూ చేయాలి, అని మత్స్య పురాణమందు అగ్నిలేనివానికి కూడా పాకంతో చెప్పబడింది, అని శూలపాణి కల్పతరువులన్నారు. ఇది లేదా దీనిని అనే శబ్దము శ్రాద్ధమును మాత్రమే సూచిస్తుంది అని ఇతరులన్నారు. ఏకోద్దిష్టాన్నైతే ఎప్పుడూ, స్వయంగా పాకం చేసే చేయాలి, అని లఘుహారీతంలోని మాట కూడా సాగ్నికునకే. అగ్నిలేని వానికి మహా ఏకోద్దిష్టం కూడా ఆమంతోనే. శూద్రునకు దశాహ (పదవరోజు) పిండాదులు ఆమంతో అని హలాయుధుడన్నాడు. అగ్ని నశించినవారికైతే ఆమశ్రాద్ధమే, ముందు చెప్పిన జమదగ్ని వాక్యాన్ననుసరించి. మరీచి ఇట్లా - శ్రాద్ధమునకు విఘ్నమేర్పడితే ద్విజాతులకు ఆమశ్రాద్ధము చెప్పబడింది. మాససంవత్సరాదులు మినహా అమావాస్యాది నిత్య శ్రాద్ధములు ఆమశ్రాద్ధమే.

**మూ॥ స్మృతిదర్పణే - మృతాహంచ సపిండంచగయాశ్రాద్ధం మహాలయం, ఆపన్నోపిన కుర్వీత శ్రాద్ధమామేన కర్హిచిత్. హేమాద్రౌవ్యాసః - ఆమందదతుకౌంతేయదద్యాదామంచతుర్గుణం, ద్విగుణం త్రిగుణం వాపినత్వేకగుణమర్పయేత్. సిద్ధాన్నేతువిధిర్యస్స్యాదామ శ్రాద్ధేప్యసౌవిధిః. ఆవాహనాది సర్వం స్యాత్ పిండదానంచ భారత. దద్యాద్యచ్ఛద్విజాతిభ్యఃశృతం వాఽ_శృతమేవవా, తేనాగ్నౌకరణం కుర్యాత్ పిండాంస్తేనైవనిర్వపేత్. పక్షాంతరమాహాస ఏవ - ఆమందద్యాద్ధి కౌంతేయ తద్దానంద్విగుణం చరేత్, త్రిగుణం చతుర్గుణంవాపినత్వేకగుణమర్పయేత్, స్మృత్యర్థసారే సమమ ప్యుక్తం (విష్ణుపురాణే, వారాహేచ - అసమర్థోఽ_న్నదానస్య ధాన్య మాశం స్వశక్తితః ప్రదద్యాత్తు ద్విజాతిభ్యః స్వల్పాల్పా మపిదక్షిణాం. అత్ర శక్తితః ఇత్యస్మాత్ సమలాభః అశ్యత ఇతి అశం). షట్త్రింశన్మతే - ఆమశ్రాద్ధం యదాకుర్యాత్ పిండదానం కథంభవేత్, గృహపాకాత్సముద్ధృత్య**

సక్తుభిః పాయసేనవా పిండాన్దద్యాద్యథాలాభం తిలై స్సహవిమత్సరః. పృథ్వీచంద్రోదయేవ్యాసః - ఆమశ్రాద్ధం యదాకుర్యాత్ విధిజ్ఞః శ్రాద్ధదః సదా, హస్తేఽగ్నౌ కరణం కుర్యాత్ బ్రాహ్మణస్య విధానతః. ఏతత్సాగ్నేః. నిరగ్నేః సదా తత్సత్వాత్ యత్తు - ఆమేన పిండం దద్యాచ్చేత్ విప్రాన్ పాకేన భోజయేత్, పక్వేనకురుతేపిండం ఆమాన్నంయః ప్రయచ్ఛతి, తావుభౌమను జౌప్రోక్తా నరకార్హౌన సంశయః, ఇతి తత్‌దర్శాదిపరం. దేశాచారాద్వ్యవస్థా ఇతియుక్తం. మరీచిః - ఆవాహనే స్వధాకారే మంత్రా ఊహ్యావిసర్జనే, అన్యకర్మణ్య నూహ్యాఃస్యుః ఆమశ్రాద్ధ విధిః స్మృతః. ఆవాహనే, హవిషేఅత్తవ ఇత్యత్ర స్వీకర్తవే, ఇత్యూహః స్వధాకారే, నమోవఃపితర ఇషే ఇత్యత్ర ఇషేపదస్థానే ఆమద్రవ్యాయేత్యూహః. విసర్జనేవాజేవాజే ఇత్యత్ర తృప్తాః ఇతిస్థానే తర్ప్యత, తృప్యత ఇతి వా ఊహః. యద్యపితస్మాదృచం నోహేదితి ఋచ్యూహోనిషిద్ధః, తథాపివచనాద్భవతి. తృప్తి ప్రశ్నేవ గాహశ్చ జుష్టప్రశ్నే యథాసుఖమ్. ఆమశ్రాద్ధే భవేన్నైతత్ ఆపోశానంచ పంచమం. అయంచాను వాదః ఖలేబాల్యాం ఛేదనా దీనామివార్థాభావాల్లోపసిద్ధేః. ధర్మ ప్రదీపేతు - ఆమంచతుర్గుణందద్యాత్ అథవాద్విగుణం తథా, హేమంచాష్టగుణంతద్వత్ ఆమే హైమేఽప్యసౌవిధిః.

అను॥ స్మృతిదర్పణమందిట్లా - మరణించినరోజు శ్రాద్ధాన్ని, సపిండాన్ని, గయాశ్రాద్ధాన్ని, మహాలయాన్ని వీనిని ఆపదలో నున్నవాడు కూడా ఆమశ్రాద్ధాన్ని ఎప్పుడూ చేయరాదు, అని. హేమాద్రి యందు వ్యాసుడిట్లా - ఓ కౌంతేయ! ఆమాన్ని ఇవ్వండి (బియ్యం). ఆమాన్ని పురుషాహారం కన్న నాల్గింతలెక్కువగా ఇవ్వాలి. రెండింతలు, మూడింతలైనా ఇవ్వాలి. ఒక గుణం ఇవ్వరాదు. సిద్ధాన్నమందు ఏవిధి ఉందో ఆమ శ్రాద్ధమందును అదే విధి. ఆవాహన మొదలుకొని పిండదానం అంతా ఉంటుంది, ఓ భారత. ద్విజాతులకై వండినది కాని వండనిదికాని ఏది ఇస్తామో దానితోనే అగ్నికరణము చేయాలి. దానితోనే పిండ నిర్వాపణము చేయాలి. మరో పక్షాన్ని (మార్గాన్ని) అతడే ఇట్లా చెప్పాడు - ఓ కౌంతేయ ఆ మాన్ని ఇవ్వాలి ఇచ్చేప్పుడు ఆదానము రెట్టింపుగా ఇవ్వాలి. త్రిగుణంగాని నాల్గింతలుగాని ఇవ్వాలి. ఒక గుణాన్ని మాత్రం ఇవ్వరాదు,అని. స్మృత్యర్థసారమందు సమము అని గూడా చెప్పబడింది. (విష్ణుపురాణమందు, వరాహపురాణమందిట్లా - అన్న దానమివ్వటానికి సమర్థుడు కాని పక్షంలో తన శక్తితో తినతగినంత ధాన్యాన్ని ద్విజాతులకు ఇవ్వాలి. కొంచమైన, కొంచంలో కొంచమైనా దక్షిణ కూడా ఇవ్వాలి, అని. ఇక్కడ శక్తితో అనే మాట వల్ల సమలాభం కన్పిస్తుంది. అశ్యతే (తినబడేది) కనుక ఆశ. షట్‌త్రింశన్మతమందిట్లా - ఆమశ్రాద్ధం చేసినప్పుడు పిండదానము ఎట్లా ఉంటుందంటే, గృహపాకంనుండి కొంత తీసి, సత్తుపిండితో కాని పాయసంతో కాని, తిలలతో కూడా, కోపం లేనివాడై దొరికినంత పిండములను ఇవ్వాలి, అని. పృథ్వీచంద్రోదయమందు వ్యాసుడిట్లా - విధినెరిగినవాడు, శ్రాద్ధం పెట్టేవాడు ఆమశ్రాద్ధము చేసినప్పుడు, ఎల్లప్పుడు బ్రాహ్మణునకు విధానప్రకారము చేతియందు అగ్నికరణము చేయాలి. ఇది సాగ్నికునకు. నిరగ్నికునకు ఎల్లప్పుడూ అది ఉండనే ఉంది. - ఆమంతో పిండం

ఇచ్చినట్లైతే బ్రాహ్మణులను వంటతో భుజింపజేయాలి, అన్నంతో పిండం చేసినట్లైతే ఆమాన్నమును ఎవడిస్తాడో, వీళ్ళిద్దరు నరులు నరకమునకు అర్హులని చెప్పబడ్డారు. అనుమానం లేదు అనే ఈ మాట దర్శాదిశ్రాద్ధపరము. దేశాచారముననుసరించి నిర్ణయము అని చెప్పుట తగును. మరీచి ఇట్లా - ఆవాహనము, స్వధాకారము, విసర్జనము వీనియందు మంత్రములను ఊహించాలి. ఇతర కర్మల్లో ఊహించవలసిన పని లేదు. ఇది ఆమశ్రాద్ధ విధి అని చెప్పారు. ఆవాహన మందు, హవిషే అత్తవే, అను చోట స్వీకర్తవే అని ఊహ. స్వధాకారమందునమోవః పితర ఇషే, అనుచోట ఇషే పదస్థానమందు ఆమద్రవ్యము కొరకు అని ఊహ. విసర్జనమందు వాజే వాజే అను చోట తృప్తా అనుచోట తర్ప్యత, తృప్యత అని కాని ఊహ. అందువల్ల ఋక్కును ఊహించరాదు అని ఋక్కుల ఊహనిషిద్ధమైనప్పటికైనా వచనం వల్ల (ఊహ) ఔతుంది. తృప్తి ప్రశ్న (తృప్తాఃస్థః) అవగాహము (బ్రాహ్మణ అంగుష్ఠనివేశనం) సుఖం కలిగేట్టు, జుషధ్వం అనుట ఐదవదైన ఆపోశనము (ఆచమనం) ఇవి ఆమశ్రాద్ధమందు కలగవు. దాని భావమిది. ఖలేవాలి పాతిన యూపస్తంబం. కాని యవక్షేత్రమందు కూడా ఖలే వాలీస్తంభముంది. దాన్ని యూపంగా అంగీకరిస్తే ఛేదనాదికం ఉండదు. ఖలేవాలి యందు ఛేదనాదులు లేనట్లు అర్ధం లేనందువల్ల పై ఐదింటికి లోపం సిద్ధిస్తుంది. ధర్మప్రదీపమందైతే - ఆమమును నాల్గింతలు ఇవ్వాలి లేదా రెట్టింపైనా ఇవ్వాలి. అట్లాగే హేమమును ఎనిమిదింతలివ్వాలి. ఆమమందు హేమమందును ఇది విధి.

మూ॥ ఆమే హైమే తథానిత్యేనాందీ శ్రాద్ధేతథైవచ, వ్యతీపాతాదికేశ్రాద్ధే నియమాన్వరి వర్జయేత్. గృహ పాకాత్సముద్ధృత్య సక్తుభిః పాయసేనవా, పిండదానం ప్రకుర్వీత ఆమే హైమేకృతే సతి. ఆమశ్రాద్ధేచ వృద్ధౌచప్రేతశ్రాద్ధేతథైవచ, వికిరంనైవకుర్వీత మునిఃకాత్యాయనోఽబ్రవీత్. ఆమశ్రాద్ధమనంగుష్ఠమగ్నౌకరణవర్జితం, తృప్తిప్రశ్నవిహీనంతుకర్తవ్యం మానవైర్ధ్రువం. ఆవాహనాగ్నౌకరణం వికిరం పాత్ర పూరణం, తృప్తి ప్రశ్నంనకుర్వీత ఆమేహైమే కదాచనేత్యుక్తం. ఏతచ్చ ఆవాహనం భవేత్కార్యమర్ఘ్యదానం తథైవచ, ఇతి హేమాద్రౌభవిష్యాది విరోధాచ్చింత్యం శాఖాంతర విషయం వాస్తు. వికిరో ఽప్యామేనేతి హేమాద్రిః. శూద్రస్యతుతత్రైవోక్తం. అగ్నౌకరణమంత్రశ్చనమస్కారోవిధీయతే. అగ్నయే కవ్యవాహనాయనమః. సోమాయపితృమతే నమ ఇత్యయం మంత్రః, మాత్స్యే - మంత్రవర్జ్యం హిశూద్రస్య సర్వమేవవిధీయతే, ఏవం శూద్రోఽపి సామాన్యం వృద్ధి శ్రాద్ధంచ సర్వదా. నమస్కారేణ మంత్రేణ కుర్యాదామాన్నవద్బుధః. తచ్చ పూర్వాహ్ణే కార్యం. ఆమశ్రాద్ధంతు పూర్వాహ్ణే ఏకోద్దిష్టంచమధ్యతః, పార్వణం చాపరాహ్ణేతుప్రాతర్ వృద్ధి నిమిత్తకం, ఇతిహారీతోక్తేః. ఏతద్ ద్విజ విషయం. శూద్ర కర్తృకంతు అపరాహ్ణే ఏవ. మధ్యాహ్నాత్ పరతో యస్తు కుతపః స ఉదాహృతః, ఆమశ్రాద్ధంతు తత్రైవ పిత్రూణాందత్తమక్షయం. ఇతి సుమం తూక్తేఃఇత్య పరార్కే హేమాద్రౌచోక్తం. తదభావేహేమశ్రాద్ధమాహ హేమాద్రౌ మరీచిః - ఆమాన్నస్యాప్య భావేతు శ్రాద్ధం కుర్వీత బుద్ధిమాన్, ధాన్యాచ్చతుర్గుణే నైవ హిరణ్యేనసురోచిషా. ధర్మః - ఆమంతు ద్విగుణం ప్రోక్తం హేమతద్వచ్చతుర్గుణం స్మృత్యర్థసారే - హిరణ్యమష్టగుణం

చతుర్గుణం సమం వాదద్యాత్. హేమాద్రౌ భవిష్యే - అన్నా భావేద్విజాభావే ప్రవాసే పుత్రజన్మని, హేమశ్రాద్ధం సగ్రహే చతధా స్త్రీ శూద్రయోరపి. షట్ త్రింశన్మతే తుర్యపాదే - వర్జయిత్వాక్షయేఒహని, ఇతి పారః యస్య భార్యా రజస్వలేతి వ్యాసపారః. **పుత్రోత్పత్తౌతు** హేమనియమమాహ సంవర్తః - పుత్రజన్మనికుర్వీత శ్రాద్ధం హేమ్నైవ బుద్ధిమాన్, నపక్వేన, నచామేన కళ్యాణాన్యభి కామయన్. భవిష్యే - గృహపాకాత్ సముద్ధృత్య సక్తుభిః పాయసేన, వా, పిండదానం ప్రకుర్వీత హేమశ్రాద్ధేకృతే సతి. శూద్రస్తుగృహపాకేన తత్పిండాన్నిర్వపేత్తథా, సక్తుమూలం ఫలంతస్య పాయసం వాభవేత్ స్మృతం. హేమశ్రాద్ధే పిండదానం నేతి దివోదాసః. స్మృత్యర్థ సారేతు వికల్ప ఉక్త స్తదా శయంనవిద్మః షట్త్రింశన్మతే - నామంత్రణాగ్నౌకరణం వికిరోనైవదీయతే, తృప్తిప్రశ్నోఒపినైవాత్ర కర్తవ్యః కేనచిద్భవేత్ అత్రమరీచినా ఆమాభావే హేమ విధానేన స్థానాపత్యాధర్మప్రాప్తేః పూర్వవత్ మంత్రోహః పూర్వాహ్ణకాలతాచజ్ఞేయేతిదిక్. పూర్వోక్త ధర్మప్రదీపోక్తేశ్చ. వ్యాసః - హిరణ్యమా మంశ్రాద్ధీయం లబ్ధంయత్ క్షత్రియాదితః, యధేష్టం వినియోజ్యం స్యాత్ భుంజీయాత్ బ్రాహ్మణాత్స్వయం. విప్రాల్లబ్ధం భుంజీయాత్. క్షత్రియాది లబ్ధేతుయధేష్టం వినియోగః తేనా పిశ్రాద్ధవైశ్వదేవాది, సకార్యం. దేవోద్దేశేన త్యక్తస్య దేవతాంతరాయత్యాగాయోగాదితి దేవయాజ్ఞికః.

అను॥ ఆమశ్రాద్ధమందు, హేమశ్రాద్ధమందు, నిత్యశ్రాద్ధము, నాంది శ్రాద్ధము వ్యతీపాతాదులకు, చెందిన శ్రాద్ధము వీని యందు నియమములను వదిలివేయాలి. ఆమం కాని హైమం కాని వీటి శ్రాద్ధం చేసినప్పుడు గృహపాకం నుండి తీసి సత్తుపిండితో కాని పాయసంతో కాని పిండదానం చేయాలి. ఆమశ్రాద్ధమందు, వృద్ధి శ్రాద్ధమందు, ప్రేత శ్రాద్ధమందును వికిరం చేయరాదు అని కాత్యాయనముని చెప్పాడు. ఆమశ్రాద్ధము, అంగుష్ఠం లేకుండా, అగ్నికరణం లేకుండ, తృప్తి ప్రశ్న లేకుండ, మానవులు తప్పకుండా చేయాలి. ఆవాహన, అగ్నికరణము, వికిరము, పాత్రపూరణము, తృప్తి ప్రశ్నము వీనిని ఆమమందు, హైమమందును ఎప్పుడూ చేయరాదు, అని చెప్పారు. ఇది, ఆవాహనము ఔతుంది అట్లాగే అర్ఘ్య దానం చేయాలి, అని హేమాద్రి యందు భవిష్య పురాణాదులకు విరోధమైనందువల్ల ఆలోచించాలి. శాఖాంతర విషయమైనా కావచ్చు. వికిరం కూడా ఆమంతో అని హేమాద్రి. శూద్రుని విషయమైతే అక్కడే చెప్పాము. అగ్నౌకరణ మంత్రము నమస్కారమని విధించబడింది. అగ్నికి, కవ్యవాహనునకు నమస్కారము. సోమునకు పితృమతునకు నమస్కారము, అని ఇది మంత్రము. మత్స్యపురాణమందిట్లా - మంత్రాన్ని వదలి శూద్రునకు అంతా కూడా విధించబడుతుంది. ఈ విధంగా బుద్ధిమంతుడైన శూద్రుడు కూడా సామాన్య శ్రాద్ధము, వృద్ధి శ్రాద్ధము వీటిని ఎల్లప్పుడు ఆమాన్నమువలె నమస్కారమంత్రంతో చేయాలి. దానిని పూర్వాహ్ణమందు చేయాలి. ఆమశ్రాద్ధము పూర్వాహ్ణ మందు, ఏకోద్దిష్టము మధ్యాహ్నకాలమందు, పార్వణము అపరాహ్ణకాలమందు, వృద్ధి నిమిత్తక శ్రాద్ధాన్ని ప్రాతః కాలమందు చేయాలి, అని హారీతోక్తి. ఇది బ్రాహ్మణుల విషయము. శూద్రుడు కర్త ఐతే

ఆశ్రాద్ధాన్ని అపరాహ్ణమందే చేయాలి. మధ్యాహ్నాంతరువాత ఉన్నకాలాన్ని కుతపకాలము అని దాన్ని అన్నారు. ఆ కాలంలో ఆమశ్రాద్ధము పితరులకిస్తే అది అక్షయమౌతుంది, అని సుమంతుని ఉక్తి అని అపరార్కమందు, హేమాద్రి యందును చెప్పారు అది లేని పక్షంలో హేమాద్రియందు మరీచి హేమశ్రాద్ధాన్ని చెప్పాడు - బుద్ధిమంతుడు, ఆమాన్నమును కూడా లేని పక్షంలో ధాన్యముకన్న నాల్గింతలైన, మంచి కాంతిగల హిరణ్యంతోనే శ్రాద్ధమాచరించాలి, అని. ధర్మిడిట్లా - ఆమమైతే రెట్టింపు అని చెప్పారు. అట్లాగే హేమము నాల్గింతలు, అని. స్మృత్యర్థసారమందిట్లా - హిరణ్యము ఎనిమిదింతలు, నాల్గింతలు లేదా సమంగా కాని ఇవ్వాలి, అని. హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా - అన్నం లేకపోతే, బ్రాహ్మణుడు లేకపోతే, ప్రవాసమందు, పుత్రుడు కల్గినప్పుడు గ్రహణమందు హేమశ్రాద్ధము చేయాలి. స్త్రీ, శూద్రులుకూడా అట్లాగే హేమశ్రాద్ధం చేయాలి, అని. షట్ త్రింశన్మతమందు నాల్గవ పాదమందిట్లా - (మరణదివసంలో మాత్రం హేమశ్రాద్ధం చేయరాదు, అని) మరణదివసాన్ని వదిలి అని పాఠము, ఎవని భార్య రజస్వలనో అని వ్యాస పాఠము. (అప్పుడు హేమశ్రాద్ధం). పుత్రుని ఉత్పత్తి యందు మాత్రం హేమ నియమాన్ని సంవర్తుడు చెప్పాడిట్లా - బుద్ధిమంతుడు పుత్రుడు జన్మించినపుడు హేమంతోనే శ్రాద్ధం చేయాలి, అన్నంతో కాని ఆమంతో కాని చేయరాదు, కళ్యాణకాంక్షకలవాడు, అని. భవిష్యమందిట్లా - హేమశ్రాద్ధం చేసినపుడు గృహపాకం నుండి తీసి సత్తుపిండితోగాని పాయసంతో కాని పిండదానం చేయాలి, అని. శూద్రుడైతే అట్లాగే గృహ పాకంతో ఆ పిండ నిర్వాపం చేయాలి (దానం). సత్తుపిండి, మూలము (గడ్డలు) పండ్లు, పాయసము ఇవి ఏవైనా వానికి ఉండాలని చెప్పారు. హేమశ్రాద్ధమందు పిండదానం లేదు అని దివోదాసు అన్నాడు. స్మృర్థ సారమందైతే వికల్పము అని చెప్పబడింది. అతని అభిప్రాయమేమిటో తెలియదు. షట్త్రింషన్మతమందిట్లా - ఆమంత్రణం, అగ్నౌకరణము, వికిరము, తృప్తి ప్రశ్న ఇవన్ని ఇక్కడ ఏ విధంగానూ చేయరాదు, అని. ఇక్కడ మరీచి ఆమం లేకపోతే హేమాన్ని విధించాడు కనుక, దాని స్థానంలో వచ్చినందువల్ల దాని ధర్మాలు దీనికొస్తాయి కనుక ముందు చెప్పినట్లు మంత్రముల ఊహ, పూర్వాహ్ణకాలమున ఆచరించుట అని తెలుసుకోవాలి, అని ఇక చాలు ముందు చెప్పిన ధర్మప్రదీపోక్తి కూడా. వ్యాసుడిట్లా-క్షత్రియాదులనుండి లభించిన శ్రాద్ధీయమైన హిరణ్యమును లేదా ఆమమును యథేష్టముగా వినియోగించుకోవచ్చును బ్రాహ్మణుని నుండి లభించినదానిని స్వయంగా అనుభవించాలి (తినాలి) అని. బ్రాహ్మణుని నుండి లభించిన దానిని అనుభవించాలి. క్షత్రియాదులనుండి లభిస్తే మాత్రం యథేష్టంగా వినియోగించాలి. దానితో కూడా శ్రాద్ధవైశ్వదేవాదులు చేయరాదు. ఒక దేవతనుద్దేశించి విడిచిపెట్టిన (ఇచ్చిన) దానిని మరో దేవత కొరకు త్యాగం చేయటం తగదు అని దేవయాజ్ఞికుడు అన్నాడు.

మూ॥ **శూద్రలబ్ధేతూక్తం** తత్రైవ షట్త్రింశన్మతే - ఆమం శూద్రస్య యత్కించిత్ శ్రాద్ధికం ప్రతిగృహ్యతే, తత్సర్వంభోజనాయాలం నిత్యనైమిత్తికేనచ, ఇతి. శుద్ధితత్వే అంగిరాః -శూద్రవేశ్మని విప్రేణక్షీరం వాయదివాదధి, నివృత్తేన నభోక్తవ్యం శూద్రాన్నంతదపిస్మృతం. శూద్రాద్విప్రగృహేష్వన్నం ప్రవిష్టంతు సదాశుచి పరాశరః - తావద్భవతి శూద్రాన్నం యావన్న స్పృశతి ద్విజః, ద్విజాతి కరసంస్పృష్టం సర్వం తన్న విరుద్ధ్యతే. విష్ణుపురాణే - సంప్రోక్షయిత్వా గృహ్ణీయాచ్ఛూద్రాన్నం గృహమాగతం అంగిరాః - పాత్రాంతరగతంగ్రాహ్యం దుగ్ధం స్వగృహమాగతం. **సపిండశ్రాద్ధాశక్తా** వాహహేమాద్రౌసంవర్తం. - సమగ్రం యస్తు శక్నోతికర్తుం నైవేహపార్వణం, **అపిసంకల్ప విధినాకాలేతస్య విధీయతే., పాత్రే భోజ్యస్యచాన్నస్యత్యాగః సంకల్ప ఉచ్యతే. వ్యాసః - సాంకల్పంతు యదాకుర్యాన్నకుర్యాత్పాత్ర పూరణం, నావాహనాగ్నౌకరణే పిండాంశ్చైవనదాపయేత్.** పాత్రమర్ఘస్య. సమంత్రకావాహనస్య నిషేధః తూష్ణీంతుభవత్యేవేతి హేమాద్రిః. స్మృత్యర్థసారే - వికిరంతునదాతవ్యం, ఇతి తృతీయపాదే పాఠః, స్మృత్యంతరే - త్యజేదా వాహనం చార్ఘ్యమగ్నౌకరణమేవచ, పిండాంశ్చ వికిరాక్షయ్యే శ్రాద్ధే సాంకల్ప సంజ్ఞకే. హేమాద్రౌ వృద్ధ శాతాతపస్తు - పిండ నిర్వాపరహితం యత్తు శ్రాద్ధం విధీయతే, స్వధావాచనలోపోత్ర వికిరస్తు నలుప్యతే, ఇత్యాహ. **పృథ్వీచంద్రోదయేవసిష్ఠః** - ఆవాహనం స్వధాశబ్దం పిండాగ్నౌకరణం తథా, వికిరం పిండ దానం చసాంకల్పే షడ్వివర్జయేత్ వికిరే వికల్పః. స్మృత్యంతరే - అంగాని పితృయజ్ఞస్య యదాకర్తుం నశక్నుయాత్, సతదావాచయేద్విప్రాన్ సంకల్పాత్ సిద్ధిరస్త్వితి. (ఛాగలేయః - పిండోయత్రనివర్తేత మఘాదిషు కథంచన, సాంకల్పంతుతదా కార్యం నియమాత్ బ్రహ్మవాదిభిః . కార్ష్ణాజినిః - మౌంజీబంధాద్వత్సరార్ధం వత్సరం పాణిపీడనాత్, పిండాన్సపిండా, నోదద్యుః ప్రేతపిండం వినాత్రతు. అస్యాపవాదః పిత్రోరాబ్దికాదౌ పూర్వముక్తః. త్యక్తాగ్నేరపి సంకల్పముక్తం షట్ త్రింశన్మతే - అనగ్నికోయదావిప్రఉచ్ఛిన్నాగ్నిస్తథైవచ, తథా వృద్ధిషు సర్వాసు సంకల్ప శ్రాద్ధమాచరేత్. అశక్తౌతు పృథ్వీ చంద్రోదయే బృహన్నారదీయేచ - ద్రవ్యా భావేద్విజాభావే అన్నమాత్రంతు పాచయేత్. పైతృకేనతు సూక్తేన హోమం కుర్యాద్విచక్షణః.

అను॥ శూద్రుని నుండి లభించిన పక్షంలోనైతే అక్కడే షట్త్రింశన్మత మందు ఇట్లా చెప్పబడింది - శూద్రుని ఆమమును ఏ కొంచమైనా శ్రాద్ధమునకు చెందినదానిని స్వీకరిస్తే అదంతా భోజనమునకు చాలు నిత్యనైమిత్తికములందు ఉపయోగించతగదు, అని. శుద్ధి తత్వమందు అంగిరుడిట్లా - శూద్రుని ఇంటి యందు బ్రాహ్మణుడు పాలుగాని పెరుగు గాని, నివృత్తుడౌతూ తాగరాదు. అది కూడా శూద్రాన్నమని చెప్పబడింది. శూద్రుని ఇంటినుండి బ్రాహ్మణుని ఇంటికి ప్రవేశించిన అన్నము అది ఎల్లప్పుడూ శుచి, అని. పరాశరుడిట్లా - బ్రాహ్మణుడు ముట్టనంతవరకు అది శూద్రాన్నము ఔతుంది. బ్రాహ్మణుని చేతితో ముట్టబడిన పిదప అదంతా విరోధము కాదు (దోషరహితము) అని. విష్ణుపురాణ మందిట్లా - శూద్రాన్నము ఇంటికి వచ్చినట్లైతే, దానిని సంప్రోక్షణ చేసి తీసుకోవాలి, అని. అంగిరుడిట్లా - తన ఇంటికి వచ్చిన శూద్రుని పాలనుమరొక పాత్రలో (పోయించి)

తీసుకోవాలి, అని. సపిండ శ్రాద్ధము చేయటానికి అశక్తుడైతే హేమాద్రియందు సంవర్తుని మాట ఇట్లా - పార్వణమును సమగ్రముగా చేయుటకు చేతకాని వారు దానిని సకాలంలో సంకల్ప విధితో చేయాలి, అని. సంకల్పమనగా పాత్రమందు తినతగిన అన్నమును త్యాగం చేయుట. వ్యాసుడిట్లా - సంకల్పం చేసినప్పుడు పాత్రపూరణ చేయరాదు. ఆవాహనము, అగ్నౌకరణము, పిండదానము చేయరాదు, అని పాత్రమనగా అర్ఘ్యపాత్రము. మంత్రముతో కూడిన ఆవాహన, నిషిద్ధము. మౌనంగానైతే ఆవాహన ఉంటుంది అని హేమాద్రి . స్మృత్యర్థసారమందిట్లా - తృతీయపాదమందు, వికిరమైతే ఇవ్వరాదు, అని పారము. స్మృత్యంతరమందిట్లా - సంకల్ప శ్రాద్ధమందు, ఆవాహన, అర్ఘ్యము, అగ్నౌకరణము, పిండములు, వికిర అక్షయ్యములు ఇవన్నీ విడిచి పెట్టాలి, అని. హేమాద్రి యందు వృద్ధ శాతాతపుడిట్లా - పిండ నిర్వాపం లేకుండా చెప్పబడిన శ్రాద్ధమందు, స్వధావచనలోపం కూడా ఉంటుంది, వికిరలోపం మాత్రం ఉండదు, అని అన్నారు. పృథ్వీచంద్రోదయమందు వసిష్ఠుడిట్లా - సాంకల్పమందు, ఆవాహన, స్వధాశబ్దము, పిండము, అగ్నౌకరణము, వికిరము, పిండదానము ఈ ఆరింటిని విడిచిపెట్టాలి, అని. (పిండము=ఉచ్ఛిష్ట పిండము అని). వికిరమందు వికల్పము. స్మృత్యంతరమందిట్లా - పితృయజ్ఞము యొక్క అంగములను చేయడానికి చేతగాని పక్షంలో ఆతడు అప్పుడు బ్రాహ్మణులతో, సంకల్పంతో సిద్ధి కలుగని, అని చెప్పించాలి, అని. ఛాగలేయుడిట్లా - మఘాదులలో ఏదో రకంగా పిండముల నివృత్తి ఐన పక్షంలో అప్పుడు బ్రహ్మవాదులు నియమంగా సంకల్పశ్రాద్ధం చేయాలి, అని. కార్ష్ణాజిని ఇట్లా - ఉపనయనం అయ్యాక అర్థ సంవత్సరం వరకు వివాహం అయ్యాక సంవత్సరం వరకు ప్రేత పిండం తప్పసపిండులు పిండములను ఇవ్వరాదు, అని. దీనికి అపవాదము, పితరుల (తల్లి, తండ్రి) ఆబ్దికము మొదలగు వానియందు, ముందు చెప్పాము. షట్ త్రింశన్మతమందు త్యక్తాగ్నికునకు కూడా సంకల్పం చెప్పబడింది. - అగ్ని లేనప్పుడు అలాగే అగ్ని నశించినప్పుడు అట్లానే అన్ని వృద్ధి శ్రాద్ధములందు సంకల్ప శ్రాద్ధమాచరించాలి, అని. శక్తి లేని పక్షంలో పృథ్వీచంద్రోదయమందు, బృహన్నారదీయమందును ఇట్లా - ద్రవ్యం లేకపోతే, బ్రాహ్మణుడు లేకపోతే, అన్నం మాత్రమే వండించాలి. బుద్ధిమంతుడు పితృసూక్తంతో హోమం చేయాలి, అని.

**మూ॥ దేవలః - పిండమాత్రం ప్రదాతవ్యం అభావేద్రవ్య విప్రయోః శ్రాద్ధీయా హాని సంప్రాప్తే భవేన్నిరశనోపివా. వృద్ధ వసిష్ఠః - కించిద్దద్యాదశక్తస్తు ఉదకుంభాదికంద్విజే, తృణానివా, గవేదద్యాత్ పిండాన్వాప్యథనిర్వపేత్. తిలదర్భైఃపితౄన్వాపి తర్పయేత్ స్నాన పూర్వకం. హేమాద్రౌభవిష్యే - అగ్నినా, వాదహేత్కక్షం శ్రాద్ధ కాలే సమాగమే, తస్మిన్‌వోపవసేదప్ని జపేద్వాశ్రాద్ధ సంహితాం. శ్రాద్ధ సంహితా సమంత్ర శ్రాద్ధ సంకల్పః. విష్ణు వరాహ పురాణయోః - అసమర్థోన్నదానస్యధాన్య మామం (మాంసం) స్వశక్తితః, ప్రదాస్యతి తిలాన్వాపిస్వల్పాం**

వాపిదక్షిణాం. సర్వాభావే వనంగత్వా కక్షామూల ప్రదర్శకః, సూర్యాదిలోకపాలానామిదముచ్చైః పఠిష్యతి. నమేస్తివిత్తం నధనం నచాన్నం శ్రాద్ధోపయోగి స్వపితౄన్నతోఽస్మి, తృప్యంతుభక్త్యా పితరౌమయైతౌ భుజౌకృతౌ వర్త్మని మారుతస్య. ఇత్యేతత్ పితృభిర్గీతం భావాభావ ప్రయోజనం యఃకరోతికృతంతేన శ్రాద్ధం భవతి భారత. ప్రభాసఖండే - గత్వారణ్యమమానుష్యం ఊర్ధ్వబాహుర్వి రౌత్యదః, నిరన్నోనిర్ధనోదేవాః పితరో మాఽనృణం కృధాః. నమేస్తి విత్తంనధనం నభార్యా శ్రాద్ధం కథంవః పితరఃకరోమి, వనం ప్రవిశ్యేహతు తన్మయోచ్చైః భుజౌకృతౌవర్త్మని మారుతస్య శ్రాద్ధర్ణమే తద్భవతాంప్రదత్తం మహ్యందయధ్వంపితృదేవతాద్యాః ఆఖ్యాయచోత్ క్షిప్యభుజౌ తతోవైదివాచరాత్రిం సముపోష్యతిష్ఠేత్. భవేత్సవైతేన కృతేన తేషాం ఋణేనముక్తః పితృదేవతానాం, ఇత్యనుకల్పః. **అథశ్రాద్ధభోజనే ప్రాయశ్చిత్తం** - దర్శేషట్ప్రాణాయామాః. వృద్ధౌత్రయః, సంస్కారేషు జాతకర్మాది చూడాంతేషుసాంతపనం. ఆద్యేచాంద్రంవా అన్య సంస్కారేషూపవాసః. సీమంతే చాంద్రమితి విజ్ఞానేశ్వరః. ఆపది నవశ్రాద్ధఏకాదశాహేషు భోజనేకాయః. ద్వాదశాహే ఊనమాసేచ పాదోనః ద్విమాసే త్రిపక్షే ఊన షష్ఠ ఊనాబ్దయోశ్చార్ధ కృచ్ఛ్రః. త్రిమాసాద్యాబ్దికాంతేషు సపిండేషు పాదకృచ్ఛ్రః ఉపవాసోవా గురుద్రవ్యార్ధ భోజనే అర్ధం. జపశీలేతదర్ధం. అనాపది తూన మాసాంతేషు చాంద్రంకా యంవా. ద్విమాసాదౌపాదోనం. త్రిమాసాదావర్ధకాయః. ఆబ్దికే పాదోనకాయః. పునరాబ్దికే ఏకాహః క్షత్రియాది శ్రాద్ధేషు ద్విత్రి చతుర్గుణానిజ్ఞేయాని. చండాల సర్పశ్వాది హతపతి తక్లీబాది నవశ్రాద్ధే చాంద్రం ఆద్యమాసికాంతే చాంద్రం పరాకశ్చ ద్వాదశాహో దౌపరాకః. ద్విమాసాదావతి కృచ్ఛ్రః. త్రిమాసాదౌకాయః ఆబ్దికేపాదః అభ్యాసేసర్వం ద్విగుణం. ఆమహేమ సంకల్పశ్రాద్ధేషు తత్తదర్ధాని. యతిబ్రహ్మచారీ చోక్తం ప్రాయశ్చిత్తం కృత్వాత్రీనుపవాసాన్ ప్రాణాయామాన్ ఘృతాశనం చాధికంకృత్వావ్రతశేషం సమాపయేత్. అనాపది ద్విగుణం. దర్శాదౌదశగాయత్రీమంత్రితా అపఃపిబేత్ షట్ ప్రాణాయామావా. సంస్కారేషు చౌలేకృచ్ఛ్రః. సీమంతేచాంద్రం. అన్యేషూపవాస ఇతిదిక్. అత్ర మాధవమితాక్షరాదౌ క్వచిద్విరోధోవిషయ భేదాత్పరిహార్యః. ఏకాదశాహే చాద్రం పునః సంస్కారశ్చేతి ప్రాయశ్చిత్త కాండే హేమాద్రిః.

అను॥ దేవలుడిట్లా - శ్రాద్ధపు రోజు వచ్చినప్పుడు ద్రవ్యము, విప్రుడు లేనప్పుడు పిండమాత్రమైనా ఇవ్వాలి. లేదా ఉపవాసమైనా ఉండాలి, అని. వృద్ధ వసిష్ఠుడిట్లా - అశక్తుడైతే, బ్రాహ్మణునకు ఉదకుంభాదికము ఏదో ఒకటి ఇవ్వాలి. ఆవునకు గడ్డిపోచలైనా ఇవ్వాలి. పిండనిర్వాపమైనా చేయాలి. స్నానం చేసి తిలదర్భలతో పితృతర్పణం ఐనా చేయాలి, అని. హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా - శ్రాద్ధ కాలం వచ్చినప్పుడు అగ్నితో గడ్డిని కాల్చాలి, లేదా ఆరోజు పగలు ఉపవాసముండాలి, లేదా శ్రాద్ధ సంహితను జపించాలి, అని. శ్రాద్ధ సంహిత అనగా మంత్ర పూర్వకముగా శ్రాద్ధ సంకల్పము చేయుట. విష్ణు వరాహ పురాణములందిట్లా - అన్నదానం చేయటానికి సమర్థుడు కాకపోతే తన శక్తి కొలది ఆమము (మాంసము) ధాన్యము కాని లేదా నువ్వులను గాని, కొంచమైనా దక్షిణ గాని ఇవ్వాలి, అని. ఏదీ లేని పక్షంలో అడవికి పోయి, కక్షమూలమును ప్రదర్శిస్తూ, సూర్యాది లోక పాలురకు ఇట్లా గట్టిగా వినిపిస్తాడు. నాకు ధనం లేదు (బంగారం మొ॥

చలసంపత్తి), విత్తం లేదు (ఆస్తి, స్థిరమైనది), అన్నము లేదు. శ్రాద్ధమునకు ఉపయోగించేది ఏది లేదు. నా పితరులకు నమస్కరిస్తున్నాను. నేను నా భుజములను గాలిమార్గంలో ఉంచాను. తల్లి తండ్రులార (నాపితరులు) భక్తితో తృప్తి చెందని, అని అనాలి (చేతులు పైకెత్తి). అనే, ఇది పితృగీతము. భావ (ఉన్నది) అభావ (లేదు) ముల ప్రయోజనము కల్గించేది. దీన్ని ఆచరించిన వాడు శ్రాద్ధాన్ని ఆచరించినట్టే ఔతుంది., ఓ భారత (ఉండవల్సినవి లేవు దాని ప్రయోజనాన్ని కల్గిస్తుంది). ప్రభాస ఖండమందిట్లా - మనుష్యులు లేని అరణ్యమునకు వెళ్ళి, చేతులుపైకెత్తి ఇట్లా ఏడవాలి. అన్నం లేనివాణ్ణి, ధనం లేనివాణ్ణి, ఓ దేవతలారా ఓ తలిదండ్రులార, నన్ను ఋణవిముక్తుణ్ణి చేయండి, అని. నాకు విత్తము లేదు ధనము లేదు భార్య లేదు, ఓ పితరులార, మీకు శ్రాద్ధము నేనెట్లా చేయను. అడవిని ప్రవేశించి ఇక్కడ నేను చేతులు పైకెత్తి, గాలి మార్గంలో ఉంచాను. శ్రాద్ధరూపమైన ఋణమును దీనిని మీకిచ్చాను. పితరులారా, మరి దేవతలారా (మొదలగు) మీరంతా నాపై దయ చూపండి. అని పలికి, భుజములు పైకెత్తి పగలు రాత్రి ఉపవసించి నిలిచి ఉండాలి. ఆతడిట్లా చేశాకనే ఆపితృ, దేవతల ఋణమునుండి ఆతడు ముక్తుడౌతాడు అని అనుకల్పము (ముఖ్యమైనది చేయలేని పక్షంలో ఇది అని). ఇక శ్రాద్ధభోజనమందు ప్రాయశ్చిత్తము చెప్తున్నాడు. అమావాస్య శ్రాద్ధభోజనం చేస్తే ఆరు ప్రాణాయామములు చేయాలి. వృద్ధి శ్రాద్ధమందు మూడు ప్రాణాయామములు చేయాలి. జాతకర్మ మొదలుకొని చూడాకర్మ అంతముగా గల సంస్కారములందు సాంతపనము ప్రాయశ్చిత్తము. జాతకర్మయందు చాంద్రాయణవ్రతం కానీ ఇతర సంస్కారములందు ఉపవాసము. సీమంతమందు చాంద్రాయణమని విజ్ఞానేశ్వరుడు. (చాంద్రాయణ వ్రతమనగా పూర్ణిమనాడు కోడిగుడ్డంత చొప్పున పదిహేను ముద్దలు అన్నము పాడ్యమినాడు పద్నాలుగు ఇట్లా తగ్గి అమావాస్య నాటికి ఏ ముద్ద ఉండదు శూన్యం. మళ్ళీ పాడ్యమి నాటికి ఒక ముద్దతో ఆరంభమై పూర్ణిమ నాటికి పదిహేను ముద్దల అన్నం ఇట్లా ఉండటం చాంద్రాయణవ్రతం) **ఆపద యందు,** నవశ్రాద్ధము, పదకొండవరోజు భోజనము వీనియందు కాయము ప్రాయశ్చిత్తము పన్నెండవరోజు, ఊనమాసము ఈ బోజనములందు పాద ఊనము. రెండవ మాసము, త్రైపక్షికము, ఊనషష్ఠము, ఊనఅబ్దము ఈ భోజనములందు అర్థకృచ్ఛ్రము. మూడవ మాసము మొదలు ఆబ్దికంచివరి వరకు, సపిండములు వీనియందు పాదకృచ్ఛ్రము లేదా ఉపవాసము గురుద్రవ్య అర్థభోజనమందు అర్థకృచ్ఛ్రము. జపము చేసేవానికైతే అందులో సగము. **ఆపదలేనప్పుడు,** ఊనమాసాంతములందు చాంద్రాయణం లేదా కాయము ప్రాయశ్చిత్తము. ద్విమాసాదులందు పాదఊనము. త్రిమాసాదులందు అర్థకాయము. ఆబ్దికమందు పాదఊనకాయము. పునరాబ్దికమందు ఒకరోజు ఉపవాసము. క్షత్రియాది

శ్రాద్ధములందు రెండింతలు, మూడింతలు, నాల్గింతలు ప్రాయశ్చిత్తమని తెలుసుకోవాలి. చండాలుడు, సర్పము, కుక్క మొ॥ వీనితోహతుడు, పతితుడు, క్లీబుడు మొదలగు వారి నవశ్రాద్ధమందు చాంద్రాయణవ్రతము తొలిమాసికాంతమందు చాంద్రము, పరాకకూడా. పన్నెండవ రోజు మొదలగువాని యందు పరాక. ద్విమాసాది యందు అతి కృచ్ఛ్రము. త్రిమాస ఆది యందు కాయము. ఆబ్దికమందు పాదముప్రాయశ్చిత్తము. అభ్యాసమైతే అన్నీ రెట్టింపే. (మాటిమాటికి భుజిస్తే). ఆమ హేమ సంకల్ప శ్రాద్ధములందు వాని, వాని ప్రాయశ్చిత్తములలో ఆయా సగం సగంలు చేయాలి. యతి బ్రహ్మచారులైతే చెప్పిన ప్రాయశ్చిత్తాన్ని చేసి, మూడు ఉపవాసములను, ప్రాణాయామములను చేసి, ఘృత ప్రాశనము అధికంగా చేసి వ్రత శేషమును సమాప్తి చేయాలి. ఆపదలేనప్పుడు రెట్టింపు ప్రాయశ్చిత్తము. దర్శాదులందు దశగాయత్రితో మంత్రితమైన నీటిని, తాగాలి లేదా ఆరు ప్రాణాయామములైనా చేయాలి. సంస్కారములందు చౌలమందు కృచ్ఛ్రము ప్రాయశ్చిత్తము సీమంతమందు చాంద్రాయణము మిగిలిన వాటియందు ఉపవాసము, అని ఇక చాలు ఇక్కడ మాధవమితాక్షరాదులందు ఒక్కోచోట విరోధము, విషయ భేదముననుసరించి విరోధ పరిహారం చేయాలి. పదకొండవ రోజు యందు చాంద్రాయణము తిరిగి సంస్కారము అని ప్రాయశ్చిత్త కాండయందు హేమాద్రి. (నవశ్రాద్ధములు అనగా మొదటి రోజు, మూడవ, ఐదవ, ఏడవ, తొమ్మిదవ, పదకొండవ రోజుల శ్రాద్ధములు. ఇవి ఆరు.) (కాయశోధన మనగా కోడిగుడ్డంత ప్రమాణముగలయవలను తిని, ఉండుట అని అర్థము.)

**మూ॥ యత్తూశనాః - దశకృత్వః పిబేదాపోగాయత్ర్యా శ్రాద్ధభుక్ద్విజః, ఇతితదనుక్త ప్రాయశ్చిత్త శ్రాద్ధ పరమితి విజ్ఞానేశ్వరః. అథక్షయాహ శ్రాద్ధం. తత్స్వరూప మాహ హేమాద్రావ్యాసః - మాసపక్షతిథి స్పృష్టే యోయస్మిన్ మ్రియతేఽహని ప్రత్యబ్దంతుతథాభూతంక్షయాహం తస్యతం విదుః. నారదీయే - పారణే మరణేన్నృణాం తిథిఃతాత్కాలికీస్మృతా. అత్ర చాంద్రమానం జ్ఞేయం. ఆబ్దికే పితృ కార్యేచ చాంద్రోమాసః ప్రశస్యతే, ఇతిగర్గోక్తేః మల మాసమృత స్యతుసౌరం. మలమాసమృతానాంతుసౌరమానం సమాశ్రయేత్, ఇతి హేమాద్రావుక్తేః. ఏతన్మృతి మాసస్యైవాధిక్యే జ్ఞేయం. బ్రాహ్మే - ప్రతి సంవత్సరం కార్యం మాతా పిత్రోః మృతేఽహని, పితృవ్య స్యాప్యపుత్రస్య భ్రాతుః జ్యేష్ఠస్య చైవహి అపుత్రస్యేతి భ్రాత్రాఽప్యన్వయః. జ్యేష్ఠస్యేతి కనిష్ఠస్య అనావశ్యక త్వార్థం. మదనరత్నే భవిష్యే - సర్వేషామేవ శ్రాద్ధానాం శ్రేష్ఠం సాంవత్సరంమతం. తథా - భోజకోయస్తు వైశ్రాద్ధం నకరోతి ఖగాధిప, మాతాపితృభ్యాం సతతం వర్షే వర్షే మృతేఽహని సయాతి నరకం ఘోరం తామిస్రం నామనామతః తచ్చనానాస్మృతిష్వే కోద్దిష్టం పార్వణం చోక్తం.**

అను॥ శ్రాద్ధభోక్త ఐన బ్రాహ్మణుడు గాయత్రితో పదిమార్లు మంత్రించబడిన జలమును తాగాలి, అని ఉశనుడన్న మాట ప్రాయశ్చిత్తం చెప్పబడని శ్రాద్ధపరము అని విజ్ఞానేశ్వరుడన్నాడు. ఇక చనిపోయిన నాటి శ్రాద్ధము. దాని స్వరూపాన్ని హేమాద్రి యందు

వ్యాసుడిట్లా చెప్పాడు. - ఎవడు ఏ మాసము, పక్షము, తిథి స్పర్శ కలిగిన రోజున మరణిస్తాడో వానికి ఆ మాస, పక్ష, తిథి కలిగిన రోజును ప్రతి సంవత్సరము క్షయాహముగా గ్రహించాలి, అని. నారదీయమందిట్లా - పారణమందు, మరణమందు నరులకు తిథి ఆ సమయమందలి తిథి చెప్పబడింది, అని. ఇక్కడ చాంద్రమానాన్ని గ్రహించాలి. ఆబ్దికమందు పితృ కార్యమందును చాంద్రమాసము ప్రశస్తమైంది, అని గర్గోక్తి. మలమాసంలో మరణించిన వానికైతే సౌరమాసము గ్రహించాలి. మలమాసమందు మరణించినవారికైతే సౌరమానమును ఆశ్రయించాలి, అని. హేమాద్రియందు చెప్పబడింది. దీనిని మరణమాసం యొక్క ఆధిక్యమందే అని గ్రహించాలి. బ్రహ్మపురాణమందిట్లా - ప్రతిసంవత్సరము మాతాపితరులు చనిపోయిన రోజున శ్రాద్ధం చేయాలి. సంతానములేని తండ్రి తోబుట్టువునకు (పెదనాన్న అట్లా) సంతానము లేని పెద్ద అన్నయ్యకు కూడా శ్రాద్ధం సాంవత్సరికము మరణదినమందు చేయాలి, అని. అపుత్రస్య అనే శబ్దము భ్రాతృశబ్దంతో కూడా అన్వయిస్తుంది. జ్యేష్ఠునకు అని చెప్పటం వల్ల కనిష్ఠుడికి చేయనవసరం లేదు అని అర్థము (పుత్రునకు తండ్రి, అనుజునకు అగ్రజుడు చేయరాదు. ఒక వేళ స్నేహం వల్ల చేసినా సపిండీకరణం లేకుండా చేయాలి అని ఉక్తి). మదనరత్నమందు భవిష్యోక్తి ఇట్లా - శ్రాద్ధములన్నింటిలో సంవత్సర శ్రాద్ధము శ్రేష్ఠము, ఇష్టమైంది, అని (చేస్తే కళ్యాణకారి, లేకపోతే నరక ప్రాప్తి తప్పక చేయాలి). అట్లాగే - ఓఖగాధిప! ఏ భోజకుడు (ఆస్తి అనుభవించేవాడు) ప్రతి సంవత్సరము తన తల్లిదండ్రులకు వారు చనిపోయిన రోజున ఎల్లప్పుడు వారికై శ్రాద్ధం చేయడో, అతడు తామిస్రమును పేరుగల ఘోరనరకమునకు వెళ్తాడు. అది కూడా ఏకోద్దిష్టవిధానంగాను పార్వణవిధిగాను చేయాలి అని అనేక స్మృతులయందు చెప్పబడింది.

**మూ॥ ఆద్యమాహయమః - సపిండీకరణాదూర్ధ్వం ప్రతి సంవత్సరం సుతైః, మాతా పిత్రోః పృథక్కార్యం ఏకోద్దిష్టం మృతేఽహని వ్యాసః - ఏకోద్దిష్టంతుకర్తవ్యం పిత్రోశ్చైవ మృతేఽహని, ఏకోద్దిష్టం పరిత్యజ్యపార్వణం కురుతేనరః, అకృతం తద్విజానీయాత్ భవేచ్చ పితృఘాతకః అంత్యమాహశాతాతపః - సపిండీకరణంకృత్వాకుర్యాత్పార్వణవత్సదా, ప్రతి సంవత్సరం శ్రాద్ధం ఛాగలేయోదితో విధిః. యఃసపిండీకృతం ప్రేతం పృథక్పిండే నియోజయేత్, విధిఘ్నస్తేనభవతి పితృహాచోపజాయతే. అత్రౌరసక్షేత్రజయోః పార్వణం దత్తకాదీనామేకోద్దిష్టమిత్యేకః పక్షః. సాగ్నేః పార్వణం నిరగ్నేరేకోద్దిష్టమిత్యపరః. తద్దూషణం మితాక్షరాదౌజ్ఞేయం. కల్పతరుస్తు - సాగ్న్యోరౌరస క్షేత్రజయోః పార్వణం, నిరగ్నికయోస్త్వేకోద్దిష్టం, ఇత్యాహ. అపరార్కే ప్యేవం. దత్తకాదయో దశపుత్రాస్తు సాగ్నయో నిరగ్నయశ్చై కోద్దిష్టమేవకుర్యుః, ప్రత్యబ్దం పార్వణేనైవ విధినా క్షేత్రజౌరసౌ, కుర్యాతామితరే కుర్యురేకోద్దిష్టంసుతాదశ. ఇతి జాతూకర్ణ్యోక్తేః. యదాతు దత్త కస్యపితాదర్శే మహాలయేవా మృతః తత్ర పార్వణ ఏకోద్దిష్టయోః వికల్పః. వస్తు తస్తు సర్వేషాం పార్వణై కోద్దిష్టయోః వ్రీహియవవ ద్వికల్పః. సచదేశాచారాద్వ్యవస్థిత ఇతి సర్వనిబంధ సిద్ధాంతః. అత ఏవ పృథ్వీ చంద్రోదయే వృద్ధ పరాశరః - మాతాపిత్రోః పృథక్కార్యమే కోద్దిష్టం మృతేఽహని, ఇత్యుక్త్వాహ**

దేశధర్మం సమాశ్రిత్యవంశధర్మం తథాపరే, సూరయః శ్రాద్ధమిచ్ఛంతి పార్వణంచక్షయాహన్యపి. ఇతితచ్చ కేవలంపితౄణాం,న, సపత్నీకానామితి హేమాద్రిః. అత్రమాతా మహోన కార్యాః. కర్షూ సమన్వితం ముక్త్వా తథాద్యంశ్రాద్ధషోడశం. ప్రత్యాబ్దికంచ శేషేషు పిండాః స్యుఃషడితిస్థితిః, ఇతికాత్యాయనోక్తేః కర్షూసమన్వితం=సపిండనం. యైరేకోద్దిష్టంక్రియతే తేషామపిక్వచిత్పార్వణమేవ అమావాస్యాం క్షయోయస్య ప్రేత పక్షేఽథవా పునః, పార్వణం తస్య కర్తవ్యం నైకోద్దిష్టం కదాచన, ఇతి శంఖోక్తేః ఏవంసన్యాసినోఽపి. ఏకోద్దిష్టంయతేర్నాస్తి త్రిదండ గ్రహణాదిహ, సపిండీకరణా భావాత్ పార్వణంతస్య సర్వదా, ఇతి ప్రచేత సోక్తేః. వాయవీయే – సంన్యాసినోఽప్యాబ్దికాది పుత్రఃకుర్యాద్యథావిధి. మహాలయే తుయచ్ఛ్రాద్ధం ద్వాదశ్యాం పార్వణంహితత్. పృధ్వీచంద్రోదయే వృద్ధ పరాశరః – సంగ్రామే సంస్థితానాంచ ప్రేతపక్షే శశిక్షయే, తేషాం పార్వణమేవోక్తం క్షయాహేపిచ సత్తమైః. చంద్రక్షయానా శకసంయుగేషు యఃప్రేతపక్షే మృతవాన్ సపిండః, సపిండితానామపిచాబ్ది కాని భవంతి తేషామిహ పార్వణాని. తథా – భ్రాతుః జ్యేష్ఠస్య కుర్వీత జ్యేష్ఠో భ్రాతా నుజస్యచ, దైవహీనంతు తత్కుర్యాత్ ఇతి ధర్మ విదబ్రవీత్. దైవహీనమేకోద్దిష్టం. జ్యేష్ఠోభ్రాతా అనాద్యగర్భజః తథాచతత్రైవశాతాతపః – అనాద్యగర్భజ్యేష్ఠో పిభ్రాతా సద్భిర్నిగద్యతే, ఋతే సపిండ నాత్తస్య నైవ పార్వణ మాచరేత్. అద్యగర్భేతు పార్వణమేకోద్దిష్టం వేత్యర్థః.

అను॥ యముడు తొలిదాన్ని గూర్చి (ఏకోద్దిష్టం) ఇట్లా చెప్పాడు – సపిండీకరణం తరువాత ప్రతి సంవత్సరము, పుత్రులు, మాతాపితరులు చనిపోయిన రోజున, మాతాపితరుల ఏకోద్దిష్టమును విడివిడిగా చేయాలి, అని. వ్యాసుడిట్లా – తల్లిదండ్రులకు, వారు చనిపోయిన రోజున ఏకోద్దిష్టమునాచరించాలి. ఏకోద్దిష్టాన్ని వదలి పార్వణాన్ని ఆచరించిన నరుడు, వాడు శ్రాద్ధంచేయనట్టే అని గ్రహించాలి. పైగా వాడు పితృఘాతకుడు కూడా ఔతాడు, అని.పార్వణాన్ని గూర్చి శాతాతపుడిట్లా – సపిండీకరణాన్ని చేసి, ఎల్లప్పుడు ప్రతి సంవత్సరము పార్వణం వలె శ్రాద్ధమాచరించాలి, ఇది ఛాగలేయుడు చెప్పిన విధి. ఎవడు సపిండీకృతం చేయబడ్డ ప్రేతను, వేరే పిండంలో కలుపుతాడో, వాడు విధిని చంపిన వాడు ఔతాడు, వాడు పితృ హంతకుడు ఔతాడు అని. ఇక్కడ ఔరస క్షేత్రజులకు పారణము, దత్తకాదులకు ఏకోద్దిష్టము అని ఒక వర్గము వారు. సాగ్నులకు పార్వణము, నిరగ్నులకు ఏకోద్దిష్టము అని మరో వర్గము. అది దూషించతగినది. దీనిని (దాని నిందను) మితాక్షరాదులందు చూచి తెలుసుకోవాలి. కల్పతరువైతే – సాగ్నులైన ఔరసక్షేత్రజులకు పార్వణము, నిరగ్నికులకు ఏకోద్దిష్టము, అని అన్నాడు. అపరార్కమందు కూడా ఇట్లాగే. దత్తకాదులు పదిరకాల పుత్రులు సాగ్నులైన నిరగ్నులైనా ఏకోద్దిష్టమే ఆచరించాలి. ప్రతి సంవత్సరము పార్వణ విధితోనే క్షేత్రజ ఔరసులు చేయాలి. ఇతరులు పది మంది కుమారులు ఏకోద్దిష్టమాచరించాలి, అని జాతూకర్ణి ఉక్తి. ఒక వేళ దత్తకుని తండ్రి అమావాస్య యందు, మహాలయమందు కాని మరణిస్తే అక్కడ పార్వణ, ఏకోద్దిష్టములు వికల్పము నిజానికైతే అందరికి పార్వణ ఏకోద్దిష్టములకు వ్రీహియవలవలె వికల్పము అది (వికల్పం) దేశాచారాన్ననుసరించి

నిర్ణయము ఐంది. అని అన్ని నిబంధముల సిద్ధాంతము. అందువల్లనే పృథ్వీచంద్రోదయ మందు వృద్ధ పరాశరుడిట్లా - మాతాపితరులకు వారు చనిపోయిన రోజున ఏకోద్దిష్టాన్ని విడివిడిగా చేయాలి, అని. మళ్ళీ ఇట్లా చెప్పాడు, దేశధర్మాన్ని ఆశ్రయించి, కొందరు వంశధర్మాన్నా శ్రయించి, పండితులు శ్రాద్ధం చేయాలని ఇష్టపడుతారు. క్షయాహమందు కూడా పార్వణముకూడా, అని. అది కేవలం పితరులకు మాత్రమే భార్యలతో కూడిన పితరులకు కాదు అని హేమాద్రి. ఇక్కడ మాతామహులకు చేయరాదు. కాత్యాయనుడిట్లా - కర్షూసమన్వితమైన తొలి పదహారు శ్రాద్ధములను, అట్లాగే ప్రత్యాబ్దికమును వదలి మిగిలిన వానియందు పిండములు ఆరు ఉంటాయి అని నిర్ణయము, అని కాత్యాయనోక్తి. కర్షూసమన్వితమనగా సపిండనము. ఎవరైతే ఏకోద్దిష్టము చేస్తారో వారికి కూడా ఒకచో పార్వణమే. ఎవడు అమావాస్యయందు మరణిస్తాడో, లేదా ప్రేతపక్షమందు మరణిస్తాడో ఆతనికి పార్వణమాచరించాలి. ఏకోద్దిష్టము ఎప్పుడూ చేయరాదు అని శంఖోక్తి. ఈవిధంగా సన్యాసులు గూడా. త్రిదండమును గ్రహించినందువల్ల యతికి ఏకోద్దిష్టం లేదు. సపిండీకరణం లేనందువల్ల అతనికి ఎల్లప్పుడు పార్వణమే, అని ప్రచేతసోక్తి. వాయవీయమందిట్లా - సన్యాసికైనా ఆబ్దికాదులు, పుత్రుడు శాస్త్రప్రకారమాచరించాలి. మహాలయమందు ఏ శ్రాద్ధముందో అది ద్వాదశి రోజున పార్వణంగా చేయాలి, అని పృథ్వీ చంద్రోదయ మందు వృద్ధ పరాశరుడిట్లా - యుద్ధమందున్న వారికి ప్రేత పక్షమందు, శశిక్షయ మందు (అమా) మరణించిన వారికి క్షయాహ మందు కూడా పార్వణమే అని సజ్జనులన్నారు,అని. చంద్ర క్షయము (అమావాస్య) అనశనవ్రతము (అనాశక) యుద్ధము వీటియందు, ప్రేత పక్షంలో సపిండుడు మరణిస్తే అట్టి సపిండులకు కూడా ఇక్కడ ఆబ్దికములు (వారికి) పార్వణములే ఔతాయి. అట్లాగే - పెద్ద అన్న యొక్క వార్షిక శ్రాద్ధమును చిన్న తమ్ముడు చేయాలి అట్లాగే తమ్ముని వార్షిక శ్రాద్ధమును పెద్ద అన్న చేయాలి. దానిని విశ్వేదేవులు లేకుండా చేయాలి, అని ధర్మమెరిగిన వారన్నారు దైవహీనమనగా ఏకోద్దిష్టము అని. జ్యేష్ఠభ్రాత అనగా తొలి గర్భంలో జన్మించనివాడు. అట్లాగే అక్కడే శాతాతపుడిట్లా - తొలి గర్భంలో జన్మించని జ్యేష్ఠుడు కూడా భ్రాత అని సజ్జనులచే చెప్పబడ్డాడు. ఆతనికి సపిండనము తప్ప పార్వణము ఆచరించరాదు అని. తొలి గర్భజనితునకైతే పార్వణము కాని ఏకోద్దిష్టం కాని ఆచరించొచ్చు అని అర్థము.

**మూ॥ మాతుస్తు హేమాద్రౌ కాత్యాయనః - ప్రత్యబ్దం యోయథాకుర్యాత్పుత్రః పిత్రే సదాద్విజ, తథైవ మాతుఃకర్తవ్యం పార్వణంచాన్యదేవవా, యత్తుతే నైవోక్తం- సపిండీకరణాదూర్ధ్వం పిత్రోరేవహిపార్వణం, పితృవ్యభ్రాతృమాతౄణామేకోద్దిష్టం సదైవతు, ఇతితత్సాపత్న మాతృపరం. యత్తు వృద్ధ పరాశరః - అపుత్రస్య పితృవ్యస్య తత్పుత్రో భ్రాతృజోభవేత్, స ఏవాస్య కుర్వీత పిండదానాదికాంక్రియాం. పార్వణం తేన కార్యం స్యాత్ పుత్రవత్ భ్రాతృజేనతు, పితృస్థానేతుతంకృత్వా**

శేషం పూర్వవదుచ్చరేత్, ఇతి తత్ పితృవద్దేశాచారాద్వ్యవస్థితమితి పృథ్వీచంద్రః శ్రాద్ధదీపకలికా యాం చతుర్వింశతిమతేతు - పితృవ్యభ్రాతృమాతౄణాంజ్యేష్ఠానాం పార్వణంభవేత్, ఏకోద్దిష్టం కనిష్ఠానాందంపత్యోః పార్వణంమిథః, అపుత్రస్య పితృవ్యస్యభ్రాతుశ్చైవాగ్రజన్మనః, మాతామహ స్యతత్పత్న్యాః శ్రాద్ధం పార్వణవద్భవేత్, ఇత్యుక్తం తత్పత్న్యాః కర్తృత్వేఽపిపార్వణమేవ. సర్వాభావే స్వయంపత్న్యః స్వభ్రాతౄణామమంత్రకం సపిండీకరణంకుర్యుః తతఃపార్వణమేవచ, ఇతి లౌగాక్షిస్మృతేః. తత్ర పత్న్యపి కుర్వీత సాపిండ్యం పార్వణం తథా, ఇతి సుమం తూక్తేశ్చేతి నిర్ణయామృతే ఉక్తం. అన్యేత్వేతత్సాక్షిక పార్వణ పరమాహుః. అతఏవ - భర్తుః శ్రాద్ధంతు యానారీమోహాత్ పార్వణ మాచరేత్, నతేనతృప్యతే భర్తాకృత్వాతు నరకం వ్రజేత్, ఇతి వచనం క్షయాహేపాక్షికైకోద్దిష్ట ప్రశంసార్థం, నపార్వణ నిషేదార్థ మిత్యుక్తం త్రిస్థలీసేతౌభట్టచరణైః. స్వభర్తృ ప్రభృతి త్రిభ్యః ఇత్యనేన, విరోధాచ్చ. **అపుత్రాణాం త్వాహ** హేమాద్రావాపస్తంబః - అపుత్రాయే మృతాః కేచిత్స్త్రియోవా పురుషాశ్చయే, తేషామపి చదేయంస్యాత్ ఏకోద్దిష్టంన పార్వణం. మిత్ర బంధుసపిండే భ్యః స్త్రీకుమారి భ్యఏవచ, దద్యాద్ద్వైమాసికం శ్రాద్ధం సాంవత్సర మతోఽన్యథా. పారిజాతేతు, అన్యథాపార్వణమిత్యుక్త్వా సర్వత్ర పార్వణమిత్యుక్తం. ఏకోద్దిష్టవాక్యానితు తీర్థ మహాలయ పరాణీత్యుక్తం. పృథ్వీ చంద్రోదయేవృద్ధగార్గ్యః - మాతుః సహోదరా యాచపితుస్సహ భవాచయా, తయోశ్చనైవకుర్వీత పార్వణం పిండనాదృతే. ప్రచేతాః - సపిండీకరణాదూర్ధ్వం ఏకోద్దిష్టం విధేయతే, అపుత్రాణాంచసర్వేషాం అపత్నీనాంతథైవచ. అపత్నీనాం=బ్రహ్మచార్యాదీనాం. మార్కండేయ పురాణే - ప్రతి సంవత్సరం కార్యం ఏకోద్దిష్టం నరైః స్త్రియాః. మృతాహనియథాన్యాయం నృణాంయద్వదిహోదితం. నృణామితి దృష్టాంతాత్ గోవి ప్రహత పాషండ్యాదీనాంసపిండ నాభావే ఽపిసాంవత్సరమే కోద్దిష్టం కార్యమేవేతి శూలపాణిః. అత్రివృద్ధవసిష్ఠౌ - సపిండీకరణాదూర్ధ్వం యత్రయత్ర ప్రదీయతే. భ్రాత్రే భగిన్యై పుత్రాయస్వామినేమాతులాయచ, పితృవ్యగురవే శ్రాద్ధమే కోద్దిష్టం, నపార్వణం. యత్తు జాతూ కర్ణ్యః - పితృవ్యభ్రాతృమాతౄణామపుత్రాణాంతథైవచ, మాతా మహస్యాసుతస్యశ్రాద్ధాది పితృవద్భవేదితి తదావశ్యకత్వార్థం నతు పార్వణార్థమితి హేమాద్రిః. యుక్తంత్వేవం - మాతుఃపితర మారభ్యత్రయోమాతామహాఃస్మృతాః, తేషాంతు పితృ వచ్ఛ్రాద్ధం కుర్యుః దుహితృసూనవః, ఇతిపులస్త్యోక్తేః మాతామహస్యపార్వణమేవ, తత్సాహచర్యాత్పితృవ్యాదౌతథా. పితృవ్యభ్రాతృమాతౄణామేకోద్దిష్టంచపార్వణమితి క్షయా హోపక్రమే పులస్త్యోక్తేశ్చ వికల్పః.

అను॥ తల్లికైతే హేమాద్రియందు కాత్యాయనుడిట్లా - ద్విజుడైన పుత్రుడు ప్రతి సంవత్సరము తండ్రి కొరకు ఎల్లప్పుడు ఎట్లా చేస్తాడో, అట్లాగే తల్లికి కూడా పార్వణం కాని మరేదైనా కాని చేయాలి అని. అతడే చెప్పింది ఇట్లా - సపిండీకరణం తరువాత తండ్రికే పార్వణము, తండ్రితో బుట్టినవాడు, భ్రాత, మాత వీరందరికి ఎల్లప్పుడు ఏకోద్దిష్టమే, అని అన్న ఆ మాట సపత్నులైన మాతల పరకము. వృద్ధ పరాశరుడు ఇట్లా-పుత్రులు లేని పితృవ్యునకు భ్రాతృజు(ని పుత్రుడు)డు, పుత్రుడౌతాడు. ఆతడే ఈతనికి పిండదానాది క్రియను చేయాలి. భ్రాతకొడుకు స్వంత కొడుకు లాగ ఆతనికి పార్వణమాచరించాలి. తండ్రిస్థానమందు

చిన్నాన్న పేరు చెప్పి మిగిలినదంతా పూర్వంలాగా ఆచరించాలి, అని చెప్పిన మాట, అది తండ్రిలాగ, దేశాచారమునననుసరించి వ్యవస్థను గ్రహించాలి (నిర్ణయము) అని పృథ్వీచంద్రుడన్నాడు. శ్రాద్ధ దీపకలికయందు చతుర్వింశతి మతోక్తి ఇట్లా - పితృవ్యుడు, భ్రాత, మాత, వీరికి పెద్దవారికి పార్వణమౌతుంది, కనిష్ఠులకు ఏకోద్దిష్టశ్రాద్ధము చేయాలి. దంపతులకు పరస్పరం (ఒకేసారి) పార్వణ శ్రాద్ధం చేయాలి, అని పుత్రుడు లేని పితృవ్యునకు, పెద్దవాడైన భ్రాతకు, మాతామహునకు, అతని భార్యకు (మాతామహికి) వీరికి శ్రాద్ధము పార్వణం వలె చేయాలి, అని చెప్పారు. అదికర్త యొక్క భార్య చేసినా (ఆమె కర్త ఐనా) పార్వణమే ఆచరించాలి, అని ఎవ్వరు లేని పక్షంలో స్వయంగా వారి భార్యలు తమ భర్తలకు, మంత్రం లేకుండా సపిండీకరణ మాచరించాలి. ఆ పిదప పార్వణము కూడా, అని లౌగాక్షిస్మృతి. అక్కడ భార్యలు కూడా సాపిండ్యము, పార్వణము అట్లాగే ఆచరించాలి, అని సుమంతుని ఉక్తి కూడా అని నిర్ణయామృతమందు చెప్పబడింది. ఇతరులు దీనిని పాక్షిక పార్వణపరమని అన్నారు. అందువల్లనే - ఏ స్త్రీ ఐతే భర్త శ్రాద్ధమును మోహంతో పార్వణ మాచరిస్తుందో, దానితో ఆమె భర్త తృప్తినందదు, ఆచరించి, ఆమె నరకమునకు వెళ్తుంది. అనేమాట క్షయాహమందు పాక్షికమైన ఏకోద్దిష్ట ప్రశంసకొరకు కాని, పార్వణ నిషేధం కొరకు కాదు అని త్రిస్థలీసేతువు యందు భట్టచరణులన్నారు. తన భర్త మొదలుకొని ముగ్గురికి ఇవ్వాలి. అనే మాటతో విరోధమౌతుంది కూడా. పుత్రులు లేనివారికైతే హేమాద్రి యందు ఆపస్తంబుడిట్లా చెప్పాడు - పుత్రులు లేకుండా ఏ కొందరు మరణించారో, పురుషులు కాని స్త్రీలు కాని వారికి కూడా ఏకోద్దిష్ట శ్రాద్ధమివ్వాలి. పార్వణ శ్రాద్ధము కాదు. మిత్రులు, బంధులు, సపిండులు, స్త్రీలు కుమారితలు, వీరికి మాసిక శ్రాద్ధమివ్వాలి. సాంవత్సరము దీనికన్న (పార్వణం కన్న) మరో రకంగా (ఏకోద్దిష్టం) చేయాలి అని. పారిజాతమందైతే, మరోరకం అనగా పార్వణం అని చెప్పి అంతట పార్వణము అని చెప్పారు. ఏకోద్దిష్ట వాక్యములైతే తీర్థమహాలయ పరములు అని చెప్పారు. పృథ్వీ చంద్రోదయ మందు వృద్ధగార్గ్యుడిట్లా, తల్లి సహోదరి, తండ్రి తోబుట్టువు (స్త్రీ) వారికి పార్వణం చేయరాదు, సపిండీకరణం (తప్ప) చేయాలి, అని. ప్రచేతుడిట్లా - సపిండీకరణం తరువాత ఏకోద్దిష్ట మాచరించాలి, ఇది పుత్రులు లేని వారికి, అపత్నీకులైన వారందరికి, అని. అపత్నీకులనగా బ్రహ్మచారి మొదలగువారు. మార్కండేయ పురాణమందిట్లా - నరులు స్త్రీలకు ప్రతి సంవత్సర శ్రాద్ధాన్ని ఏకోద్దిష్టంగా చేయాలి. చనిపోయిన రోజు నందైతేన్యాయానుసారము పురుషులకు వలె అని ఇక్కడ చెప్పబడింది, అని. నృణాం (నరులకు) అనే దృష్టాంతమువల్ల గోవులతో విప్రులతో చంపబడ్డవారికి పాషండాదులకు సపిండనం లేకపోయినా సాంవత్సరికము ఏకోద్దిష్టమాచరించాలి, తప్పదు, అని శూలపాణి అన్నాడు. అత్రివృద్ధ వసిష్ఠులిట్లా -

సపిండీకరణం తరువాత ఎక్కడెక్కడైతే భ్రాత, భగిని, పుత్రుడు, స్వామి, మాతులుడు పితృవ్యుడు, గురువు వీరికొరకు శ్రాద్ధం చేయబడుతుందో అది ఏకోద్దిష్టం కావాలి, పార్వణం కూడదు, అని. జాతూకర్ణి ఏదైతే – పితృవ్య, భ్రాతృ, మాతలకు, అపుత్రులకు, సంతానం లేని మాతా మహునకు శ్రాద్ధాదులు తండ్రికివలె చేయాలి, అని అన్నారో అది ఆవశ్యకత కొరకే చెప్పడింది, పార్వణం కొరకు కాదు, అని హేమాద్రి అన్నాడు. ఇట్లా చేయటం యుక్తము – ఎట్లాంటే – తల్లి యొక్క తండ్రిని ఆరంభించి ముగ్గురు మాతామహులని చెప్పబడుతారు. వారికి, కూతురు యొక్క కొడుకులు తండ్రికి లాగా శ్రాద్ధమాచరించాలి, అని పులస్త్యుని మాట ఉన్నందువల్ల మాతామహునకు పార్వణమే. ఆ సాహచర్యం వల్ల పితృవ్యాదులందును అట్లాగే. పితృవ్యభ్రాతృ మాతలకు ఏకోద్దిష్టము, పార్వణము కూడా అని క్షయాహ ఉపక్రమమందు, పులస్త్యుని ఉక్తి కూడా ఉన్నందువల్ల వికల్పము.

మూ॥ కేచిత్త్వాపస్తంబాదివాక్యాని – వ్యుత్క్రమాచ్చప్రమీతానాంనైవ కార్యాసపిండతా, ఇత్యస్య పితృవ్యాది పరత్వాత్ అకృత సపిండన పితృవ్యాది పరాణీత్యాహుఃమాతా=సపత్నమాతా. ఏకోద్దిష్టంతు కనిష్ఠపరమితి. పృథ్వీచంద్రోదయేఽప్యేవం, విశేషస్త్వధికారి నిర్ణయేప్రాగుక్తః. కేచిత్పుత్రాంతరాభావే పితామహవార్షికమప్యావశ్యకం. పుత్రా భావేచతత్పుత్రః పత్నీమాతా తథాపితా, వితాభావేఽపిసచ్ఛిష్యః కుర్యాత్తస్యౌర్ధ్వదైహికం. ఇతి మార్కండేయ పురాణాదిత్యాహుః. తన్న, పౌత్రేణై కాదశాహాది కర్తవ్యం శ్రాద్ధషోడశం, ఇతికాతీయే విశేషోక్తేః. **అత్రక్షయాహద్వైధేనిర్ణయః** – తత్ర ఏకోద్దిష్టం మధ్యాహ్నే కార్యం. మధ్యాహ్నశ్చ పంచధా విభక్తే దినే తృతీయ భాగ ఇతి మాధవః. అమశ్రాద్ధంతు పూర్వాహ్ణే ఏకోద్దిష్టంతు మధ్యమే, పార్వణం చాపరాహ్ణేతుప్రాతర్వృద్ధి నిమిత్తకం, ఇతిహారీతోక్తౌ ప్రాతఃశబ్ద సాహచర్యాత్. తత్రాపికుతపాది ముహూర్త ద్వితయే జ్ఞేయం. ప్రారభ్యకుతపే శ్రాద్ధం, కుర్యాదారౌహిణం బుధః, విధిజ్ఞోవిధిమాస్థాయరౌహిణంతునలంఘయేత్. ఇతిగౌతమోక్తేః ఏతత్ప రత్వాత్. రోహిణో=నవమోముహూర్తః. మైథిలాఃశ్రాద్ధకౌముదీచైవం. అన్యథా – ఊర్ధ్వం ముహూర్తా త్కుత పాద్యన్ముహూర్త చతుష్టయం, ముహూర్తపంచకం హ్యేతత్స్వధాభవన మిష్యతే, ఇత్యాది విరోధాత్. దీపికాపి –ఏకోద్దిష్టముపక్రమే త్కుతపే, ఇతి. మాధవీయే వ్యాసోఽపి – కుతప ప్రథమభాగే ఏకోద్దిష్టముపక్రమేత్, ఆవర్తన సమీపేవాతత్రైవ నియతాత్మవాన్. పృథ్వీ చంద్రోదయేఽప్యేవం. తేనకుతపాదిరౌహిణాంతోముఖ్యఃకాలః. దినద్వయేత ద్వ్యాప్తౌ సమవ్యాప్తౌచ పూర్వా. విషమ వ్యాప్తౌ వాధిక్యేన నిర్ణయః. అవ్యాప్తౌపూర్వైవ. పరవిద్ధాయానిషేధాత్. సాచపూర్వదినే రౌహిణలంఘనాపత్తేః పరైవేతి గౌడాః శుక్లకృష్ణ వశాత్ ఖర్వదర్పాద్యైర్వావ్యవస్థేత్యన్యే, తన్న, పరవిద్ధా నిషేధప్రాబల్యాత్. అత్రమూలంకాలమాధవీయే జ్ఞేయం. పార్వణంత్వపరాహ్ణేకార్యం పూర్వోక్త వచనాత్. మధ్యాహ్నవ్యాపినీయాస్యాత్ సైకోద్దిష్టే తిథిర్భవేత్, అపరాహ్ణవ్యాపినీయా పార్వణే సాతిథిర్భవేత్, ఇతి పృథ్వీ చంద్రోదయే వృద్ధగౌతమోక్తేశ్చ. పూర్వేద్యురేవపరేద్యురేవవాఽఽ పరాహ్ణవ్యాప్తౌ సైవగ్రాహ్యా. దినద్వయే తద్వ్యా ప్తౌ తద స్పర్శేఽంశతః సమ వ్యాప్తౌ వాపూర్వైవ. విషమ వ్యాప్తౌ త్వధికాగ్రాహ్యా. ద్వ్యపరాహ్ణవ్యాపినీస్యాదాబ్దికస్య యదా తిథిః, మహతీయత్రతద్విద్ధాం

ప్రశంసంతి మహర్షయః, ఇతి మరీచస్మృతేః. దర్శంచ పౌర్ణమాసంచ పితుఃసాంవత్సరందినం, పూర్వవిద్ధమకుర్వాణోనరకం ప్రతిపద్యతే, ఇత్యపరార్కే నారదోక్తేః. ద్వ్యహేతువ్యాపినీ చేత్స్యాత్మృతాహస్యయదాతిథిః, పూర్వవిద్ధాప్రకర్తవ్యాత్రిముహూర్తాభవేద్యది, ఇతిసుమంతూక్తేః పూర్వస్యాం నిర్వపేత్పిండా నిత్యాంగిరసభాషితం, ఇతిహేమాద్రౌ పాఠః. తత్రైవ వృద్ధమనుః - నద్వ్యహవ్యాపినీ చేత్స్యాత్ మృతాహస్యయదాతిథిః, పూర్వవిద్ధైవ కర్తవ్యాత్రిముహూర్తాచయాభవేత్. మదనరత్నేప్యేఽవం.

అను॥ కొందరైతే ఆపస్తంబాది వాక్యములను - విపరీతక్రమంతో, మరణించినవారికి సపిండీకరణం చేయరాదు, అనే మాటకు పితృవ్యాదిపరకమైన అర్థం కనుక, సపిండనం చేయబడని పితృవ్యాదుల పరములు, అని ఇట్లా అన్నారు. మాత అనగ సపత్నమాత. ఏకోద్దిష్టమైతే కనిష్ఠ విషయకము అని. పృథ్వీ చంద్రోదయమందు కూడా ఇట్లాగే ఉంది. విశేషాన్నైతే అధికారి నిర్ణయమందు ముందు చెప్పాము. కొందరు, పుత్రాంతరుడు లేని పక్షంలో పితామహుని వార్షిక శ్రాద్ధము కూడా ఆవవ్యకము, అని అన్నారు. పుత్రుడు లేకపోతే, ఆతని పుత్రుడు (పౌత్రుడు), భార్య, తల్లి, తండ్రి, విత్తం లేకపోయినా మంచి శిష్యుడు, ఆతనికి ఔర్ధ్వదైహిక క్రియను చేయాలి, అని మార్కండేయ పురాణం వల్ల తెలుస్తోంది అని అన్నారు. అదికాదు పౌత్రుడు పదకొండవ రోజు మొదలుకొని పదహారు శ్రాద్ధములను చేయాలి, అని కాతీయమందు విశేషోక్తి ఉంది. ఇక క్షయాహం రెండురోజులైతే నిర్ణయం గూర్చి - ఏకోద్దిష్టాన్ని మధ్యాహ్నమందు చేయాలి. మధ్యాహ్నమనగా పగలును ఐదుభాగాలు చేస్తే మూడవ భాగము అని మాధవుడు. ఆమశ్రాద్ధమైతే పూర్వాహ్ణమందు ఏకోద్దిష్టము మధ్యాహ్నమందు పార్వణము అపరాహ్ణమందు, వృద్ధిశ్రాద్ధము ప్రాతః కాలమందు అని హారీతోక్తి యందు ప్రాతఃశబ్దసాహచర్యం వల్ల. అక్కడ కూడా కుతపాది రెండు ముహూర్తముల కాలమందు, అని తెలుసుకోవాలి. కుతపమందు శ్రాద్ధాన్ని ఆరంభించి రౌహిణం వరకు బుదుడు శ్రాద్ధం చేయాలి. విధిని ఎరిగినవాడు. విధియందు (శాస్త్రం) విశ్వాసముంచి రౌహిణ ముహూర్తాన్ని మాత్రం దాటరాదు, అనేగౌతమోక్తి ఈ విషయకమైనదే. రోహిణము=తొమ్మిదవ ముహూర్తము. మైథిలులు, శ్రాద్ధకౌమిది వీరు కూడా ఇట్లాగే అన్నారు. లేనిచో - కుతపం ముహూర్తం తరువాత, ఉన్న నాలుగు ముహూర్తముల కాలము, ఈ ఐదు ముహుర్తముల కాలము స్వథాభవనమనుట ఇష్టము, అనే మొదలగు మాటలకు విరుద్ధమౌతుంది. (దినాన్ని ఐదు భాగాలు చేస్తే మూడు ముహూర్తములకు ఒక భాగం. ప్రథమం అంశం, ద్వితీయం సంగవం, తృతీయం మధ్యాహ్నం, చతుర్థం అపరాహ్ణం, పంచమం సాయాహ్నం దినాన్ని పదిహేను భాగాలు చేస్తే ఒక భాగం ఒక ముహూర్తం. అందులో ఏడవది గంధర్వం, ఎనిమిది కుతపం, తొమ్మిది రోహిణం), దీపిక కూడా - కుతప మందు ఏకోద్దిష్టాన్ని ఆరంభించాలి,అని.

మాధవీయ మందు వ్యాసుదు కూడా ఇట్లా – కుతపం యొక్క మొదటి భాగ మందు ఏకోద్దిష్టాన్ని ఆరంభించాలి లేదా దాని వెనుక నున్న సమీప కాలమందు కాని అక్కడే ఆత్మను నియమించుకొని ఆరంభించాలి,అని. పృథ్వీచంద్రోదయమందు కూడా ఇట్లాగే ఉంది. అందువల్ల కుతపం నుండి ఆరంభమై రౌహిణంతో ముగిసే కాలము ముఖ్య మైంది రెండు రోజులు తిథికి ఆకాలవ్యాప్తి ఉంటే, సమవ్యాప్తి ఉన్నా పూర్వదినమందే విషమ వ్యాప్తి ఉంటే (ఒకరోజు తిథి, కాలవ్యాప్తి ఎక్కువ, తక్కువ ఉంటే) ఏరోజు అధిక వ్యాప్తి ఉంటే ఆ రోజున అని నిర్ణయము. వ్యాప్తి లేకపోతే పూర్వదినమందే. పరవిద్ధయైన దాన్ని నిషేధించారు కనుక.అది, పూర్వ దినమందు రౌహిణాన్ని దాటుతుంది కనుక, పరమైనదే అని గౌడులన్నారు. (దాని వివరణ ఇట్లా – మొదటి రోజును గ్రహిస్తే రోహిణ లంఘన ప్రమాదం వస్తుంది కనుక పరదినమే). శుక్ల కృష్ణపక్ష భేదాన్ననుసరించి లేదా ఖర్వ దర్పాదులతో కాని నిర్ణయము అని ఇతరులన్నారు, అంటే అట్లా కాదు, పరవిద్ధయొక్క నిషేధము ప్రబలంగా ఉంది. దీనికి మూల వాక్యాలను కాలమాధవీయమందు చూచి తెలుసుకోవాలి. పార్వణమైతే అపరాహ్ణమందు చేయాలి, ముందు చెప్పిన మాట ననుసరించి మధ్యాహ్న వ్యాప్తినియైన తిథియే ఏకోద్దిష్టమందు తిథి ఔతుంది. అపరాహ్ణవ్యాపినియైన తిథియే పార్వణమందు తిథి ఔతుంది,అని పృథ్వీ చంద్రోదయమందు వృద్ధగౌతమోక్తి కూడా. ముందు రోజు కాని తరువాతి రోజు కాని అపరాహ్ణ వ్యాప్తి కలదానినే గ్రహించాలి. రెండు రోజులు దాని వ్యాప్తి ఉంటే, దాని స్పర్శ లేకపోతే, అంశంగా స్పర్శ ఉంటే సమవ్యాప్తి ఉన్నా పూర్వదినమందే. విషమవ్యాప్తి యందు అధిక వ్యాప్తి కలదానిని గ్రహించాలి. రెండు రోజులు, అపరాహ్ణ వ్యాపినిగా తిథి ఉంటే, ఆబ్దిక మందు, ఎక్కువ భాగం ఏ రోజు ఉందో ఆ విద్ధనే మహర్షులు ప్రశంసించారు,అని మరీచ స్మృతి. దర్శము, పౌర్ణమాసము, తండ్రి సాంవత్సరదినము వీనికి, పూర్వవిద్ధను ఆచరించని వారు నరకాన్ని పొందుతారు, అని అపరార్కమందు నారదోక్తి. రెండు రోజులు వ్యాప్తి చెంది ఉన్నట్లైతే, మృతాహమందలి తిథి, పూర్వవిద్ధయందే ఆచరించాలి, మూడు ముహూర్తముల కాలం తిథి ఉన్న పక్షంలో, అని సుమంతూక్తి. పూర్వదినమందు పిండ నిర్వాపం చేయాలి,అని. అంగిరసుని మాట, అని హేమాద్రి యందు పాఠముంది. అక్కడే వృద్ధమనువు ఇట్లా – మృతాహమునకు చెందిన తిథి రెండు రోజుల వ్యాప్తి లేని పక్షంలో, పూర్వవిద్ధనే ఆచరించాలి,అది మూడు ముహూర్తముల కాలమున్న పక్షంలో,అని. మదనరత్న మందు కూడా ఇట్లాగే ఉంది.

**మూ॥ యత్తుకార్ష్ణాజిని వ్యాసౌ – అహోస్తమయవేళాయాం కలామాత్రా యదాతిథిః సైవ ప్రత్యాబ్దికే జ్ఞేయా నాపరా పుత్రహానిదా, ఇతి త్రిముహూర్త స్తుతిః. పూర్వేద్యుః సాయంత్రి ముహూర్తా భావేతు పరైవ. త్రిముహూర్తాన చేద్గ్రాహ్యా పరైవ కుతపేహిసా, ఇతి. కాలాదర్శే గోభిలోక్తేః కాలాదర్శేఽపి – ప్రత్యాబ్దికేఽప్యేవ మేవతిథి ర్గ్రాహ్యా పరాహ్ణికీ, ఉభయత్ర తథా**

ణ్యేతు మహాత్యేన వినిర్ణయః. సమత్వే పూర్వవిద్ధైవహ్యత ధాత్వేऽపి సాయది, త్రిముహూర్తా భవేత్సాయం సర్వేష్వోऽయం వినిర్ణయః. అన్యత్రాపి - సాయం తన్యపరత్రచేత్ మృతతిథిః సైవాబ్దికే మాసికే గ్రాహ్యేసాద్వ్యపరాహ్ణయోర్యది తదా యత్రాధికా సామతా, తుల్యాచేదు భయాపరాహ్ణ సమయే పూర్వాన చేత్తుద్వయే పూర్వైవ త్రిముహూర్త గాస్త సమయేనోచే త్పరైవోచితా. మాధవ పృధ్వీ చంద్రౌతు - దినద్వయే పరాహ్ణవ్యాప్తౌ అంశతస్సమవ్యాప్తౌ చక్షయే పూర్వా - వృద్ధౌపరా. ఖర్వ దర్పౌ పరౌ పూజ్యా విత్యుక్తేః. అపరాహ్ణ ద్వయ వ్యాపిన్య తోతస్య చయా తిధిః, క్షయే పూర్వా చ కర్త వ్యా వృద్ధౌ కార్యా తధోత్తరా, ఇతి. బౌధాయనోక్తేః. క్షయాహస్య తిధిర్యాతు అపరాహ్ణద్వయే యది, పూర్వక్షయేతు కర్తవ్యా వృద్ధౌకార్య తధోత్తరా ఇతి బృహన్నారదీయాచ్చే త్యాహుః. వృద్ధి క్షయౌచాత్ర పరితిధేః, నతు గ్రాహ్య తిధేః. తస్యాః క్షయేऽపరాహ్ణ ద్వయే వ్యాప్తే రసంభవాత్. తదాహ మాధవః - న గ్రాహ్య తిథిగౌ వృద్ధి క్షయా పూర్వతిధేస్తుతౌ, ఇతి. యత్తు పృధ్వీ చంద్రః - పూర్వోక్త వచనేషు యత్ర సాయాహ్న స్తమయ యోగినీ తిధి రుక్తా తత్రాపరాహ్ణ వ్యాపినీ జ్ఞేయా, సాయాహ్నః త్రిమూర్తస్స్యాత్ తత్రశ్రాద్ధం న కారయేదితి మాత్స్యాదౌ సాయాహ్నే నిషేధాత్. యచ్చ - త్రిమూర్తాది గ్రహణం, తచ్ఛ్రాద్ధార్హా పరాహ్ణ రూప త్రిముహూర్త పరమిత్యాహ. తద్ధేమాద్రి మదనరత్న కాలాదర్శాది గ్రంధ విరోధాత్ లక్షణా పత్తేశ్చ చింత్యం. తస్మా త్పూర్వోక్తమేవ సాధు. యదా విప్లవ శాద్దినే సాంవత్సరం శ్రాద్ధం నకృతం తదా రాత్రా వపికార్యం. మృతాహం సమతి క్రమ్య చండాలే ష్వభిజాయతే, ఇతి మరీచినా మృతాహాతిక్రమే దోషోక్తేః. నచనక్తం శ్రాద్ధం కుర్వీత ఆరబ్ధేవా భోజన సమాపన మిత్యాపస్తంబేన గౌణ కాలోక్తేశ్చేతి మాధవః. ఆరబ్ధే శ్రాద్ధే విప్లవశాత్ రాత్రి భాగేపాతే భోజన సమాప్త్యంతం రాత్రౌ కార్యం. శేష సమాప్తిః పరదినే ఏవేతిహార దత్తః. గ్రహణదినే వార్షిక ప్రాప్తౌ తద్దిన ఏ వాన్నేన ఆమేన హేమ్నా వా కుర్యాత్, నోత్తరదినే ఇత్యుక్తం ప్రాక్ గ్రహణ నిర్ణయే. తచ్చ ప్రథమాబ్దికం త్రయోదశే మలమాసే కార్యమన్యధాన. ప్రత్యబ్దం ద్వాదశే మాసి కార్యాపిండక్రియా, సుతైః, క్వచిత్త్రయోదశేऽపి స్యాత్ ఆద్యం ముక్త్వాతువత్సర మితి లఘుహారీ తోక్తేః. ఇద మంత్యాధిక మాసపరం. ద్వాదశేత్రయోదశే వాతీత ఇత్యర్థః. తేనయత్ర ద్వాదశ మాసికం శుద్ధమాసే భవతి తత్ర త్రయో దశేऽధికే ఏవాబ్దికం కార్యం. యత్రాధిక మధ్యే ద్వాదశం మాసికం తత్ర తస్య ద్విరా వృత్తిం కృత్వా చతుర్దశే శుద్ధే ఏవ ప్రథమాబ్దిక మితి నిష్కర్షః. మాధవీయే, హేమాద్రౌ చైవం ద్వితీయాబ్దికంతు శుద్ధమాసే ఏవనాధికే, నాప్యుభయోః మలమాస మృతానాంతు యదా స ఏవాధిక స్స్యాత్ తదా తత్రైవ కార్యం అన్యథా శుద్ధే ఏవేతి ప్రాగుక్తం, దర్శే వార్షికం చేత్ తదా పూర్వం వార్షికం కృత్వాతతః పిండ పితృయజ్ఞో దర్శశ్రాద్ధం చేతి నిర్ణయ దీపే క్రమ ఉక్తః.

అను॥ కార్ష్ణాజిని వ్యాసులిట్లా - దివసము యొక్క అస్తమయ వేళయందు తిథి కలా మాత్రమున్నా అదే ప్రత్యాబ్దిక మందు అని తెలుసుకోవాలి. పరమైంది కాదు పరమైంది పుత్రహానిని కల్గించేది, అని. అది త్రిముహూర్త కాలమును స్తుతించేది. ముందు రోజు సాయంకాలము మూడు ముహూర్తములు లేని పక్షంలో పరమైనదే. మూడు ముహూర్తముల

కాలం లేని పక్షంలో (ముందురోజు) పరమందే. అది కుతప కాలమందలి తిథి అని కాలాదర్శమందు గోభిలోక్తి. కాలాదర్శమందు కూడా - ప్రత్యాబ్దిక మందును ఇట్లాగే అపరాహ్ణ కాల తిథిని గ్రహించాలి. రెండు చోట్ల తిథి ఒకే రకంగా ఉంటే ఏ రోజు ఎక్కువగా ఉందో ఆ రోజును గ్రహించాలి,అని. సమంగా ఉన్న పక్షంలో పూర్వ విద్ధనే గ్రహించాలి. అసమంగా ఉన్నప్పటికి ఆరోజే చేయాలి, సాయంకాలమందు ఆ తిథి మూడు ముహూర్తముల కాలముంటే చాలు. ఈ నిర్ణయము అందరికీ ఇష్టమైనది. వేరే చోట కూడా - తరువాతి రోజు సాయంకాలమందు మృత తిథి ఉన్న పక్షంలో దానినే ఆబ్దిక మందు మాసిక మందును గ్రహించాలి. ఆ తిథి రెండు రోజులు అపరాహ్ణకాలమందుంటే ఎక్కడ తిథి ఎక్కువగా ఉంటే ఆ రోజు గ్రహించాలి. రెండు రోజులు అపరాహ్ణ కాల మందు సమంగా ఉంటే పూర్వముది గ్రహించాలి. రెండు రోజులు అపరాహ్ణకాలమందు లేకపోయినా అస్తమయ సమయ మందు మూడు ముహూర్తముల కాలముంటే పూర్వమందే. అట్లా లేనిపక్షంలో పరమైన రోజుయందే ఆచరణ తగును,అని. మాధవ పృథ్వీ చంద్రులిట్లా - రెండు రోజులు అపరాహ్ణ వ్యాప్తి ఉన్నా, అంశంగా ఉన్నా, సమవ్యాప్తి ఉన్నా క్షయాహమందు తిథి, క్షయమందు పూర్వపు రోజును గ్రహించాలి. తిథి వృద్ధి యందు పరమును గ్రహించాలి. ఖర్వ దర్పములందు పరమే పూజ్యము, అని చెప్పారు,అని. క్షయాహ తిథి రెండు రోజులు అపరాహ్ణ వ్యాపిని ఐతే తిథిక్షయమందు పూర్వమందే ఆచరించాలి. తిథి వృద్ధియందు, పర మందు చేయాలి,అని బౌధాయనోక్తి. క్షయాహతిథి రెండు రోజులు అపరాహ్ణము లందుంటే తిథిక్షయమందు పూర్వమందు చేయాలి. తిథి వృద్ధియందు పరమందు చేయాలి,అని బృహన్నారదీయము నుండి, అని అన్నారు. వృద్ధి క్షయములనేవి ఇక్కడ పర తిథికి కాని, గ్రహించతగిన తిథికి కాదు. క్షయాహతిథి, క్షయమయ్యే పక్షంలో రెండు రోజులు అపరాహ్ణ వ్యాప్తి కుదరదు కదా. దానినే మాధవుడిట్లా అన్నాడు - వృద్ధిక్షయములు గ్రాహ్యతిథికి చెందినవి కావు.అవి ఊర్ధ్వ తిథికి చెందినవి,అని. పృథ్వీచంద్రోదయుడు ఇట్లా - ముందు చెప్పిన మాటల్లో సాయాహ్న అస్తమయయోగం గల తిథి అని చెప్పిన చోట, అపరాహ్ణ వ్యాపిని అని గ్రహించాలి. సాయంకాల సమయము, మూడు ముహూర్తముల కాలం ఉన్నట్లైతే, అక్కడ శ్రాద్ధము చేయరాదు, అని మాత్స్యాది పురాణములందు సాయాహ్నాన్ని నిషేధించారు కనుక, అని అన్నారో ఏదైతే ఇట్లా- త్రిముహూర్తము మొదలగు వాని గ్రహణము (చెప్పటం) అది శ్రాద్ధార్హమైన అపరాహ్ణరూప త్రిముహూర్త కాలపరము, అని అన్నారో అది హేమాద్రి మదనరత్న కాలాదర్శాది గ్రంథములకు విరుద్ధమైనందువల్ల లక్షణ వస్తుంది. కనుక ఆలోచించాలి. అందువల్ల ముందు చెప్పిందే తగినది. విఘ్న వశం వల్ల దినమందు సాంవత్సర శ్రాద్ధము చేయని పక్షంలో అప్పుడు రాత్రి యందు కూడా చేయాలి. మృతాహ మును అతిక్రమిస్తే చండాలు లందు జన్మిస్తాడు, అని మరీచి, మృతాహ అతి క్రమణ

మందు దోషాన్ని చెప్పాడు. రాత్రి పూట శ్రాద్ధం చేయరాదు, ఒకవేళ ఆరంభిస్తే భోజనం ముగించాలి,అని ఆపస్తంబుడు గౌణకాలాన్ని చెప్పాడు అని మాధవుడన్నాడు. శ్రాద్ధం ఆరంభించాక విఘ్న వంశం వల్ల రాత్రి భాగం ప్రవేశిస్తే భోజన సమాప్తి చివర వరకు రాత్రి యందు చేయాలి. మిగిలిన దాని సమాప్తి పరదినమందే అని హరదత్తుడు అన్నాడు. గ్రహణ దినమందు వార్షిక శ్రాద్ధం వస్తే ఆరోజే ఆమాన్నముతో కాని హేమంతో కాని శ్రాద్ధం చేయాలి. తరువాతి రోజు చేయరాదు,అని. ముందే గ్రహణ నిర్ణయమందు చెప్పాము. ఆ ప్రథమాబ్దికాన్ని పదమూడవదైన మల మాసమందు చేయాలి, లేనిచో చేయరాదు. ప్రతి సంవత్సరము పన్నెండవ మాసమందు, సుతులు, పిండ క్రియలను చేయాలి. ఒక్కోసారి త్రయోదశ మాస మందు కూడా ఔతుంది, తొలి సంవత్సరాన్ని వదలి, అని లఘు హారీతోక్తి. ఇది అంత్య మందలి అధిక మాస పరము. పన్నెండు గాని పదమూడవ నెలగాని గడిచాక అని అర్థము. అందువల్ల, పన్నెండవ మాసికము శుద్ధ మాసంలో ఐనప్పుడు అక్కడ పదమూడవ, అధిక మాసమందే ఆబ్దికం చేయాలి. ఎక్కడ అధిక మధ్యమందు ద్వాదశ మాసిక మౌతుందో అక్కడ దానిని రెండవ మారు చేసి పదునాల్గవ శుద్ధమాసమందే ప్రథమాబ్దికము అని నిష్కర్ష. మాధవీయమందు హేమాద్రి యందును ఇట్లాగే ఉంది. ద్వితీయాబ్దికమైతే శుద్ధమాసమందే, అధికమాస మందు కాదు. రెండుసార్లు (నెలలందు) కూడా కాదు. మలమాస మందు మరణించిన వారికి ఒకవేళ అదే అధిక మాసమైతే (వస్తే) అప్పుడు అక్కడే చేయాలి లేని పక్షంలో శుద్ధమందే అని ముందు చెప్పాము. అమావాస్య యందు వార్షికము ఉంటే అప్పుడు తొలుత వార్షిక శ్రాద్ధాన్ని చేసి, ఆ పిదప పిండ పితృ యజ్ఞము, దర్శశ్రాద్ధము, అని నిర్ణయ దీపమందు క్రమము చెప్పబడింది.

**మూ॥ స్మృతిసారేఽపి - దర్శే క్షయాహే సంప్రాప్తే కథం కుర్వంతి యాజ్ఞికాః, ఆదౌక్షయాహం నిర్వర్త్య పశ్చాద్దర్శో విధీయతే, ఇతి యుక్తంత్వేవం. తద్వచనే మూలాభావాత్. పిండయజ్ఞం తతః కుర్యాత్ తతోఽన్వాహార్యకం బుధః. ఇతి దర్శశ్రాద్ధే పిండ పితృయజ్ఞానం తర్యాత్రస్యాబ్దికేఽప్యతిదేశాత్ప్రాప్తేః. పితృయజ్ఞా నంతరం వార్షికం తతో దర్శశ్రాద్ధం, ఇతి వ్యతిషం గస్తున భవతి. తస్యార్థికత్వాత్. కాలాదర్శేఽపి - నిమిత్తాఽనియతిశ్చాత్ర పూర్వానుష్ఠాన కారణం, ఇతి సర్వాన్ప్రత్యైక రూప్యాభావాత్ క్షయాహనిమిత్తస్య అనియతత్వం. దేవజానీయేఽప్యేవం. ఏవం మాసికాదిష్వపి జ్ఞేయం. ప్రత్యబ్దం యో యథాకుర్యా త్తథా కుర్యాత్స తాన్యపి, ఇతి సర్వాతిదేశాత్. మృతాహే వృషోత్సర్గ ఉక్తో హేమాద్రౌ విష్ణుధర్మే - అయన ద్వితయే చైవ మృతాహే బాంధవస్య చ, ఉత్సృజేన్నీల వృషభం కౌముద్యాః సముపాగమే. కౌముదీ = కార్తికీ. అథశుద్ధి శ్రాద్ధం - దివోదాసీయే - సపిండీకరణాదూర్ధ్వం యావదబ్ద త్రయం భవేత్, తావదేవన భోక్తవ్యం క్షయేఽహని కదాచన. వర్షాంతసపిండనేప్యే తత్తుల్యం. మృతాహనితు సంప్రాప్తే యావదబ్ద చతుష్టయం, బహిః శ్రాద్ధం ప్రకుర్వీత న కుర్యా చ్ఛ్రాద్ధ భోజనం. ప్రథమే స్థీని, మజ్జా చ ద్వితీయే మాంస భక్షణం, తృతీయే రుధిరం ప్రోక్తం శ్రాద్ధం శుద్ధం చతుర్థకం. ఇతి శ్రాద్ధ కారికోక్తేః, శుద్ధం కించిదితి జ్ఞేయం.**

స్మృత్యంతరే - సప్తత్రింశచ్చ యోమాసాన్ శ్రాద్ధే భుంక్తే తమోహతః, సపంక్తి దూషితః పాపః ప్రేతాశీ చ భవేత్తుసః. తత్ర ప్రథమేఽబ్దే వర్షాంత సపిండన పక్షే మృతాహాత్పూర్వేఽహ్ని సపిండన మబ్దపూర్తి శ్రాద్ధం చ కృత్వా పరే ద్యుర్వార్షికం కుర్యాదితి స్మృత్యర్థసారే ఉక్తం. కాలకాండే హేమాద్రి స్తు మృతాహే సపిండీకరణే నైవ వార్షిక సిద్ధిః. పూర్ణే సంవత్సరే పిండష్షోడశః పరికీర్తితః. తేనైవచ సపిండత్వం తేనైవాబ్దిక మిష్యతే, ఇతి వచనాదిత్యాహ. ఇదమేవ చ యుక్తం. **అథక్షయాహ జ్ఞానే మరీచిః** - శ్రాద్ధవిఘ్నే సముత్పన్నే అవిజ్ఞాతేమృతేఽహని, ఏకాదశ్యాంతు కర్తవ్యం కృష్ణపక్షే విశేషతః, ఇత్యుక్తేః శుక్లైకాదశ్యామపి. బృహస్పతిః - నజ్ఞాయతే మృతాహశ్చేత్ ప్రమీతే ప్రోషితేసతి, మాసశ్చేత్ప్రతి విజ్ఞాతః తద్దర్శే స్యాదథాబ్దికం. దినమాసౌ న విజ్ఞాతౌ మరణస్య యదాపునః, ప్రస్థాన మాసది వసౌ గ్రాహ్యౌ పూర్వోక్తయా దిశా.

అను॥ స్మృతిసారమందు కూడా ఇట్లా - దర్శమందు క్షయాహం వస్తే యాజ్ఞికులు ఎట్లా చేస్తున్నారు, తొలుత క్షయాహాన్ని నిర్వర్తించి ఆ పిదప దర్శము (అమా శ్రాద్ధము) విధించబడుతుంది,అని. ఇట్లా చేయటం యుక్తమే. ఆ మాటలకు మూల ఆధార వచనం లేదు. ఆ పిదప పిండ యజ్ఞం చేయాలి. ఆ పైన బుద్ధిమంతుడు అన్వాహార్యము చేయాలి, అని. దర్శశ్రాద్ధమందు పిండ పితృయజ్ఞం తరువాత, ఉన్నందువల్ల అది అబ్దికమందు కూడా అతిదేశం వల్ల వస్తుంది. పితృయజ్ఞానంతరము వార్షికము ఆ పిదప దర్శశ్రాద్ధము, అని. వ్యతిషంగమైతే కాదు. అది అర్థాత్ సిద్ధము. (దానిలాగా దీన్ని చేయండి అనటం అతిదేశం) (పరస్పరం కలిసిపోవటం వ్యతిషంగం). కాలాదర్శమందు కూడా - ఇక్కడ నిమిత్తము యొక్క నియమము లేదు. పూర్వ అనుష్ఠానమును ఆచరించుటే కారణము,అని. అందరి విషయంలో సమానత (ఏకరూప్యత) లేనందువల్ల క్షయాహ నిమిత్తమునకు అనిశ్చి తత్వము ఉంది. దేవజానీయమందు కూడా ఇట్లాగే ఉంది. ఈ విధంగా మాసికాదులందు కూడా గ్రహించాలి. ఎవడు ఎట్లా ప్రత్యబ్దమును (ఆబ్దికం) ఆచరిస్తాడో అట్లాగే ఆతడు మాసికాదులను కూడా ఆచరించాలి,అని. ఇది అందరికి అతిదేశము. మృతాహ మందు వృషోత్సర్గము హేమాద్రియందు విష్ణుధర్మమందిట్లా చెప్పబడింది. రెండు అయనములందు బంధువుని మృతాహమందును కార్తికమాసం (పూర్ణిమ) వచ్చినప్పుడు నీల వృషభమును వదలాలి,అని. కౌముది అనగా కార్తీకమాసం. ఇక శుద్ధి శ్రాద్ధము దివోదాసీయమందిట్లా - సపిండీకరణం తరువాత మూడు సంవత్సరముల వరకు క్షయాహమందు ఎప్పుడూ భుజించరాదు. సంవత్సరాంత సపిండనమందు కూడా ఇది సమానమే,అని. మృతాహం వచ్చాక నాలుగు సంవత్సరముల వరకు శ్రాద్ధమును బయట (ఇంటి బయట ) పెట్టాలి. శ్రాద్ధ భోజనము చేయరాదు. ప్రథమ సం॥మందు ఆస్థులు, మజ్జ, తిన్నట్లు ద్వితీయ సం॥ మందు మాంసభక్షణము, తృతీయ సం॥ శ్రాద్ధమందు రుధిరపానము చేసినట్లౌతుంది. నాలుగవ సంవత్సర శ్రాద్ధము శుద్ధమైనది,అని శ్రాద్ధ కారిక ఉక్తి కనుక శుద్ధమైన దానిని

కొంచెము తెలుసుకోవాలి. స్మృత్యంతరమందిట్లా - ముప్పది ఏడు మాసములవరకు తమోహతుడై ఎవడు భుజిస్తాడో శ్రాద్ధమందు, అతడు పంక్తి దూషితుడు, పాపుడు. అతడు ప్రేతమును తిన్నవాడౌతాడు. అక్కడ మొదటి సంవత్సరమందు వర్షాంత సపిండన పక్షమందు మృతాహం కన్న ముందు రోజు సపిండనము అబ్ద పూర్తి శ్రాద్ధముచేసి, తరువాతి రోజున వార్షికాన్ని చేయాలని స్మృత్యర్థ సారమందు చెప్పారు,అని. కాలాకాండ యందు హేమాద్రి ఐతే ఇట్లా - మృతాహమందు సపిండీకరణం వల్లనే వార్షికసిద్ధి. పూర్తి సంవత్సర మందు పదహారు పిండములని చెప్పారు. దానితోనే సపిండత్వము, దానితోనే ఆబ్దికము అన్నారు అనే వచనంవల్ల అని అన్నాడు. ఇదియే తగినమాట. ఇక క్షయాహం తెలియని పక్షంలో మరీచి ఇట్లా - మృతాహము (చనిపోయినరోజు) తెలియనప్పుడు, శ్రాద్ధ విఘ్నము ఏర్పడితేనూ, విశేషించి కృష్ణపక్ష ఏకాదశి యందు ఆచరించాలి, అని ఉన్నందువల్ల శుక్ల ఏకాదశి యందును ఆచరించవచ్చును. బృహస్పతి ఇట్లా - మృతాహం తెలియనప్పుడు, మరణించినవాడు దూరదేశమందున్నప్పుడు మాసం తెలిసిన పక్షంలో ఆ అమావాస్య యందు ఆబ్దిక శ్రాద్ధం చేయాలి. మరణించినవానియొక్క మరణ దినము మాసము తెలియని పక్షంలో, బయల్దేరిన మాసదివసములను గ్రహించాలి. ముందు చెప్పిన విధంగా.

**మూ॥ మదనరత్నే భవిష్యే - మృతాహం యోనజానాతి మానవోవినతాత్మజ, తేన కార్యమ మావాస్యాం శ్రాద్ధం సాంవత్సరం సదా. దినమేవతు జానాతి మాసంనైవతుయోనరః, మార్గశీర్షే తథాభాద్రే మాఘేవా తద్దినం భవేత్. నిర్ణయామృతేతు - యదామాసోనవిజ్ఞాతో విజ్ఞాతం దినమేవతు, తదా చాషాఢకేమాసిమాఘేవా తద్దినం భవేత్, ఇతి బృహస్పతి స్మృతే రాషాఢోప్యుక్తః . కాలాదర్శేఽపి - మాసాజ్ఞానే, దినజ్ఞానే కార్యమాషాఢమాఘయోః, ఇత్యుక్తం. హేమాద్రౌ ప్రభాసఖండే - మృతాహం యోనజానాతి మాసం వాపి కథంచన, తేనకార్యమమాయాంస్యాత్ శ్రాద్ధం మాఘేఽథ మార్గకే. భవిష్యే - మృతవార్తాశ్రుతేర్ గ్రాహ్యౌతౌ పూర్వోక్త క్రమేణతు పూర్వోక్తేతి ప్రస్థాన దినా జ్ఞానే మాసజ్ఞానే చ తద్దర్శే మాసాజ్ఞానే దిన జ్ఞానేచ మార్గాదావితి తచ్ఛ్రవణదినేఽపిజ్ఞేయమి త్యర్థః. శ్రవణదిన మాసాజ్ఞానే మాఘమార్గదర్శేకార్యంపూర్వోక్త ప్రభాసఖండాత్. అతోఽత్ర లోప ఇతి శూలపాణ్యుక్తం హేయం. తిథితత్వేయమః - గతస్యనభవేద్వార్తా యావద్ ద్వాదశ వార్షికీ, ప్రేతావ ధారణం తస్యకర్తవ్యం సుతబాంధవైః. యన్మాసియ దహర్యాత స్తన్మాసితదహః క్రియా, దినాజ్ఞానే కుహూస్తస్యఆషాఢస్యాథవాకుహూః అథశ్రాద్ధ విఘ్న నిర్ణయః - తత్ర విప్రస్య నిమంత్ర ణోత్తరం సూతకే మృతకే చాశౌచాభావః. నిమంత్రితేషు విప్రేషుప్రారబ్ధే శ్రాద్ధకర్మణి నిమంత్రణాద్ధి విప్రస్య స్వాధ్యాయాది రతస్యచ. దేహేపితృషుతిష్ఠత్సు నాశౌచంవిద్యతేక్వచిత్, ఇతి బ్రాహోక్తేః. కర్తుస్తు విష్ణు రాహ - వ్రతయజ్ఞ వివాహేషుశ్రాద్ధేహో మేఽర్చనేజపే, అరబ్ధం సూతకంనస్యాత్ అనారబ్ధేతు సూతకం. శ్రాద్ధే ప్రారంభస్తే నైవోక్తః - ప్రారంభో వరణం యజ్ఞే సంకల్పోవ్రత సత్రయోః, నాందీముఖం వివాహాదౌశ్రాద్ధే పాకపరిక్రియా, ఇతి. మాధవీయేబ్రాహ్మేఽపి - శ్రాద్ధాదౌ పితృయజ్ఞేచ కన్యాదానేచనోభవేత్. మితాక్షరాయాం స్మృత్యంతరే సద్యఃశౌచం**

ప్రకృత్య - యజ్ఞే సంభృత సంభారేవివాహే(శ్రాద్ధ కర్మణి, ఇతి. తిధితత్వాది గౌడ గ్రంధాస్తు నిమంత్రణోత్తరం కర్తుః భోక్తుశ్చనాశౌచం నిమంత్రణోత్తరం శ్రాద్ధే ప్రారంభః స్యాదితి స్మృతిః, ఇతి విష్ణూక్తేః. యత్తు శ్రాద్ధే పాక పరిక్రియా, ఇతి తద్దర్శ శ్రాద్ధ విషయమిత్యాహుః. దాతృగృహే మరణాదౌ బ్రాహ్మే ఉక్తం - భోజనార్ధేతు సంభుక్తే విప్రైః దాతుః విపద్యతే, గృహేఇతి శేషః. యదాకశ్చిత్తదో చ్ఛిష్టం శేషంత్యక్త్వా సమాహితాః, ఆచమ్యపరకీయేన జలేన శుచయో ద్విజాః, ఇతి అన్యశ్రాద్ధ విషయత్వం హేమాద్రి ణోక్తం. పృధ్వీచంద్రోదయేఽ ప్యేవం. మమతుప్రతిభాతి - ఇదం వివాహాది విషయం నతుశ్రాద్ధ విషయం తత్పదాభావాత్, వివాహోత్సవ యజ్ఞేషు, ఇత్యుపక్రమ్య - భుంజానేషుతు విప్రేషు త్వంతరామృత సూతకే. అన్యగేహోదకాచాంతాః సర్వేతేశుచయః స్మృతాః ఇతిషట్ త్రింశన్మతైక వాక్యత్వాత్. నిమంత్రితేషు విప్రేషుప్రారబ్ధే(శ్రాద్ధ కర్మణి, ఇతి పూర్వోక్త విరోధాచ్చ. శ్రాద్ధేతు యద్యపి విష్ణునా పాకోత్తరమాశౌచాభావ ఉక్తః తధాపికర్తురేవసః భోక్తుస్తు దోషోఽ స్త్యేవ.

అను॥ మదనరత్నమందు భవిష్యోక్తి ఇట్లా - ఓ గరుత్మంత! ఏనరుడు మృత దివసమును తెలుసుకోలేడో. ఆతడు అమావాస్యయందు సంవత్సర శ్రాద్ధమును ఎల్లప్పుడు చేయాలి, అని. ఏ నరుడు, మరణదినం మాత్రం తెలిసి మాసం తెలుసుకోలేడో ఆతడు మార్గశీర్షమందు లేదా భాద్రపదమందు లేదా మాఘమాసమందు కాని ఆ శ్రాద్ధమాచరించాలి. నిర్ణయామృతమందైతే - మాసం తెలియక మృతదినం మాత్రమే తెలిస్తే అప్పుడు ఆషాఢమాసమందు లేదా మాఘమాసమందు కాని ఆ శ్రాద్ధము చేయాలి, అని బృహస్పతి స్మృతియందున్నందువల్ల ఆషాఢం కూడా చెప్పబడింది, అని. కాలాదర్శమందు కూడా - మాసం తెలియక, దినం మాత్రమే తెలిస్తే ఆషాఢమందో, మాఘమందో చేయాలి, అని చెప్పబడింది. హేమాద్రియందు ప్రభాసఖండమందిట్లా - మృతాహము తెలియదు, మాసం కూడా తెలియదు. అట్టివాడు శ్రాద్ధమును మార్గశీర్షం లేదా మాఘమాసం అమావాస్యయందు చేయాలి, అని. భవిష్యమందిట్లా - ముందు చెప్పిన ప్రకారం మృతవార్తా శ్రవణసంబంధి దిన, మాసమును గ్రహించాలి. పూర్వోక్తం అనటం వల్ల బయల్దేరిన రోజు తెలియక మాసం తెలిసిన పక్షంలో ఆ అమావాస్యయందు, మాసము తెలియక దినము తెలిసిన పక్షంలో మార్గశీర్షాదిమాసములందు, అని మరణవార్త శ్రవణసంబంధి దినస్మరణమున్నా మార్గశీర్షమందే అని తెలుసుకోవాలి అని అర్ధము. మరణవార్త శ్రవణ సంబంధి దినమాసములు తెలియని పక్షంలో మార్గశీర్ష మాఘ అమావాస్యలయందే చేయాలి, ముందుచెప్పిన ప్రభాసఖండ వాక్యాన్ననుసరించి. అందువల్ల ఇక్కడ శూలపాణి అన్నట్టి లోపము అనేది విడువతగింది, అని. తిధితత్వమందు యముడిట్లా - విదేశం పోయినవాడివార్త పన్నెండు సంవత్సరాలదాకా లేకపోతే, వాడు మరణించినట్టుగా భావించాలి, సుతులు, బంధువులు. ఏ మాసమందు, ఏ అహస్సులో వెళ్ళాడో, ఆ మాసంలో ఆ దినం

శ్రాద్ధం చేయాలి. దినం తెలియకపోతే ఆ నెల అమావాస్యయందు లేదా ఆషాఢ అమావాస్యయందు చేయాలి, అని. ఇక శ్రాద్ధ విఘ్నమందు నిర్ణయము. అక్కడ విప్రుని, నిమంత్రణ తరువాత సూతకం గాని మృతాశౌచంగాని వస్తే అశౌచం లేనట్టే. బ్రాహ్మణుల నిమంత్రణ జరిగాక, శ్రాద్ధ కర్మ ఆరంభించాక, స్వాధ్యాయాదులందు ఆసక్తి గల విప్రుని, నిమంత్రణ వల్లనే, దేహమందు పితరులు ఉంటుండగా ఎక్కడ అశౌచం ఉండదు, అని బ్రహ్మపురాణోక్తి. కర్తకైతే విష్ణువిట్లా అన్నాడు – వ్రతము, యజ్ఞము, వివాహము, శ్రాద్ధము, హోమము, అర్చన, జపము వీనిని ఆరంభించాక సూతకం వస్తే, సూతకం లేనట్టే. ఆరంభించక ముందు సూతకం వస్తే సూతకమున్నట్లు, అని. శ్రాద్ధమందు ప్రారంభాన్ని ఆతడే ఇట్లా చెప్పాడు – యజ్ఞమందు వరణము ప్రారంభము, వ్రత, సత్ర యాగములకు సంకల్పమే ఆరంభము. వివాహాదులందు నాందీముఖము ఆరంభము. శ్రాద్ధమందు పాకారంభము (పరిక్రియ) ఆరంభము, అని. మాధవీయమందు బ్రాహ్మమందు కూడా – శ్రాద్ధాదులందు, పితృయజ్ఞమందు, కన్యాదానమందును సూతకముండదు, అని మితాక్షర మందు, సద్యః శౌచము అని ప్రకరణం ఆరంభించి స్మృత్యంతర వచనములిట్లా ఉన్నాయంటూ–యజ్ఞమందు సంభారములు సమకూర్చుకున్నాక, వివాహమందు, శ్రాద్ధకర్మయందు, అశౌచం లేదు, అని. తిథితత్వం మొదలగు గౌడ గ్రంథములైతే, నిమంత్రణ తర్వాత కర్తకు భోక్తకు అశౌచం లేదు. నిమంత్రణ తరువాత శ్రాద్ధమందు ప్రారంభము ఔతుంది, అని. స్మృతి అని విష్ణూక్తి. శ్రాద్ధమందు పాక ప్రారంభము శ్రాద్ధ ప్రారంభము అని చెప్పిన మాట దర్శశ్రాద్ధ విషయము, అని అన్నారు. ఇచ్చేవాడి ఇంట్లో మరణాదులు సంభవిస్తే బ్రాహ్మోక్తి ఇట్లా – బ్రాహ్మణుల సగం భోజనం అయ్యాక దాతకు మృతివస్తే (దాత గృహమందు అని శేషము) ఎవరైనా మరణించినప్పుడు, బ్రాహ్మణులు, తినగా మిగిలిన దంతా వదలి సావధానులై వేరే ఇంటి జలంతో ఆచమనం చేస్తే ఆ బ్రాహ్మణులు శుచులౌతారు, అని. ఇది శ్రాద్ధ విషయమని హేమాద్రి అన్నాడు. పృథ్వీ చంద్రోదయమందు కూడా ఇట్లాగే ఉంది. కాని నాకు ఏమనిపిస్తోందంటే – ఇది వివాహాది విషయము, శ్రాద్ధ విషయము కాదు, ఆపదం లేనందువల్ల. వివాహ ఉత్సవ యజ్ఞేషు, అని ఆరంభించి, బ్రాహ్మణులు భుజిస్తుండగా మృతివల్ల సూతకం వల్లనో అంతరాయమేర్పడితే, ఇతరగృహమందలి నీటితో ఆచమనం చేస్తే వారంతా శుచులౌతారు అని. షట్త్రింశన్మత వాక్యంతో సరిపోయినందువల్ల. పైగా బ్రాహ్మణ నిమంత్రణ జరిగాక, శ్రాద్ధకర్మ ఆరంభించాక, అని ముందు చెప్పిన వాక్యానికి విరోధమైంది కూడా. శ్రాద్ధమందు, విష్ణువు, పాకారంభం తరువాత అశౌచం లేదు అని చెప్పినప్పటికి అది కర్తకే, భోక్తకైతే దోషం ఉండనే ఉంది.

**మూ॥ అపిదాతృగృహీత్రోశ్చ సూతకేమృతకే తథా, అవిజ్ఞాతే నదోషః స్యాత్ శ్రాద్ధాదిషు కథంచన. విజ్ఞాతే భోక్తురేవ స్యాత్ప్రాయశ్చిత్తాది కం క్రమాత్, ఇతి మాధవీయే బ్రాహ్మోక్తేః. అది**

శబ్దేనాశౌచముచ్యతే. తచ్చాహవిష్ణుః - బ్రాహ్మణాదీనామాశౌచేయఃసకృదేవాన్నమశ్నాతి తస్యతావదాశౌచం యావత్తేషాం. అశౌచవ్యపగమే ప్రాయశ్చిత్తం కుర్యాదితి. యత్తు - దేహే పితృషుతిష్ఠత్సు నాశౌచం విద్యతేక్వచిత్, ఇతి బ్రాహ్మం తచ్ఛ్రాద్ధ కాలీనస్య నిషేధకం, నతదుత్తర కాలీనస్య. శుద్ధి దీపస్తు నిమంత్రితే ష్విత్యామశ్రాద్ధపరం, భోజనార్థే త్విత్యాది త్వన్నశ్రాద్ధ పరమిత్యాహ. **ప్రాయశ్చిత్తం త్వాహ** మార్కండేయః - భుక్త్వాతు బ్రాహ్మణాశౌచే చరేత్ సాంతపనంద్విజః. ఏతత్కామతః. అభ్యాసేశంఖః - బ్రాహ్మణస్యతథాభుక్త్వామాసమే కంబ్రతీభవేత్, ఇతి. అజ్ఞానాత్తు ఛాగలేయః - ఏకాహంచత్ర్యహం పంచసప్తరాత్రమభోజనం, తతః శుచిర్భవేద్విప్రః పంచగవ్యంపి బేన్నరః, ఇతి వర్ణక్రమేణేదం. అభ్యాసేతు ద్వైగుణమిత్యాది మితాక్షరామాధవీయాదౌజ్ఞేయం. మితాక్షరామాధవాదౌతు శ్రాద్ధే కర్తుర్ భోక్తుశ్చ సర్వథా దోషాభావ ఉక్తః. **ఆశౌచమధ్యే** శ్రాద్ధ దిన ప్రాప్తౌతు మాధవీయే కాలాదర్శేచ ఋష్యశృంగః - దేయే పిత్ర్యాణాం శ్రాద్ధేతు ఆశౌచంజాయతేయదా, ఆశౌచేతు వ్యతిక్రాంతే తేభ్యః శ్రాద్ధం ప్రదీయతే. శ్రాద్ధ చింతా మణౌజ్యోతిషే - ప్రతిసాంవత్సరం శ్రాద్ధం ఆశౌచాత్పతి తంచయత్, మలమాసేఽపితత్కార్యం ఇతి భాగురిభాషితం. ఆశౌంచాత్య దినత్వేన నిమిత్తత్వా దిత్యర్థః. ఏతన్మాసికాదిపరం, నదార్శికాదౌ. అతఏవ సుదర్శన భాష్యే - అపరపక్షే పిత్ర్యాణీతి నియమాత్, కృష్ణపక్షశ్రాద్ధలోపే ప్రాయశ్చిత్తమేవ, నతుగౌణకాలేకరణం. తచ్చోపవాసః. వేదోదితానాం నిత్యానాం కర్మణాం సమతిక్రమే, స్నాతకవ్రతలోపేచ ప్రాయశ్చిత్తమ భోజనం, ఇతిమనూక్తేః ఇత్యుక్తం. అశౌచేతు ప్రాయశ్చిత్తమపిన ముఖ్యకాలే అనధికారాత్. ఆశౌచాంతే అసంభవేతువ్యాసః - శ్రాద్ధ విఘ్నే సముత్పన్నే త్వంతరామృత సూతకే, అమావాస్యాం ప్రకుర్యాద్వై శుద్ధావేకే మనీషిణః. హేమాద్రౌషట్ త్రింశన్మతేఽపి - మాసికేచాబ్దికే త్వప్నే సంప్రాప్తే మృతసూతకే, వదంతి శుద్ధౌతత్కార్యం దర్శేవాపి విచక్షణాః. గోభిలః - దేయే ప్రత్యాబ్దికేశ్రాద్ధే అంతరామృతసూతకే ఆశౌచానంతరం కుర్యాత్తన్మాసేందుక్షయేఽపివా. మరీచిః - శ్రాద్ధ విఘ్నే సముత్పన్నేఽప్య విజ్ఞాతే మృతేఽహని, ఏకాదశ్యాంతుకర్తవ్యం కృష్ణపక్షే విశేషతః విశేషత ఇత్యుక్తేః శుక్లైకాదశ్యామపి. అశౌచేతర విఘ్నే ఏతదితి మాధవ పృథ్వీచంద్రౌ. యత్వత్రిః - తదహశ్చేత్ప్ర దుష్యేతకేన చిత్సూత కాదినా, సూతకానంతరం కుర్యాత్ పునస్తదహరేవచ, ఇతి తత్ పూర్వకాలాభావేజ్ఞేయం. ఏతదాబ్ది కేతర శ్రాద్ధపరం.

అను॥ దాతకు, గ్రహీతకు, సూతకంగాని మృతాశౌచంగానివస్తే శ్రాద్ధాదులందు, తెలియకపోతే ఏ రకమైన దోషంలేదు. అశౌచం తెలిస్తే భోక్తకే ప్రాయశ్చిత్తాదికముక్రమంగా ఉంటాయి, అని మాధవీయమందు బ్రాహ్మోక్తి. అదిశబ్దంతో అశౌచం చెప్పబడుతోంది. దానిని విష్ణువిట్లా చెప్పాడు. - బ్రాహ్మణాదుల ఆశౌచమందు ఎవడు ఒక్కసారి భోజనం చేస్తాడో వానికి ఆశౌచము, వారికి అశౌచం ఉన్నంతవరకు. ఆశౌచం వెళ్ళిపోయాక ప్రాయశ్చిత్తం చేయాలి, అని. దేహమందు పితరులు ఉండగా ఎక్కడ అశౌచం ఉండదు, అని చెప్పిన బ్రాహ్మోక్తి, అది శ్రాద్ధకాలమందు మాత్రమే నిషేధాన్ని చెప్పేది, కాని అది ఆ తరువాత కాలమునకు కాదు. శుద్ధి దీపమందైతే నిమంత్రణ అయ్యాక అన్నది ఆమ

శ్రాద్ధపరము, సగం భుజించాక అని మొ॥ అన్నదైతే అన్న శ్రాద్ధ పరము అని అన్నారు. ప్రాయశ్చిత్తాన్నైతే మార్కండేయుడిట్లా చెప్పాడు - బ్రాహ్మణా శౌచమందు భుజిస్తే బ్రాహ్మణుడు సాంతపన ప్రాయశ్చిత్త మాచరించాలి, అని. ఇది తన ఇష్టంతో ఒకసారి భుజిస్తే చేయాలి. మాటిమాటికి భుజిస్తే శంఖోక్తి ఇట్లా - అటువంటి బ్రాహ్మణుని భోజనం చేస్తే ఒక నెలరోజులు వ్రత మాచరించాలి, అని. అజ్ఞానంతో (తెలియక) ఐతే ఛాగలేయుడిట్లా -ఒక రోజు, మూడురోజులు, ఐదు, ఏడురాత్రులు భుజించకుండా ఉండటమే. ఆ పిదప విప్రుడుశుచి ఔతాడు. ఆతడు పంచగవ్యాన్ని సేవించాలి. ఇది బ్రాహ్మణాది వర్ణక్రమంగా ప్రాయశ్చిత్తము. మాటిమాటికి భుజిస్తే రెట్టింపు ప్రాయశ్చిత్తమని మొ॥నవి మితాక్షరా, మాధవీయాదులనుండి గ్రహించాలి. మితాక్షరా మాధవాదులందైతే శ్రాద్ధమందు కర్తకు భోక్తకు, అన్ని విధముల దోషం లేదని చెప్పబడింది. ఆశౌచమధ్యమందు శ్రాద్ధదినము వస్తేనో, మాధవీయమందు కాలాదర్శమందును ఋష్యశృంగోక్తి ఇట్లా - పితరులకు శ్రాద్ధము ఇవ్వవలసిన సందర్భంలో, ఒకవేళ ఆశౌచం వస్తే, ఆశౌచం అయ్యాక వారికి శ్రాద్ధం పెట్టాలి, అని. శ్రాద్ధ చింతామణియందు జ్యోతిషోక్తి ఇట్లా - ప్రతి సాంవత్సర శ్రాద్ధము, ఆశౌచం వల్ల ఆగిపోయిన పక్షంలో, దానిని మలమాసంలో కూడా ఆచరించవచ్చు అని భాగురి చెప్పాడు, ఆశౌచ అంత్యదినము నిమిత్తమైంది కనుక (హద్దు) అప్పుడే చేయాలి, అని అర్థము. ఇది మాసికాదుల పరము, దర్శాదులలో కాదు. అందువల్లనే సుదర్శన భాష్యమందిట్లా - అపర పక్షమందు పితృకర్మలు అని నియమము ఉన్నందువల్ల, కృష్ణపక్షమందు శ్రాద్ధ లోపం జరిగితే ప్రాయశ్చిత్తమే. గౌణకాలంలో చేయరాదు. అది ప్రాయశ్చిత్తం ఉపవాసము, వేదోదితములైన నిత్యకర్మల అతిక్రమణం జరిగితే (చేయకపోతే). స్నాతకవ్రతలోపమందు ఉపవాసము ప్రాయశ్చిత్తము (తినరాదు) అని మనూక్తి అని చెప్పారు. ఆశౌచమందైతే ప్రాయశ్చితం కూడా లేదు, ముఖ్యకాలంలో అధికారంలేనందువల్ల. ఆశౌచాంతమందు కుదరకపోతే నో వ్యాసుడిట్లా - శ్రాద్ధమునకు, మధ్యలోమృతాశౌచం, జాతాశౌచం వల్ల విఘ్నమేర్పడితే అమావాస్యయందు ఆచరించాలి. కొందరు బుద్ధిమంతులు శుద్ధి అయ్యాక చేయాలంటారు, అని. హేమాద్రి యందు షట్ త్రింశన్మతమందును ఇట్లా- మాసికము, ఆబ్దికము చేయాల్సిన రోజున మృతాశౌచమో, జాతాశౌచమో వస్తే శుద్ధి అయ్యాక ఆశ్రాద్ధాన్ని ఆచరించాలి, లేదా అమావాస్యయందు కాని ఆచరించాలి, అని బుద్ధిమంతులు అంటారు, అని. గోభిలుడిట్లా - ప్రత్యాబ్దిక శ్రాద్ధము పెట్టాల్సిన రోజున మృత సూతకముల వల్ల అంతరాయమేర్పడితే ఆశౌచం తర్వాత చేయాలి, లేదా ఆ నెలయొక్క అమావాస్యయందు కాని చేయాలి, అని. మరీచి ఇట్లా - శ్రాద్ధమునకు విఘ్నమేర్పడితే, లేదా మృతాహం తెలియకపోతే ఏకాదశియందు ఆచరించాలి. విశేషించి కృష్ణపక్షమందు, అని. విశేషించి అన్నందువల్ల శుక్లపక్ష ఏకాదశియందు కూడా ఆచరించవచ్చు. ఆశౌచము కన్న ఇతరమైన

(పాక) విఘ్నమేర్పడితే ఇది అని మాధవ పృథ్వీచంద్రులన్నారు. అత్రి ఇట్లా – ఏదో ఒక సూతకాదులవల్ల ఆరోజు దోషమేర్పడితే, సూతకం తరువాత మళ్ళీ ఆ రోజే చేయాలి, అని. అన్నమాట అది, అంతకన్న ముందు కాలం లభించకపోతే అని గ్రహించాలి. ఇది ఆబ్దికము కన్న ఇతరమైన శ్రాద్ధ విషయము.

**మూ॥ యచ్చదేవలః** – ఏకోద్దిష్టేతు సంప్రాప్తే యది విఘ్నఃప్రజాయతే, మాసేఽన్యస్మిం స్తిథౌతస్మిన్ శ్రాద్ధం కుర్యాత్ప్రయత్నతః, ఇతి. తదపి మాసిక పరమితి మదనరత్నే హేమాద్రౌచ. ఇదమపి పూర్వకాలా సంభవే వ్యాధ్యాదౌ విస్మరణే చైవం జ్ఞేయం. అథభార్యారజో దర్శనే తత్ర దార్శిక మామేన కార్యం శ్రాద్ధ విఘ్నేద్విజాతీనాం ఆమ శ్రాద్ధం ప్రకీర్తితం, అమావాస్యాది నియతం మాససంవత్సరాదృతే, ఇతిహేమాద్రౌ హారీతోక్తేః. వ్యాఘ్రపాదోఽపి – ఆర్తవే దేశకాలానాం విప్లవే సముపస్థితే, అమశ్రాద్ధం ద్విజైః కార్యం శూద్రః కుర్యాత్స దైవహి. దీపికాపి – దర్శేతు భార్యార్తవేఽప్యామ శ్రాద్ధ విధిం ప్రవాసి విధురాద్యాశ్చాచరే యుర్ద్విజాః. వస్తుతస్తు – పాకాభావేద్విజాతీనాం ఆమశ్రాద్ధం విధీయతే, ఇతిసుమం తూక్తేః పాకకర్త్రంతరేసత్వేఽన్నేనాన్యథాఽమేనేతియుక్తం. మాసికాని సపిండాని అమావాస్యా తథాబ్దికం, అన్నేనైవతు కర్తవ్యం యస్య భార్యారజస్వలా, ఇతి కలికాయాం వచనాచ్చ. కాలాదర్శేతుస్త్రియాః రజోదర్శనే దర్శశ్రాద్ధం పంచమేఽహనీతి పక్షాంతర ముక్తం. పారిజాతే ఽప్యేవం. ఏవం మహాలయ యుగాదావపి. ఆబ్దికంతు రజోదర్శనేఽపి తద్దినే ఏవకార్యం. పుష్పవత్స్వపిదారేషు విదేశస్థోఽప్యనగ్నికః, అన్నేనైవాబ్దికం కుర్యాద్ధేమ్నావాఽఽమేన, చక్వచిత్, ఇతి మాధవీయేలౌగాక్షిస్మృతేః. మరీచిరపి – అనగ్నిశ్చప్రవాసీ చ యస్య భార్యా రజస్వలా, ఆ మశ్రాద్ధం ప్రకుర్వీత, నతత్కుర్యాన్మృతేఽహని, ఇతి. కార్ష్ణాజినిః – ఆపన్నోఽప్యాబ్దికం నైవ కుర్యాదామేన కుత్రచిత్, అన్నేన తదమాయాంతు కృష్ణేవాహారివాసరే. ప్రయోగ పారిజాతే – రజస్వలాయాం భార్యాయాం క్షయాహంయః పరిత్యజేత్, సవైనరకమాప్నోతి యావదా భూతసంప్లవం. మాసికాని సపిండాని అమావాస్యాతథాబ్దికం, అన్నేనైవతుకర్తవ్యం యస్య భార్యా రజస్వలా. దేవయాజ్ఞిక నిబంధేఽపి – భర్తుఃశ్రాద్ధం పం "మేఽహ్నికుర్యాద్భార్యా రజస్వలా, పుత్రఃపిత్రోః ప్రకుర్వీత మృతాహనిశుచిర్యతః. కాలాదర్శేఽపి – రజస్వలాంగ నోఽనగ్నిః విదేశస్థోఽథవాబ్దికే, దర్శాదావివనామేనత్వన్నేనశ్రాద్ధమాచరేత్. అన్యత్రాపి – విదేశకోవా విగతాగ్నికోవా రజస్వలాయామపిధర్మపత్న్యాం. శ్రాద్ధేమృతాహేవిదధీతపాకైః నామేన హేమ్నానతు పంచమేఽహ్ని. ఏవం మాసికేఽపి. యత్తుమరీచిః – ఆబ్దికే సమనుప్రాప్తే యస్య భార్యారజస్వలా పంచమేఽహని తచ్ఛ్రాద్ధం నతత్కుర్యాన్మృతేఽహని. మాధవీయే – శ్రాద్ధంతదానకర్తవ్యం కర్తవ్యం పంచమేఽహని, ఇత్యుత్తరార్ధం. తదపుత్రస్త్రీ కర్తృక శ్రాద్ధ విషయం. అపుత్రాతుయదాభార్యా సంప్రాప్తే భర్తురాబ్దికే, రజస్వలా భవేత్సాతు కుర్యాత్తత్పంచమేఽహని, ఇతిశ్లోకఃగౌతమోక్తేః.

అను॥ దేవలుడిట్లా – ఏకోద్ధిష్టము సంప్రాప్తించినప్పుడు ఒకవేళ విఘ్నము కలిగితే, మరోమాసమందు అతిథియందు ప్రయత్నపూర్వకంగా శ్రాద్ధం చేయాలి, అని. చెప్పినమాట, అదికూడా మాసిక పరమని మదనరత్నమందు హేమాద్రియందు చెప్పబడింది. ఇదికూడా

తొలుత (అంతకన్న ముందు కాలంలో) సంభవించకపోతే, వ్యాధి మొదలగునవి వస్తే, మరిచిపోతే ఇట్లా అని తెలుసుకోవాలి. ఇక భార్యకు రజోదర్శనమైనప్పుడు. అక్కడ అమావాస్య శ్రాద్ధాన్ని ఆమశ్రాద్ధంగాచేయాలి. శ్రాద్ధమునకు విఘ్నమేర్పడితే బ్రాహ్మణులకు ఆమ శ్రాద్ధము చెప్పబడింది, అమావాస్యాది నియత శ్రాద్ధములకు: మాస, సంవత్సర శ్రాద్ధములకు మాత్రం కాదు, అని హేమాద్రియందు హారీతోక్తి. వ్యాఘ్రపాదుడుకూడా - రజోదర్శనమందు, దేశకాలములందు విప్లవం వస్తే ద్విజులు ఆమశ్రాద్ధం చేయాలి. శూద్రుడు ఎప్పుడూ ఆమశ్రాద్ధం చేయాలి, అని. దీపిక కూడా - అమావాస్యయందు, భార్య రజోవతి ఐతే, ప్రవాసి, అట్లాగే విధురుడు (భార్యపోయినవాడు) మొదలగు ద్విజులు కూడా ఆమశ్రాద్ధవిధిని ఆచరించాలి, అని. నిజానికైతే - పాకం చేయటం వీలుకాని పక్షంలో ద్విజాతులకు ఆమశ్రాద్ధము విధించబడింది, అని సమంతూక్తి. పాకం చేసేవాళ్ళు మరొకరు ఉంటే అన్నంతో లేకుంటే ఆమంతో అని చెప్పుట తగినది. మాసికములు, సపిండములు, అమావాస్య, అట్లాగే ఆబ్దికము వీనిని భార్య రజస్వల ఐన వాడు (ఆమ) అన్నంతోనే చేయాలి, అని కాలికయందు వచనం కూడా కాలాదర్శమందైతే స్త్రీకి రజోదర్శనమైతే ఐదవరోజున దర్శశ్రాద్ధం చేయాలి, అని మరో పక్షం కూడా చెప్పబడింది. పారిజాతమందు కూడా ఇట్లాగే. ఇట్లా మహాలయ యుగాది శ్రాద్ధములందు కూడా. ఆబ్దికాన్ని, రజోదర్శనమైనా ఆరోజే చేయాలి. భార్య పుష్పవతి ఐనా, విదేశస్థుడైనా, అనగ్నికుడైనవాడు అన్నంతోనే ఆబ్దికం చేయాలి లేదా హేమంతో చేయాలి, ఆమంతో ఎప్పుడూ చేయరాదు, అని మాధవీయమందు లౌగాక్షిస్మృతి. మరీచి కూడా ఇట్లా - అనగ్నికుడు, ప్రవాసి, భార్య రజస్వల ఐన వాడు వీరు ఆమశ్రాద్ధాన్ని ఆచరించాలి. మృతాహమందైతే దానిని చేయరాదు, అని (ఆబ్దికంతగదు). కార్ష్ణాజిని ఇట్లా - ఆపన్నుడైనా, ఆబ్దికమును ఆమంతో ఎప్పుడూ చేయరాదు. (రజోదర్శనం, పాకాభావం ఆపత్తి). దానిని అమావాస్యయందు లేదా కృష్ణపక్ష ఏకాదశియందు అన్నంతో చేయాలి, అని. ప్రయోగ పారిజాతమందిట్లా - భార్య రజస్వల ఐనందువల్ల క్షయాహాన్ని ఆచరించనివాడు, ప్రళయకాలం దాకా నరకాన్ని పొందుతాడు, అని. మాసికములు, సపిండములు, అమావాస్య, ఆబ్దికము వీనిని, భార్య రజస్వలైనా, అన్నంతోనే చేయాలి. దేవయాజ్ఞిక నిబంధమందు కూడా - రజస్వలైన స్త్రీ (భార్య), తన భర్త శ్రాద్ధాన్ని ఐదవరోజున చేయాలి, పుత్రుడు, మాతాపితరుల శ్రాద్ధాన్ని మృతాహమందు ఆచరించాలి, ఆతడు శుచి కనుక (భార్య రజస్వల ఐనా), అని. కాలాదర్శమందు కూడా - భార్య రజస్వల ఐనవాడు, అనగ్నికుడు, విదేశస్థుడు కాని ఆబ్దికమును, అమావాస్యాది శ్రాద్ధములందువలె ఆమశ్రాద్ధం చేయక అన్న శ్రాద్ధమాచరించాలి, అని. మరోచోట కూడా - విదేశకుడైనా, అగ్నిలేనివాడైనా, భార్య రజస్వల ఐనా మృతాహశ్రాద్ధాన్ని వంటచేసి ఆచరించాలి, ఆమంతోకాని, హేమంతో కాని పంచమ దివసమందు కాని చేయరాదు,

అని. ఇట్లా మాసికమందు కూడా అని గ్రహించాలి. మరీచి ఇట్లా – ఆబ్దికం వచ్చినప్పుడు, భార్య రజస్వల ఐతే ఆ శ్రాద్ధాన్ని ఐదవరోజు చేయాలి, మృతాహమందు ఆ శ్రాద్ధం చేయరాదు, అని చెప్పిన మాట, మాధవీయమందు ఇట్లా – శ్రాద్ధం అప్పుడు చేయరాదు, ఐదవ రోజున చేయాలి, అని పై శ్లోక ఉత్తరార్ధము అని చెప్పినమాట పుత్రులులేని స్త్రీ ఆచరించే శ్రాద్ధ విషయము, అని గ్రహించాలి. పుత్రులు లేని స్త్రీ (భార్య) తన భర్త ఆబ్దికం వచ్చినప్పుడు, ఆమె రజస్వలఐ ఉంటే, ఆ శ్రాద్ధాన్ని ఐదవరోజుచేయాలి, ఆమె, అని ఈ శ్లోకాన్ని గౌతముడు చెప్పాడు.

**మూ॥ దైవే కర్మణి పిత్ర్యేచ పంచమేఽహనిశుధ్యతి, ఇతి ప్రభాసఖండాచ్చ. నను అశుచిత్వాదేవ తత్ర పంచమేహన్యర్థాత్ శ్రాద్ధం ప్రాప్తమితి వచనంవ్యర్థం. మైవం, గర్భిణీసూతికాదిశ్చ కుమారీవాథరోగిణీ, యదాశుద్ధాతదాన్యేనకారయేత్ప్రయతాస్వయం, ఇతి హేమాద్రౌ భవిష్యోక్తేః అనుపనీత స్త్రీ శూద్రాశ్చ శ్రాద్ధమృత్విజావాకారయేయుః, స్వయంవాఽమంత్రకం కుర్యుః, ఇతిస్మృత్యర్థసారాత్‌చ అన్యద్వారాకరణ నివృత్యర్థత్వాత్తస్య, త్వదుక్త దిశా ఆశౌచానంతరం శ్రాద్ధ కర్తవ్యతాఽవేదక వాక్యవైయ్యర్థ్యాచ్చ. అతఃప్రాగుక్త మరీచ్యుక్తేః పత్నీపంచమేఽహనీతి యుక్తం. యత్తు – సప్తాహాత్పిత్రృదేవానాంభవేద్యోగ్యావ్రతార్చనే, ఇతితత్ రజోనివృత్తి పరమితి హేమాద్రి భిన్న సర్వనిబంధ సిద్ధాంతః హేమాద్రిస్తు – శ్రాద్ధాదౌతు స్త్రియాసహైవాధికారాత్ తస్యాం రజోదుష్టాయాం తన్నివృత్తేరేక భార్యేణ పంచమేఽహని కార్యం ప్రాగుక్త మరీచ్యుక్తేః. భార్యాంతర సత్వేతు పుష్పవత్స్వ పీతి వచనాత్తద్దినే ఏవేత్యాహ. దీపికాపి – భార్యరౌసతి పంచమే చదివసే స్యాద్వార్షికం మాసికం పక్వాన్నైర్బహుభార్యకస్త్వధికృతేపత్న్యంతరే తిష్ఠతి, కుర్యాత్తద్వితయం స్వముఖ్యదివసే, ఇతి తచ్చింత్యం. సహాధికారః సహత్వశ్రుత్యావా ఏకఫల భాక్త్వేన వాపాక కర్తృత్వేనవా? నాద్యః. తదభావాత్ పాణిగ్రహణాద్ధి సహత్వం కర్మసు, ఇత్యస్య అగ్నిసాధ్య కర్మవిషయ త్వాత్. ఆబ్దికస్యచనిరగ్నేరపి పాకేనైవోక్తేః స్మార్తాగ్ని సాధ్యత్వాని యమాత్, తామపరుధ్య, ఇతివత్ పుష్పవత్స్వపీతి పూర్వోక్తవచన సత్వాచ్చ. కథంచ భర్యాంతరే సత్వేఽధికారః. జ్యేష్ఠయా, నవినేతరా, ఇతినియమాత్. జ్యేష్ఠాపరత్వేచతేనైవ సిద్ధేః. వచనవైయర్థ్యాత్. నద్వితీయః. అవిభక్తభ్రాతృషు ఏక స్యాశుచిత్వేఽన్యస్యానధికారాపత్తేః. నతృతీయః. ప్రవాస నిర్దేశసూతికారోగిణ్యాదిష్వప్యకరణాపత్తేః . ఆరభేతనవైః పాత్రైః అన్నారంభంచ బాంధవైః, ఇతిదేవలోక్తావాత్మనే పదాత్స్వస్య బాంధవానాంచ పాకకర్తృత్వోక్త్యా విరోదాచ్చ. అథ-తతస్తా నిపపాచాశు సీతా జనక నందినీ, ఇతి పాద్మాదిలింగాత్ ప్రాశస్త్యం భార్యాపాకస్యోచ్యతే. నతత్కస్యాప్యనిష్టం. తే నైతద్వచనం యుక్త్యాద్యభావాత్ పూర్వోక్తవచోవిరోధాచ్చయత్కించిదేవ. యదపి – శ్రాద్ధీయాహనిసంప్రాప్తే యస్యభార్యారజస్వలా, శ్రాద్ధం తత్రనకర్తవ్యం కర్తవ్యం పంచమేఽహని, ఇతి శ్లోక గౌతమ పారోఽన్యథాదర్శితః. మాధవీయే చతద్వశాత్పక్షాంతర ముక్తం. తేనాపి నాభిప్రేతార్థసిద్ధిః యస్యప్రేతస్యేత్యర్థాత్. తేనాత్రహేమాద్రిః ఐభ్రామేతి బహువక్తవ్యేఽపినోచ్యతే.**

అను॥ దైవకర్మయందు పితృకర్మయందును ఐదవరోజున శుద్ధురాలౌతుంది. (రజస్వలైనస్త్రీకి అర్హత), అని ప్రభాసఖండమువల్లనూ తెలుస్తోంది. అశుచి ఐనందువల్లనే,

అక్కడ ఐదవరోజున అని అర్థం వల్లనే శ్రాద్ధం ప్రాప్తమైంది కనుక అని మళ్ళీ ఈ వచనం వ్యర్థము అని అంటే అట్లా అనరాదు. గర్భిణి సూతకాదులు కలవారు, కుమారి, రోగిణి వీరు శుద్ధులు అయ్యాక అప్పుడు ఇతరులతో చేయించాలి లేదా పరిశుద్ధలై స్వయంగా చేయాలి, శ్రాద్ధం అని హేమాద్రియందు భవిష్యోక్తి. అనుపనీతులు, స్త్రీలు, శూద్రులు శ్రాద్ధమును ఋత్విజునితో చేయించాలి లేదా స్వయంగా మంత్రం లేకుండా ఆచరించాలి, అనిస్మృత్యర్థసారం వల్లను తెలుస్తోంది కనుక ఇతరులతో చేయించటాన్ని నివర్తించేకొరకు అది. నీవు చెప్పిన ప్రకారం ఐతే ఆశౌచానంతరము శ్రాద్ధకర్తవ్యతను తెలిపే వాక్యమైతే వ్యర్థ మౌతుంది. అందువల్ల ముందు చెప్పిన మరీచి వాక్యాన్ననుసరించి భార్య ఐదవరోజు యందు చేయాలి, అని చెప్పటం యుక్తము. ఏడురోజుల తరువాత పితరుల దేవుళ్ళ వ్రత అర్చన యందు యోగ్యురాలౌతుంది, అని చెప్పిన మాట అది (ఐదవరోజు) రజోనివృత్తి పరమైనది అని హేమాద్రి కన్న భిన్నమైన అందరు నిబంధకారుల సిద్ధాంతము. హేమాద్రిఐతే - శ్రాద్ధాదులందు స్త్రీతో పాటే అధికారమైనందువల్ల ఆమె రజోదుష్ట ఐతే, ఆ దోష నివృత్తి తర్వాత ఒకే భార్య కలవాడు, ఐదవ రోజున శ్రాద్ధ మాచరించాలి ముందు చెప్పిన మరీచివాక్యాన్ననుసరించి. మరో భార్య ఉన్న పక్షంలో పుష్పవతులు ఐనప్పటికీ, అనే వచనాన్ననుసరించి ఆ రోజే అని అన్నాడు. దీపిక కూడా - భార్య ఋతుమతి ఐతే ఐదవరోజున వార్షికము, మాసికము పక్వాన్నములతో ఔతుంది. బహుభార్యలు కలవాడైతే మరోభార్యను అధికారిగా కూర్చోబెట్టుకొని ఆ మాసిక, వార్షికములను తాను ముఖ్యదివసమందు ఆచరించాలి, అని అంది. దానిని విచారించాలి. సహాధికారము అనేది సహత్వశ్రుతి వల్లనా, ఏకఫల భాక్త్వం వల్లనా, పాకకర్తృత్వం వల్లనా. తొలిది కాదు. సహత్వశ్రుతిలేదు కనుక. పాణిగ్రహణం వల్లనే కర్మలలో కలిసి ఉండటం, అని ఇది అగ్నితో చేయతగిన కర్మల విషయము. ఆబ్దికమైతే అగ్నిహోత్రం లేనివాడు కూడా పాకంతోనే చేయాలి, అని చెప్పారు. స్మార్తాగ్ని సాధ్యమనే నియమం లేనందువల్లను, తామపరుధ్య అనేదానివలె పుష్పవతులైనా అనే పూర్వోక్త వచనం ఉన్నందువల్ల (తామపరుధ్య అనగా పుష్పవతి యైన స్త్రీని మరో ఇంట్లో ఉంచి ఆరంభించిన శ్రౌతయజ్ఞం, మరి ఆబ్దిక శ్రాద్ధాన్ని నిర్వహించాలి అని) మరోభార్య ఉండగా అధికారం ఎట్లా వస్తుంది. పెద్ద భార్యతో తప్ప ఇతర స్త్రీ వద్దు అనే నియమమున్నందువల్ల. పైమాట జ్యేష్ఠాపర్వతమైతే దానివల్లనే సిద్ధిస్తుంటే మరో వచనం వ్యర్థమౌతుంది. రెండోది కాదు. అన్నదమ్ములు విడివడనప్పుడు ఒకనికి అశుచిత్వం వస్తే మరొకనికి అధికారం లేకుండా పోతుంది. మూడవది కాదు. ప్రవాసి, ప్రత్యేకించి నియమింపబడ్డవాడు, సూతిక, రోగిణి వీరందరు కూడా చేయవీలులేకుండా పోతుంది. కొత్త పాత్రలతో ఆరంభించాలి, బాంధవులతో కలిసి అన్నారంభం చేయాలి, అనే దేవలుని మాటయందు ఆత్మనే పదప్రయోగం ఉన్నందువల్ల తనకు బాంధవులకు

పాకకర్తృత్వం చెప్పబడింది కనుక దానికి విరోధము ఇది. ఇక, జనకుని కూతురు సీత వాటిని త్వరగా వండిది అనే పద్మపురాణాదుల వచనాన్ననుసరించి భార్యాపాకమునకు ప్రాశస్త్యము చెప్పబడుతోంది. అది ఎవనికీ అనిష్టం కాదు. అందువల్ల ఈ మాట యుక్త్యాదులు లేనందువల్ల, ముందుచెప్పిన మాటలకు విరోధమైనందువల్ల, ఇదేదో ఒకటి (పనికిరానిది). శ్రాద్ధం రోజువస్తే, భార్య రజస్వలైనట్లైతే, ఆ రోజు శ్రాద్ధం చేయరాదు, ఐదవ రోజు చేయాలి, అని చెప్పిన శ్లోకము గౌతముని పాఠము మరోరకంగా చూపబడింది. మాధవీయమందును, అకారణంగానే మరో పక్షం చెప్పబడింది. దానివల్ల కూడా అభిప్రేతమైన అర్థము సిద్ధించలేదు. ఏ ప్రేతము యొక్క (మృతునియొక్క) అని అర్థమైనందువల్ల. అందువల్ల ఇక్కడ హేమాద్రికి భ్రమ ఏర్పడింది అని చాలా చెప్పాల్సి ఉన్నా, చెప్పటం లేదు.

మూ॥ **అథాన్వారోహణే నిర్ణయః** – లౌగాక్షిః – మృతాహని సమాసేన పిండ నిర్వపణం పృథక్, నవశ్రాద్ధం చదంపత్యోః అన్వారోహణ ఏవతు. సమాసేనతంత్రేణ ద్విపితృక శ్రాద్ధవత్ ద్వయోరేకఃపిండో విప్రశ్చ. పిండశబ్దఃశ్రాద్ధ పరః. నవశ్రాద్ధం పృథగితి హేమాద్రి పృథ్వీచంద్రౌ. అత్రమృతా హనీత్యేకత్వాద్దినభేదేదినైక్యేవా మృతతిథే రేకత్వే కాలైక్యం కర్త్రైక్యం పాకైక్యంచ. ఏకచిత్య ధిరో హేతు తిథిరే కైవజాయతే. ఏకపాకేనపిండైక్యే ద్వయోర్ గృహ్ణీత నామనీ, ఇతిస్మృత్యంతరాచ్చ. అంత్యేష్టిపద్ధతౌభట్టైరప్యుదాహృతం – అన్వారోహేతునారీణాం పత్యుశ్చై కోదక క్రియా, పిండదాన క్రియాతద్వచ్ఛ్రాద్ధం ప్రత్యాబ్దికంతథా. నవశ్రాద్ధానిసర్వాణి సపిండీకరణం పృథక్. ఏక ఏవవృషోత్సర్గో గౌరేకాతత్రదీయతే ఇతి. తిథిభేదేతు వార్షికం పృథగేవ. తథావార్షికే సమాస విధానాదన్యత్ర సర్వత్ర పృథక్త్వే ప్రాప్తే నవశ్రాద్ధమేవ పృథగితి పరిసంఖ్యయాఽన్యత్ర పృథక్త్వేప్యపి వార్షిక షోడశ శ్రాద్ధ తీర్థసపిండనాన్వష్టక్యాదిషు సమాస ఏవేతి మదన పారిజాత నిర్ణయామృతాదయః. అతః సమాసవిధిబలాత్ జ్యేష్ఠపుత్రస్యకర్తృత్వే సపత్న్యమాతురన్వారోహణే తత్పుత్రే సత్యపితద్వార్షికాదికమ విభక్తః సాపత్న్యపుత్ర ఏవ జ్యేష్ఠః కుర్యాన్నౌరసః. వక్ష్యమాణపృథ్వీ చంద్రాది మతేతు ఔరస ఏవమాతుః పృథక్ కుర్యాత్. ఏవం బహ్వీష్వపి మాతృషుజ్ఞేయం. త్రిస్థలీసేతౌ పితామహచరణైరప్యేవముక్తం. యత్తుగార్గ్యః – ఏకచిత్యాం సమారూఢౌదంపతీ నిధనం గతౌ, పృథక్ శ్రాద్ధంతయోః కుర్యాత్ ఓదనం చపృథక్ పృథక్. ఓదనం=పిండః. తన్న వశ్రాద్ధ విషయం. యత్తు భృగుః – యాసమారో హణం కుర్యాద్భర్తుఃచిత్యాం పతివ్రతా, తాంమృతా హని సంప్రాప్తే పృథక్ పిండైః నియోజయేత్. ప్రత్యబ్దం చ నవ శ్రాద్ధం యుగపత్తౌ సమాపయేత్. తద్యేషాం వార్షిక మేకోద్దిష్ట ముక్తం తద్విషయం. ప్రత్యబ్దంమృతాహనీత్యన్వయః. నవశ్రాద్ధం యుగపదితిదర్శే వర్గద్వయవదేకతంత్రేణ పృథగిత్యర్థమాహ హేమాద్రిః. ఏ తన్మృతతిథేః భేద విషయమితి పృథ్వీచంద్ర నిర్ణయామృతాద్యాః. దేవయాజ్ఞికోఽప్యేవం. పరాశరమాధవస్తు – గార్గ్యభృగ్వాది వచనాల్లౌగాక్షివాక్యే సమాసేన పాకాది తంత్రైక్యేన, దర్శేవర్గద్వయవత్పృథక్ శ్రాద్ధం కుర్యాత్, నవశ్రాద్ధం చతథాఇత్యాహ. పృథ్వీచంద్ర చంద్రికాదయస్తు – ద్వయోరేకపిండదానం లౌగాక్షివచనం చాపద్విషయం. పృథక్పిండదానంతు ముఖ్యః కల్పః. తదాహబృహత్పరాశరః – ఆరుహ్య భర్తుశ్చితి మంగనా,

యా ప్రాప్నోతి మృత్యుంఖలు సత్వయుక్తా, ఏకాదశాహేతుతయోర్విధేయం శ్రాద్ధం పృథక్ స్వర్గమపేక్ష్యసద్భిః. ఏకత్వమిచ్ఛంతి మతి ప్రహీణా ఏకాదశాహాదిషు యేన్యనార్యోః, తే స్వర్గమార్గం వినిహత్యకుర్యుః స్త్రీ సత్వఘాతాన్నరకాధివాసం. భర్త్రాసహమృతాయాతు నాకలోక మభీప్సతీ, సార్వైశ్చాద్ధం పృథక్ పిండాన్ నైకత్వంతు స్మృతంతయోః పృథగేవహికర్తవ్యం శ్రాద్ధమే కాదశాహికం, యానిశ్రాద్ధాని సర్వాణి తాన్యుక్తాని పృథక్ పృథక్, ఇతి. విశ్వాదర్శేஉపి - మాతుర్గయాష్ట కావృద్ధిమృతా హేషు మహాలయే, శ్రాద్ధం కుర్యాత్ పృథక్ దైవం తంత్రంచానుగతావపి. ఏకచిత్యాం సమారుహ్యామృతయోరేకబర్హిషః, పిత్రోః పిండాన్ పృథక్ దద్యాత్ పిండం త్వాపత్సు తత్సుతః, ఇత్యగ్నిస్మృతే రిత్యాహుః.

అను॥ ఇక అన్వారోహణమందు నిర్ణయము. లౌగాక్షి ఇట్లా - దంపతుల అన్వారోహణమందు, మృతాహమందు తలిదండ్రులకు ఇద్దరకు కలిపియే శ్రాద్ధము పిండ నిర్వాపము నవశ్రాద్ధము మాత్రము విడిగా చేయాలి. (సహగమనం చావు) అని. సమాసమనగా తంత్రము(కలిపి) ఇద్దరు తండ్రులుగల శ్రాద్ధమందు వలె ఇద్దరికి ఒకటే పిండము (శ్రాద్ధము) బ్రాహ్మణుడు కూడా ఒక్కడే. పిండమనగా శ్రాద్ధము. నవశ్రాద్ధము విడిగా అని హేమాద్రి పృథ్వీచంద్రులన్నారు. ఇక్కడ చనిపోయిన రోజు అని ఏకవచనం చెప్పినందువలన దినభేదమందుకాని దిన ఐక్యమందుకాని మరణ తిథి ఒకటైతే కాలము, కర్త, పాకము ఇవి ఒకటౌ తాయి ఒక చితి యందు స్త్రీపురుషులిద్దరు అధిరోహిస్తే ఆ తిథి ఒకటే ఔతుంది. ఒకే పాకంతో ఒకే పిండమైతే ఇద్దరి పేర్లను చెప్పాలి, అని స్మృత్యంతరం వల్ల తెలుస్తోంది. అంత్యేష్టి పద్ధతి యందు భట్టులు కూడా ఇట్లా ఉదహరించారు. - అన్వారోహణమందు స్త్రీలకు భర్తకు ఒకే ఉదక క్రియ పిండదానక్రియ, అట్లాగే శ్రాద్ధము, ప్రత్యాబ్దికము కూడా నవశ్రాద్ధములు అన్ని ఒకే తంత్రంతో (కలిపి) చేయాలి. సపిండీకరణము మాత్రము విడివిడిగా చేయాలి. వృషోత్సర్గము ఒక్కటే. ఒక ఆవుదానం చేస్తారక్కడ, అని. తిథి భేదమైతే వార్షికము విడివిడిగా చేయాలి. అట్లాగే వార్షికమందు సమాసము (కలివిడి) విధించినందువల్ల మిగిలిన చోట్ల అంతటా విడివిడిగా అని వస్తుంటే నవశ్రాద్ధమే విడిగా అని పరిసంఖ్య వల్ల నియమము ఇతరత్ర తంత్రము. విడిగా చెప్పినప్పటికి వార్షిక, షోడశశ్రాద్ధ, తీర్థశ్రాద్ధ, సపిండన, అన్వష్టకాదులందు సమాసమే, అని మదన పారిజాత నిర్ణయామృతాదులన్నాయి. అందువల్ల సమాస విధి బలం వల్ల జ్యేష్ఠపుత్రుడు కర్త ఐనప్పుడు సవతి తల్లి అన్వారోహణ చేస్తే, ఆమె కొడుకు ఉన్నా ఆమె వార్షికాదులను అవిభక్తుడైన సవతి పుత్రుడే జ్యేష్ఠుడే చేయాలి, ఔరస పుత్రుడు చేయరాదు. చెప్పబోయే పృథ్వీ చంద్రాదులమ తమందైతే ఔరసుడే తల్లికి విడిగా శ్రాద్ధం చేయాలి. ఇట్లాగే అనేక మంది తల్లుల విషయంలోనూ గ్రహించాలి. త్రిస్థలీ సేతువు యందు పితామహచరణులు కూడా ఇట్లాగే చెప్పారు. గార్గ్యుడిట్లా - ఒక చితియందు ఎక్కి దంపతులు మరణిస్తే వారికి విడిగా శ్రాద్ధం

చేయాలి. ఓదనం కూడా విడివిడిగానే ఓదనమనగా పిండము, అని అన్నమాటనవ(శ్రాద్ధ విషయము భృగువిట్లా – ఏ పతివ్రత భర్త చితిని ఆరోహణ చేస్తుందో, ఆమెకు మృతాహమందు విడిగా పిండములతో నియోజన చేయాలి. ప్రతి సంవత్సరము శ్రాద్ధము, నవశ్రాద్ధము ఒకే సారి సమాప్తి చేయాలి, అని చెప్పిన మాట ఎవరికైతే వార్షికము ఏకోద్దిష్టము చెప్పబడిందో వారి విషయము. ప్రత్యబ్దము అనగా మృతాహమందు అని అన్వయము. నవశ్రాద్ధము ఒకేమారు అని అమావాస్యయందు రెండు వర్గములవలె ఒకే తంత్రంతో విడిగా అనే అర్థాన్ని హేమాద్రి చెప్పాడు. ఇది మరణ తిథి భేద విషయకము అని పృథ్వీచంద్ర నిర్ణయామృతాదులన్నారు. దేవయాజ్ఞికుడు కూడా ఇట్లాగే చెప్పాడు. పరాశర మాధవుడైతే – గార్గ్యభృగ్వాదుల వచనాన్ననుసరించి, లౌగాక్షి వాక్యమందు సమాసంగా, పాకాదితంత్ర ఐక్యంతో, అమావాస్యయందు వర్గద్వయమువలె విడిగా శ్రాద్ధము ఆచరించాలి. నవశ్రాద్ధము కూడా అట్లాగే అని అన్నాడు. పృథ్వీ చంద్ర చంద్రికాదులైతే – ఇద్దరికి ఒకే పిండమివ్వటం, లౌగాక్షివచనము ఆపద్విషయకము. విడిగా పిండమివ్వటమనేది ముఖ్యకల్పము, అని. దానిని బృహత్పరాశరుడిట్లా అన్నాడు – ఏ సత్వ గుణం కల స్త్రీ స్వర్గాన్నికోరి భర్త చితిని ఆరోహించి మృత్యువును పొందుతుందో, అట్టి దంపతులకు, పదకొండవ రోజు యందు విడిగా శ్రాద్ధ మాచరించాలి, సజ్జనులు, అని. ఏ బుద్ధి హీనులు, స్త్రీ పురుషులకు ఏకాదశాహాదులందు ఏకత్వాన్ని కోరుతారో, వారు స్వర్గమార్గమును నాశం చేసి స్త్రీ సత్వాన్ని చంపటం వల్ల నరకాధివాసాన్ని చేస్తారు. స్వర్గలోకాన్ని కోరుతూ భర్తతో సహా మరణించిన స్త్రీ విడి పిండములకు శ్రాద్ధమునకు అర్హురాలు (కోరుతుంది) వాటికి ఏకత్వములేదు. ఏకాదశాహమును (శ్రాద్ధమును) విడిగానే ఆచరించాలి. ఉన్న శ్రాద్ధములనన్నిటిని విడివిడిగా చేయాలి అని. విశ్వాదర్శమందు కూడా–తల్లియొక్క అన్వారోహణమందు, గయాశ్రాద్ధం, అష్టకావృద్ధి, మృతాహ, మహాలయ శ్రాద్ధములు వీనియందు విడిగా శ్రాద్ధమాచరించాలి, దైవ శ్రాద్ధము తంత్రముతో ఆచరించినా, అని. ఒకే చితి యందు ఆరోహించి ఒక దర్భ యందు మరణించిన మాతాపితరులకు పిండములను విడిగా ఇవ్వాలి. ఆపదయందు వారి కుమారుడు పిండము ఒకటి ఇస్తే చాలు, అని అగ్ని స్మృతినుండి, అని అన్నారు.

**మూ. యత్తుషట్ త్రింశన్మతే – ఏకత్వం సాగతాభర్తుః, పిండేగోత్రే చ సూతకే, న పృథక్ పిండదానంతు తస్మాత్ పత్నీషు విద్యతే, ఇతి తద్దర్శాదిపరం. చంద్ర ప్రకాశేஉపి – ఏకచిత్యాం సమారూఢౌ దంపతీ ప్రమృతౌయది, పృథక్ శ్రాద్ధం ప్రకుర్వీత పత్యురేవక్షయేஉహని. మృతానామ పిభృత్యానాం భార్యాణాం పతినా సహ, పూర్వకస్యమృతస్యాదౌ ద్వితీయ స్యతతః పునః. తంత్రేణ శ్రపణం కృత్వా శ్రాద్ధం స్వామిక్షయేஉహని, తృతీయస్య తతః కుర్యాత్ సన్నిపాతే క్రమః స్మృతః ఇతి. సహగమనే సర్వత్ర శ్రాద్ధార్థ మేకపాక ఇత్యాహ మదనరత్నే ప్రచేతాః – ఏకచిత్యాం సమారూఢౌ మ్రియేతే దంపతీయది, తంత్రేణ శ్రపణం కుర్యాత్ పృథక్ పిండం సమావపేత్. పృథ్వీ చంద్రోదయే**

ఒ_ష్యేవం. అత్ర భర్తు రాశౌచ మధ్యే అన్యదినే అనుగమనేన స్త్రీ మరణే పతి మరణదినగణన యా అశౌచ పిండదానై కాదశాహాది కార్యం. నాత్రపక్షిణీ వృద్ధిః. మృతం పతి మను వ్రజ్యపత్నీ చేదన లంగలా, నతత్ర పక్షిణీ కార్యా పైత్రికా దేవశుద్ధ్యతి. పుత్రోఒ_న్యో వాగ్ని దస్తస్యాః తావదేవా శుచిస్తయోః, నవశ్రాద్ధం స పిండం చ యుగపత్తు సమాపయేత్, ఇతి షడశీతి మతాత్. యదా నారీ విశేదగ్నిం ప్రియస్య ప్రియవాంఛయా, తదా శౌచం విధా తవ్యం భర్త్రా శౌచ క్రమేణహి, ఇతి లఘు హారీతోక్తేశ్చ. భర్త్రాశౌచోత్తర మన్వారోహణేతు త్ర్యహ మాశౌచం. ఋగ్వేద వాదాత్ సాధ్వీస్త్రీ నభవేదాత్మ ఘాతినీ, త్ర్యహాశౌచేతు నిర్వృత్తే శ్రాద్ధం ప్రాప్నోతి శాస్త్రతః, ఇతి బ్రాహ్మోక్తే రితి పృథ్వీ చంద్రాపరార్కే. ఏతదన్వా రోహణే ఏవ నత్వేకచితౌ. ఋగ్వేదవాదః, ఇమా నారీర విధవాః, ఇత్యాదిః. ఏతత్సవర్ణాపరమిత్యన్యే (అసవర్ణాపరం?). స్మార్త గౌడాస్తు - దేశాంతరే మృతే పత్యౌ సాధ్వీ తత్పాదుకద్వయం. ఇత్యుపక్రమ్య, బ్రాహ్మే - త్ర్యహాశౌచే తునిర్వృత్తే, ఇత్యుక్తేః భర్త్రా శౌచోత్తర మన్వా రోహణే త్ర్యహః, సహగమనే తుపూర్ణం దశాహాది. పిండాస్తు దశాపి పహైవ. తథా చ జనక శూలపాణి శుద్ధితత్వ ధృతవ్యాసః - సంస్థితం పతిమాలింగ్య ప్రవిశేద్యా హుతాశనం, తస్యాః పిండాదికం దేయం క్రమశః పతి పిండవత్. అన్వితా పిండదానంతు యధాభర్తుర్దినే దినే. తదన్వారోహిణీ యస్మాత్ తస్మాత్సానాత్మఘాతినీ, ఇతి విష్ణూక్తేశ్చ. పృథక్ చితౌతు భర్త్రా శౌచమధ్యే తదూర్ధ్వం వా సత్యాం త్ర్యహేణ దశపిండాః. అన్వితాయాః ప్రదాతవ్యా దశపిండాస్త్ర్య హేణతు, స్వామ్యా శౌచే వ్యతీతేతు తస్యాః శ్రాద్ధం ప్రదీయతే, ఇతి తత్రైవ పైఠీనసి స్మృతేః. భర్త్రా శౌచోత్తరం మృతాతు చతుర్థేఒ_హ్ని శ్రాద్ధం. శూలపాణినాత్విదమగ్ని పురాణీ యత్వేనోక్తం - యుద్ధ హతస్య సద్యః (అ) శౌచే త్వన్వారోహణే త్రిరాత్రం, ఏకచితౌతు, సంస్థితం పతిం, ఇతి ప్రాగుక్త వ్యాసోక్తేః సద్యః అశౌచమిత్యాహుః. అన్య(స్య)స పిండా శౌచమధ్యే విదేశ మృతాఒ_న్వారోహణం త్వనాశ (ం)క్యమేవ. (అ)శుచితాయా అ(న)ంగ(త)త్వాత్. అన్యేతు రజోవత్యాః సూతికాయాశ్చ గమన నిషేధాదితరాశౌచ స్యానిషేధః. అన్యథా ప్రత్యక్ష భర్తృమరణే కాగతిరిత్యాహుః. తన్మూల వచనం వినాచింత్యమేవ. స్మృత్యర్థసారేఒ_పి - సహగమనే సర్వత్ర శ్రాద్ధపిండాదౌ పాకైక్యం కాలైక్యం కర్త్రైక్యంచేతి. యాతుపతి ముద్దిశ్య అన్య కాలే అన్యతిధౌ అన్వారూఢా తస్యాః శ్రాద్ధం తత్ క్షయతిధౌ కార్యం న భర్తృతిథౌ. పారణే మరణే నృణాం తిథి స్తాత్కాలికీ స్మృతా, ఇతి స్కాందాత్. తిధి రేకైవ జాయతే, ఇత్యాది వచనాచ్చేతి మదనరత్న పారిజాత పృథ్వీ చంద్రాదయః. అన్యేతు తస్యాః పతి మరణేన మృతప్రాయత్వాత్, సహాగ్రతః పృష్ఠతోవా తద్భక్త్యా మ్రియతేయది, తస్యాః శ్రాద్ధం ప్రదాతవ్యం పృథక్ పత్యుః క్షయేఒ_హని, ఇతి స్మృత్యంతరాత్. అగ్రతః పృష్ఠతోవాపి తద్భక్త్యా మ్రియతేయది, తస్యాః శ్రాద్ధం సుతైః కార్యం పత్యురేవక్షయేఒ_ హని. ఇతి పురాణ సముచ్చయాచ్చ భర్తృ తిథా వేవేత్యాహుః. అత్ర మూలంచింత్యం. అత్ర విశేషో హేమాద్రౌ స్మృత్యంతరే - మాతా మంగళ సూత్రేణ మ్రియతే యది తద్దినే, ఉద్దిశ్య విప్ర పంక్త్యౌతాం భోజయేచ్చ సువాసినీం.

అను॥ షట్ త్రింశన్మత మందు ఇట్లా - పిండ, గోత్ర, సూతకములందు ఆమె (స్త్రీ) తన భర్తతో కలిసిపోయింది కనుక విడిగా పిండదానము లేదు, భార్యలకు, అని

అన్నమాట అది దర్శాది శ్రాద్ధ పరకము. చంద్ర ప్రకాశమందు కూడా – ఒక చితియందు అధిరోహించి దంపతులు మరణిస్తే, భర్త యొక్క క్షయాహ మందే విడివిడిగా శ్రాద్ధం చేయాలి, అని. యజమానితో సహ మరణించిన భృత్యులకు, భర్తతో సహ మరణించిన భార్యలకు, ఒకేసారిగా వంటచేసి యజమాని క్షయాహమందు శ్రాద్ధమాచరించాలి. మొదట మరణించిన వానికి మొదలు, ఆ పిదప రెండవ వానికి, ఆ పిదప మూడవ వారికి శ్రాద్ధము. ఇట్లా – అందరూ ఒకేసారి మరణిస్తే క్రమమిది శ్రాద్ధమందు అని చెప్పబడింది, అని. సహగమనమందు అంతట శ్రాద్ధము కొరకు ఒకే పాకము అని మదనరత్నమందు ప్రచేతుడిట్లన్నాడు – ఒక చితి యందు అధిరోహించి దంపతులు మరణిస్తే పాకము ఒకేసారి చేయాలి (అందరికి కలిపి) పిండమును విడిగా సమవాపం చేయాలి (వదలాలి),అని. పృధ్వీ చంద్రోదయ మందు కూడా ఇట్లాగే ఉంది. ఇక్కడ భర్తయొక్క ఆశౌచ మధ్యమందు మరో దినమందు అనుగమనంగా స్త్రీ మరణిస్తే భర్త మరణించిన దినములను లెక్కించి, అశౌచము, పిండదానము, ఏకాదశాహాదులు ఆచరించాలి. ఇక్కడ పక్షిణీ వృద్ధిలేదు. (దినంనర పక్షిణి). మరణించిన భర్త ననుసరించి భార్య అగ్ని ప్రవేశం చేస్తే, అక్కడ పక్షిణి చేయకూడదు, **పైత్రికాదుల** వల్లనే ఆమె శుద్ధినందుతుంది. పుత్రుడు కాని ఇతరుడు కాని ఆమెకు అగ్ని పెట్టేవాడు, వారికి అశుచి ఏంతవరకంటే, నవశ్రాద్ధము, సపిండము ఒకేసారి ముగించేవరకే, (ఆదంపతులకై) అని షడశీతిమతాన్ననుసరించి తెలుస్తోంది. ప్రియమైన కోరికతో స్త్రీ ప్రియుని అగ్నిని ప్రవేశిస్తే అప్పుడు ఆశౌచము, భర్త ఆశౌచ క్రమంతోనే ఆచరించాలి, అని లఘు హారీతోక్తి కూడా. భర్త ఆశౌచం తర్వాత అన్వారోహణం చేస్తేనో మూడు రోజులు ఆశౌచము. ఋగ్వేదం మాటల వల్లనైతే ఉత్తమమైన స్త్రీ ఆత్మఘాతిని కారాదు. మూడు రోజులు ఆశౌచం అయ్యాక, శాస్త్ర ప్రకారం శ్రాద్ధాన్ని పొందుతుంది,అని బ్రహ్మ పురాణోక్తి అని పృధ్వీ చంద్ర అపరార్కులన్నారు. ఇది అన్వారోహణమందే. ఏక చితియందైతేకాదు. ఋగ్వేదవాదము, ఈ స్త్రీలు అవిధవలు, అని మొదలుగా ఉంది. ఇది సవర్ణ స్త్రీ పరమని ఇతరులన్నారు. (అసవర్ణాపరం?) స్మార్తగౌడులైతే – భర్త దేశాంతరమందు మరణిస్తే, సాధ్వియైన స్త్రీ ఆతని (భర్తయొక్క) రెండు పాదుకలను, అని ఆరంభించి – బ్రాహ్మమందు – మూడు రోజుల ఆశౌచం గడిచాక అని చెప్పినందువల్ల, భర్త ఆశౌచం తర్వాత, అన్వారోహణమైతే మూడు రోజులు, భర్తతో సహగమనమందైతే పూర్తిగా దశాహాదులు. (పదిరోజుల ఆశౌచం) ఉంటాయి. పిండములైతే పదికూడా కలిసే ఉంటాయి,అని. ఇంకా జనక శూలపాణి శుద్ధితత్వములందు వ్యాసోక్తి ఇట్లా – మృతుడై ఉన్న భర్తను కౌగిలించుకొని అగ్ని ప్రవేశం చేసిన స్త్రీకి పిండాదికములను పతి పిండమువలె క్రమంగా ఇవ్వాలి,అని. అనుగమనం చేసిన స్త్రీ ప్రతిదినము భర్తతో పాటు (సమానంగా) పిండదానంను పొందు తుంది. ఆమె, ఇందువల్లనే అన్వారోహిణీ. అట్లా ఐనందువల్ల

ఆమె ఆత్మఘాతిని కాదు అని విష్ణూక్తి కూడా. విడిగా చితియందు మరణిస్తే భర్త అశౌచమధ్యమందు కాని ఆపైన కాని ఐతే మూడు రోజుల ఆశౌచం పదిపిండములు. అన్వితకు (తరువాత మరణిస్తే) మూడు రోజులలో దశపిండములివ్వాలి. స్వామి ఆశౌచం గడిస్తేనో ఆమెకు శ్రాద్ధం ఇవ్వాలి అని అక్కడే పైఠీనసి స్మృతి. భర్త ఆశౌచం తరువాత మరణిస్తే నాల్గవరోజున శ్రాద్ధము శూలపాణి దీనిని అగ్నిపురాణమందలిది అని చెప్పాడు ఇట్లా - యుద్ధహతునకు వెంటనే (అ) శౌచము, అన్వారోహణమందు త్రిరాత్రము, ఏకచితి యందైతే మరణించి ఉన్న పతిని, అని ముందు చెప్పిన వ్యాసోక్తి ననుసరించి సద్యః ఆశౌచమని అన్నారు. అన్య సపిండ ఆశౌచ మధ్యమందు, విదేశమందు మరణించినందుకు చేసే అన్వారోహణమైతే శంకించదగినదే కాదు. శుచికి అంగమున్న(మైన)ందువల్ల (అశుచికి అంగత్వములేదు) ఇతరులైతే రజోవతి, సూతిక వీరలకైతే సహగమన నిషేధము. ఇతరాశౌచములకు నిషేధం లేదు లేని పక్షంలో ఎదురుగా భర్త మరణిస్తే దిక్కేమిటి అని అన్నారు. ఆ మాట మూలాధార వచనం లేకుండా అంగీకరించటం ఆలోచించ తగినదే. స్మృత్యర్థసారమందు కూడా - సహగమనమందు అంతటా శ్రాద్ధ పిండాదులందు పాకైక్యము, కాలైక్యము, కర్త్రైక్యము,అని. భర్త నుద్దేశించి ఏ స్త్రీ అన్యకాలమందు, అన్యతిథియందు అన్వారూఢమైందో ఆమె శ్రాద్ధమును ఆమె క్షయ తిథియందు చేయాలి, భర్త తిథియందు చేయరాదు. పారణమందు మరణమందు తిథి నరులకు ఆ సమయంలో ఉన్నదే అని చెప్పారు, అని స్కాందోక్తి. తిథి ఒకటే ఉంటుంది,అని మొదలగు మాటలవల్ల కూడా అని మదనరత్న పారిజాత పృథ్వీ చంద్రాదులన్నారు. ఇతరులైతే, భర్త మరణించినందువల్ల ఆ స్త్రీ మృతప్రాయురాలు. సహ, లేదా ముందో, వెనకో పతి మీది భక్తితో మరణిస్తే, ఆమెకు భర్తయొక్క క్షయాహమందు విడిగా శ్రాద్ధం ఆచరించాలి,అని మరోస్మృతి చెబుతోంది. ముందుకాని వెనుకకాని భర్తమీది ప్రేమతో మరణిస్తే ఆమె శ్రాద్ధాన్ని, పుత్రులు భర్తయొక్క క్షయాహమందే చేయాలి, అని పురాణ సముచ్చయం నుండి కూడా అందువల్ల భర్త తిథి యందే అని అన్నారు. ఇక్కడ మూల వచనాలను గురించి ఆలోచించాలి. ఇక్కడ విశేషము హేమాద్రి యందు స్మృత్యంతరోక్తి ఇట్లా - తల్లి (సుమంగళిగా) మంగళ సూత్రంతో ఆరోజే మరణించినట్లైతే, ఆమె నుద్దేశించి బ్రాహ్మణ పంక్తి యందు సువాసినిని భుజింపచేయాలి,అని.

**మూ॥ అథశ్రాద్ధసంపాతే నిర్ణయః - అత్రపిత్రోః మృత తిథ్యేకత్వే మరణ క్రమేణదర్శే వర్గ ద్వయవత్తం త్రేణ శ్రాద్ధం కుర్యాత్. పౌర్వాపర్యా జ్ఞానేతు పితృపూర్వం కుర్యాదితి హేమాద్రిః మాధవాదయస్తు - పితృశ్రాద్ధే సమంప్రాప్తే నవే పర్యుషితేఽపివా, పితృపూర్వం సుతః కుర్యాత్ అన్యత్రా సన్నియోగతః, ఇతి కార్ష్ణాజిని స్మృతేః. సర్వత్ర పితృపూర్వం భిన్నం ప్రయోగమాహుః . పార్వణైకో ద్దిష్టయోః సంపాతే మాధవీయే జాబాలిః - యద్యేకత్ర భవేయాతా మేకోద్దిష్టం చ**

పార్వణం. పార్వణం త్వభినిర్వర్త్య ఏకోద్దిష్టం సమాచరేత్. **గృహ దాహాదినా యుగ పన్మరణే** భృగుః – ఏకకాలే గతా సూనాం బహూనా మథవాద్వయోః, తంత్రేణ శ్రపణం కృత్వా కుర్యాచ్ఛ్రాద్ధం పృథక్ పృథక్. పూర్వకస్య మృతస్యాదౌ ద్వితీయస్యతతః పునః, తృతీయస్య తతః కుర్యాత్ సన్నిపాతే ష్వయం క్రమః. ఋష్యశృంగః – భవేద్యది సపిండానాం యుగపన్మరణంతదా, సంబంధాసత్తి మాలోచ్య తత్క్రమాచ్ఛ్రాద్ధమాచరేత్. గారుడే – ఏకేనైవతు పాకేన శ్రాద్ధాని కురుతేఽత్రహి, వికిరంత్వేకతః కుర్యాత్ పిండాన్ దద్యాత్ పృథక్ పృథక్. అత్రానుగమనే చదాహ సపిండనాదౌ విశేషం వక్ష్యామః. అత్రిః – బహూనామథ, వాద్వాభ్యాం శ్రాద్ధం చేత్స్యాత్సమేఽహని, తంత్రేణ శ్రపణం కృత్వా శ్రాద్ధం కుర్యాత్ పృథక్ పృథక్. పులస్త్యః – మహాలయే గయా శ్రాద్ధే గతాసూనాం క్షయేఽహని, తంత్రేణ శ్రపణం కృత్వా శ్రాద్ధం కుర్యా త్పృథక్ పృథక్. ఇదం చ పృథక్త్వాకేన భిన్న శ్రా(ద్ధ)ద్ధాశక్తౌ. పృథక్త్వాకేన సంబంధాసత్యా శ్రాద్ధ భేదస్తు ముఖ్యః పక్షః,ఏకత్రైవ దినే శ్రాద్ధ ద్వయం ప్రాప్తం యదాతదా, చరేదేవ పురావర్షాన్పి తుర్మాతుశ్చ తత్సుతః. ఏకస్మిన్యః కరోత్యహ్ని ద్వయోః శ్రాద్ధం యదాద్విజః, తదా పూర్వం మృతస్యాదౌ కృత్వా స్నాత్వా యథావిధి. పశ్చాత్పశ్చా న్మృతస్యైవ పృథక్ పాకైః సమాచరేత్, నైకస్మిన్ దివసే శ్రాద్ధం త్రయాణాం కుత్రచిత్ ద్విజః. ఏకః కుర్యాత్తథా ప్రాప్తే అన్యో భ్రాతా సమాచరేత్. భ్రాతర్య విద్య మానేతు తత్పరేఽహ్ని సమాచరేత్. అన్యథా శ్రాద్ధ హంతాస్యాత్ శ్రాద్ధ సంకర కృద్భవేత్, ఇత్యాశ్వలాయనోక్తే రితి పృథ్వీచంద్రః. కాత్యాయనః – ద్వేబహూని నిమిత్తాని జాయే రన్నేకవాసరే, నైమిత్తికాని కార్యాణి నిమిత్తోత్పత్త్యను క్రమాత్ జాబాలిః – శ్రాద్ధం కృత్వాతు తస్యైవ పునః శ్రాద్ధం న తద్దినే, నైమిత్తికంతు కర్తవ్యం నిమిత్తాను క్రమోదయం. కాలాదర్శే – నిత్యదార్శికయోశ్చేద కుంభమాసిక యోరపి, దార్శిక స్యయుగాదేశ్చ దార్శికా లభ్యయోగయోః. దార్శికస్య చ మన్వాదేః సంపాతే శ్రాద్ధకర్మణః, ప్రసంగా దితరస్యా పిసిద్ధేరుత్తర మాచరేత్. అస్య దేవతాభేదేఽపవాద మాహ స ఏవ – నిత్యస్య చోదకుంభస్య నిత్య మాసికయోరపి, దర్శస్య చోదకుంభస్య దర్శమాసికయోరపి నిత్యస్య చాబ్దికస్యాపి దార్శికాబ్దియోరపి, యుగాద్యాబ్దిక యోశ్చైవ మన్వాద్యాబ్దికయో స్తథా, ప్రత్యాబ్దికస్య చాలభ్య యోగేషు విహితస్యచ. సంపాతే దేవతాభేదాత్ శ్రాద్ధం యుగ్మం సమాచరేత్. నిమిత్తా నియతిశ్చాత్ర పూర్వానుష్ఠాన కారణం. పిత్రోస్తు పితృపూర్వత్వం సర్వత్ర శ్రాద్ధకర్మణి. మాధవీయే స్మృతి సంగ్రహే – కామ్యతం త్రేణనిత్యస్య తంత్రం శ్రాద్ధస్య సిద్ధ్యతి.

అను॥ ఇక శ్రాద్ధ సంపాతమందు నిర్ణయము (ఒకేసారి రెండు) – ఇక తల్లిదండ్రుల మృత తిథి ఒకటే అయిన పక్షంలో మరణ క్రమంగా అమావాస్య యందు వర్గద్వయం వలె తంత్రంగా శ్రాద్ధ మాచరించాలి. ముందు వెనుకలు తెలియని పక్షంలో తండ్రికి మొదలు శ్రాద్ధం చేయాలి,అని హేమాద్రి. మాధవాదులైతే – మాతా పితరుల శ్రాద్ధము సమంగా వస్తే కొత్తది, పాతది కూడా కలిసి వస్తే సుతుడు, తండ్రిది మొదలు చేయాలి ఇతరులదైతే విడివిడిగా చేయాలి, అని కార్ష్ణాజిన స్మృతి వల్ల తెలుస్తోంది,అని. అంతట పితృపూర్వము, భిన్న ప్రయోగము అని అన్నారు. పార్వణ ఏకోద్దిష్టములు ఒకేసారి వస్తే

మాధవీయ మందు జాబాలి వచనమిట్లా - ఏకోద్దిష్టము పార్వణము ఒకేరోజు వస్తే, పార్వణాన్ని ముగించి, పిదప ఏకోద్దిష్ట మాచరించాలి,అని. గృహదాహాదులవల్ల ఒకేసారి మరణిస్తే భృగువిట్లా - ఒకే కాలమందు ప్రాణం పోయిన చాలా మందికిగాని ఇద్దరికి గాని పాకం కలిపి చేసి, శ్రాద్ధాన్ని విడివిడిగా చేయాలి,అని. మొదలు మరణించిన వానికి మొదట, ఆ పిదప మరణించిన రెండవవానికి, ఆ పిదప మూడవ వానికి సమూహ మరణమందు ఇది క్రమము (మరణ క్రమాన్ననుసరించి) ఋష్యశృంగుడిట్లా - సపిండులు ఒకేసారి మరణిస్తే, అప్పుడు దగ్గరి సంబంధాన్ని ఆలోచించి, ఆక్రమంగా శ్రాద్ధ మాచరించాలి,అని. గారుడమందిట్లా - ఒకే పాకంతోనే ఇక్కడ శ్రాద్ధములు చేయాలి. వికరమూ ఒక్కటే, పిండములను విడివిడిగా ఇవ్వాలి,అని. ఇక్కడ అనుగమనమైతే దాహస పిండనాదులందు విశేషాన్ని చెప్తాము. అత్రి ఇట్లా - అనేకుల యొక్క లేదా ఇద్దరి శ్రాద్ధము సమదినమందు వస్తే, తంత్రంతో పాకం చేయాలి. శ్రాద్ధం విడివిడిగా చేయాలి,అని. పులస్త్యుడిట్లా - మహాలయమందు, గయాశ్రాద్ధమందు మరణించిన వారి క్షయాహ మందు, కలిపిం పాకం చేయాలి. శ్రాద్ధం విడివిడిగా చేయాలి,అని. ఇది విడివిడిగా పాకంతో భిన్న శ్రాద్ధము చేయటానికి శక్తి లేకపోతే (తంత్రపాకం). (ఉంటే విడిపాకం) విడిపాకంతో దగ్గరి దూర సంబంధాన్ననుసరించి, శ్రాద్ధ భేదము (గమనించాలి ఇది) ముఖ్య పక్షము. ఒకేరోజు రెండు శ్రాద్ధాలు వస్తే వారి పుత్రుడు తొలుత మరణించిన వారి శ్రాద్ధ మాచరించాలి తల్లిది గాని, తండ్రిది గాని ఒకేరోజు ఇద్దరి శ్రాద్ధములను బ్రాహ్మణుడు చేస్తే, అందు తొలుత, మొదలు మరణించిన వారి శ్రాద్ధం చేసి యధావిధిగా స్నానం చేసి, తరువాత, తరువాత మరణించిన వారి శ్రాద్ధమును విడిపాకంతో ఆచరించాలి. ఒకేరోజు మూడు శ్రాద్ధములను బ్రాహ్మణుడెప్పుడూ చేయరాదు. అట్లా వస్తే ఒకటి చేయాలి. ఇంకొకటి భ్రాతతో చేయించాలి. భ్రాత లేకపోతే దానిని తరువాతి రోజు ఆచరించాలి. లేనిచో శ్రాద్ధహంత ఔతాడు. శ్రాద్ధ సంకరం చేసిన వాడౌతాడు,అని. ఆశ్వలాయనోక్తి అని పృథ్వీ చంద్రుడన్నాడు. కాత్యాయనుడిట్లా - ఒకే రోజు రెండు కాని అనేకం కాని నిమిత్తాలు కలుగొచ్చు. అప్పుడు నైమిత్తికమైన ఆ కార్యములను (శ్రాద్ధం) నిమిత్త ఉత్పత్తి ననుసరించి చేయాలి,అని. జాబాలి ఇట్లా - శ్రాద్ధ మాచరించాక, ఆరోజు ఆతని శ్రాద్ధాన్నే మళ్ళీ ఆచరించరాదు. నిమిత్త క్రమాన్ననుసరించి నైమిత్తిక శ్రాద్ధమైతే చేయొచ్చు,అని. కాలాదర్శమందిట్లా - నిత్య, అమావాస్య శ్రాద్ధములు, ఉదకుంభమాసిక శ్రాద్ధములు, అమావాస్య యుగాది శ్రాద్ధములు, అమావాస్య, అలభ్యయోగంవల్ల వచ్చిన శ్రాద్ధంలు (కూర్పువల్ల), అమా మన్వాది శ్రాద్ధము, ఇట్లా జంటలుగా (కలిసి) శ్రాద్ధ కర్మలు వస్తే ప్రసంగంవల్ల (సందర్భవశాత్తు) మరొకటి కూడా సిద్ధిస్తే ఒకటి ప్రసంగ మాత్రంగా ఆచరించి ఉత్తరమైన దానికి శ్రాద్ధ మాచరించాలి,అని. దీనికి దేవతా భేదమున్న పక్షంలో, అతడే

అపవాదాన్ని ఇట్లా చెప్పాడు - నిత్యము మరి ఉదకుంభము, నిత్యము మరిమాసికము, దర్శము మరి ఉదకుంభము, దర్శము మరి మాసికము, నిత్యము మరి ఆబ్దికము, దర్శము మగి ఆబ్దికము, యుగాది మరి ఆబ్దికము, మన్వాది మరి ఆబ్దికము, ప్రత్యాబ్దికము మరి అలభ్య యోగవిహిత శ్రాద్ధము, ఇట్లా రెండేసి శ్రాద్ధాలు కలిసి వస్తే దేవతా భేదమైనందువల్ల రెండు శ్రాద్ధములను ఆచరించాలి. నిమిత్తముల (అ) నియమము ముందు ఆచరించటానికి కారణము. మాతా పితరులకైతే అంతట తొలుత పితృశ్రాద్ధమాచరించాలి, శ్రాద్ధకర్మలందు, అని. మాధవీయమందు స్మృతి సంగ్రహోక్తి ఇట్లా - కామ్యశ్రాద్ధ తంత్రంతో నిత్యశ్రాద్ధ తంత్రము సిద్ధిస్తుంది,అని.

మూ॥ **అథ శ్రాద్ధాంగతర్పణం** - పారిజాతే పృథ్వీచంద్రోదయే చ గర్గః - పూర్వం **తిలోదకం కృత్వా అమాశ్రాద్ధంతు కారయేత్.** ప్రత్యబ్దేన భవేత్పూర్వం పరేఽహని తిలోదకం. పక్ష శ్రాద్ధే హిరణ్యే చ అనువృజ్యతిలోదకం. న చ నిత్యతర్పణస్యైవాయంపరేఽహ్న్యుత్కర్షః, నతు శ్రాద్ధాంగ తర్పణ మస్తీతి వాచ్యం, యస్తర్ప యతితాన్ విప్రః శ్రాద్ధం కృత్వా పరేఽహని, పితరస్తేన తృప్యంతి న చేత్కుప్యంతి వైభృశం, ఇతి గర్గేణ ఫలనిందార్థ వాదాభ్యామం గత్వేనోక్తేః. శ్రాద్ధప్రక్రమా ద్వార్షికం. బృహన్నారదీయేఽప్యాబ్దికం ప్రక్రమ్య - పరేద్యుః శ్రాద్ధకృన్మర్త్యోయో న తర్పయతే పితౄన్, తస్యతే పితరః కృద్ధాః శా పందత్వా వ్రజంతిహి. పితృశబ్దశ్చ శ్రాద్ధే జ్యవర్గపరః. తేన తర్పణస్య పశుపురోడాశయాగవత్ ప్రస్తర ప్రహరణవచ్చేష్ట దేవతా సంస్కారకతా. తేనాబ్దిక దినే నిత్యం స్వపిత్రాది తర్పణం కార్యమేవ శ్రాద్ధాంగ భూతస్యైవ పరేద్యురుక్తేః. తదుక్తం - ప్రత్యబ్దాంగం తిలందద్యాన్నిషేధేఽపిపరేఽహని, వర్గైకస్యవ చోయేషాం అన్యేషాం తు వివర్జయేత్. **క్వచిద్విశేష మాహగర్గః** - కృష్ణేభాద్రపదేమాసి శ్రాద్ధం ప్రతిదినం భవేత్, పితౄణాం ప్రత్యహం కార్యం నిషిద్ధా హేఽపి తర్పణం. తర్పణం = తిలతర్పణం, నిషిద్ధాహేఽపి ఇత్యుక్తేః. సకృన్మహాలయేశ్వః స్యాదష్ట కాస్వంత ఏవహి, అత్ర సప్తమీ నిర్దేశాత్ అంగితాస్వేటైవ. తత్ర జయాన్ జుహుయాత్, మంద్రం ప్రాయణీయాయాం మంద్రం ప్రాతః సవనే ఇత్యాదివత్. అస్యాపవాదో బృహన్నారదీయే - వృద్ధి శ్రాద్ధే సపిండ్యాం చ ప్రేత శ్రాద్ధేఽను మాసికే, సంవత్సర విమోకే చ న కుర్యాత్తిల తర్పణం. తదయమర్థః - దర్శే విప్రనిమంత్రణోత్తరం పాకారం భోత్తరం వా శ్రాద్ధ ప్రయోగస్యా రబ్ధత్వాత్ బ్రహ్మ యజ్ఞోత్తరం నిత్యతర్పణేనైవ శ్రాద్ధాంగ తర్పణస్య తంత్రేణ ప్రసంగేన వాసిద్ధిః. తతః పూర్వంవైశ్వ దేవోత్తరం వా బ్రహ్మయజ్ఞ కరణే శ్రాద్ధాంగ తర్పణం పృథక్ కార్యం. పిత్రోర్వార్షికేతు నిత్యతర్పణం తిలవర్జ్యం కార్యం. నైవ శ్రాద్ధదినే కుర్యాత్తి లైస్తు పితృతర్పణం, శ్రాద్ధం కృత్వా పరాహ్ణే చ తర్పణం తు తిలైః సహ, ఇతి వచనాత్. సప్తమ్యాం భానువారే చ మాతా పిత్రోః మృతేఽహని, తిలైర్యస్తర్పణం కుర్యాత్సభవేత్పి తృఘాతుకః, ఇతి స్మృతిరత్నావల్యాం వృద్ధమనూక్తేశ్చ. అత్ర నిత్య తర్పణే తిలమాత్ర నిషేధో న తుతర్పణస్య తిలైరిత్యస్య వైయర్థ్యాపత్తేః. యత్తు కాతీయం - ఉపరాగే పితుః శ్రాద్ధేపాతేఽమాయాం చ సంక్రమే, నిషిద్ధేఽపి హి సర్వత్ర తిలైస్తర్పణ మాచరేత్,

ఇతి. తత్పరేద్యుః శ్రాద్ధాం గతర్పణ విషయమితి కేచిత్. శ్రాద్ధా శక్తస్యతత్ స్థానాపన్న తర్పణ విషయమితి తు యుక్తం. సకృన్మహాలయే పరేద్యుస్తర్పణం. అష్టకాసుతు సప్తమ్యష్టమీ శ్రాద్ధయోరంతే తద్దైవ వర్గద్వయస్య, అన్వష్టక్యేతు మాతృవర్గస్యాపి. తీర్థశ్రాద్ధే దర్శవత్. మాఘాద్యాదిషు అష్టకావదంతే. అనేక శ్రాద్ధ సంపాతేతు యది ప్రసంగాత్సిద్ధిః తదా తదీయమేవ తర్పణం. తంత్రత్వేతు శ్రాద్ధ సమ సంఖ్యత్వే ఆదావంతే వా. విషమ సంఖ్యాయాం బహ్వనురోధ, ఇతి. తస్మాత్ శ్రాద్ధాంగ తర్పణం సిద్ధం.

అను॥ ఇక శ్రాద్ధాంగతర్పణము. పారిజాతయందు పృథ్వీచంద్రోదయ మందును గర్గుడిట్లా - మొదలు తిలోదకంచేసి ఆ పిదప అమాశ్రాద్ధం చేయాలి. వార్షికమందైతే తొలుత కాదు. తరువాతి రోజు తిలోదకము. పక్షశ్రాద్ధము, హిరణ్య శ్రాద్ధమందును తిలోదకం తరువాత ఇవ్వాలి,అని. నిత్యతర్పణమునకే ఈ తరువాతిరోజు అనే ఉత్కర్ష (దూరంగా తోలటం), శ్రాద్ధంగ తర్పణము లేదు అని అనరాదు. ఏ బ్రాహ్మణుడు, శ్రాద్ధంచేసి, తరువాతి రోజున వారిని తృప్తి పరుస్తాడో, దానితో ఆతని పితరులు తృప్తినందుతారు, లేనిచో మిక్కిలి కోపగించగలరు అని గర్గుడు ఫలనింద, అర్థవాదముల (స్తుతి) తో అంగంగా చెప్పాడు. శ్రాద్ధ ప్రకరణం ఐనందువల్ల వార్షిక శ్రాద్ధము చెప్పబడింది. బృహన్నారదీయమందు కూడా ఆబ్దికం ఆరంభించి - శ్రాద్ధము చేసే నరుడు తరువాతి రోజున పితృతర్పణం చేయకపోతే, వానిపై ఆ పితరులు కోపించి శాపమిచ్చి వెళ్ళిపోతారు,అని. పితృశబ్దము శ్రాద్ధమందు పూజించతగినవారి పరకము. అందువల్ల తర్పణము, పశుపురోడాశయాగంవలె, ప్రస్తర ప్రహరణములవలె ఇష్టదేవతలకు సంస్కారము కల్గించేది. అందువల్ల ఆబ్దిక దినమందు నిత్యమైన స్వపిత్రాది తర్పణము ఆచరించాల్సిందే. (నిత్యతర్పణం) శ్రాద్ధాంగ భూతమైన దానికే తరువాతి రోజున అని చెప్పబడింది. అది ఇట్లా చెప్పబడింది - వార్షికాంగమైన తిలతర్పణము, నిషేధమున్నా (ఆది, మంగళ త్రయోదశి నిషేధం) తరువాతి రోజున ఇవ్వాలి, ఒకే వర్గము (వంశ) యందైతే చేయాలి (చెప్పాలి). ఇతరులకైతే విడిచిపెట్టాలి,అని. ఒకచోట గర్గుడు విశేషాన్ని ఇట్లా చెప్పాడు - భాద్రపద కృష్ణపక్షమందు శ్రాద్ధము ప్రతిరోజు ఉంటుంది. పితరులకు ప్రతిరోజు తర్పణం చేయాలి, నిషిద్ధ దినమందు కూడా,అని. తర్పణము అనగా తిలతర్పణము. నిషిద్ధాహమందు కూడా అని చెప్పారు. మహాలయమందు ఒకసారి రేపు (తరువాతిరోజున) ఉంటుంది, అష్టకములందైతే అంతమందే. ఇక్కడ సప్తమి విభక్తిలో చెప్పినందువల్ల అంగిత (అమా) (తర్పణం అంగం) స్పష్టమే. అక్కడ జయనామక మంత్రములతో హోమం చేయాలి, మంద్ర స్వరంలో ప్రాయణీయమందు మంద్రస్వరము ప్రాతః సవనమందు అని మొదలుగా గల దానివలె సప్తమిచే అంగి చెప్పారు. దీనికి అపవాదము బృహన్నారదీయమందిట్లా - వృద్ధి శ్రాద్ధమందు, సాపిండ్యమందు, ప్రేత శ్రాద్ధమందు. అనుమాసిక యందు, సంవత్సర విమోకమందు (అంతం) తిలతర్పణము

చేయరాదు. దాని అర్థమిట్లా - అమాశ్రాద్ధమందు బ్రాహ్మణ నిమంత్రణ తరువాత లేదా పాకం ఆరంభమయ్యాకనో శ్రాద్ధ ప్రయోగము ఆరంభము కనుక బ్రహ్మయజ్ఞం తరువాత నిత్య తర్పణం వల్లనే శ్రాద్ధంగతర్పణమునకు తంత్రంవల్ల కాని ప్రసంగం వల్ల కాని సిద్ధి. ఆ పిదప (నిమంత్రణకన్న) ముందు కాని వైశ్వదేవం తరువాతకాని బ్రహ్మయజ్ఞంచేస్తే శ్రాద్ధాంగతర్పణం విడిగా చేయాలి. పితరుల వార్షికమందైతే నిత్య తర్పణము, నువ్వులు లేకుండానే చేయాలి.శ్రాద్ధ దినమందు, నువ్వులతో పితృతర్పణం చేయరాదు, అపరాహ్ణమందు శ్రాద్ధం చేశాక నువ్వులతో కూడా తర్పణము చేయాలి అనే వచనాన్ననుసరించి. సప్తమి, భానువారము, తలిదండ్రుల మరణదినము వీనియందు తిలలతో తర్పణం చేసినవాడు పితృఘాతకుడౌతాడు అని స్మృతి రత్నావళి యందు వృద్ధమనూక్తి కూడా. ఇక్కడ నిత్యతర్పణ మందు తిలలు మాత్రమే నిషేధము తర్పణ నిషేధం కాదు. లేనిచో తిలలు అనే పదం వ్యర్థమౌతుంది. కాతీయమందిట్లా - గ్రహణము, పితరుల శ్రాద్ధము, వ్యతీపాతము, అమావాస్య, సంక్రమణము, నిషిద్ధదినమైనా అంతట నువ్వులతో తర్పణమాచరించాలి,అని. అది తరువాతి రోజున చేయబోయే శ్రాద్ధాంగ తర్పణ విషయమని కొందరన్నారు. శ్రాద్ధమందు అశక్తుడైన వానికి దాని స్థానంలో వచ్చిన తర్పణ విషయమని చెప్పుట తగును. ఒక్కోసారి మహాలయమందు తరువాతి రోజున తర్పణము అష్టకాదులందైతే, సప్తమి అష్టమి శ్రాద్ధముల అంతమందు అప్పుడే రెండు వర్గముల వారికి తర్పణము అన్వష్టక్యమందైతే మాతృవర్గము వారికి కూడా. తీర్థ శ్రాద్ధమందు అమాశ్రాద్ధమందువలె. మాఘం మొదలుగా గల వానియందైతే అష్టాకాదులందువలె అంతమందు. అనేక శ్రాద్ధములు ఒకేసారివస్తే ఒకవేళ ప్రసంగంవల్ల ఎవరిది సిద్ధిస్తే (వస్తే) అప్పుడు అతనిదే తర్పణము. తంత్రమందైతే శ్రాద్ధములు సమసంఖ్య ఐతే ఆదియందో, అంతమందో తర్పణము. విషమసంఖ్య ఐతే బహు అనురోధము. అందువల్ల శ్రాద్ధాంగతర్పణమని సిద్ధించింది. (బహుతోంకా అనురోధసేకరే).

**మూ॥ తద్విధిః సంగ్రహే** - స్నాత్వాతీరం సమాగత్య ఉపవిశ్యకుశాసనే, సంతర్పయేత్పితౄన్ సర్వాన్ స్నాత్వా వస్త్రంచ ధారయేత్. తర్పణోత్తరం నిత్యస్నానం కృత్వేత్యర్థః. అపసవ్యం తతః కృత్వాసవ్యం జాన్వాచ్య భూతలే, నామగోత్రస్వధాకారైః ద్వితీయాంతేన తర్పయేత్. **అత్ర వస్వాదిరూపతోక్తా** స్మృత్యర్థసారే - వసురుద్రాదితి సుతాన్ శ్రాద్ధార్థే తర్పయేత్పితౄన్. తచ్చ బహ్వృచానాం దక్షిణేనైవ. దక్షిణం ప్రతీయాదనాదేశే, ఇతి సూత్రాత్. అత్ర ప్రత్యంజలి మంత్రా వృత్తిః. నిర్వాపవత్తత్ సంధ్యార్ఘ్య దానవచ్చ ద్రవ్యభేదాత్. అవఘాతవేది ప్రోక్షణాదౌతు ద్రవ్యై కత్వాన్న మంత్రావృత్తిః. కేచిత్తు పరివ్యాణ మంత్రవత్ క్రియమాణాను వాదిత్వేన కరణత్వా భావాత్ సకృదిచ్ఛంతి. తన్న, యత్రయూ పద్రవ్యైక్యాత్ పరివీరసీతి కరణభూత మంత్రాంతర సత్వాదన్య తరేణ వ్యవధానా పత్యా ఉభయోః కరణ త్వాయోగాత్ కర్తృభేదేన వికల్పాయోగాచ్చ క్రియమాణాను వాదిత్వం నత్వత్ర తథా బౌధాయనాది వచనాత్ కరణత్వమేవ. తేనావృత్తి రేవయుక్తా.

ఏవం నిత్యేఽపి. యత్తు సంగ్రహే నామ్నా పఠంతి – పిత్రోః క్షయాహే సంప్రాప్తేయః కుర్యాన్నిత్య తర్పణం, అసురంతద్భవేచ్ఛ్రాద్ధం తత్తోయం రుధిరం భవేత్. సర్వదా తర్పణం కుర్యాత్ బ్రహ్మయజ్ఞ పురః సరం, మృతాహే నైవ కర్తవ్యం కృతం చేన్నిష్ఫలం భవేత్, ఇతి. తత్పమూలత్వేన తిలవిషయం. యచ్ఛపఠతి కపిలః – మన్వాదిషు యుగాద్యాసు దర్శే సంక్రమణేషుచ, పౌర్ణమాస్యాం వ్యతీపాతే దద్యాత్ పూర్వం తిలోదకం. అర్ధోదయే గజచ్ఛాయే షష్ఠ్యాం చైవ మహాలయే, భరణ్యాం చ మఘా శ్రాద్ధే తదంతే తర్పణం విదుః. శౌనకః – మాతాపిత్రోః మృతాహేతు పరేఽహని తిలోదకం, కారుణ్య శ్రాద్ధ విషయేసద్యో దద్యాత్తిలోదకం, ఏతన్నిర్మూలం. **అథతిల తర్పణ నిషేధః** – గార్గ్యః – భానౌభౌమేత్రయోదశ్యాం నందా భృగుమఘాసుచ, పిండదానం, మృదాస్నానం న కుర్యాత్తిల తర్పణం స్మృత్యర్థసారే – వివాహ వ్రతచూడాసువర్ష మర్ధం తదర్ధకం, అర్ధం తదేవ. వృద్ధౌ సత్యాం చ తన్మాసి నేత్యాహుః తిలతర్పణం . హేమాద్రౌ మరీచిః – సప్తమ్యాం రవివారే చ గృహే జన్మదినే తథా, నిశా సంధ్యా సు పుత్రార్థీ న కుర్యాత్తిలతర్పణం యత్తు సంగ్రహే – నందాయాం భార్గవదినే కృత్తికాసు మఘాసు చ భరణ్యాం భానువారే చ గజచ్ఛా యాహ్వయే తథా. అయనద్వితయే చైవ మన్వాదిషు యుగాదిషు, పిండదానం మృదాస్నానం న కుర్యాత్తిల తర్పణం, ఇతి తచ్చింత్యం. పానీయ మప్యత్ర తిలైర్విమిశ్రం దద్యాత్పితృభ్యః ప్రయతో మనుష్యః, ఇత్యాది విరోధాత్. **అత్రాపవాదః** – పృథ్వీచంద్రోదయే – తీర్థేతిథి విశేషే చ గయాయాం ప్రేతపక్షకే, నిషిద్ధేఽపి దినే కుర్యాత్తర్పణం తిల మిశ్రితం. స్మృత్యర్థసారేఽపి – తిథి తీర్థ విశేషేషు కార్యం ప్రేతే చ సర్వదా, ఇతి. గోభిలః – తిలాభావే నిషిద్ధాహే సువర్ణ రజతాన్వితే, తదభావే నిషించేత్తు దర్భమంత్రేణవా పునః. పఠి తస్య తిలోదకం వక్ష్యామః.

అను॥ దాని విధి సంగ్రహమందిట్లా – స్నానం చేసి ఒడ్డుకు చేరి కుశాసన మందు కూర్చొని, పితరులందరికి తర్పణ చేయాలి, తిరిగి స్నానం చేసి, వస్త్రం ధరించాలి, అని తర్పణం తరువాత నిత్యస్నానం చేసి అని అర్థము. ఆ పిదప అపసవ్యం చేసుకొని కుడిమోకాలును భూమిపై ఉంచి, నామము, గోత్రము స్వధాకారము వీనితో ద్వితీయా విభక్త్యంతంగా తర్పణ చేయాలి. ఇక్కడి వస్వాదుల రూపము స్మృత్యర్థ సారమందిట్లా చెప్పబడింది – వసు, రుద్ర, అదితి సుతులను పితరులను శ్రాద్ధం కొరకు తర్పణ చేస్తున్నాను. అది బహ్వృచులకైతే (ఋక్వేది) దక్షిణం నుండే. అనాదేశమందు దక్షిణం నుండి చేయాలి, అని సూత్రం. ఇక్కడ ప్రతి అంజలికి మంత్రము యొక్క ఆ వృత్తి. నిర్వాపమువలె అది సంధ్యార్ఘ్య దానమువలెను ద్రవ్యభేదమువల్ల. అవఘాత, వేది ప్రోక్షణాదులందు ద్రవ్యం ఒకటే ఐనందువల్ల మంత్ర ఆవృత్తి ఉండదు. కొందరు పరివ్యాణ మంత్రమువలె చేస్తున్న దాని అనువాది ఐనందువల్ల కరణత్వం లేనందువల్ల ఒకేసారి ఇష్టపడుతారు. అంటే అట్లా కాదు, అక్కడ, యూపద్రవ్యం ఒకటైనందువల్ల, పరివీరసీ అని కరణభూతమైన మరోమంత్రం ఉన్నందువల్ల ఏదో ఒకదానితో వ్యవధానం రాబోతుంటే, రెండు కరణం కావటానికి వీల్లేనందువల్ల, కర్తృభేదంతో వికల్ప మనటానికి వీలు లేనందువల్ల, చేస్తున్న దాని

అనువాదిత్వం అక్కడ. ఇక్కడ అట్లాకాదు బౌధాయనాది వచనముల వల్ల కరణత్వమే. అందువల్ల అవృత్తియే తగును. ఇట్లా నిత్య శ్రాద్ధమందు కూడా. సంగ్రహమందు పేరుతో చదువుతారు ఇట్లా – పితరుల క్షయాహం ప్రాప్తమైనప్పుడు, నిత్య తర్పణం చేస్తే, ఆ శ్రాద్ధము ఆసురమౌతుంది, ఆ నీరు రక్తమౌతుంది. ఎప్పుడూ తర్పణాన్ని బ్రహ్మయజ్ఞ పురః సరంగా చేయాలి. మృతాహమందు చేయరాదు, చేస్తే నిష్ఫలమౌతుంది,అని అన్నారో అది సమూలమైనందువల్ల తిలవిషయమని గ్రహించాలి. కపిలుడిట్లా – మన్వాదులు, యుగాదులు, దర్శము, సంక్రమణము, పూర్ణిమ వ్యతీపాతము, వీనియందు మొదట తిలోదకమివ్వాలి, అని అన్నాడు. అర్ధోదయమందు, గజచ్ఛాయయందు, షష్ఠి, మహాలయములందు, భరణి యందు, మఘా శ్రాద్ధమందు వీని అంతమందు తర్పణమివ్వాలని గ్రహించాలి. శౌనకుడిట్లా – తల్లిదండ్రుల మృతాహమందు మాత్రం తరువాతి రోజుననే తిలోదకము కారుణ్య శ్రాద్ధమందైతే అప్పుడే తిలోదకమివ్వాలి అని అన్నమాట ఇది ఆధారం లేని మాట. ఇక తిలతర్పణ నిషేధము. గార్గ్యుడిట్లా – ఆది, మంగళ వారములు, త్రయోదశి, నంద, భృగువారం, మఘానక్షత్రం వీనియందు పిండదానము మట్టితో స్నానము, తిలతర్పణము చేయరాదు,అని. (నందః=ప్రతిపత్తు, షష్ఠి, ఏకాదశి) స్మృత్యర్థ సారమందిట్లా – వివాహము వ్రతము, చూడాకరణము సంవత్సరము, ఆరు నెలలు, మూడు నెలలు పిండదానం, మట్టిస్నానం, తిలతర్పణం చేయరాదు,అని. సగము అదే (మూడు కాదు ఆరు అనే). వృద్ధి ఉన్న పక్షంలో ఆ మాసమందు తిలతర్పణం లేదు అని అన్నారు. హేమాద్రి యందు మరీచి ఇట్లా – సప్తమి ఆదివారము, ఇంట్లో, జన్మదినమందు, రాత్రియందు, సంధ్యాకాల మందు పుత్రులను కోరేవాడు తిలతర్పణము చేయరాదు,అని. సంగ్రహమందిట్లా – నంద, శుక్రవారము, కృత్తిక, మఘ, భరణి, ఆదివారం, గజచ్ఛాయ రెండు ఆయనములు, మన్వాదులు, యుగాదులు, వీనియందు పిండదానము, మట్టిస్నానము, తిలతర్పణము చేయరాదు,అని అన్నమాటను దానిని విచారించాలి. (యుగాది నిషేధము చింత్యము) ప్రయత్న పూర్వకముగా నరుడు, పితరులకు నీరు కూడా ఇక్కడ నువ్వులతో కలిపి ఇవ్వాలి, అను మొదలగు వచనములకు విరుద్ధమౌతుంది కనుక (కూడా శ్రాద్ధము అని). దీనికి అపవాదము పృథ్వీచంద్రోదయమందిట్లా – తీర్థమందు తిథి విశేషమందు (మహాలయ, అష్టక ఆది) గయయందు, ప్రేత పక్షమందు, నిషిద్ధ దినమందు కూడా నువ్వులు కలిపిన జలంతో తర్పణం ఇవ్వాలి,అని. స్మృత్యర్థసారమందు కూడా – తిథి, తీర్థ విశేషములందు ప్రేత కర్మయందు ఎల్లప్పుడు తిలమిశ్రిత జలంతో తర్పణ చేయాలి,అని. గోభిలుడిట్లా – నువ్వులు లేకపోతే నిషిద్ధ దినమందు సువర్ణం రజతం వీనితో చేయాలి అది లేకపోతే దర్భ మంత్రం వీనితోనైనా సేచనం (తర్పణం) చేయాలి,అని. పతితునకు తిలోదకాన్ని ముందు చెప్తాము.

మూ॥ **అథవృద్ధిశ్రాద్ధం** - తన్నిమిత్తం పృథ్వీ చంద్రోదయే బ్రాహ్మే - జన్మన్యథోపనయనే వివాహే పుత్రకస్యచ, పితౄన్నాందీముఖాన్నామ తర్పయేద్విధిపూర్వకం. దేవవ్రతేషు చాధాన యజ్ఞ పుంసవనేషు చ, నవాన్నభోజనేస్నానే ఊఢాయాః ప్రథమార్తవే, దేవారామతడాగాది ప్రతిష్ఠా సూత్సవేషుచ, రాజ్యాభిషేకే బాలాన్న భోజనే వృద్ధి సంజ్ఞకాన్, వనస్థాద్యాశ్రమం గచ్ఛన్ పూర్వేద్యుః సద్య ఏవవా, పితౄన్ పూర్వోక్త విధినా తర్పయేత్కర్మ సిద్ధయే. ఆది పదాత్ పన్యాసః. విష్ణుపురాణే - యజ్ఞోద్వాహ ప్రతిష్ఠాసు మేఖలా బంధమోక్షయోః, పుత్రోత్పత్తౌ వృషోత్సర్గే వృద్ధి శ్రాద్ధం సమాచరేత్. తత్రైవ - నామకర్మణి బాలానాం చూడాకర్మాదికే తథా, ఇత్యుక్తేః. నిష్క్రమాన్న ప్రాశనయోః న శ్రాద్ధమితి మైథిలాః. తన్న పూర్వోక్త విరోధాత్. నానిష్ట్వా, ఇతి నిషేధాత్. సుతోత్పత్తౌ తథా శ్రాద్ధ మన్న ప్రాశనికే తథా, ఇతి రాజమార్తండాచ్చ యత్తు ఛందోగ పరిశిష్టం - సూర్యేంద్వోః కర్మణీ, యే చ తయోః శ్రాద్ధం న విద్యతే. బహ్వృచకారికాయాం - స్యాదాభ్యుదయికం శ్రాద్ధం వృద్ధి పూర్వేషు కర్మసు, పుంసః సవన సీమంత చౌలోపనయనే ష్వివహ, వివాహే చానలాధేయ ప్రభృతి శ్రౌతకర్మసు, ఇదం శ్రాద్ధం ప్రకుర్వంతి ద్విజా వృద్ధి నిమిత్తకం. అన్యైః షోడశ సంస్కార శ్రావణ్యాదిష్వ పీష్యతే, వాప్యాద్యుద్యాపనా దౌతు కుర్యుః పూర్వనిమిత్తకం. బోపదేవ కాలాదర్శౌ - సీమంతవ్రత చౌలనామకరణాన్నప్రాశనో పాయన స్నానాధాన వివాహ యజ్ఞ తనయోత్పత్తి ప్రతిష్ఠాసుచ, పుంసూత్యావసథ ప్రవేశన సుతా ద్యాస్యావలోకా శ్రమ స్వీకారక్షితి పాభిషేక దయితాద్యర్తౌచ నాందీముఖం. యత్తు కామధేనౌ - జలాశయ ప్రతిష్ఠాయాం వృషోత్సర్గాదికర్మసు, వత్సరాభ్యంతరే పిత్రోః వృషస్యోత్సర్గ కర్మణి, వృద్ధి శ్రాద్ధం న కుర్వీత తదన్యత్ర సమాచరేత్, ఇతి. తత్ర జలాశయే వృద్ధి శ్రాద్ధస్య నిషేధో నతు కర్మాంగస్యేతి కేచిత్. అన్యేత్వస్య నిర్మూలతా మాహుః. శ్రాద్ధకౌ ముద్యాం నిర్ణయామృతేచ మాత్స్యే - అన్న ప్రాశేచ సీమంతే పుత్రోత్పత్తి నిమిత్తకే. పుంసవేచ నిషేకే చ నవవేశ్మ ప్రవేశనే. దేవ వృక్ష జలాదీనాం ప్రతిష్ఠాయాం విశేషతః, తీర్థయాత్రా వృషోత్సర్గే వృద్ధి శ్రాద్ధం ప్రకీర్తితం, ఇదం చావశ్యకం. వృద్ధౌ న తర్పితాయే వైపితరో గృహమే ధిభిః తద్దీన మఫలం జ్ఞేయ మాసురో విధి రేవసః, ఇతి శాతా తపోక్తేశ్చ.

అను॥ ఇక వృద్ధి శ్రాద్ధము. దానికి కారణము పృథ్వీ చంద్రోదయమందు బ్రాహ్మోక్తి ఇట్లా - పుత్ర జన్మమందు, ఉపనయన, వివాహములందు నాందీముఖులు అనే పేరుగల పితరులను విధి పూర్వకముగా తర్పణ చేయాలి,అని. దేవవ్రతములందు, ఆధాన, యజ్ఞ, పుంసవనములందు, నవాన్నభోజనము, స్నానము వీనియందు (సమావర్తనం, విద్య సమాప్తి యైరావటం), వివాహిత స్త్రీ తొలిగా పుష్పవతి ఐనప్పుడు, దేవ, ఆరామ, తటాకాదుల ప్రతిష్ఠయందు, ఉత్సవమందు, రాజ్యాభిషేకమందు, అన్నప్రాశనమందు (ఇవన్నీ వృద్ధిసంజ్ఞ కలవి) వాన ప్రస్థం మొదలుగా గల ఆశ్రమములకు వెళ్తూ ముందురోజుకాని, అప్పుడే కాని కర్మసిద్ధి కొరకు పితరులను ముందు చెప్పిన విధి ప్రకారము తర్పణ చేయాలి (తృప్తి పరచాలి) ఆది పదం వల్ల సన్యాసము. విష్ణుపురాణమందిట్లా - యజ్ఞం, వివాహము, ప్రతిష్ఠ, మేఖలాబంధనం మరియు త్యాగము పుత్రోత్పత్తి, వృషోత్సర్గము వీనియందు వృద్ధి

శ్రాద్ధ మాచరించాలి,అని. అక్కడే - పిల్లలకు నామకరణం చేసేప్పుడు, చూడాకర్మాదికమందు వృద్ధి శ్రాద్ధం చేయాలి.అని చెప్పినందువల్ల నిష్క్రమణ, అన్న ప్రాశనములందు వృద్ధి శ్రాద్ధం లేదంటారు మైథిలులు,కాని అట్లాకాదు, ముందు చెప్పిన దానికి విరోధం కనుక. అనిష్ట్వా-న, అని నిషేధం వల్లనూ (శ్రాద్ధం లేకుండలేదు) సుతోత్పత్తి యందు, అన్న ప్రాశనమందునూ వృద్ధి శ్రాద్ధము,అని రాజమార్తండం వల్ల తెలుస్తోంది. ఛందోగ పరిశిష్టమందిట్లా - సూర్య చంద్రుల కర్మలేవైతే ఉన్నాయో వానికి శ్రాద్ధం లేదు,అని అన్నారో అది వారికే (ఛందోగులకే) అని కల్పతరువు. బహ్వృచకారికయందిట్లా - వృద్ధి మరియు పూర్త కర్మలందు ఆభ్యుదయిక శ్రాద్ధము ఉంటుంది. పుంసవన, సీమంత, చౌల, ఉపనయనములందు ఆభ్యుదయిక శ్రాద్ధము, వివాహము, అగ్న్యాధానము మొదలగు శ్రౌతకర్మలందు వృద్ధి నిమిత్తక ఆభ్యుదయిక శ్రాద్ధమును ద్విజులు చేస్తారు,అని. ఇతరులు, షోడశ సంస్కార శ్రావణ్యాదులందు కూడా ఇష్ట పడుతారు. వాపి మొదలగు వాని ఉద్యాపన యందైతే పూర్త నిమిత్తక శ్రాద్ధం చేస్తారు. బోపదేవుడు, కాలాదర్శముల యందిట్లా - సీమంత, వ్రత, చౌల, నామకరణ, అన్నప్రాశన, ఉపాయన (శిష్యుడగుట), స్నాన, ఆధాన, వివాహ, యజ్ఞ, తనయోత్పత్తి, ప్రతిష్ఠలు వీనియందు, పుంసవన, ఆవసథ (గృహ) ప్రవేశన, సుతాదుల ప్రథమ ముఖ దర్శన, ఆశ్రమ స్వీకార రాజాభిషేక, భార్య తొలిరజస్వల వీనియందును నాందీ ముఖ మాచరించాలి,అని. కామధేనువు యందిట్లా - జలాశయ ప్రతిష్ఠయందు, వృషోత్సర్గాది కర్మలందు, సంవత్సరం మధ్యలో మాతాపితరులకై చేసే వృషోత్సర్గ కర్మయందు వృద్ధి శ్రాద్ధము చేయరాదు. దీనికన్న ఇతరమైనచోట ఆచరించాలి,అని అన్నమాట ఏ దుందో అక్కడ జలాశయమందు వృద్ధిశ్రాద్ధము నిషేధము కాని కర్మాంగమైన దానికి నిషేధము లేదు.అని కొందరన్నారు. మరికొందరైతే దీనికి మూల వచనం లేదన్నారు. శ్రాద్ధ కౌముది యందు నిర్ణయామృతమందును మాత్స్యోక్తి ఇట్లా - అన్న ప్రాశన మందు, సీమంత మందు, పుత్రోత్పత్తి నిమిత్తకమైన దానియందు, పుంసవనము, నిషేకము (గర్భాధానం) నూతన గృహ ప్రవేశము వీనియందు విశేషించి దేవత, వృక్షములు, జలము మొదలగు వాని ప్రతిష్ఠ యందు, తీర్థయాత్ర, వృషోత్సర్గము వీనియందు వృద్ధి శ్రాద్ధము చేయాలని ఉంది ఇది ఆవశ్యకమైనది. గృహ మేధులు పితరులను వృద్ధి శ్రాద్ధంతో తర్పితులను చేయనట్లైతే అది హీనమైంది ఫలరహితమైందిగా గ్రహించాలి. అది ఆసురమైన విధియే, అని శాతా తపోక్తి కూడా.

**మూ॥ అత్రశ్రాద్ధ త్రయం సవివాహే - మాతృశ్రాద్ధంతు పూర్వం స్యాత్ పితౄణాం తదనంతరం, తతో మాతా మహానాంచ వృద్ధౌ శ్రాద్ధ త్రయం స్మృతం. తత్కాల మాహ పృథ్వీ చంద్రోదయే గార్గ్యః - మాతృ శ్రాద్ధంతు పూర్వే ద్యుః కర్మాహనితు పైతృకం, మాతామహంచోత్తరే ద్యుః వృద్ధౌ శ్రాద్ధ త్రయం స్మృతం. అశక్తౌ వృద్ధశాతాతపః - పూర్వాహ్ణే మాతృకం శ్రాద్ధం మధ్యాహ్నే పైతృకం తథా, తతో మాతామహా నాంచ వృద్ధౌ శ్రాద్ధ త్రయం స్మృతం. అత్రా**

ష్యశక్తౌ స ఏవ - పృథక్ దినేష్వనుక్తశ్చేత్ ఏకస్మిన్ పూర్వవాసరే, శ్రాద్ధత్రయం ప్రకుర్వీత వైశ్వదేవంతు తాంత్రికం. వృద్ధ మనురపి - అలాభే భిన్న కాలానాం నాందీ శ్రాద్ధత్రయం బుధః, పూర్వేద్యుర్వై ప్రకుర్వీత పూర్వాహ్ణే మాతృపూర్వకం. అత్ర మహత్సు పూర్వేద్యుః తదహరల్పేషు, ఇతి గృహ్యా పరిశిష్టాత్ వ్యవస్థాజ్ఞేయా. తచ్చ ప్రాతరేవ. పార్వణం చా పరాహ్ణేతు ప్రాతర్ వృద్ధి నిమిత్తకం, ఇతి శాతా తపోక్తేః. అత్ర ప్రాతః శబ్దః సార్ధ ప్రహరపరః, ప్రహరోప్యర్ధ సంయుక్తః ప్రాతరిత్యభిధీయతే, ఇతి గార్గ్యోక్తే రితి పృథ్వీ చంద్రః. ఇదం చ పుత్రజన్మాతిరిక్త విషయం. తదాహాత్రిః -పూర్వాహ్ణే వైభవేద్వృద్ధిః వినాజన్మ నిమిత్తకం, పుత్రజన్మని కుర్వీత శ్రాద్ధం తాత్కాలికం బుధః, ఇతి. ఏతదనియత నిమిత్త పరం. నియతేషు నిమిత్తేషు ప్రాతర్వృద్ధి నిమిత్తకం. తేషామని యతత్వేతు తదానంతర్యమిష్యతే. ఇతి లౌగాక్షి స్మృతేః. ఆధానాంగం, నాందీ శ్రాద్ధం త్వపరాహ్ణే ఏవ. ఆమ శ్రాద్ధంతు పూర్వాహ్ణే సిద్ధాన్నేనతు మధ్యతః, పార్వణం చాపరాహ్ణే తు వృద్ధిశ్రాద్ధం తథాగ్నికం, ఇతి. నిర్ణయామృతే గాలవోక్తేః. నాందీముఖాహ్వాయం ప్రాతరాగ్నికం త్వపరాహ్ణతః, ఇతి విష్ణూక్తేశ్చ ఇదం చ మాతృపితృ మాతామహాది క్రమేణ నవదైవత్యం కార్యం. తత్ర మాతామహాః సపత్నీకాః వృద్ధప్రమాతా మహప్రమాతామహ మాతామహానాం సపత్నీకానాం, ఇతి పృథ్వీచంద్రోదయే గారుడే గద్యరూపేణ పారాత్.

అను॥ ఇక్కడ మూడు శ్రాద్ధములు అని ఆతడే అన్నాడు ఇట్లా - మాతృశ్రాద్ధము మొదట పితరుల శ్రాద్ధము తరువాత, ఆ పిదప మాతామహుల శ్రాద్ధము వృద్ధి యందు మూడు శ్రాద్ధములు చెప్పారు,అని. ఆ కాలాన్ని పృథ్వీ చంద్రోదయమందు గార్గ్యుడిట్లా చెప్పాడు - మాతృశ్రాద్ధము పూర్వమందుండాలి (ముందురోజు) పితరులది ఆ తరువాత రోజు ఆ పిదప మాతామహులది, మూడవరోజున వృద్ధియందు మూడు శ్రాద్ధములు అని. శక్తి లేనప్పుడు వృద్ధ శాతాతపుడిట్లా - పూర్వాహ్ణమందు మాతృశ్రాద్ధము, మధ్యాహ్నమందు పైతృకము, ఆ పిదప మాతామహులది అని వృద్ధియందు శ్రాద్ధ త్రయము, అని. ఇందుకు కూడా శక్తి లేకపోతే ఆతడే ఇట్లా - వేరువేరు దినములలో చేయటానికి శక్తి లేకపోతే ఒక దినమందే పూర్వ వాసరమందు మూడు శ్రాద్ధములు ఆచరించాలి, వైశ్వదేవమును తాంత్రికంగా చేయాలి,అని. వృద్ధ మనువు కూడా - బుధుడు నాందీ శ్రాద్ధ త్రయము ఆచరించటానికి భిన్న కాలములు లభించని పక్షంలో ముందురోజు పూర్వాహ్ణమందు మాతృ పూర్వకముగా ఆచరించాలి,అని. ఇక్కడ అనేకమంది అభిప్రాయంలో ముందురోజు అని, కొద్దిమంది అభిప్రాయంలో ఆరోజు,అని గృహ్యా పరిశిష్టం నుండి నిర్ణయమును గ్రహించాలి. అది కూడా ఉదయమే. పార్వణము అపరాహ్ణమందు, వృద్ధి నిమిత్తక శ్రాద్ధము ప్రాతః కాలమందు,అని శాతాతపోక్తి. ప్రాతః కాలమనగా ప్రహరపై అర్ధ ప్రహర (ప్రహరన్నర)కాలము.ప్రహరతో ఇంకా అర్ధ ప్రహరను కలిగి ఉంటే (ప్రహరన్నర) ప్రాతః కాలము అని అంటారు, అని గార్గ్యోక్తి అని పృథ్వీచంద్రుడు. ఇది కూడా పుత్రజన్మ కన్న ఇతరమైన విషయకము. దానినే అత్రి ఇట్లా - జన్మ నిమిత్తకం లేకుండా పూర్వాహ్ణ

మందే వృద్ధి శ్రాద్ధము చేయాలి. పుత్ర జన్మయందైతే బుధుడు తాత్కాలిక శ్రాద్ధాన్ని చేయాలి, అని. ఇది అనియతనిమిత్త పరమైనది. నియతమైన నిమిత్తములందు ప్రాతఃకాలము వృద్ధి శ్రాద్ధమునకు నిమిత్తకము. అవి అనియతంగా ఉంటే ఆ వృద్ధి శ్రాద్ధము అనంతర కాలమందు చేయాలి,అని, లౌగాక్షిస్మృతి. ఆధానాంగమైన నాందీ శ్రాద్ధాన్ని అపరాహ్ణమందే చేయాలి. ఆమ శ్రాద్ధమైతే పూర్వాహ్ణమందు, సిద్ధాన్నంతోనైతే మధ్యాహ్నమందు, పార్వణమైతే అపరాహ్ణమందు, ఆగ్నికమైన వృద్ధి శ్రాద్ధం కూడా అపరాహ్ణమందే, అని నిర్ణయామృతమందు గాలవోక్తి. నాందీ ముఖమనే దాన్ని ప్రాతఃకాలంలో ఆగ్నికమైతే అపరాహ్ణం నుండి, అని విష్ణూక్తి కూడా. ఇది కూడా మాతృ,పితృ, మాతామహాదుల క్రమంలో నవదైవత్యంగా చేయాలి. అక్కడ మాతా మహులు సపత్నీకులుగా చేయాలి. వృద్ధ ప్రమాతామహ, ప్రమాతామహ, మాతామహాలకు సపత్నీకులకు,అని పృథ్వీ చంద్రోదయమందు, గరుడ పురాణ వచనం గద్య రూపంగా పారం ఉన్నందువల్ల తెలుస్తోంది. (మాత, పితామహి, ప్రపితామహీ, పితృ, పితామహ, ప్రపితామహులు మాతామహ, ప్రమాతామహ, ప్రప్రమాతా మహాః ఇది నవదైవత్యం).

మూ॥ హేమాద్రౌశంఖః – నాందీముఖే సత్యవసూ సంకీర్త్యౌ వైశ్వదేవికే, వృద్ధపరాశరః – నాందీముఖేభ్యో దేవేభ్యః ప్రదక్షిణ కుశాసనం, పితృభ్యః తన్ముఖేభ్యశ్చ ప్రదక్షిణమితి స్మృతిః. యత్తు వృద్ధవసిష్ఠః – నాందీముఖే వివాహే చ ప్రపితామహ పూర్వకం, నామ సంకీర్తయే ద్విద్వాన్ అన్యత్ర పితృపూర్వకం. యచ్చ స్మృత్యర్థసారే – వృద్ధముఖ్యాస్తు పితరో వృద్ధి శ్రాద్ధేషు భుంజతే, ఇతి. యచ్చగారుడే – వ్యుత్క్రమ ప్రతిపాదనం తచ్ఛా ఖాంతర విషయం, పితృభ్యః పితామహేభ్యః ప్రపితామహేభ్యః, ఇతి బహ్వృచ పరిశిష్టే కాత్యాయనేన చానులోమ్యామ్నానాత్. పృథ్వీ చంద్రోదయేఽప్యేవం. యత్తు కేచిద్వృద్ధి పదం పిత్రాదిషు ప్రయుజ్యంతే తన్న, అనస్మత్ వృద్ధ శబ్దానాం అరూపాణాం అగోత్రిణాం, అనామ్నామతి లాద్యైశ్చ నాందీ శ్రాద్ధంతు సవ్యవత్, ఇతి పృథ్వీచంద్రోదయే సంగ్రహోక్తేః న చ నిషేధాదేవ విధిః కల్పత ఇతి వాచ్యం, ప్రోష్ఠ పదీ శ్రాద్ధే ప్రపితా మహాత్పరేషాం వృద్ధ పిత్రాదీనాం దేవతాత్వాన్నాందీ శ్రాద్ధ త్వసామ్యేనే హాపి తత్ప్రాప్తౌ నిషేధాత్. గోత్ర నామాది నిషేధస్తు – శుభార్థీ ప్రథమాంతేన వృద్ధౌ సంకల్ప మాచరేత్, ఇత్యుపక్రమ్య, అన స్మద్వృద్ధ శబ్దానాం ఇత్యుక్తేః సంకల్పః శ్రాద్ధపరః, సపిండకేతు సర్వంభవతి, ఇతి ప్రయోగ పారిజాతాత్. గోత్ర నామభి రామంత్ర్య పితృభ్యోఽర్ఘ్యం ప్రదాపయేత్, ఇతి ఛందోగపరిశిష్టే తద్విధానాత్. యత్తు బ్రాహ్మే – పితాపితామహశ్చైవ తథైవ ప్రపితామహః, త్రయోహ్యశ్రు, ముఖాహ్యేతే పితరః పరికీర్తితాః. తేభ్యః పూర్వతరాయేచ ప్రజావంతః సుఖైధితాః, తేతు నాందీముఖా, నాందీ సమృద్ధిరితి కథ్యతే,ఇతి. యచ్చ మార్కండేయపురాణే – యేస్యుః పితా మహాదూర్ధ్వం తేతు నాందీముఖాః స్మృతాః, ఇతి, తత్ జీవత్పిత్రాది త్రికకర్తృక వృద్ధిశ్రాద్ధవిషయం. తేన తస్యేదమా వశ్యకం. యత్తు విష్ణుః – పితరి పితా మహేప్రపితామహే చ జీవతి నైవ కుర్యాత్,ఇతి. తద్దర్శాది విషయమితి కల్పతరుః. మదనపారిజాతేఽప్యేవం. హేమాద్రిస్తు – నాందీ ముఖానాం శ్రాద్ధంతు కన్యారాశి గతేరవౌ,

పౌర్ణమాస్యాం తుకర్తవ్యం వరాహ వచనం యథా. ఇతి ప్రోష్ఠ పదీ శ్రాద్ధైక వాక్యత్వాత్ తత్రైవ పూర్వేషాం దేవతాత్వ మిత్యాహ. అత్ర సత్యవసూ విశ్వేదేవా విత్యుక్తం ప్రాక్. యత్తు శాతాతపః - మాతృశ్రాద్ధంతు యుగ్మైః స్యాత్ అదైవం ప్రాజ్ ముఖైః పృథక్, ఇతి తద్భిన్న ప్రయోగ మాతృశ్రాద్ధ పరం. యచ్చ మార్కండేయ పురాణే - విశ్వే దేవ విహీనంతు కేచిదిచ్ఛంతి మానవాః, ఇతి తద్భిన్న ప్రయోగ మాతృ శ్రాద్ధ భిన్న శ్రాద్ధ ద్వయే విశ్వేదేవ వికల్పార్థం. ప్రయోగైక్యేతు దేవ నియమః ఇతి హేమాద్రిః ఏతచ్చ మాతృ పూజా పూర్వకం కార్యం. అకృత్వా మాతృకాయాగం యః శ్రాద్ధే పరివేషయేత్,తస్య క్రోధ సమావిష్టా హింసా మిచ్ఛంతి మాతరః,ఇతి శాతా తపోక్తేః. కౌర్మేఽపి - పుష్పై ర్ధూపైః సనైవేద్యైః గంధాద్యైః భూషణైరపి, పూజయిత్వా మాతృగణం కుర్యాచ్ఛ్రాద్ధ త్రయం బుధః. **ఛందోగ పరిశిష్టే** - కర్మాదిషు తు సర్వేషు మాతరః సగణాధిపాః, పూజనీయాః ప్రయత్నేన పూజితాః పూజయంతితాః ప్రతిమాసు చ శుద్ధా సులిఖితా వాపటాదిషు, అపి వాక్షత పుంజేషు నైవేద్యైశ్చ పృథగ్విధైః. కుడ్యలగ్నాం వసోర్ధారాం సప్తధారాం ఘృతేన, తు, కారయేత్పం చ, ధారాం వానాతి నీచాం నచోచ్ఛ్రితాం. ఆయుష్యాణి చ శాంత్యర్థం జప్త్వా తత్ర సమాహితః , షడ్భ్యః పితృభ్యస్త దను శ్రాద్ధ దాన ముపక్రమేత్. అత్ర సర్వేష్వితి గ్రహణాత్ గ్రహయజ్ఞ తద్వికారేష్వపి నిత్యం శ్రాద్ధం. నానిష్ట్వాతు పితౄన్ శ్రాద్ధే కర్మ కించిత్స మాచరేత్, ఇతి శాతాతపోక్తేశ్చ. ఇయం చ వసోర్ధారా తచ్ఛాఖీయానాం నియతా, అన్యేషాం త్వనియతా, బహ్వల్పం వా స్వగృహ్యోక్త మిత్యుక్తేః. కరణే త్వభ్యుదయః, యన్నామ్నాతం స్వశాఖాయా మిత్యుక్తేః. ఆయుష్యాణి, ఆనోభద్రాః ఇత్యాదీని. షడ్భ్య ఇతి మాత్రాది త్రికోప లక్షణ మితి పృథ్వీ చంద్రః. ఛందోగానాం షడ్ దైవత్య మన్యేషాం నవ దైవత్యమిత్యా శార్కః. మమతు మతం కోకిల మతాను సారిణాం మాతృ మాతామహ ప్రమాతా మహో ఇతి మాత్రా సహైవ మాతా మహ శ్రాద్ధకరణాత్ తద్విషయ మిదం షడ్భ్యః ఇతి.

అను॥ హేమాద్రి యందు శంఖుడిట్లా - నాందీముఖమందు సత్య, వసు అను ఇద్దరు విశ్వేదేవులుగా చెప్పబడ్డారు,అని. వృద్ధపరాశరుడిట్లా - నాందీముఖులైన దేవతలకు ప్రదక్షిణ క్రమంగాకుశాసన మివ్వాలి. తన్ముఖులైన పితరులకు కూడా ప్రదక్షిణ కుశాసనము లని చెప్పారు,అని. వృద్ధ వసిష్ఠుడిట్లా - నాందీముఖమందు, వివాహమందు ప్రపితా మహునితో ఆరంభమై పేర్లు చెప్పాలి. విద్వాంసుడు ఇతరత్ర పితృపూర్వకంగా పేర్లు చెప్పాలి, అని ఏది అన్నాడో, స్మృత్యర్థసారమందిట్లా - వృద్ధిశ్రాద్ధమందు వృద్ధముఖ్యులైన పితరులు భుజిస్తారు, అని ఏది అన్నాడో గరుడపురాణమందిట్లా - విపరీత క్రమంలో ప్రతిపాదనం, అని ఏది ఉందో, ఇవి, శాఖాంతర విషయకములు, పితరులకు, పితామహులకు, ప్రపితామహులకు, అని బహ్వృచ పరిశిష్టమందు కాత్యాయనుడు, అనులోమంగా పఠించాడు. పృథ్వీ చంద్రోదయ మందు కూడా అట్లాగే ఉంది. కొందరు వృద్ధి పదాన్ని పిత్రాదులందు ప్రయోగిస్తారు,అని ఏది అన్నారో, అది అట్లా కాదు. అస్మత్, వృద్ధ శబ్దములు లేనిచోట, రూప, గోత్ర, నామములు లేని వారికి నాందీ శ్రాద్ధమును నువ్వులు లేకుండా సవ్యంవలె చేయాలి అని పృథ్వీ చంద్రోదయ మందు సంగ్రహోక్తి. నిషేధంవల్లనే విధి వచ్చిందని

భావించరాదు. ప్రోష్ఠ పద శ్రాద్ధమందు (భాద్రపద పూర్ణిమ) ప్రపితామహులకన్న పరులైన వృద్ధ పిత్రాదులు దేవతలైనందువల్ల నాందీ శ్రాద్ధత్వం వచ్చినట్లు ఆసామ్యంతో ఇక్కడ కూడా అది వస్తే నిషేధించారు. గోత్ర నామాదుల నిషేధమైతే – శుభం కోరేవాడు, ప్రథమా విభక్తి అంతంగా వృద్ధియందు సంకల్పం చేయాలి అని ఆరంభించి, అస్మత్, వృద్ధ ఈ శబ్దములు లేనిచోట అని చెప్పినందువల్ల సంకల్పము శ్రాద్ధపరమైనది. సపిండమందైతే సర్వం ఔతుంది, అని ప్రయోగ పారిజాతంవల్ల తెలుస్తోంది. గోత్రనామములు చెప్పి పితరులకు అర్ఘ్యమివ్వాలి,అని ఛందోగ పరిశిష్టమందు దాన్ని విధించారు (సపిండం). బ్రాహ్మమందిట్లా – పిత, పితామహ, ప్రపితామహులు వీరు ముగ్గురు అశ్రుముఖులై పితరులని చెప్పబడ్డారు. వారికన్న ముందున్న వారు, సంతానవంతులు, సుఖవృద్ధికలవారు, వారు నాందీముఖులు. నాంది అనగా సమృద్ధి అని అన్నారు, అని ఏది అన్నారో, మార్కండేయపురాణమందిట్లా – పితామహులకన్న ముందున్న వారు నాందీ ముఖులనబడ్డారు,అని ఏమాట ఉందో అది, పిత్రాదులు ముగ్గురు జీవించి ఉండి, వారు చేసే వృద్ధి శ్రాద్ధ విషయము. అందువల్ల అతనికి ఇది అవసరమైనది. విష్ణువిట్లా – తండ్రి, పితామహ, ప్రపితామహులు బ్రతికుండగా, ఆచరించరాదు,అని ఏదన్నాడో అది దర్శాది విషయమని కల్పతరువులో ఉంది. మదనపారిజాతమందు కూడా ఇట్లాగే ఉంది. హేమాద్రి ఐతే – నాందీ ముఖులకు శ్రాద్ధమైతే సూర్యుడు కన్యరాశి యందుండగా పౌర్ణమాసి యందు చేయాలని వరాహ పురాణ వచనము, అని ఇది భాద్రపద పూర్ణిమ శ్రాద్ధంతో ఏక వాక్యం ఐనందువల్ల అక్కడే పూర్వులకు దేవతాత్వము అని హేమాద్రి అన్నాడు. ఇక్కడ సత్య, వసు, వీరిద్దరు విశ్వేదేవులని ముందే చెప్పాము. శాతాతపుడిట్లా – మాతృశ్రాద్ధమైతే, ఇద్దరు బ్రాహ్మణులతో (సరిసంఖ్య) విశ్వే దేవతలు లేకుండ పూర్వాభి ముఖంగా బ్రాహ్మణులతో, విడిగా ఆచరించాలని అన్నారో, అది భిన్న ప్రయోగం కలిగిన మాతృ శ్రాద్ధ పరము. మార్కండేయ పురాణమందిట్లా – విశ్వేదేవులు లేకుండా కొందరు మనుజులు ఇష్టపడుతారు, అని ఏదన్నాడో అది భిన్న ప్రయోగం గల మాతృశ్రాద్ధంకన్న భిన్నమైన శ్రాద్ధద్వయమందు, విశ్వేదేవుల వికల్పం కొరకు,అని. ప్రయోగ ఐక్యమందైతే దేవ నియమము, అని హేమాద్రి. దీనిని మాతృపూజా పూర్వకముగా ఆచరించాలి. మాతృ యాగం చేయకుండా ఎవడు శ్రాద్ధంలో పరివేషణ చేస్తాడో. వానిపై కోపం గలవారై మాతలు, వానిని హింసించటానికి ఇష్టపడుతారు, అని శాతాతపోక్తి. కూర్మపురాణమందుకూడా – పుష్పములతో, ధూపములతో, నైవేద్యములతో, గంధాదులతో, భూషణములతో మాతృ గణమును పూజించి, బుధుడు శ్రాద్ధ త్రయాన్ని ఆచరించాలి,అని. ఛందోగ పరిశిష్టమందిట్లా – అన్ని కర్మలలోను, గణాధిపులతో కూడిన మాతలను పూజించాలి. ప్రయత్నంగా వారు పూజింపబడితే, వారు గౌరవిస్తారు మనల్ని అని. శుద్ధ ప్రతిమల యందో, బట్టలపై చిత్రములు గీసో, అక్షతల యందు వ్రాసో, రకరకాల నైవేద్యములతో పూజించాలి, అని అన్నారు. గోడపై అంత పైకి కాకుండా అంత క్రిందికి

కూడా కాకుండా నీటి ధారను పోసి, ఏడు ధారలుగానో ఐదు ధారలుగానో నేతితో పోయాలి,అని. అక్కడ సావధానచిత్తుడై శాంతి కొరకు ఆయుష్య మంత్రములను జపించి ఆ పిదప ఆరుగురు పితరుల కొరకు శ్రాద్ధ దానమారంభించాలి. ఇక్కడ, అన్నిచోట్ల అని చెప్పినందువల్ల గ్రహ యజ్ఞములందు, దాని వికారములందును శ్రాద్ధము నిత్యము. శ్రాద్ధమందు పితరులను పూజించకుండా, ఏ పనీ చేయరాదు, అని శాతాతపోక్తి కూడా. ఈ వసుధార, ఆశాఖీయులకు మాత్రమే తప్పనిసరి, ఇతరులకు తప్పని సరికాదు. అధికం కాని అల్పంకాని కర్మ తమ గృహ్యసూత్రమందు చెప్పిందే ఆచరించాలి,అని చెప్పారు కనుక చేస్తే అభ్యుదయమే, తమశాఖ యందు చెప్పనిదేదైతే ఉందో, అని చెప్పారు కనుక (ఆచరించరాదు). ఆయుష్యమంత్రములు, ఆనోభద్రాః, అని మొదలగునవి. ఆరుగురు పితరులు అనేది మాత్రాదులు ముగ్గురికి సూచకమని పృథ్వీ చంద్రుడన్నాడు. ఛందోగులకు ఆరుగురు దేవతలు, ఇతరులకు తొమ్మిది మంది దేవతలు, అని ఆశార్కుడన్నాడు. నా అభిప్రాయమైతే - కోకిల మతానుసారులకైతే, మాత, మాతా మహ, ప్రమాతా మహ అని తల్లులతోనే మాతామహ శ్రాద్ధం చేస్తాం కనుక వారి విషయమే ఇతి షడ్భ్యః అనే మాట అని.

మూ॥ **మాతరస్త్రత్రైవోక్తాః** - గౌరీపద్మా శచీమేధా సావిత్రీ విజయా జయా దేవసేనా **స్వధా స్వాహా మాతరోలోక మాతరః ధృతిః (హృష్టిః) పుష్టి స్తథా తుష్టిః ఆత్మదేవతయాసహ, గణేశేనాధి కాహ్యేతా వృద్ధౌ పూజ్యాశ్చతుర్దశ. మాతరో లోకమాతర ఇతి సర్వవిశేషణం. తేన చతుర్దశత్వం. యదాషోడశేతి పారస్తదాదేవతాంతరం. చంద్రికాయాం చతుర్వింశతి మతేత్వన్యా ఉక్తాః. తిస్రః పూజ్యాః పితుః పక్షేతిస్రో మాతామహేతథా ఇత్యేతా మాతరః ప్రోక్తాః పితుః మాతుః స్వసాష్టమీ. ఆసాంజీవనే ప్రత్యక్షం పూజనం. మృతానాం త్వక్షత పుంజేష్వితి హేమాద్రిః. బ్రహ్మణ్యాద్యాః తథా సప్త దుర్గాక్షేత్ర గణాధిపాన్, వృద్ధ్యాదౌ పూజయిత్వాతు పశ్చాన్నాందీ ముఖాన్ పితౄన్, మాతృపూర్వాన్ పితౄన్ పూజ్య తతో మాతామహానపి, మాతామహీస్తతః కేచిత్ యుగ్మా భోజ్యాద్విజాతయః, ఇతి. అత్ర ద్వాదశ దైవతస్య దేశాచారతో వ్యవస్థా. బ్రహ్మణ్యాద్యాః - బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీతథా, వారాహీ చ తథేంద్రాణీ చాముండా సప్తమాతరః, ఇత్య పరార్కే ఉక్తాఃఅత్ర చౌలాదీనాం యౌగపద్యే తంత్రతోక్తా ఛందోగ పరిశిష్టే - గణశః క్రియ మాణానాం మాతృభ్యః పూజనం సకృత్, సకృదేవభవేచ్ఛ్రాద్ధ మాదౌ, నపృథగాదిషు. మాతృభ్యః ఇతి షష్ఠ్యర్థే చతుర్థీ. గణశః ఏకానేక పుత్రాణాం సంస్కారే ష్వేక దినే ఏకదేశ కాలకర్త్రైక్యాదిత్యర్థః తథా - అసకృద్యాని కర్మాణి క్రియేరన్ కర్మకారిభిః, ప్రతి ప్రయోగం నైవస్యుః మాతరః సగణాధిపాః . కర్మా వృత్తావపి కుత్ర శ్రాద్ధం కార్యం కుత్రనేత్యుక్తం తత్రైవ - ఆధాన హోమయోశ్చైవ వైశ్వదేవేతథైవచ, బలికర్మణి దర్శేచ పౌర్ణమాసే తథైవచ, నవయజ్ఞేచ యజ్ఞ జ్ఞావదంత్యేవం మనీక్షిణః ఏకమేవ భవేచ్ఛ్రాద్ధం ఏతేషున పృథక్ పృథక్. ఏషు ప్రతి ప్రయోగం నావర్తతే కింత్వాదౌ, ఏతద్భిన్నే సోమ యాగాదౌతు ప్రతి ప్రయోగ మావర్తతత ఏవశ్రాద్ధ మిత్యర్థః. క్వచిదాదావపి నిషేధ మాహ**

స ఏవ – నాష్ట కాసుభవేచ్ఛ్రాద్ధం న శ్రాద్ధే శ్రాద్ధ మిష్యతే, న సోష్యంతీజాత కర్మ ప్రోషితాగత కర్మసు వివాహాదిఃకర్మగణోయ ఉక్తో గర్భాధానం శుశ్రుమో యస్యచాంతే, వివాహే దావేక మేవాత్ర కుర్యాచ్ఛ్రాద్ధం నాదౌ కర్మణః కర్మణః స్యాత్. సోష్యన్త్యా ఆసన్న ప్రసవాయాః, సోష్యంతీ మభ్యుక్ష్య ఇత్యుక్తం కర్మ. కాత్యాయనోక్తస్య శ్రాద్ధస్య పాక ప్రాధాన్యాత్తస్య – జాతశ్రాద్ధే నదద్యాత్తు పక్వాన్నం బ్రాహ్మణేష్వపి, ఇతి నిషేధాన్న జాతకర్మణి నాందీ శ్రాద్ధమిత్యా శార్కః ఆమాన్నేన వా కార్యమిత్యపితే నైవోక్తం. గౌడాస్తు జాత కర్మణ్యేవ నిషేధః. పుత్రజన్మ నిమిత్తకంతు కార్యమేవ. జన్మన్య థోపనయనే, ఇత్యుక్తేః నైమిత్తిక మథో వక్ష్యే శ్రాద్ధమభ్యుదయాత్మకం, పుత్రజన్మని తత్కార్యం జాతకర్మ సమంనరైః . ఇతి మార్కండేయపురాణాచ్చేత్యాహుః. హారలతాయాం శ్రాద్ధ వివేకే చైవం. ఏతేన జాతకర్మణి కాలాంతరే శ్రాద్ధ నిషేధో న పుత్ర జన్మదినే ఇతి వాచస్పతి మతం పరాస్తం. అథ నిషేకకాలే, ఇతి వచనాత్ గర్భాధానే ననిషేధః నిషేక కాలే సోమేచ సీమంతోన్నయనే తథా జ్ఞేయం పుంసవనే శ్రాద్ధం కర్మాంగం విధి వత్కృతం ఇతి పారస్కరః. ప్రోషితేతి ప్రోష్యేత్య గృహా నుపతిష్ఠతే పుత్రం దృష్ట్వా జపతి, ఇతి విహితం కర్మ. వివాహాదిః గర్భాధానాంతో యోగృహ ప్రవేశధృతి హోమ చతుర్థీ కర్మాదిః కర్మ సమూహ ఉక్తః, సూత్రకారేణ, తత్రాపి ప్రతికర్మనేత్యర్థః. అన్యేఽపి హలాభియో గాదయోఽపవాద విషయాస్త్రైవజ్ఞేయాః. అప్రచారాన్నోచ్యతే. అథాత్రాధికారిణః – విష్ణు పురాణే – జాతస్య జాతకర్మాది క్రియా కాండమ శేషతః, పితాపుత్రస్య కుర్వీత శ్రాద్ధం చాభ్యుదయాత్మకం. అత్రకేచిత్ జీవత్పితుః సాగ్నే రేవ వృద్ధి శ్రాద్ధేఽధికారః నతు నిరగ్నేః, న జీవత్పితృకః కుర్యాచ్ఛ్రాద్ధ మగ్నిమృతే ద్విజః, యేభ్య ఏవ పితాదద్యాత్తేభ్యః కుర్వీత సాగ్నికః. పితా మహేష్యేవ మేవకుర్యాజ్జీవతి సాగ్నికః, సాగ్నికోఽపి న కుర్వీత జీవతి ప్రపితామహే, ఇతి చంద్రికాయాం సుమంతూక్తే రిత్యాహుః. ప్రయోగపారిజాతేఽప్యనాహితాగ్నిః న కుర్యాదితి యద్ వ్యాఖ్యాతం, తన్న, అనగ్నికోఽపి కుర్వీత జన్మాదౌ వృద్ధికర్మణి యేభ్య ఏవపితా దద్యాత్ తానేవోద్దిశ్య తర్పయేత్, ఇతి హారీతోక్తేః. సామంత వంతు వృద్ధి శ్రాద్ధభిన్న శ్రాద్ధ పరమిత్యుక్తం మదనరత్నే. శ్రాద్ధపదం పిండ పితృయజ్ఞ పరమితి పృథ్వీ చంద్రః. నిర్ణయామృతేతు హారీతీయే అనగ్నికో అనాహితాగ్ని రభి ప్రేతః. పూర్వవచనేతు సాగ్నిః స్మార్తాగ్నిశ్చోచ్యతే. తేనో భయాగ్నిహీనస్య నేత్యుక్తం. తన్న, పూర్వోక్త దిశాగతి సంభవే అగ్నిప్రదస్య స్మార్తాగ్ని పరత్వే మానాభావాత్. వక్ష్యమాణ నిత్యానిత్య సంయోగ విరోధాత్.

అను॥ మాతలు అక్కడే చెప్పబడ్డారు – గౌరీ, పద్మ, శచి, మేధ, సావిత్రి, విజయ, జయ, దేవసేన, స్వధ, స్వాహామాతలు, లోకమాతలు. ధృతి (హృష్టి) పుష్టి, తుష్టి, ఆత్మదేవత ఆ పైన గణేశుడు (గణేశుడుకాక) పదునల్గురు మాతలు వృద్ధిశ్రాద్ధమందు పూజించ తగినవారు అని. మాతలు, లోకమాతలు అనేమాట అందరికి విశేషణము. అందువల్ల పదునాల్గు రకాలు. ఒకవేళ పదహారుగురు అనే పాఠం ఉంటే అప్పుడు ఇతర దేవతలు మాతర, లోకమాతర శబ్దాలు.చంద్రిక యందు చతుర్వింశతి మత మందు మాత్రం వేరేవారు చెప్పబడ్డారు. పితరుల పక్షం నుండి ముగ్గురు, మాతామహ పక్షం నుండి ముగ్గురు,

తండ్రి తోడ బుట్టినది, తల్లి తోడ బుట్టినది, అని ఈ ఎనిమిది మంది మాతలు, పూజించతగినవారు అని చెప్పబడ్డారు,అని. వీరు బ్రతికి ఉంటే వీరికి ప్రత్యక్షంగా పూజ చేయాలి. మరణిస్తే అక్షత పుంజమందు పూజ చేయాలి,అని హేమాద్రి అన్నాడు. బ్రహ్మీణీ మొదలగు మాతలు ఏడుగురు దుర్గ, క్షేత్రపాలుడు, గణాధిపుడు వీరిని వృద్ధి శ్రాద్ధ మందు పూజించి ఆ పిదప నాందీముఖులైన పితరుల పూజించి, మాతృపూర్వకంగా పితరుల పూజించి ఆ పిదప మాతామహులను ముగ్గురిని పూజించి, ఆ పిదప మాతమహి (స్త్రీలను) లను పూజించాలి. కొందరు ఇద్దరు బ్రాహ్మణుల భోజనాన్ని ఇష్టపడతారు,అని. ఇక్కడ పన్నెండు దేవతల పూజ శ్రాద్ధమందు దేశాచారాన్ననుసరించి నిర్ణయము. బ్రహ్మీణీ మొదలగువారు - బ్రాహ్మీ, మహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, ఇంద్రాణీ, చాముండ వీరు ఏడుగురు మాతలు, అని అపరార్కమందు చెప్పబడ్డారు. ఇక్కడ చౌలాదులు ఒకేసారి కలిసివస్తే ఛందోగ పరిశిష్టమందు తంత్రంగా అని చెప్పబడిందిట్లా - ఒకేరోజు, ఒక పుత్రునకో, అనేక పుత్రులకో నామకరణ అన్న ప్రాశనాది సంస్కారములు ఒకేసారి (కాలంలో) చేయవలసివస్తే మాతల పూజనము ఒకేసారి చేయాలి, వృద్ధి శ్రాద్ధము కూడా తొలుతనే ఒకసారి చేయాలి విడివిడిగా కాదు, అది తంత్రంగా,అని. మాతల కొరకు అనే చతుర్థి విభక్తి షష్ఠి విభక్తి అర్థంలో వాడబడింది. ఒకేసారి ఒకడు లేదా అనేక మంది పుత్రులకు సంస్కారములు చేసే సందర్భమందు ఒక దినమందు ఏకదేశం మాత్రమే జరుగుతుంది. స్థలము కాలము, కర్త ఒకటైనందువల్ల అని అర్థము. అట్లాగే - కర్మలు చేసేవారు ఒకేసారి ఏ ఏ పనులు చేస్తారో వానిలో గణాధిపతితో కూడిన మాతలు ప్రతి ప్రయోగ మందు (పూజ ఉండదు) ఉండరు,అని. కర్మ ఆ వృత్తి ఐనా ఎక్కడ శ్రాద్ధం చేయాలి ఎక్కడ కూడదు అనే దాన్ని అక్కడే చెప్పారిట్లా - ఆధానము, హోమము, వైశ్వదేవము, బలికర్మ, దర్శము, పౌర్ణమాసి, నవయజ్ఞము (ఆగ్రయణేష్టి) వీనియందు శ్రాద్ధము ఒకటే ఉంటుంది, విడివిడిగా కాదు,అని యజ్ఞము విషయమెరిగిన బుద్ధిమంతులు ఇట్లా చెప్తారు,అని. వీనిలో ప్రతి ప్రయోగము ఆ వృత్తి కాదు, కాని తొలుతనే ఒకసారి దీనికన్న వేరైన సోమయాగాదులందు మాత్రం ప్రతి ప్రయోగ మందు శ్రాద్ధము ఆ వృత్తి ఔతుంది అని అర్థము. ఒకచోట తొలుత కూడా నిషేధము అని ఆతడే చెప్పాడు ఇట్లా - అష్టకములందు శ్రాద్ధముండదు. ఒక శ్రాద్ధమయ్యాక మరో శ్రాద్ధముండదు, ప్రసవం దగ్గర కొచ్చినప్పుడు జాతకర్మయందు, పరదేశం నుండి వచ్చిన సందర్భంలో చేసే కర్మలందును శ్రాద్ధముండదు,అని. వివాహం మొదలుగా కర్మల సమూహం ఏదైతే చెప్పబడిందో, దేనికి చివర గర్భాధానం అని చెప్పగా వింటున్నామో ఇట్టి వివాహాదు లందు ఒకే శ్రాద్ధాన్ని ఇక్కడ చేయాలి, ప్రతికర్మయొక్క ఆదిలో కాదు. సోష్యన్తి అనగా ప్రసూతి సమీపానికి వచ్చిన స్త్రీ. సోష్యన్తిని (ప్రసవశూలగలదానిని) భర్త జలంతో ప్రోక్షించాలి, అని కర్మను చెప్పారు. కాత్యాయనుడు చెప్పిన శ్రాద్ధము పాక ప్రాధాన్యము గలది. దానిని - జాత శ్రాద్ధమందు పక్వాన్నమును

బ్రాహ్మణుల కివ్వరాదు, అని నిషేధమున్నందువల్ల జాతకర్మయందు నాందీ శ్రాద్ధము లేదు అని ఆశార్కుడన్నాడు. ఆమాన్నముతోనైనా చేయాలని కూడా అతడే చెప్పాడు. గౌడులైతే జాతకర్మయందే నిషేధమన్నారు. పుత్ర జన్మ నిమిత్తకమైనదైతే ఆచరించాలి, జన్మని ఇంకా ఉపనయనమందు చేయాలి అని చెప్పారు. ఇక నైమిత్తికమైన అభ్యుదయాత్మక శ్రాద్ధాన్ని చెప్తాను. పుత్ర జన్మమందు నరులు జాతకర్మతో పాటు దాని నాచరించాలి, అని మార్కండేయ పురాణంవల్ల తెలుస్తోంది అని అన్నారు. హారలత యందు శ్రాద్ధ వివేకమందును ఇట్లాగే ఉంది. దీనితో జాతకర్మయందు, కాలాంతర మందు శ్రాద్ధ నిషేధము పుత్ర జన్మదినమందు కాదు, అని అన్న వాచస్పతి మతము తిరస్కరింపబడింది. ఇక నిషేక కాలమందు,అనే వచనంవల్ల గర్భాధానమందు నిషేధంలేదు. నిషేక కాలము సోమము, సీమంతము, ఉన్నయనము, పుంసవనము, వీనియందు శ్రాద్ధము కర్మాంగముగా, వృద్ధి శ్రాద్ధమువలె చేయాలి,అని గ్రహించాలి. ప్రోషిత, అని దేశాంతరం వెళ్ళి, వచ్చి ఇంటియందున్న భార్య పుత్రాదులను ప్రార్థిస్తాడు. పుత్రుణ్ణి చూసి జపం చేస్తాడు, అని విహితమైన కర్మ ఇది. వివాహము ఆదిగా గర్భాధానాం తము ఏదైతే గృహ ప్రవేశము, ధృతి హోమము, చతుర్థీ కర్మము మొదలగు కర్మ సమూహము చెప్పబడిందో సూత్రకారునితో, అక్కడ కూడా ప్రతికర్మయందు లేదు అని అర్థము. ఇతరమైనవి కూడా హలాభి యోగాదులు అపవాద విషయములు అక్కడే తెలుసుకోవాలి ప్రచారంలో లేవు కనుక చెప్పలేదు. ఇక్కడ అధికారులు – విష్ణుపురాణమందిట్లా – పుట్టినవానికి, జాతకర్మ మొదలుగా క్రియా కాండ మంతా తండ్రి పుత్రునకు చేయాలి. అభ్యుదయాత్మక శ్రాద్ధము చేయాలి, అని. ఇక్కడ కొందరు – తండ్రి బ్రతికి ఉన్న, సాగ్నికుడైన వానికే వృద్ధి శ్రాద్ధమందు అధికారమూ, అగ్ని లేని వానికి కాదు. అగ్నిని (హోత్రం కలవాణ్ణి) వదలి, తండ్రి బ్రతికి ఉన్న బ్రాహ్మణుడు శ్రాద్ధము చేయరాదు. సాగ్నికుడైనవాడు, తండ్రి ఎవరికి శ్రాద్ధం పెడ్తాడో తానూ వారికే శ్రాద్ధం పెట్టాలి. పితామహుడు కూడా బ్రతికి ఉంటే సాగ్నికుడు ఇట్లాగే చేయాలి. ప్రపితా మహుడు బ్రతికుండగా సాగ్నికుడు కూడా చేయరాదు, అని చంద్రికయందు సుమంతూక్తి అని అన్నారు. ప్రయోగ పారిజాతమందు కూడా అనాహితాగ్ని శ్రాద్ధం చేయరాదు అని ఏది వ్యాఖ్యానించారో, అదికాదు. అనగ్నికుడైనా జన్మాదులందు వృద్ధి కర్మలందు చేయాలి. తండ్రి ఎవరికైతే ఇచ్చేవాడో వారికే తాను తర్పణం చేయాలి అని హారీతోక్తి. సుమంతుని వాక్యమైతే వృద్ధి శ్రాద్ధభిన్నమైన శ్రాద్ధపరము అని మదనరత్నమందు చెప్పారు. శ్రాద్ధపదము పిండ పితృ యజ్ఞపరము అని పృథ్వీచంద్రుడన్నాడు. నిర్ణయామృతమందైతే, హారీతుని వచనాన్నను సరించి, అనగ్నికుడనగా అనాహితాగ్ని (ఆధానంలేని) అని అభిప్రాయం అని ఉంది. పూర్వ వచనమందైతే సాగ్ని అనగా శ్రౌత, స్మార్తాగ్నికులు చెప్పబడ్డారు. అందువల్ల ఉభయాగ్ని హీనుడు చేయరాదు అని చెప్పారు అంటే అట్లాకాదు, ముందు చెప్పిన విధంగా (వృద్ధి శ్రాద్ధ భిన్న శ్రాద్ధం) గతి ఉంటే అగ్ని పదమునకు స్మార్తాగ్ని పరం అనటంలో

ప్రమాణం లేదు. చెప్పబోయే నిత్యానిత్య సంయోగమునకు విరోధమౌతుంది కూడా. (జాతకర్మనిత్యం, వృద్ధి అనిత్యం).

మూ॥ పితరోజనకస్యై జ్యాయా వద్వ్రత మనాహితం, సమాహిత వ్రతః పశ్చాత్ స్వాన్ యజేతపితా మహాన్, ఇతి పృథ్వీ చంద్రోదయే యమ వచో విరోధాచ్చ. అపరార్కేఽపి - సమావర్తనే బ్రహ్మచారీ స్వయమేవ నాందీ శ్రాద్ధం కుర్యాత్ ఇత్యాహ. అతః పూర్వమేవ సాధుః. బోపదేవో ప్యేవమాహ. యత్తుమతం జీవత్పితుః పుత్ర నామ కర్మాదౌ న వృద్ధి శ్రాద్ధం, హారీతీయే జన్మాదౌ ఇత్యాది శబ్దేన తత్రాప్తావపి - ఉద్వాహే పుత్ర జననే పిత్ర్యేష్ట్యాం సౌమికే మఖే, తీర్థే బ్రాహ్మణ ఆయాతే షడేతే జీవతః పితుః, ఇతి. మైత్రాయణీయ పరిశిష్టే - ఉద్వాహ ఏవ తస్యోప సంహారాత్. ఏవం యత్ర సుతసంస్కరాది పదం తదప్యుద్వాహాది పరమేవ ఇతి. తన్న, ఉద్వాహ పదస్య స్వవివాహ పరత్వస్యాపి సంభవాత్ పుత్ర వివాహ పరత్వే మానాభావాత్. (నామకర్మణి బాలానాం చూడాకర్మాదికే తథా, ఇత్యాదిభిః నిత్యశ్రాద్ధస్య చౌలాద్యం గత్వావగతౌ నిత్యానిత్య సంయోగ విరోధాచ్చ). అతో జన్మాదావితి సర్వ సంస్కార సంగ్రహః. తథా చ కాత్యాయనః - స్వపితృభ్యః పితాదద్యాత్సుత సంస్కార కర్మసు పిండానోద్వాహ నాత్తేషాం తస్యాభావేతు తత్క్రమాత్. సుతానాం చౌలాది సంస్కారేషు పితా స్వ పితృభ్యః పిండాన్ శ్రాద్ధం, పిండదోంశ హారశ్చైషాం, ఇతి దర్శనాత్ ఉద్వాహనా ద్వివాహ పర్యంతం దద్యాత్. వివాహశ్చ ప్రథమః. నాందీ శ్రాద్ధం పితా కుర్యాదాద్యేపాణి గ్రహేబుధః. అత ఊర్ధ్వం ప్రకుర్వీత స్వయమేవతు నాందికం, ఇతి స్మృతేఃతస్య పితుర భావేతత్క్రమాత్ - అసంస్కృతాస్తు సంస్కార్యా భ్రాతృభిః పూర్వ సంస్కృతైః, ఇతియః కర్తృక్రమ స్తేన క్రమేణ జ్యేష్ఠ భ్రాత్రాదిః దద్యాదితి చంద్రికాదయః. హేమాద్రిస్తు తస్య పితుర భావే యః పితృవ్య మాతులాదిః సంస్కుర్యాత్స తత్క్రమాత్ సంస్కార్యపితృక్రమాద్దద్యాన్నతు స్వపితృభ్య ఇతి వ్యాచఖ్యౌ. సమావర్త నస్యాపి వివాహ ప్రాచీన సుత సంస్కారత్వాత్ పిత్రైవ నాందీ శ్రాద్ధం కుర్యాత్. తదభావే జ్యేష్ఠభ్రాత్రాదిః తదభావే స్వయమేవ కుర్యాత్. ఉపనయనేన కర్మాధికారస్యజాతత్వాత్. ఏవమాద్య వివాహేఽపీతి పృథ్వీచంద్రోదయ చంద్రికాదయః. మదన రత్నే ప్యేవం. యదాతు పితరిసన్యస్తే ప్రోక్షితే పతితేవా ధర్మార్థం తత్పుత్ర మన్యః సంస్కుర్యాత్తదా సంస్కార్యపితుః పితామహాదిభ్యోదద్యాత్. పితరోజనక స్యేజ్యాయా వద్వ్రత మనాహితం, సమాహిత వ్రతః పశ్చాత్ స్వాన్ యజేత పితామహాన్, ఇతి పృథ్వీచంద్రోదయే యమోక్తేః. జీవత్పితృకస్య విశేష మాహ కాత్యాయనః - వృద్ధౌతీర్థే చ సన్యస్తే తాతేచ పతితే తథా, యేభ్య ఏవ పితాదద్యాత్ తేభ్యో దద్యాత్స్వయం సుతః. యత్తు బహ్వృచ పరిశిష్టే - జీవత్పితా సుత సంస్కారేషు మాతృమాతా మహయోః కుర్యాత్ తస్యాం జీవన్త్యాం మతామహస్త్యైవ ఇతి, తత్ తచ్ఛాఖీయానామేవేతి దిక్. స్మృతితత్వాది గౌడ గ్రంథేషు జీవన్మాతృకః పితామహ్యాదిభ్యో వృద్ధౌదద్యాత్, జీవంత మపిదద్యాద్వా ప్రేతాయాన్నోదకే ద్విజః, ఇతి కాత్యాయనోక్తేః. జీవేతస్మిన్ సుతాః కుర్యుః పితామహ్యాః సహైవతు తస్యాం చైవతు జీవంత్యాం తస్యాః శ్వశ్రూవేతి నిశ్చయః, ఇతి హారీతోక్తే శ్చేత్యుక్తం. తస్మిన్ = భర్తరి దాక్షిణాత్యాస్తు పూర్వోక్త స్య సపిండీకరణాది విషయత్వాత్. జీవేత్తుయది వర్గాద్యస్తం వర్గంతు పరిత్యజేత్, ఇతి వచనాత్తద్వర్గస్య లోప ఏవేత్యాహుః. యత్తు చంద్రికాయాం పారస్కరః - నిషేక కాలేసోమేచ సీమంతోన్నయనే

తథా, జ్ఞేయం పుంసవనే శ్రాద్ధం కర్మాంగం వృద్ధి వచ్చతత్, ఇతి. తత్ర గర్భాధానాదౌ కర్మాంగం జాతకర్మాదావుక్తంతు వృద్ధి శ్రాద్ధం పృథగేవ వృద్ధి వదిత్యుక్తేః. గౌద నిబంధే మాత్స్యే - అన్న ప్రాశేచ సీమంతే పుత్రోత్పత్తి నిమిత్తకే, పుంసవేచ నిషేకేచ నవవేశ్మ ప్రవేశనే, దేవవ్రతే జలాదీనాం ప్రతిష్ఠాయాం తథైవచ, తీర్థయాత్రా వృషోత్సర్గే వృద్ధి శ్రాద్ధం ప్రకీర్తితం.

అను॥ ఎంతదాకా పితరుల పూజను తండ్రి చేస్తాడో అంతవరకు సావధానంగా పుత్రుడాచరించాలి, ఆ పిదప తన పితా మహులను పూజించాలి,అని పృథ్వీచంద్రోదయ మందు యముని వాక్కులకు విరోధంగా ఉంది. అపరార్కుడు కూడా - సమావర్తన మందు బ్రహ్మచారి స్వయంగానే నాందీ శ్రాద్ధాన్ని ఆచరించాలి,అని అన్నాడు. అందువల్ల మొదటిదే బాగుంది. బోపదేవుడు కూడా ఇట్లాగే అన్నాడు ఇట్లా తండ్రి బ్రతికున్నవాడు పుత్ర నామకర్మాదులందు వృద్ధి శ్రాద్ధం చేయరాదు, హారీతీయ మందు జన్మాదులందు అనుచోట ఆది శబ్దంవల్ల అది వచ్చినా, ఉద్వాహము, పుత్ర జననము, పితరుల ఇష్టి, సోమయాగం, తీర్థము, బ్రాహ్మణుడు తటస్థించటం, ఈ ఆరింటియందు తండ్రి బ్రతికి ఉన్నవాడు, అని మైత్రాయణీయ పరిశిష్టమందు ఇట్లా వివాహ మందే అది ఉపసంహరింపబడింది అని చెప్పబడింది. ఇట్లా ఎక్కడ సుత సంస్కారాది పద ముందో అది కూడా ఉద్వాహాదిపరమే,అని, ఏది అన్నారో, అది తప్పు ఉద్వాహపదము, తన వివాహ పరకం కూడా కావచ్చు, పుత్ర వివాహ పరకమే అనటంలో ప్రమాణం లేదు. పిల్లలకు నామకర్మయందు, చూడాకర్మాదిక మందు కూడ,అని మొదలగు వచనములతో నిత్యశ్రాద్ధము చౌలాదులకు అంగమని తెలుస్తోంది. అప్పుడు నిత్య అనిత్య కర్మల సంయోగమై విరుద్ధ మౌతుంది కూడా. అందువల్ల జన్మాదులందు అనేది అన్ని సంస్కారములకు సంగ్రహము. కాత్యాయనుడిట్లా - తమ సుతుల సంస్కార కర్మ యందు తండ్రి, తన పితరులకై పిండములను వివాహ పర్యంతము ఇవ్వాలి. తండ్రి లేకపోతే సుతుడు అదే క్రమంలో పితరుల కివ్వాలి,అని. పుత్రుల చౌలాది సంస్కారములందు తండ్రి తన పితరులకు శ్రాద్ధం పెట్టాలి. పిండమును పెట్టేవాడు, వీటి అంశమును హరించువాడు,అని కన్పిస్తు న్నందువల్ల ఉద్వాహనాత్ అనగా వివాహము వరకు,పెట్టాలి. వివాహము కూడా మొదటి వివాహమే. తొలి వివాహమందు బుధుడైన తండ్రి నాంది శ్రాద్ధము చేయాలి, తరువాత కొడుకు (రెండో వివాహంలో) నాందిని స్వయంగానే చేసుకోవాలి, అని స్మృతి. అతనికి తండ్రి లేకపోతే, తండ్రి చేసిన క్రమంలోనే. ముందు సంస్కారం పొందిన భ్రాతలు సంస్కారం కాని వారికి సంస్కారం చేయాలి,అని ఏ కర్తృ క్రమముందో, ఆ క్రమంతో పెద్ద అన్నలు మొదలగు వారు ఇవ్వాలి అని చంద్రికాదు లన్నాయి. హేమాద్రి మాత్రం అతనికి తండ్రి లేకపోతే, పితృవ్యుడు మాతులుడు మొ॥ వారు ఎవరు సంస్కారంచేయాలో, వారు ఆ క్రమంగా అనగా సంస్కరించవలసిన వాని

పితృక్రమంగా ఇవ్వాలి. కాని కర్త తన పితరుల క్రమంగా కాదు అని వ్యాఖ్యానించారు. సమావర్తనం కూడా వివాహం కన్న ముందు సుతునకు చేయవలసిన సంస్కారం కనుక తండ్రే నాందీ శ్రాద్ధం చేయాలి. తండ్రి లేకపోతే జ్యేష్ఠ భ్రాతాదులు, వారూ లేకపోతే స్వయంగానే నాంది ఆచరించాలి. ఉపనయనంతో కర్మాధికారం వచ్చింది కనుక. ఈ రకంగా తొలివివాహమందు కూడా, అని పృథ్వీ చంద్రోదయ, చంద్రికాదులన్నారు. మదనరత్న మందు కూడా ఇట్లాగే ఉంది. ఒకవేళ తండ్రి సంన్యాసం చేస్తే, దేశాంతర గతుడైతేనో, పతితుడైతేనో, ధర్మముకొరకు అతని పుత్రుని మరొకరు సంస్కరించాలి, అప్పుడు సంస్కరించ తగిన వాని పితకు పితామహాదులకు ఇవ్వాలి. ఎంతవరకు తండ్రి పితరుల పూజ చేస్తున్నాడో, అంతవరకు సావధానుడై పుత్రుడు చేయాలి. ఆ తరువాత తన పితామహాదులను పూజించాలి, అని పృథ్వీచంద్రోదయమందు యమోక్తి. తండ్రి బ్రతికి ఉన్న వాని విషయంలో విశేషాన్ని కాత్యాయనుడిట్లా చెప్పాడు - తండ్రి సన్యసిస్తే, పతితుడైనా వృద్ధి శ్రాద్ధమందు తీర్థశ్రాద్ధమందు తండ్రి ఎవరికైతే శ్రాద్ధం పెట్టాడో, కొడుకు వారికే స్వయంగా శ్రాద్ధం పెట్టాలి,అని. బహ్వృచ పరిశిష్టమందు ఇట్లా - తండ్రి బ్రతికి ఉన్నవాడు, తన పుత్రులకు సంస్కారం చేసేప్పుడు మాతృమాతామహుల శ్రాద్ధం చేయాలి. ఆమె బ్రతికి ఉంటే మాతామహునకే అని, అన్నమాట అది ఆశ్వలాయన శాఖ వారికే అని ఇకచాలు. స్మృతితత్వం, మొదలగు గౌడ గ్రంథములందు తల్లి బ్రతికి ఉన్నవాడు, వృద్ధి యందు, పితామహి మొదలగు వారికి ఇవ్వాలి. బ్రతికి ఉన్నా లేదా ప్రేతకైనా అన్నోదకములు ద్విజుడు ఇవ్వాలి, అని కాత్యాయనోక్తి. భర్త బ్రతికి ఉంటే, పితామహితో కూడా పుత్రులు చేస్తారు. ఆమె బ్రతికి ఉంటే, ఆమె అత్త చేస్తుంది,అని నిశ్చయము, అనే హారీతోక్తి వల్లను అని చెప్పారు. తస్మిన్ అనగా భర్త అని. దాక్షిణాత్యులైతే ముందు చెప్పింది స పిండీకరణాదుల విషయమన్నారు. బ్రతికి ఉంటే మొదటి వర్గం, ఆ వర్గాన్ని విడిచిపెట్టాలి,అని చెప్పటం వల్ల ఆ వర్గమునకు లోపమే అని అన్నారు. చంద్రికయందు పారస్కరుడిట్లా - నిషేక కాలం, సోమయాగం, సీమంతము, ఉన్నయనం, పుంసవనము వీనియందు శ్రాద్ధము కర్మాంగము అని గ్రహించాలి. దానిని వృద్ధి శ్రాద్ధంవలె ఆచరించాలి, అని ఏదన్నాడో అక్కడ గర్భాధానాదుల్లో కర్మాంగము. జాతకర్మాదుల్లో ఐతే అన్నారు, వృద్ధి శ్రాద్ధము విడిగానే, వృద్ధిశ్రాద్ధమువలె అని చెప్పారు. గౌడ నిబంధమందు మత్స్యపురాణోక్తి ఇట్లా - అన్నప్రాశనము, సీమంతము, పుత్రోత్పత్తి నిమిత్తకమైనది, పుంసవనం, నిషేకం, నూతన గృహప్రవేశం, దేవవ్రతం, జలాదుల ప్రతిష్ఠ, తీర్థయాత్ర, వృషోత్సర్గము వీనియందు వృద్ధిశ్రాద్ధము ఆచరించాలి,అని.

**మూ॥ అత్రభూత నిమిత్తానాం వృద్ధిత్వం, భావి నిమిత్తానామంగత్వం వృద్ధి శబ్దః తద్ధర్మాతి దేశార్థ ఇతి గౌడాః. అన్యేతు నిషేకాదౌ కర్మాంగ వృద్ధి శ్రాద్ధయోః సముచ్చయ**

మాహుః. నాంది శ్రాద్ధ సంజ్ఞాతూ భయాఽనుగతా. **అథేతి కర్తవ్యతా** -
వృద్ధపరాశరః - మాలత్యాః శత పత్ర్యావా మల్లికాకుబ్జయోరపి, కేతక్యాః పాటలాయా, వాదేయా మాలా, న లోహితాః శ్రాద్ధేమాలా నిషేధ స్యాయ మపవాదః. తథా - సువేష భూషణై స్త్రత్ర సాలంకారై స్తథానరైః, కుంకుమాద్య నులిప్తాంగైః భావ్యం సుబ్రాహ్మణైః సహ. స్త్రియోఽపిస్యుస్తథా భూతా గీతనృత్యాది హర్షితాః. హేమాద్రౌ బ్రహ్మాండే - కుశస్థానేషు దూర్వాః స్యుః మంగళస్యాభి వృద్ధయే, కుశాఅపి వక్ష్యంతే. **ఛందోగపరిశిష్టే** - ప్రాతరామంత్రితాన్ విప్రాన్ యుగ్మానుభయతస్తథా (ఉపవిశ్యకుశాన్ దద్యాత్ ఋజునైవహి పాణినా) ఉభయతః దైవేపిత్ర్యేచ. వైశ్వదేవేద్వౌవిప్రౌ, పిత్రాదీనామేకైకస్య ద్వౌద్వావితి వింశతిః, త్రికేవా ద్వావిత్యష్టౌవిప్రాః. అత్ర విప్రాలాభేస్త్రియోఽపి భోజ్యాః ఇత్యాహ పరార్కే వృద్ధ వసిష్ఠః. మాతృశ్రాద్ధేతు విప్రాణామలాభే పూజయేదపి, పతిపుత్రాన్వితా భవ్యాయోషితోఽష్టౌకులోద్భవాః. మాతృత్రికే, చతస్రఃమాతామహీత్రికే చేత్యష్టా వితి హేమాద్రిః. అత్రపిత్ర్యే ప్రాఙ్ముఖాః విప్రాః పాద్యే పిత్ర్యే చతురస్రం మండల మితి జయంతః. హేమాద్రౌ బ్రాహ్మే - విప్రాన్ ప్రదక్షిణావర్తం ప్రాఙ్ముఖానుప వేశయేత్. ఛందోగ పరిశిష్టే - గోత్ర నామభి రామంత్ర్య పితృభ్యోఽర్ఘ్యం ప్రదాపయేత్, నాత్రాపసవ్యకరణం న పిత్ర్యం తీర్థమిష్యతే. జ్యేష్ఠోత్తర కరాన్యుగ్మాన్ కరాగ్రాగ్ర పవిత్రకాన్, కృత్వార్ఘ్యం సంప్రదాతవ్యం నైకైకస్యాత్ర దీయతే. పిత్రాదేర్ద్వౌ ద్వౌవిప్రౌతయోః దక్షిణ హస్తౌ సంయోజ్య ప్రథమోపవేశిత విప్రకరోపరి తంత్రేణద్వయోరర్ఘ్యం దద్యాదిత్యర్థః. బహ్వృచ కారికాయాంతు - దత్త్వార్ఘ్యాదేకదేశః స్యాదర్ఘ్యదానం ప్రతిద్విజం, ఆవృత్తిరపి మంత్రస్య ప్రతి బ్రాహ్మణ మిష్యతే. ప్రతిద్విజం పృథక్కుర్యాన్ని వీత్యర్ఘ్యాను మంత్రణం, ఇత్యుక్తం. మధుమధ్వితి యస్తత్ర త్రిర్జపోఽశితు మిచ్ఛతాం గాయత్ర్యనంతరం స్తోత్రం మధుమంత్ర వివర్జితం, నచాశ్నన్స్తు జపేదత్ర కదాచిత్పితృ సూక్తకం. తథా - సంపన్నమితి తృప్తాః స్థ ప్రశ్నస్థానే విధీయతే, సుసంపన్నమితి ప్రోక్తే శేషమన్నం నివేదయేత్. అక్షయ్యో దకదానం చ అర్ఘ్యదానవదిష్యతే, షష్ఠ్యైవ నియతం కుర్యాన్న చతుర్థ్యా కదాచన. చంద్రోదయే బ్రాహ్మే - పఠేచ్ఛకుని సూక్తంతు స్వస్తి సూక్తం శుభం తథా, నాందీముఖాన్ పితౄన్ భక్త్యా సాంజలిశ్చ సమాహ్వయేత్. తథా - శాల్యన్నం దధిమధ్వక్తం బదరాణి యవాం స్తథా, మిశ్రీకృత్వాతు చతురః పిండాన్ శ్రీఫల సన్నిభాన్, దద్యాన్నాందీముఖేభ్యశ్చ పితృభ్యో విధి పూర్వకం, ద్రాక్షామలక మూలా నియవాంశ్చ వినియోజయేత్. తాన్యేవ దక్షిణార్థంతు దద్యాద్విప్రేషు సర్వదా. తత్రైవ చతుర్వింశతిమతే - ద్వౌద్వౌ చాభ్యుదయే పిండావేకైకస్మై వినిక్షిపేత్, ఏకం నామ్నాం పరం తూష్ణీం దద్యాత్పిండాన్ పృథక్ పృథక్. వసిష్ఠః - ప్రాఙ్ముఖో దేవతీర్థేన ప్రాక్కూలేషు కుశేషు చ , దత్వాపిండాన్న కుర్వీత పిండ పాత్ర మధోముఖం. నాందీముఖేభ్యః పితృభ్యః స్వాహేతివా పిండదాన మంత్ర ఇతి వృత్తిః. అత్ర పిండాః కృతాకృతా ఇత్యుక్తం తత్రైవ భవిష్యే - పిండ నిర్వపనం కుర్యాన్నవా కుర్యాద్విచక్షణః. వృద్ధి శ్రాద్ధే మహాబాహో కులధర్మానవేక్ష్యతు. ఛాగలేయః అగ్నౌకరణం అర్ఘ్యం వాఽవాహనం చావనేజనం, పిండశ్రాద్ధే ప్రకుర్వీత పిండహీనే వివర్తతే. తేనాత్ర భోజనస్యైవ ప్రధానత్వాత్ యది విప్రస్య వమనం తదా తస్యైవ పార్వణస్య పునరావృత్తి రితి సిద్ధం. **అత్రసంకల్పేవిశేషః** ప్రయోగపారిజాతే సంగ్రహే - శుభార్థీ ప్రథమాంతేన వృద్ధౌ

సంకల్ప మాచరేత్, నషష్ఠ్యాయదివా కుర్యాత్ మహాదోషోఽభి జాయతే. నామగోత్రాది నిషేధోఽ పృత్రైవ నతు సపిండక శ్రాద్ధే ఇతి స ఏవ.

అను॥ ఇక్కడ నిమిత్తం గతించిన వానికైతే వృద్ధి శ్రాద్ధము, భావి నిమిత్తకమైతే అంగత్వము. వృద్ధి శబ్దము ఆధర్మముల అతిదేశం కొరకే అని గౌడులన్నారు. ఇతరులైతే నిషేకాదులందు కర్మాంగము మరియు వృద్ధి శ్రాద్ధములకు సముచ్చయమును చెప్పారు. నాందీ శ్రాద్ధమను సంజ్ఞమాత్రం రెంటిలోనూ అనుసరించేది (వచ్చేది). ఇక చేయాల్సినది. పృథ్వీ చంద్రోదయమందు వృద్ధపరాశరుడిట్లా –మాలతి, తామర, మల్లె, కుబ్జము, మొగిలి, పాటలము వీని మాలలను అర్పించాలి. ఎర్రని మాలలను ఇవ్వరాదు,అని శ్రాద్ధ మందు మాలల నిషేధమునకు ఇది అపవాదము. అట్లాగే – నరులు మంచివేషము, భూషణములు అలంకారములు, కుంకుమాదులు అవయములకు పూసుకొని ఉండాలి. శ్రాద్ధమందు మంచి బ్రాహ్మణులతో సహ ఉండాలి. స్త్రీలు కూడా గీత, నృత్యాదులతో హర్షితులై మగవారిలాగే అలంకరించుకొని ఉండాలి. హేమాద్రియందు బ్రహ్మాండోక్తి ఇట్లా – కుశముల స్థానమందు దూర్వలు ఉండవచ్చును, మంగళాభివృద్ధి కొరకు, అని. కుశలను కూడా చెప్పారు, ముందు. ఛందోగ పరిశిష్ట మందిట్లా – ప్రొద్దున, రెండు వైపుల ఆమంత్రణ చేసిన ఇద్దరేసి విప్రులకు కూర్చోవటానికి, వంగిన వానిని, కుశలను ఋజువుగానే ఇవ్వాలి,అని. ఉభయతః అనగా దైవ పిత్ర్య కార్యములందు వైశ్వదేవులకై ఇద్దరు విప్రులు, పిత్రాదులకు ఒక్కొక్కరికి ఇద్దరేసి చొప్పున ఇరువది మంది ముగ్గురికైతేనో ఇద్దరేసి చొప్పున అని ఎనిమిది మంది విప్రులు. ఇక్కడ విప్రులు లభించని పక్షంలో స్త్రీలను కూడా భుజింప చేయవచ్చు, అని అపరార్కమందు వృద్ధ వసిష్ఠుని వచనముంది. మాతృశ్రాద్ధమందు బ్రాహ్మణులు లభించని పక్షంలో, పతి పుత్రులతోకూడిన, యోగ్యమైన మంచికులములో జన్మించిన ఎనిమిది మంది స్త్రీలను పూజించాలి కూడా, అని. మాతృత్రిక మందైతే నలుగురు మాతామహిత్రికమందైతే కూడా ఎనిమిదిమంది అని హేమాద్రి అన్నాడు. ఇక్కడ పితరుల శ్రాద్ధమందు తూర్పుముఖంగా బ్రాహ్మణులుండాలి. పితరులకు పాద్య మండలము చతురస్రము అని జయంతుడు అన్నాడు. హేమాద్రి యందు బ్రాహ్మోక్తి ఇట్లా – బ్రాహ్మణులను ప్రదక్షిణ క్రమంగా తూర్పుముఖంగా కూర్చోబెట్టాలి,అని. ఛందోగ పరిశిష్ట మందిట్లా – గోత్ర నామములతో ఆ మంత్రణ చేసి (చెప్పి) పితరులకు అర్ఘ్యమివ్వాలి. ఇక్కడ అపసవ్యం లేదు. పితృ తీర్థములేదు, అని. ఇద్దరేసి బ్రాహ్మణులలో పెద్దవాని చేతిని పైన ఉంచి, వారి కరాగ్రములందు పవిత్రల (దర్భ) అగ్ర భాగముంచి అర్ఘ్యమివ్వాలి. ఇక్కడ ఒక్కొక్కరికి విడిగా ఇవ్వరు. పిత్రాదులకై ఇద్దరేసి బ్రాహ్మణులు. వారి కుడిచేతులు కలిపి మొదలు కూర్చోబెట్టిన బ్రాహ్మణుని చేతిమీద తంత్రంగా ఇద్దరికి అర్ఘ్యమివ్వాలి అని అర్థము. బహ్వృచ కారికయందైతే – ఇచ్చే అర్ఘ్యంలో ఒక భాగము అర్ఘ్యదానము ప్రతి బ్రాహ్మణునికివ్వాలి. మంత్రము ఆవృత్తి కూడా ప్రతి బ్రాహ్మణునికి

చెప్పాలి. ప్రతి బ్రాహ్మణునకు విడిగా నివీతిగా అర్ఘ్యాను మంత్రణము చేయాలి,అని చెప్పారు. భోజనం చేయటానికి ఇష్టపడితే, అక్కడ మధుమధు, అనేమంత్రాన్ని మూడుమార్లు జపించాలి. గాయత్రి తరువాత స్తోత్రము, మధు మంత్రము లేకుండా ఉండాలి. వాళ్ళు తింటుండగా, ఎప్పుడూ పితృసూక్తమును అక్కడ చదువరాదు. అట్లాగే – సంపన్నం అని తృప్తాః స్థః అని ప్రశ్నించాలి. సుసంపన్నం అని బ్రాహ్మణులన్నాక శేషమన్నం ఏం చేయాలి అని అడిగితే నివేదించండి అని అంటారు,అని. అక్షయ్య ఉదకదానము, అర్ఘ్యదానం వలె చెప్పబడింది. షష్ఠీ విభక్తినే తప్పక వాడాలి. చతుర్థి విభక్తిని వాడరాదు ఎప్పుడూను. చంద్రోదయ మందు బ్రాహ్మోక్తి ఇట్లా – శకుని సూక్తాన్ని పఠించాలి. అట్లాగే శుభ స్వస్తి సూక్తములు శభకరమైంది. నాందీ ముఖులైన పితరులను భక్తితో చేతులు జోడించి ఆహ్వానించాలి,అని. అట్లాగే – శాల్యన్నము, పెరుగు, తేనె, రేగుపండు, యవలు వీటిని కలగలిపి, మారేడు పండుతో సమానమైన నాలుగు పిండములు చేసి నాందీ ముఖులైన పితరులకు విధి పూర్వకముగా ఇవ్వాలి, ద్రాక్ష, ఉసిరి, మూలములు (గడ్డలు) యవలు వీనిని ఉపయోగించాలి (పిండములకు నివేదించాలి). వానినే దక్షిణ కొరకు ఎప్పుడూ విప్రులకు ఇవ్వాలి. అక్కడే చతుర్వింశతి మత మందిట్లా – అభ్యుదయ శ్రాద్ధమందు ఒక్కొక్కరి కొరకు రెండేసి పిండాలను పెట్టాలి. ఒకటి పేరుతో రెండవది మౌనంగా, పిండాలను విడివిడిగా పెట్టాలి,అని. వసిష్ఠుడిట్లా – తూర్పుముఖంగా దేవతీర్థంతో తూర్పు ముఖంగల కుశలపై పిండములపెట్టి (వంపు), పిండపాత్రమును అధోముఖము చేయరాదు,అని. నాందీముఖులైన పితరులకు స్వాహా అని పిండదాన మంత్రము, అని వృత్తి కారుడన్నాడు. ఇక్కడ పిండములు చేయాలి, చేయొద్దు అని అక్కడే భవిష్యమందిట్లా చెప్పారు – బుద్ధిమంతుడు పిండ నిర్వపనము చేయాలి, చేయకున్నాసరే. ఓ మహాబాహూ, కులధర్మాన్ననుసరించి వృద్ధి శ్రాద్ధమందు ఇట్లా, అని. ఛాగలేయుడిట్లా – అగ్నౌకరణము, అర్ఘ్యము, ఆవాహనము, అవనేజనము (పాదప్రక్షాళనం) వీనిని పిండ శ్రాద్ధమందు చేయాలి, పిండములేనిచోట చేయరాదు,అని. అందువల్ల ఇక్కడ భోజనమే ప్రధానమైనందువల్ల ఒకవేళ బ్రాహ్మణుడు వమనం చేసుకుంటే అప్పుడు ఆపార్వణమే తిరిగి ఆ వృత్తి చేయాలి, అని సిద్ధించింది. ఇక్కడ సంకల్పమందు విశేషము ప్రయోగ పారిజాతమందు సంగ్రహోక్తి ఇట్లా ఉంది – వృద్ధియందు, శుభమును కోరేవాడు ప్రథమా విభక్తి అంతముగా సంకల్పం చెప్పాలి. షష్ఠీ విభక్తితో చేయరాదు. ఒకవేళ చేస్తే గొప్ప దోషం కల్గుతుంది,అని. నామగోత్రాది నిషేధము కూడా ఇక్కడే, సపిండక శ్రాద్ధమందు కాదు అని ఆతడే చెప్పాడు.

**మూ॥ అత్రాయంక్రమః.** నాందీ శ్రాద్ధే దైవేక్షణః క్రియతామి తిద్వౌ యుగపన్ని మంత్ర్య ఓం తథేతి విప్రాభ్యాం యుగపదుక్తే ప్రాప్నుతాం భవంతౌ ప్రాప్నువావ ఇతి వైశ్వ దేవపత్న్రిత్యేచ ద్వివచనాంతేన, విప్రద్వయే ప్రయోగం కుర్యాత్. ఆహితాగ్నిస్తు హేమాద్రౌ బ్రాహ్మే

- యోఽగ్నౌతు విద్యమానేఽపి వృద్ధౌ పిండాన్న నిర్వపేత్, పతంతి పితరస్తస్య నరకేసచపచ్యతే. బహ్వృచ పరిశిష్టే - ద్వౌదర్భౌ పవిత్రే, పవిత్రాణి చత్వారి. శన్నో దేవీరిత్యను మంత్రితాసు యవానావపతి. యవోఽసి సోమదేవత్యోగోసవో దేవ నిర్మితః, ప్రత్నవద్భిఃప్రత్తః పుష్ట్యా నాందీముఖాన్ పితౄ నిమాన్ లోకాన్ప్రీణాహినః స్వాహేతి స్వాహార్ఘ్యాః ఇతి పృచ్ఛతి. విశ్వేదేవా ఇదం వోఽర్ఘ్యం నాందీ ముఖాః పితర ఇతి యథా లింగ మర్ఘ్యదానం గంధాదిదానం ద్విర్ద్విః పాణౌ హోమోఽగ్నయే కవ్యవాహనాయ స్వాహా, సోమాయ పితృమతే స్వాహా, ఇతి. అతోదేవా అవంతునః ఇత్యంగుష్ఠ గ్రహణం పావమానీః శంవతీరైంద్రీర ప్రతిరథం చ శ్రావయేత్. మధువాతే తృచ స్థానే ఉపాస్మై గాయతేతి పంచ మధుమతీః శ్రావయే దక్షన్న మీమదంతేతి చ షష్ఠీంభుక్త శేషైరైకైకస్య ద్వౌద్వౌ పిండౌ దద్యాదితి. చంద్రికాయాం వృద్ధ వసిష్ఠః - తృప్తి ప్రశ్నేతు సంపన్నం దైవేరుచిత మిత్యపి, దధికర్కంధు మిశ్రాశ్చ పిండాః కార్యాః యథా క్రమం. కాత్యాయనః - శ్యమూషు వాజినం, ఇతి విప్రాంశ్చైవ విసర్జయేత్. నాందీముఖాః పితరః పీయంతాం, ఇత్యక్షయ్యస్థానే స్వధాం వాచయిష్య ఇత్యస్యస్థానే, నాందీముఖాన్ పితౄన్ వాచయిష్యే, ఇతి నస్వధాం ప్రయుంజీతేతి. అత్ర సాగ్ని రనగ్నిర్వా ఆదౌ వైశ్వదేవం కుర్యాత్. ఆదౌ వృద్ధౌ క్షయే చాంతే మధ్యే శ్రాద్ధేతు పార్వణే, ఏకోద్దిష్టే నివృత్తేతు వైశ్వదేవో విధీయతే. ఇత్యా శార్కే శాంఖాయన పరిశిష్టాత్. హేమాద్రౌతు - శేషమన్న మనుజ్ఞాప్య వైశ్వదేవ క్రియాంతతః, శ్రాద్ధాహ్ని శ్రాద్ధశేషేణ వైశ్వదేవం సమాచరేత్, ఇతి చతుర్వింశతి మతం నాందీ శ్రాద్ధే ష్యంతే వైశ్వదేవ ఉక్తః. బహ్వృచానామపి వృత్త్యాలోచనాత్తథైవ. పూర్వోక్తం తుయేషాం పరిశిష్టం తద్విషయమన్య విషయం వాజ్ఞేయం. అత్ర శ్రాద్ధాంగతర్పణం నేత్యుక్తం ప్రాక్. ఇతి వృద్ధి శ్రాద్ధం.

అను॥ ఇక్కడ క్రమమిట్లా - నాందీ శ్రాద్ధమందు దైవకర్మయందు ఇద్దరు బ్రాహ్మణులను ఒకేసారి దైవేక్షణః క్రియతాం అని నిమంత్రణ చేసి, ఓంతథా అని విప్రులిద్దరు ఒకేసారి చెప్పాక మీరు ప్రాప్నుతాం అనగా వారు పొందాము అని అనాలి ఇది వైశ్వదేవ మందు. అట్లాగే పితృకర్మ యందు కూడా ద్వివచనాంతంగా ఇద్దరు విప్రులయందు ప్రయోగం చేయాలి. ఆహితాగ్నియైతే హేమాద్రియందు బ్రహ్మపురాణోక్తి ఇట్లా - అగ్ని ఉన్నప్పటికి వృద్ధి శ్రాద్ధమందు ఎవడు పిండ నిర్వాపం చేయడో, వాని పితరులు నరకమందు పడుతారు. వాడు నరకమందు వండబడుతాడు,అని. బహ్వృచ పరిశిష్టమందిట్లా - పవిత్ర మందు రెండు దర్భలు, పవిత్రలు నాలుగు. శన్నో దేవీః అను మంత్రంతో అను మంత్రణ చేశాక యవలను చల్లుతాడు. యవోఽసి....నః స్వాహా (నీవు యవవు, సోమదేవతాకమవు. స్వర్గంలో పుట్టావు, విష్ణు నిర్మితవు జలంతో కలిసిన దానివి. నీ సామర్థ్యంతో నాందీముఖులైన పితరులను మా ఈ లోకములతో ప్రసన్నులను చేయి స్వాహా) అని స్వాహార్ఘ్యములు అని అడుగుతాడు. విశ్వేదేవులార ఇది మీ అర్ఘ్యము, నాందీ ముఖులైన పితరులార ఇది, అని లింగాన్ని (స్త్రీ, పురుష) అనుసరించి చెప్తూ అర్ఘ్యము, గంధాదులు దానం చేయాలి రెండేసి మార్లు. చేతియందు (అగ్నౌకరణ) హోమం అగ్నయే కవ్య వాహనాయ స్వాహా, సోమాయ

పితృమతే స్వాహా,అని. అతోదేవాః అవంతునః అనుమంత్రంతో అంగుష్ఠ గ్రహణము చేయాలి. పవమాన సూక్తములు, శంవతీ, రైంద్రీః మంత్రములు అప్రతిరథమంత్రములు (ఆశుః శిశానో..... అనాధృష్ట్యాయధాసధ 12) విన్పించాలి మధువాతా అనే ఋక్ స్థానంలో ఉపాస్మైగాయత అను ఐదు మధుమతి మంత్రముల విన్పించాలి. అక్షన్న మీ మదంత అను ఆరవ మంత్రం కూడా, భుక్తశేషంతో ఒక్కొక్కరికి రెండేసి పిండములివ్వాలి,అని. చంద్రికయందు వృద్ధ వసిష్ఠుడిట్లా – తృప్తి ప్రశ్నమైతే సంపన్నం, అని దైవమందైతే రుచితం, అని కూడా అడగొచ్చు. పెరుగు, రేగు పండ్లు కలిపి యథాక్రమంగా పిండాలు చేయాలి,అని. కాత్యాయనుడిట్లా – త్వమూషు వాజినం, అను మంత్రంతో బ్రాహ్మణులను విసర్జన చేయాలి, అక్షయ్య స్థానమందు, నాందీ ముఖులైన పితరులు ఆనందించని అని, స్వధాం వాచయిష్యే అనే ధాని స్థానంలో నాందీ ముఖులైన పితరులను వాచయిష్యే, అని, చెప్పాలి. స్వధాంను ప్రయోగించరాదు,అని. ఇక్కడ సాగ్నికుడైనా, నిరగ్నికుడైనా తొలుత వైశ్వదేవం చేయాలి. వృద్ధి శ్రాద్ధమందు తొలుత, క్షయ శ్రాద్ధమందు అంతంలో, పార్వణ మందు శ్రాద్ధ మధ్య మందు, ఏకోద్దిష్టం అయ్యాక, వైశ్వ దేవము విధించబడింది,అని ఆశార్క మందు శాంఖాయన పరిశిష్ట వచనంవల్ల తెలుస్తోంది. హేమాద్రి యందైతే – బ్రాహ్మణుల అనుజ్ఞ పొంది, శేష అన్నమును గ్రహించి అప్పుడు వైశ్వదేవం ఆచరించాలి. శ్రాద్ధాహ్న మందు శ్రాద్ధ శేషంతో వైశ్వదేవం ఆచరించాలి, అని. నాందీ శ్రాద్ధమందు కూడా చివర వైశ్వదేవం చెప్పబడింది, చతుర్వింశతి మతమందు బహ్వృచులకు కూడా వృత్తి ఆలోచన వల్ల అట్లాగే ఔతుంది. (మృతోద్దేశ్యక ద్రవ్య త్యాగః శ్రాద్ధం అని). ముందు చెప్పినదైతే ఎవరికి పరిశిష్టము యందు ఉందో వారి విషయము, లేదా ఇతర విషయము అని గ్రహించాలి. ఇక్కడ శ్రాద్ధాంగ తర్పణము లేదు, అని ముందు చెప్పాము, అని వృద్ధి శ్రాద్ధము.

**మూ॥ అథజీవత్పితృక** శ్రాద్ధం. తత్రానేక పక్షాః దృశ్యంతే జీవంతం పితరం భోజయిత్వా పరయోః శ్రాద్ధం కుర్యాదిత్యేకః. హోమాంతమేవ కుర్యాదిత్యన్యః. హోమాంతః పితృ యజ్ఞః స్యాజ్జీవేపిత రిజానతః. పితరం భోజయిత్వా వా పిండౌ నిర్వృణుయాత్పరౌ, ఇతి యజ్ఞ పార్శ్వోక్తేః యది జీవత్పితా నదద్యాదాహోమాత్కృత్వా విరమేత్, ఇత్యాపస్తంబోక్తేశ్చ. జీవతాం పిండానగ్నౌ హుత్వా పరేభ్యః దేయం ఇత్యపరః. జుహుయాజ్జీవేభ్యః, ఇత్యాశ్వలాయనోక్తేః. జీవతామజీవతాం చ పిండదానమితీతరః. జీవతా మజీవతాంవాదే యమే వేతి హిరణ్య కేతురితిని గమాత్. తస్మాజ్జీవత్పితా కుర్యాద్వాభ్యామేవ న సంశయః. ఇతి భవిష్యోక్తేః ద్వాభ్యామే వేత్యన్యః ఏతేపక్షాః కలౌనిషిద్ధాః. ప్రత్యక్ష మర్చనం శ్రాద్ధే నిషిద్ధం మనుర బ్రవీత్, పిండ నిర్వపణం చాపి మహాపాతక సమ్మితం, ఇతి పృథ్వీచంద్రోదయే భవిష్యోక్తేః. చంద్రికాప్యేవం. తస్మాత్పితరి జీవతి శ్రాద్ధానారంభ ఏవేత్యేకః పక్షః. సపితుః పితృకృత్యేషు అధికారోన విద్యతే, ఇతి కాత్యాయనోక్తేః. జీవే పితరివైపుత్రః శ్రాద్ధ కాలం వివర్జయేత్, ఇతి హారీతోక్తేశ్చ. పితుః పిత్రాదిభ్యో దద్యాదితి సిద్ధాంతః. ధ్రియమాణేతు పితరి పూర్వేషా మేవ నిర్వపేత్, ఇతి మనూక్తేః. పితుః పితృభ్యోవా దద్యాత్ సపితేత్య పరాశ్రుతిః

ఇతి కాత్యాయనోక్తేశ్చ. అయంబహు సమ్మతః పక్షః అన్యేతు శాఖాభేదేనజ్ఞేయాః. ఏవం జీవన్మాతా మహేనాప్యూహేన కార్యం. మాతామహేనామప్యేవం శ్రాద్ధం కుర్యాద్విచక్షణః, మంత్రోహేన యథా న్యాయం శేషాణాం మంత్ర వర్జితం, ఇతి విష్ణూక్తేః ఏవం మంత్రాదికస్యాపి తథా మాతామహాదికే. ఇతి పృథ్వీ చంద్రోదయే అగ్ని పురాణాచ్చ పితరిజీవతి స్వమాతరి మృతాయామపి పితురేవ మాతృమాతా మహయోః కుర్యాత్. యేభ్య ఏవపితాదద్యాత్ ఇతి వక్ష్యమాణ వచనాత్, ఇతి పితామహ చరణాః. మదనరత్నేతు - జీవత్పితాస్వ మాతృ మాతా మహయోర్దద్యాత్ ఇత్యుక్తం. కాలాదర్శేఽప్యేవం. మృతేతు పితరి జీవన్మాతృకః పితామహ్యాదిభ్యో వృద్ధౌ దద్యాదితి స్మృతి తత్త్వాది గౌడగ్రంథాః.

అను॥ జీవత్పితృక శ్రాద్ధము. ఇక్కడ అనేక పక్షములు (భేదములు) కన్పిస్తున్నాయి. బ్రతికున్న తండ్రికి భోజనం పెట్టి, ఇతరులకు పై ఇద్దరికి శ్రాద్ధం పెట్టాలి, అని ఒకడన్నాడు. హోమాంతం వరకే చేయాలి, అని మరొకడన్నాడు. తండ్రి బ్రతికున్నట్టుగా తెలిస్తే పితృయజ్ఞం హోమాంతము వరకే లేదా తండ్రికి భోజనంపెట్టి, ఆపై ఇద్దరికి పిండ నిర్వాపం చేయాలి, అని యజ్ఞ పార్శ్వోక్తి. బ్రతికున్న తండ్రి ఇవ్వని పక్షంలో, హోమం వరకు చేసి విరమించాలి,అని ఆపస్తంబోక్తి కూడా. బ్రతికిన వారి పిండములను అగ్నిలో హోమంచేసి, ఆపై వారికి పిండము లివ్వాలి,అని మరొకడు, జీవించినవారికై హోమంచేయాలి,అని ఆశ్వలాయనోక్తి. బ్రతికిన వారికైనా, బ్రతికిలేనివారికైనా పిండదానము అని ఇతరుడన్నాడు. జీవించి ఉన్న వారికి లేకపోయిన, వారికైనా ఇవ్వాల్సిందే, అని హిరణ్యకేతు వన్నాడు, అని నిగమోక్తి. అందువల్ల బ్రతికున్న తండ్రి ఇద్దరికే  చేయాలి, అనుమానంలేదు, అని భవిష్యోక్తి కనుక ఇద్దరికే అని ఇతరుడన్నాడు. ఈ పక్షములు కలిలో నిషిద్ధమైనవి. శ్రాద్ధమందు ప్రత్యక్షంగా పూజ నిషిద్ధము అని మనువన్నాడు,అని. పిండ నిర్వాపము కూడా మహా పాతకంతో సమానమైంది,అని. పృథ్వీ చంద్రోదయమందు భవిష్యోక్తి. చంద్రిక కూడా ఇట్లాగే చెప్పింది. అందువల్ల తండ్రి బ్రతికి ఉండగా శ్రాద్ధం మొదలు పెట్టకపోవటమే మంచిది,అని ఒక పక్షము. తండ్రి గల వాడికి పితృకృత్యములందు అధికారం లేదు అని కాత్యాయనోక్తి. తండ్రి బ్రతికున్నప్పుడు పుత్రుడు శ్రాద్ధకాలాన్ని విడిచిపెట్టాలి,అని హారీతోక్తి కూడా. తండ్రిగారి తండ్రి మొదలగు వారికి ఇవ్వాలి అని సిద్ధాంతము. తండ్రి బ్రతికుండగా పూర్వమైన వారికే (ఇద్దరికే) నిర్వాపము, అని మనూక్తి. తండ్రిగలవాడు, తండ్రిగారి తండ్రి మొదలగు వారికి ఇవ్వాలి అని మరో శ్రుతి, అని కాత్యాయనోక్తి కూడా. ఇది చాలా మందికి నచ్చిన (అంగీకరించిన) పక్షము. ఇతరమైనవి శాఖాభేదంగా అని గ్రహించాలి. ఈ రకంగా మాతామహుడు బ్రతికున్న సందర్భంలోనూ, ఊహతో చేయాలి. మాతామహులకు కూడా ఈ రకంగా బుద్ధిమంతుడు శ్రాద్ధమాచరించాలి. యథాన్యాయముగా, మంత్రముల ఊహతో, ఇతరులకు మంత్రములు లేకుండా, అని విష్ణూక్తి. ఈ రకంగా మంత్రాదులకు కూడా

అట్లాగే మాతామహాదులందు చేయాలి,అని పృధ్వీచంద్రోదయమందు అగ్నిపురాణ వచనం ఉంది. తండ్రి బ్రతికి ఉండగా తమ తల్లి మరణిస్తే, తండ్రిగారి మాతృమాతా మహులకు శ్రాద్ధం చేయాలి. తండ్రి ఎవరికిస్తాడో వారికే పుత్రుడివ్వాలి అని చెప్పబోయే వచనాన్ననుసరించి అని పితామహ చరణులు అన్నారు. మదనరత్నమందైతే – తండ్రి బ్రతికున్నవాడు, తనతల్లికి, మాతామహులకు ఇవ్వాలి,అని ఉంది. కాలాదర్శమందు కూడా ఇట్లాగే ఉంది. తండ్రి చనిపోగా తల్లి బ్రతికి ఉన్నవాడు పితామహి మొదలగు వారికి వృద్ధియందు ఇవ్వాలి అని స్మృతి తత్త్వాదిగౌడ గ్రంథములంటున్నాయి.

**మూ॥ దాక్షిణాత్యాస్తు – పితృవర్గే మాతృవర్గే తథా మాతామహస్య చ జీవేత్తు యది వర్గాద్యః తం వర్గంతు పరిత్యజేత్, ఇతి వచనాత్ తద్వర్గత్యాగ ఏవేత్యాహుః. ఏవం పతిత సన్న్యస్త పితృకాదేరపి జ్ఞేయం. వృద్ధౌతీర్థే చ సంన్యస్తే తాతే చ పతితే సతి, యేభ్య ఏవ పితా దద్యాత్తేభ్యో దద్యాత్స్వయం సుతః, ఇతి షట్ త్రింశన్మతాత్. సంన్యస్తే జీవతీత్యర్థః. మృతేతు సంన్యస్తే తదాద్యేవదేయం. మృతేఽపి పరేభ్య ఏవేతి గౌడాః. కాత్యాయనోఽపి – బ్రాహ్మణా దిహతే తాతే పతితే సంగవర్జితే, వ్యుత్క్రమాచ్చమృతే దేయం యేభ్యఏవ దదాత్యసౌ. అయంచ సంన్యస్త పిత్రా దేర విశేషాత్ సర్వశ్రాద్ధేఽధికారః. ఏతత్త్రిదండి పరం. ఏకాదశాహ పార్వణ వార్షికా ద్యపి తస్యైవ. అహన్యే కాదశే ప్రాప్తే పార్వణంతు విధీయతే, ఇత్యుక్త్వా త్రిదండ గ్రహణాదేవ ప్రేతత్వం నైవజాయతే, ఇత్యుషన సావిశేషోక్తేః. బ్రాహ్మణాదిహతే ఇత్యాది నిషేధస్తు ఏకదండాదిపరఃఅతః పరమహంసానాం వార్షికాదిక మపిన కార్యమితి శూలపాణి శ్రాద్ధ తత్త్వాదయో గౌడ గ్రంథాః. ఇదమేవ యుక్తం. యత్తు హేమాద్రౌ కౌండిన్యః – దర్శశ్రాద్ధం గయాశ్రాద్ధం శ్రాద్ధం చాపర పక్షకం, నజీవత్పితృకః కుర్యాత్తిల తర్పణమేవచ, ఇతి, తత్ సంన్యస్త పిత్రాద్యతి రిక్త విషయం. మైత్రాయణీయ పరిశిష్టే – ఉద్వాహే పుత్ర జననే పైత్ర్యేష్ట్యాం సౌమికే మఖే, తీర్థే బ్రాహ్మణ ఆయాతే షడేతే జీవతః పితుః . తత్రైవ – మహానదీషు సర్వాసు తీర్థేషు చ గయామృతే జీవత్పితాపి కుర్వీత శ్రాద్ధం పార్వణ ధర్మవత్. గయామృతే ఇతి మాతృవ్యతిరిక్త విషయం అన్వష్టక్యం గయాప్రాప్తౌ సత్యాం యచ్చమృతేఽహని, మాతుః శ్రాద్ధం సుతః కుర్యాత్పి తర్యపిచ జీవతి ఇతి తత్రైవోక్తేః. గయాప్రాప్తౌ ప్రాసంగిక్యాం, గయాం ప్రసంగతో గత్వా మాతుః శ్రాద్ధం సమాచరేత్, ఇతి వచనాత్. తేన మృతమాతృకో గయాయాం తత్పార్వణ మాత్రం కుర్యాత్. తజ్జీవనేతు తీర్థశ్రాద్ధ మపినేతి కాలాదర్శ స్మృతి దర్పణాదయః. అన్యేతు గత్వా శ్రాద్ధం నేతి నిషేధార్థః. సామాన్యతః ప్రాప్తం తీర్థ శ్రాద్ధం భవత్యేవ గయాయా మిత్యాహుః. యదాపితుః ప్రతినిధిత్వేన గయాంయాతి, తదా యజమానస్య పితృపితామహ ప్రపితామహా ఇత్యేవం శ్రాద్ధం. తత్ర స్వమాతుః పితృపత్నీత్వే నైకోద్దిష్టం కృత్వా మాతృత్వేన పునః పార్వణం కుర్యాదితి త్రిస్థలీసేతౌ. తచ్చ ఫల్గు విష్ణు పదాక్షయ్య వటేష్వే వేతికేచిత్. అద్యంతే ఏవేత్యన్యే. మధ్యమాంతే ఇత్యపరే. సంకోచహేత్వభావాత్ తత్రత్య సర్వశ్రాద్ధాని మాతుః కార్యాణీతి యుక్తం ప్రతిభాతి. యత్తు మదన పారిజాతే – న జీవిత్పితృకః కుర్యాత్ శ్రాద్ధమగ్ని మృతేద్విజః, యేభ్యఏవ పితాదద్యాత్తేభ్యః కుర్వీత సాగ్నికః ఇతి సుమంతూక్తేః సాగ్నేరేవజీవత్పితృకస్య**

**తీర్థాది శ్రాద్ధముక్తం. సాగ్నేరపి మైత్రాయణీయ శాఖీయస్యైవ నాన్యేషాం. షడేతే జీవతః పితుః, ఇతి తత్పరిశిష్టే ఏవోక్తే ఇతి రత్నావలీ దివోదా సాద్యాః. తదయుక్తం. సౌమన్తవం పిండ పితృయజ్ఞ విషయం. సంన్యస్త పిత్రాద్యతి రిక్త విషయం వేతి పృథ్వీ చంద్రోదయోక్తేః వృద్ధౌ తీర్థే చేత్యాదేః సాధారణ్యే నాస్యాపిత ధాత్వాచ్చ. తథా నిరగ్నే రపి నాందీ శ్రాద్ధముక్తం ప్రాక్. ఏవం పితామహ జీవనే౽పిజ్ఞేయం. విశేషః పితృకృత జీవత్పితృక నిర్ణయేజ్ఞేయః.**

అను॥ దాక్షిణాత్యులైతే – పితృవర్గమందు, మాతృవర్గమందు, అట్లాగే మాతామహవర్గ మందును ఒకవేళ వర్గాద్యుడు జీవిస్తే ఆ వర్గాన్ని విడిచిపెట్టాలి, అనే వచనాన్ననుసరించి ఆ వర్గ త్యాగము చేయాల్సిందే అని అన్నారు ఈ రకంగా పతితుడు లేదా సన్యసించినవాడు తండ్రిఐతే ఈ మొదలగు వారికి కూడా ఇట్లాగే అని గ్రహించాలి. వృద్ధియందు, తీర్థ శ్రాద్ధమందు, తండ్రి సన్యసిస్తే లేదా పతితుడైతే, తండ్రి ఎవరికి శ్రాద్ధమిచ్చేవాడో, సుతుడు కూడా స్వయంగా వారికే ఇవ్వాలి, అని షట్ త్రింశన్మతం వల్ల తెలుస్తోంది. సంన్యస్తమనగా బ్రతికి ఉండగా అని అర్థం. సంన్యసించిన తండ్రి మరణిస్తే ఆతనిని మొదలుకొనే ఇవ్వాలి. మరణించినా ఆపై వారికే అని గౌడులన్నారు. కాత్యాయనుడు కూడా – బ్రాహ్మణాదులవల్ల (గోవువల్లనో) తండ్రి మరణిస్తే, పతితుడైతే, సన్యాసిఐతే, వ్యుత్క్రమంవల్ల మరణిస్తే, ఆతడు ఎవరికిచ్చేవాడో ఈతడు కూడా వారికే ఇవ్వాలి. ఇది, సంన్యస్త పితరులకు విశేషంగా లేనందువల్ల అన్ని శ్రాద్ధములందు అధికారము, ఇది త్రిదండి పరము. ఏకాదశాహము, పార్వణము, వార్షికాదులు కూడా అతనికే. పదకొండవ రోజు వస్తే పార్వణాన్ని విధిస్తున్నారు సన్యాసికి. అని చెప్పి త్రిదండ గ్రహణంవల్లనే ప్రేతత్వం పుట్టదు, అని ఉశనసుడు విశేషంగా చెప్పాడు. బ్రాహ్మణాదులతో హతుడైతే అని మొదలుగా గల నిషేధము ఏకదండాది పరము. అందువల్ల పరమహంసలకు వార్షికాదులు కూడా చేయరాదు అని శూలపాణి, శ్రాద్ధ తత్వాదులగు గౌడ గ్రంథములన్నాయి. ఇదియే తగినది. హేమాద్రి యందు కౌండిన్యుడిట్లా – దర్శ శ్రాద్ధము, గయాశ్రాద్ధము, మహాలయశ్రాద్ధము, వీనిని తండ్రి బ్రతికి ఉన్నవాడు చేయరాదు, తిలతర్పణం కూడా చేయరాదు,అని ఏదన్నాడో, అది సంన్యస్త పిత్రాదులకన్న ఇతరమైన వారి విషయము మైత్రాయణీయ పరిశిష్ట మందిట్లా – వివాహము, పుత్రజననము, పిత్రేష్టి, సోమయాగం, తీర్థము, బ్రాహ్మణుడు తటస్థపడటము, ఈ ఆరింటి యందు, తండ్రి బ్రతికి ఉన్నా చేయాల్సినదే, అని. (శ్రాద్ధము). అక్కడే – అన్ని మహానదులందు, తీర్థములందు, గయయందు మరణిస్తే, తండ్రి బ్రతికి ఉన్నవాడు కూడా పార్వణ ధర్మంవలె శ్రాద్ధ మాచరించాలి,అని. గయామృతశబ్దము తల్లికన్న వేరైన వారి విషయము. అన్వష్టక్యము, తల్లి మరణించినరోజున (మృతాహం) గయా ప్రాప్తి సంభవిస్తే, తండ్రి బ్రతికి ఉన్నా పుత్రుడు తల్లి శ్రాద్ధాన్ని గయలో చేయాలి,అని అక్కడే చెప్పారు. గయాప్రాప్తి అనగా ప్రసంగవశాత్తు గయవెళ్ళటం సంభవిస్తే, గయకు ప్రసంగవశంవల్ల వెళ్తే పుత్రుడు తల్లి శ్రాద్ధాన్ని ఆచరించాలి,

అనే వచనంవల్ల. అందువల్ల తల్లి మరణించినవాడు గయమందు ఆమె పార్వణాన్ని మాత్రం చేయాలి. ఆమె బ్రతికి ఉంటే, తీర్థ శ్రాద్ధం కూడా చేయరాదు, అని కాలాదర్శ స్మృతి దర్పణాదులన్నాయి. ఇతరులైతే వెళ్ళి శ్రాద్ధం చేయరాదు, అని నిషేధార్థము అని అన్నారు. సామాన్యంగా వచ్చిన, తీర్థ శ్రాద్ధము చేయాల్సిందే, గయయందు అని అన్నారు. తండ్రికి ప్రతినిధిగా గయకు వెళ్ళితే, యజమానుని పితృపితామహ ప్రపితామహులు అని ఈ రకంగా శ్రాద్ధం చేయాలి.అక్కడ తనతల్లికి, తండ్రికి భార్య ఐనందువల్ల ఏకోద్దిష్టాన్నిచేసి, తనకు తల్లి ఐనందువల్ల మళ్ళీ పార్వణం చేయాలి అని త్రిస్థలీ సేతువు యందు ఉంది. దానిని ఫల్గుని నది, విష్ణుపద, అక్షయ్య వటములందే చేయాలని కొందరన్నారు. ఆది, అంతములందే అని ఇతరులన్నారు. మధ్య, అంతములందని ఇంకొకరన్నారు. తగ్గించటానికి కారణం లేనందువల్ల గయ యందలి అన్ని శ్రాద్ధములను తల్లికి చేయాలి అనేది యుక్తంగా తోస్తుంది. మదన పారిజాతమందిట్లా – తండ్రి బ్రతికి ఉన్నవాడు, బ్రాహ్మణుడు అగ్ని లేకుండా శ్రాద్ధం చేయరాదు.సాగ్నికుడైన వాడు తండ్రి ఎవరికిస్తాడో వారికే పుత్రుడివ్వాలి, అని సుమంతు వచనం ఉన్నందువల్ల, అగ్ని కలవానికే, తండ్రి బ్రతికి ఉన్నవానికే తీర్థాది శ్రాద్ధము చెప్పబడింది. అగ్ని కలవానికి కూడా, మైత్రాయణీయ శాఖ వారికే ఇతరులకు కాదు, షడేతే జీవతః పితుః, అని వారి పరిశిష్ట మందు మాత్రమే చెప్పారు అని రత్నావలి దివోదాసులన్నారు, అని ఏదన్నాడో అది తగని మాట. సుమంతు వచనము పిండ పితృయజ్ఞ పరమైనదో లేదా సన్యసించిన పిత్రాదులకన్న ఇతరమైన వారి విషయమో అని పృథ్వీచంద్రో దయోక్తి. వృద్ధియంపు తీర్థమందును అను మొదలగునవి సాధారణమైనందువల్ల ఇది కూడా అటువంటి సాధారణమైనదే. (జీవ,అజీవ). అట్లాగే నిరగ్నికి కూడా ఇదివరలో నాందీ శ్రాద్ధం చెప్పబడింది. ఇట్లాగే పితామహుడు బ్రతికి ఉన్నా, అట్లాగే గ్రహించాలి. విశేషాన్ని మా తండ్రిగారు రచించిన జీవత్పితృక నిర్ణయం నుండి తెలుసుకోవాలి.

**మూ॥ అథ పితామహే జీవతి మృతే చ పితరి యద్యపి – పితామహోవా తచ్ఛ్రాద్ధే భుంజీతేత్య బ్రవీన్మనుః, ఇతి మనునా జీవితః పితామహస్య భోజనముక్తం తథాపి ప్రత్యక్షార్చనస్య పూర్వ నిషిద్ధత్వాత్ పితామహం విహాయ పితృ ప్రపితామహ వృద్ధ ప్రపితామహేభ్యోదేయం. పితాయస్య నివృత్తః స్యాజ్జీవేచ్చాపి పితామహః, పితుః సనామ సంకీర్త్య కీర్తయే త్ప్రపితామహం, ఇతిమనూక్తేః. అయమేవ సర్వ సమ్మతః పక్షః.యత్తు ఛందోగపరిశిష్టే – పితామహేధ్రియమాణే పితుః ప్రేతస్య నిర్వపేత్, పితుః తస్య చ వృత్తస్య జీవేచ్చేత్ప్రపితామహః, ఇతి ఏక పురుషం ద్విపురుషంవా పార్వణమాహ, తత్తీర్థ పితృయజ్ఞ పరం. వృద్ధౌ పూర్వోక్తమేవ. ఏవం పూర్వయోః మృతయోః ప్రపితామహే జీవతి పితృమాత్రే మృతే పరయోః జీవతోశ్చ వృద్ధ ప్రపితామహాదిభ్యో జ్ఞేయం. జీవంతమపి దద్యాద్వా ప్రేతాయాన్నోదకే ద్విజః (పితుః పితృభ్యో వాదద్యాత్ సపితేత్య పరాశ్రుతిః) ఇతి కాత్యాయనోక్తేశ్చ. ఏతత్సర్వం మనసి కృత్వాహ హేమాద్రౌ విష్ణుః – పితరి**

**జీవతియః శ్రాద్ధం కుర్యాద్యేషాం పితాకుర్యాత్తేషాం, పితరి పితామహే చ జీవతి యేషాం పితామహః పితరి పితా మహే ప్రపితామహే చ జీవతి నైవకుర్యాత్; యస్య పితాప్రేతః స్యాత్ సపిత్రే పిండం నిధాయ ప్రపితామహాత్పరాభ్యాం ద్వాభ్యాందద్యాత్. యస్య పితా ప్రపితా మహశ్చ ప్రేతౌ స్యాతాం సపిత్రే పిండం నిధాయ పితామహాత్ పరాభ్యాందద్యాత్ యస్య పితామహః ప్రేతః స్యాత్ తస్మై పిండం నిధాయ ప్రపితామహాత్ పరాభ్యాం దద్యాత్ యస్య పితా పితామహశ్చ ప్రేతౌస్యాతాం సతాభ్యాం పిండౌదత్వా పితామహ పితామహాయదద్యాత్. మాతామహానామప్యేవం శ్రాద్ధం కుర్యాద్విచక్షణః మంత్రోహేన యథా న్యాయం శేషాణాం మంత్ర వర్జితం,ఇతి. అత్ర పితృ వన్మాతా మహేజీవతి తత్పిత్రాదిభ్యః. యథా తత్రత్రిషు జీవత్సునైవ కుర్యాత్తథాత్రా పీత్యాది సర్వమతిదేశ్యం. ఏవం మాతృజీవనేఽపీతి శూలపాణి కాలాదర్శౌ. తన్న, యేభ్య, ఏవ, ఇత్యాదౌ యచ్ఛబ్దాదేః వ్యక్తి విశేష వాచిత్వేన తదప్రసంగాదితిదిక్. ఉత్తరార్థం వ్యాఖ్యాతం ప్రాక్.**

అను॥ ఇక పితామహుడు బ్రతికి ఉండి తండ్రి మరణిస్తే ఇట్లా – ఆ శ్రాద్ధమందు పితామహుడు భుజించాలి, అని మనువు చెప్పాడు,అని మనువు, బ్రతికి ఉన్న పితామహునకు భోజనం చెప్పినాడు అని అన్నా అట్లైనా ప్రత్యక్ష అర్చనము అంతకు ముందు నిషేధించాడు కనుక పితామహుని వదలి, పితృ, ప్రపితామహ, వృద్ధ ప్రపితామహులకు ఇవ్వాలి. ఎవని తండ్రి మరణించాడో, పితామహుడు బ్రతికి ఉన్నాడో, వాడు తండ్రిపేరును చెప్పి ప్రపితా మహులను కీర్తించాలి,అని, మనువచనం ఉన్నందువల్ల ఇదే అందరికి ఇష్టమైన మార్గము. ఛందోగ పరిశిష్టమందిట్లా – పితామహుడు బ్రతికుంటే పుత్రుడు, ప్రేత ఐన తండ్రికి నిర్వాపం చేయాలి. ప్రపితామహుడు బ్రతికి ఉంటే, గతించిన ఆతని తండ్రికి ఇవ్వాలి,అని ఒక పురుషునికో, ఇద్దరు పురుషులకో పార్వణం చెప్పాడు,అని ఏదుందో అది తీర్థ పితృయజ్ఞ పరము. వృద్ధియందు ముందు చెప్పిందే చేయాలి. ఇట్లా ముందువాళ్ళు మరణించి ప్రపితామహుడు జీవించి ఉంటే, తండ్రి మాత్రం మరణించి, పై వాళ్ళు ఇద్దరు జీవించి ఉంటే వృద్ధ ప్రపితామహాదులకు అని తెలుసుకోవాలి. బ్రతికి ఉన్నా, లేదా మరణించినా, తండ్రికి, అన్నోదకములివ్వాలి. బ్రాహ్మణుడు, అని కాత్యాయనోక్తి కూడా. (తండ్రిగారి పితరులకో ఇవ్వాలి, ఆతడు తండ్రి అని మరోశ్రుతి). ఇదంతా మనసులో ఉంచుకొని హేమాద్రి యందు విష్ణువిట్లా అన్నాడు – తండ్రి బ్రతికి ఉంటే శ్రాద్ధం చేసే (పుత్రుడు) వాడు, తండ్రి ఎవరికి చేసేవాడో, వారికే చేయాలి. పిత, పితామహుడు బ్రతికి ఉంటే, పితామహుడు ఎవరికి చేస్తాడో వారికి చేయాలి. పితృ, పితామహ, ప్రపితామహులు బ్రతికి ఉంటే చేయరాదు. తండ్రి మరణిస్తే, ఆతడు తండ్రికి పిండం పెట్టి ప్రపితామహునికంటే పరులైన ఇద్దరికి ఇవ్వాలి. తండ్రి ప్రపితామహుడు ఇద్దరు మరణిస్తే, ఆతడు తండ్రికి పిండం పెట్టి పితామహుని తరువాత వారికి ఇవ్వాలి. పితామహుడు మరణిస్తే, ఆతనికి పిండం పెట్టి, ప్రపితామహుని తరువాతి వారికి ఇవ్వాలి. పిత, పితామహుడు ఇద్దరు

మరణిస్తే వారికి పిండములు పెట్టి పితామహ పితామహునికివ్వాలి. మాతామహులకు గూడా ఇట్లాగే శ్రాద్ధం బుద్ధిమంతుడు చేయాలి. మంత్రముల ఊహతో యథాన్యాయంగా చేయాలి. ఇతరులకు మంత్రములు లేకుండా,అని. ఇక్కడ తండ్రికి లాగా మాతామహుడు జీవిస్తే అతని తండ్రి మొదలగు వారికి ఇవ్వాలి. ఎట్లా అక్కడ ముగ్గురు జీవించి ఉంటే చేయరాదో ఇక్కడ కూడా అట్లా ఉంటే చేయరాదు,అని మొదలుగా అంతా అతిదేశ్యము. ఇట్లా తల్లి బ్రతికి ఉంటే కూడా అని శూలపాణి కాలాదర్శములన్నాయి. అట్లాకాదు యేభ్య ఏవ, అమ మొదలగు వానియందు యచ్ఛబ్దము, మొదలగునవి వ్యక్తి విశేషాన్ని తెలిపేవి కనుక అట్లా ఇక్కడ కుదరదు అని చాలు. ఉత్తరార్థాన్ని ముందే వ్యాఖ్యానించాము.

**మూ॥ యత్త్వత్ర విజ్ఞానేశ్వరేణోక్తం, పిత్రే పిండం నిధాయ, ఇతి పితురేకోద్దిష్ట విధినా శ్రాద్ధం కృత్వా ప్రపితామహాదిభ్యః పార్వణం కుర్యాత్. తత్ వ్యుత్క్రమ మృత సపిండీకరణా భావపక్షే సపిండీకరణ స్థానాపన్నం జ్ఞేయం. వ్యుత్క్రమాత్తు ప్రమీతానాం నైవ కార్యా సపిండతా, ఇతి వచనాత్. దర్శాదౌతు పితురేకోద్దిష్టమేవ కార్యం. నజీవంత మతి దదాతి, ఇతి శ్రుతేః. జీవేత్పితా మహోయస్య పితా చాంతరితో భవేత్. పితురేకస్య దాతవ్యమే వమాహుర్మనీషిణః ఇతి యజ్ఞపార్శ్వోక్తేః పితామహే జీవతి వై పితర్యేవ సమాపయేత్, ఇతి హారీతోక్తేశ్చ. శిష్టాస్తు - వ్యుత్క్రమాత్తు ప్రమీతానాం నైవకార్యా స పిండతా యది మాతాయది పితా భర్తానైవ విధిః స్మృతః ఇతి మాధవీయే స్కాందోక్తేః వ్యుత్క్రమమృత స పిండీకరణాభావః పితృవ్యాది విషయ ఇత్యాహుః. ఏష విధిర్నిషేధ రూపః. త్రిమ జీవత్సు విష్ణురాహ - త్రిషుజీవత్సు నైవకుర్యాత్, ఇతి ఏతద్దర్శాది విషయం. నాందీ శ్రాద్ధంతు పరేభ్య స్త్రిభ్యో భవత్యే వేతి కల్పతరుః. పృథ్వీచంద్రోదయస్తు - దద్యాత్త్రిభ్యః పరేభ్యస్తు జీవేచ్చేత్త్రి తయం యది, ఇతి మనూక్తేః. సర్వత్ర వికల్పః స చ దేశాచారాద్వ్య వతిష్ఠత ఇత్యాహుః సుదర్శన భాష్యేతు మాసిక శ్రాద్ధం జీవత్పిత్రాదినా వ్యుత్క్రమమృత పిత్రాదినా చ కార్యమే వేత్యుక్తం. మదనరత్నే క్రతుః - అష్టకాదిషు సంక్రాంతౌ మన్వాదిషు యుగాదిషు, చంద్రసూర్య గ్రహే పాతే స్వేచ్ఛయా లభ్యయోగతః. జీవత్పితానైవ కుర్యాత్ శ్రాద్ధం కామ్యం తథాఖిలం, అన్యే విశేషాః శ్రీ పితృకృత జీవత్పితృక నిర్ణయే భట్ట కృతత్రి స్థలీసేతౌ చ జ్ఞేయాః.**

అను॥ విజ్ఞానేశ్వరుడిట్లా - పిత్రే పిండంనిధాయ, అని తండ్రికి ఏకోద్దిష్ట విధితో శ్రాద్ధం చేసి ప్రపితామహాదులకు పార్వణం చేయాలి,అని ఏదన్నాడో, అది వ్యుత్క్రమంగా మరణించిన వారికి సపిండీకరణం లేని పక్షంలో సపిండీకరణ స్థానంలో వచ్చిన దానినిగా గ్రహించాలి. వ్యుత్క్రమంగా మరణించిన వారికి సపిండీకరణం చేయరాదు,అనే వచనాన్నను సరించి దర్శాదులందైతే పితకు ఏకోద్దిష్టమే చేయాలి. బ్రతికి ఉన్న వానికి ఎక్కువ ఇవ్వరాదు,అని శ్రుతి. ఎవని పితామహుడు బ్రతికి ఉన్నాడో, తండ్రి మరణించాడో, అక్కడ తండ్రికి ఒక్కనికే ఇవ్వాలి, అని బుద్ధిమంతు లన్నారు,అని యజ్ఞ పార్శ్వుని మాట. పితామహుడు బ్రతికి ఉంటే తండ్రియందే సమాప్తి చేయాలి,అని హారీతోక్తి వల్లనూ. శిష్టులైతే- వ్యుత్క్రమంగా మరణించిన వారికి సపిండత చేయరాదు ఒకవేళ తల్లో, తండ్రో, భర్తో

మరణిస్తే ఈ విధిలేదు. అని మాధవీయమందు స్కాందోక్తి ఉన్నందువల్ల వ్యుత్క్రమంగా మరణించినవారికి సపిండీకరణం లేదు అనేది పితృవ్యాది విషయకమని అన్నారు. ఈ విధి, నిషేధరూపము. ముగ్గురు బ్రతికుండగా విష్ణు వచనమిట్లా - ముగ్గురు బ్రతికుండగా చేయరాదు,అని. ఇది దర్శాది విషయకము. నాందీ శ్రాద్ధమైతే పరులైన ముగ్గురికి ఔతుంది, అని కల్పతరువు. పృథ్వీ చంద్రోదయమైతే - ముగ్గురు బ్రతికి ఉంటే ముగ్గురికి పరమైన వారికి ఇవ్వాలి, అనే మనువు ఉక్తి వల్ల అని అంది. అంతట వికల్పము. అది దేశాచారాన్ననుసరించి వ్యవస్థ అని అన్నారు. సుదర్శన భాష్యమందైతే మాసిక శ్రాద్ధమైతే బ్రతికున్న పిత్రాదులైనా వ్యుత్క్రమ మృతపిత్రాదులు కలవారైనా చేయాల్సిందే అని చెప్పారు. మదనరత్నమందు క్రతువిట్లా - అష్టకాదులు, సంక్రాంతి మన్వాదులు, యుగాదులు, చంద్ర సూర్య గ్రహణములు, వ్యతీపాతము, వీనియందు స్వేచ్ఛగా లభించిన యోగం (పూజ్య)వల్ల, తండ్రి బ్రతికి ఉన్నవాడు, అట్లా సంపూర్ణ కామ్యపరమైన శ్రాద్ధమును చేయరాదు, అని. ఇతర విశేషములు శ్రీమా తండ్రిగారు రచించిన జీవత్పితృక నిర్ణయమందు, భట్టులు రచించిన త్రిస్థలీసేతువు యందును చూచి తెలుసుకోవాలి. (అని జీవత్పితృకాది శ్రాద్ధం).

మూ॥ **అథవిభక్తా విభక్త నిర్ణయః** - పృథ్వీచంద్రోదయే మరీచిః - బహవః స్యుః యదా పుత్రాః పితురే కత్ర వాసినః, సర్వేషాంతు మతం కృత్వా జ్యేష్ఠే నైవతు యత్కృతం, ద్రవ్యేణ చా విభక్తేన సర్వైరేవ కృతం భవేత్. జ్యేష్ఠస్య కర్తృత్వేఽపి సర్వేష లభాగిన ఇత్యర్థః. తేనయే బ్రహ్మ చర్యాది నియమాస్తే ఫలిత సంస్కారత్వాత్ సర్వైః కార్యాః. ఏవం సంసృష్టినామపి తుల్యత్వాత్. మితాక్షరాయాం నారదః - భ్రాతృణా మవిభక్తానాం ఏకోధర్మః ప్రవర్తతే, విభాగేసతిధర్మోఽపి భవేత్తేషాం పృథక్ పృథక్. బృహస్పతిరపి - ఏకపాకేన వసతాం పితృదేవ ద్విజార్చనం, ఏకం భవేద్వి భక్తానాం తదేవస్యాత్ గృహే గృహే. అత్ర యద్యప్య విశేషణాత్ బ్రహ్మయజ్ఞ సంధ్యాదిష్వపి అవిభక్తానాం పృథక్ నిషేధః ప్రాప్నోతి, తథాపి ద్రవ్యసాధ్య శ్రాద్ధ వైశ్వదేవా ఓష్వేవసః. ద్రవ్యస్య అనేక స్వామి కత్వేన ఏకస్యవ్యయే అనధికారాత్. యానితు ద్రవ్యాసాధ్యాని మంత్ర జపోపవాస సంధ్యా బ్రహ్మ యజ్ఞ పారాయణాదీని నిత్య నైమిత్తిక కామ్యానితేషు పృథగేవాధికారః, ద్రవ్యవ్యయా భావేఽను మత్యనపేక్షణాత్. ద్రవ్యేణ చావి భక్తేన ఇత్యస్యా విషయత్వాత్. పృథగప్యేక పాకానాం బ్రహ్మ యజ్ఞోద్విజన్మనాం, అగ్నిహోత్రం సురార్చాచ సంధ్యా నిత్యం భవేత్తథా, ఇతి ప్రయోగ పారిజాతే ఆశ్వలాయన స్మృతేశ్చ. అగ్నిహోత్ర శబ్దోఽగ్ని సాధ్య శ్రౌతస్మార్త నిత్యకర్మ పరః తేష్వప్య న్యాను మత్యై వాధికారేణ న్యాయసామ్యాత్. పితృశ్రాద్ధాదిషు తుల్యఫలేషు నిత్యేష్వనుమతిం వినాప్యే కస్యాధికారః, ఏకోఽపి స్థావరే కుర్యాద్దా నాధ్యయన విక్రయం. ఆపత్కాలే కుటుంబార్థే ధర్మార్థే చ విశేషతః, ఇతి వచనాత్. ధర్మార్థేఽవశ్య కర్తవ్యే పితృశ్రాద్ధాదావితి విజ్ఞానేశ్వరః. కేచిత్తు విభక్తానామపి పృథక్ పాకత్వే దేశాంతరే చ దార్శికాబ్దికయోః పృథక్త్వమాహుః. భ్రాతృణామ విభక్తానాం పృథక్పాకోభవేద్యది, వైశ్వదేవాదికం శ్రాద్ధం కుర్యుస్తే వై పృథక్ పృథక్ ఇతి హారీతోక్తేః. అవిభక్తేనపుత్రేణ పితృమేధో మృతాహని, దేశాంతరే పృథక్కుర్యుర్

దర్శ శ్రాద్ధం తథైవచ, ఇతియమోక్తే శ్చేతి. తత్రమూలం చింత్యం. తదయమర్థః. పంచ మహాయజ్ఞమధ్యే దేవభూత పితృమనుష్య యజ్ఞానన్యానుమత్యా జ్యేష్ఠ ఏవకుర్యాత్. హోమాగ్రదాన రహితం వభోక్తవ్యం కదాచన, అవిభక్తేషు సంసృష్టేష్వేకేనాపి కృతేకృతం, ఇతి వ్యాసోక్తేశ్చ. యస్యతు జ్యేష్ఠేనాకృతే వైశ్వదేవేఽన్నం సిద్ధ్యేత్తేన తూష్ణీమగ్నౌ కించిత్ క్షిప్త్వా భోక్తవ్యం, యస్య త్వేషామగ్రతోఽన్నం సిద్ధ్యేత్స నియుక్త మగ్నౌ కృత్వాగ్రం బ్రాహ్మణాయ దత్వాభుంజీతేత్య విభక్తాధికారే పృథ్వీచంద్రోదయే గోభిలోక్తేః. ఆశ్వలాయనస్తు పాక పార్థక్యే పృథక్త్వం తదేకత్వేఽపృథక్త్వ మాహ - వసతామేక పాకేన విభక్తా నామపి ప్రభుః, ఏకస్తు చతురో యజ్ఞాన్ కుర్యాద్వాగ్యజ్ఞ పూర్వకాన్ అవి భక్తా విభక్తా వా పృథక్ పాకా ద్విజాతయః కుర్యుః పృథక్ పృథక్ యజ్ఞాన్ భోజనాత్ప్రాక్ దినే దినే, ఇతి.

అను॥ ఇక విభక్త అవిభక్త నిర్ణయము. పృథ్వీ చంద్రోదయమందు మరీచి ఇట్లా - తండ్రికి, అనేక మంది పుత్రులు ఒకేచోట ఉండేవారు ఉన్నట్లైతే, అందరి అభిప్రాయాన్ని గ్రహించి, పెద్దవాడు అవిభక్త ద్రవ్యంతో ఏది చేస్తాడో, అది అందరు చేసినట్లౌతుంది,అని. పెద్దవాడు కర్త ఐనా అందరు ఫలాన్ని పొందేవారు, అని అర్థము. అందువల్ల బ్రహ్మచర్యాది నియమము లేవి ఉన్నాయో వాటిని ఫలించే సంస్కారము లైనందువల్ల అందరు ఆచరించాలి. ఈ రకంగా సంసృష్టులకు గూడా (భాగస్వామి) తుల్యమైనందువల్ల. మితాక్షరమందు నారాదుడిట్లా - అవిభక్తులైన భ్రాతలకు ఒకే ధర్మం ఉంటుంది. విభాగులైతే వారికి ధర్మం కూడా విడివిడిగా ఉంటుంది,అని. బృహస్పతి కూడా - ఒకేపాకంతో ఉండేవారికి పితృదేవ, ద్విజార్చన ఒకటే ఉంటుంది. విభక్తులకైతే అదే తమతమ ఇళ్ళల్లో విడిగా ఉంటుంది,అని. ఇక్కడ విశేషణం లేనందువల్ల, బ్రహ్మయజ్ఞ సంధ్యాదులందు కూడా, అవి భక్తులకు విడిగా నిషేధము వచ్చినప్పటికీ, ఐనా అది ద్రవ్యసాధ్యమైన శ్రాద్ధ వైశ్వదేవాదులందే. ద్రవ్యమునకు అనేకమంది అధికారులైనందువల్ల ఒక్కడు ఖర్చు చేయటానికి అధికారంలేదు, ద్రవ్య సాధ్యములు కానివి, మంత్రజప, ఉపవాస సంధ్యా బ్రహ్మయజ్ఞ పారాయణాదులు ఉన్నాయో నిత్య నైమిత్తిక కామ్య కర్మలు వానియందు విడిగానే అధికార ముంది. ద్రవ్య వ్యయం లేనందువల్ల అనుమతి అపేక్ష లేదు. ద్రవ్యేణ చా విభక్తేన, అనే దానికి విషయం కానందువల్ల. ఒకే పాకమైనా అన్నదమ్ములైన బ్రాహ్మణులకు, బ్రహ్మ యజ్ఞము, అగ్నిహోత్రము, దేవతార్చన, సంధ్య నిత్యము విడిగా ఉంటాయి అని ప్రయోగ పారిజాత మందు ఆశ్వలాయన స్మృతిఉక్తి. అగ్ని హోత్ర శబ్దము, అగ్ని సాధ్యమైన శ్రౌతస్మార్త నిత్యకర్మ పరము. వానియందు కూడా ఇతరుల అనుమతితోనే అధికారము న్యాయసామ్యం వల్ల. పితృశ్రాద్ధాదులు తుల్య ఫలములు కలవి, నిత్యమైనవి. వీనియందు అనుమతి లేకున్నా ఒకనికి అధికార ముంటుంది. ఒక్కడైనా, స్థావరమందు, దాన అధ్యయన, విక్రయము చేయాలి, ఆపత్కాలమందు, కుటుంబం కొరకు, విశేషించి ధర్మం కొరకు, అనే వచనాన్ననుసరించి ధర్మార్థములు తప్పక చేయవలసినవి

పితృ శ్రాద్ధాదులందు అని విజ్ఞానేశ్వరుడన్నాడు. కొందరైతే, అవిభక్తులకు కూడా విడిగా పాకముంటే, దేశాంతరమందుంటేనూ దార్శిక, ఆబ్దికములను విడిగా అని చెప్పారు. అవి భక్తులైన భ్రాతలకు విడిగా పాకముంటే, వైశ్వ దేవాదికము, శ్రాద్ధము వారు విడివిడిగా చేయాలి, అని హారీతోక్తి. అవిభక్తుడైన పుత్రుడు పితృమృతాహమందు పితృమేధమును, దర్శ శ్రాద్ధమును దేశాంతర మందు విడిగా చేయాలి,అని యమోక్తి కూడా,అని. అక్కడ మూలాన్ని విచారించాలి. దాని అర్థమిది. పంచమహా యజ్ఞ మధ్యమందు దేవభూత పితృ మనుష్య యజ్ఞములను ఇతరుల అనుమతితో పెద్దవాడే చేయాలి,అని. ఎప్పుడు హోమ, అగ్రదానము చేయకుండా భుజించ రాదు. (మృతక శ్రాద్ధమందు దానం తీసుకునే పతితుడు అగ్రదానం). అవిభక్తులైనా, సంసృష్టులుఐనా (విడిగా) ఒకరు చేసినా అందరు చేసినట్టే అని వ్యాసోక్తి కూడా. పెద్దవాడు వైశ్వదేవం చేయకుండానే, చిన్నవానికి అన్నం లభిస్తే వాడు మౌనంగా అగ్నిలో కొంచెం విడిచి, భుజించాలి. ఎవనికి, అందరికన్న ముందుగా అన్నము సిద్ధిస్తే, ఆతడు నియుక్తమును అగ్ని యందు వేసి ఆ తరువాత బ్రాహ్మణునకు ఇచ్చి భుజించాలి అని అవిభక్తాధికార మందు, పృథ్వీచంద్రోదయ మందు గోభిలోక్తి. ఆశ్వలాయనులైతే పాకం విడిగా ఉంటే విడిగా చేయాలి. పాకం ఒకటైతే విడిగా కాదు, అని అన్నారు. విభక్తులైనవారైనా ఒకే పాకంతో ఉన్న వారైతే, ఒకడే నాలుగు యజ్ఞములను వాక్ యజ్ఞ పూర్వకముగా చేయాలి. ప్రభువు. అవిభక్తులైనా విభక్తులైనా ద్విజాతులు, విడివిడి పాకం కలవారైతే, భోజనంకన్న ముందు, ప్రతిదినము విడివిడిగా యజ్ఞాలు చేయాలి,అని.

మూ।। **బ్రహ్మయజ్ఞ సంధ్యా స్నాన తర్పణాది తూక్త హేతోః** పృథగేవ. దేవపూజా **తూక్త** వచన, ద్వయా దేకత్ర పృథగ్వా. **దర్శగ్రహణ** శ్రాద్ధాది త్వేకస్యైవ. తీర్థ శ్రాద్ధాద్యపి యుగపత్సర్వేషా మవిభక్తానాం ప్రాప్తావేకస్య. భేదేన ప్రాప్తౌభిన్నం గయా శ్రాద్ధేఽప్యేవం. **ఏష్టవ్యా బహవః పుత్రాః శీలవంతో** గుణాన్వితాః, తేషాంతు సమవేతానాం యద్యేకోఽపి గయాం వ్రజేత్. **తారితాః స్తోమయం** తేన సయాతి పరమాంగతిం. ఇతి హేమాద్రౌ కౌర్మోక్తేః. కామ్యేఽపి దానహోమా దావన్యాను మత్యైవాధికారః. ద్రవ్యాసాధ్యజపాదౌతాం వినాపి. **అపరార్కేపైఠీనసిః** - విభక్తైస్తు పృథక్కార్యం ప్రతి సంవత్సరాదికం, ఏకేనైవా విభక్తేషు కృతేసర్వైస్తు తత్కృతం. సంవత్సరాత్పూర్వాణి మాసికాన్యేక త్రైవ. **తదాహలఘు హారీతః** - సపిండీకరణాంతాని యాని శ్రాద్ధా నిషోడశ, పృథఙ్ నైవ సుతాః కుర్యుః పృథక్ ద్రవ్యా అపిక్వచిత్. సపిండనం మాసి కోప లక్షణం. అర్వాక్ సంవత్సరాజ్జ్యేష్ఠః శ్రాద్ధం కుర్యాత్సమేత్యతు, ఊర్ధ్వం సపిండీకరణాత్సర్వే కుర్యుః పృథక్ పృథక్, ఇతి వ్యాసోక్తేః. ఉశనాః - నవశ్రాద్ధం సపిండత్వం శ్రాద్ధాన్యపి చ షోడశ, ఏకేనైవతు కార్యాణి సంవిభక్త ధనేష్వపి మఘాత్రయోదశీ శ్రాద్ధం త్వవిభక్తానా మపి పృథక్ ఇత్యుక్తం ప్రాక్. యత్తు

వృద్ధ వసిష్ఠః - మాసికం చ వృషో త్సర్గం సపిండీకరణం తథా, జ్యేష్ఠే నైవ ప్రకర్తవ్యం **ఆబ్దికం** ప్రథమంతథా, ఇతి. తన్నిర్మూలం బహ్వృచ పరిశిష్టే నవశ్రాద్ధం సహదద్యుః ఇతి. **అథ తీర్థ శ్రాద్ధం** - తత్ర యద్యప్యస్మత్పితామహ కృత త్రిస్థలీ సేతు రేవజాగర్తి, తథాపి కించిదుచ్యతే. **తత్ర యాత్రాయాం** - సహాగ్ని ర్వా సపత్నీకో గచ్ఛేత్తీర్థాని సంయతః. **ప్రాయశ్చిత్త** వ్రజేత్తీర్థం పత్నీ విరహితోఽపివా, యజ్ఞేష్వ నధికారీ చ యశ్చవా మంత్ర సాధకః, ఇతి కౌర్మవచనాత్ సాగ్నేః సపత్నీకస్యైవాధికారః. **భారతే** - బ్రాహ్మణః క్షత్రియోవైశ్యః శూద్రో వారాజ సత్తమ, నవియోనిం వ్రజంత్యే తే స్నానా త్తీర్థే మహాత్మనః **స్కాందే విధవా ధర్మేషు** - స్నానం దానం తీర్థయాత్రా విష్ణు నామగ్రహం ముహుః, ఏతత్పుత్రాద్యనుమత్యైవ.

అను॥ బ్రహ్మ యజ్ఞ సంధ్య స్నాన తర్పణాదులు ముందు చెప్పిన కారణంగా విడిగానే చేయాలి. దేవపూజ మాత్రం పైన చెప్పిన రెండు మాటల ననుసరించి కలిసి కాని విడిగా కాని చేయాలి. దర్శగ్రహణ శ్రాద్ధాదులైతే ఒకనికే. తీర్థ శ్రాద్ధాదులు కూడా ఒకేసారి, అవి భక్తులైన సోదరులందరికి ప్రాప్తిస్తే ఒకడే చేయాలి. భేదంగా వస్తే భిన్నంగా చేయాలి. గయా శ్రాద్ధమందు కూడా ఇట్లాగే. శీలవంతులు, గుణవంతులు చాలామంది పుత్రులు కావాలని కోరాలి. వారందరిలో ఒక్కడైనా గయకు వెళ్ళితే, వానితో మేమంతా తరించినాము, వాడు ఉత్తమ గతికి పోతాడు, అని హేమాద్రి యందు కూర్మపురాణోక్తి. కామ్యమందు కూడా దానహోమాదులందు ఇతరుని అనుమతితోనే అధికారము. ద్రవ్య అసాధ్యములైన జపాదులందైతే అనుమతి లేకుండానే అధికారము. అపరార్కమందు పైఠీనసి ఇట్లా - విభక్తులైనవారైతే ప్రతిసంవత్సరాదికమును విడిగా చేయాలి. అవిభక్తులైతే, ఒకడు చేసినా (జ్యేష్ఠుడు) అది అందరు చేసినట్టే,అని. సంవత్సరముకన్న ముందున్న మాసికములు ఒకచోటనే చేయాలి. లఘుహారీతు డిట్లా అన్నాడు - సపిండీకరణాంతమైన పదహారు శ్రాద్ధములు ఏవున్నాయో వానిని పుత్రులు విడివిడిగా చేయరాదు. ఒక్కోసారి పృథక్ ద్రవ్యులైనా (విభజనైనా),అని. సపిండన మనేది మాసికములకు ఉపలక్షణము. సంవత్సరముకన్న ముందు జ్యేష్ఠుడు కలిసి శ్రాద్ధం చేయాలి. సపిండీకరణం తరువాత అందరు విడివిడిగా చేయాలి, ఉశనుడిట్లా - నవ శ్రాద్ధము, సపిండత్వము, పదహారు శ్రాద్ధములు వీనిని ఒకడే చేయాలి. ధనం పంచుకున్నా కూడా,అని. మఘా త్రయోదశి శ్రాద్ధము, అవిభక్తులకైనా విడిగానే, అని ముందు చెప్పాము. వృద్ధ వసిష్ఠుడు ఇట్లా - మాసికము, వృషోత్సర్గము, సపిండీకరణము, ప్రథమాబ్దికము వీనిని జ్యేష్ఠుడే చేయాలి,అని ఏదన్నాడో అది మూలము లేనిది. బహ్వృచ పరిశిష్టమందు, నవశ్రాద్ధమును కలిసి ఇవ్వాలి, అని అన్నారు. ఇక తీర్థ శ్రాద్ధము. అక్కడ, మాపితామహులు వ్రాసిన త్రిస్థలీ సేతువు ఈ విషంలో జాగృతి కల్గించినా, ఐనా కొంచెం చెప్తాము. అక్కడ యాత్రయందు - అగ్నితో, సపత్నీకుడై, సంయతుడై

తీర్థములకు వెళ్ళాలి,అని. ప్రాయశ్చిత్తం (కొరకు) చేసుకోవలసినవాడు, భార్యలేనివాడు, యజ్ఞములందు అధికారం లేనివాడు మంత్రసాధకుడు వీరు తీర్థములకు వెళ్ళాలి,అనే కూర్మపురాణ వచనం ఉన్నందున అగ్ని, పత్నికలవాడే అధికారి,అని. భారతమందు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు ఎవరైనా కాని ఓరాజసత్తమ! మహాత్ముల(లు) తీర్థ మందు స్నానం చేస్తే వీరు నిందితయోని యందు జన్మించరు,అని. స్కాందమందు - విధవ ధర్మములందు - స్నానము, దానము, తీర్థయాత్ర, మాటిమాటికి విష్ణునామ గ్రహణము అని చెప్పారు. ఇది పుత్రాదుల అనుమతితోనే.

**మూ॥ సధవాయాః** పత్యాసహైవేతి ప్రాగుక్తం. **కాశీఖండే - మాతుః పితుః** క్షేప్తు మనా స్తథాస్థి సుతస్తు కుర్యాత్ ఖలుతీర్థయాత్రాం, తద్విధిః స్కాందే - తీర్థయాత్రాం చి కీర్షుః ప్రాగ్విధాయో పోషణం గృహే, గణేశం చ పితౄన్ విప్రాన్ సాధూన్ శక్త్యా ప్రపూజ్యచ కృతపారణకో హృష్టో గచ్ఛేన్నియమధృక్ పునః, ఆగత్యాభ్యర్చ్య చ పితౄన్ యథోక్త ఫలభాక్ భవేత్. **ఉపవాసాత్ప్రాక్** ముండనం చ కార్యం. ప్రయాగే తీర్థ యాత్రాయాం పితృమాతృ వియోగతః కచానాం వపనం కుర్యాత్ వృధాన వికచోభవేత్. ఇతి విష్ణూక్తేః. ప్రాయశ్చిత్తార్థ యాత్రాయాం గంగాయాం చైతదిత్యేకే. కేచిత్తు హేమాద్రౌ మహాభారతే - కేశశ్మశ్రునఖాదీనాం వపనం న చ శస్యతే, అతోన కార్యం వపనం గయా శ్రాద్ధార్థినా సదా. యే భారతేఽస్మిన్ పితృ కర్మతత్పరాః సంధార్యకేశానతి భక్తి భావితాః, ఋణక్షయార్థం పితృతీర్థమా గతాః తేషాం ఋణం సంక్షయ మేష్యతి ధ్రువం, ఇతి నిషేధాత్ గయా యాత్రాంగం వపనం న కార్యమిత్యాహుః. వస్తుతస్తు గయాధికరణస్త్యై వాయం నిషేధః. నతు యాత్రాంగస్య. శ్రాద్ధార్థినా ఇత్యుక్తేః. విశాలం, విరజం, గయాం ఇత్యనే నైక వాక్యత్వాచ్చ. **శ్రాద్ధం చ షట్ నవ ద్వాదశ** దైవతం వాఘృతేన కార్యం. గచ్ఛేద్దేశాంతరం యస్తు శ్రాద్ధం కుర్యాత్స సర్పిషా, ఇతి విష్ణుపురాణాత్. యాత్రాంగ వృద్ధి శ్రాద్ధోక్తేశ్చ. శ్రాద్ధం చ పారణాదినే ఏవ. ఉపోష్య రజనీ మేకాం ప్రాతః శ్రాద్ధం విధాయ చ, గణేశం బ్రాహ్మణాన్నత్వా భుక్త్వా ప్రస్థితవాన్ సుధీః, ఇతి స్కాంద లింగాత్. **గౌడ నిబంధే గౌతమః** - తీర్థయాత్రా సమారంభేతీర్థాత్ ప్రత్యా గమేఽపిచ, వృద్ధి శ్రాద్ధం ప్రకుర్వీత బహుసర్పిః సమన్వితం. వృద్ధిపదం తద్ధర్మార్థం. **శ్రాద్ధోత్తరం** యాత్రా సంకల్ప ఇతి భట్టాః. **వాయవీయే** - ఉద్యతస్తు గయాంగంతుం శ్రాద్ధం కృత్వా విధానతః, విధాయ కర్పటీ వేషం గ్రామం కృత్వా ప్రదక్షిణం. తతో గ్రామాంతరం గత్వా శ్రాద్ధ శేషస్య భోజనం. ఘృతస్య భోజనం. తచ్చ క్రోశమధ్యే. శ్రాద్ధోత్తరం క్రోశగమన నిషేధాత్. తతః ప్రతిదినం గచ్ఛేత్ ప్రతిగ్రహ వివర్జితః, గయాయా మేవైతన్నాన్య త్రేతికేచిత్. హేమాద్రిస్తు - గయాయాం శ్రాద్ధదినే ఏవ ప్రస్థానం. తీర్థాంతరేతు శ్రాద్ధోత్తర దినే ఇత్యాహ.

అను॥ భర్త కల స్త్రీ ఐతే, భర్తతోపాటే యాత్రఅని ముందు చెప్పాము. కాశీఖండ మందైతే - అట్లాగే, తలిదండ్రుల అస్థులను క్షేపం చేయాలనుకుంటే అప్పుడు పుత్రుడు

తీర్థయాత్ర చేయాలి,అని. దాని విధానము స్కాందమందు – తీర్థయాత్ర చేయాలనుకునేవాడు, తొలుత ఇంటిలో ఉపవాసం చేయాలి. గణేశుని, పితరులను, బ్రాహ్మణులను, సాధువులను శక్తి కొలది పూజించాలి. ఆపై పారణ చేసి, సంతోషంగా, తిరిగి నియమముల ధరించి బయల్దేరాలి. యాత్ర నుండి తిరిగి వచ్చి పితరుల పూజిస్తే చెప్పబడిన ఫలమును పొందుతాడు, అని. ఉపవాసంకన్న ముందు ముండనము కూడా చేసుకోవాలి. ప్రయాగయందు, తీర్థయాత్రయందు, పితృమాతృ వియోగమందు (మరణం) వెంట్రుకలకు వపనం (క్షౌరం) చేయాలి. వ్యర్థంగా వికచుడు కారాదు,అని విష్ణూక్తి. ప్రాయశ్చిత్తము కొరకైన యాత్ర యందు, గంగయందును (ముండనము) ఇది అని కొందరన్నారు. హేమాద్రి యందు మహాభారతోక్తి ఇట్లా – కేశములు, మీసములు, గడ్డము, నఖములు మొదలగువాని వపనము తగదు. అందువల్ల గయాశ్రాద్ధార్థి ఎల్లప్పుడు వపనం చేసుకోరాదు,అని ఉంది, అని అన్నారు. ఈ భారతదేశమందు ఎవరు పితృకర్మ తత్పరులో, కేశముల ధరించి, అతి భక్తి భావం కలవారై ఋణవిముక్తి కొరకు పితృ తీర్థం వస్తారో వారి ఋణము తప్పకుండా నశిస్తుంది,అని నిషేధమున్నందువల్ల గయాయాత్రాంగమైన వపనము చేసుకోరాదు,అని అన్నారు కొందరు. కాని, నిజానికైతే ఇది గయాధి కరణమునకే (గయాధికార అంగము) నిషేధము. యాత్రాంగమునకు నిషేధము కాదు. శ్రాద్ధార్థినా, అని చెప్పినందువల్ల విశాలము (బద్రీ) విరజ (ఉత్కల) గయ అనే దానితో ఏకవాక్యమై నందువల్ల. (యత్రార్థి అనలేదు) శ్రాద్ధమైతే ఆరు దేవతలు లేదా తొమ్మిది మంది దేవతలు లేదా పన్నెండు మంది దేవతలు కలది. ఘృతంతో చేయాలి. దేశాంతరం వెళ్ళేవాడు నేయితో శ్రాద్ధం చేయాలి,అని విష్ణుపురాణ వచనం. ఇది యాత్రాంగ వృద్ధి శ్రాద్ధ మన్నారు. పారణ దినమందే శ్రాద్ధము. ఒకరాత్రి ఉపవసించి, తెల్లవారి శ్రాద్ధ మాచరించి, గణేశుని బ్రాహ్మణులను నమస్కరించి, భోజనంచేసి, బుద్ధిమంతుడు బయలు దేరాలి, అని స్కాంద మందు వచనము. గౌడ నిబంధమందు గౌతముడిట్లా – తీర్థయాత్ర ఆరంభమందు, తీర్థయాత్ర నుండి వచ్చాక చాలా నేయితో వృద్ధి శ్రాద్ధ మాచరించాలి,అని. వృద్ధి పదము ధర్మము కొరకు శ్రాద్ధం తరువాత యాత్రా సంకల్పము అని భట్టులన్నారు. వాయవీయమందైతే – గయకు వెళ్ళటానికి ఆరంభిస్తే, విధాన పూర్వకముగా శ్రాద్ధం చేసి, కర్పటీ వేషాన్ని ధరించి (కాషాయం) గ్రామ ప్రదక్షిణం చేసి, ఆపిదప మరో గ్రామానికి వెళ్ళి, శ్రాద్ధ శేషాన్ని భుజించాలి,అని. ఘృతము భుజించుట (పారణం) అది కోసుమధ్యలో, శ్రాద్ధం తరువాత కోసుదూరం వెళ్ళరాదని నిషేధించారు. ఆ తరువాత ప్రతిరోజు ప్రతిగ్రహం చేయకుండా వెళ్ళాలి (దానం పట్టకుండ) ఈ ప్రతి గ్రహ నిషేధం గయలోనే వేరేచోట కాదు అని కొందరన్నారు. హేమాద్రి ఐతే – గయా ప్రయాణమైతే శ్రాద్ధ దినమందే బయలు దేరాలి,అని. వేరే తీర్థమునకైతే శ్రాద్ధము చేసిన తరువాతి దినమున బయలు దేరాలి, అని అన్నాడు.

మూ॥ **ప్రభాసఖండే** - యచ్చాన్యం కారయే చ్ఛక్త్యా తీర్థయాత్రాం నరేశ్వరః, స్వకీయ ద్రవ్యయానాభ్యాం తస్య పుణ్యం చతుర్గుణం. **యాత్రామధ్యే ఆశౌచే** రజసి చా శుద్ధి పర్యంతం స్థిత్వా తదంతే గచ్ఛేత్. మార్గవైషమ్యే త్వ దోషః. **యాత్రామధ్యే** తీర్థాంతర ప్రాప్తౌ శ్రాద్ధాది కార్యమేవ. **వాణిజ్యాద్యర్థం** గతేతు ముండనోపవాసాది,న కార్యమితి ప్రయాగ సేతౌ భట్టాః. వస్తు తస్తు తత్రాపి ముండనోపవాస శ్రాద్ధాది కార్యం. అర్థం తీర్థ ఫలంతస్యయః ప్రసంగేన, గచ్ఛతి, ఇతి బ్రాహ్మోక్తేః. **స్కాందే** - ద్విర్భోజనం తృతీయాంశే హరేత్తీర్థ ఫలస్యచ, వాణిజ్యం త్రీం స్తథా భాగాన్ హంతి సర్వం ప్రతిగ్రహః. **యానమర్థం చతుర్థాంశం ఛత్రో** పానహమేవచ, ఇత్యుత్తరార్థ పాఠాంతరం. **అత్రనదీషు విశేషః** - మార్గేంతరా నదీ ప్రాప్తౌ స్నానాది పరపారతః అర్వాగేవ సరస్వత్యా ఏష మార్గగతోవిధిఃయత్తు - పితౄన తర్పయిత్వాతు నదీస్త రతియోనరః తస్యా సృక్పాన కామాస్తే భవంతి భృశ దుఃఖితాః, ఇతి తత్సరస్వతీ పరం. శంఖః - తీర్థం ప్రాప్యానుషంగేన స్నానం తీర్థే సమాచరేత్, స్నానజం ఫలమాప్నోతి తీర్థయాత్రాకృతం నతు స ఏవ - న ప్రవంతీమతి క్రామేదనవ సిచ్య. **తీర్థప్రాప్తౌతు** ప్రభాసఖండే - యానానితు పరిత్యజ్య భావ్యం పాదచరైర్నరః, లురిత్వా లోరనీం తత్ర కృత్వా కార్పటికా కృతిం. కృత్వేతి గృహాన్నిర్గమ సమయేఽ కరణే ఇదం. ప్రథమం చాలభేత్తీర్థం ప్రణవేన జలం శుచి, అవగాహ్య తతః స్నాయాత్ యథావన్మం త్రయోగతః.

అను॥ ప్రభాసఖండమందిట్లా - ఏనరేశ్వరుడు, తన ద్రవ్యంతో, తన యానంతో శక్తి కొలది ఇతర నరుని తీర్థయాత్ర చేయిస్తాడో, ఆతనికి నాలుగింతల పుణ్యం లభిస్తుంది, అని. యాత్ర మధ్యలో ఆశౌచంవస్తే, రజోధర్మంవస్తేనో అశుద్ధి పోయేవరకు అక్కడే ఉండి, ఆ తరువాత వెళ్ళాలి. మార్గం విషమంగా ఉంటే దోషం లేదు. యాత్రా మధ్యంలో మరో తీర్థం వస్తే శ్రాద్ధాదులు చేయాల్సిందే. వాణిజ్యాదుల కొరకు వెళితే ముండన ఉపవాసాదులు చేయరాదు,అని ప్రయాగసేతువు యందు భట్టులన్నారు. నిజానికైతే అక్కడ కూడా ముండన ఉపవాస శ్రాద్ధాదులు చేయాలి. ప్రసంగవశాత్తు వెళ్ళిన వానికి తీర్థ ఫలము సగం లభిస్తుంది,అని బ్రాహ్మోక్తి. స్కాందమందిట్లా - తీర్థయాత్రలో రెండుసార్లు భోజనం చేస్తే అది ఫలితంలో మూడవ భాగాన్ని హరిస్తుంది. వాణిజ్యము కూడా మూడు భాగాలను హరిస్తుంది. ప్రతి గ్రహము మొత్తం ఫలితాన్ని హరిస్తుంది,అని. యానము సగం ఫలమును నాల్గవభాగమును గొడుగు చెప్పులు హరిస్తాయి,అని శ్లోక ఉత్తరార్థమునకు పాఠాంతరము ఇక్కడ నదులలో విశేషము- మార్గమధ్యంలో నదివస్తే స్నానాదులు అవతలి ఒడ్డుకు వెళ్ళి చేయాలి. సరస్వతి నదికైతే ఆ ఒడ్డుననే చేయాలి. ఇది మార్గగతమైన విధి, అని. పితరులకు తర్పణం చేయకుండా నదులను ఎవడు దాటుతాడో, వాడి రక్తాన్ని తాగే కోరిక గల వారౌతారు, బాగా దుఃఖితులౌతారు. పితరులు,అని. ఇది సరస్వతీ నది పరకమైన మాట. శంఖుడిట్లా - తీర్థమును అనుషంగంగా (ప్రసంగవశంగా) చేరి తీర్థమందు స్నానం చేస్తే,

అతనికి స్నానఫలం లభిస్తుంది. తీర్థయాత్రా ఫలం లభించదు,అని. అతడే ఇట్లా – అవసేచనం చేయకుండా ప్రవహించే నదిని దాటరాదు,అని. (చల్లుకోవటం), తీర్థమునకువస్తే ప్రభాసఖండమందిట్లా యానములను వదలి నరులు పాదచారులు కావాలి. పొర్లుతూ, ఇటు నుండి అటు పాద చారులై తిరుగుతూ (లోరలుఠ), సన్యాసి వస్త్రములు ధరించి, ఉండాలి,అని. చేసి, అనగా ఇంటినుండి బయలు దేరినప్పుడు చేయకపోతే ఇప్పుడు ఆ వస్త్రం ధరించాలి (సాష్టాంగ ప్రణామం చేస్తు ముసుగు, అంగి, మాల్య శస్త్రాదులు వదలాలి). శుచియైన జలాన్ని, తొలుత ప్రణవంతో తీర్థాన్ని పొందాలి. ఆ తరువాత మునిగి స్నానం చేయాలి, యథావత్తుగా, మంత్రముకలవాడై, (సచేలము, నీటిని కదల్చి) చేయాలి. (సాగరస్వన నిర్ఘోష దండహస్త సురాంతక, జగత్ స్రష్ట జగన్మిత్ర నమామిత్వాం సురేశ్వర. తీక్ష్ణదంష్ట్ర మహాకాయ కల్పాంత దహనోపమ, భైరవాయ నమస్తుభ్యం అనుజ్ఞాం దాతుమర్హసి తీర్థస్నాన మంత్రం. ప్రణవంతో స్పర్శ సచైలస్నానం, వపనం, సమంత్రకస్నానం అముకతీర్థాయనమః పుష్ప, అక్షత, ఫల, దక్షిణ ఆదితో అంజలి ఘటించాలి. వట్టి చేతులతో కూడదు అని).

**మూ॥ మంత్రశ్చ ప్రభాసఖండే** – నమోస్తు దేవ దేవాయ శితి కంఠాయ దండినే, రుద్రాయ చాపహస్తాయ చక్రిణే వేధసే నమః. సరస్వతీ చ సావిత్రీ వేదమాతా గరీయసీ, సన్నిధాత్రీ భవత్వత్ర తీర్థే పాప ప్రణాశినీ, ఇతి మంత్రవత్ స్నానం చ వపనోత్తరం కార్యం. **పూర్వ మావాహనం** తీర్థే ముండనం తదనంతరం, తతః స్నానాదికం కుర్యాత్ పశ్చా చ్ఛ్రాద్ధం సమాచరేత్, ఇత్యుక్తేః. యత్తు – గత్వా స్నానం ప్రకుర్వీత వపనం తదనంతరం, ఇతి తన్మశల స్నానపరం. కాశీఖండే – తీర్థోపవాసః కర్తవ్యః శిరసో ముండనం తథా. ఉపవాసే తత్రైవోక్తం – యదహ్నా తీర్థ ప్రాప్తిః స్యాత్తదహ్నః పూర్వవాసరే, ఉపవాసః ప్రకర్తవ్యః ప్రాప్తేఽహ్ని శ్రాద్ధదోభవేత్. అత్ర ఉపవాసంతతః కుర్యాత్ తస్మిన్నహని సువ్రతః, ఇతి ప్రాప్తిదినే వ్యుపవాసోక్తేర్వికల్పః. ముండనేతు స్కాంద దేవలౌ – ముండనం చోపవాసం చ సర్వతీర్థేష్వయం విధిః, వర్జయిత్వా కురుక్షేత్రం విశాలం విరజాంగయాం. విరజం=లోణారం. ప్రసిద్ధ మహాతీర్థపరః సర్వతీర్థశబ్దః. అత్రవిశేషః స్మృత్యంత రే – ఊర్ధ్వమబ్దాత్ ద్విమాసోనాత్ పునస్తీర్థం వ్రజేద్యది, ముండనం చోపవా సంచతతోయత్నేన, కారయేత్. తదా తద్వపనేశస్తం ప్రాయశ్చితమృతే ద్విజ, ఇతి వాపాఠః. ప్రయాగే ప్రతియాత్రంతు యోజన త్రయమిష్యతే, క్షౌరం కృత్వాతు విధివత్ తతః స్నాయాత్ సితాసితే. తథా చ బృహస్పతిః – క్షౌరం నైమిత్తికంకార్యం నిషేధే సత్యపి ధ్రువం, పిత్రాది మృతి దీక్షాసు ప్రాయశ్చిత్తేఽథ తీర్థకే. అపరార్కే స్కాందే – ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖోవావ పనం కారయేత్సుధీః కేశశ్మశ్రు లోమనఖాన్యు దక్ సంస్థాని వాపయేత్. ఇదం ప్రయాగే సధవానామపి సమూలం భవతీతి భట్టాః. సర్వాన్ కేశాన్ సముద్ధృత్య ఛేదయే దంగులద్వయం. ఏవమేవహి నారీణాం శస్యతేవపన క్రియా,ఇతి. తచ్చాకృత చూడానాం నకార్యమితి కేచిత్. తత్వంతు నైమిత్తికత్వాత్ పిత్రాదిమృతవత్ కార్యమేవేతి. తదాపి ప్రయాగే నిత్యం నాన్యత్ర. తచ్చ యతిభిః తీర్థేఽపి ఋతు

సంధిష్వేవ కార్యం నాన్యదా. కక్షోపస్థ శిఖా వర్జం ఋతు సంధిషు వాపయేత్, ఇతి స్మృతేః ఇదం జీవత్పితృకేనాపి తీర్థే కార్యం. న చ ముండనం పిండదానం చ, ఇతి దక్షవచనేన నిషేధః, వినాతీర్థం వినాయజ్ఞం మాతాపిత్రోః మృతింవినా, యోవాపయతిలోమాని సపుత్రః పితృఘాతుకః ఇతి స్మృత్యాతత్సంకోచాత్. తదపి ప్రయాగే ప్రతియాత్రం. అన్యతీర్థే ఆద్యయాత్రా యామేవేతిశిష్టాః తతః స్నానం.

అను॥ ప్రభాసఖండంలో మంత్రమిట్లా - దేవ దేవునకు నమస్కారము. శితి కంఠునకు, దండధారికి, రుద్రునకు, చాపహస్తునకు, చక్రధారికి, వేధకు నీకు నమస్కారము, అని. సరస్వతి, గొప్పదైన వేదమాతయైన సావిత్రి, ఇక్కడ తీర్థమందు సన్నిధానంలో ఉండి, పాపములను నశింపచేయనీ,అని. మంత్రముగల స్నానంను వపనం తర్వాత చేయాలి. తొలుత తీర్థమందు ఆవాహనము ఆ పిదప ముండనము ఆ పిదప స్నానాదికము చేయాలి. ఆ పిదప శ్రాద్ధమాచరించాలి,అని వచనము. వెళ్ళి స్నానం చేయాలి, ఆ పిదప వపనము,అనే మాట ఏదుందో అది ముశలస్నాన పరము. (సమూహస్నానం). కాశీఖండమందిట్లా - శిరోముండనము తీర్థోపవాసము చేయాలి,అని. ఉపవాసమందు అక్కడే ఇట్లా చెప్పారు - తీర్థప్రాప్తి ఏ రోజు ఉంటుందో దానికన్న ముందు రోజు ఉపవాసం చేయాలి. తీర్థానికి వచ్చిన రోజున శ్రాద్ధమును ఇవ్వవచ్చు,అని. ఇక్కడ - సువ్రతుడు, ఆ పిదప ఆరోజు ఉపవాసం చేయాలి, అని వచ్చిన రోజున కూడా ఉపవాసం చెప్పారు కనుక అది వికల్పము. ముండనమందైతే స్కాంద, దేవలులిట్లా - ముండనము, ఉపవాసము సర్వతీర్థములందు ఇదే విధి. కురుక్షేత్రము విశాలము (బద్రి) విరజ (ఉత్కలదేశం) గయ వీటియందు తప్ప. విరజ అనగా లోణారము సర్వతీర్థ శబ్దము ప్రసిద్ధ మహాతీర్థపరము. ఇక్కడ విశేషము స్మృత్యంతరమందిట్లా - సంవత్సరంకన్న రెండు నెలలు తక్కువగా ఉన్నప్పుడే తిరిగి తీర్థానికి వెళితే, ప్రయత్న పూర్వకముగా ముండనము, ఉపవాసము ఆచరించాలి అట్లాఐతే ఆవపనము ప్రాయశ్చిత్తము లేకుండాఐతే ప్రశస్తము, ఓద్విజ! అని కాని పాఠము. ప్రయాగయందు ప్రతియాత్ర కూడా మూడు యోజనములు ఇష్టమైంది (పన్నెండుకోసులు) వచ్చాకనే క్షౌరము (ప్రయాగంలో ఒక సం॥లో రెండుసార్లు క్షౌరం తగదు కనుక) విధి ప్రకారము క్షౌరం చేసుకొని ఆ పిదప గంగ యమునల యందు స్నానం చేయాలి. బృహస్పతి ఇట్లా - నిషేధమున్నప్పటికి నైమిత్తికమైన క్షౌరాన్ని తప్పక చేసుకోవాలి. పిత్రాదుల మృతి యందు దీక్షయందు, ప్రాయశ్చిత్తమందు, తీర్థమందు,అని. అపరార్కమందు స్కాందోక్తి ఇట్లా - బుద్ధిమంతుడు ఉత్తరముఖంగాని, తూర్పుముఖంగా కాని కూర్చొని క్షౌరం చేయించుకోవాలి. కేశశ్మశ్రునఖములను ఉత్తరమున ఉన్నవి కొరిగించుకోవాలి. ఇది ప్రయాగయందు భర్తలు కల స్త్రీలకు కూడా సమూలం ఔతుంది అని భట్టులన్నారు అన్ని కేశములను ఎత్తిపట్టి రెండు అంగుళములు చేధించాలి. ఈ రకంగానే స్త్రీలకు వపనక్రియ ప్రశస్తమైంది,అని.

అది పుట్టువెంట్రుకలు తీయని వారికి వపనం చేయరాదని కొందరన్నారు. యథార్థమైతే - నైమిత్తికమైనందువల్ల తలిదండ్రులు మరణిస్తే చేసినట్టు చేయాల్సిందే,అని అది కూడా ప్రయాగయందు తప్పనిసరి. ఇతరత్ర కాదు. అది కూడా యతులైతే తీర్థమందు కూడా ఋతువుల సంధియందే ఆచరించాలి, మరొకప్పుడు కాదు. చంక, ఉపస్థ, శిఖ వీనిని వదలి, ఋతు సంధులందు వపనం చేయించుకోవాలి, అని స్మృతి. దీనిని జీవత్పితృకుడైనా తీర్థమందు చేయించుకోవాలి. ముండనము పిండదానము, అనే దక్ష వచనంతో నిషేధము లేదు. తీర్థము, యజ్ఞము, మాతాపితరుల మృతి ఇవి లేకుండా రోమములను వపనం చేయించుకునేవాడు ఆ పుత్రుడు పితృఘాతుకుడు అని స్మృతి వచనం ఉన్నందువల్ల పై వాక్యమునకు సంకోచము. అది కూడా ప్రయాగయందు ప్రతియాత్ర యందు చేయాలి. ఇతర తీర్థములందైతే తొలియాత్ర యందే అని శిష్టులన్నారు. ఆ పిదప స్నానము.

మూ॥ **పరార్థేతు** మార్కండేయపురాణే - మాతరం పితరం జాయాం భ్రాతరం సుహృదం గురుం, యముద్దిశ్య నిమజ్జేత అష్టమాంశం లభేత్తుసః. పైఠీనసిః - ప్రతికృతిం కుశమయీం తీర్థ వారిణిమజ్జయేత్. మజ్జయేచ్చయముద్దిశ్య సోష్టభాగం ఫలం లభేత్. తతస్తర్పణ శ్రాద్ధే **పృథ్వీ చంద్రోదయే** బ్రహ్మదేవీపురాణ కాశీఖండాదిషు - అకాలేఽప్యథవా కాలేతీర్థే శ్రాద్ధం చ తర్పణం, అవిలంబేన కర్తవ్యం నైవవిఘ్నం సమాచరేత్. మాత్స్యే - పితౄణాం చైవతర్పణం ఇతి తుర్యపాదః అత్రదేవతా మహాలయనిర్ణయే ప్రాగుక్తాః. **శంఖదేవలౌ** - తీర్థద్రవ్యో పపత్తౌ చనకాల మవధారయేత్, పాత్రం చ బ్రాహ్మణం ప్రాప్య సద్యః శ్రాద్ధం సమాచరేత్. **హారీతః** - దివావా యది వారాత్రౌ భుక్తోవో పోషితోఽపివా, నకాల నియమస్తత్ర గంగాం ప్రాప్య సరిద్వరాం. **భారతే** - భుక్తో వాప్యథవా భుక్తో రాత్రౌ వాయదివాదివా, పర్వకాలేఽథవా కాలేశుచిర్వా ప్యథవా శుచిః. యదైవ దృశ్యతే తత్ర నదీచ త్రిపథగా ప్రియా, ప్రణామం దర్శనం తస్మాన్న కాలస్తత్ర కారణం. **ఆశౌచేఽపి కార్యం.** వివాహ దుర్గ యజ్ఞేషు యాత్రాయాం తీర్థకర్మణి, నతత్ర సూతకం తద్వత్ కర్మయజ్ఞాది కారయేత్, ఇతి పైఠీనసి స్మృతేః. తదానీ మకరణే త్వాశౌచాంతే ఏవకుర్యాత్. ప్రభాసఖండే - నవారం న చ నక్షత్రం న కాలస్తత్రకారణం, యదైవ దృశ్యతే తీర్థం తదా పర్వ సహస్రకం. **మలమాసేఽపి** కార్యం నిత్య నైమిత్తికే కుర్యాత్ ప్రయతః సన్మలిమ్లుచే, తీర్థశ్రాద్ధం గజచ్ఛాయాం ప్రేత శ్రాద్ధం తథైవచ, ఇతి బృహస్పతి స్మృతేః. ఏతచ్చా శౌచేకృత భోజనస్య రాత్రౌవా స్నాన శ్రాద్ధాదిక మాకస్మిక తీర్థ ప్రాప్తా వామహోమ శ్రాద్ధ విషయం గ్రహణాదివత్, నతు బుద్ధిపూర్వ మాశౌచాదౌ తీర్థప్రాప్తిఃకార్యా మలమాసేతుమాసద్వయేతీర్థ శ్రాద్ధంకార్యమితి.

అను ॥ ఇతరుల కోసమైతే మార్కండేయ పురాణమందిట్లా - తల్లి, తండ్రి, భార్య, భ్రాత, స్నేహితుడు, గురువు వీరిలో ఎవరినుద్దేశించిమునిగినా, అతడు ఎనిమిదవభాగాన్ని పొందుతాడు, అని. పైఠనసిఇట్లా - కుశలతోచేసిన ప్రతిమను (ముడి)

తీర్థజలమందు ముంచాలి. ఎవరినుద్దేశించి ముంచుతాడో ఆతడు ఎనిమిదవభాగం ఫలాన్ని పొందుతాడు. ఆపిదపతర్పణ శ్రాద్ధమందు అని. పృథ్వీచంద్రోదయ మందు, బ్రహ్మపురాణ దేవీపురాణ కాశీఖండాదులందును ఇట్లా - అకాలమైనా కాలమైనా తీర్థమందు, శ్రాద్ధము తర్పణము, ఆలసించకుండాఆచరించాలి, విఘ్నంచేయరాదు, అని (అకాలంరాత్రి, భోజనం చేశాక, కాలం అపరాహ్ణం, ఉపవాసం. స్నానం - తర్పణం దేవర్షితర్పణం - పితృతర్పణం) మాత్స్యమందిట్లా - పితరులకు తర్పణము అని నాల్గవపాదము, అని. అక్కడదేవతలను మహాలయ నిర్ణయమందు ముందుచెప్పాము. శంఖదేవలులిట్లా - తీర్థము, ద్రవ్యములభిస్తే కాలమునకై నిశ్చయం చేయరాదు. యోగ్యుడైనబ్రాహ్మణుడులభిస్తే అప్పుడే శ్రాద్ధ మాచరించాలి,అని. హారీతుడిట్లా - పగలుకాని రాత్రికాని, తినికాని తినకకాని, సరిత్తులలో శ్రేష్ఠమైనగంగనుచేరాక అక్కడ కాలనియమంలేదు, అని భారతమందిట్లా - తినికానితినకకాని, రాత్రికాని పగలుకాని, పర్వసమయంకాని కాకపోని, శుచిగా ఉండని, తాను అశుచిగా ఉండని గంగానది ఎప్పుడుకనిపిస్తే అప్పుడు అక్కడ చూడాలి ప్రణామం చేయాలి, ఓ ప్రియ! అందువల్ల అక్కడ కాలము కారణంకాదు, అని. ఆశౌచమందుకూడా చేయాలి. వివాహము, కఠినమార్గము, యజ్ఞము, యాత్ర అట్లాగే తీర్థకర్మవీనియందు సూతకం లేదు. అట్లాగే యజ్ఞాదికర్మచేయాలి, అని పైఠీనసిస్మృతి. అప్పుడుచేయకపోతే, అశౌచాంత మందేచేయాలి. ప్రభాసఖండమందిట్లా - వారము, నక్షత్రము, కాలము అక్కడ కారణం కాదు. తీర్థము ఎప్పుడు కన్పిస్తే అప్పుడే వేయిపర్వములతో సమానం అని. మలమాసమందు కూడా చేయాలి. ప్రయత్నపూర్వకంగా మలమాసమందు నిత్యనైమిత్తికకర్మలను తీర్థశ్రాద్ధము, గజచ్ఛాయ, పేతశ్రాద్ధములను చేయాలి, అని బృహస్పతిస్మృతిఅన్నాడు ఇది, ఆశౌచమందు, భుజించినప్పటికి, రాత్రియందైనా, స్నానశ్రాద్ధాదికము, ఆకస్మికతీర్థప్రాప్తియందు ఆమంతోగాని హేమంతోగాని శ్రాద్ధం చేయాలి గ్రహణాదులవలె. బుద్ధిపూర్వకమైన ఆశౌచాదులందు తీర్థప్రాప్తికలిగితేచేయరాదు. మలమాసమందైతే మాసద్వయమందుతీర్థ శ్రాద్ధం చేయాలి, అని

మూ ॥ **చంద్రికాయాం** దేవీపురాణే - శ్రాద్ధంచతత్రకర్తవ్యమర్ఘ్యావాహనవర్జితం, **హేమాద్రౌ - అర్ఘ్యమావాహనంచైవద్విజాంగుష్ఠనివేశనం, తృప్తిప్రశ్నంచవికిరంతీర్థశ్రాద్ధేవివర్జయేత్. భవిష్యే - ఆవాహనంవిసృష్టిశ్చతత్రతేషాంనవిద్యతే, ఆవాహనంతీర్థేస్యాన్నార్ఘ్యదానంతథాభవేత్. ఆహూతాఃపితరస్తీర్థేకృతార్థాఃసంతివైయతః. అగ్నౌకరణంనచేతిరత్నావల్యాం అత్రషట్దైవతేశ్రాద్ధేఽ పిమాత్రాదీనాంపిండమాత్రందేయం. హవిఃశేషంతతోముష్టిమాదాయైకైకమాదృతఃక్రమశఃపితృపత్నీ నాంపిండం నిర్వపణం చరేత్. ఇతి తీర్థోపక్రమే దేవలోక్తే రితి పృథ్వీచంద్రః. తతః సామాన్య పిండం దద్యాత్ తతః పిండముపాదాయహవిషః సంస్కృతస్యచ, జ్ఞాతివర్గస్యసర్వస్యసామాన్యం పిండముత్సృజేత్. ఇతితేనైవోక్తేః. పాద్మే - తీర్థశ్రాద్ధంప్రకుర్వీతపక్వాన్నేనవిశేషతః, ఆమాన్నేనహిరణ్యేన**

కందమూల ఫలైరపి. **పిండద్రవ్యాణిదేవీపురాణే** హేమాద్రౌబ్రాహ్మేచ - సక్తుభిఃపిండదానం చ సంయావైః పాయసేనవా, కర్తవ్యంఋషిభిఃప్రోక్తంపిణ్యాకేనగుడేనవా. **పిండానాంతీర్థప్రక్షేప** ఏవనాన్యా ప్రతిపత్తిరిత్యుక్తంప్రాక్. ఏతచ్చవిధవయా, అపుత్రయాకార్యంన, సపుత్రయా ఇత్యుక్తం ప్రాక్ సపుత్రయా నకర్తవ్యం భర్తుః శ్రాద్ధంకదాచన, ఇతిస్మృతేశ్చ. అనుపనీతేనాపికార్యం. ఏతచ్చానుపనీతోఽపికుర్యాత్సర్వేషుపర్వసు, ఇతిపాద్మే తీర్థశ్రాద్ధముపక్రమ్యోక్తేః. ఏతజ్జీవత్పితృకేణాపి కార్యమిత్యుక్తం ప్రాక్. **యతినాతునకార్యం** - నకుర్యాత్సూతకంభిక్షుః శ్రాద్ధపిండోదకక్రియాం, త్యక్తంసన్యాసయోగేన గృహంధర్మాదికంవ్రతం, గోత్రాదిచఋణంసర్వంపితృమాతృకులంధనం, ఇతిస్మృతేః గయాయాంతూక్తం వాయవీయే - దండంప్రదర్శయేద్భిక్షుః గయాంగత్వానపిండదః, దండంస్పృష్ట్వా విష్ణుపదేపితృభిః సహముచ్యతే. గయాయాంధర్మపృష్ఠేచకూపేయూపేవటేతథా, దండంప్రదర్శయన్ భిక్షుః పితృభిః సహముచ్యతే. **కృత్యరత్నేప్రభాసఖండే** - తీర్థేచేత్ప్రతి గృహ్ణాతి బ్రాహ్మణోవృత్తిదుర్లభః దశాంశమార్జితందద్యా దేవంకుర్వన్నహీయతే, ఇతివిశేషాంతరాణి భట్టకృతత్రిస్థలీసేతౌజ్ఞేయా నీతిదిక్.ఇతితీర్థశ్రాద్ధవిధిః. శ్రాద్ధప్రకరణంసమాప్తం.

అను ॥ చంద్రికయందుదేవీపురాణవచనమందిట్లా - అక్కడశ్రాద్ధాన్ని అర్ఘ్య ఆవాహనములు లేకుండానేచేయాలి, అని (తీర్థమందు) హేమాద్రియందిట్లా - తీర్థశ్రాద్ధ మందు, అర్ఘ్యము, ఆవాహనము, ద్విజఅంగుష్ఠనివేశనము, తృప్తిప్రశ్న, వికిరము ఇవన్నీ విడిచిపెట్టాలి, అని భవిష్యమందిట్లా - ఆవాహన, విసర్జనము అక్కడవారికిలేవు. తీర్థమందు ఆవాహనలేదు, అట్లాగేఅర్ఘ్యదానములేదు ఎందువల్లనంటే తీర్థమందుపిలువబడిన పితరులు అర్ఘ్యంచేయబడి ఉన్నారు కనుక, అని. అగ్నౌకరణములేదు అని రత్నావళి యందుకలదు. ఇక్కడ షట్దైవతశ్రాద్ధమందుకూడా మాత్రాదులకుపిండంమాత్రమేఇవ్వాలి. ఆపిదపహవిః శేషమును ఒక్కొక్కపిడికెడుతీసుకొని, గౌరవంతో క్రమంగా పితరులపత్నులకు పిండనిర్వాపము చేయాలి, అని తీర్థోపక్రమమందుదేవలోక్తి అని పృథ్వీచంద్రుడన్నాడు ఆ పిదప సామాన్యపిండ మివ్వాలి. ఆపిదప సంస్కరింపబడిన హవిస్సుయొక్క పిండాన్ని తీసుకొని, జ్ఞాతివర్గాని కంతకూ సామాన్యపిండంవదలాలి, అనిఆతడే చెప్పాడు పాద్మమందిట్లా - తీర్థశ్రాద్ధమును, విశేషించి పక్వాన్నముతోచేయాలి. ఆ మాన్నము, హిరణ్యము, కందమూలఫలములు వీనితో కూడా చేయొచ్చు, అని పిండద్రవ్యములుదేవీపురాణమందు హేమాద్రియందుబ్రాహ్మమందిట్లా - సత్తుపిండి, సంయావము (నేయి, ఆవుపాలు, గోధుమలు మొదలగువానితో చేసిన తినే పదార్థము) పాయసము, తెలికపిండి (నువ్వులపిండి) బెల్లము, వీనిలోదేనితోనైనా పిండదానము చేయవచ్చునని ఋషులన్నారు, అని పిండములను తీర్థంలోవేయటమే, వేరేమార్గంలేదు, అని ముందుచెప్పాము. ఇదివిధవ, సంతానంలేనిది చేయాలి, పుత్రులు కలది చేయరాదు, అని ముందుచెప్పాము. పుత్రులు కలది భర్త శ్రాద్ధాన్ని ఎప్పుడూ చేయరాదు, అని స్మృతి కూడా. అనుపనీతుడు కూడా ఆచరించాలి. అన్ని పర్వములందు దీనిని

అనుపనీతుడు కూడా ఆచరించాలి, అనిపాద్మమందుతీర్థశ్రాద్ధాన్నిగురించి ఆరంభించిచెప్పారు. దీనిని తండ్రిబ్రతికున్నవాడుకూడా ఆచరించాలి, అని ముందుచెప్పాము. యతిచేయరాదు, భిక్షువు (సన్యాసి) సూతకము, శ్రాద్ధపింద, ఉదకక్రియలు ఆచరించరాదు. సన్యాసయోగంతో, గృహము, ధర్మాదికవ్రతముఅన్నీ విడువబడ్డాయి. గోత్రాదులు, ఋణము, పితృమాతృకులము, ధనము అన్నీ త్యక్తము, అని స్మృతి. గయయందైతే వాయవీయోక్తిఇట్లా - గయకువెళ్ళిభిక్షువు దండంప్రదర్శించాలి, పిండమివ్వరాదు. విష్ణుపదమందుదండమును స్పృశించిభిక్షువు పితరులతోసహాముక్తుడౌతాడు, అని. గయయందు, ధర్మపృష్ఠ మందు కూపయూప వటములందు దండమును చూపించి, భిక్షువు, పితరులతోసహముక్తుడౌతాడు, అని. కృత్యరత్నమందు ప్రభాసఖండోక్తిఇట్లా - వృత్తిలభించనందువల్ల బ్రాహ్మణుడుతీర్థమందుదానం స్వీకరిస్తే, సంపాదించినదానిలోపదవభాగము దానంచేయాలి, ఇట్లాచేస్తే దూరదగినవాడుకాడు, అని. ఇతర విశేషములను భట్టులురచించిన త్రిస్థలీసేతువు నుండి తెలుసుకోవాలి, అని ఇకచాలు. అని తీర్థశ్రాద్ధ విధి. శ్రాద్ధ ప్రకరణసమాప్తి.

# అథాశౌచప్రకరణం

నారాయణాత్మజశ్రీమద్రామకృష్ణస్యసూనునా, కమలాకర సంజ్ఞేనాశౌచంనిర్ణీయతేఽధునా **మరీచిః** ఆచతుర్థాత్భవేత్ స్రావః పాతఃపంచమషష్ఠయోః, **అత ఊర్ధ్వం** ప్రసూతిః స్యాత్ దశాహంసూతకంభవేత్. (బృహత్పరాశరః - గర్భస్రావేతునైరుక్తారాత్రయోమాససమ్మితాః, స్రావం గర్భస్యవిద్వాంసోమాసాదర్వాక్చతుర్థకాత్. పాతమూర్ధ్వంవదంత్యేకేతత్రాధికంతుసూతకం) **స్రావేమాతుఃత్రిరాత్రం స్యాత్** సపిండాశౌచవర్జనం,పాతేమాతుర్యథామాసం సపిండానాందిన త్రయం. అత్రసర్వత్రమూలంమితాక్షరాయాంజ్ఞేయం. అత్రమాసత్రయేత్రిరాత్రంస్యాదిత్యనువాదః రజస్వలాత్వే నైవతత్సిద్ధేః యద్యప్యనేన చతుర్థమాసేఽపిత్రిరాత్రంప్రాప్నోతితథాపి - షణ్మాసాభ్యంతరంయావత్గర్భ స్రావోభవేద్యది, తదామాససమైస్తాసాందివసైః శుద్ధిరిష్యతే, ఇత్యాదిపురాణాత్. రాత్రిభిః మాసతుల్యాభిః గర్భస్రావేవిశుద్ధ్యతి, ఇతిమనూక్తేః. గర్భస్రావే యథా మాస మచిరేతూత్తమే త్రయః, ఇతి మరీచ్యుక్తేశ్చ చతూరాత్రం జ్ఞేయం. అచిరే = త్రిమాసమధ్యే. ఉత్తమే బ్రాహ్మణే. అత్రసపిండానాంస్నానం, సద్యఃశౌచంసపిండానాంగర్భస్యపతనేసతి, ఇతితత్రైవోక్తేః. ఏతదాచతుర్థ మాసాత్, పాతేత్రిదినస్యోక్తేః. అకారణాయాః శుద్ధేరసంభవాత్ సద్యః పదంస్నానపరం. ఏవమగ్రేఽపి. గర్భస్రావేస్నానమాత్రంపురుషస్య, ఇతివృద్ధవసిష్ఠోక్తేః. పురుషస్యేతిసపిండోపలక్షణంపూర్వోక్త వచనాత్. ఆ చతుర్థమాసం సపిండానాంనస్నానంకింతుపుంసఏవ. పాతేత్రిదినం నిర్గుణపరం. **గుణవతస్తు** - అజాతదంతే తనయే శిశౌగర్భచ్యుతే తథా, సపిండానాంతు సర్వేషాం ఏకరాత్రమశౌచకం, ఇతి యమోక్తేః ఏకాహమితిమదనపారిజాతః సప్తమమాసాదిదశాహం. ఏతత్సర్వ వర్ణవిషయం. తుల్యం వయసిసర్వేషాం అతిక్రాంతేతథైవచ, ఇతివ్యాఘ్రోక్తేః **పరాశరః** జాతేవిప్రోదశాహేన, ద్వాదశాహేన భూమిపః వైశ్యః పంచదశాహేనశూద్రోమాసేనశుద్ధ్యతి. **సంవర్తః** జాతేపుత్రేపితుః స్నానంనచైలంతు విధీయతే, మాతాశుద్ధ్యేద్దశాహేన, స్నానాత్తుస్పర్శనంపితుః **పుత్రపదాత్** కన్యోత్పత్తౌనపితుఃస్నానమితి హారలతాయాం, తన్నపుత్రపదస్యపౌత్రీమాతామహస్తేన, ఇతికన్యాయామపిప్రయోగాత్.

అను ॥ నారాయణాత్మజు(పుత్రు)డైన శ్రీమద్రామకృష్ణునికుమారుడైన కమలాకరుడను పేరుగలనాచే (నేను) ఇప్పుడుఆశౌచంనిర్ణయించబడుతోంది. మరీచిఇట్లా నాల్గవమాసం వరకు, గర్భనాశాన్ని స్రావమంటారు ఐదారునెలలలోనైతే పాతమంటారు,అని అపైన ప్రసూతి అంటారు. పదిరోజులసూతకంఉంటుంది. (బృహత్పరాశరుడిట్లా- నిరుక్తాన్ని అంగీకరించే వారైతే, గర్భస్రావమందుపన్నెండురాత్రులుఆశౌచమన్నారు. విద్వాంసులు నాల్గుమాసముల కన్నముందు గర్భనాశాన్ని గర్భస్రావమన్నారు. ఆపైదానిని కొందరు పాతమన్నారు. అక్కడ అధికులు (ఎక్కువమంది సూతకమన్నారు) స్రావమందు తల్లికిమూడు రాత్రులు, అశౌచము, సపిండులకు ఆశౌచంలేదు. పాతమైతే తల్లికి ఎన్నోనెలలోఐతే అన్నిరోజులు ఆశౌచము,

సపిండులకు మూడురోజులు ఆశౌచము. ఇక్కడఅంతటా మూలవచనమువితాక్షరమందు చూసితెలుసుకోవాలి. ఇక్కడమాసత్రయమందైతేత్రిరాత్రముఉంటుంది అని అనువాదము. రజస్వలఐనందువల్లనే (త్రిరాత్రం) అదిసిద్ధిస్తుంది. దీనితోచతుర్థమాసమందుకూడా మూడు రాత్రులే (అశౌచం) వస్తాయి అట్లా ఐనా ఆరుమాసములలోపల గర్భస్రావమైతే అప్పుడు నెలలతోసమానమైన అన్ని రోజులతోశుద్ధి తగును, అని ఆదిత్యపురాణంనుండి తెలుస్తోంది. గర్భస్రావముయందు మాసతుల్యములైన రాత్రులతోశుద్ధిలభిస్తుంది, అనిమనూక్తి. గర్భస్రావమందైతే మాసములననుసరించిమూడు మాసములమధ్య మూడురాత్రులు ఉత్తములకు, అనిమరీచిఉక్తి ఉన్నందువల్ల నాల్గు రాత్రులనిగ్రహించాలి. అచిరమనగా మూడు మాసములమధ్య. ఉత్తమే అనగా బ్రాహ్మణునియందు అని ఇక్కడసపిండులకు స్నానము గర్భపాతమైతేసపిండులకు వెంటనే శుచిత్వము, అనిఅక్కడే చెప్పారు. ఇది నాల్గవ మాసంవరకు, పాతమందుమూడురోజులు చెప్పారుకనుక. కారణంలేకుండా శుద్ధి ఉండదు కనుక సద్యః అన్న పదము స్నానపరమైనది ఇట్లా ముందుకూడా. గర్భస్రావమందు స్నానమాత్రము పురుషునకు, అనివృద్ధవసిష్ఠోక్తి. పురుషశబ్దముసపిండమనుదానికి సూచనముముందు చెప్పినవచన్నానుసరించి. చతుర్థమాసంవరకు సపిండులకుస్నానంలేదు కాని పురుషునకే (పతి) పాతమందు మూడురోజులనుమాట నిర్గుణపరమైనది గుణవంతులకైతే (ప్రధానులు) - పండ్లు ఇంకారానిపుత్రుడు మరణిస్తే గర్భస్థశిశువుచ్యు తుడైతేనూ, సపిండులందరికి ఒకరాత్రి అశౌచము, అని యమోక్తి ఉన్నందువల్ల ఒకరోజు అని మదన పారిజాతము అంది. సప్తమ మాసాదినుండిపదిరోజులుఅని. ఇది అన్ని వర్ణములవారి విషయము గర్భస్రావము, గర్భపాతములవయసుదాటాక అందరికి అశౌచము తుల్యంగానే ఉంటుంది, అని వ్యాఘ్రోక్తి. పరాశరుడిట్లా - ప్రసవమందు విప్రునకు పదిరోజులు, క్షత్రియునకు పన్నెండురోజులు, వైశ్యునకు పదిహేనురోజులు, శూద్రునకు నెలరోజులు ఆశౌచము ఆపిదపశుద్ధి అని. సంవర్తుడిట్లా - పుత్రుడుకలిగాక తండ్రికి సచేలస్నానము విధించబడింది. తల్లిపదిరోజులతో శుద్ధిపొందుతుంది. స్పృశిస్తే తండ్రి, స్నానంతో శుద్ధుడౌతాడు అని పుత్రపదంవల్ల, ఒకవేళకన్యజన్మిస్తే తండ్రికిస్నానం అవసరం లేదు, అని హారలతయందు అన్నారు అట్లా కాదు పుత్రపదమునకు పుత్రికకూడా ఉపలక్షకము. పౌత్రి ఐనందువల్ల మాతామహుడు అని ప్రయోగముండ్

**మూ॥ యచ్చతత్రైవోక్తం - సూతకేతుమృతందృష్ట్వాజాతస్య జనకస్తతః, కృత్వాసచైలం స్నానంతు శుద్ధోభవతి తత్క్షణాత్. ఇత్యాదిత్యపురాణాత్ ముఖదర్శనోత్తరమేవ పితుః స్నానమితి. తన్న, విదేశేముఖదర్శనావధ్యస్పృశ్యతాపత్తేః ముఖదర్శనోత్తరంపునః స్నానార్థమిదమితిస్మార్త గౌడాః, తన్న మూలైక్యేనజ్ఞానమాత్రపరత్వాత్. ఇదంసర్వవర్ణసమం. సూతి కాసర్వవర్ణేషు దశరాత్రేణ శుద్ధ్యతి, ఋతౌచనపృథక్శౌచంసర్వవర్ణేష్వయంవిధిః, ఇతిహారలతాయాం ప్రచేత**

సోక్తేః. యత్తు బ్రాహ్మే – బ్రాహ్మణీ క్షత్రియా వైశ్యా ప్రసూతా దశభిర్దినైః, గతైః శూద్రాచసంస్పృశ్యాత్రయోదశ భిరేవచ, ఇతి. ప్రయోగపారిజాతేపారస్కరః – ద్విజాతేఃసూతికాయాస్యాత్ సాదశాహేన శుధ్యతి. త్రయోదశేఽహ్ని సంప్రాప్తే శూద్రాశుద్ధ్యత్యసంశయం. ఇతి తదసచ్ఛూద్రాపరం. **అంగిరాః** – సూతకే సూతికావర్జంసంస్పర్శోననిషిధ్యతే, సంస్పర్శేసూతికాయాస్తుస్నానమేవ విధీయతే. నాశౌచం సూతకే పుంసః సంసర్గంచేన్నగచ్ఛతి, రజస్తత్రాశుచిర్జ్ఞేయంతచ్చపుంసినవిద్యతే, సంసర్గోమైథునం స్పర్శ ఇత్యన్యే. మాతురేవసూతకం, తాంస్పృశతశ్చ, ఇతిహారలతాయాం సుమంతూక్తే రితి, తన్న సంస్పర్శే సూతికాయాస్తు స్నానమేవ విధీయతే, ఇతి స్నానమాత్రోక్తేః సౌమంతవచన స్యస్నాన పర్యంతమ స్పృశ్యత్వమాత్రబోధకత్వాత్, ఏవకారోబాలస్పృశ్యతార్థః. మాధవస్తు – యస్తైస్సహ సపిండోఽపి ప్రకుర్యాచ్ఛ యనాసనం, బాంధవో వాపరోవాపి సదశాహేన శుధ్యతి. ఇతిబృహస్పతి స్మృతేః శయనాసనాది రూపం సంసర్గమాహపరాశరః – యదిపత్న్యాంప్రసూతాయాం ద్విజః సంపర్కమిచ్ఛతి, సూతకంతు భవేత్తస్య యది విప్రః షడంగవిత్. పితృవత్ సాపత్నమాతుః ప్రాక్స్నానాద స్పృశ్యత్వం. సూతికా స్పర్శేతు యావదాశౌచం, అన్యాస్తుమాతరస్తద్వత్ తద్గృహంనవ్రజంతిచ, ఇతి బ్రాహ్మోక్తే రితిశుద్ధి తత్త్వాదయః తన్న తద్గేహంగత్వాసూతికాంయ దినస్పృశంతితదా స్పృశ్యాః, అన్యథానఇతితస్యార్థః కర్మానధికారమాహ పైఠీనసిః – సూతికాంపుత్రవతీంవింశతిరాత్రేణ కర్మాణికారయేత్ మాసేన స్త్రీజననీం, ఇదమాశౌచోత్తరం. అన్యథాశూద్ర్యాః సపిండానామాశౌచే తదభావఃస్యాత్ విధ్యను వాద విరోధశ్చఏతచ్చసోమయాగాదిశ్రౌతభిన్నపరం. ప్రజాతాయాశ్చదశరాత్రా దూర్ధ్వంస్నానాది, ఇతి కాత్యాయ నోక్తేశ్చ. వ్యాసః ప్రథమేదివసేషష్ఠేదశమేచైవసర్వదా, త్రిష్వేతేషునకుర్వీత సూతకంపుత్రజన్మని, పుత్రశబ్దోఽపత్యమాత్రపరః బ్రాహ్మే – దేవాశ్చ పితరశ్చైవ పుత్రేజాతేద్విజన్మనాం, ఆయాంతి తస్మాత్తదహః పుణ్యంషష్ఠంచసర్వదా జననేవిశేషః ప్రాగుక్తః.

అను ॥ అక్కడే చెప్పింది ఇట్లా – తండ్రి, పుట్టిన వాని ముఖాన్ని సూతకమందు చూసి, ఆపిదపసచేలస్నానంచేస్తే అక్షణమందేశుద్ధుడౌతాడు, అనే ఆదిత్య పురాణవచనం వల్ల పిల్లవానిముఖంచూచాకనేతండ్రికి స్నానము, అని ఏదైతే ఉందో అదికాదు. విదేశమందున్నప్పుడు ముఖదర్శనంకలిగేవరకు అస్పృశ్యతఏర్పడేఅవకాశముంది ముఖదర్శనంతరువాత తిరిగిస్నానంకొరకు ఇది అనిస్మార్తగౌడులన్నారు. అదికాదు మూలం ఒకటే ఐనందువల్ల జ్ఞానమాత్రపరము. ఇది అన్నివర్ణములవారికి సమానము. అన్ని వర్ణములలోను, సూతిక పదిరాత్రులతో శుద్ధినందుతుంది. ఋతుమతిఐతే (నాల్గవరోజున దీనికై) వేరేశుద్ధిలేదు. అన్నివర్ణముల వారికి ఇదే విధి, అని హారలత యందు ప్రచేతసుని వచనము. బ్రాహ్మమందిట్లా – బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యస్త్రీలు ప్రసూతలైతే పదిరోజులయ్యాక ముట్టుకోదగినవారౌ తారు. శూద్రస్త్రీఐతేపదమూడురోజులకేస్పృశించతగినదౌతుంది అని ఉందో, అట్లాగే ప్రయోగ పారిజాతమందు పారస్కరుడిట్లా – బ్రాహ్మణజాతిస్త్రీసూతిక ఐతే ఆమె పదిరోజులకు శుద్ధినందుతుంది. పదమూడవరోజువస్తే శూద్రస్త్రీశుద్ధినందుతుంది సంశయంలేదు, అని

ఏదన్నాడో ఈరెండు అసత్‌శూద్రస్త్రీవిషయకమైనవి. (అదిఅస్పృశ్యత్వ పరము అనిమరో పారం) అంగిరుడిట్లా - సూతకమందుప్రసూతనువదలి, ఇతరులను స్పృశిస్తే దోషం లేదు. సూతికను స్పృశిస్తే స్నానమేవిధి. సూతకమందు పురుషుడు స్త్రీ సంసర్గాన్ని పొందకపోతే ఆశౌచం లేదు. అక్కడ అశుచికి రజస్సుకారణము అని గ్రహించాలి, అది పురుషునిలో లేదు. సంసర్గ మనగామైథునము అని. కాదు స్పర్శ అని ఇతరులన్నారు. తల్లికే సూతకము ఆమెను ముట్టుకున్నందువల్ల అని హారలతయందుసుమంతూక్తి అని. అట్లాకాదు, సూతికను ముట్టుకుంటే స్నానమేవిధించబడింది, అని స్నానం మాత్రమే చెప్పినందువల్ల సుమంతువచనము స్నానమువరకే అస్పృశ్యతనుమాత్రమేబోధించేది. ఏవకారముపిల్ల వాణ్ణిముట్టుకునే అర్థ పరమైనది మాధవుడైతే - సపిండుడైనా, వారితో కలిసి శయన ఆసనములు చేస్తే బాంధవుడైనా పరుడైనా వాడుపదిరోజులలో శుద్ధినందుతాడు, అని బృహస్పతి స్మృతి వల్ల తెలుస్తోంది, అని. శయన ఆసనాదిరూపమైన సంసర్గాన్ని మాత్రమే పరాశరుడుచెప్పాడు ఇట్లా - భార్యప్రసూతికాగాబ్రాహ్మణుడు సంపర్కాన్ని కోరితే, ఆతడు షడంగవిదుడైన బ్రాహ్మణుడైతే, ఆతనికి సూతకముఉంటుంది. అని తండ్రికిలాగా సవతితల్లికి స్నానం కన్న ముందు అస్పృశ్యతఉంటుంది. ఆశౌచమున్నంతవరకు సూతికను స్పృశిస్తే స్నానము (స్నానం వరకు ఆశౌచము) ఇతరతల్లులైతేఅట్లాగే ఆగృహంలోకివెళ్ళరు, అని బ్రాహ్మోక్తిఅని శుద్ధి తత్వాదులవచనం. అంటేఅట్లాకాదు. ఆ ఇంట్లోకి వెళ్ళి సూతికను ముట్టకపోతే అప్పుడు స్పృశించతగిన వారు లేకుంటే అస్పృశ్యులు అని దాని అర్థము. కర్మకు అనధికారులైన వారిని గూర్చిపైఠీనసిఇట్లా - పుత్రునికన్న సూతికను ఇరువది రోజుల తరువాత పని చేయించాలి. ఆడపిల్లను కన్నతల్లిని నెలరోజుల తరువాత ఇంటిపనులు చేయించాలి. ఇది ఆశౌచంతరువాత లేకుంటే, శూద్రస్త్రీయొక్క సపిండులకుఆశౌచంఉంటే ఆమెకు లేకుండా పోతుంది, విధికి అనువాదానికి విరోధమేర్పడుతుంది. ఇది సోమయాగం మొదలగు శ్రౌత కర్మలకన్నభిన్నమైనవానివిషయము ప్రసూతియైన స్త్రీకి పదిరాత్రులతరువాత స్నానాదులు, అనికాత్యాయనోక్తి కూడా. వ్యాసుడిట్లా - ప్రథమదినమందు, ఆరవ, పదవదినము లందు, ఎప్పుడూ ఈ మూడింటిలో పుత్రజన్మలో జాతకర్మాదులు చేయరాదు, సూతకం ఉంటుందికనుక, అని పుత్రశబ్దముసంతానమాత్రపరము. బ్రాహ్మమందిట్లా - దేవతలు, పితరులు, బ్రాహ్మణులకు పుత్రుడు జన్మిస్తే వస్తారు కనుక ఆరోజు, ఆరవరోజు ఎల్లప్పుడూ పుణ్యప్రదమైనవి, అని జననమందు విశేషాన్ని (షష్ఠీపూజనము) ముందు చెప్పాము.

**మూ॥ అత్రప్రయోగపారిజాతః** - **పుంప్రసవేదశాహః, స్త్ర్య పత్యేతుత్ర్యహః, పుంజన్మని సపిండానాందశాహోచ్ఛుద్ధిరుచ్యతేత్ర్యహాదేకోదకానాంచఏకాహంసూతకంక్వచిత్. స్త్రీజన్మని సపిండానాం సోదకానాం త్ర్యహాచ్ఛుచిః. స్త్రీషు త్రిపురుషం జ్ఞేయం సపిండత్వం ద్విజోత్తమాః,**

ఇత్యగ్ని స్మృతేరిత్యాహ. మేధాతిధిరపి – అప్రత్తానాంతుస్త్రీణాంత్రిపురుషీవిజ్ఞాయతే, ఇతివాసిష్ఠముక్త్వాఆశౌచే ఏవైతత్. వివాహేతుఅవధిః దర్శితఏవ, ఇత్యాహ అన్యేతు త్రిపురుష సాపిండస్య కానీన కన్యాపరత్వమాహుః అప్రత్తానాంతథాస్త్రీ ణాంసాపిండ్యంసాప్తపౌరుషం, ప్రత్తానాం భర్తృసాపిండ్యంప్రాహదేవః ప్రజాపతిః, ఇతికౌర్మవిరోధాచ్చ. **అత్రేదంతత్త్వం** – పంచమాత్సప్త మాద్ధీమాన్యః కన్యాముద్వహేద్ద్విజః, గురుతల్పీసవిజ్ఞేయః, ఇత్యాదివిరోధా త్రిపురుషం ప్రకరణాన్మ రణాశౌచం, వసిష్ఠేతదగ్రేఉదకదానోక్తేః తేనకన్యాప్రసవేఽపిసాప్తపురుషందశరాత్రమేవ నచ కన్యాపుత్రకృతంప్రసవేబలాబలంక్వావ్యుక్తం. అగ్నిస్మృతిస్త్వను కల్పోవిగీతాచేతి. సర్వసిద్ధాంతః. అన్యథాత్రిపురుషంసపిండానాంఅష్టమాదిసోదకానాంచత్ర్యహసామ్య యోగాత్. చతుర్థాది సప్తమాంతా నాంచకి మపినస్యాత్ (తేన, కన్యా ప్రసవేదశాహఏవ) కించస్త్రీజన్మో ద్దేశేన త్రిపురుషం సాపిండ్యం తేషాం చ త్రిరాత్రమిత్యనేకార్థవిధిఃకథంస్యాత్వాక్యభేదాపత్తేః న చచతుర్థా దీనాం సోదకత్వంక్వాపి సిద్ధం తేనత్రిపురుషంచతుర్థాదీనాంచస్త్రీజన్మనిసోదకత్వంవిధాయపునస్తేషాం త్రిరాత్రాశౌచ విధౌవిధ్యను వాదవిరోధో వాక్యభేదద్వయంచేత్యసంవాదార్థాగ్ని స్మృతిర్హేయా **అథమృతాశౌచం** – హారీతః – జాతమృతేమృతజాతేవాసపిండానాందశాహం, ఇతి స్వాశౌచపరం. జాతమృతేనాలచ్ఛే దోర్ధ్వం. యావన్నఛిద్యతేనాలంతావన్నాప్నోతిసూతకం, ఛిన్నేనాలేతతఃపశ్చాత్ సూతకంతువిధీయతె, ఇతిజైమిన్యుక్తేః. నాద్యాంఛిన్నాయామాశౌచం, ఇతిహారీతోక్తేశ్చ. ఏతన్మృతా శౌచపరమేవ. జననాశౌచంతునాలచ్ఛేదోత్కర్షేఽపి జననాద్యేవ. మృతజాతేనాలచ్ఛేదాభావాత్ షష్ఠీ పూజాత్యుత్కర్షాపత్తేశ్చ. తేననాడీఛేదాత్ప్రాజ్మాతుః స్పర్శే న దోషఇతిశుద్ధితత్వోక్తిః పరాస్తా. నాభిచ్ఛే దాత్ప్రాజ్మృతౌ తుబృహన్మనుః – జీవన్జాతోయదితతో మృతః సూతకఏవతు, సూతకంసకలం మాతుః పిత్రాదీనాంత్రిరాత్రకం. ఇదంచప్రసవాశౌచమేవ. శావనిమిత్తం స్నానమాత్రం. ప్రాజ్నామ కరణాత్ సద్యః శౌచం, ఇతిశంఖోక్తేః **అత్రకశ్చిదాహ** – నామకరణం ఆశౌచాం తకాలోప లక్షణం. ఆశౌచవ్యపగమేనామధేయం, ఇతి విష్ణూక్తేః, ఆశౌచేతువ్యతి క్రాంతే నామకర్మ విధీయతే, ఇతిమనూక్తేశ్చనామ్నోనియతకాలత్వాత్. న చ – నామధేయం దశమ్యాంతుద్వాదశ్యాంవాపికారయేత్, పుణ్యేతిథౌముహూర్తేవానక్షత్రేవాగుణాన్వితే, ఇతిమనూక్తేరనియతకాలత్వం. దశమ్యామతీతాయాం విప్రః, ద్వాదశ్యామతీతాయాం క్షత్రియః వైశ్యః షోడశే. శూద్రఏకత్రింశే ఇత్యపిజ్ఞేయం. పుణ్యఇత్యాద్య కల్పః తేననామ్నః కాలోపలక్షణం. ఏవందంతజననేఽపి, దంతజన్మ సప్తమేమాసి, ఇత్యుపనిషది నియతకాలత్వాత్. చౌలేతునకాలోపలక్షణం, ప్రథమేఽబ్దేతృతీయేవాకర్తవ్యం శ్రుతిచోదనాత్, ఇతిమనూక్తేః.

అను ॥ ఇక్కడప్రయోగపారిజాతమిట్లా – మగపిల్లవాడుపుట్టిన పదిరోజులు, ఆడపిల్లైతే మూడురోజులు ఆశౌచం. పురుషుడు జన్మిస్తే సపిండులకుపదిరోజుల తరువాత శుద్ధి అన్నారు. ఏకోదకులకు మూడురోజులతరువాత శుద్ధి ఒక్కోచోట (ఆపత్తియందు) ఒకరోజు సూతకము. స్త్రీజన్మయందు, సపిండులకు, సోదకులకు మూడు రోజుల తరువాత శుద్ధి. ఓ ద్విజోత్తములార! (కన్యలందు) స్త్రీలందు సపిండత్వము త్రిపురుషం (మూడుతర

ములు) అని గ్రహించాలి, అని అగ్నిస్మృతినుండి అని అన్నారు. మేధాతిథికూడా – వివాహం కాని స్త్రీలకైతే (కన్య) మూడుతరములు స పిండత అని గ్రహించాలి, అని వసిష్ఠవచనాన్నిచెప్పి, ఇది ఆశౌచమందే, వివాహమందైతే అవధినిముందే చెప్పాము, అని ఇట్లా అన్నాడు ఇతరులైతే మూడు తరముల సపిండత్వమును కన్యకు కల్గిన కన్యాపరంగా చెప్పారు. వివాహం కాని కన్యలకైతే సాపిండ్యము ఏడుతరములవరకు వివాహితలైన స్త్రీలకు సాపిండ్యము భర్తతోనే ఔతుంది, అని ప్రజాపతి దేవుడు అన్నాడు, అని ఇది కూర్మపురాణ విరోధం కూడా, (ఎక్కడ కన్యాపదంలేదుకూడా) ఇక్కడ తత్వమిది – ఐదవతరం తరువాతి లేదా సప్తమతరంతరువాతి (బుద్ధిమంతుడేవడైనా ద్విజుడు) కన్యను వివాహమాడితే వాడు గురుతల్పగుడౌతాడు. (అంతపాపం) అని గ్రహించాలి, అనే మొదలగు దానికి విరోధమైనందువల్ల త్రిపురుషం అనేమాట ప్రకరణాన్నను సరించి మరణాశౌచపరమైంది వసిష్ఠమందు దానికన్నముందు ఉదకదానాన్ని చెప్పాడు. అందువల్ల కన్యాప్రసవమందుకూడా ఏడుతరములవరకు పది రాత్రులే సూతకము. ప్రసవమందు కన్యగాని పుత్రుడుగాని జన్మిస్తే వీరిలోబలాబలవిచారాన్ని ఎక్కడా చేయలేదు. అగ్నిస్మృతిమాత్రం అనుకల్పము (తరువాత వచ్చింది) నిందితముకూడా అని అందరి సిద్ధాంతము. లేనిచో మూడుతరములవరకు, సపిండులకు, అష్టమతరం ఆదిగాగల సోదకులకు మూడురోజుల సూతక సామ్యము కుదరదుకనుక. నాల్గునుండి ఏడు తరముల వరకు ఏమీలేకుండా పోతోంది (అందువల్లకన్యాప్రసవమందు అశౌచం పదిరోజులే) ఇంకను స్త్రీ జన్మ ఉద్దేశ్యంతో మూడుతరాలు సాపిండ్యము, వారికిత్రిరాత్ర అశౌచము, అనిఅనేకార్థముల విధి ఎట్లాకుదురుతుంది, వాక్యభేదాపత్తివస్తుంది నాల్గవతరం మొదలైన వారికి సోదకత్వము ఎక్కడాసిద్ధించలేదు, అందువల్ల మూడుతరములవరకు చతుర్థాదులకు గూడా స్త్రీ జన్మమందు సోదకత్వం విధించి, తిరిగివారికి త్రిరాత్ర ఆశౌచము విధిస్తేవిధి అనువాదములకు విరోధము వాక్యభేదద్వయముకూడా ఔతుంది, అని పొసగని (అసంబద్ధ) అర్థాన్ని బోధించేఅగ్నిస్మృతి హేయమైనది (విడువాలి) అని. ఇకమృతాశౌచము – హారీతుడిట్లా – శిశువుపుట్టిచచ్చినా, చచ్చిపుట్టినాసపిండులకుపదిరోజులు ఆశౌచము, అని. ఇది స్వఆశౌచపరము. పుట్టినాక మరణిస్తే నాలచ్ఛేదం అయ్యాకమరణిస్తే ఇది. ఎంతదాకానాలచ్ఛేదము కాదో అంతవరకు సూతకంరాదు నాలచ్ఛేదమయ్యాక ఆపిదప సూతకం ఉంటుంది అని జైమినిఉక్తి, నాడిఛిన్నమైనాక ఆశౌచము, అని హారీతోక్తికూడ. ఇదిమృతాశౌచపరమే జననాశౌచమైతే నాలచ్ఛేదఉత్కర్షమందుకూడా పుట్టినప్పటినుండే ఆశౌచం. చచ్చినవాడైపుట్టేనాళచ్ఛేదంలేదు కనుకషష్ఠీపూజమొదలగువాని ఉత్కర్షాపత్తి కూడా రావచ్చు. అందువల్లనాడీచ్ఛేదంకన్నముందు తల్లినిస్పృశిస్తేదోషంలేదు, అనే శుద్ధితత్వోక్తి వీగిపోయింది. నాభిచ్ఛేదంకన్నముందుమరణిస్తే బృహన్మనువిట్లా – ప్రాణంతోపుట్టి, ఆ పైమరణిస్తేసూతకమే. సూతకమంతా తల్లికే, పిత్రాదులకు మూడురాత్రులు. ఇదిప్రసవా

శౌచమే, శవనిమిత్తమైతే స్నానంమాత్రమే నామకరణంకన్న ముందువెంటనేశౌచము, అని శంఖోక్తి. (సద్యః అనేది శిశువుమరణిస్తే, జననమైతే పదిరాత్రులు) ఇక్కడ ఒకడన్నాడిట్లా – నామకరణం అని చెప్పటం, ఆశౌచం యొక్కఅంత్యకాలాన్ని సూచించటంఔతుంది. ఆశౌచముపోయాకే నామధేయము, అని విష్ణూక్తి. ఆశౌచం గడిస్తే నామకర్మ విధించ బడుతుంది, అని మనూక్తికూడా నామకర్మకు నియతకాలముంది నామధెయము దశమి యందు, లేదా ద్వాదశియందు కానిచేయాలి, పుణ్యతిథి, మూహూర్తం, నక్షత్రం, గుణం కలవాని యందుచేయాలి, అనిమనూక్తి కనుక నామకర్మకు అనియతలకాత్వముఅని అనరాదు. పదవరోజు అయ్యాక బ్రాహ్మణుడు, పన్నెండవరోజు అయ్యాక క్షత్రియుడు, షోడశమున (పదహారవరోజున) వైశ్యుడు, ముప్పది ఒకటవరోజున శూద్రుడు, అనికూడా తెలుసుకోవాలి. పుణ్యముఅనేది అనుకల్పము అందువల్ల నామ కర్మకు అనేది కాలమునకు సూచనము ఇట్లాగే పళ్ళుశిశువునకు వస్తే కూడా, పంటిరాకపెడవనెలయందు, అని ఉపనిషత్తు యందు నియతకాలంచెప్పబడింది. చౌలమందుకాలసూచనలేదు మొదటి సంవత్సరమందు కాని, తృతీయమందుకాని (మూడో యేట) ఆచరించాలి అని వేదం చెప్పింది కనుక, అని మనూక్తి.

మూ॥ తతః సంవత్సరే పూర్ణేచూడాకర్మవిధీయతే ద్వితీయేవాతృతీయేవా కర్తవ్యం స్మృతిదర్శనాత్, ఇతియమోక్తేశ్చతస్యఅనియతకాలత్వాదితి. తన్మందం చౌలవత్‌నామదంతజనన యోరపిస్వరూపేణనిమిత్తత్వోపపత్తేః తద్విశిష్టకాలానువాదేవాక్యభేదాత్ సప్తమమాసా దర్వాగ్దంత జననే తదభావ ప్రసంగాచ్చ. యస్తూ పనిషద్దర్శనేన నిర్ణయం కుర్యాత్సనూనం, శతాయుః పురుషః ఇతి శ్రుతేః అర్వాక్ పితృమరణే తదంత్య కర్మాపిత్యజేత్. ననుకాలానుపలక్షణేనామోత్కర్షే తదభావేవా స్నానమా త్రాచ్ఛుద్ధిః స్యాత్. తతః కిం అస్తు అత ఏవోక్తం. ఆదంతజన్మనా త్సద్యః, ఇతి. సాచవిష్ణు వచనాద్దాహ భావవిషయేతివక్ష్యామః. త్రివర్షాదావపిస్యాదితిచేత్, న. దాహదంతాదినిమిత్తైః విశేషాశౌచేః పూర్వస్యబాధాత్, తదుక్తం – పూర్వాబాధేన నోత్పత్తిః ఉత్తరస్యహిసిద్ధ్యతి, ఇతి. జనానాద్దశరాత్రే వ్యుష్టేశతరాత్రేసంవత్సరేవా, ఇతి పరిశిష్టే. ద్వాదశ్యామపరేరాత్ర్యాం, మాసేపూర్ణే తథాపరే, అష్టాదశేఽహనితథావదంత్యన్యేమనీషిణః, ఇతి భవిష్యేచనామ్నః కాలానియమాచ్చ. న చప్రాథమ్యా ద్దశరాత్రేఽతీతే ఇతిముఖ్యః కాలః అన్యస్త్వనుకల్పఇతివాచ్యం. చౌలేఽపితథాపత్తేః నచదంతజననకాలానుపలక్షణేనదంతజాతమృతస్యదాహైకాహప్రసంగః దశాహేనబాధాత్. నామకరణోత్తరమేవదాహప్రవృత్తేః. దశాహాభ్యంతరే బాలేప్రమీతేతస్యబాంధవైః, శావాశౌచం నకర్తవ్యంసూత్యాశౌచంవిధీయతే, ఇతిబృహన్మనూక్తేశ్చ. ఆశౌచందాహోపలక్షణం. సూతకవదితి పారస్కరోక్తేః. యత్తువిష్ణుః – అనివృత్తేదశాహేతుపంచత్వంయదిగచ్ఛతి, సద్యః ఏవ విశుద్ధిః స్యాత్ నప్రేతం నోదకక్రియాః, ఇతి తదపి ప్రేతా శౌచ నిషేధార్థం నతు సద్య స్త్వపరం వాక్యభేదాత్ కించ, నామకాలాత్ ప్రాఙ్మృతస్యస్నానం, తదుత్తరంత్వేకాహోది. నామకాలేత్వేకాదశాహే

మృతస్యనకి మపిస్యాత్. అథశంఖవచనేల్యబ్లోపే పంచమీ, తదాప్రాగితినోపపద్యతే నామ్నివాపి కృతేసతి, ఇతిమన్వాదివిరోధాత్. కృతనామ్నః ఇతి మాధవ మితాక్షరాది విరోధాచ్చ నకాలోప లక్షణం క్వాపీతిదిక్.

అను ॥ పిదపసంవత్సరంనిండాకచూడాకర్మవిధించబడింది. స్మృతిననుసరించి రెండవలేదా మూడవసంవత్సరమందుచేయాలి, అనియమోక్తి కూడా. దానికి కాలనియమం లేదు, అని ఇట్లాఅనటంతెలివితక్కువ. చౌలంవలెనామకర్మదంతజననమువీనికికూడా స్వరూపంతో కారణత్వంకల్గుతుందికనుక దానితోకూడిన కాలానువాదమందువాక్యభేద మేర్పడుతుంది. ఏడునెలలకన్నాముందేపండ్లొస్తే (దంతం) అది లేకుండా పోతుంది. ఉపనిషద్దర్శనంతో నిర్ణయంచేసేవాడైతే, ఆతడు, తప్పకుండా, శతాయుఃపురుషః, అనేశ్రుతి వాక్యార్థంకన్నముందే తండ్రిమరణిస్తే ఆ తండ్రి అంత్యకర్మ కూడా వదలాల్సి వస్తుంది. ఒకవేళ కాలంనకు ఉప లక్షణం కాకపోతే నామఉత్కర్షమందుకాని, అదిలేకున్నాకాని స్నానమాత్రం వల్లనే శుద్ధికలుగుతుంది. కదా అంటే ఐతే ఏమౌతుంది, కాని. అని అందువల్లనే ఇట్లా అన్నారు దంతములొచ్చేవరకు సద్యఃశౌచము, అని. విష్ణువచనంవల్లదానిని దాహాభావ విషయం అని అంటాము మూడవసంవత్సరం మొదలగు వానియందుకూడా ఔతుంది అని అంటే, అట్లా కాదు. దాహదంతాదినిమిత్తములైన విశేషాశౌచములతో పూర్వమునకు బాధ. అందుకే అన్నారు – పూర్వమునకు బాధలేకుండ ఉత్తరమైనదానికి ఉత్పత్తి సిద్ధించదు కదా, అని. జననం తరువాత పదిరాత్రులుకాని నూరురాత్రులుకాని సంవత్సరంకానిగడిచాక, నామకర్మ, అని పరిశిష్టమందన్నారు. కొందరు పన్నెండవ రాత్రి యందు అని, మరికొందరు నెలనిండాక, అని ఇంకొందరు బుద్ధిమంతులు పద్దెనిమిదవరోజున నామకర్మఅని అన్నారు. భవిష్యమందును నామకర్మకుకాలనియమం లేదు. ప్రథమమైనందువల్ల (తొలిది) పదిరాత్రులు గడిచాక, అనేది ముఖ్యకాలము, ఇతరమైనవి, అనుకల్పము, అని అంటే అట్లా అనరాదు. చౌలమందుకూడా అట్లాగే వస్తుంది కనుక. దంతజననకాలమునకు ఉపలక్షణం కాకపోతే దంతములతోనేపుట్టిమరణించినవాని దాహమందు ఏకాహఅశౌచమువస్తుందికదా అని అంటే అట్లాకాదుఅక్కడ దశాహంతో బాధకల్గుతుంది. నామకరణంఅయ్యాకనేదాహప్రవృత్తి, పుట్టి పదిరోజులలోపల పిల్లవాడు మరణిస్తే అతనిబంధువులుశవాశౌచాన్ని చేయరాదు. సూత్యాశౌచముఆచరించాలి, అని బృహన్మనూక్తి. ఆశౌచమనేది దాహమునకు ఉపలక్షణము. సూతకంవలె అని పారస్కరోక్తి. (ఆశౌచంఅని) విష్ణువుఇట్లా – పదిరోజులుగడవకుండానే మరణిస్తే అప్పుడే శుద్ధికలుగుతుంది, ప్రేతలేదు ఉదకక్రియలులేవు అని ఏదన్నాడో అదికూడా ప్రేతయొక్క అశౌచనిషేదార్థము. సద్యఃశౌచంకొరకుకాదు వాక్యభేదమైనందువల్ల. ఇంక – నామకర్మకన్న ముందేమరణించినవానికిస్నానము, ఆపైన అయితే ఏకాహఆశౌచము మొదలగునవి. నామకాలమందు పదకొండవరోజున చనిపోయిన వానికి ఏమీలేదు

శంఖవచనమందు, ల్యబ్‌లోపమందుపంచమి. అందువల్ల ప్రాగ్ (ముందు) అనిఅనటం కుదరదు నామకర్మ కాని చేశాక, అనే మనువు మొదలగు వానికి విరోధమౌతుంది. పేరు పెట్టబడిన, అనే మాధవమితాక్షరాదులకు విరోధమౌతుంది. కనుకకాలమునకు సూచనకాదు ఎక్కడకూడా. అని ఇక చాలు.

మూ॥ **నామోత్తరందంతో** త్పత్తేఃప్రాక్ దాహేసత్యహః అదం తజాతేతనయేశిశోః గర్భచ్యుతే తథా, సపిండానాంతుసర్వేషామహోరాత్రమశౌచకం, ఇతియమోక్తేః. దాహాభావేతు స్నానమాత్రం. అదంతజాతేప్రేతేసద్యఏవనాస్యాగ్నిసంస్కారః, ఇతివిష్ణునాదాహాభావేతదుక్తేః అదంత జనాత్సద్యః ఇతియాజ్ఞవల్క్యోయాచ్చ. దాహవికల్పంచాహలౌగాక్షిః-తూష్ణీమేవోదకం కుర్యాత్ తూష్ణీం సంస్కార మేవచ, సర్వేషాంకృతచూడానాంఅన్యత్రాపీచ్ఛయాద్వయం. అన్యత్రఅకృతచూడే. అత్రచూడాకరణం తృతీయవర్షరూపకాలోప, లక్షణార్థమితి మేధాతిథిహారదత్తౌ మనురపి – నాత్రి వర్షస్య కర్తవ్యాబాంధవై రుదక్రియా, జాతదంతస్యవాకుర్యుః నామ్నివాపికృతేసతి, ఇతి ఉదకందా హోపలక్షణం **దంతోత్పత్త్యనంతరం** ప్రాక్‌త్రివర్షాన్మాత్ మృతేఽహః, దంతజాతేఽప్యకృతచూడే త్ర్యహోరాత్రేణశుద్ధిః ఇతివిష్ణూక్తేః త్రివర్షోర్ధ్వం కృతచూడేఽకృతచూడేవాప్రాగుపనయనాత్‌త్ర్యహః యద్యప్యకృత చూడోవైజాతదంతస్తు సంస్థితః, తథాపిదాహయిత్వైనమాశౌచంత్ర్యహమాచరేత్, ఇతి అంగిరసోక్తేః (అకృతాయామపి చూడాయాం త్రివర్షోర్ధ్వం దాహాది నియతం. నాత్రివర్షస్యేతి వచనాత్. మృతాయాం వర్షత్రయాత్ప్రా పితం తూష్ణీమేవ) అత్రజాతదంతత్వ ముద్దేశ్య విశేషణత్వాద వివక్షితం. దాహయిత్వే త్యప్యనువాదః ఉభయవిధౌవాక్యభేదాత్. త్రివర్షాత్ప్రాక్, చూడాభావేఽ గ్నిదానేత్ర్యహస్తదభావేవిష్ణూక్తే రేకాహఇతి మాధవః యత్తుకశ్చిదాహ – అత్రత్రివర్ష విషయాదస్మాదే వార్థాత్ త్రివర్షోర్ధ్వమపితత్సిద్ధిః విజ్ఞానేశ్వరో క్తేశ్చత్రివర్షోర్ధ్వమకృతచూడావిషయత్వంచింత్యం, జాతదంతపదవైయర్థ్యాదితి. తత్తుచ్ఛం. దాహస్యావిధేయత్వాత్. నృణామకృతచూడానాం అశుచిర్నైశికీ స్మృతా, ఇతిమనూక్తేః త్రివర్షోర్ధ్వమేకాహాపత్తే రర్థాత్‌త్ర్యహాసిద్ధేః త్వయాప్యగ్రేత థాంగీకారాత్పద వైయర్థ్యస్య సామ్యాద్వాక్యార్థా జ్ఞానాచ్చేత్యలంమితాక్షరార్థానభిజ్ఞదూషణేన. ప్రథమవర్షాదౌ కృతచూడస్య సదాత్ర్యహః, నివృత్తచూడ కానాంతుత్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే, ఇతిమనూక్తేః ఏతత్సర్వం ప్రాగుక్తం సపిండానాం. మాతాపిత్రోస్తు దశాహోర్ధ్వం మృతేసర్వత్ర త్రిరాత్రం బాలానామ జాతదంతానాం త్రిరాత్రేణశుద్ధిః ఇతికశ్యపోక్తేః. బైజికాదభిసంబంధాత్అనురుంధ్యాదఘంత్ర్యహం, ఇతి మనూక్తేశ్చ. శుద్ధితత్వాదయోగౌ దాస్తు – అజాతదంతమరణేపిత్రోరేకాహమిష్యతే, దంతజాతం త్రిరాత్రం స్యాద్యదిస్యాతాంతునిర్గుణౌ, ఇతి కౌర్మాత్మాశ్యపంశూద్రపరం త్రిరాత్రంతుభవేచ్ఛూద్రే షణ్మాసేఽపిశిశౌమృతే, ఇతి మత్స్య, సూక్తాచ్చ. దంతజాతేశూద్రేతుపంచాహః యథాహాంగిరాః – శూద్రే త్రివర్షాన్న్యూనేతుమృతే శుద్ధిస్తుపంచభిః అతఊర్ధ్వంమృతేశూద్రేద్వాదశాహోవిధీయతే. షడ్వర్షాంతమతీతో, యః శూద్రః సంమ్రియతేయది, మాసికంతుభవేచ్ఛౌచమిత్యాంగిరసభాషితం, ఇతి.

అను॥ నామకర్మ అయ్యాక దంతాలు రాకముందు దాహమైతే ఒకరోజు ఆశౌచము. శిశువునకు దంతములు రాకముందే మరణిస్తే లేదా శిశువు గర్భంనుండి పడిపోతేనూ

సపిండులందరికి అహోరాత్రము అశౌచము (రోజు)అని యమోక్తి. దాహం లేకపోతే స్నాన మాత్రము. దంతములు రాకముందు మరణిస్తే వెంటనే శుద్ధి. వానికి అగ్ని సంస్కారము లేదు, అని విష్ణువు దాహం లేకపోతే ఆ మాట అన్నాడు. దంతములు రానందువల్ల సద్యః శుద్ధి అని యాజ్ఞవల్కియోక్తి కూడా. లౌగాక్షి దాహవికల్పాన్ని చెప్పాడు. మౌనంగానే ఉదకమివ్వాలి, మౌనంగానే సంస్కారము, చూడాకర్మ ఐన వారైనా, కానివారైనా అందరికి, ఇచ్ఛననుసరించి రెండు అని. అన్యత్ర అంటే చూడాకర్మ కానివారికి ఇక్కడ చూడాకరణమనేది మూడవ సంవత్సర రూపమైన కాలసూచకము కొరకు, అని మేధాతిథి హరదత్తులన్నారు. మనవు కూడా – మూడు సంవత్సరములు రాని వానికి (మరణిస్తే) బంధువులు (తండ్రి) ఉదకదానం చేయరాదు. దంతములు వచ్చిన వానికి లేదా నామకర్మ ఐన వానికి కాని ఉదకదానం చేయవచ్చు,అని. ఉదకశబ్దము దాహమునకు సూచనము. దంతములు వచ్చాక మూడు సంవత్సరాలు ముగిసేకన్న ముందు మరణిస్తే ఒకరోజు ఆశౌచము దంతములు వచ్చినా చూడాకర్మ కాకపోతే ఒకరోజుతో శుద్ధి అని విష్ణూక్తి. మూడు సంవత్సరాల తర్వాత చూడాకర్మ ఐనా కాకపోయినా, ఉపనయనం కన్న ముందు మూడురోజులే ఆశౌచం. చూడాకర్మ కాక పోయినా దంతములు వచ్చినట్లైతే, అట్లైనా (మరణించినా) వానిని దాహంచేసి మూడురోజులు ఆశౌచం పాటించాలి, అని అంగిరసోక్తి. (చూడాకర్మ కాకపోయినా ఐనా మూడు సంవత్సరాలు దాటాక దాహాదికర్మ తప్పదు, మూడు వర్షములు రానివానికి లేదు అనే వచనాన్ననుసరించి మూడు సంవత్సరాలకే మరణిస్తే, చూడాకర్మ ఐనా మౌనంగానే క్రియ ఆచరించాలి. ఉదకదానంలేదు). ఇక్కడ దంతములు రావటంఅనేది ఉద్దేశమునకు విశేషణం ఐనందువల్ల అవివక్షితము. దహనం చేయించి అనికూడా అనువాదము. రెండు విధిస్తే వాక్యభేదమౌతుంది. మూడు సంవత్సరాలకన్న ముందు చూడాకర్మకాకముందు, అగ్నిదానమందు మూడు రోజులు, అది లేకపోతే విష్ణువచనాన్ననుసరించి ఒకేదినము ఆశౌచం అని మాధవుడన్నాడు ఒకడిట్లా – ఇక్కడ మూడు సంవత్సరాలు అనే విషయం వల్ల ఈ అర్థం వల్లనే మూడు సంవత్సరాలపైన అనేది కూడా సిద్ధిస్తుంది. విజ్ఞానేశ్వరుని వచనం వల్లను మూడు సంవత్సరాల తర్వాత చూడాకర్మ చేయనివాని విషయము ఆలోచించాలి. లేకపోతే దంతములు వచ్చిన అనే పదం వ్యర్థమౌతుంది,అని. ఏదన్నాడో అది తుచ్ఛము. దాహమునకు విధేయంకాదు కనుక చూడాకర్మ చేయనివాని మరణమందు నరులకు అశుచి ఒకరాత్రి ఔతుంది, అని మనూక్తి. మూడు సంవత్సరముల తరువాత ఏకాహ అశుచి వస్తుంది. అంటే మూడు రోజుల అశుచి సిద్ధించదు. నీవు కూడా ముందు అట్లా అంగీకరించినందువల్ల, పదవైయర్థ్యసామ్యం ఉన్నందువల్ల, వాక్యార్థ జ్ఞానం లేనందువల్లను అని ఇక మితాక్షర అర్థాన్ని తెలుసుకోకుండా నింధించడం చాలు అని. తొలి సంవత్సరం ఆది యందైతే చూడాకర్మ ఐన వానికి ఎప్పుడూ మూడు రోజులు

ఆశౌచము. చూడాకర్మ ఐన వారికి మూడు రాత్రులతో శుద్ధితగును, అని మనూక్తి. ఇదంతా సపిండులకు ముందు చెప్పాము. మాతాపితరులకైతే పదిరోజుల తరువాత మరణిస్తే అంతట మూడు రాత్రులు ఆశౌచము. పిల్లలకు దంతములు రాని వారికి (వారు మరణిస్తే) మూడు రాత్రులతో శుద్ధి అని కశ్యపోక్తి. బీజ సంబంధంవల్ల మరొకని స్త్రీయందు సంతానం కల్గితే మూడు రోజులు ఆశౌచము (అఘము) ఉంటుంది,అని మనూక్తి కూడ. శుద్ధి తత్వాదులలో గౌడులైతే – దంతములు రాకుండా మరణిస్తే తల్లి, తండ్రికి ఒక రాత్రి ఆశౌచం తగును. దంతములు వస్తే మూడు రాత్రులు ఆశౌచము, ఒకవేళ వీరిద్దరు నిర్గుణులైతే అనే కూర్మపురాణ వచనంవల్ల కాశ్యపవచనము శూద్రపరము అని గ్రహించాలి. వివాహం కాని శూద్రునివల్ల జన్మించిన కన్యలు మరణిస్తే మూడు రోజులు ఆశౌచము అని మూడు రోజుల అనువృత్తి అని శంఖోక్తి ఉంది. ఆరు నెలల శిశువు మరణించినా శూద్రునకు త్రిరాత్ర ఆశౌచము, అని మత్స్యసూక్తం వల్లను. దంతములు వచ్చి మరణిస్తే శూద్రుడు ఐదు రోజుల ఆశౌచము, తండ్రికి. ఆంగిరుడిట్లా – శూద్రుడు మూడు సంవత్సరాలకన్న తక్కువ వయసులో మరణిస్తే ఐదురోజులకు శుద్ధి ఆపై వయసులో మరణిస్తే శూద్రునకు పన్నెండురోజులు ఆశౌచం విధించబడుతోంది. ఆరు సంవత్సరములు గడిచిన పిదప శూద్రుడు మరణిస్తే నెలరోజులు ఆశౌచము,అని ఆంగిరసుని వచనము,అని.

మూ॥ యత్తు – అనూఢభార్యః శూద్రస్తు, ఇతి శంఖోక్తం మాసాశౌచం తత్సగుణ శూద్ర పరం. నిర్గుణేత్వ నూఢ భార్యే శూద్రే త్రివర్షోర్ధ్వం ద్వాదశాహః షడబ్దోఽర్ధ్వం మాసః. షడబ్దాత్ప్రా గపి కృతోద్వాహేమాస ఇత్యాహుః. ఏతత్, తుల్యం వయసి సర్వేషాం, ఇతి విరోధాత్ శిష్ట విగానాత్ నా దర్తవ్యమితి విజ్ఞానేశ్వరా దయః. దాక్షిణాత్యానాం తద్రైవ. అన్యదేశే ప్రాగుక్త మితిగౌడాః. ఏవం కన్యాస్వపి. తాస్వప్యజాత దంతాసు పిత్రో రేకరాత్రమితి మాధవః. యత్తు విజ్ఞానేశ్వరేణోక్తం. ఊనద్వివర్ష ఉభయోః సూతకం మాతురేవహి, ఇతి యాజ్ఞవల్క్యోక్తేః. గర్భస్థే ప్రేతే మాతుర్దశాహం, జాతే ఉభయోః, కృతేనామ్ని సోదరాణాం చ , ఇతి పైంగ్యోక్తేశ్చ పిత్రోః సోదరాణాం చ దశాహ మస్పృశ్యత్వమితి. తన్నేదానీం ప్రచరతి. అత ఏవ స్మృత్యర్థ సారే తన్నాదృతం. కన్యాసుచౌలాత్ప్రాక్ మృతౌస్నానం. అచూడాయాంతు కన్యాయాం సద్యః శౌచం విధీయతే, ఇత్యాపస్తంబోక్తేః ఇదం త్రిపురుషమధ్యే, అప్రమత్తానాం తు స్త్రీణాం త్రిపురుషీ విజ్ఞాయతే, ఇతి వసిష్ఠోక్తేః ఇదం వాగ్దానోత్తర మితిగౌడాః. తన్న అప్రమత్తానాం తథా స్త్రీణాం సాపిండ్యం సాప్త పౌరుషం, ఇతి వచనాత్. చౌలోత్తరం వాగ్దానాత్ పూర్వం తాస్వేకాహః, అవిశేషేణ వర్ణానామర్వాక్ సంస్కార కర్మణః. త్రిరాత్రాత్తు భవేచ్ఛుద్ధిః. కన్యాస్వహ్నో విధీయతే, ఇత్యం గిరసా త్రిరాత్ర విషయే అహోవిధానాత్. (అహస్త్వదత్తకన్యాసు బాలేషు చ విశోధనం,ఇతి యాజ్ఞవల్క్య యాచ్చ). అతః శూద్రస్యోపనయన స్థానీయ వివాహాత్పూర్వం త్రిరాత్రం. వివాహోత్కర్షేతు షోడ శాబ్దమధ్యే త్రిరాత్రమే వేత్యపరార్కాద్యాః శూద్రేతు నిర్గుణే త్ర్యబ్దోర్ధ్వం పంచాహం. షడబ్దోర్ధ్వం వివాహాభావే ద్వాదశాహమితి గౌడాః. సగుణానాం షోడశాబ్దోర్ధ్వంతు వివాహాభావేఽపి పూర్ణాశౌచం వక్ష్యతే తదుత్తరం

ప్రాగ్వివాహాత్ భర్తృకులే పితృకులేచ సప్త పురుషావధిత్రి రాత్రం. అవారిపూర్వం ప్రత్తాతుయా, నైవ ప్రతిపాదితా, అసంస్కృతాతు సాజ్ఞేయాత్రిరాత్రముభయోః స్మృతం ఇతి మరీచ్యుక్తేః **రత్నాకరే శుద్ధితత్వే చ శంఖః** - పితృవేశ్మనియా నారీరజః పశ్యత్య సంస్కృతా, తస్యాం మృతాయాం నాశౌచం కదాచిద పిశామ్యతి. యావజ్జీవ మశౌచ మితివాచస్పతిమిశ్రాః. **అథానుపనీతే కించిదుచ్యతే.** నామ్నః పూర్వం ఖననమేవ. తదూర్ధ్వం వర్ష త్రయాత్పూర్వం చౌలాభావే అగ్న్యుదక దానవికల్పః. నాత్రి వర్షస్య కర్తవ్యా బాంధవై రుదకక్రియా, జాతదంతస్య వాకుర్యు ర్నామ్నివాపి కృతేసతి, ఇతి మనూక్తేః ఉదకక్రియా సాహచర్యాద్దాహోప లక్షణం.

అను॥ ఇట్లా వివాహితుడు కాని శూద్రుడు మరణిస్తే అని శంఖుడు చెప్పిన మాస ఆశౌచము అది సగుణ శూద్ర పరము. నిర్గుణుడు వివాహం కాని శూద్రుడు మరణిస్తే మూడు సంవత్సరాలపై వయస్సైతే పన్నెండు రోజులు ఆశౌచం, ఆరు సంవత్సరాలపైన ఐతే ఒక మాసాశౌచము. ఆరు సంవత్సరాలముందైనా వివాహమై మరణిస్తే మాసము ఆశౌచము, అని ఏది అన్నారో ఇది వయస్సు యందు అందరికి సమానమే, అనే దానికి విరుద్ధమైనది, శిష్టులు నిందించినది, దీనిని ఆదరించరాదని విజ్ఞానేశ్వరాదులన్నారు. దాక్షిణాత్యులు కూడా అట్లాగే అన్నారు. వేరేచోట ముందు చెప్పాము అని గౌడులన్నారు. ఇట్లా కన్యలందు కూడా వారికి కూడా దంతములు రాకపోతే, మరణిస్తే తలిదండ్రులకు ఒకరాత్రి ఆశౌచము అని మాధవు డన్నాడు. విజ్ఞానేశ్వరుడిట్లా - రెండు సంవత్సరాలకన్న తక్కువ వయస్సులో మరణిస్తే తలి దండ్రులకు ఆశౌచము జన్మమందు సూతకము తల్లికే, అనే యాజ్ఞవల్క్యఉక్తి వల్లను గర్భమందే మరణిస్తే తల్లికి పదిరోజులు ఆశౌచం, జన్మిస్తే తల్లికి తండ్రికి ఇద్దరికి ఆశౌచం, నామకర్మ ఐతే సోదరులకు గూడా, అనే, పైంగ్యోక్తి వల్లను తలిదండ్రులకు సోదరులకు పదిరోజులు అస్పృశ్యత్వము అని ఏదన్నారో అది అట్లాకాదు అది ఇప్పుడు ప్రచారంలో లేదు. అందువల్లనే స్మృత్యర్థ సారమందు దాన్ని గౌరవించలేదు. కన్యలు చౌలంకన్న ముందే మరణిస్తే స్నానము కన్య చూడాకర్మ కాకుండానే మరణిస్తే సద్యః శౌచము ఉంటుంది (స్నానం) అని ఆపస్తంబోక్తి. ఇది మూడు తరముల మధ్య. వివాహం కాని స్త్రీలకు మూడు తరముల వరకు అని గ్రహించాలి, అని వసిష్ఠోక్తి. ఇది వాగ్దానం తరువాత అని గౌడులన్నారు. అంటే అట్లాకాదు. వివాహం కాని స్త్రీలకు సాపిండ్యము ఏడు తరముల వరకు అనే వచనంవల్లను. చూడాకర్మ తరువాత, వాగ్దానం కన్న ముందు మరణిస్తే వారి ఆశౌచము ఒకదినము. సంస్కార కర్మకన్నముందు వర్ణములకు విశేషం లేనందువల్ల, మూడు రాత్రులతో శుద్ధి అని అన్నారు. కన్యలకు ఒకరోజు ఆశౌచం విధించాము,అని అంగిరుడు మూడు రాత్రులచోట ఒక రాత్రిని విధించాడు (వివాహం కాక చూడాకర్మ ఐ మరణించిన బాలురు వాగ్దానం కాకుండా మరణించిన కన్యల విషయంలో ఒకరోజు ఆశౌచముతో శుద్ధి,అని యాజ్ఞవల్క్య వచనము) అందువల్ల శూద్రుడు, ఉపనయన

స్థానీయమైన వివాహం కాకముందు మరణిస్తే త్రిరాత్రము అశౌచము. వివాహోత్కర్ష మందును పదహారు సంవత్సరాల మధ్య మరణిస్తే మూడు రాత్రులే అని అపరార్కాదులన్నారు. శూద్రుడు నిర్గుణుడైతే మూడు సంవత్సరాలపై వయస్సైతే, మరణిస్తే ఐదు రోజులు ఆశౌచము. ఆరుసంవత్సరాల వయస్సుపైన, వివాహం కాకుండా మరణిస్తే పన్నెండు రోజులు, అని గౌడులన్నారు. సగుణులకైతే పదహారు సంవత్సరాలపై వయస్సై, వివాహం కాకున్నా మరణిస్తే పూర్ణా శౌచమన్నారు. దాని తరువాత వివాహం కన్న ముందు(వాగ్దత్తయై) భర్తృ కులమందు పితృకులమందు ఏడు తరముల వరకు త్రిరాత్రౌ శౌచము. వాగ్దత్తయై జలదాన పూర్వకముగా ఇవ్వబడని ప్రతిపాదింపబడని, వివాహం కాని కన్యను అసంస్కృత అని అంటారు. ఆమె మరణిస్తే, మూడు రాత్రులు భర్త, తండ్రికుల ములందు (రెండిటిలో) ఆశౌచము, అని మరీచి వచనము. రత్నాకరమందు, శుద్ధి తత్వమందు శంఖుని వచనమిట్లా – తండ్రి ఇంటియందు, సంస్కారం కాకుండా (వివాహం) రజస్సును పొందిన స్త్రీ (కన్య) మరణిస్తే ఆ ఆశౌచము ఎప్పుడూ శమించదు,అని. జీవితాంత మాశౌచము అని వాచస్పతి మిశ్రులన్నారు. ఇక అనుపనీతుని విషయంలో కొంచెం చెప్తాము. నామకర్మకన్న ముందు మరణము చెందితే ఖననమే. ఆ పైన మూడు సంవత్సరాల కన్నముందు, చూడాకర్మ కాకముందు మరణిస్తే అగ్ని ఉదకదానములు వికల్పము. మూడు సంవత్సరములు రాకుండా మరణిస్తే బంధువులు ఉదకక్రియ చేయకూడదు అని. దంతములు వచ్చిన వానికి లేదా నామకర్మ ఐన వానికైనా చేయాలి,అని మనూక్తి. ఉదక క్రియా సాహచర్యం వల్ల దాహ ముపలక్షణము (నిషేధం ఆపైన మళ్ళీ విధి).

మూ॥ ఖననేతు నాన్యదౌర్ధ్వదైహికం. ఊనద్వివర్షం నిఖనేత్ నకుర్యాదుదకం తతః, ఇతి యాజ్ఞవల్క్యోక్తేః. ఉదకమంత్యకర్మ పరమిత్య పరార్కః. యమః – ఊనద్వివార్షికం ప్రేతం ఘృతాక్తం నిఖనేద్భువి, యమగాథాం గాయ మానో యమసూక్తమనుస్మరన్. మాధవీయే బ్రాహ్మేఽపి – స్త్రీణాంతు పతితోగర్భః సద్యోజాతో మృతోఽథవా, అజాతదంతో మాసైర్వా మృతః షడ్భిః గతైర్బహిః వస్త్రాద్యైః భూషితం కృత్వా నిక్షిపేత్తంతు కాష్ఠవత్, ఖనిత్వాశనకైర్భూమౌసద్యః శౌచం విధీయతే. అలంకరణమపి వక్ష్యతే. కృతచూడస్యతు త్రివర్షాత్ ప్రాగూర్ధ్వం వాగ్భ్యుదకదానం నియతం. యత్తు వసిష్ఠః – ఊనద్వివర్షే ప్రేతే గర్భపతనే వా సపిండానాం త్రిరాత్రం, ఇతి తత్ ప్రథమాబ్ద చూడాపరం. వర్షత్రయా దూర్ధ్వ మకృత చూడస్యాపి నియతం, వర్షత్రయోర్ధ్వ ముపనయనాత్పూర్వం చ తూష్ణీ మగ్న్యుదకదానం. తూష్ణీమేవోదకం కుర్యాత్తూష్ణీం సంస్కారమేవ చ, ఇతి పూర్వోక్త లౌగాక్షి స్మృతేః. పిండదానమపి కార్యం. అసంస్కృతానాం భూమౌ పిండం దద్యాత్ సంస్కృతానాం కుశేషు, ఇతి ప్రచేతసోక్తేః. ఉదకదానం సపిండైః కృతచూడస్య ఇతి గౌతమోక్తేః. ఉదక గ్రహణ మౌర్ధ్వ దేహిక పరమితి హరదత్తః. ద్వాదశాద్వత్స రాదర్వాక్ పౌగండమరణేసతి, సపిండీకరణం నస్యాత్ నైకోద్దిష్టానికారయేత్, ఇతి హరదత్త ధృతదేవలోక్తేశ్చ. మరీచిరపి – ప్రేతపిండం బహిర్ద ద్యాత్ దర్భ మంత్ర వివర్జితం, ఇతి. ఏత దనుపనీత పరమితి

విజ్ఞానేశ్వరః. అత్రచూడైవ పూర్వావధిః పూర్వవాక్యేషు తద్ గ్రహణాత్, ఉదకగ్రహణస్య ఉపలక్షణత్వాత్ దాహః పూర్వా వధిరితికేచిత్. ద్వాదశాత్ వత్సరాత్ ఇత్యనుపనీత ద్విజానాధ శూద్ర విషయం. **త్ర్యహాశౌచే పిండదాన విధి** మాహ పారస్కరః - ప్రథమే దివసేదేయాః త్రయః పిండాః సమాహితైః, ద్వితీయే చతురోదద్యాత్ అస్థిసంచయనం తథా, త్రీం స్తు దద్యాత్తృతీయేఽహ్ని వస్త్రాదిక్షాలయేత్తతః, ఇతి.

అను॥ ఖననమైతే, ఇతరమైన ఊర్ధ్వ దేహక్రియాకలాపం అవసరం లేదు. రెండు సంవత్సరాలకన్న తక్కువ వయస్సులో శిశువు మరణిస్తే ఖననం చేయాలి. ఆ పిదప ఉదకం చేయరాదు,అని (దహనం) యాజ్ఞవల్క్యోక్తి. ఉదకమనగా అంత్యకర్మ అని అపరార్కు డన్నాడు. యముడిట్లా - రెండు సంవత్సరాల కన్న తక్కువ వున్న ప్రేతకు నేయి పూసి భూమి యందు పాతిపెట్టాలి. యమ సూక్తాన్ని స్మరిస్తూ, యమగాథను పాడాలి,అని. మాధవీయమందు బ్రాహ్మమందు కూడా - స్త్రీలకు గర్భపాతమైతే అప్పుడే జన్మించిన శిశువు మరణిస్తే, దంతములు రాకుండా ఆరుమాసములు దాటి మరణిస్తే, వానిని వస్త్రాదులతో అలంకరించి వానిని కట్టెవలె పారేయాలి. లేదా భూమిని మెల్లమెల్లగా త్రవ్విపాతిపెట్టాలి, అప్పుడు వెంటనే శౌచము అని చెప్పారు. అలంకరణం కూడా చెప్పారు. చూడాకర్మ ఐన వానికి మూడు సంవత్సరములకు ముందు కాని తరువాత కాని మరణిస్తే అగ్ని ఉదకదానము తప్పదు. వసిష్ఠుడిట్లా - రెండు సంవత్సరాల లోపు మరణిస్తే గర్భపాతమైతే సపిండులకు త్రిరాత్రము అశౌచము, అని ఏదన్నాడో అది తొలి ఏడాదిలో చూడాకర్మ చేసినవాని విషయము. మూడు సంవత్సరాల తరువాత చూడాకర్మ కాకున్నా మరణిస్తే త్రిరాత్రా శౌచము దాహాది తప్పదు. మూడు సంవత్సరాల తరువాత ఉపనయనం కన్న ముందు మరణిస్తే మౌనంగా అగ్ని ఉదక దానము చేయాలి. ఉదకం మౌనంగా, సంస్కారం కూడా మౌనంగానే చేయాలి,అని ముందు చెప్పిన లౌగాక్షి స్మృతి వచనము. పిండదానం కూడా చేయాలి. సంస్కారం లేని వారికి (మరణిస్తే) భూమిమీద, సంస్కారం ఐన వారికి కుశలపై పిండముంచాలి,అని ప్రచేతసోక్తి. చూడాకర్మ ఐనావానికి సపిండులు ఉదక పిండదానంలు చేయాలి, అని గౌతమోక్తి. ఉదక శబ్ద గ్రహణము, ఔర్ధ్వ దేహికపరమని హరదత్తుడన్నాడు. పన్నెండు సంవత్సరాలకన్న ముందు, పౌగండమరణం ఐతే (5-16వరకు) సపిండీకరణం గాని, ఏకోద్దిష్టములుగాని చేయరాదు,అని హరదత్తుడు చెప్పిన దేవలోక్తి కూడా. మరీచికూడా - దర్భలు మంత్రములు లేకుండా ప్రేత పిండాన్ని బయట ఇవ్వాలి,అని అన్నాడు. ఇది ఉపనయనం కాని వాని విషయమని విజ్ఞానేశ్వరుడన్నాడు. ముందు వాక్యములందు చూడాకర్మ అన్నాడు కనుక ఇక్కడ చూడా కర్మనే పూర్వావ (వి)ధి అని కొందరన్నారు. పన్నెండవ సంవత్సరం నుండి అనేది ఉపనయనం కాని బ్రాహ్మణునకు,

వివాహం కాని శూద్రునకు చెందిన విషయము. మూడు రోజుల ఆశౌచమందు పిండదాన విధిని పారస్కరుడిట్లా చెప్పాడు - సావధానులై మొదటిరోజు మూడు పిండములివ్వాలి. రెండవరోజు నాలుగు ఇవ్వాలి. అట్లాగే అస్థి సంచయనం కూడా. మూడవరోజు మూడు పిండములివ్వాలి. ఆ పిదప వస్త్రాదుల క్షాళన చేయాలి,అని.

మూ॥ **అత్రదేవయాజ్ఞిక** నిబంధే విశేషః - శిశురాదం తజననాద్బాలః స్యాద్యావదా శిఖః, కథ్యతే సర్వశాస్త్రేషు కౌమారో మౌంజి బంధనాత్, ఆపంచవర్షాత్, కౌమారః పౌగండో నవహాయనః. **తథాగర్భేనష్టే** క్రియానాస్తి దుగ్ధందేయం శిశౌమృతే, పరం చ పాయసంక్షీరం దద్యాద్బాల విపత్తితః. ఏకాదశం ద్వాదశాహం వృషోత్సర్గ విధింవినా. తథా - యత్ర ప్రమీయతే బాలః తత్ర ప్రాయః ప్రదీయతే, కించిత్సమాన వ యసాం సంస్కృత్యాన్నం యథావిధి. భక్ష్యం భోజ్యం చ దాతవ్యం తథా చ సుఖభక్షికా తద్వస్త్రాణి ప్రదేయాని సోపానత్కాని తత్సమే. కుమారాణాం చ బాలానాం భోజనం వస్త్రవేష్టనం, యచ్చోపజీవతే బాలః తత్తద్విప్రాయదీయతే. తథా - భూమి నిఃక్షేపణం బాలే ఆవర్ష ద్వయమాశిఖం, తతః పరం ఖగశ్రేష్ఠ దేహ దాహో యథావిధి. ఆ చూడేఽ పూర్వం ఖనన నివృత్యర్థ మావర్ష ద్వయమితి. ప్రాగపికృత చూడస్య తన్నివృత్యర్థ మాశిఖమితి. తథా - చూడాకర్మణి సంజాతే విపత్తిస్తు యదాభవేత్, సూతకాంతే ప్రకర్తవ్యం వృషస్యోత్సర్జనం తదా. తత్ర దాహః ప్రకరవ్యః ఉదకం తత్రనిశ్చితం, శ్రాద్ధా నిషోడ శాపిస్యుః సపిండీకరణం వినా. ఇదం పంచవర్షోత్తరం. జన్మతః పంచవర్షాణి భుంక్తే దత్తమ సంస్కృతం, పంచవర్షాధికే బాలే విపత్తిర్య దిజాయతే, వృషోత్సర్గాదికం కర్మ కర్తవ్య ముదకం తతః. అహన్య హని సంప్రాప్తే కుర్యా చ్ఛ్రాద్ధాని షోడశ, పాయసేన గుడే నైవ పిండం దద్యాద్యథాక్రమం, ఉదకుంభ ప్రదానం చ పదదానానియానిచ, దీపదానాని యత్కించిత్ పంచవర్షాధికే సదా. కర్తవ్యంతు ఖగశ్రేష్ఠ వ్రతారాక్ ప్రేత తృప్తయే. స్వాహాకారేణైవ కార్యాణ్యే కోద్దిష్టాని షోడశ. ఋజుదర్భైః తిలైః శుక్లైః ప్రాచీనావీతినా తథా, ఇతి తత్రైవోక్తేః. అత్రమూలం చింత్యం. వార్షికాది న భవత్యేవ. సపిండనత్వా భావే పితృత్వాయోగాత్ వచనా భావాచ్చ. దివోదాసీయే - అవ్రతే నిధనంప్రాప్తే విప్రాదౌ శూద్రజాతివత్, క్రియాః సర్వాః సముద్దిష్టాః సపిండీకరణంవినా. ఉదకం పిండదానంచ కృతచూడే విధీయతే, ఇతి. **స్త్రీణాంతూద్వాహాత్ప్రాక్** ఉదక పిండదాన వికల్పః స్త్రీణాం చైకేఽ ప్రత్తానాం, ఇతి గౌతమోక్తేః స్త్రీ శూద్రాశ్చ సధర్మాణః, ఇతి వచనాచ్ఛూద్రేఽ ప్యేవం. ఏత(ద్)ద్వయో (ర్) నిమిత్తా శౌచం సర్వవర్ణసమం. తుల్యే వయసి సర్వేషామతి క్రాంతే తథైవచ, ఇతి వ్యాఘ్రపాదోక్తేః యానితు - నిర్వృత్త చూడకే విప్రే త్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే, నివృత్తే క్షత్రియే షడ్భిః వైశ్యేనవభిరుచ్యతే శూద్రే త్రివర్షే న్యూనేతు మృతేశుద్ధిస్తు పంచభిః. అత ఊర్ధ్వం మృతే శూద్రే ద్వాదశాహో విధీయతే. షడ్వర్షాంత మతీతేతు శూద్రే మాసమశౌచకం, ఇత్యాంగిరసాదీని, తానిశిష్ట విగానాన్నాదర్తవ్యానీతి విజ్ఞానేశ్వర మదనపారిజాతాదయః. తే నై తద్వశాచ్ఛూద్రాణాం వ్యవస్థా ప్రాగుక్తా హేయైవ. తుల్యే వయసి సర్వేషామితి దాక్షిణాత్యపరం. అన్యదేశే కౌర్మోక్తా వ్యవస్థా ఇతి శుద్ధి తత్వే.

అను॥ ఇక్కడ దేవయాజ్ఞిక నిబంధమందు విశేషమిట్లా - దంతములు వచ్చే వరకు శిశువు, బాలుడనగా శిఖాధారణ వరకు, మౌంజీ బంధనం వరకు కుమారుడు

అని అన్ని శాస్త్రములలో చెప్పబడ్డాడు. ఐదు సంవత్సరాలవరకు మూఢుడు, అక్కడి నుండి తొమ్మిది సంవత్సరాల వరకు పౌగండమనిపేరు,అని. అట్లాగే - గర్భం నష్టమైతే ఏ క్రియలేదు, శిశువు మరణిస్తే పాలు పోయాలి (దంతజన్మవరకు), ఆపైన (చూడాకర్మకన్నముందు) బాలుడు మరణిస్తే పాయసము, క్షీరము ఇవ్వాలి. పదకొండు, పన్నెండవ రోజుల కర్మ వృషోత్సర్గ విధి చేయరాదు. అట్లాగే - ఏ వయసులో మరణిస్తాడో బాలుడు ఆ వయసు వారికి దానమివ్వాలి. (మరణించిన చోట దీపము. ప్రాయః బదులు దీపః అని) కొద్దిగా సమాన వయస్కులైన బాలురకు అన్నం వండి యధావిధిగా పెట్టాలి. భక్ష్యములు భోజ్యములు, ఇవ్వాలి అట్లాగే మరణించినవాడు ఉపయోగించినట్టిది తిన్నటు వంటివి ఇవ్వాలి. అట్లాగే వస్త్రములు ఇవ్వాలి. వానికి సమానమైన వారికి, సమానమైన చెప్పులు ఇవ్వాలి. కుమారులకు బాలురకు భోజనము, ధరించే వస్త్రాలు ఇవ్వాలి. దేనితో బాలుడు జీవించేవాడో (ఉపయోగం,తిండి) అవన్నీ విప్రునకు ఇవ్వాలి. అట్లాగే - రెండు సంవత్సరాల వరకు, శిఖపెట్టే వరకు (చూడాకర్మ) బాలుని (మరణంలో) భూమియందే పాతిపెట్టాలి. ఓ ఖగశ్రేష్ఠ! ఆ పిదప శాస్త్ర ప్రకారము దేహదాహము (కాల్చటం). చూడాకర్మ కాకపోయినా కూడా ఆపైన, ఖననం లేకుండా ఉండటంకొరకు, రెండు సంవత్సరాలవరకు అనేపదం అని. ముందుకూడా చూడాకర్మ ఐనవానికి అది లేకుండా ఉండే కొరకు (ఖననం) ఆ శిఖం అనే పదం. అట్లాగే - చూడాకర్మ అయ్యాక ఆపదవస్తే సూతకాంతమందు, అప్పుడు వృషోత్సర్జన చేయాలి. అక్కడ దాహం చేయాలి. అక్కడ ఉదకదానం తప్పదు. షోడశశ్రాద్ధములు ఉంటాయి. సపిండీకరణం ఉండదు. ఇది ఐదు సంవత్సరాల వయసయ్యాక మరణిస్తే. జన్మనుండి ఐదు సంవత్సరాలవరకు (మరణంలో) సంస్కరించిన దాన్ని ఇస్తే తింటాడు. ఐదు సంవత్సరాల పైవయసు గల బాలునకు విపత్తి కలిగితే (మరణం) వృషోత్సర్గము మొదలగు కర్మ, ఉదకదానము చేయాలి. ఆయా (రోజు) రోజున వచ్చే పదహారు శ్రాద్ధములను చేయాలి. యధాక్రమంగా పాయసంతో కాని గుడంతో కాని పిండం పెట్టాలి. ఉదకుంభదానము, పదదానము, దీపదానము ఇవ్వాల్సిన వన్నీ ఐదు సంవత్సరముల వయస్సు దాటిన వారికి ఎల్లప్పుడు చేయాలి. ఓఖగశ్రేష్ఠ! ప్రేత తృప్తికొరకు యజ్ఞోపవీతం కన్న ముందు (మరణిస్తే) చేయాలి. పదహారు శ్రాద్ధములను ఏకోద్దిష్ట విధితో స్వాహాకారంతోనే చేయాలి. దర్భలు ఋజువుగా (చక్కగా) ఉండాలి. తెల్ల నువ్వులతో, ప్రాచీనావీతిగా ఆచరించాలి. అని అక్కడే చెప్పారు. ఇక్కడ మూల వచానాన్ని గూర్చి ఆలోచించాలి. వార్షికాదులు ఉండవు. సపిండనం లేకపోతే పితృత్వం కలగదు కనుక. ఆధారవచనం లేదు కూడా. దివోదాసీయ మందిట్లా - ఉపనయనం కాకుండా మరణిస్తే విప్రాదులకు శూద్రజాతికి వలె అన్ని క్రియలు ఉద్దేశించబడినవి. స పిండీకరణం మాత్రం లేదు. చూడాకర్మ ఐతేనో ఉదకము, పిండదానము విధించబడింది,అని. స్త్రీలకైతే, వివాహం కన్న ముందైతే

(మరణం) ఉదకపిండదానములు వికల్పము. వివాహం కాని కన్యలకు కొందరు అంగీకరిస్తారు, అని గౌతమోక్తి. స్త్రీలు శూద్రులు సమాన ధర్మం కలవారు, అనే వచనం వల్ల శూద్రుని విషయంలోనూ, ఇట్లాగే. ఇది వయోనిమిత్తకమైన ఆశౌచము. (ఇద్దరి నిమిత్తకాశౌచము) అన్ని వర్ణముల వారికి సమానము. అన్ని వర్ణముల వారికి సమాన వయస్సు ఉన్నప్పుడు అయిపోయాక (మరణించాక) అట్లాగే ఆశౌచము సమానము,అని వ్యాఘ్రపాదోక్తి. చూడాకర్మఐన విప్రుని మరణమందు మూడు రాత్రులతో శుద్ధి ఏర్పడుతుంది. క్షత్రియునకు చూడాకర్మ జరిగి మరణిస్తే ఆరు రోజులతో శుద్ధి. వైశ్యునకు తొమ్మిది రోజులతో శుద్ధి. మూడు సంవత్సరాలకన్న తక్కువ వయస్సులో ఉన్న శూద్రుడు మరణిస్తే ఐదు రోజులతో శుద్ధి. ఆ పై వయస్సులో మరణిస్తే శూద్రుడు, పన్నెండు రోజులతో శుద్ధి విధించారు. ఆరు సంవత్సరాల వయసు గడిచాక మరణిస్తే శూద్రుడు నెలరోజులు ఆశౌచము అనే అంగిరసాదుల మాటలేవి ఉన్నాయో అవి శిష్టులచే నిందించబడ్డాయి. కనుక వాటిని ఆదరించరాదు. అని విజ్ఞానేశ్వర మదన పారిజాతాదులన్నారు. అందువల్ల ఈ (వచనం) కారణంగా ముందు చెప్పిన శూద్రులకు చెందిన నిర్ణయము (వ్యవస్థ) నిందించతగినదే. తుల్యే వయసి సర్వేషాం, అనేది దాక్షిణాత్య పరమైన మాట. ఇతరదేశమందు కూర్మపురాణమందు చెప్పినట్లే వ్యవస్థ అని శుద్ధి తత్వమందు చెప్పారు.

మూ॥ **అథజాత్యాశౌచం.** తచ్చ ద్విజపుంసాం ఉపనయనోర్ధ్వం ప్రవర్తతే త్రిరాత్ర **మాత్రతా దేశాత్** దశరాత్రమతః పరం. క్షత్రస్య ద్వాదశాహోని విశః పంచదశైవతు, త్రింశద్దినాని **శూద్రస్య** తదర్థం న్యాయవర్తినః, ఇతి యాజ్ఞవల్క్యోక్తేః. యత్తు స ఏవ - త్రిరాత్రం దశరాత్రం వా శావమాశౌచమిష్యతే, ఇత్యాహ. తత్ర దశాహే త్రిరాత్ర మస్పృశ్యత్వం. ఏకదినోత్పన్నే ఆశౌచద్వయే దశాహ మస్పృశ్యత్వం. మరణం యదితుల్యంస్యాత్ మరణేన కథంచన, అస్పృశ్యంతు భవేద్గోత్రం సర్వమేవ సబాంధవం ఇత్యంగిరసోక్తేః. దశాహే శౌచపరత్వే, దశరాత్రమతః పరం, ఇత్యనేన పౌనరుక్త్యాపత్తే రితి శుద్ధి వివేకాదయః. తన్న, స్మృతి భేదాత్, త్రిరాత్రం దశరాత్రం వేతి వికల్పాయోగాచ్చ. యస్తుపుత్రాణాం వేదానధ్యాప్య వృత్తిం విదధాతి తత్రాహాశ్వలాయనః. ద్వాదశరాత్రం వా మహాగురుషు దానాధ్యయనే వర్జయేరన్, ఇతి. అత్రయా వదుక్త నిషేధౌవాఽ స్పృశ్యత్వ మాత్రంవా, నతుకర్మా (న) ధికారః. ఏకాదశాహాంతే వైశ్వదేవోక్తేః. ఏకాదశాహికే ముక్త్వాతత్రహ్యంతే విధీయతే, ఇతి. **శుద్ధితత్వేతు** - త్రయః పురుషస్యాతి గురవో భవంతి మాతా పితాచార్యశ్చ, ఇతి విష్ణూక్తేః పిత్రాదయో మహాగురవః **భర్తాప్యుక్తో రామాయణే** - పతిర్బంధుర్గతిర్భర్తా దైవతం గురురేవచ. శాతాతపః - పతిరేకోగురుః స్త్రీణాం సర్వస్యాభ్యాగతో గురుః. ఏకపద విమూఢానాం పితృమాతృ నిషేధార్థం. సోదకానాం త్రిరాత్రం, త్ర్యహాదుదక దాయినః ఇతి మనూక్తేః. **అగ్నిపురాణే - సపిండతాతు** - పురుషే సప్తమే వినివర్తతే, సమానోదక భావస్తు నివర్తేత చతుర్దశే జన్మ నామస్మృతే ర్వైకే తత్పరం గోత్రముచ్యతే. బృహస్పతిః - దశాహేన

**సపిండాస్తు శుద్ధ్యంతి ప్రేత సూతకే. త్రిరాత్రేణ సకుల్యాస్తు స్నాత్వా శుద్ధ్యంతి గోత్రజాః. స్త్రీ శూద్రయోస్తు వివాహోర్ధ్వం జాత్యాశౌచం. వైవాహికోవిధిః స్త్రీణాం ఔపనాయనికః స్మృతః ఇత్యుక్తేః దత్తానాం భర్తురేవహి. స్వజాత్యుక్త మశౌచం స్యాన్మృతకే జాతకే తథా, ఇతి మాధవీయే బ్రాహ్మోచ్చ. శూద్రస్య వివాహాభావేఽపి షోడశవర్షోర్ధ్వం మాసః, అనూఢ భార్యః శూద్రస్తు షోడశాద్వత్సరాత్పరం, మృత్యుం సమధిగచ్ఛేచ్చే న్మాసాత్తస్యాపి బాంధవాః, శుద్ధిం సమధి గచ్ఛంతి నాత్రకార్యా విచారణా, ఇత్యపరార్కే శంఖోక్తేః. నిర్ణయామృత మదన పారిజాతాదౌ త్వన్యథోక్తం. హారీతః - అమౌంజీ బంధనాద్విప్రః క్షత్రియశ్చ ధనుర్గ్రహాత్. ఆప్రతోదగ్రహాత్ వైశ్యః శూద్రో వస్త్రద్వయ గ్రహాత్. ధనుః ప్రతోదా వష్టమేఽబ్దే ద్వాదశే వస్త్ర ద్వయమితి. మేధాతిథిస్తు - త్రిరాత్ర మావ్రతాదేశాత్ - ఇత్యత్ర వ్రతం కాలోపలక్షణార్థం. సచకాలః స్వకీయః సర్వేషాం చాష్టమవర్షరూపః. తేన చతుర్ణామపి వర్ణానాం ఉపనయనాభావేఽప్యష్టమాదూర్ధ్వం పూర్ణమేవాశౌచం. తథాపి ప్రాగష్టమాచ్ఛిశవః ప్రోక్తాః ఇతి స్మృత్యంతరా దూర్ధ్వం సంపూర్ణ మర్వాక్ త్రిరాత్రం, యేఽపి, ఆషోడశాద్భవేద్బాలః, ఇత్యాహుః తేషామప్యష్ట మాదూర్ధ్వం శూద్రే మాస ఏవ, ఊర్ధ్వ మష్టభ్యో వర్షేభ్యః శుద్ధిః శూద్రస్య మాసికీ ఇతి వచనాదిత్యాహ. హారలతా శుద్ధి తత్వాది గౌడగ్రంథేష్వ ప్యుక్తం.**

అను॥ ఇక జాతి ఆశౌచాన్ని చెబుతున్నాడు. అది బ్రాహ్మణ పురుషులకు ఉపనయనం తరువాత (స్త్రీలకు వివాహం) వర్తిస్తుంది. ఉపనయనంకన్న ముందు మరణిస్తే మూడు రాత్రులు, ఆ పిదప పదిరాత్రులు క్షత్రియునకు పన్నెండు రోజులు, వైశ్యునకు పదిహేను రోజులు శూద్రునకు ముప్పది రోజులు. న్యాయవర్తి శూద్రునకు పదిహేనురోజులు, అని యాజ్ఞవల్క్యోక్తి. (న్యాయమనగా శూద్రునకు చెప్పిన ద్విజ శుశ్రూషాదులు చేస్తూ స్వధర్మంలో ఉండటం). అతడే - మరణా శౌచము మూడు రాత్రులు కాని పదిరాత్రులు కాని ఉంటుంది, అని ఏదన్నాడో, అక్కడ పదిరోజులలో మూడు రోజులు అస్పృశ్యత. ఒకేరోజు రెండు ఆశౌచములు వస్తే పదిరోజులు అస్పృశ్యత ఉంటుంది. ఒక మరణంతోపాటు ఎప్పుడైనా మరొకరు అప్పుడే మరణిస్తే బంధువులందరితో పాటు సగోత్రుడు అస్పృశ్యుడౌతాడు, అనే ఆంగిరసోక్తి వల్ల పదిరోజుల ఆశౌచమైతే, ఆ పిదప దశరాత్రము, అనే దానితో పునరుక్తి వస్తుంది అని శుద్ధి వివేకాదులన్నాయి. అంటే అట్లాకాదు స్మృతి భేదమైనందువల్ల. మూడు రాత్రులు లేదా పది రాత్రులుకాని అని వికల్పం లేకుండా పోతుంది. పుత్రులకు వేదం చెప్తూ వృత్తి నిగడుపుతున్న వారికి ఆశ్వలాయనుడిట్లా చెప్పాడు - మహాగురువులందు (మరణిస్తే) పన్నెండు రాత్రులు కాని దాన అధ్యయనములు విడిచిపెట్టాలి,అని. ఇక్కడ చెప్పిన నిషేధమందు కాని అస్పృశ్యత్వమాత్ర (మేకాదు) మందు కాని కర్మ చేయటానికి అధికారంలేదు. పదకొండవరోజు అంతమందు వైశ్వదేవం చెప్పారు. పదకొండరోజులు వదలి అక్కడ చివరియందు విధించబడుతోంది,అని. (తలిదండ్రులు, ఉపనయనం చేసి వేదాలన్ని చెప్పేవాడు వీరు మహాగురువులు. పన్నెండు రాత్రులుకాని

అనే కానిపదం సపిండులకైతే పదిరోజులే అని). శుద్ధి తత్వమందైతే – పురుషునకు అతి గురువులు ముగ్గురున్నారు. తల్లి, తండ్రి, ఆచార్యుడు అని విష్ణూక్తి. పిత్రాదులు మహాగురువులు. రామాయణ మందు భర్త కూడా ఇట్లా – పతి బంధువు గతి దైవతము, గురువు కూడా, అని చెప్పబడ్డాడు స్త్రీలకు. శాతాతపుడిట్లా – స్త్రీలకు భర్త ఒక్కడే గురువు. అందరికి అభ్యాగతుడు గురువు. హఠాత్తుగా భ్రమపడే వారికి తలిదండ్రుల నిషేధం కొరకు. సోదకులకు త్రిరాత్రము ఆశౌచము. ఉదకదానం చేసే వారికి మూడు రోజులతో శుచిత్వం అని మనూక్తి. అగ్నిపురాణ మందిట్లా – సపిండత ఐతే పురుషులందు ఏడవ తరమందు ఐపోతుంది. సమానోదక భావమైతే పదునాల్గవ తరమందు ముగ్గుస్తుంది, అని. కొందరు, జన్మ నామస్మృతి యందు కాని సమానోదకమన్నారు. ఆపైన గోత్రం చెప్పబడుతుంది. బృహస్పతి ఇట్లా – ప్రేత సూతకమందు సపిండులైతే పదిరోజులతో శుద్ధినందుతారు. సకుల్యులైతే మూడు రాత్రులతో, గోత్రజులు స్నానంతో శుద్ధినందుతారు, అని. స్త్రీ, శూద్రులకైతే వివాహం తరువాత జాత్యాశౌచము. స్త్రీలకు వైవాహిక విధి, ఉపనయనము వంటిదన్నారు,అని చెప్పారు. ఇవ్వబడ్డ వారికైతే (కన్యాదానం) భర్తదే ఆశౌచము వర్తిస్తుంది. తన జాతికి చెప్పబడ్డ ఆశౌచమే ఉంటుంది మరణమందైనా, ప్రసవమందైనా, అని మాధవీయమందు బ్రాహ్మోక్తి. శూద్రునకు వివాహం కాకపోయినా పదహారు సంవత్సరాల తరువాత మరణిస్తే మాసాశౌచము. వివాహం కాని శూద్రుడు పదహారు సంవత్సరాల తరువాత, మరణిస్తే వానికి కూడా బంధువులు మాసం తరువాత శుచులౌతారు. ఇందులో అనుమానం లేదు. అని అపరార్కమందు శంఖోక్తి. నిర్ణయామృత మదన పారిజాతాదులందైతే మరో విధంగా చెప్పారు. హారీతుడిట్లా – విప్రుడు మౌంజీబంధనం నుండి క్షత్రియుడు ధనుస్సును గ్రహించినప్పటినుండి, వైశ్యుడు ములుగర్ర పట్టినప్పటినుండి, శూద్రుడు రెండు వస్త్రములు దరించినప్పటినుండి ఆశౌచము, అని ధనుస్సుప్రతోదములు ఎనిమిదేళ్ళకు ధరిస్తారు. రెండు వస్త్రాలు పన్నెండేళ్ళకు ధరిస్తాడు అని. మేధాతిథియైతే – వ్రతాదేశం (ఉపనయనం) వరకు మూడు రాత్రులు, అనేచోట వ్రతము కాలసూచనకొరకు. ఆ కాలము తమతమది అందరికి కూడా ఎనిమిది సంవత్సరాల రూపమైనది. అందువల్ల నాల్గు వర్ణముల వారికి ఉపనయనం లేకపోయినా ఎనిమిదేళ్ళ తరువాత పూర్ణమైన ఆశౌచము. అట్లాగైనా, అష్టమం కన్న ముందు శిశువులనబడ్డారు, అనే స్మృత్యంతరవచనాన్ననుసరించి ఎనిమిది తర్వాత సంపూర్ణాశౌచము ఎనిమిదేండ్ల కన్న పూర్వము మూడు రాత్రుల ఆశౌచము. పదహారేళ్ళవరకు బాలుడే, అని ఎవరన్నారో వారికి కూడా ఎనిమిదేళ్ళ తరువాత శూద్రుని మరణమందు నెలరోజుల ఆశౌచము. ఎనిమిదేళ్ళ తరువాతైతే శూద్రునకు మాసం రోజులతో శుద్ధి అనేవచనంతో అని అన్నారు. హారలతా శుద్ధి తత్వాది గౌడ గ్రంథములలో కూడా చెప్పారిది.

మూ॥ అనుపనీతో విప్రఇత్యుక్త్వా - మ్రియతే యత్ర తత్ర స్యాదాశౌచంత్ర్యహమేవహి. ద్విజన్మనామయంకాలస్త్ర యాణాంతుషడాబ్దికః, ఇత్యాది పురాణోక్తేః ఉపనయనకా లోపలక్షణం. షడబ్దపదం మాసత్రయాధిపరం. గర్భాష్టమే అష్టమే వాబ్దే ఇత్యుక్తేః. యత్తుజాబాలః - వ్రతచూడాద్విజానాంచప్రతీతిషుయథాక్రమం, దశాహేత్ర్యహ ఏకాహేశుద్ధ్యంత్యపి హి నిర్గుణా, ఇతి. ద్విజాదంతాః, ఇదంప్రతీతిష్విత్యుక్తేః పంచాబ్దోపనీత పరిమితి. తదేతన్నాద్రియంతే వృద్ధాః, యానితు పరాశరః - ఏకాహాద్ బ్రాహ్మణః శుద్ధ్యేత్ యోఽగ్నివేదసమన్వితః, త్ర్యహాత్కేవలవేదస్తు ద్విహీనోదశభిర్దినైః కేవలవేదః కేవలశ్రౌతాగ్నేరప్యుపలక్షణం. అయం సంకోచోహోమాధ్యయన పర ఏవ నతు సంధ్యాదావితి హారలతాయాం. **అంగిరాః** - సర్వేషామేవ వర్ణానాం సూతకేమృతకేతథా, దశాహాచ్ఛుద్ధిరేతేషామితి శాతాతపోఽబ్రవీత్. దేవలః - అశుచ్యందశరాత్రంతు సర్వేషామ పరేవిదుఃనిధనే ప్రసవేచైవ పశ్యంతఃకర్మణఃక్షయం. అత్యంతోత్కృష్టస్య కర్మహానౌ పిండవతో విప్రపరిచర్యా పరస్యశూద్రే దశరాత్రమితి హారలతాయాం. దక్షః - సద్యఃశౌచం తథైకాహత్ర్య హశ్చతురహస్తథా, షడ్ దశ ద్వాదశాహశ్చ పక్షో మాసస్తథైవచ, మరణాంతం తథాచాన్యత్ దశపక్షాస్తు సూతకే మితాక్షరాయాంస్మృత్యంతరే - చతుర్థే దశరాత్రం స్యాత్ షణ్ణి శాః పుంసిపంచమే, షష్ఠే చతురహాచ్ఛుద్ధిః సప్తమే తు దినత్రయం. అష్టమే దినమేకం స్యాత్ నవమే యామకద్వయం, దశమే స్నానమాత్రేణ చైతత్ గౌణంతు సూతకం, ఇత్యాదీని తాన్యాపదనాపద్గుణ వదగుణవద్విష యాణి దేశాచారభేదాద్వ్యాఖ్యేయాని. సద్యఃశౌచాది షడహాంతాః పక్షాః యాయావరాదిపరాః. అత్రమరణాంతం జననాది నిమిత్తాద్భిన్నం. (అస్వర్గ్యంలోక విద్విష్టం ధర్మ్యమప్యాచరేన్నతు, ఇత్యుక్తత్వాత్ మధుపర్కపశ్వాలంభవత్) శిష్టవిగానాత్ నాదర్తవ్యానీతి విజ్ఞానేశ్వరః. అస్నాత్వాచాప్యహుత్వావా అదత్వాఽశ్నంస్తథాద్విజః, ఏవం విధస్య విప్రస్య సర్వదా సూతకం సదా, ఇతి దక్షోక్త్యా. అన్యపూర్వాయస్యగేహేభార్యాస్యాత్తస్యనిత్యశః, అశౌచం సర్వకార్యేషు దేహేభవతి సర్వదా, ఇతి బ్రాహ్మాదివశాత్ వ్యవస్థే త్యపరార్కమదన పారిజాతాదయః. మాధవస్తు - వృత్త స్వాధ్యాయ సాపేక్షమ ఘ(ద్య)సంకోచ నంతథా, ఇతికలివర్జ్యే షూక్తేః. దశాహ ఏవ విప్రస్య సపిండ మరణే సతి, కల్పాంతరాణి కుర్వాణః కలౌభవతి కిల్బిషీ, ఇతి హారీతోక్తేశ్చన్యూనాశౌచ పక్షా యుగాంతర విషయాఃమరణాంతాది పక్షాస్తు నిందార్థవాదః. అన్యథానామధారక విప్రస్తు దశాహం సూతకీభవేత్, ఇతి విరోధః స్యాదిత్యాహ.

అను॥ ఉపనయనం కాని విప్రుడు అని చెప్పి - మరణిస్తే అక్కడ ఆశౌచము మూడు రాత్రులే ఉంటుంది. బ్రాహ్మణులకు ఇది కాలము. మిగిలిన ముగ్గురికి ఆరు సంవత్సరములు కాలము, అని ఆదిపురాణమందు చెప్పినందువల్ల ఉపనయన కాలమునకు ఉపలక్షణమిది. ఆరు సంవత్సరాలు అనే శబ్దం ఆరు సంవత్సరాల మూడు అధిక మాసములకు సూచకము. గర్భాష్టమ మందు కాని లేదా ఎనిమిదవ సంవత్సరమందు కాని, అని చెప్పారు. జాబాలుడిట్లా - ఉపనయనము, చూడాకర్మ, దంతములు కన్పిస్తే క్రమంగా పదిరోజులు, మూడు రోజులు ఒకరోజులో నిర్గుణులు శుద్ధులౌతారు,అని ఏదన్నాడో

దానిని వృద్ధులు ఆదరించుటలేదు. ద్విజాః అనగా దంతములు. ఇక్కడ ప్రతీతి అన్నాదు కనుక ఇది ఐదు సంవత్సరాలకే ఉపనయనం ఐన వాని విషయము, అని. పరాశరుడిట్లా – అగ్ని వేదములు కలిగిన బ్రాహ్మణుదు ఒకరోజుతో శుద్ధినందుతాదు. కేవలం వేదపాఠకుడైతే మూడు రోజులతో శుద్ధి. ఈ రెందూ లేనివాదు పదిరోజులకు శుద్ధినందుతాదు. కేవల వేద శబ్దముకేవల శ్రౌతాగ్నికి గూదా సూచనము. అన్నది, ఈ సంకోచము హోమ అధ్యయన పరము మాత్రమే, సంధ్యాదులందు కాదు, అని హారలతయందన్నారు. అంగిరుడిట్లా – అన్ని వర్ణముల వారికి సూతక మృతాశౌచములందు పదిరోజులతో శుద్ధి వీరికి, అని శాతాతపుడన్నాడు,అని. దేవలుడిట్లా – ఇతరులు, మరణమందు, ప్రసవమందు, కర్మక్షయాన్ని చూస్తున్నవారై అందరికి పది రాత్రులు ఆశౌచమన్నారు,అని. అంత్యత ఉత్కృష్టుడైన శూద్రుని కర్మ హానియందు, పీడింప బదుతున్న (పీడగల) బ్రాహ్మణుని సేవాపరుడైన శూద్రుని మరణమందు పదిరాత్రులు ఆశౌచమని హారలత యందు కలదు. దక్షుడిట్లా – వెంటనే శుచిత్వం, ఒకరోజు, మూదు రోజులు, నాల్గురోజులు, ఆరురోజులు, పదిరోజులు, పన్నెందు రోజులు, పదిహేను రోజులు, నెలరోజులు, మరణంవరకు అని సూతక ఆశౌచమందు పదిపక్షములున్నాయి. మితాక్షర మందు స్మృత్యంతరోక్తి ఇట్లా – నాల్గవ పిడి యందు (విప్రునకు) పదిరాత్రులు, ఐదవ తరమందు ఆరు రాత్రులు, ఆరవతరమందునాల్గురాత్రులతో శుద్ధి, ఏడవ తరమందు మూదు రాత్రులు, ఎనిమిదవ పిడియందు ఒకరోజు, నవమపిడి యందు ఆరుఘంటలు, దశమమందు స్నాన మాత్రంతో శుద్ధి. ఈ సూతకము గౌణమైంది, అని మొదలగు వచనములు, అవి ఆపద, అనాపత్తి గుణవత్, అగుణవత్ విషయములు. దేశాచార భేదంవల్లకాని తెలుసు కోవాలి, సద్యః శౌచము మొదలుకొని ఆరు రోజులవరకు అనేంతవరకు ఉన్న పక్షములన్ని యాయ వారాదిపరములు. (యాజన, అధ్యయన, ప్రతిగ్రహములతో హీనమైన వారి పరము) ఇక్కడ మరణాంత ఆశౌచము జననాది నిమిత్తము కన్నభిన్నమైంది. (స్వర్గకారికానిది, లోకము ద్వేషించేది, అలాంటిది, ధర్మమైనా ఆచరించరాదు, అని చెప్పినందువల్ల మధుపర్క పశ్వాలంభము వలె) శిష్టులు నిందించినందువల్ల ఆదరించరానివి అని విజ్ఞానేశ్వరుడన్నాడు. స్నానం చేయకుండా లేదా హోమం చేయకుండా, దానం చేయకుండా ద్విజుదు భుజిస్తే అలాంటి విప్రునకు ఎల్లప్పుదు సూతకము అన్ని కాలములందు, అనే దక్షోక్తి వల్ల, ఎవనింటి యందు, భార్యగా, ఇది వరలో మరొకనికి భార్యయైన స్త్రీ ఎప్పుడూ ఉంటుందో వానికి సర్వకార్యములందు ఆశౌచము, శరీరంలో ఎప్పుడూ ఆశౌచం ఉంటుంది. అని బ్రహ్మ పురాణాదుల వచనములవల్ల నిర్ణయము గుర్తెరగాలి, అని అపరార్క మదనపారిజాతాదు లన్నాయి. మాధవుడైతే – కలిలో విదువతగిన వాటిలో ఇట్లా చెప్పాదు – వృత్తి (అగ్నిహోత్ర అనుష్ఠానం) వేదాధ్యయనం వీనిని గౌరవిస్తూండాలి పాప సంకోచము (భీతి) ఉండాలి (మద్య సంకోచము) తగ్గింపు, అని.

సపిండుడు మరణిస్తే విప్రునకు పదిరోజులే ఆశౌచము కల్పాంతరములను ఆచరిస్తే కలియందు, పాపాత్ముడౌతాడు, అని హారీతోక్తి. తక్కువ ఆశౌచ పక్షములన్ని యుగాంతర విషయములు. మరణాంతాది పక్షములైతే నిందార్థవాదము లేనిచో నామధారక బ్రాహ్మణుడు పదిరోజులు సూతకుడౌతాడు, అని విరోధమౌతుంది అని అన్నాడు. (బ్రహ్మబీజోత్పన్నుడు, మంత్ర సంస్కారం లేనివాడు, జాతిమాత్రోపజీవి నామధారకుడు, కర్మ, తెలియదు, అధ్యయనం లేదువాడు, వాడే) (మధుపర్క సమయంలో, అర్ఘ్య ప్రదానమందు (మాంసం లేకుండా అర్ఘ్యం లేదన్నారు) మాంసవిధి ఉన్నా లోకంలో ఈ పశు వధ స్థానంలో తృణచ్ఛేదనం చేస్తారు. ధర్మమైనా పశువధ ఆచరించరు. లోకం కూడదు అన్నది. కనుక).

మూ॥ యత్తుదేవలః - దశాహే ద్విత్రిభాగేన కృతే సంచయనే క్రమాత్, అంగ స్పర్శన మిచ్ఛంతి వర్ణానాం తత్వదర్శినః, ఇతి. **పూర్ణాశౌచే స్పృశ్యతామాహ.** యచ్చాను పనీతాతి క్రాంతా శౌచే త్రిరాత్రాదౌ తేనైవోక్తం - స్వాశౌచ కాలా ద్విజ్ఞేయం స్పర్శనంతు త్రిభాగతః, ఇతి తదపి యుగాంతరేషు. అస్థి సంచయనా దూర్ధ్వం అంగస్పర్శనమేవచ, ఇతి మాధవీయే కలౌతన్నిషేధాత్. యత్తు హారలతాయాం - చతుర్థేఽహని కర్తవ్యః సంస్పర్శో బ్రాహ్మణస్యతు, ఇతి ప్రచేతసోక్తేః త్ర్య హైకాహాశౌచేఽపి చతుర్థాహ ఏవాంగ స్పర్శ ఇతి, తన్న. దేవలా దివశేనాస్య దశాహ గోచరత్వాత్. యేతు వర్ణ సంకరజా మూర్ధావసిక్తాద్యాః తేషామా శౌచ విశేషః కలౌ నోపయుక్త ఇతి నోచ్యతే. ప్రతిలో మజానాం నాశౌచం మలాపకర్షణార్థంతు స్నానమాత్ర మితి విజ్ఞానేశ్వరః. మాధవస్తు - శౌచాశౌచే ప్రకుర్వీరన్ శూద్రవద్వర్ణ సంకరాః, ఇతి బ్రాహ్మోక్తేః శూద్ర వదాహ. హారలతాఽప్యేవం దత్త క్రీత కృత్రిమాది పుత్రేషు అహీన వర్ణగాసు స్త్రీషు చ సపిండత్వేఽపి ప్రసవే మరణేచ. పూర్వాపర పిత్రోః భర్త్రోశ్చ త్రిరాత్రమేవ నదశాహాది. అనౌరసేషు పుత్రేషు జాతేషు చ మృతేషు చ. పరపూర్వాసుభార్యాసు ప్రసూతాసు మృతాసుచ, ఇతి త్రిరాత్రానువృత్తౌ విష్ణూక్తేః. సపిండానాంత్వేకాహః. పరపూర్వాసుభార్యాసు పుత్రేషు కృతకేషు చ. భర్తృ పిత్రో స్త్రి రాత్రం స్యాత్ ఏకాహస్తు స పిండతః, ఇతి మాధవీయే హారీతోక్తేః. సూతకే మృతకే చైవ త్రిరాత్రం పర పూర్వయోః, ఏకాహస్తు సపిండానాం త్రిరాత్రం యత్రవై పితుః, ఇతి మరీచ్యుక్తేశ్చ. **శంఖః - అనౌరసేషు** పుత్రేషు భార్యాస్వన్యగతాసుచ, పరపూర్వాసు చ స్త్రీషు త్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే. పరపూర్వా = పునర్భూః. ఇదం సవర్ణాసు. హీన వర్ణాసుతు శంఖలిఖితౌ - పర పూర్వాసు భార్యాసు పుత్రేషు కృతకేషుచ, నానధ్యాయో భవేత్త స్యనాశౌచం నోదక క్రియా. బ్రాహ్మేఽపి - ఆశౌచంతు త్రిరాత్రంస్యాత్ సమవర్ణేషు నిశ్చితం. యత్తు షడశీతౌ - అన్యపూర్వావరుద్ధాసు త్రిదినాచ్ఛుద్ధి రిష్యతే తాస్వేవానన్య పూర్వాసు పంచాహోభిర్వి శుద్ధ్యతి, ఇతి. తత్ర పంచాహే మూలం చింత్యం - యత్తు యాజ్ఞవల్క్యః - అనౌరసేషు పుత్రేషు భార్యా స్వన్యగతాసుచ, ఇత్యేకాహమాహ. తద సన్నిధౌ జ్ఞేయం. యదా పితురేకాహస్తదా సపిండానాం స్నానం. అన్యాశ్రితేషు దారేషు పరపత్నీ సుతేషుచ, గోత్రిణః స్నాన శుద్ధాఃస్యుః త్రిరాత్రేణైవతత్పితా, ఇతి ప్రజా పత్యుక్తేః. పితేతి వోఢు రుప లక్షణం, తథోప క్రమాత్.

అను॥ దేవలుడిట్లా - దశాహాదులను ఆశౌచక్రమంగా మూడు భాగాలు చేస్తే, దాని క్రమంగా అస్థిసంచయనం చేస్తే, ఆ పిదప, వర్ణముల (బ్రా.క్ష.వై.) అంగస్పర్శనమును తత్వదర్శులు ఇష్టపడుతారు అని ఏదన్నాడో; పూర్ణాశౌచమందు స్పృశ్యతను ఇట్లా చెప్పాడు. అనుపనీతుడై ఆశౌచం ఐపోతే, త్రిరాత్రాదులందు స్పృశ్యత ఆతడే చెప్పాడు. తమ ఆశౌచం కాలం యొక్క మూడవ భాగం నుండి స్పర్శనము అని తెలుసుకోవాలి, అని. ఏదన్నాడో అది కూడా యుగాంతరములందు. అస్థి సంచయనం తరువాత అంగ స్పర్శనము, అని మాధవీయమందు కలిలో దాన్ని నిషేధించారు. హారలతయందు ఇట్లా - బ్రాహ్మణుని స్పర్శను నాల్గవ రోజున చేయవచ్చును. అని ప్రాచేతసోక్తి ఉన్నందువల్ల మూడు రోజుల లేదా ఒకరోజు ఆశౌచమందును నాలుగవ రోజుననే అంగస్పర్శ అని ఏదన్నారో, అది తప్పు. దేవలాదుల ననుసరించి ఇది దశాహ శౌచంగా కన్పిస్తోంది. వర్ణ సంకరం వల్ల పుట్టిన మూర్ధావ సిక్తాదులున్నారో వారికి ఆశౌచ విశేషము కలిలో ఉపయోగించదు, అని చెప్పటంలేదు. ప్రతిలోమజులకు ఆశౌచంలేదు (సూతాదులు). మలాపకర్షణ కొరకు స్నాన మాత్రము అని విజ్ఞానేశ్వరునిమాట. మాధవుడైతే - వర్ణసంకరులు శూద్రునివలె శౌచా శౌచము లాచరించాలి, అని బ్రాహ్మోక్తి ఉన్నందువల్ల శూద్రునకువలె అని అన్నాడు. హారలత కూడా ఇట్లాగే చెప్పింది. దత్తుడు క్రీతుడు కృత్రిముడు మొదలగు పుత్రులందు, హీన వర్ణాన్ని పొందని స్త్రీలందును (ప్రతిలోమభిన్న) సపిండత్వమున్నా ప్రసవమందు, మరణ మందును పూర్వా పరపితరుల, భర్తల ఆశౌచము త్రిరాత్రమే, పదిరోజులు కాదు,. అనౌరస పుత్రులు పుట్టినా చచ్చినా, పర పూర్వభార్యలు ప్రసవించిన పుత్రులు ఉన్నా, మరణించినా అని మూడు రాత్రుల ఆశౌచ అను వృత్తే అని విష్ణూక్తి. సపిండులకు ఒకరోజు. పర పూర్వ భార్యలందు, కృతక పుత్రులందును (మరణంలో) భర్తలకు పితరులకు మూడు రాత్రుల ఆశౌచము సపిండత ఐతే ఏకాహము (రోజు) అని మాధవీయమందు హారీతోక్తి. సూతకమందు, మృతాశౌచమందు పర పూర్వులకు త్రిరాత్రాశౌచము (పిత, పతులకు) తండ్రికి మూడు రాత్రులున్నచోట, సపిండులకు ఒకరాత్రి, అని మరీచి వచనం కూడా. శంఖుడిట్లా - పుత్రులు అనౌరసులు, భార్య అన్యాసక్త ఇట్టి వారియందు పరపూర్వ స్త్రీలందును మూడు రాత్రులతో శుద్ధి తగును, అని. పరపూర్వా అనగా మారు మనువు. ఇది సవర్ణ స్త్రీలందు అని. హీనవర్ణ స్త్రీలందైతే శంఖలిఖితులిట్లా - పర పూర్వభార్యలందు (ఇతరుని దగ్గరకు భార్యపోవటం పరం, భర్త దగ్గర ఉండటం పూర్వం) (మారు మనువు) కృతక పుత్రులందు (మరణమందు) అనధ్యాయంలేదు, ఆశౌచములేదు, ఉదక క్రియలేదు అతనికి, అని. బ్రాహ్మమందు కూడా - సమాన వర్ణములందు మూడు రాత్రుల ఆశౌచము నిశ్చయము, అని. షడశీతి యందు ఇట్లా - అన్యపూర్వ (పూర్వం ఇతరులకు వాగ్దత్తం చేయబడ్డది) విషయంలో ఆగిపోయిన వారికి మూడు రోజులతో శుద్ధి. వారే అన్యపూర్వులు కాకపోతే

వారియందు ఐదు రోజులతో శుద్ధి, అని ఏదన్నారో అక్కడ ఐదు రోజుల శుద్ధి విషయంలో మూల వచనాలు విచారించాలి. యాజ్ఞవల్క్యుడిట్లా - అనౌరస పుత్రులు (జన్మ) భార్యలు అన్యగతలు ఐతే వీరి ప్రసవ మరణమందు ఆశౌచం ఏకాహము అని ఏదన్నాడో, అది అసన్నిధి యందు అని గ్రహించాలి. తండ్రికి ఏకాహమైతే సపిండులకు స్నానంతో సరి. (విన్నప్పటినుండే సన్నిధి మొదటిరోజు వింటే మూడు రోజులు, రెండవనాడు వింతే తరువాతి ఒక్కరోజు, నాల్గవనాడు వింటే ఆశౌచంలేదు. అసన్నిధి వివరం ఇది). దారలు ఇతరుల నాశ్రయించారు, సుతులు పరపత్నులకు చెందినవారు. ఇట్టిచోట గోత్రంవారు స్నానంతో శుద్ధి నందుతారు. వారి తండ్రి మూడు రాత్రులతో శుద్ధినందుతాడు అని ప్రజాపతి వచనం. పితా అనేది మోసే వాడికి (భర్తకు) ఉపలక్షణము. అట్లానే ఆరంభించాడు కనుక.

మూ॥ **యత్తు దత్తకే పాలక** ప్రతియోగిక **పుత్రత్వాత్ పూర్వపితుః** న త్రిరాత్రం. పూర్వ సంబంధ నివృత్తేశ్చన దశాహో దీతికశ్చిత్. తన్న. జనకేఽపి బైజికాదభి సంబంధాత్ అనురుంధ్యాద ఘంత్ర్యహం, ఇతి వాచనికా శౌచస్యాని వార్యత్వాత్. పితృమరణేఽపి దత్తకాదీనాం త్రిరాత్రం. శుద్ధితత్వే బ్రాహ్మే - దత్తకశ్చ స్వయందత్తః కృత్రిమః క్రీత ఏవచ, ఇతి ఉపక్రమ్య, సూతకేమృతకే చైవ త్ర్యహో శౌచస్య భాగినః, ఇత్యుక్తేః. **స్మృతి కౌముద్యాం హారలతాయా మప్యేవం.** దత్తకస్య పుత్ర పౌత్రాణాం జననే మరణేవా సపిండానామేకాహః, బీజినశ్చ ఇతి గౌతమేన సాప్త పౌరుష సాపిండ్యోక్తేః సపిండానాం చైకాహస్యోక్తత్వాత్. సపిండేతు పుత్రీకృతే దశాహ ఏవ. తత్రా కాంక్షా భావాత్ సపిండత్వేన దశాహ ప్రాబల్యాచ్చ. **పూర్వాపర భర్తృత్పన్నయోః** పుత్రయో స్త్ర్యహ మాధవీయే మరీచిః - మాతురైక్యాత్ ద్విపితృకౌ భ్రాతరావన్యగోత్రజౌ, ఏకాహం సూతకం తత్ర త్రిరాత్రం మృతకేతయోః, ఇతి దిక్. **ఊఢకన్యాయాంతు** విష్ణురాహ - సంస్కృతాసు స్త్రీషునాశౌచం పితృపక్షే, తత్ర సవమరణేచేత్పి తృగృహే స్యాతాంత దేకరాత్రం త్రిరాత్రంచ, ఇతి. ప్రసవే ఏకరాత్రం మరణే త్రిరాత్ర మితి విజ్ఞానేశ్వరా పరార్కౌ. **మాధవస్తు** - ప్రసవేఽపి త్రిరాత్రం పిత్రోః, ఏక రాత్రం భ్రాత్రాది బంధువర్గస్య, దత్తా నారీ పితుర్గేహే సూయే తాథమ్రియేతవా, తద్బంధు వర్గస్త్వే కేన శుచి స్తజ్జనక స్త్రిభిః, ఇతి బ్రాహ్మోక్తే రిత్యాహ. యత్తు కశ్చిదాహ - పక్షపదేన భ్రాతరో గృహ్యంతే. వాక్యాంతరేణ భగినీ మృతౌ త్రిరాత్రోక్తే రితి తచ్చింత్యం. తదభావా దేత ద్విరోధాచ్చ. భ్రాతుః ప్రసవే ఏకాహః. మృతౌ త్రిరాత్రమితికేచిత్.యుక్తాతు పక్షిణీ. పరస్పర మృతౌ భ్రాతృ భగిన్యోః పక్షిణీ భవేత్, ఇతి బ్రాహ్మాత్. భ్రాతృభిన్నా నామేకాహః. వర్ణోక్తేః, ఇతరేషాం యథావిధి, ఇతి వక్ష్యమాణ వచనాచ్చ. యత్తు ప్రధాన గృహే మాతాపిత్రోః పూర్వం భ్రాతుః త్ర్యహ ఇతి కశ్చిత్స నిర్మూలత్వాత్ నాశౌచం పితృపక్షే, ఇత్యేత ద్విరోధాచ్చ భ్రాంతః. దత్తా నారీ పితుర్గేహే ప్రధానే సూయతే యదా, మ్రియతే వాత దాతస్యాః పితా శుద్ధ్యేత్త్రిభిర్దినైః, ఇతి కల్పతరౌ శుద్ధితత్వేచ. **పతిగృహే ప్రసవేతు పిత్రాదీనాం ఆశౌచం నాస్తి. మృతౌపిత్రోః** త్రిరాత్రమస్త్యేవ. ప్రత్తాప్రత్తాసు యోషిత్సు సంస్కృతా సంస్కృతాసుచ, మాతాపిత్రోః త్రిరాత్రం స్యాత్ ఇతరేషాం

యథావిధి. అదత్తాసు పిత్రోరేక రాత్రమిది మాధవీయే శంఖ కార్ష్ణాజిని స్మృతేః. బైజికాదభి సంబంధాత్ ఇత్యుక్తేశ్చ. స్మృత్యర్థసారేఽప్యేవం. మాధవస్తు ఇదం త్రిరాత్రం జాతదంతపరం. దంతోత్పత్తేః ప్రాగేకరాత్రం పిత్రోః, సద్యస్త్వ ప్రౌఢక న్యాయాం ప్రౌఢాయాం వాసరాచ్ఛుచిః, ప్రదత్తాయాం త్రిరాత్రేణ దత్తాయాం పక్షిణీ భవేత్ ఇతి పులస్త్యోక్తేః.

అను॥ దత్తకుడు పెంచే వాని ప్రతియోగ పుత్రుడైనందువల్ల కన్న తండ్రికి త్రిరాత్రము ఆశౌచము కాదు. పూర్వసంబంధం నివృత్తమైంది కనుక దశాహాదుల కూడా లేవు అని ఒకడు ఏదన్నాడో అది తప్పు. కన్నతండ్రికి గూడా – బీజసంబంధంవల్ల మూడు రోజులు పాపానురోధం ఉంటుంది, అనే వచనంవల్ల ఆశౌచము అనివార్యము. పితృమరణమందును దత్తకాదులకు మూడు రాత్రులు ఆశౌచము. శుద్ధితత్వమందు బ్రాహ్మోక్తి ఇట్లా – దత్తకుడు, స్వయందత్తుడు, కృత్రిముడు, క్రీడుతు, అని ఆరంభించి సూతకమందు, మరణమందును త్రిరాత్రాశౌచమునకు వీరు భాగస్వాములు, అని చెప్పారు. స్మృతికౌముది యందు హారలత యందును ఇట్లాగే ఉంది. దత్తుకునకు పుత్రులు పౌత్రులు జన్మించినా, మరణించినా సపిండులకు ఒకరోజు, ఆశౌచము, బీజికిగూడా, అని గౌతముడు ఏడు తరముల సాపిండ్యాన్ని చెప్పాడు. సపిండులకు ఒకరోజు ఆశౌచం చెప్పాడు. సపిండుని పుత్రునిగా స్వీకరిస్తే పదిరోజుల ఆశౌచము. అక్కడ ప్రశ్నే లేదు సపిండుడైనందువల్ల, పదిరోజుల ప్రాబల్యమంది. మొదటి రెండవ భర్తల వల్ల కలిగిన పుత్రులకైతే మాధవీయ మందు మరీచి వచనమిట్లా – తల్లి ఒకతి, తండ్రులిద్దరు, భ్రాతలు ఇతర గోత్రముల వారు అందువల్ల అక్కడ సూతకమైతే ఒకరాత్రి, వారిద్దరు మరణిస్తే త్రిరాత్రము ఆశౌచము, అని ఇక చాలు. వివాహితయైన కన్య విషయంలో విష్ణువిట్లా అన్నాడు – సంస్కరింపబడితే (శాస్త్రీయంగా వివాహం) స్త్రీలు, తండ్రి పక్ష మందు ఆశౌచమండదు. ఆ స్త్రీలు ప్రసవించినా, మరణించినా పితృగృహ మందు అవిజరిగితే ఒక రాత్రి, మూడు రాత్రులు, ఆశౌచము ఉంటుంది తండ్రి పక్షమందు, అని. ప్రసవమందు ఒకరాత్రి, మరణమందు మూడురాత్రులు, అని విజ్ఞానేశ్వర అపరార్కులన్నారు. మాధవుడైతే – ప్రసవమందును తలిదండ్రులకు మూడురాత్రులు, భ్రాత్రాది బంధు వర్గము నకు ఒకరాత్రి ఆశౌచము వివాహిత స్త్రీ, తండ్రి ఇంట్లో ప్రసవించినా, మరణించినా, ఆమె బంధువర్గమునకు ఒకరోజు ఆశౌచము, తండ్రికి మూడు రోజులతో శుద్ధి, అని బ్రాహ్మోక్తి ననుసరించి, అని అన్నాడు. ఒకడిట్లా – పక్షమందు అనే పదంతో భ్రాతలు గ్రహింప బడతారు. మరో వచనంతో భగిని (తోడబుట్టినది) మరణిస్తే మూడు రాత్రులు ఆశౌచమని చెప్పారు కనుక అని ఏదన్నాడో దానిని ఆలోచించాలి. ఆపై వచనంలేదు ఈ బ్రాహ్మోక్తికి విరుద్ధము కూడా భ్రాత ఇంటిలో ఆమె ప్రసవమందు భ్రాతకు ఒకరాత్రి ఆశౌచము, మరణిస్తే మూడు రాత్రులు అని కొందరన్నారు. రోజున్నర ఐతే తగును. భ్రాత మరియు భగిని మరణిస్తే పరస్పరము పక్షిణీ ఆశౌచము, అని బ్రాహ్మోక్తి. భ్రాతృభిన్నులైనవారికి

ఒకరోజు ఆశౌచము, అని వర్ణోక్తి. ఇతరులకు యథావిధి,అని చెప్పబోయే వచనాన్ననుసరించి, ప్రధాన గృహమందు మరణిస్తే తలిదండ్రులకు సంపూర్ణంగా భ్రాతకు మూడు రోజుల ఆశౌచము, అని ఒకడేది అన్నాడో, అది నిర్మూలము ఐనందువల్ల, పితృపక్షమందు ఆశౌచం లేదు, అనే దానికి విరుద్ధమైనందువల్లనూ, భ్రాంతి నొందినాము. ఇవ్వబడ్డ కన్య (కన్యాదానం వివాహిత) తండ్రి ప్రధాన గృహమందు ప్రసవించినా, మరణించినా అప్పుడు ఆమె తండ్రి మూడు రోజులతో శుద్ధినందుతాడు, అని కల్పతరువు యందు శుద్ధితత్వమందును చెప్పారు. పతిగృహమందు ప్రసవిస్తే పిత్రాదులకు ఆశౌచము లేదు. ఆమె మరణిస్తే తలిదండ్రులకు త్రిరాత్రా శౌచము ఉండనే ఉంది. వివాహమైనా కాకపోయినా స్త్రీలకు సంస్కృత (వాగ్దత్త) యైనా కాకపోయినా వారి మరణమందు తలిదండ్రులకు త్రిరాత్రా శౌచము ఇతరులకు యథావిధి ఆశౌచము. ఇవ్వబడనప్పుడు తలిదండ్రులకు ఒకరాత్రి ఆశౌచము, అని. మాధవీయమందు శంఖ కార్ష్ణాజిని స్మృతి. బీజ సంబంధం వల్లనూ, అని చెప్పారు కూడా. స్మృత్యర్థ సారమందు కూడా ఇట్లాగే ఉంది. మాధవుడైతే, ఇది, త్రిరాత్రా శౌచము దంతములు వచ్చిన వారి విషయము. దంతోత్పత్తి కన్న ముందు మాతాపితరులకు ఒక రాత్రి ఆశౌచము,అని. అప్రౌఢ కన్య విషయంలో సద్యః శౌచము ప్రౌఢ కన్య ఐతే ఒక రోజుతో శుద్ధి. వివాహిత ఐతే త్రిరాత్రా శౌచము (వాక్) దత్త మరణమందు రోజున్నర ఆశౌచము,అని. పులస్త్యోక్తి.

మూ॥ **అన్యత్ర కన్యామృతౌ పిత్రోః** పక్షిణీత్యాహ. షడశీతావపి - **పితృగేహాదతో**౽న్యత్ర యది పుత్రీ ప్రమీయతే, పక్షిణీ తత్ర పిత్రోః స్యాన్నాన్యేషామితి నిశ్చయః. గ్రామాంతరే ఇయమితి స్మృత్యర్థసారే. భ్రాతుస్తు పక్షిణీ. **శ్వశురయోర్భగిన్యాం చ** మాతులాన్యాం చ మాతులే, **పిత్రోః** స్వసరితద్వచ్చపక్షిణీం క్షిపయేన్నిశాం, ఇతివృద్ధబృహస్పతిస్మృతేః శుద్ధితత్వేకౌర్మే - **ఆదంతాత్సోదరేసద్యః ఆచూడాదేకరాత్రకం ఆప్రదానాత్త్రిరాత్రంస్యాత్దశరాత్రమతఃపరం. పిత్రోః మృతౌస్త్రీణాం** త్రిరాత్రం, పిత్రోరుపరమేస్త్రీణామూఢానాంతు కథంభవేత్, త్రిరాత్రేణైవ శుద్ధిః స్యాదిత్యాహ భగవాన్యమః ఇతిమాధవీయేవృద్ధమనూక్తేః ఇదందశాహాంతః. ఊర్ధ్వంతుపక్షిణీ **భ్రాతుఃభగినీగృహే, తస్యావాతద్గృహేమృతౌ**త్రిరాత్రం. అన్యత్రపక్షిణీతి షడశీతావుక్తః బ్రాహ్మేపి - పరస్పరం మృతౌభ్రాతృ భగిన్యోః పక్షిణీభవేత్, మాతులాశౌచవత్పుత్ర్యాః పితృవ్యాశౌచమిష్యతే, ఇతి **శిష్టాస్త్వస్యనిర్మూలత్వాత్** పితృవ్యేస్నానమాత్రమాహుః **త్రింశచ్ఛ్లోక్యాం - ప్రేతేష్వాచార్య, మాతామహదుహితృసుత,** శ్రోత్రియర్త్విక్ సయాజ్యస్వస్త్రీయేషు త్రిరాత్రంత్రిదివసమశుచిః **సోదకస్తూభయత్ర.** పక్షిణ్యాశౌచమృత్విగ్, దుహితృసుత, సహాధ్యాయిబంధుత్రయాం తే వాసిశ్వశ్రూ సుమిత్ర శ్వశురభగినికాభాగినేయప్రయాణే. **మాతామహ్యాంచపిత్రోః** స్వసరిచవిరతామాతులే **మాతులాన్యాంచాధోస జ్యోతిరేవస్వ** విషయనృపతౌ గ్రామనాథేచనష్టే, శిష్యోపాధ్యాయ బంధు త్రయగురుతనయా చార్యభార్యాసగోత్రానూచానశ్రోత్రియేషు స్వగృహపరమృతౌమాతులేచైకరాత్రం.

రాత్రింసబ్రహ్మచారిణ్యర్థతుకధమపి స్వల్పసంబంధయుక్తే స్నానంవాసోయుతం స్యాదిదమపిసకలం సర్వవర్ణేషుతుల్యం, ఇతి అత్రమూలం మితాక్షరాదౌ స్పష్టం.

అను॥ వేరేచోట (తనఇంట్లోకాదు) కన్యమరణిస్తేతలిదండ్రులకు దినంనర ఆశౌచము అని అన్నారు. షడశీతియందుకూడా – తండ్రిఇంట్లోకాకవేరేచోట పుత్రికమరణిస్తే తల్లిదండ్రులకుదినంనరఆశౌచము. ఇతరులకులేదు అని నిశ్చయము. ఇది, వేరే గ్రామమందు అని స్మృత్యర్థసారమందుకలదు. భ్రాతకైతేపక్షిణీఆశౌచము. అత్త, మామ, భగిని, మేనత్త మేనమామ, తండ్రి చెల్లెలు, తల్లిచెల్లెలు మరణిస్తే అట్లాగే దినంనరఅశౌచంగడపాలి, అని వృద్ధబృహస్పతి స్మృతివచనము. శుద్ధితత్వమందుకూర్మపురాణోక్తిఇట్లా – దంతములు వచ్చేవరకు సోదరునకు (సపిండుడు) వెంటనే శుద్ధి చూడాకర్మవరకు ఒకదినము, ప్రదానంవరకు తలిదండ్రికి (వాగ్దత్త ఐతేభర్తకు త్రిరాత్రము) త్రిరాత్రా శౌచము ఆ పిదప (వివాహమయ్యాక) దశరాత్రాశౌచము (భర్తకు) అని. తలిదండ్రులు మరణిస్తే కన్యలకు త్రిరాత్రాశౌచము తలిదండ్రులు మరణిస్తే వివాహితలైన స్త్రీలకు ఆశౌచంఎట్లా అని అంటే త్రిరాత్రాశౌచముతో శుద్ధి అనిభగవాన్ యముడుఅన్నాడు. అని మాధవీయమందు వృద్ధమనూక్తి. ఇదిపదిరోజుల వరకే. ఆపైనఐతేదినంనరఅని. భ్రాతభగినిగృహమందు, భగిని భ్రాతృగృహమందుమరణిస్తే త్రిరాత్రాశౌచము. వేరేచోట మరణిస్తే దినం నర ఆశౌచము అని షడశీతియందు చెప్పారు. బ్రాహ్మమందు కూడా – భ్రాత భగిని వీరిద్దరు పరస్పరం, పరస్పర గృహము లందుమరణిస్తే ఇద్దరికి పక్షిణీ ఆశౌచము మేనమామఆశౌచంవలె పుత్రికకు పితృవ్య (చిన్నాన్న) ఆశౌచముఉంటుంది, అని శిష్టులైతే దీనికిమూలవచనంలేనందువల్ల చిన్నాన్న విషయంలో స్నానం మాత్రమే చెప్పారు, త్రింశత్ శ్లోకియందిట్లా – ఆ[1]చార్యుడు [2]మాతామహుడు [3]బిడ్డకొడుకు, శ్రోత్రియుడు, యజ్ఞం చేయించే ఋత్విక్కు తోబుట్టువు[3]కొడుకు (మేనల్లుడు) వీరుమరణిస్తే మూడురాత్రులు మూడు పగళ్ళు ఆశౌచం ఉంటుంది. సోదకుడైతే ఉభయత్ర ఆశౌచము. ఋత్విక్కు, బిడ్డకొడుకు [4]సహాధ్యాయి, బంధుత్రయం, [4]అంతేవాసి, అత్త, మిత్రుడు, మామ, భగిని, భాగినేయుడు వీరుమరణిస్తే రోజున్నర ఆశౌచము (పక్షిణి=రెండు పగళ్ళతోకూడినరాత్రి) మాతామహి, తలిదండ్రులతో బుట్టువులు, మేనమామ, మేనత్త, వీరుమరణిస్తే, తనదేశంరాజు, గ్రామనాధుడు మరణిస్తేసజ్యో[5]తి ఆశౌచము మాత్రమే (పగలుమరణిస్తే రాత్రిస్నానంతో శుద్ధి రాత్రిమరణిస్తే పగలు స్నానంతో శుద్ధి ఇదే సజ్యోతి. [5]శిష్యుడు, [6]ఉపాధ్యాయుడు, బంధుత్రయము, గురుపుత్రుడు, ఆచార్యుని భార్య, సగోత్రుడు[7], అనూచానశ్రోత్రియుడు[8] (అంగములతో వేదాధ్యయనం చేసిన బ్రాహ్మణుడు) మేనమామ వీరలు, వీరికన్న వేరైన అసపిండుడు, పరుడు స్వగృహమందు, మరణిస్తే కూడా ఒక రాత్రి ఆశౌచము సబ్ర[9]హ్మచారిమరణిస్తే మరొక సబ్రహ్మచారి ఒకదినం ఆశౌచం పాటించాలి. ఏదో రకంగా మ[10]నతో కొద్ది సంబంధం కలవాడు మరణిస్తే సవస్త్ర స్నానము చేయాలి.

ఇదంతా అన్ని వర్ణములవారికిసమానము, అని దీనికి మూలవచనములు మితాక్షరాదులందు స్పష్టంగా ఉన్నాయి {(1) శిష్యునకు అశౌచం, (2) మనువడికి (3) ఉపనీతులిద్దరు (4) ఒకేగురువుదగ్గర చాలానాళ్లువేదం కలిసి చదివారు, సహాధ్యాయివలె బహుకాలవాసి అంతేవాసి (5) మృతకాలీనేన సూర్య నక్షత్ర రూపేణజ్యోతిషా సహవర్తతేతత్సజ్యోతిః దినమృతేదినం రాత్రిమృతేరాత్రిః (6) ఒకభాగం చదివినవాడు (ఏకదేశం) లేదా వేదవిద్యార్థి ఏకదేశ అధ్యాపకుడు ఉపాధ్యాయుడు (7) పదునాల్గుతరములతర్వాత (ముందు) జన్మనామ జ్ఞానము ఉన్నంతవరకు సగోత్రం (8) శ్రోత్రియుడు సమానగ్రామీణుడు (9) ఏకాచార్య ఉపనీతుడు సబ్రహ్మచారి (10) ఏదోరకంగా స్వల్పేన ఏకాహాద్యా శౌచ ప్రయోజనక అనుక్త సంబంధేన జామాతృ శ్యాలకాదౌనష్టే (**భార్యతోబుట్టువు**) సచేలస్నానము ప్రతియోగులకు. ఈమూడు శ్లోకాలు అసపిండాశౌచం, చెప్పబోయే సన్నిపాతా శౌచము ఈ రెండు సర్వవర్ణ సమానం. ఉపనీతాశౌచంవలె వర్ణవిశేషోపాదానంతో అవిహితమైంది. }

మూ ॥ **దౌహిత్రభాగినేయ యో** రుపనీతయోస్త్రిరాత్రం అనుపనీతయోః పక్షిణీ. సంస్థితే పక్షిణీంరాత్రిం దౌహిత్రేభగినీసుతే, సంస్కృతేతుత్రిరాత్రంస్యాదితిధర్మోవ్యవస్థితః ఇతివృద్ధమనూక్తేః సంస్కృతేదాహేన. తేనదాహేత్రిరాత్రం నాన్యథేతిగౌడాః, తన్న, విశేషవైయర్థ్యాత్. **మాతులాదౌ** సన్నిధివిదేశాభ్యాం పక్షిణ్యేకాహయోర్వ్యవస్థా. మనుః - త్రిరాత్రమాహు రాశౌచమాచార్యే సంస్థితేసతి,తస్యపుత్రేచ పత్న్యాంచదివారాత్రమితిస్థితిః **శ్రోత్రియే స్వగృహేమృతే** త్రిరాత్రం - శ్రోత్రియే తూపసంపన్నేత్రిరాత్రమశుచిర్భవేత్, ఇతి స్మృతేరితి మాధవః ఏకగ్రామీణేత్వేకాహః **ఋత్విజబహ్వల్పకాల** శ్రౌతస్మార్తయాజనపరేత్రిరాత్రైకరాత్రేజ్ఞేయే. యద్యపికర్మ కుర్వతఏషవాచకః శబ్దోభవతీతిశంబరాచార్యైః కర్మమధ్యేఋత్విక్త్వముక్తంతథాపికర్మణ్యా శౌచనిషేధాత్తదుత్తరమేవైతత్ జ్ఞేయం. గౌడాస్తు - సమానోదకానాంత్ర్యహోగోత్రజానామహః,స్మృతం, మాతృబంధౌగురౌమిత్రే మండలాధిపతౌతథా, ఇతి జాబాలోక్తేః మాతృబంధోరేకాహమాహుః శిష్యేతూపనీతేత్ర్యహః శిష్యసతీర్థసబ్రహ్మచారిషుక్రమేణత్రిరాత్రమహోరాత్రమేకాహః ఇతిమాధవీయే బౌధాయనోక్తేః. అన్యత్రమనుః- మాతులేపక్షిణీం రాత్రిం శిష్యర్త్విగ్బాంధవేషుచ, ఇతి. **బంధుత్రయం** - ఆత్మపితృష్వ సృమాతృష్వసృమాతులపుత్రాః పితుః పితృష్వ సృమాతృష్వ సృమాతులపుత్రాః, మాతుః పితృష్వ సృమాతృష్వసృమాతుల పుత్రాశ్చేతి విజ్ఞానేశ్వరః అత్రపక్షిణీ **పితృష్వస్రాదికానా** మూఢానాం త్వేకాహః తద్బంధువర్గస్త్వేకేన, ఇతిపూర్వోక్తబ్రాహ్మాదితికేచిత్ యత్తు షడశీత్యాం - ఏవంప్రితోః భగిన్యాయే, యేపితామహ యోస్తథా, యేమాతామహయోశ్చైవ భగిన్యౌతత్పుజాశ్చయాః మాతులాః స్వస్యపిత్రోశ్చపత్న్యశ్చ షాంప్రజాశ్చయాః, భ్రాతరశ్చేతి సర్వేషు పక్షిణీ స్వగృహేత్ర్యహం. ఏవంశ్వశుర జామాతృదౌహిత్రవిపదిస్మృతం. **యచ్చయమః జామా** **తరిమృతేశుద్ధిః** త్రిరాత్రేణోభయోః స్మృతా, పక్షిణీశాలకానాం స్యాత్ ఇతి శాతాతపోబ్రవీత్. ఇతి **తన్నిర్మూలత్వాత్** మితాక్షరాదివిరోధాచ్చో పేక్ష్యం **మదనపారిజాతే విష్ణుః** అసపిండేస్వవేశ్మని

**మృతేఏకరాత్రం అత్రహారదత్తః అంతఃశవేచ, ఇత్యా పస్తంబసూత్రతః శవేగ్రామే ధనుః శతాదర్వాగన్నమభోజ్యం. దీపముదకుంభంచోపని ధాయభుంజీత యది సమాన వంశం నగృహమేవ సూతికాయామిత్యాహ.**

అను ॥ దౌహిత్రభాగినేయులు ఉపనీతులైతే త్రిరాత్రము ఆశౌచము, అనుపనీతులైతే పక్షిణి ఆశౌచము దౌహిత్రుడు, భగినీసుతుడు మరణిస్తే పక్షిణిరాత్రి ఆశౌచము. దహనంచేస్తే త్రిరాత్రాశౌచము అనిధర్మముఏర్పరచారు, అని వృద్ధమనూక్తి. (మనవరాలు, మేనకోడలైతే స్నానం మాత్రమే) సంస్కృతమనగా దాహము అందువల్ల దాహమందుత్రిరాత్రములేకపోతే లేదు, అనిగౌడులన్నారు. అట్లాకాదు, విశేషం వ్యర్థమౌతుంది కనుక (ఖననమందు, దంతాలురాకున్నాపక్షిణీఆశౌచం వస్తుంది. కాని దాహమైతే త్రిరాత్రంరావల్సివస్తుంది. (పక్షిణి బదులు) అదితగదు) మాతులుడు మొదలగువారు దగ్గరలోమరణిస్తే పక్షిణి ఆశౌచము, దూరమందు (విదేశ) మరణిస్తే ఒకదినము ఆశౌచము అని నిర్ణయము. మనువిట్లా - ఆచార్యుడుమరణిస్తే మూడురాత్రులు ఆశౌచము అన్నారు. ఆతని భార్య, లేదా పుత్రుడు మరణిస్తే ఒకపగలురాత్రి ఆశౌచముఅని నిశ్చయము, అని శ్రోత్రియుడు తనగృహమందు మరణిస్తే త్రిరాత్రము ఆశౌచము. శ్రోత్రియుడు సమీపంలోమరణిస్తే మూడురాత్రులు ఆశౌచము, అనిస్మృతి, అని మాధవుడన్నాడు. తనగ్రామమందైతే ఏకాహము చాలాకాలం నుండి లేదా అల్పకాలం నుండి శ్రౌతస్మార్త యజ్ఞములు చేయించే ఋత్విక్కు విషయంలో త్రిరాత్రము (శ్రౌత) ఏకరాత్రము (స్మార్తయజ్ఞం) ఆశౌచము అని గ్రహించాలి కర్మచేయిస్తున్న వానికే ఈ శబ్దము వాచకమౌతుందని శంబరాచార్యులు కర్మమధ్య యందు ఋత్విక్త్వమని చెప్పారు ఐనా కర్మయందు ఆశౌచనిషేధమున్నందువల్ల అతరువాతనే ఇది అనిగ్రహించాలి (నిషేధము) గౌడులైతే - సమానోదకులకు మూడురోజులు, గోత్రజులకు ఒకరోజుఆశౌచము, మాతృ బంధువుయందు, గురువుయందు, మిత్రునియందు, మండలాధిపతివీరుమరణిస్తే అట్లాగే, అనేజాబాలోక్తి వల్లమాతృబంధువునకుఒకరోజుఅనిఅన్నారు. ఉపనీతుడైన శిష్యుని విషయంలో మూడురోజులు ఆశౌచము. శిష్యుడు, సతీర్థుడు, సబ్రహ్మచారి వీరిమరణమందు క్రమంగా మూడురాత్రులు అహోరాత్రము, ఏకాహము ఆశౌచము అనిమాధవీయ మందుబౌధాయనోక్తి. మరోచోటమనువుఇట్లా - మేనమామ, శిష్యుడు, ఋత్విక్కు, బాంధవులు వీరిమరణమందు పక్షిణీరాత్రిఆశౌచము, అని. బంధుత్రయము - తనతండ్రి స్వసా (చెల్లెలు, లేదా అక్క) తనతల్లిస్వస తనమేనమామవీరిపుత్రులు **ఆత్మ** బంధువులు, తండ్రితండ్రి స్వస, తండ్రితల్లిస్వస, తండ్రిమేనమామవీరిపుత్రులు **పితృ**బంధువులు, తల్లితండ్రి స్వస, తల్లితల్లిస్వస, తల్లిమేనమామ వీరిపుత్రులు **మాతృ** బంధువులు అని బంధుత్రయమని విజ్ఞానేశ్వరుడన్నాడు. ఇక్కడ పుత్రుల విషయంలో పక్షిణిఆశౌచము తండ్రి స్వస మొదలగువారికి వివాహమైతే వారిమరణంలో ఒకరోజు ఆశౌచము ఆతనిబంధువర్గమైతే

ఒకదినంతో, అని ముందు చెప్పిన బ్రాహ్మవాక్యం వల్ల అని కొందరన్నారు. షడశీతియందు ఇట్లా-ఈరకంగా తండ్రిభగినులు (చెల్లె, అక్కలు) అట్లాగే పితామహులభగినులు, మాతామహుల భగినులు, వారి సంతానము, తన, తన తలిదండ్రులమేనమామలు, వీరిభార్యలు, వీరిసంతానముభ్రాతలుఅని అందరివిషయంలో పక్షిణి ఆశౌచము, తనగృహమందైతే మూడురోజులుఆశౌచము. ఈరకంగామామ, అల్లుడు, దౌహిత్రుడు వీరిమరణమందును చెప్పారు, అని ఏదన్నారో; యముడిట్లా- అల్లుడుమరణిస్తే మాతాపితలకు మూడురాత్రులతో శుద్ధిఅన్నారు, శాలకులకైతే (భావమరిది, భార్యతోబుట్టువు) పక్షిణిఆశౌచము అని శాతాతపుడు అన్నాడు, అని ఏదన్నాడో అదినిర్మూలమైనది, మితాక్షరాదులకువిరోధమైనది. అందువల్ల ఉపేక్షించదగినది. మదనపారిజాతమందు విష్ణువిట్లా - అసపిండుడు తనగృహమందు మరణిస్తే ఒకరాత్రిఆశౌచము అని. ఇక్కడ హరదత్తు డిట్లా - అంతఃశవేచ, అనేఆపస్తంబ సూత్రంవల్ల గ్రామమందుశవమునూరు ధనువుల లోపల ఉంటే అన్నము తినరాదు. దీపము జలకుంభము పెట్టుకొని భుజించాలి, ఒకవేళసమానవంశం,సమానగృహం కాకపోతే అని సూతిక యందు, అని అన్నాడు.

మూ. **ప్రధానగృహ మృతౌతు** - గృహేయస్యమృతః కృశ్చిత్అసపిండఃకథంచన, తస్యాప్యశౌచంవిజ్ఞేయంత్రిరాత్రంనాత్రసంశయః, ఇత్యంగిరసోక్తమితిమాధవః ఏతేన - త్రిరాత్రమసపిండేషుస్వగృహేసంస్థితేషుచ, ఇతికౌర్మంవ్యాఖ్యాతం. **శుద్ధితత్వేబృహన్మనుః** -శ్వశూద్రపతితాశ్చాంత్యామృతాశ్చేత్ద్విజమందిరే, శౌచంతత్రప్రవక్ష్యామిమను నాభాషితంయథా. దశరాత్రాచ్ఛునిమృతేమాసాచ్ఛూద్రేభవేచ్ఛుచిః. ద్వాభ్యాంతుపతితేగేహమంత్యేమాసచతుష్టయాత్. అత్యంత్యేవర్జయేత్ గేహమిత్యేవంమనురబ్రవీత్. అంత్యో = మ్లేచ్ఛః. అత్యంత్యః = శ్వపాకఇతివాచస్పతిః. తత్రైవయమః - ద్విజస్యమరణేవేశ్మవిశుధ్యతి దినత్రయాత్. సంవర్తః - గృహశుద్ధింప్రవక్ష్యామి అంతస్థశవదూషితే, ప్రోత్సృజ్యమృన్మయంభాండంసిద్ధమన్నంతథైవచ. గోమయేనోపలిప్యాథఛాగేనఘ్రాపయేద్బుధః; బ్రాహ్మణైర్మంత్రపూతైశ్చహిరణ్యకుశవారిభిః. సర్వమభ్యుక్షయేద్వేశ్మతతః శుధ్యత్యసంశయం. బృహద్విష్ణుః - గ్రామమధ్యగతోయావత్శవస్తిష్ఠతి కస్యచిత్, గ్రామస్యతావదాశౌచంనిర్గతేశుచితామియాత్ గృహోపశ్వాదౌమృతేఽప్యేవం. యత్తుమాధవీయేప్రచేతసామాతృష్వసాదిషుత్రిరాత్రముక్తం - మాతృష్వసామాతులయోఃశ్వశ్రూశ్వశురయోర్గురోః, మృతే చ ఋత్విజియాజ్యేచ త్రిరాత్రేణ విశుధ్యతి, ఇతి. గురురాచార్యః ఋత్విక్కులాగతః తత్స్వగృహమృతౌజ్ఞేయం. శ్వశురయోరన్యత్రమృతావపి సన్నిధౌత్రిరాత్రంఅసన్నిధౌ పక్షిణీదేశాంతరే ఏకరాత్రం, వక్ష్యమాణవిష్ణూక్తేరితిమాధవగౌడాదయః అన్యత్రతుమాతృష్వసాదిషు పక్షిణీ, పిత్రోః స్వసరితద్వచ్ఛపక్షిణీం క్షపయేన్నిశాం, ఇతివృద్ధమనూక్తేః. యత్తువృద్ధమనుః - భగిన్యాంసంస్థితాయాంతు (సంస్కృతాయాంతు) భ్రాతర్యపిచసంస్థితే (సంస్కృతే) మిత్రేజామాతరి ప్రేతేదౌహిత్రే భగినీసుతే. శాలకేతత్సుతేచైవసద్యఃస్నానేన శుధ్యతి, ఇతి తద్భ్రాతృదౌహిత్రాదౌదేశాంతరే,

శాలకసుతజామాత్రోః స్వదేశేజ్ఞేయం. శాలకేతుస్వదేశేఏకాహః అచార్యపత్నీ పుత్రోపాధ్యాయమాతుల శ్వశురశ్వశ్రూశ్వశుర్యసహాధ్యాయిశిష్యేషుఏకరాత్రం, ఇతి మాధవీయే విష్ణూక్తేః. హరదత్తీయే - దశశ్లోక్యామప్యేవం. శ్వశుర్యః = శ్యాలకః దేశాంతరేస్నానం. శ్వశురయోర్దేశాంతరేఏకాహః. జాబాలః - ఏకోదకానాంతుత్ర్యహోగోత్రజానామహఃస్మృతం. సర్వత్రమూలాభావేఽపిక్రియాకర్తుర్దశాహః గురోః ప్రేతస్యశిష్యస్తుపితృమేధంసమాచరేత్, ప్రేతాహారైః సమంతత్రదశరాత్రేణశుద్ధ్యతి, ఇతిమనూక్తేః శిష్యఇత్యుపలక్షణం. నిరన్వయేసపిండేతుమృతేసతిదయాన్వితః, తదశౌచంపురాచీర్త్వాకుర్యాత్తు పితృవత్క్రియాం, ఇతిమాధవీయేబ్రాహ్మోక్తేః. దివోదాసీయే - సగోత్రావాఽసగోత్రావాయోఽగ్నిం దద్యాత్సఖేనరః సోఽపికుర్యాన్నవశ్రాద్ధంశుద్ధ్యేచ్చదశమేఽహని. యత్రైక విషయే పక్షిణ్యే కాహాది పక్షద్వయ ముక్తం, తత్రసన్నిధివిదేశమైత్ర్యాదికృతావ్యవస్థా.

అను ।। ప్రధానగృహమందుమరణిస్తేఇట్లా - ఏదోవిధంగా అసపిండుడుఒకడు ఇంట్లోమరణిస్తే ఆఇంటివానికిత్రిరాత్రము అశౌచముఅనితెలుసుకోవాలి. ఇందులో అనుమానం లేదు, అని ఆంగిరసోక్తమనిమాధవుడన్నాడు. దీనితో అసపిండులు స్వగృహ మందుమరణిస్తే త్రిరాత్రాశౌచము, అని కౌర్మమువ్యాఖ్యానించింది. శుద్ధితత్వమందు బృహన్మనువిట్లా - బ్రాహ్మణునిఇంటియందుకుక్క శూద్రుడు, పతితుడు, అంత్యుడు వీరు మరణిస్తే అక్కడ మనువుచెప్పినట్టి శౌచాన్ని అట్లాగే చెప్తున్నాను, అని. కుక్క మరణిస్తే పదిరాత్రులతో శుద్ధి, శూద్రుని విషయంలో నెలతో శుచిత్వంవస్తుంది. పతితునిమరణ మందురెండునెలలతో శుద్ధిఅంత్యుని విషయంలోనాల్గునెలలతోగేహశుద్ధి. అత్యంత్యుని మరణమందుఇంటినివిడిచి పెట్టాలి, అనిఇట్లామనువుచెప్పాడు. అంత్యఅనగామ్లేచ్ఛుడు. అత్యంత్యుడనగాశ్వపాకుడు అని వాచస్పతి. అక్కడేయముడిట్లా - ద్విజుడుమరణిస్తే, ఇల్లుమూడురోజులతో శుద్ధినందుతుంది, అని. సంవర్తుడిట్లా - లోపలిభాగం శవంవల్ల దూషితమైతేగృహశుద్ధిని గూర్చిచెప్తున్నాను, మృణ్మయపాత్రలనుపారేయాలి, అట్లాగేతయారైన అన్నాన్నిపారేయాలి, అని. పిదపగోమయంతో ఇల్లుఅలికిమేకతో ఇంటిని వాసనచూపించాలి బుధుడు. బ్రాహ్మణులతో మంత్రపూతమైన హిరణ్య,కుశ,జలములతో ఇల్లంతా ప్రోక్షణ చేయించాలి. అప్పుడుశుద్ధిఅవుతుంది, అనుమానంలేదు. బృహద్విష్ణువిట్లా - గ్రామమధ్య మందు ఎవనిదైనాశవమున్నంతవరకుగ్రామమునకా శౌచము, శవంపోతేశుచిఔతుంది, అని గృహమందుపశ్వాదులుమరణిస్తేకూడాఇట్లాగే. మాధవీయ మందు ప్రచేతసుడిట్లా -మాతృష్వసమొదలగువారివిషయమై త్రిరాత్రముఅశౌచము చెప్పాడో, ఇట్లామాతృష్వస, మాతులుడు, అత్త, మామ, గురువు, ఋత్విక్ యజ్ఞంచేయించేవాడు (యజమాని) వీరు మరణిస్తే త్రిరాత్రాశౌచము, ఆపైశుద్ధి, అని. గురువనగా ఆచార్యుడు. ఋత్వక్కు కుల వంశపరం పరగా వచ్చినవాడు. అది తమగృహమందుమరణిస్తే అని తెలుసుకోవాలి. అత్తమామలు వేరేచోట మరణించినా, దగ్గరలో ఉంటే త్రిరాత్రాశౌచము. సన్నిధిలోలేకుంటే

పక్షిణీ ఆశౌచము. దేశాంతరమందైతేఒకరాత్రి చెప్పబోయేవిష్ణూక్తి ననుసరించి, అనిమాధవ గౌడాదులన్నారు. వేరోచోటమరణమైతే మాతృష్వసమొదలగువారి యందు పక్షిణీఆశౌచము తండ్రి స్వసవిషయంలోనుఅట్లాగేపక్షిణీరాత్రిగడపాలి, అనివృద్ధమ నూక్తి. వృద్ధమను విట్లా- వివాహితభగినిమరణిస్తే, వివాహిత భ్రాతమరణిస్తే, మిత్రుడు, జామాత, దౌహిత్రుడు, భగినీసుతుడువీరుమణిస్తే, శాలకుడు, వానిసుతుడుమరణించినాసద్యః స్నానంతోశుద్ధి, అని ఏదన్నాడో అది(భ్రాతృదౌహిత్రాదులైతేదేశాంతరమందుమరణిస్తే,అని. శాలకసుతుడు, జామాతవీరైతే స్వదేశమందనిగ్రహించాలి. శాలకునకైతేస్వదేశమందైతేఏకాహము. **ఆచార్యపత్నిపుత్రుడు,** ఉపాధ్యాయుడు, మాతులుడు, అత్తమామలు, భావమరిది, సహాధ్యాయి, శిష్యుడు వీరిమరణ మందు ఏకరాత్రముఆశౌచము. అనిమాధవీయ మందువిష్ణూక్తి. హరదత్తీయమందలి దశశ్లోకియందుకూడాఇట్లాగేఉంది. శ్వశుర్యుడు = భావమరది. దేశాంతర మందు మరణిస్తేస్నానముఅని. అత్తమామలుదేశాంతర మందుమరణిస్తే ఏకాహా శౌచము. జాబాలుడిట్లా - ఏకోదకులకు మూడురోజులు, గోత్రజులకు ఒకరోజు ఆశౌచ మన్నారు. అంతట మూలవచనంలేకపోయినా క్రియ ఆచరించేవానికి దశాహము ఆశౌచము ఔతుంది, అని. గురువుమరణిస్తే (అసపిండ) ఆతనికి శిష్యుడు పితృమేధంఆచరించాలి (అంత్యేష్టి) ప్రేతాగ్ని తీసుకుపోయే వారితో సమానంగా పదిరాత్రులతో శుద్ధినందుతాడు. అని మనూక్తి. శిష్యపదము ఉపలక్షణము. తనవంశంకన్న భిన్నమైనవాడు, సపిండుడు మరణిస్తే దయ గలవాడై ఆ ఆశౌచాన్ని మొదట స్వీకరించి పితరునకువలె క్రియను నిర్వర్తించాలి, అని మాధవీయ మందు బ్రాహ్మోక్తి. దివోదాసీయ మందిట్లా - ఓసఖ! సగోత్రుడైనా, అసగోత్రుడైనా ఏనరుడు (దాహకర్మ) అగ్నిపెట్టాడో (మరణమందు), ఆతడు కూడ నవశ్రాద్ధాన్ని చేయాలి (దశపిండం), పదవరోజున శుద్ధినందుతాడు, అని (గడిచాక) ఒకేచోట పక్షిణీ, ఏకాహాదిరెండుపక్షములుచెప్తే, అది, సన్నిధి, విదేశ, మైత్రి ఆదిగా వ్యవస్థచేయాలి.

**మూ ॥ త్రింశత్‌శ్లోక్యాం - వానప్రస్థేయతౌచో పరమతికులజేషంధకేచాప్లవఃస్యాద్యోషిత్ గోవిప్రగుప్త్యైమృతవతితుదినంయుద్ధవిద్ధేచసద్యః. అత్రమూలమాకరేస్పష్టం. యుద్ధమూర్ధ్నిమృతస్య స్నానం.ఉద్యతైరాహవేశస్త్రైః క్షత్రధర్మహతస్యచ, సద్యఃసంతిష్ఠతేయజ్ఞః తథాశౌచమితిస్థితిః, ఇతి మనూక్తేః యజ్ఞోంత్యకర్మ. సర్వంతదైవేత్యర్థః. యస్తుభారతేరాజధర్మేషు-అశోచ్యోహిహతః శూరః స్వర్గలోకే మహీయతే, నహ్యన్నముదకంతస్యనస్నానంనాప్యశౌచకం, ఇతిశ్రాద్ధాదినిషేధః సపుత్రాద్యభావపరః. అతఏవతత్రకర్ణాదీనాంశ్రాద్ధముక్తం. అన్యేతుదశపిండనిషేధమాహుర్యతివత్. యత్తుపరాశరః-ఆహవేఽపి హతానాంచఏకరాత్రమశౌచకం, ఇతితత్‌యుద్ధక్షతేనకాలాంతర మృతేజ్ఞేయం.అసన్నిధౌస్నానమితిమాధవః. శుద్ధితత్త్వేఅగ్నిపురాణే - దంష్ట్రిభిఃశృంగిభిర్వాపి హతామ్లేచ్ఛైశ్చతస్కరైః, యేస్వామ్యర్థేహతాయాంతిరాజన్‌స్వర్గంనసంశయః సర్వేషామే వర్ణానాం**

క్షత్రియస్య విశేషతః. **యత్తుబృహస్పతిః** డింబాహవేవిద్యుతాంచరాజ్ఞాంగోవిప్రపాలనే, సద్యః శౌచంమృతస్యాహుః త్ర్యహంచాన్యేమహర్షయః. తచ్ఛస్త్రంవినాపరాజ్ముఖహతేచత్రిరాత్రం, రాజ్ఞావధ్యేహతేసద్యః శౌచమన్యత్రత్రిరాత్రం. **తత్రైవవ్యాఘ్రః** - క్షతేనమ్రియతే యస్తుతస్యా శౌచం భవేద్విధా, ఆసప్తాహాత్త్రి రాత్రం స్యాద్దశరాత్రమతః పరం. **శస్త్రాఘాతేత్ర్యహా**దూర్ధ్వం యదికశ్చిత్ర్ప మీయతే, ఆశౌచంప్రాకృతం తస్యసర్వవర్ణేషునిత్యశః. శస్త్రఘాతేక్షతంవినా. **శవస్పర్శేతుహారీతః** - శవస్పృశోగ్రామంనప్రవిశేత్పు రానక్షత్రదర్శనాత్ రాత్రౌచేదాదిత్యస్య. యత్తుమనుః - అహ్నాచైకేన రాత్ర్యాచ త్రిరాత్రైరేవచత్రిభిః, శవస్పృశోవిశుద్ధ్యంతి త్ర్యహాదుదకదాయినఃఇతి. అహ్నారాత్ర్యాచేత్య హోరాత్రముక్తం త్రిభిస్త్రిరాత్రైరితి నవరాత్రమేవందశరాత్రమిత్యర్థః. **తత్తదన్నాశనేతద్గృహేవాసే**ఽ నాపదిచజ్ఞేయం. అనదన్నన్నమహ్నైవ, నచేత్తస్మిన్ గృహేవసేత్, ఇతితేనైవోక్తేః. **అంగిరాః** - **ఆశౌచం** యస్య సంసర్గాదాపతే**త్**గృహమేధినః క్రియాస్తస్యనలుప్యంతేగృహ్యాణాంచనతద్భవే**త్** అధనిర్హరణాద్యా శౌచం. స్నేహేనసవర్ణనిర్హారే తదన్నాశనేతద్గృహవాసేచదశాహః తదన్నానశనేత ద్గృహవాసేత్ర్యహః గృహావాసేఽన్నభక్షణేచైకాహః.

అను ॥ త్రింశత్‌శ్లోకియందిట్లా-వానప్రస్థుడు, యతి, కులజుడైనషంఢకుడువీరు మరణిస్తేస్నానంతోశుద్ధి. స్త్రీ, గోవు, విప్రుడువీరలరక్షణకొరకుమరణిస్తే ఒకరోజుతో శుద్ధి యుద్ధమందు మరణిస్తేసద్యఃశుద్ధి, అని. ఇక్కడమూలవచనాలు ఆకరగ్రంధాలందు స్పష్టంగా ఉన్నాయి. యుద్ధంలోముందుభాగంలో (మూర్ధ)మరణిస్తే స్నానముతోశుద్ధి. యుద్ధమందు ఎత్తబడిన శస్త్రములతో క్షత్రధర్మంగా ఎదిర్చిహతుడైతే (పారిపోక) వెంటనే (యజ్ఞఫలం) యజ్ఞమాచరించాలి. అట్లాగే వెంటనేశుద్ధి అని నిర్ణయము, అనిమనూక్తి. యజ్ఞము అనగా అంత్యకర్మ. అన్నీ అప్పుడే అని అర్థము. భారతంలో రాజధర్మమందు ఇట్లా - శూరుడు మరణిస్తే శోకించరాదు స్వర్గలోకమందు గొప్పవాడౌతాడు. అతనికి అన్నము, ఉదకము, స్నానము, ఆశౌచము ఏవీ లేవు. అని ఏ శ్రాద్ధాది నిషేధముందో అది పుత్రాదులు లేకపోతే చెప్పారు. అందువల్లనే అక్కడ కర్ణాదులకు శ్రాద్ధంచెప్పబడింది. ఇతరులైతే యతికి వలె, దశపిండ నిషేధాన్ని చెప్పారు. పరాశరుడిట్లా - యుద్ధమందు మరణించిన వారికైనా ఒకరాత్రి ఆశౌచము, అని ఏదన్నాడో అదియుద్ధక్షతుడైనవాడు కాలాంతర మందు మృతి చెందితే అని గ్రహించాలి. సన్నిధిలో లేకపోతే స్నానము అని మాధవుడన్నాడు. శుద్ధితత్వ మందు అగ్నిపురాణోక్తి ఇట్లా - కోరతో, కొమ్ములతో, మ్లేచ్ఛులతో, దొంగలతో, యజమాని కొరకును మరణం చెందినవారు స్వర్గానికి పోతారు, అనుమానంలేదు. ఓరాజ! అని. అన్నివర్ణములలో, విశేషించి క్షత్రియుడు స్వర్గం వెళతాడు. బృహస్పతి ఇట్లా - పిల్లల యుద్ధమందు మరణించిన వారికి, పిడుగులతో, మరణించిన వారికి రాజుల గోవులను విప్రులను రక్షించుటలో మరణించినవారికి వెంటనే శౌచము లభిస్తుంది. ఇతరమహర్షులు

త్రిరాత్రాశౌచము అని అన్నారు, అని. శస్త్రంతోకాకయుద్ధపరాఙ్ముఖుడై మరణిస్తే త్రిరాత్రాశౌచము. రాజుచేవధ్యుడైమరణిస్తేసద్యఃశౌచము, వేరేచోటఐతేత్రిరాత్రా శౌచము. అక్కడే వ్యాఘ్రుడిట్లా - గాయంవల్ల మరణించిన వానికి ఆశౌచము రెండు విధాలు. ఏడు రోజులలో మరణిస్తే త్రిరాత్రము, ఆపైన మరణిస్తే దశరాత్రా శౌచము అని. శస్త్రాఘాతం తరువాత మూడురోజులతరువాతమరణిస్తే వానికి అశౌచము, సర్వ వర్ణములందు ఏది నిత్యమైనదో అది వానికి ప్రకృతము, అని. శస్త్రాఘాతమందు అనగా కొమ్ములకోరల మొదలైనవాని క్షతములు కాక. శవ స్పర్శమందు హారీతుడిట్లా - శవాన్ని ముట్టిన వాడు నక్షత్ర దర్శనం కన్న ముందు గ్రామంలో ప్రవేశించరాదు. రాత్రి ఐతే సూర్యదర్శనమయ్యాక రావాలి, అని. మనువిట్లా - పగలు ఒక రాత్రి, మూడు రాత్రులు మూడింటితో శవ స్పర్శ చేసిన వారు శుద్ధులౌతారు. ఉదకదాయులు మూడు రాత్రులతో శుద్ధులౌతారు, అని. పగలు రాత్రి కలిసి అహోరాత్రము మూడు, మూడు రాత్రులు అని తొమ్మిది రాత్రులు ఈ విధముగా పది రాత్రులని అర్థము అని ఏదన్నాడో అది, వారి అన్నం తింటే, వారి ఇంట్లో ఉంటే, విపత్తు లేనప్పుడు అని గ్రహించాలి. వారి అన్నం తినకపోతే, వారి ఇంట్లో వుండకపోతే ఒక రోజుతోనే శుద్ధి, అని ఆతడే చెప్పాడు. అంగిరుడిట్లా - గృహమేధికి సంసర్గం వల్ల ఆశౌచం వస్తే, ఆతని క్రియలు లోపించవు, గృహ కర్మలకు ఆశౌచం సంభవించదు, అని. ఇక **నిర్హారణాది** ఆశౌచము **(పీనుగను కాల్చుట)** - స్నేహంతో సవర్ణుని శవాన్ని మోస్తే, వారి అన్నం తింటే, వారి ఇంట్లో ఉంటే పదిరోజులు ఆశౌచము. వారి అన్నం తినక వారి ఇంట్లో ఉంటే మూడు రోజులు ఆశౌచము. గృహంలో ఉండక, అన్నం మాత్రం తింటే ఒక రోజు ఆశౌచము.

**మూ॥ భృతిగ్రహణేన,** నిర్హారదాహేచ **తజ్జాత్యాశౌచం. యదినిర్హరతిప్రేతం ప్రలోభాక్రాంత మానసః, దశాహేనద్విజఃశుద్ధ్యేత్ ద్వాదశాహేన భూమిపః, మాసార్థేనతువైశ్యస్తు శూద్రోమాసేన శుద్ధ్యతి, ఇతికౌర్మోక్తేః. విజాతీయనిర్హారేతు** శవజాతీయమశౌచం. **అత్రభృతిగ్రహేద్విగుణం. అవరశ్చేద్వరం వర్ణం వరోవాప్యవరంయది, వహేచ్ఛవంతదాశౌచంద్రవ్యార్థేద్విగుణంభవేత్, ఇతి వ్యాఘ్రోక్తేః. కౌర్మమేతదితిగౌడాః. దాహేఽప్యేవం. యత్తుబ్రాహ్మే - యేఽసవర్ణంతు మూల్యేన నీత్వాచైవదహేన్నరః, ఆశౌచంతుభవేత్తస్య ప్రేతజాతి సమంన్నృప, ఇతి. తదాపదిజ్ఞేయం. సోదక నిర్హారేతు దశాహ ఇతి మాధవః. అలంకరణేతుశంఖః - కృచ్ఛ్రపాదోఽసపిండస్యప్రేతాలం కరణేకృతే, అజ్ఞానాదుపవాసంస్యాత్ అశక్తౌ స్నానమిష్యతే. ధర్మార్థమనాథ సవర్ణహరణే క్రియాకరణే చ ద్విజస్య అనంతయజ్ఞ ఫలం. స్నానం ప్రాణాయామోఽగ్ని స్పర్శశ్చ, ఇతిమాధవీయే. అగ్నిదేఽప్యేవం. ప్రేతసం స్పర్శ సంస్కారైఃబ్రాహ్మణో నైవదుష్యతి, వోఢాచైవాగ్నిదాతాచ సద్యః స్నాత్వా విశుద్ధ్యతి, ఇతి అపరార్కేవృద్ధ పరాశరోక్తేః. మాతులత్వాది సంబంధేత్రిరాత్రం. అసంబంధి ద్విజాన్నిహిత్వాదహిత్వా చ సద్యఃశౌచం, సంబంధేత్రిరాత్రం, ఇతిపైఠీనసి స్మృతేః. గౌతమమితా**

క్షురాయాం వృద్ధాత్రిః - సూతకాత్ ద్విగుణేశావం శావాత్ ద్విగుణ మార్తవః, అర్తవాత్ ద్విగుణాసూతిః తతోఽపి శవదాహకః. అత్ర పూర్వోత్తర నివృత్తిరిత్యర్థః విష్ణుః. **విష్ణుః** - మృతంద్విజంనశూద్రేణ హారయేన్నశూద్రంద్విజేన. దేవలః - బ్రహ్మచారీ నకుర్వీత శవవాహాదికక్రియాం, యదికుర్యాచ్చరే త్కృచ్ఛ్రం పునః సంస్కారమేవచ. యాజ్ఞవల్క్యః - ఆచార్య పిత్రుపాధ్యా యాన్నిర్హృత్యాపి వ్రతీవ్రతీ, అనుగమనేతు సపిండే నదోషః. విహితంహి సపిండానాం ప్రేతనిర్హరణాదికం, తేషంకరోతియః కశ్చిత్ తస్యాధిక్యం నవిద్యతే, ఇతిదేవలోక్తేః. దోషంస్యాత్త్వసపిండస్య తత్రానాధక్రియాంవినా, ఇతిహారీతోక్తేః. **సమోత్కృష్టవర్ణేతుమాధవీయే కణ్వః** - అనుగమ్య శవంబుద్ధ్యా స్నాత్వా స్పృష్ట్వా హుతాశనం, సర్పిఃప్రాశ్య పునఃస్నాత్వాప్రాణాయామైర్విశుద్ధ్యతి. హీనవర్ణే తుక్షత్రియేఽహః వైశ్యే పక్షిణీ, శూద్రేత్రిరాత్రం, క్షత్రియస్యవైశ్యేఽహః, శూద్రే పక్షిణీ, వైశ్యస్యశూద్రేఽహః ఇతి విజ్ఞానేశ్వరః, మాధవస్తు విప్రస్యవైశ్యేద్వ్యహః, క్షత్రియస్యశూద్రేఽప్యేవం. అన్యత్ ప్రాగ్వత్. స్నానాగ్నిస్పర్శఘృతాశనాని సర్వత్రేత్యాహ.

అను॥ డబ్బు తీసుకొని శవం తీసుకుపోవటం, కాల్చటం చేస్తే, వాని (తన) జాత్యాశౌచము ఉంటుంది. ప్రలోభంతో నిండిన మనస్సుకలవాడై ప్రేతాన్ని తీసుకుపోతే బ్రాహ్మణుడు పదిరోజులతో క్షత్రియుడు పన్నెండురోజులతో, వైశ్యుడు పదిహేనురోజులతో, శూద్రుడు మాసాశౌచంతో శుద్ధినందుతారు, అని కౌర్మోక్తి. విజాతీయ శవాన్ని తీసుకువెళితే, శవజాతీయమైన ఆశౌచముంటుంది. ఇక్కడ డబ్బు తీసుకుంటే రెట్టింపు ఆశౌచము. తక్కువ జాతివాడు, ఎక్కువ జాతి శవాన్ని మోసినా, ఎక్కువ జాతివాడు తక్కువ జాతి శవాన్ని మోసినా ద్రవ్యం కోసమైతే, అప్పుడు, ఆశౌచం రెట్టింపు ఔతుంది, అని వ్యాఘ్రోక్తి. ఇది కౌర్మవచనమని గౌడులన్నారు. దాహమందుకూడా ఇట్లాగే. బ్రాహ్మమందిట్లా - అసవర్ణుని శవాన్ని డబ్బుతీసుకొని, తీసుకుపోయి దహనం చేస్తే వానికి ఆశౌచము ప్రేతజాతి సమంగా ఉంటుంది, ఓ నృప అని ఏదన్నారో. అది ఆపదలో అని గ్రహించాలి. సోదకుని శవం తీసుకుపోతే పది రాత్రులు ఆశౌచమని మాధవుడన్నాడు. అలంకారం చేయటమైతే శంఖుడిట్లా - అసపిండుని ప్రేతాలంకరణం చేస్తే కృచ్ఛ్రపాదము శిక్ష. తెలియకచేస్తే ఉపవాసము, శక్తి లేకపోతే స్నానము మాత్రము, అని. ధర్మంకొరకు, అనాధుడైన సవర్ణుని శవం తీసుకుపోతే, క్రియా కర్మ చేస్తే ద్విజునకు అనంత యజ్ఞఫలము. స్నానము, ప్రాణాయామము, అగ్నిస్పర్శ చేయాలి అని మాధవీయమందు ఉంది. అగ్ని పెట్టినా కూడా ఇట్లాగే ప్రేత సంస్పర్శ సంస్కారములతో, బ్రాహ్మణుడు దూషితుడు కాడు. మోసేవాడు, అగ్నిదాత వీరలు స్నానం చేసిన వెంటనే శుద్ధులౌతారు, అని అపరార్కమందు వృద్ధ పరాశరోక్తి. మాతులుడు మొదలగు సంబంధముంటే త్రిరాత్రాశౌచము. సంబంధములేని ద్విజులను, మోసి నందువల్ల, కాల్చినందువల్ల వెంటనే శుద్ధి. సంబంధముంటే త్రిరాత్రము, ఆశౌచము అని. పైఠీనసిస్మృతి. గౌతముని మితాక్షరయందు వృద్ధ అత్రివచనమిట్లా - జననాశౌచం కన్న రెట్టింపు

మృతాశౌచమెక్కువ. దానికన్న రెట్టింపు రజోదర్శనాశౌచం ఎక్కువ. ఆర్తవం కన్న రెట్టింపుదోషం సూతి (ప్రసూతి). దానికన్న ఎక్కువ దోషం శవదాహంవల్ల అని. ఇక్కడ. పూర్వపు దానితో ఉత్తరమైనది ఆగిపోతుంది, అని అర్ధము, అని విష్ణువన్నాడు. విష్ణువిట్లా – చనిపోయిన బ్రాహ్మణుని శవాన్ని శూద్రుడు తీసుకుపోరాదు. శూద్రుని శవాన్ని బ్రాహ్మణుడు తీసుకుపోరాదు, అని. దేవలుడిట్లా – బ్రహ్మచారి శవవాహాదిక్రియలను చేయరాదు, ఒక వేళ చేస్తే కృచ్ఛ్రవ్రతమాచరించాలి. తిరిగి సంస్కారము, అని. యాజ్ఞవల్క్యుడిట్లా – ఆచార్యుని, తండ్రిని, తల్లిని, ఉపాధ్యాయులను (శవములను) మోసినా వ్రతి, వ్రతియే (బ్రహ్మచారే). సపిండుని శవాన్ని అనుసరిస్తే దోషం లేదు, అని. సపిండుల ప్రేతములను మోయుట మొదలగునవి విహితమైనవి. (అనుగమన, రోదన, దాహ ఉదకదానం ఆది పదంతో) ఎవరైనా, సపిండులకు చేస్తే వానికి అధిక దోషం లేదు, అని దేవలోక్తి, అసపిండునకు చేస్తే దోషం, అనాధునికి చేసే క్రియ తప్పు, అని హారీతోక్తి. సమ, ఉత్కృష్ట వర్ణమందైతే మాధవీయమందు కణ్వుడిట్లా – బుద్ధి పూర్వకంగా శవాన్ని అనుసరించి వెళ్ళి, స్నానం చేసి, అగ్నిని తాకి, నేయితిని, తిరిగి స్నానం చేసి, ప్రాణాయామంలు చేస్తే శుద్ధుడౌతాడు, అని. హీనవర్ణుడైతే (బ్రాహ్మణునకు) క్షత్రియుని శవమందు ఒక రోజు, వైశ్యునియందు పక్షిణి, శూద్రుని యందు త్రిరాత్రము. క్షత్రియునకు వైశ్యునియందు ఒక రోజు, శూద్రునియందు ఫక్షిణి. వైశ్యునకు శూద్రునియందు ఒక రోజు ఆశౌచము అని విజ్ఞానేశ్వరుడన్నాడు. మాధవుడైతే విప్రునకు వైశ్యునియందు రెండురోజులు, క్షత్రియునకు శూద్రునియందు కూడా ఇట్లాగే అని. ఇతరమంతా ముందు చెప్పినట్లే స్నాన, అగ్ని స్పర్శఘృతాశనములు అంతటా ఉంటాయి అని చెప్పారు.

మూ॥ **హీనవర్ణస్య** దాహౌర్ధ్వ దేహికకరణేతుబ్రాహ్మే – బ్రాహ్మణోహీనవర్ణస్య **నకుర్యాదౌర్ధ్వదేహికం, కామాల్లోభాత్త థామోహాత్కృత్వాతజ్జాతితాంవ్రజేత్ మనుః – వ్రాత్యానాం యాజనం కృత్వాపరేషామంత్యకర్మచ, అభిచారమహీనంచత్రిభిః కృచ్ఛ్రైఃవ్యపోహతి. పరేషాం** నవర్ణానాం హీనేషు తద్ద్వైగుణ్యత్రైగుణ్యచాతుర్గుణ్యాద్యూహ్యం. **అథరోదనే సమోత్తమవర్ణయోః** సంచయనాత్పూర్వం స చైలస్నానమూర్ధ్వమాచమనం. **హీనవర్ణేతు** సంచయాత్ప్రాక్ సచేలమూర్ధ్వం స్నానమాత్రం. **విప్రస్యక్షత్రవైశ్యవిషయేతు బ్రాహ్మే – అస్థిసంచయనే విప్రౌరౌతిచేత్ క్షత్రవైశ్యయోః, సదాస్నాతః సచైలస్తు ద్వితీయేఽహని శుధ్యతి, కృతేతు సంచయే విప్రః స్నానే నైవ శుచిర్భవేత్. క్షత్రస్య వైశ్యేఽప్యేవం. శూద్రేతు సంచయాత్ప్రాక్** విప్రస్యత్రిరాత్రం. క్షత్రవైశ్యయోః ద్విరాత్రం. ఊర్ధ్వంతుద్విజానామేకాహః. **శూద్రస్య శూద్రేస్పర్శం** వినాసంచయాత్పూర్వమేకాహః. ఊర్ధ్వంసజ్యోతి రితిమాధవీయేజ్ఞేయం. **శుద్ధితత్త్వేపారస్కరస్తు** – అస్థిసంచయనాదూర్ధ్వం మాసంయావత్ ద్విజాతయః, దివసేనైవ

శుధ్యంతి వాససాం క్షాలనేనచ సజాతేర్దివసేనైవత్ర్యహాత్క్షత్రియవైశ్యయోః, ఇత్యుక్తం. సపిండానాం రోదననిర్హారాదావదోషఇత్యుక్తం ప్రాక్. విజ్ఞానేశ్వరస్తు – మృతస్యబాంధవై స్సార్ధం కృత్వాతు పరిదేవనం, వర్జయేత్తదహోరాత్రందానశ్రాద్ధాదికర్మచ, ఇతిపారస్కరోక్తేః సర్వత్రైకరాత్రమాహ. **అథ ఆశౌచాన్నభక్షణే విష్ణుః** – బ్రాహ్మణాదీనామాశౌచేయః సకృదేవాన్నమశ్నాతి తస్యతావదాశౌచం యావత్తేషామా శౌచవ్యపగమే ప్రాయశ్చిత్తం, ఇతి. అజ్ఞానేతు అంగిరాః – అంతర్దశాహేభుక్త్వాన్నం సూతకేమృతకేఽపివా, అస్యాశౌచం భవేత్తావద్యావదన్నం వ్రజత్యథః. ప్రాయశ్చిత్తం త్వమత్యా విప్రస్య వర్ణక్రమే త్రైకాహత్ర్యహ పంచాహసప్తా హోపవాసాః, దశ, వింశతిః షష్టిః, శతంచ ప్రాణాయామాః పంచగవ్యాశనంచ. అభ్యాసే ద్విగుణం ఆపదితు ప్రాణాయామశతం పంచశత మష్టశత మష్ట సహస్రం గాయత్రీ జపశ్చ. మత్యాపదితు సవర్ణాశౌచే త్రిరఘమర్షణం గాయత్ర్యష్ట సహస్రంచ. క్షత్రియాశౌచే ఉపవాసః వైశ్యాశౌచేత్రిరాత్రోపవాసశ్చ. శూద్రాశౌచే కృచ్ఛ్రః. క్షత్రవైశ్యయోః పంచశతమష్టశతం గాయత్రీజపః. ఉత్తమేషుశూద్రస్య సర్వత్రస్నానం. మత్యానాపది విప్రస్యవర్ణేషు సాంతపన కృచ్ఛ్ర, మహాసాంతపన చాంద్రాణి. అభ్యాసేతు మాసిక ద్వైమాసిక త్రైమాసిక షాణ్మాసికానీ త్యాదిమాధవీయాదౌ జ్ఞేయం.

అను॥ హీనవర్ణునకు దాహౌర్ధ్వదేహిక కరణమందు బ్రాహ్మోక్తి ఇట్లా – బ్రాహ్మణుడు హీనవర్ణునకు ఔర్ధ్వదేహికము చేయరాదు. కామం వల్ల కాని లోభం వల్ల కాని మోహం వల్ల కాని ఆచరిస్తే ఆ జాతి త్వాన్ని పొందుతాడు, అని మనువిట్లా – వ్రాత్యులకు (ఉపనయన సంస్కారములేని) యాజనము (యజింపచేయుట) చేసి, పరులకు అంత్యకర్మ చేసి (సవర్ణ), ఉత్కృష్ట వర్ణులందు అభిచారం (మారణాది) చేసి ఉన్నట్లైతే మూడు కృచ్ఛ్రములతో శుద్ధుడౌతాడు, అని. పరులకు అనగా సవర్ణులకు, హీనులందైతే దోషము రెట్టింపు మూడింతలు, నాల్గింతలు మొదలుగా ఊహించాలి. ఇక ఉత్తమ వర్ణ సవర్ణులకై ఏడిస్తే, సంచయనం కన్న ముందైతే సచైల స్నానము ఆ తరువాతైతే ఆచమనము. హీనవర్ణమందైతే, సంచయం కన్న ముందైతే సచేల స్నానము, ఆపైన స్నాన మాత్రము(ఏడిస్తే). విప్రునకు క్షత్రియ వైశ్యుల విషయమందైతే బ్రాహ్మోక్తి ఇట్లా – క్షత్రియ వైశ్యుల అస్థి సంచయనమందు బ్రాహ్మణుడు ఏడిస్తే, అప్పుడు సచైల స్నానం చేస్తే తరువాతి రోజున శుద్ధినందుతాడు. సంచయనం అయ్యాక విప్రుడు రోదిస్తే స్నానంతోనే శుద్ధినందుతాడు, అని. క్షత్రియునకు వైశ్యుని విషయంలోను అంతే. శూద్రుని విషయంలోనైతే, సంచయం కన్న ముందైతే విప్రునకు త్రిరాత్రము క్షత్రవైశ్యులకు ద్విరాత్రము. ఆ పైన ద్విజులకు ఏకాహము (ఏడిస్తే). శూద్రుని విషయంలో శూద్రునకు స్పర్శలేకున్నా సంచయం కన్న ముందు ఒక రోజు ఆశౌచము. ఆ పైన ఐతే సజ్యోతి అని మాధవీయమందు అని గ్రహించాలి. శుద్ధితత్వమందు పారస్కరుడిట్లా – అస్థిసంచయనం తరువాత నెలవరకు బ్రాహ్మణాదులు ఏడిస్తే(ముగ్గురు) ఒక రోజుతోనే శుద్ధినందుతారు. బట్టలను క్షాళనము (ఉతుకుకొనుట) చేసుకొనుటతో,

సజాతికైతే దివసంతో, క్షత్రియ వైశ్యులకైతే మూడు రాత్రులతో శుద్ధి అని చెప్పారు. సపిండులకై ఏడవటం, వారి శవం మోయటం మొదలగు వాటియందు దోషం లేదు అని ముందు చెప్పాము. విజ్ఞానేశ్వరుడైతే - మృతుని బంధువులతో పాటు ప్రేతను గూర్చి ఏడ్చినాక ఆ అహోరాత్రములు దాన శ్రాద్ధాది కర్మలు లేకుండా ఉండాలి. (చేయొద్దు) అని పారస్కరోక్తి కనుక అంతటా ఒకేరాత్రి అన్నారు. ఇక అశౌచాన్నము తింటే విష్ణువిట్లా - బ్రాహ్మణాదుల ఆశౌచ మందు ఎవరైనా ఒక్కసారైనా అన్నం తింటే వానికి ఆశౌచము వారికి ఆశౌచమున్నంతవరకు. వారికి ఆశౌచం పోతే ప్రాయశ్చిత్తము, అని. (బుద్ధిపూర్వ కమిది). తెలియకపోతే, అంగిరుడిట్లా - సూతకమందు కాని మరణమందుకాని పదిరోజులలోపల, వారి అన్నం తింటే, ఆ అన్నము క్రిందికి పోయేవరకు వీనికి ఆశౌచముంటుంది, అని. ప్రాయశ్చిత్తమైతే, తెలియక ఐతే బ్రాహ్మణునకు వర్ణక్రమంగా ఒక రోజు, మూడు రోజులు, ఐదురోజులు, ఏడు రోజులు ఉపవాసము, పది, ఇరవై, అరవై నూరు ప్రాణాయామములు, పంచగవ్యము భుజించుట. అభ్యాసమైతే రెట్టింపు. ప్రాయశ్చిత్తము ఆపదయందైతే నూరు ప్రాణాయామములు, ఐదువందలు, ఎనిమిది వందలు, ఎనిమిది వేలు, గాయత్రీజపము కూడా. ఆపదయందు, తెలిసి ఐతే సవర్ణాశౌచమందు మూడు సార్లు అఘమర్షణములు, ఎనిమిదివేల గాయత్రిజపము. క్షత్రియాశౌచమందు ఉపవాసము. వైశ్యాశౌచమందు మూడు రాత్రులు ఉపవాసము. శూద్రాశౌచమందు కృచ్ఛ్రము. క్షత్రవైశ్యులకు ఐదునూర్లు, ఎనిమిది నూర్లు గాయత్రీ జపము. ఉత్తములయందు శూద్రునకు అంతట స్నానము. తెలిసి ఆపదలేనప్పుడైతే భోజనమందు విప్రునకు ఇతర వర్ణముల విషయంలో సాంతపన కృచ్ఛ్రమహాసాంతపన, చాంద్రాయణ వ్రతములు ప్రాయశ్చిత్తము. అభ్యాసమందైతే నెల, రెండు నెలలు, మూడు నెలలు, ఆరునెలలు అని మొదలుగా ప్రాయశ్చిత్తమని మాధవీయాదులందు గ్రహించాలి.

**మూ॥ అథదాసస్యస్వ** దాస్యుత్పన్నస్య స్వసపిండమృతౌ స్నానమాత్రేణ స్వామికార్యే స్పృశ్యత్వం. భక్తదాసస్యత్ర్యహోర్ధ్వం. సద్యః స్పృశ్యో గర్భదాసఃభక్తదాసఃత్ర్యహాచ్ఛుచిః, ఇతిస్మృత్యంతరోక్తేః. మూల్యకర్మకరాః శూద్రాదాసీదాసాస్తథైవచ, స్నానే శరీర సంస్కారే గృహకర్మణ్యదూషితాః, ఇతిశాతతపోక్తేశ్చ. ఏతచ్చానన్యసాధ్యే తత్కార్యమాత్రే అన్యత్రమాసాద్యాశౌచమస్త్యేవ. ఏవందాస్యాఅపి. సూతికాయాస్తస్యా అస్పృశ్యత్వమపి మాస మాత్రం. దాసీదాసశ్చ సర్వోవైయస్యవర్ణస్య యోభవేత్. తద్వర్ణస్యభవేచ్ఛౌచందాస్యామాసస్తుసూతకం, ఇత్యంగిరసోక్తేః. షడశీతా వపి - స్వామిశౌచేన దాసాద్యాః స్పృశ్యామాసాత్తు కర్మసు, యోగ్యాః స్యుః మాసతోదాసీసూతి శ్చేత్సుర్మతా మియాత్. దత్త దా సాదీనాం స్వసపిండమరణాదౌస్వామ్యాశౌచ సమసంఖ్యదినోర్ధ్వం సత్యపి మాసాద్యాశౌచే స్వామికార్యేస్పృశ్యతేతిహరదత్తః. దాసాంతేవాసిభృతకాః శిష్యాశ్చై కత్రవాసినః స్వామితుల్యేనశౌచేన శుధ్యంతి మృతసూతకే, ఇతిబృహస్పతి స్మృతేః. దాసాశ్చాత్ర - గృహజాతః

తథాక్రీతో లబ్ధోదాయాదుపాగతః, అన్నాకాల భృతస్తద్వదాహితః, స్వామినాచయః, మోక్షితో మహతశ్చర్ణాత్ యుద్ధప్రాప్తః పణేజితః భక్త దాసశ్చవిజ్ఞేయః తథైవ వడవాహృతః తవాహమిత్యుపగతః ప్రవ్రజ్యావసితఃకృతః విక్రేతా చాత్మనః శాస్త్రేదాసాః పంచదశస్మృతాః, ఇతినారదోక్తేషు గర్భదాసభక్తదాసౌ వినాజ్ఞేయాః, వడవాదాసీ తయాహృతస్తాముద్వాహ్యదాసో జాత ఇత్యర్థః అన్తే వాస్యపితేనైవోక్తేః. స్వశిల్ప మిచ్ఛన్నాహర్తుం బాంధవానామనుజ్ఞయా, ఆచార్యస్యవసేదంతే కృత్వాకాలంతునిశ్చితం. ఆచార్యః శిక్షయేదేనం స్వగృహేదత్త భోజనం, ఇతి. శిష్యస్తత్తుల్యోవిద్యార్థీ. దాసాదేః స్వామితత్సపిండ మరణేతు విష్ణుః - పత్నీనాందాసానాం అనులోమ్యేన స్వామితుల్య మాశౌచం. మృతే స్వామిన్యాత్మీయం, ఇతి.

అను॥ ఇక దాసునకు తన దాసియందు పుట్టినవానికి తనసపిండుడు మరణిస్తే స్నానమాత్రంతో స్వామికార్యమందు స్పృశ్యత్వము. భక్తదాసునకైతే మూడు రోజుల పిదప స్పృశ్యత. గర్భదాసుడు సద్యః స్పృశించగలిగినవాడు, భక్తదాసుడు మూడురోజుల తరువాత శుచిఔతాడు, అని స్మృత్యంతరమందు చెప్పబడింది. మూల్యం తీసుకొని పనిచేసే శూద్రులు, దాసిదాసులు స్నానమందు, శరీరసంస్కారమందు, గృహకర్మయందు దూషితులు కారు, అని శాతాతపుడన్నాడు. ఇది, ఇతరులవల్ల కాకపోతే, ఆ ఆపనియందు మాత్రమే. వేరే చోట మాత్రం మాసాది ఆశౌచము ఉండనే ఉంది. ఈ రకంగా దాసికి కూడా. సూతికయైన దాసికి అస్పృశ్యత కూడా మాసమాత్రమే. దాసి, దాసులు అందరూ ఎవడు ఏ వర్ణంవాడో ఆ వర్ణునకు ఆ వర్ణాశౌచమే వస్తుంది. దాసి కైతే మాసం సూతకము, అని అంగిరసోక్తి. షడశీతియందు కూడా - స్వామిశౌచంతో దాసాదులు స్పృశ్యులౌతారు. స్వామి అశుచియైతే దాసాదులు కర్మలందు మాసం తరువాత స్పృశ్యులౌతారు. యోగ్యులౌతారు. దాసి, సూతికఐతే మాసంతో స్పర్శయోగ్యురాలౌతుంది, అని. దత్తదాసులకు (ఇవ్వబడిన క్రీత) తమ, సపిండుల మరణాదులందు, తమ స్వామికి ఆశౌచం ఎన్నిరోజులో అన్ని రోజులతో సమానమైన సంఖ్యగల దినముల తరువాత, మాసాది ఆశౌచము ఉన్నా, స్వామి కార్యమందు స్పృశ్యత అని హరదత్తుడన్నాడు. దాస, అంతే వాసి, భృతకులు, శిష్యులు, ఒకేచోట ఉండేవారు జనన మృతసూతకమందు స్వామికితుల్యమైన ఆశౌచంతో శుద్ధులౌతారు, అని. బృహస్పతిస్మృతి. ఇక్కడ దాసులు ఇట్లా - గృహజాతుడు (తన దాసికి కల్గినవాడు) క్రీతుడు, లబ్ధుడు (ప్రతిగ్రహంవల్ల) దాయాదుల (విభాగంవల్ల) ఉపగతుడు (ప్రాప్తుడు) అన్నములేక దుర్భిక్షం వల్ల దాసుడుగా వస్తే భృతుడు, డబ్బు క్రింద తనను అప్పగించుకున్నవాడు, (స్వామి చేర్చుకున్నవాడు) గొప్పఋణం నుండి విడిపింపబడ్డవాడు, యుద్ధంవల్ల వచ్చినవాడు, పణమందు గెలువబడ్డవాడు, భుక్తమునకై దాసుడైనవాడు, బ్రాహ్మణదాసికి (తనవల్ల వివాహంతో)పుట్టినదాసుడు, నీవాణ్ణని చేరిన దాసుడు,సన్యాసం నుండి చ్యుతుడై

దాసుడైనవాడు, జీతగాడు, ఆత్మవిక్రేత ఈ రకంగా శాస్త్రమందు దాసులుగా పదిహేనుమంది చెప్పబడ్డారు, అని నారదుడు చెప్పిన వానిలో గర్భదాస, భక్తదాసులను వదలి మిగిలిన వారిని గ్రహించాలి వడవాదాసి, ఆమెను హరించి, వివాహమాడి దాసుడైనాడు అని అర్థము. అంతే వాసినికూడా ఆతడే చెప్పాడు. బంధువుల అనుజ్ఞతో, శిల్పాన్ని (కళానైపుణ్యాన్ని) నేర్చుకోవాలనే ఇచ్ఛతో, కొంతకాలాన్ని నిశ్చయించుకొని, ఆచార్యుని దగ్గర ఉంటాడు. ఆచార్యుడు తన ఇంట్లో భోజనం పెట్టి ఈతనికి శిక్షణ ఇస్తాడు, అని. శిష్యుడనగా అటువంటి విద్యార్థి. దాసాదులకు, స్వామి, అతని సపిండుల మరణమందు విష్ణువిట్లా - పత్నులకు, దాసులకు (పద్ధతి ప్రకారం) ఆనులోమంగా, స్వామితో సమానంగా ఆశౌచము స్వామి మరణమందు తమ జాతి ఆశౌచము, అని.

మూ॥ ప్రతిలోమదాసానాం ఆశౌచాభావః వర్ణానామానులోమ్యేన, దాస్యంన ప్రతిలోమతః ఇతి యాజ్ఞవల్క్యోక్తేః. **అర్థరాత్రౌ** జననేమరణేవా రాత్రిం త్రిభాగాంకృత్వాఽద్యభాగద్వయే చేత్పూర్వదినం, అన్త్యేతూత్తరమితి మితాక్షరాయాం. యత్తు ప్రాగర్థ రాత్రాత్ ప్రాగ్వా సూర్యోదయాత్పూర్వం దినమిత్యుక్తం తత్ర తత్తద్దేశాచారతో వ్యవస్థా. సర్వమాశౌచమాహితాగ్నేర్దాహం తద్భిన్నస్య మరణమారభ్యజ్ఞేయం. **అనగ్నిమతఉత్క్రాంతే** రాశౌచాది ద్విజాతిషు, దాహాదగ్నిమతో విద్యాద్విదేశస్థే మృతే సతి, ఇతి. పైఠీనసి స్మృతేః. సాగ్నిరాహితాగ్నిః. ఆహితాగ్నిశ్చేత్ప్రవసన్మ్రియేత పునఃసంస్కారం కృత్వాశవవదాశౌచం ఇతి వసిష్ఠే విశేషోక్తేః. దాహాదేవతు కర్తవ్యం యస్య వైతానికోవిధిః, ఇతి బ్రాహ్మేచ్చ. యత్తుధూర్త స్వామినా రామాండారేణచోక్తం - ఆహితాగ్నేరపి మరణాద్యేవ దశరాత్రం, దశాహంశావ మాశౌచం ఇతిమరణ నిమిత్త త్వాత్తస్య. యత్తు దాహాదేవ తస్యాశౌచముక్తం. తత్సంస్కారనిమిత్తాశౌచం పృథగేవ. తేనగృహ్యాగ్నేః సంస్కారాంగం త్రిరాత్రం. శ్రౌతాగ్నేస్తు దశరాత్రం. మరణ నిమిత్తం తూభయోః దశాహం దాహాత్ప్రాగపీతి. తద్వచన విరోధా త్పూర్వ స్యైవోత్కర్షాన్మూలకల్పనా లాఘువాచ్చింత్యం. అథ అతిక్రాంతాశౌచం. తత్రాశౌచమధ్యే జననాద్యౌజ్ఞాతే తచ్ఛేషేణ శుద్ధిః. విగతంతు విదేశస్థం శృణుయాద్యోహ్యనిర్దశం, యచ్ఛేషం దశరాత్రస్యతావదేవాశుచిర్భవేత్, ఇతి మనూక్తేః. అత్రకేచిత్ ఏతత్పుత్రాతిరిక్తవిషయం తేషాంత్వా శౌచమధ్యేశ్రవణేఽపి తదాద్యేవ దశాహాది. పితరౌచేన్మృతౌస్యాతాందూరస్థోఽపిహిపుత్రకః, శ్రుత్వాతద్దిన మారభ్యదశాహంసూతకీభవేత్, ఇత్యన్యసర్వాపవాదత్వాదిత్యాహుః, తన్న, జ్ఞాతమరణస్యనిమిత్తత్వాత్, అనగ్నిమత ఉత్క్రాంతేః, ఇత్యాదివిరోధాచ్చ. స్మృత్యర్థసారేఽపి - జననే మరణే వా ప్రథమ దినాదూర్ధ్వం జ్ఞాతే పుత్రాదీనాం శేషేణైవశుద్ధిః, ఇతి. షడశీతావ పరార్కేచైవం. **దశాహాదూర్ధ్వంజ్ఞాతేతు** వృద్ధ వసిష్ఠః - మాసత్రయేత్రిరాత్రంస్యాత్ షణ్మాసేపక్షిణీతథా అహస్తునవమాదర్వాగూర్ధ్వం స్నానేనశుద్ధ్యతి.

అను॥ ప్రతి లోమ దాసులకైతే ఆశౌచం లేదు. వర్ణములకు ఆనులోమ్యంగా దాస్యము, ప్రతిలోమంగా కాదు అని యాజ్ఞవల్క్యోక్తి. (అనులోమం, అనుక్రమం = తండ్రి

ఉత్తమ వర్ణం తల్లి అతనికన్న హీనవర్ణ (దాస్యం). ప్రతిలోమం = తండ్రి హీన వర్ణం తల్లి అతనికన్న ఉత్తమ వర్ణ ఐతే దాస్యం లేదు). ఇక రాత్రియందు జననమైనా మరణమైనా, రాత్రిని మూడుభాగాలు చేస్తే తొలి రెండు భాగాలందైతే పూర్వదినము, చివరియందైతే తరువాతి దినమని మితాక్షర యందు కలదు. ఇట్లా అర్ధరాత్రి కన్న ముందు, లేదా సూర్యోదయం కన్న ముందైనా జననమరణములందు పూర్వదినమని ఏదన్నారో అది అక్కడ ఆదేశాచారమునసనుసరించి నిర్ణయము. ఇక్కడ ఆశౌచమంతా ఆహితాగ్నికి దాహం నుండి (దహనం) ఆరంభము. ఇతరులకు మరణం నుండి ఆరంభమని గ్రహించాలి. ద్విజాతులందు అగ్నిహోత్రంలేని వారికి మరణం నుండే ఆశౌచాదులు. అగ్నిహోత్రి విదేశమందు మరణమైతే దాహం నుండే ఆశౌచము, అని పైఠీనసి స్మృతి. సాగ్ని అనగా ఆహితాగ్ని. ఆహితాగ్ని ప్రవాసమందు మరణిస్తే, తిరిగి సంస్కారం చేసి, శవం వలె ఆశౌచము, అని వసిష్ఠుడు విశేషించి చెప్పాడు. ఎవనికి వైతానిక విధి ఉందో (మూడగ్నుల విధి) వానికి దాహం నుండే ఆశౌచం ఆచరించాలి, అని బ్రాహ్మోక్తి. ధూర్తస్వామి రామాండారుదు ఇట్లా – ఆహితాగ్నికి కూడా మరణం నుండే పదిరాత్రులు, పదిరాత్రులు శవాశౌచము, అని దానికి మరణం నిమిత్తము కనుక, అని ఏదన్నారో, దాహంనుండే ఆతనికి ఆశౌచము అని ఏది చెప్పబడిందో అది సంస్కార నిమిత్తాశౌచము, వేరే కర్మ. అందువల్ల గృహ్యాగ్నికి సంస్కారాంగముగా త్రిరాత్రము ఆశౌచము ఉంటుంది. శ్రౌతాగ్నికైతే దశరాత్రమాశౌచము. మరణనిమిత్తమైనదైతే ఇద్దరికి దశాహము ఆశౌచము దాహం కన్న ముందు కూడా అని. అది వచన విరోధమైనందువల్ల (హారీతునకు) పూర్వమైన దానికే (మరణ నిమిత్తానికే) ఉత్కర్ష ఉన్నందువల్ల మూలకల్పన లాఘవమైనందువల్ల, ఆలోచించాలి. ఇక అతి క్రాంతా (గడచిన) శౌచము (అశౌచం మధ్య జననం తెలిస్తే, దేశాంతరమందు అతి క్రాంతా శౌచమందు, పదిరోజులమధ్య వింటేనూ చర్చ). అక్కడ ఆశౌచమధ్యమందు జననాదులు తెలిస్తే శేషంతో శుద్ధి అని. విదేశమందుండి మరణించిన, వాని వార్తను పదిరోజులు గడవకముందే వింటే వానికి పది రాత్రులకు ఇంకా ఎంత ఆశౌచం మిగిలి ఉంటే, అన్ని రోజులే ఆశౌచము, అని మనూక్తి(జననమందు ఇదే రీతి). ఇక్కడ కొందరు ఇది పుత్రునకన్న ఇతరమైన వాని విషయము. వారికైతే ఆశౌచమధ్యమందు విన్నా ఆ రోజునుండే పదిరాత్రులు మొదలగునవి. తలిదండ్రులు మరణిస్తే, పుత్రుడు దూరంగా ఉంటే, మరణవార్త విన్నాక ఆ రోజు మొదలు పదిరోజులు సూతకుడౌతాడు, అని. ఇది అన్నిటికి అపవాదము అని ఏది అన్నారో అది కాదు. మరణం తెలియటమే నిమిత్తము ఆశౌచానికి. అనగ్నిహోత్రికి మరణం నుండి, అని మొదలగుదానికి విరుద్ధమౌతుంది కూడా. స్మృత్యర్థసారమందు కూడా – జననమందు కాని లేదా మరణమందు కాని, తొలిరోజు తరువాత పుత్రాదులకు తెలిస్తే మిగిలిన రోజులతోనే శుద్ధి, అని. షడశీతి యందు, అపరార్కమందును ఇట్లాగే.

పదిరోజుల తరువాత తెలిస్తే వృద్ధ వసిష్ఠుడిట్లా - మూడునెలలలోపైతే త్రిరాత్రము ఆరునెలలలోపలైతే పక్షిణీ, తొమ్మిది నెలలలోపైతే ఒకరోజు, ఆపైన ఐతే స్నానంతో శుద్ధి, అని (జన్మమందు అతిక్రాంతాశౌచం లేదు).

**మూ॥ జననేతు అతిక్రాంతా** శౌచంనాస్త్యేవ. నాశుద్ధిః ప్రసవాశౌచేవ్యతీతేషుదినేష్వపి, ఇతిదేవలోక్తేః. పితుఃస్నానంతత్రాపిభవత్యేవ. నిర్దశం జ్ఞాతిమరణం శ్రుత్వా పుత్రస్యజన్మచ, సవాసాజలమాప్లుత్యశుద్ధోభవతిమానవః, ఇతి మనూక్తేః. తచ్చాతిక్రాంతాశౌచం దశాహాదిజాత్యాశౌచ విషయం నత్వనుపనీతాది నిమిత్తత్రిరాత్రాదౌ. ఉపనీతేతు విషయం తస్మిన్నేవాతికాలజం, ఇతి వ్యాఘ్రోక్తేః. నిర్దశం జ్ఞాతిమరణం, అతిక్రాంతేదశాహేతు, ఇతి మనూక్తేశ్చ. మాధవీయే దేవలస్తు - ఆత్రిపక్షాత్ త్రిరాత్రం స్యాత్ షణ్మాసాత్పక్షిణీతతః, పరమేకాహమావర్షాత్ ఊర్ధ్వం స్నాతో విశుధ్యతి, ఇత్యాహ. తత్రాపదనాపద్విషయత్వేన వ్యవస్థా. ఇదంచైకదేశే. **దేశాంతరేతు స్నానమాత్రం** దేశాంతరమృతంశ్రుత్వాక్లీబే వైఖానసే యతౌ, మృతేస్నానేన శుద్ధ్యంతి గర్భస్రావేచ గోత్రిణః, ఇతి పరాశరోక్తే రితి, విజ్ఞానేశ్వరః. స్నానంవత్సరాంతే. అర్వాక్త్రిపక్షాత్ త్రినిశంషణ్మా సాచ్చదివానిశం, అహఃసంవత్సరాదర్వాగ్దేశాంతరమృతేష్వపి. ఇతి విష్ణూక్తేరితి మాధవః. ఇదం సపిండానాం దేశాంతరే స్నానం సోదకానామితియుక్తం. **తల్లక్షణంత్వాహ బృహస్పతిః.** - మహానద్యంతరం యత్ర గిరిర్వావ్యవధాయకః, వాచోయత్రవిభిద్యంతే తద్దేశాంతర ముచ్యతే. దేశాంతరం వదంత్యేకే షష్టి యోజనమాయతం, చత్వారింశద్వదంత్యన్యే త్రింశదన్యేతథైవచ, ఇతి. ఏతత్సర్వం మాతాపితృభిన్న విషయం, తయోస్తు, పితరౌచేత్, ఇతిపూర్వ పైఠీనసి వాక్యాత్ సదాపూర్ణమేవ దశాహాది. స్మృత్యర్థసారేఽపి - మాతాపితృమరణే దూరదేశేఽపి సంవత్సరోర్ధ్వమపి పుత్రోదశాహాదికం పూర్ణమాశౌచం కుర్యాత్, స్త్రీపుంసయోః పరస్పరం సపత్నీషుచైవమితి. శుద్ధి తత్వాదయోగౌడాస్తు - ఊర్ధ్వం సంవత్సరాదాద్యాత్ బంధుశ్చేత్ శ్రూయతేమృతః, భవేదేకాహమేవాత్ర తచ్చసన్యాసినాం నతు. ఇతి దేవలోక్తేః పిత్రోరబ్దమధ్యే త్రిరాత్ర మూర్ధ్వమేకాహః, బంధుర్మాతాపితా భర్తాచ, పూర్వోక్తదశాహస్తు కలింగాదిదేశపర ఇత్యాహుః. తే బంధుపదస్య పిత్రాదిపరత్వే మానాభావాత్ ఉపేక్ష్యాః. **సాపత్న్యమాతుస్తు దక్షః** - పితృపత్న్యామపేతాయాం మాతృవర్జ్యం ద్విజోత్తమాః. సంవత్సరేవ్యతీతేఽపి త్రిరాత్రమశుచిర్భవేత్. హీనవర్ణమాతృషు సపత్నీషుచైవం, ఇతిస్మృత్యర్థసారే.

అను॥ జననమందైతే అతిక్రాంతాశౌచము లేదు. ప్రసవాశౌచమందు, ఆశౌచము రోజులు గడిచిపోతే, ఆపై అశుద్ధి లేదు. అక్కడ కూడా తండ్రికి స్నానం ఉండనే ఉంటుంది. (స్నానం చేయాలి). పుత్రజన్మను అట్లాగే జ్ఞాతి మరణమును పదిరోజులలో వింటే, సచేల స్నానమాచరిస్తే నరుడు శుద్ధుడౌతాడు, అని మనూక్తి. అది ఆశౌచం ఐపోయిన విషయం. దశాహం మొదలైనది జాత్యాశౌచ విషయము. అనుపనీతాది నిమిత్తమైన త్రిరాత్రాదుల విషయం కాదు. ఉపనీతుని విషయమందైతే విషమము (ఆశౌచముంటుంది). దానియందే, అతికాలజ ఆశౌచము ఉంటుంది. అని వ్యాఘ్రోక్తి. నిర్దశం జ్ఞాతి మరణం, అతి క్రాంతే దశాహేతు, (పదిరోజులు గడిచాక జ్ఞాతి మరణంవింటే, ఆశౌచం పదిరోజులు కాదు) అని

మనూక్తి కూడా. మాధవీయమందు దేవలుడిట్లా – మూడు పక్షముల వరకు త్రిరాత్రాశౌచము, ఆరుమాసముల వరకు పక్షిణి ఆశౌచము ఆపై సంవత్సరం వరకు ఒక దినము ఆశౌచము. సంవత్సరం తరువాత స్నానంతో శుద్ధి, అని అన్నాడు. ఇక్కడ ఆపదయందు, ఆపద లేకపోవటం వీటిననుసరించి నియమము, ఇది ఒక దేశమందు. దేశాంతరమందైతే స్నానము మాత్రమే (ఉదకదానంచ) క్లీబుడు, వైఖానసుడు, యతివీరలు దేశాంతరమందు మరణిస్తే, ఆ మరణవార్తను విన్నాక, గర్భస్రావము వార్త విన్నాకను గోత్రీకులు స్నానంతో శుద్ధినందుతారు. అని పరాశరోక్తి అని విజ్ఞానేశ్వరుడన్నాడు. స్నానము వత్సరాంతమందు అని. మూడు పక్షములకన్న ముందు తెలిస్తే మూడు రాత్రులు, ఆరు నెలలలోపలైతే రాత్రి పగలు, సంవత్సరం కన్న ముందైతే పగలు ఆశౌచము దేశాంతరమందు మరణించినవారి విషయంలోనైనా అని విష్ణూక్తి అని మాధవుడన్నాడు. ఇది సపిండులకు. దేశాంతరమందైతే, స్నానం, సోదకులకు అనుట యుక్తము అని. ఆ లక్షణాన్ని బృహస్పతి ఇట్లా – మహానదులు మధ్యలో ఉంటే, రెండు ప్రాంతాల మధ్య పర్వతాలు అడ్డైతే, భాష ఏ రెండు ప్రాంతాల మధ్యమారితే, అది దేశాంతరమనబడుతుంది, అని. దేశాంతరమంటే అరవై యోజనముల దూరమన్నారు కొందరు. ఇంకొందరు నలభై యోజనములు అన్నారు. కొందరు అట్లాగే ముప్పైయోజనములన్నారు, అని. పైదంతా మాతాపితరులకన్న ఇతరులైన వారి విషయము. వారికైతే, పితరులైతే, అని ముందు చెప్పిన పైఠీనసి వాక్యాన్ననుసరించి, ఎప్పుడూ దశాహాదులు పూర్ణమే(నిండుగా) అని. స్మృత్యర్థసారమందు కూడా – మాతాపితృమరణ మందు దూరదేశమందున్నా, సంవత్సరముగడచిపోయినా పుత్రుడు దశాహం ఆదిగా పూర్ణముగా ఆశౌచం పాటించాలి. స్త్రీ పురుషులకు పరస్పరము. సపత్నులందును ఇట్లాగే అని. శుద్ధి తత్వాదులు గౌడులైతే ఇట్లా – మొదటి సంవత్సరం తరువాత బంధువు మరణించినాడని తెలిస్తే ఒకరోజే ఇక్కడ ఆశౌచముంటుంది. అది కూడా సన్యాసులకు లేదు, అనే దేవలోక్తిననుసరించి పితరులకు అబ్దమధ్యమందైతే త్రిరాత్రా శౌచము, ఆపైన ఒకరోజు ఆశౌచము. బంధువులనగా మాత, పిత, భర్త వీరు బంధువులు అని. ముందు చెప్పిన పదిరాత్రుల విషయము కళింగాది దేశపరము, అని అన్నారు. ఆ వచనములు ఉపేక్షించ(విడువ)తగినవి, ఎందువల్లనంటే బంధుపదమునకు పిత్రాదులు అర్థము అనటంలో ప్రమాణం లేదు కనుక. సవతితల్లి విషయంలోనైతే దక్షుడిట్లా – తండ్రి భార్యలు, తల్లి తప్ప ఇతరులు (సవతి తల్లులు) మరణిస్తే, ఓ ద్విజులారా! సంవత్సరం గడిచినా, మూడు రాత్రులు ఆశౌచము ఉంటుంది. పుత్రునకు, అని. మాతలు హీనవర్ణలైనా, సవతితల్లులైతే ఇట్లా, అని స్మృత్యర్థసారమందు కలదు.

**మూ॥ కేచిత్ – పితుఃపత్న్యాం ప్రమీతాయాం ఔరసేతనయే తథా ఇతి బ్రాహ్మోక్తే స్త్వైరసేఽపీదమాహుః. షడశీతావప్యేవం. ఏతత్సర్వవర్ణతుల్యం. తుల్యంవయసి సర్వేషామతిక్రాంతేతథైవచ, ఇతి వ్యాఘ్రోక్తేః. అథాశౌచ సంపాతే ఉచ్యతే. తత్రశావే శావం.**

సూతకే, సూతకం. శావే సూతకం, సూతకే శావం వా తత్రాప్యుత్తరం కాలతః పూర్వేణ సమం స్న్యూనమధికం చేతి ద్వాదశభేదాః యద్యైకదినే సమ న్యూనమధికం వాఽశౌచద్వయం. తత్ర తంత్రేణాన్యసిద్ధిః, ద్వయోరేకకాలత్వాత్. యదాతుద్వితీయాదిదినే షూత్తరం సజాతీయం శావే జననంవా సమకాలం న్యూనకాలంవా పరంస్యాత్తదాషట్సు పక్షేషు పూర్వశేషేణ శుద్ధిః. అంతరాజన్మమరణే శేషాహోభిః విశుద్ధ్యతి, ఇతి యాజ్ఞవల్క్యోక్తేః అంతరాజ్ఞాతే ఇత్యర్థం. జ్ఞాతస్యైవ జననాదేః నిమిత్తత్వాత్ పూర్వాశౌచోత్తరం తన్మధ్యోత్పన్నే జ్ఞాతేతూత్తరమేవ కార్యం శుద్ధితత్త్వేఽప్యుక్తం పూర్వాశౌచాం తరుత్పన్నం సమానం లఘువా నిమిత్తం తత్కాలాదుపరిశ్రుతం స్వాశౌచ హేతురేవ. అజ్ఞాతంతున. అవిజ్ఞాతే, నదోషః స్యాచ్ఛ్రాద్ధాదిషు కథంచన, ఇత్యస్యాశౌచ సాంకర్యేఽపి ప్రవృత్తేః తేనా జ్ఞానాత్ వృషోత్సర్గాదౌకృతే పశ్చాత్ జ్ఞాతేఽపి నావృత్తిరితి. మాధవీయేయమోఽపి - జననే జననంచేత్ స్యాన్మరణే మరణం తథా పూర్వశేషేణశుద్ధిః స్యాదుత్తరాశౌచవర్జనం. అత్రకేచిత్ - అంతర్దశాహే స్యాతాం చేత్పునర్మరణ జన్మనీ, తావత్స్యాదశుచిర్విప్రోయావత్త త్స్యాదనిర్దశమితి మనుః. పరాశరాద్యైః దశాహ గ్రహణాత్ పూర్ణాశౌచే ఏవ పూర్వ శేషేణశుద్ధిః. త్ర్యహాద్యల్పాశౌచ సంపాతేతూత్తరేణైవ శుద్ధిరిత్యాహుః. హరదత్తోఽప్యేవమాహ గౌడా అప్యేవం. తన్న. యాజ్ఞవల్క్యాదివశేన దశాహస్య తుల్యకాలాశౌచో పలక్షణత్వాత్. సమానాశౌచ సంపాతే ప్రథమేన సమాపయేత్. అసమానం ద్వితీయేన ధర్మరాజవచో యథా, ఇతిమాధవీయే శంఖోక్తేః. అపరార్కమితాక్షరాదివిరోధాచ్చ యదాతు సూతకే శావం సమంన్యూనమధికంవా తదా నపూర్వశేషాచ్ఛుద్ధిః. తదాహాంగిరాః - సూతకేమృతకం చేత్స్యాత్ మృతకేత్వథసూతకం, తత్రాధికృత్యమృతకం శావం కుర్యాన్నసూతకం. షట్త్రింశన్మతే - శావా శౌచేసముత్పన్నే సూతకంతు యదాభవేత్, శావేన శుద్ధ్యతే సూతీ న సూతీశావశోధినీ. చతుర్వింశతి మతేఽపి - మృతేనశుద్ధ్యతే జాతం నమృతం జాతకేనతు. అతోయదాదశాహజననమధ్యేతదంతే వాత్ర్యహాది శావం తదా పూర్వేణ శుద్ధావపి తన్నిమిత్తమస్పృశ్యత్వం భవత్యేవ. మరణోత్పత్తి యోగేతుగరీయో మరణంభవేత్, ఇతికౌర్మాచ్చ. గౌతమవ్యాఖ్యాయాం వృద్ధాత్రిరపి - సూతకాత్ ద్విగుణం శావం శావాత్ ద్విగుణమార్తవం, ఆర్తవాత్ ద్విగుణాసూతిః తతోఽపి శవదాహకః. అత్రపూర్వ పూర్వేణ నోత్తరోత్తర నివృత్తి రస్పృశ్యత్వాధిక్యా దిత్యర్థః. షడశీతావపి - స్వభావ బహుసూతిస్తున్యూనశావవిశోధినీ, ఇతి. రాత్రి శేషాదౌ వర్ధితద్విత్రిదినై రాగంతుకైః సూతే ర్బహుత్వం నస్వభావేన. అతస్తత్ర న్యూనశావస్యాపిన పూర్వేణశుద్ధిరితివక్తుం స్వభావే త్యుక్తం. బ్రాహ్మేఽపి - నాగంతుకై రథాహోభిః ఆశౌచమపనుద్యతే, నచ పాతనిమిత్తేన శావస్యాన్యస్యశోధనం, ఇతి. ఏవం నవపక్షాః యదాతుత్ర్యహాద్యల్పాశౌచమధ్యే సజాతీయం విజాతీయం వా దీర్ఘకాల ముత్తరం తదాప్యుత్తరం పూర్ణం కార్యం నపూర్వేణ శుద్ధిః.

అను ॥ కొందరిట్లా - తండ్రి భార్య మరణిస్తే (సవతితల్లి) ఔరసతనయునకు అట్లాగే ఆశౌచము అని బ్రాహ్మోక్తి ఉన్నందువల్ల ఔరసునియందు కూడా ఇది వర్తిస్తుంది అని అన్నారు(త్రిరాత్రం), షడశీతియందుకూడా ఇట్లాగే ఉంది. ఇది అన్ని వర్ణముల వారికి తుల్యము అతిక్రాంత దశాహాది ఆశౌచము అన్ని వర్ణముల వారికి తుల్యము. దంతములు

వచ్చేవరకు సద్యఃశుచి అని ఏది విధించారో (త్రివర్షాది రూపమందు ఆశౌచం వచ్చినప్పుడు) అది అన్ని వర్ణములకు సమానము, అని వ్యాఘ్రోక్తి. అతిక్రాంతే తుల్యే వయసి సర్వేషాం తుల్యం. ఇక ఆశౌచ సంపాతమందు చెప్తున్నాడు. (రెండు ఆశౌచములు ఒకేసారి వస్తే అని) మరణమందు మరో మరణాశౌచము, సూతకమందు మరోసూతకాశౌచము, మరణా శౌచ మందు సూతకాశౌచము సూతకమందు మరణాశౌచము కాని. (సూతకం = జనన సంబంధి). అక్కడ కూడా ఉత్తరమైనది (తరువాతది) కాలదృష్ట్యా పూర్వమైన దానితో సమం కాని తక్కువ కాని అధికం కాని ఐనది అని పన్నెండు రకములు. ఒక దినమందు సమ, న్యూన, అధికములలో ఏవైనా రెండు ఆశౌచాలు వస్తే అక్కడ తంత్రంతో అన్యమైనది సిద్ధిస్తుంది. రెండు ఒకే కాలమువి ఐనందువల్ల. ఒకవేళ ద్వితీయాది దినములందు ఉత్తరమైన సజాతీయమైన శావమందు సమకాలమో న్యూనకాలమో ఐన జననాశౌచం వస్తే అప్పుడు ఆరు పక్షములందు పరమైనది ఔతుంది. పూర్వమైన దానికి, శేషంతో శుద్ధి అని(పూర్వాశౌచ కాలశేషం). ఒక ఆశౌచం మధ్యలో జన్మసంబంధో మరణ సంబంధో మరో ఆశౌచం వస్తే మొదటిది మిగిలినరోజులతో శుద్ధి, అని. యాజ్ఞవల్క్యోక్తి. మధ్యలో తెలిస్తే అని అర్థము జననాదులలో తెలిసిన దానికే నిమిత్తత్వము పూర్వాశౌచం తరువాత దాని మధ్యలో ఉత్పన్నమైతే (జననం) తెలిస్తే మాత్రం ఉత్తరమైనదే ఆచరించాలి. శుద్ధితత్వంలో కూడా చెప్పబడింది. ఇట్లా మొదటి ఆశౌచం మధ్యలో జనన సంబంధి (కల్గిన) సమానమైన లేదా అల్పమైన కారణంగల ఆశౌచము ఆ కాలం తరువాత విన్నట్లైతే అది తనకు ఆశౌచ హేతువే. తెలియకపోతే మాత్రం కారణం కాదు. తెలియకపోతే శ్రాద్ధాదులలో ఏ విధంగానూ దోషకారి కాదు, అని దీనికి ఆశౌచ సాంకర్యమందును (మిశ్రణం) ప్రవృత్తి. అందువల్ల తెలియక వృషోత్సర్గాదులు చేసినా తరువాత తెలిసినా ఆవృత్తి లేదు, అని. మాధవీయమందు యముడు కూడా – జననమందు మరో జన నాశౌచం, మరణమందు మరో మరణాశౌచము వస్తే పూర్వశేషంతోనే శుద్ధి. ఉత్తర ఆశౌచము ఉండదు, అని. ఇక్కడ కొందరు – పదిరోజుల ఆశౌచం మధ్యలో తిరిగి జన్మసంబంధో మరణ సంబంధో ఆశౌచం వస్తే విప్రునకు ఆశౌచం ఎంతవరకంటే, మొదటి పదిరోజులు కానంతవరకే, అని మనువు, పరాశరుడు మొదలగు వారు పదిరోజులు గ్రహించినందువల్ల. పూర్ణాశౌచమైతేనే పూర్వశేషంతో శుద్ధి. మూడు రోజులు మొదలుగా అల్ప ఆశౌచం సంభవిస్తేనో ఉత్తరంతోనే శుద్ధి అని అన్నారు. హరదత్తుడు కూడా ఇట్లాగే అన్నాడు. గౌడులు కూడా ఇట్లాగే అన్నారు. అంటే అట్లా కాదు. యాజ్ఞవల్క్యాదుల వశం గానైతే (అనుసరించి) దశాహమునకు సమానకాల ఆశౌచము ఉపలక్షణము. సమానాశౌచం వస్తే తొలిదానితోనే ముగించాలి. అసమానమైతే రెండవదాని (ఆశౌచం)తో అని ధర్మరాజు వచనము ప్రకారము, అని మాధవీయమందు శంఖోక్తి. అపరార్క మితాక్షరాదులకు విరుద్ధమైంది కూడా. సూతకమందు, మరణాశౌచము సమమో,

న్యూనమో, అధికమో వస్తే అప్పుడు పూర్వశేషంతో శుద్ధి కాదు. దానినే అంగిరుడిట్లా - సూతకమందు మృతాశౌచం వస్తే మృతాశౌచమందు జననాశౌచం వస్తే అక్కడ మృతాశౌచమునకు ఆధిక్యత కల్పించి శావాశౌచమాచరించాలి, జననాశౌచమాచరించరాదు, అని. షట్త్రింశన్మతమందిట్లా - శావాశౌచమందు జననాశౌచం వస్తే, జననాశౌచము శావాశౌచంతో (పాటే పోతుంది.) శుద్ధమౌతుంది. జననాశౌచము, శావాశౌచాన్ని శుద్ధిపరచదు, అని. చతుర్వింశతిమతమందు కూడా - జననాశౌచము, మరణాశౌచంతో శుద్ధమౌతుంది. జననాశౌచంతో మరణాశౌచశుద్ధికాదు. అందువల్ల పదిరోజుల జనానాశౌచం మధ్యలో, లేదా చివరనో మూడు రోజులు మొదలుగా మరణాశౌచం వస్తే అప్పుడు పూర్వంతో(శేషం) శుద్ధి ఐనా, దాని నిమిత్తమైన అస్పృశ్యత్వం ఉండనే ఉంటుంది, అని. మరణ, జననముల యోగంలో మరణం గరీయమైంది, అని కూర్మోక్తి. గౌతమ వ్యాఖ్యయందు వృద్ధాత్రి కూడా - సూతకం కన్న (సద్యఃప్రసూత) రెట్టింపు దోషం మరణాశౌచమందు, దానికన్నా రెట్టింపు ఆర్తవం, దాని కన్న రెట్టింపు సూతి. దానికన్నను దోషమైనది శవదాహము, అని. ఇక్కడ పూర్వ పూర్వంతో ఉత్తరోత్తర నిర్వృత్తి కాదు. అస్పృశ్యతాదోషం అధికంగా ఉంది కనుక, అని అర్థము. షడశీతియందు కూడా - స్వభావబహుసూతి ఐతే న్యూనమృతాశౌచాన్ని శుద్ధి చేస్తుంది. రాత్రి శేషాదులందు, పెరిగిన రెండు మూడు రోజుల రాకతో సూతియందు బహుత్వము. స్వభావంతో కాదు అందువల్ల అక్కడ న్యూనశావాశౌచాని కైనా పూర్వంతో శుద్ధిలేదు అని చెప్పుటకు స్వభావమని చెప్పారు. బ్రాహ్మమందు కూడా - ఆగంతుకములైన దినములతో ఆశౌచం పోదు. పాత(క) నిమిత్తం వల్ల శావాశౌచము మరొక ఆశౌచాన్ని శుద్ధి చేయదు, అని. (మరొకదానితో శుద్ధి కాదు). ఈ రకంగా తొమ్మిది పక్షాలు. మూడు రోజులు ఆదిగాగల అల్పాశౌచమధ్య మందు సజాతీయమో విజాతీయమో దీర్ఘకాలికమైన ఉత్తరభాగం కల ఆశౌచం వస్తే అప్పుడైనా ఉత్తరం పూర్ణంగా చేయాలి పూర్వశేషంతో శుద్ధికాదు, అని.

**మూ॥ స్వల్పాశౌచమధ్యేతు** దీర్ఘాశౌచం భవేద్యది, నపూర్వేణ విశుద్ధిః స్యాత్స్వకాలేనైవ **శుద్ధ్యతి, ఇతి ఉశనసోక్తేః. తేనత్ర్యహాది శావమధ్యే దశాహాది సూతకేఽపి నపూర్వేణ శుద్ధిరిత్యపరార్కః శావనిమిత్తమస్పృశ్యత్వంచభవత్యేవ. శుద్ధివివేకేతు - శావేనశుద్ధ్యతే సూతి, ఇతి ప్రాగుక్తేః తత్రాప్యుత్త రాశౌచనివృత్తి రుక్తా. తన్న ఉత్తరస్యకాలాధిక్యేన బలవత్త్వాత్. మాధవీయే యమోఽపి - అఘవృద్ధిమదాశౌచం పశ్చిమేన సమాపయేత్, యథాత్రిరాత్రే ప్రక్రాంతే దశాహం ప్రవిశేద్యది, ఆశౌచం పునరాగచ్ఛేత్ తత్సమాప్యవిశుద్ధ్యతి, ఇతి. హారీతోఽపి - గురుణా లఘు శుద్ధ్యేత్తు లఘునానైవతద్గురు, ఇతి. గురుత్వంచ లఘుత్వంచ కాలకృతమేవ, పూర్వానురోధాత్ ఏతచ్ఛహరదత్తేన, స్పష్టముక్తం. మితాక్షరాయామప్యేవం. యత్తు - అఘానాం యౌగ పద్యేతు జ్ఞేయాశుద్ధిర్గరీయసీ, మరణోత్పత్తి యోగేతు గరీయో మరణం భవేత్. ఇతి హారీతకౌర్మాది. తత్రా**

స్పృశ్యత్వాభిప్రాయం శావస్యగురుత్వంజ్ఞేయం. క్వచిదల్పకాలేనాపి దీర్ఘకాలాశౌచనివృత్తి మూహ, దేవలః- పరతః పరతోఽశుద్ధిరఘవృద్ధౌ విధీయతే, స్యాచ్చేత్పంచతమాదహ్నః పూర్వేణైవాత్ర శిష్యతే. అస్యార్థః - అఘవృద్ధౌ దీర్ఘాశౌచే పరతోఽశుద్ధిః పరమాశౌచం. యది పూర్వాశౌచము త్తరస్య పంచమదినాత్పరతోఽనువర్తతే, తదాపూర్వేణై వశుద్ధిః పూర్వస్యోత్తరా శౌచార్థాధిక కాలవ్యాపిత్వే పూర్వశేషాచ్ఛుద్ధిరిత్యర్థః. యథాషష్ఠేమాసే గర్భపాత నిమిత్త షడహాశౌచమధ్యేదశాహ పాతే పూర్వేణోత్తరనివృత్తిః యథావాత్ర్యహమధ్యేస్రావపాతనిమిత్త చతురహపంచాహయోరితి కశ్చిత్. తన్నదశాహావధి పూర్వశేషశుద్ధ్యా దావేకవాక్య విరోధాత్. షష్ఠాదిదినే పూర్ణాశౌచమంత్య రాత్రౌతు ద్వ్యహ ఇత్యనౌచిత్యాచ్చ. అస్మద్గురవస్తు పంచతమాదహ్న ఆశౌచం తతోన్యూనంత్ర్యహాది చేత్స్యాదత్రాస్మిన్ విషయే పూర్వేణై వాశుద్ధిః శిష్యతే. దశాహాది రాత్రి శేషేత్ర్యహాదల్పాశౌచానాం పరస్పరం రాత్రి శేషే సంపాతే చ న ద్వ్యహాది వృద్ధిరిత్యర్థమాహుః. క్వచిత్పూర్వశేషేణశుద్ధే రపవాదమాహ గౌతమః - రాత్రి శేషేసతి ద్వాభ్యాం ప్రభాతే తి సృభిః, ఇతి ప్రభాతే అంత్యయామే. రాత్రి శేషేద్వ్యహాచ్ఛుద్ధిః యామశేషేశుచిస్త్ర్యహాత్, ఇతి శాతాతపోక్తేః. ఇదంశావాంతే సూతకపాతే సజాతీయేవాతుల్యం. అత్రకేచిత్ రాత్రి శబ్దోఽహో రాత్రపరః. అహఃశేషేద్వాభ్యాం. ప్రభాతే తి సృభిః, ఇతి శంఖలిఖితోక్తేః. అథయదిదశరాత్రాః సన్నిపతేయు రాద్యం దశరాత్ర మాశౌచ మానవమాద్దివసాదత ఊర్ధ్వం ద్విరాత్రేణ వ్యుష్టాయాంత్రి రాత్రేణ, ఇతి బౌధాయనోక్తేః. పునః పాతే దశాహాత్ప్రాక్ పూర్వేణ సహగచ్ఛతి. దశమేఽహ్ని పతేద్యస్యాహర్ద్వ యాత్సవిశుధ్యతి ఇతి. ప్రభాతేతు త్రిరాత్రేణ దశరాత్రేష్వయంవిధిః, ఇతి దేవలోక్తేశ్చ.

అను॥ స్వల్పాశౌచం మధ్యయందు దీర్ఘాశౌచం వస్తే, పూర్వ(మొదటి) ఆశౌచముతో శుద్ధికాదు. తన సమయంతోనే శుద్ధమౌతుంది, అని ఉశనసోక్తి. అందువల్ల మూడురోజులు ఆదిగాగల మరణాశౌచమందు దశాహాదుల సూతకమందు (వస్తే) కూడా పూర్వంతో శుద్ధి కాదు, అని అపరార్కుడన్నాడు. శావనిమిత్తమైన అస్పృశ్యత్వము ఉండనే ఉంటుంది. శుద్ధి వివేకమందైతే - మరణాశౌచంతో జాతాశౌచం శుద్ధమౌతుంది, అని ముందు చెప్పారు కనుక అక్కడ కూడా ఉత్తరాశౌచ నివృత్తి చెప్పబడింది. కాని అట్లా కాదు. ఉత్తరమైన దానికి కాలాధిక్యం ఉన్నందువల్ల బలవంతమైనది (శక్తికలది) అని. మాధవీయమందు యముడు కూడా - పాప వృద్ధిగల ఆశౌచమును తరువాత సమాప్తి చేయాలి. ఎట్లాంటే త్రిరాత్రాశౌచం ఆరంభించాక దశాహాశౌచం ప్రవేశిస్తే, ఆశౌచం తిరిగివస్తే, దానిని సమాప్తి చేసి శుద్ధుడౌతాడు, అని. హారీతుడు గూడా - గురు ఆశౌచంతో లఘు ఆశౌచం శుద్ధమౌతుంది. లఘువుతో గురువుకాదు, అని. గురుత్వము లఘుత్వము అనేవి కాలకృతమైనవే (కాలాన్ని బట్టే) పూర్వులను అనుసరించటమే ఇది దీనిని హరదత్తుడు స్పష్టంగా చెప్పాడు. మితాక్షరయందు కూడా ఇట్లాగే చెప్పారు. పాపములు (ఆశౌచములు) ఒకే సారి వస్తే శ్రేష్ఠమైన దానితో శుద్ధి కల్గుతుందని తెలుసుకోవాలి. మరణజననా

శౌచములందు మరణము ప్రధానమైనది, అని హారీతుడు, కౌర్మపురాణం మొదలైనవి ఏది చెప్పారో అక్కడ అస్పృశ్యత అనే భావము మరణాశౌచంలో గురుత్వ కారణమని గ్రహించాలి. ఒకచోట అల్పకాలంతో కూడా దీర్ఘకాలాశౌచము నివృత్తమౌతుంది. అని దేవలుడిట్లా చెప్పాడు - అఘవృద్ధియందు పరమమైన ఆశౌచము తర్వాత వస్తే, ఐదవరోజు తర్వాత వస్తే, పూర్వమైనదానితోనే శుద్ధి అని. దాని అర్థము ఇట్లా - అఘవృద్ధి అనగా దీర్ఘకాలిక ఆశౌచము, పరతః అశుద్ధిః అనగాపరమాశౌచము, పూర్వమున్న ఆశౌచము, ఉత్తరాశౌచాన్ని ఐదవరోజు తర్వాత అనుసరిస్తే అప్పుడు పూర్వముతోనే శుద్ధి. పూర్వమునకు, ఉత్తరాశౌచకాలంలోని అర్ధకాలం కన్న అధికకాల వ్యాపిత్వం ఉంటే, పూర్వశేషంతోనే శుద్ధి. అని అర్థము. ఎట్లా అంటే ఆరవమాసమందు గర్భ పాతనిమిత్త ఆరురోజుల ఆశౌచం మధ్యలో దశాహం వస్తే పూర్వాశౌచంతో ఉత్తరాశౌచనివృత్తి అని. మరొకటి ఇట్లా - మూడు రోజుల ఆశౌచం మధ్య స్రావపాత నిమిత్తకమైన నాల్గురోజుల ఐదురోజుల ఆశౌచనివృత్తి అని ఒకడన్నాడు. అట్లాకాదు దశాహఅవధియందు పూర్వశేషశుద్ధ్యాదులందు ఏకవాక్య విరోధముంది. షష్ఠాదిదినమందు పూర్ణాశౌచము అంత్యరాత్రమందైతే రెండురోజులు వృద్ధి అనేది అనౌచిత్యమైనందువల్లను మా గురువులైతే ఐదవరోజు తర్వాతి ఆశౌచం అంతకన్న తక్కువది మూడురోజులది ఐతే ఇక్కడ ఈ విషయంలో పూర్వంతోనే శుద్ధి మిగులుతుంది. దశాహాదిరాత్రిశేషమందు మూడురోజులతో అల్పాశౌచములకు పరస్పరము రాత్రి శేషమందు సంపాతమందు ద్వ్యహాదివృద్ధి ఉండదు, అనే అర్థాన్ని చెప్పారు. ఒకచోట పూర్వశేషంతో శుద్ధి అనే దానికి అపవాదాన్ని గౌతముడు ఇట్లా చెప్పాడు. - రాత్రి శేషమందైతే రెండు రోజులు ప్రభాతమందైతే మూడు దినముల వృద్ధి అని. ప్రభాతమనగా అంత్యయామము. రాత్రి శేషమందు రెండు రోజులతో శుద్ధి. యామశేషమందు మూడు రోజులతో శుచి, అని శాతాతపోక్తి. ఇది మరణాశౌచాంతమందు జననాశౌచం వస్తే లేదా సజాతీయమందైనా తుల్యము. ఇక్కడ కొందరు, రాత్రి శబ్దము అహోరాత్రపరకము అని అన్నారు. అహః శేషమైతే రెండురోజులు, ప్రభాతమందైతే మూడు రోజులతో శుద్ధి అనే శంఖ లిఖితోక్తి అని అన్నారు. ఇకను, ఒకవేళ పదిరాత్రుల ఆశౌచమందు మరో పదిరోజుల ఆశౌచం వస్తే మొదటి పది రాత్రుల ఆశౌచము నవమ దివసం వరకు ఆపైన పదిన రెండవది ఆశౌచం వస్తే రెండు రాత్రుల ఆశౌచము(పదకొండవ) ప్రభాతమందైతే ఆశౌచం మూడు రాత్రుల వృద్ధితో నివృత్తి అని బౌధాయనోక్తి. దశమదినం కన్న ముందు తిరిగి ఆశౌచం వస్తే తొలిదానితోనే రెండవది సమాప్తి. ఎవనికైనా పదవరోజున రెండవ ఆశౌచం తెలిస్తే రెండురోజులతో(వృద్ధి) ఆతడు శుద్ధినందుతాడు, అని. ప్రభాతమందైతే మూడు రాత్రుల

అని పదిరాత్రులయందు ఇది శాస్త్రవిధి, అని దేవలోక్తి కూడా.

మూ॥ నవమదశమశబ్దౌ చోపాంత్యాంత్యదినపరౌ తేనక్షత్రియాదావపి తథేత్యాహుః మాధవీయేఽప్యేవం. అన్యేత్వాహుః - అంతర్ద శాహేస్యాతాంచేత్ పునర్మరణ జన్మనీ, తావత్స్యాదశుచిర్విప్రో యావత్తత్స్యాదనిర్దశం. ఇతి మనుపరాశరాద్యైః దశమదినేనోత్తరస్యశుద్ధేః ఉక్తత్వాద్విరోధః స్పష్టఏవ. విరోధేచ యద్వైకించన మనురవదత్తద్భేషజం, కలౌ పారాశ రస్మృతిః ఇత్యనేనచపూర్వ వచసాంబాధః. అతఏవ వాచస్పతినా తేషామనాకరత్వముక్తం సాకరత్వేఽపి జాతిమాత్రవిప్రాదివిషయం, దేశాంతర విషయం యుగాంతర విషయం వాస్తు తేనగౌతమీయే రాత్రి శబ్దోనా హోరాత్రపరః. రాత్రిమాత్రావశిష్టే. ఇతిమితాక్షరోక్తేశ్చ నకుకవికృతేరివాన్యథా వ్యాఖ్యాయుక్తా. మాధవస్తు, అనిర్గత దశాహం, ఇతి పూర్వస్వగ్రంథ విరోధాదుపేక్ష్య ఇతి. అస్మత్పితృచరణాస్తు భౌధాయనీయే ఆనవమాద్దివసాత్, ఇతిద్వితీయాశౌచస్యనవమం దినం ప్రథమస్యదశమమేవాహుః. ద్వ్యహాదివృద్ధేః పూర్వశేషాపవాదత్వాత్ తస్యచన్యాయతో ద్వితీయ దినాదే వప్రవృత్తేః అత ఊర్ధ్వమితి దశమరాత్రిపరం. శంఖలిఖితోక్తౌ దేవలోక్తౌచ అహః శేషేదశమేఽహ్నిచాతీతే రాత్రౌపతేదిత్యర్థః. దశమ్యాం పితానామకుర్యాదితివత్. తేన న మన్వాద్యైః విరోధోనాపి మితాక్షరాద్యైరిత్యాహుః అపరార్కే నిర్ణయామృతే స్వరసోఽప్యేవం. **యత్తు తత్రైవబ్రాహ్మే** - ఆద్యం భాగద్వయం యావత్ సూతకస్యతు సూతకే, ద్వితీయేపతతి త్వాద్యాత్సూతకా చ్ఛుద్ధిరిష్యతే. అత ఊర్ధ్వం ద్వితీయాత్తు సూతకాంతాత్ శుచిః స్మృతః, ఏవమేవవి చార్యం స్యాత్ మృతకేమృత కాంతరం, మృతకస్యాంతరేయత్ర సూతకంయత్రవిద్యతే, సూతకస్యాంతరేవాథమృతకం యత్రవిద్యతే, మృతకాంతేభవేత్తత్రశుద్ధిఃవర్ణేషు సర్వశః, ఇతి. అస్యార్థః తత్రైవోక్తః. పూర్వాశౌచచరమాహోరాత్రస్య దినరూపే, ఆద్యభాగద్వయేఽన్యాశౌచపాతేపూర్వేణ శుద్ధిః. భాగద్వయోర్ధ్వం రాత్రౌసూతకాంతరే ద్వితీయాత్ పూర్వభిన్నాత్ సూతకాంతాత్ద్వ్యహో దిరూపాచ్ఛుద్ధిరితి. అపరార్కే త్వాశౌచకాలం త్రేధా విభజ్య నిర్గుణవిషయత్వేనేదముక్తం. అస్యవచనస్య నిర్మూలత్వోక్తి రజ్ఞోక్తిరేవ అతః పూర్వాశౌచాంత్యరాత్రావన్యాశౌచేఽహోరాత్రద్వయమధికం రాత్రేరంత్యయామేతు దినత్రయమితి భట్టచరణో పదిష్టః పంథాః. ఏతత్సంపూర్ణాశౌచసంపాతే ఏవ. రాత్రి శేషే త్రిరాత్రాదిసంపాతేతు పూర్వశేషేణైవశుద్ధిః. ద్విరాత్రాదివృద్ధేః పూర్వవాక్యైః దశాహవిషయత్వాదపవాదాభావేశేషశుద్ధేరేవ సామాన్యతః ప్రవృత్తేః. షడశీతౌతు దశాహాంతే త్ర్యహపాతేఽపి ద్విత్రిదినవృద్ధిరుక్తా. రాత్రి శేషేయదాశౌచం పూర్వానధికమాపతేత్, ఊర్ధ్వందినద్వయం పూర్వాత్ యామశేషేదినత్రయం, ఇతి. అనధికం సమం న్యూనం వా. తత్తుచ్ఛం. నిర్మూలత్వాదంతే పక్షిణ్యాది పాతేఽపి ద్విరాత్రాది వృద్ధ్యా పతేత్తేశ్చ. పూర్వాశౌచాంత ర్వర్థిత ద్విత్రిదినమధ్యేఽధికాశౌచాంతర పాతేతువర్థితస్యాల్పత్వా దధికేనైవశుద్ధిః. నచవర్థితస్య పూర్వశేషత్వం శంకనీయం. రాత్రి శేషే పూర్వశేషశుద్ధ్యపవాదే నైమిత్తిక వృత్తిన్యాయో జీవనాత్ అపవాదాభావే ఉత్సర్గస్యప్రాప్తేః

అను॥ నవమదశమ శబ్దములు అంత్య సమీపదినము, అంత్యదినములను సూచించేవి. అందువల్ల క్షత్రియాదులందుకూడా అట్లాగే అని అన్నారు. మాధవీయ మందుకూడా ఇట్లాగే వుంది. ఇతరులిట్లా అన్నారు. పదిరోజులమధ్యలో, తిరిగి మరణజన్మములైతే విప్రునకు ఎంతవరకు ఆశౌచమంటే అది ఎంతవరకైతే పది రోజులు

కాదో అంతవరకు, అని మను పరాశరులు మొదలగు వారు దశమదినంతో ఉత్తరమైన దానికి శుద్ధిని చెప్పారు కనుక విరోధము స్పష్టమే. విరోధమైతే, మనువేదైతే ఏదో ఒకటి చెప్పాడో అది ఔషధరూపమైనట్టిది. కలిలో పారాశరస్మృతి గ్రహించాలి. అనేదానితోనూ ముందు చెప్పిన మాటలకు బాధ అందువల్లనే వాచస్పతి ఆ వచనములకు ఆధారం లేదన్నాడు. ఆధారమున్నా అవి జాతి మాత్ర విప్రులు మొదలగువారి విషయము, దేశాంతర విషయము లేదా యుగాంతర విషయమో కావచ్చు. అందువల్ల గౌతమీయమందు రాత్రి శబ్దము అహోరాత్రపరము కాదు. రాత్రి మాత్రం అవశిష్టం కాగా, అని మితాక్షరోక్తి ఉన్నందువల్లను, కుకవికృతికి వలె విపరీత వ్యాఖ్యచేయటం తగదు అని. మాధవుడైతే - పదిరోజులు గడవనందువల్ల అని అన్నది ముందు చెప్పిన తన గ్రంథమునకు విరోధమైనందు వల్ల ఉపేక్షించతగినది, అని. మా పితృచరణులైతే, బౌధాయన గ్రంథమందు, నవమ దివసం వరకు (లోపల) అని ద్వితీయాశౌచమునకు నవమ దినము ప్రథమమునకు దశమమని చెప్పారు. రెండు రోజులు మొదలగు వృద్ధికి పూర్వశేషము అపవాదమైనందువల్ల, దానికి న్యాయప్రకారము రెండవరోజునుండే ప్రవృత్తి కల్గినందువల్ల, అత ఊర్ధ్వం అన్నది దశమదినపరము. శంఖ లిఖితుల ఉక్తియందు, దేవలోక్తి యందును, అహః శేషమందు అనగా పదవరోజు పగలు కూడా గడిచాక రాత్రి పాతమైతే అని అర్థము. దశమియందు తండ్రి నామకర్మ చేయాలి అనే దానివలె (అంటే దశమ(పదవ)రోజు గడిచాక అని అర్థం). అందువల్ల మన్వాదులతో విరోధం లేదు,మితాక్షరాదులతోను విరోధం లేదు అని అన్నారు. అపరార్కమందు నిర్ణయామృత మందును ఇట్టి అభిప్రాయమే ఉంది. అక్కడే బ్రాహ్మమందు - ఒక సూతకం యొక్క రెండు భాగముల కాలమున్నంతలో రెండవ సూతకం పతితమైతే (వస్తే) తొలిసూతకంతోనే శుద్ధి తగును. ఆ తరువాత ఐతే రెండవ ఆశౌచసూతకాంతం వల్ల శుచి కల్గుతుంది. ఈ రకంగానే, మృతాశౌచమందు మరో మృతాశౌచం వస్తే గ్రహించాలి. ఎక్కడ మృతా శౌచం మధ్య సూతకం వస్తుందో లేదా సూతకాశౌచం మధ్య మృతాశౌచం వస్తుందో అట్టిచోట అన్ని వర్ణములందు మృతకాశౌచాంతమందే శుద్ధి, అని. దీని అర్థాన్ని అక్కడే వివరించాము. తొలి ఆశౌచం (యొక్క చివరి) అహోరాత్రముగల దినరూపమందు ఆద్యభాగద్వయమందు రెండవ ఆశౌచం వస్తే పూర్వంతో శుద్ధి రెండు భాగముల తరువాత రాత్రియందు రెండవ సూతకం వస్తే రెండవదైన పూర్వం కన్న భిన్నమైన సూతకాంతంవల్ల రెండు రోజులు మొదలుగాగల రూపం కలదానితో శుద్ధి అని. అపరార్కమందైతే ఆశౌచకాలాన్ని మూడుభాగాలు చేసి నిర్గుణవిషయంగా దీన్ని చెప్పారు. ఈ వచనము నిర్మూలమైంది అనటం అజ్ఞోక్తియే. అందువల్ల పూర్వాశౌచం యొక్క చివరిరాత్రియందు (అహోరాత్రం) రెండవ ఆశౌచం వస్తే అహోరాత్రములు రెండు (రోజులు) అధికము. రాత్రి అంత్యయామమందు వస్తేనో, మూడు రోజులు అని భట్టచరణులు ఉపదేశించిన

మార్గము. ఇది సంపూర్ణాశౌచముల సంపాతమందే. రాత్రి శేషమందు (అహోరాత్రం) త్రిరాత్రాది ఆశౌచం వస్తేనో పూర్వశేషంతోనే శుద్ధి ద్విరాత్రాదివృద్ధి, పూర్వవాక్యములతో దశాహవిషయమైనందువల్ల అపవాదంలేకపోతే, శేషశుద్ధే సామాన్యంగా ప్రవృత్తమౌతుంది. షడశీతియందు ఇట్లా దశాహాంతమందు మూడు రోజులాశౌచం వచ్చినా, రెండుమూడురోజులవృద్ధి చెప్పబడింది. రాత్రి శేషమందు, మరో ఆశౌచము పూర్వం వంటిదో, అధికం కానిదో వస్తే (పూర్వాత్ అనధికం) పూర్వం తరువాత రెండురోజులెక్కువ వృద్ధి. యామశేషమందువస్తే దినత్రయవృద్ధి, అని. అనధికం అనగా పూర్వంతో సమమైందో తక్కువైందో అని. ఇట్లా చెప్పింది తుచ్ఛమైనది. దీనికి మూలవచనం లేదు. చివర పక్షిణి ఆదులు వచ్చినప్పటికిని (సంపాతము) ద్విరాత్రాదివృద్ధి వస్తే ఆపత్తి గదా. పూర్వాశౌచం మధ్య పెరిగిన రెండు మూడు రోజుల మధ్యయందు ఆశౌచం మరొకటి అధికంగా వస్తేనో పెరిగింది తక్కువగా ఉన్నందువల్ల, అధికం తోనే శుద్ధి, వర్థితమైనది. పూర్వశేషమని భావించరాదు. రాత్రి శేషమందు, పూర్వశేషశుద్ధి అపవాదమందు, నైమిత్తిక వృత్తిన్యాయాన్ని ఆశ్రయించినందువల్ల బ్రతికినది కనుక. అపవాదం లేకపోతే ఉత్సర్గమే ప్రాప్తిస్తుంది.

మూ॥ **అపవాదాంతరమాహాశంఖః** – మాతర్యగ్రే ప్రమీతాయాం **ఆశుద్ధౌమ్రియతేఽపివా, పితుఃశేషేణశుద్ధిఃస్యాత్**, మాతుఃకుర్యాత్తు పక్షిణీ పాదత్రయం స్పష్టం **తుర్యస్యత్వయమర్థః – పిత్రాశౌచమధ్యేమాతృమృతౌ పిత్రాశౌచాంతే మాతుః పక్షిణీమధికాంకుర్యాదితి. తత్రాశుద్ధావిత్యుక్తేః అత్మహాదేః పితురాశౌచాభావాన్మాతృమరణే, నపక్షిణీ కింతు పూర్ణమే వాశౌచం. ఇయంచపక్షిణీతృతీయాది పరా, నాద్యదినద్వయే ప్రతినిమిత్త నైమిత్తి కావృత్తి న్యాయాపవాద పూర్వశేషాపవాదత్వా దితిపితృచరణాః సపిండాద్యశౌచేన మాతాపిత్రోరాశౌచో పరమోనాస్త్యేవ. ఏవం భర్తురపీతి ఇయంచపక్షిణీ దశమదినాత్పూర్వ మాతృమరణేజ్ఞేయా. దశమ్యాంరాత్రౌ తత్ర్పభాతేవా మాతృమరణేద్వ్యహత్ర్యహసముచ్చితాపక్షిణీ తికశ్చిత్, తన్న సంఖ్యాంత రోపజననాపత్యాత్ర్యహాది శ్రుతిబాధాపత్తేః. అత ఏవైకాదేయా షట్ దేయా ఇత్యాదౌశ్రుత సంఖ్యా బాధాపత్తేః సముచ్చయోనిరస్తో ద్వాదశే. గురుణిలఘోరంతర్గతేః, గురుణాలఘు శుద్ధ్యేత, ఇత్యుక్తేశ్చ మాతురన్వారోహణేతు** నపక్షిణీ. యదానారీ విశేదగ్నిం, ప్రియస్య ప్రియ వాంఛయా, తదా శౌచం విధాతవ్యం భర్త్రాశౌచక్రమేణహి, ఇతి పృథ్వీచంద్రోదయేలఘు హారీతోక్తేః తత్రైవ **షడశీతిమతేఽపి** – మృతం పతిమను వ్రజ్యపత్నీ చేదనలంగతా, నతత్రపక్షిణీ కార్యాపైతృకా దేవశుద్ధ్యతి. పుత్రోఽన్యోవాగ్ని దస్తస్యాస్తావదే వాశుచిస్తయోః, నవశ్రాద్ధంచ పిండంచ యుగపత్తు సమాపయేత్ గృహీతాశౌచానాం పుత్రాణాం పితుః సంస్కారేమాతుః సపిండస్యవా మరణేనాయం నిర్ణయః. అతి క్రాంతకాలాద్విద్యమాన నిమిత్తస్యచ బలవత్వాత్. ద్వాదశ వర్షోత్తరం సంస్కారా శౌచమధ్యే సపిండమరణేఽప్యేవం. యత్తు అపరార్కేబ్రాహ్మే – ఋగ్వేద వాదాత్ సాధ్వీస్త్రీ నభవేదాత్మ ఘాతినీత్ర్యహాశౌచేతు నివృత్తే శ్రాద్ధం ప్రాప్నోతి శాస్త్రవత్. ఇతి, తత్‌భర్తు రాశౌ చోత్తరమన్వారోహణే త్రిరాత్రాశౌచపరమితి పృథ్వీచంద్రః. బ్రాహ్మణాదేః క్షత్రియాద్యనుగమనేఽల్పాశౌచపరమిత్యపరార్కః

**శుద్ధి తత్వాదయోగౌడాస్తు - భర్త్ర శోచోత్తరమన్వారోహణే త్రిరాత్రం. సహగమనేతు సంపూర్ణం. యుద్ధహతస్య సద్యః శౌచేఽన్వారోహణే బ్రాహ్మోక్తేః. త్రిరాత్రత్వాత్ భర్తురపిత్ర్యహేణపిండదానం. ఏకచితౌతు సద్యఃశౌచం ఇత్యాహుః. అన్యత్ప్రాగుక్తం. పూర్వశేషేణ శుద్ధేరపవాదాం తరముక్తం షడశీత్యాం - పూర్వాశౌచేన, యాశుద్ధిః సూతకే మృతకేఽపిచ సూతికామగ్ని దంహిత్వా ప్రేతస్య చసుతానపి. నిర్ణయామృతేస్మృతి సంగ్రహేఽపి - ఇయం విశుద్ధిరుదితా సూతికామగ్ని దంవినా, ఇదం మూల్యేన, దాహకరణే మాతులాది సంబంధే దాహమాత్ర కరణేతు త్రిరాత్రమేవేత్యుక్తం ప్రాక్.**

అను॥ మరో అపవాదాన్ని శంఖుడిట్లా చెప్పాడు - తొలుత తల్లి మరణించాక, ఆమె ఆశౌచమందు తండ్రి మరణిస్తే, తండ్రికి శేషంతో శుద్ధి తల్లికి పక్షిణి ఆశౌచ వృద్ధి, అని మూడు పాదములు స్పష్టంగా ఉన్నాయి. నాల్గవ పాదానికి ఇది అర్థము - పితృ ఆశౌచంమధ్యలో తల్లి మరణిస్తే పితృ ఆశౌచం అంతమందు తల్లికి, పక్షిణి ఆశౌచంను అధికంగా చేయాలి, అని. అక్కడ అశుద్ధౌ అని చెప్పినందువల్ల ఆత్మహత్య చేసుకున్న తండ్రికై ఆశౌచం లేనందువల్ల మాతృ మరణమందు పక్షిణి అవసరంలేదు. పూర్ణాశౌచమే. ఈ పక్షిణి తృతీయదినం మొదలగాగల వాని పరము. తొలి రెండు దినములందు కాదు. ప్రతి నిమిత్త (తల్లి మరణం) నైమిత్తిక (తండ్రి మరణం) ఆ వృత్తి న్యాయమునకు అపవాద (ఆత్మహత్య) రూపపూర్వశేషాపవాదమైనందువల్ల, అని పితృచరణులన్నారు. సపిండాద్యాశౌచంతో మాతాపితరుల ఆశౌచం తొలగిపోదు. ఇట్లాగే భర్తకు కూడా, అని. ఈ పక్షిణి దశమదినం కన్న ముందు తల్లి మరణిస్తే అని గ్రహించాలి. దశమిరాత్రియందో దాని ప్రభాతమందో మాత మరణిస్తే రెండు మూడు రోజులతో కూడిన పక్షిణి, అని ఒకరన్నారు. అట్లాకాదు. సంఖ్యాంతరం పుట్టటమనే ఆపత్తి వస్తుంది. (ఏ సంఖ్య ఆచరించని స్థితి). మూడు రోజులు మొదలుగా అనే శ్రుతివాక్యమునకు బాధకల్గుతుంది. అందువల్లనే ఒకటి ఇవ్వాలి, ఆరు ఇవ్వాలి అను మొదలగు వానియందు విన్న సంఖ్యకు బాధకల్గుతుంది. న్యాయమాల పన్నెండవ అధ్యాయమందు జైమిని సముచ్చయాన్ని నిరసించాడు. గురువు యందు లఘువు అంతర్భవిస్తుంది కనుక. గురువుతో లఘువు శుద్ధిస్తుంది, అని చెప్పారు కూడా. మాతృ అన్వారోహణమందు పక్షిణి లేదు. ప్రియవాంఛతో ప్రియుని (పతి) చితాగ్నిని స్త్రీ (భార్య) ప్రవేశిస్తే, అప్పుడు, భర్త ఆశౌచక్రమంతోనే పత్నికి ఆశౌచం ఆచరించాలి, అని పృధ్వీ చంద్రోదయమందు లఘుహారీతోక్తి. అక్కడే షడశీతి మతమందు కూడా - మరణించిన భర్తననుసరించి భార్య అగ్నిప్రవేశం చేస్తే అక్కడ పక్షిణి అవసరం లేదు. పితృకర్మతోనే శుద్ధినందుతుంది, అని. పుత్రుడు కాని మరొకడు కాని నిప్పు పెట్టేవాడు ఆమె అశుచి ఆతనికి ఎంతవరకంటే, వారికి (ఇద్దరికి) నవశ్రాద్ధము సపిండము ఒకేసారిముగించేవరకే. ఆశౌచం స్వీకరించిన పుత్రులకు - పితృ సంస్కారమందు, తల్లి కాని సపిండుడు కాని మరణిస్తే ఈ నిర్ణయం కాదు. అతిక్రాంతకాలముకన్న విద్యమాన నిమిత్తమే బలమైనది

కనుక. పన్నెండు సంవత్సరాల తరువాత సంస్కార ఆశౌచమధ్యమందు సపిండుని మరణమందు కూడా ఇట్లాగే అని. అపరార్కమందు బ్రాహ్మోక్తి ఇట్లా - ఋగ్వేద వాదాన్ననుసరించి, సాధ్వియైన స్త్రీ, ఆత్మఘాతిని కారాదు. మూడు రోజుల ఆశౌచం ముగిస్తే శాస్త్రప్రకారం శ్రాద్ధం పొందుతుంది, అని. ఏదన్నారో అది భర్త ఆశౌచము తరువాత అన్వారోహణము చేస్తే త్రిరాత్రాశౌచపరము అని పృథ్వీచంద్రుడన్నాడు. బ్రాహ్మణాదులయొక్క క్షత్రియాదులఅను గమనమందు, అల్పాశౌచపరమని అపరార్కుడన్నాడు. శుద్ధితత్వాదులు గౌడులైతే - భర్త ఆశౌచం తరువాత అన్వారోహణ చేస్తే మూడు రాత్రుల ఆశౌచము, సహగమనమైతే సంపూర్ణాశౌచము. యుద్ధహతునకు సద్యఃశౌచమైతే, అన్వారోహణమందు, బ్రాహ్మోక్తి ననుసరించి మూడు రాత్రులు ఆశౌచం ఐనందువల్ల భర్తకు కూడా మూడురోజులలో పిండదానము చేయాలి. ఒక చితియందైతే సద్యఃశౌచము, అని అన్నారు. మిగిలినది ముందు చెప్పాము. పూర్వశేషంతో శుద్ధి అనేదానికి అపవాదాంతరమును షడశీతియందిట్లా చెప్పారు - సూతక, మృతక ఆశౌచములందు పూర్వ ఆశౌచముతో శుద్ధి అని. ఏదన్నారో అక్కడ సూతకను, అగ్నిదాతను, ప్రేతయొక్క పుత్రులను కూడా వదలి (ఇతరులకు శుద్ధి) అని. నిర్ణయామృతమందు స్మృతి సంగ్రహమందు కూడా ఇట్లా - సూతికను, అగ్నిదాతను వదలి ఈ విశుద్ధిని చెప్పాము. మూల్యం తీసుకొని దాహం చేస్తే. మాతులాది సంబంధమందు దాహం మాత్రం చేస్తే మాత్రం త్రిరాత్రాశౌచమే, అని ముందే చెప్పాము.

మూ॥ వృద్ధాత్రిః - సూతకాత్ ద్విగుణం శావం శావాద్ద్విగుణమార్తవం, **ఆర్తవాద్ద్విగుణాసూతిః తతోఽపిశవదాహకః, తథాశౌచసంపాతేఽపి న శావజనన నిమిత్త కార్యప్రతిబంధః. ఆశౌచేతుసముత్పన్నే పుత్ర జన్మయదాభవేత్, కర్తుః తాత్కాలికీశుద్ధిః పూర్వాశౌచేన, శుధ్యతి, ఇతి ప్రజాపతిస్మృతేః. ఆశౌచేద్విविధేఽపిశాతాతపః** - అంతర్దాహే జననాత్పశ్చాత్స్యా న్మరణంయది, ప్రేతముద్దిశ్యకర్తవ్యం పిండదానం యథావిధి. ప్రారబ్ధేప్రేతపిండేతు మధ్యే **చేజ్జననంభవేత్, తదైవా శౌచ పిండాంస్తు శేషాన్దద్యాద్యదావిధి. మాతుః పక్షిణీమధ్యే పితురే కాదశా హంచకుర్యాత్ - ఆద్యంశ్రాద్ధమశుద్ధోఽపికుర్యాదే కాదశేఽహని, ఇతిస్మృతేః. కేచిత్విదం క్షత్రియాది** పరం, విప్రాదేస్త్వా శౌచాంతర ఏకాదశాహశ్రాద్ధ ంనేత్యాహుః. అత ఏవ విజ్ఞానేశ్వరేణ - దశమం **పిండము త్సృజ్య రాత్రిశేషేశుచిర్భవేత్, ఇతిశుచిత్వం మహైకోద్దిష్టాంగ విప్రనిమంత్రణ పరమితి వదతాతత్రశుద్ధేరంగత్వం దర్శితం.** ఏవం వృషోత్సర్గశయ్యాదావపి. దేవయాజ్ఞికేనత్వా శౌచాంతరేఽ **పిభవత్యేవేత్యుక్తం. అథాశౌచాపవాదః.** సపంచధా. కర్తృతః, కర్మతః, ద్రవ్యతః, మృత **దోషతః, విధానాచ్చ. ఆద్యో బ్రహ్మచారియత్యాదిషు. నైష్ఠికానాం వనస్థానాం యతీనాం బ్రహ్మచారిణాం, నాశౌచం కీర్తితంసద్భిః పతితేచతథామృతే, ఇతి కౌర్మోక్తేః. తుర్యపాదే శావేవాపితథైవ చేతిదేవలపాఠః. ఆశౌచమంత్య కర్మోపలక్షణం. బ్రహ్మచారీనకుర్వీత శవదాహాదికాః క్రియాః, యదికుర్యాచ్చరేత్కృచ్ఛ్రం పునః సంస్కారమేవచ, ఇతి దేవలోక్తేః. ఏ తత్పిత్రాద్యతిరిక్త విషయం**

ఆచార్యం స్వముపాధ్యాయం మాతరంపితరంగురుం, నిర్హృత్యతుబ్రతీప్రేతం నవ్రతేన వియుజ్యతే, ఇతి మనూక్తేః. హారీతః - మాతాపిత్రోస్తు యత్రోక్తం వ్రత చారీతు పుత్రకః, వ్రతస్థోఽపి హికుర్వీత పిండదానోదకక్రియాం. భవత్యశౌచం నైవాస్య నైవాగ్నిస్తస్యలుప్యతే. స్వాధ్యాయంచ ప్రకుర్వీత పూర్వవత్ విధి దర్శితం. సంవర్తః - అన్యగోత్రోపసంబంధః ప్రేతస్యాగ్నిం దదాతియః, పిండం చోదక దానంచ సదశాహం సమాచరేత్. నిర్హరణమంత్యకర్మపరం ఏవం మాతామహస్య యధావ్రతస్థో ఽపిసుతః పితుఃకుర్యాత్క్రియాం నృప. తధామాతామహస్యాపిదౌహిత్రః కర్తుమర్హతి, ఇతి అపరార్కేభవిష్యోక్తేః. మాతాపిత్రోః ఉపాధ్యాయాచార్యయోః ఔర్ధ్వదేహికం, కుర్వన్మాతామహస్యాపివ్రతీ నభ్రశ్యతే వ్రతాత్, ఇతి కాలాదర్శాచ్చ. తత్రాంత్య కర్మనిమిత్తమస్పృశ్యత్వం దశాహమస్త్యేవ. నగోత్రోవాఽనగోత్రోవా యోఽగ్నిందద్యాత్నఖేనరః, సోఽపికుర్యాన్నవశ్రాద్ధంశుధ్యేత్తు దశమేఽహని, ఇతిదివో దాసోక్త వచనాత్, అత ఏవ బ్రహ్మచారిణః శవకర్మిణో వ్రతాన్ని వృత్తిరన్యత్ర మాతాపిత్రోర్గురోశ్చేతి గౌతమీయే వ్రతనివృత్తేరేవ పర్యుదాసోనాశౌచస్య.

అను॥ వృద్ధ అత్రి ఇట్లా - సూతకం కన్న రెట్టింపు శావము, దానికన్న రెట్టింపు ఆర్తవము, దానికన్న రెట్టింపు ప్రసూతి. దానికన్న శవదాహకుడు రెట్టింపు ఆశౌచం కలవాడు. అట్లా ఆశౌచం సంపాతమైనా, శావ, జనన నిమిత్తమైన కార్య ప్రతిబంధము ఉండదు, అని. ఆశౌచం వచ్చినప్పుడు పుత్రుడు జన్మిస్తే, కర్తకు తాత్కాలిక శుద్ధి ఏర్పడుతుంది. పూర్వాశౌచంతో శుద్ధుడౌతాడు, అని. ప్రజాపతిస్మృతి. రెండు రకాలైన ఆశౌచమందును శాతాతపుడిట్లా - జననాశౌచపు పదిరోజుల మధ్యలో, మరణాశౌచం వస్తే, ప్రేతనుద్దేశించి పిండదానాన్ని శాస్త్రప్రకారం ఆచరించాలి, అని. ప్రేత పిండం ప్రారంభించాక, మధ్యలో జననాశౌచం వస్తే అట్లాగే ఆశౌచ పిండాలను మిగిలిన వాటిని శాస్త్ర ప్రకారము ఇవ్వాలి. తల్లి పక్షిణీ మధ్యంలో, తండ్రి ఏకాదశాహాన్ని చేయాలి. తొలి శ్రాద్ధము అశుద్ధమైనా (ఉన్నా) ఏకాదశాహమందు ఆచరించాలి, అని స్మృతి. కొందరు ఇది క్షత్రియాదిపరము. విప్రాదులకైతే ఒక ఆశౌచం మధ్యలో ఏకాదశాహ శ్రాద్ధం కూడదు అని అన్నారు. అందువల్లనే విజ్ఞానేశ్వరుడిట్లా - పదవ పిండమును వదలి, రాత్రి శేషమందు శుద్ధి ఔతాడు, అని శుచిత్వాన్ని మహాఏకోద్దిష్ట అంగమైన విప్రనిమంత్రణపరమని చెప్పటం ద్వారా అక్కడ శుద్ధికి అంగత్వం చూపబడింది. ఇట్లా వృషోత్సర్గ శయ్యాదులందును. దేవయాజ్ఞికుడైతే, ఆశౌచాంతరమందును ఔతుంది అని చెప్పారు. ఇక, ఆశౌచమునకు అపవాదము - అది ఐదురకాలు - కర్తనుండి, కర్మనుండి, ద్రవ్యంనుండి, మృతదోషం వల్ల విధానం వల్ల అని. తొలిది బ్రహ్మచారియతి మొదలగు వారియందు. నైష్ఠికులకు, వానప్రస్థులకు, యతులకు, బ్రహ్మచారులకు ఆశౌచం లేదు. పతితుని మృతియందు ఆశౌచం పట్టనవసరం లేదు అని సజ్జనులు చెప్పారు, అని కౌర్మోక్తి. నాల్గవ పాదమందు, శావమందును అట్లాగే, అని దేవలుని పాఠము. ఆశౌచ శబ్దము అంత్యకర్మకు సూచకము. బ్రహ్మచారి శవదాహాదికమైన

కర్మలను చేయరాదు. ఒకవేళ చేస్తే కృచ్ఛ్రంచరించాలి. తిరిగి సంస్కారాన్ని (మే) కూడా పొందాలి, అని దేవలోక్తి. ఇది పిత్రాదులకన్న అతిరిక్త విషయము. తన ఆచార్యుడు, తన ఉపాధ్యాయుడు, తల్లి, తండ్రి, గురువు వీరి మరణమందు బ్రహ్మచారి, శవదాహం మొదలుగా చేసినా, వ్రతం నుండి తొలగడు, అని మనూక్తి. హారీతుడిట్లా – వ్రతచర్యయందున్న పుత్రుడు మాతాపితరులకు, శాస్త్రోక్తంగా వ్రతస్థుడైనా పిండదాన ఉదక క్రియలను ఆచరించాలి. ఆతనికి ఆశౌచం ఉండదు. అతని అగ్నిలుప్తం కాదు అని శాస్త్రమందు చెప్పారు. మునుపటిలాగ స్వాధ్యాయం కూడా ఆచరించాలి, అని అన్నారు, అని. సంవర్తుడిట్లా – అన్యగోత్రంతో ఉపసంబంధం కల వాడు ప్రేతకు అగ్నిపెట్టిన పిండ ఉదకదానములు చేసినవాడు, పదిరోజులు కూడా (సదశాహము) ఆచరించాలి, అని. నిర్హరణమనగా అంత్యకర్మ విషయము. ఈ రకంగా మాతామహునకు చేయాలి. వ్రతస్థుడైనా సుతుడు తండ్రికి ఎట్లా క్రియ చేయాలో, ఓ రాజా! అట్లాగే మాతామహునకు గూడా క్రియను దౌహిత్రుడు చేయటానికి అర్హుడౌతాడు, అని అపరార్కమందు భవిష్యోక్తి. మాతాపితరులకు, ఉపాధ్యాయ, ఆచార్యులకు, మాతామహునకు కూడా ఊర్ధ్వదైహికమును ఆచరించి వ్రతి, వ్రతము నుండి భ్రష్టుడు కాడు, అని కాలాదర్శోక్తి కూడా. అక్కడ అంత్యకర్మ నిమిత్తమైన అస్పృశ్యత్వము పదిరోజులు ఉండనే ఉంటుంది. ఓ సఖా! సగోత్రుడైనా, అసగోత్రుడైనా ఏ నరుడు అగ్నిదాహం చేస్తాడో, ఆతడు కూడా నవశ్రాద్ధమాచరించాలి, పదవరోజున శుద్ధి ఔతాడు అని దివోదాసుడు చెప్పిన వచనం. అందువల్లనే బ్రహ్మచారికి శవకర్మ ఆచరించివానికి వ్రతమునుండి నివృత్తి, మాతాపితరులు, గురువు వీరికన్న ఇతరులైన వారి విషయంలో అని గౌతమీయమందు. పర్యుదాసము వ్రత నివృత్తికే ఆశౌచమునకు కాదు అని.

**మూ॥ సంధ్యాదికర్మలోపస్తునాస్తి, నత్యజేత్సూ తకేకర్మ బ్రహ్మచారీ స్వయం క్వచిత్, ఇతి ఛందోగపరిశిష్టాత్. పిత్రోఃగురోర్విపత్తౌతు బ్రహ్మచార్యపియఃసుతః, సవ్రతశ్చాపికుర్వీత అగ్ని పిండోదకక్రియాం తేనా శౌచంనకర్తవ్యం సంధ్యాచైవనలుప్యతే. అగ్ని కార్యంచకర్తవ్యం సాయం ప్రాతశ్చ నిత్యశః, ఇతి చంద్రికాయాం సంవర్తోక్తేశ్చ. అత్ర కర్మానధికార రూపాశౌచ నిషేధ ఏవ. అపరార్కమాధవాదయస్తు ఏకాహమాశౌచమాహుః – ఆచార్యం వాప్యుపాధ్యాయం గురుంవాపితరంచవా, మాతరం వాస్వయం దగ్ధ్వావ్రతస్థస్తత్ర భోజనం కృత్వాపతతినో తస్మాత్ ప్రేతాన్నంతత్రభక్షయేత్. అన్యత్రభోజనం కుర్యాన్నచతైస్సహ సంవసేత్. ఏకాహమశుచిర్భూత్వా ద్వితీయేఽహనిశుద్ధ్యతి, ఇతి బ్రాహ్మోక్తేః. తదన్నభోజనేతు ప్రాయశ్చిత్తం పునరుపనయనమా శౌచంచ. దివోదాసాదయస్తు బ్రాహ్మోక్తేః ప్రథమేఽహ్ని సంధ్యాది లోపః. బ్రహ్మచారీయదా కుర్యాత్పిండ నిర్వపణం పితుః, తావత్కాలమ శౌచం స్యాత్ పునఃస్నాత్వావిశుద్ధ్యతి, ఇతి ప్రజాపతి వచనాత్ ద్వితీయాహాదౌ పిండదానకాలే ఏవాస్పృశ్యత్వమాత్రం నాన్యదేత్యాహుః దశాహ మస్పృశ్యత్వేఽపి కర్మాంగ స్నాన విధానార్థమేతదితియుక్తం. అంత్య కర్మాకరణేతు బ్రహ్మచారిణః**

పిత్రాది మరణేఽప్యాశౌచాభావ ఏవ. సోఽపి బ్రహ్మచర్యకాల ఏవ సమావర్తనోత్తరం తు పూర్వ మృతానాంత్ర్య హాశౌచం భవత్యేవ. ఆదిష్టీనోదకం కుర్యాదావ్రతస్య సమాపనాత్, సమాప్తేతూదకం దత్వా త్రిరాత్ర మశుచిర్భవేత్, ఇతిమనూక్తేః. తత్రాపి వికల్పః. పితర్యపి మృతేనైషాం దోషోభవ తికర్హిచిత్, ఆశౌచం కర్మణోంతే స్యాత్త్ర్యహం వాబ్రహ్మచారిణాం, ఇతి ఛందోగపరిశిష్టాత్. తథాకృత జీవచ్ఛ్రాద్ధేన కి మప్యాశౌచంనకార్యమితిహేమాద్రిః. శుద్ధితత్వే కౌర్మే - సద్యఃశౌచం సమాఖ్యాతం దుర్భిక్షే చాప్యుపద్రవే, డింభాహవహతానాంచ విద్యుతాపార్థివైర్ద్విజైః. ఉపద్రవే అత్యంతమరకే. ఉపసర్గమృతేచైవ సద్యఃశౌచం విధీయతే, ఇతి పరాశరోక్తేః. ఉపసర్గోఽత్యంతమరక ఇతిశూల పాణ్య నిరుద్ధ భట్టాదయః

అను|| సంధ్యాది కర్మలోపము లేదు. సూతకమందు, బ్రహ్మచారి స్వయంగా ఏ కర్మ ఐనాతనది ఎప్పుడూ విడువరాదు, అని ఛందోగ పరిశిష్టం నుండి తెలుస్తోంది. తల్లికి తండ్రికి గురువుకు విపత్తు వస్తే (మరణం) బ్రహ్మచర్యంలో ఉన్న కొడుకైనా, వ్రతస్థుడైనా వారికి అగ్ని, పిండ, ఉదకక్రియలను ఆచరించాలి. ఆతడు ఆశౌచం ఆచ రించరాదు. సంధ్యాలోపం లేదు. ప్రతిరోజు సాయంకాలము, ప్రొద్దున అగ్నికార్యంకూడా ఆచరించాలి, అని చంద్రిక యందు సంవర్తోక్తి కూడ. ఇక్కడ కర్మకు అనధికార రూపమైన ఆశౌచ నిషేధమే. అపరార్క మాధవాదులైతే ఒకరోజు ఆశౌచాన్ని చెప్పారు. ఆచార్యుని, ఉపాధ్యాయుని, గురువును, తండ్రిని, తల్లిని వీరిలో ఎవరినైనా వ్రతస్థుడైన వాడు స్వయంగా దగ్ధం చేసి, అక్కడ భోజనం చేస్తే పతితుడౌతాడు. అందువల్ల అక్కడ ప్రేతాన్నాన్ని భుజించరాదు. మరో చోట భుజించాలి. వారితో కలిసి ఉండరాదు. ఒకరోజు అశుచియై రెండవరోజున శుద్ధినందుతాడు, అని బ్రాహ్మోక్తి. ఆ అన్నం తింటే మాత్రం ప్రాయశ్చిత్తము. తిరిగి ఉపనయనము, ఆశౌచము కూడా. దివోదాసాదులైతే, బ్రాహ్మోక్తి ననుసరించి తొలిరోజున సంధ్యాదిలోపము, అని అన్నారు. బ్రహ్మచారి, తన తండ్రికి పిండనిర్వాపం చేసినప్పుడు, అంతవరకే ఆశౌచముంటుంది. తిరిగి స్నానం చేసి శుద్ధుడౌతాడు, అనే ప్రజాపతి వచనాన్ననుసరించి రెండవరోజు మొదలగు వానియందు పిండదాన కాల మందు మాత్రమే అస్పృశ్యత్వం మాత్రము. మరో సమయంలో కాదు అని అన్నారు. పదిరోజులు పిండదానకాల అస్పృశ్యత ఉన్నా, కర్మాంగ స్నాన విధికొరకు ఇది, అని అనటంయుక్తము. అంత్యకర్మ చేయకపోతే బ్రహ్మచారులకు పిత్రాది మరణమందుకూడా ఆశౌచం లేనేలేదు. అది కూడా బ్రహ్మచర్య కాలమందే సమావర్తనం తరువాతనైతే ముందు మరణించినవారికై మూడు రోజుల ఆశౌచము ఉండనే ఉంటుంది. వ్రతసమాప్తి వరకు బ్రహ్మచారి ఉదకదానం చేయరాదు. వ్రత సమాప్తి అయ్యాక ఉదకదానం చేసి ప్రేతకార్యం(తర్పణం) మూడురాత్రులు అశుచియౌతాడు, అని మనూక్తి. అక్కడ కూడా వికల్పము - తండ్రి మరణించినా ఈ బ్రహ్మచారులకు ఎప్పుడూ దోషం రాదు. కర్మాంత మందు ఆశౌచము మూడు రోజులుంటుంది. బ్రహ్మచారులకు, అని ఛందోగపరిశిష్టం నుండి తెలుస్తోంది. అట్లాగే

జీవచ్ఛ్రాద్ధం చేసుకున్నవాడు ఏరకమైన ఆశౌచాన్ని ఆచరించ రాదు, అని హేమాద్రి. శుద్ధితత్వమందు కౌర్మోక్తి ఇట్లా – దుర్భిక్షమందు, ఉపద్రవమందు (మహామారి)సద్యః శౌచము చెప్పబడింది. పిల్లల యుద్ధంలో హతులైన వారికి, పిడుగుపడి మరణించినవారికి, రాజుగారిచే బ్రాహ్మణులచే హతులైన వారికి సద్యః శౌచము అని. ఉపద్రవమనగా అత్యంత మరకము, మహామారి, సంక్రామరోగం, ప్లేగు అని. ఉపసర్గమందు మరణించినా వెంటనే శౌచం విధించబడుతుంది, అని పరాశరోక్తి. ఉపసర్గము అనగా మహామారి అని శూలపాణి అనిరుద్ధభట్టాదులన్నారు.

**మూ॥ యాజ్ఞవల్క్యోఽపి – ఆపద్యపిచకష్టాయాం సద్యఃశౌచం విధీయతే, ఇతి మరణసమయేఽపినాశౌచం. తథాచశుద్ధి రత్నాకరేదక్షః – స్వస్థకాలేత్విదం సర్వం సూతకే పరికీర్తితం, ఆ పద్గతస్య సర్వస్య సూతకేఽపి నసూతకం. అతఃసతి వైరాగ్యేసన్యాసోఽప్యాతురస్య భవతీతికేచిత్. అథ కర్మతః త్రింశత్‌శ్లోక్యాం – తత్తత్కార్యేషు సత్రివ్రతినృప నృప వర్దీక్షితర్త్విక్ స్వదేశభ్రంశా పత్స్వప్యనేక శ్రుతి పరనభిషక్కారు శిల్పాతురాణాం. సంప్రారబ్ధేషుదానోపనయనయ జనశ్రాద్ధయుద్ధ ప్రతిష్ఠాచూదాతీర్థార్థ యాత్రాజప పరిణయనాద్యుత్సవేష్వేతదర్థే. నాశౌచమితిశేషః సత్రీఅన్నసత్రవాన్. ముఖ్యసత్రస్య దీక్షితపదాత్సిద్ధేః. వ్రతీ అనంతవ్రతాది నియమవాన్, నవ్రతీనాం వ్రతే, ఇతి విష్ణూక్తేః. ప్రచేతాః – కారవఃశిల్పినో వైద్యాదాసీదాసాస్త థైవచ, రాజానోరాజభృత్యాశ్చ సద్యఃశౌచాః ప్రకీర్తితాః కారవః సూపకారాద్యాః. శిల్పినః చైల నిర్ణేజకాద్యాః. ఆతురస్య వ్యాధినాశార్థే దానాదౌ. తులాదానాదేః ప్రారంభోనాందీశ్రాద్ధం సంకల్పోవా. యజనం తదా గోత్సర్గ కోటిహోమాది లఘువిష్ణుః – వ్రత యజ్ఞవివాహేషుశ్రాద్ధే హోమేఽర్చనేజపే, ఆరబ్ధే సూతకం నస్యాత్ అనారబ్ధేతు సూతకం ప్రారంభోవరణంయజ్ఞే సంకల్పోవ్రతసత్రయోః, నాందీశ్రాద్ధం వివాహాదౌశ్రాద్ధే పాక పరిక్రియా ఇతి. పాకస్యపరిసమంతాత్ క్రియా పాకప్రోక్షణమితి శుద్ధి ప్రదీపః. తన్మందం, రూఢేః యోగాత్ బలవత్వాత్. తీర్థే తి ఆశౌచే ఆకస్మిక తీర్థప్రాప్తౌ. వివాహదుర్గ యజ్ఞేషుయాత్రాయాం తీర్థకర్మణి, నతత్ర సూతకం తద్వత్ కర్మయజ్ఞా దికారయేత్, ఇతి పైఠీనసి స్మృతేః అత్ర విశేషః ప్రాగుక్తః జపఃపురశ్చరణాదిః స్తోత్ర పాఠః అవిచ్ఛేదేన సంకల్పిత హరివంశ శ్రవణాదిశ్చ అతఏవోక్తం బ్రాహ్మే – గృహీత, నియమస్యాపి, నస్యాదన్యస్యకస్యచిత్, ఇతి. ఏవందేవపూజాది. మదన పారిజాతే యమోఽపి – శివవిష్ణ్వర్చనం దీక్షాయస్యచాగ్ని పరిగ్రహః శ్రౌతకర్మాణి కుర్వీత స్నాతః శుద్ధిమవాప్నుయాత్**

అను॥ యాజ్ఞవల్క్యుడు కూడా – ఆ పత్తి యందు (రోగం) కష్టమందు సద్యః శౌచము విధించబడింది, అని. మరణసమయమందు కూడా (చావాలనే కోరిక, ముమూర్షయందు, ఆపత్తి అది) ఆశౌచము లేదు. శుద్ధి రత్నాకరమందు దక్షుడిట్లా – స్వస్థకాలమందు ఇదంతా సూతకం గురించి చెప్పాము, ఆపద్గతుడైన వాళ్ళకందరికి సూతకమందు కూడా సూతకం లేదు, అని. అందువల్ల వైరాగ్యముంటే ఆతురునకు గూడా (వ్యాధిగ్రస్తునకు) సన్యాసముంటుంది, అని ఒకరన్నారు. ఇక కర్మననుసరించి ఆశౌచము

త్రింశత్శ్లోకియందిట్లా - ఆయాకార్యములందు, అన్నసత్రమువాడు, వ్రతి (అనంత వ్రతోద్యాపన మొదలగు వానిలో నియమంలో ఉన్నవాడు), రాజు, రాజులాగ దీక్ష తీసుకున్న ఋత్విక్కు తమదేశం భ్రంశం కావటం మొదలుగాగల ఆపదలందుకూడా అనేక శ్రుతులను చదివే వైద్యుడు, చిత్రకారుడు, శిల్పి, ఆ తురుడు వీరికి ఆశౌచం లేదు. ఆరంభించిన దానము, ఉపనయనము, యజనము, శ్రాద్ధము, యుద్ధము, ప్రతిష్ఠ, చూడాకర్మ, తీర్థమునకైన యాత్ర, జపము, పరిణయనము మొదలగు ఉత్సవములందు, ఈ ఈ పనులందు ఉన్నవారికి ఆశౌచము లేదు, అని ముగింపు. సత్రి అనగా అన్నసత్రము వాడు. సత్రమనే శబ్దాన్ని ముఖ్యమైన దాన్ని దీక్షితపదంతో వ్యవహరిస్తారు. (సత్రయాగి = దీక్షితుడు). వ్రతి అనగా అనంత వ్రతాది నియమం కలవాడు. వ్రతులకు వ్రతమందు లేదు అని విష్ణూక్తి. ప్రచేతుడిట్లా - కారువులు (సాలె, మంగలి, చాకలి, చర్మకార, శిల్పి(వడ్రంగి) ఐదుగురు) శిల్పులు, వైద్యులు, దాసి, దాసుడు, రాజులు, రాజభృత్యులు, వీరికి సద్యఃశౌచము(కలవారు అని). కారవులు అనగా వంటవారు మొదలగువారు. శిల్పులు అనగా చాకలి మొదలగువారు. ఆతురునకు వ్యాధినాశం కొరకు దానాదుల విషయంలో, తులాదానాది ప్రారంభము. నాందీ శ్రాద్ధములేదా సంకల్పము. ఆరంభించుట, యజనమనగా (హోమం యాజనము) తటాక(ము)దానము, కోటి హోమములు వీనియందు సద్యఃశౌచము లఘువిష్ణువిట్లా - వ్రతము, యజ్ఞము, వివాహము, శ్రాద్ధము, హోమము, అర్చన, జపము వీటిని ఆరంభిస్తే సూతకం లేదు. ఆరంభించకపోతే సూతకము, అని. యజ్ఞమందు వరణము ప్రారంభము, వ్రతసత్రములకు సంకల్పము ప్రారంభము. వివాహాదులందు నాందీశ్రాద్ధము ఆరంభము. శ్రాద్ధమందు పాక పరిక్రియ, ఆరంభము, అని పాకమునకు చెందిన సంపూర్ణక్రియ, పాక పరిక్రియ. పాక ప్రోక్షణమని శుద్ధప్రదీపమందు కలదు. అది తెలివి తక్కువ. యోగముకన్న రూఢి బలవంతమైనది కనుక. తీర్థమనగా ఆశౌచమందు ఆకస్మిక తీర్థప్రాప్తి ఐతే, అని. వివాహము, దుర్గరక్షణ, యజ్ఞమందు శాంతి ఉచ్చాటనము, యాత్ర, తీర్థకర్మ వీనియందు సూతకం లేదు. అట్లాగే యజ్ఞాదికర్మ చేయాలి, అని పైఠీనసి స్మృతి. సంకల్పిత యాత్ర అర్థయాత్ర అని. ఇక్కడ విశేషాన్ని ముందు చెప్పాము. జపమనగా పురశ్చరణ మొదలగునవి. స్తోత్రపారము. ఎడతెగకుండా, సంకల్పించిన హరివంశాదుల శ్రవణము కూడా. అందువల్లనే బ్రాహ్మమందిట్లా - స్వీకరించిన నియమాన్ని దేన్నైనా ఆచరిస్తుంటే అన్య ఆశౌచం రాదు, అని. ఇట్లా దేవపూజాదులు కూడా. మదన పారిజాతమందు యమోక్తి కూడా ఇట్లా - దీక్షకలవాడు, అగ్ని పరిగ్రహం కలవాడు శివవిష్ణ్వర్చన చేయాలి. శ్రౌతకర్మలు చేయొచ్చు. స్నానంచేసి శుద్ధుడౌతాడు, అని.

మూ॥ **గౌడశుద్ధితత్వేమంత్రముక్తావల్యాం** - **జపోదేవార్చనవిధిః** కార్యోదీక్షాన్వితైర్నరైః, నాస్తిపాపం యతస్తేషాం సూతకం వా యతాత్మనాం. **రాఘవభట్టీయే**

**నారదః** - అధసూతకినః పూజాం వక్ష్యామ్యాగమచోదితాం. స్నాత్వానిత్యంచ నిర్వర్త్య మానస్యాక్రియయాతువై. బాహ్యపూజా క్రమేణైవ ధ్యానయోగేన పూజయేత్, యదికామోన చేత్కామీ నిత్యం పూర్వవదాచరేత్. యత్తునృసింహకల్పే - సదామంత్రజపం ముక్త్వాయదిస్యాదశుచిర్నరః, మనసావహిత స్తత్ర స్మరేన్మంత్రం నతూచ్చరేత్. తన్మూత్రాద్యాశౌచపరం. రామార్చన చంద్రికాయాం - అశుచిర్వాశుచిర్వాపి గచ్ఛంస్తి ష్ఠన్స్వపన్నపి, మంత్రైక స్మరణం విద్వాన్ మనసైవసదాభ్యసేత్. కాలనియమాభావేతు స్తోత్ర హరివంశాద హేయమేవ. ఉత్సవోరథయాత్రాది ఏషునాశౌచం. అయమాశౌచాభావో అనన్యగతిత్వే ఆర్తౌచజ్ఞేయః. అత్రమూలమాకరే స్పష్టం **అత్రదీక్షితస్య అవభృతాత్పూర్వమే** వాశౌచాభావః. తదాదిత్వాశౌచమస్త్యేవ. తేన వైతానోపాసనాఃకార్యా ఇతి వైతానత్వేప్యవభృథాదినభవత్యేవ. అతఏవోక్తం మాధవీయే బ్రాహ్మే - తద్వత్ గృహీత దీక్షస్య త్రైవిద్యస్య మహామఖే, స్నానం త్వవభృధే యావత్ తావత్త స్యనసూతకం, ఇతి వైతానోపాసనాః కార్యాః ఇత్యనే నైవసిద్ధేః ఋత్విజాం దీక్షితానాం చేతి పునర్దీక్షిత గ్రహణం యజమానే స్వయంకర్తృత్వార్థం స్నానప్రాప్త్యర్థం వేతివిజ్ఞానేశ్వరః. వస్తుతస్తు దీక్షణీయా సంస్కృతస్య ప్రాగవభృథాత్కర్మప్రాప్త్యర్థం దీక్షిత గ్రహణం, తేనతతః పూర్వం నిషేధ ఏవ. యత్తు ప్రారంభోవరణం యజ్ఞే, ఇతి తదృత్విక్ పరం.

అను॥ గౌడశుద్ధితత్త్వమందు మంత్రముక్తా వలి వచనమిట్లా - దీక్షయందున్న నరులు, జపము దేవార్చన విధిచేయవచ్చును. వారు యతాత్ములు కనుక వారికి పాపం లేదు, సూతకం కూడా లేదు అని. రాఘవభట్టీయమందు నారదుడిట్లా - ఇక ఆగమములందు చెప్పిన సూతకి యొక్క పూజా క్రమాన్ని చెబుతాను. స్నానం చేసి నిత్యకర్మను ఆచరించి, మానసిక క్రియద్వారా బాహ్యపూజాక్రమంతో ధ్యానయోగంతో పూజించాలి. కోరికగలవాని కోరిక తీరకపోతే, నిత్యం పూర్వంలాగా చేయాలి, అని. నృసింహకల్పమందుఇట్లా - ఎప్పుడూ మంత్ర జపాన్ని వదలి నరుడు అశుచిగా ఉంటే, మనస్సుతో సావధానుడై (అవహిత) అక్కడ మంత్రాన్ని స్మరించాలి, ఉచ్చరించరాదు, అని ఏదన్నాడో అది మూత్రాదుల మూలకమైన ఆశౌచపరము. రామార్చన చంద్రికయందిట్లా - అశుచియైనా శుచియైనా వెళ్తూ, కూర్చున్నప్పుడు, (నిలిచినప్పుడు) నిద్రిస్తూ కూడా మంత్రము నొక్కదాన్నే స్మరించటాన్ని, విద్వాంసుడు మనస్సుతోనే ఎల్లప్పుడు అభ్యసించాలి, అని. కాలనియమం లేకపోతే స్తోత్ర హరి వంశాదులు విడువతగినవే. ఉత్సవమనగా రథయాత్ర మొదలగునవి. వీనియందు ఆశౌచం లేదు. ఈ ఆశౌచాభావము గత్యంతరం లేకపోతే (రాజకర్మ) ఋగ్ణావస్థమందును అని గ్రహించాలి. ఇక్కడ మూలవచనములు ఆకరమందు స్పష్టము. ఇక్కడ దీక్షితునకు అవభృథంకన్నముందే ఆశౌచం లేకపోవటం. అప్పటినుండైతే ఆశౌచమే ఉండనే ఉంది. అందువల్ల వైతానఉపాసనలు చేయవలసినవే, అని. (అగ్నులు). వైతానత్వమందును అవభృధాదులు ఉండవు. అందువల్లనే మాధవీయమందు బ్రాహ్మోక్తి ఇట్లా - ఋత్విక్కునివలె

దీక్ష గ్రహించిన, మూడు వేదములు తెలిసిన వారు మహామఖమందు ఎంతవరకు అవభృథస్నానం చేయరో అంతవరకు ఆ తనికి సూతకం లేదు, అని. వైతానోపాసనలు ఆచరించాలి. అనే దానివల్లనే సిద్ధిస్తుంటే ఋత్విజులు, దీక్షితులు అని మళ్ళీ (చెప్పటం) దీక్షిత శబ్ద గ్రహణము యజమానుడు స్వయంగా చేయటం (కర్తృత్వం) కొరకే, లేదా స్నానప్రాప్తి కొరకో అని విజ్ఞానేశ్వరుడన్నాడు. నిజానికైతే దీక్షణీయ ఇష్టియందు సంస్కృతుడైన ఆతనికి అవభృథం కన్న (స్నానం) ముందుకర్మ ప్రాప్తి కొరకు దీక్షితగ్రహణము. అందువల్ల అంతకన్న ముందు నిషేధమే. యజ్ఞమునకు వరణము ప్రారంభము అని ఏదన్నారో అది ఋత్విక్పరమైనది.

మూ॥ తథాచ ఛందోగపరిశిష్టే - నదీక్షిణ్యాఃపరంయజ్ఞే నకృచ్ఛ్రాది తపశ్చరన్, ఇతి. శుద్ధితత్త్వేఽప్యేవం. ఋత్విజాంచమధుపర్కోత్తర మాశౌచాభావః. గృహీత మధుపర్కస్య యజమానాత్తు ఋత్విజః, పశ్చాదశౌచే పతితే నభవేదితినిశ్చయః, ఇతిబ్రాహ్మోత్. అతఏవ రామాండారః - చతుర్ణాంవరణపక్షే అన్యేషామాశౌచే అన్యఆగమయితవ్య, ఇత్యాహ. ఏవం స్మార్తేఽపి తులాకోటిహోమాదౌ మధుపర్కే సతి దోషాభావోజ్ఞేయః యత్తు ప్రారంభోవరణం యజ్ఞే, ఇతి తత్రాపి మధుపర్కాంతం జ్ఞేయం. తేనాధానేష్టి పశుబంధాదౌ తదభావాదన్యే భవంతీ తిసిద్ధం. అపవాదాంతరమాహయాజ్ఞవల్క్యః - వైతానోపాసనాఃకార్యాః క్రియాశ్చశ్రుతి చోదనాత్, తత్రత్యాగమాత్రం స్నానోత్తరం స్వయం కర్తృత్వం. శ్రౌతేకర్మణి తత్కాలం స్నాతశ్శుద్ధి మవాప్నుయాత్ ఇతిస్మృతేః. త్యాగా తిరిక్తే తుశ్రౌతే స్మార్తే చాన్య స్యైవకర్తృత్వం. సూతకే మృతకే చైవ అశక్తౌ శ్రాద్ధ భోజనే ప్రవాసాది నిమిత్తే షహావయేన్నతుహాపయేత్, ఇతిబృహస్పత్యుక్తేః. నిత్యాని నివర్తేరన్వైతాన వర్జ్యం, శాలాగ్నౌచైకేఽన్య ఏతాని కుర్యుః ఇతి పైఠీనసి స్మృతేశ్చేతి విజ్ఞానేశ్వరః. ఏకగ్రహణం పూజార్థం. తేనస్మార్తం కార్యమేవే తిహారలతాయాం. దాక్షిణాత్యాస్తు వికల్ప మాహుః అపరార్కాది నిబంధాస్తు - శ్రౌతం సర్వం స్వయం కార్యం స్మార్తేతు త్యాగాతిరిక్తే అన్యస్యైవకర్తృత్వం. త్యాగమాత్రేతు స్వస్య - కర్మవైతానికం కార్యం స్నానోప స్పర్శవాన్స్వయం, ఇతిహారీతోక్తేః. దర్శంచ పూర్ణమా సంచకర్మ వైతానికంచయత్, సూతకేఽపి త్యజన్ మోహాత్ ప్రాయశ్చిత్తీయతే ద్విజః, ఇతిమరీచ్యుక్తేః. జన్మహాన్యోర్వితానస్య కర్మత్యాగోనవిద్యతే శాలాగ్నౌకేవలోహోమః కార్యఏవాన్య గోత్రజైః ఇతి జాబాలోక్తే శ్చేత్యాహుః. అపరార్కేఽప్యేవం. యాజ్ఞికాఅప్యేవం. సూతకేతు సముత్పన్నే స్మార్తం కర్మకథంభవేత్, పిండయజ్ఞం చరుం హోమమసగోత్రేణ కారయేత్, ఇతిజాతూకర్ణ్యేచ. చరుః=స్మార్త స్థాలీపాకః. శ్రవణాకర్మాదిశ్చేతి విజ్ఞానేశ్వరః. ప్రారబ్ధంతు సపిండే నాపి కార్యం. నచతత్కర్మకుర్వాణః సనాభ్యోఽప్యశుచిర్భవేత్, ఇతిమనూక్తేః. ఛందోగ పరిశిష్టేఽపి - హోమః శ్రౌతేతు కర్తవ్యః శుష్కాన్నేనఫలేనవా, అకృతం హావయేత్ స్మార్తే తదభావేకృతాకృతం. అకృతం వ్రీహ్యాది. కృతాకృతంతండులాది. స్మార్తహోమాదౌతు వికల్పోజ్ఞేయః. శాలాగ్నౌచైక ఇతి ప్రాగుక్తేః. యదాకరణం తదాఽన్యద్వారా. అత్రేదం తత్త్వం యేషాం బహ్వృచాదీనాం ద్వాదశరాత్రమ హోమేఽపినాగ్ని విచ్ఛేదః. తైర్నకార్యం తైత్తిరీయాద్యైఃకార్యం. త్రిరాత్ర(చతూ) మహూయమానోగ్నిర్లౌకికస్సంపద్యతే, ఇతి సుదర్శనభాష్యే వచనాత్ సమారూఢేత్వగ్నౌతేనాపినకార్యం. కింతు పునరాధాన

మేవ. సమారోపప్రత్యవరోహయోరాశౌచాపవాదాభావాదనన్యకర్తృకత్వాచ్చ. అన్యథా పునరాధాన మపి స్యాత్.

అను॥ ఇంకా, ఛందోగపరిశిష్టమందు-దీక్షిణి ఇష్టికన్న పరమైనది లేదు. ఆ యజ్ఞమందు కృచ్ఛ్రాదితప మాచరించినా ఆశౌచం లేదు, అని. శుద్ధి తత్వమందు కూడా ఇట్లాగే ఉంది. ఋత్విక్కులకు మధుపర్కం తరువాత ఆశౌచం లేదు. యజమానుని నుండి ఋత్విక్కులు మధుపర్కం తీసుకున్న తరువాత, ఆశౌచం వస్తే, ఆశౌచముండదు, అని నిశ్చయము అని బ్రాహ్మోక్తి. అందువల్లనే రామాండారుడిట్లా - నలుగురిని వరణంచేసే సందర్భంలో ఇతరులకు ఆశౌచం వస్తే మరోబ్రాహ్మణుని ఆహ్వానం చేయాలి, అని అన్నారు. ఇట్లా స్మార్తమందు కూడా తులాకోటిహోమాదులందు మధుపర్కమిస్తే దోషం లేదు అని గ్రహించాలి. యజ్ఞమునకు వరణము ప్రారంభము, అని ఏదన్నారో అక్కడ కూడా మధుపర్కాంతము అని గ్రహించాలి. అందువల్ల ఆధానేష్టి పశుబంధాదులందు అది (మధుపర్కం) లేనందువల్ల ఇతరులు (బ్రాహ్మణులు) ఔతారని సిద్ధమైంది. యాజ్ఞవల్క్యుడు మరో అపవాదాన్ని చెప్పారు ఇట్లా - శ్రుత ఆదేశానుసారము, వైతాన ఉపాసన క్రియలు (అగ్నిహోత్రం ఆదిగాగల వైతానికాలు, గృహ్యాగ్నివల్ల ఉపాసనకర్మలు, సాయఃప్రాతఃహోమాలు) ఆచరించాలి. అక్కడ త్యాగం మాత్రము స్నానం తరువాత స్వయంగా చేయాలి అని. శ్రౌతకర్మయందు, అప్పుడే స్నానం చేసి శుద్ధినందుతాడు, అని స్మృతి. త్యాగముకన్న వేరైనదైనచో శ్రౌతమందు స్మార్తమందు ఇతరునకే కర్తృత్వము, సూతకమందు మరణాశౌచమందు, అశక్తియందు, శ్రాద్ధభోజనమందు, ప్రవాసాది నిమిత్తములందు ఇతరులతో హోమం చేయించాలి. స్వయంగా చేయరాదు, అని బృహస్పతి వచనం. నిత్యకర్మలను ఆచరించాలి, వైతానకర్మలు తప్ప. ఇతరుల త్యాగాతిరిక్తమైన వానిని శాలాగ్నియందు చేయాలి, అని ఒకరన్నారు, అని పైఠీనసిస్మృతి యందు, అని విజ్ఞానేశ్వరుడన్నాడు. ఏకశబ్ద గ్రహణము గౌరవసూచకము. దీనితో స్మార్తకర్మలు చేయాలి. అని హారలతయందు చెప్పారు. దాక్షిణాత్యులైతే వికల్పం చెప్పారు అపరార్కం ఆదిగాగల నిబంధములైతే శ్రౌతకర్మలన్ని స్వయంగా ఆచరించాలి. స్మార్తకర్మలైతే త్యాగాతిరిక్తమైన వానిని ఇతరులతో చేయించాలి, అని. త్యాగము నందు మాత్రము తనకు (అధికారం) ఉంది. స్నాన ఉపస్పర్శ కలవారే స్వయంగా వైతానిక కర్మ చేయాలి, అని హారీతోక్తి. దర్శము, పౌర్ణమాసము, వైతానిక కర్మ వీనిని సూతకమందైనా మోహంతో వదిలిపెడితే బ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తం కావలసినవాడౌతాడు, అని మరీచివచనం. జన్మ మరణాశౌచములందు వితాన కర్మత్యాగము (గార్హపత్యాది అగ్ని) లేదు అన్యగోత్రజులు శాలాగ్ని యందు కేవలం హోమం మాత్రమే చేయాలి, అని జాబాలోక్తి కూడా, అని అన్నారు. అపరార్కమందు కూడా ఇట్లాగే ఉంది. యాజ్ఞికులు గూడా ఇట్లాగే చెప్పారు. సూతకం వస్తే స్మార్తకర్మ ఎట్లా చేయాలి.

పిండపితృయజ్ఞం, చరుహోమము, అసగోత్రునితో చేయించాలి, అని జాతూకర్ణియందు కలదు. చరువనగా స్మార్త స్థాలీపాకము శ్రవణాకర్మాది అని విజ్ఞానేశ్వరుడన్నాడు. ఆరంభించిన దాన్నైతే సపిండునితోనైనా చేయించవచ్చు. ఆ పనిచేస్తున్నవారు జ్ఞాతులైనా (గర్భసంబంధం, తల్లి ఒకతి తండ్రులిద్దరు) (పితృసపిండ) అపవిత్రులు కారు, అని మనూక్తి. ఛందోగ పరిశిష్టమందు కూడా - శ్రౌతమందు, శుష్కాన్నముతో కాని, ఫలముతో కాని హోమం చేయాలి. స్మార్తమందు అకృతం హోమం చేయాలి. అదిలేకపోతే కృతాకృతముతో హోమము అకృతమనగా వ్రీహ్యాదులు, కృతాకృతమనగా తండులాదులు. స్మార్తహోమాదులందు వికల్పమని గ్రహించాలి. శాలాగ్ని యందును అని ఒకరన్నారు. అని ముందు చెప్పాము ఒకవేళ చేస్తే అప్పుడు ఇతరులతో చేయించాలి. ఇక్కడ ఇది తత్వము - బహ్వృచులకు పన్నెండు రాత్రులు హోమం లేక పోయినా అగ్నివిచ్ఛేదం లేదు కనుక వారు చేయాల్సిన పనిలేదు. తైత్తిరీయాదులు ఆచరించాలి. మూడు (నాల్గు)రాత్రులు హోమం చేయకపోతే అగ్ని లౌకికమైపోతుంది. అని సుదర్శనభాష్యమందు వచనము. (సమారూఢ) అగ్ని ఉంటే వారుకూడా చేయరాదు. కాని తిరిగి ఆధానం మాత్రమే చేయాలి. సమారోప, ప్రత్యవరోహములకు ఆశౌచాపవాదం లేదు కనుక, మరొకరు కర్త అయ్యే వీలులేదు కనుక. లేకుంటే పునరాధానం గూడా ఉండేది.

**మూ॥ యత్త్వాశ్వలాయనః - తౌవాపిసూతకేశావే పర్వణీష్టిం మహాపది, పుష్పవత్యాంచ భార్యాయాం నకుర్యాత్తుకదాచన. స్మార్తాగ్నిఃసూతకేశావే స్వయం నజుహుయాద్ద్విజః, శ్రౌతాగ్నిస్తు సకృద్ధుత్వాసమాప్తే వాస్వయంహునేత్, ఇతి. తదపిసమారూఢపరం - తదాహస ఏవ - స్మార్తాగ్నిరాత్మనోఽన్యేషామ భావే సూతకాదిషు, సమారోప్యతదంతేతు విహృత్య జుహుయాత్స్వయం, ఇతి. తథామనుః - ప్రత్యూహేన్నాగ్ని షుక్రియాః, ఇతివైశ్వదేవస్యత్వగ్ని సాధ్యత్వేఽపి వచనాన్నివృత్తిః . విప్రోదశాహమాసీతవైశ్వదేవవివర్జితః, ఇతి సంవర్తోక్తేః. యద్యపి - పంచయజ్ఞ విధానంతు నకుర్యాన్మృత్యుజన్మనోః, ఇతితేనైవోక్తేః పూర్వనిషేధోవ్యర్థః, తథాప్యాపస్తం బాదీనాం వైశ్వ దేవస్యపంచయజ్ఞభిన్నత్వాత్ పృథక్ నిషేధః. హరదత్తస్త్వాశౌచేఽపి బహ్వృచైర్వైశ్వదేవః కార్యః, తస్యద్వావనధ్యాయౌ యదాత్మాఽశుచిర్యద్దేశః, ఇతి బ్రహ్మ యజ్ఞస్యైవాశౌచే విశిష్యనిషేధాత్. సంధ్యాదీనామప్యపవాదమాహ అపరార్కేపులస్త్యః - సంధ్యామిష్టించరుం హోమం యావజ్జీవం సమాచరేత్, నత్యజేత్సూతకేవాపిత్యజన్ గచ్ఛేదధోద్విజః. సూతకేమృత కేచైవ సంధ్యాకర్మ సమాచరేత్, మనసోచ్చారయేన్మంత్రాన్ ప్రాణాయామమృతేద్విజః. యత్తు చంద్రికాయాంజాబాలః - సంధ్యా పంచమహాయజ్ఞానైత్యకం స్మృతి కర్మచ, తన్మధ్యేహాపయే త్తేషాందశాహాంతే పునఃక్రియా, ఇతి యచ్చసంవర్తే: - సూతకేకర్మణాం త్యాగః సంధ్యాదీనాం విధీయతే, యచ్చ విష్ణుపురాణే - సర్వకాల ముపాస్యాతు సంధ్యయోః పార్థివేష్యతే అన్యత్రసూతకాశౌచ విభ్రమాతురభీతితః, ఇతితత్పూర్వ సంధ్యాపరం. అర్ఘ్యాంతా మానసీ సంధ్యాకుశవారివివర్జితా, ఇతి శుద్ధి దీపేచ్యవనోక్తేః. పైఠీనసిస్త్వర్ఘ్యే మంత్రోచ్చారణమాహ. సూతకే సావిత్ర్యాంజలిం ప్రక్షిప్య**

సూర్యంధ్యాయన్నమస్కుర్యాత్ ప్రయోగ పారిజాతే భరద్వాజోఽపి - సూతకే మృతకేకుర్యాత్ ప్రాణాయామమమంత్రకం. తథా మార్జన మంత్రాంస్తు మన సోచ్చార్య మార్జయేత్. గాయత్రీం సమ్యగుచ్చార్య సూర్యాయార్ఘ్యం నివేదయేత్, మార్జనంతునవాకార్యం ఉపస్థానం న చైవహి **గ్రహణే శ్రాద్ధా దావప్యా శౌచాప వాదమా హవ్యాప్తః** - స్మార్తకర్మ పరిత్యాగో రాహోరన్యత్ర సూతకే, ఇతి. లైంగేఽపి - సూతకేమృతకేచైవ న దోషోరాహుదర్శనే, **తావదేవభవేచ్ఛుద్ధిః యావన్ముక్తిర్న దృశ్యతే. ప్రయోగపారిజాతే** బృహస్పతిః - కన్యావివాహే సంక్రాంతౌ సూతకం నకదాచన. **వృద్ధ శాతాతపః** - యదాభోజనకాలేతు అశుచిర్భవతి ద్విజః, భూమౌనిక్షిప్యతం గ్రాసం **స్నాత్వావిప్రో విశుద్ధ్యతి.**

అను॥ ఆశ్వలాయనుడిట్లా - శ్రౌతస్మార్తాగ్నులను, సూతకమందు, మరణాశౌచ మందు, పర్వమందలి ఇష్టియందు, మహాపద మందు, భార్య పుష్పవతియైనప్పుడు ఎప్పుడూ చేయరాదు. ద్విజుడు, సూతకమందు కాని శావమందు కాని స్మార్తాగ్నిని స్వయంగా హోమం చేయరాదు. శ్రౌతాగ్నిని ఒకసారి హోమం చేసి లేదా సమాప్తి యందు స్వయంగా హోమం చేయాలి అని. అదిగూడా సమారూఢపరమే. దానిని అతడే ఇట్లా చెప్పాడు. - సూతకాదులందు, స్మార్తాగ్ని తనది, ఇతరులది లేకపోతే, ఆ అగ్నిని స్థాపించి దాని అంతమందు ఆనందంగా స్వయంగా హోమం చేయాలి. అని. అట్లాగే మనువు - అగ్నులందు చేయాల్సిన క్రియలను ఆపరాదు, అని వైశ్వ దేవం అగ్ని సాధ్యమైనా వచనంతో నివృత్తి. విప్రుడు వైశ్వదేవం లేకుండా పదిరోజులుండాలి. అని సంవర్తోక్తి. మరణ, జననాశౌచము లందు పంచయజ్ఞ విధానము చేయరాదు, అని అతడే చెప్పినందువల్ల పూర్వనిషేధమువ్యర్థము కదా అంటే అట్లాగైనా ఆపస్తంబాదులకు వైశ్వదేవం పంచయజ్ఞభిన్నమైనందువల్ల విడిగా నిషేధము. హరదత్తుడైతే, ఆశౌచమందును బహ్వృచులు వైశ్వదేవమాచరించాలి. వారికి రెండు అనధ్యాయములు. ఆత్మ అశుచియైతే ఒకటి. దేశం అశౌచమైతే మరొకటి, అని బ్రహ్మయజ్ఞాన్నే ఆశౌచమందు విశేషించి నిషేధించారు. సంధ్యాదులకు గూడా అపవాదాన్ని చెప్పాడు. అపరార్కమందు పులస్త్యుడు - సంధ్యను, ఇష్టిని, చరువును హోమమును బ్రతికినంత కాలం ఆచరించాలి. సూతకమందును వానిని విడువరాదు. విడిచిపెడితే, బ్రాహ్మణుడు పతితుడౌతాడు, అని సూతకమందు మృతాశౌచమందు సంధ్యాకర్మ చేయాలి. ద్విజుడు ప్రాణాయామాన్ని వదలి, మంత్రములను మనస్సుతో ఉచ్చరిస్తూ, సంధ్య చేయాలి. చంద్రికయందు జాబాలి ఇట్లా - సంధ్య, పంచమహాయజ్ఞములు. స్మృతులందు చెప్పబడిన నిత్యకర్మ వీనిని సూతకం మధ్యలో విడిచిపెట్టాలి. దశాహ అంతమందు తిరిగి ఆచరించాలి, అని ఏదన్నాడో, సంవర్తుడిట్లా - సూతకమందు సంధ్యాదికర్మల త్యాగం విధించబడుతుంది, అని అన్నాడో; విష్ణుపురాణమందిట్లా - సూతకము, ఆశౌచము, మతిభ్రమణము కలవాడు ఆతురుడు, భయస్థుడు వీరు తప్ప సంధ్యను అన్ని కాలములందు ఉపాసించటం తగును,

ఓ రాజ!, అని ఏదన్నారో ఈ మూడు అంశములు ఇవి పూర్ణసంధ్యా విషయకములు. అర్ఘ్యాంతమువరకు, మానసికమైన సంధ్య, కుశలు, నీళ్ళు లేకుండా ఆచరించాలి, అని శుద్ధి దీపమందు చ్యవనోక్తి. పైరీనసియైతే అర్ఘ్యమందు మంత్రోచ్చారణాన్ని చెప్పాడు. ఇట్లా - సూతకమందు సావిత్రి (గాయత్రి)తో అంజలిని వదలి సూర్యుణ్ణి ధ్యానిస్తూ నమస్కరించాలి, అని. ప్రయోగ పారిజాతమందు భరద్వాజుడు కూడా - జనన మరణాశౌచములందు మంత్రం లేకుండా ప్రాణాయామం చేయాలి. అట్లాగే మార్జన మంత్రములను మనస్సుతో ఉచ్చరించి మార్జనం చేయాలి, అని. గాయత్రిని చక్కగా ఉచ్చరించి సూర్యునకు అర్ఘ్యమివ్వాలి. మార్జనం చేయవచ్చు లేదా వదలొచ్చు. ఉపస్థానం లేదు. గ్రహణమందు శ్రాద్ధాదులందు కూడా ఆశౌచమునకు అపవాదాన్ని వ్యాఘ్రుడిట్లా చెప్పాడు - గ్రహణం కన్న ఇతరమైన సూతకమందు స్మార్తకర్మ పరిత్యాగము, అని. లైంగమందు కూడా - జనన మరణాశౌచ మందు, గ్రహణం చూస్తే దోషం లేదు. ఎంతవరకైతే గ్రహణమోక్షం చూడరో అంతవరకే శుద్ధి వుంటుంది, అని. ప్రయోగ పారిజాతమందు బృహస్పతి ఇట్లా - కన్యావివాహమందు, సంక్రమణమందు ఎప్పుడూ సూతకం లేదు, అని. (మరో ముహూర్తం దొరకకపోతే). వృద్ధ శాతాతపుడిట్లా - ద్విజుడు భోజనకాలమందు అశుచియైతే, ఆ ఆహారాన్ని భూమిపై ఉంచి స్నానం చేసివస్తే విప్రుడు శుద్ధుడౌతాడు అని (పారేసి).

**మూ॥ భక్షయిత్వాతు తంగ్రాసమహోరాత్రేణశుద్ధ్యతి, అశిత్వాసర్వమేవాన్నం త్రిరాత్రేణ విశుద్ధ్యతి. ఇదమ విశేషాత్ సూతకాది పరమపీతి శుద్ధి తత్వేశూలపాణౌచ. అథద్రవ్యతః మరీచిః - లవణే మధుమాంసేచ పుష్పమూలఫలేషుచ, శాకకాష్ఠతృణేష్వప్సుదధిసర్పిః పయఃసుచ. తిలౌషధాజినేచైవ పక్వాపక్వేస్వయంగ్రహః, పణ్యేషుచైవ సర్వేషునాశౌచం మృతసూతకే. స్వయమేవ స్వామ్యనుజ్ఞయాగ్రాహ్యంనతద్ధస్తాదిత్యర్థః. క్రయేతు తద్ధస్తాదపినదోషః. పక్వం లడ్డుకాది. అపక్వం తండులాది. ఏతదన్న సత్రపరం. అన్నసత్రే ప్రవృత్తానాం ఆమమన్నమగర్హితం, భుక్త్వాపక్వాన్నమే తేషాం త్రిరాత్రంతువ్రతీభవేత్ ఇత్యంగిరసోక్తేః పక్వాన్నం మోదకాది నతుభక్ష్యం. షట్త్రింశన్మతే - ఉభాభ్యామ పరిజ్ఞాతే సూతకం నైవదోషకృత్, ఏకే నాపి పరిజ్ఞాతే భోక్తుర్దోషముపావహేత్ వివాహోత్సవయజ్ఞేషుత్వంతరామృతసూతకే పరైరన్నం ప్రదాతవ్యం భోక్తవ్యంచద్విజోత్తమైః. భుంజానేషుతు విప్రేషు త్వంతరామృతసూతకే, అన్యగేహోదకాచాంతాః సర్వేతేశుచయస్స్మృతాః. బృహస్పతిః - వివాహోత్సవ, ఇత్యాద్యుక్త్వా - పూర్వ సంకల్పితాన్నేషు నదోషః పరికీర్తితః షడశీతౌ - సంసర్గాద్యస్యవాశౌచం యస్యాతిక్రాంతకాలతా, తదీయస్యపదార్థస్యనాశౌచం విద్యతేక్వచిత్. శుద్ధితత్వే - శుద్ధ్యేత్ ఇత్యనువృత్తౌ. విష్ణుః - ప్రోక్షణేనచ పుస్తకం, ఇతి. అథమృతదోషేహేమాద్రౌ షట్ త్రింశన్మతే కౌర్మేచ - వ్యాపాదయేద్య ఆత్మానం స్వయమగ్న్యుదకాదిభిః, విహితం తస్యనాశౌచం నాపికార్యోదక క్రియా. శవదర్శనం యావదాశౌచమస్త్యేవ, హతానాం నృపగోవిప్రైరన్వక్షంచాత్మ ఘాతినాం, ఇతియాజ్ఞవల్క్యోక్తేః. శుద్ధితత్వేకౌర్మే - సద్యఃశౌచం సమాఖ్యాతం శాపాది మరణేతథా, ఆదిపదాదభి చారహతే. భవిష్యే - స్వేచ్ఛయామరణం విప్రాచ్ఛృంగి దంష్ట్రిసరీసృపైః, అంత్యాంత్యజ**

విషోద్బంధైరాత్మనాచైవ తాడనైః. పాఖండ మాశ్రితాశ్చైవ మహాపాతకినస్తథా, స్త్రియశ్చవ్యభిచారిణ్యః ఆరూఢపతితాస్తథా. నతేషాం స్నానసంస్కారో నశ్రాద్ధం నసపిండనం. గౌతమః - ప్రాయో నాశక శస్త్రాగ్ని విషోదకోద్బంధనప్రపతనైశ్చేచ్ఛతాం, ఇతి. నాశౌచ మితిశేషః. అంగిరాః- చండాలా దుదకాత్సర్వాత్ బ్రాహ్మణాద్వైద్యుతాదపి, దంష్ట్రిభ్యశ్చ పశుభ్యశ్చమరణం పాపకర్మణాం, ఉదకం పిండదానం చ ప్రేతేభ్యోయత్ప్రదీయతే, నోపతిష్ఠతితత్సర్వం అంతరిక్షేవినశ్యతి. షట్త్రింశన్మతే ప్యేవం.

అను॥ ఆగ్రాసమును తింటే అహోరాత్రంతో శుద్ధుడౌతాడు (గ్రాసము అనగా మూతినిండా) మొత్తం అన్నాన్ని తింటే మూడు రాత్రులతో శుచిఔతాడు. ఇందులో విశేషం లేనందువల్ల ఇది సూతకాది పరము కూడా అని శుద్ధితత్వమందు, శూలపాణి యందును చెప్పారు. ఇక ద్రవ్యంతో ఆశౌచమిట్లా - మరీచి ఇట్లా - ఉప్పు, తేనె, మాంసము, పూలు, పండ్లు, మూలములు (దుంపలు), శాకములు, కట్టెలు, గడ్డి, నీరు, పెరుగు, నెయ్యి, పాలు, నువ్వులు, మందులు, జింకచర్మము, పక్వము (లడ్డు మొదలగునవి), అపక్వము (బియ్యము మొదలగునవి) ఇవన్ని మృతాశౌచమందు, జననాశౌచమందు బజారునుండి స్వయంగా తెచ్చుకుంటే ఆశౌచం లేదు. అని స్వయంగా, స్వామి ఆజ్ఞతో తెచ్చుకోవాలి. స్వామి హస్తంనుండి కాదు అని అర్థము. దుకాణం నుండి (వెల ఇచ్చి) తెస్తే ఆతని చేతి నుండి తెచ్చుకున్నా దోషం లేదు ఇది అన్నసత్ర పరము. అన్న సత్రమందున్నవారికి (ప్రవృత్తులు) ఆమ అన్నము నిందితము కాదు. వీరిపక్వాన్నము తింటే మూడు రాత్రులు వ్రతికావాలి, అని అంగిరసోక్తి. పక్వాన్నములడ్డు మొదలగునవి. ఇతర భక్ష్యము కాదు. షట్త్రింశన్మతమందిట్లా - ఇద్దరికి (ఇచ్చి, పుచ్చుకొను) తెలియకపోతే సూతకము దోషకారి కాదు. ఒకరికి తెలిసినా భోక్తకు దోషం కల్గుతుంది. వివాహము, ఉత్సవము, యజ్ఞము వీనిమధ్యలో మృతాశౌచం లేదా జననాశౌచం వస్తే వేరే గోత్రం వాళ్ళు (పరులు) అన్నం పెట్టాలి (పక్వమో, అపక్వమో) ద్విజోత్తములు భుజించాలి, అని. బ్రాహ్మణులు భుజిస్తుండగా మధ్యలో ప్రసూతి లేదా మరణంనకు చెందిన ఆశౌచం వస్తే, వేరే ఇంటినీటితో ఆచమనం చేసిన వారంతా శుచులౌతారు. బృహస్పతి - వివాహ ఉత్సవ అని మొదలుగా చెప్పి, పూర్వ సంకల్పితాన్నమందు దోషం లేదన్నాడు. (మొదలే వారికై తీసిపెడితే). షడశీతియందిట్లా - ఎవనికి సంసర్గంవల్ల ఆశౌచమో, దేని కాలం గడిచిపోయిందో, వాని పదార్థమందు ఆశౌచం ఎప్పుడూ ఉండదు, అని. శుద్ధితత్వమందిట్లా - శుద్ధినందుతుంది, అని అను వృత్తి చేసుకుంటే, అని అనగా విష్ణువిట్లా అన్నాడు - ప్రోక్షణంతో పుస్తకం (శుద్ధినందుతుంది) అని. ఇక మృతదోషమందు - హేమాద్రియందు, షట్త్రింశన్మతమందు, కౌర్మమందిట్లా - తనను తాను అగ్ని ఉదకం మొదలగు వాటితో ఎవడు చంపుకుంటాడో, వానికి ఆశౌచం లేదు. వానికి ఉదకక్రియ చేయటమూ విధించలేదు, అని శవదర్శనం అవుతున్నంతవరకు ఆశౌచమే. నృపుడు, గోవు, విప్రుడు వీరిచే మరణించినవారికి, ఆత్మహత్య చేసుకున్నవారికి

(చెందిన ఆశౌచంలో) వెంటనే శుద్ధి (విప్రుడు చండాలుని శిక్షిస్తే) అని యాజ్ఞవల్క్యోక్తి. శుద్ధి తత్వమందు కౌర్మోక్తి ఇట్లా - శాపాది మరణమందును సద్యఃశౌచము అని చెప్పారు, అని. ఆదిపదంవల్ల అభిచారహతుడైతే అని. భవిష్యమందిట్లా - తనంత తాను మరణిస్తే, విప్రుని వల్ల మరణిస్తే, కొమ్ములు కోరలు గల జంతువులతో పాకే జంతువులతో మరణిస్తే, అంత్య, అంత్యజులవల్ల, విషము, తనంత తాను ఉరేసుకొనటం, తనంత తాను కొట్టు కోవటం వీటివల్ల మరణిస్తే పాఖండమతాన్ని ఆశ్రయించిన వారు, మహాపాతకులు, వ్యభిచారం చేసే స్త్రీలు వీరు మరణిస్తే, ఎత్తుకెక్కి క్రిందపడటం వల్ల మరణిస్తే, ఇలాంటి మరణాలకు స్నాన సంస్కారములు లేవు, శ్రాద్ధము లేదు. సపిండనము లేదు అని. గౌతముడిట్లా - ప్రాయోపవేశము, ఆహారం లేకపోవటం వీటివల్ల, శస్త్రము, అగ్ని, విషము, ఉదకము, ఉరి, పడటం, వీటివల్లనూ మరణించేవారికి, అని. ఆశౌచము లేదు అని ముగింపు. అంగిరుడిట్లా - చండాలుడు, నీరు, సర్పము, బ్రాహ్మణుడు, పిడుగు, వీటివల్ల కోరలుగల వానితో పశువులతోనూ పాపకర్ములకు మరణము. ఈ ప్రేతలకై ఉదకం పిండదానం ఏదైనా ఇస్తే అదంతా అంతరిక్షంలోనే నశిస్తుంది. వారికి చేరదు అని. షట్ త్రింశన్మత మందు కూడా ఇట్లాగే చెప్పబడింది.

మూ॥ బ్రాహ్మేఽపి - శృంగి దంష్ట్రి నఖివ్యాల విషవహ్నిస్త్రియాజలైః, వ్యాలోగజః. సుదూరాత్పరిహర్తవ్యః కుర్వన్ క్రీడాంమృతస్తుయః, నాగానాం విప్రియంకుర్వన్ హత శ్చాప్యథవిద్యుతా నిగృహీతః స్వయంరాజ్ఞా చౌర్యదోషేణ కుత్రచిత్, పరదారాన్హరంతశ్చ ద్వేషాత్ తత్పతిభిర్హతాః అసమానైశ్చ సంకీర్ణైః చాండాలాద్యైశ్చ విగ్రహం, కృత్వాతైర్నిహతాః తద్వచ్చాండాలాదీన్ సమా శ్రితాః. శస్త్రాగ్నిగరదాశ్చైవ పాఖండాః క్రూరబుద్ధయః, క్రోధాత్ప్రాయం విషం వహ్నిం శస్త్ర ముద్బంధనం జలం. గిరివృక్ష ప్రపాతంచ యే కుర్వంతినరాధమాః, కుశిల్పజీవినోయేచ సూనాలంకార ధారిణః,ముఖేభగాస్తు యేకేచిత్క్లీబప్రాయనపుంసకాః, బ్రహ్మదండహతాయేచయేచాపి బ్రాహ్మణై ర్హతాః, మహాపాతకినోయేచ పతితాస్తేప్రకీర్తితాః. పతితానాం నదాహఃస్యాత్ నాంత్యేష్టిః నాస్థి సంచయః, నచాశ్రుపాతం పిండోవాకార్యం శ్రాద్ధాదికంక్వచిత్. ఏతాని పతితానాంతుయః కరోతి విమోహితః. తప్త కృచ్ఛ్రద్వయేనైవతస్య శ్శుద్ధిర్న చాన్యథా. ఏతద్బుద్ధి పూర్వం సర్వే షాంకరణేతు మాధవీయే వసిష్ఠః-యః ఆత్మత్యాగినాం కుర్యాత్ స్నేహాత్ప్రేతక్రియాంద్విజః, సతప్తకృచ్ఛ్ర సహితంచరేచ్చాంద్రా యణం వ్రతం. అజ్ఞానేతు - కృత్వాగ్ని ముదకం స్నానం సంస్పర్శం వహనం కథాం, రజ్జుచ్ఛేదాశ్రుపాతంచ తప్త కృచ్ఛ్రేణశుద్ధ్యతి, ఇతిజ్ఞేయం. ప్రత్యేకం బుద్ధిపూర్వే ఏ తదితి మదన పారిజాతః. ప్రత్యేకంతు స్పర్శాశ్రుణోః మితాక్షరాయాం - తచ్ఛవం కేవలం స్పృష్ట మశ్రుయావతితం యది, పూర్వోక్తనామకారీ చేదైకరాత్రమభోజనం. ఏకరాత్రంతునాశ్నీయాత్త్రిరాత్రం బుద్ధిపూర్వకం, ఇతిమాధవీయే ఉత్తరార్థం. అన్యేషుసంవర్తః - ఏషామన్యతమం ప్రేతం యోవహేత దహేతవా, కటోదకక్రియాంకృత్వా కృచ్ఛ్రం సాంతపనంచరేత్ అజ్ఞానేత్వర్ధం. ఏతదనాహితాగ్నేః కృచ్ఛ్ర ఏవేతి మాధవః. మితాక్షరాయాం - ఆత్మనస్త్యాగి నాంనాస్తి

**పతితానాంతథాక్రియా, తేషామపితథా గంగాతోయే సంస్థాపనం హితం. అహితాగ్నేస్తు విశేషోహేమాద్రౌభవిష్యే – వైతానం ప్రక్షిపేదప్సు అవసథ్యంచతుష్పథే, పాత్రాణి చదహేదగ్నౌ సాగ్నికే పాపకర్మణి.**

అను|| బ్రాహ్మమందు కూడా – శృంగములతో, కోరలతో, గోళ్ళతో, వ్యాళముతో, విష, వహ్ని, జలక్రియలతో మరణిస్తే పిండజలదానాదులిస్తే అంతరిక్షంలో నష్ట మౌతాయి, అతనికి చేరవు. వ్యాళము అనగా గజము. మృతుని ఆట ఆడుతూ మరణించిన వానిని సుదూరం నుండే విడువాలి. పాములకు అపకారం చేయబోయి మరణించిన, పిడుగువల్ల మరణించిన, రాజు వీడు దొంగ అని స్వయంగా ఎక్కడైన పట్టుకున్నచో వాడు మరణించిన పరస్త్రీలను హరించు వానిని వారి భర్తలు ద్వేషంతో చంపినచో అట్లా మరణించిన వారికి దూరంగా ఉండాలి. అసమానులతో సంకీర్ణులతో చాండాలాదులతో తగాదా పెట్టుకొని వారితో చంపబడినవారికి, అట్లా చాండాలాదులను సమాశ్రయించినవారికి, దూరంగా ఉండాలి. శస్త్రము, అగ్ని, విషము పెట్టువాడు, పాఖండుడు, క్రూరబుద్ధి కలవారు వీరికి దూరంగా ఉండాలి. కోపంతో ప్రాయోపవేశము, విషము, అగ్ని, శస్త్రము, ఉరి, నీరు గుట్టలమీంచి చెట్ల మీంచి పడటం చేసే నరాధములు, కుత్సితమైన శిల్పవిద్యతో జీవించేవారు (చర్మశిల్పి) వధ్యస్థానమునందలి అలంకారములు ధరించేవారు, ముఖమందు భగముగలవారు ఎవరోకొందరు క్లీబప్రాయులు, నపుంసకులు, బ్రహ్మదండహతులు, బ్రాహ్మణహతులు మహాపాతకులు, వీళ్ళంతా పతితులని పిలువబడ్డారు. పతితులకు దాహముండదు. అంత్యేష్టి, అస్థి సంచయము, ఏడవటము పిండము ఇవేవీ ఉండవు. శ్రాద్ధాదికము ఇవన్నీ చేయరాదు. పతితులకు, వీటిని మోహితుడై ఎవడైనా ఆచరిస్తే వానికి రెండు తప్త కృచ్ఛ్రములతో శుద్ధి. మరోరకంగా లేదు. దీనిని బుద్ధిపూర్వకముగా అందరికి చేస్తే మాధవీయమందు వసిష్ఠోక్తి ఇట్లా – ఆత్మహత్య చేసుకున్నవారికి స్నేహంతో ప్రేతక్రియను ద్విజుడు చేస్తే, వాడు తప్తకృచ్ఛ్రంతో పాటు చాంద్రాయణవ్రతాన్ని ఆచరించాలి, అని. తెలియకచేస్తే – అగ్ని ఉదకము, స్నానము, స్పర్శమోయటం వాని వృత్తాంతము, రజ్జుచ్ఛేదము, ఏడ్పుట ఇవన్నీ పాతకి మరణమందు తెలియక చేస్తే, తప్తకృచ్ఛ్రంతో శుద్ధుడౌతాడు, అని తెలుసుకోవాలి. ప్రత్యేకించి బుద్ధిపూర్వకమైతే, ఇది అని మదనపారిజాతమందుంది. స్పర్శ, కన్నీరు వీనికై ప్రత్యేకించి మితాక్షరయందిట్లా – పై శవాలనుకేవలం ముట్టటం లేదా వానికై కన్నీరు కార్చటం, మిగిలినవి ముందు చెప్పినవేవీ చేయకుండా ఈ రెండే చేస్తే ఒక రాత్రి భుజించకుండా ఉంటే చాలు. తెలియకచేస్తే ఒక రాత్రి తినకుంటే చాలు బుద్ధిపూర్వకంగా చేస్తే మూడు రాత్రులు భుజించరాదు. అని మాధవీయమందు ఉత్తరార్థము వేరేవానియందు సంవర్తుడిట్లా – వీనిలో ఒక ప్రేతను మోసినా కాల్చినా, కటోదకక్రియ (ప్రేతకై నీళ్ళొదలటం) చేసినా కృచ్ఛ్ర సాంతపనమాచరించాలి, అని. తెలియకఐతే సగం

(అర్ధకృచ్ఛ్ర సాంతపనం). ఇది, అనాహితాగ్నికైతే కృచ్ఛ్రమే అని మాధవుడన్నాడు. మితాక్షరమందిట్లా ఆత్మహత్య చేసుకున్నవారికి పతితులకు క్రియలేదు. వారిని గంగాజలమందు ఉంచటం హితము, అని ఆహితాగ్నికైతే విశేషాన్ని హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా - వైతానమును (అగ్ని) నీటిలో పారవేయాలి. ఆవసథ్యమును (స్మార్తాగ్ని) కూడలి మార్గంలో (చతుష్పథం) వేయాలి. సాగ్నికుడు పాపకర్మచేస్తే పాత్రలను అగ్నిలో కాల్చాలి, అని. (ఆత్మహత్య చేసుకుంటే).

**మూ॥ ఛందోగపరిశిష్టేఽపి - మహాపాతక సంయుక్తోదౌరాత్మ్యాదగ్నిమాన్యది, పుత్రాదిఃపాలయేదగ్నీన్ యుక్త ఆదోష సంక్షయాత్. ప్రాయశ్చిత్తంనకుర్యాద్యఃకుర్వన్ వామ్రియతే యది. గృహ్యం నిర్వాపయేచ్ఛ్రౌత మప్స్వస్యేత్ సపరిచ్ఛదం. పాత్రాణిదద్యాద్విప్రాయదహేదప్స్వేవ వాక్షిపేత్. మాధవీయే పరాశరః - ఆహితాగ్నిర్మృతో విప్రశ్చాండాలేనాత్మఘాతకః, దహేత బ్రాహ్మణం విప్రోలౌకాగ్నౌ మంత్రవర్జితం. ప్రాజాపత్యం చరేత్పశ్చాద్విప్రాణామనుశాసనాత్, దగ్ధాస్థీని పునర్గృహ్యక్షీరేణ క్షాలయేత్తతః. స్వేనాగ్నినా స్వమంత్రేణ పృథగేనం పునర్దహేత్. హేమాద్రౌతు - దాహయిత్వాశవంతేషాం శూద్రైరవిధి పూర్వకం, ఇత్యుక్తం. ఏతద్దర్భాదినా మరణేజ్ఞేయం. తాంస్తే ప్రేత్యాపి గచ్ఛంతియేకే చాత్మహనోజనాః, ఇతి శ్రుతావాత్మహననే ఏవదోషోక్తేః. ప్రమాదమరణేతు ఆశౌచాది సర్వంభవత్యేవ. తదాహాంగిరాః - అథకశ్చిత్ప్రమాదేన మ్రియేత తాగ్న్యుదకాదిభిః, తస్యాశౌచం విధాతవ్యం కర్తవ్యాచోదకక్రియా. బ్రాహ్మేఽపి - ప్రమాదాదపినిః శంకస్త్వకస్మాద్విధి చోదితః, శృంగిదం ష్ట్రినఖివ్యాలవిషవిద్యుజ్జలా దిభిః, చాండాలైరథవాచౌరైర్నిహతో వాపికుత్రచిత్ తస్యదాహాదికం కార్యం యస్మాన్న పతితస్తుసః, ఇతి. ప్రమాదమరణే త్రిరాత్ర మాశౌచమితి గౌడాః, శుద్ధితత్వాదయః, దశాహాదితిదాక్షిణాత్యాః. అస్యాపవాదోహేమాద్రౌ భవిష్యే - ప్రమాదాదిచ్ఛయావాపి నకుర్యాత్సర్పతోమృతే. నాగపూజాం వినా నకుర్యాదిత్యర్థః. బౌధాయనోఽపి - బుద్ధిపూర్వాత్మ హంతౄణాం క్రియాలోపో విధీయతే. క్రియాంత్యకర్మ. తత్రదుర్మరణ నిమిత్తం దానాది కార్యం. తచ్చ విశ్వ ప్రకాశాదౌ శాతాతపీయేచ - వ్యాఘ్రేణనిహతే విప్రే విప్రకన్యాం వివాహయేత్, సర్పదష్టే నాగబలిఃదేయః సర్పశ్చ కాంచనః. చతుర్నిష్కమితం హైమం గజందద్యాద్గజైర్హతే, రాజ్ఞా వినిహతే దద్యాత్ పురుషంతు హిరణ్మయం. చౌరేణనిహతే ధేనుం వైరిణానిహతేవృషం. వృషేణ నిహతే దద్యాత్యధాశక్త్యా తుకాంచనం. శయ్యామృతే ప్రదాతవ్యాశయ్యాతూలీసమన్వితా, నిష్కమాత్ర సువర్ణస్య విష్ణునాసమధిష్ఠితా. శౌచహీనే మృతే చైవ ద్వినిష్కం స్వర్ణ జంహరిం, సంస్కారహీనే చమృతేకుమారము పనాయయేత్. నిష్కత్రయ స్వర్ణమితం దద్యాదశ్వం హయాహతే, శునాహతే క్షేత్రపాలం స్థాపయేన్నిజశక్తితః. సూకరేణ హతేదద్యాత్ మహిషం దక్షిణాన్వితం, కృమిభిశ్చహతే దద్యాద్గోధూమాన్పంచఖారికాః, వృక్షం వృక్ష హతే దద్యాత్ సౌవర్ణం వస్త్రసంయుతం, శృంగిణా నిహతే దద్యాత్ వృషభం వస్త్రసంయుతం.**

అను॥ ఛందోగపరిశిష్టమందు కూడా - అగ్నిహోత్రి, దురాత్ముడైనందు వల్ల మహాపాతకయుక్తుడైతే, ఆ అగ్నులను తండ్రి దోషసంక్షయం అయ్యేవరకు పుత్రులు రక్షించుట

తగును, అని. ప్రాయశ్చితం చేసుకోకపోతే, లేదా చేసుకుంటుండగా మరణిస్తేనో, గృహ్యాగ్నిని నాలుగుదారుల కూడలిలో శాంతపరచాలి, శ్రౌతాగ్నిని అన్ని వస్తువులతో పాటు నీటిలో వేయాలి పాత్రలను విప్రునకివ్వాలి, లేదా కాల్చాలి, లేదా నీటియందైనా పారవేయాలి, అని. మాధవీయమందు పరాశరోక్తి ఇట్లా – ఆహితాగ్నియైన విప్రుడు చండాలుని ద్వారా లేదా ఆత్మహత్య చేసుకొనో మరణిస్తే అట్లాంటి బ్రాహ్మణుని మరో బ్రాహ్మణుడు లౌకికాగ్నియందు మంత్రములు లేకుండా దహనం చేయాలి,అని. ఆ పిదప బ్రాహ్మణుల అనుజ్ఞతో ప్రాజా పత్యం ఆచరించాలి. కాలిన అస్థులను తిరిగి తీసుకొని, పిదప పాలతో కడగాలి. తన అగ్నితో, తన మంత్రంతో విడిగా ఈతనిని (అస్థులను) తిరిగి దహించాలి. హేమాద్రి యందైతే – వారి శవాన్ని శూద్రులతో శాస్త్ర ప్రకారం కాకుండా, దహింప చేయాలి,అని, చెప్పారు. ఇది అభిమానంతో మరణిస్తే, అప్పుడు అని గ్రహించాలి. ఆత్మహత్య చేసుకునే వారెవరైనా వారు మరణించి కూడా నరకానికే పోతారు,అని శ్రుతియందు ఆత్మహనన మందే దోషం చెప్పబడింది. ప్రమాద మరణమందైతే ఆశౌచాది అన్నీ ఉంటాయి. దానిని ఆంగిరుడిట్లా చెప్పాడు – ఇక ఎవడైనా ప్రమాదవశాత్తు అగ్ని ఉదకాదులతో మరణిస్తే, అతనికి ఆశౌచం, పాటించాలి. ఉదక క్రియ ఆచరించాలి,అని. బ్రాహ్మమందు కూడా – ప్రమాదంవల్లకాని, ముందు అనుమానంరాక లేక భయంలేకపోవటంవల్లకాని, విధిప్రేరణవల్ల కాని, అకస్మాత్తుగా కాని కొమ్ములు, కోరలు, గోళ్ళు గల వాటితో కాని వ్యాల, విష విద్యుత్, జలాదులవల్లకాని, చండాలురతో లేదా దొంగలతోకాని ఎక్కడైనా చంపబడితే ఆతనికి దాహాదికము చేయాలి. ఎందువల్లనంటే ఆతడు పతితుడు కాదు,అని. ప్రమాద మరణమందు త్రిరాత్రాశౌచము అని శుద్ధితత్వాదులు గౌడులన్నారు. పదిరోజులతో శుద్ధి అని దాక్షిణాత్యులన్నారు. దీనికి అపవాదము హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా – ప్రమాదంవల్ల కాని ఇచ్ఛా పూర్వకంగా కాని పామువల్ల మరణిస్తే చేయరాదు,అని. నాగపూజ లేకుండా చేయరాదని అర్థము. బౌధాయనుడు కూడా – బుద్ధిపూర్వకంగా ఆత్మహత్య చేసుకున్న వారికి క్రియాలోపం విధిస్తున్నాము,అని. క్రియ అంటే అంత్యకర్మ. అక్కడ దుర్మరణ నిమిత్తమునకై దానాదులు చేయాలి. అవి విశ్వప్రకాశాదులందు శాతాతపీయమందును ఇట్లా – విప్రుడు, వాఘ్రంవల్ల మరణిస్తే విప్రకన్యకు వివాహం చేయాలి. పాము కరిచి మరణిస్తే నాగబలి ఇవ్వాలి. సర్పం దానమివ్వాలి. ఏనుగులతో చంపబడితే నాల్గు నిష్కముల పరిమితమైన బంగారు ఏనుగును దానం చేయాలి. రాజుతో చంపబడితే బంగారు పురుష విగ్రహాన్ని దానం చేయాలి. దొంగతో చంపబడితే గోవును, శత్రువుచే చంపబడితే వృషభమును, వృషభముచే చంపబడితే, శక్తికొలది బంగారం దానం చేయాలి. పడక యందు మరణిస్తే దూదిగల శయ్యా దానం చేయాలి. నిష్క మాత్రం బంగారంతో విష్ణు విగ్రహాన్ని చేయించిన శయ్యపై ఉంచి ఇవ్వాలి. శౌచహీనుడు మరణిస్తే రెండు నిష్కముల

బరువుగల బంగారు విష్ణువును దానమివ్వాలి. సంస్కార హీనుడు మరణిస్తే కుమారుని ఉపనయనం చేయించాలి. గు(ఱ)ంతో మరణిస్తే మూడు నిష్కముల పరిమితిగల బంగారు గుఱ్ఱాన్నివ్వాలి. కుక్కచేత మరణిస్తే తన శక్తి కొలది విగ్రహాన్ని చేయించి క్షేత్రపాలుణ్ణి స్థాపించాలి. పందివల్ల మరణిస్తే, దక్షిణతోపాటు మహిషదానం చేయాలి. పురుగుల వలన మరణిస్తే ఐదు ఖారికల (కొలత) గోధుమలను దానమివ్వాలి. వృక్షంవల్ల మరణిస్తే వృక్షదాన మివ్వాలి. దానితో బంగారము, వస్త్రములు కూడా ఇవ్వాలి. కొమ్ములు గల దానితో మరణిస్తే వస్త్రములతో కూడా ఒక వృషభమును దానమివ్వాలి.

మూ॥ శకటేన హతే దద్యాత్ ద్రవ్యం సోపస్కరాన్వితం, భృగుపాత మృతేచైవ ప్రదద్యాద్ధాన్య పర్వతం. అగ్నినా నిహతే కార్యం ఉదపానం స్వశక్తితః,. దారుణానిహతే చైవ కర్తవ్యా సదనే సఖా. శస్త్రేణ నిహతే దద్యాన్మహిషీం దక్షిణాన్వితాం, అశ్మనా నిహతే దద్యాత్సవత్సాంగాం పయస్వినీం. వృషేణ చ మృతే దద్యాత్ మేదినీం హేమ నిర్మితాం, ఉద్బంధనేన చ మృతే కపింకనక నిర్మితం. మృతే జలేన వరుణం హైమం దద్యాత్ ద్వినిష్కజం. విషూచికామృతే స్వాదుభోజయేచ్చ శతం ద్విజాన్. ఘృతధేనుః ప్రదాతవ్యా కంఠాంతకవలేమృతే, కాసరోగేణ చ మృతే అష్టకృచ్ఛ్రం వ్రతం చరేత్. అతిసారమృతే లక్షం గాయత్ర్యాః ప్రయతోజపేత్, శాకిన్యాది గ్రహగ్రస్తే జపేద్రుద్రం యథోదితం. విద్యుత్పాతేన నిహతే విద్యాదానం సమాచరేత్, అంతరిక్ష మృతేకార్యం వేద పారాయణం తథా. సచ్ఛాస్త్ర పుస్తకందద్యాత్ అస్పృశ్య స్పర్శతో మృతే, పతితే చ మృతే కుర్యాత్ ప్రాజాపత్యాంస్తు షోడశ. మృతేచాప త్యరహితే కృచ్ఛ్రాణాం నవతిం చరేత్, ఏవం కృతే విధానేతు విదధ్యాదౌర్ధ్వ దేహికం. **తథావైధమరణేఽపిన దోషః. తదాహతుః మనువృద్ధగార్గ్యౌ** - వృద్ధః శౌచమృతే లుప్తప్రత్యా ఖ్యాతభిష క్క్రియః, ఆత్మానం ఘాతయేద్యస్తు భృగ్వగ్న్య నశనాంబుభిః తస్య త్రిరాత్ర మాశౌచం ద్వితీయే త్వస్థి సంచయః. తృతీయే తూదకం కృత్వా చతుర్థే శ్రాద్ధ మాచరేత్, ఇతి. **హేమాద్రౌ విష్ణుధర్మేఽపి** - నరస్తు వ్యాధి రహితో నత్యజేదాత్మనస్తనుం, అసూర్యా నామయేలోకా అంధేన తమసా వృతాః. తాంస్తే ప్రేత్యాభి గచ్ఛంతి యేకే చాత్మహనోజనాః **అరిష్టై రాత్మనో జ్ఞాత్వా** మృత్యుకాల ముపస్థితం. వ్యాధితో భిషజాత్యక్తః పూర్ణే వాయుషిచాత్మనః యథా యుగాను సారేణ సంత్య జేదాత్మనస్తనుం. తస్మిన్ కాలే తను త్యాగాద్యథేష్టం ఫలమాప్నుయాత్. ఆయుషస్తు పురాదృష్టం మరణం బ్రాహ్మణస్యచ. నేతి గౌడా నామపపారః. ఉత్తరార్ధే అసంగతేః క్షత్రియస్యతు సంగ్రామే మృతే భర్త రియోషితః. **అపరార్కే బ్రహ్మగర్గః** - యోజీవితుం న శక్నోతి మహా వ్యాధ్యుప పీడితః, సోఽగ్న్యుదకం మహా యాత్రాం కుర్వన్నాత్ర న దుష్యతి. అత్రోక్త వక్ష్యమాణ వచోనిచయాత్ ప్రయాగాది రిక్తే అచికిత్స్య రోగాద్యుపహతా నామధికారః సోఽపి జీర్ణ వానప్రస్థ స్యైవేతి విజ్ఞానేశ్వర దేవయాజ్ఞికాదయః. అత ఏవ మితాక్షరాదౌ భృగుపాతాన శనాదికం వానప్రస్థస్యైవోక్తం. మనురపి - ఆసాం మహర్షి చర్యాణాం త్యక్త్వాన్య తమయా తనుం, వీత శోకభయో విప్రో బ్రహ్మ భూయాయ కల్పతే, ఇతి. తేనాన్యత్రాపి తద్విషయత్వైవ, మూలైక్యాదితి కేచిత్ తన్న, వాన ప్రస్థ మరణే ఆశౌచ నిషేధాత్.

తేన గృహస్థాది పరమే వేదం. తేన యతేర్నాధికారః కామ్యేఽనధికారాచ్చ. నైమిత్తికత్వే త్వకరణే దోషో నిత్య తాచస్యాత్. ప్రయాగేత్వ రోగిణాం రోగిణాం చ.

అను॥ బండి చేత మరణిస్తే సామగ్రితో సహ ద్రవ్యమివ్వాలి. పర్వతంపై నుండి పడి (భృగుపాతం) మరణిస్తే గుట్టంత ధాన్యం ఇవ్వాలి. అగ్ని వలన మరణిస్తే తన శక్తి కొలది నీళ్ళ దానం చేయాలి. కట్టెవల్ల మరణిస్తే గృహమందు సభ చేయాలి. శస్త్రం వల్ల మరణిస్తే దక్షిణతోపాటు (బట్టె) మహిష దానం చేయాలి. రాయివల్ల మరణిస్తే, దూడ గలిగిన, పాలిచ్చే ఆవును దూడతో సహా ఇవ్వాలి. వృషభం వల్ల మరణిస్తే బంగారంతో చేసిన భూమిని దానమివ్వాలి. ఉరి వేసుకొని మరణిస్తే బంగారు కోతిని దానమివ్వాలి. జలంతో మరణిస్తే రెండు నిష్కముల బంగారు వరుణున్ని దానమివ్వాలి. విషూచి వల్ల మరణిస్తే నూరుమంది బ్రాహ్మణులకు చక్కగా భోజనం పెట్టాలి. గొంతులో ముద్ద తట్టుకొని మరణిస్తే నేయితో చేసిన ధేనువును ఇవ్వాలి. కాస రోగంతో మరణిస్తే (దగ్గు) అష్టకృచ్ఛ్ర వ్రత మాచరించాలి. అతిసారంవల్ల మరణిస్తే గాయత్రి మంత్రమును లక్షసార్లు ప్రయత్న పూర్వకముగా జపించాలి. శాకిని మొదలగు గ్రహముల వల్ల మరణిస్తే శాస్త్ర ప్రకారము రుద్రము జపించాలి. పిడుగు వల్ల మరణిస్తే విద్యా దాన మాచరించాలి. అంతరిక్షమందు మరణిస్తే వేద పారాయణ చేయాలి. అస్పృశ్య స్పర్శ వల్ల మరణిస్తే మంచి శాస్త్ర గ్రంథాన్ని దాన మివ్వాలి. పతితుడు మరణిస్తే పదహారు సార్లు ప్రాజా పత్య వ్రతమాచరించాలి. సంతానం లేకుండా మరణిస్తే తొంబదిసార్లు కృచ్ఛ్ర మాచరించాలి. ఈ విధంగా చేసినట్లైతే ఔర్ధ్వ దేహికమును ఆచరించవచ్చు, విధి వల్ల మరణిస్తే దోషం లేదు (నియమానుసారం). దానినే మనువృద్ధ గార్గ్యులు ఇట్లా చెప్పారు – వృద్ధుడు, వైద్యుడు చెప్పిన క్రియలు చేయక, తిరస్కరించి, శౌచ ఆచమనాది కర్మలవల్ల మరణిస్తే, భృగుపాత, అగ్ని, జలములవల్ల ఆహారం లేక తనను తాను చంపుకుంటే, ఆతనికి త్రిరాత్రము ఆశౌచము రెండవరోజు అస్థిసంచయము, మూడవరోజు ఉదకదానము, నాల్గవరోజున శ్రాద్ధము చేయాలి,అని. హేమాద్రియందు విష్ణుధర్మోక్తి కూడా ఇట్లా – (విష్ణుపురాణం) మనుష్యుడు రోగం లేకుండా తన శరీరాన్ని విడువరాదు. అసూర్యా అనే ఏ లోకములున్నాయో, చీకటితో తమస్సుతో ఆవరింపబడి ఉన్నాయో ఆ లోకమును చేరుతారు. తమను తాము చంపుకున్న వారు ఎవరైనా వారు మరణించాక ఆలోకములకు వెళ్తారు, అని. అరిష్టములవల్ల, తనకు మృత్యుకాలము వచ్చిందని తెలుసుకొని, వ్యాధితుడై, వైద్యునిచే విడువబడ్డవాడై లేదా తన పూర్ణ ఆయుస్సుయందో, యుగాన్ననుసరించి తన శరీరాన్ని విడిచిపెట్టాలి. అకాలమందు తను త్యాగం చేస్తే యథేష్టమైన ఫలాన్ని పొందుతారు. జీవితకాలం కన్నముందు బ్రాహ్మణుని మరణం చూడబడింది. లేదు అని గౌడుల అపపాఠము. ఉత్తరార్థం పొసగలేదు కనుక. క్షత్రియునకు యుద్ధమందు మరణము, భర్త మరణమందు భార్య మృతి చూడబడింది.

అపరార్కమందు బ్రహ్మ గర్గుడిట్లా - మహా వ్యాధితో పీడితుడై జీవించ శక్తి లేనివాడు, అగ్ని యందో జలమందో మహాయాత్ర చేస్తూనో (కాశీ) మరణిస్తే దోషంలేదు, అని. ఇక్కడ చెప్పిన చెప్పబోయే మాటల సమూహంతో, ప్రయాగకన్న వేరైన చోట్లకు, చికిత్సకు యోగ్యం కాని రోగాదులతో పీడితులైన వారికి వెళ్ళే అధికారం ఉంది. అది కూడా చాలా వృద్ధులైన వానప్రస్థులకే అని విజ్ఞానేశ్వర దేవయాజ్ఞికాదులన్నారు. అందువల్లనే మితాక్షరాదులందు భృగుపాత, అనశ నాదులు వానప్రస్థునకే చెప్పబడ్డాయి. మనువు కూడా - ఈ మహర్షుల చర్యలలో ఏదో ఒక దానితో శరీరాన్ని వదలిన, శోక భయములు వదలిన విప్రుడు బ్రహ్మలోకమందు పూజనందుతాడు,అని. అందువల్ల వేరే చోటనైనా అదే విషయము మూలం ఒకటైనందువల్ల అని కొందరన్నారు. అంటే అట్లా కాదు. వానప్రస్థుడు మరణిస్తే ఆశౌచము, నిషేధము. అందువల్ల ఇది గృహస్థాది పరమైనదే. అందువల్ల యతికి అధికారం లేదు. కామ్యమందు అధికారం లేదు కనుక. నైమిత్తికమైతే చేయకపోతే దోషము నిత్యమైనది ఉండనే ఉంటుంది. ప్రయాగ యందైతే రోగులకు రోగం లేని వారికీ చెప్పబడింది.

మూ॥ శూద్రాశ్చ క్షత్రియా వైశ్యా అంత్యజాశ్చతథాధమాః, ఏతేత్య జేయుః ప్రాణాన్వై వర్జయిత్వా ద్విజం నృప. పతిత్వా బ్రాహ్మణ స్తత్ర బ్రహ్మహాచాత్మహా భవేత్, ఇతి తన్నిర్మూల మితి భట్టాః. తత్వంతు హేమాద్రౌ వ్రతకాండే అలిఖనా న్నిర్మూలత్వం చింత్యమేవ. ప్రక్రమాత్తు పతిత్వేతి భృగుపాత మాత్ర పరం యుక్తం. బ్రాహ్మణ స్యాప్యనుజ్ఞాతమితి వక్ష్యమాణ విరోధాచ్చ. యత్త్వాదిత్యపురాణే - అబ్రాహ్మణోవా స్వర్గాది మహా ఫలజిగీషయా, ప్రవిశేజ్జ్వలనం తోయం కరోత్య నశనం తథా, ఇతి తత్ప్రయాగాతి రిక్త పరమితి కేచిత్. హేమాద్రౌ త్వేతదగ్రే, ప్రయాగవట శాఖాగ్రాత్, ఇత్యుక్తేః బ్రాహ్మణస్య ప్రయాగేఽపి నేతి ప్రతీయతే. మాధవీయేఽపరార్కే చాదిత్యపురాణే - దుశ్చికిత్స్యైః మహారోగైః పీడితస్తు పుమానపి, ప్రవిశేజ్జ్వలనం దీప్తం కరోత్య నశనం తథా, అగాధతోయ రాశిం చ భృగోః పతనమేవ చ. గచ్ఛేన్మహాపథం వాపితుషారగిరి మాదరాత్. ప్రయాగ వటశాఖాగ్రాత్ దేహత్యాగం కరోతి చ, స్వయం దేహ వినాశస్య కాలే ప్రాప్తే మహామతిః ఉత్తమాన్ ప్రాప్నుయాల్లోకాన్ నాత్మఘాతీ భవేత్క్వచిత్, మహా పాపక్షయాత్స్వర్గే దివ్యాన్ భోగాన్ సమశ్నుతే. ఏతేషా మధికారస్తు సర్వేషాం సర్వజంతుషు, నరాణా మథనారీణాం సర్వవర్ణేషు సర్వదా, ఈ దృశం మరణం యేషాం జీవతాం కుత్రచిద్భవేత్. ఆశౌచం స్యాత్త్ర్య హంతేషాం వజ్రానలహతే తథా, వారాణస్యాం మ్రియేద్యస్తు ప్రత్యాఖ్యాత భిషక్క్రియః. కాష్ఠ పాషాణ మధ్యస్థో జాహ్నవీ జలమధ్యగః, అవిముక్తోన్ముఖస్తస్య కర్ణమూలగతోహరః. ప్రణవం తారకం బ్రూతే నాన్యథా కుత్ర చిత్క్వచిత్. హేమాద్రౌ చైవం. అత్ర ప్రాప్తకాలే ఇత్యుక్తేః. అప్రాప్త మరణ కాలాయాః స్త్రియాః అన్వారోహణే సంపూర్ణమే వాశౌచం. పృథ్వీ చంద్రస్త్వత్రా పిత్ర్యహమాహ. శుద్ధి తత్వాది గౌడగ్రంథేష్వ ప్యేవం. ఏతచ్చ వృద్ధాది మరణం కలౌ నిషిద్ధం. భృగ్వగ్ని పతనైశ్చైవ వృద్ధాది మరణే తథా, ఇతి మాధవేన పృథ్వీ చంద్రేణ చ కలివర్జ్యేషూక్తేః. న చాత్ర యా వదుక్త నిషేధః. విశిష్టోద్దేశే వాక్యభేదాత్. నచకలౌ వానప్రస్థాశ్రమ నిషేధాదేవ సిద్ధేః మరణ నిషేధో వ్యర్థ ఇతి

వాచ్యం. సర్వవర్ణే ష్విత్యాదిభిః తద్భిన్నస్యాపి ప్రాప్తేః. కామ్యం భవత్యేవ, యేవైతన్వం విసృజంతి, ఇతి శ్రుతేః స్మృత్యా సంకోచా యోగాత్. నచేయం స్వాభావిక మృత్యుపరా. ధీరపదోక్తేః. మాత్స్య భారతాదిషు – నలోక వచనాత్తాత నవేదవచనాదపి, మతిరుత్క్రమణీయాతే ప్రయాగ మరణంప్రతి, ఇత్యుక్తేః. అత ఏవ విష్ణుధర్మే – రౌగ్యాది మరణ ముక్త్వోక్తం – యథాయుగానుసారేణ సంత్య జేదాత్మనస్తనుం,ఇతి. **కాశ్యామప్యుక్తం మాత్స్యే** – అగ్ని ప్రవేశం యే కుర్యుర విముక్తే విధానతః ప్రవిశంతి ముఖంతేమే నిః సందిగ్ధం వరాననే, **హేమాద్రౌ వివస్వాన్** – సర్వేంద్రియ విముక్తస్య స్వవ్యాపారాక్షమస్య చ ప్రాయశ్చిత మనుజ్ఞా తమగ్నిపాతో మహాపథః. ధర్మార్జనా సమర్థస్య కర్తుః పాపాం కితస్య చ, బ్రాహ్మణ స్యాప్యనుజ్ఞాతం తీర్థే ప్రాణ విమోక్షణం. అపరార్కే చైవం.

అను॥ శూద్రులు, క్షత్రియులు, వైశ్యులు, అంత్యజులు అధములు వీరు ప్రాణములను వదలవచ్చును. ఓరాజ! ద్విజుడు ప్రాణములను వదలరాదు. బ్రాహ్మణుడు అక్కడ పడితే బ్రహ్మహత్య, ఆత్మహత్య చేసుకున్న వాడౌతాడు,అని. ఏదన్నారో అది నిర్మూలమని భట్టులన్నారు. యధార్థానికైతే హేమాద్రి యందు వ్రతకాండమందు వ్రాయనందువల్ల, మూల వచనం లేనందువల్ల ఆలోచించాల్సినదే ప్రకరణాన్ననుసరించి పతిత్వా అనేది భృగుపాత మాత్రపరమనుట యుక్తము. బ్రాహ్మణునకు గూడా అంగీకరించారు,అని చెప్పబోయే దానికి విరుద్ధమౌతుంది కూడా. ఆదిత్యపురాణమందిట్లా – బ్రాహ్మణుడు కానివాడైనా స్వర్గాది మహా ఫలములనుకోరి, అగ్ని, నీరు వీనియందు ప్రవేశించటం, భుజించకుండా ఉండటం, చేయాలి అని ఏదన్నారో అది ప్రయాగకన్న అతిరిక్త పరమని కొందరన్నారు. హేమాద్రి యందు, ఇక ముందు అని ప్రయాగ వటవృక్షశాఖ అగ్రభాగం నుండి, అని చెప్పటంవల్ల బ్రాహ్మణునకు ప్రయాగయందు కూడా పాతం లేదు,అని, తెలుస్తోంది. మాధవీయమందు, అపరార్క మందును ఆదిత్యపురాణ వచనమిట్లా – చికిత్సకు లొంగని మహారోగములతో పీడింపబడిన పురుషుడు కూడా, మండుతున్న అగ్ని ప్రవేశం చేయాలి. భుజించకుండా ఉండవచ్చు. అగాధతోయ రాశిని ప్రవేశించవచ్చు. భృగుపాతం చేయవచ్చు. మహాప్రస్థానం చేయవచ్చు. ఆదరంతో తుషారగిరికి వెళ్ళవచ్చు. ప్రయాగ వట శాఖాగ్రం నుండి దేహత్యాగం చేయవచ్చు. స్వయంగా దేహనాశకాలం వస్తే బుద్ధిమంతుడు పైవి చేసినా ఉత్తమ లోకములకు చేరుతాడు, ఆత్మఘాతికాదు. మహా పాపములు క్షయమై స్వర్గమందు దివ్యభోగములను అనుభవిస్తాడు. వీనిని చేయటంలో అందరికి అన్ని ప్రాణులలోను అధికారముంది. నరులకు, మరి నారీలోకానికి, అన్ని వర్ణముల వారికి, అన్ని కాలములందు అధికారముంది. ఇలాంటి మరణం జీవించి ఉన్న వారికెవరికో ఎక్కడో లభిస్తుంది. పిడుగు అగ్నివల్ల మరణిస్తే వారికై మూడు రాత్రులు ఆశౌచం ఉంటుంది. వైద్యుడు చికిత్స చేయటానికి నిరాకరించాక కట్టెలాగరాయి లాగ ఉన్న దశలో, గంగాజలం మధ్యలో, వారణాసి యందు మరణిస్తే అవిముక్త క్షేత్రమునకు ఉన్ముఖుడై యుంటే, అట్టివాని

చెవిలో హరుడు ప్రణవంతో సహా తారక మంత్రాన్ని బోధిస్తాడు, మరోరకంగా కాదు. మరోచోట ఎక్కడా ఇట్లా కాదు. హేమాద్రి యందు కూడా ఇట్లాగే ఉంది. ఇక్కడ ప్రాప్తకాల మందు అని అన్నారు. కనుక మరణకాలం రాని స్త్రీ అన్వారోహణం చేస్తే సంపూర్ణంగా (పదిరోజులు) ఆశౌచము. పృథ్వీచంద్రుడు ఇక్కడ కూడా మూడు రోజులే చెప్పాడు. శుద్ధి తత్వాది గౌడ గ్రంథములందు కూడా ఇట్లాగే ఉంది. ఈ విధంగా వృద్ధాదుల మరణాన్ని కలియందు నిషేధించారు. భృగుపాతం, అగ్నిపాతము, వీనితో వృద్ధాదులు మరణిస్తే,అని మాధవుడు, పృథ్వీచంద్రుడు కలివర్జ్య విషయములందు చెప్పినారు కనుక. ఇక్కడ చెప్పిన(ది) నిషేధమైతే (కాదు) రాదు. విశిష్టోద్దేశమందైతే వాక్యభేదమౌతుంది. కలియందు వానప్రస్థా శ్రమ నిషేధంవల్లనే సిద్ధిస్తుంటే మరణ నిషేధం వ్యర్థము,అని, అనరాదు. అన్ని వర్ణములందు, అను మొదలగు వానితో, దానికన్న భిన్నమైన వానికి కూడా ప్రాప్తిస్తుంది కనుక. కామ్యమైతే ఔతుంది. యేవైతన్వం విసృజంతి, అని శృతికి స్మృతివల్ల సంకోచం లేదు కనుక ఇది స్వాభావిక మృత్యు పరమైంది కాదు. ధీరపదం చెప్పాడు కనుక. మాత్స్యము భారతాదులందిట్లా - ఓతాత (తండ్రి) లోకవచనం వల్లగాని, వేద వచనంవల్లగానీ, నీ బుద్ధిని ప్రయాగ మరణం నుండి మార్చుకోరాదు, అని చెప్పారు. అందువల్లనే విష్ణుధర్మమందు రోగి మొదలగువారి మరణాన్ని చెప్పి ఇట్లా చెప్పారు - యుగాన్ననుసరించి తమ శరీరాన్ని విడువాలి,అని. కాశియందు కూడా, మాత్స్యోక్తి ఇట్లా - అవిముక్తమందు (వారణాసి) విధిప్రకారము అగ్ని ప్రవేశం చేసినవారు, ఓ వరానన! నిస్సంశయంగా వారునా ముఖంలో ప్రవేశిస్తారు,అని. హేమాద్రి యందు వివస్వంతుని వాక్యమిట్లా - ఇంద్రియములన్నీ పనికి రాకుండా ఐనాయి. తన పనులు చేసుకోటానికి అసమర్థుడైనాడు, అట్టి వానికి ప్రాయశ్చిత్తము, అగ్నిపాతము లేదా మహా ప్రస్థానము. ధర్మార్జనకు అసమర్థుడైనవానికి పాపము న కంకితుడు ఐన కర్తయైన బ్రాహ్మణునకు కూడా తీర్థమందు ప్రాణవిమో క్షణము అనుమతించ బడింది,అని. అపరార్క మందు కూడా ఇట్లాగే ఉంది.

**మూ॥ సహాగమనంకలౌభవత్యేవ.** కలౌనాన్యా గతిః స్త్రీణాం సహానుగమనాదృతే, ఇతి. బ్రహ్మ వైవర్తాత్. ఏతేన మరణాంతిక ప్రాయశ్చిత్తం కాశీఖండాదౌ చాతుర్వర్ణ్యస్య తనుత్యాగ విధయశ్చ యుగాంత పరా, ఏవ. **ప్రయాగేఽపి త్రిస్థలీ సేతౌ** స్కాందే - యథాకథం చిత్తీర్థేస్మిన్. ప్రాణత్యాగం కరోతియః, తస్యాత్మ ఘాతదోషోన ప్రాప్నుయా దీప్సితాన్యపి. పాద్మే విష్ణుః- దేహత్యాగం తథా ధీరాః కుర్వంతి మమ సన్నిధౌ, మత్తనుం ప్రవిశన్త్యేవ నపునర్జన్మ తేనరాః. కౌర్మే - వ్యాధితో యది వాదీనో (క్రుద్ధో) వృద్ధో వాపిభవేన్నరః, గంగా యమున మాసాద్య యస్తు ప్రాణాన్ పరిత్యజేత్. ఈప్సితాన్ లభతే కామాన్ వదంతి మునిపుంగవాః. **తథా - యాగతి ర్యోగ యుక్తస్య సత్వస్థస్య మనీషిణః, సాగతిః త్యజతః** ప్రాణాన్ గంగాయమున సంగమే **వారాహే - తత్రయో** ముంచతి ప్రాణాన్ వటమూలేషు సుందరి, సర్వలోకా నతిక్రమ్య మమలోకం ప్రపద్యతే. తథా - అకామోవా

సకామోవా వటమూలేషు సుందరి, శీఘ్రం ప్రాణాన్ ప్రముంచేత యదీచ్ఛేత్ పరమాంగతిం. **తథా - పంచ యోజన** విస్తీర్ణే ప్రయాగస్యతు మండలే, వ్యతీతాన్ పురుషాన్ సప్త భవిష్యాంశ్చ చతుర్దశ. నరస్తారయతే సర్వాన్ యస్తు ప్రాణాన్ పరిత్యజేత్. **బ్రాహ్మే - ధ్యాత్వా** విష్ణు పదాంభోజం ప్రయాగే విష్ణుతత్పరః, తనుం త్యజతివై మాఘేతస్య ముక్తిర్న సంశయః. **దుష్కృతోఽపి** దురాచారో బ్రహ్మహత్యాది పాతకీ, హరింధ్యాత్వా త్యజేద్దేహం ప్రయాగే (ప్రాయశో) ముక్తిమాన్ భవేత్. **భవిష్యోత్తరే** - సమాః సహస్రాణితు సప్త వైజలే దశైక మగ్నౌ పతనే చ షోడశ. మహాహవే షష్టిరశీతిగోగ్రహే అనాశకే భారత చాక్షయాగతిః, ఇతి సామాన్యతోఽపి ఫలం. ఏవమన్యేఽపి విధయోజ్ఞేయాః.

అను॥ సహగమనము కలిలో ఉండనే ఉంటుంది. కలిలో స్త్రీలకు సహగమనం తప్ప మరో మార్గంలేదు,అని బ్రహ్మ వైవర్తోక్తి. దీనితో మరణం తరువాతి ప్రాయశ్చిత్తములు కాశీఖండాదులందు, నాల్గు వర్ణముల వారికి తను త్యాగవిధులు ఇవి యుగాంతరమునకు చెందినవే,అని. ప్రయాగను గూర్చి త్రిస్థలీ సేతువు యందు స్కాందోక్తి ఇట్లా - ఏదో రకంగా ఈ తీర్థమందు ప్రాణత్యాగం చేసినవాడు ఆత్మఘాతికాడు. వానికా దోషం రాదు. కోరికలను కూడా పొందుతాడు,అని. పాద్మయందు విష్ణువచనమిట్లా - నా సన్నిధి యందు ధీరులై దేహ త్యాగం చేసినవారు, నా శరీరంలో ప్రవేశిస్తారు. వారికి పునర్జన్మ లేదు కూడా,అని. కౌర్మ మందిట్లా - నరుడు, వ్యాధితుడైనా, దీనుడైనా వృద్ధుడైనా (క్రుద్ధుడైనా) గంగయమునలకు (సంగమం) వచ్చి ప్రాణములను వదిలితే, ఇష్టమైన కోరికలను పొందుతాడు,అని మునిపుంగవులంటారు,అని. అట్లాగే - సత్వగుణం కలిగిన యోగ యుక్తుడైన వానికి మనీషికి ఏగతో ఆగతే గంగాయమున సంగమ మందు ప్రాణం వదలిన వారికి,అని. వారాహమందిట్లా - ఓ సుందరి! వట మూలమందు అక్కడ ప్రాణం వదలిన వానికి, అన్ని లోకములనుదాటి, నాలోకం లభిస్తుంది. అట్లాగే ఓ సుందరి! అకాముడైనా సకాముడైనా పరమగతిని కోరువాడు వటమూలమందు, త్వరగా ప్రాణం వదలాలి,అని. అట్లాగే - పంచ యోజన విస్తీర్ణమైన ప్రయాగ మండలమందు ప్రాణములు వదలినవాడు గడచిన ఏడు తరముల వారిని, రాబోయే పదునాల్గు తరముల వారిని అందరిని తరింప జేస్తాడు,నరుడు,అని. బ్రాహ్మమందిట్లా - విష్ణుతత్పరుడై ప్రయాగయందు విష్ణువు పాదాంబుజ ములను ధ్యానించి, మాఘమాస మందు ప్రాణములను వదిలితే వానికి ముక్తి లభిస్తుంది అనుమానము లేదు,అని. దుష్కృత్యములు చేసినవాడు, దురాచారుడు, బ్రహ్మహత్యాది పాతకములు చేసినవాడు, ప్రయాగయందు హరిని ధ్యానిస్తూ ప్రాణాలను వదిలితే ముక్తి మంతుడౌతాడు. (వాసనలు, పాపములు లేనివాడు). భవిష్యోత్తరమందిట్లా - ఓ భారత! జలమరణమందు ఏడు వేల సంవత్సరాలు, అగ్ని మరణమందు పదకొండు వేల సంవత్సరాలు, పాతమందు పదహారు వేల సంవత్సరాలు, యుద్ధమందు మరణిస్తే అరవై

వేల సంవత్సరాలు, గోవుల పట్టుట యందు మరణిస్తే, ఎనభై వేల సంవత్సరాలు, భుజించ కుండా మరణిస్తే అక్షయమైన గతి,అని. ఇది సామాన్యముగా కూడా ఫలము. ఈ రకంగా ఇతరమైన విధులనూ గ్రహించాలి.

మూ॥ **యత్తు గౌడాః** - ప్రయాగాది మరణం బ్రాహ్మణ భిన్న విషయం, ఇత్యాహుః తద్దూషణం పితామహ చరణైః ప్రయాగవిధౌ కృతమితి నాత్రోచ్యతే. **అత్రదశాహమా** శౌచం. త్రిరాత్రస్య ప్రాప్త కాల గోచరత్వాదితి భట్టాః. యుక్తంతు త్రిరాత్రం. దివోదాసీయేప్యేవం శుద్ధితత్వేఽపి కాశ్యపః - అనశన మృతానాం అశనిహతానాం అగ్ని జల ప్రవిష్టానాం భృగు సంగ్రామ దేశాంతర మృతానాం జాత దంతానాం చ త్రిరాత్రమితి. ఏవం మరణాంత ప్రాయశ్చిత్తేఽపి. పూర్వోక్తశ్చాత్మహా దేర్దాహా శౌచాది నిషేధస్తదానీమేవ. వత్సరాంతేతు సర్వమౌర్ధ్వ దేహికం కుర్యాత్. **గోబ్రాహ్మణ హతానాం** చ పతితానాం తథైవచ. ఊర్ధ్వం సంవత్సరాత్కుర్యాత్ సర్వమేవౌర్ధ్వ దైహికం, ఇతి హేమాద్రౌ షట్ త్రింశన్మతాత్. **ఏవం మ్లేచ్ఛీకృతానా** మపి గయా శ్రాద్ధ మపి కార్యం. బ్రహ్మహా చ కృతఘ్నశ్చ గోఘాతీ పంచ పాతకీ, సర్వే తే నిష్కృతిం యాంతి గయాయాం పిండ పాతనాత్. ఇత్యగ్ని పురాణాత్. ఏవం బ్రాహ్మేఽపి - క్రియతే పతితానాంతు గతే సంవత్సరే క్వచిత్, దేశధర్మ ప్రమాణత్వాత్ గయా కూపే స్వబంధుభిః. మార్తండ పాదమూలే వా శ్రాద్ధం హరిహరౌ స్మరన్. సూర్యపదే ఇత్యర్థః. **తత్ర వర్షమధ్యే** కృత్యముక్తమ పరార్కే వాయుపురాణే - శుక్లపక్షేతు ద్వాదశ్యాం కుర్యాచ్ఛ్రాద్ధం తువత్సరం, ద్వాదశాహని వాకుర్యాత్ శుక్లే చ ప్రథమేఽహని.

అను॥ గౌడులు - ప్రయాగాది మరణము బ్రాహ్మణ భిన్న విషయము అని ఏదన్నారో దానిని పితామహ చరణులు ప్రయాగ విధానమందు దూషించారు, కనుక ఇక్కడ చెప్పటం లేదు. ఇక్కడ పదిరోజులు ఆశౌచము ప్రాప్త కాలునకు త్రిరాత్రము గోచరమైనందువల్ల అని భట్టులన్నారు. త్రిరాత్రమే యుక్తమైనది. దివోదాసీయ మందు కూడా ఇట్లాగే ఉంది. శుద్ధి తత్వమందు కూడా కాశ్యపుడిట్లా - భోజనం లేక మరణించిన వారికి, పిడుగుపడి మరణించిన వారికి, అగ్ని జలము లందు ప్రవేశించిన వారికి, భృగుపాతము, యుద్ధము, దేశాంతరములందు మరణించిన వారికి, దంతములు వచ్చి మరణించిన వారికి మూడు రాత్రులు ఆశౌచము,అని. ఈ రకముగా మరణాంత ప్రాయశ్చిత్త మందును గ్రహించాలి. ఆత్మహననం మొదలగునవి చేసుకున్న వారికి దాహ ఆశౌచాదుల నిషేధము అప్పుడే, ముందే చెప్పాము. వత్సరాంతమందైతే ఔర్ధ్వ దేహికం అంతా చేయాలి. గోబ్రాహ్మణ హతులకు, పతితులకు, సంవత్సరం తరువాత, ఔర్ధ్వ దేహిక కర్మ అంతా చేయాలి,అని హేమాద్రి యందు షట్త్రింశన్మతం వల్ల తెలుస్తోంది. ఈ రకంగా మ్లేచ్ఛులుగా ఐనప్పుడు కూడా గయా శ్రాద్ధం కూడా చేయాలి. బ్రాహ్మణ హంతకుడు, కృతఘ్నుడు, గోఘాతకుడు, పంచ పాతకులు, వీరంతా గయ యందు పిండదానంవల్ల నిష్కృతి

నందుతారు,అని. అగ్ని పురాణంవల్ల తెలుస్తోంది. ఇట్లా బ్రాహ్మ మందు కూడా – పతితులకైతే ఒక సంవత్సరం గడిచాక, దేశ ధర్మముల ప్రమాణాను సారము, గయా కూపమందు తమ బంధువులు మార్తాండ పాదమూలమందు కాని హరిహరులను స్మరిస్తూ శ్రాద్ధం చేయాలి. సూర్య పదమందు అని అర్థము. అక్కడ వర్ష మధ్యమందు చేయవలసిన దానిని అపరార్క మందు వాయుపురాణ వచనం ఇట్లా చెప్పింది – వత్సర శ్రాద్ధాన్ని శుక్లపక్ష ద్వాదశియందు చేయాలి. శుక్లపక్షపు తొలిరోజున కాని పన్నెండవ రోజున కాని చేయాలి,అని.

**మూ॥ ఛాగలేయః – నారాయణబలిః కార్యోలోక గర్హా భయాన్నరైః, తథాతేషాం భవేచ్ఛౌచం నాన్యథేత్య బ్రవీద్యమః. వ్యాసః – నారాయణం సముద్దిశ్య శివం వాయత్ప్రదీయతే, తస్య శుద్ధి కరం కర్మ తద్భవేన్నె తదన్యథా, ఇతి. సచాత్మ ఘాతాది ప్రాయశ్చిత్తంకృత్వాకార్యః తదుక్తం హేమాద్రౌ షట్ త్రింశన్మతే – కృత్వా చాంద్రాయణం పూర్వం క్రియా కార్యా యథావిధి, నారాయణ బలిః కార్యో లోక గర్హా భయాన్నరైః. పిండోదక క్రియాః పశ్చాత్ వృషోత్సర్గాది కంచయత్, ఏకోద్దిష్టాని కుర్వీత సపిండీకరణం తథా. దివోదాసీయే వృద్ధ శాతాతపస్తు – పతితే చ మృతే శుద్ధ్యై ప్రాజాపత్యాంస్తు షోడశ, మృతే చాపత్య రహితే కృచ్ఛ్రాణాం నవతించరేత్, ఇత్యాహ. ఇదం ప్రాయశ్చిత్తార్హ పిత్రాది విషయం. ఇంద్రియైర పరిత్యక్తా యే చ మూఢా విషాదినః ఘాతయంతి స్వమాత్మానం చాండాలాది హతాశ్చయే, తేషాం పుత్రాశ్చ పౌత్రాశ్చ దయయా సమభిప్లుతాః, యథా శ్రాద్ధం ప్రతన్వంతి విష్ణు నామ ప్రతిష్ఠితం, తథాతే సంప్రవక్ష్యామి నమస్కృత్య స్వయం భువే, ఇతి హేమాద్రౌ తేనైవోక్తేః. తత్రైవ బౌధాయనోఽపి – నారాయణ బలిం వ్యాఖ్యా స్యామః (చండాలాదుదకాత్సర్పాత్ బ్రాహ్మణాద్వైద్యుతాదపి దంష్ట్రిభ్యశ్చ పశుభ్యశ్చ మరణం పాపకర్మణాం. విషశస్త్ర రజ్జుపాషాణా దేశాంతర మృతేవా) అభిశస్త పతిత సురాపాత్మ త్యాగినాం బ్రాహ్మణ హతానాం చ ద్వాదశ వర్షాణి త్రీణి వాయత్ర మరణం యస్య తత్ర తత్ర కుర్వీత, ఇతి. గృహ్యా పరిశిష్టేతు చాండాలాదిత్యాద్యుక్త్వా – దగ్ధ్వా శరీరం ప్రేతస్య సంస్థాప్యాస్థీని యత్నతః, ప్రాయశ్చిత్తం తు కర్తవ్యం పుత్రై శ్చాంద్రాయణ వ్రతం, ఇత్యుక్తం. (మదనరత్నే – బ్రాహ్మణ హతానాం ద్వాదశ వర్షాణి త్రీణివా కుర్వీత, ఇతి). మదనరత్నే బ్రాహ్మే – ప్రమాదా దపినిః శంకస్త్వ కస్మాద్విధి చోదితః, చాండాలై ర్బ్రాహ్మణై శ్చౌరైః నిహతో యత్ర కుత్ర చిత్. తస్య దాహాదికం కార్యం యస్మాన్న పతితస్తుసః. చాంద్రాయణం తప్త కృచ్ఛ్రం ద్వయంతస్య విశుద్ధయే. యద్వాకృచ్ఛ్రా న్పంచ దశ కృత్వాతు విధినా దహేత్. బుద్ధి పూర్వ మృతానాంతు త్రింశత్కృచ్ఛ్రం సమాచరేత్, ఇత్యుక్తం. స్మృతి రత్నావల్యాంతు ద్విగుణం ప్రాయశ్చిత్తం కృత్వా అర్వాగప్యబ్దాత్సర్వం కార్యం ఇత్యుక్తం. ఆత్మనో ఘాత శుద్ధ్యర్థం చరేచ్చాంద్రాయణ ద్వయం, తప్త కృచ్ఛ్ర చతుష్కం చ త్రింశ త్కృచ్ఛ్రాణి వాపునః, అర్వాక్సంవత్సరాత్కుర్యాద్ద హనాది యథోదితం. కృత్వా నారాయణ బలిం అనిత్యత్వాత్త దాయుషః, ఇతి.**

అను॥ ఛాగలేయుడిట్లా – లోకనింద భయంతో నరుడు నారాయణ బలిని ఆచరించాలి. అట్లా చేస్తే వారికి శుచి ఏర్పడుతుంది, మరో రకంగా కాదు అని

యముడన్నాడు, అని. వ్యాసుడిట్లా - నారాయణుని ఉద్దేశించి లేదా శివుని ఉద్దేశించియైనా ఏదైనా ఇస్తే, అది వానికి (ఆత్మఘాతికి) శుద్ధికరమైన కర్మ ఔతుంది. ఇది మరో రకంగా కాదు,అని. దానిని ఆత్మఘాతాది ప్రాయశ్చిత్తం చేశాక చేయాలి అదే విషయం హేమాద్రి యందు షట్ త్రింశన్మత మందిట్లా చెప్పబడింది. తొలుత చాంద్రాయణ మాచరించి తరువాత యధావిధిగా క్రియలు ఆచరించాలి. లోకనింద భయంతో నరులు నారాయణ బలి ఆచరించాలి. వృషోత్సర్గాదికము, పిండోదక క్రియలు తరువాత ఆచరించాలి. ఏకోద్దిష్టము, సపిండీకరణము అట్లాగే చేయాలి,అని. దివోదాసీయ మందు వృద్ధ శాతాతపు డిట్లా - పతితుడు మరణిస్తే శుద్ధికొరకు పదహారు ప్రాజాపత్యముల ఆచరించాలి. సంతానం లేకుండా మరణిస్తే తొంబది కృచ్ఛ్రము లాచరించాలి,అని అన్నారు ఇది ప్రాయశ్చిత్తమున కర్హులైన పిత్రాదుల విషయము. ఇంద్రియములచే వదలబడనివాళ్ళు (ఇంద్రియ లోలురు) మూఢులు, విషాదులు తమను తాము చంపుకునేవారు, చండాలాది హతులు వారి పుత్రులు, పౌత్రులు దయతో నిండినవారై, విష్ణు నామంతో ప్రతిష్ఠితమైన దానిని శ్రాద్ధాన్ని ఎట్లా చేస్తారో దానిని, బ్రహ్మకు నమస్కరించి నీకు చెబుతున్నాను, అని హేమాద్రి యందు ఆతడే చెప్పాడు. అక్కడే బోధాయనుడు కూడా - నారాయణ బలిని వివరిస్తున్నాము (చండాలుని వల్ల, నీరువల్ల, సర్పంవల్ల బ్రాహ్మణునివల్ల, పిడుగువల్ల కోరలవల్ల, పశువులతోను పాపకర్ములకు మరణము, విష శస్త్ర రజ్జు పాషాణములతో, దేశాంతర మరణమందుకాని) శాపంవల్ల, పతితుడై, సురాపుడై, ఆత్మత్యాగియై, బ్రాహ్మణహతుడై మరణించిన వారికి పన్నెండు వర్షములు కాని, మూడు సంవత్సరాలు గాని ఎవడు ఎక్కడ మరణించాడో అక్కడక్కడ చేయాలి,అని. గృహ్య పరిశిష్టమందైతే చాండాలుని వల్ల అని మొదలుగా చెప్పి - ప్రేత శరీరాన్ని దగ్ధం చేసి, అస్థులను యత్న పూర్వకముగా ఉంచి, పుత్రులు ప్రాయశ్చిత్తము చేయాలి, చాంద్రాయణ వ్రత మాచరించాలి,అని చెప్పారు. మదనరత్నమందు ఇట్లా - బ్రాహ్మణ హతులకు పన్నెండువత్సరములు లేదా మూడు సంవత్సరాలు ప్రాయశ్చిత్తం చేయాలని చెప్పారు. మదనరత్నమందు బ్రాహ్మమందిట్లా - ప్రమాదంవల్ల కాని భయం లేనందువల్ల కాని అకస్మాత్తుగా కాని విధి ప్రేరణవల్ల కాని దేని వల్లనైనా చాండాలురతో కాని బ్రాహ్మణులతోకాని దొంగలతోకాని ఎక్కడో ఒకచోట నిహతుడైతే వానికి దాహాదికము చేయాలి. ఎందువల్లనంటే ఆతడు పతితుడు కాదు. ఆతని విశుద్ధికై చాంద్రాయణము, రెండు తప్త కృచ్ఛ్రములు ఆచరించాలి లేదా పదిహేను కృచ్ఛ్రములను ఆచరించి విధిపూర్వకముగా దహించాలి. బుద్ధిపూర్వకముగా మరణించిన వారికైతే ముప్పది కృచ్ఛ్రములు ఆచరించాలి,అని చెప్పారు. స్మృతి రత్నావళి యందైతే జ్ఞానపూర్వకమైతే రెట్టింపు ప్రాయశ్చిత్తం చేసి, సంవత్సరంకన్న ముందే అంతా చేయాలి అని చెప్పారు. ఆత్మఘాత శుద్ధి కొరకు రెండు చాంద్రాయణము లాచరించాలి. నాలుగు తప్త కృచ్ఛ్రములు

కాని లేదా ముప్పది కృచ్ఛ్రములు కాని ఆచరించి, సంవత్సరం కన్న ముందు, దహనాదులు శాస్త్రంలో చెప్పినట్లు చేయాలి. ఆయుష్యం అనిత్యమైనందువల్ల నారాయణ బలిని ఆచరించాలి, అని.

మూ॥ ఇదం చ ఆత్మ వధ నిమిత్తం తజ్జాతి వధ ప్రాయశ్చిత్తే న సముచితం కార్యం అత ఏవ బౌధాయనే నోక్తం ద్వాదశ వర్షాణి, త్రీణి వా ఇతి. మదన పారిజాతే స్మృత్యర్థ సారే చ - బ్రహ్మ హాదీనాం తద్యోగ్యం ప్రాయశ్చిత్తం కృత్వా నారాయణబలిః కార్యః ఇత్యుక్తం. ఏవం మ్లేచ్ఛీ కృతానామపి. యత్తు కశ్చి దాహ - పుత్ర కృతేన ప్రాయశ్చిత్తేన పితుః పాపనాశే మానా భావః, ఆత్మ ఘాతేతు వచనాదస్తు, మహాపాతకేతు కథంస్యాత్, ఇతి. సస్వయమేవ ఆత్మ వధ ప్రాయశ్చిత్త స్యజాతి వధ నిమిత్తేన సముచ్చయం వదన్ హృదయ శూన్యఏవ. నహి జాతి వధనిమిత్తం పుత్రైః కార్యమితి వచనమస్తి. పుత్ర కర్తృక సర్వప్రాయశ్చిత్తాది విప్లవా పత్తేః ప్రాగుక్త బోధాయన వచనాచ్చేతిదిక్ ఇదం ప్రాయశ్చిత్తార్హాణామేవ. ప్రాయశ్చిత్తా నర్హాణాంతు పతితోదక మాత్రం కార్యం, ఇతి కేచిత్. మదన పారిజాతాది స్వరసోప్యేవం. వస్తుతస్తు తదర్హానర్హయోర్వచనేఽ ను పాదానాత్. అపి శేషాత్త త్రాపి నారాయణ బలిః గయా శ్రాద్ధం చేతియుక్తం. పతితోదక విధిస్తు, పిత్రాద్యతి రిక్తవిషయః, ఇత్యపరే సయథా హేమాద్రౌ బ్రాహ్మే - పతితస్యతు కారుణ్యాద్య స్తృప్తిం కర్తు మిచ్ఛతి, సహి దాసీం సమాహూయ సర్వగాందత్తవేతనాం. అశుద్ధ ఘటహస్తాంతాం యథా వృత్తం బ్రవీత్యపి, హేదాసి గచ్ఛ మూల్యేన తిలానానయ సత్వరం. తోయపూర్ణం ఘటం చేయం సతిలం దక్షిణాముఖీ, ఉపవిష్టాతు వామేన చరణేన తతః క్షిప. కీర్తయేః పాతకీ సంజ్ఞాం త్వం పిబేతి ముహుర్వద, నిశమ్య తస్య వాక్యం సాలబ్ధమూల్యా కరోతి తత్ ఏవం కృతే భవేత్తృప్తిః పతితానాం చ నాన్యథా,ఇతి. ఇదం చ మృతాహే, కార్యం, పతితస్య దాసీ మృతాహ్ని యదా ఘటమపి వర్జయే దేతావతాఽయ ముపచరితో భవతి,ఇతి, మదనరత్నే విష్ణూక్తేః. ఇదం చాత్మ త్యాగి విషయం, ఆత్మత్యాగినః పతితాస్తే నాశౌచోదక భాజః స్యుః ఇత్యుపక్రమ్య విష్ణునా ఏతస్యాభి ధానాదితి గౌడాః. (ఉపలక్షణత్వాత్ సర్వేషా మితితు యుక్తం). యత్తు కశ్చిదాహ - యః పతితో ఘటస్ఫోటేన బాంధవైః బహిష్కృతః తద్విషయాణి క్రియా నిషేధ వాక్యాని. జీవత్యేవ తస్మిన్నంత్య కర్మణః కృతత్వాత్తత్పునః కరణాభావాత్, ఇతి సస్వబంధు త్యాగేన జాతివైరాగ్య స్య కృత ప్రాయశ్చిత్త స్యాప్య కరణాపత్తేః మితాక్షరాది విరోధ మపశ్య న్మూర్ఖ ఇత్యుపేక్షణీయః. నచ కృతఘట స్ఫోటస్య సంగ్రహ విధిర్నేతి వాచ్యం. మనునాఽకృతస్య ఘటస్ఫోటస్య త్యాగముక్త్వా - ప్రాయశ్చిత్తేతు చరితే పూర్ణ కుంభ మపాంనవం, తే నైవ సార్థం పాస్యేయుః స్నాత్వా పుణ్యే జలాశయే, ఇత్యుక్తేః (మనుః). అన్యథా ప్రాయశ్చిత్త మాత్రే ఏతత్ప్ర సంగాత్. అతో ఘట స్ఫోటేన బహిష్కృతస్యాపి పిత్రాదేరబ్దాంతే నారాయణ బలిః కార్యః నిషేధాస్తు పితృవ్యాది పరా ఇతితత్వం. కేచిత్తు నారాయణబలౌ కృతేఽ ప్యంత్య కర్మ సపిండన వర్జ్యం కార్యం. గోబ్రాహ్మణ హతానాం చ పతితానాం తథైవచ, వ్యుత్క్రమాచ్చ ప్రమీతానాం నైవ కార్యా సపిండతా, ఇతి వచనాత్. బ్రాహ్మణాది హతే తాతే పతితే సంగవర్జితే,ఇతి. శ్రాద్ధ ప్రకారోక్తే శ్చేత్యాహుః. తే హేమాద్రి స్థ పూర్వోక్త షట్ త్రింశన్మత విరోధా న్నిర్మూలత్వాచ్ఛ్రాద్ధ ప్రకారస్య వృద్ధి శ్రాద్ధ విషయత్వా దుపేక్ష్యాః.

అను॥ ఆత్మవధ నిమిత్తమైన దీనిని ఆ జాతి వధ ప్రాయశ్చిత్తముతో (కలిపి) సముచితంగా చేయాలి. అందువల్లనే బోధాయనుడు చెప్పాడిట్లా - పన్నెండు సంవత్సరములు లేదా మూడు సంవత్సరములు, అని. మదన పారిజాతమందు, స్మృత్యర్థ సారమందును ఇట్లా - బ్రహ్మ హంతకులు మొదలగు వారికి వారికి తగిన ప్రాయశ్చిత్తం చేసి నారాయణ బలి చేయాలి, అని చెప్పారు. ఇట్లా మ్లేచ్ఛులు ఐన వారికి కూడా చేయాలి. ఒకడిట్లా - పుత్రుడు ప్రాయశ్చిత్తం చేస్తే తండ్రికి పాపనాశం ఔతుంది అనటంలో ప్రమాణం లేదు. ఆత్మ ఘాతమందైతే వచనం వల్ల ఐతే కాని మహాపాతక మందైతే ఎట్లా ఔతుంది,అని ఏదన్నాడో వాడు (అది) స్వయంగా ఆత్మ వధ ప్రాయశ్చిత్తమును జాతి వధ నిమిత్తమైన దానితో సముచ్చయం చేసి చెప్పిన హృదయశూన్యుడే. జాతివధ నిమిత్తమైన దానిని పుత్రులు చేయాలి అనే వచనం లేదు. పుత్రుడు చేసే సర్వప్రాయశ్చిత్తాదుల విప్లవం రావొచ్చు. పైన చెప్పిన బౌధాయన వచనం వల్లను అని ఇక చాలు. ఇది ప్రాయశ్చిత్తార్హులకే. ప్రాయశ్చిత్తానర్హులకైతే పతితోదక మాత్రం చేయాలి,అని కొందరన్నారు. మదన పారిజాతాదులందు స్వారస్యము ఇదే. నిజానికైతే - దానికి అర్హులు అనర్హులను గూర్చి వచనంలో చెప్పనందువల్ల విశేషం లేనందువల్ల అక్కడ కూడా నారాయణబలి, గయా శ్రాద్ధం చేయాలి,అని అనటం యుక్తము. పతితోదక విధి, పిత్రాదులకన్న అతిరిక్తమైన వారి విషయము, అని ఇతరులన్నారు. అది ఇట్లా హేమాద్రి యందు బ్రాహ్మోక్తి ఇట్లా - పతితునకు దయతో తృప్తి చేయటానికి ఇష్టపడేవాడు అందరితో సంగమించే దాసిని వేతనమిచ్చి పిలిపించాలి. అశుద్ధమైన ఘటము చేతియందు గల ఆమెతో ఆచార ప్రకారము చెప్పాలి కూడా. ఓ దాసి ! వెళ్ళు మూల్యంతో త్వరగా నువ్వులను తీసుకురా. ఈ నీళ్ళతో నిండిన కుండను, నువ్వులు గల దానిని నువ్వు దక్షిణ దిక్కు ముఖం చేసి కూర్చొని ఆ పిదప ఎడమ చరణం ద్వారా (కూర్చొని) పారవేయి. పాతకి యొక్క పేరును చెప్పాలి. ఓపాతకి! నీవు త్రాగుఅని, మాటి మాటికి అనుఅని. ఆతని మాటను విని ఆమె మూల్యం తీసుకున్నది కనుక అట్లాగే చేస్తుంది. ఇట్లా చేస్తే పతితులకు తృప్తి కలుగుతుంది, మరో రకంగా కలుగదు,అని. దీనిని మృతాహమందు చేయాలి. పతితునకు, దాసి, మృతాహమందు ఎప్పుడు కుండను వదులుతుందో అప్పుడు ఈ మాత్రంతో ఆతడు ఉపచారం పొందిన (కృతార్థు) వాడౌతాడు,అని మదనరత్నమందు విష్ణూక్తి. ఇది ఆత్మత్యాగి విషయము. ఆత్మ త్యాగులు పతితులు వారు ఆశౌచ ఉదకం పొందే వారు కారు,అని ఆరంభించి విష్ణువు దీనిని చెప్పాడని (లేదని) గౌడులన్నారు. (ఉప లక్షణమైనందువల్ల అందరికి అని అనటం తగును). ఒకడిట్లా - ఏ పతితుడు ఘటస్ఫోటంతో బంధువులతో బహిష్కృతుడైనాడో, ఆతని విషయములు, క్రియా నిషేధ వాక్యములు. బ్రతికుండగానే ఆతడు అంత్యకర్మ చేసుకున్నందువల్ల, అది మళ్ళీ చేయటంలేదు. అని ఏదన్నాడో అది తగదు. తన బంధువులు త్యజించినందువల్ల, వైరాగ్యం కలిగినవాడు,

ప్రాయశ్చిత్తం చేసుకుంటే ఆతనికి కూడా చేయకుండ ఉండవలసి వస్తుంది. మితాక్షరాదులకు విరోధము దీనిని గ్రహించకుండా మాట్లాడిన ఆతడు మూర్ఖుడు అని ఉపేక్షించాలి. ఘటస్ఫోటమైన వానికి సంగ్రహ విధి లేదు అని అనరాదు. మనువు ఇట్లా ఘటస్ఫోటం జరగని వాని త్యాగమును చెప్పి - ప్రాయశ్చిత్తం చేశాక, నీళ్ళు గల కొత్త కుండను, వానితో పాటే, పుణ్య జలాశయమందు స్నానం చేసి ప్రాశన చేయాలి, (పారేయాలి) అని చెప్పాడు. లేకుంటే ప్రాయశ్చిత్త మాత్రంతోనే ఇది రావలసి వచ్చేది. అందువల్ల ఘటస్ఫోటంతో బహిష్కృతుడైన వానికి కూడా పిత్రాదులకు అబ్దాంతమందు నారాయణ బలిచేయాలి. నిషేధములైతే పితృవ్యాది పరములు అనేది తత్వము. కొందరైతే నారాయణ బలిచేసినా అంత్య కర్మ సపిండనం లేకుండా చేయాలి అని అన్నారు. ఇట్లా - గోబ్రాహ్మణ హతులకు, పతితులకు, వ్యుత్క్రమంగా మరణించిన వారికి, సపిండము చేయరాదు అనే వచన్నానుసరించి బ్రాహ్మణాది హతుడైతే, పతితుడైతే, సంగవర్జితుడైతే, సపిండం లేదు తండ్రి! అని శ్రాద్ధ ప్రకారాన్ని చెప్పారు కనుక అని ఏదన్నారో అవి చెప్పినవి హేమాద్రి యందలి, ముందు చెప్పిన షట్ త్రింశన్మత విరోధములు కనుక నిర్మూలము లైనందువల్ల, శ్రాద్ధ ప్రకార వచనములు వృద్ధి శ్రాద్ధ విషయమైనందువల్ల ఉపేక్షించాలి,అని.

**మూ॥ నారాయణబలిస్తు** - హేమాద్ర్యాద్యను సారేణోచ్యతే. తత్రాదౌ క్రియా నిబంధే గారుడే తర్పణ ముక్తం - కార్యం పురుష సూక్తేన మంత్రైర్వా వైష్ణవైరపి. దక్షిణాభిముఖో భూత్వా ప్రేతం విష్ణుమితి స్మరన్. అనాది నిధనోదేవః శంఖ చక్రగదాధరః, అక్షయః పుండరీకాక్షః ప్రేతమోక్ష ప్రదోభవ, ఇతి శుక్లైకాదశ్యాం దేశకాలౌ సంకీర్త్య అముక గోత్రస్య అముకస్య దుర్మరణాత్మ ఘాతజ దోషనాశార్థ మౌర్ధ్వ దేహిక సంప్రదానత్వ యోగ్యతా సిద్ధ్యర్థం నారాయణ బలిం కరిష్యే - ఇతి సంకల్ప్య బ్రహ్మాణం విష్ణుం శివం యమం ప్రేతం పంచకుంభేషు - విష్ణుః స్వర్ణ మయః కార్యో రుద్రస్తామ్రమయ స్తథా, బ్రహ్మారౌప్య మయస్తత్ర యమో లోహ మయో భవేత్. ప్రేతోదర్భ మయః కార్యః ఇతి దేవ ప్రకల్పనా, ఇతి. గారుడోక్తాసు సర్వాసు హైమీషు వా ప్రతిమాసు షోడశోపచారైః పురుష సూక్తే నాభ్యర్చ్యాగ్నిం ప్రతిష్ఠాప్య చరుం పురుష సూక్తేన ప్రత్యృచం నారాయణాయేదమితి హుత్వా దేవానామగ్రే దక్షిణాగ్ర దర్భేషు విష్ణురూపం ప్రేతం స్మరన్ నామగోత్రాభ్యాం మధు ఘృత తిలయుతాన్ దశపిండాన్ యజ్ఞో పవీత్యేవ, అముకగోత్ర అముకశర్మన్ ప్రేత విష్ణు రూపాఽయంతే పింద ఉపతిష్ఠతాం, ఇతి దత్వా పురుష సూక్తే నాభిమంత్ర్య, యత్తే యమం, ఇతి సూక్తేన పిండా ననుమంత్ర్య శంఖోదకేన చాభిషిచ్య అభ్యర్చ్య అముక శర్మాణ మముకగోత్రం విష్ణురూపం ప్రేతం తర్పయామి, ఇతి. పురుషసూక్తేన ప్రత్యృచం తర్పయిత్వా ఏకమామాన్నం బ్రహ్మాది పంచభ్యోదద్యాత్.

అను॥ నారాయణ బలియైతే హేమాద్రి మొదలగు వారి ననుసరించి చెబుతున్నాము. అక్కడ తొలుత క్రియా నిబంధమందు గారుడోక్తిగా తర్పణం చెప్పబడింది ఇట్లా - పురుష సూక్తంతోగాని, విష్ణు మంత్రములతోగాని, దక్షిణాభిముఖుడై, ప్రేతను విష్ణువని స్మరిస్తూ

తర్పణము చేయాలి,అని. ఆద్యంత రహితుడ, దేవ, శంఖచక్ర గదాధర, అక్షయ (నాశరహిత), పుండరీ కాక్ష, ప్రేతమునకు మోక్ష ప్రదుడవుకమ్ము, అని ప్రార్థించాలి. శుక్ల ఏకాదశియందు, దేశ కాలములుచ్చరించి అముక గోత్రునకు ఈ పేరుగల వానికి దుర్మరణ ఆత్మఘాతం వల్ల కలిగిన దోష నాశం కొరకు ఔర్ధ్వదేహిక సంప్రదానమున (ఇవ్వటం)కైన యోగ్యతాసిద్ధి కొరకు నారాయణ బలిని చేస్తున్నాను, అని సంకల్పం చేసి, బ్రహ్మవిష్ణు, శివ, యమ ప్రేతలను ఐదు కుంభములందుంచి - విష్ణువు బంగారంది, రుద్రుడు తామ్రముది, బ్రహ్మ రౌప్యముది, యముడు లోహము, ప్రేత దర్భలది చేయాలి, అని దేవతల ప్రకల్పన, అని. గారుడోక్తములైనవి అన్నీ బంగారువో ప్రతిమలు. వానిని షోడశోపచారములతో, పురుష సూక్తంతో పూజించి, అగ్నిని ప్రతిష్ఠించి చరువును పురుష సూక్తంతో ప్రతి ఋక్కును నారాయణునకు ఇది అని హోమం చేసి, దేవతల ఎదుట దర్భలను దక్షిణాగ్రంగా ఉంచి విష్ణు రూపుడైన ప్రేతను స్మరించి, నామగోత్రములతో, మధుఘృత తిలలతో కూడిన పది పిండములను యజ్ఞోపవీతిగానే, ఈ గోత్రం, ఈపేరుగల ఓప్రేత! విష్ణురూప, ఈ పిండము నీకు స్వీకరించు అని ఇచ్చి "పురుష సూక్తంతో అభిమంత్రించి, యత్తేయమం, అనే సూక్తంతో పిండములనను మంత్రించి (ఆవాహనం) శంఖోదకంతో అభిషేకించి, పూజించి, ఈ పేరుగల ఈ గోత్రుడైన విష్ణురూప ప్రేతను తర్పయామి అని పురుష సూక్తంతో ప్రతి ఋక్కుతో తర్పణ చేసి ఒక ఆమాన్నమును బ్రహ్మాది ఐదు దేవతలకివ్వాలి.

**మూ॥ మంత్రస్తు - బ్రహ్మావిష్ణు మహాదేవాయమశ్చైవ సకింకరః, బలిం గృహీత్వా కుర్వంతు ప్రేతస్య చ శుభాంగతిం, ఇతి. మితాక్షరాయాంతు హోమ బల్యాదినోక్తం. తతఃప్రతి దైవతం త్రివిధం ఫలం శర్కరామధు ఘృతగుడాని చ నివేద్య పిండాన్యభ్యర్చ్య నద్యాం క్షిప్త్వా రాత్రౌ నవసప్త పంచవా విప్రా న్నిమంత్ర్యో పోషితేన జాగరణం కృత్వా శ్వోభూతే పునర్విష్ణుం యమం సంపూజ్యైకోద్దిష్ట విధినా శ్రాద్ధ పంచకం కరిష్య ఇత్యుక్త్వా బ్రహ్మావిష్ణుశివయమ ప్రేతాన్ స్మరన్ విప్రాన్ ఉపవిశ్య ప్రేతస్థానే చైకం విష్ణుం స్మరన్నా వాహనార్ఘ్యయుతం తృప్తి ప్రశ్నాంతం కృత్వోల్లేఖనాది కృత్వాన్నశేషేణ బ్రహ్మణే విష్ణవే శివాయయమాయ సపరివారాయ చతురః పిండాన్ దత్వా ప్రేత నామగోత్రే స్మృత్వా విష్ణు నామ్నా పంచమందత్వా అభ్యర్చ్యాచాంతే భ్యోదక్షిణాందత్వైకంప్రేతం స్మృత్వా విశేషతః సంతోష్యవిప్రైః ప్రేతాయ, ఇదం తిలోదక ముపతిష్ఠతాం, ఇతి సతిలక ముదకం దాపయిత్వా భుంజీతేతి. అత్ర విశేషాంతరం భట్టకృత అంత్యేష్టి పద్ధతౌక్షేయం.**

అను॥ మంత్రమైతే - బ్రహ్మ విష్ణు మహాదేవుడు కింకర సహిత యముడు వీరంతా బలిని గ్రహించి ప్రేతకు శుభమైన గతిని ఇవ్వండి,అని. మితాక్షరయందు హోమ బల్యాదులు చెప్పబడలేదు. ఆ పిదప ప్రతిదేవతకు మూడు రకాలపండ్లు, శర్కర మధు ఘృత గుడములు నివేదన చేసి పిండముల పూజించి, నదిలో పారవేసి, రాత్రికి తొమ్మిది లేదా ఏడుగురు లేదా ఐదుగురు బ్రాహ్మణులను నిమంత్రణచేసి, ఉపవాసముండి జాగరణ చేసి, తెల్లవారిన పిదప తిరిగి విష్ణువును యముని పూజించి ఏకోద్దిష్ట విధితో ఐదు

శ్రాద్ధములను చేస్తున్నాను అని చెప్పి బ్రహ్మ,విష్ణు, శివ,యమ, ప్రేతములను స్మరించి బ్రాహ్మణుల కూర్చోబెట్టి ప్రేత స్థానమందు ఒక విష్ణువును స్మరించి ఆవాహన అర్ఘ్యములతో కూడా తృప్తి ప్రశ్న చివరి వరకు ఆచరించి ఉల్లేఖనాదులు చేసి అన్న శేషంతో బ్రహ్మ, విష్ణు, శివులకు, సపరివార యమునకు, నాల్గు పిండములిచ్చి ప్రేతయొక్క నామగోత్రములు స్మరించి విష్ణు నామంతో ఐదవది ఇచ్చి పూజించి ఆచాంతమందు దక్షిణనిచ్చి ఒక ప్రేతను స్మరించి విశేషంగా సంతోష పరచి, విప్రులతో, ప్రేతకొరకై, ఈ తిలోదకం స్వీకరించు, అని తిలలతో కూడిన ఉదకం ఇప్పించి భుజించాలి,అని. ఇక్కడ ఇతర విశేషాలు, భట్టులు వ్రాసిన అంత్యేష్టి పద్ధతి నుండి గ్రహించాలి.

మూ॥ **సర్పహతేతు వర్షపర్యంతం** పూర్వేఽహ్న్యేక భక్త పూర్వం శుక్ల పంచమ్యా ముప వాసనం నక్తం వా కృత్వాపిష్టమయం నాగ మనంతవాసుకి శంఖ పద్మ కంబలకర్కోటకాశ్వతర ధృతరాష్ట్ర శంఖపాలకాలియ తక్షక కపిలేతి నామభిః ప్రతిమాసం సంపూజ్య పాయసేన విప్రాన్ సంభోజ్య వత్సరాంతే హైమం నాగం గాంచ ప్రత్యక్షాం చ దత్వా నారాయణ బలిం కుర్యాత్. మూలంతు హేమాద్రౌ జ్ఞేయం. బౌధాయన సూత్రే సర్పమృతానాం, నమోఽస్తు సర్పేభ్యః, ఇతి తిస్ర ఆహుతీర్హుత్వా, ఉదకే మృతానాం, సముద్రాయవయునాయ, ఇతి హుత్వేతి క్రియాం కుర్యాదితి శేషః. వ్యాసః – సౌవర్ణ భార నిష్పన్నం నాగం కృత్వా తథైవగాం, వ్యాసాయ దత్వా విధి వత్పితు రానృణ్య మాప్నుయాత్. హేమాద్రౌ భవిష్యే – పంచమ్యాం పన్నగం హైమం స్వర్ణేనైకేన కారయేత్, క్షీరాజ్య పాత్ర మధ్యస్థం పూజ్య విప్రాయ దాపయేత్, ప్రాయశ్చిత్త మిదం ప్రోక్తం నాగదష్టస్య శంభునా, ఇతి. అపరార్కే స్మృత్యంతరేఽపి – తదైవ శుద్ధ్యతి ప్రేతో నారాయణ బలౌకృతే, యోదదాతి క్రియా పిండం తస్మై ప్రేతాయవై సుతః తస్యైవా శౌచముద్దిష్టం త్ర్యహమేవ, నసం శయః, విష్ణు శ్రాద్ధ సమాప్తౌతు త్రయోదశ్యాం దినత్రయం. ఆశౌచం పిండదః కుర్యాన్నతు తద్బంధు గోత్రజాః. **యస్యనై మృత్యుకాలేతు** వ్యచ్ఛిన్నాసంత తిర్భవేత్, సవసేన్నరకే నిత్యం పంకమగ్నః కరీయథా, ఇత్యుపక్రమ్య **బలిం నారాయణం** కుర్యాత్త స్యోద్దేశేన భక్తిమాన్, ఇతి గారుడోక్తేః అపుత్రస్యాపి పత్న్యాద్యైః కార్య ఇత్యుక్తం దేవయాజ్ఞికేన. **అథ విధానాదా శౌచాభావః.** యథా యతి యుద్ధమృతాదిషు – త్రయాణా మాశ్రమాణాం చ కుర్యాద్దాహాదికాః క్రియాః. యతేః. కించిన్నకర్తవ్యం నచాన్యేషాం కరోతిసః. ఇతి బ్రాహ్మాత్. **ఉశనాః - ఏకోద్దిష్టం** నకుర్వీత యతీనాం చైవ సర్వదా, అహన్యే కాదశే ప్రాప్తే పార్వణంతు విధీయతే. సపిండీకరణం తేషాం నకర్తవ్యం సుతాదిభిః, త్రిదండగ్రహణాదేవ ప్రేతత్వం నైవజాయతే.

అను॥ సర్పంతో మరణిస్తే సంవత్సరం వరకు (ముందు రోజు) ఏకభక్త పూర్వకముగా శుక్లపంచమి యందు ఉపవాసం కాని నక్తం కాని చేసి పిండితో చేసిన నాగమును అనంత వాసుకి శంఖ పద్మ, కంబల, కర్కోటక, అశ్వతర, ధృతరాష్ట్ర, శంఖపాల, కాళియ, తక్షక, కపిల అనే పేర్లతో ప్రతినెల పూజించి పాయసంతో విప్రులకు భోజనం పెట్టి సంవత్సరం చివర బంగారు నాగాన్ని, నిజమైన గోవును దానం చేసి నారాయణ బలిచేయాలి. మూలమైతే

హేమాద్రి యందు గ్రహించాలి. బౌధాయన సూత్రమందు సర్పమృతులకు, నమోఅస్తు సర్పేభ్యః అను మంత్రంతో హోమం చేసి నీట మరణించిన వారికి, సముద్రాయవయు నాయ, అనే మంత్రంతో మూడు ఆహుతులు హోమం చేసి ఇట్లా క్రియ నాచరించాలి అని ముగింపు. వ్యాసుడిట్లా - బంగారు భారంతో (రెండు వేల పలాలు భారము) (నూరు పలములు ఒక తులం. ఇరవై తులములు ఒక భారం) తయారైన నాగ విగ్రహాన్ని తయారు చేయించి, దానితో గోవును (చేయించి) శాస్త్ర ప్రకారం వ్యాసునకు ఇచ్చి, తండ్రి ఋణం నుండి విముక్తిని పొందాలి,అని. హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా - పంచమి తిథి యందు బంగారు నాణాన్ని ఒక పడగ గలదాన్ని చేయించి క్షీరము నేయిపాత్ర వీనియందు ఉంచి ఆ నాగాన్ని పూజించి బ్రాహ్మణున కివ్వాలి. నాగదష్టునకు శంభువు దీనిని ప్రాయశ్చిత్తంగా చెప్పాడు,అని. అపరార్కమందు స్మృత్యంతర మందు వచనమిట్లా - నారాయణ బలిచేస్తే ప్రేత అప్పుడే శుద్ధి నందుతుంది. ఆ ప్రేతకు ఏ పుత్రుడు క్రియా, పిండము ఇస్తాడో వానికి ఆశౌచము మూడు రోజులే, అనుమానంలేదు. విష్ణు శ్రాద్ధ సమాప్తి యందు త్రయోదశి యందు మూడు రోజులు పిండం పెట్టేవాడు ఆశౌచాన్ని పాటించాలి. ఆతని బంధువులు గోత్రజులు కాదు,అని. ఎవనికి మృత్యుకాల మందు సంతతి నష్టమైందో, ఆతడు ఎల్లప్పుడు నరకమందుంటాడు, బురదలో మునిగిన ఏనుగులా, అని ఆరంభించి, ఆతని నుద్దేశించి నారాయణ బలిని భక్తి కలవాడు చేయాలి, అని గారుడోక్తి కనుక పుత్రులు లేని వానికికూడా పత్ని మొదలగువారు చేయాలి,అని చెప్పాడు దేవయాజ్ఞికుడు. ఇక విధానంవల్ల ఆశౌచంలేదు. ఎట్లాంటే యతికి, యుద్ధమృతుడు మొదలగువారికి. మూడు ఆశ్రమముల వారికి దాహాదిక క్రియలు చేయాలి. యతికి ఏమీ చేయరాదు. ఆతడూ ఇతరులకు చేయడు, అని బ్రాహ్మోక్తి. ఉశనుడిట్లా - యతులకు ఎప్పుడూ ఏకోద్దిష్టం చేయరాదు. ఏకాదశి రోజున వారికి పార్వణ విధి చేయాలి, అని. సుతాదులు యతులకు సపిండీకరణం చేయరాదు. త్రిదండ గ్రహణం వల్లనే ప్రేతత్వము కలుగదు,అని.

**మూ॥ తత్సంస్కారం వక్ష్యామః - దత్తాత్రేయః - ఏకోద్దిష్టం జలం పిండమా శౌచం ప్రేత సత్క్రియాం, న కుర్యాద్వార్షి కాదన్యత్ బ్రహ్మీ భూతాయ భిక్షవే. వార్షికాదితి పూర్వభావి మాసికాది నిషేధో నతుదర్శాదేః. సంన్యాసినోఽ ప్యాబ్దికాది పుత్రః కుర్యాద్యథా విధి, ఇతి వాయవీయోక్తేః. పృథ్వీ చంద్రోదయే ప్రజాపతిః - అహన్యేకాదశే ప్రాప్తే పార్వణంతు విధీయతే సపిండీకరణం తస్యన కర్తవ్యం సుతాదిభిః. ఏషు సపిండనాది నిషేధాను వాదేన, పార్వణోక్తేః తత్ స్థానా పన్నత్వం పార్వణస్య గమ్యతే నగిరాగిరే తిబ్రూయా ద్దైరం కృత్వోద్వేయం, ఇతివత్. ఇదం వార్షికాది విధానం చ త్రిదండి నామేవ. ఏకదండి పరమ హంసాదీనాంతు నకిమపి కార్యం. పూర్వోక్తో శనోవాక్యే త్రిదండి గ్రహణా దితి శూలపాణ్యా దయోగౌదాః. త్రిదండి శబ్దేన మనోదండాది**

**దండత్రయోక్తేః యస్యైతే నియతా దండాః సత్రిదండీతి చోచ్యతే, ఇతి స్మృతేః. బౌధాయనః - నారాయణ బలిశ్చాస్య కర్తవ్యో ద్వాదశేఽహని, అస్య పార్వణేన, సముచ్చయోజ్ఞేయః. తం చ స ఏవాహ - కృత్వా విష్ణోర్మహా పూజాం పాయసం వినివేదయేత్, అగ్నౌహుత్వాతు తచ్ఛేషం వ్యాహృతీభిః సమాహితఃయతీన్ గృహస్థాన్ సాధూన్వా నిమంత్ర్య ద్వాదశావరాన్, అభ్యర్చ్య గంధపుష్పాద్యైః మంత్రైః ద్వాదశ నామభిః. సంభోజ్య హవ్యేనాన్నేన దక్షిణాం చ నివేదయేత్. త్రయోదశం ద్విజ శ్రేష్ఠ మాత్మ సంజ్ఞం యతేంద్రియం. విష్ణుం యథా తథాఽభ్యర్చ్య పాద్యాద్యైశ్చ విధానతః. దద్యాత్పురుష సూక్తేన గంధ పుష్పాదికం క్రమాత్. వస్త్రాలంకరణాదీని యథాశక్తి ప్రదాపయేత్, ఉచ్ఛిష్ట సన్నిధౌతస్య దర్భానాస్తీర్య భూతలే. భూర్భువః స్వః స్వధాయుక్తైః తస్మై దద్యాత్ బలిత్రయం. అశ్వమేధ సహస్రస్య వాజపేయ శతస్యచ. యత్ఫలం తల్లభేదేవం యత్కరోతి యతిక్రియాం.**

అను॥ ఆ సంస్కారాన్ని చెప్తున్నాము. దత్తాత్రేయుడిట్లా – ఏకోద్దిష్టము, జలము, పిండము, ఆశౌచము, ప్రేత సత్క్రియ ఇవన్నీ బ్రహ్మీ భూతుడైన భిక్షువునకు చేయరాదు. వార్షికం తప్ప మరొకటి చేయరాదు. వార్షికాత్ అని అనటంవల్ల దానికన్న ముందుండే మాసికాదుల నిషేధము కాని దర్శాది నిషేధం కాదు. సన్యాసికికూడా ఆబ్దికాదులు, పుత్రుడు శాస్త్ర ప్రకారం ఆచరించాలి, అని వాయవీయోక్తి. పృధ్వీచంద్రోదయమందు ప్రజాపతి ఇట్లా – పదకొండవ రోజున పార్వణ మాచరించాలి. సుతాదులు ఆతనికి సపిండీకరణాదులు చేయరాదు. ఈ వాక్యములలో సపిండనాది నిషేధ అనువాదం వల్ల పార్వణం చెప్పినందువల్ల దాని స్థానంలో వచ్చినట్టుగా పార్వణము అన్పిస్తోంది. గిరాగిరా అని చెప్పరాదు ఐరం పదంను చేర్చి గానం చేయాలి, అనే దానివలె. ఈ వార్షికాది విధానము త్రిదండి పరము. ఏకదండి, పరమ హంసాదులకైతే ఏమీ చేయరాదు. ముందు చెప్పిన ఉశనుని వాక్యమందు త్రిదండి పదం గ్రహించాడు అని శూలపాణ్యాదులు గౌడులన్నారు. త్రిదండి శబ్దంతో మనో దండాది దండత్రయం చెప్పబడ్డాయి. ఎవనికి ఈ దండములు నియతంగా ఉన్నాయో వాడు త్రిదండి అని కూడా చెప్పబడ్డాడు, అని స్మృతి వచనం. బౌధాయనుడిట్లా – పన్నెండవ రోజున యతికి నారాయణ బలి ఆచరించాలి. దీనిని పార్వణంతో కలిపి చేయాలి, అని గ్రహించాలి. దానిని ఆతడే చెప్పాడు ఇట్లా – విష్ణువునకు మహా పూజ చేసి పాయసం నివేదించాలి. సావధానుడై వ్యాహృతులతో కూడా దాని శేషమును అగ్ని యందు హోమం చేయాలి,అని. యతులను గృహస్థులను, సాధువులనుకాని శ్రేష్ఠులైన పన్నెండు మందిని పిలిచి (నిమంత్రణ) గంధ పుష్పాదులతో పూజించి, ద్వాదశ నామములతో మంత్రములతో పూజించి హవ్యాన్నంతో భోజనంపెట్టి దక్షిణ కూడా ఇవ్వాలి. పదమూడవ వానిని ద్విజశ్రేష్ఠుని, ఆత్మజ్ఞానం కలవానిని, ఇంద్రియ సంయమనం కలవానిని విష్ణుమూర్తిని పూజించిన విధంగా శాస్త్ర ప్రకారం, పాద్యాదులతో పూజించి, క్రమంగా గంధ పుష్పాదికము లను పురుష

సూక్తం పరిస్తూ ఇవ్వాలి. వస్త్ర అలంకరణాదులను శక్తి కొలది ఇవ్వాలి. ఆతని ఉచ్ఛిష్టం దగ్గర భూమిపై దర్భలు పరిచి, భూః భువః స్వః అను స్వధాకారములతో ఆతనికి మూడు బలులు ఇవ్వాలి. వేయి అశ్వమేధముల, నూరువాజపేయముల, ఫలమును పొందుతారు, ఇట్లా యతిక్రియను నిర్వర్తించినవారు,అని.

మూ॥ **శౌనకస్తు - శౌనకోఽహం** ప్రవక్ష్యామి నారాయణ బలిం పరం, చాండాలా దుదకాత్సర్పాత్ బ్రాహ్మణాద్వైద్యుతాదపి. దంష్ట్రిభ్యశ్చ పశుభ్యశ్చ రజ్జు శస్త్ర విషాశ్మభిః, దేశాంతర మృతానాం చ మృతానాంవాఽన్య సాధనైః. జీవచ్ఛ్రాద్ధ మృతానాం చ కనిష్ఠానాం తథైవచ, యతీనాం యోగినాం పుం సామన్యేషాం మోక్ష కాంక్షిణాం, పుణ్యాయాఘ క్షయార్థాయ ద్వాదశేఽ హనికారయేత్. ద్వాదశ్యాం శ్రావణేఽబ్దాంతే పంచమ్యాం పర్వణోస్తువా. ఇత్యుక్త్వా పూర్వోక్తం సర్వం విధిముక్త్వా అతోదేవేతి షడ్భిః పురుష సూక్తేన చ ప్రత్యృచం పాయ సంహుత్వా కేశవాది ద్వాదశ నామభిః తద్రూపిణే పిత్రే ద్వాదశ విప్రాన్ సంభోజ్య తైరేవ ద్వాదశ పిండాన్ దద్యాది త్యధిక మాహ. యుద్ధమృతేతు ప్రాగుక్తం. **కృతజీవచ్ఛ్రాద్ధేమృతే** సపిండై రాశౌచాది కార్యం నవా. తదుక్తం హేమాద్రౌ లైంగే - మృతే కుర్యాన్న కుర్యాద్వా జీవన్ముక్తో యతః స్వయం, కాలేగతే ద్విజే భూమౌ ఖనే ద్వాపి దహేతవా, పుత్ర కృత్యమశేషంచ కృత్వా దోషోన విద్యతే. **జీవత్యపి విశేషః** తత్రైవోక్తః - నిత్యం నైమిత్తికం యత్తు కుర్యాద్వా సంత్య జేతవా, బాంధవేఽ పి మృతేతస్య నైవాశౌచం విధీయతే. సూతకం చ న సందేహః స్నాన మాత్రేణ శుధ్యతి. ఏతద్యోగి విషయం యోగ మార్గరతోఽపి చ, ఇతి తస్యాప్యుక్తేః. **తథా ఆహితాగ్నౌ** ప్రోషితమృతే తదస్థిదాహాత్పూర్వం పుత్రాదీనా మాశౌచం. సంధ్యాది కర్మలోపశ్చనాస్తి. అనగ్ని మత ఉత్క్రాంతే రాశౌచాది ద్విజాతిషు, దాహాదగ్ని మతో విద్యాద్విదేశస్థే మృతేసతి, ఇతి స్మృతేః. ఆహితాగ్నేః దాహాత్ప్రాగపి దశాహః, సంస్కారాంగం చ భిన్నే దశాహ ఇతి ధూర్త స్వామి రామాండారశ్చ తచ్చింత్యం. మూలైక్యాద్వచో విరోధాచ్చ. ఏతత్ప్రాగుక్తం. **అత్రదేహస్యైవ సంభవే** దాహః, ఆహితాగ్నౌ విదేశస్థే మృతేసతి కలేవరం, నిధేయం నాగ్నిభిర్వా వత్తదీయైరపి దహ్యతే, ఇతి బ్రాహ్మోక్తేః. **తదభావే ఛందోగపరిశిష్టే** - విదేశ మరణేఽస్థీని ఆహృత్యాభ్యజ్య సర్పిషా, దాహయేదృర్ణిషాచ్ఛాద్య పాత్రన్యా సాది పూర్వవత్. **అస్థ్నామలాభే** పర్ణాని శకలాన్యుక్త యావృత్యా, దాహయే దస్థి సంఖ్యాని తతః ప్రభృతి సూతకం. హేమాద్రౌ షట్ త్రింశన్మతే - కుర్యాద్దర్భమయం ప్రేతం దర్భైః త్రింశతషష్ఠిభిః, పాలాశీభిః సమిద్భిర్వా సంఖ్యా చైవం ప్రకీర్తితా.

అను॥ శౌనకుడిట్లా - శౌనకుడనైన నేను పరమైన నారాయణబలిని గూర్చి చెబుతున్నాను. చాండాలుని వల్ల, జలంవల్ల సర్పంవల్ల బ్రాహ్మణునివల్ల పిడుగువల్ల కోరలతో, పశువులతో, త్రాడు, శస్త్రము, విషము, రాయివీనితో కాని వేరే సాధనములతోకాని మరణించిన వారికి, దేశాంతర మృతులకు, జీవచ్ఛ్రాద్ధం చేసుకొని మరణించిన వారికి, చిన్నతనంలో మరణించినవారికి, యతులకు యోగులకు, మోక్ష కాంక్షులైన ఇతర

పురుషులకు, పుణ్యం రావటం కొరకు, పాపనాశం కొరకు పన్నెండవ రోజున చేయాలి. శ్రవణా నక్షత్రం గల ద్వాదశి యందు సంవత్సరాంతమందు పంచమి యందుకాని, పర్వమందు కాని నారాయణ బలి చేయాలి. అని చెప్పి ముందు చెప్పిన విధినంతా చెప్పి, అతొదేవా, అను ఆరు మంత్రములతో, పురుష సూక్తంతో ప్రతి ఋక్కును పాయసంతో హోమంచేసి కేశవాది ద్వాదశ నామములతో తద్రూపుడైన తండ్రి కొరకు పన్నెండు మంది బ్రాహ్మణులను భుజింపచేసి, ఆ నామములతోనే పన్నెండు పిండముల నివ్వాలి అని ఎక్కువగా చెప్పాడు. యుద్ధమందు మృతి చెందిన వానికి ముందే చెప్పాము. జీవచ్ఛ్రాద్ధం చేసుకున్న వాడు మరణిస్తే సపిండులు ఆశౌచాదులు చేయాలా వద్దా. అదే విషయం హేమాద్రి యందు లైంగోక్తి ఇట్లా – అతడు స్వయంగా జీవన్ముక్తుడు. కనుక మరణిస్తే ఆశౌచాది చేయొచ్చు లేదా మానవచ్చు. కొంత కాలానికి ద్విజుడు మరణిస్తే భూమి యందు పాతి పెట్టుటయో లేదా కాల్చటమో చేయాలి. పుత్ర కృత్యాన్నంతా చేస్తే దోషం లేదు,అని. బ్రతికి ఉన్నా విశేషము అక్కడే చెప్పారు – నిత్యము నైమిత్తికము ఐన కర్మను ఆచరించ వచ్చు లేదా విడిచి పెట్టవచ్చు. ఆతడు మరణిస్తే బాంధవులకు గూడా ఆశౌచం లేదు. సూతకం గూడ లేదు స్నానం మాత్రంతో శుద్ధి నందుతారు. అనుమానంలేదు. ఇది యోగి విషయము. యోగ మార్గరతుడైనా, అని ఆతనిని కూడా చెప్పారు. అట్లాగే ఆహితాగ్ని విదేశం వెళ్ళి మరణిస్తే ఆతని అస్థికలదాహం కన్న ముందు పుత్రాదులకు ఆశౌచము, సంధ్యాధి కర్మ లోపంలేదు. అగ్నిలేని వాని మరణమందు ద్విజాతులకు ఆశౌచాదులు. అగ్ని కలవాని మరణము విదేశమందు జరిగితే దాహం నుండి ఆశౌచము ఉంటుంది. అని స్మృతి. ఆహితాగ్నికి దాహం కన్న ముందు కూడా దశాహ శౌచము సంస్కారాంగము. వేరే దశాహము అని ధూర్త స్వామి రామాండారులన్నారు. అది ఆలోచించాలి. మూలం ఒకటైనందువల్ల వచో విరోధమైనందువల్లనూ దీనిని ముందు చెప్పాము. ఇక్కడ శరీరముంటేనే దాహము ఆహితాగ్ని విదేశస్థుడై మరణిస్తే, ఆతని కళేబరాన్ని, ఆతనివారు అగ్నితో కాల్చే దాకా జాగ్రత్త పరచాలి,అని బ్రాహ్మోక్తి అది లేకపోతే ఛందోగ పరిశిష్టమందిట్లా – విదేశ మరణమందు, ఎముకలు తెచ్చి, నేయితో స్నానం చేయించి, దర్భలతో కప్పి కాల్చాలి. పాత్రన్యాసాదులు పూర్వంవలెనే చేయాలి. అస్థులు లభించకపోతే మోదుగు ఆకులు ముక్కలతో తమశాఖానుసారముగా కాల్చాలి. అస్థి సంఖ్యలు తమ శాఖకు చెప్పిన రీతి ఉండాలి. అప్పటి నుండి సూతకము. హేమాద్రి యందు షట్త్రింషన్మత మందిట్లా – మూడు వందల అరవై దర్భలతో దర్భమయమైన ప్రేతను చేసి మోదుగు సమిధలతో కాల్చాలి. సమిధల సంఖ్య కూడా అంతే అని చెప్పారు,అని.

**మూ॥ భవిష్యే – చత్వారింశత్** శిరః స్థానే గ్రీవాయాం చ దశైవతు, బాహ్వోశ్చైవ శతం దద్యాత్ వింశతించ తథోరసి ఉదరే వింశతిం దద్యాత్ త్రింశతం కటిదేశయోః, ఊర్వోశ్చైవ

శతందద్యాత్ త్రింశతం జాను జంఘయోః. పాదాంగులీషు దశవై ఏషా చ ప్రేతకల్పనా. మదన రత్నే యజ్ఞ పార్శ్వః - శిరస్య శీత్యర్ధం దద్యాత్ గ్రీవాయాం తు దశైవతు, బాహ్వోశ్చైవ శతం దద్యాత్ దశచైవాంగులీషుచ, ఉర సి త్రిం శతం దద్యాద్వింశతిం జరరోదరే, ద్వాదశార్ధం వృషణయోః అష్టార్ధం శిశ్న ఏవతు ఊర్వోశ్చైకశతం దద్యాత్త్రిం శతం జంఘయోర్ద్వయోః పాదాంగులీషు ద్వేదద్యా దేతత్ ప్రేతస్యకల్పనం. మస్తకే నారికేరంతు అలాబుంతాలుకే తథా. పంచరత్నం ముఖేన్యస్య జిహ్వాయాం కదలీ ఫలం. చక్షుషోస్తు కపర్దౌద్వౌ నాసికాయాంతు కాలకం, కర్ణయోః బ్రహ్మపత్రాణి కేశేవట ప్రరోహకాః, నాలకం కమలానాంతు అంత్ర స్థానే వినిర్దిశేత్. మృత్తికాతు వసాధాతుః హరితాలక గంధకౌ, శుక్రేతు పారదం దద్యాత్ పురీషే పిత్తలంతథా, సంధీషు తిలపిష్టంతు మాంసే స్యాద్యవ పిష్టకం, మధుస్యాల్లోహితస్థానే త్వచాస్థానే మృగత్వచా. స్తనయోః గుంజకే (జంబీరే) దేయే నాసాయాం శతపత్రకం. కమలం నాభిదేశేస్యాత్ వృంతాకే వృషణాశ్రితే. లింగే చరక్త మూలంతు పరిధానం దుకూలకం. గోమూత్రం గోమయం గంధం సర్వౌషధ్యాది సర్వతః ఇతి.

అను॥ భవిష్యమందిట్లా - తల స్థానమందు నలభై దర్భలు, కంఠభాగ మందు పది దర్భలు, చేతులకు (బాహువులు) నూరు, ఉరస్సున ఇరవై, ఉదరమందు ఇరవై, కటి ప్రదేశమందు ముప్పై, ఊరువులకు నూరు, జాను జంఘలకు ముప్పై దర్భలు, పాద అంగుళులందు పది దర్భలు ఇట్లా చేర్చి ప్రేత కల్పన చేయాలి,అని. మదనరత్నమందు యజ్ఞపార్శ్వుడిట్లా - శిరస్సు యందు ఎనభైలో సగం (నలభై) కంఠమందు పది, బాహువులకు నూరు, అంగుళులకుపది, ఉరస్సు యందు ముప్పై, జఠర ఉదరములందు ఇరవై, వృషణములకు ఆరు, శిశ్నమునకు నాలుగు, ఊరువులకు నూరు,రెండు జంఘలకు ముప్పై, పాదాంగుళులందు రెండు ఈ రకంగా దర్భలు చేర్చి ప్రేత కల్పన చేయాలి,అని. మస్తక మందు కొబ్బరికాయ, తాలువులందు సొరకాయ, ముఖమందు పంచరత్నములు, నాలుకపై అరటిపండు, కళ్ళపై రెండు గవ్వలు, నాసికయందు కాలకము (కలిగొట్టు), కర్ణములందు బ్రహ్మపత్రములు, కేశములందు మర్రి మొలకలు, పేగుల స్థానమందు కమల నాళము లుంచాలి. వస స్థానమందు మృత్తిక, ధాతు స్థానమందు హరితాళ గంధకములు, శుక్ర మందు పాదరసము, పురీషమందు ఇత్తడి, సంధులందు తిలపిష్టము, మాంసమందు యవలపిండి, రక్తస్థానమందు మధువు, చర్మస్థానమందు మృగచర్మము, స్తనము లందు గుంజకములు, ముక్కు యందు శతపత్రము, నాభిదేశ మందు కమలము, వృషణములందు వృంతాకములు, లింగస్థానమందు రక్తమూలము, కప్పుకోవటానికి పట్టువస్త్రము, గోమూత్రము, గోమయము, గంధము, సర్వ ఓషధులు మొదలగునవి అంతటా వేయాలి,అని.

మూ॥ క్రియా నిబంధే గారుడేఽ ప్యేవ ముక్త్వాన్యదపి - ఘృతం నాభ్యాంతు దేయం స్యాత్కౌపీనే చత్రపు స్మృతం. మౌక్తికం స్తనయోర్మూర్ధ్ని కుంకుమేన విలేపనం, సింధూరం నేత్రకోణేషు తాంబూలాద్యుపహారకైః, సర్వౌషధి యుతం కృత్వా పూజాం చైవ యథోదితాం. ఇదం నిరగ్నేరపి

**తత్రైవ వృద్ధమనుః** – ప్రోషితస్య తథా కాలోగతశ్చేద్ద్వా దశాబ్దికః, ప్రాప్తే త్రయో దశేవర్షే ప్రేత కర్మాణి కారయేత్. బృహస్పతిః – యస్యన శ్రూయతే వార్తాయావద్ ద్వాదశవత్సరాత్, కుశపత్రక దాహేన తస్య స్యాదవధారణా భవిష్యే – పితరిప్రోషితేయస్య న వార్తానైవ చాగమః, ఊర్ధ్వం పంచదశాద్వర్షాత్ కృత్వా తత్ప్రతి రూపకం, కుర్యాత్తస్యతు సంస్కారం యథోక్త విధినా తతః, తదాదీన్యేవ సర్వాణి ప్రేతకర్మాణి కారయేత్. ద్వాదశాబ్ద ప్రతీక్షా పితృభిన్న విషయేతి మదనరత్నే ఉక్తం. గృహ్య కారికాయాంతు – తస్య పూర్వవయస్కస్య వింశత్యోర్ధ్వం తతః క్రియా, ఊర్ధ్వం పంచ దశాబ్దాత్తు మధ్యమేవయసి స్మృతా, ద్వాదశాద్వత్సరా దూర్ధ్వముత్తరే వయసి స్మృతా, చాంద్రాయణ త్రయం కృత్వా త్రింశత్కృచ్ఛ్రాణి వాసుతైః, కుశైః ప్రతికృతిందగ్ధ్వా కార్యాశౌచాదికా క్రియా, ఇత్యుక్తం. **పరాశరః – దేశాంతరగతో** నష్టః తిథిర్నజ్ఞాయతే యది, కృష్ణాష్టమీ హ్యమావాస్యా కృష్ణా చైకాదశీ తథా, ఉదకం పిండదానం చ తత్ర శ్రాద్ధం నకారయేత్, ఇదం మాసజ్ఞానే. **తత్రాహితాగ్నేః** పూర్ణాశౌచం. అనాహితాగ్నేస్తు త్రిరాత్రం, అనాహితాగ్నేర్దే హస్తు దాహ్యో గృహ్యాగ్నినా స్వయం. **తదలాభేపలాశానాం** వృంతైః కార్యః పుమానపి, వేష్టితవ్యస్తథా యత్నాత్ కృష్ణ సారస్య చర్మణా, ఊర్ణా సూత్రేణ బధ్వాతు ప్రలేప్తవ్యో యవైస్తథా, సుపిష్టైః జలసమ్మిశ్రైః దగ్ధవ్యశ్చ తథాగ్నినా, అసౌ స్వర్గాయలోకాయ స్వాహే త్యుక్త్వా స్వబాంధవైః. **ఏవం పర్ణశవందగ్ధ్వా** త్రిరాత్ర మశుచిర్భవేత్, ఇతి బ్రాహ్మోక్తేః. **ఇదం త్రిరాత్రం** న దశాహ మధ్యే దాహే, తత్ర ప్రోషితే కాలశేషః స్యాత్, ఇత్యుక్తేః, కింతు తదూర్ధ్వం. తత్ర పత్నీ పుత్రయోః పూర్వమ గృహీతా శౌచయోః దశాహోద్యేవ. గృహీతా శౌచయోస్తు త్రిరాత్రం. పత్నీమృతౌ భర్తు శ్చైవం సపత్న్యోశ్చైవమితి స్మృత్యర్థసారే. అన్య సపిండానాంతు సర్వత్ర పర్ణ శరదాహే త్రిరాత్రం. తదాహాంగిరాః – దేశాంతర మృతం శ్రుత్వా నా శౌచం చేత్కథంచన, గృహీత మితి శేషః. కాలాత్యయేఽపి కుర్వీత దాహకాలే దినత్రయం,ఇతి. స్మృత్యర్థసారేతు – గృహీతా శౌచానాం స్నానమాత్ర ముక్తం.

అను॥ క్రియా నిబంధమందు, గారుడమందును ఇట్లా చెప్పి వేరేది కూడా ఇట్లా – నాభియందు ఘృతమును, కౌపీనమందు తగరము, స్తనములందు ముత్యము, తలపై కుంకుమతో విలేపనము, నేత్రకోణములందు సింధూరము, తాంబూలాది ఉపహారములతో (సామాగ్రి) అని ఓషధులయుతంగా చేసి చెప్పిన ప్రకారము పూజ చేయాలి,అని. ఇది అగ్ని రహితునకు కూడా. అక్కడే వృద్ధమనువిట్లా – దేశాంతరగతుడైన వానికి పన్నెండు సంవత్సరాల కాలం గడిచిపోతే, పదమూడవ సంవత్సరం వస్తే ప్రేతకర్మ చేయాలి,అని. బృహస్పతి ఇట్లా – పన్నెండు సంవత్సరాల వరకు, పోయిన వాని వార్త తెలియకపోతే, కుశపత్రక దాహదంతో (బొమ్మ), వాని క్రియ నిశ్చయించండి అని. భవిష్యమందిట్లా – తండ్రి దేశాంతరగతుడైతే, వాని వార్తగాని, వాని ఆగమనం కాని లేకపోతే పదిహేను సంవత్సరాల తరువాత ఆతని ప్రతిరూపాన్ని చేసి, శాస్త్ర ప్రకారం దానికి సంస్కారం చేయాలి. ఆ పిదప అప్పటి నుండే అన్ని ప్రేత కార్యములు చేయాలి. పన్నెండు సంవత్సరాల నిరీక్షణ

తం(డ్రికన్న వేరైన వారి విషయమని మదనరత్నమందు చెప్పారు. గృహ్యాకారికయందైతే - వాడు తొలి వయస్సు వాడైతే ఇరవై సంవత్సరాలపైన ఆ పిదప క్రియ, మధ్యమ వయస్సుడైతే పదిహేను సంవత్సరాల తరువాత అని అన్నారు. ఉత్తర వయస్సులో ఐతే పన్నెండు సంవత్సరాల తరువాత అని అన్నారు. సుతులు చాంద్రాయణం కాని ముప్పై కృచ్ఛ్రములు కాని ఆచరించాలి,అని. కుశలతో ప్రతి కృతిని చేసి (బొమ్మ) దాహం చేసి శౌచాదిక క్రియలు చేయాలి,అని చెప్పారు. పరాశరుడిట్లా - దేశాంతరగతుడై మరణించినాడు. తిధి తెలియదు. అట్లా ఐతే. కృష్ణపక్ష అష్టమి, అమావాస్య, ఏకాదశి వీనిలో ఉదకము, పిండదానము, శ్రాద్ధము చేయాలి,అని. ఇది మాసం తెలిస్తే అని అర్ధం. అక్కడ అహితాగ్నికి పూర్ణాశౌచము. అనాహితాగ్నికి త్రిరాత్రము. అనాహితాగ్ని, దేహాన్ని స్వయంగా గృహ్యాగ్నితో దాహం చేయాలి. శరీరం లభించకపోతే మోదుగు ఆకుల తొడిమలతో పురుష రూపం చేయాలి. ప్రయత్నించి కృష్ణసార చర్మంతో దానిని కప్పి వేయాలి. ఉన్నిదారంతో కట్టివేసి బాగా విసిరిన యవల పిండిని నీళ్ళతో తడిపి దానికి పూయాలి. అట్లాగే అగ్ని దాహం చేయాలి, అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా, అని చెప్పి తమ బంధువులతో కలిసి దానిని కాల్చాలి. ఇట్లా పర్ణ శవాన్ని కాల్చి మూడు రాత్రులు అశుచి ఔతాడు అని బ్రాహ్మోక్తి. ఈ త్రిరాత్రము దశాహ మధ్య మందు దాహం చేస్తే కాదు. అక్కడ ప్రోషితుని విషయంలో కాల శేషము (శుద్ధి) ఉంటుంది, అని చెప్పారు కనుక. కాని ఆపైన. అక్కడ పత్నిపుత్రులకు ముందు ఆశౌచం తెలియదు కనుక దశాహాదులే. మరణ నిర్ణయమందు త్రిరాత్రమే. భార్య మరణిస్తే భర్తకు ఇట్లాగే సపత్నులకు కూడా ఇట్లాగే, అని స్మృత్యర్థసారమందు చెప్పారు ఇతర సపిండులకైతే అంతటా పర్ణశరదాహమందు త్రిరాత్రము ఆశౌచము దానినే ఆంగిరుడిట్లా చెప్పాడు - దేశాంతర మరణాన్ని వినగానే ఆశౌచ గ్రహణం ఎట్లైనా ఉండదు,అని. గృహీతమని శేషము (ముగింపు). కాలాత్యయ మందైనను దాహకాలమున, దినత్రయాశౌచం ఆచరించాలి,అని. స్మృత్యర్థ సారమందు మాత్రం - ఆశౌచం, గ్రహించిన వారికి స్నానం మాత్రమే చెప్పబడింది,అని.

**మూ॥ బహ్వృచ పరిశిష్టేఽపి** - అధాతీత సంస్కారః సచే దంతర్ద శాహం స్యాత్తత్రైవ సర్వం సమాపయే దూర్ధ్వ మాహితాగ్నే ర్దాహాత్సర్వ మాశౌచం కుర్యాత్కర్మచ యధాకాల మన్యేషు పత్నీ పుత్రయోః పూర్వ మగృహీతా శౌచయోః కర్మాంగం త్రిరాత్ర మితి. షడశీతావప్యేవం. **విశ్వాదర్శేతు** - ప్రతికృతి దహనేత్వగ్ని దేస్యాత్త్రి రాత్రం, ఇత్యుక్తం. ద్వాదశ వర్షాది ప్రతీక్షోత్తరం దాహేతు పుత్రాదీనాం సర్వేషాం త్రిరాత్రమేవేతి కల్పతరు దివోదాసాదయః. **అథ ప్రేత సంస్కారే కాలః** - హేమాద్రౌ గార్గ్యః - ప్రత్యక్షశవ సంస్కారే దినం నైవ విశోధయేత్, ఆశౌచ మధ్యే సంస్కారే దినం శోధ్యంతు సంభవే. ఆశౌచ వినివృత్తౌ చేత్పునః సంస్క్రియతే మృతః సంశోధ్యై వదినం గ్రాహ్య మూర్ధ్వం సంవత్సరాద్యది. ప్రేత కార్యాణి కుర్వీత శ్రేష్ఠం తత్రోత్తరాయణం, కృష్ణపక్ష శ్చతత్రాపి వర్జయేత్తు దినక్షయం (దినత్రయం). వారాహే - చతుర్థాష్టమగే చంద్రే

ద్వాదశే చ వివర్జయేత్. ప్రేతకృత్యం వ్యతీపాతే వైధృతౌ పరిఘేతథా, కరణే విష్టి సంజ్ఞే చ శనైశ్చరదినే తథా, త్రయోదశ్యాం విశేషేణ జన్మ తారాత్రయే తథా. జన్మదశమై కోన వింశాని జన్మతారాః. భారతే - నక్షత్రేతు న కుర్వీత యస్మిన్ జాతో భవేన్నరః, న ప్రోష్ఠపదయోః కార్యం తథాఽగ్నేయే చ భారత. దారుణేషు సర్వేషు ప్రత్యరే చ వివర్జయేత్ కశ్యపః - భరణ్యార్ద్రామ ఘాశ్లేషా మూలం ద్విచరణాని చ, ప్రేతకృత్యేఽతిదుష్టాని ధనిష్ఠాద్యం చ పంచకం. ఫాల్గునీ ద్వితీయం రోహిణ్యను రాధా పునర్వసూ ఆషాఢే ద్వేవిశాఖా చ భాని ద్విచరణానిచ, ఏతానికించిద్దుష్టాని సంభవేసతి వర్జయేత్. జ్యోతిర్నారదః - చతుర్దశీం తిథిం నందాం భద్రాం శుక్రారవాసరౌ, సితేజ్యయో రస్త మయం ద్వ్యంఘ్రిభం విషమాంఘ్రిభం, శుక్లపక్షం చ సంత్యజ్య పునర్దహన ముత్తమం వసూత్తరార్ధతః పంచ నక్షత్రేషు త్రిజన్మసు, పౌష్ణ బ్రహ్మర్ క్షయోశ్చైవ దహనాత్ కులనాశనం. అస్యాపవాద మాహ తత్రైవ బైజవాపః - ప్రేతస్య సాక్షాద్దగ్ధస్యప్రాప్తే త్వేకాదశేఽహని, నక్షత్ర తిథి వారాది శోధనీయం న కించన. యుగమన్వాది సంక్రాంతి దర్శేప్రేత క్రియాయది, దైవాదా పతితా తత్ర నక్షత్రా ది న, శోధయేత్, విశ్వప్రకాశేఽపి - గురు భార్గవయోర్మౌఢ్యే పౌషమాసే మలిమ్లుచే, నాతీతః పితృమేధః స్యాద్గయాం గోదావరీం వినా, దానమపి తత్రైవోక్తం - భద్రాయాం భూమిదానం స్యాత్ త్రిపాదర్క్షే హిరణ్యదః, వారేషు తత్తద్వర్ణంతు వాసోదానం విధీయతే.

అను॥ బహ్వృచ పరిశిష్టమందు కూడా - ఇక, అతీత సంస్కారము, అది పది రోజుల ఆశౌచం మధ్యలో వస్తే, అక్కడే అంతా సమాప్తి చేయాలి. ఆహితాగ్నికైతే, ఆ పైన, దాహం తరువాతనే ఆశౌచం అంతా కర్మ ఆచరించాలి, యధా కాలమందు. ఇతరులకైతే, ముందు ఆశౌచం గ్రహించని పత్నీపుత్రులకైతే కర్మాంగముగా త్రిరాత్ర మాశౌచము,అని షడశీతి యందు కూడా ఇట్లాగే. విశ్వాదర్శమందైతే - ప్రతికృతి దహనమందు మాత్రం అగ్నిదుని విషయంలో త్రిరాత్రా శౌచము అని చెప్పారు. పన్నెండు సంవత్సరాలు మొదలుగా నిరీక్షణ తరువాత దహనంచేస్తే పుత్రాదులందరికి త్రిరాత్రమే,అని కల్పతరు దివోదాసాదులన్నారు,అని. ఇక ప్రేత సంస్కారమందు కాలవిషయము - హేమాద్రి యందు గార్గ్యుడిట్లా - ప్రత్యక్షంగా శవదాహం చేస్తుంటే దినము గూర్చిన విచారణ లేదు. ఆశౌచం మధ్య సంస్కారం చేయాల్సివస్తే సంభవమైతే మంచిరోజు చూడాలి, అని. ఆశౌచం నివృత్తి అయ్యాక మృతునకు తిరిగి సంస్కారం చేస్తే మంచి రోజును చూసే చేయాలి. సంవత్సరంపైనది ఐతే కర్మ. ఆ ప్రేత కార్యాలు చేస్తే ఉత్తరాయణమందు చేయటం ఉత్తమము. అక్కడ కూడా కృష్ణపక్షము శ్రేష్ఠమైనది. దిన క్షయాన్ని విడిచిపెట్టాలి (దినత్రయం వదలిఅని). వారాహ మందిట్లా - చంద్రుడు నాల్గవ, ఎనిమిదవ, పన్నెండవ ఇంట్లో ఉంటే విడిచి పెట్టాలి. వ్యతీపాతము, వైధృతి పరిఘ యోగములందు విష్టి సంజ్ఞ గల కరణమందు, శనివారము, విశేషించి త్రయోదశియందు, అట్లాగే జన్మతారా త్రయమందు ప్రేత కృత్యము చేయరాదు, అని. జన్మనక్షత్రం, పదవ, పందొమ్మిదవ నక్షత్రాలు జన్మతారలు. భారతమందిట్లా -

నరుని జన్మ నక్షత్రమందు చేయరాదు. పూర్వాభాద్ర, ఉత్తరాభాద్రలందు, కృత్తిక యందును చేయరాదు దారుణ నక్షత్రములందు, (ఆరుద్ర, ఆశ్లేష, జ్యేష్ఠ, మూల) ప్రత్యరి తారలందు (జన్మనక్షత్రం, దాని ఐదవ, పదునాల్గవ, ఇరువది మూడవ నక్షత్రాలు) విడిచిపెట్టాలి, ఓ భారత! అని. కశ్యపుడిట్లా - భరణి, ఆర్ద్ర, మఘ, ఆశ్లేష, మూల, ద్విచరణ నక్షత్రాలు, ధనిష్ఠాది పంచకము ప్రేత కృత్యమందు అతిదుష్టములు. పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని, రోహిణి, అనురాధ, పునర్వసు, పూర్వాషాఢా, ఉత్తరాషాఢ, విశాఖ ద్విచరణ నక్షత్రములు ఇవి కొంచెం దుష్టమైనవి. వీలైతే విడిచి పెట్టాలి,అని. జ్యోతిర్నారదుడిట్లా చతుర్దశ తిథిని, నంద, భద్ర **(ప్రతిపద, షష్ఠి, ఏకాదశి, ద్వితీయ సప్తమి, ద్వాదశి)** తిథులను, శుక్ర మంగళ వారములను, గురు శుక్రుల అస్తమయమును, ద్విచరణ నక్షత్రాలను, విషమాంఘ్రి నక్షత్రాలను, శుక్ల పక్షమును వదలి మళ్ళీ దహనం చేయటం ఉత్తమము. ధనిష్ఠా ఉత్తరార్ధం నుండి పంచకమందు (నక్షత్రాలు) త్రిజన్మ నక్షత్రాలందు, రేవతి, రోహిణి నక్షత్రములందు దహనం చేస్తే కులనాశము,అని. దీనికి అపవాదాన్ని అక్కడే బైజవాపుడిట్లా - సాక్షాత్తు గాదగ్ధమైన ప్రేతకు ఏకాదశాహం వస్తే నక్షత్ర తిథి వారాదులు ఏ మాత్రం చూడరాదు,అని. యుగాది, మన్వాది సంక్రాంతి, దర్శము వీనియందు ప్రేత క్రియ దైవంవల్లవస్తే కనుక అక్కడ నక్షత్రాదులు చూడరాదు,అని. విశ్వ ప్రకాశమందు కూడా - గురు శుక్రుల మూఢమందు, పౌషమాసమందు, మలమాస మందు, అతీత పితృమేధము గయాగోదావరులందు తప్ప వేరేచోట కాదు,అని. దానం కూడా అక్కడే చెప్పబడింది - భద్ర యందు భూమిదానము, త్రిపాద నక్షత్రమందు సువర్ణదానము, వారములందు ఆయా రంగుల వస్త్ర దానమును విధించారు,అని.

**మూ॥ ధనిష్ఠా పంచకమృతే పంచరత్నాని దాపయేత్, ఏకాశీతి పలం కాంశ్యం తదర్ధం వా తదర్థకం, నవషట్ త్రిపలం వాపి దద్యాద్వి ప్రాయశక్తితః, ఇత్యలం ప్రసంగేన. హేమాద్రౌ వృద్ధమనుః - అమృతం మృతమా కర్ణ్య కృతం యస్యౌర్ధ్వ దేహికం, ప్రాయశ్చిత్త మసౌస్మార్తం కృత్వాగ్నీ నాదధీత చ. జీవన్యది సమాగచ్ఛేత్ ఘృత కుంభేనిమజ్యతం, ఉద్ధృత్యస్నాపయిత్వాఽస్య జాతకర్మాది కారయేత్. ద్వాదశాహం వ్రతచర్యా త్రిరాత్ర మథవాస్యతు, స్నాత్వో ద్వహేత్తతో భార్యా మన్యాం వా తదభావతః అగ్నీ నాధాయ విధివత్ వ్రాత్యసోమేన, వాయజేత్. అథేం ద్రాగ్నేన పశునా గిరిం గత్వా చ తత్రతు ఇష్టిమాయుష్మంతీం కుర్యా దీప్సితాంశ్చ క్రతూంస్తతః. అనాహితాగ్నేస్తు చరుః. మృతవార్తా శ్రవణే త్వాశ్వలాయనః - సురభయ ఏవయస్మిన్ జీవేమృత శబ్దః, ఇతి. యస్యతు జీవత ఏవ మృతివార్తాం శ్రుత్వాస్త్రియా సహగమనం కృతం తథా తద్ద్వైధమేవ, భర్తృమరణ జ్ఞానస్యైవ నిమిత్త త్వాత్ర మాత్వస్య గౌరవేణా యుక్తత్వాచ్చేతికేచిత్ తన్న మరణ జ్ఞానస్య నిమిత్తత్వేఽతీతా నాగతయోరపి తథాత్వాపత్తేః. భర్తుర్ద్వైధ దాహాభావేన తస్యాః సహగమనాభావాచ్చ. తస్మాదాశౌచవత్ జ్ఞాత మరణ స్యైవ నిమిత్తత్వం. నచాత్ర తదస్తి పరం కామ్యం మరణమస్తు. అత ఆత్మ హనన దోషోఽస్తీతి తాతపాదాః.**

అను॥ ధనిష్ఠా పంచక మందు మరణిస్తే ఐదు రత్నములు దానమిప్పించాలి. ఎనుబది పలముల కాంస్యము, అందులో సగం లేదా అందులో సగం కాని తొమ్మిది, ఆరు లేదా మూడు పలములు కాని శక్తి కొలది విప్రునకు దాన మివ్వాలి,అని. ఇక ఈ విషయం చాలు. హేమాద్రి యందు వృద్ధమనువిట్లా – చావని వానిని గూర్చి చచ్చినాడని విని, వానికి ఔర్ధ్వదేహిక క్రియలు చేస్తే, అట్టి వానికి స్మార్త ప్రాయశ్చిత్తము చేసి అగ్నుల ఆధానము చేయాలి,అని. అతడు తిరిగి బ్రతికి వస్తే వానిని ఘృతకుంభమందు ముంచి, తీసి స్నానం చేయించి వానికి జాతకర్మాదులు చేయించాలి. పన్నెండు రోజులు వ్రతచర్య కాని లేదా త్రిరాత్రము కాని వ్రతచర్య వీనికి ఆ పిదప స్నానం చేసి భార్యను లేదా ఆమె లేకపోతే మరో స్త్రీని వివాహ మాడాలి. అగ్నిని ఆ ధానం చేసి, విధి ప్రకారము వ్రాత్య స్తోమ యజ్ఞంతో కాని హోమం చేయాలి. ఇక ఇంద్రాగ్ని పశువుతో పర్వతమునకు వెళ్ళి అక్కడ, ఆయుః కామేష్టి చేయాలి. ఆ పిదప ఇష్టమైన క్రతువులను చేయొచ్చును. అనాహితాగ్నికి చరువుతో హోమము. మరణవార్త విన్నప్పుడు ఆశ్వలాయనుడిట్లా – ఎవడు బ్రతికుండగా మృత శబ్దం వినటం జరుగుతుందో అది మంచిదే, అని. ఎవడు బ్రతికుండగానే వాని మరణవార్తను విని వాని భార్య సహగమనం చేస్తే అది అప్పుడు శాస్త్రీయమే భర్త మరణ జ్ఞానమే నిమిత్తము. ప్రమా (జ్ఞానము) మాత్రము దీని గౌరవము (గురుత్వం) వల్ల అవసరం లేదు, అని కొందరన్నారు. అంటే అట్లా కాదు. మరణ జ్ఞానమే నిమిత్తమైతే గడచిన, రాబోయే వాటిలో గూడా అట్లాగే కావలసి వస్తుంది. భర్తకు విధి ప్రకారం దాహం కాలేదు కనుక ఆమెకు సహగమనాభావము. అందువల్ల ఆశౌచంవలె జ్ఞాతమరణమునకే నిమిత్తత్వము. ఇక్కడ అదిలేదు. కామ్య మరణమైతే కావచ్చు. అందువల్ల ఆత్మహనన దోషమున్నదని మా తండ్రిగారన్నారు.

**మూ॥ తథాసర్ప సంస్కారకృతే** త్రిరాత్ర మాశౌచం. తద్విధిం చాహ శౌనకః – అథ వక్ష్యామి సర్పస్య సంస్కార విధి ముత్తమం, సినీ వాల్యాం పౌర్ణమాస్యాం పంచమ్యాం వాపి కారయేత్, కృత సర్పవధో విప్రః పూర్వజన్మని వాయది, వధం ప్రఖ్యాపయేత్వా పీచరే త్కృచ్ఛ్రాం శ్చతుర్దశ విప్రాయలోహ దండం చ తన్మూల్యం వాపిదాపయేత్. యాజ్ఞవల్క్యోఽపి, ఉరగేష్వా యసోదండః, ఇతి. మూల్యమాహ – నిష్కత్రయం ద్వినిష్కంవా నిష్కమేకం కనీయసం, అనుమత్యాది కర్తౄణాం నిష్కమర్థం తదర్థకం. ఇదం స్వర్ణరూప్యయోః శక్త్యాజ్ఞేయం. సంస్కారమాహ – ప్రియంగువ్రీహి గోధూమైః తిలపిష్టేన వాపునః, కృత్వా సర్పా కృతిం శూర్పే నిధాయ ప్రార్థయే దహిం ఏహి పూర్వమృతః సర్ప అస్మిన్ పిష్టే సమావిశ, సంస్కారార్థ మహం భక్త్యా ప్రార్థయామి సమాహితః వస్త్రో పవీత గంధాద్యైః సంపూజ్య చ హరేద్బహిః, కుర్యాత్సం స్కార సంకల్పం ప్రాణాయామ పురః సరం. యజ్ఞోపవీతి నా కార్యం సర్ప సంస్కార కర్మచ, లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య సమిదాధాన మాచరేత్, తతోఽగ్నే రగ్నిదిగ్భాగే భూమిం సంప్రోక్ష్య వారిభిః, చితిం కృత్వాథ

సంస్తీర్యకుశై రాగ్నేయ కాగ్రకైః, పర్యుక్ష్యాగ్నిం పరిస్తీర్య పరిషిచ్య సమర్చయేత్, కృత్వేధ్మాధాన మాఘా రౌచాక్షుషీ చ యథావిధి. సర్పం గృహీత్వా యత్నేన చితి మారోపయేత్సుధీః. స్రువేణ జుహుయాదాజ్యమగ్నౌ వ్యాహృతిభిస్త్రిభిః. సర్పాస్యేజుహుయా దాజ్యం వ్యాహృత్యా చ సమగ్రయా, ఆజ్య శేషం స్రువేణైవ సర్పదేహే నిషేచయేత్.

అను॥ అట్లాగే సర్ప సంస్కారం కొరకు త్రిరాత్రము ఆశౌచము. ఆ విధానాన్ని శౌనకుడిట్లా - ఇక సర్పమునకు ఉత్తమ సంస్కార విధిని చెప్తున్నాను. అమావాస్య, పౌర్ణమి, పంచమి యందు ఏదో ఒక రోజు ఆచరించాలి. ఈ జన్మ యందుకాని, పూర్వ జన్మయందు కాని సర్పవధ చేసిన విప్రుడు ఆ వధను గూర్చి అందరికి చెప్పాలి. పాపి, పదునాలుగు కృచ్ఛ్రములను ఆచరించాలి. బ్రాహ్మణునకు లోహ దండము కాని దానికి సరిపోయే మూల్యము కాని ఇవ్వాలి. యాజ్ఞవల్క్యుడు కూడా - ఉరగములందు ఆయస దండ మివ్వాలి, అని. మూల్యమును చెప్పాడు - మూడు నిష్కములు, రెండు నిష్కములు, తక్కువలో తక్కువ ఒక నిష్కము. కర్తల అనుమతితో అర్ధ నిష్కము లేదా అందులో సగము (అర్ధార్ధ) నిష్కము ఇవ్వాలి,అని. ఇది స్వర్ణముదో వెండిదో శక్తి కొలదిగా గ్రహించాలి. సంస్కారాన్ని చెప్పాడిట్లా - కొర్రలు, వడ్లు, గోధుమలు, నువ్వులు వీనిలో ఏదేని ఒకదాని పిండితో సర్పాకృతిని చేసి చాటయందుంచి సర్పాన్ని ప్రార్థించాలి ఓ సర్పమా! ఇదివరలో మరణించినదాన, ఈ పిండియందు ప్రవేశించు ఏకాగ్రుడనై నీ సంస్కారము కొరకు నేను భక్తితో ప్రార్థిస్తున్నాను, అని. వస్త్ర ఉపవీత గంధాదులతో పూజించి బయటికి తీసుకెళ్ళాలి. ప్రాణాయామ పురః సరముగా సంస్కార సంకల్పము చేయాలి. సర్ప సంస్కార కర్మను యజ్ఞోపవీతిగా చేయాలి. లౌకికాగ్నిని ప్రతిష్ఠించి సమిదా ధాన మాచరించాలి. ఆ పిదప అగ్నికి ఆగ్నేయ దిగ్భాగ మందు నీటితో భూమిని సంప్రోక్షణ చేసి చితిని చేసి ఆగ్నేయం వైపు అగ్రముండునట్లుగా కుశలను పరచి నీళ్ళు చల్లి అగ్నిని పరిచి పరిషేచనం చేసి పూజించాలి. ఇధ్మాధాన ఆఘారములు చేసి, చక్షుషి కూడా యథావిధి చేసి ప్రయత్నంగా సర్పాన్ని తీసుకొని, బుద్ధి మంతుడు దాన్ని చితిపై ఉంచాలి. స్రువంతో అగ్నియందు ఆజ్యమును మూడు వ్యాహృతు లతో హోమం చేయాలి. సర్పం ముఖమందు సమగ్ర వ్యాహృతులతో ఆజ్యమును హోమం చేయాలి. ఆజ్యశేషమును స్రువంతోనే సర్పదేహమందుంచాలి.

మూ॥ చమసస్థైః జలైః సర్పం వ్యాహృత్యాభ్యుక్ష్య పాణినా, అగ్నే రక్షాణ ఇత్యనయా, సర్పాయాగ్నిం ప్రదాపయేత్. ఉపతిష్ఠేద్దహ్యమానం నమోఽస్తు సర్పమంత్రతః, జ్ఞానతోఽజ్ఞానతో వాపి కృతః సర్పవధోమయా, పూర్వజన్మని వాసర్ప తత్సర్వం క్షంతు మర్హసి. క్షీరాజ్యేన తతశ్చాగ్నిం ప్రోక్ష్య వ్యాహృతిభిర్జలైః. నాస్థి సంచయనం కుర్యాత్ స్నాత్వా చమ్య గృహం వ్రజేత్, బ్రహ్మ చర్యాదికం కార్యం త్రిరాత్రా శౌచమిష్యతే. సచైలం తు చతుర్థేఽహ్ని స్నాత్వా విప్రాన్ సమర్చయేత్. సర్పోనంతస్తథా శేషః కపిలో నాగ ఏవచ. కాలికః శంఖపాలశ్చ భూధరశ్చేతి నామభిః. గంధపుష్పాక్షతై ర్ధూపదీపాద్యైరర్చయే ద్విజాన్, ఘృతపాయస భక్ష్యైశ్చ ద్విజా నష్టౌ చ భోజయేత్. ఏవం కృతే

విధానేన, సర్ప సంస్కార కర్మణి, సర్పహింసా కృతాత్పాపాత్ ముచ్యతే నాత్ర సంశయః ఇతి సర్ప సంస్కారః. **క్వచిత్తు జీవతోప్యంత్య** కర్మాశౌచం కార్యం. యథా ప్రాయశ్చిత్తానిచ్ఛోః పతితస్యఘట స్ఫోటే, పతితస్యోదకం కార్యం సపిండైర్బాంధవైర్బహిః. నిందితేఽహని సాయాహ్నేజ్ఞాత్యృత్విగ్గురు సన్నిధౌ దాసీ ఘటమ పాంపూర్ణం పర్యస్యేత్ప్రేత వత్పదా, అహోరాత్రము పాసీరన్నా శౌచం బాంధవైస్సహ,ఇతి. మనూక్తేః. నిందితే - రిక్తాదౌ. అపరార్కే వసిష్ఠోఽపి - వేదవిప్లావక శూద్ర యాజకోత్తమ వర్ణవర్గపతి తాస్తేషాం పాత్రనినయన మపాత్ర సంస్కారాద కృత్స్నం పాత్రమాదాయ దాసోఽసవర్ణ పుత్రోవా బంధుర సదృశోవా గుణహీనః సవ్యేన పాదేన ప్రవృత్తాగ్రాన్ దర్భాన్ లోహితాన్ వోపస్తీర్యాపః పూర్ణం పాత్రమస్మై నినయేత్ నినేతారం చాస్య ప్రకీర్ణ కేశా జ్ఞాతయోఽ న్వా లభేరన్నప సవ్యం కృత్వా గృహేషు స్వైరమా పద్యేరన్నత ఊర్ధ్వంతేన తం ధర్మయేయుః తద్ధర్మాణస్తం ధర్మయంతఃఇతి. ఉత్తమవర్ణా - బ్రాహ్మణాదయః తేషాంవర్గః సమూహస్తస్మాత్పతితా బ్రహ్మహాదయః. అపాత్ర సంస్కారః = కుత్సిత పాత్ర సమూహః. ప్రవృత్తాగ్రాః = ఛిన్నాగ్రాః స్వైరం = యథేచ్ఛం ధర్మాది కార్యం కుర్యుః. అస్మాద్వచన సామర్థ్యాత్ పాత్ర నినయనాత్ ప్రాక్పతిత జ్ఞాతీనాం ధర్మకార్యేష్వధికారో నాస్తీ త్యపరార్కః.

అను॥ చమసస్థ జలముతో (నాలుగు మూలలు గల పాత్ర) సర్పమును, చేతితో వ్యాహృతితో అభ్యుక్షణం చేయాలి (ప్రోక్షణం). అగ్నే రక్షాణ, అను మంత్రంతో సర్పానికి అగ్ని ఇవ్వాలి. పాము కాలుతుండగా లేచి నిలబడి, నమోఽస్తు సర్పేభ్యో, అను మంత్రాన్ని చదువుతూ చెప్పాలి ఇట్లా - తెలిసో తెలియకో నేను సర్పవధ చేశాను ఈ జన్మలోనో పూర్వ జన్మలోనో. ఓ సర్ప! దానినంతా క్షమించుటకు యోగ్యురాలవు,అని చెప్పి పాలు, నేయి, జలముతో, వ్యాహృతులతో ఆ పిదప అగ్ని ప్రోక్షణ చేయాలి. అస్థి సంచయనం చేయరాదు. స్నానం చేసి ఆచమించి ఇంటికి వెళ్ళాలి. బ్రహ్మ చర్యాదులు పాటించాలి. మూడు రాత్రులు ఆశౌచము చెప్పారు. నాల్గవ రోజున సచేల స్నానం చేసి బ్రాహ్మణుల పూజించాలి. సర్ప, అనంత, శేష, కపిల, నాగ, కాలిక, శంఖపాల, భూధర అను పేర్లతో గంధ ధూప పుష్ప అక్షత దీపాదులతో బ్రాహ్మణుల పూజించాలి. ఘృతపాయస భక్ష్యములతో ఎనిమిది మంది బ్రాహ్మణులను భుజింప చేయాలి. సర్ప సంస్కార కర్మను ఈ విధముగా విధాన ప్రకారముచేస్తే సర్పహింస చేసిన పాపంనుండి ముక్తుడౌతాడు. ఇందులో అనుమానం లేదు.అని సర్ప సంస్కారము. ఒకచోట బ్రతికున్న వానికి కూడా అంత్యకర్మా శౌచము పాటించాలి ఎట్లాంటే - ప్రాయశ్చిత్తాన్ని ఇష్టపడని, పతితుని ఘట స్ఫోటమందు, పతితునకు సపిండులు బాంధవులు గ్రామం బయట, నిందితమైన దినమందు, సాయంకాలమందు జ్ఞాతి ఋత్విక్ గురువుల సన్నిధియందు ఉదక కార్యము చేయాలి. దాసి నీళ్ళతో నిండిన కుండను ప్రేతకు వలె (అపసవ్యం, దక్షిణముఖం) పాదం నుండి బయటకు వేయాలి. బాంధవులతో కూడా అహోరాత్రము కూర్చోవాలి దీనితో ఆశౌచం ఉండదు అని మనూక్తి. నిందితము = రిక్తాది తిథి. అపరార్కమందు వసిష్ఠుడు కూడా - వేదనాశకుడు, శూద్రునితో

యజ్ఞం చేయించేవాడు ఉత్తమ వర్ణులైన వారి వర్గం నుండి పతితులైనవారు, వారి పాత్రను తీసుకుపోవటం అపాత్ర సంస్కారమైనందువల్ల, నీళ్ళులేని పాత్రను తీసుకొని దాసుడో, అసవర్ణపుత్రుడో, బంధుర సదృశుడో (వేశ్యాజాతి వంటి నీచగుణుడో) గుణహీనుడు కుడిపాదంతో ఛిన్న భాగములు కల దర్భలను లేదా ఎర్రని దర్భలను పరచి నీళ్ళు నిండిన పాత్రను వీనికై తీసుకెళ్ళాలి. తీసుకుపోయే వాని వెంట్రుకలు విప్పి ఉండాలి. వానిని (కేశముల) జ్ఞాతులు (విప్పి) ముట్టాలి అపసవ్యం చేసుకొని గృహములకు రావాలి. ఆపైన స్వేచ్ఛగా అతనిని చేరవచ్చును. అతనితో ధర్మ వ్యవహారం చేయవచ్చును. అతనితో ధర్మ వ్యవహారం చేయటంవల్ల వారి ధర్మం కలవారౌతారు (సమానం),అని. ఉత్తమవర్ణాః = బ్రహ్మణాదులు వారి వర్గము సమూహము, దాని నుండి పతితుడైనవారు బ్రహ్మ హాదులు. అ పాత్ర సంస్కారము = కుత్సిత పాత్ర సమూహము. ప్రవృత్తాగ్రములు = ఛిన్నమైన అగ్రములు కలవి స్వైరం = ఇష్టమైన రీతి ధర్మాదికార్యము చేయవచ్చును. ఈ వచన సామర్థ్యంవల్ల పాత్ర నినయనంకన్న ముందు (బోర్లించటం) = పారబోయటం), పతితుని జ్ఞాతులకు ధర్మకార్యములందు అధికారం లేదు అని అపరార్కుడన్నాడు.

మూ॥ తస్య విద్యా గురూన్ యోనిసంబంధాశ్చ సన్నిపాత్య సర్వాణ్యుదకాది ప్రేత కార్యాణి కుర్యుః పాత్రం చాస్య విపర్యస్యేయుః దాసః కర్మకరోవాఽవ కరాదమేధ్యం పాత్ర మానీయ దాసీఘ టాత్పూరయిత్వా దక్షిణాముఖః పదా విపర్యస్యేద ముదకం కరోమీతి నామగ్రహం సర్వేఽ న్వాలభేరన్ ప్రాచీనావీతినో ముక్త శిఖా విద్యాగురవో యోని సంబంధాశ్చ వీక్షేరన్. అప ఉపస్పృశ్య గ్రామం ప్రవిశేయుః, ఇతి గౌతమోక్తేశ్చ. ఉదకాదీత్యుక్తేః. దాహనివృత్తిః. ప్రేతకార్యాణి ఏకాదశాహ శ్రాద్ధాంతాని. దాస్యాహృతోఽంబుఘటో దాసీఘటః. తేనోదకే నామేధ్యం పాత్రం పూరయిత్వా దాసాది ర్న్యుబ్జం వామపాదేన కుర్యాదితి హరదత్తః. అత్రనామ గ్రాహ వచనముదకాది ప్రేతకార్యే తద్వత్వార్థం. తేనతత్తూష్ణీం భవతి. ఏతచ్చ ప్రాయశ్చిత్తానిచ్ఛోః. తస్య గురోర్బాంధవానాం రాజ్ఞశ్చ సమక్షం దోషా నభిఖ్యాప్య తమను భాష్య పునః పునరాచార్యం లభస్వేతి సయద్యేవ మప్యనవస్థిత మతిః స్యాత్తతోఽస్య పాత్రం విపర్యసేత్, ఇతి శంఖోక్తేః. జీవంతమేవోద్దిశ్య పిండోదక శ్రాద్ధాని నామ్నాదద్యాదిత్య పరార్కః. **కృతప్రాయశ్చిత్తస్యఘటస్ఫోటే** కృతేఽపి సంగ్రహ విధిమాహ గౌతమః - యస్తు ప్రాయశ్చిత్తేన శుద్ధ్యేత్తస్మిన్ శుద్ధే శాతకుంభమయం పాత్రం పుణ్యహ్రదాత్పూరయిత్వా స్రవంతీభ్యోవా, తత ఏన ముపస్పర్శయే యురథాస్మై తత్పాత్రం దద్యుస్త త్ప్రతి గృహ్య జపేత్ - శాంతాద్యోః శాంతా పృథివీ శాన్తం విశ్వమంతరిక్షంయో రోచన స్తమిహ గృహ్ణామి, ఇత్యే తైర్యజుర్భిః పావమానీభి స్తరత్సమందీభిః కూష్మాండైశ్చాజ్యం జుహుయాద్ధిరణ్యం దద్యాద్గాం చాచార్యాయ. యస్యతు ప్రాణాంతికం ప్రాయశ్చిత్తం సమృతః శుద్ధ్యేత్ సర్వాణ్యేవ తస్మిన్నుద కాదీని ప్రేత కర్మాణి కుర్యురేత తదేవ శాంత్యుదకం సర్వే శూపపాతకేషు, ఇతి. ఘట స్ఫోటోత్తరం ప్రాణాంతిక ప్రాయశ్చిత్తే కృతేతు మృత ఏవ శుద్ధ్యేన్న తత్ర సంగ్రహ విధిః. అతస్తే నవినాపి ప్రేతకర్మ కుర్యాదిత్యర్థః. ఉపపాతకేష్వపి ఘటస్ఫోటే కృతే ఏవం కార్యమిత్యర్థః.

**యాజ్ఞవల్క్యః – చరిత వ్రత ఆయాతే నినయేరన్న వంఘటం, జుగుప్సేరన్న చాప్యేనం సంవసేయుశ్చ సర్వశః. కృతఘటస్ఫోటస్యైవాయం పరిగ్రహ విధిరితి మితాక్షరాయామ పరార్కే చ. అన్యథా ప్రాయశ్చిత్తమాత్రే ఏతత్ప్రసంగాత్. మనురపి ఘటస్ఫోట ముక్త్వా నివర్తేరం స్తతస్తస్మాత్తు సంభాషణ సహాసనైః, ఇత్యుక్త్వా ప్రాయశ్చిత్తేతు చరితే పూర్ణం కుంభ మపాంనవం. తేనైవ సార్థం ప్రాస్యేయుః స్నాత్వా పుణ్యే జలాశయే, ఇతి తచ్ఛబ్దం ప్రాయుంక్త.**

అను॥ ఆతని విద్యా గురువులను యోని సంబంధులను (చిన్నాయన, తండ్రి) అందరిని ఒకచోట చేర్చి, ఉదకాది సర్వప్రేతకార్యములు చేయాలి. ఈతని పాత్రను తల క్రిందులు చేయాలి, దాసుడు కాని, కర్మకరుడు (కూలి)కాని చేయాలి. చెత్తనుండి అపరి శుభ్రమైన పాత్రను తేగా దాసి ఆఘటమును నీటితో నింపగా, దక్షిణముఖుడై కాలితో బోర్లించాలి. ఈ నీటిని ఇస్తున్నాను అని పేరు చెప్పాలి. అందరు ప్రాచీనావీతులై వెంట్రుకలను విప్పేసి ఆతనిని స్పృశించాలి. విద్యా గురువులు యోని సంబంధులు అందరు చూడాలి. నీటిని స్పృశించి గ్రామంలోకి ప్రవేశించాలి, అని గౌతమోక్తికూడా. ఉదకాది అని చెప్పినందువల్ల దాహ నివృత్తి. ప్రేతకార్యములు పదకొండవ రోజు శ్రాద్ధాంతములు. దాసి తెచ్చిన నీటి కుండ దాసీ ఘటము. ఆ నీటితో అమేధ్య (అశుద్ధ) పాత్రను పూరించి, దాసాదులు ఎడమ కాలితో బోర్లించాలి అని హరదత్తుడన్నాడు. ఇక్కడ నామ గ్రహణమనుమాట ఉదకాది ప్రేతకార్యములందు ఆలక్షణం వచ్చే కొరకు. అందువల్ల అది మౌనంగానే చేయాలి. ఇది, ప్రాయశ్చిత్తం ఇష్టపడని వానికి. ఆతడు, గురువు, బంధువులు రాజు వీరి ఎదుట దోషములను చెప్పి మళ్ళీమళ్ళీ చెప్పి, తిరిగి ఆచార్యుని పొందు అని వారితనితో అంటే, అట్లాగైనా వీడు నిలకడలేని మనస్సు గలవాడైతే అప్పుడు వీని పాత్రను బోర్లించాలి,అని శంఖోక్తి. బ్రతికి ఉన్న వానిని ఉద్దేశించే పిండ ఉదక శ్రాద్ధాలు పేరుతో ఇవ్వాలి అని అపరార్కుడన్నాడు ప్రాయశ్చిత్తం చేసుకున్న వానికి ఘటస్ఫోటము చేసినా సంగ్రహ విధిని గౌతముడిట్లా చెప్పాడు – ప్రాయశ్చిత్తముతో ఎవడు శుద్ధి నందాడో ఆతడు శుద్ధుడయ్యాక శాతకుంభమయమైన పాత్రను పుణ్యమైన హ్రదపు నీటితో నింపి లేదా పారే నదుల నీటితో నింపి, ఆ పిదప ఈతనిని ముట్టాలి. ఇక ఈతనికి ఆ పాత్ర నివ్వాలి. దానిని తీసుకొని జపం చేయాలి. శాంతాద్యౌః... గృహ్ణామి, అని ఈ యజుర్ మంత్రములతో పావమాన సూక్తములతో, తరత్సమందీ కూష్మాండీ ఋక్కులతో, నేయితో హోమం చేయాలి. హిరణ్యమును గోవును ఆచార్యునకు దానమివ్వాలి. ప్రాణాంతిక ప్రాయశ్చిత్తమైతే వాడు మరణంతోనే శుద్ధినందుతాడు. ఉదకాదులు ప్రేతకర్మలు అన్నీ అక్కడ చేయాలి. ఇదే శాంత్యుదకము, అన్ని ఉపపాతకములలో ఆచరించాల్సింది. ఘటస్ఫోటం తరువాత ప్రాణాంతిక ప్రాయశ్చిత్తంచేస్తే మరణంతోనే శుద్ధి నందుతాడు. అక్కడ సంగ్రహవిధిలేదు. (గ్రహణంకై) అందువల్ల అతడు లేకుండ కూడా ప్రేతకర్మ చేయవచ్చు,అని అర్థము.

ఉపపాతకములందును ఘటస్ఫోటం చేస్తే ఇట్లా చేయాలి అని అర్థము. యాజ్ఞవల్క్యుడిట్లా - వ్రతమాచరించి (బంధువులదగ్గరకు) వస్తే, కొత్తకుండను తేవాలి. ఇతనిని అసహ్యించుకోరాదు. అన్నివిధములు కలిసి ఉండాలి. ఇది ఘటస్ఫోటం చేసినవానికే ఈ పరిగ్రహ విధి అని మితాక్షర, అపరార్కములందు కలదు. లేకున్న ప్రాయశ్చిత్త మాత్రంతోనే ఇది రావలసి వస్తుంది (స్వీకరణం). మనువు కూడా ఘటస్ఫోటాన్ని చెప్పి - ఆ పిదప అతనితో సంభాషణ సహ సనముల నుండి విరమించాలి, అని చెప్పి ప్రాయశ్చిత్త మాచరిస్తే నీటితో నిండిన కొత్త కుండను (దాసి బోర్లించాలిఅని) అతనితోపాటే సపిండులు పుణ్యజలాశయమందు స్నానంచేసి (జల) ప్రాశన చేయాలి,అని. తచ్ఛబ్దాన్ని ప్రయోగించాడు.

మూ॥ **అపరార్కే వసిష్ఠోఽపి** - పతితానాం చరిత వ్రతానాం ప్రత్యుద్ధారోఽ ధాప్యు దాహరంతి - అగ్రేష్వుద్ధరతాం గచ్ఛేత్ క్రీడన్నివహ సన్నివ, పశ్చాత్పాతయతాం గచ్ఛేచ్ఛో చన్నివ రుదన్నివ. ఇత్యాచార్య మాతృపితృహం తారస్తత్ప్ర సాదాదపగత పాపా ఏషాంతేషాం ప్రత్యాపత్తిః పూర్ణగ్రహ దాత్ప్ర వృత్తాద్వా కాంచనం పాత్రం మాహేయం వాఽద్భిః పూరయిత్వా పోహిష్ఠీయా భిరేనమద్భిరభిషించేయుః సర్వ ఏవాభిషిక్తస్య ప్రత్యుద్ధారః పుత్రజన్మనావ్యాఖ్యాతః, ఇతి. ప్రత్యుద్ధారః = పరిగ్రహః, తత్రోద్ధరతాం హసన్నివాగ్రేసరః స్యాత్. పాతయతాం ఘటస్ఫోటం కుర్వతాం శోచన్నివ పశ్చాద్గచ్ఛేత్. మాతా పిత్రాదిహంతౄణాం పరిగ్రహోన కార్యః. తత్ప్రసాదే సతిచీర్ణ వ్రతానాం కార్యః. ప్రవృత్తం = నిర్ఝరః. పుత్రజన్మనేత్యభిషేకోత్తరం. జాతకర్మాదయః సంస్కారాః పుత్రజన్మ వత్కార్యా ఇత్యపరార్కే వ్యాచఖ్యౌ. అత ఏవ విజ్ఞానేశ్వరః - ఘటేఽపవర్జితే జ్ఞాతి మధ్యస్థోయవసం గవాం, ప్రదద్యాత్ప్రథమం గోభిః సంస్కృతస్యహి సత్క్రియా, ఇత్యత్ర గవాం భక్షణాభావే పునర్వ్రతం చరేదిత్యేతత్ప్రకృతే, ఏవం చరిత వ్రత విధౌ విశేషోఽయమితి వదన్ ఘటస్ఫోటోత్తరం పరిగ్రహ ఏవైత న్న సర్వత్రేత్యాహ. తస్మాత్కృతేఽపి ఘటస్ఫోటే ప్రాయశ్చిత్తం పరిగ్రహవిధిః పునః సంస్కారో భవతీతి సిద్ధం, తథా జీవచ్ఛ్రాద్ధే కృతే హేమాద్రౌ బౌధాయనః - తత్రా శౌచం దశాహం స్యాత్, ఇత్యలం ప్రసంగేన **ఏవం సాపవాదే ఆశౌచే ఉక్తే** ప్రతిశాఖం భిన్నేప్యంత్య కర్మణి సాధారణం కించిదుచ్యతే. తత్రాధికారిణః శ్రాద్ధ ప్రకరణే ప్రాగుక్తాః. **సర్వాభావే ధర్మపుత్రోవాకార్యః**, అపుత్రేణ సుతః కార్యోయాదృక్ తాదృక్ ప్రయత్నతః, పిండోదక క్రియాహేతోః నామ సంకీర్తనాయచ, ఇతి వ్యాసవచనాత్. **గృహ్యపరిశిష్టే** - అసగోత్రః సగోత్రోవా యదిస్త్రీ యది వాపుమాన్ ప్రథమేఽహనియో దద్యాత్ సదశాహం సమాపయేత్. దద్యాత్పిండమితి శేషః. భవిష్యే - యత్రాద్యే దీయతే పిండస్తత్ర సర్వం సమాపయేత్. బ్రాహ్మేఽపి - ప్రథమేఽ హని యోదద్యాత్ప్రేతా యాన్నం సమాహితః, అన్నం నవసుచాన్యేషు స ఏవ ప్రదదాత్యపి. విజ్ఞానేశ్వరాదయస్తు - కేచిత్తు అగ్నిందద్యాత్, ఇతి వ్యాచక్షతే. సగోత్రోవాఽసగోత్రో వాయోఽ గ్నిందద్యాత్సఖేనరః, సోఽపి కుర్యాన్నవ శ్రాద్ధం శుధ్యేత్తు దశమేఽహని, ఇతి దివోదాసీయే వచనాచ్చ. **తత్రైవ- దృష్ట్వాస్థానస్థ** మాసన్న మర్ధోన్మీలిత లోచనం, భూమిష్ఠం పితరం పుత్రోయది దానం ప్రదాపయేత్. తద్విశిష్టం గయా శ్రాద్ధాదశ్వమేధ శతాదపి. **తానియథా - మోక్షం**

**దేహి హృషీకేశ మోక్షం దేహి జనార్దన, మోక్షధేను ప్రదానేన ముకుందః ప్రీయతాంమమ, ఇతిమోక్ష ధేను మంత్రః.**

అను॥ అపరార్కమందు వసిష్ఠుడు కూడా – పతితులకు, చరిత వ్రతులకు పునః స్వీకారాన్ని ఇక ఉదహరిస్తున్నారు. ఉద్ధారం చేసేవారి ముందు ఆడుతున్నట్టు, నవ్వుతున్నట్టుగా ఉంటూ, పతితుల వెనుక దుఃఖిస్తున్నట్టు, ఏడుస్తున్నట్టుగా ఉంటూ వెళ్ళాలి (నడవాలి). ఇది, ఆచార్య, మాతృ, పితృ హంతకులెవరున్నారో వారు, వారి అనుగ్రహంతో పాపం తొలగినవారై ఎవరున్నారో వారికి ప్రత్యాపత్తి. (వారిని తిరిగి స్వీకరించటం). పూర్ణమైన హ్రదము నుండి లేదా ప్రవాహం నుండి కాని, బంగారు పాత్ర లేదా మట్టిది కాని నీళ్ళతో నింపి, అపోహిష్ఠా, మొదలగు ఋక్కులతో ఈతనిని ఆజలంతో అభిషేకం చేయాలి అందరు, అభిషిక్తుని పరిగ్రహాన్ని (స్వీకరణ) పుత్రజన్మగా వ్యాఖ్యానించారు,అని. ప్రత్యుద్ధారము అనగా పరిగ్రహము అక్కడ ఉద్ధారం చేసే వాళ్ళ ముందరవెళ్ళేవాడు నవ్వుతూన్నట్టుండాలి. పతితులకు (పాపులకు) ఘటస్ఫోటం చేసేవారికై ఏడుస్తున్నట్టువలె వెనక వెళ్ళాలి. మాతా పిత్రాది హంతల పరిగ్రహము చేయరాదు. వాళ్ళను అనుగ్రహిస్తే చీర్ణవ్రతులకు చేయాలి. (ప్రాయశ్చిత్తం చేసుక్ను వారిని). ప్రవృత్త మనగా ప్రవాహము పుత్రజన్మతో, అని అభిషేకం తర్వాత చెప్పినందువల్ల జాతకర్మాది సంస్కారములు పుత్రజన్మయందువలె చేయాలి, అని అపరార్కమందు వ్యాఖ్యానించారు. అందువల్లనే విజ్ఞానేశ్వరుడిట్లా – ఘటము విడిచాక జ్ఞాతి మధ్యస్థుడై గోవులకు గడ్డిని ఇవ్వాలి. తొలుత గోవులతో సంస్కరించబడిన వానికే సత్కారము,అని. అనేచోట గోవులకు భక్షణ లేకపోతే తిరిగి వ్రతము చరించాలి,అని ఇది ప్రకృతమందు అంశము. ఈ విధముగా వ్రత విధి ఆచరించాక ఇది విశేషము అని చెప్తూ ఘటస్ఫోటం తరువాత పరిగ్రహమే కాని, ఇది, అంతటకాదు అని చెప్పారు. అందువల్ల చేసినా ఘటస్ఫోటంలో ప్రాయశ్చిత్తము పరిగ్రహ విధి తిరిగి సంస్కారము ఔతుందనేది సిద్ధమైంది. అట్లాగే జీవచ్ఛ్రాద్ధము చేశాక హేమాద్రి మందు బౌధాయనుడట్లా – అక్కడ ఆశౌచము పది రోజులు ఉంటుంది,అని. ఇక ఈ విషయంచాలు. ఈ రకంగా అపవాదంతో కూడిన ఆశౌచం చెప్పాక, ప్రతిశాఖ భిన్నమైనా, అంత్యకర్మ యందు సాధారణమైన దానిని కొంచెం చెబుతాను. అక్కడ అధికారులెవరో శ్రాద్ధ ప్రకరణ మందు ముందు చెప్పాను. ఎవ్వరూ లేకపోతే ధర్మపుత్రుడు చేయాలి. పుత్రులు లేనివారు, పిండ ఉదక క్రియల హేతువు కొరకు, నామ సంకీర్తన కొరకు (పేరు చెలామణి) ప్రయత్నించి ఏదో ఒక రీతిగల పుత్రుని గ్రహించాలి, అని వ్యాసవచనము. (ధర్మకార్య నిమిత్తక పుత్రుడు అని). గృహ్య పరిశిష్ట మందిట్లా – అసగోత్రుడో, సగోత్రుడో, ఆడదో, మగవాడో మొదటి రోజు ఎవడు పిండ మిస్తాడో వాడే పదిరోజులు ముగించాలి. ఇవ్వాలి అనగా పిండము అని ముగింపు. భవిష్యమందిట్లా – ఎక్కడైతే తొలిరోజు పిండమిస్తారో అక్కడే, ఆతడే అంతా సమాప్తి

చేయాలి,అని. బ్రాహ్మ మందు కూడా - సావధానంగా ప్రేతకై తొలి రోజు ఎవడు అన్నం ఇస్తాడో, మిగిలిన తొమ్మిది రోజులలో వాడే అన్నం ఇస్తాడు కూడా అని విజ్ఞానేశ్వరాదులైతే - కొందరైతే, అగ్నిని ఇవ్వాలి ఎవ్వరైనా,అని వ్యాఖ్యానించారు. సగోత్రుడో, అసగోత్రుడో ఏవ్యక్తి అగ్ని దాహం చేస్తాడో, ఓసఖ! ఆతడు కూడా నవశ్రాద్ధము చేయాలి పదవరోజున శుద్ధి ఔతాడు,అని దివోదాసీయమందు వచనము అక్కడే - తన స్థానమందున్న చావు సమీపించిన, సగం కళ్ళు తెరచి ఉన్న, భూమిపై పడి ఉన్న తండ్రిని చూచి పుత్రుడు, ఆ తండ్రితో దాన మిప్పిస్తే అది గయాశ్రాద్ధముకన్న, నూరు అశ్వమేధములకన్న విశిష్టమైనది, అని ఆదానములు ఎట్లాంటే - హృషీకేశ మోక్షము నివ్వు, జనార్దన మోక్షమునివ్వు. మోక్ష ధేనువును ఇచ్చినందువల్ల నాపై ముకుందుడు ప్రసన్నుడుకాని, అని మోక్ష ధేను మంత్రము

మూ।। **ఐహికా ముష్మికం యచ్చ సప్త** జన్మార్జితం ఋణం, **తత్సర్వం** శుద్ధిమాయాతు గామేతాం దదతోమమ, ఇతి ఋణధేనోః. **ఆజన్మో పార్జితం పాపం** మనోవాక్కాయ కర్మభిః తత్సర్వం నాశమాయాతు గోప్రదానేన కేశవ, ఇతి పాపధేనోః. **భారతే - శుక్లపక్షే** దివాభూమౌ గంగాయాం చోత్తరాయణే, ధన్యాః తాత మరిష్యంతి హృదయస్థే జనార్దనే. హేమాద్రౌ వారాహే - వ్యతీపాతోఽథ సంక్రాంతిః తథైవ గ్రహణం రవేః, పుణ్యకాలాస్తదా సర్వే యదా మృత్యు రుపస్థితః **వ్యాసః - ఆసన్న** మృత్యునా దేయాగౌః సవత్సాతు పూర్వవత్, తద భావేతు గౌరేవ నరకోత్తారణాయవై. తదాయది న, శక్నోతి దాతుం వైతరణీం తుగాం శక్తోఽ న్యోఽరుక్తగాం దత్వాదద్యాచ్ఛ్రేయో మృతస్యతు. **మదనరత్నే జాతూకర్ణ్యః** - ఉత్క్రాంత్యాదీని దానాని దశదద్యాన్మృతస్యతు గోభూతిలహిరణ్యాజ్యం వాసోధాన్యం గుదాని చ, రౌప్యం లవణ మిత్యాహుః దశదానాన్యను క్రమాత్. ఏతాని దశ దానాని నరాణాం మృత్యుజన్మనోః. కుర్యాదభ్యుదయార్థంతు ప్రేతేఽపిహి పరత్రవై. **బ్రాహ్మే - తామ్రపాత్రం తిలైః** పూర్ణం ప్రస్థమాత్రం ద్విజాయతు, సహిరణ్యం చయోదద్యాత్ శ్రద్ధావిత్తానుసారతః. సర్వపాప విశుద్ధాత్మా **లభతే గతి** ముత్తమాం, ఉత్క్రాం తివైతరిణ్యాం చ దశదానాని చైవహి. ప్రేతేఽపి కృత్వాతం ప్రేతం శవధర్మేణ దాహయేత్. **తత్రైవ పరిశిష్టే** - మ్రియ మాణస్య కర్ణేతు పుణ్య మంత్రాన్ జపేత్తతః. **క్రియానిబంధే గారుడేత్వష్టౌ** దానాన్యుక్తాని - తులసీ సన్నిధౌ కృత్వా శాలగ్రామ శిలాంతథా, తిలలోహం హిరణ్యం చ కార్పాసం లవణం తథా, సప్త ధాన్యం క్షితిర్గావ ఐకైకం పావనం స్మృతం, ఇతి. దశదాన వైతరణీ ధేనూత్క్రాంతి ధేనుదానాది భట్టకృత అంత్యేష్టి పద్ధతౌ జ్ఞేయం. **కర్తాన్య కర్మాధికారార్థం** త్రీన్ కృచ్ఛ్రాన్ కుర్యాదితి తత్రైవోక్తం. **అత్రదేవ యాజ్ఞికేన ముమూర్షోః** మధుపర్క దానముక్తం. తదుక్తం వరాహే - దృష్ట్వాసు విహ్వాలంహ్యే నం యమ మార్గాను సారిణం, ప్రయాణ కాలేతు నరో మంత్రేణ విధి పూర్వకం. మధుపర్కం త్వరన్ గృహ్యా ఇమం మంత్రముదాహరేత్. ఓం గృహాణ చేమం మధుపర్క మాద్యం సంసార నాశనకరం త్వమృతేన తుల్యం, నారాయణేన రచితం భగవత్రియాణాం దాహేచ శాంతి కరణం సురలోక పూజ్యం.

అనే నైవ సుమంత్రేణ దద్యాచ్చ మధుపర్కకం, నరస్య మృత్యుకాలేతు పరలోక సుఖావహం.

అను॥ ఐహికమైనది ఆముష్మికమైనది, ఏడు జన్మలలో చేకూరిన ఋణమేదుందో, అదంతా ఈ గోవును దానం చేస్తున్న నాకు శుద్ధి నొందనీ, అని ఋణ ధేనుదానమందు చెప్పాలి. మనోవాక్కాయ కర్మలతో జన్మ ఆరంభం నుండి సంపాదించిన పాపము, అదంతా ఈ గోప్రదానంతో నాశమొందని, ఓ కేశవ, అని పాపధేనువు యందు చెప్పాలి భారత మందిట్లా – శుక్లపక్షమున పగలు, భూమిపైన, గంగయందు, ఉత్తరాయణ మందు హృదయమందు జనార్దనుని ఉంచుకొని (ధ్యానిస్తూ) మరణించిన వారు ధన్యులు ఓ తండ్రి! అని. హేమాద్రి యందు వారాహోక్తి ఇట్లా – మృత్యువు వచ్చినప్పుడు వ్యతీపాతము, సంక్రమణము, సూర్యగ్రహణము ఇవి ఏవైనా అప్పుడు ఉంటే మంచిది. ఇవన్నీ పుణ్య కాలములు,అని. వ్యాసుడిట్లా – మృత్యువు సమీపిస్తే దూడతో కూడిన ధేనువును ముందు లాగా దానమివ్వాలి. అది లేకపోతే నరకోత్తారణ కొరకు ఆవునే ఇవ్వాలి,అని. ఒకవేళ అప్పుడు వైతరణీ గోవును ఇవ్వటానికి అశక్తుడైతే, శక్తుడైన మరొకడు రోగహీనుడు, మంచి ఆవును (ఆరోగ్యం, పూర్వోక్తము) ఇచ్చి మృతునకు శ్రేయస్సును కలిగించాలి,అని. మదనరత్న మందు జాతూకర్ణి ఇట్లా – మృతునకై ఉత్క్రాంతి మొదలగు వానికై పదిదానము లివ్వాలి. గో, భూ, తిల, హిరణ్యములు, నేయి, వస్త్రములు, ధాన్యము, బెల్లము, వెండి, ఉప్పు, అని దశదానములను క్రమంగా చెప్పారు. ఈ దశ దానములను నరుల మృత్యు, జన్మములందు, ప్రేతగా ఉన్నప్పుడు పరమందును అభ్యుదయము కొరకు ఇవ్వాలి, అని. బ్రాహ్మమందిట్లా – ప్రస్థమాత్రపు (కొలత) తిలలతో నిండిన తామ్ర పాత్రను, హిరణ్యముతో కూడా శ్రద్ధతో విత్తానుసారముగా బ్రాహ్మణునకు ఎవడిస్తాడో, వాడు సర్వపాపములతో విడివడి శుద్ధాత్మ కలవాడై ఉత్తమ గతిని పొందుతాడు. మృత్యు సమయంలో ఉత్క్రాంతి వైతరణీ యందును దశదానములను, ప్రేతమందును చేసి, ఆ ప్రేతను శవధర్మ ప్రకారం దహించాలి,అని. అక్కడే పరిశిష్ట మందిట్లా – ఆ పిదప చనిపోబోతున్న వాని చెవులలో పుణ్యమంత్రములు జపించాలి,అని. క్రియా నిబంధమందు, గారుడమందును ఎనిమిది దానములు చెప్పారు – తులసిని, శాలగ్రామ శిలను దగ్గరుంచుకొని తిలలు, ఇనుము, బంగారము, పత్తి, ఉప్పు, సప్తధాన్యములు, భూమి, గోవు ఈ ఎనిమిది దానములు చేయాలి, ఒక్కొక్కటి పవిత్రమైనది అని అన్నారు,అని. దశదానములు, వైతరిణీ ధేను, ఉత్క్రాంతిధేను దానాదులు భట్టులు రచించిన అంత్యేష్టి పద్ధతియందు చూచి గ్రహించాలి. కర్త, అంత్యకర్మ అధికారం కొరకు మూడు కృచ్ఛ్రము లాచరించాలని అక్కడే చెప్పారు. ఇక్కడ దేవయాజ్ఞికుడు చావనిచ్ఛగల వానికై మధుపర్క దానాన్ని చెప్పాడు. అది వారాహమందిట్లా చెప్పబడింది – బాగా విహ్వలుడైన యమ మార్గాన్ని అనుసరిస్తున్న వీనిని చూచి, మరణకాలమందు నరుడు విధి పూర్వకముగా మంత్రముతో, వేగముగా మధుపర్కమును తీసుకొని ఈ మంత్రాన్ని

ఉదహరించాలి. ఈ మధు పర్కాన్ని గ్రహించు, ఇది ఆద్యమైనది, సంసార నాశనకరము, అమృత తుల్యము, నారాయణుడు రచించాడు. భగవత్ప్రియులకు దాహమందు శాంతిని చేకూర్చేది, సురలోక మందు పూజ్యమైనది. ఈ మంత్రంతోనే మధుపర్కమివ్వాలి. నరునకు, మృత్యుకాలమందలి ఈ దానము, పరిలోకమందు సుఖం కల్గించేది,అని. (సప్తధాన్యాలు - యవ, ధాన్య, తిల, కంగు, (కొర్రలు), శ్యామాక, చణక, ముద్గలు/గోధూమ) ఆజ్య మేకపలం గ్రాహ్యం దధ్నః త్రిపలమేవచ మధునః పలమేకంతు మధుపర్క స్సఉచ్యతే. దధి / పాలు. మధు / గుడం.

మూ॥ **అథదుర్మరణే దివోదాసీయే** - చండాలాది మృతేవిప్రే త్వంతరిక్షేమృతేఽపివా, కృచ్ఛ్రాతి కృచ్ఛ్ర చాంద్రైస్తు శుద్ధిస్తత్ర ప్రకీర్తితా, **దేవజానీయేజాబాలిః** - శూద్రేణ దగ్ధోయో విప్రో నలభేచ్ఛాశ్వతీంగతిం, ప్రాయశ్చిత్తం ప్రకుర్వీత బ్రాహ్మణః పాపశుద్ధయే, చాంద్రాయణం పరార్కం చ ప్రజాపత్యం విశోధనం. **గృహ్యాకారికాయాం** - ఉదక్యా సూతికావాపి యదిప్రేతం స్పృశంతిహి, తస్యైవ విధి రాదిష్టో వాత్స్యే నైవ మహాత్మనా, ఏషః సూతికోక్తః. **మదనరత్నే స్మృత్యంతరే** - ఊర్ధ్వోచ్ఛిష్టాధరోచ్ఛిష్టోభయోచ్ఛిష్టస్తథైవచ, అస్పృశ్య స్పర్శనేచైవ ఖట్వాది మరణేఽపిచ, శ్వాన క్రవ్యాద సంస్పర్శే కృమికీటోద్భవేఽపిచ, ఏతద్దోషాను సారేణ ప్రాయశ్చిత్తం సమాచరేత్. కృచ్ఛ్రాం స్త్రిషట్ పంచదశాం శ్చాంద్ర త్రయ మథాపివా, శుద్ధైతదానీం సంపాద్య శవధర్మేణ దాహయేత్. గృహ్యాకారికాయాం - ఖట్వాయాం మరణే చైవ త్రీంస్త్రీన్ కృచ్ఛ్రాన్ప్ర కల్పయేత్, సప్తాంత్యజైస్తు సంస్పృష్టో మృతోదైవాత్కథంచన. ఏకత్రింశతా కృచ్ఛ్రైస్తు శుద్ధిరుక్తా మనీషిభిః, కుణపేత్వర్ధ దగ్ధేతు చితా స్పృష్టాంత్య జాదిభిః, తత్స్పర్శనం దూషణం చత్రిభిః కృచ్ఛ్రైః విశుద్ధ్యతి. ధర్మ ప్రదీపేతు - చాండాల సూతికోదక్యా స్పృష్టే ప్రేతే తథైవచ, తస్య పాప విశుద్ధ్యర్థం కృచ్ఛ్రాన్ పంచ దశాచరేత్, ఇత్యుక్తం. మనుః - అస్వర్గ్యాహ్యాహుతిః సాస్యాత్ శూద్ర సంపర్క దూషితా. అత్రాపి కృచ్ఛ్రత్రయం, అస్పృశ్య స్పర్శనే చైవ, ఇత్యుక్తేః. **తత్రైవ కర్మ ప్రదీపే** - రాత్రౌ వా రాత్రిశేషే వామ్రియంతేఽథ ద్విజాతయః, దాహం కృత్వాయ ధాన్యాయం ద్వౌపిండౌ నిర్వపేత్సుతః. రజస్వలా గర్భిణ్యాదౌ మృతౌతు వక్ష్యామః. **నిర్ణయామృతే పారిజాతే చయమః** - సంధ్యాయాం వా తథా రాత్రౌ దాహః పాథేయ కర్మచ, నవశ్రాద్ధం చ నోకుర్యాత్కృతం నిష్ఫలతాం వ్రజేత్. ఏతత్దినే మృతస్య రాత్రి నిషేధార్థం. యత్తుస్కాందే - యదిరాత్రౌ దహేత్తస్య సమాప్తిర్దహనస్యతు, పరేఽహన్యుదితే సూర్యే కార్యాతస్యోదక క్రియా దగ్ధస్యతు నవైకార్యా రాత్రౌ జాతూదక క్రియా, ఇతి. తన్నిర్మూలం.

అను॥ ఇక దుర్మరణమందు దివోదాసీయమందిట్లా - విప్రుడు చండాలాదుల వల్ల మరణిస్తే, అంతరిక్షమందు (ఆకాశంభూమిమధ్య) మరణించినా, కృచ్ఛ్ర, అతికృచ్ఛ్ర, చాంద్రాయణ వ్రతములాచరిస్తే అక్కడ శుద్ధి అని చెప్పారు,అని. దేవజానీయమందు జాబాలి ఇట్లా - శూద్రుని వల్ల విప్రుడు దగ్ధమైతే, ఆతడు శాశ్వతగతిని పొందదు. బ్రాహ్మణుడు

పాప శుద్ధికొరకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. చాంద్రాయణము, పరాకము (పన్నెండు రోజుల ఉపవాసము), **ప్రాజాపత్యము** శుద్ధిచేసేవి. (పరాకకు మూడింతలు)అని. గృహ్యాకారిక యందిట్లా – రజస్వల సూతిక వీరు ప్రేతను ముట్టుకుంటే మహాత్ముడైన వాత్స్యుడే వానికి ఈ విధిని ఆదేశించాడు,అని. ఇది సూతికకై చెప్పబడింది. మనదరత్నమందు స్మృత్యంతరోక్తి ఇట్లా – ఊర్ధ్వఉచ్ఛిష్టము, అధరఉచ్ఛిష్టము, ఉభయ ఉచ్ఛిష్టము మరణమందు, అస్పృశ్యస్పర్శమందు, ఖట్వాదులలో మరణమందును, కుక్క మాంస భక్షకుడు వీరి స్పర్శయందు, కృమి కీటములుత్పనమై మరణిస్తే, ఈ దోషముల ననుసరించి ప్రాయశ్చిత్త మాచరించాలి,అని. మూడు, ఆరు, ఐదు, పది కృచ్ఛ్రములను గాని మూడు చాంద్రాయణ ములుగాని శుద్ధికొరకు సంపాదించి అప్పుడు శవ ధర్మాన్ననుసరించి దాహం చేయాలి. గృహ్యాకారిక యందిట్లా – ఖట్వమందు మరణిస్తే మూడేసి కృచ్ఛ్రములను కల్పించాలి. అంత్యజ స్పర్శయందు ఏడు కృచ్ఛ్రములు, దైవయోగంవల్ల ఏదో రకంగా మరణిస్తే ముప్పది ఒకటి కృచ్ఛ్రములతో శుద్ధి అని బుద్ధిమంతులు చెప్పారు. శవం సగం కాలాక అంత్యజాదులు చితిని స్పృశిస్తే, ఆస్పర్శ దూషితమైనది మూడు కృచ్ఛ్రములతో శుద్ధి,అని. ధర్మప్రదీపమందిట్లా – చండాలుడు, సూతిక, రజస్వల వీరు ప్రేతను స్పృశిస్తే, ఆతని పాప విశుద్ధి కొరకు పదిహేను కృచ్ఛ్రము లాచరించాలి, అని చెప్పారు. మనువిట్లా – శూద్ర సంపర్కంతో దూషితమైన మృతుని శవము కాలుతున్నా ఆ ఆహుతి స్వర్గం కొరకైనది కాదు అని ఇక్కడ కూడా కృచ్ఛ్రత్రయమే. అస్పృశ్యుని స్పర్శయందును కూడా అని చెప్పారు కనుక. అక్కడే కర్మ ప్రదీప మందిట్లా – ద్విజాతులు రాత్రి కాని రాత్రి శేషమందు కాని మరణిస్తే, శాస్త్ర ప్రకారము దాహం చేసి సుతుడు రెండు పిండములు వదలాలి. రజస్వల గర్భిణి మొదలగు వారు మరణిస్తే చెప్తాము. నిర్ణయామృతమందు పారిజాతమందును యముడిట్లా – సంధ్యయందు, అట్లాగే రాత్రియందు దాహం పాథేయకర్మ, నవశ్రాద్ధము చేయరాదు, చేస్తే నిష్ఫలమౌతుంది,అని. దినమందు మరణించిన వానికి రాత్రి యందు నిషేధముకొరకు ఇది. స్కాందమందిట్లా – ఒకవేళ రాత్రి దహనంచేస్తే ఆదహనం సమాప్తియైతే, తరువాతిరోజు సూర్యోదయం కాగానే వానికి ఉదకక్రియ చేయాలి. దగ్ధమైన వానికి రాత్రియందు ఉదకక్రియ ఎప్పుడూ చేయరాదు,అని అన్నమాట నిర్మూలము.

మూ॥ **రాత్రిమృతస్యతు** తత్రైవ సంగ్రహే – రాత్రౌదగ్ధ్వాతు పిండాంతం కృత్వా వపన వర్జితం, వపనం నేష్యతే రాత్రౌశ్వస్తనీవపన క్రియా, ఇతి. వపనంతు ప్రాతః. తచ్చసర్వైః పుత్రైః కార్యం. **గయాయాం భాస్కరక్షేత్రే** మాతాపిత్రోః గురోర్మృతే, ఆధానే సోమయాగే చ వపనం సప్తసు స్మృతం, ఇతి మితాక్షరాయాం స్మృతేః. మరణస్నానం గిత్వాన్నైమిత్తిక మిదం. తదేవ సంగ్రహవచనేన పరేద్యురుత్కృష్యతే తీర్థవత్. తేనకస్యచిద్దాహాంగత్వోక్తి శ్చింత్యా. **మదనరత్నే గాలవః** – ప్రథమేఽహని కర్తవ్యం వపనం చాను భావినాం, ప్రేతస్య కేశశ్మశ్ర్వాది వాపయిత్వాఽ

ధ దాహయేత్. ఆశౌచాంతే తు పునః కార్యం విధి బలాత్. మదన పారిజాతేఽప్యేవం. తేన సర్వస్యాస్య నిర్మూలత్వోక్తిః అజ్ఞోక్తి రేవ. **స్మృతిరత్నావల్యాం**- శవం రాత్ర్యుషితం చేత్త్రీన్ కృచ్ఛ్రాన్ కృత్వాదహేత్సుతః. **మదనరత్నేంగిరాః** - ఊర్ధ్వోచ్ఛిష్టాధరోచ్ఛిష్టేహ్యంతరిక్షమృతేఽపిచ, కృచ్ఛ్రత్రయంప్ర కుర్వీత ఆశౌచే మరణేఽపిచ. **అథసాగ్నేర్విశేషః** - కారికాయాం - కృష్ణపక్షే ప్రమీయేత యద్యహ్ని ప్రాతరాహుతీః, శేషాస్తు జుహుయాద్దర్శ పర్యంతాః పక్ష హోమవత్. ప్రతిపత్ప్రా తర్హోమాంతాః ఇత్యర్థః. యద్యాహితాగ్నిర పరపక్షే మ్రియేతాహుతి భిరేనం పూర్వపక్షం హరేయుః ఇత్యాశ్వలాయనోక్తేః. తదానీమేవ జుహుయాత్ప్రాతః కాలాహుతీరపి. సాయంమ్రియేత చేత్సాయ మాహుతీర్జుహుయాదథ. తదానీమేవ జుహు యాత్ప్రాతః కాలాహుతీరపి, సకృత్ గృహీతమత్రేష్టం భిన్నం తంత్రం చ హోమయోః. దర్శంచాపి ప్రకుర్వీత స్థాలీపాకం తద్దైవతు. ఛందోగపరిశిష్టే - హుతాయాం సాయమాహుత్యాం దుర్బలశ్చే ద్గృహీభవేత్. ప్రాతర్ హోమస్తదైవ స్యాజ్జీవేచ్చస పునర్నవా. ఇదం శుక్లపరం. దుర్బలోముమూర్షుః.

అను॥ రాత్రి మరణించిన వానికి అక్కడే సంగ్రహ మందిట్లా - రాత్రి శవాన్ని దగ్ధం చేసి పిండాంతం కర్మ చేయాలి, వపనం చేయరాదు. రాత్రి పూట వపనం తగదు. వపనక్రియ రేపటికి చెందినది (ఉదయం),అని. వపనము ఉదయమందు దానిని అందరు పుత్రులు చేసుకోవాలి. గయయందు, భాస్కర క్షేత్రమందు (ప్రయాగ) తలిదండ్రులు గురువు వీరు మరణిస్తే, ఆధానమందు, సోమయాగమందు ఈ ఏడు సందర్భములందు వపనమని చెప్పారు,అని మితాక్షరమందు స్మృతివచనం. మరణమునకు ఇది అంగంకాదు ఇది నైమిత్తికము. అదే సంగ్రహ వచనంతో, తీర్థమందువలె తరువాతి రోజున బాగుంటుంది అని చెప్పారు. అందువల్ల ఒకడు దాహాంగముగా చెప్పాడు. అది విచారించాలి. మదనరత్న మందు గాలవుడిట్లా - ప్రేతకన్న చిన్న (తమ్ములు) వాళ్ళు, తొలిరోజు క్షౌరం చేయించు కోవాలి. ప్రేతకు తలవెంట్రుకలు, గడ్డం వగైరా కొరిగించి ఆ పిదప దాహం చేయాలి. విధి ప్రాబల్యం ఉంది కనుక ఆశౌచాంతమందు తిరిగి వపనము,అని. మదన పారిజాతమందు కూడా ఇట్లాగే ఉంది. అందువల్ల ఇదంతా మూల వచనాలు లేనట్టిది అని అన్నమాట అజ్ఞుని మాటయే. (అశుభంలో ఎడమ చెవినుండి, శుభంలో కడి నుండి). స్మృతి రత్నావలి యందిట్లా - శవం రాత్రి ఉంటే మూడు కృచ్ఛ్రము లాచరించి సుతుడు దహనం చేయాలి, అని. మదనరత్నమందు అంగిరుడిట్లా - ఊర్ధ్వోచ్ఛిష్ట, అధరోచ్ఛిష్ట, అంతరిక్ష మృతులందు మూడు కృచ్ఛ్రము లాచరించాలి. ఆశౌచమందు మరణమందును,అని. ఇక సాగ్నికి విశేషము - కారికయందిట్లా - కృష్ణపక్షమందు పగలు మరణిస్తే ప్రాతఃకాల ఆహుతులిచ్చి మిగిలిన ఆహుతులను పక్షహోమం వలె అమావాస్య వరకు హోమం చేయాలి. ప్రతిపత్ అంటే ప్రాతర్ హోమాంతక్రియలు,అని అర్థము. ఒకవేళ ఆహితాగ్ని అపర పక్షమందు మరణిస్తే ఆహుతులతో ఈతనిని పూర్వ పక్షం తీసుకెళ్ళాలి,అని ఆశ్వలాయనోక్తి. అప్పుడే ప్రాతః

కాల ఆహుతులను కూడా హోమం చేయాలి. సాయంకాల మందు మరణిస్తే సాయం ఆహుతులను హోమం చేయాలి. అప్పుడే ప్రాతః కాల ఆహుతులు కూడా హోమం చేయాలి. ఇక్కడ ఒకేసారి గ్రహించటం ఇష్టము. రెండు హోమములు తంత్రంగా, భిన్నంగాను ఇష్టము. దర్శం కూడా ఆచరించాలి. అప్పుడే స్థాలీపాకం కూడా చేయాలి. ఛందోగ పరిశిష్టమందిట్లా – సాయమాహుతుల హోమం అయ్యాక గృహస్థు దుర్బలుడైతే (మరణించే పరిస్థితి వస్తే) ప్రాతర్ హోమము అప్పుడే చేయాలి. ఆతడు బ్రతికితే అది తిరిగి చేయాలి లేదా లేదు,అని ఇది శుక్లపక్ష పరము. దుర్బలుడు – చావు దగ్గర కొచ్చినవాడు. (పరివాపణం = పరిత్యజ్యశిఖాం వాపనం. అనుభావితః = ప్రేతకనిష్ఠాః లేదా ప్రేత దుఃఖానుభావినః సర్వే.)

**మూ॥ త్రికాండమండనః** – దర్శేష్టిం చ తదాకుర్యాత్ ఇష్టిర్యది, నసంభవేత్, దేవతానాం ప్రధానా నామేకైకస్య హునేత్ పృథక్. పురోను వాక్యా యాజ్యాభ్యాం చతురాత్త ఘృతాహుతీః తథా – అగ్న్యావరణ్యోరారూఢే ప్రమీయేత పతిర్యది ప్రేతం స్పృష్ట్వా మథిత్వాగ్నిం జప్త్వా చోపావ రోహణం, ఘృతం చద్వాదశోపాత్తం తూష్ణీం హుత్వాశవక్రియా. **విచ్ఛిన్న శ్రౌతాగ్నేర్ను తౌతు** ప్రేతాధానం తత్రైవోక్తం, ప్రేతం స్వాగ్న్యాలయేక్షిప్త్వా మథితాగ్న్యా నలేఽరణీ, సన్నిధా ప్యారణీం మంథేద్ యస్యేతి యజుషాతతః. **యస్యాగ్నయోజుహ్వతో** మాంసకామాః సంకల్పయంతే యజమాన మాంసం,జాయంతు తేహవిషేసాదితాయ స్వర్గంలోక మిమం ప్రేతం నయంతు, ఇతి మంత్రతః. ప్రణీయ పావకం తూష్ణీం ద్వాదశోపాత్త సర్పిషా, తూష్ణీం హుత్వాతతః కుర్యాత్ప్రేతే మాల్యా ఇతి క్రియాం. **నష్టేష్వగ్నిష్వథారణ్యోర్నాశే** స్వామీ మ్రియేతచేత్, ఆహరే దరణీద్వంద్వం మనోజ్యోతిర్ ఋచాతతః. **యజ్ఞపార్శ్వః – యజమానే** చితారూఢే పాత్రన్యాసేకృతేసతి, వర్షాద్యభిహతే వహ్నౌ కథం కుర్వంతి యాజ్ఞికాః. తదర్థ దగ్ధ కాష్ఠేన మంథనం తత్ర కారయేత్. తచ్ఛేషా లాభతోఽన్యేన దగ్ధశేషేణ వాపునః. హుత్వాజ్యం లౌకికే వహ్నౌ దగ్ధశేషం దహేత్తువా అత్రాగ్నిషు సత్సు పర్ణశరైః శరీరోత్పత్తిః శరీరేవా సతి ప్రేతాధానేనా గ్న్యుత్పత్తిః. ఉభయా భావేతు ప్రేతాధానేఽనధికారాద్దాహాది సంస్కారలోపః. ఉదకదానాద్యేవ కార్యమితి కేశవీకార శతద్వయీ ప్రముఖాః. తన్న. నిషేకాద్యాః శ్మశానాంతా యేషాం వైమంత్రతః క్రియా, ఇతి విరోధాత్, క్రియాలోపగతాయే చ ఇతి నిషేధాత్, తదభావే పలాశానాం వృంతైః కార్యః పుమానపి. ఇత్యభావే విధానస్యాగ్న్య భావేఽపి సామ్యాచ్చ. తేన ప్రాతరాహుత్యభావేఽపి స్విష్టకృత్ ద్రవ్యాంతరోక్తేర దృష్టార్థత్వాత్ ప్రేతాధానం దాహోఽపి భవత్యేవ. ప్రతికృతేరగ్నీనాం చ ప్రేతాధాన ప్రయోజకత్వాక్షతేః **పత్న్యా అప్యేవం. దాహయిత్వాగ్ని** హోత్రేణ స్త్రియం వృత్తవతీం పతిః. ఇతి యాజ్ఞవల్క్యోక్తేః **యత్తు – ద్వితీయాం** చైవయో భార్యాం దహేద్వైతానికాగ్నిభిః, జీవత్యాం ప్రథమా యాంతు సురాపాన సమం స్మృతం. ఇతి తదాధానే సహానధికృతా విషయమితి విజ్ఞానేశ్వరః. **మదనరత్నే బ్రాహ్మేఽపి** – ఆహితాగ్న్యోశ్చ దంపత్యోర్యస్త్వాదౌ మ్రియతే భువి, తస్యదేహః సపిండైశ్చ దగ్ధవ్యః త్రిభిరగ్నిభిః.

అను॥ త్రికాండమండనుడిట్లా - అప్పుడు (చావు దగ్గరికొచ్చినప్పుడు) ఇష్టి సంభవించకపోతే దర్శేష్టి చేయాలి. ప్రధాన దేవతలకు ఒక్కొక్కరికి విడిగా హోమం చేయాలి. పురోను వాక్య యాజ్యములతో నాలుగు ఘృతాహుతులు తీసుకొని చేయాలి. (దేవతను పిలిచే మంత్రాలు హోత చదివేవి - అగ్నిర్మూర్ధా. పురోను వాక్య దేవతకు హవిస్సు ఇచ్చేప్పటి ఋక్కు యాజ్యా). అట్లాగే - అగ్నియందు అరణి, అధరార్ణి ఈ రెండు ఆరూఢమైనాక పతి ఒకవేళ మరణిస్తే, ప్రేతను స్పృశించి, అగ్నిని మధించి, ఉపావరోహణ మంత్రాన్ని జపించి, నేయిని పన్నెండుసార్లు తీసుకొని మౌనంగా హోమం చేసి శవక్రియ చేయాలి,అని. శ్రౌతాగ్ని విచ్ఛిన్నమైనవాడు మరణిస్తే ప్రేతాధానము అక్కడే చెప్పాడు. ప్రేతను ఆతని అగ్న్యాలయ మందుంచి, మధితాగ్నితో, అనలమందు అరణినుంచి పిదప యస్య అనే యజు మంత్రంతో అరణిని చిలకాలి. యస్యాగ్నయో... నయంతు, అనే మంత్రంతో, అగ్నిజ్వాల చేసి మౌనంగా, పన్నెండుసార్లు నేయితీసుకొని మౌనంగా హోమంచేసి ఆ పిదప మాల్య అని ప్రేతక్రియను చేయాలి. అగ్నులు నష్టమయ్యాక అరణులు నశించాక స్వామి మరణిస్తే ఆ పిదప, మనోజ్యోతిః అను ఋక్కుతో అరణులు రెంటిని (అరణి మరియు అధరార్ణి) తేవాలి. యజ్ఞ పార్శ్వుడిట్లా - యజమాని చితి యందు ఆ రూఢుడైనాడు, పాత్రన్యాసం చేశారు. అప్పుడు వర్షాదులవల్ల అగ్ని నాశమైతే యాజ్ఞికులు ఎట్లా చేస్తారు,అని. ఆ సగం కాలిన కర్రతో అక్కడ మంధనం చేయాలి. తచ్ఛేషము లభించకపోతే ఇతరమైన దగ్ధశేషంతో కాని (బూడిద) తిరిగి చేయాలి. లేదా నేయితో హోమంచేసి లౌకికాగ్ని యందు దగ్ధశేషాన్ని దహనం చేయాలి. ఇక్కడ అగ్నులు ఉంటే పర్ణశరములతో శరీరోత్పత్తి. శరీరముంటే ప్రేతాధానంతో అగ్నిఉత్పత్తి. రెండు లేకపోతేనో ప్రేతాధానమందు అధికారం లేదు కనుక దాహాది సంస్కారలోపము ఉదకదానాదికమే చేయాలి,అని కేశవీ కారశతద్వయీ ప్రముఖులన్నారు. అంటే అది అట్లా కాదు. నిషేకం నుండి మొదలై శ్మశానాంతములైన వాటన్నిటికి మంత్రములతోనే క్రియలు, అనే దానికి విరుద్ధమౌతుంది. ఏవి క్రియాలోపాన్ని పొందాయో అని నిషేధమున్నందువల్ల, దాని (శరీరం) అభావ మందు మోదుగాకుల తొడిమలతో పురుషుని కూడా తయారు చేయాలి. అది కూడా లేకపోతే, విధాన ప్రయోజనం, అగ్నిలేకపోయినా సమత్వము కొరకు అందువల్ల ప్రాతరాహుతులు లేకపోయినా స్విష్టకృత్తు కొరకు ద్రవ్యాంతరం చెప్పినట్లు, అదృష్టార్థమున్నందువల్ల అట్లాగే ఇక్కడ కూడా ప్రేతాధానము, దాహము ఔతుంది, ప్రతికృతి, అగ్నులు ఈ రెండు ప్రేతా ధాన ప్రయోజకములే కనుక క్షతి లేదు. భార్యకు గూడా ఇట్లాగే - మంచి నడవడిక గల భార్యను భర్త అగ్ని హోత్రంతో దాహం చేసి,.అని యాజ్ఞవల్క్యోక్తి. ఇట్లా - ఎవడు ప్రథమ భార్య బ్రతికుండగా రెండవ భార్యను వైతానికాగ్నులతో దాహం చేస్తాడో, వాడు సురాపానం చేసిన వానితో సముడు అని అన్నారు, అని ఏదన్నాడో అది ఆధానమందు, ఏ భార్యతో కలిసి చేయటంలో అధికారంలేదో. ఆమె విషయము అని

విజ్ఞానేశ్వరుడన్నాడు. మదనరత్న మందు బ్రాహ్మమందు కూడా ఇట్లా - అహితాగ్నులైన దంపతుల మధ్యలో భూమిపై ఎవరు మొదలు మరణిస్తే, ఆతని శరీరాన్ని సపిండులు మూడగ్నులతో (దక్షిణ గార్హపత్య, ఆహవనీయ) దహనం చేయాలి,అని.

మూ॥ **పశ్చాన్మృతస్యదేహస్తు** దగ్ధవ్యో లౌకికాగ్నినా, అనాహితాగ్ని దేహస్తు దాహ్యో గృహ్యాగ్నినా ద్విజైః. **త్రికాండమండనస్తు వికల్పమాహ** - జ్యేష్ఠాయాం విద్యమానాయాం ద్వితీయాయై స్వయోషితే, కామ్యం నిత్యాగ్ని హోత్రం వాన కథంచిత్ర్పయచ్ఛతి. స్త్రీమాత్ర మవిశేషేణ దగ్ధ్వాన్యైః వైదికాగ్నిభిః, వివాహ్యేదథతే యద్వాధానమే వాస్తిచే ద్వధూః,ఇతి. **అత్రేదంతత్వం.** సాగ్నేః పత్నీ మృతౌ ద్వౌపక్షౌ. పునర్వివాహేచ్ఛాయాం పూర్వాగ్నిభిః దహేదిత్యేకః పక్షః. భార్యాయై పూర్వమారిణ్యై దత్వాగ్నీనం త్యకర్మణి, పునర్దార క్రియాం కుర్యాత్పునరాధాన మేవచ. ఇతి మనూక్తేః దాహయిత్వాగ్ని హోత్రేణ స్త్రియం వృత్తవతీః పతిః, ఇతి యాజ్ఞవల్క్యోక్తేశ్చ. పునర్వివాహాశక్తౌ. నిర్మంథ్యేన తాందగ్ధ్వా పూర్వాగ్నిష్వే వాగ్ని హోత్రాది కార్యమిత్యన్యః. ఆహార్యేణా హితాగ్నిం పత్నీంచ, ఇత్యాశ్వలాయనోక్తేః. భరద్వాజోఽపి - నిర్మంథ్యేన పత్నీం, ఇతి. పూర్వాగ్న్యే కదేశేన దహేదితి యజ్ఞ పార్శ్వదేవయాజ్ఞికాదయః. **యానిచ - తస్మాదపత్నీకోఽప్యగ్ని హోత్రమాహరేత్,** ఇతి శ్రుతిః. విష్ణుః - ఛందోగపరిశిష్టేచ - మృతాయా మపి భార్యాయాం వైదికాగ్ని నహిత్యజేత్, ఉపాధి నాపితత్కర్మ యావజ్జీవం సమాచరేత్. ఉపాధిః హేమ కుశపత్న్యాదిః. అన్యే కుశమయీం పత్నీం కృత్వాతు గృహమేధినః, అగ్నిహోత్రము పాసంతే యావజ్జీవ మనువ్రతాః, ఇత్యపరార్కే స్మృత్యంతరాత్. కాత్యాయనోఽపి - రామోఽపి కృత్వా సౌవర్ణీం సీతాంపత్నీం యశస్వినీం, ఈజ్యే బహువిధైర్యజ్ఞైః సహభ్రాతృభిరచ్యుతః, ఇత్యాదీని, తాని పూర్వాగ్నిష్వేవాగ్ని హోత్రాది పరాణి నత్వపత్నీక స్యాధానార్థాని, క్రతు విధీనామాధానా ప్రయోజకత్వాత్, అపత్నీకస్యాధా నాప్రవృత్తి రితి మానవ పరిశిష్టాచ్చ. సోమోన భవత్యేవ, అపత్నీకోఽప్య సోమపః, ఇతి శ్రుతేః. యత్తు భారద్వాజాపస్తంబ సూత్రం - దారకర్మణి యద్యశక్త ఆత్మార్థ మగ్న్యాధేయం, ఇతి. అస్యార్థః - పునర్వివాహా శక్తౌ యదగ్న్యాధేయం పూర్వకృతమస్తి తదాత్మార్థమేవ నపత్న్యై దద్యాదితి. బ్రాహ్మణ భాష్యాపరార్కా శార్క రామాండారాది తత్వమప్యేవం. **త్రికాండ మండనస్తు పక్షద్వయ మాహ** - అన్యేఽప్య పత్నీక స్యాధాన మాహుస్త దాశయం నవిద్మః **వృద్ధయాజ్ఞవల్క్యః** - అహితాగ్ని ర్యథాన్యాయం దగ్ధవ్య స్త్రిభిరగ్నిభిః, అనాహితాగ్ని రేకేన లౌకికేనాపరోజనః.

అను॥ తరువాత మరణించిన వాని శరీరాన్ని లౌకికాగ్నితో కాల్చాలి. అనాహితాగ్ని శరీరాన్ని గృహ్యాగ్నితో దాహం చేయాలి,ద్విజులు, అని. త్రికాండమనుడైతే వికల్పం చెప్పాడు - పెద్ద భార్య ఉండగా తన రెండవ భార్యకు, కామ్యం కాని నిత్యాగ్ని హోత్రం కాని ఎట్లాగూ ఇవ్వడు,అని. స్త్రీ మాత్రమే విశేషం లేనందువల్ల ఇతర వైదికాగ్నులతో దాహం చేసి, వివాహం చేసుకొని ఆధానం చేస్తాడు లేదా మరో భార్య ఉంటే ఆధానమే,అని. ఇక్కడ విషయమిది - సాగ్నికు నకు భార్య మరణిస్తే రెండు పక్షాలు. మళ్ళీ వివాహం

చేసుకోవాలనుకుంటే పూర్వాగ్నులతో దహనం చేయాలి,అని ఒక పక్షము. ముందు మరణించిన భార్యకై అంత్యకర్మ యందు దాహము అగ్నులను ఇచ్చి, తిరిగి వివాహ మాడాలి తిరిగి ఆధానము,అని మనూక్తి. మంచి నడవడిక గల భార్యను భర్త అగ్నిహోత్రంతో దాహం చేసి, అని యాజ్ఞవల్క్యోక్తి. పునర్వివాహం చేసుకోవటానికి శక్తిలేకపోతే నిర్మంథ్యాగ్నితో ఆమెను దహనం చేసి, ముందున్న అగ్నుల యందే అగ్ని హోత్రాదులు (ఇష్టి) చేయాలని ఇతరులన్నారు. ఆహార్యంతో ఆహితాగ్నిని పత్నిని, అని ఆశ్వలాయనోక్తి. భారద్వాజుడు కూడా - నిర్మంధ్యముతో భార్య దాహము,అని. పూర్వపు అగ్నుల ఒక భాగంతో దాహం అని యజ్ఞ పార్శ్వ దేవయాజ్ఞికాదులన్నారు. ఇట్లా - అందువల్ల అపత్నీకుడైనా అగ్నిహోత్రం చేయాలి,అని శ్రుతి, అని ఏదన్నాడో; విష్ణువు, మరి ఛందోగ పరిశిష్టమందును ఇట్లా - భార్య మరణించినా వైదికాగ్నిని వదలరాదు. ఉపాధితోనైనా ఆ పనిని బ్రతికినంతకాలం చేయాలి. ఉపాధి అనగా బంగారు లేదా కుశలతో చేసిన పత్న్యాది. అని ఏదుందో, ఇతరులు గృహమేధులు కుశలతో చేసిన పత్నితో, బ్రతికినంతకాలం వ్రతమందుంటూ అగ్నిహోత్రాన్ని ఉపాసిస్తున్నారు, అని అపరార్కమందు స్మృత్యంతరవచన మేదుందో, కాత్యాయనుడు కూడా ఇట్లా - అచ్యుతుడు రాముడు కూడా యశస్వినియైన భార్యయైన సీతబంగారు విగ్రహాన్ని చేయించు కొని, తమ్ములతో కూడి అనేక యజ్ఞములను చేశాడు,అని మొదలగునవి ఇవన్నీ ఏవున్నాయో అవి పూర్వాగ్నులయందే అగ్నిహోత్రాదులు అనే విషయము కాని. అపత్నీకునకు ఆధానార్థకాలు కావు. క్రతు విధి వాక్యాలకు ఆధానమందు ప్రయోజనం లేదు. అపత్నీకునకు అధానం ప్రవృత్తం కాదు,అని మానవ పరిశిష్టం వల్లను తెలుస్తోంది. సోమము కానేకాదు. అపత్నీకుడు కూడా అసోమపుడు,అని శ్రుతి. భారద్వాజ ఆపస్తంబ సూత్రం ఇట్లా - దార కర్మయందు అశక్తుడైతే ఆత్మకొరకై అగ్న్యాధానము,అని ఏదన్నాడో దాని అర్థమిది. పునర్వివాహ మందు అశక్తుడైతే అగ్న్యాధేయము ముందు చేసినది ఏదుందో అది తన కొరకే భార్యకు ఇవ్వరాదు,అని. బ్రాహ్మణ, భాష్య, అపరార్క ఆశార్క రామాండారాదుల తత్వము కూడా ఇదే. త్రికాండమండనుడైతే రెండు పక్షములు చెప్పాడు. ఇతరులు కూడా భార్యలేని వానికి ఆధానాన్ని చెప్పారు, వారి అభిప్రాయ మేమిటో తెలియదు. వృద్ధయాజ్ఞవల్క్యుడిట్లా - తగిన రీతిగా ఆహితాగ్నిని మూడగ్నులతో దహనం చేయాలి. అనాహితాగ్నిని ఒక అగ్నితో (స్మార్తాగ్నితో) దాహం చేయాలి. ఇతరులను సాధారణ జనులను లౌకికాగ్నితో దహనం చేయాలి,అని.

**మూ॥ మనుః - ఏవం వృత్తాం సవర్ణాం స్త్రీం ద్విజాతిః పూర్వమారిణీం, దాహయే దగ్ని హోత్రేణ యజ్ఞపాత్రైశ్చ ధర్మవిత్. కారికాయాం - పత్నీ మపీదహే దేవం భర్తుః పూర్వం మృతాయది, అనగ్ని కాం దహేద్దేవం కాపాలేన హవిర్భుజా. (ఛందోగ పరిశిష్టే - అనయైవా వృతానారీ దగ్ధవ్యా యా వ్యవస్థితా, అగ్ని ప్రదానమంత్రోఽస్యా న ప్రయోజ్య ఇతిస్థితిః. ఇదం**

ఛందోగానామేవ. తథా అగ్నినైవ దహేద్భార్యాం స్వతంత్రాం పతితానచేత్, తదుత్తరేణ పాత్రాణి దాహయేత్పృథగంతికే. ఇదమపి తేషామేవ). **ఆశౌచప్రకాశేక్రతుః** – విధురం విధవాం చైవ కపాలస్యాగ్నినా దహేత్, బ్రహ్మచారీ యతీచైవ దహ్యేతోత్తపనాగ్నినా. తుషాగ్నినా చ దగ్ధవ్యః కన్యకా బాల ఏవచ, అగ్నివర్ణం కపాలంతు కృత్వాతత్ర వినిక్షిపేత్. కరీషాది తతోవహ్నిః జాతోయః సకపాలజః. అనుపనీతే యద్యపి జాతారణ్యగ్నిః క్లైశ్చిదుక్తః తథాపి తస్యకలౌ నిషిద్ధత్వోక్తేః అయమేవజ్ఞేయః. స్మృత్యంతరే – గృహస్థో బ్రహ్మాచారీ చ విధురో విధవాః స్త్రియః ఔపాసనశ్చోత్తపన స్తుషాగ్ని శ్చ కపాలజః. **ఉత్తపనస్తు – దర్భాగ్రేఽగ్నింతు** ప్రజ్వాల్య పునర్దర్భైస్తు సంయుతః, పునర్దర్భైః తృతీయోఽగ్ని రేష ఉత్తపన స్మృతః. **యమః – యస్యాన** యతి శూద్రోఽగ్నిం తృణం కాష్ఠం హవీంషిచ, ప్రేతత్వం చ సదాతస్య సచాధర్మేణ లిప్యతే, **దేవలః – చండాలాగ్ని** రమేధ్యాగ్నిః సూతకాగ్ని శ్చకర్హిచిత్, పతితాగ్ని శ్చితాగ్నిశ్చన శిష్టగ్రహణోచితః. **మనుః- దక్షిణేన** మృతం శూద్రం (పూర్వపుర ద్వారేణ నిర్హరేత్, పశ్చిమోత్తర పూర్వైస్తు యథా సంఖ్యం (యథాయోగం) ద్విజాతయః (ద్విజన్మనః). అత్ర ప్రాతి లోమ్యేన క్రమః. పూర్వాముఖస్తు నేతవ్యో బ్రాహ్మణో బాంధవైర్నృహాత్, ఉత్తరాభిముఖో రాజా వైశ్యః పశ్చాన్ముఖస్తథా. దక్షిణాభిముఖః శూద్రోనిర్ హర్తవ్యః స్వబాంధవైః. ఇత్యాదిపురాణాదిత్య పరార్కః. తేనత్రింశత్ శ్లోక్యుక్తోఽనులోమ క్రమోహేయః. **ఆశ్వలాయనః** – జ్యేష్ఠ ప్రథమాః కనిష్ఠ జఘన్యాగచ్ఛేయుః. **అథాధానోత్తరం** ద్వితీయ వివాహేకృతే యజమాన మరణే శ్రౌత స్మార్తాగ్న్యోః సంసర్గః.

అను॥ మనువిట్లా – ఇలాంటి మంచి నడవడిక గల సవర్ణ స్త్రీని ముందు మరణించిన దానిని ద్విజాతులు ధర్మమెరిగినవారు యజ్ఞపాత్రలతో అగ్నిహోత్రాగ్నితో దాహం చేయాలి,అని. కారికయందిట్లా – భర్త కన్న పూర్వం భార్య మరణిస్తే ఆమెను కూడా ఇట్లాగే దాహం చేయాలి. అనగ్నికనైతే కాపాలాగ్నితో (పిడుకలది) ఇట్లా దహించాలి,అని. ఛందోగ పరిశిష్టమందిట్లా – శుద్ధ ఆచరణ గలిగి ఏ స్త్రీ ఉందో, ఆమెను అట్లాగే ఇదే పద్ధతిలో దాహం చేయాలి. అగ్ని ప్రదాన మంత్రము ఆమెకై చదువరాదు అని నియమము. ఇది ఛందోగులకే. అట్లాగే – పతిత కానిచో స్వతంత్రమైన భార్యను అగ్నితోనే దాహం చేయాలి. ఆమె శరీరం సమీపమందు ఉత్తర భాగంలో విడిగా పాత్రలు దాహం చేయాలి. ఇది కూడా వారికే. ఆశౌచ ప్రకాశమందు క్రతువిట్లా – విధురుడు విధవ వీరిని కపాలాగ్నితో దాహం చేయాలి. బ్రహ్మచారి, యతి వీరిని ఉత్తపనాగ్నితో దాహం చేయాలి. (కుశాగ్రంలో అగ్ని ముట్టించి, కుశలు కలపాలి, మళ్ళీ కుశలు కలపాలి మూడవది ఉత్తపనాగ్ని) కన్య, బాలురు వీరిని తుషాగ్నితో దాహం చేయాలి, (ఊకంతో), కపాలమును అగ్గిలాగా చేసేసి దానిని పిడకలతో పారేయాలి. ఆ పిదప పిడకల నుండి పుట్టిన అగ్నిని కపాలజ అగ్ని అంటారు. అపనీతుని విషయంలో అరణ్యంలో పుట్టిన (అరణిపుట్టిన) అగ్ని వాడాలి అని ఎవరో చెప్పినప్పటికి దానిని కలిలో, నిషిద్ధమన్నారు కనుక ఇదే అని తెలుసుకోవాలి. స్మృత్యంతరమందిట్లా – గృహస్థుడు, బ్రహ్మాచారి, విధురుడు, విధవ స్త్రీలు వీరు క్రమంగా

ఔపాసన, ఉత్తపన, తుషార, కపాలజ అగ్నులతో దాహమందాలి,అని. ఉత్తపనమిట్లా - దర్భాగ్రమందు అగ్ని ముట్టించి మళ్ళీ దర్భలు కలిపి, మళ్ళీ దర్భలు కలిపి ఇట్లా మూడవ అగ్నియే ఉత్తపన మన్నారు,అని. యముడిట్లా - ఎవనికై శూద్రుడు, అగ్నిని, తృణమును, కట్టెలను, హవిస్సు తెస్తాడో వానికి ఎల్లప్పుడూ ప్రేతత్వమే. వాడు అధర్మంతో ఉంటాడు,అని. దేవలుడిట్లా - చండాలాగ్ని, అపవిత్రాగ్ని, ఒకచో సూతకాగ్ని, పతితాగ్ని, చితాగ్ని ఇవి శిష్టులు గ్రహించుటకు తగినవికావు,అని. మనువిట్లా - చనిపోయిన శూద్రుని పురపు దక్షిణ ద్వారం నుంచి తీసుకెళ్ళాలి. వైశ్యుని పశ్చిమ ద్వారం నుండి, క్షత్రియుని ఉత్తర ద్వారం నుండి, బ్రాహ్మణుని తూర్పు ద్వారం నుండి క్రమంగా ద్విజాతులను తీసుకెళ్ళాలి. ఇక్కడ క్రమము క్రింది నుండి (శూద్ర - బ్రాహ్మణ) బ్రాహ్మణుని బంధువులు గృహం నుండి తూర్పుముఖంగా తీసుకెళ్ళాలి. రాజును ఉత్తరాభిముఖంగా, వైశ్యుని పశ్చిమాభి ముఖంగా శూద్రుని దక్షిణాభిముఖంగా తమ బంధువులు తీసుకెళ్ళాలి. (చనిపోయినప్పుడు) అని ఆదిపురాణమందు అని అపరార్కు డన్నాడు. అందువల్ల త్రింశత్ శ్లోకిలో చెప్పిన అనులోమ క్రమము విడువతగినది. ఆశ్వలాయనుడిట్లా - పెద్దవాళ్ళు ముందర చిన్నవాళ్ళు వెనక వెళ్ళాలి. ఇక ఆధానం తరువాత ద్వితీయ వివాహం చేసుకుంటే యజమానుడు మరణిస్తే శ్రౌతస్మార్తాగ్నులను కలపాలి.

**మూ॥ బౌధాయనసూత్రే - అథయ ద్యాహితాగ్నిః ద్వేభార్యే విందేత ప్రాక్ సంయోగాత్ మ్రియేత, ఔపాసనం సంపరిస్తీర్యాజ్యం విలాప్యోత్పూయ స్రుచి చతుర్గృహీతం గృహీత్వా సమిద్ధ త్యగ్నౌ జుహోతి, సమితం సంకల్పేథాం, ఇతి మిందాహుతీ వ్యాహృతీశ్చ హుత్వాతమగ్నిం, అయంతేయోనిర్ ఋత్విజ, ఇతి సమిధి సమారోప్య గార్హపత్యే సమిధ మభ్యాదధాతి, భవతంనః సమనసౌ,ఇతి. గార్హపత్య ఆజ్యం విలాప్య (ఉత్పూయస్రుక్ స్రువం నిష్టప్య సమృజ్య) స్రుచి చతుర్ గృహీతం గృహీత్వా గార్హపత్యే జుహోతి, అగ్నావగ్ని శ్చరతిప్రవిష్టః,ఇతి. అపరం చతుర్ గృహీత్వా గార్హపత్య ఏవ, చిత్తిః స్రుక్, ఇతి. అధగార్హపత్యే స్రువాహుతీర్జుహోతి, బ్రాహ్మణ ఏకహోతా ఇతి దశభిః. అథ ప్రాచీనావీతం కృత్వాఽన్వాహార్యపచనే జుహోతి. యే సమానాః యే సజాతాః ఇతి ద్వాభ్యాం అథ (అన్వాహార్య పచనే ఏవ) తత్రైవ స్రువాహుతీర్జుహోతి అగ్నయే కవ్యవాహనాయ స్విష్టకృతే స్వధానమః స్వాహా ఇతి. అథ యజ్ఞోపవీతం కృత్వా ద్వాదశ గృహీతేన స్రువం (చం) పూరయిత్వా పురుష సూక్తే నాహవనీయే జుహోతి. అథస్రువాహుతీర్జుహోతి అగ్నయే వివిచయే స్వాహాఽగ్నయే వ్రతపతయే స్వాహాఽగ్నయే పవమానాయ స్వాహోగ్నయే పావకాయ స్వాహోగ్నయే శుచయే స్వాహాఽగ్నయే పథికృతే స్వాహాఽగ్నయే తంతుమతే స్వాహాఽగ్నయే వైశ్వానరాయ స్వాహా ఇతి. అథ (స్రుచి) చతుర్ గృహీతం జుహోతి, మనోజ్యోతి రిత్యత ఊర్ధ్వం పైతృకం కర్మ ప్రతిపద్యతే, ఇతి.**

అను॥ బౌధాయన సూత్రమందు - ఇక ఆహితాగ్ని ఇద్దరు భార్యలు కలిగి ఉంటే సంయోగము కన్న ముందు మరణిస్తే ఏం చేయాలంటే, ఔపాసనాగ్నిని స్థాపించి నేయిని కదిలించి వేరు పరచి నాలుగు మార్లు స్రుక్కుయందు తీసుకొని జ్వలిస్తున్న అగ్నియందు

హోమం చేయాలి. సమితం సంకల్పేధాం,అని మిందాహుతి, వ్యాహృతులను హోమంచేసి, ఆ అగ్నిని అయంతే యోనిర్ ఋత్విజ, అను మంత్రంతో సమిధల యందు సమారోపం చేసి (ఉంచి), గార్హపత్యాగ్ని యందు సమిధను ఆధానం చేస్తున్నాడు, భవతం నః సమనసౌ, అను మంత్రంతో, గార్హపత్యమందు అగ్నిని కదిలించి, (వేరు పరిచి స్రుక్ స్రువము లుంచి తుడిచి) స్రుక్కు యందు నాలుగు మార్లు తీసుకొని గార్హపత్య మందు హోమం చేస్తున్నాడు. అగ్నావగ్నిశ్చరతి ప్రవిష్టః,అని. మళ్ళీ నాలుగు మార్లు తీసుకొని గార్హపత్యమందే, చిత్తిః స్రుక్, అనుమంత్రంతో హోమం చేస్తున్నాడు. ఇక గార్హపత్యమందు స్రువాహుతులను హోమం చేస్తున్నాడు, బ్రాహ్మణా ఏకహోతా,అని పది మంత్రాలతో ఇక ప్రాచీనావీతి చేసుకొని అన్వాహార్య పచనమును హోమం చేస్తున్నాడు. యేసమానాః, యేసజాతాః, అను రెండు మంత్రాలతో. ఇక (అన్వాహార్య పచనమందే) అక్కడే స్రువాహుతులు చేస్తున్నాడు, అగ్నయే కవ్యవాహనాయ స్విష్టకృతే స్వధానమః స్వాహా,అని. ఇక ఉపవీతియై పన్నెండు సార్లు తీసుకొని స్రువంను (స్రుక్) నింపి పురుష సూక్తంతో ఆహవనీయమందు హోమం చేస్తున్నాడు. ఇక స్రువాహుతులు హోమం చేస్తున్నాడు, అగ్నయే వివిచయే స్వాహా, అగ్నమే వ్రతపతయే స్వాహా అగ్నయే పవమానాయ స్వాహా, అగ్నయే పావకాయ స్వాహా, అగ్నయే శుచయే స్వాహా అగ్నయే పథికృతే స్వాహా అగ్నయే తంతు మతే స్వాహా అగ్నయే వైశ్వానరాయ స్వాహా అని ఇక స్రుక్కు యందు నాల్గుసార్లు తీసుకొని హోమం చేయాలి మనోజ్యోతి రను మంత్రంతో ఆ పిదప పై తృకకర్మ సిద్ధమౌతుంది,అని.

మూ॥ **ఆహితాగ్నౌ విదేశమృతే** పథికృతీష్టిర్ మృతాగ్ని హోత్రం తద్దాహః పాత్రయోజనశ్చ కల్ప సూత్రాదిభ్యోఽస్మత్పితామహ కృతపద్ధతేశ్చ జ్ఞేయమితి బహువక్తవ్యేఽ ప్యుపరమ్యతే. **స్మార్తాగ్నే స్తూకం మదనరత్నే** ఛందోగ పరిశిష్టేచ – దుర్బలం స్థాపయిత్వాతు శుద్ధ చైలాభి సంవృతం, దక్షిణా శిర సంభూమౌ బర్హిష్మత్యాం నివేషయేత్. ఘృతేనాభ్యక్త మాప్లావ్య శుద్ధవస్త్రోపవీతినం, చందనోక్షిత సర్వాంగం సుమనోభిర్విభూషయేత్. హిరణ్య శకలాన్యస్య క్షిప్త్వాఛిద్రేషు సప్తసు, ముఖేష్వధాపిధాయైనం నిర్హరేయుః సుతాదయః. ఆమ పాత్రేన్న మాదాయ ప్రేత మగ్నిపురః సరం, ఏకోఽను గచ్ఛేత్త స్యార్థ మర్ధపథ్యుత్సృజేద్భువి. ఊర్ధ్వ మాదహనం కార్యం ఆసీనో దక్షిణాముఖః, సవ్యం జాన్వాచ్యశనకైః సతిలంపిండ దానవత్. అథపుత్రాదిరా ప్లుత్యచరేద్దారు చయంమహత్, తత్రోత్తానం నిపాత్యైనం దక్షిణా శిరసం ముఖే. ఆజ్యపూర్వం స్రువం దద్యాత్ దక్షిణాగ్రాం నసిస్రుచం, పాదయోరధరాం ప్రాచీమరణీ మురసీతరాం, పార్శ్వయోః శూర్ప చమసౌ సవ్య దక్షిణయోః క్రమాత్, సుసమేతు న్యసే న్న్యుబ్జ మంతరూర్వోరు లూఖలం. చాత్రోవిలీధమత్రైవ అనగ్నేరప్యయం విధిః. అపసవ్యేన కృత్వైత ద్వాగ్యతః పితృదిఙ్ముఖః అథాగ్నిం సవ్యమావృత్కో దద్యాద్దక్షిణతః శనైః అస్మాత్త్వ మధిజాతోఽసి త్వదయం జాయతాం పునః, అసౌస్వర్గాయలోకాయ స్వాహే,తి పరికీర్తయన్.

అను॥ ఆహితాగ్ని విదేశమందు మరణిస్తే పధికృతీష్టి, మృతాగ్ని హోత్రము, ఆతని దాహము, పాత్రయోజన, కల్ప సూత్రాదుల నుండి ఇవన్నీ మాపితామహులు చేసిన పద్ధతి నుండి తెలుసుకోవాలి,అని. చాలా చెప్పాల్సి ఉంది ఐనా విరమిస్తున్నాము. స్మార్తాగ్నికైతే (తోదాహం) మదనరత్న మందు, ఛందోగ పరిశిష్టమందును ఇట్లా - దుర్బలునికి (మరణం ఆసన్నమైందనిపిస్తే) స్నానం చేయించి, శుద్ధమైన వస్త్రాన్ని కప్పి, దక్షిణ దిక్కుగా తలపెట్టి భూమిపై కుశలపై ఉంచాలి,అని. నేయిని శరీరంపై పూసి స్నానం చేయించి, శుద్ధ వస్త్రము కప్పి, యజ్ఞోపవీతం వేయాలి. ఒంటి నిండా చందనం పూసి (చల్లి) పూలతో అలంకరించాలి. ఈతని ఏడు రంధ్రములందు బంగారు తునకలు ఉంచి, ఇక ముఖాన్ని మూసివేసి ఈతనిని సుతాదులు శ్మశానంకు తీసుకుపోవాలి. ఆమ పాత్రమందు (కాల్చని మట్టిపాత్ర) అన్నము తీసుకొని, ప్రేత అగ్ని ఈ రెండు ముందు వెళ్ళగా ఒకడు వెంట వెళ్ళాలి.ఆ అన్నములో సగభాగమును మార్గ మధ్యంలో భూమిపై వదలాలి. ఆపైన దహన పర్యంతము దక్షిణ ముఖుడై కూర్చొని పిండదానమువలె కుడిమోకాలును వంచి మెల్లమెల్లగా నువ్వులతో చేయాలి. ఇక పుత్రాదులు స్నానం చేసి బాగా కట్టెల కుప్పలను కూర్చాలి. అక్కడ దక్షిణ దిక్కుతలగా ఈశవాన్ని వెల్లకిల ఉంచి ముఖమందు దక్షిణంవైపు అగ్రంకల ఆజ్యపూర్ణంగా ఉన్న స్రువంను ఉంచాలి. స్రుచంను ముక్క యందు ఉంచాలి. పాదముల కింద అధరార్ణిని, ఉరస్సు యందు ఉత్తరార్ణిని ఉంచాలి. పక్క భాగాలందు చాట, చమసము (నాల్గు మూలలు గల యజ్ఞపాత్ర) లుంచాలి. ఎడమవైపు చాట, కుడివైపు చమసము ఉంచాలి. చక్కగా సమంగా ఉన్న ప్రదేశంలో, తొడల మధ్య రోలును తలక్రిందలుగా ఉంచాలి. చాత్ర విలీధము (దంచేదా?) లిక్కడే ఉంచాలి. అనగ్నికి కూడా ఇదే విధి. (మాటలను అదుపులో ఉంచుకొని) మౌనంగా, దక్షిణాభిముఖుడై దీనిని అపసవ్యంగా చేసి ఇక అగ్నిని, ఎడమవైపు తిరిగి, దక్షిణం వైపు నుండి మెల్లగా ఇవ్వాలి. ఇచ్చేప్పుడు ఈతని వల్ల నీవు పుట్టావు. నీ నుండి (అగ్ని) ఈతడు తిరిగి జన్మించని, ఈతడు స్వర్గలోకమునకు వెళ్ళని, స్వాహా అని పఠించాలి. పఠిస్తూ అగ్నితో చితిని ముట్టించాలి.

**మూ॥ తధా** - ఏవమే వాహితాగ్నేశ్చ పాత్రన్యాసాదికం భవేత్. కృష్ణాజినాదికం చాత్ర విశేషోఽధ్వర్యుచోదితః. **తత్రైవ - అనయైవా** వృతానారీ దగ్ధవ్యా యావ్యవస్థితా, అగ్ని ప్రదాన మంత్రోఽస్యాన ప్రయోజ్య ఇతి స్థితిః. ఇదం ఛందోగా నామేవ. పాత్రన్యాసోక్తే రుత్తానదేహత్వం సాగ్నికపరం, నిరగ్నిస్తు పుమానధో ముఖః స్త్రీతూత్తానా దాహ్యా. సగోత్రజైః గృహీత్వాతు చితామారోప్యతే శవః, అధోముఖో దక్షిణ దిక్ చరణస్తుపుమానితి. ఉత్తాన దేహా నారీతు సపిండైరపి బంధుభిః, ఇత్యాది పురాణాదితి శుద్ధి తత్వ హారలతాదయః. ఉత్తర శిరస్త్వం సామగేతర పరం. **వారాహేత్వగ్నిదానేఽన్యో మంత్రః** - కృత్వాతు దుష్కృతం కర్మ జానతావాప్య జానతా, మృత్యుకాల వశం ప్రాప్యనరం పంచత్వమాగతం. ధర్మాధర్మ సమాయుక్తం లోభమోహ సమావృతం

దహేయం సర్వగాత్రాణి దివ్యాన్ లోకాన్ సగచ్ఛతు. జ్వలమానం మహావహ్నిం శిరః స్థానే ప్రదాపయేత్, చతుర్వర్ణేషు సంస్థానమేవం భవతి పుత్రకే. **అత్రక్రియా నిబంధే** గారుడే షట్ పిండదాన ముక్తం - మృతస్యోత్క్రాంతి సమయే షట్ పిండాన్క్రమశోదదేత్, మృతిస్థానే తథాద్వారి చత్వరేతార్ క్ష్యకారణాత్. విశ్రామే కాష్ఠచయనే తథా సంచయనే చషట్ తథా - ఆదౌదేయాతు షట్ పిండా దశదేయా దశాహికాః, స్థానేచార్ధపదేఖ_తీ తే చితాయాం శవహస్తకే. శ్మశాన వాసి భూతేభ్యః షష్ఠం సంచయనే తథా. **తతః - త్వం భూతకృ**జ్జగద్యోనే త్వంలోక పరిపాలకః, **ఉక్తః** సంహారకస్త స్మాదేనం స్వర్గం మృతంనయ. ఇత్యగ్నిం దత్వా అస్మాత్త్వమితి మంత్రేణార్ధ దగ్ధే **ఆజ్యాహుతిరుక్తా. ఆహితాగ్నౌ పరాశరః** - శమ్యాం శిశ్నే వినిక్షిప్య అరణీముష్కయోరపి, **జుహూం చ దక్షిణే హస్తే వామేతూ పభృతం న్యసేత్.ఓష్ఠే తూ లూఖలం దద్యాత్ పృష్ఠే చముసలం న్యసేత్, ఉరసిక్షిప్య దృషదం తండులాజ్యతిలాన్ముఖే. శ్రోత్రే చ ప్రోక్షణీం దద్యాత్ ఆద్య స్థాలీంచ చక్షుషోః.** కర్ణే నేత్రే ముఖే ఘ్రాణే హిరణ్య శకలం న్యసేత్. అగ్నిహోత్రోపకరణ మశేషం తత్ర **నిక్షిపేత్.**

అను॥ అట్లాగే - ఆహితాగ్నికి కూడా ఇట్లాగే పాత్ర న్యాసాదిక ముండాలి. అధ్వర్యువు చెప్పిన విశేషము ఇక్కడ కృష్ణాజినాదికము ఉండాలి, అన్నది. అక్కడే - వ్యవస్థితంగా ఉన్న స్త్రీ నిగూడా (శుద్ధ ఆచరణంగల) ఇదే పద్ధతిలో దహనం చేయాలి,అగ్ని ప్రదాన మంత్రము ఈమెకు ప్రయోగించరాదు అని. నిర్ణయము. ఇది ఛందోగులకే. పాత్రన్యాసం చెప్పినందువల్ల ఉత్తాన దేహం (వెల్లికిల) అనేది సాగ్నికులకు చెందినది. నిరగ్నికైతే పురుషుడైతే అధోముఖము, స్త్రీ ఐతే వెల్లికిలగా దహించాలి. సగోత్రజులు శవాన్ని తీసుకుపోయి చితియందుంచాలి. అధోముఖుడు, దక్షిణంవైపు పాదములు కలవానిగా పురుషుని ఉంచాలి. స్త్రీని ఐతే వెల్లికిలగా శరీరాన్ని ఉంచి సపిండులు, బాంధవులు కూడా,అని ఆదిత్య పురాణం నుండి, అని శుద్ధితత్వహారలతాదులన్నారు. ఉత్తరం వైపు శిరమనేది సామవేదులకన్న ఇతరులైన వారి విషయము. వారాహా మందైతే అగ్నిదానమందు మరో మంత్రము ఇట్లా - తెలిసో, తెలియకో దుష్కృత కర్మను చేసి, మృత్యు కాలాధీనుడై నరుడు మరణిస్తే ఆతనిని ధర్మాధర్మములతో కూడిన వానిని లోభ మోహములతో నిండిన వానిని ఆతని సర్వశరీరమును కాలుస్తున్నాను. ఆతడు దివ్యలోకములకు వెళ్ళనీ, అని చదవాలి. మండుతున్న అగ్నిని శిరః స్థానమందుంచాలి. పుత్రులుండగా (ఉంటే) నాలుగు వర్ణములందు ఇట్లాగే విధాయకమౌతుంది,అని. ఇక్కడ క్రియా నిబంధమందు, గారుడ మందలి షట్ పిండదానము చెప్పబడింది ఇట్లా - మృతుని తీసుకు పోయేప్పుడు ఆరు పిండములను క్రమంగా ఇవ్వాలి. కారణమైనందువల్ల మృతిస్థానమందు, ద్వారమందు నాల్గు దారుల కూడలి యందు, మధ్యదారిలో విశ్రామ మందు, చితి స్థానమందు, అట్లాగే అస్థి సంచయన మందు,అని ఆరు స్థానాలు ఓతార్క్ష్య! అని (శవ - పాంథ (వాస్తు దేవతకై)-ఖేచర

(భూత)-భూత(పిశాచ)-సాధక(మోక్ష)- అస్థి (ప్రేత) అట్లాగే - తొలుత ఆరు పిండము లివ్వాలి. పదిరోజులు పది పిండములివ్వాలి. మరణ స్థానమందు, సగం దారి గడిచాక, చితియందు, శవం చేతియందు, శ్మశాన మందలి భూతములకు, ఆరవది సంచయనమందు అట్లా,అని. ఆ పిదప - నీవు భూత సృష్టి కర్తవు, సంసార కారణమువు ఐన ఓ అగ్ని! నీవు లోక పరిపాలకుడవు, సంహారకుడవు,అని అన్నారు. అందువల్ల ఈ మరణించిన వానిని స్వర్గానికి తీసుకెళ్ళు, అని అగ్నిపెట్టి, అస్మాత్త్వం అనే మంత్రంతో, శవం సగం కాలాక ఆజ్యాహుతు లివ్వాలని చెప్పారు. ఆహితాగ్ని విషయంలో పరాశరుడిట్లా - శమ్య పాత్రను శిశ్నమందు , అరణి వృషణములందు, జుహూ పాత్రను కుడిచేతియందు, ఉపభృత పాత్రను ఎడమ చేతియందు, పెదవి యందు రోలు, వీపుయందు రోకలి, రొమ్ముపై శిలను ఉంచి, తండుల, ఆజ్యతిలలను ముఖ మందుంచి, శ్రోత్రమందు ప్రోక్షణి పాత్రను, కళ్ళపై ఆజ్యస్థాలిని ఉంచాలి. కర్ణములు, నేత్రములు, నాసిక, ముఖము వీని యందు బంగారు తునక లుంచాలి. అగ్నిహోత్ర ఉపకరణములన్ని అక్కడ పెట్టాలి, అని.

మూ॥ **ప్రచేతాః - స్నానం** ప్రేతస్య పుత్రాద్యైః వస్త్రాద్యైః పూజనం తతః, నగ్నదేహం దహేన్నైవ కించిద్దేయం పరిత్యజేత్. యమః - ప్రేతం దహేచ్ఛు భైర్గంధైః స్నాపితం స్రగ్విభూషితం. **ఆశ్వలాయనసూత్రే** - సంస్థితే (తీర్థేన నిర్హృత్యావ భృతే) ప్రేతాఽలంకారాన్ కుర్వంతి కేశ శ్మశ్రులోమనఖాని వాపయంతి నలదేనాను లింపంతి నలదమాలాం ప్రతి ముంచంతి ఇతి **మాధవీయే బ్రాహ్మే** - దరిద్రోఽపి నదగ్ధవ్యో నగ్నః కస్యాంచి దాపది. **తథా - నిఃశేషస్తు** న దగ్ధవ్యః శేషం కించిత్ త్యజేన్నరః. **దాహకాలేఽగ్ని నాశేతు** మదనరత్నే యజ్ఞపార్శ్వః - యజమానో మృతః క్వాపిచితాదౌవా ప్రవేశితః, వర్షాద్యభిహతేఽగ్నౌతు కథం ప్రేత వికల్పనా. శేషం దగ్ధ్వా ప్రదగ్ధేషు నిర్మంథ్యైవతు కారయేత్. (క్రియా నిబంధే - ఉదధారామవిచ్ఛిన్నాం సించేత్కర్తా ప్రదక్షిణం, స్కంధావ సిక్త కుంభేన పాదతః పరితశ్చితేః) **అథపర్ణశరాది దాహేనాగ్ని** నాశే పశ్చాత్తద్దేహ లాభే మదనరత్నే బ్రాహ్మే - అథపర్ణ శరేదగ్ధే పాత్రన్యాసే కృతేసతి, గతేష్వగ్నిషు తద్దేహో యద్యూర్ధ్వం లభతే క్వచిత్, తదాఽర్థ దగ్ధ కాష్ఠాని తాని నిర్మథ్య తందహేత్. యదర్ధ దగ్ధకాష్ఠంతు తదీయం వైనలభ్యతే. తదా తదస్థి ఖండంతు నిఃక్షిప్తవ్యం మహాజలే. **దంపత్యోరేకదామృతౌ** విశేష మాహ ఆపస్తంబః - తథైవ ప్రేతే సహైవ పితృమేధో ద్వివచన లింగాన్ మంత్రాన్ సంధారయతి. పితృమేధో దాహాంతం కర్మ, దాహాంతమేక తంత్రత్వం, ఇతి బౌధాయనోక్తేః అస్థి సంచయన మప్యేకం. ఉదక పిండదానాది పృథగేవ. సహగమనేఽప్యేవం. తదాహ మదనరత్నే భాష్యార్థ సంగ్రహకారః - ఏకకాల మృతౌ భార్యా భర్తా చయదిచేత్ ద్వయోః, తంత్రేణ దహనం కుర్యాత్ పిండ శ్రాద్ధం పృథక్ పృథక్. ఏకకాలే మృతౌజాయాపతీ యది తదాపితుః, విభజ్యాగ్నిం క్రియాం కుర్యాదితి యత్త దసాం ప్రతం.

అను॥ ప్రచేతుడిట్లా - పుత్రాదులు ప్రేతకు స్నానము వస్త్రాదులతో పూజనం చేసి ఆ పిదప దాహం చేయాలి. నగ్నదేహాన్ని దహించరాదు. కొంచం వస్త్రాన్ని ఇచ్చి

వేయాలి, అని యముడిట్లా – ప్రేతకు స్నానం చేయించి, పూలతో అలంకరించి శుభమైన వాసనగల వానితో ప్రేతను దహించాలి అని ఆశ్వలాయన సూత్రమందిట్లా – మరణించాక (మోసుకు పోయి, తీర్థంతో అవభృతం అయ్యాక) ప్రేత అలంకారాన్ని చేస్తున్నారు. కేశ శ్మశ్రు లో మనఖములను కొరిగించా (లోమ= శరీరంపైవి)లి. వట్టివేళ్ళతో అనులేపనం చేయ్యాలి, వట్టి వేళ్ళమాలను వేయాలి,అని మాధవీయమందు బ్రాహ్మోక్తి ఇట్లా – ఎటువంటి ఆపద యందైనా దరిద్రుడు కూడా ప్రేతను నగ్నంగా దహనం చేయరాదు. అట్లాగే – ప్రేతను నిఃశేషంగా దహనం చేయరాదు. నరుడు కొంచెం శేషం వదలాలి. దాహ కాలమందు అగ్ని నాశమైతే మదనరత్న మందు యజ్ఞపార్శ్వుడిట్లా – యజమానుడు మరణిస్తే లేదా ఎక్కడైనా చితి మొదలగు వానిలో ప్రవేశిస్తే, అగ్ని వర్షాదులవల్ల ఆరిపోతే ప్రేతకు చేయడమెట్లా అంటేకాల్చగా (ఘోగా) మిగిలిన దాహాగ్నిని మథనం చేసే చేయాలి, అని. {క్రియా నిబంధమందిట్లా – కర్త ప్రదక్షిణంగా అవిచ్ఛిన్న ఉదకధారను, భుజముపైనున్న సేచన కుంభంతో ప్రేత పాదం నుండి చితి చుట్టుముట్టు విడువాలి, అని.} ఇక పర్ణశరాది ధాహంతో అగ్ని నాశమైతే, పిదప అతని దేహం లభిస్తే మదనరత్నమందు బ్రాహ్మోక్తి ఇట్లా – ఇక పర్ణశరం దగ్ధమై పాత్ర న్యాసం చేశాక, అగ్నులు చల్లారిపోతే అతని దేహం ఆపైన ఒకవేళ లభిస్తే అప్పుడు సగంకాలిన కట్టెలను వానిని మధనంచేసి ఆ ప్రేతను దహించాలి. ఒకవేళ అతని, సగం కాల్చిన కర్ర కూడా లభించకపోతే అప్పుడు అతని అస్థిఖండమును మహాజలమందు వేయాలి, అని. దంపతులు ఒకేసారి మరణిస్తే విశేషం చెప్పాడు ఆపస్తంబుడిట్లా – అప్పుడే కలిసి మరణిస్తే పితృమేధం (దాహాది) చేయాలి, మంత్రములను ద్వివచన లింగములతో చదువాలి. పితృమేధమనగా దాహాంతమైనకర్మ. దాహాంతము ఏకతంత్రంతో, అని బౌధాయనోక్తి. అస్థి సంచయనం కూడా ఒకటే. ఉదకపిండదానాదులు విడివిడిగా సహగమన మందు కూడా ఇట్లాగే, అని. దానిని మదనరత్నమందు భాష్యార్థ సంగ్రహ కారుడిట్లా చెప్పాడు – ఒకవేళ భార్యాభర్తలు ఒకేకాలంలో మరణిస్తే ఇద్దరికి తంత్రగా (ఒకేసారి) దాహం చేయాలి. పిండ శ్రాద్ధము విడివిడిగా చేయాలి,అని. ఒకవేళ దంపతులు ఒకే కాలంలో మరణిస్తే అప్పుడు తండ్రికి అగ్నిని విభజించి క్రియను చేయాలి అనేదేదుందో అది తగదు.

**మూ॥ దాహాంతమేకతం త్రత్వమితి యాజ్ఞిక సమ్మతం, మృతం పతిమనువ్రజ్య యానారీ జ్వలనంగతా. అస్థి సంచయనాంతోఽస్యాభర్తుః సంస్కార ఏవహి. కీకసానాంతు సంస్కారో న్యాయ సిద్ధోఽపి యోమతః. ఏకకాలే మృతేఽప్యేవం కీకసానాం విధిః స్మృతః, నవ శ్రాద్ధం సపిండాంతం భిన్న కాలమృతౌ యథా. కపర్దికారికాపి – మృతే భర్త రితద్దాహాత్ప్రాక్ పత్నీ మ్రియతే యది, పత్న్యాం వా ప్రాక్ ప్రమీతాయాం దాహాదర్వాక్పతి ర్మృతః. తత్ర తంత్రేణ దాహః స్యాన్మంత్రేషు ద్విత్వమూహ్యతే, కీక సానాంతు సంస్కారః పృథగేవతయోర్భవేత్. ఏకాహ**

మృత్యోయుగపన్నవ శ్రాద్ధాది కంతయోః మృతం పతి మను ప్రజ్యపత్నీ చేదనలం గతా. తత్రాపి దాహస్తంత్రేణ పృథగస్థి క్రియా భవేత్. అస్థి సంచయన పృథక్త్వే వికల్పః సహగమనే సర్వత్ర పాకైక్య మాహ ప్రచేతాః - ఏకచిత్యాం సమారూఢౌ మ్రియేతే దంపతీయది, తంత్రేణ శ్రపణం కుర్యాత్ పృథ క్పిండం సమాచరేత్. **అథోదక దానం వసిష్ఠః** - శరీరమగ్నౌ సంయోజ్యాన పేక్ష్యమాణా అపోభ్యవయంతి సవ్యోత్తరాభ్యాం పాణిభ్యా ముదక క్రియాం కుర్వంత్య యుగ్మామ్. ఆపస్తంబః - మాతుశ్చయోని సంబంధేభ్యః పితుశ్చా సప్తమా త్పురుషా ద్యావతాం వాసంబంధోజ్ఞాయతే తేషాం ప్రేతే దూషక క్రియా, ఇతి. యాజ్ఞవల్క్యః - సప్తమాద్దశ మాద్వాపి జ్ఞాతయోభ్యుపయంత్యపః, అపనః శోశుచదఘమనేన పితృదిఙ్ముఖాః. సకృత్ప్ర సించన్త్యుదకం నామగోత్రేణ వాగ్యతాః. సప్త మాద్దశమాద్వా దివసాదర్వాగితి విజ్ఞానేశ్వరః. కాతీయాస్తు సప్తమాద్ దశమాద్ వా పురుషాదిత్యాహుః సప్తమాద్దశ మాద్వా పురుషాత్సమాన గ్రామవాసే యావత్సంబంధ మనుస్మరేయుః ఇతి పారస్క రోక్తేః. మంత్ర స్నానాంగమే వేతి హేమాద్రిః. ప్రచేతాః - ప్రేతస్య బాంధవా యథా వృద్ధ ముదక మవతీర్య నోద్వర్షయేయుః ఉదకాంతే ప్రసించేయుః అపసవ్య యజ్ఞోపవీత వాససో దక్షిణ ముఖా బ్రాహ్మణస్యోదఙ్ ముఖాః ప్రాఙ్ ముఖాశ్చ రాజన్య వైశ్యయోః . సఏవ, నదీ కూలం తతో గత్వా, ఇత్యుక్త్వా - సచైలస్తు తతః స్నాత్వా శుచిః ప్రయతమానసః పాషాణం తత్ర ఆదాయ విప్రేదద్యాత్ దశాంజలీన్. ద్వాదశ క్షత్రియే దద్యాద్వైశ్యే పంచదశ స్మృతాః. త్రింశత్ శూద్రాయ దాతవ్యాస్త తస్తు ప్రవిశేద్గృహం. తతః స్నానం పునః కార్యం గృహ శౌచం చ కారయేత్. **ప్రేతస్నానే విశేషః శుద్ధితత్వే ఆదిపురాణే** - ఆదౌ వస్త్రం చ ప్రక్షాల్యతే నైవాచ్ఛాధితస్తతః, కర్తవ్యంతైః సచైలంతు స్నానం సర్వమలాపహం పూర్వం పరిహితం వస్త్రం ప్రక్షాల్యపునః పరిధాయ స్నాయాది త్యర్థః. అపనః, ఇతి మంత్రేణ వామహస్తానామిక యా జలాలోడనం. అవతరణే వృద్ధపురః సరత్వోక్తేః. యథాబాలం పురస్కృత్య ఇతి బౌధాయనీయం జలాదుత్థాన పరమితి హారలతా దయః.

అను॥ దాహాంతము వరకు ఏకతంత్రంగా అని యాజ్ఞికులకు సమ్మతమైనది. చనిపోయిన భర్తననుసరించి ఏ స్త్రీ చితి ప్రవేశించిందో, అస్తి సంచయనాంతము వరకు ఈమె కర్మ భర్త సంస్కారముతోనే. ఆ అస్థి సంస్కారము న్యాయసిద్ధము అంగీకారము కూడా, ఒకేసారి మరణించినా ఇట్లా అస్థిసంచయన విధి చెప్పారు. నవ శ్రాద్ధము సపిండాంతము మాత్రము. భిన్నకాలమందు మరణించిన వారికి వలె చేయాలి. కపర్ది కారిక కూడా - భర్త మరణించాక ఆతని దాహం కన్న ముందు భార్య మరణిస్తే, భార్య మొదలు మరణించి, ఆమె దాహం కన్న ముందు భర్త మరణిస్తే, అక్కడ దాహము తంత్రంగా ఉంటుంది. మంత్రములందు ద్వివచనం చెప్తారు. అస్థి సంస్కారమైతే వారికి విడిగానే ఉంటుంది. ఒకే రోజు మరణిస్తే వారికి నవశ్రాద్ధాదికములు ఒకేసారి ఔతుంది మరణించిన భర్త ననుసరించి భార్య అగ్ని ప్రవేశం చేస్తే, అక్కడ కూడా దాహము తంత్రంగా, అస్థిక్రియ మాత్రం విడిగా ఔతుంది, అస్థి సంచయనము విడిగా అనటంలో వికల్పముంది.

సహగమనమందు అంతటా ప్రచేతుడు పాకైక్యాన్ని చెప్పాడు ఇట్లా – ఒక చితియందు ఆరోహించి దంపతులు మరణిస్తే పాకము తంత్రంగా (ఒకేసారి) చేయాలి. పిండములు విడిగా పెట్టాలి, అని. ఇక ఉదక దానము వసిష్ఠుడిట్లా – శరీరాన్ని అగ్ని యందు కలిపి, చూడకుండా జలమును సమీపించి కుడి ఎడమల చేతులతో అయుగ్మంగా ఉదక క్రియ చేయాలి,అని. ఆపస్తంబుడిట్లా – తల్లి యోని సంబంధులకు తండ్రి వర్గము వారికి ఏడు తరముల వరకు ఎందరి సంబంధము గుర్తుందో వారికి ప్రేత కర్మయందు ఉదక క్రియ అని. యాజ్ఞవల్క్యుడిట్లా – ఏడవది లేదా పదవరోజు కన్నముందు (నుండి) కాని జ్ఞాతులు (సగోత్ర, సపిండ) నీటిని సమీపించి, అపనః శోశుచదఘం, అనే ఈ మంత్రాన్ని చదువుతూ దక్షిణముఖులై మౌనంగా ప్రేత నామ గోత్రములు చెబుతూ ఒకసారి నీటిని వదులుతారు,అని (లేదా) మూడుసార్లు) ఏడు లేదా పదవరోజుల కన్న ముందు అని విజ్ఞానేశ్వరుడన్నాడు. కాతీయులైతే ఏడవ లేదా పదవతరం నుండి అని అన్నారు. ఏడవ లేదా పదవ పురుషుని నుండి ఒకే గ్రామము నందు ఉన్నట్టైతే, ఎంత వరకు సంబంధముందో (జ్ఞాపకం) అంతా స్మరించాలి,అని పారస్కరోక్తి. మంత్ర స్నానాంగమే అని హేమాద్రి. ప్రచేతుడిట్లా – ప్రేతయొక్క బంధువులు వృద్ధుల నుండి ఆరంభమై (పిల్లల వరకు అని క్రమం) నీటియందు దిగి స్నానం చేయాలి (నీటిని వర్షించు కోరాదు, చల్లుకోవాలి నీటి సమీపం చేరి) యజ్ఞోపవీతము, వస్త్రములను అపసవ్యం చేసుకొని, దక్షిణ ముఖులై శూద్రునకు, బ్రాహ్మణునకు ఉత్తరముఖంగా, క్షత్రియ వైశ్యులకు తూర్పుముఖంగా ఉదకదానం చేయాలి,అని. ఆతడే ఆ పిదప నదీకూలమునకు వెళ్ళి, అని చెప్పి సచేల స్నానం చేసి సావధానుడై ఆపిదప మనః శుచియై అక్కడ నుండి రాతిని తీసికొని దానిపై విప్రునికై పది అంజలులను, పన్నెండు అంజలులను క్షత్రియునకై వైశ్యునికై పదిహేను అంజలులను శూద్రునకు ముప్పది అంజలులను ఇవ్వాలి. ఆ పిదప గృహమునకు చేరాలి. ఆ పిదప తిరిగి స్నానం చేయాలి. గృహ శౌచము చేయాలి,అని. ప్రేత స్నానమందు విశేషము. శుద్ధితత్వమందు ఆదిత్యపురాణోక్తి ఇట్లా – తొలుత వస్త్రమును పిండి ఆ పిదప ఆ వస్త్రాన్నే కప్పుకొని వారు సర్వమలములను తొలగించే సచేల స్నానమును చేయాలి. ముందు ధరించిన వస్త్రాన్ని ఉతికి తిరిగి ధరించి స్నానం చేయాలి అని అర్థము. అపనః, అను మంత్రంతో ఎడమచేయి అనామికతో నీటిని కదిలించాలి. దిగేప్పుడు నీటిలో పెద్దలు మొదలుగా దిగాలని చెప్పారు. బాలుడు మొదలుగా అని చెప్పిన బౌధాయనీయోక్తి నీటినుండి పైకి వచ్చేటప్పుడు, అని హారలతాదులన్నాయి.

**మూ॥ ఆశ్వలాయనః –సవ్యావృతో వ్రజం త్యనవేక్షమాణాః, యత్రోదక మవహద్భవతి తత్రాప్య సకృదున్మజ్య ఏకాము దకాంజలి ముత్సృజ్య తస్యగోత్రం నామ గృహీత్వా, ఇతి. ప్రచేతసాఽ న్యహ మంజలి త్రయమ ప్యుక్తం తత్ర, త్రిః ప్రసేకం కుర్యుః ప్రేతస్పృష్యతు ఇతి. తథా – దినే దినేంజలీన్ పూర్ణాన్ ప్రదద్యాత్రేత కారణాత్. తావద్వృద్ధిశ్చ కర్తవ్యాయావత్పిండం సమాప్యతే.**

ఏకవృద్ధిః త్రికవృద్ధిర్వేత్యర్థః. మదనరత్నే భారద్వాజ గృహ్యేతు ద్విక వృద్ధిరప్యుక్తా. ఆశౌచాంతే ప్రదద్యాత్తు ప్రేత పుత్రస్తిలాంజలీన్. ప్రథమేఽహ్ని సకృద్దద్యాత్ పిండ యజ్ఞావృతాదివా. త్రీంశ్చ దద్యాత్ ద్వితీయేఽహ్ని తృతీయే పంచ ఏవచ. చతుర్థే సప్త సంఖ్యాస్తు పంచమే నవచోత్సృజేత్. షష్ఠేఽహ్ని చైకాదశకాః సప్తమేతు త్రయోదశ అష్టమే పంచదశకో నవమే దశ సప్తచ, ఏకోన వింశతించాగ్రే శతాంజలి మతం స్మృతం. కేచిద్దశాంజలీన్ ప్రోచుః కేచిదాహుః శతాంజలీన్ పంచ పంచాశతం చాన్యే స్వశాఖోక్త వ్యవస్థయా. ఛందోగ పరిశిష్టే - అథానవేక్షయంత్యాపః (యేత్వాపః) సర్వేచైవ శవస్పృశః, గోత్ర నామ పదాంతేతు తర్పయామీ త్యనంతరం, దక్షిణాగ్రాన్ కుశాన్ కృత్వా సతిలంతు పృథక్ పృథక్. విష్ణుపురాణే - సపిండీకరణం యావత్ ఋజుదర్భైః పితృక్రియా, సపిండీకరణాదూర్ధ్వం ద్విగుణం విధి వద్భవేత్. రామాయణే - ఇదం పురుష శార్దూల విమలం దివ్యమక్షయం, పితృలోకేషు పానీయం మద్దత్తముప తిష్ఠతాం. దానవాక్యే వికల్పః. యాజ్ఞవల్క్యః - కామోదకం సఖిప్రత్తా స్వస్రీయశ్వశురర్త్విజాం, కామ - ఇచ్ఛా. ప్రేత తృప్తీచ్ఛాయాం దేయ మన్యథానేత్యర్థః. శంఖ పారస్కరౌ - ఆచార్యే చైవం మాతామహ యోశ్చ స్త్రీణాం చా ప్రత్తానాం కుర్వీరం స్తాశ్చతేషాం, ఇతి. ద్వివచనాన్మాతా మహ్యాఅపి. శంఖలిఖితౌ - ఉదకక్రియా కామం శ్వశుర మాతులయోః శిష్యే సహాధ్యాయిని రాజనిచ, ఇతి. వృద్ధమనుః - క్లీబాద్యా నోదకం కుర్యుః తేనాప్రాత్యా విధర్మిణః, గర్భ భర్తృద్రుహశ్చైవ సురాప్యశ్చైవ యోషితః. యాజవల్క్యః - నబ్రహ్మచారిణః కుర్యుః ఉదకం పతితాస్తథా. షడశీతౌ - స్వీయాచారా దపి భ్రష్టాః పతితాశ్చైవ దూషితాః నకుర్యురుదకంతే వైతేభ్యోప్యన్యేన చైవహి. మదనరత్నే హారీతః - పతితానామపవి (అవృ)ద్ధానాం చరంతీనాంచ కామతః, ప్రత్తానాం చైవకన్యానాం నిర్వర్త్యా సలిల క్రియా అపరార్కే శంఖలిఖితౌ - అపపాత్రితస్యరిక్థ పిండోదకానివ్యా వర్తంతే. అపపాత్రితః - కృతఘటస్ఫోటః తస్యాపి సంగ్రహ విధౌ కృతే ఆశౌచోదకాది కుర్యాదేవేత్యా శౌచ ప్రకాశః. **అథాశౌచేనియమాః** - యాజ్ఞవల్క్యః - ఇతి సంశ్రుత్యగచ్ఛేయుః గృహం బాలపురః సరాః, విదశ్య నింబపత్రాణి నియతా ద్వారివేశ్మనః, ఆచమ్యాగ్న్యాది సలిలంగోమయం గౌరసర్షపాన్, ప్రవిశేయుః సమాలభ్య కృత్వాఽశ్మని పదం శనైః.

అను॥ ఆశ్వలాయనుడిట్లు - సవ్యంగా తిరిగి (సంస్కారం తర్వాత చితికి అప్రదక్షిణ ప్రదక్షిణంచేసి) శవంను చూడకుండా వెళ్ళాలి. నీరు ప్రవహించకుండా నిలకడగా ఉన్నచోటికి (చెరువు అట్లా) వెళ్ళి ఒకసారి మునిగి స్నానం చేసి, ప్రేత గోత్ర నామములను చెప్తూ ఒక జలాంజలిని వదలాలి,అని. ప్రచేతసుడు ప్రతిరోజు మూడు జలాంజలులను వదలాలని కూడా చెప్పాడు. అక్కడ - ప్రేతతృప్తి చెందని అని మూడుమార్లు నీరు వదలాలి,అని. అట్లాగే - ప్రేత కొరకు ప్రతిరోజు జలపూర్ణముగా అంజలులను ఇవ్వాలి. పిండ సమాప్తి వరకు వీని వృద్ధిని కూడా చేయాలి,అని. ఒకటి చొప్పున గాని మూడింతల చొప్పున గాని వృద్ధి అని అర్థం. మదనరత్నమందు భారద్వాజ గృహ్యాసూత్రమందును రెట్టింపు కూడా అభివృద్ధి చెప్పబడింది. ప్రేత యొక్క పుత్రుడు ఆశౌచాంతమందు తిలాంజలులను ఇవ్వాలి,

మొదటిరోజు పిండ యజ్ఞము ప్రక్రియతో పగలు ఒకసారి తిలాంజలి ఇవ్వాలి. రెండవ రోజు మూడుసార్లు ఇవ్వాలి. మూడవరోజు ఐదుసార్లు ఇవ్వాలి నాల్గవరోజు ఏడుసార్లు, ఐదవరోజు తొమ్మిది సార్లు ఆరవరోజు పదకొండుసార్లు ఏడవరోజు పదమూడుసార్లు, ఎనిమిదవరోజు పదిహేను సార్లు, తొమ్మిదవరోజు పదిహేడుసార్లు, ఆపైన పందొమ్మిదిసార్లు పదిన, ఆపైన నూరుసార్లు ఇవ్వాలన్నారు. కొందరు పది అంజలులు అని అన్నారు కొందరు నూరు అంజలులు చెప్పారు. కొందరు ఏబది ఐదు అంజలులన్నారు. తమ శాఖ యందు చెప్పిన విధంగా చేయటం నిర్ణయము. ఛందోగ పరిశిష్టమందిట్లా – ఆపిదప శవమును ముట్టుకున్న వారంతా శవాన్ని చూడకుండా, గోత్రనామ పదం చివర తర్పయామి అని చెప్పి పిదప కుశలను దక్షిణాగ్రంగా చేసి నువ్వులతో విడివిడిగా జలదానం చేయాలి,అని. విష్ణుపురాణ మందిట్లా – సపిండీకరణం వరకు ఋజుదర్భలతో పితృక్రియ చేయాలి, సపిండీకరణం తరువాత రెట్టింపు దర్భలతో శాస్త్రం ప్రకారం చేయాలి,అని. రామాయణమందిట్లా – ఓ పురుష శార్దూల ! ఈ విమలమైన దివ్యమైన అక్షయమైన పానీయమునునే నిచ్చే దానిని పితృలోకములందు ప్రాప్తం కానీ (పొందండి),అని. దాన వాక్యమందు వికల్పము. (ప్రేతస్తృప్యతు, అముష్మైస్వధా, అసౌఏతత్తే ఉదకం, అసౌతృప్యతాం గోత్రనా మాంతే తర్పయామి ఇట్లా). యాజ్ఞవల్క్యుడిట్లా – స్నేహితుడు, వివాహిత కన్య లేదా చెల్లెలు, మేనల్లుడు, మామ, ఋత్విక్ వీరికై ఉదకదానము ఇష్టముంటే ప్రేతకు తృప్తి కలగాలనిపిస్తే ఇవ్వొచ్చు,అని. కామ మనగా ఇచ్ఛ. ప్రేత తృప్తి కలగాలనుకుంటే ఇవ్వాలి లేదా అవసరంలేదు అని అర్థం. శంఖ పారస్కరులిట్లా – ఆచార్యునకు, మాతామహులకు, అవివాహిత స్త్రీలకు జలదాన మివ్వాలి వారు కూడా వారికివ్వాలి,అని. ద్వివచనం వల్ల మాతామహికి కూడా,అని. శంఖలిఖితులిట్లా – శ్వశురుడు, మాతులుడు, శిష్యుడు, సహాధ్యాయి, రాజు వీరికి ఉదక క్రియ చేయటము ఇచ్ఛానుసారము, అని. వృద్ధమనువిట్లా – క్లీబాదులు, సువర్ణహార్యాదిచోరులు, ఉపనయనం కానివారు, ఇతర ధర్మాన్ని అనుసరించినవారు, గర్భపాతం (చేసుకునే కన్యలు పుత్రుడు కూడా) తో భర్తకు ద్రోహం చేసే స్త్రీలు, సురపానం చేసే స్త్రీలు వీరంతా ఉదకదానము చేయరాదు,అని. యాజ్ఞవల్క్యుడిట్లా – బ్రహ్మచారులు, పతితులు ఉదకదానం చేయరాదు,అని. షడశీతియందిట్లా – తమ ఆచారము నుండి భ్రష్టమైనవాళ్ళు, పతితులు, దూషితులు వీరు ఉదకదానం చేయరాదు. వారికి కూడా ఇతరులివ్వరాదు,అని. మదనరత్నమందు హారీతుడిట్లా – పతితులకు, తల్లిదండ్రులతో విడువబడ్డవారికి (వృద్ధులు కాకుండానే) ఇష్టానుసారం తిరిగే వారికి, ఇట్టి వివాహితలైనకాని కన్యలకు (చెల్లెళ్ళు) సలిల క్రియను నిర్వర్తించరాదు,అని. (స్త్రీల పరమీవాక్యాలు). అపరార్కమందు శంఖలిఖితులిట్లా – అప పాత్రితునకు ధనము పిండోదకాలు లేవు,అని. అపపాత్రితుడనగా ఘటస్ఫోటమైనవాడు. వానికి కూడా సంగ్రహ

విధి చేస్తే ఆశౌచ ఉదకాదులు చేయాల్సిందేనని ఆశౌచ ప్రకాశము చెప్పింది. ఇక ఆశౌచమందు నియమాలు. యాజ్ఞవల్క్యుడిట్లా - అని (పెద్దల మాటలు) బాగా విని చిన్నలు మొదలు (ముందు)కొని అంతా ఇంటికి వెళ్ళాలి. వెళ్ళి గృహ ద్వార మందు సంయత మనస్కులై నిలబడి వేపాకులను కొరికి (ఉమిసి) ఆచమనం చేసి, అగ్న్యాదులు జలము, గోమయము, తెల్ల ఆవాలు వీనిని స్పృశించి (ఆది దూర్వాంకురం, ఎద్దు), రాయిపై పాదముంచి మెల్లమెల్లగా గృహమందు ప్రవేశించాలి,అని.

**మూ॥ ప్రవేశనాదికం కర్మ ప్రేత సంస్పర్శినామపి, క్రీతలబ్ధాశనా భూమౌ స్వపేయుస్తే పృథక్క్షితౌ. ఇదం చాద్యేహ్ని. వసిష్ఠః - అధః ప్రస్తరేత్ర్యహ మనశ్నంత ఆసీరన్ క్రీతోత్పన్నేన వావర్తేరన్. శుద్ధితత్వే - బైజవాపః - శమీ మాలభంతే శమీపాపం శమయత్వితి. అశ్మాన మాలభంతే అశ్మే వస్థిరోభూయా సమితి. అగ్నిమగ్నిర్నః శర్మయచ్ఛత్వితి. హోృగిత్యంతరా గామ జమువస్పృశంతః క్రీత్వాలబ్ధ్వా వా ప్రాప్య గృహ(త్) మేకాన్న మలవణమేక రాత్రం దివాభోక్తవ్యంత్రిరాత్రం కర్మోపరమణం, క్రీతాద్యశనముప వాసాశక్తస్య. ఆశ్వలాయనస్తు - నైతస్యాం రాత్ర్యమన్నం పచేరన్. క్రీతోత్పన్నేనవా వర్తేరన్. త్రిరాత్ర మక్షార లవణాశినః స్యుః, ద్వాదశ రాత్రంవా, ఇత్యాహ. అశక్తౌరత్నాకరే ఆపస్తంబః - భార్యా పరమ గురు సంస్థాయాం చాకాల భోజనాని కుర్వీరన్ యదా మృతిః, పరదినే తావత్కాల మిత్యర్థః. బృహస్పతిః - అధః, శయ్యాసనా దీనా మలినా భోగవర్జితాః, అక్షార లవణాన్నాః స్యుః లబ్ధ క్రీతాశనాస్తథా. భోగోఽభ్యంగతాం బూలాదిః క్షారాః పరిభాషాయా ముక్తాః. యత్తు మార్కండేయపురాణే - తైలాభ్యం గోబాంధవానామం గసంవాహనం చయత్. తేన చాప్యాయతే జంతుః యచ్చాశ్నంతి సబాంధవాః ప్రథమేఽహ్ని తృతీయే చ సప్తమే నవమే తథా, వస్త్ర త్యాగం బహిః స్నానం కృత్వా దద్యాత్తిలోదకం, ఇతి. తదంత్యదినపరం. ఆశౌచాంతే తిలకల్కైః స్నాత్వా గృహం ప్రవిశేయుః, ఇతి విష్ణూక్తేః. విష్ణుపురాణే త్వస్థి సంచయోర్ధ్వం భోగోఽప్యుక్తః - శయ్యాసనోపభోగస్తు సపిండానామ పీష్యతే. అస్థి సంచయనాదూర్ధ్వం సంయోగస్తు నయోషితాం. భారతే - తిలాన్ దదతు పానీయం దీపందదతు జాగ్రతు, జ్ఞాతిభి స్సహ భోక్తవ్యం ఏతత్ప్రేతేషు దర్లభం. మనుః - మాంసాశనం చనాశ్నీయుః శయీరంశ్చ పృథక్క్షితౌ.**

అను॥ ప్రవేశనాదులందలి కర్మ ప్రేతను స్పృశించిన వారందరికి గూడా, వస్తువులు కొని వండుకుతిని, (అయాచితంతిని) వారు భూమిపై పడుకోవాలి, విడిగా భూమి యందు, అని. ఇది తొలిరోజు. వసిష్ఠుడిట్లా - కింద రాయిమీద మూడురోజులు, ఉపవాసంగా ఉండాలి. కొన్నదానిపైననో, వారి కోసమే చేసిన దానిపైననో పరుండాలి,అని. శుద్ధితత్వ మందిట్లా - బైజవాపుడు - శమీ, పాపమును శమింప చేయని అని శమిని స్పృశిస్తారు. రాతిని స్పృశిస్తారు, రాయివలె స్థిరంగా ఉండాలి,అని. అగ్నిని ముద్దారు, అగ్ని మాకు సుఖాన్ని ఇవ్వనీ అని. హోృగితి, అనే మంత్రాన్ని అప్పుడప్పుడు చదువుతూ గోవును మేకను

స్పృశించాలి. ఇతరుల గృహం నుండి కొని కాని అయాచితంగా కాని పొందిన, ఉప్పులేని ఒక్క అన్నాన్ని (జలం) రోజుకు ఒక రాత్రిపూటే తినాలి. మూడు రోజులు కర్మలు ఏవి లేవు. కొని తినటం అనేది ఉపవాసం ఉండే శక్తిలేని వానికి, అని. ఆశ్వలాయనులైతే – ఆ రాత్రి అన్నం వండరాదు లేదా కొన్న (వండిన) దానితో ఉండాలి. మూడు రాత్రులు క్షారం లవణం లేకుండా భుజిస్తూ ఉండాలి, పన్నెండు రాత్రులు కాని, అని అన్నారు. అశక్తి యందు రత్నాకరమందు ఆపస్తంబోక్తి – భార్య, పరమగురువు మరణిస్తే అకాల భోజనములు చేయాలి,అని. మృతి చెందితే, పరదినమందు అంతవరకు అని అర్థము. బృహస్పతి ఇట్లా – క్రింద భూమిపై శయ్య, కూర్చోవటము, దీనంగా ఉండటం (హర్షంలేక) మలినంగా (వస్త్ర క్షాలనాది) భోగవర్జితులుగా ఉండటం, క్షార లవణములులేని అన్నం తినటం, చేయాలి. అన్నము లబ్ధమోక్రీతమో కావాలి ఇట్లా ఉండాలి,అని. భోగమనగా అభ్యంగ, తాంబూల, మాల, చందనాదులు, క్షారములను పరి భాషయందు చెప్పాము. మార్కండేయ పురాణ మందిట్లా – తైలాభ్యంగము, బాంధవులకు అంగ సంవాహనము, బాంధవులు భుజించటం, వీనితో ప్రేత తృప్తి నందుతాడు,అని. తొలిరోజు, మూడవ, ఏడవ, తొమ్మిదవ రోజులందు వస్త్రం త్యాగంచేసి, బయట స్నానం చేసి తిలోదక మివ్వాలి, అని ఏది చెప్పారో, అది అంత్యదిన పరమైనది. ఆశౌచాంత మందు నువ్వుల పిండితో (మడ్డి) స్నానం చేసి ఇంట్లోకి రావాలి,అని విష్ణూక్తి. విష్ణుపురాణ మందైతే అస్థి సంచయనంపైన భోగం కూడా చెప్పబడింది – అస్థి సంచయనం తరువాత శయ్య, ఆసనముల ఉపభోగము సపిండులకు కూడా చెప్పారు. స్త్రీలకు సంయోగం మాత్రం తగదు, అని. భారతమందిట్లా – నువ్వులివ్వండి, నీళ్ళివ్వండి. దీపం పెట్టండి, మెలకువగా ఉండండి. జ్ఞాతులతో కలిసి భుజించండి. ఇది ప్రేతలయందు దుర్లభము, అని. మనువిట్లా – మాంసము భుజించరాదు. విడిగా భూమిపై పడుకోవాలి,అని.

**మూ॥ దేవజానీయే కారికాయాం – లవణ క్షీర మాషాన్నా పూపమాం సాని పాయసం వర్జయే దాహృతాన్నేషు బాలవృద్ధాతు రైర్వినా. ఉపవాసోగురౌప్రేతే పత్న్యాః పుత్రస్య వా భవేత్. మరీచిః – ప్రధమేఽహ్ని తృతీయేఽహ్ని (చతుర్థే) సప్తమే, దశమే తథా. జ్ఞాతిభిః సహ భోక్తవ్యమే తత్ప్రేతేషు దర్లభం భోజనం చ దివైవ. దివాచైవతు భోక్తవ్యమ మాంసం మనుజర్షభ, ఇతి విష్ణు పురాణాత్. క్రీత్వా లబ్ధ్వావా దివాన్న మశ్నీయుః, ఇతి పారస్కరోక్తేశ్చ. మదనరత్నే హారీతః – పాణిషు మృణ్మయేషు పర్ణపుటేషు వాశ్నీరన్. దేవజానీయే బ్రాహ్మే – (శుద్ధితత్వే ఆదిపురాణేచ) ఆశౌచమధ్యే యత్నేన భోజయేచ్చ స్వగోత్రజాన్. అంత్యదినేతు మదనరత్నే బ్రాహ్మే – యస్యయస్యతు వర్ణస్య యద్యత్ స్యాత్పశ్చిమం త్వహః, సతత్ర గృహ శుద్ధించ వస్త్ర శుద్ధిం కరోత్యపి. అంత్యకర్మకాలీన వస్త్రయోస్త త్రైవోక్తం – గ్రామాద్బహిస్తతో గత్వా ప్రేత స్పృష్టేతు వాససీ, అంత్యా నామాశ్రితానాం చ త్యక్త్వా స్నానం కరోత్యధ, ఇతి. శంఖః-దానం**

**ప్రతిగ్రహో** హోమః స్వాధ్యాయః పితృకర్మచ, ప్రేత పిండ క్రియా వర్జమా శౌచే వినివర్తతే. **కారకగృహ్యే** - యత్రప్రాణోత్క్ర మస్తత్రాన్వహం మహాబలిం కుర్యాత్, ఇతి. పారస్కరః - తదానీమేవ వస్త్రం తండులం దీపం కాంస్య భాజనం ప్రేతాయ దద్యాత్. **ఆశౌచ ప్రకాశే భరద్వాజః** - వాసోఽన్నం చ జలం కుంభం ప్రదీపం కాంస్య భాజనం, నగ్న ప్రచ్ఛాదనే శ్రాద్ధే బ్రాహ్మణాయ నివేదయేత్. **భృగుః - తిలోదకం** తథా పిండాన్ నగ్న ప్రచ్ఛాదనాదికం, రాత్రౌన కుర్యాత్సంధ్యాయాం యది కుర్యాన్నిరర్థకం. **అథ ప్రేతపిండః** - యద్యపి హేమాద్రౌ పారస్కరేణ - బ్రాహ్మణేదశ పిండాస్తు క్షత్రియే ద్వాదశ స్మృతాః, వైశ్యే పంచదశప్రోక్తాః శూద్రేత్రింశత్ప్రకీర్తితాః ఇత్యుక్తం. తథాపి - ప్రేతేభ్యః సర్వవర్ణేభ్యః పిండాన్ దద్యాత్ దశైవతు, ఇతితే నైవోక్తేః సర్వేషాం దశైవ జ్ఞేయః. మదనరత్నేఽప్యేవం. తథాచ హేమాద్రౌ బ్రాహ్మపాద్మయోః - జాత్యుక్తా శౌచతుల్యాంస్తు వర్ణానాం క్వచిదేవహి, దేశధర్మాన్ పురస్కృత్య ప్రేతపిండాన్ వపంత్యపి. ఇత్యుక్త్వా విప్రాన్యేషు దశపిండోత్కర్ష ఉక్తః. దేయస్తు దశమః పిండోరాజ్ఞాం వైద్వాదశేఽహని, వైశ్యానాంవై పంచదశే దేయస్తు దశమస్తథా, శూద్రస్య దశమః పిండో మాసే పూర్ణేఽహ్నిదీయతే, ఇతి.

అను॥ దేవజానీయమందు కారికా వచనమిట్లా - తెప్పించిన అన్నములో ఉప్పు, పాలు, మినుములు, అన్నంతో చేసిన అపూపములు (మాల్‌పూడ), మాంసము, పాయసము, వీనిని బాల వృద్ధ, ఆతురులు తప్ప మిగిలిన వారు విడిచిపెట్టాలి. గురువు మరణిస్తే పత్ని లేదా పుత్రుడు ఉపవాసముండాలి. మరీచి ఇట్లా - తొలిరోజు, మూడవ (నాల్గవ) ఏడవ, పదవ రోజులలో జ్ఞాతులతో కలిసి భుజించాలి. ప్రేతలకిది దుర్లభము. పగటియందే భోజనము. పగలే భుజించాలి,అది మాంసం లేకుండా, ఓ మనుష్య శ్రేష్ఠ ! అని విష్ణు పురాణము నుండి. కాని లేదా ఉచితంగా లభిస్తే పగలు అన్నము భుజించాలి, అని పారస్కరోక్తి కూడా. మదనరత్నమందు హారీతుడిట్లా - చేతులందు, మట్టిపాత్రలందు, ఆకుల దొప్ప లందుకాని తినాలి,అని. దేవజానీయమందు బ్రాహ్మోక్తి - (శుద్ధితత్వమందు, ఆది పురాణమందును) - ఆశౌచ మధ్యమందు ప్రయత్న పూర్వకముగా తన గోత్రజులను భుజింప చేయాలి,అని. అంత్యదినమందు మదనరత్నమందు బ్రాహ్మోక్తి ఇట్లా- ఏ ఏ వర్ణము వారికి ఏదేది చివరి దినమో (ఆశౌచమందు) ఆతడు అక్కడ గృహ శుద్ధిని వస్త్ర శుద్ధిని చేయించాలి కూడా,అని. అంత్యకర్మకాలీన వస్త్రముల గూర్చి అక్కడే చెప్పాము ఇట్లా - ఆ పిదప గ్రామము నుండి బయటికి వెళ్ళి, ప్రేతను స్పృశించి వస్త్రములను అంత్యులకు ఆశ్రితులకు ఇచ్చి ఇక స్నానం చేయాలి,అని. శంఖుడిట్లా - ఆశౌచకాలమందు ప్రేతపిండ క్రియ తప్ప దానము, ప్రతి గ్రహము, హోమము, స్వాధ్యాయము, పితృకర్మ ఇవి అన్నీ ఆగిపోతాయి. కారక గృహ్యమందిట్లా - ప్రాణం పోయినచోట ప్రతిరోజు మహాబలి చేయాలి,అని. పారస్కరు డిట్లా - అప్పుడే వస్త్రము, తండులము, దీపము కాంస్యపాత్ర ప్రేతకొరకు ఇవ్వాలి,అని. ఆశౌచ ప్రకాశమందు భరద్వాజుడిట్లా - వస్త్రము అన్నము,

నీరు, కుంభము, దీపము, కాంస్యపాత్ర వీనిని నగ్న ప్రచ్ఛాదన శ్రాద్ధమందు బ్రాహ్మణునకు ఇవ్వాలి,అని (వికచ్ఛః కచ్ఛశేషశ్చ ముక్తకచ్ఛః తథైవచ, ఏకవాసా అవాసాశ్చ నగ్నః పంచవిధః స్మృతాః). భృగువిట్లా – తిలోదకము, పిండములు, నగ్న ప్రచ్ఛాదనాదులు వీటిని రాత్రిపూట చేయరాదు. సంధ్యయందు చేసినా నిరర్థకమే,అని. ఇక ప్రేత పిండము – హేమాద్రి యందు పారస్కరుడిట్లా – బ్రాహ్మణునకు పది పిండములు క్షత్రియునకు పన్నెండు, వైశ్యునకు పదిహేను, శూద్రునకు ముప్పది పిండములు,అని చెప్పినప్పటికీ, అట్లైనా – అన్ని వర్ణముల వారు ప్రేతకై పది పిండములనే ఇవ్వాలి, అని ఆతడే చెప్పాడు కనుక అందరికి పదే అని గ్రహించాలి. మదనరత్న మందు కూడా ఇట్లాగే ఉంది. అట్లాగే హేమాద్రి యందు బ్రాహ్మపద్మోక్తులిట్లా – ఆయా వర్ణముల వారికి వారి జాతికి చెప్పిన ఆశౌచతుల్యమైన పిండములను ఎక్కడో ఒకచోట ఇస్తారు. దేశ ధర్మాన్ననుసరించి ప్రేత పిండములను ఇస్తారు కూడా. అని చెప్పి విప్రులకన్న ఇతరులైన వారి విషయంలో పది పిండముల ఉత్కర్ష చెప్పారు. క్షత్రియులకు పన్నెండవ రోజున పదవ పిండ మివ్వాలి. వైశ్యులకు పదిహేనవ రోజున పదవ పిండమివ్వాలి. శూద్రునకు నెలనిండాక పగటి పూట పదవ పిండమివ్వాలి,అని (కనుక పదిపిండములే శ్రేష్ఠముఅని)

మూ॥ **యుద్ధమ్మృతాదేరాశౌచేత్ర్యహాదౌచతే** నైవోక్తః – సద్యః శౌచే ప్రదాతవ్యా సర్వేఽపి యుగపత్తథా. త్ర్యహాశౌచే ప్రదాతవ్యః ప్రథమేఽహ్న్యేక ఏవహి, ద్వితీయేఽహని చత్వారః తృతీయే పంచచైవహి. త్ర్యహే ప్రకారాంతరం ప్రాగుక్తం **శాతాతపః – ఆశౌచస్యహి** హ్రాసేఽపి పిండాన్ దద్యాద్దశైవతు, తత్రైకపాత్రే సకృత్పక్త్వా దశపిండాన్ దద్యాత్. **ఉత్తరీయశిలాపాత్ర** కర్తృద్రవ్య విపర్యయే, పూర్వదత్తాంజలీన్, దద్యాత్ పూర్వపిండాం స్తథైవచ, ఇతి గృహ్యకారికాయాం పాత్ర విపర్యయే, దోషోక్తేః. శిలా విపర్యయే ఘటస్ఫోటాదేః నావృత్తిః. అక్షాభ్యంజనాది పదకర్మణః ఏకహాయనీ, నయన పద ప్రయోజకత్వాత్. తద్వచ్ఛాత్ర లౌకిక గ్రహణం. **కేచిత్తున వాన్యాదాయ** భాండాని ఆరుకం చరుకం తథా, ఇతి ప్రచేతసోక్తేః. పాత్రానే కత్వమాహుః. **క్రియాకర్తుర్నాశేఽన్యేన** శేషః సమాపనీయః. ఏవం క్రియా ప్రవృత్తానాం యదికశ్చిద్విపద్యతే, తద్ బంధునా క్రియా కార్యా సర్వైర్వా సహకారిభిః ఇతి శుద్ధి తత్వే బృహస్పతి స్మృతేః. **పత్న్యాః కర్తృత్వే** రజోదర్శనే చ తదంతే కుర్యాత్, శావాద్ ద్విగుణ మార్తవం, ఇత్యుక్తేః. **ఆశౌచాంతే ఆర్తవే** కర్తురస్వాస్థ్యే వాన్యేన క్రియా సర్వావర్తనీయా, కర్తుర్వి పర్యయాత్ కాలా తిక్రమాయోగాచ్చ. వారాహే – స్థండిలే ప్రేత భాగంతు దద్యాత్పూర్వాహ్ణ ఏవతు, కృత్వాతు పిండ సంకల్పం నామగోత్రేణ సుందరి. **మరీచిః – ప్రేత** పిండం బహిర్దద్యాత్ దర్భ మంత్ర వివర్జితం, ప్రాగుదీచ్యాం చరుం కృత్వా స్నాతః ప్రయతమానసః. దర్భవర్జన మనుపనీత పరం. **అసంస్కృతానాం భూమౌ** పిండం దద్యాత్, సంస్కృతానాం కుశేషు, ఇతి. ప్రచేతసోక్తేః. మితాక్షరాయాం స్మృత్యంతరే –

**భూమౌ మాల్యం పిండం పానీయము పలే వాదద్యుః. (హారీతః - అకృప్త చూడాయే బాలాయే చ గర్భాద్వినిః సృతాః అనుపనీతాయే అనూఢా అపికన్యకాః. యేమృతాశ్చాప్య సంస్కారాస్తేభ్యో భూమౌ ప్రదీయతే).**

అను॥ యుద్ధములో మరణించిన వారికి ఆశౌచమందు మూడు రోజుల ఆశౌచమందును ఆతడే చెప్పాడు - సద్యః శౌచమందు అన్ని పిండములను ఒకేసారి ఇవ్వాలి. మూడు రోజుల ఆశౌచమందు మొదటి రోజు ఒక పిండమివ్వాలి, రెండవరోజు నాలుగు పిండములివ్వాలి. మూడవరోజు ఐదు,అని. మూడు రోజుల విషయంలో మరో పద్ధతిని ముందే చెప్పాము. (మూడు - నాలుగు - మూడుఅని). శాతాతపుడిట్లా - ఆశౌచము తగ్గినా, పిండములను పదే ఇవ్వాలి. అక్కడ ఒక పాత్రయందు ఒకేసారి వండి పది పిండములనివ్వాలి,అని. ఉత్తరీయము, శిల, పాత్ర, కర్త, ద్రవ్యము ఇవి మారితే ముందిచ్చిన అంజలులను తిరిగి ఇవ్వాలి పూర్వపిండములను అట్లాగే ఇవ్వాలి,అని గృహ్యకారిక యందు పాత్ర విపర్యయమందు దోషం చెప్పబడింది. శిలా విపర్యయమందు ఘటస్ఫోటాదులు ఆవృత్తికావు. అక్ష్యాభ్యంజనాది పదకర్మకు ఏకహాయనీ, నయనంవలె అప్రయోజకత్వము. అట్లాగే ఇక్కడ కూడా లౌకికం గ్రహించాలి. కొందరు - కొత్త కుండలు తెచ్చి ఆరుకము, చరుకము పాత్రలను అట్లాగే, అని ప్రాచేతసుడు చెప్పాడు కనుక పాత్రలు అనేకమన్నారు. క్రియాకర్త నశిస్తే మరొకనితో మిగిలింది పూర్తి చేయించాలి. ఈ రకంగా క్రియ యందు ప్రవృత్తులైన వారిలో ఎవరైనా మరణిస్తే ఆతని బంధువు, క్రియ చేయాలి లేదా అందరు సహకారులతోనో చేయాలి,అని శుద్ధితత్త్వమందు బృహస్పతి వచనము. పత్నికర్తయై రజోదర్శనమైతే మధ్యలో, దాని చివర చేయాలి. శవా శౌచం కన్న రెట్టింపు ఋతుమతిది, అని చెప్పారు కనుక. ఆశౌచాంతమందు ఋతుమతిఐతే, కర్తకు అస్వస్థత కల్గితేనో ఇతరునితో అన్ని పనులు చేయించాలి,కర్త మారి నందు వలన కాలాతిక్రమం జరుగరాదు. వారాహ మందిట్లా - స్థండిల మందు ప్రేత భాగాన్ని పూర్వాహ్ణ మందే ఇవ్వాలి. ఓ సుందరి ! నామ, గోత్రములతో పిండ సంకల్పం చేసి ఇవ్వాలి, అని. మరీచి ఇట్లా - స్నానం చేసి సావధాన మనస్కుడై ఈశాన్య మందు చరువును చేసి, దర్భ, మంత్రములు లేకుండా ప్రేత పిండమును బయట ఇవ్వాలి,అని. దర్భ లేకుండా అనేది అనుపనీతుని విషయము. అసంస్కృతులకు భూమియందు సంస్కృతులకు కుశలపై పిండ మివ్వాలి,అని, ప్రచేతసోక్తి. మితాక్షర మందు స్మృత్యంతరోక్తి ఇట్లా - మాల్యము, పిండము, పానీయము వీనిని భూమియందు కాని రాతిపై కాని ఇవ్వాలి (హారతుడిట్లా - చూడాకర్మ కాక మరణించిన పిల్లలు, గర్భం నుండి పడిపోయినవారు, అనుపనీతులై మరణించినవారు, వివాహంకాకనే మరణించిన కన్యకలు, సంస్కారం లేకుండా మరణించిన వారు వీరందరికి భూమి యందు పిండము ఇవ్వాలి,అని). (ఒక సంవత్సరం దూడ, బంగారు రంగు **కళ్ళది.**

**దాన్నిచ్చి** సోమం కొనాలి. దాన్ని తెచ్చేటప్పుడు దాని ఏడవ అడుగులో బంగార ముంది హోమం చేయాలి **(పదహోమం)**. ఆ దుమ్మును తెచ్చి హవిర్ధాన శకటపు అక్షమందుంచాలి **(అక్షాభ్యంజనం)**. సోమ క్రయం ముఖ్యం దానికి ఏకహాయ నీయనం ప్రధానం. పదహోమ అక్షాభ్యంజనం అప్రధానం. శిలప్రధానం, ఘటస్ఫోటం అప్రధానం).

మూ॥ **పైఠీనసిః** - **శాలినాం సక్తు భిర్వాపి పిణ్యాకైర్వాపి నిర్వపేత్, శునః పుచ్ఛః - ఫలమూలైశ్చ పయసాశాకేన చ గుడేనచ, తిలమిశ్రంతు దర్భేషు పిండం దక్షిణతో హరేత్. తూష్ణీం** ప్రసేకం పుష్పం చ ధూపం దీపం తథైవచ, శాలినా సక్తుభిర్వాపి శాకైర్వా పృథ నిర్వపేత్. **ప్రథమేఽహని** యద్ద్రవ్యం తదేవ స్యాద్దశాహికం, **మదనరత్నే మాత్స్యే** - తైజసం మృణ్మయం చాథ పాత్రం సంశోధ్య యత్నతః, లౌకికాగ్నావధి శ్రిత్యప చేదన్నం ఘృతప్లుతం. స్నాత్వాథ తిలసమ్మిశ్రం ప్రదద్యాత్ దర్భ సంస్తరే. **శుద్ధితత్వే దేవజానీయే బ్రాహ్మే** - ప్రథమేఽహనియో దద్యాత్ ప్రేతాయాన్నం సమాహితః, అన్నం నవసుచాన్యేషు స ఏవ ప్రదదాత్యపి.

అను॥ పైఠీనసి ఇట్లా - శాలిధాన్యపు పిండితో లేదా నువ్వుల పిండితోకాని పిండ దానం చేయాలి,అని. శునః పుచ్ఛుడిట్లా - ఫలములు, మూలములు, పాలు, శాకము, గుడము వీనిని తిలలతో కలిపి దర్భలందు పిండమును దక్షిణంవైపు ఇవ్వాలి. మౌనంగా ప్రసేకము, పుష్పము, ధూపము, దీపము కూడా ఇవ్వాలి. శాలిధాన్యం, సత్తుపిండి, శాకముతో పిండం ఏదానితోనైనా పిండ నిర్వాపం చేయాలి. మొదటిరోజు ఏ ద్రవ్యమో పది రోజులు అదే ద్రవ్యముండాలి, పిండానికై (పదార్థం). మదనరత్నమందు మాత్స్యోక్తి ఇట్లా - (బంగారు మొదలగు ధాతువులతో చేసిన) తైజసపాత్ర లేదా మృణ్మయపాత్ర దానిని ప్రయత్న పూర్వకముగా శుద్ధిచేసి, లౌకికాగ్ని యందుంచి అన్నమును నేయి కన్పించేట్టు కలిపి వండాలి. ఆపై స్నానం చేసి నువ్వులతో కలిపి పరచిన దర్భలపై ఉంచి ఆ అన్నపు పిండమివ్వాలి,అని. శుద్ధి తత్వమందు దేవజానీయమందు బ్రాహ్మోక్తి ఇట్లా - సావధానుడై మొదటిరోజు ప్రేతకై ఎవడు అన్నాన్ని ఇస్తాడో మిగిలిన తొమ్మిది రోజులలో ఆతడే అన్నమును ఇవ్వాలి కూడా,అని.

మూ॥ **మృణ్మయంభాండ** మాదాయ నవం స్నాతః సుసంయతః, **తండుల ప్రసృతిం తత్ర త్రిః** ప్రక్షాల్య పచేత్స్వయం. **సపవిత్రైః తిలైః మిశ్రం** కృమికేశ వివర్జితం, ద్వారోపాంతేతతః క్షిప్త్వా శుద్ధాంవా గౌరమృత్తికాం, భూపృష్ఠే సంస్తరేద్దర్భాన్ యామ్యాగ్రాన్ దేశసంభవాన్, **తతోఽ** వనే జనందద్యాత్ సంస్మరన్ గోత్రనామనీ. తిలసర్పిర్మధుక్షీరైః సంసిక్తం తప్తమేవహి, దద్యాత్ప్రేతాయ పిండంతు దక్షిణాభిముఖ స్థితః. అర్ఘ్యైః పుష్పైః తథాధూపైః దీపైస్తోయైశ్చ శాలిభిః (శీతలైః) ఊర్ణా తం తుమయైః శుద్ధైః వాసోభిః పిండమర్చయేత్. దివసే దివసే దేయః పిండ ఏవం క్రమేణతు, సద్యః శౌచం ప్రదాతవ్యా సర్వేఽపి యుగపత్తథా. త్ర్యహాశౌచేఽపి దాత వ్యాస్త్రయఃపిండాః సమాహితైః ద్వితీయే చతురో దద్యాత్ అస్థి సంచయనం తథా, త్రీంస్తు దద్యాత్తృతీయేఽహ్ని వస్త్రాది క్షాలయేత్తతః దశాహేఽపి చ దాతవ్యః ప్రథమేత్వేక ఏవహి. ఏకస్తోయాం జలిస్త్వేవం పాత్రమేకం చ దీయతే.

ద్వితీయే ద్వౌతృతీయేత్రీన్, ఇత్యాద్యుక్త్వా - ఏవంస్యుః పంచ పంచాశత్తో యస్యాంజలయః క్రమాత్. తోయప్రాతాణి తావంతి సంయుక్తాని తిలాదిభిః, ఇతి. పాత్రం కుంభః. **అత్రాహః పదమహో రాత్ర** పరం. తేన రాత్రా వపి దేయ ఇతి గౌడాః. దివ సపదా ద్రాత్రౌనేతి మైథిలాః, స ఏవేత్యుక్తేః సపిండేన దశపిండే ప్రక్రాంతే పుత్రాగమేஉపి సనదద్యాత్. అసగోత్రః సగోత్రోవా, ఇతి ప్రాగుక్తేః దాహకర్తైవ దశాహం కుర్యాదితి మితాక్షరాయాం. శుద్ధితత్వే వాయవీయే - అసగోత్రః సగోత్రోవా యదిస్త్రీయది వాపుమాన్. యశ్చాగ్నిదాతా ప్రేతస్య పిండం దద్యాత్స ఏవహి, ఇతి.

అను॥ కొత్త మట్టికుండను తీసుకొని స్నానం చేసి ఇంద్రియ నిగ్రహంతో దోసెడి నిండా బియ్యాన్ని తీసుకొని మూడుసార్లు కడిగి అక్కడ స్వయంగా వండాలి,అని. పవిత్ర గలిగి, నువ్వులతో కూడిన, పురుగులు కేశములులేని, శుద్ధమైన తెల్లమట్టిని ద్వార సమీపమందు వేసి, ఆ పిదప భూపృష్ఠమందు (పై) దేశమందు పుట్టిన వానిని దక్షిణా గ్రములుగా దర్భలను పరచి, గోత్ర నామములను స్మరిస్తూ ఆ పిదప అవనేజన మివ్వాలి. (పాదప్రక్షాళనకై) నువ్వులు, నెయ్యి, తేనె, పాలు వీనితో కలిపి తపింప చేయబడిన (వేడి) పిండమును, దక్షిణాభిముఖంగా ఉండి ప్రేతకు ఇవ్వాలి. అర్ఘ్యము, పుష్పము, ధూపము, దీపము, చల్లని జలము, (ధాన్యము) ఉన్ని దారంలో చేసిన శుద్ధ వస్త్రములు వీనితో పిండమునర్చించాలి. ఈ రకంగా క్రమంగా ప్రతిరోజు పిండమివ్వాలి. అందరు కూడా ఒకేసారి పిండము లివ్వాలి. అట్లాగే సద్యః శౌచమును అందరు ఒకేసారి పొందుతారు. మూడు రోజుల ఆశౌచమందు కూడా సావధానంగా మూడు పిండములివ్వాలి. రెండవరోజు నాలుగు పిండములివ్వాలి, అస్థి సంచయనం కూడా.మూడవ రోజు మూడు పిండములివ్వాలి. ఆ పిదప వస్త్రాదులను శుభ్రపరచుకోవాలి. పదవరోజున కూడా ఇవ్వాలి. తొలిరోజున ఒక్కటే ఇవ్వాలి. ఒకతోయాంజలి, అట్లాగే ఒక పాత్రను ఇవ్వాలి. రెండవ రోజు రెండు, మూడవ రోజు మూడు, అని మొదలుగా చెప్పి, ఈ రకముగా తోయాంజలులు ఏబదిఐదు, క్రమంగా తిలాదులతో కూడిన తోయ పాత్రములు అన్నే,అని. పాత్రం అనగా కుంభము. ఇక్కడ అహమనే శబ్దము అహోరాత్ర పరము అందువల్ల రాత్రి కూడా ఇవ్వాలి అని గౌడులన్నారు. దివస పదంవల్ల రాత్రియందు కాదు అని మైథిలులన్నారు. ఆతడే అని చెప్పినందువల్ల సపిండుడు దశపిండములివ్వటం ఆరంభించాక పుత్రుడు వచ్చినా ఆతడు ఇవ్వరాదు. అసగోత్రుడో సగోత్రుడో కాని అని ముందు చెప్పినందువలన దాహకర్తయే పదిరోజులు చేయాలని మితాక్షరయందు అన్నారు. శుద్ధితత్వమందు వాయవీయోక్తి ఇట్లా - అసగోత్రుడో, సగోత్రుడో పురుషుడో, స్త్రీయో, ప్రేతకు అగ్నిదానం చేసినవాడే పిండమివ్వాలి,అని.

మూ॥ **తత్రైవ - పూరకేణతు** పిండేన దేహోనిష్పద్యతేయతః, కృతస్య కరణాయోగాత్ పునర్నావర్తయేత్క్రియాం. శుద్ధి ప్రకాశే వాయవీయేஉపి - నివర్తయతియో మోహాత్ క్రియామన్య నివర్తితాం, విధిఘ్నస్తే నభవతి పితృహాచోపజాయతే. తస్మాత్ప్రేత క్రియాయేనకేనాపిచ కృతాయది,

నతాం నివర్తయేత్ప్రాజ్ఞః సతాం ధర్మమనుస్మరన్, ఇతి. **ఆదిపురాణే - పితృశబ్దం** స్వధాం చైవ న ప్రయుంజీత కర్హిచిత్, అను శబ్దం తథాచేహ ప్రయత్నేన వివర్జయేత్. ఉపతిష్ఠతామయం పిండః ప్రేతాయేతి సముచ్చరేత్. క్రియానిబంధే వ్యాసః - ప్రేతాయ పిండం దత్వాతు తతోఽ శ్నాయాద్ది నాత్యయే.

అను॥ అక్కడే - పూరక పిండంతోనే దేహం నిష్పన్నమౌతుంది కనుక చేసిన దాన్ని చేసే వీలు లేదు కనుక క్రియను తిరిగి ఆవృత్తి చేయరాదు, అని. శుద్ధి ప్రకాశమందు వాయవీయ వచన మందు కూడా - ఇతరులు నిర్వర్తించిన క్రియను మోహంతో తిరిగి నిర్వర్తించేవాడు, ఆతడు విధిని నాశం చేసేవాడు ఔతాడు. పితృహంతకుడౌతాడు,అని. అందువల్ల ప్రేత క్రియను ఎవడో ఒకడు చేసినట్లైతే, దానిని సజ్జనుల ధర్మాన్ని అనుసరిస్తూ ప్రాజ్ఞుడు తిరిగి చేయరాదు,అని. ఆదిపురాణ మందిట్లా - పితృశబ్దమును, స్వధా శబ్దమును ఎక్కడా ప్రయోగించరాదు. అను శబ్దమును (యేచత్వామను) అట్లాగే ఇక్కడ ప్రయత్న పూర్వంగా విడువాలి. ప్రేతాయ, అయంపిండః ఉపతిష్ఠతాం అని ఉచ్చరించాలి,అని. క్రియా నిబంధ మందు వ్యాసుడిట్లా - ప్రేతమునకు పిండమిచ్చి ఆపిదప దినం (పగలు) అయ్యాక (రాత్రి) భుజించాలి,అని.

మూ॥ **భవిష్యే - ఓదన మామిష** సక్తూనాం శాకమూల ఫలాదిషు, ప్రథమేఽహని యద్దద్యాత్ తద్దద్యాదుత్తరేఽహని. **గృహద్వారేశ్మశానే వాతీర్థే** దైవగృహేఽపివా, యత్రాద్యైర్దీయతే పిండస్తత్ర సర్వం సమాచరేత్. **బ్రాహ్మే - శిరః స్త్వా** ద్యేన పిండేన ప్రేతస్య క్రియతే సదా, ద్వితీయేన తు కర్ణాక్షి నాసికాశ్చ సమాసతః, గలాంస భుజ వక్షాంసి తృతీయేన యథా క్రమం. చతుర్థేన తు పిండేన నాభిలింగ గుదానిచ, జానూ జంఘే తథా పాదౌ పంచమేన తు సర్వదా, సర్వమర్మాణి షష్ఠేన సప్తమేనతునాడయః. దంతలోమాన్యష్టమేన వీర్యంతు నవమేనచ. దశమేనతు పూర్ణత్వం తృప్తతాక్షుద్విపర్యయః, ఇతి. యాజ్ఞవల్క్యేనతు - పిండ యజ్ఞావృతాదేయం ప్రేతాయాన్నందిన త్రయం, ఇత్యుక్తేః. అత్ర ఫలతారతమ్యం జ్ఞేయమితి విజ్ఞానేశ్వరః. తేనత్ర్యహాశౌచ పరత్వం దేవయాజ్ఞికోక్తం చింత్యం. ఆశౌచస్యచ హ్రాసేఽపి పిండాన్ దద్యాద్ద శైవతు, ఇతి వచనాచ్చ దినత్రయా వశ్యకత్వార్థ మితిహారలతాదయః. **శాతాతపః - జలమే** కాహ మాకాశే స్థాప్యం క్షీరం చ మృన్మయే. పారస్కరః - మృన్మయేతాం రాత్రిం క్షీరోదకైః విహాయసి నిదధ్యుః ప్రేతాత్ర స్నాహీత్యుదకం, పిబచేదం క్షీరం, ఇదం రాత్రా వితిగౌడాః.

అను॥ భవిష్యమందిట్లా - అన్నము, మాంసము, సత్తుపిండి, శాకము, మూలము ఫలము వీనిలో మొదటిరోజు దేనినిస్తారో, దానినే తరువాతి రోజు కూడా ఇవ్వాలి,అని. గృహద్వార మందు, శ్మశానమందు, తీర్థమందు, దేవగృహమందు, ఎక్కడ తొలివారు పిండ మిస్తారో అక్కడే అంతాచేయాలి. బ్రాహ్మమందిట్లా - తొలి పిండంతో ఎప్పుడూ ప్రేతయొక్క శిరస్సు చేయబడుతుంది. రెండవ దానితో చెవులు, కళ్ళు, ముక్కులు సంక్షేపంగా

చేయబడతాయి. యథా క్రమంగా మూడవ దానితో కంఠము, స్కంధము, భుజము, వక్షము చేయబడుతాయి. నాల్గవ పిండంతో నాభి, లింగము, గుదము చేయబడుతాయి. ఐదవ దానితో ఎప్పుడూ మోకాలు, పిక్కలు, పాదములు చేయబడుతాయి. ఆరవ దానితో మర్మ స్థానములన్నీ, ఏడవదానితో నాడులు, ఎనిమిదవ దానితో దంతరోమములు, తొమ్మిదవ దానితో వీర్యము, పదవ పిండంతో పూర్ణత్వము, తృప్తి, ఆకలి నాశము కల్గుతాయి, అని యాజ్ఞవల్క్యుడైతే - పిండ పితృ యజ్ఞవిధితో ప్రేతకు అన్నమును మూడు రోజులు ఇవ్వాలి, అని చెప్పినందువలన,అని. ఇక్కడ ఫలతార తమ్యాన్ని గ్రహించాలని విజ్ఞానేశ్వరుడన్నాడు. అందువల్ల మూడు రోజుల ఆశౌచము పరముగా ఇది అని దేవయాజ్ఞికుడు చెప్పిన దాన్ని ఆలోచించాలి. ఆశౌచం రోజులు తక్కువైనా పది పిండములే ఇవ్వాలి, అనే వచనము వల్లను మూడు రోజుల ఆవశ్యకత కొరకు,అని హారలతాదులన్నాయి. శాతాతపుడిట్లా - మృన్మయ పాత్రలయందు, ఆకాశమందు ఒకరోజు జలము, పాలు ఉంచాలి,అని. పారస్కరుడిట్లా - మృన్మయపాత్ర యందు ఆ రాత్రి క్షీర ఉదకములను ఆకాశమందు ఉంచాలి. ప్రేత! ఇక్కడ స్నానం చేయి, అని నీరు ఈ పాలు త్రాగు అని పాలు ఉంచాలి,అని. ఇది రాత్రియందు అని గౌడులన్నారు.

మూ॥ గారుడేతు - అపక్వే మృన్మయే పాత్రే దుగ్ధం దద్యాద్దిన త్రయం, ఇతి ఉక్తం. హేమాద్రౌ పాద్మేతు దశాహ ముక్తం - తస్మాన్నిధేయ మాకాశే దశరాత్రం పయోజలం, సర్వ తాపోప శాంత్యర్థ మధ్వశ్రమ వినాశనం. **దేవజానీయే కారికాయాం** - తత్ర ప్రేతోప కృతయే దశరాత్రమ ఖండితం, కుర్యాత్ప్రదీపం తైలేన వారి పాత్రం చమార్తికం. భోజ్యా ద్భోజన కాలేతు భక్త ముష్టిం చ నిర్వపేత్, నామగోత్రేణ సంబుద్ధ్యా ధరిత్ర్యాం పితృ యజ్ఞవత్. **శాతాతపః** - **భూలోకాత్ప్రే** తలోకంతు గంతుం శ్రాద్ధం సమాచరేత్, తత్పాథేయం హి భవతి మృతస్య మనుజస్యతు. **అథ దశాహ మధ్యే** దర్శపాతే నిర్ణయః - భవిష్యే - ప్రవృత్తా శౌచ తంత్రస్తు యది దర్శోప్రపద్యతే, సమాప్య చోదకం పిండాన్ స్నాన మాత్రం సమాచరేత్. ఋష్యశృంగః - ఆశౌచమంతరా దర్శోయది స్యాత్సర్వ వర్ణినాం, సమాప్తిం ప్రేతతంత్రస్యకుర్యాదిత్యాహ గౌతమః పైఠీనసిః - ఆద్యేందావేవ కర్తవ్యా ప్రేత పిండోదక క్రియా, ద్వితీయేందవేతు కుర్వాణః పునః శావం సమశ్నుతే. **మాతా పిత్రోస్తు** శ్లోకగౌతమః - అంతర్దశాహేదర్శ శ్చేత్తత్ర సర్వం సమాపయేత్, పిత్రోస్తు యావదాశౌచం దద్యాత్పిండాన్ జలాంజలీన్, ఇదమపి త్ర్యహ మధ్యే దర్శపాతే, తదూర్ధ్వం దర్శేతు పిత్రోరపి తంత్రం సమాప్యమేవ. పిత్రోరాశౌచ మధ్యేతు యదిదర్శః సమాపతేత్, తావదేవోత్తరం తంత్రం పర్యవస్యే త్త్ర్యహోత్పరం, ఇతి గాలవోక్తేః. అన్యేషాంతు త్ర్యహ మధ్యేఽపి సమాప్తి రితి పరాశర మాధవీయే నిర్ణయామృతే చోక్తం. కాలాదర్శేఽపి - దర్శే దశాహ మధ్యే స్యాదూర్ధ్వం తంత్రం సమాపయేత్, త్రిరాత్రాదుత్తరం పిత్రోః మృతావితి వినిశ్చయః. మదనపారిజాతేతు గాలవీయ మాపదనౌరస పుత్రాది విషయం, త్ర్యహోర్ధ్వమపి పిత్రోర్న తంత్ర సమాప్తి రిత్యుక్తం. మదనరత్నేఽ ప్యేవం. **మమతు దేశాచారాద్వ్య** వస్థేతి ప్రతిభాతి. **అథాస్థి**

**సంచయః** – తత్రాశ్వలాయనేన కృష్ణపక్షే ఏకాదశీ త్రయోదశీ దర్శేషు, ఆషాఢా ఫాల్గునీ ప్రోష్ఠ పదాభిన్నర్‌క్షే ఉక్తం. తదాశౌచ మధ్యేఽసంభవే తత ఊర్ధ్వం చ ప్రాగబ్దాత్కరణే జ్ఞేయం. ఆశౌచ మధ్యేతు మదనరత్నే సంవర్తః – ప్రథమేఽహ్ని తృతీయేవా సప్తమే నవమే తథా, అస్థి సంచయనం కార్యం దినే తద్గోత్రజైః సహ.

అను॥ గారుడమందిట్లా – కాల్చని మట్టి పాత్రయందు పాలను మూడు రోజులు ఇవ్వాలి, అని చెప్పారు. హేమాద్రి యందు పాద్మ వచన మందైతే పదిరోజులని చెప్పారిట్లా – అందువల్ల ఆకాశమందు పది, రాత్రులు, పాలు, నీరు ఉంచాలి. అవి సర్వతాప శాంతి కొరకు, అధ్వ శ్రమను నశింప చేసేవి, అని. దేవజానీయమందు కారికా వచనమిట్లా – అక్కడ ప్రేతకు ఉపకారం కొరకు పదిరాత్రులు తప్పకుండా (వరుసగా) తైలంతో దీపము, మట్టి పాత్రయందు నీరు ఉంచాలి. భోజన కాలమందైతే తినే పదార్థం నుండి, పిడికెడు అన్నాన్ని, నామ గోత్రములు చెప్పి, భూమియందు, పితృయజ్ఞంవలె వదలాలి,అని. శాతాతపుడిట్లా – భూలోకం నుండి ప్రేత లోకం వెళ్ళటానికి శ్రాద్ధ మాచరించాలి, మరణించిన మనుజునకు అది బాట బత్తెము ఔతుంది,అని. ఇక పదిరోజుల మధ్యలో దర్శం వస్తే, నిర్ణయము – భవిష్యోక్తి ఇట్లా – ఆశౌచతంత్రం ఆరంభం కాగా మధ్యలో దర్శం (అమావాస్య) వస్తే ఉదకము, పిండములను సమాప్తి చేసి స్నానం మాత్రం (అన్నిరోజులు) చేయాలి,అని. ఋష్యశృంగుడిట్లా – ఆశౌచం మధ్యలో అన్ని వర్ణముల వారికి అమావాస్య వస్తే, ప్రేత తంత్రాన్ని సమాప్తి చేయాలి, అని గౌతముడన్నాడు, అని. పైఠీనసి ఇట్లా – ప్రేత పిండోదక క్రియలను తొలి చంద్రుని యందే (అమావరకు) చేయాలి. రెండవ చంద్రుని యందు (అమా తర్వాత) చేస్తే తిరిగి శవసూతకం వస్తుంది,అని. మాతా పితృలకైతే గౌతమశ్లోకమిట్లా – పది రోజుల ఆశౌచం మధ్య అమావాస్య వస్తే అక్కడ అంతా ముగించాలి. తల్లిదండ్రులకైతే ఆశౌచమున్నంతవరకు పిండములను జలాంజలులను ఇవ్వాలి,అని. ఇది కూడా మూడు రోజుల మధ్య దర్శం వస్తే. ఆపైన అమావస్తే పితరులకు గూడా తంత్రంతో ముగించాలి,అని. పితరుల ఆశౌచం మధ్య దర్శం వస్తే మూడు రోజుల కన్న పరమైన ఉత్తర తంత్రాన్ని అక్కడే ముగించాలి (అంతవరకే) అని గాలవోక్తి. ఇతరులకైతే త్ర్యహ మధ్యమందును సమాప్తి అని పరాశర మాధవీయమందు మరి నిర్ణయామృతమందును చెప్పారు. కాలాదర్శ మందు కూడా – పదిరోజుల మధ్య అమా తిథి వస్తే ఆపై కర్మను (తంత్రం) ముగించాలి. తల్లిదండ్రుల మరణమందు మూడు రాత్రుల తరువాత ముగించాలి అని నిశ్చయము,అని. మదన పారిజాతమందైతే, గాలవుడు చెప్పింది, ఆపదయందు, అనౌరస పుత్రాదుల విషయము. మూడు రోజుల తరువాత కూడా తల్లిదండ్రులకు తంత్ర సమాప్తి లేదు. అని చెప్పారు. మదనరత్న మందు కూడా ఇట్లాగే ఉంది. నాకైతే దేశాచారము ననుసరించి నిర్ణయము అని తోస్తోంది. ఇక అస్థి సంచయము – అక్కడ ఆశ్వలాయనుడు కృష్ణపక్షమందు,

ఏకాదశి, త్రయోదశి, అవావాస్య యందు పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, పూర్వఫల్గుని, ఉత్తర ఫల్గుని పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర వీనికన్న ఇతరమైన నక్షత్రములందు అని చెప్పాడు. అప్పుడు ఆశౌచ మధ్యమందు అసంభవమైతే ఆ పిదప, సంవత్సరం కన్న ముందు సపిండీకరణమందు అని తెలుసుకోవాలి. ఆశౌచ మధ్యమందైతే మదనరత్నమందు సంవర్తుడిట్లా - తొలిరోజున లేదా తృతీయ, సప్తమ, నవమములలోనైనా ఆ దినమందు ఆ గోత్రజులతో కూడా అస్థి సంచయనం చేయాలి,అని.

**మూ॥ ఛందోగ పరిశిష్టే - అపరేద్యుః తృతీయేవా అస్థి సంచయనం భవేత్, ఇతి ద్వితీయేఽప్యుక్తం. విష్ణు కాత్యాయనౌ - సంచయనం చతుర్థ్యాం, ఇతి. మాధవీయే యమః - భౌమార్క మంద వారేషు తిథి యుగ్మే వివర్జయేత్, వర్జయే దేకపాదర్క్షేఽద్వి పాదర్క్షేఽస్థి సంచయం, ప్రదాతృజన్మ నక్షత్రే త్రిపాదర్క్షే విశేషతః. బ్రాహ్మే - చతుర్థే బ్రాహ్మణా నాంతు పంచమేఽహని భూభృతాం, నవమే వైశ్యజాతీనాం శూద్రాణాం దశమాత్పరం. దశమేఽహని, ఇతివాపారః. శౌనకః - పలాశేష్వస్థి దాహే చ సద్యః సంచయనం భవేత్. కామ్య మరణేతు - తస్యత్రిరాత్ర మాశౌచం ద్వితీయే త్వస్థి సంచయః, ఇత్యుక్తం. అంగిరాః - ప్రేతీ భూతం తథోద్దిశ్యయః శుచిర్న కరోతిచేత్ దేవతా నాంతు యజనం తం శపంత్యథ దేవతాః, తద్విధిః స్వస్వసూత్రే భట్టకృతౌజ్ఞేయః. హేమాద్రౌ నాగరఖండే - త్రీణి సంచయన స్యార్థే తానివై శ్రుణు సాంప్రతం, యత్ర స్థానే భవేన్మృత్యుః తత్ర శ్రాద్ధం ప్రకల్పయేత్. ఏకోద్దిష్టం తతో మార్గే విశ్రామో యత్ర కారితః, తతః సంచయన స్యార్థే తృతీయం శ్రాద్ధమిష్యతే. అపరార్కే మదనరత్నే చ బ్రాహ్మే - సద్యః శౌచేతథైకాహే సద్యః సంచయనం భవేత్, త్ర్యహా శౌచే తృతీయేఽహ్ని కర్తవ్యస్త్వస్థి సంచయః. తత్రైవ శ్మశాన దేవతాయాగం చతుర్థే దివసేచరేత్, మృన్మయేషు చ భాండేషు కుంభేషు రుచకేషుచ, సుపక్వైః భక్ష్యభోజ్యైశ్చ పాయసైః పానకైస్తథా, ఫలైర్మూలైర్వనోత్థైశ్చ పూజ్యాః క్రవ్యాద దేవతాః. ధూపో దీపస్తథామాల్య మర్ఘ్యం దేయం త్వరాన్వితైః, తత్ర పాత్రాణి పూర్ణాని శ్మశానాగ్నేః సమంతతః. నివేద యద్భిర్వక్తవ్యం తైస్సర్వైర నహం కృతైః నమః క్రవ్యాదముఖ్యేభ్యో దేవేభ్య ఇతి సర్వదా. యేఽత్ర శ్మశానే దేవాః స్యుః భగవంతః సనాతనాః, తేఽస్మత్సకాశాత్ గృహ్ణంతు బలిమష్టాంగ మక్షయం. ప్రేతస్యాస్య శుభాన్ లోకాన్ ప్రయచ్ఛంతుచ శాశ్వతాన్, అస్మాక మాయురారోగ్యం సుఖం చ దదతాం చిరం. ఏవం కృత్వా బలిం సర్వాన్ క్షీరేణాభ్యుక్ష్య వాగ్యతః, ఏవం దత్వా బలిం చైవ దద్యాత్పిండ త్రయం బుధః. ఏకం శ్మశాన వాసిభ్యః ప్రేతాయైవతు మధ్యమం, తృతీయం తత్సఖిభ్యశ్చ దక్షిణాసంస్థమా దరాత్. తతో యజ్ఞియ వృక్షోత్థాం శాఖామాదాయ వాగ్యతః, ప్రేతస్యాస్థీని గృహ్ణాతి ప్రధానాంగోద్భవానిచ. శిరసోవక్షసః పాణ్యోః పార్శ్వాభ్యాం చైవ పాదతః, పంచగవ్యేన సంస్థాప్యక్షౌమ వస్త్రేణ వేష్టయేత్, ప్రక్షిప్య మృన్మయే భాండేనవేసాచ్ఛాదనే శుభే, ఆరణ్యే వృక్షమూలేవా శుద్ధే సంస్థాపయత్యపి.**

అను॥ ఛందోగ పరిశిష్టమందిట్లా - రెండవరోజు లేదా మూడవ రోజున అస్థి సంచయనము చేయాలి,అని. రెండవ రోజును కూడా చెప్పారు. విష్ణు కాత్యాయను

(స్మృతులు)లిట్లా – సంచయనము నాల్గవరోజున,అని. మాధవీయమందు యముడిట్లా – మంగళ, ఆది, శనివారములందు రెండు తిథులున్న రోజు వదలాలి. ఏకపాద, త్రిపాద, నక్షత్రములు వీనియందు అస్థిసంచయనం వదలాలి, ఇచ్చేవాని (కర్త) జన్మ నక్షత్రమందు విశేషించి త్రిపాద నక్షత్రమందు తగదు,అని. బ్రాహ్మమందిట్లా – నాల్గవరోజున బ్రాహ్మణులకు, ఐదవ రోజున క్షత్రియులకు, తొమ్మిదవ రోజున వైశ్యజాతికి శూద్రులకు దశమం తరువాత అస్థి సంచయనము,అని. దశమం రోజున అనికూడా పాఠము. శౌనకుడిట్లా – పలాశములందు అస్థి దాహం చేస్తే అప్పుడే సంచయనం చేయాలి,అని. కామ్య మరణమందైతే – ఆతనికి త్రిరాత్రము ఆశౌచము, రెండవ రోజున అస్థి సంచయము, అని చెప్పారు. అంగిరుడిట్లా – ప్రేతగా మారిన వాని నుద్దేశించి, శుచియై ఎవడు అట్లా చేయడో, దేవతల పూజను వానిని శ్మశాన దేవతలు ఇక శపిస్తాయి,అని. ఆవిధి తమ తమ సూత్ర గ్రంధము లందు భట్టుల కృతియందును చూచి గ్రహించాలి. హేమాద్రి యందలి నాగర ఖండమందిట్లా – సంచయనం కొరకు మూడు శ్రాద్ధములు. ఇప్పుడు వాటిని విను. ఏ స్థానమందు మరణించాడో అక్కడ శ్రాద్ధం చేయాలి. పిదప మార్గమందు ఎక్కడ విశ్రాంతి చేశారో అక్కడ ఏకోద్దిష్టం చేయాలి. ఆ పిదప సంచయనం కొరకు మూడవ శ్రాద్ధము చెప్పాము,అని. అపరార్కమందు మదనరత్నమందును బ్రాహ్మోక్తి ఇట్లా – సద్యః శౌచమందు, ఏకాహ మందును, అప్పుడే సంచయనం చేయాలి. మూడు రోజుల ఆశౌచమందు మూడవరోజు అస్థి సంచయనము చేయాలి,అని. అక్కడే – నాల్గవరోజున శ్మశాన దేవతా యాగం చేయాలి. మట్టి పాత్రలలో అందమైన గిన్నెలలో కుంభములందుకాని, బాగా పక్వమైన భక్ష్యభోజ్యములతో పాయసములతో అట్లాగే పానకములతో, ఫలములు, మూలములు, వనములందు లభించే వానితో అపక్వమాంస భక్షకులైన దేవతలను పూజించాలి,అని. ధూపము, దీపము, మాలలు, అర్ఘ్యము వీనిని త్వరగా ఇవ్వాలి. అక్కడ నిండిన పాత్రలను శ్మశానాగ్నికి చుట్టూ పెట్టాలి. వారంతా అనహంకృతులై నివేదన (విజ్ఞాపన) చేస్తూ చెప్పాలి. క్రవ్యాదముఖ్యులైన దేవతలకు సర్వదా నమస్కారము,అని. ఇక్కడ శ్మశానంలో ఎప్పుడూ ఉండే పూజ్యులైన దేవతలు మీరున్నారో, అట్టి మీరు మా దగ్గరి నుండి అష్టాంగమైన అక్షయమైన ఈ బలిని తీసుకోండి,అని. ఈ ప్రేతకు శాశ్వతమైన పుణ్యలోకములను ఇవ్వండి, అట్లాగే మాకు, ఆయువు, ఆరోగ్యము, సుఖము చిరంగా ఇవ్వండి,అని. ఈ రకంగా బలిచేసి, మౌనంగా అన్నిటిపై పాలను చిలకరించి, ఈ రకంగా బలి ఇచ్చి బుధుడు మూడు పిండము లివ్వాలి. ఒక పిండము శ్మశాన వాసులకు, మధ్యమ పిండము ప్రేత కొరకు, మూడవది ఆతని స్నేహితులకొరకు దక్షిణంవైపు తిరిగి (అపసవ్యంగా) ఆదరంగా ఇవ్వాలి. ఆ పిదప యజ్ఞీయ వృక్షం నుండి వచ్చిన శాఖను తీసుకొని మౌనంగా, ప్రధాన అంగముల నుండి వచ్చిన ప్రేతాస్థులను తీసుకోవాలి. శిరస్సు, వక్షము, చేతులు, పక్కలు, పాదములు ఈ

అస్థికలు తీసుకొని పంచగవ్యంతో స్నానం చేయించి పట్టు వస్త్రంలో చుట్టాలి. వానిని శుభమైన కొత్త మట్టి కుండలో ఉంచి, బట్టతో కప్పి కుండను అరణ్యమందో శుద్ధమైన వృక్షమూల మందో ఉంచాలి కూడా.

మూ॥ **గృహీత్వాస్థీని తద్భస్మ నీత్వాతోయే వినిక్షిపేత్. తతః సమ్మార్జనం భూమేః** కర్తవ్యం గోమయాం బుభిః. పూజాచ పుష్ప ధూపాద్యైః బలిభిః పూర్వ వత్క్రమాత్, ఇతి. **అథతీర్థేఽస్థిక్షేప విధిః.** తత్రైవ - తత్ స్థానాచ్ఛన్న కైర్నీత్వా కదాచిజ్జాహ్నవీజలే, కశ్చిత్ క్షిపతి సత్పుత్రో దౌహిత్రో వాసహోదరః. **మాతుః కులం పితృకులం** వర్జయిత్వా నరాధమః, అస్థీన్యన్య కులస్థస్య నీత్వా చాంద్రాయణం చరేత్. తత్రైవ బ్రహ్మాండపురాణే - అస్థీనిమాతా పితృ పూర్వజానాం నయంతి గంగామపియే, కథంచిత్, సద్బాంధవస్యాపి దయాభి భూతాస్తేషాంతు తీర్థాని ఫలప్రదాని. స్నాత్వాతతః పంచ గవ్యేన సిక్త్వా హిరణ్య మధ్వాజ్యతిలైశ్చయోజ్యః. తతస్తు మృత్పిండపుటే నిధాయ పశ్యన్ దిశం ప్రేతగణో పరూఢాం. నమోఽస్తు ధర్మాయ వదత్ప్రవిశ్యజలం సమేప్రీత ఇతి క్షిపేచ్చ. ఉత్థాయ భాస్వంతమవేక్ష్య సూర్యం సదక్షిణాం విప్రముఖ్యాయ దద్యాత్. ఏవం కృతే ప్రేత పురః స్థితస్య స్వర్గేగతిః స్యాత్తు మహేంద్ర తుల్యా. **యమః** - గంగాతోయేషు యస్యాస్థి క్షిప్యతే శుభకర్మణః నతస్య పునరావృత్తిః బ్రహ్మలోకాత్సనాతనాత్. **తథా - అస్తంగతేగురౌశుక్రేతథా** మాసే మలిమ్లుచే, గంగాయా మస్థినిక్షేపం నకుర్యాదితి గౌతమః **దశాహాంతర్నదోషః** - దశాహోభ్యంతరే యస్యగంగాతోయేఽస్థిమజ్జతి, గంగాయాం మరణం యాదృక్తాదృక్ఫల మవాప్నుయాత్, ఇతి మదనరత్నే వృద్ధమనూక్తేః. **శౌనకః - శౌనకోఽహం** ప్రవక్ష్యామి అస్థిక్షేప విధిం క్రమాత్, అదౌ గ్రామాద్బహిర్గత్వా స్నానం కృత్వాస చైలకం, ప్రోక్షయేత్పం చ గవ్యేన భువం మంత్రైర్విచక్షణః గాయత్ర్యాద్యైః పంచగవ్య మంత్రైః నిఖాతాస్థి భూమిం ప్రోక్ష్యైత్యర్థః ఉపసర్పాదిభిర్మంత్రైః ప్రార్థనం ఖననం తథా, మృత్తికోద్ధరణం చా స్థ్నాం గ్రహణం చ యథాక్రమం, ఉపసర్పేతి చతుర్భిర్మంత్రైః క్రమేణ ప్రార్థనాది జ్ఞేయం.

అను॥ అస్థులను, వాని బూడిదను తీసుకొని పోయి నీటియందు పారవేయాలి. పెండ నీళ్ళతో ఆ పిదప భూమిని సమ్మార్జన చేయాలి. పుష్ప ధూపాదులతో బలులతో ముందరివలె క్రమంగా పూజ చేయాలి. ఇక తీర్థమందు అస్థిక్షేప విధి - అక్కడే - ఆపాతిన స్థానము నుండి మెల్లగా తీసుకుపోయి ఎప్పుడైనా గంగా జలమందు ఒక మంచి పుత్రుడో, దౌహిత్రుడో, సహోదరుడో వేయాలి, అని. మాతృకులము, పితృకులము వదలి,న రాధముడు అన్యకులస్థుని అస్థులను తీసుకుపోతే చాంద్రాయణ వ్రతమాచరించాలి. అక్కడే బ్రహ్మాండ పురాణమందిట్లా - మాతాపితరుల, పూర్వజుల అస్థులు ఎవరైనా ఏదో విధంగా గంగకు తీసుకుపోతే, దయగలవారై సద్బంధువులవి కూడా తీసుకుపోతే వారికి తీర్థములు ఫలప్రదము లౌతాయి. (తీర్థఫలం),అని. స్నానంచేసి, పిదప పంచగవ్యంతో తడిపి, బంగారం, తేనె, నెయ్యి, నువ్వులతో కలపాలి. ఆ పిదప మృత్పిండము యొక్క పుటమందుంచి దక్షిణ

దిక్కును చూస్తూ, ధర్మునకు నమస్కారము అని అంటూ నీటిలో ప్రవేశించి, ఆతడు నాయందు ప్రసన్నుడు కాని (సమేప్రీతః) అని పారవేయాలి కూడా లేచి వెలిగే సూర్యుని చూచి దక్షిణతో కూడా సూర్యుని విప్రముఖ్యునకు ఇవ్వాలి. ఇట్లా చేస్తే ప్రేత పురమందున్న వానికి స్వర్గమందు మహేంద్రునితో సమానమైన గతి లభిస్తుంది. యముడిట్లా – శుభకర్మ గలవాని అస్థికలు గంగాతోయమందు వేసిన యెడల వానికి సనాతనమైన బ్రహ్మ లోకం నుండి పునరావృత్తి లేదు,అని. అట్లాగే – గురు శుక్రులు అస్తమించాక, అట్లాగే మలమాసమందు గంగ యందు అస్థి నిక్షేపము చేయరాదు,అని గౌతమోక్తి,అని. దశాహముల లోపల దోషం లేదు,అని. ఆశౌచం పది రోజులలో ఎవని అస్థికలు గంగాతోయమందు మునుగుతాయో వాడు గంగయందు మరణిస్తే ఎంత పుణ్యం లభిస్తుందో అంత ఫలమును పొందుతాడు,అని మదనరత్నమందు వృద్ధమనూక్తి. శౌనకుడిట్లా – శౌనకుణ్ణి నేను క్రమంగా అస్థి క్షేప విధిని చెబుతున్నాను. తొలుత గ్రామం నుండి బయటికి వెళ్ళి, సచేల స్నానం చేసి, విచక్షణుడు మంత్రములతో పంచగవ్యంతో భూమిని ప్రోక్షించాలి. గాయత్రి మొదలగు మంత్రములతో పంచ గవ్యమును, ఎముకలు పాతిన భూమిపై ప్రోక్షించి, అని అర్థము. ఉపసర్పాది మంత్రములతో ప్రార్థనము, ఖననముకూడా. క్రమానుసారంగా మృత్తికను తీయటం, అస్థికలను తీసుకోవటం ఉపసర్ప అనే నాల్గు మంత్రములతో క్రమంగా ప్రార్థనాదులు అని తెలుసుకోవాలి.

మూ॥ స్నాత్వాఽస్థి శుద్ధిం కుర్వీత ఏతోన్వింద్రేతి సూక్తతః, స్పృష్ట్వా స్పృష్ట్వా తతః స్నానం పంచగవ్యేన శుధ్యతి. దశస్నానాని కుర్వీత తత్తన్మంత్రైర్విచక్షణః. **గోమూత్రం గోమయం** క్షీరం దధిసర్పిః కుశోదకం, భస్మ మృన్మధువారీణి మంత్ర తస్నాని వైదశ. కుశైః సమ్మార్జయే దస్థీన్యతో దేవేతి మంత్రతః, ఏతోన్వింద్రం శుచీవేతి నతమంహ ఇతీతిచ, పాపమానీర్మమాగ్నేచ రుద్ర సూక్తం యథా క్రమం. ఏతైః కుశైర్మార్జనం. **హేమశ్రాద్ధం తతః కుర్యాత్పితౄనుద్దిశ్య యత్నతః పిండదానం ప్రకుర్వీత తతశ్చ తిలతర్పణం.** అస్థిక్షేపాంగం చేదం. **అజినం కంబలా** దర్భాగోకేశాః శాణమేవ చ, భూర్జపత్రం తాడపత్రం సప్తధావేష్టనం స్మృతం. **హేమం చమౌక్తికం రూప్యం** ప్రవాలం నీలకంతథా, నిక్షిపేదస్థి మధ్యేతు శుద్ధిర్భవతి నాన్యథా. **తతోహోమం ప్రకుర్వీత** తిలాజ్యేన విచక్షణః, ఉదీరతేతి సూక్తేన హునే దష్టోత్తరం శతం. తతోగత్వాక్షిపేత్తీర్థే స్పర్శదోషోన విద్యతే. మూత్రం పురీషా చమనం కుర్వన్నాస్థీ నిధారయేత్. అత్ర దశదానం వైతరణీ ఋణమోక్ష పాపధేను దానముక్తం. **దివోదాసీయే కాశీఖండే** – ధనం జయోఽపి ధర్మాత్మా మాతృభక్తి పరాయణః ఆదాయాస్థీన్యథో మాతుః గంగా మార్గస్థితోఽభవత్. పంచగవ్యేన సంస్నాప్య తథా పంచామృతేనవై, యక్షకర్దమలేపేన లిప్త్వా పుష్పైః ప్రపూజ్య చ, ఆవేష్ట్య తత్ర వస్త్రేణ తతః పట్టాంబరేణచ, తతః సురస వస్త్రేణ తతోమాంజిష్ఠ వాససా, నేపాల కంబలేనాథ మృదాచాథ విశుద్ధయా, తామ్ర సంపుటకే కృత్వా మాతురంగా న్యథో వహేత్. వ్యాసః – పట్టవస్త్రం చ

కౌశేయం మాంజిష్టం శ్వేత వస్త్రకం, కంబలం శాణ పత్రం చ అజినం చతథోత్తరం. ఏషాం వికల్పాః. అన్యశ్చాత్ర విశేష స్త్రి స్థలీసేతౌ దివోదాసీయే చ జ్ఞేయః. **సంచయనోత్తరం శ్రాద్ధ మాశ్వలాయనః** - శ్రాద్ధ మస్మైదద్యుః ఇతి. స్మృత్యర్థసారే - సంచయనే కృతే మనుష్యలోకాత్ ప్రేతలోకం గచ్ఛతః పాథేయ శ్రాద్ధ మామేన కార్యమితి. **అనుపనీతస్యన** సంచయనం.

అను॥ స్నానం చేసి, ఏతోన్వింద్రం, అను సూక్తంతో అస్థి శుద్ధిని చేయాలి మంత్రంతో స్పృశించి స్పృశించి ఆ పిదప స్నానం చేసి పంచ గవ్యంతో శుద్ధి నందుతుంది. విచక్షణుడు ఆయా మంత్రములతో పది స్నానములు చేయాలి. గోమూత్రము, గోమయము, క్షీరము, పెరుగు, నేయి, కుశల నీరు, భస్మము, మట్టి, తేనె, నీరు, మంత్రములు వీనికి చెందినవి. అవి పది. కుశలతో అస్థులను సమ్మార్జన చేయాలి, అతోదేవ అనుమంత్రముతో, ఏతోన్వింద్రం, శుచీవ, నతమంహ (పదమూడివి) పావమానీ, మమాగ్నే, రుద్రసూక్తం వీనితో క్రమాంగా కుశలతో మార్జన చేయాలి. (ఆయాపై జెప్పిన మంత్రాలతో మార్జన). ఆ పిదప ప్రయత్న పూర్వకముగా పితరుల నుద్దేశించి హోమ శ్రాద్ధం చేయాలి. పిండదానం చేయాలి. ఆ పిదప తిలతర్పణము. ఇది అస్థిక్షేపమునకు అంగము. జింకచర్మము, గొంగడి, దర్భలు, గోకేశములు, శాణపత్రము, భూర్జపత్రములు, తాడపత్రములు ఈ ఏడు రకములైన వాటితో అస్థులను చుట్టాలన్నారు. బంగారము, ముత్యము, వెండి, పగడము, నీలము వీనిని అస్థుల మధ్యలో పెట్టాలి. అట్లాఐతే శుద్ధి ఔతాయి. లేకుంటే కావు. విచక్షణుడు, ఆ పిదప తిల ఆజ్యములతో హోమం చేయాలి. ఉదీరత, అను సూక్తంతో (అష్టోత్తర శతం) నూటా ఎనిమిది మార్లు హోమం చేయాలి. ఆ పిదప, తీర్థ సమీపమునకు వెళ్ళి అందులో వేయాలి. అప్పుడు స్పర్శ దోష ముండదు. మూత్రము, పురీషము, ఆచమనము చేస్తూ అస్థులను పట్టుకోరాదు. ఇక్కడ దశదానములు, వైతరణీదానం, ఋణధేను, మోక్షధేను, పాపధేను దానములను చేయాలని చెప్పారు. దివోదాసీయమందు కాశీఖండోక్తి ఇట్లా - ఆ పిదప ధర్మాత్ముడు, మాతృభక్తి పరాయణుడు ధనంజయుడు కూడా తల్లి అస్థికలను తీసుకొని గంగా మార్గమందున్న వాడాయెను,అని. పంచగవ్యంతో, అట్లాగే పంచామృతంతోను స్నానం చేయించి యక్ష కర్దమ లేపనము పూసి (కర్పూరాదులతో చేసిన లేపనం) పూలతో పూజించి, అక్కడ వస్త్రంతో చుట్టి ఆ పిదప పట్టు వస్త్రంతోను చుట్టి ఆ పిదప లాలిత్యము గల వస్త్రముతో చుట్టి, ఆ పిదప మాంజిష్ఠ వస్త్రముతో చుట్టి (ఎరుపు మించిన పసుపు రంగు గల), ఆపై నేపాలకంబళముతో చుట్టి, విశుద్ధమైన మట్టి లేపనం చేసి, రాగి సంపుట మందుంచి (డబ్బ) ఆపై మాతృ అంగములను (అస్థికలను) తీసుకుపోవాలి. వ్యాసుడిట్లా - పట్టువస్త్రము, కౌశేయము, మాంజిష్ఠము, శ్వేతవస్త్రము, కంబలము, శాణపత్రము (సూత్రం) అజినము ఆ తరువాత,అని. ఇవి వికల్పము. ఇంకను ఇక్కడ విశేషములను త్రిస్థలీ సేతువు యందు దివోదాసీయమందును చూచి గ్రహించాలి. సంచయనం తరువాత శ్రాద్ధాన్ని

ఆశ్వలాయనుడు చెప్పాడు - వీనికి శ్రాద్ధమివ్వాలి,అని. స్మృత్యర్థ సారమందిట్లా - సంచయనం చేశాక మనుష్య లోకం నుండి ప్రేత లోకానికి వెళ్ళేవారికి పాథేయ (చద్దిమూట, బాటబత్తెం) శ్రాద్ధమును ఆమంతో చేయాలి,అని. అనుపనీతునకు అస్థిసంచయనం లేదు.

మూ॥ **అథ నవశ్రాద్ధం.** పృథ్వీ చంద్రోదయే అంగిరాః - ప్రథమేఽహ్ని తృతీయే చ పంచమే సప్తమే తథా, నవమైకాదశే చైవ తన్నవ శ్రాద్ధ ముచ్యతే. శివస్వామీ - నవశ్రాద్ధాని పంచాహు రాశ్వలాయన శాఖినః, ఆపస్తంబా షడిత్యాహుః విభాషాత్వితరేషుహి. పంచ ఏకాదశాహికంవినా, మరణాద్విష మేషు దినేష్వేకైకం నవశ్రాద్ధం కుర్యాదానవమాత్, యదినవమం విచ్ఛిద్యే తైకాదశే తత్కుర్యాత్, ఇతి మదనరత్నే బౌధాయనోక్తేః. భవిష్యే - నవ సప్త విశాం రాజ్ఞాం నవ శ్రాద్ధాన్యను క్రమాత్, ఆద్యంతయో ర్వర్ణయోస్తు షడిత్యాహుర్మహర్షయః. హేమాద్రౌ వృద్ధ వసిష్ఠః - అలబ్ధ్వాతు నవశ్రాద్ధం ప్రేతత్వాన్నైవ ముచ్యతే, అర్వాక్తు ద్వాదశాహస్య లబ్ధ్వాతరతి దుష్కృతం. అతఃషడేవ. ఏతాన్యేవ విషమ శ్రాద్ధానీత్యుచ్యంతే. నాగరఖండేతు - పంచమే సప్తమే తద్వదష్టమే నవమే తథా, దశమైకాదశే చైవ నవశ్రాద్ధాని తానిచ, ఇత్యుక్తం. కాత్యాయనస్తు - చతుర్థే పంచమే చైవ నవమైకాదశే తథా, యదత్ర దీయతే జంతోః తన్నవ శ్రాద్ధముచ్యతే. ప్రథమే సప్తమే చైవే త్యాద్యపాదే వ్యాసపారః. బహ్వృచానాంతు - నవశ్రాద్ధందశాహాని నవమిశ్రంతు షడృతూనిత్యుక్తం నారాయణ వృత్తౌ. దీపికాయాం - అథ తనుయా దాద్యే చతుర్థే దినే శ్రాద్ధం పంచమ సప్తమాష్ట నవదిక్ రుద్రేషు యుగ్మద్విజైః. ప్రథమేఽహ్ని తృతీయేఽహ్ని పంచసప్తనవస్వపి, ద్వౌద్వౌ పిండౌ ప్రదాతవ్యౌ శేషేష్వేకేతు విన్యసేత్. ఏకోవిషమ శ్రాద్ధే అవయవ పిండశ్చైక ఇతి ద్వావిత్యర్థః. అత్ర శాఖాభేదాద్వ్యవస్థా. అపరార్కే భవిష్యే - నవశ్రాద్ధం త్రిపక్షంచ షణ్మాసం మాసికానిచ, నకరోతి సుతౌ యస్తు తస్యాధః పితరోగతాః, వారాహే - గతోఽసి దివ్యలోకంత్వం కృతాంత విహితాత్పథః, మనసా వాయుభూతేన విప్రత్వాహం నియోజయే, పూజయిష్యామి భోగైస్త్వామేవం విప్రం నిమంత్రయేత్. ఆవాహనేఽపి తత్రైవ - ఇహ లోకం పరిత్యజ్య గతోఽసి పరమాంగతిం, మనసా వాయుభూతేన విప్రేత్వాహం నియోజయే, ఇతి. తత్రైవ బహ్వృచ పరిశిష్టే - అనూదకమధూపం చ గంధమాల్య వివర్జితం, నవశ్రాద్ధమ మంత్రం చ పిండోదక వివర్జితం, ఉదక మర్ఘ్యః. పిండోదకం శుంధంతాం పితరః, ఇత్యవనే జనాది. ఏకోద్దిష్టేషు సర్వేషు నస్వధానాభి రమ్యతాం, నాగ్నౌకరణ మంత్రశ్చ ఏకం వాథ తిలోదకం. అనపత్యేషు సర్వేషు నస్వధా నాభిరమ్యతాం, స్వస్త్యస్తు విసృజే దేవం సకృత్ప్రణవ వర్జితం. ఏకోద్దిష్టస్య పిండేతు అత్రశబ్దోన విద్యతే, పితృశబ్దం నకుర్వీత పిత్రహాచోపజాయతే. సపిండనాత్ప్రాగితి హేమాద్రిః తేన నచ స్వధాం ప్రయుంజీత ప్రేతశ్రాద్ధే దశాహికే. ఇతి ఋష్యశృంగోక్తౌ దశాహికోక్తేః ఏకాదశాహే స్వధా ప్రయోగ ఏవేతి హారలతా పరాస్తా.

అను॥ ఇక నవశ్రాద్ధము. పృథ్వీ చంద్రోదయమందు అంగిరోక్తి ఇట్లా - ప్రథమ దినము, తృతీయ, పంచమ, సప్త, నవమ, ఏకాదశ దినములందలి శ్రాద్ధములు నవశ్రాద్ధ మనబడుతాయి,అని. శివస్వామి ఇట్లా - ఆశ్వలాయన శాఖవారు నవశ్రాద్ధములు ఐదు అని అన్నారు. ఆపస్తంబులు ఆరు అని అన్నారు. ఇతరులు వికల్పమన్నారు. (ఐతరేయులు ఐదో ఆరో అన్నట్టు),అని. ఐదు అన్నది పదకొండవ రోజు శ్రాద్ధాన్ని వదలి. మరణం

తరువాత విషమ దినములందు ఒక్కొక్కటి తొమ్మిదవ రోజు వరకు నవశ్రాద్ధము చేయాలి. ఒకవేళ తొమ్మిదవది విచ్ఛిత్తిఐతే దానిని పదకొండవ రోజున చేయాలి,అని మదనరత్నమందు బౌధాయనోక్తి. భవిష్యమందిట్లా - తొమ్మిది వైశ్యులకు ఏడు క్షత్రియులకు వరుసగా నవ శ్రాద్ధములు బ్రాహ్మణ, శూద్రులకైతే ఆరు అని మహర్షులన్నారు,అని. హేమాద్రి యందు వసిష్ఠుడిట్లా - నవశ్రాద్ధాన్ని పొందకుండా ప్రేతత్వం నుండి ముక్తినందదు. పన్నెండవ రోజు కన్న ముందు నవశ్రాద్ధాన్ని పొంది దుష్కృతం నుండి తరిస్తాడు,అని. అందువల్ల ఆరే. వీనినే విషమ శ్రాద్ధములని అంటారు. నాగర ఖండమందైతే - ఐదవ, ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ, పదవ, పదకొండవ రోజుల శ్రాద్ధాలను నవ శ్రాద్ధాలు అంటారు అని చెప్పారు. కాత్యాయనుడైతే - నాల్గవ, ఐదవ, తొమ్మిదవ, పదకొండవ రోజులందు ప్రాణికి దేన్ని ఇక్కడ ఇస్తామో,అది, నవ శ్రాద్ధమంటారు,అని. తొలిపాదంలో ప్రథమము, సప్తమము అని వ్యాసపాఠము. బహ్వృచులకైతే - నవశ్రాద్ధము పదిరోజులు చేయాలి నవ మిశ్రమమును (మాసికాది) ఆరు ఋతువులందు చేయాలి, అని నారాయణ వృత్తియందు చెప్పారు. దీపిక యందిట్లా - ఇక ప్రథమ దినము, నాల్గవ దినము, ఐదు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది, పదకొండు రోజులందు శ్రాద్ధమును ఇద్దరు బ్రాహ్మణులతో చేయాలి, అని (ఏకోద్దిష్టవిధిగా) ప్రథమ, తృతీయ, పంచమ, సప్తమ, నవమ దినములందు, రెండేసి పిండములివ్వాలి. మిగిలిన రోజులలో ఒక పిండమివ్వాలి. విషమ శ్రాద్ధమందు ఒకటి, ఒకటి అవయవ పిండము,అని రెండు అని అర్థము. ఇక్కడ శాఖా భేదము ననుసరించి నిర్ణయము. అపరార్కమందు భవిష్యోక్తి ఇట్లా - నవశ్రాద్ధము, త్రిపక్షము, షణ్మాసము, మాసికములు, వీనిని పుత్రుడు ఆచరించకపోతే వాని పితరులు అధఃపతితులౌతారు, అని (నరకం) వారాహ మందిట్లా - యముడు ఏర్పరచిన మార్గం గుండా నీవు దివ్య లోకమునకు వాయువుగా ఐన మనస్సుతో వెళ్ళావు. ఓ విప్ర, నిన్ను నేను నియోగిస్తున్నాను. భోగములతో నిన్ను పూజిస్తాను, అని ఈ విధంగా విప్రుని నిమంత్రించాలి, అని. ఆవాహనమందు కూడా అక్కడే - ఈ లోకమును వదలి, వాయువుగా ఐన మనస్సుతో ఉత్తమ గతికి వెళ్ళావు ఓ విప్ర నిన్ను నేను నియుక్తం (ఏర్పరచటం) చేస్తున్నాను,అని. అక్కడే బహ్వృచ పరిశిష్ట మందిట్లా - ఉదకం, ధూపము, గంధము, మాలలు, మంత్రము, పిండోదకము వీనిని నవ శ్రాద్ధమందు చేయరాదు,అని. ఉదకమనగా అర్ఘ్యము, పిండోదకమనగా శుంధంతాం పితరః,అని పాద ప్రక్షాళనం మొదలైనవి. ఏకోద్దిష్టములన్నింటా స్వధా, అభిరమ్యతాం, అగ్నౌకరణ మంత్రం, ఒక తిలోదకము ఇవేవీ ఉండవు. (ఉంటే తిలోదకం ఉంటుంది). సంతానం లేని వారికందరికి స్వధా, అభిరమ్యతాం అను శబ్దాలు లేవు ఒక్కసారి ప్రణవం లేకుండా, స్వస్త్యస్తు అని పలికి ఇట్లా వదలాలి. ఏకోద్దిష్ట పిండమందు, అత్ర పితరోమాధయధ్వం, అనే శబ్దం ఉండదు. పితృశబ్దం పలుకరాదు. పలికితే పితృ

హంతకుడౌతాడు. ఇది సపిండనం కంటే ముందు అని, హేమాద్రి. అందువల్ల - ప్రేత శ్రాద్ధమందు, దశాహిక మందు స్వధా శబ్దం ప్రయోగించరాదు,అని చెప్పిన ఋష్యశృంగోక్తి యందు దశాహిక శబ్దమున్నందువల్ల, పదకొండవ రోజు యందు స్వధా ప్రయోగమే, అని హారలతాదుల వచనం పరాస్తమైంది.

మూ॥ **రత్నావల్యాం - ఆశిషో** ద్విగుణాదర్భాజయాశీః స్వస్తి వాచనం, పితృశబ్దః, స్వసంబంధః, శర్మశబ్దః తథైవచ. పాత్రాలంభోఽవగాహశ్చ ఉల్ముఖోల్లేఖ నాదికం, తృప్తి ప్రశ్నశ్చ వికిరః, శేష ప్రశ్నః తథైవచ, ప్రదక్షిణా, విసర్గశ్చ, సీమాంత గమనం తథా, అష్టాదశ పదార్థాశ్చ ప్రేత శ్రాద్ధే వివర్జయేత్. అత్ర స్వధా పితృనమః శబ్దానాం, తిలోసి ఇతి మంత్రే ప్రేత శబ్దోహేన తూష్ణీంవా తిలావపనం. తూష్ణీ మర్ఘ్యదానమ్. అముష్మై స్వాహేతి ప్రేత నామ్నా పాణిహోమః, నామ్నా ఏకః పిండః, నినయన మంత్రే ఊహః. అనుమంత్రణాది త్వమంత్రకం. అభిరమ్యతామితి విసర్జనం, ఏవం నవశ్రాద్ధ వర్జైకోద్దిష్టేషు. నవశ్రాద్ధేతు అమంత్రకం సర్వం, ఇతి నారాయణ వృత్తిః. **క్రియానిబంధే** - ఉత్తానం స్థాపయేత్పాత్రమేకోద్దిష్టే సదాబుధః, న్యుబ్జంతు పార్వణే కుర్యాత్త స్యోపరి కుశాన్ న్యసేత్. **నవశ్రాద్ధం గృహేకుర్యాత్** భార్యా యత్రాగ్నయోఽపివా, సపిండీకరణాంతాని ప్రేత శ్రాద్ధాని యానివై, తాని స్యుర్లౌకికే వహ్నౌ విత్యాహ త్వాశ్వలాయనః. **ఇదం సంభవేఽన్నేన** కార్యం. **నవశ్రాద్ధేషు** యచ్ఛిష్టం గ్రహ పర్యుషితం చయత్, దంపత్యోర్భుక్త శేషం చ నతద్ భుంజీత కర్హిచిత్, ఇతి అంగిరోవచన లింగాత్. ద్వాభ్యాం సదాతు కృచ్ఛ్రాభ్యాం శుద్ధిః స్యాత్తు వివేకినాం, ఇతి బ్రాహ్మే ఉక్తం. **విఘ్నేతు నిర్ణయామృతే కణ్వః** - నవశ్రాద్ధం మాసికం చయద్యదం తరితం భవేత్, తత్తదుత్తరసాతం త్ర్యాదనుష్ఠేయం ప్రచక్షతే. హేమాద్రౌగాలవః - శవేతు సూతకం చేత్స్యాన్ని శాయాం చమృతౌతయా నవశ్రాద్ధాని దేయాది యధాకాలం యధాక్రమం నిశాయా మాశౌచాంతే ద్వ్యహ వృద్ధౌ. **అన్వారోహణేతు - నవశ్రాద్ధాని** సర్వాణి సపిండీకరణం పృథక్, ఏక ఏవ వృషోత్సర్గో గౌరేకా తత్రదీయతే. **ఆశౌచాంత్యదినే కార్యముక్తం** బ్రాహ్మే - యస్యయస్యతు వర్ణస్య యద్యత్స్యాత్పశ్చిమం త్వహః సతత్ర వస్త్ర శుద్ధించ గృహ శుద్ధిం కరోత్యపి. సమాప్య దశమం పిండం ప్రేత స్పృష్టేతు వాససీ, అంత్యా నామాశ్రితానాం చ త్యక్త్వా స్నానం కరోతిచ. శ్మశ్రులోమ నఖానాం చ యత్త్యాజ్యం తజ్జహాత్యపి, గౌరసర్షపకల్కేన తిలకల్కేన సంయుతం. శిరః స్నానం తతః కృత్వాతో యేనా చమ్య వాగ్యతః, వృషభంగాం సువర్ణం చ స్పృష్ట్వా శుద్ధో భవేన్నరః క్రియా నిబంధే గృహ్యా కారికాయాం - అత్రపిండ త్రయందద్యుః తత్సఖిభ్యస్తథాదిమం. ప్రేతాయ మధ్యమం తద్వత్తృతీయం చయమాయవై.

అను॥ రత్నావలియందిట్లా - ఆశీస్సులు, రెట్టింపు దర్భలు, జయాశీస్సులు, స్వస్తి వాచనము, పితృశబ్దము, స్వసంబంధము, అట్లాగే శర్మ శబ్దము, పాత్ర స్పర్శ, ద్విజాంగుష్ఠ నివేశనము, ఉల్ముఖము (జ్వలదంగారము), ఉల్లేఖనము మొదలగునవి, తృప్తి ప్రశ్న మిగిలిన అన్నం ఏం చేయాలి అనే ప్రశ్న, వికిరము, శేష ప్రశ్న ప్రదక్షిణం, విసర్జనము, సీమాంత

గమనము, ఈ పద్దెనిమిదింటిని ప్రేత శ్రాద్ధమందు విడిచి పెట్టాలి,అని. ఇక్కడ స్వధా, పితృ, నమః శబ్దములు, తిలోసి, అను మంత్రమందు ప్రేత శబ్దము ఊహతో లేదా మౌనంగా తిలావాపము మౌనంగా అర్ఘ్య దానము. అముష్మై స్వాహా, అని ప్రేత నామంతో పాణి యందు (తో) హోమము. నామంతో ఒక పిండము. నినయన మంత్రమందు ఊహ. అను మంత్రణాదులు (మంత్రం చదువుతూ సంస్కారం) మంత్రములు లేకుండా చేయాలి. అభిరమ్యతామని విసర్జనము. ఈ విధంగా నవశ్రాద్ధం కాక మిగిలిన ఏకోద్దిష్టములందు చేయాలి. నవశ్రాద్ధమందైతే మంత్రం లేకుండానే అంతా, అని నారాయణ వృత్తి చెప్పింది. క్రియా నిబంధమందిట్లా - బుధుడు, ఏకోద్దిష్ట మందు ఎల్లప్పుడు, పాత్రను వెల్లకిలగా ఉంచాలి. పార్వణమందు బోర్లించాలి దానిపై కుశలనుంచాలి,అని. నవశ్రాద్ధమును గృహమందు, భార్య, అగ్నులుకాని ఉన్నచోట చేయాలి. సపిండీకరణాంతములైన ప్రేత శ్రాద్ధములను లౌకికాగ్నియందు చేయాలి,అని ఆశ్వలాయనుడు చెప్పాడు. ఇది వీలైతే అన్నంతో చేయాలి. నవశ్రాద్ధములందు మిగిలింది, వాడగా మిగిలింది ఉందో, భార్యాభర్తలు తినగా మిగిలినదుందో దాన్ని ఎట్టిస్థితిలోనూ తినరాదు,అని అంగిరుని వచన ప్రమాణం. వివేకులకు అప్పుడు రెండు కృచ్ఛ్రములతో శుద్ధి అని బ్రాహ్మమందు చెప్పారు. విఘ్నమైతే నిర్ణయామృత మందు కణ్వోక్తి ఇట్లా - నవశ్రాద్ధము, మాసికము ఒకవేళ విఘ్నమైతే దానిని తరువాతి ప్రధానమైన దానితో చేయాలని అన్నారు,అని. హేమాద్రి యందు గాలవోక్తి ఇట్లా - శవా శౌచమందు సూతకం వస్తే, ఆమె నిశియందు మరణిస్తే నవశ్రాద్ధాదులు యథాకాలమందు యథాక్రమంగా ఇవ్వాల్సినవి ఇవ్వాలి,అని. నిశాయామనగా ఆశౌచాంత మందు రెండు రోజుల వృద్ధియందు (చేసి) ఇవ్వాలి. అన్వారోహణమందైతే - అన్ని నవ శ్రాద్ధములు, సపిండీకరణము విడివిడిగా చేయాలి. ఒక వృషోత్సర్గమే ఉంటుంది. ఒక ఆవు ఇవ్వబడుతుంది, అని. ఆశౌచాంత్యదినమందు చేయవలసిన దానిని బ్రాహ్మమందిట్లా చెప్పారు - ఏఏ వర్ణము వారికి ఏదేది ఆశౌచమునకు చివరిరోజో వారు ఆరోజు వస్త్ర శుద్ధి, గృహశుద్ధి చేసుకోవాలి, అని. పదవ పిండాన్ని సమాప్తి చేసి ప్రేతను ముట్టిన (తాకిన) వస్త్రములను అంత్యులకు ఆశ్రితులకు ఇచ్చి స్నానం చేయాలి, విడువతగిన శ్మశ్రులో మనఖములను విడువాలి. తెల్ల ఆవాల మడ్డి, నువ్వుల మడ్డి (పిండి) కలిపి (నదానితో) శిరః స్నానం చేసి ఆ పిదప నీటితో ఆచమనం చేసి మౌనంగా వృషభమును, ఆవును, బంగారాన్ని ముట్టినట్లైతే నరుడు శుద్ధుడౌతాడు. క్రియా నిబంధమందు గృహ్యకారిక యందిట్లా - ఇక్కడ మూడు పిండము లివ్వాలి. స్నేహితులకు మొదటిది ప్రేతకు మధ్యమ పిండము అట్లాగే మూడవది యమునకు, అని.

**మూ॥ తథా - కర్త్రాఽత్ర ప్రార్థితాః సంతోజ్ఞాతి సంబంధి బాంధవాః, దద్యురభ్యంగతః పూర్వం త్రీం స్త్రీన్ ధర్మోదకాంజలీన్. పూర్వవన్నామ గోత్రాభ్యాం నియమోనేహ కశ్చన. మధనరత్నే**

**పునరేవసః, ఇతి హేమాద్రౌ శంఖోక్తేః. పైఠీనసిః - ఏకాదశేఽహ్ని యచ్ఛ్రాద్ధం తత్సామాన్య ముదాహృతం, చతుర్ణామపి వర్ణానాం సూతకం తు పృథక్ పృథక్. యత్తు మరీచిః - ఆశౌచాంతే తతస్సమ్యక్ పిండదానం సమాప్యతే. తతః శ్రాద్ధం ప్రదాతవ్యం సర్వవర్ణేష్వయం విధిః, ఇతి. తత్సర్వ వర్ణానాం దాహాశౌచపరం. యత్తు విష్ణుః - అథాశౌచాపగమే, ఇతి. యచ్చ గౌడగ్రంథే హారీతః - శ్వోభూతే ఏకోద్దిష్టం కుర్యాత్. యచ్చ బైజవాపః - ఊర్ధ్వం దశమ్యా అపరేద్యుః, ఇతి తద్విప్రవిషయం. ఏతేన దశమ పిండోత్కర్ష పక్షే అవయవ పిండా సమాప్తౌ కథమేకాదశాహే శ్రాద్ధమితి మూర్ఖోక్తిః పరాస్తా. వచనాదా శౌచమధ్య ఇవతత్రాప్య విరోధాత్. భవిష్యే - ఏకాదశేభ్యో విప్రేభ్యో దద్యాదేకాదశేఽహని, భోజనం తత్ర చైకస్మై బ్రాహ్మణాయ మహాత్మనే.**

అను॥ శుద్ధితత్త్వమందు దేవలుడిట్లా - పాపపు రోజులు గడిచాక, చక్కగా స్నానం చేసి, శుభకరమైనవి నిర్వర్తించుకొని, బ్రాహ్మణుని వలన స్వస్తి వాచనము పొందినచో ఆశౌచము నుండి బ్రాహ్మణులు దూరమౌతారు,అని. యాజ్ఞవల్క్యుడిట్లా - చనిపోయిన రోజున సంవత్సరము వరకు ప్రతినెలలో శ్రాద్ధం చేయాలి. ప్రతివత్సరము కూడా. తొలిది పదకొండవ రోజున, అని క్షత్రియాదులు ఆశౌచమందును పదకొండవ రోజున శ్రాద్ధం చేయాలి. తొలి శ్రాద్ధము అశుద్ధ దినమందైనా పదకొండవ రోజున చేయాలి. కర్తకు తాత్కాలికమైన శుద్ధి. తిరిగి ఆతడు అశుద్ధుడే, అని హేమాద్రి యందు శంఖోక్తి. పైఠీనసి ఇట్లా - పదకొండవ రోజున ఏ శ్రాద్ధం చెప్పామో అది సామాన్యంగా చెప్పాము. కాని నాల్గు వర్ణముల వారికి సూతకం మాత్రం విడివిడిగానే, అని మరీచి ఇట్లా - ఆశౌచాంత మందు పిదప చక్కగా పిండదానము సమాప్తి చేయాలి. ఆ పిదప శ్రాద్ధ మాచరించాలి. అన్ని వర్ణముల వారికి ఇది విధి, అని ఏదన్నాడో అది సర్వవర్ణములకు పదవరోజు ఆశౌచ పరము. విష్ణువిట్లా - ఇక ఆశౌచం ఐపోయాక, అని ఏదన్నాడో, గౌడగ్రంథమందు హారీతుడిట్లా - రేపు ప్రొద్దున ఏకోద్దిష్టం చేయాలి, అని ఏదన్నాడో, బైజవాపుడిట్లా - దశమిపైన తరువాతిరోజున, అని ఏదన్నాడో, ఇవన్నీ విప్ర విషయకములు, అని. దీనితో ధశమ పిండము యొక్క ఆధిక్యత పక్షమందు, అవయవ పిండం సమాప్తి కాకుండానే పదకొండవ రోజున శ్రాద్ధం ఎట్లా కుదురుతుంది,అనే మూర్ఖోక్తి తొలగిపోయింది. వచనంవల్ల ఆశౌచ మధ్యమందు వలె అక్కడ కూడా విరోధం లేదు. భవిష్యమందిట్లా - పదకొండవ రోజున పదకొండుమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. అక్కడ ఒక మహాత్ముడైన బ్రాహ్మణునకు భోజనం పెట్టాలి,అని.

**మూ॥ యత్తు మాత్స్యే - ఏకాదశేఽహని తథా విప్రానేకాదశైవతు క్షత్రాదిః సూతకాంతేతు భోజయే దయుజోద్విజాన్,ఇతి. తద్రు ద్రగణ శ్రాద్ధ పరమితి మదన పారిజాతః గౌడస్త్వస్మాద్వచనాత్ క్షత్రియాదీనా మాశౌచాంత ఏవేత్యాహుః. రామాయణేఽపి - సమతీతే దశాహేతు కృతశౌచో యథావిధి, చక్రే ద్వాదశికం శ్రాద్ధం త్రయోదశిక మేవచ. ద్వాదశికం ద్వాదశాహేన నిర్వర్త్యం త్రయోదశాహ శ్రాద్ధం. త్రయోదశికం చతుర్దశాహ విధేయం సపిండన పాథేయాది. క్షత్రియాణాం**

ద్వాదశాహే శౌచే త్రయోదశే మహైకోద్దిష్టం చతుర్దశే సపిండనం. ద్వివిధ వాక్యా దేకాదశాహే శౌచాం త(ర)యోర్వికల్ప ఇత్యేకే. సద్యః శౌచాదౌ యుద్ధహతాదే రేకాదశాహే అన్యేషాం ఆశౌచాంత ఇతి వయం. కౌర్మే - ఏకాదశేఽహ్ని కుర్వీత ప్రేత ముద్దిశ్య భావతః, ద్వాదశే వాఽహ్ని కర్తవ్య మనింద్యే పృథవాఽహని. నింద్యం ప్రేత క్రియా కాలే ఉక్తం. ఏకాదశేతు ననిషేధ ఇత్యుక్తం ప్రాక్. బృహస్పతిః - వస్త్రాలంకార శయ్యాది పితుర్యద్వాహ నాదికం, గంధమాల్యైః సమభ్యర్చ్య శ్రాద్ధ భోక్త్రే తదర్పయేత్. శ్రోత్రియా భోజనీయాస్తు నవ సప్తత్రయోదశ, జ్ఞాతయో బాంధవానిః స్వొస్త్రధా చాతిథయోఽపరే. దేవయాజ్ఞిక నిబంధే - ఏకాదశ సువిప్రేషు ప్రేత మావాహ్య భోజయేత్, తత్రాద్యాయ చ శయ్యాది దద్యా దాద్యమితి స్మృతం. విష్ణుః. ఏకవన్మంత్రా నూహేత్తైకోద్దిష్టే, బహు వచనాం తానేక వచనాంతాన్ వదే దిత్యర్థః. ఏతద్బృష్టార్థత్వే. **అస్యవిఘ్నే గౌణకాల** మాహ హేమాద్రౌ బౌధాయనః - ఏకోద్దిష్టం శ్వ ఏవస్యాత్ ద్వాదశేఽహని వాపునః, అత ఊర్ధ్వమయుగ్మేషు కుర్వీతాహః సుశక్తితః. అర్ధమాసేఽథవా మాసి ఋతౌ సంవత్సరేఽపివా, ఇతి. **తత్రైవ లఘుహారీతః** - ఏకోద్దిష్టంతు కుర్వీత పాకే నైవ సదాస్వయం, అభావే పాక పాత్రాణాం తదహః సముపోషణం. **గోభిలః**-బ్రాహ్మణం భోజయేదాద్యే హోతవ్యమనలేఽథవా, పునశ్చ భోజయేదేకం ద్విరావృత్తి ర్భవేదితి. ఏతదాద్య మాసికాద్యాబ్దికయోః సిద్ధ్యర్థమితిభట్టాః. (తేన మహైకోద్దిష్టం షోడశ శ్రాద్ధాద్భిన్న మేవ. అత ఏ వాద్యం సర్వైకోద్దిష్ట ప్రకృతి భూతమే కాదశ ఇతి విజ్ఞానేశ్వరః. అన్యేత్వాద్య మాసికాబ్ది కయోః, అద్యమేకాదశేఽహని, ఇతి నియమాదభేద మాహుః ద్వయోస్తం త్రత్వ బాధార్థం గోభిలీయ మిత్యన్యే). **యుద్ధహతాదౌతు** హేమాద్రౌ పృథ్వీచంద్రోదయే పైఠీనసిః - సద్యః శౌచేఽపి దాతవ్యం ప్రేతస్యైకాదశేఽహని, సఏవదివసస్తస్య శ్రాద్ధ శయ్యాసనాదిషు. ఏవమేకా హాదౌ. అతోఽత్ర ద్వితీయేఽహ్ని ఏకాదశాహం వదన్ ధోంధుః శూలపాణిః స్మార్త గౌదాశ్చ పరాస్తాః. ఏతేన, ఆద్యమేకాదశేఽహని, ఇత్యాశౌచానంతర దినపరమితి విష్ణూక్తేః ప్రాగుక్త శంఖాది వచనానాం చానాకరత్వాదితి వదంతః కల్పతరువాచస్పతి ప్రముఖాః సర్వే నిబంధవిరోధా దుపేక్ష్యాః. ఉశనాః - త్ర్యహాశౌచేఽపి కర్తవ్యం. ఆద్యమేకాదశేఽహని, అతీత విషయేసద్యః త్ర్యహోర్ధ్వం వా తదిష్యతే.

అను|| మాత్స్యమందిట్లా - పదకొండవ రోజున పదకొండు మంది బ్రాహ్మణులను భుజింప చేయాలి. క్షత్రియాదులైతే సూతకాంతమందు అయుగ్మ బ్రాహ్మణులను భుజింప చేయాలి, అని ఏదన్నారో అది రుద్రగణ శ్రాద్ధపరమని మదన పారిజాతోక్తి. గౌడులైతే ఈ వచనంతో క్షత్రియాదులకు ఆశౌచాంతమందే, అని అన్నారు. రామాయణ మందు కూడా - పదవరోజు గడిచాక యథావిధిగా శుచియై ద్వాదశిక శ్రాద్ధమును చేశాడు. త్రయోదశిక శ్రాద్ధమును కూడా చేశాడు,అని. ద్వాదశికమనగా పన్నెండవరోజు తరువాత చేసే త్రయోదశాహ శ్రాద్ధము, త్రయోదశికం అనగా పదునాల్గవ రోజున చేయవలసిన సపిండన పాథేయాదులు. క్షత్రియులకు పన్నెండు రోజుల ఆశౌచము కనుక త్రయోదశమున మహాఏకోద్దిష్టము, చతుర్దశిన సపిండనము. ఇక్కడ రెండు రకాలైన వాక్యమున్నందువల్ల,

పునరేవసః, ఇతి హేమాద్రౌ శంఖోక్తేః. పైఠీనసిః - ఏకాదశేఽహ్ని యచ్ఛ్రాద్ధం తత్సామాన్య ముదాహృతం, చతుర్ణామపి వర్ణానాం సూతకం తు పృథక్ పృథక్. యత్తు మరీచిః - అశౌచాంతే తతస్సమ్యక్ పిండదానం సమాప్యతే. తతః శ్రాద్ధం ప్రదాతవ్యం సర్వవర్ణేష్వయం విధిః, ఇతి. తత్సర్వ వర్ణానాం దాహాశౌచపరం. యత్తు విష్ణుః - అథాశౌచాపగమే, ఇతి. యచ్చ గౌడగ్రంథే హారీతః - శ్వోభూతే ఏకోద్దిష్టం కుర్యాత్. యచ్చ బైజవాపః - ఊర్ధ్వం దశమ్యా అపరేద్యుః, ఇతి తద్విప్రవిషయం. ఏతేన దశమ పిండోత్కర్ష పక్షే అవయవ పిండా సమాప్తౌ కథమేకాదశాహే శ్రాద్ధమితి మూర్ఖోక్తిః పరాస్తా. వచనాదా శౌచమధ్య ఇవతత్రాప్య విరోధాత్. భవిష్యే - ఏకాదశేభ్యో విప్రేభ్యో దద్యాదేకాదశేఽహని, భోజనం తత్ర చైకస్మై బ్రాహ్మణాయ మహాత్మనే.

అను॥ శుద్ధితత్త్వమందు దేవలుడిట్లా - పాపపు రోజులు గడిచాక, చక్కగా స్నానం చేసి, శుభకరమైనవి నిర్వర్తించుకొని, బ్రాహ్మణుని వలన స్వస్తి వాచనము పొందినచో ఆశౌచము నుండి బ్రాహ్మణులు దూరమౌతారు,అని. యాజ్ఞవల్క్యుడిట్లా - చనిపోయిన రోజున సంవత్సరము వరకు ప్రతినెలలో శ్రాద్ధం చేయాలి. ప్రతివత్సరము కూడా. తొలిది పదకొండవ రోజున, అని. క్షత్రియాదులు ఆశౌచమందును పదకొండవ రోజున శ్రాద్ధం చేయాలి. తొలి శ్రాద్ధము అశుద్ధ దినమందైనా పదకొండవ రోజున చేయాలి. కర్తకు తాత్కాలికమైన శుద్ధి. తిరిగి ఆతడు అశుద్ధుడే, అని హేమాద్రి యందు శంఖోక్తి. పైఠీనసి ఇట్లా - పదకొండవ రోజున ఏ శ్రాద్ధం చెప్పామో అది సామాన్యంగా చెప్పాము. కాని నాల్గు వర్ణముల వారికి సూతకం మాత్రం విడివిడిగానే, అని మరీచి ఇట్లా - ఆశౌచాంత మందు పిదప చక్కగా పిండదానము సమాప్తి చేయాలి. ఆ పిదప శ్రాద్ధ మాచరించాలి. అన్ని వర్ణముల వారికి ఇది విధి, అని ఏదన్నాడో అది సర్వవర్ణములకు పదవరోజు ఆశౌచ పరము. విష్ణువిట్లా - ఇక ఆశౌచం ఐపోయాక, అని ఏదన్నాడో, గౌడగ్రంథమందు హారీతుడిట్లా - రేపు ప్రొద్దున ఏకోద్దిష్టం చేయాలి, అని ఏదన్నాడో, బైజవాపుడిట్లా - దశమిపైన తరువాతిరోజున, అని ఏదన్నాడో, ఇవన్నీ విప్ర విషయకములు, అని. దీనితో ధశమ పిండము యొక్క ఆధిక్యత పక్షమందు, అవయవ పిండం సమాప్తి కాకుండానే పదకొండవ రోజున శ్రాద్ధం ఎట్లా కుదురుతుంది,అనే మూర్ఖోక్తి తొలగిపోయింది. వచనంవల్ల ఆశౌచ మధ్యమందు వలె అక్కడ కూడా విరోధం లేదు. భవిష్యమందిట్లా - పదకొండవ రోజున పదకొండుమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. అక్కడ ఒక మహాత్ముడైన బ్రాహ్మణునకు భోజనం పెట్టాలి,అని.

**మూ॥ యత్తు మాత్స్యే - ఏకాదశేఽహని తథా విప్రానేకాదశైవతు క్షత్రాదిః సూతకాంతేతు భోజయే దయుజోద్విజాన్,ఇతి. తద్రు ద్రగణ శ్రాద్ధ పరమితి మదన పారిజాతః గౌడస్త్వస్మాద్వచనాత్ క్షత్రియాదీనా మాశౌచాంత ఏవేత్యాహుః. రామాయణేఽపి - సమతీతే దశాహేతు కృతశౌచో యథావిధి, చక్రే ద్వాదశికం శ్రాద్ధం త్రయోదశిక మేవచ, ద్వాదశికం ద్వాదశాహేన నిర్వర్త్యం త్రయోదశాహ శ్రాద్ధం. త్రయోదశికం చతుర్దశాహ విధేయం సపిండన పాథేయాది. క్షత్రియాణాం**

ద్వాదశాహే శౌచే త్రయోదశే మహైకోద్దిష్టం చతుర్దశే సపిండనం. ద్వివిధ వాక్యా దేకాదశాహే శౌచాం త(ర)యోర్వికల్ప ఇత్యేకే. సద్యః శౌచాదౌ యుద్ధహతాదే రేకాదశాహే అన్యేషాం ఆశౌచాంత ఇతి వయం. కౌర్మే - ఏకాదశేఽహ్ని కుర్వీత ప్రేత ముద్దిశ్య భావతః, ద్వాదశే వాఽహ్ని కర్తవ్య మనింద్యే పృథవాఽహని. నింద్యం ప్రేత క్రియా కాలే ఉక్తం. ఏకాదశేతు ననిషేధ ఇత్యుక్తం ప్రాక్. బృహస్పతిః - వస్త్రాలంకార శయ్యాది పితుర్యద్వాహ నాదికం, గంధమాల్యైః సమభ్యర్చ్య శ్రాద్ధ భోక్త్రే తదర్పయేత్. శ్రోత్రియా భోజనీయాస్తు నవ సప్తత్రయోదశ, జ్ఞాతయో బాంధవానిః స్వాస్తథా చాతిథయోఽపరే. దేవయాజ్ఞిక నిబంధే - ఏకాదశ సువిప్రేషు ప్రేత మావాహ్య భోజయేత్, తత్రాద్యాయ చ శయ్యాది దద్యా దాద్యమితి స్మృతం. విష్ణుః. ఏకవన్మంత్రా నూహేత్రైకోద్దిష్టే, బహు వచనాం తానేక వచనాంతాన్ వదే దిత్యర్థః. ఏతద్దృష్టార్థత్వే. **అస్యవిఘ్నే గౌణకాల** మాహ హేమాద్రౌ బౌధాయనః - ఏకోద్దిష్టం శ్వ ఏవస్యాత్ ద్వాదశేఽహని వాపునః, అత ఊర్ధ్వమయుగ్మేషు కుర్వీతాహః సుశక్తితః. అర్థమాసేఽథవా మాసి ఋతౌ సంవత్సరేఽపివా, ఇతి. **తత్రైవ లఘుహారీతః** - ఏకోద్దిష్టంతు కుర్వీత పాకే నైవ సదాస్వయం, అభావే పాక పాత్రాణాం తదహః సముపోషణం. **గోభిలః**-బ్రాహ్మణం భోజయేదాద్యే హోతవ్యమనలేఽథవా, పునశ్చ భోజయేదేకం ద్విరావృత్తి ర్భవేదితి. ఏతదాద్య మాసికాద్యాబ్దికయోః సిద్ధ్యర్థమితిభట్టాః. (తేన మహైకోద్దిష్టం షోడశ శ్రాద్ధాద్భిన్న మేవ. అత ఏ వాద్యం సర్వైకోద్దిష్ట ప్రకృతి భూతమే కాదశ ఇతి విజ్ఞానేశ్వరః. అన్యేత్వాద్య మాసికాబ్ది కయోః, అద్యమేకాదశేఽహని, ఇతి నియమాదభేద మాహుః ద్వయోస్తం త్రత్వ బాధార్థం గోభిలీయ మిత్యన్యే). **యుద్ధహతాదౌతు** హేమాద్రౌ పృథ్వీచంద్రోదయే పైఠీనసిః - సద్యః శౌచేఽపి దాతవ్యం ప్రేతస్యైకాదశేఽహని, సఏవదివసస్తస్య శ్రాద్ధ శయ్యాసనాదిషు. ఏవమేకా హాదౌ. అతోఽత్ర ద్వితీయేఽహ్ని ఏకాదశాహం వదన్ ధోంధుః శూలపాణిః స్మార్త గౌడాశ్చ పరాస్తాః. ఏతేన, ఆద్యమేకాదశేఽహని, ఇత్యాశౌచానంతర దినపరమితి విష్ణూక్తేః ప్రాగుక్త శంఖాది వచనానాం చానాకరత్వాదితి వదంతః కల్పతరువాచస్పతి ప్రముఖాః సర్వే నిబంధవిరోధా దుపేక్ష్యాః. ఉశనాః - త్ర్యహాశౌచేఽపి కర్తవ్యం. ఆద్యమేకాదశేఽహని, **అతీత విషయేసద్యః త్ర్యహోర్ధ్వం వా తదిష్యతే.**

అను॥ మాత్స్యమందిట్లా - పదకొండవ రోజున పదకొండు మంది బ్రాహ్మణులను భుజింప చేయాలి. క్షత్రియాదులైతే సూతకాంతమందు అయుగ్మ బ్రాహ్మణులను భుజింప చేయాలి, అని ఏదన్నారో అది రుద్రగణ శ్రాద్ధపరమని మదన పారిజాతోక్తి. గౌడులైతే ఈ వచనంతో క్షత్రియాదులకు ఆశౌచాంతమందే, అని అన్నారు. రామాయణ మందు కూడా - పదవరోజు గడిచాక యథావిధిగా శుచియై ద్వాదశిక శ్రాద్ధమును చేశాడు. త్రయోదశిక శ్రాద్ధమును కూడా చేశాడు,అని. ద్వాదశికమనగా పన్నెండవరోజు తరువాత చేసే త్రయోదశాహ శ్రాద్ధము, త్రయోదశికం అనగా పదునాల్గవ రోజున చేయవలసిన సపిండన పాథేయాదులు. క్షత్రియులకు పన్నెండు రోజుల ఆశౌచము కనుక త్రయోదశమున మహాఏకోద్దిష్టము, చతుర్దశిన సపిండనము. ఇక్కడ రెండు రకాలైన వాక్యమున్నందువల్ల,

ఏకాదశాహ ఆశౌచ అంత(ర)ములకు వికల్పమని కొందరన్నారు. మాకిట్లా అన్పిస్తోంది - సద్యః శౌచాదియందైతే యుద్ధహతాదులకు పదకొండవరోజున, ఇతరులకు ఆశౌచాంత మందు, అని. కౌర్మమందిట్లా - ప్రేతమునుద్దేశించిన భావనతో పదకొండవరోజున, చేయాలి. పన్నెండవరోజున కాని లేదా అనింద్యమైన రోజున కాని చేయాలి, అని నింద్యమైన దాని గూర్చి ప్రేత క్రియా కాలమందు చెప్పాము. ఏకాదశ మందైతే నిషేధం లేదని ముందే చెప్పాము. బృహస్పతి ఇట్లా - వస్త్రము, అలంకారములు, శయ్యాదులు తండ్రిగారి వాహనాదికము వీనిని గంధమాల్యాదులతో పూజించి శ్రాద్ధ భోక్తకు దాని నర్పించాలి,అని. శ్రోత్రియులను తొమ్మిదిమంది, ఏడుగురు లేదా పదముగ్గురిని భుజింప చేయాలి. జ్ఞాతులు, బంధువులు, ధనహీనులు ఇతర అతిథులు వీరిని కూడా భుజింపచేయాలి,అని. దేవయాజ్ఞిక నిబంధమందిట్లా - పదకొండు మంది బ్రాహ్మణులపై ప్రేతమును ఆవాహన చేసి భుజింప చేయాలి. అందులో ఆద్యునకు శయ్యాదులు ఇవ్వాలి. అందుకనే ఆద్యమని చెప్పారు, అని. విష్ణువిట్లా - ఏకోద్దిష్టమందు ఏకవచనంగా మంత్రములను ఊహించాలి. బహువచనాంతములను బహువచనంగా ఏకవచనాంత ములుగా ఏకవచనాంతములను చెప్పాలి అని అర్థము. ఇది దృష్ట అర్థమందు,అని. (ఉన్నట్లుగా). దీనికి విష్ణుమైతే గౌణకాలాన్ని హేమాద్రియందు బౌధాయనోక్తి ఇట్లా - ఏకోద్దిష్టము రేపే ఔతుంది లేదా తిరిగి పన్నెండవ రోజున ఔతుంది. ఆపైన శక్తి కొలది అయుగ్మ (బేసి) దినములందు ఔతుంది లేదా పదిహేను రోజులకు, నెలకు (రెండు) ఋతువుయందు, సంవత్సరమందు కాని చేయాలి, అని. అక్కడే లఘు హారీతుడిట్లా - ఏకోద్దిష్టాన్ని ఎప్పుడూ స్వయంగా పాకంతోనే చేయాలి. పాక, పాత్రములు లేకపోతే ఆరోజు ఉపవాసము, అని. గోభిలుడిట్లా - తొలుత శ్రాద్ధమందు ఒక బ్రాహ్మణునకు భోజనం పెట్టాలి. లేదా అగ్నియందు హోమం చేయాలి. తిరిగి ఒకరికి భోజనం పెట్టాలి. ద్వారా వృత్తి కావాలి,అని. ఇది ఆద్యమాసిక, ఆద్య ఆబ్దికముల సిద్ధికొరకు అని భట్టులన్నారు. (అందువల్ల మహా ఏకోద్దిష్టము, షోడశ శ్రాద్ధము కన్న భిన్నమైనదే. అందువల్లనే తొలిది అన్ని ఏకోద్దిష్టములకు ప్రకృతి ఐనట్టిది పదకొండవది అని విజ్ఞానేశ్వరుడన్నాడు. ఇతరులైతే ఆద్య మాసిక ఆబ్దికములకు, తొలిది ఏకాదశ దినమందు, అనే నియమాన్ననుసరించి, అభేదాన్ని చెప్పారు. రెంటికి తంత్ర త్వబాధ కొరకు ఈ గోభిలీయమని ఇతరులన్నారు. (బాధ = నిషేధం). యుద్ధహతాదుల విషయంలో హేమాద్రియందు, పృథ్వీ చంద్రోదయమందు పైఠీనసోక్తి ఇట్లా - సద్యః శౌచమందైనా, ప్రేతకు ఏకాదశాహమందు ఇవ్వాలి. శ్రాద్ధ, శయ్య, ఆసనాదులందు, ఆతనికి అదే దివసము అని. ఇట్లా, ఏకాహాదులందు (ఒకేరోజు). అందువల్ల ఇక్కడ రెండవరోజున, ఏకాదశాహ మును చెప్పిన ధోండు, శూలపాణి, స్మార్త గౌడులు తిరస్కరింపబడ్డారు. దీనితో తొలిది ఏకాదశాహ మందు, అనేది ఆశౌచానం తర దిన పరము అని విష్ణూక్తి ఉన్నందువల్ల

ముందు చెప్పిన శంఖాదుల వచనములకు ఆధారం లేనందువల్లను, అని చెప్పిన కల్ప తరువాచ స్మృతి ప్రముఖులంతా, నిబంధ గ్రంధములకు విరుద్ధమైనందువల్ల ఉపేక్షించ తగినవారు. ఉశనులిట్లా - మూడు రోజుల ఆశౌచమందును తొలి శ్రాద్ధము పదకొండవ రోజున చేయాలి. అతీత విషయమైతే వెంటనే కాని మూడు రోజుల తరువాత కాని అది చేయాలి,అని.

మూ॥ **యాజ్ఞవల్క్యః** - ఏకోద్దిష్టం దైవహీనం ఏకార్ఘ్యైక పవిత్రకం, ఆవాహనాగ్నౌ కరణ రహితం త్వపసవ్యవత్. ఉపతిష్ఠతా మిత్యక్షయ్య స్థానే విప్ర విసర్జనే, అభిరమ్యతా మితి వదేత్ బ్రూయుస్తేఽభిరతాః స్మహ. ఇత్యగ్నౌ కరణ నిషేధోఽన్యపరః. బహ్వృచానాం సర్వైకోద్దిష్టేషు తద్భవత్యే వేత్యుక్తం ప్రాక్. స్వదిత మితి తృప్తి ప్రశ్న ఇతి కాత్యాయనః. ప్రధమే పాత్రే సంస్రవానిత్యస్య తృతీయేనాపి ధానస్య చ బాధాన్న పాత్రన్యుబ్జతేతి శూలపాణిః ప్రచేతాః - నాత్ర పాత్రా లంభో నాశిషః ప్రార్థయేత్. **అత్రవిశేషో హేమాద్రౌ** వారాహే - శ్మశ్రుకర్మతు కర్తవ్యం నఖచ్ఛేదస్తథైవచ, స్నపనాభ్యంజనం దద్యా ద్విప్రాయ విధి పూర్వకం. తథా - ఉపవేశ్యాసనే భద్రే ఛత్రం తత్ర ప్రకల్పయేత్. పశ్చాదుపానహౌ దద్యాత్సర్వాణ్యా భరణాని చ. విష్ణుః - దక్షిణాంతం శ్రాద్ధముక్త్వా దత్త్వాక్షయ్యోదకేషు చతురంగుల పృథ్వీ స్తావదంతరాలాస్తావదధః ఖాతావితస్త్యాయతాస్తి స్రః కర్షూః కుర్యాత్ కర్షూణాం సమీపే అగ్ని త్రయ మాధాయ పరిస్తీర్యైకైక స్మిన్నాహుతి త్రయం జుహుయాత్. సోమాయ పితృమతే స్వధా నమోఽగ్నయే కవ్య వాహనాయ, యమాయాంగిరస్వతే, ఇతి. స్థానత్రయే ప్రాగ్వత్ పిండ నిర్వపణం దధి మధుఘృతమాంసై కర్షూత్రయం పూరయిత్వై తత్త ఇతి జపేత్. శేషం నవశ్రాద్ధవత్. అత్ర సాగ్నేరప్యంతే వైశ్వదేవ ఇత్యుక్తం ప్రాక్. ఇదం దశాహ కర్త్రా పుత్రేణ వా కార్యమిత్యుక్తం. క్రియా నిబంధే గృహ్యకారికాయాం - తిలోఽసి ప్రేత దైవత్యః ప్రేతం లోకాన్ హినోంతకం, మంత్ర ముక్త్వాతిలానేవం ప్రక్షిపే దర్ఘ్య పాత్రతః. దక్షిణా ముదకుంభం చ సాన్నం దత్త్వా తథైవగాం. తస్మైదద్యాద్భుక్తశేషం తద్భాండాన్యపి భాజనం. విప్రాభావే అగ్నావేకోద్దిష్టం, అగ్నౌపాయసం శ్రపయిత్వా ఆజ్యభాగాంతే తదగ్రే శ్రాద్ధ ప్రయోగం కృత్వాగ్నౌ ప్రేతమా వాహ్యా గంధాద్యైః సంపూజ్య పృథివీతే పాత్రం, ఇత్యాదినాఽన్నం సంకల్ప్య, ఉదీరతా మవర ఇత్యష్టాభిశ్చతురావృత్తాభిర్ద్వా త్రింశదాహుతీర్హుత్వా పిండదానాది శ్రాద్ధం సమాపయేత్, ఇతి. **యాజ్ఞవల్క్యః - ఏతత్సపిండీకరణమేకోద్దిష్టం స్త్రియా అపి.**

అను॥ యాజ్ఞవల్క్యుడిట్లా - ఏకోద్దిష్టము విశ్వేదేవం లేకుండా ఒక అర్ఘ్యపాత్ర, ఒక పవిత్ర ఉండి, ఆవాహన, అగ్నౌకరణం లేకుండా, అపసవ్యం వలె చేయాలి,అని. అక్షయ్య (ఉదక) స్థానమందు ఉపతిష్ఠతాం, అనాలి. విప్ర విసర్జనమందు, అభిరమ్యతాం, అని అనాలి. విప్రులు, అభిరతాః స్మః అని అనాలి. అని అగ్నౌకరణ నిషేధము ఇతరుల (మరోదాని) విషయము. బహ్వృచులకు అన్ని ఏకోద్దిష్టములందు అది (అగ్నౌకరణం) ఉంటుందని ముందే చెప్పాము. స్వదితం, అని తృప్తి పశ్న అని కాత్యాయనుడన్నాడు. ప్రధమపాత్ర యందు సంస్రవాలను (పోయటం) అనే దానికి తృతీయంతో మూయటానికి

బాధ ఐనందువల్ల పాత్రముల బోర్లింపు లేదు అని శూలపాణి అన్నారు. ప్రచేతుడు - ఇక్కడ పాత్ర స్పర్శ, ఆశీః ప్రార్థన లేవన్నాడు. ఇక్కడ విశేషాన్ని హేమాద్రి యందు వరాహోక్తి ఇట్లా - శ్మశ్రుకర్మ అట్లాగే నఖచ్ఛేదము చేయాలి. విప్రునకు విధి పూర్వకముగా స్నానము అభ్యంజనమునకు ఇవ్వాలి,అని. అట్లాగే - ఆసనమందు కూర్చోబెట్టి అక్కడ గొడుగు ఏర్పరచాలి, పిదప పాదుకలు, అన్ని ఆభరణములు ఇవ్వాలి. విష్ణువిట్లా - దక్షిణ వరకు శ్రాద్ధాన్ని చెప్పి అక్షయ్యోదకం ఇచ్చిన చోట, నాలుగంగుళముల భూమి గలవి అంతరాళము అంతయే, లోతు తవ్వటము అంతే, జానెడు పొడవు గల మూడు కర్షూలు చేయాలి. కర్షువుల సమీపమందు మూడు అగ్నులను స్థాపించి, కుశల పరిస్తరణం చేసి ఒక్కొక్క దానిలో మూడాహుతులు హోమం చేయాలి. సోమాయ పితృమతే స్వధా, నమో అగ్నయే కవ్య వాహనాయ, యమాయ అంగిరస్వతే స్వాహా అని, మూడు చోట్ల ముందు చేసినట్లు పిండ నిర్వాపము చేయాలి. దధి మధు ఘృత మాంసములతో మూడు కర్షువులను నింపి ఏతత్తే, అను మంత్రం జపించాలి. మిగిలినది, నవ శ్రాద్ధంవలె చేయాలి. ఇక్కడ సాగ్నికునకైనా అంతమందు వైశ్వదేవము అని ముందు చెప్పాము. ఇది దశాహకర్తగాని పుత్రుడుగాని చేయాలని అన్నారు. క్రియా నిబంధమందు గృహ్యకారిక యందిట్లా - తిలోసి, అనుమంత్రాన్ని చెప్పి, అర్ఘ్య పాత్ర నుండి ఇట్లా తిలలను వేయాలి,అని. దక్షిణ, అన్నముతో పాటు ఉదకుంభము, ఆవును అట్లాగే ఇచ్చి, ఆ బ్రాహ్మణునకు తినగా మిగిలినది, ఆ పాత్రలు, ఆ భాండములు కూడా ఇవ్వాలి. విప్రుడు లేకపోతే అగ్ని యందు ఏకోద్దిష్టము. అగ్నియందు పాయసాన్ని వండి ఆజ్య భాగాంతమందు దాని తరువాత శ్రాద్ధ ప్రయోగం చేసి, అగ్నియందు ప్రేతను ఆవాహన చేసి, గంధాదులతో పూజించి, పృథివీతే పాత్రం, అను మంత్రంతో అన్న సంకల్పం చేసి ఉదీరతామవర, అను ఎనిమిది మంత్రాలతో నాలుగు ఆవృత్తులతో ముప్పది రెండు ఆహుతులను హోమం చేసి పిండదానాది శ్రాద్ధమును ముగించాలి,అని. యాజ్ఞవల్క్యుడిట్లా - ఈ సపిండీకరణము, ఏకోద్దిష్టము స్త్రీలకు కూడా,అని. (ప్రాదేశ మాత్ర దీర్ఘాః చతురంగుళ విస్తారః తావ దేవనిమ్నోగర్తః కర్షూః)

**మూ॥ అథవృషోత్సర్గః - సచనిత్యః కామ్యశ్చ. నకరోతి వృషోత్సర్గం సుతీర్థేవా జలాంజలిం, నదదాతిసుతోయస్తు పితురుచ్చార ఏవసః ఉచ్చారః పురీషం. ఏష్టవ్యా బహవః పుత్రా యద్యేకోఽపి గయాం వ్రజేత్, యజేత వాశ్వమేధేన నీలంవా వృషముత్సృజేత్, ఇతి మాత్స్యకౌర్మోక్తేః. ఏకాదశేఽహ్ని ప్రేతస్య యస్య నోత్సృజ్యతే వృషః. ప్రేతత్వం సుస్థిరం తస్య దత్తైః శ్రాద్ధ శతైరపి, ఇతి షట్ త్రింశన్మతే నిందాశ్రుతేః. ఏవం కృత్వాహ్యవాప్నోతి ఫలం వాజి మఖోదితం, యముద్దిశ్యోత్సృజేన్నీలం సలభేతపరాంగతిం. వృషోత్సృష్టః పునాత్యేవ దశాతీతాన్ దశాపరాన్, ఇతి దేవీపురాణే భవిష్యాదౌ ఫలశ్రుతేశ్చ. అయం ద్వాదశాహే ఉక్తో భవిష్యే. చైత్ర్యాం వాపి తృతీయాయాం వైశాఖ్యాం ద్వాదశేహ్నివా, ఇతి. విష్ణుధర్మేతు మృతాహే ప్యుక్తః. విషువ ద్వితయే చైవ మృతాహే బాంధవస్యచ, ఇతి. అయం గృహే న కార్యః. నగృహే మోచయేన్నీలం**

కామ యన్నుష్కలం ఫలం ఇతి కాలికా పురాణాత్. కామధేనౌ - వత్సరాభ్యంతరే పిత్రోర్వృషస్యోత్సర్గ కర్మణి, వృద్ధి శ్రాద్ధం న కుర్వీత తదన్యత్ర సమారభేత్. తల్లక్షణంతు బ్రాహ్మే - లోహితో యస్తు వర్ణేన ముఖేపుచ్ఛే చ పాండురః శ్వేతః ఖురవిషాణాభ్యాం సనీలో వృష ఉచ్యతే. శ్వేత వర్ణస్య ముఖాదీని శ్యామాని. శ్యామస్య వా శ్వేతాని యస్యసోఽపి నీల ఉక్తో మాత్స్యాదౌ. దేవీపురాణే - చతస్రోవత్సికా భద్రాద్వేవా సంభవతోఽపివా. యత్తు పరతి - వృషోత్సర్జన వేళాయాం వృషాభావః కధంచన, మృద్భిః పిష్టైశ్చదర్భైర్వా వృషం కృత్వా విమోచయేత్, నశక్యతే వృషోత్సర్గో హోమం వా తత్రకారయేదితి తన్నిర్మూలం. తద్విధిః హేమాద్రౌ భట్టకృతౌ చ జ్ఞేయః. అత్ర దేవయాజ్ఞికేన వృషోత్సర్గాత్పూర్వం పురుషసూక్తేన విష్ణు రూపి ప్రేతోద్దేశేన విష్ణు తర్పణ ముక్తం. తత్ర మూలం చింత్యం, పారస్కరః - సవ్యేన పాణినా పుచ్ఛం సమాలంబ్య వృషస్యతు, దక్షిణేనాప ఆదాయ సతిలా స్సకుశాస్తతః. ప్రేతగోత్రం సముచ్చార్య అముకస్మై ఇతి బ్రువన్, వృష ఏవ మయాదత్త స్తంతారయతు సర్వదా. సహేమ సలిలం భూమా విత్యుచ్చార్య వినిక్షిపేత్. తథా - విధారయేన్నతం కశ్చిత్ న చ కశ్చన వాహయేత్ నదోహ యేచ్చ తాధేనూర్న చ కశ్చన బంధయేత్. స్త్రీషు విశేషః - సంగ్రహే - పతిపుత్రవతీ నారీ భర్తురగ్రే మృతాయది, వృషోత్సర్గం నకుర్వీత గాందద్యాచ్చ పయస్వినీం. పతిపుత్రయో స్సాహిత్యం వివక్షితం. అన్వారోహణేఽపి గోదానమే వేత్యుక్తం ప్రాక్. ఆశౌచాంతరేఽపి వృషోత్సర్గాద్య మాసిక శయ్యాది దద్యాదేవేత్యుక్తం. క్రియానిబంధే స్మృత్యంతరే - సూతకే మృతకే చైవ ద్వితీయం మృతకం యది, పిండదానం ప్రకుర్వీత వృషోత్సర్గం తథైవచ.

అను॥ ఇక వృషోత్సర్గము. అది నిత్యము కామ్యము కూడా. మంచి తీర్థమందు జలాంజలిని ఇవ్వని వృషోత్సర్గమును చేయని కొడుకు ఎవడున్నాడో వాడు తండ్రి ఉచ్చారమే, ఉచ్చారమనగా పురీషము. అనేకమంది పుత్రులను కోరుకోవాలి. ఒకవేళ ఒక్కడైనా గయకు వెళితే, అశ్వమేధ యాగం చేయాలి, నీల వృషభమునైనా వదలాలి, అని మాత్స్య కౌర్మోక్తి. పదకొండవరోజున ఏ ప్రేతకై వృషభము విడువబడదో, ఆతనికి ప్రేతత్వము సుస్థిరము, నూరు శ్రాద్ధములిచ్చినా కూడా, అని షట్త్రింశన్మతమందు నిందాశ్రుతి. ఈ రకంగా చేస్తే అశ్వమేధ యాగంవల్ల వచ్చే ఫలితాన్ని పొందుతాడు. ఎవని నుద్దేశించి నీల వృషభమును వదలుతారో ఆతడు ఉత్తమగతిని పొందుతాడు. వృషభము విడువబడినవాడు గతించిన పదితరముల వారిని, పవిత్రులను చేస్తాడు, అని దేవీపురాణమందు భవిష్యాదులందు ఫలశ్రుతి కూడా. దీనిని పన్నెండవరోజున అని భవిష్యోక్తి - చైత్రమాసం తృతీయమందో, వైశాఖం తృతీయనో, పన్నెండవరోజునో, అని. విష్ణుధర్మమందైతే మృతాహ మందు కూడా చెప్పారు - రెండు విషువత్తులందు, బాంధవుని మృతాహమందును, అని. దీనిని ఇంట్లో చేయరాదు. అధిక ఫలాన్ని కోరుకునేవారు గృహమందు నీల వృషభమును విడువరాదు,అని. కాలికా పురాణం నుండి తెలుస్తోంది. కామధేనువు యందిట్లా - సంవత్సరం లోపల తల్లిదండ్రులకై వృషోత్సర్గ కర్మయందు వృద్ధిశ్రాద్ధం చేయరాదు. అది మరోచోట ఆరంభించాలి,అని. దాని లక్షణము బ్రాహ్మమందిట్లా - ఎరుపు రంగుది, ముఖము, తోకతెల్లది, గిట్టలు, కొమ్ములు

తెల్లది ఇట్టి దానిని, నీలవృషభమని అంటారు,అని. తెల్లని దానికి ముఖాదులు శ్యామములు లేదా శ్యామమైన దానికి ముఖాదులు తెల్లనివి దేనికున్నాయో అది కూడా నీలమని మాత్స్యాదులందు చెప్పారు. దేవీపురాణమందిట్లా – నాలుగు సంవత్సరముల దూడగల ఆవు, రెండు సంవత్సరాల దూడదో, దూడను కనబోయేదో కావాలి,అని. ఇట్లా – వృషభ ఉత్సర్జన వేళలో వృషభం లేకపోవటం సంభవిస్తే ఏదో విధంగా, అప్పుడు మట్టితోగాని పిండితోగాని, దర్భలతోగాని వృషభాన్ని చేసి వదలాలి,అని. వృషోత్సర్గం చేయటం చేతకాకపోతే అక్కడ హోమం గాని చేయాలి,అని. ఏమి పరిస్తారో అది నిర్మూలమైనది. దాని విధిని హేమాద్రియందు భట్టుల కృతియందును చూచి తెలుసుకొనవచ్చును. ఇక్కడ దేవయాజ్ఞికులు, వృషోత్సర్గము కన్న ముందు పురుష సూక్తంతో, విష్ణురూపియైన ప్రేతనుద్దేశించి విష్ణు తర్పణం చేయాలని చెప్పారు. అక్కడ మూలాధారము విచారించతగినది. పారస్కరుడిట్లా – ఎడమ చేతితో వృషభము యొక్క తోకను పట్టుకుని, కుడిచేతితో నీరు తీసుకొని, నువ్వులు, కుశలతో సహా తీసుకొని ఆ పిదప ప్రేత గోత్రమునుచ్చరించి ఈతనికై అని పేరు చెప్పి నేను వృషభము నిచ్చాను, ఇది ఆతనిని ఎల్లప్పుదు తరింప జేయని, అని పలికి బంగారము నువ్వులతో సహా నీటిని భూమిపై వదలాలి,అని. అట్లాగే – దానినెవరూ (ధరించ) చంపరాదు. ఎవడూ దానిని ఎక్కరాదు. ఆ ధేనువులను ఎవరూ పితుకరాదు, ఎవరూ దానిని బంధించరాదు, అని. స్త్రీల యందు విశేషము. సంగ్రహమందిట్లా – పతిపుత్రులు గలనారి భర్త ఎదుట (కన్నతొలుత) మరణిస్తే అప్పుడు వృషోత్సర్గము చేయరాదు. పాలిచ్చే ఆవును దానం చేయాలి,అని. పతిపుత్రులకూడిక చెప్పదలచినది. అన్వారోహణ మందును గోదానమే, అని ముందు చెప్పాము. ఆశౌచాంతరమందును వృషోత్సర్గము ఆద్యమాసికము శయ్యాదులు ఇవ్వవలసినవే అని చెప్పారు. క్రియా నిబంధమందు స్మృత్యంతర వచనమిట్లా – సూతక మందు మరణాశౌచమందును రెండవ మరణాశౌచం వస్తే, పిండదానము చేయాలి అట్లాగే వృషోత్సర్గము కూడా,అని.

**మూ॥ నహన్యాత్సూతకే కర్మ ద్వాదశైకా దశాహికం, శుద్ధోవా యదివాఽ శుద్ధః కుర్యాదేవావ చారయన్, ఇతి. అత్రపద దానముక్తం దేవజానీయే గారుడే ఏకాదశాహం ప్రక్రమ్య – తదహ్ని దీయతే సర్వే ద్వాదశాహే విశేషతః, పదాని సర్వ వస్తూని వరిష్ఠాని త్రయోదశ. యోదదాతి మృతస్యేహ జీవతోప్యాత్మహేతవే, సుఖీ భూత్వా మహామార్గే వైన తేయ సగచ్ఛతి. తథా – ఆసనోపానహోఛత్రం ముద్రికాచ కమండలుః, భోజనం భోజనాధారో వస్త్రాణ్యష్ట విధం పదం. తథా – భాజనాసన దానేన ముద్రికా భోజనేన చ, ఆజ్యయజ్ఞోపవీతేన పదం సంపూర్ణతాం వ్రజేత్. మహిషీరథ గోదానా త్సుఖీభవతి నిశ్చితం, సర్వోపస్కర యుక్తాని పదాన్యత్ర త్రయోదశ. యోదదాతి మృతస్యేహ జీవన్నప్యాత్మ హేతవే, సగచ్ఛతి పరంస్థానం మహాకష్ట వివర్జితః. త్రయోదశ పదానీత్థం ప్రేతాయైకాదశేఽహని, దాతవ్యాని యధాశక్తి తేనా సౌప్రీణితో భవేత్. అన్నం చైవోదకం చైవోపానహౌచక మండలుః, ఛత్రం వస్త్రం తథా యష్టిం లోహదండం తథాష్టమం. అగ్నీష్టికాంచ దీపంచ**

తిలాస్తాంబూలమేవచ, చందనం పుష్పదానం చోపదానాని చతుర్దశ. యోఽశ్వంరథం గజంవాపి బ్రాహ్మణే ప్రతిపాదయేత్, స్వమహిమ్నోనుసారేణ తత్తత్సుఖ మవాప్నుయాదితి. అత్రమూలం చింత్యం. అథశయ్యాదానం - హేమాద్రౌ భవిష్యే - తస్మాచ్ఛయ్యాం సమాసాద్య సారదారు మయీాం దృఢాం, దంతపత్ర చితాం రమ్యాం హేమ పట్టైరలం కృతాం, హంసతూలీ ప్రతిచ్ఛన్నాం శుభ దండోపధానికాం, ప్రచ్ఛాదన పటీయుక్తాం గంధ ధూపాది వాసితాం, తస్యాం సంస్థాపయేద్ధైమం హరిం లక్ష్మ్యాసమన్వితం అత్రహరిస్థానే ప్రేతం. ఉచ్ఛీర్షకే ఘృతభృతం కలశం పరికల్పయేత్. తాంబూలం కుంకుమక్షోద కర్పూరాగరు చందనం దీపికో పానహౌఛత్రం చామరాసన భాజనం పార్శ్వేషు స్థాపయే ద్భక్త్యా సప్త ధాన్యాని చైవహి, శయనస్థస్య భవతి యదన్యదుపకారకం, భృంగారకరకాద్యంతు పంచవర్ణవితానకం. మంత్రస్తు - యథానకృష్ణ శయనం శూన్యం సాగరజాతయా, శయ్యామవాప్యశూన్యాస్తు తథాజన్మని, జన్మని, యస్మాదశూన్యం శయనం కేశవస్య శివస్య చ. అర్థంతదేవ. దత్త్వైవం తస్య సకలం ప్రణిపత్య విసర్జయేత్. ఏకాదశాఽహేపి తథా విధిరేష ప్రకీర్తితః. విశేషం చాత్ర రాజేంద్ర కథ్యమానం నిశామయ. తేనోపభుక్తం యత్కించిత్ వస్త్ర వాహన భాజనం, యద్యదిష్టం చతస్యా సీత్తత్సర్వం పరికల్పయేత్. తమేవ పురుషం హైమం తస్యాం సంస్థాపయేత్తదా, పూజయిత్వా ప్రదాతవ్యా మృతశయ్యా యథోదితా.

అను॥ సూతకమందు పన్నెండవ, పదకొండవ రోజుల కర్మను ఆపరాదు. శుద్ధమైనా అశుచియైనా ముందుకు నడిపిస్తూ చేయాల్సిందే, అని. ఇక్కడ దేవజానీయమందు, గారుడ మందు పదకొండవ రోజును గూర్చి ఆరంభించి పదదానం చెప్పారు ఇట్లా - ఆరోజు విశేషించి పన్నెండవ రోజున అన్ని ఇవ్వాలి. అన్ని వస్తువులను శ్రేష్ఠమైన వానిని పదములను ఇవ్వాలి. అవి పదమూడు మృతిచెందిన వానికై ఇక్కడ ఎవడిస్తాడో, జీవించి ఉన్న తనకోస మైనా ఎవడిస్తాడో, అతడు సుఖవంతుడై మహా మార్గమైన వైన తేయ మార్గంలో వెళ్తాడు,అని. అట్లాగే - ఆసనము, పాదుకలు, ఛత్రము, ముద్రిక, కమండులువు, భోజనము, పాత్రల ఆధారము, వస్త్రములు, అని పదము ఎనిమిది విధములు. అట్లాగే - భాజన, ఆసన, దానములు, ముద్రిక, భోజనము, ఆజ్యము, యజ్ఞోపవీతము వీనితో పదము సంపూర్ణ మౌతుంది. బట్టె, రథము, గోవు వీని దానంతో తప్పకుండా సుఖవంతుడౌతాడు. అన్ని సంభారములతో కూడిన పదములను ఇక్కడ పదమూడింటిని దానం చేస్తే సుఖియౌతాడు. మృతునకై ఎవడు వీటిని దానం చేస్తాడో ఇక్కడ, జీవితుడైన తనకొరకై ఎవడు దానం చేస్తాడో, వాడు మహాకష్టములన్ని పోయి ఉత్తమగతికి పోతాడు. ఈ త్రయోదశ పదములను ఇట్లా ప్రేతకొరకై పదకొండవరోజు (అయ్యాక) యథాశక్తి దానం చేయాలి. దీనితో ఆతడు సంతుష్టుడౌతాడు. అన్నము, నీరు, పాదుకలు, కమండలువు, ఛత్రము, వస్త్రము, కర్ర, లోహదండము, అగ్నిష్టిక, దీపము, తిలలు, తాంబూలము, చందనము, పుష్పములు, అని దానములు చేయాల్సినవి ఉపదానములు పదునాలుగు. ఎవరైనా బ్రాహ్మణునకై గుఱ్ఱము, రథము, ఏనుగు ఏదైనా ఇస్తే తమ గొప్పతనాన్ననుసరించి ఆయా

సుఖములను పొందుతారు, అని. దీనికి ఆధార వచనాలు ఆలోచించాలి. ఇక శయ్యాదానము. హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా – అందువల్ల సారము గల దారువుతో చేసిన దృఢమైన శయ్యను పొందాలి. అది దంతపత్రములు కూర్చబడి, అందమైనదై, బంగారు పట్టములతో (పాదములతో) అలంకృతం కావాలి. హంస ఈకలతో కప్పబడి, శుభమైన రెండు మెత్తలు కలిగి ఉండాలి. ప్రచ్ఛాదన వస్త్రం కలది, గంధము ధూపము మొదలగు వాని వాసన కలది, అట్టిదానిపై లక్ష్మితో కూడిన విష్ణువును బంగారు రూపాన్ని ఉంచాలి. ఇక్కడ హరిస్థానమందు ప్రేత నుంచాలి. తలభాగమందు నేతితో, నింపిన కలశమును, పెట్టాలి. తాంబూలము, కుంకుమము, సాన, కర్పూర, అగరు చందనములు, దీపములు, పాదుకలు, ఛత్రము, చామర, ఆసనములు, పాత్రలు, సప్తధాన్యములు, భక్తితో పార్శ్వములందుంచాలి. శయనమందున్న వానికి ఉపకరించేది ఇతరమైనదేదైనా సరే ఉంచాలి. బంగారుపాత్ర. (మూత్రి దగ్గర చిన్నగా ఉండేది, కరకం) మొదలైనవి, ఐదు రంగుల చాందిని ఉండాలి. మంత్రమైతే – యథానకృష్ణ... శివస్యచ. అర్థము అదే శ్లోకము ఇట్లా ఆతనికి అంతా ఇచ్చి నమస్కరించి వదిలిపెట్టాలి. ఏకాదశాహమందును అట్లాగే ఈ విధి చెప్పబడింది. ఓ రాజేంద్ర! ఇక్కడ చెప్పబోయే విశేషాన్ని విను. ఆ ప్రేత అనుభవించిన వస్త్రము, వాహనము, పాత్రలు ఏదైనాసరే అవి, ఆతనికి ఏదేది ఇష్టముండెనో, అదంతా ఏర్పరచాలి. ఆ పురుషునే బంగారు రూపంలో ఆశయ్య యందు అప్పుడు ఉంచాలి. పూజించి, పైన చెప్పినట్లుగా మృతశయ్యను దానం చేయాలి.

**మూ॥ పాద్మే – మృతకాంతే ద్వితీయేఽహ్ని శయ్యాందద్యాత్సలక్షణాం, కాంచనం పురుషం తద్వత్, ఫలవస్త్ర సమన్వితం, సంపూజ్య ద్విజదాంపత్యం నానామణి విభూషితం, ఉపవేశ్యతు శయ్యాయాం మధుపర్కంతతోవదేత్. రజతస్యతు పాత్రేణ దధిదుగ్ధ సమన్వితం, అస్థిలాలాటికం గృహ్యా సూక్ష్మం కృత్వా సపాయసం, భోజయేద్ద్విజ దాంపత్యం విధి రేషస్సనాతనః. ఏష ఏవ విధిర్దృష్టః. పార్వతీయైః ద్విజోత్తమైః. ఏతత్రపతి గ్రహీతత్రైవోక్తం. గృహీతాయాంతు తస్యాంవై పునస్సంస్కార మర్హతి. శయ్యాదాన ఫలం భవిష్యే – స్వర్గే పురందరపురే సూర్యపుత్రాలయే తథా, సుఖం వసత్య సౌజంతుః శయ్యాదాన ప్రభావతః. ఆభూత సంప్లవం యావత్ తిష్ఠత్యాతంకవర్జితం, ఇతి. అథోదకుంభః – హేమాద్రౌ స్మృతి సముచ్చయే – ఏకాదశాహాత్ప్రభృతి ఘటస్సోమాన్న సంయుక్తః, దినేదినే ప్రదాతవ్యో యావత్సంవత్సరం సుతైః, లౌగాక్షిః – యస్య సంవత్సరా దర్వాక్ సపిండీకరణం భవేత్, మాసికం చోదకుంభంచ దేయంతస్యాపివత్సరం. ఉత్తరార్థే – తస్యాప్యన్నం సోదకుంభం దద్యాత్సంవత్సరం ద్విజే ఇతి యాజ్ఞవల్క్యపారః. సపిండనాప కర్షేఽస్యాపకర్ష ప్రాప్తే బాధక మిదమితి శూలపాణిః. తన్న. ప్రకృతి వికారా భావేన తదంతన్యాయా విషయత్వాత్. మాత్స్యే – యావదబ్దం చయో దద్యాత్ ఉదకుంభం విమత్సరః, ప్రేతాయాన్న సమాయుక్తం సోశ్వమేధ ఫలం లభేత్. కేచిత్త్రయోదశాహ మారభ్యాహు స్తన్నిర్మూలం. దేవయాజ్ఞికః – సపిండనాపకర్షే సంవత్సరం యావదుదకుంభం అర్వాగేవదద్యాన్నోర్ధ్వం. ప్రేతలోక గతస్యాన్నం సోదకుంభం ప్రయచ్ఛత, ఇతి గోవిందరాజ ధృత విష్ణూక్తేః.**

అను॥ పాద్మమందిట్లా - మృతకాంతమందు రెండవరోజున సలక్షణమైన శయ్యను ఇవ్వాలి. బంగారు పురుషుని, అట్లాగే పండ్లు వస్త్రములు కూడా ఇవ్వాలి. ద్విజ దంపతులను పూజించి, రకరకాల మణులతో అలంకరించి, శయ్యయందు కూర్చోబెట్టి ఆ పిదప మధుపర్కము ఇవ్వాలి. వెండిపాత్ర యందు పాలుపెరుగు తీసుకొని, లలాటాస్థిని తీసుకొని సూక్ష్మంగా చేసి పాయసంతోపాటు ద్విజదంపతులను భుజింపచేయాలి. ఇది సనాతనమైన విధి. పార్వతీయులైన ద్విజోత్తములు ఇదే విధిని చెప్పారు. దీనిని గ్రహిస్తే, అక్కడే చెప్పారిట్లా - దానిని స్వీకరిస్తే తిరిగి సంస్కారాన్ని పొందాలి,అని. శయ్యాదాన ఫలము - భవిష్య మందిట్లా - శయ్యా దాన ప్రభావంవల్ల ఈ ప్రాణి స్వర్గమందు పురందరుని పురమందు, యముని ఆలయమందును సుఖంగా ఉంటాడు అని. ప్రళయకాలందాక ఆటంకములు లేకుండా ఉంటాడు,అని. ఇక ఉదకుంభము - హేమాద్రి యందు స్మృతి సముచ్చయ మందిట్లా - ఏకాదశాహం నుండి ఘటస్తోమములందు నీరు అన్నం కలవారై, ప్రతిరోజు సంవత్సరం వరకు సుతులు దానమివ్వాలి,అని. లౌగాక్షి ఇట్లా - ఎవనికి సంవత్సరం కన్న ముందు సపిండీకరణము ఔతుందో వానికి కూడా మాసికము, ఉదకుంభము, వత్సరమివ్వాలి,అని. ఉత్తరార్థమిట్లా - వానికి కూడా ఉదకుంభముతోపాటు అన్నము బ్రాహ్మణునకు సంవత్సర మివ్వాలి,అని. యాజ్ఞవల్క్యుని పాఠము. సపిండన అపకర్షవల్ల దీనికి అపకర్షవస్తే ఇది బాధకమౌతుంది (పోతుంది)అని శూలపాణి అన్నాడు. అంటే అట్లా కాదు. ప్రకృతి వికారం లేనందువల్ల అది అంతన్యాయ విషయము కానందువల్ల,అని. మాత్స్యమందిట్లా - సంవత్సరం వరకు విమత్సరుడై ఎవడు ప్రేతకు అన్నముతోపాటు ఉదకుంభము నిస్తాడో వాడు అశ్వమేధ ఫలమును పొందుతాడు,అని. కొందరు పదమూడవ రోజు నుండి ఆరంభించి అని అన్నారు. దానికి ఆధారములేదు. దేవయాజ్ఞికుడిట్లా - సపిండన అపకర్షమందు సంవత్సరం వరకు ఉదకుంభమును ముందు వరకే ఇవ్వాలి, ఆపై ఇవ్వరాదు,అని. ప్రేత లోకం వెళ్ళిన వానికి ఉదకుంభంతో అన్నాన్ని ఇవ్వండి,అని గోవిందరాజు చెప్పిన విష్ణూక్తి.

మూ॥ అన్నం చైవ స్వశక్త్యాతు సంఖ్యాం కృత్వాబ్దికావధి, దాతవ్యం బ్రాహ్మణేస్కంద, ఘటాదౌ నిక్షిప్యంతువా. అపి శ్రాద్ధశతైర్దత్తైః ఉదకుంభం వినానరాః, దరిద్రా దుఃఖిన స్తాత భ్రమంతి చ భవార్ణవం. తేనా పకృష్య దాతవ్యం ప్రేతస్యాప్యుద కుంభకమితి గోభిల భాష్యే స్కాందాచ్చ. సపిండనాత్ప్రాగే వతస్య విధానాదూర్ధ్వం నిషేధాదిత్యాహ, తన్న. ఉదకుంభే పార్వణ విధినా నుపపత్తే రేవం వ్యాఖ్యాయాం మానాభావాన్మితాక్షరాది విరోధాచ్చ. వచనం చయది సమూలం తదా వృద్ధావపకర్ష విధత్తే. ప్రేత శ్రాద్ధాని సర్వాణి సపిండీకరణం తథా, ఇతి హేమాద్రౌ శార్యాయనోక్తేః. తస్యాప్యన్నం సోదకుంభమితి యాజ్ఞవల్క్య విరోధాచ్చ. మదనరత్నే గౌతమః - తదైవం పార్వణం శ్రాద్ధం సోదకుంభమధర్మకం, కుర్యాత్ప్రత్యాబ్ది కాద్ప్రాద్ధాత్ సంకల్పవిధినాన్వహం. అధర్మకం బ్రహ్మచర్యాది నియమహీనం. ఏతన్మాసిక వదేకోద్దిష్టం పార్వణం వా కార్యం. అపరార్కస్తు - సపిండీకరణే వృత్తే పృథక్త్వే నోపపద్యతే. పృథక్త్వేతు కృతే పశ్చాత్ పునః కార్యా సపిండతా,

ఇతి లఘు హారీతోక్తావపి. తస్యాప్యన్నం సోదకుంభం దేయం సంవత్సరం ద్విజే ఇతి యాజ్ఞవల్కీయే తస్యేత్యేకత్వోక్తేః. సపిండనోత్తర మప్యేకోద్దిష్ట మేవేత్యాహ. అత్రపిండదానం కృతాకృతం. అహరహ రన్న మస్మై బ్రాహ్మణాయోదకుంభం చ దద్యాత్పిండ మప్యేకే నిపృణం తీతి హేమాద్రౌ పారస్క రోక్తేః. శ్రాద్ధాశక్తౌ పిండ మాత్ర మితిగౌడాః. తన్న. అపిశబ్ద బాధాపత్తేః. హారీతః – మృతేపితరివైపుత్రః పిండమబ్దం సమాచరేత్, అన్నం కుంభం చ విప్రాయ ప్రేత నిర్దేశ ధర్మతః ప్రేత శబ్దోచ్చారణే నేతి హలాయుధః యద్వాప్రేతస్య నిర్దేశో యత్ర తదేకోద్దిష్టం తద్ధర్మకమిత్యర్థః. అత్రా శౌచాం తదినాద్యబ్దాంతం యావద్వత్సరాపూర్తేః శౌచం నాధికారి విశేషణం. తేన మృతిదిన మారభ్యై తత్కార్యమితికేచిత్. తన్న. హేమాద్రి ధృతవచో విరోధాత్. మధ్యే ఆశౌచాదినా బాధేతు లోప ఏవదార్శవత్. తథా ప్రథమాబ్దే దీపదానముక్తం దేవజానీయే గారుడే. ప్రత్యహం దీపకోదేయో మార్గేతు విషమేనరైః. యావత్సంవత్సరం వాపి ప్రేతస్య సుఖలిప్సయా, ప్రాఙ్ముఖోదఙ్ముఖందీ పందేవాగారే ద్విజాలయే, కుర్యాద్యామ్య ముఖంపిత్ర్యే అద్భిః సంకల్ప్య సంస్థితం, అథ మాసికాని తానిచ కృత్వైవ సపిండనం కార్యం. తథా గోభిల లౌగాక్షీ– శ్రాద్ధానిషోడశాదత్వా నైవకుర్యాత్స పిండనం, శ్రాద్ధాని షోడశా ప్యాద్య విదధీత సపిండనం. తాని త్వాహ జాతూకర్ణ్యః – ద్వాదశ ప్రతిమాస్యాని ఆద్యషాణాసికం తథా, త్రైపక్షికాబ్దికే చేతి శ్రాద్ధాన్యే తాని షోడశ.

అను॥ అన్నమైన తన శక్తి కొలది సంవత్సరం వరకు లెక్కించి ఓ స్కంద ! ఘటాదులందు కాని వెలయిచ్చికొని కాని బ్రాహ్మణునకు ఇవ్వాలి. నరులు ఉదకుంభం లేకుండా శ్రాద్ధశతములు ఇచ్చినా, దరిద్రులు దుఃఖితులై భవార్ణవమందు తిరుగుతుంటారు, ఓతండ్రి! అందువల్ల ప్రేతకు కూడా ఉదకుంభాన్ని అపకర్షణ చేసి (తక్కువ) ఇవ్వాలి అని గోభిల భాష్యమందు స్కాందోక్తి కూడా. సపిండనం కన్న ముందే దాన్ని విధించినందువల్ల, ఆపైన నిషేధించినందువల్ల అని అన్నారో. అట్లాకాదు. ఉదకుంభమందు పార్వణ విధి కుదరదు, ఇటువంటి వ్యాఖ్య యందు ప్రమాణం లేదు, మితాక్షరాదులకు విరోధమైనందు వల్లను, ఈ వచనము ఒకవేళ సమూలమైతే అప్పుడు వృద్ధియందు అపకర్ష విధించాలి. ప్రేత శ్రాద్ధములన్నీ, అట్లాగే సపిండీకరణం కూడా అని. హేమాద్రి యందు శాఠ్యాయనోక్తి. అతనికి కూడా అన్నము సోదకుంభము, అనే యాజ్ఞవల్క్య వచనమునకు విరోధము కూడా. మదనరత్న మందు గౌతముడిట్లా – అదైవంగా (వినావిశ్వేదేవ) పార్వణ శ్రాద్ధము, సోదకుంభము చేయటం అధర్మముగా, ప్రత్యాబ్దిక శ్రాద్ధము నుండి సంకల్ప విధితో ప్రతిరోజు చేయాలి,అని. అధర్మకమనగా బ్రహ్మచర్యాది నియమములు లేకుండా. దీనిని మాసికంవలె ఏకోద్దిష్టము లేదా పార్వణము చేయాలి. అపరార్కుడైతే – సపిండీకరణం అయ్యాక విడిగా చేయటం తగదు. విడిగా చేస్తే తరువాత తిరిగి సపిండత చేయాలి,అని. లఘు హారీతోక్తి యందు కూడా ఉంది. ఇట్లా అతనికి కూడా అన్నము సోదకుంభము బ్రాహ్మణునకై సంవత్సరం ఇవ్వాలి, అని యాజ్ఞవల్కీయ వాక్యమంధు (తస్య) వానికి అని ఏకవచనం చెప్పినందువల్ల, సపిండనం తరువాత కూడా ఏకోద్దిష్టమే అని అన్నాడు. ఇక్కడ పిండదానము చేసీ చేయనట్లు. ప్రతిరోజు అన్నము ఈ బ్రాహ్మణునకు, ఉదకుంభము కూడా ఇవ్వాలి

పిండము కూడా అని కొందరు అన్నారు అని హేమాద్రి యందు పారస్కరోక్తి. శ్రాద్ధం చేత కాకపోతే పిండం మాత్రమే అని గౌడులన్నారు. అంటే అట్లాకాదు. కూడా అనే శబ్దానికి బాధ కల్గుతుంది. హారీతుడిట్లా - తండ్రి మరణిస్తే పుత్రుడు సంవత్సరం వరకు పిండం పెట్టాలి, అన్నము, ఉదకుంభము విప్రునకు ప్రేత నిర్దేశ ధర్మంతో ఇవ్వాలి,అని. ప్రేతశబ్దోచ్చారణతో అని హలాయుధుడన్నాడు. లేదా ప్రేత శబ్ద నిర్దేశం ఎక్కడుంటుందో అది ఏకోద్దిష్టము ఆధర్మం కలది అని అర్థము. ఇక్కడ ఆశౌచం అంత దినం మొదలుకొని సంవత్సరం చివర వరకు వత్సరంపూర్తి అయ్యేవరకు శౌచము అధికారి విశేషణం కాదు. అందువల్ల మృతదినం మొదలుకొని దీనిని చేయాలని కొందరన్నారు. అంటే అట్లాకాదు హేమాద్రి యందు ఉట్టంకించిన వాక్యమునకు విరోధమౌతుంది. మధ్యలో ఆశౌచాదులవల్ల బాధ కల్గితే లోపమే దార్శమువలె. అట్లాగే ప్రథమాబ్దమందు, దేవజానీయమందు గారుడోక్తిగా దీపదానం చెప్పబడింది ఇట్లా - సంవత్సరం వరకైనా, ప్రేతకు సుఖం కలిగే కొరకు ప్రతిరోజు దీపమివ్వాలి, విషమ మార్గమందు తోడుగా, నరులివ్వాలి. ప్రాఙ్ముఖుడై, ఉదఙ్ముఖంగా దీపాన్ని దేవాలయమందు ద్విజుని గృహమందు ఉంచాలి. గతించిన పితరులకై జలంతో సంకల్పంచేసి దక్షిణముఖంగా ఉంచాలి. ఇక ఆమాసికములు అవి చేసే, సపిండనం చేయాలి. అట్లాగే గోభిల లౌగాక్షులిట్లా - పదహారు శ్రాద్ధములిచ్చి సపిండనం చేయరాదు. షోడశ శ్రాద్ధములకన్న ముందు సపిండనం చేయాలి,అని. వాటిని జాతూకర్ణి ఇట్లా చెప్పాడు - ప్రతినెలవి పన్నెండు, ఆద్యము, షాణ్మాసికము, త్రైపక్షికము, ఆబ్దికము అని ఈ శ్రాద్ధములు పదహారు.

మూ॥ ఆద్యషాణ్మాసికాబ్దిక శబ్దాః ఊనమాసికోన షష్ఠో నాబ్దికపరాః. హేమాద్రౌతు సపిండీకరణంచైవ ఇత్యేతత్ శ్రాద్ధషోడశ మిత్యుత్తరార్థే పాఠః. తదా ఆద్యమూన మాసికంద్వా దశాహే. షాణ్మాసికం ఊన షష్ఠోనాబ్దికే ఇత్యర్థః. కాత్యాయనస్త్వన్యథాహ. ద్వాదశ ప్రతిమాస్యాని ఆద్య షణ్మాసికే తథా, సపిండీకరణం చైవ ఇత్యేత చ్ఛ్రాద్ధ షోడశం. ఏకాహేన తుషణ్మాసా యదా స్యురపి వాత్రిభిః, న్యూన సంవత్సర శ్చైవ స్యాతాం షణ్మాసికే తథా. ద్వివచనా దూన షష్ఠోనాబ్దికే ఇత్యర్థ మాహ పృథ్వీచంద్రః. వ్యాసస్త్వన్యథాహ - ద్వాదశాహేత్రి పక్షే చ షణ్మాసే మాసికాబ్దికే, శ్రాద్ధాని షోడశైతాని సంస్మృతాని మనీషిభిః. ద్వాదశాహ పదం ఊన మాసికం పరం. తస్య ద్వాదశాహే వృక్తేరితి కాలాదర్శః. మదనరత్నే బ్రాహ్మేత్వన్యథోక్తం. నృణాంతు త్యక్తదేహానాం శ్రాద్ధః షోడశసర్వదా, చతుర్థే పంచమే చైవ నవమైకాదశం తథా. తతో ద్వాదశ భిర్మాసైః శ్రాద్ధా ద్వాదశ సంఖ్యయేతి. చతుర్థా దీని దానాని. భవిష్యే త్వన్యథోక్తం. అస్థి సంచయనం శ్రాద్ధం త్రిపక్షే మాసికానితు, రిక్తయోశ్చ తథా తిథ్యోః ప్రేత శ్రాద్ధా నిషోడశ, ఇతి. రిక్తయోః తిథ్యోరితి న్యూన షష్ఠో నాబ్దిక పరమితి హేమాద్రిః. అత్రదేశ కులశాఖా భేదాద్వ్యవస్థేతి సర్వనిబంధాః. గాలవః - ఊనషాణ్మాసి కంషష్ఠే మాసేవా న్యూనమాసికం, త్రైపక్షికం త్రిపక్షే స్యాదూనాబ్దం ద్వాదశే తథా. ఊనమాసికేతు గోభిలః - మరణాద్ద్వాదశాహే స్యాన్మాస్యూనే చోనమాసికం. మదనరత్నే కాలాదర్శేచ శ్లోక గౌతమః - ఏకద్విత్రిది నైరూనే త్రిభాగే నోన ఏవవా, శ్రాద్ధాన్యూనాబ్దికా

దీని కుర్యాదిత్యాహ గౌతమః. క్రియానిబంధే క్రతుస్తు - సార్ధ ఏకాదశే మాసే సార్ధవై పంచమేతథా, ఊనాబ్దమూన షణ్మాసంభవేతాం శ్రాద్ధకర్మణీ త్యుక్తం. తత్ర మూలంచింత్యం. ఊనేషు వర్జ్యాన్యాహ మరీచిః - ద్విపుష్కరేచనందా సుసినీవాల్యాం భృగోర్దినే, చతుర్దశ్యాం చనోనాని కృత్తికాసు త్రిపుష్కరే. జ్యోతిషే - త్రిపాదర్క్షం తిథిర్భ ద్రాభౌమేజ్య రవిభిస్సహ తదా త్రిపుష్కరో యోగోద్వయోర్యోగే ద్విపుష్కరః గాలవః - త్రిభిర్వాదివసై రూనే త్వేకేన ద్వితయేనవా, ఆద్యాదిషు చ మాసేషు కుర్యాదూనాబ్ది కాదికం. ఏకన్యూన పక్షే పంచమ్యాం మృతస్య తృతీయాయాం త్రిభిర్న్యూనే ప్రతిపది ద్యూనే ద్వితీయా యామితికేచిత్. మాధవస్తు - షాణ్మాసికాబ్ది కే శ్రాద్ధేస్యాతాం పూర్వేద్యురేవతే, మాసికాని స్వకీయేతు దివసే ద్వాదశేపి చ, ఇతి పైఠీనసి వాక్యే ఊనషణ్మాసికం సప్తమ మాసగత మృతాహాత్పూర్వేద్యుః కార్యం, ఊనాబ్దికంతు ద్వితీయాబ్దే మృతాహాదినా త్పూర్వేద్యుః కార్యమిత్యర్థ మాహ. మాసికాని స్వకీయేతు దివసే ఇత్యుక్తేః. ఇదమేవ యుక్తం. మదనరత్నే ప్యేవం.

అను॥ ఆద్యషాణ్మాసిక, ఆబ్దిక శబ్దములు ఊనమాసిక, ఊనషష్ఠ ఊన ఆబ్దిక పరములు హేమాద్రియందైతే - ఉత్తరార్ధమందు, సపిండీకరణము కూడా అనే ఇవి శ్రాద్ధ షోడశము, అని ఉత్తరార్ధమందు పారము అని అన్నాడు. అప్పుడు తొలి ఊన మాసికము పన్నెండవరోజున, షాణ్మాసికం అనగా ఊనషష్ఠ ఊన ఆబ్దికములు అని అర్ధము. కాత్యాయనుడు మరోరకంగా చెప్పాడు - ప్రతినెలవి పన్నెండు, ఆద్యము, షాణ్మాసికములు (రెండు) సపిండీకరణము, అని ఇవి. షోడశశ్రాద్ధములు,అని. ఒక రోజుతో ఆరు నెలలు కాని లేదా మూడు రోజులతో కాని (తక్కువ) (తర్వాతి) షాణ్మాసిక మందు కావాలి. అట్లా న్యూన సంవత్సరము. ద్వివచనం వల్ల ఊనషష్ఠము, ఊన ఆబ్దికము,అని అర్థాన్ని చెప్పాడు పృథ్వీచంద్రుడు. వ్యాసుడు మరోరకంగా చెప్పాడు - ద్వాదశాహము, త్రిపక్షము, షణ్మాసము, మాసిక ఆబ్దికములు,అని. ఇవి పదహారు శ్రాద్ధములు అని బుద్ధిమంతులు చెప్పారు,అని. ద్వాదశాహ పదము ఊన మాసిక విషయము. దానిని పన్నెండవ రోజున కూడా చెప్పారు, అని కాలాదర్శము. మదనరత్న మందు బ్రాహ్మ వచన మందు మరోరకంగా చెప్పారిట్లా - మరణించిన నరులకు ఎల్లప్పుడు శ్రాద్ధములు పదహారు, నాల్గవ, ఐదవ, తొమ్మిదవ, పదకొండవ (రోజులలో) ఆపిదప పన్నెండు మాసములలో శ్రాద్ధములు పన్నెండు అని. చతుర్థాదులు దినములు భవిష్యత్తులో మరోరకంగా ఉంది - అస్థి సంచయన శ్రాద్ధము, త్రిపక్షము, మాసికములు, అట్లాగే రిక్త తిథులవి రెండు, అని ఇట్లా ప్రేత శ్రాద్ధములు పదహారు,అని. రిక్త తిథులవి అనగా ఊనషాణ్మాసిక, ఊనాబ్దిక పరములు అని హేమాద్రి. ఇక్కడ దేశకుల శాఖా భేదము ననుసరించి నిర్ణయము అని అన్ని నిబంధములన్నాయి. గాలవుడిట్లా - ఆరవ నెలలో ఊనషాణ్మాసికము, నెలలో ఉనమాసికము, త్రైపక్షికము త్రిపక్షమందు పన్నెండవ మాసమందు ఊనాబ్దము,అని. ఊన మాసికమందు గోభిలుడిట్లా - మరణం తరువాత పన్నెండవ రోజున, మాసంకన్న తక్కువ కనుక ఊనమాసికం,అని. మదనరత్నమందు, కాలాదర్శమందును గౌతముని శ్లోకమిట్లా - ఒకటి, రెండు మూడు రోజులు తక్కువైనా మూడవ భాగంతో ఊనమైనా, న్యూనాబ్దికాది శ్రాద్ధములను చేయాలి

అని గౌతముడన్నాడు. క్రియా నిబంధమందు క్రతువైతే ఇట్లా - పదకొండున్నర నెలలకు, ఐదున్నర నెలలకు ఊనాబ్దము, ఊన షణ్మాసము శ్రాద్ధ కర్మ యందు ఔతాయి, అని చెప్పారు. అక్కడ మూల వచనాలు విచారించాలి. ఊనమందు విడువ తగిన వానిని మరీచి ఇట్లా చెప్పాడు - ద్విపుష్కరము, నందతిధులు, సినీవాలి వీనియందు శుక్రవారము, చతుర్దశి తిథి, కృత్తిక లందు, త్రిపుష్కరమందు ఊనములు తగవు,అని. జ్యోతిషమందిట్లా - త్రిపాద నక్షత్రాలు భద్ర తిథి, మంగళ, గురు, ఆదివారములు ఈ మూటియోగము త్రిపుష్కర యోగం, రెండు కలిస్తే ద్విపుష్కరము,అని. గాలవుడిట్లా - మూడు రోజులు తక్కువైనా, ఒకటి, రెండు తక్కువైనా ఆది (తొలి) మొదలగు మాసములందు, ఊనాబ్దికము మొదలగునవి ఆచరించాలి,అని. ఒకరోజు తక్కువ పక్షంలో, పంచమి రోజున మరణించిన వానికి తృతీయమందు, మూడు రోజులు తక్కువ అన్నప్పుడు ప్రతిపద యందు రెండు తక్కువ అన్నప్పుడు ద్వితీయ యందు అని కొందరన్నారు. మాధవుడైతే - షాణ్మాసిక ఆబ్దిక శ్రాద్ధములు, ముందు రోజే అవి ఔతాయి, పన్నెండు మాసికములు మాత్రం తమ దినమందే ఔతాయి ద్వాదశమందును అంతే,అని. పైఠీనసి వాక్యమందు, ఊనషాణ్మాసికము సప్తమ మాసమందుండే మృతాహం కన్నముందు రోజు చేయాలి, ఊనాబ్దికమైతే రెండవ అబ్దమందు మృతాహదినం కన్న ముందు రోజు చేయాలి, అనే అర్థాన్ని చెప్పాడు. మృతాహం కన్న ముందు రోజు అని అర్థం. మాసికములు స్వకీయ దివసమందు అని చెప్పినందువల్ల ఇదే సరియైనది. మదనరత్న మందు కూడా ఇట్లాగే ఉంది.

మూ॥ యాజ్ఞవల్క్యః - మృతేఽహనితు కర్తవ్యం ప్రతిమాసంతువత్సరం, ప్రతి సంవత్సరం చైవ మాద్యమేకాదశేఽహని. అత్రాద్య మాసిక మాబ్దికం చైకాదశేఽహ్నీతి నిర్ణయామృతాదయఃబ్రాహ్మణం భోజయే దాద్యే హోతవ్యమనలేఽథవా, పునశ్చ భోజయే ద్విప్రం ద్విరావృత్తి ర్భవే దితీతి గోభిలీయం చ తద్విషయమాహుః. అన్యేతు మాసపక్ష తిథి స్పృష్టే ఇత్యాది విరోధా దాబ్దికం వర్షాంతమేవ. మాసికంతు మాసాదౌ. ద్విరావృత్తిస్తు ఏకాదశాహి కాద్యమాసిక పరా. దేవయాజ్ఞికోప్యేవ మాహ. లౌగాక్షిరపి - మాసాదౌ మాసికం కార్యం ఆబ్దికం వత్సరే గతే, ఆద్యమేకాదశే కార్యం అధికే త్వధికం భవేత్. దీపికాయాంతు - ఆద్యం రుద్రమితేఽర్క సమ్మిత దినే వాస్యాదిత్యుక్తం. గౌడాస్తు - మృతతిధ్య వధికే ఏకదినాధికే మాస సంవత్సర పదం గౌణం. పూర్ణేఽబ్దే ఇతి ఈషద సమాప్త పరత్వమితి శూలపాణిః. తేన ద్వితీయ మాసాదా వాద్యమాసికా దీని - తన్మౌర్ఖ్యకృతం. అశక్తౌతు హారీతః - ముఖ్యం శబ్దం మాసిమాసి అపర్యాప్తౌ వృతుం ప్రతి. ద్వాదశాహేన వాభోజ్యా ఏకాహే ద్వాదశాపివా. ఋతుం ప్రతిద్వేద్వే ఇత్యర్థః. యదా పితుర్మరణా త్రయో వింశతి తమే దినే దర్శో వృద్ధి ర్వాస్యాత్తదా ద్వాదశదినేషు ద్వాదశ మాసికాని కార్యాణీత్యర్థః త్రైపక్షికంతు త్రిపక్షేఽతీతే మృతాహే కార్యం. త్రైపక్షికం భవేద్వృత్తే త్రిపక్షే తదనంతరమితి భవిష్యోక్తే రితి మదనరత్నే ఉక్తం. పృథ్వీచంద్ర కాలాదర్శ నిర్ణయా మృతాదయస్తు - ఊనాన్యూనేషు మాసేషు విషమాహే సమేపివా, త్రైపక్షికం త్రిపక్షే స్యాన్మృతాహేత్వి తరాణితు, ఇతి కార్ష్ణాజిని స్మృతేః. పూర్వత్ర వృత్తే ప్రవృత్తే ఇత్యర్థమాహుః. తేతదనం తరశబ్ద విరోధాత్. త్రైపక్షిక ద్వితీయ మాసికయోః

అను॥ వచనమిట్లా - పుత్రులు లేకుండా మరణించినవానికి సపిండతను చేయరాదు, అని ఏదన్నారో, ఆపస్తంబుడిట్లా - పుత్రులు లేకుండా మరణించిన స్త్రీలు కాని పురుషులు కాని ఎవరున్నారో వారికి సపిండనం లేదు కనుక ఏకోద్దిష్టమే పార్వణం లేదు అని ఏదన్నారో, ఇవి (రెండు) ఈ మాటలు పుత్రోత్పాదన విధిని ప్రశంసించే కొరకైనవి అని మాధవుడన్నాడు. సపిండీకరణం తరువాత ఏకోద్దిష్టాన్ని పుత్రులు లేనివారికి అందరికి పత్నిలేని వారికి అట్లాగే విధిస్తున్నాము అని హేమాద్రి యందు ప్రచేతస వచనము కూడా. ఇతరులైతే రెండు రకాలైన వాక్యములు కన్పిస్తున్నందువల్ల వికల్పాన్ని చెప్పారు. స్మృత్యర్థసారమందు కూడా - బ్రహ్మచారులకు సంతానం లేనివారికి సపిండనంలేదు వారికి ఎప్పుడూ ఏకోద్దిష్టమే. వ్యుత్క్రమంగా మరణించిన వారికైతే సాపిండ్యం చేయాలి లేదా వద్దు. కొందరు అంతటా సపిండనమన్నారు,అని. పుత్రులు లేని వారు వ్యుత్క్రమంగా మరణించిన వారికి విశేషము రేణుకారికయందిట్లా - భ్రాతకాని భ్రాతృపుత్రుడు గాని సపిండుడు లేదా శిష్యుడు కాని, పుత్ర హీనుడు వ్యుత్క్రమంగా మరణిస్తే సపిండీకరణం చేయాలి, ఏ బంధువులు లేని వారికి పత్ని సపిండత చేయాలి,అని. ఋత్విజునితో లేదా పురోహితునితో చేయించాలి. వసురుద్రాదితి సుతులతో వారికి సపిండత చేయాలి. వ్యుత్క్రమంగా మరణించిన వారికి అదిలేకపోతే ప్రేతత ధ్రువము. పితామహుడు మరణిస్తే వారికి తిరిగి సపిండనం చేయాలి,అని. ఇక్కడ మూలం ఆలోచించాలి. యతులకు సపిండనం లేదుకాని పదకొండవ రోజున పార్వణం చేయాలి. అది కూడా త్రిదండికి. ఏకదండ్యాదులకు అది కూడా లేదు అని ముందు చెప్పాము. దండశబ్దం గ్రహించినందువల్ల దండగ్రహణం కన్న ముందు మరణిస్తే దాహం నుండి సపిండనం చివరి దాకా అంతాచేయాలి, అని భట్టచరణులన్నారు. సపిండన విధిని బైజవాపుడు చెప్పాడిట్లా - సంవత్సరం సమాప్తి అయ్యాక నాలుగు ఉదక పాత్రలు ప్రయోగిస్తున్నాడు. ఒకటి ప్రేతకు మూడు పితరులకు ప్రేత పాత్రను పితృపాత్రల యందు ఆసేచన చేస్తున్నాడు, యే సమానా అను రెండు మంత్రాలతో ఈ రకంగా ఇక పిండమును స్పృశిస్తున్నాడు. ఈ ప్రేత మిమ్మల్ని అనుసరిస్తున్నాడు. ఓ పితరులార! ఆతనిని మీకు ఇస్తున్నాను. మిగిలిన వారికి మంగళం జరగని, చిరజీవులు పుట్టనీ ! సమానీవః సంగచ్ఛధ్వం సంవదధ్వం, అనే మంత్రాలతో ఇట్లా - అది కూడా దేవరహితంగా ఏకఅర్ఘము, ఏక పవిత్ర కలిగి, అక్కడ అగ్నౌకరణం లేకుండా, అది కూడా ఆవాహన లేకుండా,అని. మార్కండేయుడు చెప్పినప్పటికి, అట్లైనా సపిండీకరణ శ్రాద్ధము దైవపూర్వకంగా నియోగించాలి. అనే మొదలగు వానికి విరుద్ధమైనందువల్ల వికల్పము. ప్రేతాంశ యందు కాని అని తెలుసుకోవాలి. ఇక్కడ కామకాలులు వైశ్వదేవులు అని కూడా ముందు చెప్పాము. మైత్రాయణీయ పరిశిష్టమందిట్లా - పితరునకు చెందిన విప్రుని కరమందు హోమము సాగ్నికునకైనా ఇక్కడ ఔతుంది,అని. గోభిలుడిట్లా - చెప్పని కాలములందు కూడా వ్యుత్క్రమంగా మరణించినా, సాపిండ్యాన్ని

ఆమంతోకాని, హోమంతో కాని ఏర్పరచాలి,అని ఇది ఆపది మాతా పితరులకన్న ఇతరుల విషయమైనప్పుడు, ఆపన్నుడైనా శ్రాద్ధమును ఆమంతో ఎప్పుడూ చేయరాదు,అని ఆతడే చెప్పాడు. శుద్ధితత్వమందు కామధేనువు యందును లఘు హారీతుడిట్లా – సపిండీకరణం వరకు షోడశ ప్రేత శ్రాద్ధములను పక్వ అన్నంతోనే చేయాలి, మాంసంతో ద్విజాతులు చేయాలి,అని

మూ॥ విశ్వప్రకాశే – ప్రేతస్సపిండనా దూర్ధ్వం పితృలోకేను గచ్ఛతి కుర్యాత్తస్యతు పాథేయం ద్వితీయేఽహ్ని సపిండనాత్. స్మృత్యర్థసారే ప్యేవం. తతో వృద్ధి శ్రాద్ధం కుర్యాత్. ఏతన్మలమాసేఽపి కార్యం. అధిమాసే న కర్తవ్యం శ్రాద్ధ మాభ్యుదయం తథా, తదైవ కామ్యం యత్కర్మ వత్సరా త్ప్రథమా దృతే, ఇతి హేమాద్రౌ హారీతోక్తేః. ఇతి సపిండీకరణం అథ ప్రథమాబ్దే నిషిద్ధాని – హేమాద్రౌ – స్నానం చైవ మహాదానం స్వాధ్యాయం చాగ్నితర్పణం, ప్రథమేఽబ్దే న కుర్వీత మహాగురునిపాతనే, అగ్ని తర్పణం లక్ష హోమాది నత్వాధానం. తత్తు ప్రథమాబ్దేభవత్యేవ. తదాహ హేమాద్రావుశనాః. పితుస్సపిండీకరణం వార్షికేమృతవాసరే. ఆధానాద్యుప సంప్రాప్తావే తత్ప్రాగపి వత్సరాత్. అన్యతర్పణమితి శుద్ధితత్వేపారః ఆదిపదం వృద్ధినిమిత్త నిత్య కర్మపరం. దివోదాసీయే – మహాతీర్థస్యగమన ముపవాస వ్రతానిచ, సంవత్సరం నకుర్వీత మహాగురు నిపాతనే. ఇదం శ్రాద్ధ కౌముద్యాం దేవీపురాణస్థముక్తం. గౌదనిబంధే మాత్స్యే – సపిండీకరణా దూర్ధ్వం ప్రేతః పార్వణ భుగ్భవేత్, వృద్ధీష్టా పూర్తయోగ్యశ్చ గృహస్థశ్చ సదాభవేత్. వర్షాంత సపిండనాభావే నాధికారీత్యర్థః. గృహస్థ స్సపిండోఽపీత్యర్థః. అత ఏవ – ప్రేతకర్మాణ్య నిర్వర్త్య చరేన్నాభ్యుదయ క్రియాం ఆ చతుర్థం తతః పుంసి పంచమే శుభదం భవేత్, ఇతి జ్యోతిషే ఉక్తం. మాధవీయే దేవలః – ప్రమీతౌ పితరౌ యస్య దేహస్త స్యాశుచిర్భవేత్, నదైవం నాపి వాపిత్ర్యం యావత్పూర్ణోన వత్సరః. ఇదం వర్షాంత సపిండన పరం. తదైవకామ్యం యత్కర్మ వత్సరాత్ప్రథమా దృతే, ఇతి లఘుహారీతాద్యేక వాక్యత్వాత్. వృద్ధి నిమిత్తాపకర్షేతు కామ్యాది భవత్యేవేతిగౌదాః. పిత్ర్యం సపిండనం. అత ఏవ లౌగాక్షిః – అన్యేషాం ప్రేతకార్యాణి మహాగురు నిపాతనే కుర్యాత్సవంత్స రాదర్వాక్ శ్రాద్ధమే కంతు వర్జయేత్. దాహాద్యేకా దశాహాంతం కార్యం. తత్రా శౌచాంతర స్యాప్రతి బంధ కత్వాత్. ఆద్యం శ్రాద్ధ మశుద్ధోఽపి కుర్యాదేకాదశేఽహనీత్యుక్తేశ్చ ఏకం సపిండనం. పత్న్యాదౌత్వ పవాదమాహ మాధవీయే ఋష్యశృంగః – పత్న్యాః పుత్రస్య తత్పుత్ర భ్రాతోస్త త్తనయేషు చ, స్నుషా స్వస్రోశ్చ పిత్రోశ్చ సంఘాత మరణం యది. అర్వాగబ్దా న్మాతృపితృపూర్వం సాపిండ్య మాచరేత్. లౌగాక్షిః – పత్నీపుత్రస్తథా పౌత్రోభ్రాతా తత్పుత్రకా అపి, పితరౌచయదై కస్మిన్ మ్రియే రన్వాసరే తదా. ఆద్యమే కాదశే కుర్యాత్రిపక్షేతు సపిండనం. ధవళ నిబంధే – మహాగురు నిపాతేతు ప్రేతకార్యం యథావిధి, కుర్యాత్సవత్సరా దర్వాగే కోద్దిష్టం నపార్వణం.

అను॥ విశ్వప్రకాశమందిట్లా – ప్రేత, సపిండనం తరువాత పితృలోకానికి వెళ్తాడు, కనుక ఆతనికి బాటబత్తాన్ని రెండవరోజు సపిండనంతో చేయాలి,అని. స్మృత్యర్థసారమందు కూడా ఇట్లాగే ఆ పిదప వృద్ధి శ్రాద్ధం చేయాలి. దీనిని మలమాసంలో కూడా చేయాలి. అధిమాసమందు అభ్యుదయ శ్రాద్ధము కూడదు. అట్లాగే కామ్యకర్మ చేయరాదు. ప్రదమవత్సరంలో తప్ప, అని హేమాద్రి యందు హారీతోక్తి. అని సపిండీకరణము. ఇక ప్రథమాబ్దమందు నిషిద్ధములైనవి. హేమాద్రి యందిట్లా – మహాగురువు మరణమందు

ప్రథమాబ్దమందు స్నానము, మహాదానము, స్వాధ్యాయము, అగ్ని తర్పణము చేయరాదు, అని. అగ్నితర్పణ మనగా లక్షహోమాదులు, ఆధానము కాదు. అది ప్రధమాబ్దమందైతే ఔతుంది కదా. దానినే హేమాద్రి యందు ఉశనుడిట్లా - వార్షిక మృతవాసరమందు పితృ సపిండీకరణము, ఆధానాదులు వస్తే ఇది వత్సరం ముందునుంచీ ఉంది. (వస్తే) (చేయాలి) అని. అన్య తర్పణమని శుద్ధి తత్వమందు పారము. ఆదిపదము వృద్ధి నిమిత్తమైన నిత్యకర్మపరము. దివోదాసీయమందిట్లా - మహాతీర్ధ గమనము, ఉపవాసము, వ్రతములు, మహాగురు మరణమందు సంవత్సరం దాకా చేయరాదు,అని. ఇది శ్రాద్ధ కౌముదియందు దేవీపురాణమందలిదిగా చెప్పబడింది. గౌడ నిబంధమందు మాత్స్యోక్తి ఇట్లా - సపిండీకరణం తర్వాత ప్రేత పార్వణం భుజిస్తాడు, వృద్ధి, ఇష్టాపూర్తములకు యోగ్యుడుగా ఎప్పుడూ గృహస్థుడౌతాడు,అని. వర్షాంతమందలి సపిండనం లేకపోతే అధికారికాదు అని అర్ధము. గృహస్థుడు సపిండుడుకూడా అని అర్ధము. అందువల్లనే - ప్రేతకర్మలు నిర్వర్తించ కుండా అభ్యుదయ క్రియ ఆచరించరాదు. నాల్గవ తరం వరకు, ఆ పిదప ఐదవ తరం పురుషుని నుండి శుభదమౌతుంది,అని జ్యోతిషమందు చెప్పారు. మాధవీయమందు దేవలుడిట్లా - తల్లిదండ్రులు మరణించినవాని దేహం అశుచి ఔతుంది. సంవత్సరం పూర్తి దాకా ఆతడు దైవ కార్యము, పితృ సంబంధికార్యము కాని చేయరాదు, అని. ఇది వర్షాంతమందలి సపిండన విషయము. అట్లాగే కామ్యమైన కర్మ ప్రధమవత్సరంలో తప్ప, అని లఘుహారీతా దుల(తో) ఏకవాక్యమైనందువల్ల. వృద్ధి నిమిత్త అపకర్షమందైతే కామ్యాదులు ఔతాయి గదా అని గౌడులన్నారు. పిత్ర్యమనగా సపిండనము అందుకే లౌగాక్షి ఇట్లా - మహాగురు నిపాతమందు ఇతరుల ప్రేత కార్యములను సంవత్సరం కన్న ముందే చేయాలి. శ్రాద్ధమును మాత్రం వదలాలి,అని. దాహాది అనగా ఏకాదశపు రోజు వరకు అంతమయ్యే కర్మ. అక్కడ మరో ఆశౌచమునకు ప్రతిబంధకం లేదు కనుక. తొలి శ్రాద్ధమును అశుద్ధుడైనా ఏకాదశాహమందు చేయాలి,అని చెప్పారు కనుక. ఏకం అనగా సపిండనము. పత్ని మొదలగు వారి విషయంలో అపవాదాన్ని చెప్పాడు మాధవీయమందు ఋష్యశృంగుడిట్లా - పత్ని, పుత్రుడు, వాని పుత్రుడు, భ్రాత, వాని తనయులు, కోడలు, చెల్లెలు, తల్లిదండ్రులు, వీరందరు సంఘాతంగా (ఒకేసారి) మరణిస్తే, సంవత్సరం కన్న ముందు మాతాపితల నుండి ఆరంభించి సాపిండ్య మాచరించాలి,అని. లౌగాక్షి ఇట్లా - పత్ని, పుత్రుడు, పుత్ర పుత్రుడు లేదా పౌత్రుడు, భ్రాత, ఆతని పుత్రులు, తల్లిదండ్రులు వీరంతా ఒకవేళ ఒకేసారి ఒకే వారమున (రోజు) మరణిస్తే అప్పుడు తొలిది పదకొండవరోజున చేయాలి. త్రిపక్షమందు సపిండనం చేయాలి,అని. ధవళ నిబంధమందిట్లా - మహాగురువు మరణమందు ప్రేత కార్యాన్ని యధావిధిగా చేయాలి, సంవత్సరం కన్న ముందు ఏకోద్దిష్టం చేయాలి, పార్వణం కాదు,అని.

**మూ॥ భృగుః - మాతాచైవ తథా భ్రాతా భార్యా పుత్రస్తథాస్నుషా, ఏషాం మృతౌ చరేచ్ఛ్రాద్ధం అన్యస్యన పునః పితుః. ఏతదపి సపిండన పరం. పితుర్మృతావన్యస్య శ్రాద్ధం నచరే దిత్యర్థః**

శుద్ధితత్వే దేవలః. అన్యశ్రాద్ధం పరాన్నం చ గంధమాల్యం చ మైథునం, వర్జయే ద్గురుపాతేతు యావత్పూర్ణోనవత్సరః. పారస్కర భాష్యే బృహస్పతిః - పితర్యుపరతే పుత్రో మాతు శ్రాద్ధాన్ని వర్తతే, మాతర్యపిచ వృత్తాయాం పితృశ్రాద్ధాదృతేసమం. సమంపితరం వినాన్య శ్రాద్ధం నేత్యర్థః. శుద్ధితత్వే దేవలః - మహాగురు నిపాతేతు కామ్యం కించిన్న చాచరేత్, ఆర్త్విజ్యం బ్రహ్మచర్యం చ శ్రాద్ధం దేవక్రియాం తథా. ఏతత్స పిండనాత్ప్రాగితి కేచిత్. తదుత్తర మపీత్యన్యే. శ్రాద్ధ కౌముద్యాం కాలికాపురాణే పూర్వార్థే - విశేషత శ్శివపూజాం ప్రమీత పితృకోనరః యావద్వత్సర పర్యంతం మనసాపిన చాచరేత్. కేచిత్తు - పిత్రోరబ్ద మశౌచం స్యాత్ షణ్మాసం మాతురేవచ త్రైమాసికం తు భార్యా యాస్తదర్థం భ్రాతృపుత్రయోరితి స్మృతేః. సపత్నమాతురబ్దార్థమాహుః. శ్రాద్ధ కౌముదీకారస్తు - ద్వయోరేవ మహాగుర్వోః అబ్దమేక మశౌచకం, నాన్యేషా మధికాశౌచం స్వజాతి విహితాత్మిల, ఇతి సమూల జాతూకర్ణ్య విరోధా న్నిర్మూల మహ. హేమాద్రౌ భవిష్యే - గయా శ్రాద్ధం మృతానాంతు పూర్ణేత్వబ్దే ప్రశస్యతే. త్రిస్థలీసేతౌ గారుడే - తీర్థశ్రాద్ధం గయాశ్రద్ధం శ్రాద్ధమన్యచ్చ పైతృకం, అబ్దమధ్యే న కుర్వీత మహాగురు విపత్తిషు. ఇదం వృద్ధ్యర్థ సపిండనా భావేవృద్ధౌ సపిండనాపకర్షేఽబ్దమధ్యేఽపి దర్శాది కార్యమేవ. పితుస్సపిండనం కృత్వా కుర్యాన్మా సానుమాసికం, ఇతి ఛందోగ పరిశిష్టాత్. సపిండీకరణా దూర్ధ్వం ప్రేతః పార్వణ భుగ్భవేదితి మాత్స్యాత్. తతః ప్రభృతి వైప్రేతః పితృ సామాన్యమశ్నుతే, విందతే పితృలోకం చ తత శ్రాద్ధం ప్రవర్తతే, ఇతి హారీతాచ్చేతి శూల పాణిః. యత్తుకాలీయం - సపిండీకరణా దూర్ధ్వం న దద్యాత్ప్రతి మాసికం, ఏకోద్దిష్ట విధానేన దద్యాదిత్యాహ కౌశిక ఇతి, తత్రైకోద్దిష్ట విధానాన దద్యాదిత్యన్వయః. తుర్యపాదేన పార్వణే వికల్ప ఉక్తః. బ్రహ్మకైవర్తే - ఉద్వాహశ్చో పనయనం ప్రథమేబ్దే మహీపతే, కృతే సపిండనే పూర్వ్వ మస్నాం చోద్ధరణం త్యజేత్. తథాపి కర్తు మిచ్ఛంతి త్రీణీ చైతాని వైసుతాః, మాసికాన్యవ శిష్టాని చాపకృష్య చరేత్పునః. అత్రే దంతత్వం - వృద్ధిం వినార్వాగపి సపిండనాపకర్షే పితృత్వ ప్రాప్తిర్వర్షాంత ఏవ. కృతే సపిండీకరణే నరస్సంవత్స రాత్పరం, ప్రేత దేహం పరిత్యజ్య భోగ దేహం ప్రపద్యత, ఇతి విష్ణుధర్మోక్తేః.

అను॥ భృగువిట్లా - తల్లి, భ్రాత, భార్య, పుత్రుడు, కోడలు, వీరు మరణిస్తే శ్రాద్ధ మాచరించాలి. తిరిగి తండ్రికి తప్ప ఇతరులకు కాదు, అని. ఇది కూడా సపిండన పరము తండ్రి మరణిస్తే ఇతరుల శ్రాద్ధాన్ని ఆచరించరాదు,అని అర్థము. శుద్ధితత్వమందు దేవలుడిట్లా - అన్యశ్రాద్ధము, పరాన్నము, గంధము, మాలలు, మైథునము, ఇవన్నీ గురు మరణమందు సంవత్సరం పూర్ణమయ్యేదాక విడిచి పెట్టాలి,అని. పారస్కర భాష్యమందు బృహస్పతిఇట్లా - తండ్రి మరణిస్తే పుత్రుడు తల్లి శ్రాద్ధం నుండి మరలాలి. తల్లికూడా మరణిస్తే పితృ శ్రాద్ధం లేకపోయి నాసమమే,అని. సమమనగా తండ్రిది తప్ప ఇతరుల శ్రాద్ధం వద్దు అని అర్థము. శుద్ధితత్వమందు దేవలుడిట్లా - మహాగురువు మరణిస్తే కామ్యమైనదేదీ ఆచరించరాదు, ఆర్త్విజ్యము, బ్రహ్మచర్యము, శ్రాద్ధము, దేవక్రియ వీని నాచరించాలి, తప్పవేరు కాదు. ఇది సపిండనము కన్న ముందు అని కొందరన్నారు. ఆ దాని తరువాత కూడా, అని ఇతరులన్నారు. శ్రాద్ధ కౌముది యందు కాలికా పురాణ వచనంలో పూర్వార్థమిట్లా - విశేషించి శివపూజను తండ్రి మరణించినవాడు, సంవత్సరం

వరకు మనస్సులో కూడా ఆచరించరాదు, అని. కొందరైతే – తండ్రి ఆశౌచము సంవత్సరము, తల్లికి చెందిన ఆశౌచము ఆరు నెలలు, భార్య మరణిస్తే ఆశౌచము మూడు నెలలు, భ్రాత, పుత్రుల మరణమందు ఆశౌచము అందులో సగము (నెలన్నర) అనిస్మృతి,అని. సపత్న మాతకు ఆశౌచము ఆరునెలలు అని అన్నారు. శ్రాద్ధ కౌముదీకారుడైతే – మహాగురువులిద్దరికే ఒక సంవత్సరము ఆశౌచము, ఇతరులకు అధికాశౌచము కాదు, స్వజాతికి విహితమైన దానికన్న, అని సమూలమైన జాతూకర్ణి వచనమునకు విరోధమైనందువల్ల నిర్మూలమన్నారు. హేమాద్రి యందు భవిష్యోక్తి ఇట్లా – మృతులకు గయాశ్రాద్ధము సంవత్సరం పూర్తై నాకైతే బాగుంటుంది, అని. త్రిస్థలీ సేతువు యందు గారుడోక్తి ఇట్లా – తీర్థ శ్రాద్ధము, గయా శ్రాద్ధము, పైతృక శ్రాద్ధము, వీనిని మహాగురువు మరణిస్తే అబ్దమధ్యంలో చేయరాదు,అని ఇది వృద్ధ్యర్థమైన సపిండనం లేకపోతే, వృద్ధియందు సపిండనం అపకర్షఐతే, అబ్దమధ్యమందు కూడా దర్శాదులు చేయాల్సిందే. తండ్రికి సపిండనం చేసి మాస అనుమాసికములు చేయాలని ఛందోగ పరిశిష్టం నుండి.సపిండీకరణం తరువాత ప్రేత పార్వణభుక్ ఔతాడు,అని మాత్స్యోక్తి. అప్పటి నుండి ప్రేత పితరులలో సామాన్యుడు (సమానుడు) ఔతాడు (పొందుతాడు). పితృలోకాన్ని పొందుతాడు. ఆ పిదప శ్రాద్ధం ఆరంభ మౌతుంది,అని హారీతం నుండి అని శూలపాణి అన్నాడు. కాతీయమందిట్లా – సపిండీకరణం తర్వాత ప్రతిమాసికము ఇవ్వరాదు, ఏకోద్దిష్ట విధానంతో ఇవ్వాలని శౌనకుడన్నాడు, అని ఏదుందో అక్కడ, ఏకోద్దిష్ట విధితో ఇవ్వరాదు అని అన్వయము. నాల్గవ పాదంతో పార్వణ మందు వికల్పము చెప్పారు. బ్రహ్మకైవర్తమందిట్లా – ఓ మహీపతి, ప్రథమ అబ్దమందు వివాహము, ఉపనయనము వీనిని చేయవచ్చు. సపిండనం చేసినా ఆపైన అస్థుల ఉద్ధరణము విడువాలి. ఐనా సుతులు ఈ మూడింటిని చేయాటానికి ఇష్టపడుతారు. అవశిష్ట మాసికములను అపకర్షచేసి చేయాలి,అని. ఇక్కడ తత్వమిది – వృద్ధిలేకుండా ముందుగా కూడా సపిండన అపకర్ష చేస్తే పితృత్వ ప్రాప్తి మాత్రం వర్షాంతమందే. సపిండీకరణం చేసినా నరుడు సంవత్సరం తరువాతనే ప్రేత దేహాన్ని వదలి భోగదేహాన్ని పొందుతున్నాడు, అని విష్ణుధర్మోక్తి.

**మూ॥ అర్వాక్సంవత్సరాద్యస్య సపిండీకరణం భవేత్, ప్రేతత్వమపి తస్యాపి విజ్ఞేయం వత్సరం నృప, ఇత్యగ్ని పురాణాచ్చ. తేన తత్సత్వేపి వృద్ధిదైవపిత్ర్యేష్వనధికారః. వృద్ధి నిమిత్తే త్వనంతరమేవ. అర్వాక్సం వత్సరాద్వృద్ధౌ పూర్ణే సంవత్సరేఽపివా, యే సపిండీకృతాః ప్రేతాః న తేషాంతు పృథక్క్రియా, ఇతి శాతాతపోక్తేః. తథైవ కామ్యమితి హేమాద్రి ధృత హారీతాది వశాచ్చైవమితి. తథా – అస్థిక్షేపం గయా శ్రాద్ధం శ్రాద్ధం చాపర పక్షికం, ప్రథమేబ్దే, న కుర్వీత కృతేఽపితు సపిండనే అస్యాపవాదః – అస్థిక్షేపం గయా శ్రాద్ధం శ్రాద్ధం చాపర పక్షికం ప్రథమేఽబ్దేపి కుర్వీత యదిస్యాద్భక్తిమాన్ సుతః, భక్త్యాఖ్యం శ్రాద్ధం తద్వానితి మదనపారిజాతాదయః. అన్యేయథాశ్రుత మాహుః. తత్త్వంతు యదీదం సమూలం తదా వృద్ధిం వినాపకర్షే పూర్వం వృద్ధ్యర్థేతు పరమితి యోజ్యం. పతితానాం గయాయాం విశేషో బ్రాహ్మే – క్రియతే పతితానాం చ గతే సంవత్సరే క్వచిత్, దేశధర్మ ప్రమాణత్వాద్గయా శ్రాద్ధం స్వబంధుభిః. అథవిధానాని – తత్ర**

పంచక మృతే మదనరత్నే గారుడే - ఆదౌకృత్వా ధనిష్ఠా ర్థమేతన్న క్షత్ర పంచకం, రేవత్యంతం సదా దూష్యం అశుభం దాహకర్మణి. శవస్యతు సమీపేతు క్షేప్తవ్యాః పుత్తలాస్తదా. దర్భమయాస్తు చత్వార ఋక్ష మంత్రాభి మంత్రితాః. తతో దాహః ప్రకర్తవ్యస్తైశ్చ పుత్తలకైస్సహా, సూతకాంతే తతః పుత్రైః కార్యం శాంతి కపౌష్టికం. పంచకేషు మృతోయోవైన గతిం లభతే నరః, తిలాంశ్చైవ హిరణ్యం చ త ముద్దిశ్య ఘృతం దహేత్. క్రియానిబంధే - భాజనోపాన హౌ ఛత్రం హైమ ముద్రాం చ వాససీ, దక్షిణా దీయతే విప్రే సర్వపాతక మోచనీ. మదనరత్నే గార్గ్యః - యదిభద్రా తిథీనాంస్యా ద్వానుభౌమ శనైశ్చరౌ, త్రిపాదర్క్షైశ్చ సంయోగో ద్వయోర్యోగే ద్విపుష్కరః. ద్విత్రి పుష్కరయోగేతు మృతిర్నృత్యంత రావహా. దహనే మరణే చైవ త్రిగుణం స్యాత్రి పుష్కరే. ఖననేఽ ప్యేవమేవస్యా దేతద్దోషోప శాంతయే. తిలపిష్టైర్య వైర్వాపి శరీరం కారయేత్తతః, శూర్పేనిధాయా లంకృత్య దాహయేత్సైతృకోపరి. తద్దాహే మంత్ర మాహ బౌధాయనః - అస్మాత్త్వమితి మంత్రేణ తిలపిష్టం ప్రదాహయేత్. ద్విత్రిపుష్కరయో ర్దోషః త్రిభిః కృచ్ఛ్రైర్వ్యపోహతి. వాసవే మరణం చేత్స్యాద్నృహోవాపి పునర్మృతిః, సువర్ణం దక్షిణాం దద్యాత్ కృష్ణవస్త్ర మథాపివా. వాసవం ధనిష్ఠా. బ్రాహ్మే - కుంభమీన స్థితే చంద్రే మరణం యస్య జాయతే, నతస్యోర్ధ్వగతి ర్దృష్టా సంతతౌన శుభం భవేత్. నతస్యదాహః కర్తవ్యో వినాశాస్త్రేషు జంతుషు. అథవాతద్దినే కార్యోదాహస్తు విధి పూర్వకం. ధనిష్ఠా పంచకే జీవోమృతో యదిక ధంచన, త్రిపుష్కరే యామ్య భేవాకులజాన్మారయే ద్ధ్రువం.

అను॥ సంవత్సరం కన్న ముందు ఎవనికి సపిండీకరణం చేస్తారో, వానికి ప్రేతత్వం కూడా వత్సరకాలం ఉంటుంది అని గ్రహించాలి, ఓ నృప! అని అగ్నిపురాణం వల్ల, అందువల్ల అది ఉన్నా వృద్ధి దైవ పితృకార్యములందు అధికారము లేదు. వృద్ధి నిమిత్తమైతే తర్వాతనే. సంవత్సరం కన్న ముందు లేదా పూర్ణ సంవత్సర మందు కాని వృద్ధియందు, సపిండీకృతులైన ప్రేతలకు విడిగా క్రియలేదు, అని శాతాతపోక్తి. అట్లాగే కామ్యము అని హేమాద్రి యందున్న హారీతాదుల వచనం వల్లను ఇట్లాగే అని. అట్లాగే - అస్థిక్షేపము, గయాశ్రాద్ధము అపర పక్ష శ్రాద్ధము వీనిని సపిండనంచేసినా ప్రథమాబ్దమందు చేయరాదు, అని. దీనికి అపవాదము - అస్థిక్షేపము, గయా శ్రాద్ధము అపర పక్ష శ్రాద్ధము వీనిని సుతుడు భక్తి మంతుడైతే ప్రథమాబ్దమందునూ చేయవచ్చును,అని. భక్తి అని పేరుగల శ్రాద్ధమును, అది కలవాడై అని మదనపారిజాతాదులన్నాయి. ఇతరులైతే విన్న ప్రకారం (ఉన్న) చెప్పారు. నిజానికైతే - ఒకవేళ ఇది సమూలమైతే అప్పుడు వృద్ధి లేకుండా అపకర్షమైతే పూర్వమందు. వృద్ధ్యర్థమందైతే పరమందు అని గ్రహించాలి. పతితులకు గయ యందు విశేషాన్ని బ్రాహ్మమందిట్లా - ఒకచోట సంవత్సరం గడిచాక పతితులకు దేశధర్మ ప్రమాణాను సారం తమ బంధువులు గయా శ్రాద్ధాన్ని చేస్తున్నారు,అని. ఇక విధానాలు - అక్కడ పంచకమృతమందు మదనరత్నమందు గారుడోక్తి ఇట్లా - ధనిష్ఠార్ధం నుండి ఆరంభమై ఆ ఐదు నక్షత్రములు రేవతి చివరి వరకు దాహకర్మయందు ఎల్లప్పుడూ దూషించ తగినవి, అశుభమైనవి, అని. అప్పుడు శవ సమీపమందు, దర్భలతో చేసిన నాలుగు బొమ్మలను నక్షత్రమంత్రములతో అభిమంత్రించి ఉంచాలి. ఆ పిదప ఆ బొమ్మలతో సహ దాహం

చేయాలి. ఆ పిదప పుత్రులు సూతకాంతమందు శాంతిక పౌష్టిక హోమం చేయాలి. ఆ ఐదు నక్షత్రములలో మరణించిన నరుడు ఉత్తమ గతిని పొందదు. తిలలు, హిరణ్యము వీనితో వాని నుద్దేశించి ఘృతముతో హోమం చేయాలి. (దహించాలి)అని. క్రియా నిబంధమందిట్లా - భాజనము, పాదుకలు, ఛత్రము, బంగారుముద్ర, వస్త్రములు, దక్షిణ ఇవి బ్రాహ్మణునకు దానం చేస్తే అన్ని పాపముల నుండి ముక్తి అని. మదనరత్నమందు గార్గ్యుడిట్లా - తిథులలో భద్ర, ఆది, మంగళ, శనివారములు, త్రిపాద నక్షత్రముల యోగము వీనిలో రెండు కూడితే ద్విపుష్కరం. ద్విత్రిపుష్కరముల యోగమందైతే మరణం సంభవిస్తే మరో మృతిని తీసుకు వస్తుంది. త్రిపుష్కరమందైతే దహనమందు లేదా మరణమందైనా మూడింతలు దోషం. ఖనన మందును ఇట్లాగే దోషముంటుంది. ఈ దోష ఉపశాంతి కొరకు, నువ్వుల పిండితో లేదా యవలతో కాని శరీరాన్ని చేయాలి ఆ పిదప చాటయందుంచి, అలంకరించి పైతృకంపై (పితృశరీరం) ఉంచి దహనం చేయాలి, అని. ఆదాహమందు మంత్రాన్ని బోధాయనుడిట్లా - అస్మాత్త్వం అనుమంత్రంతో తిలపిష్టాన్ని దాహం చేయాలి. ద్వి, త్రిపుష్కర యోగ దోషము మూడు కృచ్ఛ్రములతో పోతుంది,అని. వాసవమందు మరణమైతే గృహమందుకాని మరణిస్తే, సువర్ణము, దక్షిణ, దానం చేయాలి. లేదా కృష్ణ వస్త్రాన్నైనా దానం చేయాలి,అని. వాసవ మనగా ధనిష్ఠ నక్షత్రం. బ్రాహ్మమందిట్లా - చంద్రుడు కుంభ మీనములందుండగా మరణించిన వానికి ఊర్ధ్వగతి లేదు, సంతతియందు శుభం కలుగదు,అని. తమ జాతి జంతువు ల నాశ భయంతో వాని దాహము చేయరాదు లేదా ఆరోజే విధి పూర్వకముగా దాహం చేయాలి. ధనిష్ఠ పంచకమందు ప్రాణి మరణిస్తే త్రిపుష్కర మందు లేదా యామ్య నక్షత్రమందు మరణిస్తే (భరణి) కులజులను చంపుతాడు, నిశ్చయము.

**మూ॥ తత్రా నిష్ట వినాశార్థం విధానం సముదీర్యతే. దర్భాణాం ప్రతిమాః కార్యాః పంచోర్ణా సూత్రవేష్టితాః యవపిష్టే నానులిప్తాః తాభిస్సహ శవందహేత్. ప్రేతవాహః ప్రేతసఖః ప్రేతపః ప్రేత భూమిపః, ప్రేతహర్తా పంచమస్తు నామాన్యే తాని చ క్రమాత్. అత్ర ప్రతిమా గంధపుష్పైః పూజయిత్వా ప్రథమాం శిరసి ద్వితీయాం నేత్రయోః తృతీయాం వామ కుక్షౌ చతుర్థీం నాభౌ పంచమీం పాదయోః న్యస్య తదుపరి నామభిః ఘృతం హుత్వా యమాయ సోమం త్ర్యంబక మితి మంత్రాభ్యాం ప్రత్యేకంతా స్వాజ్యం హునేదితి భట్టాః. సూతకాంతే తతః పుత్రః కుర్యాచ్ఛాంతిక పౌష్టికం. కాంస్య పాత్ర స్థితం తైలం వీక్ష్య దద్యాద్ద్విజన్మనే. బ్రహ్మావిష్ణు మహేశేంద్ర వరుణ ప్రీతయే తతః, మాషముద్గయ వవ్రీహి ప్రియంగ్వాది ప్రయచ్ఛతి. స్వర్ణ దానం రుద్ర జాప్యం లక్ష హోమో ద్విజార్చనం, గోభూదానం షడంశేన కుర్యాద్దోషోప శాంతయే. అపరార్కే - ధనిష్ఠా పంచక మృతే పంచరత్నాని తన్ముఖే ప్రాశ్యాహుతి త్రయంతత్ర హునేద్భువపామితి. తతో నిర్హరణం కుర్యాదేష సాగ్నేర్విధిః స్మృతః. ఇతరంని ఖనే దేవజలేవా ప్రతిపాదయేత్. త్రిపాదర్క్ష మృతే తద్వద్ధిరణ్య శకలం ముఖే. తస్యపిష్టమయం కుర్యాత్పురుష త్రితయంతతః, హోమః ప్రతిముఖం కుర్యాత్తథా వహవ పామితి. కార్ష్ణాయ సంచకార్పాసంకు సుంభం ప్రతిపాద్యచ, నిర్యాత్య సాగ్నిం**

సంస్కుర్యాద్భువ్యగ్నౌ వాన్య ముత్సృజేత్. తత్రైవ - కనకం హీరకం నీలం పద్మరాగం చ మౌక్తికం, పంచరత్న మిదం ప్రోక్తం ఋషిభిః పూర్వదర్శిభిః. రత్నానాం చాప్యభావేతు స్వర్ణం కర్షార్ధమేవచ, సువర్ణ స్యాప్య భావేతు ఆజ్యం జ్ఞేయం విచక్షణైః. మదనరత్నే ప్యేవం. తథా - ఏకాశీతి పలంకాంస్యం తదర్ధం వా తదర్ధకం, నవషట్ త్రిపలం వాపి దద్యాద్విప్రాయశక్తితః, తథాన్యత్ర - స్వగృహ్యోక్త విధానేన కృత్వాగ్నేః స్థాపనం తతః, అన్వాధానం నిర్వపణం దేవతానాం తథాహుతిః. యమాయ ధర్మరాజాయ మృత్య వేచాంత కాయచ, వైవస్వతాయ కాలాయ సర్వభూత క్షయాయచ, ఔదుంబరాయ దధ్నాయ నీలాయ పరమేష్ఠినే, వృకోదరాయ చిత్రాయ చిత్ర గుప్తాయవై క్రమాత్, విధినాశ్రవణం కృత్వా ఏకైకా మాహుతిం హునేత్. కృష్ణాంగాం కృష్ణ వస్త్రాం చ హైమనిష్క సమన్వితాం, దద్యాద్విప్రాయ శాంతాయ ప్రీతో భవతు మేయమః.త్రిపాదర్ క్షేప్యేతదేవ. అపరార్కే - పునర్వసూత్తరాషాఢా కృత్తికోత్తర ఫాల్గునీ, పూర్వాభాద్రా విశాఖా చ జ్ఞేయమే తత్త్రిపాదభం.

అను॥ అక్కడ అనిష్ట వినాశం కొరకు విధానాన్ని చెప్తున్నాను. ఐదు, ఉన్ని దారములతో చుట్టబడిన దర్భల ప్రతిమలను చేయాలి. యవపిండితో వానిని పూయాలి. వానితో పాటు శవాన్ని దహించాలి. ఈ ఐదు ప్రతిమలు ప్రేతవాహుడు, ప్రేత సఖుడు, ప్రేతను రక్షించేవాడు, ప్రేత భూమియందుండేవాడు, ప్రేతను తీసుకుపోయేవాడు, క్రమంగా ఇవి వీనిపేర్లు. ఇక్కడ ప్రతిమలను గంధపుష్పములతో పూజించి, తొలిది శిరస్సున, రెండవ దానిని కళ్ళయందు, మూడవ దానిని ఎడమ కడుపువైపు, నాల్గవ దానిని నాభియందు, ఐదవ దానిని పాదములందుంచి దానిపై పేర్లతో నేతితో హోమం చేసి, యమాయ సోమం, త్ర్యంబకం అను మంత్రాలతో ప్రత్యేకంగా వానిపై ఆజ్యంతో హోమం చేయాలి, అని భట్టులన్నారు. సూతకాంతమందు ఆ పిదప పుత్రుడు శాంతిక పౌష్టిక హోమం చేయాలి. కాంస్య పాత్రయందున్న నూనెను చూచి, ద్విజన్మునకు ఇవ్వాలి (దానిని) ఆ పిదప బ్రహ్మ విష్ణు మహేశ ఇంద్ర వరణుల ప్రీతి కొరకు మినుములు, పెసలు, యవలు, వ్రీహి (ధాన్యం). కొర్రలు మొదలైనవి దానం చేయాలి. స్వర్ణదానము, రుద్రజపము, లక్షహోమము, ద్విజార్చనము, గోభూదానము, దోష ఉపశాంతి కొరకు ఆరవ భాగంగా ఇవ్వాలి. అపరార్కమందిట్లా - ధనిష్ఠ పంచకమందు మరణిస్తే పంచరత్నములను ఆతని ముఖమందుంచి, ఆహుతి త్రయము ఉంచి (పోసి) అక్కడ బహువపాం (అను మంత్రంతో) అని హోమం చేయాలి. ఆ పిదప శవాన్ని తీసుకుపోవాలి. ఇది సాగ్నికునకు విధి అని అన్నారు, అని. ఇతరమైన వాటిని పాతాలి, లేదా నీటిలో పారవేయాలి. త్రిపాద నక్షత్రమందు మరణిస్తే అట్లాగే హిరణ్య శకలాన్ని (తునక) ముఖమందుంచి, వానికి ముగ్గురు పురుషులను పిండితో చేయాలి. ఆ పిదప ప్రతిముఖమందు అట్లాగే హోమం చేయాలి, వహావపాం అను మంత్రంతో, ఇనుము, పత్తి (వస్త్రము) బంగారు ఇచ్చి తీసుకుపోయి సాగ్నికుని భూమియందు, అగ్నియందుకాని సంస్కరించాలి, ఇతరుని వదలాలి,అని. అక్కడే - కనకము, హీరము (వజ్రం) నీలము, పద్మరాగము, ముత్యము ఇవి ఐదు రత్నములు (పంచరత్న) అని పూర్వదర్శులైన ఋషులన్నారు. రత్నములు లేకపోతే సగంకర్ష బంగారము, సువర్ణం

కూడా లేకపోతే విచక్షణులు ఆజ్యము, అని తెలుసుకోవాలి. మదనరత్నమందును ఇట్లాగే. అట్లాగే - ఎనుబది ఒక్క పలముల కాంస్యాన్ని, అందులో సగం లేదా ఇంకా అందులో సగం లేదా తొమ్మిది లేదా ఆరు లేదా మూడు పలముల కాంస్యమును శక్తి కొలది బ్రాహ్మణున కివ్వాలి,అని. అట్లాగే మరోచోట - తమ గృహ్య సూత్రమందు చెప్పిన విధంగా అగ్నిస్థాపన చేసి ఆ పిదప అన్వాధానము, నిర్వపణము, అట్లాగే దేవతలకు ఆహుతి ఇవ్వాలి. యమాయ ధర్మరాజాయ.... క్రమాత్ విధి ప్రకారము వినిపించి (చదివి) ఒక్కొక్క ఆహుతిని హోమం చేయాలి. నల్లని ఆవును, నల్లని వస్త్రంతో కూడా, బంగారు నిష్కములతోపాటు, శాంతుడైన విప్రునకు, నాయందు యముడు సంతుష్టుడు కాని అని అంటూ, ఇవ్వాలి. త్రిపాద నక్షత్ర మందును ఇదే. అపరార్కమందిట్లా - పునర్వసు, ఉత్తరాషాఢ, కృత్తిక, ఉత్తరఫల్గుని, పూర్వాభాద్ర, విశాఖ ఇవి త్రిపాద నక్షత్రాలని గ్రహించాలి,అని.

**మూ॥ మయూర చిత్రే గర్గః - మృతః శ్మశానం యోనీత ఉపజీవతి మానవః. గృహే యస్య ప్రవిష్టోఽసౌ తిష్ఠేదథకదాచన. అచిరాన్మృత్యు మాయాతి హృతదార పరిగ్రహః. తత్ర శాంతిం ప్రవక్ష్యామి ధర్మ రాజమతం యథా. సక్షీరాణాం ఘృతాక్తానాం అగ్నేర్హుత్వా ముఖేబుధః ఔదుంబరీణాం విధివత్ తతశ్శాంతిః కృతాభవేత్. సావిత్ర్యష్ట సహస్రేణ క్షీరశాంతిం చ కారయేత్. కపిలాం తిలకాంస్యం చహుతాంతే భూరిదక్షిణా, ఇతి. అథ బ్రహ్మచారి మృతౌ శౌనకః - బ్రహ్మ చారి మృతౌ రీతిం కథయామి సమాసతః, తత్రా వకీర్ణ దోషస్య ప్రాయశ్చిత్తం ప్రశాంతయే. ద్వాదశాబ్దం షడబ్దం వా త్ర్యబ్దం శక్త్యాథ వాచరేత్. స్నాతకో బ్రహ్మచారీ చ నిధనం ప్రాప్నుయాద్యది. సంయోజ్య చార్క విధినా సంయోజ్యౌ తౌతతః పరం. దేశకాలౌ స్మృత్వా అముక గోత్రా ముక నామ్నో మృతస్య బ్రహ్మచారిణో వ్రత విసర్గం కరిష్యే, ఇత్యుక్త్వా హేమ్నా నాందీ శ్రాద్ధం కృత్వాగ్నిం ప్రతిష్ఠాప్య ఆఘారాంతే, చత సృభిర్వ్యాహృతిభిరగ్నయే వ్రత పతయే వ్రతానుష్ఠాన సంపాదనాయ విశ్వేభ్యో దేవేభ్య శ్చాజ్యం హుత్వాస్విష్ట కృదాది సమాప్య పునర్దేశకాలౌ స్మృత్వాఽర్క వివాహం కరిష్యే, ఇత్యుక్త్వా హేమ్నా నాందీ శ్రాద్ధం కృత్వార్క శాఖాం శవం చ హరిద్రయా లిప్త్వా పీతసూత్రేణ వస్త్ర యుగ్మేన చావేష్ట్య అగ్నిం ప్రతిష్ఠాప్య ఆఘారాంతేఽగ్నయే బృహస్పతయే వివాహ విధియోజకాయ చ యస్మైత్వం కామం కామాయేతి కామాయ వ్యాహృతిభిశ్చాజ్యం హుత్వా స్విష్టకృదాది సమాప్య అర్కశాఖాం శవంచ దహేత్. విధాన మాలాయాం - యేషాం కులే బ్రహ్మచారీ నిధనం ప్రాప్నుయాద్యది, తత్కులం క్షయమాప్నోతి సోఽపి దుర్గతి మాప్నుయాత్. మృతస్య మ్రియ మాణస్య షడబ్దం వ్రతమా దిశేత్. త్రింశద్భ్యో బ్రహ్మ చారిభ్యో దద్యాత్కౌపీన కాన్నవాన్, హస్త మాత్రాః కర్ణ మాత్రా దద్యాత్కృష్ణా జినాని చ, పాదుకా ఛత్ర మాల్యాని గోపీచందనమేవచ, మణి ప్రవాళ మాలాశ్చ భూషణాది సమర్పయేత్. ఏవం కృతే విధానే చ విష్ణుః కోపిన జాయతే. అత్ర మూలం మృగ్యం. కుష్ఠి మృతౌతు యమః - మృతస్య కుష్ఠినోదేహం నిఖనే ద్గోష్ఠభూమిషు, వాసరత్రి తయం పశ్చాత్ ఉద్ధృత్యా న్యత్ర తందహేత్. నగంగా ప్లవనం కార్యం నిక్షేపే విధి రుచ్యతే, షడబ్దవ్రత పూర్ణేన విధినాంత్యం క్రతుం చరేత్. తతోఽస్థి సంచయం తస్య గంగాయాం ప్రక్షిపేత్సుధీః. మాసిమాసి తతః కుర్యాన్మాసి శ్రాద్ధాని పార్వణాత్. ఇత్యేతత్కుష్ఠి మరణే కథితం శాస్త్రకోవిదైః. శుద్ధితత్వే భవిష్యే - శృణుకుష్ఠి గణం విప్ర ఉత్తరోత్తరతో గురుం, విచర్చి కాతు**

దుశ్చర్మా చర్చరీయ స్తృతీయకః. వికచ్ఛూర్వణ తామ్రౌచ కృష్ణ శ్వేతే తథాష్టక మిత్యుక్త్వా - మృతేతు ప్రాపయేత్తీర్థ మథవాతరు మూలకం, సపిండనోదకం కార్యం న చ దానక్రియాం చరేత్.

అను॥ మయూర చిత్రమందు గర్గుడిట్లా - మరణించాడని శ్మశానందాకా తీసుకుపోతే ఆతడు బ్రతికితే, ఆతడు ఎవరి ఇంటికి చేరి ఉంటాడో, ఆతడు ఇక ఎప్పుడో త్వరలోనే మృత్యువు నందుతాడు, భార్యపరివారము కోల్పోతాడు. అక్కడ, ధర్మరాజు మతము రీతిగా శాంతిని చెబుతున్నాను. పాలు గలిగిన నేతితో తడిపిన మేడి (శాఖ) సమిధలను, విధి ప్రకారము బుధుడు అగ్ని ముఖ మందు హోమం చేయాలి. ఆ పిదప శాంతి చేసినట్లౌతుంది. సావిత్రి మంత్రము వేయి మీద ఎనిమిది సార్లు హోమము, అట్లాగే క్షీరశాంతిని చేయించాలి, కపిలను, తిలలు, కంచు వీనిని హోమాంతమందు భూరి దక్షిణను ఇవ్వాలి, అని. ఇక బ్రహ్మచారి మరణిస్తే శౌనకుడిట్లా – బ్రహ్మచారి మృతి యందు పద్ధతిని సంక్షిప్తంగా చెప్తాను. అక్కడ లోపించిన బ్రహ్మచర్యం కలవానికి (అవకీర్ణి) ఆదోషానికి ప్రాయశ్చిత్తాన్ని ప్రశాంతికై చెప్తాను. పన్నెండు సంవత్సరాలు లేదా ఆరు లేదా మూడు లేదా శక్త్యానుసారం ప్రాయశ్చిత్త మాచరించాలి. స్నాతకుడు బ్రహ్మచారి మరణిస్తే అర్కవిధితో సంయోజన చేసి, ఆ పిదప వారిద్దరిని కలపాలి,అని. దేశకాలములు స్మరించి ఈ గోత్రం ఈ పేరు గలిగి మరణించిన బ్రహ్మచారి యొక్క వ్రత విసర్గను చేస్తున్నాను అని చెప్పి హేమంతో నాందీ శ్రాద్ధం చేసి అగ్ని ప్రతిష్ఠచేసి ఆఘారాంతమందు నాలుగు వ్యాహృతులతో అగ్నికి వ్రతపతికి, వ్రత అనుష్ఠాన సంపాదన కొరకు విశ్వేదేవతలకు ఆజ్యం హోమంచేసి స్విష్ట కృదాదులు సమాప్తిచేసి తిరిగి దేశకాలములు స్మరించి ఔర్ధ్వ దేహిక అధికారం కొరకు అర్క వివాహం చేస్తున్నాను. అని చెప్పి హోమంతో నాందీ శ్రాద్ధం చేసి, అర్కశాఖను, శవమును, పసుపుతో పూసి పచ్చని దారంతో రెండు వస్త్రములతో కప్పి అగ్ని ప్రతిష్ఠచేసి ఆఘారాంత మందు (అగ్నికి, బృహస్పతికి, వివాహ విధి యోజకునకు) అగ్నయే... కామాయ, అని కామునకు వ్యాహృతులతోను ఆజ్యం హోమం చేసి, స్విష్ట కృదాదులు సమాప్తిచేసి, అర్కశాఖను శవాన్ని దహించాలి. విధాన మాలయందిట్లా – ఎవని కులమందు బ్రహ్మచారి మరణిస్తే ఆ కులం నశిస్తుంది, వాడు కూడా దుర్గతి నందుతాడు. మరణించిన వానికి, మరణించబోయే వానికి ఆరు సంవత్సరాలు వ్రతాన్ని ఆదేశించాలి. ముప్పది మంది బ్రహ్మచారులకు కొత్త గోచులను దానమివ్వాలి. చెవి నుండి చేతిదాకా అంతపొడవుండే కృష్ణ అజినములను ఇవ్వాలి. పాదుకలు, ఛత్రము, మాలలు, గోపీచందనము, మణులు, ప్రవాళములు కూర్చిన మాలలు భూషణాదులు సమర్పించాలి. ఇట్లా విధానంగా చేస్తే విఘ్నమే దీకలు గదు ఇక్కడ మూల వాక్యాలను వెదకాలి. కుష్ఠరోగి మరణిస్తే యముడిట్లా – మరణించిన కుష్ఠవాని దేహాన్ని కొర్దము ప్రదేశమందు పాతాలి. మూడు రోజుల తరువాత తీసి మరోచోట ఆ శవాన్ని కాల్చాలి. గంగా ప్లవనము చేయరాదు. పూడ్చుటయందు విధి చెప్పబడుతోంది. షడబ్ద పూర్ణమైన వ్రత విధితో అంత్యక్రతువు నాచరించాలి. ఆ పిదప ఆతని అస్థి సంచయాన్ని బుద్ధిమంతుడు గంగలో వేయాలి. ఆ పిదప ప్రతి మాసమందు మాసి శ్రాద్ధములను

పార్వణంతో చేయాలి. ఇది కుష్ఠుని మరణమందు శాస్త్ర కోవిదులు చెప్పినమాట. శుద్ధి తత్త్వమందు భవిష్యోక్తి ఇట్లా – ఓ విప్ర! ఉత్తరోత్తరము గురువైన కుష్ఠి గుణాన్ని విను. గజ్జి, దుశ్చర్మ, చర్చరీయం (ముడత చర్మం), వికచ్ఛువు (అధికంగోకుడు, తామర), పుండ్లు, ఎర్రబడటం, నలుపు, తెలుపు (గా చర్మం మారటం) ఇట్లా చర్మంలో కలిగే మార్పిడిని బట్టి కుష్ఠువును ఎనిమిది రకాలుగా చెప్పి దీనితో మరణిస్తే తీర్థమునకు తీసుకెళ్ళాలి (నీరు) లేదా చెట్టు మొదటికి తీసుకెళ్ళాలి. సపిండము, ఉదకము చేయరాదు. దాన క్రియ ఆచరించరాదు,అని.

మూ॥ షణ్మాసీయ త్రిమాసీయ మృతః కుష్ఠీ కదాచన, యదిస్నేహాచ్ఛరేద్దాహం యతి శ్చాంద్రాయణం చరేత్. అకృత ప్రాయశ్చిత్త కుష్ఠ్యాది దాహే ఇదం ప్రాయశ్చిత్తం. అత ఏవ కునఖ్యా దివత్కుష్ఠి నోపి ద్వాదశ రాత్రం శూలపాణి నోక్తం. అత ఏవాన్య దీయం కుష్ఠినో మరణాంత మాశౌచ ముక్తం కూర్మే – క్రియాహీనస్య మూర్ఖస్య మహారోగిణ ఏవచ, యథేష్టాచరణ స్యాహుః మరణాంత మశౌచకం – మహారోగాస్తు – వాతవ్యాధ్యశ్మరీకుష్ఠ మేహోదర భగందరాః అర్శాంసి గ్రహణీ త్యష్టౌ మహారోగాః ప్రకీర్తితా ఇతి. రజస్వలాయాస్తు వృద్ధ శాతాతపః – రజస్వలాయాః ప్రేతాయాః సంస్కారా దీని నాచరేత్, ఊర్ధ్వం త్రిరాత్రా త్స్నాతాంతాం శవధర్మేణ దాహయేత్. అతః ప్రక్షాళ్యకాష్ఠవద్ద గ్ధ్వా త్ర్యహోర్ధ్వం దహేత్. సంకటేతు మదనరత్నే స్మృత్యంతరే – ఉదక్యా సూతికావాపి మృతాస్యాద్యదితాం తదా. ఆశౌచే త్వనతి క్రాంతే దాహయేదం తరాయది. ఉద్ధృతేనతు తోయేన స్నాపయిత్వాతు మంత్రతః, ఆపోహిష్ఠేతి తిసృభిః హిరణ్యవర్ణాశ్చతసృభిః. పవమానాను వాకేన యదంతీతి చ సప్తభిః. తతో యజ్ఞ పవిత్రేణ గోమూత్రేణాథతే ద్విజాః. స్నాపయిత్వాన్యవసనే నాచ్ఛాద్య శవధర్మతః, దాహాదికం తతః కుర్యాత్ ప్రజాపతి వచోయథా. యజ్ఞపవిత్ర మాపో అస్మానితి. మితాక్షరాయాం – పంచభిః స్నాపయిత్వాతు గవ్యైః ప్రేతాం రజస్వలాం, వస్త్రాం తరా వృతాం కృత్వా దాహయేద్విధి పూర్వకం. గృహ్యాకారికాయాం – అంతరిక్ష మృతాయే చ వహ్నే వప్సు ప్రమాదతః, ఉదక్యా సూతికా నారీ చరేచ్చాంద్రాయణ త్రయం. తతో యవపిష్టే నాను లిప్యాష్టోత్తర శతం శూర్పోదకైః సంస్నాప్య భస్మ గోమయ మృత్కుశోదక పంచగవ్య శుద్ధోదకై రాపోహిష్ఠా పావమానీభిః సంస్నాప్యాన్య వస్త్రే ధృతేదహేదితి భట్టాః. అత్ర ప్రాయశ్చిత్త మాహ బౌధాయనః – ఉదక్యా సూతికా మృత్యైచరే చ్చాంద్రాయణ త్రయమితి. సూతికాయాస్తు మితాక్షరాయాం – సూతికాయాం మృతాయాంతుక థంకుర్వంతి యాజ్ఞికాః, కుంభే సలిల మాదాయ పంచగవ్యం క్షిపేత్తతః, పుణ్యర్గ్భిరభి మంత్ర్యాథో వాచిశుద్ధిం లభేత్తతః, తేనైవ స్నాపయిత్వాతు దాహం కుర్యాద్యథా విధి, అబ్లింగాభిః మంత్రితాభిః వామదేవ్యాభిరేవచ, అన్యైశ్చవారుణై ర్మంత్రై స్సంస్నాప్య విధినాదహేత్. గృహ్యాకారికాయాం – సూతికా మరణే ప్రాప్తే సర్వౌష ధ్యను లేపనం అసూతకీతు సంస్పృష్ట శ్శూర్పాణాంతు శతం క్షిపేత్. ప్రాయశ్చిత్తే విశేష స్తత్రైవ. సూతికాతు యథా సాధ్వీ విస్నాతా మరణం గతా, త్రివర్ష పూర్ణ పర్యంతం శుద్ధ్యై త్కృచ్ఛ్రేణ సర్వదా. ఇదం చాద్యత్ర్యహే.

అను॥ ఆరు నెలల క్రితం మరణించిన లేదా మూడు నెలల క్రితం మరణించిన కుష్ఠి ఉంటే ఆతనికి ఎప్పుడైనా ఒకవేళ స్నేహంతోకాని దాహ మాచరిస్తే యతి చాంద్రాయణ

మాచరించాలి. ప్రాయశ్చిత్తం లేకుండా కుష్ఠ్యాదులను దహనం చేస్తే ఇది ప్రాయశ్చిత్తము. అందువల్లనే కునఖి మొదలగు వారికి వలె కుష్ఠికి కూడా ద్వాదశరాత్రము, అని శూలపాణి అన్నాడు. అందువల్లనే ఇతరులదైన కుష్ఠికి మరణాంత మాశౌచము చెప్పారు. కౌర్మంలో – క్రియాహీనుడైన మూర్ఖునకు మహారోగికి, యథేష్ట మాచరించే వాడికి (చరించే) మరణాంత మాశౌచమని అన్నారు. మహారోగములైతే – వాత వ్యాధి (కీళ్ళు), మూత్రాశయంలో రాళ్ళు, కుష్ఠు, మూత్రవ్యాధులు, ఉదర వ్యాధులు, భగందరము, అరిశ మొలలు, గ్రహణి అని ఎనిమిది మహారోగములుగా చెప్పబడ్డాయి,అని. రజస్వలకైతే వృద్ధ శాతాతపుడిట్లా – రజస్వలయైన ప్రేతకు సంస్కారాదులు ఆచరించరాదు. మూడు రాత్రుల తరువాత స్నానం చేసిన ఆమెను శవధర్మంతో దాహం చేయాలి. అందువల్ల కడిగి కట్టివలె మూడు రోజుల తరువాత దాహం చేయాలి. సంకట మందైతే మదనరత్నమందు స్మృత్యంతరోక్తి ఇట్లా – రజస్వల కాని ప్రసూతి ఐన స్త్రీ కాని మరణిస్తే ఆమెను అప్పుడు ఆశౌచం గడిచాక దాహం చేయాలి. ఒకవేళ అంతరాయంలో (మధ్య) ఐతే చేదిన నీటితో మంత్ర పూర్వకంగా స్నానం చేయించి, ఆపోహిష్ఠా, అని మూడు మంత్రాలు, హిరణ్యవర్ణా అని నాలుగు మంత్రాలు, పవమాన అనువాకంతో యదంతి అను ఏడు మంత్రాలతో స్నానం ఆ పిదప యజ్ఞంలో పవిత్రమైన గోవు మూత్రంతో ఇక ఆద్విజులు స్నానం చేయించి మరో వస్త్రం కప్పి శవ ధర్మంగా ఆపిదప దహనము మొదలైనవి చేయాలి,అని ప్రజాపతి వచనము. యజ్ఞ పవిత్రమనగా ఆపోఅస్మాన్ అనే మంత్రంతో, మితాక్షర మందిట్లా – ప్రేతయైన రజస్వలను గోసంబంధమైన ఐదింటితో స్నానం చేయించి, మరో వస్త్రం చుట్టి విధి పూర్వకంగా దాహం చేయాలి,అని. గృహ్యకారిక యందిట్లా – అంతరిక్షమందు మరణించిన లేదా అగ్నియందు లేదా నీటియందు ప్రమాదం వల్ల మరణించిన రజస్వల, ప్రసూతియైన నారి మూడు చాంద్రాయణము లాచరించాలి. ఆ పిదప యవపిష్ఠంతో పూసి నూట ఎనిమిది సార్లు రెండు ముంతల పరిమితిగల మానికతో స్నానం చేయించి భస్మము, గోమయము, మట్టి, కుశోదకము, పంచగవ్యము, శుద్ధోదకము వీనితో స్నానం చేయించి, ఆపోహిష్ఠా, పావమానీ మంత్రాలు, మరో వస్త్రం ధరింపచేసి దాహం చేయాలి అని భట్టులన్నారు. ఇక్కడ ప్రాయశ్చిత్తాన్ని బోధాయనుడిట్లా చెప్పాడు – ఉదకి, సూతిక వీరి మరణమందు మూడు చాంద్రాయణములు చరించాలి,అని. సూతికకైతే మితాక్షర మందిట్లా – సూతిక మరణిస్తే యాజ్ఞికులు ఎట్లా చేస్తారు. కుంభమందు నీరు తెచ్చి అందులో పంచగవ్యం వేయాలి, ఆ పిదప పుణ్యమైన ఋక్కులతో అభిమంత్రించి ఇక వాక్కులతో శుద్ధి పొందాక ఆ పిదప దానితోనే స్నానం చేయించి యథావిధిగా దాహం చేయాలి, అని. అప్ (నీరు) లింగములు గల మంత్రములతో, వామదేవ్యా మంత్రములతో, ఇతరమైన వారుణ మంత్రములతో మంత్రించబడిన నీటితో స్నానం చేయించి, విధి పూర్వకంగా దహించాలి. గృహ్యా కారికయందిట్లా – సూతిక మరణాన్ని పొందితే అన్ని ఓషధులను పూయాలి.

అసూతకిని ముట్టుకుంటే నూరు శూర్పములను పోయాలి,అని. ప్రాయశ్చిత్త మందు విశేషమక్కడే ఇట్లా - సూతిక సాధ్వియై స్నానం లేకుండా మరణిస్తే, మూడు సంవత్సరములు నిండేదాకా కృచ్ఛ్రమాచరిస్తే ఎల్లప్పుడు శుద్ధినందుతుంది,అని. ఇది తొలిమూడు రోజులందు.

మూ॥ సూతికాతు యదానారీ రజసాతు పరిప్లుతా మ్రియేతచేత్తు సానారీ ద్వివర్షం కృచ్ఛ్ర మాచరేత్. ఇదం ద్వితీయ త్ర్యహే. సూతికాతు యదాసాధ్వీ విస్నాతా మరణంగతా, అబ్దకృచ్ఛ్రేణ శుద్ధ్యేత వ్యాసస్య వచనం యధా. ఇదం తృతీయ త్ర్యహే. అత్రాశక్తౌ పక్షాంతర ముక్తం తత్రైవ - సూతికాతు యదానారీ విస్నాతా మరణం గతా త్రిషణ్ణ వదినాదర్వాగ్ ఏకాబ్దేన విశుద్ధ్యతి. ఊర్ధ్వంతు - సూతికాతు యదానారీ ప్రాణాం శ్చైవ పరిత్యజేత్, మాసమే కావధిం యావత్త్రిభిః కృచ్ఛ్రైః విశుద్ధ్యతి. గర్భిణీ మృతౌతు మదనరత్నే శౌనకః - గర్భిణ్యుదక్యా సంస్కారం శిశు సంస్కార మేవచ, ప్రవక్ష్యామి సమాసేన శౌనకోఽహం ద్విజన్మనాం. గర్భిణీ మరణే ప్రాప్తే గోమూత్రేణ జలైస్సహ, ఆపోహిష్ఠాది భిర్మంత్రైః ప్రోక్ష్య భర్తా సమాస్థితః, ప్రేతం శ్మశానే నీత్వా థోల్లిఖ్య సవ్యోదరం తతః. పుత్రమా దాయజీవంశ్చేత్ స్తనం దత్వా సుతాయతు. యస్తేస్త నశ్శశయ ఇత్యృచాయామే నిధాయచ, ఉదరం చావ్రణం కుర్యాత్పృష దాజ్యేన పూర్వచ, మృద్భస్మ కుశ గోమూత్రైః ఆపోహిష్ఠాదిభి స్త్రిభిః. స్నాప్యచాచ్ఛాద్య వాసోభి శ్శవధర్మేణ దాహయేత్. తత్రైవ షడశీతి మతే గద్యాని - గర్భిణ్యాం మృతాయాం దక్షిణా శిరసం నిధాయ తస్యానాభి రంధ్రా త్సవ్య ముదరం చతురంగుళం హిరణ్యగర్భ స్సమ వర్తతేతి ఛిత్వాగర్భచ్ఛేద ప్రాణస్తం - ప్రక్షాళ్యని ఖనేత్సయది జీవన్జీవత్వం మమ పుత్రకేత్యుక్త్వా క్షేత్రియేత్వేతి పంచభి స్స్నాపయిత్వా హిరణ్యా మంతర్ధాయ భూమౌ నిధాయ వ్యాహృతిభిః అభిమంత్ర్య యస్తేస్త నశ్శశయ ఇతి స్తనం పాయయిత్వా శిశుం గ్రామం ప్రాపయేత్. గర్భచ్ఛేదస్థలే శతాయుధాయేతి పంచాహుతీర్ హుత్వా ప్రాణాయ స్వాహా పూష్ణేస్వాహేత్యను వాకాభ్యాం వ్యాహృత్యా వాజ్యం హుత్వాభిన్నముదరం సూత్రేణ సంగ్రథ్య ఘృతేనాను లిప్య బ్రాహ్మణాయ తిలాన్ గాం భూమిం సువర్ణం దద్యాద ధయధోక్తేన కల్పేనదహేత్. బోధాయనేన తు శతాయుధాయేతి పంచహోమానంతరం ప్రయాసాయ యాసాయ వియాసా య సం యాసాయో ద్యాసాయ శుచే శోకాయ తప్యతే తపత్యై బ్రహ్మహత్యాయై సర్వస్మై ఇతి స్వాహోం తైరాహు తయోప్యధికా ఉక్తాః. గృహ్యకారికాయాం - యదాగర్భవతీ నారీ సశల్యాసంస్థితా భవేత్, కుక్షింభిత్వా తతశ్శల్యం నిర్హరేద్యది జీవతి. ప్రమీతం నిఖనేత్తంతు ప్రాయశ్చిత్తమతః పరం. సాత్రయస్త్రిం శతా కృచ్ఛ్రైః శుధ్యతే శల్యదోషతః. సగర్భ దహనే తస్యా వర్జజం వధపాతకం, ప్రాయశ్చిత్తం చరిత్వాతు శుద్ధ్యం తేపాపకారిణః. దగ్ధ్వాతు గర్భసంయుక్తాం త్రిరబ్దం కృచ్ఛ్రమాచరేత్. అథాన్వారోహణం స్త్రీణాం ఆత్మనో భర్తురేవచ. సర్వపాపక్షయకరం నిరయోత్తారణాయచ, అనేక స్వర్గ ఫలదం ముక్తిదం చ తథైవచ. జన్మాంతరే చ సౌభాగ్య ధనపుత్రాది వృద్ధిదం.

అను॥ సూతికయైన నారి రజస్సుతో మునిగిపోతే, ఆమె మరణిస్తే, రెండు సంవత్సరాలు కృచ్ఛ్రమాచరించాలి, ఇది రెండవ మూడు రోజులందు సూతికయైన స్త్రీ స్నానం లేకుండా మరణిస్తే సంవత్సర కృచ్ఛ్రంతో శుద్ధినందుతుంది, వ్యాస వచనం ప్రకారం, ఇది మూడవ మూడు రోజుల విషయం. ఇందుకు శక్తి లేకపోతే మరో మార్గాన్ని అక్కడే చెప్పారిట్లా - సూతికయైన స్త్రీ స్నానం లేకుండా మరణిస్తే మూడు, ఆరు, తొమ్మిది దినముల

కన్న ముందే ఒక అబ్దంతో (కృచ్ఛ్రం) శుద్ధినందుతుంది,అని. ఆపైన – సూతికయైన నారి ప్రాణములను వదలితే ఒక నెలవరకు మూడు కృచ్ఛ్రములతో శుద్ధినందుతుంది. గర్భిణి మరణిస్తే మదనరత్న మందు శౌనకుడిట్లా – గర్భిణీ, ఉదకి శిశువు వీరి సంస్కారాన్ని సంక్షిప్తంగా శౌనకుడనైన నేను బ్రాహ్మణులకై చెప్తున్నాను. గర్భిణీ మరణిస్తే గోమూత్రం జలము కలిపి, ఆపోహిష్ఠాది మంత్రములతో ప్రోక్షించి, భర్త వెంబడి ఉండి, ప్రేతను శ్మశానానికి తీసుకువెళ్ళి ఇక ఉదరం సవ్య భాగంలో రాచి, ఆపిదప, పుత్రుడు బ్రతికి ఉంటే తీసుకొని పిల్ల వానికి స్తనమిచ్చి, యస్తే స్తన శ్శశయ అనే ఋక్కుతో యామ (గ్రామ) మందుంచి (దూరం), ఉదరంపైగాయము చేసి వృషదాజ్యేన అనుమంత్ర పూర్వకముగా, మట్టి భస్మము, కుశలు గోమూత్రములతో, ఆపోహిష్ఠాది మూడు మంత్రములతో స్నానం చేయించి, వస్త్రములతో కప్పి, శవధర్మంగా దాహం చేయాలి. అక్కడే షడశీతి మతమందు గద్యములు – గర్భిణి మరణిస్తే దక్షిణం వైపు శిరముంచి, ఆమె నాభి రంధ్రం నుండి కుడి ఉదరమును నాలుగు అంగుళములు, హిరణ్యగర్భ స్సమ వర్తత అను మంత్రంతో కోసి, గర్భచ్ఛేదం వల్ల వచ్చిన ప్రాణిని కడిగి పాతాలి. ఒకవేళవాడు జీవిస్తే బ్రతుకురా నీవు నా పుత్రుడవు అని చెప్పి క్షేత్రియేత్వా అను ఐదు మంత్రాలతో స్నానం చేయించి హిరణ్యమును (బంగారం) కప్పి ఉంచి, భూమి యందుంచి, వ్యాహృతులతో అభిమంత్రించి యస్తేస్తనశ్శశయ, అని స్తనం తాగించి శిశువును గ్రామమునకు తీసుకుపోవాలి. గర్భం ఛేదించినచోట శతా యుధాయ అని ఐదు ఆహుతులు హోమం చేసి ప్రాణాయ స్వాహా, పూష్ణే స్వాహా అను అనువాకములతో, వ్యాహృతులతో ఆజ్యంహోమంచేసి, చీల్చినగర్భాన్ని దారంతో కుట్టినేయి పూసి బ్రాహ్మణునకు నువ్వులు, గోవు, భూమి, సువర్ణము దానమివ్వాలి. ఇకయథోక్తమైన కల్పంతో దహించాలి, అని. బోధాయనుడైతే శతాయుధాయ అని ఐదుహోమములతరువాత ప్రయాసాయ, యాసాయ, వియాసాయ, సంయాసో .... సర్వస్మై, అని స్వాహాంతములతో ఆహుతులు అధికంగా చెప్పబడ్డాయి. గృహ్యాకారికయందైతే – నారిగర్భవతియైనప్పుడు సశల్యగాఉంటేకడుపుచీల్చి ఆపిదవశల్యాన్నిబ్రతికిఉంటే తీసివేయాలి. చనిపోతే దానినిపాతి పెట్టాలి. ఆపిదప ప్రాయశ్చిత్తము. ఆమె ముప్పదిమూడుకృచ్ఛ్రములతో శల్యదోషంనుండి శుద్ధినందుతుంది. సగర్భదహనమందు ఆమెవధయందు ఆమె వర్ణమునకు చెందినపాతకమును పొంది; ప్రాయశ్చిత్తమును ఆచరించి పాపకారులుశుద్ధులౌతారు. గర్భయుక్తురాలినిదగ్ధంచేస్తే మూడుసంవత్సరాలు కృచ్ఛ్రమాచరించాలి. ఇక అన్వారోహణము స్త్రీలకు ఆమెభర్తకు అన్నిపాపములనశింపచేసేది నరకం నుండి ఉత్తారణ చేసేది. అనేక స్వర్గఫలమిచ్చేది అట్లాగే ముక్తినిచ్చేది కూడా. జన్మాంతరమందును సౌభాగ్యధనపుత్రాదుల వృద్ధినికల్గించేది, అని.

**మూ॥ దేశకాలౌస్మృత్వారుంధతీసమాచరత్వస్వర్గలోకమహీయమానత్వమనుష్యరోమ సంఖ్యాబ్దావచ్ఛిన్నస్వర్గవాసభర్తృసహితచతుర్దశేంద్రావచ్ఛిన్నకాలికక్రీడమానత్వమాతృపితృశ్వశురకులత్రయ**

పూతత్వబ్రహ్మఘ్నమిత్రఘ్నకృతఘ్నపతిపూతత్వపత్యవియోగకామాభర్తృజ్వలచ్చితారోహణంకరిష్యే. అనుగమనేతు ఫలముల్లిఖ్యాన్వారోహణం కరిష్యే ఇత్యుక్త్వా హారిద్రా కుంకుమాంజనాది యుత శూర్పాణి సువాసి నీభ్యోదద్యాత్. మంత్రస్తు-లక్ష్మీనారాయణోదేవోబలసత్వగుణాశ్రయః, గాఢంసత్వంచమేదేయాత్ వాణకైఃపరితోషితః, సోపస్కరాణిశూర్పాణివాణకైస్సంయుతానిచ, లక్ష్మీనారాయణప్రీత్యైసత్వకామాదదామ్యహం. అగ్నేస్సమీపమాగత్యపంచరత్నానిపల్లవే, నీలాంజనంతథా బధ్వాముఖేముక్తా ఫలంన్యసేత్, తతోఽగ్నిప్రార్థనంకృత్వామంత్రేణానేనమిశ్రితం, స్వాహాసంశ్లేషనిర్విణ్ణసర్వగోత్రహుతాశన, సత్వమార్గప్రదానేన, నయమాంభర్తురంతికం. తతోగ్నావాజ్యేనాగ్నయే, తేజోధిపతయే, విష్ణవేసత్వాధి పతయే, కాలాయధర్మాధిపతయే, పృథివ్యైలోకాధిష్ఠాత్ర్యై,అద్భ్యోరసాధిష్ఠాత్రీభ్యః, వాయవేబలాధి పతయే, ఆకాశాయసర్వాధి పతయేకాలాయ ధర్మాధిష్ఠాత్రేఽధ్యుస్సర్వసాక్షిణీభ్యః, బ్రహ్మణేవేదాధిపతయే, రుద్రాయ శ్మశానాది పతయే, చ హుత్వాగ్నింప్రదక్షిణీకృత్యదృషదముపలాంచ సంపూజ్య పుష్పాం జలింగృహీత్వాగ్నిం ప్రార్థయేత్. త్వమగ్నేసర్వభూతానామంతశ్చరసిసాక్షివత్త్వమేవదేవజానీషేన విదుర్యాని మానుషాః, అనుగచ్ఛామి భర్తారంవైధవ్యభయపీడితా, సత్వమార్గప్రదానేన, నయమాంభర్తురంతికం, మంత్రముచ్చార్యశనకైఃప్రవిశేచ్చహుతాశనం. గౌడాస్తు-ఇమానారీరవిధవా, ఇతి ఓం, ఇమాః పతివ్రతాః పుణ్యాఃస్త్రియోయా యాస్సుశోభనాః, సహభర్తృశ్శరీరేణసందిశంతు విభావసుం. ఇతిచవిప్రః పరేదిత్యాహుః కాతరాంతు -ప్రేతోత్తరేసుప్తాందేవరశ్శిష్యోవాఉదీర్ష్వేతిద్వాభ్యా ముత్థాపయేత్. ఏతన్మహిమామితాక్షరా దౌక్షేయః పృథ్వీచంద్రోదయేస్కాందే-అనువ్రజతిభర్తారంగృహా త్పితృవనంముదా, పదేపదేశ్వమేధస్య ఫలంప్రాప్నోత్యనుత్తమంయస్త్వంగిరాః-యాస్త్రీబ్రాహ్మణజాతీ యామృతంపతి మనువ్రజేత్, సాస్వర్గమాత్మఘాతేననాత్మనంనపతింనయేదితి. యచ్చవ్యాఘ్రపాత్- నమ్రియేత సమంభర్త్రా బ్రాహ్మణీ శోకకర్శితా, నబ్రహ్మ గతిమాప్నోతిమరణాదాత్మఘాతినీ, ఇతిపృథక్చితిపరం.

అను ॥ దేశకాలములుస్మరించిఅరుంధతిసమంగాఅయ్యేందుకు, స్వర్గలోకంలో వసించేందుకుతగ్గశక్తిపొందేందుకు, మనుష్యులరోమములసంఖ్యాకమైన సంవత్సరాల వరకు స్వర్గవాసము భర్తతోపాటుచతుర్దశఇంద్రులకాలమంతవరకుక్రీడించేకొరకు, మాత, పిత, శ్వశుర ఈ మూడుకులములను పవిత్రంచేసేకొరకు, బ్రహ్మహత్య, మిత్రహత్య, కృతఘ్నత ఇలాంటి దోషములు గల పతిని పవిత్రంచేసేకొరకు, భర్తవియోగాన్ని కోరనిదై భర్తయొక్క మందుతున్న చితిని ఆరోహిస్తున్నాను అని. అనుగమనమందైతే ఫలాన్నివ్రాసి అన్వారోహణం చేస్తున్నాను, అని చెప్పిపసుపుకుంకుమ, కాటుక మొదలగువానితోకూడిన చాటలను సువాసినులకు ఇవ్వాలి. మంత్రమైతే-లక్ష్మీనారాయణుడుదేవుడు, బలసత్వగుణములకు ఆశ్రయుడు, గాఢంగాసత్వమునునాకివ్వాలి, ఈవాయినములతో సంతోషించి, అని. సామగ్రితో కూడిన చాటలను వాణకములతోకూడినవానిని లక్ష్మీనారాయణుల ప్రీతికొరకు, సత్వమును కోరినేనుఇస్తున్నాను. అగ్నిదగ్గరకు వచ్చి పంచరత్నములను చీరచెరగుయందు అట్లాగే నల్లకాటుకను కట్టుకొని, ముఖమందుముత్యముంచుకోవాలి. ఆపిదపఅగ్నిప్రార్థన చేసి (దీనితో కూడి) ఈ మంత్రంతో, స్వాహాదేవిసంశ్లేషతోతృప్తినొందిన, సర్వగోత్రుడవైన

ఓ అగ్నినాకు సత్యమార్గాన్ని ఇస్తూ, నన్నునాభర్తదగ్గరకుతీసుకువెళ్ళు. అని ప్రార్థించాలి. ఆపిదపఅగ్నిలో ఆజ్యంతో అగ్నయే....శ్మశానాధిపతయేచ, అనుమంత్రాలతో ఆయాదేవతకు హోమంచేసి, అగ్నికిప్రదక్షిణంచేసి రోలుపాత్రములకుపూజచేసి పుష్పాంజలి తీసుకొని అగ్నినిప్రార్థించాలి. ఓ అగ్ని! నీవు సాక్షిలాగా అందరుప్రాణులలోపలఉన్నావు. మనుష్యులకు తెలియనివన్నీ ఓదేవ! నీకేతెలుసు. వైధవ్యభయంతోపీడితనై భర్తను అనుసరిస్తున్నాను. సత్యమార్గాన్ని ఇస్తూ నన్నునాభర్త దగ్గరకు తీసుకువెళ్ళు, అని మంత్రముచ్చరించి మెల్లగా అగ్నినిప్రవేశించాలి. గౌడులైతే-ఈస్త్రీలు అవిధవలు, అని ఓం! ఈపతివ్రతలైన పుణ్యలైనసుశోభనలైన స్త్రీలు వెళ్ళని, భర్త శరీరంతోపాటు అగ్నినిప్రవేశించని, అనికూడా విప్రుడుచదవాలి అని కూడా అన్నారు. భయస్థురాలైతే-ప్రేతఉత్తరమందు నిద్రపోయినఆమెను దేవరుడు కాని శిష్యుడు కాని ఉదీర్ష్వఅనేరెండు మంత్రాలతోలేపాలి. దీనిమహిమను మితాక్షరాదులందు చూచి గ్రహించాలి. పృథ్వీచంద్రోదయ మందు స్కాందోక్తి ఇట్లా - భర్తను అనుసరిస్తోంది. ఆనందంగా గృహం నుండి పితృవనంవెళ్తోంది. కనుకఅడుగడుగునా ఉత్తమమైనఅశ్వమేధఫలాన్ని పొందుతుంది అని. అంగరుడిట్లా-బ్రాహ్మణ జాతిస్త్రీ, మరణించినభర్తనుఅనుసరిస్తే ఆమెతననుచంపు కోవటం ద్వారాతానుస్వర్గానికిపోవటంలేదు తన భర్తను తీసుకుపోవటంలేదు, అని ఏదన్నాడో; వ్యాఘ్ర పాదుడిట్లా- బ్రాహ్మణి శోకకర్షితయై భర్తతోపాటుమరణించరాదు, ఆమె మరణంవల్ల తనను చంపుకుంటోంది కాని బ్రహ్మగతిని పొందటంలేదు, అని ఏదన్నాడో; ఇవి రెండువిడిగా చితిపెట్టుకున్న వారిపరము, అని

మూ॥ పృథక్చితింసమారుహ్యనవిప్రాగంతుమర్హతి, అన్యాసాంచైవనారీణాం స్త్రీధర్మో౾యం పరః స్మృతః, ఇత్యుశనసోక్తేః. పృథక్చితిస్తుక్షత్రియాదిపరాతద్విధిర్బ్రాహ్మే-దేశాంతరేమృతేపత్యౌ సాధ్వీతత్పాదుకాద్వయం, నిధాయోరసిసంశుద్ధాప్రవిశేజ్జాతవేదసం, ఋగ్వేదవాదాత్సాధ్వీస్త్రీన భవేదాత్మ ఘాతినీ, త్ర్యహాశౌచేనివృత్తేతు శ్రాద్ధంప్రాప్నోతి శాస్త్రవత్. ఇమానారీరవిధవా, ఇతిఋగ్వేద వాదః త్ర్యహాశౌచమన్వారోహణపరమితి స్మార్తః. నిషేధవాక్యానిప్రాయశ్చిత్తార్థంమృతేన, పతితేన వాసహమరణనిషేధపరాణీత్యప్యాహుః అస్థిదాహేపలాశదాహేవా, నపృథక్చితిదోషః అంగత్వేన స్థానాపత్త్యావాశరీరతుల్యత్వాత్. యత్తు-బ్రహ్మఘ్నోవాకృతఘ్నోవామిత్రఘ్నోవాభవేత్పతిః, పునాత్యవిధవానారీతమాదాయమృతాతుయా, ఇతిహారీతీయంతత్పతితదాహాదినిషేధేనసహగమనస్య దూరతో౾పాస్తత్వాదర్థవాదమాత్రమితిపృథ్వీచంద్రః. జన్మాంతరీయపాపవతాసహమరణేనోద్ధారఇతి స్మార్తగౌడాః శుద్ధితత్త్వేవ్యాసః-దినైకగమ్యదేశస్థాసాధ్వీచేత్కృతనిశ్చయా, నదహేత్స్వామినంతస్యా యావదాగమనంభవేత్. తత్రైవభవిష్యే-తృతీయేహ్నిఉదక్యాయామృతేభర్తరివైద్విజాః, తస్యాను మరణార్థాయ స్థాపయేదేకరాత్రకం. ఏకాంచితాంసమాసాద్యభర్తారంయానుగచ్ఛతి, దద్భర్తుర్యః క్రియా కర్తాస తస్యాశ్చక్రియాంచరేత్. ఏతద్దశాహాంతరం. యశ్చాగ్నిదాతాప్రేతస్యపిండందద్యాత్స ఏవహి, ఇతివాయవీయోక్తేః. ఆపస్తంబః-చితిభ్రష్టాతుయానారీమోహాద్విచలితాభవేత్, ప్రాజాపత్యేన శుద్ధ్యేత, తస్మాద్వైపాపకర్మణః. తథా-అన్వారోహేతునారీణాం పత్యుశ్చైకోదకక్రియాం, పిండదాన క్రియా తద్వత్శ్రాద్ధంప్రత్యాబ్దికంతథా. అన్వారోహేకృతేపత్న్యాః పృథక్పిండాంస్తిలాంజలీన్, పృథక్చితే న కుర్వీతదద్యాదేకశిలేతథా. అన్యత్ప్రాగుక్తం-ఇదంగర్భిణీబాలాపత్యా సూతికారజస్వలా

వ్యభిచారిణీభిర్న కార్యంస్వైరిణీనాంగర్భిణీనాంపతితానాంచయోషితాం, నాస్తిపత్న్యాగ్నిసంవేశః పతితౌహితధాఉభౌ, ఇతిమదనరత్నేస్మృతిసంగ్రహోక్తేః. మదనరత్నేబృహస్పతిః-బాలసంవర్ధనం ముక్త్వాబాలాపత్యాన గచ్ఛతి, వ్రతోపవాసనియతారక్షేద్గర్భంచగర్భిణీ. తృతీయపాదే రజస్వలాసూతికా చేతి పృథ్వీచంద్రో దయేగౌడీయశుద్ధితత్వేచపాఠః. తత్రైవబృహన్నార దీయేఽపి-బాలాపత్యాచ గర్భిణ్యోహ్యదృష్ట ఋతవస్త థా, రజస్వలారాజసుతే నారోహంతి, చితాంతుతా, ఇతి. అత్రపతివ్రతాసుసందీప్తంప్రవిశేద్యాహుతా శనం, ఇతిభారతాత్. ఋగ్వేద వాదాత్సాధ్వీస్త్రీతిః బ్రాహ్మేచ్ఛ - పతివ్రతానామేవాధికారోనదుర్వృత్తానాం.

అను ॥ పృథక్‌చితినిఆరోహించి విప్రస్త్రీమరణించరాదు. ఇతరస్త్రీలకు ఈ స్త్రీ ధర్మముపరమమైనదిగా చెప్పబడింది, అని ఉశనసోక్తి. పృథక్చితిఅనేది క్షత్రియాదిపరమైనది. దానివిధిబ్రాహ్మమందిట్లా-పతిదేశాంతరమందుమరణిస్తే, సాధ్విఆతనిరెండు పాదుకలను ఉరమందుంచుకొనిశుద్ధురాలై అగ్నిప్రవేశంచేయాలి, అని ఋగ్వేదవాదాన్ననుసరించి సాధ్వి యైన స్త్రీ ఆత్మఘాతినికారాదు. మూడురోజులఆశౌచం ముగిస్తే, శాస్త్రంప్రకారం శ్రాద్ధాన్ని పొందుతుంది. ఈ స్త్రీలు అవిధవలు అని ఋగ్వేదవాదం. మూడురోజుల ఆశౌచం అన్వారోహణ పరమని స్మార్తుడన్నాడు. నిషేధవాక్యములైతే ప్రాయశ్చితం కొరకు మృతి చెందిన పతితునితో సహమరణ నిషేధ పరములు అనికూడా అన్నారు. అస్థిదాహమందు పలాశదాహమందును పృధక్చితిదోషంలేదు. అంగమైనందువల్ల స్థానంలో వచ్చినందువల్ల నైతేనేమి శరీరతుల్యమైనందువల్ల. ఇట్లా- భర్త, బ్రహ్మఘ్నుడో, కృతఘ్నుడో, మిత్రఘ్నుడో ఐతే, అతనితోపాటు మరణిస్తే ఆఅవిధవస్త్రీ, ఆతనిని పవిత్రుని చేస్తుంది, అని హారీతీయమైన వచనం. ఆ పతితుని దాహాదులు నిషేధమైనందువల్ల, సహగమనమనేది దూరంగా పోయినందువల్ల ఇది అర్థవాద మాత్రము అని పృథ్వీచంద్రుడన్నాడు. జన్మాంతరమందు పాపంగల వానితో సహమరణంవల్ల ఉద్ధారంలేదు అనిస్మార్తగౌడులన్నారు. శుద్ధితత్వమందు వ్యాసుడిట్లా- ఒకరోజుపోదగినంతదూరంలోఉండి, సాధ్విపోవటానికి నిశ్చయిస్తే, ఆమెవచ్చేవరకు, ఆమెభర్తను దహించరాదు, అని. అక్కడేభవిష్యమందిట్లా- ఋతుమతియైన స్త్రీమూడవరోజునందుండగా, ఆమెభర్తమరణిస్తే, ఓద్విజులారా! ఆమెభర్తతోపాటు మరణించాలనుకుంటే, ఆమెకొరకు ఒకరాత్రి ఆమె భర్తశవాన్ని ఉంచాలి, ఒకేచితిని చేరిభర్తనుఏస్త్రీ అనుసరిస్తుందో, ఆమె భర్తకు, క్రియాకర్త ఎవరో ఆతడే ఆమెక్రియను ఆచరించాలి. ఇది దశాహంమధ్యలో. ప్రేతకు ఎవడు అగ్నిదాత యోవాడేపిండమివ్వాలి, అనివాయవీయోక్తి. అపస్తంబుడిట్లా-మోహంతో విచలితయై, చితినుండి భ్రష్టమైననారి, ఆమెఆపాపకర్మనుండిప్రాజాపత్యంతోశుద్ధినందుతుంది, అని అట్లాగే-స్త్రీఅన్వారోహణచేస్తే, ఆభార్యాభర్తలకుఉదకక్రియలుఒక్కటే, పిండదానక్రియ, శ్రాద్ధము, ప్రత్యాబ్దికము అన్ని కలిపియే, అన్వారోహంచేస్తే, పత్నికి విడిగాపిండములు తిలాంజలులు పృథక్ శిలయందు చేయరాదు. అట్లాగే ఏకశిలయందు ఇవ్వాలి ఇతరమైనది ముందు చెప్పాము. దీనిని గర్భిణి, చిన్నపిల్లలతల్లి, సూతిక, రజస్వల, వ్యభిచారిణి వీరలుచేయరాదు. స్వైరిణులకు, గర్భిణులకు,

పతితలకు, పతితో అగ్నిసంవేశంలేదు. ఇద్దరు పతితులుకదా, అని మదనరత్నమందు స్మృతిసంగ్రహోక్తి. మదనరత్నమందు బృహస్పతి ఇట్లా- పిల్లలపెంపకాన్ని వదలి, బాల, పతితోవెళ్ళరాదు. గర్భిణివ్రతఉపవాసములతో నియతంగా గర్భాన్నిరక్షించాలి, అని. తృతీయపాదమందిట్లా-రజస్వల, సూతికఅని పృథ్వీచంద్రోదయ మందు, గౌడీయశుద్ధితత్వ మందునుపారము. అక్కడే బృహన్నారదీయమందుకూడా- చిన్నపిల్లల తల్లి, గర్భిణి, ఋతుమతికానివారు, రజస్వల రాజుకూతురు వారు రజోగుణమందు వారిచితిని ఆరోహించ రాదు, అని. ఇక్కడ పతివ్రత ఐనట్టిది బాగాజ్వలిస్తున్న అగ్నిని ఏస్త్రీప్రవేశిస్తుందో, అని భారతంనుండి. ఋగ్వేదవాదంనుండి సాధ్వీస్త్రీ అని. బ్రాహ్మంనుండి కూడా-పతివ్రతలకే అధికారము, దుర్వృత్తులకు కాదు, అని

మూ ॥ యత్తు-అవమత్యచయాః పూర్వంపతిందుష్టేనచేతసా, వర్తంతేయాశ్చసతతం భర్తౄణాం ప్రతికూలతః. తత్రానుమరణంకాలేయాఃకుర్వంతితథావిధాః, కామాత్క్రోధాద్భయాన్మో హాత్సర్వాః పూతాః భవంత్యుత. ఇతిభారతం. తత్ కైముతికన్యాయేన స్తావకమితి పృథ్వీచంద్రః. బ్రాహ్మణ్యా ఏకచితిరేవ, నపృథక్చితిః. క్షత్రియాదీనాంపృథగేకావేతి కల్పతరురత్నా కరమదనపారిజాతాదయః. శుద్ధిచింతామణౌచైవం. తత్రాన్వారోహణేభర్తుశ్చైచ మధ్యేతదూర్ధ్వంవా, కృతే త్రిరాత్రమధ్యేఏవ దశపిండాః. సహగమనేతు భర్తృశౌచతుల్యమాశౌచంపిండదానంచ. అన్వితాయాః ప్రదాతవ్యాదశ పిండాస్త్ర్యహేణతు, స్వామ్యాశౌచే వ్యతీతేతు తస్యాశ్శ్రాద్ధం ప్రదీయతే, ఇతిశుద్ధితత్వేశూలపాణౌచ పైఠీనసిస్మృతేః. సంస్థితం పతిమాలింగ్య ప్రవిశేద్యాహుతాశనం, తస్యాః పిండాదికందేయం క్రమశః పతిపిండవత్, ఇతి శూలపాణిశుద్ధితత్వధృతవ్యాసోక్తేః. అన్యత్ప్రాగుక్తం. యదాతురజస్వలాపి పత్నీమృతేపత్యౌదేశకాలవశాత్తదైవానుగచ్ఛతి, నశుద్ధింప్రతీక్షతే, తత్రవిధిః దేవయాజ్ఞికనిబంధే- యదాస్త్రియాముదక్యాయాంపతిఃప్రాణాన్ సముత్సృజేత్, ద్రోణమేకంతండు లానా మవహన్యాద్వి శుద్ధయే, ముసలాఘాతై స్తదసృక్స్రవతేయోనిమండలాత్ విరజస్కాంమన్య మానాస్వేచిత్తేతదసృక్ క్షయం దృష్ట్వాశౌచంప్రకుర్వీతపంచమృత్తికయాపృథక్, త్రింశద్వింశతిర్దశచ గవాందత్వాత్వహః క్రమాత్, విప్రాణాం వచనాచ్ఛుద్ధాసమారోహేద్ధుతాశనం నారీణాంసరజస్కానా మియంశుద్ధి రుదాహృతా. అత్రశ్రాద్ధాదౌ నిర్ణయఃపూర్వముక్తః ఇతి అంత్యకర్మనిర్ణయః అగ్నిప్రవేశాశక్తౌతువిష్ణుః- మృతేభర్తరిబ్రహ్మచర్యం తదన్వారోహణంవేతి. బ్రహ్మవైవర్తే-సహానుగమనం శస్తంవైధవ్యస్యాథ పాలనం. యత్తుతత్రైవ- కలౌనాన్యాగతిఃస్త్రీణాంసహానుగమనాదృతే, ఇతి బ్రహ్మచర్యాశక్యత్వపరం. తథాచమనుః-బ్రహ్మచర్యం చరేద్వాపిప్రవిశేద్వాహుతాశనం. కాశీఖండేఽ పి-పత్యౌమృతేపియా యోషిత్ వైధవ్యం పాలయేత్క్వచిత్, సాపునఃప్రాప్యభర్తారంస్వర్గలోకంసమశ్నుతే. అనుయాతిన భర్తారంయది దైవాత్క థంచన, తత్రాపిశీలంసంరక్షేత్ శీలభంగాత్పతత్యధః తద్వైగుణ్యాదపిస్వర్గాత్పతిః పతతినాన్యథా, తస్యాఃపితాచ మాతాచభ్రాతృవర్గస్తథైవచ. అధవిధవాధర్మాః -మదనరత్నే స్కాందే- విధవాకబరీబంధో భర్తృబంధాయజాయతే, శిరసోవపనంతస్మాత్కార్యంవిధవ యాసదా. ఏకాహారస్సదా కార్యోనద్వితీయః కదాచన, మాసోపవాసంవాకుర్యాచ్చాంద్రాయణ మథాపివా. పర్యంక శాయినీనారీవిధవాపాతయే త్పతిం, నైవాంగోద్వర్తనంకార్యంస్త్రియావిధవయా క్వచిత్, గంధద్రవ్యస్య సంభోగో నైవకార్యస్తయా పునః, తర్పణంప్రత్యహంకార్యంభర్తుస్తిలకు

శోదకైః. తత్పితుస్తత్పితుశ్చా పినామగోత్రాదిపూర్వకం. ఇదమపుత్రాపరమితిమదనపారిజాతః నాధిరోహేదన ద్వాహంప్రాణైః కంఠగతైరపి, కంచుకంనపరీ దద్యాద్వాసోనవికృతంవసేత్. వైశాఖేకార్తికేమాఘే విశేషనియమంచరేత్, ప్రచేతాః-తాంబులా భ్యంజనంచైవకాంస్యపాత్రేచభోజనం. యతిశ్చబ్రహ్మచారీ చవిధవాచవివర్జయేత్. శ్రాద్ధాదౌతువిశేషః ప్రాగుక్తః యత్తుబౌధాయనః -సంవత్సరంప్రేతపత్నీ మధు మాంసంవివర్జయేత్, అధశ్శయీతషణ్మాసానితి మౌద్గల్యభాషితమితి తదసవర్ణాపరమిత్యపరార్కః.

అను ॥ ఇట్లా-ఎవతెముందుదుష్టచిత్తంతోభర్తనుఅవమానంచేసిందో, ఏస్త్రీలు ఎల్లప్పుడు భర్తలకువ్యతిరేకంగాఉన్నారో, అటువంటిస్త్రీలు అక్కడభర్తమరణకాలమందు అనుమరణంచేస్తారో, కామంవల్లకానిక్రోధంవల్లకాని భయంవల్లకాని మోహంవల్లకాని వారంతా పవిత్రులౌతారు, అని భారతమందు. అదికైముతికన్యాయాన్ననుసరించిస్తుతిపరము అని పృథ్వీచంద్రుడన్నాడు. బ్రాహ్మణస్త్రీకిఒకేచితి. పృథక్చితిలేదు. క్షత్రియాదులకువేరుకాని లేదా ఒకటికాని అని కల్పతరురత్నాకరమదనపారిజాతాదులు అన్నాయి. శుద్ధిచింతామణి యందును ఇట్లాగేఉంది. అక్కడఅన్వారోహణమందు, భర్తఆశౌచంమధ్యయందు కాని ఆపైన కాని అన్వారోహణచేస్తే త్రిరాత్రమధ్యమందేదశపిండాలు. సహగమనమందైతే భర్తఆశౌచానికి సమానంగా ఆశౌచముపిండదానముకూడా. అన్వారోహణంచేస్తే ఆమెకుపదిపిండములు మూడురోజులలోఇవ్వాలి. భర్త ఆశౌచం దాటిపోతే ఆమెకు శ్రాద్ధమాచరించాలి, అని శుద్ధితత్వమందు, శూలపాణియందునుపైరీనసిస్మృతి. మరణించిన పతిని ఆలింగనంచేసు కొని ఏస్త్రీ అగ్నినిప్రవేశిస్తుందో ఆమెకు పిండాదికమును, క్రమంగా పతికిపిండములవలె ఇవ్వాలి అని శూలపాణి శుద్ధితత్వమందు చెప్పిన వ్యాసునివచనము-ఇతరమైనది ముందు చెప్పాము. పత్నిరజస్వలఐనప్పటికీ, భర్తమరణిస్తే దేశకాలవశంవల్ల ఆమె అప్పుడే అనుసరిస్తే, శుద్ధికై ఎదిరి చూడకపోతే, అక్కడవిధిదేవయాజ్ఞిక నిబంధమందిట్లా -స్త్రీఋతుమతియైన ప్పుడు భర్తప్రాణాలువదిలితే, విశుద్ధికొరకు ఒకద్రోణము తండులములను ఆమెదంచాలి. రోకలిదెబ్బలవల్లయోని మండలంనుండి ఆరక్తం కారుతుంది. ఆరక్తంపోవటంద్వారా తన్నుతాను ఆమె తనచిత్తమందు విరజస్కగాభావించుకొని రక్తక్షయ మవటంచూచి పంచమృత్తికతో విడిగా శౌచమాచరించాలి, ముప్పది, లేదా ఇరువది లేదా పది ఆవులను రోజులక్రమానన్నుసరించి దానంచేసి, విప్రులవచనముతో, శుద్ధయై, అగ్నినిఅధిరోహించాలి. సరజస్కలైన స్త్రీలకు ఈ శుద్ధి ఉదహరించబడింది. ఇక్కడ శ్రాద్ధాదులందు నిర్ణయాన్ని ముందు చెప్పాము. అని అంత్యకర్మనిర్ణయము. అగ్నిప్రవేశ మందు అశక్తమైతే విష్ణువిట్లా- భర్తమరణిస్తే బ్రహ్మచర్యము, ఆతని అన్వారోహణము లేదా అని. బ్రహ్మకైవర్త మందు ఇట్లా-సహానుగమనము ప్రశస్తమైంది. ఇంకావైధవ్యపాలనము, అని. అక్కడేఇట్లా- కలిలోస్త్రీలకు సహానుగమనము తప్పమరోమార్గం లేదు. అనేది ఏదన్నారో అది బ్రహ్మ చర్యం అశక్యమైన వారివిషయము. మనువిట్లా-బ్రహ్మచర్యం ఆచరించాలి లేదా అగ్నినైనాప్రవేశించాలి, అని. కాశీఖండమందుకూడా-భర్తమరణించిన ఏస్త్రీవైధవ్యాన్ని

పాలిస్తుందో, ఆమెఒకసారి తిరిగిభర్తను పొంది స్వర్గలోకాన్ని చేరుతుంది. ఒకవేళ దేవవశాత్తు ఏదో విధంగా భర్తను అనుసరించకపోయినా అప్పుడుకూడా తనశీలాన్ని రక్షించుకోవాలి. శీలభంగంవల్ల అధః పతితురాలౌతుంది. ఈమెవైగుణ్యంవల్లను (చేడుతనం) భర్తస్వర్గమునుండి పతితుడౌతాడు, మరోరకంగాకాదు. ఆమెతండ్రి, తల్లి, భ్రాతృవర్గము పతితులౌతారు అట్లాగే అని. ఇకవిధవ ధర్మాలు మదనరత్నమందుస్కాందోక్తిఇట్లా- విధవయొక్కకేశబంధముభర్తృబంధనమౌతుంది, అందువల్ల శిరోముండనముచేసుకోవాలి విధవ, ఎప్పుడూను. ఒక్కపూటభోజనంచేయాలి ఎప్పుడూ, ఎప్పుడూ రెండో పూటచేయ రాదు.మాసోపవాసంచేయాలి, లేదా చాంద్రాయణ మాచరించాలి. మంచంమీద పడుకుంటే విధవస్త్రీ భర్తను పతతుణ్ణిచేస్తుంది. విధవస్త్రీ ఎప్పుడూ నలుగుపిండిపెట్టుకోవటం చేయరాదు. ఆమె గంధద్రవ్యానుభవమును చేయరాదు. తిలకుశోదకములతోభర్తకు ప్రతిరోజుతర్పణం చేయాలి. నామగోత్రాదుల పూర్వకముగా భర్త తండ్రికి ఆతని తండ్రికి (భర్తతాత) కూడా తర్పణం చేయాలి. ఇది పుత్రులులేని స్త్రీ పరమని మదనపారిజాతమందు ప్రాణాలు కంఠంలోకి వచ్చినా (పోతున్నా) ఎద్దును ఎక్కరాదు. కంచుకము ధరించరాదు. వికృతవస్త్రము లను (బహుశారంగులవి) ధరించరాదు. వైశాఖము, కార్తికము, మాఘము ఈమాసములందు విశేషనియమములాచరించాలి. ప్రచేతుడిట్లా- తాంబూలము, అభ్యంజనము, కంచుపాత్ర యందుభోజనము వీనిని యతి, బ్రహ్మచారి విధవ వీరువిడిచిపెట్టాలి, అని. శ్రాద్ధము ఆదియందు విశేషాన్ని ముందుచెప్పాము. బౌధాయనుడిట్లా- ప్రేతయొక్కపత్ని సంవత్సరం వరకు మధు, మాంసము విడిచిపెట్టాలి, ఆరునెలలు భూమిపై పడుకోవాలి, అని మౌద్గల్యుడన్నాడు అని ఏదన్నాడో అది అసవర్ణస్త్రీ పరమని అపరార్కు డన్నాడు.

మూ ॥ అథసన్యాసః యాజ్ఞవల్క్యః- వనాద్గృహాద్వాకృత్వేష్టింసార్వవేదసదక్షిణాం ప్రాజాపత్యాంతదంతేతానగ్నీనారోప్యచాత్మని. అధీతవేదోజపకృత్ పుత్రవానన్నదోగ్నిమాన్. శక్త్యాచ యజ్ఞకృన్మోక్షేమనఃకుర్యాత్తునాన్యథా. ఏతదాశ్రమసముచ్చయపక్షే. జాబాలశ్రుతౌత్వన్యేఽపిపక్షాఉక్తాః - యదిచేతరథాబ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేద్గృహాద్వనాద్వా అథపునరవ్రతీవాస్నాతకోవాఽస్నాతకోవోత్స న్నాగ్ని కోవాయ దహరేవ విరజేత్తదహరేవప్రవ్రజేదితి. అంగిరాః- ప్రవ్రజేద్బ్రహ్మచ ర్యాద్వా ప్రవ్రజేచ్చ గృహాదపి, వనాద్వా ప్రవ్రజేద్విద్వానాతురోవాథదుఃఖితః. ఆతురోముమూర్షుః దుఃఖితశ్చోర వ్యాఘ్రాదిభీతః. భారతే- ఆతురాణాంచ సన్న్యాసే న, విధిర్నైవచక్రియా, ప్రేషమాత్రం సముచ్చార్యా సన్న్యాసంతత్ర పూరయేత్. జాబాల శ్రుతావపి-యద్యాతురస్యాన్మన సావాచావాసన్న్య సేదితి అత్రవిప్రస్యైవాధికారః బ్రాహ్మణాః ప్రవ్రజంతీ తిజాబాలశ్రుతేః ఆత్మన్యగ్నీన్స మారోప్యబ్రాహ్మణః ప్రవ్రజేద్గృహాదితిమనూక్తేశ్చేతి విజ్ఞానేశ్వరాదయః చత్వారోబ్రాహ్మణస్యోక్తా ఆశ్రమాశ్రుతిచోదితాః, క్షత్రియస్యత్రయఃప్రోక్తా ద్వావేకోవైశ్య శూద్రయోరితి. బ్రాహ్మణః క్షత్రియోవాథవైశ్యోవాప్రవ్రజేద్గృ హాదితికౌర్మాద్యుక్తేఃవర్ణత్రయస్యాప్యధికారః పూర్వవాక్యంతు కాషాయిదండాది నిషేధార్థం. ముఖజానా మయంధర్మోయద్విష్ణోర్లింగధారణం, రాజన్య వైశ్యయోర్నేతిదత్తాత్రేయమునేర్వచ, ఇతిబౌధాయనో క్తేరితిపక్షాంతరమాహ. తత్వంతుకుటీచకాది పరమేతదితి. యోఽపి సన్న్యాసంపలపైతృకమితి కలౌనిషేధః, సోఽపిత్రిదండాదిపరఇత్యుక్తంప్రాక్.

అను ॥ ఇకసన్యాసము యాజ్ఞవల్క్యుడిట్లా-వనము నుండి (వానప్రస్థం) కాని గృహస్థ ఆశ్రమంనుండి కాని సర్వవేదములతో, దక్షిణతో కూడిన ఇష్టిని చేసి, ప్రాజాపత్యం చేసి, దాని చివర ఆ అగ్నులను ఆత్మయందు సమారోపణచేసినవాడు, వేదమున భ్యసించిన వాడు, జపమాచరించినవాడు, సంతానవంతుడు (పుత్ర) అన్నదానంచేసేవాడు, అగ్నికలవాడు, శక్తి కొలది యజ్ఞములాచరించినవాడు ఇట్టివాడు మోక్షమందుమనస్సుంచాలి. మరోరకంగానైతేకాదు. ఈ నాలుగు ఆశ్రమములకూడిక పక్షమందు జాబాలశ్రుతియందు ఇతరపక్షములు కూడా చెప్పబడ్డాయి. ఒకవేళ మరోరకంగా ఐతే ఇట్లా- బ్రహ్మచర్యంనుండే సన్యాసము గృహస్థునుండేలేదా వానప్రస్థమునుండే సన్యాసము. ఆ తరువాత ఇంకా, వ్రతి కాకుండానో అస్నాతుకుడైయో, స్నాతకుడై కాని ఉత్సన్న అగ్నికుడై కాని ఏరోజువైరాగ్యం కలిగితే ఆరోజే సన్యసించాలి, అని అంగిరులన్నారు. బ్రహ్మచర్యం నుండి సన్యసించవచ్చులేదా గృహస్థాశ్రమం నుండి సన్యసించవచ్చు. విద్వాంసుడు వానప్రస్థంనుండైనా సన్యసించవచ్చు., ఆతురుడైనా దుఃఖితుడైనా సన్యసించవచ్చు, అని. ఆతురుడనగా చావసిద్ధమైనవాడు. దుః ఖితుడనగా చోరవ్యా ఘ్రాదులవల్ల భీతుడైనవాడు. భారతమందిట్లా-ఆతురులకుసన్యాసం విషయంలోవిధికాని క్రియకానిలేదు. ప్రైషమాత్రాన్ని పలికి (వెళ్తున్నా) సన్యాసాన్ని అక్కడ పూర్తి చేయాలి అని. జాబాలశ్రుతియందు కూడా. ఆతురుడైతే, మనస్సుతోకాని మాటతోకాని సన్యసించవచ్చుఅని. ఇక్కడవిప్రునకేఅధికారము బ్రాహ్మణులుసన్యసిస్తున్నారు, అని జాబాలశ్రుతి. తమయందు అగ్నిని సమారోపించుకొని బ్రాహ్మణుడు గృహమునుండి సన్యజించాలి, అని మనూక్తి కూడా అని విజ్ఞానేశ్వరాదులన్నారు బ్రాహ్మణునకు నాల్గుఆశ్రమములు శ్రుతి చోదితమైఉన్నాయి, అని చెప్పారు. క్షత్రియునకు మూడు చెప్పబడ్డాయి, రెండు వైశ్యునకు శూద్రునకు ఒకటి, అని బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడుకాని గృహమునుండి సన్యసించవచ్చు అని కౌర్మాది వచనంఉన్నందువల్ల మూడువర్ణముల వారికి అధికారముంది. ముందుచెప్పిన వాక్యము కాషాయ దండాదుల నిషేధంకొరకు బ్రాహ్మణులకిదిధర్మము ఏమిటంటే విష్ణుచిహ్నాన్ని ధరించటం. రాజన్యవైశ్యులకు లేదు అని దత్తాత్రేయమునివచనము, అని బౌధాయనోక్తి అని మరో పక్షాన్నిచెప్పారు. తత్వమైతే ఇది కుటీచకాదుల పరము, అని. పలపైత్రుకమని ఏసన్యాస ముందో అది కలిలో నిషేధముఅని ఏదన్నారో అదికూడా త్రిదండాదులపరము అని ముందు చెప్పాము.

**మూ ॥ సచసన్యాసశ్చతుర్థాఇత్యాహహారీతః, కుటీచకోబహూదకోహంసశ్చై వతృతీ యకః, చతుర్థఃపరమోహంసోయోయఃపశ్చాత్సఉత్తమః ఆద్యఃపుత్రాదినాకుటీంకారయిత్వాత త్రగృహేవా వనన్ కాషాయంవాసాః, శిఖోవవీతత్రిదండవాన్‌బంధుషున్వగృహే వాభుంజానఆత్మజ్ఞోభవేత్. ఏతదత్యంతా శక్తపరం. ద్వితీయస్తుబంధూన్‌హిత్వాసప్తాగారాణిభైక్ష్యం చరన్‌పూర్వోక్తవేషస్స్యాత్. హంసస్తుపూర్వోక్త వేషోప్యేకదండః. ఏకంతువైణవందండంధారయేన్నిత్య మాదరాదితిస్కాందాత్. విష్ణురపి-యజ్ఞోపవీతం దండంచవస్త్రంజంతునివారణం, తావాన్పరిగ్రహః**

ప్రోక్తోనాన్యోహంస పరిగ్రహఃచతుర్థోఽపిస్కాందే- పరహంసస్త్రిదండంచరజ్జుంగోబాలనిర్మితాం, శిఖాంయజ్ఞోపవీతంచ నిత్యంకర్మపరిత్యజేత్. అయమప్యే కదండఏవ. యేతుశిఖోపవీతాదిత్యాగ నిషేధాస్తేకుటీచకాదిపరాః. యత్తుమేధాతిథిః-యావన్నస్యుస్త్రయోదండాస్తావదేకేనవర్తయేదితి. తదపితత్పరమేవ. యచ్చాత్రిః-చతుర్థాభిక్షవః ప్రోక్తాస్సర్వేచైవత్రిదండినఇతి. తద్వాగ్దండాదిపరం నయష్టిపరం. వాగ్దండోఽథమనోదండః కర్మదండస్తథైవచ. యస్యైతేనియతాదండాస్స త్రిదండీతిచోచ్యతేఇతిమనూక్తేః తస్మాత్పరమహం సస్యైకదండఏవ. సోప్య విదుషః విదుషస్తుసోఽ పినాస్తి. నదండంనశిఖాం నాచ్ఛాదనంచరతి పరమహంస ఇతిమహోపనిష దుక్తేః. జ్ఞానమేవాస్యదండ ఇతి వాక్యశేషాచ్చ. యత్తుయమః-కాష్ఠదండోధృతోయేన సర్వాశీజ్ఞాన వర్జితః, సయాతినరకాన్ఘోరాన్మ హారౌరవ సంజ్ఞితానితి. తద్వైరాగ్యంవినాజీవనార్థసన్యాసపరం. ఏకదండంసమాశ్రిత్యజీవంతి బహవోనరాః, నరకేరౌరవేఘోరేకర్మత్యాగాత్పతంతితే, ఇతిస్మృతేః యచ్చాశ్వమేధికే-ఏకదండీత్రిదండీ వాశిఖాముండి తఏవవా, కాషాయమాత్ర సారోఽపియతిః పూజ్యో యుధిష్ఠిర, ఇతితస్యాపి పూర్వోక్తవ్యవస్థాజ్ఞేయా. అథ తద్విధిఃబౌధాయనః- కృత్వాశ్రాద్ధాని సర్వాణి పిత్రాదిభ్యోష్టకం పృథక్, వాపయిత్వాచకేశాదీన్మార్జయేన్మాతృకాఇమాః. సర్వాణీతి స్వస్యనవశ్రాద్ధ; షో డశశ్రాద్ధాదికృత్వేత్యర్థః స్మృత్యర్థసారేపి-ఏకోద్దిష్ట విధానేనకుర్యాచ్ఛ్రాద్ధానిషోడశ, అగ్నిమాన్పార్వణే నైవ విధినానిర్వపేత్స్వ యం, ఇతికాత్యాయనః కృచ్ఛాంస్తుచతురఃకృత్వాపావనార్థమ నాశ్రమీ, అశ్రమీచేత్తప్తకృచ్ఛం తేనాసౌయోగ్యతాంవ్రజేత్. బౌధాయనః-సదైవమార్షకందివ్యంపిత్ర్యం మాతృక మానుషే, భౌతికం చాత్మనశ్చాంతే అష్టౌశ్రాద్ధానినిర్వపేత్. అత్రక్రమమహాహేమాద్రౌ శౌనకః.

అను ॥ ఆసన్యాసము నాల్గురకాలు అనిఅన్నాదుహారీతుడు. కుటీచక, బహూదక హంస (మూడవవాడు) పరమహంస నాల్గవవాడు. తరువాత తరువాత ఉన్నవారు ఉత్తములు. ఆద్యుడిట్లా-పుత్రాదులతోగుడిసెచేయించుకొని అక్కడకాని ఇంట్లోకాని ఉంటూకాషాయ వస్త్రం ధరించి శిఖఉపవీతము త్రిదండము ధరించి బంధువుల ఇండ్లలోనో తనఇంటిలోనో తింటూ ఆత్మజ్ఞుడు అయ్యేవాడుకుటీచకుడు ఇదిఏమాత్రం శక్తిలేనివానిపరము రెండవవాడైతే బంధువులను వదలి ఏడుఇండ్లలోభిక్షమెత్తి పైవానిలా వేషంధరించిఉండేవాడు. హంసుడైతే ముందున్న వారివేషం ధరించినా ఏకదండి ఒకవేణుదండమును, నిత్యము, ఆదరంతో ధరించేవాడు ఏకదండిఅనిస్కాందోక్తి. విష్ణువుకూడా-యజ్ఞోపవీతము, దండము, వస్త్రము జంతువుల నివారణము ఇంతమాత్రమే స్వీకరించటం అని చెప్పారు. ఇతర పరికరాలు లేవు. ఈతడుహంస. చతుర్థుని గూర్చి స్కాందమిట్లా-పరమహంస, త్రిదండములు, గోవుల వెంట్రుకలతో తయారుచేసిన తాడు, శిఖ, యజ్ఞోపవీతము ఇవి ఉంటాయి. నిత్యకర్మ ఉండదు. ఈతడుకూడా ఏకదండియే. శిఖఉపవీతాదుల త్యాగంనిషేధింపబడ్డవారు కుటీచకాదులు (వారి విషయకం) మేధాతిథిఇట్లా- (తిదండములు లేనంతవరకు ఒకదండంతో ఉండాలి, అని ఏదన్నాడో అది అదికూడా వారిపరమే. అత్రిఇట్లా- భిక్షులునాల్గురకాలు అనిఅన్నారు. అందరు కూడా త్రిదండులు అని ఏదన్నాడో, అది వాక్ దండాదిపరము యష్టిపరముకాదు (చేతికఱ్ఱ) వాగ్దండము, మనోదండము, కర్మదండము ఈదండములు ఎవనికినియమంలో ఉన్నాయో, ఆతడు త్రిదండి అని కూడాచెప్పబడ్డాడు

అనిమనూక్తి. అందువల్ల పరమహంసకు ఒకేదండము. అదికూడా విద్వాంసుడుకానివానికి. విద్వాంసునకైతే అదికూడాలేదు. దండములేదు శిఖలేదు. కప్పుకునేది లేదు ఇట్లా తిరుగుతాడు పరమహంస అని మహోపనిషత్తులో చెప్పారు జ్ఞానమే ఈతనికి దండము, అని వాక్యముముగింపు. యముడిట్లా-ఎవడు కాష్ఠదండం ధరించి, అన్ని తింటూ, జ్ఞానంలేకుండా ఉంటాడోవాడు ఘోరమైన మహారౌరవమనుపేరుగల నరకములకు వెళ్తాడు అని ఏదన్నాడో అది వైరాగ్యంలేకుండా జీవనమునకైనసన్యాసపరము ఏకదండాన్ని ఆశ్రయించి అనేకమంది నరులుజీవిస్తున్నారు వారుకర్మత్యాగంవల్ల ఘోరమైన రౌరవనరకమందుపడ్తారు, అని స్మృతి. అశ్వమేధికమందిట్లా- ఏకదండో, త్రిదండో, ముండితశిఖుడో, కాషాయమాత్రముకలిగి ఉంటే యతిపూజించతగినవాడు, ఓయుధిష్ఠిర! అని ఏదన్నాడో ఆతనికిగూడాముందుచెప్పిన నిర్ణయము, అనిగ్రహించాలి. ఇక తద్విధి బౌధాయనుడిట్లా - అన్ని శ్రాద్ధములనుచేసి పిత్రాదులకు అష్టకము విడిగా చేసి, వెంట్రుకలు మొదలగువానిని కొరిగించుకొని ఈమాతృకలను మార్జనంచేయాలి. సర్వాణి అనిచెప్పింది తనకు, నవశ్రాద్ధషోడశశ్రాద్ధాదులు చేసి(కొని) అనిఅర్థము. స్మృత్యర్థసార మందు కూడా- షోడశశ్రాద్ధములనుఏకోద్దిష్టవిధానంతో చేయాలి. అగ్నికలవాడు, పార్వణవిధితోనే స్వయంగా నిర్వాపంచేయాలి, అని. కాత్యాయనుడు ఇట్లా-ఆశ్రమమందు లేనివాడు పావనతకొరకు నాలుగుకృచ్ఛ్ర ములను ఆచరించాలి. ఆశ్రమియైతేతప్తకృచ్ఛ్ర మాచరించితే దానితో ఆతడు యోగ్యత నందుతాడు. అని. బౌధాయనుడిట్లా -అది, దైవం, ఆర్షకం, దివ్యంప్రిత్యం, మాతృకం, మానుషం, భౌతకం, తనకుచివర ఇట్లా, ఎనిమిదిశ్రాద్ధ ములనునిర్వాపంచేయాలి. ఇక్కడక్రమాన్నిహేమాద్రి యందుశౌనకుడిట్లా చెప్పాడు.

**మూ ॥ దేవశ్రాద్ధేబ్రహ్మావిష్ణుమహేశ్వరాదేవతాఃఆర్షేదేవర్షిబ్రహ్మర్షిక్షత్రర్షయః, దేవర్షిక్షత్ర ర్షిమనుష్యర్షయోవామరీచ్యాదిఋషయఇతి. సన్యాసపద్ధతౌతచ్చింత్యం. దివ్యేవసురుద్రాదిత్యాః, మానుషేసనకసనందనసనాతనాః. భూతశ్రాద్ధేపృథివ్యాదిభూతాని, చక్షురాదికరణాని, చతుర్విధో, భూతగ్రామశ్చేతిత్రిః. పిత్ర్యే, పిత్రాదిత్రయోమాతామహాశ్చమాతృకే మాత్రాదయస్త్రిః, ఆత్మశ్రాద్ధే ఆత్మపితృపితామహాదేవతాః ఆత్మశ్రాద్ధంపరమాత్మదైవత్యమితిసన్యాసపద్ధతౌ. తచ్చింత్యం. సర్వత్ర నాందీముఖత్వం విశేషణంజ్ఞేయం. సర్వత్రపిండదానం. యుగ్మావిప్రాః, దక్షక్రతూసత్యవసూవా విశ్వేదేవౌ అన్యత్రనాందీశ్రాద్ధవదితిహేమాద్రిః స్మృత్యర్థసారే-కేశశ్మశ్రురోమనఖంవాపయిత్వో పకల్పయేత్. దండంజలపవిత్రంచ శిక్యంపాత్రంకమండలుం, ఆసనంకౌపీనమాచ్ఛాదనం కంథాం పాదుకే ఇతి దశపంచవా. ఏతచ్చపూర్వేద్యుర్నాందీముఖంకృత్వాపరేద్యుః పుణ్యాహవాచనంకృత్వా కార్యమితిశౌనకః బౌధాయనః- త్రీన్దండానంగుళీస్థూలాన్వైణవాన్మూర్ధసమ్మితాన్, ఏకాదశనవద్విత్రి చతుస్సప్తాన్య పర్వకాన్. వేష్టితాన్కృష్ణగోబాలరజ్జ్వాతుచతురంగుళాన్. ఏకోవాతాదృశోదండోగోబాల [illegible]శోభవేత్. అనగ్నిరగ్నిముత్పాద్యనిత్యేనవిధినాతతః. పృష్ఠోదివివిధానేన, ఇత్యర్థః. స్వాగ్నావేవాగ్ని మాన్కుర్యాదప వర్గోక్తమాదితః. ఆజ్యంపయోదధీత్యేతత్త్రివృద్ధాజలమేవవా. ఓంభూరిత్యాదినాప్రాశ్య రాత్రించోపవసే త్తతః అథాదిత్యాస్తమయాత్పూర్వమగ్నీన్విహృత్యసః, ఆజ్యమగ్నౌగా ర్హపత్యేసంస్కృత్యే**

తేన చ(స్రుచా పూర్ణయాహవనీయేతు జుహుయాత్ప్రణవేన, తత్. బ్రహ్మాన్వాధాన మేతత్స్యాదగ్ని హోత్రేహుతేతతః, సంస్తీర్యగార్హపత్యస్యదర్భానుత్తరతోఽ త్రతుపాత్రాణ్యాసాద్యదర్భేషు బ్రహ్మాయతన ఏవతు, జాగృయాద్రాత్రిమేతాంతుయావద్బ్రాహ్మోముహూర్తకః. అగ్నిహోత్రంస్వకాలేతు హుత్వా ప్రాతస్తనం తతః, ఇష్టింవైశ్వానరీంకుర్యాత్ప్రా జాపత్యామధాపివా. జాబాలశ్రుతౌతద్దకే ప్రాజాపత్యా మేవేష్టింకుర్వంతి తదుతథా, న కుర్యాదాగ్నేయీమేవకుర్యాత్పశ్చాత్త్రై ధాతవీయామేవ కుర్యాదిత్యుక్తం. తేనాత్రవి కల్పః అత్రాహుః త్రేతాగ్నేఃప్రాజాపత్యాతద్వాక్యశేషేఽగ్నీనితిబహుత్వశ్రుతేః ఏకాగ్నేస్త్వాగ్నే యీతి అనాహితాగ్నేరిష్టిస్థానేవైశ్వానరఆగ్నేయోవాచరురితి మాధవః. కాత్యాయనః– ఆత్మన్యగ్నీన్స మారోప్య వేదిమధ్యస్థితోహరిం, ధ్యాత్వాప్యాదిత్వనుజ్ఞాతోగురుణాప్రైషమీరయేత్. కపిలః– విధివత్ప్రైషముక్త్వాధత్రిరుపాం(శు) శ్రుతిరుచ్చకైః, అభయంసర్వభూతేభ్యో మత్తస్స్వాహేత్యథో భువి. నినీయదండశిక్యాదిగృహీత్వాధబహిర్వ్రజేత్.

అను ॥ దేవశ్రాద్ధమందు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులుదేవతలు, అర్షమందుదేవర్షి బ్రహ్మర్షి క్షత్రర్షులు, దేవర్షిక్షత్రర్షిమనుష్యర్షులో. మరీచ్యాదిఋషులుఅని, సన్యాసపద్ధతిలో ఈ విషయం గూర్చి ఆలోచించాలి దివ్యమందువసురుద్రఆదిత్యులు మానుషమందుసనకస నందన సనాతనులు భూతశ్రాద్ధమందుపృధ్వివ్యాదిభూతములు, చక్షురాదికరణములు నాల్గురకాలు, భూతగ్రామములు అని మూడు అని. పితరులందు ముగ్గురు పిత్రాదులు ముగ్గురు, మాతామహులు, మాతృకయందు మాత్రాదులు ముగ్గురు, ఆత్మశ్రాద్ధమందు ఆత్మపిత్రు పితామహులు దేవతలు, ఆత్మశ్రాద్ధమందుపరమాత్మదేవత, అని. సన్న్యాసపద్ధతిలో ఈ విషయాన్ని ఆలోచించాలి. అంతట నాందీ ముఖత్వమనేది విశేషణంగా గ్రహించాలి. అంతట పిండదానము. ఇద్దరేసి బ్రాహ్మణులు. దక్షక్రతువులుకాని సత్య, వసువులుకాని విశ్వేదేవులు. మిగిలినదినాందీశ్రాద్ధంవలె అని హేమాద్రి. స్మృత్యర్థసార మందిట్లా– కేశశ్మశ్రురోమనఖములను కొరిగించుకొని ఏర్పరచాలి. దండము, జలము, పవిత్ర, కావడి, పాత్రము, కమండలువు, ఆసనము, కౌపీనము, ఆచ్ఛాదనము, బొంత, పాదుకలు అని పదికాని ఐదుకాని. దీనిని ముందు రోజునాందీముఖంచేసి తరువాతిరోజుపుణ్యాహవాచనం చేసి చేయాలి, అని శౌనకుడన్నాడు. బౌధాయనుడిట్లా– మూడుదండములు, వ్రేలంతలావు గలవి, వెదురువి, మూర్ధంగలవి, పదకొండు, తొమ్మిది, రెండు, మూడు, నాలుగు, ఏడు వీనిలో ఏదో ఒక సంఖ్య గల పర్వములుకలవి కావాలి (దండములు), నల్లగోవువెంట్రుకల తాడుతో, నాల్గంగుళములు చుట్టబడినవి. అటువంటిదే దండము ఒకటికాని గోవువెంట్రుకల సదృశమైనదై ఉండాలి. అగ్నిలేనివాడు అగ్నిని పుట్టించి నిత్యవిధితో ఆపిదప “పృష్టోదివి” విధానంతో అని అర్థము. అపవర్గమందుచెప్పినదంతా తొలినుండి, అగ్నికలవాడు తనఅగ్నియందే చేయాలి. ఆజ్యము, పాలు, పెరుగు ఈమూడు వీనికిమూడింతల నీరుకాని, ఓంభూః అను మొదలగు వానితో త్రాగిఆపిదపఆరాత్రి ఉపవసించాలి. ఇకసూర్యాస్తమయం కన్నముందు ఆతడు అగ్నులను కదిలించి, సంస్కృతికొరకు (అలంకారం) గార్హపత్యాగ్ని యందు ఆజ్యముంచి, ఆస్రుక్కుతోనే నేయినింపిన దానితో ప్రణవంతో ఆహావనీయమందు

దానిని హోమంచేయాలి. ఇది బ్రహ్మాన్వాధానమౌతుంది, అగ్నిహోత్ర మందు హోమంచేయ బడితే, ఆపిదప గార్హపత్యంయొక్క దర్భలను పరచి, ఇక్కడ ఉత్తరంవైపు, పాత్రములు ఆసాదించి దర్భలయందు, బ్రహ్మాయతనమందే ఈ రాత్రి మెలకువగాఉండాలి బ్రాహ్మ ముహూర్తంవరకు. బ్రాహ్మముహూర్త మయ్యాక, అగ్నిహోత్రాన్ని స్వల్పకాలంలో హోమంచేసి ప్రాతఃకాలమున, ఆపిదప వైశ్వానరేష్టిని చేయాలి. లేదా ప్రాజాపత్యంకాని. జాబాలశ్రుతి యందిట్లా-కొందరు ప్రాజాపత్యమందే ఇష్టిని చేస్తున్నారు, అని. అదిఅట్లా చేయరాదు ఆగ్నేయియందే చేయాలి. ఆపిదపత్రిధాతవీయమందే చేయాలి, అని అన్నారు. అందువల్ల ఇక్కడవికల్పము ఇక్కడ చెప్పారు త్రేతాగ్ని ప్రజాపతి ఐనందువల్ల, ఆవాక్యశేష మందు అగ్నులుఅని బహుత్వం విన్పిస్తున్నందువల్ల, ఏకాగ్నికి ఆగ్నేయీ అని అర్థం. అనాహితాగ్నికి ఇష్టిస్థానమందువైశ్వానరమోఆగ్నేయమోచరువు అని మాధవుడన్నాడు. కాత్యాయనుడిట్లా- తనయందు అగ్నులను సమారోపంచేసుకొని వేదిమధ్య యందుండి హృదయంలో హరినిధ్యానించి, గురువుల అనుజ్ఞపొంది వెళ్తున్నానని చెప్పాలి, అని. కపిలుడిట్లా- విధిప్రకారము వెళ్తున్నానని చెప్పి ఇక మూడు మార్లు ఉపాంశు అనే శ్రుతిని గట్టిగా చెప్తూ, నానుండి సర్వభూతములకు అభయముస్వాహా అని భూమిపై (నీరు) వదలి, దండము. కావడి మొదలైనవి తీసుకొని ఇక బయటికివెళ్లాలి.

**మూ ॥ బౌధాయనః-సఖేమేత్యాదినాదండం, యేనదేవాః పవిత్రకం, యదస్యపారే శిక్యంతుపాత్రంవ్యాహృతిభిస్తథా. యువాసువాసాఃకౌపీనంగృహీత్వాబాంధవాంస్త్యజేత్. అథక్రమః - తత్రసన్న్యాసేఅధికారసిద్ధ్యర్థం స్వస్యనవశ్రాద్ధషోడశశ్రాద్ధసపిండనానిసాగ్నిః పార్వణాన్యనగ్నిస్త్వే కోద్దిష్టవిధినాకృత్వానాశ్రమీచేత్కృచ్ఛ్రచతుష్టయమన్యస్తుతప్తకృచ్ఛ్రంకృత్వోదగయనేఏకాదశ్యాంద్వాదశ్యాం వాసాగ్నిరమావాస్యాయాంపౌర్ణమాస్యాంచతుర్దశ్యాం యధాపర్వణిప్రాజాపత్యంస్యాత్. తత్రదేశకాలౌ స్మృత్వాపరమహంసాదిసన్న్యాసగ్రహణంకరిష్యఇతిసంకల్ప్యగణేశంసంపూజ్యపుణ్యాహంవాచయిత్వా మాతృకాపూజాంవృద్ధిశ్రాద్ధంచకృత్వాఽస్తమయాత్ప్రాగౌపాసనంసమిధ్యాఽహితాగ్నిస్తు గార్హపత్యం విధురోగ్ని హోత్రీతుత్రికాండమండనోక్తదిశాకుశపత్న్యాసహపవమానేష్ట్యంతంపూర్ణాహుత్యంతంవా ఆధానం కుర్యాత్. బ్రహ్మచారీచేల్లౌకికేవిధురశ్చేద్వ్యాహృతిభిః ప్రణవేనవాగ్నిమాదాయాన్వగ్నిరుష సామిత్యాన్వీయపృష్ఠోదివీతినిధాయతేనైవసమిధ్యతత్సవితుస్త్వాంసవితుర్విశ్వానిదేవఇతితిస్రస్సమిధో భ్యాదధ్యాత్. ఏవమగ్నౌసిద్ధేకక్షోపస్థవర్జంవపనంకృత్వాపయోదధియుతమాజ్యమపోవాఓం భూస్సావిత్రీం ప్రవిశామితత్సవితుర్వరేణ్యమితి ప్రాశ్యాచమ్యపునరాదాయ ఓంభువస్సావిత్రీం ప్రవిశామి భర్గోదేవస్య ధీమహీతి ద్వితీయం ఓంస్వస్సావిత్రీం ప్రవిశామిధియోయోనః ప్రచోదయాదితి తృతీయం సమస్తయా చతుర్థంఓంభూర్భువస్స్వస్సావిత్రీంప్రవిశామి, తత్సవితుః-యాత్ ఇతి, సన్న్యాసపద్ధతౌతు త్రివృదసీ తిప్రథమం ప్రవృదసీతిద్వితీయం, వివృదసీతితృతీయంప్రాశ్యాపః పునంత్వితిజలం ప్రాశ్యసావిత్రీ ప్రవేశఉక్తః తతఆహవనీయంవిహృత్యబ్రహ్మాణము పవేశ్యాజ్యం సంస్కృత్యచతుర్ద్వాదశ వాగృహీత్వా సమిత్పూర్వాంఓంస్వాహాపరమాత్మనఇదమితిహుత్వోప వసేత్. తతస్సాయంహోమం వైశ్వదేవంచకృత్వా అగ్నేరుదక్కుశానాస్తీర్యదండాదీనిదశపంచవాఽ సాద్యబ్రహ్మాసనేకృష్ణాజినో పవిష్టో రాత్రౌజాగరంకృత్వా ప్రాతర్హోమానంతరంప్రాజాపత్యాం వైశ్వానరీం**

వాకృత్వా ఋత్విగ్భ్యస్సర్వస్వంబ్రహ్మణే చ మధుపూర్ణంతైజసపాత్రందత్వాదారుపాత్రాణ్యా హవనీయే శ్మమృన్మయానిచజలేక్షిపేత్. కృష్ణాజినంత్వా దధీత-అనాహితాగ్నిస్తువైశ్వానరమాగ్నేయం వాచరుం హుత్వా పాత్రాణ్యగ్నౌక్షిప్త్వా భూర్భువస్స్వరిత్యపః స్పృష్ట్వాతరత్సమందీతిజప్త్వావిప్రాన్ సంభోజ్య పుణ్యాహంవాచయిత్వాఅత్రవావపనం కృత్వాహైమరూప్య కుశజలైఃస్నాత్వాపురుషాయ చరుంకృత్వా ప్రాణాయస్వాహేతిపంచాహు తీర్హుత్వాపురుషసూక్తేన ప్రత్యృచమాజ్యం చరుంచజుహు యాత్. అత్రవిరజా హోమంకేచిదాహుః. యథోక్తంశివ గీతాసు-జుహుయాద్విరజామంత్రైః ప్రాణాపానాది భిస్తతః, అనువాకంతమే కాగ్రస్సమిదాజ్య చరూన్పృధక్. ఆత్మన్యగ్నీన్సమారోప్యయాతే అగ్నేతిమం త్రతః భస్మాదాయాగ్నిరిత్యా ద్యైర్విమృజ్యాం గానిసంస్పృశేత్. పాపైర్విముచ్యతేసత్యంముచ్య తేనాత్ర సంశయః.

అను ॥ బౌధాయనుడిట్లా-సఖేమే, అని మొదలైన మంత్రంతో దండాన్ని, యేనదేవాః అనుదానితో పవిత్రను, యదస్యపారే, అనికావడి, వ్యాహృతులతోపాత్ర, యువాసువాసాః అనికౌపీనాన్నితీసుకొని బంధువులను విడిచిపెట్టాలి. ఇకక్రమము. అక్కడ సన్యాసమందు అధికారసిద్ధికొరకు, తనకు, నవశ్రాద్ధషోడశశ్రాద్ధ, సపిండనములు సాగ్నికుడు పార్వణములు, అనగ్నికుడు ఏకోద్దిష్టవిధిగా చేసి, అనాశ్రమిఐతేనాల్గుకృచ్ఛ్రములు ఆచరించి, ఇతరులు తప్తకృచ్ఛ్రమాచరించి, ఉత్తరాయణమందు ఏకాదశియందో, ద్వాదశియందో సాగ్నికుడు, అమావాస్యయందో పౌర్ణమియందో, చతుర్దశియందో, వీలైన పర్వమందు ప్రాజాపత్యం కలవాడు కావాలి. అక్కడ దేశకాలములు స్మరించి, పరమహంసాదిసన్యాస గ్రహణం చేస్తున్నాను, అని సంకల్పంచేసి గణేశుని పూజించి పుణ్యాహవాచనము చేసి, మాతృకాపూజ వృద్ధిశ్రాద్ధముచేసి, అస్తమయంకన్నముందు ఔపాసనము సమిధలతో ఆహితాగ్నియైతే గార్హపత్యాగ్నివిధురుడు అగ్నిహోత్రియైతే, త్రికాండమండనుడు చెప్పిన విధంగా కుశలతో చేసిన భార్యతో కూడా పవమానేష్ట్యంతము, లేదా పూర్ణాహుతి అంతంగానో ఆధానం చేయాలి. బ్రహ్మచారియైతే లౌకికాగ్నియందు విధురుడైతే వ్యాహృతులతో కాని, ప్రణవంతోకాని అగ్నితీసుకొని, అన్వగ్నిరుషసాం (మంత్రం) అని తెచ్చి పృష్టోదివిఅను మంత్రంతో అక్కడపెట్టి ఆఅగ్నియందేతత్సవితుః తాంసవితుః, విశ్వానిదేవఅనుమూడు మంత్రములతో సమిధలను అందుంచాలి. ఈరకంగా అగ్నిసిద్ధమైతే, కక్ష, ఉపస్థ ఈరెండుచోట్ల తప్పమిగిలినచోట్ల వపనంచేయించుకొని పయో, దధివీనితోకూడిన నేయిలేదా నీరు కాని ఓంభూఃసావిత్రీంప్ర విశామితత్సవితుర్వరేణ్యమితి పుచ్చుకొని (త్రాగి) ఆచమనంచేసి, తిరిగితీసుకొని ఓంభువ స్సావిత్రీం...ధీమహీతిరెండవది, ఓంస్వస్సావిత్రీం ..... ప్రచోదయాత్ అని తృతీయము మొత్తముతో ఓంభూర్భువస్వః సావిత్రీం ప్రవిశామి తత్సవితుః....యాత్ అని ప్రాశన చేయాలి. సన్యాసపద్ధతియందైతే త్రివృదసిఅనిప్రథమం, ప్రవృదసి అనిద్వితీయం, వివృదసి అని తృతీయంపుచ్చుకొని, ఆపఃపునంతు అని నీరు పుచ్చుకొని సావిత్రి ప్రవేశం చెప్పబడింది. ఆపిదప ఆహవనీయాన్నిజ్వలింపచేసి బ్రహ్మను కూర్చోబెట్టి ఆజ్యాన్ని అలంకరించి నాలుగోలేదాపన్నెండోతీసుకొని సమిధలపూర్వకముగా

ఓంస్వాహాపరమాత్మన ఇదం అని హోమంచేసి కూర్చోవాలి (ఇది బ్రహ్మ అన్వాధానం) ఆపిదప సాయంకాలము హోమమువైశ్వ దేవముచేసి, అగ్నికి ఉత్తరమందుకుశలనుపరిచి దండాదులు పదిలేదా ఐదు ఉంచి బ్రహ్మాసనమందు కృష్ణాజినమందుకూర్చొని రాత్రిజాగారం చేసి, ప్రొద్దున హోమం తరువాత ప్రాజాపత్యమోవైశ్వానరమోచేసి, ఋత్విక్కులకు అంతా, బ్రహ్మకు తేనెతో నిండిన తైజసపాత్రనుఇచ్చి, దారుపాత్రలను ఆహవనీయమందు, అశ్మమృణ్మయమైన వానిని జలమందువేయాలి. కృష్ణాజినముతీసుకోవాలి. అనాహితాగ్నియైతే వైశ్వానరమో, ఆగ్నేయమో ఐన చరువును హోమంచేసిపాత్రలు అగ్నియందు వేసి, భూర్భువస్స్వః అని జలం స్పృశించి, తరత్సమంది, అనేమంత్రంజపించి, బ్రాహ్మణులను భుజింపజేసి పుణ్యాహం చెప్పించి, ఇక్కడ మరోసారి వపనం చేయించుకొనిలేదా, హైమము, వెండికుశ జలములతో స్నానం చేసి, పురుషునకై చరువుచేసి, ప్రాణాయస్వాహ అని ఐదు ఆహుతులు చేసి పురుషసూక్తంతో ప్రతిఋక్కుతోఆజ్యము, చరువుతోహోమంచేయాలి. ఇక్కడ కొందరు విరజాహోమాన్ని చెప్పారు. ఇట్లాశివగీతములందు చెప్పబడింది- విరజామంత్రములతోఆపైన ప్రాణాపానాదులతో హోమం చేయాలి. యాతేఅగ్నా అనుమంత్రంతో ఆత్మయందు అగ్నిసమారోపంచేయాలి, భస్మంతీసుకొని అగ్నిః అను మొదలగు మంత్రములతో కదిలించి (రాచి) అంగములను ముట్టుకోవాలి. పాపములనుండి విముక్తుడౌతాడు, నిజముగా ముక్తుడౌతాడు ఇందులో అనుమానంలేదు.

**మూ ॥ యథా-ప్రాణాపానవ్యానోదానసమానామేశుద్ధ్యంతాం జ్యోతిరహంవిరజా విపాప్మా భూయసగ్ంస్వాహా, సర్వత్రలింగోక్తే, దేవతాభ్యఇదమితిత్యాగః. వాఙ్మనశ్చక్షుశ్రోత్ర జిహ్వాఘ్రాణరేతోబుద్ధ్యాకూతిస్సంకల్పామేశుద్ధ్యంతాంజ్యోతి, త్వక్చర్మమాంసరుధిరమేధోమజ్జాస్నాయ వోస్థీనిమేశుద్ధ్యంతాంజ్యోతి, శిరఃపాణిపాదపార్శ్వపృష్ఠోరూద రజంఘశిశ్నోపస్థ పాయవోమేశుద్ధ్యంతా ంజ్యోతిరహం, ఉత్తిష్ఠపురుషహరితపింగళలోహితాక్షిదేహిదాపయితామేశుద్ధ్య, పృథివ్యాపస్తేజోవా యురాకాశోమే శుద్ధ్యంతాంజ్యోతిరహం,శబ్దస్పర్శరూపరసగంధామే శుద్ధ్యంతాం జ్యోతి, మనో వాక్కాయ కర్మాణిమేశుద్ధ్యం. అవ్యక్తభావైరహం కారైఃజ్యోతిరహం ఆత్మామేశుద్ధ్యంతాం, అంతరాత్మామే శుద్ధ్యంతాం పరమాత్మమేశుద్ధ్యంతాం, క్షుధేస్వాహా, క్షుత్పిపాసాయస్వాహా, వివిద్యైస్వాహా, ఋగ్విధానా యస్వాహా, కర్షోత్కాయస్వాహా. క్షుత్పిపాసామలంజ్యేష్ఠామలక్ష్మీంనాశయామ్యహం, అభూతిమ సమృద్ధించ సర్వాన్నిర్ణుదమేపాప్మానగ్ం స్వాహా, (ఇది అగ్నికి) అన్నమయప్రాణమయ మనోమయ విజ్ఞాన మయా నందమయ మాత్మామేశుద్ధ్యంతాంజ్యోతి (ఇది అన్నమయాదులకు) తతస్స్విష్టకృదా దిహుత్వా బ్రహ్మణేహిరణ్యమాజ్య పాత్రంధేనుంచ దత్వాసమాసించత్విత్యుపతిష్ఠేత. అత్రకేచిదనగ్నే స్సావిత్రీప్రవేశం పూర్ణాహుతించాహుః తతో, యాతే అగ్నే యజ్ఞియాతనూరితి త్రిస్త్రిభిరే కైకంజిఘ్రన్నాత్మన్యగ్నీన్ సమారోప్య గురువేసర్వస్వందత్వాయోబ్రహ్మాణంవిదధాతి పూర్వంయోవై వేదాగ్ంశ్చప్రహిణోతితస్మై తంహదేవమాత్మబుద్ధి ప్రకాశంముముక్షుర్వైశరణమహం ప్రపద్యేఇత్యుప స్థాయదక్షిణం జాన్వాచ్యపాదావుపసంగృహ్యా అధీహి భగవోబ్రహ్మేతివదేత్. తతోగురురాత్మానం బ్రహ్మరూపంధ్యాత్వాశంఖంద్వాదశప్రణవైరభిమంత్ర్యతేనశిష్యమభిషించ్య శన్నోమిత్ర, ఇతి శాంతింపరిత్వాతచ్ఛిరసిహస్తందత్వా పురుషసూక్తంజప్త్వా, మమవ్రతేహృదయంతే**

**దదామీతి, చజప్త్వాఉదఙ్ముఖః ప్రణవార్థమను సందధ ద్దక్షిణేకర్ణే ప్రణవముపదిశ్యతదర్థంచ పంచీకరణాద్యవబోధ్య అయమాత్మాబ్రహ్మ, తత్త్వమసి, ప్రజ్ఞానం బ్రహ్మే అహంబ్రహ్మాస్మి ఇత్యాద్యుపది శేత్. తదర్థంచవదేత్. తతోనామదద్యాత్. తతశ్శిష్యస్తేనోపదిష్టో హరింస్మరన్నూర్ధ్వబాహు స్తిష్ఠన్‌దేవాన్ సాక్షిణఃకృత్వా, ఓంభూ,ర్భువ, స్స్వ, స్సన్యస్తం మయేతి త్రిరుపాంశుః, త్రిరుచ్చైః, త్రిరత్యుచ్చైశ్చోక్త్వా జలసమీపంగత్వాస్నాత్వా, అభయంసర్వభూతేభ్యో మత్తస్స్వాహేతి త్రిరంజలింక్షిప్త్వా యువాసువాసా ఇతి కాషాయంకౌపీనం వాసశ్చపరిధాయసఖేమాం గోపాయేతి ముఖ్యంవైణవం పాలాశంబైల్వమౌ దుంబరంవాదండంగృహ్ణీయాత్. అత్రపుత్రకామోగృహస్థః శంఖేనపురుష సూక్తేన దండమభిషిచ్య దద్యాదిత్యాచార్యః తతశ్శిఖా ముత్పాట్యఓంభూస్స్వాహేత్యగ్నౌ జలేవాహుత్వాతథై వోపవీతంహుత్వా యేనదేవాః పవిత్రేణజలపవిత్రంయదస్యపారఇతిశిక్యం సావిత్ర్యాకమండలుం సప్తవ్యాహృతిభిః భోజన పాత్రంఇదం విష్ణురిత్యాసనంబృ సీంవాగృహీత్వా ఓంభూస్తర్పయా మీతివ్యస్త సమస్తాభిఃమహర్నమ ఇతి తర్పయిత్వాభూస్స్వధోం భువస్స్వధోం స్వస్స్వధోం భూర్భువస్స్వర్మ హర్నమస్స్వధేతి పితౄంస్తర్పయిత్వా, ఉదుత్యం, చిత్రం, తచ్చక్షుః, హగ్ం సశ్శుచిషత్, నమోమిత్రస్యేతి స్నాత్వా సురభి మతీభిరాపోహిష్ఠేతి హిరణ్యవర్ణాభిః పావమానీభిః వ్యాహృతిభిశ్చమార్జయిత్వా అష్టోత్తరశతవార మఘమర్షణం ప్రాణాయామాం శ్చకృత్వా ఓంభూర్భువస్సువరితి చపటిత్వానమస్సవిత్రే ఇతి సూర్యంచో పస్థాయపున స్స్నాత్వాజంఘేక్షాళయిత్వా ఓమితిబ్రహ్మోమితీ దంసర్వమోమితిబ్రహ్మావా ఏషజ్యోతిర్యఏషవేదోయ ఏషత పతివేద్యమేవైతద్యఏష వేదోయదవనమస్తీతి జపిత్వాఅష్టసహస్రంగా యత్రీంజపేత్, ఇతి.**

అను ॥ 1 ఎట్లాంటే-ప్రాణాపాన ........... సగ్ంస్వాహా అని త్యాగము-చేయాలి. అంతటలింగముచెప్పాముకనుక దేవతలకు ఇది, అని త్యాగము. 2 వాఙ్మనః ..... శుద్ధ్యంతాం జ్యోతి, అని 3త్వక్చర్మ .... తాంజ్యోతి, అని, 4శిరఃపాణి .... జ్యోతిరహం, అని 5 ఉత్తిష్ఠపురుష ..... శుద్ధ్య, అని, 6పృధివ్యాప ............... రహం, అని, 7శబ్దస్పర్శ .... జ్యోతి అని, 8 మనోవాక్ ... శుద్ధ్యం అని, 9అవ్యక్తభావై ..... రహం, అని 10 ఆత్మామేశుద్ధ్యం తాం అని; 11 అంతరాత్మా .. తాం, అని, 12 పరమాత్మా .. తాం, అని, 13 క్షుధే ... అని; 14 క్షుత్పిపా ..... అని, 15 వివిట్యై .. అని, 16 ఋగ్విధా .... అని, 17 కర్షోత్కా .... అని, 18 క్షుత్పిపాసా .... నిర్ణుదమే పాప్మానగ్ం స్వాహా, అని (అగ్నికి) 19 అన్న మయ ప్రాణమయ ......... జ్యోతి, అని (అన్నమ యాదులకు) ఆ పిదప స్విష్టకృదాదులు హోమంచేసి బ్రహ్మకు హిరణ్యము, ఆజ్యపాత్ర ధేనువు. వీటిని ఇచ్చి సమాసించతు అని నిలబడాలి. ఇక్కడ కొందరు అనగ్నికునకు సావిత్రీ ప్రవేశాన్ని పూర్ణాహుతిని చెప్పారు. ఆపిదపయాతేఅగ్నేయజ్ఞియాతనూః అని ఒక్కొక్కటిమూడేసి మార్లువాసనచూస్తూ ఆస్వాదిస్తూ ఆత్మయందు అగ్నులను సమారోపణచేసి గురువునకు అంతాఇచ్చి యోబ్రహ్మాణం విదధాతి... శరణమహంప్రపద్యే అనిసమీపమందునిలబడి, కుడిమోకాలువంచి పాదములను ముట్టుకొని అధీహిభగవోబ్రహ్మా, అని చెప్పాలి. ఇప్పుడుగురువు, తనను బ్రహ్మ రూపునిగా ధ్యానించుకొని, శంఖమును పన్నెండుమార్లు,

ప్రణవముతో అభిమంత్రించి, దానితో శిష్యుని అభిషేకించి శన్నోమిత్ర..అనే శాంతిపారం పఠించి ఆతనిశిరస్సుపైహస్తముంచి, పురుషసూక్తము జపించి, నాయందు భక్తిగలవాడ! నాహృదయాన్నినీకిస్తున్నాను, అని (మమవ్రతే.... అని) జపించి, ఉత్తరంముఖంకలవాడై, ప్రణవము అర్థాన్ని అనుసంధిస్తూ కుడిచెవియందు ప్రణవాన్నిఉపదేశించిదాని అర్థాన్ని పంచీకరణాదులు బోధించి, అయమాత్మా బ్రహ్మ, తత్వమసి, ప్రజ్ఞానం బ్రహ్మ అహం బ్రహ్మాస్మి అని మొదలుగా ఉపదేశించాలి. దాని అర్థాన్నిచెప్పాలి. ఆపిదప పేరుపెట్టాలి. (యతిఅయ్యాకపేరు) ఆపిదపశిష్యుడు ఆతనితో ఉపదేశాన్ని పొంది, హరినిస్మరిస్తూ చేతులుపైకెత్తి నిలిచి దేవతలను సాక్షిగా చేసి ఓం భూర్భువ,స్స్వఃనేను సన్యసించాను, అనిమూడుసార్లుమెల్లగా, మూడుసార్లుపెద్దగా, మూడుసార్లు చాలా పెద్దగా అరుస్తూ చెప్పినీటి దగ్గరకు వెళ్ళిస్నానంచేసి సర్వభూతములకు నానుండి అభయము, స్వాహా అని మూడుసార్లుఅంజలినివదలి, యువాసువాసా, అనికాషాయపు రంగుగల కౌపీనము వస్త్రములుధరించి, సఖేమాంగోపాయ, అని వెదురుది (ప్రధానంగా) లేదా మోదుగలేదా బిల్వము లేదా మేడిపీటిదండాన్ని తీసుకోవాలి. ఇక్కడ పుత్రకాముడైనగృహస్థుడు శంఖంతో పురుషసూక్తంతో దండాన్ని అభిషేకించి ఇవ్వాలి అని ఆచారము. ఆపిదపశిఖనుపెరికిఓంభూః స్వాహా అని అగ్నియందులేదాజలముయందుహోమం చేసి అట్లాగే ఉపవీతంహోమంచేసి, యేనదేవాః పవిత్రేణ, అనిజలపవిత్రను, యదస్యపార, అని కావడిని, సావిత్రిమంత్రంతో కమండలును, సప్తవ్యాహృతులతో భోజన పాత్రను, ఇదం విష్ణుః అని ఆసనములేదా బృసిని తీసుకొని, ఓంభూస్తర్పయామి, అని వ్యస్తంగా సమస్తంగాను, మహర్నమఅని తర్పణంచేసి, భూఃస్వధోంభువఃస్వధోం.............. స్వధా, అని పితరులను తర్పణంచేసి, ఉదుత్యం, చిత్రం, తచ్చక్షుః, హగ్ం సశ్శుచిషత్, నమో మిత్రస్య, అను మంత్రాలు పఠిస్తూ స్నానం చేసి, సురభి మతి అను, ఆపోహిష్ఠా, అను హిరణ్యవర్ణా అను పావమానీ అను ఈ ఈ మంత్రములతో, వ్యా హృతులతో మార్జనం చేసి, నూట ఎనిమిది మార్లు అఘమర్షణము, ప్రాణాయామములు చేసి, ఓం భూర్భువస్సువః అని కూడా పఠించి, నమస్సవిత్రే, అని సూర్యోపస్థానం చేసి, తిరిగి స్నానంచేసి, జంఘలు కడుగుకొని ఓమితి బ్రహ్మ.... మస్తి, అని జపించి, ఎనిమిది వేల గాయత్రిని జపించాలి,అని.

**మూ॥ అథయతి ధర్మాః - ప్రాతరుత్థాయ బ్రహ్మణస్పతే ఇతి జపిత్వా దండాదీని మృదం చనిధాయ, మూత్ర పురీషయోః గృహస్థ చతుర్గుణం శౌచం కృత్వా ఆచమ్య పర్వద్వాదశీ వర్జ్యం ప్రణవేన దంత ధావనం కృత్వాతే నైవ మృదా బహిః కటిం ప్రక్షాళ్య జలతర్పణ వర్జ్యం స్నాత్వా పునర్జంఘే ప్రక్షాళ్య వస్త్రాదీని గృహీత్వా మార్జనాంతం కృత్వా కేశవాది నమోంత నామభిః తర్పయిత్వా ఓం భూస్తర్పయామిత్యాది, వ్యస్త సమస్త వ్యాహృతిభిః మహర్జన స్తర్పయా మీతి తర్పయేత్. ఓం భూస్స్వాహేతిస్వాహాశబ్దాంతైః స్వధాశబ్దాంతై శ్చైభిరేవ పునస్తర్పయేదితి కేచిత్. తత ఆచమ్యాంజలినా ప్రణవేన జలమాదాయ వ్యాహృతిభి రుద్ధృత్య గాయత్ర్యాత్రిః క్షిప్త్వా గాయత్రీం జపేత్. ఉదితే సూర్యే ప్రణవేన వ్యాహృతిభిః వా అర్ఘ్యం త్రిర్దత్వా మిత్రస్య చర్షణీత్యా ద్యైః పూర్వోక్త**

**సౌరీభిః ఇదం విష్ణు, స్త్రిర్దేవో, బ్రహ్మజ జ్ఞానమితి చోపస్థాయ సర్వభూతేభ్యోనమఇతి ప్రదక్షిణమావర్తతే. తతోనత్వా ఆదిత్యాయవిద్మహే సహస్రాక్షాయధీమహి తన్నః సూర్యః ప్రచోదయాత్, ఇతి త్రిర్జపేత్. ఏవం త్రికాలం విష్ణుపూజాం బ్రహ్మయజ్ఞం చ కుర్యాత్. అథ భిక్షా - విధూమే సన్నముసలేవ్యంగారే భుక్త వజ్జనే, కాలేఽ పరాహ్ణేభూయిష్ఠేనిత్యం భిక్షాంయతిశ్చరేదిత్యుక్తేకాలేఉద్వయమితి చతసృభిః ఆదిత్యముపస్థాయ తే నైక్యం ధ్యాత్వా. ఆకృష్ణేనేతి ప్రదక్షిణం కృత్వా యేతే పంథాన ఇతి జప్త్వా. యోఽసౌ విష్ణ్వాఖ్య ఆదిత్యే పురుషోంతర్హృదిస్థితః, సోఽహం నారాయణో దేవ ఇతిధ్యాత్వా ప్రణమ్యతం.**

అను॥ ఇక యతి ధర్మములు - ప్రొద్దున్నే లేచి బ్రహ్మణస్పతే అని జపించి, దండాదులు, మట్టిని ఉంచి, మూత్రపురీషములకు గృహస్థునకు నాల్గింతలుగా శౌచం చేసుకొని, ఆచమనంచేసి, పర్వ ద్వాదశులందు తప్ప ఇతర దినాలలో ప్రణవంతో దంత ధావనం చేసుకొని, ఆ మట్టితోనే కటి బహిర్భాగాన్ని ప్రక్షాళనచేసి, జలతర్పణం లేకుండా స్నానంచేసి, తిరిగి పిక్కలు కడుగుకొని వస్త్రాదులు తీసుకొని మార్జనాంతం చేసి కేశవాది నామములు నమోంతములుగా వానితో తర్పణ చేసి, ఓం భూః తర్పయామి, అని మొదలుగా వ్యస్తంగా సమస్తంగా వ్యాహృతులతో మహర్జనస్తర్పయామి, అని తర్పణ చేయాలి. ఓం భూః స్వాహా అని స్వాహా శబ్దాంతములుగా తర్పణము స్వధాశబ్దాంతములుగా కూడా వీనితోనే తిరిగి తర్పణ చేయాలి,అని కొందరన్నారు. ఆ పిదప ఆచమించి, అంజలితో ప్రణవంతో జలం తీసుకొని వ్యాహృతులతో తీసుకొని గాయత్రితో మూడుసార్లు వేసి గాయత్రిని జపించాలి. సూర్యుడు ఉదయించాక ప్రణవంతో, వ్యాహృతులతోకాని మూడుసార్లు అర్ఘ్యమిచ్చి మిత్రస్య చర్షణీ అను మొదలగు వానితో ముందు చెప్పిన సూర్యమంత్రములతో, ఇదం విష్ణుః, త్రిర్దేవో, బ్రహ్మ జజ్ఞానం, అని కూడా ఉపస్థానం చేసి, సర్వభూతములకు నమస్సులు,అని ప్రదక్షిణ మాచరిస్తారు. ఆ పిదప నమస్కరించి, ఆదిత్యాయ.... యాత్, అని మూడుసార్లు జపించాలి. ఈ రకంగా త్రికాలములు, విష్ణుపూజ బ్రహ్మయజ్ఞములు చేయాలి. ఇక భిక్ష - పొగలేకుండా ఐ, ముసల శబ్దం తగ్గి, నిప్పులేకుండా ఐ, జనులు భుజించాక, అపరాహ్ణకాలము బాగా అయ్యాక, యతి నిత్యము భిక్షనాచరించాలి, అని చెప్పిన కాలమందు, ఉద్వయమని నాల్గు మంత్రములతో ఆదిత్యోపస్థానం చేసి, ఆతనితో ఐక్యమైనట్టుగా ధ్యానించి, ఆకృష్ణేన, అని ప్రదక్షిణంచేసి, యేతే పంథాన, అని జపించి, ఏ విష్ణువు అను పేరుగల ఈ పురుషుడు, ఆదిత్యునందు, హృదయాంతరమందు ఉన్నాడో, ఆ నారాయణ దేవుణ్ణి నేనే అని ధ్యానించి ఆతనికి నమస్కరించి...

**మూ॥ త్రిదండం దక్షిణేత్వంగే తత స్సంధాయ బాహునా, పాత్రం వామకరే క్షిప్త్వా శ్లేషయే ద్దక్షిణేత్వితి. బౌధాయనోక్త దిశాత్రీన్పంచ సప్తవా గృహాన్గత్వా భవత్పూర్వం భిక్షాం యాచిత్వా పూర్ణమసి పూర్ణం మేభూయాః ఇత్యాగత్య శుచిరన్నం ప్రోక్ష్య ఓం భూః స్వధానమ ఇత్యాది వ్యస్త సమస్త వ్యాహృతిభిః సూర్యాది దేవేభ్యో భూతేభ్యశ్చ భూమౌక్షిప్త్వా భుక్త్వా ప్రణవేన షోడశ ప్రాణాయామాన్కుర్యాదితి సంక్షేపః. గౌతమ వ్యాఖ్యాయాం భృగుః - యతిహస్తే జలం దత్వా**

భైక్షం దద్యాత్పునర్జలం, భైక్షం పర్వత మాత్రం స్యాత్త జ్జలం సాగరోపమం. అత్రసర్వత్ర మూలం మాధవ, అపరార్క మదనరత్న స్మృత్యర్థసారాదౌ జ్ఞేయం. కణ్వః - ఏకరాత్రంవసేద్గ్రామే నగరే పంచరాత్రకం, వర్షాభ్యోఽన్యత్ర వర్షాసు మాసాంస్తు చతురోవసేత్. జాబాల శ్రుతౌ - శూన్యాగారదేవగృహ తృణకుటీవల్మీకవృక్షమూల కులాలశాలాగ్ని హోత్ర గృహ నదీపులిన గిరికుహర నిర్ఝర స్థండి లేష్వనికే తన ఇతి. మాత్స్యే - అష్టౌ మాసాన్విహార స్స్యాద్యతీనాం సంయతాత్మనాం, ఏకత్ర చతురోమా సాన్వార్షికాన్నివసే త్పునః. అవి ముక్త ప్రవిష్టానాం విహారస్తు నవిద్యతే. అత్రిః - భిక్షాటనం జపం స్నానం ధ్యానం శౌచం సురార్చనం, కర్త వ్యానిషదే తాని సర్వథా నృప దండవత్. మంచకం శుక్ల వస్త్రం చ స్త్రీ కథాం లౌల్యమేవచ, దివాస్వాపంచయానం చ యతీనాం పతనానిషట్. ఆసనం పాత్రలోభశ్చ సంచయశ్శిష్య సంగ్రహః, దివాస్వాపో వృథాజల్పోయతే ర్బంధ కరాణి షట్. దక్షః - నాధ్యేతవ్యం నవస్త(క్త) వ్యం నశ్రోతవ్యం కథంచన, యతిపాత్రాణి మృద్వేణు దార్వలాబుమయానిచ. మదనరత్నే అత్రిః - పిత్రర్థం కల్పితం పూర్వమన్నం దేవాది కారణాత్, వర్జయేత్తా దృశీం భిక్షాం పరబాధాకరీం తథా. బృహస్పతిః - నతీర్థ వాసి నిత్యం స్యాన్నోపవాస పరోయతిః, నచాధ్యయన శీల స్స్యాన్న వ్యాఖ్యాన పరోభవేత్. ఏతద్వేదార్థభిన్నపరం. అత్రిః - స్నానం సురార్చనం ధ్యానం ప్రాణాయామో బలిః స్తుతిః, భిక్షాటనం జపస్సంధ్యా త్యాగః కర్మఫలస్యచ. ఏతేయతి ధర్మా ఇత్యర్థః. అన్యేఽపి మాధవ మితాక్షరాదౌ జ్ఞేయాః. యతి ధర్మ సముచ్చయే - నస్నానమాచరేద్భిక్షుః పుత్రాదినిధనే శ్రుతే, పితృమాతృక్షయం శ్రుత్వా స్నాత్వా శుద్ధ్యతి సాంబరః.

అను॥ ఆ పిదప త్రిదండమును దక్షిణంవైపు అంగమందుంచి బాహువుతో పట్టుకొని, పాత్రను ఎడమచేతియందుంచి దక్షిణం (కరం) జోడించి, అని బోధాయనుడు చెప్పిన దిక్కుగా మూడు, ఐదు లేదా ఏడు గృహములకు వెళ్ళి భవత్పూర్వకముగా భిక్షను యాచించి, పూర్ణమసి పూర్ణం మేభూయా, అని (పఠిస్తూ) వచ్చి శుచియై అన్నమును ప్రోక్షించి ఓం భూః స్వధానమ అని ఆదిగా వ్యస్త సమస్త వ్యాహృతులతో సూర్యాది దేవులకు భూతములకు భూమియందుంచి, భుజించి ప్రణవంతో పదహారు ప్రాణాయామములను చేయాలి, అని సంక్షేపము. గౌతమ వ్యాఖ్య యందు భృగువిట్లా - యతి హస్తమందు జలమిచ్చి భైక్ష మివ్వాలి, తిరిగి జలమివ్వాలి భిక్ష పర్వతమాత్రము, నీరు సాగరం వలె ఉండాలి. ఇక్కడ అంతట మూల వచనాలను మాధవ, అపరార్క మదవ రత్న స్మృత్యర్థ సారాదులందు గ్రహించాలి. కణ్వుడిట్లా - గ్రామమందు ఒకరాత్రి, నగరమందు ఐదు రాత్రులు వర్షాకాలం తప్ప ఇతర కాలములందుండాలి. వర్షాకాలమందైతే నాలుగు మాసములు ఒకచోట ఉండాలి,అని. జాబాల శ్రుతియందిట్లా - ఎవ్వరు లేని ఇల్లు, దేవగృహం, తృణముల కుటీరము, పుట్ట (ఉన్న) వృక్షమూలము, కుమ్మరిశాల, అగ్నిహోత్ర గృహం, నదీపులిన ప్రదేశం, గిరికుహరం, ప్రవాహము ఉన్నచోటు, యజ్ఞస్థలం (స్థండిలం) ఈ ప్రదేశములందు స్థావరంగా ఉండరాదు,అని. మాత్స్యమందిట్లా - ఎనిమిది నెలలు, యతులకు, సంయతాత్మ లకు తిరుగుట ఉంటుంది. వర్షాకాలమందు మాత్రం ఒకచోట నాలుగు మాసములు ఉండాలి, అవి ముక్త ప్రదేశంకు వచ్చిన వారికైతే విహారం లేదు,అని.

అత్రి ఇట్లా – భిక్షాటన, జపము, స్నానము, ధ్యానము, శుచిత్వము, సురార్చనము. వీటిని ఆరింటిని ఎల్లప్పుడూ రాజాజ్ఞవలె ఆచరించాలి,అని. మంచము, తెల్లని వస్త్రము, స్త్రీల విషయాలు మాట్లాడటం, లౌల్యము, పగటినిద్ర, యానము (పల్లకి వంటివి) ఇవి యతులకు పతనాన్ని కూర్చేవి,ఆరు. ఆసనము (గజపీఠం వంటి ఆసన సౌఖ్యం) పాత్రలయందు లోభము, కూడ బెట్టటం, శిష్యుల కూర్చుకోవటం, పగటినిద్ర, అతిగా అనవసరంగా మాట్లాడటం ఈ ఆరు యతికి బంధనమునకు కారణములు దక్షుడిట్లా – యతి చదువరాదు, ఒకచోట ఉండరాదు (మాట్లాడరాదు) వినరాదు ఏవిధంగాను. యతిపాత్రలు, మట్టివి వెదురు కర్రవి, సొరకాయవి కావాలి,అని. మదనరత్నమందు అత్రి ఇట్లా – ముందు పితరులకై కల్పించిన అన్నము, దేవాది కారణమైన అన్నము, ఇతరులకు బాధకల్గించే అన్నము, అలాంటి భిక్షను విడువాలి,అని. బృహస్పతి ఇట్లా – నిత్యము తీర్థవాసి కారాదు. ఉపవాస పరుడు కారాదు, యతి. అధ్యయన శీలుడు కారాదు, వ్యాఖ్యాన పరుడు కారాదు,అని. ఇది వేదార్థముకన్న భిన్నమైనది చదువరాదు, అని. అత్రి ఇట్లా – స్నానము, దేవపూజ, ధ్యానము, ప్రాణా యామములు, బలి, స్తుతి. భిక్షాటనము, జపము, సంధ్య, కర్మ ఫలత్యాగము,అని. ఇవి యతి ధర్మములని అర్థము. ఇతరమైనవి కూడా మాధవ, మితాక్షరాదులందు చూచి గ్రహించాలి. యతి ధర్మసముచ్చయమందిట్లా – పుత్రాదులు మరణించారని తెలిస్తే యతి స్నానమాచరించరాదు. మాతపితరుల మరణాన్ని విని, సచేల స్నానం చేస్తే శుద్ధుడౌతాడు,అని.

మూ॥ అథయతి సంస్కారః – స్మృత్యర్థసారే – (సన్న్యసేద్బ్రహ్మ చర్యాద్వా సన్న్యసేచ్చ గృహాదపి, వనాద్వా ప్రవ్రజేద్విద్వా నాతురోవాథ దుఃఖితః) ఆతురాణాం చ సన్న్యాసే, నవిధిర్నైవ చక్రియా, ప్రేషమాత్రం చ సన్యాస ఆతురాణాం విధీయతే. ఉత్పన్నే సంకటే ఘోరే చౌర వ్యాఘ్రా దిగోచరే, భవభీతస్య సన్న్యాసమంగిరామనుర బ్రవీత్. యద్యాతురః స్యాన్మన సావాచావా సన్న్యసేద్ద్విజః, ఇతి, జాబాల శ్రుతిః. ఆతురాణాం చ సన్న్యాసే, నవిధిర్నైవచ క్రియా, ప్రేష మాత్రం సముచ్చార్య సన్న్యాసం తత్రకారయేత్. సన్న్యస్తోఽహమితి బ్రూయాత్ సవనేషు త్రిషు క్రమాత్, త్రివారంచ త్రిలోకాత్మా శుభాశుభ సుధాద్రవే. యత్కించి ద్బాధకం కర్మ కృతమజ్ఞానతో మయా, ప్రమాదాలస్య దోషాద్యత్తత్సం త్యక్తవానహం. ఏవం సంత్యజ్య భూతేభ్యో దద్యాదభయ దక్షిణాం. పద్భ్యాంకరాభ్యాం విహరన్నాహం వాక్కాయ మానసైః. కరిష్యే ప్రాణినాం హింసాం ప్రాణినః సంతునిర్భయాః. ఇత్యాతురస్య స్వశక్త్యాఽవస్థానురూప మంగళ భూత ప్రేషోచ్చారణాచె యథా శాస్త్రం మనసా వాచా వా కుర్వతస్తావ తైవ కృచ్ఛ్ర చాంద్రాయణ నాందీ శ్రాద్ధ నఖ కృంత నాదీని కృత్వా సంన్యాస పూర్తిరితి ప్రతీయతే. అంగిరాః – షష్టిః కులాన్యతీతాని షష్టీనామధికానిచ కులాన్యుద్ధరతే ప్రాజ్ఞః సన్న్యస్తమితియో వదేత్. విష్ణుః – ఏకరాత్రో షితస్యాపి యతే ర్యాగతి రుచ్యతే, నసాశక్యా గృహస్థేన, ఆతురోఽపిచ సన్న్యసేత్. సన్న్యస్తమితియో బ్రూయాత్ ప్రాణైః కంఠగతైరపి, నతత్క్రతు శతైః పుణ్యం ప్రాప్తుం శక్నోతి మానవః, మనుః – యోదత్వా సర్వభూతేభ్యః ప్రవ్రజత్య భయం గృహాత్, తస్యతేజో మయా లోకాభవంతి బ్రహ్మవాదినః. అథ శ్రౌతాతురస్య

**విలంభితస్య, ప్రేష మాత్రం సముచ్చార్య సన్యాసం తత్ర పూజయేత్, ఇతి. అత్రమాత్రత్వోప సంభవా దంగకలాపావ్యా పకత్వేనాప్యుపపత్తౌ కర్తు ర్యాగత్యాగ కలాప వ్యావృత్తస్యై కత్వానుపపత్తేః . కృచ్ఛ్ర నాందీ శ్రాద్ధ విరజాహోమాది కర్తుమశక్త స్యాతురస్య విద్యమానాగ్నే రిష్ట దేవతాయై పూర్ణాహుతిం హుత్వా అసౌ స్వర్గాయ లోకాయ స్వాహేతి ఆహవనీయే దారుమయాని పాత్రాణి ప్రజ్వాల్య మృణ్మయా న్యప్సు ప్రక్షిప్య సమాప్తిం చ, మరుత, ఇత్యుపస్థాయ, యాతేఅగ్నే ఇత్యనేనహస్తం ప్రతాప్యఆత్మన్యగ్నిం సమారోప్య సర్వప్రాయశ్చిత్త పూర్వకం సప్తపంచకేశాన్ విసృజ్య వాపయిత్వా యథావిధి స్నాత్వా ఆతురసన్యాసం కుర్యాత్.**

అను॥ ఇక యతి సంస్కారము. స్మృత్యర్థసార మందిట్లా - (బ్రహ్మ చర్యం నుండి సన్యసించవచ్చును. గృహస్థునుండి లేదా వానప్రస్థం నుండియైనా సన్యసించవచ్చును, ఆతురుడు లేదా దుఃఖితుడైన విద్వాంసుడు). ఆతురులకు, సన్యాసమందు విధి, క్రియ వగైరా ఏమి లేవు. ఆతురులకు సన్యాసమందు ప్రేష అని మాత్రమే విధించబడుతోంది. ఘోర సంకటము కల్గినప్పుడు, చోరులు వ్యాఘ్రములు మొదలగునవి గోచరమైనప్పుడు, భవభీతునకు సన్యాసమును అంగిరా, మనువు చెప్పారు. ఒకవేళ మనస్సు వల్ల కాని వాక్కులవల్లకాని ఆతురుడైతే ద్విజుడు సన్యసించాలి,అని జాబాలశ్రుతి. ఆతురులకు సన్యాస మందు విధానము, క్రియా కర్మ ఏమీలేవు. ప్రేష అని మాత్రము ఉచ్చరించి అక్కడ సన్యసించాలి,అని. మూడు సవనములందు క్రమంగా, నేను సన్యసించాను, అని చెప్పాలి. ఇట్లా మూడు మార్లు చెప్పాలి. ఓ త్రిలోకాత్మ! శుభాశుభములను నీటితో వలె కరిగించువాడా నేను సన్యసించాననాలి. బాధ కలిగించే పనిని ఏదైనా తెలియక నేను చేసిఉంటే, వానిని ప్రమాద ఆలస్య దోషముల వల్ల కల్గినదేదైనా ఉంటే దానినంతా నేను విడిచిపెట్టాను. అని విడిచిపెట్టి భూతములకు అభయ దక్షిణను ఇవ్వాలి. (దాక్షిణ్యం). విహరిస్తూ నేను, చేతులతో పాదములతో వాక్కు, శరీరము, మనస్సు వీనితో ప్రాణి హింసను చేయను. ప్రాణులు నిర్భయంగా ఉండవచ్చును. అని ఆతురునకు తన శక్తికొలది అవస్థకు తగిన, మంగళకర మైనవి భూత ప్రేష ఉచ్చారణాదులు యధాశాస్త్రముగా మనస్సుతోకాని వాక్కుతో కాని ఆచరిస్తూ అంతటితోనే కృచ్ఛ్రచాంద్రాయణ, నాందీశ్రాద్ధ, నఖ కృంత నాదులు చేసి సన్యాసపూర్తి అని తెలుస్తోంది. అంగిరుడిట్లా- ప్రాజ్ఞుడు, సన్యసించాను అని అన్నవాడు గడచిన ఆరు (తరముల) కులములను, అధికమైన (రాబోయే) ఆరు (తరముల) కులములను ఉద్ధరిస్తాడు,అని. విష్ణువిట్లా - ఒకరాత్రి యతిగా ఉన్నా ఆతనికి ఏగతి చెప్పబడిందో, ఆతురుడై సన్యసించినా అట్టి గతి గృహస్థునకు శక్యమైనది కాదు,అని. సన్యసించాను అని ఎవడంటాడో వాడు, ప్రాణములు కంఠగతమై ఉన్నా, నూరు క్రతువులతోనైనా, నరుడు అట్టి పుణ్యమును పొంద సమర్థుడు కాడు. మనువిట్లా - ఎవడు భూతములకన్నిటికి అభయమిచ్చి గృహం నుండి సన్యసిస్తాడో, వానికి తేజోమయ లోకములు లభిస్తాయి అని బ్రహ్మవాదులన్నారు. ఇక్కడ శ్రౌత ఆతురునకు, త్యాగం కలవానికి, ప్రేషం అని మాత్రము ఉచ్చరించి అక్కడ సన్యాసమును పూజించాలి, అని. ఇక్కడ ప్రేత మాత్రత్వం అని

ఉన్నందువల్ల అంగకలాపము వ్యాప్తి లేకపోయినా (సన్న్యాసం) సంభవించినా, కర్తయొక్క యాగత్యాగ కలాప వ్యావృత్తునకు ఒక్కటి (ఏకత్వం) కుదరనందువల్ల కృచ్ఛ్ర, నాందీశ్రాద్ధ, విరజా హోమాదులు చేయటానికి అశక్తుడైన ఆతురునకు ఉన్న అగ్నియొక్క ఇష్టదేవత కొరకు పూర్ణాహుతి హోమం చేసి, అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా అని ఆహవనీయమందు దారుమయ పాత్రలను జ్వలింప చేసి, మట్టి వానిని నీళ్ళలోవేసి, సమాప్తిని మరుత అని ఉపస్థానం చేసి, యాతే అగ్నే అను మంత్రంతో హస్తమును వేడిచేసుకొని తన యందు అగ్నిని (ఆత్మ సమారోపం) సమారోపం చేసుకొని సర్వప్రాయశ్చిత పూర్వకముగా ఏదు ఐదు వెంట్రుకలను వదలి క్షౌరం చేయించుకొని యధావిధిగా స్నానం చేసి, ఆతుర సన్న్యాసము చేయాలి.

మూ॥ అథ ఆతుర సన్న్యాస విధిః. అపాం సమీపే గత్వా, తిధ్యాః స్మరణ పూర్వకం స్నాన సంధ్యావందనాది కృత్వా దేశకాలౌ సంకీర్త్య మమాశేష దుఃఖ నివృత్తి నిరతిశయా నంద ప్రాప్తి పరమపురుషార్థ ప్రాప్తయే చ పరమహంస సన్న్యాసం కరోమీతి సంకల్పయేత్. తత్ర ప్రధానాని. ప్రేషోచ్చారణ ప్రణవోపదేశ మహావాక్యాని. తతః సన్న్యాసోచితం క్షౌరం కృత్వా పూర్వవత్సప్త పంచకేశాన్ విసృజ్య స్నాత్వాఽ చమ్య పాత్రేణ తోయమాదాయ ఉపస్పృశ్య దక్షిణేన పాణినాఽ ప్సుజుహోతి. ఏషవోఽ గ్నే ర్యోనిర్యః ప్రాణం గచ్ఛస్వాహా ఇతి ప్రథమాహుతిః. ఆపోవై సర్వా దేవతాః సర్వాభ్య ఏవైనం దేవతాభ్యో జుహోమి స్వాహా, ఇతి ద్వితీయా. తతోహుత శేషం ఆచుః శిశాన ఇత్యనువాకేనాభి మంత్ర్య పుత్రేషణా విత్తేషణా లోకేషణా మయాత్యక్తా స్వాహేతి ప్రథమాంపి బేత్. ఓం భూర్భువః స్వరోం మయా సన్న్యస్తం స్వాహేతి ద్వితీయాంపిబేత్. అభయం సర్వభూతేభ్యో మత్తః స్వాహేతి తృతీయాం, పిబేత్. తతోఽ న్యత్తోయమంజలి పూర్ణ మాదాయ ప్రాగాది దిక్షు ప్రత్యేకం నినయేత్. ఓం భూః సావిత్రీం ప్రవేశయామి, ఓం భువః సావిత్రీం ప్రవేశ యామి, ఓం స్వః సావిత్రీం ప్రవేశయామి, ఓం భూర్భువస్వః సావిత్రీం ప్రవేశయామి ఇతి సావిత్రీ ప్రవేశం కృత్వా అధోఽ ర్ధ్వ బాహుః సూర్యాభిముఖో భూత్వా ఓం భూః సన్న్యస్తం మయా, ఓం భువః సన్న్యస్తం మయా, ఓం స్వః సన్న్యస్తం మయా, ఓం భూర్భువః స్వః సన్న్యస్తం మయేతి ప్రేషోచ్చారం బ్రూయాత్. ఏవం మంద్ర మధ్యోచ్చైః త్రిరుక్త్వా తూష్ణీం శిఖాం నికృత్య స్నాత్వా చమ్య యజ్ఞోపవీత ముద్ధృత్యాంజలి నాగృహీత్వా భూః స్వాహేతి అప్సుహుత్వా దిగంబరో భూత్వా పుత్రేషణా విత్తేషణా లోకేషణాతో ముక్తోఽ హమితి బ్రూయాత్. అత ఊర్ధ్వం న పుత్ర గృహం గచ్ఛేత్. మృతే చ పురుష సూక్తేన విష్ణు బుద్ధ్యాభిషించతి సంస్కారమేవ కుర్యాత్. ఏవం విరక్తస్యాతు రస్యస్వస్థస్య సన్న్యాస విహితాంగేషు, యన్మంత్రానుష్ఠానే శక్తిర్యధా విధి తదనుష్ఠాన పూర్వకం ప్రధానం ప్రేషోచ్చారణ మాత్రం మత్వా సన్న్యాస యుక్తిరితి శ్రవణాత్. తదుత్తర కాలమేవ మృతస్యోపదేశ వికలస్యాపి ఖనన సంస్కారమేవ కుర్యాత్. జీవతశ్చేచ్ఛిఖాం యజ్ఞోపవీతం చ నిత్య క్రియా విధివత్ విసృజ్య దండకాషాయ వస్త్రాదీని చాదాయ యతి ధర్మానేవాను తిష్ఠేత్. సద్గురు మన్విష్య తదుపదేశం గృహీత్వా స్వధర్మ నిష్ఠోభవేత్. అయమర్థో విద్వత్సం మతః ప్రయోక్తవ్యః ఇత్యాతురసన్న్యాసః.

అను॥ ఇక ఆతుర సన్న్యాసవిధి. నీటిదరికి వెళ్ళి, తిథిని స్మరించి స్నాన సంధ్యావంద నాదులు చేసి దేశకాలములు కీర్తించి, నా దుఃఖములన్నీ పోయి, నిరతిశయ ఆనందప్రాప్తి, పరమ పురుషార్థ ప్రాప్తి కొరకు పరమహంస సన్న్యాసము స్వీకరిస్తున్నాను అని సంకల్పం చేయాలి. అక్కడ ప్రధానమైనవి, ప్రేష అని పలకటం, ప్రణవమంత్ర ఉపదేశం, మహా వాక్యములు ఆ పిదప సన్న్యాసమునకు తగిన క్షౌరం చేసుకొని, ముందులాగ ఏడు ఐదు కేశములను వదిలిపెట్టి స్నానం చేసి ఆచమనం చేసి పాత్రతో నీళ్ళుతీసుకొని, తాకి, కుడి చేతితోనే నీటియందు హోమం చేయాలి. ఏషవోగ్నేర్యోనిః...... స్వాహా అని ప్రథమాహుతి. ఆపోవైసర్వా...... జుహోమి స్వాహా, అని ద్వితీయాహుతి, ఆ పిదప హుత శేషమును, ఆశుః శిశాన, అను అనువాకంతో అభిమంత్రించి, పుత్రేషణ, విత్తేషణ, లోకేషణ వీటిని నేను వదిలాను స్వాహా, అని మొదటిసారి తాగాలి. ఓ భూర్భువః స్వరోం మయా సన్న్యస్తం స్వాహా అని రెండవసారి తాగాలి. నా నుండి సర్వభూతములకు అభయము స్వాహా అని మూడవసారి తాగాలి. ఆ పిదప మరో జలాన్ని అంజలి నిండా తీసుకొని, తూర్పు మొదలగు దిక్కులందు ప్రత్యేకంగా వదలాలి. ఓం భూః సావిత్రీం ప్రవేశయామి, ఓం భువః సావిత్రీం.... ఓం స్వః సావిత్రీం... ఓం భూర్భువస్వః సావిత్రీం ప్రవేశయామి, అని సావిత్రీ ప్రవేశం చేసి, ఇక చేతులు పైకెత్తి సూర్యునకభి ముఖుడై ఓం భూః నేను సన్న్యసించాను, ఓం భువః...., ఓం స్వః... ఓం భూర్భువః స్వః నేను సన్న్యసించాను అని ప్రేష శబ్దాన్ని చెప్పాలి. ఇట్లా మంద్ర మధ్య, ఉచ్చ స్థాయిలలో మూడు సార్లు చెప్పి మౌనంగా శిఖ తీసివేసి, స్నానంచేసి, ఆచమనం చేసి, యజ్ఞోపవీతం తీసేసి, అంజలియందు తీసుకొని భూఃస్వాహా అని నీటియందు (వదిలి) హోమంచేసి, దిగంబరుడై, పుత్ర, విత్త, లోక ఈషణత్రయం నుండి నేను ముక్తుణ్ణయ్యాను, అని పలకాలి. ఆపైన పుత్రుని ఇంటికి పోగూడదు. మరణిస్తే పురుష సూక్తంతో విష్ణువను బుద్ధితో అభిషేచనం సంస్కారమే చేయాలి. ఈరకంగా విరక్తునకు ఆతురునకు, స్వస్థునకు, సన్యాసమునకు విధించిన అంగములలో ఏ మంత్రానుష్ఠాన మందు శక్తి ఉందో, శాస్త్ర ప్రకారం దానిని అనుష్ఠిస్తూ దాని పూర్వకముగా ప్రధానమైనది ప్రేష శబ్ద ఉచ్చారణ మాత్రము అని భావించి సన్న్యాసయోగము, అని విన్నాము. ఆ వెంటనే, చనిపోయిన వానికి, ఉపదేశం లేకపోయినా ఖనన సంస్కారమే చేయాలి. బ్రతికి ఉంటే, శిఖ యజ్ఞోపవీతమునిత్యక్రియ విధివలె వదిలి దండ, కాషాయ వస్త్రాదులు తీసుకొని యతి ధర్మములనే అనుష్ఠించాలి, సద్గురువును వెతికి, ఆతని ఉపదేశాన్ని తీసుకొని స్వధర్మ నిష్ఠుడు కావాలి. ఈ విషయము విద్వాంసులకు సమ్మతమైనది. ప్రయోగించతగినది. అని ఆతుర సన్న్యాసము, అని.

**మూ॥ స్మృత్యర్థసారే - సర్వసంగ నివృత్తస్య ధ్యాన యోగరతస్య చ, నతస్య దహనం కార్య మాశౌచం నోదకక్రియా. తథా - కుటీచ కంతు ప్రదహేత్, పూరయేత్తు బహూదకం, హంసో జలేతు నిక్షేప్యః, పరహంసం ప్రపూరయేత్. పాలాశమూలేనదీ తీరేన్యత్రవా గంధపుష్పాలం కృత శవం వాద్య ఘోషేణ నీత్వా దండమాత్రం వ్యాహృతిభిః ఖాత్వాసప్తవ్యా హృతిభిఃత్రిః ప్రోక్ష్య**

దర్భానాస్తీర్య నవఘటే పంచరత్నోదకం క్షిప్త్వా నారాయణః పరంబ్రహ్మే త్యభిమంత్ర్య తేనైవ సంస్నాప్య అష్టాక్షరేణ వస్త్ర గంధపుష్ప ధూపదీపాదీన్దత్వా, విష్ణోహవ్యం రక్షస్వేతి శవం గర్తే నిధాయ ఇదం విష్ణురితి దక్షిణహస్తే దండం, యదస్య పారే ఇతి సవ్యేశిక్యం, యేనదేవాః పవిత్రేణేతి ముఖే జలపవిత్రం సావిత్ర్యోదరే భిక్షాపాత్రం భూమిశ్శ్వభ్రేతి, గుహ్యే కమండలుం నిధాయ చిత్తి స్రుగితి దశహోత్రాభిః మంత్రయేదితి విశ్వాదర్శటీకాయాం, స్మృత్యర్థసారేచ. బృహచ్ఛౌన కస్తు - యతిం పురుష సూక్తేన స్నాపయిత్వా ఘటంతతః, ప్రణవే నాష్ట వారంతం ప్రోక్షయే దధ సర్వతః, విష్ణోహవ్యం రక్షస్వేతి యజుషా ప్రణవేన చ, గర్తే ప్రేతం వినిక్షిప్య చేదం విష్ణుర్విచక్రమే ఇతి మంత్రేణ దండంతు దద్యాద్దక్షిణ హస్తకే. మూర్ధానం భూర్భువస్స్వశ్చేత్యుక్త్వా శంఖేన భేదయేత్. గర్తం పురుష సూక్తేన లవణేన ప్రపూరయేత్, సృగాలశ్వాది రక్షార్థం సమ్యగ్గర్తం ప్రపూరయేత్, ఇతి. కుటీచకస్యతు దాహః కార్యః యథా సర్వం ప్రాగ్వత్కృత్వాగ్నిం ప్రజ్వాల్య సాగ్నేర్దక్షిణకరే ఉపావరోహే త్యవ రోహ్యానిర్మథ్యవా గర్తేచితిం కృత్వాగ్నినాగ్ని స్సమిధ్యత ఇత్యగ్నిం దత్వా సావిత్ర్యా ప్రణవేనవా దహేత్. తతోఽష్టశతం ప్రణవం నారాయణః పరంబ్రహ్మేతి జప్త్వా సశిరః ప్రణవ వ్యాహృత్యా గాయత్ర్యా తధ్భస్మాస్థీనితీర్థే క్షిప్త్వా స్నానాచ్ఛుచిః నాస్యాన్య దౌర్ధ్వ దేహికం. త్రిదండ గ్రహణాదేవ ప్రేతత్వం నైవజాయతే, ఇతి ఉశనః స్మృతేః. ఏకాదశేఽహ్ని పార్వణం తదపి త్రిదండినః. హసం పరమ హంసాదీనాం పార్వణాది కిమపిన కార్యమితి శూలపాణిః. శ్రాద్ధ చింతామణౌ దత్తాత్రేయః - ఏకోద్దిష్టం జలం పిండమాశౌచం ప్రేత సత్క్రియాం, నకుర్యాద్వార్షికా దన్యద్బ్రహ్మీ భూతాయ భిక్షవే ప్రేతక్రియయా ఏకోద్దిష్ట నిషేధే సిద్ధే పునస్త ద్గ్రహణ మాబ్దిక పరం. తేన తత్పార్వణ మేవ. త్రిదండి నాం ద్వాదశే నారాయణబలిః తద్విధి రన్యశ్చ విశేషః ప్రాగుక్త ఇత్యలం బహునా.

అను॥ స్మృత్యర్ధసారమందిట్లా - అన్ని సహవాసముల నుండి నివృత్తుడైన వానికి, యోగధ్యానరతునకు, ఆతనికి దహనం చేయరాదు, ఆశౌచం లేదు. ఉదక క్రియలేదు,అని. అట్లాగే - కుటీచకుని దహనం చేయాలి. బహూదకుని నింపాలి. హంసుని జలంలో వేయాలి. పరమ హంసను బాగా నింపాలి,అని. మోదుగు చెట్టు మూలమందు, నదీ తీరమందు, మరోచోటనో, గంధ పుష్పములతో అలంకరించిన శవాన్ని, వాద్య ఘోషములతో తీసుకుపోయి, దండమును మాత్రము వ్యాహృతులతో పాతిపెట్టి, ఏడు వ్యాహృతులతో మూడుమార్లు ప్రోక్షణ చేసి, దర్భలను పరచి, కొత్తకుండయందు పంచరత్నములు, నీరు పోసి నారాయణః పరంబ్రహ్మ అని అభిమంత్రించి, ఆ నీటితోనే స్నానం చేయించి, అష్టాక్షరితో వస్త్ర గంధపుష్ప ధూప దీపాదులను ఇచ్చి, విష్ణోహవ్యం రక్షస్వ అని శవమును గర్తమందుంచి ఇదం విష్ణుః అని కుడిచేతియందు దండమును, యదస్యపారే అని ఎడమచేతియందు కావడిని, యేనదేవాః పవిత్రేణ అని ముఖమందు జలపవిత్రము, సావిత్రి మంత్రంతో ఉదరమందు పాత్ర, భూమి శ్శ్వభ్రా అను మంత్రంతో గుహ్యమందు కమండులువును ఉంచి, చిత్తిస్స్రుగను పది స్తోత్ర మంత్రములతో అభిమంత్రించాలి,అని విశ్వాదర్శ టీకయందు, స్మృత్యర్ధ సారమందును చెప్పారు. బృహచ్ఛౌనకుడైతే - యతిని పురుష సూక్తంతో స్నానం చేయించి, ఆ పిదప ఘటమును పూజించి. (తాడు లేదా దండం) ప్రణవంతో ఎనిమిది

మార్లు ఆతనిని ప్రోక్షించాలి, ఆ పిదప అంతట ప్రోక్షించాలి. విష్ణోహవ్యం రక్షస్వ అని యజుర్ మంత్రముతో ప్రణవంతోను గోయియందు ప్రేత నుంచి, ఇదం విష్ణుర్విచక్రమె అని మంత్రంతో కుడిచేతికి దండ మివ్వాలి. మూర్ధమును భూర్భువస్స్వః అని పలికి శంఖంతో భేదించాలి. గర్తమును పురుష సూక్తంతో, లవణంతోను నింపాలి. నక్కలు, కుక్కలు మొదలగువాని నుండి రక్షణ కొరకు గోతిని సరిగ్గా పూరించాలి, అని. కుటీచకునకు దాహము చేయాలి. పైన చెప్పినట్లు ఉన్నదున్నట్లుగా సర్వమాచరించి, అగ్నిని ప్రజ్వలింపజేసి సాగ్నికునకు కుడిచేతి యందు ఉపావరోహ అను దానితో దిగికాని, మంథనం ద్వారా కాని గర్తమందు చితినిచేసి, అగ్ని నాగ్ని స్సమిధ్యతే, అనే మంత్రంతో అగ్నిని చేర్చి సావిత్రితో గాని ప్రణవంతోగాని దాహం చేయాలి. ఆ పిదప నూట ఎనిమిది మార్లు ప్రణవమును నారాయణః పరంబ్రహ్మ, అని జపించి, ప్రణవ వ్యాహృతితో, గాయత్రితో ఆతని భస్మ అస్థులను శిరస్సు యందుంచుకొని తీర్థమందు పారవేసి స్నానం చేస్తే శుచిఔతాడు. ఈతనికి మరొక రకమైన ఔర్ధ్వదైహిక క్రియా కర్మలేదు. త్రిదండ గ్రహణం వల్లనే ప్రేతత్వం కలగదని ఉశనుని స్మృతి. పదకొండవ రోజున పార్వణము, అదికూడా త్రిదండికే, హంస పరమ హంసలకైతే పార్వణాదులు ఏదీ చేయరాదు అని శూలపాణి అన్నాడు. శ్రాద్ధ చింతామణి యందు దత్తాత్రేయుడిట్లా - ఏకోద్దిష్టము, జలము, పిండము, ఆశౌచము, ప్రేతసత్క్రియ ఇవన్నీ చేయరాదు. బ్రాహ్మీ భూతుడైన భిక్షువునకు, వార్షికం తప్ప మరొకటి చేయరాదు,అని. ప్రేత క్రియవల్ల ఏకోద్దిష్ట నిషేధము సిద్ధించినా తిరిగి దానిని గ్రహించటం వల్ల ఆబ్దికము అని దాని అర్థంగా గ్రహించాలి. అందువల్ల అది పార్వణము. ఈ రకంగా త్రిదండులకు పన్నెండవనాడు నారాయణబలి. దానివిధి, ఇతర విశేషములు ముందు చెప్పాము. అని ఇక అధికంగా చెప్పటంచాలు.

**మూ॥ ఏవం నిరూపిత మిదం గహనంతు ధర్మతత్వం విచార్య వచనైశ్చ నయైశ్చ సమ్యక్, తద్దోష దృష్టి మపహాయ వివేచనీయం విద్వద్భిరిత్య విరతం ప్రణతోఽస్మితేషు. మయాసద్వాఽసద్వాయదిహ గదితం మందమతినా కిమేతచ్చక్యం వాఽధ్యవసితు మపి స్వల్పమతినా. తదేవం యత్కించి ద్గదిత మిహ విఖ్యాత మహిమా, ప్రతాపోయం సర్వో వికసతితు పిత్రోశ్చరణయోః. యోభాట్ట తంత్ర గహనార్ణవ కర్ణధారః శాస్త్రాంతరేషునిఖిలేష్వపి మర్మభేత్తా, యోఽత్రశ్రమః కిలకృతః కమలాకరేణ ప్రీతో మునాస్తు సుకృతీ బుధరామకృష్ణః. శ్రీభట్ట రామేశ్వర సూరి సూను శ్రీభట్ట నారాయణ సూరి సూనోః, శ్రీరామకృష్ణస్య సుతః కృతీయం వ్యధాన్నిబంధం కమలాకరాఖ్యఃనానా నిర్ణయ వత్త్వా న్నిర్ణయ సింధుః ప్రోచ్యతాం విబుధాః. నిర్ణయ సరోజవత్త్వా న్నిర్ణయ కమలాకరోఽప్యస్తు. వసు ఋతు ఋతు భూమితే గతేఽబ్దే నరపతి విక్రమతోఽథయాతి రౌద్రే తపసి శివ తిథౌ సమాపితోఽయం రఘుపతి పాదసరో రుహేఽర్పి తశ్చ. జగతి సకలవిద్యాం సింధుముష్టిం ధయానాం పరభణితి పరీక్షా యుజ్యతే సజ్జనానాం, తదిహ మమనిబంధే దూషణం భూషణం వాయది భవతి విదగ్ధైః తద్ధ్యవశ్యం విమృశ్యం.**

**ఇతి శ్రీమత్పదవాక్య ప్రమాణ పారావార పారీణ శ్రీమద్రామేశ్వర భట్టసూరిసూను మీమాంసక నారాయణ భట్టసుత విద్వన్మకుట హీరాంకుర శ్రీ రామకృష్ణ భట్టాత్మజ దినకర భట్టానుజ కమలాకర భట్టకృతే నిర్ణయసింధౌ తృతీయః పరిచ్ఛేదః సమాప్తః.**

అను॥ గహనమైన ధర్మతత్వాన్ని, ఆయా ధర్మవేత్తల వచనములతో మేలైన (యుక్తి) నీతి మాటలతో చక్కగా విచారించి, దీనినిట్లా నిరూపించాను. అందువల్ల విద్వాంసులు దోష దృష్టిని విడిచి దీని వివేచన చేయాలి అని చెప్తూ వారికి ఎడతెగకుండా నమస్కారాలు చేస్తున్నాను. మందమతినైన నేను మంచో, చెడో ఏదో ఒకటి ఇక్కడ చెప్పాను. స్వల్పమతి గల నేను దీనిని చదవటానికి కూడా శక్తుణ్ణా (ప్రయత్నానికి కూడా) కాదు. కాని ఇక్కడ నేను ఇట్లా ఏదో కొంచెం చెప్పినదంతా, ప్రసిద్ధి చెందిన మహిమ గల మా తండ్రిగారి ప్రతాప మిదంతా ఇట్లా వికసించింది. భాట్టతంత్రమనే గహనమైన సముద్రానికి కర్ణ ధారులు, ఇతరములైన అన్ని శాస్త్రములందును కిటుకులను భేదించినవారు సుకృతియైన రామకృష్ణ పండితులు, ఇక్కడ కమలాకరుడు చేసిన శ్రమతో దీనితో (వారు) సంతోషపడని. శ్రీభట్ట రామేశ్వరసూరి కుమారులైనవారు శ్రీభట్టనారాయణులు, వారి కుమారులు శ్రీరామకృష్ణులు వారి సుతుడు, కమలాకరుడను పేరుగలవాడు ధన్యాత్ముడు ఈ నిబంధమును రచించాడు. అనేక రకాల నిర్ణయములున్నందువల్ల నిర్ణయసింధువు అని దీనిని పిలవండి. ఓ బుధు లార! నిర్ణయములనే తామరపూలు కలిగి ఉన్నందువల్ల నిర్ణయకమలాకరము అని కూడా అనొచ్చును. పదహారు వందల అరవై ఎనిమిది మితమైన (వసు, ఋతు, ఋతు, భూ.) ఈ సంవత్సరాలు గడిచాక (విక్రమ శకము నుండి), రౌద్రం సంవత్సరం గడుస్తుండగా మాఘమాసం కృష్ణపక్షం చతుర్దశినాడు ఈ గ్రంథ రచన పూర్తియై శ్రీరాముని పాద సరోరుహములందు అర్పించబడింది. జగత్తులో సమస్త విద్యలను సింధువును పిడికిట్లో ఆస్వాదించే (బంధించే) వారికి సజ్జనులకు ఇతరుల మాటలను పరీక్షించటం తగినదే. అందువల్ల నానిబంధమందు దూషణకాని భూషణకాని ఒకవేళ ఉంటే విదగ్ధులు దాన్ని తప్పకుండా విమర్శించండి.

అని శ్రీమత్ పదవాక్య ప్రమాణ పారావారపారీణులైన వారు శ్రీమద్రామే శ్వరభట్టసూరులు వారి సూనులు మీమాంసకులు నారాయణభట్టులు, వారిసు తులైన వారు విద్వాంసుల శిరస్సులందు వజ్రపు మొలకయైనవారు శ్రీరామకృష్ణభట్టులు వారి కుమారులు, దినకరభట్టు అనుజులైన కమలాకరభట్టుల కృతి అగు నిర్ణయసింధువు యందు తృతీయ పరిచ్ఛేదము సమాప్తము

శ్రీ సీతారామార్పణమస్తు.

తేది : 15 - 1 -2001న

కిడాంబి నరసింహాచార్యులచే తెనుగు అనువాదం సమాప్తి చేయబడింది.

# అనుబంధము

1. గౌతమీతంత్రమందు – పలం దుగ్ధం, పలం గోమూత్రం, పలం నేయి, గోమయం 2 తులాలు (12 మాసాలు 1 తులం), పెరుగు 2 పలములు ఇది పంచగవ్యము లేదా ఈ ఐదు సమానంగా (5 × 2 = 10). స్త్రీలకు శూద్రులకు పతితులకు పంచగవ్యమివ్వరాదు. ఇచ్చినా మంత్రం లేకుండా ఇవ్వాలి. మూత్ర మందు వరుణుడు, గోమయ మందు అగ్ని, పాలలో చంద్రుడు, పెరుగులో వాయువు, నేయిలో సూర్యుడున్నారు. పంచగవ్యాశనాద్విప్ర చాంద్రాయణ ఫలం లభేత్. పర్ణేషు యోనరో భుంక్తే కురుక్షేత్ర ఫలం లభేత్. శిలాయాం భోజనాన్నిత్యం ప్రాయాగజ ఫలం లభేత్. కపిల లేదా వృద్ధ గోవు పంచగవ్యం ప్రశస్తము.

2. రజస్వల నాలుగు రకాలు 1. ఋతుకాలంలో పుష్పించినట్టిది 2. తిన్న ఆహారం వల్ల రజస్వల ఐతే ద్రవ్యజ 3. రోగజం 4. రాగజం ప్రసూతికన్న ముందు స్త్రీలలో భేదవృద్ధి వల్ల ఉత్పన్నమైనది.

3. ఛందోగ పరిశిష్టమందు – కుష్టం (చెంగల్వ కోష్ఠు) మాంసి (జటామాంసి) రెండు రకాల పసుపు, మురి (సుగంధ ద్రవ్యం) శైలేయం (గుగ్గిలం) చందనం, వస, చంపకం, ముస్త (తుంగ ముస్తలు) ఈ పదింటిని కలిపి సర్వౌషధులంటారు.

4. శాంతి నక్షత్రాలు – మూల, జ్యేష్ఠ ఆశ్లేష, అశ్వినులు ఏకనక్షత్ర జననం పదకొండవ రోజు శాంతి. నామకరణం కన్న ముందే శాంతి. అదే రోజు నామకరణం కూడా. దత్త పుత్రుడు ఇలాంటివాడు – దగ్గరి బంధువు, జాతి కులగుణములతో సదృశుడు, తల్లిదండ్రులచే ప్రీతితో ఇవ్వబడ్డవాడు కావాలి. దత్తుహోమం చేసుకొని తీసుకోవాలి. సపిండ, సగోత్రుడు, జాతకర్మాదులతో సంస్కరింపబడ్డవాడు పుత్రుడౌతాడు. సగోత్ర సపిండుడు లేకపోతే అసగోత్ర సపిండుని తీసుకోవాలి. (మాతా మహకులీనుడు) సాపిండ్యం ఏకపిడాన్వయిత్వం, ఏక శరీరాన్వయిత్వం అని రెండు రకాలు. జ్యేష్ఠుని దత్తు ఇవ్వరాదు. దాతకే దోషమది. ఒక్క కొడుకు ఉన్నవాడు దత్తు ఇవ్వరాదు. దత్తునకు గయాశ్రద్ధాధికారం ఉంది, తన పెంపుడు తండ్రికే. కన్న తండ్రికి కాదు.

5. శిఖ ఉంచటం ఇట్లా – వసిష్ఠ గోత్రులకు దక్షిణ దిక్కున శిఖ, అత్రి కశ్యపులకు రెండు పక్కల శిఖ, భృగువులకు ముండనము, అంగిరసులు ఐదు శిఖలవారు, వాజసనేయు లకు ఒకటే శిఖ. ఇతరులకు మంగలము కొరకు శిఖ ఉండాలి. తమ కులాచారాన్ననుసరించి వారి ఋషుల ననుసరించి శిఖ ఉండాలి. (చూడాకరణం). శిఖలేనివాడు, ఉపవీతం లేనివాడు చేసే కర్మ కర్మకాదు. శిఖను ముడివేయాలి. ఆచార నియమస్య అదృష్టార్థత్వాత్ నతావన్మాత్ర మేవ ప్రయోజనం.

యశసే, శ్రియై, శిఖా (శు.య. (9-91) ఛందోగులకు సర్వవపనము. కులదేవతకు మొక్కు ఉంటే చూడాకర్మ కన్న ముందే వెంట్రుకల మొక్కు తీర్చాలి.

6. చౌలకర్మ గూర్చి (చూడాకర్మ) - చౌలంలో గణపతి పూజ, పుణ్యాహవాచనం, మాతృపూజ, ఆభ్యుదయికం, గ్రహయజ్ఞము. చౌలంకన్న మూడు రోజుల ముందు అభ్యుదయిక శ్రాద్ధము. చౌలం ఒకరోజు ముందు ఆరోజే పై పూజలు. సోదరులకు ఒకేరోజు చౌలం తగదు. అసోదరులకు ఒకేసారి చౌలం చేస్తే మాతృపూజ, నాంది శ్రాద్ధాదులు ఒకటే సారి చేయాలి. చౌలకర్మ ప్రథమ, తృతీయ, పంచమ, సప్తమ లేదా అసమవర్ష మందు. ఉపనయనంతో పాటు చౌలం అన్నారు. చూడాకర్మ తరువాత మూడు నెలల వరకు పిండదానం, తిలతర్పణాదులు చేయరాదు. చూడాకర్మ తండ్రి చేయాలి. లేనిచో ఇతరులు. తండ్రి లేకపోతే పిల్లవాడి తండ్రిని మొదలుకొని శ్రాద్ధాదులు చేయాలి. తన తండ్రిని మొదలుకొని కాదు. తండ్రి మొదలగు వారు బ్రతికి ఉంటే పితామహాదులను మొదలుకొని శ్రాద్ధం చేయాలి. విధవ నాంది శ్రాద్ధం చేస్తే పత్యాదులు శ్వశ్ర్వాదులు పిత్రాదులు దేవతలు. అపుత్రా పుత్రవత్ పత్నీ భర్తుః శ్రాద్ధం సమాచరేత్. అని వచనము. చౌలము శిఖాధారణ సంస్కారము. గర్భకేశములు, ధరించరాదు, అనే జనులమాట నిర్మూలమైనది. (ఆధారం లేనిమాట, శాస్త్రంలేదు). స్త్రీకి చౌలకర్మ మంత్రం లేకుండా మౌనంగా చేయాలి. హోమకర్మ మాత్రం పురుషునకు లాగా స్త్రీకి చూడాకర్మ యందు సమంత్రకము. ప్రధానమైన పని మాత్రం అమంత్రకం. మిగిలినదంతా అంగకర్మ సమంత్రకమే. (గణపతిపూజాది) నాంది శ్రాద్ధాంతం. స్త్రీలకు శిఖాధారణలేదు. శిఖ, యజ్ఞోపవీతం, కుశ, మౌనము, వేదాధ్యయనము, భైక్ష్యము ఇవి స్త్రీ శూద్రులకు పతన కారణాలు ఆరు అన్నారు. శూద్రునకు గూడా ఇట్లాగే మంత్రం లేకుండా సంస్కారం చేయాలి. దీన్నిబట్టి శూద్రునకు కూడా చూడాకరణం ఉంది. జ్వరం వస్తే చూడాకరణంవద్దు. గర్భాది అసంస్కృతునకు కూడా ఉపనయనం చేయాలి. ఉపనయన మైతే పూర్వం వాటికి ప్రాయశ్చిత్తం లేదు. ఉపనయన మైతే, శ్రౌతస్మార్తాధికారి ఔతాడు. వీటిలో ఒక్కొక్కటి లోపిస్తే పాదకృచ్ఛ్రమాచరించాలి. అపదలో చూడాకర్మ లోపిస్తే అర్ధకృచ్ఛ్రము ఆచరించాలి. ఆపద లేకపోతే అంతటా రెట్టింపు రెట్టింపుగా ప్రాయశ్చిత్త ముంటుంది. శిశువు తల్లి గర్భిణిఐతే మొదటి నెల తరువాత చూడాకర్మ చేయరాదు. ఉపనయనంతోపాటు చూడాకర్మ ఐతే గర్భిణీ ఐనా చూడాకర్మ చేయొచ్చు. కుమారునకు ఐదేళ్ళు దాటాక చూడాకర్మ ఐతే తల్లి గర్భిణీ ఐనా నిషేధం లేదు. తల్లి రజస్వల ఐతే చౌలం లేదు. నాంది శ్రాద్ధం తర్వాత రజస్వల ఐతే శ్రీశాంతి, గోదానం చేసి చౌలం చేయాలి.

సంకటమందైతే నాంది శ్రాద్ధం చేయకపోయినా శాంతితో చేయాలి, చౌలాన్ని. చతుష్ పురుషుల మధ్యలో ఆరు నెలల మధ్యలో ఉపనయన వివాహముల తర్వాత చూడాకర్మ చేయరాదు. సంవత్సరం మారితే చేయొచ్చు. చూడాకర్మ తర్వాత కూడా మహాలయమందు, గయలో, వార్షికమందు కూడా పిండదానాది చేయొచ్చు. చౌలంలో పూర్ణాహుతి లేదు. పితృశాఖ ద్వారా అగ్ని ముఖము. సాగ్నికి గూడా ఈ కర్మలౌకికాగ్నిలో, గృహ్యాగ్నిలోకాదు. ప్రమాణ వచనం లేకుండా అగ్నిని తన ఇంటి నుండి బయటికి తీసుకుపోరాదు. ముహూర్తం కారణంగా అనధ్యాయమందు చౌలం చేయాల్సి వస్తే మంత్రపాఠం చేస్తే అనధ్యాయ దోషం రాదు.

మాణవకునకు, ఉపనయన మందు చూడాకర్మ యందలి శిఖను విడిచి క్షౌరమూ, కాకశిఖతో కూడా వపనమూ, అని ప్రశ్న.భుజింపచేసి, చౌలంవలె మౌనంగా క్షౌరం చేయించి, స్నానమయ్యాక, శుభ్ర వస్త్రములు కట్టుకున్నాకముడివేసిన శిఖ, యజ్ఞోపవీతం కలవానికి చెప్తున్నాడు. అని బోధాయనుని సూత్రం. ఇందులో బద్ధ శిఖ అనటంవల్ల మధ్య శిఖను వదిలేసి ఉపనయనంలో క్షౌరము అని తెలుస్తోంది. (దిగ్వపనం అయాదిక్కుల్లో క్షౌరం, సర్వవపనం కాదు). మధ్యశిఖ నిత్యము, సదాబద్ధశిఖ. శిఖాచ్ఛేదమైతే తప్తకృచ్ఛ్రము ప్రాయశ్చిత్తము శిఖలేకపోతే బ్రహ్మ గ్రంధితో కూడిన కౌశి శిఖను (కుశ) కుడిచెవిపైన ధరించాలని వీరమిత్రోదయం, కారక గృహ్యాసూత్రం చెప్తోంది. కనుక చౌలం నాటి నుండి బ్రతికినంతకాలం శిఖ ఉండాలని తెలుస్తోంది. గోత్రచిహ్నం శిఖా కర్మ. ఆర్ష సంఖ్య ననుసరించి శిఖ కదా. గోత్రఖ్యాపకత్వ మాత్రం దృష్టం ఫలం. తమ గృహ్యాసూత్రంలో చెప్పిన వారికైతే సశిఖ ముండనం తగును. (సామవేది)

7. అపరాహ్ణం అనగా స్కాందమందిట్లా – సూర్యోదయం తర్వాత మొదటి ఐదు ముహూర్తములు పూర్వాహ్ణము. ఆ పిదప మధ్యాహ్నము. ఐదు ముహూర్తములు, ఆ పిదప కాలము అపరాహ్ణ మన బడింది,అని. జ్యోతిర్నావ మందిట్లా – అన్ని దేశములందు, పూర్వాహ్ణమందు ఉపనయనం చేయటము ముఖ్యము. మధ్యాహ్నమైతే మధ్యమము. అపరాహ్ణ మందైతే నింద్యము, అని.

8. వరునకు రవిబలము కన్యకు గురుబలం ఉండాలి.

9. గాయత్రి ఉపదేశము అగ్నికి ఉత్తరభాగంలో ఔతుంది. ఇది ఆశ్వలాయన శాఖీయులకు కాదు.

10. నిషేధింపబడని వానిని తొలుత యాచించాలి, అని ఈ సూత్రమందు పురుషుని యాచించటమునకే ప్రాధన్య మీయబడింది. ఐనా, కాత్యాయనుడు అట్లాగే ఇతర వాక్యములతో తల్లిదగ్గర భిక్షకే తొలుత ప్రాధాన్య మీయబడింది. ఇట్లా చెప్పారు గదా – సూత్రము యొక్క విశేష ప్రవృత్తి లేనిచోట స్త్రీ భిక్షకు ప్రాధాన్య

మీయబడుతుంది. ఎందుకంటే అక్కడ విరోధం లేదు కాబట్టి. భిక్షాం భవాన్ దదాతు అనుప్రవచనీయమితివా, ఈ సూత్రంలో భిక్షా మధ్యలో భవత్ శబ్ద ప్రయోగముంది ఐనా బ్రాహ్మణుడు భవాన్ భిక్షాం దదాతు అనాలి, రాజు, భిక్షాం భవాన్ దదాతు అనాలి, వైశ్యుడు భిక్షాం దదాతు భవాన్, అనాలి. ఇది తగును. పై మాటలో భవాన్ శబ్దము మధ్యలో ఉండటము మరో పక్షమునకు చెందిన అంశము, అని మొదలుగా.

11. వ్యాహృతులు :- ఓం భూః స్వాహా. ఓం భువః స్వాహా, ఓం స్వః స్వాహా, ఓం భూర్భువః స్వః స్వాహా, అని.

12. బహూనాం అపత్యానాం యుగపత్ సంస్కార కరణమంటే - ఉపనయనం కంటే ముందు తమకు తగిన కాలంలో ఏదో కారణంగా చౌలపర్యంత సంస్కారాలు చేయబడక, ఆ జాతకర్మాది సంస్కారాలు ఉపనయనంతోపాటు దానికన్నముందు అన్ని కలిపి చేయబడతాయో అవి. అట్లాగే వ్రతములు కలిపి చేయబడ్డప్పుడు అవి. అట్లాగే దేశాంతరగతుడైనవాడు చనిపోయినాడని భావించి వానికి ప్రేత కార్యం చేశాక, కాలాంతరమందు వాడు వస్తే వానికి తిరిగి, కలిపి చేసే జాతకర్మాదులు అవి. అట్లాగే పతితుడైన వానికి ప్రాయశ్చిత్తం చేశాక తిరిగి, అన్ని కలిపి చేసే జాతకర్మాదులు అవి. వానిలో సమూహంగా చేర్చి చేయబడుతున్న జాతకర్మాదులలో (సంస్కారములలో) తొలుత చేయబడుతున్న సంస్కార క్రమంలో, ఆదియందు మాతృపూజ యందు నాందీ శ్రాద్ధాన్ని ఒక్కసారి తంత్రంగా చేయాలి. విడివిడిగా మొదలయ్యే సంస్కార కర్మల మొదళ్ళలో కాదు. విడిగా ఆచరించరాదు. (ఇది స్మృతి ముక్తా ఫలంలోనిది.)

13. ప్రమాదంవల్ల నశించిన ఉపనయనాగ్నికి పునరుత్పత్తి విధిని చేస్తున్నాను. అగ్న ఆయూంషి అని మూడుసార్లతో, ప్రజాపతే అనే మంత్రంతో హవనాది కర్మ చేయాలని, ముగింపు.

14. పశుయాగాదులలో మంత్ర బాహుళ్యముతో పశువును స్పృశించుట ఉపాకరణము. అదిలేని పశువు అనుపాకృతము. అధ్యాపనము బ్రహ్మయజ్ఞము, స్వాధ్యాయము బ్రహ్మయజ్ఞము.

15. గురునింద జరుగుతూంటే అక్కడి నుండి దూరంగా వెళ్ళాలి. చెవులు మూసుకోవాలి. గురువు గారి గురువు వస్తే వారిని గురువుగా భావించాలి, గౌరవించాలి. గురుపుత్రుడు, గురుపత్ని, గురువు, వారి బంధువులు వారి శరీరమును బాగా

మర్దించుట, వారికి స్నానం చేయించుట, వారి ఉచ్ఛిష్టమును భుజించుట గురుపుత్రుని పాదములను కడుగుట చేయరాదు. అభ్యంగము, స్నానం చేయించుట, శరీరము మర్దించుట, తలవెంట్రుకలను అలంకరించుట, గురుపత్ని చేయాలి. ఏవిధంగానైనా, మనస్సులో గూడా గురువు ఆజ్ఞను ఉల్లంఘించరాదు. గురువు యందువలె గురు పత్నులందు ఆతని పుత్రులందు ఎల్లప్పుడు ప్రవర్తించాలి.

16. ఈషద్ధౌతం, నవం, శ్వేతం, సదశం (బద్దెకలది) యన్నధారితం, **అహతం**, తద్విజానీయాత్ సర్వకర్మసుపావనం. దీనికి అహతమని పేరు. (కొద్దిగా తడిపిన, కొత్త, తెల్లని, అంచుగల, ధరించని వస్త్రము అన్ని కర్మలలో పవిత్రము.)

17. యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేః యత్సహజం పురస్తాత్, ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః. యజ్ఞోపవీతమసి యజ్ఞస్యత్వా యజ్ఞోపవీతే నోపనహ్యామి. యజ్ఞోపవీతధారణ కశ్యపుడిట్లా – మూడు, నాలుగు, ఐదు, ఎనిమిది, పదికాని ఒక్కొక్కచో నలభై కూడా గృహస్థునకు, ఆయుష్కామునకు అని.

18. అమత్యా = కార్య వ్యాసంగేన, గురుశుశ్రూషాదినా అని.

19. యజ్ఞోపవీతం లేకుండా భుజిస్తే బ్రాహ్మణుడు, స్నాన, జప, ఉపవాసములతో శుద్ధుడౌతాడు. ఉపవీతం ధరించి విప్రుడు, విస్మరించి మలమూత్రములు విడిస్తే, ఆ ఉపవీతాన్ని తీసేసి అప్పుడు ఇంకో కొత్తదాన్ని ధరించాలి. జలంలో మూత్రం చేస్తే – వినా అద్భిరప్సు వ్యాప్యార్తః శారీరం సన్నిషేవ్యచ, సచైలో బహి రాప్లుత్య గామాలభ్య విశుద్ధ్యతి.

20. దక్షిణం పాణి ముద్ధృత్య ప్రక్రామ మభివాదయేత్. శ్రోత్రియే త్వంజలిః కార్యః పాదోప గ్రహణం గురోః, ఉపగ్రహణం = స్పర్శః. మనుః – వ్యత్యస్త పాణినా కార్యం ఉపసంగ్రహణం గురోః. సవ్యేన, సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేనతు దక్షిణః.

21. పేరు చివరి అకారం ప్లుతం. ఆయుష్మాన్ భవరామ 3 శర్మన్ అని టీకలో. పితృవ్య ఆది సంబంధులు అన్నం పెట్టే వారిని చూచి లేవాలి, అభివాదం చేయరాదు. శాతాతపుడు – క్షత్రియుని, వైశ్యుని నమస్కరించిన బ్రాహ్మణునకు ప్రాయశ్చిత్తమేమి. పది లేదా ఎనిమిది మంది బ్రాహ్మణులకు నమస్కరిస్తే శుద్ధుడౌతాడు. ద్విజుడు శూద్రునకు అభివాదం చేసిన సచైల స్నానమాచరించాలి. నూరుగురు బ్రాహ్మణులకు చక్కగా నమస్కరించి శుద్ధుడౌతాడు. స్మృత్యర్థసారమందిట్లా – మత్తం ప్రమత్త మున్మత్తం ధావంత మశుచిన్నరం, వమంతం జృంభమాణం చ కుర్వంతం దంతధావనం, అభ్యక్త శిరసం స్నానం కుర్వంతం నాభివాదయేత్. జపయజ్ఞ గణస్థం చ సమిత్పుష్ప కుశానలాన్, ఉదపాత్రార్ఘ భిక్షాన్నం వహన్తం నాభివాదయేత్, అభివాద్య

ద్విజశ్చైతా నహోరాత్రేణ శుద్ధ్యతి. దేవతా ప్రతిమాం దృష్ట్వాయతిం చైవత్రిదండినం, నమస్కారం నకుర్యాచ్చేత్ ఉపవాసేన శుద్ధ్యతి. విష్ణుః – సభాసుచైవ సర్వాసుయజ్ఞే రాజగృహేషు చ, నమస్కారం ప్రకుర్వీత బ్రాహ్మణా న్నాభివాదయేత్, శాతాతపః – ఉదక్యాం సూతికాం నారీం భర్తృఘ్నీం గర్భఘాతినీం అభివాద్య ద్విజోమోహా దహోరాత్రేణ శుద్ధ్యతి. మనుః – యోనవేత్త్యభివాదస్య విప్రః ప్రత్యభి వాదనం, అభివాద్యః సవిదుషా యథాశూద్రః తథైవసః.

22. సింధుసౌ వీరాదులకు తీర్థయాత్ర లేకుండా వెళ్తేనే పునః సంస్కారము.

23. సప్తతే అగ్నే సమిధః సప్త జిహ్వాః సప్త ఋషయః సప్తధామ ప్రియాణి. సప్తహోత్రాః సప్తధాత్వా యజంతి సప్తయోనీ రాపృణస్వ ఘృతేనస్వాహా.

24. శాఖరణ్యుడు అంటే తన వేదం శాఖలు వదలి మధ్యలో అన్యవేద శాఖలు చదివే వాడు. వానికి తిరిగి ఉపనయనం.

25. త్రిభ్య ఏవతు వేదేభ్యః పాదం పాదమదూదుహత్. తదిత్యృచోఽస్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః.

26. శశమనేది సూచకము. గురువు అంతేవాసులు, అధ్యేతలు వీరి మధ్య నుండి శశ, శ్వపాకజులు వెళ్తే ఆరు నెలలు అధ్యయనం చేయరాదు. ఈ విధముగా తొలి ఆరంభ మందు మేకపోతే. వ్యాఘ్రము కూడా ప్రథమారంభమందైతేనే సంవత్సరము అనధ్యాయము.

27. చతుర్దశి, అష్టమి, పర్వ, ప్రతిపత్ వీటిని వదలి ఇతరత్ర వేదాంగ న్యాయమీమాంస ధర్మశాస్త్రాలు అభ్యసించాలి. నిత్య నైమిత్తికాదులలో దేవతార్చనలో అనధ్యాయము లేదు.

28. ప్రథమం మహానామ్నీ ద్వితీయం మహావ్రతం, తృతీయం ఉపనిషద్ గోదానాఖ్యము, అని స్మృతి. యజుర్వేదినాం – ప్రాజాపత్య, ఐంద్ర, ఆగ్నేయ సౌమ్యాని. సామవేదినాం – కేశాంతగోదాన మహానామ్నీ జ్యేష్ఠ సామవ్రతాని. అథర్వాణాం – గోదాన సావిత్రీవ్రత వేదవ్రత విసర్జన వ్రతాని. ఈ వ్రతాలను పదమూడవ ఏటి నుండి బ్రాహ్మణుడు, పందొమ్మిదో ఏటినుండి క్షత్రియుడు, ఇరువది ఒక్కటవ ఏటి నుండి వైశ్యుడు చేయాలి.

29. వృద్ధాప్యమందు కూడా. సంకలోపాహిత, వేదసమాప్తి ఛర్ది (వమనము) శ్రాద్ధ మనుష్య యజ్ఞ భోజనేషు అహోరాత్రము అనధ్యాయము. సంకలో పాహిత = అగ్న్యుత్పాత. ఛర్దయిత్వా స్వప్నాంతే ఘృతం వా ప్రాశ్య అధీయాత – అపస్తంబః. ముక్తకే ఆమ్లోద్గారే అని. కడుపులోని అసిడిటిని, కక్కటం.

30\. ఎ) (ఉపనయనం చివరిది) ఉపనయనం, వేదారంభం, సమావర్తనం ఒక్కొక్క దానికి తత్తత్ కర్మారంభకాలే పృథక్ పృథగేవ సంకల్పః నతు సర్వాదౌ. (ఉపనయన సంకల్పం – కర్మ – సమాప్తి. పిదప వేదారంభం – సంకల్పం – కర్మ – సమాప్తి. పిదప సమావర్తన సంకల్పం – కర్మ – సమాప్తి)

బి) మేఖలాబంధన మంత్రం ఆచార్యుడే చదవాలి. వటుడు కాదు.

సి) గాయత్రి ఉపదేశం తరువాత గాయత్రితోనే సంధ్య, బ్రహ్మయజ్ఞము, అది అభ్యాసం కానంత వరకు ఉపనయన దినంలో మధ్యాహ్న సంధ్య వికల్పము. ఉపనయనం తెల్లవారి, బ్రహ్మయజ్ఞము, మధ్యాహ్న మందు గాయత్రితో చేయాలి.

డి) వేదారంభము ఇషేత్వా అనే దానితో చేయాలి.

ఇ) తల్లిదండ్రులున్నారు. పెళ్లైంది. వాడికి శిఖలేదు. తిరిగి గృహస్థుడు కాదలిచాడు. వానికి పునరుపనయనాది సంస్కారము. సర్వేషామేవ పాపానాం జపః ప్రాయశ్చిత్తమీరితం, పన్నెండువేల గాయత్రీజపంతో శుద్ధుడౌతాడు.

ఎఫ్) రోగార్త గృహస్థునకు స్నానసంధ్యా దేవర్షి పితృతర్పణ వైశ్వదేవ దేవార్చాలోపం కలిగితే (మంచి వానికి ఒకటి లోపిస్తే ఒక ఉపవాసము) (రాష్ట్ర క్షోభే నృపక్షోభే రోగార్తౌ క్షయసూతకే సంధ్యావందన విచ్ఛిత్తిః నదోషాయ కదాచన) ఒక్కొక్క దానికి, మూడు రోజుల కొక ఉపవాసం. ఆరు ఉపవాసములకొక ప్రాజాపత్యం. లేదా ఒక గోవు నివ్వాలి. ఈ రేషియోతో ప్రాయశ్చిత్తం.

జి) స్వస్థకాలే త్విదం సర్వం సూతకం పరికీర్తితం ఆపద్గతస్య సర్వస్య సూతకేఽపి, న సూతకం. వ్యతీపాతోఽథ సంక్రాంతిః తథైవ గ్రహణం రవేః. పుణ్యకాలాః తదాసర్వే యదామృత్యు రుపస్థితః. మానసిక సంకల్పస్యాపి ఆరంభ రూపత్వాత్ ఆరబ్ధకర్మణో నిత్యత్వాత్ నిత్యానాం శుక్రాస్తాది దోషాభావాత్.

హెచ్) శుద్ధిర్నైవ గురోర్యస్య వర్షే ప్రాప్తేఽష్టమే యది, చైత్రే మీనగతేభానౌ తస్యోపనయనం శుభం.

ఐ) సంధ్యసమయము మూడు గడియలు. సంధ్యకాలంలో సంధ్య చేయలేకపోతే నూట ఎనిమిది గాయత్రి చేయాలి. మధ్యాహ్నం సంధ్య సమయం పద్దెనిమిది గడియల వరకు. సంకటమందు రాత్రి ప్రథమ ప్రహర వరకు ప్రాతః సంధ్యాది చేయొచ్చు. వ్రత నియమ భంగమైతే నూట ఎనిమిది మార్లు అష్టాక్షరి జపం చేయాలి. పగలు కాని రాత్రి కాని రెండుసార్లు భోజనం చేస్తే శత ప్రాణాయామము ప్రాయశ్చిత్తము. కర్మకాలమందు పిల్లి తోకముద్దే స్నానము,

అంగస్పర్శ చేస్తే ఆచమనము. 55 ఘడియ గడిస్తే ఉషఃకాలము, 57 గడియ గడిస్తే అరుణోదయం, 58 గడియ గడిస్తే ప్రాతః కాలము, ఆ పిదప సూర్యోదయం. రాత్రి చివరి ప్రహర యొక్క మూడవ భాగం బ్రాహ్మముహూర్తము.

31. ఎనిమిది పిండములు :- 1) పొలం మట్టిముద్ద. 2) గోశాల మట్టిముద్ద 3) వేదిక మట్టి 4) చెరువు మట్టి 5) ద్యూతస్థానం మట్టి 6) చౌరస్తామట్టి 7) ఊషరం మట్టి 8) శ్మశానం మట్టి. ఇవి తెచ్చి విడివిడిగా ఎనిమిది ముద్దలు చేసి, ఋతమగ్రే అనే మంత్రంతో అభిమంత్రణ చేసి, కుమారిని ఒకటి తీయమనాలి. వాటి ఫలాలు క్రమంగా 1) అన్నము, 2) సంతానము 3) బ్రహ్మవర్చస్సు గల సంతానం 4) వస్తు సమృద్ధి, 5) జూదరులు, 6) స్వైరిణీ 6) దౌర్భాగ్యము, 8) భర్తను చంపేది.

32. ఎ) ప్రాణైస్తే ప్రాణాన్ సందధామి అస్థిభిరస్థీని మాంసైర్మాంసాని త్వచాత్వచం.

బి) సమానః ఏకః పిండో దేహః దేహోవయ వోయస్యాః సాసపిండా నసపిండా అసపిండా, తాం.

33. ఒక శబ్దం ప్రకృతి ప్రత్యయ అపేక్షతోపాటు సముదాయ శక్తి ద్వారా అర్థాన్నిస్తే **యోగరూఢము.** ప్రకృతి ప్రత్యయ అపేక్ష లేకుండా కేవల సముదాయ శక్తితో అర్థాన్నిస్తే **రూఢము.** ప్రకృతి ప్రత్యయ సంయోగంవల్లనే అర్థాన్నిస్తే అది **యౌగికము.**

34. పితుః పితృష్వసుః పుత్రాః పితుః మాతుష్వసుః సుతాః, పితుర్మాతుల పుత్రాశ్చ విజ్ఞేయాః పితృబాంధవాః. మాతుః పితృష్వసుః పుత్రాః మాతుః మాతృష్వసుః, సుతాః, మాతుర్మాతుల పుత్రాశ్చ విజ్ఞేయా మాతృబాంధవాః.

35. ఎ) గర్భేను, నౌజనితా దంపతీక ర్దేవస్త్వష్టా సవితా విశ్వరూప ఇతి. (అయమర్థః - యమీయమం స్వభ్రాతరం మైథునార్థం యాచితవతీ, తతోయమేన ప్రత్యాఖ్యాతా వదతి - ప్రజాపతిః విశ్వరూపః విశ్వాత్మా సవితా త్వష్టానౌ ఆవయోః గర్భే దంపతీ జనితా. తథాచ ఆవయోః అపత్యయోః భావిదంపత్య నిశ్చయాత్ తద్వరమావామేవ దంపతీ భావాయ ఇతి). నకిరస్య ప్రమిమంతి వ్రతానివేద, నావస్య పృథివీ ఉతద్యౌః. (నవా ఉ,తే తన్వాతన్వం సంపపృచ్యాం పాపమాహుర్యః స్వసారం నిగచ్ఛాత్). అన్యేన మత్ర్పముదః కల్పయస్వనతే భ్రాతా సుభగే వష్ట్యేతత్.

బి) దర్శపూర్ణమాస ప్రకరణే స్రుగ్వ్యూహనార్థవాదః ఏకస్మాత్ మిథునాత్ ద్వావుత్పన్నౌ మిథః సంకల్పయతః - తృతీయే వాచతుర్థేవా వివాహో వహై ఇతి తదర్థః. అత్ర ప్రమాణాంతరా విరోధాత్, అర్థవాదాత్ విధిః కల్ప్యః.

సి) ప్రాప్తమైన దాన్ని అర్థవాదం ద్వారా స్తోత్రమంటారు. రాకపోతే, అర్థవాదం కాదు. మృతాగ్ని హోత్రమందు, అధస్తాత్ సమిధం ధారయన్నను ద్రవేత్, అగ్నిహోత్ర వహనం చేసేప్పుడు యజమానుడు అగ్నిహోత్ర హవనీయమందు హోమద్రవ్యము దాని క్రింద సమిథ నుంచుకొని ఆహవనీయాగ్ని సమీపానికి వెళ్ళాలి. దానికే, ఉపరి హిదేవేభ్యో ధారయతి ఈ వాక్యంలా స్తుతి కాదు.

ప్రశంస లేదా నింద చేసే విధి వాక్యానికి శేషభూత వాక్యం అర్థవాదము. ఇది మూడు రకాలు – 1) గుణవాదం 2) అనువాదం 3) భూతార్థవాదం.

36. అర్జున ప్రద్యుమ్నులకు మాతుల కన్యావివాహం ఎట్లా అని అనరాదు. అది యుగాంతరంలోది. కనుక దోషం లేదు. మనుష్య నిర్మిత శాస్త్రం, అక్కడ ప్రవర్తిం చదు. దేవతలాచరించింది ఆచరించరాదు. వారు చెప్పింది మనుష్యులాచ రించాలి.

37. సనాథాశ్చాపి గృహ్ణంతి భ్రాతృభార్యా మభర్తృకాం. సర్వదేశే ష్వ నాచారో రథ్యా తాంబూల చర్వణం.

38. సావిత్రీం యస్యయోదద్యాత్ తత్కన్యాం న వివాహయేత్. తద్గోత్రే తత్కులే వాపి వివాహో నైవ దోషకృత్. ఏతత్ స్వగోత్రా జ్ఞాన విషయమితి నారాయణః. గురోః సగోత్ర ప్రవరా నోద్వాహ్యాక్షత్ర వైశ్యయోః. స్వగోత్రాద్యనభిజ్ఞైస్తు విప్రైరాచార్య గోత్రజాః.

39. నగ్నిక – నగ్నికాంతు వదేత్ కన్యాం యావన్నర్తు మతీభవేత్. ఋతుమతీ త్వనగ్నికా తాం ప్రయచ్ఛేత్తు నగ్నికాం. అప్రాప్తా రజసోగౌరీ, ప్రాప్తే రజసిరోహిణీ, అవ్యంజితా భవేత్ కన్యా కుచహీనా చ నగ్నికా.

40. గురుడు సింహరాశిలో, మకర రాశిలోను ఉండగా వివాహము, వ్రతబంధము, ప్రతిష్ఠ, మందిర ప్రవేశము, దక్షిణ యాత్ర చేయరాదు. నీచరాశి గతుడైన గురువు అన్ని పనులకు ప్రశస్తుడు. నీచాంశకగతుడైతే మాత్రం త్యాజ్యుడు. సింహరాశి గతుడైనా **మఘ యందున్న** గురువును విడువాలి.

41. **పతితోత్పన్నః పతితః భవతి** అన్యత్ర స్త్రియా. కన్య అట్లా పతిత కాదు.

42. 1. బ్రాహ్మవివాహం = కన్యను అలంకరించి కన్యాదాన పూర్వకంగా జరిగే వివాహం 12 ఇటు 12 అటు తరాలు తరిస్తారు.

2) దైవం = ఋత్విజునకు ఇవ్వటంవల్ల 10, 10 పిడీలు పవిత్రులౌతారు.

3) ఆర్షము = రెండు ఆవులు కట్నంగా ఇవ్వాలి. 7, 7తరాలు పవిత్రమౌతాయి.

4) ప్రాజాపత్యం = 8, 8 తరాలు పవిత్రులౌతారు.

5) ఆసురం = వరుని నుండి బాగా ధనం తీసుకుని కన్యాదానం చేయటం (దానం కాదు ఇవ్వటం)

6) గాంధర్వం = పరస్పరం వధూవరులు ఇష్టపడి చేసుకునేది.

7) రాక్షస = హరించి పెళ్ళి చేసుకోవటం

8) పైశాచం = నిద్రిస్తున్న లేదా అజాగ్రత్త దానిని అపహరణ చేయటం.

43. సర్వేషు ధర్మకార్యేషు పత్నీ దక్షిణతః స్థితా, విప్రపాద క్షాలనేచ అభిషేకే చ వామతః.

44. ఒక వివాహం దాని చతుర్థి కర్మ తరువాత రెండవ వివాహం చేయాలి. కొడుకు వివాహం తరువాత కూతురు వివాహం 6నెలల లోపల తగదు వివాహం తరువాత ఉపనయనం తగదు.

45. అర్కకన్యామిమాం విప్ర యథాశక్తి విభూషితాం, గోత్రాయ శర్మణేతుభ్యం దత్తాం విప్ర సమాశ్రయ.

## వివాహ పదం అర్థం

46. విశిష్టం వహనం వివాహం. ఇతరుని కన్యను తనదానిగా చేసుకుంటూ చేసే సంస్కార కర్మ. దానము1, ప్రతిగ్రహణము2, పాణిగ్రహణాది3 హోమ4 సంస్కారములతో సంస్కరీకరించుటే వివాహ పద అర్థము. ఈ వివాహం స్త్రీకి భార్యత్వమును పురుషునికి పతిత్వమును కల్గించేది. ఉపనయనం **అధ్యయనం** కొరకైతే వివాహం స్త్రీ, పురుషులకు అగ్న్యాధాన అగ్నిహోత్ర పాక **యజ్ఞాది** కర్మానుష్ఠాన యోగ్యత కల్గించేది. వివాహం ధర్మం కొరకు, **పుత్రోత్పత్తి** కొరకు, (రతి) కామ్యం కొరకే కాదు. బ్రహ్మచర్యంతో ఋషుల ఋణం నుండి, యజ్ఞంతో దేవతల ఋణం నుండి, సంతానం కల్గటం వల్ల పితృ ఋణం నుండి ముక్తుడౌతాడు బ్రాహ్మణుడు. అందువల్ల వివాహం కావాలి.

## వివాహం అనాది

సమ్రాజ్ఞీశ్వశురేభవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాంభవ. ననాందరి సమ్రాజ్ఞీ అధిదేవృషు. ఇది ఋగ్వేద మంత్రం. వివాహ బంధాన్ని తెలుపుతోంది. వేదాలలోయజ్ఞం గూర్చి ఉంది. దానిని దంపతులే చేయాలి. అది వివాహ బంధం. ఇందులో ప్రధానమైనవి. కన్యా ప్రతిగ్రహము, పాణిగ్రహణము, లాజహోమము, అశ్మారోహణము (సాన) సప్తపది, జయాది హోమాలు, ఇవి **ప్రధాన పదార్థాలు.** మధుపర్కము, పగలు సూర్యుణ్ణి చూడటం, రాత్రి ధ్రువుణ్ణి చూడటం, హృదయాలంభము, అభిషేకము, చతుర్థీకర్మ ఇవి **అంగభూతాలు.** శాఖోచ్చారము, గ్రంథి బంధనము, పరదాపట్టటం, కన్యను ఎడమవైపు కూర్చో పెట్టటం

ఇవి ఆచారం వల్ల వచ్చినవి. మధుపర్కం దీనిని ఆచార్యుడు మొదలుగా ఆరుగురు చేయాలి. అర్ఘ్యపాద్య ఆచమనాదులు ఇవ్వటంతో పాటు వరునకు తినటానికి దధి, మధు, ఘృతములను ఇవ్వాలి. ఇందులో మధువుంది కనుక ఇది **మధుపర్కం.** (తేనె) కన్యతండ్రి ఉత్తర ముఖంగా కూర్చొని పడమర ముఖంగా ఉన్న అమ్మాయి హస్తాన్ని తూర్పు ముఖంగా ఉన్న వరుని చేతిలో పెట్టి వరుడవైన నీకు నేను ఇస్తున్నాను అని పలికి ఇచ్చే కర్మ **కన్యాదానం.** వేపిన వడ్లు (పేలాలు) లాజలు. వాటిని శమీపత్రములతో కలిపి వధువు అన్న ఆమెచేతిలో పోయగా అర్యమణం మొదలగు మూడు మంత్రాలతో వరుడు తాకిన, వానిని, వధువు చేసే హోమం **లాజాహోమం.** గృభ్ణామి, త అను మొదలగు మంత్రములతో వరుడు అంగుష్ఠముతో సహ కన్య చేతిని గ్రహించడం **పాణిగ్రహణము.** ఏకమిష అని మొదలగు ఏడు మంత్రములతో వరుడు కన్యయొక్క కుడిపాదమును తీసికొని లాగి ఏడు స్థానములందు వరుసగా ఉంచటం **సప్తపది. ఏడవ అడుగుయందు పతిత్వము.** వివాహం తర్వాత నాల్గవ రోజున అపరరాత్రి చివరియామంలో వివాహాగ్ని యందు అగ్నే ప్రాయశ్చిత్త అని మొదలుగా ఆజ్యహోమము, స్థాలీపాక హోమము, హృదయాలంభము, స్థాలీపాక భక్షణాదికము చేస్తారు. అది చతుర్థ దివసం రాత్రియందు చేయబడుతోంది. కనుక ఇది **చతుర్థీకర్మ** అనబడుతోంది.

(2) కన్యాదాన కాలమందు చెప్పాల్సిన పేర్లు పితృపితామహ, ప్రపితామహులవి అని స్మృతి కారులన్నారు. ముగ్గురికన్నా ఎక్కువ మంది పేర్లను వైశ్యవివాహంలో చెప్తారు అది కూడా ఆచార ప్రాప్తమైందే. కన్యాదానంవల్ల తన కులంలోని ఇరువది ఒక్క పురుషుల ఉత్తారణ ఫలాన్ని నూరుగురు పురుషుల ఉత్తారకత్వాన్ని కూడా కొందరు అంగీకరిస్తారు. వివాహంలో పూర్వ పురుషుల నామస్మరణ కల్గుతుంది. సీతారాముల వివాహంలో వారివారి పూర్వుల నామస్మరణ జరిగింది. కనుక ఇదీ ప్రాచీనమైన ఆచారమే. (3) నీకు నేను ఇస్తున్నాను అని అన్నాకే కన్యాహస్తాన్ని వరుడు గ్రహించాలి. అంతకు ముందు కాదు అని (4) బాసి కాలు కట్టటం (ఆశ్వలాయన గృహ్య పరిశిష్టం) (5) దేవతోద్దేశేన స్వద్రవ్య పరిత్యాగః యాగః. వేయటం ఎక్కువైతే హోమం. నమమ అనటంవల్ల స్వస్వత్వ నివృత్తి వస్తుంది. (పరస్వత్వం వస్తుంది) దాధాతువుతో ఇవీ ఉండాలి. (6) పెళ్ళి అయ్యాకే కొంగుముడి వేయటం ఇది అన్వారబ్ధ జ్ఞాపకం.

(6) వాగ్దానం అయ్యాక ఇద్దరి కులాల్లో ఎక్కడైనా తల్లిదండ్రులు మరణిస్తే సంవత్సరం దాకా వివాహం తగదు. ఇతరులు మరణిస్తే తక్కువలో తక్కువ ఒక నెల వరకు తగదు. నాలుగు తరాల వరకు ప్రేత క్రియ సమాప్తి కానంత వరకు వివాహాదులు చేయరాదు. అంత అవసరమైతే వినాయక శాంతి చేసి వివాహం చేయండి. (7) వివాహ, చౌల, ఉపనయన, యజ్ఞము వీనిలో తల్లి బయటుంటే కార్యం చేయరాదు. నాందీ శ్రాద్ధం తరువాత ముట్టైతే గోదానం కూష్మాండీ హవనంచేయాలి. (8) ఒక తల్లికి పుట్టిన వారికి

ఏ సంస్కారం ఒకేసారి కాదు. కవలల దౌతుంది. (9) కొడుకు వివాహం అయ్యాక ఆరు నెలల దాకా కూతురు వివాహం చేయొద్దు. ఉపనయనం పుట్టు వెంట్రుకలు కూడదు. సంవత్సరం మారితే చేయొచ్చు. (10) ఒకే ఇంటిలో రెండు మంగళ కార్యాలు కారాదు. అవసరమైతే మండప, ద్వార, ఆచార్యాదుల భేదంతో చేయొచ్చు. (11) వివాహం నుండి చతుర్థీకర్మ వరకు ఏవిధమైన శ్రాద్ధాది తిథులు రాకూడదు (12) ఒకే వరునకు ఇద్దరు కన్యల నివ్వరాదు. (13) కన్య ఋతుమతి ఐతే ఋతు సంఖ్య ప్రకారం గోదానం చేయాలి. కన్య ఉపవాసం చేయాలి. ఆమె మరోకన్యకు వస్త్ర ఆభూషణాదులు కూడా ఇవ్వాలి. కూష్మాండీ హవనం కూడా చేయాలి. వివాహ సమయంలో కన్య ఋతుమతి ఐతే యుంజాన అనే మంత్రంతో హవనం, స్నానం, పంచగవ్యపానం చేయాలి. (14) నాందీ శ్రాద్ధం చేయక పోయినప్పటికి సామగ్రి సమకూరాక వివాహాది కార్యం అశౌచంలో కూడా ఔతుంది. వ్రత, యజ్ఞ, వివాహాదులలో నాందీ శ్రాద్ధం తరువాత అశౌచం ఉండదు. (15) మాతృసంపిడులతో వివాహం తగదు. రెండవ పెళ్ళిలో వరుడే నాందీ శ్రాద్ధం చేయాలి. తండ్రి చేయొద్దు. వివాహాదుల్లో మండపోద్వాసన అయ్యే వరకు, శ్రాద్ధం, అపసవ్యం, నిత్యశ్రాద్ధం, బ్రహ్మ యజ్ఞం, అధ్యయనం, నదిని దాటటం ఉపవాసం సపిండులు చేయరాదు (16) వివాహంలో స్పర్శా స్పర్శ దోషం లేదు. వివాహం ఆది తరువాత తిలతర్పణం, శవ అనుగమనం, నూతన తీర్థగమనం, ముండనాదులు ఒక సంవత్సరం దాకా చేయరాదు. మంగళ కార్య మందు గోపీచందన ధారణ నిషిద్ధము. (17) శూద్రుడు చేసే కర్మలో పౌరాణిక మంత్రాలే బ్రాహ్మడు చదవాలి. అలాగే స్త్రీ చేసే కర్మలో కూడా. వేదమంత్రాలు చదువరాదు. (18) అనుపనీతుడైన సోదరుడు కన్యాదానానికి అధికారికాదు తల్లే చేయాలి.

47.1) చతుర్థీ హోమం తర్వాత కల్గిన అగ్ని స్మార్తాగ్ని. అది లేకపోతే దాయకాలంలో అగ్ని సంపాధన చేయాలి. (వంశ పారంపర్య ఆస్తి పంపక కాలం). అప్పుడూ కుదరకపోతే తండ్రి చనిపోయాక పన్నెండో రోజున సపిండీకరణ మందున ఆధేయం చేయాలి. (అగ్ని సంపాదన). అప్పుడూ కుదరకపోయినా ఎంతకాలం గడిచిందో అంతకాలానికి తగిన ప్రాయశ్చిత్తం చేసి, అప్పుడు అగ్ని ఆధానము. ప్రాయశ్చిత్తం అంటే ప్రతి సంవత్సరం చాంద్రాయణం. శక్తి లేకపోతే ప్రాజాపత్యం (చాంద్రాయణమంటే పూర్ణిమన 15 నోటి నిండిన ముద్దలు, అమావాస్య వరకు ఒక్కో ముద్ద తక్కువ చొప్పున, అట్లాగే అమావాస్య నుండి ఒక్కో ముద్ద ఎక్కువ చొప్పున పూర్ణిమ వరకు తినటం). చాంద్రాయణమందు ఎనిమిది ఆవులు బదులుగా ప్రాజాపత్యమునకు ఒక గోవు ప్రత్యామ్నాయము. ప్రతి సంవత్సరము24 ప్రస్థముల బియ్యముగాని యవలుగాని అట్లాగే మూడు ప్రస్థముల నెయ్యి హవనీయ ద్రవ్యముల దానము అని. ఈ అగ్నియందే ప్రతిరోజు సాయం ప్రాత రౌపాసన హోమము, పిండ పితృ యజ్ఞము, పక్షాది, పంచమహాయజ్ఞాలు, దైనందిన పాకము, సప్తపాక యజ్ఞాలు ఆచరించాలి.

2) పూజారి ఉత్తమ అస్పృశ్యుడు. చండాలుడు జాతివల్ల (అధమ) అస్పృశ్యుడు. (పవిత్ర అస్పృశ్యుడు పూజారి. బ్రహ్మహత్యాది పాతకుడు అపవిత్ర అస్పృశ్యుడు. చండాలుడు జాతి అస్పృశ్యుడు). చండాల శ్వపచులు గ్రామం బయట ఉండాలి (మనువు). కుక్కలు, గాడిదలు వారి ధనం, ఎద్దు కావు. శవవస్త్రాలు ధారణం. పగిలిన కుండల్లో ఆహారం. లోహ ఆభరణాలు. ఎప్పుడూ తిరుగుతుంటారు. (సంచారులు) శూలి ఇవ్వటం (ఉరి) వీరి పని. (తలారి వగైరా శూద్రులు శవం దగ్గర అందుకే).

48. 1) ధ్వజహీనమైన ఆలయంలో రాక్షసులు వసిస్తారు. విగ్రహం సమదృష్టి కలది కావాలి. మహా నీలము విగ్రహము యజ్ఞప్రదము, దారుజము కామదము. సువర్ణముది భుక్తిముక్తి ప్రదము, రజతంది స్వర్గదము, తామ్రము ఆయుర్వర్ధినీ. కాంస్యము ఆపద్ధంత్రీ, పిత్తలి శత్రు నాశిని, శిలది సర్వభోగదము, స్ఫటికం దీప్తి నిచ్చేది. మృన్మయము మహాభోగ ప్రదా, దశ, అథవా పంచ అంగుళములది ఇంట్లో, ఉండాలి అంతే. సంపూర్ణావయవ ములు కలది విగ్రహం ఆయుర్లక్ష్మీప్రదా.

2) భాగవంతం దశమం - ఉత్తర భాగం 6.63 శ్లో 25 –29 జ్వరభగవానుల సంవాదం.

3) ప్రతిష్ఠాధికారిని గూర్చి – విష్ణువును నాలుగు వర్ణాల వారు స్థాపించవచ్చు. బ్రహ్మను గాయత్రితో పాటు బ్రాహ్మణుడు స్థాపించాలి. భైరవుని నాల్గు వర్ణాలవారు మాతలను కూడా అందరూ లింగమును గృహస్థు లేదా సన్యాసి స్థాపించి పూజించాలి.

కూపాద్యారంభంలో భూమి పూజ. ప్రాసాద గృహములకు శిలాన్యాసము ఆగ్నేయంలో లేదా ఈశాన్యంలో.

-----

1) మలమాసం తండ్రిగారి తొలిశ్రాద్ధంలో, పదకొండోనాడు (ఏకాదశాహం) వృషోత్సర్జన చేయాలి. శయ్యాదానం కూడా.

2) జీవశ్రాద్ధం చేసుకున్నాక కూడా సంధ్య జపహోమాదులు చేయాలి. ప్రతిగ్రహం, శరీర ధారణ పరిమితానికే చేయాలి.

3) మూడవరోజు అస్థిసంచయనం. పన్నెండవరోజు సాపిండ్యం. రాత్రి చచ్చిన ముందు రోజునే గ్రహించాలి. మాసపక్ష తిథి నాడే మాసికం లేదా శ్రాద్ధం (క్షయాహం నాడే). పారణే మరణే చ తత్కాల తిథి గ్రహించాలి. ( దినంకాదు)

4) గయాశ్రాద్ధం, బదరీ శ్రాద్ధం రెండు చేయాలి.

5) భృగుపాతాదుల వల్ల మరణిస్తే (దుర్మరణం) ప్రాయశ్చిత్తం చేసి, పదకొండోనాడు నారాయణ బలిచేసి తొలి శ్రాద్ధం చేయాలి. సన్యాసికి పన్నెండవనాడు నారాయణ బలి. సాధారణ మరణంలో, నారాయణ బలి తగదు.

-----

1) త్రి పురుష (ముగ్గురుని) ఉద్దేశించి చేసేది పార్వణము. ఒకరిని ఉద్దేశించి చేసేది ఏకోద్దిష్టం.

2) అతిదేశమనగా ఒకదాని ధర్మాన్ని మరోచోట చేయటానికి ఆదేశించటం. ఒకచోట ఆచరింపబడ్డ పూర్తి ధర్మాన్ని, మరోచోట కార్యవశాత్తు నిర్వహించటం అతిదేశము. గోసదృశో గవయః రూపాతిదేశం.

## వివరణలు

1) సేకః ప్రతిజ్ఞా గాయత్రీ దేవతాభ్యః తథాసనం, ఆవాహనార్ఘ దానాని గంధాదీనాం సమర్పణం. మండలాన్యాహుతీ ద్వేచాప్యన్నం భూస్వామినే తథా, పరివేషో మధూత్సర్గః. పాత్రాలంభోఽన్నదానకం, అన్నహీనంచ గాయత్రీ మధువాతాంతతోజపేత్, వికిరాచమనం చాథ గాయత్రీ మధువాతిచ, వేదికాం చ తతః కుర్యాత్ తత్రోల్లేఖనం తథా, ఉల్మూక భ్రామణం చాథ రేఖయోః కుశధారణం. దేవతాభ్యస్తథా పిండస్థానే తత్రావనే జనం, పిండదానముప స్పర్శోద్విః శ్వాసయమనం తథా, పిండో పరిప్రత్యవనేజన, నీవ్యాశ్చ స్రంసనం సూత్రదానం పిండపూజా జలపుష్పాక్షతాన్ క్షిపేత్. అక్షయ్యవాదో వార్ధారాగోత్రాశీః ప్రార్థనం తతః, పితృప్రీణన మాఘ్రాణం పిండోత్థాపనకం తథా, చాలనం చార్ఘపాత్రాణాం దక్షిణాం చ విసర్జనం, దేవతాభ్యో జపోరక్షాదీప నిర్వాపణం తతః. ఆచమ్య చతతో బ్రూయాత్ ప్రమాదాత్ కుర్వతామితి (పార్వణ శ్రాద్ధ క్రమమిది)

2) సపిండాః = సమానోద[2]కాః (న, సజాతయః) స[3]మాన గోత్రాః వీరు జ్ఞాతులన బడతారు. సపిండానంతరం సజాతీయులతో భోజనము శాస్త్ర విహితంకాదు.

3) స్వస్థకాలే త్విదం సర్వం సూతకం పరికీర్తితం, ఆపద్గతస్య సర్వస్య సూతకేఽపి నసూతకం వ్యతీపాతోఽథ సంక్రాంతిః తథైవ గ్రహణంరవేః, పుణ్యకాలా స్తదాసర్వేయదా మృత్యు రుపస్థితః.

4. ఎ) ఏక భక్త అయాచిత ఉపవాసైః కథంచిత్ త్రిగుణైః పాదోనకృచ్ఛ్రః.

బి) సాయంప్రాతః తథైకైకం దినద్వయమయాచితం, దినద్వయం చ నాశ్నీయాత్ కృచ్ఛ్రార్థం సోఽభిధీయతే. ఏకభక్త నక్త అయాచితద్వయ ఉపవాసద్వయైః

అర్ధకృచ్ఛ్రః (లేదా మూడు రోజులు అయాచితం, మూడు రోజులు ఉపవాసం ఐతే అర్ధ కృచ్ఛ్రము)

సి) ఏకభక్తేన, నక్తేన తథైవాయాచితేన చ, ఉపవాసేన చైవాయం పాదకృచ్ఛ్రః ప్రకీర్తితః

డి) కుశోదకం చ గోక్షీరం దధిమూత్రం శకృత్ ఘృతం, ప్రాశ్యాపరేద్యుః ఉపవసేత్ కృచ్ఛ్రం సాంతపనం స్మృతం.

ఇ) (సాంతపనం అశక్తపరం). గోమూత్ర మాసకాస్త్వష్టౌ గోమయస్యతు షోడశ, క్షీరస్య ద్వాదశప్రోక్తా దధ్నస్తు దశకీర్తితాః. గోమూత్రవత్ ఘృతస్యోక్తాః తదర్ధేన, కుశోదకం, ఏతత్ ద్రవ్య పరిమాణం శుద్ధ్యర్థం కాయశోధనం.

ఎఫ్) యతాత్మనోఽ ప్రమత్తస్య ద్వాదశాహ మభోజనం, పరాకోనామ కృచ్ఛ్రోఽయం సర్వపాప ప్రణాశనః.

జి) అయమేవ అతికృచ్ఛ్రః స్యాత్ పాణి పూరాన్న భోజనః.

హెచ్) పిపీలికం, యవమధ్యం, యతిచాంద్రాయణం, చాంద్రాయణం, శిశు అని ఐదు రకాలివి.

ఐ) పాదవ్రతే వస్త్రదానం, కృచ్ఛ్రార్ధే తైలకాంచనం పాదహీనేతు గామేకాం కృచ్ఛ్రే గోమిధునం స్మృతం.

5) ఉదకుంభ మాసిక, ఆబ్దికేషు పిత్రాదయః అపత్నీకాః, అన్యత్ర సపత్నీకాః.దేవతాభేదం. నిత్య, దార్శికములు షట్దైవత్యం, మాసిక ఏకోద్దిష్టయోః ఏకోద్దిష్టత్వం. దేవతాభేదం. నిత్య, దార్శిక, యుగాది, మన్వాది, అలభ్య యోగనిమిత్తానాం షట్దైవత్యం, ప్రత్యాబ్దిక త్రిదైవత్య లేదా ఏకోద్దిష్టం అందువల్ల దేవతాభేదం అందువల్ల తంత్రం లేదు.

6) పశుపురోడాశం – పశుయాగం – దానిఅంగం పురోడాశయాగం. దాని దేవతే దీని దేవత. ఈ దేవత సంస్కారం. ప్రస్తర ప్రహరణ – దర్శ పూర్ణమాసేష్టి అయ్యాక ఏ దేవత కోసం యాగం చేయాలని ఆలోచిస్తారు. సూక్త వాక్ మంత్రం చదివి విడువబడ్డ యాగాను సంధానం చేస్తారు. ఐపోయిన యాగదేవతే రాబోయే యాగ దేవత. ఇక్కడ దర్భ ముష్టిని (ప్రస్తరం) అగ్నిలో (ప్రహరణ) వేస్తారు. దీనివల్ల ఇష్ట దేవతా సంస్కారం. శ్రాద్ధ దేవతలే, తర్పణ దేవతలు వారికి మాత్రమే తర్పణం.

7) దీక్షణీయేష్టి యందు కామస్వరం. వీలైనంత పెద్దగా అరచి. ప్రాయణీయేష్టి యందు మంద్రస్వరం (మెల్లగ) ఆతిథ్యేష్టి యందు ఇంకా మెల్లగా ఉపసద మందు ఉపాంశు స్వరం (చంకలో వానికి కూడా విన్పించకుండ)

8) దేవతలకు తర్పణాంజలి ఒకటి స్త్రీలకు (ఇతరులు) మాతామహులు (ఇతర గోత్రం) మాతులుడు, గురు, ఆచార్య శ్వశుర, సుహృత్, సంబంధి. సనకాదులకు తర్పణాంజలి రెండేసి సపత్ని, ఆచార్య పత్ని (జలాం). పితరులకు తర్పణాంజలి మూడేసి తిల ఉదక అంజలులు మూడేసి మాతా, మాతామహీ, మాతుః పితామహి జలాంజలి 1 ×3 = 3 × 3 = 9. మాతామహాః 1 × 3 = 3 × 3 = 9

9. మన్వాది = కార్తిక శుద్ధ నవమి, వైశాఖ శుద్ధ తదియ, ఆశ్వీన కృష్ణ త్రయోదశి, ఫాల్గుణ కృష్ణ అమావాస్య.

యుగాది = ఆశ్వీన శుక్ల నవమి, భాద్రపద, చైత్ర శుక్ల తదియ, భాద్రపద అష్టమి, కార్తిక శుక్ల ద్వాదశి, ఆషాఢ, ఫాల్గుణ పూర్ణిమ, పౌష కృష్ణ ఏకాదశి, ఆషాఢ శుక్ల దశమి, చైత్ర, కార్తిక పూర్ణిమ, భాద్రపద అమావాస్య, జ్యేష్ఠ శుక్ల పూర్ణిమ

10) అర్ధోదయం – మాఘమాసం, ఆదివారం, అమావాస్య, వ్యతీపాతయోగం, శ్రవణ నక్షత్రం ఇవన్నీ కలిస్తే.

గజచ్ఛాయా – ఆశ్వీనమాసం, కృష్ణపక్షం, త్రయోదశి, సూర్యుడు హస్తలో, చంద్రుడు మఘలో ఉండి, అన్నీ ఏకమైతే.

షష్ఠి – కపిల షష్ఠి. (ఆశ్వీన మాసం, కృష్ణపక్షం, షష్ఠి, మంగళవారం, రోహిణి నక్షత్రం, వ్యతీపాతం, ఇవి కలిస్తే.

11. ఎ) నవదైవత్యం – పితృ, పితామహ, ప్రపితామహ; మాతృ, పితామహీ, ప్రపితామహీ; సపత్నీక మాతామహ, ప్రమాతామహ, వృద్ధప్రమాతామహ.

ఆసన, భోజన పాత్ర, అర్ఘపాత్ర, జల పాత్ర, ఘృత పాత్ర, అవనేజన పాత్ర, (పాదప్రక్షాళన).

(బి) ద్వాదశదైవత్య :– (ఎక్కువ, సపత్నీకులు విడిగా) మాతామహిలు ముగ్గురు. మహాలయే గయాశ్రాద్ధే వృద్ధౌ చాన్వష్ట కాసుచ, జ్ఞేయం ద్వాదశ దైవత్యం తీర్థే ప్రోష్ఠే మఘాసుచ.

12) ద్వారమాతలు :– జయంతీ, మంగళ, పింగళ దక్షిణేగృహాత్, ఆనంద వర్ధినీ వామే, మహాకాలీ చ నిర్గమే, గృహస్య దక్షిణే భాగే, తిస్రోలేఖ్యాస్తు మాతరః, వామ భాగేచ ద్వేచ జయంత్యాది క్రమేణతు.

గృహమాతలు :– కీర్తిః లక్ష్మీః ధృతిః మేధా పుష్టిః శ్రద్ధా క్రియామతిః

బుద్ధి ర్లజ్జావపుః శాంతిః తుష్టిః కాంతిస్తుమాతరః,

13) గోదావరి, గయ, శ్రీశైలం, గ్రహణద్వయం వీనిలో గురు శుక్రమౌఢ్య దోషం లేదు. గయలో అన్ని కాలాల్లో పిండం పెట్టవచ్చు. అధిమాసం, జన్మదినం, గురు, శుక్ర,

అస్తమయం, గురువు సింహరాశి యందు ఉన్నా వీనియందు గయాశ్రాద్ధం పెట్టవచ్చు. అధిమాసం జన్మ నక్షత్రం గురు శుక్ర అస్తమయం వీనిలో తీర్థయాత్ర చేయరాదు. గయ, గోదావరి యాత్ర చేయొచ్చు.

14) క్షౌరనిషేధం :- రవ్యార సౌరివారేషు రాత్రౌ పాతేవ్రతేఽహని, శ్రాద్ధాహః ప్రతిపద్రిక్తా భద్రాః క్షౌరేషు వర్జయేత్. షష్ఠ్యష్టమీ పూర్ణిమా పాత చతుర్దశ్యష్ట మీషుచ, నక్షత్రేతు న కుర్వీత యస్మిన్ జాతో భవేన్నరః నప్రోష్ఠ పదయోః కార్యం నైవాగ్రేయేతు భారత, దారుణేషుతు సర్వేషు దుష్టతారాం వివర్జయేత్. కుంభేకర్కటకే చైవకన్యాయాం కార్ముకేరవౌ, రోమఖండం గృహస్థస్య పితౄన్ ప్రాశయతే యమః. వివాహ మౌంజీ చూడాసు వర్ష మర్ధం తదర్ధకం, అంతర్వత్న్యాం చ జాయాయాం నేష్యతే వపనద్వయం. తదపవాదశ్చ :- క్షౌరం నైమిత్తికం కార్యం (ప్రాప్తం) నిషేధే సత్యపి ధ్రువం, పిత్రాది మృతి దీక్షాసు ప్రాయశ్చిత్తే చ తీర్థకే, అత్రవపనం కరిష్యే ఇతి సంకల్పః. యానికాని చ పాపాని బ్రహ్మహత్యా సమాని చ, కేశానా శ్రిత్య తిష్ఠంతి తస్మాత్కే శాన్వపామ్యహం.

15. ఎ) యేఽబాంధవా బాంధవావాయేఽన్య జన్మనిబాంధవాః, తేతృప్తి మఖిలాయాంతు యే చా స్మత్తోఽభికాంక్షిణః, యత్ర క్వచన సంస్థానాం క్షుత్తృష్ణో పహతాత్మనాం, ఇదమక్షయ్య మేవాస్తు మయాదత్తం తిలోదకం. లేదా - ఆ బ్రహ్మస్తంబ పర్యంతం దేవర్షి పితృబాంధవాః (మానవాః), తృప్యంతు పితరస్సర్వే మాతృమాతా మహాదయః, అతీతకుల కోటీనాం సప్తద్వీప నివాసినాం, ఆ బ్రహ్మ భువనాల్లోకాది దమస్తు తిలోదకం. లేదా ఆబ్రహ్మస్తంబ పర్యంతం జగత్ స్థావర జంగమం, మయాదత్తేన తోయేన తృప్తిం యాతు పరాంగతిం. ఆ బ్రహ్మస్తం బపర్యంతం జగత్ తృప్యతు ఇతి బ్రువన్, జలాంజలిత్రయం దద్యాత్ కుర్వన్ సంక్షేప తర్పణం. ప్రత్యంజలౌ మంత్రావృత్తిః.

బి) తీర్థేషు బ్రాహ్మణం నైవ పరీక్షేత కదాచన. చతుర్విధా బిక్షవస్తు విఖ్యాతా బ్రహ్మణో ముఖాత్. కుటీచకో, బహూదకోహంసశ్చైవ తృతీయకః. చతుర్థః పరమహంసశ్చ.

సి) మార్జార, శ్వ, పక్షివధే, దుగ్ధపాన మాత్రం, త్రిరాత్ర ముపవాసః.

డి) శుద్ధ్యేద్వి ప్రోదశాహేన ద్వాదశాహేన భూమిపః, వైశ్యః పంచదశాహేన శూద్రోమాసేన శుద్ధ్యతి.

# ఆశౌచ ప్రకరణం

1) కూటస్థుని నుండి ఏడుతరాల దాకా సపిండుడు ఆ తరువాత ఏడు తరాల దాకా సమానోదకుడు ఆ తరువాత ఏడు తరాల దాకా సగోత్రులు.

2) ప్రమాణాంతరేణ ప్రాప్తస్య అర్థస్య పునః కథనం అనువాదః. అనుపశ్చాత్ వాదః. జ్ఞాతార్థ జ్ఞాపకం, స్వప్రతిపాదకత్వే సతిస్వేతర ప్రతిపాదకత్వం. మంత్ర గ్రహణం బ్రాహ్మణస్య ఉపలక్షణం.

3) **ఆత్మబంధుత్రయం** : ఆత్మనః పితృష్వసు, మాతృష్వసు, మాతుల పుత్రులు. ఉదా: ఆత్మ మాతృష్వసు పుత్రులు

**పితృబంధు త్రయం** : పితుః పితృష్వసు, మాతృష్వసు, మాతుల పుత్రులు

**మాతృబంధు త్రయం** : మాతుః పితృష్వసు, మాతృష్వసు, మాతుల పుత్రులు 9 మంది మొత్తం.

4) అగ్న్యాధేయ పాకయజ్ఞానగ్నిష్టో మాదికాన్ మఖాన్, యః కరోతి వృతోయస్య సతస్యర్త్వి గిహోచ్యతే.

5) గోమాంసఖాదకోయ స్తు విరుద్ధం బహు భాషతే, సర్వాచార విహీనశ్చమ్లేచ్ఛ ఇత్యభి ధీయతే. రజకశ్చర్మ కారశ్చ నరో బురుడ ఏవ చ, కైవర్త మేదభిల్లాశ్చ సప్తైతేఽ ంత్యావ సాయినః.

6) పృథక్ సాంతపన ద్రవ్యైః షడహః సోపవాసకః, సప్తాహేనతు కృచ్ఛ్రోఽయం మహాసాం తపనః స్మృతః. తప్త కృచ్ఛ్రం ద్వాదశాహ సాధ్యః, జల క్షీరఘృత అనిలాని తప్తం, ప్రతిత్ర్య హం. త్రిరాత్ర మారుత పూరణే ఉష్ణోదక బాష్పం.

బి) గోమూత్రం కృష్ణవర్ణాయాః శ్వేతాయాశ్చైవ గోమయం, పయశ్చతామ్ర వర్ణాయాః రక్తాయాః గృహ్యతే దధి కపిలాయా ఘృతం గ్రాహ్యం సర్వంకాపిలమేవవా, మూత్రమేక పలంగ్రాహ్యం అంగుష్ఠార్ధంతు గోమయం. క్షీరం సప్తపలం గ్రాహ్యం దధి త్రిపలముచ్యతే. ఘృతమే కపలం గ్రాహ్యం పలమేకం కుశోదకం ఏతచ్చ గాయత్ర్యా గోమూత్ర మిత్యాది సమంత్రకంకార్యం. పాలాశే మధ్యమే పర్ణేభాండే తామ్రమయే తథా. మృన్మయేఽపి

సి) తప్తక్షీర ఘృతాంబూనామేకైకం ప్రత్యహం పిబేత్, ఏకరాత్రోపవాసశ్చ తప్తకృచ్ఛ్ర ఉదాహృతః ప్రతిత్ర్యహం,

డి) సాంతపనం పాపప్రణాశనం

ఇ) గర్భస్రావాశౌచం

ప్రథమమాసం - తల్లికి రెండు / మూడు రోజులు. తండ్రికి స్నానం

ద్విత్రిమాసం - తల్లికి మూడు తండ్రికి స్నానం

చతుర్ - తల్లి నాలుగు తండ్రికి స్నానం

పంచమ / షష్ఠ - తల్లికి ఐదు / ఆరు తండ్రికి స్నానం

ఏడు నుండి ఆప్రసవం - పది

పుత్రుడు / పుత్రిక నెల / మండలం తర్వాత - పూర్ణా శౌచం

## కర్మాధికారం

| | | | |
|---|---|---|---|
| మృతోత్పత్తిలో | మరణాశౌచం లేదు | జననాశౌచం తల్లికి పూర్ణం | అన్యులకు లేదు |
| నాలచ్ఛేదపూర్వం మరణం | మరణాశౌచం లేదు | జననాశౌచం తల్లికి పూర్ణం | తండ్రికి త్రిరాత్రం |
| పదిరోజులలో మరణం | మరణాశౌచం లేదు | జననాశౌచం తల్లికి పూర్ణం | తండ్రికి పూర్ణం సపిండులు |
| నామకరణం ముందు మరణం | ఒకటి / మూడు రాత్రులు తండ్రికి కూడా | సపిండులు స్నానం | |
| ఆరుమాసాలలోపు మరణం | ఒకరాత్రి | | |
| దంతాలోస్తే మరణం | మూడు రాత్రులు | సపిండులు స్నానం | |
| ఆరుమాసాలు దాటి దంతోత్పకి పూర్వం మరణం | మూడు రాత్రులు | సపిండులు స్నానం ఖననం ఒకదినం -దాహంలో | * కన్య మరణంలో ఒకరోజు పుత్ర మరణంలో మూడు దంతోత్పత్తికి పూర్వం. తర్వాత మూడు రోజులు సపిండులు - సద్యః |
| రెండు సంవత్సరాలలోపు మరణం | మూడు రాత్రులు ఒకదినం (ఖ) | ఒకదినం - దాహం ఒకదినం ఖననం | |
| చూడాకర్మకు పూర్వం మరణం | మూడు రాత్రులు | ఒకదినం | |
| ఉపనయనం పూర్వం చూడాకర్మ తర్వాత | మూడు రాత్రులు | మూడు రాత్రులు | |
| ఆరు సంవత్సరాల తర్వాత అనుపనీత మరణం | మూడరు రాత్రులు | | |
| ఉపనీతుడైతే | పూర్ణాశౌచం | పూర్ణం | |

తల్లిదండ్రుల మరణంలో వివాహితకన్యకు పదిరోజుల్లో తెలిస్తే మూడు రాత్రులు తర్వాత పక్షిణి.

కన్య మరణంలో మూడు సంవత్సరాలపైన వాగ్దానంకన్న పూర్వం తల్లి, తండ్రి త్రిరాత్రం సపిండులు ఒకరాత్రి (మూడు తరాలు) వాగ్దానం తర్వాత వివాహ పూర్వం త-తం/పతి/ సపిం ఒకదినం / త్రి- దాహకర్తకు) (7 తరాలవరకు) వివాహం తరువాత త్రిరాత్రం/పూర్ణం-పతివంశంలో

మామ మరణంలో మేనల్లుడికి పక్షిణి. తన ఇంట్లో మరణిస్తే త్రిరాత్రం. మామకూతురు మరణంలో మేనల్లుడి కొడుక్కు ఒకరోజు ఆశౌచం. అనుపనీత మేనల్లుని మరణంలో, మామ, మామకూతురు, మామచెల్లెలు, వీరికి త్రిరాత్రం. (పక్షిణికాని)

మాతామహ మరణంలో దౌహిత్రునికి త్రిరాత్రా శౌచం. మాతామహి ఆశౌచం పక్షిణి ఉపనీత దౌహిత్ర మరణంలో మాతామహ, మాతామహిలకు త్రిరాత్రం. అనుపనీతుడైతే పక్షిణి. అత్తమామలు దగ్గరలో మరణిస్తే అల్లునకు త్రిరాత్రం. అసన్నిధిలో పక్షిణి. వేరే గ్రామమైతే ఒకరోజు (పక్షిణిలేదా) అల్లుడి మరణంలో అత్త మామలకు ఒకరోజు (సద్యః). భావమరిది మరణిస్తే భావకు ఒకరాత్రి. భావమరది కొడుకైతే సద్యః శుచి.

దత్తకుడు మరణిస్తే ఇద్దరు తండ్రులకు త్రిరాత్రం. తండ్రులు మరణిస్తే పుత్రునకు దశరాత్రం.

శవస్పర్శమందు నక్షత్ర దర్శనంతో శుద్ధి / సూర్యదర్శనంతో. వెంట వెళ్తే స్నానం సచేలం.

మామ, తల్లి చెల్లెలు, తండ్రి చెల్లెలు వీరి వహనదహనమందు త్రిరాత్రం. సవర్ణ నిర్హరణంలో ఒకరాత్రి. రజోదర్శనమైన 17వనాడు తిరిగి రజోదర్శనమైతే స్నానం 18న ఐన 1రోజు 19న ఐన 2 రోజులు 20న ఐతే 3 రోజులు ఆశౌచం.

పదిరోజుల ఆశౌచంలో 5 రోజుల్లో మరోదశరాత్రా శౌచం వస్తే పూర్వంతో శుద్ధి. ఆరు నుండి తొమ్మిది రాత్రి వరకు రెండోది వస్తే వచ్చిన దానితో శుద్ధి. పదినాటి రాత్రి మరోటి తెలిస్తే రెండు రోజుల ఆశౌచవృద్ధి. 11 నాటి ఉదయం కన్నముందు తెలిస్తే త్రిరాత్రా శౌచ వృద్ధి. ఆచార్య మరణ మందు శిష్యునకు త్రిరాత్రౌ శౌచం. జనన మరణములందు మరణంతో శుద్ధి. తండ్రి మరణాశౌచం మధ్య తల్లిమరణిస్తే తండ్రి ఆశౌచాంత మందు పక్షిణి వృద్ధి తల్లికై. తల్లి తరువాత తండ్రి మరణిస్తే తండ్రి ఆశౌచం, శేషదినములతో శుద్ధి, తల్లిదండ్రుల మరణంవింటే విన్నప్పటి నుండి పది రోజుల ఆశౌచం. వివాహిత కన్యకు దశంలో ఐతే త్రిరాత్రం. అపై పక్షిణి త్రిరాత్రాది అతిక్రాంతమైతే ఆశౌచం లేదు. పూర్ణం అతిక్రాంతమైన త్రిరాత్రం. బ్రహ్మచారికి ఆశౌచంలేదు. సమావర్తనం తరువాత ఆశౌచం. ఆశౌచం మధ్య శ్రాద్ధం వస్తే తరువాతి ద్వాదశిన చేయాలి. మలమాసం వస్తే కృష్ణ పక్ష ద్వాదశిన చేయాలి. ప్రేత శ్రాద్ధం మలమాసంలోనూ చేయాలి. ఆశౌచంలో సంధ్య మానసికం అర్ఘ్యం వరకు. వృత్తులందు ఆశౌచంలేదు. కోమటికి ఆశౌచంవస్తే వాడిస్తే సామాను తీసుకోవద్దు. వాడి ఆజ్ఞతో మనం తీసుకోవచ్చు. ఆశౌచం తెలియకపోతే (ఇద్దరికి) దోషంలేదు. తెలిస్తే భోక్తకు దోషం. వివాహంలో ఆశౌచం తెలిస్తే వేరే వాళ్ళు వడ్డించాలి. అన్నం పూర్వందే కనుక దోషం లేదు (తెలియక ముందుది) పాపులకై

ప్రాయశ్చిత్తం తర్వాత ఆశౌచ శ్రాద్ధములు పిండదానం. ఆరంభమయ్యాక జననా శౌచమైనా పిండదానం చేయొచ్చు.

6) అనువాదం అనగా ప్రమాణాంతర అర్థంతో రెండోసారి తిరిగి చెప్పటం. ఒక వాక్యంలోఉద్దేశ్య విధేయం రెండుంటాయి. రెండు ఉద్దేశ్యాలుంటే వాక్యభేదం. రెండు విధేయాలున్నా వాక్యభేదం. ఒకవాక్యంలో విధి, అనువాదం ఉండరాదు. విధి అంటే కొత్తది చెప్పటం, అనువాదం పాతది చెప్పటం (అనుపశ్చాత్ వాదః).

బి) ననగ్నః శ్రాద్ధమాచరేత్, నగ్నః కాషాయ వరసాః స్యాత్. కాషాయధారీ నగ్నః అని అర్థము.

సి) ఆత్మఘాతియైన వానికి పుత్రాదులు, శుక్లైకాదశియందు, ఆత్మహత్యకు చెందిన పాపానుసారం ప్రాయశ్చిత్తం చేసి దుర్మరణ దోష నివృత్తికై కలశద్వయమందు బంగారు విష్ణువును పూజించి నారాయణ బలి చేయాలి. రెండు రోజులు. పర్ణశరదాహం చేసి, దాహం నుండి ఆశౌచం చేసి ఔర్ధ్వదేహికం చేయాలి.

7. వాగ్దండోఽథ మనోదండః కాయదండస్త థైవ చ, యస్యైతే నిహితాబుద్ధౌ త్రిదండీతి స ఉచ్యతే. శరీరజైః కర్మదోషైః యాతి స్థావరతాం నరః, వాచికైః పక్షిమృగతాం మానసైరంత్య జాతితాం, త్రిదండమే తన్నిక్షిప్య సర్వభూతేషు మానవః, కామక్రోధౌతు సంయమ్య తతః సిద్ధిం నియచ్ఛతి.

8. కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర, త్రిపాద నక్షత్రాలు, ద్వితీయ సప్తమి, ద్వాదశి తిథులు మంగళ, శని, ఆదివారాలు వీని యోగం త్రిపుష్కర యోగం. ఇవే తిథి వారాలు. వీనితో మృగశిర, చిత్త, ధనిష్ఠ చేరితే ద్విపుష్కర యోగం.

9. పంచరత్నాలు :- కనకం, వజ్రం, ముత్యం, పద్మరాగం, ప్రవాలం / నీలం.

10. అన్వాహార్యం – దర్శపూర్ణమాసమందు బ్రహ్మహోత అధ్వర్యు, ఆగ్నీధ్ర వీరలకై దక్షిణ కొరకై దక్షిణాగ్ని యందు వండిన అన్నము ఇస్తారు. అది అన్వాహార్యం. ఇధ్మ – మొదుగుది, ఒక చేయి పొడవు, ఒక వ్రేలు మందం, త్వచాసహితం. బర్హి – అసంస్కృత, అసంఖ్యాత కుశలను బర్హి అంటారు. వాజినం – వేడిపాలల్లో పెరుగేస్తే పాలు పగిలితే ముద్దను ఆమిక్షా అని, నీరును వాజినం అంటారు. స్రుక్ – వికంకతం కర్ర, చేయిపొడవు, చిటికన వేలంతతో మొదలై పైకెళ్ళే వరకు కొంచెంకొంచెంలావౌతుంది. ఐదంగుళాల గుండ్రని ముఖం, మూడంగుళాలలోతు హంసముఖం (ముక్కు) ముందుభాగం గలది. స్రువం – ఖైర వృక్షం చేయిపొడవు చిటికెన వేలంత మొదలై పైపైన కొంచెంకొంచెం పెరిగి, బొటన

వేలంత గుండ్రడనై నాలుగు మూలలది. చాత్రః – ఉపమంధ అనగా అరణీ మంథనములకై ఎనిమిది అంగుళముల కట్టె మేకు, బాడిస ద్వారా దీన్ని మంధన దండ మందు పెడ్తారు. మంథన దండం ఖైరవృక్షంది పన్నెండంగుళముల పొడవు రెండంగుళముల ఇనుప మొలతో కూడి మూడంగుళముల గుండ్రత కలది, తాడు తిప్పటానికి అనేక వలయములు గలది, చాత్రము లేదా ఉపమంధము అని అంటారు. దృషద్ ఉపల – పది అంగుళాల పొడవు ఎనిమిది అంగుళముల వెడల్పు రెండంగుళముల మందం కలిగి, పురోడాశానికి చెందిన వ్రీహ్యాదులను నూరటంలో ఉపయుక్తమైంది దృషత్. ఇంకా దృషత్‌కు అనురూపమైన లోఢీని ఉపల అంటారు. (నూరుడుబండ). కూర్చ – చేయంత పొడవు నాలుగంగుళముల వెడల్పు సగం అంగుళం మందం, మూలం, అగ్రములందు ఒక అంగుళం మందం పావగలది వారణపు కట్టెది కూర్చ అంటారు. సమిధ – మొదుగది చిటికన వేలు మందంతో, పై చర్మం గలది, పది అంగుళముల పొడవుది సమిధ. పరిధి – దర్శ పూర్ణ మాసాది యాగమందు ఆహవనీయ కుండమునకు దక్షిణ పశ్చిమ ఉత్తరములందు మోదుగువి చేతంత పొడుగు కలవి సమిధలు ఉంచుతారు. అవి పరిధి అంటారు. ప్రమంథ – ఉత్తరారణి యొక్క ఎనిమిదంగుళాల పొడవు, రెండంగుళాల వెడల్పు, రెండంగుళాల ఎత్తుగ కర్రముక్క ప్రమంథం పురోడాశం – యవలులేదా బియ్యం పిండి ముద్ద అగ్న్యాది దేవతలకై హోమం కొరకు తయారు చేస్తారు. గార్హపత్య కుండమందు నిప్పులపై మట్టిపెద్ద ఉంచి దానిపై నిప్పులు పెట్టి దానిపై పురోడాశాన్ని వండుతారు. ఆ మట్టిపెద్దను కపాలం అంటారు. అరణీ – శమితో పిప్పలం పుట్టి రెండు కలిసి ఒక చెట్టైతే దాని (పిప్పలం) తూర్పు వైపు శాఖో, ఉత్తర శాఖో పైకెళ్ళిన శాఖో ఇరవై నాల్గంగుళముల పొడవు, ఆరంగుళముల వెడల్పు నాల్గంగుళముల ఎత్తు, మూలము, అగ్రము (ముందు) వీటిని కలిపే గుర్తు గల, కర్ర అరణీ, అధరార్ణి, ఉత్తరార్ణి. అగ్ని పుట్టేది అధరార్ణి. మంధనం చేసేది ఉత్తరార్ణి. ఉత్తరార్ణి అంతే కాని రెండు రెండు అంగుళముల వెడల్పు ఎనిమిదెనిమిది అంగుళముల పొడవు రెండంగుళముల ఎత్తులో పద్దెనిమిది తునకలుంటాయి. దీనిలోంచి ఒక శంకును మంధన దండమందు తగిలించి అరణీ మంథనం చేస్తారు.

11) గోమూత్రం – గాయత్రి మంత్రం, గోమయం – గంధద్వారాం మంత్రం, పాలు – ఆప్యాయస్వస, పెరుగు – దధిక్రావ్ణ మంత్రం, నేయి – ఘృతంమిమిక్షే; కుశోదకం – ఆపోహిష్ఠా, దేవస్యత్వా భస్మ – మానస్తోకే; మృత్ – అశ్వక్రాంతే; తేనె – మధువాతా; నీరు – ఆపోహిష్ఠా;

పట్టవస్త్రం – సాధారణ పట్టు; కౌశేయం – రంగులది ఉత్తమమైన పట్టు.

యక్షకర్దమం – కర్పూరం, అగరు, కస్తూరి, చందనం, కక్కోలం వీనితో తయారైన లేపనం. పన్నెండు తులాలు చందనం, కుంకుమ, ఆరుతులాలు కర్పూరం నాల్గు తులాలు కస్తూరి అని.

దక్షిణావర్తం – ప్రాచీనావీతి పితృకృత్యే రజతం

అష్టగంధం – చందన, అగరు, కర్పూర, కస్తూరి, రోచనం, ఉశీరం, కేశరం, దవదారు, **కౌశేయ** ఆవికయోరూపైః **కుతపానా** మరిష్టకైః, శ్రీఫలైరం **శుపట్టానాం** **క్షౌమాణాం** గౌరసర్షపైః

హోమం :– ప్రక్షేప, ఉద్దేశ, త్యాగములు సమప్రాధాన్యం గలది. నవగ్రహ హోమం

యాగం :– ఉద్దేశ త్యాగ ప్రాధాన్యం, ప్రక్షేపం అంగం

1) మాసికములు 12, ఊనములు 3, త్రైపక్షికం 1, మొత్తం – 16

2) పన్నెండో నెల అధికమైతే 13వ నెలలో ఊన ఆబ్దిక, ఆబ్దికములు. అధికంలో శ్రాద్ధం సాధారణం.

3) పిండమేళనమైతే ప్రేతశబ్దం ఉండదు.

4) ఆశౌచం వస్తే తరువాతి శ్రాద్ధంతో కలిపి చేయాలి.

5) వివాహాదులొస్తే మాసికంనకు అపకర్ష

6) వృద్ధి శ్రాద్ధం తర్వాత ఈ శ్రాద్ధములు చేయరాదు.

7) మాతా – పితా మహీ – ప్రపితా మహీ – వృద్ధ ప్రపితామహీ.

తండ్రి బ్రతికి ఉంటే, పితామహితో స్త్రీకి సపిండనం. తండ్రి మరణిస్తే, తల్లి అన్వారూఢ ఐతే భర్తతోనే. మాతృ పిండాన్ని పితృ పిండంతో కలిపి దానిని పితామహాదులతో కలపటం. లేదా పితృపిండాన్ని మగ్గురిలో కలిపి పిదప తల్లి పిండాన్ని ఆమె భర్తతో కలపటం.

